## 5వ. ప్రకరణము. రావణుని పూర్వపుచర్యలు.

౨వ. ప్రకరణము. రాముడు వనవాసమునకు బోవలసివచ్చుట.

11వ. ప్రకరణము. రామరావణులయు, బలములయు యుద్ధము.

## 12 వ. ప్రకరణము. రామనిర్యాణము

## 13వ. ప్రకరణము. సామాన్యాంశములు

ఈగణితప్రకారము రాముడు 25వ మహాయుగముచివర నొక కలియుగాంతమున జన్మించినట్లు కనబడినను, పై తెలియజేసిన యంశములచే నీతడు త్రేతాయుగమందున్నట్లు తెలియవచ్చుచున్నందున నితడు వైవస్వతమనువు 25వ మహాయుగపు త్రేతాయుగమున జన్మించియుండును. బ్రహ్మాండపురాణమున నితడు 24 వ మహాయుగపు త్రేతాయుగమున జన్మించినటుల వివరింపబడినది. ఏది యెట్లున్నను, నితడు కోటిసంవత్సరములకు పూర్వపుకాలమువాడని మనము నిర్ధారణ చేయవచ్చును.

---

## ౨. అధ్యాయము — రాముని యాయుఃప్రమాణము.



శ్రీరాముడు 11,000 సంవత్సరములు రాజ్యము చేసెనని మొదటి యధ్యాయమున జూపితిమి. శ్రీమద్రామాయణగ్రంథమున నీతనిపూర్వులీక్రింద వివరింపబడినట్లు రాజ్యముచేసిరి.

| | | | |
|---|---|---|---|
| సగరుడు | 60, 000 | సంవత్సరములు | |
| అంశుమంతుడు | 32, 000 | ,, | |
| దిలీపుడు | 30, 000 | ,, | |
| దశరథుడు | 60, 000 | ,, | పైగా |

దీనినిబట్టిచూడ రాముడును, నతనిపూర్వులును నీకలికాలపు మనుష్యులవలె 100 సంవత్సరములు జీవితపరిమాణము గలవారుకాక, వేలకొలది సంవత్సరములు జీవించినవారని స్పష్టమగుచున్నది. ఈ కాలమున నాయుఃప్రమాణము నూరుసంవత్సరములైనను, దానిలో సగము అనగా 50 సంవత్సరములకంటె నెక్కువకాలము నేలుబడిచేసిన రాజులను మనము సాధారణముగ వినియుండలేదు. దీనినిబట్టి రాముని యాయుర్దాయము సుమారు 20, 000 సం॥లుండవచ్చునని మన మూహింపవచ్చును. నూరుసంవత్సరములు పరమాయువుగల కలికాల

నారదుడు పోవ భరద్వాజుడను తనశిష్యునితో తమసానదికి స్నానమునకు పోయెను. స్త్రీపురుష క్రౌంచపక్షులు రెండక్కడ క్రీడించుచుండెను. ఒక కిరాతకుడు పురుషపక్షిని బాణముతో జంపె నాడుపక్షి విలపించెను. దీనిని వాల్మీకి చూచి —

"మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమశ్శాశ్వతీస్సమాః।
యత్క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితమ్॥"

అని పలికెను. దీనిప్రకృతార్థ మేమన— ఓకిరాతకుడా! క్రౌంచ ద్వంద్వములో క్రీడించు పురుషపక్షిని చంపినందున నీవు చిరకాలము జీవింపవని శాపము. దీని రెండవయర్థ మేమన— ఓవిష్ణువా! నీవు మండోదరీ రాక్షసులలో నొకడగు రావణుని జంపినందున నీవు శాశ్వత ప్రతిష్ఠను బొందెదవు.

ఈశ్లోకము వాల్మీకినోటనుండి వెలువడినతరువాత పదినాలుగు పాదములు గలిగి గానయోగ్యమగుటను గమనించి శిష్యునితో నా శ్లోకమును చెప్పుచు నాశ్రమమునకు ప్రయాణపడెను. వారిరువురును తమ యాశ్రమమునకు రాగా బ్రహ్మ యక్కడకు వచ్చెను. వాల్మీకి యాశ్లోకమునుగూర్చి విచారించుచుండ బ్రహ్మ తాను దానిని సరస్వతిచే నీనోట పలికించితిననియు, నారదుడు తెలిపినట్లుల నీవు రామాయణము రచింపుమనియు, లోకములుండునంతవరకు నీకథను వినుచుందు రనియు, నంతకాలము నీవు క్రిందిమీది లోకములందు నుండువనియు సెల విచ్చెను. బ్రహ్మ యక్కడనుండి వెళ్ళిపోయినతరువాత వాల్మీకి స్నానముచేసి, దర్భలపై తూర్పుముఖము పెట్టుకొని కూర్చుండి, రామ చరిత్రము సంతయు యోగమార్గమున దెలిసికొని పిదప రామాయణ మును రచించెను.

రాముడు పట్టాభిషిక్తుడై యుండినతరువాత 10, 000 సంవత్సరములు సీతతో రాజ్యముచేసి యారాముడు సీత గర్భవతి కాగ నామెను

నడవికి బంపెను. ఆమె వాల్మీకి యాశ్రమమును జేరెను. తరువాత కొంతకాల మాతడు రాజ్యకార్యమును జరిపినతరువాత శత్రుఘ్నుని లవణాసురుని జంపుటకు బంపెను. అప్పుడు కుశలవులు జన్మించిరి. * తరువాత 12వ సంవత్సరమున శత్రుఘ్ను డయోధ్యకు తిరిగివచ్చు త్రోవలో వాల్మీకి తన రామాయణమును సంస్కృతమున లక్షణము లతో రచియించి వీణలయతో గూడునట్లును, మూడుస్థాయిలు, కరణము (నాట్యగీతభేదము) గూడునట్లును, సమమగు తాళముతో గూడునట్లును పాడెను.

వాల్మీకి తన రామాయణమును రచియించి దీనినెట్లు ప్రచు రించెదనని యాలోచించుచుండ, మునివేషధరులగు కుశలవు లాతని పాదములుబట్టి, నామహర్షి వారు వేదములందు పరిశ్రమగలవారగు టచే వారిచే వేదార్థమును దెలుపు నీకావ్యమును జదివించెను. వారు సంగీతవిశారదులగుటచే చివరకు రాముని యశ్వమేధయజ్ఞమునకు వాల్మీకితో వెళ్ళి ఋషులయెదుటను, బ్రాహ్మణులయెదుటను, సాధువు లయెదుటను బాడ, ఋషులెక్కువగ వారిని ప్రశంసించి తమకలశము లను, నారబట్టలను బహుమానముగ వారికిచ్చిరి. వారు రాజమార్గము లందును, రచ్చలయందును దానిని బాడ రాముడు వారిని తనసభకు పిలిపించి పాడించెను.

పైసంగతులనుబట్టి యాదిరామాయణము కోటి సంవత్సరము లకుబూర్వము వాల్మీకిచే రచియింపబడినదని తేలుచున్నది.

—:o:—

* పైయంశములబట్టి సీతకు కుశలవులు ప్రస్తుతపుయుగమానవులవలె గర్భో త్పత్తియైన 9—10 మాసములకు జన్మించలేదనియు, నప్పటిలో ప్రజలకు నాయు ర్దాయమింతకంటె మిక్కిలి యెక్కువగ నుండెననియు స్పష్టమగుచున్నది.

## ४. అధ్యాయము—రామాయణరచనకాల నిర్ణయము.



ఆదిరామాయణము కోటిసంవత్సరములకు పైగ రచియింప బడినదని ముందధ్యాయమున దెలిపితిమి. రామాయణగ్రంథమును పఠించువారు పఠనప్రారంభమున గ్రంథకర్తయగు వాల్మీకిని కీర్తించుచు దానియంతమున నిది 100 కోట్ల గ్రంథమనియు, నొకపాదమునైన చదువువారు, తాము చేసినమహాపాతకముల బోగొట్టుకొనుదురనియు నర్థముగలశ్లోకముల జదువుదురు. దీనినిబట్టి వాల్మీకి 100 కోట్లగ్రంథ మును మొదటరచియించెనని నమ్మదగియున్నది. అట్టిచో మనకుగల వాల్మీకి రామాయణము 24,000 శ్లోకములు కలదియగుటకు కారణము మనమాలోచింపవలసి యున్నది.

బాలకాండమున 21సర్గమునందు 2వ శ్లోకమున దశరథుడు రామునికి 16 సంవత్సరములలోపువయస్సని విశ్వామిత్రునితో దెలి పెను. తరువాత రామలక్ష్మణులతనితోనేగి స్వల్పదినములలో మిథిలను జేరిరి. దారిలోను, నక్కడను వారు యౌవనవంతులని గ్రంథములో వర్ణింపబడినది. అప్పటికి వారివయస్సు సుమారు4000సంవత్సరములని తెలిపితిమి. రామునికి 16 సంవత్సరములకు యౌవనము వచ్చినదను సంగతివలనను, సీతారాముల వయస్సులుకూడ నీగ్రంథములో కలి కాలపువయస్సులై యుండుటచేతను నీగ్రంథము కలికాలములో రచి యింపబడినదనుట కొక కారణమైనది.

అయోధ్యాకాండమున 103 వ సర్గమునందు 34 వ శ్లోకమున బుద్ధుడు చోరునివంటివాడనియు, వాడుబోధించినది నాస్తికమత మనియు, బుద్ధిమంతులు వానితో వాదించగూడదనియు రాముడు పలికెనని చెప్పబడినది. బుద్ధు డిప్పటి కలియుగమ్మున సుమారు 2500 సంవత్సరములక్రిందట జన్మించినవాడు. ఆతనిపేరీగ్రంథమ్మున తెలుప

బడుటనుబట్టి, యిది యీకలికాలగ్రంథమనియు, బౌద్ధమతమును హిందూమతము క్షీణింపజేసిన కాలములో రచియింపబడియుండు ననియు ననుటకు నిదియొక నిదర్శనము.

ఉత్తరకాండములో గూడ నీగ్రంథము పురాతనము కాదను టకు గొప్ప నిదర్శనములు కనిపించుచున్నవి. 22వ సర్గమునందు 31వ శ్లోకమున నరకుడు మరణించెనని చెప్పబడెను. వీడు 28వ మహాయుగపు ద్వాపరయుగాంతమున శ్రీకృష్ణునిచే జచ్చెను. 23వ సర్గమునందు 45,46 శ్లోకములలో ముచికుందుడు, కంసుడు విష్ణువునకు స్వాధీనమైనట్లు చెప్పబడినది. అతడే శ్రీకృష్ణుడు. ఆసర్గమునందే 73వ శ్లోకమున విష్ణువు వాసుదేవుడని వర్ణింపబడెను. ఈతడు వసుదేవుని కుమారుడగు శ్రీకృష్ణుడు.

ఈనిదర్శనములబట్టి యీ 24,000 శ్లోకముల రామాయణ గ్రంథము వాల్మీకిమొదటరచించిన గ్రంథము కాదనియు నది మిక్కిలి విపులముగ నుండి యుగయుగములకు నుత్పన్నముకాగ చిరకాలజీవు లగు ఋషులచే తిరుగ వ్రాయబడుచు నీకలియుగమున నీగ్రంథము రచియింపబడెననియు మే మూహించెదము. వాల్మీకియు గూడ నట్టి మహర్షులలోనొకడే. ఆతడు తిరుగ నీకలికాలమున బౌద్ధమతము మనదేశమున నాశనమొంద నీరామాయణమును రచియించి యుండును.

పైకారణములచే మాకుగల యభిప్రాయములను మేము తెలిపితిమి. ప్రాజ్ఞులు వాటిని గ్రహింతురుగాక!

---

ఓమ్

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# విశోధితరామాయణము.



## 2 ప్రకరణము—సృష్టివివరము మొదలగునవి.



### ౧-వ అధ్యాయము—సృష్టివివరము.



పూర్వము చంద్ర సూర్య నక్షత్రములతో గూడిన యాకాశము, పర్వతారణ్య సముద్రములతో గూడిన చరాచరప్రపంచమంతయు నేకాకారమై యుండెను. భూలత్వములు విష్ణుగర్భమున బ్రవేశించిరి. విష్ణు వాభూమితో గూడ సముద్రమున బ్రవేశించి సర్వభూతమయుడై యనేక సంవత్సరములు నిద్రించెను. అప్పుడు బ్రహ్మ యతని గర్భమున బ్రవేశించెను. ఆనాడీమార్గములన్నియు నిరోధింపబడి యుండ, విష్ణువునాభియందు బంగారువికారముకల పద్మమొకటి జన్మించెను. దానినుండి బ్రహ్మ బైటికివెడలి గొప్పయోగము కలవాడయ్యెను. అతడు సృజింపనిశ్చయించినవాడై భూమిని, వాయువును, పర్వతములను, ప్రజలనందరిని, ప్రాకుజంతువులనుగూడ సృజించెను. అతనివలన మావినుండిపుట్టినవియు నండజములునుగూడ నుద్భవించెను. అతనిచెవినుండి గొప్పపరాక్రమముగలవారును, ఘోరరూపులును, జేరశక్యముకానివారును నగు మధుకైటభు లనుదానవు లిద్దరు

జన్మించిరి. వారు బ్రహ్మనుజూచి మిక్కిలిక్రోధముకలిగి శీఘ్రముగ నతనియొద్దకు బరుగెత్తిరి. వారినతడుచూచి భీతిల్లుచు వికృతమగు ధ్వని జేయు విష్ణువునకు దెలిసి యాతడు తనచక్రముతో వారిని ఖండించి చంపెను. వారిమేదస్సు(మెదడు) వలన భూమితడుపబడుటచే దానికి "మేదిని" యని పేరు కలిగెను. విష్ణువు భూమిని పలుమారులు పరీక్షించెను. అట్టిభూమియందంతటను నానావిధములగు చెట్లును, నోషధులును, సస్యములును జన్మించెను.

బ్రహ్మ ప్రజావృద్ధికై 18 గురు ప్రజాపతులను బుట్టించెను. వారలపేర్లు క్రమముగ నీక్రింద నుదహరింపబడుచున్నవి.

కర్దముడు, విక్రీతుడు, శేషుడు, సంశ్రియుడు, బహుపుత్రుడు, వీర్యవంతుడు, స్థాణువు, మరీచి, అత్రి, క్రతువు, మహాబలుడు, పులస్త్యుడు, అంగిరసుడు, ప్రచేతసుడు, పులహుడు, దక్షుడు, వివస్వంతుడు, అరిష్టనేమి యను నామాంతరముగల కాశ్యపుడు. వారిలో చివరవాడగు కాశ్యపునిసంతతి యన్నిలోకముల విస్తరించెను. ఈతడు దక్షునికూతుల నెనమండ్రను పెండ్లాడి యీప్రకరణములోని వంశవృక్షములో జూపినప్రకారము ప్రజావృద్ధిగావించెను.

దైత్యులు జన్మించిన తరువాత సముద్రమునందును, వనములందును, దేశములందును నివసించిరి. వీర లధర్మపక్షమువారు. దేవతలు ధర్మపక్షమువారు.

పూర్వకాలమున బ్రహ్మ నీటిని సృజించి దానిని కాపాడుటకు బలవంతులను సృజించెను. వా రాకలిదప్పికలచే బాధనొంది తమస్సృష్టికర్తతో సవినయముగ వాటిని దెలిపిరి. అతడు నవ్వి వారితో యత్నముతో నీటిని కాపాడుమనెను. వారిలో కొందరు నీటిని భక్షించుటకును (సంస్కృతమున 'జక్ష'), కొందరు రక్షించుటకును (సంస్కృతమున 'రక్ష') పలికిరి. వారిమాటలచే భక్షించెదమని పలికినవారికి

ఆదితివలన — 12 ఆదిత్యులు, 8 వసువులు, 11 రుద్రులు, 2 అశ్వనీదేవతలు

దితివలన — దైత్యులు

దనుజవలన — అశ్వగ్రీవుడు

కాళికవలన — 1 నరకుడు, 2 కాలకుడు

తామ్ర — కూతు

క్రౌంచీ — గుడ్లగూబలు

భాసి — భాసములు

శ్యే — డేగలు

మృగి — లేళ్లు

మృగమద — ఎలుగుబంట్లు, సృమరములు, చమరములు

హరి — సింహములు, వానరములు

భద్రమద — కూతురు — ఐరావతి — ఐరావతవ

* బ్రాహ్మణులకు నగ్రజన్ములనికూడ పేరుకలదు. గనుక మొద

పే మూహించెదము.

యక్షులనియు, రక్షించెదమని పలికినవారికి రాక్షసులనియు బ్రహ్మ పేరిడెను.

—:♦:—

## ౨-వ అధ్యాయము — సంపాతి జటాయువులు.

ఈ పక్షిశ్రేష్ఠములు రెండును నరుణునివలన శ్యేనియందు జన్మించినవి. పెద్దది సంపాతి. చిన్నది జటాయువు. వీరిద్దరికి సూర్యపథమున నుదయాద్రినుండి యస్తాద్రి వరకు సూర్యునివెంట వెళ్ళగలుగుటకై పంతము గలిగి కైలాసశిఖరముననుండు మునులయెదుట పందెముగట్టి, గర్వముతో నవి యాకాసమును జేరెను. అవి యట్లు వెళ్లుచు క్రిందనున్న పట్టణములను రథచక్రప్రమాణములుగను, నడవులను పచ్చికబయిళ్ళగను, కొండలను రాళ్ళవలెను, నదులను దారములవలెను, హిమవద్వింధ్యమేరువులను నీటిలోనున్న యేనుంగులవలెను చూచుచు సూర్యునివెంటనుండు వేదఘోషములను, వాద్యఘోషములను, నెత్తురుబట్టలు ధరించిన స్త్రీల గాన ధ్వనులను వినినవి. ఆపక్షులకు మిక్కిలి చెమటయును, గొప్పవిచారభయములును జనించెను. కండ్లు చీకటికమ్మెను. వాటికి మనస్సు చాంచల్యమొంది మూర్ఛగలిగెను. యుగాంతమున ప్రళయాగ్నిదగ్ధమగునట్లు లోకము కాన్పించెను. ఏది యేదికో తెలియకుండెను. సంపాతి తనకండ్లను స్వాధీనముచేసికొని, కష్టముతో వాటితో సూర్యుని జూచెను. అప్పుడు దానికి సూర్యుడు భూమియంత విస్తీర్ణుడై గనబడెను. జటాయువు సంపాతికి చెప్పక పడిపోవుచుండుట చూచి సంపాతికూడ నాకాశమునుండి మరలెను. అప్పుడది జటాయువును కాలిపోకుండునటుల తనరెక్కలతో దానిని కప్పెను. కాని తనరెక్కలు కాలిపోవ నది వింధ్యకడపటి పశ్చిమశిఖరమునపడెను. జటాయువు హానినొందక జనస్థానమునబడెను.

వింధ్యపర్వతశిఖరమున సంపాతి తెలివితప్పి పడినతరువాత దానికి నారురోజులకు తెలివివచ్చెను. అది దిక్కులను చూచినను పోల్పలేకపోయెను. తరువాత నది చుట్టునున్న సముద్రతీరమును పర్వతములను, నదులను, సరస్సులను, వనములనుజూచి తెలివితెచ్చుకొని తానుండుస్థానము వింధ్యపర్వతమని పోల్చెను. అక్కడ మంచిపుష్పములు, ఫలములు కలచెట్లతో నిండిన నిశాకరమహర్షి యాశ్రమముండెను. సంపాతి కష్టమున వింధ్యశిఖరమునుండి కొంతదిగి ఋషియాశ్రమము జేరెను. అతడు స్నానముచేసి యాశ్రమమునకు వచ్చుచుండ నక్కడుండు జంతువులన్నియును వానినివెంబడించి వచ్చుచుండెను. ఆతడు సంపాతినిజూచి సంతోషించి లోనికిబోయి యొకగడియలోవచ్చి యాపక్షిని తానువచ్చినకార్యము తెలుపుమనెను. అతడు దానివిరూపమును జూచి దానిరెక్కలు కాలిపోవుటయును, శరీరమున గాయములుండుటయునుగాంచియిట్లు సెలవిచ్చెను. "నీవును, నీతమ్ముడును వాయువేగులును, కామరూపులునగు గృధరాజములు. నీవు మనుష్యరూపమునుబొంది నాపాదములు పట్టుకొనుము. నీకేమి రోగమువచ్చినదో, రెక్కలేలపడినవో, యెవరు నీకిట్టిశిక్ష విధించిరో తెలుపుము." ఇట్లు ఋషి సెలవీయ సంపాతి యేడ్చుచు జరిగిన దంతయు నాతనికి దెలిపెను. ఋషి యాపక్షితో నిట్లు సెలవిచ్చెను. నీకు మంచిరెక్కలువచ్చును. నీప్రాణములకును,కండ్లకును, విక్రమమునకును పూర్వమువలెనెక్కువబలము కలుగును. ముందునీవుగొప్పకార్యము జరుపగలవు. నేను దీనిని నాదివ్యదృష్టివలన తెలిసికొంటిని. దశరథునకు రాముడుపుట్టబోవుటయును,నతడు వనమున తనతమ్ముడులక్ష్మణునితోను, భార్యసీతతోను కాపురముండ రావణు డామెనెత్తికొనిబోవుటయును, నామెను వెదకుటకై వానరులు రాబోవుటయును, వారికి రావణుడును సీతయును లంకలోనుండుట నీవు తెలియపరచబోవుటయును, జరుగగలవని యాఋషి యాపక్షితో జెప్పి నీవంతవరకు చాల

*కాలము వేచియుండుము. ఇప్పుడు నీకు రెక్కలిప్పించుటకు నాకిష్టము లేదు. వానరులకు తెలియవచ్చినతరువాత నీకు రెక్కలు వచ్చును. ఇట్లాతడు తెలిపి స్వర్గమునకుబోయెను. ఈపక్షులు రామకార్యమునకు జేసినసహాయము రామకథలో తెలిపితిమి.

—o—

## 3-వ అధ్యాయము—ఇంద్రుడు, దేవతలు.

ఇంద్రుడు సూర్యాగ్నులువలె గొప్పతేజముగల శరీరముకలవాడు. ఇతడు గొప్పచక్రవర్తులవలె మంచియాభరణములు ధరించి నిర్మలమగు బట్టలు కట్టియుండును. ఇతడు భూలోకమునకు వచ్చునపుడు భూమినంటక నిలుచును. ఈతనిరథముగూడ తేజోవంతమైయుండును. మంచిజవముగల గుఱ్ఱములు దానికి కట్టబడును. అతడు భూలోకమునకువచ్చునపుడు రథము భూమిని స్పృశింపకయే యంతరాళమున నిలుచును. ఈతనిగొడుగు తెల్లని మేఘమువలెను చంద్రమండలమువలెను కాంతిగలిగి స్వచ్ఛమై మంచిగంధములు దానిపై చల్లబడియుండును. ఇద్దరుమంచిస్త్రీలు బంగారుకట్లుకలిగిన మిక్కిలి విలువగల చామరములతో నింద్రుని వీచుచుందురు. ఈతడు బయలువెడలునపు డనేకగంధర్వులు, దేవతులు, సిద్ధులు, గొప్ప ఋషులును నాతనిని వెంబడించుచు స్తుతించుచుందురు. ఇంద్రుని యనుచరులు పురుషశ్రేష్ఠులును, కుండలములుకలవారును, ఖడ్గములు

---

* నిశాకరఋషి స్వర్గస్థుడైన కాలమునకును వానరులచ్చటికి వచ్చినకాలమునకును 8000 సంవత్సరము లంతరమని శ్రీమద్రామాయణము. కిష్కింధాకాండ, 60సర్గ,9-వ శ్లోకములో చెప్పబడినది జటాయువును సంపాతియును నొక్కకాలమున భూమిపై పడిరి. వీరు సృష్టిలో మొదటి సంతానము వారు. జటాయువుమరణముతరువాత కొంతకాలమునకు వానరులు సీతను వెతకిరి. ఈతడు పక్షిరాజుగ నెన్నోకోట్ల సంవత్సరములుండెనని మేమూహించుచున్నందున 8000 సంవత్సరములయంశము చరిత్రలో చాలకాలమని వివరించితిమి.

పట్టువారును, విశాలమగు వక్షఃస్థలముకలవారును నిడుపగు బాహువులుకలవారును, నెత్తిని బట్టలుకట్టువారును, మెడలలో వెలుగు హారములుకలవారును నై 25 సంవత్సరములు వయస్సుగలవారివలె నెల్లప్పుడు కనబడుదురు.

పూర్వము దేవాసురసమాగమునందు వృత్రుడనుగొప్పదైత్యుడుండెను. వాడు నూరుయోజనములు (800 మైళ్ళు) వెడల్పును, మూడువందలయోజనములు (2400మైళ్ళు) యెత్తును కలిగినలోకము లన్నింటిని స్నేహముతోను, దయతోను చూచుచుండెను. వాడు ధర్మబుద్ధికలవాడును, చేయవలసినదాని నెరిగినవాడును,మంచిబుద్ధికలవాడై పుష్టియగుభూమిని ధర్మముగను, జాగ్రత్తగను బాలించుచుండెను. అప్పుడు భూమి యన్నికోరికలిచ్చుచుండెను. పుష్పములును, మూలములును, ఫలములును, మిక్కిలి రసవంతముగ ఫలించుచుండెను. భూమి దున్నకయే పండుచుండెను. ఇట్లు వృత్రుడు రాజ్యము చేయుచుండ వానికి గొప్పతపస్సు చేయవలయునని బుద్ధిపుట్టెను. తపస్సే గొప్ప శ్రేయస్కరమైనది. ఇతరసుఖమంతయు మోహమునిచ్చునని తలంచి వాడు మధురకు తనపెద్దకుమారుని రాజుగనునిచి తపమునకు బోయెను. అతడు దేవతలందరికి తాపముకలుగునటుల గొప్పతపము చేయు నిందుడు గొప్పవిచారమునుబొంది విష్ణువునొద్దకుబోయి యిట్లుపలికెను."వృత్రుడు తపస్సుచేయుటచే లోకములన్నిటిని జయించి బలవంతుడై ధర్మాత్ముడయ్యెను. నేను వానిని జయింప శక్తిలేకయున్నాను. వాడింకను చాలకాలము తపస్సుచేయుచుండిన నిలిచిన లోకములన్నియు నతనివశమగును. మీరతని నుపేక్షచేయుచున్నారు. మీరు వానిపై క్రోధముకలిగిన, వాడొక నిమిషమైనను జీవించియుండలేడు. మీకులోకములపై ప్రీతికలిగినదిమొదలు మీరు వాటికి ప్రభువులైరి. మీరు జాగ్రత్తగలిగి దేవతలయందు గొప్పదయచూపుడు. మీవలన లోకమునకు శాంతియు, బాధలేకుండుటయును నగును ఈ దేవు

దరు మీతట్టుచూచుచున్నారు. గొప్పవాడగు వృత్రుని మీరుచంపి వారికి సహాయముచేయుడు. మీరు వీరికెల్లప్పుడును చేయు మేలును నితరులు చేయలేరు. గతిలేనివారికి మీరేగతి." ఇట్లింద్రుడు విష్ణువుతో విన్నవించెను.

ఈమాటలకు విష్ణువీతీరున సెలవిచ్చెను. "పూర్వము వృత్రునిపై నాకు స్నేహముకలదు. గనుక మీకు ప్రియమును జేయుటకు నేను వానిని జంపను. అయినను మీకు మిక్కిలి సుఖమును కలిగించు కార్యము జరుగవలెను. వృత్రుడు చచ్చునుపాయము మీకు దెలిపెదను. దేవతలారా! నేను నాయాత్మను మూడుభాగములుగ పంచికొనెదను. దానివలన వృత్రుని తప్పక యింద్రుడు చంపును.సందేహములేదు. నాలోనొకయంశము ఇంద్రునిబొందుగాక. మరియొక యంశము వజ్రమును, మరియొకయంశము యుద్ధభూమిని బొందుగాక." ఇట్లు విష్ణువు సెలవీయ దేవతలు మీమాటలు తప్పక జరుగుననియు మేము వృత్రునివధకోరుచు వెళ్లెదమనియు, మీతేజమింద్రునందు నిలుచుగాకయనియు పలికిరి. ఇంద్రాది దేవతలు వృత్రుడు నిలిచియున్న యరణ్యమునకుబోయి యతడు మిక్కిలి తేజముతో నుండి గొప్పతపముచేయుచు మూడులోకములను మ్రింగునటులను, నాకాశమును కాల్చునటులను నుండ దేవతలకు వీనినెట్లు జయింతుమనియు, వీనివలన మనకు పరాజయము కలుగక యెట్లుండుననియు భయముకలిగెను. అప్పుడింద్రుడు తనభుజములతో వజ్రాయుధమును బట్టి వృత్రునితలపై విసరెను. అది ప్రళయకాలపు ఘోరాగ్నివలె మిక్కిలిమండుచు వృత్రునితలను తెగగొట్ట లోకమునకంతయు భయముకలిగెను. వృత్రునివధ జరగవలసినదికాదని యింద్రుడాలోచించుచు జగత్తుచివరకు శీఘ్రముగ పరుగెత్తెను. వానిని బ్రహ్మహత్య

వెంటదగిలి వానిశరీరావయవములను నన్నిటినిబట్టి వానికి గొప్పదుఃఖముకలిగించెను. దేవతలు తమశత్రువు నశించుటయును, నింద్రుడులేక పోవుటయును చూచి విష్ణువును మిక్కిలి పూజించి యిట్లు విన్నవించిరి. "మీరే మాకు ముఖ్యులగుదేవులు. ముందుజన్మించిన వారలు. లోకములకు తండ్రులు. అన్నిజీవులను రక్షించుటకు విష్ణుపదవినిపొందితిరి. మీవలన వృత్రుడు హతుడయ్యెనుకాని బ్రహ్మహత్య యింద్రుని బాధించుచున్నది. దానివలన వానికి విముక్తికలుగుమార్గము పదేశింపుడు."అనియిట్లు దేవతలుపలుక విష్ణువు వారితో నిందుడు నన్నుగూర్చి యశ్వమేధయజ్ఞము చేసిన నేను వానిని పవిత్రతనొందించెదననియు, నప్పుడతడు దేవతలపై నధికారముకలిగి యెక్కడనుండియు భయములేకయుండుననియు పలికి దేవతలు కీర్తించుచుండ వైకుంఠమున కరిగెను.

ఇంద్రుడు బ్రహ్మహత్యచే పీడితుడగుచు జగత్తుచివరను తెలివిలేకపడియుండెను. ఇట్లుకొంతకాలముజరుగ జగత్తునకు మిక్కిలి బాధ కలిగెను. అడవులెండిపోయెను. భూమి ధ్వస్తమై నట్లుండెను. నదులు, సరస్సులు, కాలువలు నీరులేకుండెను. వర్షములేమిచే జంతువులకు గొప్పకష్టము కలిగెను. ఇట్లు లోకములు క్షీణించుచుండ దేవతలుతమకు మనస్సు చలనమొంద,పూర్వము విష్ణువు తెలిపినయజ్ఞమును చేయనుద్దేశించిరి. తరువాత సురలుతమగురువులతో నింద్రుడు పడియున్న దేశమునకు వెళ్లి, యతడు బ్రహ్మహత్యచే పట్టుబడియుండుటజూచి, నశ్వమేధమును బ్రహ్మహత్యానివృత్తికై ఇందునిముందిడుకొని చేసిరి. ఆయజ్ఞము పూర్తికాగ, బ్రహ్మహత్య దేవతలవద్దకుబోయి నేనెక్కడ నిలుచుటకు తావు నిశ్చయించిరని యడుగ వారుసంతోషించి ప్రీతితో నీయాత్మను నాలుగు భాగములుగ పంచికొనుమని పలికిరి. ఈమాటలు బ్రహ్మహత్య విని తనభాగములిట్లు నిలుచునట్టుల వారలను వరములోగెను.ఒక భాగము

తో వర్షాకాలము నాలుగు మాసములు నీటితో నిండిన నదులయందును, రెండవభాగముతో భూమియందును, మూడవభాగముతో ఋతుకాలమున త్రిరాత్రము యువతులగు స్త్రీలయందును, నాల్గవ భాగముతో బ్రహ్మహత్య చేసినవారియందును నివసింతును. దేవతలట్లేయగుగాక యని పలికిరి. అప్పుడింద్రుడు విచారమును విడిచి పవిత్రుడుకాగ దేవతలు ప్రీతితో నతనికి నమస్కరించిరి. ఇంద్రుడు తన స్థానమునకు జేర లోకమంతయు శాంతినొందెను. ఆశ్చర్యకరమగు నా యజ్ఞమును నింద్రుడు కీర్తించెను.



## ౪-వ అధ్యాయము—క్షీరసాగర మథనము, కుశప్లవనము, మరుత్తులజన్మము.



పూర్వము దితిపుత్రులు మహాబలులుగను, నదితిపుత్రులు భాగ్యశాలురును వీరులును ధార్మికులుగను నుండిరి. వారుభయులు చావు, ముసలితనము లేకయుండుటకై యమృతమును బొందనిశ్చయించి, వాసుకిని ద్రాడుగను, మందరపర్వతమును కవ్వముగను జేసి క్షీరసాగరమును దరచిరి. అట్లు వేయి సంవత్సరములుజరుగ మొదట దండకమండలములతో ధన్వంతరియును, తరువాత రూపవతులగు 60 కోట్ల యప్సరసలును వారిపరిచారిక లనేకులును జన్మించిరి. దేవదానవులు వారిని గ్రహించకపోవుటచే వారందరు సాధారణ (వేశ్యలు) స్త్రీలైరి. *తరువాత వరుణపుత్రికయగు వారుణి జన్మించెను. దైత్యులాకన్యను తమకక్కరలేదన నామెను దేవతలు బొందిరి. తరువాత నుచ్చైశ్శ్రవమను మంచిగుఱ్ఱమును, కౌస్తుభమణియును బుట్టినవి. చివరకు నమృ

* బాలకాండ, 45-వ సర్గ, 19-వ శ్లోకమున కుండలీకృతమగు ప్రక్షిప్తశ్లోకములలోగల హాలహలము జనించుటయు, దానిని శివుడు గ్రహించుటయు మొదలుగాగల యంశముల నిచట చేర్చలేదు.

తము పుట్టెను. దానివిషయమై గొప్పయుద్ధము దైత్యులకును దేవతలకును జరిగెను. రాక్షసు లసురులు నేకమైరి. దేవతలు దైత్యుల జంపిరి. ప్రజాక్షయముకాగ విష్ణువు మోహినీరూపధారియై యమృతమును బుచ్చికొని దేవతల కిచ్చెను. తనతో దలపడిన దైత్యులను నతడు పరిమార్చెను. ఇంద్రుడునుగూడ దైత్యుల నాశనమునొందించి తనరాజ్యమునుబొంది ఋషులతోను చారణులతోను సుఖముగనుండెను.

దితి తనపుత్రులు నాశనమునొందుట నెరిగి తనభర్తయగు కాశ్యపునితో నా కుమారులు నీపుత్రులచే మడిసిరని పలికి గొప్ప తపస్సు గలిగినవాడును నింద్రుని జంపువాడును నగు పుత్రుని కోరి నేను తపస్సుచేసెదను గాన గర్భోత్పత్తిజేయుమని తనభర్తను వేడెను. దానికాతడు నీవు వేయిసంవత్సరములు శుచిగనుందువేని నా వలన నీకట్టి పుత్రుడు కలుగునని సెలవిచ్చెను. కాశ్యపుడు నీటిని నామెమీదజల్లి గర్భమొసగి తపోవనమున కరిగెను. అంతట దితి మిక్కిలి సంతోషించి గంగాతీరమున నుత్తరపుగట్టును విశాలాపట్టణము కట్టబడిన పూర్వపువనమగు కుశప్లవనమును జేరి గొప్పతపస్సు చేయుచుండెను. ఇంద్రుడామెవద్దకువచ్చి గొప్ప సుగుణములతో పరిచర్యలు చేయుచుండెను. అతడగ్నిని, దర్భలను, కట్టెలను, నీటిని, పండ్లను, దుంపలను దితికి సమకూర్చి కోరినవన్నియు జతపరచుచుండెను. కాళ్లుపట్టుట మొదలగు పనులామెకు జేయుచు నెల్లప్పుడు పరిచర్యలు చేయుచుండెను. ఈతీరున వేయికి పదితక్కువగ సంవత్సరములు గడచెను. అంతట దితి యింద్రుని పరిచర్యలకు సంతోషించి వానితో నేను నీతండ్రిని వేడ, వేయిసంవత్సరముల వెనుక పుత్రుడుపుట్టునని వరమిచ్చెననియు, పదిసంవత్సరము లింకయున్నవనియు తరువాత తమ్ముని జూచెదవనియు, ఆతడు నీతో వైరమూనక భ్రాతృస్నేహముతో నుండునట్లు చేసెదననియు, త్రైలోక్య విజయుడగు నాతనితో గూడి నీవు సిరి ననుభవించెదవనియు బలికెను. తరువాత నింద్రుడు

చెంతనుండగనే పగలు మట్టమధ్యాహ్నమపుడు దితి తనకాళ్ళమీాద తలజుత్తు పెట్టుకొని నిద్రించుచుండెను. ఇంద్రుడీయశుచిత్వమును గనిపెట్టి సంతోషించి నవ్వి వజ్రముతో నామె గర్భవివరమును ప్రవేశించి యక్కడుండు గర్భమును మిక్కిలి ధైర్యముతో నేడు ముక్కలుగ గొట్టెను. అంతట గర్భమేడ్చుచుండ ఇంద్రుడు "ఏడువవలదు ఏడువవలదు (మారుద)" యని పలుకుచు, ఏడ్చుచున్నను నాగర్భమును ఖండించెను. అప్పుడు దితికి తెలివివచ్చి యింద్రునితో తనగర్భమును జంపవలదన, నామెమాట గౌరవించుటకు నాతడు గర్భమునుండి బయటికివచ్చెను. ఇంద్రుడు దితికి వజ్రముతో జేతులు మోడ్చి "దేవీ! నీవు కాళ్ళమీాద తలజుత్తుపెట్టుకొని యశుచిగ నిద్రించుటచే నీలోపమును నేను కనిపెట్టి యుద్ధములో నన్ను జంపు శత్రువును నేడు ముక్కలుగ గొట్టితిని గాన నాతప్పు క్షమించు" మనెను. దానికి మిక్కిలి దుఃఖించి యింద్రునితో మంచిమాటలాడుచు నిట్లు పలికెను. "నేను తప్పుచేయుటచే నాగర్భమేడుతునక లయ్యెను. నీదోషములేదు. ఇట్టి నాగర్భమునకు ప్రియము జరుపగోరెదను. ఈయేడు గర్భఖండములును నేడు వాయుస్థానములయందు పాలకుల య్యెదరుగాక!వీరు వాయుస్థానపాలకులై దివ్యరూపములతో నేడు దేవ రూపములగు మారుతములయ్యెదరుగాక. ఒకడు బ్రహ్మలోకమునను, నొకడు దేవేంద్రలోకమునను, మరియొక డంతరిక్షమునను, మిగిలిన నలుగురు నాలుగు దిక్కులను సంచరించెదరుగాక! ఇంద్రుడు చంపునపుడు ఈ ఏడ్చుచున్న వీరిని "మారుద" అనుటచే వీరికి 'మారుతము'లను పేరువచ్చుగాక!" దితి యిట్లు సెలవీయ నింద్రుడామెకు నమస్కరించి నీవుచెప్పినట్లు సందేహములేక జరుగుగాక యనియు నీకుమారులు దేవరూపములతో జరించెదరు గాకయనియు పలికెను. తరువాత నింద్రుడును, దితియును స్వర్గమునకుబోయిరి.



## ౫-వ అధ్యాయము—కుమారస్వామి జననము.

లోహములకు గొప్పనిధియును, పర్వతశ్రేష్ఠుడునునగు హిమవంతునికి మేరుపుత్రికయగు 'మనోరమ'యను నామెయందు 'గంగ' యను జ్యేష్ఠపుత్రిక జన్మించెను. ఆమెను తమకిమ్మని దేవతలాతని వేడ నతడట్లిచ్చెను. గంగ తనయిచ్చవచ్చినట్లు మూడులోకముల బారుచుండెను. హిమవంతునికి'ఉమ'యను రెండవపుత్రిక జన్మించెను. ఆమె గొప్పతపము చేయుచుండెను. ఆతఁడు సర్వలోకములవారును నమస్కరించదగిన దేవిని శివునకిచ్చి వివాహమొనర్చెను. శివుడామెతో కామవశుడై నూరు దివ్యసంవత్సరములు సంగమమొనర్చినను పుత్రుడు జన్మించలేదు. అప్పుడు బ్రహ్మాది దేవతలు పుట్టబోవు పుత్రునితో నెవడు యుద్ధముజేయగలడని జడిసి యందరుకలసి శివుని యొద్దకుజేరి, యాతని నమస్కరించి దేవదేవా! మహాదేవా! లోకములకు హితకారీ! నమస్కరించు దేవతలయందు మీగొప్పదయ జూపుడనియు,మీ తేజమును లోకములు ధరింపలేవు గాన మీరు పార్వతితో గూడ తపస్సుచేయుడనియు మీ రేతస్సును మీ తేజమందే నిలుపుడనియు వేడిరి.దానికాత డంగీకరించెదననియు,నస్ఖలితమగు నావీర్యమును నేను ఉమతోగూడినను నాయందు నిలిపెదననియు దేవతలు జగత్తులో సుఖముగ నుండెదరుగాకయనియు పలికి యిదివరకు స్ఖలితమైన ఇంద్రియమును నెవరు ధరించెదరనియు శివుడు దేవతలనడిగెను. దానికి వారు భూమి దానిని ధరించుననిరి. శివుడు తనవీర్యమును భూమియందు విడిచెను. అది కొండలడవులతోగూడిన జగత్తంతయు వ్యాపించెను. అప్పుడు దేవత లగ్నిదేవుని వాయుసహాయుడై రౌద్ర వీర్యమును ధరించుమని వేడిరి. అతడట్లుచేసెను. తరువాత దేవాదులు ప్రీతమనస్కులై యుమామహేశ్వరులను మిక్కిలి పూజించిరి. అయినను పార్వతి గొప్పకోపముకలదై కండ్లెఱ్ఱజేసి భూమిని, దేవత

లను నిట్లు శపించెను. "నేను పుత్రునిగోరి సంగమము జరుపుచుండ దానిని మీరు నివారించుటచే మీమీ భార్యలందు మీకు సంతానము కలుగక పోవుగాక! ఈ దినమునుండి మీభార్యలకు సంతానము లేకపోవుగాక. భూమీ! నీవనేక రూపములబొంది యనేకమందికి నీవు భార్యయగుదువుగాక! నాకు పుత్రులు జన్మించుట నీకిష్టములేకపోవుటచే నాకోపముచే నీకు పుత్రులువలన సంతోషములేకపోవునుగాక!" ఇట్లు పార్వతి శపించినతరువాత పార్వతీపరమేశ్వరులు హిమవంతమున నుత్తరశృంగమందు తపస్సుచేయుచుండిరి.

తరువాత దేవతలు సేనాపతినిగోరి బ్రహ్మయొద్దకుబోయి నమస్కరించి యిట్లు విన్నవించిరి."మాకు పూర్వమియ్యబడిన సేనాపతి (శివుడు) పార్వతితోనిప్పుడు గొప్పతపస్సు చేయుచున్నాడు.మీరే మాకు ముఖ్యమైన యాధారము. తమరు తగినట్లాజ్ఞాపింపుడు." ఇట్లు దేవతలు మనవిజేయ మీకు పార్వతిశాపమున మీభార్యలందు సంతానము కలుగదు గాన యీయాకాశగంగయందగ్ని మీసేనాపతినిపుట్టించునని పలికెను.తరువాత వారు కైలాసపర్వతమునకు బోయి యగ్నిని శివవీర్యముచే గంగయందు పుత్త్రుని కలిగించుమని కోరిరి. అప్పు డగ్ని గంగవద్దకుజేరి దేవతలప్రీతికై నీవు గర్భమును ధరింపుమని కోరెను. దానికామె పరికాశమానమగు స్త్రీరూపమును బొంద నగ్ని యామెనుచూచి యావీర్యమామెశరీరమంతటను ప్రవేశింపజేసెను. అప్పుడు గంగ యగ్నితో నీతేజమును ధరించశక్తిలేక దానిచే దహించబడుచు నాయవయవములు బాధజెందుచున్నవని పలుక నగ్ని యాగర్భమును హిమవత్పర్వతపాదమున విడువుమని కోరెను. ఆమె యట్లు విడువ నది మంచి బంగారమును, వెండియును, రాగి యును,తగరమును,సీసమును నాయెను.అక్కడ శరము(రెల్లు)లనేకములును, శ్వేతపర్వతమును బుట్టెను. గంగవిడిచినగర్భమునకు కుమార

స్వామిజన్మించ నతఁడు పాలుత్రాగుటకై దేవతలు కృత్తికలను దెచ్చిరి. వారికిపాలుకలుగ, వారు వానిని తమపుత్రునిగ భావింప దేవతలుకుమార స్వామికి 'కార్త్తికేయు'డని నామాంతర మిచ్చిరి. తరువాత వారిగర్భములనుండి స్రవించినదానిచే నాశిశువు తడుపబడుటచే వానికి'స్కందు' డనికూడ పేరిడిరి. అప్పుడు కృత్తికల కార్వురకు పాలుగలుగ కుమారస్వామి యారుముఖములుకలిగి వారిస్తనముల పాలుత్రాగెను. ఒక్కదినముననే యాశిశువు మంచిశరీరము కలుగ నాతఁడు తన వీరత్వముచే దైత్యసేనలను జయించెను. అప్పుడు దేవతలును నగ్నియు నాతని దేవసేనాధిపతిగ నభిషేకము చేసిరి.

---

## 6-వ అధ్యాయము—వామనావతారము, సిద్ధాశ్రమము.

గంగా సరయూసంగమమున గంగానదికి దక్షిణతీరమును దాటి మలదకరూశదేశములు (దక్షిణబీహారు) దాటినతరువాత పర్వతములదగ్గర పెద్దవృక్షములుగలచోట సిద్ధాశ్రమ ముండెను. చాలకాలముక్రిందట విరోచనపుత్రుడగు బలి దేవగణములను, నింద్రుని జయించి మూఁడులోకములరాజ్య మేలుచుండెను. అప్పు డగ్నియు, దేవతలును విష్ణువుయొద్దకుబోయి యతని నిట్లువేడిరి. "బలి గొప్ప యజ్ఞము చేయుచున్నాడు. అది పూర్తికాకమునుపు మనకార్యము నెరవేర్చబడవలెను. అతని నాశ్రయించి యెవరు దేనిని నాతని యాచించెదరో దానినంతయు నతడిచ్చును గనుక మీరు దేవతల హితమునకై మాయయోగ మవలంబించి వామనరూపమునుబొంది మాకు శుభము కలిగించుము." ఇట్లు దేవతలు వేడుసమయమునరికి కాశ్యపుడును, నతనిభార్య యదితియును సిద్ధాశ్రమమున దేవపూజనమున 1000 సంవత్సరములు తపస్సుచేసిరి. తరువాత కాశ్యపుడు తపోమయుడును తపోరాశియు తపోమూర్తియు తపోమహాత్ముడును నగు

మధుసూదనునిదర్శించి 'మీశరీరమున జగత్తంతయు కనబడుచున్నది, మీరనాది, వాఙ్మనసులచే నిర్దేశింప వీలులేనివారు, మిమ్ములను శరణము బొందితి,' నని మనవి చేసెను. దానికి విష్ణువు సంతోషించి నీవు వరము బొందుటకు దగినవాడ వైతివనియు, వరము కోరుమనియు కాశ్యపునితో పలికెను. దానికాత డదితికిని, దేవతలకును తనకును వరము నిమ్మనియు నది యేదన, మాదంపతులకు నీవు పుత్రుడవై జన్మించి యింద్రునికి తమ్ముడవై శోకముచే బాధనొందిన దేవతలకు సహాయము చేయుమనియు, నీగొప్పదయచే నిది సిద్ధాశ్రమమని పేరొందుననియు, మాకర్మలు సిద్ధినొంద నీవిక్కడ జన్మించుమనియు వేడెను. ఆదంపతులకు వామన రూపమున విష్ణువక్కడ పుట్టెను. తరువాత నతడు బలియొద్దకుబోయి మూడడుగులు యాచించి వాటిని బొంది లోకములన్నియు నాక్రమించి బలిని తన తేజముచే నిగ్రహించి యింద్రునికి త్రైలోక్యాధిపత్యము నిచ్చెను. ఈసిద్ధాశ్రమమున వామనుడనేకవందలయుగములు తపస్సు చేయుచు నిలిచియుండెను. ఈయాశ్రమమున తపస్సుచేసి గొప్ప ఋషులు తప్పక సిద్ధినిబొందిరి.



ఓమ్

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# విశోధితరామాయణము.

## 3 వ ప్రకరణము—ఋషులు.

### ౧-వ అధ్యాయము—ఋషుల లక్షణములు.

ఎల్లప్పుడు తపస్సు చేయుచు పాపములుపోయి పవిత్రవంతులగు ఋషులు ధర్మమును వృద్ధిచేయుదురు. వా రనేకవిధములగు గొప్ప యజ్ఞములు చేసి స్రుక్స్రువాదివస్తుసమృద్ధిగలిగి విధియుక్తముగ నగ్నిని హోమముచే తృప్తినొందింతురు. ఋషులు రాక్షసుల తిరస్కరించి వేదములను గట్టిగనుచ్చరించుటచే వార లన్నిదిక్కుల పరుగులిడుదురు. ఋషుల యగ్నిహోత్రముపొగ రాక్షసుల తేజమును హరించును. వారు పుణ్యదేశములలో చేయుగొప్పతపస్సు రాక్షసుల బీడించును.

ఋషులు సత్యమును బలుకుచు ధర్మమార్గమున చరించు దీర్ఘజీవులు. వారు సూర్యాగ్నుల తేజస్సుగలిగి తపస్సుచే ముందు వెనుక జరుగుకార్యములను కని పెట్టుదురు. ఋషులకు వేదవేదాంగములును, శాస్త్రముల నేకములును తెలియును. వారు బ్రహ్మజ్ఞానము, దివ్యజ్ఞానము గలిగి క్రోధమును, నింద్రియములను జయించి గొప్ప నియమముగలవారు. వారు బ్రహ్మవర్చస్సుగలిగి యెల్లప్పుడు భగవంతునే ధ్యానించుచుందురు,

ఋషులు సాయంకాలమున నదులలోను, సెలయేళ్ళలోను స్నానముచేసి వాటితీరమున పూవులతో దేవపూజలుచేసి తడిసిననార బట్టలతో నాశ్రమములకు వచ్చి యగ్నిహోత్రముపాసనచేసి దాని లో వేల్తురు. పెద్దమంటలు వచ్చును. పెద్దపొగలు నల్లనిమేఘముల వలె యాశ్రమములనుండి బయలువెడలుచుండును. ఋషుల యాశ్రమ ముల ప్రక్కను తడిపిన నారచీరలను, లేడిచర్మములును వ్రేలకట్టు దురు. కుశలును, నగ్నిలోవేయుటకు కట్టలును మెండుగనుండును.

ఋషు లనేకవిధములవారు. కొందరు బ్రహ్మగోళ్ళనుండి జన్మిం చిరి. కొందరు రాతనిరోమములనుండి జన్మించిరి. కొందరు ఫలమూల ముల జీవింతురు. కొందరెల్లప్పుడు స్నానముచేసి తడిసియేయుందురు. కొందరు సూర్యచంద్రకిరణముల పానముచేసి జీవింతురు. కొందరు తమ యాహారపదార్థములను రాళ్ళతో బిండిచేసియే తినుదురు. కొందరాకులుతినియే జీవింతురు. కొందరు తమయాహారపు దినుసులను తమ పండ్లతోనే పైతొక్కతీసి తినుచుందురు. కొందరు తలమాత్ర ము పైకినిలిపి నీటను నిలిచియుందురు. కొందరు భూమిపై నేమైనను పరచకయే పరుండియుందురు. కొందరు శయనింపకయే యుందురు. కొందరు గాలి యెండలలో తపస్సుచేయుచుందురు. కొందరు పర్ణశాల లలోను, లేక శూన్యస్థలములలోను నివసింతురు. కొందరునీరుత్రాగియు, కొందరు గాలిపీల్చియు జీవింతురు. కొందరుపవాసములు మిక్కిలిగ జేతురు. కొందరెండకాలమున నలుదిక్కుల నగ్నులు వెలుగుచుండ సూర్యునిజూచుచు పంచాగ్నిమధ్యస్థులై తపస్సుచేయుచుందురు.

---

## ౨వ. అధ్యాయము-వసిష్ఠుడు.

ఇతడు బ్రహ్మప్రాణమువలన* పుట్టినమహర్షి. ఇతడు వైవ స్వతమనువునకును నిక్ష్వాకుసంతతివారికిని కులగురువుగ నుండెను.

---

* ప్రమాణము—ఆంధ్రభాగవతము తృతీయస్కంధము 377—వ పద్యము.

ఇక్ష్వాకుని పుత్రులలో నొకడగు నిమి చాలాకాలముపట్టు నొకయ
జ్ఞముచేయించుటకు మొదట వసిష్ఠునికోరియుండ నాతడు తా నింద్రుని
యజ్ఞముచేయించి వచ్చెదనని పలికెను. ఇంతలో నిమి తనయజ్ఞ
మును గౌతమమునిచే చేయించుచుండెను. ఇంద్రునియజ్ఞము పూర్తి
యైనతరువాత వసిష్ఠుడు నిమియజ్ఞమునకువచ్చి యది జరుగుచుండుట
చూచి క్రోధముకలిగి నిమిని చూడబోయెను. నిమి నిద్రరచే మై
మరచియుండెను. ఇంతలో వసిష్ఠుడు నిమిని 'నీశరీరము పడుగాక' యని
శపించెను. నిమికి తెలివివచ్చి యతడు వసిష్ఠునిగూడ నట్లే శపించెను.
వారిరువురు శరీరములు కోల్పోయి వాయుగూపముతో నిలిచిరి. తరు
వాత నాబ్రాహ్మణఋషియగు వసిష్ఠుడు బ్రహ్మయొద్దకుబోయి యతని
పాదములకు నమస్కరించి యిట్లు విన్నవించెను. "నేను నిమిశాపమున
శరీరమునుకోల్పోయి వాయురూపమున నున్నాను. దేహములేని జీవు
లన్నిటికిని గొప్పదుఃఖము సంభవించును. కార్యములేమియు జరుప
బడవు. నాకు మరియొక దేహము కలుగునట్లు దయజూపుము." ఈ
మాటలు బ్రహ్మవిని మిత్రావరుణుల తేజమును బొందు మనియు,
నక్కడను గూడ నీవు యోనిగర్భమున నిలువక యే జన్మము నొందెద
వనియు, తరువాత గొప్పధర్మమును నాచరించుచు నావద్దకు వచ్చెద
వనియు సెలవిచ్చెను. తరువాత వసిష్ఠుడు బ్రహ్మను నమస్కరించి ప్రద
క్షిణముచేసి వరుణగృహమగు పాలసముద్రమును శీఘ్రముగ ప్రవే
శించెను. సూర్యుడుగూడ నాకాలమున వరుణుని పనులను చేయుచుం
డెను. అపుడు అప్సరసలలో శ్రేష్ఠురాలును పద్మదళములువంటి నేత్ర
ములు కలదియును, పూర్ణచంద్రునివంటి ముఖముకలదియును, మిక్కిలి
రూపవంతురాలునునగు యూర్వశి తన సఖులతో క్రీడించుచు దైవ
యోగమున పాలసముద్రమునకు వచ్చెను. ఆమెను వరుణుడుచూచి
మిక్కిలి సంతోషమునుబొంది సంభోగమునకు కోరెను. దానికామె

చేతులుజోడించుచు, నన్ను పూర్వము సూర్యుడు (మిత్రుడు) స్వయముగ కోరియుండెనని పలుక, వరుణుడు మన్మథబాణములచే బాధ నొందుచు "నీకు నాతో సంగమ మిష్టములేనియెడల నీతట్టు నావీర్యమునువిడిచి యీ దేవనిర్మితమగు కుంభమున నునిచెద" నని పల్కెను. దానికి నూర్వశి మిక్కిలి సంతోషమునుబొంది "మీకోరిక తప్పక జరుగుగాక! నాశరీరమును మాత్రము నేను మిత్రునికప్పచెప్ప సిద్ధముగనున్నాను, మీయందు నామనస్సెక్కువగ నున్నది" అని విన్నవింప, వరుణుడు తనవీర్యమును కుంభమును నిలిచెను. తరువాత నూర్వశి సూర్యుడుండు చోటికి బోవ నామె నాతడుచూచి "నీవు పూర్వము నాతో సంభోగమునకు నియమింపబడి యేలరాలేదు? దుర్మార్గురాలవగు నీవు మనస్సున మరియొకనికోరియున్నందున నాకునీపైనిక్రోధము కలిగినది. నీవు మనుష్యలోకమునకు బోయి కొంతకాలము నివసించి బుధునిపుత్రుడును, కాశీరాజును నగు పురూరవునికి భార్యయగుదువుగాక!" అని శపించెను. తరువాత సూర్యుడు తనవీర్యమును నాకుంభములోనే విడిచెను.

ఆకుంభమునుండి యిద్దరు బ్రాహ్మణులు జన్మించిరి. ముందు నగస్త్యుడు పుట్టెను. అతడు మిత్రునితో నేను నీపుత్రుడను కానని పలికి కుంభమునుండి వెడలిపోయెను. తరువాత కొంతకాలము నకుమిత్రావరుణుల వీర్యములువలన వసిష్ఠుడు జన్మించెను. వానిని నిక్ష్వాకువు పూర్వమువలెనే పురోహితునిగ గోరెను.

ఈమహర్షికిని విశ్వామిత్రునికిని వివాదము విశ్వామిత్రుని చరిత్రయందు జూపబడినది. ఇతడు రామునకు పురోహితుడుగనుండి నాయనగూర్చిచేసినకార్యములను రామకథలో తెల్పెదము.

—o—

## 3-వ అధ్యాయము—అగస్త్యుడు.

ఇతడు కుంభమునజన్మించిన మహర్షి. వింధ్యపర్వతము మిక్కిలి పెరుగుచుండ సూర్యుని ప్రచారమున కిబ్బందికలిగెను. అప్పుడు మహాఋషి దానివద్దకుబోవ, నది క్రిందికివంగి నమస్కరించెను. అప్పుడా మహర్షి దానితో నీవిట్లే యుండుమని యాజ్ఞాపింప నాపర్వత మట్లేయుండి వృద్ధినొందకుండెను. అగమును(వింధ్యపర్వతమును)స్తంభింపచేసినవాడగుటచే, నీతనికి నగస్త్యుడనిపేరు కలిగెను.

దక్షిణదిక్కునందు రాక్షసులబాధ లెక్కుడుకాగ నీతనిప్రభావముచే వా రక్కడ కనబడక పోయిరి. ప్రజలకక్కడ వారిబాధ లేక పోయెను.

ఇంకను నితడు వాతాపిని నాశనమునొందించిన నీకథ కలదు. దండకావనమున వాతాపి యిల్వలులను నన్నదమ్ములగునిద్దరు రాక్షసులుండిరి. క్రూరుడగు నిల్వలుడు బ్రాహ్మణరూపము ధరియించి సంస్కృతమున మాట్లాడుచు బ్రాహ్మణులను శ్రాద్ధమునకు పిలుచుచుండెను. వాడు తనతమ్ముడు మేకరూపముబొంద వానిని జంపి మేక మాంసము విప్రులకు శ్రాద్ధమున యథావిధిగ బెట్టుచుండెను. వారు భోజనముచేసినతరువాత నిల్వలుడు 'వాతాపీ వయికిరమ్ము'అని పెద్ద గొంతుకతో నరచుచుండెను.ఆమాటలు వాతాపివిని మేకవలెనరచుచు బ్రాహ్మణుల కడుపుల చించి పైకిబయలు వెడలెను.ఇట్లనేక బ్రాహ్మణులీకామరూపులగు రాక్షసులచే నాశమునొందిరి. అంతట నగస్త్యుని దేవతలు ప్రార్థింప నతడిల్వలు నింటికి శ్రాద్ధమునకు బ్రాహ్మణుడుగా వెళ్ళెను. వాతాపి యథాపూర్వముగా భక్షింపబడెను. శ్రాద్ధము సంపన్నమయినదని యిల్వలుడుపలికి యుత్తరాపోశనము నగస్త్యునికిచ్చి 'తమ్ముడా బయలు వెడలు'మనెను. ఆమాట లగస్త్యుడువిని నవ్వుచు మేషరూపుడగు నీతమ్ముడు నాయుదరమున జీర్ణింపబడి యమలోకమును

బొందెను. తిరిగివచ్చుటకు వానికిశక్తి యెక్కడకలదన నిల్వలుడు మహాఋషిని హింసించబోయెను. దానికాతడుకోపించి యెట్టఎదైన తన నేత్రముతో జూడ నాయగ్నిచే వాడుకూడ నాశనమొందెను.

అగస్త్యుడు నియమితభోజనముచేయుచు సత్పురుషుల కెల్ల ప్పుడు మేలుకలుగ జేయ గోరుచుండెను. ఈతని నాశ్రమము దండకా వనమధ్యమున నుండెను. అక్కడ దేవతలు, సిద్ధులు, గొప్పఋషులు, యక్షులు, నాగులు, గరుడులు నియమముగ భుజించుచు, ధర్మమున జరించుచు నీమహాఋషుని కొల్చుచుండిరి. అక్కడ యబద్ధమాడు వాడుకాని, క్రూరుడుగాని,లోలోపల విప్రియములు చేయువాడుగాని, హింసచేయువాడుగాని, యింద్రియ లోలుడుగాని, నివసించలేదు. ఈతని సేవచేయు మహాఋషులు, సిద్ధులు దేహమువిడిచినతరువాత తేజోవంతములగు విమానములెక్కి మంచిశరీరములతో స్వర్గమునకు బోవుదురు. లోకులిక్కడుండు దేవతలను బూజించి యక్షత్వమును, మరణములేని జీవనమును, ననేక రాజ్యముల యాధిపత్యములను బొందుదురు.

అగస్త్యుడు గొప్పతపస్సుచేయుచుండెను. అతడు దండకావన మున తనయాశ్రమును నిర్మించకపూర్వము జరిగినవృత్తాంతపుకథ యిట్లుకలదు. దండుడు శుక్రునికూతురగు నరజను బలత్కారముగా బట్టుటచే వింధ్య, శైవల పర్వతముల మధ్యనున్న 800మైళ్ళు నిడివిగం దేశమగు నాతనిరాజ్యము శుక్రునిశాపముచే నాశనమై *దండకా వన మయ్యెను. అరజ యుండిన శుక్రునియాయాశ్రమముమాత్రము4మైళ్ళ వరకు పెద్దసరస్సయ్యెను. దానిలో మంచిజలపక్షులు కూయుచుండెను. పద్మములు, కలువలు, నాచు, మొదలగునవి యుండెను. నీరు నిర్మ లముగనుండెను. ఈసరస్సుదగ్గఱ పూర్వపు త్రేతాయుగములలో నొక

*చూ. ప్రకరణము 6, అధ్యాయము 3, దశరథుని పూర్వులు.

దానియందు నగస్త్యుడు తపస్సుచేయుటకై యాశ్రమము నేర్పరిచి యొండకాలమున నొకరాత్రి యచట నిలచెను. ఆమరునాడుదయ మున నగస్త్యుడులేచి సరస్సుకువెళ్ళగా దానిలో బలిసినమంచి శరీరముకలదియు, గొప్ప తేజముకలదియు,ముసలితనము పొందనిదియు నగు నొకశవమాతనికి కనబడెను. దానిగూర్చి యాఋషి యొక ముహూర్తమాలోచించి యాశవమును చూచుచుండ, హంసలుచే మోయబడి మనోవేగముగలదియు, ప్రకాశమానమగునదియు, నా శ్చర్యముగ కనబడునదియు నగు నొకవిమానము వచ్చెను. దానిలో నొకగొప్పస్వర్గపు దివ్యపురుషుడును,మంచిశరీరములుగల వేయియప్స రసలును నుండిరి. వారాపురుషునితో క్రీడించుచుండిరి. కొందరు మంచిపాటలుపాడుచుండిరి. కొందరు మంచిమాటలాడు చుండిరి. కొందరు నృత్యముచేయుచుండిరి. కొందరు కేకలువేయు చుండిరి. కొందరు బంగారుపిడులుగల వింజామరములతో నాతని వీచు చుండిరి. కొందరా దివ్యపురుషుని ముఖమును కడిగిరి. తరువాత నతడు తనసింహాసనమును విడిచి విమానమునుండి దిగి, శవమాంసమును నిచ్చవచ్చినటుల భక్షించెను. తరువాత నతడు సరస్సులోదిగి, చేతులు కడిగి క్రమముగ నాచమనముచేసి, విమానము నెక్కె ను. అప్పుడగస్త్యుడాదివ్యపురుషునితో "దేవతలుతో సమానముగ నున్న మీరెవరు? మీరుతినిన యాహారము నసహ్యకరముగ నున్నదే! దీనికి మీరేమనియెదరు? మీవంటివారికిట్టి యాహా రము తగియుండునా? నాకాశ్చర్యముకలుగుచున్నది. నిజమును మీవల్లనుండి విన గోరెదను. మీరు శవమునుభుజించుట యుక్తము కాదని తలచెదను." అని పలికెను.

అగస్త్యునిమాటలాదివ్యపురుషుడువిని చేతులుజోడించి తన పూర్వచరిత్రమును నిట్లు తెలిపెను. "పూర్వము నాతండ్రి సుదేవుడను

వాఁడు విదర్భకు రాజుగనుండెను. పరాక్రమశాలియగు నాతనికీర్తి ముల్లోకముల వ్యాపించెను. అతనికిద్దరుభార్యలు. పెద్దభార్యవలన శ్వేతుఁడను నేను జన్మించితిని. చిన్నభార్యవలన సురథుఁడనువాఁడు జన్మించెను. నాతండ్రి స్వర్గస్థుఁడుకాఁగా, పట్టణవాసులు నన్ను రాజుగ నభిషేకింప నేను ధర్మమార్గమున జాగ్రత్తగా రాజ్యము చేయుచుంటిని. వేయి సంవత్సరములు నేను రాజ్యము చేసినతరువాతి కొంతకాలమునకు, నేనెవరో యొకని వలన నాయాయుఃపరిమాణము తెలిసికొని నామరణముసంగతి మనస్సులో నుంచుకొని, నాతమ్మునికి రాజ్యమునిచ్చి, పశువులు మృగములు లేని యీదండకావనమునకు వచ్చి యీసరస్సు సమీపమున చాలకాలము తపస్సుచేసియుంటిని. నేను మూఁడువేలసంవత్సరములు గొప్ప తపస్సుచేసినతరువాత బ్రహ్మలోకమును బొందితిని. అక్కడ నాకాకలిదప్పులబాధ యెక్కువగ నుండెను. నేను బ్రహ్మయొద్దకు బోయి యాకలిదప్పులులేని యీబ్రహ్మలోకమున నేనేమి పాపము చేయుటచే నాకివి కలుగుచున్నవనియు, నాకేది యాహారమనియు విన్నవించితిని. దీనికాతఁ డిట్లు సెలవిచ్చెను. నీకు నీశరీరసంబంధమగు మంచిమాంసమే యాహారము. నీవు తపస్సుచేసినపుడు నీశరీరము వృద్ధిచెందెను. ఎక్కడనైనను, విత్తులువిత్తినగాని మొక్కలుపుట్టి పెరుగవు. అడవిలో నీవేదియు విత్తియుండలేదు. అందుచేత పూర్వము నీవు తపస్సుచేయుకాలమున భిక్షుకువచ్చిన యతులకు నీవు భోజనము పెట్టకుంటివి. నీ వతిథులకిచ్చిన దేమియు కొంచెమయినను లేదు. గనుక నీవు స్వర్గమునకువచ్చినను నాకలిదప్పులు బాధించుచున్నవి. గనుక మంచి యాహారములచే బలిసిన నీశరీరమాంసమును నీవు తినిన నది నీకమృతరసముతో సమానమై నీకు తృప్తికలిగించును. దండకావనమ్మునకు నగస్త్యుఁడువచ్చినపిమ్మటనీకష్టములుపూర్తిగతొలగిపోవును.

అతడు దేవతలైనను తరింపజేయును. నీయాకలిదప్పులన నతని కెంత?" ఇట్లు బ్రహ్మ నాకాజ్ఞాపించెను.

అగస్త్యునితో నామహాపురుషుడింకను నిట్లు మనవిచేసికొనెను. "బ్రహ్మ యాజ్ఞచే నాస్వంతశరీరమాంసమును అనేకసంవత్సరముల నుండినేను భుజించుచున్నను నిది నాశనము నొందకున్నది. నాకు తృప్తి యుకలుగకున్నది. నన్నీ గొప్పకష్టము నుండి విముక్తునిచేయుము. మీరు తప్ప నితరులు నాకుగతిలేదు. నన్ను తరింపజేయుటకు నీయలంకారము పుచ్చికొని మీరు దయచూపుడు. ఇది యుండినంతకాలము జనులకు బంగారమును, ధనమును, బట్టలను, భక్ష్యములను, భోజ్యములను, నాభరణములను నిచ్చును. మీరు కోరినభోగములనిచ్చెదను. నన్ను తరింపజేయుడు." ఇట్లాదివ్యపురుషుడు పలుక నగస్త్యుడాయాభరణమును పుచ్చుకొనెను. తక్షణమే యారాజు పూర్వపు మనుష్యశరీరము నశింప వానిపాపము తొలగెను. ఆరాజర్షి సంతోషముతో బ్రహ్మలోకమునకు బోయెను.

అగస్త్యునకు రామునకు జరిగినసమావేశములు రామకథలో తెలిపెదము.

—:♦:—

## ౪-అధ్యాయము—అనసూయ.

అనసూయయను నామె యత్రిమహాముని భార్య. పూర్వమొకప్పుడు 10సంవత్సరములు కరువురాగ దేశమంతయు మండుచుండెను. అప్పుడామె తపముచేయుచుండ ఫలమూలములు సృజింపబడినవి. గంగానది పూర్ణజలయై ప్రవహింపసాగెను. ఈతీరున నామె 10,000 సంవత్సరములు తపస్సు విఘ్నములేక చేసెను. ఆమె తపస్సుచే పది రాత్రులు దేవతలలాభముకొఱ కొకరాత్రిగ కనబడెను. తనగొప్ప కర్మలచే నసూయలేనందున నామె నననసూయయను నామము నొందెను.

—♦—

## ౧౧-వ అధ్యాయము — మాండకర్ణి ఋషి.

మాండకర్ణిఋషి 10,000సంవత్సరములు నీటనిలిచి వాయువునుభక్షించుచు ఘోరమైనతపమును జేయుచుండెను. అప్పుడు అగ్ని మున్నగు దేవతలందరు మిగులభీతిల్లి యొకచోటగూడి 'మనస్థానములలో నెవ్వైదెనగోరి యీతడు తపముచేయుచున్నా' డని యాలోచించి తపోభంగముగావింప మెరపువలెమెరియుచున్న ముఖ్యురాండ్రగు నైదుగురప్సరసల నంపిరి. వారు జీవపరమాత్మజ్ఞానముగల యామహర్షిని మన్మథపరవశునిగావించి దేవకార్యమునునెరవేర్ప నాతనికి భార్యలైరి. ఆతడు దండకారణ్యమున నొక సరస్సులోపల గృహమునునిర్మించి తనతపోబలముచే యౌవనమునొంది యాయప్సరసలతో విహరించుచుండెను. ఆయప్సరసలునాట్యమాడునపుడు వాద్యములధ్వనియు, నలంకారధ్వనితోగలసిన పాటధ్వనియు భూమిపైనున్నవారికిగూడ వినిపించుచుండెను.

## ౧౨-వ అధ్యాయము — అహల్యాశాపము.

పూర్వము బ్రహ్మ యొకే వర్ణము, భాష, రూపము గల ప్రజల ననేకులను సృజించెను. వారందరు నెట్టిభేదములేక యొకే తీరుననుండిరి. అప్పుడు బ్రహ్మ యేకాగ్రమనస్సుతో భేదముగల యొకస్త్రీని ప్రత్యేకముగ సృజింపదలచి యాప్రజల ప్రతియవయవమునందలి యెన్నదగినసొంపును కూడదీసి రూపవతియగు *నహల్యను నిర్మించెను. 'హల్య' మన నందవికారపురూపమునుండి

* తెలుగుభాగవతము 9-వస్కంధమున 657-వ పద్యమున నీమె చంద్రవంశజుడగు ముద్గలుని కూతురుగ వివరింపబడెను. ముద్గలుడు జన్మముచే క్షత్రియుడయ్యు తరువాత బ్రాహ్మణుడయ్యెను.

పుట్టినది. అట్టిది కానందున 'అహల్య' యను యామెకు పేరుకలిగెను. ఇంద్రుడు తాను గొప్పపదవియందుండుటచే నీయందకత్తె తనకే భార్యకాదగునని యెంచెను. కాని, బ్రహ్మ యీసంగతిదెలిసికొని గౌతమునికడ నామెనునిచెను. గౌతము డామె ననేకసంవత్సరములు దాచి బ్రహ్మకు తిరిగియప్పగింప నాతడు గౌతముని స్థిరచిత్తతకు మెచ్చుకొని యాతనికే యామెనిచ్చి వివాహముచేసెను. గౌతము డామెతోగూడి మిథిలయొక్క యుపవనమున దివ్యమగునాశ్రమము నందు ననేకసంవత్సరములు తపముచేసెను.

ఒకనాడు గౌతముడులేనిసమయమున నాతనివేషముతో నింద్రు డాతనియాశ్రమమునకుబోయి యహల్యతో "నేను నీతో సంగమముగోరి వచ్చితిని. కాముకులు స్త్రీలఋతుకాలమును నిరీక్షింపరు గదా!" యనిపలుక దుర్బుద్ధియగునామె యింద్రుడేయాతడని తెలిసియు నాతనియందు కుతూహలముకలిగి యాతనికోరికను నెరవేర్చి "కృతార్థురాలనైతిని. వేగముగబొమ్ము. నన్ను, నిన్ను రక్షించుకొనుము." అని పలికెను. అంతటనింద్రుడు తనయభీష్టమును నెరవేర్చుకొని నవ్వుచు వచ్చినదారినిబోయెదనని పలికి తొందరగ బోవుచు తనయాశ్రమమునకువచ్చుచున్న గౌతముని కంటబడి మిగుల భీతిల్లెను. గొప్పతపోబలముకలవాడును, దేవదానవులకులొంగనివాడు నగుగౌతముడు స్నానముచేసి తడిబట్టలతో కుశలను, సమిధలను పట్టుకొని వచ్చుచుండెను. మునివేషముతోనున్నయింద్రునిజూచి నిజమారసి యామహర్షి "ఓదుర్బుద్ధీ, నావేషముధరించి చేయగూడని పని చేసితివి. నీయకృత్యమునకు ఫలితముగ * వృషణహీనుడవగుము." అనిశపింప వెంటనే వానివృషణములు తెగి క్రిందపడెను. గౌతముడు వెంటనే యహల్యతో ‡ "నీ వీయాశ్రమమున వేల

* వెయ్యియోనులుకలవాడవయ్యెదవు" అని అ. రా.

‡ "శిలయయ్యెదవు" అని అ. రా.

కొలదిసంవత్సరము లాహారములేక తపించుచు, గాలినే భక్షించుచు, బూడిదయందు శయనించుచు, నెవరికిని గాన్పింపక పడియుందువు. దశరథపుత్రుడగు రాముడీయాశ్రమమునకు వచ్చినతోడనే పవిత్రురాలవై యాతని కాతిథ్యమొసగి లోభమోహములుతొలగ తొల్లిరూపమున నన్నుగలియుదువు." అనిపలికి యాశ్రమమునువీడి పుణ్యమగు హిమవచ్ఛిఖరిమునకుబోయి తపముజేయుచుండెను.

వృషణహీనుడగునింద్రుడు తనలోకమునకుబోయి అగ్నిమున్నగు దేవతలను, ఋషులను, చారణులను బిలచి తాను గౌతమునికి జేసిన యపచారమును, దానిమూలమున దాను,నహల్యయు శపింపబడిన విధమును, శాపమునిచ్చుటచే గౌతమునికి గలిగినతపోభంగమును, దానివలన దేవకార్యము నెరవేరుటను వారికెరిగించి తనకు వృషణములిప్పింప సహాయము జేయుడని వారినికోరెను. వెంటనే వారందరు పితృదేవతలయొద్దకుబోయి "మీకు నియ్యబడిన యీమేకయొక్క వృషణములనుదీసి యింద్రునకు దగిలింపుడు. ఇటుపిమ్మట వృషణహీనమగు మేకను మానవులిచ్చినను వారికర్మకు లోపములేకుండ మీకు సంతృప్తికలుగును." అనిపలికిరి. వెంటనే పితృదేవతలు మేకవృషణములుతీసి యింద్రునకు దగిలించిరి. అప్పటినుండియు వృషణములులేని మేకను శ్రాద్ధమునందిచ్చినను మానవులకు కర్మహానిలేకుండ పితృదేవతలకు తృప్తికలుగుచుండెను.

## ౭-వ అధ్యాయము — *వాల్మీకి.

ఇతడు వరుణిని పదియవపుత్రుడు. జన్మముచే బ్రాహ్మణుడయ్యు నింద్రియజయములేక శూద్రస్త్రీయందనేకపుత్రులనుగని శూద్రాచారుడై యుండెను. ఇతడు కిరాతులతో మెలగుచు వారి

* ఈతనికథయంతయు నధ్యాత్మరామాయణమునుండి గ్రహింపబడినది.

సంఘమునసే పెరుగుచు క్రమముగ చౌర్యవృత్తిలోనికిదిగెను. ధనుర్బా
ణములనుబట్టి ఎంతటిమహాత్ములకైన వెనుదీయక 'గజదొంగ' యయ్యెను.

ఒకనాడీతడు, గొప్పయడవిలో సూర్యతేజముగల సప్త మహర్షులు పోవుచుండ, వారిసామగ్రిని దొంగిలింపదలచి వారిని వెంబడించెను. వా రీతనిచర్యగాంచి 'ద్విజాధమా, నీవేలవచ్చితివి?' అని యడుగ దనకు పెద్దకుటుంబముకలదనియు, భార్యాపుత్రులనుపోషింప చౌర్యవృత్తి జేయుచున్నాననియు, దోచుకొనుటకే వచ్చితిననియు వారితోబలికెను. "నీవు ప్రతిదినమునుజేయుపాపమును నీకుటుంబము పంచుకొనునోలేదో కనుగొని రమ్ము. అంతవరకు మే మిచ్చటనే యుందుము." అని సప్తఋషులుచెప్ప వాడింటికేగి యడిగెను. పాపముతో తమకు సంబంధములేదనియు, ధనమునే తా మనుభవింతుమనియు భార్యాపుత్రాదులుచెప్ప మిక్కిలివిచారించుచు నాఋషుల కడకు వచ్చెను. దయామయులైన ఋషులను జూచుటతోడనే పాపములుతొలగి పవిత్రుడై 'క్షమించి రక్షింపు'డని వేడుచు వారి పాదములపైబడెను.

వా రాతనిని లేవదీసి సత్పురుషులనుగలియుటచే నీవు పవిత్రుడవై దానిఫలము ననుభవింతువనియు, నీకు మే ముపదేశించి మోక్షమార్గముజూపెదమనియు బలికి, వారిలోవారు 'ఈతడు పశ్చాత్తప్తుడైనందున మనచే తప్పక రక్షింపదగినవా'డని యాలోచించి 'రామ' మంత్రమును 'మరా' యని తిరగవేసి యుపదేశించిరి. తాము తిరిగి యిచ్చటికివచ్చువరకు దానియందేదృష్టినిలిపి యామంత్రమునుజపింప నాజ్ఞాపించి వారు వెడలిరి.

అంతటనాతడు మంచిమనస్సుతో నిశ్చలుడై సర్వమునుమరచి తన్మయుడై యామంత్రమునుజపించెను. ఇట్లు వేలకొలదిసంవత్సరములు గడువగా నాతనిపై వల్మీకము (పుట్ట) బలిసెను. వెయ్యియుగములు గడచినతరువాత సప్తఋషులువచ్చి వానిని బయటికి రమ్మనిరి. వాడు

బయటికిరాగా మంచువిడచిన సూర్యుడువలె నగపడెను. 'వల్మీకము' నుండి బయటికి వచ్చుటచే 'వాల్మీకి'యని యాబుషులు పేరుపెట్టిరి.

వాల్మీకి రాముడువనవాసమున కేగినపుడు చిత్రకూటమున నాశ్రమమేర్పరచుకొనియుండెను. మరికొంత కాలమునకు నయోధ్య నుండిమధురకుబోవు త్రోవలో గంగానదికిసమీపముగా తమసానది యొద్దున నాశ్రమమునేర్పరచుకొనెను. ఇక్కడనే శ్రీమదాశ్రమా యణమును రచించెను. ఇక్కడనే సీత యీాతనిసంరక్షణలోనుండి కుశలవులనుగనెను. దీనినిబట్టి వాల్మీకి కొంతకాలము చిత్రకూటాశ్ర మునుండి పిమ్మట తమసానదీతీరమున క్రొత్తయాశ్రమము నేర్పరచు కొనినట్లు స్పష్టమగును.



ఓమ్

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# విశోధితరామాయణము.



## 4 వ ప్రకరణము—పూర్వవానరులు.

### ౧-వ అధ్యాయము — వాలిసుగ్రీవులు.



పర్వతములన్నిటిలో మిగుల పెద్దదియు బంగారుమయమైనదియు నగు మేరుపర్వత మొకటి కలదు. దేవతలందరిచే పూజింపబడు దాని మధ్యశిఖరమునందు నూరుయోజనముల (800 మైళ్ళ) పొడవును, నంతే వెడల్పును గల బ్రహ్మపట్టణము కలదు. అందు బ్రహ్మ నివసించును. ఆతడు యోగాభ్యాసము జేయుచుండ నొకప్పుడాతనికండ్లనుండి రసము కారెను. దానిని చేతిలోవేసికొని నలిపి భూమిమీదజల్లెను. 'ఋక్షరజసు' డను నొకవానరుడు దానినుండి బయలుదేరెను. వాని నోదార్చుచు బ్రహ్మ యిట్లు పలికెను. "దేవతలునివసించు నీగొప్ప పర్వతమున నీ కాహారముగ దుంపలు, ఫలములు విరివిగాదొరకును. వానినిభుజించుచు నాకడనే కొంతకాలముండుము. నీకు శ్రేయము గలుగును." ఇట్లు బ్రహ్మసెలవీయ నావానరుడు బ్రహ్మపాదములకు నమస్కరించి యచ్చటనెనడచుకొనుచుండెను.

ఆవానరుడు మిక్కిలివేగముగలవాడై పువ్వులతోను, పండ్లతోను నిండియున్న చెట్లుగల వనమున కేగుచు పండ్లనుదినుచు తేనెలను, పువ్వులను, పండ్లను సంగ్రహించి ప్రతిదినము సాయంకాలమున బ్రహ్మపాదములయం దర్పించుచుండెను. ఇట్లుండ నొకనాడాతడు దప్పికచే

బాధపడి యుత్తరశిఖరమునకుబోయి మంచినీరుగలసరస్సును గాంచెను. దానియొద్దనకుబోయి జుత్తునుకదల్చుచు నీటిలో తనప్రతిబింబమును జూచెను. మరియొకవానరుడు నీటిలోనుండి తనను వెక్కిరించుచున్నట్లు భ్రమపడి యాశత్రువును పట్టి నిగ్రహింపవలెనని కోతిబుద్ధిచే నాలోచించి సరస్సులోనికిదుమికెను. నీటనుండిపైకిరాగానే యావానరుడు త్రిలోకసుందరియగు స్త్రీగా మారిపోయెను. ఆస్త్రీ లక్ష్మిపార్వతీ సరస్వతులవలెనుండి దిక్కులను ప్రకాశింపజేయుచుండెను. ఇంతలో బ్రహ్మనుసేవించి యింటికిపోవుచున్నయింద్రుడు దానిలో నీమెను గాంచెను. అదేసమయమున సూర్యుడాకాశమార్గమునచరించుచు నావనమునకేగెను. ఇంద్రసూర్యులిద్దరు నొకేసమయమున నామెను జూచి మన్మథబాధనొందిరి. ఇంద్రుడు ధైర్యమువిడచి యామెతో సంభోగములేకయే యామెశిరస్సునందు వీర్యమునువిడచెను. దాని వలన నామె బలశాలియగు పుత్రునిగనెను. ఆవీర్యము వాలము (తోక) నందుపడుటచే పుట్టినందున 'వాలి'యని యాతడు పేరొందెను. సూర్యుడుకూడ నదేవిధముగ నామెగ్రీవము (మెడ) నందు వీర్యమువిడచుటచే దానివలనజన్మించినవాడు 'సుగ్రీవు'డయ్యెను. ఇంద్రుడు నాశనములేనిదియు గుణములుగలదియు నగు బంగారు మాలికను వాలికిచ్చి స్వర్గమునకుజనెను. సూర్యుడు హనుమంతుని తనపుత్రుడైనసుగ్రీవునకు సర్వకార్యములందు సహాయునిగా నియమించి యాకాశమునకుబోయెను.

మరుచటిదినమున వాలిసుగ్రీవులతల్లి యథాపూర్వముగ వానర రూపమునుబొందెను. ఆవానరము కామరూపులు, బలశాలురునగు తనపుత్రులకు నమృతమువంటి తేనెల నాహారమిచ్చి వారితోగూడ బ్రహ్మసన్నిధికేగెను. బ్రహ్మ యావానరునోదార్చి దేవదూతలను పిలిపించి యిట్లాజ్ఞాపించెను. "ఓయీ, వీరిని కిష్కింధానగరమునకు దీసికొనిపొమ్ము. అక్కడనుండువానరులను, వారిసేనానాయకులను పిలి

పించి గౌరవించి పుత్రులతోఁగూడిన యీ ఋక్షరజసుని సింహాసనమున గూర్చుండబెట్టి పట్టాభిషిక్తునిగావింపుము. అచ్చటివానరు లితనిచే చూడబడినమాత్రముననే యితనికివశులగుదురు. ఇట్లు బ్రహ్మయాజ్ఞా పింప నా దేవదూత యీ ముగ్వురినిదోడ్కొని కిష్కింధకుబోయి ఋక్షరజసుని రాజుగ జేసెను. ఏడుదీవులలోనుండువానరులను నితడు సంతోషముతో నేలుచుండెను.

కిష్కింధయనునది బ్రహ్మయాజ్ఞచే విశ్వకర్మనిర్మించిన గొప్ప పట్టణము. ఇది వింధ్యపర్వతపంక్తికినుత్తరమున కొంచెముదూరముగ నొకగుహాలో కలదు. ఇది యనేకధ్వజములతోను, యంత్రములతోను నిండి రత్నమయములైన మేడలుకలిగి బంగారుప్రాకారములతో నొప్పు చుండెను. ఇందు నానావిధములైన యంగళ్లుకలవు. రత్నాదులలో వ్యాపారములు విరివిగ జరుగుచుండెను. ఇచ్చట వానరులు కామ రూపులు; మంచిపుష్పమాలలను బట్టలను ధరించువారు. వారిలో నాలుగువర్ణములవారును గలరు. ఇచ్చట చందనము మొదలగు సుగంధ ద్రవ్యములు, అనేకవిధములగుమద్యములు దొరుకుచుండెను. నిర్మల మైననీరుగల నది ప్రవహించుచుండెను. ఋక్షరజసునినగరు ఇంద్ర భవనమువలె ప్రకాశించుచు కొండశిఖరములువలెనున్న గొప్పగొప్ప మేడలతో విరాజిల్లుచుండెను. ఇందు ద్రిడిచ్చిన వివిధవృక్షములుకూడ నచ్చట పెరుగుచుండెను.

వాలిసుగ్రీవులు గొప్పబలశాలురు. పెద్దశరీరము, పెద్దబాహు వులుగలవారు. ప్రకాశమానమగు ముఖముగలవారు. గరుడునివలె వేగముగబోవువారు. ఇద్దరును నొక్కతీరుననే యుండుటచే పోల్చుటకు వీలులేకుండును. వీరిలో వాలి యధికబలవంతుడు. సూర్యుని తేజముగల వాడు. పెద్దపెద్దచెట్లను విరచువాడు. కొండశిఖరములెక్కి పెద్దరాళ్ళ నుపైకివిసరి చేతులతో పట్టువాడు. అనేకరాక్షసులను వధించినవాడు.

పాల సముద్రమును మథించినపుడు 'తార' యనునామెపుట్టెను. ఆమెచేతిని సుషేణుడు వాలిచేతిలో పెట్టెను. కనుక దేవతలామెకు సుషేణుని తండ్రిగాను, వాలిని భర్తగాను నిర్ణయించిరి. ఆమె వాలితో సుఖముగ కాపురముచేయుచుండెను.

ఋక్షరజసుడు మరణమునొందినతరువాత మంత్రిలాలోచించి బలవంతుడగువాలిని రాజుగను, సుగ్రీవుని యువరాజుగను జేసిరి.

వాలి గొప్పపౌరుషముగలవాడు. ఇతడు ప్రతిదినము వేకువ జామున లేచి దక్షిణసముద్రమునకు,నక్కడనుండిపశ్చిమసముద్రమునకు, నక్కడనుండియుత్తరసముద్రమునకు,నక్కడనుండి తూర్పుసముద్రము నకు బోయి, సంధ్యావందనాదికృత్యములనుదీర్చికొని సూర్యోదయము కాకుండనే కిష్కింధకు జేరుచుండెను. ఇతడు రావణునికి పరాభవ మొనర్చినకథ రావణపరాజయకథలలో దెల్పబడును. ఈతడు గోలభు డనుగంధర్వునితో 15 సంవత్సరములు యుద్ధముచేసి 16-వ సంవత్సర మున నాతనినంతమొందించెను. వాలి 'దుందుభి'యనురాక్షసుని,వాని కొడుకు 'మాయావి'ని జంపినవృత్తాంతమీాక్రింద వర్ణింపబడుచున్నది.

దుందుభి వెయ్యియేనుగులబలము, కైలాసశిఖరమునుబోలిన పెద్దశరీరము గలిగి దున్నపోతురూపముతో నుండెను. ఇతడు తపస్సు జేసి, వరములుపొంది తనతోయుద్ధము జేయదగినవానికై వెదకుచు సముద్రునియొద్దకుబోయి వానిని యుద్ధమునకుబిలిచెను. సముద్రుడు తా నశక్తుడననియు, హిమవంతుడు సమర్థుడనియు జెప్పి యక్కడకు బొమ్మనెను. వెంటనే దుందుభి తపము జేయుమహర్షులతోను, గుహల తోను, రాళ్ళతోను నిండినహిమవత్పర్వతమునకు వేగముగబోయి రాళ్ళనువిసరుచు పెద్దధ్వనిచేసెను. అప్పుడాపర్వతము తెల్లనిమేఘపు కాంతిగలపురుషరూపమునుదాల్చి తనశిఖరముసనిలిచి 'సన్న్యాస పెట్టుకము. నాకు యుద్ధమునందు నేర్పులేదు.' అనిపలుకనారాక్షసుడు కోపముతో 'నీవుసమర్థుడవయ్యు భయముచే నాతోయుద్ధముచేయున్ని

యెడల నాతో యుద్ధముచేయగలవానిని జేర్కొను' మనిపలికెను. హిమవంతుడు కోపముతో "కిష్కింధలో నింద్రపరాక్రమముగలిగి మంచి బుద్ధిమంతుడగు 'వాలి'యనువానరశ్రేష్ఠుడు కలడు. అతడు ద్వంద్వయుద్ధమున నారితేరినవాడు. నీకిష్టమున్న యెడల వానియొద్దకు పొమ్ము" అనిచెప్ప, నారాక్షసుడా రాత్రియే కిష్కింధకుబోయి సింహద్వారమున బిగ్గరగనరచుచు, చెట్లనువిరచుచు, కాళ్ళగొరిజలతో భూమిని త్రవ్వుచు, పట్టణద్వారమును పైకెత్తదలచి తనకొమ్ములతో దానిని పొడచుచుండెను.

ఈబీభత్సమును సంతఃపురమునసున్నవాలియు, నంతఃపురస్త్రీలును తెలిసికొని దుందుభియుండుతావునకువచ్చిరి. వాలి యారాక్షసునితో 'నీవు నానగరద్వారమున కడ్డుగ నెందుకు నిలచి యరచుచున్నావు? నీసంగతి నాకుదెలియును. నీప్రాణములు రక్షించుకొనుము.' అనిపలుక నారాక్షసుడు కండ్లెఱ్ఱజేసి "ఆడువారియెదుట నేల ప్రగల్భములు పల్కెదవు? నాతో యుద్ధముచేసి నీబలమును జూపించుము. ఇప్పుడుకానిచో రేపటివరకు నేనిచ్చటనే వేచియుండును. నీ వీరాత్రి కామభోగములను స్వేచ్ఛగననుభవింపుము. నీబంధువులకు నియ్యదలచినధనమునిచ్చి, తగినరాజును నియమించి, మిత్రులందరితోను మాట్లాడి రేపు నాతో యుద్ధమునకురమ్ము. త్రాగినవాడు, జాగ్రత్త లేనివాడు, నిద్రించినవాడు, ఆయుధములులేనివాడు, నీవంటికామమోహితుడు -వీరినిజంపినచో భ్రూణహత్యాపాపము(గర్భస్థశిశువును జంపుటచేవచ్చుపాపము) గల్గునందురు." అనిగర్వమున బలికెను.

వాలి చిరునవ్వునవ్వి స్త్రీల నంతఃపురమునకుబోనియమించి "నీవు నాతో యుద్ధమునకు భయపడకుండు వేని నన్ను మత్తునిగ భావించి యీరాత్రి వేచియుండనక్కరలేదు. నేజేసినమద్యపానము యుద్ధారంభమున వీరులుచేయుమద్యపానముగానే భావించి నాతో యుద్ధమునకు సన్నద్ధుడవగుము" అనిరాక్షసునితో బలికి, తనతండ్రియింద్రుడిచ్చిన బంగారుపూలమాలనుధరించి, కోపముతో యుద్ధమునకునిలిచి, పర్వతము

వలెనున్న యారాక్షసుని కొమ్ములుపట్టుకొని, గిరగిరత్రిప్పి పెద్దధ్వని జేయుచు విసరివైచెను. వెంటనే వానిచెవులనుండి రక్తము కారజొచ్చెను. పిమ్మట వారిద్దరు నొకరినొకరు జయింపదలచి పిడికిళ్ళతోను, మోకాళ్ళతోను, రాళ్ళతోను, చెట్లతోను ఘోరముగపోరాడిరి. ఆ యుద్ధమునందు దుందుభిబలము క్రమముగక్షీణింప, వాలిబలము క్రమముగవృద్ధిజెందెను. క్షీణబలుడైనయాదుందుభిని వాలి వేగముతో పైకెత్తి నేలమీదగొట్టెను. తోడనే వాడు మరణించెను. వాలి యాశవమునుపైకెత్తి నాలుగుక్రోసులదూరమునపడున ట్లాక్షుమ్మడి విసరెను. ఆవేగమునకు దానినోటినుండి చిమ్మబడినరక్తబిందువులు గాలికెగిరి మతంగాశ్రమమున పడెను.

మతంగుడు కోపించి తనవైపు నీరక్తమునుజిమ్మిన మహాపాపాత్ముడెవడో తెలియగోరి బయటికివచ్చిచూడగా పర్వతాకారముకలిగి పడియున్నదుందుభిశవము కాన్పించెను. తనతపోబలముచే వాలివలన నిదిజరిగినట్లు తెలిసికొని వానికిట్లు శాపమొసగెను. "వాలి నాయాశ్రమము చుట్టు నాలుగుక్రోసులదూరమున నుండుప్రదేశమును ప్రవేశింపరాదు. ప్రవేశించినచో వాడు మరణించును. మరియు నావనమునవివసించు వాలియనుచరులందరు నావనమునువీడి నేడే మరియొకచోటికిపోవలెను. ఈరోజుదాటుటతోడనే యీశాపమములులోనికివచ్చును. రేపు నావనమున నేవానరుడైన కనబడినచో వాడు వేలకొలదిసంవత్సరములు రాయియగును." ఈశాపవచనములను వానరులు వెంటనే వాలికెరిగింప నాతడువచ్చి మతంగుని బ్రతిమాలుకొనెను. కాని, మతంగుడు వినిపించుకొనక తనయాశ్రమమునకుబోయెను. వాలి మిక్కిలివిచారించి యప్పటినుండియు నాయాశ్రమమునకు, దానిసమీపముననున్న ఋష్యమూకపర్వతమునకు బోవకుండెను.

ఇట్లుండ నొకనాటిరాత్రివేళ దుందుభిపెద్దకుమారుడు 'మాయావి' యనువాడు కిష్కింధకుబోయి నగరుద్వారమున బొబ్బలిడుచు వాలిని

యుద్ధమునకుబిలిచెను. అంతఃపుర స్త్రీలును, సుగ్రీవుడును వలదనినను వినక వాలి వానినిజంప తొందరగ బయలుదేరెను. సుగ్రీవుడు వాలిని వెంబడించి వెడలెను. వారిద్దరినిజూచి మాయావి భయపడిపరుగెత్తెను. ఇంతలో చంద్రోదయమై దారికాన్పింప వానిని వారిద్దరు వెంటదరిమిరి. వారు సమీపించుటతోడనే మాయావి గడ్డితో కప్పబడియున్న సొరంగమును ప్రవేశించెను. వాలి సుగ్రీవునితో 'నే నీరాక్షసుని జంపివచ్చువరకు నీ వీబిలద్వారమున జాగరూకుడవై యుండు' మని పలుక సుగ్రీవుడు తానుకూడ వచ్చెదనని ప్రార్థించెను. కాని వాలి యొప్పుకొనక తనపాదముపై చేయివేయించి ప్రమాణముచేయించుకొని బిలద్వారమున నాతనికావలాయుంచి లోనికిబోయెను.

పిదప నొకసంవత్సరముగడచినను వాలి రానందున నాతడుచంపబడెనేమోయని యనుమానము సుగ్రీవునకుకలుగజొచ్చెను. ఇంతలో బిలద్వారమునుండి నురుగుతోగూడినరక్తధారలు ప్రవహించుటయు, రాక్షసులకేకలు వినబడుటయు జూచి సుగ్రీవుడు వాలిమరణించెనని నిశ్చయించుకొని, పెద్దరాతితో బిలద్వారమును మూసి, అన్నకునుదకక్రియలుచేసి కిష్కింధకు మరలివచ్చెను. అతడు తెలుపకపోయినను మంత్రులు ప్రశ్నోత్తరములచే వాలిమరణమును తెలిసికొనిరి. దేశమరాజకముకాకుండ సుగ్రీవునకు పట్టముగట్టిరి. అతడు తారతోను, తనభార్య రుమతోను భోగించుచు సుఖముగ రాజ్యమేలుచుండెను.

వాలి యొకసంవత్సరమువరకు వెదకి చివరకు మాయావినిపట్టుకొని యుద్ధమున వానిని, వానిబంధువులను వధించెను. సుగ్రీవుడు నాడు వినినకేకలు, గాంచినరక్తధారలు నారాక్షసులవే. వాలి తిరిగి బిలద్వారమునకురాగా సద్దుగా రాయికాన్పించెను. సుగ్రీవు నెన్నిసార్లుపిలచినను మారుపలుకు లేకుండెను. అంతట రాయిని కాలుతో దన్ని బయటికివచ్చి కిష్కింధ జేరెను.

సుగ్రీవుడు పట్టాభిషిక్తుడగుటగాంచి, ముందు వానిమంత్రులను బంధించి సుగ్రీవుని పరుషముగ నిందించెను. అప్పుడు సుగ్రీవుడు నమస్కరించి "అన్నా, దైవవశమున మీరు శత్రువునుజంపి కుశలముగ వచ్చినారు. ఇవిగో మీ ఛత్రచామరములు. వీనిని గ్రహింపుడు. నేను బిలద్వారమున నొకసంవత్సరముండి రక్తధారలు వచ్చుటతోడనే విచారముతో బిలద్వారమునుమూసి కిష్కింధకు వచ్చితిని. నేను కోరకయే మంత్రులు, పౌరులు నాకు పట్టాభిషేకము జేసిరి. నీవే రాజువు. నేను యథాపూర్వముగనుందును. నీ రాజ్యమును నీ కొప్పగించుచున్నాను. నాపై కోపగింపకుము." ఇట్లు వేడుకున్నను వినక వాలి సుగ్రీవు ననేకవిధముల నిందించి సభ చేసి జరిగినదంతయు వారికి దెల్పి సుగ్రీవునిభార్యనపహరించి వానినితరిమివేసెను. హనుమంతుడు మున్నగుమంత్రులతోగూడ సుగ్రీవుడు తూర్పుచివర నుదయాద్రి వరకు పారిపోయెను. వాలి యింకను తరుముచుండ దక్షిణదిక్కు చివరకు పారిపోయి, ఇంకనుతరుముచుండ పశ్చిమమునకు, నట్లేయుత్తరమునకు పారిపోయి యింకను తరుముచుండ, బుద్ధిమంతుడగుహనుమంతుడు 'శాపమువలన మతంగాశ్రమమునకుచుట్టు నాలుగుక్రోసులదూరమున వాలి సంచరింపవీలులేనందున నట్టితావున నివాసమేర్పరచుకొనుట మంచి' దనిచెప్ప సుగ్రీవుడంగీకరించి ఋష్యమూకమున నివాసమేర్పరచుకొనెను.

వాలిసుగ్రీవులకును, రామునకును సంబంధించిన విషయములు రామకథలో దెలుపబడును.



## త్రి-వ అధ్యాయము-హనుమంతుడు.



అస్తాద్రిప్రక్కను సుమేరు వనుపర్వతము కలదు. సూర్యునివరముచే నది బంగారుమయమైయుండెను. అందెల్లప్పుడు మహర్షులు నివ

సించియుందురు. అక్కడ బృహస్పతిపుత్రుడు 'కేసరి' యనువానరా ధిపుడు రాజ్యముచేయుచుండెను. ఇతడు మహర్షులకోరికచే 'శంబసా దను' డనురాక్షసుని జంపినవాడు. ఈతనిభార్య యంజనాదేవి. ఈమె పూర్వజన్మమున'పుంజికస్థల'యను నప్సరసయై శాపవశమున'కుంజరు' డనువానరశ్రేష్ఠునకు కూతురుగాజన్మించి 'అంజనాదేవి' యను పే రొంది కేసరిని పెండ్లాడెను. ఈమె రూపవతియు, కామరూపమును బొందగలదియు నై యుండెను.

ఈమె యొకనాడు సింధుయౌవనమునసున్న మనుష్యస్త్రీ యొక్క రూపమునుదాల్చి మంచిమాల్యములను,అంకారములను,వస్త్ర ములను ధరించి సుమేరుపర్వతముమీద విహరించుచుండెను. వాయు దేవు డామెనుకామించి యామెవస్త్రమును మెల్లగతొలగించి సంభోగిం చెను. ఆమె తత్తరపాటుచెంది 'నాపాతివ్రత్యమునుభంగపరచినదెవ' రని యనుచుండ వాయుదేవుడు ప్రత్యక్షమయి 'భయపడకుము. నీ పాతివ్రత్యమునకు భంగములేదు. వీర్యవంతుడు, బుద్ధిమంతుడు, గొప్ప రూపతేజోబలపరాక్రమములుగలవాడు, లంఘించుటలో నాతోసమానుడు నగుపుత్రుడు నీకు గల్గు' నని చెప్పి వెళ్లిపోయెను. ఆమె సంతోషముతో మందరగుహాలోనికిబోయి పుత్రుని గనెను.

మిక్కిలి ప్రకాశించుచున్న శరీరచ్ఛాయకల యాపిల్లవాని నంజనాదేవి సుమేరువునకుదెచ్చి యొకచోటనుంచి ఫలములకై యడ వికిబోయెను. ఆశిశువు తల్లి దగ్గరలేకుండుటచేతను, ఆకలివేయుట చేతను మిక్కిలియేడ్చుచు నప్పుడే ఉదయించుచున్న సూర్యుని జూచి ఫలమనిభ్రాంతినొంది యాసూర్యునిపట్టుకొనుటకు నాకాశమున కెగి రెను. దేవదానవయక్షులు లెగురుచున్నయాపిల్లవాని గతిపరాక్రమము లనుజూచి యాశ్చర్యపడుచు మిక్కిలిమెచ్చుకొనిరి. అప్పుడు వాయువు సూర్యునివేడిమికికాలిపోకుండ మంచుకురిపించుచు తనపుత్రుని వెంబ డించెను. పిల్లవాడు తండ్రిబలముచేతను, బాల్యముచేతను వేలకొలది

యోజనము లెగిరి సూర్యునిదరిచేరెను. వీడు దోసములేనివాడనియు, గొప్పకార్యము నెరవేర్పవలసినవాడనియు దెలిసి సూర్యుఁడతని దహింప లేదు.

ఆ దినమే రాహువు సూర్యునిమ్రింగవలసిన దినము. రాహువు సూర్యరథముమీదఁగూర్చొని మ్రింగ సిద్ధముగనుండెను. ఇంతలో నీశిశువు సూర్యుని పట్టుకొనుటనుజూచి రాహువు భయపడి తప్పించుకొని యింద్రునికడకు గోపముతోబోయి "నాకాహారముగ సూర్యచంద్రుల నిచ్చియుంటివి. ఇప్పుడు వారిని మరియొకనికాహారముగ నేల యిచ్చితివి? నేడుపర్వదినమని నేను సూర్యునిగ్రహింపనుండ మరియొక రాహువువచ్చి యాతనిని పట్టుకొనె" ననిపలుక నిందుడు తత్తరపాటుతో నాసనమునుండిలేచి బంగారుమాలనుబట్టుకొని యైరావతమెక్కి రాహువుతోఁగూడ వాయుపుత్రునితోఁగూడిసూర్యుడున్నచోటికి వెడలెను. అప్పుడు రాహు విండ్రుడున్నాడనుధైర్యముతో సూర్యుని గ్రహింపబోవ వాయుపుత్రుడు సూర్యునివిడచి ఫలభ్రాంతిచే రాహువును పట్టుకొనబోయెను. రాహువుభీతిల్లి తప్పించుకొని యింద్రునిశరణ జొచ్చెను. 'భయపడకుము. నేను వీనినిజంపుచున్నా' నని యింద్రుడనుచుండగానే యాపిల్లవా డైరావతమును ఫలమనుకొని దానిమీదికి పరుగెత్తెను. అప్పుడు వానిరూప మింద్రాగ్నులరూపమువలె భయంకరమైయుండెను. ఆశిశువునుచూచి యింద్రుడు మిక్కిలికోపము చెందకపోయినను తనచేతికొనతో గట్టిగావిడువబడిన వజ్రాయుధముచే గొట్టగా నాతడు పర్వతముమీదపడెను. వాని యెడమచెక్కిలికి దెబ్బతగిలెను.

అప్పుడు వాయుదేవుడింద్రునిపై మిగులకోపించి, శిశువునుదీసికొని యొకగుహాలోనికిబోయెను. తోడనే ప్రాణులశరీరములోపలి వాయుప్రచారమాగిపోయెను. మలమూత్రాశయములు బంధింపబడెను. సర్వభూతములు వాయుప్రకోపమువలన నూపిరాడక, కీళ్లు

చలింపక కట్టుకట్టిపోయెను. అందుచే వేదపఠనము, యాగాదికర్మలు, ధర్మకార్యములు నిలిచిపోయి ప్రపంచమంతయు నరకమందున్నట్లయ్యెను. అప్పుడు గంధర్వులు, దేవతలు, మనుష్యులు మున్నగువారందరు వాయువు స్తంభించుటచే పెద్దబొజ్జలుగలవారై దుఃఖమునుండి విముక్తిగోరి బ్రహ్మకడకుబరుగెత్తిరి. "భగవంతుడా, నీవుమమ్ములను సృజించి మాప్రాణములునిలుచుటకు వాయుదేవుననుగ్రహించితివి. ఆప్రాణేశ్వరుడేలకో మమ్ముల నంతఃపురస్త్రీలనువలె నిరోధించి దుఃఖంపజేయుచున్నాడు. ఈదుఃఖమునుతొలగింప నిన్ను శరణవేడుచున్నాము." అనివారుపలుకఁ బ్రహ్మ జరిగినదంతయు వారికిజెప్పి "శరీరములందు వాయు వశరీరియై చరించును. వాయువుచరింపనిశరీరము కట్టెతో సమానము. వాయువే ప్రాణము. ఈలోకమంతయు వాయువే. వాయువులేనిలోకము సుఖమునొందదు. లోకమునకాయువునిచ్చు వాయువిప్పుడు దానిని వీడియున్నాడు. అందుచే నేడు లోకము కట్టెవలెను, గోడవలెను నున్నది. మనకీయాపదకలుగజేసిన వాయువున్నచోటునకు పోవుదము; రండు. ఆతని ననుగ్రహింపజేసికొని యీవినాశమును తప్పించుకొందము."ఇట్లుపలికి యాతడు దేవగంధర్వాదులను తోడ్చుకొని వాయువుండుగుహకు బోయి సూర్యాగ్నుల తేజముతో నొప్పుచు వాయువుతొడపైనున్న శిశువుపై దయామయమైనదృష్టిని సారించెను.

పుత్రవధచేదుఃఖించుచున్న వాయువు బ్రహ్మనుజూచినతోడనే శిశువునెత్తికొనిలేచి బ్రహ్మపాదములపైబడి నమస్కరించెను. బ్రహ్మ వాయువునులేవనెత్తి శిశువుదేహమును చేతితో నంతటనుస్పృశించెను. తోడనే ప్రాణములువచ్చి శిశువుజీవింప వాయువు మిక్కిలిసంతోషించి వెంటనే ప్రాణులశరీరములందు సంచరింప మొదలిడెను. వాయునిరోధము తొలగినందున ప్రాణులందరు సంతసింపసాగిరి. వాయువునకు ప్రియముజేయగోరి బ్రహ్మ యింద్రాదులతో "మీకంతయు దెలిసియున్నను మీహితమునుగోరి నేజెప్పునది వినుడు. ఈపిల్లవానిచే

మున్ముందు మీకార్యము నెరవేర్పబడును. కావున మీరందరు వీనికి వరములొసగుడు" అని సెలవిచ్చెను. తోడనే యింద్రుడు పద్మమాలనుపైకెత్తి "నావజ్రాయుధముచే వీనిచెక్కిలికొట్టబడినందున వీనికి 'హనుమంతు'డని పేరువచ్చెను. నావజ్రాయుధముచే నితడుమరణింపడు" అనివరమొసగెను. పిమ్మట సూర్యుడు తనతేజములో నూరవవంతు నిచ్చి తగినవయస్సువచ్చినతోడనే శాస్త్రములితనికివచ్చునట్లనుగ్రహింతుననియు, నందువలన గొప్పవక్తయై పాండిత్యమునసాటిలేనివాడగుననియు జెప్పెను. నూరుసంవత్సరములువచ్చినను వీనికి నుదకమువలనగాని, తనపాశములవలనగాని మృత్యువులేదని వరుణుడు వరమొసగెను. యమదండమువలనచావులేకుండుటను, రోగములులేక యెల్లప్పుడు సంతోషముతో నుండుటను, యుద్ధమున విచారము లేకుండుటను యముడనుగ్రహించెను. తనగదచే వీనికి చావులేదని కుబేరుడు పలికెను. తనవలనగాని, తనయస్త్రములవలన గాని చావుండదని యీశ్వరుడు ప్రసాదించెను. బ్రహ్మదండములన్నిటిచేతనుచావులేకుండుటను, దీర్ఘాయువును, మహాత్మత్వమును బ్రహ్మ కటాక్షించెను. తానునిర్మించిన దివ్యశస్త్రములచే యుద్ధమున చావు లేకుండుటను, చిరజీవిత్వమును త్వష్ట యొసగెను. పిమ్మట బ్రహ్మ సంతోషమున వాయువుతో "నీపుత్రుడు శత్రువులకుభయంకరుడై మిత్రులకు నభయమొసగును. యుద్ధమునజయింపబడడు. రావణునికి నష్టమును, రామునకు మేలును నొనగూర్చును. అద్భుతములైనపనులు చేసి వాసికెక్కును" అనిపలికి దేవతలతో తనస్థానమునకరిగెను. వాయువుకూడ పుత్రునినంజనాదేవికొప్పగించి వరలాభమును తెలియ జెప్పి వెడలిపోయెను.

హనుమంతుడు వరములవలన లోలోన బలముచే పూరింపబడి నిర్భయుడై యాశ్రమములకుబోయి స్రుక్కులనువిరచియు, నారచీరెలనుచించియు, నగ్నిహోత్రములనార్పియు మహర్షులకు బాధలు

కలిగించెను. బ్రహ్మాదండములచే వీనికి చావులేదని తెలిసి వారు క్షమించిరి. తలిదండ్రులు, వాయువు ఎంతనివారించినను నితడు వినకుండెను. అప్పుడు భృగు, అంగీరస వంశస్థులగుఋషులు మిక్కిలికోపింపకయే యిట్లుశపించిరి. "ఏబలముచే నీవు మమ్మిట్లుబాధించుచున్నావో యాబలమును మాశాపముచే మోహితుడవై చిరకాలము గుర్తింపనేరవు. (త్వరలో మరచిపోదువు.) నీకీర్తి శ్లాఘింపబడినకాలమందియు నీబలము వృద్ధిచెందుచుండును." ఈశాపముచే తనబలముతగ్గిపోవ నాతడాశ్రమములలో మృదువుగ మెలగుచుండెను.

ఇట్లుండ కిష్కింధలో 'ఋక్షరజసు'డను వానరరాజు మరణింప వానిపెద్దకుమారుడువాలి రాజుగను, చిన్నకుమారుడు సుగ్రీవుడు యువరాజుగను నుండిరి. హనుమంతునికి సుగ్రీవునితో భేదింపశక్యముకానిదియు, నచంచలమైనదియు నగుసఖ్య మేర్పడెను. హనుమంతునియందు శౌర్యము, దక్షత్వము, బలము, ధైర్యము, ప్రాజ్ఞత, నయసాధనము, విక్రమము, ప్రభావము, ఉత్సాహము, మంచిశీలము, ఓర్మి మున్నగుసుగుణములన్నియు నెలకొనియుండెను. దేవతలకశక్యమైనయుద్ధముల నితడు చేసెను. బలమునను, గమనమునను నితనికి సాటియగువారు లేరు. పూర్వమితడు వ్యాకరణము నేర్చుకొనునప్పుడు నిత్యము సూర్యాభిముఖుడై ఉదయాద్రినుండి వెనుకకునడచి యస్తాద్రివరకుపోవుచు శాస్త్రాభ్యాసముచేసి సూత్రములు, వార్తికములు, వ్యాఖ్యానములు, సంగ్రహము- వీనితోగూడిన గొప్ప యర్థముగలవ్యాకరణశాస్త్రమును సాధించెను. ఇతడు నవవ్యాకరణవేత్తయై వేదవేదాంగములను బాగుగనేర్చినవాడు. ఇతడు మిగుల బుద్ధిమంతుడై వ్యాకరణయుక్తముగను, మధురముగను మాటలాడగల గొప్పవక్తయని ఖ్యాతిజెందెను. సర్వవిద్యలయందును, తపము [illegible] నితడు బృహస్పతినిగూడ మించినవాడు.

ఈహనుమంతుడు రామునిగూర్చిచేసిన కార్యములన్నియు రామకథలో దెలుపబడును.

---

## ౩-వ అధ్యాయము — ఇతరవానరులు.

దేవతలుమున్నగువారు రావణునిబాధల కోర్వలేక బ్రహ్మ కడకుబోయి మొఱ్ఱపెట్టుకొనగా బ్రహ్మ తానేమియు ప్రతిక్రియచేయ జాలక విష్ణువుకడకుబొమ్మని సెలవిచ్చెను. అట్లువారు పోయి విష్ణువునకు తమబాధలు సవిస్తరముగ విన్నవింప నాతడు మనుష్యజన్మమెత్తి రావణుని సంహరించెదనని వారికభయ మొసగెను. అంతకుపూర్వమే చిరకాలముక్రిందట బ్రహ్మ యొకప్పుడు దేవతలు, ఋషులు, గంధర్వులు మున్నగు దేవజాతులవారిని రప్పించి "రామావతారమున రామునకు సహాయముజేయ మీరందరు మీయిష్టానుసారము వానరులను *ఋక్షులను (ఎలుగుగొడ్లను), *గోపుచ్ఛులను (ఆవుతోకవంటి తోకగలవారిని) సృజింపు"డని యాజ్ఞాపించియుండెను. అప్పుడు వారు కిన్నరస్త్రీలు, విద్యాధరస్త్రీలు, గంధర్వస్త్రీలు, అప్సరసలు, నాగకన్యలు మున్నగువారియందును, ఋక్ష, వానర, గోపుచ్ఛస్త్రీలయందును ననేకులను పుట్టించిరి.

ఈపుట్టిన ఋక్షవానర గోపుచ్ఛులొకచోటనేగాక నలుదిక్కులను వ్యాపించియుండిరి. వారు హిమవత్, వింధ్య, కైలాస, మందర, మహేంద్ర, ధూమ్ర, అంజనాది పర్వతములందును, మేరు, ఉదయగిరి, అస్తాద్రుల ప్రాంతములందును, చందనపుతోటలు, సరస్సులు, సముద్రములు, నదీతీరములు, ఋష్యాశ్రమములు మున్నగుతావులందును నివసించియుండిరి. వారు మైరేయాదిమద్యములను త్రాగుదురు. వారిలోకొందరు పది, వంద, వెయ్యి యేనుగులబలముకలవారు. మరికొందరు అంతకంటెను హెచ్చుబలముకలవారు. వారు కొండలువలె,

---

*ఋక్షులు, గోపుచ్ఛులు వానరజాతి భేదములు.

మేఘములువలె విశాలములును పెద్దవియు నగు శరీరములుకలవారై వికృతరూపము, వికృతముఖము కలిగియుందురు. వారిజుత్తు బంగారు చ్ఛాయకలిగి సింహపుజుత్తునుపోలియుండును. వారిశరీరకాంతి సూర్యునిగాని, చంద్రునిగాని, పద్మకేశరములనుగాని పోలియుండును. వారందరు కామరూపులు, మాయావులు. సింహపరాక్రములు, వాయువేగులు, అస్త్రబలముకలవారు. బుద్ధిమంతులు, నీతిమంతులు, ఉపాయము తెలిసినవారు. యుద్ధములలో గోళ్ళను, కోరలను నాయుధములుగనుపయోగించువారు. రాళ్ళతోను చెట్లతోను, పోరు సలుపువారు. యుద్ధములందు శత్రువులనుజయించువారేగాని పరాజయము నెన్నడు పొందువారుకారు.

వీరిలో ముఖ్యులగు కొందరినిగూర్చి యిట సంగ్రహముగా దెల్పుచున్నాము—

నీలుడు, ఉల్కాముఖుడు, అసంగుడు, నగ్నిపుత్రులు. నళుడు విశ్వకర్మపుత్రుడు. ఇతడు తండ్రివలె శిల్పవిద్యాప్రవీణుడు. సుషేణుడు మరీచిమహర్షిపుత్రుడు. ఇతడే వాలిభార్యయగు 'తార'కు తండ్రిగ భావింపబడెను. తేజమున నింద్రునకు, వేగమున గరుత్మంతునకు సాటియైనవాడు. గొప్పబుద్ధిపరాక్రమములు కలవాడు. మైందుడు, ద్వివిదుడు అశ్వినీదేవతలపుత్రులు. వీరు దేవసైన్యమునుజయించి యమృతమునుగ్రోలినవారు. బ్రహ్మ వీరితండ్రిని మర్యాదచేయగోరి వీరికి చావులేదని వరమిచ్చెను. గంధమాదనుడు కుబేరునిపుత్రుడు. గజ, గవాక్ష, గవయ, శరభులు, గంధమాదనుడు (మరియొకడు) యమునిపుత్రులు. తారతండ్రికాక మరియిద్దరుసుషేణులు కలరు. వారిలోనొకడు వరుణపుత్రుడు. రెండవవాడు ధర్మదేవతపుత్రుడు. ఇట్లే శరభుడు మరియొకడు కలడు. ఇతడు పర్జన్యపుత్రుడు. దధిముఖుడు చంద్రపుత్రుడు. శ్వేతుడు, జ్యోతిర్ముఖుడు సూర్యపుత్రులు. హేమకూటుడు వరుణపుత్రుడు. సుదుర్ధరుడు వసుపుత్రుడు. నముఖుడు,

దుర్ముఖుడు, వేగదర్శి బ్రహ్మపుత్రులు. క్రథనుడు దేవాసురయుద్ధమున దేవతలకు సహాయము జేయుటకై గంధర్వకన్యకయందు జన్మించినవాడు. ఇతడింద్రపరాక్రమముకలిగి కుబేరునిపర్వతమున వానరులతో సంచరించుచుండెను. సన్నాదనుడను వానరశ్రేష్ఠుడు కొన్ని యోజనములయెత్తుకలిగి గొప్పపరాక్రమవంతుడై దేవతలకు సహాయము చేసినవాడు.

పశ్చిమదిక్కున 60,000పర్వతములమధ్య 'సావర్ణిమేరు' అను పర్వతము కలదు. అందు ననేకరంగులశరీరములును, పెద్దతోకలును కలిగి గొప్పపరాక్రమముగల వానరులు నివసించుచుండిరి. వారిని 'శతవలి' యనువాడు పాలించుచుండెను. ఇతడు నిత్యము సూర్యునినుపాసించువాడు. శౌర్యము, బలము, పరాక్రమము, పౌరుషము గలవాడు. 'కుముదు' డనువాడు గోమతీతీరమునందలి సంకోచపర్వతమున నివసించువానరులకు రాజుగనుండెను. 'రంభు' డనువాడు వింధ్య, కృష్ణగిరి, సహ్య, సుదర్శన పర్వతములందుండు వానరులను పాలించుచుండెను. 'శరభుడు' సాల్వేయపర్వతమునందలి వానరులకు రాజు. 'పనసుడు' పారియాత్రపర్వతమునందలి వానరులకు ప్రభువు. 'వినతుడు' పర్ణాసనదిపరిక్కను పాలించుచుండెను. 'ప్రమాథి' యనువాడు గంగాతీరమున ఉశీరబీజమనుపర్వతమునందు నివసించుచున్న బలవంతులగు వానరులసేనలకు నాయకుడుగానుండెను. పూర్వమొకప్పుడు వానరులకు, యేనుగులకు గొప్పయుద్ధముజరుగ నీత డనేకమదగజములను నాశనము జేసెను.

ఋక్షులు పెద్దపెంటుకలు, నీలమేఘములవంటి శరీరములు కలిగి గొప్పపరాక్రమవంతులై యుండిరి. వీరు యుద్ధసమయమున కొండశిఖరములెక్కి పెద్దగండశిలలను శత్రువులపై రువ్వుదురు. వీరు రాక్షసపిశాచములతో సమానమైనబలముగలవారు. మృత్యువునకై

నను భయపడనివారు. వీరు ఋక్షవంతమనుపర్వతమున నివసించుచు నర్మదనీటిని త్రాగుచుదురు. వీరిలో ముఖ్యులు ధూమ్రుడు, జాంబవంతుడు. వీరిద్దరు బ్రహ్మపుత్రులు. వీరిలో పెద్దవాడు ధూమ్రుడు ఋక్షులకందరకు రాజుగనుండెను. చిన్నవాడగు జాంబవంతుడు గొప్పబలపరాక్రమశాలి. దేవాసురయుద్ధమున దేవతలకు సహాయమొనర్చినవాడు.

గోపుచ్ఛులు నల్లనిముఖము, పెద్దశరీరము కలిగి మిగులబలవంతులైయుండిరి. వీరందరు రూపమునను, వేషమునను, పరాక్రమమునను తమతండ్రుల ననుకరింతురు. గవాక్షుడు వీరందరికి రాజుగనుండెను.

వానరులు ముందుగువారుజరిపిన రామకార్యములు రామ రామకథలో దెలుపబడును.



ఓమ్

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# విశోధితరామాయణము.



## 5 వ ప్రకరణము—

## రాక్షసులు, రావణుని పూర్వపుచర్యలు.



### ౧-వ అధ్యాయము — పూర్వపురాక్షసులు



పూర్వము హేతి ప్రహేతియను సోదరులైన రాక్షసాధిపు లిద్దరు కలరు. వారు మధుకైటభులతో సమానులై శత్రువులనోడించెడివారు. వారిలో ప్రహేతి ధార్మికుడై తపోవనమునకరిగెను. హేతి యనువాడు పెండ్లికై మిక్కిలిప్రయత్నించి 'భయ'యని సార్థకమైన పేరుగల కాలునిచెల్లెలను పెండ్లాడెను. ఆమెయందు 'విద్యుత్కేశు' డను పుత్రునిగనెను. ఆపిల్లవాడు ప్రజ్వలించు సూర్యునికాంతిగలిగి క్రమముగయౌవనమునొందగా తండ్రి సర్వలక్షణసంపన్నురాలగు 'సాలకటంకట'యనుకన్య నాతనికి భార్యగాజేయగోరి యామెతల్లి యగు సంధ్యనుగోరెను. ఆమెయు 'కన్యక నెప్పుడైన నితరులకియ్యవలసినదే'యని తలచి హేతికోరికనుమన్నించి విద్యుత్కేశునకు తన కూతురునిచ్చి వివాహముచేసెను. ఆనూతనదంపతులు కొంతకాలముసుఖముగనుండ 'సాలకటంకట' గర్భవతియాయెను. ఆమె మందర పర్వతమునకుబోయి 'సుకేశు'డను పుత్రునిగనెను. ఆమె భర్తతో రమింపగోరి శిశువునచ్చటనేవిడచి వెళ్ళిపోయెను. శరత్కాలపు

సూర్యునికాంతిగల యాసుకేశుడు నోటిలోపిడికిలిపెట్టుకొనియేడ్వగా ఉరుమువలెవినబడెను. అంతట వాయుమార్గమున వృషభము నెక్కి-వెడలుచున్న పార్వతీశివులు రోదనధ్వనివిని పిల్లవానినిజూచిరి. పార్వతి కనికరించి శివునిప్రార్థింప నతడు సుకేశునకు తల్లితో సమానమగు వయస్సును, మరణములేకుండుటను ప్రసాదించి వానిని కైలాసమునకు తీసికొనిపోయెను. పార్వతి రాక్షసులందరకు 'నప్పుడేగర్భము, నప్పుడేప్రసవము, నప్పుడేతల్లితో సమానమగు వయస్సువచ్చుట' అను వరములననుగ్రహించెను. సుకేశుడు శివునిసిరిగలిగి వరదానమున గర్వించినవాడై చరించుచుండెను.

'గ్రామణి' యను గంధర్వుడు వరములనుపొంది ధార్మికుడైయున్న సుకేశునకు రెండవలక్ష్మివలెనున్న రూపయౌవనసంపన్నురాలగు 'దేవవతి' యను తనకూతురునిచ్చి వివాహముచేసెను. ఆదంపతులకు శివునిత్రినేత్రములువలె, త్రేతాగ్నులువలెనొప్పు ముప్పురు పుత్రులు 'మాల్యవంతుడు, సుమాలి, మాలి' యను వారలు జన్మించిరి.




ఈముప్పురును, తమతండ్రి తనతపోబలముచే నీశ్వరప్రసాదమునుబొందగలిగినట్లు తెలిసికొని, తాముకూడ నట్లే తపముచేయ సంకల్పించి మేరుపర్వతమునకుబోయిరి. అచ్చటవారు కఠిననియమములనుపాలించి, సత్యము, ఋజుత్వము, శమము కలిగి సర్వభూతము

లకు భయముకలిగించు నతిదుష్కరమైనతపము నాచరించి దేవాసుర మనుష్యలోకములకు సంతాపమును గలిగించిరి. అంతట బ్రహ్మ యింద్రాదిదేవతలతోఁగూడి వారుండుతావునకు వచ్చి 'మీతపమునకు మెచ్చితిని. వరమునుగోరు' డనిపలుక వారు 'శత్రువుల కజేయులమై వారిని సంహరించుచు, చిరజీవులమై ప్రభుత్వము కలిగియుండున ట్లను గ్రహింపు' డని కోరిరి. బ్రహ్మ 'అట్లే యగుగాక' యనిపలికి తన లోకమునకుఁబోయెను. ఆరాక్షసులు వరములబొంది నిర్భయులై సురాసురులను బాధింప దేవతలు, ఋషులు, చారణులు, రక్షకుని గాంచక నరకబాధ ననుభవించిరి.

ఇట్లుండ సుకేశపుత్రు లొకనాడు శిల్పిశ్రేష్ఠుడైన విశ్వకర్మను బిలిపించి "తేజోబలసంపన్నులగు దేవతలకు వారిమనస్సునకునచ్చినగృహమును నిర్మించియుంటివి. మాకుగూడనట్లే మేరు మందర హిమాలయ పర్వతములం దెచ్చటనైనను మహేశ్వరగృహమువంటి గృహమును నిర్మింపుము" అనికోరగా త్వష్ట యిట్లనియె. "దక్షిణసముద్రతీరమున సువేలపర్వతము నంటి త్రికూటమను పర్వతమొకటి కలదు. దానిమధ్య శిఖరమున పక్షులుకూడ చేరవీలులేనిదియు, ఉలులచే దొలవబడిన నాలుగుదిక్కులుకలదియు, ముప్పదియోజనముల వెడల్పు నూరుయోజనములపొడవు కలదియు, బంగారుమయమైన ప్రాకారములు, సింహద్వారము కలదియు పెద్దయగడ్తలతోఁగూడినదియు నగు 'లంక'యను పట్టణ మొకటికలదు. అది పూర్వము దేవేంద్రుడాజ్ఞాపింప నాచే నిర్మింపబడినది. అమరావతియందు దేవతలతోఁగూడి దేవేంద్రుడు నివసించినట్లు మీరు రాక్షసులతోఁగూడి యాలంకలో సుఖముగ నివసింపుడు. ఈలంకాదుర్గమున మీరు శత్రువులకు లొంగనివారై వారిని సులభముగ జయింపగల్గుదురు." త్వష్ట యిట్లుపలుక వారు మిక్కిలి సంతసించి వేలకొలదియనుచరులతో నాలంకాపురిఁజేరి యందు సుఖముగ నివసించిరి.

ఒకనాడు 'నర్మద' యను ధార్మికురాలైన గంధర్వస్త్రీయొకతె లంక కేతెంచెను. ఆమెకు 'హ్రీ, శ్రీ, కీర్తులు' వలెనొప్పుచున్న ముప్పురు పుత్రికలు కలరు. వారిలో 'సుందరి'ని మాల్యవంతునకు, 'కేతుమతి'ని సుమాలికి 'వసుధ'ను మాలికి జ్యేష్ఠక్రమముగ నిచ్చి వివాహములు గావించెను. సుకేశపుత్రులు ముప్పురు పూర్ణచంద్రునివంటి మోము గల యాగంధర్వకన్యకలు ముప్పురితోఁగూడి సుఖముగ కాపురము చేయుచుండిరి. ఆముప్పురిదంపతులకు గలిగిన సంతానముల వివరములు ఈక్రింది వంశవృక్షమువలన దెలియనగును.

1. మాల్యవంతుడు, భార్యసుందరి.




2. సుమాలి, భార్యకేతుమతి.




♦ 3. మాలి, భార్యవసుధ.




* ఈగుర్తుకలవారు స్త్రీలు.

♦ మాలిపుత్రులు నల్గురు విభీషణుని మంత్రులు.

సుకేశపుత్రులుముగ్గురు తమపుత్రులతోను, అనుచరులైన రాక్షసులతోనుగూడి యింద్రుడు, దేవతలు,ఋషులు,నాగులు మున్నగువారిని మిగులబాధించుచుండిరి. వారు లోకములందంతట దిరుగుచు యజ్ఞములనుపాడుచేయుచు, శత్రుసంహారముగావించుచు మృత్యుతుల్యులై లోకములను హడలెత్తించుచుండిరి. దేవతులు, ఋషులు మున్నగువారు దేవదేవుడును, సర్వలోకములకు నాధారభూతుడునగు మహేశ్వరుని శరణుజొచ్చి యిట్లువిన్నవించుకొనిరి. "బ్రహ్మవరముచే సుకేశపుత్రులు గర్వించి ప్రజలను బాధించుచున్నారు. మాయాశ్రమములను పాడుజేసినారు. ఇంద్రుని తనపదవినుండి తొలగించి స్వర్గము నాక్రమించుకొని యందు స్వేచ్ఛగా విహరించుచున్నారు. 'నేను బ్రహ్మ, నేను విష్ణువు, నేను రుద్రుడు, నే నింద్రుడు, నేను యముడు నేను వరుణుడు, నేను చంద్రుడు, నేను సూర్యుడు' అని కేకలిడుచు పార్వతీవరములచే గర్వించి మమ్ములను మిక్కిలి బాధించుచున్నారు. దేవా! నీవు మాకభయమిచ్చి భయంకరరూపముదాల్చి యాదేవకంటకులను సంహరింపుము" ఈమాటలను త్రిపురాంతకు డాలకించి సుకేశునియందలిదయచే వానిసంతతికి హానిజేయనొల్లక 'వారు నాకవధ్యులు. వారిని నేను జంపజాలను. వారిని జంపగలవాడు విష్ణువు. అతనియొద్దకుబోయి మీబాధలను విన్నవించుకొను' డనిపలుక వారు శంఖచక్రధరుడైన విష్ణువును జేరి నమస్కరించి తమబాధలను విన్నవించుకొని సుకేశతనయులను, వారియనుచరులను సంహరింప వేడుకొనిరి. విష్ణువు వారికభయమొసగుచు వరములచే గర్వించిన సుకేసుని, వానితనయులను తానెఱుగుదుననియు వారిని తప్పకసంహరింతుననియు జెప్ప దేవతలు మున్నగువారు సంతోషముతో తమస్థానముల కరిగిరి.

మాల్యవంతుడు దేవతలప్రయత్నములను, వారికి విష్ణువొసగిన యభయమును విని తనతమ్ములతో నిట్లుపలికెను. "హిరణ్యకశిపుడు మున్నగు మహాబలశాలురైన రాక్షసులు, నసురులు, దానవులు,

పెక్కండ్రు నారాయణునిచే యుద్ధమున జంపబడిరి. వీరందఱు యుద్ధమున పరాజయమెన్నడు నెరుగనివారును, సన్నియస్త్రములను బాగుగ దెలిసినవారును, మహామాయావులును, శత్రుభయంకరులు నై యుండిరి. అట్టివారిని జంపగల్గిన నారాయణునికి మన మొకలెక్కలోని వారము కాము. కావున మనకు క్షేమముకలుగుమార్గము నారయుడు" ఈమాటలను విని మాలి సుమాలు లిట్లుబదులు చెప్పిరి. "మనము వేదాధ్యయనము జేసి యజ్ఞములను, దానములను, గావించితిమి. ఐశ్వర్య మనుభవించితిమి. రోగములులేని యాయువు నొందితిమి. దేవతలను జయించి మనధర్మమును నిలబెట్టుకొంటిమి. శత్రువులను జయించి సాటిలేనివార మయితిమి. మృత్యుభయములేనివార మయితిమి. నారాయణుడు, రుద్రుడు, ఇంద్రుడు, యముడు, మన యెదుట నిలుచుటకు భయపడుదురు. విష్ణువు మనలను ద్వేషించుటకు కారణ మెద్దియు లేదు. ఈపాడుదేవతలు పోయి మనమీద ద్వేషమును పురికొల్పి యుందురు. అందువలననే యాతడు మనపైకోపించియున్నాడు. ఈ యపరాధమొనర్చిన దేవతలను మనము నేడే హింసించి దండింపవలయును." ఈమాటలు వినిన తోడనే వారందఱు దేవతలపై దండెత్త నిశ్చయించిరి.

పిదప యుద్ధమును ప్రకటించి గొప్పబలశరీరములుగల యారాక్షసవీరులు సైన్యములతోను, రథములతోను, ఏనుగులు, గుఱ్ఱములు, సింహములు వ్యాఘ్రములు మున్నగుజంతువులతోను దేవలోకమునకు బయనమైరి. దారిలో * దుశ్శకునము లనేకములు రాక్షసవినాశమును సూచించుచు నగపడినను వానిని లెక్కింపక మృత్యుపాశములచే నాకర్షింపబడి ముందుకుజనిరి. ఆసేనలకు ముందర మాల్యవంతుడు, సుమాలి, మాలి, యనుముగ్గురు బలశాలులు నిలిచియుండిరి. మాలి సేనలను ముందునకు నడుపుచుండెను.

---

* చూడుము. ప్ర. 12. అ. 8–దుశ్శకునములు.

అంతట దేవదూత రాక్షసులయుద్ధప్రయాణము నెరిగింప నారాయణుడు వేయిసూర్యులకాంతిగల దివ్యకవచమును ధరించి బాణములతో నిండిన రెండమ్ములపొదులను పట్టుకొని శంఖ చక్ర గదా శార్ఙ్గాది దివ్యాయుధధారియై గరుడవాహనము నెక్కి రాక్షసవినాశనమునకై బయలుదేరెను. సిద్ధులు, యక్షులు, గంధర్వులు, దేవతలు, ఋషులు మున్నగువారు స్తుతించుచుండ నాతడు క్షణములో రాక్షససేనను జేరికొనెను.

తోడనే గరుత్మంతుడు రెక్కలనూప నాగాలికి రాక్షససేన యంతయు జెల్లాచెదరయ్యెను. జెండాలు, శస్త్రములు మున్నగునవి యెగిరిపోయెను. అంతట రాక్షసవీరులు ప్రళయాగ్నిజ్వాలలవలె మండిపడుచు నారాయణుని ముట్టడించి బాణవర్షముఁ గురిపింపసాగిరి. రథములు, గజములు, గుఱ్ఱములు, మున్నగువానితో నాతనిని ముంచివేయుచు శక్తి, ఋష్టి, తోమరము మున్నగు నాయుధములను ప్రయోగించుచు నాతనియూపి రాడకుండ జేసిరి. వెంటనే విష్ణువు శార్ఙ్గమను విల్లునుబట్టి మనోవేగముగల బాణములను విడువ వేలకొలది రాక్షసులు హతులైరి. పాంచజన్యమును బూరింప వెంటనే వారా ధ్వనికి హడలెత్తి పారిపోయిరి. ఏనుగులు, గుఱ్ఱములు, మున్నగునవి చెల్లాచెదరయ్యెను. యోధులు రథములనుండి పడిపోయిరి. వారిబాణములచే రాక్షసులశిరోభూషణములు, శరములు, ధనువులు, అమ్ములపొదులు, పతాకములు, రథములు ఖండింపబడెను. తిరిగి శంఖమును బూరింపగా రాక్షససేన లంకవైపు పరుగెత్తజొచ్చెను.

ఇట్లు రాక్షసబలము భగ్నముకాగ సుమాలి మిక్కిలిరోషముతో హరినెదుర్కొని శరవర్షమున ముంచివేయ బలవంతులగు రాక్షసులు ధైర్యమొంది తిరిగియుద్ధాభిముఖులైరి. సింహనాదము చేయుచు సుమాలి తనమీదకు వచ్చుటగాంచి హరి ముందుగవాని సారథిశిరమును ఛేదించెను. సారథిహతుడుకాగా రథాశ్వములు

సుమాలిరథమును మఱియొకదిక్కునకు దీసికొనిపోయెను. అంతట మాలి ధనుర్బాణధరుడై హరినెదుర్కొని బాణవర్షమును గురిపింప సాగెను. హరియు బాణవర్షముకురిపించి మాలిని విముఖునిజేసి వాని కిరీటమును, జెండాను, ధనువును, గుఱ్ఱములను, నేలమీదపడునట్లుచేయ రథహీనుడైన మాలి గదాధారియై హరిమీదకుపోయి ముందుగగరుత్మంతునినుదుట బొడిచెను. ఆదెబ్బబాధకోర్వజాలక వెనుకకు దిరిగి భగవంతుని పరాఙ్ముఖునిగావింప రాక్షసులు మహానాదముజేసిరి. తోడనే హరి వెనుకకు దిరిగి, రాక్షసాభిముఖుడై చక్రమును ప్రయోగించి మాలిశిరమును ఖండించెను. ఆశిరము తెగి, నేలమీదపడుట గాంచి దేవతలు సింహనాదము చేసిరి. మాల్యవంతుడు, సుమాలియు తమ్ముని వధకు మిక్కిలి శోకించి సైన్యములతోగూడి లంకాభిముఖులు కాజొచ్చిరి. అంతటగరుత్మంతుడు తిరిగియుద్ధాభిముఖుడై తనఱెక్కలనూపి రాక్షససేనను బారదోలెను. హరియు పారిపోవుచున్న రాక్షసులపై బాణవర్షముకురిపింప ఛత్రములు భగ్నమయి, శస్త్రములు పడిపోయి పేగులుపైకివచ్చి యారాక్షససేన భయభ్రాంతిమయ్యెను. బాణప్రహారములచే వారిశరీరములు ఖండింపబడెను. చక్రప్రహారములచే శిరములు తెగిపడెను. గదాప్రహారములచే వారివక్షస్థలములు చూర్ణములయ్యెను. ఇట్లు నిహతులైనరాక్షసులాకాశమునుండి సముద్రమధ్యమునబడి మడిసిరి.

ఇట్లు తనసేన వధింపబడుటగాంచి మాల్యవంతుడు కోపముతో వెనుకకుదిరిగి యిట్లుపలికెను. "నారాయణా, క్షత్రియధర్మమును నీవెరుగవు. యుద్ధమునందిష్టములేక తిరిగిపోవుచున్నమమ్ములను యథేష్టముగ సంహరించుచున్నావు. పరాఙ్ముఖునివధించుట మహాపాపము, అట్లు చంపినవాడుగాని, చంపబడువాడుగాని స్వర్గమునొందలేడు. నీకు యుద్ధాభిలాష మెండుగానున్నచో నాపై నీబలముజూపుము. ఇదిగో నిలచియుంటిని," అని పలుక నారాయణు డిట్లునుడివెను. "మీవలన

బాధింపబడుచున్న దేవతలకు రాక్షసవధగావింప నభయమొసఁగియుంటిని. దానిని నేను పరిపాలింపక తప్పదు. దేవకార్యము నాకు ప్రాణములకంటె కూడ ప్రియతరమైనది. మీరు పాతాళమున కేగినను చంపితీరుదును." ఇట్లు పలుకుచుండగనే మాల్యవంతుఁడు శక్తితో హరిని వక్షస్థలమున గొట్టెను. హరి దానిని బట్టుకొని తిరిగి మాల్యవంతుని పైకివిసర నదివానికవచమును భేదించి వానిని మూర్ఛిల్లజేసెను. మాల్యవంతుడు తెలివితెచ్చుకొని ముల్లుగలయినుపశూలముతో హరిని వక్షస్థలమున బొడిచి, గరుత్మంతునిగూడ పిడికిలితో గుద్ది కొద్దిదూరము వెనుకకు తప్పుకొనెను. అప్పుడు గరుత్మంతుడు తనఱెక్కలను గట్టిగా నూపి యాగాలిచే వానినెగురగొట్టెను. అదిచూచి సుమాలి మిగిలిన సేనతో లంకకుమఱలెను. ఱెక్కలగాలికెగిరిపోయిన యామాల్యవంతుడు సిగ్గుజెందినవాడై దారిలో తమ్ముని సేనలను గలియ వారందఱు లంకకు జేరిరి.

ఇట్లు వారనేకపర్యాయములు హరిచేనోడింపబడి యనేక రాక్షసులు, సేనానాయకులు హతులుకాగా హరికిజడిసి లంకనువీడి పాతాళమునకు జనిరి.



## ౨ వ అధ్యాయము—కుబేరుడు.



* పూర్వ మొకానొకకృతయుగమున బ్రహ్మమానసపుత్రుడగు 'పులస్త్యు'డను బ్రహ్మర్షియొకడుండెను. ఆతడు ధర్మశీల శౌచాది గుణములుగలిగి దేవతాప్రియుడై లోకపూజితుడై రెండవబ్రహ్మవలె

* పులస్త్యుడు 'పూర్వముకృతయుగముననుండె' నని యుత్తరకాండమున 2-వ సర్గలో 3-వ శ్లోకమున జెప్పబడెను. బ్రహ్మదినమునకు 14మన్వంతరములును, 1000 మహాయుగములును కలవు. ప్రతిమహాయుగమునకు కృతత్రేతాద్వాపరకలియుగములను గలవు. ఏకృతయుగమున నాతడుండెనో వివరములుతెలియనందున 'నొకానొకకృతయుగ' మని వ్రాయబడినది.

నుండెను. ఆతఁడు మేరుపర్వతపార్శ్వమున తృణబిందుని యాశ్రమము నకు సమీపముగా నొకయాశ్రమము నేర్పఱచుకొని స్వాధ్యాయము చేయుచు నింద్రియనిగ్రహముఁ గలిగి తపము సల్పుచుండెను.

ఆతని యాశ్రమప్రదేశములు దివ్యములైన యడవులుఁగలిగి యన్నిఋతువులందు సంభోగ్యముగను దగియుండుటచే నక్కడకు నెల్లపుడు దేవకన్యకలు, నాగకన్యకలు, ఋషికన్యకలు, వచ్చి పాడుచు కేళులువేయుచు, నాట్యమాడుచునుందురు. వీరివలన తపోవిఘ్నముఁ గలుగ నాబ్రహ్మర్షి కోపముతో నాకన్యల నుద్దేశించి 'నాకంటఁబడువారు గర్భవతులగుదు' రని శపించెను. నాటినుండి యాకన్యకలు శాపభయమున వెడలుట మానిరి. కాని తృణబిందునికూతురాశాపమును విననందున యథాపూర్వముగ వెడలి చెలికత్తెలను వెదకుచు స్వాధ్యాయముఁ జదువుచున్న పులస్త్యునికంటఁబడి వెంటనే గర్భచిహ్నముగ పాండు (తెలుపుపచ్చకలిసిన) వర్ణముగల శరీరమును ధరించి హఠాత్తుగా తనకుగలిగిన మార్పునకు విచారించుచు తనతండ్రియొద్దకుఁబోయెను. ఆతఁడు 'నీవేల యీవికృతరూపము నొందితి' వని యడుగ దీనురాలై తాను నిర్దోషురాలననియు, పులస్త్యాశ్రమమునకు బోవ నీమార్పు సంభవించెననియు జెప్ప నాతఁడు ధ్యానముచే ఋషిశాపమును దెలిసికొని తనకూతురుతో పులస్త్యునికడ కేగి 'భగవంతుఁడా గుణములే యాభరణములుగాఁగల యీనాకన్యకను మీకు భిక్షగ నర్పించుచున్నాను. ఆమె యెల్లప్పుడు మీకు శుశ్రూష జేయుచు మీశ్రమను పోగొట్టుచుండు' నని పలుక నాబ్రహ్మర్షి యామెను పరిగ్రహింప నంగీకరించెను. తృణబిందువు యథావిధిగ తనకన్యక నిచ్చి పెండ్లిచేసి తనయాశ్రమమునకు జనెను. ఆమె తనశీలముచేతను, నడువడిచేతను, భర్తనుసంతోషపెట్టుచునుండెను. ఆమెసుగుణసంపదకు బ్రహ్మర్షి మెచ్చి "నాతో సమానుఁడు, నుభయవంశోద్ధారకుఁడు నగు

పుత్రుడు నీకుగల్గును. ఆతడు 'పౌలస్త్యు'డని ఖ్యాతినొందును. నేను వేదముచదువుచుండ నీవువినినందున నాపుట్టబోవుపిల్లవాడు 'విశ్రవసు'డనికూడ పిల్వబడును." అని పలుక నామె మిక్కిలి సంతసించి కొద్దికాలముననే విశ్రవసుని కనెను.

విశ్రవసుడు వేదాధ్యయనపరుడై, శుచియై, వ్రతాచారములందాసక్తుడై, సమదర్శియై, సత్యము, శమము, శీలము, మున్నగుగుణములుగలిగి భోగలంపటుడుగాక తపోనిష్ఠకలవాడై స్వల్పకాలముననే తండ్రివలె మునిశ్రేష్ఠుడయ్యెను. ఇతడుతగినవరుడనితలచి భరద్వాజుడు తనకూతురు 'దేవవర్ణిని' నాతనికిచ్చి వివాహము చేసెను. ఆదంపతులు వీర్యవంతుడు, ధార్మికుడు, బ్రహ్మగుణసంపన్నుడునగు 'కుబేరు' డనుపుత్రుని బడసిరి. తాతయగు పులస్త్యుడు కుబేరునిబుద్ధిసంపదను జూచి యాతడు ధనాధ్యక్షుడు కాగలడని తలచెను. మఱియు దేవర్షులతోగూడి యాతడు "విశ్రవసునిపుత్రుడై, విశ్రవసుని పోలియున్నందున నీపిల్లవాడు 'వైశ్రవణు'డను పేరునొందుగాక" యని పల్కెను.

ఆవైశ్రవణుడు తపోవనమునకరిగి యగ్నివలె మహాతేజశ్శాలియై వృద్ధినొందుచు ధర్మమే పరమగతియని యెంచి యుగ్రనియమములతో వేయిసంవత్సరములు తపమాచరించెను. పిదపకొంతకాలము నీటిని, మఱికొంతకాలము వాయువును, ఆహారముగాగలవాడై చివరకు నిరాహారుడై కూడ దపముజేయుచు వేలకొలదిసంవత్సరముల నొకసంవత్సరముగ గడపెను. అంతటబ్రహ్మ యింద్రాదులతో నచ్చటకు బోయి 'వత్సా! నీతపమునకు మెచ్చితిని. వరమునుగోరు' మని పలుక గుబేరుడు లోకపాలత్వమును, ధనరక్షణమును గోరెను. బ్రహ్మ యనుగ్రహించుచు నిట్లుపలికెను. "ఇంద్రుడు, యముడు, వరుణుడు, అనుమువ్వురుదిక్పాలకులను సృజించి నాల్గవవానిని గూడ సృజింపదలచితిని. నీవాపదవినిగోరుటచే నీవు నాల్గవదిక్పాలకుడవై

నిధీశత్వమును గూడ పొందుము. నీవు తిరుగుటకు సూర్యునితో సమానమగు 'పుష్పక'మను నీవిమానమును, గ్రహించి దేవతలతో సమానుడవగుము. నీకీ రెండువరములనిచ్చి కృతార్థులమైతిమి." అనిపలికి బ్రహ్మ దేవతలతోగూడ తనస్థానమునకు జనెను. తోడనే కుబేరుడు తండ్రి యొద్దకు బోయి చేతులు జోడించి బ్రహ్మయిచ్చిన వరములను దెల్పి 'భగవన్తుడా, బ్రహ్మ నాకునివసించుస్థానమునొసంగలేదు. ప్రాణుల కెట్టిపీడనుకలుగజేయని నివాసస్థానమును నీవు నిర్దేశింపు'మని వేడెను. అంతట విశ్రవసుడు 'దక్షిణసముద్రతీరమున త్రికూటపర్వతము కలదు; దానియగ్రభాగమున పూర్వము విశ్వకర్మచే నిర్మింపబడిన లంకాపురి కలదు. పూర్వము రాక్షసులు విష్ణుభయముచే దానిని వీడి పాతాళమునకుబోయిరి. ఇప్పుడునిర్జనముగనున్న యాలంకాపురికి బోయి సుఖముగనివసింపు'మని చెప్ప నాకుబేరుడు వేలకొలది నైర్ఋతులతో లంకకుబోయి నివసించెను. అచ్చట దేవతలు, గంధర్వులు, అప్సరసలు, మున్నగువారిచే సేవింపబడుచున్న యాకుబేరుడు సూర్యుని వలె ప్రకాశించుచు నప్పుడప్పుడు విమానము నెక్కి వినయముతో తల్లిదండ్రులనుదర్శించుచువచ్చుచుండెడివాడు.

'పుష్పక'మనునది దేవవిమానము. పూర్వము బ్రహ్మ యాజ్ఞాపింప విశ్వకర్మ దీనిని మిక్కిలిప్రయత్నపూర్వకముగ తయారుచేసెను. ఇందుకావలసినవస్తుసామగ్రియంతయు నెల్లప్పుడు సమకూడియుండును. దీనితోసమానమైనది దేవతలకైనను లేకుండెను. ఇది మేరుశిఖరము వలెనెత్తయి, పెద్దమేఘమువలెనుండి గొప్పపుణ్యముచేసిన యింద్రాది మహాత్ముల నివాసస్థానమా యనునట్లుండును. ఇది నానావిధములగు వజ్రములు, వైడూర్యములు, మణులు మున్నగువానితో నలంకరింపబడినదై వైడూర్యపుబహిర్ద్వారములుకలిగి ముత్యాలసరుసలతో గూడినదై కడురమ్యముగనుండును. ఇది వెండిబంగారములతో నిర్మింపబడిన స్తంభములును, మణిఖచితములైన బంగారపుమెట్లును, నింద్ర

నీలమణులతోను వైడూర్యములతోను గూడిన బంగారపు నాసనములును, స్ఫటికములతోను, ముత్యములతోను, నమర్చబడినబంగారపుకిటికీలును ఇంద్రనీల మహానీలమణులతో గట్టబడిన వేదికలును, పగడములు, మణులు, ముత్యములు మున్నగు వానితో మలామా చేయబడిన క్రింది ప్రదేశమునుకలదై నలువైపుల చిరుగంటలును, మూలలందు పెద్దగంటలునుగలిగి, మధురధ్వనిగావించుచు తెల్లనిజెండాలుకలిగి మంచియాకారముగల మేడమీదిగదులతో నొప్పుచు ప్రజ్వలించుచున్న సూర్యునివలె ప్రకాశించుచుండును.

అందు మనోహరములగు చిత్తరువు లనేకములుండెను. పర్వతపంక్తులతోగూడినభూమియు, చెట్లవరుసలతో నిండిన పర్వతములు, పువ్వులరాసులతో నిండినచెట్లు, పుప్పొడితోనిండినపువ్వులు, తెల్లని గృహములు, పద్మములతో నిండినసరస్సులు, వనములు, పగడములు, వైడూర్యములు, వెండి, బంగారము మున్నగు వానితో చేయబడిన విచిత్రాకారములుగలపక్షులు, రత్నములతో చేయబడిన పాములు, ఉత్తమజాతివైన గుఱ్ఱములు మున్నగునవి మిక్కిలియందముగ దానియందు చిత్రింపబడెను. మఱియు పద్మసరస్సులో విహరించి శరీరమంతట పుప్పొడి విదజల్లుకొని కలువతేకులను తొండములతో వర్షించుచున్న యేనుగులు, నట్టియేనుగులచే నభిషిక్తురాలగుచు పద్మహస్తయైన లక్ష్మియు, నందుచిత్రింపబడి చూపరులదృష్టుల నాకర్షించుచుండెను.

ఆ విమానమునందలి మేడమీది గదు లాకసమునంటుచున్నట్లుండును. అది యాకసమున నెగురుచుండ భూమిమీదనుండువారికి చంద్రునివలె గాన్పించును. అందు సర్వకాలములందు ఫలించువృక్షములు గలవు. అది కేవలము చలిగాని, కేవలము వేడిగాని లేక యన్నిఋతువులందు సుఖకరముగనుండును. అది నాశనరహితమై సూర్యపథమునను, నంతరిక్షమునను, వాయుమార్గమునను, వాయువేగముతో

గోరినచోటునకు నడ్డులేక పోగల్గును. అది కోరినయాకారమును దాల్చి యాశ్చర్యకరమై యందఱిదృష్టులను, మనస్సులను నాకర్షించు చుండును.

ఈవిమానము బ్రహ్మచే కుబేరున కియ్యబడెను. కుబేరుని జయించి రావణుడు దీనినిపొందెను. రావణునిజంపి రాముడు పొందెను. దీని నెక్కి యయోధ్యకు జేరినపిమ్మట రాముడు మరల కుబేరునికడకు దీనినంపివైచెను.

## 3-వ అధ్యాయము—రావణాదుల జననము, వరములు.

సుమాలిమున్నగు రాక్షసులు నారాయణునకు భయపడి పాతాళమునకు జనినట్లు వెనుక జెప్పియుంటిమి. కొంతకాలము గడచినపిమ్మట సుమాలి తనకూతునగు కైకసిని తోడ్కొని యేదో కారణమున భూలోకమున సంచరించెను. అప్పుడు దేవతుల్యుడును, నగ్నివలె ప్రకాశించువాడును నగు కుబేరుడు పుష్పకమునెక్కి తండ్రియగు విశ్రవసునిజూడ నేగుచుండెను. అతని తేజమును, వైభవమును జూచి సుమాలి మిక్కిలి యచ్చెరువొందెను. తోడనే సుమాలి పాతాళమునకువచ్చి రాక్షసులకు హితమును, శ్రేయమును, వృద్ధిని కలుగజేయు నుద్దేశముతో కూతురుని బిలచి యిట్లుపలికెను. "నీకు వివాహవయస్సు వచ్చినది. యౌవనము వృథయగుచున్నది. నీవు నిరాకరింతువని భీతిల్లి యే వరుడును నిన్ను వరింపకున్నాడు. మానమును గోరువారికి కన్యాపితృత్వము (కన్యకకు తండ్రిగానుండుట) మిక్కిలి కష్టము. కన్యక; తల్లి, తండ్రి, భర్త,—యీమువ్వురికులములను సంశయమున నుంచును. కావున నీవు బ్రహ్మకులమునజనించిన పౌలస్త్యుడగు విశ్రవసుని స్వయముగబోయి వరింపుము. అతనివలన నీవు కుబేరునివంటి తేజశ్శాలురగు పుత్రులను బడయుము."

తండ్రి పల్కినమాటలను గౌరవించి తోడనే యామె దారుణ సమయమైనను లెక్కింపక విశ్రవసునికడకు బోయి ముఖమును దించి తనపాదములజూచుచు కాలిబొటనవ్రేలితో నేలను గీయుచు నాతని యెదుట నిలుచుండెను. పూర్ణచంద్రునివంటి మోముకలిగి మిగుల మనోహరముగనున్న యామెను జూచి విశ్రవసుడు 'కల్యాణీ, నీవెవ్వని కుమార్తెవు? ఎక్కడనుండి యేపనిమీద వచ్చితివి?' అనియడుగ నామె తానుతండ్రియాజ్ఞచే వచ్చితిననియు, తనపేరు 'కైకసి' యనియు, తాను వచ్చినపని తపఃప్రభావమువలన తెలిసికొనదగుననియు, విన్నవించెను. అంతట నాతడు ధ్యానముచేసి తనవలన బుత్రులను బడయగోరి వచ్చినట్లు గ్రహించి యామెను బెండ్లాడి యామెతో రమించెను. పిదప నాతడు 'దారుణవేళయందు నన్ను పొందితివిగాన దారుణమైన వారు, దారుణరూపులు, దారుణజనప్రియులు, క్రూరకర్ములునగు రాక్షసులు నీకు జనింతురు.' అనిపలుక నామె చేతులుజోడించి 'దురాచారులగు పుత్రులు మీవలన కలుగుట నాకిష్టముగాదు. నన్ననుగ్రహింపు'డనిపల్కెను. అప్పుడు విశ్రవసుడు కనికరించి నీచివరి పుత్రుడు నావంశమునకు దగునటుల ధర్మాత్ముడు కాగలడని సెలవిచ్చెను.

పిదప కొంతకాలమునకు పదితలలు, నిరువదిభుజములు, ఎఱ్ఱని పెదవులు, పెద్దనోరు, పెద్దకోఱలు, ప్రకాశించుచున్న వెండ్రుకలు కలవాడును, కాటుకరాసివలె నల్లగనుండువాడును, మిగులభయంకర మైనవాడును, దారుణమైనవాడు నగు రాక్షసుడు కైకసిగర్భమున జన్మించెను. ఆశిశువు పుట్టినతోడనే నక్కలు నోటినుండి మంటలు గక్కెను. మాంసాహారముగలజంతువు లపసవ్యముగ దిరిగెను. మేఘములు ఘోరధ్వనులు గావించుచు రక్తమునువర్షించెను. అగ్నిజ్వాలలు పడెను. సూర్యుడు కాంతిహీనుడయ్యెను. భూమి కంపించెను. పెనుగాలులు వీచెను. సముద్రము కలతనొందెను. ఈయుత్పాతములచే

ఈపిల్లవానివల్ల దేశమునకు గల్గుక్షోభ సూచింపబడెను. పిమ్మట తండ్రి పిల్లవానికి పదితలలుండుటచే 'దశగ్రీవు'డని పేరు పెట్టెను. వీనితరువాత మహాబలుడగు 'కుంభకర్ణుడు' జన్మించెను. వీడు లోకాతీతమైన శరీరము పెద్దకోఱలు కలిగి తేజోవీర్యసంపన్నుడై యింద్రునితో సమాన బలము కలవాడుగ నుండెను. వీనివెనుక వికృతముఖముగల 'శూర్పణఖ'యనునామె జన్మించెను. ఈమెతరువాత ధర్మాత్ముడును, బలశాలియగు 'విభీషణుడు' జన్మించెను. తోడనే పుష్పవర్షము కురిసెను. దేవదుందుభులు మ్రోగెను. 'బాగు, బాగు' అనువాక్యములు వినబడెను.

విశ్రవసునకు (కైకసియందు)

| దశగ్రీవుడు | కుంభకర్ణుడు | శూర్పణఖ | విభీషణుడు |
|---|---|---|---|

ఈకైకసిసంతానమంతయు తమతండ్రియుండు మహారణ్యమునందే వృద్ధిజెందుచుండెను. వారిలో దశగ్రీవుడు మిగులక్రూరుడై లోకములకు భయమును కలిగించుచుండెను. కుంభకర్ణుడు మిగుల మదించినవాడై, దుష్టుడై ధర్మాత్ములగు మహర్షులను, ముల్లోకములనుగూడ భయపెట్టుచు, చంపుచు యథేష్టముగ సంచరించుచుండెను. విభీషణుడు స్వాధ్యాయపరుడై యాహారనియమము నింద్రియనిగ్రహము కలిగి ధర్మమార్గమున చరించుచుండెను.

ఇట్లుండ నొకనాడు కుబేరుడు పుష్పకము నెక్కి తండ్రినిజూడ వెడలుచుండ కైకసిచూచి రావణునితో 'పుత్రా, తేజశ్శాలియగు నీయన్నను జూడుము. నీవు వానితో సమానుడ వగుటకు యత్నింపు'మని పలికెను. రావణుడు మిక్కిలి యసూయ చెంది 'తల్లీ, కుబేరునితో సమానుడను గాని, యధికుడను గాని, త్వరలో నగుదును. నీవు చింతనువీడు,' మని పలికి యుగ్రమైనతపస్సుచే నభీష్టసిద్ధి నొందగోరి తమ్ములతో గూడ గోకర్ణాశ్రమమును జేరెను. వారిలో

కుంభకర్ణుడుధర్మపరుడై, వేసవికాలమునపంచాగ్నిమధ్యస్థుడగుచు,వర్షా కాలమున వర్షోదకముచే దడియుచు, చలికాలమున నీటిమధ్యమున నివసించుచు పదివేలసంవత్సరములు ఘోరతపంబుగావించెను. విభీష ణుడు ధర్మపరుడై, శుచియై యైదువేలసంవత్సరము లొకపాదమున భూమిమీదనిలిచి తపస్సుచేసెను. ఈతపము ముగియుటతోడనే యప్సరసలు నృత్యముచేసిరి. పుష్పవర్షము కురిసెను. దేవతలు కలత నొందిరి. తిరిగియాతడు చేతులు తలపైకెత్తి స్వాధ్యాయపరుడై సూర్యోపాసనగావించుచు మఱియైదువేలసంవత్సరములు గొప్పతప మొనర్చెను. దశగ్రీవుడు నిరాహారుడై ఘోరతపమొనర్చుచు వేయి సంవత్సరముల కొక్కొక్కశిరస్సునుఛేదించి యగ్నిలోవేల్చుచుం డెను. ఇట్లు తొమ్మిది వేలసంవత్సరములకు తొమ్మిదిశిరస్సులు ఛేదింప బడెను. పదియవవేయి పూర్తియగుటతోడనే యగ్నిలోవేల్వ తన పదియవశిరమును ఛేదింప నుద్యుక్తుడయ్యెను. ఇంతలో బ్రహ్మ ప్రీతి జెంది దేవతలతోవచ్చి 'నీతపమునకు మెచ్చితిని. కావలసినవరమును గోరుము. నీశ్రమ వ్యర్థము కారాదు. అనిపలికెను. రావణుడు సంత సించి సాష్టాంగనమస్కారము గావించి 'భగవంతుడా, ప్రాణులకు మృత్యువుకంటె వేరొండుభయము లేదు. కావున నాకు నెవ్వరివల నను చావులేకుండునట్లనుగ్రహింపు మని ప్రార్థింప నది నీకు సంభ వింపదనియు, మఱియొకవరమును గోరుకొనుమనియు బ్రహ్మ శెల విచ్చెను. అంత నాతడు 'గరుడులు, నాగులు, యక్షులు, దైత్యులు, గంధర్వులు, రాక్షసులు, దేవతలు, వీరివలన చావులేకుండునట్లను గ్రహింపుము. మిగిలిన మనుష్యాదిప్రాణులవలన నాకెన్నడును భయములేదు. వారు నాకు తృణప్రాయులు" అనిపలుక బ్రహ్మ యావరమునొసగి యిదివరలో నతడగ్నిలోవేల్చిన పదితలలు తిరిగి యథాపూర్వముగ వచ్చునట్లును,నతడు కామరూపు డగునట్లును నను గ్రహించెను. తోడనే యాశిరములు లగ్నినుండి పైకివచ్చి యథా

పూర్వముగ దగులుకొనెను. పిమ్మట బ్రహ్మ విభీషణునితో 'నీ ధర్మబుద్ధికి మెచ్చితిని. వరమును గోరుకొను'మని పలికెను. అతఁడును బ్రహ్మతో 'భగవంతుడా, లోకగురుడవైన నీవు ప్రీతినొందగ నేను కృతకృత్యుడనైతి. ఎట్టియాపదలోనున్నను నాబుద్ధి ధర్మమార్గమును వీడకుండుగాక! నేర్చుకొనకయే బ్రహ్మాస్త్రము నాకు సిద్ధించుగాక! ఏయే యాశ్రమములందు నాబుద్ధి ప్రసరించినను నది ధర్మబద్ధమై యా యాశ్రమధర్మములను బాలించుగాక!' యని బ్రహ్మను బ్రార్థించెను. బ్రహ్మ యావరములనొసగుచు 'రాక్షసకులమందు జన్మించినను నీకు నధర్మమందు బుద్ధి ప్రసరింపనందున నమరత్వమును గూడ నీవు పొందు' మనిపలికి కుంభకర్ణునకుగూడ వరమీయనుద్యుక్తుడయ్యెను. అంతట దేవతలు చేతులుజోడించి 'మీరు వీనికి వరము నీయకూడదు. ఇతడప్సరసల నేడుగుర నింద్రానుచరుల పదిమందిని, మహర్షులను, మానవులను భక్షించియుండెను. ఇట్టివానికి వరములిచ్చితిరేని ముల్లోకములను మ్రింగివేయును. వరమునుమిషచే వానికి మోహముకలుగునట్లు చేసితిరేని లోకములకు క్షేమము కల్గును.' అని విన్నవించిరి. తోడనే బ్రహ్మ సరస్వతిని చింతింప నామె సన్నిహితురాలయ్యెను. కుంభకర్ణునిముఖమున నుండునట్లామె నాజ్ఞాపించి వానిని వరమును కోరుకొనుమనెను. సరస్వతి వానినోటనుండి "అనేక సంవత్సరములు నిద్రపోవునట్లనుగ్రహింపు"మని వానిచే ననిపించెను. తోడనే బ్రహ్మ యావరమునొసగి సరస్వతితోను, దేవతలతోను నిజస్థానమున కరిగెను. సరస్వతి వీడినతోడనే కుంభకర్ణుడు చైతన్యము నొంది 'అయ్యో! నాముఖమునుండి యిట్టివాక్యమేలవచ్చెను? జాగరూకులైన దేవతలచే మోహింపజేయబడితిని. సమయము మించినది. నేనేమి చేయుదును? మోసపోతి'నని దుఃఖింపసాగెను. పిదప నన్నదమ్ములందఱు శ్లేష్మాతకవనమును జేరి యచ్చట సుఖముగ నివసించిరి.

కుంభకర్ణునకు నిద్ర బ్రహ్మచే శాపరూపముగ నీయబడినట్లు మఱియొకకథ కలదు. అదియెట్లన;—కుంభకర్ణుడు జన్మించినతోడనే గొప్పయాకలివేయ గొప్పగొప్పజంతువులను వేలకొలది తినివేయ జొచ్చెను. వీని హింసాకృత్యమునకు భయపడి ప్రజలందఱు దేవేంద్రుని శరణుజొచ్చిరి. ఇంద్రుడుకోపముతో నాతనిపై వజ్రాయుధము విసరెను. అంతట కుంభకర్ణుడు చలించి కోపముతో భూమికంపించునట్లు సింహనాదముచేసి యైరావతపుదంతముల నూడబెరికి వానితో నింద్రునివక్షస్థలమున గొట్టెను. ఇదిచూచి బ్రహ్మర్షులు, దేవతలు; మున్నగువారు మిక్కిలివిచారించిరి. ఇంద్రుడు దేవతలతోగూడి బ్రహ్మకడకుబోయి మనుష్యులను తినుట, దేవతలను జయించుట, ఆశ్రమములను ధ్వంసముజేయుట యనేకపరస్త్రీలను పట్టుకొనుట మున్నగు కుంభకర్ణుని దుశ్చర్యల నెఱింగించెను. తోడనే బ్రహ్మ, రాక్షసులను పిలిపించెను. రాక్షసులందఱు రాగా కుంభకర్ణునిజూచి, వాని దుశ్చర్యలను నమ్మెను. 'పౌలస్త్యుడైన విశ్రవసుడు నిన్ను లోకముల నశింపజేయ పుట్టించలేదు. నేటినుండియు నీవు నిద్రించుచు చచ్చినవానివలె పడియుండుము"అని కుంభకర్ణునికి బ్రహ్మ శాపమొసగెను. కుంభకర్ణు డేమియుతోచక రావణునికాళ్ళమీద పడెను. రావణుడు బ్రహ్మతో 'ప్రజాపతీ, పెరుగుచున్నచెట్టు తెగనఱుకుట భావ్యము కాదు. మీమనుమని నిట్లు శపించుట న్యాయముకాదు. మీశాప మసత్యము కానేరదు. కావున వీడెంతకాలము నిద్రించవలయునో, యెంతకాలము మెలకువగ నుండవలయునో యాజ్ఞాపింపు'డనిప్రార్థింపగా బ్రహ్మ యారుమాసములు నిద్రించి యొకరోజున మెలకువగ నుండునని సెలవిచ్చెను.

## ౧౧-వ అధ్యాయము.- రావణుని లంకాప్రవేశము, కుటుంబవృద్ధి.

సుమాలి తనమనుమలు వరము నొందుటను దెలిసికొని 'మారీచుడు, ప్రహస్తుడు, విరూపాక్షుడు, మహోదరుడు' అను మంత్రులతోను, ననుచరులతోను గూడి రసాతలమునుండి వెడలివచ్చి దశగ్రీవుని కౌఁగలించుకొని యిట్లు పలికెను. "వత్సా, నీవు మా మనోరథమును త్రిలోకాధిపుడగు బ్రహ్మనుండి వరములందు సాధింపగలిగితివి. ఏవిష్ణువువలన భయమునొంది లంకనువీడి రసాతలమున కేగితిమో యావిష్ణువువలన భయము మాకిప్పుడు పోయినది. ఈలంకాపురి మనది. మొదట నిందు రాక్షసులందఱము నివసించియుండెడివారము. మేము విష్ణువునకు భయపడి రసాతలమునకు పారిపోగ నీయన్నయగు కుబేరుడు దీనినాక్రమించుకొనెను. సామ దాన భేద దండోపాయములలో నెద్దానిచేనైనను నీవు తిరిగి లంకను వశపఱచుకొన సాగునేమో చూడుము. నీవు లంకాధిపుడవై మమ్ముల నేలుము. మునిగిపోయిన యీరాక్షసవంశము నీచే నుద్ధరింపబడి నీమీదనే యాధారపడి యున్నది. నీవే నాథుడవు. నీవే మాకు గతి." ఈమాటలువిని దశగ్రీవుడు కుబేరుడు తన కన్నగారగుటచే నతనికూర్చి యిట్లుపలుక తగదని సుమాలిని వారింప నతడు రావణహృదయము నెఱిఁగి మాఱుమాట పలుకకుండెను.

పిమ్మట కొంతకాలమునకు ప్రహస్తుడు తిరిగి రావణునిదగ్గరకు వచ్చి వినయముతో యుక్తియుక్తముగ నిట్లు పలికెను. "దశగ్రీవా, నాడు నీవు సుమాలితో నట్లుపలుకుట తగియుండలేదు. శూరులకు భ్రాతృస్నేహ మెక్కడిది.? వెనుక జరిగిన విషయమును జెప్పెద. వినుము. పూర్వము 'అదితి, దితి' యనెడు నిద్దఱక్కచెల్లెండ్రు కశ్యప ప్రజాపతికి భార్యలుగనుండిరి. వారిలో నదితియందు దేవతలును, దితియందు దైత్యులును జన్మించిరి. మొదట వనములు, పర్వతములు

సముద్రములు, మున్నగు వానితో గూడిన యీభూమియంతయు దైత్యులపాలనమున నుండెను. విష్ణువు యుద్ధమున వారినోడించి యీ త్రైలోక్యమును వారియన్నదమ్ములగు దేవతలకు వశపఱచెను. నాడులేసి యీ స్నేహమును నేడు నీవు పాటింతువా? కావున నామాట విని లంకను వశపఱచుకొనుము" రావణుడు కొద్దిసే పాలోచించి ప్రహస్తునిసలహా నంగీకరించెను.

ఆరోజుననే రావణుడు రాక్షసులతోబోయి త్రికూటపర్వతమున నిలచి ప్రహస్తుని దూతగ కుబేరునొద్దకు బంపెను. ఆతడు పోయి కుబేరునితో సామపూర్వకముగ నిట్లుపలికెను. "ధనాధిపా, యీలంకాపురి పూర్వము మహాత్ములగు రాక్షసులది. నీవు దీని నాక్రమించుకొనుట తగదు. నీవు దీనిని నాకిచ్చితి వేని నాకు సంతసము కలుగజేసినవాడ వయి ధర్మమును పాలించినవాడ వగుదువు" అని రావణుడుపల్కిన మాటల నెఱిగించెను. కుబేరుడు "రాక్షసులు విడిచిపెట్టిన పిమ్మట నా తండ్రి విశ్రవసుడు శూన్యమగు నీలంకాపురిని నాకొసగెను. దాన మానాది సద్గుణములు గలయక్షులతోగూడి నేనిందు నివసించుచుంటిని. ఈపట్టణమును, ఈ రాజ్యమును, ఈ నాధనముసర్వమును నన్నదమ్ములపంపకము లేకయే నా తమ్ముడు రావణుడు నాతోగూడ ననుభవింపవచ్చును. ఈనామాటలను రావణున కెఱిగింపుము" అని ప్రహస్తునకు జవాబిచ్చి తోడనే తండ్రికడకేగి రావణసందేశము నెఱిగించి తానేమి చేయవలయునో యాజ్ఞాపింప గోరెను.

ఆబ్రహ్మర్షి "దశగ్రీవు డీవిషయమును నాకెఱిగింప వానికి మిక్కిలిచీవాట్లు పెట్టితిని. అయినను వాడు వినకుండుట జూచి కోపముతో 'నశించెద' వని కూడ పల్కితిని. వాడు వరదానముచే గర్వించియున్నవాడు. నాశాపముచే దారుణప్రకృతిని బొందినవాడు. కావున వాడు గౌరవాగౌరవముల నెఱుగడు. వానితో నీకు వైరము తగదు. వాడుగొప్పవరములను పొందియున్నాడు. నీవు లంకను

విడిచి కైలాసగిరికి పొమ్ము. అచ్చట పద్మములతోను, కలువలతోను విరాజిల్లు మందాకినీనది కలదు. అచ్చట దేవతలు, గంధర్వులు, నాగులు, అప్సరసలు, కిన్నరులు, మున్నగువారు విహరింతురు. అచ్చటనే నీవు నీపరివారముతో గూడ నివాసమేర్పఱచుకొనుము." అని కుబేరునితో బలుక నాతడు తండ్రిమాటలందు గౌరవముంచి క్షణములో లంకను విడిచి కుటుంబమును, పరివారమును, తోడ్కొని ధనవాహనాదివస్తుసమృద్ధితో కైలాసగిరికి జనెను. ప్రహస్తుడు లంక నిర్జనమగుటను దెల్ప రావణుడు తన తమ్ములతోను, బలవాహనాదులతోను, బ్రవేశించి పట్టాభిషిక్తుడై యందు నివసించెను.

రావణుడు తన చెల్లెలగు శూర్పణఖను కాలకేయుడగు 'విద్యుజ్జిహ్వు' డను దానవేంద్రున కిచ్చి పెండ్లిచేసెను. ఆదానవుడు యుద్ధమున రాక్షసులను నాలుకతో నాకి చంపువాడు. కావుననే వానికి 'విద్యుజ్జిహ్వు' డను పేరు సార్థకమయ్యెను. శూర్పణఖకు పెండ్లిచేసినతరువాత నొకనాడు రావణుడు వేటకొఱకు వనమునకేగెను. అచ్చట దితి పుత్రుడైన 'మయు' ని, నాతనికూతురు 'మండోదరి' ని గాంచెను. రావణు డడుగ మయుడు తనవృత్తాంతము నిట్లుచెప్పెను. "దేవతలు 'హేమ' యను నప్సరసను నాకిచ్చిరి. ఆమెను నేను బెండ్లాడినైనను వందలసంవత్సరములు ఆమెతో సుఖముగ కాపురముచేసితిని. ఆమె కొఱకు వజ్రవైడూర్యములచే జిత్రింపబడిన బంగారునగరమును మాయచే నిర్మించియుంటిని. ఆమె దేవకార్యము నెఱవేర్ప స్వర్గమునకు వెడలి పదునాల్గుసంవత్సరములాయెను. ఇంతవఱకు నామె వియోగముచే దుఃఖించుచు నాపట్టణముననే యుంటిని. నాకూతురుకు తగినభర్తను వెదకుచు నేడిచ్చటకు వచ్చియుంటిని. నేనీమెను, 'మాయావి, దుందుభి' యను నిద్దరుపుత్రులను నామెయందు బడసితిని" ఇట్లు మయుడు తెలిపెను.

మయుడు,—భార్య హేమ.




ఇట్లు రావణుడు మయుని వృత్తాంతము తెలిసికొని యాతడడుగ తాను బ్రహ్మకు నాల్గవపురుషుడననియు, తనతండ్రి బ్రహ్మర్షియైన 'విశ్రవసు' డనియు, నాతడు బ్రహ్మపుత్రుడైన పులస్త్యునికి తనయుడనియు నెఱిగించెను. పిమ్మట మయుడు, రావణుడు బ్రహ్మర్షి పుత్రుడగుటచే వానికి తనకూతురగు మండోదరిని కన్యాదానము చేసెను. తోడనే యాతడగ్నిని ప్రజ్వలింపజేసి యథావిధిగ పాణిగ్రహణమును జేసెను. మయు డొకానొక మునివలన రావణునకు శాపమున్నట్లు వినియున్నను బ్రహ్మవంశస్థుడగు వరుడు లభించుటచే నాశాపమును లెక్కింపలేదు. పిమ్మట మయుడు తాను తపస్సువల్ల పొందిన యమోఘమగు నద్భుతశక్తిని తనయల్లునకిచ్చెను. దీనిచేతనే రావణుడు లక్ష్మణుని యుద్ధమున గొట్టెను. రావణుడు భార్యతో గూడి సుఖముగ లంకాపురి జేరెను.

దుందుభిమాయావులు వాలిచే జంపబడినట్లు *వాలిచరిత్రమున దెల్పియుంటిమి.

కుంభకర్ణుడు వైరోచనుని దౌహిత్రి (కూతురునకు కూతురు) యగు 'వజ్రజ్వాల'ను పెండ్లాడెను. విభీషణుడు శైలూషుడను గంధర్వరాజు కూతురు 'సరమ' ను పెండ్లాడెను. ఈమె మానససరస్సు తీరమున జన్మించెను. వర్షాకాలమున నాసరస్సు వృద్ధినొంద తీరమునందున్న తనపిల్లకు నపాయము నూహించి యామెతల్లి 'సరఃమా' (సరస్సా, వృద్ధినొందకుము) అని పలికినదట. అందుచే నాపిల్లకు

* 4. ప్ర, ౧. అ. వాలిసుగ్రీవులు చూడుము.

'సరమా' యనిపేరు కలిగెను. ఇట్లు రావణాదులు ముగ్గురు వివాహి తులై తమతమభార్యలతో సుఖముగ కాపురము చేయుచుండిరి. రావణునిభార్య మండోదరి మేఘనాదుని కనెను. ఆపిల్లవాడు పుట్టు నప్పుడు చేసినరోదనధ్వని మేఘధ్వనివలెనుండి లంకను నిశ్చేష్టము గావించెను. కావుననే రావణుడాతనికి 'మేఘనాదు'డని పేరు పెట్టెను. వీనికి 'ఇంద్రజిత్తు' అను నామాంతరముకలదు. వీడు తల్లి దండ్రులకు సంతసమొదవించుచు లంకలో పెరుగుచుండెను.

అంతట బ్రహ్మవరముచే నిద్ర లేసను నావరించ కుంభకర్ణుడు తాను నిద్రించుటకు దగినయిల్లు నిర్మింప నన్నగారిని వేడుకొనెను. ఆతడు కైలాసముపంటి గృహమును శిల్పులచే నిర్మింపజేసెను. అది నాలుగు క్రోసులు వెడల్పు నెనిమిది క్రోసులు పొడవుకలదై, బంగారుపుస్తంభములతోను, వైడూర్యపు మెట్లతోను, చిఱుగంటలుగల కిటికీలతోను, దంతమయమైన బహిర్ద్వారముతోను, వజ్రస్ఫటికములచే చేయబడిన వేదికలతోను, కూడినదై, యన్ని ఋతువులందు సుఖకరమై, మిక్కిలి మనోహరముగ నుండెను. అందు వేలకొలది సంవత్సరములు మెలకువలేకయే కుంభకర్ణుడు శయనించెను.

శూర్పణఖ తనభర్తయగు విద్యుజ్జిహ్వునితో సుఖముగ కొంతకాలము కాపురముచేసియుండెను. రావణుడు పాతాళమునకేగి జైత్రయాత్ర సలుపునపుడు కాలకేయులతో పోరాటము సంభవించెను. అందు కాలకేయుడగు విద్యుజ్జిహ్వుడు నాలుకతో నాకి రాక్షసులను జంపుచుండ ఖడ్గముచే రావణుడు వానిని సంహరించెను. జైత్ర యాత్ర ముగించి లంకకుజేరినపిదప శూర్పణఖయేడ్చుచు నన్నతో 'నీవు నాభర్తనుజంపి నాకు వైధవ్యమును కలుగజేసితివి. చెల్లెలుకుభర్త యని యైనను, గమనించకపోతివి. నీపేరుచెప్పుకొని శాశ్వతముగ నీవైధవ్యము ననుభవించెద' నని కఠినముగబలికెను. వాడామె నోదార్చుచు "నీవు దుఃఖింపవలదు. నీమనస్సునకు వచ్చినటుల సర్వవిధముల

ప్రయత్నింతును. యుద్ధమున నోడలెఱుగక జయకాంక్షతో బావ యనిగుర్తింపక చంపియుంటిని. యుద్ధమున నెదురువచ్చినవాడు నావాడు పరాయివా డను విచక్షణ నాకు లేదు. నీవిప్పుడు చేయ వలసినదేదియో చెప్పెద, వినుము. మనపినతల్లికొడుకు ఖరుడు 14000 రాక్షససైన్యముతో దండకారణ్యమునకు వెడలి యాప్రదేశము నంతను పాలింపగలడు. ఆప్రదేశము మొదట మంచిదేయైనను, శుక్రునిశాపముచే వనమయ్యెను. అది నేడు రాక్షసులకు వశమగును. దూషణుడు ఖరునిసేనలకు నాయకుడుగనుండును. భ్రాతయగు నారా క్షసాధిపునికడ నీవుండుము. వాడు చెప్పినట్లు నడచుకొను"మని రావణుడు పలికి 14000 రాక్షసులసేనతో ఖరదూషణాదులనంపెను. వారితో శూర్పణఖ దండకావనమునకేగి యచ్చట సుఖముగ నివ సించెను.

రావణుడొక దిగ్విజయ యాత్రను ముగించి లంకకు తిరిగి వచ్చునప్పటికి తనపుత్రుడగు మేఘనాదుడు శుక్రాచార్యుల గురువుగ జేసి లంకలో జేరిన నికుంభిలవనమున గొప్పయజ్ఞమును జేసియుండెను. దానికై యనేక యూపస్తంభములు పాతబడెను. మేఘనాదుడు కృష్ణాజినధరుడై కుశలతోగూడిన కమండలమునుపట్టెను. రావణుడు తనకొడుకును కౌగలించుకొనిదానిని గుఱించియడుగ శుక్రాచార్యులు "నీకొడుకు 1 అగ్నిష్టోమము 2 అశ్వమేధము 3 బహుసువర్ణకము 4 రాజసూయము 5 గోమేధము 6 వైష్ణవము 7 మాహేశ్వరమను నేడు యజ్ఞములుచేసెను. మాహేశ్వరయజ్ఞాంతమున నీశ్వరునివలన నంతరిక్షమున శాశ్వతముగ చరించునదియు, కోర్కెల నిచ్చునదియు నగు దివ్యరథమును, చీకటినికలిగించు 'తామసి' యను మాయను బొందెను. యుద్ధమం దామాయ నుపయోగించిన యుద్ధము చేయు వాని గమనము నెవరైనను కనిపెట్టలేరు. అక్షయములగు బాణ ములుగల యమ్ములపొదులు రెండును, జయించ వీలులేనిది యగు

విల్లును, శత్రువుల నశింపజేయు నస్త్రమునుగూడ నీకుమారుడు పొందెను. యజ్ఞ మీదినమున ముగిసినది. నీరాక కెదురుచూచుచున్నాడు." అని చెప్పెను. ఇట్లు శుక్రుడు రావణునితో జెప్ప నతడు "మనశత్రువులగు నింద్రాదుల పూజించినయజ్ఞము మంచిదికాదు. చేసినదానిని మార్పవీలులేదుకదా! కుమారా! రమ్ము" అనిపలికెను. తర్వాత రావణాదులు తమగృహములకు జేరిరి.

ఇంతలో రావణునిమాతామహుడగు సుమాలి యన్న మాల్యవంతుని కూతు రనలయొక్క కూతురు కుంభీనసిని లంకలోని యంతఃపురమునుండి మధువను రాక్షసుడెత్తుకొని పోయెను. రావణుడు తనపుత్రునితోను, విభీషణునితోను, తనయంతఃపురస్త్రీలను జూడబోయి, తాను చెఱపట్టి తెచ్చిన దేవ దానవ రాక్షసస్త్రీలు కండ్లంట నీరు పెట్టి నిలిచియుండ వారిని పుష్పకమునుండి దింపెను. అప్పుడు విభీషణుడు వారిని జూచి తనయన్నమనస్సు తెలిసికొని యాతనితో "యశము, ధనము, కులము, నాశనముకలిగించు నిట్టి పనులు నీవు చేసితివి. జ్ఞానులను వారిబంధువులను గొట్టి వారిస్త్రీలను దెచ్చితివి. నీయిష్టమునజరించితివి. నీయధికారము నెట్టివేసి మధువనెడివాడు మనకుంభీనసిని నెత్తుకొనిపోయె"నని తెలిపెను. దానికాతడు నీవుచెప్పినది తెలియలేదనియు, నెవడామధువనియు నడిగెను. విభీషణుడు దానికి కోపించి యిట్లు చెప్పెను. "వినుము, నీపాపకర్మఫలము; నీకుమారుడు యజ్ఞముచేయుచుండ, నేను నీటమునిగి తపముచేయుచుండ, కుంభకర్ణుడు నిద్రలోనుండ, మనమంత్రులను, మధువుచంపిమనయంతఃపురమునుండు కుంభీనసిని నెత్తుకొనిపోయెను. కన్యలను తగినభర్తలకిచ్చి వివాహముజేయుట ధర్మముగాన నేను వినియు శాంతమువహించి వానిని జంపలేదు. ఇదియంతయు నీదుర్మార్గఫలము." ఇట్లువిభీషణుడు పలుక రావణుడు వేడినిట్టూర్పులు విడిచి కోపించి యిట్లు సెలవిచ్చెను. "ఇప్పుడే నారథమును సిద్ధముచేయుడు.

కుంభకర్ణుడును, శూరులగు రాక్షససముఖ్యులును, నాయుధములతో వాహనారూఢులై నాతోరండు. ఇప్పుడే నేను మధువును జంపి యింద్రలోకము జయార్థమై వెళ్ళెదను. ఆతనిజయించి త్రైలోక్యైశ్వర్యమనుభవించెదను.”ఇట్లు రావణుడు సెలవీయ రాక్షసులు యుద్ధమునకు బయలువెడలిరి. విభీషణుడు లంకలో నిలచెను. సేనముందర యింద్రజిత్తును,మధ్యను రావణుడును,కొనను కుంభకర్ణుడును నుండిరి.వీరు మొదట మధుపురమునకు బోయిరి.వాడచ్చట లేకుండెను. రావణుని చెల్లెలు కుంభీనసి కనబడెను. ఆమె భయమును జెంది యాతనికాళ్ళమీద పడ నాత డామెనులేవనెత్తి 'భయమువలదు, నేను నీకేమి చేయగలవాడ' నని యడిగెను. ఆమె “నాభర్తమధుని నీవిప్పుడు చంపవలదు. స్త్రీలకన్ని భయములకంటె వైధవ్యభయమెక్కువ, గనుక నీవు సత్యవచనుడవుకమ్ము” అనివేడెను. రావణు డామెతో 'నీభర్త యెక్కడ నున్నాడో శీఘ్రముగ జెప్పుమనియు, నీయందలి దయచే వానిని జంపకున్నా ననియు,వానితో నింద్రలోకమునకు యుద్ధమునకు వెళ్ళెద' ననియు పలికెను. ఆమె నిద్రించుచున్న తనభర్తను లేపి 'రావణుడు వచ్చి సురలోకజయమునకు నీసాయముగోరుచున్నాడు గాన బంధువులతో గూడ నీవుపొ' మ్మనిగోర వా డొప్పికొని రావణునొద్దకు బోయి వానినిపూజించెను.రావణు డొకదినము మధునియింట నిలిచెను. మఱునా డందఱు స్వర్గమునకు యుద్ధమునకు బోవుచుండిరి.



## ౫వ అధ్యాయము — తాటక, మారీచులు.



పూర్వము సుకేతువను యక్షుడుండెను. అతడు వీర్యవంతుడును, మంచియాచరణము కలవాడునై పుత్రులు లేక గొప్పతపమాచరింప బ్రహ్మ ప్రీతినిజెంది వానికొక కన్యారత్నము నిచ్చెను. కాని పుత్రుల నియ్యలేదు. ఆమెపేరు తాటక. బ్రహ్మ, యామెక

1000 ఏనుగులబలము నిచ్చెను. ఆమెకు యౌవనము వచ్చి రూపవతి కాగ యామెతండ్రి కీర్తిమతియగు నామెను ఝర్ఝపుత్రుడగు సుందుడను రాక్షసునకు వివాహముచేసెను. కొంతకాలమునకామెకు మారీచుడను వీరుడు జన్మించెను. వాడు పెద్దబాహువులు పెద్దశరీరము గలవాడును వెడల్పగుముఖము కలవాడునునై భయంకరాకారము కల్గి యిందునితో బరాక్రమమున సమానముగా నుండెను. సుందుడగస్త్యునిచే మృతినొంద తల్లియు, కుమారుడును నాతనిబలవంతముగ పట్టుకొని యాతని దినుటకు గర్జించుచు ప్రక్కకుపరుగెత్తిరాగ మారీచుని నగస్త్యుడు రాక్షసుడవు కమ్మని శపించెను. తల్లిని గూడ 'నీవు మనుష్యుని భుజించుదానవును విరూపముకలదానవును,వికృతముఖము కలదానవునునై పరివర్తించుమనియు,నీపరిష్కృతరూపముబోయి భయంకరమగు రూపమగుగాక' యనియు శపించెను. అప్పుడు తాటక కోపమును జెంది యగస్త్యుడుసంచరించిన యాదేశపు ప్రజలను జంతువులను బాధించుచుండెను.

రామునికి వీరితో గలిగిన చర్యలును వీరి సంహారణమును రామకథలో దెలిపితిమి.

---

## ౬ వ అధ్యాయము. మధు, లవణాసురులు.

పూర్వము నొకకృతయుగమున లోలాపుత్రుడగు మధువను నసురుడుండెను. వాడు బ్రహ్మజ్ఞానము కలిగి శరణు బొందతగినవాడుగను, బుద్ధిలో మంచిపరిశ్రమకలవాడుగను నుండెను. దేవతలకును గూడ వానియందుప్రీతికలిగెను. ఆమధువు గొప్పవీర్యముకలవాడు, ధర్మమందే బుద్ధికలవాడు. అతడు శివుని ప్రీతినిమిత్తమై యనేకవేలసంవత్సరములు తపస్సుచేసెను.దానితో శివుడు వానిపై ప్రీతి కలిగి తనశూలమునుండి మంచివీర్యము కలదియు కాంతికలదియునగు మఱి

యొక శూలమును దీసి వానికిచ్చి యిట్లు పలికెను. "నీవు మిక్కిలి గొప్పదగు ధర్మమున నుండుటచే నాకు నీపై గొప్పకరుణ గలిగి యీగొప్పయాయుధము నీకిచ్చితిని. నీవు దేవతలతోను, బ్రాహ్మణులతోను, విరోధములేక యుండునంతకాల మీశూలము నీయొద్ద నుండును. మఱియొకవిధమునజరిగిన నిది నశించును. నీతో భయము లేక యుద్ధమునకు వచ్చినవానిని నిది పరిమార్చి నీచేతికి తిరుగ వచ్చును." ఇట్లు మధువు వరమునుబొంది మహాదేవుని నెక్కువ నమస్కరించి 'భగవంతుడా! యీశూలము నావంశమున నెల్లప్పుడును నుండుగాక!' యనివేడెను. దానికి శివుడు "అట్లు జరుగదు. అయినను నీవు పలికిన పలుకులు నాదయచే విఫలముగాక శుభమై నీపుత్రునికి మాత్ర ముండుగాక! యీశూలము వానిచేతిలో నుండు నంతకాల మేజీవునిచేతను వాడు చంపబడడు" ఇట్లు శివుడు మధువు నకు వరమీయ నతడు తనస్థానమునకు తిరుగవచ్చి గొప్పప్రకాశ మగు భవనమును, మధురాపట్టణమును గట్టించెను. ఇతడు మాల్యవంతుని కూతురగు ననలకును, విశ్వావసునకును పుట్టిన కుంభీనసిని రావణుని గృహమునుండి యెత్తుకొనిపోయి వివాహమాడెను. వీరికి గొప్పపరాక్రమవంతుడును, దారుణుడును, చిన్నతనమునుండి పాపములు చేయువాడును నగు లవణుడు జన్మించెను. మధువు తనపుత్రుని దుర్మార్గపుచర్యలు చూచి వానిపై క్రోధముకల్గి శోకమును బొందెను కాని వాని నేమియు ననలేదు. మధువు భూలోకమును విడుచుచు తనశూలమును కుమారునకిచ్చి వానికి దాని వరముసంగతులు చెప్పి, తా నీలోకమును విడిచి వరుణలోకము ప్రవేశించెను.

తరువాత లవణాసురుడు తనదుర్బుద్ధిచేతను, శూలప్రభావము చేతను, మూడులోకముల వారిని, ముఖ్యముగ ఋషులను బాధించు చుండెను. వీ డనేక వేలసింహములు, పులులు మొదలగు జంతువులను, మనుష్యులను గూడ జంపి భుజించుచుండెను, ముఖ్యముగ

ఋషులను దినివేయుచుండెను. ఎల్లప్పుడు వీడు మధువనములోనుండి భయంకరముగ వర్తించుచుండెను. వీడనేక రాజులను, తత్పరివారములతో జంపెను. మాంధాతచక్రవర్తికూడ దీనివలననే మరణమునొందెను.

శత్రుఘ్నుడు వీనిని జంపిన కథ రామాదులచివరకాలపు చరిత్రిలో దెలిపితిమి.

## ౭ వ. అధ్యాయము. రావణుడు కుబేరుని నోడించుట.



దశగ్రీవుడు నిత్యము దేవతలను, ఋషులను, యక్షులను, గంధర్వులను బాధించుచుండెను. అతడు విచిత్రములైన నందనము మొదలగు నుద్యానవనములను క్రీడించునేనుగు నదులనుకలగించునట్లును, వాయువు వృక్షముల విఱచునట్లును భగ్నముచేసెను. ఈసంగతులు ధర్మజ్ఞుడగు కుబేరుడు తెలిసికొని వానిచర్యలు తనకులమునకు తగినవికావని యాలోచించి తనతమ్మునియందు స్నేహముచే వానిహితము కొఱకు దూతనొకని లంకకు బంపెను. వాడు వెళ్లి విభీషణుని కలిసికొన నాతడు వానిని మర్యాదచేసి ధర్మముగ వాడు వచ్చిన కార్యమును తెలిసికొని కుబేరునియు వానిబంధువులయు క్షేమమడిగి రావణుడు కొలువుండిన సభను నాదూతకు చూపించెను. వాడు తేజముతో వెలుగు దశాననుజూచి, 'జయ, జయ' యనిపలికి యొకముహూర్తమూఱుకొని మంచిప్రక్కమీద కూర్చొనిన యాతని జూచి యిట్లుపలికెను. "రాజా! నీయన్న కుబేరుడు చెప్పిన దంతయు దెలిపెదవినుడు. కులముచేతను నాచరణముచేతను, మనమిద్దఱము సమానమే. ఇంతవఱకు నీవు చేసినది బాగుగ నున్నది. నీవు చేయ గలిగినచో ధర్మమున వ్యవహరించుట లెస్స. నీచేత భగ్నమయిన నందనవనమును నేను జూచితిని. ఋషులను నీవుచంపుటయు, నీవలన దేవతలు భయమునొందుటయు వింటిని. నీచేత చాలసారులు నిరాక

రింపబడితిని. చిన్ననాటినుండియు నీవు బంధువుల విషయమున నప రాధము చేసితివి. నేను ధర్మముగ నడచుటకు హిమవత్పర్వతము వెనుక భాగమునకు బోయి కఠినమైన నియమములు గలిగి యింద్రియ నిగ్రహముతో దపము జేసితిని. అచ్చట పార్వతియును, నీశ్వరుడును కలిసియుండ నాయెడమనేత్రము దేవియందు పడెను. దేవి యక్కడ నుపమానములేని రూపముకలదై నిలువగ నీమె యెవతెయై యుండు నని చూచితిని. కాని, మఱియొక కారణమువలన కాదు. ఆమెదివ్య ప్రభావముచే నాయెడమకన్ను దగ్ధమయ్యెను. దుమ్ము పడినట్లు నాకన్ను పింగళవర్ణము కలదయ్యెను. తరువాత నేను కొంతదూరము పోయి యాకొండసదును భూమిని 108 సంవత్సరములు గొప్పనియమ ముతో తపస్సు పూర్తినొందింప మహేశ్వరునకు నాపై దయ గలిగి యాతడిట్లు సెలవిచ్చెను. నీతపస్సునకు ప్రీతినొందితిని. నీవును నేనును తప్ప మఱియెవరును దీనిని చేసియుండలేరు. ఈతపస్సును పూర్వము నేనే కల్పించితిని.దీనిని నీ వాచరించినందున నీవు నాసఖ్యము నంగీక రింపుము. నీతపముచే నేను జయింపబడితిని. నాసఖుడవు కమ్ము. నీవు దేవీప్రభావముచే దగ్ధమైన కంటితో "ఏకాక్షిపింగళుడవని శాశ్వత ముగ పేరునొందెదవు." ఇట్లీశ్వరుడు శలవీయ నేను వానిస్నేహమును బొంది సెలవు పుచ్చుకొని వచ్చునపుడు నీపాపపు పనులు వింటిని. అధర్ములును, కులదూషణులును నగు వారిసహవాసమునుండి నీవు తొలగుము. దేవతలును, ఋషిసంఘములును, నిన్ను జంపు నుపాయ మాలోచించుచుండిరి." దూత యీమాటలను జెప్ప దశాననుడు కోపముతో గన్నులెఱ్ఱజేసి రెండుచేతులు గట్టిగనొక్కి పండ్లు పట పట కొఱికి వానినిట్లు జడిపించెను. 'ఎవడు చెప్పినవాక్యము నీవు పలి కితివో నాకు తెలిసినది. నాయన్నచే బంపబడిన నీవు జీవింపవు. కుబే రుడు చెప్పినది నాకు హితమైనదికాదు. మూఢుడా! నిజముగ మహే శ్వరునిస్నేహము నాకు దెలిపెదవా? నీవు నాతో పలికిన దానిని

క్షమింప వీలులేదు. దూతా! యింతకాలము నే నోర్చియుంటిని. నాకంటె నతఁడు జ్యేష్ఠుఁడు గనుక వానిని జంపకూడదని తలంచితిని. కుబేరుని యీమాటలు నేను విని నా బాహుపరాక్రమముచే మూఁడులోకములను జయించెదనని యాలోచన చేసితిని. ఈక్షణముననే నేను కుబేరునితోఁగూడ లోకపాలురనందఱిని యమలోకమునకు బంపెదను.' ఈప్రకారము దశాననుఁడు దూతతో బలికి, వానిని ఖడ్గముతో ఖండించి దుర్మార్గులగు రాక్షసులకు దినుటకిచ్చెను.

తర్వాత దశాననుఁడు శుభాశీర్వచనముల నొంది, త్రిలోకజయకాంక్షియై రథమెక్కి, బలిష్ఠులగు మహోదర, ప్రహస్త, మారీచ, శుక, సారణులును, యుద్ధాభిలాషియగు ధూమ్రాక్షుఁడును నను 6 సచివులతో మూఁడులోకములను దహించునటుల క్రోధముతో లంకనుండి బయలుదేరి యొకముహూర్తములో పురములు, నదులు, కొండలు, వనములు, ఉపవనములుదాటి, కైలాసగిరికి, వెళ్ళెను. అత్యుత్సాహముతో దనమంత్రులతో గలిసి యుద్ధమునకు వచ్చు రాక్షసరాజు నెదుట యక్షులు నిలువలేక, వచ్చినశత్రువును తమరాజగు కుబేరుని తమ్మునిగ తెలిసికొని కుబేరునియొద్దకు వెళ్ళి రావణుడు చేయదలచినదంతయు సాంతముగ నతనికి దెలియజేసిరి. అతఁడు వారిని వానిపై యుద్ధమునకుబంపెను. ఆబలములసంక్షోభము వృద్ధినొందుచున్న సముద్రిని సంక్షోభమువలెనుండెను. అది యాకైలాసగిరిని కదిలించివైచెను. యక్షులకును రాక్షసులకును జరిగిన యుద్ధములో రావణునిమంత్రులు కొట్టబడిరి. అపుడు దశాననుఁడు సింహనాదముచేయ నొక్కొకరాక్షసమంత్రి వేయిమందియక్షులతో యుద్ధముజేసెను. దశాననుఁడు, గదలు, పరిఘలు, కత్తులు, శక్తులు, తోమరములు మొదలగువానితో గొట్టబడుచున్నను, యక్షసైన్యమున బ్రవేశించెను. పెద్దకొండపైని మేఘములువర్షించునటుల యక్షవీరులు

రావణునిపై బాణవర్షముఁ గురిపించినను వాడుతప్పించుకొని వీరుడగుటచే బాధను గనపర్చలేదు. తర్వాత దశగ్రీవుడు యమునిదండమువంటిగద నొకదానిని పట్టి యక్షులను యమలోకమునకు బంపుచు శత్రు సైన్యమున బ్రవేశించి దానిని నాశనముఁ నొందించెను. అతని యమాత్యులగు మహోదర, శుకాదులవలన గూడ చాలమంది యక్షులుమరణించిరి. కొందఱిశరీరము లాయుధములచే ముక్కలై యుద్ధభూమియందుబడెను. కొందఱు తమపండ్లచే పెదవులను గఱచుకొనుచు భూమియందు బడిరి. భయముచే కొంద ఱొకరి నొకరు కౌగిలించుకొని యుద్ధభూమిలో శస్త్రములనువిడిచిరి. ఇట్లు యక్షులు నశించిరి. చనిపోయిన యక్షులు స్వర్గలోకమునకు వెళ్లుచుండుటయు మిగిలినవారు యుద్ధము జేయుటయు ఋషిసమూహము లాకాశమున జూచుచుండెను. పడినవారిని కుబేరుడు చూచి మహాబలులును యక్షులలో శ్రేష్ఠులునగు యక్షకులను, మహాశూరుడగు సంరోధకంటకుని సేనాధిపతిగా జేసి బలవాహనములతో యుద్ధమునకు బంపెను. వాడు చక్రముతో మారీచుని గొట్ట వాడు భూమిమీదపడి, ముహూర్తకాలములో తెలివి తెచ్చుకొని తిరుగ యక్షనాయకునితో యుద్ధము జేసెను. యక్షుడు దెబ్బలుతిని, కోటద్వారము ప్రవేశించి లోనికి బోయెను. అంతట దశగ్రీవుడు కుబేరుని భవనములోనికి ప్రవేశింపబోవ సూర్యభాను డనెడు ద్వారపాలకు డాతని నడ్డెను. వానికి దశాననుడు డాగకయుండ వాడు బహిర్ద్వారము స్తంభమును పెటికి దానితో వానిని గొట్టెను. అతడు రక్తము వచ్చినను బ్రహ్మ వరమువలన బాధనొందక దానితోనే యాయక్షుని బరిమార్చెను. మిగిలిన యక్షులు భయమునొంది యాయుధములు విడిచి ముఖములు మాడ శాంతులై నదులు గుహాలు ప్రవేశించిరి. అటుపైని కుబేరుడు మాణిభద్రుని పిలిచి 'దుర్వృత్తుడును, పాపమనస్కుడును నగు దశాననుని చంపు' మని యాజ్ఞాపించెను. వాడు 4000 యక్షు

ంతో బయలుదేఱి, వారు యుద్ధపుకేకలు వేయుచు గద, ముసలము, పాశ, శక్తి, తోమరము, ముద్గరములతో రాక్షసులనెదిరించిరి. గొప్పయుద్ధము జరిగెను. దేవతలు, గంధర్వులు, బ్రహ్మర్షులు నా యుద్ధమును జూచి యాశ్చర్యము నొందిరి. ప్రహస్తు డొక వెయ్యి మందియక్షులను మహోదరు డొక వెయ్యిమందియక్షులను మారీచుడు రెండువేలమందియక్షులను నంతము నొందించిరి. న్యాయమార్గము నాశ్రయించిన యక్షునికంటె మాయాబలము నాశ్రయించిన రాక్షసులు యుద్ధమున నధికులైరి. మాణిభద్రుని ధూమ్రాక్షుడు ముసలముతో వక్షస్థలమున గొట్టినను వాడు కదలక యుండెను. మాణిభద్రుడు గదపట్టి యారాక్షసవీరుని తలమీద గొట్ట వాడు భయమునొంది నిలువలేక క్రిందబడెను. దానిని దశగ్రీవుడు చూచి మాణిభద్రునిపైకురికెను నాతడు వానిని మూడు శక్తులతో గొట్టెను. దశాననుడును తనయాయుధముతో మాణిభద్రుని తలమీద బొడవ వానికిరీట మొకప్రక్కకు వచ్చెను. కాని, వాడు యుద్ధములో నష్టమునెందినను కదలలేదు. అప్పటినుండి యాయక్షవీరుడు 'పార్శ్వమౌళి' యని పేరు వహించెను.

కుబేరుడు మాణిభద్రునియు యక్షులయు నపజయశబ్దము కైలాసగిరియందుండగా విని గదనుధరించి తానే యుద్ధమునకు వచ్చెను. శంఖపద్మములతోను, శుక్రప్రోష్ఠపదములతోను, వచ్చిన కుబేరుడు యుద్ధమునకు వచ్చిన తన తమ్ముని జూచి బ్రహ్మకులమునకు దగినట్లిట్లనెను. "దుర్బుద్ధీ! నీవు నావలన నివారింపబడినను తెలిసికొనకున్నావు. ఇట్టి దుష్కార్యములచే నీవు నరకమును బొందిన తరువాత దానిని తెలిసికొనగలవు. మూఢుడు కర్మఫలమును, దానివల్లవచ్చు విపరీతముచే తెలిసికొనును. అట్టివానిగూర్చి దేవతలు గాని ధర్మము తెలిసిన యెవరునుగాని సంతోషింపరు. ఈరీతిగ నీతి చెప్పినను వినని వాడును, దల్లిదండ్రులను, అన్నదమ్ములను, నాచార్యుని

నవమానించువాడును నగు నీవు యముని పాలబడిన వెనుక దాని ఫలమును గనెదవు. శాశ్వతముకాని యీశరీరముతో బలమగు తపస్సు చేయని మూఢుడు మరణమును బొంది, తనగతిని జూచిన వెనుక విచారించును. ధర్మమువలన రాజ్యమును, ధనమును, సుఖమును, నధర్మమువలన దుఃఖమును సంభవించును. సుఖముకొఱకు ధర్మమాచరించి పాపమును విడువవలెను. పాపమునకు ఫలమగు దుఃఖమును నీలోకమున పురుషు డనుభవింపవలెను. అందుచే మూఢుడు తన బాధకొఱకే పాపమును జేయును. దుర్బుద్ధి కెన్నడు మంచిబుద్ధి పుట్టనేఱదు. పురుషుడు తాను జేయుకర్మకు దగినట్టుల ఫల మనుభవించును. అతడు మంచికర్మచే బుద్ధిని, రూపమును, విత్తమును, పుత్రులను, మాహాత్మ్యమును బొందును. పూర్వము తాము చేసిన కర్మలచే నరులు స్వర్గమును బొందుదురు. నీవంటి బుద్ధికలవాడు నరకమును బొందును. నీవు దుర్వృత్తుడవగుటచే నీతో మాట్లాడను. ఇదియే తగినపద్ధతి.” ఇట్లు కుబేరుడు చెప్పి రావణుని, యమాత్యులను గొట్ట వారు పరాఙ్ముఖులై పరుగెత్తిరి. పిదప నతడు గదతో రావణుని తలపైని గొట్టినను వాడు కదలలేదు. వారిరువురు యుద్ధములో నొకరి నొకరు పొడిచికొనుచు, నొకరి కొకరు లొంగక, యలసట నొందక, యొకరినొకరు నోర్వలేక యుండిరి. కుబేరుడు రావణునిపై నాగ్నేయాస్త్రమును విడువ నాతడు వారుణాస్త్రముతో దానిని త్రిప్పెను. అప్పుడు రావణుడు రాక్షసమాయబొంది పులులు, అడవిపందులు, మేఘములు, లేళ్ళు, కొండలు, సరస్సులు, యక్షులు, దైత్యులు మొదలగు ననేకరూపముల జూపి నాదము చేసెను. కాని తన నిజరూపమును జూపలేదు. తర్వాత వాడు ధనదునిపై గొప్ప యస్త్రమును బ్రయోగించి గొప్ప గదను ద్రిప్పి వానితలమీద గొట్టెను. దానితో రక్తముకార నాతడు భయమంది మూలము

ఛేదింపబడిన యశోకవృక్షమువలె పడెను. అతని నెల్లప్పు డనుసరించి యుండు పద్మాదినిధులు వానిచుట్టు జేరి నందనవనమును దెచ్చి వాని మూర్ఛను దొలగించెను. రావణు డాతనిజయించి వానిపుష్పక విమానమును దీసికొని ప్రతాపము, జయముగల దానిని నత డారోహించి గర్వముచే మూడులోకముల జయించినటుల భావించెను. అతడు తనకిరీటహారములతో బాసియందుంచునప్పు డగ్నివలె తేజరిల్లెను. తర్వాత రావణుడు కుబేరపట్నముండు కైలాసపర్వతభాగము విడిచి వెళ్ళుచుండెను.



## ౮ వ అధ్యాయము. నందీశ్వరశాపము, శంకరవరము.



తర్వాత దశగ్రీవుడు కైలాసపర్వతముయొక్క మఱియొక భాగమున, కుమారస్వామిజన్మించిన పర్వతమెక్కి వనములుండు చోటునకు బోవ పుష్పక మాకసమున కదలక నిలిచెను. దానిని దశాననుడు చూచి తనమంత్రులతో, తాను కోరినటు లేల యది పోవదనియు, పర్వతమున నుండువారెవరేమి చేసియుందురనియు, పలుక వానితో బుద్ధిమంతుడగు మారీచుడు 'రాజా! పుష్పకము నడువకుండుట నిష్కారణముగ గాదు. ఇది ధనదుని తప్ప నితురుల మోయకపోవుటచేతను, నతడులేకపోవుటచేతను, నిశ్చయము కావచ్చును.' అని మనవిచేసెను. ఇంతలో భయంకరుడును, నల్లని వర్ణము గోరోచనవర్ణము కలసినవాడును, పొట్టివాడును, వికటుడును, తలగొరుగబడినవాడును, వంగినభుజములు గలవాడును, బలవంతుడును, శంకరపార్శ్వవర్తియునగు నందీశ్వరుడు వచ్చి యనుమానము లేక దశగ్రీవునితో 'ఆపర్వతమున శంకరుడు క్రీడించుననియు, గరుడ,

నాగ, యక్ష, దైత్య, దానవ, రాక్షసులును, నన్ని జీవులును, ఆపర్వతమునకు బోఁగూడదనియు సెలవిచ్చెను. దానికి వాడు కోపముచే కదలుచున్న కుండలములు కలవాఁడై కన్ను లెఱ్ఱజేసి పుష్పకమునుండి దిగి, యెవఁడీశంకరుఁ డని కొండ మొదటికి వెళ్ళెను. వానికి నందీశ్వరుఁడు శంకరుని తేజము గలిగి, శూలమును ధరించి, దగ్గఱనే రెండవశంకరుని వలె కనబడెను. వానిముఖము వానరముఖముగ గనబడుటచే దశాననుఁడు మూర్ఖతచే పెద్దనవ్వు నవ్వెను. దానికి శంకరుని మఱియొకశరీరము ధరించినవాఁడును, భగవంతుఁడును నగు నందీశ్వరుఁడు కోపించి యిట్లు సెలవిచ్చెను. "నా వానరరూపము నీ వవమానించి గొప్పగ నపహసించుటచే నా వీర్యమువలనబుట్టినవారును, నాతో సమానమగు రూపముగలవారును నగువారు నీకులమును వధించుటకై, శూరులగు వానరులై గోళ్ళు, కోఱలే యాయుధములుగ గలిగి, మనోవేగమును, యుద్ధమందే మనస్సును, బలోద్రేకములను గలిగి పర్వతరూపముల బొంది పుట్టెదరు. నీయొక్కయు, నీమంత్రులయొక్కయు, నీపుత్రులయొక్కయు గొప్పగర్వమును, ననేకవిధములగు నున్నతులను నణచెదరు. నేను నిన్నిపుడు చంపుటకు శక్తుఁడనైనను, నీవు నీపూర్వకర్మలచేతనే చంపబడియుండుటచే నాచే చంపబడ నవసరములేదు." ఇట్టి మాటలు నందీశ్వరుఁడనునపుడు దేవదుందుభులు వాగెను. ఆకాశమునుండి పుష్పవర్షము కురిసెను. దశాననుఁడాతని మాటలను లక్ష్యపెట్టక, తానుండు తన పుష్పగమన మెవరివలన నడ్డముపెట్టబడెనో యట్టి యాతఁడు కాపాడు పర్వతమును మూలముతో పెఱికివేతు ననియు, నే ప్రభావముచే నీశ్వరుఁడు రాజువలె నెల్లపుడు క్రీడించునో తనకు దెలియవలయు ననియు, తాను భయస్థానమునకువచ్చినసంగతి తెలియదనియు పలికెను. తర్వాత వాఁడు తనభుజములను నాపర్వతమునందుంచి దానిని శీఘ్రముగ నెత్త నది కంపమొందెను. దానిపైనుండిన దేవగణములు

కదలినవి. పార్వతి పరమేశ్వరుని కౌగిలించుకొని చలనమొందెను. ఈసంగతి యీశ్వరుడు పెద్దనవ్వు నవ్వుచు చూచి తనకాలిబొటన వ్రేలితో లీలగ పర్వతమును నొక్క దశాననునిభుజములు పర్వతము కింద బడి నలిగెను. వానిమంత్రులు విస్మయమునొందిరి. వాడు తన భుజములు నొక్కకొనియుండుటచే కోపముతో ముల్లోకములు కంపమొందునట్లుల యఱచెను. మనుష్యులా శబ్దముచే భయము నొంది ప్రళయమయ్యెనని భావించిరి. దేవతలు తమస్థానములందు కలకలమొంది చలించిరి. యక్ష, విద్యాధర, సిద్ధ లిదియేమని పలికిరి. దశగ్రీవుని మంత్రులతనికి నిట్లు సలహానిచ్చిరి. 'నీలకంఠుడును, నుమాపతియును నగు నీశ్వరుని మీరు సంతోషపఱచుడు. ఆతని దప్ప మీరు శరణుకొచ్చుటకు నితరులను గానము. మీరు నమ్రులరై స్తుతులచే నాతని శరణు బొందుడు. దయాళువగు శంకరుడు మీకు దన ప్రసాదమును గనబఱచును.' దశాననుని మంత్రు లీరీతిన జెప్ప నతడు మంచివాక్యములచేతను ననేకవిధస్తోత్రములచేతను, శంకరుని నమస్కరించి వేయిసంవత్సరములు రోదన జేయుచు వేడెను. అంతట ప్రీతుడగు మహాదేవుడు కైలాసాగ్రమున కూర్చొని దశాననుని భుజములు విడిచిపెట్టి వానికిట్లు సెలవిచ్చెను. "నీధీరత్వమునకును,శక్తికిని సంతోషించితిని. కొంత నిన్నాక్రమించుటచే నీవు గొప్ప రావము చేసితివి. దానివలన ముల్లోకములు భయమునొందుటచే నీవు 'రావణుడ'వని నామముబొందెదవు. దేవ, దానవ, యక్షులును, మిగిలినవారును, నిన్ను లోకములనేడ్పించు 'రావణు' డని పిలిచెదరు. నీ వేత్రోవను బోవుటకు గోర నిష్టకలిగెనో యాత్రోవను బోవుటకు నేను సెలవిచ్చితిని. నీవు వెళ్ళవచ్చును." ఇట్లు శంకరుడు సెలవీయ లంకేశుడా మహాదేవునితో నిట్లు విన్నవించెను. "నాయెడ దయగలవారైన వరమిండు. నేను దేవ, గంధర్వ, దానవ, రాక్షస

గుహ్యక, నాగులచేతను, నితరబలవంతులచేతను, మరణమునంభవిం పని వరమును బొందితిని. స్వల్పులగు మనుష్యులను నేను లెక్క చేయను. వారు నాచే జంపబడిరి. బ్రహ్మచే నాకు దీర్ఘాయువు సంప్రాప్తమైనది. ఆయువు శేషమును శస్త్రమునొకటిని నాకుదయచేయుము.” ఇట్లు రావణుడు కోర శివుడు వానికి తేజరిల్లుచంద్రహాసమనెడు ఖడ్గమును, నిలిచిన యాయుశ్శేషమును నిచ్చి యిట్లనియె. ‘ఈఖడ్గమును నీవు తిరస్కరింపకూడదు. అట్లు చేసినయెడల నది తిరిగి నన్ను బొందును.’ అప్పుడు రావణుడు శివునికి నమస్కరించి పుష్పకమెక్కి మహావీరులగు క్షత్రియుల నన్నిచోట్ల బాధించుచు భూమియందు దిరిగెను. అతనియాజ్ఞకు లొంగనిశూరులగు క్షత్రియులు వానితో యుద్ధముజేసి తమ యనుచరులతోగూడ నశించిరి. ప్రాజ్ఞులు వాడు దుర్జయుడని తెలిసికొని తాము జయింపబడితిమని బలదర్పితుడగు వానితో నొప్పుకొనిరి.

---

## ౯ వ అధ్యాయము. రావణుడు రంభను చెఱబట్టుట.



రావణుడు మేఘనాద, కుంభకర్ణ, మధులతోను, నితరవీరులతోను నింద్రలోకజయమునకు వెళ్ళునపుడు, మధుపురము విడిచి, కైలాసగిరి మీదనున్న కుబేరునిగృహమునకు గొంతదూరమున నతనిసేనతో విడిసెను. రాత్రికాగా, చంద్రుడుదయించెను. రావణుడు తప్ప సేనయంతయు నిద్రించెను. అత డాపర్వతశిఖరమున కూర్చొని వనములు, చెట్లు, గంగలోనిపద్మములు మొదలగువానిని చూచుచుండెను. కిన్నరులు వనములలో మన్మథపీడగలుగుటచే ననురాగముకలవారై బాగుగ పాడుచుండిరి. విద్యాధరులు తేనెను ద్రాగుచు నెట్టని

కన్నులు గలిగి మైమఱచి తమస్త్రీలతో క్రీడించిరి. కుబేరగృహము నుండి యప్సరసలగానము వినబడెను. చెట్లు గాలిచే కదలుచు మంచి వాసనలుగల పుష్పవర్షముల గురిపించెను. గాలి తేనెనిచ్చు పుష్పముల పుష్పాదివాసనతో వీచెను. ఇవన్నియు రావణునికి కామోద్రేకమును గలిగించెను. అతడు చంద్రునిజూచి మిక్కిలి నిట్టూర్పులు విడుచుసమయమున నప్సరసలలో మిక్కిలి చక్కనిదియు, దివ్యాభరణములను ధరించినదియు, చందనము నలదికొన్నదియు, సిగయందు మందార పుష్పము ముడుచుకొన్నదియు, మంచిపుష్పములచే నలంకరింపబడినదియు నగు రంభ సైన్యమధ్యమునుండి వెళ్లుచుండ, నామెను ఆతడు చూచి కామపరవశుడై యామెను తనచేతులతో నెత్తుకొని యామెతో నిట్లనెను. "నీ వెక్కడికి వెళ్లుచున్నావు? ఎవరిని సంతోషపెట్టదలచి యుంటివి? నాకంటె నింద్రుడు, విష్ణువు, అశ్వినులెక్కువవారా! యేమి? నీవు నన్ను తప్పించుకొని వారివద్దకు వెళ్ళుట శుభము కాదు. మూడులోకములలో నాకంటె నన్యుడు ప్రభువు లేడు. ఈ రాతిసమభాగమున నన్ను పొందుము." రావణుని యీమాటలు రంభ విని తనశరీరము కంపించుచుండ నిట్లు విన్నవించెను. 'నాయందు మీరు దయజూపుడు. ఈరీతిని మీరు పలుకదగదు. మీరు నాకు పూజ్యులు. ధర్మముగ నాకు మామలు కనుక యితరులు నన్ను బలవంతముగ బట్టినను, మీరు నన్ను రక్షింపవలసినవారు.' ఇట్లు రంభ క్రిందకు జూచుచు పలుక, రావణు డామెతో నామె తనపుత్రుని భార్య యైనయెడల తనకు కోడ లగుననెను. ఆమె వానికిట్లు జవాబిచ్చెను. "ఆమాట స్థిరము. ధర్మముగ నేను మీ కుమారుని భార్యను. మీయన్న కుబేరునికుమారుడగు నలకూబరుడు నాకు ప్రాణముకంటె ప్రియుడగువాడు. ధర్మమున విప్రుడును, వీరత్వమున క్షత్రియుడును, క్రోధమున నగ్నివంటివాడును, ఓరిమిచే

భూమివంటివాఁడను నగు నాతనిని గలియుటకు నేను సంకేతము కలదాన నై యలంకరించుకొని వెళ్ళుచున్నాను. నే నిప్పు డితరులందు మనస్సు నిలుప లేదు. ఆతఁడు నాకొఱకిప్పుడు నిరీక్షించుచుండును. అతనికి విఘ్నముచేయక నన్ను విడిచి ధర్మమార్గమున జరింపుఁడు. మీరు నాచే మర్యాద బొందవలయును. నన్ను మీరు లాలనజేయవలయును." ఇట్లామె విన్నవింప, రావణుడామెతో 'నీవు నాకోడలవయిన, నీధర్మము ఏకపతిగలవారియందు వర్తించును. అప్సరసలకు భర్త లేకుండుటయు, నొకనికే వారలు భార్యలు గాకుండుటయు నను నీపద్ధతి దేవలోకమున శాశ్వతముగ నున్న' దని శిలాతలమం దామెతో సంభోగించి తన యభీష్టమును దీర్చుకొని యామెను విడిచెను. ఆమె కలతనొందుచు పోయి, నలకూబరునికాళ్ళమీద బడి జరిగినవృత్తాంతమంతయు నాతనికి దెలియబఱచెను. అతడు కోపించి ధ్యానముచే నిజమును దెలిసికొని యొకముహూర్తములో జలమును గ్రహించి యథావిధిగ దానిని స్పృశించి, 'కోర్కె లేని నిన్ను వాడు బలవంతముగ గ్రహించుటచే వాడు కోర్కె లేని యితరస్త్రీని చేరడు. ఒకవేళ బలవంతముగ చెఱబట్టిన వానితల వేయిముక్కలగుగాక!" యని రావణుని శపించెను. వెంటనే దేవదుందుభులు మ్రోగెను. స్వర్గమునుండి పుష్పవర్షము కురిసెను. బ్రహ్మాదులు సంతోషించిరి. లోకములోజరుగు సంగతులను, రావణుని మరణకారణమును ఋషులును, పితృదేవతలును విని ప్రీతినొందిరి. రావణుడీశాపమును విని, తనయందు కోరిక లేని స్త్రీలతో సంభోగమున విముఖుడయ్యెను. వాడు చెఱబట్టిన పతివ్రతలు నలకూబరుని శాపము విని సంతోషించిరి.

—o—

## ౧౦ వ. అధ్యాయము. ఇంద్రరావణుల యుద్ధము, ఇంద్రజిత్తు వరములు.

—※—

తర్వాత రావణుడు కైలాసమును దాటి యింద్రలోకమునకు తనసైన్యముతో బోయెను. దానితో నింద్రుడు తనయాసనమునుండి చలించి దేవతల నందఱిని, నాదిత్యులను, వసువులను, రుద్రులను, విశ్వులను, సాధ్యులను, మరుద్గణములను, యుద్ధమునకు బయలుదేఱుట కాజ్ఞాపింప, వా రట్లు దానికి సన్నద్ధులైరి. ఇంద్రుడు రావణునితో యుద్ధముచేయుటకు ముందు దీనుడై విష్ణునియొద్దకు బోయి యిట్లు విన్నవించెను. "బలవంతు డగు రాక్షసుడు యుద్ధమునకు వచ్చెను. వానితో నే నెట్లు యుద్ధముచేయగలను? వీడు వరదానముచేతనే బలవంతుడు. బ్రహ్మవాక్యములు నిజముగ జరుగవలెను. మీబలమును బట్టియే నేను నముచి వృత్రాదుల సంహరించితిని. ఇప్పుడు కూడ మీ రట్లు చేయుడు. మూడులోకముల చరాచరములకు మీరుతప్ప నన్యులు గతిలేరు. మీరు సిరితోగూడిన నారాయణులు; పద్మనాభులు; సనాతనులు. మీచేతనే యీలోకములు స్థాపింపబడినవి. నేను శక్రుడుగను, దేవతల కధికారిగను నియమింపబడితిని. ఈ చరాచరములతో గూడిన మూడులోకములు మీవలన సృజింపబడినవి. కనుక అన్నియును ప్రళయమున మీయందే ప్రవేశించును. రావణునితో మీరు చక్రసహాయులరై యుద్ధము చేయగలరేమో నాకు నిజస్థితి తెలుపగోరెదను." ఇట్లింద్రుడు మనవిచేయ నారాయణుడు "నీవు భయపడకుము. నీవు చేయవలసిన కార్యమును జెప్పెదను వినుము. ఈ రావణుడు వరదానముచే దుర్జయుడు. యుద్ధములో సురాసురులచే జయింపబడుటయు, చంపబడుటయు శక్యము కానంత కాల మన్నివిధములను వీడు తనపుత్రునితోగూడ గొప్ప

బలము కలవాఁడై గొప్ప కర్మలు చేయును. ఇది వాని స్వభావము వలన కలిగినది. నీవు, నన్ను 'వానితో యుద్ధము చేయు' మని యంటివి; కాని, నేను వానితో పోరు సలుపను. విష్ణువు యుద్ధములో శత్రువును జంపక తిరిగి రాఁడు. రావణునకు వరములచే రక్షింపబడుట వలన నీకోరిక జరుగదు. ఇంద్రా! యీ రాక్షసునికి మృత్యుకారణము నే నయ్యెదనని నీ యెదుట ప్రతిజ్ఞ చేసెదను. ఆ కాలము రాగానే, నేనే రావణుని, వానిపుత్రుని బరిమార్చి దేవతలను సంతోషింప జేసెదను. నిజము నీకు తెలియబఱచితిని. నీవు భయము లేనివాడవై, దేవతలతో యుద్ధమునకు బోయి వానితో బోరు సలుపుము" అని సెలవిచ్చెను. తర్వాత నింద్రుడు స్వర్గమునకు తిరిగిరాగా, రుద్రులు, ఆదిత్యులు, వసువులు, మరుత్తులు, అశ్వినులు యుద్ధమునకు పురమునుండి బయలుదేఱి రాక్షసుల సమీపించిరి. ఇంతలో దెల్లవారుసమయమున యుద్ధమునకు వచ్చిన రాక్షసులకు వారిశబ్దమువినబడ నాపక్షపు గొప్పవీరులు యుద్ధమునకు నిలిచిరి. వారిని జూచుటచే దేవసైన్యమున కలకలమాయెను. ఉభయసైన్యములాయుధములతో గొప్పయుద్ధము జేసినవి. అంతట రావణుడు తన మంత్రులను యుద్ధమునకు బురికొలిపెను. అతని మాతామహుడగు సుమాలి వీరితోగూడి దేవసైన్యమును నాయుధములతో నాశనము జేయ వారు చెల్లాచెదరై పాఱిపోయిరి. అంతట వసువులలో నెనిమిదవ వసువగు 'సావిత్రు' డను శూరుడు యుద్ధమున బ్రవేశించి శత్రుసైన్యమును బాధించెను. త్వష్ట, పూషులును, నాదిత్యులును గూడ కవచములధరించి యింద్రునకు సహాయము వెళ్ళి యుద్ధము జేసిరి. దేవతలును, రాక్షసులును, నొకరి నొక రాయుధములతో బొడిచికొనిరి. అప్పుడు సుమాలి దేవతలబలమును నశింపజేయ సావిత్రుడు వచ్చి వానితో బోరాడెను. ఆ వసువు వాని పాములరథమును క్షణకాలములో విఱుగ

గొట్టి గొప్పగదను బట్టి వానితలమీద గొట్టెను. దానితో సుమాలి చూర్ణమై మరణ మొందెను. వానిని జూచి రాక్షసులందఱు కూడి మొఱబెట్టి వసువున కాగలేక పాఱిపోయిరి.

అంతట రావణపుత్రుఁడు మేఘనాదుఁడు యుద్ధమునకునిలచెను. అగ్నివర్ణము కలదియు, కోరినప్రకారము నడచునదియు నగు రథ మారోహించి నిలచినమాత్రమున దేవతలందఱు ఆయుధములబట్టియు జడిసి దిక్కులు పాఱిరి. ఇంద్రుఁడు దీనిని జూచి "మీరు జడియవద్ద నియు, యుద్ధమునుండి మఱలవద్దనియు, నా కుమారుఁడు జయంతుని యుద్ధమునకు బంపెద"ననియు పలికి మాతలిపుత్రుఁడగు గోముఖుని సారథిగ జేసి, రథమున నాతనినుంచి సురబలముతో బంపెను. రావణ మహేంద్రుల పుత్రులు యుద్ధము చేసిరి. మేఘనాదుఁడు జయంతుని సారథిని బాణములతో గొట్ట నాతఁడుకూడ వానిసారథిపై నమ్ముల విడిచెను. ఆవీరు లిద్దఱు నొకరిపై నొకరు శరవర్షము కురిపించిరి. తర్వాత రావణి బలమగు శస్త్రములను దేవతలపై విసర లోకము లన్నియు విచారము నొందెను. అతఁడు గొప్పచీకటిని కల్పించి శత్రు వులను హింసింప దేవబలము శచీపుత్రునిచుట్టుచేరికొని యనేకకష్టము లనుభవించెను. శత్రుసైన్యము లొకరినొకరు కనుగొనలేక పరుగెత్తిరి. దేవతలు దేవతలను, రాక్షసులు రాక్షసులను గొట్టుకొనిరి. మఱి కొందఱు చీకటివ్యాపించుటచే నేమియు దెలియక నిశ్చేష్టులయిరి. అంతట జయంతుని మాతామహుఁడును శచీదేవితండ్రియు నగు పులో ముఁడు తనదౌహిత్రుని శత్రుసైన్యమునుండి తీసికొనిపోయి సముద్ర మున బ్రవేశించెను. దేవతలు జయంతుఁడు నాశనమొందెనని చాల విచారించి పాఱిపోయిరి. మేఘనాదుఁడు దేవతలను వెంబడించి గొప్ప నాదము చేసెను. అప్పు డింద్రుఁడు సంగతులను దెలిసికొని మాతలిని రథము సిద్ధము చేయుమన నతఁడు ప్రకాశమానమైనదియు, గొప్ప

యాకారము కలదియు, మనస్సువలె వేగముకలదియు నగు రథమును తయారుచేసెను. మేఘము లారథమున మెఱుపులు మెఱయుచుండ, వాయువుచే వీచబడి ధ్వనిచేయుచు ముందు కదలెను. రథమునకు ముందు గంధర్వు లన్నివాద్యములను వాయించిరి. అప్సరసలు నృత్యములు సలిపిరి. దేవేంద్రుడు దేవగణములన్నియు నాయుధములనుబట్టియుండ యుద్ధమునకు బయలుదేఱెను. కాని యతనికి దుశ్శకునములు కనిపించెను. ఈసమయమున రావణుడు విశ్వకర్మ తయారుచేసి తనకిచ్చినదియు గొప్పపాములచే చుట్టబడినదియు నగు రథమెక్కి రాక్షసవీరు లాతని వెంబడింప యుద్ధమునకు వెళ్ళెను. వెళ్లి తనపుత్రునియుద్ధము నుండి మఱలించి తానే యింద్రు నెదుర్కొనెను. దేవరాక్షసులకు గొప్పకయ్యము జరిగెను. దుష్టుడగు కుంభకర్ణుడు తానెవరితో యుద్ధము చేయుచుండెనో తెలిసికొనలేక దంతములతోను, భుజములతోను, కాళ్ళతోను, శక్తి తోమర బాణములతోను తనకెదుర్కొనిన దేవతలను బాధించెను. గొప్పరూపముగల రుద్రులు వానితో యుద్ధము జేసి, శస్త్రములతో వారిశరీరమందంతట నవకాశము లేకుండునట్లు పొడువ రక్తప్రవాహ మయ్యెను. మరుద్గణములు రాక్షసులను జంపిరి. యుద్ధభూమి సముద్రమువలె నయ్యెను. రావణుడు తనబలము నాశనమొందుట జూచి, కోపించి దేవతల గొట్టుచు నింద్రు నెదుర్కొనెను. అతడు పదిదిక్కులు మ్రోగునట్లు గొప్పవింటిని సజ్జుచేసి రావణునితలలపై గొప్పబాణముల వేసెను. వాడుకూడ నాతనిపై శరవర్షము గురిపించెను. ఉభయుల బాణవర్షములచే నేమియు తెలియకుండునట్లంతటను చీకటిమయ మయ్యెను. దేవరాక్షసు లొకరినొకరు పొడిచికొనిరి. రాక్షసబలములో పదియంశములలో నొకయంశము మాత్రము నిలిచెను. చీకటిచే నొకరినొకరు తెలిసికొనలేక పోయిరి. రావణుడు, రావణి, యింద్రుడు మాత్రము చీకటివలన నజ్ఞానము

బొందలేదు. రావణుడు తనబలములు నశించెనని తెలిసికొని మిక్కిలి కోపించి, కేకలు వేసి, తనరథసారథితో "శత్రుసైన్యము మిక్కిలి మధ్య నుండి దానిచివఱవరకు నారథమును తీసికొనివెళ్ళుమనియు, యుద్ధములో నేను దేవతలనందఱిని యమలోకమునకు బంపెదననియు, నింద్రుని కుబేరుని వరుణుని యముని జంపెదననియు మూడులోకము లేలెదననియు, ఈనందనప్రదేశమునుండి దేవసైన్యము నిండియున్న యుదయపర్వతమువఱకు రథమును తీసికొనిపొమ్మనియు" జెప్పెను. అతనిసారథి యావిధమున మనోవేగముగల గుఱ్ఱములను బూన్చి రథమును శత్రుమధ్యమునకు తీసికొనివెళ్లెను. దీని నింద్రుడు తెలిసికొని దేవతలకిట్లు సెలవిచ్చెను. "దశగ్రీవుడు జీవించియుండగ వానిని మనము పట్టుకొనవలెను. బలవంతుడగు వీనిని వరబలముచే జంప వీలు లేదు. వీనిని బట్టుటకు యుద్ధములో సిద్ధముగ నుండుడు. బలిబంధన తర్వాత నేను త్రిలోకలక్ష్మి ననుభవించినట్టుల నీపాపుని బంధించియు దాని ననుభవింతును." ఇట్లింద్రుడు సెలవిచ్చి రావణుడున్నచోటు విడిచి యుత్తరస్థలమున రాక్షసులకు భయముకలుగునట్లు యుద్ధము చేయుచుండెను. దేవతలు శరవర్షము గురిపించిరి. రావణు డుత్తరము నుండి యడ్డులేక వచ్చెను. ఇంద్రుడు దక్షిణమునుండి పశ్చిమమార్గమున వచ్చెను. రావణుడు 100 యోజనములు కదలివచ్చి శరవర్షము దేవబలమునం దంతటను గురిపించెను. ఇంద్రుడు తనబలములు నశించుట జూచి కంగారుపడక రావణుని చుట్టు తిరిగెను. దానవరాక్షసులు 'చచ్చితిమి. రావణు నింద్రుడు పట్టె' నని మొఱబెట్టిరి. అంతట మేఘనాదుడు కోపించి రథము నెక్కి దేవసైన్యమున ప్రవేశించి, పూర్వము శివుడు తనకిచ్చిన గొప్పమాయను తానెవరికిని కనబడక వానిపై విసరెను. రావణి దేవతలను విడిచి యింద్రుని కభిముఖుడయ్యెను. కాని యింద్రుడు వానిని జూడలేదు. అతడు వానిని

లక్ష్యపెట్టక, తన దేవగణముతో రావణునిచుట్టు గడియ గడియకు వానిని గ్రహించి వానిరథమెక్కి వానియశ్వములను, సారథిని గొట్టి దానియందున్న రావణుని బ్రతికియుండగ బట్టికొని గొప్పధ్వని చేసెను. దేవతలుగూడ నట్లనే నాదము చేసిరి. ఇంద్రుడు రావణుని స్వర్గలోకమునకు బంపించెను. రాక్షసులు పాఱిపోవుచు పెద్దబొబ్బలిడిరి.

అప్పుడు మేఘనాదుడు గొప్పనాదము చేసి శరవేగమున నింద్రుడున్నచోటునకు వచ్చి తనకు దేవవీరులచే దెబ్బలు తగిలినను తనకవచము వదలిపోయినను కొంచెమైన చలింపక గొప్ప బాణములచే మాతలిని, గుఱ్ఱములను గొట్టి యింద్రునిపై శరవర్షము కురిపించెను. అతడును రథమును విడిచి ఐరావతము నెక్కి రావణుని వెంటడఱుము వాడు మాయను గనపఱచుచు నంతరిక్షమున కెగసెను. మేఘనాదుడు బాణములచే నింద్రునిపై మాయగప్పి యాతడు శ్రమబొందినట్లు తెలిసికొని మాయచే నాతని బాధించి తనబలములాతనిచుట్టు నిలిపి యాతని దీసికొనిపోయెను. ఇట్లు వాడింద్రునిబట్టి తనతండ్రిని విడిపించెను. ఆతనిని బలవంతముగ తీసికొనిపోవుట దేవతలు చూచి యేమగునో యని విచారించిరి. మాయావియగు నింద్రజిత్తు కనబడక యక్కడనుండెను. అప్పుడు దేవగణములగు వసువులు, ఆదిత్యులు, మరుద్గణములు రావణునిపై శస్త్రవర్షము కురిపించిరి. కాని వానికి యుద్ధముచేయుటకుగాని దానిలో నిలచుటకుగాని శక్తి లేకుండెను. అప్పుడు మేఘనాదుడు తనతండ్రికి కనుపించి యిట్లు విన్నవించెను. 'తండ్రీ! మీరు మఱలుడు. యుద్ధము విడిచి వెళ్ళుదము మనకు జయమైనది. మీకు తెలిపెదను. విచారము వీడుడు. మూడులోకములకు ప్రభువగు నింద్రుడు పట్టుపడెను; గనుక దేవతలకు గర్వపరిహారమాయెను. మూడులోకముల రాజ్యలక్ష్మిని మీరనుభవింపుడు.

యీ యవలయునో తెలుపుము.' ఇట్లు బ్రహ్మ పలుక నింద్రజిత్తు 'వీనిని విడచుటకు వరముగ నే నమరత్వము గోరుచున్నా' ననెను. దానికి బ్రహ్మ 'యే జీవునికి నెల్లకాల మమరత్వములేదు. నాలుగు పాదములుగల జంతువులు స్వర్గమున జరించుజీవులు వృక్షములు, లతలు, గుజ్జు చెట్లు, గడ్డి, రాళ్ళు, పర్వతములు మొదలగు సర్వజీవులును మరణమునకు లోనై భయము నొందును. లోకములో నన్ని జంతువులకు నన్నిటివలన భయము కలుగును. పక్షులకును, నాలుగుపాదములుగల జంతువులకును గొప్పబలముగల వారివలనను, చెట్లునకు నెండిన యాకులు పడుటవలనను భయము కలుగును. అన్ని స్థావర జంగమ జీవులును మరణమున నంతము నొందును.' బ్రహ్మ యిట్లు పలుక మేఘనాదు డిందుని విడుచుట కీవరము గోరెను. 'నేను ప్రతిదినము చేయు యజ్ఞము సిద్ధియగుగాక. శత్రువును జయించు కోరిక గలవాడనై హవిస్సులతోను, మంత్రములతోను నే నగ్నిని బూజించినచో యుద్ధముజేయుటకు గుఱ్ఱములతోగూడిన రథము నాకొఱ కగ్నినుండి బయలువెడలుగాక. అట్టి రథమువిూదనుండి యుద్ధముచేయు నాకు అమరత్వము సిద్ధించుగాక. ఇదియే నేను కోరు నమరత్వవరము. నేనగ్నియందు జేయు జపహోమములు, నే జేయు యజ్ఞము పూర్తిగాకుండ నేను యుద్ధమునకు వెడలుచో నేను నశింతును గాక. జనులందఱు తపస్సుచే నమరత్వమును గోరుదురు. నేను పరాక్రమముచేత నే యమరత్వము బొందగోరెదను.' ఇంద్రజిత్తుని యీమాటలు బ్రహ్మ విని 'యీలాగునే యగుగాక!' యని వరమీయ వా డిందుని విడిచెను.

ఇందుని బ్రహ్మ విడిపింప దేవతలు మాత్రము స్వర్గమునకు బోయిరి. ఇంద్రుడు దీనుడై దేవకళలేక చింతకలవాడై ధ్యానించుచుండెను. బ్రహ్మ వానిని జూచి ఇట్లు సెలవిచ్చెను. 'పూర్వము నీవు

గొప్పపని చేతిసివా ఏమి? నీ వహల్యను బొందిన కారణముచే గౌత ముడు 'నీవు యుద్ధములో శత్రువులచేతులలో బడుదు వనియు నిట్టి పరస్త్రీహరణబుద్ధి మనుష్యులందఱికి కలుగుననియు నట్టిచోట గొప్ప యధర్మముండుననియు వారిపాపములో సగపాలు నీకు కలుగుననియు నీకు స్థిరమగు స్థానముండదనియు నీ సురేంద్రత్వము పోవుననియు' శపించెను. ఆశాపఫలము నీ వనుభవించితివి. నీవు వైష్ణవయజ్ఞమును శ్రద్ధగలవాడవై చేయుము. దానివలన పావనుడవై నీ వప్పుడు స్వర్గ మునకు బోయెదవు. నీ కుమారుడు యుద్ధములో నాశనము కాలేదు. వానిమాతామహుడు వానిని సముద్రములోనికి తీసికొనిపోయెను.' ఇట్లు బ్రహ్మ సెలవీయ నింద్రు డాప్రకారము యజ్ఞమును జేసి స్వర్గ మును బొంది దేవతలను జేరెను.



## ౧౧ వ అధ్యాయము. రావణ యమధర్మరాజుల యుద్ధము.



రావణుడు మనుష్యులను బాధించుచు మంత్రులతో పుష్ప కమున చరించుకాలమున నొకమేఘము వెనుకప్రక్కను మహాతేజ డును, దేవర్షియు, గొప్పప్రభావము కలవాడు నైన నారదుని జూచి నమస్కరించి కుశలమడిగి యాతడు వచ్చినకారణము తెలియగోరెను. ఆతడిట్లు చెప్పెను. 'విశ్రవసుని పుత్రుడా! సౌమ్యుడా! నిలువుము. దైత్య గంధర్వ నాగులను లోబఱచికొనిన విష్ణువుతో సమానమగు నీ మంచిపరాక్రమమునకు మెచ్చితిని. నీవు విననలసిన దానిని వినుటకు నీకిష్టమున్నయెడల నీతో కొంచెము చెప్పెదను. తర్వాత నీవు తోచి నట్లు చేయవచ్చును. నేను చెప్పినది బాగుగ నాలోచించుము. దేవతలవలన నైనను చంపబడశక్యముగాని నీ వీ మనుష్యలోకమువారిని

ఏల చంపుచున్నావు? మృత్యువునకు లోబడిన వీరలు చచ్చినట్టు భావింపుము. దేవ దానవ దైత్య యక్ష గంధర్వ రాక్షసులచే చంపబడ శక్యముగాని నీవు మనుష్యలోకమువారిని హింసించుట తగదు. నిత్యము శ్రేయస్సులేక గొప్పవ్యసనములచే బాధ నొందుచుండువారును, ననిష్టములుగలుగు ముదిమిచేతను, ననేకవ్యాధులచేతను నెల్లపుడు కూడియుండువారునునగు మనుష్యులను నెవడు నీవలె చంపును? ఎక్కడనైన నేబుద్ధిమంతుడు మనుష్యలోకయుద్ధమున సంతోషము నొందును? ఆకలిచేతను, దప్పికచేతను, ముసలితనముచేతను క్షీణించువారును, గొప్పవిచారములచే నజ్ఞానముకలవారునునగు మానవులను నీవు నాశనము నొందింపకుము. రాక్షసరాజా! నీవు మనుష్యలోకమును చూడుము. అది మూఢమైనదియు, వింతయైన యర్థము కలదియు, ముందుగతి తెలిసికొనలేనిదియు నైయున్నది. కొందఱు వాద్యనృత్యములచే సంతోషము నొందుదురు. మఱికొందఱార్తులై తల్లి, తండ్రి, పుత్రుడు, భార్య, బంధువులని స్నేహముచే రోదనము చేయుదురు. అజ్ఞానము కలవారును బాధ నొందినవారునైన యీ జనులు తమకష్టములను తెలిసికొనలేరు. ఆ బాధలు వారికి చాలును. మర్త్యలోకము నీచే జయింపబడినది. సందియము లేదు. ముఖ్యముగ నీవీ మంత్రులతో యమగృహమునకు బోయి యముని జయింపుము. అంతటితో సర్వము జయింపబడిన దగును.'

నారదుని యీమాటలకు రావణుడు పెద్దనవ్వు నవ్వుచు తాను నిజముగ నిజయమునకు వెళ్ళుచుండెననియు మూడులోకములను జయించి నాగులను, దేవతలను వశముచేసికొని రసములకు స్థానమగు సముద్రమును నమృతమునిమిత్తము మథించు ననియు పలికెను. దానికి నారదుడు వానితో 'నెక్కడికి నీవీ యితరమార్గమునుండి వెళ్లుచున్నావు? యమపురమునకు నీతోవన దుర్గమమైనది.' యని

చెప్పెను. దానికి రావణుడు నవ్వి మీరు మనుష్యలోకమునుగుఱించి దయ కనపఱచుచున్నారు గనుక, తాను సూర్యపుత్రుడగు యముని వధకు సిద్ధమై యతడుండు దక్షిణదిక్కునకు పోవుచుండెననియు తాను యుద్ధమును గోరి నలుగురు లోకపాలురను జయించుననియు ప్రతిజ్ఞచేసి ప్రాణులకు గొప్పక్లేశము కలిగించు యముని జంపుట కిప్పుడే వానిపురమునకు బోవుచుండెననియు పలికి యా మునికి నమస్కరించి మంత్రులతో దక్షిణదిక్కున కరిగెను. అంతట నారదుడొకముహూర్తము ధ్యానించి యీప్రకారముగ చింతించెను. 'చరాచరములతోను,నింద్రునితోను గూడిన మూడులోకములను హింసించువాడును, నధర్మముచే నాయుక్షీణమైనవాడును నగు రావణుడు జనులుచేయు దానములను, కార్యములను జూచువాడగు యముని నెట్లు జయించును? ఆ మహాత్మునివలన లోకములు జ్ఞానముగలిగి వర్తించుచున్నవి. అతనికి మూడులోకములవారును నిత్యము భయపడుదురు. సుకృత దుష్కృతముల నిర్ణయించువాడును, మూడు లోకములవారి కర్మలకు సాక్షియునగు నాతనిని రావణుడు సమీపించి యెట్లు జయించును? లేక రావణుడింకే కొత్తవిధానమైన జేయునా? యమరావణుల యుద్ధము చూచుటకు నాకు కుతూహలము కలుగుటచే నేను యమపట్టణమునకు వెళ్ళెదను.' ఇట్లు నారదుడాలోచించి జరిగినసంగతులు యమునకు తెలియజేయుటకు యమపట్నమునకు వెళ్ళెను. అచ్చట నగ్నిని యథావిధిగ నుపాసనజేయునాతనిని ఋషి చూడనాతడు వాని కర్ఘ్య మిచ్చి 'క్షేమముగ నున్నారా? ధర్మము నశింపకయున్నదా' యని యడిగి 'తాము వచ్చినకార్యము తెలియజేయు' డని కోరెను. దానికి నారదుడు 'దశగ్రీవుడను రాక్షసుడు నిన్ను జయింప వచ్చుచున్నాడు. కాన కాలదండముచే శిక్షించు నీకేమికలుగునో యని యనుమానించి నీతో చెప్పవచ్చితి'ననెను.

అంతట దేదీప్యమానమగు పుష్పకమున రావణుడు వచ్చుచు సుకృత దుష్కృతముల ఫలము ననుభవించు ప్రాణుల నక్కడ చూచెను. యముని సైనికులును, అతనియనుచరులును, రౌద్రులును ఘోరరూపముగలవారును, భయము కలిగించువారును నగు యమ లోకపురుషులను గూడ నాతడు చూచెను. కొన్ని ప్రాణులు చంపబడు చుండెను. కొందఱు బాధింపబడుచును, గొప్పనాశనము బొందుచును, గొప్పయేడ్పు లేడ్చుచు నుండిరి. కొందఱు పురుగులచేతను, కొందఱు పెద్ద కుక్కల చేతను భక్షింపబడుచు వినుటకు భయముకలిగించు మాటల బలుకుచుండిరి. కొందఱు ఎక్కువర క్తమే నీరుగాగల వైతరణీనది దాటి కాలినయిసుకలో గడియగడియకు బాధపడుచుండిరి. కొందఱు అసిపత్రవనమునను, (కత్తులే యాకులుగా గలవనము) కొందఱు రౌరవ నరకమునను, ఉప్పునదియందును, వాడియైన కత్తులచే ఛేదింపబడుచుం డిరి. కొందఱు దాహము, ఆకలి గలిగి శరీరము శుష్కింప దీనులై వర్ణముమాఱిజుట్టువిరియబోసికొనినీరుఅడుగుచుండిరి. కొందఱుమలము, బురదబూసికొని యాయాసమునుబొంది దిగంబరులై చుట్టుపరుగెత్తుచు నుండిరి. కొందఱు తమసుకృతములచే విమానములందు గీత వాద్యము లను వినుచు సంతోషించుచుండిరి. గోదానము చేసినవారు పాలను, అన్నదానమును చేసినవా రన్నమును, గృహదానము చేసిన వారు గృహములను నక్కడక్కడ ననుభవించుచుండిరి. బంగా రము, మణులు, ముత్యములు దానముచేసిన ధార్మికులు వాని నలంకరించుకొని తమ తేజస్సుతో ప్రకాశించుచుండిరి. ఇట్లుండ తమ దుష్కర్మలచే చంపబడుచుండిన వారిని మహాబలుడగు దశగ్రీవుడు చూచి విడిపించెను. అప్పు డా ప్రాణులు స్వల్పకాలము సుఖ మనుభవించినవి. అంతట వానిని కాచు యమభటులు రాక్షసేశ్వరుని నెదిరించిరి.

శూరులగు యమధర్మరాజభటు లన్నిదిక్కుల హాలహాలా శబ్దము చేసి యనేకులు కూడి ప్రాసాదులతో బంగారుమయమగు పర్వతశిఖరమును మేఘములు చుట్టియుండునటుల నా పుష్పకము చుట్టు నిలిచి దానియాసనములను, వేదులను, తిన్నెలను, తోరణములను విఱిచిరి. దేవతలను మోయు నా పుష్పకము విఱువబడినను అది బ్రహ్మతేజముచే నాశనము కాకుండెను. అంత రావణుడును, నతని యమాత్యులును వారిబలముకొలది వారిమనస్సులోనుండు కోరిక ప్రకారము యుద్ధము చేసిరి. ఆ మంత్రులు తమశరీరములు రక్తముచే తడిసినను, అన్నిశస్త్రములచే దెబ్బలు కొట్టబడినను తమశత్రువులతో గొప్పపోరుసలిపిరి. ఇరుపక్కలవారు నొకరినొక రాయుధములతో నెక్కువగ హింసించుకొనిరి. యముని యోధులు రావణుని యమాత్యుల విడిచి రావణునిపైనే శూలవర్షము గురిపింప నాతడు బాధపడుచు విమానముననే యుండి తనయస్త్రబలముచే శూలములు, కత్తులు, గదలు, ప్రాసములు మొదలగువానిని విడిచెను. వారును వానిని తిరుగగొట్టి యస్త్రమును దిప్పివేసి యనేకులు కలిసి శూలాదులతో నతనిని గొట్టిరి. అతడుచ్ఛ్వాసములేక కవచము వీడిపోవ విమానమునుండి పడి యొకఘడియకు తెలివితెచ్చుకొని బాణములను, వింటిని బట్టి భూమియందునిలిచెను. అతడు తనధనస్సునందు పాశుపతాస్త్రమును సంధించి చెవివఱకు వింటిత్రాటిని లాగి బాణమును విడిచెను. అది యగ్నిజ్వాలలు కలిగి చెట్లను, పొదలను కాల్చుచు యమసైన్యమును నాశనము చేసెను. రావణుడును, మంత్రులును సింహనాదము చేసిరి. దీనిని యముడు విని శత్రువులు జయము బొందినటులను, తన బలములును, యోధులును నాశన మొందినటులను నాలోచించి తనసూతుని శీఘ్రముగ రథము తెమ్మని యాజ్ఞాపించెను. అట్లు ప్రకాశమగు రథము సిద్ధము కాగా నాతడు దానినెక్కి పాశ ముద్గరముల బట్టి నిలిచెను. మూడులోకములు

నాశనము లేనిదైనను వాని నంతము నొందించు శక్తిగల మృత్యుదేవత యాతనిముందు నిలిచెను. అతనిముఖ్యాయుధమును, అగ్నివలె తేజరిల్లునదియునగు కాలదండము తనస్వరూపముతో నా రథమున నిలిచెను. ఆతనిప్రక్కలను కొంచెమైనను తెగిపోవని కాలపాశమును, అగ్నివలె తేజరిల్లు ముద్గరమును నిలిచెను. ఆతనికి కోపము రాగా మూడులోకము లందంతటను కలకల మయ్యెను. దేవతలు కంపము నొందిరి. యముని రథసారథి సన్నాదముచేసి రాక్షసేశ్వరుడుండు చోటునకు నా రథమును దోలెను. యముడు తనపరివారముతో రణరంగమునకు నొకముహూర్తములో జేరెను. మృత్యువుతో వచ్చు నా రథమును రావణమంత్రులు చూచి, 'బలవంతులము,యుద్ధసన్నద్ధులముఅయినను మేముయుద్ధము చేయలే'మని రావణునితో పలికి యన్నిదిక్కులకు పరువెత్తిరి. కాని రావణుడు కంగారును, భయమును లేక నిలిచెను.యముడు రావణుని మర్మస్థానములందు శక్తితో మరము లను విడువ నవి వానికి తగిలినను వాడు వానిని సరకుగొనక యమునిపై శరవర్షము కురిపించెను. దాని కాతడు రావణుని వక్షస్థలముపై మహాశక్తులను శరములను విడిచెను. రావణుని యెముకలకు దెబ్బలు తగిలినను వాడు శత్రువునకు లొంగలేదు. ఈతీరున యమరావణుల కేడురాత్రులు యుద్ధము జరిగినను రావణుడు పరాజయము నొందకుండెను. వీరిలో నెవరును రణమునుండి వెనుదీయకుండిరి. అంతట దేవతలును గంధర్వులును సిద్ధులును మహాఋషులును బ్రహ్మతో కలిసి యుద్ధభూమికి వచ్చిరి. లోకములు ప్రళయకాలమునందువలె నుండెను. రావణుడు వింటిని ఎక్కుపెట్టి మృత్యుదేవతపైని 4 బాణములను, సూతునిపైని 7 బాణములను, యముని మర్మస్థానములందనేక బాణములను విడిచెను. యముని నిశ్వాసమునుండి గొప్పయగ్ని బయలువెడలెను. అది శత్రువును దహించునని యముడును, మృత్యు

వును సంతోషించిరి. తరువాత మృత్యువునకు గొప్పకోపము వచ్చి యమునితో నిట్లు విన్నవించెను. 'దేవా! నన్ను పీడుడు. యుద్ధమున మీా శత్రువుని జంపెదను. నన్ను విడిచినయెడల నిప్పుడు శత్రువున కున్న మర్యాద యిక జరుగదు. హిరణ్యాకశిపుడు మొదలగు రాక్షసులును, శాస్త్రవిదులగు రాజర్షులును, గంధర్వులును, నాగులును, ఋషులును, దైత్యులును, యక్షులును, అప్సరసలును, నితరబల శాలురును నావలన మడిసిరి. యుగాంతమునందు సముద్రములు గొప్పవృక్షములు, నదులుగల పృథివియంతయు నావలన నాశనము నొందెను. నాకీనిశాచరు డెంత? వీనిని వధించెదను. నేను చూచినచో బలవంతుడైనను వాడు తిరిగి జీవింపడు. ఇది నాబలము కాదు. అది యొకశక్తి. నేను బయలుదేఱిన నట్టికార్యములు జరుగును.' మృత్యువు యొక్క ఈమాటలు యముడు విని, నేనే వానిని సంహరించెదనని క్రోధముతో కాలదండమును చేతితో నెత్తెను. అతనిప్రక్కను కాల పాశములు, ముద్గరములు నిలిచెను. ఆముద్గరమును జూచినతోడనే జీవులకు ప్రాణము పోవును. అది రాక్షసుని దేహమునకు తగిలిన తక్షణమే వానిదేహమున మంటలుపుట్టి వానిని దహించును. యముని యీ గొప్పయాయుధమును దానిమెఱుపును జూచి యచ్చటివారం దఱు భయముతో పాఱిపోయిరి. రావణునిపై విసరుటకు యముడు కాలదండము నెత్త దేవతలు భయభ్రాంతులైరి. బ్రహ్మ యముని జూచి వానితో నీతీరునజెప్పెను. "వలదు. ఈ దండముచే రాక్షసుని జంపవలదు. నే నిట్లు వీనికి వర మిచ్చితిని. నేను పలికినవాక్యములను నీ వనృతముగ చేయకూడదు. దేవుడుగాని మనుష్యుడుగాని నాపలుకబద్ధముగ జేసినయెడల మూడులోకములకు ననృతము చేసినవాడగును. నీవుకోపించి దండమును విడిచిన నది శత్రువులను మిత్రులను గూడ నాశనము చేయును. మూడు లోకములకు భయము కలిగించు

రౌద్రిముగల నీదండము ప్రజలను సంహరించుటకును, ప్రజలనందఱిని నాశనము నొందించుటకును నమోఘమగు సాధనముగ పూర్వము నాచే సృజింపబడెను. మృత్యువు గూడ నాచే పూర్వము సృజింపబడెను. అందుచే ఈదండమును రాక్షసునితలయందు నీవు విడువకూడదు. అది వానిమీద పడినయెడల నొకముహూర్తమైనను వాడు జీవింపడు. అది పడినపుడు వాడు చావకపోయినను చచ్చినను రెండు వరములును ననృతములగును. రావణునిపై నెత్తిన దండమును నీవు మఱలింపుము. లోకములు నిలుచుట నీవు చూడగోరిన నామాటసత్యముగ నిలుపుము.” ఇట్లు బ్రహ్మపలుక యముడు ‘నాదండమునుమఱలించితిని. నీవు మాకు ప్రభుడవు. వాడు రణమునకువచ్చిన నే నేమి చేయవలెను? వరదర్పితు డగు రాక్షసుని నేను జంపవీలు లేనపుడు వానికి కనబడక యుండెద’నని చెప్పి తన రథాశ్వములతో నదృశ్యుడయ్యెను. దశగ్రీవు డట్లు యమునిజయించి తనపేరు చెప్పుకొనుచు పుష్పకము నెక్కి యమపట్నమునుండి వెడలెను. యముడు బ్రహ్మతోను, దేవతలతోను స్వర్గమునకు వెళ్ళెను. నారదుడు సంతోషించెను. రావణుడు తన్ను పొగడుకొనుచు తనమంత్రులను జూచెను. యుద్ధములో గాయపడిన వానిశరీరమును మంత్రులు జూచి విస్మయము నొందుచు జయజయశబ్దములు బలుకుచు ఆతని పుష్పకమును వెంబడించిరి.



## ౧౨వ అధ్యాయము. రావణుని రసాతలయుద్ధము. వరుణుని యపజయము.



రావణుడు తనమంత్రులతో సముద్రమును దాటి రసాతలమున వాసుకి పాలించు ‘భోగవతీపురము’నకు వెళ్ళి నాగులను

వశపఱచుకొనెను. అక్కడనుండి యాతడు 'మణిమతి'యను పురము నకు బోయి 'నివాతకవచు' లను దైత్యులను యుద్ధమునకు బిలిచెను. వారు బలపరాక్రమశాలురును, ననేకశస్త్రాస్త్రములు కలవారును గాన వారును యుద్ధమునకు వచ్చిరి. రావణుడు, వానిమంత్రులును, నివాతకవచులును యుద్ధముచేసి యొండొరుల నన్యోన్యము నాయుధములతో హింసించుకొనిరి. ఎవరునుగూడ గెలుపు నోటమియు గూడ పూర్తిగ లేక యొకసంవత్సరము యుద్ధము జేసిరి. అంతట బ్రహ్మ వచ్చి, నివాతకవచులను యుద్ధమునుండి మఱలించి 'యీ రావణుడు యుద్ధములో నజేయుడు. మిమ్ములను నాశన మొందించు టకు నెవ్వరికిని శక్యము కాదు. ఈతనితో మీరు సఖ్యము చేయ నగును. స్నేహితుల కోరికలన్నియు విభజింప వీలులేదని సెల విచ్చెను. పిమ్మట రావణుడు నివాతకవచులతో నగ్నిసాక్షిగ సఖ్యము చేసికొని వారివలన మర్యాదలను బొంది యొకసంవత్సర మక్కడ నిలిచెను. అతడు తనపురమునకంటె నక్కడ నెక్కువ ప్రియమును బొంది వారికడ 99 మాయల నభ్యసించెను. తర్వాత రావణుడు వరుణపురముకొఱకు రసాతలమున దిరుగుచు తనచెలియలు శూర్పణఖకు భర్తయగు విద్యుజ్జిహ్వుడుండు నశ్మనగరమును జేరి, దానిని సంరక్షించు బలశాలురగు కాలకేయులను సంహరించి, తన భావమఱదిని, 400 దైత్యులను నొక్కముహూర్తమున కత్తితో నఱ కెను. అక్కడినుండి రావణుడు కైలాసమువలె ప్రకాశించు తెల్లని వరుణాలయమును, పాలసముద్రము మధ్యమందు జూచెను. ఆ సముద్రము చంద్రునకు బుట్టినిల్లు. పరమఋషులు అందలిపాల మీగడ తిని జీవించుచుందురు. అందు దేవతలు భుజించునమృతము బుట్టెను. అట్టి పాలసముద్రములో నుండునదియు, పాలనెప్పుడునిచ్చు నదియు, గోవృషభముల కాదిభూతమైనదియు, తన పాలనుగార్చు

సముద్రమునకు 'పాలసముద్ర'మని నామము కలిగించునదియు, నద్భుతముగ నగపడునదియు నగు కామధేనువును రావణుడు చూచి ప్రదక్షిణము చేసెను. తర్వాత నాతడు, ఎల్లప్పుడు సంతోషమును బుట్టించునదియును, ననేకబలములచే కాపాడబడునదియు నగు వరుణ పురమును జూచెను. రావణు డక్కడి బలనాయకులను గొట్టి వారిచే తిరుగ కొట్టబడి యక్కడుండు యోధులతో 'రావణుడు యుద్ధము చేయుటకు వచ్చెను. గనుక వానితో యుద్ధము చేయుమనియు, లేని యెడల చేతులు జోడించి 'జయింపబడితి' ననుమనియు వరుణునితో జెప్పుడు.' అనెను. ఇంతలో నుదయసూర్యవర్చస్సుగల వరుణపుత్రులు, పౌత్రులును క్రోధముకలవారై తమబలములతోను, గోపుష్కరుల తోను, కోరినప్రకారము నడచు రథములతోను వచ్చి రావణుని తోను, వానిమంత్రులతోను యుద్ధము చేసిరి. అందు తమబలములు నశింప వరుణపుత్రులు శీఘ్రముగబోవు రథములతో మింటికెగసిరి. రావణుడును వానిమంత్రులును గూడ నాకాశమున నిలిచి వారితో యుద్ధము చేసిరి. వారు రావణునిపై తీక్ష్ణమైన బాణముల విడిచి సింహనాదము చేయ మహోదరుడు క్రుద్ధుడై వారిగుఱ్ఱములను యోధులను భూమియందు పడి చచ్చునటుల తనగదతో కొట్టెను. వరుణపుత్రులు విరథులైనను విచారము నొందక తమ ప్రభావముచే నాకాశమున నిలిచి, విండ్లనుసంధించి మహోదరునిపైనను రావణుని పైనను కఠినమగు బాణములను వదలిరి. దానికి రావణుడు కోపించి వారిమర్మస్థానములపై శరవర్షములు కురిపింప కొందఱు నాశన మందుచు భూమిని జెందిరి. మఱియు నాతడు వారిపైని విచిత్రములగు కొన్ని ముసలములను, వందలకొలది బల్లెములను, పట్టసములను, శక్తులను, శతఘ్నులను, (100మందిని చంపుగదలు) తోమరములను విడువ శరీరములు స్వాధీనములుగాక వారు భూమియందు పడిరి.

అంత రావణుడు వరుణపుత్రులు వడిసిరని నాదము చేసెను. వారి యాప్తులు వారిని గృహమునకు జేసికొనిపోయిరి. 'వరుణుని పరాక్రమము జూపు సమయము వచ్చినదనియు దానిని జూపవలెననియు రావణుడు వారిద్వారా వరుణునకు కబురంపెను. వరుణునిమంత్రి ప్రహస్తుడనెడివాడు 'నీవు కోరువరుణుడు గంధర్వగానము వినుటకు బ్రహ్మలోకమునకు వెళ్ళెను. రాజు లేనపుడు నీపోరుట మేల? అతని పుత్రులు నీచే జయింపబడిరిగదా!' అని రావణునకు ప్రత్యుత్తర మిచ్చెను. దాని కతడు సంతోషించి వరుణభవనమునుండి బయలు వెడలి తానువెళ్ళినత్రోవను తనచెల్లెలియత్తపురుషునకు మహోదరునితో తిరిగివచ్చెను.



## ౧౩ వ అధ్యాయము. రావణుడు బలిగృహము ప్రవేశించుట.



రావణుడు తిరుగ 'అశ్మ' నగరమును జేరి యుద్ధాభిలాషియై తిరుగుచు నొకగృహమును జూచెను. అది తెల్లనిదియు, వైడూర్య బహిర్ద్వారము కలదియు, ముత్యములచే నలంకరింపబడినదియు, బంగారుస్తంభములు, తిన్నెలు కలదియు, మఱికొన్నివిచిత్రములు కలదియునై యుండెను. రావణుడు ప్రహస్తునితో 'ఆ యిల్లెవరిదో! కనుగొను' మన నతడటు వెళ్ళి చూచి మొదటిప్రాకారద్వారమున నెవరును లేకుండుటచే నేడవప్రాకారమువఱకు వెళ్ళెను. అక్కడాతడొక తేజమును దర్శించి యాతర్వాత పురుషు నొకని జూచెను. అచ్చట నా మహాత్ముడు నవ్వ ప్రహస్తుని రోమములు భయముచే గగుర్పొడిచెను. ఆ కాంతులమధ్యను ఆ పురుషుడు నిలిచి బంగారు పూల మెడయందు ధరించియుండెను. ఆతడు సూర్యునివలె చూచు

టకు శక్యముకానివాడై సాక్షాత్తు యమునివలె కనపడెను. ప్రహస్తు డాగృహమునుండి పైకి వచ్చి జరిగినదంతయు రావణునితో జెప్పెను. అప్పుడు రావణుడు పుష్పకమును దిగి యా భవనములోనికి ప్రవేశింప గోరు సమయమున చంద్రుడు తలయందు కలవాడును, మంచిశరీరము కలవాడును, నాలుకయందు మంటలు కలవాడును, భయంకరుడును, నెఱ్ఱని కన్నులు, తెల్లని ముఖము, మంచి పెదవులు, మిక్కిలి భయంకరమగు ముక్కు, శంఖమువంటి కంఠము, ఎత్తైన చెక్కిలి నూనూగుమీసములు, బలిసినశరీరము, ప్రకాశించుకోఱలు, గగుర్పొడిచిన రోమములు కలవాడును, ఇనుపముసలము చేత ధరించినవాడు నగు నా మహాపురుషుని నా గృహద్వారమునజూచెను. వానిని జూచుటచే రావణుని రోమములు గగుర్పొడిచెను; గుండెలు కొట్టుకొనెను; శరీరము కంపించెను. అనిష్టములయిన యీ శకునములను జూచి యాలోచించుచు రావణునితో నా పురుషుడు 'నీ వేలచింతించుచున్నావు? నీకు యుద్ధము చేయవలయునని కోరికయున్న బలితోగాని నాతోగాని యుద్ధము చేయవచ్చును. నిజమును దెలుపు'మని యనెను. రావణు డీమాటలు వినుటచే తన శరీరమున వెంట్రుకలు గగుర్పాటు జెంద ధైర్య మవలంబించి 'యీ గృహములో నెవరుండిరో చెప్పుమనియు నీవు కోరినట్లు నీతోగాని వానితోగానియుద్ధము చేసెద' ననియు పలికెను. దాని కా మహాపురుషుడు "ఈ గృహమున 'బలి' యను రాక్షసుడు నివసించియున్నాడు. అతడు శూరుడు; సత్యపరాక్రముడు; మిక్కిలి యుదారుడు; బహుగుణములు కలవాడు; యమునివలె పాశహస్తుడు; బాలసూర్యునివలె ప్రకాశించువాడు; కోపము లేనివాడు; యుద్ధమునుండి వెనుదిరుగనివాడు; గెలుచుటకు వీలుకానివాడు; ధైర్యము కలవాడు; ప్రియవచనములు పలుకువాడు; గురువులకు, విప్రులకు ప్రియుడగువాడు; గొప్ప బలిష్ఠుడు; కాలము

నిరీక్షించువాడు; నిజము పలుకువాడు; సౌమ్యముగ నగపడువాడు; శక్తిమంతుడు; స్వాధ్యాయమునందు నిష్ఠకలవాడు; ఈతడు గర్జించును; వీచును; ప్రకాశించును; తపించును; దేవతలవలనను, మహర్షులవలనను, భూతగణములవలనను, పాములవలనను భయ మెఱుగడు. ఈతనితో నీ వేల యుద్ధము కోరెదవు? బలితో రణముచేయ నీ కిష్టమున్న శీఘ్రముగ యుద్ధమున బ్రవేశింపుము, ఆలసింపకుము" అని యా మహాపురుషుడు పలికెను.

తర్వాత రావణుడు లోనికి బోవ విశ్వగురుపుడగు బలి సూర్యుని వలె చూచుట కశక్యముగనుండి యట్టహాసము చేసెను. ఆతడు రావణుని తనతొడమీద నిడికొని 'నీకు నేనేమి పనిచేయగలను? నీవచ్చినపనియేమి?' అని వాని నడిగెను. దానికి రావణుడు 'నీవు పూర్వము విష్ణువుచే గట్టబడితి వని వింటిని. నే నా బంధమునుండి నిన్ను విడిపింప శక్తుడను. నీద్వారమునయున్న వానినిగురించి తెలియ గోరుచున్నాను.' అని పలికెను. ఇది బలివిని నవ్వి "ఓ రావణా! అక్కడెల్లపుడునుండు నా శ్యామలవర్ణుడు దానవేంద్రుల నందఱిని, నితరబలవంతులను యుద్ధమున జయించెను. యమునిబోలు నీ యజేయునిచే నేను గట్టబడితిని. అతడు సర్వభూతములకు నంతకుడును, సృష్టించువాడును, సృష్టింపజేయువాడును, పోషించువాడును, శాసించువాడును, లోకములకు నీశ్వరుడును నై యుండ నాతని నెవడు వంచనజేయును? భూతభవిష్యద్వర్తమానములందుండు వాని నెవరును దెలిసికొనలేరు. ఆతడే కలియు కాలమునై యున్నాడు. ఆతడు స్థావర జంగమ భూతముల నంతము నొందించువాడు. తిరుగపుట్టించువాడు, ఆద్యంతములు లేనివాడు. కార్యములు చేయించు సాధనమును, కారణమును, కర్తయు నాపురుషోత్తముడే, యజ్ఞమును, యజ్ఞములో హుతమగునదియును, దానిలో నీయబడినదియును నతడే. ఈ తీరుననుండు మహాపురుషుడు

మూడులోకములలో మఱిలేడు. నీకును, నాకును, మనపూర్వులకును నీతడు పోషకుడు. పశువు ముక్కుత్రాడువలన స్వాధీనమయినట్లు మన మాత్రనికి స్వాధీన మైతిమి. కొందఱు దైత్య దానవమహాత్ము లనేక యజ్ఞములు చేసియు, గొప్పతపస్సులు జేసియు, యోగధర్మ మవ లంబించియు, గొప్పయైశ్వర్యముల బొందిరి. గొప్పభోగముల ననుభ వించిరి. కొందఱు వేదాధ్యయనము, యజ్ఞములు, దానములు చేసిరి. కొందఱు ప్రజలను న్యాయముగ పాలించిరి. కొందఱు తమపక్షముల వారిని రక్షించి విరోధులను హింసించిరి. వీరితో యుద్ధమున సమా నులు లేకయుండిరి. అందఱును శూరులును, మంచివంశము కలవా రును, నన్ని శస్త్ర యస్త్రములను బాగుగ నెఱిగినవారును, అన్ని విద్యలు తెలిసినవారును, యుద్ధమునందు వెనుదీయనివారునై యుండిరి. వీరందఱు దేవతలను జయించి వారిరాజ్యములను బొందిరి. దేవత లకు కీడుచేయశక్తిగలవారును, మత్తులును, భోగములం దిచ్ఛకల వారును, బాలసూర్యతేజస్కులును, అజేయులును నగు ఈ దాన వేంద్రులు దేవతల నోడింప వారిప్రభువగు విష్ణువు ఉపాయము చేతను, బలముచేతను దానవుల నాశనము చేయుట బాగుగ నెఱిగి యుండెను. వీరిని నాశనము చేయుటకు తగిన యవతారముల నెత్తి నాశనము చేసి తిరుగ నాతడు తన యాత్మయందు తాను నిలిచి యుండును.” అని చెప్పి మఱియు నాతడు రావణునితో ‘ఆ చక్రము నీవు నాప్రక్కకు పట్టుకొనిరమ్ము. అప్పుడు నీకు ముక్తికారణమును, నాశరహితత్వమును తెలిపెదను. విలంబము చేయక నేను చెప్పినట్లు చేయుము.’ అని చెప్పెను. రావణు డీమాటలు విని పెద్దనవ్వు నవ్వి యక్కడనున్న దివ్యకుండలమును బలగర్వముచే నెత్త యత్నించెను. కాని వాడు దానిని కదల్ప నశక్తుడయ్యెను. అతడు లజ్జనుబొంది గొప్పబలముతో తిరుగ నెత్తెను. ఎత్తినంతనే రక్తము క్రక్కుచు

భూమియందు బడెను. అప్పుడాకాశమునుండి శబ్దము పుట్టెను. రావణునిమంత్రులు హాహాకారవము చేసిరి. ఒకముహూర్తములో రావణుడు తెలివినొంది సిగ్గుచే ముఖము వంచుకొనియుండ నతనితో బలి యిట్లనెను. 'రమ్ము; నామాట వినుము. నీ యెత్తిన మణిభూషితమగు కుండలము నాపూర్వీకుడగు హిరణ్యకశిపునిది. వానిచెవులనుండి పర్వతచరియలపై నొకకుండలమును యుద్ధమునందు వానికిరీటపుసమీపమునమఱియొక కుండలమును బడెను. వానికి కాలముగాని, మృత్యువుగాని, రోగముగాని, దేశాంతరముబొందించువాడుగాని, లేకుండెను. వానికిని వానిపుత్రుడగు ప్రహ్లాదునకును భయంకరమగు వాదము జరిగెను. అప్పుడు ధీరుడును, లోకభయంకరుడును నగు విష్ణువు నరసింహరూపమును దాల్చి రౌద్రముచే లోకములను కంపింపజేయుచు హిరణ్యకశిపునిబట్టి, గోళ్లతో జీరి యమలోకమునకు బంపెను. అట్టి వాసుదేవుడే నాద్వారమునందున్నాడు. నీకు మంచిమనస్సుతో వినుట కిష్టమున్నయెడల అట్టి యాదిదేవుని నిజమగు చరిత్రము చెప్పెదను' వినుము. 'అతని స్వాధీనములో వేలకొలది యింద్రులును, పదివేల దేవతలును, అనేకలక్షల ఋషులును గలరు.' అనిబలి తెలుప రావణు డిట్లు మాఱుపలికెను. 'మృత్యువుకోరాడినవాడును, పాశహస్తుడును, భయంకరుడును నిత్యములగు గొప్పగుణములుకలవాడునగు యముని నేను యుద్ధమున జయించితిని. నాకు భయముగాని విచారముగాని లేదు. నీవాకిట నిలిచినవానిని నేనెఱుగను. వానినిగూర్చి నాకు తెలుపుము. రావణుని యీమాటలకు బలి విష్ణువు నిట్లు పొగడెను. 'అతడు మూడులోకములను శాసించువాడు; హరి; నారాయణుడు; 12 సూర్యులతో సమానుడు; మొదటి పురుషోత్తముడు; నల్లని మేఘరూపము కలవాడు; సురోత్తముడు; జ్వాలలే మాలలుగా గలవాడు; యోగి; భక్తజనులయందు ప్రియముకలవాడు; అనంతుడు;

కపిలుడు; విష్ణువు; నారసింహుడు. ఈతడే లోకములను బుట్టించును; రక్షించును; నాశనము చేయును. ఈతడే యజ్ఞమును, యజ్ఞము చేయువాడును నై యున్నాడు. చక్రాయుధధరుడగు నా హరి దేవమయుడును, సర్వభూతమయుడును, సర్వలోకమయుడును, సర్వజ్ఞానమయుడు నై యున్నాడు. సర్వరూపములను బొందువాడును, గొప్పరూపములు గలవాడును, బలదేవుడును, మహాభుజుడును, వీరులను సంహారించువాడును, వీరచతుష్టయులు గలవాడును నీతడే. మోక్షము గోరుబుద్ధు లీతని స్తుతింతురు. వీనిని దెలిసికొనువాడు పాపమును బొందడు, వీనిని స్తుతించుచు, స్మరించుచు, యజ్ఞమున బూజించుచునున్నవాడు వీనివలన సర్వమును బొందును.' అని బలిదెలుప రావణుడీ మాటలను విని బయలుదేఱెను. కోపముతో కండ్లెఱ్ఱజేసి ముసలము ధరించిన హరి వానిని జూచి బ్రహ్మవరము నిలుపుటకు నీ పాపుని ఇప్పుడు జంపకూడదని యాలోచించి యంతర్ధానము నొందెను. ద్వారము నందుండిన హరి యా రావణునకు కనబడక పోవుటచే రావణుడు సంతోషముతో వచ్చిన త్రోవను బోయెను.



## ౧౮ వ అధ్యాయము. రావణుని కొన్ని దిగ్విజయములు.



రావణుడు పుష్పక మెక్కి తిరుగుచు ఉశీరబీజ మను దేశమున యజ్ఞమును జేయు మరుత్తు డనురాజును జూచెను. బృహస్పతితమ్ముడును, ధర్మజ్ఞుడును నగు సంవర్తు డను బ్రహ్మర్షి దేవతలతో గూడి వాని యజ్ఞమును జరిపించుచుండెను. రావణుడు వరములు పొందుటచే దుర్జయుడని దేవతలు తెలిసికొని వానిని జూచుటకు జడిసి తిర్యక్కులయిరి. ఇంద్రుడు నెమలియు, ధర్మరాజు కాకియును, కుబేరుడు

తొండయును, వరుణుడు హంసయును నయిరి. ఇతర దేవత లితర రూపములబొందిరి. రావణుడు రాజును జూచి 'నీవు నాతో యుద్ధము చేయుము. లేక 'జయింపబడితి నని, యనుము.' అనెను. మరుత్తు నీ వెవ్వడ వని యడుగ రావణుడు పెద్దనవ్వునవ్వుచు 'కుబేరునితమ్ము డగు రావణునిగ నన్ను నీవు తెలియనందుకు నాశ్చర్యముగనున్నది. మూడులోకములలో నాబలము తెలియనివారు లేరు. నేను నా యన్నను జయించి యీ విమానము హరించితి' నని తెలిపెను. అంతట మరుత్తుడు వాని కిట్లు మారుపలికెను. 'నీ యన్నను జయించిన నీవు నిజముగ ధన్యుడవే. నీవంటి శ్లాఘనీయుడు మూడులోకములలో నుండడు. నీ వేధర్మము లాచరించి పూర్వము వరములు బొందితివి? నీవు పలికినవిషయములను నే నిదివరలో వినియుండలేదు. ఇక్కడ నిలువుము. నేను జీవించియుండ నీవు తిరిగి వెళ్ళవు. ఇప్పుడే నిన్ను కఠినమైన బాణములచే హింసించి యమలోకమునకు బంపెదను.' ఇట్లు మరుత్తుడు పలికి బాణములను నమ్ములపొదిని గ్రహించి క్రోధముతో యుద్ధమునకు బయలుదేరెను. అప్పుడు సంవర్తుడను ఋషి యతని మార్గమున కడ్డువచ్చి యిట్లు చెప్పెను. 'నా వాక్యములను వినవలెను. నీకు యుద్ధము తగదు. శివసంబంధమైన యీ యజ్ఞము పూర్తి కానియెడల నది నీ కులమును నాశనమొందించును. యజ్ఞదీక్షితునకు యుద్ధమును క్రోధమును పనికిరావు. రాక్షసుడు దుర్జయుడు. నీ జయము సంశయము' సంవర్తుని యీ మాటలు రాజు విని తన విల్లును బాణములను విడిచి స్వస్థుడై తన యజ్ఞమునందు మనస్సిడెను. రావణుడు 'వానిని జయించితి' నని తలంచి తన జయమును దిక్కుల ప్రకటించి సంతోషధ్వనిచేసి యజ్ఞమునకు వచ్చిన మహర్షులను భక్షించి వారి రక్తమును ద్రాగి తిరిగి మహీతలమున కరిగెను. ఇంద్రాది దేవతలు తిర్యగ్జంతురూపములను వదలి తమ స్వరూపముల బొంది యాయాజంతువుల కిట్లు వరము లిచ్చిరి. ఇంద్రుడు 'మయూ

రమా! నీ యుపకారమునకు ప్రీతినొందితిని. నీ పింఛము లోనుండు నీలివెంట్రుకలలో నా వేయికన్నులు కలుగుగాక! నేను వర్షమును కురిపించునపుడు నీవు మిక్కిలి సంతోషమును పొందుదువు. మొదటినుండియు నీలముగనున్న నీ పింఛము చిత్రమగురంగులు కలదగు'నని సెలవిచ్చెను. ధర్మరాజు తనముందున్న కాకినిజూచి 'నీవలన ప్రీతి నొందితిని. నావలనకలుగు రోగములు ప్రాణులను పీడించుచున్నవి. అవి నిన్ను పీడింపవు. నీకు మృత్యువునుండి భయములేనివర మిచ్చితిని. నిన్ను మనుష్యులు జంపనంతవఱకు జీవించెదవు. * యమలోకములోనుండు మానవు లాకలిగొనినపుడు నీవు భుజించినయెడల వారును, వారివంశమువారును తృప్తి నొందుదురు' రని పలికెను. వరుణుడు గంగాతోయముల విహరించునదియు, పూర్వమున నీలవర్ణము, తెలుపువర్ణము కలదియు, భుజముప్రక్క భాగముల వెండ్రుకలు పైకి కలిగి నిర్మలముగ నుండునదియు, అంచులయందు నీలవర్ణముగల రెక్కలుకలదియు నగుహంసకు నిట్లువరమిచ్చెను. "నా శరీరము నీవు పొందుటచే నీవు మిక్కిలి తెల్లనినురుగుతోను, చంద్రమండలముతోను సమానమగు కాంతినిపొంది నిన్ను జూచినలోకులకు నానందము కలిగించెదవు." తర్వాత కుబేరుడు పర్వత మందుండుతొండతో 'నీకు బంగారువర్ణము నిచ్చితిని. నీతలనుండి యెల్లపుడు నీరూరు' నని వర మిచ్చెను. ఆయజ్ఞోత్సవమందు దేవతలు ప్రీతినొంది పశుల కట్లు వరము లిచ్చి తమ స్వగృహములకు వెళ్ళిరి.

ఈ తీరున రావణుడు గొప్పరాజులయొద్దకు బోయి "నాతో యుద్ధము జేసెదరా? 'లేక జయింపబడితిమి'యని యొప్పుకొనెదరా?

---

* దీనినిబట్టి కాకము చిరకాలజీవి యగునటుల గనబడుచున్నది. అమరసింహుడు తనకోశములో కాకమునకు చిరజీవి' యని నామాంతరమిచ్చి దీనిని ధృవపఱచియున్నాడు; గనుక కాకములు చాలకాలముజీవించు నవి మనము స్థిరపఱుపవచ్చును.

మఱియొకప్రకారము చెప్పినయెడల నే నొప్పుకొన” నని పలుకు చుండెను. ధర్మజ్ఞులును, ధర్మిష్ఠులును, బలవంతులునగు దుష్యంతుడు సుగధుడు, గాధి, గయుడు,పురూరవుడు అను రాజశ్రేష్ఠులు భయము నొందకపోయినను తమలో నాను రాలోచించి శత్రువుయొక్క వర బలమును దెలిసికొని 'ఓడితి'మని యొప్పుకొనిరి; కాని యింద్ర సమానుడును, నయోధ్యాపతియునగు ననరణ్యుడుమాత్రము వాని మాటలకు క్రోధము జెంది 'నీతో ద్వంద్వయుద్ధము జేసెదను. నిలు వుము. శీఘ్రముగ సిద్ధపడుము. నేను గూడ సిద్ధపడెద' నని ప్రత్యు త్తర మిచ్చెను. ఇంతకుపూర్వమే రావణుని ప్రఖ్యాతి వినుటవలన నయోధ్యలో గొప్పబలము సిద్ధమైయుండెను. పదివేలయేనుగులును, లక్షగుఱ్ఱములును, ననేకవేలరథ సైన్యములును రావణుని వధార్థమై బయలుదేఱెను. రాజునకు, రావణునకును, వారిబలములకును గూడ యుద్ధముజరిగెను. అయోధ్యాపతిబలము విక్రమముతో యుద్ధము జేసినను నది కొంతకాలమునకు క్షీణించెను. ఇది యనరణ్యుడు తెలిసికొని క్రోధముతో తనవిల్లును ఝుంకారము జేయించుచు రావ ణునితో దలపడెను. అతని యుద్ధములో మారీచ శుక సారణ ప్రహస్తులు పాఱిపోవ నతడు రావణునితలపై 108 బాణములను విడువ నవి వాని కేమియు నష్టము కలిగింపక కొండమీాద గురియు వర్షధారలవలె నయ్యెను. అప్పుడు రావణుడు క్రోధముకలవాడై తన యఱచేతితో ననరణ్యునితలమీాద గొట్ట నతడు రథమునుండి భూమిమీాద బడెను. అతనిశరీరము భయముచే గంపించి యతనికి స్వాధీనముకాకపోయెను. అప్పుడు రావణుడు పెద్దనవ్వునవ్వుచు నయోధ్యాపతితో “నాతో యుద్ధమువలన నీ కిప్పు డేమిఫలము దొరికిన దనియు, మూాడులోకములందు నాతో ద్వంద్వయుద్ధము చేయువారు లేరనియు, 'నీవు భోగముల ననుభవించుచు నాబల

మునుగుఱించి వినియుండలే' దని నే ననుమానించెద" ననియు బలికెను. రాజు స్వల్పప్రాణముతో వాని కిట్లు జబాబుచెప్పెను. "కాలగతినతిక్రమించుటకు వీలులేదు. ఇప్పుడు నే నేమి చేయుటకును శక్యుడను గాను. ప్రతాపముచాటుకొను నీచేత నేను జయింపబడ లేదు. కాలము రాగా నేను విపత్తునొందుటకు నీవు కారణభూతుడ వైతివి. నాప్రాణము క్షీణించుచుండగా నే నిప్పు డేమిచేయగలను? నేను నీతో యుద్ధముజేయుచు నీవలన హతుడ నైనను నాకు యుద్ధము నందు విముఖత లేదు. ఇక్ష్వాకువంశమునకు నవమానముకలిగినందున ఈవచనములు పలుకుచున్నాను. నేను సరియైనదానములు చేసిన యెడల సరిగా నగ్నియందు వేల్చినయెడల, నేను బాగుగ తపస్సు చేసినయెడల, నేను సరిగా ప్రజలను పరిపాలించినయెడల నేను పలుకు నీవచనములు సత్యములగుగాక! ఈయిక్ష్వాకుకులమందు నీప్రాణ ములు హరించు దాశరథీరాముడు జన్మించును." ఇట్లనరణ్యుడు పలుక దేవదుందుభులు మ్రోగెను. మేఘము లెక్కువగ ధ్వని చేసెను. పుష్పవృష్టి యాకాశమునుండి పడెను. అనరణ్యుడు గొప్ప రాజులుపొందు స్వర్గమునుబొంద రావణుడు మఱలెను.



## ౧౫ వ అధ్యాయము. రావణుడు సూర్యచంద్రలోకములకు బోవుట, మాంధాతతో యుద్ధము.



రావణు డొకనాటిరాత్రి మేరుశృంగమున విశ్రమించి, యామఱునాటియుదయమున పుష్పక మెక్కి సర్వతేజోమయుడును, బంగారుభుజకీర్తులుధరించినవాడును, ఎఱ్ఱనిబట్ట గట్టినవాడును, కుండలములచే వికసించు ముఖముగలవాడును, నితరయలంకారములు గల

వాడును, వేయికిరణములచే ప్రకాశించువాడును, నాదిదేవుడును, ఏడుగుఱ్ఱములు లాగు రథమున నుండువాడును, మొదలు మధ్య తుద లేనివాడును, లోకములకు సాక్షియును, నీశ్వరుడును నగు సూర్యుని జూచెను. పిమ్మట రావణుడు ప్రహస్తునితో "నీవు భాస్కరునియొద్దకు బోయి, నాసితో 'రావణుడు యుద్ధముగోరి వచ్చెను. గాన నీవు యుద్ధము చేయవలెను. లేనియెడల 'జయింపబడితి'నని యొప్పుకొనవలెను. ఈ రెండింటిలో నేదియో యొకటి జరుగవలె' నని చెప్పు"మని చెప్పెను. ఆ మంత్రి వెళ్ళి సూర్యునిద్వారపాలకు లగు పింగళ, దండులతో నట్లుపలికి సూర్యతేజస్సుచే తాపము నొందుచు నచ్చట నిలిచెను. దండి సూర్యునియొద్దకుబోయి జరిగిన సంగతి జెప్పెను. సూర్యు డప్పుడు బాగుగ నాలోచించి దండీ! "నీవు వెళ్ళి వానిని జయింపుము. లేక 'సూర్యుడు నీకు లోబడె'నని చెప్పుము. నేనిప్పుడు కాలక్షేపమున కిష్టపడ" నని దండికి దెలిపెను. సూర్యునాజ్ఞప్రకారము దండి రావణునితో నంతయు జెప్ప నతడు తన జయమును బ్రకటించుచు బోయెను.

రావణు డటుతర్వాత రాత్రి మేరుశృంగమున నివసించి సోమ లోకమునకు బోవుచుండెను. అంతట దేవఋషియగు పర్వతు డచ్చటికి వచ్చెను. ఆ సమయముననే యొకడు రథమునెక్కి శరీరమునకు సువాసనగంధములు పూసికొని మంచియప్సరసలచే సేవింపబడుచు వారితోగూడి చేసినక్రీడలచే నలసటజెంది వారిని ముద్దుపెట్టుకొను చున్నవాడుగ రావణునికి గనబడెను. తరువాత రావణు డాదేవర్షిని జూచి నమస్కరించి 'వీ డెవడు? భయమును, లజ్జయును లేక పోవు చున్నా'డని యడిగెను. అతడు వానికి "వీడు తపస్సువలన లోకము లను జయించి, బ్రహ్మను సంతోషపఱచి, సోమరసము త్రాగుచు మోక్షమునకై సుఖమును కలిగించు గొప్పస్థానమునకు బోవు

చున్నాడు. నీవంటిశూరులు, సత్యవ్రతులు, బలవంతులు నిట్టి బ్రహ్మ చారులయెడ గోపమును జూప" రని తెలిపెను. అంతట మఱియొక పెద్దరథము నెక్కి తేజరిల్లెడు శరీరము గలిగి కిన్నరులు వాద్యము, నాట్యము సలుపుచుండ శోభించుచు వెళ్ళువాని నొకనిని రావణుడు చూచి 'వీ డెవ్వ'డని పర్వతు నడిగెను. వానికి నా దేవఋషి "ఈ శూరుడు రణమున వెనుదీయక యుద్ధము జేసెను. శత్రువులచే రక్తప్రవాహములుగలుగు దెబ్బలు పడియు వారిని రణమున జయించెను. తనస్వామి కార్యములను బాగుగ నెఱవేర్చెను. అనేక బలములను వీరులను యుద్ధములో జంపి తనప్రభుప్రాణులకు జీవముల విడిచెను. ఇతడిప్పు డింద్రలోకమునకు బోవుచున్నాడు. వాడు తనయిష్టమువచ్చిన చోటునకుగూడ బోవచ్చు" నని జవాబు చెప్పెను. తర్వాత సూర్యసన్నిభు డొకడు పోవుచుండ రావణుడు 'వీ డెవ' డని యడుగ దేవర్షి "శీఘ్రముగబోవు బంగారువిమానమున నప్సరసలతోనుండువాడును, పూర్ణచంద్రునివంటి మోముగలవాడును, విచిత్రములగు బట్టలు, నగలు ధరించువాడును నగు నీతడు బంగారము దానము చేసినవా"డని చెప్పెను. ఆ రాక్షసరాజు 'వీరెవరైనను నాతో యుద్ధముచేసెదరా?' యని యడుగ వానికి పర్వతుడు 'స్వర్గముకోరి వెళ్ళువీరు యుద్ధము జేయరు. నీతో రణము సలుపువానిని జెప్పెదవిను' మని పలికి "సప్తద్వీపపాలకుడును, చిత్రమగుబట్టలు నలంకారములు గలవాడును, మహాతేజశ్శాలియునగు మాంధాత నీతో యుద్ధము జేయగలవా"డని తెలిపెను. 'అత డెక్కడుండునో తెలుపుడు. నే నక్కడకు బోవలె' నని రావణుడు కోర దేవఋషి 'యువనాశ్వనిపుత్రు డగు నాత డేడుదీవులను జయించి నేడు స్వర్గమునకు బోవుచున్నా' డనెను. అంతట రావణుడు రథమెక్కి వచ్చువాడును, దివ్యమగుగంధముల బూసికొనినవాడును, తేజ

శ్శాలియునగు మాంధాతను నెదుర్కొని 'నీతో యుద్ధముజేయ వచ్చితి' నని చెప్ప నాతడు పెద్దనవ్వునవ్వి 'నీకు జీవింప నిష్టములేని యెడల నీవు నాతోడ రణముసలుపు' మని పలికెను. దానికి వాడు 'వరుణ కుబేర యములవలన బాధనొందని నేను ఒకమనుష్యమాత్రునికి భయపడుదునా!' యని చెప్పి యుద్ధమందు నేర్పరులగు తనమంత్రులను పురికొల్ప వారు మాంధాతపై బాణవర్షము గురిపించిరి. బలవంతుడగు నారాజును వారిని శరములచే నొప్పింప ప్రహస్తాదులు కూడ తిరుగ నట్లు చేసిరి. ఆశరములనన్నిటిని రాజు భిండివాలాదులచే ఖండించి, వారిని బాణములచే దహింప జేసి యనంతర రావణుని నైదుబాణములతో గొట్టి, యొకఖడ్గము ముద్గరమును ద్రిప్పి వానిరథముపై బడవేయ, వాడు కూర్చొని నిద్రపోవుచు క్రిందబడెను. రాజు సంతోషించెను. రాక్షసబలము హాహాకారము జేసి రావణునిచుట్టు మూగెను. రావణుడు ముహూర్తములో తెలివి తెచ్చుకొని, మాంధాత శరీరమును బీడించి వానిరథమును విఱుగగొట్టెను. అతడు విరథుడై ఘంటధ్వనులుగలశక్తి రావణునిపై బ్రయోగింప దానిని వాడు తన శూలముతో నడచి మయుడు తన కిచ్చినబాణమును మాంధాతపై వేసెను. దానివలన రాజు మూర్ఛనొంద రావణునిమంత్రులు సింహనాదము చేసిరి. మాంధాత ముహూర్తములో తెలివి తెచ్చుకొని, యానాదమును విని కోపముతో రాక్షసబలముపై శరవర్షము గురిపించెను. మాంధాతకు, రాక్షసరాజునకు గొప్పయుద్ధము జరిగెను. వారు విండ్లను, కత్తులను, నమ్ములను, పట్టి యుద్ధముచేయ నాయాయుధపు దెబ్బలచే వారి శరీరములు రక్తమయములయ్యెను. రావణుడు రౌద్రయస్త్రమును విడువ మాంధాత యాగ్నేయాస్త్రముతో దానిని తిరుగ గొట్టెను. రావణుడు గాంధర్వయస్త్రమును బ్రయోగింప దానినాతడు వారుణాస్త్రముచే ఖండించెను. రావణుడు బ్రహ్మాస్త్రమును

దీయు, మాంధాత త్రిలోకభయంకరమగునదియు, తాను గొప్ప తపము జేసి రుద్రునివరమువలన బొందినదియు నగు పాశుపతాస్త్రమును దీసెను. అంతట సర్వభూతములు భయము నొందెను. మూడులోకములు కంపించెను. దీనిని పులస్త్య గాలవ్యులను ఋషులు ధ్యానయోగముచే జూచి, రాజునొద్దకు వచ్చి వానిని వారించిరి. రావణునకు ననేక చీవాట్లు బెట్టిరి. వారిద్దరికి స్నేహము జేసిరి. అప్పుడు సంతోషముతో నెవరువచ్చిన త్రోవను వారు పోయిరి.

రావణుడు పుష్పకము నెక్కి సోమలోకమునకు 10,000 యోజనముల (80,000మైళ్ళు)కొక్కొక స్థానము చొప్పున నీదిగువ గనబఱచినవిధముగ నెనిమిదిస్థానములను దాటి వెళ్లెను.

చంద్రుడు 80,000 యోజనములపైని (6,40,000మైళ్ళు) గ్రహనక్షత్రములతో నుండుచోటు. అతడు తనమండలమునుండి 100 లక్షలు కిరణములచే లోకములను ప్రకాశింపజేసి సమస్తజీవులకును సుఖము నిచ్చును.

| | |
|---|---|
| 8 | సూర్యపథమున నాకాశగంగ వాయువుచే ధరింపబడినస్థానము. |
| 7 | ఋషులలోకము. |
| 6 | గరుడుడు బంధుకోటితో నుండులోకము. |
| 5 | గంగకు, కుముదాది యష్టదిగ్గజములకు స్థానము. (ఇవి జల్లిన నీరు మంచగును.) |
| 4 | వినాయక, భూతముల లోకము. |
| 3 | సిద్ధచారణ లోకము. |
| 2 | ఆగ్నేయ పక్షజ బ్రాహ్మము లను మేఘములకు స్థానము. |
| 1 | సర్వగుణములు గల హంసలోకము. |

భూలోకము.

చంద్రుడు రావణుని తన శీతకిరణములచే శీతలత్వమును బొందించెను. వానిమంత్రులు శీతలత్వమును సహింపలేకుండిరి. అందు ప్రహస్తుడు వినయముతో రావణుని కిట్లు విన్నవించెను. 'శీతలముచే బాధనొందుచుంటిమి. భయము కలుగుచున్నది. మనము వెళ్లిపోవుదము.' ఈమాటలను రావణుడు విని కోపముతో తనవింటిని ధ్వని చేయించి బాణములచే చంద్రుని పీడించెను. అంతట బ్రహ్మవచ్చి దశగ్రీవుని మందలించి "గొప్పవాడైన విశ్రవసునికి పుత్రుడవై నీ విట్టిపనలు చేయకూడదు. ఇక్కడనుండి మరలుము. చంద్రుని నీవు బాణములచే బీడింపకూడదు. లోకముల హితముకొఱకు నీతడు కల్పింపబడెను. నీ కొకమంత్రముపదేశించెదను. అది ప్రాణములు పోవుకాలమున నభయము నిచ్చును. దీనిని పఠించువాడు మృత్యువును బొందడు." అని సెలవీయ దశగ్రీవు డాతనికి నమస్కరించి నన్ను గూర్చి మీరు సంతోషించితిరేని నా కియ్యదగినయెడల నది గొప్ప మంత్రమైనను దానిని నాకీయగోరెదను. దానిని జపించి సమస్తదేవతలు మొదలగు వారియందు నిర్భయముగ జరించెదను. మీ ప్రసాదమువలన నాకు భయములే దని విన్నవించెను. తరువాత వానికి మంత్రముపదేశించి బ్రహ్మ "యిది ప్రాణములుపోవుకాలమునమాత్రమే యుపయోగించునుకాని యెల్లపుడు నుపయోగింపదు. జపమాలికను ధరించి నేను చెప్పిన *108 నామములుగల శివమంత్రమును నీవు జపింపవలెను. జపింపనియెడల సిద్ధిలేదు. దీనివలన యుద్ధమున జయము గలుగును. దీనిని నీవు జపించిన శత్రునాశన మగు"నని వరమిచ్చి తన లోకమునకు బోయెను. రావణుడు సంతోషించి లంకాపట్టణమునకు మఱలుచు దారిలో రాజర్షి దేవ గంధర్వ కన్యలను బట్టుకొని లంకకు దీసికొనిపోయెను.



*13వ ప్రకరణము. ౨వ.అధ్యాయము,అష్టశతనామశివమంత్రమును జూడుము

## ౧౬.వ. అధ్యాయము. రావణునకు వేదవతీశాపము.



ఒకానొక కృతయుగమున రావణుడు మహీతలమున సంచరించునపుడు హిమవత్పర్వతముపై నొకభాగమునుండిపోవుచు నచ్చట లేడితోలును, జడలును గలదియు, ఋషులుచేయు విధులనుజరుపు నదియు, తేజస్సుగలదియు, దేవతవలెనున్నదియు, మంచివ్రతముకల్గి నదియు, సౌందర్యవతియు నగు నొకకన్యనుజూచి కామముచే నజ్ఞానమును బొంది పెద్దగానవ్వుచు నామెనిట్లుప్రశ్నించెను. 'నీవు నీయౌవనమునకు విరుద్ధముగ నేలవర్తించెదవు? నీరూపమున కీచర్యతగక విరోధముగనున్నది. సాటిలేని నీరూపము జనులకు కామోద్రేకమును కలిగించు చున్నది. నీవు తపస్సుచేయుట యుక్తముకాదు. దానిని నీవు విడుచుటయే మంచిది. నీ వెవని కుమార్తెవు? నీభర్త యెవడు? నీవెవనిని గూర్చి శ్రమపడుచున్నావో వాడు పుణ్యవంతుడు.' ఇట్లు రావణు డామెను ప్రశ్నింప నామె వానికి విధిప్రకార మాతిథ్య మిచ్చి తన చరిత్ర మిటుల జెప్పెను "నాతండ్రి గొప్పప్రభావముగలవాడును, ఎల్లపుడు వేదాభ్యాసముచేయు మహాత్ముడును, బ్రహ్మర్షియు నగు కుశధ్వజుడు; అతడు బృహస్పతికుమారుడును, సిరిగలవాడును, బుద్ధిలో తనకు సమానులు లేనివాడునునై యుండెను. నేను వానివాక్కున బుట్టి 'వేదవతి' యని పిలువబడు చుంటిని. దేవతలు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, నాగులు నాతండ్రి వద్దకుపోయి నన్ను వివాహమాడుటకు గోర నతడు 'సురోత్తముడును, త్రిలోకేశ్వరుడును నగు విష్ణువే నాయల్లు' డని తలంచుచు, 'నాకన్యను మీ కీయ' ననెను. అందుచే బలగర్వితుడగు 'దంభు' డను దైత్యరాజు కోపించి పాపియై నాతండ్రిని రాత్రి పరుండ జంపెను. అప్పుడు నాతల్లి నాతండ్రిశరీరము దహనమగుచుండ నాయగ్నిలో ప్రవేశించెను. నన్ను

'విష్ణువున కిచ్చి వివాహము చేయవలె' నను నాతండ్రికోరికను సత్యముగ జేయుటకు నేను నామనస్సున నాతని వివాహమాడియుంటిని. ఈ ప్రతిజ్ఞతో నే నేను గొప్పతపస్సు చేయుచున్నాను. నారాయణుడే నాకు భర్తగాని యితరుడు గాడు. నారాయణుని పొందుకోరిక చే గొప్పనియమమును జేయుచున్నాను. మూడులోకములలో జరుగునది తపస్సుచే నాకు దెలియును. నిన్ను నే దెలిసికొంటిని. నీవు నీయాశను వీడి పొమ్ము". ఇట్లు పలికిన వేదవతితో రావణుడు కామమోహితుడై తనవిమానమునుండి యింకను నిట్లు ప్రసంగించెను. "నీమన స్సిట్లుండుటచే నీవు గర్వించియున్నావు. పుణ్యము సంపాదించుట వృద్ధులకే తగియున్నది. సర్వగుణసంపన్నురాల వగు నీ కిట్లుపలుక దగదు. మూడులోకములలో సుందరమగు నీయౌవనము వ్యర్థమగుచున్నది. నేను 'దశగ్రీవు' డను పేరుగల లంకాపతిని. నాకు భార్యవై నీవుభోగములను సుఖముగ ననుభవింపుము. నీవు పలికినవిష్ణు వెవడు? నీవు కోరునాతడు వీరత్వముచేతను, తపస్సుచేతను, భోగములచేతను, బలముచేతను నాతో సమానుడు గాడు." ఇట్లు దశగ్రీవుడు పలుక మిక్కిలి మంచిబుద్ధిగల యామె 'నేనును, సమస్తలోకములును నమస్కరించు త్రిలోకాధిపతి యగు విష్ణుని నీవు తప్ప నన్యుడు బుద్ధిమంతు డెవడును నవమానింప' డని మాఱు పల్కెను. అంతట రావణుడు వేదవతిజుట్టును తనచేతితో పట్టుకొనెను. దాని కామె కోపించి యాజుట్టును తనచేయి కత్తికాగ దానితో రెండుముక్కలుగ నఱికెను. తరువాత నామె రోషముతో రావణుని గాల్చునటుల మండిపడుచు తనమరణమున కగ్నిని తయారుజేసి యిట్లు పలికెను.'మర్యాదహీనుడా! నీవలన నేను పట్టుబడినందున నాకు జీవించుట యిష్టము లేదు. రాక్షసాధమా! నీవు చూచుచుండగ నే నగ్నియందు ప్రవేశించెదను. పాపాత్ముడ వగు నీవు న న్నేకారణమున పట్టితివో యదే

కారణముగ నేనునిన్ను వధించుటకు తిరిగిపుట్టెదను. పాపనిశ్చయుడగు పురుషుని స్త్రీ చంపలేదు. నేను నిన్ను శపించినయెడల నాతపస్సు ఖర్చగును. నేను కొంచెమైనను దానముచేసినయెడల,నగ్నిలో వేల్చినయెడల, మంచికర్మల జేసినయెడల ధర్మాత్మునికి గుమార్తెను, సాధ్వినయి గర్భమునుండి గాక పుట్టెదను.' ఇట్లామె చెప్పి మండెడునగ్నిలో ప్రవేశించెను. ఆకాశమునుండి పుష్పములు గురిసెను. (ఉత్తరకాండ 17వ సర్గలో గుండలీకరణమున నీక్రిందియంశములు వివరింపబడినవి.) తిరిగి పద్మమునందు పద్మసమప్రభగల లక్ష్మి జనించెను. రావణుడామెను పూర్వమువలెనే తనయింటికి దీసికొనిపోయి తనమంత్రికి జూపెను. జ్యోతిషము తెలిసిన యాతడు రావణునితో 'ఈమె నీయింటిలో నున్నయెడల నీవధకు గారకురాలగు' నని చెప్పెను. అది విని రావణు డామెను సముద్రములోనికి విసరివేసెను. ఆమె భూమిని బొంది జనకునియజ్ఞశాలయొక్క మధ్యను జేరెను. రాజు నాగలితో దానిని దున్నించుచుండ నాగలికి దగిలి యామె పైకి లేచెను.(ఈయంశములు కుండలీకృతము లగుటచేతను, లంకనుండి సముద్రములోనికి విసరబడిన యామె కొట్టుకొనిపోయి గంగాప్రవాహమునకు నెదురుగా వెళ్ళుచు మిథిలానగరముజేరిన దను నంశము జనులకు సత్యముగ దోచకపోవుటచేతను విశ్వసనీయముగా దని మాయభిప్రాయము.) ఈమెయే జనకునికి నొకానొక త్రేతాయుగమున జన్మించిన సీత.

---

## ౧౮వ అధ్యాయము. రావణుడు పరస్త్రీలను చెఱబట్టుట.

రావణుడు కపిలునివలన పరాభవమునొంది మఱలి, తన మంత్రులతో పుష్పకము నెక్కి లంకకు బోవునపుడు దారిలో సౌందర్యముగల కన్యలు, స్త్రీలు కనబడినయెడల వారిబంధువులను జంపి

వారిని గ్రహించెను. ఇట్లాతడు పన్నగ, యక్ష, గంధర్వ, రాజర్షి, రాక్షస, దైత్య, దానవ, దేవకన్యలను, స్త్రీలను తన పుష్పకమున నెక్కించెను. వారితోను వారి కన్నీటితోను నాపుష్పకము నిండెను. మిక్కిలి సౌందర్యముగల వారు విచారమును బొంది శరీరములు స్వాధీనములు గాక కంపించుచు కన్నీరువిడుచుచు నుండిరి. అందొకతె 'వీడు నన్ను భక్షించునేమో' యనియు, మఱియొకతె 'వీడు నన్ను చంపునేమో' యనియు బలుకుచు విచారించుచుండిరి. కొందఱు తమతల్లిదండ్రిలను, నన్నదమ్ములను, భర్తను, పుత్రులను స్మరించుచు నీతీరున విలపించుచుండిరి. "నన్ను విడిచి శోకసాగరమున మునిగి నా పుత్రుడు, నా యన్న, నా తలిదండ్రు లెట్లుండగలరు? నేను నాభర్తను విడిచి యెట్లుండగలను? ఓ మృత్యువా! నన్ను యమలోకమునకు తీసికొనిపొమ్ము. పూర్వజన్మమున నే నేమిపాపము జేసియుంటినో? వీనివలన పట్టుబడితిని. అయ్యో నాదుఃఖమున కంతము కనిపించుట లేదు. అయ్యో! జన్మము నీటిబుగ్గవంటిది. అయ్యో ఛీ! మనుష్యలోకమున ధర్మపరుడైన జనుడు లేడు. లోకములలో మనకు బంధువు కనబడడు. రావణుడు బలవంతముగ మమ్ము తీసికొనివచ్చునపుడు సూర్యోదయమున నక్షత్రములువలె మా బంధువులు దుర్బలులై నశించిరి. బలవంతుడగు నీరాక్షసుని బరిమార్చు మార్గము తెలియకున్నది. దుర్వృత్తుడగు వీడు తనయాత్మను గుఱించి విచారింపడు. వీనిపరాక్రమము గొప్పదే కాని, వీనికుండు పరస్త్రీలయందలి యభిరుచి మిక్కిలిచెడ్డది. ఈ దుర్మార్గుడు పరస్త్రీలయం దేకారణమున రంజించునో యాకారణముననే స్త్రీని గుఱించి వీడు మరణమునొందును." ఇట్లు పతివ్రతలైన పరస్త్రీలు పలుక దేవదుందుభులు మ్రోగెను. పుష్పవర్షము గురిసెను. రావణునకు కాంతి తగ్గెను. ఈ తీరున రావణుడు లంకాపట్నము చేరెను.

---

## ౧౮ వ అధ్యాయము. రావణుని యపజయములు కార్తవీర్యార్జునునితో యుద్ధము.

రావణుడు రాజులను బాధించుచు భూమియందు దిరిగెను. హైహయవంశస్థుడును, నగ్నితుల్యుడును, బాణములను బాగుగా ప్రయోగించువాడును నగు కార్తవీర్యార్జునుడు స్వర్గపురముతో తుల్యమగు మాహిష్మతీపురమును చుట్టును నగ్ని కాపాడుచుండ, రావణునితో సమానమగు ప్రతాపముకలిగి యాపట్టణమును పాలించుచుండెను. ఆరాజు తనస్త్రీలతో నొకనాడు నర్మదానదిలో క్రీడించుటకు వెళ్ళియుండెను. రావణు డాదినముననే తనమంత్రులతో నానగరము వెళ్ళి వానిమంత్రులతో "మీ కార్తవీర్యార్జును డెక్కడ? 'రావణుడు యుద్ధమునకు వచ్చె' నని యతనితో జెప్పు" డన రాజు పట్నమున లేడని వారు తెలిపిరి. అంతట నాతడు హిమవత్పర్వతము వలె నున్నదియును, నాకాశము నంటునట్లున్నదియును, భూమినుండి లేచినట్లున్నదియును, వేయిశిఖరములు గలదియును, దేవ దానవ గంధర్వ కిన్నర నాగులచే క్రీడింపబడు స్త్రీలును, నప్సరసలును కలదియును, నెత్తైనదియును, తెల్లనిజలమును ప్రవహింపజేయునదులుగలదియును నగు వింధ్యపర్వతమును జూచెను. తర్వాత నతడు పశ్చిమసముద్రమునకు పాఱునదియు, ననేకవిధజంతువులచే నీరు త్రాగునపుడు కలతపెట్టబడినదియు, మనోహరముగకూయుపక్షులుకలదియు, చెట్లు, చక్రవాకపక్షులు, ఇసుకతిన్నెలు, హంసలు, చిలుకలు, నీటినుఱుగు, నల్లకలువలు మొదలగువానిచే సుందరమగునదియు నగు నర్మదానదిలో పుష్పకమునుండి దిగి స్నానముచేసెను. అతడు తనమంత్రులతో నానది యిసుకతిన్నెలపై కూర్చొని 'యిదియే గంగానది' యని పొగిడి నర్మదానదిని చూచి సంతోషించెను. రావణుడు పెద్దనవ్వు నవ్వుచు మారీచ శుక సారణులతో నిట్లు పలికెను. "ఆకాశము

మధ్యనుండి తీక్ష్ణమై తన వేయికిరణములచే లోకమందంతటను బంగారు రంగును గలిగించు సూర్యుడు నే నిచ్చట కూర్చొనుట తెలిసికొని చంద్రునివలె చల్లగ వెలుగుచున్నాడు. నర్మదాజలములచే చల్లదనము గలదియు, సువాసనలుగలదియు, శ్రమను బోగొట్టునదియు నగు గాలి నాభయముచే సుఖముగ వీచుచున్నది. మీరందఱు యుద్ధములో రాజులవలన శస్త్రములచే గొట్టబడిరి; కావున మీశరీరములనుండి రక్తముకారెను. మీరు ప్రజలకు సుఖముకలిగించు నర్మదలో స్నానము చేసి పాపముల బోగొట్టుకొనుడు. నేను ప్రకాశించు నాయిసుకతిన్నెపై శివుని ప్రతిష్ఠ జేసి పుష్పములతో పూజ చేసెదను." ఇట్లు రావణుడు పలికిన తర్వాత గంగలో దిగ్గజములు స్నానముచేయునట్లు ఆతని మంత్రులు నర్మదలో స్నానము జేసిరి. వారు పువ్వులను దెచ్చి యొక కొండవలె నింప, రావణుడు గూడ తిరిగి నర్మదలో స్నానము జేసివిధి ప్రకారముజపించెను. తరువాత నతడు తడివస్త్రములను విడిచి పొడి బట్టలనుగట్టి రాగ మంత్రులాతనివెంట వచ్చిరి. వారు పాడుచు నాడుచు నుండ, రావణు డిసుకతిన్నెపైని పీఠ మేర్పఱిచి లింగమును స్థాపించి గంధముచేతను, మిక్కిలి పరిమళముగల పూవులచేతను దానిని పూజ చేసెను. చంద్రుడే భూషణముగా గలవాడును, వరము లిచ్చువాడును, శుభప్రదుడును నగు శివుని రావణుడు బాగుగ బూజించి, చేతులు చాచి సాష్టాంగపడి కీర్తించెను. ఈ రీతిని రావణు డక్కడక్కడ శివలింగములను ప్రతిష్ఠజేసెను.

అంతట నర్మదానదిలో నాస్థలమునకు పడమటివైపు కొంత దూరమున కార్తవీర్యార్జునుడు తనస్త్రీలతో క్రీడించుచు తన వేయి చేతులబలపరీక్షకై నదీప్రవాహమును చేతులతో నడ్డెను. అందుచే నది నిలిచి యొడ్డను గొట్టివేయుచు, వెనుకకు పాఱుచు, మొసళ్ళు, చేపలు మొదలగువానితోను, పుష్పములు, కుశలు మొదలగువాని

తోను నిండి వర్షకాలమందువలె నయ్యెను. అందువలన పడమటినము ద్రమునకు బోవు నీ రాతట్టునకు పోక తూర్పుదిక్కునకు ప్రవహించుచు రావణుడు చేసిన శివపూజాపుష్పములసమూహమును త్రోసి వేసెను. అందుచే సగముమాత్రమే పూర్తియయిన తననియమమును విడిచి, నర్మదానదిలో పక్షు లెక్కువగ కొట్టుకొనిపోవుచుండుటయు, నానదిస్థితి తనకు ప్రతికూలముగ నుండుటయు, పశ్చిమమునుండి తూర్పునకు ప్రవహించుటయు రావణుడు చూచి, తనకుడిచేతి యం గుళితోను, ప్రతిధ్వనించు శబ్దముతోను 'నీటివేగమునకు కారణమును కనుగొనుడని తనకు నన్నదమ్ములగు శుక సారణుల నాజ్ఞాపించెను. వా రాకాశమార్గమున పశ్చిమముగ రెండుక్రోసులదూరము బోయి స్త్రీలతో క్రీడించు పురుషు నొకనిని జూచిరి. ఆ పురుషుడు గొప్ప గుగ్గిలవృక్షమువలె నుండి తనజుట్టు నీటిచే చలింప మదముచే కం డ్లెఱ్ఱగ నుండ మన్మథరూపముగలిగి వేయిచేతులతో నదిని నరికట్టి యుండి సౌందర్యముగల వేయిమంది స్త్రీలతో క్రీడించుచుండెను. వా రీయద్భుతమును జూచి రావణునియొద్దకు వచ్చి దానిని తెల్పి యాత డెవడని రావణు నడిగిరి. రావణుడు ఆత డర్జునుడనిచెప్పి యాత నితో యుద్ధమునకు బయలుదేఱెను. అప్పు డాతనికి దుశ్శకునములు కనబడెను. అయినను వాడు తనమంత్రులతో సింహనాదము చేయుచు నర్జునుడుండు చోటునకు వేగముగబోయి యాతనిని జూచెను. రావ ణుడు కోపముతో 'నేను యుద్ధమునకు వచ్చితి నని మీరాజున కెరిం గింపుడు' అని అర్జునునిమంత్రులతో చెప్పెను. వా రాయుధములు బట్టుకొని రావణునితో నిట్లనిరి. "యుద్ధమునకు మంచికాలము నీకు తెలిసినది. బాగుబాగు! మదించి స్త్రీలతో క్రీడించు రాజుతో యుద్ధముచేయుట కిష్టపడు శత్రురాజు బ్రాహ్మణహత్యచేసినవాడుగ సత్పురుషులచే తలుపబడును. స్త్రీలయొద్దనుండు నర్జునునితో పోరాడ

నీ వెట్లుత్సహించెదవు? ఈ దినమునకు క్షమింపుము. ఈ రాత్రి నీవు నిలిచి నీకు యుద్ధమునందు శ్రద్ధకలదేని రేపటిదినమున మమ్ము జంపి యాతనితో నీవు యుద్ధము చేయగలవు.” ఇట్లర్జునుని మంత్రులు రావణునితో బలుక రావణునిమంత్రులు రాజుమంత్రులను జంపి యుద్ధముచే గలగినయాకలిచే వారిని భుజంచిరి. అంతట నర్మదాతీరమున హాలహాలాశబ్దము పుట్టెను. అర్జునుని యనుచరులకు, రాక్షసులకు యుద్ధము జరిగెను. రావణుడును, వానిమంత్రులును వారలను తరిమిరి. రావణుడు, వానిమంత్రులగు శుకసారణులును తనబలమును నాశనము చేసిరనువార్తను తనద్వారపాలకులవలన అర్జునుడు విని తనస్త్రీలతో ‘భయము వల’ దని చెప్పి నర్మదానదినుండి బయలు దేఱి గొప్పకోపముతో నతిశీఘ్రముగ బంగారుకట్లుగల పెద్దగదను బట్టి రాక్షసులను శీఘ్రముగ తఱిమెను. దానికి ప్రహస్తుడు పెద్ద ధ్వని చేయుచు తనముసలముతో నడ్డువచ్చి దానిని విసర నర్జునుడు దానిని తనగదతో ఛేదించెను. తర్వాత నర్జునుడు వేయిమూరలు పొడుగుగల తనపెద్దగద త్రిప్పుచు ప్రహస్తుని కొట్ట వాడు పడిపోయెను. మారీచ శుక సారణ మహోదర ధూమ్రాక్షులు యుద్ధమునుండి మఱలిరి. రావణుడుమాత్రము అర్జునునితో రణము సలిపెను. 20భుజములతో నొకడును, వేయిభుజములతో మఱియొకడును గొప్ప యుద్ధముచేసి గదలతో మొత్తికొనిరి. ఆదెబ్బ లన్నిదిక్కులందు ప్రతిధ్వనించెను. వారు విసరికొనినగదలు శత్రువక్షస్థలములందు మెఱసెను. అర్జున రావణులు విచారములేక పూర్వము బలి,యింద్రుడు పోరినటుల యుద్ధముచేసి రితర్వాత నర్జునుడు తనగదను రావణుని వక్షస్థలముమీదికి మిక్కిలిబలముగ విసర నది వరమునుబొందిన వానిని జంపలేక రెండుముక్కలై భూమియందు పడెను. వాడును బారెడుదూరము తుల్లిపడి కూర్చొనెను. వానిశరీరము స్వాధీనముగ

లేకుండుట అర్జునుడు చూచి, యెగిరి గరుత్మంతుడు . పామును బట్టు విధమున తన వేయిచేతులతో బలముగ వానిని బట్టి, కట్టి నాదము చేయ సిద్ధచారణదేవతలు బాగుబాగని యాతనిశిరస్సుపై పుష్ప వర్షము కురిపించిరి. అంతట ప్రహస్తుడు తెలివి తెచ్చుకొని రావణుడు కట్టబడియుండుట చూచి మిగిలినరాక్షసులతో నర్జునుని నెదిరించెను. వారు 'విడువుము విడువుము; ఉండుము ఉండుము.' అనుచు ముసల ములను, శూలములను నాతనిపై వేసిరి; కాని యతనికినవితగులలేదు. ఆ యాయుధములనే యాతడు గ్రహించి తిరుగ వానిని వారిపై విసరి వారిని తఱిమెను. ఇట్లర్జునుడు వారిని భయపెట్టి రావణుని పట్టుకొని తన మాహిష్మతీపురమును జేరెను. పౌరులు, బ్రాహ్మణులు పుష్పులను, అక్షతలను తమ రాజుపై జల్లిరి.

రావణుడు పట్టుబడె నని దేవలోకములో దేవతలవలన నాతనిపితామహు డగు పులస్త్యమహాఋషి విని, గొప్పధైర్యము గల వాడైనను మనస్సు చలనమొంద మాహిష్మతీ పతియగు నర్జునుని జూచుటకు వాయుమార్గమున శీఘ్రముగ నచటికి వెళ్ళెను. ద్వార పాలకులు సూర్యునివలె తేజోధికుడును, నడచివచ్చువాడును నగు నాఋషిని నడిగి తెలిసికొని తమరాజుతో జెప్పిరి. హైహయాధిపుడు తనతలను జేతులుమోడ్చి ఋషిని జూడవచ్చెను. రాజపురోహితుడు ముం దర్ఘ్యమును, మధుపర్కమును బట్టుకొని నడిచెను. రాజు ఋషికి నమస్కరించి వానికి నర్ఘ్యపాద్యములను, మధుపర్కమును, నావును నిప్పించి సంతోషముతోను, గద్గదస్వరముతోను నిట్లు విన్నవించెను. "ఈ దినమున నేను చూచుటకు నలవికాని బ్రాహ్మణశ్రేష్ఠు లగు మిమ్ము నేను దర్శించుటచే నాపుర మమరావతివలె నైనది. ఈదిన మున నాకు కుశలము. నానియమములకు కుశలము. ఈదినముననే నాజన్మ, తపస్సు, ఫలించినవి. దేవతలచే నమస్కరింపబడదగిన మీ

చరణములకు నేను వందనములు చేయుచున్నాను. ఈ నా రాజ్యము నాపుత్రులు నా భార్యలు మే మందఱము మీవారము. మే మేమి చేయుచుంటిమో మే మేమి చేయవలయునో మీ రాజ్ఞాపింపవలె నని కోరుచున్నాను." ఇట్లు రాజు మనవిజేయ ఋషి యాతని ధర్మాగ్నులయొక్కయు, భృత్యులయొక్కయు శుభ మడిగి యిట్లు సెలవిచ్చెను. "నీవు దశగ్రీవుని జయించుటచే నీబలము సాటిలేనిదియైనది. ఎవనిభయముచే వాయువును, సముద్రమును చలనములేక నిలుచునో, యట్టి రావణుడు నీచే కట్టబడినాడు. వాడుదుర్జయుడగు నాపౌత్రుడు; వానికీర్తిని హరించి నీపేరు వెల్లడించుకొంటివి. నామాటలను విని నీవు దశాననుని విడువుము." ఇట్లు ఋషి సెల వీయ, రాజేమియును మాఱు పలుకక సంతోషించి రావణుని విడిచి వానికి ప్రకాశమానమగు నగలను, మాల్యములను, బట్టలను నిచ్చి యగ్నిసాక్షిగ వానితో స్నేహము జేసెను. అర్జునుడు ఋషికి నమస్కరించి తన యింటిలోనికి నాతనిని దీసికొని వెళ్లెను. ఋషి సహాయమువలన విడువబడుటచే లజ్జతోనున్న రావణుడు రాజుచే కౌగలింపబడి యతని యాతిథ్యము నొందెను. ఋషి బ్రహ్మలోకము వెళ్లెను. రావణుడు కార్తవీర్యార్జునునితో సఖ్యము జేసి తిరుగ రాజులతో యుద్ధము జేయుటకు భూతలమున దిరిగెను.



## ౧౯ వ అధ్యాయము. రావణుడు వాలిచే గ్రహింపబడుట.



రావణుడు బలాధికులగు మనుష్యులను, రాక్షసులను యుద్ధమునకు బిలుచుచు నొకానొక కాలమున కిష్కింధానగరమునకు వెళ్లి వాలినికూడ తనతో యుద్ధముచేయ రమ్మనిపిలిచెను. ఆతడు లేనం

డుటచే తారతండ్రియు, వాలిమంత్రియునగు తారుడు రావణునితో నిట్లు పలికెను. "నీతో యుద్ధముచేయగలవాడు వాలియే. ఆత డిప్పుడు సంధ్యవార్చుటకు నాల్గుసముద్రములకు వెళ్ళెను. ఈ గడియ లోనే రాగలడు. ఉండుము. ఆతనితో యుద్ధమునకు వచ్చినవారి యొక్క యీ తెల్లనియెముకలపోగులను జూడుము. నీ వమృతరసము సేవించితివేని వాలితో యుద్ధము చేయువఱకు బ్రతుకుదువు. లోక ములో నీ చిత్రము చూడుము. ఒకముహూర్తముండుము. నీ విది వరలో పొందనిది పొందెదవు. నీకు తొందరగా చావవలెనని యున్నచో దక్షిణసముద్రమునకు బొమ్ము. అచ్చట సూర్యునివలె ప్రకాశించు వాలిని జూడగలవు." ఇట్లు వాలిమంత్రి పలుక రావణు డాతని నిందించి పుష్పకమెక్కి దక్షిణసముద్రమునకు బోయి యచ్చట సంధ్యవార్చువాలిని జూచి పుష్పకమునుండి దిగి వానిని బట్టుకొనుటకు నేమియు చప్పుడు కాకుండునటుల మెల్లగ నడిచెను. దైవయోగముచే వాలి కండ్లుతెఱచి పాపోద్దేశముగల యాతనిని జూచి తొందరపడక సింహము కుందేలును జూచియు, గరుడుడు పామును జూచియు సరకుగొనకయుండునట్లు వాలియు నుండి "నేను వీనిని నాచంకలో నిడికొని మూడుసముద్రములకు వెళ్ళెదను. అపుడు నాచంకలోనుండి వ్రేలాడు వీనితొడలను, చేతులను, బట్టను గరుడుడు పట్టిన పామునువలె అందఱును జూచెదరు." ఇట్లు వాలి మనస్సులో దలచి యూరకుండి వేదమంత్రములు జపించుచుండెను. పిదప రావ ణుడును, వాలియు నొకరినొకరు పట్టుకొనుటకు యత్నించిరి. ఆ వానరరాజు రావణుని పాదములచప్పుడుచే వాడు తనచేతులనుపట్టు నని తలచి ముఖము మఱియొకప్రక్కకు త్రిప్పుకొనియుండియు గరు త్మంతుడు పామును పట్టువిధమున వానిని బట్టి తనచంకలో పెట్టి, వేగముగ నాకాశమున కెగిరి వాడు తనను గోళ్ళతో గడియగడి

యును చీరుచున్నను వానిని బాధించెను. దీనిని రావణునిమంత్రులు కనిపెట్టి తమరాజును విడిపించుటకు కేకలు వేయుచు పరుగెత్తిరి. కాని మేఘములమధ్య గొప్పవేగముతో బోవు ఆ వాలిని వారు చేరలేకపోయి యలసటను బొంది యాతనిమార్గమునుండి తప్పుకొనిరి. ఆతనిబాహువులయొక్కయు, తొడలయొక్కయు వేగముచే పర్వతేంద్రము లలసటచెందినవై వానిమార్గమునుండి తొలగియుండ, జీవితముగోరువాడును, మాంసశోణితములు కలవాడునునగు ఏప్రాణి వానిమార్గమునుండి తొలగక యుండగలుగును? క్రమముగ వాలి అన్నిసముద్రములకు బోయి సంధ్యవార్చెను. ఆకాశమున సంచరించువా రాతనిని గీర్తించిరి. వాలి మొదట పడమటిసముద్రమునకు వెళ్ళి స్నానముచేసి, సంధ్యవార్చి జపము చేసెను. తరువాత నాతడు రావణుని మోయుచు ననేకవేలయోజనములు వాయువేగ మనోవేగములతో ఉత్తర సముద్రమునకు వెళ్ళెను. అక్కడనుండి యాతడు తూర్పు సముద్రమునకు వెళ్లెను. నాల్గు సముద్రములలో సంధ్యవార్చి యింద్రపుత్రుడగు వాలి తనకిష్కింధానగరమునకు వచ్చునపుడు చిన్నతోటయొద్ద రావణుని మోయుటవలన గలిగిన శ్రమచే పడిపోయెను. పిదప నాతడు తనచంకనుండి వానిని విడిచి పెద్దనవ్వు నవ్వుచు శ్రమబొందిననేత్రములతో జూచుచు గొప్ప యాశ్చర్యముతో 'నీవెక్కడినుండి వచ్చితివి' అని వానినడిగెను. దానికి రావణు డాతనితో నిట్లు విన్నవించెను. "మహేంద్రునితో సమానమగు ప్రకాశముగల వానరేంద్రా! నేను రాక్షసేంద్రుడనగు రావణుడను; నీతో యుద్ధము కోరి వచ్చిన నన్ను నీ వీ విధమున బట్టితివి. నీబలము, వీరత్వము, గంభీరత ఇంతింతని చెప్పరాదు. పసికూనవలె నన్ను నీవు చంకనిడికొని నాలుగుసముద్రములను హేలగా త్రిప్పితివి. ఇతరు డేవీరుడు నీవలె నన్ను మోసికొని వెళ్లగలడు?

నీవు, మనస్సు, వాయువు, గరుడుడు వేగమున సమానులుం. నీబల మెఱిగినందున నేను అగ్ని సాక్షిగ నీతో స్నేహము గోరుచున్నాను. భార్యలు, పుత్రులు, పురము, రాష్ట్రము, భోగములు, కట్టుబట్టలు, భోజనము ఇవన్నియు మనకు నేకముగ నుండవలయును." ఇట్లు రావణుడు పలుక, వారు అగ్నిహోత్రము తెప్పించి అగ్నసాక్షిగ నొకరినొకరు కౌగలించుకొని భ్రాతృత్వమును బొందిరి. వారు కిష్కింధ చేరి సంతోషముగ నుండిరి. రావణుడు వాలితో సుగ్రీవుని వలె నొకమాస మక్కడుండెను. తర్వాత నాతడు తనమంత్రులు రాగా లంకకు బోయెను.

---

## ౨౦వ అధ్యాయము. రావణుడు విష్ణుని యవతారమగు కపిలుని జూచుట.

రావణు డొకానొక కాలమున తనమంత్రులతో పశ్చిమ సముద్రమున కరిగి యొకద్వీపమునందు అగ్నిప్రభకలవాడును, బంగారు చాయగలవాడును, ఒక్కరుడును, ప్రళయాగ్నివలె భయంకరుడును, దేవతలలో శ్రేష్ఠుడుగ నగపడువాడును, అనేకధ్వనులుచేయువాడును, పొడుగైనచేతులుకలవాడును, గొప్పకోఱలచే భయముకలిగించు వాడును, శంఖమువంటి కంఠముకలవాడును, కప్పకడుపువలెనుండు కడుపుకలవాడును, గోరోజనవర్ణముగల నేత్రములుకలవాడును, కైలాస శిఖరమువంటి శరీరముకలవాడును, పద్మములవలెనుండు అరకాలుకల వాడును, ఎఱ్ఱకలువవలవలెనుండు మోముగలవాడును, వేగమున మనస్సుతోను, వాయువుతోను సమానుడును, అమ్ములపొదికలవాడును, దట్టముగ కట్టబడినచామరముకలవాడును, మంటలసమూహముచే

రక్షింపబడినవాడును, నాదముచేయు చిరుగంటలను కట్టుకొనిన వాడును, వక్షస్థలమున వ్రేలాడుచున్న బంగారుపద్మముల మాల గల వాడును, మేరువువలె శోభించువాడును, గంభీరుడును, మహాబలుడునగు మహాపురుషుని జూచి శూలాదులుధరించి యుద్ధమునకు రమ్మని గర్జించెను. దాని కాతడు చలింపక 'యుద్ధమునందు శ్రద్ధగల నిన్ను నాశనమొందించెద' ననెను. అంతట నతనియందు రావణునివేగము కంటె ననేకరెట్లు వేగమును, అతని నేత్రములందు గ్రహమాలలవలె నున్న యద్భుతతేజమును, అతడు పండ్లుకొరుకుటచే యంత్రశబ్దము వలెనుండు గొప్పధ్వనియు బయలుదేరెను. ఆతనిశరీరమందు రావణు నకు * విశ్వరూపసందర్శన మాయెను. ఆ మహాపురుషుడు రావణుని లీలగను, మెల్లగను పిడికిట బొడవ వాడు భూమిమీద పడెను. వాని మంత్రులు మొఱపెట్టిరి. ఋగ్వేదస్వరూపుడగు నా పురుషుడు పాతా ళమునకు వెడలెను. రావణుడు లేచి 'అతడేడి' అని తనమంత్రుల నడుగ నా త్రోవను బోయెనని వారు చెప్పిరి. రావణుడు కత్తిపట్టు కొని పాతాళబిలద్వారమున బోవ నక్కడ భుజకీర్తులు గలవారును, శూరులును, ఎఱ్ఱనిసుగంధములను బూసికొనినవారును, వ్రేలియుంగర ములు హారములు మొదలగు భూషణములు కలవారును, నాట్యము చేయువారును, ఎల్లప్పుడు సంతోషముగలవారును, భయములేనివా రును, అగ్నివలె తేజస్సుకలవారునగు మూడుకోట్లమహాపురుషులు వానికి కనపడిరి. వారందఱున్ని రీతులచేత నా మహాపురుషునివలె యొక్కటే వర్ణమును, బలమును, రూపమును, నాల్గుభుజములును గల్గి యుండిరి. రావణుడు భయము నొందియు బ్రహ్మవరముచే ధైర్యమువలంబించి బయలుదేఱి శేషశాయియును, తెలుపుపచ్చ కలిసినరంగుగల కౌస్తు భమణికలవాడును, అగ్నిచే చుట్టబడినవాడును, అగ్నికంటె నెక్కువ

*13వ ప్రకరణము, 3వఅధ్యాయము, కపిలునివిశ్వరూపదర్శనము చూడుము.

తేజముకలవాడును, మహావిష్ణుస్వరూపుడను నగుకపిలుని జూచెను. అతనిపక్కను దివ్యములగు పూలదండలను, సుగంధములను ధరించినదియును, దివ్యాభరణములు కలదియును మూడులోకములకు భూషణమనదగిన మంచిస్త్రీయును, చామరమును చేత ధరించినదియునగు లక్ష్మీదేవి పద్మమును పట్టుకొని యుండెను. సింహాసనమునందుండు నామెను రావణుడు చూచి సంతోషించి మోహితుడై కోఱలందు విషముగలిగి శయనించు పాముతీరుననుండు నా వనితను బట్టదలచెను. కపిలుడు వానిమనసెఱిగి తాను కప్పుకొనినబట్టను పాఱవైచి పెద్ద నవ్వు నవ్వి పెద్దయూపిరి తీయ దానిచే వాడు పాతాళభూమియందు పడెను. అప్పుడు కపిలుడు వానిని బిలిచి 'లెమ్ము; నీకిప్పుడు బ్రహ్మవరముచే చావు లేదు; నిర్భయముగ పొమ్ము' అని సెలవిచ్చెను.

రావణు డొకగడియలో తెలివి తెచ్చుకొని భయమును బొంది 'ప్రళయకాలాగ్నితో సమానమగు శౌర్యముగల నీవెవడవు? సమస్తదేహులయందుండు భగవంతుడవా?' యని వానినడిగెను. ఆతడు పెద్దనవ్వు నవ్వుచు 'నీకెందుకు నాచేత నీవిప్పుడు శీఘ్రముగ జంపబడవై తి'వని వానికి జబాబు చెప్పెను. దానికిరావణుడు చేతులు జోడించి యిట్లు పలికెను. "బ్రహ్మవరముచే నేను మరణము నొందలేదు. పుట్టినవాడుగాని, పుట్టబోవువాడుగాని, దేవతలలో నాకు సాటివాడుగాని బ్రహ్మవరము తప్పింపలేడు. ఎంతప్రయత్నము చేసినను దానిని మార్చుటకు వీలులేదు. దానిని నిష్ఫలముగజేయువానిని నేను మూడులోకములందు కానను. నాకు కందుకు భయము లేదు. నాకొకవేళ మరణము సంభవించిన నది మీవలననేకాని యితరులవలన కలుగదు. మీవలన మరణము కీర్తికరమును, పొగడతగినదియు నగును." ఇట్లు రావణుడు మనవిచేసి శయనించిన యా మహాపురుషునియందు నమస్తమైన మూడులోకములను, ఆదిత్యులను, వసువులను, రుద్రులను,

వాయువులను, అశ్వినులను, సిద్ధులను, పితరులను, యమకుబేరులను, సముద్రములను, కొండలను, నదులను, విద్యలను, వేదములను, త్రేతాగ్నులను, గ్రహములను, నక్షత్రములను, ఆకాశమును, సాధ్యులను, గంధర్వులను, చారణులను, వేదవిదులైన మహర్షులను, గరుడుని, పాములను, దేవతలను, దైత్యులను, దానవులను, రాక్షసులను మిగిలినవారిని జూచెను. అతడే దేవదేవుడును, సనాతనుడును, భగవంతుడును, ఆ ద్వీపముననుండు నరుడునగు కపిలుడు. అతడు శంఖ చక్ర గదాధరుడును, భూతముల శాసించువాడును, సంహరించువాడును, అనాదియైనవాడును, శాశ్వతుడును, నాశరహితుడును, నారాయణుడునగు మహావిష్ణువు. అక్కడనుండు పురుషులు దేవతలు. ఆతడు రావణుని గొప్పకోపముతో జూడనందున వాడు మరణించలేదు. వాడు భూమియందు పడి కపిలుని రహస్యముగ కఱినపుమాటలాడెను. చాలసేపటికి వాడు తెలివితెచ్చుకొని లంకకు మఱలెను.



## ౨౧ వ అధ్యాయము. రావణుడు మోక్షాసక్తి కలిగి రామునితో యుద్ధము గోరుట.



పూర్వకాలమున నొకకృతయుగమున రావణుడు బ్రహ్మపుత్రుడును, సూర్యతేజుడును నగు సనత్కుమారుడు కూర్చొనియుండ వెళ్ళి యతనికి నమస్కారముచేసి వినయముతో ఋషి నిట్లడిగెను. "దేవతలలో మిక్కిలి బలవంతుడగువా డెవడు? ఎవనిసహాయమువలన దేవతలు యుద్ధములో గెలుతురు? జనులెల్లపుడు నెవరిని యజ్ఞమూలముగ పూజించెదరు? యోగు లెవ్వని ధ్యానింతురు? ఈసంగతులు నాకు పూర్తిగా తెలియజెప్పుడు" ఇట్లు రావణుడు

కోర ఋషి వానిమనస్సులోనున్న దానిని గ్రహించి ధ్యానదృష్టితో జూచి ప్రేమతో 'పుత్రుడా వినుము.' అని*విష్ణువును వర్ణించెను. దానికి రావణుడు వినయముతో తిరిగి యిట్లడిగెను. 'అతనియుద్ధములో చచ్చు శత్రువులగు దైత్యదానవరాక్షసులు ఏగతిని బొందుదురు?' రావణుని యీప్రశ్నకు ఋషి "దేవతలచే మరణమొందువారు స్వర్గమునొంది అక్కడనుండి భూమికి వచ్చి తమపూర్వసుఖదుఃఖములచే పుట్టుచు చచ్చుచు నుందురనియు, లోకనాథుడగు విష్ణునిచక్రముచే మడియువా రాతనితో నైక్యము నొందుదురనియు, విష్ణువుతో క్రోధము వానివరముతో సమానము." అనియు పలికెను. సనత్కుమారుని యీ మాటలు రావణుడు విని సంతోషించి యాశ్చర్యమును బొందెను. హరిని యుద్ధములో నెట్లెదుర్కొనెద నని యాలోచించు వానికి ఋషి 'నీవు కోరినది యుద్ధములో జరుగు ననియు సుఖముగ నుండుమనియు, కొంతకాలము వేచియుండు' మనియు తెలిపెను. రావణుడు ఋషితో 'విష్ణునిలక్షణము లెట్టివో పూర్తిగ నాకు తెలియచెప్పు'మన ఋషి*వానిని వివరముగ జెప్పెను. మఱియు సనత్కుమారుడు 'గొప్పభక్తు లాతని జూడ గలుగుదు' రని తెలిపి 'మఱియొకతీరున నీవు మహావిష్ణువును జూడ నిష్టముకల దేని యీ కథ చెప్పుచున్నాను. వినుమ'ని యిట్లుచెప్పెను. "కృతయుగాంతమున వచ్చు త్రేతాయుగారంభమున దేవమనుష్యుల మంచికొఱకు నాత డిక్ష్వాకువంశములో రాజగు దశరథునకు పుత్రుడును, రాముడను పేరుగలవాడును, గొప్ప తేజశ్శాలియు, గొప్పబుద్ధిమంతుడును, గొప్పబలపరాక్రమములుకలవాడును, యుద్ధమునందు శత్రువులకు సూర్యునివలె చూడశక్యముకానివాడును, ఓరిమియందు

---

* 13 వ ప్రకరణము 4 వ అధ్యాయము సనత్కుమారుని విష్ణువర్ణనము చూడుము.

భూమివంటివాడునునై జన్మించును. ధర్మాత్ముఁడగు నారాముఁడు మహాత్ముఁడగు తనతమ్మునితో తనతండ్రియాజ్ఞచే గొప్పయడవియగు దండకారణ్యమున తిరుగగలఁడు. లక్ష్మీదేవి మిక్కిలిసౌందర్యవతియు, సర్వలక్షణములుకలదియునై భూమియందుబుట్టి జనకునకు కూతురై రాముని పెండ్లాడి తనభర్త ననుసరించి తోడునీడగ దండకారణ్యమునకు వెళ్లును. మంచిగుణములు, నడవడిక గలదియు, మంచియిల్లాలును, ధైర్యముతోఁగూడినదియు నగు ఆమె వేయికిరణము లొకచోటకూడినటుల ప్రకాశించుచుండును. అప్పుడు నీవు మహావిష్ణువుయొక్క రూపము చూడగలవు. శాశ్వతుఁడును, నాశరహితుఁడునునగు నా గొప్ప దేవదేవునిసంగతి యంతయు నీకు దెల్పితిని.” ఇట్లు సనత్కుమారుఁడు రావణునితో చెప్ప వాఁడు భగవంతునితో విరోధము కోరుచు ఋషివాక్యములు మాటిమాటికి నాలోచించుచు సంతోషించి యతనితో యుద్ధమునుగోరి సంచరించెను.

రావణుఁడు భూతలమున జరించుచు సూర్యునివలె తేజస్సు కలిగి బ్రహ్మలోకమునుండి వచ్చు నారదుని మేఘమువెనుక చూచెను. వాఁడాతనికి నమస్కరించి సంతోషముతో నిట్లు విన్నవించెను. ‘మీరు బ్రహ్మలోకము మొద లనేకలోకములు చూచుచుండిరి. ఏ లోకమున మనుజులు మిక్కిలిబలముకలవారు? చెప్పుఁడు; వారితో నాయిష్టమువచ్చినట్లు యుద్ధముచేయుటకు కోరుచున్నాను.’ ఇట్లురావణుఁడు విన్నవింప నారదుఁ డామాటలు విని కొంచె మాలోచించి “పాలసముద్రముదగ్గఱనుండు గొప్ప శ్వేతద్వీపమున గొప్పబలముగల మనుష్యులు చంద్రునితోసమానమగు కాంతిగలవారును, గొప్పశరీరముగలవారును, గొప్పవీరత్వముగలవారును, మేఘగంభీర భాషణులును, ధైర్యవంతులును, ఆజాను బాహువులుకలవారునునై యున్నారు.” అని వానికి దెలుప రావణుఁడు ‘అట్టిబలు లాద్వీపమున నెట్లుజన్మించి

రనియు, వారి కా ద్వీపములో నివాస మెట్లుదొరకెననియు వీరు జగత్తునంతయు జూచితిరిగాన; నంతయు తనకు నిజమైనసంగతులు చెప్పుడ'నియు నాఋషిని కోరెను. ఇట్లు రావణుడు కోర ఋషి వాని కిట్లు జవాబు చెప్పెను. "నారాయణునియందు నెల్లప్పుడు మనస్సు గలిగి మఱిదేనియందును మనస్సులేకయుండువారును, బ్రాహ్మణుల యందు భక్తికలవారును, వారిపూజయం దాసక్తికలవారును, భగవంతునియందు నేకాంతభావము పొందినవారును, నారాయణుని యందే చిత్తముకలిగి వానియందే తమప్రాణము లుంచువారును నై పుణ్యకర్మలు చేసినవారగుటచే వారు శ్వేతద్వీపమున వసింతురు. విష్ణువును కోదండమును సజ్జుచేసి యుద్ధమున నెవరిని చంపునో వారు అక్కడ నివసింతురు. యజ్ఞఫలముచేగాని, తపస్సులచేగాని, నియమములచేగాని, గొప్పదానఫలముచేగాని, యా లోకము పొందవీలు లేదు." నారదుని యీ మాటలు రావణుడు విని నవ్వి వానితో యుద్ధముచేసెదనని చాలసేపాలోచించి యతనివద్ద సెలవుపుచ్చుకొని శ్వేతద్వీపమునకు బయలుదేఱెను. ఆఋషికూడ చాలసేపాలోచించి యచ్చటజరుగునది చూచుటకు సంతోషముతో నచటికి పోయెను. రావణుడు పదిదిక్కుల సింహనాదముచేయుచు దేవతలకైనను చేర వీలుకాని శ్వేతద్వీపమునకు తనమంత్రులతో వెళ్లెను. వానిపుష్పక 'మా శ్వేతద్వీపముయొక్క తేజస్సుచే నిలువలేకపోయెను. చూడనలవి కాని యా ద్వీపమును సమీపించి ప్రయాణముచే నలసటజెందిన వానిమంత్రులు భయముకలవారై 'మాకు స్పృహతప్పుచుండుటచే మేమిచ్చట నిలువలేమనియు, యుద్ధమెంతమాత్రముచేయలేమనియు వానితోజెప్పి వారు పాఱిపోయిరి. రావణుడు వారిని, విమానమును విడిచి, గొప్పభయంకరమగురూపమును దాల్చి శ్వేతద్వీపమును ప్రవేశించెను. వెంటనే అక్కడ స్త్రీలు వానిని జూచిరి. వారిలో

నొకతె నవ్వి వానిని చేతితో నెత్తుకొని 'నీ వేలవచ్చితివి? నీ వెవ్వడవు? నీ వెవనిపుత్రుడవు? నిన్నెవరు పంపించిరి? చెప్పు'మని వానినడిగెను. దానికి వాడు కోపించి 'విశ్రవసుని పుత్రుడను; రాక్షసరాజును; రావణుడను; నేను యుద్ధమునకు వచ్చితి'నని పలికెను. దానికి స్త్రీలందఱు నవ్విరి. వారిలోనొకతె కోపముతో రావణుని క్రీడగ పిల్లనుపట్టినట్టుపట్టి త్రిప్పి వారలమధ్య పడవేసి మఱియొకతెను బిలిచి 'పదిముగములు, ఇరువదిభుజములు, నల్లనిపర్వతమువలెనుండు శరీరముగలయీ పురుగును చూడు' మనెను. వారొకరిచేతినుండి మఱియొకరిచేతికి రావణుని త్రిప్ప వాడు శ్రమనొందెను. అందుచే వాడు కోపగించి యొక స్త్రీ చేతిని కఱువ నామె యాబాధచే తనచేతిని విదలింప వాడుక్రిందపడెను. మఱియొకతె వానినిబట్టి యాకాశమున కెగిరెను. వాడు కోపముతో నామెనుగూడ గోళ్ళతో జీర నామె వానిని విసరివైచెను. రావణుడు భయమును జెంది పాలసముద్రము మధ్యను బడెను. ఇదంతయు నారదుడు చూచి యాశ్చర్యమును బొంది నవ్వి నాట్యముచేసెను. అక్కడినుండి రావణుడు దక్షిణతీరముచేరి 'నేను జయించినలోకములలో నెచ్చటను నాకిట్టిభయము లేకపోయెను. జన్మచే స్వల్పబలముగల స్త్రీలవిరోధమున నవమానము బొందితిని. ఈ ద్వీపముననుండు మనుజులు గొప్పకాంతిగలిగి స్త్రీరూపమును ధరించినారు. నారదుడు వీరితోనే యుద్ధముచేయవలెనని నాతో చెప్పెను' అని రావణుడాలోచించెను.

తర్వాత రావణుడా స్త్రీలుండుస్థలము తెలిసికొనుటకు తిరుగుచు యోగశ్రేష్ఠుడును, తపస్సుచే వెలుగువాడును, గుహాలో నివాసముగలవాడును, కూర్చొనియున్నవాడు నగు సనత్కుమారునకు నమస్కరించి సిగ్గుపడి యిట్లు మనవిచేసెను. 'ఈ శ్వేతద్వీపమెమహాత్మునిచే గల్పింపబడినది? ఇక్కడెవరు నివసించెదరు? మీరు

కొంచెము సమాధిలో ధ్యానించి యంతయు నాకు తెలియబఱుపుడు. మీరు సర్వజ్ఞులని వినియుంటిని.' ఇట్లు రావణుడు పలుక ఋషి వానిమనస్సులోగలదానిని కనిపెట్టి పెద్దనవ్వు నవ్వుచు విష్ణుమాహాత్మ్యమును *తెలుపుచు 'నాతడు పీల్చినగాలిచే పుట్టినస్త్రీలు నిన్ను జయించి గొప్పవేగముతో నిన్ను సముద్రములో పడవైచిరని తెలిపెను. ఇంకను నతడు విష్ణు మాహాత్మ్యమును వర్ణించెను. ఇట్లు సనత్కుమారుడు దెలుప రావణు డతని నిట్లు ప్రశ్నించెను. 'నా కాతడెట్లు కనపడును? ఎట్లు వినబడును? ఆతడెట్లు క్రీడించును? లోకమున నాతనిజూడ నెట్లు శక్యమగును? నే నెంతకాలము తపస్సుచేసి యా లోకము ప్రవేశింపగలను?' ఇట్లు రావణుడు ప్రశ్నింప వానికి ఋషి విష్ణుమహాత్మ్య మింకను చెప్పుచు నిట్లు సెలవిచ్చెను. "భగవంతుని యందే మనస్సుగలిగి శుచులై వానియందే తమప్రాణముల నిడుచు నుండువారు తమపాపములు నశించుటచే శ్వేతద్వీపమును ప్రవేశింపగలరు. అట్టిపురుషోత్తములు కోరికలు లేక క్రోధమును పోగొట్టుకొని యజ్ఞానమును నశింపజేసి యాలోకమున దేవరూపులై నిలుతురు. వైవస్వతమనువు 28వ మహాయుగమున (కృష్ణావతారమున) నీవు వైష్ణవరూపమునుదాల్చి యా లోకమున ప్రవేశింపగలవు. నేను మఱిచెప్ప వీలులేదు. లేచి వెళ్లుము. నీకు శుభమగును. నీవు కోరినగతిని బొందెదవు." ఇట్లు సనత్కుమారుడు సెలవీయ ఋషి మాటలకు రావణు డట్లేయని పలికి యాతనికి నమస్కరించి పూజించి తనసైన్యముతో లంకకు పోయెను.

నారదు డంతయు చూచి సంతోషించి తొందరగ మేరుపర్వతమునకు బోయి బ్రహ్మసభకు వెళ్ళి చేతులుజోడించి బ్రహ్మకు

---

*13వ ప్రకరణము నాల్గవ అధ్యాయము సనత్కుమారుని విష్ణువర్ణనమును చూడుము.

నమస్కరించి జరిగినదంతయు దేవతలకు, బ్రహ్మకును తెలియ జేసెను. బ్రహ్మ నారదుని కౌగలించుకొని యిట్లు పలికెను. "ఈ రాక్షసుడు పూర్వము హిరణ్యకశిపుడై, మహాబలుడై తాను పొందిన వరములచే నేయాయుధములచేతను జంపవీలులేనివాడుగ నుండెను. వాడొకానొకసమయమున గర్వముతో విష్ణువును తనసభలోనిందింప నరసింహశరీరు డగుహరి యుద్ధమున వానినిబట్టి తనగోళ్ళచే వానిశరీరము జీరుచుండ, రక్తము వానికంటికి దగుల నది దివ్యనేత్రమయ్యెను. దానిచే నతడు తనకు ముందురాబోవు రాక్షసజన్మమున తాను మనుష్యునిచే నంతమునొందుట చూచెను. ఆ రాక్షసుడు హరి తొడలలోనుండి తనహృదయము చీల్పబడ దీనుడై మెల్లగ చేతులు జోడించి యిట్లు విన్నవించెను. 'పుటముబెట్టిన బంగారురంగుగల జుట్టుకొసలుకలవాడా! అగ్నిలోచనా! వజ్రాయుధమువలెనుండు గోళ్లుకలవాడా! దివ్యసింహా! విష్ణువా! నీకు నమస్కారము. నన్ను రక్షింపుము. నేను రాక్షసుడ (రావణుడ)నై యున్నప్పుడును, మనుష్యుడ (శిశుపాలుడ)నై యున్నప్పుడును నీచేతిలో మరణము నొంది నీలోకమును బొందునటుల ననుగ్రహింపుము.' ఇట్లు హిరణ్యకశిపుడు వేడ 'అట్లేయగుగాక' యని నరసింహదేవుడు రాక్షసునితో జెప్పి హంసలు మోయునదియు, చిరుగంటలుగలదియు నగు విమానముపై వెళ్ళెను. ఆ హిరణ్యకశిపుడే దశాననుడై జన్మించి రాక్షసకార్యములచే మనస్సులో నాభావమే యెప్పుడు కలిగియుండెను. వాడు మూడవజన్మమున (శిశుపాలుడై) మనుష్యరూపము నెత్తి లోకముల బాధించి హరిచే చంపబడి శ్వేతద్వీపము ప్రవేశించును." ఇట్లు బ్రహ్మపలికి నారదునికి దేవతలకునుగూడ సెలవిచ్చి తన గృహమునకు బోయెను. నారదు డీ కథను ప్రచురించెను. రావణు డీ సంగతులను దేవఋషులవలన విని రామునివలన మరణమునకై సీత నెత్తుకొనిపోవుటకు కాలము నిరీక్షించుచుండెను.

---

## ౨౨వ అధ్యాయము.

## రావణుడు మహదైశ్వర్యముల ననుభవించుట.



లంకాపట్నము త్రికూటపర్వతశిఖరమున నిడువున నంటి యుండెను. అది 30 యోజనములు వెడల్పును, 100 యోజనములు పొడుగును గలిగి యింద్రునియమరావతికంటెను, కుబేరుని యలకాపట్నముకంటెను సొగసైనదిగ నుండెను.

ఆపట్టణమునకుచుట్టు బలమగు తెల్లనికోటగోడలును, బంగారపుప్రాకారములును, మంచియగడ్తలును నుండెను. ప్రాకారములలో నున్న వెలుపలిద్వారములు సువర్ణమయములుగను, వైడూర్యమయములుగను నుండెను. ద్వారములుండుచోట నెత్తైనగోపురములుండెను. అనేకయేనుగులు, గుఱ్ఱములు మొదలగువానితో నాపట్టణము నిండియుండెను. అది తూర్యవాద్యములధ్వని కలిగియుండెను. అక్కడ నన్ని ఋతువుల ఫలించుచెట్లును, పువ్వులతోనిండియుండుచెట్లును నుండెను. చెట్లపై ననేకరకములపక్షులు కూయుచుండెను. అనేక వనములును, నుద్యానవనములును నుండెను. సరస్సులలోను, బావులలోను, హంసలు, చక్రవాకములు మొదలగు పక్షులు విహరించుచుండెను. ఆసరస్సులు పద్మములతోను, నల్లకలువలతోను నిండియుండెను. ఆపట్నమున వీథులు బాగుగ నేర్పఱుపబడి విశాలముగ నుండెను. వానిలో ఘోరరాక్షసు లెల్లపుడు తిరుగుచు, పెద్దకేకలు వేయుచు, శూలములను, పట్టసములను బట్టి దానిని రక్షించుచుండిరి. కోటగోడలపై చిన్నగృహము లేర్పఱుపబడెను. అవి యాయుధములతో నిండియుండెను. ఆపట్టణమున ననేకయంత్రగృహములును, నూఱుమందినిజంపు యంత్రముసలములును (శతఘ్నులు) నుండెను,

రావణుని మూలబలము వానినగరముచుట్టు నుండెను. ఆపట్నమున రాక్షసులు హోమముజేయుటకై జుట్టుముడివేసికొనినవారు కొందఱును, గొఱుగబడిన తలలుగలవారు కొందఱును, వృషభచర్మములు కట్టుకొనినవారు కొందఱును, దర్భలను చేతధరించినవారు కొందఱును నై అగ్నిలో హోమముజేయుచుండిరి. కొందఱు వికృతరూపములు కలిగియుండిరి. కొందఱు కూటములు, ముద్గరములు, దండములు మొదలగు నాయుధములుపట్టియుండిరి. కొందఱు ధనస్సులను, కొందఱు ఖడ్గములను, కొందఱు శతఘ్నులను, కొందఱు ముసలములను కొందఱు పరిఘలను, కొందఱు శూలములను, కొందఱు వజ్రములను బట్టియుండిరి. రాక్షసు లనేకచిత్రములగు కవచములను తొడిగియుండిరి. కొందఱు జెండాలు పట్టియుండిరి, కొందఱు శక్తులను, చెట్లను, పట్టసములను పట్టియుండిరి. కొందఱు పిడుగులను, కొంద ఱురిపోయు త్రాళ్ళను పట్టియుండిరి. రావణునిసైనికులు మంచిబుద్ధిమంతులును, బాగుగమాటలాడువారును, లోకములో ప్రసిద్ధిగలవారును, మంచి నామములు గలవారును, నానారకములవారును, మంచిరూపములు గలవారును, తమగుణముల ననుసరించివ్యవహరించువారును, వికృత రూపములు గలవారునై యుండిరి.

ఆపట్టణమున పెద్దభవంతులు, మేడలు మిక్కిలి పెద్దవిగను, తెల్లవిగను నుండెను. వానికి బంగారుతలుపులును, వెండిబంగారము లతోచేయబడిన స్తంభములును, బంగారుతో నలంకరింపబడిన చిన్న రంధ్రములుగల కిటికీలును నుండెను. ఆపట్టణమున భూతలముపైని రాయికిబదులుగ వజ్రములు, స్ఫటికములు, ముత్యములు, మణులు మొదలగునవి చెక్కబడియుండెను. వేదికలు వైడూర్యములచే నిర్మింప బడెను. వైడూర్యములతో నమర్పబడిన మెట్లుగలమేడలు 7-8 అంత స్తులను గలిగియుండెను. వానిపైభాగములు స్ఫటికములతోను, బంగా

రముతోను, ముత్యములతోను, చెక్కబడియుండెను. వానిలో గోరువంకలు మొదలగుపక్షులు కలకలముచేయుచుండెను. అచట నెల్లపుడు వాద్యఘోషములు వినబడుచుండెను. ఇండ్లప్రాకారములు గూడ బంగారుతో గట్టబడియుండెను. ఇండ్లలోనుండు స్త్రీలకు మంచి మంచి యాభరణములుండెను. మంచివిలువగలబట్టలతోను, రత్నములతోను నిండ్లునిండియుండెను. ఇండ్లలో మంచిదీపములు వెలుగుచుండెను. వీనిలో ప్రహస్తాదులు నివసించియుండిరి. సామగ్రిలుగల యిండ్లనేకములుండెను. లంకలో రాక్షసులు 32 కోట్లుండిరి. ప్రజల కలకలము సముద్రవాయు ఘోషములవలె వినబడుచుండెను. కుబేరుడు యముడు వరుణుడు మొదలగువారి యైశ్వర్యములు రాక్షసుల గృహములందుండెను.

రావణునినగరు త్రికూటపర్వత మధ్యశిఖరముననుండెను. అది యన్నిసుగుణములుగలిగి, మంచిపరిఘలు మొదలగునాయుధములను బట్టిన రాక్షసులచే రక్షింపబడియుండెను. ఆనగరునకు పెద్దబంగారు ప్రాకారములును, వానిలో సువర్ణమయములగు బహిర్ద్వారములును నుండెను. ఇంకను నానగరులో పెద్దమేడలును, చిన్నమేడలును నుండెను. అందు అన్నిరకములగు పక్షులు కూయుచుండెను. నగరుయొక్క వెలుపలిద్వార ప్రాకారము మంచిమెట్లుగలిగి మంచి వాద్యములతో మాఱుమోగుచుండెను. ఆనగరులో మంచిబావులును, చెఱువులును గూడనుండెను. మంచిరంగులుగల యనేకగుఱ్ఱములు, మంచిబలము గలయేనుగులు, రథములు, ననేకవిధములగు సవారీలు మొదలగు వానితో నానగరు నిండియుండెను. రాక్షసు లాయుధములబట్టి తిరుగుచు దానినిరక్షించుచుండిరి. ఘోరరూపములుగలకొందఱు శూరులు ఏనుగులనెక్కియు, కొందఱు గుఱ్ఱములనెక్కియు, కొందఱు రథములనెక్కియు, కొందఱు సింహము, పులి మొదలగుక్రూరజంతువుల

చర్మములనుధరించియు, కొందఱు దంతము, వెండి, బంగారము మొదలగువానితోచేయబడిన కవచములను తొడుగుకొనియు తిరుగుచు నాపట్టణమును రక్షించుచుండిరి. అగ్నిహోత్రము లెల్లపుడును రాక్షసులచే పూజింపబడుచుండెను. ఆనగరున సవారీలును, చిత్రములగు పొదరిండ్లును, చిత్రముగకట్టబడిన యిండ్లును, వినోదములకై కట్టబడిన యిండ్లును, క్రీడలకై కట్టలతో పర్వతమువలెను, నెమళ్ళవలెను కట్టబడినయిండ్లును నుండెను. మేడలమీదియిండ్లు ముఖ్యములగు నాయుధములతో నింపబడియుండెను.

రావణుడునివసించు భవనము నాలుగుక్రోసులు పొడుగును, రెండుక్రోసులు వెడల్పును గలదైయుండెను. దానిని పెద్దయేనుగుల నెక్కినవారును,నాయుధములపట్టినవారును, రాక్షసస్త్రీలును రక్షించుచుండిరి. దానియందు దిక్పాలురభవనములనుండులక్ష్మియెల్లపుడును నిలిచియుండెను. ఆభవనము బంగారుద్వారములతోను, బంగారము, స్ఫటికములు, వెండి, వజ్రవైడూర్యములు మొదలగుమణులతోను నిర్మింపబడి,కాంతికలిగి,మనోహరములగు స్తంభములుగలిగ యుండెను ఆ స్తంభములుకొన్ని మిక్కిలి నిడుపుగను, కొన్ని ప్రక్కకును నుండెను. ఆభవనమునకు కిటికీలు దంతములతోను, వెండితోను నిర్మింపబడి బంగారము, వైడూర్యములు చెక్కిన రంధ్రములుకలిగి చూచుటకింపుగానుండెను. ఆభవనమున ననేకరత్నములును, బంగారుసాసనములున్ను, మంచములును నుండెను. అందు మేడలకు మణులతో చెక్కబడినమెట్లు కట్టబడియుండెను. భవనస్థలభాగమంతయు స్ఫటికములతోను, మధ్యమధ్యను దంతములతోను, ముత్యములతోను, పగడములతోను, వెండి, బంగారములతోను సమర్చబడియుండెను. అచ్చటమదించిన యన్నిరకములపక్షులు కూయుచుండెను. పృథివీలక్షణములగు సముద్రములు, నదులు, మొదలగునవి యోగ్యహామున చెక్కబడి

యుండెను. అక్కడ మంచియగరు, సాంబ్రాణి మొదలగు సుగంధ ద్రవ్యములపరిమళము వ్యాపించియుండెను. బంగారు పాచికలతో ద్యూతక్రీడలు జరుగుచుండెను. మంచిదీపములు వెలుగుచుండెను. మనస్సునకు సంతోషముకలుగునట్లు మంచిపువ్వులు సువాసననిచ్చు చుండెను. రావణునిభవనము స్వర్గమువలెను, ఇంద్రపట్నమువలెను నుండెను. అట్టి భవనమున రావణుడు మండోదరితోను, తాను యుద్ధములో జయించి బలవంతముగ తెచ్చిన రాజ పితృ నాగ రాక్షస దైత్య గంధర్వ దేవ యక్షాదిస్త్రీలతోను నిచ్ఛావిహారముగ విహరించుచుండెను. వారు మంచికులమువారును, మంచిరూపవతులును, మంచియాలోచనపరులును, మంచిప్రవర్తన గలవారును, ననేకవర్ణములుగలవారును, మోహింపతగినవారునునై యుండిరి. ఆరాజభవనములో స్త్రీలకు మంచికంబళములు,పక్కలు గలమంచము లుండెను. రావణునిమంచము వానిమధ్యనుండెను. అది స్ఫటికములతో జేయబడి రత్నములతో చెక్కబడి యింద్రునిమంచమువలె ప్రకాశించెను. దానికోళ్ళు మొదలగునవి దంతములతో జేయబడి బంగారుతోను, వైడూర్యములతోను చెక్కబడియుండెను. ఆమంచముపైని మంచి మంచి విలువగల పక్కలును, చర్మములును పఱుపబడియుండెను. అది యశోకవృక్షముల పూసలదండలచే నలంకరింపబడి సూర్యప్రభ వలె వెలుగుచుండెను. మంచముమీదికి మంచివింజామరలు వీచబడుచుండెను. దాని సమీపమున మంచికాముగలిగి చంద్రునివలె ప్రకాశించు తెల్లనిపెద్దఛత్రముండెను. రావణుని నివాసగృహము మఱి యొకటి *పుష్పకవిమానమునగూడ నుండెను.

రావణుని నగరునకు స్వల్పదూరమున నశోకవనముండెను. దానిలోకొన్ని బంగారుచెట్లును, కొన్ని వెండిచెట్లును, కొన్ని యగ్ని

* పుష్పకవిమానమును గూర్చినవివరములు. 5వ ప్రకరణము ౨వ అధ్యాయము కుబేరుడు చూడుడు.

రంగుగల చెట్లును, కొన్ని నల్లనిరంగుగల చెట్లును, నుండెను. మామిడి, గుగ్గిలము మొదలగు నన్ని విధముల చెట్లును, నన్ని విధములపువ్వులను, ఫలములనునిచ్చు చెట్లును, నన్ని కాలముల ఫలించు చెట్లును నావనమున నుండెను. చెట్లు పక్షులతో నిండియుండెను. ఆవనమున మృగముల నేకములుండెను. కోకిలలు, తుమ్మెదలు ధ్వనిచేయుచుండెను. దానిలోనింకను మణులగనులును, బంగారపుగనులును నుండెను. మణులతో చెక్కబడిన మెట్లుగలిగి మంచినీటితోనిండిన యనేకరకముల మడుగులు, నిడుపగు జలాశయములు నుండెను. ముత్యములు, పగడములు, ఇసుకతిన్నెలు గలప్రదేశములును, స్ఫటికముతో చెక్కబడినతిన్నెలును, నామడుల చుట్టుపచ్చనిచెట్లును నుండెను. ఆమడుగులలోను, జలాశయములలోను పద్మములును, కలువలును విస్తారముగానుండెను. నీటిపక్షులుకలకలము చేయుచుండెను. ఇరుప్రక్కల చెట్లుగలిగి పర్వతమునుండివచ్చుమంచినీరుగల పొడుగగునదులును, ప్రవాహములును, నానిప్రక్క లతలును, కల్పవృక్షములు మొదలగు చెట్లును నుండెను. మఱియు నాతోటలో రాతి కట్టడపునిండ్లును, విశ్వకర్మవలన నిర్మింపబడిన పెద్దమేడలును, చిన్నతోటలును నుండెను. కొన్నివృక్షములక్రింద బంగారువేదికలును, వానిపైని శయనాసనములును, వేదికలపైని మఱల చిన్నచిన్నవేదికలును నుండెను. దానిలోకొన్నిచోట్ల భూసారంగములును, నీటిబుగ్గలును, బంగారుపెద్దచెట్లునునుండెను. చెట్లనుండి మంచితేనె జారుచుండి మంచివాసనలు కొట్టుచుండెను. కొన్నిచోట్ల భూసారంగములలో నిండ్లును, మేడలును నుండెను. ఆవనము మధ్యను బాటలు లెస్సగ నేర్పఱుపబడెను. అది యింద్రుని నందనవనముకంటెను కుబేరునిచైత్రరథముకంటెను మిక్కిలి శోభాయమానముగ నుండెను.

(రావణునిచరిత్ర మిదివఱకు వర్ణింపబడినది. కొన్నియంశము లిదివఱకు స్పష్టముగ వివరింపబడనందున నిక్కడ దెల్పుచుంటిమి.)

అతనిభుజము లింద్రధనస్సువలె పెద్దవిగానుండెను. అతనికి మంచికను బొమలును, మంచిముక్కును, నెఱ్ఱనిముఖమును, వెడల్పగు వక్షము ను, మంచిశరీరమును నుండెను. అతని శరీరమునకు నింద్రుని వజ్రసం బంధమైనవియు, పిడుగు సంబంధమైనవియు, విష్ణుచక్రము సంబంధ మైనవియు, ఐరావతదంతముసంబంధమైనవియునగు దెబ్బలు తగిలి యుండెను. అతడు మంచికిరీటమును, కుండలములను, మంచియలంకార ములను ధరించెను. అతడు గొప్ప తేజస్సుగలవాడై నను ధర్మములనన్ని టిని విడిచి పరస్త్రీలను బలాత్కారముగ తీసికొనివచ్చుటను నవలంబిం చెను. యజ్ఞములను పాడుజేసి యక్కడ సోమపానము జేసెను. బ్రాహ్మ ణులను జంపెను. లంకానగరముండుతి క్కూటపర్వతమున సూర్యచం ద్రులు నిలిచి యితరులను నక్కడకు బోగూడదని చేతులతో నాటం కపఱచుచుండిరి. రావణుడు దుర్మార్గముగ జరించి దయలేక కఠినుడై ప్రజలకు గీడు కలిగించెను.

ఈ క్రింద వివరింపబడిన జంతువులమాంసములను వంటలవాడు బాగుగవండి పెరుగుతోను, ఉప్పుతోను బాగుచేసి బంగారుపళ్లెరము లలో నుంచ వానిని రావణుడు భుజించుచుండెను.

జంతువులవివరము:— లేళ్లు, దున్నలు, అడవిపందులు, సెనుళ్లు, కోళ్లు, మేకలు, ఏదుపందులు, కొన్నిరకములపక్షులు, చకోర పక్షులు, చేపలు మొదలగునవి.

రావణుడును, వానిస్త్రీలునుత్రాగు మద్యవిశేషములు:— సముద్రమథనకాలమందు జనించిన సుర, పంచదారనుండియు, తేనె నుండియు, పూవులనుండియు, ఫలములనుండియు తీయబడిన సారాలు:-

—♦—

## ౨౩ వ అధ్యాయము. రావణునిమంత్రులు; సేనాధిపతులు.

రావణునిమంత్రులు, సేనానాయకులు కొండలవలె పెద్ద శరీరములుకలిగి గొప్పవీరత్వముకలవారై యుండిరి. వారలలో ముఖ్యుడు ప్రహస్తుడు. ఈతడు రావణుని మేనమామ; గొప్పపరాక్రమశాలి; అస్త్రములను బాగుగ నెఱిగినవాడు.

మహోదరుడు దిక్పతులతో సమానమగు వీర్యముకలవాడు; బాలసూర్యునివంటి తేజముగల కండ్లుగలవాడు.

మహాపార్శ్వుడు దిక్పతులతో సమానమగు పరాక్రమము కలవాడు.

అకంపనుడు దేవతలతో యుద్ధమున చలింపనివాడు; గొప్ప పరాక్రమము, తేజము కలవాడు; వీనికన్ని శస్త్రములసంగతి తెలియును.

వజ్రదంష్ట్రుడు గొప్పమాయావి; గొప్పబలముకలవాడు.

మఱియొక యకంపనుడు దిక్పతులతో సమానమగు వీర్యము కలవాడు; గొప్పశరీరముగలవాడు; క్రొత్తగనుదయించిన సూర్యుని వంటి తేజముగల ముఖముకలవాడు.

పిశాచియనురాక్షసుడు శరవేగముకలవాడు.

త్రిశిరుడు మిక్కిలి ప్రతాపవంతుడు; మూడు పెద్దతలలు కలవాడు.

కుంభుడు మేఘమువలెనుండు రూపముకలవాడు. సుందరముగను, విశాలముగను, కఠినముగను నేర్పఱుపబడిన వక్షస్థలము గలవాడు.

నికుంభుడు రాక్షసబలములలో ముఖ్యుడు; గొప్పయద్భుత కర్మలాచరించువాడు.

నరాంతకుడు పర్వతశిఖరములతో యుద్ధముచేయువాడు.

మారీచ శుక సారణులును, ధూమ్రాక్షుడును యుద్ధమున గొప్పప్రవీణులు.

దేవాంతక నరాంతకులును, అతికాయుడును, మఱియొక త్రిశిరుడును రావణునిపుత్రులు; ఇంద్రునితోసమానమగు తేజము కలవారు; అంతరిక్షమున సంచరింప శక్తికలవారు; గొప్పమాయలు తెలిసినవారు; యుద్ధములో జయింపశక్యముగానివారు; మంచిబలము, వీర్యము, కీర్తులు కలవారు; దేవ గంధర్వ కిన్నర నాగులతో యుద్ధమున నపజయమొందనివారు; మంచిశాస్త్రములు, విద్యలు తెలిసినవారు; యుద్ధములో నేర్పరులు; వరములు పొందినవారు; సూర్యవర్చస్సుగలవారు.

వీరిలో అతికాయుడు రావణునికి ధాన్యమాలియందు జన్మించినవాడు; గొప్పపర్వతమువలె ఎత్తుగనుండువాడు; నీలమేఘమువంటి రంగుగలయతివీరుడు; గొప్పచాపమునుబట్టిన యతిరథుడు. ఇతడు తనమంత్రితోసమానమగువీర్యము కలిగి పెద్దలను సేవించినవాడు; అన్నియస్త్రములను బాగుగనెఱిగినవాడు; నేర్చినదంతయు జ్ఞాపకముంచుకొనినవాడు. ఇతడు గుఱ్ఱములను, ఏనుగులను ఎక్కి యుద్ధముచేయుటలోను, కత్తితోను, ధనస్సుతోను యుద్ధచేయుటలోను గొప్పవాడు. సామ దాన భేదముల నెఱిగినవాడు; మంచియాలోచనగలవాడు. ఇతనిబాహుబలముచే లంకకు శత్రువులవలన నేమియు భయములేకుండెను. ఇతడు బ్రహ్మనుగూర్చి తపస్సుచేయ నతడు ప్రత్యక్షమై యస్త్రములనితనికిచ్చెను. వానివలన శత్రువులు జయింపబడిరి. దేవాసురులవలన మరణములేకుండ బ్రహ్మ వీనికి వరమిచ్చెను. ఇంకను తేజోమయమగు నొక కవచమును, సూర్యతేజోమయమగురథమును బ్రహ్మ యిచ్చెను. వీనివలన వందలకొలది

దేవదానవులును, యక్షులును జయింపబడిరి. రాక్షసులు రక్షింపబడిరి. ఇంద్రుడు వీనిపై తనవజ్రాయుధము విడువ దానిబలమితడు తన బాణములచే వ్యర్థము చేసెను. వరుణునిపాశమునుకూడ అట్లే నిరర్థకము చేసెను. వీడు బ్రహ్మాస్త్రముచేతప్ప నితరయస్త్రములచే చావకుండుటకు వర మొందెను.

---

## ౨౮ వ అధ్యాయము.

## కుంభకర్ణుడు లంకలో సుఖముగ నిద్రించుట.



కుంభకర్ణుడు 600ధనస్సులయెత్తును, 100ధనస్సులవెడల్పును నైన శరీరము కలవాడు. (ధనస్సు=నాల్గుమూరలయెత్తు). వీనితల రాక్షసులందరిలోను పెద్దదిగ పర్వతమువలె నుండెను. వీనికి పెద్దచెవులుండుటచే నీపేరు వచ్చినది. ఇతని ముక్కు చెరమలు మిక్కిలి పెద్దవై భయంకరముగనుండెను. ఇతడు బుసకొట్టినపామువలె ఊపిరితీయుచుండెను. ఇతనిముఖము పాతాళమువలె వెడల్పుగ నుండెను. ఇతని బాహువులు పామువడగలవలె వెడల్పులై, కొండశిఖరములవలె కఠినములైయుండెను. వానికండ్లు బండిచక్రమువలెనుండి తేజోయుక్తములైయుండెను. వాడు శరీరమున నన్నియలంకారములను, తలను కిరీటమును గలిగియుండెను. ఇతడు గొప్పబలముకలవాడు.

ఇతనిభోజనమునకు పెద్దప్రోగులుగ లేడి, యెనుబోతు, అడవిపంది మొదలగువానిమాంసములును, పెద్దయన్నపురాసులును, కడవలతో రక్తమును, కడవలతో ననేకవిధములగు మద్యములును సిద్ధము చేయబడియుండెను. ఇతడు తన దేహమును మంచిగంధములతోను, మాల్యములతోను అలంకరించుకొనుచుండెను.

ఇతడు నిద్రాపరవశుడై యుండుటచే లేపుటకు మిక్కిలి కష్టముగనుండెను. రావణుడు వీనిని లేపుట కొకసమయమున ననేకులను నియోగింప వారు తమపూర్తిబలముతో భేరీలు మొదలగువానిని వాయించి, శంఖములు పూరించి అందఱు కలిసి గొప్పధ్వనిచేసిరి. వారు వానిని కదుపుచు చేతులతో కొట్టిరి. పెద్దగదలు, శతఘ్నులు మొదలగు నాయుధములతో వానిని మొత్తిరి. గుఱ్ఱములను, ఏనుగులను, జంతువులను కొరడాలతో కొట్టుచు వానిపైని శీఘ్రముగ నడిపించిరి. వా రాతని జుట్టును తెంపిరి. కొందఱు చెవులు కొఱికిరి. కొందఱు చెవులలో కడవలకొలది నీళ్ళుపోసిరి. వేయియేనుగుల నొకసారి అతనిశరీరమున పరుగెత్తింప వానికి తెలివివచ్చెను. వారతనిని పర్వతశిఖరములతోను, పెద్దచెట్లతోను కొట్ట నతడు మెల్లగ లేచెను.

—♦—

## ౨౫వ అధ్యాయము. రాక్షసస్త్రీల వికృతరూపములు.



కొందఱు రాక్షసస్త్రీలకొక కన్నే యుండును. కొందఱికొక చెవియే యుండును. కొందఱికి చెవులులేకుండును. కొందఱికి చెవులు పెద్దవై తలను మించియుండును. కొందఱికి చెవులు కొయ్యలవలె నుండును. కొందఱిచెవులు గాడిద, గుఱ్ఱము, ఆవు, ఏనుగు మొదలగువానిచెవులవలె నుండును. కొందఱి చెవులు పెద్దవై నేలపడుచుండును. కొందఱికి కడుపులును, కొందఱికి స్తనములును నిడుపుగ నుండును. కొందఱినోరు క్రిందికినుండును. కొందఱి యవయవములు ఎక్కువతక్కువగ నుండును. కొందఱు మిక్కిలి పొట్టివారు. కొందఱు మఱుగుజ్జువారు. కొందఱితలలు పెద్దవిగనుండును. కొందఱిమెడ సన్ననై శరీరమంత పొడుగుగనుండును. కొందఱికి కొంచెము జుట్టుండును. కొందఱికి జుట్టు లేకయుండును. కొందఱిజుట్టు తెల్లగనుండును.

కొందఱికి రోమములవలె జుట్టుండును. కొందఱి చెవులు, నుదురు పెద్దవిగానుండును. కొందఱిపెదవులు పెద్దవిగానుండును. కొందఱికి గడ్డములందు పెదవులుండును. కొందఱికి పొడుగైనముఖములుండును. కొందఱికాలిమణుకులు పెద్దవిగనుండును. కొందఱికాలిపిక్కలు పెద్దవిగానుండును. కొందఱు భయంకరమైనరూపముకలవారు. కొందఱు తెల్లనినేత్రములు కలవారు. కొందఱు వికారపుముఖముకలవారు. కొందఱు గోరోజనమువంటి వర్ణమును, కొందఱు నలుపువర్ణమును కలవారు. కొందఱు పంది, అడవిపంది, లేడి, పులి, ఆవు, ఎనుబోతు, నక్క, ఏనుగు, మేక, సింహము మొదలగువాని ముఖములు కలవారు. కొందఱితలలు శరీరమధ్యమున నుండును. కొందఱి కొకే చెయ్యికలదు. కొందఱి కొకేపాదముకలదు. కొందఱిముక్కులు తలమీదిభాగమున నుండును. కొందఱికి ముక్కులు లేవు. కొందఱి ముక్కులు నుదుటను,కొందఱిముక్కులు మిక్కిలిపొడుగుగను,కొందఱి ముక్కులు వంకరగ నుండును. వికృతములగు ముక్కులు కొందఱి కుండును. కొందఱిముక్కులు ఏనుగుముక్కులవలె నుండును. కొందఱికి చేతులయందు పాదములుండును. కొందఱికి పెద్దపాదములుండును. కొందఱికి పాదము లావుపాదములవలె నుండును. కొందఱి పాదములందు తలలుండును. కొందఱికి పాదములు లేకుండును. కొందఱికి ముఖము, నేత్రములు మిక్కిలి పెద్దవిగనుండును. కొందఱికి పెద్దనాలుకలు, పెద్దగోళ్ళు ఉండును. కొందఱికి నాలుకలు లేవు. కొందఱినోళ్లు గుఱ్ఱము, ఒంటె, గాడిద మొదలగువాని నోళ్ళవలె నుండును. కొందఱిపాదములు ఏనుగు, ఒంటె, గుఱ్ఱము మొదలగు వానిపాదములవలె నుండును.



ఓమ్

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# విశోధితరామాయణము.



## 6 వ ప్రకరణము—సీతారాములవంశములు.

### ౧-వ అధ్యాయము—విశ్వామిత్రుడు, అతనిపూర్వులు.

బ్రహ్మపుత్రుడును, గొప్పధర్మవ్రతములు గలవాడును నగు * కుశుడను రాజొకడుండెను. అతడు విదర్భరాజపుత్రిక నొకతెను వివాహమాడెను. ఈక్రిందివంశవృక్షప్రకార మాతనివంశము వృద్ధి నొందెను.




* తెలుగుభాగవతము 9వ స్కంధము, 422 వచనముప్రకార మితడు అజకుని పుత్రుడు.

కుశుడు మగధదేశమును బాలించి మిక్కిలి గుణవంతులగు తనపుత్రులకు దానినిబంచి యీయ వారికిగ్రిందిపట్టణముల నేర్పఱచుకొని యక్కడ రాజ్యముచేయుచుండిరి.

కుశాంబుడు—కౌశాంబీనగరము.

కుశనాభుడు—మహోదయము.

అధూర్తరజసుడు—ధర్మారణ్యము.

వసువు ——గిరివ్రజము.

కుశనాభుడు ఘృతాచియను నప్సరసను వివాహమాడి యామెయందు సౌందర్యవతులగు నూర్గురు కూతులను గనెను. యౌవనవతులగు వారు అలంకరించుకొని తమయుద్యానవనమున కేగి ఆడుచు, పాడుచు మిక్కిలి సంతోషముతో వీణలను వాయించుచుండ వాయుదేవుడు వారినిజూచి మోహించి వారితో నిట్లు పలికెను. 'మిమ్ములను నేను భార్యలుగ గోరుచున్నాను. మీరు మనుష్యత్వము విడిచి దీర్ఘాయుష్మతు లగుడు. చంచలమగు యౌవనము స్థిరముగాదు. ముఖ్యముగ మనుష్యులం దది స్థిరముకాదు. మీరు నశింపని యౌవనమును, నమరత్వమును బొందుడు.' ఇట్లు వాయుదేవుడు సెలవీయ ఆకన్యలామాటలను విని యాతని నిట్లుపహసించిరి. "నీవు సర్వభూతములందు జరించువాడవు. మేము నీప్రభావము దెలిసినవారము. మమ్మ నీవేల యవమానించెదవు? కుశనాభుని పుత్రికలమగు మేము నిన్ను, నింద్రునిగూడ మీస్థానములనుండి పెకలింప సమర్థులము. మేము మానియమములచే మమ్ములను రక్షించుకొనుచున్నాము. దుర్బుద్ధీ! కాలముసమీపింపని పని నీవు చేయకుము. సత్యవాదియగు మాతండ్రిని నవమానింపకుము. మేము ధర్మమగు స్వయంవరమున మావరుని గ్రహించెదము. మాతండ్రియే మాప్రభువును, దైవము నైయున్నాడు. ధర్మముగ నాతడు మమ్మెవని

కిచ్చునో వానిని మేము వరించెదము.” ఇట్లాకన్యలు పలుక, వాయుదేవుడు కోపించి వారిశరీరముల బ్రవేశించి వారిని కుబ్జలుగ జేయ, వారు తమయింటికి జేరి వికలమనస్సులతో లజ్జనుబొంది దీనులై కన్నీరుతో భూమిపైబడిరి. కుశనాభుడు వారలనుజూచి మనస్సు బాధనొంద ‘పుత్రికలారా! మీ రేదేవుని నవమానించిరి? ఎందుకు కుబ్జలై’ రని యడుగ వారు వానిని చూచుచు మాఱుపలుకరైరి. ఆతడు విచారమునొంది సమాధిలో నుండెను. తర్వాత ఆనూర్వురు కన్యలు కుశనాభునిపాదములకు తమశిరములతో నమస్కరించి జరిగినదంతయు దెలిపిరి. రాజు వారిమాటలు విని వారితో నిట్లు పలికెను. ‘ఓరిమిగలవారుచూపదగినగుణమును మీరు చూపిరి. మీరందఱుగూడి నా కులమునకు దగినట్లు వర్తించిరి. స్త్రీపురుషులకు నోరిమియే యలంకారము. ఓర్పు మీయందఱియం దుంకినట్లువలె నితరులందును ముఖ్యముగ దేవతలందును నుండుటకష్టము. దానివలన దాన యజ్ఞ సత్య ధర్మ కీర్తులవలన కలుగుఫలములు కలుగును. లోకమందంతట నట్టియోర్పుకలదు.’ ఇట్లు రాజు వారితో పలికి తర్వాత తనమంత్రులతో తనకూతులను తగినవరునకిచ్చి వివాహము చేయుట కాలోచించుచుండెను. అట్టికాలమున ‘చూళి’ యనెడు మునీశ్వరు డూర్ధ్వరేతస్కుడై మంచియాచారముగలిగి తపస్సు చేయుచుండెను. వానియొద్దకు ఊర్మిళపుత్రికయగు ‘సోమద’యను నొకగంధర్వస్త్రీ వెళ్ళి వానికి నుపచారము జేయుచుండెను. ఆమె శుశ్రూషకు ముని సంతోషించి యామెతో ‘నీకోరికను తెలుపు’ మనెను. ఆమె యాఋషితో ‘మీరు బ్రహ్మవర్చస్సుతో గూడియుండిరి. నాభర్త నశింప నేను తిరుగ వివాహమాడలేదు. కాన మీరు తపోబలయోగమున నాకొకపుత్రుని నీయుగోరుచున్నా’నని మనవిచేసెను. దాని కామహాఋషి గొప్పదయగలవాడై యామెకు తనమానస

పుత్రుడును, మిక్కిలి యుత్తముడునగు 'బ్రహ్మదత్తు'డను వాని నిచ్చెను. అతడు 'కాంపిల్య'మను నగరమున రాజ్యముచేయుచుండెను. కుశనాభుడు తనమంత్రులతో నాలోచించి తననూర్గురుకుమార్తెల నాబ్రహ్మదత్తునకిచ్చి సంతోషముతో వివాహముజేసెను. పాణిగ్రహణము జరుగ నాస్త్రీలు తమకుబ్జరూపముల విడిచి లక్ష్మీవతులుగ ప్రకాశించిరి. వాయు వాస్త్రీలశరీరమును విడువ కుశనాభు డాస్త్రీలనుజూచి సంతోషించి వారిని వారిభర్తతోగూడ కాంపిల్యపట్టణమునకు బంప సోమద తనకుమారునికి తగినభార్యలు దొరికిరని సంతోషించి కోడళ్ళను ముద్దుపెట్టుకొనెను.

కుశనాభుడు పురుషసంతానములేక పుత్రకామేష్టిని జేసెను. దానికి వానితండ్రికుశుడు వచ్చి వానితో 'నీకు నీతో సమానుడును, ధార్మికుడునునగు 'గాధి' యనువాడు జన్మింపగలడు. వానివలన లోకములో శాశ్వతమగు కీర్తిబొందగల'వని చెప్పి బ్రహ్మలోకమునకు జనెను. కొంతకాలమునకు కుశనాభునకు గాధి జన్మించెను. ఆగాధికి 'సత్యవతి'యనుకూతురును, 'విశ్వామిత్రు'డను పుత్రుడును గలిగిరి. గాధి యామెను ఋచీకునకిచ్చి వివాహముజేసెను. ఆమె తనభర్తతో స్వర్గమునకు బోయి, లోకోపకారమునకై హిమవత్పర్వతమునుండి 'కౌశికి'యనునదియై పుణ్యోదకములు కలిగి ప్రవహించి లోకపావని యయ్యెను. ఆకుశకునివంశస్థులే నరోత్తములు.

విశ్వామిత్రు డన్నివిద్యలలో పరిపూర్ణుడై, ప్రజలహితమందాసక్తి గలిగి గొప్పతేజోవంతుడై యనేకవేలసంవత్సరములు ధర్మముగ రాజ్యముచేసెను. కొంతకాలమునకు నతడొకయక్షౌహిణీసేనను తోడ్కొని భూమియందంతటను దిరిగి యనేకనగరములను, రాష్ట్రములను, నదులను, కొండలను, నాశ్రమములను దాటి చివరకు వసిష్ఠాశ్రమము జేరెను. అది యనేకవిధములైన చెట్లను,

మృగములను గలిగినదియు, సిద్ధచారణులచేతను, బ్రాహ్మణగణముల చేతను, దేవఋషులచేతను సేవింపబడునదియు, దేవదానవ గంధర్వ కిన్నరులచే శోభించునదియు, మంచిలేళ్లను కలిగినదియు, బ్రహ్మర్షులతో నిండినదియు, తపస్సుచేసి సిద్ధిబొందిన యగ్నితేజులగు మహాత్ములచేతను, నీటిని, వాయువును, ఎండినయాకులను దిని జీవించువారిచేతను, ఫల మూలములను దిని మనోనిగ్రహముగలిగి కోపములేకయుండు నింద్రియజయముగలవారిచేతను, జపహోమము లందే మనస్సుగల వాలఖిల్యఋషులచేతను, వైఖానసులచేతను, నితరులచేతను నిండి శోభించునదియు, మఱియొక బ్రహ్మలోకమువలె నుండునదియునై యొప్పుచుండెను. ఆ వసిష్ఠాశ్రమమును విశ్వామిత్రుడు చూచి మిక్కిలి సంతోషించి, తపశ్శ్రేష్ఠుడగు వసిష్ఠునికి నమస్కరించి నమ్రుడై వినయముతోనుండ వసిష్ఠుడు 'మీరాక మంచిది. ఈ యాసనమున కూర్చొనుము' డని యాతని కోరెను. తర్వాత ఋషి యారాజునకు ఫలమూలములీయ నాతడు వానిని బుచ్చుకొని 'మీతపము, అగ్నిహోత్రము, శిష్యులు, వృక్షరాజములు కుశలముగ నున్నవా?' యని యడిగెను. వసిష్ఠు డందఱికుశలమును దెలిపి విశ్వామిత్రుని నిట్లు ప్రశ్నించెను. 'నీవు కుశలముగనున్నావా? ప్రజలను ధర్మమార్గమున సంతోషపఱచుచు పాలించుచున్నావా? నీయాశ్రితులు, సేవకులు నీయాజ్ఞను మన్నించుచున్నారా? నీశత్రువులందఱు జయింపబడిరా? నీబలములును, ధనమును, మిత్రులును, నీపుత్రపౌత్రులును కుశలముగనున్నారా?' ఇట్లు ప్రశ్నింప విశ్వామిత్రుడు వినయముతో 'నన్నియును నట్లేయున్నవ'ని యనెను. ఇద్దఱును చాలసేపు ననేకశుభసంగతులు మాట్లాడుకొని నొకరినిగూర్చియొకరు ప్రీతితో నుండిరి. తర్వాత వసిష్ఠుడు 'నీకును, నీబలమునకును నాతిథ్యము చేయుదలచి

యున్నాను. రాజగు నీవు పూజనీయుడవును, నతిథిశ్రేష్ఠుడవును, మిక్కిలి శ్రద్ధతో పూజింపదగినవాడవును గాన నాతిథ్యము నుగ్రహింపు' మని విశ్వామిత్రుని గోర నారాజిట్లు విన్నవించెను. 'మీ ప్రియ వాక్యములచేతను, పాద్యము, ఆచమనీయము ఇచ్చుటచేతను, మీ యాశ్రమములోనుండు ఫలమూలము లిచ్చుటచేతను, మీదర్శనము చేతను నన్నివిధముల నాకు నాతిథ్యము జరిగినది. మీకు నమస్కారము. స్నేహభావముచే నన్ను చూచుచుండుడు. నే బోయెదను.' ఇట్లు విశ్వామిత్రుడు వినయముతో దెలుప దానికి ధర్మాత్ముడును, నౌదార్యముకలవాడును నగు వసిష్ఠుడు తిరుగ, తిరుగ నారాజును నతిథిగ బిలువ నాతడంగీకరించి 'మీకిష్టమగునటుల జరుపు'డనెను. అంతట నాఋషి యనేకరంగులుకలదియు, పాపములేనిదియు, 'శబళ' యను పేరుగలదియునగు తనయజ్ఞకామధేనువును వేగముగ రమ్మని పిలిచి దానిని 'నేను జెప్పినట్లుచేయుమనియు, రాజర్షియగు విశ్వామిత్రునికిని, వానిబలములకును నేనుసత్కారము చేయదలచినందున వారికి నీవు తగినభోజనమును తయారు జేయుము'నియు నాజ్ఞాపించెను. అంతట కామధేనువు ఎవరెవరికేది యిష్టమున్నదో దానినంతను కల్పించియిచ్చెను. తీయనిచెఱకురసమును, పేలాలను, ననేకరకములగు మద్యములను, మంచిపానీయములను, మంచిరుచిగల భక్ష్యములను, పర్వతమువలెనున్న వేడియన్నపురాసులను మంచి క్షీరాన్నములను, పప్పులను, పెరుగుతో జేయబడిన పిండివంటలను, షడ్రసములతో జేయబడిన రుచిగల యనేకవిధములగు పిండివంటలను, బెల్లముతో జేయబడిన వేలకొలది పదార్థములను విశ్వామిత్రునికిని, వాని యంతఃపురస్త్రీలకును, బ్రాహ్మణపురోహితులకును, నమాత్య మంత్రి భృత్యబలములకును సమకూర్చి వడ్డింప వారు వానిని సంతుష్టిగ భుజించి మిక్కిలిసంతోషించిరి.

అప్పుడు విశ్వామిత్రుడు వసిష్ఠునితో నిట్లు పలికెను. 'మీావలన మిక్కిలి గౌరవింపబడితిని. ఒకమాటజెప్పెదను వినుడు. లక్షగోవులను మీాకిచ్చెదను. వానికి బదులుగ శబళను నాకిండు. శ్రేష్ఠమగు నిట్టి వస్తువులు భూపాలురవద్ద నుండవలెను. ధర్మముగ శబళ నాది; గనుక మీారు దానిని నాకిచ్చివేయుడు.' విశ్వామిత్రుని యీాకోరికకు వసిష్ఠుడు "లక్షగోవులనుగాని, కొన్నివందలకోట్ల గోవులనుగాని, వెండిప్రోగులనుగాని యిచ్చినను నేను శబళను విడువలేను. నది నావద్దనుండి విడువతగినది కాదు. అది శాశ్వతముగ బుద్ధిమంతుల కీర్తివలె నాతో నుండవలసినది. దానివలననే నేను నా హవ్యకవ్యములను, పంచప్రాణములను తృప్తినొందించుచున్నాను. అగ్నిహోత్రము, బలి, హోమము, స్వాహాకారము, వషట్కారము, అనేకవిద్యలు మొదలగువానినన్నిటిని జరిగించుచున్నాను. అదియే నాకుండు యావదాస్తి యైయున్నది. అది యెల్లపుడు నిజముగ నాకు సంతోషముగలిగించును; కనుకను, ఇంకను ననేక కారణములుండుట చేతను నేను నీకు దాని నియ్యను." అని జవాబిచ్చెను. దీనికి విశ్వామిత్రుడు మిక్కిలి తొందరగలవాడై ఋషి నిట్లుకోరెను. 'నేను మీాకు బంగారుత్రాళ్ళచే కట్టబడినవియు, బంగారునంకుశములు గలవియునగు 14,000 యేనుగులను, అనేకదేశములనుండి తెచ్చినవియు, మంచిజాతి, తేజము గలిగినవియునగు 1000 గుఱ్ఱములను, మంచివయస్సు, అనేకరంగులుగల యొకకోటిగోవులను నిచ్చెదను. మీారు కోరినరత్నములను, బంగారును నిచ్చెదను. శబళను నాకీయవలెను.' విశ్వామిత్రునియీామాటలకు వసిష్ఠుడు 'నే నెంతమాత్రము శబళనియ్యను. ఇదియే నారత్నము; ధనము; యావదాస్తి; జీవితము; దర్శము; పూర్ణిమాస; యజ్ఞములు; తగినదక్షిణలు; అనేకకర్మలు నాయన్నికర్మలు దానిమూాలముననేజరుగుచున్నవి. నీ వెక్కు డేల

ప్రేలెదవు? నేను నాయజ్ఞకామధేనువును నీయను.' అని జవాబు చెప్పెను.

అంతట విశ్వామిత్రుడు కామధేనువును బలవంతముగ తోలించుకొని పోవుచుండెను. శబళ యప్పుడు మిక్కిలి దుఃఖించి యేడ్చుచు 'గొప్పమహాత్ముడగు వసిష్ఠుడు నన్నేల విడిచెను? నన్ను రాజభటులేల తీసికొనిపోవుచున్నారు? నేనామహాఋషి కేమి యుపకారముచేసితిని.' అని యాలోచించి, మాటిమాటికి నిట్టూర్పులు విడుచుచు భటుల నెగురగొట్టి వాయువేగమున ఋషిపాదములవద్దకు జేరి యేడ్చుచు, కేకలు వేయుచు వసిష్ఠుని 'బ్రహ్మపుత్రా! నీవద్ద నుండి రాజభటులు నన్ను తీసికొనిపోవుచుండ నీవేలయూరకుంటివి?' అని పెద్దధ్వనితో నడుగ నాతడిట్లు పలికెను. 'గొప్పవిచారమును బొందినదానవును, నాతో బుట్టువవలెనుండు దానవునునగు నిన్ను నేను విడువను. నీవు నాకేమియు నపకారము చేయలేదు. బలోన్మత్తుడును, మహాబలుడును నగురాజు నిన్ను తీసికొనిపోవుచున్నాడు. వానిబలముతో నాబలము సరిపోదు. ఇంతేకాక యాతడురాజు; బలవంతుడు; క్షత్రియుడు; భూమికినధిపతి యైయున్నాడు. అతనికి నక్షౌహిణీసేనకూడ గలదు.' వసిష్ఠుని యీమాటలువిని శబళ వినయముతో నిట్లుపలికెను. 'పెద్దలవచనముప్రకారము క్షత్రియబలము బలముకాదు. బ్రాహ్మణు డంతకంటె బలవంతుడు. ప్రకాశమానమగు బ్రాహ్మణునిబలము క్షత్రియబలముకంటె గొప్పది. కావున నీ బలము గొప్పది. విశ్వామిత్రుడు మహావీరుడైనను మీకంటె నెక్కువ బలవంతుడు గాడు. మీ తేజమును నతడు తేటి చూడజాలడు. మీ బ్రహ్మబలముచే వృద్ధినొందిననన్ను వీరినాశనమునకు నియోగింపుడు. నేను వాని గర్వోద్రేకబలమును నాశనమొందించెదను.' ఇట్లు శబళ పలుక వసిష్ఠుడు దానితో 'నీవు శత్రుబలమును నాశనము జేయువారిని

సృజింపు' మని యన నది బలవంతుల ననేకులను సృజించెను. దాని యఱుపువలన వందలకొలది పహ్లవులు పుట్టి విశ్వామిత్రుడు చూచు చుండ నతనిబలమునంతను నాశన మొనర్చిరి. అప్పుడు విశ్వామిత్రుడు కోపముతో కండ్లెఱ్ఱజేసి గొప్పయస్త్రములతో పహ్లవులను నాశన మొనర్చెను. దానికి శబళ కోపించి యనేకశకులను, యవనులను భూమంతయునిండునటుల సృజించెను. గొప్పవీరులును, ప్రభావముకలవారును, బంగారు రంగుగలవారును, బంగారురంగుగలబట్టలు కట్టినవారునునగు వారు పొడవైనకత్తులను, పట్టసములను బట్టి విశ్వామిత్రుని బలము నంతము నొందించిరి. అంతట నారాజు అస్త్రములను విడువ యవన కాంభోజ పహ్లవులు కలకలమొందిరి. దీనిని వసిష్ఠుడు చూచి శబళను యోగమహిమచే నింకను సృజింపు మనెను. అప్పుడు దానియంబారవమునుండి సూర్యతుల్యులగు కాంభోజులును, స్తనప్రదేశమునుండి శస్త్రములుధరించిన పహ్లవులును, యోనిప్రదేశమునుండి యవనులును, మలద్వారమునుండి శకులును, రోమములు పుట్టుస్థానములనుండి హారీత కిరాతకులనెడు మ్లేచ్ఛులును బుట్టి విశ్వామిత్రునిరథమును, గుఱ్ఱములను, సర్వసేనను నాశన మొనర్చిరి. అంతట విశ్వామిత్రుని నూర్గురుపుత్రులు అనేకయాయుధములతో వసిష్ఠుని నెదుర్కొని యతనిహుంకారముచే నందఱు నశించిరి. అప్పుడు విశ్వామిత్రుడు తనసమస్తబల మడగుటజూచి విచారమును, సిగ్గునుబొంది గర్వము విడిచి యుత్సాహమువదలి మిగిలిన తనపుత్రుని రాజ్యముననునిచి తపస్సుచేయుటకు హిమవత్పర్వతమునకు నరిగెను.

అక్కడ విశ్వామిత్రుడు, కిన్నరులు, పాములు సేవించు పర్వతపార్శ్వమున శివునిగూర్చి గొప్పతపస్సు జేసెను. కొంత కాలమున కీశ్వరుడు సంతోషించి వానికి దర్శనమిచ్చి 'రాజా! నీవేల తపస్సు జేయుచున్నావు? నీకోరిక యేమి? వరమునిచ్చెదను. కోరుకొను'

మని యనెను. అంత నతడు శివునికి నమస్కరించి తనకోరికల నిట్లు తెలిపెను.'మహాదేవా! నాయెడ మీకు సంతోషమయ్యేనేని,అంగ ఉపాంగములతోగూడిన ఉపనిషత్తులను, రహస్యసహితముగ ధనుర్వేదమును నాకిండు. దేవ దానవులును, మహర్షులును నెఱిగినయస్త్రములను నాకు దయచేయుడు. గంధర్వులు, యక్షులు, రాక్షసులు నాకంటె తక్కువపరాక్రమముతో నుందురుగాక!' శివుడీకోరికల నిచ్చి యదృశ్యుడయ్యెను. రాజర్షియగు విశ్వామిత్రుడాయస్త్రములను బొంది వసిష్ఠుడు చచ్చిపోయినట్లుగ దలచి గొప్పగర్వముతో వానియాశ్రమమునకు బోయి వానిపై బాణములను విడిచెను. ఆ బాణముల వలన నతనితపోవనము నాశనమయ్యెను. అక్కడనుండు ఋషులందఱు భయమునొంది నలుదిక్కులకు బాఱిపోయిరి. వసిష్ఠుని శిష్యులుగూడ భయపడి పాఱిపోయిరి. అచ్చటనుండు మృగములు, పక్షులు, భయమున చెల్లాచెదరైనవి. ఆశ్రమము శూన్యమై నిశ్శబ్దమయ్యెను. అప్పుడా బ్రహ్మర్షి 'భయము వలదు.గాధిపుత్రుని నిప్పుడు నాశనముచేసెద'నని పలికెను. తర్వాత నాతడు విశ్వామిత్రునిని రోషముతో 'చిరకాలమునుండి వృద్ధిలోనున్న యాశ్రమమును నశింపజేసినదురాచారుడవును, మూఢుడవునునగు నీవు జీవించియుండవు' అని నిందించి యమదండముతో సమానమును, పొగలేనికాలాగ్నితో సమానమునునగు బ్రహ్మదండము నెత్తెను. విశ్వామిత్రుడాగ్నేయాస్త్రమును వసిష్ఠునిపైని విడిచి 'నిలువుము నిలువు'మన నాతడు 'క్షత్రియాధమా! యిదిగో నిలిచితిని; నీబలమును జూపుము. నీగర్వమును, నీశస్త్రములబలమును నిప్పుడే నాశనము జేసెదను. నీ క్షత్రియబలమెక్కడ? గొప్పదియును, ప్రకాశమగునదియునగు బ్రహ్మబలమెక్కడ? దానిని నీవు చూచెదవుగాక!' అని పలుకుచు నాయాగ్నేయాస్త్రమును తనబ్రహ్మదండముచే శాంతినొందింప విశ్వామిత్రుడీక్రిందనుదహరింపబడిన యస్త్రములను ప్రయోగించెను.

వారుణము, రౌద్రము, ఐంద్రము, పాశుపతము, ఐషీకము, మానవము, మోహనము, గాంధర్వము, స్వాపనము, జృంభణము, మాదనము, సంతాపనము, విలాపనము, శోషణము, దారణము, వజ్రము, బ్రహ్మపాశము, కాలపాశము, వారుణపాశము, పైనాకాస్త్రము, దయితము, చలిపిడుగు, నిప్పుపిడుగు, దండాస్త్రము, పైశాచము, క్రౌంచము, ధర్మచక్రము, కాలచక్రము, విష్ణుచక్రము, వాయవ్యము, మథనము, హయశిరము, విష్ణు శివశక్తులు, కంకాళము, ముసలము, వైద్యాధరము, కాలాస్త్రము, త్రిశూలము, కాపాలము, కంకణము మొదలగునవి.

దీనికి వసిష్ఠు డాశ్చర్యమునుబొంది వీనినన్నిటిని తనబ్రహ్మదండముచే శాంతినొందించెను. తర్వాత విశ్వామిత్రుడు బ్రహ్మాస్త్రము వేయ నగ్ని, దేవతలు, దేవఋషులు, గంధర్వులు, నాగులు మొదలగుమూడులోకములవారు తత్తరపాటును, భయమును నొందిరి. దానినిగూడ వసిష్ఠుడు తనబ్రహ్మదండముచే నాపెను. మిక్కిలి భయంకరమైన వసిష్ఠునిశరీరముయొక్క రోమకూపములనుండి నిప్పుకణములు బయలుదేఱెను. అతనిచేతిలోని బ్రహ్మదండము కాలాగ్నివలెను, యమదండమువలెను వెలుగుచుండెను. దానికి ఋషులు సంతోషించి 'వసిష్ఠా! నీ తేజోబలము గొప్పదగుటచే గొప్పతపశ్శాలియగు విశ్వామిత్రుడు నీకు లొంగిపోయెను. లోకములన్నిటికిని బాధపోవుగాక! నీవు శాంతినొందుము.' అని వేడ నతడు శాంతినొందెను. విశ్వామిత్రుడపజయమునొంది నిట్టూర్పువిడిచి "ఛీ! క్షత్రియబలము నింద్యమైనది. బ్రహ్మతేజోబలమే బలము, ఒక్కబ్రహ్మదండముచే నాయస్త్రములన్నియు రూపుమాసెను. నేను శాంతిజెందిన యింద్రియములను, మనస్సునుగలిగి బ్రహ్మదండమును బొందగలను. బ్రాహ్మణ్యమును గలుగజేయు గొప్పతపమును జేసెదను." అని పలికెను.

ఇట్లు విశ్వామిత్రుడు పలికి తనయపజయము నాలోచించుకొనుచు, మండిపడి నిట్టూర్పుదీయుచు వసిష్ఠునియెడ క్రోధమవలంబించి తనపట్టమహిషితో దక్షిణదిక్కునకుబోయి గొప్పతపమాచరించుచుండెను. అంతట నాతనికి హవిష్యందుడు, మధుష్యందుడు, దృఢనేత్రుడు, మహారథు డనునలుగురుపుత్రులు జన్మించి సత్యధర్మములను నవలంబించి యుండిరి. అక్కడ వేయిసంవత్సరములు విశ్వామిత్రుడు తపస్సుజేయ నతనికి బ్రహ్మ ప్రత్యక్షమై మంచిమాటలతో 'నీతపస్సుచే లోకములు జయింపబడినందున నిన్ను రాజర్షి యని పిలిచెద'రనిచెప్పి దేవతలతో తనలోకమునకుబోయెను. ఆమాటల కారాజర్షి సిగ్గుచే తలవంచుకొని గొప్పదుఃఖముతోను, కోపముతోను తాను గొప్పతపస్సుచేసినను తన్ను దేవతలును, ఋషులును రాజర్షియనిమాత్రమే పిలిచెదరనియు, తాను జేసినతపస్సునను ఫలములేదనియు తలచెను. తిరుగ నతడు గొప్పతపము జేయుచుండెను.

అట్టికాలములో నిక్ష్వాకువంశజుడును, సత్యవాదియును, నింద్రియజయముగలవాడును నగు త్రిశంకుడు రాజ్యము చేయుచుండెను. అతనికి తాను యజ్ఞముచేసి యీశరీరముతోనే దేవలోకమును బొందవలెననుబుద్ధి కలిగెను. అందుచే నతడు తనకులగురువగు వసిష్ఠుని బిలిపించి తనమనస్సులోనిమాటచెప్ప 'నది శక్యముకా'దని యాఋషి పలికెను. తర్వాత త్రిశంకుడు దక్షిణదిక్కునకు బోయి తనకార్యసిద్ధికొఱకు వసిష్ఠునినూర్వురుపుత్రులయొద్దకు వెళ్ళెను. అచట గొప్పతపస్సుచేయుచుండినవారికి త్రిశంకుడు నమస్కరించి సిగ్గుచే కొంచెము ముఖమువంచుకొని చేతులుజోడించి యిట్లు విన్నవించెను. "మిమ్ములను శరణుబొందితిని. నేను యజ్ఞము చేసి యీశరీరముతో స్వర్గమును బొందుటకు వసిష్ఠునికోర నాతడు వలదనెను. ఇక్ష్వాకు

వంశమునకు పురోహితుడేముఖ్యగతి. విద్వాంసులగుపురోహితులు రాజులను తరింపజేయుదురు. మీరు గురుపుత్రులు; మీతండ్రి యొప్పుకొనకపోవుటచే మిమ్ములనుతప్ప నేనింకొకగతిగానను. మీరే నాదైవము; నాచేత యజ్ఞము చేయించి నన్ను సిద్ధినిబొందింపవలెనని మిమ్ములను మిక్కిలి వేడుచున్నాను.” ఇట్లు త్రిశంకుడు ప్రార్థింప వసిష్ఠపుత్రులు కోపముతో నిట్లు సెలవిచ్చిరి. “దుర్బుద్ధీ! మాతండ్రిచే నివారింపబడిన నీవు మఱియొక యితరగురువుల నెట్లుపొందితివి? ఇక్ష్వాకువంశమువారికి పురోహితుడే ముఖ్యగురువు. వాని సత్యవాక్య మతిక్రమించుటకు వీలులేదు. భగవానుడగు వసిష్ఠుడు వీలులేదనిన నీయజ్ఞమును చేయించుటకు మాకు శక్తిచాలదు. నీవు మూర్ఖుడవు. నీవు నీపట్టణమునకుబొమ్ము. మూడులోకములలో యజ్ఞముచేయించుటకు వసిష్ఠునికే శక్తికలదు. ఆతనిమాటను మేమెట్లుతిరస్కరింపగలము?” ఇట్లు వసిష్ఠపుత్రులు పలుక త్రిశంకుడు దానికి ‘నాగురువు, నాగురుపుత్రులు వలదనుటచే నే నితర గతిని జూచికొనెదను. మీరు శుభముగనుండు’డని పలికెను. ఆమాటలకు వారు మిక్కిలి కోపించి ‘నీవు చండాలత్వము నొందెదవుగాక!’ అని వానిని శపించి తమ యాశ్రమమునకు బోయిరి.

అంతట నారాత్రి గడచినతర్వాత రాజు చండాలత్వమును బొందెను. అతడు నీలివస్త్రమునుగట్టి నీలిరంగును, కఠినమును నగు శరీరమును, చిన్నవెంట్రుకలను గలిగి శవదాహపుభస్మమును ధరించి యినుపయలంకరణములు కలవాడై తనపట్టణమునకు వెళ్లెను. ఆతని మంత్రు లాతనిచండాలరూపమునుజూచి నాతనినివిడిచిరి. మంత్రులును, పౌరులును, రాజానుచరులును గోలపెట్టిరి. అప్పుడు రాజొక్కడే బయలుదేఱి రాత్రింబగళ్ళు విచారించుచు విశ్వామిత్రతపసిని జేరెను. విఫలమనోరథుడైన రాజు చండాలరూపమును బొందుట విశ్వా

మిత్రుడు చూచి యాతనిపై దయగలిగి 'అయోధ్యాపతీ! నీవు శాపముచే చండాలత్వమును బొందితివి. నీవు వచ్చుటకు కారణ మెయ్యది?' యని వానినడిగెను. రాజు ఆమాటవిని యతనికి నమస్కరించి యిట్లుపలికెను. "నేనీశరీరముతో స్వర్గమునకు బోవుటకు గోరి యజ్ఞము చేయింపవలెనని నాగురువగు వసిష్ఠుని, నతని పుత్రులను గోర వారు వలదనిరి. నేనిదివఱకు నూఱుయజ్ఞములను జేసితిని. వానివలన శరీరముతో స్వర్గమునకు వెళ్ళుటకు తగినఫలము కలుగలేదు. నేను కష్టములలో నున్నను నబద్ధము పలుకలేదు. ముందెప్పుడును పలుకను. క్షత్రధర్మమున మీయెదుట నేను శపథము చేయుచున్నాను. అనేకవిధములగు యజ్ఞములను జేసితిని. ప్రజలను ధర్మముగ బాలించితిని. మహాత్ములగు నాగురువులు నామంచిగుణములకు, ప్రవర్తనలకు సంతోషించిరి. నేను ధర్మబుద్ధితో యజ్ఞము చేయగోర గురువు లిష్టపడలేదు. పురుషప్రయత్నమున లాభముండదు; దైవసహాయమే ముఖ్యమని యాలోచించితిని. అంతటను దైవముండును. అతడే పొందదగినవారిలో ముఖ్యుడు. మిక్కిలి విచారమునొంది దైవయోగముచే బాధజెందిననన్ను మీరు గొప్పదయతో జూచెదరు గాక! నాకింక నితరగతిలేదు. శరణుబొందుటకును మఱెవ్వరును లేరు. నాకు మీరు దైవమువలె కనబడుచున్నారు. మీరే నన్ను రక్షింపదగినవారు." ఇట్లు త్రిశంకుడు విన్నవించెను.

విశ్వామిత్రుడు చండాలరూపముగల త్రిశంకుడు పలికిన మాటలు విని దయగలిగి యిట్లుపలికెను. "ఇక్ష్వాకువంశజుడా! నీవు సుధార్మికుడవని నేనెఱుగుదును. నీయాగమనము లెస్స. నన్నుశరణు బొందిననీకు భయములేదు. పుణ్యకర్ములగు మహర్షులందఱిని నేను పిలిపించెదను. వారు నీయజ్ఞమునకు సహాయముచేయ నీవు యజ్ఞము చేసి గురుశాపమూలమగు నీచండాలరూపముతోను, ఈశరీరము

తోను స్వర్గమును బొందెదవు. నీవు నన్ను శరణుబొందుటచే స్వర్గము నీకు లభించినదని తలచెదను.” ఇట్లు విశ్వామిత్రుండు వానికి సెలవిచ్చి యజ్ఞసంభారమును జతకూర్చుటకు తనపుత్రులను నియమించి తన శిష్యులనందఱిని బిలిచి “నాయాజ్ఞచే నందఱుఋషులను, వారిశిష్యులను, నాస్నేహితులను, గొప్పవేదపండితులను పిలిచి తీసికొనిరండనియు, ఎవరైనను ప్రతికూలముగ మాటలుపలికిన ఆమాటలను నాతో చెప్పు”డనియు సెలవిచ్చెను. వారలట్లు చేసి అన్నిప్రదేశములనుండి నందఱిని తీసికొనివచ్చి విశ్వామిత్రునితో నిట్లుచెప్పిరి. “మహోదయుఋషియును, వసిష్ఠుడును, వానిపుత్రులు నూర్గురును రాలేదు. వారు పలికినమాటలు వినుడు. ‘క్షత్రియుడు యజ్ఞముచేయించువాడును, చండాలుడు యజ్ఞకర్తయునైన దేవతలు, ఋషులు నిట్టి యజ్ఞమున హవిస్సు నెట్లుభుజించెదరు? విశ్వామిత్రుడు జరిపించిన యజ్ఞమున మహాత్ములగు బ్రాహ్మణులు భుజించి స్వర్గమున కెట్లు పోగలరు?’ అని వారనిరి.” ఇట్లు శిష్యులు చెప్ప విశ్వామిత్రుడు వానిని విని మిక్కిలికోపముతో కండ్లెఱ్ఱజేసి తన్నాక్షేపించినవారి నిట్లు శపించెను. “గొప్పతపముజేసిన నన్ను దూషించినదురాత్ములు నాశనముబొంది మఱిజీవింపరు. వసిష్ఠపుత్రులీదినముననే మరణమునొంది యమలోకమునకు బోయి 700 జన్మములపర్యంతము శవభక్షకులై కుక్కమాంసము దిని ముష్టికులును, నీచులును, వికృతరూపులునునై లోకములో సంచరించెదరు. దుర్బుద్ధియగు మహోదరుడును నన్ను దూషించుటచే బలవంతముగ ప్రాణములుపోవ నిషాదుడై జన్మించి యన్నిలోకములలో జాలకాలము నీచుడై దుర్గతిని బొందుగాక!” విశ్వామిత్రుడిట్లు శపించి యాతీరున పలికెను. “ఈతడు ఇక్ష్వాకువంశజుడును, ధర్మిష్ఠియు, దాతయునగు త్రిశంకుడు. ఇతడు ‘తనశరీరముతో దేవలోకమునకు బోవుటకు యజ్ఞము చేయింపు’డని నన్ను

వేడెను. కావున నది జరుగునటుల మీరును, నేనును యజ్ఞము చేయింపవలెను." విశ్వామిత్రుని యీమాటలు ఋషులువిని "గొప్ప కోపముగల యీతడు కోరినటుల మనము చేయకపోయిన నితడుశపించును. కాన నతనికోరికప్రకారము యజ్ఞము చేయించెదముగాక." అని నిశ్చయించుకొని తమక్రియలను జరిపిరి. విశ్వామిత్రుడు యాజకుడయ్యెను. ఋత్విజులందఱు బాగుగ మంత్రములను దెలిసినవారై యథావిధిగను, సమంత్రకముగను, తమకర్మలను జరిపిరి. ఆతర్వాత చాలకాలమునకు విశ్వామిత్రుడు దేవతలనందఱిని తమయజ్ఞభాగములను బుచ్చుకొనుటకు నాహ్వానముచేసెను. కాని వారు రాలేదు. అప్పుడతడు గొప్పకోపముతో స్రువమునెత్తి త్రిశంకునితో "నేను స్వయముగచేసిన తపోబలము చూడుము. నిన్ను దానివలన స్వర్గమునకు బంపెదను. నీవు శరీరముతో స్వర్గమునకు వెళ్లుము. నేను చేసిన తపమునకు ఫలమేదైన నున్నయెడల నీవు స్వర్గమునకు వెళ్ళెద" వనిచెప్పెను. అంతట ఋషులందఱు చూచుచుండ నారాజు స్వర్గమునకు వెళ్లెను. అచ్చట నిందుడును, దేవతలును, త్రిశంకునితో 'మూఢుడా!నీవు గురుశాపహతుడవగుటచే స్వర్గముననుండ వీలులేదు. గాన నీవు తిరిగి పోయి భూమియందు తలక్రిందుగ పడు'మని పలికిరి. ఆరాజు అట్లుపడుచు, రోదనముచేయుచు 'రక్షింపు'మని విశ్వామిత్రుని వేడెను. ఈమాట లారాజర్షి విని గొప్పకోపముతో త్రిశంకుని 'నిలువు, నిలువు'మని పలికి రెండవబ్రహ్మవలె దక్షిణమార్గమున నూతనముగ సప్తఋషులను, నక్షత్రములను సృజించి యిట్లు పలికెను. 'నూతనముగ ఇందునినిసృజించెదను. లేనియెడల ఇందుడు లేనిలోకమును సృజించెదను. దేవతలనుగూడ సృష్టించెదను.' ఇట్లు విశ్వామిత్రుడు పలికి వారిని సృష్టించుటకు సిద్ధముగనుండ నపుడు దేవతలు అసురులు, ఋషులు తత్తరపాటునొంది యాతనితో మంచి

మాటలను పలుకుచు 'ఈరాజు గురుశాపహతుడగుటచే శరీరముతో స్వర్గమునుబొంద నర్హుడుకాడని చెప్పిరి. అపుడు విశ్వామిత్రుడు "వీనిని శరీరముతో స్వర్గమునకు బంపెదనని ప్రతిజ్ఞచేసిన నేను ఆప్రతిజ్ఞను నబద్ధముచేయ సహింపను; కాన నతడుండుచోటు శాశ్వతముగ స్వర్గమగుగాక! నేను నిర్మించిన నక్షత్రములు శాశ్వతముగ నుండుగాక! లోకములన్నియు నుండునంతవఱకు నివి యుండుగాక!" యని వారిని కోరెను. దేవతలందఱు 'నట్లేయగుగాక!' యని యొప్పికొనిరి. మఱియు వారు ఇవన్నియు జ్యోతిశ్చక్రముయొక్క బయట నుండి యితరనక్షత్రములవలె ప్రకాశించుచు నుండుననియు, త్రిశంకుడు కృతార్థుడై తలక్రిందుగనుండి దేవతుల్యుడై స్వర్గలోకమును బొందినట్టుగ నుండుననియు, 'ఈనక్షత్రము లాతనిచుట్టును తిరుగుచుండుననియు సెలవీయ విశ్వామిత్రు డంగీకరించెను. దేవతలాతని పొగిడిరి. యజ్ఞము పూర్తియగుటచే ఋషులును, దేవతలును తమనివాసములకు జనిరి.

యజ్ఞమునకు వచ్చినఋషులు తమనివాసములకు జనుచుండ విశ్వామిత్రుడు వారితో 'నీదక్షిణదిక్కున గొప్పవిఘ్నములు జరుగుచున్నవి; కాన మఱియొకదిక్కునకు బోవుదమనియు, పశ్చిమదిక్కున విశాలమగు వనమున పుష్కరసరస్సుతీర్థములందు గొప్పతపస్సు చేయుదమనియు పలికెను. తర్వాత నతడు కొందఱుఋషులతో నచటికి బోయి యందు కందమూలములు, ఫలములు తినుచు, గొప్పతపస్సుచేయుచునుండెను. అట్టికాలమున నయోధ్యాపతియగు నంబరీషుడు యజ్ఞముచేయ నారంభించెను. వానియజ్ఞపశువును ఇంద్రుడు హరింప వానిపురోహితుడిట్లుపలికెను. "పశు వీదినమున నీయజాగ్రతవలన హరింపబడినది. యజ్ఞసాధనముల రక్షింపని రాజును దోషములు నాశనమునొందించును. దీనికి గొప్పప్రాయ-

శ్చిత్తముగాని, యజ్ఞకర్మారంభింపకపూర్వము నీవు నరపశువును వేయుటగాని, నష్టమైనపశువును తిరిగి తెచ్చుటగాని జరుపవలెను.” పురోహితుని యీమాటలను రాజు విని వేలకొలది గోవులనిచ్చి నరపశువును దెచ్చెదనని తలచి దేశములు, పట్టణములు, ఆశ్రమములు, దాటి భృగుపర్వతాశ్రమమున విశ్వామిత్రునిసోదరియగు సత్యవతిని, యామెకు భర్తయు, ప్రకాశవంతుడునగు ఋచీకఋషిని, వారి పుత్రులను జూచెను. రాజు ఋషిని కుశలమడిగి యతనితో ‘నేను నరపశువుకొఱకు దేశములన్నియు తిరిగినను నాకది లభింపలేదు; కాన నేను మీకిచ్చు లక్షగోవులకు బదులుగ నీపుత్రులలో నొకనిని యజ్ఞపశువుగ నాకిమ్మనియు, నట్లైన కృతార్థుడనయ్యెద’ననియు విన్నవించెను. దానికి ఋచీకుడు ‘జ్యేష్ఠపుత్రులు పితృదేవతలకు ప్రియులగుటచే నేను జ్యేష్ఠపుత్రుని నమ్ముటకు వీలులే’దనెను. తపస్వినియగు నతనిభార్య ‘కనిష్ఠుడగు శునకుడు మాతృవంశమునకు ప్రియుడగుటచే వానిని నేనియ్య’ననెను. అంతట వారిమధ్యమపుత్రుడగు *శునశ్శేపుడట్టిసమయమున ‘నన్నే వారమ్మినట్లు భావించెదననియు, నన్ను తీసికొనిపొ’మ్మనియు రాజుతో బలికెను. రాజు లక్షగోవులనిచ్చి శునశ్శేపునిగొని సంతోషముతో వానిని తనరథమున నెక్కించికొని శీఘ్రముగ బోవుచు మధ్యాహ్నమున పుష్కరక్షేత్రమున నిలిచెను. అక్కడ రాజు విశ్రమించుచుండ మహాయశుడగు శునశ్శేపుడు అక్కడకు సమీపముననే తపస్సుచేసికొనుచున్న

* తెలుగుభాగవతమున 9వస్కంధము 210 పద్యమున హరిశ్చంద్రుడజీగర్తుని మధ్యమపుత్రుడగు శునశ్శేపుని యాగపశువుగజేసెననియు, కౌశికుడు హోతయనియు తెలుపబడినది. బాలకాండ 6 సర్గప్రకారము అంబరీషుడనురాజు ఋచీకుని మధ్యమపుత్రుడగు శునశ్శేపుని యజ్ఞపశువుగ దీసికొనిపోయెనని వక్కాణింపబడినది. పేర్లలో తేడాలున్నను ముఖ్యాంశములు రెండింటిలో నొక్కటేయని యూహింపవచ్చును.

తన మేనమామయగు విశ్వామిత్రునికడ కేగి మిక్కిలిదీనుడై, శ్రమ చేతను, దప్పికచేతను వాడినముఖముకలవాడై యాతనితొడమీాదను తొందరగపడి యిట్లు విన్నవించెను. "నాకు తల్లి లేదు; తండ్రిలేడు; జ్ఞాతులు, బంధువులు లేరు. ధర్మమార్గముగ నన్ను రక్షింపుడు. మీారందఱకు రక్షకులును, హితము జేయువారునై యున్నారు. నేను దీర్ఘజీవుడను, నాశనరహితుడనునై గొప్పతపస్సుచేసి స్వర్గముపొందు నటులను, రాజు తనకార్యము నిర్వహించుకొనునటులను జేయుడు. అనాథుడనగు నన్ను మంచిమనస్సుతో రక్షింపుడు. ధర్మాత్మా! తండ్రి పుత్రునిరక్షించునటుల మీారు నన్ను కష్టములనుండి రక్షింపుడు." ఇట్లు శునశ్శేపుడు విశ్వామిత్రుని వేడ నాతడు వానికి మంచిమాటలు చెప్పి తనపుత్రులతో నిట్లనెను. "తండ్రులు పుత్రులను పరలోక హితవునుగోరి కనెదరు. అట్టికాలమిప్పుడు సంభవించినది. ముని పుత్రుడగు నీబాలుడు నన్ను శరణువేడెను. వీనికి జీవనమొసగి ప్రీతిని జేయుడు. మీారందఱు మంచికర్మలు చేసినవారు; ధర్మపరాయణులు; కావున మీారందఱు రాజుచేయు యజ్ఞమున పశురూపముల జెంది యగ్నిని తృప్తినొందింపుడు. మీావలన శునశ్శేపుడు రక్షింపబడును. యజ్ఞమునకు విఘ్నము రాకుండును. దేవతలు తృప్తినొందుదురు. నామాట నెఱవేఱును." ఇట్లు విశ్వామిత్రుడు తనపుత్రులగు మధుష్యందాదులతో బలుక వారందఱు గర్వముతో నిట్లు పరిహా సించిరి. "ప్రభువా! మీాస్వంతకుమారులను విడిచి యితరులపుత్రుని మీారేల రక్షించెదరు? ఇది తగనకార్యము కాదు. మంచిభోజనము మాని కుక్కమాంసము భుజించినట్లగును." తనపుత్రుల యీామాటల కాతడు రోషముతో కండ్లెఱ్ఱజేసి వారు చెప్పినమాటలు దుష్టములై నందులకును, తనమాటల నతిక్రమించి ధర్మవిరుద్ధములును, కఠినములు నైన మాటలు వారాడినందులకును వారందఱు కుక్కమాంసమును

భుజించుచు వసిష్ఠపుత్రులవలె వేయిసంవత్సరములు భూమియందు నివసింతురుగాక! యని వారిని శపించెను. తర్వాత విశ్వామిత్రుడు శునశ్శేఫునిభయము పోగొట్టి "నీవు పవిత్రములగు దర్భత్రాళ్ళచే గట్టబడి యెఱ్ఱని మాల్యమును బూసికొని వైష్ణవయూపమును జేరి నేను చెప్పెడి ఈరెండుమంత్రములను నీవు రహస్యముగ పఠించి యగ్నిదేవుని ప్రార్థించిన నాయజ్ఞములో సిద్ధిని బొందెదవు" అని వాని కామంత్రముల నుపదేశించెను. శునశ్శేఫుడు మిక్కిలిశ్రద్ధతో వానిని గ్రహించి రాజునొద్దకుబోయి 'తొందరగ యజ్ఞమునకు వెళ్ళి మీరు దీక్షవహింపు'డని రాజుతో ననెను. అప్పుడు శీఘ్రముగ వారిరువురు యజ్ఞవాటము జేరిరి. సదస్యులయనుమతిచే రాజు యజ్ఞపశువగు శునశ్శేఫునకు నెఱ్ఱనిబట్టకట్టించి పవిత్రకర్మలజరిపి వానినియూపమున గట్టెను. అప్పుడు శునశ్శేఫుడు విశ్వామిత్రుడుపదేశించిన రెండుమంత్రములచే నింద్రుని, నుపేంద్రుని ప్రీతినొందించెను. ఆరహస్యమంత్రములకు నిందుడు సంతోషించి శునశ్శేఫునికి దీర్ఘాయువొసగెను. మహేంద్రునికృపచే రాజు యజ్ఞమును సమాప్తినొందించి గొప్పఫలమును బొందెను. విశ్వామిత్రుడు పుష్కరక్షేత్రమున 1000 యేండ్లు తపస్సుజేసెను.

తర్వాత విశ్వామిత్రుడు తపోవ్రతస్నానముజేయు నతనికి తపోఫలమిచ్చుటకు దేవతలతో బ్రహ్మ యచటికివచ్చి 'నీశుభకర్మలచే నీవు ఋషివైతి'వని వరమిచ్చి వెళ్ళిపోయెను. విశ్వామిత్రుడింకను గొప్పతపమొనర్చెను. అంతట చాలకాలమునకు నప్సరసయగు మేనక పుష్కరతీర్థముల స్నానముచేయుట కారంభించెను. మిక్కిలి సౌందర్యవతియగునామెను విశ్వామిత్రుడు చూచి మన్మథపీడను బొంది యామెతో "నీరాక బాగున్నది. నీవు నాయాశ్రమమున నిలిచి మదనమోహితుడనగు నన్నను గ్రహింపుము." అని పలికెను.

ఆమె యట్లు 10 సంవత్సరము లాతనియాశ్రమమునందు సుఖముగ కాలము గడిపెను. తర్వాత విశ్వామిత్రుడు సిగ్గుదెచ్చుకొని మిక్కిలి విచారమునొంది దేవతలుచేసినపనివలన నేను10సంవత్సరము లహోరాత్రములు కాముకుడనై నాగొప్పతపమునకు విఘ్నముచేసికొంటి నని కోపముతో నాలోచించి నిట్టూర్పుదీయుచు భయముచెంది వణకుచున్న మేనకను మంచిమాటలచే విడిచి హిమవత్పర్వతమునకు బోయెను.

తర్వాత విశ్వామిత్రుడు కామమును జయించునుద్దేశముతో నిష్ఠకలిగినబుద్ధిని బొంది యాపర్వతమునుండి పాఱుకౌశికీనదియొడ్డున వేయిసంవత్సరములు గొప్పతపస్సు జేయ, దేవతలందఱు గొప్పభయమునుజెంది ఋషులతోగలిసి 'కౌశికుడు మహర్షిపదవిని బొందవలె' నని యాలోచించిరి. బ్రహ్మ వారిమాటలను విని విశ్వామిత్రునితో 'నీగొప్పతపస్సునకు నేను సంతోషమునొంది నీకు మహర్షిపదవి నిచ్చితి'నని మంచివాక్యములనెను. దానికి విశ్వామిత్రుడు సంతోషవిషాదములనొందక బ్రహ్మకు నమస్కరించి వినయముతో "నాశుభకర్మలవలన నేనుమహర్షిత్వము బొందినపుడు నాకు నింద్రియజయము కూడ గలిగినదని తలచుచున్నా"ననిపలికెను. ఈమాటలకు బ్రహ్మ వానితో 'నీవు జితేంద్రియత్వముకలుగువఱకు యత్నింపు'మని పలికి తనలోకమునకరిగెను. తర్వాత విశ్వామిత్రు డూర్ధ్వబాహుడును,నిరాలంబుడును,(దేనిని పట్టుకొననివాడు)గాలినిభుజించువాడునునై యెండకాలమున పంచాగ్నులమధ్యను(నాలుగుదిక్కుల నగ్నియు పైనిసూర్యుడును)వర్షాకాలమున వర్షమునను,చలికాలమున నీటను నిలిచి రాత్రింబగళ్లు వేయిసంవత్సరములు గొప్పతపస్సు జేయ నింద్రునికిని, దేవతలకును చాలకంగారు పుట్టెను. వారు రంభను పిలిచి "నీవిప్పుడు కౌశికునకు కామమోహములు పుట్టించునదియు, దేవతలకు హితమైన

దియునగు గొప్పకార్యమును జరుపవలె”నని కోరిరి. ఆమె సిగ్గును జెంది యింద్రునికి నమస్కరించి వడకుచు నాతనితో “విశ్వామిత్రుడు నిశ్చయముగ నాపైని ఘోరమైన క్రోధమును జూపును. నాకు భయము కలుగుచున్నది; కాన దయచేసి నన్ను తప్పింపు”డని యనెను. దాని కిందు్రి డామె నిట్లాజ్ఞాపించెను. “నీకు భయములేదు. నాయాజ్ఞను నెఱవేర్పుము. నేనును మన్మథుడును కోకిలలమై యాతనిహృదయము నాకర్షించుచు వసంతకాలమున మంచిచెట్టుమీద నీప్రక్కను నిలిచెదము. నీవు తేజోమయురాలవై యనేకచిన్నెలు జూపుచు నాతని మనస్సు వికలముజేయుము.” ఇంద్రునియీయాజ్ఞను నామె యంగీకరించి సుందరమగురూపముతో నవ్వుచు విశ్వామిత్రునిప్రక్క నిలిచి పాడుచుండ కోకిల మంచిస్వరమున గూసెను. ముని దీనిని జూచి సందేహమునొంది యింద్రుడు దీనికి గారణమని తెలిసికొని కామక్రోధములను జయింప నిచ్ఛగించిన తన్ను రంభ లోభపఱిచినందున నామె 10,000సంవత్సరములు శిలయైయుండునని క్రోధమును బట్టలేక యామెను శపించెను. పిమ్మట నాతడు పశ్చాత్తాపమునుబొంది ‘గొప్ప తేజశ్శాలియు, తపశ్శాలియునగు బ్రాహ్మణు డామెను రక్షించు’నని పలికెను. రంభ శిలయయ్యెను. ఇంద్రుడును, మన్మథుడును వెడలిపోయిరి. విశ్వామిత్రుడు కోపముచేత తనతపమును బోగొట్టుకొనినందుకు మనశ్శాంతిలేక విచారమునొందెను. తర్వాత నతడిట్లు నిశ్చయించుకొనెను. “లోకములో నిటుపైని నేను క్రోధమును బొందను, ఏమియు బలుకను. వందలకొలదిసంవత్సరములైనను నూపిరిదీయను. నాకు తపస్సుచే బ్రాహ్మణ్యము దొరుకువఱకు విజితేంద్రియుడనై నేను శరీరమును శుష్కింపజేసెదను. ఊపిరి దీయక, భోజనముజేయక యనేకసంవత్సరము లుండెదను. ఆలాగు చేయుటవలన నవయవములు నశింపవు.”

ఇట్లు విశ్వామిత్రుడు నిశ్చయించి యుత్తరదిక్కు నవిడిచి తూర్పుదిక్కునకుబోయి వేయిసంవత్సరములు మౌనవ్రతమాచరించి గొప్పతపస్సుజేసెను. అనేకవిఘ్నములువచ్చినను నతడు క్రోధము నకు నవకాశమియ్యలేదు. అతడు కట్టగట్టిపోయెను. ఆతడు తపస్సు జాలించి యన్నము భుజించుటకు సిద్ధముగనున్న సమయమున నింద్రుడు బ్రాహ్మణరూపమున వచ్చి యాసిద్ధాన్నమును యాచించెను. ఉన్న దంతయు విశ్వామిత్రు డతనికిచ్చి భోజనములేక మౌనమువలంబించెను. తర్వాత నతడు వేయిసంవత్సరము లూపిరితీయక తపస్సు జేయుచుండ వానిశిరస్సునుండి పొగ బయలువెడలి మూడులోకము లను సంతాపమునొందించెను. అప్పుడు దేవతలు, గంధర్వులు, పన్నగులు, అసురులు, రాక్షసులు ఆతపస్సుచే కాంతిహీనులై విచారము నొంది బ్రహ్మతో నీతీరున బలికిరి. "విశ్వామిత్రునికి లోభమోహ ములు పుట్టింప ననేకవిధములగు ప్రయత్నములు జరిగినను నాతడు తపస్సుచే వృద్ధినొందుచున్నాడు. ఆతనిలో కొంచెమైనను లోపము కనబడదు. ఆతని మనస్సులోని కోరికను నెఱవేర్పకపోయిన నాతడు తపస్సుచే మూడులోకముల నశింపజేయును. దిక్కులన్నియు వ్యాకులతజెంది ప్రకాశింపకయున్నవి. సముద్రములు కల్లోలమొందు చున్నవి. పర్వతములు బ్రద్దలగుచున్నవి. భూమికంపమొందుచున్నది. గాలి మిక్కిలి కళవళముగ వీచుచున్నది. దీనికి ప్రతీకారము చేయుట మాకు తెలియదు. నాస్తికులు జన్మించుచున్నారు. మూడులోకముల వారు తమమనస్సు చంచలమగుటచే నజ్ఞానముబొందినట్లున్నారు. సూర్యునికి ప్రభ తగ్గిపోయినది. విశ్వామిత్రునికి నంతయు నాశన మొనర్చుబుద్ధి పుట్టకపూర్వమే వానిని బాగుగ సంతోషపఱుపుడు. పూర్వము కాలాగ్నివలన లోకము నశించినట్లు వానితపస్సువలన నంతయు నాశనమగుచున్నది. ఇతడు దేవరాజ్యమును గోరినను నిండు" ఇట్లు దేవతలు మొదలగువారు పలికిరి. బ్రహ్మయు, వారును

విశ్వామిత్రునియొద్దకుబోయి మంచిమాటలతో 'బ్రహ్మర్షీ! నీకు స్వాగతము. మేము నీగొప్పతపస్సునకు సంతోషించితిమి' అని యనిరి. మఱియు బ్రహ్మ 'నీవు బ్రాహ్మణ్యమును సంపాదించితివి. నేనును, దేవతలును నీకు దీర్ఘాయువు నిచ్చెదము. నీకు శుభమగు గాక! యథాసుఖముగ నీవు బొమ్మని పలుక విశ్వామిత్రుడు వారికి నమస్కరించి సంతోషముతో నిట్లువిన్నవించెను. "నాకు బ్రాహ్మణ్యమును, దీర్ఘాయువును నీయబడినపుడు ఓంకారమును, వషట్కారమును, వేదములనుగూడ సాకిందు. క్షాత్రవిద్యలోను, బ్రహ్మవిద్యలోను శ్రేష్ఠుడును, బ్రహ్మపుత్రుడునునగు వసిష్ఠుడు ఈతీరున పలికిన నాయభీష్టము నెఱవేఱును." విశ్వామిత్రుని యీకోరికకు దేవతలు వసిష్ఠుని వేడుకొన నాతడు 'నీవు బ్రహ్మర్షివగుగాక!' యనిపలికి యాతనితో సఖ్యము నొందెను. దేవతలందఱు 'నీవు బ్రహ్మర్షివి; సందేహములేదు. నీకంతయు సమకూడును.' అనిపలికి తమనిజస్థానములకు జనిరి.

## ౭వ అధ్యాయము. చంద్రవంశజులు, యయాతి.

* వైవస్వతమనువునకు 'ఇళుడను ధార్మికుడును, శ్రీమంతుడును, మంచికీర్తిగలవాడునునగు పుత్రుడుండెను. అతడు భూమినంతను తనవశముజేసికొని బాహ్లీకదేశమున ప్రజలను తనపిల్లలవలె పాలించుచు రాజ్యముచేయుచుండెను. మంచియౌదార్యముగల దేవతలును, గొప్పబలవంతులగు దైత్యులును, మహాత్ములగు నాగ రాక్షస గంధర్వయక్షులును నతనివలన భయమునొంది యతనిని బూజించుచుండిరి. అతనిరోషమునకు మూడులోకములవారును భయ

* భాగవతమున 9వ స్కంధము 11వ పద్యముప్రకారము ఇళుడు వైవస్వతుని పుత్రుడును, రామాయణము, ఉత్తరకాండ, 87వ సర్గ 3వ శ్లోకముప్రకారము కర్దమునిపుత్రుడునునై యుండెను.

పడుచుండిరి. అతడుగొప్పపరాక్రమముకలవాడును, మంచిబుద్ధిమంతుడును, గొప్పయౌదార్యముకలవాడును నైయుండెను. అతడొక చైత్రమాసమున సంతోషకరమగు సమయమున తనపరివారముతోను,చతురంగబలములతోను, వేటకుబయలుదేఱి యడవిలో లక్షలకొలదిజంతువులను జంపియు దృప్తిసిపొందకుండెను. ఇట్లతడు జంతువులనుజంపుచు కుమారస్వామిజన్మించినట్టియు, శివుడుపార్వతికి ప్రీతిజేయుటకు తాను స్త్రీరూపమునుదాల్చి యక్కడనుండు జంతువులను, పక్షులను, వృక్షములను, తనయనుచరులను గూడ స్త్రీలనుగజేసి క్రీడించుచున్నట్టియు ప్రదేశమును నిళుడు చేర నాతడును,నాతనిపరివారమునుగూడ స్త్రీలైరి. శివునిచే జరుపబడినదానికి నారాజు భయమునొంది తాను, తనపరివారము యామహాదేవుని శరణుబొందిరి. తర్వాత నుమామహేశ్వరులు పెద్దనవ్వునవ్విరి. శివుడు ఇళునిజూచి 'లెమ్ములెమ్మ'ని పలికి 'పురుషత్వము తప్ప మఱియేదైనవరమువేడు'మని యన రాజు మిక్కిలివిచారమునొంది 'యితరవరములక్కఱలే'దని పార్వతికిసాష్టాంగదండప్రణామమాచరించి తనసంపూర్ణమనస్సుతో నిట్లు స్తుతించెను."లోకములను రక్షించుదానా! వరములుకోరుజనులకు వరములిచ్చుదానా! దేవీ! నీదర్శనమువలన గొప్పలాభముకలుగును. నన్ను దయజూడుము." ఈస్తుతులను రుద్రునికి ప్రియురాలైన దేవి విని 'శివుడు వరములో సగముభాగ మిచ్చుటకును మిగిలినసగము నేనిచ్చుటకును సమర్థులము. స్త్రీపురుషరూపములలో నీవు కావలసినటుల సగమే రూపము బొందు'మని వానికి సెలవీయ నారాజు మిక్కిలి సంతోషించి 'దేవీ! నీకు నాయందు గొప్పదయకలదేని యొకమాస మాడుదానిగ నుండుటకును, నొకమాసము పురుషుడుగ నుండుటకును వరమునిమ్మ'ని కోరెను. దానికి పార్వతి యట్లేజరుగుననియు, వాడు పురుషుడుగ నుండునపుడు స్త్రీభావమేమియు నుండదనియు, నాడుదానిగ నుండునపుడు పురుషభావమేమియు నుండదనియు వరమిచ్చెను. ఇట్లు ఇళు

డొకమాసము మూడులోకములలో సాటిలేని సౌందర్యముగల స్త్రీగను, తర్వాతమాసమున పురుషుడుగను నుండెను.

ప్రథమమాసమున నిళుడు స్త్రీయై తనవాహనములనన్నిటిని విడిచి తనయనుచరులుకూడ స్త్రీలుకాగా వారితో నడవులందు శీఘ్రముగ దిరుగుచు కొండపైనంతటను చరించుచుండెను. అంతట నామెకు నా పర్వతసమీపమున మంచిపక్షులుగల సరస్సొకటి కనబడెను. దాని మధ్యను తారకు, చంద్రునికి జన్మించినబుధుడు ప్రకాశమానమగు మంచిశరీరముగలిగి, గొప్పతపస్సుజేయుచు, కీర్తిమంతుడుగను, వయస్సులోనుండుటచే కామబాధగలిగించువాడుగను నుండెను. ఇళాదేవి తనచెలికత్తెలతో నాశ్చర్యముగ నాసరస్సునీటిని కదల్చెను. దీని నాతడుచూచి మన్మథపీడితుడై తన్ను తాను మఱచి నీటను చలించెను.

చంద్రుడు
|
బుధుడు
|
పురూరవుడు

ఆత డిళను జూచి యీమె దేవతాస్త్రీలకంటె సుందరముగ నున్నదనియు, నీమె యెవతెయనియు, నిట్టిరూపముగల స్త్రీని నాగ యసుర స్త్రీలలోను, దేవతాస్త్రీలలోను, నప్సరసలలోను తాను జూచియుండ లేదనియు, నీమె తనకు భార్యయైన యెడల తా నితరులను వివాహమాడ నక్కఱలేదనియు తలచి నీటినుండి యొడ్డునకు వచ్చెను. తర్వాత నతడు తనయాశ్రమమునకు బోయి వారిని బిలిచెను. అంతట నిళయు, నామెచెలికత్తెలును నతని ప్రక్కకు బోయి నమస్కరించిరి. అప్పుడు బుధుడా చెలికత్తెలను జూచి యీమె యెవనికూతురనియు, నిక్కడికేలవచ్చెననియు, నంతయు శీఘ్రముగ దెలియజెప్పుడనియు పలుక వారు మంచిమాటలతో నామె తమరాణి యనియు, భర్తలేక యడవులలో తమతో తిరుగుచున్నదనియు దెలిపిరి. ఆ మాటలతనికి దెలియనందున నత'డావర్తనీ'యను మంత్రమునుజపించి తన దివ్యదృష్టిచే నంతయు కనుగొనెను. తర్వాత నాతడు వారికి "మీరు కింపురుషస్త్రీలై యీపర్వతభూమిని నివసింపుడు. మీరు శీఘ్రముగ

నిండ్లు కట్టుకొనుడు. మీరు కందమూలములను, పత్రములను, ఫలములను భుజించియుండుడు. మీరు కింపురుషభర్తలను బొందెదరు." అని సెలవీయ వారంద అట్లుచేసిరి. ఆస్త్రీ లక్కడనుండి వెళ్ళినతరువాత బుధు డీళాకన్యను జూచి పెద్దనవ్వు నవ్వుచు తాను చంద్రునిపుత్రుడనియు, తనయందు మంచిస్నేహముగలిగి తన్ను వరింపవలెననియు నామెను కోరెను. ఋషిస్వరూపమగు నాగ్రహమున కామె తనవారు తన్నువిడుచుటజూచి తాను తనయిష్టప్రకారము తిరుగుచుండెననియు, నతనివశమైన తన్ను పాలించి యాతనియిష్టమువచ్చినట్లు చేయవచ్చుననియు పలికెను. దీనికి బుధుడు మిక్కిలిసంతోషించి యామెతో సంభోగింప నాచైత్రమాసమంతయు నొకనిమిషముగ గడిచెను. తర్వాత బుధుడు సరస్సులోదిగి చేతులుపైకెత్తి తపస్సుచేయుచుండెను. అపుడు పురుషుడైనయిళుడు వానిని జూచి 'నాతో నీగొప్ప పర్వతమున ప్రవేశించిన నాయనుచరు లెక్కడికిబోయిరని యడిగెను. దానికాతడు ఆరాజుతో 'గొప్ప రాళ్ళవర్షముచే నీయనుచరులు కొట్టబడినపుడు నీవావర్షమునకు మిక్కిలి భయమును జెంది యా యాశ్రమమున మైమఱచి సుఖముగ నిద్రించితివి. నీవువిచారమును, భయమును విడిచి, యోరిమివహించి, యిక్కడ ఫలమూలములను భుజించి సుఖముగనుండిన నీకుశుభమగు'నని మంచిమాటలను బలికెను. ఆమాటలనువిని రాజు తన యనుచరుల నాశనమునకు మిక్కిలి దీనత్వమునొంది'నారాజ్యమునైనను విడిచెదనుగాని నాయనుచరులనువిడిచి యొకనిమిషమైనను నుండజాలను. నాపెద్దకుమారుడగు శశిబిందుడు నారాజ్యమును జేయుచున్నాడు. నేను నాయనుచరుల భార్యలకు ఈయశుభవార్త చెప్పజాలను.' అని పలికెను. వానికి బుధుడు "నీవిక్కడ సంతాపములేక నివసింపుము. నీ వొకసంవత్సరమిక్కడనుండిన నీకు మేలుకలిగించెదన"ని తెలిపెను. అట్లిళుడొప్పుకొని యొకమాసమున స్త్రీయై బుధునితో క్రీడించుచు నొకమాసమున

పురుషుడై ధర్మకార్యములు జరుపుచు నుండెను. ఇట్లు కాలము గడుపుచు తొమ్మిదవమాసమున నాతడు స్త్రీయై బుధుని తేజస్సుగల పురూరవుని కని యాతక్షణమే యాపుత్రుని బుధునిచేతిలో బెట్టెను. ఆఋషి యాసంవత్సరములో నిళుడు పురుషుడుగానున్నపుడు వానికి ధర్మయుక్తములగు మంచికథలను జెప్పెను.

ఆసంవత్సరము గడచినతర్వాత బుద్ధిమంతుడగు బుధుడు మిక్కిలిగొప్పవాడగు సంవర్తఋషిని, భృగుపుత్రుడగు చ్యవనుని, నరిష్టనేమిని, ప్రమోదఋషిని, దూర్వాసుని పిలిచి వారు సావధానచిత్తులైయుండ స్నేహధర్మముతోను, ధైర్యముతోను, వారితో నిట్లు పలికెను. 'ఈరాజు కర్దమునిపుత్రుడగు నిళుడు. ఇతనికి జరిగినసంగతి మీకు తెలియును. వీనికి శ్రేయస్సుకలుగుమార్గ మాలోచింపుడు.' ఇట్లు బుధుడు తనయాశ్రమమునపలుకుచుండ కర్దముడు బ్రాహ్మణులతో నక్కడకువచ్చెను. పులస్త్యుడును, క్రతువుతోను, వషట్కారముతోను, నోంకారముతోను నక్కడకు వచ్చెను. అక్కడిఋషులు వారివారియభిప్రాయముల దెలుప కర్దముడు తనపుత్రుని శ్రేయస్సుకొఱకు నందఱికి మిక్కిలిహితమగు మాటల నిట్లుపలికెను. 'ఈరాజునకు శ్రేయస్సుకూర్చుటకు వృషధ్వజుడగు శివుడు తప్ప నితరుడు లేడు. అతనికి నశ్వమేధముకంటె ప్రియమగు యజ్ఞము లేదు. కనుక ఈరాజు నిమిత్తము దానిని చేయుదము.' కర్దమునియీమాటలను ఋషులందఱు విని దానికొప్పుకొని యశ్వమేధము చేయుదమనిరి. అప్పుడు సంవర్తుడను రాజర్షిశిష్యుడును, శత్రువులను జయించువాడునునగు మరుత్తను ఋషి బుధునియాశ్రమసమీపమున గొప్పయశ్వమేధముచేయింపదాని చివరను రుద్రుడు మిక్కిలిసంతోషించి బ్రాహ్మణులయెదుట 'యజ్ఞమునకును, మీభక్తికిని నేను ప్రీతినొందితిని. కాన నీరాజునకు నేనేమి ప్రియమగు శుభకార్యముచేయవలెనని పలికెను. అప్పుడు బ్రాహ్మ

ణులు జాగరూకులై యిళుఁడు పూర్వమువలె పురుషుఁడగునట్లు వరము కోర శివుఁడు దాని నిచ్చి యదృశ్యుఁడయ్యెను. బ్రాహ్మణులు తమతమ నివాసములకు బోయిరి. ఇళుఁడు బాహ్లికదేశమును విడిచి మధ్యదేశమున ప్రతిష్ఠానపురమును నిర్మించెను. అతఁడు శశిబిందునకు బాహ్లికదేశమునునిచ్చి తాను ప్రతిష్ఠానపురమున రాజ్యముచేసి మరణాంతమున బ్రహ్మలోకమునకుబోయెను. తర్వాత పురూరవుఁడు ప్రతిష్ఠానపురమునకు రాజై దానిని పాలించెను.

సూర్యశాపమున నూర్వశి మనుష్యలోకమున కొంతకాలము నిలిచి పురూరవునికి భార్యయయ్యెను. ఈతనికి పుత్రులు కలిగినపిదప నామె శాపాంతమునొంది యింద్రలోకమునకు బోయెను. పురూరవుని కుమారుఁడగు నాయువునకు నహుషుఁడు జన్మించెను. ఇంద్రుఁడు వృత్రవధానంతరము జగత్తులో దిరుగుచుండ నొకలక్షసంవత్సరములు నహుషుఁడింద్రపదవినొందెను. నహుషునకు యయాతి జన్మించెను. ఇతనికి శుక్రునికూతురగు దేవయానియు, రాక్షసరాజగు వృషపర్వుని కూతురగు శర్మిష్ఠయు నిద్దఱుభార్యలు. దేవయానియందు రాజునకు దయలేకయుండెను. శర్మిష్ఠకుపూరుఁడును దేవయానికి యదువును పుట్టిరి. పూరుని మంచిగుణములచేతను, వానితల్లియందుగలప్రియముచేతను యయాతికి పూరునందుదయగలిగెను. అప్పుడు యదువునకు గొప్పదుఃఖ



ముకలుగ నన్ను తనతల్లితో “గొప్ప తేజముకలవాడును, గొప్పకర్మలు చేసినవాడును నగుభృగునివంశములో నీవు జన్మించి యిట్టిదుఃఖమును, నవమానమును సహించెదవా? మనమిద్దఱముకలిసి యగ్నిలో ప్రవేశించెదము. నాతండ్రి రాజకన్యపుత్రికతో ననేకరాత్రులుసుఖింప నిమ్ము. నీవు ఓర్పువహించి యాతనిక్షమించినను నేను క్షమింపక నిస్సందేహముగ మరణమునొందెద”నని యేడ్చుచుపలికెను. దానికి దేవయాని గొప్పక్రోధముకలిగినదై తనతండ్రినిస్మరింప శుక్రుడు తనకుమార్తె కోరికను తెలిసికొని యామెవద్దకు శీఘ్రముగవచ్చిచూడ నామెవిచారముకలదై పూర్వపుసహజస్థితిలో లేకుండెను. తండ్రి కుమార్తెనుజూచి ‘నీవిట్లుండుటకు గారణమేమి?’ యని యడుగ నామె క్రోధముతో నిట్లనెను. “నేను తీవ్రమగు విషముత్రాగికాని, యగ్నిలోపడికాని, నీటమునిగికాని మరణమునొందెదను. నాకు కలిగినయవమానమును మీరెఱుగకున్నారు. నాకు జీవించుట శక్యము కాదు. వృక్షమునకు నవమానముకలిగిన దానిపై జీవించు జంతువులు ఖేదమొందును. రాజర్షియగు నాభర్త మిమ్ములను నవమానపఱచి తిరస్కరించి నన్నుకూడ నవమానించి నన్నెక్కువగ జూడకున్నాడు.” ఇట్లు దేవయానిపలుక బ్రహ్మర్షియగు శుక్రుడు ‘నన్ను నవమానించిన కారణముచే దుర్బుద్ధియగు యయాతి గొప్పముసలితనముచే శరీరము తగ్గిపోవ మిక్కిలి బాధపడును.’ అని యయాతినిశపించి తనకూతు నోదార్చి తననివాసమునకు బోయెను.

యయాతి శుక్రునిశాపముచే గొప్ప ముసలితనముగలుగ మిక్కిలివిచారమునొంది తనపుత్రుడగు యదువుతో నిట్లనెను. “నీవు బుద్ధిమంతుడవు. నాముసలితనమును నీవు పొందుము. నేను భోగముల ననుభవించెదను. నాకింద్రియభోగములందు కోరికతీరునంతవఱకు నా యిష్టమువచ్చినటుల భోగములననుభవించి తరువాత నేను ముసలితన

మును తీసికొనెదను.” ఇట్లు యయాతిపలుక యదువువానికిట్లుప్రత్యుత్తరమిచ్చెను. “నీసమీపమునుండి నీవు నన్ను పాలదోలితివి. నాకోరికలేమియు నీవు జరుపలేదు. నీకు పూరునంటు దయకలదు. వాడు నీతో భుజించుచున్నాడు; మంచిభక్ష్యములదినుచు, మంచిమద్యముల ద్రాగుచున్నాడు; కనుక వాడే నీముసలితనమును గ్రహించును.” ఇట్లు యదువు జవాబీయ యయాతి పూరునితో ‘నాముసలితనమును నీవునాకొఱకై గ్రహింపు’మనిపలుక వాడు చేతులుజోడించి ‘ధన్యుడనైతిని. మీయాజ్ఞనుజరిపెద’ననిపలికెను. దానికి యయాతి మిక్కిలి సంతోషించి తన ముసలితనమును వానికిచ్చి వానియౌవనమును తానుబొంది వేలకొలది యజ్ఞములను జేసెను. అనేక వేలసంవత్సరములు యయాతి భూమిని బాలించితర్వాత పూరునితోనిట్లనెను. “నేను నీయందునిలిపిన ముసలితనమును నీవు తిరుగ నాకిమ్ము. నాయాజ్ఞను నీవు మన్నించినందున నేను సంతోషించితిని. నాముసలితనమును నేను గ్రహించెదను. మఱియొక తీరునజరుగదు. సంతోషముతో నీకు నేను పట్టాభిషేకము జేసెదను.” ఇట్లు యయాతి పూరునితోబలికి క్రోధముతో యదువునిట్లుశపించెను. “నీవు నాకు పుత్రరూపమునబుట్టిన గొప్పదుర్మార్గుడవగు రాక్షసుడవు. నీకు గురువువంటివాడను, తండ్రినినగు నేను ఆజ్ఞాపింప దానిని తిరస్కరించినందుకు నీవు మంచిసుతులనుబొందవు. దారుణులగు రాక్షసులు నీకు జన్మించెదరు. నీవలన చంద్రకులమందుబుట్టినవంశముండదు. నీవంశమువారు నీవలెదుర్మార్గులయ్యెదరు.” ఇట్లుయయాతి యదువునుశపించి పూరునకు పట్టాభిషేకమొనర్చి మునియాశ్రమమునుబొంది చాలకాలమునకుమరణించి స్వర్గమునకుబోయెను. కాశీరాజ్యమున ప్రతిష్ఠానపురమున పూరుడుండి రాజ్యముచేసెను. యదువు కోటనుండి, యాపట్టణమునుండి, క్రౌంచవనమునుండి రాజవంశమువారిచే పైకితోలివేయబడి వేలకొలది రాక్షసులను పుట్టించెను. యయాతిశాపమువలన యదువువంశమున కిట్టి దుర్దశవచ్చెను.

---

## ౩వ అధ్యాయము. దశరథుని పూర్వులు.

అవ్యక్తపరబ్రహ్మము లేక, నారాయణుడు.
|
బ్రహ్మ
|
మరీచి
|
కశ్యపుడు
|
వివస్వంతుడు (సూర్యుడు)
|
వైవస్వతమనువు (రాజు)
|
ఇక్ష్వాకుడు (అయోధ్యకు ప్రథమరాజు)

ఇక్ష్వాకుడు దేవతలతో సమానమగు నూర్వురుపుత్రులను గనెను. వీరిలో చివరివాడగు దండుడు మూఢుడును, విద్యలు నేర్వనివాడును నై తనయన్నలసేవింపకుండెను. వాడు దండనకు తగినవాడగుటచే వానితండ్రి వానికి 'దండు'డని పేరుపెట్టెను. వింధ్య శైవలపర్వతములకు మధ్యనుండు దేశమును చూడకుండ దండునకు పరిపాలనకిచ్చెను. ఒకపర్వత భూమియందు వాడు 'మధుమంత'మను పురమును కట్టించి శుక్రుని తనపురోహితునిగ నేర్పఱచుకొని బాగుగ రాజ్యముచేయుచుండెను. ఇట్లనేక సంవత్సరములు వాడు ఇంద్రియనిగ్రహము కలవాడై రాజ్యముచేసి కొంత కాలమునకు సుందరమగు శుక్రునియాశ్రమమునకు చైత్రమాసమున నొకదినమున వెళ్ళెను. అక్కడ వాడు శుక్రునిపుత్రికయును, మిక్కిలి సౌందర్యవతియునగు 'నరజ'యను కన్యనుజూచిదుర్బుద్ధి

శైవలపర్వతము

పై



మధుమంతము

వింధ్యపర్వతపంక్తి

కలవాడును, మన్మథపీడితుడునునై మిక్కిలి భయము పొందిన యామెతో 'నీ వెక్కడనుండి వచ్చితివి? నీ వెవనికుమార్తెవు? నేను మన్మథపీడితుడనై యిట్లడుగుచున్నా'నని యనెను. దాని కామె వినయముతో నిట్లనెను. "నేను శుక్ర మహర్షి పెద్దకుమార్తె నగు నరజను. ఈయాశ్రమమున నివసింతును. నేను నాతండ్రివశము లోనున్నందున నన్ను బలవంతముగ బట్టకుము. నాతండ్రి నీకు గురువు. నీవాతని శిష్యుడవు. అతనికి కోపముగలిగిన నీకు నతడు గొప్ప కీడు చేయును. అట్లు కాదేని నీవు ధర్మయుక్తముగ నాతండ్రిని ప్రార్థించి నన్ను వరింపుము. మఱియొకతీరున నీ వాచరించిన గొప్పవిపత్తు నొందెదవు. నాతండ్రికి క్రోధముగలిగిన నాతడు మూడులోకములనుగూడ తగులబెట్టును. నీకు నన్ను వివాహమాడవలెననియున్న నీవాతని గోరుము.ఆతడు నన్ను నీకిచ్చును." ఈమాటలను అరజ పలుకుచుండ దండుడు కాముని బారికిలోనై తనచేతులను జోడించి "నాయందు దయజూపుము. కాలవిలంబము చేయకుము. నిన్నుగూర్చి నాప్రాణములు ముక్కలగుచున్నవి. నిన్ను పొందినతర్వాత నాకు మరణము వచ్చినను, గొప్పశాపమువచ్చినను రానిమ్ము.శరీరముధరింపలేని నీసేవకుడనగు నన్ను పొందుము." అని పలికి బలవంతముగ నామెతో తన కోరికతీరునట్లు సంభోగముచేసెను. ఇట్లు దండుడు గొప్పదుర్మార్గము జరిపి శీఘ్రముగ తనపట్టణమగు మధుమంతమునకు బోయెను.

అరజ తర్వాత నేడ్చుచు నాశ్రమసమీపమున తనతండ్రికై వేచుచు నిలిచెను. అంతట నొక ముహూర్తము (2గడియలు) లో నేడ్పునువిని శుక్రుడు మిక్కిలియాకలికలవాడై తనశిష్యులతోవచ్చి దీనత్వముగ రోదనముచేయుచున్నదియు, శరీరమంతట బుగ్గికలదియు నగు నరజను జూచి యాకలిచేకూడ మిక్కిలిరోషముకలవాడై మూడు లోకములను మండించునటుల తనశిష్యులతో నిట్లనెను. "దుర్మార్గుడగు

దండుడు నాకుమార్తెను ముట్టి విపరీతకార్యమును జేసినందున వానికి వానిబలములకు;పరివారమునకుగలుగు నాశనమునుచూడుడు. 7 దినములలో రాజును, వాని సేవకులును, చతురంగబలములును నశించును. నూఱుయోజనములు విస్తీర్ణముండు వాని దేశమంతయు బుగ్గివర్షించుటచే నేదియు కనబడకుండునట్లు నశించును.” ఇట్లు శుక్రుడు దండునికి శాపమిచ్చి తనయాశ్రమముననుండు ఋషులకు ‘మీరు ఈదేశము చివరకుపొండని సెలవీయ వారట్లుచేసిరి. తర్వాత నతడు అరజనుజూచి “నీవు నాయాశ్రమమున నిలిచి ఒకయోజనముదూరము మంచి పెద్ద సరస్సుగనగుము. కాలము నిరీక్షింపుము. సరస్సునమీపమున నిలుచు జంతువులుబుగ్గివర్షముచే నాశనమొందవ”ని యామెకు సెలవీయ దుఃఖముతో నామెయట్లుచేసెను.అతడుతనయాశ్రమమును మఱియొకచోట కట్టెను.అతని శాపప్రకారము దండుని రాజ్యము పాడై ‘దండకారణ్య’ మను పేరొందెను. ఋషులు నిలిచినచోటునకు ‘జనస్థాన’మని పేరు కలిగెను.

హిందూదేశపటమున వింధ్యపంక్తి,ఇందూరు, భోపాల మధ్యపరగణాల దేశములలోనున్నను నది బండల్‌ఖండు, రీవా, చోటానాగపూర్ ప్రదేశములలో విస్తరించియుండుటచే హిందువులు దీనినంతను వింధ్యపంక్తిగ పరిగణించుచున్నారు. దీని నిడుపంతయు సుమారు 800 మైళ్ళు. ఇది దండుని దేశపునిడుపుతో సరిపోవుచున్నది. శైవలపర్వతమనునది సంయుక్తరాష్ట్రములకు దక్షిణసరిహద్దుగను, రీవాదేశమునకు నుత్తరసరిహద్దుగను మేము నిర్ణయించియున్నాము. ఈమధ్యనుండు ప్రదేశము దండకవనమనునది యిందూరు, భోపాల, మధ్యపరగణాలు, బండల్‌ఖండు, రీవా, చోటానాగపూర్ దేశములలో నుండినటులను, దానికి నుత్తరభాగమున జనస్థానముండినటులను మేము నిశ్చయించి యావలిపుటయందు పటములో జూపియుంటిమి.

ఇక్ష్వాకుడు
కుక్షి
వికుక్షి
బాణుడు
అనరణ్యుడు ♦
పృథువు
త్రిశంకుడు *
దుందుమారుడు (లేక) యువనాశ్వుడు
మాంధాత ♦‡

ఇక్ష్వాకునొక్క మఱియొకపుత్రునివలన ప్రక్కను జూపిన వంశవృక్షప్రకారము వాని వంశము వృద్ధి నొందెను. అందు మాంధాతచక్రవర్తి గొప్పబలవంతుడును, మూడులోకములందు ప్రఖ్యాతిగల వీర్యవంతుడును నైయుండెను. అతడు భూలోకమంతయు జయించి పిదప దేవలోకమును జయింపయత్నించుచుండెను. అందుచే నింద్రునకును, దేవతలకును గొప్పభయము కలిగెను. దేవతలచేపూజింపబడు నతడు ఇంద్రునియర్ధాసనమును, నతని రాజ్యములో సగమును పొందుటకు ప్రతిజ్ఞజేసి స్వర్గమునకుబోయెను. అతనిపాపబుద్ధిని నింద్రుడు తెలిసికొని యాతనితో మంచిమాటల నిట్లనెను. "రాజా! నీవు మనుష్యలోకమునంతను వశముచేసికొనకయే దేవరాజ్యము నిక్కడ కోరుచున్నావు. భూలోకమంతయు నీస్వాధీనమైన యెడల నీవు దేవరాజ్యమును నిక్కడ నీవారితో నేలవచ్చును." ఇట్లింద్రుడు పలుక మాంధాత 'తనయాజ్ఞను మనుష్యలోకములో విననివాడెక్కడనున్నా'డని యడిగెను. దానికింద్రుడు 'మధువనములోనున్న మధుపుత్రుడగు లవణా

---

♦ ఇతనికి, రావణునికి జరిగినయుద్ధము రావణునిచరిత్రమున చూడుము.

‡ బ్రహ్మాండపురాణప్రకారమితడు వైవస్వతమనువు 1౮వ మహాయుగపు త్రేతాయుగమున జన్మించెను.

* ఈతడు హరిశ్చంద్రునితండ్రియగు త్రిశంకుడుకాడు. ఆతనిచరిత్రము విశ్వామిత్రునికథలో కనబడును. ఈత్రిశంకు డాతనికి ముందుజన్మించి యావంశములో పేరును పొందియుండును.

సురుడు నీయాజ్ఞను వినుడని ప్రత్యుత్తరమీయ మాంధాత సిగ్గుపడి తలవంచుకొని వానికి జవాబియ్యలేక యింద్రునివద్ద సెలవుపుచ్చుకొని భూలోకమునకు వెళ్లెను. అతడు లవణునిపై క్రోధముకలిగి వానితోయుద్ధముచేయుటకుముందుగ వానియొద్దకు దూతనొకని బంపెను. వాడు లవణునితో విప్రియములగుమాటలుపలుక నారాక్షసుడు వానిని తినివేసెను. దూత తిరిగిరాకపోవుట మాంధాత చాల కాలము చూచి క్రోధముగలిగి లవణునిపై బాణవర్షముకురిపించెను. దానికి వాడు పెద్దనవ్వునవ్వుచు మాంధాతపైని, యతనిసేనపైని తనశూలమును విసరెను. అది వారిని నాశనముచేసి తిరుగ లవణుని చేతికి వెళ్లెను. మాంధాతవంశమునకై యీక్రిందివంశవృక్షమును జూడుము.







అసితుడు హైహయ తాలజంఘాదులవలన తనరాజ్యమును గోలుపోయి హిమవంతము జేరి భృగుమహామునివంశజుని సమక్షమున నొక యింట్ల కాల్వవద్ద తనమంత్రులతో నివసించెను. అతనికిద్దఱు

భార్యలు కలరు. వారు గర్భముధరించిరి. ఒకదానిగర్భము పోవుటకు మఱియొకతె యామెకు విషము నిచ్చెను. రాజుభార్యలలో కాళిందియను నొకభార్య సుతునిగోరి చ్యవనమహాఋషికి నమస్కరింప నత డామెతో నామెయుదరమునుండి గొప్పబలవంతుడును, తేజస్కుడును, సదృష్టవంతుడునునగు పుత్రుడు స్వల్పకాలములో జన్మించుననియు, నాశిశువు విషముతోజేరినను నామెవిచారింపనవసరము లేదనియు పలుక పతివ్రతయగునామె ఋషికి నమస్కరించెను. తరువాత నామె తనభర్త మరణమునొంద ఋషిప్రసాదముచే నొక పుత్రుని గనెను. సపత్నిచే గర్భనష్టముకొఱకు విషమియ్యబడ నావిషముతోజేరి పుట్టుటచే నాశిశువునకు 'సగర'అనునామ మియ్యబడెను. (గరము=విషము)

సగరుడు ధర్మముగ నయోధ్యనేలుచుండెను. అతడు పుత్రులనుగోరి విదర్భరాజుకుమార్తెయును, ధర్మాత్మురాలును, సత్యవచనములు పలుకునదియునునగు కేశిని యనుదానిని జ్యేష్ఠభార్యగను, కాశ్యపునిపుత్రికయును, మిక్కిలిసౌందర్యవతియును, గరుత్మంతునితోబుట్టువునునగు సుమతిని రెండవభార్యగను బెండ్లాడెను. ఆతడు హిమవత్పర్వతమున తనభార్యలతో భృగునియాశ్రమమున 100 సంవత్సరములు గొప్పతపము జేసెను. భృగు వాతపస్సునకు మెచ్చి వానికిట్లు వరమిచ్చెను. "నీకు గొప్పసంతానము కలుగును. నీకొక భార్యయందు వంశోద్ధారకుడగు పుత్రుడొకడు పుట్టును. మఱియొక భార్యయందు 60,000మంది జన్మించెదరు." ఈవరమును నతని భార్యలువిని ఋషికి నమస్కరించి "మాలో నెవరి కెట్టిపుత్రులు జన్మించెదరు?" అని ప్రశ్నించిరి. దాని కాతడు 'మీరు మీకోరికను తెలియబఱపు'డన కేశిని తనభర్తయెదుట వంశకరుడగు పుత్రుని

గోరెను. సుమతి కీర్తిమంతులును, సుత్సాహముకలవారును నగు 60,000పుత్రులను గోరెను, తర్వాత సగరుడు ఋషికి నమస్కరించి తన భార్యలతో నయోధ్యకు బోయెను. కొంతకాలమునకు కేశినికి 'అసమంజసుడు' జన్మించెను. సుమతికి గర్భపిండము పుట్టెను. దానిని విభజింప దానినుండి 60,000 పుత్రులు పుట్టిరి. వారిని నేతితోనిండిన కడవలలోనుంచి దాదులు వృద్ధిపొందించుటచే జాల కాలమునకు వారికి యౌవనరూపము వచ్చెను. అసమంజసుడు ప్రతిదినము పట్టణములోని బాలురను సరయూనదిలో పడవైచి వారినిజూచి నవ్వుచు స్నానముచేయుచుండెను. వాడు పాపాచరణ కలిగి సజ్జనులను బాధించుటచేతను, పట్టణవాసులకు చెడ్డకలిగించుట చేతను పట్టణమునుండి తోలివేయబడెను. అసమంజసునికి 'అంశుమంతు'డను పుత్రుడు కలడు. వాడు ప్రియవచనములు పలుకువాడగుటచే ప్రజలకందఱికి నిష్టుడయ్యెను. తర్వాత చాలకాలమునకు సగరునకు యజ్ఞముచేయు తలంపు గలుగ నాతడు దానినారంభించెను.

శంకరునిమామ హిమవంతుడు. ఆతనికిని వింధ్యునకును నడ్డులేకపోవుటచే వారొకరినొకరు చూచుకొనుచుందురు. వీరికి మధ్యనుండుదేశములో యజ్ఞములు చేయబడినవి. యజ్ఞములనుచేయుటకు అది ప్రశస్తమైనభూమియై యున్నది. సగరుని కోరికప్రకారము మహారథుడును, విలువిద్యలోగొప్పవాడునునగు నంశుమంతుడు యజ్ఞాశ్వమును రక్షించుచుండెను. యజ్ఞపర్వదినమున మహేంద్రుడు రాక్షసరూపముతో వచ్చి యాయశ్వమును హరించెను. దానికి ఋత్విక్కులు అశ్వమును హరించినవానిని హింసించి దానిని తేవలెననియు, యజ్ఞలోపముకలిగిన తమకందఱకు కీడుకలుగుననియు, నట్టిది జరుగకుండ తమరు యజ్ఞముచేయవలెననియు పలికిరి. సగరు డీమాటలనువిని

యాగసభలో తన 60,000 పుత్రులతో నిట్లు పలికెను. "యజ్ఞము మంత్రవేత్తలగు మహానుభావులచే జరిపింపబడుచున్నది. అశ్వమును హరించిన రాక్షసుడు వెళ్ళుట నేను చూచియుండలేదు. మీరు వెళ్ళి సముద్రముచే చుట్టబడియున్న యీ పృథివినంతను వెదకుడు. ఒక్కొక రొక్కొక యోజనము చొప్పున గుఱ్ఱము దొరకువఱకు భూమిని త్రవ్వి యశ్వమును హరించినవానిని వెతకుడు. నేను నా మనుమని తోను, ఋత్విక్కులతోను గుఱ్ఱము దొరకువఱకు నిక్కడ దీక్షతో నుండెదను. మీకు శుభమగుగాక!" అని సగరుడు పలుక బలశాలు రగు నా రాజపుత్రులు తమతండ్రియాజ్ఞప్రకారము సంతోషముతో భూమిని త్రవ్వుటకు వెళ్ళి యాతడు చెప్పినటుల వజ్రతుల్యములగు తమగోళ్ళతోను, శూలములతోను, వాడియైనవియు, గట్టివియునగు నాగళ్ళతోను దానిని త్రవ్విరి. అంతట భూమి మొఱలిడెను. నాగులను, నితరజంతువులను, నసురులను, రాక్షసులను సగరపుత్రులు చంప వారు గొప్పధ్వనులు జేసిరి. ఇట్లు వారు 60,000 యోజనములు పర్వతములతో నిండిన జంబూద్వీపమును రసాతలమువఱకు త్రవ్వి తిరుగుచుండిరి. అంతట దేవతలును, గంధర్వులును, నసురులును, పన్నగులును చలించినమనస్సులతో బ్రహ్మయొద్దకుపోయి నతనికి నమస్కరించి విచారముతో "సగరకుమారులు భూమినంతయు ద్రవ్వి వీరే మాయశ్వమును హరించి తెచ్చిరని పలుకుచు పాతాళనివాసుల ననేకులను జంపిర"ని తెలిపిరి.

బ్రహ్మ వారినిజూచి యిట్లుపలికెను. "సగరపుత్రులు కపిలుని కోపాగ్నిచే నశించెదరు. పృథ్వికి ప్రభువగు విష్ణువు కపిలరూపమును బొంది యెల్లప్పుడా భూమిని ధరించుచుండును. దీర్ఘజీవులుకానిసగర పుత్రులు భూమిని త్రవ్వుటచే వారిని నంతమునొందించుటయే సనాతనధర్మము." ఇట్లు బ్రహ్మపలుక ఏకాదశరుద్రులును, అష్టవసువు

లును, ద్వాదశాదిత్యులును, అశ్వినీదేవత లిరువురును (మొత్తము 33 దేవతలు) సంతోషించి తమయిండ్లకు బోయిరి. భూమిని త్రవ్వు సగరపుత్రులకు పిడుగువలె గొప్పశబ్దము వినబడెను. ఇట్లు సగర పుత్రులు భూమిని త్రవ్వి తరువాత భూమికిప్రదక్షిణముచేసి తమ తండ్రియొద్దకు బోయి యిట్లు విన్నవించిరి. "భూమినంతటిని జుట్టబెట్టితిమి. దేవ దానవ రాక్షస పిశాచ నాగ కిన్నరులలో బలవంతుల జంపితిమి. గుఱ్ఱముకాని, దానిని దొంగిలించినవాడుగాని మాకు కనబడలేదు. మే మేమి చేయవలయునో మా కాలోచన చెప్పవలెను." సగరపుత్రులయొక్క యీమాటలను విని సగరుడు కోపించి "గుఱ్ఱపు దొంగ దొరకువఱకు ననేకపర్యాయములు మీరు భూమిని త్రవ్వి వానిని బట్టుకొని మీకార్యము నెఱవేర్చుకొని తిరిగి రావలెను" అని వారికి నుత్తరువిచ్చెను. దానిప్రకారము వారు రసాతలమునకు వేగిరముగబోయి దానిని త్రవ్వ నచ్చట పర్వతములతోను, వనములతోను, పూర్తిగనుండు భూమిని తలతో మోయునదియు, పర్వతము వలెనుండునదియు నగు 'విరూపాక్ష' మనెడు దిగ్గజము వారికి గనబడెను. ఆమహాగజము పర్వకాలములందు తనయాయాసము తీర్చుకొనుటకు విచారముతో తనతలను గదల్ప నపుడు భూమి కంపము నొందును. ఆదిగ్గజమునకు సగరపుత్రులు ప్రదక్షిణముచేసి తూర్పు దిక్కున త్రవ్విరి. తరువాత దక్షిణమున త్రవ్వ నక్కడకూడ పైకీరున భూమిని మోయు 'మహాపద్మ' యను దిగ్గజము వారికి గనబడెను. వా రాశ్చర్యమునుబొంది దానికి ప్రదక్షిణముచేసి పశ్చిమమునకు వెళ్ళిరి. అక్కడకూడ త్రవ్వ 'సౌమనస' మనెడు దిగ్గజము



వారికి గనబడెను. వారు దానికి ప్రదక్షిణము చేసి కుశలమడిగి యుత్తర మునకు వెళ్ళిరి. అక్కడ త్రివ్వి వారు మంచువలె తెల్లనిదియు, గొప్ప శరీరముతో భూమిని మోయునదియు నగు 'భద్ర' మను దిగ్గజమును చూచి దానిని ముట్టి ప్రదక్షిణము చేసి రసాతలమును త్రివ్విరి. తరువాత నీశాన్య దిక్కునకు సగరపుత్రులు వెళ్ళి కోపముతో భూమిని నక్కడ త్రవ్విరి. అక్కడ సనాతనుడును, వాసుదేవుడునునగు కపిలుని సగరపుత్రులు చూచి యాతనికి దగ్గఱగ మేయు గుఱ్ఱమును గూడ జూచి మిక్కిలి సంతో షించి యాతడే దానిని హరించెనని భావించి కోపముగలవారై గున పములతోను, నాగళ్ళతోను, చెట్లతోను, శిలలతోను 'నిలునిలు' మని పలుకుచు నాతని నెదుర్కొని "నీవు మా యజ్ఞాశ్వమును హరించితివి. మమ్ము సగరపుత్రులుగ దెలిసికొనుము." అని పలికిరి. ఇట్లు వారు పలుక కపిలుడా మాటలను విని గొప్ప కోపముతో హుంకారము జేసెను. దానిచే సగరపుత్రు లందఱు నశించిబుగ్గయిరి. వీరు త్రవ్విన గోతులు నీటితో నిండి 'సాగర' మను నామము వహించి సముద్రముగ నయినవి.

సగరుడు చాల కాలముక్రిందట వెళ్ళిన తనపుత్రులు తిరిగి రాక పోవుట నాలోచించి తనకు మనుమడును, తేజస్సుచే వెలుగువాడును నగు నంశుమంతుని పిలిచి యిట్లు పలికెను. "నీవు శూరుడవు. విద్యలు నేర్చినవాడవు, తేజస్సులో పూర్వము జన్మించిన నీవంశము వారితో సమానుడవు; కనుక నీవు నీపినతండ్రులు వెళ్ళిన మార్గమున వెళ్ళి యశ్వమును హరించినవానిని వెతకుము. భూలోకముక్రిందినుండు లోకములలో గొప్ప బలముగలవారుందురు. వారితో యుద్ధము చేయు సమయము వచ్చినపు డుపయోగమగునటుల విల్లును, కత్తిని బట్టు కొని వెళ్ళుము. నమస్కరింప దగినవారికి నమస్కరించుచు, విఘ్న ములు చేయువారిని జంపుచు నీ కార్యమును నెఱవేర్చుకొని నా యజ్ఞ

మును పూర్తి జేయుటకు మఱలిరమ్ము." ఇట్లు సగరుఁడు పలుక నంశుమంతుఁ డట్లు ధనస్సును, ఖడ్గమును బట్టి బయలుదేఱి తనపినతండ్రులు త్రవ్విన రసాతలములోని గోతులను జూచుచు వెళ్ళి దైత్య దానవ రాక్షస పిశాచములచేతను, పక్షులు, పాములు మొదలగువానిచేతను పూజింపబడుచున్న దిగ్గజమునుజూచి దానికి ప్రదక్షిణముచేసి తనపినతండ్రులవృత్తాంతమును, గుఱ్ఱపువృత్తాంతమును దాని నడుగ నది 'నీవుకృతార్థుఁడ వయ్యెదవు. గుఱ్ఱముతో వచ్చెద'వని యనెను. ఈతీరున నన్నిదిగ్గజముల నంశుమంతుఁ డడుగ నవి యట్లే పలికెను. తర్వాత నతఁడు పినతండ్రులు బుగ్గయిపడినచోటికి వెళ్ళి వారి మరణమునకు విచారించి, దగ్గఱను మేయుచున్న గుఱ్ఱమునుజూచెను. అంశుమంతుఁడు సగరపుత్రులకు జలక్రియచేయఁదలచి నీరెక్కడను గానక తనదృష్టిని నిపుణముగ ప్రసారించి, తనపినతండ్రుల మేనమామయగు గరుత్మంతునిజూచెను. అతఁడు వానిని జూచి యిట్లుసలహా చెప్పెను. "వీరి మరణములోకసమ్మతము; గనుక నీవు విచారింపవలదు. వీరు మహానుభావుఁడగు కపిలునిచే నాశనమునొందిరి. వీరు పరలోకమును బొందుటకు ఈయుదకక్రియ నీవు చేయవలదు. హిమవంతుని జ్యేష్ఠపుత్రికయగు గంగలో వారికి నుదకక్రియ జేయుము. లోకపావనియగు గంగతో వీరి భస్మమును దడిపినయెడల వీరు 60,000 మంది స్వర్గమునకు వెళ్లెదరు. నీవు గుఱ్ఱమునుతీసికొని వెళ్ళి నీతాతయజ్ఞమును పూర్తిచేయింపుము." ఇట్లు గరుత్మంతుఁడు వానికి సలహాచెప్ప నాప్రకార మంశుమంతుఁడు గుఱ్ఱమును వేగముగ తనతాతకిచ్చి, జరిగినవృత్తాంతమును దెలిపి, యజ్ఞమును పూర్తినొందించెను. సగరుఁడు తనయజ్ఞమును బూర్తిచేసి యయోధ్యకువచ్చెను. కాని గంగను తెచ్చుటకు యత్నింపలేను. చాలకాలము సగరుఁడు జీవించి 30,000 సంవత్సరములు రాజ్యముచేసి స్వర్గస్థుఁడయ్యెను.

ఈతనివంశము ఈక్రిందివంశవృక్షము ప్రకారము వృద్ధినొందెను.

సగరుడు

|

అసమంజసుడు

|

అంశుమంతుడు

*ప్రజలీతనిని రాజుగ గోర 32,000సంవత్సరములు రాజ్యము చేసి దానిని కుమారునకిచ్చి హిమవత్పర్వతమున తపస్సుచేసి స్వర్గస్థుడయ్యెను.

|

దిలీపుడు

ఇతడు గంగను తెచ్చుటకు నాలోచించెను; గాని ప్రయత్నము చేయలేదు. 30,000సంవత్సరములు రాజ్యముచేసి స్వర్గస్థుడయ్యెను.

|

భగీరథుడు

రాజర్షియు, ధార్మికుడును, గొప్పతేజశ్శాలియునగు భగీరథుడు పుత్రులులేనివాడై పుత్రులనుకోరి రాజ్యము మంత్రులందుంచి గంగనుతెచ్చుశ్రద్ధతోనుండెను. ఆతడు హిమవత్పర్వతపాదపర్వతముననున్న గోకర్ణమునకుబోయి యూర్ధ్వబాహుడై యింద్రియములను జయించి మాసమున కొకసారి భుజించుచు నాలుగు దిక్కులనగ్నియు పైనిసూర్యుడునుండ (పంచాగ్నులమధ్య) తపస్సు చేసెను. ఇట్లు 1000సంవత్సరములు గొప్పతపస్సుచేయ బ్రహ్మ దేవగణములతో వచ్చి యతనితో 'నీగొప్పతపమునకు మెచ్చితిని, వరమడుగు'మని పలికెను. భగీరథుడు బ్రహ్మకు చేతులుమోడ్చినమస్కరించి "మీరు నాయందు దయగలదేని, నాతపస్సునకు ఫల

* బాలకాండ42వ సర్గలో నంశుమంతుడు 32,000సంవత్సరములు తపస్సు చేసెనని వర్ణింపబడినది. ఇది సమంజసముగాలేనందున నత డంతకాలము రాజ్యము చేసెనని చరిత్రలోదెలిపితిమి.

ముండెనేని సగరకుమారులయొందటిభస్మములు నేను తెచ్చుగంగా జలమువలన నెల్లప్పుడుతడిసిన వారక్షయమైన స్వర్గమునుబొందుదురు గాక! ఇక్ష్వాకువంశము నాశనములేనిదై యెల్లప్పుడు సంతతిని పొందు గాక!" అని వరములను వేడెను. బ్రహ్మ 'యట్లగుగాక' యని వరములిచ్చి యిట్లుసెలవిచ్చెను. 'ఈగంగ హిమవంతుని జ్యేష్ఠపుత్రిక. దానినిధరించుటకు శివుడేశక్తుడు. అతనిని నీవు ప్రార్థింపుము. గంగాపతనమును భూమిభరింపలేదు. శివునితప్ప దానిని భరించువానినింకొకనిగానను.' ఇట్లుబ్రహ్మపలికి గంగతో నీసంగతులను జెప్పి దేవగణములతో స్వర్గమునకువెళ్లెను.

తరువాత భగీరథుడు తనకాలిబొటనవ్రేలున నిలిచి యొక సంవత్సరము తపమాచరింప నుమాపతి ప్రత్యక్షమై యతనితపస్సునకు తాను సంతోషించెననియు, వానికోరికజరుపుననియు, గంగను తాను ధరించుననియు రాజునకు సెలవిచ్చెను. అంతట సర్వలోకములకు మాననీయురాలగు నాగంగ గొప్పరూపమునుబొంది యాకాశమునుండి వేగమునను, బలముగను శివునిశిరస్సున బడెను. గంగ తనప్రవాహముతో శివునితీసికొని పాతాళమునకు వెళ్లుట కాలోచింప నాతడు దాని గర్వమును దెలిసికొని కోపించి దానిని కనబడకుండునటులచేయుట కాలోచించి తనజటామండలముమధ్యనున్న నందులో దానినుంచెను. అక్కడనుండి గంగ భూమికి వెళ్ళుటకు ప్రయత్నముచేసియు శక్తిలేనిదై యూరుకొనెను. ఆమె జటలసమూహముచే మోహితురాలై పైకివెళ్ళలేక యక్కడనే యనేకసంవత్సరములు తిరుగుచుండ భగీరథు డామెను జూడలేక తిరుగ గొప్ప తపస్సు చేసెను. దానికి శివుడు మిక్కిలిసంతోషించి గంగను బిందుసరస్సున విడిచెను. అక్కడనుండి గంగ యేడుపాయలాయెను. భగీరథుడు వెలింగెడు రథముతో ముందువెళ్ళ గంగయొక్కయొక

పాయమాత్రమే యాతని వెంబడించెను. మిగిలినవానిలో మూడు పాయలు తూర్పునకును, మూడుపాయలు పశ్చిమమునకును ప్రవహించెను. దేవఋషులు, గంధర్వులు, యక్షులు, సిద్ధులు దీనినంతను జూచుచుండిరి. దేవతలు విమానములమీదను, గుఱ్ఱములమీదను ఏనుగులమీదను నుండి దీనిని జూచుచుండిరి. గంగలో చేపలు, హంసలు మొదలగు నీటిజంతువులు విహరించుచుండెను. గంగ కొన్నిచోట్ల మిక్కిలితొందరగను, కొన్నిచోట్ల వంకరగను, కొన్నిచోట్ల తిన్నగను, కొన్నిచోట్ల భూమిలోనికి నణగియుండియును, కొన్నిచోట్ల పైకిలేచియును, కొన్నిచోట్ల మెల్లమెల్లగను పాఱెను. గంగోదకము నిర్మలమును, పాపహరణమును నగుటచే దేవఋషులును, గంధర్వులును, భూతలవాసులును శివునిశిరస్సునుండి జారిన గంగ 'పవిత్ర'యని దానిలోస్నానము జేసిరి. స్వర్గమునుండి శాపములచే భూలోకమునకు వచ్చినవారు గంగలోస్నానముచేసి తమపాపముల బోగొట్టుకొని తమతమలోకములకు జనిరి. భగీరథునివెంట గంగయు, నామెవెనుక దేవతలు, ఋషులు మొదలగువారును వెళ్లుచుండిరి. అప్పుడు జహ్నుమహర్షి తనయజ్ఞవాటమును ముంచివేయుచుప్రవహించు గంగనుజూచి దానిగర్వమునకు కోపించి యా గంగను బూర్తిగ త్రాగివేసెను. దేవతలు, ఋషులు మొదలగువారతనిని వేడ నాతడు దానిని తనపుత్రికావాత్సల్యముచే తనచెవులనుండి విడిచెను. అందుచే గంగకు 'జాహ్నవి'యను పేరుకలిగెను. భగీరథుని వెనుక గంగ సగరపుత్రులు భస్మమైపడియుండినస్థలమునకు వచ్చి యాభస్మముపై ప్రవహించెను. గంగాజలముతో సముద్రము నిండెను. అప్పుడు బ్రహ్మ ప్రత్యక్షమై భగీరథునితో నిట్లుపలికెను. "60,000సగరపుత్రులు తరించిరి. సముద్రములో జలముండునంతకాలము సగరపుత్రులు స్వర్గలోకమున నుండెదరు. గంగ భగీరథుని

ప్రథమపుత్రికగ నెంచబడి 'భాగీరథి' యను నామ మొందును. గంగ 'దివ్య' యనియు, మూడులోకములందు పాఱుటచే 'త్రిపథగ' యనియు నామములనొందును. నీవు నీపూర్వులకు నుదకక్రియ జేసి నీప్రతిజ్ఞను నెఱవేర్చుకొనుము. నీతండ్రి మొదలగువా రిట్లుచేయలేకపోయిరి. నీవు గంగలోస్నానముచేసి సగరపుత్రులకు నుదకక్రియ జేయుము." ఇట్లు బ్రహ్మ పలికి తనలోకమునకు వెళ్ళెను. భగీరథుడు యథావిధిగ తనపూర్వులకు నుదకక్రియజరిపి తనయయోధ్యాపట్నము చేరెను. (ఆతనివంశీయులను నీక్రిందివంశవృక్షమున జూడుము.)

భగీరథుడు
|
కకుత్థ్సుడు
|
రఘువు
|
*ప్రవృద్ధుడు(లేక కల్మాషపాదుడు)

కల్మాషపాదుడగు ప్రవృద్ధునకు 'సౌదాసుడు' (సుదాసునిపుత్రుడు)అనునామాంతరమున్నట్లుకన బడుచున్నది. ఇతనికి 'మిత్రసహు'డని మఱియొక నామముకలదు. ఇతడు చిన్నతనమున వేటాడు సమయమున నిద్దఱురాక్షసులను జూచెను. వారు గొప్పపులులరూపముతో సంచరించుచు వేల కొలదిమృగములను తినుచు, వనమును పాడు చేయుచు నుండిరి. అయినను వారికి సంతుష్టి లేకుండెను. వారిట్లు వనములో మృగములు లేకుండునట్లు వానిని బరిమార్చుట సౌదాసుడు చూచి గొప్పక్రోధముతో వారిలో నొకనిని గొప్పబాణముతో కొట్టిచంపెను. దానితో సౌదాసుడు కోపమును విడిచి చచ్చినరాక్షసుని జూచెను. రెండవరాక్షసుడు

* రామాయణము బాలకాండ70సర్గలో భగీరథునకు కకుత్థ్సుడును, నతనికి రఘువును, నతనికి కల్మాషపాదుడని పేరొందిన ప్రవృద్ధుడును, వానికిశంఖణుడును జన్మించినట్లు వర్ణింపబడినది. ఉత్తరకాండ65సర్గలో 'సుదాసు'డనువానికి సౌదాసుడు జన్మించి 'కల్మాషపాదు'డని నామముబొందినటు లున్నది. ఆంధ్రభాగవతము 9వ స్కంధము 236 గద్యములో ఋతుపర్ణునకు సర్వకాముండును, నతనికి సుదాసుండును జన్మించినట్లును నీతడే కల్మాషపాదుడును నని వ్రాయబడియున్నది. వంశవృక్షమెట్లున్నను నీరాజు దశరథునికి పూర్వుడనుసంగతి నిశ్చయము. ఇతని చరిత్ర మిక్కడ జూపితిమి.

మిక్కిలివిచారమునొంది సౌదాసునితో నిట్లనెను. "ఏమియు నపరాధము చేయని నా స్నేహితుని నీవు చంపితివి. పాపబుద్ధిగలవాడా! దానికి తగినపని నేను చేసెదను." ఇట్లు రాక్షసుడుపలికి వానికి కనబడకుండ పోయెను. తరువాత కొంతకాలమునకు సౌదాసుడు రాజ్యమునకు వచ్చెను. ఆతడు వాల్మీకి యాశ్రమమునకు సమీపమున నొక యాశ్రమ మేర్పఱచి యం దశ్వమేధమును తనకులగురువగు వసిష్ఠుని సహాయముచే ననేకసంవత్సరములు దేవయజ్ఞమువలె గొప్పవైభవముగ జరుపుచుండెను. రాజునకు విరోధియగు రాక్షసుడు తన పూర్వవిరోధము తలంచుచు యజ్ఞాంతమున వసిష్ఠరూపమును బొంది రాజుతో నిట్లనెను. "ఈయజ్ఞము సమాప్తమైనది. నాకు మాంసముతో గూడిన భోజనము శీఘ్రముగ నిప్పుడు పెట్టవలెను. మఱియేమియు నాలోచింపవలదు." ఇట్లుమాయవసిష్ఠుడు పలుక రాజు తనమంచి వంటలవానినిబిలిచి "అన్నమును, మాంసమును రుచిగవండి నాగురువు సంతోషించునటుల నతనికి భోజనము పెట్టుము." అనియాజ్ఞాపించెను. ఆవంటలవాడు రాజాజ్ఞప్రకారము తొందరపడినమనస్సుతో నట్లు తయారు చేసెను. అప్పుడు రాక్షసుడు వంటలవాని వేషము వేసికొని రాజునకు మనుష్యమాంసముతో గూడిన యన్నమునుజూపి 'ఇదిగో మంచియన్నము, మాంస'మని రాజునకునీయ నతడును, నతనిభార్య మదయంతియు వసిష్ఠునికి దానిని వడ్డించిరి. ఋషి దానిలో 'మనుష్య మాంసముకలిసిన'దని తెలిసికొని గొప్పక్రోధముకలవాడై "యేకారణముచే నీవు నాకు మనుష్యమాంసభోజనము పెట్టుటకు కోరితివో యాకారణముచేత నీ కట్టిభోజనము సందేహము లేకుండ గలుగు" నని యారాజును శపించెను. అందుచే సౌదాసుడును గొప్ప గ్రోధమునుబొంది నీటినిబట్టి వసిష్ఠునికి ప్రతిశాపమిచ్చుటకు సిద్ధముగ నుండ వానిభార్య వానినాటంకపఱచి "రాజా! భగవంతుడును, ఋషియునగువసిష్ఠుడు మనకు ప్రభువు. దేవునితో సమానుడగు మనపురోహితునికి నీవు ప్రతిశాపమీయదగ"దనిపలికెను. తరువాత తేజోబల

ములతోఁగూడిన నాశాపపునీటిని ధర్మాత్ముఁడగు రాజు తనపాదముల మీఁద జల్లుకొనెను. అప్పటినుండి యాతనిపాదములు కల్మాషమునొంది చెడిపోవుటచే నతఁడు 'కల్మాషపాదు'డను నామమొందెను. తరువాత రాజు తనభార్యతోఁగూడ వసిష్ఠునికి మాటిమాటికి నమస్కరించుచు 'మీయాపముతో రాక్షసుఁడు పలుకుటచేతను, వానిమాయచేతను నట్లు జరిగినది. కాని నేను మీకు నపరాధము చేసియుండలేఁదనివిన్న వించెను. ఈసంగతుల నాఋషివిని తాను రోషముచే పలికినమాటలు వృథకానేరవనియు, వానికివరమిచ్చెదననియు, 12సంవత్సరములు గడిచినతరువాత వానిశాపముపూర్తియగుననియు,జరిగినదానికి విచారింప వలదనియు సెలవిచ్చెను. రాజు శాపము ననుభవించి రాజ్యమునకు తిరుగవచ్చి ప్రజలనేలెను. (తరువాతరాజులవంశవృక్ష మీక్రిందను వివరించితిమి.)

కల్మాషపాదుఁడు
|
శంఖణుఁడు
|
సుదర్శనుఁడు
|
అగ్నివర్ణుఁడు
|
శీఘ్రగుఁడు
|
మరువు

మరువు
|
ప్రశుశ్రుకుఁడు
|
అంబరీషుఁడు (ఈతఁడు శునశ్శేఫుని యజ్ఞపశువుగ తీసికొనిపోవుట విశ్వామిత్రుని చరిత్రలో చూపితిమి.)
|
నహుషుఁడు
|
యయాతి
|
నాభాగుఁడు
|
అజుఁడు
|
దశరథుఁడు



## ౪వ అధ్యాయము. నృగమహారాజు.

ఇక్ష్వాకుకుమారులలో నొకడగు*నృగమహారాజు గొప్పకీర్తి కలవాడును, సత్యవచనుడును, శౌచముకలవాడును, బ్రహ్మజ్ఞానము కలవాడునునై యుండెను. అతడొకానొక పుష్కరసమయమున దూడలతో గూడిన కోటియావులను రత్నభూషణములచే నలంకరించి దక్షిణలతో బ్రాహ్మణులకు దానమిచ్చెను. దరిద్రుడును, నేలపడిన ధాన్యపుగింజల నేఱుకొని జీవించువాడును, నగ్నిహోత్రము లెప్పుడుచేయువాడునునగు నొక బ్రాహ్మణుని కీయబడిన గోవును, పెయ్యయును నా బ్రాహ్మణునివద్దనుండి తప్పిపోయినవి. వానిని వెదకుచు నతడనేక దేశముల ననేక సంవత్సరములాకలిచే బాధపడుచు తిరిగి చివరకు కనఖల క్షేత్రమునకు బోయి చిక్కిపోయిన పెయ్యగల తనయావును నొక బ్రాహ్మణునియింట సుఖముగనుండ జూచెను. దానికిగల 'శబళ' యను పేరుతో నా బ్రాహ్మణుడు దానిని పిలువ నది యాధ్వనిని విని పోల్చి యాతనివద్దకు వచ్చెను. ఆ బ్రాహ్మణుడు నడచుచుండ నాగోవు వాని వెంటబడెను. తరువాత నాయింటి బ్రాహ్మణుడుకూడ తొందరగబోయి మొదటిబ్రాహ్మణునితో దీనిని నృగమహారాజు తనకు దానముగ నిచ్చెననియు, నీయావు తనదనియు పల్కెను. అప్పుడాపండితుల కిద్దఱికి గొప్పవాదమయ్యెను. తరువాత వారు రాజభవనమునకు వెళ్ళి యనేకదినములు రాత్రింబగళ్ళు ద్వారమువద్ద నిలిచినను వారికి రాజేమియు నాజ్ఞ నీయలేదు. అంతట వారికిద్దఱికి గొప్పసంతాపము, క్రోధము కలుగ వారిట్లు రాజును శపించిరి. "కార్యముకొఱకువచ్చిన ప్రజలకు నీవు దర్శనమియ్యకపోవుటచే జనులకందఱకు నీవు కనబడ

* దీనికి ప్రమాణము ఆంధ్రభాగవతము. 10 స్కంధము ఉత్తరభాగము. 660 పద్యము.

కుండునట్లు 'తొండ'వయ్యెదవు. అనేక వేలసంవత్సరములు నీవు కన్నములో వసించి చాలకాలము జీవించెదవు. యదువంశములో కీర్తిని వృద్ధినొందించు మహావిష్ణువగు వాసుదేవుడు పుట్టును. కలియుగసమీపమున నరనారాయణులు జన్మించెదరు. నారాయణుడు నిన్ను శాపమునుండి తొలగించును. ఆకాలము రాగా నీకు శాపవిముక్తి యగును." ఇట్లు బ్రాహ్మణులు వానికి శాపమిచ్చి మూముపలియావును నొక బ్రాహ్మణునకిచ్చి వెళ్ళిపోయిరి. ఆ రాజు తనసుకృతకార్యములఫలమనుభవింపక శాపము నిట్లనుభవింపవలసివచ్చెను. బ్రాహ్మణులు వారిత్రోవను వారు పోవుట రాజు తెలిసికొని మంత్రులను, వణిక్కులను, పురోహితులను పిలిచి వారితో దుఃఖముతో నిట్లనెను. "నారదుడును, పర్వతుడునునను నాబ్రాహ్మణులు గొప్పభయంకరమగు శాపమును నాకిచ్చి మూడులోకములకు సంచారమున కరిగిరి. నాకుమారుడగువసువునకు నీదినమున రాజ్యాభిషేకము చేయవలెను. శిల్పకారులు చిలుకలుండదగినంతకన్నమును చేసెదరుగాక! వర్షము వలన తడియనికన్న మొకటియును, మంచుపడనికన్న మొకటియును, ఎండతగులక సుఖముగనుండు కన్నము మఱియొకటియును తయారు చేసెదరుగాక! ఫలములనిచ్చు వృక్షములను, పుష్పములనిచ్చు లతలను, సొగసైనపొదలను, ఇంకననేక చెట్లను నాకన్నముల కన్ని దిక్కులను పెంచెదరుగాక! అక్కడ నేను నిలిచి కాలమును సుఖముగ గడపెదను. అక్కడ మంచివాసనగల పుష్పములుగూడ నెల్లప్పుడును నుండుగాక! ఇవన్నియు నాచుట్టును 2 క్రోసులవఱకు నుండుగాక!" ఇట్లురాజునిర్ణయించి తనపుత్రుడగు వసునితో నిట్లు పలికెను. "కుమారా! బ్రాహ్మణులశాపము నాకెట్లుతగిలెనో చూడుము. నీవు ధర్మమునందు బుద్ధిగలవాడవై రాజధర్మమున భూమిని, ప్రజలను పాలింపుము. కోపముగల యాబ్రాహ్మణులు

నాకిట్టి శాపమునిచ్చినను నన్ను గురించి సంతాపమునొందకుము. నాకిట్టి కష్టముకలిగించిన యముడు మంచినేర్పుగలవాడు. జనుడు సుఖములనుగాని, దుఃఖములనుగాని పొందవలసినవానిని తప్పకపొందును. పూర్వజన్మమున నేను గొప్పపాపములను జేసితిని; గనుక దాని ఫలముగ నీశాప మనుభవింతును. నీవు విచారమును బొందకుము." ఇట్లు నృగమహారాజు పలికి రత్నములతో చెక్కబడిన మంచికన్న మును బొంది, క్రోధముచే బ్రాహ్మణు లిచ్చిన శాపము ననుభవించెను.

---

## ౫వ అధ్యాయము. ఋశ్యశృంగుడు.

కాశ్యపఋషి పుత్రుడు విభండకుడు. అతడొకగొప్ప సరస్సు ఒడ్డున తపస్సుచేయుచుండెను. ఊర్వశి యాత్రోవనువెళ్లుట ఆతడు జూచుటచే నతనికి రేతస్ఖలనముకాగా దానిని నీటవిడిచెను. నాపీటిని లేడియొకటి త్రాగ దానికి నావీర్యమున కొమ్ములుగల ఋశ్యశృంగుడు జన్మించెను. ఈతడు మునియై వనముల జరించుచు యజ్ఞములు చేయుచుండెను. ఇతడు తనతండ్రియాజ్ఞచే మఱిదేని నెఱుగక యగ్నిహోత్రములు జరుపుచు తనతండ్రికి శుశ్రూష జేయుచుండెను. అంతట నంగదేశమున రోమపాదుడు రాజైయుండ నతనియపచారముచే నచట వర్షములులేకుండెను. అందుచే ప్రజలకు జాలకాలము భయంకరమగు కఱవు సంభవించెను. దానినిజూచి రాజు చాలవిచారించి చదువుకొనిన బ్రాహ్మణులను పిలిపించి ధర్మములను, లోకచరిత్రమునుదెలిసిన వారిని కఱవునకు దగినప్రాయశ్చిత్తము తనకు తెలుపవలెననికోరెను. వారాతనితో 'నీవు తగిన ప్రయత్నము లన్నియు జేసి ఋశ్యశృంగుని నిచటకు దీసికొనివచ్చి

విధిపూర్వకముగ నాతనికి నీకూతురగు శాంతనిచ్చి వివాహము చేయవలెననిరి. రాజామాటలను విని ఋషి నెట్లుతీసికొని రాగలనని విచారించి తనమంత్రులతో నాలోచించి వానిని తీసికొనివచ్చుటకు తనపురోహితుని, నమాత్యులను బంప నిశ్చయించెను. వారు దానికి విచారమునొంది, ముఖములు దించికొని ఋశ్యశృంగునితండ్రి యందలి భయముచే తాము వెళ్ళలేకపోయినను నాతనిని తీసికొని వచ్చుట కుపాయమాలోచించి రాజుతో నిట్లు చెప్పిరి. "ఋశ్యశృంగుడు వనమున చరించువాడు; తపస్స్వాధ్యాయనిరతుడు; స్త్రీలను నింద్రియసుఖములను నెఱుగనివాడు; గనుక మనుష్యులమనస్సు నాకర్షించువారును, సొగసుగనుండువారును, నింద్రియముల సంతోషింపజేయువారునునగు స్త్రీలచే నాతనిని శీఘ్రముగ మనపురమునకు తప్పక రప్పించెదము. రూపవతులును, ఆభరణముల నలంకరించుకొనినవారునునగు వేశ్యలు తగినబహుమానములబొంది ఋశ్యశృంగు నాశ్రమమునకువెళ్ళి తమయుపాయములచే ఋశ్యశృంగుని నిచటకు తీసికొనివచ్చెదరు."ఇట్లు వారు చెప్ప నీయుపాయమునకు రాజొప్పుకొని తనపురోహితునితో నీసంగతి జెప్పెను. అతడును, మంత్రులును నట్లు వేశ్యాముఖ్యులను బంపిరి. వా రావనము ప్రవేశించి ఋశ్యశృంగు నాశ్రమమునకు స్వల్పదూరముననుండి వానిని జూచుటకు యత్నించుచుండిరి. ఋశ్యశృంగుడు పితృసేవలోనుండి తనయాశ్రమమును దాటి యెప్పుడు నెచ్చటకు వెళ్లియుండలేదు. పుట్టినది మొదలాతడు స్త్రీలను, పురుషులను, పట్టణములను, దేశములను, అనేకజంతువులను జూచియుండలేదు. అంతట దైవవశమున ఋశ్యశృంగు డొకానొకప్పుడు వేశ్యలుండువనమునకు వచ్చి వారిని జూచెను. చిత్రమైన వేషములుగలవారును, మంచికంఠములతో బాడువారును నగు నా స్త్రీలు ఋశ్యశృంగునొద్దకు వెళ్ళి 'బ్రాహ్మణోత్తమా! మీ రెవరు?

ఏమిచేయుచున్నారు? జనులులేని యీయడవిలో నొంటరిగా నేల సంచరించెదరు? మాకు తెలియజెప్పుడు.' అని వానిని కోరిరి. ఇదివరలో జూచియుండని రూపముగలవారును, వనములో మోహము గలిగించు రూపవతులునగు వారియందు ఋశ్యశృంగునికి స్నేహభావము కలుగుటచే తనతండ్రిసంగతి వారికి తెలుప మనసయ్యెను. తరువాత నతఁడు తనపేరు, తనతండ్రిపేరు చెప్పుచు సమీపముననున్న తమయాశ్రమమునకు వారందఱు రావలయుననియు, తమవలన విధియుక్తముగ పూజగొనవలయుననియు పలికెను. ఋషిమాటలు విని వేశ్యలచటికి వెళ్లిరి. ఋశ్యశృంగుఁడు వారికి నర్ఘ్యము, పాద్యము ఫలమూలనిచ్చి 'పుచ్చుకొనుఁ'డనెను. వారందుకంగీకరించి వానిని పుచ్చుకొని యాతనితండ్రిభయమున వేగముగ నాయాశ్రమమును విడిచి వెళ్లుట కాలోచించి యాఋషిపుత్రునకు తాముదెచ్చిన ముఖ్యమైన పండ్లుమొదలగు భక్ష్యములనిచ్చి శీఘ్రముగ భుజింపవలెనని చెప్పి యాతనిని సంతోషముతో కౌగలించుకొనిరి. వానినాతఁడు భుజించి వానిని వనములోనుండువా రింతకుముందు తినియుండని ఫలములుగ దలచెను. అంతట వేశ్యలు వానితండ్రికి జడిసి తమకు వ్రతమున్నందున తాముపోవలెనని వానితో జెప్పి యాయాశ్రమమును విడిచిరి. తరువాత ఋశ్యశృంగునికి మనస్సు స్వస్థత లేకపోవుటచే విచారముకలిగెను. ఆమఱునాడాతఁడు తాను మొదట వేశ్యలనుజూచినచోటికి బోయెను. అంతట నాస్త్రీ లాతనిని సంతోషముతో జేరి తమయాశ్రమమునకు నాతఁడు రావలెననియు, నక్కడ నింతకంటె నెక్కువపూజ యాతనికి జరుగుననియు నతనితో బలికిరి. ఆతఁడు దానికొప్పుకొనగ వారాతనిని అంగదేశమునకు తీసికొని పోయిరి. వెంటనే వర్షముకురిసెను. ప్రజలు సంతోషించిరి. వర్షముతో తనదేశమునకువచ్చుఋషికి నంగరా జెదురువెళ్ళి భూమిమీదపడి

మొక్కి—* విధియుక్తముగ నర్ఘ్యమునిచ్చి 'క్షమింపుము. కోపము పొందవలదని ఋశ్యశృంగుని వేడెను. రాజు ఋశ్యశృంగుని తన యంతఃపురమునకు దీసికొనిపోయి తనకూతురగు శాంతను వానికిచ్చి పెండ్లిచేసెను. రాజు సంతోషముగనుండెను. ఋశ్యశృంగుడు తన భార్యతో నన్నిభోగముల ననుభవించుచుండెను.

---

## ౬వ. అధ్యాయము. అయోధ్య, దశరథుడు.

కోసలయనెడు రాష్ట్రము గొప్ప విశాలమగు దేశము. అది సరయూనదీతీరమున ధనధాన్యములతో నిండియుండెను. ఆదేశమునకు నిక్ష్వాకునిచే*గట్టింపబడినదియు, లోకవిఖ్యాతమైనదియు, రమ్యమైనదియు నగు 'అయోధ్య'యను పట్టణము రాజధానిగ నుండెను. అది 12 యోజనములు (యోజన=8మైళ్ళు) పొడుగును, 3 యోజనములు వెడల్పును గలిగి బాగుగ నేర్పబడిన గొప్పబాటలును, లెస్సగ నిర్మింపబడిన పెద్దరాజమార్గములును గలదైయుండెను. ఆమార్గములనుదినము నీటిచే దడుపబడుచు పుష్పములచేతను, ముత్యములచేతను విరజల్లబడుచుండెను. ఆపట్టణమునకు మంచితలుపులుగల బహిర్ద్వారములుండెను. ఆపట్టణములో బాగుగ నేర్పబడిన యంగడులుండెను. అవి యన్ని యంత్రములతోను నాయుధములతోను, చిత్రకారులతోను, నెల్లపుడు పొగడుచుండు వందిమాగధులతోను నిండియుండెను. కోటగోడలపైని పెద్దయిండ్లును, జండాలును, ననేకశతఘ్ను

---

* బాలకాండ 70. వ. సర్గ 19వ. శ్లోకమునను, నాంధ్రభాగవతమునను విది యిక్ష్వాకువలన కట్టబడినదని వర్ణింపబడినందున నాప్రకారమిట్లు తెలిపితిమి. ఆకాండలోనే 5వ. సర్గ 6వ. శ్లోకమున నీపట్నము వైవస్వతమనువుచే కట్టబడినదనువర్ణన నాలోచింపనక్కఱలేదు.

ములు నుండెను. (నూఱుమందినిచంపు గడలను తయారుచేయు యంత్రము.) మఱియు నాట్యమును నృత్యముచేయు స్త్రీసమూహము గలదియు, మామిడిచెట్లు, ఉద్యానవనములు గలదియు, గొప్పప్రాకారములు గలదియు దాటశక్యముగానట్టియు, లోతగునట్టియు నగడ్తలు గలదియు, శత్రువులు ప్రవేశించుటకు వీలులేనిదియు గుఱ్ఱములు, ఏనుగులు, లొట్టియలు, ఎద్దులు, కంచరగాడిదలు మొదలగువానితో నిండినదియు, రాజునకు కప్పమిచ్చు సామంతసమూహములతో నిండినదియు, ననేకయితరదేశములనుండి వచ్చిన వర్తకులుండుటచే శోభగలదియు, రత్నములచే చెక్కబడిన రాజభవనములును, క్రీడాపర్వతములవలె తయారుచేయబడిన మంటిదిబ్బలును కలిగినదియు, చాలయంతస్థులుగల మేడలుగలదియు, నష్టదళపద్మమువలెనుండు రూపముగలదియు, సౌందర్యముగల స్త్రీలుగలదియు, రత్నములు, ముత్యములు, మణులు, మొదలగువానితో నిండినదియు, విమానములవలెనుండు నిండ్లుగలదియునై శోభస్కరముగ నుండెను.

అయోధ్యలో 'అశోకవన'మను నుద్యానవనముండెను. దానిలో మామిడి, చందనము, పనస మొదలగునన్నివిధములచెట్లు నుండెను. అవి మంచిపూవులను పూచి పండ్లను కాచును. మఱియు మందార మొదలగు లతలుండెను. అక్కడ మంచిశిల్పములు కట్టబడియుండెను. కోకిలలు, తుమ్మెదలు, చిలుకలు మొదలగు ననేకవిధములగు పక్షులు ధ్వనిచేయుండెను. కొన్ని నిడుపగు జలాశయములుకూడ నుండెను. వానికి మంచిమణులతోను, స్ఫటికములతోను మెట్లు కట్టబడియుండెను. వానిలో జలపక్షులు నీదుచుండెను. జలాశయముల ప్రక్కను మంచిచెట్లును, ననేకయాసనములును, నిండ్లును, మంచిమేడలును నుండెను. ఈయుద్యానవన మింద్రుని నందనవనమువలెను, బ్రహ్మ చైత్రరథమువలెను నుండెను.

ఆపట్టణమున మంచి దేవాలయములును, చలువపందిళ్లును, మంచిచెర్వులును నుండెను. అది సమతలమున నిర్మింపబడి యనేక గృహములతోను, ధాన్యాదులతోను నిండి మంచినీటివసతి కలదై, వాద్యవిశేషములధ్వనులుకలదై, సమానముగ నిర్మింపబడినదై, యే లోపములు లేనిదై, పురుషశ్రేష్ఠులచే నివసింపబడినదై యుండెను. అక్కడ మహారథులును, శిక్షితహస్తులును నగు వీరులు నివసించి యుండిరి. వారిలో వారొకరిసహాయ మొకరికి లేకుండ శత్రువులను యంత్రములచే నాశనమొందించు సమర్థులుగనుండిరి. అందుచే వారికి బాణముల యుపయోగ మక్కఱలేకుండెను. అడవులలో గర్జించునవియు, మదించినవియునగు సింహ వ్యాఘ్ర వరాహముల బలముకంటె నెక్కువ బలముకలవారై వానిని వాడియగు శస్త్రములతో జంపు వీరులనేకులుండిరి. ఆపట్టణమునన్న బ్రాహ్మణు లగ్నిహోత్రము జరుపువారును, మంచిగుణములు కలవారును, వేదవేదాంగములు బాగుగ దెలిసినవారును, దాతలును, సత్యవ్రతులును, మహర్షులతో సమానమగువారును, నియతేంద్రియులును, తమకర్మలయం దాసక్తి కలవారును, మహాత్ములును, దానధర్మములందు, సద్ధ్యయనములందు నాసక్తిగలవారును, స్వభార్యానిరతులునునై యుండిరి, అక్కడనుండు జనులు సంతోషముతోగూడినవారును, ధర్మాత్ములును, బాగుగచదివినవారును, తమధనమనుభవించువారును, లుబ్ధులు కానివారును, సత్యవాదులునునై యుండిరి. ఆపట్టణమున స్వల్పద్రవ్యముకలవారుకాని, గుఱ్ఱములు, పశువులు, ధనము, ధాన్యము లేనివారుకాని, కాముకులుగాని, లోభులుగాని, క్రూరులుగాని, విద్యావిహీనులుగాని నాస్తికులు (ఈలోకముతప్ప యితరము లేదనువారు) కాని లేరు. అక్కడనుండు స్త్రీపురుషులందఱు ధర్మపరులును, నియతేంద్రియులునునై, మహర్షులవలె పరిశుద్ధులై మంచిచరిత్రముగలవారై యుండిరి.

కుండలములు, శిరోభూషణములు లేనివారును, పుష్పములు, మంచిభోగములు, చందనము, స్నానము లేనివారును నక్కడ లేకుండిరి. ఇంకను నచ్చట దాత కానివాడును, బాహువులకు, వక్షమునకు చేతులకుభూషణములు లేనివాడును, యాగాశికరణవశీకరణము చేసికొననివాడును, నిత్యాగ్నిహోత్రములు చేయనివాడును స్వల్పుడును, దరిద్రుడును, సంకరజాతివాడును లేకుండెను. ఆపట్టమున నబద్ధమాడువారును, శక్తివిహీనులును, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము నెడు వేదాంగముల నాఱింటిని తెలియనివారును, చాంద్రాయణాది వ్రతములు చేయనివారును, బాగుగ దానము చేయనివారును, దీనులును, విచారమనస్సు కలవారును, రోగులును లేకుండిరి. మఱియు స్త్రీపురుషులలో రూపము లేనివారును, సిరి లేనివారును, రాజభక్తి లేనివారును నక్కడ లేకుండిరి. బ్రాహ్మణులు మొదలగు వర్ణముల వారు దేవతలను, నతిథులను పూజచేయువారును, కృతజ్ఞత కలవారును, దానశీలురును, శౌర్యవిక్రమములు కలవారును నైయుండిరి. ప్రజలందఱు దీర్ఘాయుష్మంతులును, సత్యధర్మములందు నియమము కలవారును, భార్యలు, పుత్రులు, పౌత్రులు గలవారును నైయుండిరి. ఆపట్టమున క్షత్రియులు బ్రాహ్మణుల ననుసరించియు, వైశ్యులు క్షత్రియుల ననుసరించియు, శూద్రులు వారిస్వవృత్తి చేయుచు మిగిలిన మూడువర్ణముల ననుసరించియు నుండిరి. * కృషివలన, గోరక్షణవలన జీవించు వైశ్యులను, వర్తకమువల్ల

* నాలుగువర్ణములు చేయవలసినవృత్తి లీపరికారము భాగవతమునందును, భగవద్గీతయందును, పురాణములందును, స్మృతులందును కనబడుచున్నను నిప్పటి స్థితి దాని ననుసరించియుండలేదు. అది యెట్లున్నదో విచారింతము. బ్రాహ్మణులనెడివర్ణము కనబడుచున్నది. సాధారణముగ క్షత్రియులనెడివర్ణము కనబడదు. వ్యాపారముచేయుకోమటులే వైశ్యులక్రింద పరిగణింపబడుచున్నారు. గోరక్షణ చేయువారును, కర్షకవృత్తిచే జీవించువారును శూద్రులుగ దలంపబడుచున్నారు. సేవకావృత్తియన ప్రజలసేవకావృత్తియని మేము భావించెదము. గ్రామములు,

జీవించువైశ్యులను, తదితరజనులను రాజు బాగుగ పాలించుచుండెను. అక్కడ యోధవీరు లగ్నితుల్యులును, తిన్ననిమార్గమున సంచరించు

---

పెరళ్ల శుభ్రపఱచువారును, గ్రామములు, పొలములు కాయువారును, ప్రజలకుప యోగించు చర్మకారులును, జనసామాన్యులకు నుపయోగించు నదివిధవృత్తులచే జీవించువారును శూద్రులకు క్రిందిజాతివారుగను, సంకరజాతివారుగను తలంపబడు చున్నారు. ఇప్పుడు జరుగుచున్నవర్ణపద్ధతి సనాతనధర్మవర్ణపద్ధతికాదని మాకు స్పష్ట మగుచున్నది. దీనికి కారణము నేమొకవిధమున నూహించెదము. బ్రాహ్మణ మతము క్షీణముకాగా బౌద్ధమత మభివృద్ధిజెందెను. అప్పుడువర్ణభేదము లేకుండెను. పిమ్మట కొంతకాలమునకు బౌద్ధమతము క్షీణింపగా బ్రాహ్మణమతము వృద్ధి జెందెను. అపుడు ఈమార్పులు జరిగినట్లు తోచుచున్నది. దేశములో బలవంతులే క్షత్రియులుగను, ధనికులగువాణిజ్యపరులు వైశ్యులుగను విభాగింపబడిరి. ధనహీను లగు పశుసంరక్షకులును, వ్యవసాయదారులును వర్ణములో నొకతరగతికి తగ్గింపబడి శూద్రులుగ భావింపబడిరి. గ్రామములలో జనసామాన్యసేవ కుపయోగించు మాల మాదిగ మేదరి హడ్డి రెల్లి మొదలగువర్ణములు శూద్రులనుండి తప్పింపబడి సంకర జాతులుగ భావింపబడిరి. మనుధర్మశాస్త్రప్రకారమునుండు సంకరజాతులు లేవని చెప్పుటకు మాకు సామర్థ్యములేదు. అవి స్వల్పసంఖ్యాకములై యుండెను. అధిక సంఖ్యాకులగు పరిచారకులందఱు సంకరజాతికి చెందినవారని భావించుటకు మాకు కారణము కానరాదు. కనుక మనదేశము సనాతనధర్మముగ పునరుద్ధారణచేయుట క్రియాలోచన మాకు తోచుచున్నది. ఇప్పుడు బ్రాహ్మణులుగ నున్నవారు బ్రాహ్మ ణులుగ భావింపబడవలెను. క్షత్రియులని చెప్పుకొనువారు క్షత్రియులుగ భావింప బడవలెను. ఇప్పుడు వైశ్యులుగను, శూద్రులుగను తలంపబడువారు వైశ్యులుగ భావింపబడవలెను. మనుస్మృతిప్రకారము ద్విజాతులగు మొదటిమూడువర్ణములకు ధర్మములలోకొలదితేడాలున్నందున హిందూజనసంఘసంఘ సంస్కరణమిట్లుచేసిన దేశాభివృద్ధికి నాటంకము కలుగదని మాయభిప్రాయము. ఇప్పుడు సంకరజాతులుగ భావింపబడువారు శూద్రులుగ నాలోచింపబడి స్పృశ్యులగుదురు. గో మాంసభక్షకులు స్పృశ్యులుకారు. వారు వేరుచేయబడవలెను. ఇప్పుడు క్షత్రియులను కొనువారు దేశసంరక్షణకై చాలకపోవుటచేతను, క్షాత్రధర్మముఖ్యత పైదేశీయులం దుండుటచేతను, నన్నిజాతులవారికి సమయోచితముగ క్షాత్రధర్మమవలంబింపవలసి యుండును. ఈయంశములు ప్రాజ్ఞు లాలోచించి గ్రహింతురుగాక!

వారును, మంచివర్చస్సుగలవారును, నన్నివిద్యలను బాగుగనభ్య
సించువారునునై గుహలలో సింహములవలె నుండిరి. ఇట్టియయో
ధ్యలో ననేకవేల ప్రజలు నివసించియుండిరి. అక్కడ కాంభోజము,
బాహ్లీకము, వనాయువు, సింధుదేశము మొదలగు దేశములనుండి
తేబడిన శ్రేష్ఠములగు గుఱ్ఱములును, వింధ్యహిమవంతములనుండి
తేబడిన యేనుగులును నుండెను. ఆయేనుగులు మంచిమదము, బలము
కలవియును, దిగ్గజముల సంతతివియును, మంచికములైనవియునునై
యుండెను. జనులకు మంచియావులు మొదలగు పశువులుండెను.
అక్కడ పులులు మొదలగు క్రూరజంతువులభయము లేకుండెను.

అట్టియయోధ్యను వేదవిదుడును, మంచిశీలముకలవాడును,
గొప్పకీర్తికలవాడును, తిన్నని ప్రవర్తనకలవాడును, ధనాదుల గ్రహించు
వాడును, ముందురాబోవుదానిని బాగుగ కనిపెట్టువాడును, గొప్ప
తేజముకలవాడును, పట్టణములకు, దేశములకు ప్రియుడును, యజ్ఞ
ములు చేసినవాడును, ధర్మపరుడును, నింద్రియములను వశముచేసి
కొనినవాడును, గొప్పఋషులతో సమానుడును, మూడులోకము
లలో ప్రసిద్ధినొందినవాడును, సత్యపరాక్రముడును, బలవంతుడును,
శత్రుజయముకలవాడును, మిత్రులుకలవాడును, ధనసంగ్రహము
లోను, నితరవిషయములలోను కుబేర మహేంద్రులతో సమానుడును,
నతింథుడును, ధర్మార్థకామముల ననుసరించువాడునునగు దశరథుడు
పాలించుచుండెను. అయోధ్యలో దశరథుడుండు రెండుయోజనములు
(యోజనము ౮ మైళ్లు) విస్తీర్ణముగల ప్రదేశము 'అయోధ్య' యను
(యుద్ధముచేయుటకుశక్యముకానిది అయోధ్య) సార్థకనామముకలదై
యొప్పుచుండెను. దశరథునకు ధృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధా
ర్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రపాలుడు, సుమంత్రుడునను నెన
మండుగు రమాత్యులుండిరి. ఆయమాత్యులు (కార్యనిర్వాహకులు) మం
త్రాంగము తెలిసినవారును, నింగితజ్ఞానము (శరీరచేష్టలవలన మనస్సు

పోల్చుట) తెలిసినవారును, నెల్లప్పుడు ప్రజలమంచికై పాటుపడు వారును, కీర్తివంతులును, శుచిగలవారును, రాజకార్యములం దాసక్తి గలవారునునై యుండిరి. వీరిలో సుమంత్రు డనువాడు దశరథుని పూర్వులకాలమునుండియు మంత్రిగనుండెను. ఇతడు జ్ఞానవంతుడును, మృదుస్వభావముగలవాడును, గొప్పబుద్ధిమంతుడును, నింద్రియ నిగ్రహముగలవాడును, శాంతుడునునై యుండెను. దశరథునికి వసిష్ఠ వామదేవులను నిద్దఱుపురోహితులుండిరి. పైనిచెప్పిన యెన మండ్రుమంత్రులుకాక దశరథునికి నను మంత్రులుండిరి. వారు ధనుర్విద్య, యస్త్రవిద్య మొదలగువిద్యలను బాగుగ నేర్చినవారును, శ్రీమంతులును, మహాత్ములును, శాస్త్రములు తెలిసినవారును, మంచి పరాక్రమముకలవారును, కీర్తిమంతులును, రాజ్యకార్యములం దప్రమత్తులును, రాజుచెప్పినప్రకారము చేయువారును, తేజస్సు, కీర్తి, యోరిమి గలవారును, నవ్వుచు పలుకువారును, కోపముచేగాని, కోరికచేగాని యబద్ధము పలుకనివారునునై యుండిరి. తమ రాష్ట్రము లందును, నితరదేశములందును వారికి తెలియనివిషయములు లేకుం డెను. రాష్ట్రములలో జరిగినది, జరుగుచున్నది వారికి చారులవలన తెలియుచుండెను. ఇంకను వారు వ్యవహారములందు నేర్పరులును, వారివారిపరిపాలనాంశములు బాగుగ దెలిసినవారును, తమపుత్రులు శిక్షార్హులైనచో వారినిగూడ శిక్షింపక విడువనివారును, ధనమును గ్రహించుటయందును, సైన్యమును రక్షించుటయందును దగినవారును దోషములేనపుడు శత్రువునైనను హింసింపనివారును, వీరులును, తగిన యుత్సాహముగలవారును, నీతిశాస్త్రప్రకారము రాజకార్యములను జరుపువారును, తమదేశీయులలో శుచియగువారి నెల్లప్పుడు రక్షించు వారును, బ్రాహ్మణులను, క్షత్రియులను బాధింపక రాజధనము గ్రహించు వారును, ప్రజలదోషము తెలిసికొని వారికితగినశిక్ష విధించువారునునై

శుచిగలిగి యేకమనస్కులై వ్యవహారములు జరుపుచుండిరి. ఇట్టిపరిపాలనచే పురమునగాని, దేశమునగాని యసత్యవాదులును, దుష్టులును, పరభార్యారతులును లేకుండిరి. కావుననది శాంతముగనుండెను. మఱియు, వానిమంత్రులుమంచిబట్టలను మంచియలంకారములను ధరించి, రాజు హితమునుగోరి తమగురువులగుణములనే గ్రహించి, పరాక్రమముచే తమకీర్తినిదెలుపుచు,పరరాష్ట్రవిషయములనన్నిటిని తెలిసికొని, సంధి విగ్రహముల నెఱిగి, యైశ్వర్యవంతులై, తమయాలోచనలను రాజునకు తెలియజేయు నేర్పుగలవారై,సూక్ష్మముగను,బాగుగను,రాజ్యాంగము జరుపగలిగి, శాస్త్రములను బాగుగదెలిసికొని, ప్రియవచనముల నెప్పుడు పలుకుచు ప్రవర్తించుచుండిరి. ఇట్టి మంత్రులతో గూడి దశరథుడు భూచక్రమును బాగుగ పరిపాలించెను. అతడు చారులవలన సంగతులను తెలిసికొని, ధర్మమున ప్రజలను రంజింపుచు, నధర్మమును విడిచి ప్రజాపాలన జరిపెను. మూడులోకములందు నతడు సత్యప్రతిజ్ఞుడుగను, దానశీలుడుగను ప్రఖ్యాతినిబొందెను. దశరథుడు ప్రతాపముచే శత్రువులను జయించుచుండెను. దశరథునకు వానితో సమానుడగు శత్రువుగాని, వానికంటె గొప్పవాడగు శత్రువుగాని యెక్కడను లేకుండెను. అతడు మిత్రులును,తనకులోబడిన సామంతులును గలవాడై యుండెను. దేశోపద్రవముకలిగించువారు లేకపోవుటచే దశరథుడు సూర్యుడు కిరణములతోగూడినటుల తాను మంత్రులతోను, సలహాచెప్పువారితోను గూడి వెలుగుచు మహేంద్రుడమరావతిని బాలించునటుల నయోధ్యను బాలించెను.

దశరథుడు తనకు వివాహముకాకపూర్వము తాను యువరాజుగనుండునపుడు జంతువును జూడకుండ దానిశబ్దమునుబట్టి బాణమును విడుచు నేర్పరిగ నుండెను. ఒకానొక దక్షిణాయనములో వర్షాకాలమున మేఘము లాకాశమున నిండియుండ కప్పలు, లేళ్ళు,పక్షులు

సంతోషముగ ధ్వనిచేయుచుండెను. ఏనుగులపై వర్షముకురిసిన కొండలపై వర్షముకురిసినట్లు లుండెను. ప్రాణులకు సుఖమగునట్టి కాలమున నొకరాత్రి దశరథుడు రథమెక్కి వేటకుతూహలముతో ధనస్సును, బాణములనుబట్టి సరయూనదిని దాటెను. అక్కడ నతడు నదిలో జంతువులు నీరుత్రాగు రేవునకు దున్నపోతో యేనుగో పులియో మఱియేయడవిజంతువో నీరుత్రాగుటకు వచ్చు నని యాలోచించి దానిని వేటాడుతలంపుతో నుండెను. అప్పుడు నీటిలో నొకకడవనుముంచుధ్వని నాతడువిని చీకటిలో దానిని చూడలేక యేనుగొకటి నీరుత్రాగుచున్నదని యాలోచించి యా యేనుగును జంపుటకు నాధ్వనివైపు తీవ్రమగు బాణము నొక దానిని వేసెను. అంతట తెల్లవారుజామున నాతట్టునుండి బాణము మర్మస్థానమున తగులుటచే నీటిలోపడిన తపస్వియొక్క మాటలు దశరథుని కిట్లు వినబడెను. "అయ్యో! నావంటివానిపై తపస్సు చేయువా డెవడు బాణము నిట్లువేసెను? నేను విజనమగునదికి నీటి కొఱకై వచ్చి యొక్క బాణముచే కొట్టబడితిని. వనములో దుంపలు, కాయలు మొదలగు వానిని తిని పరులను నొప్పింపక ఋషివృత్తిని జీవించు నే నెవరికి నేమియపకారము చేసితిని? జడలు, నారబట్టలు, లేడిచర్మము ధరించియుండు నేను శత్రువుచే చంపబడుట యేల? ఎవరికిని నపకారము జేసియుండని నన్ను జంపకోరువా డెవడు? కేవలము నిష్ఫలమును, తనకు గొప్పకీడు కలుగజేయునదియునగు నాచావును కోరువాడు సాధువుకాడు. అతడు గురుభార్యాగమన మహాపాతకముతో సమానమగు పాపమును జేసినవాడగునని తలచెదను. నామరణమువిషయమై నేను విచారింపను; కాని నేను చాల కాలమునుండి పోషించుచున్న యంధులగు నాముసలితలిదండ్రులను గూర్చి విచారించెదను. నేను గతించినపిదప వారెట్లు జీవించెదరు?

మూర్ఖుడును, బుద్ధిహీనుడునునగు వానివలన మేమందఱము మరణము నొందుచున్నాము.” ఈదీనవృపలుకులను ధర్మబుద్ధిగల దశరథుడు విని విచారము నొందియుండ నాతనిచేతులనుండి ధనస్సును, బాణము లును భూమియందుపడెను. అతడు మతిలేక గొప్పవిచారముతో తొందరగ నచ్చోటికి బోవ సరయూనదీతీరమున జటలు విడియుండిన వాడును, కొంతదూరమున నీరుతోనున్న కలశ నుంచినవాడును, శరీ రమున బుగ్గి, రక్తము కలిగినవాడును, బాణముచే కొట్టబడి భూమిపై బడియుండినవాడునునగు నొకతపస్వి యతనికి గనబడెను. ఆతడు దశరథునిజూచి యిట్లుకఠినవృమాట లాడెను. “రాజా! నాతలిదండ్రుల కొఱకై నేనీవనమున నివసించియుంటిని. వారికి నీరుతీసికొనివెళ్ళు టకు నేనిచ్చటకు వచ్చియుండ నీవు నన్ను చంపగోరి నాపై బాణము విడుచుటకు నేను నీకేమియపకారా మొనర్చితిని? నీవు నాపై బాణము విడుచుటవలన నేనే కాక యంధులగు నాముసలితలిదండ్రులుగూడ మరణము నొందుచున్నారు. వారు దాహముగలవారై నీటిని తెచ్చు టకు నన్నిచటకు బంపినారు. వారాదాహముతీరక యెట్లు బాధ నొందుచున్నారో! నేనిట్లుపడియుండుసంగతి నాతండ్రికి తెలియక పోవుటవలన నతనితపస్సునకును, నతడు వినియున్నసత్కథలకును ఫలములేదని నిశ్చయ మగుచున్నది. నే నిట్లుపడియుండుట యతనికి దెలిసినను శక్తిలేనివాడును, కదలలేనివాడునునగు నాతడు నన్నెట్లు రక్షింపగలుగును? రాజా! నీవు శీఘ్రముగబోయి యీసంగతి నాతండ్రితో జెప్పుము. దీనికతడు నిన్ను శపింపడు. ఇక్కడకు దగ్గ ఱనే యాతనియాశ్రమమున్నది. నీవు వెళ్ళి మంచిమాటలాడి యతనికి నీసంగతిని దెలుపుము. నామర్మస్థానమునతగిలి నన్ను బాధించు చున్న యీబాణమును దీసివేయుము.” ఇట్లాతపశ్శాలి దశరథునితో బల్కక దశరథుడు ‘బాణము వానిని బాధించుచున్నదని దానిని తీసి

వేసినయెడల వానిప్రాణములు పోవునని విచారించుచుండెను. ముని కుమారుడుకూడ నట్లేవిచారించి చివరకు ధైర్యము తెచ్చుకొని వణకుచు శరీరము కంపింప చావసిద్ధమై తాను విచారమువిడిచి ధైర్యముతో తనమనస్సును నిలుకడచేసెననియు, నాతడు బ్రహ్మహత్యచేసె నని యనుమానింప వలదనియు, తాను ద్విజాతుడు కాడనియు, * శూద్రస్త్రీయందు వైశ్యునివలన జన్మించినవాడనియు, నాతడు తనమనస్సున విచారము నొందకూడదనియు దశరథునితో పలికెను. దశరథు డప్పుడు వాని బాణము నూడదీయ వాడు రాజును జూచుచు మరణము నొందెను. దశరథుడును గొప్పవిచారము నొందెను.

తర్వాత దశరథు డక్కడనున్న నీటికుండను దీసికొని ముని కుమారు డిదివరలోజెప్పిన త్రోవను వెళ్ళి బలములేనివారును, ముసలివారును, గుడ్డివారును, కదలలేనివారునునగు నాతనితలిదండ్రులను జూచెను. వారు తమకుమారు డెప్పుడు నీరుతెచ్చునోయని వేచియుండిరి. వారియాశ్రమమును జూడగానే దశరథునకు గొప్పవిచారము కలిగెను. దశరథునిపాదధ్వనిని వినగానే యామునీశ్వరు డతని నిట్లడిగెను. "కొడుకా! నీ వేలయాలస్యము జేయుచున్నావు? నీటిని వేగముగ దెమ్ము. నీటిలో నీవింతవఱకు నేలయాడుచున్నావు? నీ తల్లికి చాలవిచారము కలిగినది. శీఘ్రముగ నాశ్రమములోనికి రమ్ము. నేనును, నీతల్లియును పలికినమాటలు నీకప్రియములైన వానిని నీవు మనస్సులో నుంచుకొనవద్దు. నడువలేనిమాకు నీవేగతి. కండ్లులేనిమాకు నీవేకన్ను. మాప్రాణములు నీయందు నిలిచియున్నవి. నీవేల మాతో పలుకవు?" ఇట్లు మునీశ్వరు డడుగ

* దశరథునికాలమున శూద్రులకును కొన్నినియమములును, కర్మలును నుండి క్రమముగ నవి క్షీణించినట్లు కనబడుచున్నవి.

దశరథుడు మిక్కిలి భయమునొంది మనస్సులో ధైర్యము తెచ్చుకొని స్పష్టముకానిమాటలతోను, కంపించుచున్న స్వరముతోను తాను ఋషిపుత్రుడు కాడనియు, 'దశరథు'డను రాజనియు చెప్పి వారి పుత్రునిమరణమునుగూర్చి జరిగినదంతయు వివరముగ వారికి దెలిపి చేతులుజోడించి నిలిచెను. అప్పుడా ముసలిఋషి నిట్టూర్పుదీయుచు నాతనితో నిట్లనెను. "నీవిప్పు డీయశుభమగు సంగతిని నాతో స్వయముగ జెప్పియుండకపోయిన నిప్పుడే నీతల నూఱుగాని, వేయిగాని ముక్కలయియుండును. ఈవధ వానప్రస్థములోనున్నవానికి క్షత్రియునివలన సంభవించినది. ఇట్టిపనిని తెలిసిచేసిన నింద్రుడైనను తనపదవిని బోగొట్టుకొనును. తపస్సుచేయుచున్న మునిపైగాని బ్రహ్మజ్ఞానముగలవానిపైగాని తెలిసి బాణమువిడిచినవానితల వేయు ముక్కలగును. నీ వజ్ఞానమువలన బాణమును విడుచుటచే నింకను జీవించియున్నావు. నీవు తెలిసి చేసియుండినయెడల నిక్ష్వాకువంశమే నశించియుండును. నీవనెంత! మాపుత్రుడు పడియుండుస్థలమునకు మమ్ము తీసికొనిపొమ్ము. యమునివశముననుండి రక్తముచే తడుపబడిన శరీరముతో భూమియందు పడియుండు మాకుమారుని జూడగోరుచున్నాము." ఇట్లు ముసలితాపసి పలుక దశరథు డట్లు వారిని తీసికొనివెళ్లి వారిద్దఱిచేతను వారికుమారునిశవమును ముట్టించెను. వాని శరీరముమీదపడి యాముసలిఋషి యిట్లు విలపించెను. "కుమారా! యిప్పుడు మమ్ము నమస్కరించి మాతో నేలమాట్లాడకున్నావు? కోపముచే భూమియందేలపరుంటివి? నాయందు నీకిష్టము లేకపోయిన నీతల్లినైన జూడుము. నన్నేలకౌగలింపవు? మాటలాడుము. కొంత రాత్రి గడచిన తర్వాత మాకు మనస్సు కింపగునటుల మధురములగు మాటలతో శాస్త్రవిమర్శనముగాని, యితరపుణ్యకథలనుగాని తెలుపువారెవ్వరు? నీవలె స్నానముచేసి, సంధ్యావందన మొనర్చి,

యగ్నిహోత్రముచేసి, మాపరిక్కను గూర్చొని మమ్మాదరించు వారెవ్వరు? నీవలె కందమూలములను తెచ్చి యేమియు జేయశక్తిలేనట్టి యనాథులమగు మాకు నెవ్వరు దయతో దినిపించెదరు? నియమము గలిగినదియు, ముసలిదియు, గుడ్డిదియు, దీనురాలునునగు నీతల్లిని నేనెట్లు భరింపగలను? నాకొఱకై నీవు నిలువుము. యమునియింటికి బోకుము. రేపటిదినమున మేమిద్దఱముగూడ నీతో వచ్చెదము. నేను యముని జూచి 'ఇతడు నాకుమారుడు. మమ్ముల నితడు పోషించును; కనుక నితనివిలంబమునకు క్షమింపుడు. మీరు మాకు శాశ్వతముగ నట్టియభయమును, సుఖమును గలిగింపుడు.' అనివానిని వేడెదను. ఈపాపాత్మునిచే జంపబడి నీవు పాపముల బోగొట్టు కొంటివి. యుద్ధములో వెనుదిరుగనిశూరులు పొందునట్టియు, శత్రుములతో యుద్ధముచేయువారు పొందునట్టియు నుత్తమలోకములను నీవు సత్యప్రవర్తనచే బొందెదవుగాక! సగరుడు, శైబ్యుడు, దిలీపుడు, *జనమేజయుడు, నహుషుడు, దుందుమారుడు పొందినలోకములను, పుణ్యకర్మలు చేయువారు పొందులోకములను నీవు పొందెదవుగాక! మావంశములో పుట్టినవారు చెడుగతులను బొందరు. నిన్ను జంపినవాడుమాత్రము చెడుగతిని బొందును." ఈతీరున ముసలిఋషి విలపించి తాను, తన భార్య తమపుత్రునకు నుదకప్రదానము జేయ జితేంద్రియుడగు నామునిపుత్రుడు తాను జేసినకర్మలకు తేజోమయమగు రూపమును ధరించి యింద్రునితో స్వర్గమునకు బోవుచు తనతలిదండ్రుల నోదార్చి తనతండ్రితో 'మీకు పరిచర్యచేయుటచే నే నాగొప్పస్థానము బొందుచుంటిని. మీరు గూడ శీఘ్రముగ నావద్దకు వచ్చెదరు.' అనిపలికి ప్రకాశమానమగు విమానమును వేగముగ నెక్కి కాంతిగల

* పరీక్షిత్తుకుమారుడగు జనమేజయు డిప్పటికలియుగమువాడైనందున నీ రామాయణగ్రంథ మీకలియుగముననే రచియింపబడినది. అందులకిది యొకనిదర్శన ము.

శరీరముతో స్వర్గమునకు బోయెను. అప్పుడు ముసలితపసియు, నతని భార్యయు వానికి నుదకకర్మలు జరిపిరి. తరువాత నతడు దశరథునితో నిట్లు పలికెను. 'నాపుత్రుని నొక్క బాణమున జంపిననీవు నన్నుకూడ జంపుము. నామరణమువలన నాకు విచారము లేదు. శుచియగు నా కుమారుని నీ వజ్ఞానమున చంపుటచే నీకు గొప్పశాపము నిచ్చెదను.' అనిపలికి "నాకిప్పుడిట్లు పుత్రశోకము కలిగించినందున నీవు పుత్రశోకముతో కాలధర్మము నొందెదవు. క్షత్రియుడవగు నీవు నజ్ఞానముచే వానిని జంపినందున నీకు బ్రహ్మహత్యాదోషము లేదు. నీకు గూడ నిట్టిగొప్పయాపద శీఘ్రముగ సంభవించును." అనిదశరథుని శపించెను. తరువాత ఆభార్యాభర్తలు మిక్కిలివిచారించి, తమశరీరములను చితియందు జేర్చి మరణమునొంది స్వర్గముపొందిరి. దశరథుడు తనపట్నము జేరెను.

దశరథునకు 'కౌసల్య, సుమిత్ర, కైకేయి'యను ముగ్గురు ప్రధానభార్యలు. వారిలో కోసలరాజు కుమార్తెయు, ధర్మమందే మనస్సుగలదియు, ధర్మము తెలిసినదియు, ధర్మమే యాచరించునదియు నగుకౌసల్య జ్యేష్ఠభార్య; ధర్మములుబాగుగ దెలిసిన సుమిత్ర రెండవభార్య; గర్వము, కోపము, తీవ్రస్వభావముగల కైకేయి మూడవభార్య. ఆమె యెల్లపుడు తనమంచిని, ఐశ్వర్యమును గోరుచుండును. తానే బుద్ధిమంతురాలనియు, సౌందర్యవతియనియు నాలోచించుచుండును. కేకయరాజగు నశ్వపతి తనకుమార్తెయగు కైకేయిని దశరథున కిచ్చి వివాహము చేయకపూర్వమే దశరథునిచే నామెకు బుట్టినపుత్రునకు వానిరాజ్య మిచ్చునట్లు వాగ్దానము చేయించెను.

కేకయరాజొకయోగివద్ద నన్నిజంతువులమాటలు తెలిసికొను విద్యనొకదానిని నేర్చెను; కాని యావిద్యసంగతి పైకి తెలిపిన

నాతడు మరణము నొందునని యాతనికి శాపముగూడ నుండెను. అత డొకనాడు తాను శయనించు పాన్పుసమీపమున చీమలమాటలను విని యెక్కువగ నవ్వెను. అంతట నాతనిభార్య తన్నుజూచి యాతడు నవ్వెనని యనుమానపడి మిక్కిలికోపించి యాతడు నవ్వుటకు కారణము తెలుపవలెనని యాతని గోరెను. దాని కారాజు తాను నవ్విన యంశ మామెకు దెలిపిన తనకు వెంటనే మరణము సంభవించున నెను. అంతట నామె యాతడు జీవించినను, జీవింపకపోయినను, తనకు మాత్రము దానిని దెలుపవలెననియు, దానినిబట్టి యాతడు, తన్ను గూర్చి యుపహాసము జేయలేదని తాను దెలిసికొనుననియు పలికెను. అంతట కేకయరాజు తనకు విద్యనేర్పిన యోగివద్దకు బోయి యాతనికి జరిగినసంగతి దెలుప నతడు 'ఆమెచచ్చిననుసరే నాశనము నొందిననుసరే కానియామెకు దానిని దెలుపగూడ'దని రాజుతో పలికెను. ఆమాటలకు కేకయరాజు సంతోషించి తనభార్యమాటలను నిరసించి కుబేరునివలె సంచరించెను.

దశరథుడు రాజ్యముచేయునపుడు కోసలదేశమునకు దక్షిణ దిక్కుననుండు దండకారణ్యమున 'వైజయంత'మనుపురమున నూఱు మాయలుగల 'తిమిధ్వజు'డను నసురుడుండెను. అతడు దేవతలతో యుద్ధముజేసి వారివలన జయింపబడక యుండెను. అంతట నింద్రు డక్కడికి యుద్ధమునకు బోవ రాజర్షులు కొంద ఱానికి సహాయము వెళ్ళిరి. దశరథుడుగూడ కైకేయితో రథముననచటికివెళ్ళెను. పగటి సమయమున దెబ్బలుపడిన రాజులందఱు తమశిబిరములలో రాత్రివేళ సుఖముగ నిద్రించుచుండ రాక్షసులువచ్చి తమశరీరబలముచే వారిని జంపిరి. అప్పుడు దశరథుడు రాక్షసులతో యుద్ధముచేసి శస్త్రముల బాధచే మూర్ఛనొందెను. అప్పుడు కైకేయి తనభర్తను రథముమీద దూరముగ దీసికొనిపోయెను. దీనికి దశరథుడు సంతోషించి యామెకు

రెండువరములిచ్చి వానిని గోరుమనెను. దానికామె యావరములను వానియొద్దనే యుంచవలెనని పలుక దశరథుడట్లేయని యంగీకరించెను.

## 2వ. అధ్యాయము. విష్ణువు భృగువువలన శాపమునొందుట.



పూర్వము దేవాసురయుద్ధములో నసురులు దేవతలచే కొట్టబడి భృగుమహర్షి భార్యను శరణుబొందిరి. ఆమె వారికి నభయమిచ్చుటచే వారు నిర్భయులై యుండిరి. ఈసంగతి మహావిష్ణువు తెలిసికొని క్రోధముగలవాడై వాడియైన తనచక్రముచే నామెశిరమును ఖండించెను. భృగువు తనభార్యమరణించుట జూచి క్రోధముగలిగి శీఘ్రముగ విష్ణువునకు "నిర్దోషియగునాభార్యను నీవు క్రోధముచే జంపితివి; గావున నీవు మనుష్యలోకమున జన్మించి యనేక సంవత్సరములు భార్యావియోగము నొందెదవుగాక!" యని శాపమిచ్చెను. భృగువు తానిచ్చిన శాపమును గూర్చి తనమనస్సులో నాలోచించి యతనికి పూజచేయ నతడు 'లోకములకు ప్రియముజేయుకొఱకు నేను నీశాపమును గ్రహించితి'నని పలికెను.*



* ఉత్తరకాండలో 51సర్గ. 17వ॥శ్లో॥మొదలు 25వ॥శ్లో॥ వఱకునుండు శ్లోకములు కుండలీకృతములగుటచే నవి ప్రక్షిప్తములని వానిభావమిక్కడచూపలేదు.

## ౮వ. అధ్యాయము. జనకునివంశము.

*ఇక్ష్వాకునకు నూర్వురు పుత్రులు. వారిలో 12వ. వాడగు నిమి పరాక్రమముకలవాడై ధర్మముగ ప్రవర్తించుచుండెను. రాజర్షియగు నితడు గౌతమునియాశ్రమసమీపమున 'వైజయంత' మను పురమును నిర్మించి యక్కడ రాజ్యముచేయుచుండెను. ఇతడు తనతండ్రి మనమును సంతోషపఱచుటకు చాలకాలముననైనను పూర్తికాని యజ్ఞమును జేయుట కాలోచించి తనతండ్రినిపిలిపించి యజ్ఞముచేయించుటకు ముందుగ బ్రహ్మర్షులలో ముఖ్యుడగు వసిష్ఠుని కోరెను. తరువాత నతడు అత్రిని, అంగిరసుని, భృగుమహర్షిని పిలిచెను. వసిష్ఠుడు నిమితో "నన్ను ముందుగ నింద్రుడు యజ్ఞముచేయించుటకు కోరియుండుటచే నేనచ్చటికి బోవలెను. నేను తిరిగివచ్చువఱకు నాకొఱకు నీవు నిరీక్షించియుండుము." అని చెప్పి యింద్రునియజ్ఞముచేయించుటకు వెళ్ళెను. తర్వాత నిమి బ్రాహ్మణశ్రేష్ఠుడగు గౌతమమునిని యజ్ఞముచేయించుటకు బిలిచెను. పిమ్మట రాజు బ్రాహ్మణులను బిలిపించి తనపట్టణసమీపమున నొకప్రక్కను గొప్పకాళీప్రదేశమున యజ్ఞముచేసెను. అతడట్లు 5000 సంవత్సరములు యజ్ఞదీక్షలోనుండ వసిష్ఠు డింద్రునియజ్ఞమునుపూర్తిచేసి, నిమియజ్ఞమును జేయించుటకు వచ్చి దానిని గౌతముడు జేయించుటచూచి గొప్పకోధముగలవాడై నిమిని జూచుటకై యొకగడియకూర్చొనెను; కానియాదినమున నిమి మైమఱచి నిద్రించుటచే వసిష్ఠునికి కనపడలేదు. అందుచే కోపముగల వసిష్ఠుడు నిమిని నిట్లు శపించెను. 'నన్ను అవమానించి యితరులను యజ్ఞముచేయించుటకు కోరుటచే నీవు ఇంద్రియములులేని దేహము కలవాడవై యుండెదవుగాక!' తరువాత నిమి నిద్రనుండిలేచి క్రోధముచే నజ్ఞానముకలవాడై శీఘ్రముగ వసిష్ఠునకు తిరుగ నీతీరున ప్రతిశాపమిచ్చెను. 'తెలియక నిద్రపోవుచున్ననాకు నీవు కోధముచే

* ప్రమాణము. ఆంధ్రభాగవతము. నవమస్కంధము 166వ. పద్యము.

పాపబుద్ధికలవాడవై యమదండమువంటి తీవ్రమగు శాపము నిచ్చితివి; గనుక నీవును నష్టేంద్రియములులేని శరీరమును బొందెదవు. అయినను మంచిదేహమును బొందెదవు.' ఇట్లు వారిరువురు శాపములచే దేహముల బోగొట్టుకొని వాయురూపముతో నిలిచిరి. వసిష్ఠుడు తిరుగ *మిత్రావరుణుల తేజమున నూర్వశికి జన్మించెను. శరీరములేక యుండు నిమిని ఋషులందఱు చూచి వానివాయురూపశరీరముతోనే యజ్ఞదీక్షను చేయించిరి. వానిస్థూలశరీరమును బ్రాహ్మణులు, పట్టణవాసులు, పరిచారకులు గంధములచేతను, మాల్యములచేతను, రక్షించుచుండిరి. యజ్ఞము పూర్తియైనతరువాత భృగువు నిమితో 'నీయందు నాకు మిక్కిలి సంతోషము కలిగినందున నీశరీరమునకు ప్రాణములు కలిగించెద'నని పలికెను. దేవతలు ప్రీతికలవారై 'రాజర్షీ! నిమీ! నీకిష్టమగు వరమును కోరు'మని యనిరి. అప్పుడు నిమి తన కన్నిభూతముల నేత్రములందు నిలువవలెననియున్నదని పలుక దేవతలందఱు 'అట్లే నీవు సంచరించెదవుగాక! అన్నిభూతములు నీకాయాసము పోవుచుండుటకై కండ్ల నప్పుడప్పుడు మూయుచుందురు.' అని వానికి వరమిచ్చి తమస్థానముల కరిగిరి. ఋషులు అగ్నినిబుట్టించుటకు మథించుమ్రానిపై నిమిశరీరమును బెట్టి యతనికి పుత్రుడు కలుగుటకై మంత్రహోమములతో దానిని మథింప గొప్ప తపశ్శాలి పుట్టెను. అతడు మథించుటవలన పుట్టుటచే వానికి 'మిథి' యనియు, జనించుటచే 'జనకు'డనియు, దేహములేనివానివలన జన్మించుటచే 'వైదేహు'డనియు పేర్లుకలిగెను. ఇతడే యీవంశమునకు పూర్వుడు.(ఈరాజవంశము; ప్రక్కనుండువంశవృక్షమున జూపబడినది.) మిథి మిథిలాపట్టణమును నిర్మించెను. ఈతనికాలమునుండియు నీవంశపు రాజులకు 'జనకు'డనుపేరుకలదు. దేవతలు దక్షునియాజ్ఞమున శివునినుపేక్షించుటచే నతడు తనధనస్సుచే దేవతలను మర్దించెను. అప్పుడు వారందఱు శివునిప్రార్థింప నతడుకృపజెంది వారికి శివధనస్సునిచ్చెను.

* శివ ప్రకరణము. ౨వ అధ్యాయము. వసిష్ఠుడు చూడుము.

వారు దేవరాతునియందు దయగలవారై యాతని కావిల్లునిచ్చిరి. అప్పటినుండియు నాతనివంశమువారిచే శివధనస్సు పూజింపబడుచుండెను.



## ౯-వ అధ్యాయము.

## దశరథుడు పుత్రకామేష్టి జేయ ప్రయత్నించుట.



మహాత్ముడగు దశరథుడు పుత్రులు లేకపోవుటచే విచారము గలవాడై పుత్రులకొఱ కశ్వమేధయాగము చేయ మంత్రులతో నిశ్చయించి సుమంత్రునిబిలిచి 'నాగురువులను, పురోహితులను రప్పింపు'మనికోరెను. అతడు త్వరితముగ వెళ్లి వేదము బాగుగ దెలిసిన సుయజ్ఞుని, వామదేవుని, జాబాలిని, కాశ్యపుని, పురోహితు డగు వసిష్ఠుని, తదితర బ్రాహ్మణోత్తములను దీసికొనివచ్చెను. వారిని దశరథుడు క్రమప్రకారము పూజచేసి యిట్లు పలికెను. 'పుత్రులకై విచారించుచు నేను సుఖమొందకున్నాను. నేను అశ్వమేధము విధి ప్రకారముగ జేసి పుత్రులను బొందగోరెదను. ఆయశ్వమేధము జరుగునట్లు మీరాలోచనచేయుడు' రాజుయొక్క యీమాటలను వసిష్ఠాదులు విని 'లెస్స'యనిపొగిడి మిక్కిలిసంతోషముతో "యజ్ఞ సామగ్రిని సంపాదింపుము. యజ్ఞాశ్వమును విడువుము. ముఖ్యముగ నీవు కోరినపుత్రులు నీకు గలిగెదరు." అని బహులు పలికిరి. రా జామాటలకుసంతోషించి తనమంత్రుల కిట్లాజ్ఞాపించెను. "నాగురువులు చెప్పినప్రకారము యజ్ఞసామగ్రిని తెప్పింపుడు. యజ్ఞాశ్వముతో నుపాధ్యాయుడును, సమర్థులగు నితరులును వెళ్లవలెను. సరయూ నదియొక్క యుత్తరపుగట్టున యజ్ఞవాటము నేర్పఱుపుడు. అక్కడ యథావిధిగ శాంతులను జరుపవలెను. రాజులందఱు యజ్ఞమునకు వచ్చెదరు. దానియందు కష్టములును, నపచారములును కలుగ గూడదు. విద్వాంసులును, బ్రహ్మరాక్షసులును లోపములనె వెతుకు చుందురు. యజ్ఞమునకు నష్టముకలిగిన యెడల వెంటనే కర్త క్ష

నాశనము కలుగును. నాయజ్ఞము పూర్తియగునట్లు చేయుటకు మీరు సమర్థులు గాన తగిన ప్రయత్నములు చేయుడు." దశరథు డిట్లాజ్ఞాపింప మంత్రు లాతనిని శ్లాఘించిరి. బ్రాహ్మణులు రాజును దీవించి సెలవు పుచ్చుకొని తమస్థానములకు జనిరి. అప్పుడు రాజు మంత్రులతో 'గురువులు చెప్పినప్రకారము చేయు'డని చెప్పి వారికి సెలవిచ్చి తనయంతఃపురమున కరిగి 'నేను పుత్రులకొఱకు యజ్ఞముచేసెదను. మీరుకూడ దీక్షవహింపు' డని తనభార్యలతో జెప్ప వారిముఖకమలములు వికసించెను.

సుమంత్రు డొకమాఱు దశరథునివద్దకు పోయి రహస్యముగ నిట్లుపలికెను. "పూర్వకాలమున సనత్కుమారుడు మీగురువులతో నీయంశములను జెప్ప వారు వానిని నాతో నిట్లుచెప్పిరి. 'విభండకు' డనుఋషికి ఋశ్యశృంగుడు పుట్టగలడు. అతడు అంగదేశములకు రాజగు రోమపాదుని కుమార్తెయగు శాంతను పెండ్లాడి వానియింట నుండగలడు. ఇక్ష్వాకువంశమున సత్యవ్రతుడగు దశరథుడు పుట్టగలడు. దశరథునకు రోమపాదునకు సఖ్యము కలుగును. దశరథుడు రోమపాదునియొద్దకు పోయి 'నాకు పుత్రులు లేరు. వంశాభివృద్ధికై నేను యజ్ఞమును చేసెదను. కావున నీకుమార్తెను, నీయల్లుని నాయజ్ఞమునకు బంపుము. వానిసహాయమువలన యజ్ఞసమాప్తిని, పుత్రులను బొందెదను' అని వానినడుగును. అందులకు రోమపాదు డొప్పుకొని సంతానవంతులైన యాదంపతులను దశరథునితో బంపును. దశరథుడు ఋశ్యశృంగుని సహాయమువలన యజ్ఞముపూర్తిచేసి యాతనివరముచే ప్రఖ్యాతికీర్తిమంతులగు నలుగురుపుత్రులను బడయును.' ఇట్లు వారు నాతో జెప్ప నేనిప్పుడు వానిని మీకు దెలిపితిని." ఈమాటలను సుమంత్రుడు దశరథునితో జెప్పి మఱియు వానితో 'రోమపాదునియొద్దకు మీరు స్వయముగ వెళ్లు'డని చెప్పెను. ఈవిష

యమును దశరథుడు వసిష్ఠుని నడుగ నతడుకూడ నట్లేయనెను. పిమ్మట దశరథుడు తనగురువు ననుమతిపొంది యంతఃపురస్త్రీలతోను, నమాత్యులతోను ప్రయాణమయి యడవులను, నదులను మెల్లమెల్లగ దాటివెళ్ళి రోమపాదునిసమీపమున నగ్నివలె తేజరిల్లు ఋశ్యశృంగుని జూచెను. రోమపాదుడు తనకుసఖుడగు దశరథుని మిక్కిలిసంతోషముతో పూజచేసి ఋశ్యశృంగునికి వానితోగల స్నేహమును, సంబంధమును దెలియబఱచెను. ఋశ్యశృంగుడుగూడ దశరథునికి పూజలొనర్చెను. దశరథు డక్కడ 7,8 రోజులుండి రోమపాదునితో శాంతను, నామెభర్తను తనపురమునకు బంపవలెననియు గొప్ప కార్యము కలదనియు పలికెను. రోమపాదుడు దానికొప్పుకొని ఋశ్యశృంగునితో 'నీభార్యను దీసికొని దశరథునితోగూడ నతని పురమునకు వెళ్ళు'మనిచెప్పెను. దానికాత డంగీకరించి తనభార్యతో బయలుదేఱెను. రోమపాదుడును, దశరథుడును నొకరికొకరు నమస్కరించుకొని, యొకరినొకరు కౌగలించుకొని సంతోషమును బొందిరి. దశరథుడు తనసఖునితోజెప్పి బయలుదేఱి తననగరవాసులకు నగర మలంకరింపవలెననియు, ధూపములు వేయింపవలెననియు, బాటలయందు నీరుజల్లింపవలెననియు, జండాలు, తోరణములు మొదలగునవి కట్టింపవలెననియు తనదూతలద్వారా ముందుగ వర్తమానమంపెను. పౌరులు సంతోషించినవారై యట్లుచేసిరి. దశరథుడు ఋశ్యశృంగుని వాద్యములతో దీసికొనివచ్చి యయోధ్యను జేరెను. పౌరులందఱు సంతోషించిరి. దశరథుడు శాంతను, ఋశ్యశృంగుని తనయంతఃపురమునకు దీసికొనిపోయి వారికి పూజచేసి తాను చేయవలసినపని జరిగినదని తలచెను. అంతఃపురస్త్రీలు శాంతను, నామె భర్తను మర్యాదచేయ వారు కొంతకాలమక్కడ సుఖముగ నివసించిరి.

చాలకాలము గడచిన తరువాత వసంతఋతువు రాగా దశరథునకు యజ్ఞముచేయ మనస్సు కలిగెను. అతడు ఋశ్యశృంగునికి నమస్కరించి పుత్రులకొఱకు నతనిని యజ్ఞముచేయింపగోర ఋషి 'యట్లే' యనిచెప్పి 'సామగ్రిని తెప్పింపుము. యాగాశ్వమును వదలుము.' అని యనెను. రాజు సుమంత్రునిచే మొదట దాను బ్రాహ్మణులను బిలిపించినటుల నప్పుడుగూడ వారిని బిలిపించి వారితో దనయభిప్రాయమును జెప్ప వారు దాని కంగీకరించిరి. ఋశ్యశృంగుడును, బ్రాహ్మణులును దశరథునితో 'తగినప్రయత్నములు చేయుము. నీకు నలుగురుపుత్రులు జన్మించెదరు.' అనిపలికిరి. రాజు పూర్వము తనమంత్రుల నాజ్ఞాపించినటుల తిరుగ వారిని నాజ్ఞాపించెను. రాజు బ్రాహ్మణుల యాశీర్వాదమునొంది వారిని బంపి తనయంతఃపురమును బ్రవేశించెను. మంత్రులు రాజాజ్ఞను జరిపిరి.

తరువాత కొంతకాలమునకు దశరథుడు వసిష్ఠునికి నమస్కరించి, పూజలొనర్చి వానినిట్లు వేడెను. "నాచే యజ్ఞమును విఘ్నము లేకుండ యథావిధిగ జేయింప గోరెదను. మీరు నాకు గురువులు; నిరంతరముండుస్నేహము గలవారు. యజ్ఞభారము మీరు వహింపవలెను." ఇట్లు దశరథుడు వేడ 'అట్లే నీవు కోరినదానిని నేను చేయించెద'నని వశిష్ఠుడు పలికెను. తరువాత కులగురువు యజ్ఞకర్మలను బాగుగ నెఱిగినవారును, ధార్మికులును నగుముసలి బ్రాహ్మణులను, సామానులు తెచ్చుటలో సమర్థులగువారిని, పనులను బాగుగ నెఱవేర్చువారిని, శిల్పకారులను,వడ్రంగులను, సూతులు, గోతులు మొదలగువానిని త్రవ్వువారిని, గణితము తెలిసినవారిని, నటకులను, నర్తకులను, నెక్కువవిద్యలు చదివినవారిని, శుచియగువారిని, శాస్త్రవిదుళను పిలిపించి వారిని నిట్లునియమించెను. "మీరు రాజాజ్ఞప్రకారము

యజ్ఞకర్మలను జరుపవలెను. అనేక వేలయిటుకలను తయారుచేసి తీసి కొనిరావలెను. రాజులుండుట కుపయోగమగునట్లు మంచియిండ్లను కట్టవలెను. బ్రాహ్మణులకు వందలకొలది యిండ్లను కట్టవలెను. అనేకరకములగు నన్నపానాదులను తయారుచేయింపవలెను. పట్టణ వాసులకుగూడ వానిని తయారుచేయింపవలెను. ఇండ్లలో ననేకభక్ష్యములను తయారుచేసి యుంచవలెను. గ్రామవాసులకుగూడ విధిప్రకారము అన్నమీయవలెను. అన్నివర్ణములవారికి తగినమర్యాదలు జరుగవలెను. కోరికవలనగాని, కోపమువలనగాని యెవరికిని నవమానము జరుగకూడదు. యజ్ఞకర్మలు చేయించువారికిని, శిల్పులకును ముఖ్యముగ తగినమర్యాదలను జరుపవలెను. వారికి తగినసొమ్మిచ్చి భోజనము పెట్టవలెను. లోపమేమియు జరుగకూడదు. కార్యములన్నియు జరుగునటుల ప్రీతితో మీరందఱు చేయవలెను." ఇట్లు వసిష్ఠుడు పలుక వారంద అతడు చెప్పినట్లుచేసి లోపములేకుండ వానినన్నిటిని జరుపుట కొప్పుకొనిరి. అంతట వసిష్ఠుడు సుమంత్రుని బిలిచి వానినిటుల నియమించెను. "పృథివియందుండు ధార్మికులగు రాజులను రప్పింపుము. వేలకొలది బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను మర్యాదచేసి యన్నిదేశములనుండి రప్పింపుము. మిథిలాధిపతియగు జనకునికి దశరథునికిగల సంబంధము పూర్వము నీకు తెలిపితిని. శూరుడును, సత్యపరిపాలకుడును, వేదశాస్త్రములన్నిటిలో పరిపూర్ణుడును నగు నతనిని నీవు స్వయముగబోయి పిలువుము. దశరథుని స్నేహితుడును, ప్రియవాదియు నగుకాశీరాజును నీవు స్వయముగ బిలువుము. దశరథుని మామయును, వృద్ధుడునునగు కేకయరాజును, వానిపుత్రులను నీవు పిలిచిరమ్ము. రాజునకు స్నేహితుడును, సత్పురుషుడును, కీర్తిమంతుడును, నంగరాజునునగు రోమపాదుని నీవు పిలువుము. తూర్పు దక్షిణ దేశాధిపతులను, సింధు, సౌవీర సౌరాష్ట్రదేశముల

రాజులనున్ మిగిలిన రాజులను పిలిపింపుము. స్నేహపాత్రులగు రాజుల నందఱిని కుటుంబపరివారసహితముగ రప్పింపుము." ఇట్లు వసిష్ఠుడు నియమింప సుమంత్రు డట్లు మనుష్యులను బంపి తానుగూడ బయలు దేఱెను. యజ్ఞసన్నాహము చేసినవారందఱు తాము చేసినది వసిష్ఠునితో జెప్ప నాతడు సంతోషించెను. అతడందఱితో 'మీరు గర్వముచేగాని, పరిహాసముచేగాని యేమియును పంచిపెట్టకుడు. అట్లుచేసిన యెడల యజ్ఞకర్తకు నష్టముకలుగు'నని చెప్పెను. అంతట కొన్నిదినములకు ననేకరత్నములు పట్టుకొని రాజులు దశరథునినగరునకు వచ్చిరి. తర్వాత వసిష్ఠుడు దశరథునితో 'రాజులందఱు వచ్చిరి. యజ్ఞసంభారములు సిద్ధమైనవి. యజ్ఞశాలకు బయలుదేఱుము.' అని చెప్పెను. అంతట శుభదినమున శుభనక్షత్రమున వసిష్ఠ ఋశ్యశృంగులు కోరిన ప్రకారము దశరథుడు తనయజ్ఞవాటమున కరిగెను. వసిష్ఠ ఋశ్యశృంగులుకూడ బ్రాహ్మణోత్తములతో యజ్ఞమునుచేయించుటకు నచటికి వెళ్లిరి.

---

## ౧౦ వ. అధ్యాయము. దశరథు డశ్వమేధ పుత్రకామేష్టుల జేయుట.

అశ్వమును విడిచిన యొకసంవత్సరమునకు వసంతకాలము తిరిగి రాగా దశరథుడు తనభార్యలతోను, ఋశ్యశృంగునితోను సరయూనదికి నుత్తరదిక్కునకట్టబడిన యజ్ఞవాటమున బ్రవేశించెను. బ్రాహ్మణోత్తము లాతనిపురస్కరించుకొని తగినకర్మలను సలిపిరి. 'ప్రవర్గ్య' మనుకర్మను, 'ఉపసదన' మనుయష్టిని బ్రాహ్మణులు చేసిరి. ఋషిశ్రేష్ఠు లుదయము, మధ్యాహ్నము, సాయంకాలము చేయవలసిన యజ్ఞములను జేయించి యింద్రదేవతాప్రీతిగ సోమలతను స్తుతించిరి. బ్రాహ్మణులచే నగ్నిలో వేయబడకుండ విడువబడినదియు, యజ్ఞపాత్రలనుండి క్రిందపడినదియునగు హోమపదార్థము కొంచెమైనను లేకుండెను. విఘ్నములులేకుండ మంత్రయుక్తముగ యజ్ఞకర్మలు చేయబడెను. దశరథునియజ్ఞము జరుగుదినములలో నక్కడ నాకలి దప్పి

కలుగలవారు లేకుండిరి. యజ్ఞమునకు వచ్చిన బ్రాహ్మణులలో విద్వాంసులు కానివారుగాని, నూఱుమంది శిష్యులు లేనివారుగాని లేకుండిరి. యజ్ఞమున బ్రాహ్మణులును, ఋషులును, సన్యాసులును, శూద్రాదులును సంతుష్టిగ భుజించిరి. ముసలివారును, రోగులును, స్త్రీలును, బాలురును బాగుగ భుజించిరి. అన్నమును, బట్టలును బీదలకు బాగుగ నిచ్చిరి. బాగుగ వండిన ధాన్యమును పెద్దరాసులుగ బోసిరి. అనేక దేశములనుండి యజ్ఞమును జూచుటకు వచ్చిన స్త్రీ పురుషులందఱు అన్నపానములచేతను, వస్త్రములచేతను బహుమానింపబడిరి. మంచియలంకారములు, మంచికుండలములు గల బ్రాహ్మణు లందఱికి వడ్డించిరి. యజ్ఞకర్మలమధ్యను బ్రాహ్మణులు తమతమ వాదములకు దగినకారణముల దెలియజేయుచు పండితవాదములు సలిపిరి.

పా పా పా
P P P
ఖ ఖ ఖ
P P P
బి బి బి
P P P
P దే.దా
శ్లేష్మా
P
P దే.దా
బి బి బి
P P P
ఖ ఖ ఖ
P P P
పా పా పా
P P P

ఈ ప్రక్కను జూపినరీతిని నశ్వమేధమునకు శ్లేష్మాతక (విరిగి) దేవదారు బిల్వ (మారేడు) ఖదిర (చండ్రి) పాలాశ (మోదుగ) వృక్షముల సంబంధమైనయూపములు (స్తంభములు) శాస్త్ర ప్రకారము తయారుచేయబడి బంగారముచే నలంకరింపబడి భూమియందు పాతబడెను. అవి 21 మూరలు పొడుగుగలిగి 8 పలకలుగ నిర్మింపబడి నునుపుగనుండెను. వానిపైని బట్టలు కప్పినపు డవి సప్తర్షులవలె ప్రకాశించుచుండెను. శాస్త్రప్రకారము తయారు చేయబడిన యిటికలతో బ్రాహ్మణులు యజ్ఞకుండమునకు గోడలను గట్టిరి. అగ్నికుండములు గరుత్మంతుని యాకారమువలె నేర్పఱుపబడెను. ఆ యూపములకు యజ్ఞపశువులను, యజ్ఞసర్పములను, యజ్ఞపక్షులను, యజ్ఞజలచరములను నాయాదేవతలకొఱకు గట్టిరి. ఆయూపములవద్ద నశ్వమేధాశ్వమును, 300 పశువులను గట్టిరి. కౌసల్య యాగుఱ్ఱ

మునకు తగినపరిచర్య జేసి యొక రాత్రి దానివద్దనుండెను. ఋత్విక్కులు పట్టపు దేవియగు నామెచేతను, దశరథునియితర భార్యలచేతను, నితర స్త్రీలచేతను గుఱ్ఱమును ముట్టించిరి. తరువాత కౌసల్య మూడుకత్తులతో నాగుఱ్ఱమును నఱికెను. ఋత్విజుడు గుఱ్ఱము యొక్కవపను శాస్త్రప్రకారము తీసి పక్వముచేయ నావాసనను రాజు క్రమముగ బీల్చి తనపాపమును బోగొట్టుకొనెను. ఋత్విజులందఱు గుఱ్ఱము యొక్కయవయవముల నన్నిటిని యజ్ఞకుండములో విధిప్రకారము హోమము జేసిరి. అశ్వాంగములను 'వైతసము'నెడు ఇష్టిచేతను, నితరపశువులను ప్లక్షశాఖలనెడు కర్రలచేతను వారు హోమము చేసిరి. అశ్వమేధము మూడుదినములు జరిగెను. మొదటిదినమున 'చతుష్టోమ' మనెడు యజ్ఞమును, రెండవదినమున 'ఉక్థ్య' మనెడు యజ్ఞమును, మూడవదినమున 'అతిరాత్ర'మనెడు యజ్ఞమును ఋత్విజులు జరిపించిరి. జ్యోతిష్టోమము, ఆయుష్టోమము, అతిరాత్రము, అభిజిత్తు, విశ్వజిత్తు, అప్తము, యామము అను నితర క్రతువులను యథాశాస్త్రముగ వారు చేయించిరి.

బ్రహ్మ పూర్వకాలమున నశ్వమేధముచేసి ఋత్విజులకు దక్షిణలనిచ్చినరీతిని దశరథుడును యజ్ఞాంతమున నాల్గుదిక్కులకు వ్యాపించిన తనరాజ్యమును ఋత్విజుల కీయ వారు రాజుతో "భూమిని పరిపాలింప నీవే సమర్థుడవు. మాకు భూమితో కార్యములేదు. మేము దానిని పరిపాలింపలేము. కావున నెల్లప్పుడు వేదాధ్యయనపరులమగు మాకు నీవు మణిరత్నములనుగాని, సువర్ణమునుగాని, గోవులనుగాని యిమ్ము" అనిపలికిరి. అంతట దశరథుడు ఋత్విజులకు 10లక్షల గోవులను, 10కోట్లబంగారమును, 40కోట్లవెండిని నీయ వారు వానిని ఋశ్యశృంగునకును, వసిష్ఠునకును నిచ్చిరి. వానిని వారు న్యాయముగ బ్రాహ్మణోత్తములకు బంచియిచ్చిరి. బ్రాహ్మణులు సంతోషించి

'తృప్తులమైతిమి' అని రాజుతో బలికిరి. యజ్ఞముజూడవచ్చిన బ్రాహ్మణులకు చాలబంగారును, దరిద్రులగు బ్రాహ్మణులకు హస్తాభరణములను దశరథు డీయ వారు సంతోషించిరి. రాజు వారికి నమస్కరించి వారి యాశీర్వచనముల బొంది పాపమును హరింపచేయునదియు, స్వర్గలాభమును పొందించునదియు, రాజులు చేయుటకు మిక్కిలి కష్టమైనదియునగు నీయశ్వమేధమును పూర్తినొందించెను. తర్వాత దశరథుడు 'నావంశాభివృద్ధిని కలుగజేయు నిష్టిని మీరు చేయింపవలె'నని ఋశ్యశృంగుని వేడ నతడు 'అట్లేలెమ్ము. నీకు వంశోద్ధారకులగు పుత్రులు నలుగురు జన్మించెదరు.' అనిపలికెను. తరువాత నాఋషి కొంచెముధ్యానించిచూచి రాజుతో "పుత్రోత్పత్తికి కారణభూతమగు పుత్రకామేష్టిని నథర్వణవేదమునందుండు మంత్రములతో జేయించెద"నని చెప్పెను. పిమ్మట నత డిష్టిని ప్రారంభించి మంత్రసహితములగు కర్మలతో నగ్నియందు హోమముజేసెను. అక్కడకు దేవతలును, గంధర్వులును, సిద్ధులును, గొప్పఋషులును, తమయజ్ఞభాగములను బుచ్చుకొనుటకు విచ్చేసిరి.

---

## ౧౧ వ. అధ్యాయము. రామాదుల జన్మకారణము.

దశరథుడు పుత్రకామేష్టి చేయుకాలమున రావణాదిరాక్షసుల బాధలకోర్వలేక దేవతలును, గోరూపమునుధరించిన భూమియును, దేవఋషులును, గంధర్వులును, సిద్ధులును బ్రహ్మయొద్దకు బోయి యిట్లనిరి. "మీరిచ్చిన వరములవలన 'రావణు'డను రాక్షసుడు మమ్ములను బాధించుచున్నాడు. అందువలన వానిని మేము శిక్షింపలేకున్నాము. మీరు వానికి వరమిచ్చుటచే వానిదుష్టప్రవర్తనలను

మేమోర్చియుంటిమి. వాడు మూడులోకములను, రాజులను భయపెట్టి యింద్రునిగూడ తిరస్కరించుచున్నాడు. వాడు వరదానముచే గర్వించి ఋషులను, యక్షులను, గంధర్వులను, నసురులను, బ్రాహ్మణులను బీడించుచున్నాడు. సూర్యుడు వానిని తపింపజేయలేకున్నాడు. వాని వద్ద వాయువు వీచుటకుభయపడుచున్నాడు. వానినిజూచి సముద్రము చలింపక యుండెను. ఈఘోరరాక్షసునివలన మాకు భయము కలుగుచున్నది. వీనిని సంహరించు నుపాయ మాలోచింపుడు." దేవతల యీమాటలను బ్రహ్మ విని యాలోచించి "నేను వాని కిదివరలో గంధర్వ యక్ష దేవ దానవ రాక్షసులచే నాతడు మరణము నొందకుండునట్లు వరము నిచ్చితిని. వాడు మనుష్యులను స్వల్పజీవులుగ నెంచి వారిసంగతి చెప్పలేదు; గనుక మనుష్యునివలన వానికి మృత్యువు కలుగును." అని వారికి జెప్పెను. బ్రహ్మమాటలను దేవతలు విని సంతోషించిరి. తరువాత వారందఱు వేయిసూర్యుల ప్రకాశముకలవాడును, నీలవర్ణుడును, కిరీటము, హారము, కేయూరము కౌస్తుభమణిమొదలగు నాభరణములు కలవాడును, శంఖ చక్ర గదాపాణియు, పీతాంబరమును ధరించినవాడునునగు మహావిష్ణువును దర్శించుటకు తూర్పుదిక్కుననున్న పాలసముద్రమునకు బోయిరి. సనకాదులు విష్ణువును స్తుతించుచుండిరి. విష్ణువు లక్ష్మితోను, భూదేవితోను, గరుడునిపైనిలువ బ్రహ్మాదులాతనికి నమస్కరించి యిట్లు విన్నవించిరి. "లోకములమేలుకొఱకు మిమ్ము వేడుచున్నాము. ధర్మజ్ఞుడును, మహర్షితేజుడునునగు దశరథుడయోధ్యాపతియై యుండెను. అతనికి ముగ్గురుభార్యలు కలరు. మీరు మీయాత్మను నాలుగు విధములుగ విభజించుకొని వారియందు వానికి పుత్రులుగ నవతరింపుడు. లోకకంటకుడగు రావణుని యుద్ధమున జంపుడు. వాడు దేవతలు, గంధర్వులు మొదలగువారిని బాధించుచున్నాడు. నందన

వనములో క్రీడించు గంధర్వాప్సరసలను హింసించుచున్నాడు." ఇట్లు బ్రహ్మమొదలగువారు విన్నవింప విష్ణువు వారికిట్లు సెలవిచ్చెను. "మీరు భయమును జెందకుడు. నేను రావణుని, వానిపుత్రులను, పౌత్రులను, నమాత్యులను, మిత్రులను, జ్ఞాతులను సంహరించి 11,000 సంవత్సరములు మనుష్యలోకములో రాజ్యము చేసెదను. పూర్వము కశ్యపుడు నన్ను పుత్రునిగగోరుచు తపస్సుచేయ నేను దానికి సంతోషించి యటులజరిపెదనంటిని. అతడు దశరథుడుగ జన్మించెను. అతనికి నేను నా యాత్మను నాలుగువిధములుగ విభజించి కొని జన్మించెదను. యోగమాయ జనకునిగృహమున సీతగజన్మించును." ఇట్లు విష్ణువు సెలవీయ దేవతలాతని స్తుతించి 'రావణుని వధించిన తరువాత మీలోకమునకు మీరు విచ్చేయుడని కోరిరి. అతడు దశరథునకు జన్మించుటకు నిశ్చయించి యదృశ్యుడయ్యెను. *

## ౧౨వ. అధ్యాయము.

## దశరథుడు భార్యలకు యజ్ఞపాయసమిచ్చుట.

దశరథుడు పుత్రకామేష్టి జేయ యజ్ఞకుండమునుండి బలపరాక్రమ తేజములు కలవాడును, నల్లనిబట్టలను, నెఱ్ఱనిబట్టలను కట్టిన

* తరువాత బ్రహ్మ దేవతలతో 'మీరు మీయంశములతో వానరులుగను, ఋక్షులుగను,(ఎలుగుబంట్లు) గోపుచ్ఛులుగను, జన్మించి రామునికి సహాయమొనర్చుడు' అనిపలికెనని బాలకాండ 17వ. సర్గలో తెలుపబడినది. ఇదివరలో వాలిసుగ్రీవులయు, హనుమంతునియు, నితరవానరులయు, చరిత్రములు; 4వ. ప్రకరణమున తెలిపియుంటిమి. వాలిసుగ్రీవులు బ్రహ్మపుత్రుడగు ఋక్షరజునిపుత్రులు. వాలి రావణునికి పరాభవమొనర్చెను. హనుమంతుడును, నితరవానరులును చాల కాలముక్రిందట జన్మించి యనేకపౌరుషకర్మలను జరిపిరి. వారు దశరథుని యజ్ఞకాలమున జన్మించిరనుమాట యుక్తముగనుండదేమొ. దేవతలప్రార్థనకుముందు చాలకాలముక్రిందట వారు జన్మించియుండిరి.

వాడును, నెత్తురువంటి ముఖము కలవాడును, దుందుభులధ్వనివంటిధ్వనికల వాడును, సింహపుజూలువంటి తలవెండ్రుకలు, మీసములు, రోమములు కలవాడును, శుభలక్షణములు కలవాడును, వెలిగెడు నాభరణములు కలవాడును, సూర్యరూపముకలవాడును, నగ్నివలె తేజరిల్లువాడును, కొండశిఖరమువలెనుండు నెత్తైనశరీరముకలవాడునునగు

యజ్ఞపురుషుడు బయలువెడలి పైని వెండిపూయబడినదియు, దివ్యపాయసము గలదియునగు బంగారుపాత్రను తనభుజములతో నెత్తి దశరథునిజూచి 'నన్ను బ్రహ్మ బంప నేనిచ్చుటకై వచ్చితిని.' అని పలికెను. దశరథు డామహాపురుషునికి నమస్కరించి 'దయచేయుడు. నేనేమిచేయవలయునో సెలవీయుడు' అని విన్నవింప నాపురుషు డిట్లు పలికెను. "నీవు దేవతలను యజ్ఞమువలన తృప్తిజేయుటచే నేను దీనిని తీసికొని వచ్చితిని. ఇది దేవనిర్మితమగు పాయసము. ధనము నిచ్చునదియు, నారోగ్యమువృద్ధి జేయునదియు, పుత్రోత్పత్తి కలుగజేయునదియునగు దీనిని నీవు గ్రహింపుము. దీనిని నీయనుంగుభార్యలకు భుజించుటకునిమ్ము. యజ్ఞఫలముగ వారియందు నీవు పుత్రులబడయుదువుగాక!" ఇట్లు యజ్ఞపురుషుడు పలుక నట్లేయని రాజు పలికి యాతనికి మ్రొక్కి పాయసపాత్రను గ్రహించి వానికి చాలసారులు ప్రదక్షిణముచేసెను. అంతట యజ్ఞపురుషు డదృశ్యుడయ్యెను. దశరథుడు మిక్కిలి సంతోషముతో పాయసపాత్రను నంతఃపురమునకు తీసికొనిపోవ నతనిభార్యలుగూడ హర్షమొందిరి. రాజు తనజ్యేష్ఠభార్యయగు కౌసల్యతో 'పుత్రోత్పత్తిని కలుగజేయు నీపాయసమును గ్రహింపు'మనిచెప్పి యామెకు దానిలో సగమిచ్చెను. మిగిలిన సగములో సగము సుమిత్రకిచ్చెను. మిగిలిన పావులో సగము కైకేయికిచ్చెను. మిగిలిన యెనిమిదవభాగము నాతడాలోచించి తిరుగ సుమిత్రకునిచ్చెను. వారు పాయసమును దినిరి. యజ్ఞానంతరమున దేవతలు

తమతమభాగములతో తమతమ లోకములకు జనిరి. యజ్ఞముచూచుటకు వచ్చిన రాజులు సంతోషించి దశరథునివలన తగినసత్కారముల బొంది వసిష్ఠునికి నమస్కరించి తమదేశములకు వెళ్ళిరి. వారియనుచరులకు దశరథుడు తగినబహుమానము లియ్య వారు సంతోషముతో వెడలిరి. శాంతయును, ఋష్యశృంగుడును రోమపాదునితోను, నతని యనుచరులతోను వెడలిరి. అంతట దశరథుడు తనదీక్షయు, నియమములు పూర్తికాగా తనభార్యలతోను, భృత్యులతోను, బలవాహనములతోను, బ్రాహ్మణులతోను, అయోధ్యను జేరెను. అతడు పుత్రోత్పత్తినిగురించి యాలోచించుచుండెను.



## ౧౩వ. అధ్యాయము.

## రామాదుల జననము. విద్యాభ్యాస యౌవనములు.

---

దశరథునిభార్యలు యజ్ఞపాయసమును భుజించినతరువాత * చాలకాలమున సూర్యాగ్నుల తేజస్సువంటి తేజస్సుగల గర్భములను ధరించిరి. దశరథుడు వారలను జూచి మిక్కిలి సంతోషించెను. ఒకానొక సంవత్సరమున చైత్రశుద్ధ నవమి రోజున పునర్వసూనక్షత్రయుక్త కర్కటకలగ్నమందు కౌసల్య సర్వలక్షణాంక్షితుడును, జగన్నాథుడు

---

*బాలకాండ 16 సర్గ. 31వ శ్లోకములో 'చిరేణ' యనుపదము ప్రయోగింపబడినది. కాని 18వ. సర్గలో 7వ.శ్లోకమున 12మాసములు గర్భముధరించిరని చెప్పబడినది. నూఱుసంవత్సరముల ఆయుర్దాయముగల మనుష్యులకే 9మాసములకుపైగా గర్భవాసమైనపుడు 11000 సంవత్సరములు రాజ్యముజేసిన రామాదులకు గర్భవాసము 12నెలలుగాక [Proportionnately] సుమారు నూఱేండ్లని మాకు తోచుచున్నది, గనుక చిరకాలమనుమాట యుక్తముగనున్నది.

నగు రామునిగని తేజరిల్లుచుండెను. అప్పుడు ఐదుగ్రహము లుచ్చస్థానములం దుండెను. కర్కటకలగ్నమున బృహస్పతి చంద్రు లుదయించుచుండిరి. కైకేయి సర్వగుణసంపన్నుడును, సత్యపరాక్రముడునునగు భరతుని పుష్యమీనక్షత్రయుక్తమీనలగ్నమునగనెను. సుమిత్ర ఆశ్లేషనక్షత్రయుక్తకర్కటకలగ్నమున సూర్యుడుదయించు సమయమున వీరులును, సర్వాస్త్రకుశలులును,కవలలునునగు లక్ష్మణశత్రుఘ్నులను గనెను. అప్పుడు గంధర్వులు పాడిరి. అప్సరస లాడిరి. దేవదుందుభులు మ్రోగెను. పుష్పవర్ష మంతరిక్షమునుండి కురిసెను. అయోధ్యలో గొప్పయుత్సవములు జరిగెను. జను లనేకులు వచ్చిరి. వీధులలో నాట్యమాడువారును, గీతములు పాడువారును, వాద్యములు వాయించువారును, నితరులును ననేకులుండిరి. రాజు సూతులకు, వందిమాగధులకు బహుమతుల నిచ్చెను. బ్రాహ్మణులకు ధనమును, గ్రామములను, ననేకగోవులను నిచ్చెను. అతడు 11రోజులుపోయిన తరువాత వసిష్ఠునిచే పుత్రులకు నామకరణములు చేయించెను. మహాత్ముడగు దశరథునియొక్క జ్యేష్ఠపుత్రుని మునులందఱు చూచి గొప్ప సంతోషము నొందుటచే వానికి 'రాము'డనియు, కైకేయిపుత్రుడు లోకమును భరించువాడగుటచే వానికి 'భరతు'డనియు, సుమిత్రిపుత్రులలో మంచిలక్షణములతో కూడినవానికి 'లక్ష్మణు'డనియు శత్రువులనుజంపువానికి 'శత్రుఘ్ను'డనియు వసిష్ఠుడు నామకరణములనుజేసెను. దశరథుడు పట్టణములలోను, దేశములలోనునున్న బ్రాహ్మణులకందఱికి భోజనములనుబెట్టి యెక్కువగ రత్నముల నిచ్చెను.

రామునికండ్లు కమలపత్రములవలె విశాలముగనుండెను. అతని ముఖము చంద్రునివలెను, నన్నియవయవములు సమముగను, సుందరముగను నుండెను. అతనికి నిడుదలగు మంచికనుబొమలును, సింహపు

వక్షస్థలమువంటి వక్షస్థలమును, బాగుగ నేర్పఱుపబడిన పొడవైన బాహువులును, సొగసైనముక్కు, పెదవులు, చెక్కిళ్ళును, శంఖము వంటికంఠమును, దుందుభిధ్వనివంటి కంఠస్వరమును, నునుపగుశరీరమును, సన్ననిమంచిపలువరుసయునుండెను. అతఁడు శ్యామలవర్ణము గలవాఁడై యనేకయలంకారములను ధరించెను.*

లక్ష్మణుఁడు మంచిబంగారువర్ణముగల శరీరమును, వెడల్పగు వక్షస్థలమును, నీలిరంగుగల కురులును గలిగియుండెను.

---

*అ. రా:—రాముడు కౌసల్యకు జన్మించినపుడు విష్ణురూపమున నుండెను. అతఁడు శ్యామలవర్ణముగలశరీరము, నాలుగుభుజములు కలవాఁడును, పచ్చనివస్త్రము కట్టినవాఁడును, పద్మమువలె నెఱ్ఱగనుండు కంటికొనలు గలవాఁడును, ప్రకాశమానమగు కుండలములు, కిరీటము మెలితిరిగినముంగురులు కలవాడును, శంఖ చక్ర గదా పద్మ వనమాలలచే ప్రకాశించువాఁడును, హృదయమందున్న యనుగ్రహమనెడిచంద్రునిసూచించు 'నవ్వు' అనెడి వెన్నెలగలవాడును, శ్రీవత్సము హారము, భుజాలంకారములు కాలియలంకారములు మొదలగు నవికలవాఁడును, వేయిసూర్యులప్రకాశము కలవాడును, జగన్నాథుఁడును, సనాతనుఁడును, పరమాత్ముఁడునునై యుండెను. అట్టి పరమాత్ముని కౌసల్యజూచి యాశ్చర్యమునుబొంది గొప్పసంతోషమువలన నానందబాష్పములుకలదై చేతులుజోడించి వానిని స్తుతించుచు నిట్లు పలికెను. "దేవదేవా! శంఖ చక్ర గదాధరా! నీకు నమస్కారము. నీవు పరమాత్ముఁడవు. అచ్యుతుఁడవు. మొదటినుండియు నుండువాఁడవు. స్వయముగ ప్రకాశించువాఁడవు. అంతములేనివాఁడవు. పురుషోత్తముఁడవు. పరిపూర్ణుఁడవు. స్వతంత్రుఁడవు. నాశనరహితుఁడవు. నిన్ను వేదము దెలిసినవారు వాక్కుచే నిర్ణయింప వీలులేనివాఁడనియు, బుద్ధి మొదలగు జ్ఞానేంద్రియములచే తెలిసికొనవీలులేనివాఁడనియు, సత్త్వస్వరూపుఁడై

దశరథుడు తనపుత్రులకు నితరములగు జాతకర్మాదిశుభ కర్మలను జేయించెను. వారలలో రాముడు తండ్రికి ప్రీతిని గలుగజేసి జనసమ్మతుడై పతాకమువలె వెలుగుచుండెను. దశరథునిపుత్రు లందఱు తమకు నుపనయనములు కాగా వేదములను జదివిరి. వారు శూరులును, నన్నిలోకములకు మేలుచేయుటయం దాసక్తిగలవారును, జ్ఞానముతో గూడినవారును, సుగుణసంపత్తు గలిగినవారును నై యుండిరి. వారిలో రాముడు గొప్పతేజశ్శాలియు, సత్యపరాక్రము

---

జ్ఞానముచే తెలియదగినరూపము కలవాడనియు జెప్పుదురు. నీవే మాయతో గూడి లోకములను సృజించి రక్షించి నశింపజేయుదువు. నీవు సత్త్వ రజస్తమోగుణములతో గూడి యెప్పుడును జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలుగాక కేవల బ్రహ్మైకసంధానమను నాల్గవ యవస్థను బొంది గుణాతీతుడవై నిర్మలముగ నుందువు. నీవు పనులు చేయుచున్నవానివలె గనపడినను వానిని జేయవు. కదలుచున్నట్లు కనబడినను కదలవు. వినుచున్నట్లున్నను వినవు. చూచుచున్నట్లున్నను చూడవు. నీవు ప్రాణములు, మనస్సు లేనివాడవై శుద్ధముగనుందువు. ఈతీరున నిన్ను వేదములుద్ఘోషించు చున్నవి. అన్నిభూతములందు నీవుసమత్వముగనుండి చలించుమనస్సు గలమనుష్యులచే తెలియబడని వాడవైనను మంచి బుద్ధిమంతులకు స్పష్టముగ గనబడుచునేయుందువు. నీయుదరమున బ్రహ్మాండములు చిన్నతునుకలవలె కనబడుచున్నవి. నీవు నాకడుపునబుట్టుటయనునది లోకవిడంబనమునకై జరిగినది. భక్తులయెడ నీకుగలపారవశ్యము నాకి ప్పుడు కనబడినది. నేను పతి పుత్ర ధనాదులనెడి సంసారసముద్ర ములో మునిగి మాయచే తిరుగుచు నిప్పుడు నీపాదమూలమును జేరి తిని. దేవా! నీరూపమెల్లప్పుడును నామనస్సున నిలుచుగాక! లోకము నంతను భ్రమపెట్టు నీమాయ నన్నావరింపకుండుగాక! అసాధారణ

డున్నై నిర్మలమగుచంద్రునివలె ప్రకాశించుచుండెను. అత డేనుగుల మీద, గుఱ్ఱములమీద స్వారిచేయుటయందు నేర్పుగలవాఁడై రథములను నడుపుచర్యలు తెలిసినవాఁడై దనుర్విద్యయందు పరిపూర్ణుఁడై తన తండ్రికి సేవ జేయుచుండెను. అతఁడు ధనస్సును ప్రయోగించుటచే వతనికి కుడిచేతివద్దకొంచెము చర్మమూడిసమచ్చపడియుండెను. లక్ష్మణుఁడు చిన్నతనమునుండి సౌమ్యుఁడై రాముని నెల్లపు డనుసరించుచుండెను. అతఁడు తనశరీరమునకంటె రామునియం దెక్కువప్రియము గలవాఁడై యాతనిబహిఃప్రాణమువలె సంచరించుచుండెను. అతఁడు రాముఁడు లేకుండ భుజింపకయు, నిద్రింపకయు నుండెను. రాముఁడు గుఱ్ఱమెక్కి వేటకు ముందు బయలుదేఱిన లక్ష్మణుఁడు ధనస్సుపట్టి యాతని వెంబడించుచుండెను. భరతశత్రుఘ్ను లన్యోన్యము ప్రేమ గలవారై సంచరించుచుండిరి. బహ్మా దిక్పాలురతో ప్రీతినొందునటుల

---

మగు నీవిశ్వరూపమును విడిచి సుందరమగునట్టియు నానందమును గలిగించునట్టియు నీబాలరూపమును జూపుము. నిన్ను కౌగిలించుకొని సంతోషదాయకములగు నీముద్దుపలుకులను విని నేను నాగొప్పయజ్ఞానాంధకారమును విడిచెదను." ఇట్లు కౌసల్య వానిని స్తుతించుచు పలుక భగవంతుడగు నారాము డిట్లు బదులుచెప్పెను. "తల్లీ! నీవు కోరినదే జరుగుగాక! ఇతరము జరుగకుండుగాక! భూభారమును తొలగించుకొఱకును, రావణుని సంహారించుకొఱకును బ్రహ్మచే పూర్వము నేను ప్రార్థింపబడినవాఁడనై యిప్పుడు మనుష్యరూపము నెత్తితిని. పూర్వము నీవును, దశరథుడును తపస్సుజేసి నన్ను 'నీవు మాకు పుత్రుడవుగమ్ము' అని గోరియుండిరి. అట్లు నేను జరిపి మీతపఃఫలముచే మీకు కనబడితిని. నాదర్శన మితరులకు దొరకుట మిక్కిలిదుర్లభము. మీకు మోక్షముకలుగుటకు దర్శనమిచ్చితిని." ఇట్లు పలికి రాముడు బాలుడై యేడ్చెను.

దశరథుడు తనపుత్రులతో సంతోషించుచుండెను. దశరథునిపుత్రు లందఱు కీర్తిమంతులును, ముందు రాబోవు దాని నెఱుగువారును, గొప్ప తేజస్సుగలవారును, తండ్రికి సేవజేయుటయందు మిక్కిలి శ్రద్ధగల వారును, సన్ని శాస్త్రములు జదివినవారును, సన్నివిద్యలు తెలిసిన వారును, ధనుర్విద్యయందు పరిపూర్ణులును నై యుండిరి. రాముడు మునులతోగూడ భుజించుచు ధర్మశాస్త్రరహస్యములను విని తెలిసి కొనుచు వాని నితరులకు దెలుపుచు నుండెను. వారికి యౌవనము రాగా దశరథుడు తనపురోహితులతోను, బంధువులతోను, వారి వివాహవిషయమై యాలోచించుచుండెను.



## ౧౪వ. అధ్యాయము.

## రామలక్ష్మణులు విశ్వామిత్రునితో వెడలుట.

దశరథుడు తనపుత్రులవివాహవిషయమై యాలోచించుకాలమున విశ్వామిత్రు డయోధ్యకు బోయి రాజనగరుయొక్క ద్వారపాలకులతో తాను రాజును జూడవచ్చెనని పలుక వారు భయముతో శీఘ్రముగ లోనికిబోయి రాజుతో 'విశ్వామిత్రుడు మిమ్ము జూడ వచ్చెను' అని జెప్పిరి. అంతట నతడు తనమంత్రులతోను, పురోహితుని తోను, ఋషియెదుటకు వెళ్ళి దేదీప్యమానముగ ప్రకాశించువానిని సంతోషముతో జూచి వానికి నర్ఘ్యమిప్పించెను. అతడు శాస్త్రోక్తముగ దానినిబుచ్చుకొని రాజుకుశలమును, పట్టణవాసులయు, స్నేహితులయు, బంధువులయు కుశలమును దశరథునడిగి తెలిసికొని 'నీసామంతులందఱు నీకు లొంగి యున్నారా? నీశత్రువులు నీచే జయింపబడిరా? దైవమానుషకర్మలను నీవు క్రమముగ జరుపుచున్నావా?' యనికూడ వానినడిగెను. విశ్వామిత్రుడు వసిష్ఠుని, నితర

ఋషులను గూడ కుశలమడిగినతరువాత వందఱు సంతోషముతో తగినయాసనములమీద గూర్చొనిరి. అప్పుడు దశరథు డాఋషితో నిట్లువిన్నవించెను. నేను మీరాకకు మిక్కిలి సంతోషించితిని. మీకు నేను చేయవలసిన గొప్పకార్యమెయ్యది? మీరు మాయదృష్టవశమున నిక్కడకు వచ్చిరి. మీరు దానములను, సమస్తసేవలను పొందదగినవారు. ఈదినమున నాజన్మ సఫలమైనది. నాజీవనము సుజీవనమైనది. పూర్వము 'రాజర్షి'యైన మీరు ఇప్పుడు గొప్పతపస్సుచే తేజరిల్లి 'బ్రహ్మర్షి' పదవినొందుటచే నాకు మిక్కిలి పూజ్యులరు. మీరాకచే నేను పవిత్రుడనైతిని. నాగృహము పావనమైనది. మీరు వచ్చినకార్యమును నాకు దెలుపగోరెదను. దానిని నేను తప్పక నెఱవేర్చెదను. మీరు మా కులదేవతలు, మీరు వచ్చినదినము మాకు గొప్పయుత్సవపుదినము. నాధర్మమును పూర్తిగ జరిపెదను." ఇట్లు దశరథుడు విన్నవింప విశ్వామిత్రు డెక్కువగ సంతోషమునొందెను.

తరువాత నాఋషి సంతోషముగలవాడై రాజుతో నిట్లు పలికెను. "రాజశ్రేష్ఠా! నీతో సమానమగువారు భూలోకములో లేరు. నీవు గొప్పకులమున బుట్టినవాడవును, వసిష్ఠునిశిష్యుడవును నగుటచే నామనస్సులోనిమాటను జరుపుటకు నీవు నిశ్చయింపుము. సత్యపరిపాలన జేయుము. నేను సిద్ధినిగోరి యజ్ఞమును జేయుచున్నాను. దానిని కామరూపులగు రాక్షసులిద్దఱు విఘ్నము జేయుచున్నారు. నాయజ్ఞము సమాప్తమగుకాలమున సుందునిపుత్రుడగు మారీచుడును, ఉపసుందునిపుత్రుడగు సుబాహుడును యజ్ఞవేదికయందు రక్తమాంసముల వర్షములను కురిపించుచున్నారు. యజ్ఞమునకు భంగముజరుగుటచేతను, నా శ్రమ వృథయగుటచేతను నేను నిరుత్సాహముతో నిక్కడకువచ్చితిని. నాకు కోపమువచ్చినను నేను వారిని

శపించుట కిష్టపడను. యజ్ఞకాలమున శాపమును విడువగూడదు. నీ జ్యేష్ఠపుత్రుడును, సత్యపరాక్రముడునునగు రాముని నాకిమ్ము. నేను వానిని రక్షించుచుండ వాడు తనదివ్య తేజమున యజ్ఞమునకు విఘ్నముచేయువారిని నాశనముజేయు శక్తుడై యుండును. వానికి నే ననేకవిధములగు శ్రేయస్సులను కలిగించెదను. దానివలన నతడు మూడులోకములందు ఖ్యాతిగాంచును. ఆ రాక్షసులు రామునితో యుద్ధముజేయలేరు. రాముడుతప్ప నన్యుడు వారిని జంపలేడు. బలముచే గర్వించి పాపముచే కాలపాశమునొంద సిద్ధమైయున్న వారు మహాత్ముడగు రాముని జేరలేరు. నీవు పుత్రవాత్సల్యము విడిచి రామలక్ష్మణుల నాతో బంపుము. 'రాముడు వారినిజంపునని నీవు తెలిసికొనుము. నేనుకూడ నీకు దెలియపఱచెదను. నేనును, వసిష్ఠుడును, నీతపోధనులును మాహాత్మ్యమును, సత్యపరాక్రమమునుగల రాముని నెఱుగుదుము. నీవు వానిని నాతోబంపినయెడల ధర్మలాభమును, గొప్పకీర్తిని బొందెదవు. నీమంత్రులును, వసిష్ఠాదులును నంగీకరించినయెడల నాతో రాముని బంపుము. 10దినములుపట్టు నాయజ్ఞమునకు యజ్ఞకాలము మీరకుండ శీఘ్రముగ రాముని బంపుము. నీవు విచారము నొందకుము. ఇట్లు విశ్వామిత్రుడు పలికి యూరకుండెను. దశరథు డామాటలను విని గొప్పవిచారమును,భయమును బొంది మనస్సు కలతజెంద మూర్ఛనొంది తనయాసనమున కంపమునొందెను.

దశరథు డొకముహూర్తములో దెలివితెచ్చుకొని యిట్లు పలికెను. "నా రాముడు*చిన్నవాడు. వానియందు రాక్షసులతో యుద్ధము

---

* దశరథుడు రామునిగూర్చి బాలకాండ 20 సర్గలో. 2వ. శ్లోకమున 'ఊనషోడశవర్షు'డని పలికెను '16 సంవత్సరములు లోపు'అని యర్థము. 100సంవత్సరము లాయుఃప్రమాణముగల కలికాలపుమనుష్యులకు మనుధర్మశాస్త్ర ప్రకారము వయస్సులో నాల్గవభాగము బ్రహ్మచర్యము జరుగ వివాహము కావలెను. 26వ.సంవ

జేయగలశక్తిని నేనుగానను. నేనునాయక్షౌహిణీబలముతో వెళ్ళివారితో యుద్ధము జేసెదను. నాసైనికులు శూరులును, పరాక్రమవంతులును, అస్త్రములనెఱిగినవారును నగుటచే రాక్షసులతో యుద్ధముచేయ గలరు. నేను యుద్ధముచేయువారిలో ముఖ్యుడనై ప్రాణములున్నంత కాలము ధనస్సునుబట్టి రాక్షసులతో యుద్ధముచేసి మీయజ్ఞమును కాపా[illegible]. దానికి విఘ్నము లేకుండజేసి దానిని పరిసమాప్తి నొం దించి[illegible]జాలెద[illegible] రాముడు చిన్నవాడు. యుద్ధవిద్యలు నేర్చినవాడు కాడు. శత్రువుల బలా బలములను తెలిసినవాడు కాడు. వాని శస్త్రములు తెలియవు. యుద్ధకౌశలము నెఱిగినవాడుకాడు. వారితో యుద్ధముచేయుటకు తగినవాడుకాడు. వారు కపట యుద్ధ యులు చేయువారు. నేను రామునివిడిచి యొకగడియయైనను జీవింప లేను. మీకు రామునిదీసికొనివెళ్లుట యందిష్టమున్న యెడల చతురంగ బలములతో నన్నుగూడ మీరు దీసికొనిపొండు. నాకు 60,000 సంవ త్సరములవయస్సు గడచినది. అతికష్టములచే చాలకాలమునకు నాకు రాముడు జన్మించెను. వీడు నాకు జ్యేష్ఠుడును, ధర్మకార్యములకు ప్రధానుడును నగుటచే నాపుత్రులందఱిలో వీనియందు నాకధికమగు ప్రేమ కలదు. కనుక వీనిని తీసికొనివెళ్ళవలదు.” ఇట్లు దశరథుడు పలికి యింకను నిట్లనెను. “ఆ రాక్షసులప్రతాప మెటువంటిది? వా రెవరిపుత్రులు? వారిస్వరూపాదులెట్టివి? వారి నెవరు రక్షించుచున్నారు? రాముడైనను నాబలములైనను వారినిగూర్చి యేమిచేయవలెను?

---

త్సరమున వివాహము జరుగవలసినచో రామునికి 16సంవత్సరములకంటె తక్కువ వయస్సున్నదనుమాట కేవలము చిన్నవాడని తెలుపుటకే యుట్లుపయోగింపబడి నదనియు,యథార్థముతెలుపుటకు గాదనియు మేమాలోచించుచున్నాము. వెనుకయధ్యా యమున రామునికి యౌవనము వచ్చినదనియు. తండ్రి వానివివాహమునుగూర్చి యాలోచించుచుండెననియు దెలిపితిమి. రాముని వయస్సునుగూర్చి 1వ.ప్రకరణములో 3వ. అధ్యాయమున చర్చించితిమి.

చెప్పడు?" ఈప్రకారము దశరథుడు విశ్వామిత్రునితో బలుక నతడు "గొప్పబలవంతుడును, గొప్పవీర్యవంతుడును, ననేకరాక్షసులసహాయముకలవాడును, పులస్త్యపుత్రుడగు విశ్రవసుని పుత్రుడును, కుబేరునితమ్ముడును, రాక్షసుల కధిపతియునగు రావణుడు బ్రహ్మవలన వరములను బొంది మూడులోకములవారిని బాధించుచున్నాడు. వాడు స్వయముగ కాక మారీచ సుబాహులచే యజ్ఞములకు విఘ్నము కావించుచున్నాడు." అని వానికి తెలిపెను. ఈమాటలను దశరథుడు విని వాని కిట్లువిన్నవించెను." నేనాదుర్మార్గునితో యుద్ధము జేయలేను. మీరు నాపుత్రునందు మిక్కిలి దయజూపి వానిని విడువుడు. మీరు మాకు గురువులు; దేవతలు. రావణునితో దేవ దానవ గంధర్వ యక్ష గరుడ పన్నగులే యుద్ధముజేయలేనపుడు మనుష్యులెట్లు యుద్ధము జేయగలరు? గొప్పవీరుల నోడించిన వానితో నేను, నాపుత్రులు, నాబలగము కలిసియైనను యుద్ధము జేయలేము. అట్టిచో యుద్ధమెఱుగనివాడును, బాలుడునునగు నాపుత్రునెట్లు మీకిచ్చెదను? మారీచసుబాహులు వీర్యవంతులును, యుద్ధవిద్యలో బాగుగ మెలగినవారునునై యున్నారు. వారితోగాని, యన్యులతోగాని నేనెట్లు యుద్ధము జేయగలను?"

రాజుమాటలను విశ్వామిత్రుడు విని బాగుగమండుచున్న హోమాగ్నిలో నేయిపోసినపుడుమండుమంటతో సమానమగు గొప్పకోపమును దెచ్చికొని దశరథునితో నిట్లు పలికెను. "నీవు నాకోరికను జరిపెదనని మొదటపలికి యిప్పుడు దానిని భంగపఱచుచున్నావు. రఘువంశజుల కిట్టి ప్రతిజ్ఞాభంగము తగదు. ఇట్లనుట నీకు తగియున్నయెడల నేను వచ్చినత్రోవను బోయెదను. అబద్ధపు ప్రతిజ్ఞను చేసిన నీవు నీబంధువులతో సుఖముగనుండుము." ఇట్లు విశ్వామిత్రుడు పలుక వానికోపమునకు భూమియంతయు కదిలెను.

దేవతలు భయమునొందిరి. దీనిని జూచి వసిష్ఠుడు*దశరథునితో నిట్లుపలికెను. "నీ విక్ష్వాకువంశమున జన్మించితివి. ధర్మదేవతవలె

*అ. రా:— విశ్వామిత్రుడు 'రాముని నాతో బంపు' మని దశరథునిగోర నపుడతడు గొప్పవిచారముగలవాడై వసిష్ఠునితో నేకాంతమున నిట్లనెను. "గురూత్తమా! నేనేమిచేయవలెను? రాముని విడుచుటకు నామనస్సొప్పుట లేదు. అనేక వేలసంవత్సరములు గడిచినపిదప గొప్పకష్టముతో నాకు దేవతలతో సమానులగు పుత్రులు కలిగిరి. వారిలో రాముడు నాకు మిక్కిలి ప్రియుడు. వాడిక్కడనుండి వెళ్లిన నేనెంతమాత్రము జీవింపలేను, నేను విశ్వామిత్రునితో రాముని బంపకుండ వానిని తిరుగబంపివేసిన నతడు నాకు తప్పక శాపమిచ్చును. నాకు శ్రేయస్సు కలుగునటులను, నేనబద్ధముగ నాచరించుటచే గల్గు పాపము నాకంటకుండునటులను నుపాయమును దెలుపుడు." ఇట్లు దశరథుడు పలుక వసిష్ఠుడు వానికిట్లు సలహానిచ్చెను. "దేవతలకుగూడ తెలియనట్టియు, ప్రయత్నముచే రహస్యముగ నుంచవలసినదియునగు విషయమును వినుము. 'రాముడు మనుష్యుడు కాడు. సనాతనుడగు పరమాత్మయేయితడై పుట్టెను. ఇతడు పూర్వము బ్రహ్మచే భూభారమును తొలగించుటకుగాను భూలోకమున బుట్టుటకు కోరబడి నీయింట కౌసల్యకు జన్మించెను. పూర్వము నీవు బ్రహ్మపుత్రుడగు కశ్యపప్రజాపతివి.కౌసల్య దేవమాతయగు నదితి.మీ రనేక సంవత్సరములు లోకవిషయములందిచ్ఛలేనివారై విష్ణుపూజాధ్యానములందే మనస్సు కలవారై గొప్పతపస్సుజేసిరి.అప్పుడు భగవంతుడు మీయందుప్రసన్నుడై 'వరముడుగు'డని మీతోబలుక 'నీవు నాపుత్రుడవు కమ్ము.' అని నీవు వానిని ప్రార్థించితివి. భగవంతుడు 'అట్లేయగు'ననిపలికియిపుడు నీకు రాముడై జన్మించెను. శేషుడు లక్ష్మణుడుగజన్మించి రాముని వెంటనున్నాడు. శంఖ చక్ర గదలను ధరించినవిష్ణునియంశమున భరతశత్రు

నున్నావు. ధైర్యవంతుడవు, శ్రీమంతుడవు, సువ్రతుడవునై యున్నావు. ధర్మహాని చేయగూడదు. నీవు ధర్మాత్ముడని పేరుపొందినవాడవు. స్వధర్మమును నీవు పాలింపుము. అధర్మమును జేయకుము. 'ఈపనిని జేసెద'నని పలికి దానిని జేయనివాడు ఇష్టాపూర్తముల (యజ్ఞములు చేయుట; నూతులు మొదలగునవి త్రవ్వా.) నాశనఫలము నొందును; గనుక నీవు రాముని వానితో బంపుము. అతనికి నస్త్రములు తెలిసినను, తెలియకున్నను నగ్నిజ్వాలలచే రక్షింపబడు నమృతముదగ్గఱకువలె విశ్వామిత్రునిచే రక్షింపబడు రామునిదగ్గఱకు పోవుటకు రాక్షసులు సమర్థులుగారు. ఆ ఋషి యుద్ధకుశలుడు; ధర్మాత్ముడు; వీరులలో శ్రేష్ఠుడు; గొప్పబుద్ధిమంతుడు; తపస్సులో గొప్పవాడు. మూడులోకములలోనుండు నస్త్రము లాతనికి తెలియును. ఇతరులకును, దేవతలు మొదలగువారికినిగూడ నవి యట్లు తెలియవు. ధార్మికులగు భృశాశ్వనిపుత్రు లస్త్రములయిరి. విశ్వామిత్రుడు రాజ్యముచేయుకాలమున వానికి నవి యియ్యబడెను. భృశాశ్వుడను ప్రజాపతి దక్షప్రజాపతిపుత్రికలగు జయను, సుప్రభను వివాహమాడి దేవాసురయుద్ధమందు నసురులజంపుటకై జయయందు50మంది పుత్రులను, సుప్రభయందు 50మంది పుత్రులను గనెను. వా రనేకరూపములుగలవారును, గొప్పవీర్యము, తేజముగలవారును, జయమును చేకూర్చువారును, కామరూపులును, బలవంతులును, పరాక్రమవంతులును, నితరులచే జయింపబడనివారును నై యుండిరి. వా రేయాయస్త్రము

---

ఘ్నులు పుట్టిరి. యోగమాయ జనకునికి కుమార్తెయగు సీతయై జన్మించెను. విశ్వామిత్రుడా మెను రామునికి గూర్చుటకు వచ్చెను. రహస్యముగ నుంచవలసిన యీయంశమును నీవు పైకిచెప్పకూడదు. కనుక నీవు సంతోషముతో విశ్వామిత్రుని పూజించి రామలక్ష్మణుల వానివెంట బంపుము." ఇట్లు వసిష్ఠుడు పలికెను.

లైరి.వానిని విశ్వామిత్రుఁ డెఱుంగును. ధర్మశీలుఁడగు నాతఁడు క్రొత్త యస్త్రముల ననేకములను కల్పింపసమర్థుఁడు. వీరుఁడును,మహాతేజుఁడును, గొప్పకీర్తిగలవాఁడునునగు విశ్వామిత్రునితో రాముని బంప ననుమానింపకుము. రాక్షసులను బరిమార్చుశక్తి యాతనికిగలదు. నీపుత్రుని మేలుకోఱకున్నతఁడు నిన్ను కోరుచున్నాఁడు.'' ఇట్లు వసిష్ఠుఁడు పలుక దశరథునిమనసు సనకానందమాయెను.అతఁడుసంతోషించి రామలక్ష్మణులను విశ్వామిత్రునికప్పగించెను.వారిని వారితలిదండ్రులు దీవించిరి. వసిష్ఠుఁడు మంగళమంత్రములను జదివెను.దశరథుఁడు తనపుత్రులశిరములాఘ్రాణించెను. విశ్వామిత్రునితో రామలక్ష్మణులు వెడలుచుండ వాయువుదుమ్ములేగకుండునట్లు సుఖముగ వీచెను. పుష్పవర్షము కురిసెను. దేవదుందుభులు మ్రోగెను. శంఖదుందుభులధ్వని యాయెను. ముందువిశ్వామిత్రుఁడును, తరువాత ధనస్సునుబట్టిన రాముఁడును, చివరను ధనుష్పాణియగు లక్ష్మణుఁడును నడిచిరి. రెండుభుజముల నమ్ములపొదులుగలవారై పదిదిక్కుల వెలుగుచు చేతివ్రేళ్ళకు రక్షణకొఱకు చర్మముగట్టుకొని ఖడ్గములను చేతధరించి సుందరమైనశరీరముగల రామలక్ష్మణులు శివునివెంటబోవు విశాఖ కుమారస్వాములవలె విశ్వామిత్రునివెంట వెళ్ళిరి.

---

## ౧౫. వ. అధ్యాయము.

### రామలక్ష్మణులు విశ్వామిత్రునితో మూఁడుదినములు గడుపుట.



అయోధ్యనుండి రెండుక్రోసులకంటె నెక్కువదూరము విశ్వామిత్రరామలక్ష్మణులు వెళ్ళినతరువాత సరయూనది దక్షిణపుటొడ్డున విశ్వామిత్రుఁడు రాముని బిలిచి యిట్లు పలికెను. "వత్సా! కాలవిలంబను కాకుండ ఆచమనము చేయుము. 'బల, అతిబల' యను నేను

మంత్రశ్రేష్ఠములను నీ వుపదేశము పొందుము. అట్లయిన నీకు శ్రమ యుండదు. జ్వరము రాదు. శరీరము వికారమునొందదు. నీవు నిద్రించి యున్నపుడుకాని, ఏమరియుండునపుడుగాని రాక్షసులు నీవద్దకు చేరలేరు. మూడులోకములలో బాహుబలమున నీతోసమానులు లేరు. సౌభాగ్యమున, సామర్థ్యమున, జ్ఞానమున, బుద్ధిచే, కార్యనిశ్చయమున, మాటలకు జబాబుచెప్పుటలోనుగూడ నీతోసమానులు లేరు. ఈరెండుమంత్రములు నీవభ్యసించిన నీతోసమాను డెవడునుండడు. ఇవి సమస్తజ్ఞానములకు మూలములు. వీనిని నీవుపఠించిన నీకుదారిలో నాకలిదప్పులుండవు. నీకు గొప్పకీర్తి వచ్చును. ఈరెండు బ్రహ్మపుత్రికాస్వరూపములు; తేజస్సుగలవి. వీనిని గ్రహించుటకు నీవు తగినవాడవు. నీయందనేకసుగుణములు కలవు. ఆమంత్రములను నేను నీకు జెప్పిన నవి లోకములో విస్తరించును.” ఇట్లు విశ్వామిత్రుడు పలుకఁ నప్పుడు రాముడు ఆచమనముచేసి ఋషివలన నావిద్యల నుపదేశముబొంది వేయి కిరణములుగల సూర్యునివలె ప్రకాశించెను. సాయంకాలముకాగా సరయూతీరమున నారాత్రి వారుముగ్గురు విశ్రమించిరి. రామలక్ష్మణులు విశ్వామిత్రునకు గురూపచారములనుజరిపి గడ్డి, యాకులు పరువుగ నేర్పఱచుకొని దానియందు ఋషిచెప్పు మంచిమాటలను వినుచు నిద్రించిరి.

ఆమఱునాటి యుదయమున విశ్వామిత్రుడు రామునితో “కౌసల్యాపుత్రా! లెమ్ము. ప్రాతస్సంధ్యాకాలమయినది. ఆహ్నికకర్మలను జరుపుము.” అని పలికెను. ఆమాటలను విని రామలక్ష్మణులు లేచి స్నానముచేసి గాయత్రిమొదలగుమంత్రములను జపించి ఋషికి నమస్కరించి ప్రయాణసన్నద్ధులైరి. వారు ముగ్గురు కొంతదూరము నడిచి సరయూగంగాసంగమమునకు వెళ్ళిరి. అక్కడ కామునియాశ్రమముండెను. శివుడు పార్వతిని వివాహమాడుటకు తన

మనస్సులో నిశ్చయించుకొనియుండి మరుద్గణపరివేష్టితుడై యిక్కడ తనతపస్సుచేసికొనుచుండెననియు, అప్పుడు మన్మథుడతనిని కందర్పరూపముచే గ్రహింప నాతడు వానిని తృతీయనేత్రదృష్టిచే నాశనమునొందించెననియు, అప్పటినుండి కాముడు 'అశరీరుడు, అనంగుడు' అనిపేరుపొందెననియు విశ్వామిత్రుడు రామునికి దెలిపెను. అనంగుడు పాపిష్ఠుడైనను నాయాశ్రమము పవిత్రమైనదగుటచే ఋషు లిక్కడనివసించి యనేకవేలసంవత్సరములనుండి తపస్సుచేయుచుండి రనియు వారిశిష్యులు ధర్మపరులుగ నుండిరనియుగూడ విశ్వామిత్రుడు వారికి దెలిపెను. తరువాతనాతడు రామలక్ష్మణులతో "ఈరాత్రి యిచ్చటనుండి రేపటియుదయమున స్నానముచేసి జపహోమము లను జరిపి శుచులమై మనయాశ్రమమునకు వెళ్ళుదము." అని చెప్పెను. పిమ్మట వారుముగ్గురును నట్లుచేసిరి. అక్కడిమునులువారిని జూచి తమదివ్యనేత్రములతో నిజమగుసంగతులను దెలిసికొని విశ్వామిత్రునకు నర్ఘ్యపాద్యములనిచ్చి యాతిథ్యముజరిపిరి. రామలక్ష్మణు లకుగూడ నాతిథ్యము జరిపిరి. ఋషులకథలను వినుచు వారుముగ్గురు నాయాశ్రమమున నారాత్రిగడిపిరి.

ఆమఱునాటియుదయమున వారుముగ్గురును సంధ్యావందనాది క్రియలను జరిపిరి. ఋషులు నావనొకదానిని దెప్పించి "మీరు దీనిమీద వెళ్ళుడు. త్రోవలో మీకు శుభమగుగాక! విలంబము చేయవలదు." అని విశ్వామిత్రునితో బలికిరి. విశ్వామిత్రుడు 'అట్లే యగుగాక!' యనెను. నావలో మధ్యను విశ్వామిత్రుడును, వానికి నిరుప్రక్కల రామలక్ష్మణులును గూర్చుండి గంగానదిని దాటుచుండిరి. సరయూనదిలోని నీరు ఎత్తయినప్రదేశమునుండి వచ్చి గంగానదిలో గలియుటచే గలిగిన గొప్పశబ్దము వారికి వినబడెను. విశ్వామిత్రుడు

రామునికి *సరయూనదివృత్తాంతమంతయు దెలిపెను. రామలక్ష్మణులా సంగమస్థానమునకు నమస్కరించి గంగానదియొక్క దక్షిణతీరమును జేరిరి, అక్కడ వారికి నిర్జనమగు గొప్పవనముపడెను. అది గొప్పక్రూరమృగములు, వృక్షములు మొదలగువానితో భయంకరముగనుండెను. విశ్వామిత్రుడు మలద కరూశదేశవృత్తాంతములను, సుందుని భార్యయగు తాటకయొక్కయు, వానిపుత్రుడగు †మారీచునియొక్కయు వృత్తాంతములను, వారాప్రదేశమున ప్రాణిహింస చేయుటచే ఆ మలద కరూశదేశములు వనముగ నగుటయును, తాటకయుండు వనమక్కడకు 2క్రోసులుండుటయును వారికి దెలిపెను. "క్రూరాత్మురాలగు నాతాటకను నీవు సమయింపవలెను. నీవుతప్ప మూడులోకములలోనునుండు నితరులెవ్వరు దానిని జంపలేరు. క్రూరకార్యములను జేయు స్త్రీలను జంపినయెడల రాజులకు దోషములేదు. అది సనాతనరాజధర్మము." అని విశ్వామిత్రుడు రామునితో జెప్పెను. తరువాత నాతడు పూర్వముజరిగినసంగతులనిట్లు వారికి దెలిపెను. "భూమిని హరించుటకు సిద్ధమైనదియు, విరోచనునిపుత్రికయునగు మంథరను ఇంద్రుడు చంపెను. భృగుపత్నియగు శుక్రుని తల్లి యింద్రునినాశనముచేయ సమకట్ట విష్ణువామెను సంహరించెను. ఈతీరున నధర్మములను జేయు స్త్రీలనేకులు రాజులవలన మడిసిరి." ఈమాటలను రాముడు విని విశ్వామిత్రునకు నమస్కరించి "నాతండ్రియాజ్ఞప్రకారమును, మీయాజ్ఞప్రకారమును గోబ్రాహ్మణదేశకంటకియగు తాటకను తప్పకవధించెద" నని చెప్పి వింటిమధ్యను తనపిడికిలితో పట్టి ధనుష్టంకారముజేసెను. దానితో తాటక

---

* ౧౩వ. ప్రకరణము ౧౫వ. అధ్యాయము. భరతఖండభూగోళము. సరయూనది, మలద కరూశదేశములు చూడుము.

† ౫వ ప్రకరణము. ౫వ. అధ్యాయము. తాటకమారీచులు చూడుము.

వ్యాకులతజెంది కోపించి రాముడుండుచోటునకు వేగముగ బరుగెత్తి వచ్చెను. రాముడు లక్ష్మణునకామెవికృతరూపమును, దీర్ఘదేహమును, జూపి "స్త్రీయగుటచే నీతాటకను జంపుటకు నాకిష్టములేదు. కావున నీమెముక్కును, చెవులనుగోసి పంపవలెనని నాకు తోచినది. కాని యీమెశౌర్యము, నడవడికజూచినతరువాత నీమెను జంపకుండ విడిచిపెట్టకూడదని నాకుబుద్ధిగలుగుచున్నది." అనిపలికెను. అంతట నారాక్షసి చేతులను జాపుచు గర్జించుచు రామునివైపు పరుగెత్తి వచ్చెను. దీనికి విశ్వామిత్రుడు జడిసి యామెను హుంకరించి 'రాఘవు లిద్దఱికి జయమగుగాక!' యని వారిని దీవించెను. అంతట తాటక ధూళి నెగురగొట్టి రామలక్ష్మణులకు గనబడకుండునట్లు కామరూపిణియై వారిమీాద రాళ్ళవర్షము గురిపించెను. దానికి రాముడు శరవర్షమును గురిపించి దగ్గఱకువచ్చుతాటకభుజములను బాణములచే దెగగొట్టెను. సమీాపమున గర్జించుచున్న యామెముక్కును, చెవులను క్రోధముచే లక్ష్మణుడు తెగగోసెను. అది యప్పుడు కామరూపమును ధరించి యాకసమున కెగసి యనేకరూపములను బొంది వారికి కనబడకుండ వారిమీాద వర్షమును గురిపించి భయంకరముగ చరించెను. విశ్వామిత్రుడు దానినిజూచి రామునితో "నీవు చూపిన దయచాలును. పాపాత్మురాలును, దుష్టచారిణియు, యజ్ఞములకు విఘ్నముచేయునదియు నగు నీమె మాయచే వృద్ధినొందును. సాయంకాలమందు రాక్షసులను జంపుటకష్టము; గనుక సాయంకాలము కాకపూర్వమే దీనిని నీవు వధింపవలెను" అనిపలికెను. రాము డేదిక్కుననుండి రాళ్లవర్షము గురియుచుండెనో కనిపెట్టి యాదిక్కును బాణములచే బంధించెను. తాటక బాణములచే నరికట్టబడి రామలక్ష్మణులున్నచోటికి కేకలువేయుచురాగ రాముడొకబాణముతో నామెహృదయమున గొట్ట నామె క్రిందపడి ప్రాణములనువదలెను.

అప్పుడు తాటక తనశాపబాధను విడిచి యన్నియలంకారములతో వెలుగుచు రామునికి నమస్కరించి యాతనియాజ్ఞచే స్వర్గమునకు బోయెను. దేవతలును, నింద్రుడును నక్కడకు వచ్చి రామునిశ్లాఘించిరి. ఇంద్రుడును, దేవతలును విశ్వామిత్రునితో "తాటకవధచే సంతోషించితిమి. రామునియందు స్నేహభావమున భృశాశ్వుని పుత్రులగు నస్త్రములను వానికి దెలుపుము. ఆతడే వానికితగినవాడు; నిన్ననుసరించి తిరుగుటయందు శ్రద్ధగలవాడు; దేవతలకొఱకనేక కార్యములను జేయగలవాడు." అనిపలికి తమస్థానములకు బోయిరి. విశ్వామిత్రుడు తాటకవధకు సంతోషించి రామునిశిరము మూర్కొని యారాత్రియక్కడుండి మఱునాడు తన యాశ్రమమునకు రామలక్ష్మణులతోగూడ బయలుదేఱెను. ఆవనము తాటకబాధ లేనిదై ప్రకాశించెను.



## ౧౬వ. అధ్యాయము.

## రామలక్ష్మణులు విశ్వామిత్రునితో నాల్గవదినము గడపుట.



రామలక్ష్మణులు విశ్వామిత్రునితో బయలుదేఱిన నాల్గవ దినమున విశ్వామిత్రుడు తాటకావనమున రామునిజూచి, నవ్వి "నీయెడ నేను సంతోషించితిని. అన్నియస్త్రములను నీకు దెలిపెదను. అవి నీస్వాధీనమైనయెడల శత్రువులగు దేవగంధర్వయసురులనైనను జయించెదవు." అనిచెప్పి వానినామములను వానికిదెలిపెను. అప్పుడు రాముడు శుచియై తూర్పునకు ముఖము పెట్టుకొనియుండ విశ్వామిత్రుడుగూడ నట్లుండి యాయస్త్రములసంబంధమైన మంత్రములను రామున కుపదేశించెను. (ఆయస్త్రములు మొదలగువానినామములు క్రింద తెలుపబడినవి.)

తేజోమయములగు దండ ధర్మ కాల విష్ణుచక్రములు.

ఐంద్రము, వజ్రము, బ్రహ్మశిరము, ఐషీకము, బ్రాహ్మము, వారుణము, పైనాకము, నారాయణము, శిఖరమనెడు నాగ్నేయము, ప్రథనమనెడు వాయవ్యము, హయశిరము, క్రౌంచము, నందనమనెడు వైద్యాధరము, మానవమనెడు గాంధర్వము, ప్రస్వాపన ప్రశమనములనెడు గాంధర్వములు, సౌరము, దర్పణము, శోషణము, సంతాపనము, విలాపనము, కందర్పదేవతాసంబంధమైన మదనము, మోహనమనెడు పైశాచము, తామసము, సౌమనము, సంవర్ధము, దుర్ధర్షము, మౌసలము, సత్యము, మాయాధరము, శత్రుతేజము నాకర్షించు తేజఃప్రభము, శిశిరమనెడు సౌమ్యము, 'సుదామన'మనెడు త్వష్టృదేవతాస్త్రము, దారుణము, భగదేవతసంబంధమైన శీతేషువు, మానవము.

శైవమనెడు గొప్పశంఖము.

ప్రకాశమానములగు మోదకి, శిఖరి యను రెండుగదలు.

ధర్మ కాల వారుణపాశములు.

అగ్నిపిడుగు, చలిపిడుగు.

శివ విష్ణుశక్తులు.

రాక్షసాస్త్రములగు కంకాళము, ముసలము, కాపాలము, కంకణము:—

ఇట్లు విశ్వామిత్రు డాయస్త్రములను వానికి దెలిపి గొప్ప యౌదార్యము కలవియు, కామరూపములుగలవియు, దేవతలకైనను జాగ్రత్తపర్చుటకు కష్టమైనవియునగు వానినన్నిటిని రామునకు నత డుపదేశముచేయ నతడు వానిని జపించెను. అంతట నాయస్త్రము లన్నియు తమరూపములతో నాతనియెదుట ప్రత్యక్షమై సంతోషముతో వానికి నమస్కరించి "మీవశమైన మేము ఏమిచేయవల

యును." అని యడిగెను. రాముడు వానిన్గ్రహించి యాచమనము చేసి "నేను కోరినప్పుడు మీరు వచ్చెదరుగాక!" అని పలికి వానికి సెలవిచ్చెను.

తరువాత రామలక్ష్మణులును, విశ్వామిత్రుడును, బయలు దేఱి వెళ్ళుచుండ రాముడస్త్రములయుపసంహారమును (ఉపయోగించిన యస్త్రములను తిరుగ స్వాధీనపఱుచుకొనుట.) తనకు జెప్పవలెనని విశ్వామిత్రుని కోరెను. ఆఋషి దయగలవాడై యాతనిచే వానినుపాసింపజేసెను. (అవియేవన)

"సత్యవంతము, సత్యకీర్తి, ధృష్టము, రభసము, ప్రతిహారతరము, పరాఙ్ముఖము, అవాఙ్ముఖము, లక్షాక్షవిషములు (రెండు) దృఢనాభము, సునాభకము, దశాక్షము, శతవక్త్రము, దశశీర్షము, శతోదరము, పద్మనాభము, మహానాభము, దుందునాభము, జ్యోతిషము, కృశనము, నైరాస్యము, విమలము, దైత్యులను స్వాధీనము చేయు యోగంధర హరిద్రములు, సార్చిర్మాలి, ధృతిర్మాలి, వృత్తిమంతము, రుచిరము, పిత్ర్యసౌమనసము, విధూతము, మకరము, కరవీరకరము, ధనము, ధాన్యము, కామరూపము, కామరుచి, మోహము, ఆవరణము, జృంభకము, సర్వనాభము, సంతానము, వరణము." అనునవియై యున్నవి.

విశ్వామిత్రుడింకను భృశాశ్వతనయులగు నస్త్రములనుకూడ రామున కుపదేశింప నతడు వానినన్నిటిని నుపాసించెను. ఆవి తేజముగల తెల్లని దేహములతో రామునియొద్దకు వచ్చెను. అందుకొన్ని యంగారకునివలెను, కొన్ని పొగవలెను, కొన్ని సూర్యచంద్రులవలెను, కొన్ని నక్షత్రములవలెను, నాతనికి గనబడి యవి చేయవలసిన వానిని నియమింప రాముని గోరెను. రాముడాయస్త్రములతో తాను గోరినప్పుడవి యన్నికాలములలో సహాయము చేయువలయునని యనివెళ్ళ

వచ్చునని యుపలుకనవి రామునికి నమస్కరించి ప్రదక్షిణముచేసి 'యట్లేయగుగాక!' యనిపలికి తమస్థానముల కరిగెను. రాముడు తాను పొందిన యస్త్రాదులనన్నిటిని లక్ష్మణునికి దెలిపెను. రామలక్ష్మణులు విశ్వామిత్రునితో నడచుచు తాటకావనము దాటిరి. పిమ్మట గొప్పవృక్షములు, మృగములు గలదియు, పక్షుల కలకలశబ్దముచే నిండినదియు, పర్వతమునకు దగ్గఱగనున్నదియు, మనోహరమగు నదియునగు నాశ్రమమును రాముడు చూచి 'యిది యెవరియాశ్రమ' మని విశ్వామిత్రునినడుగ నాఋషి 'అది సిద్ధాశ్రమ'మని చెప్పి *వామను డక్కడ జన్మించినవృత్తాంతమును వానికి దెలిపెను. మఱియు నాఋషి తానక్కడనే మునులతో నివసించియుండెననియు, నక్కడనే రాక్షసులు తనయజ్ఞమునకు విఘ్నము చేయుచున్నారనియు, నక్కడకే తామిప్పుడు వెళ్ళవలెననియు పలికెను. వారు ముగ్గురు అక్కడకు బోవ ఋషులు విశ్వామిత్రుని సత్కరించి యిప్పుడే యజ్ఞదీక్షను నతడు గైకొనవలెననియు, ♦నాసిద్ధాశ్రమమున నాతని యజ్ఞము సిద్ధమగుననియు పలుక నాఋషి యట్లు యజ్ఞదీక్ష నారంభించెను. ఆరాత్రి రామలక్ష్మణు లతిజాగ్రతతో నుండిరి.

---

* ౨ వ. ప్రకరణము, ౨౯ వ. అధ్యాయము. వామనావతారము, సిద్ధాశ్రమము జూడుము.

♦ మలద కరూశదేశములు దక్షిణపూర్వబీహారుదేశమని మేము ౧౩వ. ప్రకరణము. ౧౫వ అధ్యాయము. భరతఖండభూగోళములో నిర్ణయించితిమి. సిద్ధాశ్రమము ప్రస్తుతము 'చోటానాగపూరు' ప్రదేశములో మొదటనుండుకొండలవద్దనుండుననియు, నది దండకవనములోని ప్రదేశములో నున్నదనియు మే మూహించుచున్నాము. ఈ యభిప్రాయమును ౮వ. ప్రకరణము ౧౩వ, అధ్యాయములో మారీచుడు తెలిపినయంశములు స్థిరపఱచుచున్నవి.

## ౧౭. వ. అధ్యాయము.

## మారీచుని పరాభవము, సుబాహువధ.

---

విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో తన యాశ్రమమునకు వెళ్ళిన రాత్రియే యాగదీక్ష నారంభించెను. మఱునాటియుదయమున రామలక్ష్మణులు లేచి కాలోచితకర్మలను దీర్చి విశ్వామిత్రునికి నమస్కరించి "రాక్షసులవలని బాధ నెప్పుడుమాన్పవలెనో యట్టిసమయము మీఱకుండ మాకు దెలుపు"డని యతనితో త్వరగబలుక నతడు దీక్షలోనుండి మౌనమువహించుటచే నక్కడిమునులు దానికి సంతోషించి "ఈయాగము నింకను నాఱురాత్రులు మీరు రక్షింపవలె"నని వారికి దెలిపిరి. అప్పుడు వారు యుద్ధ కుతూహలముతో నాఱుదినములు రాత్రింబగళ్ళు నిద్రలేనివారై నెల్లప్పుడు ధనస్సులెక్కుపెట్టి తపోవనమును రక్షించిరి. ౬ వ దినమున రాముడు లక్ష్మణునితో 'యుద్ధమునకు సిద్ధముగనుండు'మని చెప్పెను. యుద్ధసన్నద్ధుడై రాము డుండుసమయమున యజ్ఞవేదిక చుట్టు విశ్వామిత్రుడును, ఋత్విజులును యజ్ఞపాత్రలతో నుండ దానినుండి మంటలు బయలుదేఱెను. యజ్ఞము సమాప్తియగు మంత్రములతో యథాప్రకారముగ హోమముజరుగుచున్నపుడు ఆకాశమునుండి భయంకరమగు గొప్ప శబ్దము బయలువెడలెను. అక్కడనుండి వర్షాకాలమున మేఘము వచ్చునట్లు మారీచసుబాహులు నయనుచరులతో మాయలనుబన్నుచు పరుగెత్తుకొనివచ్చి రక్తప్రవాహమును యజ్ఞవేదికయందు గురిపించిరి. రాముడు వారికెదురుగ బరుగెత్తి వారి నాకాశమున జూచెను. వారు త్వరగవచ్చుట నాతడుజూచి లక్ష్మణునితో 'ఆరాక్షసులనుమానవాస్త్రముతో నెగురగొట్టెద'నని చెప్పి గొప్పకోపముతో మారీచునివక్షస్థలమున నాయస్త్రమును విడువ వాడు 100 యోజనముల [800 మైళ్లు]

దూరము వెళ్ళి సముద్రములో బడి తేలుచుండెను. ఆ రాక్షసుడు తెలివిదప్పి కలకలముతో బడియుండుటను రాముడు తెలిసికొని "యజ్ఞవిఘ్నకారులును, దుష్టాచరణకలవారును, పాపకర్మలను జేయు వారునునగు రాక్షసులను జూచెద" నని తమ్మునితో పలికి యాగ్నేయాస్త్రమును సుబాహువక్షస్థలమున విడువ వాడు భూమియందు పడి చచ్చెను. రాముడు మిగిలిన రాక్షసుల వాయవ్యాస్త్రమున జంపెను. ఇట్లు యజ్ఞవిఘ్నము చేయువచ్చిన రాక్షసులందఱు ప్రాణములను విడిచిరి. యజ్ఞము సమాప్తినొంద దిక్కులు బాధలేనివైయుండ విశ్వామిత్రుడు రామునితో 'కృతార్థుడనైతిని. నీ తండ్రి వచనమును నీవు జరిపితివి. ఇది సిద్ధాశ్రమము మనుమాట సత్య'మని పలికెను. ఆ రాత్రి సంతోషముతో రామలక్ష్మణు లక్కడ గడపిరి.

---

## ౧౮ వ. అధ్యాయము.

### రామలక్ష్మణులు విశ్వామిత్రునితో సిద్ధాశ్రమమునుండి మిథిలకు వెడలుట.

రామలక్ష్మణులు అయోధ్య విడిచినతరువాత 10 దినములు గడపి సుబాహువధజరిగిన మఱుసటిదినమున సిద్ధాశ్రమమున నిద్ర నుండి లేచి సంధ్యావందనాదికర్మలను జరిపి విశ్వామిత్రునికిని, ఋషులకును నమస్కరించి తామేమిచేయవలయునని వారిని కోర వారు 'మిథిలాపట్టణమున జనకుడు యజ్ఞముచేయుచున్నందున మనమక్కడకుబోవుదము.' అని పలికిరి. విశ్వామిత్రుడు 'నేను సిద్ధాశ్రమము నకు తిరుగ రాను. హిమవంతమునునుండు గంగాతీరమున నాసోదరి

'కౌశికి' యను నదియై ప్రవహించినది; కాన నే నా నదియొడ్డున నుండెద'నని పలికెను. పిమ్మట విశ్వామిత్రుడు సిద్ధాశ్రమమునకు ప్రదక్షిణము జేసి వనదేవతలవద్ద సెలవుపుచ్చుకొని ఋషులతోను, రామలక్ష్మణులతోను, నుత్తరాభిముఖుడై బయలుదేరెను. వాని వెంట ఋషులు నూఱుబండ్లమీద బయలుదేఱిరి. మృగములు, పక్షులుకూడ నతనితో వెళ్ళబోవ నతడు వానిని తిరుగ బంపివేసెను. వారు కొంతదూరము వెళ్ళునప్పటికి సాయంకాలమగుటచే శోణానది యొడ్డున వారందఱు విడిసిరి. పిమ్మట వారు స్నానము, అగ్నిహోత్రములు జరిపి యక్కడ కూర్చొనియుండిరి. విశ్వామిత్రుడు రాత్రి ♦ మగధదేశవృత్తాంతమును, తన కుశవంశవృత్తాంతమును వారికి దెలిపెను. అప్పటికి సగము రాత్రి యగుటచే నందఱు విశ్వామిత్రుని శ్లాఘించి నిద్రించిరి.

అమఱునాటియుదయమున నందఱు కాలోచితకర్మలను దీర్చుకొని ప్రయాణమైరి. మిక్కిలి లోతయినదియు నిసుకతిన్నెలుకలదియు, శుభ్రమగు నీరుకలదియునగు శోణానదిని 'నేత్రోవను దాటవలెనని' రాముడు విశ్వామిత్రునినడుగ నతడు 'ఋషులు వెళ్ళు నీత్రోవనే మనము వెళ్ళుద'మని పలికెను. అట్లు వారందఱు అనేక వనములను, నదులను దాటుచు చాలదూర మరిగి మధ్యాహ్నమునకు గంగయొడ్డున జేరి యచట బసలేర్పఱచుకొనిరి. మునులు సేవించుచున్న శ్రేష్ఠమగు నాపుణ్యనదియం దందఱు స్నానముజేసి పితృదేవతలకు తర్పణములను జేసి యగ్నిహోత్రకార్యములను జరిపి హవిస్సును భుజించి కూర్చొనియుండిరి. అచట విశ్వామిత్రుడు

---

♦ ౬వ. ప్రకరణము, ౧వ. అధ్యాయము. విశ్వామిత్రుడు: అతిపూర్వులు చూడుము.

వారికి (1) కుమారస్వామిజననమును, (2) గంగానదిచరిత్రమును, (3) సగరాదులవృత్తాంతమును దెలిపెను. అంత రాత్రికాగా నందఱు సుఖముగ నిద్రించిరి.

ఆమఱునాటియుదయమున నందఱు కాలకృత్యములను దీర్చుకొని తరువాత వారాగంగను *దాటి దానియుత్తరపుటొడ్డున స్వర్గతుల్యమును, ప్రకాశమానమును నగు విశాలాపట్నమును జూచిరి. ఋషులక్కడ నిలిచిరి. విశ్వామిత్రుడును, రామలక్ష్మణులును నా పట్నముఁ గూర్చి వెళ్ళిరి. ఋషి యక్కడ రామలక్ష్మణులకు ♦ క్షీరసాగరమథనమును, మరుత్తులజన్మమును దెలిపి యాదేశమున దితి తపస్సు జేయ నింద్రుడు ఆమెకు సపర్య జేసెననియు, నిక్ష్వాకువంశజు

(1) 2వ. ప్రకరణము, 5వ. అధ్యాయము కుమారస్వామిజననము చూడుము.
(2) 13వ. ప్రకరణము. 15వ. అధ్యాయము, భరతఖండభూగోళము గంగ చూడుము
(3) 6వ. ప్రకరణము 3వ. అధ్యాయము, దశరథునిపూర్వులు 200పుట జూడుము.
అ. రా-* అందఱు గంగానదికి వెళ్ళినపుడు నావికుడు తాను రాముని పాదములను కడుగవలెననియు, రాతికి కఱ్ఱకు భేదములేదనియు, మనుష్యులను పుట్టించుచూర్ణము వానిపాదములందుకలదని ప్రతీతి కలదనియు, వానిపాదములను కడిగినతరువాత గంగయావలియొడ్డునకు దీసికొనిపోవుననియు, నట్లుచేయకపోయినయెడల తనకఱ్ఱనావ స్త్రీయగుననియు, నట్లైన తనకుటుంబమునకు హాని కలుగుననియు పలికెను. (రాముడు గంగను దాటినతరువాత నహల్యను శిలారూపమునుండి స్త్రీరూపముగ మార్చెను. నావికుడు తెలిపినప్రతీతి రాముడు గంగను దాటినతరువాత జరిగియుండును. అతడు దానిని దాటినపు డట్టిప్రతీతి యున్నదని తెలుపుట కల్పితముగ దోచుచున్నది.)
♦ 2వ. ప్రకరణము. 3వ. అధ్యాయము క్షీరసాగరమథనము, మరుత్తుల జన్మము చూడుము.

నకు 'అలంబుస' యనెడు నప్సరసయందు జన్మించిన విశాలుడీపట్టణమును నిర్మించెననియు, నాతనివంశములోనివాడగు సుమతి యిప్పుడిక్కడ రాజ్యముచేయుచున్నాడనియు తెలిపెను. (వారివంశవృక్షమిూ క్రిందను జూపబడినది.)

విశాలుడు
|
హేమచంద్రుడు
|
సుచంద్రుడు
|
ధూమ్రాశ్వుడు
|
సృంజయుడు
|
సహదేవుడు
|
కుశాశ్వుడు
|
సోమదత్తుడు
|
కకుత్స్థుడు
|
సుమతి

ఇంకను విశ్వామిత్రుడు రామునితో సుమతి గొప్ప పరాక్రమవంతుడనియు, నిక్ష్వాకుదీవనచే వైశాలిక రాజులందఱు దీర్ఘాయుష్మంతులును, మహాత్ములును, వీరులును, ధార్మికులును నైరనియు, నా రాత్రి యక్కడ తాము నిలువవలెననియు పలికెను. సుమతి విశ్వామిత్రునిరాక తెలిసికొని యాతనివద్దకు బంధువులతోను, పురోహితులతోనువచ్చి యాతనికి నమస్కరించి కుశలమడిగి తనదేశమునకు నాతడు వచ్చుటచేతను, నతనిని జూచుటచేతను తాను ధన్యుడ నయ్యెనని పలికెను. తరువాత నతడు రామలక్ష్మణులను జూచి విశ్వామిత్రుని నిట్లడిగెను. "దేవతలతో సమానమగు పరాక్రమము కలవారును, ఏనుగు, సింహము, పులి వృషభముల నడకవంటి నడకగలవారును, ప్రతాపవంతులును, పద్మపత్రములవలె విశాలమైన నేత్రములు కలవారును, ఖడ్గము, అమ్ముల పొది, ధనస్సు ధరించి యశ్వినులవలె సుందరముగ నున్నవారును, దైవవశమున భూమికివచ్చిన స్వర్గలోకములోని దేవతలవలె నున్నవారును సూర్యచంద్రులు, ఆకాశమునువలె నీదేశమును వెలిగించుచున్నవారును, నాకారములోను, ఇంగితజ్ఞానములోను, చేష్టలలోను

నొక్క తీరుననుండి గొప్పయాయుధములను ధరించినవారునునగు నీ యౌవనపురుషులెవ్వరు? వీరు కష్టతరగుమార్గమున నేల నడచుచు వచ్చిరి? వీరివృత్తాంతమును నాకు తెలుపగోరెదను." ఇట్లు సుమతి విశ్వామిత్రునిని నడుగ నతడు సిద్ధాశ్రమమున జరిగిన రాక్షససంహార మునుమిగిలినసంగతులను రాజునకు దెలుప నతడు మిక్కిలి సంతోషించి వారు దశరథపుత్రులని తెలిసికొని వారికి తగినయాతిథ్యమొసగెను. ఆరాత్రి యచ్చట రామలక్ష్మణులును, విశ్వామిత్రుడును విశ్రమించిరి.

ఆమరునాటియుదయమున నందఱు బయలుదేఱి మిథిలకు వెళ్ళిరి. విశ్వామిత్రుడు, రామలక్ష్మణులు నాపట్టణసమీపమున నుండు నుపవనమును జూచిరి. అక్కడ నాఋషి రామునికి నానిర్జనమగు నాశ్రమము గౌతముని దనియు,పూర్వమక్కడ నహల్యయును, నింద్రుడును శాప మొందిరనియు దెలిపి *వారికథలనుగూడ దెలిపెను. తరువాత విశ్వామిత్రుడు 'దేవరూపిణియగు నహల్యను నీవు తరింప జేయుము' అని రామునితో ననెను. అంతట విశ్వామిత్రుడును, రామలక్ష్మణులును నాయాశ్రమమున బ్రవేశించిరి. అక్కడ తపస్సుచే గొప్పగ వెలుగునదియు, దేవాసురులును, నితరులును నక్కడకు వచ్చినను వారికి చూడనలవికానిదియు, బ్రహ్మచే గొప్ప ప్రయత్నమున నిర్మింపబడినదియు, నాశ్చర్యకరమగు రూపముకలదియు, మంచుచేగప్పబడిన పూర్ణచంద్రునినలెను, మేఘములచే గప్పబడిన సూర్యునివలెను నున్నదియునగు ♦ నహల్యను రాముడు చూచెను. శాపాంతమగుటచే ఆమె రామలక్ష్మణులకు గనబడ వా

* 3వ. ప్రకరణము ౬వ.అధ్యాయము అహల్యాశాపము జూడుము.

♦అ॰ రా:—అహల్యకు రాముడు విష్ణుస్వరూపమున కనబడ నామె యతనిని పూజించి నమస్కరించి యాతనిపరమాత్మస్వరూప

రామె పాదములను బట్టిరి. ఆమె తనభర్తమాటలను మనస్సునకు దెచ్చుకొని సంతోషముతో వారికాళ్ళు పట్టుకొనెను. ఆమె రామునికి పాద్యమును, నర్ఘ్యమును నిచ్చి యతిథిసత్కారము చేయు నటు విధిప్రకారముగ వానిని గ్రహించెను. అప్పుడు గొప్పపుష్పవర్షము కురిసెను. దేవదుందుభులు మ్రోగెను. గంధర్వులు పాడిరి. అప్సరసలాడిరి. దేవత లహల్యను బొగిడిరి. ఇట్లామె తపోబలముచే పరి

---

మును కౌసల్యవలె వర్ణించి యింకను నిట్లు ప్రార్థించెను. “మీ పాదములకు నంటిన ధూళి నాకు తగులుటచే నేను కృతార్థురాలనైతిని. నా యదృష్టమేమని చెప్పుదును! బ్రహ్మ, శివుడు మొదలగువారు దేనిని వెతకుచుందురో దానికి నమస్కరించెదను. మీ యవతారచరిత్రలను బ్రహ్మలోకములో నారదుడు, శివుడు, బ్రహ్మ, సరస్వతి మొదలగు వారు పాడుచుందురు. ఇతరులయందు ననుగ్రహము జూపుటకు మాయతోగూడిన మీరు అవతారముల నెత్తుదురు. పరమాత్మలగు మీరు ‘బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు’ అను నామములను బొందియుందురు. మిమ్మెల్లప్పుడు నిరహంకారులగు మునులు ధ్యానించుచుందురు. మీరు జగత్తునకు మొదటివారు. మీరే జగత్తు. అది మీయందు నిలుచును. మీ రన్ని జీవులయందు నుండక పరమాత్మలై వేరే నిలుతురు. మీ రోంకారస్వరూపులరు. పదములును, నాపదములచే తెలుపబడునర్థములును, కార్యములును, కారణములును, పనితనములును వానిఫలములును, సాధనములును మీరేయై యున్నారు. మీ రాకాశమువలె నన్నిచోట్ల శుద్ధులరై లోపలను, పైని సంచరింతురు. మీరు దేనితోను సంబంధములేనివారును, చలింపనివారును, నిత్యులును, నాశరహితులును, బుద్ధులును సత్పదార్థమునునై యున్నారు. స్త్రీయును, అజ్ఞానురాలునునగు నేను మీతత్త్వము నెట్లు తెలిసికొన గలుగుదును? కనుక ఇతరవిషయములందు మనస్సులేనిదాననై నేను

శుద్ధమైన శరీరముకలదై గౌతమునిబొంది సుఖమున నుండెను. గౌతముడుగూడ రామునికిపూజచేసి తపస్సుచేయుచుండెను. రాముడు గూడ నాతనికి పూజచేసెను. తరువాత విశ్వామిత్రుడు, రామ లక్ష్మణులు ఈశాన్యదిక్కున కేగి మిథిలానగరమున యజ్ఞవాటమును జేరిరి.

౧౯వ. అధ్యాయము.

రాముడు శివధనస్సును విఱుచుట; రామాదులవివాహము స్థిరపడుట.



రాముడు మిథిలానగరమున యజ్ఞవాటము చేరిన తరువాత విశ్వామిత్రునికి యజ్ఞము బాగుగ జరుగుచున్నదనియు, యజ్ఞ సామగ్రి సమృద్ధిగ నున్నదనియు, వేదాధ్యయనము చేసిన బ్రాహ్మణు లనేకులు నానాదేశములనుండి వచ్చిరనియు, ఋషివాటములవద్ద ననేకబండ్లున్నవనియు దెలియబటుచి తామెక్కడ నివసింపవలెనని విశ్వామిత్రునినడుగ నతడు 'విజనమైనదియు, మంచినీటివసతి గల దియునగు స్థలముననివసింత'మని పలికెను. అంతట వారంద ఱట్లు

---

మీకు వందలకొలది నమస్కారములను నర్పించెదను. దేవా! నే నెక్కడున్నను మీపాద కమలములందే మనస్సు, మీయందే భక్తి నాకు కలుగుగాక! పురుషోత్తమ! భక్తవత్సల! హృషీకేశ! నారాయణ! మీకు నమస్కారము. సంసారభయమును బోగొట్టు నట్టియు, కోటిసూర్యులతేజస్సు కలిగినట్టియు, శ్యామలవర్ణముగల శరీరముగలిగినట్టియు, మంచి బంగారురంగుగల వస్త్రమునుకట్టి రత్నములుచెక్కిన కుండలములను ధరించి విశాలమగునేత్రములను గలిగి చేతితో ధనస్సునుబాణములను బట్టి లక్ష్మణునితో నున్నట్టియు రాముని నేనెల్లపుడు స్తుతింతును.

చేసిరి. ఈసంగతి జనకునికి దెలియగ నత డచ్చటికి గౌతమునిపుత్రుడును, తనపురోహితుడునునగు శతానందునితోను, ఋత్విజులతోను వెళ్ళి వారిచే విశ్వామిత్రున కర్ఘ్యమిప్పించెను. అతడు దానిని పుచ్చుకొని రాజును కుశలమడిగి 'యజ్ఞము బాగుగ జరుగుచున్నదా! యని ప్రశ్నించెను. జనకుడు విశ్వామిత్రుని, నతని వెంటవచ్చినమునులనుగూడ కుశలమడిగెను. తరువాత నతడు విశ్వామిత్రుని, నాఋషులను 'ఆసనములమీద కూర్చుండు'డనికోర నందఱట్లు కూర్చొనిరి. రాజు విశ్వామిత్రునితో "ఈదినమున నాయజ్ఞసమృద్ధి దేవతలచే సఫలముచేయబడినది. మీదర్శనమున నేనిప్పుడు యజ్ఞఫలము నొందితిని. మునులతో మీరు నాయజ్ఞశాలకు వచ్చి నన్ననుగ్రహించుటచే నేను ధన్యుడనైతిని. 'ఈదినము మొదలింకను 12రోజులు యజ్ఞముజరుగవలెనని ఋత్విజులు చెప్పుచున్నారు. అప్పుడు దేవతలు వచ్చి వారిభాగములను బుచ్చుకొనుట మీరు చూచెదరు." అని మనవిచేసి సంతోషముతో రామలక్ష్మణులనుజూచి విశ్వామిత్రునికి నమస్కరించి వారలనుగూర్చి సుమతి యడిగిన ట్లతనినడిగెను. అంతట నాఋషి 'వారు దశరథునిపుత్రు'లని చెప్పి సిద్ధాశ్రమమునకు వారు వచ్చుటయు, 'రాక్షసులను వధించుటయు, నహల్యను, గౌతముని దర్శించుటయు మొదలగుసంగతులను జనకునకు దెలిపి 'వారు యజ్ఞముననుండు నీశివధనస్సును పరీక్షచేయుటకు వచ్చి'రనిపలికి యూరకుండెను. ఈసంగతులను గౌతముని ప్రథమపుత్రుడగు శతానందుడు విని సంతోషముతో తనశరీరమున రోమములు గగుర్పాటుచెంద రామునిదర్శనముచే మిక్కిలి యాశ్చర్యమును బొంది రామలక్ష్మణులజూచుచు విశ్వామిత్రుని నిట్లడిగెను."నాతల్లి రాముని జూచినదా?వనఫలములు, దుంపలు మొదలగువానిని వారికిచ్చి వారిని పూజించినదా? నాతల్లిపూర్వవృత్తాంతము రామునికి దెలుపబడినదా? నాతలిదండ్రులు కలిసియున్నారా? నాతండ్రి రాముని పూజించెనా?

వానికి నమస్కారము చేసెనా?" అని యడుగ వానికి విశ్వామిత్రుడు 'జరుపవలసిన కార్యములను నేను జరిపితిని. అహల్యాగౌతములు సుఖముగ కలిసియున్నారు' అని చెప్పెను. అప్పుడు శతానందుడు రామునితో "మీ యాగమనము గొప్పది. దైవయోగముచే విశ్వామిత్రుడు మీకు లభించెను. ఇతడు గొప్పప్రభ కలవాడు; ఆలోచింపశక్యముగానికర్మలను జరిపినవాడు. ఇతడు గొప్పతపస్సుచే బ్రహ్మర్షి పదవి నొందెను. ఇతడు మీకు జేయవలసిన గొప్పమేలును నెఱుగును. ఈతనిచే మీరు రక్షింపబడుచున్నారు. మీకంటె ధన్యుడెవడును లేడు. ఈతనిబలమును, చరిత్రమును నేను మీకు దెలిపెదను; వినుడు." అని పలికి * విశ్వామిత్రుడు రాజ్యముచేసినది మొదలు బ్రహ్మర్షిత్వము బొందువఱకు జరిగిన వానిచరిత్రమునంతయు స్పష్టముగ వారికి జెప్పి యాతడు యుద్ధకుశలుడు; తపశ్శాలి; ధర్మపరుడు; గొప్పవీరుడు అని కూడ వారికి దెలిపెను. అంతట జనకుడు విశ్వామిత్రునిజూచి "మీ రాకచే నేను ధన్యుడనైతిని. పవిత్రుడ నైతిని. మీతపస్సు, బలము గుణములు గొప్పవి. సాయంకాలమగుటచే కర్మలు చేయుటకు కాలమైనది. రేపటిదినమున మీదర్శనము చేసెదను. సెలవిండు." అని పలికెను. ఆఋషి సంతోషించి రాజునకు సెలవిచ్చెను. జనకుడు తనపురోహితులతో విశ్వామిత్రునికి ప్రదక్షిణము చేసి వెడలెను. ఆఋషియు తననివాసమున రామలక్ష్మణులతోను, మునులతోను సుఖముననుండెను.

ఆమఱునాడు జనకుడు తననిత్యకర్మలను నెఱవేర్చుకొని విశ్వామిత్రునియొద్దకు వచ్చి యాతనిని విధిప్రకారము పూజించి రామలక్ష్మణులను మర్యాదచేసి మునితో 'నేను చేయవలసినదాని నాజ్ఞా

---

* 6వ ప్రకరణము. 1వ అధ్యాయము. విశ్వామిత్రుడు; అతనిపూర్వులు చూడుము.

పింపు'డని పలికెను. అంతట విశ్వామిత్రుడు "వీరు రామలక్ష్మణులు దశరథునిపుత్రులు; క్షత్రియులు; నీవద్దనున్న శివధనస్సును జూడ గోరుచున్నారు. దానిని వారికి జూపుము. దానిని జూచిన మొదల వారికోరిక నెఱవేఱు"నని వానికి దెలుప జనకుడు వారికి * ధనస్సు యొక్క పూర్వవృత్తాంతమును, † సీత వృత్తాంతమును దెలిపి 'అధనస్సు నెక్కుబెట్టినవానికి నాకుమార్తెయగు సీతనిచ్చి వివాహము చేసెదనని ప్రతిజ్ఞ చేసితి'నని చెప్పి దగ్గఱ నుండుమంత్రులకు 'మిథిలా పట్నమునుండి శివధనస్సును దెప్పింపు'డని సెలవిచ్చెను. అది యెనిమిది చక్రములుగల యొక పెట్టెలోనుండ దానిని 5000 మంది మోసి పెట్టెతో విశ్వామిత్రాదులున్న చోటునకు దెచ్చిరి. దానికి నూఱు గంటలు గలవు. అది మణులు, వజ్రములు మొదలగువానితో నలంకరింపబడియుండెను. జనకుడు విశ్వామిత్రునికి నమస్కరించి "మునీశ్వరా! జనకరాజులు పూజించునదియు, మీరు కోరినదియు నగు శివధనస్సు ఇదిగో. దీనిని దేవతలు, అసురులు, రాక్షసులు, గంధర్వులు, యక్షులు, కిన్నరులు, నాగులు, గొప్పరాజవీరు లెక్కు పెట్టలేకపోయిరి. రాజపుత్రుల కిద్దఱికి దీనిని జూపుడు"అని పలుక ఋషి రామునితో 'వత్సా! ధనస్సునుజూడుము'అని యనెను. అతని యాజ్ఞచే రాముడు పెట్టెమూతను దీసి దానిని జూచి 'ఇది గొప్ప ధనస్సు. దీనిని చేతితోముట్టి యెక్కుపెట్టుటకు ప్రయత్నము చేసెద' ననియనెను. 'అట్లే జరుపుము.' అని విశ్వామిత్రుడును, జనకుడును ననిరి. రాముడు శివధనస్సును లీలగా నెడమచేతితో బట్టి యనేక వేలజనులు చూచుచుండ నారినిబిగించి కుడిచేతితో నెక్కుబెట్టి దానిని మధ్యకు విఱిచెను. దానివలన పిడుగువంటిధ్వనియాయెను. పర్వత

---

* 6వ ప్రకరణము 8వ అధ్యాయము జనకునివంశము చూడుము.

† 6వ ప్రకరణము 20వ అధ్యాయము సీతాజననము; యౌవనము చూడుము.

ములు పగిలినట్లు శబ్దముపుట్టెను. గొప్పభూకంపముకలిగెను. విశ్వామిత్రుడు జనకుడు రామలక్ష్మణులుతప్ప మిగిలినవారును, దేవతలును మోహితులై క్రిందబడిరి. *రాముడు విల్లువిఱిచినతరువాత జనకుడు విశ్వామిత్రునకి నమస్కరించి యతనితో "రామునివీరత్వము నాకు దెలిసినది. అది మిక్కిలియాశ్చర్యకరమును, వర్ణింపనలవి కానిదియునైయున్నది. అది యిట్టిదని నాకింతకుపూర్వము తెలియ లేదు. రామునికి దప్పక నాకుమార్తెయగు సీతనిచ్చి జనకులకులము నకు కీర్తిని గలిగించెదను. మీయాజ్ఞప్రకారము నామంత్రులయోధ్యకు శీఘ్రముగ రథములమీదబోయి రామలక్ష్మణులు విశ్వామిత్రునిరక్షణలో నుండిరనియు, సీతాప్రదానమునకై నాప్రతిజ్ఞను, ధనుర్భంగమును, సర్వమును దశరథునికి దెలిపి యాతని దీసికొనివచ్చెదరు." అనిపలుక కౌశికుడు 'అట్లుగుగాక!' యని సెలవీయ జనకుడు తనమంత్రుల నయోధ్యకు బంపెను.

జనకుని మంత్రులు మిథిలనుండి బయలుదేఱి మూడు రాత్రులు త్రోవలోనుండి పిమ్మట శ్రమతో నయోధ్యను జేరి దశరథుని నన్నుజ్ఞచే నతని నగరుచేరి దేవతుల్యుడగు వృద్ధరాజును జూచి నమస్కరించి వినయముతో మంచిమాటల నిట్లు పలికిరి. "మిథిలాధిపుడగు జనకుడు మీయొక్కయు, మీ యగ్నిహోత్రి

---

*అ. రా:—రాముడు విల్లువిఱిచినతరువాత జనకుడతనిని కౌగిలించుకొనెను. అంతఃపురములోనుండు వానిభార్య లాశ్చర్యము నొందిరి. సీతబంగారుతో జేయబడినమాలను కుడిచేతితో బట్టి నవ్వుచు బంగారువర్ణముగల తనశరీరమునకు నన్నియాభరణములుబెట్టుకొని మంచిబట్టలను గట్టుకొని రాముని మెడలో నామాలను వేసి సంతోషముతో నవ్వెను. దీనిని రాజుభార్యలంతఃపురములోని కిటికీకన్నములనుండి చూచుచుండిరి.

ములయొక్కయు, మీ ఋత్విజులయొక్కయు, మీ పురోహితుల యొక్కయు, మీ యనుచరాదులయొక్కయు కుశలమును మాటి మాటికి స్నేహయుక్తమగు మంచిమాటలతో నడిగెను. విశ్వామిత్రుని యనుజ్ఞచే మీతో 'నా కుమార్తెయగు సీతను శివధనస్సు నెక్కు పెట్టినవానికి వివాహము చేసెదనని పూర్వము ప్రతిజ్ఞ చేసి యుంటిని. రాజులు కొందఱు ధనస్సు నెత్తలేక వెడలిపోయిరి. మీ పుత్రుడగు రాముడు దైవయోగమున విశ్వామిత్రునితో నిచటికి వచ్చి యనేకుల యెదుట ధనస్సును విఱిచి సీతను పొందెను. నేను వానికి సీత నిచ్చెదను; గనుక మిమ్ముల నంగీకరింపగోరెదను. మీరు మీ పురోహితులు, ఋత్విజులు మొదలగువారితో వచ్చి రామలక్ష్మణులజూచి సంతోషమును బొందెదరు. విశ్వామిత్రుని యాజ్ఞచే శతానందుడుకూడ నదే యభిప్రాయమున నున్నాడని చెప్పుడు' అని మాతో జెప్పెను." ఇట్లు జనకుని మంత్రులు పలుక దశరథుడు విని మిక్కిలి సంతోషించి వసిష్ఠ వామదేవులతోను, మంత్రులతోను, నితరులతోను, "రామలక్ష్మణులు కౌశికునిరక్షణలో మిథిలానగరమున నున్నారు. రామునివీర్యమునుజూచి జనకుడు తన కుమార్తెను వానికియ్య నిశ్చయించెను. జనకుడు చెప్పినమాటలు మీ కిష్టమైనయెడల మనము మిథిలానగరమునకు శీఘ్రముగ వెళ్ళవలెను."అని పలికెను. దానికి ఋషులును, మంత్రులును మిక్కిలి సంతోషించి 'అట్లేయగుగాక!' యనిపలికిరి. అపుడు దశరథుడు 'రేపటిదినమున బయలుదేఱుద'మని జనకునిమంత్రులతో బలికి యారాత్రి వారికి తగినమర్యాదలను జరిపెను.

ఆమఱునాడు దశరథుడు సుమంత్రుని బిలిచి "ఈదినమున ద్రవ్యరక్షకులు మంచిరత్నాదులును, ద్రవ్యమును బట్టించుకొని ముందు బయలుదేఱవలెను. నాచతురంగబలముకూడ బయలుదేఱ

వలెను. నేను కోరినప్పుడు బయలుదేఱుటకు వాహనాదులు సిద్ధముగ నుండవలెను. వసిష్ఠ వామదేవ జాబాలి కాశ్యప మార్కండేయ కాత్యాయనులు ముందు వెళ్ళవలెను. నా రథము సిద్ధముచేసి సరియగు సమయమున దూతలు నాతో జెప్ప నేను బయలుదేఱెదను." అని పలికెను. తరువాత సుజనులతో నారాజు బయలుదేఱి నాలుగుదినములను దారిలో గడపి పిమ్మట మిథిలాపురమును జేరెను*. జనకుడీసంగతి తెలిసి వెంటనే దశరథునొద్దకు బోయి మిక్కిలి సంతోషముతో నిట్లు విన్నవించెను. "మీరాక శుభమైనది. మీరు మా యదృష్టవశమున నిచటకు వచ్చిరి. మీపుత్రులవీరత్వమువలన పొందవలసిన ప్రీతిని బొందుదును. దైవవశమున బ్రాహ్మణశ్రేష్ఠులతో వసిష్ఠవామదేవులును దయచేసిరి. నావిఘ్నములన్నియు బోయినవి. వీరశ్రేష్ఠులును, మహాత్ములును గల రఘువంశముతో సంబంధమువలన మాకులము పవిత్రమునొందును. రేపటిదినమున తిరిగి మీదర్శనము చేసి ప్రసంగించెదను. యజ్ఞాంతముననే వివాహము చేయుట ఋషిసమ్మతము." ఇట్లు జనకుడు పలుక సత్యవచనుడగు దశరథుడు "పుచ్చుకొనువాడు దాతవశములోనుండు నని పూర్వము నేను వినియుంటిని. ధర్మజ్ఞా! నీవు పలికినట్లనే మనము చేయుదము." అని బదులుచెప్పెను. జనకుడు గొప్పధర్మమును, కీర్తిని తెలియజేయు నామాటలను విని మిక్కిలి యాశ్చర్యమునొందెను. అంతట మిథిలలోనుండు ఋషులును, దశరథునితో వచ్చిన ఋషులును నొకరినొకరుకలిసికొని మిక్కిలిసంతోషముతో నారాత్రినిగడపిరి. దశరథుడు తనపుత్రులతో సుఖముగనుండెను. జనకుడు యజ్ఞకర్మలను తీర్చికొని తన కుమార్తెలగు సీత ఊర్మిళలగూర్చి విధియుక్తముగుకర్మను జరిపి యారాత్రిగడపెను.

---

*అ. రా:—దశరథుని భార్యలుకూడ పెండ్లికి వెళ్ళిరి. (ఇది యిప్పటి రాజమర్యాదగ గనబడదు.)

ఆమరునాటియుదయమున జనకుడు లేచి ఋషులతో యజ్ఞకర్మలను జరిపి తనపురోహితుడగు శతానందునితో "నాతమ్ముడగు కుశధ్వజుడు కందకమువలెనున్న యిక్షుమతీనదిచే చుట్టబడిన సాంకాశ్యపురమును నేలుచున్నాడు. వాడు నాయజ్ఞమునకు సహాయము చేయుచున్నాడు. వాని నిప్పుడు నేను జూడగోరెదను. వాడుకూడ నాతో నీసంతోషమును బొందు"నని పలుక వేగముగబోవు గుఱ్ఱములనెక్కి దూతలతనిని బిలువ బోయిరి. తరువాత కుశధ్వజుడు జనకునొద్దకు వచ్చి యాతనికి, శతానందునకు నమస్కరించి యుచితాసనమున గూర్చుండెను. జనకుడును, కుశధ్వజుడును మంత్రియగు సుదామునిబిలిచి 'నీవు శీఘ్రముగ బోయి దశరథుని, వానిపుత్రులను, మంత్రులను, పురోహితులను, బంధువులను దీసికొనిరమ్మ'ని వానికి సెలవియ్య నాతడు దశరథునిశిబిరమునకుబోయి యారాజునకు నమస్కరించి యాసంగతులను వారికి జెప్పి వారిని జనకునియొద్దకు దీసికొనివచ్చెను. అప్పుడు దశరథుడు జనకునితో "వసిష్ఠుడు నాయిక్ష్వాకువంశమునకు దైవతము. సర్వకార్యములకు వక్త. వానికి నావంశానుక్రమణిక తెలియును; గనుక నతడు విశ్వామిత్రునియొక్కయు, మిగిలినఋషులయొక్కయు ననుమతిని దీసికొని నావంశము మీకు దెలుపు"నని పలికెను. పిమ్మట నొకగడియ దశరథుడూరకుండ వసిష్ఠుడు *ఇక్ష్వాకువంశమును జనకునియొక్కయు, వానిపురోహితులయొక్కయు సమక్షమున సంపూర్ణముగ దెలిపి "ఆదివంశజులును, మిక్కిలి ధార్మికులును, వీరులును, సత్యవాదులును, నిక్ష్వాకువంశజులునగు రామలక్ష్మణులకు తత్తుల్యులగు నీకుమార్తెలనిద్దఱను నియ్యగోరెదను." అని పలికెను. అంతట జనకుడు చేతులుజోడించి 'కన్యాదానమందు కన్యాదాత వంశముకూడ దెలుపవలె'నని పలికి ♦తనవంశమును బూర్తిగ వారికి

* 6వ ప్రకరణము ౩వ. అధ్యాయము. దశరథుని పూర్వులు చూడుము.

♦ 6వ ప్రకరణము ౭వ అధ్యాయము. జనకునివంశము చూడుము.

తెలిపి "సీతను రామునకును, తనయూరసపుత్రికయగునూర్మిళను లక్ష్మణునకు నిచ్చి వివాహము చేసెదను. దశరథమహారాజా! మీరు రామలక్ష్మణులకొఱకు గోదానములను, నాందీశ్రాద్ధమునుజరిపింపుడు. ఈరోజున మఖానక్షత్రము. నేటికి మూడవదినమున నుత్తరఫల్గునీ నక్షత్రమున వారికి కన్యాదానముజేసెదను." అని దశరథునితో చెప్పెను. అంతట విశ్వామిత్రుడును, వసిష్ఠుడును జనకునితో నిట్లనిరి. "ఇక్ష్వాకు విదేహవంశములు గొప్పవి. వానితో నితరవంశములు సరిపోలవు. రామలక్ష్మణులకు సీతయూర్మిళ లతో వివాహము ధర్మమైనదియు, సమానమగు రూప సంపదలతోగూడినదియునై యున్నది. మేమొకమాట జెప్పెదము వినుము. నీతమ్ముడగు కుశధ్వజునకు రూపవతులగు నిద్దఱు కూతులు గలరు. వారిని భరతశత్రుఘ్నులకు నీయుము. దశరథునిపుత్రు లందఱు రూపయౌవనములుగలవారును, దేవతలతో తుల్యమగు పరాక్రమముగలవారును,లోకపాలురతో సమానులునునై యున్నారు. మీయుభయులకులములు గొప్పవి. మీరు సంబంధము చేసికొన దగినవారు." ఈమాటలను జనకుడు విని వారికి నమస్కరించి వారితో "మీరాజ్ఞాపించినటుల సంబంధము జేయుటచే మాకులము పవిత్రతనొందును. అట్లే జరిపెదను. ఒక్కదినముననే మా కుమార్తె లను నలుగురను దశరథునిపుత్రులు పాణిగ్రహణము జేసికొనెదరు గాక! ఉత్తరఫల్గునీనక్షత్రమున వివాహము మంచిదని పెద్దలుచెప్పె దరు." అని విన్నవించెను. తరువాత నాతడు లేచి ఋషులకిద్దఱికి నమస్కరించి "మీరు నాకు గొప్పధర్మకార్యమును దెలిపి యుప కారమును జేసితిరి. నేను మీశిష్యుడను. ఈయాసనములమీఁద కూర్చుండుడు. దశరథునికి నాపురమెట్లో నాకును నయోధ్యయట్లే. మీరు నాకు ప్రభువులు; కావున తగినట్లుచేయుడు," అనిపలికెను.

దశరథుడు దానికి సంతోషించి "మీయన్నదమ్ములిద్దఱు గొప్ప గుణములుగలవారు. ఋషులును, ననేకరాజులును మీవలన తగిన సత్కారములను బొందిరి. మీరు శుభము పొందుదురుగాక! నేను నాశిబిరమునకు బోయి తగినపితృకర్మలను జేయుచుండెద"నిపల్కి విశ్వామిత్రవసిష్ఠులతో తనశిబిరమునకు బోయి యాదినమున జేయవలసిన పితృకార్యములను జరిపెను.

ఆమఱునాటి యుదయమున దశరథుడు లేచి నిత్యకృత్యములనుజరిపి తనపుత్రుల శ్రేయస్సునుగూర్చి బ్రాహ్మణులకు బంగారుతో నలంకరింపబడిన కొమ్ములుగలవియు, నెక్కువగాపాలిచ్చునవియు, దూడలుగలవియునగు నాలుగులక్షలగోవులను, పాలుపితుకుటకు తగిన కంచుపాత్రలను,నింకను నెక్కువగ సొమ్మును నిచ్చెను. ఆదినముననే భరతునిమేనమామయును, కేకయరాజకుమారుడునునగు 'యుధాజిత్తు' మిథిలానగరమును జేరి దశరథునిదర్శించి "మాతండ్రి మీకుశలమును గోరెను. మేమందఱము కుశలముగానున్నాము. మాతండ్రి భరతుని జూడగోరి నన్నయోధ్యకుబంప నేనచటికి వెళ్ళి మీరుమీపుత్రులతో నిక్కడకు వచ్చుటను విని నేను గూడ వేగముగ నిచటికి వచ్చితిని" అని పలుక దశరథుడు వానికి తగినమర్యాదలను జరిపెను.

---

## ౩౦ వ. అధ్యాయము.

## సీతజననము- యౌవనము.

---

జనకుడు తనయజ్ఞవాటమును దున్నించుచు బీజముల జల్లించుచుండ సీతామహాదేవినాగటికి దగిలి భూమినుండి బయలువెడలెను. అందువలన నామెకు 'సీత'యను పేరువచ్చెను. జనకుడు శరీరమున

బుద్ధిగలయామెనుజూచి యాశ్చర్యపడి పిల్లలులేనివాడగుటచే నామెను దీసికొని తనతొడలమీద గూర్చుండబెట్టుకొని 'ఈమెయే నా కుమార్తె'యని స్నేహముతో ననెను. ఆకాశవాణిగూడ 'అట్లే యీమె నీధర్మపుత్రిక'యని జనకునితోననెను. అప్పటినుండి జనకునకు గొప్పసిరిగలిగెను. ఆతను తన పెద్దభార్య కాపిల్లనీయ నామె సీతను తనకుమార్తెగ బెంచుచుండెను.

సీతకు యౌవనమువచ్చెను. జనకుడు'ఆమెకు దగినవరుడు లభించునా?'యని విచారించుచుండెను. కన్యతండ్రి యెంతవాడైనను లోకములో నల్లునివలన తిరస్కారమునొందును. జనకుని గృహములో వరుణుడిచ్చిన * శివధనస్సును, అక్షయములగు బాణములుగల యమ్ములపొదులు రెండునునుండెను. వానిని ననేక సుగంధద్రవ్యములతోను, ధూపములతోను పూజించుచుండెను. 'ఆధనస్సు నెక్కుపెట్టినవానికి నాకన్యనిచ్చి వివాహముజేసెదను.' అని జనకుడు ప్రతిజ్ఞ చేసెను. దీనిని దేవతలుగాని, గంధర్వులుగాని, యసురులుగాని, రాక్షసులుగాని యెక్కుపెట్టలేకపోయిరి. రాజులు కొందఱు మిథిలాపురమునకు వెళ్లి శివధనస్సునుబట్టి కదలించుటకు శక్తిలేనివారై తిరిగి వెళ్ళిపోయి యూరకుండిరి. అంతట జనకుడు వారితో 'నాకన్యను మీకీయ'నని చెప్ప వారు కోపముజెంది యాతనితో నొకసంవత్సరము యుద్ధముజేసిరి. అంతట మిథిలను రక్షించు యంత్రములన్నియు నశించెను. అప్పుడు జనకుడు తపస్సుచేసి దేవతలను తృప్తినొందించి వారిదయవలన చతురంగబలములను బొంది శత్రువులను నాశనముజేసెను. తరువాత సాంకాశ్యపురాధిపతియగు 'సుధన్వుడను వాడు సీతను, శివధనస్సును తనకీయవలెనని జనకునిగోర నతడు వానిని వానికియ్యలేదు. అందుచే నా రాజు మిథిలను ముట్టడించెను. వానికిని, జనకునకును

* ౮వ. ప్రకరణము. ౮వ అధ్యాయము. జనకునివంశమున నీధనస్సు శివునిచే దేవతలకియ్యబడినట్లును, వారు జనకుని కిచ్చినట్లును తెలుపబడినది.

గొప్పయుద్ధము జరిగెను. జనకుడు సుధన్వునోడించి తనతమ్ముడగు కుశధ్వజుని సాంకాశ్యపట్టణమునకు రాజుగ నియమించెను. చాలకాలమిట్లు జరుగ రామలక్ష్మణులు మిథిలానగరమునకు వెళ్ళిరి. జనకుని నౌరసపుత్రిక యూర్మిళ; కుశధ్వజునిపుత్రికలు మాండవి శ్రుతకీర్తులు.

సీత మిక్కిలి యుత్తమురాలు. మంచిరూపమును, నవయౌవసౌష్టవమునుగలది. ఆమె నిడుదయగునేత్రములను, చంద్రునివంటి మోమును, పలుచనికనబొమలను, మంచిబొమముడిని, మంచిపెదవులను, మంచితొడలను, మల్లెమొగ్గలవంటి పలువరుసను కలిగియుండెను. కాటుకరంగువంటి యామె జుట్టు తొడలవరకును వేలాడు చుండెను. ఆమెకు సన్ననినడుమును, సొగసైనముక్కును నుండెను. ఆమెశరీరకాంతి పుటముపెట్టిన పదాఱువన్నెబంగారువలెనుండెను. ఆమె మంచియాభరణములుకలదై స్త్రీలలో శ్రేష్ఠురాలుగనుండెను. దేవ గంధర్వ యక్ష కిన్నరస్త్రీలలోను, అప్సరస్త్రీలలోను, మానవస్త్రీలలోను నామెతో సమానమగు సౌందర్యముగలస్త్రీ లేకుండెను. ఆమె యేమియు విచారములేనిదై జనకునింట సుఖముగ పెరుగుచుండెను.*

---

## ౨౧ వ. అధ్యాయము. రామాదుల వివాహము.

దశరథుడు జనకునితో గలిసికొనిన నాల్గవదినమున నుదయముననే యయోధ్యాధిపతియును, నాతనిపుత్రులును లేచి కాలోచిత

---

* అ. రా:—సీత మూలప్రకృతి. జనన స్థితి మరణములకు గారణము. ఆత్మ నిలిచియుండ మాయ వానియెదుటనుండి జననముకలిగించును. జననాదులు మాయవలన కలుగును; గాని పరమాత్మవలన కలుగవు. రామాయణములో వివరింపబడిన చరిత్రయంతయు మాయవలననే జరిగెను.

కర్మలను దీర్చుకొని సరియగు ముహూర్తమునకు ఋషులతో జనకుని
యజ్ఞవాటమును జేరిరి. రాముడును, వానితమ్ములును తమకు మంగళ
కార్యములు జరిగినతరువాత నలంకారములను బెట్టుకొనిరి. ముందు
వసిష్ఠుడును, ఋషులును నడచిరి. వసిష్ఠుడు జనకునియొద్దకుబోయి
"దశరథుడు మంగళకృత్యములను జరిపి యుత్సాహముతోనుండిన
పుత్రులతో వచ్చియున్నాడు. కన్యాదానముచేయు మీకొఱకు నిరీ
క్షించియున్నాడు. దాత ప్రతిగ్రహీతలుండిన నన్నికోరికలు సమ
కూడును. ఉత్తమమైన వివాహమునుజరిపి మీస్వధర్మమును నెఱవేర్చు
కొనుడు." అనిపలికెను. దానికి జనకుడు "మీకు అడ్డెవరున్నారు?
మీరు ఎవరియాజ్ఞకొఱకు నిరీక్షింపవలెను? మీస్వగృహవిషయమున
మీ రేలయాలోచింపవలెను? నారాజ్యమంతయు మీదే. అగ్నివలె
వెలుగు నాపుత్రికలకు మంగళకార్యములు జరిగినవి. వారు వేదికవద్ద
వేచియున్నారు. నేనను సిద్ధముగ వేదికవద్దనిలిచి మీకొఱకు నిరీక్షిం
చుచున్నాను." అని మనవిచేసి దశరథునివైపు తిరిగి 'రాజా! విలం
బము, విఘ్నములు లేకుండ జేయుడు.' అనిపలికెను. జనకుని మాట
లను దశరథుడు విని తనపుత్రులను, ఋషులను లోనికి బ్రవేశింప
జేసెను. అప్పుడు జనకుడు వసిష్ఠునితో 'రామునివివాహమును ఋషుల
సహాయమున మీరు జరుపు'డనిపలికెను. 'అట్లే యగుగాక! యని
యాఋషి రాజుతో బలికి విశ్వామిత్ర శతానందుల ననుమతివడసి
మంటపమున విధిపూర్వకముగ వేదికను గల్పించి దానిని గంధపుష్ప
ములతో నలంకరించి దానిపైని దూర్వాంకురములతోనిండిన బంగారు
పాలికలను, రంధ్రములుగల కలశలను, నంకురములుగల కలశలను,
నంకురములతోనిండిన మూకుళ్ళను, ధూపములతోనిండిన ధూపపాత్ర
లను, నీటితోనిండిన శంఖాకారములుగలపాత్రలను, స్రుక్స్రువములను,
నర్ఘ్యజలములతోనిండిన పాత్రలను, పేలాలతోనిండిన పాత్రలను,

మంత్రింపబడిన యక్షతలుకలపాత్రలను, దర్భలను నునిచెను. మఱియు నతడు మంత్రపూర్వకముగ దానిపై దర్భలనుపఱచి మంత్రములతో నగ్నినునిచి దానియందు హోమముచేసెను. జనకుడు సర్వాభరణభూషితురాలును, లక్ష్మి యవతారమునగు సీతను దీసికొని వెళ్ళి రామున కెదురుగ నగ్ని సమీపమున కూర్చుండబెట్టి రామునితో "ఇదిగో! నాకూతురు. నీతో నీమె ధర్మములనాచరించును. ఈమెను పరిగ్రహింపుము. సూర్యుని ఛాయాదేవి యనుసరించునటుల నిన్ను ఈమె యనుసరించును. నీచేతితో నీమెచేతిని గ్రహింపుము." అని పలికి మంత్రముచే పవిత్రతనొందిన జలమును ఆతనిచేతిలో ధార పోసెను. అప్పుడు దేవతలు, ఋషులు 'శుభము, శుభ'మని పలికిరి. దేవదుందుభులు మ్రోగెను. గొప్పపుష్పవర్షము కురిసెను. తరువాత జనకుడు సంతోషముతో లక్ష్మణునిబిలచి ఆతనితో 'నేను తీసికొని వచ్చిన ఈయూర్మిళను విలంబముచేయక పాణిగ్రహణముచేయు' మనెను. తరువాత నతడు భరతునితో 'నీవు మాండవీహస్తమును గ్రహింపు'మనియు, శత్రుఘ్నునితో 'నీవు శ్రుతకీర్తిహస్తమును గ్రహింపు'మనియు చెప్పి 'బుద్ధిమంతులును, సుచరిత్రులునగు మీరు నలుగురును వరుసగ నాపుత్రికలనలుగురను భార్యలుగ గ్రహింపుడు.'

---

అ. రా:—సీతావివాహమైనవెంటనే జనకుడామె పెండ్లిని గూర్చి పూర్వముజరిగిన యీవృత్తాంతమును వసిష్ఠునకును, విశ్వామిత్రునకును నిట్లుదెలిపెను. "ఒకనాడు నారదుడు నారాయణనామమును వీణపై వాయించుచు నేనొంటరిగనుండుసమయమున నాదగ్గఱకు వచ్చెను. అప్పుడు నేనాతనిపూజింప నతడు రహస్యమగు నీసంగతిని నాకు దెలిపెను. 'పరమాత్ముడగు మహావిష్ణువు భక్తులయెడ ననుగ్రహముచేతను, దేవకార్యము జరుపుటకును, రావణునిజంపుటకును రాముడై మనుష్యరూపముదాల్చెను. అతడు నాలుగురూపము

అనెను. వారు నలుగురు ఆ రాజకన్యలను నల్వురను వసిష్ఠునియొక్క సుమతి ప్రకారము పాణిగ్రహణముచేసికొని వారితో నగ్నివేదికను, ఋషులను, జనకుని ప్రదక్షిణముచేసి విధిప్రకారము వివాహక్రియలను జరిపిరి. అంతట ఆకాశమునుండి గొప్పపుష్పవృష్టి కురిసెను. దేవదుందుభులతోను, సంగీతవాద్యధ్వనులతోను నప్సరస లాడిరి. గంధర్వులు పాడిరి. దశరథునిపుత్రులు అగ్నికిప్రదక్షిణముచేసి వివాహము పూర్తి చేసికొని తమతండ్రితోను, ఋషులతోను, బంధువులతోను, తమ భార్యలతోను తమశిబిరములకు బోయిరి.

ఆమరునాడు విశ్వామిత్రుడు రాజపుత్రులనాశీర్వదించి దశరథ జనకులతో జెప్పి హిమవత్పర్వతమునకు వెడలెను. తరువాత దశరథుడు జనకునితో జెప్పి యయోధ్యకు బయలువెడలెను. జనకుడు తనకూతులను ననేకలక్షలగోవులను, లక్షలకొలది మంచికంబళ్ళను,

---

లనో దశరథునకు జన్మించెను. యోగమాయ సీతయై జన్మించి నీయింటనున్నది. కనుక నీవు సీతను ప్రయత్నముచే రామునకు వివాహము చేయుము. ఆమె పరమాత్ముడగు రామునకు పూర్వము భార్యయైయుండెను. ఆమెను నీవితరులకు వివాహము చేయగూడదు' ఇట్లు నారదుడు పలికి స్వర్గమునకు బోయెను. అదిమొదలు నేను సీతను లక్ష్మిగ నాలోచించుచు 'నామెను రామున కెట్లియ్యగల'నని విచారించుచుంటిని. నాపితామహులయింటిలో శివుడు త్రిపురములను దహించినతరువాత నీధనస్సును నుంచెను. ఇది గొప్పబలముకలది. 'దీనిని విఱిచినవానికి సీతను వివాహముచేసెద'నని నిశ్చయించితిని. ఆమెను వివాహమాడుటకు చాలమంది వచ్చి ధనస్సునెత్తలేక మానభంగమునొంది వెడలిపోయిరి. విశ్వామిత్రునిదయచే రాముడిక్కడకు వచ్చెను. నామనోరథము ఫలించెను. సీతతోనుండు మహావిష్ణుస్వరూపుడగు రామునిపాదము లాశ్రయించెదను."

కోట్లకొలది మంచిబట్టలను, పట్టువస్త్రములను, ఏనుగులను, గుఱ్ఱములను, రథములను, కాల్బలమును, మంచిరూపములు, అలంకారములుగల దాసీజనమును, చాలబంగారును, వెండిని, మాణిక్యములను, ముత్యాలహారములను స్త్రీధనముగనిచ్చెను. జనకుడు కొంతదూరము వఱకు దశరథునిసాగనంపి తిరిగి తననగరమును జేరెను. దశరథుడు తనపుత్రులతోను, కోడండ్రతోను, ఋషులతోను, మంత్రులతోను, సేనతోను నయోధ్యకు బోవుచుండెను.

---

## ౨౨ వ. అధ్యాయము. రామ పరశురామ సమాగమము.

దశరథుడు తనపుత్రులతోను, కోడండ్రతోను, ఋష్యాదులతోను నయోధ్యకుబోవుటకు మిథిలనుండి బయలుదేఱి [illegible] యోజనములు వెళ్ళినతరువాత పక్షులు క్రూరమైన ధ్వనులను జేసెను. కాని భూమియందుగల మృగములు దశరథుడు, రాముడు, ఋషులు మొదలగువారికి ప్రదక్షిణముచేసెను. దానిని జూచి దశరథుడు వసిష్ఠునితో ‘దీనికి కారణమేమి? నాహృదయము చలించుచున్నది. నాకు గొప్ప విచారము కలుగుచున్న’ దనెను. వసిష్ఠు డాతనిమాటలనువిని ‘పక్షులు క్రూరధ్వనులుచేయుటచే గలిగిన గొప్పభయమును నీమృగములు పోగొట్టగలవు. నీవు విచారమును వీడుము.’ అని పలికెను. అప్పుడు గొప్పగాలివీచి భూమిని కదలించి మంచిచెట్లనన్నిటిని పడద్రోసెను. చీకటి సూర్యునిగప్పెను. అన్నిదిక్కులకు ప్రభతగ్గిపోయెను. దశరథుని సేన మూర్ఛపొందునట్లంతటను బుగ్గివ్యాపించెను. దశరథునికి, వానిపుత్రులకు, వసిష్ఠునికి, నితరఋషులకు తెలివియుండినను వారందఱు మిక్కిలిభయపడిరి. మిగిలినవారలకు చైతన్యము లేకపోయెను.

అప్పుడు భయంకరమైనరూపముగలవాడును, నీలివర్ణముగల శరీరము గలవాడును, జటలను ధరించినవాడును, గొప్పరాజుల సంతమునొందించినవాడును, కైలాసమువలె దుర్జయుడును, గాలాగ్నివలె సహింపవీలులేనివాడును, తేజోవంతుడును, పామరులకు గనబడనివాడును, మూపున గండ్రగొడ్డలిని, గొప్పధనస్సును ధరించినవాడును, త్రిపురములను దహించిన శివునివలె తీవ్రస్వభావముకలవాడును, జమదగ్ని పుత్రుడుననగు పరశురాముని దశరథుడును, జపహోమపరాయణులగు వసిష్ఠాదులును జూచి భయపడి యందఱు కలిసికొని రహస్యముగ నిట్లు మాటలాడుకొనిరి. "ఇతడు తనతండ్రిమరణమునుగురించి కోపముగలవాడై పూర్వము క్షత్రియులను వధించి కోపమును, తాపమును విడిచి మఱలనిప్పుడు క్షాత్రధర్మముచే మనలను బాధపెట్టునాయేమి? ఇతడు తిరుగ క్షత్రియవధ కిష్టపడునాయేమి?" ఋషులిట్లు వారిలో వా రాలోచించుకొని పరశురామునియొద్దకు నర్ఘ్యమును దీసికొని వెళ్లి 'రామా! రామా!' యని మంచిమాట లాడిరి. జామదగ్న్యుడు వానినంగీకరించెను. తరువాత పరశురాముడు రఘురామునితో నిట్లుపలికెను. 'దాశరథీరామా! నీవీరత్వము నితరులద్భుతముగ జెప్పుకొనుటను, ఇతరు లాలోచించుటకు వీలుకానంతయద్భుతముగ నీవు శివవిల్లును విఱుచుటయు మొదలగుసంగతులనన్నిటిని నేను విని యుంటిని. కావున మఱియొకశుభమగు గొప్పధనస్సును పట్టుకొని వచ్చితిని. ఇదిగో ఘోరమైనరూపముగల జమదగ్నియొక్క విల్లు. దీనిని నీవు బాణముచే బూరించి నీబలమును జూపింపుము. అటుపైని నీతో ద్వంద్వయుద్ధమును జేసెదను." ఇట్లు పరశురాముడుపలుకక దశరథుడు గొప్పవిచారముగలముఖముతో దీనుడై యిట్లుపలికెను. "క్షత్రియకులముపై మీకు కోపము తీరినది. మీరు బ్రాహ్మణులు. గొప్పకీర్తిమంతులు. బాలురగు నాపుత్రులకభయ మియ్యగోరెదను.

స్వాధ్యాయ వ్రతములుగల భార్గవకులములో బుట్టిన మీరు ఇంద్రుని యెదుట 'నేను మఱి యుద్ధముచేయను.' అని యొప్పుకొనియుండిరి. మీరు ధర్మపరులయి కాశ్యపునకు భూమినొసగి వనమునకుబోయి మహేంద్రపర్వతమున తపస్సుచేయుచుండిరి. ఇప్పుడు మీరు నావంశమునంతటిని నశింపజేయుటకు వచ్చితిరి. రాముడొక్కడు మరణము నొందిన మేమందఱము జీవింపము.'' ఇట్లు దశరథుడు పల్కుచుండ పరశురాముడామాటల నంగీకరింపక రఘురామునితో నిట్లనెను. "ప్రకాశించునవియు,గొప్పబలముగలవియు, లోకములో ఖ్యాతిగాంచినవియు నగు రెండుధనస్సులు విశ్వకర్మవలన గొప్పప్రయత్నముచేనిర్మింపబడినవి. త్రిపురముల దహనమునకై శివునికి దేవతలవలన నొకధనస్సు ఇయ్యబడినది. దానిని నీవు విఱిచితివి. ఈ వైష్ణవధనస్సు దానితో సమానమగుబలముకలది. ఒకప్పుడు దేవతలందఱు శివ విష్ణువుల బలాబలముల దెలియగోరి బ్రహ్మనడిగిరి. వారియభిప్రాయములను బ్రహ్మ తెలిసికొని శివ విష్ణులకు విరోధము కల్పించెను. అప్పుడొకరి నొకరు జయించునుద్దేశ్యముతో శివ విష్ణులిద్దఱు గొప్పయుద్ధము జేసిరి. విష్ణు హుంకారముచే శివధనస్సు మందతనొంద శివుడు నిలిచిపోయెను. అప్పుడు దేవతలు ఋషులు మొదలగువారు వచ్చి వారియుద్ధము నాపుజేయ వారు తమస్థానములకు బోయిరి. విష్ణు పరాక్రమముచే మాంద్యతనొందిన శివధనస్సును జూచి దేవతలు, ఋషులు, 'శివుని కంటె విష్ణువెక్కువవాడు.' అని తలంచిరి. అంతట శివుడు కోపము నొంది తనధనస్సును, బాణములను విదేహదేశపు రాజగు *దేవరాతున కిచ్చెను. ఈవిష్ణుధనస్సును విష్ణువు ఋచికునకిచ్చెను. ఆతడు తనకుమారుడును,నాతండ్రియునగు జమదగ్నికిచ్చెను. కార్తవీర్యార్జునుడు

* ౧వ. ప్రకరణము. ౭౧వ. అధ్యాయము. జనకునివంశములో 'దేవతలు దేవరాతునకిచ్చి'రని చెప్పబడినది. శివుడు, దేవతలు వరుణునిద్వారా దానిని వానికిచ్చియుందురు. ఇదియొక గొప్పవ్యత్యాసముకాదు.

నాతండ్రిని జంప నేను గొప్పకోపమునుబొంది క్షత్రియుల ననేక పర్యాయములు చంపి భూమినంతయుబొంది నాయజ్ఞాంతమున కాశ్యపునికి నాపృథివిని దానముచేసి గొప్పతపముజేయుచు మహేంద్రపర్వతమున నిలిచితిని. 'నీవు శివునివిల్లును విఱిచితి' వని విని నేను తొందరగ నిచ్చటకు వచ్చితిని. నాతాతలనుండి యీవిష్ణుధనస్సు లభ్యమైనది. నీవు క్షత్రియధర్మము నవలంబించి దీనిని గ్రహించి దీనియందు శరమును సంధింపుము. అట్లుచేసిన తరువాత నీతో నేను ద్వంద్వయుద్ధముజేసెదను." ఇట్లు పరశురాముడు పలుక నామాటలను రఘురాముడు విని తనతండ్రియందలిగౌరవముచే తానెట్లు పరశురామునితో బలుకవలెనో తండ్రినడిగి తెలిసికొని పరశురామునితో "నీవు చేసినకర్మలను వినియుంటిని. నీవు పితృఋణమును దీర్చితివి. నన్ను నీవు వీర్యములేనివానిగను, శక్తిలేనివానిగను క్షాత్రధర్మముచే నవమానించుచున్నావు. నాతేజమును, పరాక్రమమును నేడుచూడు" మని పలికి కోపించి పరాక్రమముతో శీఘ్రముగ పరశురాముని చేతినుండి విల్లును, బాణమును దీసికొని ధనస్సును నారోపణజేసి బాణమును సంధించి కోపముతో "నీవు బ్రాహ్మణుడవగుటచేతను, విశ్వామిత్రునికి చుట్టమవగుటచేతను నాకు పూజ్యుడవైతివి. అందుచే నేను నీప్రాణములుహరింప శరమును విడువజాలనైతిని. నీకిష్టమగునెడల నీపాదములగతికి నష్టమగునటుల బాణమును విడిచెదను. లేనియెడల నీతపోబలముచే నీవు పుణ్యలోకములను బొందుదువో యట్టి నీతపోబలమును బోగొట్టెదను. తేజోమయమైనదియు, శత్రువులను జయించునదియు నగు నీవైష్ణవశరము తనశక్తిచే నితరులబలదర్పములను నశింపజేయును. ఇదివ్యర్థముగ పడిపోదు." అనిపరశురామునితో బలికెను. అంతటనద్భుతముగ ధనస్సును, బాణమును బట్టి నిలిచియుండు రాముని జూచుటకు దేవాదులును, బ్రహ్మయు నచటికివచ్చిరి. లోకములన్నియు మానవములై

నిలిచియుండిరి. పరశురాముడు రఘురాముని తేజముచే తనబలము దుగుటను జూచి మెల్లగ నాతో నిట్లనెను. "నేను పూర్వము కాశ్యపునకు భూమినంతయు నిచ్చుటచే నతడు తన దేశమునందు నేను నివసింపరాదని నాకు సెలవిచ్చెను. నేను గురువగు నాతని వచనములను శిరసావహించి రాత్రియందు భూమియందు నిలువక కాశ్యపునకు భూమిని సమర్పించితిని. నా కాలినడకను, బలమును నష్టముచేయకుము. నేను మనోజవమున మహేంద్రపర్వతమునకు బోయెదను. నేను తపస్సుచే లోకములను జయించితిని. నీవు ఆతపఃఫలమును కొట్టుము. నీ వీధనస్సును ఎక్కుపెట్టుటచే నిన్ను సురులకు ప్రభువునిగను, మధువ్రాసించిన విష్ణువునిగను తెలిసికొంటిని. నీకు శుభమగుగాక! ఈ దేవ... నిన్ను యుద్ధములో ద్వంద్వములేనివీరునిగను, గొప్పకార్యము చేయువానిగను కనుగొనుచున్నారు. నీవలన నేను పరాభవము నొందితిని. గనుక మఱినాకు లజ్జకలుగజేయకుండ నను గ్రహింపుము. ఈ బాణమును విడిచినతోడనే నేను మహేంద్రపర్వతమునకుబోయెదను." ఇట్లు పరశురాముడు పలుక రఘురాముడు శరము విడువ భార్గవరాముడు లోకములనన్నిటిని జయించిన తనతపోబలము నాశనమునొందుటను

---

అ. రా:—రాముడు వైష్ణవధనస్సున బాణము సంధించి 'దీనిని లోకములపై విడువవలయునా? లేక నీపాదములపై విడువవలయునా?' అని పరశురాముని నడిగెను. దానికాతడిట్లు వానిని ప్రార్థించెను. "రామా! నిన్ను నేను పరమేశ్వరునిగ తెలిసికొనుచున్నాను. నీవు పురాణపురుషుడవు; విష్ణుడవు; లోకములను బుట్టించి నశింపజేయువాడవు. నేను నాచిన్నతనమున తపస్సుచే విష్ణు నారాధనచేయుటకై చక్రతీర్థమునకు బోయి విష్ణునిగూర్చి ప్రతిదినము మఱిదేనియందు మనస్సులేనివాడనై తపస్సుచేయుచుంటిని. దానికి నారాయణుడు నాయందు ప్రసన్నుడై యిట్లు సెలవిచ్చెను. 'నీవు తపస్సును జాలిం

జూచి యాతనిగుర్తించి వానికి ప్రదక్షిణముచేసి మహేంద్రపర్వతమునకు శీఘ్రముగ పరుగెత్తెను. అన్నిదిక్కులను జీకటి వ్యాపించెను. దేవతలు, ఋషులు వైష్ణవధనస్సునుధరించిన రఘురాముని గొనియాడిరి. తరువాత నోతడు ధనస్సును వరుణునకిచ్చెను. రాముడు వసిష్ఠాదులకు నమస్కరించి చైతన్యములేని తనతండ్రిని జూచి

---

వుము. అది ఫలించినది. జ్ఞానస్వరూపుడనగు నాయంశమును నీవు పొంది హైహయవంశజుడగు కార్తవీర్యునిజంపుము. అతడు నీతండ్రిని జంపినందుకు నీవీతపస్సును చేయుచున్నావు. 21మారులు క్షత్రియులనందఱిని జంపి భూమిని కశ్యపునకిచ్చి శాంతినిబొందుము. త్రేతాయుగారంభమున నేను దశరథునకు పుత్రుడనైపుట్టి యుత్కృష్టమగు శక్తిగలవాడనై 'రాముడ'ను పేరునొందుదును. అప్పుడు నేను నిన్ను జూచినతక్షణమే నీకు నేను పూర్వమిచ్చిన తేజమును తీసికొనియెదను. అప్పుడు నీవు లోకములో తపస్సుచేయుచు బ్రహ్మదివస పరిమాణ పర్యంతము(2000యుగములు)నిలువుము.' ఇట్లు నారాయణుడు పలికి యదృశ్యుడయ్యెను. అట్లు నేనంతయు జరిపితిని. బ్రహ్మచే కోరబడిన విష్ణువగు నీవు రాముడవైపుట్టితివి. నాయందు నీవు నిలిపిన తేజమును తిరుగ నీవు తీసికొంటివి. ఇప్పుడు నాజన్మసఫలమైనది. బ్రహ్మాదులచే పొందనలవికానట్టియు, ప్రపంచాతీతుడవగునట్టియు నిన్ను తెలిసికొంటిని. నీవు మనుష్యరూపమును బొందితివనితలచెదను. నీయందజ్ఞానము వలనపుట్టు జననము మొదలగు 6 వికారములు (పుట్టుట, మనుట, వృద్ధిపొందుట, పరిణామము బొందుట, క్షీణించుట, నశించుట) లేవు. నీవు నిర్వికారుడవు. పూర్ణుడవు. చలనాదులు లేనివాడవు. జలమందు నురుగుండునటులను,నగ్నియందు పొగయుండునటులను మాయ నీయందుండి నిన్నాశ్రయముగజేసికొని నీసంబంధమైనదై కార్యములను పుట్టించును. లోకులను మాయ యావరించియుండునంతకాలము

"జామదగ్న్యుడు వెళ్లెనుగనుక మనము చతురంగబలములతో నయోధ్యకు మీయాజ్ఞానుసారముగ బోవచ్చు"నని పలుక నాతడు.

---

వారునిన్ను తెలిసికొనజాలరు. జ్ఞానముచే బోగొట్టబడు నీమాయ అనాది సిద్ధము. ఆవిద్యవలనకలిగిన దేహాదులయందు ప్రతిబింబముగానుండు పరమాత్మ (చిచ్ఛక్తి) 'జీవాత్మ'యని పేరొందును. జనుడు దేహము, మనస్సు, ప్రాణము, బుద్ధి మొదలగువానియందు అభిమానము కలిగి యుండునంతకాలము చేయుట, యనుభవించుట, సుఖదుఃఖములబొం దుట వానికి గలుగును. పరమాత్మ జ్ఞానస్వరూపుడుగాన అతడు మఱి యొకజ్ఞానమున కెప్పుడును నాశ్రయుడు కాడు. అందుచే జనన మరణ ప్రవాహరూపమగు సంసార మాతనికిలేదు. అవివేకముచే నీకిందిరెంటినికలిపి సంసారియై ప్రవర్తించును. అగ్నిసంపర్కమువలన జలమునకు వేడిమివలె జడమునకు (మాయకు) చిత్తు (జ్ఞానము)యొక్క సంపర్కమువలన చిత్త్వమును, చిత్తునకు జడసంపర్కమువలన జడత్వమును సంభవించును. మీపాదభక్తులతో కూడుటవలన గలుగు సౌఖ్యము నెఱుగనివారు సంసారదుఃఖములనుండి తొలగిపోరు. సత్పురుషసాంగత్యముచేపొందబడినభక్తిచే నిన్ను సేవించువానిని మాయ సూక్ష్మభావముపొంది మెల్లమెల్లగ విడిచిపెట్టును. నీజ్ఞానముతో గూడినవానికి మంచిగురువు దొరకును. అప్పుడు వాడు ఆగురువువలన జీవబ్రహ్మైక్యమును బోధించు 'తత్త్వమసి' మొదలగు వాక్యములచే జ్ఞానమును బడసి నీప్రసాదముచే సంసారవిముక్తుడగును. కనుక నీయందు భక్తిలేనివారికి ననేకజన్మలు కలిగినను ముక్తివిషయమైన యాలోచనయును, విజ్ఞానసంబంధమైన యాలోచనయును, సుఖమును గలుగవు. కనుక నాకు ప్రతిజన్మలోను నీపాదములందు భక్తియు, నీపాదభక్తులతో సంపర్కమును నుండుగాక! ఆరెండిటిచేత నవిద్య నశించును. అట్టివారు లోకములనన్నిటిని

గనబాహువులతో రాముని కౌగలించుకొని శిరము మూర్కొని మిక్కిలి సంతోషమునొంది తాను, రాముడును తిరుగజన్మించినట్లు తలంచి సేనకు నయోధ్యకు బోవ సెలవిచ్చెను.



## ౨౩ వ. అధ్యాయము.

## రామాదులు సీతాదులతో నయోధ్యలో సుఖముగనుండుట.



దశరథుడును, వానిపుత్త్రులును, కోడండ్రును నయోధ్య ప్రవేశించునపుడు అక్కడివారు ధ్వజస్తంభములను, జండాలను గట్టిరి. వాద్యములతో గొప్పశబ్దమును జేసిరి. రాజవీథుల నీళ్ళతో తడిపి

---

పవిత్రముచేయునప్పుడు వారికుటుంబమును గూర్చి వేఱుగ చెప్పనేల? జగన్నాథుడవును, భక్తిభావనుడవును, కరుణాసముద్రుడవును నగు నీకు నమస్కారము. దేవా! నేను లోకములనుజయించు నభిప్రాయముతో జేసినపుణ్యమంతయు నీబాణమునకు సమర్పణమగు గాక! రామా! నీకు నమస్కరించుచున్నాను." ఇట్లు పరశురాముడు భగవంతుడగు శ్రీరామునిగీర్తింప శ్రీరాముడు కరుణాసముద్రుడగుటచే మిక్కిలి దయగలవాడై యిట్లు పలికెను. "ఓబ్రహ్మజ్ఞానీ! నీయందు ప్రసన్నుడనైతిని. నీమనస్సులో నుండుదానినిచ్చెదను. అనుమానమువలదు." శ్రీరాముని యీమాటలువిని పరశురాముడు మిక్కిలిసంతోషించి 'రామా! నీకు నాయందనుగ్రహముకలదేని నీ భక్తులతో కూడికయును, నీపాదములందు దృఢమగుభక్తిని నాకిమ్ము' అనికోరెను. రాముడు దానినంగీకరింప పరశురాము డాతనికి ప్రదక్షిణముజేసి నమస్కరించి మహేంద్రపర్వతమునకు బోయెను.

పువ్వులను జల్లిరి. రాజు ప్రవేశించునపుడు పౌరులు మిక్కిలి సంతోష ముఖములతోనుండిరి. మంగళయాశీర్వాదముల బలికిరి. వారిని అనేక జనులు చూడవచ్చిరి. కొంతదూరము పౌరులును, బ్రాహ్మణులును ఎదురుగవెళ్ళి వారిని తీసికొనివచ్చిరి. దశరథుడు తనవారందఱితో కోరికల ననుభవించుచు సంతోషముతో నుండెను. కౌసల్యయు, సుమిత్రయు, కైకేయియు, నితరాజస్త్రీలును కోడండ్రను లోనికి దీసికొనిపోయి మంగళవాక్యములతో వారిని దీవించిరి. కోడండ్రు మంచి యంబరములను గట్టుకొని దేవగృహములను బూజించిరి. వారు పెద్దలకు నమస్కరించి తమభర్తలనుగూడి సంతోషముతో రహస్యముగ క్రీడించిరి. దశరథునిపుత్రులందఱు గొప్పపరాక్రమముకలిగినవారై తమభార్యలతో కాపురముచేయుచు శస్త్రవిద్యలను బాగుగనేర్చి ధనమును, స్నేహితులను గలిగియుండి యెల్లపుడు తండ్రికి శుశ్రూషచేయుచు సుఖముగనుండిరి. రాముడు సీతయందెల్లపుడు మనస్సుకలవాడై యామెతో * ననేకసంవత్సరములు సంతోషముగ కాపురముచేసెను. సీతను తనకు నామెతండ్రి వివాహముచేయుట చేతను, ఆమె రూపగుణములచేతను, ఆమెయందు రాముడు మిక్కిలి ప్రీతిగలిగియుండెను. ఆమెయు భర్తయందు నంతకంటె ద్విగుణమగు ననురాగము కలిగియుండెను. రాముడు సీతమనస్సులోనిమాటను గూడ దెలిసికొని యనుకూలముగ వర్తించుచుండెను. సీతయు రాముని

---

* అరణ్యకాండ 47వ. సర్గలో రాముడు సీతతో తన వివాహానంతరము కాపురముచేసి యరణ్యమునకు బయలుదేరెనని చెప్పబడినది. కాని బాలకాండ 77 వ. సర్గ 25 వ. శ్లోకములో బహుఋతువులని చెప్పబడినది. దీనికి 12 సంవత్సరములు సరియైనకాలముకాదు. రామునియాయుఃప్రమాణముగూర్చి 1వ. ప్రకరణము ౫వ. అధ్యాయమున చర్చించితిమి, బహుఋతువు అనుదానికి ననేకసంవత్సరము లని చరిత్రలో దెలుపుట యుక్తముగ నున్నది.

విషయమై యట్లే వర్తించుచుండెను. ఇట్లు వారు లక్ష్మీ విష్ణువులవలె సంతోషముతో కాలమును గడుపుచుండిరి.

---

## ౩౪ వ. అధ్యాయము.
## రామునకు భృగుశాపముకలదని దశరథుడెఱుగుట.

---

పూర్వము వసిష్ఠుని యాశ్రమమున నత్రికుమారుడగు దుర్వాసుడొక సంవత్సరము నివసించి యుండెను. అపుడు దశరథుడు తనపురోహితుడగువసిష్ఠుని జూడబోయెను. అంత సూర్యప్రకాశము గలదుర్వాసుడు వసిష్ఠునియెడమప్రక్కనుండెను. వారిరువురకు వినయముతో నారాజు నమస్కరింప వారతనిని నాశీర్వదించి యాసనమును, పాద్యమును, ఫలమూలములను వానికిచ్చిరి. వారుముగ్గురు సుఖముగకూర్చుండి మంచికథలను మధ్యాహ్నమువఱకు చెప్పుకొనిరి. తరువాత దశరథుడు దుర్వాసునకు చేతులుజోడించి "మహాత్మా! నావంశ మెంతయభివృద్ధినొందును? నారాముని కాయుఃప్రమాణ మెంతయుండును? మిగిలిననాపుత్రులకు ఎంత ఆయుః ప్రమాణముండును? రాముని కెందఱు పుత్రులు కలుగుదురు? వారికాయుఃప్రమాణ మెంత యుండును?" అని యడిగెను. అప్పుడు దుర్వాసుడు* "మహావిష్ణువు మనుష్యజన్మము నెత్తి, భార్యావియోగము నొందు" నని భృగువు విష్ణువునకు శాపమిచ్చెననియు, దానిని మహావిష్ణు వంగీకరించె ననియు, మహావిష్ణువే రాముడై జన్మించెననియు దశరథునకు దెల్పెను.

* ౮వ ప్రకరణము ౨వ అధ్యాయము. విష్ణువు భృగువువలన శాపము నొందుట జూడుము.

ఇంకను దుర్వాసుడిట్లు పలికెను. "రాముడు సీతను జన్మింప భృగు శాపఫలము వానికి కలుగును. అయోధ్యలో సీతను చాలకాలము రాజ్యముచేయును. అక్కడ నతనికి చాలకాలము భార్యావియోగముకలుగును. వానితమ్ములు సుఖముగను, వృద్ధిగను నుందురు. రాముడు 11 వేలసంవత్సరములు రాజ్యముచేసి మంచియశ్వమేధ యజ్ఞములను జేసి బ్రహ్మలోకమునకు బోవును. ...డనేకరాజవంశములను స్థాపించును. ఆతనికి సీతవలన నిద్దఱుపుత్రులు కలుగుదురు. మఱియొకతీరున జరుగదు. ఇది సత్యము. సీతాకుమారులను రాముడు పట్టాభిషిక్తులుగ జేయును." ఇట్లు దుర్వాసుడు పలికి దశరథవంశములో జరిగినవియును, జరుగబోవునవియును వానికిదెలిపి యూఱకుండెను. తరువాత దశరథుడు మునులిద్దఱికి నమస్కరించి తనపట్టణమునకు వెళ్ళెను. ఇది జరిగినపుడు సుమంత్రుడు ప్రక్కనుండెను. 'దీని నెవరికి దెలుపవలదని సుమంత్రునితో దశరథుడు చెప్పెను.



ఓమ్

రామచంద్రపరబ్రహ్మణే నమః

# విశోధిత రామాయణము.

## 7 వ. ప్రకరణము —

## రాముడు వనవాసమునకు బోవలసివచ్చుట.

### ౧ వ. అధ్యాయము. రాముని గుణములు.

మనుష్యునకు నాలుగు బాహువులుండినప్పుడు అనాల్గిటియందు వానికి సమానమగు ప్రీతి యుండునట్లు, దశరథునకు తననలుగురు పుత్రులందు సమానమగుప్రీతి యుండెను. రామునియందుమాత్రము కొంచెమెక్కువగ ననురాగముండెను. దేవాదులందఱిలో బ్రహ్మ విష్ణువునకు ప్రీతినొనర్చునటుల రాముడు తనతండ్రికి ప్రీతిని కలిగించు చుండెను. గర్వించిన రావణుని వధింపవలెనని దేవతలు విష్ణుని ప్రార్థింప నతడు మనుష్యలోకమున రాముడై జన్మించెను. దేవతల కోరికచే తను, నింద్రుని ప్రార్థనచేతను, జన్మించిన వామనునివలన నదితి శోభించినటుల రామునిజన్మముచే కౌసల్య ప్రకాశమునొందెను. రాముడు గొప్పసౌందర్యవంతుడును, నసూయలేనివాడును, వీరుడును, భూమియందు సాటిలేనిపుత్త్రుడును, గుణములలో దశరథునంతటివాడును, నెల్లప్పుడు శాంతస్వభావముకలవాడును, మృదువైన మాటల పలుకువాడును, ఇతరులు తనను కఠినమైనమాటల ననిన తిరిగి వారికి జవాబు చెప్పనివాడునునై యుండెను. ఎవడైనను తనకు నుప

కారము జేసిన మిక్కిలి సంతోషించును. అనేకులు తనకు నపకారము జేసినను జ్ఞానవంతుడగుటచే నతడు వానిని లెక్క చేయకుండెను. అస్త్రాభ్యాసము చేయని సమయములందు గుణ జ్ఞాన వయోవృద్ధులగు వారితోను, సజ్జనులతోను వేదాంతము మొదలగు విషయములను చర్చించుచుండెను. మంచి బుద్ధిమంతుడును, మధురములగు మాటలను పలుకువాడును, నితరులను ముందుగ పలుకరించువాడును, గొప్పవీర్యవంతుడును, గర్వము లేనివాడును, నబద్ధ మెన్నడును పలుకని వాడును, విద్వాంసుడును, వృద్ధులకు మిక్కిలి మర్యాద చేయువాడును, ప్రజలకు మిక్కిలియిష్టుడునైనయాతడు ప్రజలను రంజింప జేయుచుండెను. మరియు నతడు మిక్కిలి దయగలవాడును, బ్రాహ్మణుల కెక్కువ గౌరవము జరుపువాడును, దీనులయెడ మిక్కిలి దయగలవాడును, ధర్మము తెలిసినవాడునునై యాతడెల్లపుడు నియమముగలిగి శుచియై యుండెను. ఇక్ష్వాకువంశస్థుల సుగుణములుగలవాడును, తన క్షాత్రధర్మము నెక్కుడుగ దలచువాడును, తనకు తన గొప్పకీర్తివలన నధికమగు స్వర్గఫలము గలుగునని యాలోచించువాడును, శ్రేయస్సు గలిగింపని విషయములం దాసక్తి లేనివాడును, ధర్మ విరుద్ధములగు పనులయం దిష్టము లేనివాడును, ప్రశ్నోత్తరములను యుక్తిగ జెప్పుటలో బృహస్పతివలె మంచివాక్కు కలవాడును, ఆరోగ్యముకలవాడును, యౌవన పురుషుడును, మంచిశరీరముగలవాడును, నే దేశమున నే కాలమున నేమి జరుపవలెనో యెఱిగిన వాడును, లోకములో మనుష్యుల గుణములను పోల్చువాడును, సత్పురుషుడునునై తనకు తానే సాటిగనుండెను. ఆతడు గొప్పగుణములు గలవాడగుటచే ప్రజలకు బహిఃప్రాణమువలె నుండి వారికి ప్రియుడైయుండెను. లెస్సగ విద్యలను నభ్యసించినవాడును, సంగములతోగూడిన వేదములను గ్రమముగ దెలిసినవాడునునై యస్త్రశస్త్రములపరిశ్రమలో

దశరథునికంటె నెక్కువవాఁడుగ నుండెను. మంచివంశమున బుట్టిన వాఁడును, దైన్యములేనివాఁడును, సత్యవచనుఁడును, తిన్ననిమార్గము కలవాఁడును, ధర్మార్థముల నెఱిఁగిన వృద్ధబ్రాహ్మణులవలన బాగుగ నేర్పఁబడినవాఁడును, ధర్మకామార్థములనిజస్థితిని దెలిసినవాఁడును, మఱపులేనివాఁడును, ప్రజ్ఞావంతుఁడును, లోకవ్యవహారములను, ఏసమయమున నేదిజరుపవలయునో యట్టియాచారములను బాగుగస్థిరపఱచి నేర్పుగ జరుపువాఁడును, అణఁకువకలవాఁడును, గూఢమైన యభిప్రాయములుకలవాఁడును, తనయాలోచనను పైకివెల్లడిచేయక నిలుపగలశక్తిగలవాఁడును,తగినమంత్రులయు ఇతరులయు,సహాయము గలవాఁడును, వ్యర్థముగాని క్రోధసంతోషములుగలవాఁడును, సమయము నెఱిఁగి వస్తువులను సంగ్రహించుటయును, ఇచ్చుటయును, బాగుగదెలిసినవాఁడునునై యుండెను. స్థిరమైనభక్తికలవాఁడును, గొప్పప్రజ్ఞకలవాఁడును, దుష్టులసహవాసములేనివాఁడును, చెడుపలుకులు పలుకనివాఁడును, శాస్త్రపరిశీలనలో నాలస్యరహితుఁడును, జాగ్రత్తకలవాఁడును, తనయొక్కలోపమును, పరులలోపమును నెఱిఁగినవాఁడును, శాస్త్రజ్ఞుఁడును, కృతజ్ఞుఁడును, పురుషులతారతమ్యము నెఱిఁగినవాఁడును, పురుషుని స్నేహితునిగ గ్రహించి వానియందు దనుగ్రహముజూపుటలో న్యాయక్రమము నెఱిఁగినవాఁడును, శత్రునిగ్రహము, మిత్రపరిగ్రహము బాగుగ తెలిసినవాఁడునునై యుండెను. ప్రజలను కష్టపెట్టకుండ నుపాయముచే ధనమునార్జించుటయు, న్యాయముగ దానిని వ్యయముచేయుటయు నసనికి బాగుగ దెలిసి యుండెను. అతనికి వేదాంతము మొదలగు శాస్త్రములన్నియును, కావ్యనాటకాలంకారాదులన్నియును బాగుగ దెలిసియుండెను. అతఁడు ధర్మార్థములను ...పి సుఖమునుబొందెను. వినోదమున కనుకూలములగుపనులను,సంగీతము మొదలగు విద్యలను,శిల్పసంబంధమైన పనులను

బాగుగ గ్రహించువాడును, ఏనుగులమీదను, గుఱ్ఱములమీదను స్వారిచేయుటలో గట్టివాడును, ధనుర్విద్యలో శ్రేష్ఠుడును, లోకమున 'అతిరథు'డను పేరుపొందినవాడును, శత్రువున కభిముఖముగ బోయి వానిని కొట్టువాడును, సేనను నడపుటలో కుశలుడును, యుద్ధములలో నుద్రేకమునుపొందిన తాను సురాసురులకైన నజేయుడును నై యుండెను. రాముడు క్రోధమును జయించినవాడును, మాత్సర్యము, గర్వము లేనివాడును, జీవుల నవమానింపనివాడును, కాలలక్షణములకు లోబడక వర్తించువాడును నింకను నితరములగు మంచిగుణము లన్నియు గలవాడును, మూడులోకములకు నిష్టమైనవాడును నైయుండెను. అత డోర్పు మొదలగు గుణములలో భూమితోను, బుద్ధిలో బృహస్పతితోను, పరాక్రమమున నిందృయములతోను సమానుడై ప్రజలకు సంతోషముకలిగించుగుణములచే సూర్యునివలె ప్రకాశించెను. అతడు ఇక్ష్వాకువంశపురాజులలో మిక్కిలిగొప్పవాడు. ప్రజలకు సుఖముకల్గించుటలో చంద్రునివంటివాడు; సత్యప్రతిజ్ఞకలవాడు; స్థిరచిత్తుడు. అతడు దేవాసురమనుష్యులలో నస్త్రములు బాగుగ దెలిసినవాడు. ఇతరస్థలములనుండి అయోధ్యకు ప్రజలు వచ్చినపుడు రాముడు వారి కుశలమెప్పుడును కనుగొనుచుండెను. ప్రజలుదుఃఖము పొందినపుడు వారితోదుఃఖించుచు సంతోషముపొందినపుడు వారితో సంతోషించుచునుండెను. అతడు లోకములో నాలుగు వర్ణములను నిలిపెను.

---

## ౨వ. అధ్యాయము.

## రాముని పట్టాభిషేక ప్రయత్నములు.

దశరథునిపుత్రులు తమ వివాహానంతరము చాలసంవత్సరములు సుఖముగ గడపినతర్వాత భరతుని మేనమామయగు యుధాజిత్తు భరతుని తనయింటికి తీసికొనివెళ్ళుటకు నయోధ్యకు వచ్చియుండెను. దశరథుడు భరతునితో 'నీవు నీమేనమామతో వెళ్లు' మని చెప్పెను. అప్పుడు భరతశత్రుఘ్నులు తండ్రికి, తమతల్లులకు, రామునికి నమస్కరించి బయలుదేఱి వెళ్ళిరి. రామలక్ష్మణులు తమ తండ్రిని పూజించుచు నాతనియాజ్ఞ ప్రకారము పట్టణకార్యములన్నియు జరుపుచుండిరి. రాముడు సంతోషజనకమైన మంచికార్యములను జరుపుచు తనతల్లులకార్యములను, గురువులకార్యములనుగూడ మిక్కిలి శ్రద్ధతో చేయుచుండెను. అతనినిగూర్చి దశరథుడును, బ్రాహ్మణులును, వణిజులును, దేశములోనుండు వందఱును మిక్కిలి సంతోషించిరి. దేవతలకు బ్రహ్మవలెనే, లోకులందఱకు సత్యపరాక్రముడగు రాముడు తన గొప్పగుణములచే ప్రీతి గలవాడయ్యెను. భరతశత్రుఘ్నులు భరతుని మేనమామయింట సుఖముగనుండిరి. ఐనను వారు తమతండ్రిని తలచుచుండిరి. అతడుగూడ వారినిగూర్చి పలువరించుచుండెను. గొప్పనియమములుగల వాడును, నజేయమగు పరాక్రమముగలవాడును, లోకపాలురతో సమానుడునునగు రాముని ప్రజలు రాజుగా గోరిరి. వృద్ధుడును చిరకాలజీవియునగు దశరథుడు తాను జీవించియుండ సకలసుగుణాఢ్యుడగు తనపుత్రుడు రాముడు రాజెట్లగునో వానికెట్లు తాను పట్టాభిషేకముచేయునో వాడు రాజ్యముచేయుచుండ తానెట్లు స్వర్గముపొందునో యని యాలోచించెను. వానిమనస్సులో సంతోషమగు నాతలంపు గలుగ నాతడు

దానిని నిశ్చయించి తనమంత్రులతో రాముని యువరాజును జేయుటకు సలహాచేసి భూమ్యాకాశములకంపముతో సమానముగు తన భయమును, మనోవిచారమును లోకమునకు వ్యక్తపఱచి జనులకును, ప్రజలకును, శ్రేయస్సు, ప్రీతియు గలుగునటుల నభిషేకకాలమున కన్నియు సమకూర్చెను. తరువాత నాతడు సమస్తపట్టణవాసులను, దేశవాసులను, భూప్రదేశమునుండి ముఖ్యరాజుల నందఱిని రప్పించెను. కేకయరాజును, జనకుని నభిషేకకాలము తొందరయగుటచే రప్పింపలేదు. తరువాత వెనుకనుండి వారు రామాభిషేకము విని సంతోషించెదరుగాక యని వారికి కబురుపంపలేదు. రామాభిషేకమునకై వచ్చిన రాజులకు తగినబస లిప్పించి, యాభరణములు మొదలగువానిచే వారికి మర్యాదసలిపి తరువాత వారిని జూచెను. దశరథుడు సభయందాసీనుడైయుండ మిగిలినరాజులు తమతమ యాసనముల గూర్చుండిరి. రాజసభలో పట్టణ దేశనివాసులుగూడ చేరియుండ నాతడు దేవతలతోనుండు ఇంద్రునివలె ప్రకాశించుచు సభవైపునకు ముఖముత్రిప్పి వారితో సంతోషజనకమును, హితమునునగు మాటలను మంచికంఠమున నిట్లుపలికెను. "నాపూర్వులును, నేనును ప్రజలను పుత్రులవలె బాలించినసంగతి మీకందఱకు దెలిసినదే. ఇక్ష్వాకురాజులచే బాగుగపరిపాలింపబడిన యీజగత్తునకు నికముందుగూడ శ్రేయస్సు గలుగవలె నని కోరుచున్నాను. నాపూర్వులాచరించినవిధమున జాగరూకతతో ప్రజలను రక్షించితిని. గొప్పరాజ్యభారమును వహించి యీలోకము నంతటిని న్యాయముగ బాలించి వృద్ధుడనైతిని. అనేకవేలసంవత్సరములు జీవించి ముసలితనమునొందిన నేను విశ్రాంతిని గోరెదను. ఇక్కడనుండు ద్విజశ్రేష్ఠులసలహాపైని నాకుమారుని ప్రజలకు హితమగునటుల రాజ్యమున నిలుపగోరెదను. నాజ్యేష్ఠకుమారుడగు

రాముడు గుణములలో నన్ననుకరించుచు జన్మించెను. వీడు పరాక్రమమున నింద్రతుల్యుడును, శత్రుక్షయముకలవాడును, పుష్యమితో గూడినచంద్రునివలె ప్రకాశించువాడును, ధార్మికపురుషశ్రేష్ఠుడునై యుండెను. ఈతనిని సంతోషముతో యువరాజుగ జేయగోరుచున్నాను. లక్ష్మీవంతుడును, మంచిగుణములు కలవాడునునగు రాముడు లోకమునకు రాజుగ నుండతగినవాడు. మూడులోకములలోను నతనికంటె మంచియోగ్యతగలరాజు దొరకడు. ఈదినమున నాదేశమును నా కుమారున కప్పజెప్పి విచారమునుండి తొలగెదను. నేను బాగుగ నాలోచించిచెప్పిన యంశములు అనుకూలముగ నున్నయెడల మీరు దానినంగీకరించి నాకు సెలవిండు. లేనియెడల నేనేమి చేయవలెనో చెప్పుడు. నాకిష్టముగనున్న యీ విషయమేగాక మఱియొకటిమీకు తోచినయెడల దానిని సహేతుకముగజెప్పుడు.” ఈతీరున దశరథుడుపలుక నక్కడిరాజులందఱుమిక్కిలిసంతోషించి కలకలముచేసిరి. అక్కడనుండుప్రజలందఱియొక్క సంతోషజనకమగు నాదము సభామండపమును గదల్చినట్లాయెను. దశరథుని ధర్మార్థసహితమగు మనోభిప్రాయమంతయు పౌరులును, దేశస్థులును, రాజులును, బ్రాహ్మణులును బాగుగ దెలిసికొని వారందఱుకలిసి యాలోచించి యేకగ్రీవముగా నాతనితో నిట్లు పల్కిరి. “మీరు కొన్నివేలసంవత్సరములు గడచినతరువాత వృద్ధులయిరి. రాముని యువరాజుగనభిషేకముచేయుడు. దీర్ఘబాహుడును,మహాబలుడునునగు రఘుశ్రేష్ఠుడుగొప్ప యేనుగు నెక్కి రాజఛత్రమును బొందవానిని మేముచూడగోరెదము.” ఇట్లు వారు వారిమనస్సులకు నిష్ఠములగుమాటలను పలుక దశరథుడు దాని నెఱుగనివానివలెనటించి వారితోనిట్లు పలికెను. “నామాటలు వినినవెంటనే మీరు రాముని రాజుగ గోరిరి. నాకీసంశయమును బాపుడు. నేను ధర్మమార్గమున భూమిని బరిపాలించుచుండ మీ రేల

నాకుమారుని యువరాజుగ గోరెదరు?" అని దశరథుడడుగ వారు "మీపుత్రునిసుగుణము లనేకములు; వానిని దెలిపెద" మని పలికి రాముని గుణములనన్నిటిని వర్ణించి యింకను వారిట్లు మనవిచేసిరి. "దేవా సురమనుష్యులును, గంధర్వులును, నాగులును, రాష్ట్రమున పట్టణమున, నంతఃపురమున, సకలస్థలములనుండుజనులును రాముని బలమును, నారోగ్యమును, నాయువును గోరుచున్నారు. స్త్రీలును,

---

అ. రా:— రాముని యువరాజుగ పట్టాభిషేకము చేయుటకు దశరథునిచే నిశ్చయింపబడినదినమున రాముడు అన్ని యాభరణములను ధరించి నారదుడు వచ్చుననుసంగతి తెలియక సింహాసనమున గూర్చునియుండ సీత వింజామరతో వానికి వీచుచుండ నారదుడు ఆతనిని జూడవచ్చెను. అప్పుడతడు లేచి ప్రీతితో చేతులు జోడించెను. సీతారాములు భక్తితో నాతనికి నమస్కరించిరి. రాముడు గొప్పప్రీతితో నారదునితో నిట్లనెను. "మునిశ్రేష్ఠా! యెల్లపుడు ఇంద్రియవిషయములందాసక్తిగల మావంటిసంసారులకు మీ దర్శనము దుర్లభము. పూర్వజన్మములో జేసిన గొప్పపుణ్యములచే మావంటిసంసారులకుగూడ సత్పురుషులతో సమాగమము కలుగును. కనుక మీదర్శనముచే కృతార్థుడనైతిని. మీకు నేను చేయవలసిన కార్యమేదియో దెల్పుడు. దానిని జేసెదను." ఇట్లు రాముడు పలుక నామునిప్రవరుడు యాతనితో నిట్లనెను. "లోకమునను సరించి పలుకుమాటలచే నన్నేల భ్రమపెట్టెదవు. 'నేను సంసారినని నీవు పలికినమాట సత్యమే. జగత్తులో మొదటపుట్టినమాయ నీభార్య. నీతో నామె కలియుటచే నామెయందు బ్రహ్మాదిప్రజలు పుట్టుచుందురు. నీయాజ్ఞచే సత్త్వరజస్తమోగుణములుగలమాయ యెల్లపుడు వెలుగుచుండును. తెలుపు, ఎఱుపు, నలుపు రంగుగల (సత్త్వరజస్తమోగుణములుగల) ప్రజ లామెవలన బుట్టుదురు. మూడులోకములనెడు గొప్ప యింటియందు నీవు గృహస్థుడవని చెప్పబడినావు.

పురుషులును, వృద్ధులునుప్రతిదినము ఉదయము, సాయంకాలము రామునిసుఖముకొఱకు దేవతలను వేడుచుందురు. వారికోరికను మీరు దయకలవారై నెఱవేర్చెదరుగాక! విష్ణుతుల్యుడును, సర్వలోకములకు మేలుచేయ నడుకట్టినవాడునునగు రాముని యువరా

నీవు మహావిష్ణుడవు. సీత లక్ష్మి. } ఇట్లు పురుషరూపము
నీవు శివుడవు. సీత పార్వతి. } లన్నియు నీవు. స్త్రీ రూపము
నీవు బ్రహ్మవు. సీత సరస్వతి. } లన్నియు సీత. గనుక మూడులోకములలో మీరిరువురు తప్ప నితరులు లేరు. నీయాభాసము (లేనివస్తువున్నట్లుతలచుట.) వలన పుట్టిన యజ్ఞానము 'అవ్యాకృత' మనబడును. దానికి గొప్పనాధారభూతమైన దేదియన 'నన్నిటిచేరికగల 'లింగ' మనునదియే. అహంకారము, బుద్ధి, ప్రాణ అపాన సమాన ఉదాన వ్యానములను 5 ప్రాణములును, 'ఘ్రాణ చక్షుః శ్రోత్ర జిహ్వా త్వక్కు' లను 5 ఇంద్రియములును, జన్మ మృత్యు సుఖాదులుగల లింగ మన బడును. దానినే జగత్తంతయు నిండియుండు జీవు డందురు. మాయకు 'అవాచ్యము, అనాది, అవిద్య, కారణోపాధి' అనుపేళ్లు కలవు. చిత్తునకు 'స్థూలము, సూక్ష్మము, కారణము' అని 3 ఉపాధులు (దేహములు) కలవు. వీనితో కూడినది 'జీవాత్మ' యనియు, వీనివలన విడువబడినది 'పరమాత్మ' యనియు పలుకుదురు. 'జాగ్రత్తు' స్వప్నము, సుషుప్తి' యనునవస్థలతో సంసారము ప్రవర్తించుచున్నది. ఆసంసారముకంటె విలక్షణుడును, జ్ఞానస్వరూపుడునునగు నీవే సాక్షిభూతుడవు. నీవలననే లోకములుసృజింపబడి నీయందేనిలిచి నీయందే నాశమును బొందును. కనుక నీవన్నిటికి కారణము. త్రాడును జూచి పామనుకొనుటచే భయముకలుగునటుల పరమాత్మను జీవాత్మగ భావించుటచే భయము కలుగుచుండును. 'నేనే పరమాత్మ' నని తెలియబడునపుడు భయదుఃఖములు పోవును. చిన్మాత్రుడవగు నీవు

జుగ పట్టాభిషేకముచేయుడు." ఇట్లు ప్రజలందఱు చేతులను జోడించి విన్నవింప నతడు "మీరు నా జ్యేష్ఠపుత్రుడగు రాముని యువరాజుగ గోరుచున్నారు. నా ప్రభావము గొప్పది. నేను మిక్కిలి సంతోషించితి" నని బ్రాహ్మణులయెదుట పలికెను. వారు వినుచుండ నతడు వసిష్ఠ వామదేవులకు "ఇది చైత్రమాసము. పుణ్యమును, శ్రీమంతమునైనది. వనములు పుష్పించును. రాముని యౌవరాజ్యము వివయమై యంతయును సమకూర్పు" డని సెలవీయ జనులసంతోషకలకల మెక్కువగ నయ్యెను. జనులకలకలము తగ్గినతరువాత దశరథుడు

---

అన్ని దేహములందుండి సర్వబుద్ధులను ప్రకాశింపజేయుదువు. అందుచే నన్ని దేహములందు వెలుగు నాత్మ నీవే. అజ్ఞానముచే త్రాడునందు పాము నారోపించునట్లు నీయందు జగత్తు నారోపింతురు. త్రాడుస్వరూపమును దెలిసికొనుటచే సర్పమునివర్తించునటుల నీస్వరూపమును దెలిసికొనుటచేజగత్తంతయునివర్తించును. కనుకజనుడు జ్ఞానము నెల్లపుడును నభ్యసింపవలెను. నీపాదభక్తిగలవారికి క్రమముగ విజ్ఞానముకలుగును. కనుక వారేముక్తిబొందతగినవారు. నేనునీభక్తులయొక్క భక్తులకును, వారి భక్తులకును సేవకుడను. కావున నన్ను భ్రమింపజేయక ననుగ్రహింపుము. నీనాభికమలమందు నాతండ్రియగు బ్రహ్మ జన్మించెను. కనుక నేను నీకు మనుమడను. రామా! భక్తుడనగు నన్నురక్షింపుము." ఇట్లు నారదుడు రాముని ప్రార్థించి యనేకపర్యాయములు నమస్కరించి యానందబాష్పజలముచే దనశరీరమును దడుపుకొనుచు బ్రహ్మ పలికినపలుకులను రామున కిట్లు దెలిపెను. "రామా! నీవు రావణుని వధకై పుట్టితివి. ఇప్పుడు నీతండ్రి నిన్ను రాజ్యాభిషిక్తునిగజేయ సిద్ధముగనున్నాడు. అట్లు జరిగినయెడల నీవు రావణుని జంపవు. 'నేను భూభారము తొలగింతు'నని నీవు ప్రతిజ్ఞచేసియుంటివి. దానినంతయు జరుపుము. సత్యమును బరిపాలింపుము." ఇట్లు నారదుడు

వసిష్ఠునితో మెల్లగ నిట్లనెను. 'రామునియభిషేకమునుగూర్చి సమకూర్చవలసిన సామగ్రిని, చేయవలసినపనులను ఈదినముననే యాజ్ఞాపింపుడు' అనిపలుక కులగురు వామాటలను విని రాజు దగ్గఱనుండగనే యాతనికర్మచారుల కిట్లాజ్ఞాపించెను. "మీరు బంగారమును, రత్నములను, పూజాద్రవ్యములను, నవధాన్యములను, తెల్లనిమాల్యములను, పేలాలను, తేనెను, నేతిని, క్రొత్తబట్టలను, రథమును, ఆయుధములను, చతురంగబలమును, మంచిలక్షణములుగల యేనుగులను, రెండు తెల్లని చామరములను, ధ్వజమును, తెల్లనిఛత్రమును, అన్నిరంగులుగల నూఱుబంగారుబిందెలను, అన్నియవయవములు, బంగారుతొడుగుగలకొమ్ములుగల యెద్దును, పులిచర్మమును జాగ్రత్తపఱుపుడు." ఇంకను వసిష్ఠవామదేవు లిట్లు వారికి సెలవిచ్చిరి. "ఇవన్నియుగాక నింకను కావలసినయితరవస్తువులను దశరథునియగ్నిగృహమునొద్ద రేపు తెల్లవాఱుజామునకు సమకూర్పవలెను. అంతఃపురద్వారములను, నగరములోనుండు సన్నిద్వారములను చందనముతోను, పూవులదండలతోను, మంచిసువాసనగల ధూపములతోనునలంకరింపవలెను.

---

పలుక రాముడు నవ్వి యిట్లనెను. "నారదా! వినుము. నాకు తెలియనివిషయ మెక్కడను కొంచెమైనను లేదు. పూర్వము నేను ప్రతిజ్ఞచేసినదానిని తప్పక చేసెదను. కాలముననుసరించి ప్రాదుర్భావము పూర్తికాగా భూభారమగు రాక్షసుల నందఱిని క్రమముగ జంపెదను. రావణునినాశనమునకై రేపు దండకావనమునకు బోయి యక్కడ మునివేషమున 14 సంవత్సరములుండి 'సీత'యను మిషచే నాదుష్టుని, వానికులమును నాశనము చేసెదను." ఇట్లు రాముడు పలుక నారదుడు గొప్పసంతోషమునొంది యతనికి ప్రదక్షిణముచేసి దండప్రణామము లాచరించి యాతనివద్ద సెలవుపుచ్చుకొని స్వర్గమునకు బోయెను.

లక్షమందిద్విజులకు పాలు, పెరుగుతోఁగూడిన యన్నమును వారు కోరినటులను, సరిపోవునటులను పెట్టవలెను. రేపటియుదయమున బ్రాహ్మణులకు తగినమర్యాదలను జరిపి నేయి, పెరుగు, పేలాలు మొదలగు వానిని, మంచిదక్షిణలను నియ్యవలెను. సూర్యోదయమగుసరికి బ్రాహ్మణులను బిలిపించి వారిని తగినయాసనములమీఁద కూర్చుండజేసి వారిచే స్వస్తివాచకములను జదివింపవలెను. నగరములో పతాకములను గట్టవలెను. రాజమార్గమును నీటితో దడుపవలెను. నర్తకులును, నటకులును, బాగుగ నలంకరించుకొనిన వేశ్యస్త్రీలును రాజనగరుయొక్క రెండవవాకిలిద్వారమున నుండవలెను. దేవాలయములందును, చతుష్పథగృహములందును నన్నమును, భక్ష్యములను, దక్షిణలను, మంచిమాల్యములను వేఱువేఱుగ నుంచవలెను. రాజభటులందఱు మంచిబట్టలను కట్టుకొని పెద్దకత్తులను బట్టి రాజాంగణమున నుత్సవము జేయుటకై సిద్ధముగ నుండవలెను." ఈతీరున వసిష్ఠవాముదేవు లందఱికి నన్నిటిని జాగ్రత్తతో నాజ్ఞాపించి మిగిలినకార్యములను వారు చేసి దశరథునకు వానిని దెలిపి సంతోషముగనుండిరి. అంతట దశరథుఁడు సుమంత్రుని బిలిచి 'నీవు పోయి శీఘ్రముగ రాముని దీసికొనిరమ్ము' అని వానినాజ్ఞాపింప నతఁడు 'అట్లే' యని వెళ్ళి యాతనిని రథముపై తీసికొనివచ్చెను. అంతట నా రాజసభలో నాలుగుదిక్కులందునుండు దేశములరాజులును, ఆర్యులగు రాజులును (వర్ణాశ్రమధర్మములు గలవారు), మ్లేచ్ఛరాజులును (వర్ణాశ్రమధర్మములు లేనివారు), పర్వతవాసులును, నితరులును దేవత లింద్రుని గొలుచునటుల దశరథుని సేవించుచుండిరి. దశరథ మహారాజు తనమేడయందున్నసభలోనుండి రథమునవచ్చు రాముని గనెను. ఆతఁడు గంధర్వరాజువలె సౌందర్యవంతుఁడును, లోకమున విఖ్యాతపౌరుషముగలవాఁడును, దీర్ఘబాహుఁడును, మదించిన యేనుఁగు

నడకవంటి నడకగలవాడును, చంద్రునివలె నాహ్లాదకరమగు మోము గలవాడును, మిక్కిలిప్రియదర్శనుడును, రూపౌదార్యగుణములచే పురుషులనుగూడ భ్రమింపజేయువాడును, వేడివలన తాపముగలిగిన ప్రజలకు వర్షదేవతవలె సంతోషముకలిగించువాడును నైయుండెను. దశరథుడు తనయుని జూచి తృప్తిని పొందలేకపోయెను. సుమంత్రు డాతనిని రథమునుండి దింపెను. అతడు తండ్రియొద్దకు వెళ్లుచుండ సుమంత్రుడు చేతులుజోడించుకొని వానిని వెంబడించెను. తరువాత రాముడు మేడమీదనుండు తనతండ్రిసభకు సూతునితో బోయెను. అతడు తనతండ్రికి దోసిలిడి వినయముతో తనపేరు చెప్పుకొనుచు వానిపాదములకు నమస్కరించెను. దశరథు డాతని చేతులను పట్టుకొని కౌగిలించి బంగారుతోను, మణులతోను ప్రకాశించు నెత్తైనయాసనమున నాతనిని కూర్చుండ నియమించెను. రాము డట్లు కూర్చుండి మేరుపర్వతమున నుదయించు సూర్యునివలె నుండెను. ఆసభలో నతడు స్వచ్ఛమగు గ్రహనక్షత్రములమధ్య నుండు శరత్కాలచంద్రునివలె ప్రకాశించెను. ఆకుమారుని తండ్రి జూచి తనవలెనున్నాడని సంతోషించి యాతనితో నిట్లనెను. “నాకను కూలముగనుండు నాజ్యేష్ఠభార్యయందు నాతో సమానుడవగు నీవు జన్మించితివి. మంచిగుణములచే నీవు నాకు ప్రియముచేయువాడవైతివి. నీగుణములచే నీప్రజలు సంతోషించుటవలన నీవు పుష్యమీనక్షత్రమున యౌవరాజ్యమును బొందెదవు. సహజముగ నీవు మిక్కిలి గుణవంతుడవు. అణకువగలవాడవు. అయినను నీయందలి స్నేహముచే నీమంచికొఱకుకొన్ని సంగతులను దెయలిజేయుచున్నాను. వినుము. ఎల్లపుడును వినయముగలిగి జితేంద్రియుడవు కమ్ము. కామ క్రోధములవలనబుట్టు వ్యసనములను విడువుము. అమాత్యాదుల వలన నీవు ప్రత్యక్షవ్యవహారము జరుపునటుల చారులవలనగూడ

నీవు సమాచారములను దెలిసికొని వ్యవహరింపుము. అమాత్యాదులను, పరిజనలనందఱిని సంతోషపఱుపుము. ధనాదులుండుస్థలములను, నాయుధగృహములను నిండుగ నుంచుము. ప్రజలు సంతోషించునటుల భూమిని బాలించు రాజునుగూర్చి మిత్రులు అమృతము దొరకిన దేవతలవలె సంతోషింతురు. కనుక నీవు నియమములు గలిగి వర్తింపుము." ఈతీరున దశరథుడు రామునితో జెప్పుచుండ రాముని స్నేహితులు తత్క్షణమే కౌసల్యయొద్దకు బోయి యీసంగతుల నామెకు దెలిపిరి. అంతట నామె సంతోషముతో వారికి బంగారమును, గోవులను, ననేకవిధములైనరత్నములను నిచ్చెను. ఆమె రామునిపట్టాభిషేకవిషయములను తనస్నేహితురాండ్రకు దెలిపెను. రాముడు తన తండ్రికి నమస్కరించి రథమెక్కి పరిజనులు ప్రశంసించుచుండ తన నివాసగృహమునకు వెళ్ళెను. పౌరు లీమాటలను విని తమయభీష్టలాభమును బొంది దశరథునివద్ద సెలవుపుచ్చుకొని తమయిండ్లకు బోయి దేవతలను తమయభీష్టసిద్ధికొఱకు పూజించిరి. పిదప రాజు తనమంత్రులతో నాలోచించి 'రేపటిదినమున రామునికి యౌవరాజ్యాభిషేకము చేసెద'నని నిశ్చయించెను.

తరువాత దశరథుడు తన రాజభవనములోనున్న లోపలిగృహమునకు బోయెను. పిమ్మట నాతడు సూతునిబిలిచి వానితో 'రాముని తిరుగ నిక్కడకు దీసికొనిరమ్ము' అనిచెప్పెను. అట్లు సూతుడు బయలుదేఱి యాతనిగృహమునకు బోయి యక్కడనుండు ద్వారపాలకులతో జెప్ప వారు లోనికి బోయి రామునితో జెప్పిరి. అప్పుడతడు సూతుని రాకకు శంకించి వానినిలోనికి తొందరగ రప్పించియతడు వచ్చినకార్యమంతయు నడిగెను. అప్పుడు సూతుడు రామునితో 'నిన్ను దశరథుడు చూడగోరుచున్నాడు. కావున నీవువచ్చుటకుగాని, మఱియేవిషయమునకుగాని యాలోచింపకుము.' అనిచెప్ప నాతడు శీఘ్రముగ బయలు

దేటి సూతునితో రాజనగరు చేరెను. దశరథుడు వానిని లోనికి రమ్మన నతడు లోనికివచ్చి తనతండ్రికి నమస్కరించి కృతాంజలియై యుండెను. తండ్రి తనకు నమస్కరించిన కుమారుని లేవనెత్తి కౌగలించుకొని మంచియాసనమున కూర్చుండబెట్టి వానితో నిట్లనెను. "నేను చాలకాలము కావలసినభోగముల ననుభవించి ముసలివాడ నైతిని. అన్నదానమును, మంచిదక్షిణలతో నూఱు యజ్ఞములను జేసితిని. ఇంకను నాయిష్టమువచ్చిన దానములను, వేదాధ్యయనమును జేసితిని. నాకోరికప్రకారము అనుకూలుడవైన నిన్ను పుత్రునిగ గంటిని. దేవ పితృ బ్రాహ్మణుల ఋణములను దీర్చి భోగముల ననుభవించి నాఋణమునుగూడ దీర్చుకొంటిని. వీరుల సౌఖ్య మనుభవించితిని. నీయభిషేకముదప్ప నేను చేయవలసినదేదియు నికలేదు. కనుక నేను జెప్పినది చేయుము. ఈదినమున ప్రజలందఱు నిన్ను రాజుగ గోరుటచే నిన్ను యువరాజుగ నభిషేకము జేయుదును. ఈ దినమున నేను స్వప్నములో భయంకరములగు నశుభముల జూచితిని. నాకాశమునుండి చుక్కలు పిడుగులతోను, గొప్పశబ్దముతోను రాలినవి. నాజన్మనక్షత్రము సూర్య అంగారక రాహువులచేతను క్రూరగ్రహములచేతను గప్పబడినది. ఇట్టి దుశ్శకునములు గలిగిన బహుశః రాజునకు మృత్యువుగాని, గొప్పయాపదగాని వచ్చునని జ్యోతిష్కులు పలుకుదురు. మనుష్యులమనస్సు చంచలముగనుక నామతి చెడిపోవకమునుపే నభిషిక్తుడవు కమ్ము. ఈదినమున పునర్వసూనక్షత్రమున చంద్రుడున్నాడు. రేపు పుష్యమీనక్షత్రమున నభిషేకము నిర్ణయమని జ్యోతిష్కులు పలికిరి. కనుక నప్పుడభిషేకము చేయుటకు నామనస్సు తొందరపడుచున్నది. అలాగు చేసెదను; గనుక నీరాత్రిమొదలు నియమముతో నీవు నీభార్యతో నుపవాసము జేసి దర్భలపై శయనింపుము. నీస్నేహితులు ఈరాత్రింతయు జాగరూక

తగ నిన్ను రక్షింపవలెను. ఇట్టి మంచియభిషేకకార్యములకు ననేక విఘ్నములు కలుగుచుండును. భరతు డిప్పు డయోధ్యను విడిచి యున్నాడు. వాడు మనపట్టణమునకు రాకపూర్వమే నీ వభిషిక్తుడవు కావలెనని నాయభిప్రాయము. నీతమ్ముడగు భరతుడు నీవిషయమై సద్వృత్తిగలవాడు; పెద్దయన్నననుసరించి తిరుగువాడు; ధర్మాత్ముడు; దయగలవాడు; జితేంద్రియుడు. మనుష్యులు సత్పురుషులును, ధర్మపరులును నయినను వారిచిత్తములు మితిభేదముచేయువారిచే మాఱి యొక్కతీరున నుండవని నాయభిప్రాయము." ఈతీరున దశరథుడు పలుక రాముడు అందుల కంగీకరించి తండ్రికి నమస్కరించి రాజభవనమును విడిచి స్వగృహమునకు వెడలెను. వెంటనే యత డక్కడనుండి తనతల్లియింటికి వెళ్ళెను. అప్పుడు కౌసల్య మంచిబట్టలుకట్టుకొని దేవగృహమున జనార్దనునియందు మనస్సిడి మౌనముగ రామునికి సిరి గోరుచుండెను. రాముని యభిషేకముసంగతి సుమిత్రయు, లక్ష్మణుడును విని కౌసల్యతో జెప్పుటకు నచ్చటికి వచ్చియుండిరి. వారు సీతను అక్కడకు రప్పించిరి. కౌసల్య ప్రాణాయామముతో జనార్దనుని ధ్యానించుచుండ నామెకు సుమిత్రయు, సీతయు, లక్ష్మణుడును రాముని యభిషేకము సంగతి తెలియబఱుప నామె కన్నుల దెఱచెను. రాము డప్పుడు ఆమెయొద్దకు బోయి నమస్కరించి సంతోషముతో "అమ్మా! తండ్రి నన్ను ప్రజాపరిపాలనకర్మకు నియమించెను. నాతండ్రియనుజ్ఞప్రకారము రేపు నాకభిషేక మగును. ఈరాత్రి సీతతో నేను ఉపవాసము చేసెదను. తండ్రియు, ఋత్విజులును, నుపాధ్యాయులును నా కిట్లు నియమించిరి. రేపటియభిషేకమునకై నాకును, సీతకును నీ వేమి మంగళకార్యములను జేయవలెనో వాని నిప్పుడే చేయింపు" మని పలికెను. కౌసల్య తాను చిరకాలమునుండి

రామునకు గోరుచున్న యీశుభకార్యమును విని మిక్కిలి సంతోషించి హర్షబాష్పములతో రామునిగూర్చి యిట్లనెను. "వత్సా! నీవు చిరంజీవి వగుగాక! నీశత్రువులు నాశనమొందెదరు. మంచినక్షత్రమున జన్మించిన నీవు నీగుణములచే తండ్రికి మర్యాద తెచ్చితివి. నీవు సిరికలిగియుండ సుమిత్రయు, నాబంధువులును సంతోషించెదరు. నేను పురుషోత్తమునిగూర్చి చేసిన నోములచే నీకు అభిషేకమును, రాజ్యలక్ష్మియు జేకూరినవి." ఇట్లు కౌసల్య పలుక రాముడు తన తల్లికి వినయముతో నమస్కరించి చిరునవ్వు నవ్వి అణకువగ గూర్చొనియున్న లక్ష్మణుని జూచి "లక్ష్మణా! నీవుగూడ నాతో భూమిని బాలింపుము. నీవు నాకు రెండవ యంతరాత్మవలె నున్నావు. నీకుగూడ నీసిరి కలిగినది. నీ విష్టమువచ్చినటుల భోగములను, రాజ్యలాభమును ననుభవింపుము. నాజీవితమును, రాజ్యమును నీవిషయమై కోరుచున్నాను." అని వానికి సెలవిచ్చి తన తల్లికి నమస్కరించి సీతను వాదికప్పజెప్పి తనగృహమునకు బోయెను.

తరువాత దశరథుడు వసిష్ఠుని బిలిపించి వానితో నిట్లు జెప్పెను. 'మీరు వెళ్ళి నియమముతో సీతారాములచే రాజ్యలక్ష్మికొఱకై యుపవాసమును జేయింపుడు.' ఇట్లుచెప్ప నాఋషి 'అట్లేయగుగాక!' యని పలికి బ్రాహ్మణులుకూర్చుండు రథమెక్కి రామునిగృహమునకు బోయి దానితో మూడుద్వారములను దాటెను. అంతట రాముడు తనగురువును మర్యాదచేయుటకు తొందరగ పైకివచ్చి రథముప్రక్కకు బోయి ఋషిని స్వయముగ దింపెను. కులగురువు రాముని కుశలమడిగి దీవించి వానితో సంతోషముగ ప్రియమగు మాటల నిట్లు పలికెను. "నీతండ్రి నీయెడ దయగలవాడైయున్నాడు.

---

అ. రా:—వసిష్ఠుడు రామునొద్దకు బోయి యతనితో నిట్లు ప్రసంగించెను. "నీవు పరమాత్ముడవు. దేవకార్యము నెఱవేర్చుకొఱ

నీవు రేపటియుదయమున యౌవరాజ్యమును బొందెదవు. నీవును, సీతయును నేటిదినమున నుపవాసమును జేయవలెను.” ఇట్లు వసిష్ఠుడు పలికి వారలచే మంత్రపూర్వకముగ నియమముతో నుపవాసము జేయింప రాము డాతనికి తగినపూజచేసెను. తరువాత నాఋషి వానికి సెలవిచ్చి యాగృహమునుండి వెడలెను. రాముడు ప్రియ మునుబలుకు తన స్నేహితులతో కొంతకాలము గడిపి వారలవలన

---

కును, భక్తుల భక్తిసిద్ధికొఱకును, రావణునివధనిమిత్తమును నీవు లక్ష్మితోగూడ జన్మించితివి. అయినను నీరహస్యవృత్తాంతమును నేను పైకి తెలుపుటకు వీలులేదు. నీవు నాశిష్యుడవు. నేను నీకు గురువునైనను మాయచే నీవు చేయుదానిననుసరించి నేను విధించుచుండెదను. దేవా! నీవు గురువులకు గురువవు. పితృదేవతలకు పితామహుడవు. నీవన్నిటికి నంతర్యామివగుటచే నెవరికిని గోచరింపక జగత్తును (సాంసారికప్రవృత్తిని) నడుపుచున్నావు. నీకు స్వాధీనమైన రజస్తమస్సాంకర్యములేని శుద్ధసత్త్వమగు దేహమును ధరించి నీవు యోగమాయచే మనుష్యునివలె గనబడుచున్నావు. పౌరోహిత్యము మంచివృత్తికాదని నాకు తెలిసినను పూర్వము బ్రహ్మ నాతో ‘ఇక్ష్వాకువంశమున పరమాత్మ రాముడై జన్మించు’నని చెప్పియుండుటచే నీతోడిసంబంధమునకై యీవంశమునకు పౌరోహిత్యము చేయుటకొప్పుకొనియుంటిని. నామనోరథ మీదినమున నెఱవేఱెనది. నీవు గురుఋణవిముక్తుడవు కాగోరినచో లోకములనన్నిటిని మోహింపజేయునదియు, నీస్వాధీనమునను న్నదియునగు మహామాయ నన్ను భ్రమింపజేయకుండునటుల జేయుము. దీనిసంతయు ప్రసంగవశమున నీకు దెలిపితిని. కాని యెక్కడనైనను దీనిని నేను చెప్పగూడదు.” ఇట్లు వసిష్ఠుడు వానితో బలికి సీతారాములతో నారాత్రి యుపవాసముండవలెనని చెప్పెను.

మర్యాదనుబొంది వారికి సెలవిచ్చి తనగృహములోనికి బోయెను. అప్పు డక్కడనుండు స్త్రీపురుషులందఱు మిక్కిలిసంతోషముగ నుండిరి. వసిష్ఠుడు రామునిగృహమునుండి వెళ్ళునపుడు త్రోవలో నంతటను జనలు గుంపులుగుంపులుగనుండి మిక్కిలికుతూహలముగ నుండిరి. వారు సంతోషముగ శబ్దముచేయుటచేతను, వారి రావుచు చేతను నక్కడ గొప్పకలకలధ్వని యాయెను. ఆదినమున నయోధ్యలో వీథులు బాగుగ నూడ్చబడి నీటితో తడుపబడియుండెను. ఇండ్లద్వారములకడ అరటిచెట్లు కట్టబడెను. ఇండ్లపైన పెద్దజండాలు కట్టబడెను. ఆపట్టణములోని స్త్రీలు, బాలురు, దుర్బలులునుగూడ రాముని యభిషేకము గోరుచు నెప్పుడు సూర్యోదయమగునని యెదురుచూచుచుండిరి, జనులకు సంతోషము కలుగజేయునదియు, నలంకరింపబడిన పత్రిజలుకలదియు నగు నామహోత్సవమును జూచుట కనేకులు జనులువచ్చిరి. వీనినన్నిటిని జూచుచు వసిష్ఠుడు మెల్లగ రాజభవనమునజేర దశరథు డాతని జూచి తనయాసనము నుండి లేచి తనకుమారుని యుపవాసవిషయ మాతనినడుగ నాతడు దానిని దెలిపెను. రాజువద్దనుండు సభికులుకూడ తమయాసనము లనుండి ఋషిని మర్యాదజేయుటకు లేచిరి. దశరథు డాతనివద్ద సెలవుపుచ్చుకొని సభాజనులకు సెలవిచ్చి తనయంతఃపురమున కేగెను.

ఆదినమున రాముడు స్నానముచేసి మనస్సును నిలుకడచేసి కొని తనభార్యతో నారాయణునిసేవించుచు హవిస్సుగలపాత్రను శిరస్సువఱకు విధిప్రకారమెత్తి దేవునిగూర్చి నేతితో నగ్నిహోత్రి మున హోమముజేసి హవిశ్శేషమును భుజించి సంతోషమును బొంది మౌనవ్రతుడై దేవగృహమున తానును, భార్యయు దర్భలు పఱచుకొని వానియందు శయనించిరి. కొంతరాత్రియైనతరువాత

నతనికి తెలివిరాగా తనగృహము నలంకరింప జేసెను. తెల్లవాఱు జామున సూత మాగధులు పొగడుట రాముడు విని స్నానముచేసి మనస్సును నియమముతో నిలిపి యుదయసంధ్య నుపాసించెను. తరువాత నాతడు మంచిబట్టలను గట్టుకొని మధుసూదనునికి నమస్కరించి ద్విజులచే స్వస్తివాచకముల బొందెను. వానివలనను, తూర్య ఘోషములవలనను బయలుదేఱిన శబ్దములు పట్టణమున మాఱు మ్రోగెను. ఈసంగతులను ప్రజలందఱు విని సంతోషించి యాదినమున రామునికి పట్టాభిషేకమగునని పట్టణమంతయు నలంకరించిరి. దేవగృహములందును, చతుష్పథగృహములందును, వీథులందును, కోటగోడలపైనుండు నిండ్లకును, గొప్పయంగడిగృహములకును, వర్తకులయిండ్లకును, ధనికులగృహములకును, గొప్పకుటుంబముగల వారి యిండ్లకును, సన్నిసభలకును, పెద్దచెట్లకును నందఱికి గనబడునట్లు ధ్వజములను,పతాకములనుగట్టిరి. నటకులును,నర్తకులును,పాటగాండ్రు బాగుగనాడుచు పాడిరి. చతుష్పథగృహములందు రామునియభిషేకము సమీపించుసమయమున దానికిసంబంధించినసంగతులను ప్రజ లన్యోన్యము చెప్పుకొనిరి. పిల్లలుకూడ నీసంగతులను జెప్పుకొనుచు నాడిరి. పౌరులు రాజమార్గమున పుష్పములను జల్లి సుగంధ ధూపములను వ్యాపింపజేసిరి. రాత్రివేళ నన్నిబాటలయందు సంచరించుప్రజలకు ఇబ్బందికలుగకుండునటుల దీపస్తంభములు వెలిగింపబడెను. పట్టణవాసులు పురము నలంకరించి యభిషేకసమయము నిరీక్షించుచు చతుష్పథగృహములందు గుంపులుగుంపులుగ జేరి యిట్లు ప్రసంగించిరి. "దశరథుడు వృద్ధుడయ్యెను. అత డాసంగతిని తెలిసికొని తనపుత్రునికి యౌవరాజ్య మిచ్చుచున్నాడు. భగవంతుడు మనయందు దయజూపెను. అన్నిలోకములను రాముడు చిరకాలము రక్షించుగాక! అతడు గర్వములేనివిద్వాంసుడు; ధర్మాత్ముడు. అతడు

తనతమ్ములవలె మనలను దయతో జూచును. దశరథుడు చిరంజీవి యగుగాక!" ఇట్లు పౌరులు పలుకుమాట లన్నిదిక్కులకు వ్యాపింప దేశములోనిప్రజలంద అయోధ్యయంతయు నిండి వానిని వినిరి. అక్కడ జనులఘోష మెక్కువగ నుండెను.

## 3 వ. అధ్యాయము.

## రాముని పట్టాభిషేక భంగప్రసంగము.

శ్రీరామునిపట్టాభిషేకము జరుగబోవుదినమునకు ముందు రోజున నయోధ్యయంతయు నలంకరింపబడియుండెను. బ్రాహ్మణులు మాల్యమోదకములను రామునకిచ్చుటకు చేతులతో బట్టుకొనియుండిరి. సంతోషముతో గొప్పయేనుగులు ఘీంకరించుచుండెను. గుఱ్ఱములు సకిలించుచుండెను. గొప్పయెద్దులు రంకెవేయుచుండెను. ప్రజలు మిక్కిలి సంతోషించుచుండిరి. ఆసమయమున కేకయవంశసంబంధమగు దాసీకుటుంబములో పుట్టిన మంథర రాజనగరులోని మేడనెక్కి వీనినన్నిటిని జూచి మిక్కిలియాశ్చర్యమును బొందెను. అంతట

అ. రా:—రాముని పట్టాభిషేకము నిర్ణయింపబడినముందు రోజున దేవతలందఱుగూడి స్వర్గమున సరస్వతి నిట్లుప్రోత్సాహపఱచిరి. "దేవీ నీవు ప్రయత్నముగ భూలోకముననుండు నయోధ్యకు బోయి రామాభిషేకవిఘ్నమునుగూర్చి యత్నింపుము. బ్రహ్మ గూడ నిట్లు సెలవిచ్చెను. నీవు మొదట మంథరలోను, తరువాత కైకేయిలోను ప్రవేశింపుము. దానికి విఘ్నము జరిగినతరువాత తిరిగి స్వర్గమునకు రమ్ము." ఈమాటలను సరస్వతి విని 'అట్లే చేసెద'నని పలికి మంథరలో ప్రవేశించెను.

మంథర మంచిబట్టలను కట్టుకొని మిక్కిలిసంతోషముతో తనదగ్గఱకు వచ్చు రామునిదాదిని జూచి 'రామునితల్లి మిక్కిలిసంతోషముతో జనులకేల సొమ్ము నిచ్చుచున్నది? ఈజనులు మిక్కిలిసంతోషముగా నేలయున్నారు? రాజే యుత్సవము చేయించుచున్నాడు? నీవు మిక్కిలిసంతోషముగ నుండుటకు గారణమేమి?' అని యామెనడుగ నాదాది మిక్కిలిసంతోషముతో 'రేపటిదినమున దశరథుడు పుష్యమీనక్షత్రమున జితేంద్రియుడగు రాముని నభిషేకముజేసి వానికి రాజ్యలక్ష్మి నొసంగు'నని పలికెను. ఆమాటలను విని మంథర శాంతము లేనిదియు, గొప్పకోపముకలదియునై మిక్కిలియున్నతమగు మేడ నుండి దిగి కోపముచే మండిపడుచు శయనించియున్న కైకేయివద్దకు పోయి పాపబుద్ధితో నిట్లనెను. "మూఢురాలా! లెమ్ము. నీవేల పడుకొనియున్నావు? నీకు గొప్పభయము రాబోవుచున్నది. గొప్పదుఃఖము నీకు సంభవించినను దానిని నీవు తెలిసికొనలేకున్నావు. నీ కనిష్టము సంభవించినను సుందరమగు రూపముతో నీసౌభాగ్యమును శ్లాఘించుకొనుచున్నావు. ఎండకాలమునందు నదీప్రవాహమువలె నీసౌభాగ్యము క్షీణమైనది." కుబ్జయగు మంథరయొక్క యీకఠినపుమాటలను కైకేయి విని గొప్ప విచారమును బొందెను. అప్పుడామె 'మంథరా! నీకు క్షేమముగ లేదా? మిక్కిలిదుఃఖముగల ముఖముకలదానవై యేల యిట్లున్నావు?' అని మంథర నడిగెను. దానికి మంథర మాటలనేర్పుతోను, క్రోధముతోను, గొప్పవిచారముతోను కైకేయిమంచిని కోరుచు నామెకు రామునియెడ భేదబుద్ధి కలుగునటుల నామెతో నిట్లనెను. "దశరథుడు రామునికి యౌవరాజ్యమిచ్చిన నీకు గొప్పనష్టము కలుగును. నేను గొప్ప భయమును బొంది దుఃఖము, శోకము కలదాననై కోపముతో నీమేలుకొఱకిచ్చటికి వచ్చితిని. నీకు దుఃఖము కలిగినయెడల నాకెక్కువ

దుఃఖమును, నీకు వృద్ధికలిగినయెడల నాకు తప్పకవృద్ధియును గల్గును. నీవు రాజవంశమున బుట్టి గొప్పరాజునకు మహిషివై రాజధర్మములలో క్రూరపువనుల నేల తెలిసికొనవు? నీభర్త నీతో పైకి ధర్మముపలుకువాడైనను లోలోన నీకు చెడుగు చేయుచుండును. పైకి మంచిమాటలాడుచు క్రూరపువనులు చేయుచుండును. ఈవంచనములను నీవు మంచిబుద్ధితో మంచిగ దలతువు. కౌసల్యకోరికను నీభర్త యీదినమున జరుపుచు మంచిమాటలచే నీ కనర్థములను గలుగజేయుచున్నాడు. దుష్టాత్ముడగు దశరథుడు నీకుమారుని బంధువులయొద్దకు బంపి సమయముజూచి శత్రువులులేకుండ రాముని రాజ్యమున నిలుపుచున్నాడు. అజ్ఞానురాలా! నీవు నీభర్తను లాలనజేసి పాలుపోసి పెంచినపామునువలె మంచిబుద్ధితో నాదరించుచున్నను నతడు నీకు నిజమైనశత్రువైయున్నాడు. ఉపేక్షింపబడిన శత్రువుగాని, సర్పముగాని నాశనము జరుపునటుల రాజు నీకును, నీపుత్రునకును నాశనముజరిపెను. అబద్ధములాడు పాపబుద్ధిగల దశరథుడు రాముని రాజ్యమున నిలుపుటచే నీవును, నిన్ననుసరించువారును నాశనము నొందుదురు. నీపుత్రునకు హితముచేయుకాలము వచ్చినది. ఆశ్చర్యమగుకార్యములు చేయగల నీవు నీపుత్రుని, నిన్ను, నన్ను రక్షించుకొనుము.” ఇట్లు మంధర పలుక కైకేయి రామునిపట్టాభిషేకవార్త విని మిక్కిలి సంతోషముతో పక్కనుండిలేచి తనయాభరణములలో నొకదానిని మంధరకిచ్చి యిట్లనెను. “నీవు నాకు మంచిప్రియమగు శ్రీరామపట్టాభిషేకవార్త దెలిపితివి. ఇంకను నీకేమి కావలెను? రాముడును, భరతుడును నాకునొకటే. నేను వారిద్దఱియందు తారతమ్యమును గానను. రామునియభిషేకమువలన నాకు సంతోషమే కలిగినది. నీవింతకంటె నెక్కుడుసంతోషమైనమాట నాతో చెప్పునది లేదు.

అట్టిది చెప్పినయెడల నీకు బహుమాన మిచ్చెదను. దానిని కోరుము.”
మంధర యీమాటలను విని మిక్కిలియసూయతో నాయాభరణ
మునువిడిచి కోపముతోను, దుఃఖముతోను, కైకేయికిట్లనెను. “అజ్ఞా
నురాలా! సంతోషింపఁగూడనివిషయమున నీవేల హర్షించెదవు? శోక
సాగరమున మునిగియున్నను నీవు నీసంగతిని తెలిసికొనలేకున్నావు.
ఇట్టి గొప్పకష్టముకలిగిన నీవు విచారింపవలసినవిషయమున సంతో
షించుచున్నావని నేను మిక్కిలిదుఃఖించుచు మనస్సులో నవ్వుచు
న్నాను. అయ్యో! మృత్యువువలె సంభవించు సాపత్నిపుత్రునివృద్ధికి
సంతోషించు ప్రజ్ఞావంతురాలెవతె? నీ దుష్టబుద్ధికి విచారించు
చున్నాను. రాజ్యలాభమునుగూర్చి భరతునివలన రామునికిభయము.
దీని నాలోచించియే నేను మిక్కిలి విచారమును బొందుచున్నాను.
భీతి కలిగినచోట భయముపుట్టును. మహాధన్వియగులక్ష్మణుడు నన్ని
విధములచే రాముని ననుసరించి యుండును. అట్లే శత్రుఘ్నుడు భర
తుని ననుసరించియుండును. వారిజననక్రమము ననుసరించి రామునితరు
వాత భరతునిదే రాజ్యము. మిగిలినచిన్నతమ్ములకు రాజ్యములభిం
చుట కాలవిలంబమువలనదట జరుగును. క్షత్రియధర్మములలో పండి
తుడును, తెలిసినవాడును, ప్రాజ్ఞుడును, కార్యనిర్వాహకుడును నగు
రాముడు రాజ్యాలోచనచేయుచుండ నేను నీకుమారునిగూర్చి విచా
రించుచున్నాను. నాశరీరము వడకుచున్నది. రేపటిదినమున పుష్యమీ
నక్షత్రమున రామునకభిషేకమగుచుండుటచే కౌసల్య గొప్పయదృష్ట
వంతురాలు. శత్రుక్షయమును, గొప్పసంతోషమును, కీర్తిని పొందిన
కౌసల్యను నీవు చేతులుజోడించుకొని దాసివలె సేవించెదవు. మాతో
నీ వామెపరిక్కును దాసివై నిలిచిన నీపుత్రుడు రామునివద్ద పరిచా
రకునివలె నుండును. రాముని ననుసరించుస్త్రీలు* మిక్కిలిసంతోషిం

*అయోధ్యాకాండ ౮వ. సర్గ,౧౨వ.శ్లోకమున “రామస్యస్త్రియః,” తే (కైకేయి)
స్నుషా” “రామునిస్త్రీలు, కైకేయికోడళ్ళు” అనుమాటలకు నాతదేకపత్నీవ్రతస్థుడు
గనుక వారాతనిభార్యలు కారనియు, నతనిసేవకురాండ్రనియు మాయభిప్రాయము.

తురు. భరతునియింటిలోనుండు స్త్రీలు, పరిచారకులు విచారమునొం దుదురు." ఇట్లు మంథర పలుక నామాటలను విని కైకేయి విచారము బొందిన మంథరను జూచి రాముని గుణముల నిట్లు పొగడెను. "వాడు ధర్మజ్ఞుడు; గురువులవలన బాగుగ విద్యలను నేర్చినవాడు; కృతజ్ఞుడు; సత్యవాక్కు; శుచి గలవాడు; దీర్ఘాయువు గలవాడు; రాజునకు జ్యేష్ఠ పుత్రుడు; యౌవరాజ్యమున కర్హుడు. వాడు తమ్ములను, భృత్యులను తండ్రివలె సంరక్షించును. మంథరా! రామునియభిషేకము విని నీ వేల విచారించెదవు? అతని రాజ్యమతనియనంతరమందు భరతునికి నూఱుసంవత్సరములకైనను గలుగును. రాముడిప్పుడు రాజ్యాభి షిక్తుడైనయెడల తరువాత భరతునికి రాజ్యము కలుగును. ఆవిషయ మున నీవేల విచారించెదవు? భరతునియందుకంటె రామునియందు నాకెక్కువ యిష్టము. కౌసల్యకుకూడ నాయందు మిక్కిలియనురా గము కలదు. రాముడు కౌసల్యకు చేసినకంటె నాకెక్కువశుశ్రూష చేయును. రామునికి రాజ్యముకలిగిన భరతునికి కలిగినటులనే తలం తును. వాడు తన్ను తనతమ్ములను నొక్కతీరున జూచుకొనును." ఇట్లు కైకేయి పలుక మంథర దానిని విని మిక్కిలికోపించి పెద్దవేడి నిట్టూర్పుదీసి "నీవు శోకముతో గూడిన దుఃఖసాగరములో మునిగి నను నజ్ఞానముచే చెడుగును మంచిగాజూచుచు నీసంగతి నీ వెఱుగ కున్నావు. రాముడు రాజైనయెడల వానియనంతరము వానిపుత్రుడు రాజగును. భరతుడు రాజవంశమునుండి తప్పింపబడును. రాజకుమారు లందఱికి రాజ్యమియ్యబడదు. అలాగునజరుగుట నీతికి మిక్కిలివిరుద్ధము. జ్యేష్ఠపుత్రునితరువాతివారు గుణవంతులైనను జ్యేష్ఠునకే రాజులు రాజ్యము నిత్తురు. నీకొడుకు మిక్కిలి అస్వతంత్రుడగును. అనాథుని వలె సుఖములులేనివాడై రాజవంశమునుండి వేఱుచేయబడును. నీకొఱకు నే నన్నియు జెప్పుచుండ దానిని నీవు గ్రహింపక సాపత్న్య

వృద్ధిని విని నాకు బహుమానమిచ్చితివి. రామునికి శత్రురహితమగు రాజ్యముకలిగిన నతడు భరతుని దేశాంతరమునుగాని, లోకాంతరమునుగాని బొందించును. ఇది నిశ్చయము. నీ వజ్ఞానముచే భరతుని వానిమేనమామయింటికి బంపితివి. వృక్షములు మొదలగు స్థావరములకుగూడ నొకదానికొకటి చేరువగనుండుటచే స్నేహముకలుగును. లక్ష్మణుడు రామునిననుసరించివెళ్ళునటుల శత్రుఘ్నుడు భరతుననుసరించి వానితో వెళ్ళియున్నాడు. వనమువలన జీవించు జనులు ముండ్లపొదలుమొదలగువానిచే నావరింపబడిన వృక్షములను నఱకలేరని వినియుండలేదా? రామలక్ష్మణు లొకరినొకరు రక్షించుకొనెదరు. అశ్వినులస్నేహమువలె వారిభ్రాతృస్నేహము లోకమున కంతకును దెలియును. కనుక రాముడు లక్ష్మణునిగూర్చి పాపకర్మ చేయడు. భరతునిగూర్చిమాత్రము తప్పక జేయును. కనుక నీ కుమారుడు తనమేనమామయింటినుండి వనమునకుబోవుగాక! ఇదియే నాకెక్కువగ తోచుచున్నది. అది నీకు మిక్కిలి మంచిదగును. ఇంకను భరతునికి ధర్మముగ రాజ్యము గలిగినచో మీబంధువులందఱికి శ్రేయస్సు కలుగును. నీకుమారుడు రామునికి సహజశత్రువు. అన్నికోరికలను నేఱవేర్చుకొనిన రామునివద్ద తనకోరికలు నెఱవేఱని భరతుడుండి యెట్లుజీవింపగలడు? అడవిలో సింహము ఏనుగును తఱుమునట్లు రాముడు భరతుని తిరస్కరింప నప్పుడు భరతుని నీవు రక్షింపదగును. సౌభాగ్యముచే గర్వించిన నీవు నీభర్తను వశము జేసికొని నీకు సపత్నియును, రామునికి తల్లియునగు కౌసల్యను నిరాకరించితివి. ఇప్పుడామె నీయెడ వైరమేల చూపకపోవును? రాముడు సముద్రముతోను, పర్వతములతోను, పట్టణములతోను నిండిన సమృద్ధియగుభూమిని బొందినతోడనే నీకుమారునికిని, వానిమూలముగ దీనురాలవగునీకును గొప్పయశుభమును, పరాభవమును,

గొప్పనష్టమును కలుగును. కనుక నీకుమారునికి రాజ్యలాభమును, రామునికి వనవాసమును గలుగునటుల నీవాలోచింపుము." అని మంథర కైకకు సలహాయిచ్చెను.

మంథర చెప్పిన మాటలను విని కైకేయి కోపముచే మండి పడుచు, పెద్దవేడినిట్టూర్పుదీయుచు దానితో "ఈదినముననే రాముని నిక్కడనుండి యడవికి బంపి భరతుని శీఘ్రముగ యౌవరాజ్యమున నభిషేకముచేయించెదను. ఇది జరుగునటుల నుపాయమును దెలుపుము." అనిపలికెను. దానికి పాపబుద్ధిగల మంథర రామకార్యము నకు నష్టముచేయదలచి సంతోషముతో కైకేయి కిట్లనెను. "కేవలము నీభరతునికే రాజ్యము దొరకునట్లు నేను చెప్పెదను. నామాట వినుము. నీమేలుకొఱకు నావలన నీవు వినగోరుమాటలను నీవేల స్మరింపకుండెదవు? లేక స్మరించినను వానిని దాచుచుంటివా? నేను చెప్పుమాటలను నీకు వినవిచ్ఛ గలదేని చెప్పెదను వినుము. వినిన తరువాత నాలోచింపవచ్చును." ఇట్లు మంథరపలుక కైకేయి పక్క నుండి కొంచెము లేచి 'నామనస్సులోని తలవు జరుగునటుల నేయుపాయమునైనను నాకు దెలుపుము.' అని పలికెను. దానికి మంథర * "కైకా! దశరథుడు నీతో దండకారణ్యమున శంబరునినగరమునకు ఇంద్రునకు సహాయము వెళ్లి శత్రువులచే గొట్టబడి తాను మూర్ఛ నొంది నీచే రథమున దీసికొనిరాబడి నీకు రెండువరములనిచ్చెను. నీ వావరములను నాతనివద్దనే యుంచితి" వని యామెకు దెలిపి యాసంగతుల నామెకు జ్ఞప్తికిదెచ్చి యిట్లు సలహాయిచ్చెను.

---

* అ. రా:—దశరథునిరథము శీల పడిపోయెననియు, నది యుండవలసినస్థలమున కైకేయి తనచేతినుంచి రథమును నడిపెననియు, నతడు రాక్షసులను జంపినతరువాత దీనినిజూచి యాశ్చర్యపడెననియు వర్ణింపబడినది.

"రామునియభిషేకము బలాత్కారముగ దప్పింపుము. భరతునికి నభిషేకమును, రామునికి 14 సంవత్సరములు వనవాసమును నను నీరెండువరములను నీభర్తను గోరుము. రాము డాపదునాల్గుసంవత్సరములు వనములోనుండ నీపుత్రునియందు ప్రజలకుగలుగుస్నేహముచే నీపుత్రుడు రాజ్యమున స్థిరముగ నిలుచును. నీవు కోపమువచ్చినపుడు ప్రవేశించు గదిలోనికి వెళ్ళి మురికిబట్టలను గట్టుకొని భూమియందు నేమియుపఱువక పరుండుము. నీభర్తవచ్చినయెడల వానిని జూచి భూమియందే యుండి విచారముతో నేడ్చుచు వానిని మోమెత్తి చూడకుము. ఏమియు బలుకకుము. నీభర్త నీయందెల్లపుడు దయగలవాడు. నీవిషయమై యామహారాజు అగ్నిలోకూడ ప్రవేశించును. నీకుకోపముగలుగుపనుల నాతడు చేయలేడు. నీవు కోపించియుండ నిన్ను ముఖమెత్తి చూడలేడు. నీప్రీతికొఱ కాతడు తనప్రాణములనైనను విడుచును. నీమాట నాత డతిక్రమింపలేడు. మందస్వభావురాలా! నీసౌందర్యబలము నాలోచించుకొనుము. అతడు నీకు మణులను, సువర్ణమును, ననేకవిధములగు రత్నములను నిచ్చినను వానియందు నీవు మనస్సుంచక దేవాసురయుద్ధములో నతడు నీకిచ్చిన వరములను జ్ఞాపకముదెచ్చుకొని నీమనోభీష్టమును నెఱవేర్చుకొనుము. దశరథుడు స్వయముగ నిన్ను లేవదీసి వరమిచ్చినపుడే యతనిమాటల సత్యమును స్థిరపఱచి రాముని 14 సంవత్సరములు వనవాసమును, నతనిని వనమునకు బంపినతక్షణమే దశరథుడు భరతుని రాజ్యాభిషిక్తుని జేయుటయు నను నీవరములను గోరుము. రాముడు 14 వత్సరములు వనవాసముచేయ నీకుమారుడు కీర్తిని, ప్రసిద్ధిని పొంది రాజ్యములోని మూలబలములను వశముచేసికొని మిగిలిన తనజీవితకాలమంతయు రాజ్యముచేయును. ముఖ్యముగ రామునివనవాసమును వేడుము. అట్లుజరిగిన నీకుమారునికి సమస్తప్రయోజనములు

నెఱవేఱును. అంతట రాముడు ప్రజలయం దనురాగములేనివాడు కాగా నీభరతుడు శత్రువులు లేనివాడై రాజ్యముజేయును. రాముడు వనమునుండి తిరిగి వచ్చుసమయమునకు నీకుమారుడు రాజ్యకార్యములందు స్థిరపడి ప్రజలను వశముచేసికొని తనస్నేహితులతోగూడి తన యభీష్టములను నెఱవేర్చుకొనగలుగును. ఇదియే నీకుమంచిసమయము. నీవు భయములేనిదానవై రాజును రామాభిషేకప్రయత్నములనుండి మఱలింపుము." ఈతీరున మంధర యనర్థకములగుమాటలను నామెకు మంచిమాటలుగ బోధపఱుప కైకేయి వానిని నమ్మి సంతోషించి తాను మంచిస్త్రీయైన దానిమాటలకు నాశ్చర్యమునుబొంది దానితో నిట్లనెను. "కుబ్జా! నీవు మఱుగుజ్జువారిలో శ్రేష్ఠురాలవనియు, శ్రేష్ఠమగుమాటలు పలుకుదానవనియు నిదివఱకు నేనెఱింగియుండలేదు. భూలోకములోనుండు మఱుగుజ్జులలో నీబుద్ధి మిక్కిలి ప్రశస్తమైనది. నీవు నామేలు గోరుచు నాప్రయోజనములందు నెల్లప్పుడు మనస్సు నిలిపెదవు. రాజునకు మనోభీష్టమగు రామాభిషేకమును నేను సరిగా దెలిసికొనలేకపోయితిని. కుబ్జలు సాధారణముగ వక్రముగలవారును, మిక్కిలి క్రూరులును వికృతయవయవములు కలవారునై యున్నారు. కాని నీవుమాత్రము గాలిచే వంగినపద్మమువలె సౌందర్యవంతురాలవు. నీవక్షస్థలము భుజములకంటె ముందుకువచ్చినది. నీయుదరము లోనికి బోయినది." ఈతీరున కైకేయి మంధరయవయవములను వర్ణించుచు దానినిట్లు పొగడెను. "నీకు మాయ లనేకములు తెలియును. నీవక్షస్థలమున రాజనీతియు ననేకమాయలు నున్నవి. కాన భరతునికి నభిషేకమును, రామునికి వనవాసమును జరిగిన నీమెడలో బంగారుమాలను వేసెదను. నీమనస్సులోని కోరిక జరిగిన నీవు సంతోషముగ నుండునట్లు నీవక్షస్థలమునకు బంగారుకలిసినచందనముతో లేపనము చేయించెదను.

నీముఖమునకు బంగారుతిలకమును, నీకు మంచి యలంకరణములను జేయించెదను. నీవు మంచిబట్టలుకట్టుకొని దేవతవలె సంచరించెదవు. చంద్రాననవగు నీవు నీశత్రువులను గర్వముచే ధిక్కరించుచు నడచెదవు. నీవు నాదగ్గఱ దాసిగా సంచరించునటుల మంచియాభరణములుగల కుబ్జలు నీపాదములను సేవించెదరు.'' అని వేదికయందు వెలుగునగ్నివలె ప్రకాశించు కైకేయి మంచిపక్కమీఁదపండుకొని మంధరతో నిట్లు పలుక నాదాసి "నీరుపోయినతరువాత గట్టువేసిన లాభమేమి? లేచి శుభకార్యములను నెఱవేర్పుము. రాజురాక నిరీక్షింపుము." అని యామెను కోరెను. ఈరీతిగ మంధరచే కైకేయి ప్రోత్సాహపఱుపబడి తన సౌందర్యమదముచే గర్వించి కోపగృహమునకు మంధరతో వెళ్లి మిక్కిలివిలువగల హారమును, మంచియాభరణములను దీసివేసి తేజస్వినియగునామె దాసిమాటలచే భూమియందు పండుకొని దానితో నిట్లనెను. "కుబ్జా! నాకు సువర్ణముగాని, సొమ్ములుగాని, రత్నములుగాని,భూషణములుగాని యక్కఱలేదు. రాముడు వనమునకు వెళ్ళినతోడనే భరతునకు రాజ్యము లభించును. రాముని కభిషేకము గలిగినచో నాప్రాణము లంతమొందును. నాభర్త యిక్కడకు వచ్చినతోడనే నీవు 'కైక చావసిద్ధముగనున్న'దని వానికి తెలియజేయుము.'' ఈమాటలను మంధర విని రాముని కపకారమును, కైకేయికి హితమును గోరి గొప్పపరాక్రమముగల రాజులుపలుకు మాటలచే నిట్లామెను బ్రోత్సాహపఱచెను. "రామునికి రాజ్యలాభము గలిగిన నీవును, నీకొడుకును నెల్లకాలము విచారించెదరు. కనుక నీ కుమారుని కభిషేకము కలుగునట్లు యత్నింపుము.'' ఇట్లు దాసి గడియగడియకు బాణములవంటి మాటలచే నామెమనస్సునొప్పింప నామె మిక్కిలిక్రోధముకలదై గుండెలమీఁద రెండుచేతులను పెట్టుకొని దానితో నిట్లు పలికెను. "నీవు దశరథునితో 'కైకేయి యము

లోకమునకు బోవ సిద్ధముగనున్న'దని తప్పక పలుకుము. రాముడు చాలకాలము వనములోనుండ భరతునకు కోరికలన్నియు సమకూరును. ఇప్పుడు వాడు వనమునకు వెళ్ళనియెడల నాకు పాన్పులుకాని, పూలదండలుగాని, చందనముగాని, కంటికికాటుకగాని, పానీయములు, భోజనములుగాని, ప్రాణములుగాని మరేదియుగాని, యక్కఱ లేదు." ఇట్టిదారుణపుమాటలు కైకేయి పలికి తనయలంకారముల నన్నిటిని నాకాశమునందుండునక్షత్రములవలె నచ్చట జల్లి కేవలము భూమియందు స్వర్గమునుండిపడిన కిన్నరివలె బొట్టు ముసి వేసికొని మురికిబట్టలతో శయనించెను. ఆమె కోపోద్రేకము, కళంకము గల ముఖముతో నాకాశమందు చీకటితో గప్పబడిన నక్షత్రమువలె తేజోరహితయై యుండెను. ఆదాసి యామెమనోనిశ్చయము తప్పక సిద్ధించునని సంతోషముతో నుండెను..

దశరథుడు వసిష్ఠాదులతో రాముని యభిషేకప్రయత్నము జరిపి దానికి కావలసినవస్తువులను జాగ్రత్తపర్చవలెనని చెప్పి తన యంతఃపురము జేరెను. అత డాదినమున నిశ్చయించిన రామపట్టాభిషేకవిషయమున తాను స్వతంత్రుడైనను తనకు మిక్కిలి ప్రియురాలగు కైకేయికిగూడ దానిని దెలుపవలెనని లోనికి బోయెను. అక్కడ చిలుకలు, నెమళ్ళు, క్రౌంచములు, హంసలు ధ్వనిచేయుచుండెను. వాద్యములు వాయింపబడుచుండెను. కుబ్జలును, పొట్టివారునునగు దాసీలు పనిచేయుచుండిరి. అక్కడక్కడ లతాగృహములును, చంపకయశోకవృక్షములునుగల చిత్రగృహములును, నేనుగుదంతముతోను, వెండితోను, బంగారముతోను, చేయబడిన యరుగులును, నెల్లప్పుడు ఫలించు చెట్లును, దిగుడుబావులును, దంతము, వెండి, బంగారు మొదలగువానితో జేయబడిన మంచియాసనములును, నుండెను. అనేక విధములగు నన్నములు, పానీయములు, భక్ష్యములు కూడ నుండెను.

ఆగృహము బాగుగ నలంకరించుకొనిన స్త్రీలతో నిండియుండెను. దశరథునికి నివియన్నియు గనబడెను; గాని తన ప్రాణేశ్వరియగు కైకేయి యుత్తమశయనమున గనబడలేదు. మన్మథోద్రేకముగల యారాజు పూర్వ మెప్పుడు నిట్టిసమయమున నక్కడనుండునామె యప్పుడక్కడ లేకుండుటచే మిక్కిలివిచారించి యామెను పిలిచెను. అంతట ద్వారపాలకురాలు భయపడి చేతులుజోడించుకొని 'దేవా! దేవి మిక్కిలికోపముతో నలుకగృహమునకు తొందరగా బోయెను.' అని పలికెను. దీనితో రాజుమనస్సు మిక్కిలి వ్యాకులమునొంద నాతడు విచారించుచు నలుకగృహమునకు వెళ్ళి క్రిందను పరుండిన భార్యను జూచెను. ఆమె త్రెంపబడినలతవలెను, స్వర్గలోకమునుండి క్రిందబడిన దేవత, కిన్నరి, యప్సరస మొదలగు వారివలెను, కట్టబడిన లేడివలెను,వనములో వేటకానిచే హింసింపబడిన యాడయేనుగువలెను వానికి గనబడెను. వృద్ధుడును, కాముకుడునునగు నారాజు తన ప్రాణములకంటె నెక్కుడగు తనభార్యనుజూచి రెండుచేతులతో నామెను ముట్టి చంచలమగుమనస్సుతో నిట్లనెను. "దేవీ! నీకేల కోపము వచ్చెను? నిన్నెవరు పరుషోక్తులాడిరి? నాకుదుఃఖముకలుగునట్లు నీవు బుగ్గిలో శయనించుటకు కారణమేమి? నాచిత్తమును కలకలము చేయు మంచిబుద్ధిమంతురాలా! నేను జీవించియుండ నీవు భూతము పట్టినదానివలె నేల నేలశయనించెదవు? నాయందనురాగముగల గొప్పవైద్యులు నాయొద్దనున్నారు. వారునిన్ను బాగుచేయగలరు. నీరోగమును దెలుపుము. నీవెవరికి ప్రియమగుకార్యమును జరుపవలెను? నీకెవ్వరప్రియమును జేసిరి? ఎవనికి నేనీదినమున మేలుచేయవలెను? లేక యెవనికి గొప్పయుపకారము జేయవలెను? దోషములేనివాని నెవనిని నేను జంపింపవలెను? చంపదగినవాని నెవనిని విడువవలెను? దరిద్రునెవనిని ధనికునిగ జేయవలెను? ద్రవ్యవంతు డెవడు దరిద్రుడు

కావలెను? నీవు దుఃఖింపకుము. గొప్పశోకమును బొందకుము. నేనును నావారును నీవశానువర్తులము. నీయభిప్రాయమునకు వ్యతిరిక్తముగా జరుపుటకు నేను సహింపలేను. దానికొఱకు నాప్రాణములనైన నిచ్చెదను. నీమనస్సులోనిసంగతిని దెలుపుము. నీయందుగల నా యనురాగము దెలిసిన నీవు నన్నేల శంకించెదవు? నీయిష్టమువచ్చిన దానిని జరిపెదను. నేను చేసినసుకృత్యములనుబట్టి నేను శపథము చేసెదను. ఈభూచక్రమంతయు నాయధీనమున నున్నది. తూర్పు దేశములును, సింధు, సౌవీర, సౌరాష్ట్ర దక్షిణదేశములును, అంగ వంగ మగధ మత్స్య కాశి కోసల దేశములన్నియునునావే. అక్కడ నుండు వస్తువులలో వేనినైనను నీకు కావలసిన వానిని గోరుము. ఏల యాయాసము నొందెదవు; లెమ్ము. నీభయకారణము నీవు నిజముగ దెలిపిన దానిని బోగొట్టెదను." అని యామెను బ్రతిమాలెను.

ఈతీరున దశరథుడు పలుక కైకేయి యాతనితో దారుణ మగు మాటల నిట్లు పలికెను. "నాకేమియు రోగములేదు. నన్నెవరు నవమానింపలేదు. నాయభిప్రాయమేదో మీరు జరుపవలెను. అట్లు జరుపుట కిష్టమున్నయెడల మీప్రతిజ్ఞను దెలుపుడు. తరువాత నా కోరికను జెప్పెదను." రాజు ఈమాటలను విని కొంచెము నవ్వి యామె నవ్వుచుండ నామెసిగను సవరించుచు నిట్లనెను. "గర్వము కలదానా! నీయందుకంటె నాకేస్త్రీయందు ననురాగము లేదు. మనుష్యులలో రామునికంటె నిష్టుడు నాకు లేడు; కావున నజేయుడును, మహాత్ముడును, రఘుకులములో ముఖ్యుడునునగు వానినిబట్టి నీవు కోరినదానిగూర్చి శపథము చేయుచున్నాను. వాని నొకగడియ యైనను జూడకుండ జీవింపలేను. నాకంటెను, నాయితరపుత్రుల కంటెను వాడు నాకిష్టుడు. నీమాటలను జరిపెదనని వానిపై శపథము చేయుచున్నాను. ప్రియురాలా! నామనస్సులోనిసంగతులు నీవు

తెలిసికొని నన్నుద్ధరింపుము. దీని నాలోచించి నీమనస్సులోని మంచి మాటను దెలుపుము. నీయందున్న నాయనురాగము నీవు తెలిసికొని నన్ను శంకింపగూడదు. నేను చేసినసుకృతములనుబట్టికూడ నీయిష్టములను జరిపెదనని శపథముచేయుచున్నాను.'' ఇట్లు దశరథుడు శపథములు చేయ తనమనస్సులోని తలపు జరిగింపగోరిన కైకేయి యతనియభిప్రాయమును దెలిసికొని తనకార్యము జరుగునని నిశ్చయించి తనపుత్రునియందలి పక్షపాతముతో నప్పుడువచ్చిన యముని వలె ఘోరమగు దుర్వచనముల నిట్లు పలికెను. "నీ వెట్లు శపథము పలికితివో యేరీతిని వరము లిచ్చితివో యగ్నితోగూడిన 33 దేవతలును, సూర్యచంద్రులును, నాకాశమును, గ్రహములును, రాత్రింబవళ్ళును, దిక్కులును, జగత్తును, భూమియు, గంధర్వరాక్షసులును, రాత్రిజరించుభూతములును, గృహములనుండు గృహదేవతలును, నితరజీవులును నీమాటలను వినెదరుగాక! నీవు సత్యసంధుడవు; గొప్పతేజస్సుగలవాడవు; ధర్మజ్ఞుడవు; జాగరూకుడవు. దేవతలారా, వినుడు. ఈతడు నాకు వరమిచ్చెను.'' ఈ ప్రకారము కైకేయి వరమిచ్చువాడును, కామముచే నజ్ఞానుడునునగు దశరథుని నియమమున నిలిపి సమస్తదేవతలను సాక్షులుగనిలిపి యింకను నిట్లనెను. "రాజా! పూర్వము దేవాసురయుద్ధములో జరిగిన దానిని జ్ఞప్తికి దెచ్చికొనుము. అప్పుడు శత్రువు నీప్రాణమునకు భంగముచేయ నేను నిన్ను జాగ్రత్తగా రక్షించినందుకు నాకు రెండువరముల నిచ్చితివి. వాని నప్పుడు నీవద్దనే యుంచితిని. వాని నిప్పుడు కోరెదను. సత్యప్రతిజ్ఞుడవగు నీవు వానిని ధర్మముగ నాకు నియ్యకపోయినయెడల నీవలన నవమానముపొందిన నేను ఈదినము ననే ప్రాణముల విడిచెదను.'' ఈతీరున కైకేయి మాటలచే రాజును తనవశముచేసికొని తిరుగ నిట్లుబలికెను. "నీవు నాకుదయచేసిన

యా రెండువరములను నీదినమున నీకు దెలిపెదను. నామాటలను వినుము. రామునికూర్చిసమకూర్చిన యభిషేకసామగ్రితో భరతునికి నభిషేకము జేయుము. ఇది నా మొదటివరము. రెండవవరమేమన 14 సంవత్సరములు రాముడు దండకారణ్యములో నారచీరలను, చర్మములను, జటలను ధరించి తపస్వియై యుండవలెను. భరతునికి నీదినముననే యౌవరాజ్య మీయవలెను. ఇవి నాకు మిక్కిలి యిష్టమైనవి. నీవు నాకిచ్చినవరములనే నేను కోరితిని. ఈదినముననే రాముడు వనమునకు వెళ్ళుట నేను చూడవలెను. రాజా! సత్యప్రతిజ్ఞగలవాడవై కులమును, శీలమును, జన్మను రక్షించుకొనుము. మనుష్యులకు సత్యవచనములు పరలోకమునకు మిక్కిలి యుత్తమములని ఋషులు పలుకుదురు."

దశరథుడు కైకేయిదారుణవరములను విని చింతను బొంది యొకగడియ పరితపించెను. 'ఇది స్వప్నమా! నాచిత్తభ్రమయా! సుషుప్తియా! మనస్సుయొక్క యుపద్రవమా!' అని యతడు విచారించి సుఖమును పొందలేకపోయెను. చాలకాలమునకు నాతనికి తెలివి రాగా నామెమాటలచే వ్యాకులత్వమునొందిన యతడు లేడి పెద్దపులినిజూచి భయపడునటుల నామెనుజూచి భయపడి వణకుచు పెద్దనిట్టూర్పుదీయుచు భూమిపై బడెను. అతడు గొప్పకోపముతో 'ఛీ' యనిపలుకుచు గొప్పవిచారముచే తిరుగ మూర్ఛనొందెను. చాలసేపటికి మిక్కిలిదుఃఖముగల రాజు తనకు తెలివి రాగ గొప్ప క్రోధముతో మండిపడుచు నెత్తురికండ్లతో కైకేయి కిట్లనెను. "క్రూరాత్మురాలా! దుష్టచరిత్రలు కలదానా! కులనాశనీ! రాముడు కాని నేనుగాని నీ కేమిపాపమును జేసితిమి? వాడు నిన్ను తల్లియను భావముతో జూచినందులకు వానికి ననర్థము గూడునటుల యత్నించితివా? నిన్ను నానగరునకు నావినాశముకొఱకు తెచ్చితిని. పాముపంటి

నిన్ను అజ్ఞానముచే రాజకుమార్తెగ దెలిసికొంటిని. ప్రజలందఱు రామునిగుణములు స్తుతించుచుండ వానిలో నే నేరము నెంచి నాముద్దు కుమారుని విడిచెదను. కౌసల్యనుగాని, సుమిత్రనుగాని, నాసిరినిగాని నాజీవితమునుగాని, నేను విడువగలను; గాని తండ్రియెడ స్నేహము గలిగిన రామునిమాత్రము విడువలేను. నా పెద్దకుమారుని జూచిన నా కెక్కువప్రీతిగలుగును. వానిని జూడనియెడల నామతిచెడిపోవును. లోకులు సూర్యుడును, నన్నోదకములును లేకయుండగలరుగాని నేను రాముని విడిచి జీవింపలేను. చాలును; నీపాపపునాలోచనను మానుము. నీకాళ్ళకు నమస్కరించెదను. నాయందు దయజూపుము. నీవేల యిట్టి గొప్పదారుణపుమాటల నాలోచించితివి? భరతునిమంచి చెడుగులగూర్చి నాయభిప్రాయమును నీ వేల తెలియగోరెదవు? అట్లే కానిమ్ము. నీవిదివరలో నాజ్యేష్ఠకుమారుడగు రాముడు 'ధర్మజ్యేష్ఠు'డనిపలికినది వానిచేత శుశ్రూష చేయించుకొనుటకు చెప్పినదిగానగుచున్నది. అట్టినీవు వానియభిషేకముసంగతివిని మిక్కిలివిచారించి నన్నెక్కువ విచారము నొందించుచున్నావు. దీనినిబట్టియాలోచింప నీవితరులమాటలను విని యలుకగృహము చేరితివని తోచుచున్నది. నీతిగల యిక్ష్వాకువంశమునకు నీవిపరీతిబుద్ధిచే గొప్పయనర్థము వచ్చినది. నీవు పూర్వము నా కయుక్తమగు పనులుగాని, యిష్టములేని పనులుగాని చేసియుండలేదు. కనుక నీవు కోరినయంశములు నిజమైనవిగా నమ్మజాలను. నిశ్చయముగ మహాత్ముడగు నీభరతునితో రాముడు నీకు సమానుడని నీవనేకపర్యాయములు చెప్పితివి. అట్టి ధర్మాత్ముడును సుకుమారుడును, కీర్తిమంతుడునునగు రాముడు 14 వత్సరములు గొప్పవనవాసముచేయుట నీ కెట్లిష్టమయ్యెను? నీకు శుశ్రూష జేసిన యీ రామునికేల వనవాసము? వాడు భరతునికంటె నీ కెక్కువ శుశ్రూష జేసెను. అట్టి రామునియందుకంటె నీ కుమా

రనియందు నీకెక్కువ ప్రేమ యుండుటకు గారణము గాదను. శుశ్రూషచేయుటలోను, భక్తిలోను, చెప్పినమాటను జరుపుటలోను, గౌరవించుటలోను, మనుష్యులలో రామునికంటె నెక్కువవా డెవడు? నగరులో ననేకమంది దాసీలున్నను వానినిగూర్చి పరిభవమునుగాని, యపవాదమునుగాని యెవ్వరు పలుకరు." ఇట్లు దశరథుడు పలికి రాముని గుణముల వర్ణించెను. తరువాత నతడు విలపించుచు, కైకేయితో నిట్లు పలికెను. "అట్టిమహర్షితుల్యునివిషయమై నీవు పాపమేల యాలోచించెదవు? లోకమునకు బ్రియమును బలుకువానినిగూర్చి విప్రియము మనస్సులోనైనను స్మరింపని నేను ఈవనవాసవార్తను నాకుప్రియుడగు నా రామునితో నెట్లుపలుకగలను? వాడుతప్ప నాకెవడుగతి? నేనువృద్ధుడను; నాకు కాలము సమీపించినది. తపస్సు చేసియుంటిని. విలపించుచున్ననాయందు దయజూపుము. ఈలోకములో సారకువస్తువుల నన్నిటిని నీకిచ్చెదను. రామునివిషయమై క్రోధము మానుము. నీకు నమస్కరించెదను. నీకాళ్ళుబట్టెదను. రామునికి శరణు కమ్ము. అందువలన నాకేమియు నధర్మముకలుగదు." ఇట్లు దశరథుడు గొప్ప దుఃఖముతో విలపించుచు, మూర్ఛపోవుచు, ఇటునటుతిరుగుచు, శోకసముద్రములో మునిగి మాటిమాటికి నామెను ప్రార్థించుచుండ కైకేయి రౌద్రముతో నతిదారుణములగుమాటల నిట్లు పలికెను. "రాజా! నీవు నాకు వరములిచ్చి తిరుగ వాని విషయమై విచారించిన యెడల నీవు లోకమున నీధార్మికత్వము నెట్లు తెలుపగలిగెదవు? నీతో రాజఋషు లనేకులు 'నీవు ధర్మజ్ఞుడ'వని పలికినపుడు నీవు వారికి నేమని జవాబు చెప్పెదవు? 'ఎవరిప్రయత్నముచే నేను జీవించి యుంటినో యెవతె నన్ను రక్షించినదో యట్టి కైకేయివిషయమై నే నాడినమాటలు నిలుపుకొనలేక పోతి'నని పలికెదవా? ఇప్పుడే నీవు నాకు వరములిచ్చి మఱల నిప్పుడే మఱియొకతీరున బలుకుటచే రాజు

లలో నీవు పాపమును బొందెదవు. పూర్వము డేగ పావురముల వాదములో శైబ్యుడు పావురమున కభయమిచ్చి దానికిబదులుగ తన మాంసమును డేగకిచ్చెను. అలరుడు అంధబ్రాహ్మణున కొకనికి తననేత్రముల నిచ్చి యుత్తమమగు గతిని బొందెను. సముద్రము తనచెలియలికట్టను విడువనని ప్రతిజ్ఞచేసి యట్లు జరుపును. నీవు పూర్వము పలికినదాని నాలోచించి దాని ననృతముగ జేయకుము. దుర్మతీ! నీవు ధర్మమువిడిచి రాముని రాజ్యమున నభిషేకము జేసి యెల్లవుడు కౌసల్యతో క్రీడింపగోరెదవు. నేను నీతోపలికినది ధర్మమైనను, నధర్మమైనను, సత్యమైనను, నసత్యమైనను దానిని నీ వతిక్రమింప వీలులేదు. రామునకు నీ వభిషేకముచేసినయెడల నే నిప్పుడే నీవు చూచుచుండ విషమును ద్రాగి నీయెదుట చచ్చెదను. ఒకదినమైనను రామునితల్లి నాయెదుట చేతులుకట్టుకొని నన్ను నమస్కరించుచుండ నే నామెను చూడవలయును. అది జరుగనియెడల మరణమైనను నాకు నిశ్చయముగ శ్రేయము. 'రామునివనవాసము కంటె నితరమైనదానివలన నాకు సంతోషము లేదు.' అని నాభరతుని పైని, నాపైని నేను శపథముచేసి పలుకుచున్నాను." ఇట్లు కైకేయి పలికి దశరథుడు విలపించుచుండ మరేమియు పలుకక యూరకుండెను. రాజు ఆమెకోరినయశుభమగువరములనువిని మిక్కిలివిచారమనస్కుడై యప్రియములను బలుకు ప్రియురాలిని కనురెప్పవేయక చూచుచు నొకగడియ మాటలాడక యూరకుండెను. కఠినములును, దారుణములునునగు నామెమాటలను వినుటచే నాతనికి సుఖములేక పోయెను. అత డామెశపథమును నాలోచించుచు 'రామ! రామ!' యని నిట్టూర్పుదీయుచు మొదలుతెగినచెట్టువలె క్రిందబడి నష్టచిత్తుడై వెఱ్ఱివానివలెను, రోగివలెను, విపరీతరూపముగలవాడై తేజము తగ్గ నామెతో దీనత్వమున నిట్లనెను. 'పైకి ప్రయోజనము

వలె కనబడు నీయనర్థమును నీ కెవరు బోధించిరి? నీవు భూతముబట్టిన దానివలె లజ్జలేక నాతో నేల బలికెదవు? ఇట్టిదుష్టబుద్ధిని నీయందు పూర్వము నేను కానను. ఈవిపరీతము నీయం దిప్పుడు చూచితిని. నీ కేమి భయముకలిగి భరతుని రాజ్యాభిషేకమును, రాముని వనవాసమును వరములుగ గోరితివి? నీకు నీభర్తయొక్కయు, లోకులయొక్కయు, భరతునియొక్కయు ప్రియము కావలసినచో నన్నృతములగు వీనియందు మనస్సును విడువుము. క్రూరురాలా! నీచురాలా! దుష్కార్యములుచేయుదానా! నాయందును, రామునందును నీవిషయమై యేమియపరాధములను కనిపెట్టితివి? రాముని దప్పించి భరతునికి రాజ్య మెంతమాత్రము నీయ వీలులేదు. పెద్దవానికంటె చిన్నవానిని ధర్మమార్గమున నెక్కువగ దలచెదవా? 'నీవు వనమునకు బొమ్ము' అని రామునితో బలుక వానిముఖము రాహుగ్రస్తమగు చంద్రునివలె వర్ణము మాఱియుండ వానిని నేనెట్లు జూడగలను? స్నేహితులు నిశ్చయించినదియు, బాగుగ స్థిరపఱుపబడినదియునగు నభిషేకప్రయత్నమంతయు త్రిప్పివేయబడుట నేనెట్లు చూడగలను? దీనివిషయమై యన్నిదిక్కులనుండి వచ్చినరాజులందఱు 'దశరథుడు చిరకాలము రాజ్యముచేసినను బాలునివలె నజ్ఞానుఁ'డని పలుకుదురు. వృద్ధులును, గుణవంతులును, విద్వాంసులును దీనివిషయమై యడిగిన వారికి నేనేమిప్రత్యుత్తర మిచ్చెదను? 'కైకేయి పీడించుటచే నేను రాముని వనమునకు బంపితి'నని నిజముపలికిన నాయభిషేకప్రయత్నము లన్నియు నసత్యములగును. వాడు వనములోనుండ కౌసల్య న న్నేమని పలుకును. నేనామె కిట్టియపకారముజేసి యామెకు నేనేమి యుత్తరమీయగలను. ఆమె నాయెడల దాసివలెను, సఖివలెను, భార్యవలెను, తోబుట్టువువలెను, తల్లివలెను సంచరించి నాప్రియమును గోరుచు ప్రియపుత్రుడుగలదై ప్రియమును బలుకుచుండు

నామె నీవుచేసినకార్యమువలన నావలన, నవమానమును బొందును. నీకు చేసినయుపకారము రోగికిచ్చిన యపథ్యమువలెనే నన్ను బాధించుచున్నది. రాముని గృహమునుండి వనమునకు బంపుట జూచి సుమిత్రి భయమునొంది యింక నన్నేమని నమ్మును? రాముడు వనవాసముజేయు హిమవత్పర్వతపార్శ్వమున కిన్నరుడు విడిచిన కిన్నరివలె సీత మిక్కిలి ఖేదమునొందును. అడవిలో నివాసముచేయు రాముని, దుఃఖించుచున్నసీతను జూచి నేను జీవింపలేక ప్రాణములను విడుతును. అప్పుడు నిశ్చయముగ నీవు విధవవై కుమారునిచే రాజ్యమేలించెదవు. రూపవంతురాలైనభార్య విషముతో గూడిన మద్యమును పానముజేసినభర్తకు గనిపించునటుల పూర్వము మంచిదానవైన నీవిప్పుడు మిక్కిలి దుష్టురాలుగ నాకు కనుపించుచున్నావు. నీవు అబద్ధపుమాటలను నామనస్సున కింపగు నట్టులను, శాంతిని కలుగజేయునటులను పలుకుచు పాటలుపాడుచు వేటగాడు మృగము నరికట్టి చంపునటుల నన్ను మరణము నొందించు చున్నావు. మద్యపానముచేసినబ్రాహ్మణుడు వీధులం దవమానింప బడునటుల నేను ఆర్యులచే నాసౌఖ్యమునకై పుత్రునివిక్రయించిన యనార్యునిగ దలంపబడుదును. అయ్యో! నీమాటలను నేనొప్పు కొనినందుకు నాకు గొప్పదుఃఖమును, కష్టములును సంభవించినవి. ఇది నాపూర్వజన్మకృతపాపము. పాపాత్మురాలా! పాపుడనై యజ్ఞానముచే నేను చాలకాలము నిన్ను రక్షించితిని. ఇప్పుడు నీవు నా మెడ కురితాడువలె నున్నావు. బాలు డజ్ఞానముచే చేతితో కృష్ణసర్పమును బట్టినటుల నిన్ను నేను పాణిగ్రహణముచేసితిని; కాని నీతో క్రీడించు నేను నిన్ను నామృత్యువునకు గారకురాలుగ నెంచి యుండలేదు. నాదుర్మార్గపుకార్యమువలన రామునికి దండ్రిలేనట్లయ్యెను.' అడుదానిమాట విని తనప్రియపుత్రుని వనమునకు బంపిన

యీ దశరథమహారాజు మిక్కిలి కాముకుడు; మూర్ఖు డని లోకమంతయుచేయు నిందకు నేను నిశ్చయముగ తగినవాడ నగుదును. రాము డిదివఱకే నియమములను జరిపి బ్రహ్మచర్యమును,గురుశుశ్రూషలును జేసి కష్టపడియున్నాడు. భోగముల ననుభవించుకాలమున వాని కీ గొప్పకష్టము తిరుగ కలుగుచున్నది.'నీవువనమునకు వెళ్ళవలయు'నని నేను వానితో బలికిన వాడు మాఱుమాట్లాడక 'అట్లే' యనును. శుద్ధమగు మనస్సు కలవాడగుటచే నామనస్సులోని భావము తెలిసికొనలేడు. నే నట్లు పలికినపుడు వాడు ప్రతికూలమగు జబాబు చెప్పిన నాకు సంతోషముగ నుండును. కాని వాడట్లు చేయడు. వాడు వనమునకు బోవ నేను లోకములో నందఱిని ధిక్కరించినందులకు మృత్యువు నన్ను క్షమింపక యమలోకమునకు దీసికొనిపోవును. నాకిష్టులగు మిగిలినజనులకు నీ వేమి పాపము జేసెదవో? సుమిత్రయు, చనిపోవుటకు సిద్ధముగనుండుకౌసల్యయు, లక్ష్మణశత్రుఘ్నులను, వనవాసమునకు వెళ్ళిన రాముని విడిచి నాతో మరణము నొందుదురు.వీరినందఱిని దుఃఖమున విడిచి కైకా! నీవు సుఖమును బొందుము. శాశ్వతమైనదియు మంచిగుణములుగలదియునగు నిక్ష్వాకువంశమును నేనును, రాముడును విడువ దానికి క్షోభ కలుగును. వానివనవాసము భరతున కిష్టమైన వాడు నా ప్రేతకార్యములను జరుపగూడదు. అమర్యాదగలదానా! శత్రురాలా! నీకోరిక సిద్ధించుగాక! నీవు రాజపుత్రికారూపమున నాయింటిలోనున్నావు. నీపాపపుకార్యమువలన నాకు లోకమున నెక్కువయపకీర్తియు, శాశ్వతమగు పరాభవమును, నన్నిజీవులకు నవమానము గలుగును. గడియగడియకు నేనుగులను,గుఱ్ఱములను,రథములను నెక్కి తిరిగెడు రాముడు గొప్పవనములో నెట్లునడచును? రాజభవనములో కుండలములుధరించుకొనిన మంచివంటవాండ్రచే తయారుకాబడిన రుచిగలపానీయములను, భోజనములను భుజించు

రాముడు వనములో బుట్టిన వగరు, చేదు, కారముగల వస్తువుల నెట్లు తినగలడు? మంచివస్త్రములను గట్టి చిరకాలము హంసతూలికా తల్పముల సుఖమున ననుభవించుచుండిన రాముడు కాషాయరంగుగల బట్టలను గట్టి భూమియం దెట్లు నివసింపగలడు? 'నీ వీదారుణవరముల నడుగు'మని నీ కెవ 'రాలోచన జెప్పిరి? ఛీ! స్త్రీ లెల్లపుడు తమకోరికలనె నెఱవేర్చుకొనుక్రూరురాండ్రే కాని మంచిచెడ్డల నరయువారు కారు. నేను వారితోగాక ముఖ్యముగ భరతుని తల్లితో మాట్లాడను. అనర్థభావములుగలదానా! స్వార్థపరాయణురాలా! క్రూరురాలా! నాకు గొప్పవిచారము కలిగించుటలో గొప్పమనస్సుగలదానా! లోకోపకారియగు రామునియందుగాని, నాయందుగాని నీ కప్రియములగు పనులను వేనిని జూచితివి? వాడు విచారమునొంద లోకమంతయు నీయెడ గోపించును. నీసంగతిని జూచి తండ్రులు కొడుకులను, భార్యలు తమయెడ ననురాగమును జూపు తమభర్తలను విడిచెదరు. దేవతుల్యస్వరూపుడును, నలంకృతుడును నగు నారాముడు వచ్చునపుడు వానిని జూచి నేను నూతనముగ యౌవనమువచ్చినవాని వలె సంతోషింతును. సూర్యుడు లేకున్నను, నింద్రుడు వర్షింపకపోయినను లోకగతిజరుగును; గాని రాము డిక్కడనుండి వెళ్లిపోయిన యెడల నెవడును బ్రతుకలేడని నాయభిప్రాయము. ఒకపురుషునిచే పాలుపోసి పెంచబడిన గొప్పవిషముగలపాము తిరిగి యాపురుషునికి మృత్యువు గలుగజేయునట్లు నావినాశమును, నప్రియమును జేయునట్టి నిన్ను నామృత్యుదేవతవలె నాయింటిలో గాపురముంచి యజ్ఞానముచే మరణమునొందుచున్నాను. నేనును, రాముడును, లక్ష్మణుడును లేనట్టిపట్టణమును, దేశమును నీవును, నీభరతుడును పాలించి మాబంధువులకు మరణముగలిగించి మావిరోధులను సంతోషము నొందించెదరు. క్రూరప్రవృత్తిగలదానా! యాపద

నొందినవారికి విపత్తుగలిగించుదానా! నామాటలను నీవు బలవంతముగ తిరస్కరించి పలికినపుడు నీపండ్లు వేయిముక్కలయి నీనోటినుండి యేల పడుటలేదు! రాముడు నీతో నప్రియముల నేమియు బలుక లేదు. కఠినపుమాటలను పలుకుట వానికి తెలియదు. ఎల్లప్పుడును మంచి గుణములు గలవాడును, మనోహరమైన వాక్కుగలవాడునునగు రాముని యందు దోషము లేల యారోపించెదవు? నీ వెంతయేడ్చినను, కోపించినను, నష్టమునొందినను, వేయిముక్కలయి భూమిమీద పడినను నాకిష్టములేని యీదారుణపుకోరికలను నేను జరుపను. కత్తితో సమానురాలవును, మిక్కిలిదుష్టస్వభావముకలదానవును, నెల్లపుడు నెగ్గులు పలుకుదానవును, నావంశమునకు చేటుదెచ్చుదానవును, నామనస్సునకు విచారముకలిగించుదానవును, నాహృదయమును మండునట్లుచేయు దానవునునగు నీవు చచ్చినను నేను విచారింపను. నాకుమారుని విడిచి నేను జీవింపలేనపుడు నాకు నీతో క్రీడలేల? నాకయిష్టములగు పనులను జేయకుము. నీపాదములను బట్టెదను. నాయందు దయ జూపుము.” ఇట్లు దశరథు డనాథునివలె విలపించుచు కైకేయియనీస మైన హృదయముకలవాడై యామెపాదములను బట్టబోయి వానిని ముట్టలేక గొప్పరోగివలె భూమియందు బడెను.

అట్టిసమయమున పాపరూపముగల కైకేయి భయములేనిదై తనమనోభీష్టము జరుగలేదని బిగ్గరగా రాజు నిట్లడిగెను. “మహా రాజా! ‘నేను గొప్పసత్యవాదిని, దృఢవ్రతుడ’నని నీవు శ్లాఘించు కొనుచున్నావుగదా! నావరములనేల జరుపుటకు నిష్టపడవు.” అన దానికి రాజు క్రోధముచే నొకగడియ మూర్ఛజెందినవానివలె గనబడి యామెను నిందించుచు రాముని గుణములను పొగడుచు నిట్లువిలపించెను. “నేను స్వర్గమునకు వెళ్ళినపుడు దేవతలు ‘రామునియభిషేక మేల తప్పించితి’వనియడిగిన నే నేమిమాటలు పలుకుదును. ‘కైకేయి ప్రియ

ముకొఱకు నేను రామునివనమునకు బంపితి'ననిన 'నేనతనికి రాజ్యాభిషేకము జేసెద'నన్నపలు కబద్ధమగును. అపుత్రుడనగు నేను గొప్ప శ్రమచే రాముని గంటిని. అట్టివానిని నే నెట్లు విడువగలను? వానికి దుఃఖము కలుగ జేయకుండ నే నిప్పుడే మరణము నొందిన నాకుస్వర్గమున సుఖము కలుగును." ఇట్లు దశరథుడు విలపించుచుండ నతని మనస్సు మిక్కిలిచలించుచుండ సూర్యాస్తమయ మయ్యెను. రాత్రి గూడ మూడుజాములు గడిచెను. ఆకాశమున నక్షత్రములు, చంద్రుడు ప్రకాశించుచున్నను నారాత్రి ప్రకాశమానముగ వానికి గనబడలేదు. దశరథుడు వేడినిట్టూర్పుదీయుచు నాకాశమును జూచుచు మిక్కిలి దుఃఖించుచు 'ఓరాత్రీ! నీకు నమస్కరించెదను; నీవు తెల్లవాఱకుము. తెల్లవాఱినచో రామునితో నాకు వియోగము గలుగును. లేక తెల్లవాఱినను శీఘ్రముగ తెల్లవాఱుము. నాకు గొప్పవ్యసనము కలిగించిన నిర్దయగల యీక్రూరురాలి సముఖము తప్పును.' అనిపలికి కైకేయిని సంతోషపఱచుటకు చేతులుజోడించి యామెతో నిట్లనెను. "నీవలన నాప్రాణములు పోవుచున్నవి. నేను దీనుడను; రాజును; నీభర్తను. కావున నాయెడ దయజూపుము. రామపట్టభిషేకమును నేను పెద్దసభలో దెలియబలికితిని. నాయందు దయగలదానవై నేను నీకిచ్చిన రాజ్యమును రామునకిచ్చి గొప్ప కీర్తిని బొందుము. ఈప్రియము నాకును, వానికినిగాక లోకమంతకును, మాగురువులకును, భరతునకునుగూడ నగును." ఇట్లు మంచి స్వభావముగల దశరథుడు దీనత్వముతో నేడ్చినను, వానికండ్లెఱ్ఱనై కన్నీరుతోనిండినను క్రూరురాలగు నాకైకేయి మాఱుపలుకలేదు. అతడు రామునివనవాసముగూర్చి యామెప్రతికూలపుమాటలను విని తిరుగ మూర్ఛనొంది దుఃఖముతో క్రిందబడెను.

కైకేయిదీనినిజూచి "నాతో నాతీరున ప్రతిజ్ఞ జేసియిపుడు దానిని చేయనని పలికి యీతీరున భూమియందు పడియుండుట నీకు తగదు.

ధర్మము తెలిసినజనులు 'సత్యము పరమధర్మ'మని పలుకుదురు. దాని ననుసరించియే నీవు నాకు వరము లిచ్చితి"వని యాతనితో పలికి శైబ్యాదుల పూర్వకథలను తిరుగ జెప్పి సత్యమును గూర్చి యిట్లుపన్యసించెను. "సత్యమను పదమొక్కటియే బ్రహ్మము. దానియందు ధర్మము ప్రతిష్ఠింపబడెను. నాశనములేని వేదములు నదియే. దానిచే నక్షయపదవిని బొందనగును. నీకు ధర్మమందు మన స్సున్నయెడల సత్యమును బరిపాలింపుము. నీవు నా కిచ్చినవరములు సఫలములగుగాక! ధర్మవృద్ధికొఱకు నాప్రేరణచే రాముని వనవాసమునకు బంపుము. ముఖ్యముగ మూడు పర్యాయములు చెప్పుచున్నాను. అట్లు నీవు చేయకనన్ను విడిచిననేను నీయెదుట నాప్రాణములను విడిచెదను." ఇట్లామె యేమియు నను మానములేక పలుక బలి యింద్రప్రేరితుడైన వామనునిమాటలను దప్పించుకొనలేనటుల దశరథు డామెమాటలను దప్పించుకొనలేక పోయెను. రెండుచక్రములమధ్యను కష్టముగ నడచు నెద్దువలె నాతడు చంచలమనస్కుడును, వాడినముఖముకలవాడును, కండ్లు చీకట్లుక్రమ్ముటచే చూడలేనివాడునునై అతికష్టముతో ధైర్యము తెచ్చుకొని యామెతో నిట్లనెను, "నిన్ను అగ్నిసాక్షిగ మంత్రములతో పాణిగ్రహణముజేసికొనిన నేను నిన్ను నీపుత్రుని నీవారిని విడిచెదను. రాత్రి తెల్లవాఱినది. సూర్యోదయమున నాగురువులు సిద్ధపఱచిన వస్తువులతో రామునికి నభిషేకముజేయుటకు తొందరపెట్టెదరు. వానితో రాముడు నామరణక్రియలను జరుపును. దుష్టురాలా! యీగొప్పకార్యమునకు నడ్డువచ్చిన నీవును, నీపుత్రుడును నామరణక్రియ జరుపగూడదు. పట్టాభిషేకమహోత్సవమునుగూర్చి సంతోషముగనున్నజనులు దానిభంగమునకు మిక్కిలి విచారముగనుండ నేను చూడలేను." ఇట్లు దశరథుడు పలుకుచుండ తెల్లవాఱెను. కైకేయి యాతనిమాటలకు రోషముజెంది కఠినముగ 'రాజా! గర

శమును ద్రాగినరోగివలె నీ విట్లేల పలికెదవు? రాముని నిక్కడకు రప్పింపుము. నీవు నాకుమారుని రాజ్యమున నిలిపి రాముని వనమునకు బంపి నన్ను సపత్నులయధికారమునుండి తొలగించి కృతకృత్యుడ వగుము.' అని పలికెను. అప్పుడు రాజు తీక్ష్ణమగు నామెమాటలను మంచికొరడాతో కొట్టబడిన గుఱ్ఱమువలె విచారమును బొంది యామెకు 'నేను ధర్మబంధమునకు గట్టువడితిని. నామనస్సు చెడినది. నాకు ప్రియుడును, జ్యేష్ఠపుత్రుడునునగు రాముని నేను జూడ గోరెద' నని సెలవిచ్చెను.

---

## ౮ వ. అధ్యాయము.

## రాముని పట్టాభిషేక భంగము.

రామునిపట్టాభిషేకము జరుగబోవుదినమునకు ముందురోజున దశరథుడు వసిష్ఠునితో జేయవలసినకార్యములన్నియు నిర్ణయించెను. ఆదినమున కులగురువగు వసిష్ఠుడు పెందలకడ లేచి సరయూనదిలో స్నానముజేసి యభిషేకసామగ్రినంతయు దెప్పించి నయోధ్యలో జరుగుచున్న యుత్సవములను తనశిష్యులతో జూచుచు రాజునగరు ప్రవేశించుసమయమున నచట ననేకద్విజులు మూగియుండిరి. పౌరులును, దేశీయులును, యజ్ఞకార్యములనుజరుపు సభార్హులగు గొప్ప బ్రాహ్మణులునుగూడ నుండిరి. వసిష్ఠుడు సంతోషించి రాజగృహము బ్రవేశించుచు రాజనగరునుండి వెలికివచ్చు సుమంత్రుడనువానిని జూచి యాతనితో "నేను వచ్చినట్లు దశరథునకు దెలుపుము. మఱియు నభిషేకమునకై పూర్వదినమున నతడు కోరినవస్తువులను, బంగారు బిందెలతోను, వెండిబిందెలతోను గంగాయమునాసంగమములోని

జలము, తూర్పునకు పాఱునవియు, మీఁదికి నెగయునవియు, వంకరగ పాఱునవియునగు నదులలోనిజలము, సరస్సులలోని జలము, లోతైనచెరువులలోనిజలము, నూతులలోనిజలము తేబడెను. పాలతోను, పేలాలతోను నిండినబంగారుపాత్రిలు, వెండిపాత్రిలు, 'ఔదుంబర'మనెడు మంచిపీఠము, దర్భలు, పువ్వులు, పాలు, నేయి, పెరుగు, నాలుగుగుఱ్ఱములు, వ్యాఘ్రిచర్మాసనముగలరథము, ఖడ్గము, గొప్పధనస్సు, పల్లకీలు, సవారీలు మొదలగు వాహనములు, బంగారుజారీ, మంచిమూపురముగల తెల్లనియెద్దు, నాల్గుకోఱలుగల సింహము, తెల్లనిపెద్దగుఱ్ఱము, తెల్లనిగొడుగు, తెల్లనివింజామరలు, పులిచర్మముగలసింహాసనము, హోమమునకు నగ్నిహోత్రిము, సమిధలు, మంచిమృగములు, పక్షులు, మంచిగోవులు, మంగళకరులును, నలంకరింపబడినవారునునగు సౌందర్యముగల యెనమండుగురు కన్యలు, అలంకరించుకొనినవేశ్యలు, వాద్యములు సిద్ధముగ నున్నవి. ఆచార్యులు, బ్రాహ్మణులు, పౌరులు, దేశీయులు, గొప్ప వర్తకులు, అమాత్యులు, సేనాముఖ్యులు, పట్టణవాసులలోముఖ్యులు, దేశములనుండి వచ్చినరాజులు, ఇతరులు వేచియున్నారని తెలుపుము. నీవు లోనికి బోయి మంచినక్షత్రిమున రాముడు రాజ్యమును బొందునట్టుల దశరథునితొందరజేయు"మని పలికెను. అతడు రాజాంతఃపురము జేరి లోనికి బోయెను. అతడు రాజునకిష్టుడును, వృద్ధుడును, పూర్వమునుండి లోనికి బోవువాడును నగుటచే ద్వారపాలకు లాతని నడ్డలేదు. అతడు దశరథుని మనస్థితి తెలియక పూర్వమువలె నేయిప్పుడును నమస్కరించుచు వాని నిట్లు స్తుతించెను. "పూర్ణచంద్రోదయమున సముద్రిము పొంగునటుల మీరు సంతోషింపుడు. ఇంద్రుడు దానవుల జయించునట్లు ఇట్టిప్రిభాతసమయమున మాతలి యింద్రుని బొగిడెను. కావున సారథినగను, సాంగవేదములు తమవిభుడగు

బ్రహ్మను స్తుతించునటులను, సూర్యచంద్రులు భూమిని స్తుతించునటులను, నేను మిమ్ములను స్తుతించి లేపెదను. మేరువున నుదయించు భాస్కరునివలె మీరు లేచి మంగళకృత్యములను దీర్చుడు. ఇంద్రుడును, సూర్యచంద్రులును, నగ్నులును మీకు జయ మొసర్చెదరు గాక! రాత్రి తెల్లవాఱినది. మీరు చేయవలసిన కార్యమును జరుపుడు. పౌరులును, దేశీయులును, వర్తకులును రాముని యభిషేకమునకు సిద్ధముగనున్నారు. కృతాంజలియగు వసిష్ఠుడుగూడ బ్రాహ్మణులతో సిద్ధముగనున్నాడు. అభిషేకమునకై మీరు శీఘ్రముగ నాజ్ఞాపింపుడు. రాజులేని రాష్ట్రము పాలకులులేని పశువులవలెను, నాయకుడులేని సేనవలెను, చంద్రుడులేని రాత్రివలెను, వృషభములేని యావులమందవలెను నుండును." ఇట్లు సుమంత్రుడు విన్నవింప రాజు మిక్కిలి విచారించెను. పిమ్మట దశరథుడు తనకుమారుడగు రామునిగూర్చి సంతోషము లేనివాడై శోకముచే నెఱ్ఱబడిన నేత్రములతో సూతుని జూచి 'నీవాక్యములచే నీవు నాహృదయశల్యములను బాధించుచున్నావు.' అని పలుక నతడు రాజుదీనత్వముజూచి జోడించినచేతులతో కొంచెము ప్రక్కకు బోయెను. రాజు వానితో మాటలాడలేకపోవుట నాలోచన నెఱిగిన కైకేయి చూచి వానితో "సుమంత్రా! నిన్నటి రాత్రి రాముని యుత్సవముగూర్చి సంతోషము కలుగ నీరాజు పెద్దజాగరముచే నలిసి నిద్రపోవుచున్నాడు. నీవు శీఘ్రముగబోయి కీర్తిమంతుడును, రాజపుత్రుడునునగు రాముని దీసికొనిరమ్ము. నీకు శుభమగుగాక! మఱియొకతీరున నాలోచింపకుము." అని పలుక సుమంత్రు డాతనికి మంగళముజరుగునని తన మనస్సులో సంతోషించి రాజు శాసనముచే నామె యట్లు పలికెనని యాలోచించి వెంటనే బయలుదేఱెను. ఆమె పలికినది స్పష్టముగ రామాభిషేకముగూర్చియని యు, రాము డక్కడకు వచ్చు

ననియు సుమంత్రు డాలోచించెను. అతడు రామునిగృహమునకు బోవుచు రాజద్వారమున నభిషేకమునుగూర్చి యందఱు సిద్ధముగ నుండుట జూచెను. అప్పు డక్కడ కూడిన రాజులందఱు దశరథుడు రాకపోవుట జూచి 'మేము వచ్చినట్లాతనికి దెలుపువా రెవరు? సూర్యుడుదయించినను, నభిషేకమునకు నంతయు సిద్ధముగనున్నను నాతనిని గానము.' అని పలికిరి. అంతట వారితో సుమంత్రుడు 'నన్ను రాముని తొందరగ తీసికొనివచ్చుటకు మహారాజు పంపెను. అతడును, రాముడును మిమ్ము గౌరవించెదరు. మీమాటల నాతనికి దెలిపి యతని నిచటకు రమ్మని చెప్పెద' నని పలికి రాజభవనము తిరుగ ప్రవేశించి దశరథునకు తనకు మధ్యను తెరమాత్రముండ పూర్వమువలెనే యాతని స్తుతించి వాని కంతయు దెలిపెను. అంత నతడు సూతునితో 'రాముని దీసికొనిరమ్మనిన యామెమాటలను నీ వేలజరుపలేదు? నేను గాఢనిద్ర జెందలేదు. రాముని నిక్కడకు శీఘ్రముగ దీసికొనిరమ్ము' అని తిరుగ వానికి నాజ్ఞాపించెను.

సుమంత్రుడు రాజవచనము జరుపుటకు రాజగృహము విడిచి దారిలో రామాభిషేకకథలు చెప్పుకొనుచు సంతోషించుచున్న జనులను జూచుచు రథము నడుపుటలో తనచమత్కారమును జూపి ప్రజలను సంతోషింపజేయుచు మేరు కైలాసశిఖరములతోను, నింద్ర కుబేరుల భవనములతోను తుల్యమగు రామునిభవనమును జేరి యక్కడ నతని యభిషేకమునకై వేచియుండి కానుకలతో సిద్ధముగ నున్న యనేకప్రజలను జూచెను. మరుగుజ్జువారును, చిన్నశరీరము గలమనుష్యులును నాతని నగరునకు కాపలాయుండిరి. అక్కడ నెమళ్ళు, మంచిమృగములు, ఇతరపక్షులు విస్తారముగ నుండెను. పట్టాభిషేకప్రసంగము లనేకములు జరుగుచుండెను. రాముని వాహనమగు గొప్పశరీరముగల 'శత్రుంజయ'మను నేను గక్కడ

నిలిచెను. గుఱ్ఱములనుగట్టిన రథములును, ఏనుగులనెక్కిన గొప్ప యమాత్యులును, యతనిస్నేహితు లనేకులునుగల యారాజనగరు ద్వారమును సుమంత్రుడు దాటెను. తరువాత యతడు మొదటి ప్రాకారమున నాయుధములను ధరించినవారును, జాగరూకులును, రామునియందే మనస్సునిలిపినవారును, యౌవనులును నగు పురుషులను జూచెను. వృద్ధులును, దండధరులును, నేమరుపాటులేనివారును యగు ద్వారపాలకు లాతని జూచి వారుండుచోట్ల వారు నిలువ యతడు వారితో తాను వచ్చినవార్తను రామునికి దెలుపవలెనని పలికెను. వా రట్లాతనియొద్దకు బోయి సీతతోనుండు రామునికి సుమంత్రుని రాక దెలియజేసిరి. అతడు సుమంత్రుని తనయొద్దకు రప్పించెను. రాముడు బంగారుచే నలంకరింపబడిన పాన్పుపై కుబేరునివలె కూర్చుండియుండెను. ఆతనిశరీరమున మంచిగంధము పూయబడియుండ సీత తనచేతితో నాతనికి చామరము వీచుచుండెను. అప్పు డాతడు చిత్తానక్షత్రముతో జేరిన చంద్రునివలె ప్రకాశింప సూతు డాతనికి నమస్కరించి యోగక్షేమముల నడిగి 'దశరథుడును, కైకేయియు నిన్ను జూడగోరియున్నందున శీఘ్రముగ బయలుదేఱు' మని వానిని గోరెను. దానికి రాముడు సుమంత్రునికి తగినమర్యాద జరిపి సీతతో నిట్లు పలికెను. "నాతండ్రి మాపినతల్లియగు కైకేయితో గలిసి నాపట్టాభిషేకమునుగూర్చి నిశ్చయముగ నాలోచించిరి. ఆమె కూడ రాజాభిప్రాయమును గనుగొని నాప్రియమును గోరి రాజును ప్రోత్సాహపఱచినది. నా శ్రేయమునకే వారు తమకుదగిన దూతయగు సీతని బంపిరి. ఈదినమున నాయభిషేకము జరుగుట నిశ్చయము. ఇప్పుడే నే నిక్కడనుండి వెడలి రాజును జూచెదను. నీవు పరిచారికలతో సుఖముగ జరింపుము." ఈతీరున రాముడు పలుక సీత యాతనితో ద్వారమువఱకు వచ్చి "ఇంద్రునకు బ్రహ్మ యభి

షేక మొనర్చినటుల దీక్షగలవారును, శుచియగువారును, వ్రతసంపన్నులును, నజినధారులునునగు మీకు దశరథుడు నభిషేక మొనర్చును. మిమ్ము నేను సేవించియుండెదను. మీరాజ్యమును తూర్పున నింద్రుడును, దక్షిణమున యముడును, పశ్చిమమున వరుణుడును, నుత్తరమున కుబేరుడును రక్షింతురుగాక!" యని శుభవచనములు పలుక సుమంత్రునితో నాతడు బయలుదేఱెను. రాజభవనద్వారము వద్ద లక్ష్మణుడు చేతులుజోడించుకొని వినయమున నిలిచెను. రాముడు మధ్యమప్రాకారమువద్ద తన శ్రేయస్సుగోరు మిత్రులను జూచి సంతోషించి తాను లక్ష్మణసుమంత్రులతో నగ్నితుల్యమగునదియు, పులిచర్మముగలదియునగు వెండిరథము నెక్కెను. దానికి పిల్లయేనుగు వంటిబలముగలగుఱ్ఱములు కట్టబడెను. అది బంగారుచిరుగంటలతోను, మణులతోను, నలంకరింపబడి మేఘమువలె ధ్వనిజేయుచు నింద్రుని రథమువలె శీఘ్రముగ వెళ్ళెను. లక్ష్మణుడు ఛత్రచామరముల బట్టి రాముని వెనుక నిలిచెను. చాలమంది ప్రజ లటునిటు సంచరించుటచే కలకలశబ్దముపుట్టెను. వేలకొలది గొప్పగుఱ్ఱములు, పెద్దయేనుగులురథము వెనుక నడిచినవి. ఖడ్గములను, విండ్లను బట్టిన శూరులు 'జాగ్రత్త'యని మందలించుచు రథముముందు నడిచిరి. వాద్యశబ్దములును, స్తుతిపాఠకులశబ్దములును, సూరులసింహనాదములును, దారిలో వినబడెను. మేడలపైని కిటికీలనుండి స్త్రీలు ఉత్సవమును జూచుచు రథముపైని పుష్పవర్షము కురిపించిరి. వారును, క్రిందనుండిన స్త్రీలును రాముని యందలి ప్రీతిచే నతనిని తగినవాక్యములతో నిట్లు పొగిడిరి. "నీవిటుల రాజ్యపదవినొంద నీతల్లి మిక్కిలిసంతోషించును. స్త్రీలందఱిలో నుత్తమురాలును, నీకు ప్రియురాలునునగు సీత పూర్వము నిశ్చయముగ గొప్పతపస్సు జేసినది. కనుక నే రోహిణి చంద్రునిగూడునట్లామె నిన్ను గూడి ని న్ననుసరించియున్నది." స్త్రీలు పలుకు నీప్రియ

వాక్యములను రాముడు వినెను. దారిలోనిండియున్న పురజనులును, దేశములోనిజనులును 'దశరథునిదయచే రామునకు నీదినమున గొప్ప శ్రేయస్సు కలుగును. మనకోరికలన్నియు నెఱవేఱును. ఈతడు మనలను బాలించును. ఇతడెప్పుడును ప్రజాలాభమునే చేకూర్చును. ఈతనిరాజ్యమున నెవనికిని విప్రియముగాని, దుఃఖముగాని కలుగ' దని ప్రసంగించిరి. ప్రజలు దారిలో జండాలను, స్వాగతములు వ్రాయబడిన ధ్వజములను గట్టిరి. అగరుధూపములను వేసిరి. చందనపువాసన కొట్టుచుండెను. మంచిబట్టలను, పట్టుబట్టలను, ముత్యములను, స్ఫటికములను ప్రజలు ధరించిరి. అంగళ్ళలో ననేకరకములగు భక్ష్యములును, ననేకవివిధవస్తువులును నమ్మబడెను. నాలుగుబాటలు కలిసినచోట పెరుగు, అక్షతలు, హవిస్సు, పేలాలు జల్లబడెను. అగరు చందనధూపములు వేయబడెను. రాముడు తనయందిష్టము గలవారియాశీర్వాదముల ననేకములను వినుచుండెను. ప్రజలు "మీపితామహులును, ప్రపితామహులును జరిపినమార్గము మీరవలంబించి యీదినమున నభిషిక్తులై మమ్ములను బాలింపుడు. మీరు రాజ్యముచేయ పూర్వులపాలనలో నుండునంతకంటె నెక్కువ సుఖముగ నుండెదము. మాకీదినమున భోజనముకాని, పరలోకసౌఖ్యము కొఱకుజేయు క్రియలుగాని యక్కఱలేదు. మీరు రాజ్యముచేయుటకంటె నెక్కువయిష్టమగు నంశము మాకేదియులేదు." అని యాతని స్తుతించిరి. అక్కడిప్రజలందఱిమనస్సులు, నేత్రములు, రామునందే లగ్నమైయుండెను. అతడు దూరముగ వెళ్లినను నతనియందు దృష్టి దప్పించువా రెవరును లేకుండిరి. అతనిని జూడనినరుడును అతనిచే జూడబడనినరుడును లోకములో నిందితుడై నివసించును. వానియాత్మ గూడ వాని నసహ్యించుకొనును. నాలుగువర్ణములకు జెందినజనుల కందఱికి వారివయస్సునకు దగినటుల నాతడు దయజూపెను. కాన

వారందఱు జతఃనాశ్రయించిరి. అతడు చతుష్పథములను, దేవాలయములను, గొప్పవృక్షములను, సభాదులను ప్రదక్షిణము జేయుచు గొప్పకైలాసశిఖరములవలెనున్న మేడలుగలిగి యింద్రభవనమువలె నున్న దశరథుని రాజనగరును జేరెను. రాముడు మూడుప్రాకారములు రథముమీదనుండి దాటి మఱిరెండుప్రాకారములను కాలినడకను దాటి యంతఃపురమున బ్రవేశించెను. అతడు తనతండ్రిని జూచుటకు వెళ్ళినతరువాత ప్రజలత డెప్పుడు తిరుగ పైకి వచ్చునో యని వేడుకతో వేచియుండిరి.

రాముడు దీనుడైనట్టియు, నాసనముమీద కూర్చున్నట్టియు, వాడినముఖముకలిగినట్టియు తనతండ్రిని, వానిప్రక్కనున్న కైకేయిని జూచి వినయముతో మొదట నాతనిపాదములకు వందనమొనర్చి తరువాత నామెపాదములకు మ్రొక్కెను. అతడు 'రామా!' యను మాటనుమాత్రము పలికి కండ్లంటనీరు తెచ్చుకొని దీనుడై వానిని జూచుటకుగాని, వానితో మాట్లాడుటకుగాని శక్తుడుగాకపోయెను. అప్పుడు రాముడు భయమునుగలిగించు నపూర్వమైనరూపముగల తనతండ్రి నిట్టూర్పుదీయుటయు, శోకముచే బాధనొందినయింద్రియములును, దుఃఖముచే చలించిన మనస్సును గలిగియుండుటయు గనిపెట్టి యాతడు రాహుగ్రస్తచంద్రునివలెను, నబద్ధమాడిన ఋషివలెను గనబడ తొందరయు, భయమును బొందెను. అప్పుడు రాముడు తానువచ్చినతోడనే తనతండ్రి యేలసంతోషింపడనియు, పూర్వమతడు కోపించియున్నను తన్నుజూచినయెడ నేల దయగలిగి యుండడనియు, తన్నుజూచియు నతడేల యాయాసము జెందుచున్నాడనియు నాలోచించెను. తరువాత రాముడు గొప్పవిచారమును బొంది ముఖకాంతి తగ్గ కైకేయికి నమస్కరించి యామెతో నిట్లనెను. "నేనజ్ఞానముచే నాతండ్రికి కోపముగలిగించునట్టుల నపరాధ మేమియు జేసి

యుండలేదుగదా? దయతో నాకు దెలుపుము. ఎల్లప్పుడును నాయెడ ప్రసన్నుడైన నాతండ్రి మనస్సులో విచారమును బొంది ముఖకాంతి తగ్గ దీనుడై నాతో నేల మాట్లాడడు? శరీరరోగముగాని, మనోతాపముగాని యీతని బాధించుచుండుట లేదుగదా? మనుజునకెల్లపుడు సుఖముండుట దుర్లభము. ప్రియమైనరూపముగల భరతునికిగాని, మహాబలుడగు శత్రుఘ్నునకుగాని, నాతల్లులకుగాని చెడుగేదియు గలుగలేదుగదా? నాతండ్రికి సంతోషముకలిగింపకయు, నాతనివచనములను జరుపకయు, నాతడు కోపించియుండ నేనొక నిమిషమైనను జీవింపలేను. మనుజుడు తనజన్మకు మూలకారణమును, ప్రత్యక్షదైవమునునగు తనతండ్రిమాటల నెట్లు జరుపకయుండును? మీరు కోపముచేగాని, గర్వముచేగాని నాతండ్రి నేమైన కఠినవాక్యముల బలుక నాతడు దుఃఖమును బొందలేదుగదా? తల్లీ! నిజమును బలుకగోరుచున్నాను. ఈతనికి నపూర్వమగు నీవికార మేలగలిగెను?”

ఇట్లు రాముడు కైకేయి నడుగ నామె లజ్జను విడిచి కఠినమనస్సుతో తన కుపయోగమగుమాటల నిట్లు పలికెను. “రామా! రాజు కోపింపలేదు. వానికేమియు విచారము లేదు. నీయందలిభయముచే తన మనస్సులోనున్న స్వల్పవిషయమును నీతో బలుకలేకున్నాడు. ప్రియుడవగు నీతో నప్రియములు పలుకుటకు నాతనికి నోరు రాకున్నది. ఆతడు నాతో జెప్పినదానిని నీవు తప్పకజరుపవలెను. పూర్వమీతడు నన్ను మర్యాదజేసి వరము లిచ్చి తుదకు నభిమానముగల యితర పురుషునివలె విచారించుచున్నాడు. ‘లోకమంతయు ధర్మమూలం’ మని సత్పురుషులందఱికి దెలియును. నీవిషయమై రాజు నామీద కోపము జెందినను నతనికి సత్యమును విడుచుట తగదు. రాజు నీకు తెలియబఱచినది శుభమైనను నశుభమైనను దానిని దప్పక నీవు జరిపే యెడల నీకంతయు నేను దెలిపెదను. రాజు నీతో జెప్పుమాటలు

నీవు 'తప్పక జరిపెద'నన్న వానిని నీకు దెలిపెదను. వానిని రాజు నీతో స్వయముగ జెప్పడు." ఇట్లు కైకేయి పలుక రాముడు మిక్కిలి విచారమునొంది రాజుసన్నిధిని "అయ్యో! తల్లీ!నీవిట్లు పలుకదగదు. రాజు తండ్రియు, గురుడును, హితుడునుగనుక నాతనివాక్యములను జరుపుటకు నేనగ్నిలోనైనను బ్రవేశింతును. తీక్ష్ణమైన విషమునైనను మ్రింగెదను. సముద్రములోనైన మునిగెదను. రాజు కోరినమాటలను నీవు పలుకుము. 'నేను తప్పక జేసెద'నని ప్రతిజ్ఞ జేసెదను. రాముడు రెండవమాట పలుకడు." అని చెప్పెను. ఇట్లు ఋజుమార్గవర్తియు, సత్యము పలుకువాడునగు రాముడు పలుక మర్యాదహీనురాలగు కైకేయి గొప్పదారుణమగు నీవాక్యములను నుడివెను. "పూర్వము దేవాసురయుద్ధములో నీతండ్రిశరీరమునకు శస్త్రములు తలిగియుండ నే నాతని రక్షించుటచే నాతడు నాకు రెండువరముల నిచ్చెను. కావున నేడు నేను భరతునిపట్టాభిషేకమును, నీ వీదినమున దండకారణ్యమునకు బోవుటయు నను నా రెండువరములను గోరియుంటిని. నీవు, నీతండ్రి సత్యపరిపాలకులు కాగోరిన నావాక్యము వినుము. ఆతడు నాతో సెలవిచ్చినటుల నీవు రాజాజ్ఞ జరుపుము. నీవు 14 సంవత్సరములు వనవాసము జేయవలెను. నీపట్టాభిషేకమునకై సమకూర్చిన సామగ్రితో రాజు భరతుని కభిషేకము జరుపవలెను, నీ వీయుత్సవమును విడిచి జటలను, చర్మమును ధరించి దండకారణ్యములో నివసింపుము. పుష్కలమగు నీకోసలదేశమున భరతుడు నిలిచి భూమిని పరిపాలించుగాక! నాకీవరము లిచ్చుటచే రాజు విచారమునొంది నీమొగము జూడలేకున్నాడు. నీవు రాజు మాట జరిపి గొప్పసత్యపరిపాలనచే నాతని తరింపజేయుము." ఈ తీరున మరణతుల్యములగు వాక్యముల నామె పలికినను రామునికి శోకము కలుగలేదు. పుత్రునికష్టమునకు పరితాపము నొందిన మహానుభావుడగు నా రాజు దానికి గొప్పబాధనొందెను.

అప్పుడు రాము డామెతో నిట్లనెను. "అట్లే జరుగుగాక! నేను రాజాజ్ఞను పరిపాలించుచు జటాజినధరుడనై యిక్కడనుండి వనములో నివసించుటకు వెళ్లెదను. కాని పూర్వము నన్ను జూచి సంతోషించునటుల రాజు నేడేల యానందింపక యున్నాడో నేను తెలియగోరెదను. నీవు దైన్యము నొందకుము. నీయెదుటనే నేను నారబట్టలు, జటలు ధరించి వనమునకు బోయెదను. నీవు సంప్రీతి నొందుము. వరముల నిచ్చినరాజాజ్ఞాపించినపుడు నిశ్శంకగ నాతని ప్రియమును నేనేల యొనర్పను? రాజు నాతో స్వయముగ భరతుని పట్టాభిషేకమునుగూర్చి దెలుపలేదను నప్రియము నామనస్సులో నిలిచి నాహృదయమును దహించుచున్నది. నే నాజ్ఞాపింపబడకయే సంతోషముతో వానినిగూర్చి సీతను, రాజ్యమును, నాకిష్టమగు ప్రాణములనుగూడ నిచ్చువాడను. అట్టిచో నాతండ్రి స్వయముగ నాజ్ఞాపించునపుడు నీప్రియముకొఱకు నాతండ్రిప్రతిజ్ఞ నే నేల పాలింపను? రాజు భూమివైపు మొగము త్రిప్పుకొని కన్నీరు విడుచుచున్నందుకు నీ వాతని నోదార్పుడు. రాజాజ్ఞచే తనమేన మామయింటనున్న భరతుని దీసికొనివచ్చుటకు వేగముగబోవుగుఱ్ఱములపై యీదినముననే దూతలు వెళ్ళవలెను. నాతండ్రివాక్యముల యుక్తాయుక్తమును విచారణచేయక నే నిప్పుడే యిక్కడనుండి వేగముగ వెళ్లి దండకారణ్యమున 14 సంవత్సరములు వసించెదను."

రాముని యీమాటలు కైకేయి విని సంతోషించి యాతనిప్రయాణమందు శ్రద్ధగలదై యాతని నిట్లు తొందరజేసెను. "నీవు భరతుని గూర్చి తెలిపినది జరుగును. రామా! నీవు వెళ్ళుటకు నిష్టపడుచున్నావుగనుక నీవు విలంబముచేయుట యుక్తముకాదు. నీవు వెంటనే యిక్కడనుండి వనమునకు బోవలెను. రాజు సిగ్గుపడినవాడై నీతో దీనిని జెప్పలేదు. అందుచే నీవు కోపమును జెందకుము. నీవు

పురమునుండి తొందరగ వెళ్లునంతవరకు నీతండ్రి స్నానముకాని, భోజనముకాని చేయఁడు.'' ఆమెమాటలకు రాజు గొప్పవిచారమును బొంది 'ఛీ! దారుణపుమాటలు' అని నిట్టూర్పుదీసి తనపక్కమీఁద మూర్ఛజెందెను. రాము డాతని లేపి యామెమాటలచే వెళ్లుటకు తొందరపడెను. మర్యాదహీనురాలగు నామెపలికిన దారుణమును, నప్రియమునునగు మాటల నతఁడు విని విచారము బొందక యామెతో నిట్లనెను. "తల్లీ! నేను ధనముకోరి లోకులను వశీకరణము చేయుటకు సహింపను. నేను కేవలము ధర్మమార్గమున నిలిచిన ఋషితుల్యుఁడను, నేను మీకు ప్రియముజేయుగలిగిన దేమైననున్న యెడల నాప్రాణములనైన విడిచి దానిని ముఖ్యముగ జేయువాఁడను. తండ్రిశుశ్రూషకంటెను, నతనిమాటలను జరుపుటకంటెను నాకెక్కువ ధర్మాచరణ మేదియు లేదు. నాతండ్రి నాతో జెప్పనప్పటికి నీవు చెప్పినప్రకారము నే నిక్కడనుండి వనమునకు బోయి 14 సంవత్సరములు నివసించెదను. నీవు రాజును వరములుగోరి నన్ను నియమించుచున్నావు; కనుక నాగుణములు నీకు కొంచెమైనను దెలియవు. నేను నాతల్లితోను, సీతతోను చెప్పినతోడనే యీదినము దండకారణ్యమునకు బోయెదను. భరతుఁడు రాజ్యమును పాలించుచు నాతండ్రికి శుశ్రూష జరుపునటుల నీవు చేయుము." రాముని యీమాటలు దశరథుఁడు విని మిక్కిలి దుఃఖమును బొంది విచారముచే కన్నీరునిలుపలేక పెద్దగొంతుకతో నేడ్చి మూర్ఛజెందెను. అప్పుడాతఁడు తనతండ్రిపాదములకు వందనమొనర్చి యామెకుగూడ నట్లే జరిపి వారిద్దఱికి ప్రదక్షిణముజేసెను.

రాము డంతఃపురము విడుచుసమయమున నంతఃపురస్త్రీలు విచారవాక్యముల నీతీరున జెప్పుకొనిరి." తండ్రి చెప్పకపోయినను నితఁడు మనయంతఃపురవ్యవహారముల నన్నిటిని జూచుచు మనకు శరణు, గతియునై యుండెను. అట్టివాఁ డీదినమున నిక్కడనుండి వనమునకు

పంపబడుచున్నాడు. ఈతడు తనతల్లిమెడ నెటులప్రవర్తించెనో మన మెడలను జన్మించినదిమొద లట్లే సంచరించెను. ఇతరులు తన్ను కఠినవాక్యము లాడినను నితడు వారియందు క్రోధమువిడిచి దయగలిగి యుండెను. అయ్యో! రాజెంతబుద్ధిహీనుడు. అన్నిలోకములకు గతి యగు నీతనిని విడిచి రాజు ప్రాణికోట్లకు నష్టముకలిగించుచున్నాడు.” ఈతీరున దూడలను విడిచిన యావులవలె *అవివాహితలగు రాజు భార్యలు, అంతఃపురస్త్రీలు రాజును నిందించి యేడ్చుచుండ నామాటలను రాజు విని పుత్రశోకముచే మిక్కిలివిచారమునొంది తనయానసమున నణగిపోయెను. వీని నన్నిటిని రాముడు విని విచారించెను.

అత డంతఃపురమునుండి బయలుదేఱివచ్చి తనస్నేహితుల జూచెను. లక్ష్మణుడు మిక్కిలికోపించి కన్నీటితో నతని ననుసరించి వెళ్ళెను. రాముడు తనయభిషేకవస్తువులకు ప్రదక్షిణమొనర్చి వానియందుదృష్టినిలుపక మెల్లగ నడిచెను. అతనికి రాజ్యనష్టము కలిగినను నతడు లోకనాయకుడగుటచే నతనిని గొప్పలక్ష్మి విడువలేదు. అతడు మనోవికారమునొందక శుభచిహ్నములగు ఛత్రచామరములను, రథమును, పరివారమును, పట్టణవాసులను విడిచి స్వజనులదుఃఖమును భరించి యింద్రియములనుసరకుగొనక యీావిప్రియమును తనతల్లితో జెప్పుట కామెయంతఃపురమునకు బోవుచుండెను. శ్రీమంతుడును, సత్యముపలుకువాడును, నందఱికి సమ్మతుడునునగు నాతనియాకారమందును, ముఖమునందును విపరీతము లెవ్వియు గనపడలేదు. అతడు తనసహజసంతోషమును విడువలేదు. మధురవాక్యములతో రాముడు ప్రజలను సన్మానించుచు బోవ నాతనితో సమానమగు గుణములుగల లక్ష్మణుడుగూడ దుఃఖించుచు వానివెంట వెడలెను.



* అయోధ్యాకాండ 20 సర్గ 5 వ. శ్లోకమున ‘మహిష్యః’ అనుదానికి దశరథునికివివాహితభార్యలు ముగ్గురుగాన మిగిలినయవివాహితభార్యలని దెలిపితిమి.

## ౨౦వ. అధ్యాయము. రాముడు వనవాసముబోవు ప్రసంగము.

వనవాసమునకు బోవలెనని కైకేయి తనతో జెప్పినతక్షణమే రాముడు లక్ష్మణునితో కౌసల్యయంతఃపురమునకు బోయి మొదటి ద్వారమున ముఖ్యద్వారపాలకుని, నితరద్వారపాలకులను జూడ వారు లేచి యాతని స్తుతించిరి. తరువాత నతడు రెండవప్రాకారమున రాజసత్కారముకల వేదసంపన్నులగు ముసలిబ్రాహ్మణులను జూచి నమస్కరించి మూడవప్రాకారమునకు బోయెను. అక్కడ ముసలివారును, చిన్నపడుచులును ద్వారపాలకులుగ నుండిరి. వారు రాముని స్తుతించి సంతోషముతో కౌసల్యయొద్దకు వేగముగబోయి యామెకు నాతనిరాక దెలిపిరి. ఆమె గడచినరాత్రి వ్రతనియమముగలదై తెల్లవాఱినతరువాత పుత్రునిమేలుకొఱకు విష్ణువును బూజించెను. ఎల్లపుడు వ్రతనియమములుగల యామె మంచిబట్టలను గట్టుకొని తగిన మంత్రములతో సంతోషమున నగ్నిలో హోమము జేయుచుండెను. అక్కడ హోమముకొఱకు పెరుగు, అక్షతలు, నేయి, మోదకములు, హవిస్సు, పేలాలు, మంచిసుగంధద్రవ్యములు, పరమాన్నము, తిలోదనము, సమిధలు, నీటితోనిండినబిందెలు నుండెను. ఆమె జలముచే దేవతలకు నర్ఘ్యము లిచ్చి వారిని సంతోషపెట్టుచు తనకు నెదురుగవచ్చు రాముని కౌగిలించుకొని శిరము మూర్కొనెను. ఆమె 'వృద్ధులు, ధర్మశీలురు, మహాత్ములునగు రాజర్షులుపొందు నాయువును, కీర్తియు, కులధర్మములును నీకు గలుగుగాక!' అని తనకుమారునిదీవించి 'సత్యప్రతిజ్ఞుడును, ధర్మాత్ముడునునగు నీతండ్రిని జూడుము. అత డీదినముననే నీకు బట్టాభిషేకము జేయును.' అని వానితో బలికి కూర్చుండుటకు వానికి పీఠమును జూపించెను. తరువాత నామె రాముని భోజనమునకు బిలువ నాతడు కొంచెము సిగ్గుతో

పీఠమును ముట్టుచు నమ్రుడై యీప్రకారము చెప్ప నారంభించెను. "తల్లీ! నీకును, సీతకును, లక్ష్మణునకును నిజముగ నిప్పుడు గొప్ప దుఃఖమును గలుగజేయు భయంకరకార్య మొకటి సంభవించినది. అది నీకు తెలియదు. దండకారణ్యమునకు బోవు నాకు పీఠమేల? నాకు ఋషులయాసనముల గూర్చుండు కాలము వచ్చెను. నేను దండకారణ్యమునకు బోవుచున్నాను. 14 సంవత్సరము లక్కడ దుంపలు, పండ్లు, తేనె భుజించి వండినమాంసమును విడిచి మునివలె నివసించెదను. నాతండ్రి భరతునకు యౌవరాజ్యమిచ్చి నన్ను దండకారణ్యమున తాపసవృత్తితో నుండ నియమించెను. అందుచే నేనట్లు చేసెదను." ఇట్లు రాముడు కౌసల్యకు దెలుప నామె దానిని విని యాకాశమునుండి క్రిందపడు దేవతవలెను, గొడ్డలితో నఱకబడిన గుగ్గిలపువృక్షమువలెను క్రిందబడి మూర్ఛనొందెను. అత డామెను లేవనెత్తి దీనురాలగు నామెను నాయాసముపోవునటుల కూర్చుండబెట్టి యామెశరీరమున నున్న బుగ్గిని చేతులతో దుడిచెను. ఆమె తెలివి తెచ్చుకొని లక్ష్మణుడు వినుచుండ రామునితో నిట్లనెను. "నీవు జన్మింపకుండిన నేను గొడ్రాలనై యింతటిదుఃఖము ననుభవింపక పోదును. అట్లయిన పిల్లలు లేరన్న దుఃఖ మొకటి తప్ప మఱేమియు నుండదు. రామా! నాభర్త పౌరుషవంతుడగుటచే నేను గొప్పశుభమును, సౌఖ్యమును బొందినను నాకు కుమారుడు జన్మింపవలెనను కోరిక యుండెను. నీవు వనవాసమునకు వెళ్ళినచో రాజునకు జ్యేష్ఠభార్యనైనను నేను కనిష్ఠభార్యలనుండి గుండెలను పగులజేయు పరుష వాక్యములను వినెదను. స్త్రీల కంతకంటె దుఃఖమేమున్నది? నాశోకమునకు విలాపమునకు నంతులేదు. నీ విక్కడ నున్నపుడే నేను నిరాదరణ బొందుచున్నాను. నీవు వెళ్ళినతక్షణమే నాకు మరణము నిశ్చయము. ఇప్పుడే నేను నాభర్తయాదరణ లేనిదాననై

కైకేయిదాసీలచే నెక్కువగ నమర్యాదను బొందుచున్నాను. ఇప్పుడు నన్ను సేవించువారును, న న్ననుసరించి తిరుగువారును భరతుని మొగముజూచి యింక నాతో మాట్లాడరు. ఇదివఱకే మిక్కిలి కోపము గలదియు, పరుషవాక్కులను పలుకునదియునగు కైకేయి మొగము నేనెట్లు చూడగలను? *నీవు జన్మించి యిప్పటికి కొలది కాలమైనది. నేను సుఖముకోరుచుంటిని. నేను నాసవతులు పలికెడి కఠినపుమాటలను సహించియుండినను నవి నాకు గొప్పదుఃఖము కలిగించుటచే వానిని చాలకాలము భరింపలేను. పూర్ణచంద్రునివంటి నీముఖమును జూడక యొకదినమైనను జీవనము గడపలేను. నేను చేసిన యుపవాసములును, యోగములును, గొప్పపరిశ్రమలును, నాకు గొప్పదుఃఖమునే కలిగించినవి. భాగ్యహీనురాలనగు నా కవి మంచిఫలితము నియ్యలేదు. నాగుండె రాయివంటిది. కావున నాకు మరణము కలుగదు. నేను పుత్రజననముకొఱకు చేసినవ్రతములు దానములు, నియమములు, తపములు వ్యర్థములయ్యెను. నీవులేని నాజీవనమేల? నీతో నడవికివచ్చెదను.” ఇట్లు కౌసల్య విలపించెను.

అంతట లక్ష్మణుడు సమయోచితముగ నిట్లు పలికెను. ‘తల్లీ! రాము డాడుదానిమాట విని రాజ్యలక్ష్మిని విడిచి యడవికి బోవుట నాకు మనస్కరింపలేదు. స్త్రీలోలుడును, నింద్రియలోలుడును, వృద్ధుడును నగుమాతండ్రి కైకేయిమాటలచే ప్రోత్సహింపబడి మఱియొక లాగేల పలుకకుండును. ఇతనిని వనవాసమునకు బంపునంతటి యుప

* అయోధ్యాకాండ 2వసర్గ, 45వశ్లోకమున రాముడు వనవాసమునకు వెళ్ళునపుడు వానికి ‘17సంవత్సరములు వయస్సు. అని కౌసల్య పలికినట్లు తెలుపబడినది. అతని యాయుఃప్రమాణమునుగూర్చి 1వ. ప్రకరణము ౨వ అధ్యాయమున చర్చించితిమి. ఇట్లు వయస్సుతెలుపుట ప్రస్తుతకలికాలమునకు తగినట్లు కనబడుచున్నది.

రాధముగాని, దోషముగాని వీనియందు నేను గానను. ఇతనిస్నేహితులలోగాని, విరోధులలోగాని, యీతనిపరోక్షమునగాని వీనియందు దోషమును నిరూపించు జనుడెవ్వడును లేడు. దేవతుల్యుడును, తిన్నని మార్గముకలవాడును, శాంతుడును, తనవిరోధులయెడగూడ దయగలవాడును, ధర్మస్వరూపుడునగు పుత్త్రుని నెవడు నిష్కారణముగ చూచుచు విడువగలడు. అట్టిపలుకులు రాజు చపలభావముచే బలికినను రాజనీతి దెలిసిన యే రాజకుమారుడు వానిని మనసార జరుపును? రామా! నీ వనవాసముసంగతి ప్రజలకు దెలియకపూర్వము నేనును, నీవును రాజ్యమును వశము జేసికొందము. నేను ధనస్సును బట్టి నీప్రక్కను యమునివలెనిలిచి నిన్ను రక్షించుచుండ నిన్నతిక్రమించువారెవ్వరు? నీ కేమైన విప్రియము జరిగిన వాడి యైన బాణములచే నీ యయోధ్య నంతయు నేను నిర్జనముగ జేసెదను. భరతుని, వానిపక్షమువారిని, వానిహితము గోరువారిని, నందఱిని, నేను జంపెదను. మెత్తగనున్నవానిని లోకు లవమానించెదరు. మనతండ్రి కైకేయిమాటలు విని శత్రునివలె దుష్టాచరణ జేసినందుకు నిశ్చయముగ వానిని బంధింపవలెను; లేక చంపవచ్చును. గురువు గర్వించి తాను చేయవలసినవి, చేయకూడనివి యైన కార్యములు తెలిసికొనక తప్పుత్రోవను సంచరించిన నతడు దండనార్హుడగును. దశరథు డేబలమును పురస్కరించుకొని నీకు వచ్చిన రాజ్యమును కైకేయి కిచ్చుచున్నాడు? లేక యే యితరకారణముచే నిచ్చుచున్నాడు? నీతోను, నాతోను, విరోధించి భరతునికి శ్రేయముజరుపుటకెవనికి శక్తిగలదు? తల్లీ! 'మనస్ఫూర్తిగ నిజముగ రామునియందనురాగముగలవాడ' నని నేను సత్యముచే, నేను చేసినదానములను, మంచికార్యములను, నాధనస్సును బట్టి నీతో శపథముచేసి చెప్పుచున్నాను. అతడు మండెడునగ్నిలో బ్రవేశించినను నరణ్యము

నకు వెళ్ళినను నే నాతనితో ముందుగ నుండువాడనే. నాపౌరుషముచే నీదుఃఖమును బోగొట్టెదను. నీవును, నాతడును నావీరత్వమును జూచెదరు గాక." ఇట్లు లక్ష్మణుడు పలుక శోకముచే రోదనము చేయుచున్న కౌసల్య యామాటలను విని రామునితో "నీతమ్ముని మాటలను విని నీకు దోచినట్లు తరువాతి కార్యమును జరుపుము. నాసవతు లధర్మపుమాటల బలుకుచుండ నీవు నన్నిక్కడవిడిచి పోవ గదు. ధర్మజ్ఞా! నీవు ధర్మాసక్తిగలిగి ధర్మము జేయగోరితివేని నీ విక్కడ నిలిచి నా సేవ జేయుచు గొప్పధర్మమును జరుపుము. పూర్వము కశ్యపునిపుత్రు డొకడు తనయింటిలోనుండి తనతల్లికి సేవజేసి స్వర్గమును బొందెను. రాజు గౌరవముచే నీకెట్లు పూజనీయుడో నేనును నీకట్లే. నిన్ను నే నాజ్ఞాపింపను. నీ విక్కడనుండి వనమునకు వెళ్లుట నే నంగీకరింపను. నిన్ను విడిచి నేను జీవించినను సుఖమును జెందినను కార్యములేదు. నేను నీతోగూడ కందమూలముల దినినను నాకు శ్రేయస్సు కలుగును. శోకించుచున్న నన్ను నీవు విడిచి యడవికి వెళ్ళిన నేను భోజనముమాని యుండగోరుచున్నాను. నేను జీవింపలేను. అట్టియెడ నీ వధర్మము జరిపి బ్రహ్మహత్యాపాతకమును బొంది దుఃఖించెదవు." అనిపలికెను.

ధర్మాత్ముడగు రాముడు తనతల్లిమాటలు విని ధర్మముతో గూడిన యీవాక్యముల నుడివెను. "నాతండ్రిమాటల నతిక్రమించుటకు నాకు శక్తిలేదు. నీకు శిరస్సుతో నమస్కరించెదను. నేను వనమునకు బోవనిష్టపడితిని. పూర్వము ధర్మము తెలిసిన 'కండు' డను ఋషి తనతండ్రిమాటలు విని పశ్చాత్తాపములేనివాడై గోవును జంపెను. మాకులమునబుట్టిన పూర్వులలో నొకడగు సగరచక్రవర్తి యాజ్ఞచే నతనిపుత్రులు భూమిని ద్రవ్వి గొప్పమరణమును బొందిరి. జమదగ్నికుమారుడగు పరశురాముడు తండ్రియాజ్ఞచే గండ్రగొడ్డ

లితో తనతల్లిని వనములో వధించెను. దేవతుల్యులగు నితరులుగూడ ననేక లిట్లు చేసిరి. తండ్రియాజ్ఞ వ్యర్థముచేయ వీలులేదు. కాన దానిని జరిపెదను. నే నొక్కడనే పితృనాజ్ఞ పాలించుటలేదు. నేను జెప్పినమహాత్ములందఱు దానిని జరిపిరి. నేను క్రొత్తగ నీ కయిష్ట మగునటుల ధర్మమును జరుపుచుండుటలేదు. పూర్వులు త్రొక్కిన త్రోవనే నేను బోవుచున్నాను. నేను జరుపవలసిన నాతండ్రియాజ్ఞనే నేను జరుపుచున్నాను. మఱియొకతీరున కాదు. తండ్రియాజ్ఞను జరిపినవా డెవడును నష్టము నొందలేదు.” ఇట్లు రాముడు పలికి లక్ష్మణునితో నిట్లనెను. “లక్ష్మణా! నీకు నాయందు గొప్పస్నేహముగలదు. నీపరాక్రమ బల తేజస్సు లసమానములు. సత్యశమముల రహస్యము నీ వెఱుగక పలుకుటచే నాతల్లికి దుఃఖ మెక్కువయైనది. లోకములో ధర్మమే ముఖ్యము. దానియందే సత్యము నిలుచును. నాతండ్రి వాక్యము ధర్మము ననుసరించియున్నందున మిక్కిలి గొప్పది. ధర్మము నం దుండగోరినవాడు తండ్రి, తల్లి, బ్రాహ్మణుడు చెప్పినవాక్యములను వ్యర్థముచేయగూడదు. కనుక నేను నాతండ్రిమాట దాట వీలులేదు. అతడు చెప్పుటచే కైకేయి దానిని నాతో బలికెను. నీవు తీక్ష్ణమును, దుష్టమునునగు క్షాత్రధర్మమందలి బుద్ధిని విడిచి తీక్ష్ణము లేని ధర్మముతో నాబుద్ధి నవలంబింపుము.” ఈతీరున లక్ష్మణునితో రాముడు పలికి తల్లికి చేతులుజోడించి నమస్కరించుచు తలవంచుకొని యామెనిట్లు ప్రార్థించెను. “నేనిక్కడనుండి వనమునకు బోవుట కంగీకరింపుము. ‘నీవు వనమునకు వెళ్ళిన నేను ప్రాణముల విడిచెద’ నని నీవు శపథముచేసితివి. ఆశపథమును వీడి నన్నాశీర్వదింపుము. నేను నాప్రతిజ్ఞదీర్చుకొని వనమునుండి తిరుగ నయోధ్య జేరెదను. నీవు శోకమును మనస్సులో నణచుకొని విచారింపకుము. నేను తండ్రియాజ్ఞ నెఱవేర్చి వనమునుండి తిరుగ నిక్కడికి వచ్చెదను. నీవు,

నేను, సీత, లక్ష్మణుడు, సుమిత్ర నాతండ్రియాజ్ఞను నెఱవేర్పవలెను. ఇదే సనాతనధర్మము. నామనస్సు పట్టాభిషేకప్రయత్నమును విడిచి దుఃఖమును బోగొట్టుకొని వనవాసమునకు బోవుటయందు ప్రీతిని కలిగియున్నది. నాబుద్ధి ధర్మమునందుండు గాక!" ఇట్లు ధర్మముగ రాముడు తనతల్లిని ప్రార్థింప నామె మూర్ఛనొంది కొంత సేపటికి దెలివి తెచ్చుకొని వానిని జూచి యిట్లు పలికెను. "స్నేహముచేతను, స్వధర్మముచేతను తండ్రి నీకెట్టిగురువో నేనుగూడ నట్టిదాననే; గాని నేను నిన్నాజ్ఞాపింపను.దుఃఖించుచున్న నన్ను విడిచి నీకు వెళ్లదగదు.నీవులేని నాజీవన మేల? నేను మృతినొందినను నాకు స్వర్గలాభ మేల? నాకన్ని లోకములు పొందులాభముకంటె నొకనిమిషమైనను నీయెదుటనుండుటయే శ్రేయము." ఇట్లు కౌసల్య పలుక రాముడు మిక్కిలి విచారించి మూర్ఛబోవుచు దుఃఖించుచున్న తనతల్లితోను, మిక్కిలి విచారమునొందిన లక్ష్మణునితోను ధర్మబుద్ధికలవాడై తగినధర్మవాక్యముల నిట్లు పలికెను. "లక్ష్మణా! నీభక్తిని పరాక్రమమును నే నెల్లపుడు నెఱుగుదును. నాయభిప్రాయమును సరిగ గనుగొనక నీవును, నాతల్లియు నాకు దుఃఖముకలిగించు సలహాల నిచ్చిరి. భర్తవశములోనున్న భార్యయందు సత్కార్యాచరణరూపమగు ధర్మము, భర్తయభిమతములను దీర్చుట యను కామము,పుత్రులను గనుట యను నర్థమునను మూడును నున్నట్లు సర్వపురుషార్థములకు మూలమగు నొక్క ధర్మాణచరణవలన కలుగుసుఖములందు ధర్మార్థకామములు మూడును నుండును. ఏకార్యములందు ధర్మార్థ కామములుండకపోవునో, వేనియందు ధర్మము తప్పునో యాకార్యములు ప్రశస్తములుగాక కామములతో జేరి కోరికయే ప్రధానముగ గలవై యుండును. కనుక ధర్మముతోగూడిన కార్యమును జేయవలెను. గురువు, రాజు, వృద్ధుడును నగు నాతండ్రి కోపముచేగాని, సంతోషముచేగాని, కామముచేగాని,

దేని నాజ్ఞాపించునో యది ధర్మము. కనుక దానిని జేయనివాడు దుష్టుడగును. నేను నాతండ్రియాజ్ఞనంతయు సరిగ జేయకుండ నుండలేను. అతడు మనతల్లికి భర్తయై మనకు గురువు, ధర్మము, గతియునై యున్నాడు. తల్లీ! యతడు జీవించియుండ నీవు నన్నిట్లాజ్ఞాపించి విధవవలె నడవి కెట్లువచ్చెదవు? నాప్రార్థన నంగీకరించి నేను తిరుగ వనమునుండి వచ్చునటుల శుభాశీర్వాదముల చేయుము. రాజ్యము కొఱకు కీర్తికి కారణమగు వనవాసమును నేను విడువలేను. జీవిత మశాశ్వత మగుటచే నధర్మముగ నేనిప్పుడు రాజ్యమును బొందగోరను." ఇట్లు రాముడు తల్లికి తమ్మునికి బోధపఱిచి నామెకు బ్రదక్షిణము చేసెను.

ఇంకను దీనుడై కోపించియున్న లక్ష్మణునితో రాముడిట్లు పలికెను. "నీవు శోకరోషములవిడిచి ధైర్యమవలంబించిగొప్పసంతోషముగలవాడవై నాపట్టాభిషేకమునకు సమకూర్చిన సామగ్రినివిడిచి యిటుపైని చేయదగు మంచికార్యమును జరుపుము. సామగ్రిని సమకూర్చుటయందు నీకుండు నుత్సాహము దానిని విడుచుటయందు గూడ నుపయోగింపుము. కైకేయి నాయభిషేకమునుగూర్చి విచారించుచున్నది. ఆమె తనయనుమానమును విడుచునట్లు చేయుము. దానివలనగలుగు నామె మనోదుఃఖమును నే నుపేక్షించి యుండలేను. నే నిదివరకు నాతండ్రికి నాతల్లులకు బుద్ధిపూర్వకముగగాని, తెలియకకాని యే విప్రియము నొనరింపలేదు. సత్యవచనుడగు మనతండ్రి సత్యప్రతిజ్ఞకలవాడై యమునిదండనకు లోనైయుండక నిర్భయముగ నుండుగాక! నాతండ్రిపలికినది జరుగదేమోయని యాతని మనస్సు పరితపించిన నాకుకూడ మిక్కిలి దుఃఖముకలుగును. అభిషేకమును విడిచి నేనిప్పుడే యిక్కడనుండి వనమునకు బోవ సిద్ధమైయున్నాను. అట్లుజరిగిన కైకేయి పూనిన కార్యము జరుగును. భరతునకు వెనుక

నుండి యభిషేక మగును. నేను నారచీరలను, జటలను ధరించి యరణ్యమునకు బోయిన నామెమనస్సునకు సుఖము కలుగును. దీనిని గూర్చి యట్టిబుద్ధికలిగినవారలకు విచారముకలిగింపక నేను వెంటనే వనమునకు బోయెదను. నాకు సిద్ధముగనున్న రాజ్యలాభము పోవుటయు, నేను వనవాసమునకు బోవుటయు దైవప్రేరితములవలె గనబడుచున్నవి. అట్లు కానియెడల నన్ను బాధించుటలో కైకేయికింత పట్టుదలయేల? నాతల్లులందఱికిని నాయందు భేదము లేకయుండుటయు, నామెకు నాయందును, భరతునియందును సమానమైనప్రేమయుండుటయు నీవెఱుగుదువు. దైవికకారణము లేనియెడల నామె నా వనవాసమునుగూర్చి దారుణపుపలుకుల నేలపలుకును? సత్కులమున జన్మించినదియు, మంచిగుణములుగలదియునగు నారాజపుత్రిక నీచస్త్రీవలె తనభర్తతో నన్ను గుఱించియేలపలుకును? చింతించుటకు వీలులేనిదే దైవము. లోకములోని జనులు దైవకృతమును మార్చలేరు. దైవయోగముచేతనే యామెకు నాయందీవిపరీతబుద్ధిపుట్టెను. దైవమునకు ప్రతికూలముగ వర్తించువారెవ్వరు? ఏకార్యములోనైనను దైవకృతమునకు విరుద్ధముగ నెంతమాత్రము జరుగదు. సుఖదుఃఖములు, భయక్రోధములు, లాభనష్టములు, జననమరణములు మొదలగు నవన్నియు నిశ్చయముగ దైవకార్యములు. గొప్పఋషులుగూడ దైవమాయచే తమనియమముల విడిచి కామక్రోధములతో గూడియుందురు. ఆరంభించినకర్మ తప్పిపోవుటయు, నిదివర కాలోచించి విడిచినకార్యములు జరుగుటయు దైవయోగమున కాదా? ఇట్టినిజస్థితిని నేనాలోచించి నామనస్సును స్వాధీనము జేసికొని నాయభిషేకము తప్పినందుకు నేను విచారించుటలేదు. కనుక లక్ష్మణా! నీవు గూడ పరితాపములేనివాడవై నన్ననుసరించి యభిషేకప్రయత్నము విడువుము. దానినిగూర్చి తెచ్చిన యీకుంభములలోని

యుదకముచేనేను తపోవ్రతస్నానము జేసెదను.ఆరాజద్రవ్యమేల? నేను స్వయముగ నీళ్లు తోడుకొని స్నానముజేసెదను. రాజ్యలాభమును, వనవాసమును నాకు సమానమే. రాజ్యలక్ష్మి తొలగినందుకు నీవు విచారింపకుము. వనవాసమువలననే గొప్పలాభమున్నది. ఈవిఘ్నము నకు కైకేయి కారణమని శంకింపగూడదు. ఆమె దైవప్రేరణచే నా కనిష్టము పలికినది. దైవమును నాతనిప్రభావమును తెలిసికొనుము.”

రాముడు చెప్పిన యీమాటలను విని లక్ష్మణుడు దుఃఖ సంతోషములతో గూడుకొనినవాడై తలవంచుకొని రెండుకనుబొమల మధ్యను బొమముడివేసి రోషముతో నిట్టూర్పుదీసెను. అప్పు డాతనిముఖము క్రోధముతోగూడిన సింహామువలె నుండెను. అతడు తనచేతిని కదల్చుచు మెడకొంచెమువ్రక్కకు వంచుకొని క్రీగంటితో రామునిజూచుచు నిట్లు పలికెను. “తండ్రియాజ్ఞ జరుపకపోవుటచే ధర్మహాని జరుగుచున్నదని లోకులనుకొనెద రని మీరు వనమునకు బోవుటకై తొందరపడుట మీకు యుక్తముకాదు. క్షత్రియశ్రేష్ఠా! బలవంతుడా! తొందరలేని మీవంటివారికి దుర్బలుడగు దైవమును గూర్చి యిట్లు ప్రసంగించుట తగదు. మీవిషయమైపాపాత్ములగు తల్లిదండ్రులగూర్చి మీకేల యనుమానము కలుగదు. అశక్తుడును, దీనుడునునగు దైవమును మీరేలశ్లాఘించెదరు? లోకములో పైకి ధర్మ మును గనబఱచుచు తమలోపములను కప్పిపుచ్చువారున్నారు. మీ రాజ్యమును హరింపతలచిన తలిదండ్రులను మీకు బాగుగ విప్రి యము లొనరించువారినిగ మీరేలతలపరు? మిమ్ము రాజ్యమునుండి తొలగించుటకు వా రిదివరకే యాలోచించినయెడల నీవరములు పూర్వమే యియ్యబడియుండును.అట్టియాలోచన జరిగియుండనందున నివి ప్రస్తుతము కల్పింపబడియుండెనని నిశ్చయమగుచున్నది. మీకు సిద్ధముగనున్న పట్టాభిషేక మితరులకు చేయుట లోకవిరుద్ధము.

దానిని నేనుసహింపలేను. మీకుపుట్టిన ధర్మబుద్ధియందలి మోహము నాకు విరుద్ధముగ దోచుచున్నది. గొప్పశక్తిగలమీరు కైకేయివలన బ్రోత్సహింపబడిన మనతండ్రి యధర్మపుమాటల నేల జరిపెదరు? కపటబుద్ధితో వారుజేసిన పట్టాభిషేకభంగము నాలోచింపని మీధర్మమునుగూర్చి నాకు విచారము కలుగుచున్నది. వారు కాముకులై, నిత్యశత్రుప్రియులై పేరునకు తలిదండ్రులైనచో వారిమాటలను మీరు మనసార నెందుకు జరుపవలెను. వారు దైవ ప్రేరితులై యట్లు పలికిరని మీ రాలోచించి యుపేక్షించుట నా కిష్టము లేదు. వీర్యహీనులును, బలహీనులును దైవము ననుసరించెదరు. వీరులును, ధీరులును నట్లు చేయరు. దైవబలమును తిరస్కరించు పురుషు డది తన కడ్డువచ్చినను విచారము నొందడు. దైవమానుషబలములను బ్రజ లీదినమున జూచెదరు. నేనిప్పుడు నాపౌరుషముచే దైవబలమును హరించి విఘ్నమును బొందిన మీపట్టాభిషేకమును తిరుగ జరిపించుట జనులు చూచెదరు. దిక్పాలకు లందఱుకాని, మూడులోకములలోని వారందఱుకాని మీయభిషేకమునకు భంగముచేయ నశక్తులయిన పుడు మనతండ్రి యేమిచేయగలడు? మీవనవాసమును రహస్యముగ నిశ్చయించినవారే 14సంవత్సరములు వనవాసమునకు బంపబడుదురు. మీకు పట్టాభిషేకము తప్పించి తమభరతుడే రాజ్యముచేయవలెనను కైకేయీదశరథులయాశను నేను పోగొట్టెదను. నాబలపౌరుషములు మనవిరోధులకు విచారముకలిగించునటుల దైవబలము వారికి విచారము కలిగింపచాలదు. * వేయిసంవత్సరముల తరువాత మునివలె

---

* ప్రస్తుతము కలియుగములో మనుష్యునియాయుఃప్రమాణము నూఱు సంవత్సరములైయుండ లక్ష్మణుడు రామునితో వేయియేండ్లయినను మీకుమారునికే రాజ్యమువచ్చునని చెప్పుటను బట్టి యీయుగమునను, దానికి పూర్వపుయుగమున కొంతకాలమునను నరులకు పరమాయువు నూఱుసంవత్సరము లనియు, నంతకు పూర్వము మనుజునియాయుఃప్రమాణము వేయిసంవత్సరములనియు మే మూహింతుము. 'దినదినగండం వెయ్యేళ్లాయుష్షు'అను లోకోక్తిగూడ మాయభిప్రాయమును దృఢపఱచుచున్నది.

మీరు వనవాసమునకు వెళ్ళినను మీపుత్రులకే రాజ్యము రావల యును. పూర్వము రాజులు కొంతకాలము రాజ్యముచేసి 'ప్రజలను పుత్రులవలె పాలింపు' మని తమకుమారులకు చెప్పి వారికి రాజ్య మిచ్చి యడవికి బోయి రాజర్షులైరి. దశరథునిచంచలచిత్తముచేత రాజ్యము భిన్నభాగములగునని యనుమానించుచున్న మీకు రాజ్య మందిష్టములేనియెడల నావీరత్వమువలన నేను దానిని రక్షించెదను. మీ రభిషేకకర్మలో మునిగియుండ నేను రాజులనందఱిని నడ్డెదను. నేను నాబాహువులను, ధనస్సును, ఖడ్గమును, బాణములను మీశత్రు

---

అ. రా:—లక్ష్మణుడు 'దశరథుడు మొదలగువారిని జంపెద' నని పలుక రాము డతని నిట్లు నివారించెను. "కంటికి గనబడు దేహము మొదలగున వన్నియు సత్యములుకావు. భోగములు చంచ లములు. ఆయువు కాలినలోహముపైచిలుకు జలబిందువువంటిది. పామునోటియందున్నను కప్ప యాహారముకోరునట్లు జనుడు కాలము నకులోనై యున్నను తనశరీరభోగములను గోరుచు వానికొఱకై రాత్రింబగళ్లు కర్మ ననుసరించిన పనులను దుఃఖముతో జేయుచుం డును. 'పురుషుడు (ఆత్మ) దేహమునకంటె వ్యతిరిక్తు'డని తలచువాడు శరీరభోగముల కొఱకేలప్రయత్నించును? తల్లి, తండ్రి, పుత్రులు, తమ్ములు, భార్య, బంధువులు మొదలగువారితో సంబంధము మంచినీటి కొఱకుచలిపందిరి (చలివేంద్ర)లో జేరు మనుష్యులసంబంధమువలెను, నదులలో కొట్టుకొనిపోవు కట్టెలసంబంధమువలెను చంచలము. మను ష్యునినీడవలె సిరి చంచలము. యౌవనము నీటికెరటమువలె నశాశ్వత మైనది. స్త్రీసుఖము కలవంటిది. అయినను ప్రాణికి నభిమాన మధి కము. రోగాదులతోగూడిన యీసంసారము స్వప్నమువంటిది. మిథ్యాభూతమయినది. మూఢుడు దాని ననుసరించును. సూర్యుని గమనాగమనములవలన జనుని యాయువు క్షీణించుచున్నను నితరు

నివారణకే యుపయోగించెదను. శత్రువుల యేనుగులను, గుఱ్ఱములను, కాల్బలములను, శిరస్సులను, శరీరములను నాఖడ్గముతో పిండి చేసి భూమినిండునటుల చేసెదను. నేను ధనస్సు బట్టియుండ నా యెదుట పురుషాకారుడెవ్వడు నిలువగలడు? నేనొక్కడనే తొందరగ

---

లకు ముసలితనము, మరణము కలుగుట జూచుచున్నను వాడెంత మాత్రము దానిని తెలిసికొనడు. అతడు మూఢబుద్ధితో 'ఇది పగలు, ఇది రాత్రి' యనియాలోచించుచు భోగముల ననుభవించుచుండును; గాని కాలవేగమును గానడు. ప్రతిక్షణ మాయువు క్షీణించుచుండును. శరీరమునకు రోగములు శత్రువులవలె బాధచేయుచుండును, ముసలితనము పెద్దపులివలె భయపెట్టుచు వాని యెదుట నిలుచును. మృత్యు వెల్లపుడు వాని ననుసరించుచు సమయమునకై నిరీక్షించుచుండును. జనుడు పురుగులు, మలము, బుగ్గి గల దేహమందహంభావము (నేను నాది యనెడుబుద్ధి)కలిగి నేను కీర్తిగలరాజు నని తలంచుచు జీవించును. చర్మము, ఎముకలు, మాంసము మొదలగువానితో గూడి వికారములను, మార్పులను బొందు నీదేహ మాత్మ యని యెట్లు పలికెదవు? 'లోకములను దహించెద'నని పలికిన దేహాభిమానముగలవారికి నన్ని దోషములు పుట్టును. 'నేనే దేహము.' అనుబుద్ధియే మాయ(అవిద్య) యనబడును. 'నేను దేహము కాను. నేను చిదాత్మను' అనుబుద్ధియే విద్య (జ్ఞానము) యనబడును. అవిద్య (మాయ) వలన సంసారము కలుగును. విద్య (జ్ఞానము) దానిని తప్పించును. కనుక మోక్షము కోరువారు జ్ఞానాభ్యాసమెల్లపుడు చేయవలెను. వారికి కామ క్రోధాదులు శత్రువులు. వారిలో క్రోధమును నదెల్లపుడు మోక్షమునకు విఘ్నముచేయుటకు జాలును. క్రోధమువలననే పురుషుడు తండ్రిని, తమ్ములను, బంధువులను, స్నేహితులను జంపును. ఆక్రోధమువలన మనస్సునకు తాపమును, సంసారబంధనమును, ధర్మనాశనమును కలు

నందఱిమీఁద బాణములను విడిచెదను. ఈదినముననే దశరథునికి రాజ్యభ్రంశమును, మీకు రాజ్యలాభమును గలుగునటుల యత్నములనుపయోగించెదను. నాబాహువులతో మీయభిషేకమునకు విఘ్నముచేసినవారి నడ్డుచు మీస్నేహితుల పాలించుచు బీదలకు ధనము బంచియిచ్చెదను. ఏశత్రువులనుండి యీదినమున మిమ్ము తప్పింపవలెనో సెలవిండు. మీకు రాజ్యము సమకూడునటుల మీరు మీదాసుఁడనైన నన్నాజ్ఞాపింపుఁడు." ఈతీరున లక్ష్మణుఁడు పలుక రాముఁడు వానికన్నీటిని దుడిచి తాను తండ్రివాక్యములనే జరుపవలె ననియు, నదియే మంచిమార్గ మనియు వానికి సెలవిచ్చెను.

---

గును. కనుక క్రోధమును పడువవలెను. అదియే గొప్పశత్రువు. ఆశ వైతరణీనదివంటిది. సంతోషము నందనవనము వంటిది. శాంతి కామధేనువువంటిది. కనుక నీవు శాంతిని బొందితివేని నీకు శత్రువులే యుండరు. దేహము, ఇంద్రియములు, మనస్సు, ప్రాణము, బుద్ధి మొదలగువానికంటె వేఱగు నాత్మ శుద్ధమైనదియు, స్వయముగ వెలుగునదియు, వికారములేనిదియు, రూపములేనిదియు నై యున్నది. 'దేహ ఇంద్రియ ప్రాణములకంటె నాత్మ వేఱయినది' అని తెలిసి కొనేవఱకు జనుఁడు మృత్యువుతో గూడిన సంసారదుఃఖములచే పీడింపబడును. కనుక నీవు బుద్ధి మొదలగువానికంటె నాత్మ వేఱని తలచి విచారములేనివాఁడవై యన్నిపనులను జేయుము. నీవు ప్రారబ్ధ కర్మవలనవచ్చు సుఖదుఃఖములను ననుభవించుచు జీవితకాలములో వచ్చు కార్యములను జేయుచుండినను అవి నిన్ను బంధింపవు. నీవు పైకన్నికార్యముల జేయుచున్నను నంతశ్శుద్ధిగల స్వభావమును గలిగి యున్నయెడల కర్మలు నిన్ను బంధింపవు. కర్మమార్గము ననుసరించి జీవుల కెల్లవు డొకచోట స్థిరముగు నునికి లేదు." ఇట్లు రాముఁడు లక్ష్మణునికిని, కౌసల్యకును బోధించెను.

ఇట్లతఁడు దృఢనిశ్చయుఁడై యుండుటజూచి కౌసల్య కన్నీరుతో నిండిన మోముగలదై యాతనితో నిట్లనెను. "నాకును దశరథునకును జన్మించి దుఃఖముల నెప్పుడును నెఱిగియుండనినీవు అడవిలో ధాన్యపు గింజల నెట్లేఱుకొనెదవు? నీసేవకులుకూడ నిక్కడ మంచిభక్ష్యములను దినుచుండ నీవు వనములో దుంపలను, ఫలముల నెట్లుతిని జీవించెదవు? గుణవంతుఁడవును, రాజునకు ప్రియుఁడవునునగు నీవు రాజుచే వనవాసమునకు బంపబడితివని విని దానినెవరు విశ్వసింతురు? ఎవనికి భయముకలుగదు? లోకమునకు ప్రియుఁడవగు నీవు వనమునకు వెళ్లుటనుబట్టి యాలోచింప బలవంతుఁడగు దేవుఁడే యందఱిని శాసించుచున్నట్లు కనబడుచున్నది. నిన్ను జూడనిదుఃఖముచే నే నేడ్చుచు విచారించుచు మిక్కిలి కృశించి మరణమునొందెదను. ఆవు తనదూడ వెంట వెళ్ళునటుల నేను నీతో వచ్చెదను." ఇట్లు కౌసల్య పలుక రాముఁ డిట్లామెకు బదులు చెప్పెను. "నేను వనమునకు బోయినతరువాత నాతండ్రిని కైకేయి యవమానించిన నపుడు నీవే యాతనికి పరిచర్య జేయవలెను. లేనియెడల నాతఁడు నిశ్చయముగ మరణము నొందును. భర్తనువిడుచు స్త్రీ కేవలము దుర్మార్గురాలగును. నీ వట్లు చేయగూడదు. మనస్సునగూడ దలపగూడదు. నాతండ్రి జీవించి యుండువరకు నీ వాతనికి పరిచర్య చేయవలెను. ఇదియే సనాతన ధర్మము." రాముని యీమాటలను కౌసల్య యంగీకరించెను. ఇంకను నాతఁడిట్లు పలికెను. "నేనును నీవును నాతండ్రివాక్యమును జరుపవలెను. రాజు మనకు పోషకుఁడును, గురువులలో శ్రేష్ఠుడును, ప్రభువును, నందఱిని బాలించువాఁడును నైయున్నాఁడు. ఈ 14 సంవత్సరములు నేను వనములో విహరించి తిరిగివచ్చి నీయాజ్ఞను జరిపెదను." అతని యీ మాటలకు కౌసల్య కన్నీరు తెచ్చుకొని 'నేను నాసవతులతో నుండుట కష్టము.

నీకు తండ్రియాజ్ఞ జరుపుటకు బుద్ధిపుట్టినయెడల నీవు నన్నుకూడ నడవికి తీసికొనిపొమ్ము' అని యేడ్వ నాతడుకూడ విచారించుచు 'స్త్రీలకు భర్తయే దైవము, గురుడు, ప్రభువు.' అని బోధించి యింకను నిట్లు పలికెను. "భరతుడుగూడ ధర్మాత్ముడు. అన్నిజీవులకు ప్రియము పలుకువాడు. ధర్మబుద్ధిగలయాతడు నీవు చెప్పినప్రకారము నడుచును. నేను వెళ్ళినవెనుక నీవు జాగరూకతకలదానవై దశరథునికి పుత్రవియోగశోకముచే శ్రమలేకుండునటుల చేయుము. ఈగొప్ప దుఃఖమువలన రాజునకు ప్రాణభయము రాకుండునట్లు హితమును జేయుము. స్త్రీ వ్రతోపవాసములందు శ్రద్ధగలిగి మిక్కిలి యుత్తమురాలైనను తనభర్త ననుసరించి నడువనిచో పాపగతినొందును. తన భర్తకు శుశ్రూషజేయు స్త్రీ దేవపూజచేయకయు, నితరుల నమస్కరింపకయు స్వర్గమునొందును. స్త్రీ తనభర్తకు ప్రియమునుగోరి శుశ్రూష జేయుచుండవలెను. ఈధర్మమే పూర్వము వేదములోను, స్మృతులలోను దెలుపబడినది. నానిమిత్తము నీవు అగ్నికార్యముల చేయుచు పుష్పములచే దేవతలను పూజింపుము. మంచిబ్రాహ్మణులను గూడ పూజింపుము. నేను తిరుగ వచ్చుటను గోరుచు నియమము గలిగి సాత్త్వికభోజనము చేయుచు భర్తకు శుశ్రూషజేయుము. నేను వచ్చుసరికి రాజు జీవించియున్న నీగొప్పకోరిక నెఱవేఱును." ఇట్లు రాముడు పలుక కౌసల్య దుఃఖించుచు నిట్లనెను. "వనమునకు బోవుటయందు నిశ్చయింపబడిన నీబుద్ధిని నేను త్రిప్పలేకున్నాను. కాలగతి నెవరును దప్పింపలేరు. పుత్రా! నీవు నిశ్చలమనస్సుతో వెళ్ళుము. నీకెల్లపుడును శుభమగుగాక! నీవు తిరుగ వచ్చినప్పుడు నేను దుఃఖము లేనిదాన నగుదును. పితృఋణమును దీర్చిన నిన్నుజూచి నేను గొప్ప సుఖము నొందెదను. నామాటను తిరస్కరించి నిన్ను వనమునకు బంపెడిదైవముయొక్క మార్గమును జను లాలోచింపలేరు. నీవు క్షేమ

ముగ తిరిగి వచ్చి నన్నాదరించిన నేను సంతోషము నొందెదను. అట్టికాలమువచ్చునా?" అని యామె కన్నీరు తుడుచుకొనుచు విచారించెను.

తరువాత కౌసల్య ఆచమనముచేసి శుచికలదై మంగళ వాక్యములతో నీవిధముగ రాముని దీవించెను. "నీవు నియమముగ ప్రీతితో పాలించు ధర్మమే నిన్ను రక్షించుగాక! నీవు నమస్కరించు చతుష్పథగృహ దేవతలును, దేవగృహ దేవతలును నిన్ను, వనములో నుండు గొప్పఋషులను రక్షించుగాక! విశ్వామిత్రుడు నీకిచ్చిన యంత్రములు నిన్ను రక్షించుగాక! నీవు చేసిన మాతృపితృసేవలును, నీసత్యమును నిన్ను చిరంజీవిగా జేయుగాక!

ఇంకను సమిధలును, దర్భలును, నన్ని వేదికలును, దేవపూజా స్థలములును, కొండలపైనుండు పెద్దచెట్లును, చిన్నశాఖలుగలచెట్లును, సరస్సులును, కొండలును, సముద్రములును, నదులును, పక్షులును, పాములును, సింహములును, సాధ్యులును, విశ్వేదేవులును, వాయువు లును, మహర్షులును, దేవతలును, ద్వాదశాదిత్యులును, నిందాద్రిది లోకపాలురును, సప్తఋషులును, నారదుడును, దిక్కులును, సంవత్స రములును, ఋతువులును, మాసములును, పక్షములును, గడియలును, నహోరాత్రములును, వానిసంధ్యలును, స్మృతి ధృతి ధర్మములును, సూర్యుడు, చంద్రుడు, బృహస్పతి మొదలగుగ్రహములును, నక్షత్ర ములును, వానియధిదేవతలును, భూమియు, నంతరిక్షమును, స్వర్గ మును, బ్రహ్మవిష్ణు మహేశ్వరులును, కుమారస్వామియు నిన్ను రక్షింతురుగాక!

క్రూరకర్ములును, రౌద్రస్వరూపులునగు దైత్యులవలనను, రాక్షసులవలనను, పిశాచములవలనను, మాంసభోజను లందఱివల నను నీకు భయములేకుండుగాక! కోతులవలనను, తేళ్ళవలనను, వన

మక్షికములవలనను,కొండచిలువలవలనను నీకు భయము లేకుండుగాక! గొప్పయేనుగులును, సింహములును, పులులును, ఎలుగుబంట్లును, కోఱలుగల యితరజంతువులును, కొమ్ములుగలిగి రోషముగలదున్న పోతులును నీకు హింసజేయకుండుగాక! రౌద్రముగలవారును, నర మాంసభోజనులునగు నితరబలిష్ఠులును నాదీవనచే నిన్ను బాధ పఱుపకుండెదరుగాక! నీవు వెళ్లుత్రోవలో నీపరాక్రమము వృద్ధియై నీకార్యములకు జయమును జేకూర్చుగాక! అంతరిక్షమున సంచరించు వారు, రాజులు, దేవతలు,శత్రువులు మొదలగువారందఱినుండి నీవు బాధను బొందక జయమును బొందెదవుగాక! నీవు జలమాచమ నము చేయునపు డగ్నియు, వాయువును, ధూమమును, ఋషిముఖ మునసుండి వచ్చినమంత్రములును నిన్ను రక్షించుగాక!"

ఈతీరున కౌసల్య రాముని శ్రేయముకొఱకు దేవతలను మంచి వస్తువులతోను, సుగంధమాల్యములతోను పూజించి యుపాధ్యాయు నిచే నగ్ని నధిష్టింపజేసి విధ్యుక్తముగ నేతిని, తెల్లనిమాల్యములను, సమిధలను, తెల్లావాలను దానిలో హోమము జేయించెను. ఇట్లు తె దగ్నిని శాంతినొందించి మిగిలినహవిస్సుతో హోమస్థానమునకు వెలుపల బలిసమర్పణ జేసెను. ఆమె బ్రాహ్మణులకు తేనె, పెరుగు, నేయి, యక్షతల నిప్పించి వారిచే స్వస్తివాచకముల జేయించి వారి కిష్టమగు దక్షిణల నిచ్చెను.

తరువాత నామె యింకను మంగళవాక్యముల నిట్లు పలికెను "వృత్రాసురవధనిమిత్తము ఇంద్రునకు కలిగినశుభము నీకగుగాక! గరుత్మంతు డమృతముదెచ్చుటకు పూర్వము వినత వానికూర్చిపలికిన మంగళము నీకగుగాక! ఇంద్రుడమృతము దఱచి దైత్యులజంపక పూర్వము అదితి వానికొసంగిన మంగళము నీకు గలుగుగాక! వామనుడు మూడడుగులభూమి నాక్రమించునపు డాతనికి గలిగిన

శుభము నీ కగుగాక! ఋతువులు, సముద్రములు, ద్వీపములు, వేదములు, లోకములు, దిక్కులు, మంగళద్రవ్యములు నీకు శుభముల నొనగూర్చుగాక!" ఇట్లు కౌసల్య రాముని దీవించి వానిశిరస్సున తెల్లనియక్షతలను వేసి పరిమళసుగంధద్రవ్యములను రాసి కోరికలనుసిద్ధిపొందించునదియు, విఱిగిన యెముకల నతుకునదియునగు*నోషధిని వానిచేతికి గట్టి మంత్రములను జపించెను. పిమ్మట నామె వానితలను మూర్కొని కౌగిలించుకొని "పుత్రా! నీకోరిక ప్రకారము నీవు సుఖముగ బొమ్ము. నీవు పితృవాక్యమును నెఱవేర్చి యారోగ్యవంతుడవై యయోధ్యలో రాజగృహమున సుఖముగ సింహాసనమున నుండి సీతతోగూడ నాకోరికల నెఱవేర్పు"మని పలికి దుఃఖముతోనున్న కౌసల్య మాటలలోగాని, భావములోగాని తనదుఃఖమును పైకి తెలియపఱుపక సంతోషమును గనపర్చుచు వానిరక్షణాకై వానికిప్రదక్షిణము జేసి వానిని గట్టిగ కౌగిలించుకొనెను. అతడామెచరణములకు వందన మొనర్చి సీతాగృహమునకు లక్ష్మణునితో వెడలెను.

సీతగృహమున కాతడు లక్ష్మణునితో వనవాసోద్యుక్తుడై వెళ్ళునపుడు దారిలో ప్రజలగుండెలు జల్లుమనుటను కనిపెట్టెను. రాముని వనవాసపు సంగతి తెలియనిసీత వానికి పట్టాభిషేకము జరుగునని యాలోచించి దేవపూజచేసి తనభర్తను పూజించుటకు సిద్ధమైయాతడు రాజచిహ్నములతో వచ్చునని వానికొఱ కెదురుచూచుచుండెను. అంతట రాముడు కొంచెము సిగ్గుతో తలవంచుకొని సీతగృహమును ప్రవేశించెను. ఆమె లేచి వణకుచు శోకగ్రస్తుడగు తనభర్తను జూడ నతడామెకు తనమనోదుఃఖమును తెలియపఱుపలేక దానిని వ్యక్తపఱచెను. ఆమె తనభర్తమొగము వాడియుండుటయు, చెమట

* పూర్వమిట్టియోషధు లుపయోగింపబడినటులను క్రమక్రమముగ వావిడుక పోవుచున్నట్లును కనబడుచున్నది.

బట్టియుండుటయు, శోకము పట్టలేకయుండుటయు చూచి మిక్కిలి విచారించి "ఆర్యా! మీరు పట్టాభిషేక చిహ్నములు లేనివారై విచారముతో నిట్లేల యున్నారు? మీ మొగ మెప్పుడు నిట్లు వాడి యుండలేదు" అని వానినడిగెను. దానికాతడు "సీతా! నాతండ్రి నన్ను వనమునకు పంపుచున్నాడు. దీనికి కారణ మేమన సత్యప్రతిజ్ఞుడగు నా తండ్రి పూర్వము కైకేయికి రెండు గొప్పవరము లిచ్చెను. ఈదినమున రాజు నాపట్టాభిషేకము చేయుటకు సిద్ధముగనుండ నామె యావరములనుకోర నాతడు వానివిషయమై చేసినప్రతిజ్ఞ నెఱవేఱుటకు ధర్మమార్గమునకుకట్టువడెను. నేను 14సంవత్సరములు దండకావనములో నివసింపవలెను. యావ రాజ్యమున భరతుడు నియమింపబడెను. నేను వనమునకు బోవుచు నిన్ను చూడవచ్చితిని. యువరాజునెదుట నాసంగతి నీవేమియు చెప్పకూడదు. పరులనుగూర్చి పొగడిన బుద్ధిమంతు లిష్టపడరు. కాన భరతునెదుట నాగుణములను నీవు స్తుతింపకూడదు. నీపోషణకై యతడెక్కువగ శ్రద్ధవహింపనక్కఱలేదు. నీవాతని కనుకూలురాలవై యుండుము. నాతండ్రి యాతనికి సనాతనమగు యావరాజ్య మిచ్చుటచేతను భరతుడు రాజగుటచేతను నీ వతనిని గౌరవింపవలెను. నేను నాతండ్రియాజ్ఞను పాలించుచు నీదినముననే వనమునకేగెదను. నీవు దృఢచిత్తురాలవై యుండుము. నేను మునులునివసించు వనమునకు బోయినప్పటినుండి నీవు వ్రతోపవాసములను జేయుచుండుము. నీవు ప్రాతఃకాలమున లేచి దేవపూజ యథావిధిగ నొనర్చి రాజగు నాతండ్రికి వందనముచేయుచుండవలెను. వృద్ధురాలును, విచారగ్రస్తురాలును, నాకు తల్లియునగు కౌసల్యకు మర్యాదలు జరుపుచుండుము. మిగిలిన నాతల్లులనుకూడ నీవు ప్రతిదినము స్నేహముతోను, పానభోజనాదులతోను సత్కరించుచుండుము. నాకు ప్రాణములకంటె ప్రియులగు భరతశత్రుఘ్నులను నన్నదమ్ములవలె నీవు

చూచుకొనుచుండవలెను. భరతునకు విప్రియములగు పనులను నీ వెం తమాత్రము చేయకూడదు. అతడు దేశమునకు, మనకులమునకును ప్రభువాయెను. రాజులు తమకు మంచిమార్గమున శ్రద్ధతో జను లుప చారములు చేసినపుడు సంతోషింతురు. విపరీతముగ నడచినయెడల కోపింతురు. అనిష్టకార్యములను జరిపిన తమకుమారులనైనను వారు విడుతురు. ఇతరులు తగినవారైన వారిని చేరదీయుదురు. కాన నీవి క్కడ ధర్మముననిలిచి రాజాజ్ఞను జరుపుచు భరతున కనుకూలురాలవై యెవరికిని విప్రియము జరుపక సత్యవ్రతముతో నే జెప్పినటుల నంచ రింపుము. నేను వనమునకు బోయెదను." అని సెలవిచ్చెను.

సీత రామునియందు ప్రేమగలదియైనను వానిమాటలను విని కోపముతో నీపలుకుల నుడివెను. "రామా! మీరిట్టి తేలికమాటలతో నన్నేల పరిహాసము చేసెదరు. తల్లిదండ్రులును, సోదరులును, పుత్రు లును, కోడళ్ళును తమతమపుణ్యఫలములను, నైశ్వర్యములను ననుభ వించెదరు; కాని భర్తభాగ్యము భార్యయే పొందును. కనుక నేను గూడ వనములో నివసింపవలెనని యాజ్ఞాపింపబడితిని. స్త్రీలకు తలి దండ్రులును, పుత్రులును సఖులును, తమకుతామును నీలోకములో గాని, ముందులోకములోగాని గతికారు. వారికెల్లపుడు భర్తయే గతి. మీ రీదినమున వనమునకు బయలుదేఱిన మీముందు నేను మార్గ మును బాగుచేయుచు నడచెదను. నాయందు మీ రసూయయు కోపమును లేనివారై నిశ్శంకగ నన్ను తీసికొనిపొండు. నాయందు పాపమేమియు నుండదు. మేడలలోన, విమానములలోను నుండు నపుడుకాని, యాకాశమందు పోవునపుడుకాని మనుష్యుని కాలినీడ వలె నెల్లపుడు భార్య తనభర్త ననుసరించియుండవలెను. నే నేసమ యములో నెట్లు సంచరింపవలెనో నాతలిదండ్రులు నాకు చెప్పియుం డిరి. కాన నే నిప్పుడు క్రొత్తగ నేర్చుకొనవలసినది లేదు. నేనుగూడ

నిర్జనమైనదియు, ననేకమృగసంకులము కలదియునగు నడవికి వచ్చె
దను. నేను మీతండ్రియింట నుండునటులనే వనములోగూడ నివసించి
మూడులోకములసౌఖ్యములను లెక్కజేయక మిమ్ము సేవించుచు నెల్ల
ప్పుడు నియమముగలదాననై బ్రహ్మచర్యవ్రతము జరుపుచు మీతో
సంతోషముగ నుండెదను. ఇక్కడిజనులను పరిపాలింపసమర్థతగలిగిన
మీరు నన్నడవిలో రక్షింపలేకపోరు. అది మీకెంత. మీతో నేనీదిన
మున వనమునకు సంశయము విడిచి వచ్చెదను. మీరు నన్ను తప్పింపవ
గూడదు. అడవిలో ఫలమూలములను దినుచు మీకు విచారమును
కలుగజేయక నేనెల్లప్పుడును మీతో నుండెదను. నేను మీచే రక్షింప
బడుచు భయములేనిదాననై పర్వతములను, నదులను, మంచిసరస్సు
లను, వనములను జూడగోరెదను. సరస్సులలోను, నదులలోను
మనము సంతోషముగ స్నానముచేయుదము. మీతో లక్షసంవత్స
రములు తిరిగినను నాకేమియు కష్టముండదు. మీరు లేని స్వర్గమైనను
నాకక్కఱలేదు. మిమ్మే నే ననుసరించియుండియున్నాను. మీరు
నన్ను విడిచిన నేను చావ నిశ్చయించియున్నాను. 'నన్ను తప్పక
మీరు తీసికొనిపొండు.' అని మిమ్ము యాచించుచున్నాను." ఇట్లు
సీత కన్నీరు తెచ్చుకొని రాముని వేడెను.

రాముడామెమాటలను విని యామె యక్కడనే ధర్మముతో
నుండవలెనని పలికి వనములోనుండుకష్టముల నామె కీప్రకారముగ
దెలిపెను. "వనవాసులుకూడ సింహములయఱపులను కొండనీటిధారల
వద్ద విని భయపడుదురు. నిరాటంకముగ క్రీడించు కొండపాములు
మొదలగు గొప్పజంతువు లిదివరకు జనులను జూడకపోవుటచే నక్క
డకు వచ్చినవారిని జంపబోవును. ఏళ్ళలో పెద్దజంతువు లుండుట
చేతను, నందలినీరు బురదగ నుండుటచేతను వానిని దాటుట కష్టము.
త్రోవలలో ముండ్లును, తీగెలును నుండుటచేతను, నీరులేకపోవుట

చేతను వానిని దాటుటకష్టము. తేళ్లు, అడవియీగలు, గొప్పపక్షులు మొదలగునవి బాధచేయుచుండును. పగలంతయు నాహారసంగ్రహముకొఱకు కష్టపడి రాత్రి భూమిపై రాలినయాకులను పఱచుకొని పండుకొనవలయును. చెట్లనుండి రాలినపండ్లను, దొరకినయాహారములను భుజించి నియమముగలిగి సంతోషముగ రాత్రింబగళ్లు గడుపుచుండవలెను. శక్తికొలది యుపవాసముల చేయుచు నారచీరలను, జటలను ధరించి యుండవలెను. దేవతలను, పితరులను యథావిధిగ బూజించుచు నచ్చుటకువచ్చినయతిథులకు భోజనమిడవలెను. ఎల్లపుడు నుదయము, మధ్యాహ్నము, సాయంకాలము స్నానము చేయుచుండవలెను. పుష్పాలను స్వయముగ దెచ్చుకొని ఋషులవలె వేదికయందు దేవుని పూజింపవలెను. అచట గొప్పవాయువులు వీచును. శీతకాల రాత్రులందు చలి విస్తారముగనుండును. అక్కడ నాకలి యెక్కువగ నుండును. వనములో క్రోధలోభముల విడిచి భయములేకుండ తపస్సునందే బుద్ధిగలిగియుండవలెను. నీవిట్టివనవాస బాధలను పడలేవు. కనుక నీవిక్కడనే నిలిచి నీధర్మములను జరుపుచుండుము. వనవాసబుద్ధిని విడువుము."

రాముని మాటలకు సీత యొప్పుకొనక దుఃఖము, కన్నీరు కలదై యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "మీరువనవాసమునుగూర్చి చెప్పిన కష్టములన్నియు మీతో నుండిన నాకు సుఖములేయగును. అక్కడ నుండు క్రూరమృగము లితరులతో జూచియుండని మీరూపమును జూచి భయమునొంది తొలగిపోవును. నాతలిదండ్రులయాజ్ఞచే నేను మీతోకూడ సంచరింపవలెను. మిమ్ము విడిచిన నా కిక్కడ మరణము సంభవించును. మీయొద్ద నేనుండిన దేవేంద్రుడైనను నన్ను బలవంతముగ బట్టలేడు. భర్తలేనిభార్య జీవించుటకష్టము, పూర్వము నాతండ్రి యింట నే నుండు దినములలో బ్రాహ్మణులును, సాముద్రికులును,

సాధువులగుఋషులును వనవాసము నాకు నిర్ణయింపబడియున్నట్లు తెలిపిరి. అప్పటినుండియు నాయభిలాషతోనే నే నుంటిని. కనుక మీతో తప్పక నేను వచ్చెదను. పూర్వము నిర్దిష్టమైన దిప్పుడు సంభవించెను. బ్రాహ్మణులు పలికినది నిజమగుగాక. మీతో నేను వనమునకు వచ్చెదను. శిక్షితబుద్ధిలేనివారికి వనవాసకష్టములవలన దుఃఖములు కలుగును. పూర్వ మనేకపర్యాయములు వనవిహారము జేయుటకు మిమ్ము నేను గోరియుండ మీరొప్పకొనియుండిరి. దానికి నుత్సాహము కలదాననై వనములో మీపరిచర్య జేయగోరియున్నాను. మహాత్మా! నే నేవిచారమునొందక సంతోషముతో నుండెదను. మీరే నాకు దైవము గనుక నేను మి మ్మనుసరించియుండెదను. పరలోకమందైనను నేను మీతోగూడియుండుటయే నాకు శ్రేయము. 'తనతల్లిదండ్రులచే విధ్యుక్తముగ వివాహము చేయబడిన పుణ్యస్త్రీ తనభర్తకు నీలోకమునను లోకాంతరముననుగూడ పరిచర్య జేయవలెను.' అని శ్రుతులు బోధించునటుల బ్రాహ్మణులు పలుకుదురు. నేను మంచిప్రవర్తనగల పతివ్రతను; మీయాధీనమున నున్న దానను. నన్ను తీసికొనిపోవుటకు మీకేల యిష్టములేదు. మీతో సమముగ సుఖదుఃఖముల ననుభవించుదానను, దీనురాలను, మీభక్తురాలనునగు నన్ను మీరు తప్పక తీసికొని వెళ్ళవలెను. మీ రట్లు చేయనిచో నేను విషమును త్రాగియైనను, నగ్నిలోగాని, నీటిలోగాని పడియైనను మరణించెదను." ఈ తీరున ననేకవిధముల సీత రాముని వేడుకొనినను నాత డామెను వనమునకు దీసికొనిపోవుటకు నిష్టపడలేదు.

సీత తనకన్నీటితో భూమిని దడుప నాత డామెను మఱలించుటకనేకప్రకారముల నామెకు బోధించెను; కాని యామె దానిని వినక వనవాసమునకు బోవుట కిచ్ఛగలదై యాతనియందలి స్నేహభావ

ముచే నాతని నిట్లు నిందించెను. "రామా! పైకి పురుషవిగ్రహము గలిగి స్త్రీవలె ప్రవర్తించు మిమ్ముగూర్చి మీమామగా రేమనుకొనదరు? 'లోకములను తపింపజేయుసూర్యునికివలె రామునికిని గొప్పతేజస్సుగల' దని యజ్ఞానమువలన ప్రజలు పలికినను నది యబద్ధము కాదు. మీ రేపనిజేయుటచే విచారమునొందు చున్నారు? మీకేల భయము? మఱియెవరియందు మనస్సులేని నన్ను మీ రేల విడువ గోరుచున్నారు? పూర్వము ద్యుమత్సేనకుమారుడగు సత్యవంతుని సావిత్రి యనుసరించి తిరిగినటుల నేను మి మ్మనుసరించి తిరుగుచున్నాను. నే నితరనీచస్త్రీలవలె మనస్సులోనైనను పరపురుషులను తలంపను; గనుక నేను మీతో రావలసినదానను. తమభార్యను నితరులకు వ్యభిచరించుటకు పంపి జీవించువారివలె మీరు మీతో చాలాకాలము కాపురముజేసిన యౌవనవంతురాలు, మీభార్యయగు నన్ను స్వయముగ వేశ్యనువలె పైవారి కియ్యగోరుచున్నారు. మీరు హితమును బలుకుచు శ్రమజెందుచు భరతునికి దాసులైయుండవచ్చును; కాని మీరు నన్ను తీసికొనకుండ వనమునకు వెళ్ళగూడదు. మీరు తపస్సు చేయుచుండినను, నడవికిబోయినను, స్వర్గమునకు బోయినను నేను మీతో నుండుదాననే. మీ వెనుక నేను నడచునపుడును మీతో విహరించునపుడును నాకేమియు నాయాసము కలుగదు. మీతో నడచునపుడు నాకు ముండ్లపొదలు దూదివలె తగులును. పెద్దగాలిచే వ్యాపించిన దుమ్ము నాశరీరమునకు తగిలిన దానిని నేను మంచిగంధపుపొడివలె దలతును. ఇంటిలోనుండు చిత్రకంబళములను పఱచిన పక్కలకంటె పచ్చికతో బఱచిన పక్కలే నాకు సుఖముగనుండును. మీరు నాకు వనములో తెచ్చియిచ్చిన ఆకులు, దుంపలు, ఫలములు కొంచెమైనను నవి నాకు నమృతరసమువలె నుండును. నే నక్కడ వాని ననుభవించుచు నాతలి

దండ్రులనుగాని, వారిగృహములనుగాని తలంపను. అక్కడ నావలన మీకు విప్రియముగాని, శోకముగాని కలుగదు. మీతోడినివాసము నాకు స్వర్గము. మీరులేని నానివాసము నాకు నరకము. మీరు దీనిని తెలిసికొని గొప్పసంతోషముతో నాతో కలిసి వెళ్లుము. మిమ్మాశ్రయించిన నన్ను మీరు మీవిరోధులపాలు జేసెదరేని యీ దినముననే నేను విషముద్రాగి మరణము నొందెదను. ఆలాగు నేను జరుపలేకపోయినను దుఃఖము నన్ను బ్రతుకనీయదు. మీచే విడువ బడిన నాకు వెంటనే మరణము శ్రేయము. ఒకనిమిషమైనను నేను మిమ్ము విడిచియుండలేనపుడు 14సంవత్సరములు మిమ్ము విడిచి దుఃఖ ముతో నెట్లుండగలను?" ఇట్లు సీత దీనత్వముతో విలపించి శోక మును, మిక్కిలి యాయాసమును బొంది తనభర్తను కౌగిలించుకొని యేడ్వ, నామె కన్నీళ్ళు వరదలై ప్రవహించెను.

అప్పుడామెముఖపద్మము మిక్కిలివాడిపోయి యుండెను. రాముడు తనబాహువులతో నామెను కౌగిలించుకొని దుఃఖముచే మూర్ఛ బొందినట్లు కనబడు నామెకు తెలివివచ్చునటుల మంచిమాటల నిట్లు పలికెను. "నీకు దుఃఖముకలిగిన నేను స్వర్గమునైనను కోరను. సృష్టి కర్తకు దేనివలనను భయములేనటుల నాకును దేనివలనను భయము లేదు. నిన్ను రక్షించుటకు నాకు శక్తియున్నను నీమనోభిప్రాయ మంతయు తెలియక నీవనవాసము నే నిష్టపడలేదు. నీవు నాతో వన వాసముచేయుటకు సృజింపబడియున్నావు. బుద్ధిమంతులకు తమకీర్తి విడువ వీలులేనిదైనటుల నాకు నీవు విడువ వీలులేనిదానవు. రాజ ర్షులు వారిభార్యలతో వనమున వానప్రస్థము జరిపినటుల నేను సీతతో వానప్రస్థముజరిపెదను. నేను నాతండ్రిమాట సత్యముగ బాలింప వనమునకు బోక తప్పదు. నాతలిదండ్రులకు లోబడియుండుటయే నాకు ధర్మము. దానిని విడిచి నేను జీవింపలేను. ప్రత్యక్షదైవములగు

తల్లిదండ్రులను, గురువులను సన్మానింపనివాడు ప్రత్యక్షముగనుండని భగవంతుని నెట్లు పూజింపగలుగును? గురువు, తలిదండ్రులు నుండు ప్రదేశమున క్రమముగ భూలోక భువర్లోక స్వర్గలోకముల ఫలము కలుగును. వారితో సరియగువారు లోకములోలేనందున వారిని తప్పక పూజింపవలెను. సత్యము, దానము, యజ్ఞము, మంచిదక్షిణలు మొదలగుమంచికర్మలఫలములకంటె తండ్రిసేవయే యెక్కువ ఫలమునిచ్చును. దానివలన స్వర్గము, ధనము, ధాన్యము, విద్యలు, పుత్రులు, సుఖములు లభించును. ఆముగ్గురుగురువులయొక్క శుశ్రూషచే పొందుటకు కష్టమైన దేదియు లేదు. తలిదండ్రులసేవచేయు మహాత్ములు దేవగంధర్వలోకములను, బ్రహ్మలోకమును బొందుదురు. నాతలిదండ్రు లాజ్ఞాపించిన నేను సత్యధర్మమున నిలిచి యాలాగు జరుపుటకు గోరెదను. ఇదే సనాతనధర్మము. నిన్ను దండకావనమునకు తీసికొనిపోవుటకు తొలుత నాకిష్టము లేకుండెను. 'నేను కూడ వచ్చెద' నని నీవు పట్టుపట్టుటచే నేనట్లు తీసికొని వెళ్లుటకు నిశ్చయించితిని. నీవు వనమునకు బోవుటకై భగవంతునిచే సృష్టింపబడితివి. నన్ను వెంబడించి నాతో కార్యములను జరుపుము. నీకులమును, నాకులమును నన్నివిధముల సమానములు. నీవు భర్తశుశ్రూషను బాగుగ నెఱిగినదానవు.నీవులేకుండ నేనుస్వర్గమునకుగూడ బోనొల్లను. వనవాసమునకు బూర్వము చేయవలసిన కార్యముల నారంభింపుము. దరిద్రులకు భోజనమును, బ్రాహ్మణులకు రత్నములను యాచకులకు తగిన వస్తువులను, శీఘ్రముగనిమ్ము. అలంకారములు, మంచిబట్టలు, క్రీడావస్తువులు మొదలగు వానిని మొదట బ్రాహ్మణులకిచ్చి పిమ్మట సేవకుల కిమ్ము." ఇట్లు తనభర్తపలుకు ననుకూలపుమాటలను విని సీత తానుగూడ వనమునకు బోవుట తెలిసికొని శీఘ్రముగ దానములు చేయుట కారంభించెను.

లక్ష్మణుడు రామునితోనే వచ్చి సీతారాములప్రసంగము వినుచుండి కండ్లంట నీరు తెచ్చుకొని తనదుఃఖ మాపుకొనలేక తన యన్నకాళ్ళను గట్టిగబట్టి నమస్కరించి యామె యొక్కడనుండ నాతనితో నిట్లు పలికెను. "జంతువులతోను, ఏనుగులతోను, పక్షులతోను నిండిన వనమునకు మీరు వెళ్ళనిశ్చయించిన నేను మీముందు ధనస్సునుబట్టి నడిచెదను. నాతోగలిసి మీరనేకయరణ్యములు తిరిగెదరు గాక! మిమ్ములవిడిచిపెట్టి నేను దేవలోకములోని యింద్రపదవిని గాని, యమరత్వమునుగాని, త్రైలోక్యాధిపత్యముగానికోరను." ఇట్లు లక్ష్మణుడు మనవిజేయ రాముడు వానినసేకపర్యాయములు మాటలచే నివారించెను. దానికి వాడు 'మీరు పూర్వము నన్ను వనమునకు బోవ నాజ్ఞాపించి యిప్పు డేలవలద నెదరు? దానికి గారణమే'మని చేతులు జోడించి యాతని నడుగ నాతడిట్లు పలికెను. "నిజముగ నీవు దయగలవాడవు. ధర్మాసక్తుడవు. వీరుడవు. ఎల్లపుడు మంచిమార్గమున నుండువాడవు. నాప్రాణముతో సమానుడవు. ప్రియుడవు. సఖుడవు. నేను చెప్పినట్లు జరుపువాడవు. అన్నదమ్ములభావము గలవాడవు. నీవును, నేనును వనమునకు బోయిన కౌసల్యాసుమిత్రలకు నుపచారము చేయువా రెవ్వరు? రాజు వారికి కోరినవన్నియు నిచ్చును; కాని యతడు కైకేయికి వశుడగుటచే నట్లు చేయలేడు. కైకేయి రాజ్యపదవినిబొంది తనసవతులకు సౌఖ్యము జరుపదు. భరతు డామె మాటలకు లోనై వారలను దలపడు. నీవు రాజానుగ్రహముచేగాని, నీబుద్ధిచేగాని కౌసల్యను భరించి నేను చెప్పినట్లుచేయుము. అట్లు చేసిన నాయందు గొప్పభక్తియు, తల్లులకు సంరక్షణ చేయుటవలన సంతకంటె నెక్కువధర్మమును నీకు గలుగును. మేము నాతల్లినివిడిచి వనవాసమునకు వెళ్ళుచున్నందున నా మెకు సౌఖ్యము జరుగదు. కనుక నానిమిత్తము నీ వామెను పూజింపుము." ఇట్లు రాముడు

మంచిమాటలను సెలవీయ దానికి లక్ష్మణుడు మాటనేర్పుతో నీక్రిందిసంగతులను మనవిచేసెను. "మీపరాక్రమముచేతనే భరతుడు కౌసల్యాసుమిత్రలను బూజించును. అనుమానము లేదు. వారిద్దఱికి వేయేసిగ్రామములు కలవు. నావంటివారిని వేయిమందిని వారు పోషింపగలరు. నేను మీతో వచ్చుట యొప్పుకొనుడు. ఇందు విపరీత ధర్మమేదియు లేదు. నాకోరిక నెఱవేఱును. మీకార్యములు జరుగును. నేను విల్లును, బాణములనుబట్టి మీకు ముందు దారిజూపించుచు నడచెదను. గునపమును, బుట్టను పట్టుకొని మీభోజనమునిమిత్తము ఋషులయాహారమగు దుంపలను, ఫలములను, వస్తువులను మీకు తెచ్చియిచ్చెదను. మీరును, సీతయు కొండచరియలలో విహరించు నప్పుడును, మేలుకొనియుండునపుడును, పండుకొనియుండునప్పుడును నేను మీకు కాపుండెదను." ఈతీరున లక్ష్మణుడు పలుక రాముడు సంతోషించి దానికొప్పుకొని వానికి ట్లాజ్ఞాపించెను, "నీవు మాతో రమ్ము. దీనినంతయు మనస్నేహితులకు దెలుపుము. జనకుని యజ్ఞమందు మనకు వరుణుడు స్వయముగ నిచ్చినవియు, దేదీప్యమానముగ ప్రకాశించునవియు, భయంకరముగ గనబడునవియునగు నారెండు ధనస్సులును, నభేద్యములగు రెండుకవచములును, అక్షయమైనబాణములుగల రెండమ్ములపొదులును, బంగారుకట్టును, సూర్యునివంటి కాంతియుగల రెండుఖడ్గములును వసిష్ఠునియింట పూజింపబడుచున్నవి. వానిని దీసికొని బయలుదేఱుము." ఇట్లు రాముడు సెలవీయ లక్ష్మణుడు వెంటనే వెళ్ళి యీవృత్తాంతమును తనస్నేహితులకు జెప్పి తనగురునియింటికి బోయి యాయుధములను దెచ్చి రామునికి జూపించెను. అప్పుడతడు వానికి "నాస్వంతధనమంతయు బ్రాహ్మణులకు, ఋషులకు మనమిద్దఱ మిచ్చెదము గాక! ఇక్కడ గురువులకు బాగుగ శుశ్రూషజేయు బ్రాహ్మణోత్తములున్నారు. వారికిని,

మనసేవకులకును, దాని నిచ్చెదను. వసిష్ఠునికుమారుడగు సుయజ్ఞుని, నితర బ్రాహ్మణులను దీసికొనిరమ్ము." అని సెలవిచ్చెను.

---

౬. వ. అధ్యాయము. రామవనవాసప్రయత్నము.



రామపట్టాభిషేకనిర్ణయదినమున కైకేయిమాటలను విని రాముడు తత్క్షణమే తనతల్లిని, లక్ష్మణుని, సీతను కలిసికొని సీతాలక్ష్మణులతో వనవాసముచేయుటకు నిశ్చయించెను. రామునియాజ్ఞ ప్రకారము లక్ష్మణుడు వసిష్ఠపుత్రుడగు సుయజ్ఞుని యగ్నిగృహము నకు బోయి యాతనికి నమస్కరించి "మీరు రాముని గృహమునకు రండు. ఆతనిదృఢనిశ్చయమును జూచెద"రనిపలికెను. ఆతడు శీఘ్రముగ మాధ్యాహ్నిక సంధ్యోపాసన చేసి బయలుదేరి వానితో రాముని గృహమునకు వెళ్లెను. సీతారాము లాతనికి నమస్కరించిరి. రాముడాతనికి బంగారుకేయూరములు, అంగదములు, (దండగడియములు) కుండలములు, బంగారుతాళ్ళతో గుచ్చిన మణులు, అనేకవిధములైన రత్నములు మొదలగువానిని సమర్పించెను. సీత సుయజ్ఞునిభార్యకు బంగారుతాడును, హారమును, మొలతాడును, చిత్రములగు కేయూరాంగదములను, రత్నములతో స్థాపింపబడిన మంచికంబళ్ళు పఱుపబడిన పక్కను నియ్యగోర వానినాతడు తన భార్యకిచ్చుటకు పుచ్చుకొనెను. ఇంకను రాముడు తనమామ తన కిచ్చిన శత్రుంజయమను నేనుగును, మఱివేయియేనుగులను సుయజ్ఞుని కియ్య నాతడు వానిని పుచ్చుకొని సీతారామలక్ష్మణులకు శుభాశీర్వచనములను జేసెను. తర్వాత రాముడు లక్ష్మణునికి నిట్లు సెలవిచ్చెను. "బ్రాహ్మణోత్తములగు నగస్త్యుని, కౌశికునిగూడ బిలువుము. వారికి రత్నములను, వేలకొలదిగోవులను, బంగారమును,

వెండిని, సొమ్మును నిమ్ము. కౌసల్యకు నాశీర్వచనము చేయుచుండి యామెనాశ్రయించియుండిన ఋగ్వేదయాధ్యాపకునికి వాహనమును, దాసీలను, మంచిబట్టలను నిమ్ము. మనరథములను నడపుచు మన యొద్ద చిరకాలమునుండియున్న సూతుడను వృద్ధమంత్రికి మంచి రత్నములను, బట్టలను, సొమ్ములను, పశువులను, వేయిగోవులను నిమ్ము. పాలాశదండములనుబట్టి తిరుగుబ్రహ్మచారు లెప్పుడు వేద పఠనముచేయుచు మఱియేయితరపనుల జేయరు. వారికి రత్నములతో నిండిన సంచులుకల 80 ఒంటెలను,1200 మంచియెడ్లను,1000గోవులను నిమ్ము. మనతల్లియగు కౌసల్యనాశ్రయించిన బ్రహ్మచారుల కొక్కొక్కరికి వేయేసిగోవులనిచ్చి యామెనంతోషించునటుల మంచిదక్షిణ లనిమ్ము.'' ఈప్రకారము రాముడు సెలవీయ లక్ష్మణుడట్లు జరిపెను. తరువాత రాముడు కన్నీటితోనున్న తనగృహసేవకులతో మీరు పూర్వమువలెనే నాగృహమును, లక్ష్మణునిగృహమును తిరిగి మే మొచ్చువఱకు జాగ్రత్తగ కాపాడవలెను.'' అని పలికి ధనాగారయుజ మానికి సొమ్ముతెచ్చుట కాజ్ఞాపించెను. రాసులుగపడియున్న యా ధనమునుండి వానిసేవకులు కొంతధనమును దీసికొనిరి. తరువాత రామ లక్ష్మణులు దరిద్రులను, బాలురను, వృద్ధులునునగు బ్రాహ్మణులకు సొమ్మును బంచిపెట్టిరి. ఆకాలమున గర్గవంశజుడగు 'త్రిజటు' డను బ్రాహ్మణున కనేకకుమారు లుండిరి. అత డడవిలో దుంపలుత్రవ్వి తెచ్చి కుటుంబపోషణ జేయుచు దారిద్ర్యస్థితిలోనుండెను. అంతట నాతని భార్య యాతనితో 'నీవు ధర్మజ్ఞుడగు రాముని దర్శించిన నీకే మైన దొరకు' నని పలికెను. దానికాత డంగీకరించి చినిగిపోయినబట్ట కట్టుకొని రామునియింటిమెుదుట నిలిచెను. భృగువువలెను, నంగిర సునివలెను ప్రకాశమానముగ జనులకు గనబడు నాతనిని రాజనగరు లోని 5 ప్రాకారములు దాటువరకు నెవ్వరు నడ్డలేదు. ఆతడు

రామునిజూచి "నేను నిర్ధనుడను. నాకు జాలమంది కుమారులున్నారు. నేనడవిలో దుంపలను త్రవ్వి జీవించుచున్నాను. కాన నాయందు దయజూపుడు." అని పలుక నతడు నవ్వి యాతనితో "నాగోవులలో మీకొక్కవేయిగోవులనే యియ్యను; కాని యీకఱ్ఱను మీరు విసరుడు. అది పడినచోటువఱకు నుండు స్థలములలోనున్న గోవులను మీకిచ్చెదను." అని పలికెను. దానికాఋషి తన నడుమునకు బట్టను వేగముగ బిగించి యాకఱ్ఱనుతనబలముతో త్రిప్పి విసర నది సరయూనదినిదాటి యనేకవేలగోవులును, వృషభములును నుండుచోట బడెను. అప్పుడు రాముడు త్రిజటుని కౌగిలించుకొని సరయూతీరమునుండి గోపకులద్వారా వానిని దెప్పించి యాఋషియాశ్రమమునకు బంపెను. అప్పు డాత డామునితో మంచిమాటలు చెప్పుచు "మీరు కోపింప వలదు. నేను పరిహాసమున కట్లు పలికితిని. మీ తేజస్సు చూడనలవికానిది. దానిని తెలిసికొనుట కట్లు చేసితిని. మీకు మ తేమికావలసినను నిచ్చెదను. మీతో మర్మముతోగాక నిజముగ జెప్పుచున్నాను. నాకున్నధనము మీవంటిబ్రాహ్మణుల కిచ్చుటచే నాకు సంతోషమును, కీర్తియుగలుగును."అని పలికెను. ఆఋషి యాతనికి యశము, బలము, ప్రీతి, సుఖము వృద్ధియగునటుల నాశీర్వదించి తనయాశ్రమమునకు బోయి తమకు గోవులువచ్చినందుకు తన భార్యతోగూడ సంతోషించెను. రాముడు మిగిలినవారికిగూడ తగిన బహుమానముల నీయ వారు సంతోషించిరి.

తరువాత రామలక్ష్మణులు మెఱయుచున్న తమయాయుధములను మొదట సీత చందనాదులతో నలంకరింప వానికి పుష్పమాలికలనుగట్టి వానిని పట్టుకొని యాగృహమును విడిచి యామెతోకూడ దశరథుని జూచుటకు రాజమార్గమున బోవుచుండిరి. అప్పుడు వీధులు జనసంకులముచేనిండి ప్రజలరాకపోకల కిబ్బంది గలుగజేయ వాచు

మిద్దెలు, మేడలు నెక్కి మిక్కిలి విచారముతో వారిని జూచుచుండిరి. వారు ఛత్రములేకుండ కాలినడకను వెళ్లు రాముని జూచి మిక్కిలివిచారమునొంది యీతీరున ననేకవిధముల బలికిరి. "ఈయుదయమున చతురంగబలములతో వెళ్ళిన యాతడిప్పుడు సీతా లక్ష్మణులతో మాత్రమే పోవుచున్నాడు. అధికారముసంగతి తెలిసిన వాడును, కోరినవారికోర్కెలు దీర్చువాడునునగు నీతడు ధర్మబుద్ధిచే తనతండ్రి మాట లబద్ధముకాకుండునట్లు కోరుచున్నాడు. ఆకాశమున సంచరించు వారైనను నెప్పుడు జూడలేని యీమెను రాజమార్గమున నుండు జనులు చూచుచున్నారు. రక్తచందనము బూసికొనినదియు, మంచి రంగుగల యవయవములు గలదియునగు సీత వర్ణమును వర్షమును, వేడియు, చలియు శీఘ్రముగ మార్చుగలవు. ఈదినమున దశరథునికి పిశాచముపట్టుటచే నతడట్లు పలికెనుగాని యతనికి నిజముగ తనప్రియ పుత్రుని నడవికి పంపుట యిష్టములేదు. గుణహీనుడగు పుత్రునినైనను తండ్రి యడవికి బంపనిచో తనప్రవర్తనచే లోకమునంతను జయించిన రాముని రాజు వనవాసమునకు బంపుట యెట్లు? 'అహింస, దయ, గ్రంథపఠనము, మంచి స్వభావము, దమము, (ఇంద్రియ నిగ్రహము) శమము(చిత్తప్రశాంతి)' అను నీయాఱుగుణములు నాతని యందు గలవు. మొదలును నఱికినయెడల పుష్పములు, ఫలములు గల చెట్టునకు బాధకలుగునటుల రామునికి పీడగలుగుటచే ప్రజలు మిక్కిలిబాధనొందుదురు. మిక్కిలి తేజోవంతుడును, కేవలము ధార్మికుడునునగు నీతడు చెట్టువేరువంటివాడు. దానిఫల పుష్ప పత్ర శాఖలు ప్రజలగుదురు. లక్ష్మణుడు రామునితో వెళ్ళినటుల మనమును బంధువులతో శీఘ్రముగ నాతడువెళ్ళినతోవనే బోవుదము. మనయిండ్లను, భూములను, తోటలను విడిచి సుఖదుఃఖములను సమముగ జూచుచు నాతనితో బోవుదము. సిరితొలగిన మనగృహాదుల నవ్వాడు

కైకేయి పొందుగాక! రాముడుండు వనమే నగరమగుగాక! మనము విడిచిన నగరమే వనమగుగాక! మన మడవికి బోయిన నక్కడి వనజంతువులు మనలనుజూచి పాఱిపోయి మనపట్టణములో నివసించి కైకేయీభరతుల యేలుబడిలోనుండును. మనము రామునితో వనమున నుందము." ప్రజలు పల్కిన యీమాటల రాముడు విని మనోవైకల్యమునొందక తనతండ్రినగరునుజేర విచారముతో సుమంత్రుడు దగ్గఱగ నటని కగపడెను. విచారముతో నక్కడిప్రజలు తన్ను జూచినను తాను విచారింపక నవ్వుచు తనతండ్రియాజ్ఞను క్రమముగజరుపగోరి వనమునకు బోవ నిశ్చయించి యామంత్రితో తాను వచ్చిన సంగతి తనతండ్రికి దెలుపవలెనని పలికెను.*

---

* అ-రా:- సీతారాము లక్ష్మణులు పట్టణమును విడిచి వెళ్లునపుడు మంచి గుణములుగల ప్రజలు విచారించుచుండ ఋషిశ్రేష్ఠుడగు వామదేవుడు వారిమధ్యను జేరి యిట్లుపన్యసించెను. "మీరు విచారింపవలదు. రాముడు మహావిష్ణుని యవతారము. సీత లక్ష్మియగు యోగమాయ. లక్ష్మణుడు శేషుడు. ఈరాముడే మాయాగుణములతో గూడుకొనినవాడై యాయారూపములను బొందినవానివలె గనబడును. ఇతడు రజోగుణమున బ్రహ్మయై లోకమును బుట్టించి సత్త్వరూపమున విష్ణువై దానిని రక్షించి తమోగుణమున రుద్రుడై దాని నంతము నొందించును. ఇతడు మత్స్య కూర్మ వరాహ నారసింహ పరశురామావతారముల నెత్తెను. ఈరామావతారమున నితడు రావణాదులను, కోట్లకొలదిరాక్షసులను జంపును. దశరథుడు తపస్సు జేయుటచే విష్ణు వాతనిపుత్రు డయ్యెను. రాముడు లక్ష్మణసహాయముతో రావణునివధించుటకై వనమునకు వెళ్ళుచున్నాడు. ఈసీత విష్ణునిమాయ; సృష్టి స్థితి నాశనములకు గారణము. వీరు వనమునకు బోవుటకు దశరథుడుగాని, కైకేయిగాని యెంతమాత్రము కారణము

అప్పుడు సుమంత్రుడు విచారముతో దశరథునియొద్దకు బోవ నాతడు నిట్టూర్పుదీయుచు రాహుగ్రస్తమైన సూర్యునివలెను, నివురు గప్పిన నిప్పువలెను వానికి గనబడెను. అతడు రామునే తలచుచు విచారించుచుండ సుమంత్రు డాతనిజూచి చేతులుమోడ్చి జయ వాక్యముల బలుకుచు భయముచే వణకుచు మెల్లగను, స్పష్టముగను, నిట్లు పలికెను. "రాముడు తనధనమంతయు బ్రాహ్మణులకును, తన

---

గారు. నిన్నటిదినమున నారదుడు భూభారమునుగూర్చి రామునితో బలుక నతడు 'నేను స్వయముగ రేపటియుదయమున వనమునకు బోయెద' ననిపలికెను. మూఢులగు మీరు రామునిగూర్చి విచారము విడువుడు. 'రామ! రామ!' యని భూలోకమున నేజను లెల్లపుడు జపింతురో వారికెంతమాత్రము మృత్యుభయము మొదలగునవి కలుగవు. మహాత్ముడగు రాముని దుఃఖశంక యింకను మీకేల? కలి యుగమున జనులకు రామనామమువలననేకాని మఱిదేనివలనను ముక్తి గలుగదు. సృష్టికర్తయగు రాముడు మాయామానుషరూపమున జనులను భ్రమింపజేయును. రావణుని వధించుటకును, భక్తులు తన్ను భజించుటకును, దశరథునికోర్కె నెఱవేర్చుటకును నితడు మనుష్య రూపమును బొందెను." ఇట్లు వామదేవుడు ప్రసంగించెను.

టిప్పణము:-రామనామముచే గలియుగమున ముక్తి గలుగునని వక్కాణింపబడుటచేతను, నారదుడు కలికాలపు ప్రజలశ్రేయస్సు కొఱకు బ్రహ్మనొకగ్రంథము కోరుటచేతను నీయధ్యాత్మరామాయణ మిప్పటికలియుగమున రచింపబడినదని మేమూహించెదము. ఇది వాల్మీకిరామాయణమున కనంతరగ్రంథము. ఇది వ్యాసరచితమని తెలుపబడినది. అతడు గాని, మఱియొకడుగాని దీనినిరచించినను నిది ప్రస్తుత కలికాలగ్రంథమనుటకు ననుమానము లేదు. దీనిలో వేదాంతవిషయములు మనస్సునకు నాటునట్టుల విపులముగ దెలుపబడినవి.

సేవకులకును నిచ్చి మిమ్ముజూచుటకు ద్వారమున వేచియున్నాడు. అతడు మిమ్ముజూచి తనస్నేహితుల నందఱి నడిగి వనమునకు వెళ్లును. కనుక మీరతనిని జూడవలెను." సుమంత్రుని యీమాటలను ధర్మాత్ముడును, సత్యవాదియునగు దశరథుడు విని 'నాభార్యలనందఱిని నిచ్చటకు దీసికొనిరమ్ము. వారందఱితో కలసి ధర్మాత్ముడగు రాముని చూచెదను.' అని వారికిసెలవీయ నాత డంతఃపురములోనుండు స్త్రీలను బిలిచి వారిని దీసికొని రాజునొద్దకు వచ్చెను. ఆ350 మంది స్త్రీలును విచారముచే నెఱ్ఱబడిన కండ్లుగలవారై కౌసల్యతోగూడ వచ్చిరి.తరువాత రాజు తనకుమారుని దీసికొనివచ్చుటకు తనమంత్రికి సెలవీయ నతడు సీతారామలక్ష్మణులను రాజున కెదురుగ తొందరగ దీసికొనివచ్చుచుండ రాజుకూడ తన యాసనమునుండి లేచి వారి కెదురు వచ్చుచు విచారముచే భూమియందు బడి మూర్ఛ జెందెను. అప్పుడు రామలక్ష్మణులు వానిదగ్గఱకు శీఘ్రముగ రాగ నంతఃపుర స్త్రీలు 'హా! హా! రామా!'యనుచు గొప్పశబ్దము చేసిరి. అప్పుడు రామలక్ష్మణులు, సీతయు తమచేతులతో దశరథుని లేవనెత్తి యేడ్చుచు పక్కమీద పరుండబెట్టిరి. అంతట నొకగడియకు తెలివి నొందినరాజు గొప్పవిచారముతోనుండ రాము డాతనికి చేతులు జోడించి "మీరు మాకందఱికి ప్రభువులు. నేను దండకారణ్యమునకు బోవుచున్నాను. నన్ను కుశలముగ దీవింపుడు. పరమార్థకారణముల చేతను, ననేక యితరకారణములచేతను నేను సీతాలక్ష్మణులను రావలదన్నను వారిష్టపడలేదు;కాన వారిప్రయాణమునుగూడ నంగీకరింపుడు." అని మనవిచేసెను. అంతట దశరథుడు 'కైకేయికి వరమిచ్చుటచే నేను మోసపోతిని. నీవిప్పుడు నన్ను నిగ్రహించి యయోధ్యకు రాజవు కమ్ము' అని రాముని గోరెను. రాముడు తనతండ్రికి చేతులుజోడించి "మీరు వేలకొలదిసంవత్సరములనుండి భూమిని

పాలించుచున్నారు. నే నరణ్యమున కాపురముండి మీరు పలికినమాట లబద్ధముకాకుండునట్లు చేయవలెను. 14 సంవత్సరములు వనవాసము చేసి మీప్రతిజ్ఞను నెఱవేర్చి మీపాదములయొద్దకు తిరిగివచ్చెద”నని జవాబు చెప్పెను. దానికాత డేడ్చుచు రహస్యముగ కైకేయి ప్రోద్బలముచే తాను పలికినదానిని జరుపుటయను సత్యపాశముచే గట్టువడి వానితో నిట్లుపలికెను. “నీ శ్రేయస్సునకును, వృద్ధికిని నీవు వెళ్ళి తిరుగరమ్ము. నీకుశుభమగుగాక! నీకుత్రోవలో నెంతమాత్రము భయము కలుగకుండుగాక! సత్యబుద్ధిగల నీవంటిధర్మాత్ముని బుద్ధి త్రిప్పశక్యముకాదు. అయినను నీరాత్రి నీవిక్కడనుండుము. అట్లాక రోజు నిన్ను జూచియైన నేను సుఖము నొందెదను. నీవు నీతల్లిని, నన్ను జూచి మాకోర్కెలు దీర్చి రేపటియుదయమున వెళ్ళుము. నాప్రియముకొఱకు నీవు సుఖముల విడిచి నిర్జనమైనయడవికి బోవుట యను గొప్పకష్టమైన పని జేయుచున్నావు. గూఢమగు క్రూరబుద్ధి గల కైకేయి కపటముచే నేను మోసపోతిననియు, నాకిది యిష్టము లేదనియు నేను ప్రమాణము జేయుచున్నాను. మంచికులచరిత్రను నాశనముచేయు నామె కపటముచే నావలనపొందినవరములను నీవు జరుపనిశ్చయించితివి. నాజ్యేష్ఠకుమారుడవగుటచే నీవు తండ్రిమాట లబద్ధము కాకుండజేయుట యాశ్చర్యముగాదు.” ఇట్లు దశరథుడు దీనముతో బలుక లక్ష్మణసహితుడగు రాముడు విచారముతో నిట్లనెను. “రేపటిదినమున మాకు మీరీయదలచిన వస్తువుల నీదినమునకే యిండు. ఆవస్తువు లన్నిటికంటె నేను వనప్రయాణము నే గోరుచున్నాను. నేను విడుచు నీధన ధాన్య జనసహిత రాష్ట్రమును భరతున కియ్యవలెను. నేనిప్పుడు వనమునకు బోవుటకు నిశ్చయించిన నాబుద్ధి చలింపదు. మీరు కైకేయి కోరినవర మంతయు నామెకిచ్చి సత్య పరిపాలన జేయుడు. నేను మీయాజ్ఞను పాలించి 14 సంవత్సరములు

తపశ్శాలురతో వనములో నుండెదను. మీరు విచారింపక భరతునికి రాజ్యమిండు. మీయాజ్ఞ నెఱవేర్చుటయే నాకు ముఖ్యము. రాజ్యమునుగాని, సుఖమునుగాని, ప్రియమైన వస్తువులనుగాని, సీతనుగాని, కోరికలనుగాని, స్వర్గమునుగాని, జీవితమునుగాని నేనుకోరను. మీరు దుఃఖమును పొందకుడు. మీమాట సత్యమగునటులను, నసృతము కాకుండునట్లును నేను కోరి మీయెదుట సుకృతమును, సత్యమును బట్టి శపథము చేయుచున్నాను. నేనొకనిమిషమైన నిక్కడ నుండ వీలు లేదు. మీరు విచారింప వలదు. నేను నిశ్చయించినదానికి భంగము కలుగకుండుగాక! కైకేయి 'వనమునకు వెళ్లు'మని నన్ను గోర 'నేనట్లు చేసెద' ననిపలికితిని. దానిని నేను సత్యముగ బాలించెదను. మీరు విచారమునొందకుడు. మేము వనములో సంతోషముగ నుండెదము. దేవతలుకూడ 'తండ్రి దైవ'మని తలచుటచే నేనును నట్లు మిమ్ము దైవముగ దలచి మీమాటలను జరిపెదను. 14 సంవత్సరములు పూర్తికాగా నేను వచ్చుట మీరు చూచెదరు. అందుచే నీవిచారమును మీరు వీడుడు. కన్నీరువిడుచువారిమనస్సును త్రిప్పుటకు బదులుగ మీరుకూడ విచారించెదరేల? నేను విడుచున యోధ్యను, కోసలదేశమును, భూమినంతయు మీరు భరతునకిండు. నేను మీయాజ్ఞను పరిపాలించుచు వనములో కొంతకాలముండుటకు వెళ్లెదను. నేనక్కడ ఫలములను, దుంపలను భుజించి కొండలు, నదులు, సరస్సులు, వృక్షములు మొదలగువానిని జూచుచు సుఖముగ నుండెదను. మీరు విచారమును బొందకుడు." ఇట్లు రాముడు పలుక దశరథునకు విచారముచే కళ్ళు చీకట్లు గమ్మెను. రాజతనిని గౌగిలించుకొని మూర్ఛనొంది చలింపకయుండెను. అప్పుడు కైకేయితప్ప మిగిలిన స్త్రీలందఱు రోదనము చేసిరి. సుమంత్రుడుకూడ నేడ్చుచు మూర్ఛనొందెను. అగృహమందంతటను హా హా రవములు బయలుదేరెను.

అప్పుడామంత్రి కోపమునుజెంది నిట్టూర్పు దీయుచు వెంటనే తలను గదల్చుచు కండ్లెఱ్ఱజేసి పండ్లు కొఱుకుచు విచారమునొంది యంతకుపూర్వమున్న తనశరీరవర్ణము మాఱ నామెనుగూర్చి రాజు కోపమునుజెందెనని యెఱిగి తనశరీరము వణక కైకేయిమనస్సునకు నాటునటుల నామెను నిట్లు నిందించెను. "స్థావరజంగములుగల జగత్తునకు ప్రభువగు దశరథుని నీవు విడిచితివి. నీవింతకంటె జేయవలసిన దేదియు నిక్కడ కనబడదు. ఇంద్రునివలె నజేయుడును, పర్వతమువలె కదలింపశక్యముగానివాడును, సముద్రమువలె క్షోభపెట్ట శక్యముగాని గంభీరముగలవాడునునగు నీభర్తను నీక్రూరపుపనులచే గొప్పవిచారము నొందించితివి. భర్తను జంపుదానిగను, కులనాశనమునుగూడ జేయుదానిగను నిన్ను నేను తలచుచున్నాను. నీవు వరములిచ్చిన నీభర్తను నవమానించితివి. స్త్రీలకు పుత్రులయిష్టానుసరణముకంటె భర్తయిష్టానుసరణమే మిక్కిలిప్రధానము. న్యాయముగ రాజకుమారులకు రాజమరణాంతమందు రాజ్యము రావలయును. అధర్మపద్ధతినిబోగొట్టి నీవు దశరథుడు జీవించియుండగనే రాజ్యమును గోరుచున్నావు. భరతుడు రాజ్యమేలుగాక! మేము రాముడుండు చోటుకు బోయెదము. నీవుండు దేశమున బ్రాహ్మణులుండదగరు. అట్టియమర్యాదకర్మను నిప్పుడే చేయగోరియున్నావు. ఇట్టిపనులను నీవు చేసినందుకు వెంటనే నీవుండు భూమి బ్రద్దలుకాకపోవు టాశ్చర్యము. రాముని నడవికి బంపినందుకు నిన్ను బ్రహ్మర్షులు గొప్పకోపముగలవారై 'ఛీ'యని భయంకరవాక్యములను పలుకకున్నారు. మామిడిచెట్టును నఱికి యాప్రదేశమున వేపమొక్కను పాతి పాలుపోసి పెంచినను దానికి తీపిరాదు. నీతల్లిగుణములే నీకు వచ్చినవని తలచెదను. వేపచెట్టునుండి యెప్పుడును తేనె స్రవింపదు. * నీతల్లిదుష్టచరిత్రమును మేము విని

* 6వ. ప్రకరణము, ౨వ. అధ్యాయము. అయోధ్య. దశరథుడు 230పుట జూడుము.

యుంటిమి. ఆతీరుననే నీవుకూడ మాారాజును దుర్మార్గప్రవర్తనచే నట్లు చేయుచున్నావు. తండ్రితాతలగుణములు పుత్త్రులకును, తల్లి గుణములు కూతులకును గలుగునను లోకోక్తి యిప్పుడు సత్యముగ గనబడుచున్నది. నీతల్లివలె నీవు చరింపక తనజ్యేష్ఠపుత్త్రుడగు రాముని రాజ్యాభిషిక్తుని జేయవలెనన్న దశరథునివాక్యమును జరిపించి ప్రజలకు శరణు కమ్ము. ఇంద్రతుల్యుడును, లోకప్రభువును నగు రాజును నీవు ప్రోత్సాహపఱచి పాపకార్యములను జరిపింపకుము. నీవు కోరిన వికృతపుప్రతిజ్ఞ నాతడు జరుపడు. లోకములకు రక్షకుడును, కార్యముల బాగుగ జరుపువాడును, తనధర్మమును రక్షించుకొనువాడును, సత్పురుషుడును, జ్యేష్ఠుడునునగు రామునికి రాజ్యాభిషేకము జరుగుగాక! ఆతడు తనతండ్రిని విడిచి వనమునకు బోయిన నీవు లోకమున గొప్పయపకీర్తి పాలయ్యెదవు. రాముడు రాజ్యమును బొందుగాక! నీవు విచారమును విడువుము. ఈపట్నమున రాజ్యము జేయ నతనికంటె మఱియెవ్వడు సమర్థుడు? పూర్వాచారప్రకార మాతడు పట్టాభిషిక్తుడు కాగా రాజు వానప్రస్థుడగును." ఇట్లు సుమంత్రుడుదశరథునిసన్నిధిని చేతులు జోడించి కఠినపుమాటలతోను, మంచిమాటలతోను కైకేయికి చీవాట్లు పెట్టినను నామెమనస్సు చలన మొందలేదు. విచార మొందలేదు. ఆమెముఖమున వికార మేమియు కనబడలేదు.

తరువాత నారాజామెకిచ్చినవరముచే విచారమునొంది పెద్ద నిట్టూర్పుదీసి కన్నీరుతోనున్న తనమంత్రినిజూచి యిట్లు వాని కుత్తరు విచ్చెను. "నాచతురంగబలమునకు ఖర్చునిమిత్త మెక్కువగ రత్నములనిచ్చి రాముని వెంటబంపుము. ఆసైన్యముతో మంచిపాటలు పాడు వేశ్యలును, ధనవంతులగువణిజులును, భోజనసామగ్రులనిచ్చువారును వెళ్ళవలెను. అతని ననుసరించియుండు ధీరులకు తగినసొమ్ము

నిచ్చి వానితో బంపుము. ముఖ్యములగు నాయుధములును, పట్టణము నుండి సామగ్రిబండ్లును వానితో వెళ్ళవలెను. వనమునజరించు వేటగాండ్రు వానికి ముందు త్రోవజూపవలెను. రాముడు మృగములను వేటాడుచు నడవిలోని తేనెద్రాగుచు నదులు మొదలగు వానిని జూచుచు రాజ్యముసంగతి మఱచును. వానికి వనవాసమునకు గావలసినంతధనధాన్యముల నియ్యవలెను. వాడు పుణ్యదేశములందు యజ్ఞములజేయుచు బ్రాహ్మణులకు తగినదక్షిణలనిచ్చుచు ఋషులతో గలిసి వనమున సుఖముననుండును. భరతు డయోధ్యను బాలించును. రామునకు గావలసిన వస్తువులనన్నిటిని నియ్యవలెను." ఈతీరున దశరథుడు సుమంతుని కాజ్ఞాపింప కైకేయికి భయము కలిగెను. ముఖము వాడిపోయెను. కంఠధ్వనితగ్గిపోయెను. అప్పుడామె గొప్పవిచారముతో రాజున కెదురుగనిలిచి 'జనులందఱు రాజ్యమునుండి వెళ్ళిన భాగ్యహీనమగు నీప్రభుత్వము భరతునికేల?' అని సిగ్గులేక క్రూరముగ బలుక నాతడు 'శత్రువురాలా! నీవు కోరినవరములను నేనిచ్చితిని. నీవు పూర్వము కోరని కోరికలచే తిరిగి నన్నేలబాధించెద' వని కోపముతో నామెనడిగెను. దాని కామె మఱింతకోపము గలదై 'పూర్వము మీవంశములోని సగరచక్రవర్తి యసమంజసుడను తన జ్యేష్ఠకుమారుని వనవాసమునకు బంపెను. కాన నీవునునట్లు చేయనగును.' అనిపలికెను. దశరథుడు 'ఛీ,' యని యామెను నిందించెను. అక్కడిజనులు సిగ్గును జెందిరి. రాజుమాట నామె యేమియు లక్ష్యముచేయలేదు. అప్పుడు రాజుమంత్రియగు ముసలిసిద్ధార్థుడామెతో నిట్లుపలికెను. "అసమంజసుడు పిల్లలను సరయూనదిలో పడవేసినందున తండ్రిచే దేశాంతరముల నొందింపబడెను. రాముడు వనవాసము పంపబడుట కట్టిపాపమేమి జేసెను? ఇతనియందు దుర్గుణములనుగాని, దోషములనుగాని యేమియు గానము. నీ వేదోషమునైన వీనియందు కనిపెట్టినజెప్పుము.

అందుచే రాముడు వనవాసమునకు బంపబడును. సత్పురుషుని నడవిలో విడుచుటయును సధర్మాచరణచే నిందుగ్రీనంతటివాని కాంతి గూడ నశించును. రామునిసిరి బోగొట్టు నీయత్నము చాలును. లోకములో దీనివలనకలుగు నపవాదము లేకుండ జేసికొనుము.” సిద్ధార్థుని యీమాటలను విని దశరథుడు ఆయాసముజెందిన స్వరముతోను, విచారముతోను కైకేయి నైపుతిరిగి “కైకేయీ! వానిమాటలు నీకును నాకును హితమైనవి. నీవు దుర్మార్గములో నుండుటచే వానిని దెలిసికొనలేవు. నీవును, నీకుమారుడు భరతుడును రాజ్యము చేయుడు. నేను రాజ్యమును, ధనమును, సుఖమును విడిచి రామునితో నడవికి వెళ్ళెద”నని పలికెను.

అప్పుడు రాముడు తనతండ్రితో వినయముగ నిట్లుపలికెను. “భోగముల నన్నిటిని విడిచి యన్ని సంబంధములను వదలి వనములో వనవృత్తిని జీవించు నాకు నీ సేనతో పనియేమి? ఏనుగునుదానము చేసినవానికి దానిగొలుసువలన ప్రయోజనము లేనట్లు రాజ్యమును విడిచిననాకును సైన్యమువలన ప్రయోజనములేదు. అన్నివస్తువులు భరతునికే యుండనిమ్ము. నేను వనవాసముచేయు 14 సంవత్సరము లడవిదుంపలు మొదలగుపదార్థములు త్రవ్వుటకు గునపమును, నాపదార్థముల నుంచుటకు బుట్టయు, కట్టుకొనుటకు నారబట్టలును కావలెను. కాన వాని నీయుడు” ఇట్లు రాముడు పలుకకైకేయి తాను స్వయముగ నారచీరలను దెచ్చి జనసమూహములో సిగ్గులేనిదై వానికి కట్టుకొనుట కిచ్చెను. అంత రాముడు తాను కట్టిన పలుచనివస్త్రములవిడిచి యానారచీరను ధరించెను. లక్ష్మణుడును కూడనట్లు చేసెను. అంతట పచ్చనిపట్టువస్త్రముల ధరించిన సీత కైకేయితెచ్చిన నారచీరలను జూచి భయమును జెంది సిగ్గుపడి వానిని పుచ్చుకొని కండ్లంటనీరు తెచ్చుకొని ధర్మబుద్ధితో తనభర్తను

'వనవాసులగు మునులు నారచీరల నెట్లు కట్టుకొనెద' రని యడిగెను. ఆమెకు గడియగడియకు ముఖముతిరుగుచుండెను. ఆమె తనమెడకొక చీరను చుట్టబెట్టుకొని చేతితో నొకచీరను బట్టుకొని సిగ్గుతో నిలుచుండెను. అంతట రాముడు శీఘ్రముగ నామెదగ్గఱకు వచ్చి యామెపట్టువస్త్రముపైని నారచీరను కట్టుచుండెను. అంతఃపుర స్త్రీలు దీనినంతయు జూచి కండ్లంట నీరుతెచ్చుకొని యాయాసముతో "రామా! యీమెకు వనవాసము నిర్ణయింపబడలేదు. తండ్రియాజ్ఞచే నీవు వెళ్ళినను నీమె యిక్కడుండిన నామెనుజూచి నిన్ను జూచినట్లు తలంచెదము. లక్ష్మణుడును, నీవును వనమునకు బొండు. అడవిలో నీమె ఋషులవలె నుండదగదు. మామాటలను జరుపుము. ధర్మబుద్ధిగల నీ విక్కడుండుట కిష్టపడవు గనుక సీతనిక్కడ విడువుము."అని రాముని ప్రార్థించిరి. అయినను రాము డామెకు నారచీరను గట్టెను. అప్పుడు కులగురువగు వసిష్ఠుడు దానిని జూచి సీతను 'వల'దని నివారించి కైకేయి కిట్లుచీవాట్లు పెట్టెను. "దుర్మార్గురాలా! నీవు రాజును మోసపుచ్చి నీవుకోరినవరము నతిక్రమించుచున్నావు. సీత వనమునకు వెళ్ళగూడదు. రామునిసింహాసనమున నామె నిలువవలెను. గృహస్థుల భార్యలు వారితో సమానులు. అందుచే నీమె గూడ రామునికి నట్లే గనుక నాతని రాజ్య మీామె పరిపాలించును. ఇతనితో నీమెకూడ వెళ్ళిన పట్టణములోని ప్రజలును, మేమందఱమును నతనితో వెళ్ళెదము. తమతమ కుటుంబములతో సేనానాయకులును, రాజ్యములోని పట్టణవాసులును, వారిపరిచారకులును దశరథుడును నాతనితో వెళ్లెదరు. భరతశత్రుఘ్నులుకూడ నారచీరలను ధరించి వారియున్న యొద్దకు వెళ్ళెదరు. జనులువిడిచిన యీదేశమును,చెట్లను నీవు పాలించెదవు. రాముడు లేనిరాష్ట్రము రాష్ట్రముకాదు. రాముడు నివసించినవన మైనను రాజ్యమగును.తనతండ్రితనకు మనస్ఫూర్తిగ నియ్యని

రాజ్యమును భరతు డేలడు. అతడు దశరథునికి జన్మించుటచే నీమాటలను జరుపువాడు కాడు. నీవిక్కడనుండి యాకాశమున కెగిరినను తనవంశచరిత్ర నెఱిగినయాతడు తదనుకూలముగనే జరుపును. నీవు పుత్రునియందలి వాత్సల్యముచే నీవాతని కిష్టములేనిదానిని జరిపితివి. అతడు లోకములో రాము ననుసరించియుండలే దను మాటను జరుగనీయడు. కైకేయీ! పశువులు, మృగములు, పక్షులు, చెట్లుకూడ నాతనితో పోవుటను నీవీదినముననే చూచెదవు. నీవు సీతయొద్ద నుండి నారచీరను తీసికొని యామెకు మంచియాభరణములనిమ్ము. ఆమెకు నారచీరలు నిర్ణయింపబడలేదు. ఆమె యాభరణముల నలంకరించుకొని రామునితో వనమున నుండును. ఆమెతో సవారీలను, పరిచారకులను బంపుము. ఆమెకు మంచిబట్టలను, నితరవస్తువులను నిమ్ము. ఆమెనుగూర్చి నీవు వరమడిగియుండలేదు." ఇట్లు వసిష్ఠుడు పలుక సీత యెంతమాత్రము వనవాసమునుండి మఱలుట కిష్టపడక నారచీరను గట్టుకొని రామునితో బోవ సిద్ధముగ నుండెను.

అప్పు డక్కడనుండు జనులందఱామె యాచీరకట్టినందుకు దశరథుని 'ఛీ'యని నిందించిరి. దానిచే నతడు దుఃఖమును జెంది తనప్రాణమునందును, ధర్మమునందును, కీర్తియందును నాశ విడిచి వేడినిట్టూర్పుదీయుచు కైకేయితో నిట్లనెను. "సీత నారచీరధరించి వెళ్ళదగదు. ఆమె సుకుమారి; యౌవనవతి; సుఖమేయనుభవింపదగినది. 'ఆమె వనమునకు వెళ్ళగూడద'ని మాగురువు నిజముగ సెలవిచ్చెను. గొప్పరాజుకూతురును, పాతివ్రత్యము గలదియునగు నామె యెవరి కపకారము జేసినందుకు జనులమధ్యను నారచీర యియ్యబడి వెలవెలబోవుచు నిలబెట్టబడినది. ఆమె నారచీరను విడువవలెను. నేను దీనివిషయమై వరమిచ్చియుండలేదు. రత్నములను బుచ్చుకొని యామె వనమునకు బోవలెను. క్రూరుడను, జీవించు

టకు తగనివాడనునగు నేను నీకు వరమిచ్చితిని. నీవజ్ఞానముచే సీత కిట్టియవమానము కల్గించినందు కది నన్ను దహించుచున్నది. రాముడు నీకేమైన కొంచెమపకారము జేసియున్నను నామె నీకుగాని, నాకుగాని యేమియపకారము జేసెను? మనము నరకము పొందుటకు వానివనవాసము చాలును. ఇంకను నిట్టి యనేక గొప్పపాపముల నేల చేయుదువు? వాడు తనపట్టాభిషేకమునుగూర్చియిక్కడికి వచ్చినపుడు నీవు వానితో వనవాసమునుగూర్చి పలికినవాక్యముల నేను విని యంగీకరించితిని. దాని నతిక్రమించి నీవు నరకమును పొందగోరి సీతగూడ నారచీర కట్టుకొనుటను జూచుచున్నావు." ఈతీరున దుఃఖించుచు రాజు అంతులేనివిచారమునొంది పుత్రవియోగవిచారముచే భూమిమీదను తలక్రిందుగబడెను. రాముడు తనతల్లియగు కౌసల్యనుగూర్చి తనతండ్రి నిట్లు ప్రార్థించెను. "ఈమె ధర్మబుద్ధి గలది; మంచిగుణవంతురాలు; పతివ్రత; ముసలిది. ఈమె మీకెల్లపుడు పూజ చేయుచుండును. నావియోగముచే నీమె గొప్పదుఃఖములో మునిగి యుండును; గాన నాశోక మీమెకు కలుగకుండను, నందుచే నామె మరణమునొందకుండను తగినసన్మాన మామెకు జేయగోరెదను." ఇట్లు తండ్రిని ప్రార్థించి యడవికి వెళ్ళుటకు సిద్ధమయ్యెను.

మునులవేషములను ధరించిన సీతారాములను జూచుటచే దశరథునకు మతిపోయెను. అతడు విచారముచే వానివైపు తిరుగ జూడలేదు. చూచినను జబాబుచెప్పలేదు. ఇట్లొకగడియజరుగ నతడు రాముని దలచుచు నీతీరున నేడ్చెను. "నేను పూర్వమనేకదూడలను తమతల్లులనుండి వేరుచేయుటగాని, ప్రాణులకు హింసజేయుటగాని చేసియుంటినని తలతును. దానిచే నిట్లు జరిగెను. రాముడు పలుచని వస్త్రముల విడిచి నాయెదుట నారచీరలుకట్టుట నేను చూచినందుకును, కైకేయిచే నేను బాధ జెందినందుకును నాకు మరణము కలుగకుండుట యాశ్చర్యముగనున్నది. మరణకాలము రాకుండ ప్రాణము

పోదు. తనయభీష్టములను నెఱవేర్చుకొనుటకు కఠినకార్యములను జరిపిన యీకైకేయివలన ప్రజలందఱుకూడ బాధనొందుచున్నారు." ఇట్లు దశరథుడు విలపించుచు కన్నీటిచే కండ్లు చీకట్లుగమ్మ 'రామ! రామ!' యనుచు నేమియుచెప్పలేక యూఱకుండెను. అతనికి కొంచెము సేపటికి తెలివివచ్చి కండ్లంట నీరువచ్చుచుండ నతడు సుమంత్రునితో 'మంచిగుఱ్ఱములను గట్టిన బంగారురథమును మన దేశముదాటువరకు రాముని దిగబెట్టుటకు నీవు సిద్ధముచేసి దీసికొని రమ్ము. తలిదండ్రులమగు మేము వీరుడగు మాకుమారుని వనవాసము బంపుట యనునది వానిసుగుణములకు తగినఫలమని తలంచెద' నని పలుక సూతు డట్లు జరిపెను. దశరథుడు తనధనాగారాధ్యక్షుని పిలిచి వానిచే 14 సంవత్సరములకు సరిపడునట్లు సీతకు మంచి బంగారునగలను, వస్త్రములను, తెప్పించి యిచ్చెను. ఆమె వానిని ధరించి ప్రకాశమానముగనుండెను. తరువాత కౌసల్య మంచిపనులుజేయు నామెను కౌగిలించుకొని శిరమునూర్కొని యిట్లు హితవాక్యములనుజెప్పెను. "ఈలోకములో చాలమందిస్త్రీలు తమభర్తలవలన మర్యాదలను బొందియు విపరీతముగప్రవర్తించి వారికి హీనస్థితి వచ్చినయెడల వారిని నవమానింతురు. వారు పూర్వము సుఖమనుభవించి కొంచెము కష్టమువచ్చిన తమభర్తలను దూషించి యింకను విడుతురు. వారసత్యమందు బుద్ధికలిగి కఠినహృదయము కలవారై పాపబుద్ధితో నొక క్షణములో కోపము బొందుదురు. వారు తమభర్తకులముగాని, యుపకారముగాని, విద్యగాని, యిచ్చుటగాని, పుచ్చుకొనుటగాని యాలోచింపక తమభర్తలకు హితముచేయక చంచలచిత్తు లగుదురు. పతివ్రతలు మంచిగుణము, సత్యము, పుణ్యకథలనువినుట యందు మనస్సు, శాంతము మొదలగుసుగుణములను గలిగి తమభర్త నొక్కనిలి పవిత్రునిగ దలతురు. నాకుమారుడు వనవాసమునకుబంపబడుచున్నాడని

నీ వాతని నవమానింపవలదు. వీడు ధనికుడైనను, నిర్ధనుడైనను నీకు దైవము." కౌసల్యపలికినయీమాటలనువిని సీతయెదురుగనున్న యామె కిట్లుత్తరమిచ్చెను. "అమ్మా! మీమాటలప్రకారమన్నియు జరిపెదను. వానిని నేనెఱుగుదును. భర్తవిషయమై యెట్లు సంచరింపవలెనో నాతలిదండ్రులు నాకు చెప్పియుండిరి. నన్ను చెడుస్త్రీలతో సరిపోల్చదగదు. నేను ధర్మమును దప్పి ప్రవర్తింపను. నూఱుమందికుమారులున్నను భర్త లేనియెడల స్త్రీకి సౌఖ్యములేదు. తలిదండ్రులు, పుత్రులు స్త్రీలకు మితముగ నియ్య గలరు, భర్త భార్య కిచ్చుదానికి మితములేదు. అట్టిభర్త నవతె పూజింపదు? పతివ్రతాధర్మములను విని యట్లాచరించు నేను నాభర్తనేల యవమానింతును? స్త్రీలకు భర్తయే దైవము." ఇట్లు మనస్సునకు నాటునట్లు చెప్పిన సీతమాటలకు కౌసల్య దుఃఖసంతోషముల రెండిటిని దెలుపు కన్నీటిని విడిచెను. అంతట రాముడు తన తల్లియొద్దకు వచ్చి యామెకు ప్రదక్షిణముచేసి 'నీవు దుఃఖింపకుము. నాతండ్రిని క్షమించుము. నావనవాసము వేగముగ గడతేఱును. నీవు నిద్రబోయి లేచునంతలో నేను 14 సంవత్సరములను గడిపి భార్యతోను, తమ్మునితోను తిరుగవచ్చెద' నని పలికెను. తరువాత నతడు దశరథుని 350 మంది భార్యలను జూచి నమస్కరించి 'నేను మీ సమీపవాసముచేతనుగాని, యజ్ఞానముచేతనుగాని యేమైన కఠినముగు పనుల జేసినను నన్ను క్షమింపవలెనని మిమ్ము ప్రార్థించెద' నని పలుక వారు విచారముచే రోదనము చేసిరి.

తరువాత సీతారామలక్ష్మణులు చేతులుజోడించి దశరథుని పాదములబట్టి యాతనికి ప్రదక్షిణముచేసిరి. సీతారాము లతనివద్ద సెలవుపుచ్చుకొని విచారముతో కౌసల్యకు నమస్కరించిరి. లక్ష్మణుడుకూడ నామెకు నమస్కరించి తనతల్లియగు సుమిత్రకు వందనము చేసెను. అప్పుడామె యేడ్చుచు వానిహస్తమునుగొని వాని

శిరము మూర్కొని వానికిట్లు హితవు చెప్పెను. "బంధువులకు, స్నేహితులకు ననుకూలుడవగు నీవు వనవాసమునకే పుట్టితివి. రాముడు వనములో దిరుగునపుడు వానికేమియు ప్రమాదము జరుగనీయకుము. అతడు మంచిదశలోనున్నను, చెడుదశలోనున్నను నతడే నీకు గతి. పెద్దవాని ననుసరించి నడచుటయే లోకములో సత్పురుషులధర్మము. యజ్ఞములందు దీక్షయు, దానమును, యుద్ధములందు శరీరము విడువవలసివచ్చిన విడుచుటయు నీవంశములోనివారికి తగినసనాతనధర్మము. లక్ష్మణా! వెళ్ళుము; వెళ్లుము. రాముని నీతండ్రియగు దశరథుని వలెను, సీతను నీతల్లివలెను, వనమును నయోధ్యవలెను తలంపుము. నీవు వెళ్ళి సుఖముగనుండుము." ఇట్లు సుమిత్ర పలికినతరువాత సుమంత్రుడు రామునికి నమస్కరించి 'రథము సిద్ధముగనున్నది. మీరు శీఘ్రముగ వచ్చి దానిపై కూర్చుండుడు. మీరు కోరిన చోటికి తీసికొని వెళ్ళెదను. కైకేయివరప్రకారము మీరు వనములో నివసింపవలసిన 14 సంవత్సరము లీదినమునుండియు ప్రారంభ మగును.' సూతుని యీమాటలను విని సీత తనయాభరణముల నలంకరించుకొని రథమున గూర్చుండెను. తరువాత రామలక్ష్మణులు కూడ గూర్చుండిరి. రథముమీద దశరథు డామెకిచ్చిన 14 సంవత్సరములకునరిపడు బట్టలును, నగలును, నన్నదమ్ముల యాయుధములును, గునపమును, ఫలమూలములుంచుకొనుటకు గంపయు నుంచబడెను. అట్లు సీతారామలక్ష్మణులు కూర్చుండియుండ సుమంత్రుడు గుఱ్ఱములను దోలెను.



## ౨. వ. అధ్యాయము. రామాదులవనవాసగమనము.



రామునికి పట్టాభిషేకము నిర్ణయమైనదినముననే సీతారామలక్ష్మణులు సుమంత్రుడు నడపిన రథమున వనమునకు వెళ్లుటకై

యయోధ్యను విడుచుచుండ పట్టణములోని చతురంగబలమునకును, జనులకును మతిదప్పెను. ప్రజలయాలజడితోను, ఏనుగులు విచారముచే చేసిన ఘీంకారములతోను, గుఱ్ఱములసకిలింపులతోను పట్టణమంతయు ప్రతిధ్వనించెను. పురవాసులందఱు రాముడుండుచోటునకు పరుగెత్తిరి. రథము వెనుకను, ప్రక్కలను నుండుజనులు దానిని జూచుచు కండ్లంట నీరుదెచ్చుకొని పెద్దగొంతుకలతో 'రథమును మెల్లగ దోలుము. రాముని ముఖమును జూచెదము. ఇతనిదర్శనము మాకిక దుర్లభము.' అని సుమంత్రుని ప్రార్థించి "ఇతడు వనమునకు బోవునపు డీతనితల్లిహృదయ మినుమువలె కఠినమైనదగుటచే పగులకున్నది. సూర్యునను సరించు ఛాయాదేవివలె నీసీత పతివ్రతయై యీతనితో వెళ్ళుచు తాను చేయవలసిన కార్యమును జరిపినది. లక్ష్మణుడు తనయన్నకు సేవజేయుచు తనకోరికను సిద్ధింపజేసికొనుచున్నాడు. ఇది గొప్ప శ్రేయస్సునకును, గొప్పసిద్ధికిని కారణము; స్వర్గమునకు మార్గము." ఈతీరున పలుకుచు ప్రజలు కండ్లంట నీరు తెచ్చుకొని యాతని వెంట వెళ్ళుచుండిరి. అంతట రాజును, నంతఃపురస్త్రీలును దీనత్వముతో 'ఆతనిజూచెద'మని పలికి భవనమునుండి బయటకు వచ్చిరి. అప్పు డాస్త్రీలు గొప్పరోదనము చేయుచుండ దశరథుడు కాంతిహీను డయ్యెను. రాముడు 'వేగముగరథము తోలు'మనియు, ప్రజలు 'నిలుపు'మనియు సూతునితో బలుక వాడావాక్యములను విని యేదియు జరుపలేకుండెను. అప్పుడు దుఃఖించుచున్న పురవాసుల కన్నీటిచే రాజబాటలందలి దుమ్ము తడిసి పైకియెగురకుండెను. పట్టణమందంతటను నేడ్పులును, హా, హా శబ్దములును బుట్టెను. దశరథుడిదంతయుజూచి వేరు తెగిన చెట్టువలె భూమిపై బడెను. దీనినిగూర్చి రామునిరథము వెనుక గొప్పగగ్గోలు పుట్టెను. అంతఃపురములో కొందఱు 'రామా! రామా!'యనియు, మిగిలిన వారు 'రామమాతా!'

యనియు మొఱలిడిరి. రాముడు తనరథము వెనుకను నడచివచ్చు తనతలిదండ్రులందు ప్రేమయున్నను తనధర్మమును జరుపుటయందలి నిశ్చయబుద్ధిచే వారివైపు స్పష్టముగా జూడక సూతునితో 'వేగముగ రథమును తోలు'మని చెప్పెను. అంతట కౌసల్య 'రామా! సీతా! లక్ష్మణా!' యనుచు నేడ్చుచు రథమువెంట బరుగెత్తనత డామె ముఖమువైపు దుఃఖముతో జూచెను. దశరథుడు 'రథమును నిలువు' మనియు, రాముడు 'రథమునుతోలు' మనియు పలుకుటచే సూతుని మనస్సు గొప్పవిచారమునొందెను. అంతట రాముడు సూతునితో "నామాటను వినలేదేమని నాతండ్రి నిన్నడిగిన 'చిరకాలము మీరు దుఃఖమనుభవింపవలెను; గనుక మీమాటను నేను వినియుండలేదు.' అని పలుకు"మని సెలవిచ్చెను. అప్పుడు సుమంత్రుడట్లు జరిపి ప్రజలనుబంపి గుఱ్ఱములను శీఘ్రముగ తోలెను. దశరథుని సేవకులు రామునికి ప్రదక్షిణము చేసి వెడలిరి. అంతట మంత్రులు దశరథునితో 'రాముడు తిరుగవచ్చును. మీరు దూరము వెంబడింపకూడదు.' అని చెప్పిరి. ఆమాటలను విని దశరథుడు చెమటపట్టిన శరీరము, గొప్పవిచారము కలవాడై తనభార్యలతోగూడ తనకుమారునిరథము జూచి చూచి యంతఃపురమునకు బోయెను.

అంతట రామునియందలి యనురాగముచే నయోధ్యలోని ప్రజలుకొందఱు వానిరథము వెంట బోయిరి. రాజును, వారిస్నేహితులును 'మఱలు' డని బలవంతముగ జెప్పినను వారుమఱలక రథము వెంటనరిగిరి. రాము డయోధ్యలోని జనులకు గుణములచే పూర్ణచంద్రునివలె నాహ్లాదకరుడుగ నుండుటచేతను, వా రతనిని 'మఱలు'మని కోరినను నతడు తనతండ్రిమాటల జరుపుచు వనమునకు బోవుచుండుటచేతను వానిని విడిచిపెట్టలేక నారు వానిని వెంబడించిరి. . అతడు వారిని దయతో జూచుచు "నాయందుగలప్రీతిని మీరు నాసంతో

షముకొఱకు ముఖ్యముగ భరతునెడ జూపుడు. మంచిచరిత్రగల యాతడు మీకు తగినకార్యముల జరుపును. అతడు వయస్సులోచిన్న వాడైనను జ్ఞానములో గొప్పవాడు; మెత్తనిస్వభావము గలవాడు; వీర్యవంతుడు. అతడు మీ కనుగుణముగ రాజ్యము చేయును. అతడు యువరాజుగ నియమింపబడ నేనును, మిగిలిన నాతమ్ములును, మీరును రాజాజ్ఞను జరుపవలెను. నేను వనమునకు వెళ్ళుటచే నాతండ్రికి విచారము కలుగకుండ మీరు కార్యములను జరుపవలెను.” అని పిల్లలకు బోధపఱచినట్లు వారికి బోధపఱచెను. అతడిట్లు మిక్కిలి ధర్మమార్గములో నుండుచుండుటచేతనే ప్రజ లాతనిని రాజుగ గోరిరి. అతడు మంచిగుణములు గలవాడగుటచే వారి కాతనియందు బద్ధానురాగము కలిగెను. అంతట నక్కడనున్న వయోవృద్ధులును, తేజోవృద్ధులును, జ్ఞానవృద్ధులునునగు బ్రాహ్మణులలో ముసలివారు తమతలల ద్రిప్పుచు దూరమునుండి రామునిరథగుఱ్ఱములతో “మీకు మేము పలుకుచున్న వన్నియువినబడు చున్నవి; కాన మీరు వెనుకకు మఱలుడు. ముందుకు పోగూడదు. మనయజమానుని హితముగోరుడు. మామాటవిని మఱలుడు. ధర్మాత్ముడును, శుద్ధమనస్కుడును, వీరుడునునగు సీతని మీరు పట్టణమునకట్లు తీసికొనివెళ్ళవలెను; కాని యీతనినిపురమునుండి వనమునకు తీసికొనిపోగూడదు.” అని పలికిరి. ఆమాటలనన్నిటిని విని రాముడు వారు నడచుచుండుట యిష్టపడక వెంటనే రథమునుండి దిగి సీతాలక్ష్మణులతో వనవాసబుద్ధితో మెల్లగ పదము లిడుచుండెను. అప్పుడు వా రాతనిజూచి యిట్లు విన్నవించిరి. “బ్రాహ్మణసమూహమంతయు బ్రాహ్మణ్యుడవగు నీతో వచ్చుచున్నది. అగ్నిహోత్రములను, వాజపేయ యజ్ఞమందు సంపాదింపబడిన తెల్లనిగొడుగులను మేము తీసికొని మీవెంట వచ్చుచున్నాము. ఎండతగులకుండ నాగొడుగులచే మీకు నీడను కల్పించుచున్నాము. ఎల్లప్పుడును వేదమంత్రి

ముల ననుసరించు మాబుద్ధి మిమ్ముగుఱించి మీతో వనవాసమునకు బోవుటకు నిశ్చయించినది. మాకు ముఖ్యధనమగు వేదములు మామనస్సులో నెల్లప్పుడు నుండును. మీరు వనమునకు బోవుటకు బాగుగ నాలోచించినను నట్లు చేయగూడదు. మాకోర్కెలను జరుపక ధర్మమునకు హాని యేలకలిగించెదరు? ముసలివారమగు మేము మీపాదములకు వందనము చేయుచున్నాము. అడవిలో నివసించుబుద్ధిని విడిచి మీరు వెనుకకు మఱలుడు. ఇక్కడకు వచ్చిన బ్రాహ్మణు లనేక యజ్ఞముల చేయుటకు సామగ్రిని సమకూర్చిరి. ఆయజ్ఞముల సమాప్తి మీయధీనమున నున్నది; గనుక మిమ్ము వెనుకకు మఱలగోరెదము. లోకములోనున్న స్థావరజంగమజీవు లన్నియు మీయందే భక్తి గలిగి యున్నవి. ఆభక్తులకోరికను మీరు జరుపుడు. చెట్లు తమవేళ్ళపట్టు వలన రాలేక మీరు వెళ్ళుచున్నారని బాగుగవీచుగాలిచే తమరోదన శబ్దములను తెలియపఱచుచున్నవి. పక్షులన్నియు తమ భోజన విహారములమాని యేమియు చేయక వృక్షములందు నిలిచి రోదనము చేయుచున్నవి.” ఇట్లు వృద్ధబ్రాహ్మణులు పలుకుచుండ వారు తమసా తీరమును జేరిరి. అక్కడ సుమంత్రుడు రథమునుండి గుఱ్ఱములను విప్పి యటునిటు తిప్పి వాని యాయాసమును బోగొట్టి వానిని నీటిలో కడిగి వానికి తిండి పెట్టెను.

రాము డానదీ తీరమును జేరినతరువాత సీతను జూచి లక్ష్మణునితో నిట్లనెను. “ఈరాత్రి యిక్కడనే మనవనవాస మారంభమైనది. నీవు గృహసౌఖ్యాభిలాషను విడువవలెను. అడవిలో పశుపక్షులు తమస్థానములకు వచ్చుచుండ వనము రోదనము చేయుచున్నట్లు శూన్యమైయున్నది. ఇప్పుడయోధ్యలోని స్త్రీపురుషులందఱు మనలను గూర్చి విచారింతురు. వారందఱు మనయందు మిమ్ములందఱిని, రాజును బాగుగ ప్రేమించిరి. రాతిరియంతయు గడియగడియకు నేప్పుడు

డుటచే వారికండ్లు చీకట్లుగమ్మియుండును. నిజముగ ధర్మాత్ముడగు భరతుడు వారిని తగినమర్యాదలచే నోదార్చును. అతడు మంచివాడగుటచే తలిదండ్రులనుగూర్చి నేను విచారింపను. నీవు మాతోవచ్చుట మంచిపనిచేసితివి. సీతను రక్షించుటకు నీసాయము దొరకినది. ఈరాత్రి వనములో దుంపలు మొదలగు వస్తువులను సంపాదింపగలిగినను నేను మంచినీరుత్రాగి యుండెదను." ఇట్లు పలికి రాముడు సుమంతుని తో 'గుఱ్ఱములవిషయమై యేమఱియుండకుము' అని చెప్పెను. అతడు వానిని కట్టి గడ్డివేసి తిరుగవచ్చి సూర్యాస్తమయముకాగ * సంధ్యోపాసనజేసెను. తరువాత నతడును, లక్ష్మణుడును తమసా తీరముననున్న చెట్లయాకులను తెచ్చి రామునికై పక్కతయారు చేసిరి. సీతారాములక్కడ శయనించిరి. ఆరాత్రియంతయు లక్ష్మణుడు జాగ్రత్తగ మెలకువగనుండి సూతునితో రామునిగుణములగూర్చి చెప్పుచుండెను. ఆనదీతీరముననే యయోధ్యలోని ప్రజలు నిద్రించిరి. రాముడు రాత్రి యుండగనేలేచి వారినిజూచి లక్ష్మణునితోనిట్లనెను. "లక్ష్మణా! వీరు తమగృహములం దాసక్తివిడిచి మనయందే మనస్సుగలవారై యిప్పుడీచెట్లక్రింద నేలాగునిద్రించుచున్నారో చూడుము. వీరు మనలను మఱలించుటకు నిశ్చయము చేసికొని దాని విషయమై మనలను విడువక తమప్రాణములనైనను బోగొట్టుకొన సిద్ధమైయున్నారు. ఇక్కడ పండుకొనియున్న వీరికి తెలివి రాకపూర్వమే మనము రథమెక్కి శీఘ్రముగ బోవుదము. రాజకుమారులు తమ ప్రజలకు కలిగిన కష్టములనుండి వారిని తప్పింపవలెను; కాని వారికి

---

* సూతులనగా బ్రాహ్మణస్త్రీయందు క్షత్రియునికి జన్మించినవారు. ఇప్పుడు బ్రాహ్మణులే సంధ్యోపాసనచేయుచున్నారు; కాని పూర్వమితరులుకూడ వానిని జరిగించినట్లును, క్రమక్రమముగ నది క్షీణించినట్లును కనబడుచున్నది.

దుఃఖము కలిగింపకూడదు." ఇట్లు రాముడు పలుక లక్ష్మణుడు 'నాకుగూడ నట్లే తోచుచున్నది. రథమెక్కుద' మని పలికెను. అంతట 'గుఱ్ఱములను గట్టి రథమును దీసికొనిరమ్ము. ఇక్కడనుండి యరణ్యమునకు వేగముగ బోవుద' మని యాతడు సుమంత్రునితో పలుకవాడట్లు చేసెను. సీతారామలక్ష్మణులు రథమెక్కి యాయుధాదుల దానిపై నునిచిరి. రథము తమసానదిని దాటెను. అక్కడ సీతాలక్ష్మణులతో రాముడు రథముదిగి 'అయోధ్యలోని జనులు వచ్చియుండిరి; గాన వారికి మనత్రోవ తెలియ గూడదు. నీవు రథమును నుత్తరపు దిక్కునకు తీసికొని పోయి త్రిప్పి తిరుగ మాయొద్దకు తీసికొనిరమ్ము' అని సుమంత్రునకు సెలవిచ్చెను. ఆతడట్లు చేసి రథమును సీతారామలక్ష్మణులయొద్దకు తీసికొనిరాగ వారారథమెక్కిరి. సూతుడు రథమునకుదానిని మొదట నుత్తరపు దిక్కునకు నడిపి తరువాత తపోవనమునుగూర్చి దక్షిణదిక్కునకు నడిపెను.

సీతారామలక్ష్మణులా రాత్రి రథమెక్కి తెల్లవాఱుసరికి చాల దూరము వెళ్ళిరి. సూర్యోదయమున రామలక్ష్మణులు రథము దిగి సంధ్యవార్చిరి. తరువాత వారు దున్నినపరిమళ్లుగల గ్రామములను, పూచినతోటలను జూచుచు "ఛీ! కామపరవశుడగు దశరథుడు పాపబుద్ధిగలవాడై కేయిమాటలను వినెను. ఆమె క్రూరురాలై యమర్యాదప్రవర్తనకలిగి ధార్మికుడును, గొప్పబుద్ధిశాలియు, దయాళుడును, నింద్రియజయముకలవాడునునగు రాముని దశరథునిచే వనవాసమునకు బంపించినది. ఎల్లప్పుడును సుఖములనే యనుభవించిన సీత వనవాసకష్టముల నెట్లనుభవించును? అయ్యో! రాజిట్టి సుపుత్రుని దయలేక వనమునకు బంపుచున్నాడు." అని కోసలరాజ్యములో నున్న గ్రామములలోని ప్రజలు పలుకుచుండ వానిని వినుచు రథమెక్కి పోవుచుండిరి.




మొదట రథము వేదశ్రుతిని దాటి తరువాత దక్షిణదిక్కునకు బోయి సముద్రమునకు బోవు గోమతిని దాటి పిమ్మట స్యందికను దాటెను. ఇట్లు పైపటములో జూపినరీతిగ నదులను దాటుచు రాముడు కోసలదేశమంతయు సీతకు జూపుచుండెను. తరువాత నాతడు 'నేను వనవాసమునుండి వచ్చి సరయూతీరమున నాతలిదండ్రులతో గలిసి విలాసముగ వేటసలుపుట యెప్పుడోగదా? విల్లు బాగుగ నుపయోగించు రాజర్షులు విలాసముకొఱకు వేటయందెక్కువ శ్రద్ధగలవారైనను నేనుమాత్ర మట్లుకాక కొంచెముగ

నా వేటను జరుప కుతూహలముగలిగియున్నా'నని సూతునితో పలికెను.

తరువాత రాముడు కోసలదేశ గ్రామముల నన్నిటిని దాటి యయోధ్యవైపు ముఖము త్రిప్పి చేతులుజోడించి 'నేను వనవాసమును జరిపి నాతండ్రిఋణమునుదీర్చి తిరిగివచ్చి నాతలిదండ్రులతో గలిసి కాకుత్స్థరాజులచే పరిపాలింపబడు నిన్ను, నిన్నురక్షించుచు నీలో నివసించునట్టిదేవతలను జూచి నమస్కరించెద' నని విన్నవించెను. అత డట్టుబారినకండ్లనుండి కన్నీరువిడుచుచు దీనుడై దారిలో విచారించుచు కనబడినప్రజలతో 'మీరు నాయందు దయయు, నాదరణను జూపిరి. చాలకాలము మీరు దుఃఖ మనుభవించుట శ్రేయస్సు కాదు. మీరు మీపనులను జేసికొనుటకు వెళ్లు'డని చెప్పెను. అంతట వారతనికి ప్రదక్షిణము చేసి కష్టముతో వానిని విడిచిరి. ఈతీరున ధనధాన్యములతో నిండినవియు, మంచినీటివసతులును, మంచితోటలును, దేవాలయములును గలవియు, దానశీలురైనప్రజలును, యజ్ఞాదిక్రతువులనుజేసిన ద్విజులును కలవియు, వేదఘోషములు గలవియు సంతోషము, బలముగల ప్రజలు గలవియునగు కోసలదేశ గ్రామములనుదాటి రాముడు గంగానదినిజేరెను.

గంగానదియొడ్డుననున్న శృంగిబేరపురమున నిషాదులు (అడవి మనుష్యులు) కాపురముండిరి. బలవంతుడగు గుహుడు వీరికి రాజుగ నుండెను. ఈదేశము కోసలకు సమీపమున నున్నందున నతడు దశరథునందు స్నేహభావము కలిగి రామునికి ప్రియసఖుడుగ నుండెను. ఆ గ్రామముదరిని గంగానదికి సమీపమున నింగుదీవృక్షముండెను. (గార చెట్టు) రాముడు 'ఈరాత్రి యాచెట్టుక్రింద నివసింతు'మని వారితో

పలుక లక్ష్మణుడును, సుమంత్రుడును నంగీకరించిరి.రథమునుండి సీతా రామలక్ష్మణులు దిగినతరువాత సుమంత్రుడు గుఱ్ఱములను చెట్టునకు గట్టెను. అంతట గుహుడు తనబంధువులతో నచ్చటికి రాగా రామ లక్ష్మణులు వానికెదురుగ వెళ్ళిరి. వాడు రాముని కౌగలించుకొని 'నీకయోధ్యయెట్లో యీ దేశమును నట్లే నీవంటియతిథి మాకు లభించుటయెట్లని పలికి మంచియాహారములను, పరుండుటకు పక్కలను, గుఱ్ఱములకు గడ్డిమొదలగువానిని తెప్పించి 'ఈదేశమంతయు నీదే. మేము నీపరిచారకులము. ఈరాజ్యమును గ్రహింపు' మని యాతనినికోరెను. అంతట నాతడు 'నీవల్ల తగినమర్యాదలను బొంది సంతోషించితి' మనిపలికి వానిని కౌగిలించుకొని యిట్లు సెల విచ్చెను. "దైవవశముచే నీవును, నీవారును సుఖముగ నున్నారని తలచెదను. నీరాజ్యమునకును, నీస్నేహితులకును, ధనమునకుగూడ కుశలమా? నీవు ప్రీతితో నీసామగ్రినంతయు దెచ్చుటచే చాల సంతోషించితిని; కాని నేను వానిని గ్రహింపవీలులేదు. నేను నార చీరలను ధరించి కందమూలాదుల దినుచు మిక్కిలిధర్మమార్గమున మునివృత్తినవలంబించి వనముల దిరుగుచున్నాను. నీవు గుఱ్ఱములకు తిండి యిచ్చిన చాలును.వానిని మాతండ్రి మిక్కిలిప్రీతితో పోషించు చున్నాడు." ఇట్లు రాముడు సెలవీయ వాడు తనమనుష్యులను తొందరబెట్టి గుఱ్ఱములకు మేత యిప్పించెను. సాయంకాలము కాగా రాముడు సంధ్యవార్చి లక్ష్మణుడు తెచ్చిన యాహారములను,జలమును పుచ్చుకొనెను. ఆచెట్టుక్రింద సీతారాములు నిద్రించుటకుముందు వారిపాదములను గడిగి యాజలమును శిరమున జల్లుకొని వృక్షమూల మున నిలిచెను. అంతట సీతారాములు శయనింప నాలక్ష్మణుడు విల్లునుబట్టి రాత్రియంతయు వారిని రక్షించుచు సూతునితోను, గుహుని తోను మాట్లాడుచుండెను.

*లక్ష్మణుడు జాగరూకుడై రామునికాచుచుండుటను జూచి గుహుడు మిక్కిలివిచారముతో నిట్లుపలికెను. "నాయనా నీనిమిత్తము మంచిపక్క తయారుచేయబడినది. సుఖమనుభవించు నీవు దాని యందు సుఖముగా విశ్రమింపుము. మావారందరు కష్టజీవులు. మే మీరాత్రి రామునిగూర్చి కాపుండెదము. అతనికంటె నాకు ప్రియు డెవ్వడును లేడు. నీతో నిజము పలుకుచు సత్యమునుబట్టి శపథముచేయు చున్నాను. అతనిదయవలన గొప్పకీర్తిని, కోరికలను ధర్మమును బొంద గోరెదను. ఆతడును, నాతనిభార్యయు నిద్రించుచుండ విల్లుబట్టి మే మందఱము వారిని గాపాడెదము. ఈవనములో నే నెల్లప్పుడు చరించు చుందును. కావున నిందుజరుగునది నాకు దెలియక యుండదు.

---

*అ. రా:—సీతారాములు శయనించియుండిరి. లక్ష్మణ గుహులు వారికి కాపుండిరి. గుహుడు కైకేయిని రాముని కష్టకష్టము లను గలిగించినందుకు నిందించెను. దానికి లక్ష్మణుడు "ఎవనిసుఖ దుఃఖముల కెవడుకారణము? జనుడు తనపూర్వజన్మములలో నార్జిం చిన తనకర్మలచే సుఖదుఃఖములను బొందుచున్నాడు. వాని నెవ్వ డును కలుగజేయడు. అట్లుకలుగజేయుననితలంచుట సరియగునది కాదు. లోకములో తనకు జరుగునదంతయు తన స్వకర్మవలననే యగుచున్నను 'నేనే చేయుచున్నా'నని జనుడు వృథగ నభిమానము పొందుచున్నాడు. జనుడు తా నాచరించిన కర్మనుబట్టియే యితరులను మిత్రులుగనో, సహజశత్రువులుగనో, యుదాసీనులుగనో, నైమిత్తిక శత్రువులుగనో, మధ్యస్థులుగనో, బంధువులుగనో తలచుచుండును. మనుజుడు కర్మవశుడై దానివలనలభించు సుఖమునుగాని దుఃఖమును గాని, యనుభవించి స్వస్థచిత్తుడు కావలెను. భోగములందు నాకు కోరిక లేదు. అవివిడుచునపుడు నాకు విచారము లేదు. అవి కలుగనిమ్ము. కలు గకపోనిమ్ము. వానివశములో నేనుండను. ఏదేశముననైనను, ఏకాలమును

శత్రువు చతురంగ బలముతో వచ్చినను నతని నోడించెదము."
గుహునియీమాటలను విని లక్ష్మణుడు ఇట్లువిలపించెను. "ధర్మమార్గ
మున నీచే రక్షింపబడు మాకందఱికి భయములేదు. సీతారాములు
భూమిపై శయనించియుండ నాకెట్లు నిద్రవచ్చును. దేవాసురులందఱి
చేతనైనను యుద్ధములో నోడింపబడని మహావీరుడు గడ్డిపై సీతతో
నిద్రించుచున్నాడు. దశరథుడు కష్టముగు గొప్పకార్యముల జరిపి
మంత్రతపోయుక్తములగు కర్మలచే సాటిలేని యొకకుమారుని గనెను.
అట్టికుమారుని వనవాసమునకు బంపుటచే నతడు చాలకాలము జీవిం
పడు. కోసలదేశము శీఘ్రముగ భర్తలేనిది యగును. రాజస్త్రీలందఱు
శ్రమచే కష్టమునొంది మిక్కిలి యేడ్తురు. రాజనగరమంతయు గోల
పెట్టుట జరుగును. కౌసల్యయు, దశరథుడును నీరాత్రి జీవింతురని
నాకు తోచదు. శత్రుఘ్ను డుండుటచే నాతల్లి జీవింపవచ్చును; కాని

నైనను ఏకారణముచేతగాని, లేక యెవరివలనగాని చేయబడు కర్మలు
శుభములైనను, నశుభములైనను వాని ననుభవింపవలెను. మఱియొక
మార్గములేదు. శుభాశుభములఫలములగు సుఖదుఃఖములు కలుగు
నప్పుడు సంతోషవిచారముల పొందగూడదు. విధి నిర్ణయించినదానిని
దేవాసురులైనను తప్పించుకొనలేరు. సుఖదుఃఖములచే మనుజు డెల్ల
ప్పుడును సంసారమం దరికట్టుబడుచున్నాడు. శరీరము పుణ్యపాపముల
వలన సుఖదుఃఖములతో పుట్టినది. రాత్రింబగళ్ళవలె సుఖదుఃఖము
లొకదానితరువాత నొకటియనుల్లంఘనీయములై ప్రాణులకు ప్రాప్తించు
చుండును. సుఖముమధ్యను దుఃఖమును, దుఃఖముమధ్య సుఖమును
నీరుబురదకలిసియుండునటుల కలిసియుండును; గనుక ఇష్టాయిష్ట
వస్తువులు గూడునపుడు విద్వాంసుడు ధైర్యము తెచ్చుకొని యంతయు
మాయవలనకలిగెనని యాలోచించుచు సంతోషముగాని, దుఃఖము
గాని లేకుండ నుండును." అని గుహునికిజబాబుచెప్పెను.

వీరమాతయగు కౌసల్య జీవింపదు. అయోధ్య రాజునందనురాగము గల ప్రజలుకలదగుటచే నాపట్టణమంతయు నశించును. తనకు ప్రియుడగు తనపెద్దకుమారుని జూడకుండ రాజునకు ప్రాణము లెట్లు నిలుచును? రాజు మరణమునొంద కౌసల్యయును, నటుతరువాత నాతల్లియును కాలధర్మము నొందుదురు. దశరథుడు 'రాముని రాజుగ జేయవలెనను' తనకోరిక తప్పిపోవ మరణమునొందును. అట్టి కాలమున నక్కడనుండి యూరనికి ప్రేతకార్యములన్నియు జరుపువారు మిక్కిలి యదృష్టశాలురు. మేము వనవాసము జరిపి యయోధ్యకు తిరుగవచ్చి చూచువరకు మాతండ్రి జీవించునా? మేమట్లు ప్రవేశించెదమా?" ఇట్లు లక్ష్మణుడు విలపించుచుండ రాత్రి తెల్లవారెను. ఆతని సత్యపు పలుకులను విని గుహుడు కన్నీరు తెచ్చుకొని విచారముచే మిక్కిలి కలతనొందెను.

ఆయుదయముననే రాముడు లేచి లక్ష్మణుని జూచి 'రాత్రి గడచినది. సూర్యోదయకాలమయ్యెను, కోకిలలును, మిగిలినపక్షులును నడవిలో కూయుచున్నవి. గంగానదిని దాటుద'మని సెలవిచ్చు నాతడీసంగతి గుహునితోను, సుమంత్రునితోను జెప్పి తనయన్నయెదుట నిలిచెను. నిషాదప్రభువు రాముని యాజ్ఞ జరుపుటకై తన మంత్రుల బిలిపించి 'మంచియాననముగలదియు, శుభమైనదియు, నదిని దాటుటకు యోగ్యమైనదియునగు నొకనావను తీసికొనిరండు' అని వారితో జెప్ప వారట్లు చేసిరి. వాడప్పుడు రామునికి నమస్కరించి 'నావ సిద్ధముగనున్నది. మరేమి సెలవు' వని యడిగెను. అప్పుడు రాముడు వానితో 'మంచిది. మేము తెచ్చిన సీతబట్టలు మొదలగు వానితో మమ్ము దానినెక్కింపు' మని చెప్పెను. రామలక్ష్మణులు ఖడ్గములను, ధనస్సులను, నమ్ములపొదులను తీసికొని సీతతో గంగకు వెళ్ళుటకు సిద్ధముగనుండిరి. అప్పుడు సుమంత్రుడు రామునికి నమస్క-

రించి 'నాకేమి సెల' వని యడుగగా నాతడు వానిని తనకుడిచేతితో నిమిరి "నీ వుత్తము డవు.శీఘ్రముగ నయోధ్యకు వెళ్ళుము.రాజునొద్ద జాగ్రత్తగ నుండుము.నీవు మమ్ముల నింతవరకు రథమున దీసికొనివచ్చితివి. ఇటుపైని మేము నడచుచు గొప్పయడవికి వెళ్ళెదము. నీవు తిరిగి వెళ్ళుము." అని సెలవిచ్చెను. దాని కాసుమంత్రుడు గొప్పవిచారముతో నిట్లు మనవిచేసెను. "మీరు భార్యతోను తమ్మునితోను స్వల్పునివలె వనవాసమునకు వచ్చిరి. దైవయోగమున వచ్చిన దెవరికైనను తప్పదు. మీవంటివాని కిట్టికష్టము సంభవించుటచే బ్రహ్మచర్యమువలనను, వేదాధ్యయనమువలనను, మెత్తనిగుణము, తిన్నని మార్గము గలుగుటవలనను సరియైనఫలము లోకములో లేదని నే నాలోచించెదను. మీరందఱు వనవాసముచేయుటచే మూడులోకములను జయించినవానికీర్తి ని పొందెదరు. మీవెంటవచ్చిన యయోధ్యాపురవాసులను మీరు వంచనచేసిరి. పౌరులమగు మేము కైకేయియధికారమునకు లోనై గొప్పదుఃఖములను బొందెదము" ఇట్లు మనవిచేసి సుమంత్రుడు రాముడు చాలదూరము వెళ్ళిపోయినట్లు తలచి యేడ్వసాగెను. తరువాత నాచిమనముచేసి శుచిగనున్న సుమంత్రునితో రాము డిట్లు పలికెను. "ఇక్ష్వాకువంశపురాజులకు నీతోసరియైన స్నేహితుడులేడు. నేను వనమునకు వెళ్ళినందుకు నాతండ్రికి విచారము లేకుండ జేయుము. ముసలివాడగు నాతడు విచారములో మునిగియున్నాడు. అతడు కైకేయియందు మోహము కలిగియున్నందున నాకు ప్రియముకొఱకు రా జాజ్ఞాపించుదానిని మీరు సంతోషముతో జరుపుడు. రాజులు తమకిష్టమువచ్చినదానిని జరిపించుటకు ప్రజలను కోరుదురు. అతని కిష్టములేనిపనులేమియు జరుగగూడదు. నేను చెప్పుచున్న యీవాక్యములనుగూడ నాతండ్రితో జెప్పుము. 'రామునకుగాని, లక్ష్మణునకుగాని, సీతకుగాని యయోధ్యవిడిచి వనములో నివసింప

వలసివచ్చినందుకు విచారములేదు. 14 సంవత్సరములు గడిచినతరు
వాత వారు వచ్చి మిమ్ము దర్శించెదరు.’ ఈమాటలను నాతల్లితో
గూడ జెప్పుము. కైకేయిని, మిగిలినరాజుభార్యలను బాగుగనున్నారా
యనియు, మేమడిగితిమనియు పలుకుము. నాతల్లికి నమస్కరించితి
మని పలుకుము. రాజుతో ‘భరతుని వేగముగ రప్పించి వానికి పట్టా
భిషేకముచేసి మేము వెళ్ళినందుకు దుఃఖము విడువదగు’నని చెప్పుము,
భరతునితో ‘దశరథునియెడ ప్రవర్తించునటులనే నీవు మనతల్లు లం
దఱియెడ ప్రవర్తింపవలెను. నీతల్లియగు కైకేయిని గౌరవించినటుల
సుమిత్రా కౌసల్యలను గూడ గౌరవింపవలయును. అట్లుచేయుటచే నీ
వుభయలోకములసుఖమునుబొందు’మని పలుకుము.”ఇట్లు రాముడు
వానిని గోర సుమంత్రు డిట్లు మనవిజేసెను. “నేను మీయందలి
స్నేహముచేతను, ధైర్యముచేతను, భక్తిచేతను నేమైన నపచారపు
మాటలను బలికిన వానిని మీరు క్షమింపవలెను. మీరు లేకుండుటచే
నిదివరకే విచారమును బొందిన యయోధ్యకు నేనెట్లు వెళ్ళగలను?
ఇదివరకు మిమ్ము రథముమీద తీసికొనివచ్చిన నే నిప్పుడు మీరు
లేకుండ దానిని తోలినయెడల ప్రజలగుండెలు విచారముచే పగు
లును. పట్టణమంతయుగూడ నట్లగును. వారు శూన్యమగునీరథమును
జూచి యుద్ధములో వీరునిమరణాంతమున సూతుడొక్కడే యుండుండి
రథమును నడప దానిని జూచి సైన్యము విచారించునటుల విచా
రింతురు. మీరింతదూరములోనున్నను నెదురుగనున్నటుల మిమ్ము
మనస్సులో ముఖ్యముగ దలచి విచారించు ప్రజలుభోజనము చేయక
యున్నారు. మీవనవాసము సంగతి తెలిసినపుడు వారిమనస్సెంత
విచారముబొందెనో మీకు తెలిసియేయున్నది. మీరు వెళ్ళునపుడు
వారు పొందిన విచారముకంటె నూఱురెట్లు దుఃఖమును మీరులేని
యీరథమునుజూచి వారు పొందుదురు. నేను మీతల్లినిజూచి

యామెతో 'మీకుమారుడు తన మేనమామయింటికి బోయెను. విచారింపవలదని యబద్ధము పలకను. నిజముగ మీరువనవాసమునకు వెళ్ళిరని విప్రియము నెట్లు పలుకుదును? మిమ్ముల నింత వరకు తీసికొనివచ్చిన యీగుఱ్ఱములు మీరులేని యీరథమును నెట్లు లాగగలవు? మీరులేనియయోధ్యకు నేను బోలేను. మీతో వనవాసమునకు వచ్చుటకు సెలవిండు. మీరు నాకోరిక నంగీకరింపనియెడల తత్క్షణమే రథముతోగూడ నేనగ్నిని ప్రవేశింతును. వనమున మీతపస్సునకు విఘ్నము చేయు జీవులను రథమునుండి తోలి బరిమార్చెదను. మీరథమును తోలిన సౌఖ్యమును నేను పొందితిని. మీతో వనవాససుఖముగూడ నేను పొందగోరుచున్నాను. నాయందు దయయుంచి మీతో నేను వనములో నుండుటకు నంగీకరింపవలెను. ఈగుఱ్ఱము లడవిలో మీసేవ జేసిన గొప్పగతిని బొందును. ఈవనవాసములో మీ పరిచర్యకంటె నయోధ్యయు, దేవలోకమును నా కెక్కువ కావు. పాపాత్ముడు స్వర్గమును బొందలేనటుల మీరులేనియయోధ్యను నేను బొందలేను. మీ వనవాసము పూర్తికాగా నీరథముననే మిమ్ము నయోధ్యకు తీసుకొని వెళ్ళవలెనని నామనస్సులో కోరికయున్నది. మీతో గూడ వనవాసము చేసిన 14 సంవత్సరములు నాకు నిమిషములుగ దోచును. అవి మఱియొకచోట వందలకొలది సంవత్సరములగును. నా రాజకుమారునితోవచ్చినభక్తుడను, సేవకుడను, రాజకార్యములను జరుపువాడనునగు నన్ను మీరు విడువదగదు." ఇట్లు సుమంత్రుడు దీనముగ ననేకవిధముల రాముని ప్రార్థింప నతడు వానిపై దయగలిగి 'నీవు నాయెడ భక్తి కలవాడవని నేనెఱుగుదును. నిన్నేల యయోధ్యకు బంపుచున్నానో వినుము, నీవక్కడకు బోయిన నాపినతల్లియగు కైకేయి నేను వనమునకు వెళ్ళితినని నమ్మకతో సంతోషముగ నుండును. ధార్మికు

డగు నా తండ్రిని నబద్ధము జరుపు వానిగ శంకింపకుండును. భరతు డేలురాజ్య మూమె యనుభవించుట నాముఖ్యోద్దేశము. నాప్రియమును, రాజుప్రియమును జరుపుటకు నీవయోధ్యకు బొమ్ము. నేను చెప్పినసంగతులను రాజాదులకు దెలుపుము' అని వానితో పలుమారులు మంచిమాటలను జెప్పెను. పిమ్మట రాముడు గుహుని జూచి 'జనులుసంచరించు నీవనమున నే నుండదగదు. నేను ఋషుల వలె నాశ్రమమును జేరి నాతండ్రికోరిక ప్రకారము నియమము జరుపు చుండవలెను. నాజుట్టును జటలుగ జేయుటకు మఱ్ఱిపాలను తెమ్ము. అని పలుక వా డట్లుచేసెను. దానితో రామలక్ష్మణులు తమజుట్టును జటలుగ నల్లుకొనిరి. వారు నారచీరలు కట్టుకొని జటలను ధరించి వానప్రస్థులై ఋషులవలె ప్రకాశించిరి. అప్పుడు రాముడు గుహునికి 'నీచతురంగబలమును, ధనమును, నీనగరమును, నీదేశమును, నీవు జాగ్రత్తగ కాపాడి నీరాజ్యమును రక్షించుకొనుము.' అని సెలవిచ్చెను. తరువాత రాముడు లక్ష్మణునితో 'సీతను నావపైకూర్చుండబెట్టి నీవును దానిలోకూర్చుండు'మని పలుక నత డట్లుచేసెను. రాముడుకూడ నావ నెక్క గుహుడు తన వారితో 'నావను నడుపు'డని చెప్పెను. రాము డటుపిమ్మట తన శ్రేయస్సుకొఱకు బ్రాహ్మణ క్షత్రియులు జరుపుతీరున జపమొనర్చి సీతతోగూడ యథాశాస్త్రముగ నాచమనముచేసి ప్రాణాయామము జరిపి సంతోషముగ నుండెను. లక్ష్మణుడుగూడ నట్లుచేసెను. తరువాత రాముడు సుమంత్రునకును, గుహునకును, వాని పరివారమునకును సెలవిచ్చి నావవాండ్రకు నావను నడుపుట కనుజ్ఞ నిచ్చెను. వా రట్లు శీఘ్రముగ నావను నడిపిరి. నదిలో నావ నగముదూరము వెళ్ళిన తరువాత సీత గంగకు నమస్కరించి యిట్లు ప్రార్థించెను. "దశరథపుత్రుడగు నీతడు నీవలన రక్షింపబడి తనతండ్రి యనుజ్ఞను జరిపి 14 సంవత్సరము లడవిలో నివసించి తిరుగ నాతోను,

తనతమ్మునితోను క్షేమముగ తిరిగి వచ్చుగాక. అప్పుడు నేను నీకు తగినపూజ చేసెదను. నీవు మూడులోకములందు చరించి నీభర్తయగు సాగరమును బొందెదవు. నిన్నుపొగిడి నమస్కరించుచున్నాను. రాముడు తిరుగవచ్చి తనరాజ్యమును బొందినయెడల నీప్రియము కొఱకు బ్రాహ్మణులకు లక్షలకొలది గోవులను, వస్త్రములను, మృష్టాన్నములను నిచ్చెదను. వేలకొలదిసారాకుండలను మాంసముతో నీకు నైవేద్యముచేసెదను. నీతీరముననుండు దేవతలను, దీర్థములను, దేవగృహములను సేవించెదను. మేము ముగ్గురము వనవాసమునుండి యయోధ్య బ్రవేశించునటుల బ్రసాదింపుము" ఇట్లు ప్రార్థించుచుండ నావ గంగానది దక్షిణతీరమును జేరెను. తరువాత వారు నావను విడిచి వెళ్ళిరి. అంతట రాముడు లక్ష్మణున కిట్లాజ్ఞాపించెను. "జనులుండుచోటగాని, వారు లేనిచోటగాని నీవు మారక్షణకై సిద్ధముగ నుండుము. ముఖ్యముగ నిర్జనవనమున నీవట్లుండవలెను. నీవు ముందు వెళ్లుచుండుము, నీవెనుకను సీతవచ్చుచుండును. ఆమెవెనుక నేను వచ్చుచు మీయిద్దఱిని రక్షించుచుందును. ఈతీరున మన మొకరి నొకరు రక్షించుకొనుచుండవలెను. చేయవలసినకార్యము సమయము తప్పిన మిక్కిలి కష్టమగును. వనవాసకష్టము లిప్పుడాసీతకు దెలియును. పంటలుపండుభూములు నిర్జనప్రదేశములు, మొరకపల్లములు, గోతులు కలదియునగు నీవనము నామె ప్రవేశించును." ఇట్లు రాము డాజ్ఞాపింప వారట్లు నడచిరి. సుమంత్రు డావలిగట్టుననుండి వీరు కష్టమగు త్రోవను వెళ్ళుచుండుట రెప్పవేయకచూచుచువిచారమునొందికన్నీరు విడిచెను. అంతట వారు పుష్కలమగు వత్సదేశమున నడచుచుసాయంకాలమున నొకపెద్దచెట్టుక్రిందికి చేరిరి. రామలక్ష్మణు లాకలి గలవారై యొకయేదుపందిని, మూడుతేళ్ళను వేటాడి తెచ్చిరి. ఆమృగములమాంసమును వారు ముగ్గురును భుజించిరి.

— ♦ —

## ౮ వ. అధ్యాయము.

## రామాదులు భరద్వాజాశ్రమ చిత్రకూటములకు బోవుట.

సీతారామలక్ష్మణు లయోధ్యవిడిచినరాత్రియు, మఱియొక రాత్రియు దారిలోనుండి మూడవనాటిసాయంకాలమునకు గంగానది దక్షిణతీరమున వత్సదేశమునకు సమీపమున నొకమఱ్ఱిచెట్టుక్రిందకు జేర రాముడు సంధ్యోపాసనజేసి లక్ష్మణునితో 'మనమడవిలో గ్రామములుండనిస్థలమున నుండుట కిదియేమొదటిరాత్రి. ఇప్పుడు సుమంత్రుడు లేడని నీవు విచారింపకుము. మన మీదినముననుండి సీత యోగక్షేమముకొఱకు రాత్రులందు జాగ్రత్తగ నుండవలెను. మనము తెచ్చిన యాకులపక్కలపై నీరాత్రి పరుండెదము.” అని పల్కెను. మంచిరత్నకంబళులపైకూర్చుండతగిన వారు ముగ్గురును భూమిపైని గూర్చుండిరి. రాముడు మంచిసంగతులను జెప్పుచు నిట్లుపలికెను. “ఈరాత్రి దశరథుడు దుఃఖించుచు పరుండును. కైకేయి తన కోరిక నెఱవేఱుటచే సంతోషమునొందును. భరతుడు వచ్చినతరువాత రాజ్యలాభముకొఱకై యామె దశరథునిప్రాణములను బోగొట్టదు గదా? పాప మాతని కెవ్వరును సహాయము లేరు. ఆవృద్ధునినుండి నేను తప్పింపబడితిని. ఆమెయందుగలమోహముచే నాత డామెచేతిలో చిక్కి యేమిచేయగలడు? నాకు గలిగిన కష్టమును,దశరథునిమతి వికారమును జూడ నాకు ధర్మార్థములకంటె కామమే బలమైనదని తోచుచున్నది. ఎంతబుద్ధిహీనుడైనను నాడుదానిమాట విని దశరథుడు నన్ను విడిచినట్లు తనయభిప్రాయము ననుసరించి వర్తించు పుత్రుని విడుచునా? భరతుడు భార్యతోగూడి పుష్కలమైనయయోధ్య నధికారముతో ననుభవింపగలిగినందులకు సంతోషించుచున్నాను. మన తండ్రి లోకాంతరమునొంద నేను వనవాసముననుండ నాతడొక్కడే

ముఖ్యుడగును. అర్థధర్మములవిడిచి కామము ననుసరించువాడు దశరథునివలె వేగముగ నాపదను బొందును. దశరథునిమరణమునకును, నన్ను వనవాసమునకు బంపుటకును, భరతునకు రాజ్య మిప్పించుటకును, కైకేయి యిక్కడకు సంప్రాప్తమైనదని నేను తలచెదను. ఆమె తన సౌభాగ్యముచే గర్వించి నన్నుగురించి కౌసల్యాసుమిత్రలనుగూడ బాధింపదుగదా? నన్ను గురించి నీతల్లి దుఃఖమునొందగూడదు. కనుక నీవిచ్చటినుండి యిప్పుడయోధ్యకు వెళ్లుము. నేనొక్కడనే సీతతోదండకావనమున కరిగెదను. నీవు కౌసల్యకు రక్షకుడ వగుము. నీచురాలగు కైకేయి విరోధముచే నామె కన్యాయము చేయును. నీవామెను భరతున కప్పజెప్పుము. ఏజన్మయందో నాతల్లి తల్లికొడుకుల కెడబాటు చేసియుండును. కనుకనే యిప్పు డామె కీపుత్ర వియోగము తటస్థించినది. గొప్పకష్టములను పడి చాలకాలము నన్ను పెంచిన కౌసల్యను దుర్మార్గుడనైన నేనుసమయమునకు విడిచితిని. తల్లికిగొప్పవిచారమును గలిగించిన నావంటిపుత్రుని మతియెవతెయు కనియుండదు. ఆమె పెంచినగోరువంకకూడ 'ఓచిలుకా! మనశత్రువుని పాదమును చీల్చు' మనును. విచారించుచున్నయామె కేమియు నుపకారముచేయలేని నేను జీవించినను నామె కేమియులాభములేదు. మందభాగ్యురాలగు నామె నేను లేకపోవుటచే విచారించుచు శోయనించును. నేనొక్కడను నయోధ్యను, జగత్తునంతటిని బాణములు వేసి జయింపగలసమర్థుడనైనను పాపభీతిచేతను, పరలోకభీతిచేతను నట్టియధర్మకార్యమును చేయలేను. అట్లుచేసి నేను రాజ్యాభిషేకము చేసికొనను." ఈతీరున రాముడు విలపించుచు కన్నీరువిడిచి యూరకుండెను. అప్పుడు లక్ష్మణుడాతని నిట్లోదార్చెను, "చంద్రుడులేనిరాత్రివలె మీరులేనియయోధ్య యిప్పుడు కళావిహీనమగుట నిశ్చయము. రామా! మీరిట్లు విలపించి నన్ను, సీతను విచారమునొందించుట

తగదు. సీత మిమ్ము విడువలేనటుల నేనుగూడ విడువలేను. అట్లయిన నీటిని విడిచిన చేపలవలె మేమొకగడియయైనను జీవింపలేము. నేను దశరథునిగాని, శత్రుఘ్నసుమిత్రలనుగాని యిప్పుడు చూడగోరుట లేదు. నిన్ను విడిచి నేను స్వర్గమునైనను గోరను." లక్ష్మణు డిట్లు పలుక రాముడు వనవాసకాలమంతయు నడవిలోనుండుటకు నిశ్చయించుకొనెను.తరువాత సీతా రాము లా రాత్రి మఱ్ఱిచెట్టుక్రింద నేర్పఱుపబడిన పక్కలమీద శయనించిరి.

ఆమఱునాటియుదయమున వారు గంగాయమునాసంగమప్రదేశమునకై బయలుదేఱి పెద్దయడవులను దాటుచు నిదివఱకు జూడని రమ్యమగు కొన్ని దేశములను, పెద్దచెట్లను జూచుచు సాయంకాలమునకు ప్రయాగదగ్గఱకు చేరిరి. అప్పుడు రాముడు 'లక్ష్మణా! పైకిపోవు పొగను జూడుము. అది మునియాశ్రమ మని తలచెదను. మనము ప్రయాగకు వచ్చినాము. గంగాయమునలనీరు కలియుటచే గొప్ప శబ్దము వినబడుచున్నది. అడవిలోనున్న వస్తువులచే జీవించువారు కఱ్ఱలను నఱకుచున్నారు. భరద్వాజాశ్రమములోని చెట్లనేకములు కనబడుచున్న' వని పలికెను. తరువాత రామలక్ష్మణులు సూర్యాస్తమయసమయమునకు చేతులతో ధనస్సులుబట్టుకొని గంగాయమునాసంగమప్రదేశమునుండు భరద్వాజాశ్రమము జేరిరి. వీరిని జూచి యక్కడిమృగములు, పక్షులు భయమునొందినవి. ఆశ్రమమునకు కొంచెముదూరమున సీతారామలక్ష్మణులు మునిదర్శనము కోరుచు నిలుచుండిరి. ఆసమయమున నాఋషి శిష్యులతోనుండి మంచినియమముకలిగి మఱిదేనియందు బుద్ధిత్రిప్పక భగవంతుని ధ్యానించుచు నగ్నిహోత్రము జరుపుచుండెను. అంతట వారుముగ్గురు నాఋషిని దర్శించి నమస్కరించిరి. పిమ్మట రాముడు తాము దశరథపుత్రులగు రామలక్ష్మణులనియు, నాయువతి జనకరాజు కుమార్తెయు, పతివ్రతయు, తనభార్యయునగు సీత యనియు, తనతో

తపోవనమునకు వచ్చినదనియు, తాను తండ్రియాజ్ఞచే వనమునకు పంపబడ లక్ష్మణుడుగూడ స్నేహముచే వచ్చెననియు, తాము తపోవనమున నిలిచి ఫలమూలములదిని జీవించుచు ధర్మమార్గమున సంచరింతురనియుపలికెను. ఈమాటలను విని ఋషి వారికి నర్ఘ్యపాద్యాదుల నిచ్చి తగినభోజనము పెట్టించి యాడవిదుంపలు, ఫలములు నిచ్చి వారు రాత్రినిలుచుటకు స్థలమేర్పఱచెను. ఋషి తనప్రక్కను మృగపక్షులుకూర్చుండియుండ రామునితో 'నీ రాక తెస్స'యని పలికి వారికి తగినగౌరవమును జేసెను. వారట్లు కూర్చుండ నాభరద్వాజఋషి రామునితో "మీరు చాలకాలమున కిచ్చటికి వచ్చిరి, కారణములేకుండ మిమ్ము వనవాసమునకు బంపినసంగతిని విని యున్నాను. ఇక్కడ రెండుగొప్పనదులు కలియును. సుందరముగ నుండు నీపుణ్యభూమి నిర్జనస్థలముగుటచేతను, కావలసినస్థల మిక్కడ నుండుటచేతను మీరిక్కడ సుఖముగ నివసింపు"డని పలికెను. దానికి రాముడు 'పట్టణములలోను, పల్లెలలోను నివసించుజను లిక్కడకు సమీపముననే యున్నారు. వారు నన్ను, సీతను జూడగోరి సంతోషముతో నీయాశ్రమమునకు వచ్చుచుందురు; గనుక నాకిక్కడ నుండుట కిష్టములేదు. భగవంతుడా! యెవ్వరులేనిచోట మంచి యాశ్రమము జూడుము. అక్కడ సీత సుఖముగ క్రీడించు'నని పలుక భరద్వాజుడు చిత్రకూటము నిట్లు వర్ణించెను.

"ఇక్కడకు పదిక్రోసులదూరమున చిత్రకూటమను పర్వతము కలదు. అది గంధమాదనమువలె గొప్పదిగ నుండును. ఆపర్వతమున ఫలమూలములు, తేనెలు నధికముగ నుండును. ఋషులు తపస్సు చేయుచుందురు. గొప్పయేనుగులగుంపులును, పులులును, నెమళ్లును, లేళ్లును, ననేకవిధములగు పక్షులును నున్నవి. ఆకొండనుండి నదులు, సెలయేళ్ళు వచ్చుచుండును. చిత్రకూటవన మెత్తుపల్లములులేక

సమతలముగలిగియుండును. అక్కడ వానరులును, ఎలుగుబంట్లును, నావుతోకలవంటి తోకలుగలవారును నున్నారు. అక్కడ ఋషులనేక సంవత్సరములు* తపస్సుచేసి శరీరములతో స్వర్గమునకు బోవుదురు. కోకిలలును, మిగిలినపక్షులును మధురముగ కూయుచుండును. లేళ్ళు పరుగెత్తుచుండును. చిత్రకూటశిఖరము లాకాశము నంటియుండును. వానిలో కొన్ని వెండివర్ణములు, రక్తవర్ణములు, చిత్రవర్ణములు గలిగియుండును. కొన్ని మణులు, పుష్యరాగములు. స్ఫటికములు మొదలగువానివర్ణములు కలిగియుండును. కొన్ని నక్షత్రములవలె కాంతిగలిగియుండును.ఆశిఖరములనుజూచిన మనుజులకు మనస్సులో మంచిబుద్ధులే కలుగునుగాని పాపబుద్ధులు కలుగవు. మామిడి, నేరేడి వకుళ, పనస, మారేడు, రేగు మొదలగుచెట్లతో నాశిఖరములు నిండియుండును. కిన్నరమిథునములు బద్ధమనస్కులై కొండచరియలందు విహరింతురు. విద్యాధరమిథునములు గూడ మంచిబట్టలనుగట్టి ఖడ్గములను బట్టి చెట్లపైనుండి విహరింతురు. నాగులుకూడ నక్కడ క్రీడించును. పర్వతమున నక్కడక్కడ నీరు ధారలుగ బడుచుండును. కొన్నిచోట్ల భూమినుండి నీరుబికి పారుచుండును. గుహలనుండివచ్చు వాయువులు మంచివాసనగలవియైయుండును. ఆపర్వతమున రాళ్ళు విశాలములై యనేకరంగులతో నుండును. అందు కొన్ని యిండ్లవలె నుండును. కొన్ని యుద్యానవనములవలె చెట్లతో నిండియుండును. కొన్ని బండరాళ్లుగనుండును. ఆకొండయందలి యోషధులు తమ కాంతులచే వెలుగుచు రాత్రియం దగ్నిజ్వాలలవలె గనబడును. ఆపర్వత మిందద్రిపురముకంటెను, మానససరస్సుకంటెను, నుత్తర

* రామాయణములో నుపయోగింపబడిన 'శత' మను పదమునకు మేమనేక మని యర్థముచేసితిమి. 7వ. ప్రకరణము ౩వ. అధ్యాయము 362 పుట టిప్పణములో నది ప్రస్తుతపుకలియుగ నూయుఃప్రమాణమని తెలిపితిమి.

కురు దేశము లలంకారమును శోభాయమానముగ నుండి నీటివసతులు, ఫల మూలసమృద్ధి గలిగి యుండును.

ఆపర్వతమునకు తూర్పున కొండచరియలక్రింద 'మందాకిని' యను నది యున్నది. అది మంచియిసుకతిన్నెలు కలిగి కమలములతో నిండియుండును. అక్కడ హంసలు, చక్రవాకములు కలకలము చేయుచుండును. వేగముగ పాఱు నానది కిరుప్రక్కల పుష్పములు ఫలములుగల మంచిచెట్లుండును. ఆయేటిలోని రేవులలో లేళ్ళు నీరు త్రాగి యానీటిని కలగించుచుండును. దానిలో జటలుధరించిన ఋషులు నారచీరలను గట్టుకొని స్నానముచేయుచుందురు. వారు సూర్యుని కెదురుగ నిలిచి చేతులెత్తి తపస్సుచేయుచు నాతని నుపాసనజేయుచుందురు. ఆనదికి రెండుప్రక్కల పంక్తులుగనున్న చెట్లపుష్పములు గాలి వీచునపుడు దానిలోపడుచుండును. దానిలోనిజలము ముత్యములవలెను, మణులవలెను స్వచ్ఛముగ నుండును. సిద్ధు లక్కడక్కడ స్నానము చేయుచుందురు. నదిలో కొట్టుకొనిపోవుచుండు పుష్పములపైని చక్రవాకములు మొదలగు పక్షిద్వంద్వములు నిలిచి మనోహరముగ కూయుచుండును. ఆయేటికి నేనుగులు, లేళ్ళగుంపులు, సింహములు, వానరములు మొదలగునవి కలిసి నీరు త్రాగుటకు వచ్చుచుండును."

భరద్వాజు డీవిధముగ చిత్రకూటము వర్ణించి మఱియు రామునితో అది మిక్కిలి నిర్జనమైనది. మీకక్కడ నన్నివిధముల సుఖముగ నుండును. లేనియెడల మీరు నాతో నిక్కడ వనవాసము జరుపు' డని చెప్పెను. తరువాత నాతడు వారికి మంచియతిథిసత్కారము జేసి యారాత్రియంతయు మంచి పుణ్యకథలను జెప్పి 'మీరు చిత్రకూటమునకు వెళ్లుడు. అక్కడి ప్రదేశము మీకు మిక్కిలిసౌఖ్యముగ నుండును. నదులవద్దను, సెలయేళ్ళవద్దను, రాళ్ళగుట్టలవద్దను నీవును, సీతయు సంతోషముగ విహరించెదరు. మందాకినీ చిత్రకూటముల

గుఱించి మీాకు దెలిపితిని. వానివద్ద సుఖముగ నివసింపు' డని సెలవిచ్చెను.

ఆమఱునాటియుదయమున రాముడు లేచి భరద్వాజునికి నమస్కరించి 'మీాదయచే నిన్నటిరాత్రి మీాయాశ్రమమున నిలిచితిమి. మేము పోవుటకు సెలవిం'డని వానిని కోరెను. ఋషి రామలక్ష్మణుల దీవించి వారు పోవలసినమార్గమును, చేయవలసినకార్యములను వారికి బాగుగ దెలిపెను. రామలక్ష్మణులు మునిజూపిన గొప్పదయనుగూర్చి శ్లాఘించుచు సీతతోగూడ బయలుదేఱి యమునానదితూర్పుతీరమున కొంతదూరము వెళ్ళిరి.

తరువాత వా రెండినవెదుళ్ళు తెచ్చి యొకతెప్పకట్టి వానిపైని గడ్డివఱచిరి. లక్ష్మణుడు నేరేడు రెమ్మలను, ప్రబ్బలిరెమ్మలను తెచ్చి సీతకూర్చుండుటకు నాసనమును తయారు చేసెను. రాముడు సీతను దానిపై కూర్చుండజేయ నామెకొంచెము సిగ్గు తెచ్చుకొనెను. ఆమె ప్రక్కను బట్టలను, నాభరణములను, గునపమును, గంపను, నాయుధములను నుంచిరి. వా రాతెప్పను వడిగల యమునలో నీదుచు తీసికొనిపోవుచుండిరి. వారు నదిలో సగము దూరమువెళ్లిన తరువాత సీత యమునను గంగను ప్రార్థించినటుల ప్రార్థించి 'బ్రాహ్మణులకు వేయిగోవులను, నీకు నూఱుకుండల సారాయిని నిచ్చెద'నని పలికెను. వా రా నదియొక్క దక్షిణతీరమును జేరి యందలి వృక్షముల జూచుచు పెద్దమఱ్ఱివృక్షముక్రిందికి వెళ్ళిరి. అక్కడ సీత దానికి ప్రదక్షిణము జేయుచు 'గొప్పవృక్షమా! నీకు నమస్కారము. నాభర్త నియమమును పూర్తిచేయునటులను సుమిత్రా కౌసల్యలను జూచునటులను ప్రసాదింపు'మని ప్రార్థించెను. అక్కడనుండి ముందులక్ష్మణుడును,నాతని వెనుక సీతయు వారి వెనుక రాముడును నడచుచు వెళ్ళుచుండిరి. రాముడు తనతమ్మునికి 'సీతకోరినపండ్లను,పువ్వుల

నిమ్మని సెలవిచ్చెను. ఆమె యిదివరకు చూచియుండని చెట్లను, పొదలను, నాకులను పూలగుత్తులను జూచివానిపేర్లను తనభర్తనడుగ నాతడామెకు వానిని తెలియజేయుచుండెను.సీతకోరినటుల పూలగుత్తులను, చెట్లయాకులను లక్ష్మణుడు తెచ్చుచుండెను.ఇట్లొక క్రోసుదూరము వెళ్లినతరువాత వారు యమునానదినీలవనమును బ్రవేశించిరి. అక్కడ రామలక్ష్మణులు కొన్నిలేళ్ళను జంపి వానిమాంసమును భుజించి సాయంకాలముకాగ నానదియొడ్డున నివసించిరి.

అమఱునాటియుదయమున రాముడు లేచి లక్ష్మణునితో 'పక్షులు కూయుచున్నవి. మనము బయలుదేఱుట కిది మంచిసమయమనిపలుక నిద్రింపకయున్న యతడు బద్ధకమును దీర్చుకొని లేచెను. వారు ముగ్గురు నదిలో స్నానముజేసి బయలువెడలిరి. చిత్రకూటము సమీపించునపుడు రాముడు సీతకు దానివిచిత్రముల జూపుచు 'ఇచట ఫలములనేకములున్నవి.మన మిచట జీవింపగలము.చెట్లనున్న యొక్కొక తేనెపట్టునుండి నాలుగేసికుంచముల తేనె వచ్చును. మనము జీవించుట కిక్కడ సుఖముగనుండును. ఈపర్వతమున ఋషులు నివసించియున్నారు.ఇక్కడనే మనము కాపురముండెద'మని యామెతోను లక్ష్మణునితోను చెప్పెను. తరువాత వారక్కడనుండు వాల్మీకియాశ్రమమునకు వెళ్ళి యాతనికి నమస్కరించిరి. ఆఋషి వారి నక్కడ కూర్చుండజేసి కుశలమడిగెను. *రాము డాఋషితో తనసంగతిని జెప్పి లక్ష్మణునితో 'మంచిదూలములదెచ్చి మనము నివసించుటకు

---

* అ. రా:—రాముడు వాల్మీకిదర్శనముచేసి చిత్రకూటమునొద్ద తన కొకనివాసస్థానము తెలుపవలెనని యాతనిగోర నాతడు నవ్వుచు నిట్లనెను.'నీవేయన్నిలోకములకు నుత్తమమగునివాసస్థానము. అన్నిభూతములు నీకునివాసగృహములు. శాంతాత్ములయొక్కయు, సమబుద్ధిగలవారియొక్కయు, ప్రాణులయందు సమదృష్టికలవారి

మంచిపర్ణశాలను గట్టు'మన నత డట్లు చేసెను. గట్టిగను, నిండుగను నున్నట్టియు, తలుపులు గలిగినట్టియు నాపర్ణశాలనుజూచి రాముడు లక్ష్మణునితో 'గృహశాంతికొఱకు లేడిమాంసము దెమ్ము. చాల కాలము జీవింపగోరువారు శాస్త్రోక్తముగ గృహదేవతలను శాంతులచే తృప్తిని బొందింపవలె'నని చెప్పెను. తరువాత లక్ష్మణు డవయవములు పూర్తిగనున్న నల్లనిలేడినిచంపి చర్మమునుదీసి 'ఈమాంసమును నగ్నిహోత్రములో వేల్చి హోమముచేయు'మని యన్నను గోరెను. రాముడక్కడినదిలో స్నానముచేసి యజ్ఞమంత్రములన్నియు చదివి దేవగణములన్నిటికి హోమము జేసెను. తరువాత నతడు పర్ణశాలలో ప్రవేశించి, శివుని విష్ణువుని పూజించి వైశ్వదేవబలి జరిపి గృహశాంతిమంత్రముల జపించి తిరుగస్నానముచేసి గృహముననుండు

---

యొక్కయు, ప్రాణులను ద్వేషింపనివారియొక్కయు, నిన్నెల్లప్పుడు మనస్సులో భజించువారియొక్కయు, ధర్మాధర్మములవిడిచి నిన్నెప్పుడు భజించువారియొక్కయు, నీమంత్రముజపించువారియొక్కయు, ద్వంద్వబుద్ధియు, సంసారవాంఛయు లేనివారియొక్కయు, నహంకారము, రాగద్వేషములు లేనివారియొక్కయు, మంటిపెల్ల, రాయి, బంగారులందు సమబుద్ధి గలవారియొక్కయు, భగవంతుడవగు నీయందు మనస్సును, బుద్ధినినిలిపి యెల్లపుడు సంతోషముగనుండువారియొక్కయు, సన్యసించువారియొక్కయు, నప్రియము కలిగినపుడు విచారములేకయు, ప్రియముకలిగినపుడు సంతోషములేకయు నుండువారియొక్కయు, జననాదివికారములగు 'పుట్టుట, మనుట, వృద్ధిపొందుట, పరిణామముపొందుట, క్షీణించుట, నశించుట' యనునాఱును దేహమునకేగాని యాత్మకు లేవనువారియొక్కయు, నాకలి, దప్పిక, సుఖము, దుఃఖము, భయమునను నివి ప్రాణబుద్ధుల సంబంధము వలననే కలుగునని తలంచువారియొక్కయు, సంసారధర్మములవిడిచిన

భూతపిశాచాదులవలన గలుగుభయమును బాపుకొనుటకు వానికి బలి హరణమిచ్చెను. అటుతరువాత నతడు వేఱువేఱు దేవతలకు వేఱువేఱు తిన్నెల నాశ్రమవాసులుచేయు విధమున కల్పించెను. తరువాత రామ లక్ష్మణులు మంచిగంధములతోను, పండ్లతోను కాల్చినమాంసము తోను, నీటితోను, దర్భలతోను, కుశలతోను, భూతముల తృప్తిపఱచి సీతతో పర్ణశాలను ప్రవేశించిరి. వారు జితేంద్రియులై యయోధ్యను విడిచినందుకు విచారములేనివారై సుఖముగ నుండిరి.



వారియొక్కయు హృదయములందు నీ వధివసింతువు. నీ వందరిహృద యములందు నుండువాడవనియు, చిన్మయుడ ( జ్ఞానస్వరూపుడ ) వనియు, నెల్లపుడు నుండువాడవనియు, నంతములేనివాడవనియు, దేని తోను సంబంధములేక వేఱుగనుండువాడవనియు, నేమియునంటని వాడవనియు, నంతటనుండువాడవనియు, మిక్కిలి శ్రేష్ఠుడవనియు, తలచువారిమనస్సులందును, నెల్లపుడును నభ్యాసముచే దృఢముగ నాత్మలందు బుద్ధినిలుపువారియొక్కయు, నీపాదసేవయందు శ్రద్ధగల వారియొక్కయు, నీనామకీర్తనముచే పాపముల బోగొట్టుకొనినవారి యొక్కయు, హృదయములందును నీవుసీతతో నివసింపుము. నీనామ ప్రభావముచే నేను బ్రహ్మర్షిపదవినొందితిని. దానిమహిమను నెవ డైన నెట్లు వర్ణింపగలడు?' ఇట్లు వాల్మీకిపలికి *తనచరిత్రను దెలిపి 'రామనామప్రభావము గొప్పది. దానివలన నేను ముక్తుడనైతి'నని పలికి నాతడు నివసించుటకు స్థలము చూపించెను.

* శివ, ప్రకరణము. ౩ వ అధ్యాయము. వాల్మీకి చూడుము.

## ౬౮. అధ్యాయము.
## రామవనగమనానంతరమున నయోధ్యాదురవస్థ.

రాముని రథము బాగుగ సుమంత్రుడు తోలుచుండ దశరథుడును, వాని భార్యలును దానిని జూచుచుండిరి. ఇట్టిసమయమున నంతఃపురములో స్త్రీలిట్లు విలపించిరి. "అనాథులకును, దుర్బలులకును శుచియగువారికిని గతియగువాడును, తిట్టినను కోపింపనివాడును, క్రోధింపతగినవస్తువులను విడుచువాడును, కోపించువారియందుకూడ దయగలవాడును, సుఖదుఃఖములను సమముగ జూచువాడును, తన తల్లియగు కౌసల్యయం దేరీతిని నడచునో మనయెడ నట్లే నడచువాడును, కైకేయిమాటలవలన దశరథునిచే వనమునకు బంపబడిన లోకరక్షకుడునునగు రాముడెక్కడికి వెళ్ళుచున్నాడు? అయ్యో! బుద్ధిహీనుడగు రాజు లోకప్రియుడును, ధర్మాత్ముడును, సత్యవ్రతుడునునగు కొడుకును వనమునకు బంపెను." ఈరీతిన వారు విలపింప రాజు దానిని విని మిక్కిలి దుఃఖించెను. పట్టణములోని యిండ్లలో నగ్నికార్యములు నిలిచిపోయెను. గృహస్థులు వంటచేసికొనలేదు. ప్రజలు తమతమ కార్యముల జరుపుకొనలేదు. సూర్యు డస్తమించెను. ఏనుగులు తమయాహారములను తినకుండ విడిచెను. ఆవులు తమ దూడలను పాలు త్రాగనియ్యలేదు. తల్లి తనకు పుట్టిన మొదటిపుత్రుని యందు సంతోషమును పొందలేదు. ఆకాశమున క్రూరగ్రహములు చంద్రుని చుట్టు నిలిచెను. గ్రహములకు, నక్షత్రములకు కాంతితగ్గెను. ఇక్ష్వాకుకులనక్షత్రమగు విశాఖానక్షత్రమునకు పొగకప్పెను. అయోధ్య మిక్కిలి చలనమొందెను. దిక్కులకు చీకట్లు క్రమ్మవట్లయ్యెను. పట్టణవాసులు విచారమునుబొంది యాహారవిహారములందు మనస్సులేనివారై నిట్టూర్పుదీయుచు రాముని గూర్చి శోకించిరి. రాజమార్గ

ములోనుండుజనులు దుఃఖముతో కన్నీరు విడిచిరి. వాయువు చల్లగ వీవలేదు. చంద్రుని జూచుటవలన జనులకు సుఖము కలుగలేదు. సూర్యుడు ప్రకాశింపలేదు. లోకమంతయు విచారముతోనిండెను. పిల్లలు తలిదండ్రుల యపేక్ష లేకయు, భార్యలు భర్తలందును, నన్న దమ్ము లన్యోన్యమందును మనస్సులేకయు ప్రజలందఱు తమయితర పనులుమానియు రామునినే చింతించుచుండిరి. అతనిస్నేహితులు మూర్ఛనొందిరి. అత డయోధ్యను విడుచునపుడు పట్టణము చలించెను. అక్కడ నేనుగులు, గుఱ్ఱములు, యోధులు విచారముచే గొప్పశబ్దముచేసిరి.

దశరథుడు తనకుమారుని రథమువైపు బుగ్గి కనుపించునంతవఱకు చూచుచు తరువాత నాతడు విచారముతో భూమియందు బడెను. అంతట నాతనికుడిభుజము కౌసల్య పట్టుకొనెను. కైకేయి యెడమ భుజమును, నాభాగమును పట్టుకొనెను. అప్పుడు రాజు గొప్పవిచారముతో చిన్నభార్యను జూచి నీతి, ధర్మము, వినయము కలవాడై యిట్లు నిందించెను. "దుష్టురాలా! నాశరీరమును ముట్టకుము. నిన్ను జూచుటకు నాకిష్టము లేదు. నీవు నాభార్యవుగాని, బంధురాలవుగాని కావు. నిన్ననుసరించిజీవించువారికిఁగూడ నేనేమియు గాను. నాకును వారేమియు గారు. కేవలము నీవు స్వార్థపరురాలవును, ధర్మమును విడిచినదానవును; గాన నేను నిన్ను విడుచుచున్నాను. అగ్నిహోత్రసాక్షికముగ పాణిగ్రహణము జేసిన నేను నీవిషయమైన యిహావరలోకసంబంధములను విడిచెదను. భరతు డీరాజ్యమును బొంది సంతోషయుక్తుడైనచో వాడు నావిషయమై చేయుపితృకార్యములు నన్ను పొందకూడదు." ఇట్లు దశరథుడు కైకేయిని నిందించుచుండ కౌసల్య బుగ్గియంటిన శరీరముగల యాతనిని లేవదీసి తీసికొనివచ్చునపు డతడు ఋషివేషముధరించిన తన పుత్త్రునికలచి రాముడువలన

బ్రహ్మహత్య చేసినవానివలెను, నగ్నిలో చేయిపెట్టినవాని వలెను మిక్కిలి విచారించెను. రథమార్గమువైపు తిరిగి తిరిగిచూచి మఱలి వచ్చినరాజు ప్రకాశహీనముగ నుండెను. అతడు రాముని స్మరించి విచారించుచు 'వా డిప్పటికి పట్టణము దాటియుండు'నని తలచి యిట్లు పలికెను. 'నాకుమారుని రథగుఱ్ఱముల యడుగులు కనబడుచున్నవి, కాని వాడు రాకున్నాడు. పూర్వము దాసీలు వింజామరలువేయ మంచిగంధముపూసికొని మంచిపక్కలమీద పరుండు నాకుమారు డీరాత్రి యేదో యొకచెట్టుమొదట తలక్రిందకఱ్ఱగాని, రాయిగాని పెట్టుకొని శయనించును. వాడు దీనుడై శరీరముమీద బుగ్గిపడియుండ నిట్టూర్పుదీయుచు లేచును. వనములోని ఋషులు వా డనాథునివలె బోవుచుండుటను జూతురు. మంచిసుఖము లనుభవించిన జనకమహారాజుకూతురు ముండ్లతో నిండినవనములో నెట్లు నడువగలదు? ఆమె యడవిలో తిరుగుట నెఱుగకపోవుటచే నక్కడ పులిమొదలగు క్రూరజంతువులు బొబ్బలిడ భయమును జెందును. కైకేయి విధవయై తనకోరికప్రకారము రాజ్యమును బొంది యిక్కడ నివసించును. నేను రాముని విడిచి జీవింపలేను.' ఈతీరున దశరథుడు విచారించుచు ప్రజలశూన్యమండి యశుభమగు నయోధ్యను బ్రవేశించెను. అక్కడ నాలుగుదారులు కలియుచోటులందు దేవగృహములలో మనుష్యులు లేకుండిరి. అంగళ్ళు మూయబడియుండెను. జనసమ్మర్దము లేకుండెను. ప్రజలు దుర్బలులుగను, నాయాసము చెందినవారుగను విచారగ్రస్తులుగను నుండిరి. ఇట్టిపట్టణమును రాజు చూచుచు సీతారామలక్ష్మణులు లేకపోవుటచే వెలవెలబోవునగరునకు వెళ్లి ద్వారపాలకులతో గద్గదస్వరముతో దీనముగ 'నన్ను కౌసల్యయింటికి శీఘ్రముగ దీసికొని పొండు మఱియొక్కచోట నామనస్సునకు శాంతి కలుగ'దని పలికెను. అంతట వారట్లు వానిని దీసికొని వెళ్ళిరి. రాజు

మెత్తని పక్కపై కూర్చుండినను వానికి సుఖము లేకుండెను. తరువాత నతడు సీతారామలక్ష్మణు లక్కడ లేకపోవుటచే తనచేయి యెత్తి పెద్దగొంతుతో 'రామా! నన్ను విడిచితివా! నీవు తిరుగ వచ్చువఱకు జీవించువారు నిన్ను జూచి సుఖమును జెందుదు'రని పలికెను. ఆరాత్రి రెండుజాముల కాతడు కౌసల్యతో 'రామునియందు లగ్నమైన నామనస్సిప్పుడైనను వానిని విడువలేదు. కావున నీవు నాకు గనబడుటలేదు. నీచేతులతో నాశరీరము నిమురు' మని పలికెను. ఆమె వానిదగ్గఱకు వెళ్ళి యిదంతయు జూచి నిట్టూర్పు దీయుచు విచారించెను.

రాజు తనపక్కపై విచారముతో శుష్కించియుండ కౌసల్య యాతనితో నిట్లు చెప్పుచు విలపించెను. "కైకేయి కపట మనెడి తనవిషపుకోఱలచే నాకుమారునికఱచి పొరవిడిచిన పాము వలె మెలగుచున్నది. ఆమె వానిని వనమునకుబంపి తనకోరిక నెరవేర్చుకొనియు నిచట నన్నెక్కువగ బాధలను బెట్టును. రాముడు బిచ్చమెత్తుకొనియైనను నయోధ్యలోనుండిన చాలును. భరతుని సేవించియైనను వనవాసముకంటె నిక్కడ నివసించుట మంచిది. పౌర్ణమి, యమావాస్య మొదలగుపర్వదినములందు నగ్నికార్యముల జరుపు బ్రాహ్మణుడు దేవతలకీయవలసిన పురోడాశమును రాక్షసుల కిచ్చినట్లు మీరు రామునికీయవలసిన రాజ్యమును రాము నడవికిబంపి కైకేయికిచ్చితిరి. వాడు ధనస్సును బట్టుకొని భార్యతోను, తమ్మునితోను వనమునకు బోయెను. ఎప్పుడును కష్టముల నెఱిగియుండని వారిని మీరు కైకేయిమాటలను విని యడవికి బంపిరి. అక్కడ వారిగతి యేమగునో? సుఖముల ననుభవింపవలసినకాలములో నట్టి యౌవనులు దుంపలనుదిని దరిద్రులవలె నెట్లు జీవింపగలరు. రాముడు భార్యతోను, తమ్మునితోను వచ్చి యిప్పుడు నాకంటబడిన యెడల నా శోకక్షయకరమగునదియు, వారు వనవాసమునుండి తిరిగివచ్చురోజు

నేడే యగును. అట్టిసమయమున నయోధ్యలోని ప్రజలు జండాలు కట్టి సుఖముగ నుందురు. ఎప్పుడు నాకుమారుడు తన భార్యను, తమ్ముని రథముమీద కూర్చుండబెట్టుకొని యయోధ్యకు నాయుధములతో వచ్చును? రాజమార్గమునుండివచ్చువారిపైని ప్రజలందఱెప్పుడు పేలాలు జల్లెదరు. బ్రాహ్మణకన్యలు పువ్వులను, ఫలములను బట్టుకొనియుండ సీతారామలక్ష్మణు లెప్పుడు పట్టణమున నూరేగెదరు? గొప్పబుద్ధిమంతుడును, దేవతుల్యుడును నగు రాముడు బాలునివలె సంతోషముకలిగించుట కెప్పుడు వచ్చును? పూర్వము నేను తమతల్లి పాల కాశించియున్నయావుదూడలను బలగర్వముచే తమతల్లులనుండి విడదీసియుంటినని తలచెదను. సింహ మావులవద్దనుండి దూడలనెత్తుకొనిపోవునటుల పుత్రవాత్సల్యముగల నావద్దనుండి బలవంతముగ కైకేయి నాకుమారుని దీసికొనిపోయినది. అన్నివిద్యలను నేర్చినవాడును, నన్నిసుగుణములు కలవాడునునగు రాముడు నాకేకపుత్రుడు. గనుక నేను వానిని విడిచి జీవింపలేను. వానిని జూడకుండ నుండలేను. ఎండకాలమున సూర్యుని ప్రచండకిరణములు భూమిని తపింపజేయునటుల రాముని వియోగాగ్ని నన్ను తపింపజేయుచున్నది.” ఇట్లు కౌసల్య విలపించెను.

అంతట ధర్మబుద్ధిగలసుమిత్ర యామె కిట్లు బోధించెను. “అన్నిసుగుణములుగల పురుషోత్తముడగు నీకుమారునిగూర్చి దీనుని గురించివలె నీవు విలపింపనేల? మహాబలుడగు నాతడు రాజ్యమును విడిచి తనతండ్రిసత్యవాక్యమును నిలిపి తనకు ముందులోకమునగలుగు మేలుకొఱకై ధర్మాత్ములు జరుపునటుల నడవికి బోయినందులకు నీకు విచారమేల? సర్వభూతదయాళుడగు లక్ష్మణుడుగూడ వానికి కష్టములులేకుండ చేయుటకు వానివెంటవెళ్ళెను. సుఖముల ననుభవించు సీత వనవాసకష్టముల దెలిసికొనియు వానివెంటవెళ్లెను. ఇంచు

వలన మిక్కిలి కీర్తిపొందు నీకుమారుడు సత్యధర్మఫలముల నొందును. రాముని శౌచము, మాహాత్మ్యము నెఱిగిన సూర్యుడుతనకిరణములచే వానిని బాధింపడు. వాయువుకూడ నడవులందు వాని కనుకూలముగ వీచును. రాత్రులందు చంద్రుడు రాముడు శయనించునపుడు తనకిరణములచే చల్లదనముగలిగించి వానిని సంతోషపఱచును. నీకుమారుడు తిమిధ్వజునికుమారుడగు దానవశ్రేష్ఠుని యుద్ధమున జంపినందులకు బ్రహ్మ వానికి దివ్యాస్త్రముల నిచ్చెను. శూరుడును, మహాబలుడును నగు నీపుత్రు డడవిలోనున్నను నగరులోనున్నట్లు భయములేకుండ నుండును. శత్రువుల నొకనిమిషములో బరిమార్చుశక్తిగల నీ కుమారునిచే రాజ్య మేల పరిపాలింపబడకుండును? వాడు వనవాసము నుండి తిరిగివచ్చినవెంటనే తనసిరితోను, శౌర్యముతోను, గొప్ప బలముతోను తనరాజ్యమును తాను బొందును. వా డన్నివిధముల సత్కృష్టుడు. వానికి దుర్గుణములేమియు లేవు. అయోధ్యనువిడిచి వెళ్ళుచున్నయేరాముని జూచి ప్రజలు దుఃఖముచే కన్నీరువిడిచి శోకమునొందిరో యట్టిరాముడు తిరుగవచ్చి భూమిని, సీతను, సిరిని గూడి శీఘ్రముగ రాజ్యాభిషిక్తుడగును. మునివేషధారియగువానితో లక్ష్మివలెనున్న సీత వెళ్ళునపుడును, ధనస్సును, బాణములను, ఖడ్గమును, నస్త్రములను బట్టుకొని లక్ష్మణుడు ముందునడచునపుడును వానికి లభింపనివి యేమియున్నవి? అతడు వనమునుండి తిరిగివచ్చుట నీవు తప్పకచూడగలవు? నీవు విచారమును, నజ్ఞానమును విడువుము. నేను నిజము పలుకుచున్నాను. రాముడు వచ్చి నీపాదములకు నమస్కరించునపుడును, వాడు పట్టాభిషిక్తుడగునపుడును నానంద బాష్పముల విడుచు భాగ్యము నీకు లభించును. వాని కశుభ మేమియు గలుగదు. సీతారామలక్ష్మణులు తిరిగి వచ్చెదరు. నీవు విచారమును విడుము. ఇతరుల నోదార్చుటకు బదులుగ నీవే మనస్సున నింతగ

విచారించెద వేల? మంచిమార్గమున సంచరించెడి నీపుత్రునిగూర్చి నీవు విచారింపవలను." ఇట్లు సుమిత్ర పలికి కౌసల్యనూఱడింప నామెకు విచారము కొంచెము తగ్గెను.

సీతారామలక్ష్మణుల రథమును, నయోధ్యాపట్టణములోని ప్రజలు కొందఱు వెంబడించిరి. వారందఱు తమసానదీతీరమున దిగి రామాదులతో నారాత్రి నిద్రించెంద రామాదులు రాత్రియుండగనే లేచి తమతోడివ పౌరులకు దెలియకుండ రథము నెక్కి- వెడలిరి. తరువాత నాపురవాసులు తెల్లవారగనే లేచి రామాదు లగుపడకపోవుటచే వారిరథమార్గమునుబట్టి కొంతవఱకు జూచి వారు వెళ్ళినజాడను గానక విచారించుచు "ఛీ! మననిద్ర మనలను భంగపఱచెను. గొప్ప కార్యములను జరుపు రాముడు భక్తజనులను విడిచి యడవి కేల వెళ్లెను? మనలను తనపిల్లలవలె పాలించు నారఘుకులశ్రేష్ఠుడు మనల విడిచి యడవికేల యేగెను? ఇప్పుడుమనము మరణదీక్షతో నుత్తరాభి ముఖులమై పోవుదము. లేనియెడల నెండిసకట్టెలచితి యేర్పఱచుకొని యాయగ్నిలోపడి మరణించెదము. రాముని విడిచిన మనజీవిత మేల? 'మే మాతని నయోధ్యకు దీసికొనివచ్చితి'మని పలుకుటకు మనకేమి శక్తిగలదని యెట్లు చెప్పగలము? అతడు లేకుండ మన మయోధ్యకు బోయిన నక్కడి ప్రజలందఱు సంతోషములేక యుందురు. అతనితో కూడ వెళ్ళినమన మతడు లేకుండ నాపట్టణమెట్లు చూడగలము?" అని విలపించుచు కొంతదూరము వెళ్ళి వారిరథమార్గమును గానక మఱల నయోధ్య జేరుచు కన్నీరువిడిచిరి. వారు విచారముచే తమవారిని, పైవారిని పోల్పలేనివారై ప్రాణములు పోయిన వారివలె నుండిరి. అప్పుడు వారిభార్యాపుత్రులు వచ్చి యందఱు కలిసికన్నీరు విడిచిరి. ఆదినమున వర్తకులెవరును తమ యంగడులను తెఱవలేదు. ఎవరికిని సంతోషము లేకుండెను. దేవగృహములు ఘోధలగునట్లి

శోభ లేక యుండెను. గృహస్థులు వంటచేసికొనలేదు. ప్రజలు చాల కాలముక్రిందట పోయినవస్తువులు దొరకినను సంతోషము పొందక యుండిరి. ప్రథమపుత్రులవిషయమై తల్లులు సంతోషించుటమానిరి. అప్పుడు రాముడులేకుండ తిరుగవచ్చినవారిని వారిభార్యలు చూచి యిట్లు నిందించిరి. 'రాముని జూడని జనులకు గృహములవల్లను, భార్యాపుత్రులవల్లను, ధనమువల్లను లాభమేమి? సీతారాములతో వనమునకు వెళ్ళిన లక్ష్మణుడే లోకములో సత్పురుషుడు. రాముడు స్నానముచేసిన సరస్సులు, నదులు పూర్వము పుణ్యముచేసికొన్నవి. అతడు తిరుగునడవులును, నదీతీరములును, కొండలును శోభగలవై యాతనిని తప్పక సత్కరించును. చెట్లు చిత్రములగు పూలగుత్తుల తోను, నాకులతోనునాతని దర్శించును. కొండలకాలమందైన నతనికి ఫలపుష్పములను గనబర్చును.కొండలనుండి నదులును, సెలయేళ్ళును, నూటకాల్వలును పారును. శూరుడగు నత డుండుచోట భయము గాని, పరాభవముగాని కలుగదు. అతడు మనకు కొద్దిదూరములో దొరకును. అతనియొద్దకు మనముపోవుదము. అట్టిపోషకుడు మఱి లేడు. అతడే మనకు గతి. మీరు రాముని సేవింపుడు. మేము సీతను సేవించెదము. ఇట్టి దుఃఖసముద్రములో మునిగినమన కెవ్వరిక్కడ సంతోషము కలిగింతురు? కైకేయి యధర్మముగ రాజ్యముచేసిన మన మిచట జీవింపలేము. అట్టిచో మనకిక్కడ పుత్రుల వలనను, ధనమువలనను నేమిప్రయోజనము? ఆమె యైశ్వర్యమునకై తన భర్తను, కుమారుడగురాముని విడిచినపుడు పైవారినిగూర్చి చెప్ప నేల? 'ఆమె జీవించియున్నంతకాల మామెపరిపాలనలో మేముజీవింప లే'మని మాకుమారులను బట్టి ప్రమాణము చేయుచున్నాము. ఆమె పనివలన శీఘ్రముగ నిప్పుడే రాజులేకపోవుటయు ప్రభువు లేకపోవు టయు, సంతయు నాశనమగుటయు సంభవించును. రాము డడవికి

వెళ్ళుటచే దశరథుడు జీవింపడు. మనము రాముని యొద్దకు బోదము. లేనియెడల విషము త్రాగి మరణింతము. లేనియెడ మననామ రూపములు తెలియని దేశాంతరమునకు బోదము. కైకేయి దశరథుని వంచనచేసి కపటవరములచే సీతారామలక్ష్మణులను వనమునకు బంపెను. మనము క్రూరుడగు భరతుని పాలబడితిమి. రాముని సుగుణములన్నియు వర్ణింపనేల?" ఇట్లయోధ్యలోని స్త్రీలు విలపించుచుండ రాత్రియయ్యెను. వారు తమపుత్రులను, నన్నదమ్ములను దేశాంతరమునకు బంపినటుల నెక్కువగ విలపించిరి. ఆపట్టణములో సంతోషజనకములగు నృత్యగీతవాద్యములుకాని, తెఱచిన దుకాణములుగాని లేక పోవుటచే నాపురమంతయు విచారమున మునిగియుండెను.



## ౧౦ వ. అధ్యాయము. దశరథుని మరణము.



సీతారామలక్ష్మణులు గంగానదిదక్షిణతీరము జేరినతరువాత గుహుడును, సుమంత్రుడును మిక్కిలి విచారముతో మాట్లాడుకొనుచు శృంగిబేరపురము చేరిరి. ఆనిషాదరాజు తనచారులవలన సీతారామలక్ష్మణులు భరద్వాజాశ్రమమునకును, చిత్రకూటపర్వతమునకును వెళ్ళినట్లు తెలిసికొని సుమంత్రునితో జెప్పెను. ఆతడు రామాదులు శృంగిబేరపురమును విడిచిన మూడవనాడు (అనగా వారయోధ్యను విడిచిన యెనవనాడు) తనగుఱ్ఱములను రథమునకు గట్టి తాము వచ్చిన మార్గము ననుసరించి యతిశీఘ్రముగ నదులు మొదలగువానిని దాటి సాయంకాలమున నయోధ్య చేరెను. ఆపట్టణమంతయు మనుష్యసంచారములేని ప్రదేశమువలె వెలవెలబోవుచు సంతోషములేనిదై నిశ్శబ్దముగనుండెను. అట్టియయోధ్యను జూచి సుమంత్రుడు మిక్కిలి

దుఃఖించి యేనుగులు, గుఱ్ఱములు, జనులు, రాజులు రాముని విడుచు టచే గలిగినదుఃఖమువలన నశించిరా యని యనుమానించెను. అత డాపట్టణము ప్రవేశింప వేలకొలది ప్రజలు 'రాముడెక్కడ? రాము డెక్కడ?' యని సుమంత్రునిదగ్గఱకు పరుగెత్తుకొనివచ్చి యడిగిరి. వారితో నాతడు తాను సీతారామలక్ష్మణులను గంగాతీరమున విడుచుటయు, రాముడు తనకు తిరిగి యయోధ్యకు వెళ్ళుటకు నాజ్ఞ యిచ్చుటయు దెలుప నాప్రజలు గుంపులుగూడి 'అయ్యో! వారు గంగను దాటిరా?' యని కన్నీరు తెచ్చుకొని 'అయ్యో! రామా!' యనియు రాముడెప్పుడును యజ్ఞములకు, దానములకు, వివాహము లకు, సభలకు వచ్చుచుండెడివాడు. అతడు పట్టణములోని ప్రజలనంద టిని తండ్రివలె పరిపాలించెను. మన మిప్పు డతనిని నింక జూడము. మనము చంపబడితిమి. ఈప్రజలకు మిక్కిలియుపయోగమును, ప్రియమును, సుఖమును కలుగజేయువస్తువేది? యనియు విచారించిరి. రామునివియోగముచే గలిగిన స్త్రీలయార్తనాదములు వీధులలో నడచుచున్న వారికి వినబడుచుండెను. తరువాత సుమంత్రుడు తనముఖ మును చేతితో కప్పుకొని రాజనగరుచేరి రథమునుండి దిగి వెంటనే మొదటియేడుప్రాకారములు దాటెను. ఆసమయమున ప్రజలనేకు లక్కడ నిలిచియుండిరి. మేడలమీదనుండు స్త్రీ లతనిని జూచి రాముడు కనబడకపోవుటచే నొకరినొకరు చూచుకొనుచు నిట్లు రోదనము చేసిరి. "రామునితో గలిసి వెళ్ళి రాముడు లేకుండ తిరిగివచ్చిన సూతుడు విచారించు కౌసల్యతో నెట్లు మాట్లాడగలడు? తనకొడుకు వనవాసము వెళ్లుటచే నామె జీవించుట మిక్కిలికష్టము" ఇట్లు రాజ స్త్రీలు విలపించుట విని సూతు డది నిజమనితలచెను. తరువాత నత డెనిమిదవప్రాకారమును దాటి దీనముతోను, విచారముతోను నుండు రాజును జూచి యాతనికి నమస్కరించి రాముడు చెప్పినదంతయు

జెప్పెను. దశరథుడు కొంచెము విని మొగము తిరుగుటచే పుత్త్ర వియోగశోకముతో భూమియందు బడి మూర్ఛజెందెను. అంతఃపుర స్త్రీలందఱు చేతులెత్తి యేడ్చిరి. కౌసల్యయు, సుమిత్రయు రాజు భుజములబట్టి లేవదీసిరి. పిమ్మట పెద్దభార్య యిట్లు పలికెను. "ఈ సుమంత్రుఁడు కష్టముల జెందుచున్న మీకుమారుల నడవిలోవిడిచి వారివార్తలను దెచ్చెను. వానితో నేలపలుకరు? మీకు నీతివిహీన మగుపనిచేసినందుల కిప్పుడు సిగ్గుగు జెందుచున్నారు. మీకు సత్యపరి పాలనసుకృత ముండుగాక! విచారించినలాభము లేదు. సుమంత్రు నితో మాట్లాడుటకు మీకు వెఱపును గలుగజేయు కైకేయి యిచ్చట లేదు. మీరు నిశ్శంకగ నతనితో మాట్లాడవచ్చును." ఇట్లు కౌసల్య కన్నీటితో గద్గదస్వరముతో మాట్లాడుచు భూమిమీదపడెను. దానిని జూచి యక్కడస్త్రీలందఱు విలపించిరి. అంతఃపురరోదనశబ్దము విని పట్టణములోనుండు స్త్రీపురుషులందఱు మిక్కిలి విలపించిరి. తిరుగ పట్టణమంతయు నల్లకల్లోలమయ్యెను.

దశరథున కుపచారములుచేయ నాతనికి తెలివివచ్చెను. ఆతడు 'రామా! రామా!' యని విచారించుచు నిట్టూర్పుదీయుచుండెను. వానియెదుట సూతుడు చేతులు జోడించుకొని ప్రయాణముచేసి వచ్చుటచే శరీరమున బుగ్గియంటియుండ కన్నీటితో దీనుడై నిలచెను. అంతట దశరథుడు వానితో నిట్లు విచారమున బలికెను. "బాగుగ సుఖముల ననుభవించిన రాముడు చెట్లమొదట నెట్లు నివసించుచు చున్నాడు? ఏమి తినుచున్నాడు? మంచిపక్కపై పరుండిన నాకుమా రుడు భూమిపై నెట్లు శయనించుచున్నాడు? చతురంగబలములు లేకుండ బయలుదేఱని యాతడు విజనమగు నడవిలో నెట్లు నివసించు చున్నాడు? సుకుమారులగు సీతారామలక్ష్మణులు రథము దిగి యెట్లు నడచివెళ్ళిరి? నీవు వారడవిలో ప్రవేశించుచుండుట వానిని జూచితివి.

అదృష్టవంతుడవు. రాముడు, లక్ష్మణుడు, సీతయు నేమని పలికిరి? వారు భూమిపై నెట్లు కూర్చుండిరో? యెట్లు శయనించిరో? యేమి భుజించిరో? నాకు తెలియ జెప్పుము. అవి వినియే నేను జీవించెదను."
ఇట్లు దశరథు డడుగ సుమంత్రుడు పొంగిపొరలివచ్చుకన్నీటిని నిలుపుకొని రాముడు తనతో జెప్పినదంతయు దశరథునికి దెల్పి యింకను రాముడు చెప్పిన మాటల నీప్రకారము పలికెను. "తనతల్లి యగ్నిగృహము జేరి యగ్నిని బూజించి దశరథుని సేవించుచుండవలెననియు, భరతుడు తనతండ్రియాజ్ఞను జరుపుచుండవలెననియు చెప్పెను. తరువాత లక్ష్మణుడు మిక్కిలి కోపించి నిట్టూర్పుదీయుచు నిట్లుపల్కెను. 'ఏమియపరాధముచేయుటచే రాముని నాతండ్రి వనవాసమునకు బంపెను. రాజు కైకేయినీచపుమాటలను విని చేయగూడని కార్యమును జేసెను. అందుచే మేము బాధనొందుచున్నాము. లోభముచే నామె వరము ఫలించుకొఱకు రా జితని నరణ్యమునకు బంపి యన్నివిధముల గొప్పకష్టమగు కార్యమును జేసెను. ఇదియంతయు నీశ్వరునాజ్ఞచే జరిగినను నతనిని విడుచుటకు గారణము గానరాదు. రాజు తన తెలివి తక్కువచే లోకవిరుద్ధమగు నిట్టికార్యము జరిపి రాముని వనవాసమునకు బంపి ప్రజలను మిక్కిలిగ నేడ్పించెను. నే నాతనియందు తండ్రికుండవలసినధర్మములను గానను. నాయన్నయగు రాముడే నాకు పోషకుడు, బంధువు, తండ్రియునై యున్నాడు. అన్నిలోకములకు ప్రియుడును, లోకములమేలుకోరువాడునునగు నాతని నన్నిలోకములు ప్రేమించును. అట్టిరాముని విడిచి లోకము మీయెడ ప్రేమ నేలజూపును? ప్రజలందఱికి మనోహరుడును, ధార్మికుడునునగు రాముని నడవికి బంపి యాతనికి వ్యతిరేకముగ రాజువై యెట్లు ప్రవర్తింపగలవు?' ఈతీరునలక్ష్మణుడు పల్కె" నని చెప్పి యింకను నాతడు 'మహారాజా! సీత నిట్టూర్పుదీయుచు దయ్యముపట్టినదానివలె జూచు

చుండెను. ఆమె పూర్వము కష్టము లోర్చినదికాదుగనుక రోదనము చేయుచు నాతో నేమియు బలుకలేదు. ఆమె వాడినముఖముతో తనభర్తను జూచుచు తిరిగి ప్రయాణమై వచ్చుచున్న నన్ను జూచి కన్నీరువిడిచె' నని పలికెను.

తరువాత నింకను సుమంత్రు డిట్లు విన్నవించెను. "సీతారామ లక్ష్మణులు వనమునకు బోవునపుడు వారికి నమస్కరించి తిరిగివచ్చుటకు నేను రథమున గూర్చుండి గుఱ్ఱములను దోలితిని. అవి వేడి కన్నీరు విడుచుచు త్రోవను నడువలేదు. రాముడు గుహునిపురము విడిచినతరువాత నతడు తిరుగ నన్ను పిలిపించునేమో యని కొన్ని దినము లక్కడ నేను నివసించియుంటిని. రామునియందలి విచారముచే వృక్షములపుష్పములు, లేతయాకులుగూడ నెండిపోయెను. నదులలోను, సరస్సులలోను, చిన్నమడుగులలోను నీరు వేడిగ నుండెను. అడవులలోను, నుద్యానవనములలోను నాకు లన్నియు నెండిపోయెను. క్రూరమృగములు సంచరింపకయుండెను. పాములు కదలలేదు. రామునిగూర్చి విచారముచే నడవియందలిపక్షులు ధ్వని చేయక నిశ్శబ్దముగ నుండెను. సరస్సులందలి పద్మములు వికసింపక యుండెను. చేపలు నీటిపిట్టలు నీటియందు చలింపకయుండెను. పద్మములు, పువ్వులు, మంచిగంధపుచెట్లు మొదలగునవి పూర్వమువలె పరిమళింపక కొంచెము వాసనగలిగియుండెను. నేనయోధ్యకు వచ్చినపుడు పట్టణమంతయుగూడ విచారముతో నుండెను? సుమంత్రుని యీమాటలనువిని దశరథు డిట్లు పలికెను. "నేను నేర్పరులగు మంత్రులసలహాలేక పాపబుద్ధియగు కైకేయిమాటలచే నట్లు చేసితిని. స్నేహితులతో గాని, యమాత్యులతో గాని, వర్తకులతో గాని, యాలోచనచేయక యజ్ఞానముచే నాడుదాని మాటప్రకారము తొందరగ నట్లుచేసితిని. నిజముగ దైవయోగముచే కులనాశనమున

కిట్టిఘోరకష్టము సంభవించెను. నేను నీ కుపకారమేమైన జేసియుండిన యెడల నీవు రాముని నాయొద్దకు రప్పింపుము. లేక నన్ను రాముని యొద్దకు తీసికొనివెళ్ళుము. నాప్రాణములు పోవ సిద్ధముగనున్నవి. నేనాజ్ఞాపించినప్రకారము నీవు వానిని దీసికొనిరమ్ము. వాడు లేని యెడల నే నొకగడియయైనను జీవింపలేను. వాడు చాలదూరము వెళ్ళినయెడల నన్ను రథముమీద వాడుండుచోటికి తీసికొనివెళ్ళి వానిని నాకు జూపుము. సీతారాములను జూచినయెడల నేను జీవింపగలను. వారిని జూడనియెడల మరణము నొందెదను. ఇట్టి యవస్థలో నేనుండి వానిని జూడలేకపోయినయెడల నింతకంటె మఱియెక్కువ దుఃఖము నాకేమున్నది? అయ్యో రామా! లక్ష్మణా! పతివ్రతయగు సీతా! యనాథునివలె దుఃఖముచే మరణించుచున్న నన్నేల కనుగొనరు? నేను మిమ్మేల విడిచి నిట్టూర్పుదీయుచు కన్నీరు విడిచి భుజములమోదుకొనుచు జుట్టువిడిపోయియుండ విచారించుచుంటిని. కుబ్జమాటలను వినినక్రూరురాలైన కైకేయి ప్రోద్బలముచే మిమ్ము వనమునకుబంపితిని. కౌసల్యా! నేను జీవించుట కష్టము. రామలక్ష్మణులను జూడగోరుచున్న నేను వారినిజూడనందులకు నాకు గొప్ప ముప్పుకలుగును." ఇట్లు దశరథుడు దుఃఖించుచు తనప్రక్కపైని మూర్ఛనొంది పడిపోయెను. అప్పుడు కౌసల్య తనకుమారుడు వనవాసమునకు వెళ్లుటయు, తనభర్తయిట్లు పడియుండుటయు జూచి యధికభయము నొందెను.

తరువాత నామె దయ్యముపట్టినదానివలె గడియగడియకు వణకుచు ప్రాణముపోయినదానివలె గనబడుచు సూతునితో 'సీతారామలక్ష్మణులుండుచోటికి నీవు నన్ను తీసికొనిపొమ్ము. వారిని విడిచి నేనొకనిమిషమైనను జీవింపలేను. దండకావనమునకు రథము ద్రిప్పి నన్ను దీసికొనివెళ్ళుము. వారిని జూడనియెడల నేను మరణము నొందెద'నని పలికెను. దాని కాతడు పొంగివచ్చుకన్నీటి నాపుకొని

గద్గదస్వరముతో నామె నోదార్చుచు నమస్కరించి "మీరు శోక మోహ దుఃఖములవలనగలిగిన తొందరను విడువుడు. రాముడు వనమున విచారమువిడిచి నివసించియున్నాడు. లక్ష్మణుడు ధర్మమును దెలిసికొని యింద్రియముల జయించి యాతనిపాదముల సేవించుచు ముందులోకమునకై యత్నించుచున్నాడు. సీతయింటిలోనుండునటులనే విజనమగువనమున గూడ భయములేక యాతనియందు మనస్సు నిలిపి సంతోషముతో నున్నది. ఆమెకు కొంచెమైనను విచారము లేదు. వనవాసమే యామెకు తగియున్నట్లు నాకు దోచుచున్నది. అయోధ్యాపట్టణసమీపముననుండు నుద్యానవనముల విహరించునట్లామె వనమునగూడ పిల్లవలె విహరించుచున్నది. రాముడులేని యీపట్టణ మామెకు వనముతో సమానము. మేమందఱము రథముపై వెళ్ళునపుడు త్రోవలోనున్న పట్టణములను, గ్రామములను, నదులను, ననేకవిధములగు చెట్లను జూచి యామె వానివిషయమున రామలక్ష్మణులనడిగి తెలిసికొనెను. ఆమె చెప్పినమాట లివియే నాకు జ్ఞాపకమున్నవి. కైకేయివిషయమై యామె పలికినమాటలు నాకు జ్ఞాపకములేవు. నడచుటచేగాని, పెనుగాలివీచుటచేగాని, తొందరపాటుచేగాని, యెండచేగాని చంద్రప్రభగల యామె ముఖము, శరీరమువికారరూపమును బొందలేదు. ఆమెకాలియందెల శబ్దముచేయుచు శరీరమున నగల నలంకరించుకొని సుఖముగ నడచుచుండును. ఏనుగు, సింహము, పులి మొదలగు క్రూరజంతువులను జూచిన తనభర్తరక్షణలోనుండుటచే నామె భయమును బొందదు. వారినిగురించి మీరుకాని, రాజుగారుగాని విచారింపనవసరములేదు. వారు వనమున దుంపలు, ఫలములు భుజించుచు ఋషులవలె జరించుచు విచారమును విడిచి రాజాజ్ఞను బాలించి శాశ్వతకీర్తిని బొందుదురు" రని సూతుడు కౌసల్యకు బోధించినను నామె పుత్రుని

విడుచుటచే విచారమును బొంది యూరకుండక 'ప్రియపుత్రా! రాఘవా!' యని పిలుచుచుండెను.

ఆరోజు సాయంకాలముననే కౌసల్య తనభర్తను 'మహారాజు లోకములలోను దయాళురు; ప్రియముపలుకువారు; చాలమందికిచ్చువారని కీర్తింపబడు మీరు సుఖముననుభవించుచున్న కుమారులనిద్దఱిని సీతతోగూడ దయలేనివారై వనమున కేలపంపితిరి?' అని యడిగి యింకను నిట్లు విన్నవించెను. "వారడవులలోపడుకష్టములకు నేను విచారించుచున్నాను. తామరపూవువంటివర్ణము పరిమళముగల రామునిముఖము నేనెప్పుడు చూచెదను? నేను వానిని జూడకుండ నున్నందుకు నాహృదయము వేయిముక్కలు కాకపోవుటచే నిజముగ నది వజ్రమువలె కఠినమైనదని నాకు తోచుచున్నది. భరతుడు రాజ్యముచేయుటచే రాముడు 15వ సంవత్సరమున వనమునుండివచ్చినను నారాజ్యమును, ధనమును నతడు పుచ్చుకొనుట కిష్టపడడు. దీనికి దృష్టాంతము బ్రాహ్మణుడొకడు శ్రాద్ధమునకు బ్రాహ్మణశ్రేష్ఠులను బిలిచి వారు రాకపూర్వము తనబంధువులను శ్రాద్ధమున బ్రాహ్మణులుగ కూర్చుండబెట్టి పిమ్మట మొదటపిలిచినవారిని నమృతముభుజించుటకు రమ్మనినను వారు వచ్చుట కిష్టపడరు. తమ్ముడు చేయుచున్న రాజ్యమును పుచ్చుకొనుటకు బుద్ధిమంతుడగు జ్యేష్ఠుడంగీకరింపడు. ఇతరజంతువులుతినిన మాంసమును దినుటకు పులి యిష్టపడనటుల పరు డనుభవించు రాజ్యమును పుచ్చుకొనుటకు రాము డిష్టపడడు. ఒకయజ్ఞమం దుపయోగింపబడిన హవిస్సు, పురోడాశము, నేయి, కుశలు, యజ్ఞస్తంభములు మొదలగునవి మఱియొకయజ్ఞమునకు పనికిరావు. సోమపానాంతమున యజ్ఞమువలెను, సారములేనికల్లువలెను నిస్సారముగ నీరాజ్యమును పుచ్చుకొనుటకు రాము డెంతమాత్ర మిష్టపడడు. అన్నిలోకములవారును యుద్ధమున

రాముని జయింపలేరు. ధర్మాత్ముడగు రాముడు ధర్మము తెలియని లోకమునకు ధర్మకార్యములను తెలియజేయును. అట్టివా డధర్మమగు పనినిజేయడు. చేప తనపిల్లలకు మరణరూపమగు కష్టమును గలుగ జేయునటుల మీరు వానికి వనవాసరూపమగు కష్టమును గలుగ జేసిరి. ద్విజు లాచరించినదియు, శాస్త్రయుక్తమైనదియునగు ధర్మము నకు వ్యతిరిక్తముగ మీరు మీకుమారుని వనవాసమునకు బంపిరి. స్త్రీకి మొదట భర్తయును, తరువాతకుమారుడును, తరువాత బంధువు లును గతి; గాని నాల్గవగతి లేదు. మీవలన నాకు ప్రయోజనము లేదుగదా? రాముడు వనవాసమునకు వెళ్లెను. నేనక్కడకు వెళ్ళ లేను. అన్నివిధముల మీవలన నేను నష్టము నొందితిని. నేనేగాక మీవలన రాజ్యములోని ప్రజలును, మంత్రులును, మీయాత్మయు, నాపుత్రులును, పట్టణవాసులును నష్టమునొందిరి. మీయనుంగు భార్యయగు కైకేయియు, నామెప్రియపుత్రుడగు భరతుడును మాత్రము మిక్కిలి సంతోషముగనున్నారు." కౌసల్యపలికిన యీమాటలను విని దశరథుడు దుఃఖించి తాను జేసిన చెడుపనికి పలుమారులు విచారించుచు దుఃఖముతో మూర్ఛపోయెను.

తరువాత నతడు చాలసేపటికి తెలివితెచ్చుకొని వేడినిట్టూర్పు దీయుచు ప్రక్కనున్న యామెను జూచి తిరుగ విచారమునొంది తాను పూర్వము పిన్నవయస్సులో జేసిన దుష్కృత్యమును మనస్సు నకు దెచ్చుకొనెను. ఆవిచారము రామునివిడుచుటచే గలిగిన విచా రము నతనికి మిక్కిలిదుఃఖమును గల్గింప తనశరీరము వణక నామెకు చేతులుజోడించి తలవంచుకొని యిట్లు పలికెను. "కౌసల్యా! నిన్ను నేను ప్రార్థించుచున్నాను. నీ కంజలియొనర్చితిని. నీవునాయందును, నితరులయందును దయగలదానవు. క్రూరబుద్ధిలేనిదానవు. భర్త గుణవంతుడైనను, గుణహీనుడైనను ధర్మవిచక్షణగల స్త్రీకి నాతడే

ప్రత్యక్షదైవము. నీవెల్లపుడు ధర్మబుద్ధి గలదానవు. నిన్నుజూచిన ప్రజలందఱికి నీవు దయజూపుదానవు. నీకు దుఃఖముకలిగినను మిక్కిలిగ విచారించు నన్నిట్లు పలుకదగునా?" ఇట్లు దీనముగ రాజుపలుక దానికామె కన్నీటిధారలు విడిచెను. ఆమె తనశిరస్సుపై నంజలి చేసి యేడ్చుచు భయమునొంది తొట్రుపాటుతో కొందరమాటల నిట్లుపలికెను. "మీరునాయందుదయజూపుడు. నేనుసాష్టాంగ నమస్కారముచేసి మిమ్ముయాచించుచున్నాను. ఇదివరకే నేనుకష్టము నొందితిని. మీరింకను నన్ను బాధనొందింపకుడు. బుద్ధిమంతుడును, మర్యాదస్థుడునునగు భర్తచే ప్రార్థింపబడిన స్త్రీ యుభయలోకములందు సుఖమునెందదు. మీరు ధర్మమెఱిగినవారనియు, నిజము పలుకువారనియు నేనెఱుగుదును; కాని నాపుత్రవియోగవిచారముచే నేనేదో పలికితిని. కాన క్షమింపుడు, శోకమువలన ధైర్యము, ఇదివరకు దెలిసిన సమస్తవిషయములును నశించును. శోకముతో సరియగు శత్రు వెక్కడను లేడు. శత్రువువలన నకస్మాత్తుగ తగిలిన దెబ్బలను సహింపవచ్చునుగాని శోకమునుమాత్రము కొంచెమైనను సహింపలేను. రాముడు వనవాసమునకు వెళ్ళి నేటి రాత్రితో 5 రాత్రులగును. విచారముచే నవి ఏ సంవత్సరములవలె నాకు గానిపించుచున్నవి. వానినిగురించి విచారించినకొలది నామనస్సున దుఃఖ మెక్కువగుచున్నది." ఇట్లు కౌసల్య పలుకునరికి సూర్యు డస్తమింప రాత్రి యయ్యెను. ఈమాటలను విని దశరథుడు విచారములో మునిగి నిద్రజెందెను. ఒకగడియలో నతడు తెలివినొంది తిరుగ మిక్కిలివిచారము పొందెను.

ఆమఱునాటిరాత్రి దశరథుడు కౌసల్యతో మాట్లాడుటకు కోరి తాను * యువరాజుగ నుండుదినములలో శబ్దమునుమాత్రము విని

---

* 6వ. ప్రకరణము ౬వ .అధ్యాయము, అయోధ్య, దశరథుడు, 224 పుట జూడుము.

బాణమెక్కు పెట్టివిడిచి మునిపుత్రు నొకని జంపినందుకు వానితండ్రి వలన తనకుగూడ పుత్రవియోగమువలన మరణముకలుగునని శాపముకలుగుట జ్ఞప్తికి దెచ్చుకొని జరిగినవృత్తాంత మంతయు నామెకు జెప్పి యింకను ధర్మము నిట్లు తెలిపెను. "మనుజుడు తాను జేసిన పుణ్యాపాపములఫలముల ననుభవించును. గొప్పకార్యములను, చిన్న కార్యములను జేయుట కారంభించునపుడు వానిమంచిచెడ్డలను తెలియనివా డజ్ఞానుడు. ఒకానొకడు మోదుగు పూవులయందము జూచి మంచికాయలు కాయునని తలచి మామిడిచెట్లనునరికి యెక్కడ మోదుగుచెట్లను నీరుపోసి పెంచి ఫలకాలమున విచారించునట్లు నేను రామునివిడిచి యిప్పుడు విచారము నొందుచున్నాను. నేను పూర్వము చేసిన ఘోరమునకు ప్రతిఫల మిప్పుడు నాకు వచ్చినది. పుత్రశోకముచే నే నిప్పుడు ప్రాణముల విడుచుచున్నాను. కౌసల్యా! నిన్ను జూచుటకు నాకు కండ్లుకానరావు. నాశరీరమును నిమురుము. నేను రామునిగూర్చి యొనర్చిన యుపకారమునకు తగినట్లు బాధ ననుభవించుచున్నాను. పుత్రుడు దుర్మార్గుడైనను వాని నేబుద్ధిమంతుడు విడుచును? తండ్రిచే వనవాసమునకు పంపబడుచున్నకుమారు డెవడు తండ్రియెడ నసూయజెందడు? ఇదంతయు నాకర్మపరిపక్వఫలము. ఆమునికుమారుని తలిదండ్రులశాపముచే నేనిప్పుడే మరణము నొందెదను. రాముడు నాయొద్దనిలిచి నాకు శుశ్రూష జేసిన నాకీదశ యెట్లు వచ్చును? వాడిక్కడ నుండినను లేక నన్ను స్పృశించినను నేను యమలోకమునకు బోకయుందును. కౌసల్యా! నేను యమలోకమునకు బోవుచుండుటచే నిన్ను జూచుటకు నాకు కండ్లు కనబడవు. మతి పోవుచున్నది. ఈయమదూతలు నన్ను తొందరపెట్టుచున్నారు. ఇట్టిమరణకాలమున ధర్మజ్ఞుడును, సత్యపరాక్రముడునునగు రాముని నేను జూడనైతిని. ఆవిచారము నన్ను దహించుచున్నది. 15 వ సంవ

త్సరమున పద్మపత్రములవంటినేత్రములు, మంచిబొమముడి, మంచి పలువరుస, మంచిముక్కు, మంచికుండలములు, చంద్రునివంటి ముఖము గలిగిన రామునిజూడగలుగు వారు నిజముగ దేవతలుగాని మనుష్యులుగారు. వారు ధన్యులు సుఖవంతులు. కౌసల్యా! నా మనస్సు చలించుచున్నది. గుండె పగులుచున్నది ఇంద్రియములు నాశ మొందుచున్నవి. నాకుమారునివియోగదుఃఖము నన్ను పీడించుచు న్నది. అయ్యో! రామా! మహాబాహూ! నాయాయాసమును బోగొ ట్టువాడా! తండ్రికి ప్రియమునుగూర్చువాడా! నీ విపుడెక్కడకు బోతివి? అయ్యో! కౌసల్యా! అయ్యో! తపస్వినియగు సుమిత్రా! అయ్యో! క్రూరురాలును, వంశనాశకురాలును శత్రురాలునునగు కైకేయీ! ప్రాణములు పోవుచున్నవి." ఇట్లు విలపించుచు కౌసల్య యెదుట దశరథుడు కాలధర్మమునొందెను. అప్పటికి నర్ధరాత్రి యయ్యెను.



## ౧౧వ. అధ్యాయము.
## భరతుని పట్టాభిషేక ప్రసంగము.



దశరథు డర్ధరాత్రివేళ మృతినొందినను నప్పుడెవరికిని దెలియ లేదు. తెల్లవారుజామున వందిమాగధులలో బాగుగ విద్వాంసు లైనవారు మంచిగానముచేసిరి. కొందఱు చేతులతో తాళము వేసి రాజగీతములను బాడిరి. దానితో నగరులోను, చెట్లమీదను, పంజ రములలోను నుండుపక్షులన్నియు లేచి ధ్వనులను జేసెను. రాజదాసీ లును, నపుంసకులైన సేవకులును శుచులై తమతమపనులను జేయుటకు పూర్వమువలె చేరిరి. పరిచారకులు రాజకుటుంబీకులు స్నానము జేయు

టకు మంచిగంధముకలపిన నీటిని బిందెలతో సిద్ధముజేసిరి. స్త్రీపరిచారికలు మంచితైలములను, దంతధావనానంతరము నోటిలో వేసికొను సుగంధద్రవ్యములు మొదలగువస్తువులను, బట్టలను, నలంకారములను పట్టుకొని సిద్ధముగ నుండిరి. ఎచ్చటెచ్చట నేవి సిద్ధముగ నుండవలెనో యవియన్నియు సిద్ధముగ నుండెను. అట్టిసమయమున నచ్చటనున్న పరిచారకులకందఱికి 'రాజింకను రాలేదే'మని యనుమానము కలిగెను. దశరథునిమంచముదగ్గఱ శయనించినస్త్రీలతనిని లేపుచు నాతనిప్రక్కను సమీపించి యతనికి నుచ్ఛ్వాసనిశ్వాసములు లేకుండుట కనిపెట్టి వానిచేతులు, కాళ్లు కదల్చి హృదయము జూచి రాజు ప్రాణములతో నుండలేదని యనుమానించి తమశరీరములు వణక వానిమరణము నిశ్చయించిరి. కౌసల్యాసుమిత్రలు తమకుమారులవియోగముచే విచారమునొంది నిద్రజెంది మరణము నొందిన వారివలె తెలివిలేకయుండిరి. కౌసల్య కాంతిలేని శరీరవర్ణముకలదై వాడిపోయి ప్రకాశములేకయుండెను. రాజుతర్వాతను కౌసల్యయు, నామెతరువాతను సుమిత్రయు మరణించియున్న దశరథునివలె శయనించియుండిరి. ఇదంతయు జూచి దాసీలు విచారముతో గోలపెట్టి యేడ్చిరి. అప్పుడు కౌసల్యాసుమిత్రలు నిద్రనుండిలేచి రాజునుముట్టుకొనిచూచి యేడ్చుచు భూమిమీదపడిరి. తరువాతమిగిలిన రాజభార్యలును, కైకేయియు, మిగిలినవారును విచారముచే నేడ్చుచు భూమిమీద పడిరి. రాజనగరంతయు నేడ్పులతోనిండెను. తరువాత రాజుభార్యలందఱు నతనిచుట్టుచేరి యొకరిభుజముపై నొకరు మొగముపెట్టుకొని యేడ్చుచు నతనినిగూర్చి విలపించిరి.

తరువాత కౌసల్య విచారముచే కండ్లంట నీరుతెచ్చుకొని తన తొడపై రాజుశిరస్సునుంచుకొని కైకేయితో నిట్లనెను. "కైకేయీ! నీకోరిక నెరవేఱినది. దుష్టురాలా! నీవు రాజును విడిచి శత్రువులు

లేని రాజ్యము ననుభవింపుము. నన్ను విడిచి నాకుమారుడు వనమునకు బోయెను. భర్త స్వర్గమునకుబోయెను. కష్టమగుత్రోవలో సాయము లేనిదానివలె నున్నాను. నాకు జీవించుటకిష్టము లేదు. ధర్మమువిడిచిన నీవుతప్ప మఱియేస్త్రీ తనభర్తను విడిచి జీవించుట కిష్టపడును? లుబ్ధుడు దోషము తెలియక చెడువంటకము తినునట్లు నీవు కుబ్జసలహా విని రఘు వంశమునకు నష్టము తెచ్చితివి. మొదట రాజు నీవరములవివరము తెలిసి కొనకుండనిచ్చిపిమ్మట నావరములకుగట్టువడి నీప్రోద్బలముచే రాముని భార్యతో గూడ వనమునకు బంపెను. ఈసంగతి జనకునకు దెలిసిన యెడల నాతడు నావలె మిక్కిలి విచారించును. ఇక్కడ జరిగినవిపత్తు రామునికి దెలియదు. అతడు జీవించి యుండియు నిక్కడమాత్రము నాశముబొందెను. అయ్యో! సీత యడవిలో దుఃఖముచే భయమునొందును. స్వల్పసంతానముగల వృద్ధజనకు డామెసంగతి విని గొప్పవిచారముతో ప్రాణముల బోగొట్టుకొనును. పతివ్రతనైన నేనిప్పుడే ప్రాణముల విడిచెదను. నా భర్తశరీరముతో నగ్నిని బ్రవేశించెదను.” ఇట్లు పలికి కౌసల్య తనభర్తశరీరమును కౌగిలించుకొని విచారించుచుండ నామెను తప్పించి రాజవ్యవహారములు తెలిసినమంత్రులు రాజశవమును నూనెగంగాళములో పడవేసిరి. రాజమంత్రులు రాజకార్యములను క్రమముగ జరిపిరి. రాజకుమారుడు లేకుండ శవదహనముచేయుట యుక్తముకాదని తోచుటచే వారతనిశరీరమును జాగ్రత్తగ రక్షించుచుండిరి. అప్పుడు రాజభార్యలు భుజములెత్తి కండ్లంటనీరు వరదలైప్రవహించుచుండ నిట్లు విలపించిరి. “అయ్యో! మహారాజా! ప్రజలకు పరిపాలకుడును, సత్యసంధుడును, ప్రియవాదియునగు రాముడు మమ్ముల విడిచి వనమునకు బోయెను. నీవుకూడ మమ్ములను విడిచెదవా? కైకేయిక్రూరత్వముచే రాముడు మమ్ములను విడిచెను. భర్తను జంపినకైకేయివద్ద మేమెట్లు నివసింప

గలము? నీవు, సీతా రామలక్ష్మణులు విడిచిన మమ్ముల నామె పరి హాసముగూడ జేయును." ఈతీరున వారు మిక్కిలివిచారించుచుండ నయోధ్య చంద్రుడు, నక్షత్రములు లేని రాత్రివలెను, భర్తవిడిచిన భార్యవలెను, సూర్యుడులేనియాకాశమువలెను దశరథుడు లేకపోవు టచే ప్రకాశహీనముగనుండెను. ప్రజలు కన్నీరుతెచ్చుకొనియుండిరి. జనసంకులములుగల యిండ్లు విచారములతో నిండియుండెను. తరు వాత సూర్యుడస్తమించెను. అప్పుడయోధ్యలోనున్న స్త్రీపురుషు లందఱు గుంపులుగ గూడుకొని కైకేయిని మిక్కిలి నిందించి మిక్కిలి విచారించు చుండిరి. ఆరాత్రిగడచుటకు మిక్కిలికష్టముగను, చాల కాలముగను వారికి గనబడెను.

ఆమఱునాటియుదయమున రాజాభిషేకము చేయించు బ్రాహ్మణశ్రేష్ఠులగు మార్కండేయుడు, మౌద్గల్యుడు, వామదేవుడు, కాశ్యపుడు, కాత్యాయనుడు, గౌతముడు, జాబాలి, రాజమంత్రులు రాజసభలో రాజపురోహితుడగు వసిష్ఠుని ముఖ్యునిగ జేసికొని వేర్వేఱుగ నిట్లు పలికిరి. "పుత్రవియోగదుఃఖముచే మనరాజు మరణమునొంద నిన్నటిరాత్రి మనకు నూఱుసంవత్సరములవలె గడ చెను. మహారాజు మరణించెను. రాముడు వనమునకు బోయెను. తేజోవంతుడగు లక్ష్మణు డాతనితో వెళ్ళియుండెను. భరతశత్రుఘ్ను లిద్దఱు తమమాతామహుడగు కేకయరాజుపట్టణమున రాజగృహ మున నున్నారు. అరాజకముచే మనరాష్ట్రము నశింపకుండనుండుటకు నిక్ష్వాకువంశములోనివారి నెవరినైనను మనము రాజుగ జేయవలెను." ఇట్లు వారు పలికి *యరాజకమువల్లగలుగు విపత్తులను విపులముగ దెలిపిరి. తరువాత వారు 'వసిష్ఠా! దశరథు డున్నపుడుగూడ మేమంద ఱము సముద్రము తనచెలియలికట్టను దాటనటుల మీమాటలను

* 13వ. ప్రకరణము. ౧౩వ. అధ్యాయము, అరాజకముకూడుము.

దాటకుండ జరిపితిమి. మీరే యిక్ష్వాకువంశములో దగినవానిని రాజ్యాభిషిక్తునిగ జేయు'డనిపలికిరి.

అప్పుడు వసిష్ఠుడు వారితో 'తన మేనమామపట్టణమున రాజగృహమున సౌఖ్యముగ భరతుడు శత్రుఘ్నునితో నున్నాడు. వడిగల గుఱ్ఱములనెక్కి వేగిరముగ పోవు దూతలు వారిని దీసికొనివచ్చిన తరువాత మన మాలోచించెద'మనిపలుక వారందఱును 'అట్లే' యని బదులుపలికిరి. అప్పుడు పురోహితుడగు వసిష్ఠుడు సిద్ధార్థుడును, విజయుడును, జయంతుడును, నశోకనందనుండును ననునలుగురు దూతలనిట్లాజ్ఞాపించెను. "మీరు చేయవలసినది వినుడు. మీరు వడిగలగుఱ్ఱముల నెక్కి కేకయరాజుపట్టణములోని రాజగృహమును శీఘ్రముగ జేరి విచారములేనివారై నేను చెప్పినయీమాటను భరతునితో జెప్పుడు. 'మీపురోహితుడును, మీమంత్రులందఱును మీకుశల మడిగిరి. మీరేదో తొందరగ జరుపవలసిన పనికొఱకు శీఘ్రముగ బయలుదేఱవలెను.' ఈమాటలనే చెప్పుడు. కాని వానితో మీరు రాముడు వనవాసమునకు వెళ్లుటగాని, దశరథుని మరణమునుగాని,యందువల్ల రఘువంశమునకు వచ్చిన నష్టమునుగాని చెప్పకుడు. మంచిబట్టలను, మంచినగలను, వేగిరముగ కేకయరాజునకును, భరతునకును దీసికొనివెళ్లుడు." ఇట్లు వసిష్ఠుడు పలుక వారు తమయిండ్లకు బోయి త్రోవలోనికి భోజనసామగ్రిని బట్టుకొని మంచి గుఱ్ఱములమీద కేకయరాజ్యమునకు వెళ్ళుటకు సిద్ధమయి వసిష్ఠుని వద్ద సెలవుపుచ్చుకొని వెళ్ళిరి.

దూతలయోధ్యను విడిచి తరువాత కోసలదేశమును దాటిరి. పిమ్మట వారు కురుదేశమున ప్రవేశించి 'అపరతాల' మనుపర్వతమునకు పడమటిప్రక్కనుజేరి మాలినీనదిని, ప్రలంబపర్వతపుటుత్తరపు తట్టునుదాటి కురుజాంగలదేశములనుండి పోవుచు గంగానదినిదాటి

హాస్తినాపురము చేరిరి. అక్కడనుండి వారు పశ్చిమోత్తరముగ బోవుచు నదులను దాటుచు సరస్సులప్రక్కనుండి పోవుచు పాంచాలదేశము జేరి యక్కడనుండి శరదండానదిని, నికూటవృక్షమును, కళింగపురమును, నభికాళపురమును, 'బోధిభవన' మను పర్వతమును, నిక్షునదిని దాటిరి. పిమ్మట వారు బాహ్లీక దేశమున సుదామపర్వతమును, విష్ణుపదపురమును, విపాశనదిని, శాల్మలీనదిని దాటిరి. తరువాత వారు కేకయదేశమున బోవుచు రాత్రికి రాజపట్టణమగు గిరివ్రజమును ప్రవేశించిరి.

ఆ రాత్రి తెల్లవాఱుజామున భరతుడిట్లు స్వప్నమును గాంచెను. "తనతండ్రియగు దశరథుడు మురికితోగూడియుండి జుట్టు విరియబోసికొని కొండశిఖరమునుండి కంపుకొట్టుచుండు పేడబావిలో పడెను. దానిలో నతడు తేలుచుండి గడియగడియకు నవ్వుచు చేతులతో నూనె త్రాగెను. అతడు తలక్రిందుగనుండి నువ్వులతో గలిసిన యన్నమును భుజించి శరీరమంతటను నూనెబూసికొని నూనెలో స్నానము చేసెను. సముద్ర మెండిపోయెను. చంద్రుడుభూమియంతయును జీకటిచే గప్పబడెను. అయోధ్యలోనిపట్టణపు టేనుగుదంతము విఱువబడెను. అగ్నిహోత్రములు చల్లారెను. భూమి బ్రద్దలాయెను. పెద్దచెట్లు గాలిచే విఱుగగొట్టబడి యెండిపోయెను. కొండలుపొగతో నిండెను. దశరథుడినుపపీటపై నల్లనిబట్టలుకట్టుకొని విచారముతో గూర్చుండియుండెను. నల్లనిరంగు బూడిదరంగుగలస్త్రీలు వానిని జూచి నవ్విరి. తరువాత నతడు తొందరగలేచి యెఱ్ఱనిగంధము బూసికొని గాడిదనుగట్టినరథముపై దక్షిణదిక్కునకు వెళ్లెను. వికృతముఖము కలదియు నెఱ్ఱనిబట్టలుకట్టుకొనినదియునగు రాక్షసి వానిని వెక్కిరించి పట్టుకొనెను." ఈరీతిగ భయంకరమగు కలను గాంచి భరతుడు మిక్కిలిభయము నొందెను.

ఆమఱునాటియుదయమున భరతుడు లేచి రాజసభకు వెళ్ళి యక్కడ మిక్కిలివిచారముతోనుండ వానిస్నేహితులు వానినిచూచి వానిదుఃఖముపోవునటుల కథలనుజెప్పిరి. కొందఱు వాద్యములవాయించిరి. కొందఱు నృత్యముజేసిరి. కొందఱు నాటకములలోని పద్యములను బాడిరి. కొందఱు హాస్యపుమాటలను బలికిరి. వానిస్నేహితులిట్లుచేసినను భరతునకు సంతోషములేకుండెను. అప్పుడు వానిప్రియసఖుడు 'నీ వేల సంతోషముగ లే' వని యడుగ నతడు గడచిన రాత్రి తాను గాంచినకలయంతయు వానికి జెప్పి యిట్లువిలపించెను. "నాకుగాని, రామునకుగాని, దశరథునకుగాని, లక్ష్మణునకుగాని మరణము సంభవించును. ఖరవాహనముపై వెళ్ళుచున్నట్లునరుడు స్వప్నమున గనబడిన నాపురుషునిచితియగ్నినుండి పొగగూడ శీఘ్రముగ గనబడును. అందునిమిత్తము నేను మిక్కిలివిచారము నొందియున్నాను. నాగొంతుక యెండిపోవుచున్నది. నామనస్సు సుఖముగ లేదు. భయమునకు కారణము లేకపోయినను నాకు భయముకలుగుచున్నది. నాకంఠధ్వని తగ్గినది. నాదేహకాంతి వాడిపోయినది. వీనికి తగినకారణము కానరాదు. ఇట్టికల నేనిదివరలో కనియుండలేదు. రాజగునాతండ్రినిగూర్చి యాలోచించునపుడెల్ల నా హృదయము భయముచే కంపము నొందుచున్నది." ఇట్లు భరతుడు విలపించుచుండునంతలో శ్రమజెందిన గుఱ్ఱములతో వచ్చినదూతలు నగరులోని రాజగృహమున ప్రవేశించి కేకయరాజుకాళ్ళకు భరతుని కాళ్ళకు నమస్కరించి భరతునితో నిట్లనిరి. "మీపురోహితుడును, మంత్రులందఱును మీకుశలమడిగిరి. మీరు తొందరగ జేయవలసిన పనియున్నది. వేగిరముగ బయలుదేఱుడు. మేము తెచ్చిన యీమంచి బట్టలను మీరు పుచ్చుకొని మీతాతగారికిని, మీ మేనమామకును నిండు. మీతాతగారికి 20 కోట్లయాభరణములను మీమేనమామకు

10 కోట్లయాభరణములను నిండు." నారిట్లు పలుక నామాటలను భరతుడు విని యాభరణములను తన బంధువుల కిచ్చి దూతలకు తగినసత్కారముగావించి వారిని 'నాతండ్రియగు దశరథుడును, నన్ను దమ్ములగు రామలక్ష్మణులును బాగుగనున్నారా?' యని యడుగ వారు వానితో వినయముగ 'మీరు కుశలముకోరిన వారందఱు బాగుగనున్నారు. మీరథమునకును, మీకును సిరికలుగుగాక!' యని పలికిరి. అంతట నతడు 'మాతాతగారితో నన్ను దూతలు తొందర పెట్టుచున్నారని చెప్పి వారిసెలవడిగెద'నని వారితో బలికి తనతాత యొద్దకు వెళ్ళి యతనితో 'నేను దూతలుచెప్పినప్రకారము నాతండ్రి యొద్దకు వెళ్ళెదను.మీరు నన్ను జూచుటకు కోరినతత్క్షణమే నేను తిరిగి వచ్చెద'నని పలికెను. భరతుని యీవాక్యములను విని కేకయరాజగు నశ్వపతి వానిశిరస్సు మూర్కొని 'నాయనా! నేనంగీకరించితిని. నీవు కైకేయికి సంతోషజనకమగు పుత్రుడవు. నీతల్లిదండ్రుల క్షేమమును, పురోహితునియు, నితరబ్రాహ్మణులయు, రామలక్ష్మణులయు క్షేమము నడిగితినని చెప్పు'మని పలికి వానికి మంచికంబళ్ళను, చర్మములను, ధనమును నిచ్చెను. ఇంకను 2000 వక్షోభూషణములను 1600 గుఱ్ఱములను నిచ్చి తనకు నమ్మకముగలిగిన మంచిమంత్రులను వానివెంట బోవుటకు నియమించెను. అప్పుడు భరతునిమేనమామ మంచియేనుగులను, బాగుగనడచు కంచరగాడిదలను, సొమ్మును భరతున కిచ్చి తనయంతఃపురములోనుండు మిక్కిలిబలముగలమంచి కుక్కలను వానితో బంపెను. వీనినన్నిటిని పుచ్చుకొన్నను భరతునకు ప్రయాణపుతొందరచే సంతోషము కలుగలేదు. అతడు దూతల తొందరపెట్టుటచేతను, తనకుస్వప్నమువచ్చుటచేతను గొప్ప విచారముతో నుండెను. తరువాత నతడు తన నివాసమును విడిచి యేనుగులు, గుఱ్ఱములు, మనుష్యులు బయలుదేఱుటకు సిద్ధముగ

నున్న వీధిలోనికి వచ్చి కేకయరాజు నంతఃపురమున తన మేనమామను జూచి వానివద్ద సెలవుపుచ్చుకొనెను.

భరతశత్రుఘ్నులు రథాదులతో బయలుదేఱిరి. అప్పుడు కైకేయిపుత్రు డింద్రలోకమునుండి బయలుదేఱిన సిద్ధునివలె గనబడెను. వారు చతురంగబలముతో బయలుదేఱుటచే కొంతదూరము త్రోవను వెళ్ళవలసివచ్చెను. వారు మొదట రాజగృహమును విడిచి సుదామనదిని దాటి తరువాత హ్లాదినీనదిని, యేలాధానపురమున శతద్రూనదిని, యపరపర్వత దేశములను, 'శిలావహా' మను నదిని క్రమముగ దాటి యాగ్నేయమున శల్యకర్తనమను గ్రామమును, గొప్ప పర్వతములను చైత్రరథవనమును జూచుచు సరస్వతీనదిని దాటి వీర మత్స్యదేశముల యుత్తరభాగమున బోవుచు భారుండవనమును, కుళింగనదిని దాటి యమునానదిని ప్రవేశించిరి. అక్కడ వారందఱు స్నానముచేసి యక్కడనుండి యడవిని దాటి పిమ్మట గంగానదిని, నంశుధాన దేశములోని ప్రాగ్వటపురమును దాటిరి. తరువాత వారు కుటికోష్ఠికానదిని దాటి ధర్మవర్ధనము, తోరణము, జంబూప్రస్థము, వరూథ మను గ్రామములను జూచుచు నుజ్జిహానపురవనమును దాటి సర్వతీర్థపురమునకు వెళ్ళిరి. అక్కడనుండి వా రుత్తానికనదిని, చిన్న నదులను, హస్తిపృష్ఠక మను గ్రామమును, కుటికనదిని, లౌహిత్యపురమున 'కపీవతి' యను నదిని, ఏకసాలపురమున స్థాణుమతీనదిని, వినత నగరమున గోమతీనదిని, కళింగనగరమును, సాలవనమును, శర్వర్యమునెడు గుగ్గిలపుటడవిని దాటి యయోధ్యను సమీపించిరి. ఇట్లు భరత శత్రుఘ్నులు గుఱ్ఱములను గట్టినరథములపైని, నదులను దాటుటకు కష్టమైనచోట నేనుగులపైని యేడుదినములు ప్రయాణముచేసి చివరకయోధ్యదగ్గఱకు వచ్చిరి.

అప్పుడు భరతుడు తనసారథితో నయోధ్యను వర్ణించుచు నిట్లు పలికెను." ఈయయోధ్యను జూచినను నాకు నంతోష మేమియు కలుగ

కున్నది. అయోధ్యలోనున్న స్త్రీపురుషులుచేయు కలకలధ్వనులు పూర్వమువలె నిప్పుడేమియు వినబడుటలేదు. సాయంకాలసమయమున నుద్యానవనములకు బోయి యక్కడ క్రీడించుచుండెడి కాముకు లిప్పు డెవరును కనబడుటలేదు. ఈపట్టణ మడవివలె నాకు గనబడు చున్నది. ఏనుగులు, గుఱ్ఱములు, వాహనములు మొదలగునవి యేవియు కానరాకున్నవి. పూర్వమువలె పట్టణములో వచ్చుచు బోవుచునున్న జను లెవ్వరును కనబడుటలేదు. మృగపక్షులశబ్ద మేమియు వినబడుటలేదు. చందనాగరుధూపములతో వీచు పరిమళ వాయువు పూర్వమువలె నిప్పుడు వీచుటలేదు. భేరీ, మద్దెల, వీణ మొదలగువాని వాద్యములు పూర్వమువలె నిప్పుడు వినబడుటలేదు. అనేకదుశ్శకునములు కనబడుటచే నామనస్సు దిగులొందుచున్నది. సూతుడా! మాబంధువులందఱికి కుశలమేగదా?" ఇట్లు భరతుడు పలికి విచారముతో నయోధ్యను బ్రవేశించెను. అతడు వైజయంత మను పశ్చిమద్వారమున నగరు ప్రవేశింప నక్కడనుండు ద్వార పాలకు లాతనికి విజయముపలికిరి. భరతుడు రథమునుండి దిగి తన మనస్సుచలించుచుండ తనతో వచ్చినవారికి సెలవిచ్చి ద్వారపాలకుని తోను, సూతునితోను వెళ్ళుచు నిట్లు పలికెను. "కారణములేకుండ నన్నేల తొందరగ రప్పించిరి? నామనస్సునకు నశుభముతోచు చున్నది. రాజులు మరణమునొందుకాలముననుండు చిహ్నాలు నాకు గనబడుచున్నవి. పట్టణవాసులు తమయిండ్లను శుభ్రపఱచుకొనుట లేదు. తలుపులు వేయబడలేదు. అన్నిగృహములు శోభలేకయున్నవి. ఇండ్లలో ధూపములు వేయబడుటలేదు. బలిహరణము లిచ్చుటలేదు. భోజనములు చేయనికుటుంబములు కనబడుచున్నవి. ప్రజలకు కాంతులు లేవు. ఇండ్లకు కళలేదు. దేవగృహములు మాల్యాదిలేప నములు లేక శోభతగ్గియున్నవి. ముంగిలివాకిళ్ళు తుడువబడక

యున్నవి. యజ్ఞసభలు జరుగుటలేదు. దుకాణములలో సరుకు లమ్ముటలేదు. వర్తకులు పూర్వమువలె సంతోషములేక నష్టము బొందినవారివలె విచారముతోనున్నారు. దేవాలయములలోను, తోటలలోను పక్షులు దైన్యమునొందియున్నవి. స్త్రీపురుషులు మురికితో కండ్లంట నీరు కారుచుండ మిక్కిలి విచారముగ నున్నారు.” ఈతీరున భరతుడు పలికి రాజగృహము చేరి పూర్వముజూడనియుప శకునముల ననేకములను జూచి తలవంచుకొని విచారముతో తనతండ్రియింటికి బోయెను.

అత డక్కడ తనతండ్రిలేకుండుట జూచి తనతల్లియింటికి బోవ నామె తనకుమారునిజూచి బంగారుపీఠమునుండి లేచెను. అతడు శోభావిహీనమగు తనగృహమునుజూచి తనతల్లి పాదములకు నమస్కరించెను. కైకేయి వానితలమూర్కొని వానిని కౌగిలించుకొని తన తొడలమీద కూర్చుండబెట్టుకొని యిట్లు క్షేమ మడిగెను. ‘నీవు తాతగారియిల్లువిడిచి కొన్నిదినములు రథముననుండి వచ్చినందుకు నీకు ప్రయాణశ్రమ లేదుగదా? నీతాతయు, నీ మేనమామయు కుశలముగ నున్నారా? నీవు వెళ్ళినప్పటినుండి నీవనుభవించినసుఖమును దెలుపుము.’ ఆమె యడిగినయీమాటలకు భరతు డంతయుజెప్పి యిట్లనెను. ‘నేను తాతగారియిల్లుబయలుదేఱి యిప్పటికి నేడు రాత్రులు గడచినవి. నీవు కోరినవారు క్షేమముగనున్నారు. వారు నాకిచ్చిన ధనము, జంతువులు, పరివారము మార్గాయాసముచే వెనుకనుండి వచ్చుచున్నవి. నేను ముందుగ వచ్చితిని. తండ్రిమాటలను దెలిపిన దూతలచే నేను తొందరపెట్టబడి శీఘ్రముగ వచ్చితిని. నేనడిగినదానికి జబాబు చెప్పుము. నాతండ్రి పండుకొనుపక్క యేల శూన్యముగనున్నది? ఈయిక్ష్వాకుప్రజలు సంతోషముతోనున్నట్లు కానరారేల? పూర్వమిక్కడనే యెక్కువకాలముండు నాతండ్రిని నేనుచూడవచ్చినందులక్ష

నతడేల కనబడడు? ఆతనిపాదములుముట్టి నేను నమస్కరింప వలెను. అతడు కౌసల్యాగృహమునకు వెళ్ళెనా?' యిట్లు భరతుడు తనతల్లినడుగ నామె వానికి రాజ్యముగలుగునను సంతోషముతో ఘోరమగు దశరథునిమరణవార్తను ప్రియమును జెప్పురీతి నిట్లు చెప్పెను. 'అన్ని జంతువులు తుదకేగతి నొందునో యజ్ఞములు చేసిన నీతండ్రికూడ నాగతినే పొందెను.' తల్లిచెప్పిన యాఘోరవార్తను విని ధర్మాత్ముడగు నాతడు పితృనష్టవిచారముచే భూమిమీదబడి 'అయ్యో! మరణించితి' నని దీనవాక్యమును బలికి చేతులు చాచి మతిలేక విచారించుచు శరత్కాలచంద్రునివలె నాయింట తనతండ్రి ప్రకాశించుచుండెననియు నతడు లేకపోవుటచే నాయిల్లు నీరులేని సముద్రమువలె ప్రకాశములేక యున్నదనియు విలపించెను. ఆతడు కన్నీరు విడిచి విచారముచే మొగముమీద బట్టకప్పుకొని భూమిపై బడియుండ నామె వానిని చేతితో లేవనెత్తి 'నీవిట్లేల పడియుండెదవు? లెమ్ము, లెమ్ము. నీవంటిబుద్ధిమంతు లిట్లు విచారింపరు. నీబుద్ధి దాన యజ్ఞములజేయుటయం దిచ్ఛగలదియు, వేదవాక్యములననుసరించు నదియు,సూర్యుని తేజస్సువలె ప్రకాశించునదియు నైయున్న' దని వాని నోదార్చెను. భరతుడు చాలసేపేడ్చి లేచి విచారముగ తనతల్లితో నిట్లు పలికెను. "రాజు రామునికి పట్టాభిషేకమో, లేక యజ్ఞమో చేయునని సంతోషించి నేను బయలుదేఱి వచ్చితిని. నాతండ్రి మర ణము నొందినందులకు నామనస్సు దుఃఖలగుచున్నది. అమ్మా! నాతండ్రి కేమిజబ్బుచేసినది? ఆతనికి దహనాదికర్మలను జేసినరామా దులు ధన్యులు. నాతండ్రియుండినచో నేను వచ్చినందులకు నిజముగ నాతడు నాశిరము మూర్కొనియుండును. నాశరీరమున బుగ్గియున్న పుడు దానిని తనచేతులతో తుడిచి నాకు సుఖముకలిగించు నాతండ్రి యెక్కడ? నాయన్నయు, నాతండ్రితోసమానుడును, మంచికర్మలు

షేయువాఁడనునగు రాముఁడెక్కడఁ? ధర్మము తెలిసినవారికి నన్నయే తండ్రి. ఆతనిపాదముల బట్టెదను. ఆతఁడే నాకిప్పుడు గతి. ధర్మాత్ము డును, సత్యశీలుఁడునునగు నాతండ్రి మరణకాలమున నేమిపలికెనో వినగోరుచున్నాను." ఇట్లు భరతుఁడు కైకేయినడుగ నామె "నీతండ్రి 'రామా! సీతా! లక్ష్మణా!' యని విలపించుచును, వారు తిరుగ వచ్చుటఁజూచువారు తమకోరికలు నెఱవేర్చుకొనినవా రగుదురని పలుకుచును మరణమునొందె" నని తెలుప నాతఁడు రెండువిపత్తులు సంభవించెనని విచారమునొంది తనతల్లిని 'సీతారామలక్ష్మణు లిక్కడనుండి కదలివెళ్ళుటకు కారణమే' మని తిరిగిప్రశ్నింప నామె దానినిజస్థితి తెలిపిన వానికి సంతోషముకలుగునని తలచి 'రాముఁడు నారచీరలుకట్టుకొని దండకావనమునకు సీతాలక్ష్మణులతో వెళ్ళె' నని తెలిపెను. దీనిని విని భరతుఁడు తనవంశముగొప్పదనియు, తన యన్న మంచిప్రవర్తనగలవాఁడనియు నెఱుఁగుటచే భయముగలవాఁడై తనతల్లి నిట్లడిగెను. 'రాముఁడు బ్రాహ్మణులధన మేమైన దొంగిలింప లేదుగదా? మంచిప్రవర్తనగలధనికునిగాని, దరిద్రునిగాని కష్టపెట్ట లేదుగదా? పరస్త్రీల నపహరింపలేదుగదా? వేదపారగుఁడగు బ్రాహ్మ ణుని జంపినవానివలె నతఁడు దండకావనమున కేలపంపబడెను?' ఈప్రశ్నల కామె చంచలబుద్ధికలదై సంతోషముతో "రాముఁడు నీవు చెప్పినదేమియు చేయలేదు. నేనాతనిపట్టాభిషేకము విని నీకు రాజ్యము, వానికి వనవాసము కలుగునటుల నీతండ్రిని వరములను గోర సత్యపరిపాలకుఁడగుటచే నతఁడట్లు చేసి సీతారామలక్ష్మణులను వనమునకు బంపెను. పిదప రాజు తనప్రియపుత్రవియోగవిచారముచే మరణము నొందెను. నీకొఱకే నేనంతయు జేసితిని. నీవు రాజ్యమును బొందుము. విచారమును విడిచి ధైర్యమువలంబింపుము. శత్రురహిత మగు నీపట్టణము, రాజ్యము నీయధీనమయ్యెను. నీవు వసిష్ఠాది

బ్రాహ్మణులు నిర్ణయించినప్రకారము రాజును దహనపఱచి రాజ్యాభిషిక్తుడవుకమ్ము." అని వానికిదెల్పెను.



## ౧౨వ. అధ్యాయము.
## భరతుడు పట్టాభిషేకమున కిష్టపడకపోవుట.



కైకేయి జరిగినదంతయు భరతునికి దెలిపి వాని రాజ్యాభిషేకము గోర నత డిష్టపడక విలపించుచు నామెతో నిట్లు పలికెను. "నాతండ్రియు, నాసోదరులగు రామలక్ష్మణులు లేని యీరాజ్యము వలన నాకేమి ప్రయోజనము? నీవు నాతండ్రిని మరణము నొందించి నాయన్నకు ఋషివేషమిప్పించి గాయములమీద జల్లిన ఉప్పువలె నాకు దుఃఖము కలుగ జేసితివి. నీవు మాకుల నాశనమునకు ప్రళయకాలశక్తివలె దాపరించితివి. నాతండ్రికి నీకూరత్వము తెలియకపోయెను. నీపాపకృత్యములచే రాజు మరణమునొందుటయు, మాకు సుఖములేకపోవుటయు సంభవించెను. రాముని వనమునకు బంపుటేల? ఆతడు వెళ్లుటేల? తనతల్లి యెడ నెట్లు ప్రవర్తించెనో యట్లెనీయెడగూడ ప్రవర్తించినయాతడు నిశ్చయముగ మర్యాదస్థుడును,ధర్మాత్ముడునైన యున్నాడు.పుత్రశోకముచే విచారించుచున్న కౌసల్యాసుమిత్రలు నీవలన జీవించుటకష్టము. కౌసల్య నిన్ను చెల్లెలివలెను, నన్ను పుత్రునివలెను జూచుచుండెను. ఆ సుకుమారునికి నీవు నారచీరలిచ్చి వనవాసము బంపినందులకు నీకేల విచారము కలుగుటలేదు? పాపమాలోచింపనివాడును, శూరుడును, కీర్తిమంతుడును, నింద్రియవశీకరణుడునునగు నాతని వనవాసమునకు బంపుటకు

నీ కేమికారణములు కలవు? నేనతనివిషయమై యెట్లు ప్రవర్తించుచుం టినో నీకు తెలియదని తలచెదను. అందుచే రాజ్యలాభమునకు నీ విపత్తు తెచ్చితివి. పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులను జూడకుండ నే శక్తిచే నేను రాజ్యమును రక్షింపగలుగుదును? నాతండ్రి గొప్పబలము కలవాడైనను రామునిసహాయముననే రాజ్యము చేయుచుండెడివాడు. గొప్పవారు భరింపవలసిన యీ రాజ్యభారమును బాలుడనగు నేనెట్లు వహింపగలను? అట్టి శక్తి, బుద్ధి, బలము, ఉపాయము నాకుగలిగినను నావిషయమై యభిలాషగల నీకోరికప్రకారము నేను జరుపను. అతడు నిన్ను తల్లియనుభావముతో జూడకపోయినయెడల నిన్ను నేను విడుచుట కిష్టము కలిగియుండును. మాపూర్వవంశస్థుల కనహ్యాకర మగు నీబుద్ధి పాపాత్మురాలవగు నీ కేల కలిగెను? మాకులములో పెద్ద వానికి రాజ్యమువచ్చుటయు, మిగిలినవా రాతని నాశ్రయించియుండు టయు నాచారము. క్రూరురాలా! శాశ్వతమగు రాజధర్మమును, దానిరీతిని నీవు తెలిసికొనలేదు. ఇక్ష్వాకువంశస్థుల ధర్మపరాయణ త్వము, మంచిగుణములు, గొప్పతనములు నీవల్ల నష్టమగుచున్నవి. మావంశములోగూడ పెద్దవానికి రాజ్యమువచ్చుటయు, తరువాతవారు వాని ననుసరించుటయు జరుగుచున్నదిగదా? నీకిట్టి యజ్ఞానబుద్ధియెట్లు కలిగెను? నీవు కోరినట్లు నేను జరుపను. నీవల్ల నాకు ప్రాణాంతము కలి గినది. ఇప్పుడే నే నడవికి బోయి నీ కయిష్టులును, ప్రజలకు ప్రియు లుననగు రామలక్ష్మణులను వెనుకకు తీసికొనివచ్చెదను. నాయన్నను రప్పించి వానికి దాసుడనై నేను విచారములేక తిరిగెదను." ఇట్లు భరతుడు విలపించుచు కొండగుహాలోనుండు సింహమువలె గర్జించెను.

తరువాత నతడు తనతల్లికి చీవాట్లు పెట్టుచు మిక్కిలికోపముతో తిరుగ నిట్లు పలికెను. "దుష్టప్రవర్తకురాలా! క్రూరురాలా! రాజ్య మును విడిచిపొమ్ము. నేను చనిపోయితినని యేడ్చుచు నీవు ధర్మమును

విడిచియుండుము. నీ కేమి యవమానము కలుగ జేసిరని రామునికి వనవాసమును, రాజునకు మరణమును కలుగ జేసితివి? నీవు మాకుల మునకు నాశనముకలిగించి వేదపారగబ్రాహ్మణహత్యతో సమాన మగు పాపమును జేసితివి. నీవు నరకమునకు బొమ్ము. నీభర్తకు దొర కినలోకము నీకు దొరకదు. నీవు సర్వలోకసమ్మతుడగు రామునికి కీడు జేసి నాకుగూడ భయమును కలిగించితివి. నీవలన నేనీలోకమున నపకీర్తిని బొందితిని. తల్లిరూపమున గనబడు శత్రురాలా! రాజ్య కాంక్షచే భర్తనుజంపిన దుర్మార్గురాలా! నీతో నేను మాట్లాడను. నీవలన కౌసల్యాసుమిత్రలును, మిగిలిననాతల్లులును గొప్పదుఃఖ మును బొందిరి. నీవు ధర్మాత్ముడగు నశ్వపతికి కుమార్తెవు కావు. ఆతనికులమునకు నపకీర్తిని దెచ్చురాక్షసివై యాతనికి జన్మించితివి. నీపాపమువలననే నాకు తండ్రిలేకపోవుటయు, నే నన్నదమ్ముల విడుచు టయు జరిగినది. జనులకందఱికిగూడ నేను విప్రియుడనైతిని. నీవు కౌస ల్యకు పుత్రవియోగము కలిగించినందులకు నీకు తప్పకనరకము గలు గును. కౌసల్యాతనయుడును, పెద్దవాడును, మాతండ్రితో సమానుడును, బంధువులకు ముఖ్యుడునునగు రామునికి నీవుచేసినయపకారము నేల యాలోచింపవు? తల్లియొక్క ప్రతియవయవమునుండియు, హృదయ మునుండియు పుత్రుడు జన్మించును; గాన నామెకు తోబుట్టు వులకంటె కుమారునియం దెక్కువప్రీతి యుండును." ఇట్లు పలికి కామధేనువు తనసంతానమగు దుక్కిటెద్దులకు గలిగినకష్ట మునుగూర్చి యెట్లు తన పుత్రవాత్సల్యమును * జూపెనో దానిని భరతుడు దెలుపుచు నింకను నిట్లు ప్రసంగించెను. "వేలకొలదిసంతా నముకల కామధేనువే తనసంతానముగూర్చి విచారించునపు డొక్క పుత్రుడుకల కౌసల్యసంగతి చెప్పనేల? నీవలన నామెకు పుత్రవియో

* 13వ. ప్రకరణము. ౧౮వ. అధ్యాయము. పుత్రవాత్సల్యము చూడుము.

గముకలిగినందులకు నీ వీ లోకమునందును, ముందులోకమునందును దుఃఖమునొందెదవు. నేను నాతండ్రికి పరలోకకర్మల జరిపి రామునికి రాజ్య మిచ్చి కీర్తిబొంది ప్రవర్తించెదను. ఆకౌసల్యాకుమారుని రప్పించి నేనే ఋషివేషమును బొంది యడవిని బ్రవేశించెదను. నీవుచేసిన పాపమువలన ప్రజలు కండ్లంట నీరుతెచ్చుకొనుచుండ నేను జూచి భరింపలేను. నీ వగ్నిలో బడుము; లేక దండకావనమునకు బొమ్ము; లేక మెడ కురితాడు తగిలించుకొని మరణమునొందుము. నీకు మఱే దియు గతిలేదు. రాముడు రాజ్యపరిపాలన జేయ నేను పాపమును విడిచి సుఖముగ నుండెదను." ఇట్లు భరతుడు పలికి మిక్కిలికోపముతో పామువలె బుసకొట్టుచు భూమిమీఁద బడెను. వానికండ్లెఱ్ఱగ నుండెను. కట్టుకొనినబట్టలు జారిపోయెను. నగలు క్రిందబడి చెదరి పోయెను.

చాలసేపటికి నతడు తెలివితెచ్చుకొని లేచి కండ్లంట నీరు కాఱుచుండ తనమంత్రులందఱు వచ్చియుండ వారియెదుట తనతల్లిని జూచి యామెను తిరుగ నిట్లు నిందించెను. "నేను రాజ్యము నెప్పుడును గోరలేదు. దానివిషయమై నేనొకప్పుడును గూడ నాతల్లితో నాలోచింపలేదు. నాతండ్రియాలోచించిన నాపట్టాభిషేకవిషయముకూడ నాకు తెలియదు. నేను శత్రుఘ్నునితో నీదేశము విడిచి వనములో నివసించెదను. రాముని సీతాలక్ష్మణులతో వనమునకు బంపుటగాని, యతని వనవాసమునుగాని నేనెఱుగను." అతని యీవిలాపవు మాటలు రామవియోగవిచారముచే చిక్కిపోయినదియు, రూపుమాఱినదియు, మురికిబట్టలుకట్టుకొని తనగృహములోనున్నదియునగు కౌసల్యకు వినబడ నామె సుమిత్రతో 'మూరపాలోచనగలభరతుడు వచ్చెను. నేను వానిని జూడగోరుచున్నా' నని చెప్పి మతిలేక వణకుచు వాడున్నచోటికి వెళ్ళుచుండెను. అంతట భరతశత్రుఘ్ను లామె

యుండునింటికి వెళ్ళిరి. అక్కడ వా రామెను జూచి దుఃఖించుచు నామెను కౌగిలించుకొని యేడ్వ నామెకూడ నేడ్చెను. ఆమె మతిలేక భూమియందు బడెను. తరువాత కౌసల్య తెలివితెచ్చుకొని మిక్కిలివిచారముతో భరతునితో నిట్లనెను. "కైకేయిదుర్మార్గపుకార్యమువలన రాజ్యమునుకోరుసీకు శత్రురహితమగు నీదేశమంతయు దొరకినది. ఆమె నాకుమారునికి నారచీరలగట్టించి వనమునకు బంపుటకు తగినంత దోషము వానియం దేమికని పెట్టినది? ఆమె నాకుమారుడుండుచోటికి నన్నుగూడ బంపుటకు తగియున్నది. లేనిచో నేనును, సుమిత్రయు రాజసంబంధపునగ్నిహోత్రము పట్టుకొని రాముడున్నచోటికి పోయెదము. నాకుమారుడు తపస్సు చేయుచోటికి నీవు మమ్ము స్వయముగ దీసికొనిపోవలెనని నాకోరిక. సమస్తవస్తుసంపూర్ణమగు నీరాజ్యము నామె నీకిప్పించినది." ఇట్లు కౌసల్య యనేకములగుమాటలను భరతునిగూర్చి పలుకుసరికి నతడు కురుపుపైని కఠినముగ సూదితో బొడిచినట్లు బాధనొంది మతిపోవ మిక్కిలివిలపించుచు నామెపాదములపైబడెను. చివర కాతడు తెలివినొంది యామెకు నమస్కరించుచు నామెతోనిట్లనెను. 'తల్లీ! యేపాపము నెఱుగని నన్నేలనిందించెదవు? రామునియందు నాకుగల స్థిరమగుప్రీతిని నీ వెఱుగుదువు. అతడు నాయనుమతిని వనమునకు బోయిన నేను *వివిధపాపకర్మలు చేసినవాడ నగుదునని ప్రమాణముచేయుచున్నాను.' ఇట్లతడు నిట్టూర్పుదీయుచు భూమిపై బడెను. దానికామె యాతనితో 'నాకు తిరిగి దుఃఖమువచ్చుచున్నది. నీవు ప్రమాణములుపలికినాప్రాణములను బాధించుటేల? నీవును, లక్ష్మణుడును రామునియెడ చలింపని యనురాగము కలవారు. నీప్రతిజ్ఞను నెఱవేర్చి యుత్తమలోకముల బొందు'మని పలికెను. తరువాత

* 13వ. ప్రకరణము ౫వ. అధ్యాయము పాపకర్మలు చూడుము.

కౌసల్య భరతుని తనతొడపై నిడుకొని వానిని కౌగిలించుకొని మిక్కవగ నేడ్చెను. అతనిమనస్సుగూడ విచారమునొందెను. ఆరాత్రియంతయు నాతడు విచారించుచు భూమియందుపడి గడియ గడియకు వేడినిట్టూర్పుదీయుచుండెను.



## ౧౩ వ. అధ్యాయము.

## దశరథునికి నుత్తరక్రియలు జరుపుట.

—♦—

భరతుడు కౌసల్యాగృహమున రాత్రియంతయు విలపించుచుండ నామఱునాటియుదయమున మాటలలో నేర్పరియు, మంచి మాటలు పలుకువాడునునగు వసిష్ఠుడు 'నీవు విచారింపకుము. రాజునకు స్వర్గముకలిగించు కార్యములజరుపు'మని భరతునకు సెలవీయ వాడు ధైర్య మవలంబించి తనతండ్రికి ప్రేతకార్యములనన్నిటిని ధర్మమార్గమున జరిపెను. నూనెకాగునుండి రాజశవమును పైకితీసి భూమియందుంచిరి.అప్పుడతని ముఖవర్ణమేమియు మార్పు జెందియుండ లేదు. అతడు నిద్రించినవానివలె కనబడెను. రాజశవమును రత్నములతో చెక్కిన పక్కపై నుంపించి భరతు డిట్లు విలపించెను. 'నేను దేశాంతరముననుండ మీరు ధర్మజ్ఞుడగు రాముని, మహాబలుడగు లక్ష్మణుని వనమునకు బంపి నాయన్న లేక బాధపడునీజనుల విడిచి యేల మరణించిరి? ఇట్టిచో నీపట్టణమునకు యోగక్షేమము లెవరు కూర్చెదరు? చంద్రుడులేని రాత్రివలె మీరులేని యీదేశము, పట్టణము నాథుడులేనిదై ప్రకాశింపకున్నవి.' ఇట్లు భరతుడు విలపించు

చుండ పురోహితుడగు వసిష్ఠుడు వానితో * 'మఱియొకదానియందు మనస్సులేనివాడవై విచారింపకుండ నీవు నీతండ్రికి ప్రేతకార్యములను జరుపవలె'నని పలుక నతఁడు తనగురువుమాట నంగీకరించి ఋత్విజులను పురోహితులను, నాచార్యులను, నందఱిని తొందరపెట్టెను. వారుదశరథునియగ్నిగృహమునుండి పైకితీసినయగ్నులను విధియుక్తముగ తీసికొనివచ్చిరి. రాజసేవకులు శవమును పవారీలోనునిచి దుఃఖముతో మోసిరి. ప్రజలు కొందఱు దానిపైని బంగారునాణెములను, వెండినాణెములను, బట్టలను విసరుచు ముందునడచిరి. మఱికొందఱు చందనము, అగరు, గుగ్గిలము మొదలగు సువాసనద్రవ్యములను దానిపై పడవేసిరి. సరయూతీరమున దహనస్థలమునకు శవము సమీపించిన తరువాత ఋత్విజులు దానిని చితిపై నుంపించి భరతునిచే నగ్నిని తగిలింపించి జపములను జేసిరి. కొందఱు శాస్త్రయుక్తముగ సామగాన

---

* అ. రా:- భరతుడు తనతండ్రిమరణమునకై విలపించుచుండ నతనిని జూడవచ్చిన వసిష్ఠు డాతని కిట్లు తత్త్వోపదేశము చేసెను. "నీతండ్రి దేవేంద్రునియర్ధాసనమున నున్నాడు. ఆత్మ నిత్యమైనది. నాశనము లేనిది. శుద్ధమైనది. జనన నాశాదులు లేనిది. శరీరమపరప్రకృతియనబడు పంచభూతములచేతను, మనోబుద్ధ్యహంకారములచేతను, నిర్మింపబడినదగుటచే మిక్కిలిజడమైనది. పవిత్రము కానిది. నాశనమగునది. ఆలోచించినయెడల నీశోకమునకు కారణమేమియు లేదు. తండ్రిగాని, కుమారుడుగాని మృత్యువునకు లోనైనప్పుడు వానిని గుఱించి మూఢులు తమశరీరముల బాదుకొనుచు విచారింతురు. జ్ఞానులకు నిస్సారమగు సంసారమునందు వియోగము వైరాగ్యహేతువగుచు శాంతిసౌఖ్యములను గలిగించును. ఈలోకములో పుట్టిన వానిని మృత్యు వనుసరించియుండునుగనుక నెవ్వనికిని మృత్యువు తప్పించుకొనశక్యముకాదు. అన్నిజంతువులకు తమకర్మవశమునజనన

ములను బాడిరి. రాజనగరునండి రాజభార్యలుకూడ సవారీలలోను, గుఱ్ఱపుబండ్లలోను ముసలిదాసీలతో నక్కడకు వచ్చి వాహనముల నుండి దిగిరి. ఋత్విజులును, రాజునకు ముఖ్యభార్యలగు కౌసల్యమొదలగువారును చితికి సవ్యాపసవ్యముగ ప్రదక్షిణముచేసిరి. పిదపస్త్రీలందఱును విచారముతో నేడ్చి సరయూనదిలో స్నానముచేసి కన్నీటితో గృహముజేరి పదిరాత్రులను కష్టముతో గడిపిరి.

తెరువాత భరతుడు 11 వ దినమున కర్మలను క్రమముగ జేసెను. 12 వ దినమున నతడు శ్రాద్ధకర్మలను జరిపి బ్రాహ్మణులకు

---

మరణములు కలుగును. ఇట్టిచో తెలిసినవాడు తెలియనివానివలె తనబంధువులగూర్చి యేలవిచారించును? అనేకబ్రహ్మాండములు నశించెను. అనేకసృష్టులు జరిగెను. అన్నిసముద్రములెండిపోవును. అట్టితరి క్షణములో నశింపదగిన మనుజునిగూర్చి విచారమేల? తెలియని సమయమున క్షణములో నశించునాయువునందు నీకీయాదరణయేల? ఆత్మ తనపూర్వదేహమువిడిచి యాపూర్వదేహమున చేసినకర్మవలన తిరుగ దేహమునుబొందును. అది యాదేహమునువిడిచియాదేహమందు జేసినకర్మచే మఱియొక దేహమును బొందును. జనుడు చిరిగిపోయిన పాతవస్త్రమును విడిచి క్రొత్తవస్త్రమును కట్టుకొనునటుల నాత్మ జీర్ణించినశరీరమును విడిచి క్రొత్త దేహమును ధరించును. ఇట్లు దేహములు కలుగుచుండ నావిషయమై శోకింపవలసినయావసరమేమి? ఆత్మ యెుకానొకప్పుడును మరణమునొందదు; పుట్టదు; వృద్ధినొందదు. అది జననాదిషడ్భావములు లేనిది; అంతములేనిది; శాశ్వతమైనది; గొప్పజ్ఞానరూపమైనది; ఆనందస్వరూపమైనది. బుద్ధిమొదలగువాని నెల్లప్పుడు చూచుచుండునది; నాశనములేనిది; ఒకటిగానుండునది; ఉత్కృష్టమైనది; సాటిలేనిది; ఎల్లప్పుడు నొక్కరీతిగ నుండునది. ఇట్టి యాత్మలక్షణముల నీవు బాగుగ దెలిసికొని విచారము మానుము."

సంతృప్తిగ నన్నమును, రత్నములను, సొమ్మును, బట్టలను, తెల్లని మేకలను, వందలకొలది యావులను, వాహనములను, దాసదాసీజనములను, గృహములను దానమిచ్చెను. 13 వ నాటియుదయమున నతడు మిక్కిలి విచారించుచు తనతండ్రిచితినుండి యెముకలను సంగ్రహించునపుడు పెద్దగొంతుకతో నేడ్చుచు నిట్లు విలపించెను. 'మీయాజ్ఞచే నాయన్న వనవాసముననుండగా మీరు రాజ్యమిచ్చి నన్ను సహాయములేనివానిగ జేసి విడిచితిరి. తనపుత్రుడు డడవికి బోవుటచే ననాథవలెనున్న కౌసల్యను విడిచి మీ రెక్కడకు బోయితిరి?' ఇట్లతడు విలపించుచు తనతండ్రిచితిని బరీక్షించి బాగుగ కాలిన యెముకలను జూచి తనతండ్రి యాలోకమును విడిచినందులకు జాలవిచారించెను. తరువాత నత డేడ్చుచు నింద్రుని ధ్వజస్తంభమువలె క్రిందపడిపోయెను. అతనిజూచి దశరథుని యమాత్యులుకూడ నట్లే పడిరి. శత్రుఘ్నుడుకూడ వీరినిజూచి తనతండ్రిని స్మరించుచు నేలమీదబడి వెఱ్ఱివానివలె తనతండ్రిగుణముల నన్నిటిని నిట్లు వర్ణించెను. "కైకేయి మంథరమాటలను విని వరదానముకోరి యావరములను బొందుటచే నీకష్టము మాకందఱికి కలిగెను. సుకుమారులమగు మమ్ము మీరు లాలించుచుండిరిగదా? మీరిపుడెక్కడకు బోయితిరి? మేము భోజనపానములు చేయునప్పుడును, బట్టలను, నగలను ధరించునపుడును మీరు వానిని మాకు స్వయముగ నిచ్చుచుండిరి. అట్లు చేయువారు మాకింక మఱియెవరు? ధర్మజ్ఞులగు మీరు భూమినివిడిచినను నది బ్రద్దలుకాకున్నది. మీరు స్వర్గమునను రాముడు వనమునను నుండ నేనెట్లు జీవింపగలను? నేనగ్నిలో బ్రవేశించెదను. వారు లేనట్టి యయోధ్యకు నేను వెళ్లకుండ వనమునకు బోయెదను." ఇట్లతడు విలపించుచుండ వారితో వెళ్ళినవారందఱు మిక్కిలివిచారము నొందిరి. వారు భూమియందు పడియుండుట బుద్ధిమంతుడును, పురోహితుడు

నగు వసిష్ఠుడు చూచి భరతుని లేవనెత్తి వానికిట్లు బోధించెను. "మీ తండ్రిశవము దహనమై నేటికి 13దినములాయెను. నీవుమిగిలియున్న యెముకలను సంగ్రహింపక యేలవిలంబము చేసెదవు? ప్రపంచమున నన్నిజంతువులకు నాకలిదప్పులు, శోకమోహములు, జరామరణములు కలుగును. అవిసంభవించినను విచారింపకూడదు.' ఇట్లు వసిష్ఠుడు భరతునికి బోధింప సుమంత్రుడు శత్రుఘ్నుని లేవనెత్తి దయతో వానికి సమస్తజీవుల జననమరణములనుగుఱించిన తత్వమును (నిజస్థితిని) తెలిపెను. వారు కండ్లంట నీరు విడుచుచు నెఱ్ఱని నేత్రములతో దైన్యముగ మాట్లాడుచుండ వారిచే నమాత్యులపరకర్మలను తొందరగ జేయించిరి.



## ౧౮ వ. అధ్యాయము.

## రామునిగూర్చి భరతాదులప్రయాణము.



భరతుడు దశరథునియనంతరక్రియలను జరిపినపిమ్మట 13వ దినమున విచారమునొంది రామునియొద్దకు బోవకోరియుండశత్రుఘ్నుడాతనితో నిట్లు పలికెను. 'అన్నిజీవులకు గతియు, బలవంతుడును నగురాముడు దుఃఖమును బొంది యొకయాడుదానిచే వనమునకు బంపబడుట చిత్రముగ నున్నది. బలవంతుడును, వీరపురుషుడునునగు లక్ష్మణుడు తనతండ్రినినిగ్రహించి యాతని నాపదనుండి తప్పింపలేదు. రాజు స్త్రీవశుడై తప్పుమార్గములోనున్నపుడు వాడు నీతులనాలోచించి మొదట తండ్రిని తిరస్కరించి యుండవలసినది.' ఇట్లు శత్రుఘ్నుడు పలుకు సమయమున తూర్పుద్వారమువద్దకు మంథర నగలనన్నిటిని పెట్టుకొని, శరీరమున చందనముబూసికొని, రాజవస్త్రము

లను కట్టుకొని నడుమునకు బంగారుపూసలు గుచ్చిన మొలత్రాడు కట్టుకొని త్రాడుతో గట్టబడిన కోతివలె వచ్చెను. ఇట్టి పాపాత్ము రాలిని ద్వారపాలకుడు పట్టుకొని శత్రుఘ్నునితో 'ఈమెవలననే రాముడు వనవాసమునకు బంపబడుటయు, మీతండ్రి మరణము నొందుటయు జరిగెను; ఈక్రూరాత్మురాలిని మీ రిష్టమువచ్చినట్లు శిక్షింపవచ్చు' నని పలికెను. ఈమాటలను శత్రుఘ్నుడు విని మిక్కిలివిచారించి యక్కడనున్న యంతఃపురమున తిరుగువారితో 'నీ మెవలన నా యన్నదమ్ములకును, నాతండ్రికిని గొప్పదుఃఖము సంభవించినందులకు తగినఫల మిది పొందు' నని పలికెను. తరువాత నతడు దాసీజనుల దగ్గఱనుండగ దానిని బలవంతముగ బట్టుకొన నది నగరమంతయు ప్రతిధ్వనించునట్లు గోలపెట్టెను. దానిని వారందఱుచూచి మిక్కిలి భయమును బొంది పాఱిపోవుచు 'నిత డిట్లు కోపముతోనుండి మనల నందఱిని సంహరించును. మనము కౌసల్యను శరణు బొందుదము. ఆమెయే మనకు గతి' యని యాలోచించిరి. తరువాత నాత డేడ్చుచున్న మంథరను భూమిపై నీడ్చెను. ఆమె నగలన్నియు తెగి క్రింద పడెను. అక్కడకు వచ్చినకైకేయినిగూడ నాతడు చీవాట్లుపెట్ట నామాటల కామె భయమునొంది తనకుమారుని శరణువేడెను. ఇదియంతయుజూచిభరతుడుశత్రుఘ్నునిజూచి 'అన్నిజీవజంతువులలోను స్త్రీలను మాత్రము వధింపకూడదు. కాన నీమెను క్షమింపవలెను. దుష్టప్రవర్తనగల యీనాతల్లిని నేను చంపినయెడల ధార్మికుడగురాముడు నన్ను మాతృఘాతకుడని యసహ్యించుకొనును. కనుక నేనీమెను జంపను. నీవు మంథరను జంపవలదు; చంపినచో యీసంగతి యాతనికి తెలిసిన నతడు నీతోను, నాతోను మాటిమాట్లాడ' డని శత్రుఘ్నునితో బలుక నత డామాటలను విని కోపమును విడిచి యాదాసిని విడిచెను. అది కైకేయికాళ్ళమీదబడి పట్టుబడిన క్రౌంచపక్షి (కొంగ) వలె మిక్కిలియేడ్వనామె దాని నోదార్చెను.

దశరథునిదహనానంతరమున 14వ దినమున రాజాభిషేకమును జేయించు బ్రాహ్మణులును, తదితరులును భరతునితో నిట్లనిరి. 'మాకందఱికి గురుశ్రేష్ఠుడగు దశరథుడు తన జ్యేష్ఠపుత్రుడగు రాముని, లక్ష్మణుని వనమునకు బంపి తాను స్వర్గముజేరెను. నేటి దినమున నీవిప్పుడు మాకు రాజువు కమ్ము. రాజ్యమరాజకమైనను దైవవశమున నాశనమొందలేదు. అమాత్యాదులును, వర్తకులును నభిషేకవస్తువులతో సిద్ధముగనున్నారు. మీతాతముత్తాతల రాజ్యమున నీ వభిషిక్తుడవై మమ్ము రక్షింపుము.' ఇట్లు వారు తెలుప దృఢనియమముగల యాతడావస్తువులకు ప్రదక్షిణమొనర్చి యిట్లు పలికెను. 'మాకులాచారప్రకారము రాజ్యము జ్యేష్ఠునిది. మామేలు కోరు మీరిట్లు పలుకవలదు. పెద్దవాడు రాజగును. నేను 14 సంవత్సరములు వనములో నివసించెదను. గొప్పసేనను సిద్ధముచేయుడు. నేను రాముని వనమునుండి రప్పించెదను. నేనీయభిషేకవస్తువుల నన్నిటిని నక్కడకు తీసికొనివెళ్ళి యాతని కభిషేకముజేసి వానిని దీసికొనివచ్చెదను. తనకుమారునియం దెక్కువ యాశగల నాతల్లి కోరికను నేను జరుపను. వనములో నెగుడుదిగుడుగనున్న త్రోవలను శిల్పకారులు సమముగ జేయవలెను. వానిని సరిజూచువారు వారితో వెళ్ళవలెను.' ఇట్లు భరతుడు సెలవీయ నక్కడి వారందఱు మిక్కిలి సంతోషించి 'నీవు జ్యేష్ఠునికి రాజ్యమిచ్చుచున్నావు గనుక నీయెడ సిరియెల్లపుడు నిలుచునని దీవించి కండ్లంట సంతోషబాష్పముల విడిచిరి. వారు విచారమువిడిచి శిల్పులకు నతనియాజ్ఞను దెలిపిరి. వారు బాటలు బాగుచేసి మార్గమున విశ్రాంతిభవనములు మొదలగు వానిని గట్టుటకు వెళ్ళిరి.

ఆమఱునాటి వేకువజామున రాజనగరున వందిమాగధులు భరతుని మిక్కిలిపొగడుచు వాద్యవిశేషములతో పాడిరి. దానికి

భరతుడు మిక్కిలి విచారించి 'నేను రాజును కా'నని వారికి తెలియజేసి దాని నాపించెను. తరువాత నతడు శత్రుఘ్నునితో 'కైకేయి క్రూర కర్మవలన ప్రజలకు మిక్కిలియుపకారమును, నాకు దుఃఖమును, మన తండ్రికి మరణమును సంభవించెను. ధర్మాత్ముడగు నాతని రాజ్యము నాథుడు లేక చలించుచున్నది. మనకు ముఖ్యప్రభువగు రాముడా మె యధర్మప్రవర్తనచేతనే వనమునకు బోయె'నని పలుక రాజభార్య లందఱు మిక్కిలి విలపించిరి. అట్టిసమయమున వసిష్ఠుడు రాజసభకు తనశిష్యులతో బోయి బంగారుపీఠమున గూర్చుండి 'బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను, మంత్రులను, సేనానాయకులను శీఘ్రముగ దీసికొనిరండు. మఱియు భరతశత్రుఘ్నులను, సుమంత్రుని, యుధాజిత్తనుపేరుగల మంత్రిని, వారికిష్టులగు జనులను తొందరగ దీసికొని రం'డని యచ్చటనున్న దూతలకు సెలవీయ వారట్లు చేసిరి. రథముల పైని, గుఱ్ఱములపైని, యేనుగులపైని, యందఱు కూడిరాగా! నచట గొప్పకలకలమాయెను. భరతుడు వచ్చుచుండ ప్రజలు పూర్వము దశరథునికి మర్యాద చేసినటుల వానికి గౌరవము చేసిరి. దశరథుని సభవలెనే భరతునిసభ కూడ వెలుగొందెను. ఆసభకు తగినవారం దఱు వచ్చియుండిరి. అప్పుడు వసిష్ఠుడు లేచి యక్కడిప్రజలను జూచి భరతునితో మంచిమాటలిట్లు పలికెను. 'నాయనా! నీతండ్రి ధర్మమార్గమున జరించి పుష్కలమగు దేశమును నీకు విడిచి స్వర్గమున కరిగెను. సత్యపరిపాలకుడగు రాముడు తనతండ్రియాజ్ఞను మన్నించి యడవికి బోయెను. నీతండ్రియు, నీయన్నయు నీకు విరోధులు లేనిదియు, సంతోషముగలమంత్రులుగలదియునగు రాజ్యము నిచ్చిరి. వేగముగ నీ వభిషేకమును బొందుము. నాలుగుదిక్కుల రాజులును, సముద్రపుదీవులలోనుండువారును నీకు కానుక లిచ్చుచు న్నారు.' ఇట్లు వసిష్ఠుడు సెలవీయ భరతుడీమాటలను విని మిక్కిలి

విచారమునఁ బొంది ధర్మబుద్ధితో తనయన్నయందు మనస్సునిలిపి కన్నీరు దెచ్చుకొనుచు పురోహితునిమాట లొప్పుకొనక విలపించుచు మంచి కంఠధ్వనితో నిట్లు పలికెను. "బ్రహ్మచర్యవ్రతముగలిగి వేదము నభ్యసించి బుద్ధిమంతుడగు నావంటివా డెవడు రాజ్యమును హరించును? నాతండ్రి యాజ్ఞనిచ్చినంతమాత్రమున నేను రాజ్యమును హరింతునా? ఈరాజ్యము రామునిదే; నేనును వానిసేవకుడనే. మీరీ ధర్మమును దెలుపుటకు తగియున్నారు. సూర్యచంద్రవంశములలో జ్యేష్ఠుడే శ్రేష్ఠుడు. దశరథుడు రాజ్యమనుభవించినట్లు రాముడు రాజ్య మనుభవింపవలెను. మర్యాదహీనులుజరుపునట్టిదియు, స్వర్గ లాభములేనట్టిదియునగు నిట్టిపాపకృత్యము నేను జేసిన నిక్ష్వాకువంశ నాశకుడనని లోకములో పేరొందుదును. నాతల్లి చేసినపాపుపని నా కిష్టములేదు. ఇక్కడనున్నను నేను వనములోనుండు నాయన్నకు నమస్కరించెదను. పురుషులలో నతడే శ్రేష్ఠుడు. అతని ననుస రించియే నేనుండెదను. మూడులోకములరాజ్యమును పాలించుటకు నతడే తగియున్నాడు." ఇట్లు భరతుడు పలుక నీమాటలను సభ్యు లందఱు విని రామునియందే మనస్సుగలవారై సంతోషముతో కన్నీరువిడిచిరి. తరువాత నింకను భరతుడిట్లనెను. 'నేను నాయన్నను వనమునుండి తీసికొనిరాలేనియెడల లక్ష్మణునివలె నతనియొద్దనే యుండెదను. బలవంతముగ నతనిని దీసికొనివచ్చుటకై యన్నియుపా యములను నేను చేసెద నని సభ్యులగు మీయెదుట పలుకుచున్నాను. త్రోవసరిజూచి బాగుచేయువారి నందఱిని నిదివరకే పంపియుంటిని. నేను నేనట్లో బోవుటకు నిశ్చయించియున్నాను.' ఇట్లు భరతుడు పలికి దగ్గఱనుండు మంత్రిశ్రేష్ఠుడగు సుమంత్రునితో 'నీవు లేచి శీఘ్రముగ బలముల నన్నిటిని సిద్ధము జేయు' మని పలుక నతడు సం తోషముతో నట్లు చేసెను. ఈసంగతి వానికిని, సేనానాయకులకును.

ప్రజలకును దెలియ వారు మిక్కిలి సంతోషించిరి. సైనికులభార్యలు దీనిని విని సంతోషముతో తమభర్తలను యాత్రకు తొందరబెట్టిరి. సేనానాయకులు గుఱ్ఱములను, మంచియెద్దుబండ్లను, మంచిరథములను, సైనికులను సిద్ధముజేసిరి. సేనయంతయు వసిష్ఠునియెదుట సిద్ధమైయుండెను. అప్పుడు సత్యవ్రతుడును, ప్రతాపవంతుడునునగు భరతుడు తనదగ్గఱనుండు సుమంత్రునితో 'రథమును సిద్ధముచేయు' మని చెప్ప నతడు మంచిగుఱ్ఱములను గట్టి రథమును తయారుచేసెను. అప్పుడు కైకేయిపుత్రుడు రామునిప్రశంసించుచు సూతునితో 'లోకోపకారముకొఱకై నేను వనములోనున్న నాయన్నను దీసికొని రాగోరియున్నాను. శీఘ్రముగ బలములను, సేనానాయకులను బయలుదేఱజేయు' మని పలుక నతడాసంగతి సేనానాయకులకు, ప్రజలకు, భరతుని స్నేహితులకును దెలియజేయ నందఱు వెళ్లుటకు సిద్ధమైయుండిరి.

అమఱునాటియుదయమున భరతుడు శీఘ్రముగ లేచి రాముని జూచు కోర్కెతో బయలుదేఱెను. అతనికిముందు రాజపురోహితులును, మంత్రులును, గుఱ్ఱపుబండ్లపై వెడలిరి. నడివయస్సుగల 9000 ఏనుగులును, నాయుధములబట్టినవీరులుగల 6000 రథములును, నొకలక్ష రౌతులుగల గుఱ్ఱములును నతనితో వెళ్లెను. రాజభార్యలు ముగ్గురును వాహనములమీద వెళ్ళిరి. రామలక్ష్మణుల జూచునభిలాషతో బ్రాహ్మణక్షత్రియవైశ్యులును రథములు మొదలగు వాహనములపై గూర్చుండి రామునిచిత్రకథలనుజెప్పుకొనుచు సంతోషముతో బయలుదేఱిరి. ఇంకను వేదముచదివినబ్రాహ్మణులును, వర్తకులును, పట్టణవాసులును, రాజశిబిరములతోగూడబోవు మణులపనివాండ్రును, కుండలుచేయువారును, నాయుధములజేసి యమ్మి జీవించువారును, నెమలిపింఛముతో పనులుచేయువారును, దంతపువస్తువులుచేయువారును,

గంధపువస్తువు లమ్మి జీవించువారును, చాకళ్ళును, మంగళ్ళును, నితరులును తమతమకుటుంబములతో నెద్దుబండ్లపై వెళ్ళిరి. అందఱు మంచిబట్టలు కట్టుకొని, గంధము బూసికొని మంచిరూపములతో బయలుదేఱిరి. ఇట్లు జలములు మొదలగునవి యాత్ర వెడలుచు చాల దూరము వెళ్ళి గంగాతీరమున రామసఖుడగు గుహునుండు దేశము నకు బోయిరి. అప్పుడు భరతుడు తనమంత్రులతో 'మనము ప్రయా ణముచే నలసటనొందితిమి. ఈదినమున నిక్కడనుండుదము. రేపటి దినమున గంగను దాటుదము.తరువాత నాతండ్రికి నాయుదకముతో తర్పణమొనర్చెద' నని పలుక వారు దానికొప్పుకొని సేన నానదీతీ రమున వేఱువేఱుగ విభజించి తగినడేరాలలోను, పైనను నిలిపిరి. భరతుడు రామునితిరుగ తీసికొనివచ్చువిషయ మాలోచించు చుండెను.

అక్కడ విడిసియున్న యాసేనను కిరాతకరాజగు గుహుడు చూచి తనబంధువులతో నిట్లు పలికెను. "ఈగొప్పసేన సముద్రము వలె గనిపించుచున్నది. ఆలోచింప దీనికంతము గనబడదు. అదిగో కోవిదార (ఎఱ్ఱకాంచనపుచెట్టు) ధ్వజముగలరథము. దానిపై గొప్ప శరీరముగల భరతుడే వచ్చెను. అతడు మనకిరాతులను కట్టివేయునో! లేక చంపునో! లేక గొప్పరాజ్యలక్ష్మినుండి తొలగింపబడి రాజ్యము నుండి వనమునకు బంపబడిన రాముని జంపుటకు నాతనియొద్దకు బోవు చున్నాడో! రాముడు నాకు ప్రభువు; స్నేహితుడు. అతనిప్రయోజ నముగోరి మీరందఱును గంగాతీరమున మాంసమును, ఫలములను, దుంపలను తినుచు మీబలములతో నక్కడనే సిద్ధముగ నుండుడు." ఇట్లు గుహుడు పలికి500పడవలను, నొక్కొకపడవకు100 మందిని పడ వనునడుపువాండ్రను నియమించెను.పిమ్మట గుహుడు 'భరతుడుతన బంధువులతో తనయన్నయగు రామునియెడ స్నేహభావమును జూపిన

యెడల నేమియునాపదబొందక గంగను దాటు' మని పలికి కానుకలను, మత్స్యమాంసములను, మద్యపానములను పట్టుకొని యాతనియొద్దకు వెళ్లెను. దీనిని సుమంత్రుడు చూచి వినయముగ భరతునితో 'ఇదుగో! దండకారణ్యములో కుశలముగ తిరుగగలిగిన కిరాతకప్రభువగు గుహుడు; మీయన్న స్నేహితుడు. వీనికి రామలక్ష్మణులుండుచోటు బాగుగ తెలియును. ఇతడు తనబంధువులందఱితోను వచ్చెను. వీనికి మీరు దర్శనమీయవలె'నని మనవిచేయ భరతుడు వానిని శీఘ్రముగ దీసికొనివచ్చుట కుత్తరువిచ్చెను. అప్పుడు కిరాతరాజు సంతోషించి తనబంధువులతో నాతనియొద్దకు బోయి వానికి నమస్కరించి పిమ్మట నిట్లు విన్నవించెను. 'ఈ దేశమంతయు మీయధీనమే. మీ రాక మాకు దెలిసియుండలేదు. మేమందఱము మీభృత్యులమే. మీరు సుఖముగనుండుడు. ఈకిరాతులు తెచ్చిన ఫలములు, దుంపలు, పచ్చిమాంసము, ఎండుమాంసము మొదలగు వానిని మీసేన భుజించును. ఈరాత్రి మీరిక్కడనే నిలిచి తగిన మర్యాదలను బొంది రేపటిదినమున వెళ్ళవచ్చును.' ఇట్లాకిరాతకరాజు మనవిచేయ గొప్పబుద్ధిశాలియగు 'నాయన్నసఖుడా! నీవిట్లు సేనను సత్కరింపగోరిన నట్లే కానిమ్ము. ఈగంగాతీరమున నడవి దట్టముగ నున్నది. ఇందు భరద్వాజాశ్రమమునకు బోవుత్రోవ యేది?' యని వానినడిగెను. దానికి గుహుడు భరతునికి నమస్కరించి యాతనితో 'నాకిరాతకులు ధనస్సులను బట్టుకొని మీవెంట వచ్చెదరు. నేనుకూడ మీతోనుండెదను. ఒకరి కపకారము చేయని రాముని యొద్దకు మీరు దుర్మార్గపుబుద్ధితో బోవుచుండుట లేదుగదా? ఈ గొప్పసేనను జూచిన నాకనుమానము కలుగుచున్న'దని పలికెను. ఈ మాటల కాతడు స్పష్టమగువాక్యములతో నిట్లు సెలవిచ్చెను. 'నా యన్నయగు రాముడు నాతండ్రితో సమానుడు. వనవాసమునుండి

యాతనిమాఆలించుటకు నేను వెళ్ళుచున్నాను. నావిషయమున నీవనుమా నింపగూడదు. ఆతనికి కష్టమేమియు సంభవింపదు. నీమనస్సున మఱి యొకవిధమున నాలోచింప నక్కఱలేదు. నీతో నిజము పలుకుచున్నాను.' భరతునియీమాటలకు గుహుడు సంతోషముగల ముఖముతో తిరుగ నిట్లనెను. 'ప్రయత్నము లేకవచ్చిన రాజ్యమును మీరిచ్చివేయుచున్నారు. భూలోకమున మీతో సమానుని నే జూడను. మీరు ధన్యులరు. కష్టమునొందిన మీయన్నను మీరు తీసికొని రా గోరుచున్నారు. మీకీర్తి యన్నిలోకములందు శాశ్వతముగ జరించును.' ఇట్లు కిరాతకరాజు పలుకుసరికి సూర్యుడస్తమించ రాత్రియయ్యెను. వానిమాటలకు భరతుడు సంతోషించి తానును, శత్రుఘ్నుడును సేనను తగినచోట్లనుంచి రాముడు నిద్రించుచోటికి వెళ్ళిరి. ఆ రాత్రి యాతనికి తన యన్నవిషయమై విచారముకలుగ మనస్సులో దుఃఖ మెక్కువై శరీరమునుండి వేడియు, చెమటయు పుట్టెను. భరతుడు రామునే ధ్యానించుచు నిట్టూర్పుదీయుచు దైన్యము, శోకము, నాయాసము, మిక్కిలిదుఃఖము నొందెను. అతనిమనస్సున కేమియు శాంతి కలుగకుండెను.

తరువాత గుహుడు భరతునిపక్కకుబోయి విచారముతో నాతనికి రాముడచటికి వచ్చి జరిపినసంగతులను, లక్ష్మణు డాతని గూర్చి చెప్పినప్రసంగమును దెలిపి వారు వచ్చినమఱునాడే వారు జటలుకట్టుకొని బయలుదేఱిరనియు, తాను వారిని గంగను దాటించెననియు జెప్పెను. సుకుమారుడును, గొప్పబలశాలియు, ప్రియముగ గనబడువాడునునగు నాతడీ విపరీతపుసంగతులు విని యాలోచించి మిక్కిలి విచారమునొంది మూపెరిదియందు నంకుశముచే బొడవబడిన యేనుగువలె భూమియందు బడెను. దగ్గఱనున్న శత్రుఘ్ను డాతని గౌగిలించుకొని యెక్కి విచారముచే మూర్ఛబోయెను.

తరువాత నుపవాసముచే కృశించినవారును, భర్తృవియోగముచే విచారమునొందినవారునునగు వారితల్లులందఱు వారిదగ్గఱకు వచ్చి యేడ్చిరి. కౌసల్యకూడ వారిదగ్గఱకు వచ్చి గొప్పవిచారముతో భరతుని కౌగిలించుకొని యేడ్చుచు నిట్లు విలపించెను. 'నాయనా! నీశరీరము నేరోగము బాధించుటలేదుగదా? ఇప్పుడు రాజకులములోని వారిప్రాణములన్నియు నీయధీనమునను న్నవి. నీయన్న వనవాసమునకేగ, నీతండ్రి స్వర్గస్థుడు కాగ నేను నిన్ను జూచి జీవించియున్నాను. నీవే యాకిప్పుడు దిక్కు. లక్ష్మణునిగుఱించి కాని, సీతారాములగుఱించి కాని యేమైనను విప్రియమగుసంగతి వినియుంటివా?' ఈవిలాపములను భరతుడు విని యొకగడియకు నిట్టూర్పుదీయుచు నేడ్చుచు 'అట్టిదేదియు జరుగలే' దని యామె నోదార్చి గుహుని 'సీతారామలక్ష్మణు లెక్కడ శయనించిరి? ఏమి భుజించిరి?' అని యడుగ వాడు జరిగినదంతయు వానికి దెలిపెను. తరువాత భరతుడును, నతనితల్లులును, మంత్రులును రాముడు శయనించిన యింగుదీచెట్టు మొదటికి వెళ్ళి చూచిరి. అక్కడ భరతుడు తనతల్లులకు తనయన్న యారాత్రి భూమియందు శయనించినచోటు చూపి సుమంత్రు డయోధ్యకు తిరుగవచ్చినప్పుడు దశరథుడును, కౌసల్యయు సీతారాములగూర్చి విచారించినట్లు యెక్కువగ శోకించెను. తరువాత భరతు డింకను నిట్లు ప్రసంగించెను. "రాముడు తృణశయ్యను నిద్రించెననుట నమ్మదగినదికాదు. అది నిజముగ దోచుటలేదు. నేను తప్పుగ నాలోచించుచున్నాను. ఇది స్వప్నముగ నాబుద్ధికి దోచుచున్నది. నాయన్న యిక్కడ శయనించుటనుబట్టి కాలముకంటె దైవబల మెక్కువైనదికాదని నాకు తోచుచున్నది. ఈకఠిన భూమియందు ప్రతము శయనించుటచే గడ్డియంతయు నలిగిపోయినది. ఈపక్కయందు సీత నిదురించుటచే నిక్కడ నామెబంగారువస్త్రముల

చిన్నపూసలు రాలినవి. ఆమెచీరనుండి పచ్చనిదారములు రాలి యున్నవి. అయ్యో! నేను క్రూరుడను. నన్నుగుఱించి సీతారాము లిట్టిపక్కలపై నిద్రింపవలసివచ్చెను. రాముడు చక్రవర్తికుటుంబములో జన్మించి యన్నిలోకములకు ప్రియుడై, యందఱికి నిష్టుడై సుఖమగు రాజ్యమును విడిచి భూమియందెట్లు శయనించెను? కష్టకాలములో గూడ నాతనినివిడువనిశుభలక్షణుడగు లక్ష్మణుడు ధన్యుడు. తనభర్తతో నడవికి వెళ్ళిన సీతయు తనకోరికను నెఱవేర్చుకొనెను. ఆతనిని విడిచిన మాయదృష్ట మెట్లుండునో తెలియదు. అతడు వనమునయుండ, దశరథుడు మరణమునొంద కోసలరాజ్యము నాథుడులేనిదై యున్నది. రాముడు వనములోనున్నను వాని బాహుబలముచే రక్షింపబడు నీరాజ్యమును శత్రువులెవ్వరు మనస్సులోగూడ కోరరు. ఇప్పుడు ప్రాకారరక్షకులులేనట్టియు, తెఱవబడినపురద్వారములుగలిగినట్టియు సంతోషములేని సైన్యముకలిగినట్టియు, నాపదనొందినట్టి మా యయోధ్యపై శత్రువులు దండెత్తరు. ఈదినమునుండి నేను భూమి యందుగాని, గడ్డిమీదగాని శయనించి ఫలములను, దుంపలను దిని జటలను, నారచీరలను ధరించి యుండెదను. రామునిప్రతిజ్ఞను నాయం దుంచుకొని యాతనికి బదులుగ 14 సంవత్సరములు నేనును, శత్రుఘ్నుడును వనమున నివసించెదము. అందుచే నాతనిప్రతిజ్ఞ యబద్ధము కాదు. రామలక్ష్మణులు రాజ్యమును బరిపాలించెదరు. బ్రాహ్మణు లతని నభిషేకింతురుగాక! దేవతలు నాయభీష్టమును నెఱవేర్తురుగాక! నేను స్వయముగ నెన్నివిధములచెప్పినను రాముడు వినకపోయినచో నేనుకూడ నాతనితో వనమున నుండెదను. అతడు నన్నుపేక్షింపడు." ఇట్లు భరతుడు పలుకుచుండ రాత్రియయ్యెను.

ఆమఱునాటియుదయమున భరతుడు వేగముగలేచి 'శత్రుఘ్నా! తమ్ముడా. శీఘ్రముగ గుహుని దీసికొనిరమ్ము. నేననతడు గంగానదిని

దాటించు'మనిపలుక నతడు 'నేను నిద్రింపలేదు. రామునిగూర్చి యాలోచించుచు తెలివిగనున్నా'నని బదులుచెప్పెను. అట్టి సమయమున కిరాతక రాజు వచ్చి 'మీరును, మీసేనయు రాత్రి సుఖముగ నుండిరా?' యని యడుగ భరతుడు 'మేము నీయాతిథ్యమున సుఖముగ నుంటిమి. చాల నావలను దెప్పించి మమ్ములను గంగను దాటింపవలె'నని గుహుని కోర వాడు తనపట్టణమునకు బోయి కిరాతకులతో 'మీరు నావలను జాగ్రత్తగ సిద్ధముచేయు'డని చెప్పవారట్లు 500నావలను సిద్ధముచేసిరి. ఇంకను వారు కవాటములు, కిటికీలు, గంటలు, జెండాలు, బాగుగనిర్మింపబడినగదులుగల నావలనుగూడ సిద్ధపఱచిరి. వానిలో నొకమంచినావకు తెల్లనిబట్టలు వ్రేలగట్టబడియుండ దానిలో భరతశత్రుఘ్నులును, వారితల్లులు మొదలగు రాజస్త్రీలును నెక్కిరి. ముందు పురోహితులును, గురువులును, బ్రాహ్మణులును నావలమీద వెళ్ళిరి. తరువాత దశరథుని యితర భార్యలు నావల నెక్కిరి. తరువాత సామానుబండ్ల నెక్కించిరి. నావికులు కొన్ని నావలలో నాడువారిని, కొన్నిటిలో వాహనములను, కొన్నిటిలో గుఱ్ఱములు, ఎడ్లు మొదలగు నితరజంతువులను, కొన్నిటిలో గొప్పధనమును నెక్కించి నదిని దాటించిరి. ఏనుగులు తమమావటీండ్రతో నీటిలోనీదునపుడు చిన్నపర్వతములవలె గనబడెను. కొందఱు తెప్పలపైని కొందఱు భుజములతోను నీదుకొనుచు గంగయావలిగట్టుచేరిరి. ఇట్లాసేన యానదిని దాటి రెండుగడియలలో ప్రయాగవనముచేరి యక్కడ విడిసెను. అప్పటికి నుదయ మూఁడుగడియల ప్రొద్దెక్కెను.

## ౧౫౪వ. అధ్యాయము.

## భరతాదులు భరద్వాజాశ్రమమున నివసించుట.



భరతుడు ప్రియాగవనమును జేరినతరువాత తనసేనను, మంత్రులను నచ్చటవిడిచి తెల్లనిబట్టలను కట్టుకొని ఋత్విజులను, పురోహితుని వెంటబెట్టుకొని క్రోసుదూరముననున్న భరద్వాజాశ్రమమునకు నడచివెళ్ళెను. ఆఋషి వసిష్ఠుని జూచి శీఘ్రముగ తనయాసనమునుండి లేచి తనశిష్యులకు నర్ఘ్యపాద్యములదెచ్చుట కాజ్ఞ ఇచ్చి యిక్ష్వాకులగురువును కలిసికొని భరతుడు తనకు నమస్కరింప వసిష్ఠునితో గూడవచ్చుటచే నాతని దశరథపుత్రునిగ తెలిసికొని వారిద్దఱికి నర్ఘ్యపాద్యములను, ఫలములను నిచ్చెను. తరువాత నాఋషి 'అయోధ్యలో బలము, ధనము, మిత్రులు,మంత్రులు సుఖముగనున్నారా?' యని భరతుని నడిగి దశరథుడు మృతినొందుటచే నాతనిసంగతి ప్రశ్నింపలేదు. వసిష్ఠభరతు లాఋషిని 'మీ కిచట సౌఖ్యముగనున్నదా? అగ్నిహోత్రములు నిర్విఘ్నముగ జరుగుచున్నవా? ఆశ్రమమున వృక్షములు, శిష్యులు, మృగములు, పక్షులు కుశలముగ నుండెనా?' యని యడుగ నాఋషి 'అట్లే'యని పలికి రామునియందలిస్నేహముచే భరతునితో నిట్లు ప్రసంగించెను. 'రాజ్యమును పరిపాలించు నీ విక్కడికి వచ్చుటకు కారణమేమి? నా మనస్సున కనుమానము కలుగుచున్నది. మీతండ్రి యాడుదాని మాటవిని మీయన్నను 14సంవత్సరములు వనమున నివసించుటకు బొమ్మన నాతడు తనభార్యతోను, తనతమ్మునితోను చిరకాలము డవి నుండుటకు వచ్చెను. నీవు శత్రువులులేకుండ రాజ్యమనుభవించు నుద్దేశముతో నేపాపమెఱుగని రామునికి నేమియు హానిచేయ గోరలేదు గదా! ఇదంతయు నాకు తెలియజేయుము.' ఋషి పలికినయీమాట

లకు భరతుడు కన్నీరుదెచ్చుకొని దుఃఖముతో నాఋషితో నిట్లు మనవిచేసెను. 'మీరట్లు తలచితిరేని నేను జీవించిన ప్రయోజనము లేదు. నాయందు దోషమును తలంపకుడు. మీరిట్టి కఠినోక్తు లాడ కూడదు. నేను లేనప్పుడు నాతల్లి చేసినదానికి నేనిష్టపడను. నేనట్లు జరుపను. నేను రాముని ప్రార్థించి యతనిపాదములబట్టి యయోధ్యకు నాతని దీసికొనివెళ్ళుటకు బయలుదేఱితిని. అతడుండుచోటు నాకు తెలియజేయగోరుచున్నాను.' ఇట్లు భరతుడు విన్నవింప వసిష్ఠాదులు గూడ నట్లేకోరిరి. దాని కాఋషి సంతోషించి "భరతా! నీవురఘు వంశస్థులకు దగినట్లు పలికితివి. జ్యేష్ఠానువర్తనము, ఇంద్రియనిగ్రహము, మంచివారినడవడిక నవలంబించుట వారికి ముఖ్యగుణములు. నేనంతయు దివ్యదృష్టినిజూచితిని. దానిని స్థిరపఱచుటకును, నీకీర్తి కను గొనుటకును నిన్నడిగితిని. ధర్మజ్ఞుడగు రాముడు సీతాలక్ష్మణులతో చిత్రకూటమహాపర్వతమునందు నివసించియున్నాడు. నీవీదినమిక్కడ మంత్రులతో నిలిచి రేపక్కడకు వెళ్ళవచ్చును. నాకోరికను నెఱవేర్పుము." ఇట్లు భరద్వాజుడుకోర భరతు డొప్పుకొని యారాత్రి యక్కడుండుటకు నిశ్చయించెను.

తరువాత నాభరతుడు ఋషితో 'మీ రర్ఘ్యపాద్యములను, వనములో దొరకు వస్తువుల నిచ్చి యాతిథ్యము జరిపియున్నా' రని పలుక ఋషి నవ్వి యిట్లు పలికెను. 'నీకేమిచ్చినను నీవు సంతోషించు వాడవని నిన్ను నేనెఱుగుదును. నీకును, నీసేనకును భోజనము పెట్టదలచియున్నాను. నాసంతోషము నెఱవేఱునటుల జరుపుము. నీవు సేనను దూరముననిలిపి వచ్చితివేల? సైన్యముతో నేల రాలేదు.' ఇట్లు ఋషి యడుగ భరతుడు 'మీయాశ్రమమునకు నష్టముకలుగు నను భయముచే నేను సేనతో రాలేదు. ఋషులుండు తావులకు రాజును, రాజపుత్రులును నెప్పుడును సైన్యముతో వెళ్ళగూడదు.

నాతో ననేకగుఱ్ఱములు, మనుష్యులు, మదించినయేనుగులుగల గొప్పసేన వచ్చినది. అది యిక్కడకు వచ్చినయెడల నాశ్రమము లోని నిర్మలోదకములకు, భూమికి, చెట్లకు, పర్ణశాలకు నష్టముచేయు నని నేనొక్కడనే వచ్చితి' నని మాఱు పలికెను. అంతట ఋషి 'యీసేనయంతయు నిచటికి రావలె' నని భరతుని గోరనత డట్లు చేసెను. తరువాత ఋషి తనయగ్నిగృహముజేరి యాచమనముచేసి శరీరమంతటను నీరుజల్లుకొని యాతిథ్యము జరుపుకొఱకై విశ్వకర్మను, నలుగురు దిక్పాలురను, నితర దేవతలను ప్రార్థించెను. ఇంకను నతడు లోకములో పూర్వపశ్చిమములుగ పాఱెడినదులను, మైరేయము (చెఱకురసములో దయారుచేసినమద్యము), మద్యముగల నదులను, సారాయిగల నదులను, తీయనినీరుగల నదులను రావలెనని ప్రార్థించెను. అతడు దేవతలలో గానవిశారదులగు విశ్వావసు హాహా హూహూలను గంధర్వులను, దేవగంధర్వజాతులయప్సరసలను, ఘృతాచి, విశ్వాచి, మిశ్రకేశి, అలంబుస, నాగదంత, హేమ మొదలగు నప్సరసలను, నింద్రలోకములోను, బ్రహ్మలోకములోనునుండు నప్సరసలను, తుంబురుడనువానిని, గంధర్వులను వారివాద్యవిశేషములతోగూడ నాహ్వానముచేసెను. చెట్లయాకులనెడి నగలు, బట్టలుగల యుత్తరకురుదేశమందలి వనముచ్చటికి దీసికొనిరావలెనని కుబేరుని, అనేకరకములయన్నములను, చెట్లవలనగలుగు సుగంధములను,*వివిధ మద్యములను, వివిధమాంసములను కల్పింపవలెనని చంద్రుని నాఋషి వేడెను. ఇట్లు గొప్పతేజోవంతుడగు భరద్వాజుడు సమాధియందు నిలిచి విధ్యుక్తస్వరముతో తూర్పుదిక్కున కెదురుగనిలిచియుండ వారందఱు వచ్చి నిలిచిరి. వాయువు చందనపువాసనలతో దూరమునుండి యందఱికి సుఖముకలుగునటుల వీచెను. మేఘములు

* 13వ. ప్రకరణము. ౨౫ వ. అధ్యాయము భోజనమద్యములు చూడుము.

పుష్పవర్షము కురిపించెను.అన్నిదిక్కులనుండి దేవదుందుభులశబ్దము విన బడెను. అప్సరస లాడిరి. దేవగంధర్వులు పాడిరి. వీణస్వరములు విన బడెను. సరియగు లయతోగూడిన యాపాటలన్నియు స్వర్గమర్త్య లోకములవారికి మిక్కిలి యింపుగ నుండెను. అక్కడ విశ్వకర్మచే 20 క్రోసులు వరకునున్న దేశమంతయు సమతలముగ జేయబడి లేత పచ్చికతో నిండియుండెను. దానిలో మారేడు, వెలగ, పనస, కమల, మామిడి, మొదలగు చెట్లు ఫలములతోనిండి కుబేరునివనముకంటె నెక్కువగనుండెను. అక్కడ పెద్దనది యిరుప్రక్కలచెట్లతో ప్రకా శించెను. అక్కడ గుఱ్ఱములకును, ఏనుగులకును మంచి సాలలును, నాలుగిళ్ళభవంతులు,మంచిమేడలు, బహిర్ద్వారములుగల మంచిరాజ నగ రొకటియు నిర్మింపబడెను. అందు మంచిసుగంధపువాసనలును, మంచియాసనములును, పక్కలును, వాహనములును, చక్కెరమొద లగు నన్నిరసములును, నన్నిరకముల భోజనములును, వస్త్రములును నుండెను.

ఆఋషి భరతుని, దానిలో ప్రవేశింపగోర నతడు తనమంత్రు లతోను, పురోహితులతోను నందు బ్రవేశించి యానగరుసౌందర్యము నకు సంతోషించెను. అక్కడొక రాజసింహాసనమును, గొడుగును, వింజామరయునుండ నక్కడ రాముడున్నట్లతడు భావించి వానికి ప్రదక్షిణముచేసి వింజామరతో విసరి మంత్రులుకూర్చుండు నాస నమున గూర్చుండెను. అతని ననుసరించి మంత్రి, పురోహితులును, తరువాత సేనాధిపతియు, నగరవ్యవహారస్థుడును వారివారియాస నముల గూర్చుండిరి. అప్పుడు వనమున నొకగడియలో మంచినీటి నదులు పాఱెను. వానికిరుప్రక్కల తెల్లనియిండ్లు కనబడెను. మంచి యాభరణములుగల బ్రహ్మలోకములోని 20,000 అప్సరసలును, కుబేరలోకములోని 20,000 అప్సరసలును, నిందప్రలోకములోని

20,000 అప్సరసలును భరతునియెదుటకు వచ్చి నిలిచిరి. ఇంకను నారదుడు, తుంబురుడు మొదలగు గంధర్వశ్రేష్ఠులు వచ్చిరి. అలంబుస మిశ్రకేశి, పుండరీక, వామన యనెడు నప్సరసముఖ్యలు నృత్యము చేసిరి. స్వర్గలోకమునందు సుగంధవస్తువు లక్కడ నుండెను. అక్కడ వృక్షములన్నియు స్త్రీరూపములతో నాతిథ్యముజరుపుచు 'భుజింపుడు; త్రాగు'డని యక్కడవారలకు సంతోషము కలిగించెను. నదీతీరములందు పండ్లుతోను తెల్లనిపుల్లలును, కషాయదినుసులతో నీళ్ళబిందెలును నుండెను. ఒక్కొక్కనిదగ్గఱకు 7, 8, అప్సరసలుచేరి వానిని నదీతీరములస్నానముచేయించుచు వానినలంకరించుచు వాని పాదములనొత్తుచు వానిచే మద్యముల త్రాగించిరి. అక్కడ మంచి చందనపుగంధములును, పాంకోళ్లును, చెప్పులజోళ్లును, కాటుకబరణి లును, తలదువ్వెనలు మొదలగువస్తువులును నుండెను. మేక, అడవి పంది, లేడి, నెమలి, కోడి మొదలగువాని మాంసములను, పండ్లు, పంచదార మొదలగు రసములను, పప్పుదినుసులను, తెల్లనియన్న రాశులను బంగారుపాత్రలతో వడ్డించిరి. పాయసపునూతులనుండి పాయసమునువడ్డించిరి. ఆవులు కావలసినన్ని పాల నిచ్చెను. చెట్లనుండి త్రాగుటకు మద్యముకారెను. మైరేయమద్యములు కుండలతో నుండెను. కుండలతో మంచి పెరుగు, జీలకఱ్ఱ, శొంఠి, పిప్పలి, మిరి యము, పంచదార మొదలగునవి కలిసినమజ్జిగ వడ్డించిరి. ఏనుగుల కును, గుఱ్ఱములకును, నొంటెలకును, కంచరగాడిదలకును కావలి వాండ్రు తగినతిండి పెట్టించిరి. వారు చెఱకుగడలను, పేలాలను, మద్యములను సేవించి మత్తులైరి. సైనికులంద అప్సరసలతో సంతో షముగ విహరించి 'మే మయోధ్యకు వెళ్ళము; దండకావనమునకు వెళ్ళము; రామునికి, భరతునకు కుశలమగుగాక!' యని మైమఱచి మాటలాడిరి. వారు 'ఇదియేస్వర్గ'మని గంతులు వేసి నవ్వుచు,

పాడుచు, పరుగెత్తుచు కేకలు వేసిరి. భోజనవస్తువులు మిక్కిలి రుచిగ నుండుటచే వారు వానిని తినుటయందే మతిగలిగియుండిరి. సేనతో వచ్చిన సేవకులకును, దాసీలకును, సైనికులభార్యలకును, నందఱికిని, భరద్వాజుడు బట్టలనిచ్చెను. సేన, యేనుగులుకూడ మిక్కిలిసంతోషముగ నుండెను. ఈతీరున కలలోనివిషయమువలె నద్భుతముగ నాఋషి భరతునికి నాతిథ్యముజరుప నారాత్రి యాతడును, నతని మంత్రిపురోహితులును సేనతో సుఖముగ నుండిరి. తెల్లవాఱునరికి నదులును, గంధర్వులును, నప్సరసలును నాఋషివద్ద సెలవు పుచ్చుకొని తమతమ నివాసస్థానముల కేగిరి.

ఆమఱునాటియుదయమున భరతుడు రాముని యొద్దకు బోవగోరి యగ్నిహోత్రము జేయుచున్న భరద్వాజమహర్షిని సమీపించి వానికి నమస్కరింప నతడు 'నిన్నటిరాత్రి నీవును, నీపరివారమును మాయాశ్రమములో సుఖముగ నుంటిరా?' యని వాని నడిగెను. అంతట నాశ్రమమునుండి పైకివచ్చిన యాఋషికి నమస్కరించుచు 'నేనును, నామంత్రులును, బలవాహనములును బాగుగ భుజించి యన్నికోర్కెల దీర్చుకొంటిమి. నేను నాయన్నయొద్దకు వెళ్ళగోరుచున్నాను. ధార్మికుడగు నామహాత్ముడెక్కడ నెంతదూరమున నాశ్రమము నేర్పఱచుకొనెనో దానికి మార్గమెట్లో మీరు దయతో దెలుపవలెనని వానిని గోరెను. దానికి మహాతేజోవంతుడును, గొప్పతపశ్శాలియునగు నాఋషి యతనికి నిట్లు దెలిపెను. 'ఇక్కడకు 10 క్రోసులదూరమున చిత్రకూటమను పర్వతము గలదు. దానియుత్తరమున మందాకినియను నది ప్రవహించుచున్నది. ఆరెండిటికిని మధ్యను సీతారామలక్ష్మణులు పర్ణశాలను గట్టుకొని నివసించుచున్నారు. మీరు మొదట దక్షిణమార్గమున బోయి తరువాత దక్షిణపశ్చిమ దిక్కుల మధ్యగ వెళ్ళిన రాముని జూచెదరు.' ఇట్లు ఋషి తెలుప

భరతుడు, వానిపరివారము ప్రయాణమగుచున్నట్లు దశరథునిభార్యలు తెలిసికొని తమవాహనములనుండి దిగి మునివద్దకు వెళ్ళిరి. కృశించినదియు, వణకుచున్నదియు, దీనురాలునునగు కౌసల్యయు, సుమిత్రయు ఋషిపాదములజట్టి నమస్కరించిరి. నెఱవేఱనికోర్కెగలదియు, లోకమున నపకీర్తి బొందినదియు గు కైకేయికూడ సిగ్గుతో మునిపాదములబట్టి విచారముతో నిలిచెను. తరువాత ఋషి యాతనిని 'ఈ నీతల్లులను నామములతో గూడ నాకెఱుకపఱుపు'మని యడుగనతడు 'దీనురాలును, విచారముచే భోజనముచేయక క్షీణించినదియు, నదితి విష్ణువునువలె రాముని కనినదియునగు నీమె కౌసల్య. విచారముతో నామెయెడమభుజమును బట్టుకొనినదియు, సత్యపరాక్రమములును, దేవతుల్యులునునగు లక్ష్మణశత్రుఘ్నుల తల్లియునగు నీమెసుమిత్ర. రామలక్ష్మణులను భయంకరమగు దండకావనమునకు బంపినదియు, పుత్రవియోగముగలిగించి దశరథుని లోకాంతరమునకు బంపినదియు, నాకు గొప్పవిచారమును కలుగజేసినదియునగు నీమె నాతల్లియగు కైకేయి.' యని వానికి దెలిపి విచారముచే కంఠము బొంగుపడ నిట్టూర్పు దీసెను. మంచిబుద్ధిమంతుడగు నాఋషి యీసంగతులను విని 'కైకేయి దోషము చేసినదని నీ వామెను నవమానింపవలదు. రాముని వనవాసమువలన సుఖముకలుగును. దేవతలకును, దానవులకును, భవిష్యద్విషయములు తెలియు ఋషులకును, నది హితమైనదగు'నని సెలవీయ నాతడాఋషికి నమస్కరించి ప్రదక్షిణము చేసి వానివలన నాశీర్వచనముల బొంది సెలవు పుచ్చుకొని తన సైన్యమునకు వెళ్ళుట కుత్తరువిచ్చెను. అంత నందఱును బయలుదేఱిరి. దశరథునిభార్యలు రామునిజూచు వేడుకతో మంచివాహనముల నెక్కి సంతోషముతో వెడలిరి. భరతుడు మంచిసవారియెక్కెను. సేనయంతయు దక్షిణదిక్కునకు బోయి యమునానదిపశ్చిమతీరమున నడచుచు కొండలను, నదులను దాటుచుబోయెను.



## ౯౬. వ అధ్యాయము.

## చిత్రకూటమున భరతాదులు రామునిగలియుట.



భరద్వాజాశ్రమమునుండి భరతుని, వాని సేననుగుహుడు తనవేయిమంది బంధువులతో చిత్రకూటమునకు తీసికొనివెళ్ళునపు డడవిలో సైన్యముచే హింసనొందిన మృగశ్రేష్ఠములును, నెలుగు బంట్లును, లేళ్ళును లేచి పరుగులెత్తుచుండెను. వారు చాలదూరము వెళ్ళినతరువాత భరతునకు చిత్రకూటపర్వతము, మందాకినీనది, వానిమధ్యనుండువనము గనబడెను. అప్పు డతడు వసిష్ఠునితోను, శత్రుఘ్నునితోను 'ఈదేశమిప్పు డయోధ్యవలె ప్రజలతో నిండియు న్నది. మనసైన్యములోని మంచిసైనికులు రామలక్ష్మణులను వెతుక వలె' నని పలుక కొందఱు సైనికులు శస్త్రములను ధరించి వనమునకు బోయి యొకచో పొగనుజూచి యాతనియొద్దకు వచ్చి 'మనుష్యులు లేనిచోట నగ్నియుండదు. రామలక్ష్మణు లిక్కడుండుట స్పష్టము. వారులేకపోయినను రామునివంటితపశ్శాలురైననుందు' రని మనవి చేసిరి. అంతట నాతడు సైన్యమంతయు నక్కడనిలుచుట కాజ్ఞాపించి గురువగువసిష్ఠునితోను, సుమంత్రునితోను పొగకనిపించు ప్రదేశ మునకు బయలుదేఱెను.

అప్పటికి సీతారాములు చిత్రకూటమున నొకమాసము నివ సించి సంతోషముగ విహరించిరి. రాముడక్కడ చిరకాలము నిలిచి తనతండ్రియాజ్ఞ నెఱవేర్చుటకును, భరతునికి నిష్టము కలుగజేయు టకును కోరియుండెను. పూర్వము రాజర్షులు రాజ్యభారమును విడిచి వానప్రస్థమున నిలిచి గొప్పలోకములబొందిరి. రాముడు చిత్రకూట మందాకినుల జూచుచు, తనభార్యముఖావలోకనము జేయుచు, తన తమ్ముని సేవల గ్రహించుచు నయోధ్యావాసమునకంటె నెక్కువ

సుఖముననుభవించుచుండెను. అతడు మందాకినీనదిలో నామెతో జలక్రీడలసలుపుచు త్రికాలముల స్నానముచేసి తేనె, ఫలములు, దుంపలు మొదలగువానిని దిని జీవించుచుండెను. అతడు కొండచరియ లందు నిలిచి లేడిమాంసము తెచ్చి పచ్చిది కొంత భుజించి కొంత యామె కిచ్చుచుండెను. కొంతయగ్నిలో వండించి తాను తిని 'ఇది తీయగ నున్నది; తిను' మని కొంతయామె కిచ్చుచుండెను. ఈతీరున వారక్కడ నివసించుచుండిరి.

అట్టిసమయమున భరతుని సేనసంబంధమగుదుమ్మును, శబ్ద మును రాముడు కనిపెట్టెను. ఆధ్వనిచే శ్రీఘ్రముగు జంతువులుకూడ పరుగు లెత్తుచుండెను. వానినాతడు చూచి లక్ష్మణునకిట్లు సెలవి చ్చెను. 'మేఘగంభీరధ్వనివంటిశబ్దము వినబడుచున్నది. సింహములకు భయపడి పరుగెత్తున ట్లేనుగులును, దున్నపోతులును, మృగములును పరుగులెత్తుచున్నవి. ఎవడైన రాజుగాని, యట్టివాడింకొకడుగాని వన మున వేటకై తిరుగుచున్నాడు. లేనియెడల పెద్దపులి మృగములను వెం టాడుచున్నది. ఈపర్వతమునకుపక్షులుకూడవచ్చుటకష్టము. ఏమిజరుగు చున్నదో నిజస్థితి వేగముగ నాకుదెలుపుము.' ఇట్లు రాముడు సెలవీయ లక్ష్మణు డొక పెద్దగుగ్గిలపుమ్రానెక్కి నలుదిక్కుల జూచి తూర్పు వైపునకు తనదృష్టిని ప్రసరింపజేసి తరువాత నుత్తరమువైపు చూచి యక్కడ గొప్పసేనయుండుట కనిపెట్టెను. ఆసంగతి నతడు తన యన్నకు దెలిపి 'అగ్నిహోత్రముల జల్లార్చి సీతను గుహలోనికి బంపి కవచముల దొడుగుకొని ధనస్సును, బాణములను సిద్ధపఱుపు' మని చెప్పెను. దానికి రాముడు 'అది యెవరిసేనయో తెలుపు' మన లక్ష్మణుడు దానిని జూచి మిక్కిలికోపించి "భరతుడు రాజ్యాభి షిక్తుడై రాజ్యమును శత్రురహితముగ ననుభవింపగోరి మనలను జంపుటకు వచ్చుచున్నాడు. అదిగో! వానిరథమున కోవిదార (ఎఱ్ఱ

కాంచనపుచెట్టు) చిహ్నముగలజెండా. వానివెంటగుఱ్ఱపురౌతులును, నేనుగుమీాదస్వారిచేయువారును వచ్చుచున్నారు. మనము ధనస్సులనుబట్టి కొండప్రక్కనిలుచుండెదము. లేక యిక్కడనే యుండి యాయుధములబట్టి యుద్ధసన్నద్ధులమై యుండెదము. భరతుడు మనకు లొంగిపోడా? వానిమూాలముననే మీారును, నేనును, సీతయు గొప్ప కష్టములపాలైతిమి. వానివల్లనే మీారు శాశ్వతమగు రాజ్యమును గోలుపోయిరి. కనుక వానిని నేను వధింతును. అపకారముచేసినవానిని వధించుట యధర్మము కాదు. మీాకు పూర్వ మపకారముచేసిన వాడును, ధర్మమువిడిచినవాడునునగు వానిని నేను వధింప మీారు దేశమునంతను పాలింపుడు. తనపుత్రుడు యుద్ధమున మరణింప రాజ్యముకోరినకైకేయి మిక్కిలిదుఃఖమునొందును. ఆమెను, నామె బంధువులనుగూడ నేను జంపెదను. ఈదినమున భూమి పాపభారమును విడుచుగాక! మనకు జరిగినయవమానమునకు దగినక్రోధకృత్యములను నేను వారికి జరిపెదను. నేను వాడిశరములచే శత్రుశరీరములగూల్చి చిత్రకూటవనమును నేను రక్తమయముగ జేసెదను. నేను చంపినయేనుగులను, గుఱ్ఱములను, మనుష్యులను వనమునందలి క్రూరజంతువులు తినుగాక! భరతుని, వానిసైన్యమును జంపి నాధనస్సునకు, బాణములకు నేను ఋణము తీర్చుకొందు"నని తన యన్నకు విన్నవించెను.

ఈమాటలను విని రాముడు వానితో నిట్లనెను. "మిక్కిలి బుద్ధిమంతుడును, బాణములను విడుచుటలో నేర్పరియునగు భరతుడు మనయొద్దకు వచ్చినయెడల నీవు ధనస్సును, కత్తిని నుపయోగించుట యెందులకు? నేను నాతండ్రిప్రతిజ్ఞకు భంగముకలిగించి యిక్కడకు వచ్చినభరతుని జంపి యపవాదు బొందినయెడల నాకు రాజ్యము వలన నేమిలాభము? బంధువులయొక్కయు, స్నేహితులయొక్కయు

నాశనమువలనగలుగు సిరిని నేను గ్రహింపను. నేను ధర్మముగ జరించుటయు, కామములను, భూమిని గోరుటయు మీయన్నదమ్ముల కొఱకే యని నీవు తెలిసికొనుము. మీ రనుభవించుకొఱకును, సుఖముగనుండుటకును నేను రాజ్యమును సంపాదించువాడనని నా యాయుధములను బట్టి శపథముచేయుచున్నాను. చుట్టును సముద్రము గల యీభూమినంతయు నేను సంపాదింపగలనుగాని దానిని నేను కోరను. అధర్మముగ సర్వలోకాధిపత్యము గలయింద్రపదవిగూడ నాకక్కఱలేదు. మీయన్నదమ్ములను ముగ్గురనువిడిచినయెడల నాకు సుఖమేలేదు. నాప్రాణములకంటె నెక్కువయగు భరతుడు తనమేన మామయింటినుండి యయోధ్యకువచ్చి నేను సీతతోను, సీతతోను వనవాసము వెళ్ళి జటలను, నారచీరలను ధరించితినని విని కులధర్మము నాలోచించుచు నాయందలి స్నేహముచే మిక్కిలివిచారమునొంది నన్ను జూడవచ్చును. మఱేకారణముకాదని నేనాలోచించెదను. వాడు కైకేయిని నిందించి మనతండ్రిమనస్సునంతోషపఱచి నాకు రాజ్యమిచ్చుటకు వచ్చెను. కాని మనకేవిషయమునైన మనస్సులోనైనను కీడు తలంపడు. ఇట్టిభయముకలుగుటకు నీ కేమైన వా డెగ్గుచేసి యుండెనా? నీవు వానిని గుఱించికఠినపుమాటలనుగాని, విప్రియపు మాటలనుగాని యాడకూడదు. ఆలాగుచేసినచో నీవు నాకు నప్రియుడ వగుదువు. పుత్రులుతమతండ్రిని నెట్టియాపదలోనైన నెట్లుజంపగలరు? తనప్రాణముతో సమానమగు నన్నదమ్ములను తోడబుట్టినవా డెట్లు చంపును? నీవు రాజ్యమునకై యిట్లు పలికితివేని దానిని నీకిమ్మని భరతునితో జెప్పెదను. వాడందుల కంగీకరించును.” ధర్మయుక్తము లగు రాముని యీమాటలను విని లక్ష్మణుడు మిక్కిలి సిగ్గునొంది ‘నిన్ను జూచుటకు మనతండ్రి స్వయముగ వచ్చెనని తలచెద’నని పలుక రాముడిట్లనెను. ‘సుఖముల ననుభవింపదగిన మనముగ్గురివన

వాసమునకు జింతించి మనలను నడవినుండి యయోధ్యకు తీసికొని పోవుటకు మనతండ్రివచ్చెను. అతనిరథమునకు మంచిగుఱ్ఱములు కట్టబడినవి. ఆతనిముందు శత్రుంజయమను పెద్దయేనుగు వచ్చుచున్నది. కాని యాతని పెద్దగొడుగు కానరానందున నాకనుమానముకలుగుచున్నది. లక్ష్మణా! నీవు చెట్టుదిగి నేను చెప్పినట్లు చేయుము.' ఇట్లు రాముడు సెలవీయ వాడట్లు చేసి చేతులుజోడించుకొని యాతని ప్రక్కను నిలిచెను.

భరతుడు చిత్రకూటపర్వతముప్రక్కను 6 క్రోసులదూరమున సేనను నిలిపి సందడిచేయకుండ ధర్మమార్గమున నుండునట్లు దానిని నియమించి తనయన్నయొద్దకు కాలినడకను వెళ్ళుటకు నిశ్చయించి శత్రుఘ్నునితో నిట్లనెను. "గుహుని వానివేయుమంది బంధువులను వనములో రామలక్ష్మణులయాశ్రమమును వెతకుటకు బంపుము. నేను గురువులతోను, మంత్రులతోను, నయోధ్యావాసులతోను నడచివెళ్లెదను. నేను సీతారామలక్ష్మణులను జూచువఱకును, రాజచిహ్నములుగల రామునిపాదములకు నమస్కరించువఱకును, నతడు తనపూర్వుల రాజ్యమున పట్టాభిషిక్తుడగువఱకును నామనస్సునకు శాంతి కలుగదు. ఆతనినిర్మలముఖచంద్రుని జూచులక్ష్మణుడదృష్టవంతుడు. జగత్తునకు ప్రభువును, తనకు భర్తయునగు రాముని ననుసరించివెళ్ళిన సీత మంచిభాగ్యవంతురాలు. కుబేరుడు నందనవనమునం దుండునట్లు రాముడీగొప్పపర్వతమందు నివసించుటచే నీచిత్రకూటపర్వతముగూడ గొప్పభాగ్యముకలదియైనది. క్రూరసర్పములు మొదలగునవికల యీగొప్పవనమునం దాతడు కాపురముండుటచే నీవనము పవిత్రతనొందెను." ఇట్లు పలికి భరతు డడవినిప్రవేశించి కొండచరియలలో పుష్పించినచెట్లను దాటుచు రామాశ్రమమునందలి పొగను కొంతదూరమునుండి చూచి పారవశ్యమును జెంది కష్టము

లంతమయ్యెనని సంతోషించెను. అతడు రామాశ్రమమును వెతకు చున్నవారి నక్కడ నిలిపి తనకులగురువుతో 'నాతల్లులను దీసికొని రం' డని చెప్పి ముందు తానును తరువాత శత్రుఘ్న సుమంత్ర గుహులును సంతోషముతో వెళ్లుచుండ వారికి నాశ్రమము దగ్గఱగ గనబడెను. అక్కడ చెట్లకు నారచీరలు కట్టబడియుండెను. చెట్లపై నక్కడక్కడ కుశలుగూడ నుండెను. అక్కడ లేళ్ళయొక్కయు, దున్న పోతులయొక్కయు పేడతో తయ్యారైన పిడకలు శీతకాలమున నుప యోగించుటకు నిలువచేయబడియుండెను. భరతుడు నడచుచు తన తమ్మునితోను, మంత్రులతోను, నిట్లు ప్రసంగించెను. "భరద్వాజుడు మనతో జెప్పిన దేశమునకు మనము వచ్చితిమనియు, నిక్కడకు సమీపమున మందాకినీనది యున్నదనియు నేనాలోచించెదను. లక్ష్మ ణుడు సాయంసమయమున ఫలమూలాదుల దెచ్చుటకు వెళ్ళి చెట్లకు పైని గుర్తునిమిత్తము నారచీరలను గట్టినందున నిదియే పర్ణశాలకు త్రోవయని తోచుచున్నది. ఇక్కడ మదించినయేనుగులు సంచరిం చును. తపశ్శాలు రెల్లప్పుడు వనములో నుపాశించు నగ్నిహోత్ర మునుండి నల్లనిపొగ బయలువెడలుచున్నది. అక్కడ నేను పూజ్యు డును, నరశ్రేష్ఠుడును, కర్మశ్రేష్ఠుడును, ఋషితుల్యుడునునగు రాముని జూచెదను." ఇట్లు భరతుడు సంతోషముతో బలుకుచు వారందఱితో కొంచెముదూరము వెళ్ళి మందాకినీనదిని దాటెను. తరు వాత భరతు డిట్లు విలపించెను. "అయ్యో! జనవిభు డీనిర్జనమగు నడవిలో వీరాసనమున నున్నాడు. ఛీ! నాబ్రతుకెందుకు? 'నామూలా ముననే యీలోకనాథు డన్నికోర్కెలను విడిచి వనమున కష్టముల బొందుచు నివసించుచున్నా' డను నపకీర్తినిబొందిన నేను దానిని బోగొట్టుకొనుటకు సీతారామలక్ష్మణుల పాదములపై బడి ప్రార్థించె దను." ఇట్లు భరతుడు విలపించుచు రామునిపర్ణశాలను జూచెను.

ఆపర్ణశాల గుగ్గిలము మొదలగు చెట్లయాకులతో నేయబడియుం డెను. అం దక్కడక్కడ దర్భలును, బంగారుపూతగల మంచిధనస్సులును, సూర్యకిరణములవలె మంచి తేజోవంతములగు బాణములుగల యమ్ములపొదులును, మంచిచర్మముతో తయారైన యొఱలుగల కత్తులును, ధనస్సుయొక్క నారివలన బాధకలుగకుండ వ్రేళ్ళను రక్షించు గోధ(ఉడుము)చర్మములును నుండెను. ఆపర్ణశాల శత్రువులు ప్రవేశించుట కశక్యముగ నుండెను. దానిలో నీశాన్యదిక్కున లోతుగ నొక హోమగుండమును, దానికొక వేదికయు నుండెను. భరతు డొకగడియ బాగుగనిదానించిచూచి యక్కడ జటలను, కృష్ణాజినమును, నారచీరలను ధరించిన యగ్ని తేజస్కుడును, లోక నాయకుడును, నగ్నిగుండముప్రక్కను దర్భలపై కూర్చున్నవాడును, బ్రహ్మవలె ప్రకాశించువాడునునగు రాముని జూచెను. ఆతనిప్రక్కను నాతనిభార్య, తమ్ముడు కూర్చుండిరి. వారినిజూచి భరతుడు మిక్కిలి విచారమునొంది వారియొద్దకు శీఘ్రముగ బోయి కన్నీరువిడిచి యేడ్చుచు దుఃఖమును బట్టలేక చివరకు ధైర్యమును దెచ్చుకొని గద్గదస్వరముతో విలపించుచు నతనితో నిట్లు పలికెను. 'రాజసభలో ప్రజలు కొలుచుచుండ నుండదగినమీా రడవిలో వనమృగములతో నున్నారు. మంచియమూల్యములగు బట్టలను గట్టుకొనతగినమీారు కృష్ణాజినము వేసికొనవలసివచ్చెను. మంచిపూవులను తలలో ముడుచుకొనెడి మీారు జటాభారమును మోయుచున్నారు. యజ్ఞముల చేసి ధర్మమునుసమకూర్చవలసిన మీారు శరీర మాయాశపెట్టుకొను ధర్మము జరుపవలసివచ్చెను. చందనమును శరీరమున బూసికొను మీాకు మురికె యెట్లు వచ్చెను? సుఖముగనున్న మీాకు నానిమిత్త మిట్టి గొప్పదుఃఖము సంభవించినది. ఛీ! నేను క్రూరుడను. నాజీవితము లోకమున నపవాదము బొందినది.' ఇట్లుభరతుడు పలుకుచు

విచారముచే ముఖము వాడియుండ నేడ్చుచు తనయన్న పాదముల మీదబడి 'ఆర్యా! ఆర్యా!' యనిమాత్రముపలికి మఱేమియు పలుకలేకపోయెను. శత్రుఘ్నుడుకూడ నేడ్చుచు నాతనిపాదములకు వందనమొనర్చెను. రాముడు వారిద్దఱిని కౌగిలించుకొని వారికండ్ల నీళ్ళను దుడిచెను. సుమంత్రుడును, గుహుడును తీసికొనివచ్చిన భరతశత్రుఘ్నులు రామలక్ష్మణులతో నిలువ నాకాశమున సూర్య చంద్రులతో నుండు గురుశుక్రులవలె గనబడిరి. అక్కడి వనఋషులు కూడ వచ్చి విచారించి కన్నీరు విడిచిరి.

భరతుడు జటలను, నారచీరలను ధరించి యుగాంతమున క్రిందబడు సూర్యునివలె రాముని పాదములమీద బడియుండ నాతడు వానిని కొంతసేపటి కెట్లో గుర్తించి తనచేతులతో వానిని లేవనెత్తి కౌగిలించుకొని వానితలను మూర్కొని తనతొడమీద కూర్చుండ బెట్టుకొని యిట్లడిగెను. "నీవు వనమునకు రాగా మనతండ్రి యెట్లున్నాడో! ఆతడు జీవించియుండ నీవడవికి రాగూడదు. కేకయనగరమునుండి శరీరకష్టముతో వచ్చిన నిన్ను చాలకాలమునకు జూచితినిగదా! నీ వీవనమున కేలవచ్చితివి? నీవు వచ్చినందులకు రాజు లోకాంతరమునొందక జీవించియున్నాడా? శాశ్వతమైననీ రాజ్యము నీ బాల్యపరిపాలనచే నష్టమునొందలేదుకదా? నీవు మనతండ్రికి సేవ జేయుచున్నావా? రాజసూయాశ్వమేధముల జేసినవాడును, సత్య ప్రతిజ్ఞుడును, ధర్మమార్గముననడచువాడునునగు మనతండ్రి కుశలముగనున్నాడా? ధర్మమున నడచు గొప్పతేజశ్శాలియగు మనకుల గురువు కుశలముగనున్నాడా? కౌసల్యాసుమిత్రలుసుఖముగనున్నారా? దేవియగు కైకేయి సంతోషముగ నున్నదా? బాగుగ జదివినవాడును, నసూయలేనివాడునునగు సుయజ్ఞుడనుమనగురుపుత్రుడు క్షేమముగ నున్నాడా? నీచేతనత డగ్నికార్యములను సరియగుకాలమున జేయించు

చున్నాడా? నీవు దేవతలను, పితరులను, తల్లులను, గురువులను, వృద్ధులను, విద్వాంసులను, బ్రాహ్మణులను పూజించుచున్నావా? మనకు విలువిద్యను, శస్త్రవిద్యలను, నీతిశాస్త్రమును నేర్పిన సుధన్వునికి నీవు తగుమర్యాద జేయుచున్నావా? అయోధ్యయంతయు పుష్కలముగ నుండ నీవు ప్రజలను బాగుగ పాలించుచున్నావా?” ఇట్లు రాముడు భరతుని నడిగి యాతనికి *రాజనీతులను దెలిపి ‘వానిని నీ వాచరించుచుంటివా?’ యని ప్రశ్నించెను. ఇంకను నతడు ‘నీవు వేదములప్రకారము క్రియలను జరుపుచున్నావా? నీవు ప్రారంభించినపనులను బాగుగ నెఱవేర్చుచున్నావా? నీభార్యలవలన నీవు సౌఖ్యములను బొందుచున్నావా? సద్గ్రంథములలోవినినట్లు నీవు జరుపుచున్నావా? నాబుద్ధివలె నీబుద్ధి యాయురారోగ్యాభివృద్ధియందును, కీర్తికొఱకును, ధర్మార్థకామములయందును నుపయోగింపబడుచున్నదా? మన పూర్వులుజరిపిన మంచిమార్గమున నీవు నడచుచున్నావా? మంచి భోజనము కలిగినపుడు నీవొక్కడవేగాక యితరులతోగూడ భుజించుచున్నావా? స్నేహితులు కోరినపుడు ధనమిచ్చుచున్నావా?’ యని వానిని ప్రశ్నించెను.

---

౧౭ వ. అధ్యాయము.

## సీతారామలక్ష్మణులు దశరథునిమరణమును వినుట.

---

రాముడు భరతునకు రాజనీతులు బోధింప దాని కతడిట్లు విన్నవించెను. “ధర్మమువిడిచిన నే నేరాజధర్మము జరిపెదను? మన వంశములో పెద్దకుమారుడుండ చిన్నకుమారుడు రాజ్యముచేయకుండుట శాశ్వతమైనధర్మము. నాతో మీరు పుష్కలముగ నయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తులరై మనకులము నుద్ధరింపుడు రాజు సామాన్య

* 13వ. ప్రకరణము ౧౨వ, అధ్యాయము రాజనీతులు చూడుము.

ముగ వ్యవహారించినయెడల మనుష్యతుల్యుడగును. ధర్మార్థములను బాగుగ జరిపినయెడల దేవతుల్యుడగును. నేను నామేనమామయగు కేకయరాజు దేశములోను, మీరరణ్యములోను నుండ యజ్ఞశీలుడగు మనతండ్రి స్వర్గస్థుడయ్యెను. మీరును, సీతాలక్ష్మణులును వెళ్ళినతోడనే యతడు మిక్కిలివిచారమునుబొంది మరణించెను. నేనును, శత్రుఘ్నుడును నాతనికి నుత్తరక్రియలను జరిపితిమి. మీరు లేచి యాతనికి నుదకక్రియలను జరుపుడు. పితరులకు వారిప్రియులచే సంతోషపూర్వకముగ నీయబడినది యక్షయమని పెద్దలు పలుకుదురు. మీరాతనికి ప్రియులు. మిమ్ముగురించి విచారించుచు, మీదర్శనము గోరుచు, మీయందే బుద్ధి నిలిపి, దానిని మరలింపక మీవియోగముచే దుఃఖమును, పీడను బొంది, మిమ్ములను స్మరించుచు మనతండ్రి స్వర్గస్థుడయ్యెను."

రాక్షసులతో యుద్ధముజేయునపు డింద్రుడు విడిచిన వజ్రాయుధముయొక్క దెబ్బలవలె కఠినములును, దుఃఖకరములునునగు భరతునియీమాటలను విని రాముడు చేతులు నలువుకొని తెలివి తప్పి యడవిలో గండ్రగొడ్డలితో నఱకబడినదియు, పూలతోనిండి నదియునగు పెద్దచెట్టువలె క్రిందబడెను. అప్పు డాతనితమ్ములును, సీతయు వానిచుట్టు కూర్చుండి యేడ్చిరి. తరువాత నాతడు కొంత సేపటికి తెలివినిబొంది కన్నీరువిడుచుచు భరతునితో ధర్మవాక్యముల నిట్లు పలికెను. "మనతండ్రి దైవయోగముచే మరణమునొంద నే నయోధ్యలో నేమిచేసెదను? ఆరాజశ్రేష్ఠుడులేని రాజ్యము నెవడు పాలించును? నావియోగశోకముచే నతడు మరణింప నతనిదహనాది సంస్కారములను జేయలేని దౌర్భాగ్యుడనగు నావలన నతని కేమి లాభము? నీవును, శత్రుఘ్నుడును నతనికి ప్రేతకార్యముల నన్నిటిని జేసి కృతకృత్యులైరి. దశరథుడులేని యయోధ్యకు నేను వనవాసాంత

మున నైనను వెళ్ళ నిష్టపడను. నాతండ్రిలేనియయోధ్యకు నేను వెళ్ళిన యెడల నన్ను కార్యములను జేయు నెవడు నియోగించును? పూర్వము నన్నుజూచి యాతడు సంతోషకరముగ మాటలాడి నట్లిప్పు డెవడు మాటలాడును?'' ఇట్లు రాముడు విలపించి మిక్కిలివిచారముతో 'సీతా! నీమామగారు మృతినొందిరి. లక్ష్మణా! నీవుతండ్రిలేడయ్యేను. ఈ సంగతి భరతుడు నాకు దెలిపె'నని పలుక నన్నదమ్ములందఱును మిక్కిలిగ నేడ్చిరి. తరువాత నందఱు రాముని నోదార్చి 'నృపతికి నుదకక్రియలను జేయు'మని చెప్పిరి. సీత తన మామగారు స్వర్గస్థులగుటవిని యేడ్చుచు మిక్కిలికన్నీరువిడిచి తనభర్తను జూడలేకపోయెను. రాముడామెనోదార్చి 'లక్ష్మణా! ఇంగుదీవృక్షపు (గార చెట్టు)గింజలపిండిని తెమ్ము. నాయుత్తరీయమునుగూడ నిమ్ము. మహాత్ముడగు మనతండ్రికి జలక్రియలను జరుపుటకై పోయెదను. ముందు సీతయు నీవును వెళ్ళవలెను. నేను వెనుకనుండి వచ్చుచున్నాను. ఇట్టి గొప్పకష్టము మనకు వచ్చె'నని పలుక నాతనియందు భక్తిగల సుమంతుడును, తమ్ములును నాతని నోదార్చిరి. అందఱును మందాకినీనదికి వెళ్ళిరి. సీతారామలక్ష్మణులు నదిలోదిగి స్నానముచేసి పశ్చిమమున కెదురుగ నిలిచి యేడ్చుచు దోసిళ్ళతో నీటినిబట్టి 'ఓ రాజశ్రేష్ఠా! మేమిచ్చు నిర్మలోదకము నీకెల్లప్పుడు జెందుగాక!' యని దానిని జల్లిరి. అక్కడ రాముడు దశరథునిగూర్చి యింగుదీఫలములగింజలపిండితో పిండములను జేసి దర్భలపై వేసి యేడ్చుచు 'వీనిని సంతోషముతో భుజింపుడు. ఏయన్నమువలన మేము జీవించుచున్నామో పురుషుడు జన్మించుచున్నాడో యాయన్నమే వానికి దేవత లగుచు'నని పలికెను. తరువాత వారు వెళ్ళినత్రోవనే కొండయెక్కి చరియలోనుండు పర్ణశాలయొద్దకు వచ్చిరి. అప్పుడు రాముడు భరతలక్ష్మణులను కౌగిలించుకొని యేడ్వ సీతయు నందఱును నేడ్చిరి.

ఆశబ్దముతో కొండ ప్రతిధ్వనించెను. దీనిని భరతుని సైనికులు విని భరతశతృఘ్నులు రామునిగలిసి తమతండ్రి మరణమును వానికి తెలియ జేసిరనియు, నందఱు దానినిగూర్చి యేడ్చిరనియు నూహించి తమతమ బసలనువిడిచి శబ్దముపుట్టిన ప్రదేశము వైపునకు నేనుగులపైని గుఱ్ఱములపైని,రథములపైని తొందరగ వెళ్ళిరి.కొందఱుపరుగెత్తి వెళ్లిరి. వారు స్వల్పకాలము క్రిందట రామునిజూచినను చాలకాలముక్రిందట జూచినట్లుగదలచి యాతనిజూచుటయం దభిలాషగలవారై శీఘ్రముగ రామునియాశ్రమమునకు పరుగెత్తి వెళ్ళిరి. వారిగొప్పశబ్దము భూమ్యా కాశములనిండెను. దానితో నక్కడనుండు నాడయేనుగులు, మొగ యేనుగులు, అడవిపందులు,నక్కలు,దున్నపోతులు,పాములు, కోతులు, పులులు మొదలగు జంతువులును, చక్రవాకములు, అడవికోళ్ళు, హంసలు, కోకిలలు మొదలగుపక్షులును నలుదిక్కులకు పాఱిపోయెను. ఆకాశమున పక్షులును, భూమియందు మనుష్యులును సమూహముగ నుండిరి. తరువాత వారు కైకేయిని, మంధరను మిక్కిలిగ నిందించుచు కన్నీరువిడుచుచు భూమియందుకూర్చున్న రాముని జూచిరి. ధర్మజ్ఞు డగు రాముడు వారిని జూచి కొందఱిని తలిదండ్రులవలె కౌగిలించు కొనెను. కొందఱు వానికి నమస్కరించిరి. రాముడు తనస్నేహితు లకు, బంధువులకు తగినమర్యాదలను జేసెను.

వెనుకనుండి వసిష్ఠుడును, దశరథునిభార్యలును మెల్లగ వచ్చు చుండిరి. వారు మందాకినీనదిని చేరినతరువాత కౌసల్య యానదిని జూచి వాడినముఖము, కన్నీరుకలదై సుమిత్రతోను, నితరరాజ భార్యలతోను నిట్లనెను. "ఇదుగో! యీవనమునకే యనాథులును, మంచికర్మలు చేసినవారునునగు రామలక్ష్మణులు వనవాసము పంప బడిరి. ఈనదియందే వారెల్లప్పుడు తిరుగుచుందురు. సుమిత్రా! నీ కుమారుడు దిక్కడనుండే నాకొడుకునకై జలము శ్రద్ధగ దీసికొనివెళ్ళు

చుండును. అది నీచకార్యమైనను లక్ష్మణుడట్లు తలంపక రాముని యందలిస్నేహభావముచే దానిని జరుపుచుండును. ఈదినమున భరతుని ప్రార్థన నంగీకరించి రాముడు రాజ్యాభిషిక్తుడైన నీకుమారుని నీచకర్మ యీదినమునుండియైనను తప్పునా?" ఇట్లామె పలికి దక్షిణము వైపుకొనలుండునట్లు పఱపబడినదర్భలపై రాముడు వేసిన యింగుదీఫలములగింజలపిండితో జేసిన పిండములను జూచి రాజభార్యలతో "ఇక్ష్వాకుప్రభువగు దశరథునకు నాకుమారుడు యథావిధిగనిచ్చిన పిండములను జూడుడు. దేవసమానుడును, నాల్గుసముద్రములమధ్యను నుండు భూమిని పాలించిన చక్రవర్తియునగు నాతని కిది తగిన భోజనము కాదు. అత డీయింగుదీపిండముల నెట్లు భుజించును. ఇంతకంటె మిక్కిలిదుఃఖకరమగున దేదియు నాకు గనబడదు. దీనిని జూచిన నాగుండె వేయిముక్కలుగ నేలపగులదు? 'ఏయన్నమువలన పురుషుడు పుట్టుచున్నాడో యాయన్నము వానికి దేవతలగుదురను వేదవాక్య మీలోకమున నిజముగ సత్యమగుచున్న''దని చెప్పుచు విలపింప దశరథునియితరభార్య లామెను నోదార్చుచు రాముడుండు చోటునకు బోయిరి. అక్కడ స్వర్గమునుండి జారిపడిన దేవతవలె నాతడు వారికి గనబడెను. అన్నిభోగములను విడిచియున్న రాముని జూచి వారు విచారముతో నేడ్చి కన్నీరు విడిచిరి. రాముడు వారి పాదములకు నమస్కరించెను. వారు తమచేతులతో నాతని శరీరమున నున్న ధూళిని తుడిచిరి. తరువాత లక్ష్మణుడుకూడ విచారముతో వారందఱికి, వరుసగ నమస్కరించెను. దశరథునిభార్యలు లక్ష్మణుని శరీరమునుగూడ తమచేతులతో నిమిరిరి. సీతయు విచారముతో కండ్లంట నీరుతెచ్చుకొని వారికి నమస్కరించెను. వనవాసముచే కృశించినదియు, విచారముకలదియునగు నామెను కౌసల్య తల్లి కుమార్తెను కౌగిలించుకొనునట్లుకౌగిలించుకొని యిట్లుపలికెను. 'విదేహరాజకుమా

ర్తెవును, దశరథునికోడలవును, రాముని భార్యవునునగు నీకు వనవాస దుఃఖమెట్లుకలిగెను? చంద్రునివంటినీముఖము వాడియున్నది. నీకష్టము వలనబుట్టిన శోకాగ్ని నన్ను దహించుచున్నది.' ఇట్లుకౌసల్య పలుకుచుండ నిందు్రిడు బృహస్పతిపాదముల బట్టినట్లు రాముడు వసిష్ఠుని పాదములబట్టి నమస్కరించి వాని ప్రక్కను కూర్చుండి యుండెను. మంత్రులును, నగరముఖ్యులును, సైనికులును, భరతుడును నక్కడ నాసీనులైరి.

---

## ౧౮వ. అధ్యాయము.

### రాముడు రాజ్యాభిషేకము నిష్టపడకపోవుట.

రామలక్ష్మణులు దశరథునికి నుదకక్రియలు జరిపినతరువాత వారును, వసిష్ఠుడు మొదలగువారును, భరతుడును కూర్చుండి యుండిరి. అప్పుడు రాముడు భరతుని 'నీవు నారచీరలను, జటలను ధరించి రాజ్యమును విడిచి యీచిత్రకూటమున కేలవచ్చితివి? అంతయు పూర్తిగ దెలియబలుకు' మని యడిగెను. అప్పుడతడు తన యన్నను గాఢముగ కౌగిలించుకొని చేతులుజోడించి యిట్లుపలికెను. "దశరథుడు నాతల్లియగు కైకేయిమాటప్రకారము జరిపి తనకీర్తికి నష్టమునుదెచ్చుకొని గొప్ప పాపముజేసి మిమ్ములను నడవికి బంపి మీవియోగశోకముచే మరణించెను. కైకేయి విధవయైవిచారించుచు తనకోర్కెను నెఱవేర్చుకొనలేక గొప్పనరకమున బడును. దాసుడనగు నాయందు మీరు గొప్పదయజూపి యిందు్రినివలె నిప్పుడే రాజ్యాభిషేకమునొందుడు. అందుకొఱకే యీపురజనులును, విధవ

లగుమనతల్లులును వచ్చియున్నారు. కనుక వారియందు మీరు దయ జూపుడు. పూర్వాచారప్రకారము జ్యేష్ఠుడే యభిషేకమునొందవలెను గనుక మీరట్లు చేసి ధర్మమార్గమున రాజ్యమునుబొంది మీ స్నేహితుల కోరికల నన్నిటిని నెఱవేర్పుడు. శరత్కాల చంద్రునిచే రాత్రి ప్రకాశించునట్లు మీరాజ్యపరిపాలనచే పృథివి ప్రకాశించును. మీకు తమ్ముడును, దాసుడును, శిష్యుడునునగు నేనును, నీమంత్రులును మీపాదములకు మ్రొక్కి యట్లుచేయవలెనని ప్రార్థించుచున్నాము. సమస్తప్రజలతో నుండినదియు, శాశ్వతమైనదియు, మీ పూర్వులనుండి వచ్చుచున్నదియునగు నీరాజ్యమును గైకొనుడు." ఇట్లు భరతుడు పలుకుచు కన్నీరువిడుచుచు రాముని పాదములబట్టెను. అంతట నతడు వానిని కౌగిలించుకొని యిట్లు పలికెను. "మంచికులమున జన్మించి తేజోబలములు, మంచిప్రవర్తనగల నీవంటివాడు రాజ్యముకొఱకు పాపమేలజేయును? నీయందు నేను స్వల్పమాత్రమైనను దోషమునుగానను. నీతల్లిని నజ్ఞానముచే నీవునిందింపగూడదు. సత్పురుషులకు నాశ్రితులందును, భార్యలందును, పుత్రులందును నిర్మలమగుస్నేహ ముండును. మంచివారు భార్యలను, పుత్రులను, శిష్యులను నెట్లు నియమింతురో యట్లే దశరథుడుకూడ మనలనునియమించెనని తెలిసికొనుము. 'అడవిలో నారచీరలను, లేడిచర్మములను ధరించి యుండు' మనుటకును, 'రాజ్యము పాలింపు' మనుటకును నతనికధికారము కలదు. ధర్మాత్ముడగు తండ్రిమాట నెట్లు జరుపవలెనో తమతల్లిమాటకూడ ధర్మాచరణులు నట్లే జరుపవలెను. నాతలిదండ్రులు నన్ను 'వనమునకు బొమ్మని నియమింప నేను మఱియొకతీరున నెట్లు చేయగలను? నీ వయోధ్యయందు రాజ్యము చేయవలెను. నేను దండకారణ్యమున నారచీరలను ధరించి నివసింపవలెను. ఇట్లు లోకములో మనకు కార్యములను మహాతేజుడగు దశరథుడు విభ

జించి స్వర్గమునొందెను, అతనిమాటయే మనకు ప్రమాణము. నీకిచ్చిన రాజ్యమును నీవనుభవింపవలసినదే. నాకు నియమించినది త్రిలోకాధిపత్యముకంటెకూడ మిక్కిలి శ్రేయస్కరమైనదని నేనాలోచించెదను.” ఇట్లు రాముడును, వానితమ్ములును, వారి స్నేహితులును విచారించుచుండ రాత్రి తెల్లవారెను.

ఆమఱునాటియుదయమున వారు మందాకినీనదిలో స్నానము చేసి జపహోమములను జేసి రామునియొద్దకు తిరిగివచ్చి యక్కడ కూర్చుండిరి. కొంతసే పెవరును నేమియుపలుకలేదు. అంతట భరతుడు స్నేహితులతో కూర్చుండియున్న రామునితో నిట్లనెను. “నేను నాతల్లికి బోధపఱచితిని. నాకీయబడిన శత్రురహితమగు నీరాజ్యమును నేను మీకిచ్చుచున్నాను. దానిని మీరనుభవింపుడు. వర్షాకాలమున నీటిప్రవాహముచే విఱిగిపోయిన యడ్డుగట్టువలెనున్న యీరాజ్యమును మీరుతప్ప యితరులు పాలింపలేరు. గుఱ్ఱముతో పరుగెత్తుటకు గాడిదకు, గరుత్మంతునితో శీఘ్రముగ బోవుటకునితర పక్షులకుశక్తిలేనటుల మీవలెరాజ్యమును బాలించుటకు నాకుశక్తిలేదు. తన్నితరు లెల్లవు డాశ్రయించియుండునట్లు జీవించుటయే యుత్తముని జీవనము. ఇతరుల నాశ్రయించియుండు చెడుజీవనము మీదికాదు. మీరు దశరథునికి పుత్రులరై జన్మించి యాతనిరాజ్యమున పట్టాభిషేకము నొందక, మమ్ములను బాలింపకయుండుట యొకడు మంచి వృక్షమునకై బీజమువేసి చెట్టును వృద్ధినొందింప నది పెద్దచెట్టయి పూవులనుమాత్రముపూచి కాయలుకాయక వానికి సంతోషము కలుగజేయకుండునట్లుండును. ఈవిషయమును మీరు తెలిసికొన తగియున్నారు. పట్టణవాసులును, ప్రధానులందఱును మీ రెప్పుడు రాజ్యముచేయుదురని యెదురు చూచుచున్నారు. మీరయోధ్యకు మఱలునంతలో నేనుగులు సంతోషముతో ఘీంకరించును. అంతఃపుర

స్త్రీలు మిక్కిలి సంతోషమునొందుదురు." ఇట్లు భరతుడు పలుక నీమాటల నక్కడిప్రజలు విని యాతనిని మిక్కిలి శ్లాఘించిరి. ధైర్యశాలియు, బాగుగ దెలిసినవాడునునగు రాముడు దుఃఖించుచున్న భరతుని నోదార్చి వానికి *కొన్ని వేదాంతపు మాటలను దెలిపి యింకను నిట్లు బోధించెను. "మనతండ్రి గొప్పశుభకార్యములను జరిపెను. మంచిదక్షిణలిచ్చి, గొప్పయజ్ఞములుచేసి, పాపములబోగొట్టుకొని, తనసేవకులను బాగుగపోషించి, ప్రజలనుపాలించి, మంచి భోగము లనుభవించి, చాలకాలము జీవించి, యీశరీరమును విడిచి స్వర్గమునకు బోయి, దేవత్వమునుబొంది, బ్రహ్మలోకమున సంతోషముగ దిరుగుచున్నాడు. దానికి మనము విచారింపనేల? పుణ్యగ్రంథ పరిశోధన జేసిన వాడవును, బుద్ధిమంతుడవుననగు నీవు మనతండ్రిని గూర్చి యిట్లు విచారింపగూడదు. నీవు శోకమును విడిచి ధైర్యవంతులన్ని సమయములందు నవలంబించు ధీరత్వమును గలిగియుండుము. నీవు మనశ్శాంతిగలవాడవై విచారింపక మనతండ్రినిర్ణయించినప్రకారము నీవయోధ్యకు బోయి రాజ్యమును బాలింపుము. నేను వనవాసము చేసెదను. అతడు మనకు తండ్రియు, ముఖ్యబంధువుగనుక మనమతనియాజ్ఞను విడుచుట న్యాయముకాదు. నీవు దానినిమన్నింపవలయును. నేను దానిని జరిపి వనముననుండెదను.ముందులోకములను సాధింపవలెనన్న పెద్దలుచెప్పినటుల ధర్మబుద్ధితోనుండవలెను. మనతండ్రియాచరించినప్రకారము నీవు రాజ్యమును బాలింపుము." ఇట్లు రాముడు బోధించి యొకగడియయూరకుండెను.

అప్పుడు భరతుడు రామునితో చిత్రముగ ధర్మయుక్తమగు మాటలనిట్లనెను. "దుఃఖముకలిగినప్పుడు మనస్సునకు గొప్పబాధయు,

---

* 13వ. ప్రకరణము. ౧వ. అధ్యాయము. వేదాంతవిషయములు. ధర్మనీతులు చూడుము.

ప్రీతియగువస్తువులు నమకూడినప్పుడు గొప్పసంతోషము లేనట్టి మీవంటిమనుజుడు లోకములో లేడు. మీమనస్సునందు నవమానములను మీరు పెద్దలయొద్ద తీర్చుకొనెదరు. మరణించినమనుజుని యందు క్రోధమును జెందకూడనట్లు జీవించియున్నమనుష్యునియందు కూడ క్రోధమును జెందక లేనివస్తువునందు వైరాగ్యముబొందునట్లు నమకూడినవస్తువునందుకూడ వైరాగ్యమును బొంది యెవడు నమ బుద్ధిని కలిగియుండునో యట్టివానికి దేనిచేనైన విచారమేలకలుగును? భూతభవిష్యద్వర్తమానములసంగతి తెలిసిన మీకు విచారమువచ్చి నను మీరు దానికి లొంగిపోరు. మీరు దేవతుల్యులగుమహాత్ములు; సత్యప్రతిజ్ఞులు; అన్నియు దెలిసినవారు; అన్నిసంగతులను విమర్శిం చిన గొప్పబుద్ధిమంతులు. మీరు జననమరణములను నెఱిగినవారు. సహింపలేనిదుఃఖములైనను మిమ్ము బాధింపలేవు. నేను నామేన మామయింటనుండ నాకొఱకు నాతల్లి నీచబుద్ధితో జేసిన దుఃఖకర మగుపాపమునకు మీరు నన్ను క్షమింపుడు. నేను ధర్మబుద్ధిచే కట్టు బడియున్నాను. లేనియెడల శిక్షార్హురాలును, పాపముచేసినదియునగు నాతల్లిని నప్పుడే చంపియుందును. నేను శుభచారిత్రుడగు దశరథు నకు జన్మించి, ధర్మము తెలిసికొని, లోకమునకు ననహ్యకరమగు పని నెట్లు చేయుదును? వృద్ధుడగు మనతండ్రి మనకు గురువు, రాజు నైయున్నాడు. అతడు మరణించెనని దేవతుల్యుడగు నాతని నేనే సభలోను నవమానింపగూడదు. కాని ధర్మము తెలిసినవాడెవ డాడు దానికి సంతోషము కలుగజేయుటకిట్టి ధర్మవ్యతిరిక్తమగు పాపపు కార్యము చేయును? మరణకాలమున జీవులు విపరీతబుద్ధినొందుదురను పూర్వకాలపువేదవాక్యము మనరాజుచేసినకార్యమువలన ప్రత్యక్ష మాయెను. మనతండ్రికోపముచేతను, నజ్ఞానముచేతను, సాహసము చేతను చేసినయీవిపరీతకార్యమును మీరు మంచిమార్గముచే మళ్లి

లింపవలెను. తండ్రిచేసినయక్రమపుపనులను చక్కబెట్టుకుమారుడే యతనికి తగినపుత్రుడు. అట్లు చేయనివారు పుత్రులుకారు. అందుచే మీరు తగినకుమారు లయ్యెదరుగాక! మనతండ్రిచేసిన లోకమున కపహాస్యకరమగు కార్యముచే మీరు బాధనొందకూడదు. కైకేయిని, నన్ను, దశరథుని, మనబంధువులను, స్నేహితులను, దేశవాసులను, పట్టణవాసులను, నందఱిని మీరు రక్షింపవలెను. భూపరిపాలన చేయ వలసిన క్షత్రియులగు మీకు నరణ్యవాసమును, జటధారణయు తగదు. మీ రిట్టిపనిలో నుండగూడదు. పరిపాలన చేయువలసినక్షత్రి యునకు రాజ్యాభిషేకము ముఖ్యమగుధర్మము. ఏక్షత్రియపురుషుడు తనకంటికి కనిపించు ధర్మమగురాజ్యమును విడిచి యనుమానాస్పద మైనదియు, శోభాయుక్తముకానిదియు, నిశ్చయముకానిదియు, ముందెవ్వడో లభించునదియునగు ధర్మము నాచరించును? మీరు కష్టముతోగూడినధర్మమునే యాచరింపవలయునని కోరినచో నాలుగు వర్ణములవారిని పాలించుట యనుకష్టము నొందుడు. నాలుగాశ్రమము లలో గృహస్థాశ్రమమే శ్రేష్ఠమైనదని పెద్దలు పలుకుదురు. దానిని మీ రెట్లు విడిచెదరు? విద్యచేతను, స్థితిగతులచేతను, జన్మముచేతను నేను మీకంటె తక్కువవాడనుగదా? మీరుండ నే నెట్లు రాజ్యమును పరిపాలించెదను? నేను బుద్ధిమంతుడనుగాను. ఏమియు తెలియని వాడను. మీరు లేకుండ నేనెక్కడను నిలువలేను. అట్టిచో నేను రాజ్యమెట్లుచేయగలను? మీరు మీపూర్వులనుండివచ్చిన శత్రు రహితమైన యీరాజ్యమునంతను మీబంధువులతోగూడ పరిపా లింపుడు. ఇప్పుడే యీప్రజలును, మంత్రవేత్తలగు వసిష్ఠాదిగురువు లును, మంత్రపూర్వకముగ మిమ్ము నభిషేకము జేసినపిమ్మట రాజ్యమును పాలించుటకు మీ రయోధ్యకు వెళ్ళవలయును. మీరు దేవ పితృ మనుష్యులఋణము దీర్చుచు, శత్రువుల దండించుచు,

స్నేహితులను తగినకోరికలచే తృప్తినొందించుచు నన్ను బాలింపుడు. మీయభిషేకమువలన నిప్పుడే మీస్నేహితులు సంతోషమునొందెదరు. మీశత్రువులన్నిదిక్కులకు పాఱిపోయెదరు. మీరు నాతల్లి శాపమును త్రోసివేసి పూజ్యుడగుమనతండ్రిని పాపమునుండి రక్షింపుడు. మహేశ్వరుడు సర్వభూతములందు దయజూపురీతిని మీరు మనబంధువులయెడ, నాయెడ కనికరము జూపవలెనని నేను మీపాదములమీద బడుచున్నాను. మీరు నామాటవినక వనములోనుండి పోయిన నేనుగూడ మీతోకలిసి వనములో దిరిగెదను." ఇట్లు భరతుడు రామునిపాదములమీదబడి యాచించినను నాతడు తన తండ్రిమాటయే జరుపుటకు నిశ్చయించి యయోధ్యకు వెళ్లుటకు నిష్టపడలేదు. తనకోరికప్రకారము రాము డయోధ్యకు వెళ్ళుట కంగీకరింపకపోవుటచే విచారమును, నతనిస్థిరబుద్ధికి సంతోషాశ్చర్యములును భరతునకు గలిగెను. భరతునియీమాటలకు వానితల్లులు మొదలగువారందఱును వానిని మెచ్చుకొనిరి. వర్తకులును, సేనానాయకులును వానిని బొగడి చేతులుజోడించి వానియన్నను 'అయోధ్యకురం'డని యాచించిరి.

తరువాత రాముడు భరతునిమాటలకు "దశరథునికి కైకేయియందు బుట్టిన నీ విట్లు చెప్పుట యుక్తముకాదు. పూర్వము కేకయరాజు కైకేయిని మనతండ్రి కిచ్చి వివాహముచేయుటకుముందు మన తండ్రిచే 'ఆమెకుపుట్టినపుత్రునికి రాజ్యమిత్తు'నని వాగ్దానముచేయించెను. మఱియు దేవాసురయుద్ధములో నీతల్లి దశరథుని రక్షించి యాతనివలన రెండువరములను పొందెను. అందుచే నీకు రాజ్యలాభమును నాకు వనవాసమును సంప్రాప్తమయ్యెను. కనుక నీవు తండ్రిఋణమును దీర్చి కైకేయిమనస్సును సంతోషపెట్టుము. కుమారుడు తండ్రిని పున్నామనరకమునుండి తప్పించుటచే వానికి పుత్రుడన్న

పేరువచ్చెను. వాడు పితరులకు గయయందు పిండప్రదానముచేసి వారిని తృప్తినొందింపవలయును. తలిదండ్రులు చదువుకొనినవారును, గుణవంతులునునగు పుత్రులను చాలమందిని కోరుదురు. వారిలో నెవరైనను గయకు బోయిన వారిఋణము తీరును. ఈసంగతి రాజర్షులందఱికిని దెలియును. నీవు మనతండ్రిని పున్నామనరకమునుండి తప్పింపుము. నీవు పురోహితులతోను, బ్రాహ్మణులతోను, శత్రుఘ్నునితోను నయోధ్యకు బోయి ప్రజలను బాలింపుము. నేనును సీతాలక్ష్మణులతో విలంబముచేయక దండకారణ్యము చేరెదను. నీవు శత్రుఘ్నునిసాహాయ్యమున దేశములోని ప్రజలనుబాలింపుము. నేను లక్ష్మణునిసాహాయ్యమున నడవిలో మృగములను రక్షించెదను. నీవు సంతోషముగ నయోధ్యకు బొమ్ము. నేను దండకావనమునకు సంతోషముగ వెళ్ళెదను. మనము నలుగురన్నదమ్ములము తండ్రి వాక్యముల బాలించి విచారములేక చరించెద"మని ప్రత్యుత్తర మిచ్చెను.



## ౧౯వ. అధ్యాయము.

### జాబాలి వసిష్ఠులు రాముని రాజ్యాభిషేకము కోరుట.



రాముడు భరతుని నోదార్చుచుండ జాబాలియను బ్రాహ్మణోత్తముడు వేదమార్గవిరుద్ధమగు *చార్వాకమతము లేక నాస్తికము బాగుగబోధించుచు నిట్లుపన్యసించెను. 'ఉపయోగములేని సాధుబుద్ధి సామాన్యనరున కున్నట్లు మీకుండగూడదు. మీరు మీతండ్రివలన

* 13వ. ప్రకరణము ౧౦వ, అధ్యాయము చార్వాకము లేక నాస్తికము చూడుము.

వచ్చిన రాజ్యమును విడిచి మిక్కిలికష్టముగ బ్రతుకుట కాలోచించి యున్నారు. మీరయోధ్యకు వెళ్ళి యభిషేకము నొందవలెను. ఆపట్టణము మీయందే మనస్సుకలిగియున్నది. ఇంద్రుడు స్వర్గమున భోగముల ననుభవించునటుల మీరయోధ్యలో సుఖముల ననుభవింపవలెను. దశరథుడు మీకేమియుగాడు. మీరతని కేమియు గారు. రాజగునతడు మీ కన్యుడు. అతనికి మీ రన్యులు. అతడు మరణము నొంది మరణించుజీవులవలె పంచభూతములలో గలిసెను. మీరేల మతిమోహబుద్ధితో నాయాసము జెందెదరు? మీరు నేనుచెప్పిన నాస్తికమతము నవలంబించి కంటికి కనబడుదానినే ప్రమాణముగ దీసికొని భరతు డిచ్చినరాజ్యమును గ్రహింపుడు.'

ఆబ్రాహ్మణునిమాటలను విని రాముడిట్లు జవాబు చెప్పెను. "మీరు పలికినది చేయుదగినట్లు పైకి కనబడినను దానిని జేయగూడదు. అది మంచివలె గనబడును; గాని యది యట్లుగాదు. పాపప్రవర్తన గలవాడు మర్యాదలేనివాడు నగుజనుడు మంచిప్రవర్తనగల జనసామాన్యముచే గౌరవమును బొందడు. అట్టివాడు తనయాచరణవలననే మంచికులమువాడో చెడుకులమువాడో లేకవీరుడో శుచిగలవాడో తెలియబడుచుండును. ఆర్యుడనగు నే ననార్యునివలెను, శుచిగలనేను శుచిలేనివానివలెను, మంచిలక్షణములుగలనేను మంచిలక్షణములు లేనివానివలెను, మంచిస్వభావముగలనేను దుస్స్వభావముగలవానివలెను ప్రవర్తించి శుభమును విడిచి లోకసంకరమును జేయుదనియు, వైదికక్రియలకు దూరమైనదియునగు నీవుచెప్పిన యీయధర్మమును ధర్మముగదలచి దానిని చేసితినేని యేబుద్ధిమంతుడు నన్ను గౌరవించును? నాప్రతిజ్ఞను నేను తప్పినయెడల స్వర్గమునెట్లు పొందగలుగుదును? నీవు చెప్పిన దానిని లోకులకెట్లు బోధింపగలను? లోకములోనివారందఱికి కోరిక ముఖ్యమయియున్నది. రాజులెట్లుసంచరించె

దరో పృజలుకూడ నట్లే సంచరించెదరు.” ఇట్లు చెప్పుచు రాముడు *సత్యమునుగూర్చి యుపన్యసించుచు నింకను నిట్లు పలికెను. “సనాతనమగు రాజచరిత్రము సత్యమైనదే. అది భూతదయనుగూడ గలిగి యున్నది. కనుక రాజ్యము సత్యాత్మకము. సత్యమువల్లనే లోకములన్నియు నిలిచియున్నవి. నాతండ్రి సత్యశపథము చేయ సత్యమగు నాతనియాజ్ఞను సత్యసంధుడనగు నే నేలజరుపకుందును? సత్యసంధుడగు నాతండ్రిమాటలను లోభ మోహాజ్ఞానములచే నేను భంగపఱుపను. నామనస్సున సత్యధర్మములను నిలుపుచు నే నీజటాభారమును వహించితిని. నీచులును, లుబ్ధులును, పాపకర్ములును నవలంబించునట్టియు, పైకిధర్మముగ గనబడి నిజముగనధర్మమగునట్టియు క్షత్రియధర్మమును నేను విడిచితిని. మీరు యుక్తితో గూడిన మాటలచే ‘ఇది మంచిది. చేయు’మని బోధించినమీమాటలు మర్యాదహీనములైనవి. నేనునాతండ్రియొద్ద ‘వనవాసము జేసెద’నని ప్రతిజ్ఞచేసి దానిని విడిచి భరతునికోరికప్రకార మెట్లు జరిపెదను. నేను ప్రతిజ్ఞచేయ కైకేయి సంతోషించి యుండెను. నేను వనవాసముచేయుచు శుచినై నియమముగ భోజనముచేయుచు కందమూలఫలములచేతను, పుష్పములచేతను దేవతలను, పితరులను తృప్తినొందించుచు పంచేంద్రియములను సంతోషింపజేయుచు కృత్రిమములేనివాడనై చేయదగినది, చేయగూడనిది బాగుగ నాలోచించుచు కాలము గడిపెదను.” ఇట్లు రాముడు పలికి †నాస్తికవాదమును ఖండించుచు వేదమార్గమును

---

* 13వ. ప్రకరణము. ౧వ. అధ్యాయము. వేదాంతవిషయములు, ధర్మనీతులు చూడుము.

†13వ. ప్రకరణము. ౧౧వ అధ్యాయము, నాస్తికమతఖండన చూడుము.

బోధించి యింకను నిట్లుపలికెను. 'వాంగ యెట్టివాడో ♦బౌద్ధమతస్థుడు నట్టివాడే. బౌద్ధమతము నాస్తికమని తెలియును. దానిని ప్రజలు విన గూడదు. బౌద్ధమతస్థునితో ప్రజలు వాదనజరుపగూడదు. మీకంటె పూర్వులగు బ్రాహ్మణులు మంచిశుభకర్మల ననేకముల జేసి యిహ పరలోకములజయించి యజ్ఞములను, తపస్సులను జేసియుండిరి.' రాము డిట్లు కోపముతో బలుక జాబాలి 'అదినిజమే.' యని చెప్పి యాస్తిక సత్యములసంబంధమైన మాటలను రామునితో 'ఇంక నేను నాస్తికుల మాటలను బలుకను. నేను నాస్తికుడను గాను. నాకు నాస్తికునిమాట లేవియు లేవు. నేను కాలమునననుసరించి యాస్తికుడను, నాస్తికుడను నయ్యెదను. ఇప్పుడు నేను నాస్తికవాదము చేయవలసిన కాలము వచ్చెను. మిమ్ములను వనమునుండి తప్పించి రాజ్యమునకు దీసికొని పోవుటకు నేనట్లు పలికితి'నని వినయముతో బలికెను.

అంతట కోపించియున్న రాముని వసిష్ఠుడు చూచి 'జాబాలికి గూడ లోకసంగతులు తెలియును. నిన్ను యోధ్యకు మరలించుటకు నతడట్లు పలికె'నని చెప్పి రాముని *పూర్వులవృత్తాంత మంతయు దెలిపి "రామా! నీరాజ్యమును నీవేలుము. ఇక్ష్వాకువంశజు లందఱిలో జ్యేష్ఠుడే రాజుకావలెను. పెద్దవాడుండ చిన్నవాడు రాజ్యాభిషిక్తు డగుటకు వీలులేదు. ఇది రఘువంశజులకు సనాతనముగు కుల ధర్మము. దానిని నీవుతప్పింపవీలులేదు. పుష్కలముగు నీకోసల రాజ్యమును నీతండ్రివలె నీవుకూడ కీర్తితో బాలింపు"మని రామునితో జెప్పి యింకను నిట్లు పలికెను. "నేను నీతండ్రికిని, నీకును గురుడను.

♦ బౌద్ధమతము ప్రస్తుతపుకలియుగమున కొన్నివేలసంవత్సరములు కాగా ప్రబలమైనది. ఈరామాయణగ్రంథమున బౌద్ధమతమును గురించి యుపన్యాసము జరిగినందున నీగ్రంథ మీకలికాలమున రచింపబడినదనుట స్పష్టము. వాల్మీకిరచించిన పవిత్రమగ్రంథమిదికాదని మాయభిప్రాయము.

* 6వ. ప్రకరణము 4వ. అధ్యాయము దశరథునిపూర్వులు చూడుము.

నామాటప్రకారము నీవు జరుపుము. నీవారగు నీ బ్రాహ్మణులను, నితరద్విజాతులను, పట్టణవాసులను పాలింపుము. సుగుణములుగల నీముసలితల్లి నిన్ను రమ్మనికోరుచున్నది. ఇవన్నియు నీవు జరిపిన నీకు మంచిస్థానము కలుగకమానదు. నిన్ను భరతుడు 'రాజ్యముపాలింపు' మని యాచించుచున్నాడు. నీవు సత్యధర్మములను బాలించువాడవు గనుక నీభక్తునికోరికను తప్పింపగూడదు." ఇట్లు వసిష్ఠుడు పలుక రాముడు వానికి 'తల్లిదండ్రులు తమపుత్రునికి జన్మకలిగించి వానికి తమశక్తికొలది యుపచారములనుజేసి యన్నముపెట్టి స్నానాదులు చేయించి బట్టలు కట్టించి మంచిమాటలాడుచు వాని వృద్ధికొఱకే యత్నించుచుందురు. వారికి పుత్రుడు తగినప్రత్యుపకారము చేయలేడు. దశరథుడు రాజు. నాతండ్రి నన్నాజ్ఞాపించినది యబద్ధము కాకూడ' దని జవాబుచెప్పెను.



## ౨౦ వ. అధ్యాయము.

## భరతుడు రామపాదుకలతో నందిగ్రామమున నివసించుట.



జాబాలి వసిష్ఠుల పలుకులను గూడ వినని రాముని జూడ భరతునకు మిక్కిలి విచారము కలిగెను. అప్పు డతడు తనదగ్గఱ నున్న సుమంత్రునితో 'దర్భలు తీసికొనిరమ్ము. నేను రాముని యెదుట భూమిపై నాదర్భలను పఱచి యాతనికి నాయందు దయ గలుగునంతవఱకు వానిపై పండుకొనెదను. ఇల్లే తనకున్నధనమును ఋణమిచ్చుటచే ధనహీనుడగు బ్రాహ్మణుడు తనఋణమును తీర్పని వానియింటియెదుటభోజనముమాని మొగముముడుచుకొనిసొమ్మిచ్చు వఱకు పడియుండు'నని పలికి యట్లు శయనించెను. రాముడు వానిని

జూచి 'భరతా! నేను నీకేమియపకారముచేసితినని నీవిట్లు పరుండి యున్నావు? ఋణదాతయగు బ్రాహ్మణుడు వడ్డీతోతనకువచ్చు ధనమునిమిత్తము తనకు ఋణమున్నవానిని బాధించుట కట్లు పరుండును. కాని రాజ్యాభిషిక్తులగు క్షత్రియు లట్లు చేయగూడదు. గొప్పకష్టమగు నిట్టిపనిమాని నీవు శీఘ్రముగ నయోధ్య కరుగు' మని సెలవిచ్చెను. అప్పుడు భరతు డక్కడనున్నప్రజలతో "మీరు రాముని 'మమ్మేల పరిపాలింపక యున్నా'రని యడుగరు?" అనిపలుక వారు భరతునితో 'మేము మీయన్న నెఱుగుదుము. అతడు సరిగ పలుకుచున్నాడు. అతడు తనతండ్రివాక్యమును జరుప నిశ్చయించి యున్నాడు. అతనిని శీఘ్రముగ మేము మఱలింపలే'మని చెప్పిరి. ఈమాటలను విని రాముడు 'భరతా! వీరిమంచిమాటలను దెలిసి కొనుము. నేను చెప్పినమాటలను, వీరుచెప్పినసంగతులను బోధ పఱచుకొని లెమ్ము. అట్లు దర్భలపై శయనించిన దోషము పోవు కొఱకు నీవు నన్ను ముట్టి జలముచే శుచివగు'మని పలికెను. అంతట భరతు డట్లుచేసి "సభ్యులారా! మంత్రులారా! పౌరులారా! నా మాటలను వినుడు. నేను రాజ్యమిమ్మని దశరథుని కోరలేదు. నాతల్లిని నాకొఱకు రాజ్యమును కోరు మనలేదు. ధర్మజ్ఞుడును, పూజ్యుడును నగు రాముడు వనవాసము వెళ్లుట నేనంగీకరింపలేదు. నాతండ్రి మాటలను జరుపుటయే ముఖ్యమయినయెడల వనవాసము తప్పని యెడల నేనే 14 సంవత్సరములు వనవాసము చేసెద"నని పలుక రాము డాశ్చర్యపడి పట్టణ దేశవాసులతో "మాతండ్రి జీవించి యున్నపుడు నాకు నిర్ణయించినది నేనుగాని, భరతుడుగాని మార్చు కొనుటకు వీలులేదు. వనవాసమునకు నేను జడిసి నాకు బదులుగ భరతుని వనమునకు బంపుటకు వీలులేదు. కైకేయిచెప్పినమాటలే తగినవి. నాతండ్రిచేసిన పనియే మిక్కిలిమంచిది. భరతుడు పెద్దలను

మర్యాద చేయువాడనియు, శాంతముగలవాడనియు, సత్యసంధుడనియు, మంగళకార్యములను జేయువాడనియు నేనెఱుగుదును. నేను వనవాసమునుండి వచ్చినతరువాత నాతనితో కలిసి రాజ్యము చేసెదను. రాజు జీవించియుండ కైకేయి కోరినమాటలను నేను జరిపితిని. భరతుడు నేను చెప్పినప్రకారము జరిపి మాతండ్రి వాక్యము లబద్ధములు కాకుండునట్లు చేయవలె"నని పలికెను.

అసమాన తేజోరాశులగు రామభరతులు కలిసి యిట్లు ధర్మవాదన చేయునపు డాయడవిలోని ఋషులును, నితరఋషులును, నక్కడకు వచ్చియుండిరి. కొందఱుఋషులును, సిద్ధులును సమీపముననే నిలిచి యదృశ్యులుగనుండి 'ధర్మజ్ఞులగు నిట్టిపుత్రులు గలిగినదశరథుడు మిక్కిలిధన్యుడు. మాకు వీరిమాటలింకను వినవలె ననియున్న'దని వానిని గీర్తించిరి. తరువాత ఋషులు మొదలగువారు రావణాసురునివధగోరి భరతునితో నేకగ్రీవముగ నిట్లనిరి. 'నీవు గొప్పకులములో బుట్టినవాడవు; మంచిబుద్ధిమంతుడవు; మంచికీర్తి గలవాడవు. నీతండ్రికి సుఖముకలుగవలెనని నీవు కోరినయెడల రామునివాక్యము వినుము. అతడు తనతండ్రి ఋణముతీర్చినవాడగును. కైకేయిమాటను నిలుపుటచే దశరథుడు స్వర్గమును బొందెను.' ఇట్లు వారు పలికి రామునిపూజల నంగీకరించి తమతమస్థానముల కేగిరి. భరతు డీమాటలను విని శరీరము వణక తనయన్నకు నమస్కరించి మెల్లగ నిట్లనెను. 'మీరు మనకులాచారమును, రాజధర్మము నాలోచించి నాతల్లి వేడినప్రకారము మీరు రాజ్యమును బొందుడు. రాజ్యమును రక్షించుటకును, దేశవాసులను, పట్టణవాసులను సంతోషపఱచుటకును నేనొక్కడను శక్తిపరుడను గాను. మనబంధువులును, స్నేహితులును, సేనానాయకులును మిమ్మే రాజుగ గోరుచున్నారు. మీరు లోకముల పరిపాలింప సమర్థులరు. కాన నీరాజ్యమును నంగీక

రించి దానిని నిలుపుడు.' ఇట్లు భరతుడు వేడుచు రాముని పాదముల మీదబడెను. అంతట రాముడు వానిని లేవనెత్తి తనతొడలపై కూర్చుండబెట్టుకొని యిట్లు సెలవిచ్చెను. 'సహజముగను, పెద్దలవద్ద నుండి నేర్చుకొనుటచేతను నీకు వినయము మొదలగు మంచిబుద్ధులు కలిగినవి. అందుచే నాయనా! నీవు రాజ్యమును రక్షించుటకు సమర్థుడవు. బుద్ధిమంతులగు మంత్రులతోను, మంచియమాత్యులతోను నీవు బాగుగనాలోచించి యన్ని కార్యములను జరుపుము. చంద్రుడు తనకాంతిని, హిమవంతము తనమంచును, సముద్రము తనచెలియలికట్టను విడిచినవిడుచుగాక! నేనుమాత్రము నాతండ్రియాజ్ఞను నెఱవేర్చకుండ విడువను. నీతల్లి కోరికచేతగాని, యజ్ఞానముచేతగాని నీకొఱకిట్లు జరిపినది. నీవు దానిని మనస్సులో నుంచుకొనగూడదు. ఆమెకోరికను తప్పక నీవు జరిపి యామెను తల్లివలె గౌరవింపవలెను.' ఇట్లు రాముడు సెలవీయ వసిష్ఠునిసలహాచే భరతు డాతనితో 'బంగారుతో నలంకరింపబడిన మీపాదుకలను నాకిండు. ఇవియే యన్ని లోకములకు యోగక్షేమములను గలుగజేయు'నన తేజోవంతుడగు నాతడు తనపాదుకలను విడిచి మహాత్ముడగు భరతున కిచ్చెను. అతడువానికి నమస్కరించి రామునితో నిట్లనెను. 'ఈ 14 సంవత్సరములు నేను జటలను, నారచీరలను ధరించి ఫలమూలములభుజించుచు, నయోధ్యవెలుపల నివసించి మీరాక కెదురుచూచుచు, మీపాదుకలపై రాజ్యతంత్రభారము నిలిపి యుండెదను. 14 సంవత్సరములు పూర్తియైనపిదప మీరు రానిచో నేనగ్నిని ప్రవేశించెదను.' ఇట్లు భరతుడు మనవిచేయ రాముడు దానినొప్పుకొని వానిని, శత్రుఘ్నుని కౌగిలించుకొని భరతునికి 'నీతల్లియగు కైకేయిని రక్షింపుము. ఆమెనుగూర్చి నీవు రోషమును జూపకుము. ఇందువిషయమై నేనును, సీతయు శపథముపలుకుచున్నా'మని సెలవిచ్చెను భరతు డాపాదుకలను పూజించి తనయన్నకు ప్రదక్షిణముచే

మంచియేనుగుపై నాపాదుకల నుంచి యాతనివద్ద సెలవుపుచ్చుకొనెను. తరువాత రాముడు తనగురువులను, మంత్రులను, ప్రజలను, తమ్ములను సంతోషపఱచి వారిని సాగనంపెను. కాని తన ధర్మమున తాను హిమవత్పర్వతమువలె స్థిరముగనుండెను. తరువాత నతడు దుఃఖమువలన గొంతుక బొంగురుపోవుటచే మాట్లాడజాలకున్న తనతల్లులను జూచి వారికినమస్కరించి వారివద్ద సెలవుపుచ్చుకొని యేడ్చుచు తనపర్ణశాలను ప్రవేశించెను.

తరువాత భరతుడు పాదుకలను తనశిరస్సుననుంచుకొని శత్రుఘ్నునితోగూడ సంతోషముతోరథమెక్కెను. మంత్రులును వసిష్ఠవామదేవజాబాలులునుముందుబయలుదేఱి చిత్రకూటపర్వతమునకుప్రదక్షిణముచేసి తూర్పుననున్న మందాకినీనదిని దాటిరి. ముందువారు వెళ్ళుచుండ వారివెంట భరతునిరథమును, సైనికులును వెళ్ళిరి. అంతట భరద్వాజాశ్రమము జేరిరి. అక్కడ భరతుడు రథము నుండిదిగి భరద్వాజునికి నమస్కరింప నాతడు వానిని 'నీవుచేయవలసినపని జరిగినదా? రాముని గలిసితివా?' యని యడుగ వాడు జరిగినదంతయు వానికి జెప్పి 'నేను రామపాదుకలను దీసికొని యయోధ్యకు బోవుచున్నా'నని దెలిపెను. అంతట ఋషి 'ఇది చిత్రముకాదు. నీవు నీయన్నమాటలప్రకారము జరుపుట మిక్కిలి యుక్తము. నీవు మంచి గుణములు గలవాడవు. దశరథునికి నీవంటిపుత్రులు కలుగుటచే నాతడు స్వర్గస్థుడైనను నెల్లప్పుడు జీవించియున్నట్లేయగు'నని పలికెను. భరతుడు ఋషికి చాలసారులు ప్రదక్షిణముచేసి ప్రయాణమై తనవారితో నయోధ్యకు బయలుదేఱెను. అందఱు యమునాగంగలను దాటి శృంగిబేరపురము వెళ్ళి యక్కడనుండి యయోధ్యకు వెళ్ళిరి. భరతు డయోధ్యకు వచ్చునప్పటికి పట్టణము చాలవిచారముతో నుండెను. మఱియు పిల్లులతోను, గుడ్లగూబలతోనునిండి యేనుగులసం

చారము, మనుష్యుల సంచారము లేకయుండెను. భరతుడు సుమంతునికి *తాను తన మేనమామపట్టణమునుండి యయోధ్యకు వచ్చినపు డయోధ్యకు గలిగినదురవస్థను దెలిపినట్లు మాటలదెలుపుచు నింకనునిట్లుపలికెను. 'దుకాణములు మూయబడియున్నవి. పట్టణమంతయు మూర్ఛజెందినట్లున్నది. మాయన్న యిచట నున్నరోజుల్లలో ప్రకాశముతోనుండు నీపట్టణ మిప్పుడు ప్రకాశింపకున్నది. అతడు తిరుగనిచటికి వచ్చినప్పు డందఱును సంతోషముతోనుందురు.' ఈతీరున భరతుడు విలపించుచు తనతండ్రినగరు జేరి యొంటరియై మిక్కిలి దుఃఖముతో కన్నీరువిడుచుచు తనతల్లులను రాజనగరులో ప్రవేశపెట్టెను.

---

* 7వ. ప్రకరణము. ౧౧వ. అధ్యాయము. భరతుని పట్టాభిషేక ప్రసంగము 462 పుట జూడుము.

అ. రా:—భరతుడు దర్భలపై ప్రాయోపవేశము జేయునపుడు రాముడు వసిష్ఠునకు కనుసంజ్ఞ చేసెను. అప్పుడు భరతు డొక్కడే యుండుసమయమున వారికులగురువు వాని కిట్లు జ్ఞాన ముపదేశించెను. 'వత్సా! రహస్యమగు విషయమును జెప్పెదను వినుము. రాముడు నారాయణుడు. రావణాసురుని జంపుటకై పూర్వము బ్రహ్మవలన నతడు ప్రార్థింపబడి దశరథునకు కుమారుడై పుట్టెను. యోగమాయ జనకునికి కుమార్తెగ సీతయై జన్మించినది. శేషుడు లక్ష్మణుడై పుట్టి రాముని నెల్లప్పుడు ననుసరించియున్నాడు. వారు ముగ్గురును రావణునిజంపుటకు వెళ్ళెదరు. అనుమానములేదు. కైకేయి పలికిన వరదానము మొదలగు కఠినపుపలుకులన్నియు దేవతలవలననే చేయబడినవి. కానియెడల నామె వానినెట్లు పలుకగలదు? కనుక రాముని నయోధ్యకు తీసికొనివెళ్ళుటకు నీకుగలిగినపట్టుదలను విడువుము. నీవు నీతమ్మునితోను, గొప్పసైన్యముతోను వెనుకకు మరలుము. రాముడు రావణుని, వానికుటుంబమును వానిసంతతిని జంపి

తరువాత భరతుడు మిక్కిలి విచారమునొంది తనగురువులతో నిట్లనెను. 'నేను నందిగ్రామము వెళ్లెదను. మిమ్ములనక్కడకు రాగోరుచున్నాను. అక్కడ రాముని విడుచుటచేగలిగిన దుఃఖమును సహించియుండగలను. రాజు స్వర్గస్థుడయ్యెను. నాయన్న వనమున నున్నాడు. రాముడే రాజు. అతని రాకకొఱకు నేనెదురుచూచుచున్నాను.' భరతునియీమాటలను మంత్రులును, వసిష్ఠుడును విని 'నీవు చెప్పినది మిక్కిలి బాగుగ నున్నది నీయన్నయందలినీవాత్సల్యమున కిది తగియున్నది. నీవు బంధువుల విషయమున మిక్కిలి యాశగలవాడవు,

---

శీఘ్రముగ తిరుగ వచ్చును.' ఈమాటలు భరతుడు విని యాశ్చర్యమును బొంది రామునియొద్దకు బోయి వాని పాదుకలను గోరెను.

భరతుడును, వానితల్లులును నయోధ్యకుబోవ సిద్ధమగుచున్న సమయమున కైకేయి రాముడొక్కడే యుండుసమయమున వాని యొద్దకుబోయి కన్నీరువిడుచుచు విచారముగలమనస్సుతో నిట్లు విన్నవించెను. "రామా! నీరాజ్యవిఘాతమును నేను మాయచే తెలియనిమనస్సుగలదాననై చెడుబుద్ధితో జేసితిని. నాదుర్బుద్ధిని క్షమింపుము. సాధువులు 'క్షమించుటయే ముఖ్య'మనుస్వభావముగలవారు గదా? నీవు సాక్షాత్తుగ విష్ణుడవు; అవ్యక్తుడవు; పరమాత్మవు; సనాతనుడవు. మాయచే మనుష్యరూపమును బొంది లోకమునంతను నజ్ఞానముకలదానిగ జేయుదువు. నీవలననే ప్రేరేపింపబడి లోకమంతయు మంచి చెడ్డలను జేయును. నీయాధీనమునున్న యస్వాతంత్ర్యమగు నీలోకమేమిచేయగలదు? దురుద్దేశముతో నర్తనముచేయు కృత్రిమస్త్రీలవలె బహురూపములతో నర్తనముచేయు మాయ నీయాధీనమై యున్నది. దేవకార్యమును జేయు నీచేతనే ప్రేరేపింపబడి నేను పాపబుద్ధితో పాపిష్ఠికార్యమును జరిపితిని. దేవతలకైనను కనబడనినీవు నాకిప్పుడు ప్రత్యక్షమైతివి. విశ్వేశ్వరా! అనన్తా! జగ

నన్నుదమ్ములయెడ మిక్కిలి స్నేహము గలవాడవును, పెద్దలననుసరించి ప్రవర్తించువాడవును నైయున్నావు. నీవుపలికిన యీమాటలను తప్పక జరుపు'మని పలికెను. ఈమాటలను విని భరతుడు సుమంత్రునితో 'రథమును సిద్ధముచేయు'మని చెప్పెను. పిమ్మట భరతుడు తన తల్లులకు నమస్కరించి సంతోషముతో తనశిరమున పాదుకలనుంచుకొని శత్రుఘ్నునితో రథమెక్కెను. ముందు వసిష్ఠాది గురువులు తూర్పుముఖమున కెదురుగ నందిగ్రామమున నంతయుసిద్ధముచేయు

---

న్నాథా! నన్ను రక్షింపుము. నీకు నమస్కరించెదను. నీజ్ఞానమునెడు శస్త్రముగుఖడ్గముతో పుత్రులు, ధనము మొదలగువానియందలి నాస్నేహమనెడు త్రాటిని తెగఁగోయుము.' ఇట్లు కైకేయి విన్నవింప రాము డిట్లు పలికెను. ఐశ్వర్యవంతురాలా! నీవు నాతో పలికిన దంతయు నబద్ధముకాదు; సత్యమే. నావలన సరస్వతి ప్రేరేపింపబడి నీనాలుకలో ప్రవేశించి దేవకార్యసిద్ధికొఱ కట్లు నీచే పలికించి విడిచినది. ఇంక నీకు దోషమెట్లు? నీవు వెళ్లుము. రాత్రింబగళ్లెల్లప్పుడు నన్ను నీమనస్సులో ధ్యానించుచుండిన దేనియందు స్నేహములేనిదానవై నాభక్తిచే శీఘ్రముగ ముక్తినిబొందెదవు. నేనందఱియందు సమబుద్ధిగలవాడను. కల్పవృక్షమునకువలె నాకు శత్రువుగాని, మిత్రుడుగాని లేడు. నన్ను భజించువానిని నేననుసరించియుందును. నామాయచే మోహింపబడిన బుద్ధిగలవారు నామనుష్యరూపమును జూచి నిజమును దెలిసికొనలేక నేను సుఖదుఃఖాదుల ననుభవించుచున్నానని తలంచుచున్నారు. దైవయోగమున నీసంసారమును బోగొట్టునట్టి జ్ఞానము నీకు లభించెను. నన్ను స్మరించుచు నింటనుండుము. కర్మలు నిన్నంటవు." ఇట్లు రాముడు సెలవీయ కైకేయి వానికి ప్రదక్షిణముచేసి యనేకపర్యాయములు నమస్కరించి గొప్ప సంతోషముతో రాముని జుతించుచు నయోధ్యకు బోయెను.

టకు బయలు దేఱిరి. వారివెంట బలములును, గుఱ్ఱములును, సేనగు లును, రథములునుబయలు దేఱెను. పట్టణవాసులందఱుగూడ బయలు దేఱిరి. అందఱు నందిగ్రామము జేర భరతుడు తనశిరస్సునను న్న పాదుకలతో రథమునుండి క్రిందికిదిగి తనగురువులతో 'ఈరాజ్యమును నాయన్నకు ప్రతినిధిగ నేను పాలించెదను. ఈపాదుకలు యోగ క్షేమములను గలిగించు'నని పలికి యాపాదుకలను క్రిందనునిచి వానికి నమస్కరించి మిక్కిలివిచారముతో ప్రజలతో నిట్లనెను. "వీనికి ఛత్రము పట్టుడు. వీనిని రాముని పాదములుగ భావింపుడు. వీని యందే రాజ్యధర్మమునిలిచియున్నది. స్నేహముచేనాయన్న యీ పాదుక లను నాకిచ్చెను. ఆతడు వచ్చువఱకు నేను పాలించెదను. ఆతడు వచ్చిన వెంటనే యీ పాదుకలాతని పాదములకు తొడిగి యాతని యందు రాజ్యభారము నిలిపి యాతనిని గురువుగ భావించి యాతని ననుసరించియుండెదను. రామునిప్రతినిధులగు నీ పాదుకలకు రాజ్యము నమర్పించి పాపమునుండి తొలగియుండెదను. రాముడు రాజ్యాభి షిక్తుడగునపుడు ప్రజలు మిక్కిలి సంతోషింతురు. అప్పుడు నాకు సంతోషము కీర్తి మిక్కిలిగనగును." ఇట్లు భరతుడు విచారించుచు నందిగ్రామమున నారచీరలను, జటలను ధరించి మునివేషమును దాల్చి మంత్రులతోను, తనసైన్యముతోను రాజ్యముచేసెను. అతడు తనయన్న రాక నిరీక్షించుచు నాతనిమాటలను జరుపుచు తనప్రతిజ్ఞను పాలించుచు నందిగ్రామమున రామపాదుకల నభిషేకించి వానికి రాజ్యతంత్రములన్నియు దెలుపుచుండెను. రాజ్యమంతయు వానికి స్వాధీనముచేసెను. ఏకానుకలు వచ్చినను నే రాజ్యవిషయము నైనను వానికి దెలియపఱచి తరువాత తాను జరుపుచుండెను.

---

ఓమ్

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# విశోధితరామాయణము.

## 8వ ప్రకరణము. రామాదుల వనవాసము.

### ౧ వ. అధ్యాయము.

### రామాదులు చిత్రకూటమున నివసించుట.



భరతుడు రాముని విడిచివెళ్ళినతరువాత రామాదులుచిత్రకూటపర్వతమున సుఖముగ నివసించిరి. *అంతట నొకనాడు సీతారాములా కొండకు నీశాన్యదిక్కున క్రిందిభాగముననున్న సిద్ధాశ్రమమునుండి యాపర్వతముదగ్గఱ సెలయేళ్ళతో నొప్పుచున్న యుపవనములలోను, మంచిపరిమళములుగలచెట్లలోను విహరించుచుండిరి. ఒకచోట నామె తనశరీరము నీటితో తడిసియుండ నాతనితొడ మీఁద కూర్చుండియుండెను. అప్పుడింద్రపుత్రుఁడు కాకరూపము ధరించి భూలోకమునకు వచ్చి మాంసమును తినగోరి సీతయొద్దకు వచ్చి యామెస్తనమధ్యమున బొడిచెను. ఆమె దానిపై మంటిబెడ్డ విసరినను నదియక్కడనే నిలిచి యామాంసమునుగూర్చి తిరుగపొడుచుచుండెను. సీత యాపక్షియందు కోపగించి లేచి దానినికొట్టుటకు తన మొలనూలును లాగుకొనుచుండెను. అందుచేనామెబట్ట జారిపోవుచుం

* 10వ. ప్రకరణము ౯వ, అధ్యాయము హనుమంతుడు సీతకు రాముని యుంగరమిచ్చుట చూడుము.

డెను. రాముఁడు దానిని జూచినవ్వెను. అప్పుడామెకు కోపమును, సిగ్గును రాగ నతఁడామె నోదార్చి తనతొడమీఁద కూర్చుండబెట్టుకొనెను. ఆమె తన నేత్రములనుండివచ్చిన కన్నీటిని తుడుచుకొనెను. అతని తొడపై నాయాసముచే నామె నిద్రించెను. తరువాత రాముఁడు కూడ నామెతొడపై నిద్రించెను. అంతట కాకి తిరుగవచ్చి సీత లేచియుండ నామెస్తనములమీఁద పలుమార్లు పొడిచెను. అప్పుడు సీత రాముని శరీరముపై రక్తబిందువులుపడుటచే నాతని లేపెను. అతఁడు తెలివితెచ్చుకొని యామెను జూచి యామె గాయములకు కారణమును తెలిసికొని మిక్కిలికోపించి 'ఎవఁడు నీస్తనములను బొడిచి యిట్లు క్రీడించె'నని యడిగి యామెసమీపముననున్న వాయసమును, దానిగోళ్ళయందున్న రక్తమును జూచెను. అప్పుడతనికి దానియందు గొప్పకోపము కలుగుటచే దానిని బాధించుబుద్ధితో తనదర్భాసనము నుండి యొకదర్భనుదీసి దానితో బ్రహ్మాస్త్రము నుపయోగించి దానిపై విడిచెను. అది కాలాగ్నివలె మండుచు నాకాశమున పరుగెత్తుచున్న కాకిని వెంటాడెను. ఆకాకి రక్షకునికొఱకై యన్నిలోకముల దిరిగెను. దాని నింద్రుఁడుకాని, బ్రహ్మర్షులుగాని రక్షింపలేదు. అది మూఁడులోకములదిరిగి రామునియొద్దకువచ్చి భూమిపైబడి యాతని శరణుజొచ్చెను. అప్పు డతఁడు చంపదగినయాకాకిని దయతో జూచెను. మఱెక్కడను సుఖమును బొందలేక విచారముతో వచ్చి నిలిచిన దాని నాతఁడు 'బ్రహ్మాస్త్రమును వ్యర్థముచేయుటకువీలులేదు. కాన నీ వేమనెద'వని యడుగ నది 'బ్రహ్మాస్త్రము నాకుడికన్నును తీసికొనవలె'నని పలికెను. అప్పుడు దానికుడికన్ను పోవ దానిప్రాణములు దక్కెను. తరువాత నది రామునికి, దశరథునికి నమస్కరించి తనయింటికి బోయెను.



## ౬వ. అధ్యాయము. రామాదులు చిత్రకూటమును విడుచుట.

భరతుడు రామునివిడిచివెళ్ళిన కొంతకాలమునకు చిత్రకూటమున ఋషులకు భయమును, చిత్రకూటమును విడుచుతొందరయు నున్నట్లు రాముడు తెలిసికొనెను. పూర్వము రామునియొద్దకు వచ్చుచు నాతని నాశ్రయించి విడువని తాపసులకు తమయాశ్రమములవిడుచు తొందరకలిగెను. అతడు తమ్మును రక్షించునో లేదో యను ననుమానము వారిసేత్రములందును ముఖవర్చస్సునందును కనబడుచుండెను. వారు రహస్యముగ కొన్నిసంగతులను మాట్లాడుకొనిరి. దీనినంతయు చూచి రాముడు తనప్రవర్తనవిషయమై యని యనుమానముజెంది వారిలో ముఖ్యుడగువానికి నమస్కరించివానిని 'తపోనిధులగు మీరు పూర్వమువలెగాక మఱియొకతీరున నాచరించుచున్నందులకు పూర్వాచరణకంటె నిప్పటినాప్రవర్తనలో నేమైన భేదమున్నదా? నాతమ్ముడగు లక్ష్మణుడు పొరపాటుచే నేదైన నప్రియకార్యము చేయలేదుగదా? నావిషయమై సేవజేయువదియు, మీసేవయందు మనస్సుగలదియునగుసీత తగినట్లు ప్రవర్తించుటలేదా?' యని రాము డడుగ ముసలివాడును, చిరకాలమునుండి తపస్సు చేయుచున్నవాడునగు ఋషిముఖ్యుడొకడు వణకుచు భూతదయాపరుడగు నతనితో నిట్లనెను. "మంచిస్వభావము కలదియు, మంచియుండే మనస్సుగలదియునగు నామె మఱియొకవిధమున ముఖ్యముగ ఋషులయెడ నేలవర్తించును? నీవిక్కడ నుండుటచే రాక్షసులవలన కీడులు కలుగుచున్నవి. ఋషులు భయపడి వానిని గూర్చియే రహస్యముగ మాటలాడుచున్నారు. రావణుని తమ్ముడగు 'ఖరుడనువాడు జనస్థానముననున్న ఋషుల నందఱిని పాఱద్రోలెను. వాడు క్రూరుడును ధైర్యవంతుడునునై జయముచే ప్రకాశించి మనుష్యులను భక్షించుచు గర్వించి పాపములజేయుచు నిక్కడ నీనివాసమును సహింపకున్నాడు. నీ వీయాశ్రమమునకు

వచ్చినది మొదలు రాక్షసులు తాపసుల కపకారము జేయుచున్నారు. వారి కారక్కసులు భయంకరములును, క్రూరములును, వికృతములునునగు నాకారములను జూపుచు వారిపై నశుచికరము వస్తువులను విడుచుచు కొందఱిని జంపుచున్నారు. వారు ఋషుల యాశ్రమములందు కనపడకుండనిలిచి మునులను నాశనము జేయుచు క్రీడించుచున్నారు. వా రగ్నికార్యములనుండు స్రుక్కులను విసరివేసి యగ్నులలో నీరుజల్లి కలశలను విఱిచివేయుచున్నారు. ఆదురాత్ములచే నాశ్రమములసమృద్ధి తగ్గుచుండుటచే ఋషు లాయాశ్రమములను విడుచుట యందు మనస్సు గలవారై యుతర దేశములకు వెళ్ళ నిశ్చయించి నా కిప్పుడు దానిని తెలియజేసిరి. ఆదుష్ట రాక్షసులు మాశరీరములకు హింస జేయుటచే మేమీయాశ్రమముల విడిచెదము. ఇక్కడికి దూరమున చిత్రమైనదియు, చాలఫలమూలములు గలదియు నగు నాశ్రమమున్నది. పూర్వము మేము నివసించియున్న యా యాశ్రమమునకు నేను వారితో వెళ్లెదను. ఖరుడు నీవిషయమైకూడ నక్రమముగ ప్రవర్తించును. నీకిష్టమున్న యెడల మాతో రమ్ము. నీవెల్లపుడు జాగరూకుడవై యున్నను, సమర్థుడవైనను నీభార్యతో నున్న నీకు నిక్కడినివాసము మిక్కిలి దుఃఖమును గలిగించును.” ఇట్లు వృద్ధఋషి మనవిచేయ రాముడు వారిని నివారించుటకు తగినమాటలను జెప్పలేక తానుకూడ నాయాశ్రమమును విడువనిశ్చయించెను. ఋషిముఖ్యు డాతనిని సంతోషపఱిచి యాతనివద్ద సెలవుపుచ్చుకొని యగ్నికార్యముజరిపి తమయాశ్రమములనువిడిచిన తనబంధువులతో గూడ వెళ్ళెను. రాము డాతనికి నమస్కరించి తనయాశ్రమము చేరెను. మంచిచరిత్రములుగల ఋషులు పూర్వ మొప్పుడును తన్నాశ్రయించియుండుటచే నతడు తనయాశ్రమము నొకనిమిషమైనను విడువలేకపోయెను. తరువాత నతడు ఋషులసంగతి నాలోచించి యక్కడికి భరతుడును, తనతల్లులును, పట్టణవాసులును తన్ను జూడ

వచ్చుటచేతను, వారినిగూర్చి విచారముకలిగించుబుద్ధి తనమనస్సున కెల్లప్పుడు కలుగుచుండుటచేతను, సైన్యమక్కడ విడియుటచే నావన మంతయు పాడగుటచేతను నక్కడనుండుట కిష్టపడక యక్కడనుండి వెడలుట కాలోచించి తనభార్యతోను, తమ్మునితోను నాచిత్రకూటమును విడిచెను.

## ౩ వ. అధ్యాయము. రామాదు లత్రియాశ్రమమునకు వెళ్లుట.

సీతారామలక్ష్మణులు చిత్రకూటమును విడిచి దక్షిణమార్గమున బోవుచు ప్రయాగదేశముననున్న యత్రిమహర్షి యాశ్రమము జేరిరి. అక్కడ రాము డామహర్షికి నమస్కరింప నాముని యాతనిని కుమారునివలె గౌరవించి 'నీవు నాయతిథివిక'మ్మని పలికి యాతని కాతిథ్యము జరిపి సీతాలక్ష్మణులనుగూడ గౌరవించెను. ముసలిదియు, తనకు భార్యయునగు ననసూయను ఋషి పిలిచి యామెతో 'సీతకు మర్యాదజేయుమని చెప్పెను. తరువాత, నాతడు రామునికి*తన భార్య మహిమను దెలిపి 'మాహాత్మ్యముగలదియు, గొప్పకీర్తిగలదియు, నన్నిలోకములవారు నమస్కరింపదగినదియు, కోపము లేనిదియు, ముసలిదియునగు ననసూయను నీవు తల్లివలె పూజింపుము. ఆమె యొద్దకు సీతను వెళ్ళనిమ్మ'నిపలికెను. రాముడు దానికొప్పుకొని ధర్మముల నెఱిగిన తనభార్యతో 'మహర్షిమాటలను నీవు విని యుంటివిగాన నాఋషిపత్నియొద్దకు నీవు వెళ్ళిన నీకు మంచిమేలగు' నని పలుక నామె యట్లు చేసెను. అనసూయ ముసలితనముచే నెండినశరీరము, తెల్లనిజుట్టు కలదై వణకుచుండెను. సీత యామెను జూచి యామెకు తనపేరు దెలిపి నమస్కరించి చేతులుజోడించి సంతోషముతో నామెయారోగ్యమునుగూర్చి యడిగెను. ఆమె శ్రీమంతురాలగు సీతనుజూచి సంతోషముతో నామెకు "అమ్మా నీవు

* ౪వ. ప్రకరణము. ౪వ. అధ్యాయము. అనసూయ చూడుము.

బంధుజనులను, రాజ్య లక్ష్మిని విడిచి దైవయోగమున ధర్మమున జరించుచు రాముని వెంట వచ్చితివి. భర్త పట్టణములో నున్నను, వన ములో నున్నను, పాపియైనను, మంచిప్రవర్తన లేనివాడైనను వతని యందు ప్రేమగల స్త్రీలు గొప్పలోకముల నొందుదురు. అతడు చెడు స్వభావము కలవాడైనను, కాముకుడైనను, ధనహీనుడైనను మంచి స్వభావముగలకులస్త్రీలకు నాతిడే దైవము. వారి కాతనికంటె గొప్ప బంధువు లేడు. స్త్రీలు ముఖ్యముగ తపస్సుకంటెగూడ నెక్కువగ భర్తను తలంపవలెను. అట్టివారికి దోషములు, చెడుసంగతులు కలు గవు. కామములనే కోరుచు పరపురుషులను బొందువారపకీర్తిని బొంది ధర్మమునుదప్పి చేయకూడనిపనులను జేయుదురు. ధర్మమున జరించుస్త్రీలు స్వర్గమును బొందుదురు. నీవు నీభర్త ననుసరించి పతి వ్రతగనుండి యాతనితో ధర్మకార్యముల జేయుచుండిన కీర్తిధర్మము లను బొందెదవ” వని బోధించెను.

సీతకు ననసూయ యట్లు బోధింప నామె “మీరు బోధించిన సంగతులు నా కాశ్చర్యమైనవికావు. ‘స్త్రీలకు భర్తయే గురు’ వని నేను తెలిసికొనియుంటిని. ఆతడు మంచిచరిత్రము లేనివాడైనను నాతనిని నేను తప్పక పూజింపవలెను. నాభర్త మంచిగుణములు కల వాడు; భూతదయాళుడు; ఇంద్రియజయము కలవాడు; ధర్మాత్ముడు; స్థిరమగుననురాగము కలవాడు. అతడు తలిదండ్రులవలె నాయెడ ప్రేమజూపును. అతడు తన తల్లియగు కౌసల్యయందు వర్తించునట్టు లనే యితరతల్లులందుగూడ ప్రవర్తించును. అతడు పరస్త్రీలను జూచి నతోడనే ‘తల్లు’ లను భావముతో మఱలును. మే మీయడవికి వచ్చునపుడు మాయత్తగారిట్లే సెలవీయ నామాటలను నేను నామ నస్సున నెక్కువగ నిలిపితిని. నావివాహకాలమున నాతల్లిగూడ నాకిట్లే బుద్ధులను జెప్పెను. ఆమాటలను మీరు నాకు జ్ఞప్తికి దెచ్చి తిరి. భర్తసేవకంటె స్త్రీ కెక్కువతపస్సు నిర్ణయింపబడలేదు. సావిత్రి తనభర్తకు శుశ్రూషజేసి స్వర్గమునొందెను. మీరుకూడ నట్లే స్వర్గ

మునొందుచున్నారు. రోహిణి తనభర్తయగు చంద్రుని నొకనిమిష మైనను విడిచియుండదు. ఇట్లు మంచిస్త్రీలు తమభర్తలకు శుశ్రూష జేసి పుణ్యకర్మలచే స్వర్గమునకు వెళ్ళియున్నారు.” ఇట్లు సీత తెలుప ననసూయ మిక్కిలిసంతోషించి యామెతలను మూర్కొని ‘నీమాటలు నిశ్చయా’ మని పలికి సంతోషముతో ‘నేను గొప్పతపము జేసితిని. నీకేమి కావలసిన నిచ్చెద’ నని చెప్ప నామె సంతోషించి ‘మీరు చేయవలసినదంతయు జేసితి’ రని పలికెను. అప్పు డనసూయ సంతోషముతో నిట్లు పలికెను. ‘నీకు సంతోషమగు కార్యమును జేసెదను. ఇదిగో మంచివాసనగల మాల్యము. ఇవిగో మంచిబట్టలు; నగలు; పూలదండలు. ఈగంధము నీవు పూసికొనిన నీశరీరము కాంతిగలిగి యుండును. దీనిని నీ వెల్లప్పుడు రాసికొనవచ్చును. ఆలాగు నీవు చేసిన యెడల లక్ష్మి మహావిష్ణుని సంతోషపెట్టునట్లు నీవు నీభర్తను సంతోషపెట్టగలవు.’ ఇట్లనసూయ పలుక సీత వానిని పుచ్చుకొని యామెకు నమస్కరించి ప్రక్కను గూర్చుండెను. అప్పు డాఋషిపత్ని ‘నీవు రాముని స్వయంవరమున బొందితివని నేను వినియుంటిని. కాని యాసంగతి నాకు పూర్తిగ దెలుపు’మని యామెను గోరెను. అంతట నామె *జరిగినదంతయు స్పష్టముగ నామెకు జెప్పెను. ఆసంగతంతయు ననసూయ విని సీతను కౌగిలించుకొని తలను మూర్కొని మధురములగు మాటల నిట్లు పలికెను. “నీవు తెలిపిన వృత్తాంతమంతయు విని నేను సంతోషించితిని. సాయంకాలమాయెను. పగలంతయు నాహారము కొఱకు తిరిగినపక్షు లిప్పుడు తమగూళ్ళకు నిద్రించుటకు వచ్చుచున్నవి. ఋషులు స్నానముచేసి తమయాశ్రమములకు వచ్చుచున్నారు. వారి యగ్నిహోత్రములనుండి పెద్దమంటలు వచ్చుచున్నవి. రాత్రితిరుగు వనజంతువులు సంచరించుచున్నవి. లేళ్లు యజ్ఞ

---

* ౮ వ. ప్రకరణము ౨౦ వ. అధ్యాయము. సీతాజననము. యౌవనము చూడుము.

వేదికలయందు నిద్రించుచున్నవి. ఆకాశమున నక్షత్రములు ప్రకాశించుచున్నవి. చంద్రుడుకూడ నుదయించెను. నీవు వెళ్ళి రామునను సరించియుండుము. నీవు చెప్పినసంగతులకు నే నానందించితిని. వీనిని నాయెదుట నీవలంకరించుకొనుము. నీవు ప్రకాశమానమగు నీ నగలు పెట్టుకొనిన నాకు మిక్కిలిసంతోషము కలుగును." ఇట్లనసూయ పలుక సీత యట్లొనర్చి యామెకు సాష్టాంగముగ నమస్కరించి రామునియొద్దకు వెళ్ళెను. అత డామెను జూడ నామె తనకు ఋషిపత్నియిచ్చిన వస్తువులసంగతి నాతనికి దెలిపెను. అంతట రామలక్ష్మణులు సీతకు జరిగిన గౌరవమునుజూచి మిక్కిలి సంతోషించిరి.

ఆరాత్రి ఋషులును, సిద్ధులును వారికి మర్యాదచేయ వారక్కడ నివసించిరి. ఆమఱునాడు వారు లేచి కాలకృత్యముల దీర్చుకొని స్నానముచేసి యగ్నిహోత్రోపాసన జేసి యక్కడనుండి వెళ్లుటకు ఋషులను సెలవడిగిరి. అంతట వారు వనమునకు తాము కందమూలాదుల దెచ్చుటకు వెళ్ళుచుండుటయు, రాక్షసు లక్కడ నుపద్రవముల జరుపుచుండుటయు, నక్కడ మనుష్యభక్షకులగు రక్కసులనేకులును, క్రూరమృగములును నుండుటయు, ఋషి యెవడైన నశుచిగనుండినను, నే మరియుండినను వారివలన తినబడుచుండుటయు, వారికి దెలిపి 'దానిని మీరు నివారింపు' డని వారిని కోరిరి. ఇంకను వారు ఋషులు వనమునకు బోవుత్రోవయిదియనియు, నీలాగు వెళ్ళినదట్టమైన యడవియుండుననియు వారికి దెలిపిరి. రామలక్ష్మణులు వారికిచేతులుజోడించి నమస్కరించి వారివలన దీవనలను బొంది సూర్యుడు మేఘములలో బ్రవేశించునట్లు సీతతో నత్రియాశ్రమమునకు దక్షిణముననుండు దండకారణ్యములోనుత్తరభాగమగు జనస్థానమును బ్రవేశించుటకు వెడలిరి.

శ్రీరాముడు దండకారణ్యములోని భాగమగు జనస్థానమును ప్రవేశించి యచట ఋషులయాశ్రమములను జూచెను. అక్కడ ఋషులు తమతడిబట్టలను చెట్లకు గట్టియుండిరి. కుశలంతటను నుండెను. ఆయాశ్రమములసమూహము తపస్తేజోమహిమలచే సూర్యునివలె ప్రకాశించుచుండెను. వారియిండ్లయెదుట నంగణములు బాగుగ తుడువబడి దుమ్ము రేగకుండునట్లు నీరు బాగుగ జల్లబడియుండెను. అక్కడ ననేకమృగములు, పక్షులు నివసించియుండెను. ఆశ్రమములలోని యగ్నిగృహములు చర్మములతోను, కుశలతోను, స్రుక్స్రువాది యజ్ఞోపకరణములతోను, నప్సరసలనృత్యముతోను నిండియుండెను. కొందఱు ఋషులు బలిహోమములను జేయుచుండిరి. కొందఱు వేదము చదువుచుండిరి. కొంద ఱడవిపువ్వులతో పూజలు చేయుచుండిరి. అక్కడక్కడ పద్మములతోనిండిన చిన్నకొలనులుండెను. ఫలమూలములచే జీవించువారును, నారచీరలను, లేడిచర్మములను కట్టువారును, సూర్యాగ్నులవంటి తేజస్సుగలవారును, దివ్యజ్ఞానము, బ్రహ్మజ్ఞానము కలవారును, వృద్ధులునునగు మును లక్కడ తపస్సు చేయుచుండిరి. వారిని జూచి రాముడు తనవింటినారిని వదులుగ జేసెను. అక్కడిఋషులు చంద్రునివలె ప్రకాశించురామునికి, సీతాలక్ష్మణులకుగూడ నెదురువెళ్ళి వారిముగ్గురిని దీవించిరి. రామునియావనసౌందర్యమును, కాంతిని, సౌకుమార్యమును జూచి వారాశ్చర్యమునొందిరి. అక్కడనున్న మృగపక్షులుగూడ సీతారామలక్ష్మణులసౌందర్యమును కనురెప్పవేయక చూచుచుండెను. అప్పుడు ఋషులతిథులైన వారిముగ్గురిని తమపర్ణశాలకు దీసికొనివెళ్ళి వారికి నర్ఘ్యపాద్యములను, ఫలమూలములను, పుష్పములను, నితరపదార్థములను నిచ్చిరి. వారు రామునికి చేతులు జోడించి యిట్లనిరి. 'నీవు మాకు ధర్మపాలకుడవుగాన పూజనీయుడవు; గురుడవు; పాపుల దండింపదగిన

వాడవు. ఇంద్రుని యంశములో నాల్గవభాగము కలవాడై రాజు ప్రజలను రక్షించి మంచిభోగముల ననుభవించును. నీ దేశవాసులమగు మేము నీవలన రక్షింపబడదగినవారము. నీవు పట్టణమందున్నను, నడవిలోనున్నను నీజనులమగు మాకు నీవే పరిపాలకుడవు. మేము క్రోధమును జయించి యింద్రియములను వశపఱచుకొనుటచే మాకు బాధ కలిగించినవారికి శాపమియ్యలేము. నీవు నీకుమారులవలె మమ్ములను గూడ రక్షింపవలెను.' ఇట్లు ఋషులు మనవిచేసి సీతారామలక్ష్మణులకు నాతిథ్యమిచ్చిరి. ఇట్లు సకలలోకేశ్వరుడగు రాముని వారు తృప్తినొందించిరి. రామాదులా రాత్రి యక్కడ నిలిచి మఱునాడుదయమున నందఱియొద్ద సెలవు పుచ్చుకొని మహావనమున కేగిరి.



## ౫ వ. అధ్యాయము.

## విరాధునివధ



సీతారామలక్ష్మణులు ఋషులయాశ్రమములవిడిచి యడవికి బోవుచు గొప్పవనమధ్యమునకు వచ్చిరి. అక్కడ చెట్లు, లతలు, పొదలు మిక్కిలి నలిగియుండెను. అక్కడ నీరెక్కడను లేకుండెను. పక్షులు, పురుగు లేమియుధ్వనిచేయకుండెను. అక్కడ లేళ్ళు, పులులు, నక్కలు నుండెను. అట్టిచోట వారు కొండశిఖరమువంటిరూపముగలవాడును, మనుష్యభోజనుడును, పెద్దకంఠధ్వనికలవాడును, లోతైన కండ్లు, పెద్దనోరు, పెద్దకడుపు, మిక్కిలిమొత్తైనశరీరము, భయంకరమైనరూపము, హెచ్చుతగ్గులుగలయవయవములు గలవాడును, వికార

స్వరూపముగల వాడునునగు నొక్క రాక్షసు నొకనిని జూచిరి. వాడు కట్టుకొనిన పులిచర్మము రక్తమాంసములతో తడిసియుండెను. అన్ని జీవులకు భయముకలుగునటుల వానినోరు తెఱువబడియుండెను. భోజనమునకై వానియినుపశూలమునకు మూడుసింహములును, నాలుగు పెద్దపులులును, రెండుతోడేళ్లును, పదిలేళ్ళును, నొక పెద్ద యేనుగు తలయు గుచ్చబడియుండెను. వాడు మిక్కిలి ధ్వనిచేయుచు నక్కడ నిలిచియుండెను. వాడు సీతారామలక్ష్మణుల జూచి కోపముతో వారి యొద్దకు పరుగెత్తివచ్చి భూమివణకుచునటుల పెద్దధ్వని జేసి సీతను తనతొడను జేర్చుకొని యిట్లు పలికెను. "మీరిద్దఱు నారచీరలనుగట్టుకొని జటలను ధరించి చేతులతో ధనస్సులను, కత్తులను పట్టుకొని స్త్రీతో దండకారణ్యమునకు మీప్రాణములను గోలుపోవుటకు వచ్చియున్నారు. తాపసులగు మీకు స్త్రీతో సవాసమేందులకు? పాపులగు మీరు దొంగముని వేషములధరించి యధర్మముగ జరించుచున్నారు. ఎవరును చొరరాని యీ గొప్పవనములో 'విరాధు' డనుపేరుగల నేనాయుధములబట్టి యెల్లపుడు ఋషిమాంసముల భుజించుచు తిరిగెదను. ఈమె నా భార్యయగును. మిమ్ములను యుద్ధములో జీల్చి మీ రక్తమును నేను త్రాగెదను." ఇట్లారాక్షసుడు గర్వపుమాటలు బలుక సీత మిక్కిలి భయముతో వణకసాగెను. రాముడి దంతయు జూచి లక్ష్మణునితో నిట్లనెను. "జనక మహారాజుకుమార్తెయు నాకు భార్యయు, మంచిప్రవర్తనగలదియు, సుఖముగనుండునదియు నగు సీత యిప్పుడు విరాధుని తొడపైనున్నది. కైకేయి మనలకూర్చి వర రూపమునగోరిన ప్రియముగుకోరిక యిప్పుడే సఫలమైనది. ఆమె తన కుమారునకు రాజ్యలాభముచు కలుగజేయుటయే గాక యన్ని భూతము లందు దయగలనన్ను వనమునకుబంపి తనకోరికను నెఱవేర్చుకొన్నది. నా భార్యను పరపురుషుడు స్పర్శించుటచే నాతండ్రిమరణము వలనను,

రాజ్యముపోవుటవలనను కలిగినదుఃఖముకంటె నెక్కువ దుఃఖము నాకు కలుగుచున్నది.” ఇట్లు రాముడు పలుక కోపముచే బుసకొట్టు పామువలె లక్ష్మణుడు ‘ఇంద్రతుల్యుడవును, సర్వభూతములకు నాథుడవునగు నీవు నేను నీ సేవజేయుచుండ ననాథునివలె నేల పరితాపము నొందెదవు? నేను విరాధుని బాణముతో గొట్టిచంప వాని రక్తము భూమిపై వరదలై పాఱును. రాజ్యముగోరిన భరతునిపైని నాకు గలిగినకోపమును నింద్రుడు వజ్రాయుధమును విడుచునటుల వీనిపై నేను విడిచెదను. నేను వానివక్షస్థలమున నొకబాణమువిడువ వాడు గిరగిరతిరిగి భూమిమీదపడి ప్రాణమువిడుచునని మనవిచేసెను.

అంతట విరాధుడు వారిని ‘మీరెవరు? ఎక్కడకు వెళ్ళెద’రని పెద్దగొంతుకతో నడిగెను. అప్పుడు రాముడు వానితో తామిక్ష్వాకుకులజులనియు, మంచిచరిత్రముగలక్షత్రియులనియు,వనములో దిరుగుచుండిరనియు చెప్పి ‘దండకావనములో దిరుగునీ వెవ్వడ’వని వానినడిగెను. ఆరాక్షసుడు తాను జయునకును శతహ్రదకును పుట్టినవాడనియు, తన్ను రాక్షసులందఱు ‘విరాధు’డని పిలిచెదరనియు, తాను తపస్సుచేసి శస్త్రములవలన చావుకలుగకుండను, వానివలన జీల్చబడకుండను, కొట్టబడకుండను బ్రహ్మవలన వరముపొందెననియు పలికి యిట్లనెను. ‘ఈస్త్రీని మీరువిడిచి యీమెయం దెట్టియాశయు లేనివారై వచ్చినత్రోవను తొందరగ వెళ్ళుడు. అట్లయిన మీప్రాణములను నేను పుచ్చుకొనన’నని పలుక రాముడు కోపముతో కండ్లెఱ్ఱజేసి పాపబుద్ధియు, వికృతరూపము గలవాడునునగు విరాధునితో ‘ఛీ! నీచుడా! తుచ్ఛమైనకోరికవలన నీవు నిశ్చయముగ యుద్ధములో చావును దెచ్చుకొనుచున్నావు నిలువుము. నేనుండ నీప్రాణములతో నీ వెక్కడికిని వెళ్ళలే’వని పలికి ధనస్సెక్కుపెట్టి శీఘ్రముగబోవు వాడియగు నేడుబాణములను వానిశరీరమునవిడిచెను. అవి వానిశరీరమున బ్రవేశించి రక్తముతో బయలువెడలి యగ్నివలె వెలుగుచు క్రింద

బడెను. అప్పుడు విరాధుడు సీతను క్రిందనునిచి యింద్రధ్వజమువలె పెద్దదియు వజ్రముతో సమానమును, మిక్కిలి ప్రకాశమానమును నగు నొక పెద్దశూలమును జేతధరించి గొప్పధ్వని జేయుచు నోరు తెఱచు కొని కోపముతో రామలక్ష్మణులయొద్దకు పరుగెత్తుకొని వచ్చెను. అప్పుడు వారాతనిపై బాణవర్షము కురిపించిరి. దానికి వాడు నవ్వి రుద్రుడై నిలిచి విజృంభింప బాణములు వానిశరీరమునకు తగిలి క్రింద పడెను. తరువాత నా రాక్షసుడు బలముకొఱకు తనహృదయమున ప్రాణములబిగబట్టి శూలముపై కెత్తి వారిదగ్గఱకు పరుగెత్తెను. రాముడాశూలమును రెండుబాణములతో ముక్కలుగ జేయ వజ్రాయుధముచే తెగిన మేరుపర్వతపు రాళ్ళవలె నది వానిచేతినుండి క్రిందబడెను. అప్పుడు రామలక్ష్మణులు తమఖడ్గములను బట్టుకొని తమదగ్గఱకు వచ్చుచున్న రాక్షసునిగొట్టిరి. విరాధుడు వారిని తనబాహువులతో బట్టి మోసికొనివెళ్ళిపోవుట కాలోచించుచుండ రాముడు దానినిగ్రహించి లక్ష్మణునితో 'ఏకష్టే చేయుగాక! ఏత్రోవను వాడు మనలను మోసికొనిపోవునో యాత్రోవనే మన మిప్పుడు వెళ్ళవలె' నని పలికెను. విరాధుడు తనబలముచే రామలక్ష్మణులను భుజములపై పిల్లలనువలె నెక్కించుకొని పెద్దధ్వని జేయుచు వనమువైపు పోవుచుండెను.

ఇట్లు విరాధుడు రామలక్ష్మణులను తనభుజములపై నెక్కించుకొని మోసికొనిపోవుచుండ సీత పెద్దకంఠముతో నిట్లు మొఱపెట్టెను. 'దశరథపుత్రుడగు నీరాము డెప్పుడు సత్యముపలుకుచు మంచి సుగుణములుగలిగి శుచిగనుండును. ఘోరస్వరూపుడగు రాక్షసుడు రామలక్ష్మణులను తీసికొనిపోవ నన్ను నక్కలును, పెద్దపులులును, చిఱుతపులులును తినివేయును. రాక్షసోత్తమా! నీకు నమస్కరించెదను. వారిని విడిచి నన్ను హరింపుము.' సీతపలికిన యీమాటలను వీరులగు

రామలక్ష్మణులు విని యాదుష్ట రాక్షసునిజంపుటకు తొందరపడి వాని యెడమ భుజమును, లక్ష్మణుడును, కుడిభుజమును రాముడును ఖడ్గము లతో బలముగ నఱికిరి. దానితో పెద్దకొండవలెనుండు నారాక్షసుడు క్రిందపడెను. అప్పుడు వారాతనిని పిడికిళ్ళతోను, మునుకులతోను పొడిచి కాళ్ళతో పలుమార్లుతన్ని పిండిచేసిరి. మఱియు వారాతనిపై బాణములను విడిచి ఖడ్గములతో వానిని నఱికినను వాడు చావలేదు. అంతట రాముడు వాడు చావకపోవుటచూచి 'లక్ష్మణా! వీడుతపస్సు చేసి వరములనుబొందుటచే వీనిని మనము శస్త్రములచే జయించుటకు వీలులేదు. కాన గోయితీసి యందు వీనిని పాతిపెట్టుద'మని పలికెను. ఆమాటలను విని విరాధుడు వినయముతో వాని కిట్లనెను.* "పురు షోత్తమా! యింద్రతుల్యులగుమీబలముచే నేను చనిపోవుచున్నాను. పూర్వము మీసంగతి యజ్ఞానముచే తెలిసికొనిలేకపోతిని. కౌసల్యా నందనా! నీసంగతియు, సీతాలక్ష్మణులసంగతియు నాకిప్పుడు తెలిసెను.

---

* అ: రా:—విరాధుని రామలక్ష్మణులు బాణములతో గొట్టి చంపినతరువాత వానిశరీరమునుండి మిక్కిలిసుందరమైనవా డును, ప్రకాశమానమగు దేహముకలవాడును, శుభ్రమైనబట్టలు కట్టు కొనినవాడును, మంచిబంగారునగలు ధరించినవాడునునగు దివ్య పురుషు డొకడు బయలువెడలెను. అతడు రామునికనేకపర్యాయ ములు నమస్కరించి భూమిమీదపడి యిట్లు ప్రార్థించెను. 'శ్రీరామా! పూర్వము నేను మిక్కిలి తేజోవంతుడగు విద్యాధరుడను. దుర్వాసుడు కారణములేక నాపైకోపముతెచ్చుకొని పూర్వము నన్నుశపించెను. మీవలన నాశాప మిప్పుడు నన్ను విడిచెను. ఇటుపైని మీపాదము లపై నాకు జ్ఞానమెప్పుడును నాశనరాహిత్యముగాఉండుగాక! మీనామసంకీర్తన మెల్లప్పుడు నాశ్రవణపుటంబుల నిలుచుగాక! మీ కథల నే నెల్లప్పుడు వినుచుందునుగాక! వాతల మీపాదములవల కెల్ల

పూర్వము నేను 'తుంబురు' డను గంధర్వుడను. అప్పుడు నేను కుబేరునికి పరిచర్య జేయుచుంటిని. నే నొకదినమున రంభాలోలుడ నై యతని సేవచేయక యాతనికి కనబడకుండ నుండుట జూచి యాతడు నన్ను 'నీవు రాక్షసుడ వై పుట్టు' మని శపించెను. నే నతనిని వేడుకొన నాతడు 'దాశరథీ రాముడు నిన్ను యుద్ధములో జయించును. తరువాత పూర్వమువలె నీవు స్వర్గములో నుండెదు' వని నాకు సెలవిచ్చెను. నీదయచే నే నాకఠినమగు శాపమునుండి తొలగితిని. నేను స్వర్గమునకు బోయెదను. మీరు శుభముగ నుందురుగాక! ఇక్కడికి నాలుక్రోసుల దూరమున సూర్యునితో సమానమగు కాంతిగలవాడును, ధర్మాత్ముడును, గౌతమవంశజుడునగు శరభంగమహర్షి తనయాశ్రమమున నున్నాడు, మీ రాతనియొద్దకు శీఘ్రముగ బోయిన నతడు మీకు మేలుకలిగించును. నన్ను మీరు గోతిలో పాతిపెట్టి కుశలముగ

---

పుడు నమస్కరించుచుండుగాక! నా చేతులు మీపాదపద్మముల నెల్లపుడు పూజించుచుండుగాక! భగవంతుడా! శుద్ధజ్ఞానస్వరూపుడా! ఆత్మారాముడవును, ప్రజలను రమింపజేయువాడవును, పరబ్రహ్మవును, సీతారాముడవునగు నీకు నమస్కారము. రామా! నీయందు భక్తిగల నన్ను రక్షింపుము. మీయొద్ద సెలవుపుచ్చుకొని నేను దేవలోకమునకు బోయెదను. మీమాయ నన్నావరింపకుండుగాక!'

ఇట్లు విరాధుడు ప్రార్థింప వానియందు ప్రీతిగలవాడై రాముడు వానికట్లే వరమిచ్చి 'విద్యాధరా! నీవు వెళ్ళుము. నాదర్శనముచే నీవు మాయవలనపుట్టిన దోషములనన్నింటిని జయించితివి; సద్యోముక్తిని బొందితివి; జ్ఞానవంతులలో శ్రేష్ఠుడ వైతివి. లోకమునకు నాయందు భక్తిగలుగుటకష్టము. ఒకవేళ కలిగిన నదితప్పక ముక్తినికలిగించును. నీవు గొప్ప భక్తిగలవాడవు. నాయాజ్ఞచే నీవు గొప్పలోకమునకు బొమ్మని సెలవిచ్చెను.

వెళ్ళుదు. రాక్షసులు మరణాంతమున పాతిపెట్టబడినయెడల గొప్ప లోకముల బొందుదురు. ఇదియే సనాతన (శాశ్వత)మగు ధర్మము." విరాధుని యీమాటలను విని రాముడు లక్ష్మణునితో 'వీడు పెద్ద యేనుగువలె నున్నాడు. ఈక్రూరకర్మునికై ఒక పారతో పెద్దగోతిని త్రవ్వు' మని పలికి యారాక్షసుని మెడను తనపాదముతో నొక్కి పెట్టెను. లక్ష్మణు డట్లే యారాక్షసునిప్రక్కను పెద్దగోయిత్రీసెను. అంతట రాముడు తనపాదమును దీసెను. విరాధుడు పెద్దధ్వనిచేయు చుండ వారు వానిని గోతిలోనికి త్రోసి దానిపై రాళ్ళునుంచిరి. ఇట్లు వారు క్రూరరాక్షసుని జంపి సీతను దీసికొని సంతోషముతో భూమి పైని సూర్యచంద్రులవలె ప్రకాశించిరి.

---

## ౬. వ అధ్యాయము.

## శరభంగదర్శనము, సుతీక్ష్ణసమాగమము.

రాముడు విరాధునిజంపినతరువాత సీతను కౌగిలించుకొని యామెనోదార్చి లక్ష్మణునితో 'దట్టమైనయీయడవిలో మన ముండుట కష్టము. మనమిక్కడనుండదగినవారముకాము. మనము శీఘ్రముగ శరభంగమహర్షియొద్దకు వెళ్లుద'మనిపలికెను. తరువాత వా రాతనియాశ్రమము సమీపించిరి. అంతట రాముడు *రథము తోను, పరివారముతోను నచటికి వచ్చినయింద్రుని జూచి లక్ష్మణు నికి నాతనిసంగతంతయు స్పష్టముగ దెలిపి 'నీ విచట నొకగడియ సీతతోనుండిన నేను ఋషియొద్దకు బోయి రథముననున్న యాతని సంగతంతయు కనుగొనెద'నని చెప్పి యాయాశ్రమమునకు బోవు చుండెను. ఈసంగతి యింద్రుడు చూచి తానే ముందుగ ఋషి

---

* 2వ ప్రకరణము, 8వ- అధ్యాయము. ఇంద్రుడు, దేవతలు చూడుము.

యొద్దకు వెళ్ళి రహస్యముగ నాతనితో నిట్లు పలికెను. 'ఇదిగో! రాము డిక్కడికి వచ్చెను. అతడు నాతో మాట్లాడకపూర్వమే రావణవధరూపమగు తనప్రతిజ్ఞను నెఱవేర్చుకొనవలెను. పిమ్మట నింద్రలోకమున నాతో మాట్లాడవలెను. అతడు శీఘ్రముగ తన కార్యమును జరిపి జయమును బొందినతరువాత వానిని నేను జూచెదను. ఇతరులు చేయలేని గొప్పపని యితడు చేయవలసియున్నది. అది పూర్తిజేసి తరువాత నతడు స్వర్గమున నన్ను జూచును.' ఇట్లింద్రుడు శరభంగునితో పలికి యతనివద్ద సెలవు పుచ్చుకొని వానిని గౌరవించి రథమెక్కి తనవారితో తనలోకమునకు బోయెను. తరువాత సీతారామలక్ష్మణు లాఋషి యగ్నిహోత్రము జేయుచుండ నాతనిపాదములమీదబడి యాతనియనుజ్ఞ బొంది యారోజక్కడ నతిథులుగ నివసించుటకు వానిచే సత్కరింపబడి కూర్చుండిరి. అప్పుడు రాము డింద్రుని రాకగూర్చి యాఋషి నడుగ నాతడు జరిగినదంతయు వానికి దెలిపి యింకను నిట్లనెను. "నేను గొప్పతపస్సు చేసి సామాన్యులుపొందలేని బ్రహ్మలోకమునకు నింద్రుడు నన్ను పిలుచుచున్నాడు. మీరు శీఘ్రకాలములో నిచ్చటకు వత్తురని నే నెఱిగి మిమ్ము జూడగోరి బ్రహ్మలోకమునకు వెళ్ళకనిలిచియున్నాను. రామా! ధర్మబుద్ధిగల మహాత్ముడవగు నీతో కలిసినతరువాత స్వర్గమునకు బోయెదను. నేను తపస్సుచే నాశనములేనిలోకములను బొందగలిగితిని. నా బ్రహ్మలోకసుఖమును, స్వర్గలోకసుఖములను మీకిచ్చెదను గ్రహింపుము." ఇట్లాఋషి సెలవీయ రాముడు 'నీవిచ్చిన లోకములఫలములను నేను గ్రహించెదను. ఈయడవిలో నాకు తగిన నివాసమేర్పఱుపగోరెద'నని పలుకశరభంగుడు "ఇక్కడ 'సుతీక్ష్ణు'డను ధార్మికుడగు ఋషికలడు. అతడు సుందరమగుస్థలమున మీకు మంచి నివాస మేర్పఱచును. నీవాతనియొద్దకు వెళ్ళుము. ఈమందాకినీనదీ

ప్రవాహమున కెదురుగ వెళ్లుము. అక్కడక్కడ నీనది నీకు లోతులు చూపును. ఇదిగో! త్రోవ. ఇక్కడ నొకగడియయుండుము. పాము తన పాతపొరను విడచునటుల నేను నాశరీరమును విడిచెద"నని వానికి సెలవిచ్చి యగ్నినుపాసనజేసి మంత్రములతో నేతిని దానిలో వేల్చి తానందు బ్రవేశించెను. అప్పుడాతని రోమములు, జుట్టు, ముసలి చర్మము, ఎముకలు, రక్తమాంసములు కాలిపోవ సీతారామలక్ష్మణు లాశ్చర్యపడిరి. ఆయగ్నినుండి యగ్నితేజుడగు శరభంగుడు యౌవన పురుషాకారముతో లేచి యగ్నికర్మలుచేయువారు పొందులోకము లను, గొప్పఋషులు పొందులోకములను దాటి బ్రహ్మలోకము నకు బోయి బ్రహ్మను, నతనియనుచరులను జూచెను. బ్రహ్మ యామహర్షియొద్దకు వచ్చి సంతోషించి 'నీరాక లెస్స' యని పలికెను.

అప్పుడు శరభంగాశ్రమమునకు రాముని జూచుటకు వచ్చిన యనేకవిధములగు*ఋషులు యాతనితోనిట్లు విన్నవించిరి. 'నీవిక్ష్వాకు కులములో ముఖ్యుడవు. దేవతలకు నింద్రుడువలె నీవు భూలోకమున కధిపతివి. నీకీర్తియు, నీపితృభక్తియు, పరాక్రమము, సత్యము, ధర్మము మూడులోకములకు విశదమయ్యెను. ధర్మజ్ఞుడవగు నీ వాశ్రితులను రక్షించువాడవుగాన నిన్నొకటికోరుచు దానిని నీకు జెప్పవచ్చితిమి. మమ్ము క్షమింపుము. రాజులు ప్రజలకువచ్చు రాబడిలో నాలవ భాగము పుచ్చుకొని వారిని రక్షింపకపోయిన నారాజులకు ధర్మహాని కలుగును. వారు ప్రజలను రక్షించిన గొప్పసుకృతములు కలుగును. మేమందఱము వానప్రస్థాశ్రమమున నున్నగొప్ప బ్రాహ్మణులము. నీవే మాకు రక్షకుడవు. రాక్షసులు మమ్ము మిక్కిలి బాధించు చున్నారు. నీవు మాదగ్గఱకువచ్చి మాశరీరములజూడుము. అడవిలో

* 3 వ. ప్రకరణము ౧ వ. అధ్యాయము ఋషులలక్షణములు చూడుము

ననేక రాక్షసులు మమ్ము హింసించిరి. పంపానదీతీరమునను, మందాకినీనదీతీరమునను, చిత్రకూటపర్వతమునను నివసించిన మాకు వారివలన గొప్పబాధలు కలుగుచున్నవి. భయంకరమగుపనులు చేయు రాక్షసులు ఋషులకు జేయు బాధలను మేము సహింపలేము. మేము ఫలమూలములచే జీవించుచున్నను, నిష్ఠతో వ్రతములను జరుపుచున్నను మాకు సుఖములేదు. క్రూరులును, భయంకరులునగు రాక్షసులు మమ్ము తినివేయుచున్నారు. నీవు మమ్ము రక్షింపవలెను. రక్కసులు హోమకాలములందును, పూర్ణిమామావాస్యలందును మాయాశ్రమములకు వచ్చి మమ్ము తిరస్కరించి మాకర్మలకు భంగము కలుగజేయుచున్నారు. మాకు నీవే గతి. మేము మాతపఃప్రభావముచే వారిని శపించి మాబాధలను తప్పించుకొనగలముగాని తపస్సు చేయుట కష్టము. దాని కనేక విఘ్నములు కలుగుచుండును. చాల కాలమునుండి యార్జించిన తపస్సును బోగొట్టుకొనలేము. కనుక మమ్ము భక్షించు రాక్షసులను మేము శపింపలేకున్నాము. మేము మీయన్నదమ్ములిద్దఱికరుణకు పాత్రులము. మీరు రక్కసులను సంహరించి మమ్ము పూర్తిగ బాలింపుము. *నీవు శరణ్యుడగినవాడవు. నీయొద్దకు మేము శరణుబొందుటకు వచ్చితిమి. నీవు మమ్ములనందఱిని పాలించి రాక్షసులబాధలనుండి తప్పింపుము. నీవు తప్ప యీలోకములో మఱియేదిక్కు మాకు గానరాదు." ఇట్లు ఋషులు విన్నవింప రాముడు వారితో నిట్లు పలికెను. "మీరట్లు పలుకవలదు. నేను మీచే నాజ్ఞాపింపబడువాడను. నేను నాతండ్రిచే నాజ్ఞాపింపబడి నాస్వ

---

అ. రా:—భూభారమును పోగొట్టుటకై విష్ణువగు నీవు బ్రహ్మచే ప్రార్థింపబడి రాముడవై యవతరించితివి. లక్ష్మి సీతయై పుట్టినది. శేషుని యంశమున లక్ష్మణుడు పుట్టెను. శంఖచక్రములు భరతశత్రుఘ్నులైరి.

కార్యమును నెఱవేర్చుకొనుటకు వనములో ప్రవేశింప వలసివచ్చెను. దైవయోగమున నసురులబాధ మీకు తప్పించి మీ కార్యముజరుపుట తటస్థించెను. నే నీ వనమున కాపుర ముండెదను. అందువలన మీకు గొప్పలాభము చేకూరును. నేను యుద్ధములో మీ శత్రువులగు రాక్షసులను జంపెదను. మాయన్నదమ్ములపరాక్రమములను ఋషులగు మీరు చూచెదరు." ఇట్లు రాముడు వారికి నభయ మొసంగెను. తరువాత వారును, సీతారామలక్ష్మణులును సుతీక్ష్ణునియొద్దకు బయలుదేఱిరి.

వారు బాగుగ ప్రవహించు నదులను దాటి వెళ్లుచు పెద్దపర్వతము దగ్గఱనుండు గొప్పవనమును బ్రవేశించిరి. తరువాత వారు నారచీరలతోను, పుష్పఫలవృక్షములతోను నొంటిగనున్న సుతీక్ష్ణుని యాశ్రమముచేరిరి. చిరకాలమునుండి తపము జేయుచున్న యా ముసలి మహర్షి మలము,బుగ్గికలశరీరముకలవాడై జటలను ధరించియుండ రాముడతనికి తనపేరు తెలిపి ధర్మజ్ఞుడగు నాతనిని తనతో కొంత సేవు సంభాషించుటకు కోఱ నతడు వానినిజూచి కౌగిలించుకొని యిట్లనెను. *"రామా! నీరాక లెస్స. ఈయాశ్రమమునకు నీవు ప్రభుడవు. మీ

---

అ. రా:—సుతీక్ష్ణుడు సీతారామలక్ష్మణులను జూచి వారి నిట్లు ధ్యానించెను. "రామా! మీతారకమంత్రమును నే నెల్లప్పుడు జపించుచుందును. మీపాదములను శివుడును, బ్రహ్మయుగూడ నాశ్రయింతురు. మీ రనేక గుణములు గలవారు. మీకెవరును సాటిలేరు. నేను మీదాసులదాసుడను. సంసారమనెడుసముద్రమును దాటించుటకు మీపాదములు తెప్పవంటివి. లోకములకు తెలియునిమీరు నన్ను భార్యాపుత్రగృహాదులనెడి చీకటినూతిలో నీమాయచే పడియున్నవానిగను, మలము (క్రొవ్వు మొదలగునవి) మొదలగువానితోను, మోహపాశములతోను కట్టబడియున్నవానిగను దెలిసికొని మీరిప్పుడు

రిక్కడుండవచ్చును. నే నీభూలోకమున దేహమును విడిచి యిక్కడ నుండి దేవలోకమునకు బోవసిద్ధమై నీరాక కెదురుచూచుచు నిచట నిలిచితిని. నీవు చిత్రకూటమునకు వచ్చుట, రాజ్యవిహీనుడవగుట మొదలగుసంగతులను వినియుంటిని. ఇక్కడకు దేవేంద్రుడు వచ్చి నాతో 'ఇక్కడకు రాముడు వచ్చెను. నీవు నీపుణ్యకర్మలచే సర్వలోకములను జయించితి'వని చెప్పెను. నాతపస్సుచే నార్జించిన వానినన్నిటిని నీకు సమర్పించెదను." ఇట్లు సుతీక్ష్ణుడు పలుక రాము డతనితో నిట్లనెను. 'మీ రిచ్చిన వానిని నేను గ్రహించెదను. నాకీవనమున మంచినివాసము నిర్ణయింపుడు. మీరన్ని జీవుల సుఖమును కోరువారు. మీరన్నివిషయములందు నేర్పుగలవారు. మహాత్ముడగు శరభంగుడు మీసంగతంతయు నాకు దెలిపెను.' ఇట్లు రాముడు విన్నవింప దానికామహర్షి మిక్కిలి సంతోషమునుబొంది

---

స్వయముగ జూడవచ్చితిరి. మీరన్నిజంతువులహృదయములందు నివసింతురు. మీమంత్రజపమం దిష్టములేనివారియందు మీరు మాయను గలిగింతురు. మీమంత్రసాధనముగలవారిని మాయ విడుచుచుండును. మీమంత్రసేవననుసరించు ప్రజలకు రాజువలె తగినఫలముల నొసంగుచుందురు. జగత్సృష్టికి, రక్షణకు, నాశనమునకు మీరే కారణమయ్యును సత్త్వరజస్తమోగుణములుగల మాయచే బ్రహ్మవిష్ణుమహేశ్వరరూపముల మీరు పొందుదురు. దేవా! సూర్యుడు వేఱువేఱు నీటిపాత్రలందు వేఱువేఱుగ గనబడురీతిని మీరొక్కరేయైనను మోహ (అజ్ఞాన) బుద్ధిగలవారికి ననేకరూపములుగ గనబడుదురు. రేశమైనను తమోగుణసంపర్కములేని మీ చరణారవిందములను నేనిప్పుడు ప్రత్యక్షముగ జూచుచున్నాను. మీరు సత్పురుషులుగానివారికి గనబడకున్నను మీ తారకమంత్రముచే శుద్ధమగు మనస్సుగలవారి కెల్లప్పుడును మీరు దయజూపుదురు. మీరు రూపములేని

'ఈయాశ్రమము మంచిది. ఇచట ఫలమూలములు మిక్కిలిగ దొరకును. ఋషులనేకు లిక్కడికి వచ్చుచుందురు. నీవిక్కడ సుఖముగ నుండవచ్చును. కాని యిచట నొకయిబ్బందికలదు. లేళ్ళనేకము లిటు నటు వనమున సంచరించి భయములేనివై యిక్కడికి వచ్చుచుండును. ఇంతకంటె నిచట నేదోషములే'దని పలికెను. దానికాతడు 'నేను ధనస్సుసంధించి బాణములను విడిచి యొకనిమిషములో వానినన్నిటిని జంపగలను కాని యప్పుడు మీమనస్సు ఖేదమునొందును. అంతకంటె కష్టమగునని యింకేమి గలదు. అందుచే నిక్కడ నేను చాల కాలముండుట కిష్టపడ'నని మనవిచేసెను. అప్పటికి సాయంకాలమాయెను. రాముడు సాయం సంధ్యవార్చెను. సీతారామలక్ష్మణు లా రాత్రి యాతనియాశ్రమమున నిలిచిరి. ఆఋషి వారికి ఋషులు భుజించునాహారములను బెట్టెను.

---

---

వారైనప్పటికి మీమాయామానుష విగ్రహమును నేను జూచుచున్నాను. దేశకాలాములవలన మార్పులు లేనిదియు, ననంతమునునగు మీరూపము గొప్పచిత్స్వరూపముగ జనులు తెలిసికొనెదరుగాక! ఇప్పుడు ప్రత్యక్షముగ గనబడు నీరూపమే నామనస్సులో నెల్లప్పుడు నిలుచుగాక. నేను మఱియొకదానిని గోరను." ఇట్లు సుతీక్ష్ణుడు రాముని బొగడ నాతడు 'మునీంద్రా! నామంత్రోపాసనచే నీమనస్సు శుభ్రముగనున్నదని నాకు దెలియును. కనుకనే నేను నిన్ను జూడ వచ్చితిని. నావలనతప్ప యితరులవలన ముక్తి గలుగదు. నామంత్రము నుపాసించువారు లోకములో నన్నే శరణుబొందుదురు. వారికి గోరికలు లేవు; మఱిదేనియందు బుద్ధియుండదు. నేను వారికి ప్రతిదినమున గనబడుచుందును. నాయుపాసనచే నీవు ముక్తినొందితివి. ఈ దేహము విడిచిన తరువాత నీకు విష్ణుసాయుజ్యము కలుగు'నని సెలవిచ్చెను.

## ౭ వ. అధ్యాయము.

## సీతారామలక్ష్మణులు పదిసంవత్సరములు ఋష్యాశ్రమముల నివసించుట.



సీతారామలక్ష్మణులు సుతీక్ష్ణునియాశ్రమమున నా రాత్రిని గడిపి మఱునాటి యుదయమున వేగముగ లేచి చెరువులో స్నానము చేసి యగ్నికార్యమును, దేవపూజను విధ్యుక్తముగ జరిపి సూర్యునికి నమస్కరించి పాపమునుండి తొలగి సుతీక్ష్ణునియొద్దకు వెళ్ళి యిట్లనిరి. 'మీవలన తగినమర్యాదలను బొంది సుఖముగనుంటిమి. పుణ్యశీలు రగు ఋషులు తమయాశ్రమములనన్నిటిని జూచుటకు మమ్ము తొందరజేయుచున్నారు. సూర్యునితాప మెక్కువ కాక పూర్వమే మేముచటికి వెళ్ళదలచుచున్నాము.' ఇట్లు రామలక్ష్మణులు పలికి యాఋషిపాదములబట్టి నమస్కరించిరి. అతను వారిని లేవనెత్తి కౌగిలించుకొని యిట్లనెను. 'మనుష్యుని వెంబడించు నీడవలె నిన్ను వెంబడించు సీతతోను, లక్ష్మణునితోను నీవు వెళ్లుము. మీకు దారిలో శుభమగుగాక! మీరు దండకారణ్యమునమున్న ఋషులయాశ్రమములకు పుష్కలముగదొరకు ఫలమూలములను భుజించి పుష్పించినవనములను, విరోధములేక యుండు మృగపక్షులు మొదలగు జంతువులను జూచి తిరుగ నాయాశ్రమమునకు రండు.' ఇట్లాఋషి కోర వారు 'అట్లే చేసెద'మని పలికిరి. తరువాత వారాతనికి ప్రదక్షిణము చేసి బయలుదేఱుటకు సిద్ధముగనున్నపుడు సీత వారికి నమ్ములపొదులను, ధనస్సులను, ఖడ్గములను నిచ్చెను. వారు వానిని బట్టుకొని యాయాశ్రమమునుండి యామెతో బయలుదేఱిరి. వారియావిశేషములు, దేదీప్యమానముగ ప్రకాశించు వారికాంతి వర్ణింపనలవి కాకుండెను. ఋషులు వారితో వెళ్ళుచుండిరి.

దారిలో సీత రామునితో 'కారణము లేకుండ రాక్షసులతో విరోధము తెచ్చుకొని వారిని చంపవల'దని చెప్పదలచి వానితో నిట్లు విన్నవించెను. "కోరికవలనవుట్టుదోషములలో ననత్యమాడుట గొప్పది. దానికంటె పరస్త్రీగమనము, విరోధములేక హింసచేయుట మిక్కిలి గొప్పదోషములు. మీరెవ్వుడును మీస్త్రీయందే యభిలాషగలిగిన ధర్మాత్ములు. మీతండ్రియాజ్ఞ ప్రకారము జరుపు సత్యపరిపాలకులు కాన మీకు మొదటిరెండుదోషములు లేవు. కాని మీకు మూడవది కలదు. మీరు దండకారణ్యములోనుండు ఋషులను రక్షించుకొఱకు 'రాక్షసులను యుద్ధములో జంపెద'నని ప్రతిజ్ఞచేసియుండిరి. ఇందులకే మీరును, మీతమ్ముడును నయోధ్యనుండి బయలుదేఱినపుడు బాణములను, ధనస్సులను బట్టి బయలుదేఱిరి. అప్పుడే మీయిహపర సౌఖ్యములనుగోరు చుండు నామనస్సునకు విచారమయ్యెను. అప్పుడు నాకు దండకావనమునకు వెళ్ళుట కాసక్తి లేకుండెను. దానికి గారణము చెప్పెదను వినుడు. మీరును, లక్ష్మణుడును నాయుధములబట్టి బయలుదేఱి వనములో తిరుగునపుడు రాక్షసులందఱిని జూచి కొన్ని బాణములైనను విడిచెదరు. అగ్నికి కట్టెలువలె క్షత్రియులకు ధనస్సులుండిన వారికి తేజోబలము లెక్కువగును. తపసుచేయువా రాయుధముల బట్టకూడదు. దీనికొక యితిహాసముకలదు. పూర్వమొక ఋషి తపస్సుజేయుచు సత్యవచనుడు, శుచియునై వనజంతువుల యెడ దయగలవాడై యుండెను. ఆతనితపస్సునకు విఘ్నముచేయుటకై యాలోచించి యింద్రుడొకభటునివలె వచ్చి వాడియగు ఖడ్గమొకటి తెచ్చి దాని నాతనికిచ్చి 'దీనిని నీయొద్ద దాచిపెట్టు'మని చెప్పి వెళ్లెను. ఆఋషి దానినెల్లపుడు భద్రపఱచుటకు తాను ఫలమూలముల దెచ్చునపుడుకూడ దానిని వనమునకు దీసికొని వెళ్ళుచుండెను. క్రమక్రమముగ నాతనికి పూర్వపుబుద్ధిమాఱి దానితో

నన్నిటిని నటకవలెనను బుద్ధికలిగెను. దానితో నతడు జంతువులను జంపి యధర్మముజరిపి నరకమునకు బోయెను. అగ్నివలన నెట్లు భయముకలుగునో యట్లే శస్త్రమువలనగూడ భయముకలుగును. రామా! మీయందలిస్నేహమర్యాదలచే నేనీసంగతులను మీకు జ్ఞాపకము తెచ్చితిని; కాని మిమ్ము నిరోధించుశక్తిగలదాననుగాను. ధనస్సును బట్టినమీరు దండకారణ్యవాసులగు రాక్షసులను విరోధము లేకుండ నెంతమాత్రము చంపగూడదు. ఇతరులనుగూడ నపరాధము లేకుండ చంపుటకు నేనిష్టపడను. క్షత్రియవీరులు ధనస్సులనుబట్టి చాలకాలమునుండి వనమున నివసించుచు రక్కసులచే బాధింపబడుచున్నవారిని రక్షింపవలయునే గాని శస్త్రముపట్టితిరుగు క్షత్రియుడు వనములో నివసింపగూడదు. క్షత్రియధర్మమునకు తపస్సునకు పరస్పరవిరోధము. వనముననివసించుమనము తపోధర్మము నవలంబింపవలెను. మీకు శస్త్రములతో పనిచేయు మనస్సుకలిగిన మనము తిరుగ నయోధ్యకు బోయి క్షాత్రధర్మ మవలంబించెదము. మనము రాజ్యము విడిచి ఋషులవలె జరించిన మామామయగు దశరథునకును నాయత్తయగు కౌసల్యకును గొప్పప్రీతికలుగును. ధర్మమన్నిటికిని మూలము. మనము తగినవ్రతములజరిపి ధర్మ మాచరించెదము. ఎప్పుడును సుఖములవలన సుఖములు కలుగవు. నియమములచే శరీరమును కష్టపెట్టినయెడల ధర్మములు కలుగును. మీరు తపోవనమున నెల్లప్పుడు మంచిమనస్సుతో ధర్మమాచరించిన మీకు మూడు లోకములలో జరుగునదంతయు తెలియును. నేను స్త్రీబుద్ధిచే దీనిని మీకు జెప్పితిని. మీకు ధర్మముగూర్చి చెప్పుటకు శక్తికలవారెవరు? మీతమ్మునితో మీరు బాగుగనాలోచించి శీఘ్రముగ దగినకార్యము జరుపుడు." ఇట్లు సీత రామునితో విన్నవించెను.

రాముడామె మాటలను విని యామెకిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "నీవు నీకులమునకుదగినట్లు ప్రియముగు మంచిమాటలను నాయందలి

ప్రేమచే బలికితివి. నీవు ధర్మము తెలిసినదానవు. 'క్షత్రియులు దీను లను రక్షించునపుడే ధనస్సును బట్టవలె'నని నీవు యుక్తముగ పలికి తివి. క్రూరకర్మలనుజేయు రాక్షసులవలన నీదండకావనమున గొప్ప బాధలను, భయమును నొంది రక్షింపబడదగిన ఋషులు నన్ను శరణు వేడిరి. 'మీవంటిమహర్షు లిట్లు నన్నాశ్రయించుటవలన నాకు లజ్జ కలుగుచున్నది. నే నేమి చేయగల'నని నేను పలుక వారు వారికష్టము లను పూర్తిగ నాకు దెలిపిరి. తరువాత నేను 'రక్కసుల నిర్మూలము జేసెద'నని ప్రతిజ్ఞచేసితిని. ఋషులయెడ నేను చేసినప్రతిజ్ఞను తప్పక జరుపవలెను; నిజముగ నాచరించుటయే నాకిష్టము. నేను ప్రాణముల నైనను, నిన్నైనను, లక్ష్మణునినైనను విడిచెదను గాని నేను చేసిన ప్రతిజ్ఞనుమాత్రము విడువను. ముఖ్యముగ ఋషులయెడ చేసిన ప్రతి జ్ఞను విడుచుటకు వీలులేదు. వారిచే కోరబడకుండగనే నేను వారిని పరిపాలింపవలెను.అట్టిచో వారిచే కోరబడికూడ వారినెట్లు పరిపాలింప కుందును. నీవు నాయందలిస్నేహానురాగములచే చెప్పినందులకు సం తోషించితిని. దానివలన నాయందు నీ కయిష్ట మేదియు కానరాదు. నీవు నీకులమునకును నీగుణములకును తగినట్లు పలికితివి. నీవు నా ప్రాణములకంటె నెక్కువదానవు. నాతో సరిగ ధర్మము జరుపుము."
ఇట్లు రాముడు సెలవీయ వారందఱు సంభాషించుచు నడచుచుండిరి.

ముందు ధనస్సునుబట్టిన రాముడును, తరువాత సీతయు, వారి తరువాత లక్ష్మణుడును వనసౌందర్యములను జూచుచు ఋషులతో వెళ్లుచుండిరి. వారనేకవిధములగు కొండచరియలను, నడవులను, నదు లను, వానియిసుకతిన్నెలందుండు వివిధహంసలను, చక్రవాకపక్షు లను, పద్మములను, నీటిపక్షులువిహరించుసరస్సులను, గుంపులుగుంపు లుగ తిరుగులేళ్ళను, మెలితిరిగిన కొమ్ములుకల మదించినదున్నుపోతు లను, నడవిపందులను, చెట్లనువిఱుచు నేనుగులను జూచుచు చాల

దూరము వెళ్ళిరి. అప్పటికి సాయంకాలమాయెను. అక్కడ వారికి మిక్కిలి సుందరమైనదియు, నెటుచూచినను 4 క్రోసులపొడుగు, వెడల్పులు గలదియు, మంచిపద్మములుకలదియునగు నొకసరస్సు కనబడెను. దానిలో నేనుగులగుంపులును, హంసలు మొదలగుజలపక్షులును క్రీడించుచుండెను. దానిమధ్యనుండి మధురమైనగానము, వాద్యములశబ్దము వినిపించుచుండెను. కాని పైకెవరును గనిపింపకుండిరి. రామలక్ష్మణులు దానిని గూర్చి ధర్మభృత్యుడను ఋషినినడుగ నతడు వారికి *మాండకర్ణియను ఋషిచరిత్రమును, నతడాసరస్సులోనున్న గృహములో నైదుగురప్సరసలతో విహరించుటయు, నది వారిగీత వాద్యనృత్యవిశేషములధ్వనియనియు, నాసరస్సు పంచాప్సరస్సరస్సని పేరొందెననియు, దానిలోనన్నికాలముల నీరుండుననియు దెలిపెను. సీతారామలక్ష్మణు లాయంశములను వినుచు మిక్కిలి యాశ్చర్యమునొందిరి. తరువాత వారొక మునియాశ్రమముజేరి యచట నిలిచిరి.

ఈతీరున సీతారామలక్ష్మణు లొకయాశ్రమమువిడిచి మఱియొకయాశ్రమమునకు బోవుచు గొప్ప యంత్రములబట్టి తిరిగిరి. వారును, సీతయు కొన్నియాశ్రమములలో సుమారు 10 మాసములును కొన్నిటిలో నొకసంవత్సరమును, కొన్నిటిలో 14 మాసములును, కొన్నిచోట్ల 5, 6, 8 మాసములును, కొన్నిచోట్ల మఱింతయెక్కువ కాలమును, కొన్నిచోట్ల 1మాసము 15రోజులును సుఖముగనుండి యొకమాఱుచూచినయాశ్రమములకు కొన్నిటికి తిరుగబోవుచు పది సంవత్సరములిట్లు ఋష్యాశ్రమములగడపి తిరుగ సుతీక్ష్ణునియాశ్రమము జేరిరి.

---

* 3 వ. ప్రకరణము ౫ వ. అధ్యాయము మాండకర్ణి చూడుము.

## ౮౫. అధ్యాయము.

## సీతారామలక్ష్మణు లగస్త్యాశ్రమమును, పంచవటిని జేరుట.



సీతారామలక్ష్మణులు ఋష్యాశ్రమములు దిరిగి సుతీక్ష్ణాశ్రమమునకు వచ్చి యక్కడ ఋషులతో నిష్టాగోష్ఠి సలుపుచు కొంతకాలము సుఖముగ నుండిరి. అంతట నొకనాడా ఋషి కూర్చుండియుండ రాముడు వినయముగ నాతనితో నిట్లనెను. 'ఈయరణ్యమున ఋషిశ్రేష్ఠుడగు నగస్త్యుడు నివసించియున్నాడని నేనెల్లప్పుడు వానిసంగతులను వినుచుంటిని. అతడుండుచోటు నాకు తెలియదు. అతనియాశ్రమమెక్కడ? మీదయచే నేను నా భార్యతోను, తమ్మునితోను గలిసి యాతనియొద్దకు బోయి వానికి నమస్కరింపగోరుచున్నాను. నేనతనికి స్వయముగ సేవ జేయవలెనని నామనస్సులో గొప్పయభిలాష గలదు.' ఇట్లు రాముడు మనవిచేయ సుతీక్ష్ణుడాతనితో నిట్లనెను. "నీవు నీ భార్యతోను, తమ్మునితోను కలిసి యాతనియొద్దకు వెళ్ళుమని నేను నీకు చెప్పదలచియుంటిని. దైవవశమున నాసంగతి నీవే నాతో బలికితివి. వానిసోదరునియాశ్రమము నిక్కడకు దక్షిణదిక్కున 16 క్రోసుల దూరమున నున్నది. అది సమతలభూమిపైనుండును. అక్కడ పిప్పలివనమును, పుష్పఫలభారముచే వంగిన చెట్లును, మిక్కిలిగ కూయు పక్షులును, మంచినీటిసమృద్ధిగలసరస్సులును, నాసరస్సులక్రీడించు హంసలు, చక్రవాకములు మొదలగుపక్షులును నుండును. దారిలో పెద్దవనములును, గొప్పపర్వతములును, పెద్దకొలనులును, నదులును నుండును. మీరా యాశ్రమమున నొకరాత్రి నిలువుడు. ఆమరునాటి యుదయమున లేచి మీరు పెద్దచెట్లప్రక్కనున్న త్రోవనుబట్టి దక్షిణముగ 4 క్రోసులదూరము వెళ్ళిన నగస్త్యునియాశ్రమము జేరెదరు. అక్కడ మీరు విహరింపవచ్చును. మీరు వెళ్ళవలెనని మనస్సుగలిగిన నిక్కడనుండి వెంటనే బయలుదేరుడు." ఇట్లు సుతీక్ష్ణుడు సెల

వీరు సీతారామలక్ష్మణు లాతనికి నమస్కరించి వెంటనే బయలు దేఱి వెళ్ళిరి. దారిలో నన్నియు జూచుచు వారగస్త్యునితమ్ముని యాశ్రమము దగ్గఱకుబోయిరి. అక్కడ రాముడు లక్ష్మణునకు *వాతాపి యిల్వలులకథను దెలిపెను. అప్పటికి సాయంకాలమయ్యెను. అప్పుడు వారు సంధ్యావందనము చేసికొని యాయాశ్రమము జేరి యాఋషికి నమస్కరించిరి. అతడు వారికి తగినమర్యాదలనుజరిపి ఫలమూలముల భోజనము పెట్టింప వారు దానిని భుజించి యారాత్రి యక్కడ నివసించిరి.

అమఱునాటియుదయముననే వారు లేచిరి. రాముడాఋషిని 'నిన్నటిరాత్రి యిక్కడ సుఖముగనుంటిమి. మీయన్నగారిని జూచుటకు వెళ్లుచున్నాము. సెలవీయవలె'నని కోర 'అట్లే జరుపు'డని యాతడు పలికెను. సీతారామలక్ష్మణులు సుతీక్ష్ణుడు చెప్పినమార్గమున బోవుచుండిరి. దారిలో వారికి పనస, మామిడి మొదలగుచెట్లనేకములు కనబడెను. అవి పూవులతో నిండియుండెను. వానిని కొన్నిటిని నేనుగులు విఱిచియుండెను. వానిపై కోతులు గంతులు వేయుచుండెను. మదించినపక్షు లనేకములు కూయుచుండెను. అక్కడ చెట్లయాకులు దట్టముగనుండుటయు, జంతువులు పరస్పరవైరములేక యుండుటయుజూచి రాముడు లక్ష్మణునితో 'మన మగస్త్యునియాశ్రమము సమీపించితిమి. ఈతనిమాహాత్మ్యము నీకు తెలుపుచున్నాను. మనమాతనియొద్దకు వెళ్ళిన నాతడు మనకు శ్రేయస్సుకలిగించును. నేను మిగిలినవనవానకాలమంతయు నీతనిసేవజేసి వెళ్ళుచున్న'దని చెప్పి *యాఋషిమాహాత్మ్యమునుగూడ వర్ణించి చెప్పెను. తరువాత రాముడు తాము వచ్చినసంగతి ఋషికి దెలుపుటకు ముందుగ లక్ష్మణుని నగస్త్యునియాశ్రమమునకు బంపెను.

---

*3వ. ప్రకరణము. 3వ అధ్యాయము. అగస్త్యుడు చూడుము.

అట్లు లక్ష్మణుం డాఋషియాశ్రమమునకు బోయి యాతని శిష్యుని కలిసికొని తనసంగతంతయు వానికి దెలిపి తా మామహర్షిని జూడగోరి వచ్చినట్లామహర్షికి దెలుపవలెనన నాతడు 'అట్లేచేసెద' ననిపలికి మహర్షి కావిషయము దెలియజేయుటకు వానియగ్ని గృహము ప్రవేశించెను. ఆశిష్యు డాఋషికి నమస్కరించి తాను విన్నదంతయు వానికి దెలిపెను. ఆమాటల నగస్త్యుడు విని 'దైవయోగమున చాలకాలమున కీదినమున రాముడు నన్ను జూడవచ్చెను. ఆతని రాక నేను మనస్సులో మిక్కిలిగ గోరుచుంటిని. సీతారామలక్ష్మణులను శీఘ్రముగ తీసికొనిరమ్మని వానికి సెలవిచ్చెను. శిష్యుడు చేతులు జోడించుకొని 'అట్లే చేసెద'నని పలికి తొందరగ లక్ష్మణుడుండుచోటికి వచ్చి 'రాము డెక్కడుండెను? మామహర్షి యాతనిని జూడగోరుచున్నా'డనిపలికెను. అంతట వారిద్దఱు కలిసి యాశ్రమద్వారమువద్దనున్న రాముని ప్రక్కకు బోయిరి. లక్ష్మణు డాశిష్యునికి సీతారాములజూప నాతడు వారికి వినయముగ తనగురునియాజ్ఞను దెలిపి యథావిధిగ వారిని మహర్షియొద్దకు దీసికొని వెళ్ళెను. రాము డక్కడ బ్రహ్మవిష్ణుమహేశ్వరుల పూజాస్థలములను, సూర్య చంద్ర భగ ధాత విధా తాగ్ని కుబేర వాయు యమ వరుణులస్థానములను, ననంతునిస్థలమును, కుమారస్వామిస్థానమును, గాయత్రీస్థానమును, నష్టవసువులపూజాస్థలములను జూచెను. అగస్త్యుడు లేచి ఋషులతోను, శిష్యులతోను నతని కెదురేగెను. అప్పుడతడు తనతమ్మునితో 'చూడుము. అగస్త్యుడు వచ్చుచున్నాడు. అతని తేజఃప్రభావముచే నాతడే యాఋషియనియు, ఋషులలో నాతడు గొప్పవాడనియు పోల్చెద'నని పలికి యామహర్షి పాదములబట్టెను. తరువాత సీతాలక్ష్మణు లాతనికి నమస్కరించిరి. అగస్త్యుడు వారికి నర్ఘ్యపాద్యములనిచ్చి తగినయాసనముల జూపి కుశలప్రశ్న లడిగెను. ఆతడగ్నినుపాసించి వారికి నతిథిమర్యాదలనుజరిపి తాపసభోజనము

పెట్టించెను. ఆఋషియు గూర్చుండి రామునితో నిట్లనెను. 'ముని యగువాడు మొదట నగ్నినుపాసించి తరువాత నతిథుల పూజింప వలెను. అట్లుచేయనివా డబద్ధపుసాక్ష్యము చెప్పినవానివలె తనమరణాంతమున తనమాంసమును తానే తినును. అన్నిలోకములకు ప్రభుడవును, ధర్మప్రవర్తనగల మహారథుడవును, మర్యాదకు పాత్రుడవును, ప్రియమైనయతిథివియునగు నీవు వచ్చితివి.' ఇట్లు ఋషిపలికి ఫలములను, దుంపలను, పుష్పములను రామునకిచ్చి వానిని సంతోషపఱచి యింకను నిట్లు పలికెను.

"బంగారుతో నలంకరింపబడిన విష్ణుసంబంధమగు నీగొప్ప ధనస్సును విశ్వకర్మ నిర్మించెను. వ్యర్థముకానిదియు, సూర్యుని తేజముతోసమానమగు ప్రతాపముకలదియునగు నీబాణమును నాకు బ్రహ్మయిచ్చెను. అక్షయమగు వాడిబాణములుకల యీరెండమ్ముల పొదులను నింద్రుడిచ్చెను. బంగారుకట్లుగల యీఖడ్గమునకు వెండి పేటిక కలదు. ఈధనస్సుతో విష్ణువు రాక్షసులను యుద్ధములో నిర్మూలముజేసి దేవతలకు జయలక్ష్మిని జేకూర్చెను. అట్టియీయాయుధములను పుచ్చుకొని నీవు జయమునొందుము." ఇట్లాఋషి పలికి వానిని రామునకిచ్చి యిట్లు సెలవిచ్చెను. "రామా! లక్ష్మణా! మీరు సీతతో నన్ను జూడవచ్చినందులకు నాకు మిక్కిలి సంతోషమైనది. నడచివచ్చుటచే మీరు చాలబాధను బొందితిరి. ఈమె కొంతసేపు విశ్రాంతిగోరుచున్నది. ఈమె సుకుమారియయ్యు, నిదివఱకు దుఃఖము

---

అ. రా—అగస్త్యుడు రాము డొక్కడేయుండుసమయమున నతనికి నమస్కరించి యతనినిట్లు ప్రార్థించెను."మీరాకకై నేనెదురు చూచుచుంటిని. పాలసముద్రముచివరను పూర్వము బ్రహ్మ మిమ్ము భూభారమును బోగొట్టుటకై రావణునివధనిమిత్తము ప్రార్థించినది మొదలు నేను మీదర్శనముకోరి తపస్సుచేయుచు మిమ్మే స్మరిం

చుచు మునులతో నివసించుచున్నాను. సృష్టికి బూర్వము మార్పు లేనివారును, నుపాధి (ఆశ్రయము) లేనివారునునగు మీరొక్కరే యుండిరి. మిమ్మాశ్రయించినదియు, మీసంబంధమగునదియునగు మాయ మీశక్తియని చెప్పబడును. నిర్గుణులగు మిమ్మాశక్తి యావరించుకొనియుండు నంతకాల మాస్వరూపమును వేదాంతము బాగుగ నెఱిగినవారు 'అవ్యాకృతి' మని పిలిచెదరు. కొందఱు దానిని మూల ప్రకృతియనియు, కొందఱు మాయ, అవిద్య, సంసృతి, బంధము మొదలగునవియనియు ననేకనామములతో పిలిచెదరు. ఆమాయ మీచే కలకలపెట్టబడినదై మహాత్తత్త్వమును బుట్టించును. దానివలన మీయాజ్ఞచే నహంకారముపుట్టును. అహంకారము మహాత్తత్త్వముచే నావరింపబడి సాత్త్విక, రాజస, తామస యహంకారములని మూడు విధములాయెను. తామసయహంకారమువలన సూక్ష్మతన్మాత్రలు పుట్టెను. తరువాత నాతన్మాత్రలనుండి యొకదానికంటెనొకటి యెక్కువ

పరమాత్మకు మాయ
యాశ్రితురాలు.
|
మహాత్తత్త్వము.
|
అహంకారము.
|
| సాత్త్విక | రాజస | తామస |
|---|---|---|
| దేవతలు, మనస్సు. | ఇంద్రియములు. | పంచతన్మాత్రలు పంచస్థూలభూతములు. |

లచే బీడింపబడనిదయ్యు తనభర్తయందలి యనురాగముచే గొప్ప కష్టములుగలయడవికి వచ్చినది. ఈ యాశ్రమములలో నామెకు సుఖముకలుగునటుల యత్నింపుము. ఆమె నీతో వనమునకు వచ్చుట యను గొప్పకష్టమగుపని జరిపినది. సృష్టికాలమునుండియు స్త్రీలకు సాధారణముగ తమభర్త మంచిస్థితిలోనున్న యాతనిని సంతోష పెట్టుటయు, నతడు బీదస్థితిలోనున్న నాతని విడుచుటయు స్వభావము. వారు మెఱుపువలె చంచలస్వభావముకలవారును, శస్త్రమువలె క్రౌర్యముగలవారును, గరుత్మంతవాయువులవేగము వంటి తొందర గలవారును నైయున్నారు. నీభార్యకిట్టిదోషము లేమియులేవు. ఆమె కొనియాడదగిన మంచిగుణములుగల గొప్పపతివ్రత. సీతయు, లక్ష్మ

---

గుణములుగల యాకాశాది స్థూలభూతములు పుట్టినవి. రాజసయహంకారమువలన నింద్రియములును, సాత్త్వికయహంకారమువలన దేవతలును, మనస్సును బుట్టెను. ఈయన్నిటివలన సర్వవ్యాపకమగు లింగముకలిగెను. అది యన్నిటియందు దారమువలె నంటియుండెను. స్థూలభూతములవలన విరాట్టు జన్మించెను. విరాట్పురుషునివలన స్థావరరూపమైన జగత్తును, కాలానుసారముగను, కర్మానుసారముగను దేవతిర్యఙ్మనుష్యరూపమగు జంగమజగత్తును జన్మించినవి. మీరు రజోగుణమును బొందుటచే జగత్తును సృజించుబ్రహ్మయైతిరి. సత్త్వగుణముచే మీరు విష్ణువై లోకములను బాలించుచున్నారని బుద్ధిమంతులు పలుకుదురు. మీమాయాగుణములభేదముచే మీరే యాలోకములను నాశనమొనర్చుటకు రుద్రులైతిరి. 'స్వప్నము, నిద్ర జాగ్రత్తులను వృత్తులు బుద్ధివలనబుట్టిన గుణములవలన నేర్పడును. వీనికి విలక్షణులగు మీరు చిత్తోగూడి నాశనరహితులై యన్నిటిని జూచుచుందురు. లీలయగుసృష్టిని మీరు చేయగోరినప్పుడు గుణవంతులువలె మాయనంగీకరింతురు. 'విద్య, అవిద్య'యని మాయ

ణుడును, నీవును నివసించుదేశము మిక్కిలిపుష్కలముగ నుండును.”
ఇట్లగస్త్యుడు సెలవీయ రాముడతనికి నమస్కరించి వినయముతో
నిట్లనెను. ‘నా భార్యగుణములకును, నాతమ్మునిగుణములకును మీరు
సంతోషించినందులకు నేను ధన్యుడనైతిని. మేమెల్లపుడు సుఖముగ
నివసించుకొఱకు మంచినీటివసతిగలదియు,ననేకములగు చెట్లుగలదియు
నగు నాశ్రమమొకటి మాకు సెలవిండు.’ ఇట్లు రాముడు వానినిగోర
దానికి మహర్షి కొంచెము సేపాలోచించి యిట్లుపలికెను.

“ఇక్కడికి 8 క్రోసులదూరములో మంచిఫలములు, దుంపలు
కలదియు, మంచినీటివసతికలదియు, నెక్కువజంతువులు కలదియు,

---

రెండువిధములుగ నుండును. అవిద్యకు లోబడినవారు ప్రవృత్తి
(సంసారమును వృద్ధిపొందించు) మార్గములందు శ్రద్ధతోనుందురు.
వేదాంతార్థమును బరిశీలించుచు నివృత్తి (సంసారమునుండి తప్పించు)
మార్గములోనుండి మీయందుభక్తిగలిగినవారు విద్యతోనిండినవారని
పిలువబడుదురు. అవిద్యవశములోనుండువారెల్లప్పుడును సంసారములో
బడుదురు. ఇట్టివిద్య నభ్యసించుటలో శ్రద్ధగలవారే యెల్లప్పుడును
ముక్తిగలవారుగ పరిగణింపబడుచున్నారు. మీభక్తియందు శ్రద్ధ
గలిగి మీమంత్రము నుపాసనచేయువారు తప్పక విద్యను గలిగియుం
దురు. ఇతరులకెంతమాత్రమావిద్య చేకూరనేఱదు. కనుక మీ భక్తి
బాగుగ గలవారు ముక్తులగుట కనుమానములేదు. మీభక్తిలేనివారికి
కలలోనైనను మోక్షముగలుగదు. రామా! పెక్కుమాటలేల? నేను
ముఖ్యాంశములను బలికెదను. సాధువులతో సహవాసము మోక్షము
నకు గారణమని చెప్పబడినది. అన్నిటియందు సమబుద్ధిగలిగి దేని
యందు నెక్కువ యిష్టములేక యీషణత్రయములను (దారేషణ,
ధనేషణ, పుత్రేషణ) విడిచి తపశ్శ్రమనోర్చి గొప్పశాంతము
వహించి యన్నికోరికలను విడిచినవారు మీభక్తులగుదురు. వారు

శోభాయమానముగనుండునదియునగు 'పంచవటి' యనుప్రదేశము (5 మఱ్ఱిచెట్లుండుప్రదేశము) కలదు. అక్కడ నీవు నీతమ్మునితోను, భార్యతోను నాశ్రమమేర్పఱచుకొని మీతండ్రియాజ్ఞ పాలించుచు వినోదించుచుండుము. నీవు నీవనవాసనిర్ణయకాలము చాలవఱకు గడపితివి. మిగిలినవనవాసకాలము పూర్తికాగ నీవు నీతండ్రి ప్రతిజ్ఞను నెఱవేర్చి సుఖముగ రాజ్యము పాలించెదవు. నీవలన నాతపు తరించును. అతనియందలిస్నేహముచేతను, నాతపోబలముచేతను

---

కోరినదిగలిగినప్పుడును, దానికి భంగముకలిగినప్పుడును సమబుద్ధిగలిగి సంసారసంగమును విడిచి యన్నికర్మలఫలాఫలములను మీయందుంచుచు నెల్లప్పుడు బ్రహ్మమునందే బుద్ధిగలిగి యంతరింద్రియనిగ్రహము, బహిరింద్రియనిగ్రహము మొదలగు యోగాంగములను సాధించుచు తమకులభించుదానితో తృప్తిజెందుచు సత్సహవాసము బడయుదురేని వారికి నీకథలను వినుటయందాసక్తిగలుగును. దానివలన నాదిపురుషులగు మీయందు వారికి భక్తి యెక్కువగ జనించును. మీభక్తిగలవారికి స్పష్టముగు గొప్పవిజ్ఞానము కలుగును. మొదటిదగు నీముక్తిమార్గము నిపుణులచే సేవింపబడి మిక్కిలియభివృద్ధి జెందుచున్నది. కనుక ప్రేమయే లక్షణముగగల సద్భక్తి మీయందు నాకు గలదు. కనుక నెల్లప్పుడును ముఖ్యముగ మీభక్తులతో నాకు సంగము కలుగుగాక! మీదర్శనముచే నీదినమున నా జన్మయు, నాయజ్ఞములన్నియును సఫలములైనవి. మీయందుతప్ప యితరులందు మనస్సులేక నేను చాలకాలము తపస్సు చేసితిని. మిమ్ము పూజించుటయే యాతపస్సునకు ఫలము. రామా! మీరెల్లప్పుడును సీతతో నాహృదయమున నివసింపుడు. నేను నడచుచున్నను కూర్చుండియున్నను నెల్లప్పుడు మీయందు నామనస్సుండుగాక!' ఇట్లు రాముని నగస్త్యుడు స్తుతించెను.

మీచరిత్రమంతయు నేను తెలిసికొంటిని. నీమనోభిప్రాయము నా యోగదృష్టితో జూచితిని. నీవు నాతో నుండవలెనని యున్నదిగనుక నీయిష్టమువచ్చినంతకాల మిక్కడ నీవుండుము. తరువాత పంచవటికి వెళ్లుము. ఆదేశము మిక్కిలి సుందరముగ నుండును. అక్కడ ననేక పక్షులుండును. అక్కడికి * గోదావరినది సమీపముగనుండును. జనరహితమగు నావృక్షప్రదేశమున సీత విహరింపనగును. నీవిక్కడ సభార్యతో నిలిచి ఋషులను వారిశత్రువులగు రాక్షసులబాధనుండి తొలగింపుము. అదిగో యిప్పవనము కనిపించుచున్నది. దానియుత్తరమున మఱ్ఱిచెట్టొకటి కలదు. దానితరువాత పర్వత మొకటి యున్నది. దానికి స్వల్పదూరమున పంచవటికలదు." ఇట్లగస్త్యుడు పలికి సీతారామలక్ష్మణులకు మర్యాదచేసెను. అన్నదమ్ము లిద్ద ఱతనిపాదములకు నమస్కరించి తమధనస్సులను, నమ్ములపొదులను బట్టి సీతతో పంచవటికి వెళ్లిరి.

---

## ౯ వ. అధ్యాయము.

## సీతారామలక్ష్మణులు పంచవటిని నివసించుట.

సీతారామలక్ష్మణులు పంచవటికి వెళ్ళుచు నొకమఱ్ఱిచెట్టు పైని గొప్పశరీరము, భయంకరమగు పరాక్రమముగల యొకగ్రద్దను జూచి 'రాక్షసుడని భావించి 'నీ వెవ్వడ' వని దాని నడిగిరి. అంత నది మృదువగుమంచిమాటలతో 'నేను మీతండ్రి స్నేహితుడ'నని సంతోషముతో దెలుప రాముడు దానికి తగినమర్యాదజేసి దాని

* వింధ్యపర్వతపంక్తికి నుత్తరముననుండు దండకావనములోనున్న గోదావరీనదివి. పశ్చిమకనుమలలోబుట్టి బొంబాయి, హైదరాబాదు, గోదావరిజిల్లాలలో పాఱు గౌతమీగోదావరీనదివి వేఱువేఱుగభావింపవలెను.

పేరును, వంశమును దెలుపగోరెను. వారికది * సృష్టివివరమును దెలుపుచు తనపేరు 'జటాయువు' వనియు, తినవంశము 'గరుడవంశ' మనియు దెలిపి 'మీరాశ్రితమున్నయెడల నేను మీకు వనవాసమున సహాయముగనుండెదను. మీరును, లక్ష్మణుడును నడవికి వెళ్ళినపుడు మృగములనుండియు రాక్షసులనుండియు, నేను సీతను రక్షించుచుండెద' నని పలుక రాముడు దానికి మిక్కిలి మర్యాదజేసి సంతోషముతో దానిని కౌగిలించుకొని తినతండ్రితో దానికిగలస్నేహమును పలుమార్లు దానినోటనుండి వినెను. వారందరు కలిసి పంచవటికి వెళ్ళిరి. జటాయువు దండకావనమున 10,000 సంవత్సరములు పక్షులకు ప్రభువుగ నుండెను.

పంచవటిచేరినతరువాత రాముడు లక్ష్మణునితో 'మనతో నగస్త్యుడు చెప్పినప్రదేశమునకు వచ్చితిమి. ఇక్కడ చెట్లు బాగుగ పుష్పించియున్నవి. నీకు వనములోనిసంగతులన్నియు దెలియును. నీవు బాగుగ జూచి యాశ్రమము కట్టుకొనుటకు బాగుగనుండునదియు, మనము సుఖముగ నుండుటకు వీలగునదియు, దగ్గరగ నీటివసతి కలదియు, శృంగారమైనవనములోనుండునదియు, నాచులు, పువ్వులు, దర్భలు దగ్గరగదొరకుటకనుకూలమైనదియునగు శృంగారస్థలమున మనయాశ్రమమును నిర్మింపు' మని చెప్పెను. అప్పుడు లక్ష్మణు డాతనికి చేతులు జోడించి 'చాలకాలమునుండి మీయాజ్ఞచొప్పున నడచుచుంటిని. మీరే మంచిస్థలమును నిర్ణయించి నాతో జెప్పు' డని పలుక రాముడు మిక్కిలి సంతోషించి దానినిగూర్చి యాలోచించుచుండెను. తరువాత నతడు మంచిప్రదేశమునకు లక్ష్మణుని దీసికొనివెళ్ళి వాని చేతులను తనచేతితో బట్టుకొని యొకప్రదేశమును జూపించుచు వానికిట్లు సెలవిచ్చెను. "ఇదిగో! యీస్థలము సమతలముగ నున్నది.

*2వ. ప్రకరణము. ౧ వ. అధ్యాయము, సృష్టివివరము చూడుము.

ఇక్కడ పూచినచెట్లున్నవి. ఇది శ్రీమంతమైనది. ఇక్కడ నాశ్రమమును నిర్మింపుము. ఇక్కడకు దగ్గఱగనే మంచితామరపద్మములుగల కొలను గలదు. పుష్పించినచెట్లుకలదియు, కిలకిలధ్వనిజేయు హంసలు, చక్రవాకములు మొదలగు పక్షులుకలదియునగు గోదావరీనది యదిగో. మంచిచెట్లు, నెమళ్లు, గుహలుగల యెత్తైనకొండ లిక్కడకు దగ్గఱగనే కనిపించుచున్నవి. ఇదిపుణ్యస్థలము. ఇక్కడ మృగపక్షు లెక్కువగనున్నవి. జటాయువు, నేను నిక్కడ నివసించెదము." ఇట్లు రాముడు సెలవీయ లక్ష్మణుడు తనభుజబలముతో మట్టిగోడలు పెట్టి మంచిస్తంభములను పాతి మంచివెదురుబొంగులను కప్పుపైని వేసి జమ్మికొమ్మలను పఱచి వానిని మంచితీగెలతో గట్టి దానిపై కుశలు, రెల్లుగడ్డి, యాకులు మొదలగువానితో నేసి క్రిందను సదును జేసి చూచుటకింపగునట్లు మంచివిశాలమగు పర్ణశాలను గట్టెను. తరువాత నతడు గోదావరీనదికి వెళ్ళి స్నానముచేసి పద్మములను, ఫలములను దెచ్చి యాపువ్వులతో గృహమున పూజచేసి గృహశాంతిజరిపి రామునకు నాయాశ్రమమును జూపెను. సీతారాములు దానిలోనికి వెళ్ళి చూచి మిక్కిలి సంతోషించిరి. * తరువాత

అ. రా:—రాముడు పంచవటిని నివసించుసమయమున నతడొక్కడేయున్నపుడు లక్ష్మణు డొకపర్యాయము వినయముతో నతనివలన మోక్షమునకు ముఖ్యమగుమార్గమును దెలియగోర నతడిట్లు సెలవిచ్చెను. "దేనిని దెలిసికొనుటవలన భయముపోవునో దానిని పరమాత్మ యందురు. ఆత్మకానటువంటి శరీరాదులందు నాత్మయనుబుద్ధి గలుగుటయే మాయ. దానివలననే సంసారము కల్పింపబడును. మాయకు నావరణమనియు, విక్షేపమనియు రెండురూపములు కలవని నిశ్చయింపబడినది. (ఆవరణము=వస్తువుయొక్క నిజస్వరూపమును మఱుగుపఱచుట. విక్షేపము=ఆవస్తువునందే దానితో సమానమగు నాకారముగల మఱియొక వస్తువును గనబడు నట్లు

రాముడు తనతమ్ముని గట్టిగ కౌగిలించుకొని మిక్కిలిస్నేహముగ నిట్లనెను 'నీవింతటి గొప్పపనిచేసినందులకు నేను మక్కిలి సంతోషించి

---

చేయుట.) ఇందు నావరణమనునది జ్ఞానరూపమగు పరమాత్మను సంపూర్తిగ కప్పివుచ్చుచున్నది. రెండవదియగు విక్షేపము లింగము మొదలు బ్రహ్మపర్యంతముగల స్థూలసూక్ష్మమగు జగత్తునంతను గల్పించును. త్రాడునందు భ్రాంతిచే గల్పింపబడిన సర్పమువలె కేవలపరమాత్మయందు మాయచే గల్పింపబడిన యీప్రపంచము పరమాత్మస్వరూపమును బాగుగ విచారించుచో నేమియు లేకుండును. జనులకు వినబడునది, కనబడునది, యాలోచింప బడునది బాగుగనాలోచింపగ కలలోనికోరికవలె నేమియు లేదు. సంసారమనెడి వృక్షమునకు గట్టివేరు దేహమని పలుకుదురు. ఆ దేహమువలననే పుత్రుడు, భార్య మొదలగు బంధనములు కలుగును. ఇవి యాత్మకు నెట్లు సంభవించును? స్థూలశరీరము పంచభూతముల యొక్క పంచతన్మాత్రలచే కలుగును. అహంకారమును, బుద్ధియు, 10 ఇంద్రియములును, చిత్తు (పరమాత్మ)వలె గనబడునదియు, మనస్సును, మూలప్రకృతియు క్షేత్రమనబడును. దీనిని దేహమందురు. ఈలక్షణములకు వ్యతిరిక్తమైనవి జీవాత్మపరమాత్మలు. అవియొక్కటే. వాని విషయమై భేదబుద్ధి నుంచరాదు. జీవాత్మయొక్క విజ్ఞానమును సంపాదించు సాధనములను దెలిపెదను. అవియేవన మానము (తన్ను గూర్చి యెక్కువగ నాలోచించుట) లేకపోవుట, దంభము, హింస మొదలగు వానిని విడుచుట, పరులాక్షేపించినను నోర్చియుండుట. కౌటిల్యములేకుండుట, మనస్సు,వాక్కు,శరీరములచే మంచిభక్తిగలిగి యుండి మంచిగురువును సేవించుట, శరీరములోన, పైనను, శుచికలిగి యుండుట, మంచికార్యములను చేయుటలో స్థిరబుద్ధి కలిగియుండుట, మనస్సును, వాక్కును, శరీరమును నియమముగనుంచుట, ఇంద్రి

తిని. నీకియ్యవలసినబహుమతికి బదులుగ నిన్ను కౌగిలించితిని. ఆలోచనాపరుడవును, చేసినమేలును మఱువనివాడవును, ధర్మము తెలిసిన

---

యములందు శ్రద్ధ లేకయుండుట, యహంకారము లేకుండనుండుట జన్మము ముసలితనము మొదలగువానియం దాలోచనగలిగియుండుట దారాపుత్రధనాదులందు సభిలాష, స్నేహము లేకుండనుండుట, కష్టసుఖములు ప్రాప్తించినపుడు మనస్సునందు నేవికారమును లేకయుండుట, సర్వాత్మకుడను, రాముడనునగు నాయందు నితర మనస్సు లేక తదేకబుద్ధి కలిగియుండుట, జనసమూహములేని శుభ్రమగు దేశమున నివసించుట, జ్ఞానములేని జనులందెల్లప్పు డాశక్తి లేకయుండుట యాత్మజ్ఞానము పొందుటకు మంచికృషి చేయుచుండుట, వేదాంతార్థమును దెలిసికొనుచుండుట వీనివలన జ్ఞానము కలుగుచుండును. వీనికి విపరీతమగువానివలన విపరీతబుద్ధి కలుగుచుండును. బుద్ధి, ప్రాణము, మనస్సు, దేహము, అహంకారములను వీనినుండి వేఱులక్షణములు గల చిత్స్వరూపుడనగు నేను నిత్యమైనవాడను; పరిశుద్ధమైనవాడను; బుద్ధుడను. ఏజ్ఞానమువలన నీకు పరమాత్మ సాక్షాత్కారమగునో, యదియే నాసంబంధమగు నిశ్చితమైన జ్ఞానము. సాక్షాత్తుగ ననుభవించినజ్ఞానము విజ్ఞానమనబడును. ఆత్మనాశనములేనిదై యన్నిచోట్ల నిండియుండును; చిదానందమయమైయుండును. అది బుద్ధిమొదలగు నుపాధులు (నిలుచుటకు స్థానములు)గాని, మార్పులుగాని లేకయుండును. ఆత్మ తనప్రకాశముచే దేహముమొదలగు వానిని ప్రకాశింపజేయుచు దేనిచేతను నావరింపబడక యుండును. అది తనతో సరియగునది మఱియొకటిలేక యొక్కటై సత్యము, జ్ఞానము మొదలగు లక్షణములుగలిగియుండును. అది దేనితోను సంబంధములేక స్వయముగ ప్రకాశించుచు నన్నిటిని జూచుచుండును. ఆచార్యుని (గురువు) శాస్త్రోపదేశమువలన నైక్య జ్ఞానము కలుగ నావిజ్ఞానముచే నది

వాడవునునగు నీతో మనతండ్రి కలిసి యుండలేకపోయెను.” ఇట్లు రాముడు పలికి యాయాశ్రమమున సీతాలక్ష్మణులతో కొంత కాలము స్వర్గలోకమున దేవతలవలె సుఖముగ నుండెను.



తెలియబడును. పరమాత్మజీవాత్మలకంటె వేఱగునది మాయ. అది చేయుటకు సాధనమును, కార్యమున్నై పరమాత్మయం దణగియుం డును. ఈయవస్థకే ముక్తి యనిపేరు. ఈముక్తి యాత్మయందు గల్పింపబడినది. పరమాత్మనగు నాయొక్కజ్ఞాన విజ్ఞాన వైరాగ్యము లతో గూడిన మోక్షస్వరూపమును నీకు దెలిపితిని. ఇది నాభక్తియం దిష్టములేనివారికి లభించుట మిక్కిలికష్టము. కండ్లుకలవారికి రాత్రు లందు త్రోవ బాగుగ గనబడకపోయినను దీపముగలవారికి బాగుగ త్రోవ గనబడును. అట్లే నాభక్తిగలవారికి నాత్మ ప్రకాశముగ గన బడును. నాభక్తికి గారణము లేవన నాభక్తులతో సహవాసమును, నన్ను సేవించుటయు, నాభక్తులను విడిచియుండకపోవుటయు, నేకా దశినా డుపవసించుటయు, నాపర్వములను సేవించి సంతోషముగ నుం డుటయు, నాకథల వినుటయందును, జదువుటయందును, స్పష్టముగ దెలుపుటయందును నెల్లప్పుడిష్టము కలుగుటయు, నాపూజయందు శ్రద్ధయు, నానామము కీర్తించుటయును నైయున్నవి. ఎల్లప్పుడు నన్ను ధ్యానించుచుండువారికి ననన్యభక్తి నాయందెల్లప్పుడు కలుగును. మఱిచేయవలసినదేమున్నది? నాయందు భక్తిగలవానికి జ్ఞానవిజ్ఞాన ములవలె వైరాగ్యము శీఘ్రముగ గలుగును. తరువాత ముక్తి గలు గును.నాభక్తిలేనివారికి ప్రయత్నపూర్వకముగ వీనిని దెలుపగూడదు. నాభక్తులగువారిని పిలిపించి ప్రయత్నముతో వీనిని దెలుపవలెను.” ఇట్లు రాముడు లక్ష్మణునకు బోధించెను.



## ౧౦ వ. అధ్యాయము.
## శూర్పణఖ విరూపణము.



అంతట హేమంతఋతుప్రారంభమున నొకానొకతెల్లవాఱు ఝామున సీతారాములు గోదావరీనదికి స్నానము జేయుటకు వెళ్ళు చుండిరి. లక్ష్మణుడు చెంబుపట్టుకొని వారితో వినయముగ బోవుచు *నాఋతులక్షణములను వారికి దెలిపి యిట్లు పలికెను. "ఇప్పుడు ధర్మాత్ముడగు భరతుడు విచారముతో తపస్సు జేయుచున్నాడు. అతడు రాజ్యభోగములను, నితరసుఖములను, నభిమానమును విడిచి నియతమగు భోజనము చేయుచు భూమియందు శయనించుచున్నాడు. ఇట్టిసమయమున నతడు ప్రజలతో గలిసి సరయూనదికి స్నానము నకు వెళ్లుచుండును. మిక్కిలిసుఖముగ పెరిగిన యీ రాజకుమారుడు వేకువజాముననే యానదిలో నెట్లు స్నానము జేయును? పద్మపత్రముల వంటి నేత్రములుగలవాడును, వీరుడును, ధర్మజ్ఞుడును, సత్యముపలుకు వాడును, నింద్రియజయము కలవాడును, నాజానుబాహుడు నునగు నాతడు భోగముల విడిచి సంపూర్ణమనస్సుతో మిమ్ము ధ్యానించు చున్నాడు. అతడు స్వర్గలాభమునైనను కోరక వనములోనుండు మీ వలెనే తాపసవృత్తిలో నున్నాడు. 'నరులు తండ్రిగుణముల బొంది యుండక తల్లిగుణముల బొందుదు'రను లోకోక్తి యాతనివిషయమై చెల్లలేదు. కైకేయి క్రూరస్వభావము కలదైనను నామెభర్తయగు దశరథుడును,కుమారుడగు భరతుడును మంచిస్వభావము గలవారు." ఇట్లు లక్ష్మణుడు విన్నవింప కైకేయినిగూర్చి పలికిన మాటలను సహిం పలేక రాముడు వానికిట్లు జవాబిచ్చెను. "మనకు తల్లియగు నామె

* 13 వ. ప్రకరణము. ౪౩ వ. అధ్యాయము, హేమంతఋతులక్షణ ములు చూడుము.

నెంతమాత్రము నిందింపగూడదు. నీవాతనిగురించి మంచిమాటలనే పలుకుము. వనవాసముచేయనిశ్చయించి దృఢనిశ్చయముతోనున్న నామనస్సాతనియందలి యనురాగముచే నజ్ఞానములో బడుచున్నది. మనస్సునకు సంతోషకరములును, నమృతతుల్యములునగు నాతని మాటలు నాకు జ్ఞాపకము వచ్చుచున్నవి. మనము నలుగుర మెప్పుడు కలిసికొందుము.” ఇట్లు రాముడు విచారించుచు సీతాలక్ష్మణులతో గూడ గోదావరీనదిలో స్నానము చేసెను. తరువాత వారు నీటితో పితృదేవతలకు, దేవతలకు తర్పణముచేసి యుదయించిన సూర్యుని స్తోత్రముచేసి సంధ్యాదిదేవతలకు నమస్కరించిరి. లక్ష్మణునితో గూడినసీతారాములు నందీశ్వరునితోగూడిన యుమామహేశ్వరుల వలె ప్రకాశించుచు తమయాశ్రమము జేరిరి. వారిద్దఱన్నదమ్ము లుద యమునజేయుకర్మల జేసి పర్ణశాలకు సీతతోవచ్చి ఋషులతో ననేక కథలను జెప్పుకొనుచుండిరి. సీతతోనుండు రాముడు చిత్తానక్షత్రముతో గూడినచంద్రునివలె ప్రకాశించెను.

అట్టిసమయమున రావణుని చెల్లెలగు శూర్పణఖ దేవతుల్యు డగురాముని జూచెను. సింహవక్షమువంటి యాతని వక్షస్థలమును, దీర్ఘబాహువులను, పద్మపత్రములవంటి నేత్రములను, నేనుగునడక వంటి నడకను, ప్రకాశమానమగు ముఖమును, మిక్కిలిసంతోషజనకమగు రూపమును, నాతనితలమీదనున్న జటాభారమును, రాజచిహ్నము లను, గొప్పబలమును, నల్లకలువలకుండు శ్యామలవర్ణమును, మన్మథుని వంటి యాకారమును జూచి యా రాక్షసి యింద్రునివలెనుండు నాత నిని మోహించెను. చూచుట కసహ్యాకరమగు ముఖము, పెద్దకడుపు వికృతముగనున్న నేత్రములు, ఎఱ్ఱని తలవెండ్రుకలు, వికృతస్వరూ పము, భయంకరమగుగొంతుక, ముసలితనము, వికారపుమాటలు, చెడ్డప్రవర్తన, చూచుట కిష్టముగలిగింపని స్వరూపముగల యామె

లక్షణములు రామునిలక్షణములకు మిక్కిలివ్యతిరేకముగ నున్నను నామె యాతనిని మోహించి 'నీవు జటలను ధరించి తాపసరూపమున భార్యతోఁగూడ ధనస్సును, బాణములను బట్టి రాక్షసులకు నివాసమగు నీయడవికి వచ్చుటకు కారణమేమో నిజముగ దెలుపు' మని యాతని నడుగ రాముడు తనకెన్నడును నబద్ధమాడుట కిష్టము లేకపోవుటచేతను, తాను ముఖ్యముగ తాపసాశ్రమమున నుండి స్త్రీచే ప్రశ్నింపబడుటచేతను నసృతముపలుకక మంచిబుద్ధితో తమ ముగ్గురిసంగతుల నామెకు దెలిపి దాని నిట్లడిగెను. 'నీవెవ్వతెవు? నీవారెవరు? నీ రూపము మనోహరముగ నుండుటచే నీవు రాక్షసివి కావని నే నూహించుచున్నాను. నీవిక్కడి కేలవచ్చితివి? నిజముగ బలుకుము.' ఇట్లాత డామె నడుగ నామె యాతనియందలి కామముచే మోహితురాలై యాతనితో "నేను నిజము బలికెదను. నాపలుకులను వినుము. నేను కోరిన రూపము బొందగల 'శూర్పణఖ' యను రాక్షసిని. ఈవనమున నే నొక్కతెను నందఱికి భయముకలిగించుచు తిరిగెదను. బలిష్ఠుడును, విశ్రవసునిపుత్రుడునునగు రావణాసురుడు నాకొకయన్న. మఱియొక యన్న మహాబలుడగు కుంభకర్ణుడు. అతడెల్లప్పుడు నిద్రజెందియుండును. మఱియొకయన్న ధర్మాత్ముడగువిభీషణుడు. వానికి రాక్షస చేష్టలు లేవు. గొప్పవీరులగు ఖరదూషణులును నాయన్నదమ్ములే. నేను వారియిష్టప్రకారము సంచరింపను. ఎప్పుడును జూడని నీరూపమును జూచుటచే నేను నామనస్సులో నుత్తమపురుషుడవగు నిన్ను భర్తగ గోరియుంటిని. నాకు గొప్పప్రభావము కలదు. ఎక్కడికికోరిన నక్కడికి వెళ్ళుటకు నాకు బలముకలదు. చాలకాలము నీవు నాభర్త వగుదువుగాక! సీతవలన నీకు ప్రయోజనమేమి? వికృతమగురూపమును, నవయౌవములునుగల యీమె నీకు తగినదికాదు. నీకు నేను

తగినదానను. నన్ను భార్యగ నేలుకొనుము. పలుచనికడుపుకలదియు చెడ్డస్త్రీయునగు నీమెను, నీతమ్మునిని నేను భక్షించెదను. కొండశిఖరములను, ననేకవనములను నీవు నాతో జూచుచు దండకావనమున విహరించెద"వని పలికెను.

ఆమెమాటలకు రాముడు నవ్వుచు స్పష్టముగ మృదువగు మాటల నిట్లనెను. "నేనీమెను వివాహమాడితిని. నీవంటిస్త్రీలకు సవతులుండుట తగదు. మంచిగుణములుగలవాడును, చూచుటకింపైనవాడును, వీర్యముగలవాడును నగు నాతమ్ముడు భార్యతో గూడ లేడు. సిరిగల యీయావనుడు చాలకాలమునుండి భార్యాసౌఖ్యములేకయున్నాడు. అందుచే నితడు స్త్రీయందు కోర్కె గలిగియుండును. ఇతడు నీరూపమునకు తగినభర్త. ఇతనిని నీవు భర్తగగ్రహించి సవతిలేనిదానవై మేరుపర్వతమును సూర్యకాంతివలె నీతని సేవింపుము." ఇట్లాతడు పలుక నారాక్షసి యాతనివిడిచి లక్ష్మణుని మోహించి తొందరగ వానిదగ్గఱకు వెళ్ళి 'నేను నీరూపమునకు తగిన మంచియాకారముగల భార్యను. నీవు నాతో గలిసి దండకావనమున విహరింపు'మని వానిని కోరెను. శూర్పణఖమాటలను విని యాతడు నవ్వి యామెతో నిట్లు పలికెను. 'నేను నాయన్న సేవకుడనుగదా? నీవు నాభార్యవై దాసిగ నేలయగుదువు? అతనికన్ని యైశ్వర్యములున్నవి.నీవాతనికిచిన్న భార్యవు కమ్ము.ముసలిదియు, వికృతరూపముకలదియు, పలుచనికడుపుకలదియునగు సీతను విడిచి యాతడే నిన్ను పొందును. నీవంటిరూపవతిని విడిచి యెవడు మనుష్యస్త్రీలందు మనస్సు నిలుపును?' లక్ష్మణునియీమాటలను విని శూర్పణఖ వానిని పరిహాసపుపలుకులని తెలపక నిజమనుకొని పర్ణశాలలో సీతతోగూడ కూర్చుండియున్న రామునియొద్దకు వెళ్ళి యాతనియందలి మోహముచే నాతనితో "నీవు వికృతరూపముకలదియు, నెండిన

కడుపుకలదియునగు నీముసలిభార్యతోనుండి నన్ను మర్యాదజేయుచున్నావు. నీవు చూచుచుండ నిప్పుడే యీమనుష్యస్త్రీని నేను భక్షించెదను. సవతిలేనిదాననై నీతోసుఖముగ దిరిగెద' నని పలికి కండ్లెఱ్ఱజేసి యామెను బట్టుకొనుట కామెవైపు పరుగెత్తెను. అంతట రాముడు కోపముతో దానినడ్డి లక్ష్మణున కిట్లు చెప్పెను. 'క్రూరులును, మర్యాదలేనివారునగువారి నెన్నడును హాస్యముచేయగూడదు. సీత జీవించునట్లు చూడుము. వికృతరూపముగలదియు, మర్యాదహీనురాలును, మిక్కిలి మదించియున్నదియు, గొప్పకడుపుకలదియునగు నీరాక్షసి నింకను వికృతరూపముగలదానిగ జేయుము.' రాముడు చెప్పిన మాటలనువిని లక్ష్మణుడు గొప్పకోపముతో వానిప్రక్కనున్న ఖడ్గముతో నామెముక్కు చెవులను గోసెను. దానితో నామె గొప్ప వికారముగ ధ్వనిజేయుచు భయంకరముగు రూపముతో తాను తన వనమునకు తిరుగబోయెను. రక్తము వరదలై కారుచుండ నామె యనేకవిధములు శబ్దముజేయుచు భుజములు మీదికెత్తి గర్జించుచుబోయి జనస్థానములోనున్న రాక్షసులకు రాజును, తనకు సోదరుడునునగు ఖరుని యొద్దకు వెళ్ళి వానిపాదములమీద బడెను.

---

## ౧౧ వ. అధ్యాయము.

### ఖరుని రాక్షసవీరులు పదునల్గురు మడియుట.



శూర్పణఖ విరూపియై తనయెదుట పడియుండుట జూచి ఖరుడు మిక్కిలికోపముతో నిట్లనెను. "నీవు మతిభ్రమణమును, గొప్ప యజ్ఞానమును విడిచి లేచి నిన్నెవరు విరూపిగ జేసిరో తెలుపుము? గొప్పవిషపుకోఱలుగల నల్లత్రాచుపామును గోళ్ళతో గిల్లినట్లు

నిన్నెవడు బాధించెను? అజ్ఞానమువలన నిన్నిట్లుచేసి యెవడు తనకంఠమునకు కాలపాశమును తగిలించుకొనినట్లును, గొప్ప విషము త్రాగినట్లును తలంపకున్నాడు? గొప్పబలపరాక్రమ ములుగలిగినట్టియు, కోరినచోటికి వెళ్లునట్టియు, కోరినరూప మును బొందునట్టియు, మృత్యువుతో సమానమగునట్టియు నిన్నెవ డిట్లు చేసెను? దేవతలు, గంధర్వులు, పిశాచములు గొప్ప ఋషులుమొదలగువారిలో నేమహావీరుడు నీకిట్టివికృతరూపమును గలి గించెను? లోకములో నాకు విప్రియము జేయగలవాడు మహేంద్రుడు తప్ప మఱియెవడునులేడు. హంస నీళ్ళతోగలిసినపాలను త్రాగినట్లు నేను కఠినమగుబాణములచే వానిప్రాణముల దీసెదను. నేను యుద్ధ ములో వానియాయుస్థానములగొట్ట వానిరక్తము భూమిపై వఱదలై పాఱును. వానిమాంసమును రాబందులు గుంపులుగజేరి సంతో షముతో దినును. నాతో విరోధముబొందినవానిని యుద్ధములో దేవతలుగాని, గంధర్వులుగాని పిశాచరాక్షసులుగాని రక్షింపలేరు. శూర్పణఖా!నీవు మెల్లగ తెలివితెచ్చుకొని యేదుర్మార్గునివలన నీవిట్లు వనమునవమానమునొందితివో నాకు దెలుపుము." ఇట్లు ఖరుడడుగ శూర్పణఖకన్నీరువిడుచుచు నీసంగతులను దెలిపెను. "యౌవనవంతు లును,మంచిరూపవంతులును, గొప్పబలముకలవారును, పద్మపత్రముల వంటి నేత్రములుగలవారును, నారచీరలను, చర్మములను కట్టుకొనిన వారును,ఫలమూలములే తిని ఇంద్రియనిగ్రహముకలిగి మునివృత్తితో ధర్మముగ నడచువారును, దశరథునిపుత్రులునునగు రామలక్ష్మణులను వా రిద్ద ఱన్నదమ్ము లున్నారు.వారు కుబేరునితో సమానమైనవారు, రాజచిహ్నములుగలవారు నగుటచే వారిని మనుష్యులుగగాని, దేవత లుగగాని తెలిసికొనుటకు నాకుత్సాహము కలుగలేదు. వారితో యౌవనవంతురాలును, మంచిరూపముగలదియు, సన్ని నగలు శరీర

మునధరించుకొన్నదియు, మంచియవయవసౌష్ఠవము గలదియునగు నొక స్త్రీ కలదు. ఆమెనుగుఱించి వారిద్దఱివలన దిక్కులేనిదానికి వ్యభిచారిణికి గలుగు నవస్థ నాకు గలిగెను. యుద్ధములో జంపబడిన వారిద్దఱియొక్కయు, నామెయొక్కయు రక్తమును నేను త్రాగగోరెదను. ఇదియే ముఖ్యమగు నాకోరిక.'' ఇట్లు శూర్పణఖ ఖరునికి దెలుప నాతడు గొప్పకోపముతో యమునిప్రతాపమువంటిప్రతాపము గల 14 సేనానాయకులను బిలిచి వారికి 'సీతారామలక్ష్మణుల జంపి వారిరక్తము నాయక్కకు త్రాగుటకిం'డనియాజ్ఞాపింప వారామెతో గూడ రాముని యాశ్రమమునకు వెళ్ళిరి.

అక్కడ నామె వారికి తనవిరోధులను జూపెను. అప్పుడు రాముడు లక్ష్మణునితో 'నీవు సీతదగ్గఱ నొకగడియ జాగ్రత్తగ నామెను రక్షించుచు నుండుము. ఈరాక్షసితోవచ్చినవారిని జంపెద' నని పలుక వాడు 'అట్లేకానిమ్మ'ని చెప్పెను. అంతట రాముడు బంగారుపుకట్లుగల యొకపెద్దధనస్సును బట్టి దానికి బాణముల సంధించి యారాక్షసులకు తమసంగతులను దెలుపుచు నిట్లనెను. ''ఫలమూలములదిని యింద్రియనిగ్రహముకలిగి మునివృత్తితో ధర్మముగనడచుచు దండకారణ్యమున నివసించిన మమ్మేల మీరు హింసించెదరు? హింసచేయుపాపాత్ములగు మిమ్ము యుద్ధములో జంపుటకు నన్ను ఋషులు నియమించుటచే నేను విల్లును, బాణములను బట్టితిని. మీరు సంతోషముతో నిలువుడు. పాఱిపోగూడదు. మీకు ప్రాణములయందాసయున్న మీరు మఱలిపొండు." రాముని యీ మాటలకు బ్రాహ్మణులజంపు నారాక్షసులు మిక్కిలికోపముతో శూలములబట్టి యిట్లనిరి. 'గొప్ప ప్రతాపముగల మాఖరరాజునకు నీవు కోపముకల్గించినందులకు యుద్ధములో నీదినమున మేము నీప్రాణముల బోగొట్టెదము. అనేకమందితో యుద్ధముచేయుటకు నొక్కడవగు నీకేమిశక్తి

కలదు? మాయెదుటనే నీవు నిలువలేనపుడు మాతో యుద్ధమెట్లు చేయగలవు? రమ్ము; మేము విడుచుగదలు, కత్తులు, శూలములు మొదలగువానితో నీధనస్సుత్రెంచబడును. నీశౌర్యము, ప్రాణములు పోవును.' ఇట్లు పలికి వారు గొప్పకోపముతో రామునిపై శూలములు విసరిరి. వాని నన్నింటి నాతడు బంగారుతో నలంకరింపబడిన తన బాణములతో గొట్టెను. తరువాత నతడు తనవిల్లెక్కుపెట్టి సూర్య తేజముగల 14 బాణములను నిందుండు వజ్రములను విడుచునట్లు విడువ నవి వారివక్షస్థలముల దగిలి రక్తము ప్రవహింపజేయుచు గొప్ప శబ్దముతో బయలువెడలి భూమియందు బడెను. దానితో వారు శరీరమునుండి రక్తముకాలుచుండ వికారరూపముల బొంది ప్రాణముల విడిచి వేరుతెగినచెట్లవలె క్రిందబడిరి. వారిని శూర్పణఖచూచి మిక్కిలికోపమును, భయమునుబొంది భయంకరమగుధ్వనులుచేసెను. ఆమె కేకలువేయుచు నచ్చినతోవను ఖరునియొద్దకు బోయి ముఖము వాడిపోవ గొప్పవిచారముతో వానిపాదములుమీదబడి మాటి మాటికి పెద్దధ్వనిజేయుచు కండ్లంట నీరువిడచెను.

---

## ౨౦ వ. అధ్యాయము.

## ఖరదూషణత్రిశిరులసంహారము.



శూర్పణఖ తిరుగ గొప్పకోపముతో తనపాదములయొద్ద పడుట ఖరుడు చూచి యామెతో నిట్లనెను. "ఇప్పుడే నేను శూరులగు రాక్షసవీరులను నీకిష్టమైనపనులుజరుపుటకు బంపితిని. తిరుగ నీవేల యేడ్చెదవు? వారు నాయందు మిక్కిలి యనురాగముకలిగి నాయిచ్చవచ్చిన క్లిష్టమును వర్తించుచు నితరులను జంపుదురు; గాని వారు చంపబడరు. నేను చెప్పినపనులను వారు తప్పకజేసెదరు. నేను

పరిభవున్నై యుండ 'హా? నాథా! యని నీవు విలపించుచు పామువలె భూమియం దిట్లేల దొర్లుచుంటివో కారణము నాకు దెలుపుము. నీకు భయములేదు. విచారము మానుము." ఇట్లు ఖరుడు శూర్పణఖ నోదార్చనామెకన్నీరు తుడుచుకొని.తనతమ్మునితో నిట్లనెను."నాముక్కు, చెవులు కోయఁబడుటచే నాశరీరమంతయు రక్తముచే తడిసినది.ఇట్టి శరీరముఁగల నేను నీచే నోదార్చబడితిని. నాప్రియముఁకొఱకు నీవు రామలక్ష్మణులను జంపుటకు 14 రాక్షసవీరులను బంపితివి. వారు శూలములతో రాముని నెదుర్కొని యుద్ధముచేసినను నాతనిబాణములచే నొకనిమిషముఁలో నందఱునుజంపబడిరి. అతనియీగొప్పకార్యమును జూచిన నాకు మిక్కిలిభయముకలుగ గొప్పవిచారమునుబొంది నిన్ను తిరుగ శరణు బొందితిని. నీవు నన్నేలరక్షింపవు? నాయందును, రాక్షసకుటుంబములందును నీకు దయగలదేని రాముని దండించుటకు నీకు శక్తిపరాక్రమములు కలవేనిదండకారణ్యములోనుండి రాక్షసులకు బాధకలిగించు నాతని నీవు చంపుము. నాశత్రువగు నతనిని నీవిప్పుడు చంపకపోయిన సిగ్గువిడిచి నీయెదుట నేను ప్రాణముల విడిచెదను. నీవు నీబలములతో యుద్ధములో నాతనియెదుటనిలువలేవని నేను తలచెదను.మనుష్యులగు రామలక్ష్మణులను నీవు చంపలేకపోయినయెడల పేరునకు నీవు శూరుడవుగాని నిజముగ నీవు శూరుడవుకావు; నిజమగుపరాక్రమము కలవాడవుగావు. బలహీనుడును, స్వల్పవీర్యవంతుడుననగు నీవంటివాడిక్కడ నెట్లుకాపుర ముండగలడు? నీవు నీబంధువులతో శీఘ్రముగ నీజనస్థానమునుండి పాఱిపొమ్ము. రాముని తేజోమహిమచే నీవు పరాభవమునొంది శీఘ్రముగ నాశన మొందెదవు. ఆతడును, నన్ను విరూపిగజేసినయాతనితమ్ముడును గొప్పపరాక్రమవంతులు." ఇట్లు శూర్పణఖ యనేకపర్యాయములు గొప్పదుఃఖముతో విలపించుచు చేతులతో తనపెద్దకడుపును మోదుకొనెను.

ఇట్లా మొవలన నవమానమునొందిన ఖరుడు రాక్షసులమధ్యను నామెతో కఠినములగువాక్యముల నిట్లు పలికెను. 'నీయవమానముచే పుట్టిన యీగొప్పకోపమును నేను సహింపలేను. మనుష్యుడును, నొక గడియలో జంపబడగలవాడునునగు రాముని పరాక్రమము నేనేమియు గొప్పదిగా నాలోచింపను. వాడు తానుజేసిన చెడుపనులచేత తన ప్రాణముల నిప్పుడే పోగొట్టుకొనును. నీవు కన్నీటిని, మనశ్చాంచల్యమును విడువుము. రాముని, వానితమ్ముని నేను యమపురికి బంపెదను. ఈదినమున యుద్ధమున గండ్రగొడ్డలితో వానిని నేనుసంహరింప వాని రక్తము నీవు త్రాగెదవు.' ఇట్లు ఖరుడు పలుక నజ్ఞానముచే మొదట వానిని దూషించినశూర్పణఖ తరువాత వానిని ప్రశంసించెను. అంత నారాక్షసవీరుడు తనసేనాపతియగు దూషణునితో నిట్లనెను. 'నేను కోరినటుల నడచువారును, యుద్ధములో వెనుదిరుగనివారును, గొప్ప వేగముగలవారును, నల్లనిమేఘమువంటి రూపములతో గొప్పక్రూర కర్మలనుజేయువారును, లోకములకు బాధకలుగజేయుటలో సంతోషముగలవారును, మంచిబలపరాక్రమములుగలవారును, పులివలె శౌర్యముగలవారును, గొప్పముఖములుగలవారును, గర్వముగలవారునునగు 14000 రాక్షసులను వారియాయుధములన్నింటితోను యుద్ధమునకు సిద్ధముచేయుము. నారథమును, నాయుధసామగ్రిని సిద్ధము చేయుము. దుర్మార్గుడగు రామునివధార్థమై ముందుగ రాక్షసబలములను బంపుము.' ఇట్లు ఖరుడు పలుక దూషణుడు మంచిరథమును సిద్ధముచేయించెను. అది మేరుశిఖరమువలె నెత్తుగనుండి మెఱయుచున్నబంగారుమలామజేయబడి విశాలమైనదై బంగారుచక్రములు గలిగి వైడూర్యములదండచే గట్టబడి బంగారుతో జేయబడిన చేపలు, పువ్వులు, చెట్లు, రాళ్లు, సూర్యచంద్రులు, పక్షులు, నక్షత్రములు మొదలగుచిత్తరువులతో నిండి ధ్వజములతో నలంకరింపబడి యాయు

ధములతో నింపబడి చిరుగంటలతో నమర్పబడి మంచిగుఱ్ఱములు కట్టబడియుండ ఖరుడు గొప్పకోపముతో దానినెక్కెను. అప్పుడు దూషణుడును, పదునాల్గువేలరాక్షసవీరులును తమవివిధాయుధము లతో సిద్ధమైయుండ ఖరుడు వారికి బయలుదేఱుటకు సెలవిచ్చెను. జనస్థానమునుండి వారందఱు పెద్దకేకలువేయుచు మిక్కిలియుత్సాహ ముతో బయలువెడలిరి. వారికి కొంచెముదూరమున ఖరునిసారథి వానిచిత్తముననుసరించి బంగారుతోనలంకరింపబడిన యారథగుఱ్ఱము లను దోలెను. ఆరథశబ్దము దిక్కులవ్యాపించెను.

ఖరుడును, నతనిసేనయు బయలుదేఱునపు డనేకములగు * దుశ్శకునము లాయెను. రథమునకు గట్టబడినగుఱ్ఱములు పువ్వులతో నిండిన సమతలరాజమార్గమందు దైవవశముచే పడిపోయెను. రథధ్వజ మునందు బంగారుకఱ్ఱపైని పెద్దగ్రద్దయొకటి వ్రాలెను. ఖరుడు రథ మునగూర్చుండి యట్టహాసముచేయుచుండ వానియెడమభుజము వణ కెను. వానిస్వరము హీనమయ్యెను. వాడు చూచుచుండ వానికం డ్లలో నీరుచేరెను. వానినుదుట నొప్పివచ్చినను వాడజ్ఞానముచే యుద్ధ మునుండివెనుకకు మఱలలేదు. ఇట్టియుత్పాతములను జూచి ఖరుడు రాక్షసులందఱితో నిట్లు ప్రసంగించెను. "ఈఘోరములగు దుశ్శకు నములను బలిష్ఠుడనగు నేను దుర్బలులవలె సరకు గొనను. నే నాకాశ మునుండి నాబాణవేగముచే నక్షత్రములనైనను పడగొట్టెదను. మృత్యుదేవతను నాశనము నొందించెదను. బలగర్వములుగలరాముని, వానితమ్ముడగులక్ష్మణుని బాణములతో జంపకుండ నేను తిరుగ వచ్చుటకిష్టపడను. శూర్పణఖకొఱకై నేను వారిని నాశనమునొందించు చున్నాను. వారిరక్తము త్రాగి తనకోరికను నెఱవేర్చుకొనును గాక! పూర్వము యుద్ధములో నాకెన్నడును నపజయము కలుగలేదను

* 13 వ, ప్రకరణము. ౯ వ. అధ్యాయము దుశ్శకునములు చూడుము.

సంగతి మీకందఱికి తెలిసినదే కదా? నేనబద్ధముపలుకను. నాకు మిక్కిలికోపముకలిగినయెడల నేను వజ్రాయుధముపట్టినయింద్రునినైన వధింతును. అట్టిచో నీస్వల్పమనుష్యులసంగతిచెప్ప నేల?" ఖరునియీ మాటలను మృత్యుపాశముచే నీడ్వఁబడుచున్న రాక్షససేన విని మిక్కిలిసంతోషమునొందెను. ఆతనిరథము ముందునడిచెను. రాక్షసులు దానివెంట వెళ్లిరి. ఆతనియమాత్యులగు శ్యేనగామి, పృథుగ్రీవుఁడు, యజ్ఞశత్రువు, విహంగముఁడు, దుర్జయుఁడు, కరవీరాక్షుఁడు, పరుషుఁడు, కాలకార్ముకుఁడు, మేఘమాలి, మహామాలి, సర్పాస్యుఁడు, రుధిరాశనుఁడునను 12 గురును, నాతనిసేనానాయకులగు మహాకపాలుఁడు, స్థూలాక్షుఁడు, ప్రమాథి, త్రిశిరుఁడు ననువారును సేనాధిపతియగు దూషణునితో బయలుదేఱి యాతనివెంట వెడలిరి. ఇట్లు వారందఱును రాముని పంచవటీయాశ్రమమును జేరఁబోయిరి.

రాముఁడీయుత్పాతములు జరుగుచుండుట జూచి లక్ష్మణునితో నిట్లు చెప్పెను. "ఈదుశ్శకునములన్నియు రాక్షసులందఱినాశనము కొఱకై కాన్పించుచున్నవి. నాబాణములన్నియు యుద్ధమున కెదురుచూచుచు ప్రతాపాగ్నితో నిండియున్నవి. బంగారుకట్లుగల నాధనస్సులు మిక్కిలి చలించియున్నవి. నాభుజము మాటిమాటికి నదురుచుండుటచే గొప్పయుద్ధము శీఘ్రముగ వచ్చును. మనకు జయమును మనశత్రువుల కపజయమును కలుగుట నిశ్చయము. నీముఖము నాకు సంతోషకరముగను, కాంతిగలదిగను కనబడుచున్నది. యుద్ధమునకు వచ్చువారిముఖములు కళావిహీనములుగ నున్నయెడల వారియాయువు నాశనమునొందును. అదిగో! రాక్షసులగొప్పధ్వని వినబడుచున్నది. క్రూరకర్ములగు రాక్షసులు భేరీలు వాయించుచున్నారు. శుభమును గోరు దూరదృష్టిగలపురుషుఁ డాపదవచ్చునని తోఁచినపుడు ముందు జరుగఁబోవుకార్యమునకు ప్రతీకారమును ముందు బాగుగ చక్కఁబెట్టి

వలెను. కనుక నీవు ధనస్సునుబట్టి చెట్లతో నిండిన గుహాలలోనికి సీతను దీసికొనిపొమ్ము. నీవు నామాట కెదురుపలుకగూడదు. నీవు నాపాదము లందు భక్తికలవాడవగుటచే నిన్ను నే నాజ్ఞాపించుచున్నాను. నీవు శీఘ్రముగ బొమ్ము. నిజముగ శూరుడవగు నీవు శతృవులను జయింప గలవు. ఆవిషయమై నాకనుమానములేదు; కాని నేనే రాక్షసులనంద ఱిని జయింపగోరెదను." ఇట్లు రాముడు చెప్ప లక్ష్మణుడు ధనస్సును, బాణములను బట్టి బాగుగరక్షించుగుహాలోనికి సీతను దీసికొని పోయెను. రాముడప్పుడు సంతోషముతో మంచియాలోచన చేసితివని పలికి మిక్కిలికాంతిగలకవచమును ధరించి చీకటిలోప్రకాశించు నగ్ని వలె ప్రకాశించెను. అతడు గొప్పధనస్సునుబట్టి బాణములను సంగ్ర హించి దిక్కులు ప్రతిధ్వనించునట్లు ధనుష్టంకారముచేసి నిలిచియుండెను. అప్పుడు యుద్ధముచూచు వేడుకతో దేవతలును, గంధర్వులును, సిద్ధు లును, చారణులును, గొప్పఋషులును, బ్రహ్మర్షులును నిలిచి 'లోకము లకు శ్రేయమునుగలిగించు గోబ్రాహ్మణులకు శుభము కలుగుగాక! చక్రహస్తుడగు విష్ణు వసురలను ఖండించునటుల రాముడు రాక్షసు లను నాశనముచేయుగాక!' ఇట్లు వారు రాముని దీవించుచు నొకరి నొకరు జూచుకొనుచు భయంకరకర్మలను జరుపు 14000 రాక్షసులతో రాముడొక్కడే యెట్లు యుద్ధముచేయునని పలికిరి. తమవిమానముల పైనుంచి దేవతలును, మిగిలినవారందఱును దానిని శ్రద్ధతో జూచు చుచుండిరి. యుద్ధమునకు నిలిచి రాముని తేజఃప్రభావమును జూచి జీవులన్నియు భయముచే బాధనొందుచుండెను. అప్పుడు రాముడు దక్షయజ్ఞముధ్వంసముచేయునపుడు ధనస్సుబట్టి నశివునివలె రౌద్రరూప ముతో నుండెను. అంతట రాక్షససేన యాయుధములను, ధ్వజము లను బట్టి కవచములను ధరించి సింహనాదములజేయుచు ధనస్సులను మోగించుచు దుందుభులను వాయించుచు వచ్చెను. దానికి నాయడ

విలోనున్న జంతువు లన్నియు నక్కడనుండి పాఱిపోయి శబ్దములేనిచోట నిలిచెను. రాక్షససైన్యము రామునియెదుట నిలిచెను. అతడు పెద్ద ధనస్సుపెట్టి యమ్ములపొదులనుండి బాణముల దీసి రాక్షసులనందఱిని సంహరించుటకు గొప్పక్రోధముకలిగియుండెను. అతని తేజఃప్రభావము జూచి వనములలోనుండుభూతములన్నియు పాఱిపోయెను.

ఖరుడు రామునియెదుటకు తనరథమును దోలుటకు తనరథ సారథికి నాజ్ఞాపింప వాడు గుఱ్ఱముల నట్లు తోలెను. ఖరునిచుట్టు ఖరునియమాత్యులు చేరి పెద్దధ్వనిజేయుచుండిరి. అప్పుడు వాడు నక్షత్రములలో నంగారకునివలె వారిమధ్యను ప్రకాశించెను. వాడు రాముని వేయిబాణములతో గొట్టి శబ్దముచేసెను. రాక్షసులందఱు గొప్ప కోపముతో ననేకవిధములగు శస్త్రముల నాతనిపై విసరిరి. మేఘములవలె నల్లనైన గొప్పశరీరములుగల యారాక్షసులు కొందఱు రథములపైనుండియు, కొందఱు గుఱ్ఱములపైస్వారిచేయుచును, కొంద ఱేనుగులనెక్కియు నాతనిపై శరవర్షము కురిపించి యాతనిచుట్టుముట్ట డించిరి. వాని నన్నిటిని రాముడు తనబాణములతో తిరుగగొట్టినను నవి రామునిశరీరమునకు గాయములు కలిగించెను; గానియాతడు బాధ నొందక నిలిచెను. యాతనిశరీరమునుండి రక్తముకాఱుచుండుటచే నాతడు సంధ్యాకాలమేఘములచే గప్పబడిన సూర్యునివలె ప్రకాశించెను. ఇట్లొకనితో ననేకులు తలపడుట జూచి యక్కడకువచ్చిన దేవతలును, గంధర్వులును, సిద్ధులును, గొప్పఋషులును విచారముతో నుండిరి. రాముని కప్పుడు గొప్పకోపముగలిగి ధనస్సును చక్రమువలె త్రిప్పి వేలకొలది తీక్ష్ణములగుబాణములను విడువ వానిని రాక్షసులు నివారింపలేకపోయిరి. యమునికాలపాశములవలె నాబాణములు రాక్షసుల ప్రాణముల హరించి వారిరక్తములోమునిగి వారిదేహములనుండి పైకివచ్చి యాకాశమున కెగిరి ప్రకాశించెను. రాముని బాణ

ములు రాక్షసులధనస్సులను, ధ్వజములకొనలను, కవచములను, వారి శిరస్సులను, నలంకారములను, వారిబాహువులను, పెద్దతొడలను, ఛేదించెను. రాముడు బంగారుచే నలంకరింపబడిన రథగుఱ్ఱములను, రథసారథులను, ఏనుగులను, వాని నారోహించినవారిని, గుఱ్ఱములను, కాల్బలములనుగూడ బరిమార్చెను. రాక్షసుల ఛత్రి చామరములును, ధ్వజములును, శస్త్రములును ముక్కలాయెను. రామునితీవ్రబాణములచే గొట్టబడి రాక్షసులు దైన్యముతో గోల పెట్టుచుండిరి. అప్పుడు బలవంతులగుకొందఱు రాక్షసులాతనిపై ననేక విధములగు శస్త్రములవిడువ వానినన్నిటిని నతడు తన బాణములతో విఱుగగొట్టి వారిశిరముల ఖండించెను. వారికవచములు, ధనస్సులు భూమియందు పడెను. మిగిలినరాక్షసులు విచారమునొంది ఖరుని యొద్దకు పరుగెత్తుకొని పోయి వానిని శరణుజొచ్చిరి. తరువాత వాని సేనాధిపతియగు దూషణుడు వారినందఱిని నోదార్చి తిరుగ యుద్ధమునకు దీసికొనివచ్చి యముడు ఋుద్రునితో దలపడినట్లు రామునితో యుద్ధమునకు దలపడెను. రాక్షసులు గుగ్గిలపుమ్రానులతోను, తాటిచెట్లతోను, పెద్దరాళ్లతోను నాతని నెదుర్కొనిరి. బలముగలరక్కసులు కొందఱు వివిధశస్త్రములతోను, బాణములతోను రామునితో నన్నిదిక్కులనుండి పెద్దయుద్ధము జరిపిరి. అప్పుడు రాముడు పెద్దధ్వని జేసి వారిపై మిక్కిలి తేజోవంతమగు గంధర్వాస్త్రమును విడిచెను. మఱియు ధనస్సును చక్రాకారముగ త్రిప్పి యనేకములగు బాణముల నన్నిదిక్కుల విడిచెను. వానితో దిక్కులు చీకట్లుగ్రమ్మ సూర్యుడు కనబడకయుండ ననేకరాక్షసు లొక్కకాలమున పడుచు చచ్చుచుండిరి. రామునిబాణములచే వేలకొలదిరాక్షసులు బంధింపబడిరి. కొందఱిశరీరావయవములు ముక్కలయ్యెను. కొందఱు చీల్చబడిరి. ఇట్లు 14000 మంది రాక్షసులలో 9000 మంది మడిసిరి. తరువాత దూష

ణుడు మంచిజవబలములుగల మిగిలిన 5000 మందిరాక్షసులను, యుద్ధమునకు బురికొల్పెను. వారు శస్త్రములను, రాళ్లను రామునిపై కురియింప వాని నాతడు కఠినములగు తనబాణములతో తిరుగగొట్టి క్రోధముతో రాక్షసులసందడిని సంహరించుటకు నిశ్చయించెను. అతడు రాక్షససైన్యముపైని, దూషణునిపైని శరవర్షము కురిపింప నా సేనాధిపతికూడ నాతనిపై బాణముల విడిచెను. తరువాత రాముడు కత్తియాకారముగల తనబాణముచే వానిధనస్సును విఱిచి 4 బాణములతో వానిరథగుఱ్ఱములను, నొక్కబాణముతో వానిరథసారథితలను ద్రుంచి వాని వక్షస్థలమున వాడియగు 3 బాణములను నాటెను. అప్పుడు దూషణుడు భూమిపై నిలిచి కొండశిఖరమువలె పొడుగైన గొప్పగదనుపట్టి యాతని నెదుర్కొనెను. బంగారుకట్లుగలయాగదతోనే పూర్వము వాడు దేవసైన్యములను మర్దించి శత్రుగోపురములను విఱుగగొట్టెను. అప్పుడు రాముడు దూషణుని రెండుభుజములను బాణములతో గొట్ట వాడు భూమిపైబడి మృతినొందెను. దానికి ఋషులు మొదలగువా రందఱును మిక్కిలిమంచిపనిజరిగెనని యాతని స్తుతించిరి.

తరువాత ఖరుని సేనానాయకులలో మహాకపాలుడు పెద్దశూలమును, స్థూలాక్షుడు పట్టసమును, ప్రమాథి గండ్రగొడ్డలిని బట్టుకొని యందఱు కలిసి రాముని నెదుర్కొనిరి. అతడు మహాకపాలుని శిరస్సును గొప్పబాణములచే ఖండించి యనేకబాణములచే ప్రమాథిని పిప్పిజేసి, స్థూలాక్షునికండ్లలో బాణముల గొట్ట వారు నశించిరి. ఈసేనానాయకులును, మిగిలి 5000రాక్షసులును జంపబడుట తెలిసికొని ఖరుడు మిక్కిలికోపించి 'ఈస్వల్పమానవుని రాక్షసులందఱు అనేకవిధములగు శస్త్రములతో నంతమునొందింపు'డన శ్యేనగామిమొదలగు 12 గురమాత్యులు రాముని నెదుర్కొని మంచిబాణముల విడి

చిరి. రాముఁడు బంగారుకట్లుగల బాణములను వదల నవి పొగతో గూడి మంటలువలె బయలుదేఱి మిగిలినరాక్షససైన్యమునంతను నాశ నముచేసెను. ఇట్లు ఖరుఁడును, త్రిశిరుఁడును, వానియనుచరులునుతప్ప మిగిలిన 14000రాక్షసులు భూమిపైబడి మడియ నావనము వారిశరీర ములతోను, రక్తమాంసములతోను నరకమువలెనుండెను.

తరువాత రామునికెదురుగ ఖరుఁడు యుద్ధమునకు బోవుచుండ త్రిశిరుఁడను సేనానాయకుఁ డాతనిదగ్గఱకు వెళ్ళి యిట్లు మనవిచేసెను. 'నన్ను యుద్ధమునకు నియమింపుఁడు. మీరు సాహసమును విడిచి వెనుకకు మఱలుఁడు. రాముఁడు యుద్ధములో పడుట మీరు చూచె దరు. రాక్షసులందఱికి జంపదగిన యాతనిని నేను వధించెదనని నాయాయుధమునుముట్టి మీయెదుట ప్రమాణము చేసెదను. యుద్ధ ములో నావలన నతఁడుగాని, యతనివలన నేనుగాని మృత్యువునొంద వలెను. మీరొకగడియ యుద్ధసన్నాహమువాని జయాపజయముల జూచుచుండుఁడు. రాముఁడు మరణించిన సంతోషముతో మీరు జన స్థానమునకు బోవచ్చును. నేను మరణమునొందిన మీ రాతనితో యుద్ధమునకు బోవచ్చును.' ఇట్లు త్రిశిరుఁడు పలుక దానికి ఖరుఁడొప్పు కొనెను. వాఁడు మంచిగుఱ్ఱములనుగట్టిన రథమెక్కి రామునినెదుర్కొని యనేకబాణములను విడిచి హీనకంఠముతో ధ్వనిచేసెను. రాముఁడు తనధనస్సునుండి తిరుగ కఠినములగు బాణములను విడచెను. మంచి బలముగల యేనుఁగునకు, సింహమునకు జరుగుయుద్ధమువలె బలవంతు లగు త్రిశిరరాములకు గొప్పపోరాటము జరిగెను. అప్పు డారక్క సుఁడు రామునినుదుట మూఁడుబాణములువేయ నాతనికికోపమువచ్చి వానితో 'ఆహా! నీబలపరాక్రమము లిట్టివా? నీబాణములు పువ్వుల వలె నాకు దగిలినవి. నేను విడుచువానిని నీవు కాచుకొను'మని బల్కి 14బాణముల నతఁడు వానివక్షస్థలముపై వేసెను. 4బాణములను వాని

గుఱ్ఱముపైని విడువ నవి క్రిందపడెను. 8 బాణములతో వానిరథసారథిని గొట్టెను. ఒక బాణముతో వానిజండాను విఱుగగొట్టెను. త్రిశిరుడు రథమునుండి పైకిను ఱుకుచుండ నతడు బాణములతో వానిహృదయమున గొట్ట వాడు చేష్టలుడిగియుండెను. తరువాత రాముడు బలిష్ఠములగు మూడుబాణములతో త్రిశిరుని మూడుతలలను బడగొట్టెను. అంతట వాడు శరీరమునుండి రక్తముకాఱుచుండ భూమిపై బడి చచ్చెను. తరువాత మిగిలిన వానియనుచరులు భయముతో ఖరునియొద్దకు బరుగెత్తిరి. అంతట ఖరుడు కోపముతో వారిని యుద్ధమునకు మళ్లించెను.

తరువాత ఖరుడు రామునియెదుటకు యుద్ధమునకు బోయెను; కాని యతడు దూషణత్రిశిరులును, మిగిలిన రాక్షసులును నాతనిచే గూల్ప బడుటవలన నతనిపరాక్రమము మెచ్చికొని భయమును బొంది గర్వమును విడిచి రథమెక్కి పెద్దధనస్సును సంధించి ధనుర్వేదయుక్తముగ నస్త్రములను, బాణములను విడిచెను. అవి యన్నిదిక్కులకు వ్యాపించెను. రాముడుగూడ పెద్దధనస్సునుబట్టి బాణముల విడిచెను. ఇట్లు వారిద్దఱు నొకరినొకరు చంపునుద్దేశముతో యుద్ధముచేయుటచే నన్నిచోట్ల శరమయమై యుండి సూర్యుడుకూడ కనిపింపకపోయెను. ఖరుడాతనిపై ననేకవిధములగు బాణములను విడిచి తనరథముపై ధనస్సుపట్టి నిలిచినపు డతడు కాలపాశముపట్టిన యమునివలె నక్కడిజనులకు గనబడెను. తనసైన్యముల నన్నిటిని బరిమార్చి యాయాసముగనుండిన రాముడు గొప్పబలవంతుడని ఖరుడనుకొనెను. వానియుద్ధచాతుర్యమును రాముడేమియు పాటింపలేదు. ఖరుడు బాణములతో రాముడు ధనస్సును, బాణములను పట్టినచోటగొట్ట నవి క్రిందబడెను. తరువాత వాడేడుబాణములతో నాతనికవచమునుగొట్ట నది క్రిందబడెను. ఇంకను ఖరుడు రామునిపై వేయిబాణములను విడిచి పెద్దధ్వనిచేసెను.

ఆదేవ్వలతో రాముడు పొగలేనినిప్పువలె తేజరిల్లుచు శత్రునాశమునకై పూర్వ మగస్త్యుడు తనకిచ్చిన విష్ణుసంబంధమగుధనస్సును బట్టి వానినెదుర్కొనెను. అతడు బాణములతో మొదట వానిరథముపైనున్న బంగారుధ్వజమునుగొట్ట నది చాలముక్కలై భూమియందు బడెను. అందుచే ఖరుడు తనకు కోపమురాగ నాతనియవయవములం దనేకబాణముల విడువ నతనిశరీరమంతయు రక్తముతో దడిసెను. అంత నతడు గొప్పరోషముకలవాడై యొకబాణముతో ఖరునిశిరస్సును, రెండుబాణములతో వానిభుజములను, మూడుబాణములతో వానివక్షస్థలమును గొట్టెను. తరువాత నతడు వానిరథముపై బాణము వేయ నది ముక్కలయ్యెను. 4 గుఱ్ఱములపైని 4 బాణములను వేయ నవి చచ్చెను. ఒకబాణమును రథసారథిపైని వేయ వాడు హతుడయ్యెను; ధనస్సునుగొట్ట నది క్రిందబడెను. తరువాత రాముడు నవ్వుచు ఖరునిపై నొకబాణమును వేయ నతడపుడు పెద్దగదపట్టి రథమునుండి క్రిందకు దుమికి భూమియందు నిలిచెను. ఇదంతయు దేవతలు, మహర్షులు చూచి మిక్కిలిసంతోషించి రామునికి చేతులు జోడించి వానిని స్తోత్రముచేసిరి. దేవతలు విమానమునుండి యతని దగ్గఱకు వచ్చిరి.

రాము డప్పుడు మృదువైనమాటలతో ఖరుని నిట్లు నిందించెను. "చాలయేనుగులు, గుఱ్ఱములు, రథములుగల నీవు లోకముల కన్నిటికి కష్టమునగునట్టి ఘోరమగుపనులను జేసితివి. జీవులకు భయమునుగలిగించి వారికి ఘాతచేయుపాపి మూడులోకములకు నధిపతియైనను జీవించియుండడు. ఓరీ! రాక్షసాధమా! లోకవిరుద్ధమగు కర్మలను జేయువానిని జనులందఱు పైకివచ్చినదుష్టపామును జంపునట్లు జంపుదురు. అజ్ఞానముచేగాని, కోరికచేగాని పాపముజేయువాడు తన సంగతి తెలిసికొనక తనకువ్యాంతకరమగు నష్టమును జెంది తననాశన

మును తెలిసికొనును. దండకారణ్యములో నివసించిన ధర్మాచరణు లగు గొప్పఋషులను జంపినందులకు నీవు దానిఫల మేల యనుభవింపకుందువు? లోకములకు భయంకరములగు పనులుచేసిన క్రూరులగుపాపాత్ములు చాలకాల మైశ్వర్య మనుభవింపరు. చెట్లు తమతమ ఋతుకాలములువచ్చినపుడు తగినపుష్పములను పూచునటుల జీవులు తమపాపకర్మలఫలమును తగినసమయమువచ్చినపుడు తప్పక యనుభవింతురు. విషముతోగూడినయన్నమును భుజించువాడు మరణము నొందునటుల పాపకర్మలజేయువాడు వానిఫలమును వేగముగ ననుభవించును. గొప్పపాపములజేయువారియొక్కయు, లోకులకు కీడు కోరునట్టివారియొక్కయు ప్రాణములను దీయుటకు రాజుచే నేను నియమింపబడితిని. నేను విడిచినబాణములు నీకిప్పుడు తగిలి నిన్నుజీల్చి నీశరీరమునుండి బయలువెడలును. దండకారణ్యములో నీవు భక్షించిన ఋషులుపొందినలోకమును నీవు నీసేనతోగూడ నీదినమున బొందెదవు. నీవలన పూర్వము బాధజెందినగొప్పఋషులు విమానములందుండి బాణములతో చీల్చబడి గొప్పబాధనొందు నిన్ను జూచెదరు. నీయిష్టమువచ్చినట్లు యుద్ధముచేయుటకు యత్నించినను నేనిప్పుడే నీతలను తాటిపండువలె నేలను రాల్చెదను.” ఇట్లు రాముడు వానిని నిందింప ఖరుడు మిక్కిలికోపముజెంది కండ్లెఱ్ఱజేసి పెద్దనవ్వునవ్వి యిట్లనెను. ‘సామాన్యరాక్షసులను యుద్ధములో జంపి నిన్ను నీవే పొగుడుకొనెదవేల? బలపౌరుషములుగల నరశ్రేష్ఠులు తమప్రతాపముచే గర్వించి యేమియు చెప్పుకొనరు. రామా! సామాన్యులును, చెడుబుద్ధిగలవారునగు క్షత్రియాధములు నీవు పొగుడుకొనునట్లు నిరర్థకముగ శ్లాఘించుకొందురు. మృత్యుతుల్యమగు యుద్ధముసంభవించినపు డప్రసక్తముగ తనకులఘనతను నేవీరుడు పొగుడుకొనును? అన్నివిధముల నీస్వల్పగుణమును నీవు తెలుపుకొంటివి. నేను గదపట్టి

పర్వతమువలె కదలకుండ నీప్రాణముల దీయుటకు మూడులోకముల ప్రాణములను హరించుపాశమునుధరించిన యమునివలె నిలిచియుండ నీవు నన్ను జూడకున్నావు. నేను నీవిషయమై పలుకవలసిన కఠినమగు మాట లనేకము లున్నను నేను వానిని పలుకను. సాయంకాలము సమీపించుచున్నది. అప్పుడీ యుద్ధమునకు భంగముకలుగును. నేను జంపి నీవలన మడిసిన 14000 రాక్షసులనుగూర్చి యేడ్చువారిదుఃఖ మును నీర్చెదను.' ఇట్లు ఖరుడు పలికి రామునిపై మిక్కిలికోపముతో పెద్దగదను విసర నది దారిలోనుండు చెట్లను, పొదరిండ్లను నాశనము చేయుచు నాకాశమునుండి తనమీదకు వచ్చుచుండ దానిని రాముడు బాణములతో ఖండించెను. అది ముక్కలై భూమియందు పడెను.

రాము డటుతరువాత నవ్వుచు కోపించియున్నఖరునితో నిట్ల నెను. "రాక్షసాధమా! నీబలమంతయు దెలిసినది. మత్తుడవగు నీవు వ్యర్థముగ గర్వించి బలహీనుడవై ప్రేలుచుంటివి. శత్రువులకు హింస కలిగించు నీగద నాబాణములచే ముక్కలై భూమియందు బడెను. 'చనిపోయినరాక్షసుల బంధుదుఃఖమును బోగొట్టెద'నని నీవు పలికిన పలుకు లబద్ధము లయ్యెను. గరుత్మంతు డమృతమును హరించునటుల నీచుడవును, నల్పబుద్ధిగలవాడవును, దుర్వృత్తిగలవాడవునగు నీ ప్రాణముల హరింతును. ఇప్పుడు నాబాణములచే తెగిన నీకంఠమునుండి రక్తముకారు భూమి దానిని పానముచేయును. శరీరమంతట బుగ్గియంటి యుండ నీవు రెండుభుజములతో భూమియందు పడియుండెదవు. అట్లు నీవు మరణమునొంద మునులు నివసించుటకు వీలుగలేని యీదండకా వన మిప్పుడు నివాసయోగ్యముగ నగును. నాబాణములచే నీజనస్థాన మున నీవు మరణమునొంద ఋషులందఱు వనములో భయమేమియు లేక తిరిగెదరు. ప్రజలకు భయముకలిగించురాక్షసస్త్రీలు తమబంధు వులు మరణమునొంద నిప్పుడు దీనులయి కండ్లంట నీరుదెచ్చుకొనుచు

భయమునొంది జనస్థానమునుండియిప్పుడే పాఱిపోయెదరు.ఇట్టిదుర్మార్గు డవగునిన్ను భర్తగపొందిన నీభార్య లిప్పుడు శోకరసమునుగూడ దెలిసికొందురు. నీచా! నీచబుద్ధిగలవాడా! బ్రాహ్మణహింసకా! నీకు భయపడి బ్రాహ్మణు లగ్నియందు హవిస్సు మొదలగువానిని వేల్చు టకు శంకించుచుండిరి." ఇట్లు యుద్ధములో రాముడు ఖరుని దూషింప వాడుగూడ పెద్దధ్వనితో రాముని నిట్లు నిందించెను. 'నీకు గొప్ప భయమునుకలుగజేయు కారణములున్నను నీవు మిక్కిలిగర్వముచే నిర్భ యుడవై యున్నావు. నీకు మరణము సిద్ధముగనున్నను నీవు పలుకతగిన దానిని, పలుకతగనిదానిని తెలిసికొనలేకున్నావు. కాలపాశముచే గొట్టబడువారు తమయింద్రియబల ముడుగుటచే జేయతగినదానిని, జేయతగనిదానిని తెలిసికొనజాలరు.' ఇట్లు ఖరుడు పలికి రామునివైపు మొగముత్రిప్పి బొమముడివేసి యాతనితోయుద్ధముచేయుటకు నాయు ధమునకై యన్నిదిక్కుల జూచి స్వల్పదూరమున గుగ్గిలపుమ్రానును జూచి పండ్లు పటపటకొఱుకుచు రెండుచేతులతోను నాచెట్టును పెఱికి పెద్దధ్వనిజేయుచు 'నీవు దీనితో హతుడవైతి'వని దానిని రామునిపై విసరెను. అంతట నాతడు దానిని బాణములచే గొట్టి వానిని జంపు టకు గొప్పరోషముతో కండ్లెఱ్ఱజేసి శరీరమున జెమటలుపుట్ట వేయి బాణములతో ఖరుని గొట్ట వానిశరీరమునుండి చాల రక్తముకాఱెను. వాడు చంచలమనస్కుడై రామునియెదుటకు పరుగెత్త నస్త్రప్రయో గమునెఱిగిన రాముడు కొంచెము వెనుకకుజరిగి యింద్రు డగస్త్యుని ద్వారా తనకిచ్చిన బాణమును ధనస్సున సంధించి ఖరునిపై విడిచెను. అది పిడుగువలె ధ్వనిజేయుచు ఖరునివక్షస్థలమునకు తగుల వాడు భూమియందుబడి మరణమునొందెను. అప్పుడు రాజర్షులును, నితర గొప్పఋషులును గూడి సంతోషముతో రాముని గౌరవించి యిట్లు పలికిరి. 'ఇందునిమిత్తమే యింద్రుడు శరభంగాశ్రమమునకు వెళ్లెను.

పాపకర్ములగు నీక్రూరరాక్షసులను జంపుటకై గొప్పఋషు లుపాయ మున మిమ్మీదేశమునకు రప్పించిరి. చేయవలసినకార్యమును మీరు జరిపితిరి. మహర్షులు దండకారణ్యమున ధర్మమును సుఖముగ జరిపెదరు.' ఋషు లిట్లు పలుకుచుండుసమయమున దేవతలును, చారణులును దుందుభులను గట్టిగవాయించుచు నవ్వుచు రామునిపైని పుష్పవర్షము కురిపించిరి. ఇట్లు మూడుగడియలలో రామునివాడిబాణములచే ఖర దూషణులుమొదలగు భయంకరులగు 14000 రాక్షసులు మరణించిరి. 'ఆహా! రాముడెంత గొప్పపనిజేసెను. ఆతనివీర్యమును, శక్తియు విష్ణునివలె గనిపించుచున్న'వని వారందఱు రాముని పొగుడుచు తమ తమనెలవులకు బోవుచుండిరి. ఇంతలో లక్ష్మణుడును, సీతయు కొండ గుహనుండి బయలువెడలి తమయాశ్రమమునుసుఖముగ జేరిరి. అప్పుడు విజయముపొందినరాముడు మహర్షులచే గీర్తింపబడుచు తనయాశ్ర మము జేర లక్ష్మణు డాతనిని మిక్కిలికొనియాడెను. ఇట్లు శత్రువుల సంపదఁనిని సంహరించినవాడును, మహర్షులచే పొగడబడుచున్నవాడును నగు రాముని జూచి సీత మిక్కిలియానందమునొంది వానిని కౌగిలించు కొనెను.

---

## ౧౩ వ. అధ్యాయము.

### రావణుడు సీతను హరింప నాలోచించుట.



జనస్థానమున ఖరదూషణత్రిశిరులును, 14,000 రాక్షసులును రామునిచే యుద్ధమున మడిసినతక్షణమే 'అకంపను'డను దూత వేగ ముగ లంకకు పరుగెత్తుకొనిపోయి జరిగినదంతయు రావణునికి దెలిపి తానెట్లో తప్పించుకొని వచ్చినసంగతికూడ దెలుప నారాక్షసరాజు

మిక్కిలికోపమును దెచ్చుకొని కన్నెఱ్ఱజేసి కన్నులనుండి మంటలుబయలు దేఱుచుండ వాని నిట్లడిగెను. 'సుందరమగు నాజనస్థానము ప్రాణములుగోలుపోవు నెవనిచే నాశనముచేయబడినది? అన్నిలోకములకు గతియగు న న్నతిక్రమించువా డెవ్వడైనా కయిష్టకార్యములను జేసినప్పు నింద్రునకైనను, కుబేరునికైనను, యమునికైనను, విష్ణునికైననుగూడ సుఖము కలుగదు. నేను యముని నంతము నొందింతును. అగ్నినికూడ కాల్చెదను. నాకు క్రోధముకలిగిన నగ్నిసూర్యులు కలిసివచ్చినను వారిని మండించెదను. వాయువేగమును నణగద్రొక్కెదను.' ఇట్లా రాక్షసరాజు పలుక నకంపనుడు తడబడుమాటలతో నతనిని శరణు వేడ నతడు వాని కభయమిచ్చెను. అప్పుడా దూత యాతనితో నిట్లు చెప్పెను. 'అనుపమసౌష్ఠవముగలవాడును, మహాబలవంతుడును, నెద్దువలె విశాలవక్షస్థలముకలవాడును, బాగుగతీరిన పొడుగగు భుజములుకలవాడును, సింహమువలె నడచువాడును, నిడుదకన్నులవాడును, వీరుడును, గొప్పకీర్తిమంతుడును, సత్యవంతుడును, చంద్రునివంటిమోముగలవాడును, నసమానబలపరాక్రమములుగలవాడును, దశరథునిపుత్రుడునునగు రాముడొకడున్నాడు. అతనిచే జనస్థానములోనిరాక్షసులందఱు మడిసిరి.' ఇట్లకంపనుడు పలుక రావణుడు పెద్దపామువలె బుసకొట్టుచు 'ఇంద్రునితోను, దేవతలందఱితోను నాతడక్కడకు వచ్చెనా?' యని వాని నడిగెను. దానికి వాడాతనిబలపరాక్రమములు రాక్షసరాజున కిట్లు తెలిపెను. "రాముడు గొప్పతేజశ్శాలి; విలువిద్యలో నసమానుడు. అతడు యుద్ధములో నింద్రునితో సమానుడు. అతనితో సమానమగు బలముగలవాడును, రక్తజీరలుగలనేత్రములుగలవాడును, మంచిధ్వనిగలకంఠముగలవాడును, చంద్రునివంటి మోముగలవాడునునగు లక్ష్మణు డాతనికి తమ్ముడు. వారిరువురగ్నివాయువులవలె కలిసియున్నారు. అట్టిశ్రీమంతుడగు రాజశ్రేష్ఠు

నిచే జనస్థానము నాశనముచేయబడినది. అక్కడికి దేవతలెవ్వరును యుద్ధమునకు రాలేరు. అతఁడు విడుచు బాణము లైదుముఖములుగల పాములవలె బయలుదేఱి రాక్షసులను జంపెను. భయముచే రాక్షసు లెటుపోయినను రాముఁడు వారికి నెదుటనుండినట్లు కనబడుచుండెను.” అకంపనుని యీమాటలను విని రావణుఁడు ‘నేను రామలక్ష్మణులనుజంపుటకు జనస్థానమునకుఁ వెళ్లెద’నని పలికెను. దాని కాదూత యాతనికి తిరిగి రామునిబలపౌరుషముల నిట్లు తెలిపెను. “అతఁడు కోపము జెందిన బాగుగ ప్రవహించు నదీవేగమునైనను తనబాణములతోఁగొట్టి నిలుపును. నక్షత్రగ్రహతారకలను, నాకాశమునుగూడ నశింపజేయును. అతఁడు సముద్రములో మునుఁగుచున్న భూమినిగూడ నెత్తగలఁడు. సముద్రతీరమును శరములతో భేదించి యానీటిని లోకములపై ప్రవహింపజేయగలఁడు. అతఁడు తనబాణములతో సముద్ర వాయువేగములను గూడ నాశనముచేయగలఁడు. తనపరాక్రమముచే నతఁడు లోకముల నన్నిటిని సంహరించి తిరుగ వానిని సృజింపగలఁడు. పాపులు స్వర్గమును బొందలేనట్లు మీరుగాని, రాక్షసులందఱుగాని రాముని యుద్ధమున గెలువలేరు. ఆతనిని దేవాసురులందఱుగూడ చంపలేరని నేను తలచెదను. ఆతనినివధించు నుపాయమొకటి నాకు గనబడుచున్నది. దానిని మీరు సావధానముగ వినుఁడు. రాముని భార్య మిక్కిలియుత్తమురాలును, విశాలనేత్రములుగలదియు, చంద్రునివంటి మోముగలదియు, పతివ్రతయు, తనభర్తకు ప్రియమే యెల్లప్పుడు కోరునదియునై మంచిజుట్టు, మంచిముక్కు, మంచిపలువరుస, యరటిస్తంభములవంటి తొడలు, మంచిహాసము గలిగి వనదేవతవలె ప్రకాశించి రెండవ లక్ష్మివలె నున్నది. మఱియు నామె బంగారమువంటి చాయగలదియు, మంచికటిసౌష్ఠముగలదియు, మధ్యయౌవనముననున్నదియు, మంచియలంకారములుగలదియునై యున్నది. స్త్రీలలో శ్రేష్ఠురాలగు

నా మొపేరు సీత. దేవతలలోగాని, గంధర్వులలోగాని, యక్షకిన్నరుల లోగాని, యప్సరసలలోగాని, దానవస్త్రీలలోగాని, యీమెతో సమానమగు స్త్రీ లేదు. ఇట్టిచో మనుష్యస్త్రీలలో నామెతో సమానమగు స్త్రీ యెట్లుండును? నీవా రాముని భార్యను బలాత్కారముగ నా మహావనమునుండి యిక్కడకు దీసికొనిరమ్ము. కాముకుడగు నారాముడామెం లేకపోయినచో ప్రాణముల విడుచును.” అకంపనుడు తెలిపిన యీమాటలకు రావణు డిష్టపడెను. అతడు * సనత్కుమారుడు తనతో జెప్పిన మాటలను మనస్సునకు దెచ్చుకొని యాలోచించి యమాత్యుతో ‘నీవు చెప్పినదాని నంగీకరించితిని. రేపటిసూర్యోదయమున నేను నాసారథితో గూడ రథమెక్కిపోయి సంతోషముతో మనలంకకు నాసీతను తీసికొనివచ్చెద’నని పలికెను.

అట్లు రావణుడు రథమెక్కి త్రికూటపర్వతముననుండు లంకను విడిచి యాకాశపథమున దానిని త్రిప్పుచు సముద్రతీరముననున్న పువ్వులు, పండ్లుగల నానావిధములగు చెట్లను, చల్లనినీటితో నిండిన కొలనులను, వేదికలుగల పెద్దయాశ్రమములను, ననేకనాగులను, గరుత్మంతులను, గంధర్వులను, కిన్నరులను, బ్రహ్మపుత్రులను, బ్రహ్మనఖములనుండి పుట్టినవారిని, బ్రహ్మపుచ్ఛమువలన పుట్టినవారిని, మాష గోత్రజులను, సూర్యకిరణములవలననే జీవించువారిని, మిక్కిలి నియమితమగు నాహారమును భుజించు గొప్పఋషులను, కోరికలను జయించిన సిద్ధులను, చారణులను, మంచియాభరణములను, మాల్యములను ధరించి దివ్యరూపములుగలిగి బాగుగ క్రీడించు నప్సరసలను, సిరిగలిగి విహరించు దేవతాస్త్రీలను, దేవ దానవ సమూహములను, కూయుచున్నహంసలు, క్రౌంచములు మొదలగు పక్షులను, వైడూర్య

* 5 వ. ప్రకరణము ౨౧ వ. అధ్యాయము. రావణునికి మోక్షశక్తిగలుగుట చూడుము.




--- రావణుని రథము వెళ్లిన త్రోవ.

శీలలను, సంగీతవాద్యములను, మంచిమాల్యములను ధరించి తపస్సుచే లోకములనుజయించినవారివిమానములను నారాక్షసరాజు చూచెను. ఇంకను, నానాము ప్రస్రవణములనుండి రసమును స్రవించుచున్న యనేకచందన వృక్షవనములను, మంచి యగరుచందనములుగల తోటలను, నుపవనములను, తమాలపు పొదరిండ్లను, ముత్యములయొక్కయు, శంఖముల యొక్కయు రాసులను, ననేకములగు పగడములను, బంగారుకొండలను, వెండికొండలను, నింపగు నీటియూటలను, మంచిసరస్సులను, ధనధాన్యములతోను, స్త్రీరత్నములతోను, నేనుగులు, గుఱ్ఱములు, రథములు మొదలగువానితోను నొప్పుచున్న కొన్నిపట్టణములను వీక్షించెను. తరువాత నతడొకచోట 'సుభద్ర' మనెడు నొకపెద్దమఱ్ఱిచెట్టును జూచెను. అక్కడ చల్లనిగాలి వీచుచుండెను. ఆమఱ్ఱిచెట్టుకొమ్మలు నూఱుయోజనములువిస్తీర్ణముకలిగి యుండెను. అక్కడఋషులనేకులు తపస్సు చేయుచుండిరి. అక్కడ పూర్వమొకప్పుడు గరుత్మంతు డొక పెద్దయేనుగును, నొకపెద్దకూర్మమును నాచెట్టుకొమ్మపై పెట్టి తినుటకు యత్నింప నది విఱిగిపోయెను. తరువాత నాఖగరాజు వానిని భుజించి యాకొమ్మను తీసికొనిపోయి దానితో నిషాదదేశమును నిర్మూలము చేయ ఋషులు సంతోషించిరి. అట్టిచెట్టును రావణుడు చూచి సముద్రపుటావలితీరమునకు బోయి యనేకవనములమధ్య వెలుగుచున్న మారీచునియాశ్రమమును జూచెను. ఆమారీచుడు లేడిచర్మమును గట్టుకొని జటలను, నారచీరలను ధరించి నియమితభోజనుడై యక్కడ నివసించుచుండెను. అతడారాక్షసరాజునకు తగినమర్యాదను జరిపి తాను స్వయముగ వానికి నర్ఘ్యపాద్యముల నిచ్చి భోజనముపెట్టి తగినయాసన మిచ్చెను.

తరువాత మారీచుడు రావణునితో 'రాక్షసరాజా! మీరుకుశలముగనున్నారా? మీరాక్షసలోకమునకు కుశలమా? మీ రెక్కడ

నుండియో యింతతొందరగ వచ్చుటజూడ నా కనుమానము కలుగుచున్న' దని పలుక నాతడు 'నారాజ్యాంతజనస్థానరక్షకు లజేయులయ్యు గొప్పకర్మలు చేసినరామునిచే యుద్ధమున జంపబడినందులకు వానిభార్యను హరించుటకై నీసాహాయ్యమును గోరి వచ్చితి'నని పలికెను. దాని కారాక్షసవీరుడు రావణున కిట్లు చీవాట్లు పెట్టెను. "సీతను దీసికొనిరమ్మని మీతో నెవడు చెప్పెను? అట్టివాడు మీకు మిత్రునివలె గనిపించినను వాడు నిజముగ శత్రువు. వాడు మీశ్రేయస్సునుగూర్చి సంతోషము నొందడు. వానిపేరు తెలుపుడు? రాక్షసుల సందఱిని సంరక్షించు మిమ్ము నాశనము నొందించుటకే వాడు కోరుచున్నాడు. రామునిచే రక్షింపబడుచున్న సీతను హరించుట గొప్ప విషముగలపామునోటినుండి కోఱలను దీయుటవంటి దగును. ఇట్టి చెడు కార్యముచేయుమని మీకెవరు సలహా యిచ్చిరి? రాముడు మంచిదంతములుగల మదించిన యేనుగువంటివాడు. వానియెదుటనే మీరు నిలువలేరు. అట్టిచో మీరు వానితో యుద్ధముచేయుటెట్లు? వాని ప్రక్కకు మీరు పోగూడదు. నిద్రించుచున్న రాముడనెడి సింహము నేల లేపెదరు? లంకేశ్వరా? నాయందు దయయుంచి సంతోషముతో మీరు లంకకు బోయి మీభార్యలతో సుఖ మనుభవింపుడు. అడవిలో నాతడు తనభార్యతో క్రీడించుగాక!" ఇట్లు మారీచుడు రావణుని మనస్సు త్రిప్పి యాతనిని లంకాపట్టణమునకు బంపెను.

అంతట శూర్పణఖ ఖరదూషణాదులమరణము జూచి పెద్ద ధ్వనిజేసి యసాధ్యమగురామునికార్యమునకు మిక్కిలిజడిసి లంకలో నుండు రావణునియొద్దకు బోయెను. అతడు పుష్పకవిమానముపై మంచియాసనమున మంచిబట్టలుకట్టుకొని యాభరణములను ధరించి శరీరమునకు మంచిసువాసనద్రవ్యములను బూసికొని మంత్రులతో గూర్చుండియుండ వికృతరూపమునొందిన యారాక్షసి భయముచే

వణకుచు వానిదగ్గఱకు బోయి దీనురాలై క్రోధముతో 'నీవు కామ భోగము లిచ్చవచ్చిన ట్లనుభవించుచు లుబ్ధుడవై నీదేశమున జరిగి నట్టియు, దెలిసికొనదగినట్టియు గొప్పభయజనకములగు పనులను నెఱుగకున్నా'వని పలికి వానికి గొన్ని *రాజనీతులను దెలిపి 'నీవు పురుషప్రయత్నముగల దేవదానవగంధర్వులతో విరోధము నొంది రాజ్యమెట్లు చేసెదవు? నీవు చారులవలన సమాచారము తెలిసికొన లేదా?' యనియడిగి వానిరాజదోషములను దూషించుచు జనస్థాన మున ఖరదూషణత్రిశిరులును, మిగిలినరాక్షసులును రామునిచే మడి యుట వానికి దెలిపెను. దానికి రావణుఁడు చాలసేపు బాగుగ నాలో చించి రామునిగూర్చియు, నక్కడజరిగినసంగతిని గూర్చియు ప్రశ్నింప నామె యదంతయు జెప్పి సీతసౌందర్యమును వర్ణించి 'సీతకు భర్త యగువాఁడు లోకములలో నింద్రునికంటె నెక్కువసుఖముల ననుభ వించును. ఆమె నీకు తగినభార్య. నీవామెకు తగినభర్తవు. నీకొఱ కామెను దెచ్చుటకు నేను సిద్ధముగ నున్నాను. క్రూరుఁడగు లక్ష్మణుఁడు నాకు వికృతరూపము కలుగజేసెను. నీవామెను జూచినయెడ తప్పక మన్మథబాధ నొందెదవు. ఆమెను భార్యగ దెచ్చుటకు నీకుమనస్సున్న యెడల జయముకొఱకు నీకుడికాలిప్పుడు ముందుకు వేయుము. నీవు దండకావనములోనున్న రాముని జంపి వాఁడిబాణములచే లక్ష్మణుని నంతమునొందించి రాక్షసులకు ప్రియము కలిగించి నీప్రభావమును నీవు తెలిసికొని సీతను బలాత్కారముగ దెచ్చి యనుభవింపుము. నామాటలు నీకిష్టమైనయెడల ననుమానములేకుండ నట్లు జరుపు'మని యతనికి సలహాయిచ్చెను.

ఆరాక్షసరాజు తనచెల్లెలు చెప్పిన యాశ్చర్యకరములగు మాట లను విని తనమంత్రులవలన తాను జేయవలసినకార్యములను దెలిసి

---

*13వ. ప్రకరణము. ౧౨ వ. అధ్యాయము రాజనీతులు చూడుము.

కొని వారికి సెలవిచ్చి తానుపూనినకార్యముయొక్క మంచిచెడుగులను, తనబలాబలములను * నాలోచించెను. తరువాత నతడు కృతనిశ్చయుడై తనగుఱ్ఱపుసాలకు రహస్యముగ బోయి సారథితో 'రథమును సిద్ధముచేయు'మని చెప్పెను. వాడు మంచిగుఱ్ఱముల నలంకరించి కోరినచోటికి బోవునదియు, ఛత్రచామరములుగలిగినదియునగు రథమును సిద్ధముజేయ నతడు దానినెక్కి లంకను విడిచి యాకాశమార్గమున సముద్రతీరమునకు బోయి మఱల మారీచునియాశ్రమమును జేరెను. మారీచు డాతనికి తగినమర్యాద జేసి మంచిమాటలతో 'రాజా! లంకలో నందఱికి కుశలమా? తిరుగ మీరు తొందరగ నేలవచ్చితి' రని యడిగెను. దానికాతడు "నాయనా! మారీచా! నామాటవినుము. నేను మిక్కిలి బాధనొందితిని. నీవే నాకు ముఖ్యమగు గతియైయున్నావు. జనస్థానములో రాముడు ఖరదూషణాదులను సంహరించుట, లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు, చెవులు గోయుటమొదలగు సంగతులు నీకు దెలిసియేయున్నవి. రామునిపై క్రోధమున వానితండ్రి వానిని, వానిభార్యను నరణ్యవాసమునకు బంపెను. ఖరుని, వానిసైన్య

---

* అ-రా:—శూర్పణఖమాటలను వినినతరువాత రావణు డిట్లాలోచించెను. 'రాముడు మనుష్యుడు కానియెడల పరమేశ్వరుడు నన్ను నాబలగములను జంపుటకు పూర్వము బ్రహ్మచేగోరబడి యిప్పుడు రఘుకులములో మనుష్యుడై యవతరించి యుండును. ఆపరమేశ్వరుడు నన్ను జంపిన నేను వైకుంఠరాజ్యమును బొందెదను. లేనియెడల చిరకాల మీరాక్షసరాజ్యమునే యనుభవించెదను. కాన నేనిప్పుడు తప్పకుండ రామునివద్దకు వెళ్లెదను.' ఇట్లు రావణుడు రాముని పరమేశ్వరునిగ దలచి 'విరోధముచేతనే శీఘ్రముగ నేనాతని బొందెదను. భగవంతుడు భక్తివలన శీఘ్రముగ ప్రసన్నుడు కాడని యాలోచించెను.

మును జంపుటచే స్వల్పకాలము వానికి నాయువు దక్కెను. వాడు నీచక్షత్రియుడు; దుర్మార్గుడు; క్రూరుడు; మూర్ఖుడు; ఇంద్రియనిగ్రహములేనివాడు; ధర్మమువిడచిన యధర్మాత్ముడు; అతడు జీవుల కన్నిటికి కీడుజేయువాడు. దేవకన్యవలెనుండు వానిభార్యను నాపరాక్రమమువలన జనస్థానమునుండి తెచ్చెదను. నీవు నాకు సహాయుడవు కమ్ము. పూర్వము నీతోను, నాతమ్ములతోను యుద్ధములకు వెళ్ళి దేవతలను సులభముగ జయించితిని. నీవు సమర్థుడవు. పరాక్రమమునను, యుద్ధమునను, దర్పమునను నీతో సరియగువారు లేరు. నీవన్నిమాయలు, మంచియుపాయములు తెలిసినగొప్పసహాయుడవు. అందుకొఱకే నేను నీయొద్దకు వచ్చితిని. నాకు గావలసిన నీసాహాయ్యమును జెప్పెదను వినుము. నీవు వెండిపువ్వులుగల బంగారులేడివై చిత్రముగ రామునియాశ్రమమువద్ద సీతయెదుట తిరుగుము. ఆబంగారు లేడిని జూచి యామె నిస్సంశయముగ రామలక్ష్మణులను 'దానిని పట్టుకొని తీసికొనిరావలె'నని కోరును. తరువాత వారు దానినిమిత్తము వెళ్ళియుండ నామెయొక్కతెయే యక్కడ నుండును. అప్పుడు నేను రాహువు చంద్రకళలను హరించునటుల నామె నెత్తుకొనిపోయెదను. రాముడు తనభార్యను గోలుపోయి బాధనొందుచుండ నేను నిరాటంకముగ కృతార్థుడనై మిక్కిలిసంతోషించి యామెతో సుఖముగ నుండెద"నని పలుక మారీచు డామాటలను విని భయమును బొందెను. వానిమొగము వాడిపోయెను. వా డెండినపెదవులను గఱచుచు చచ్చినవానివలెనుండి యాతనిని రెప్పవేయకుండ జూచుచు చేతులు జోడించి యిట్లు పలికెను.

"రాజా! యెల్లప్పుడు ప్రియమును బలుకుపురుషులు సులభముగ దొరకుదురు. వినుట కిష్టములేనిదైనను నుపకారముకలుగజేయుదానిని చెప్పెడువాడుగాని వినువాడుగాని దొరకుట కష్టము. మీరు తగిన

చాపలు లేనివారగుటచే చంచలచిత్తులై యింద్రియరుణులతో సమా నుడగు రాముని గొప్ప గుణములను, గొప్పవీర్యమును బాగుగ తెలియకు న్నారు. మీరిప్పుడు తలచిన కార్యమును జేసినయెడల రాక్షసుల కంద ఱికి నాశనము కలుగకుండునా? ఆతనికి కోపమువచ్చినయెడల లోకములో రాక్షసులలో నొక్కడైనను నిలిచియుండునా? సీతమీామరణమునకై పుట్టి యుండలేదా? ఆమెవలననే నాకు గొప్పదుఃఖము కలుగకుండునా? మీా వంటి కామవృత్తిగలవాడు నిరాటంకముగ రాజై వర్తించిన లంకా పట్నముతో గూడ మీారును, రాక్షసులందఱును నాశనమొందకుందురా? మీావంటి మహ్యుక్తియు, కామవృత్తిగలవాడును, చెడుస్వభావముగల వాడునునగు రాజు పాపాలోచనలచేసి తన్ను, తనవారిని, తనదేశములను నాశనమునొందించును. మీారు రామునిగూర్చి నిందించిన చెడుగుణము లాతనికి లేవు. కైకేయిమాటలవలన మోసపోయినదశరథుని సత్యవచ నునిగజేయుటకు నతడు వానిని జరుపుటకునొప్పుకొని వనమునకువచ్చెను. అతడు వారిప్రియముకొఱకు రాజ్యమును, భోగములను విడిచి దండ కారణ్యము ప్రవేశించెను. మీారాతనిగూర్చి యబద్ధములను, చెడు మాటలను బలుకగూడదు. అతనికి యుద్ధపద్ధతి బాగుగ దెలియును. అతడు ధర్మమునాచరించుచు సత్యపరాక్రమములుగలవాడై ప్రవర్తిం చును. ఇంద్రుడు దేవలోకమునకు రాజయినట్లత డన్నిలోకములకు ప్రభువగును. తనపాతివ్రత్యముచే ప్రకాశించునదియు, రామునిచే రక్షింపబడునదియునగు సీతను మీారు బలాత్కారముగ నెట్లు హరింప నిశ్చయించియున్నారు? అతడు చాపమును, ఖడ్గమును బట్టి యుద్ధము జేయుచు బాణముల విడుచుచుండ మీారాతనితో పోరుసలుపుటకు బోగూడదు. అలాగుచేసినచో మీారు రాజ్యమును, సుఖములను, ప్రాణములను బోగొట్టుకొందురు. రాముడు తనప్రాణములకంటె నెక్కువగ నామెను సాటిలేని తనతేజోమహిమలచే గాపాడుచుండును.

ఆమె, యెల్లప్పుడు వాని నాశ్రయించియుండును. అట్టిసీతను మీరు హరించి తీసికొనిరాలేరు. బాగుగమండుమంటను పట్టుకొనలేనటు లామెను మీరు స్పృశింపలేరు. మీరిట్టి వ్యర్థప్రయత్నము లేలచేసెదరు? యుద్ధములో నాతని కెదురుగ నిలుచువఱకే మీప్రాణము లుండును. మీరు సుఖమును, రాజ్యమును, మంచివస్తువులను జాలకాల మనుభవించి జీవింపదలచినయెడల నాతనికి విప్రియముజేయకుడు. విభీషణుడుమొదలగు ధర్మాత్ములతోను, మంత్రులందఱితోను నాలోచించి మీరు చేయదలచినకార్యము నందలి గుణదోషములను, ఇరువురి బలములను నాలోచించి మీబలమును, నిజమగు రాముని బలమును దెలిసికొని మంచిచెడుగుల నాలోచించి మీమనస్సు స్థిరపఱచుకొని తెన్నయగుకార్యమునుజేయుడు." ఇట్లు పలికి 'ఇంకను వినుడ'ని మారీచు డీసంగతులను వానికి దెలిపెను.

"పూర్వ మొకప్పుడు నేను వేయియేనుగులబలమును, పర్వతమువంటిశరీరమును గలిగి బంగారుకిరీటకుండలములను ధరించి యినుపకట్లుగలగదను బట్టుకొని దండకావనమున ఋషిమాంసములు భుజించుచు భయంకరముగ దిరుగుచుంటిని. విశ్వామిత్రు డాయడవిలో యాగముచేయుచుండ నేను దానికి భంగము కలిగించితిని. అప్పుడతడు దశరథుని యాచించి రాముని దీసికొనివచ్చెను. ఆతడు వచ్చి నన్ను బాణముతో గొట్ట నేను నూఱుయోజనములదూరములో పడితిని. తరువాత నేను లంకకు బోయితిని." ఇట్లు తనపూర్వకథను దెలిపి యింకను నిట్లు పలికెను. "సీతారామలక్ష్మణులు దండకావనములో నివాసముచేయుచుండ నేను, మఱియిద్దఱు రాక్షసులును లేడిరూపములను ధరించి యాయరణ్యమున తిరుగ ప్రవేశించితిమి. మేము మంచి నాలుకలను, వాడియగుకోఱలను గలిగి గొప్పబలముతోను, పెద్దశరీరముతోను నగ్నిహోత్రములుచేయు-వారిని, తీర్థములను, చతుష్పథ

దేవగృహ వృక్షములయొద్దను ఘోరముగ దిరుగుచు ధర్మాచరణ గల ఋషులనుబట్టి వారిని జంపి వారిరక్తముల బీల్చి వారిమాంస ముల దినుచుంటిమి. ఇట్లు మేము ధర్మమార్గముదప్పి యొకనాడు తాపసవేషముధరించియున్న రాముని, సీతాలక్ష్మణులను జూచితిమి. అతడు నియమితాహారుడగుఋషియనియు, దుర్బలుడనియు, నహింసా ధర్మమున నున్నాడనియు నాలోచించి పూర్వ మాతనితో నాకు గల విరోధమును జ్ఞాపకముదెచ్చుకొని వాడికొమ్ములతో నాతని బొడుచు టకు నే నాతనితట్టు పరుగెత్తితిని. అంతట నతడు మాపైని మంచి బాణములను వేయ రెండుబాణములచే నాయిద్దఱు రాక్షసులు చచ్చిరి. ఆతనిబలమును, వానిబాణములు కలుగజేయు భయమును నెఱిగియుండుటచే నే నెట్లో తప్పించుకొని పరుగెత్తుకొని పోయితిని. అప్పటినుండి నేను మునివేషమును ధరించి యిక్కడ నివసించి యున్నాను. నారచీరలను గట్టుకొని విల్లునుబట్టినరాముడు పాశమును బట్టినయమధర్మరాజువలె నీయాశ్రమమున నాకు ప్రతివృక్షమునందును గనబడుచున్నాడు. భయముచే నాకు వేలకొలదిరాములు కనబడు చున్నారు. ఈవనమంతయు నాకు రామమయముగ గనబడుచున్నది. అతడిక్కడ లేకపోయినప్పటికి నిక్కడనున్నట్లే నాకు గనబడుచున్నాడు. అతడు నాకు స్వప్నమందు కనబడినను నేను భయపడి విలపించు చున్నాను. 'ర' అనునక్షరము మొదటగల రత్నములు, రథములు మొదలగువానిని పలుకుతోడనే నాకు గొప్పభయము కలుగును." ఇట్లు పలికి మారీచు డింకను నిట్లు వానికి హితోపదేశము చేసెను.

"అట్టి రామునితో మీరు యుద్ధముజేసిన తప్పక గొప్పయా పదను బొందెదరు. మంచిక్రీడల ననుభవించుచు సభలలో దిరుగు చుండు రాక్షసు లందఱికి మీరు విపత్తు కలిగించెదరు. మంచిమేడలు మిద్దెలుగల లంకాపట్టణము సీతను గుఱించియే నాశనమునొందును.

పాములుండుచెరువులో నివసించు చేపలు పాములసహవాసముచే గరుత్మంతునివలన నాశనమునొందునట్లు పవిత్రులైన మనుజులు పాపముల జేయకున్నను పాపులసహవాసముచే నాశనము నొందుదురు. మంచి నగలను ధరించి చందనముల పూసికొని సుఖముగ దిరుగు రాక్షసు లందఱు మీవలన నశించెదరు. లంకయంతయు బాణములచే గొట్టబడ, నగ్నిజ్వాలలచే భవనము లన్నియు కాలిపోవ మీరు నాశనమైనయాపట్టణమును జూచెదరు. పరస్త్రీల సంయోగముకంటె గొప్పదగుపాప మేదియులేదు. మీరు వేలకొలది స్త్రీలను పెండ్లాడితిరి. ఆ మీ భార్యలతో మీరు భోగించి మీరాజ్యమును, మీజీవితమును, స్నేహితులను, బంధువులను రక్షింపుడు; మీకు చిరకాలము భోగముల ననుభవింపవలెననియున్న రామునికి విప్రియమును జేయకుడు. సేనాతని నెఱుగుటచే నాతనితో మీరు యుద్ధముజేయలేరని తలచెదను. అతడు బలినినైనను, నముచినైనను యుద్ధములో జంపును. మీ కిష్టముండిన నాతని నెదుర్కొని యుద్ధముచేయుడు. లేనియెడల ఖరాదులమరణమును మఱచిపొండు; కాని సీతనుమాత్రము తీసికొనిరాకూడదు. నేను జీవింపవలెనన్న నాతనిప్రసంగమును దలపకుడు. కొందఱు సాధువులగు పురుషులు ధర్మమార్గమున నున్నను దుర్మార్గప్రవృత్తుల జేయు నితరులవలన నాశనమునొందుదురు. నేను మీయపరాధముల వలన నాశనమునొందెదను. మీరు చేయగలిగినది చేయుడు. నేనిప్పుడు మీతో రాను. గొప్పతేజోబలముగలరాముడు రాక్షసలోకమునకు నాశనము కలిగింపడా? శూర్పణఖనుగూర్చి దుష్ప్రవర్తనగల ఖరుని రాముడు వధించిన నది యాతనితప్పెట్లగును? మీబంధువుల హితముకొఱకు చెప్పిననామాటలను మీరు జరుపకపోయిన మీబంధువులతో మీరు యుద్ధమున రాముని బాణములచే జంపబడుదురు.

మారీచునియీమాటలను మరణముకోరువా డౌషధమును సేవింపనటుల నారాక్షసరా జొప్పుకొనక మరణకాలముచే నీడ్వబడి కఠినములును, నయుక్తములునునగు మాటల నిట్లనెను. "నీవుచెప్పిన చెడువాక్యములు నిజముగ చవిటినేలను నాటిన విత్తులవలె ప్రయోజములేనివి. పాపశీలుడును, మూర్ఖుడును, మనుష్యుడునునగు రామునితో యుద్ధముచేయుటకు నీమాటలవలన నాకు భయముకలుగదు. వాడు స్నేహితులను, రాజ్యమును, తలిదండ్రులను విడిచి పామరురాలగు స్త్రీచెప్పినమాటలను వినినవెంటనే వనమునకు వెళ్లెను. వానితో నేను తప్పక యుద్ధముచేసెదను. నీవు సమీపమందుండ నేను వాని భార్యను హరించెదను. నాకిట్టి నిశ్చయబుద్ధిగలదు. దాని నింద్రుడును, సురాసురులునుగూడ తప్పింపలేరు. కార్యనిశ్చయమునగూర్చి గుణదోషములనుగాని, యపాయోపాయములనుగాని నేను నిన్నడిగినయెడల నీవు చెప్పవలెను. విద్వాంసుడగుమంత్రిని రాజడిగిన నామంత్రి తనకు శ్రేయముకావలసినయెడల చేతులుజోడించుకొని రాజునకు గుణదోషములను జెప్పవలెను. రాజుల కనుకూలముగను, నిష్టముగను, మృదువుగను, శుభముగను, మర్యాదగను నతడు పలుకవలెను. హితవాక్యములైనను నవమానముగను, తిరస్కారముగను బలికినయెడల రాజులు సంతోషమునొందరు. రాజులు సమయముననుసరించి యింద్రాగ్నియమవరుణచంద్రుల ధర్మములను పొందుదురు. కాన వారన్నియవస్థలలోను పూజింపబడదగినవారు. నీయొద్దకువచ్చిన నన్ను నీవు రాజధర్మము తెలియక యజ్ఞానముచే కఠినోక్తు లాడితివి. నేను నిన్ను గుణదోషములనుగూర్చియు, నాక్షేమమునుగూర్చియు, కార్యముయొక్కమంచిచెడ్డలనుగూర్చియు నడుగలేదు. నేను నీకిప్పుడు చెప్పునది యేమన నాకీగొప్పకార్యమున నీసాహాయ్యము కావలెను. నీవు చేయవలసిన పనిని పూర్వముకంటె విశదముగ చెప్పెదను;

వినుము. నీవు వెండిపువ్వులుగల బంగారులేడివై రామునియాశ్రమము ముందు సీతయెదుట నామెకు నీయందు మనస్సుకలుగునటుల తిరిగి నీయిష్టమువచ్చినచోటికి వెళ్ళుము. అంతట నామె యాశ్చర్యము నొంది మాయామృగమగు నిన్నుజూచి రామునితో నిన్ను దీసికొని రమ్మని చెప్పును. అతడు చాలదూరము నిన్ను వెంటపడును. నాతని మాటలతీరున 'హా! సీతా! హా! లక్ష్మణా!' యని నీ వఱువుము. రాముడు వెళ్లినత్రోవవైపునుండివచ్చిన యామాటలను విని యామె భయమునొంది తనమఱదిని బంప నతడు తనయన్నమీదిప్రేమచే తొందరగ వెళ్ళును. వారిద్దఱాశ్రమమున లేనిసమయమున నాయిష్టమువచ్చినట్లు నేను సీతను దెచ్చెదను. ఈకార్యమును నీవు బాగుగ జరిపి నీయిష్టమువచ్చినట్లు పోవచ్చును. నేను నారాజ్యములో సగము రాజ్యమును నీకిచ్చెదను. కార్యసాఫల్యముకొఱకు నీవు శుభమార్గమున ముందు వెళ్లుము. నిన్ననుసరించి నేనీరథముపై దండకావనమునకు వచ్చెదను. నేను యుద్ధములేకుండ రామునివంచించి సీతను బొందిన తరువాత నీవును, నేనును గలిసి లంకకు బోవుదము. నీ వీపనిచేయనిచో నిన్నిప్పుడే చంపెదను. నేను చెప్పినపని నీవు తప్పక చేయవలెను. రాజున కడ్డుచెప్పువా డెన్నడును సుఖమును బొందడు. నీవు లేడిరూపమును బొందినయెడల నీకు మృత్యు వనుమానముమాత్రమేయగును. నాతో విరోధముపొందినయెడల నీకు చావుతప్పదు. ఇదంతయు బాగుగ నాలోచించి యేది నీకు మంచిదో దానిని జేయుము."

రావణునియీమాటలను మారీచుడు విని కఠినమగువాక్యముల నిట్లు పలికెను. 'పుత్త్రులతోను, రాష్ట్రముతోను, మంత్రులతోనుగూడ మీకు నాశనముకలుగు నీయాలోచన యేపాపునివలన మీ రుపదేశము నొందితిరి? మీరు సుఖముల ననుభవించుట యేపాపకర్మున కిష్టములేదు? మృత్యువాసన్నమగునటుల మీకు నెవ డీదుస్సలహా

నిచ్చెను? గొప్పబలవంతునితో యుద్ధము చేసి మీరు నాశనమొంద వలెనని కోరు నీచరాక్షసులు నిజముగ మీకు శత్రువులు. మీస్వ కర్మచే మీరు నాశనము నొందుటను గోరి యేనీచు డీయహితకార్య మును మీ కుపదేశించెను? మిమ్ము దుర్వృత్తినుండి మఱలింపని మీ మంత్రులు వధార్హులు. కాని వారు వధింపబడుటలేదు. మంచివారు చెప్పినప్రకారము మీరు మనస్సును మఱలింపకున్నారు.' ఇట్లు మారీచుడు రావణునకు కొన్నిచీవాట్లు పెట్టి * కొన్ని రాజనీతులు దెలిపి యింకను నిట్లనెను. 'లోకములో ధర్మము నాచరించుసాధుజను లనేకులున్నను వారు దుర్మార్గులసహవాసదోషమున తమపరివార ముతోగూడ నాశనమొందుదురు. క్రూరుడును, ప్రతికూలుడునునగు రాజుచే పాలింపబడుప్రజలు నక్కచేరక్షింపబడు మేకలవలెనే వృద్ధి నొందరు. రావణా! మీరు దుర్బుద్ధిగలవారును, నింద్రియనిగ్రహము లేనివారును, క్రూరులును, నగుటచే రాక్షసులందఱు నశించెదరు. ఆమరణము కాకతాళీయముగ నాకిప్పుడు సంభవించినది. దానికై నేను విచారింపను; కాని మీరు మీసైన్యమంతటితోగూడ నాశన మగుదురని నేను విచారించుచున్నాను. రాముడు మొదట నన్ను జంపి పిమ్మట స్వల్పకాలములో మిమ్ము మరణమునొందించును. నే నాతనిచే జంపబడి కృతకృత్యుడనయ్యెదను. రాముని జూడగనే నేను మరణమునొందినట్లును, మీరు సీతను హరింపగనే బంధువులతో గూడ నాశనమొందినట్లును తలంపుడు. నాసహాయమువలన మీరు రాముని యాశ్రమమునుండి సీతను దీసికొనివచ్చినయెడల మీరుండరు; నేనుండను; రాక్షసులతోనిండినలంక యుండదు. మీహితమునుగోరెడి నేను మిమ్ములను నివారించుచున్నను మీరు నామాట వినుటలేదు. యమలోకమునకు బోవసిద్ధముగనున్నవారు స్నేహితులమాట వినరు.

* 1 శవ. ప్రకరణము ౧౨వ. అధ్యాయము. రాజనీతులు చూడుము.

ఇట్లు పలికి మారీచుడు రావణాసురునియందలిభయముచే దీనుడై 'వెళ్లుదము; రండు. కోదండమును, కత్తిని బట్టుకొనియున్న రాముడు నన్నుజూచినతక్షణమే నామరణము నిశ్చయము. నేను ప్రాణములతో రాముని తప్పించుకొని రాలేను. యమపురికి బోవసిద్ధముగనున్న మీప్రతిరూపమువంటి రూపముతో నేను వర్తించెదను. మీకిట్టిదుర్బుద్ధి గలుగ నేనేమిచేయగల'నని పలుక నారాక్షసరాజు వానిని కౌగిలించుకొని 'ఇప్పుడు నాయభిప్రాయమునకు దగినట్లు నీవు శౌర్యమగు మాటలను బలికితివి. ఇప్పుడు నీవు నిజముగ మారీచునివలె నున్నావు.

---

అ. రా:—మారీచుడు రావణునితో "నేనొకమునివలన 'మొదటియుగమున బ్రహ్మ విష్ణువును దశరథపుత్రుడగు రామునిగ మనుష్యావతార మెత్తి రావణునిజంపవలెనని కోర నతడట్లు జన్మించి మాయామానుష వేషమున భూభారమును బోగొట్టుటకై తిరుగుచుండె' నని వినియుంటిని. కావున నాయనా! నీవు సుఖముగ నింటికి బొ"మ్మని చెప్పెను. దానికారాక్షసరా జిట్లు జబాబిచ్చెను. 'బ్రహ్మచే ప్రార్థింపబడి పరమాత్ముడగు రాముడు ప్రయత్నముతో నన్ను జంపుట కిక్కడకు వచ్చినయెడల సత్యసంకల్పుడగు నాయీకోర్కెను డట్లు శీఘ్రముగ జేయును. కనుక నేను ప్రయత్నముతో సీతను రామునిదగ్గఱనుండి తీసికొనివచ్చెదను. నేను యుద్ధములో మరణమునొందిన పరమపదవి నొందెదను. అట్లుగాక నేనాతనిజంపిన నిర్భయముగ సీతను బొందెదను. నీవు మాయామృగరూపమును బొంది రామలక్ష్మణులను వారియాశ్రమమునుండి దూరముగ దీసికొనిపోయి తరువాత నీయిష్టమువచ్చినట్లు పూర్వమువలె సుఖముగ నుండుము. మఱియేమిపలికినను నిన్ను కత్తితో నఱకెదను.' ఇట్లు రావణుడు పలుక మారీచుడు తనమనస్సులో నిట్లనుకొనెను. 'నన్ను రాముడు చంపిన నేను సంసారబంధమునుండి విముక్తుడనయ్యెదను. దుష్టుడగు రావణుడు నన్ను జంపిన నేను నిశ్చ

పూర్వము నీవొక సామాన్యరాక్షసునివలె బలికితివి. ఈరథమెక్కుము; రమ్ము. సీతకు లేడిరూపమందు మనస్సుగలుగునటుల సంచరించి పిమ్మట నీయిష్టమువచ్చినట్లు వెళ్లుము. ఆశ్రమమున నెవరును లేని సమయమున నే నామెను బలవంతముగ దీసికొనివచ్చెద'నని పలికెను. తరువాత వారిద్దఱు రథమెక్కి యాయాశ్రమమునుండి వెడలిరి.

---

## ౧౨ వ. అధ్యాయము. మారీచునివధ.

రావణమారీచు లాయాశ్రమమును విడిచి విమానమువలె నుండు రథమెక్కి యనేకపట్టణములను, వనములను, పర్వతములను, ననేకనదులను, రాష్ట్రములను జూచుచు దండకావనములోనుండు రామునియాశ్రమము జేరి రథమునుండి దిగిరి. తరువాత రావణుడు మారీచునిచేయిపట్టుకొని 'అదిగో! రామునియాశ్రమము. అరటిచెట్లు దానిచుట్టు నున్నవి. మనమువచ్చినపనిని జరుపు' మని చెప్పెను. ఆరాక్షసరాజుమాటలను విని మారీచు డద్భుతముగ గనబడు లేడి రూపమును బొంది యాయాశ్రమమున కెదుట తిరుగుచుండెను. ఆలేడికొమ్ములకొన లింద్రనీలమణులవలె నుండెను. దానిముఖము కొంతభాగము తెల్లగను, కొంతభాగ మెఱ్ఱనిపద్మములవలెను నుండెను. చెవులింద్రనీలములవలెను, కలువలవలెను నుండెను. దానిమెడ కొంచె మెత్తుగను, పెదవు లింద్రనీలములవలెను నుండెను. కడుపు మల్లె పూవులవలెను, చంద్రునివలెను, వజ్రములవలెను తెల్లగ నుండెను. దాని

యముగ నరకమునకు బోయెదను.' ఇట్లాతాటకేయుడు రామునివలన తనమరణమును నిశ్చయించుకొని యారాక్షసరాజుతో 'నీయాజ్ఞను జరిపెద' ననిపలికెను.

పక్క లిప్పపువ్వురంగుగను, మిగిలినశరీరము పద్మములపుష్పాకారంగు గను నుండెను. డెక్కలు వైడూర్యములతో సమానముగను, పిక్క లనుకూలముగను నుండెను. దానితోఁకయొక్కమీదిభాగ మింద్రా యుధవర్ణము గలిగియుండెను. మఱియు నాలేడి నునుపగుశరీరమును శరీరముపై వెండివలెనుండు తెల్లని మచ్చలను, ననేకవిధములగు రత్నములవలెనుండు మచ్చలను గలిగియుండి చూచువారిమనస్సుల కింపుగ నుండెను. ఇట్లు మారీచుడు బంగారులేడియై పచ్చికమేయుచు సీత కభిలాషకలిగించుట కక్కడ తిరుగుచుండెను. అది చెట్లయాకు లను దినుచు నాయాశ్రమములోని యరటితోటకు వెళ్లి యామె చూచుటకై కొండగోగుచెట్లయొద్దకు మెల్లగ నడచుచు తిరుగ వెను కకు వచ్చుచు మఱల ముందుకు వెళ్లుచు కూర్చుండుచు నెగిరిగంతులు వేయుచు నుండెను. ఆమాయామృగ మక్కడ లేళ్లగుంపులతో గలి యుచు తిరుగ వానిని విడుచుచు నుండెను. అక్కడనుండు లేళ్లన్నియు దానిని మూర్కొని యఱచుచు నలుదిక్కులకు పాఱిపోవుచుండెను. మారీచుడు పూర్వము వానిని వేటాడుచుండినను నిప్పుడు తనభావము మఱుగుపఱచుటకు వానిని జంపి భుజింపలేదు. ఆసమయముననే సీత

---

అ. రా:—రాముడు రావణుడు చేయుచుండినచర్య లన్నియు దెలిసికొని సీతతో నేకాంతముగ నిట్లు పలికెను. 'రావణుడు నీవద్దకు భిక్షుకరూపముతో వచ్చును. నీవు నీయాకారమువంటిఛాయను గలి గించి యీయాశ్రమమున నుంచుము. నాయాజ్ఞానుసారముగ నీవగ్నిలో ప్రవేశించి కనబడకుండ దానిలో నొకసంవత్సరముండుము. నేను రావణునిచంపినతరువాత నీవు నన్ను తిరుగ పూర్వమువలె బొందె దవు.' ఈమాటలను విని సీత యాశ్రమమున మాయాసీతను నుంచి తానగ్నిలో నంతర్ధానమునొందెను. తరువాత మాయాసీతవద్దకు మాయామృగము వచ్చెను.

పూవులను గోయుటకు కొండగోగుమొదలగు చెట్లలో దిరుగుచు రత్నమయమగు నామాయలేడిని జూచి మిక్కిలి యాశ్చర్యమునొందెను. దీనిని గనిపెట్టి యామాయలేడి మఱింతచిత్రమగునటుల గంతులు వేయుచుండెను. పూర్వ మెన్నడును నట్టిలేడిని జూచియుండనందున నామె మిక్కిలియాశ్చర్యము నొంది రామలక్ష్మణులను నాయుధములను బట్టుకొని రండని గట్టిగ బిలిచెను.

రామలక్ష్మణు (లాప్ర)దేశమునకు వచ్చి యామాయామృగమును జూచిరి. అప్పుడు లక్ష్మణు డాలేడినిగూర్చి యనుమానముపొంది రామునితో 'మారీచు డీలేడిరూపమును బొంది వచ్చియున్నాడని నేను తలచుచున్నాను. కామరూపుడగు వాడు లేడిరూపమును బొంది పూర్వము వనములో వేటకుతూహలముతో దిరుగు ననేకరాజులను జంపెను. వాడు తనమాయచే నీలేడిరూపము నొందెను. లోకములో నిట్టి రత్నమయమగు లేడి లేదు. ఇదంతయు వానిమాయయే; సందియము లే'దని చెప్పెను. దానికి సీత యొప్పుకొనక దాని చర్మసౌందర్యమందు మనస్సుకలదై తనభర్తతో నిట్లుపలికెను. "ఆర్యపుత్రా! యీలేడిపైనుండి నామనస్సు మఱలకున్నది. మీరు దానిని తీసికొని రండు. అది మనక్రీడ కుపయోగించును. మనయాశ్రమమున మంచి రూపముగల లేళ్ళు, చమరీమృగములు, ఎలుగుబంట్లు, వానరములు మొదలగు మృగము లనేకము లెన్నేని కలవు. కాని దీనితో సమమగు కాంతి, వర్ణము, మందగమనముగల మృగమును దేనిని నేను జూచియుండలేదు. ఆహా! దీనికంఠస్వరమునకు నామనస్సు మిక్కిలి సంతోషించుచున్నది. మీరు దీనిని జీవించియుండ బట్టినయెడల మనము వనవాసము ముగించి మనరాజ్యమును జేరినతరువాత మన యంతఃపురములో విలాసార్థముగ దీని నుంచవచ్చును. భరతునకును, నాయత్తలకును దీనిని జూడ నాశ్చర్యముకలుగును. అది జీవములతో

దొరకనియెడల దానిచర్మమైనను నాకు ప్రియమును గలిగించును. దానిచర్మముపైని మనము దర్భాసనమును బఱచి కూర్చుండవచ్చును. నే నిట్లు నాకోర్కెలను దెలిపి మిమ్ములను గోరుట నాకు తగదు. అయినను దాని శరీరమును జూడ నాకు మనస్సుకలిగినది." ఇట్లు సీత పలుక రామునికిగూడ దానిపై మోహము కలిగెను. అంతట నతఁడు లక్ష్మణునితో నిట్లు పలికెను. "సీతకు దీనిసౌందర్యముచే విస్మయము కలిగినది. ఇట్టి సౌందర్యముగల లేడి యెక్కడను లేదు. నందనవనములోను, చైత్రరథవనములోను నిట్టిది లేనపు డీభూలోకమున నెక్కడుండును? దీనిని వర్ణింప నెవరికిని శక్యముకాదు. దీని నెవరు చూచినను విస్మయ మొందకమానరు. కొందఱు రాజు లడవిలో విహారము కొఱకును, కొందఱు మాంసముకొఱకును జంతువులను జంపుదురు. కొంద అడవిలో పెద్దయేనుగులశిరస్సులనుండియు, కొండలనుండియు మణులను, రత్నములను, బంగారము మొదలగు లోహములను, మంచి వస్తువులుగల గైరికాదిధాతువులను ప్రయత్నముతో సంగ్రహింతురు. వారు న్యాయమార్గముగ వస్తువులను పొందవలెను. ఈలేడియందును, దీనిచర్మమునందును సీతకును, నాకును మనస్సుకలిగినది. ఇతరజంతువులచర్మ మింతమృదువుగ నుండ దని నాయభిప్రాయము. ఆకాశమున నుండు నక్షత్రములలో మృగశీర్షనక్షత్రమువలె నిది భూలోకమృగములలో తగినమృగము. అట్లుగాక నీవుచెప్పిన ట్లిది రాక్షసమాయయైన యెడల దీనిని నేను తప్పక వధింపవలెను. ఈ మారీచుడే పూర్వము వనమున జరించుచు ననేకఋషులను జంపెను. వీడు వేటకు వచ్చిన గొప్పరాజులనుగూడ మరణము నొందించెను. ఈదండకావనముననే వాతాపి తనమాయచే బ్రాహ్మణులను జంపి చివరకు నగస్త్యునికడుపులోబడి జీర్ణమయ్యెనని నీకిదివరలోదెలిపియుంటిని. నిత్యము ధర్మాచరణుడును, జితేంద్రియుడునునగు నావంటివానిని నీమారీచు డవ

మానించిన వానికిగూడ ప్రాణాపాయగతియే కలుగును. నీవు పరాకు లేకుండ సాయుధసన్నద్ధుడవై సీతను రక్షించుచుండుము. నే నీలేడిని పట్టు కొనెదను. అది జీవములతో దొరకనియెడల దానిని జంపియైనను దీసి కొనివచ్చెదను. నేను వచ్చువఱకు నీవు జాగ్రత్తగ నుండుము. సీత దీనిచర్మమందు మంచి మనస్సుగలిగియున్నది. మంచిచర్మము కలిగి యుండుటచే నిది నాచే జంపబడును. నేనొక బాణముచే దీనిని జంపి చర్మమును శీఘ్రముగ దెచ్చెదను. నేను వచ్చువఱకు ప్రతిక్షణము విపత్తులు వచ్చునని యనుమానించుచు నీవు మహాబలుడగు జటాయువు సాహాయ్యముతో జాగ్రత్తగ సీతను రక్షించుచుండుము." ఇట్లు రాముడు పలికి తనకత్తిని, ధనస్సును, రెండమ్ములపొదులను పట్టు కొని తనయాశ్రమమునుండి బయలుదేఱెను.

రాముడట్లు బయలుదేఱుట మాయలేడి చూచి యాతని వంచించుచు మొదటభయముచే నాతనికి గనబడకుండనుండి కొంతసేప టికి కనబడెను. దానిని జూచి రాముడు దానివెంట పరుగెత్తెను. అది యాతనికి గనబడి వనములో వింటినిబట్టి పరుగెత్తు నాతని జూచి, చూచి యతడు బాణమును విడువలేకుండునట్లు తప్పించుకొనుచు నత నికి తనయందు లోభమును గలిగించుచు నతడు బాణమును వేయు నేమో యని యాతని శంకించుచు నాకాశమున నెగురుచు నుండెను. ఇంకను నాలేడి యావనములో నొకప్పు డతనికి గనబడుచును, నొకప్పు డతనికి గనబడకుండపోవుచును, నొకముహూర్తము దగ్గఱ గను, నొకముహూర్తము దూరముగను గనబడుచునుండెను. ఇట్లా లేడి యాతనికి కొంతసేపు కనబడుచును, కొంతసేపు కనబడకుండపోవు చును నా రాముని నాయాశ్రమమునుండి చాలదూరముతీసికొనిపోయెను. అంతట రాము డలసి యొకచెట్టుక్రింద నిలిచియుండి దానిమాయచే మోహితుడై మిక్కిలికోపమును బొందెను. అప్పు డామాయలేడి ఘ్నిగి

లినమృగములతో నాతనికి దగ్గఱగ కనబడెను. అంత నాతడు దానిని పట్టుకొనబోవ నది పరుగెత్తుకొనిపోయి యాతనికి గనబడకుండనుండెను. చివరకు రాముడు పెద్దచెట్లమధ్యనుండివచ్చు నాలేడిని జూచి మిక్కిలి కోపముతో దానిని జంపనిశ్చయించి బ్రహ్మనిర్మితమగునొక బాణమును ధనస్సున సంధించి దానిపై విడిచెను. అంత నది మాయామృగశరీరమును జీల్చి మారీచుని హృదయమునుగూడ పగులగొట్టెను. దానితో నామాయలేడి తాటిచెట్టంతయెత్తెగిరి కేకలువేయుచు 'ఏయుపాయముచే సీత లక్ష్మణు నిచటికి బంపును? ఎవరును లేనిసమయమున రావణు డామె నెట్లు హరించు'నని యాలోచించెను. తరువాత నా మాయలేడి రాముని కంఠధ్వనివంటి ధ్వనితో 'హాసీతా! హా!లక్ష్మణా!' యని యఱచెను. తరువాత నా బాణపుదెబ్బచే మారీచుడు లేడిరూపము విడిచి పెద్దశరీరమునుబొంది కేయూరాద్యలంకారభూషితుడై మెడలో బంగారుమాలయుండగొప్పకోఱలుకలిగినరాక్షసరూపముతో మరణము

---

అ. రా:—మారీచుడు చచ్చిపడినతరువాత వానిశరీరమునుండి యన్నిలోకములవారు చూచుచుండ తేజమొకటి బయలుదేఱి రామునిలో బ్రవేశించెను. దీనికి దేవతలందఱు గొప్పయాశ్చర్యమును బొంది యొకరితో నొక రిట్లనుకొనిరి. 'మునులను జంపిన యీపాపాత్ముడేకర్మచే నిట్టిసద్గతి నొందెను? లేక యిది రామునిమహిమయైయుండును; సందేహములేదు. వీడు పూర్వ మాతనిబాణముచే గొట్టబడి యతనిని స్మరించుచు భయముచే గృహము, ధనము మొదలగువాని నన్నిటిని విడిచి యతని నెల్లప్పుడు మనస్సున ధ్యానించుచు తన పాపముల బోగొట్టుకొని చివరకు రామునిచే జంపబడి యాతనిని బొందెను. ద్విజుడుగాని, రాక్షసుడుగాని, పాపిగాని, ధార్మికుడుగాని రాముని స్మరించుచు శరీరమును విడిచినయెడల గొప్పపదవిని బొందును.' ఇట్లు దేవతలు చెప్పుకొనుచు స్వర్గమునకు బోయిరి.

నొందెను. అప్పుడు రాముడు వానిని జూచి లక్ష్మణుడు పూర్వముతనతోఁ బలికినమాటలను, సీతనుస్మరించుచు నిట్లాలోచించెను. "లక్ష్మణుడు చెప్పిన ట్లిదంతయు మారీచునిమాయ. వీడిప్పుడు నావలన చచ్చెను. వీడు 'హా! సీతా!, హా! లక్ష్మణా!' యని యఱచి మరణించెనుగదా? ఈ మాటలను విని సీత యేమగును? లక్ష్మణు డెట్టియవస్థను బొందును?" ఇట్లు రాము డాలోచించి గొప్పవిచారముచే భయమును బొందెను. తరువాత నతడొక లేడిని జంపి దానిమాంసమును దీసికొని తొందఱగ జనస్థానమునకు బయలుదేఱి వెళ్లుచుండెను.

---

## ౧౫ వ. అధ్యాయము.

## రావణుడు సీత నెత్తుకొనిపోవుట.

మారీచుడు చనిపోవుచు రామునికంఠస్వరమువంటిస్వరముతో 'హా! సీతా! లక్ష్మణా!' యని యఱవ నాయఱపులను నాశ్రమములో సీత విని లక్ష్మణునితో 'నీవు వెళ్లి మీయన్నసంగతి తెలిసికొనుము. నామనస్సు, నాప్రాణములు సరిగలేవు. ఏదో యొకగొప్పవిపత్తుచే నడవిలో విచారించుచున్న మీయన్నకంఠస్వరమును నేను వినియుంటిని. నీవు శీఘ్రముగ బోయి రాక్షసులచే బాధనొంది యన్యసాహాయ్యముగోరు నాతని రక్షింపు'మని చెప్పెను. అతడు తనయన్న యాజ్ఞచే వెళ్లనందున నామె కోపించి యతని నిట్లు నిందించెను. "లక్ష్మణా! నీయన్న యట్టి యవస్థలోనుండ నాతనియొద్దకు నీవు వెళ్ళకున్నావు. నీయన్నకు నీవు మిత్త్రరూపముననున్న శత్రుడవు. 'రాముడు నాశనమునొందినయెడల నీ మెను నేను పొందవచ్చు'నని తలచి నీవు దుర్బుద్ధిగలవాడవై వెళ్లకున్నావు. ఆతనికి కష్టమువచ్చుట నీకిష్టముగ గనబడుచున్నది. నీయన్నయందు నీ కనురాగములేనందున

ననే నీ వాతని జూచుటకు వెళ్లక నిశ్చింతగ నున్నావు. ముఖ్యుడగు నాతనితో వచ్చిన నీ విప్పు డాపదవచ్చిన యాతనికొఱకు వెళ్ళక యీ యాశ్రమములోనుండి నాకొఱకై నీవు చేయవలసినదేమున్నది?” ఇట్లు సీత యేడ్చుచు విలపించుచుండ లక్ష్మణు డామెను నిట్లోదార్చెను.

“అసురులు, పన్నగులు, గంధర్వులు, దేవతలు, మనుష్యులు, రాక్షసులు, పిశాచులు, కిన్నరులు, మృగములు, ఘోరదానవులు మొదలగువారిలో నీభర్తతో సరిగ యుద్ధముచేయువారుకాని, యాతని జయించువారుకాని లేరు. యుద్ధములో నత డెన్నడును హతుడు గాడు. అతడు లేకుండ నిన్నీయడవిలో నొంటరిగ విడుచుటకు నే నంగీకరింపను. ముల్లోకనాయకులుగూడ నాతనిబలమును నాశనము చేయలేరు. నీమనోదుఃఖమును విడువుము. నీ విచారము మానుము. నీభర్త యీగొప్పలేడిని జంపి శీఘ్రముగ వచ్చును. అది వానికంఠ స్వరము గాదు. మాయచే నెవడో యట్లఱచెను. అది యీరాక్షసుని యింద్రజాలమాయ. అతడు నిన్ను నాస్వాధీనములో నుంచెను. నిన్నొంటరిగ విడుచుటకు నేనంగీకరింపను. ఈ జనస్థానములో ఖరుని వధించుటచే నీరాక్షసులందఱితోను మనకు విరోధము వచ్చినది. ఈయడవిలో హింసచేయుచు విహరించు రాక్షసు లనేకవిధములుగ మాటలను బలికెదరు. వానినిగూర్చి నీవు విచారింపవలదు.” ఇట్లు లక్ష్మణుడు నిజము పలుకుచుండ సీత గొప్పకోపమును దెచ్చుకొని కండ్లెఱ్ఱజేసి యాతని నిట్లు దూషించెను.

“దుస్స్వభావుడా! దయలేనివాడా! క్రూరుడా! క్రూరాత్ముడా! కులదూషకా! రామునికి గొప్పకష్టమువచ్చుట ‘నీ కిష్ట’మని నేనుతలచెదను. రామునకువచ్చినకష్టమును జూచి నీ విట్లు ప్రేలెదవా? నీవంటి గుప్తచారులును, క్రూరులును, సవతియన్నదమ్ములునునగువారికి నిట్టి పాపచింతయుండుట చిత్రముకాదు. నానిమిత్తము నీ వొక్కడవె

గుప్తభావముతో రామునితోఁగూడ నడవికి వచ్చితివి. లేక భరతుడు నిన్ను బంపియుండును. నేను రాముని విడిచి నిన్నుగాని, భరతుని గాని పొందెదనను నీయభిప్రాయ మెట్లన నెన్నడును నెఱవేరగదు. అతడు లేనియెడల నొకనిమిషమైనను నేను జీవింపలేను. నాప్రాణములను నీయెదుటనే విడిచెదను." సీతపలికిన యీకఠినవాక్యములను విజితేంద్రియుడగు లక్ష్మణుడు విని చేతులు జోడించి యిట్లు పలికెను. "నీవు నాకు దేవతవు. నీకు జవాబిచ్చుట నా కిష్టములేదు. ఇట్టి యయుక్తపుమాటలను స్త్రీలు పలుకుట చిత్రముకాదు. సాధారణముగ వారు ధర్మమువిడచినవారును, చంచలచిత్తులును, క్రూరస్వభావము గలవారును, విరోధముకల్పించువారునునై లోకములో గనబడుచుందురు. సీతా! నా రెండుచెవులలోను నిప్పువంటి బాణములతో గొట్టినట్లుండు నీమాటలను నేను సహింపలేను. వనములోనుండు దేవతలారా! మీరు నామాటలను వినుడు. నేను న్యాయముగ జెప్పుచుండ నీమె నన్ను కఠినోక్తులాడినది. నేను నాయన్నమాటప్రకారము జరుపుచుండ నీమె నన్నవమానించి దుష్టబుద్ధితో నిట్లు పలికెను. ఛీ! యిప్పుడే నీవు నష్టమునొందెదవు. సీతా! నేను రాముడుండు చోటికి బోయెదను. నీకు శుభమగుగాక! వనదేవతలందఱు జాగరూకులై నిన్ను రక్షింతురుగాక! గొప్పదుశ్శకునములు నాకు గనిపించుచున్నవి. నేను రామునితోఁగలిసి తిరుగ వచ్చి నిన్ను జూచెదనా?" ఇట్లు లక్ష్మణుడు సీతతో మాటుపలుక నామె యేడ్చుచు కఠినమగుమాటల నిట్లు పలికెను. 'నాభర్తలేనియెడల నేను గోదావరిలోబడి చనిపోయెదను. లేక యురిపోసికొనికాని, విషముత్రాగికాని, మండుచున్నయగ్నిలోబడికాని చచ్చెదను; గాని యాతనితప్ప నితరపురుషులను నేను ముట్టను.' ఇట్లు పలికి యామె రెండుచేతులతోను గుండెలుబాదుకొనుచు దుఃఖించెను. అప్పుడు లక్ష్మణు డామెను

నోదార్చెను. దాని కామె వాని నేమియునన లేదు. తరువాత నాతడు చేతులుజోడించుకొని భూమిమీదబడి యామెకు నమస్కరించి యామెపై ననేకపర్యాయములు చూచుచు ధైర్యముతో రాముని సమీపమునకు వెళ్లెను.

అంతట సమయమునకై వేచియున్న రావణుడు యతివేషమును ధరించి సీతదగ్గఱకు వెళ్ళుటకు బయలుదేరెను. అతడు కాషాయవస్త్రములను గట్టుకొని శిఖగలవాడై గొడుగు వేసికొని యెడమభుజమున దండమును, కమండలమును ధరించి యుండెను. సూర్యచంద్రులులేని సంధ్యాకాలముల వ్యాపించు కాఱుచీకట్లవలెను, చంద్రునివిడిచిన రోహిణీనక్షత్రమునుజూచు క్రూరగ్రహమువలెను, చిత్తానక్షత్రమునుబట్టు శనిగ్రహమువలెను నున్న రావణుడు రామలక్ష్మణులులేనిసమయమున సీతను బట్టుట కాయాశ్రమమువద్దకు వచ్చెను. వాడు తీవ్రమగుకార్యములు చేయువాడగుటచే జనస్థానములోనుండు చెట్లు వానిని జూచి చలింపకుండెను. వాయువు వీవలేకుండెను. వాడు మిక్కిలియెఱ్ఱబారినకండ్లతో జూడ శీఘ్రముగప్రవహించు గోదావరీనదికూడ మెల్లగ ప్రవహించుచుండెను. అప్పటికి సీత పర్ణశాలలో పచ్చనిబట్టకట్టుకొని తనభర్తవిషయమై కన్నీరువిడుచుచు మిక్కిలివిచారముతో నాలోచించుచుండెను. రావణుడు మన్మథుని బారికిలోనై వేదముజదువుచు వినయముగ నామె సౌందర్యమును గూర్చి పొగడుచు నిట్లనెను. "నీవు విష్ణుశక్తులగు హ్రీ, కీర్తి, శ్రీ, లక్ష్మి మొదలగువారిలో నొకతెవా? లేక రతీదేవివా? అప్సరసవా? లేక స్వతంత్రురాలవా? నీపలువరుసను, నీనేత్రములను, నీసౌందర్యమును జూచిన నామనస్సు కరుగుచున్నది. ఏస్త్రీయు నీవంటిసౌందర్యవంతురాలు కాదు. ఇట్టియామెను నేను జూచియుండలేదు. నీ రూపము, నీసౌకుమార్యము, నీయౌవనము నామనస్సునకు వికారము

కలిగించుచున్నవి. నీ విక్కడనుండి బయలువెడలుము. ఇది కామరూపులగు రాక్షసులకు నివాసస్థానము. కావున నీ విక్కడ నుండదగవు. నీవు గొప్పమేడలలోను, మంచిపట్టణములలోను, నుద్యానవనములలోను నుండవలసినదానవు. మంచిగంధముల బూసికొని మంచిభోజనముచేసి మంచిబట్టలు కట్టుకొని నీకు తగినభర్తతో నీవు కాపురము చేయవలసినదానవు. నీవు రుద్రులు, మరుత్తులు, వసువులు మొదలగువారి దేవతాంగనవా? గంధర్వులు, దేవతలు మొదలగువారెవ్వరును నిక్కడకు రారు. నీ విక్కడి కెట్లు వచ్చితివి? ఇక్కడ ఘాతుకమృగములు, మదించినయేనుగులు మొదలగునవి నీకు భయము కలిగింపవా? నీపేరేమి? నీ వెవరిదానవు? ఎక్కడనుండివచ్చితివి? ఈదండకావనమున నీ వొక్కతె వేల నిలిచియున్నావు." ఇట్లు రావణుడు సీత నడుగ నామె యతిరూపముతో నున్న వానికి దగినయతిథిసత్కారముచేసి 'బ్రాహ్మణుడా! యిదిగో! యాసనము; దీనిపై గూర్చుండుము. ఇవిగో! నీళ్లు; తీసికొనుము. ఇవిగో! వనవస్తువులు; వీనిని భుజింపు' మని చెప్పెను. రావణుడు దాని కిష్టపడక చిరునవ్వునవ్వి తనమరణము కొఱకు నామెను బలవంతముగ నెత్తుకొనిపోవుటకు నిశ్చయించి స్థిరచిత్తముతోనుండెను. ఆమె రామలక్ష్మణులు వేటనుండి వచ్చుచున్నారేమోయని యడవివైపు చూచుచుండెను. కాని వారు వచ్చుచున్న జాడ యేమియు నామెకు గనబడలేదు.

ఆరాక్షసరా జడిగినప్రశ్నల కామె యిట్లాలోచించెను. 'యతీశ్వరుడును, నతిథియు, బ్రాహ్మణుడునునగు వీనికి జబా బియ్యకపోయినయెడల నన్నితడు శపించును.' ఇట్లొకగడియయామె యాలోచించి 'నేను జనకరాజకుమార్తెను. నేను నాభర్తయగు రామునితోను, మఱిదియగులక్ష్మణునితోను దండకావనమునకువచ్చితి'

నని చెప్పి * తమచరిత్రమంతయు వానికి దెలిపెను. తరువాత నామె వానితో 'నాభర్త యెవరికైనను, నిచ్చువారుకాని స్వీకరించువారు కారు. నిజమునే పలుకువారుకాని యబద్ధమాడువారు కారు. వారు వనమునుండి యిప్పుడే వత్తురు. కాన నంతవఱకు నిచ్చట మీరు విశ్రమింపు'డని పలికి వానిపేరును, గోత్రమును, కులమును, నత డక్కడ నొంటరిగ దిరుగుటకు గారణమును వాని నడుగ వాడు కఠినములగు మాటలనిట్లనెను. "నేను లోకములను, దేవతలను, నసురులను, పన్నగులను భయపెట్టిన రాక్షసరాజగు రావణుడను. నీసుందరరూపమును జూచి నాభార్యలం దనురాగమును విడిచితిని. నేను చాలమంది యుత్తమస్త్రీలను బలవంతముగ దెచ్చి నాకు భార్యలుగ నుంచితిని. వారలలో నీవు పట్టమహిషివికమ్ము. సముద్రమధ్యముననుండు ద్వీపములో పెద్దపర్వతముపైని నాలంకాపట్టణమున్నది. అక్కడ నీవు నాతో వనముల విహరించుచు నీవనవాసదుఃఖమును మఱచెదవు. నీవు నాకు భార్యవైనయెడల బాగుగ నలంకరించుకొనిన 5000 దాసీలు నిన్ను సేవించెదరు." ఇట్లు రావణుడు పలుక సీత మిక్కిలికోపము గలదై వానిని తృణీకరించి తనభర్త మేరువువలె దృఢమైనవాడనియు, మహేంద్రునితో సమానుడనియు, సముద్రునివలె చలింపనివాడనియు, జితేంద్రియుడనియు పలికి యాతనిరూపరేఖావిలాసాదులను,

* అరణ్యకాండ 47 వ. సర్గలో సీత దశరథునిగృహములో 12 సంవత్సరములు భోగము లనుభవించెననియు, తరువాత నామె వనవాసమునకు వెళ్లినపు డామెకు 18 సంవత్సరములనియు, రామునికి 25 సంవత్సరములనియు చెప్పబడినది. అట్లయినచో వారివివాహకాలమున భార్యాభర్తలకు క్రమముగ 6,-13. సంవత్సరములైయుండును. ఇది కేవల మసంభవము. ఈవయస్సులు సరియైనవికావనియు, నిప్పటికలియుగమువారికి నమ్మకముకలిగించుట కట్లు తెలుపబడినవనియు, 1 వ. ప్రకరణము ౨ వ. అధ్యాయములో రామునివయఃప్రమాణమున వ్రాసితిమి.

గుణములను బొగడి 'సేనాతని నాశ్రయించి యుంటి' నని వానికి దెలిపి పిమ్మట రావణు నిట్లు నిందించెను. "నక్క యాడుసింహమును గోరునటుల నీవు నన్ను గోరితివి. సూర్యకాంతిని మనుజుడు స్పృశింప లేనటుల నీవు నన్ను స్పృశింపలేవు. మరణ మాసన్నమైనవాడు బంగారుచెట్లను జూచునటుల నీవు రామునిభార్యనగు నన్ను గోరుచున్నావు. ఆకలిగొనిన సింహమునోటి నుండియు, మంచి విషముగల సర్పమునోటినుండియు కోఱలను లాగుటకును, మందర పర్వతమును జేతులతో నెత్తుటకును, కాలకూటవిషమును ద్రాగి సుఖముగనుండుటకును, సూదితో గంటిని బొడుచుకొనుటకును, కత్తిని నాలుకతో నాకుటకును, మెడలో పెద్దరాయి కట్టుకొని సముద్రము నీదుటకును, సూర్యచంద్రులను జేతులతో హరించుటకును, మండు చున్న యగ్నిని బట్టతో దెచ్చుటకును, విసుపములుకులుగల శూల ములపై నడచుటకును గోరునటుల రాముని భార్యనగు నన్ను నీవు పొందగోరుచున్నావు. నక్కకు సింహమునకును, బురదకు చందనపు నీటికిని, నీటికాకికి నెమలికిని, చిన్నయేటికి సముద్రమునకును, పిల్లికి నేనుగునకును, గ్రద్దకు హంసకును, సీసమునకు బంగారమునకును, కాకికి గరుత్మంతునకును నున్నంతభేదము నీకును, రామునకునుగలదు. ఇంద్రునితో సమానుడగు రాముడు ధనస్సును, బాణములను బట్టి యుండ నీవు నన్ను హరించినయెడల నీగ వజ్రమును మ్రింగిమరణించు నటుల నీవు మరణించెదవు." ఇట్లామె రావణుని నిందించి వాయువుచే గదల్పబడు నరటిచెట్టువలె కంపమునొందెను.

అంతట రావణు డామెకు భయముకలుగునటుల కనుబొమలను ముడివైచి యిట్లు పలికెను. "నేను కుబేరుని సవతితమ్ముడను. నాకు గోపమువచ్చినయెడల నింద్రాదులుకూడ భయపడుదురు. నేనుండు చోట వాయువు వీవ వెఱచును. సూర్యుడు తనవేడికిరణములను

చల్లగ ప్రసరింపజేయును. చెట్లయాకులుకూడ చలింపవు. నదులు ప్రవహింపవు. నీవు సర్వసమృద్ధియగు నాలంకాపట్టణమున నాతో గాపురముండిన మనుష్యస్త్రీలను మఱచెదవు. మానుషభోగములను, దివ్యభోగములను ననుభవించు నీవు స్వల్పాయుర్దాయముకలవాడును, మనుష్యుడుననగు రాముని మఱచెదవు. దశరథుడు తనప్రియపుత్రునరాజ్యముననిలిపి జ్యేష్ఠుడును, స్వల్పపరాక్రమముగలవాడుననగు నీ భర్తను వనమునకు బంపెను. రాజ్యభ్రష్టుడును, తెలివితక్కువవాడును, దుర్బలుడును, తాపసరూపమును ధరించినవాడుననగు వానివలన నీకేమి ప్రయోజనము? రాక్షసులందఱికి ప్రభుడను, మన్మథబాణములచే బాధింపబడినవాడుననగు నన్ను నీవు తిరస్కరింపవలదు. అట్లు తిరస్కరించినయెడల పూర్వ మూర్వశి పురూరవచక్రవర్తిని మొదట కాలితో దన్ని తరువాత పరితాపమునొంది యాతనిని గలిసికొనునట్లు నీవుకూడ పరితాపము నొంది తిరిగి నన్ను గలిసికొందువు. రాముడు యుద్ధములో నాగోరునకైన బోలడు. నీయదృష్టముచే నే నిక్కడకు వచ్చితిని; నన్ను సేవింపుము." ఇట్లు రావణుడు పలుకుచుండ సీతకు గొప్పకోపము వచ్చెను. అప్పు డామె వాని కిట్లు జబాబిచ్చెను. 'సమస్తప్రాణులు నమస్కరింపదగిన కుబేరుని తమ్ముడవగు నీ కిట్టి దుర్మార్గప్రవర్తనయేలకలిగెను? దుర్బుద్ధిగలవాడవును, నింద్రియలోలుడవును, క్రూరుడవుననగు నీవు రాజువగుటచే రాక్షసులందఱు నీమూలమున నశించెదరు. ఇంద్రునిభార్యయగు శచీదేవినైనను నీవు హరించి జీవింపగలిగెదవు; కాని నన్ను నీవు తీసికొనివెళ్లి జీవింపలేవు.' ఇట్లు జవాబు చెప్పినపుడు మంచిబట్టలను, నలంకారములను ధరించినసీత సూర్యునికాంతివలె ప్రకాశించెను.

తరువాత రావణుడు తనచేతిలో జేయివేసికొని యతిరూపమునువిడిచి యామెకు ఘోరమగు తననిజరూపమును జూపెను. అప్పుడు

వానికంఠస్థ మిక్కిలి యెఱ్ఱగనుండెను. వానిచెవులకు బంగారుకుండలము లుండెను. వానిశరీరము పెద్దనీలమేఘమువలెనుండెను. పదిమొగము లుగల యతడు వింటిని, బాణములనుబట్టి యెఱ్ఱనివస్త్రమును ధరించి భయంకరముగ సీతతో నిట్లనెను. 'నావీర్యపరాక్రమములు పిచ్చిదాన వగు నీకు దెలియవని నేననుకొనుచున్నాను. నే నాకాశమున నిలిచి నాచేతులలో భూమిని నిలుపగలను. సముద్రమును పానముచేయ గలను. మృత్యుదేవతను యుద్ధములో జయింపగలను. వేడిబాణము లచే సూర్యుని నరికట్టగలను. నిన్నుగోరి స్వయముగవచ్చిన యిట్టినన్ను నీవు భర్తగ జూడుము. మూడులోకములలోను ప్రఖ్యాతిగలపురుషుని భర్తగ నంగీకరించుటకు నీకిష్టమున్నయెడల నన్నాశ్రయింపుము. నీకు నేను తగినభర్తను. ఎన్నడును నేను నీకయిష్టమును జేయను.' ఇట్లు పలికి దుష్టుడగు రావణుడు కామోద్రేకముతో * నామెజుట్టును తనయెడమచేతితోను, నామెతొడలను తనకుడిచేతితోను బట్టెను. అప్పుడు వనదేవతలందఱు భయంకరుడగు వానిని జూచి భయమును జెంది మొఱలిడుచు పాఱిపోయిరి. అప్పుడు గుఱ్ఱములనుగట్టిన మాయామయమగు వానిబంగారురథము సిద్ధముగనుండెను. వాడు కఠినమగు మాటలతో నామెకు చీవాట్లు పెట్టుచు తనతొడలమీద నామెనుంచుకొని యారథమునెక్కి యక్కడ నామెను గూర్చుండ బెట్టెను. అప్పుడు సీత చాలదూరమున నడవిలోనున్న రామునిగూర్చి విలపించి దుఃఖించెను. అప్పుడు రథమాకాశమార్గమున నెగురుచు బోవుచుండెను. అప్పుడామె మత్తెక్కినదానివలెను, మతిభ్రాంతిగల దానివలెను మిక్కిలివిచారముతో నిట్లు విలపించెను. "అయ్యో! లక్ష్మణా! నీవు నీయన్నమాటప్రకారము సంచరించువాడవు. నన్ను

* అ. రా:—రావణుడు సీతయుండుభూమిని తనగోళ్ళతో పెకలించి భుజములతో నెత్తి రథముపైనుంచెను.

కూ్రరాక్షసు డెత్తుకొనిపోవుట తెలిసికొనకున్నావు. ఓరామా! ధర్మముకొఱకు సుఖమును, రాజ్యమును, చివరకు ప్రాణములనైనను విడుచు మీరు ధర్మవిరుద్ధముగ నీతడు నన్ను దీసికొనిపోవుట చూడ కున్నారు. మీరు నిశ్చయముగ దుర్మార్గులను శిక్షించువారలయ్యు గొప్పపాపాత్ముడగు నీతని నేలదండింపరు? దుర్మార్గులు చేయు పనులకు వెంటనే ఫలముకానరాదు. దానికి కాలము సహాయముగ నుండవలెను. దుర్మార్గపుపనులను జేసిన యీ రావణుడు తనమరణ కాల మాసన్నముకాగా రామునివలన తనప్రాణములను బోగొట్టు కొనుగాక! కైకేయియు, నా బంధువులును నా యవస్థ కిప్పుడు సంతోషము నొందెదరుగాక! జనస్థానములోనుండు కొండగోగువృక్షము లారా! శిఖరములుగల ప్రస్రవణపర్వతమా! హంసలుమొదలగు వానితోనుండు గోదావరీనదీ! యిక్కడనుండు వివిధవనదేవతలారా! గొప్పబలముగలజంతువులారా! మృగపక్షులారా! మీకందఱికి వంద నములు. మీరు రావణుడు నన్ను హరించి తీసికొనిపోవుచున్నట్లు రాము నికి దెలుపుడు. ఈవిషయ మతనికి దెలిసినయెడల నేను పరలోకములో నున్నను పరాక్రమముచే నాతడు నన్ను వీనిబారినుండి తప్పించి తీసి కొనివచ్చును.” ఇట్లామె విలపించుచుండ నామెకు జటాయువు కన బడెను. ఆమె వానిని జూచి దుఃఖముతో నేడ్చుచు ‘జటాయువా! నాథుడులేనిదానివలె నేను పాపకర్ముడగు నీరావణునిచే దీసికొనిపోబడు చున్నాను. వీడు బలవంతుడు; జయప్రదుడు; దుర్మార్గుడు; క్రూరుడు. వీనియొద్ద గొప్పయాయుధములున్నవి. నీవు వీనిబారినుండి నన్ను దప్పింపలేవు. రామలక్ష్మణులతో రావణుడు నన్ను హరించుటమొద లగునదంతయు నిజస్థితిదెలుపు’మని వానిని గోరెను.

## ౧౫ వ. అధ్యాయము.

### రావణుడు జటాయువును నలుకుట.

రామునియాశ్రమమునకు సమీపమున నిద్రించుచున్న జటాయువు సీతమాటలను విని తెలివితెచ్చుకొని వేగముగ రావణుని, సీతను జూచెను. పర్వతశిఖరమువలెనుండు నల్లనిశరీరమును, వాడియగు ముక్కును గలిగియున్న యాజటాయువు రావణునితో మంచిమాటల నిట్లు పలికెను. "రావణా! నేను గృధ్రములకధిపతిని; మహాబలుడను; జటాయువనువాడను. నేను సనాతనధర్మమున నిలిచి సత్యముగ బ్రవర్తించుచున్నాను. అన్నిలోకములకు ప్రభువును, లోకములకు మేలుచేయువాడునునగు రామునిధర్మపత్నిని నీవు హరించుచున్నావు. నీవు రాజువైయుండి పరభార్యలనెట్లు గ్రహించుచున్నావు? రాజభార్యలను ముఖ్యముగ రక్షింపవలెను. సత్పురుషులు పరభార్యలను బొందరు. వారు తమ భార్యలను రక్షించుకొనునట్లే యితరులభార్యలనుగూడ రక్షింతురు. కావున నీవిట్టి నీచబుద్ధిని విడువుము. శాస్త్రవిరుద్ధములగు ధర్మార్థకామములందు రాజులు ప్రవేశింపరు. దుర్మార్గుడవును, పాపస్వభావముగలవాడవును, చపలుడవునగు నీకునైశ్వర్య మెట్లుకలిగినది? కామమేస్వభావముగాగలవానియొక్కయు, దుర్మార్గమునుండి తప్పింపబడవీలులేనివానియొక్కయు సిరి చాలకాలముండదు. రాముడు నీదేశమునకుగాని, నీకుగాని యపకారముచేసియుండలేదు. అట్టివానికి నీవు ద్రోహబుద్ధితో నిట్టిదుర్మార్గప్రవర్తన నెట్లు చేయుచున్నావు? శూర్పణఖమూలమున జనస్థానములో దుష్ప్రవర్తనగ జరించిన ఖరుని నాతడు చంపెను. ఆవిషయమున నాతనియందేదోషము కలదని యాతనిభార్యను నీవు దొంగిలించి తీసికొనివెళ్లుచున్నావు? ఆమెను వేగముగ విడువుము. లేనియెడల నామహోగ్రాగ్నిచే నీవు వజ్రమునముచే నశించిన వృత్రుని

వలె వశించెదవు. నీవు నీబట్టలో మంచివిషపుకోఱలుగలపామును గట్టుకొని మెడలో గాలపాశమును వ్రేలవైచుకొని వానివలన కీడు గలుగునపాయమును నాలోచింపలేకున్నావు. బాధలేకుండ మోయ గలబరువును మనుష్యుడు మోయవలెను. రోగమునుగలుగజేయకుండ జీర్ణమగు యన్నమును భుజింపవలెను. లోకములో ధర్మమును, కీర్తి, యశస్సును గలిగింపని పనులను, శరీరమునకు దుఃఖమును గలిగించు పనులను నెవ్వడు చేయును? నాపూర్వులనుండి క్రమముగవచ్చినరాజ్య మును బాలించిననాకు నిప్పటికి 60,000 సంవత్సరములు గడచినవి. నే నిప్పుడు ముసలివాడ నై తిని. నీవు యౌవనవంతుడవు. నీవు కవచ మును దొడుగుకొని శరమును, వింటినిబట్టి రథమునున్నావు. అయి నను నీవు నేనుజూచుచుండ బలవంతముగ సీతనుదీసికొని కుశలముగను, న్యాయముగను బోలేవు. నీవు శూరుడవైన నాతో యుద్ధము చేయుము. ఒకగడియ నీవు వేచియుండినయెడల పూర్వము ఖరుడు మరణించినటుల నీవు గూడ మరణమునొందెదవు. మహాత్మా! రాక్షసులనుజంపినవాడును, తాపసవేషమును ధరించినవాడునునగు రాముడు నిన్ను యుద్ధమున జంపును. ఆయన్నదమ్ములిద్దఱు చాల దూరము వెళ్లియుండిరి. నే నేమి చేయగలను? వారివలనగలుగు భయముచే నీవు శీఘ్రముగ జచ్చెదవు. నేను జీవించియుండ నీ వీమెను దీసికొనిపోలేవు. నాప్రాణములను బోగొట్టుకొనినైనను నేను వారికి ప్రియమగుపనిని జేసెదను. రావణా! ఒకగడియనిలువుము. నాబలము కొలది నీకు యుద్ధాతిథ్యము నిచ్చెదను. తాటిచెట్టునుండి పండ్లను బడగొట్టునట్లు నిన్ను రథమునుండి క్రిందకు బడగొట్టెదను." ఇట్లు జటాయువు పలికెను.

ఆపక్షిరాజుమాటలకు రావణుని యిరువదికండ్లు కోపముచే మండుచుండెను. అంతట వారిద్దఱును నాకాశమున వాయువుచే గదల్ప

బడినమేఘములవలెను, ఱెక్కలుగలపర్వతములవలెను యుద్ధముజేసిరి. రావణుడు జటాయువుపై తీక్ష్ణమగు బాణములను, నస్త్రములను విడువ నది వానిని తృణప్రాయముగ దలచెను. అది తనగోళ్లతోను, వాడియైనముక్కుతోను వాని ననేకచోట్ల చీల్చెను. అందుచే వానికి కోపముగలుగ వాడు దానిపై మృత్యుదండముతో సమమగు 10బాణములను విడిచెను. అది వానినిగూడ లక్ష్యపెట్టక తనకాళ్లతో వాని ధనస్సును విఱిచెను. అంతట వాడు మఱియొక ధనస్సును బట్టి యా పక్షిరాజుపై ననేకబాణములవిడువ నది వానిని తనఱెక్కలతో నెగురగొట్టి వానివింటిని తిరుగ తనకాళ్ళతో విఱిచివైచెను. మఱియు నది తనఱెక్కలతో వానికవచమును నెగురగొట్టెను; మంచిజవముగలవాని గుఱ్ఱములను జంపెను; బంగారురథమును ముక్కలుచేసెను; ఛత్రచామరాదులను బట్టుకొనినవానిపరిచారకులను బడగొట్టెను; తనముక్కుతో వానిరథసారథిని బరిమార్చెను. అప్పుడు రావణుడు సీతను తనయెడమతొడపై నిడుకొని రథమునుండి క్రిందబడెను. అక్కడిభూతములు దీనిని జూచి జటాయువును బొగడిరి. ముసలిదగుటచే గొంతయాయాసమును బొందిన యాపక్షినిజూచి వాడు సంతోషముతో నామెనుబట్టుకొని యాకాశమున కెగసి వెళ్ళుచుండెను. అంతట నది వానివెంటవెళ్లి వానినడ్డగించి యిట్లనెను. "నీచబుద్ధిగలవాడా! నీవు చండతేజుడగు రామునిభార్యను రాక్షసులందఱి నాశనముకొఱకు దీసికొని పోవుచున్నావు. దాహముగలవాడు నీరుత్రాగునట్లు నీవు పుత్ర మిత్రి కళత్ర బంధు మంత్రి పరివారముతోగూడ నాశనమునొందుటకు విషమును ద్రాగుచున్నావు. మంచిచెడ్డల నాలోచింపక వానిఫలములను దెలియక కార్యములను జేయువారు శీఘ్రముగ నీవలెనే నశింతురు. మాంసముకొఱకై వలలోబడిన చేప యందుండి తప్పించుకొనలేక నాశనమునొందునట్లు కాలపాశముచే గట్టబడిన నీవు తప్పకుండ నాశనము

నొందెదవు. పరాక్రమవంతులగు రామలక్ష్మణులకు తమయాశ్రమము నుండి నీవు సీతను హరించినట్లు తెలిసినయెడల వారు నిన్నెన్నటికిని [illegible] క్షమింపరు. లోకనింద్యమగు నిట్టిదొంగపని భయముజెందిన [illegible] దొంగలుతప్ప వీరు లెవ్వరును జేయరు. నీవు శూరుడవైన [illegible] నిలిచి నాతో యుద్ధము చేయుము. ఖరునివలె నీవుగూడ మరణము నొందెదవు. పురుషుడు మరణకాలమున తననాశనమునకొఱ కెట్టియధర్మ కర్మఫలమును బొందునో యట్టిదానిని నీవు పొందుచున్నావు. పాపము సంభవించు కార్యములను భగవంతుడైనను జేయడు." ఇట్లు జటాయువు పలికి పాఱిపోవుచున్న రావణునివెంట వెళ్ళి వానివీపుమీదబడి తనవాడిగోళ్ళతోను, ముక్కుతోను వానిని జీల్చి వానిజుట్టు నెక్కలాగెను. అంతట వాడు మిక్కిలికోపమునొంది వణకుచు పెదవులను గదల్చుచు సీతను తనయెడమతొడతో గట్టిగనొక్కిపట్టి తన కుడి చేతితో జటాయువును గొట్టెను. అది యాదెబ్బను తప్పించుకొని వాని యెడమచేతులను పదింటిని తనముక్కుతో ఛేదింప వెంటనే యక్కడ పదిచేతులు తిరుగ మొలిచెను. తరువాత రావణుడామెను క్రిందికి దింపి తనకాళ్ళతోను, పిడికిళ్ళతోను దానిని గొట్టెను. ఇట్లు వారిరువురకు తిరుగ గొప్పయుద్ధముజరిగెను. అంతట రావణుడు రామునిభార్య యగు సీతనుగుఱించి గొప్పకష్టముతో యుద్ధముచేయుచున్న యాపక్షి రాజుయొక్క రెండు రెక్కలను, పాదములను తనఖడ్గముతో నఱికెను. అంతటనాపక్షిరాజు తనశరీరమునుండి రక్తముకాఱుచుండ స్వల్పజీవముతో భూమియందు బడెను. సీత దానియొద్దకు పరుగెత్తుకొనిపోయి దానిని కౌగిలించుకొని యిట్లు విలపించెను. 'శకునములును, పక్షులర్వములును, వానిదర్శనములును జనులకు సుఖదుఃఖములను బాగుగ జ్ఞప్తికిదెచ్చును. రామా! నాకు గలిగిన యీగొప్పవిపత్తును మీరు తెలియకున్నారు. అవిగో! మృగపక్షులు నాయవస్థను సూచించు

టకు మీఁదుండుచోటికి పరుగెత్తుచున్నవి. నన్ను రక్షించుటకు పూను కొనిన యీపక్షిరాజు పాపియగు వీనిచే నఱకబడి క్రిందబడియున్నాడు. రామలక్ష్మణులారా! నన్ను రక్షింపుఁడు.' ఇట్లామె తనకు దగ్గఱగ నున్నట్లు వారిని దలచి మొఱబెట్టెను. తరువాత నామె పెద్దచెట్లను బట్టుకొని 'రామా! రామా!' యని యేడ్చుచుండ రావణుఁడు 'విడు వుము; విడువు'మని హుంకరించి తనమరణమునకై యామెజుట్టును బట్టుకొని లాగెను.

---

## ౧౭. వ. అధ్యాయము.

### రావణుడు సీతను నశోకవనమున నుంచుట.

రావణుఁడు 'రామా! రామా!' యని యేడ్చుచున్న సీత యొక్క జుట్టును బట్టుకొని లాగి తన యెడమతొడమీఁదికి జేర్చి యాకాశమార్గమున బోవుచుండ నపుడు లోకమంతటను జీకట్లువ్యాపిం చినట్టులయ్యెను. వాయువు వీవలేదు. సూర్యునికి ప్రభ తగ్గెను. బ్రహ్మ తనదివ్యజ్ఞానముతో రావణుఁడామెను నెత్తుకొనిపోవుటను దెలిసికొని 'జరుగవలసినది జరిగె' నని పలికి 'వానివధనిశ్చయ' మని తలచెను. దండకారణ్యనివాసులగు ఋషులు సీతాపహరణమునకు విచార మును, దైవయోగమున కాబోవురావణవధకు సంతోషమును బొం దిరి. రావణుఁడామె నెత్తుకొనిపోవునపుడు మంచియాభరణములను, పచ్చనిపట్టువస్త్రమునుధరించిన యామెదేహము నల్లనిమేఘములలోని మెఱపువలెను, పెద్దపర్వతముపై ప్రకాశించు నగ్ని తేజమువలెను, నెండలో మెఱయు నెఱ్ఱనిమేఘమువలెను, నీలములను గుచ్చిన బంగారపుమొలత్రాడువలెను, నేనుగకు గట్టినబంగారపుత్రాడువలెను

గనబడెను. ఆమెముఖము నల్లనిమేఘములలో గనబడు చంద్రునివలె
గళావిహీనముగనుండెను. వాడామెను దీసికొనిపోవునప్పు డామె
యాభరణములధ్వనిచే నతడు గర్జించుచున్న మేఘమువలె గనబడెను.
సీతను దీసికొని వాడు వేగముగ బోవుచుండుటచే నామెశిరస్సుననున్న
సువాసనగల పద్మపుదళములును, పుష్పములును వానిశరీరమునబడి
క్రిందబడుచుండెను. ఆమెపాదములనుండి రత్నములతో నలంకరింపబడిన
గొలుసులు తెగి భూమియందు బడుచుండెను. తెగిపోయియున్న మిగిలిన
నగలుకూడ నాకాశమునుండి రాలు నక్షత్రములవలె క్రిందబడుచుండెను.
ఆమెహారములు తెగి యాకాశమునుండిపడు గంగవలెనే క్రిందపడు
చుండెను. వానివేగముచే నటునిటు నూగుచున్న పెద్దచెట్లు 'భయము
నొందకు' మని యామెతో జెప్పుచున్నట్లు కనబడెను. వాడిపోయిన
కమలములు,భయమునొందిచలించుచున్న చాపలుగల కొలను లామెను
గూర్చి విచారించుసఖురాండ్రవలె గనబడెను. అడవిలోనుండు నేను
గులు, సింహములు, పులులు మొదలగు జంతువులు రావణునందలి
కోపముచే నామెనీడననుసరించి రోషముతో పరుగెత్తుచుండెను. అప్పు
డడవిలోనుండు భూతములు గుంపులుగుంపులుగ జేరి 'రామునిభార్య
యగు సీతను రావణుడు హరించుచుండ లోకములో ధర్మము,
న్యాయము, సత్ప్రవర్తనము, దయ యెట్లుకలుగు' నని విచారించు
చుండెను. మృగశిశువులుగూడ దీనిని జూచి కండ్లంటనీరు తెచ్చుకొనుచు
దీనముఖములతో నేడ్చుచుండెను. సీత 'రామా! లక్ష్మణా!' యనిమొఱ
లిడుచు భూమివైపుపలుమార్లు చూచుచుండ వనదేవతలశరీరములు
ఇక్కిలి వణకుచుండెను. ఆమెజుట్టు గాలి కెగురుచుండెను. ఆమె
ముఖముపై తిలకము చెఱిగిపోవుచుండెను. ఆమె రామలక్ష్మణులను
పలుమార్లు పిలిచినను వారు కనబడకపోవుటచే నామెముఖము వాడి
యుండెను. ఇట్లు రావణుడు సీతను తనమరణముకొఱకు నాకాశ
మార్గమున నతిశీఘ్రముగ నెత్తుకొనిపోవుచుండెను.

ఆసమయమున సీత మిక్కిలిభయదుఃఖములనుబొంది శరీరము కంపింప నేడ్చుచు రోషముతో కండ్లెఱ్ఱజేసి రావణునితో నిట్లనెను. 'నాభర్తలేనిసమయమున దొంగతనముగ నన్ను నీవు తీసికొనివచ్చి నందులకు నీకు సిగ్గుగలుగుటలేదా? దుష్టాత్ముడా! నీవు నిశ్చయముగ నన్ను హరించునుద్దేశముగలవాడవై భయముచే నాతనియెదుటబడి నన్ను దీసికొనిపోలేక మాయామృగముచే నాతని నాశ్రమమునుండి మఱలించితివి. నామామగారిస్నేహితుడును, వృద్ధుడునగు జటాయువు నన్ను రక్షించుటకు యత్నింప వానిని నీవు పడగొట్టితివి. రాక్షసాధమా! ప్రగల్భపుమాటలనుబలికిన నీవు యుద్ధమున రాముని జయించి నన్ను దీసికొనిరాలేక దొంగతనముగ దీసికొనివచ్చుటచే నీపరాక్రమమెట్టిదో కనిపించుచునేయున్నది. భర్తలేనిసమయమున పరస్త్రీలను హరించుటయను నీపని యధర్మమైనదనియు, మిక్కిలి నీచమైనదనియు జనులు నిందింతురు. ఛీ! నీవు పొగడుకొనిన నీ శౌర్యము, నీబలము, కులనాశనకరమగు నీచరిత్రము నిందింపదగినవి. నీవతివేగముగ జరుగెత్తుకొనిపోవుచున్నావు. ఒకనిమిషము నిలువుము. ప్రాణములతో దిరుగవెళ్ళవు. రామలక్ష్మణులకంటబడినయెడల నీవు నీసేనసకలముసహాయముజేయుచున్నను నొకగడియయైనను జీవింపలేవు. వారిశరబాధను నీవెట్లు సహింపగలవు? నన్నిప్పుడు విడిచి నీవు మేలును, శ్రేయస్సును బొందుము. నీ వట్లుచేయనిచో నామఱదియు, నాభర్తయు గోపముజెంది నిన్ను నాశనమొందించెదరు. నీచా? నీవు నన్నెందుకొఱకు బలవంతముగ దొంగిలించితివో యాకార్యమంతమాత్రము నీకు నెఱవేఱదు. నాభర్త నాకు గనబడనియెడల నేను చాలకాలము జీవింపను. మరణకాలము సమీపించినపుడు జనులు విపరీతముగుపనులజేయునటుల నీవు మంచిశ్రేయస్సుకలుగని పనులను జేయుచున్నావు. నీకంఠమునమృత్యుపాశము కట్టబడినట్లు కనబడు

చున్నది. భయముకలుగు పరిస్థితిలోనున్నను నీవు భయమును బొంద కున్నావు. నరకములోనుండు రక్తధారలతో ప్రవహించు వైతరణీ నదిని, నసిపత్రవనమును, కఠినమగు నినుపముండ్లతోనున్న శాల్మలీ వృక్షమును నీవు చూచుచున్నావు. 14000 రాక్షసుల నొకనిమిష ములో జంపినవాడును, నన్నియస్త్రముల నుపయోగించుటలో నేర్ప రియునగు రాముడు తనభార్యను హరించిన నిన్నేలచంపకుండును!' ఇట్లామె విలపించుచున్నను రావణు డామెను తనమరణమునకై యెత్తు కొనిపోవుచుండెను.

సీతకు దారిలో తన్ను రక్షించువా డెవడును గనబడలేదు. తరువాత కొంతదూరమున నామె యొక కొండశిఖరముననున్న వానర శ్రేష్ఠుల నైదుగురను జూచి తనపైమీదనున్నపట్టువస్త్రములో తన నగల నన్నిటిని మూటగట్టి రామునితో వారు తనసంగతి దెలిపెద రని తలచి దానిని వారిమధ్య బడవేసెను. ఈసంగతిని రావణుడు తన మనస్సునకు గొప్పసంభ్రమము కలుగుటచే దెలిసికొనలేకపోయెను. ఆవానరులు రోదనముచేయుచున్న సీతను రెప్పపాటులేనికండ్లతో జూచిరి. తరువాత రావణుడు పంపాసరస్సును, వనములను, నదులను, కొండలను, సరస్సులను శీఘ్రముగదాటి సముద్రతీరమును జేరెను. వా డామెను దీసికొనివచ్చినందులకు సముద్రము కెరటములతో నల్ల కల్లోలమునొందెను. దానిలోని చేపలుమొదలగునవి కదలకుండనుం డెను. అప్పు డాకాశమున జరించుచారణులు, సిద్ధులు 'దీనితో రావణు డంతమగు' నని పలికిరి. తరువాత వాడు లంకలో బ్రవేశించి తన నగరున సీతను దింపెను.

రావణు డప్పుడు ఘోరరూపములుగల రాక్షసస్త్రీపరిచారిక లను కొందఱిని బిలిపించి వారి కిట్లు సెలవిచ్చెను. 'నాయాజ్ఞలేనిదే

యీమెతో నేపురుషుఁడుగాని, స్త్రీగాని మాట్లాడఁగూడదు. ఈమె కోరినట్లు ముత్యములను, బంగారును, బట్టలను, నగలను నీమెకు మీరి య్యవలెను. ఈమెనుగుఱించి మీ రెవరైనను తెలిసిగాని, తెలియక గాని విప్రియములగు మాటలను బలికినయెడల మిమ్ము మరణమునొం దించెదను.' ఇట్లు రావణుఁడు వారి కుత్తరు విచ్చి తననగరునుండి బయ టకు వచ్చి యేమిచేయవలయునని యాలోచించి మిక్కిలిపరాక్రమ శాలురగు నెనమండ్రురాక్షసవీరులను బిలిపించి వరములనుబొందినవా డగుటచే మిక్కిలిగర్వించి వారితోనిట్లు పలికెను. 'మీరు పూర్వము ఖరుఁడు నివసించిన జనస్థానమునకు మంచియాయుధములను బట్టుకొని తొందరగఁబోయి యక్కడ భయములేకుండ నివసింపుఁడు. ఆవనమున ఖరుఁడు మొదలగువారిని రాముఁడు వధించుటచే నా కాతనితో గొప్ప విరోధము సంభవించినది. ఆక్రోధమును నేను తీర్చుకొనెదను. యుద్ధ ములో నాతని జంపినగాని నాకు నిద్రపట్టదు. అప్పుడుగాని నేను సుఖ మును బొందను. మీ రంద ఱక్కడ నివసించి యతఁడుచేయుపనులను నిజముగ నాకు దెలుపుచుండుఁడు. రాక్షసులంద ఱజాగ్రత్తగనుండ గూడదు. ఆతనివధఁగూర్చి మీరు యత్నముచేయుచుండుఁడు. నేను యుద్ధములందు మీబలములను జూచియుంటిని; కనుకనే మిమ్ము జన స్థానమునకై నియమించితిని.' ఇట్లు రావణుఁడు వారికి ప్రియమగుమాట లను బలుక వారు వానికి నమస్కరించి లంకను విడిచి యెవరికిగన బడనిరూపముతో నక్కడికి వెళ్లిరి. ఇట్లు రావణుఁడు రామునితో వైరము సంప్రాప్తమైనదని యజ్ఞానముచే మిక్కిలి సంతోషించు చుండెను.

తరువాత వాఁడు సీతసంగతి మనస్సునకు దెచ్చుకొని మన్మథ బాణములచే గొట్టబడి తొందరగ రాక్షసస్త్రీలమధ్యనున్న యీమె

యొద్దకు వెళ్లెను. వాడు తననగరులో విచారముచే గన్నీరుదెచ్చుకొని ముఖమువంచుకొని యున్న యామెకు నానగరుసౌభాగ్యమంతయు బలవంతముగజూపి యామెను మెట్లమీదనుండి తనబహిర్ద్వారప్రాకారమునకు దీసికొనిపోయి యక్కడనుండు మేడలు, కిటికీలు, బావులు, చెరువులు మొదలగు వాని నామెకు జూపెను. తరువాత వాడామెతో నిట్లు పలికెను. "నేను మిక్కిలిబలశాలురగు 32 కోట్లరాక్షసులకు ప్రభుడను. ప్రతికార్యమునకు వేయిమంది యోధానులు నియమింపబడి యున్నారు. నీవు నాప్రాణములకంటె నెక్కువగుదానవుగాన నీరాజ్యమంతయు నీకు సమర్పించితిని. నాజీవితమునుగూడ నీకు సమర్పించితిని. నేను వివాహమాడినస్త్రీలకు నీవు ముఖ్యురాలవై నాప్రియభార్యవు కమ్ము. నీ పితరులయందు మనస్సుంచుటవలన లాభమేమి? నీవు నామాటల నంగీకరించి కామబాధనొందు నన్ను దయజూడుము. నూఱుయోజనములుగల యీలంకాపట్టణ మనేకులచే రక్షింపబడుచున్నదగుటచే దేవతలును, వారిప్రభువగు నింద్రుడునుగూడ నిందు బ్రవేశింపలేరు. వారిలోను, యక్షగంధర్వులలోను నాతో సమానమగు వీర్యవంతు డెవడును లేడు. రాజ్యమునుండి తొలగింపబడిన దీనుడును, స్వల్పాయుర్దాయముకలవాడును, తపస్సుచేయువాడును, మనుష్యుడునగు రామునివలన నీకేమిప్రయోజనము? నీవు నన్ను సేవింపుము. నేను నీకు తగినభర్తను. యౌవనము శాశ్వతము కాదు. నీవిక్కడ నాతో రమింపుము. త్రాళ్లతో వాయువును గట్టవీలులేనటులను, చేతులతో నగ్నిశిఖలను బట్టవీలులేనటులను నీలంకకు వచ్చుటకు నెవనిమనస్సునకుగూడ వీలులేదు. రాము డిక్కడకు వచ్చి నిన్ను జూచుననుబుద్ధిని నీవు విడువుము. మూడులోకములలో నెవ్వడును బలవంతముగ నిన్నిక్కడనుండి తీసికొనిపోలేడు. ఈలంకారాజ్యమును నీ వనుభవింపుము. నేనును, దేవతలును, చరాచరభూతములును

నీపరిచారకులమయ్యెదము. నీ వభిషేకమునొంది నాపట్టమహిషివి కమ్ము. నీపూర్వపాపములు వనవాసమున నశించినవి. నీసుకృతధర్మ ఫలముల నిక్కడ ననుభవింపుము. ఇక్కడ నీవు మాల్యములను ధరించి గంధములను బూసికొని భూషణముల నలంకరించుకొని నాతో క్రీడింపుము. నీవు నాతో బుష్పక మెక్కి విహరింపుము. నీముఖము విచారముచే ప్రకాశింపకున్నది." ఇట్లు రావణుడు పలుక సీత తనవస్త్రముతో గన్నీరు తుడుచుకొనెను. వా డింకను నామెనిట్లు ప్రార్థించెను. 'ధర్మలోపముచే గలిగిన నీసిగ్గు చాలును. నేను నిన్నుబొందుటయను నీరాక్షసము దైవకృతము, ఋషిప్రోక్తము నై యున్నది. నేను నాశిరములతో నీపాదములకు నమస్కరించుచు నీదాసుడనై నీవశమైతిని. నన్ను కృపజూడుము. నేనిట్టినీచపుమాటలను కామబద్ధుడనై పలుకుచున్నాను. రావణు డెన్నడును నేస్త్రీకి నమస్కరింపలేదు.' ఇట్లు పలికి వాడు కాలునిపాశమునకు లోబడి యామె తనవశమైనట్లుగ దలచెను.

రావణుడుపలికిన యామాటలను సీత విని గడ్డిపరక నొకదానిని పట్టుకొని రామునిచరిత్రమును వర్ణించుచు నిట్లు పలికెను. "రాముని బల మాలోచింప నీరాక్షసులందఱు దుర్బలులగుదురు. ఆతని బాణములు వారిశరీరములకు దగిలి వారిని జీల్చును. నీవు సురాసురులవలన మరణము నొందకపోయినను నాతనికి గొప్పకోపమును బుట్టించుటచే నాతనివలన మరణము నొందెదవు. యజ్ఞస్తంభమునకు గట్టబడిన పశువు తనప్రాణములం దాశ విడుచునటుల నీవుగూడ నీప్రాణములం దాశ విడువుము. నీప్రాణములను బలిష్ఠుడగు నాతడు తీసివేయును. నిన్నాతడు కోపదృష్టితో జూచినయెడల నీ వప్పుడు వెంటనే తప్పకుండ మరణింతువు. చంద్రుని నాకాశమునుండి పడవేసి నాశనము జేయగలిగినవాడును, సముద్రమును శుష్కింపజేయగల్గినవాడునునగు

నాత డిక్కడనుండి నన్ను విడిపింపలేడా? నీవు బలమును, నైశ్వర్యమును, నింద్రియపటుత్వమును, నాయువునుబోగొట్టుకొని యున్నావు. నీమూలమున లంకనాథుడు లేనిదగును. నీవు వనములో బలవంతముగ నాభర్తకు,నాకు వియోగము గలిగించి నన్నుదీసికొనివచ్చినందుల కీపాపము నీకెంతమాత్రమును సుఖమును గలుగజేయదు. దైవబలముగలవాడును, మహాపరాక్రమశాలియు గనుకనే నాభర్త దండకావనమున నొంటరిగ నివసించియున్నాడు. అతడు బాణములతో నిన్ను గొట్టి నీబలమును, నీవీర్యమును, గర్వమును, నతిశయమును బోగొట్టును. నరులు తమకు వినాశకాలమువచ్చినపుడు ప్రమాదములగు కార్యములను జేయుదురు. నీ వెప్పుడు నన్ను బలవంతముగ దెచ్చితివో యప్పుడే నీకును, నీరాక్షసులకును, నీయంతఃపురమునకును వినాశకాలమువచ్చినది. స్రుక్కు మొదలగు యజ్ఞోపకరణములుకలదియు బ్రాహ్మణులమంత్రములచే పరిశుద్ధమైనదియునగు యజ్ఞవేదికను చండాలుడు స్పృశింపవీలులేనటుల నిత్యము ధర్మము ననుసరించియున్న రామునిభార్యను, పతివ్రతనునగు నన్ను పాపుడవగు నీవు ముట్టవీలు లేదు. సరస్సులందు మొగహంసలతో గ్రీడించు నాడుహంస నీటికాకి నెట్లుపొందును? చైతన్యములేని యీశరీరమును నీవు బంధింపుము; లేక ముక్కలుగ గోయుము; లేక భక్షించిన భక్షింపుము. కాని నేను నపవాదును మాత్రము బొందను." ఇట్లు సీత క్రోధముచే కఠినమగు మాటలను బలికి యూరకుండెను.

దానికి రావణుడు కఠినమగుమాటల నిట్లనెను. 'నేను చెప్పిన మాట వినుము. 12నెలలో నీవు నన్ను బొందనియెడల నిన్ను నా వంటలవాండ్రు ముక్కలుముక్కలుగ గోసి ప్రాతఃకాలభోజనమున నుపయోగింతురు.' ఇట్లు వాడు పలికి యక్కడనుండు రాక్షస స్త్రీలకు

'మీరు శీఘ్రముగ దీనిగర్వమును బోగొట్టు' డని యాజ్ఞాపించెను. వారు వానికి జేతులను జోడించి యామెచుట్టు నిలిచిరి. అప్పుడు వాడు తనపాదములతో భూమిని దన్నుచు 'మీ రీమెను నశోకవనమునకు దీసికొనిపోయి యక్కడ బాగుగ రక్షించుడు. ఈమెను గొట్టుచును, దిట్టుచును మంచిమాటలను జెప్పుచును నీమె నాకు వశమగునటుల జేయు'డని వారికు త్తరు విచ్చెను. ఆప్రకారము వా రామెను నశోక వనమునకు దీసికొని పోయిరి. అక్కడ నామె యాడుపులులకు జిక్కిన లేడీవలె విచారమునొందుచు వారివశమునమండెను. అక్కడ వా రామెను తర్జనభర్జనలను జేయుచుండ నామె సుఖము, సంతోషము లేనిదై తనకు పతియు, దైవమునగు రాముని దలచుచు భయశోకము లను గలిగి మతిలేకయుండెను.

---

## ౧౮వ. అధ్యాయము.

### రామలక్ష్మణులు సీతను గానకపోవుట.

రాముడు మృగరూపముననున్న మారీచునివధించి తొందరగ సీతనుజూచు నుద్దేశముతో వచ్చుచుండ మార్గమున నతనికి దుశ్శకు నము లనేకములు గనబడెను. వానినతడు చూచి 'సీత రాక్షసులచే భక్షింపబడకుండ క్షేమముగనుండెనా?' యని శంకించుచు నిట్లాలో చించెను. 'మారీచుడు నాస్వరమువంటి స్వరముతో బలుకుటచే దానిని లక్ష్మణుడు విని యామెను విడిచియు, నామెచే ప్రేరేపింపబడియు నాయొద్దకు వచ్చుచుండవచ్చును. జనస్థానమున రాక్షసులతో నాకు విరోధము సంభవించినది. నాతమ్ముడును,సీతయు సుఖముగనున్నారా? రాక్షసులందఱు తమకోరికప్రకార మామెనుభక్షించియుందురు.' ఇట్లు

చింతించుచు రాముడు విచారముతో వచ్చు * లక్ష్మణుని సమీపమున జూచెను. తరువాత నతడు లక్ష్మణుని యెడమచేతిని బట్టుకొని విచారముతో కలితమగు మాటలను స్ఫుటముగ నిట్లనెను. 'లక్ష్మణా! నీవు సీతను విడిచివచ్చుట యనునది యెంతాశ్చర్యమైనది. ఆమె శుభముగా నుండునా? ఆమె రాక్షసులచే భక్షింపబడియుండును; లేక వారిచే దొంగిలింపబడి మార్గమున నుండు నని యీదుశ్శకునములవల్ల నూహించుచున్నాను. నా మనస్సునకు విచారముగ నున్నది. నా యెడమకన్నదరుచున్నది. ఆమె క్షేమముగ నుండునా? ఆమారీచుడు నన్ను మృగరూపముతో నాశ్రమమునుండి చాల దూరము తీసికొనిరాగ నేను వింటిని, బాణమును సంధించి వానిని గొట్టితిని. అప్పుడు వాడు మృగరూపమును విడిచి తనరాక్షసరూపమును బొంది యఱచి మరణము నొందెను.' ఇట్లు పలికి రాముడు లక్ష్మణునిజూచి యింకను నిట్లు విలపించెను.

---

* అ. రా:— రాముడు లక్ష్మణునిజూచినప్పుడు తనమనస్సులో నిట్లు తలంచెను. 'నేను మాయసీతను నిర్మించినసంగతి వీనికి తెలియదు. ఆసంగతి వీనికి దెలిసినను నేను వీనిని మోసపుచ్చి యేమియు నెఱుగని సామాన్యపురుషునివలె విచారించెదను. నేను భార్యయందనురాగము లేనివాడనై యింటిలోనుండి యూరకుంటినేని కోట్లకొలదనున్న రాక్షసుల జంపునుపాయ మెట్లు కలుగును? నేను కాముకునివలె దుఃఖము నొంది యామెనుగూర్చి విచారించుచు నామెను వెదకుచు రావణుని గృహముజేరెదను. అప్పుడు వానిని, వానికుటుంబమువారిని జంపి యగ్నిలో నేను నిలిపిన సీతను తిరుగ బొంది యయోధ్యకు తొందరగ బోయెదను. బ్రహ్మ నన్ను ప్రార్థించుటచే నేను మనుష్యావతారమెత్తితిని. కొంతకాలము భూలోకమున నివసించెదను. మాయామనుష్యుడనగు నాచరిత్రమెల్లప్పుడును వినుచు భక్తిమార్గమున నున్నవారికి నాయాసములేకుండ ముక్తి కలుగును.'

"నేను రాజ్యమును విడిచి దండకావనమునకు వచ్చుచుండ నాతోఁగూడ వచ్చి నాతో సమముగ దుఃఖముల ననుభవించుచున్న సీత యెక్కడ? ఆమె లేనియెడల నొకముహూర్తమైన నేను జీవించియుండలేను. భూలోకరాజ్యముకంటెను, స్వర్గరాజ్యముకంటెను నే నామె నెక్కువగ దలతును. సీత జీవించియున్నదా? ఆమె మరణించిన నేనుగూడ మరణింతును. అప్పుడు నీ వొక్కడవే యయోధ్యకు బోవలసివచ్చును. కైకేయితనపుత్రుడు రాజ్యముచేయుచుండ సుఖముగనుండును. ఆమెను నాతల్లి విచారమునమునిఁగి సేవింపకుండునా? సీత జీవించియున్నయెడల నే నాశ్రమమునకు వెళ్ళెదను. లేనియెడల నిక్కడనే మరణించెదను. లక్ష్మణా. నీ వజాగ్రత్తగనుండుటచే సీత జీవించియుండునా? లేదా? రాక్షసు లామెను దినివేసియుండిరా? చెప్పుము. సుకుమారియగు నామె నేను లేకపోవుటచే మిక్కిలివిచారమునొందును. దురాత్ముడగు నారాక్షసుడు 'లక్ష్మణా!' యని పలుకుటచే నీకుగూడ భయముకలిగెనా? సీత దానిని విని యది నామొఱ యని శంకించి నిన్ను బంప నీవు వచ్చితివి. ఖరుడుమొదలగు రాక్షసులను నేను చంపుటచే వారికి, మనకు విరోధము సంభవించెను. సీత నొక్కతెనే మనము విడుచుటచేతను, వారికి మంచిసమయము దొరకుటచేతను వా రామెను భక్షించియుందురు. నే నేమిచేసెదను. నే నీగొప్పవ్యసన మనుభవించుయోగమున్నది." ఇట్లు రాముడు విలపించుచు నాశ్రమమునకు బోవుచు మార్గమున లక్ష్మణునితో 'నేను నిన్ను నమ్మి సీతను నీ కప్పగించితిని. నీ వామెను విడిచి యెక్కడ వేలవచ్చితివి? నాయెడమకన్ను, బాహువు, వక్షస్థల మదురుచున్న'దని పలుక నతడు సీతకును, తనకును జరిగిన దంతయు రామునికి దెలిపెను. రాము డామాటలను విని 'ఆమెను విడిచి నీ వొక్కడవు వచ్చుట యను చెడ్డపని జేసితివి. నేను రాక్షసులనుజంపు శక్తిగలవాడనని నీకు దెలిసినను నామె క్రోధవాక్యములను

నీవు వచ్చితివి. నీపనికి నేను సంతోషింపను. నీ వామెమాటలకు క్రోధ
మునుజెంది నాయాజ్ఞను జరుపకుండవచ్చినందులకు విచారించుచున్నా'
నని పలికెను. రాము డాకలితోను దప్పికతోను, శ్రమతోను నిట్టూ
ర్పుదీయుచు, దుశ్శకునముల జూచుచు లక్ష్మణునితో తనయాశ్రమ
మును జేరెను.

తరువాత రాముడు పర్ణశాలలోను, పొదరిండ్లలోను సీతను వెదకెను; కాని యామె కనిపింపలేదు. పర్ణశాలలో చర్మములు, కుశలు జల్లబడియుండెను. ఆసనములు మొదలగునవి పూర్వస్థానములలో లేకుండెను. ఆమె కనబడకపోవుటచే నతడు 'సీతా! నీవు పరిహాసముకొఱకు దాగియుంటివా? పూవులను, ఫలములను తెచ్చుటకు వెళ్లియుంటివా? స్నానముకొఱకు కొలనులకు, నదికి వెళ్లియుంటివా? నిన్నెవరైన నెత్తుకొనిపోయిరా? లేక చనిపోయితివా? రాక్షసులు నిన్ను తినివేసిరా?' యని విలపించెను. ఎంతవెదకినను సీత కనబడకపోవుటచే నతడు కండ్లెఱ్ఱబాఱ నున్మత్తునివలె నొకచెట్టునుండి మఱియొకచెట్టునకును, నొకకొండనుండి మఱియొకకొండకును, నొకనదినుండి మఱియొకనదికిని బరుగెత్తుచు విలపించెను. అతడు కొన్ని చెట్లను, వానిభాగములను, వానిగుణములను తనప్రియురాలియవయవములతోను, గుణములతోను సరిపోల్చుచు 'మీరు సీతను జూచితిరా?' యని యడిగెను. తరువాత నాతడు మృగములనుగూడ నిట్లె యడిగి యిట్లు విలపించుచుండెను. 'సీతా! నీవు నాకు గనబడి యేలపరుగెత్తుచున్నావు? నీవు చెట్లలో దాగియుండి నాకు గనబడకుండను, నాతో మాటలాడకుండను నేలయున్నావు? నిలువుము; నిలువుము. నాపై నీకు దయలేదు? నీవు నన్ను హాస్యములాడుదానవు కావు; కాని నన్నేలయుపేక్షచేయుచున్నావు? నీశరీరావయవములను రాక్షసులు

13వ. ప్రకరణము. ౧౩వ. అధ్యాయము. విప్రలంభశృంగారము చూడుడు.

ఖండించి భుజించియుందురు. అయ్యో! లక్ష్మణా! నీవు నాప్రియురాలిని జూచితివా? అయ్యో! సీతా! నీ వెక్కడికిబోయితివి?' ఇట్లు విలపించుచు రాముడు వనములను, నదులను, కొండలను, నడవులను వెదకెను. ఐనను నామె వానికి లభింపకుండెను. అతడు మిక్కిలి యాయాసము నొంది తిరుగ నాశ్రమమునకు వచ్చెను. రాముడు చేతు లెత్తి సీతను గట్టిగ బిలుచుచు "లక్ష్మణా! సీత యేదేశము వెళ్ళినది? లేక నెవరిచేనైన నెత్తుకొనిపోబడినదా? లేక మరణము నొందెనా? ఆమెతో నాడుకొనుచుండిన లేడిపిల్లలు కన్నీరు విడుచుచున్నవి. ఆమె లేకపోవుటచే నేను జీవింపను. స్వర్గలోకమున నాతండ్రి నన్ను జూచి 'నీవు 14 సంవత్సరములు వనవాసమునకు నాచేనియోగింపబడి దానికొప్పుకొని దానిని బూర్తిచేయక నావద్ద కేల వచ్చితివి? 'ఛీ! నీవు సత్యముపరిపాలించువాడవుకా'వని చీవాట్లు పెట్టును. సీతా! యిట్లు నన్ను విడిచి నీ వెక్కడకు వెళ్ళితివి? నాయొద్దకు తిరుగ మఱలుము. నీవు లేనియెడల నేను మరణించెదను." ఇట్లు విలపించు రామునిజూచి లక్ష్మణుడు 'మీరు విచారము బొందకుడు. నేనును, మీరును వనములు మొదలగువానిని వెతకుదము. వనసంచారమందు శ్రద్ధగల యామె యడవులకు వెళ్ళియుండును; లేక స్నానమునకై చెరువులకును, నదులకును వెళ్లియుండును; లేక మనలను హాస్యముచేయుటకుగాని, భయపెట్టుటకుగాని వనములో దాగియుండును. ఆమెను మనము వెతకుదము. విచారము నొందకు'డని రాముని నోదార్చెను. పిమ్మట వారిద్దఱు వనములను, కొండలను, నదులను, సరస్సులను, ప్రస్రవణపర్వతశిఖరములను, కొండచరియలను వెదకిరి; కాని సీత వారికి గనబడలేదు. వారు తిరిగి తమయాశ్రమమునకు వచ్చిరి. అప్పుడు రాముడు లక్ష్మణునితో 'దండకావనమంతయు వెదకితిమి; కాని సీతమాత్రము దొరకలే'దని దుఃఖముతో బల్కగ లక్ష్మణుడు 'మహావిష్ణువు బలిని బంధించి లోక

ములను బడయునటుల మీరు సీతను బొందెద'రని రాముని నోదార్చెను. రాముడు సీత కానరాకుండుటకు మిక్కిలిదుఃఖమును బొంది పరవశుడై శరీరముశుష్కింప మతిలేక దీనుడై నిట్టూర్పుదీయుచు కూర్చుండెను. లక్ష్మణు డెంతచెప్పినను నాతడు బిగ్గఱగ నేడ్చుచుండెను.

సీత తనదగ్గఱలేకపోయినను తనసమీపముననున్నట్లు తలచి రాము డామెను వర్ణించెను. చివరకు తన కామె కనబడకపోవుటచే నాతడు 'సీతరాక్షసులచే భక్షింపబడియుండును. లేక వారిచే హరింపబడియుండు'నని పలికి యిట్లు విలపించెను. "లక్ష్మణా! యీమృగసమూహములు కన్నీరువిడుచుటచే నామె రాక్షసులచే భక్షింపబడుట నిశ్చయము. సీతా! నీ వెక్కడకుబోయితివి? కైకేయిమనస్సులోని కోరిక సిద్ధించెను. నేను సీతోగలిసి యయోధ్యలోని యంతఃపురము నుండి వచ్చి తిరిగి నేను నీవులేకుండ నచ్చటికి నెట్లు వెళ్ళెదను. నీవు కనబడనియెడల ప్రజలు నన్ను బలహీనుడనియు, దయలేనివాడనియు బలికెదరు; నేను నిన్ను బోగొట్టుకొనుటచే నన్ను ధైర్యములేనివాడని యందురు. వనవాసాంతమున మనయోగక్షేమములనడుగు జనకమహారాజును నే నెట్లు చూడగలుగుదును? నీవు లేకుండవెళ్ళిన నన్నొక్కడనే చూచి యతడు మూర్ఛనొందును. నే నొక్కడను నయోధ్యకు వెళ్లకుండ మరణించెదను. లక్ష్మణా! నీవు నన్ను వనమునవిడిచి యయోధ్యకుబోయి భరతునిగౌగిలించి రాజ్యముచేయుటకు నే నను‌జ్ఞనిచ్చితినని వానికి దెలుపుము. నాతల్లియగుకౌసల్యకును, నీతల్లికిని, కైకేయికిని నమస్కరించి నాతల్లిని క్రమముగ రక్షింపుము. సీత నాశనమును, నానాశనమును నామెకుసవిస్తరముగ దెలుపుము." ఇట్లు రాముడు విలపింప లక్ష్మణునకు భయమును, మిక్కిలివిచారముగూడ కలిగెను. రాము డింకను నిట్లు విచారించెను. "నావంటి పాపకర్ములుచేసినవాడు లోకములో మఱియొకడు లేడు. అనేక దుఃఖములు నాహృదయమును

పగులగొట్టినవి. పూర్వము నే ననేకపాపములను జేసియుంటినిగాన వానిఫలముల వలన నీదుఃఖములు నాకు సంభవించినవి. రాజ్యనష్టము, బంధువులతో వియోగము, తండ్రిమరణము, తల్లియెడబాటు నామనస్సునకు జ్ఞప్తికివచ్చుచున్నవి. సీత యుండుటచే వీనినన్నిటిని మఱచితిని. ఆమె వియోగముచే నాకు దుఃఖమధికమగుచున్నది. ఆమెతన్ను రాక్షసు డెత్తుకొనిపోవుటచే భయమువలన నపస్వరముగ నేడ్చియుండును. ఆమెయవయవములు ఖండింపబడియుండును. పూర్వ మీరాతిపై నామె కూర్చుండి సీతోను, నాతోను ముచ్చట లాడుచుండెడిది. ఆమె గోదావరినదికి పద్మములనుదెచ్చుటకు వెళ్ళియుండును; కాని యామెయొక్కతెయు నెన్నడును నన్నువిడిచి వెళ్ళలేదు. ఆమె యడవికి వెళ్లియుండును; కాని యామె యెన్నడును నొంటరిగ నడవికి బోలేదు. సూర్యభగవానుడా! నీవు లోకులకార్యములను దెలియువాడవు. నిజమును, నబద్ధమునునగుపలుకులకు సాక్షిభూతుడవు. కాన నీవు నాభార్య యెక్కడకు బోయినదో యామె నెవరు హరించిరో నాకు దెలుపుము. వాయుదేవుడా! యన్నిలోకములలోను ప్రతిదినమును నీకు దెలియని దేదియు లేదు. నాభార్య హరింపబడెనా? చనిపోయెనా? లేక త్రోవలో వెళ్లుచుండెనా? దానిని నాకు దెలుపుము." ఇట్లు రాముడు విలపించుచుండ లక్ష్మణుడు న్యాయముగను, కాలోచితముగను 'ఆర్యా! మీరు శోకమునువిడిచి ధైర్యమును దెచ్చుకొనుడు. ఆమెను వెదకుటకు మన ముత్సాహముతో నుండుదము. గొప్పకష్టములు వచ్చినప్పు డుత్సాహముగలపురుషులు నాశనమొంద'రని పలికెను. రాము డాతనిమాటలను వినక ధైర్యమును విడిచి తిరుగ గొప్ప విచారమును బొందెను. తరువాత నాతడు లక్ష్మణునితో 'నీవు గోదావరీనదియొద్దకు బోయి సీత యక్కడికి పద్మములనిమిత్తము వెళ్లెనేమో కనుగొనుము'మని యన నతడు తొందరగ నక్కడకు వెళ్లి వెదకి యామెను

గానక తిరిగివచ్చి రామునితో 'నేను గట్టిగ నఱచినను నామె నాకు గాన రాలేదు. ఆమె యేప్రదేశమునకు వెళ్లెనో తెలియ'దని పలికెను. అంతట నాతడు స్వయముగ నానదికి బోయి 'సీత యే'దని యడుగ నానదిపలు కక యూరకుండెను. పంచభూతములును, గోదావరీనదియు రావణుని యందలిభయముచే సీత సంగతి తెలుపలేదు. అప్పు డతడు తనతమ్ము నితోనిట్లనెను. 'గోదావరి యూరకున్నది. నేను సీతలేకుండ నయోధ్యకు బోయి జనకమహారాజునకును, నాతల్లికిని నేమి తెలిపెదను? నాకు రాజ్యము పోయినను నేను వనవస్తువులచే జీవనము సీత యుండుటచే తనే జరిపితిని. జ్ఞాతులసహాయము, బంధువులసహాయము, నిద్రాహార ములు లేనినాకు సీతలేకపోవుటచే రాత్రులు చాలకాలముకలవియగును. సీత నాకు గనబడినయెడల నే నీదండకావనమునను, ప్రస్రవణగిరియం దును సంచరించెదను. ఈమృగములు తమచేష్టలచే నేమో నాకుదెలు పుటకు గడియగడియకు నావైపుజూచుచున్నవి.' ఇట్లుపలికి రాముడు సీత'యెక్కడ నున్న'దని వాని నడిగెను. అప్పు డామృగములు దక్షిణ దిక్కునకు బయలుదేఱి యాకాశమును జూపుచు రామునివైపుజూచు చుండెను. లక్ష్మణుడుకూడ వానివైపుజూచుచుండ నవి యామార్గ మున నింకను బోవుటకు సిద్ధముగనుండెను. వీనిని లక్ష్మణుడు చూచి రామునితో 'ఇవి దక్షిణనైఋతిదిక్కులను జూపించుచున్నవి. అక్క డికివెళ్ళిన సీతదొరకు నుపాయము కనుగొందుము. లేక యామె స్వయముగ మనకు లభించు'నని పలుక రాముడు దానికొప్పుకొనెను. అంతట వారిరువురు నాశ్రమమును విడిచి దక్షిణదిక్కునకు వెళ్ళిరి.

## ౧౯ వ. అధ్యాయము.

## రామలక్ష్మణులు సీతను వెదకుట.

రామలక్ష్మణులు సీతను వెదకుటకై యాశ్రమమువిడిచి దక్షిణదిక్కునకు మాటలాడుకొనుచు బోవుచుండ సీతశిరస్సునుండి భూమిపై రాలిన పుష్పములు వారికి గనబడెను. రాముడు వానిని జూచి యవి సీతవేయనిపోల్చి లక్ష్మణునితో 'నాకు ప్రియముచేయు కొఱకు సూర్యుడును, భూమియు, వాయువును వీనిని భద్రపఱచి' రని పలికెను. తరువాత నతడు ప్రస్రవణపర్వతమును జూచి దానితో 'నాభార్యను నాకు జూపుము. లేనియెడల నీచరియలతోగూడ నిన్ను నాశనమొనర్చెద'నని పలుక నది సీతను జూపలేదు. అందుచే నతనికి గోపమువచ్చెను. అప్పు డతడు 'గోదావరినిగూడ నాబాణాగ్నిచే నింకించెదను. ఈపర్వతమును, నిందున్నగడ్డి, యాకులు, చెట్లుమొద లగువానిని నెవరికిని నుపయోగింపకుండునట్లు నాశనమొనర్చెద'నని పలికెను. తరువాత నాతడు పెద్దరాక్షసునిపాదచిహ్నములను, నారాక్ష సునినుండి తప్పించుకొనుటకు నటునిటు పరుగెత్తిన సీతపాదముల గుర్తును, విఱిగిపోయియున్న రెండుధనస్సులను, ముక్కలుముక్కలుగ నైన రథమును, రెండమ్ములపొదులను, తుత్తునియలైన మంచికవచమును, విఱిగిపోయిన ఛత్రమును, చచ్చిపడియున్నపెద్దగుఱ్ఱములను, సారథిని, చామరములు వీచువానిని, విఱిగినపెద్దజండాను, క్రిందపడియున్న బాణములను, తనభార్యయలంకారములనుండి తెగిపోయిపడిన బంగా రపుపూసలను, నామెశరీరమునకు బూసికొన్న లేపనద్రవ్యములను, రక్తపుముక్కలను భూమిపైని జూచి లక్ష్మణునితో నిట్లు పలికెను. "లక్ష్మణా! చూడుము. కామరూపులగు రాక్షసులు సీతను బొడిచి పొడిచి ఖండించియుందురు. లేక తినియుందురు. ఇక్కడ నామెను

గూర్చి యిద్దఱు రాక్షసులు తగవులాడుకొని యుద్ధముజేసియుందురు. పెద్దవియగు రాక్షసునిపాదచిహ్నములనుజూడ నాకు గోప మధిక మగుచున్నది. మిక్కిలికఠినులును, కామరూపులునునగు రాక్షసులు సీతను హరించియుందురు; లేక భక్షించియుందురు. సీత నెత్తుకొనిపోవుచుండ ధర్మదేవతగూడ నామెను రక్షించినదికాదు. సీత నెత్తుకొనిపోవుటకును, భక్షించుటకును, నా కిట్లు విప్రియము కలుగజేయుటకును నేలోకపాలురకు శక్తిగలదు? నేను లోకములను నిర్మింప సమర్థుడనైనను, కరుణానిధినైనను పంచభూతము లజ్ఞానముచే న న్నవమానించుచున్నవి. నేను మృదుస్వభావముగలవాడను, లోకోపకారముచేయువాడను, కరుణగలవాడనునగుటచే నేను దుర్బలుడనని దేవనాయకు లనుకొనుచున్నారు. నా కున్నమంచిగుణము లిప్పుడు రాక్షసులయొక్కయు, సర్వభూతములయొక్కయు నాశనముకొఱకు దోషములుగ పరిణమించుచున్నవి. సూర్యుడు చంద్రునివెన్నెలను తన తేజముచే మఱుగుపఱచునటుల నా తేజము నామంచిగుణములను నణచికట్టి ప్రకాశించును. దేవతలు, దానవులు, యక్షులు, గంధర్వులు, పిశాచరాక్షసులు, కిన్నరులు, మనుష్యులు మొదలగువారెవరును సుఖమునొంది జీవింపరు. నేను బాణములను, నస్త్రములను నాకాశమంతటను విడిచి మూడులోకములందు తిరుగువారు సంచరించుటకు వీలు లేకుండునట్లు చేసెదను. గ్రహములు కదలకుండునట్లును, చంద్రుడు కనబడకుండునట్లును, నగ్ని, వాయువు, సూర్యమండలము నష్టమగునటులను, పర్వతములు ముక్కలగునటులను, సముద్రములు, నదులు మొదలగునవి యింకిపోవునటులను, చెట్లుచేమలు నాశనమగునటులను, మృగపక్షులు మిక్కిలిభయమునొందునట్లును, మూడులోకములు ప్రళయకాలమందువలె నాశనమొందునటులను జేసెదను. సీతను కుశలముగ లోకనాయకులు నా కియ్యనియెడల వారు నాపరాక్రమము

జూచెదరు. నే నన్నిలోకములను నాశనమొనర్తును.” ఇట్లు రాముడు
పలికి వింటిని బాగుగలాగి మంచిబాణమును దానికి సంధించి ‘అన్ని
జంతువులు ముసలితనమును, మృత్యువును, కాలోచితకర్మను, దైవసం
కల్పమును తప్పింపలేనటుల నాకోపమునుగూడ నెవరును దప్పింపలేరు.
పూర్వమువలెనున్న నాసీతను నాకు లోకములు సమర్పింపకపోయిన
యెడల వాని నన్నిటిని బరిమార్చెద’ నని పలికి నిలిచియుండెను.

ఇట్లు రాము డన్నిలోకములను నాశనముజేయుటకు నిట్టూర్పు
దీయుచు సిద్ధముగనుండ లక్ష్మణునిముఖము వాడిపోయెను. అతడు
పూర్వమెప్పుడునులేని క్రోధముగల యాతనిముఖమునుజూచి చేతులు
జోడించి యిట్లు విన్నవించెను. “పూర్వము మృదుస్వభావమును, నిం
ద్రియ నిగ్రహమును గలిగియుండి యన్నిలోకములయొక్క క్షేమ
మును గోరుచునున్న మీరిప్పుడు సామాన్యమనుష్యునివలె క్రోధమును
జెందకూడదు. చంద్రునికి శోభయు, సూర్యునికి గాంతియు, వాయు
వునకు శీఘ్రగమనము, భూమికి నోర్పును గలవు. మీ కివన్నియుగాక
గొప్పకీర్తికూడకలదు. ఒక్కడుచేసినయపరాధమునుగూర్చి లోకముల
నన్నిటిని నాశనముజేయుట తగదు. ఈరథాదు లెవ్వనివో తెలియదు.
ఒక్కడే యుద్ధముజేసినట్లు కనబడుచున్నది. ఇద్దఱు యుద్ధముచేయ
లేదు. బలములేవియు యుద్ధమునకు రాలేదు. ఒక్కనికొఱకు లోక
ములనునాశనముచేయకూడదు. రాజులుశాంతచిత్తులై కాఠిన్యము వహిం
పక తగినశిక్షలనుమాత్రము విధింపవలెను. జీవులన్నిటికి మీరే శర
ణ్యులు. మీభార్యనష్టమొందుట మంచిదనియెవడనుకొనును. నదు
లును, సముద్రములును, పర్వతములును, దేవదానవగంధర్వులును
మీకు విప్రియము జేయుటకు శక్తిగలవారుకారు. నేను ధనస్సును
బట్టియుండ మహర్షులు మీకు సహాయులైయుండ మీరు సీత నెత్తు
కొనిపోయినవారిని వెదకుడు. సముద్రములను,పర్వతములను,నదులను,

భయంకరములగు గుహలను, పద్మములుండుసరస్సులను, దేవగంధర్వలోకములను, వానికొఱకై వెతకుదము. మంచిమాటలచే దేవనాయకులు మీభార్యను మీకు నప్పగింపనియెడల తరువాత మీరు వారికి తగినదండోపాయ మాలోచింపుడు. అప్పుడు మీరు తీవ్రబాణములను విడువవచ్చును." ఇట్లు లక్ష్మణుడు విన్నవించి విచారముతోనున్న రాముని నోదార్చి వానిపాదములబట్టి యింకను నిట్లు వానికి బోధపఱచెను. "దశరథుడు చాలకష్టములబడి చాల క్రతువులను జేసి దేవత లమృతముబొందునటుల నిమ్ముగ బడసెను. మీయందే యతడనురాగముకలిగియుండుటవలన మీవియోగముచే నాతడు స్వర్గస్థుడయ్యెను. ఈసంగతి భరతుడు మనకు దెలిపెను. మీకు గలిగిన కష్టములను మీరే సహింపలేకపోయినయెడల దుర్బలులును, మూర్ఖులునునగు నితరు లెట్లనుభవింపగలరు? మీరు దుఃఖముచే గలిగిన తేజస్సువలన లోకములనన్నింటిని దహించినయెడల బాధనొందిన ప్రజలు దానినుండి తప్పించుకొనుటెట్లు? ఇట్లు కష్టమునొందుట లోకస్వభావము. నహుషపుత్రుడగు యయాతి స్వర్గలాభమునుబొంది దానినిబోగొట్టుకొనెను. మనపురోహితుడగు వసిష్ఠునికి నొక్కదినమున పుట్టిననూర్వురుపుత్రు లొక్కదినముననే నాశనమునొందిరి. సర్వలోకములకు దల్లియు, నమస్కరింప తగినదియునగు యీభూదేవికిగూడ చలనముకలదు. లోకములకు నేత్రములవంటివారును, మహాబలులును, ధర్మప్రవర్తకులును, లోకముల నుద్ధరించువారునునగు సూర్య-చంద్రులకుగూడ గ్రహణమువలన నష్టము సంభవించుచున్నది. గొప్పపురుషులగు దేవతలుగూడ నన్నిశరీరములలోనుండు పరమాత్ముని యాజ్ఞనుండి తప్పించుకొనలేరు. ఇంద్రాదిదేవతలకైనను సుఖదుఃఖములుతప్పవు. సామాన్యునివలె మీరు మీకష్టమునకు విచారింపగూడదు. ఎల్లప్పుడును యథార్థమునుగనుగొను మీవంటివారు గొప్ప

కష్టములు వచ్చినను విచారములేకయుందురు. మీరు సరియైనబుద్ధితో నాలోచింపుడు. బాగుగదెలిసినవారు శుభాశుభములగూర్చి మనస్సులో వేఱుగ నాలోచింపరు. పూర్వజన్మలో జేసిన గుణదోషములకును, కర్మలకును తగినఫలములే యిప్పుడు గానవచ్చును. మీరు దేవగురువు వంటివారు. ఇంతకు బూర్వము మీరు నా కనేకములగు విషయము లను దెలిపియుండిరి. మిమ్ము శాసించువారెవ్వరు? మీకుగలబుద్ధి దేవతలకుగూడ లేదు. మీకు విచారముకలుగుటచే మీజ్ఞానము క్షీణించినది; కనుక నేను మీ కింతవఱకు దెలిపితిని. ఆకాశమందు సంచరించు దేవతలుమొదలగువారిని, భూలోకములోని బ్రాహ్మణులు మొదలగుసత్పురుషులను దెలిసికొని మీపరాక్రమమునాలోచించి పాపులును, మీకు శత్రువులునగువారిని వధించుటకు యత్నింపుడు. మీరు లోకమునంతటిని సంహరించు టేల?" ఇట్లు లక్ష్మణుడు బోధింప దానిని రాముడు గ్రహించి తనకోపమునువిడిచి ధనస్సునుదించి 'నాయనా! మన మేమి చేయుదము? ఎక్కడకు వెళ్లుదము? సీతను గనుగొను నుపాయమాలోచింపు'మని యడిగెను. అంత నతడు 'మనము జనస్థానమంతయు వెదకుదము. ఇక్కడ రాక్షసులుసంచరించు చెట్లును, లతలును, పెద్దకొండచరియలును, గుహలును, కిన్నరగంధర్వ నివాసములును గలవు. వానిని మనము వెదకుదము. వాయు వేగముచే గదలని కొండలవలెనే నీవంటిబుద్ధిమంతులగుమహాత్ములు గొప్పకష్టములు వచ్చినను చలింప'రని పలుక నామాటలను విని రాముడు బాణమును ధనస్సున సంధించి బయలుదేఱెను.

---

## ౨౦ వ. అధ్యాయము. జటాయుమరణము.

తరువాత రామలక్ష్మణు లడవిలో బోవుచు పర్వతశిఖరము వలెనుండి రక్తముతో దడిసిన జటాయువును జూచిరి. రాముడు దానిని జూచి 'ఇది సీతను భక్షించినది. రాక్షసు డొక డీగ్రిద్దరూపమును ధరించి యామెను దిని సుఖముగ పండుకొనియున్నాడు. వీనిని తీవ్ర బాణముతో జంపెద'నని పలికి తనధనస్సునందు తీవ్రబాణము నొక దానిని సంధింప నాగ్రద్ద దీనమగుమాటలతో నురుగును, రక్తమును గ్రక్కుచు నాతనితో నిట్లు విన్నవించెను. 'మీ రాతురతతో వెదకు సీతను, నాప్రాణములను రావణుడు తీసికొనిపోయెను. మీ రిద్ద రామె నొక్కతెను నడవిలోవిడువ వా డామెను హరించెను. నేను వానితో బోరాడి వానిరథమును విఱిచి వానిసారథిమొదలగువారినిజంప వాడు తనఖడ్గముతో నా ఱెక్కలను నఱికి యామెను దీసికొని యాకాశమార్గమున బోయెను. వాడు న న్నిదివఱకే చంపెను; మీరు చంపకుడు.' ఇట్లు జటాయువు మొఱలిడ తనభార్యవార్త తెలిసికొనిన రాముడా పక్షిరాజు కొట్టబడినందులకు నెక్కువవిచారమునొంది తనధనస్సును విడిచి జటాయువును కౌగిలించుకొని భూమియందుఁబడి దుఃఖించెను. లక్ష్మణుడుకూడ విచారమునొందెను. తరువాత నది దట్టమగు నాయడవిలో నిట్టూర్పుదీయుచుండ రాముడు దానిని జూచి మిక్కిలి విచారముతో 'నాకు రాజ్యనష్టమును, వనవాసమును, సీతానష్టమును నాతండ్రిసఖుడగు జటాయువునకు మరణమును సంభవించినవి. నావంటి భాగ్యహీను డీలోకములోనైన నెవడైనను న్నాడా? నాదురదృష్ట మగ్నినైనదహించును. దౌర్భాగ్యుడనగు నేను నాతాపశాంతికొఱకు సముద్రములో బ్రవేశించిన నది నిశ్చయముగ నెండిపోవు'నని లక్ష్మణునితో బలికెను. తరువాత వారిద్దఱు జటాయువు శరీరమును జేతులతో నిమి

౭౭. రాముడు దానిని గాంచి 'నాప్రాణసమానురాలైన సీత యే' యనిపలికి భూమియందు బడెను. తరువాత కొంతసేపటి కతడు లేచి దానిని జూచి తనతమ్మునితో 'నానిమిత్త మీగృధ్రరాజు యుద్ధములో క్రూరుడగు రాక్షసునిచే గొట్టబడి ప్రాణములవిడుచుచున్నది. దీనికి స్వరము తగ్గుచున్నది. ఇది మూర్ఛజెందుచున్న'దని చెప్పుచు దాని నిట్లడిగెను. 'నీకు జెప్పుటకు శక్తికలదేని సీతనెత్తుకొనిపోయిన విధమును, నీవధయు నాకు దెలుపుము. రావణునికి నే నేయపరాధము చేసినందున నాప్రియురాలిని వా డెత్తుకొనిపోయెను? సుందరమగు నామె మోమప్పుడెట్లుండెను? ఆమె యేమిచెప్పినది? ఆరాక్షసునిరూప బలపరాక్రమము లెట్టివి? వాని నివాసమెక్కడ?' ఇట్లు పలుమార్లడుగుచు రాముడు విలపించుచుండ జటాయువు హీనస్వరముతో మెల్లగ నిట్లనెను. 'రావణుడు గొప్పమాయచే గాలిని, మేఘములను గల్పించి నా రెక్కలను నఱికి సీత నాకాశమార్గమున దక్షిణదిక్కునకు దీసికొని పోయెను. నాప్రాణములు క్షీణించుచున్నవి; కండ్లుతిరుగుచున్నవి; మరణచిహ్నములు కనబడుచున్నవి. సీత నెత్తుకొని పోయిన సమయము విందముహూర్తముగాన నామె మీకు తిరుగలభించును. రావణున కది తెలియదు. వాడువలలో బడినచేపవలె శీఘ్రముగ నశించును. మీరు వానిని యుద్ధమున జంపి సీతతో సుఖముగనుండుడు. వాడు విశ్రవసుని కుమారుడు; కుబేరునితమ్ముడు.' ఇట్లు*జటాయువుపలికి తననోటినుండి రక్తమాంసములను గ్రక్కెను. రాముడు 'చెప్పుము; చెప్పు'మనుచుండ దాని శరీరమునుండి ప్రాణము లాకాశమునకు బోయెను.

---

*అ. రా:—జటాయువు రామునితో మఱిపలుకుటకు తనకు శక్తిలేదనియు, నాతనియెదుట తనప్రాణములు పోవుచున్నవనియు బలికి యిట్లతనిని బ్రార్థించెను. 'రామా! నామరణకాలమున దైవయోగమున నాకు నీవు కనబడితివి. నీవు పరమాత్ముడవగు విష్ణుడవు.

ఆజటాయువు తలను, కాళ్లనుజాపి భూమిమీద కొండవలె పడియుండ రాముడు దానికళేబరమును జూచి దీనమగుమాటలతో నిట్లు విలపించెను. "ఈపక్షి రాక్షసులుండు దండకారణ్యమున ననేక సంవత్సరములనుండి పక్షులకు రాజై సుఖముగ జీవించి యిప్పుడు మరణమునొందెను. మరణమును తప్పించుకొనుటకు వీలులేదుగదా! ఇది నా కుపకారముచేయుటకై బలవంతుడగు రావణునితో సీత నిమిత్తము యుద్ధముచేసి చనిపోయెను. ఇది తనరాజ్యమును విడిచి మరణమునొందుట నామూలముననయ్యెను. ధర్మముగజరించు శూరు లన్నిదేశములందు గలరు. తిర్యగ్జంతువులలోగూడ సత్త్వశౌర్యముగల జంతువులు గలవు. నానిమిత్తము మరణమునొందిన యీజటాయువు సీతావియోగముకంటె నాకెక్కువవిచారమును గలుగజేయుచున్నది. దశరథుడు నాకెట్లు పూజనీయుడో యీపక్షిరాజుకూడ నట్టివాడే. లక్ష్మణా! నీవు కట్టెలనుదెమ్ము. నేను నిప్పుచేసి నానిమిత్తము చని పోయిన దీనిని చితిమీద నునిచి దహనపఱచెదను. గృధ్రరాజా! నావలన నీ విట్లు సంస్కారముబొంది యజ్ఞములుచేయువారును, నగ్నిహోత్రములుచేయువారును, తిరుగబడ్డింపనివారును, భూదాన ములుచేసినవారును బొందులోకముల బొందుము." ఇట్లుపలికి తాను కూడ తమ్మునితో నడవికిబోయి పెద్దమానులను దెచ్చెను. అతడు తనబంధువునివలె నాపక్షికళేబరమును చితిపైనునిచి విచారించుచు దానిని దహనపఱచెను. తరువాత వారు గోదావరీనదికి వెళ్లి స్నానము

---

మాయచే మనుష్యరూపమును ధరించితివి. నాయంత్యకాలమున నిన్ను నేను చూచి ముక్తినొందితిని. నీచేతులతో నన్ను ముట్టుము. నీస్థాన మును నేను తిరుగ బొందెదను.' జటాయు విట్లు ప్రార్థింప రాముడు దానిని నంగీకరించి నవ్వుచు దానిశరీరమును ముట్టెను. జటాయువు మరణమునొందెను.

చేసి యాపక్షికి నుదకదానముచేసిరి. తరువాత వా రొకమృగమును జంపి తెచ్చిరి. దానిమాంసముతో రాముడాపక్షిరాజునుగూర్చి దర్భల పై పిండప్రదానముచేసెను. *తరువాత నత డప్పుడు చెప్పవలసిన మంత్రములను జపించెను. ఇట్లు జటాయువు గొప్పలోకములనుబొంద రామలక్ష్మణులు సీతను వెతకుతలంపుతో జనస్థానముననున్న యడవిని విడిచి మొదటపశ్చిమముగ కొంచెముదూరము వెళ్ళి తరువాత దక్షిణమునకు దిరిగిరి.

---

* అ. రా:—రాముడు జటాయువునకు పిండప్రదానముచేసిన తరువాత నతడు 'పక్షిరాజోత్తమా? నీవు నాస్థానమును బొంది యన్ని లోకములవారు చూచుచుండ నాసారూప్యమును బొందు' మని సెల విచ్చెను. తరువాత వెంటనే యది మంచిప్రకాశముగల శుభ్రమగు రూపమును బొంది సూర్యతేజముగల గొప్పవిమానము నొకదాని నెక్కి శంఖము, చక్రము, గద, పద్మము, కిరీటము, మంచిభూషణములు గలదై ప్రకాశించుచు దివ్యపురుషుడాయెను. అతడు శుభ్రమగు పచ్చనిబట్టలను గట్టుకొని విష్ణువవలె నలుగు రనుచరులచే పూజింపబడుచు యోగీశ్వరులు తన్ను కీర్తించుచుండ తొందరగ చేతులు జోడించుకొని రాముని పరమాత్మస్వరూపమును నిట్లు ప్రార్థించెను. 'మీగుణము లిన్ని, యన్ని యని లెక్కపెట్టుటకు వీలులేదు. మీ రన్ని లోకములను పుట్టించి పోషించి యంతము నొందింతురు. మీ రాసక్తి విడిచినయుత్కృష్టులరు? పరమాత్మస్వరూపులరు; అంతులేని సుఖము కలవారు; బ్రహ్మ, యింద్రుడు మొదలగువారి దుఃఖములను బోగొట్టువారు? వరములిచ్చువారు; గొప్పధనుస్సును, బాణములను చేతులతో బట్టినవారు; మూడులోకములలోను సుందరమగురూపమును ధరించినవారు; నూరుసూర్యుల తేజముగలవారు; కోటిమన్మథులకాంతిని మించి...

## ౭౧ వ. అధ్యాయము.

## కబంధునివధ; రామసుగ్రీవులస్నేహోపదేశము.

రామలక్ష్మణులు జనస్థానమను నడవిని విడిచినతరువాత మొదట పశ్చిమమునకు స్వల్పదూరముపోయి యక్కడనుండి దక్షిణాముఖముగ దిరిగి పెద్దయడవిని దాటిరి. వారట్లు మూడుక్రోసులదూరము వెళ్ళినతరువాత వారికి క్రౌంచవనము కనబడెను. అదికూడ పెద్దచెట్లతోను, మృగములతోను నిండియుండెను. వారు సీతనువెదకుచు నక్కడక్కడ విశ్రమించుచుండిరి. తరువాత వారు తూర్పుదిక్కుగ ౩ క్రోసుల దూరము వెళ్ళ మతంగాశ్రమసమీపమున పెద్దపర్వతగుహ వారికి గనబడెను. అది దట్టమైనచీకటితోనిండి పాతాళమునవలె లోతుగ నుండెను. దానికి సమీపమున వారు 'అయోముఖి'యను పెద్దరాక్షసిని జూచిరి. పెద్దశరీరముగలదియు, వికృతమగు ముఖముగలదియు

---

వేర్చువారు; శరణిచ్చువారు; దేవవృక్షముక్రింద నివసించువారు; సంసారమనెడు గొప్పయడవికి దావాగ్నివంటివారు; శివుడు మొదలగు దేవతలకుగూడ దైవమగువారు; గొప్పదయగలవారు; వేలకొలది రాక్షసవీరులను నాశనముచేయువారు; రూపములో సూర్యపుత్రిక యగుకాళిందితో సమానమైనవారు. మఱియు మీరు సంసారమం దెల్లపుడు శ్రద్ధగలవారిమనస్సులకు దూరమైనవారు; సంసారమందిష్టములేనిమునులకు నెల్లప్పుడును గనబడువారు; సంసారమను సముద్రమును దాటుటకై తెప్పవలె నుపయోగించు పాదములుగలవారు; పార్వతీపరమేశ్వరులమనస్సున నివసించువారు; గోవర్ధనపర్వతమును ధరించినవారు; దేవరాక్షసశ్రేష్ఠులచే సేవింపబడువారు; పరులధనమందును, భార్యలందును నపేక్షలేనివారిచేతను, నితరులమంచిగుణములను, నైశ్వర్యమును జూచి సంతోషించువారిచేతను, నితరుల కెల్ల

నల్లజంతువులకు మిక్కిలిభయముకలిగించునదియు, పెద్దకడుపుగలదియు, వాడియైనకోఁరలుగలదియు, కఠినమగు చర్మముగలదియు, జుట్టు విడియ బోసికొనినదియు నగు నారాక్షసి పెద్దజంతువులను దినుచుండెను. ఆమె వారి యొద్దకు వచ్చి ముందు నడచుచున్న లక్ష్మణునిచేయిపట్టుకొని వానిని కౌఁగిలించుకొని 'నన్ను బొందుము. మనము సుఖముగ క్రీడింతము. నే నయోముఖి యనువానను. నీకు లాభము కలుగును. నీవు నాకు ప్రియుడవు కమ్ము. నాథా! మనము పర్వతశిఖరములందును, నదులలోనియిసుకతిన్నెలయందును రమించుచు మిగిలినమనయాయుష్కాలమంతయు గడపుద' మని పలుకఁగా నాతనికి గొప్పకోపమువచ్చెను. అంతట నతఁడు తనఖడ్గమును దీసి దానిముక్కును, చెవులను, స్తనములను గోసెను. దానితో నామె వచ్చినత్రోవను పెద్దధ్వనిచేయుచు భయంకరరూపముతో పాఱి పోయెను. తరువాత వారు వనమును జూచుచు పోవుచుండిరి.

---

ష్ఠుడు నుపకారముచేయువారిచేతను సేవింపఁబడువారు; మీరు సులభముగ దొరకరు. మీరు గురువులకుగూడగురువులు. మీరు సత్త్వగుణప్రధానులై విష్ణునిగను, రజోగుణప్రధానులై బ్రహ్మగను, తమోగుణప్రధానులై యీశ్వరునిగను ప్రకాశించుచున్నను వేఱు వేఱునుదకపాత్రలలోఁ గనఁబడుసూర్యునివలె నేకమైనవారు; మన్మథుని కంటె నూఱుకోట్లధికమైనరూపముకలవారు; శతపథబ్రాహ్మణమను యాజ్ఞవల్క్యశాఖీయులబ్రాహ్మణభాగమందు చెప్పబడినయుపాసనలచే తెలిసికొనఁదగినవారలు; గొప్పయతీశ్వరులయొక్క మనస్సునన్నెల్లప్పుడు ప్రకాశించువారు; గొప్పవిచారములను బోఁగొట్టువారు; గొప్పప్రభువులు. ఇట్టిమిమ్ము నేను బొందెదను.' ఇట్లాదివ్యపురుషుఁడు రాముని కీర్తింప నతఁడు మిక్కిలిసంతోషమునుబొంది 'నీవు విష్ణుఁడనగు నా యొక్కయుత్తమస్థానమును బొందు' మని సెలవిచ్చెను. అప్పుడు వాడు విష్ణురూపమును బొంది యాతనిలోకమునకు బోయెను.

అప్పుడు లక్ష్మణుడు చేతులుజోడించుకొని రామునితో "నాయెడమభుజ మదరుచున్నది. నామనస్సుచలించుచున్నది. నాకు కొన్ని దుశ్శకునములు కనిపించుటచే భయము కలుగుచున్నందున జాగ్రత్తగనుండగోరెదను. 'వంచులక'మను పక్షిపలుకులనుబట్టి మనకు జయము నిశ్చయమని తోచుచున్న"దని పలికెను. ఇట్లు రామలక్ష్మణులు వనమున నొకక్రోసుదూరము వెదకుచు బోవుచుండ పెద్దగాలి యాకాశమున శబ్దముచేయునటుల నావనమున పెద్దధ్వనిపుట్టెను. కొంతదూరమున వారికి నొకపొదరింటివద్ద క్రూరరాక్షసు డొకడు కనబడెను. విశాలమగువక్షముగలవాడును, తలలేనివాడును, కడుపులో ముఖముగలవాడును, నగ్నిజ్వాలవలె ప్రకాశించుచునదియు, విశాల మైనదియు, బాగుగ గనబడునదియునగు నొకకన్ను నుదుటియందుగల వాడును, పెద్దపర్వతమువలె నెత్తైనవాడును, నీలమేఘమువంటి కాంతి గలవాడును, మేఘమువలెధ్వనిచేయువాడును, కబంధుడనుపేరుగల వాడునునగు నారాక్షసుడు పెద్దకోఱలుగలిగి పెద్దయెలుగుబంట్లు, సింహములు మొదలగు జంతువులనుదినుచు, పెదవులను నాకుకొనుచు నుండెను. వాడు 4 క్రోసులదూరమువ్యాపించు విశాలమగు తనబాహువులను జాపి కొన్ని మృగములనుబట్టి తినుచుండెను; కొన్నిటిని విడుచుచుండెను. వాడు రామలక్ష్మణులువెళ్లుత్రోవలో నడ్డముగనుండెను. వాడు తనచేతులను జాపి రామలక్ష్మణులను బట్టుకొనెను. తేజోవంతులగువారు ఖడ్గములను, గొప్పధనస్సులనుబట్టియున్నను కాలవశమున వానిచేతులలో బడిరి. అయినను రాముడు ధైర్యముతో విచారములేకయుండెను; కాని లక్ష్మణుడు ధైర్యములేకపోవుటచే విచారగ్రస్తుడై యిట్లు విలపించెను. 'నేను దైవవశమున వీనిచేతిలో బడితిని. మీరు నన్ను విడిచిన నేను వీనికి బలియయ్యెదను. మీరు సుఖముగపాఱిపొండు. శీఘ్రముగ మీరు సీతను బొందగలరని నే నాలోచించెదను. మీరు

మనపూర్వులరాజ్యమును బొంది నన్ను స్మరించెదరుగాక!' ఇట్లు లక్ష్మణుడు పలుక రాముడు 'నీవు వీరుడవు. భయమునుబొందకుము. నీవంటివా రిట్లు గొప్పవిచారమునొందగూడ'దని జవాబిచ్చెను. ఇట్లు ప్రసంగముజరుగుచుండ కబంధుడు వారిని జూచి 'పెద్దఖడ్గములను, ధనస్సులను బట్టుకొని విశాలమగు వక్షస్థలమును గలిగియున్న మీరెవరు? ఇక్కడ కేలవచ్చితిరి? ఈదేశమునకువచ్చి మీరు నాయాహారమునకు సిద్ధమైయున్నారు. మీరు జీవించుటకష్టమని తలచెద'నని పలికెను. ఈ మాటలకు రామునిముఖము వాడిపోయెను. అప్పు డతడు తనతమ్మునితో నిట్లు పలికెను. 'నాభార్యావియోగముకొఱకేగాక మనప్రాణములుపోవుటకుగూడ నీగొప్పవిపత్తు వచ్చినది. అన్నిజంతువులు కాలబలమునకు లోనై యుండును. మనము విచారముచే నెట్లజ్ఞానులమై యుంటిమో యాలోచింపుము. దైవమునకు భూతములన్నియు స్వల్పములుగ గనబడును. శూరులును, బలవంతులును, యుద్ధములో నస్త్రవిద్యను బాగుగనుపయోగించువారునుగూడ నిసుకగట్లవలె కాలవశమున నశింతురు.' ఇట్లు ప్రతాపవంతుడగు రాముడు లక్ష్మణునితో బలుకుచు తనమనస్సును దృఢపఱచుకొనెను.

కబంధుడు వారిని 'మీరు దైవయోగమున నాయాహారమునకై దొరకితిరి. మీ రెట్లు తప్పించుకొనగల' రని యడుగ లక్ష్మణుడు విచారగ్రస్తుడగు తనయన్నకు హితమగునటుల సమయోచితముగ నిట్లు పలికెను. 'ఈక్రూరరాక్షసుడు లోకమునంతను జయించి మనలనుబట్టి చంపగోరుచున్నాడు. వీనిబాహువులను మనము శీఘ్రముగ నఱకుదము. లక్ష్మణునియీసలహాను కబంధుడువిని క్రోధముతో భయంకరముగ తననోరు తెఱచి వారిని తినుటకు యత్నించుచుండ దేశకాలములను నెఱిగిన రాముడు వానికుడిభుజమును, లక్ష్మణుడు వానియెడమభుజమును కత్తులతో తెగనఱకిరి. దానితోవాడు పెద్ద

మేఘము దిక్కులందును, భూమిపైని, స్వర్గమునను ధ్వనిచేయునటుల ధ్వనిజేయుచు భూమియందుబడెను. రక్తముకాఱుచుండ వాడు దీనముతో 'మీరెవ' రని యడుగ లక్ష్మణుడు 'ఇక్ష్వాకువంశజుడగు నీతడు రాముడు. నేను వాని తమ్ముడను. మేము లేనిసమయమున నడవిలో రాక్షసు డొకడు నాయన్నభార్యను నెత్తుకొనిపోయెను. ఆమెను వెదకుటకు మేము వచ్చితి' మని చెప్పి 'నీవెవడవు? ఎందుకొఱకు కబంధునివలె హృదయమున ముఖముగలిగి విఱిగిపోయినతొడలుగలవాడవై చరించుచున్నా' వని ప్రశ్నించెను. అంతట వా డిందు్రుడు తనకు బూర్వము చెప్పినసంగతి జ్ఞాపకము తెచ్చుకొని మిక్కిలి సంతోషముతో 'మీరాకమంచిది. దైవవశమున మిమ్ములను నేను జూచితిని. నాపూర్వవృత్తాంతమును మీకు దెలిపెద' నని యిట్లుచెప్పెను.

"పూర్వము నేను సూర్యచంద్రులవలెను, నిందు్రునివలెను మంచిశరీరముగలిగి మూడులోకములందు ప్రఖ్యాతిగలపురుషుడనై యుంటిని. నే నప్పుడు భయంకరమగు నీఘోరరూపముదాల్చి యడవికి వచ్చుఋషులను నాయాసపెట్టుచుంటిని. ఒకనాడు 'స్థూలశిరు' డనుఋషి వనములో వస్తువులను సంపాదించుచుండ నేను వానిని బట్టుకొంటిని. వాడప్పుడు నన్ను కోపముతో 'క్రూరా! యీరూపముతోనే నీ వుండెదవుగాక!' యనిశపించెను. ఆశాపమెప్పుడు విమోచనమగు నని నే నతనిని ప్రార్థింప నతడు 'రాముడు నీభుజములను నఱికి నిన్ను వనములో దహించినప్పుడు నీకు పూర్వమువలె మంచిశరీరము లభించు'నని సెలవిచ్చెను. నేను మంచిసిరిగలదనువుత్రుడను. నేను గొప్పతపముజేయ బ్రహ్మసంతోషించి నాకు చిరాయువొసగెను. ఇందు్రుడు న న్నేమిచేయగల డని నేను గర్వించి యజ్ఞానముచే నాతనితో యుద్ధముచేయ నతడు తన వజ్రాయుధమును నాపై విడిచెను. నాతలయు, నా రెండుతొడలును దెగిపోయినవి. నాశిరసు

నాయుదరభాగమున బ్రవేశించెను. నన్ను జంపుమని నేనాతనిని ప్రార్థించినను నతడు 'బ్రహ్మమాటలు నిజముకావలె'నని చెప్పెను. నేను భోజనముచేయకుండ చిరకాల మెట్లు జీవింపగలనని యాతనితో విన్నవింప నాతడు నాకడుపులో ముఖమును, వాడికోఱలును, నాలుగు క్రోసులపొడుగుగలభుజములును నాకు గలుగునట్లు వరమిచ్చెను. ఈచేతులతో నేను జంతువులను బట్టుకొని భుజించుచున్నాను. 'రామలక్ష్మణులు నీభుజములను యుద్ధమున నఱికినపుడు నీవు స్వర్గమును బొందెద'వని గూడ నాతడు నాకు సెలవిచ్చెను. నేను మీరాకకొఱకు నిరీక్షించియుంటిని. ఆరామలక్ష్మణులగు మీరే వచ్చితిరి. శుభమగుగాక! నన్నితరులు చంపలేరని ఋషి నిజమును బలికియుండెను. నన్ను మీరు దహనపఱచినతరువాత మీకు మంచిసలహా యిచ్చి మీస్నేహితుడనయ్యెదను." ఇట్లు కబంధుడు తెలుప లక్ష్మణుడు వినుచుండ రాముడిట్లు పలికెను. "మేము లేనిసమయమున నాభార్యయగుసీతను రావణు డెత్తుకొని పోయెను. వాని పేరుమాత్రము నాకు దెలియును; గాని వానిరూపమును, వానినివాసస్థలమును, వానిపరాక్రమమును మే మెఱుగము. విచారములో మునిగి నీ కుపకారముచేయుమాయందు నీవు తగినకారుణ్యమును జూపవలెను. తరువాత మే మెండినకఱ్ఱలనుదెచ్చి పెద్దగోయితీసి దానిలో గఱ్ఱలనెక్కుడగవేసి నిన్ను దహనపఱచెదము. సీత నెవ డెత్తుకొనిపోయెనో నీకు దెలిసిన సవిస్తరముగ దెలుపుము." రాముని యీమాటలను కబంధుడు విని యతనితో "నాకు దివ్యజ్ఞానములేదు. ఆమె యెక్కడ నున్నదో నాకు దెలియదు. నన్ను మీరు దహించినపిమ్మట నేను నాస్వరూపమునుబొంది సీతనుదొంగిలించినవానినిగూర్చి మీకు దెలియ జేయగలవానిని జెప్పెదను. నన్ను దహింపకపోయిన నామెను హరించినరాక్షసునిగూర్చి తెలుపుటకు నాకు శక్తిలేదు. నేను

శాపమును బోరీదుటచే నాదివ్యజ్ఞానము పోయెను. సూర్యుడ_స్త మింపకుండ మీరు నన్ను గోతిలోనుంచి యథావిధిగదహింపుడు. తరువాత నారాక్షసునిసంగతి తెలియబఱచువానిని గూర్చి నేను మీకు జెప్పెదను. వానితో శాస్త్రోక్తముగ మీరు స్నేహముజేసిన వాడు సంతోషించి మీకు సహాయము చేయును. కొన్ని కారణము లచే వా డన్నిలోకములందు దిరుగుటచే మూడులోకములలోను జరుగునది వానికి దెలియక యుండదని మనవిచేసెను.

వానికోరికప్రకారము రామలక్ష్మణు లొకగోయితీసి యందు గట్టెలను జేర్చి చితియేర్పఱచి వానిశవమును దానిపైనునిచి యగ్నిని రగుల్ప నది బాగుగమండెను. వాడు జంతువులను దినుటచే మాంస కండరములు, నేతిముద్దలవంటికొవ్వు పెఱిగిన వానిశరీరము కొంచెము కొంచెముగ గాలుచుండెను. ఆచితిని శీఘ్రముగ గదలించుచు దాని నుండి మిక్కిలిసుందరుడును, నన్ని యాభరణములను ధరించినవాడును, మంచిబట్టలను గట్టుకొనినవాడును, తేజోవంతుడును, మెడయందు బ్రకాశించు పూలదండలుగలవాడునునగు నొకదివ్యపురుషుడు లేచి హంసలుమోయుచున్న తెల్లనివిమానముపై నంతరిక్షమున దేజరిల్లుచు నిలిచి రామునితో సీతనుబొందువిధ మిట్లు తెలిపెను. "లోక ములో 'సంధి విగ్రహ యాన ఆసన ద్వైధీభావ సమాశ్రయము' లనెడు నా ఉపాయములచే సర్వము విమర్శింపబడును. దురవ స్థను బొందినవాడు దురవస్థనుబొందినవానితో స్నేహముచేయును. మీకు భార్యావియోగము, రాజ్యనష్టముకలుగుటచే మీరు దుర వస్థను బొందియున్నారు. కనుక మీ రొక మంచిస్నేహితుని ముఖ్యముగ సంపాదింపవలెను. అట్లు చేయనియెడల మీకు గార్య సిద్ధియగునని నాకు తోచదు. రామా! నేను చెప్పుమాటలను వినుము. సూర్యునికుమారుడగు సుగ్రీవుడను వానరశ్రేష్ఠునిపై నింద్రుని

కనమారుడగు వాలికి రాజ్యమునుగూర్చి కోపము కలిగెను. అందుచే నతడు వానిని దేశాంతరముబంపెను. వీరుడగు నాసుగ్రీవుడు ఋశ్యమూకపర్వతము మొదలు పంపాసరోవరమువఱకు నలుగురువానర వీరులతో దిరుగుచుండును. అతడు గొప్పబలముగల తేజోవంతుడును, సత్యసంధుడును, వణకువగలవాడును, ధైర్యవంతుడును, బుద్ధిమంతుడును, పరాక్రమముగలవాడునునై యున్నాడు. సీతను వెదకుటలో నాతడు మీకు స్నేహితుడును, సహాయుడును గాగలడు. జరుగవలసినది తప్పక జరుగును. మీకు గలిగినకష్టములకు మీరు విచారము నొందకుడు. కాలక్రమ మెవ్వరును దప్పింపలేరు. మీ రిక్కడనుండి వెంటనే వెళ్ళవలెను. మీరు వెళ్ళినతక్షణమే సుగ్రీవునితో ద్రోహబుద్ధిలేనివారై యగ్నిసాక్షిగ నాయుధములయెదుట స్నేహముచేయవలెను. రామా! యాతడు కృతజ్ఞుడును, కోరినరూపమును ధరించువాడును, సహాయముగోరువాడును, బలముగలవాడును గాన మీరాతని నవమానింపకూడదు. అతడు కోరినకార్యమును మీరిద్దఱు జరుపగలరు. దానిని మీరుచేసినను జేయకపోయినను మీకార్యము నతడు జరుపును. ఆతడు వాలితోగలవిరోధముచేతను, వానియందలి భయముచేతను దిరుగుచుండును. కనుక మీయాయుధములతో మీరతనితో సఖ్యముచేయుడు. అతడు రాక్షసులుండు నన్నిప్రదేశములకు పూర్తిగ వెళ్ళగలడు. సూర్యకిరణములు ప్రసరించులోకములలో నాతనికి దెలియనిదేదియులేదు. ఆతడు తన వానరులచే విశాలమగు కొండలను, కొండగుహలను వెదకించి సీతను మీ కప్పజెప్పును. అతడు గొప్పశరీరముగల వానరులను బంపించి యన్నిదిక్కులను వెదకించి సీత రావణునిపట్టణమున పవిత్రముగనున్నసంగతిని దెలిసికొనును. ఆమె మేరుశిఖరమున నున్నను, పాతాళముననున్నను నతడు రాక్షసులను జంపి పవిత్రముగనున్న యామెను మీ కప్పజెప్పును." ఇట్లు

కబంధుడు పలికి వారికి ఋశ్యమూకమునకు బోవుత్రోవను నిట్లు తెలిపెను.

"మీకు త్రోవ పశ్చిమముగనున్నది. అక్కడమంచిపండ్లుగల నేరేడు, మామిడి మొదలగువృక్షములుండును. వానిఫలములను మీరు భుజింపుడు. ఆవనమును దాటినతరువాత మఱియొకవనముకలదు. దానిలో నన్ని ఋతువులందు ఫలించువృక్షములుండును. అక్కడగూడ మీరు ఫలములను భుజింపుడు. తరువాత మీరు కొన్ని దేశములను, వనములను, కొండలను దాటవలెను. తరువాత మీకు పంపాసరస్సుకనబడును. ఋషులు మొదలగువా రక్కడ నివసింతురు; కిన్నరులు తిరుగుచుందురు; వివిధములగు చెట్లుండును. ఆసరస్తీరమున మాలతీలతలు, మల్లెతీగలు, మొగలిపొదలు, చంపకము, ఖర్జూరము మొదలగు చెట్లును, పర్వతముమధ్యను మామిడి మొదలగుచెట్లును, కొండచరియలలో చందనము మొదలగు చెట్లునుగలవు. అవి మిక్కిలిపెద్దవిగనుండి పూవులతోనిండి యాపుష్పములను భూమిపై వెదజల్లుచుండును. చెట్లపై లతలు ప్రాకియుండును. హంసలు, చక్రవాకములు, క్రౌంచపక్షులు, నీటికాకులు మొదలగునవి యాసరస్సున గూయుచుండును. అక్కడ మీరు మంచిపక్షులను జంపి వానిమాంసమును భుజించెదరు. ఆసరోవరతీరమున యడవియేనుగులు, లేళ్లు మొదలగుమృగములను, సర్పములను మీరు చూచెదరు. ఆసరస్సులోనుండు మంచిచేపలనుబట్టి మీరు భుజించెదరు. ఆనీరు చల్లగనుండి మీకు సుఖమును గలిగించును. లక్ష్మణుడు పద్మపత్రములతో మీకు నుదక మీయ మీరు దానిని త్రాగి సంతోషమునొందెదరు. దానిలో గాలిచే కెరటములు వచ్చుచుండును. దున్నపోతులవలెనుండి కొండగుహాలలో శయనించు పెద్దయడవిపందు లక్కడకు నీరుత్రాగుటకు వచ్చుచుండును. సాయంకాల మాసరస్తీరమున చల్లగనీచుగాలిలో దిరుగుచు మీరు విహార

మును మఱచెదరు. అక్కడ పూర్వము మతంగమహర్షి శిష్యులు తమ గురువునిమిత్తము కష్టపడుటచే వారిచెమటబిందువులు భూమిమీద బడెను. వానినుండి మాల్యములు పుట్టెను. అవి యెప్పుడును నెండిపోవు. ఆసరస్సునకు పశ్చిమముగ నాఋషియాశ్రమముగలదు. అక్కడ శబరియనుముసలిది తాపసవృత్తితో నుండి యాఋషిశిష్యులకు బరిచర్య చేయుచుండెను. వారు స్వర్గమును బొంద నామె యొక్కతెయు నక్కడనున్నది. ఆమె మిమ్ము జూచినతరువాత స్వర్గమునకు బోవును. అక్కడ గొప్పయేనుగులు చాలగనున్నను నవి మతంగాశ్రమమునకు బోలేవు. పంపాసరస్సు దాటినతరువాత బ్రహ్మచేనిర్మింపబడిన ఋశ్య మూకపర్వతముగలదు. దానిపైనుండు చెట్లన్నియు పువ్వులతో నిండి యుండును. అక్కడ నేనుగులు తిరుగుచుండును. ఆ ఋశ్యమూకపర్వ తము నెక్కుట మిక్కిలికష్టము. అక్కడ చిన్నయేనుగులు దానిని

---

అ. రా:—కబంధుడు దివ్యరూపమును బొంది రామునకు ప్రదక్షిణముచేసి నమస్కరించి భక్తిచే గద్గదభాషణములు గలవాడై పరమాత్ముడగు రాముని నిట్లు స్తుతించెను. "నామనస్సిప్పుడు మిమ్ము స్తోత్రముచేయుట కుత్సాహపడుచున్నది. మీ రాద్యంతములు లేని వారు; మనస్సుచేతనుగాని, మాటలచేతనుగాని తెలియబడనివారు. స్థూల (విరాడ్రూపము) సూక్ష్మ (హిరణ్యగర్భరూపము) రూపముల కంటె వేఱయినయీశ్వరాత్మకమగు మీసూక్ష్మరూపము యోగీశ్వరు లకుగూడ గోచరముకాదు. కంటికిగనబడుచున్న మిగిలినలోకమం తయు నాత్మకు వ్యతిరిక్తమగునదియు, జడస్వరూపమును నైయున్నది. దానికంటె వేఱగు మిమ్ము మనస్సెట్లు కనుగొనగలదు? 'బుద్ధి, బుద్ధి యందు ప్రతిబింబించుచిదాభాస' యను నీరెండును నొకటియనుజ్ఞానము 'జీవు'డనిచెప్పబడును. బుద్ధి మొదలగువానిని జూచునది పరబ్రహ్మము. వాఙ్మనస్సులకు గోచరముకానిదియు, మార్పులు లేనిదియు, సర్వ

రక్షించుచుండును. ఆపర్వతశిఖరమున నిద్రించువాడు స్వప్నములో జూచుద్రవ్యములను మఱునాడు పొందును. చెడుప్రవర్తనకలవాడును, పాపములు చేయువాడును దానినెక్కలేడు; ఎక్కినను దానిపై నిద్రించినయెడల రాక్షసులు వానినిబట్టి చంపుదురు. దానిపైనున్న యెలుగుబంట్లు, పులులు మొదలగు క్రూరజంతువులను మీరు చూచినయెడల మీవిచారమును బోగొట్టుకొనెదరు. దానిశిఖరములలో నొకదాని

---

జగత్తులో నిండియున్నదియునగు పరబ్రహ్మమందజ్ఞానముచే నంతయు నారోపింపబడుచున్నది. మీసూక్ష్మరూపమునకు హిరణ్యగర్భుడనియు స్థూలరూపమునకు విరాట్టనియు పలికెదరు. ధ్యానించువానికి శుభమునుగలిగించు మీసూక్ష్మరూపము హృదయ పుండరీకమందు ధ్యానింపదగినది. దానిని ధ్యానించువానికి భూతభవిష్యద్వర్తమానరూపమగు జగత్తంతయు దెలియబడును. ఒకదానికంటె నొకటి పదిరెట్లెక్కువగల 'భూమి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తు' అను నేడిటిచే నావరింపబడి పృథివ్యాదితేజస్సులవలన బుట్టిన యండకోశమునందున్న చతుర్దశభువనాత్మకమగు మీస్థూలదేహమునందు విరాట్పురుషరూపునిగ మీరు ధ్యానింపదగినవారు. అంతమందు నందఱికి పొందదగినవారు మీరే." ఇట్లాదిపురుషుడు రాముని స్తుతించి తరువాతనతని * విశ్వరూపమును వర్ణించి యింకను వాని నిట్లు ప్రార్థించెను. "మీస్థూలరూపమును మనస్సున నిలుపు సత్పురుషులకు నాయాసములేకుండ ముక్తి కలుగును. దానికంటె ముక్తికి సులభమగు మార్గమేదియులేదు. కనుక రామా! దేనిని ధ్యానించుటవలన ప్రేమరసము శరీరముయొక్క గగుర్పాటుతో గలుగునో యట్టిమీస్థూలరూపమును నేను సేవింతును. ఆధ్యానమే

---

* 12 వ. ప్రకరణము 23 వ. అధ్యాయము. రాముని విశ్వరూపవర్ణనము చూడుము.

మీఁద కొంచెముదిగువను నొకగుహ కలదు. దానికెదురుగ తూర్పు తోరివను నొకమంచిచెరువు కలదు. ఆగుహాలో సుగ్రీవుఁడును, నలుగురువానరముఖ్యులును నివసించుచుందురు." ఇట్లు దివ్యపురుషుఁడు రామలక్ష్మణులకు దెలిపి విమానముతో నంతరాళమున నిలువ వా రాతనికి స్వర్గమునకు బోవుటకు సెలవిచ్చిరి. అతఁడు వారితో 'మీకార్య సిద్ధికిబోయి వారితోస్నేహముచేయు'డనిపలికి వెడలెను.

---

ముక్తికి గారణము. అవిరాట్స్వరూపధ్యానమేగాక యంతకంటె సులభ మగునదియు, ధనుర్బాణములను, జటావల్కలములను ధరించినదియు, చిన్నవయస్సుగలిగినదియు, సీతాదేవినివెదకుచున్నదియు, లక్ష్మణుని తోఁగూడియుండినదియునగు నిప్పుడున్న మీస్థూలరూపమును నేనెంచు ధ్యానముచేయుదును. అదెల్లప్పుడు నామనస్సున నిలుచుఁగాక! పార్వతి తోనుండుశంకరుఁడు మీరూపము నెల్లప్పుడు ధ్యానించుచు కాశీలో మరణముగోరువారికి నెల్లప్పుడు 'రామ రామ'యనెడు తారకమంత్ర మును నుపదేశించుచు సంతోషమనస్సుతో నుండును. కనుక రామా మీరే పరమాత్ములరు. మూఢులందఱు మీమాయచే మిమ్ము నిజ ముగ గనుగొనలేరు. రామభద్రా! పరమాత్మా! పరంబ్రహ్మా! మీకు నమస్కరించెదను. జగన్నాథా! నన్ను రక్షింపుఁడు. మీమాయ నన్నావరింపకుండుగాక !" ఇట్లుదివ్యపురుషుఁడు కీర్తింప రాముఁడు "నీభక్తికి, నీస్తుతికి నేను మెచ్చితిని. యోగులుపొందు సనాతనమగు నాగొప్పస్థానమును నీవు పొందుము. నన్నెల్లప్పుడు నితరములందు మనస్సునిలుపక వేదానుసారముగ నీవు పలికినట్లు నన్ను భక్తిచే ధ్యానించుచుండువా రజ్ఞానమువలన బుట్టిన సంసారమునువిడిచి యెల్లప్పుడును సేవింపదగిన నన్ను పొందెద"రని వానికి సెలవిచ్చెను.

## ౭౪ వ. అధ్యాయము.

## రామలక్ష్మణులు శబర్యాశ్రమమున నిలిచి ఋశ్యమూకమును జేరుట.

కబంధుడు తెలియజేసినటుల రామలక్ష్మణులు వెడలుచు నా రాత్రి ఋశ్యమూకపర్వతము మొదటను శయనించి యామఱునాడుదయమున పంపానదీతీరముననున్న మతంగాశ్రమము జేరిరి. అక్కడ నుండు శబరి వారినిజూచి శీఘ్రముగ వారిపాదములకు నమస్కరించి యర్ఘ్యపాద్యముల నిచ్చెను. అంతట రాము డామెను జూచి 'నీవు విఘ్నములులేకుండ తపస్సుచేయుచున్నావా? నీవు క్రోధమును జయించి నియతాహారమును భుజించుచుంటివా? తపోనియమములను జరుపుచు సుఖముగనుంటివా? నీవు చేసినగురుశుశ్రూష ఫలించినదా?' యని కుశలమడుగ ముసలిదియు, తపస్సిద్ధిపొందినదియునగునామె యాతనియెదుట నిలిచి యిట్లు విన్నవించెను. "మీదర్శనమువలన నిప్పుడు నాతపస్సునకు సిద్ధి కలిగినది. నాతపస్సు ఫలించినది. నాగురువులు మర్యాదనొందిరి. మిమ్ము పూజించుటచే నాజన్మఫలించినది. నాకు స్వర్గములభించును. మీదర్శనముచే నేను పవిత్రురాలనైతిని. మీదయచే నేను నాశనములేనిలోకముల బొందెదను. మతంగమహర్షిశిష్యులకు నేను పరిచర్యచేయుచుంటిని. మీరు చిత్రకూటముననుండుసమయమున వారు విమానములపై స్వర్గమునకుబోవుచు 'రామలక్ష్మణులు నీయాశ్రమమునకు వత్తురు. వారిని నీవు పూజింపుము. అక్షయమైనలోకములను బొందెద'వని నాకు సెలవిచ్చిరి. పంపాతీరముననుండు వనవస్తువులను నేను మీనిమిత్తము జాగ్రత్త పఱచితిని. వానిని మీరు సేవింపుడు." ఇట్లు శబరిప్రార్థింప వారు వానిని గ్రహించిరి. సుజ్ఞానమెక్కుడుగగల యామెతో రాముడు 'మతంగఋషిప్రభావమును కబంధుడు తెలిపెను. దానిని ప్రత్యక్షముగ జూడగోరుచున్నా' నని పలుక నామె వారికి సమృద్ధిగనుండు మృగపక్షులుగలదియు, పరస్పరవైరములేని జంతువులుగలదియు, మంచి

చెట్లుగలదియునగు మతంగవనమును జూపుచు నిట్లనెను. 'ఇక్కడనే నాగురువులు యజ్ఞములజేసిరి. ఈవేదికలపైని పుష్పములను బూజించిరి. వారిప్పు డిక్కడలేకున్నను వారితపఃప్రభావముచే నవి యింకను ప్రకాశించుచున్నవి. వా రుపవాసముచే కృశించి సప్తసముద్రములకు బోవుటకు శక్తిలేక వానిని ప్రార్థింప నవియే యిక్కడకు వచ్చియున్నవి. దానిలో వారు స్నానముచేసియుండిరి. వారు తమకుపుకొనినతమనార చీరలను నీచెట్లపై వేసియుండిరి. అవి యింకను తడిగనున్నవి. వారు పూజించినపుష్పములు, పద్మము లింకను వాడకయున్నవి. ఈవనమంతయు మీకు జూపితిని. నేను వినినదంతయు మీకు దెలిపితిని. మీ సెలవుపుచ్చుకొని నే నీశరీరమును విడిచి నాగురువులు పొందిన లోకములకు బోవగోరుచున్నాను.' ఇట్లు శబరిపలుక రామలక్ష్మణులు 'ఇది నిజముగ నాశ్చర్య'మని పలుకుచు మిక్కిలిసంతోషించిరి. అప్పుడు రాము డామెకు 'నేను నీవలన భక్తితో బూజింపబడితిని. నీవు నీకోరికప్రకారము సుఖముగ బొమ్మని సెలవీయ నామె తన జటలతోను, తానుగట్టుకొనినచీరలతోను నగ్నిలోబడి దానినుండి దివ్యరూపముతో వెలువడి ప్రకాశమానమగుబట్టలను, నాభరణములను ధరించి మంచి సుగంధద్రవ్యములనురాసికొని మెఱుపువంటి మంచిశరీరముకలదై తన గురువులుండు నూర్ధ్వలోకములకు బోయెను.*

---

*అ. రా:—శబరి రామునిస్తుతింప నత డామె కిట్లు సెలవిచ్చెను. "నన్ను భజించుటకు స్త్రీపురుషవిచక్షణగాని, జాతివిచక్షణగాని, నామవిచక్షణగాని, యాశ్రమము మొదలగువానివిచక్షణలుగాని లేవు. నన్ను సేవించుటకు భక్తిమాత్రమే ముఖ్యకారణము. యజ్ఞము, దానము, తపస్సు, వేదాధ్యయనము మొదలగు సుకర్మలను జేసినను నాయందు భక్తిలేనియెడల వారికి నాదర్శనము గలుగదు. కాన భక్తిమార్గమును స్వల్పమగుమాటలతో దెలిపెదను వినుము.

తరువాత రామలక్ష్మణులు సప్తసముద్రములలోను స్నానము చేసి పితృతర్పణములను జేసిరి. అప్పుడు రాముడు లక్ష్మణునితో 'నాకు చెడుగుపోయినది. శుభము సిద్ధముగ నున్నది. అందుచే నామనస్సు సంతోషించుచున్నది. అట్టిశుభము పొడచూపుచున్నది. మనము బయలుదేఱుదము. ఋశ్యమూకమున సుగ్రీవుని జూచుటకు నాకు తొందరగనున్నది. అతనిసహాయమువలననే సీతను వెదకుటజరుగు'నని పలుక నాతడు 'నాకుగూడ తొందరగనున్న'దని యనెను. వారిద్దఱు శబర్యాశ్రమమునుండి బయలుదేఱి పంపాసరస్సుసమీపముననుండు మతంగసరస్సునకు బోయి దానిలో స్నానముచేసిరి. పంపాతీరమున నుండు వనమురమ్యముగనుండెను. అక్కడక్కడ చిన్నసరస్సులుండెను. రాముడు పంపాసరస్సును జూచి మిక్కిలి విరహవేదనను బొంది తన తమ్మునితో నిట్లు పలికెను. 'భరతుడు పట్టణమువెలుపల వ్రతోపవా

---

(1) సత్పురుషుల సహవాసము.

(2) నాకథలను బలుకుట.

(3) నాగుణములను దెలుపుట.

(4) నావాగ్రూపమగు నుపనిషత్తులయొక్క యర్థవిచారణ చేయుట.

(5) కపటములేకుండ నాచార్యుని (ఉపదేశించువానిని) నన్నుగ భావించి యతని నెల్లప్పుడు మనస్సులో నుంచుకొని సేవించుట.

(6) పుణ్యమునుజేయుబుద్ధి, యమాదులు, (హింస,దొంగతనము చేయకుండుట, ఇంద్రియములను జయించుట, దానము గ్రహింపకుండుట, ప్రాణాయామము మొదలగునవి) నియమాదులు (శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరసేవ, ధ్యానసమాధులు మొదలగునవి) గలిగియుండుట, నన్ను పూజించుటయందు శ్రద్ధగలిగి యుండుట.

సాదినియమములను గలిగియుండుటచే వానినిగూర్చియు, సీతా వియోగమునుగూర్చియు విచారించుచున్న నన్ను వసంతఋతువు మిక్కిలిగ పీడించుచున్నది. పుష్పములపైనుండి వచ్చు చల్లనిగాలి మంచిసువాసనగలదై నాకు మన్మథోద్రేకమును గలిగించుచున్నది.' ఇట్లు రాముడు మఱికొన్ని * వసంతఋతులక్షణములను తెలుపుచు నింకను నిట్లు విలపించెను. "సీతావియోగ మీఋతువున నన్ను మిక్కిలిగ పీడించుచున్నది. పూర్వము మన మాశ్రమమున నుండునప్పుడు సీత నీటికాకులధ్వని విని నన్ను బిలిచి మిక్కిలియానందముతో నుండెను. నే నామెను జూడకపోయిన నాజీవితమువలన లాభములేదు. ఈఋతు

(7) అంగదేవతా మంత్రోపాసనతోఁగూడిన నామంత్రమును జపించుట.

(8) నాభక్తులయం దెక్కువమర్యాద, అన్నిజీవులయందు భగవంతుడనగు నే నున్నానను బుద్ధి, విషయములందు కోరికలేకయుండుట, బాహ్యేంద్రియములయొక్కయు, అంతరేంద్రియములయొక్కయు నిగ్రహము గలిగియుండుట.

(9) తత్త్వమును (పరమాత్మను) నాలోచించుట.

స్త్రీకిగాని, పురుషునికిగాని, తిర్యగ్జంతువులకు గాని యీ 9 భక్తిమార్గములు గలిగినచో ముక్తిగలుగును. భక్తిగలిగినవెంట నే నాతత్త్వము తెలియబడును. ఏజన్మమునందు నాతత్త్వానుభవముకలుగునో యాజన్మయందే ముక్తిగలుగును. కనుక భక్తి ముక్తికిమార్గము. మొదటిసాధనమగు సత్పురుషులసహవాసము కలవానికి క్రమక్రమముగ మిగిలిన భక్తిమార్గములు కలుగగలవు. నీవు నాయందు భక్తికలదానవగుటచే నే నిక్కడకు వచ్చితిని. నాదర్శనమువలన నీకు తప్పక ముక్తిగలుగును." ఇట్లు రాముడు సెలవిచ్చెను.

* 1వ ప్రకరణము ౨౦ వ. అధ్యాయము. వసంతఋతువర్ణనము చూడుము.

వున నామె వాయువువీచుచుండ మిక్కిలిసంతోషముగనుండెను. ఆమెను రావణుడు హరింపకపోయినయెడల నామె నాతో మన్మథోద్రేకమున గూడియుండును. ఆమె యుండినచోట నీఋతువుండినచో నామెగూడ నావలె మిక్కిలివిచారించును; లేక ప్రాణములను విడుచును. మేమిద్దఱము పరస్పరము మనస్సును నిలుపకొనియున్నాము. నేను పద్మపత్రదళములను జూడ నాకు నామెకన్నులు స్ఫురించుచున్నవి. సీత యిప్పుడు నాకు గనబడి నాతో నివసించిన నాకు నింద్రభోగముగాని, యయోధ్యారాజ్యముగాని యక్కఱలేదు. ఈపంపాసరస్సునుండి వచ్చు వాయువు ననుభవించుస్త్రీపురుషు లదృష్టవంతులు. అదిగో! యీకాకికూత శుభమును సూచించుచున్నది. ఆమె నాకు లభించునుగాబోలు. నే నొక్కడను నయోధ్యకుబోయిన 'సీత యే'దని జనకు డడుగును. అప్పుడు నే నేమిప్రత్యుత్తర మిచ్చెదను? అయ్యో! సీతా! నీ వెక్కడనున్నావు? నీముఖమును నేను జూడకుండను, నీతో మాట్లాడకుండను నే నెట్లు ప్రాణములను నిలుపగలను? కష్టపడుచు నడవిలో నివసించినను నామె సంతోషముగ నున్నట్లు మాట్లాడుచుండెడిది. కౌసల్య 'నాకోడలే'దని యడిగిన నేనేమిపలికెదను? లక్ష్మణా! యీమెలేకుండ నేను మఱిజీవింపను. నీ వొక్కడవే యయోధ్యకు బోయి భరతునిజూడుము." రామునియీమాటలను విని లక్ష్మణు డాతని కిట్లు తగినసలహాచెప్పెను. "రామా! మీకు శుభమగుగాక! మీరు విచారమును విడిచి ధైర్య మవలంబింపుడు. మీవంటిధైర్యశాలురకిట్టిమందబుద్ధికూడదు. ఇష్టమైనవారితో మిక్కిలిస్నేహముచేసిన వారికి వారితో వియోగముగలిగిన మిక్కిలిదుఃఖముకలుగును. కనుక మీరు వియోగమువలనగలిగిన దుఃఖమును దలచి యిష్టముగలవారి యందలి స్నేహమును విడువుడు. రావణుడు పాతాళమునకు బోయినను మఱియెక్కడకుబోయినను వానికిమరణము తప్పదు. వాని వార్తను దెలిసి

కొనుడు. వాడు సీతనైన విడుచును; లేక యమపురికైన బోవును. వాడు సీతను విడువకుండ నామెతో నదితిగర్భమునజొచ్చినను వానిని జంపెదను. మీరు ధైర్యమును దెచ్చుకొని హీనబుద్ధినివిడువుడు. చెడినకార్యమును జక్కపెట్టగోరువారు యత్నముచేయకుండ దానిని జేయలేరు. ఉత్సాహమే బలమైనది. దానికంటె బలమైనదేదియు లేదు. ఉత్సాహముగలవానికి దుర్లభమైనదేదియులేదు. ఉత్సాహము గలవారు తమకార్యములలో నష్టమునొందరు. మన మట్టియుత్సాహ మును గలిగి సీతను బొందెదము. మీరు శోకమును, కామమును విడువుడు. మీరు మీగొప్పగుణములను దెలిసికొనలేకున్నారు.”

ఇట్లు లక్ష్మణుడు రాముని నోదార్చ నతడు శోకమోహములను విడిచి ధైర్య మవలంబించెను. వారు వనములను చిన్ననదులను, కొండగుహ లను జూచుచు పంపానరోవరముదాటిరి. వారు దానికి దక్షిణమున నుండు ఋశ్యమూకపర్వతమును సమీపించునప్పుడు సుగ్రీవుడు వారి యద్భుతశరీరములను జూచి మిక్కిలిభయమును, విచారమును బొంది యేమియు దలంపక నిలిచెను. వానియనుచరులగు హనుమంత నళ నీల తారలుగూడ భయమును జెందిరి.

ఓమ్.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# విశోధిత రామాయణము.

## 9 వ ప్రకరణము. కిష్కింధచర్య.

### ౧ వ. అధ్యాయము.

### రామలక్ష్మణ సుగ్రీవులసమావేశము.

రామలక్ష్మణు లాయుధములను ధరించి పంపాసరస్సుప్రక్కను నుండ వారిని సుగ్రీవుడును, వానియనుచరులును జూచి భయమును జెందిరి. సుగ్రీవుడు వారితో 'ఇదిగో! వీరు మాయవేషము వేసికొని నారచీరలను ధరించి వాలిచే బంపబడి'రని యనెను. అంతట వారందఱు ధనుర్ధరులగు రామలక్ష్మణులను జూచి ఋశ్యమూకపర్వతము నుండి యాప్రక్కనున్న మలయపర్వతమునకు చెట్లను విఱుచుచు పరుగెత్తుకొనిపోయిరి. దానితో నక్కడనున్న జంతువులకు భయముకలిగెను. తరువాత వారందఱు మలయపర్వతమున జేతులను మోడ్చుకొని సుగ్రీవుని చుట్టు జేరిరి. వారిలో బుద్ధిమంతుడును, పూజ్యుడును నగు హనుమంతు డాతనిజూచి యిట్లనెను. "మీరు వాలిని గూర్చి భయమును విడువుడు. ఈఋశ్యమూకమలయపర్వతములందు వాలివలన భయములేదు. వా డిక్కడకు రాలేడు. మీశాఖామృగభావము స్పష్టమైనది. మీరు చంచలచిత్తముగలవారగుటచే మనస్థిమితములేక సంగతులను బాగుగ దెలిసికొనలేకున్నారు. మీరు

బుద్ధిని, గొప్పజ్ఞానమును, నింగితములను (అభిప్రాయములను దెలుపు వ్యాపారములను) నుపయోగించి ప్రవర్తింపుడు. అజ్ఞానము కలరాజు ప్రజలను బాలింపలేడు." ఇట్లు హనుమంతుడు పలుక సుగ్రీవు డాలోచించి యిట్లనెను. "దీర్ఘబాహువులు, నిడుదనేత్రములు గలవారును, విండ్లను, బాణములను, ఖడ్గములను బట్టినవారును, దేవతుల్యులునునగు వారినిజూచి యెవరు భయము నొందరు? రాజుల కనేకులగు మిత్రు లుందురు. వారివిషయమున విశ్వాసమును, నోర్పును నొందగూడదు. వీరిని వాలిపంపెనని నే ననుమానించితిని. శత్రువులు కపటరూపము లనుదాల్చి యమాయకులగు తమశత్రువులలోపములను గనిపెట్టి వారిని జయింతురు. వాలి రాజకార్యములలో గొప్పబుద్ధిమంతుడు. రాజులు శత్రువులను మడియించుటలో ననేకోపాయములు దెలిసిన వారు. వారిని సామాన్యులు కనిపెట్టుదురు. నీవు సామాన్యరూపమును దాల్చి వారియొద్దకుబోయి వారిరూపము, మాటలు, వ్యాపారము మొదలగువానివలన వారిని, వారియభిప్రాయమును గనిపెట్టి వారు మంచిమనస్సుతోవచ్చినయెడల వారిని స్తుతించుచు మనయెడల విశ్వాసము గలవారిగ చేయుము. వా రీవనమునకేలవచ్చిరో కనుగొనుము. నీవు వారితో మాట్లాడి వారిమనస్సెట్టిదో తెలిసికొని వారి మంచి చెడ్డలను కనుగొనుము." ఇట్లు సుగ్రీవుడు హనుమంతుని నాజ్ఞాపింప నత డట్లే యని యతనికి నమస్కరించి రామలక్ష్మణు లుండుచోటు నకు ఋశ్యమూకమునుండి యెగురుచు బోయెను.

హనుమంతుడు తనవానరరూపమును విడిచి రామలక్ష్మణులను దెలిసికొనుబుద్ధితో సన్యాసిరూపమును బొంది వారలకు నమస్కరించి వినయముగ మంచిమాటలతో వారల నిట్లు వర్ణించెను. "మీరు రాజర్షులతోను, దేవతలతోను సమానముగనున్నారు. తపస్సుచేయుచు జటలను, నారచీరలను ధరించి గొప్పనియమములతో నున్న మీరు

బంగారు తేజస్సుగలిగి ధైర్యవంతులై గొప్పవక్షస్థలములతో ప్రకాశించు చున్నారు. సింహముచూపులవంటిచూపులను, బలపరాక్రమములను గలిగినమీరు మంచిరూపవంతులుగనున్నారు. ఏనుగుతొండమువంటి బాహువులుగల మీరు గొప్పరాజ్యమును పాలించుటకు దగినవారు. పద్మపత్రములవంటి నేత్రములుగల మీరు దేవలోకమునుండి దిగిన సూర్యచంద్రులవలె నున్నారు. మీకు మిక్కిలియుత్సాహముకలదు. మీభుజములు విశాలమ్ములై పెద్దగదలవలె నున్నవి. బాగుగనలంక రింపబడదగిన మీబాహువులకు నలంకారములేలలేవు? మీరు లోక ముల నన్నింటిని రక్షింప సమర్థులుగనున్నారు. మీరు లోకములను నిర్మించినవారివాలె గనబడుచున్నారు. మీరు భూభారమును తప్పించుటకును, భక్తులను పాలించుటకును మాయామానుషరూప మును దాల్చిన క్షత్రియులవలె గనబడుచున్నారు. మీరు జగత్తును సృష్టించి, పోషించి, నాశనముచేయగలిగిన నరనారాయణులవలె నున్నారు. అందఱిహృదయములందునుండు పరమాత్మవలె స్వతంత్రు లుగనున్నారు. మీరు పట్టినధనస్సులు బంగారుతో నలంకరింపబడిన యింద్రధనస్సులవలెను, నిండ్రునివజ్రాయుధమువలెను నున్నవి. మీ యమ్ములపొదులు తీవ్రమగుబాణములతో నిండియున్నవి. బంగా రుతోనలంకరింపబడిన మీఖడ్గములు మిక్కిలిపొడుగుగనున్నవి. మీరు నిట్టూర్పులుదీయుచు నలసటపొందినవారివలె గనబడుచున్నారు. మీరీ దేశమునకేలవచ్చితిరి? ఇక్కడ జంతువులు మిమ్ములను జూచి భయ మొందుచున్నవి." ఇట్లు హనుమంతుడు విన్నవింప రామలక్ష్మణులు దానికిప్రత్యుత్తర మీయలేదు. అంతట వాడు 'మీరుసమాధాన మేల యియ్య'రని పలికి వారితో నింకను నిట్లు విన్నవించెను. "సుగ్రీవుడను పేరుగల వీరుడగు వానరరాజొకడు కలడు. అతడు వానియన్నచే నవ మానమునుపొంది జగత్తంతయును దిరుగుచున్నాడు. అతడు నన్ను బంప

నేను వచ్చితిని. నే నతనియనుచరుడను; వాయుపుత్రుడను; హనుమంతు డను పేరుగలవానరుడను. వీనితో సుగ్రీవుడు సఖ్యము చేయగోరు చున్నాడు. వానికి మేలుచేయుటకై నే సన్యాసివేషమును బొంది ఋశ్యమూకపర్వతమునుండి వచ్చితిని.” ఇట్లు హనుమంతుడు పలికి యూరకుండెను. ఈమాటలను విని రాముడు మిక్కిలిసంతోషముగల ముఖముతో తనప్రక్కనున్న లక్ష్మణునితో నిట్లనెను. “నేను చూడ గోరినవాడును, కపిరాజును, మహాత్ముడునునగు సుగ్రీవునిమంత్రి యీతడు. నీ వితనితో మంచిమాటలను స్నేహయుక్తముగ బలు కుము. ఈతనిమాటలుచూడ నన్ని వేదములు తెలిసినవాడును, వ్యాకర ణము బాగుగనెఱిగినవాడును పలికినమాటలవలె నేమియు నపశబ్ద ములు లేకయున్నవి. ఈతనిముఖమందును, కంఠమందును, నుదుటి యందును, కనుబొమలయందును, శరీరములోని యన్నియవయవ ములందును లోపము లేవియుగానరావు. ఈతనిమాటలు స్పష్టముగను, ననుమానము, తొందర లేకుండగను, ననుకూలమగు కంఠస్వరము తోను నున్నవి. ఈతడు మధురములగు సంస్కృతపుమాటలతో మన స్సునకింపగునటులను, శుభముగను బలుకుచున్నాడు. ఇట్టిమాటలను బలికిన నెవనిమనస్సునకైన సంతోషము కలుగును. ఇట్టివాడు రాజునకు దూతయయ్యేనేని యతనిరాజకార్యము లేలసిద్ధినొందక యుండును?” ఇట్లు రాముడు సెలవీయ లక్ష్మణుడు హనుమంతునితో ‘సుగ్రీవుని గుణములను మే మిదివఱలో వినియుంటిమి. మే మతనికొఱకు వెదకు చున్నాము. అతనియాజ్ఞప్రకారము నీవు చెప్పినమాటలన్నియు జరి పెద’మని వానికి తగినట్లు పలికెను. ఆవానరుడు దానికి మిక్కిలి సంతోషమునొంది సుగ్రీవుడు వాలినిజయింపవలె ననునుద్దేశమును తనమనస్సులో నిడుకొని రామలక్ష్మణులతో స్నేహముచేయగోరి రామునికార్యముసఫల మగుననియు, సుగ్రీవునికార్యముగూడ జరుగ

గలదనియు తనమనస్సులో నాలోచించెను. తరువాత హనుమంతుడు రాముని 'మీరిద్దరు ఘోరమగు నడవికి నేలవచ్చితి'రని యడుగ నతడు లక్ష్మణునితో 'వానికి నుత్తరమిమ్ము'మని చెప్పెను. లక్ష్మణుడు తమ సంగతంతయు వానికి స్పష్టముగ దెలుపుచు తాము సీతతో వనవాసము చేయుచుండ తాము లేనిసమయమున కామరూపుడగు రావణు డామెను నెత్తుకొనిపోయెననియు, నామెయుండుచోటు తమకు దెలియుటలేదనియు, సమర్థుడగు సుగ్రీవునకు నారాక్షసునిసంగతి తెలియునని కబంధుడు చెప్పెననియు దెలిపి యిట్లు పలికెను. "నే నంతయు నిజము బలికితిని. నేనును, రాముడును సుగ్రీవునిశరణుబొందితిమి. లోకనాథు డగు నీరాము డింతకు బూర్వము యాచకులకు, బ్రాహ్మణులకు ద్రవ్యము లనేకము లిచ్చి కీర్తిబొందెను. ధర్మిష్ఠుడును, సీతనితండ్రియు నగు దశరథుడు తన్నెనేకరాజులు శరణుబొంద వారికి తగినమర్యాద జరిపెను. అట్టివానిపుత్రుడును, సన్నిలోకములకు శరణీయదగినవాడును, దయతో ప్రజల కెందఱికి గొప్పసౌఖ్యములను జేకూర్చువాడును, ధర్మాత్ముడునునగు నీరాముడు మిక్కిలివిచారముననుండి సుగ్రీవుని శరణుబొందెను. కనుక నాతడు రామునియందు మిక్కిలిదయచూపవలెను." ఇట్లు లక్ష్మణుడు కన్నీరువిడుచుచు బలుక హనుమంతు డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. 'ఇట్టిగొప్పబుద్ధిమంతులును, క్రోధమును, నింద్రియములను జయించినవారునునగు మిమ్ము సుగ్రీవుడు ముఖ్యముగ దర్శింపవలెను. మీరు దైవయోగమునవచ్చితిరి. సుగ్రీవుడుకూడ తన రాజ్యమును గోలుపోయి తనయన్నయగు వాలితో విరోధమునొంది వానిచే మిక్కిలియవమానము నొందినాడు. ఆవాలిచే వానిభార్య హరింపబడినది. అతడడవిలో దిరుగుచున్నాడు. అతడును, మేమందఱమును సీతను వెదకుటలో మీకు సాహాయ్యముచేసెదము.' ఇట్లు హనుమంతుడు స్పష్టమును, మృదువునునగుమాటలను బలికి 'సుగ్రీవుని

యొద్దకు వెళ్లుడ'మని పలికెను. లక్ష్మణుడు వాయుపుత్రునకు తగిన మర్యాదజరిపి రామునితో 'ఇతడు చెప్పినట్లు జరిగినయెడల సుగ్రీవుడును, మీరును మీమీకార్యములను జరిపించుకొనిన వారగుదురు. ఈవీరుడు మిక్కిలిసంతోషముగ బలుకుచున్నాడు. ఈతడబద్ధమాడ' డని పలికెను. తరువాత హనుమంతుడు సన్యాసిరూపమును విడిచి తన వానరరూపమును దాల్చి తనవీపుపైని రామలక్ష్మణులను గూర్చుండ బెట్టుకొని ఋశ్యమూకపర్వతమున కెగిరెను. అక్కడనుండి యతడు దానిసమీపముననున్న మలయపర్వతమున కెగిరెను.

తరువాత హనుమంతుడు రామలక్ష్మణుల నొకచోట నునిచి తాను భిక్షుకరూపమునుధరించి సుగ్రీవుడుండుచోటికి బోయి వానికి వారివృత్తాంతమంతయు దెలిపి 'రాముడు సత్యవిక్రముడు; గొప్ప పరాక్రమముగలవాడు. ఆరామలక్ష్మణులు నీతో సఖ్యముచేయ వచ్చినా'రని చెప్పెను. అప్పు డావానరశ్రేష్ఠుడు భయమును విడిచి మంచిమనుష్యరూపమును దాల్చి వారుండుచోటికి నెదురుగవచ్చి ప్రేమనుజూపుచు రామునితో నిట్లనెను. "మీరు ధర్మమును బాగుగ జరుపువారు; పరాక్రమవంతులు; అన్నిజీవులయెడ దయగలవారు. మీగుణము లాంజనేయుడు నాకు సరిగ దెలిపెను. మహాప్రభో! వానరుడనగు నాతో మీరు సఖ్యముచేయుట నాకు గొప్పలాభదాయకమును, గొప్పసత్కారమును నగును. మీరు నాతో చెలిమిచేయు గోరినయెడల నిదిగోనాచేయి. మీచేతితో దీనిని బట్టుకొనుడు. ఇదియే శాశ్వతమైన మనమైత్రికి గారణమగును." ఇట్లు సుగ్రీవుడు పలుక రాముడు మిక్కిలిసంతోషించి తనచేతితో వానిచేయి గట్టిగ బట్టుకొని గాఢముగ వానిని కౌగిలించుకొనెను. అప్పుడు హనుమంతుడు భిక్షుకరూపమును విడిచి తన నిజరూపమును దాల్చి రెండుకట్టెలను దెచ్చి యగ్నినిమండింపజేసి పువ్వులతో దానిని పూజించి దాను

సుగ్రీవుల మధ్యనుంచెను. వారు దానికి ప్రదక్షిణముచేసి యగ్ని సాక్షిగ మిత్రులైరి. వారొకరి నొకరు సంతోషముతో జాలసేపు చూచుకొనినను వారికి తృప్తికలుగలేదు. అప్పుడు సుగ్రీవుడు రాముని తో 'మీరు నాకు మిత్రులైతిరి. సుఖదుఃఖములలో మనమనిప్పాక టిగ నుండవలయు'నని పలికి యొకగుగ్గిలపుకొమ్మను విఱిచి తెచ్చెను. దానిపై వారిద్దఱును గూర్చుండిరి. హనుమంతుడు చందనపుచెట్టు కొమ్మను విఱిచి లక్ష్మణుడు కూర్చుండుటకు వేయ నాతడు దానిపై గూర్చుండెను. అప్పుడు సుగ్రీవుడు రామునితో నిట్లు పలికెను. 'నాయన్నయగువాలితో నాకు విరోధము వచ్చినది. అతడు నా రాజ్య మును, నా భార్యను హరించెను. నే నతనికి జడిసి యీవనమున తిరుగు చున్నాను. వాని వలన నాకు భయములేకుండునటుల మీరు చేయుడు.' ఇట్లు సుగ్రీవుడు పలుక తేజోవంతుడును, ధర్మము తెలిసినవాడును, దయాళుడునునగు రాముడు చిఱునవ్వునవ్వుచు వానితో నిట్లనెను. 'స్నేహితున్కి కుపకారముచేయుటయే విధి. నీభార్యను హరించినవాలిని జంపెదను. తేజోయుక్తములగు నీతీవ్రబాణములను జూడుము. ఏనిని వానిపై వేయ వాడు నశించును. వాని నిప్పుడేచంపెదను.' ఇట్లు రాముడు పలుక సుగ్రీవుడు మిక్కిలిసంతోషించి 'మీదయవలన నేను నాభా ర్యను, రాజ్యమును బొందెదను. వాలినిజంపుమార్గమును మీ రాలో చింపు'డని విన్నవించెను. ఇట్టిసమయమున వాలిరావణులయెడమనేత్ర ములును, సీతయెడమనేత్రమును నదరెను.

---

## ౭ వ. అధ్యాయము. రామసుగ్రీవులప్రసంగము.

రామసుగ్రీవులు సఖ్యమునుబొందినపిమ్మట నావానరశ్రేష్ఠు డగు సుగ్రీవుడు తనకష్టములను నాతనికి దెలిపి తరువాత నిట్లనెను.

"మీరు వనమునకు వచ్చినకారణమును, మీరులేనిసమయమును జూచి సీతను రావణుడు జటాయువునుగొట్టి యెత్తుకొనిపోవుటయు హనుమంతుడు నాకు దెలిపెను. భార్యావియోగదుఃఖమును మీరు స్వల్పకాలములో విడిచెదరు. ఆమె పాతాళలోకములోనున్నను, నాకాశమున నున్నను నే నామెను వెదకి మీ కప్పగించెదను. నేను చెప్పిన మాటను నిజమనినమ్ముడు. మీభార్య విషముకలిసిన భక్ష్యమువంటిది. ఆమెను నింద్రాదిదేవతలైనను తమవశము చేసికొనజాలరు. మీరు శోకమును విడువుడు. మీభార్యను నేను తెచ్చెదను. నేనును, నాలుగురు వానరముఖ్యులును నీపర్వతశిఖరమునుండి 'రామా! రామా! లక్ష్మణా!' యని యేడ్చుచున్నయొకస్త్రీని క్రూరకర్ముడగు నొకరాక్షసుడు తన తొడపైఁ గూర్చుండబెట్టుకొని తీసికొనిపోవుచుండ నామెను జూచితిమి. ఆమెయే సీతగాఁబోలు. మమ్ముల నామె చూచి తనపైనున్నచీరలో బంగారు నలంకారములను మూటగట్టి క్రిందబడవైచెను. దానిని మేము భద్రపరచితిమి. మీరు పోల్చుటకు దానిని దెచ్చెదను." అని సుగ్రీవుడు పలుకగ రాముడు 'వెంటనే తీసికొనిరమ్ము. ఏలవిలంబము చేసెదవు' యనెను. అంతట వాడు దట్టమైనచీకటిగల యొకగుహలోఁ బ్రవేశించి యలంకారములుగట్టినచీరను దెచ్చి రామునికిఁ జూపించెను. అతఁడు దానిని బట్టుకొని కండ్లంటనీరు తెచ్చుకొని 'హా! ప్రియా!' యని ధైర్యమును విడిచి భూమిమీదబడెను. తరువాత నాతఁడు తన హృదయమున దానినుంచుకొని రోషముతో పామువలె బుసకొట్టుచు నిట్టూర్పువిడుచు ప్రక్కనున్నలక్ష్మణునిఁజూచి 'లక్ష్మణా! సీతవిడచిన యీయలంకారములను, నుత్తరీయమును జూడుము. భూమిమీదను విడువబడిన యీభూషణములు తమపూర్వస్వరూపమును విడువలేదని విలపించెను. ఆమాటలకు లక్ష్మణుడు 'ఆమె కేయూరములను, కుండలములను నే నెఱుగను. నే నెల్లప్పుడు నామెపాదములకు నమస్కరించు

చేయుటచే నామెకాళ్ళయందెలనుమాత్ర మెఱుగుదు'నని ప్రత్యుత్తర మిచ్చెను. తరువాత రాముడు సుగ్రీవుని దీనముగ జూచి యిట్లుప్రశ్నించెను. "క్రూరరాక్షసు డామెను నేదేశమునకు దీసికొనిపోవుచుండ నీవు చూచితివి? వా డెక్కడ నివసించును? వాడు సీతను హరించి నాకు గొప్పవ్యసనమును,రోషమును గలుగజేసెను. కావున నేను రాక్షసుల నందఱిని నాశనము చేసెదను. వానిమరణము సిద్ధముగ నున్నది. సుగ్రీవా! వాడెవడో చెప్పుము. వానిని జంపెదను." ఇట్లు రాముడు ప్రశ్నింప సుగ్రీవుడు కండ్లంటనీరు తెచ్చుకొని గద్గదస్వరముతో నిట్లు విన్నవించెను. "వాడుండుచోటు నాకు తెలియదు. వానిపరాక్రమమునుగాని, వాడుపుట్టినచెడుకులమునుగాని నే నెఱుగను. సీత మీకు లభించునటుల నేను ప్రయత్నము చేసెదను. రావణుడును, వారివంశమువారును నశించునటులను, నాపౌరుషమువ్యక్తమగునటులను, మీరు సంతోషించునటులను నేను చేసెదను. మీరు దైన్యమును విడిచి ధైర్యమవలంబింపుడు. ఇట్టి స్వల్పవిషయములో విచారము మీవంటి వారికి తగదు. భార్యను హరించుటచేగలిగిన గొప్పదుఃఖము నాకు గూడగలిగినను నేనుధైర్యమునువిడువను. నేనుసామాన్యవానరుడనయ్యు నామెనుగూర్చి విచారింపను.మహాత్ములును, ధైర్యవంతులును, బాగుగ దెలిసినవారునునగు మీవంటివారు విచారించుటయేల? మీరు ధైర్యమును బొంది కన్నీరులేకయుండుడు. విచారము కలిగినపుడును, ధననాశనముకలిగినపుడును, భయముకలిగినపుడును, ప్రాణముపోవుసమయము వచ్చినపుడును తనబుద్ధి నుపయోగించుధైర్యశాలి నాశనము నొందడు. అజ్ఞానుడగు మనుష్యుడు దైన్యమునుబొంది నీటిలో బరువుతో బాగుగనిండినపడవవలెనుండును. నేను మీకు నమస్కారము చేసి స్నేహముచే ప్రార్థించుచున్నాను. మీరు పౌరుషము నాశ్రయించి విచారమునకు నవకాశ మీయకుడు. విచారముకలవారికి సుఖ

ముండదు; తేజముక్షీణించును. కాన మీరు విచారింపగూడదు. శోకముగలవానికి ప్రాణభయముగూడగలుగును. శోకమువిడిచి కేవలముధైర్యమునుదెచ్చుకొనుడు. నేను స్నేహభావముతో హితమును జెప్పుచున్నాను. కాని మిమ్మాజ్ఞాపించుటలేదు. నామాటవిని విచారము నొందకుడు." ఇట్లు సుగ్రీవుడు పలుక రాముడు తనబట్టతో కన్నీరు తుడుచుకొనెను.

తరువాత రాముడు సుగ్రీవుని కౌగిలించుకొని 'మంచిస్నేహితుడు చేయవలసిన .దానిని నీవు చేసితివి. ఇటువంటిసమయమున నీవంటిస్నేహితుడు దొరకుట కష్టము. ఆక్రూరరాక్షసుని, సీతను వెదకుటకు ప్రయత్నము చేయుము. నేనేమిచేయవలయునో దానిని నాకు లెస్సగదెలుపుము. నేను చెప్పినదంతయు నిజమనితలంపుము. నేనసబద్ధము పలికి యుండలేదు. ఇటుపైనిపలుకను. నేను సత్యముగ ప్రమాణము చేయుచున్నా' నని పలుక నామాటలను సుగ్రీవుడును, వాని మంత్రులును విని మిక్కిలిసంతోషించిరి. తరువాత రామసుగ్రీవులు వేఱుగనొకచోటికి బోయి వారిసుఖదుఃఖములనుగూర్చి మాట్లాడుకొనిరి. రామునిమాటలను విని సుగ్రీవుడు తనకార్యము నెఱవేఱినట్లు తలచి సంతోషముతో లక్ష్మణునియెదుట రామునితో నిట్లనెను. "మంచిగుణములుగల మీరు నాకు స్నేహితులగుటచే నేను దేవతలకుగూడ ప్రియుడనైతిని. ప్రభువా! మీసహాయమువలస దేవతల రాజ్యముకూడ నాకు లభించును. అట్టిచో నారాజ్యమునాకుదొరకుట యెంత! రఘువంశజులగు మీతో నగ్నిసాక్షిగ నేను మైత్రిజేయుటచే మాబంధువులలోను, స్నేహితులలోను నేను పూజ్యుడనైతిని. నేనును మీకు దగినమిత్రుడనని క్రమముగ మీరు తెలిసికొందురు. నాగుణములను నేను పొగడుకొనగూడదు. మహాత్ములును, పరిపక్వముబొందిన మనస్సుగలవారునునగు మీవంటియాత్మజ్ఞానులకు ప్రేమయు, ధైర్యము

శాశ్వతముగనుండును. మిత్రులన్యోన్యము తమబంగారమును, వెండిని, బట్టలను, నలంకారములను వేఱువేఱుగ దలంపరు. ధనవంతుడైనను, దరిద్రుడైనను,సంతోషముగలవాడైనను,దుఃఖముకలవాడైనను,నిర్దోషియైనను,దోషముగలవాడైనను మిత్రునకు మిత్రుడేగతి. అట్టి మిత్రుడు తనస్నేహితునికొఱకు ధనమునైనను,సుఖమునైనను, ప్రాణములనైనను విడుచును." సుగ్రీవునియీమాటలను లక్ష్మణు డక్కడ నిలిచియుండ రాముడు విని 'అట్లే యగుగాక!' యని పలికెను. అప్పుడు సుగ్రీవుడు పువ్వులతోనున్న గుగ్గిలపుకొమ్మ నొకదానిని విఱిచి తెచ్చి దానిపై రామునితోగూడ గూర్చుండెను. హనుమంతుడు మఱియొకకొమ్మను విఱిచి లక్ష్మణుడు కూర్చుండుటకు వేసెను. రాముడు మిక్కిలిసంతోషముగనుండెను. సుగ్రీవు డతనితో స్పష్టముగ మృదువగుమాటలతో తనయన్నవలన తనకుగలిగినబాధను తిరుగ దెలుప నతడు చిఱునవ్వు నవ్వుచు 'ఈబాణములతో వాలిని వధింతు'నని చెప్పెను. ఈమాటలకు సుగ్రీవుడు మిక్కిలిసంతోషించుచు 'నేను విచారములో మునిగియున్నాను. మీరే నాకు గతి. నేను మీసఖుడనైతి' నని పలికి కన్నీరువచ్చుటచే పలుకలేక యూరకుండెను. తరువాత నతడు ధైర్యము తెచ్చుకొని కన్నీరు తుడుచుకొని రామునితో నింకను నిట్లు పలికెను. "వాలి నన్ను కఠినోక్తులాడి రాజ్యమునుండి తొలగించెను; నాభార్యను హరించెను; నాస్నేహితులను కారాగృహములో నుంచెను; నన్ను చంపుటకు గొప్పయత్నముచేసెను. అతడు కొంతమందివానరులను నన్ను జంపుటకు బంప నేను వారిని నంతము నొందించితిని. మీరు వచ్చునపుడు నేను మిమ్ము జూచి యనుమానించి మీదగ్గఱకు రాలేదు. భయము వచ్చినప్పు డందఱును భయపడుదురు. హనుమంతుడు మొదలగు నీవానరముఖ్యులు కష్టదశలోనున్న నాకు సహాయముగనున్నారు. నే నెక్కడనున్నను వీరు న న్ననుసరించియుందురు. అందుచేత నే నే

నిప్పుడు ప్రాణములను ధరించియున్నాను. నాసంగతులన్నియు మీకు సంక్షేపముగ దెలిపితిని. నాయన్నయగువాలి ప్రఖ్యాతపౌరుషముగల వాడు. వానినాశనమువలన నాదుఃఖముపోవును; నాజీవితము సుఖ వంతమైనదగును. సుఖదుఃఖములలో స్నేహితుడే గతి." సుగ్రీవుని యీమాటలను విని రాముడు 'మీవిరోధమునకు గారణమును దెలియ గోరుచున్నాను. దానిని దెలిసికొని పిమ్మట మంచిచెడ్డ లాలోచించి నీకు సుఖముకలుగు మార్గ మాలోచించెదను. మనశత్రువు బల వంతుడు. నీకవమానము కలిగినందులకు నామనస్సు కంపమొందు చున్నది. నేను విల్లునుసంధించి బాణమువిడుచునంతలో వాడు చచ్చును. నీవు సంతోషముతో సంగతులన్నియుదెలుపు'మని వానిని గోర నావానరశ్రేష్ఠుడు మిక్కిలిసంతోషించి * దుందుభికుమారుడగు మాయావి వాలిచే హతుడగుటయు, తానుకొంతకాలము రాజ్యము చేయ వాలి కిష్కింధకు వచ్చి తన్ను దేశాంతరము పంపుటయు మొదలగువృత్తాంతమును దెలిపి 'నన్నురక్షింపు'మని రాముని వేడ నతడు 'నాబాణములతో వాలిని జంపెదను. నీకు మంచిమేలు కలి గించెద'నని పలికెను.

---

## 3వ. అధ్యాయము.

### సుగ్రీవుడు రామునిబలమును పరీక్షించి వాలితో యుద్ధముచేయుటి.

తరువాత సుగ్రీవుడు రామునికి వాలిబలపౌరుషముల నిట్లు తెలిపెను. "వాలి చతుస్సముద్రములకు ప్రతిదినము వేకువజామున సంధ్యావందనమునకై వెళ్ళి సూర్యోదయముకాకుండ తిరిగివచ్చు చుండును. వాడు పెద్దచెట్లను విఱిచివేయుచుండును. పెద్దకొండలపై

* 4వ. ప్రకరణము, ౧వ. అధ్యాయము. వాలిసుగ్రీవుల 41 పుటచూడుము.

కెక్కి- వానిశిఖరములను బంతులవలెనాడుచుండును. వాడు * దుందుభిని జంపి వానిశవమును మతంగాశ్రమముపద్దకు విసరెను.” ఇట్లు సుగ్రీవు డాతనితో బలికి యాతనికి పర్వతశిఖరమువలెనున్న యాదుందుభియస్థి పంజరమును జూపెను. ఇంకను నావానరశ్రేష్ఠుడు వానికి చాల కొమ్మలుగల గుగ్గిలపుచెట్లను జూపి ‘వానిలో నొక్కొకదానిని వాలి తనబాణముతో గొట్టనవి యాకులను రాల్చును. ఇట్టియసమానమైన వీర్యముగల నాయన్నను మీరు యుద్ధములో నెట్లు చంపగల’రని యడిగెను. దానికి లక్ష్మణుడు ‘మే మేమిచేసిన నీకు వానిమరణమును గూర్చినమ్మకముకలుగు’నని పలుక నావానరశ్రేష్ఠుడు ‘దుందుభియస్థి పంజరమును రాముడొకకాలితో నెత్తి 200ధనస్సులదూరము విసరి నప్పుడును, (ధనస్సు=4మూరలు) నేను చూపినయీ 7 గుగ్గిలపుచెట్లను నొక్కొకదానిని నాతడొకబాణముతో చీల్చినపుడును నే నాతని పరాక్రమమును దెలిసికొని వానివలన వాలిచచ్చునని విశ్వసింతు’నని పలికి యొకగడియయాలోచించి తనయన్నపౌరుషమునుగూర్చి రాముని తో నిట్లు పలికెను. ‘వాలి శూరుడు; శూరులనుజంపువాడు; ప్రఖ్యాత బలపౌరుషములుగలవాడు. వానికి యుద్ధములలో నపజయములేదు. వాడనేకరాక్షసవీరులను జంపెను. వాడు దేవతలుకూడ చేయలేని పనులను చేయును. వానికి నేను జడిసియున్నాను. హిమవంతునివంటి బలముగల సన్మిత్రుడు నాకు దొరకెనన్నమాట నిజమే. మీబలము నాకు దెలియకపోయిన మీరు నాయన్నను జయింపగలుగుదురని నా కెట్లు నమ్మకము పుట్టును? మీమాటలను, మీబుద్ధిని, ధైర్యమును, రూపమునుజూచిననాకు మీరుగొప్ప తేజోవంతులని పొడగట్టుచున్నది.’ ఇట్లు సుగ్రీవుడు పలుక రాముడు చిఱునవ్వునవ్వుచు ‘మాపరాక్రమమునుగూర్చి నీకు విశ్వాసములేనియెడల యుద్ధబలమును నీకు జూపి

* 4వ. ప్రకరణము. ౧వ. అధ్యాయము. వాలిసుగ్రీవులు 41 చూడుడు.

నమ్మకముపుట్టించెద'నని పలికి తనకాలిబొటనవ్రేలితో దుందుభియస్థి పంజరమునెత్తి 40 క్రోసులదూరమునపడునట్లు విసరెను. దాని కా వానరశ్రేష్ఠుడు తనయనుమానము నిట్లు తెలిపెను. "ఇది మాంసము లేనిది; గడ్డితో సమానమైనది. నాయన్న యుద్ధములో శ్రమనొంది నను రక్తమాంసములుగలదియు, బరువుగనున్నదియునగు శరీరమును విసరెను. కాన మీయిద్దఱిలోనెవ రెక్కువబలముగలవారో చెప్పవీలు లేదు. ఒక్కొకగుగ్గిలపుమ్రానును మీరు బాణముతో గొట్టిన మీబలాబలములు నాకు దెలియును. ఈధనస్సును సరిగ సిద్ధముచేసి బాణమును విడువుడు. మీరు తప్పక చెట్టును జీల్చెదరు. నాకు నమ్మకము కలుగుటకు మి మ్మి ట్లడుగుచున్నాను. మీరు నరులలో నసమానమగు వీర్యపరాక్రమములుగలవారు." ఇట్లు సుగ్రీవుడు తెలుప రాముడు తనధనస్సును సంధించి దానినారిని ధ్వనిజేసి యన్నిదిక్కులందు శబ్దముకలుగున ట్లొకగుగ్గిలపుమ్రానుపై నొకబాణమును బలముతో విడువ నది యేడుచెట్లను జీల్చి భూమిని విదారించి తిరుగ నతని యమ్ములపొదిలో ప్రవేశించెను. సుగ్రీవుడు దీనినిజూచి గొప్పయాశ్చర్యమునుబొంది యాతనికి నమస్కరించుచు నాతనికాళ్ళమీదబడి యిట్లు వానిని ప్రార్థించెను. * 'రామా! మీ రన్నియస్త్రములు

---

* అ. రా:—రాముడు తనబాణముతో నేడుగుగ్గిలపుచెట్లను ఛేదింప సుగ్రీవు డతని నిట్లు ప్రార్థించెను. "దేవా! మీరు జగత్తునకు ప్రభువులు; పరమాత్ములరు. సంశయములేదు. నాపూర్వపుణ్యాపరంపరలచే మీతో నిప్పుడు నాకు స్నేహముకలిగినది. మహాత్ములు సంసారముతప్పిపోవుటకు మిమ్ము సేవింతురు. మోక్షమునిచ్చు మిమ్ము బొంది నేను సంసారమునేలకోరుదును? భార్యలు, పుత్రులు, ధనము, రాజ్యముమొదలగునవన్నియు మీమాయచే కల్పింపబడినవి. మిమ్ము తప్ప నితరమును నేను కోరను. మీరు నాయందు గొప్పదయ

తెలిసినవారు. ఇంద్రాదులతో గూడిన దేవతల నందఱిని యుద్ధములో మీరు జయింపగలరు. అట్టిచో వాలినిజయించు టెంత! ఇంద్రవరుణుల వంటి మీరు నాకుమిత్రులగుటచే నిప్పుడు నాశోకముపోయినది. నాకు గొప్పప్రీతికలిగినది. నేను మీకు నమస్కరించుచున్నాను. ఇప్పుడే వాలిని జంపుడు.' ఇట్లు సుగ్రీవుడు ప్రార్థింప రాముడు వానిని కౌగిలించుకొనెను. తరువాత నతడు లక్ష్మణునిసలహాపుచ్చుకొని యావానర శ్రేష్ఠునితో 'మనమిక్కడనుండి కిష్కింధకు బోవుదము. నీవు ముందుగ బోయి వాలిని యుద్ధమునకు బిలువు'మని చెప్పెను.

అందఱును తొందరగ కిష్కింధకువెళ్ళి యొకదట్టమగు నడవిలో చెట్లచాటుననిలిచిరి. సుగ్రీవుడు మంచికాసెకోకను కట్టుకొని

---

జూపుడు. మట్టికొఱకు వెదకువానికి గనిదొరకినట్లు నాయదృష్టముచే నానందముచే దెలిసికొనదగిన మీరు నాకు దొరకిరి. అనాదియగు మాయవలనగలిగిన విషయవాసనా (అనురాగము) రూపమగు బంధనము నేడు తెగిపోయినది. విషయవాసనవలనగలిగిన జననమరణ రూపమగు సంసారము యజ్ఞము, దానము, తపస్సు, ఇష్టాపూర్తములు (క్రతువులు, హోమదానాదులు, చెరువులుమొదలగువానిని త్రవ్వించుట.) మొదలగుమంచికర్మలవలననైనను నశింపదు; గాని యది తిరుగతిరుగ దార్ఢ్యమునేపొందును. మీపాదదర్శనముచే జ్ఞానముగలుగును. దానివలన విషయవాసనపోవును. అది పోయినవెంటనే సంసారము నశించును. ఒకయఱనిమిషమైనను చంచలము లేనిమనస్సును మీయందు నిలిపినవానికి ననర్థములకు మూలకారణమగు నజ్ఞానము తత్క్షణమే నశించును. ఇతరములందు నామనస్సెప్పుడును నిలువకుండ మీయందే నిలుచుగాక! 'రామ! రామ!' యనుమాటలను నొకక్షణమైనను పలుకువానిని బ్రహ్మహత్య, సురాపానము మొదలగు గొప్ప పాపములు విడుచును. రామా! నేను జయమునుగాని, భార్యా

పెద్దబొబ్బపెట్టెను. దానిని వాలి విని క్రోధము తెచ్చుకొని నగరు నుండి బయలువెడలెను. ఆకాశమున బుధునకును, సంగారకునకునువలె వారిద్దఱికి ఘోరమగు యుద్ధముజరిగెను. అఱచేతులతోను, పిడికిళ్ల తోను నొకరినొకరు క్రోధముతో గొట్టుకొనిరి. అప్పుడు రాముడు కొంతదూరమునుండి వారినిజూచి యాయిరు లిద్ద అశ్వనీదేవతలవలె నొక్కరూపముగనుండుట కనిపెట్టి సుగ్రీవుని, వాలిని వేఱువేఱుగ గుర్తింపలేక తాను విడువనిశ్చయించుకొన్న బాణమును విడుచుట కిష్ట పడలేదు. అంతట వాలిచే సుగ్రీవుడు దెబ్బలుపడి నిలువలేక రాముడు కనబడకుండుట జూచి శరీరమంతయు దెబ్బలచే రక్తమయమై చిల్లులు పడియుండ ఋశ్యమూకపర్వతమునకు బాఱిపోయెను. వాలి వానిని

---

సౌఖ్యము మొదలగువానినిగాని కోరను. నాసంసార బంధనమును తెగగోయు మీయందలిభక్తినే నేను కోరెదను. మీమాయచే సంప్రాప్తించినసంసారముగల నేను మీయంశభూతుడనే. మీపాదభక్తి నాకుపదేశించి నన్ను సంసారకష్టములనుండి తొలగింపుడు. మీపాద దర్శనముకంటె పూర్వమందు మీమాయచే నావరింపబడినమాయ గలవాడనగుటచే నాకు 'వీడు మిత్రుడు. వీడు శత్రు' వనెడి భావన గలిగినది. ఆభావన మీపాదదర్శనమువలన పోయి 'సర్వము బ్రహ్మయే' యనుభావన దృఢమైనది. ఇక నాకు మిత్రుడు, శత్రు వెక్కడ? ఎంత వఱకు మీమాయవలన బంధనముండునో యంతవఱకు ముఖ్యముగ సత్త్వరజస్తమోగుణములు కలుగును. ఎంతవరకు సత్త్వాదిగుణము లుండునో యంతవఱకు శత్రుమిత్రాదిభావముండును. ఎంతవఱకు శత్రుమిత్రాదిభావముండునో యంతవఱకు మృత్యుభయముండును. కనుక కోరికతో కర్మలనాచరించువాడు జననమరణరూపమగు సంసారములో మునిగిపోవును. పుత్రులు, భార్యమొదలగువానిని గలుగ జేయు మీదాసియగు మాయను తొలగించి మీపాదకమలములందు

వెంబడించెను; గాని శాపభీతిచే నక్కడకు వెళ్లక 'తప్పిపోయితి'వని పలికి కిష్కింధకు మఱలెను. తరువాత రామలక్ష్మణులును, హనుమంతుడును సుగ్రీవుడుండుచోటునకు బరుగెత్తుకొనివచ్చిరి. వాడు సిగ్గుచే తలవంచుకొని భూమిని జూచుచు రామునితో "మీరు మీపరాక్రమమును నాకు జూపి శత్రువును పిలువుమని పలికి వానిచే నేను దెబ్బలు తినునట్లేల చేసితిరి? మీరు 'నేను వానిని జంప'నని మొదట తెలిపియుండిన నే నిక్కడనుండి కదలకయుండియుందునుగదా!" యని పలుక నాతడు దయతో వాని కిట్లనెను. 'సుగ్రీవా! నామాట విని కోపము మానుము. నేను బాణము విడువనందులకు కారణముదెల్పెదను. మీఝులంకారములు, వేషములు, నడక, యెత్తు, స్వరము, రంగు, చూపులు, పరాక్రమము, మాటలు, రూపము నొకతీరుననుండుటచే మిమ్ము పోల్చలేక యనుమానించి శత్రుని జంపు ఘోరమగుబాణమును వేయలేకపోయితిని. నీవు కష్టముపొందుచున్నప్పుడజ్ఞానముచే నే నిట్లు చేసితిని. అభయమిచ్చి వానిని వధించుట యను

---

నామనస్సునిలుచునటులను, నావాక్కుమీనామమును కీర్తించునటులను, నాచేతులు మీభక్తులను సేవించునట్లును, నాశరీరము మీశరీరముతో కలిసికొనునటులను, నాకండ్లు మీమూర్తులను, మీభక్తులను, నాగురువులను నెల్లప్పుడు చూచుచుండునటులను, నాచెవులు మీజన్మము మొదలగు కర్మలను వినుచుండునటులను, నాపాదములు మీమందిరములకు వెళ్లుచుండునటులను, నాయవయవములు మీపాదధూళితో గూడిన పుణ్యతీర్థములలో మునుగునటులను, శివుడు, బ్రహ్మమొదలగువారు మ్రొక్కిన మీపాదములను నాశిర మెల్లప్పుడు మ్రొక్కుచుండునటులను ననుగ్రహింపుడు." ఇట్లు సుగ్రీవుడు ప్రార్థింప రాముడు వానిని కౌగిలింప వానిపాపములన్నియు నశించెను. అప్పుడు రాముడు

నది గొప్పపాతకము. నేనును, లక్ష్మణుడును, సీతయు నీయడవిలో నివశమైయున్నాము. నాయందనుమానములేక నీవు తిరుగ యుద్ధము చేయుము. అప్పుడు వాడొకబాణముచే జచ్చును. మీరిద్దఱు యుద్ధము చేయునపుడు నిన్ను నేను పోల్చుటకు చిహ్న మేదేని యుండవలెను. లక్ష్మణా! యీ గజపుష్పమనెడి లతనుదెచ్చి సుగ్రీవుని కంఠమున దండగా గట్టుము.' ఇట్లు రాముడు పలుక లక్ష్మణు డట్లు చేసెను. ఆలత వానికంఠమున నుండ వాడు నక్షత్రమాలచే బ్రకాశించు చంద్రునివలె ప్రకాశించెను. వారందఱు కిష్కింధకు వెళ్ళుటకు బయలుదేఱిరి.

రాముడు బంగారముతో నలంకరింపబడిన ధనస్సును, సూర్యవర్చస్సుగల బాణములను బట్టుకొనెను. ముందు సుగ్రీవుడును, లక్ష్మణుడును నడచిరి. తరువాత రాముడును, వాని వెనుక హనుమంత నళనీల తారులును నడచిరి. వారు దారిలో మంచిచెట్లను, నదులను, కొండగుహలను, కొండశిఖరములను, పద్మములు మొదలగుపుష్పములతోనిండిన చెరువులను, జలపక్షులను, లేళ్ళను, మదించినపక్షులను జూచుచు శీఘ్రముగ బోయిరి. కొంతదూరము వెళ్ళినతరువాత వారికి మంచిచెట్లును, వానితరువాత నరటిచెట్లునుగనపడెను. అప్పుడు రాముడు సుగ్రీవుని జూచి 'ఆకాశమునందలిమేఘములవలె నట్టముగనున్న

---

తనకార్యసిద్ధికొఱకు మోహమునుగలుగజేయుమాయను వానికి మిక్కిలిగ గలిగించి వానితో నిట్లు పలికెను. "సఖుడా! నీవు నాతోపలికినదంతయు నిజమేకాని ప్రజలు 'రాముడు సుగ్రీవునితో నగ్నిసాక్షిగ స్నేహముచేసి వాలినివధించి రాజ్యమిచ్చెదనని ప్రతిజ్ఞచేసి యట్లు చేయకుండ తత్త్వోపదేశముచేసి రాజ్యమందు వైరాగ్యముగలవానిగ జేసెనని యపవాదములు పలుకుదురు. కనుక నీవు పోయి వాలిని యుద్ధమునకు బిలువుము. నీకు శుభమగును. ఒక్కబాణముతో నేను వాలిని జంపి నీకు రాజ్యాభిషేకము చేసెదను." ఇట్లు రాముడు పలుక సుగ్రీవుడు దానికొప్పుకొని కిష్కింధదగ్గఱనున్న వనమునకు వెళ్లెను.



యీాయరటిచెప్పుమి?'యని యడుగ వాడు నడచుచు వానితో నిట్లు పలికెను. "ఇది మంచియుద్యాన వనములుకలదియు, మంచినీళ్లు, దుంపలు కలదియు నగు నొకయాశ్రమము. ఇక్కడ నేడుగురు ఋషులు తలక్రిందుగ నీటియందు జపించుచుండిరి. వారు 7దినములకొకసారి వాయువునుభక్షించి * యనేక సంవత్సరములు జీవించి శరీరములతోగూడ స్వర్గమున కరిగిరి. వారిప్రభావముచే నింద్రాదిదేవతలైనను నీయాశ్రమమున బ్రవేశింపవీలులేదు. పక్షులు, వనజంతువులు దీనిలోనికి వెళ్లవు. ఇందులోనికి వెళ్ళినవారక్కడనే నశింతురు; గాని తిరిగిరారు. ఇక్కడ నప్సరసస్త్రీలు నృత్యముచేయు నపుడు వారియలంకారస్వనములును, వారిగాన స్వరములును వినబడును. ఇక్కడనుండి మంచి సువాసనలు బయలుదేఱుచుండును. మూడగ్నులు కూడ వెలుగుచుండును. వానిపొగచే చెట్లకొనలు తెల్లగ నుండును. రామా! మీాయన్నదమ్ము లిద్దఱిక్కడ నమస్కారముచేయుడు. ఈఋషులకు నమస్కరించువారికి శరీరపీడ లేమియు కలుగవు." ఇట్లు సుగ్రీవుడు పలుక వారట్లు చేసిరి. తరువాత వారును, వానరులును సంతోషముగ చాలదూరము పోవ కిష్కింధ వారికి కనపడెను.

* ఇక్కడ నుపయోగింపబడిన సంస్కృతములోని 'శత' శబ్దమునకు ననేక సంవత్సరములని 7వ. ప్రకరణము ౮వ. అధ్యాయమున చర్చించితిమి.

అందఱు రెండవసారి యానగరమునకు బోయి దట్టమగు నడవిలో చెట్లచాటున నుండిరి. సుగ్రీవుడు బాలసూర్యునివలె బ్రకాశించుచు మదించినసింహమునలె నడచెను. వాడు రాముని 'మీరు వాలివధగూర్చి ప్రతిజ్ఞచేసితిరి. దానిని శీఘ్రముగా నెఱవేర్పు'డని వేడ నతడు వానితో నిట్లనెను. "లక్ష్మణుడు గజపుష్పమాలను నీమెడను వైచెను. ఇప్పుడే నీశత్రువైరమును, భయమును విడువుము. నేనొక బాణముతో వానిని గొట్ట వాడు క్రిందపడి ప్రాణములనువిడుచును. నాకు కనబడి వాడు జీవములతో తప్పిపోయిన నామొగమును నీవు చూడకుము. అప్పుడు నీవు నన్ను నిందింపవచ్చును. నాబలమును నీవు పరీక్షించితివి. నేను కష్టదశలోనున్నను నబద్ధమాడలేదు. ధర్మలోపముకలుగునను భయముచే నే నన్నృతమెప్పుడును పలుకను. నాప్రతిజ్ఞను నేను నెఱవేర్చుకొని నీకోరికను దీర్చెదను. నీవు వాలికొఱకు బొబ్బలిడుము. నిన్నిదివఱలో జయించినందులకు వాడు తనబలమునుగూర్చి పొగడుకొనుచు శీఘ్రముగ సంతోషముతో యుద్ధమునకు వచ్చును. శూరులు యుద్ధమున తమశత్రువులవలన గలిగినపరాభవమును సహింపలేరు." ఇట్లు రాము డుపదేశింప సుగ్రీవుడు వాయువు బాగుగవీచుటచే బయలుదేఱు పెద్దకెరటములుగలసముద్రమువలె గొప్పశబ్దము చేసెను. దానితో పశువులు మిక్కిలిభయము నొందెను. అడవిజంతువులు పరుగెత్తెను. పక్షులు నేలమీదపడెను.

సుగ్రీవునిధ్వనులను రాజనగరులోనున్న వాలి విని క్రోధము తెచ్చుకొని రోషముతో నుండెను; కాని వానిపూర్వపు తేజస్సు కొద్దిగ తగ్గియుండెను. వాడు తొందరగ నడుగులు భూమిమీద వేయుచు యుద్ధమునకు బయలుదేఱుచుండ వానిభార్యయగు తార వానిని కౌగిలించుకొని వానియందలిస్నేహముచే కంగారుతో "మీక్రోధమిప్పుడు విడువుడు. రేపటియుదయమున మీరు యుద్ధముచేయవచ్చును. సుగ్రీ

వునకున్న సహాయమును, నందువలన గలిగిన వానిసంతోషమును మీకు దెలియదు. వాడు పూర్వము మీవలనదెబ్బలను తిని పాఱిపోయి తిరిగి మిమ్మిప్పుడు యుద్ధమునకు బిలుచుచున్నాడు. అందుచే వానికి సాహాయ్యమున్నదని నే ననుమానించెదను. కావున మీరు వానితో యుద్ధముచేయుటకు బోగూడదు. వానిగర్వమును, ప్రయత్నమును మీరు స్వల్పముగ నాలోచింపకుడు. దానికి గొప్పకారణముండి యుండును. వాడు గొప్పసాహాయ్యముతో వచ్చెనని నే నూహించెదను. వాడు స్వతస్సిద్ధముగ నేర్పరి; బుద్ధిమంతుడు. వాడు మఱియొకరి బలపరాక్రమములను బరీక్షించి యాతని దీసికొనివచ్చియుండును. అంగదకుమారుడు వనమునకు వెళ్లి నక్కడ వానికి చారులు 'శూరులును, యుద్ధములో జయింపశక్యముకానివారును, నిక్ష్వాకుకులములో బుట్టినవారును, నయోధ్యాధిపతియగుదశరథునిపుత్రులునునగు రామలక్ష్మణులు ఋశ్యమూకపర్వతమునకువచ్చి సుగ్రీవున కుపకారము చేయుట కొప్పుకొని'రని తెలిపిరి. వాడు నాతో నీసంగతి నిదివఱలో జెప్పెను. మీతమ్మునికి సహాయుడగు రాముడు శత్రువులను జయించువాడు; యుద్ధములో నసమానవీరుడు. అతడు సాధువులకు కల్పవృక్షమువంటివాడు. ఆశ్రయించినవారికి నుత్కృష్టమగు గతి; దీనులకాశ్రయుడు; అసమానమగుకీర్తికలవాడు; జ్ఞానవిజ్ఞానములుకలవాడు; తండ్రియాజ్ఞచొప్పునప్రవర్తించినవాడు; సుగుణనిధి. యుద్ధములో నసమానుడగు నామహాత్మునితో మీకు యుద్ధముతగదు. మి మ్మవమానించుటకు నేను చెప్పుచుండుటలేదు. నేను చెప్పినదానిని విని మీరు తగినట్లాలోచింపుడు. సుగ్రీవునకు మీరు తక్షణమే యౌవరాజ్యమిచ్చి వానితో యుద్ధముమానుడు. మీరు రామునితోను, వానితోను స్నేహభావముతో నుండుడు. మీతమ్ముని మీరు లాలనచేయుడు. వా డెక్కడున్నను మీకు సన్నిహితబంధువే. మీకు వానితోసరి

యగు బంధువు లేడు. మీరు వానికి తగినమర్యాదసలిపి మీయొద్ద నుంచుకొనుడు. వాడు మిమ్ములను బంధువుగ తలచుచుండును. మీరు మీతమ్మునిమీద ప్రేమజూపుడు. మీరింతకంటె చేయవలసినదేదియు లేదు. నేచెప్పినది మీ కిష్టమున్నయెడల నేనుచెప్పినట్లు చేయయత్నింపుడు. మీరు నేను చెప్పినమంచిమాటలను విని రోషమును విడిచి రామునితో యుద్ధముమానుడు. నేనింతగ జెప్పినందులకు నన్ను క్షమింపు"డని మంచిమాటలను పలికెను.

* వాలి యామెమాటలను దిరస్కరించి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. 'నాశత్రువు గర్జించుచుండ నేను సహింపలేను. గొప్ప శూరులు శత్రువులభీకరారావములసహనమును మరణముకంటె నెక్కువగ నాలోచింతురు. తారా! నీవు విచారింపవలదు. ధర్మజ్ఞుడును, కృతజ్ఞుడునునగు రాముడు తనతోవైరములేనినన్ను జంపి పాపమేల మూటకట్టుకొనును. నీవును, నంతఃపురస్త్రీలును నగరులోనికి వెళ్లుడు. నాయందలి మీస్నేహమునకును, మీభక్తికిని నేను మెచ్చితిని. నేను సుగ్రీవునితో యుద్ధముచేసి వానిగర్వమును నణచెదను. కాని వాని

*అ. రా:—తార సుగ్రీవునితో యుద్ధమువలదని వాలిని నివారింప నత డిట్లుప్రత్యుత్తరమిచ్చెను. 'రాముడు లక్ష్మణునితో వచ్చియుండిన వారితో నాకు స్నేహము తప్పక కలుగును. నారాయణుడు భూభారమును బోగొట్టుటకై రాముడై యవతరించెనని పూర్వము నేను వినియుంటిని. ఆపరమాత్మునికి స్వపక్షపరపక్షములులేవు. అతని పాదకమలములకు నేను నమస్కరించి యాతనిని మనయింటికి దీసికొని వచ్చెదను. అతనిభజించువారికి నతడు తిరుగ దయజూపును. ఆదేవతాశ్రేష్ఠుడు భక్తిచే బొందదగినవాడు.' ఇట్లు ప్రత్యుత్తరమిచ్చి 'వాడు నన్ను యుద్ధమునకు బిలుచుచుండ నేను వానికి యౌవరాజ్యమొసగి చ్చెద' నని పలికెను.

ప్రాణములను హరింపను. నేను పిడికిళ్ళతో వానిని పొడిచి చెట్లతో మొత్తిన వాడు తిరిగి వెళ్లిపోవును. నీవు మఱలుము. నాప్రాణముల బట్టి నేను శపథము చేసెదను. నేను నాతమ్ముని యుద్ధములో జయించి తిరిగివచ్చెదను.' ఇట్లు వాలి పలుక తార వానిని కౌగిలించుకొని యేడ్చుచు మెల్లగ వానికి ప్రదక్షిణముచేసి మంత్రములతో స్వస్తి వాచకముల జదివి యంతఃపురస్త్రీలతో గూడ నగరునకు వెళ్లెను. వాలి రోషముతో బయలుదేఱి నలుదిక్కుల సుగ్రీవునికై చూచెను. ఆతడు తనతమ్మునిజూచి తనబట్టను గట్టిగబిగించి తనపిడికిళ్ళను వానికి జూపెను. వాడుకూడ తనపిడికిళ్లియెత్తెను. వాలి వానితో 'ఈపిడికిటితో నీప్రాణములదీసెద'నని పలుక వాడు 'ఈపిడికిటితో నేను నీతలమీద గొట్ట నీప్రాణములుపోవు'నని యనెను. వాలి వానిని పిడికిటితో బొడువ వానిశరీరమునుండి రక్తముకాఱెను. వాడు వేఱుగనున్న గుగ్గిలపుచెట్టునొక దానిని పెఱికి తెచ్చి యాతనిశరీరమున గొట్ట నతడు బాధనొందెను. వారిద్దఱొకరిలోపమునొకరు, వెదకుచు నాకాశమునందు సూర్య చంద్రులవలె నొప్పుచు చెట్లతోను, గోళ్లతోను, పిడికిళ్ళతోను, చేతుల తోను యుద్ధముచేసిరి. అంతకంతకు వాలిబలపరాక్రమములు హెచ్చుగుచుండెను. సుగ్రీవునిబలము క్షీణించుచుండెను. నలుదిక్కులను జూచుచున్న సుగ్రీవుని రాముడు బాగుగజూచెను. పిమ్మట నతడు వాలిని వధించుటకు ధనస్సునందు తీవ్రమగునొక బాణమును సంధించి నారిని బట్టుకొని లాగ నాశబ్దముతో పక్షులుభయమొందెను. మృగములు పరుగెత్తెను. వజ్రముతోను, పిడుగులతోను సరియగు నాతీవ్రబాణమును నతడు విడువ నది వాలివక్షస్థలమునతగిలెను. *ఆదెబ్బతో రక్తము వఱదలై పాఱ వాడు తెగినయింద్రధ్వజమువలె భూమిమీదబడెను.

---

* అ. రా:—రాముడు పెద్దచెట్టుప్రక్కను వాలికి గనబడకుండ నిలిచి వానిపై బాణమును విడిచెను.

## ౮. వ. అధ్యాయము. వాలిరాములసంవాదము.

రాముని బాణముతో వాలి భూమియందు బడినను నింద్రు డిచ్చిన బంగారుకంఠమాలను వాడు ధరించియుండుటచే వానిదేహ మును తేజస్సు, పరాక్రమము, ప్రాణములు, శోభయు విడువలేదు. శరీరము, కంఠమాల, రామునిశరము నను మూడువిధములగు తేజ స్సుతో వాడు ప్రకాశించెను. ఆబాణము తగులుటవలన వానికి స్వర్గ మును, ముక్తియు గలిగెను. ఇట్లు యుగాంతమున భూమిమీదబడు సూర్యునివలె నున్నవాడును, మహేంద్రునివలెదుర్జయుడును, గొప్ప మేఘధ్వనికలవాడును, నింద్రపుత్రుడునునగు వాలిని రామలక్ష్మ ణులుచూచి వానియొద్దకు వెళ్లిరి. వాడు వారిని జూచి వినయ మునను, కఠినముగను, ధర్మశాస్త్రానుసారముగను నిట్లు పలికెను. "'రామా! మీరుమంచికులములో జన్మించినవారు; గొప్పబలము, మంచితేజస్సు గలవారు; మంచి ప్రవర్తనగల రాజపుత్రులు. నేను మఱియొకనితో యుద్ధముచేయుచుండ మీరు నావక్షస్థలముపై బాణముతో గొట్టి నన్ను జంపుటవలన మీకు మంచిగుణమేమికలి గెను? మీరు కరుణగలవారనియు, ప్రజలకు మేలుచేయుటయందాసక్తి గలవారనియు,మంచినడవడిక,దృఢనియమము గలవారనియు, ధర్మాత్మ లనియు నందఱు పలుకుదురు. తార నన్ను యుద్ధమునకు బోగూడ దని నివారించి నిజముపలికినను నేను మీరాజగుణములను, గొప్పదగు మీవంశమును నాలోచించి సుగ్రీవునితో పోరు సలిపితిని. నాకు కాలము సమీపించెను. నాకు మీదర్శనము గాకపోవుటచే నేనొక రితో యుద్ధముచేయుచుండ మీరు నాతో పోరుసలుపుదురని నే నను కొనలేదు. మీరు కృత్రిమమగు నాత్మగలవారనియు, పైకిధర్మమాచ రించుచున్నట్లగుపడి యన్యాయముగసంచరించెదరనియు, పైకిముని

వేషమును ధరించి పాపపుపనులు చేయుదురనియు నే ననుకొనలేదు. మీపట్టణమునకుగాని, మీ దేశమునకుగాని మీకుగాని నే నేవిధమైన యపకారము చేసియుండలేదు. మిమ్ముగూడ నే నెప్పుడును జూచి యుండలేదు. వనములో ఫలములు, దుంపలు మొదలగువానినిదిని తిరుగుచు పాపముచేయక పై వానితో యుద్ధముచేయుచున్న వానరుడనగు నన్ను మీ రెందుకొఱకు బాణముతో గొట్టితిరి? విద్యావంతుడును, ధర్మసందేహములుతీర్చుకొనినవాడుననగు నేక్షత్రియుడు పైకిధర్మము గలవానిగ గనబడి యీవలె క్రూరపుపనులను జేయును? మీరు మనుష్యులు; రాజులు. మేము వనమృగములము. విరోధమునకు గారణములగు భూమి, బంగారు, వెండి మొదలగు వివాదములేమియు మనకు లేవు. అడవిలో మానిమిత్తము మీకు లోభమేమి కలదు? నీతియు, శిక్షయు, మైత్రియు, విరోధము నను రాజనీతులు పరస్పరవిరుద్ధములైనవి కావు. రాజులు స్వేచ్ఛావిహారముగ జరింపగూడదు. కోరికయే ప్రధానముగాగలిగి యమర్యాదగ ప్రవర్తించి గొప్పకోపముతో రాజవృత్తులకు వ్యతిరేకముగా ధనస్సును, బాణములను బట్టి ధర్మార్థములందు గౌరవబుద్ధిలేక మీ రపరాధము చేయనినన్ను బాణముతో గొట్టితిరి. సత్పురుషులసభలో నీక్రూరకర్మకు మీరేమని జవాబుచెప్పెదరు? నేను బ్రహ్మహత్యాపాతకములనుగాని, గొప్పపాపములను గాని, చేయలేదు. నాచర్మముగాని, మాంసముగాని, యెముకలుగాని యెవరికి నుపయోగింపవు. నేను మాంసమున కుపయోగించు 'ఏదుపంది, ముళ్లయేదుపంది, కుందేలు, కూర్మము, ఉడుము' అను నీయైదుపవిత్రజంతువులలోనివాడను కాను. నన్నుచంపుటచే నా రాజ్యము నాథుడులేనిదైనది. రహస్యముగ నపకారముచేయువాడును, నధర్మప్రవర్తనుడును, నీచుడును, నక్రమపుపనులు చేయువాడును, పాపుడుననగు నీవంటిపుత్రుని దశరథున కెట్లు జన్మిం

చెను? ఉదాసీనముతోనున్న నాయందు మీప్రతాపమును జూపించితిరి. మీ కపకారముచేసిన శత్రువుల నేమియు చేయలేకపోయితిరి. మీరు నాయెదుటపడి నాతో పోరాడిన నేను మిమ్ము యమపురికి బంపియుందును. సుగ్రీవునిమేలుకొఱకు నన్ను జంపితిరి. సీతనుగుఱించి మీ రిదివఱలో నాతో జెప్పియుండిన నొక్కదినములో నామెనుదెచ్చి మీ కప్పగించియుందును. ఆమె సముద్రమధ్యమందున్నను, పాతాళ మందున్నను నామెను వెదకితెచ్చి మీ కప్పగించియుందును. రావణుని గూడ యుద్ధమున జంపిగాని వానిమెడకు త్రాడుగట్టి మీయొద్దకు నీడ్చుకొనివచ్చిగాని మీ కప్పగించియుందును. నామరణాంతమున సుగ్రీవుడు రాజ్యముబొందుట న్యాయమైయుండును; గాని నన్ను జంపుట యన్యాయము. జంతువు లెప్పుడును కాలమునకు లోనై యుండును. మీరు రహస్యముగ నన్ను జంపుటయనునది యుక్తమైనదియు, నుత్తమ మైనదియు నైనయెడల ముందుసంగతి నాలోచింపుడు.” ఇట్లు వాలి పలికి యూరకుండెను.

ఆవానరరాజుమాటలను విని రాముడు వానికి ధర్మ ముపదే శించుబుద్ధితో నిట్లు పలికెను. “నీవు ధర్మమును, నర్థమును, కామ మును, నాచారమును, లోకవ్యవహారములను మూఢబుద్ధితో దెలి యక నన్నేల నిందించెదవు? బుద్ధిమంతులను, సదాచారము తెలిసిన వారిని, వృద్ధులను నడిగి తెలిసికొనక యజ్ఞానునివలె పలుకుచున్నావు. కొండలు, అడవులు మొదలగువానితోగూడిన యీజగత్తంతయు నిక్ష్వాకువంశస్థులది. మృగపక్షులను, మనుష్యులను బాలించుటయు, శిక్షించుటయు వారిపనియైయున్నది. ధర్మాత్ముడును, సత్యముపలుకు వాడును, సత్ప్రవర్తనగలవాడును, ధర్మార్థకామముల బాగుగ నెఱి గినవాడునునగు భరతు డీలోకమును బాలించుచున్నాడు. అతనికీ సామాన్యనీతులును, ముఖ్యములగునీతులును, సత్యమును దెలియును.

పరాక్రమవంతుడును, దేశకాలధర్మము లెఱిగినవాడునునగు నాతని ధర్మాదేశములను మేము పాలించుచు ధర్మకార్యములను జరుపుచు దేశమంతయుగూడ దిరుగుచున్నాము. అట్టిధర్మవత్సలుడు భూమిని బాలించుచుండ నధర్మముగ నెవ్వడు సంచరించుచుండును? అట్లు చరించినవానిని భరతునియాజ్ఞననుసరించి ధర్మముగ శిక్షింతుము. నీవు ధర్మాచరణను వీడి కామవ్యవహారమునకు లోనై రాజకార్యములను సరిగ జరుపలేదు. పుట్టుగుడ్డివాడు పుట్టుగుడ్డివానిసలహాపై నేమియు తెలిసికొనలేనట్లు చంచలమనస్సుగలనీవు చంచలబుద్ధిగలవారును, నేమియు తెలియనివారునునగు వానరులసలహా తీసికొని యేమియు తెలిసికొనకున్నావు. లోకములో ధర్మమార్గమున జరించువారికి తమతండ్రిలేగాక జ్యేష్ఠసోదరుడును, విద్యనేర్పినగురువును గూడ తండ్రులగుదురు. వీరికి తమపుత్రులేగాక తమ్ములును, శిష్యులు గూడ పుత్రులగుదురు. కావున ధర్మముగ నీకు సుగ్రీవుడు పుత్రుడగును. వానిభార్య నీకు కోడలగును. నీవు సనాతనమగు ధర్మమును విడిచి కామముచే నామెను బొందుచున్నావు. దానికి మరణమే నీకు తగినశిక్ష. అందుచే నీ కిట్టి శిక్ష విధింపవలసివచ్చెను. ధర్మవిరుద్ధముగ జరించువారికి దండముకంటె మఱేదియుతగినశిక్ష కనబడదు. నేను క్షత్రియుడనుగాన పాపమునకు దండము విధింపకుండ నూరుకొనను. కుమార్తెను, సోదరిని, సోదరునిభార్యను కామముచే బొందువారికి మరణముకంటె వేఱుశిక్షలేదు. నాకు లక్ష్మణునియెడ నెట్టిస్నేహము కలదో సుగ్రీవునియెడకూడ నట్టి ప్రేమయే కలదు. నేను వానికి వానిభార్యను, రాజ్యమును నిప్పించుటకు వానరులయెదుట ప్రతిజ్ఞచేసి దానినె ట్లుపేక్షచేయుదును? సరియైనకారణములచే శాస్త్రసమ్మతముగ నీకు విధించిన దండన ధర్మముగ తగియున్నది. నీవు దానినొప్పుకొనవలయును. ధర్మముగజరించిన నాస్నేహితుడగు

సుగ్రీవుని కార్యమును నేను జరుపుటవలన పశ్చాత్తాపము నొందిన నీవుకూడ నిది ధర్మమైనదని యనుకొనవలెను. పాపులు రాజులవలన శిక్షనుబొంది పాపమువిడిచి పుణ్యవంతులవలె స్వర్గమునకు బోవుదురు. పాపులను దండింపని రాజు వారిపాపములను తానే పొందును. అట్లు చేసి మాపూర్వుడగు మాంధాత బాధనొందెను. రాజులు ప్రమత్తులై యుండి నిజము తెలియలేకపోయినను తరువాత విమర్శనకాలమందు పాపముసంగతి తెలిసికొని వారు తగినదండనను విధింపవలెను. అప్పుడు పాపపరిహారమగును. మేము నీవధను ధర్మమునసనుసరించి చేసితిమి. ఇష్టమువచ్చినట్లు చేయుటకు మాకు స్వాతంత్ర్యములేదు. రాజన్యులు వేటలో నెదురుగనుండియు, చాటుననుండియు ననేకవిధములగు జంతువులను మాంసముకొఱకును, చర్మము మొదలగువానికొఱకును జంపుదురు. దానివలన దోషము లేదు. నీవు శాఖామృగమవు; కాన నిన్ను జంపిన పాపములేదు. రాజులు దుర్లభమగు ధర్మమును జేయువారును, శుభమగుజీవితము నిచ్చువారును నై యున్నారు. వారు దేవాంశగలవారు. నీవు ధర్మమును దెలియక కేవలము రోషముతో ధర్మపరుడనగు నన్ను దూషించుచున్నావు.” ఇట్లు రాముడు సెలవిచ్చెను.

రాముడు పలికినయీమాటలకు * వాలి తనమనస్సున మిక్కిలి బాధనొంది యతనియందు దోషములేదని నిశ్చయించి యతనికి నమ

---

* అ. రా:—రాముడు ధర్మవాక్యములు పలుక వాలి భయముచే వణకుచు నతనిని విష్ణునిగ నెఱిగి యతనికి నమస్కరించి తొందరగ నతని నిట్లు ప్రార్థించెను. “రామా! మహాత్మా! మిమ్ము పరమేశ్వరునిగ నేను తెలిసికొనుచున్నాను. నేను తెలియకపలికినదానిని మీరు క్షమింపుడు. మీబాణపుదెబ్బచే ముఖ్యముగ మీయెదుట నాప్రాణములను విడుచుచున్నాను. మీదర్శనము మహాయోగులకు గూడ దొరకుటకష్టము. పుత్రాదిమమకారముగలవాడైనను ప్రాణ

స్కరించి యిట్లు పలికెను. "మీరు చెప్పినదంతయు నిజము. నావంటి మూర్ఖుడు మీవంటిమహాత్మునికి ప్రత్యుత్తరమీయలేడు. నేను పొరపాటుచే మిమ్ము దూషించినందులకు నన్ను క్షమింపుడు. మీరు యథార్థములను బాగుగ దెలిసికొని ప్రజలక్షేమునే కోరుదురు. ఏపాపమునకేదండనవిధింపవలెనో దానిని మీరు బాగుగ నెఱిగియున్నారు. చేయగూడనిపనులనుజేసిన నన్ను మీరు ధర్మమార్గమునరక్షింపవలెను. నావిషయమైకాని, తారనుగూర్చికాని, నాబంధువులనుగూర్చి కాని నాకు విచారములేదు. గుణశ్రేష్ఠుడును, నేమియు తెలియనివాడును, నాపుత్రుడునునగు నంగదునిగూర్చి నేను విచారించుచున్నాను. వాడు బాలుడు; నన్ను చూడనియెడల దీనుడై యెండిపోవును. నా కున్నయీయొక్కకుమారుని మీరు రక్షింపవలెను. రక్షకులును, శాసించువారునునగు మీరు చేయవలసినదానిని, చేయగూడనిదానిని నెఱుగుదురు. మీరు తగినయాలోచనచేయుచు భరతునియందును, లక్ష్మణుని

---

ములువిడుచుసమయమున మిమ్ము స్మరించినంతమాత్రమున ముక్తిని బొందుచుండ ప్రాణములువిడుచుచున్ననాయెదుట మీరే సాక్షాత్కరించినప్పుడు వేఱెచెప్పవలసినదేమున్నది? దేవా! మీరు విష్ణువనియు, జానకి లక్ష్మియనియు, మీరు బ్రహ్మచే ప్రార్థింపబడి రావణునివధించుటకు జన్మించిరనియు దెలిసికొనుచున్నాను. మీయుత్తమలోకమునకు బోవుటకు నన్ననుగ్రహింపుడు. నాతో సమానబలుడును, బాలుడును నగు నంగదునందు దయజూపుడు. మీరు నాబాణము నూడబెఱికి నా హృదయమును మీచేతితో ముట్టుడు." ఇట్లు వాలి ప్రార్థింప రాముడట్లుచేసెను. అంతట వాడు వానరరూపమును విడిచి తత్క్షణమే యిందద్రరూపమును బొందెను. ఇట్లు వాలి యితరులెవ్వరు పొందలేనిదియు, పరమహంసయతులకుగూడ దొరకనిదియునగుగొప్పపదవిని బొందెను.

యందును, సుగ్రీవునియందును మీకుగల ప్రీతిని నంగదునియందుఁగూడ జూపుడు. నేనుచేసినదోషములకు సుగ్రీవుడు తారను బాధింపక దయతోజూచుగాక! మీరుచెప్పినట్లు వాడు మీదయకులోనై రాజ్యము చేయుగాక! మీసాహాయ్యమువలన నన్నిలోకములను సెవఁడైన నేల వచ్చును; స్వర్గమును బొందవచ్చును. తార యుద్ధముచేయవలదని నన్ను నివారించినను మీవలన మరణము నొందుటకై నేను వానితో యుద్ధమొనర్చితిని." ఇట్లు వాలి పలికి యూరకుండెను. రాముడు వానిని మంచిమాటలతోను, ధర్మనీతులతోను నిట్లోదార్చెను. "నీవు దీనినిగూర్చి విచారమును బొందకుము. సోదరభార్యాపహారణమును గూర్చి తగినఫల మనుభవించితివిగాన నీవు నీయాత్మనుగూర్చి కూడ విచారమునుబొందకుము. మేము ధర్మాచరణులము. దండనార్హుడ వగు నీవు దండింపబడుటచే నుత్తమలోకములకు బోయెదవు. నీవు శోకమును, నజ్ఞానమును, భయమును విడువుము. కాలవిధితప్పదు. నీకు ప్రియుడగు నంగదుడు సుగ్రీవునకును, నాకును ప్రియుడగును." ఇట్లు రాముడు సెలవీయ వాలి 'నేను మిమ్ము తెలియక దూషించినందులకు నన్ను క్షమింపు'డని వానిని ప్రార్థించెను.

---

## ౧౯వ. అధ్యాయము.

## తారావిలాపము; వాలిమరణము.

---

వాలి రాముని నట్లు ప్రార్థించి రాళ్ళతోను, చెట్లతోను తనకు తగిలినదెబ్బలవలన తనయవయవములు విఱిగియుండ బాణపుదెబ్బచే భూమిపై బడి ప్రాణములు పోవుచుండ మూర్ఛనుబొందెను. ఈసంగతి తారకు దెలియ నామెయు, నంగదకుమారుడును పర్వతగుహాలోనున్న కిష్కింధానగరమునుండి భయముతో పైకి వచ్చిరి. అప్పటికి వానర

రులు వాలిపడియున్న చోటునుండి భయముతో పరుగెత్తుకొనివచ్చిరి. తార వారినిజూచి 'రాజ్యనిమిత్తముగదా! సుగ్రీవుడు తనయన్నను రామునిచే బాణముతో గొట్టించెను. మీ రాతనివిడిచి యేలవచ్చితి' రని యడిగెను. అప్పుడు వా రామెతో నిట్లు మనవిచేసిరి. "మనకు కష్టకాలమువచ్చినది. నీపుత్రుడగు నంగదుడు జీవించియుండ నీ విక్కడ నుండి తొలగిపోయి వానిని రక్షింపుము. రాముడు వాలిని లోకాంత రము నొందించెను. వాలి చెట్లను, పెద్దరాళ్ళనుబట్టి సుగ్రీవునితో యుద్ధముచేసెను; కాని రాము డాతనిని పనవాడిబాణముతో గొట్టెను. ఇక్కడనుండి వెళ్ళినమేమంతఱము నాతడు పడిపోవ చెల్లాచెదరై యిక్కడికి పరుగెత్తుకొని వచ్చితిమి. మనము నగరద్వారమును గాపాడ వలెను. అతనిపుత్రుడగు నంగదుడు పట్టాభిషిక్తుడుకాగ వానరులందఱు వానిని సేవించుచుండవలెను. అమ్మా! యీస్థానము మనకు శ్రేయ స్కరమైనది కాదు. సుగ్రీవునియనుచరులు మనదుర్గస్థలములను ప్రవే శించుచున్నారు. వీరు వివాహములేకయున్నవారును, వివాహమాడి భార్యలను విడిచినవారునునై యిదివరలో నెల్లప్పు డడవులలో దిరుగుచుండిరి. వీరివలన మన కెక్కువ భయముకలుగును." ఇట్లు స్వల్పకాలములో పలికినవానరులమాటలను వినక తార తనమనస్సునకు దోచిన మంచియాలోచనప్రకార మిట్లనెను. "మహాను భావుడగు నాభర్త నాశనమొంద నీకుమారునితోను, నీరాజ్య ముతోను, నాశరీరముతోను నాకేమిప్రయోజనము? రామబాణ ముచే నతడు పడియున్నచోటికి నేను వెళ్లి యాతనిపాదముల నాశ్ర యించెదను." ఇట్లు తార పలికి తనచేతులతో తలను, గుండెలనుబాదు కొనుచు తనభర్తపడియున్నచోటికి వెళ్ళెను. ఆమె రామ లక్ష్మణ సుగ్రీవులనుదాటివెళ్ళి వాలినిజూచి మిక్కిలిదుఃఖించి తొట్రుపాటుతో క్రిందపడెను. ఆమె తిరుగలేచి 'ఆర్యపుత్రా!' యని పిలిచెను. తరు

వాత నామె యాతని కౌగిలించుకొని యిట్లు విలపించెను. "మీారు యుద్ధములలో గొప్పపరాక్రమముజూపెడిగొప్పవీరులు. వానరశ్రేష్ఠా! మీారు లెండు. మంచిపక్కమీాద పండుకొనుడు. మీావంటివానరశ్రేష్ఠు లిట్టియెత్తుపల్లములుగల భూమిపై పండుకొనరు. ఇట్టిభూమిపై పూర్వము మీారు శత్రువులను జంపిరి. మీాభార్యయగు భూదేవిపై మీారు వీరస్వర్గముకై ధర్మముగ పండుకొనుటవలన నామె యదృష్టవంతురాలు. మీా రిక్కడ పండుకొనుటచే నిది స్వర్గమార్గమునకు నిర్మింపబడిన మఱియొకకిష్కింధవలె గనబడుచున్నది. మనము పూర్వము వనములలో విహరించిన స్థలము లిప్పుడు శూన్యముగ నున్నవి. సంతోషము, సంతోషముకలుగుటనవకాశము లేనిదాననై మీామరణమునుగూర్చి నేను గొప్పశోకములో మునిగియున్నాను. శోకముచే నాగుండె వేయిముక్కలుగాకుండ గట్టిగనున్నది. మీారు సుగ్రీవునిభార్యనుహరించి వానిని దేశాంతరము బంపిరి. దానిఫల మిప్పుడు మీారు పొందితిరి. నేను చెప్పినమంచిమాటలను మీారు తిరస్కరించి యుండిరి. మీారు వీరస్వర్గమునకు బోవుచున్నారు. అక్కడ రూపయౌవనములుగలిగి మంచినేర్పులుగనున్న యప్సరసల మనస్సులను మీారు స్వాధీనము చేసికొనెదరు. మీాకవసానకాలము వచ్చెను. మీారు కాలమునకు వశముగాకున్నను నిప్పుడు సుగ్రీవుని వశమైతిరి. పూర్వము నేను సుఖములనే యనుభవించుచున్నను నిప్పుడు వైధవ్యమును, శోకమువలనసంతాపమును, దైన్యమును ననాథవలె ననుభవింపవలసివచ్చినది. సుకుమారుడును, వీరుడును, సుఖమనుభవించువాడునునగు నంగదుని నేను లాలించుచుంటిని. ఇప్పుడు వాని పినతండ్రి వానిపై గోపమును జూప వాడెట్టియవస్థనుజెందును? అంగద పుత్రా! నీతండ్రిదర్శనముచేయుము. నీయెడ నాతడు మిక్కిలిదయతో నుండెను. తరువాత నాతనిదర్శనము నీకు దొరకదు. నాథా!

మీా రంగదుని తలమూర్కొని యాతని నోదార్చి యాతనికి 'దెలుప వలసినదానిని దెలుపుడు. మీా రీలోకమును విడిచివెళ్ళుచున్నారు. రాముడు మిమ్ము బాణములతో గొట్టి గొప్పకార్యమును జరిపి సుగ్రీవునియెడ తనప్రతిజ్ఞ నెఱవేర్చుకొని వానిఋణమును దీర్చికొని యున్నాడు. సుగ్రీవా! నీశత్రువు హింసనొందె నీవు నిర్భయముగ రాజ్యమును, నీభార్యయగు రుమను ననుభవించుచు నీకోర్కె నెఱవేర్చు కొనెదవు గాక! నాథా! ఇట్లు ప్రేమతో విలపించునాతో నేలపలుకరు? ఇక్కడకు వచ్చిన మీాభార్య లందఱిని జూడుడు." ఇట్లు తార విలపించుచుండ మిగిలిన వాలిభార్యలందఱు నంగదుని బట్టుకొని దుఃఖముతో నేడ్చిరి. తరువాత నామె యింకను నీతీరున విచారించెను. "ప్రియా! ప్రియపుత్రుడగు నంగదుని విడిచి వెళ్ళుట మీాకు యుక్తము కాదు. మీారు లోకాంతరము నొందుటకు మేము మీా కేమి యప్రియముల నొనర్చితిమి? నేను తెలియక మీా కయిష్టమగుదానిని జేసితినేని నన్ను మీారు క్షమింపుడు. మీా పాదములకు నమస్కరించుచున్నాను." ఇట్లు విలపించుచు తార తనసపత్నులతోగూడ వాలిని విడిచి ప్రాయోపవేశముచేయుటకు (ప్రాణత్యాగపర్యంత మాహారము లేకయుండుటకు) నిశ్చయించెను.

అప్పుడు హనుమంతుడు తార నిట్లు మెల్లగ నోదార్చెను. "జీవులు జ్ఞానాజ్ఞానములచే తాము చేయుకర్మఫలమువలనగల్గు పాపపుణ్యముల ననుసరించి యీాలోకమును విడిచినతరువాత తప్పక సుఖదుఃఖముల ననుభవించుచున్నారు. దేహము నీటిబుగ్గ వంటిది. ఎవరి స్వవిషయమై వారు విచారింప వలయును గాని యొకరి విషయమై యొకరు విచారింపనవసరము లేదు. అట్టిచో నీ వెవరిని గూర్చి యిట్లు విచారించెదవు? నీవు దీనురాలవై యేదీనునిగూర్చి దయజూపుచున్నావు? ఒకరినిగూర్చి యొకరు విచారింపకూడదు. కాన

నీ వెంతమాత్రము విచారింపవలదు. వాలిపుత్రుడగు నంగదుని జూడుము. వాలికి నీతడు చేయవలసిన యుత్తరక్రియలనుగూర్చి యాలోచింపుము. జీవులజననమరణములు స్థిరములుకావు. వాలిమరణముగూర్చి రోదనముచేయక యాతనికి పరలోకక్రియలను జరుపవలెను. వాలిదగ్గఱ ననేకవానరులు పనులను జేయుచు జీవించుచుండిరి. అట్టి యాతడు దైవయోగమున కాలధర్మ మొందెను. అతడు న్యాయయుక్తముగ వ్యవహరించుచు సామమును, దానమును, నోరిమిని జూపుచు ధర్మాత్ములవలె నంతమునొందెను. దీనినిగూర్చి నీవు విచారింపవలదు. ఈవానరశ్రేష్ఠులును, నంగదుఁడును నీవశములో నున్నారు. వానరులయు, ఋక్షులయు (ఎలుగుబంట్లరూపముకలవారు) రాజ్యము నీ భర్తది. నీవు శోకసంతాపములను మెల్లగ విడిచి యంగదునకు నభిషేకముచేయించి వానిచే రాజ్యము నేలింపజేయుము. మీకు సంతానము కలిగినందులకు వానిచే రాజునకు జేయదగిన కర్మల నాచరింపజేయుడు." ఇట్లు హనుమంతుఁడాడు నోదార్ప తార "అంగదునివంటి నూర్గురుపుత్రులపలనగల్గు సౌఖ్యముకంటె నాభర్త మరణించినను వాని నాలింగనము జేసి నిలుచుటయే నాకు మేలు. నేను కపివీరుని యనంతరక్రియలను జేయించుటకుగాని యంగదునిచే రాజ్యభారమును వహింపజేయుటకుగాని సమర్థురాలను గాను. వానిపినతండ్రియగు సుగ్రీవుడే యన్నిపనులు చేయదగినవాడు. హనుమంతా! యంగదునిగూర్చి నీవు తలంచిన యాలోచనమానుము. వానిపినతండ్రియే వానికి తగినబంధువు; కాని తల్లియెంతమాత్రముకాదు. వాలి జీవించియున్నను, పరలోకమున కేగినను నేనతని ననుసరించి యుండెద"నని పలికెను.

అంతట వాలి యల్పప్రాణములతో మెల్లగ నిట్టూర్పుదీయుచు కండ్లు తెఱచి తనకుమారునియెదుటనున్న సుగ్రీవునిజూచి వానియందలి ప్రేమచే వానిని మెల్లగబిలిచి స్నేహముతో స్పష్టముగ నిట్లనెను.

“నేను నీకు చేసినపాపకృత్యములచే నీవు నాతో మాట్లాడగూడదు; కాని ముందుచేయబోవుపనులనుగూర్చి ప్రసంగించుట ముఖ్యము. దైవయోగమున మన కిద్దఱికి చెలిమియు, సౌఖ్యములును లేవు. నేను ప్రాణములను విడుచుచున్నాను. ఈవానరాదులరాజ్యమును నీ వీదినముననే వహింపుము. నేను ప్రాణములను, రాజ్యమును గొప్ప శోభను, గొప్పకీర్తిని శీఘ్రముగ విడుచుచున్నాను. ఇట్టిసమయమున నేనుచెప్పినపనులు కష్టమైనవియైనను వానిని నీవు చేయవలెను. సుఖముగ పెఱిగినవాడును, నాప్రాణములకంటె నెక్కుడగువాడునునగు నంగదుడు భూమియందేడ్చుచు పడియున్నాడు. వాడు బాలుడైనను వివేకముగలవాడు. వానిని నీ వౌరసపుత్రునివలె జూచుకొనుము. నీవే వానికి రక్షకుడవు; దాతవు; వానికి భయముకలిగినపుడు దానిని లేకుండజేసెదవు. అన్నివిధముల నీవు వానిని బాలింపుము. వీడు నీతోసరియగు గొప్పపరాక్రమము, బలము గలిగి రాక్షసులవధించుటలో నీకు ముఖ్యుడగును. వీడు యుద్ధములలో తనవిక్రమకార్యముల జూపును. సుషేణునికుమార్తెయగు తార సూక్ష్మాంశముల పరిశీలనలోను, గొప్పవిపత్తులువచ్చినపు డాలోచనచెప్పుటలోను గొప్పది. ఆమె యేదిమంచి దని చెప్పునో దానివిషయమై యేమియనుమానము లేదు. ఆమెకు వ్యతిరేకముగ నీవు నడువకూడదు. రామునికార్యము నీవనుమానములేక జరుపవలెను. అట్లు చేయనిచో నదియధర్మమగును. అతడవమానముపొంది నిన్ను బాధించును. సుగ్రీవా! దివ్యమగునీబంగారు మాలను నీవు ధరింపుము. దీనియందు గొప్పసిరిగలదు.”

ఇట్లు వాలిపలుక సుగ్రీవుడు తనయన్నయందలి యనురాగముచే జయము వలన తనకుగలిగిన సంతోషమును విడిచి రాహుగ్రస్తచంద్రునివలె దీనుడైయుండెను. అతడు వాలియందు విరోధమువిడిచి తనయన్న కోరినట్టుల బంగారుపుమాలను పుచ్చుకొనెను. తరువాత వాలి యంగ

దునిజూచి ప్రాణముల విడుచుచు నిట్లు పలికెను. "నీవు సుఖదుఃఖము లకు లొంగక ప్రియాప్రియములను సహించుచు దేశకాలముల నెఱిగి సుగ్రీవుని నాశ్రియించియుండుము. నేనెల్లప్పుడు నిన్నాదరించినటుల వాడుగూడ నిన్ను లాలించును. వానిశత్రువుతోగాని, వానిశత్రువుల స్నేహితులతోగాని నీవు కూడక నీప్రభుకార్యములను సమర్థతతో జేయు చుండుము. నీ కెవరితోను మిక్కిలిస్నేహముగాని, స్నేహములేక పోవుటగాని యుండగూడదు. అవిరెండును గొప్పదోషములు. కనుక నీవు మధ్యమార్గమవలంబింపవలెను." ఇట్లు వాలిపలికి బాణబాధచే కండ్లుతిరుగుచుండ తనపెద్దపండ్లను బైటకు పెట్టి ప్రాణములను విడిచెను.

అంతట వానరవీరులు వానిమరణమునుగూర్చి యిట్లు విలపించిరి. 'ఈదినమున కిష్కింధయు, నడవులును, పర్వతములును, నుద్యానవనములును శూన్యములైనవి. వానరులప్రభ నశించినది. పూర్వము వాలి పరుగెత్తునప్పుడా వేగముచే వృక్షములు చాలదూర మెగురుచుండెడివి. ఇప్పుడది యెట్లు జరుగును?' ఇట్లు విలపించుచు వారు సుఖము లేకయుండిరి. తరువాత తార తనభర్తముఖముజూచి వానిని గౌగిలించుకొని వానిముఖమును ముద్దిడుకొని విలపించుచు నిట్లుపలికెను. "మీరు నాకేమియు జెప్పకుండ మరణమునొందితిరి. మీరు దొంగయుద్ధముల జేసెడివారు కారు. మంచి వంశమున బుట్టినవారు. శూరునిభార్యనగు నే నిప్పుడు విధవనైతిని. నామానము పోయినది. శాశ్వతమగు నాపతి శుశ్రూష నశించినది. ధనధాన్యములు, పుత్రులు నున్నను భర్తలేని స్త్రీని విధవయందురు. మీశరీరమంతయు రక్తముతో నిండియున్నది. మీవక్షస్థలమున బాణము నాటుకొనియుండుటచే మిమ్ము నేను గౌగిలించుకొనలేను. వానరశ్రేష్ఠుడవగు నీలుడా! ఈబాణమును నూడదీయుము." ఇట్లామె పలుక నతడు దానినిబైకిలాగెను. అప్పుడా

బాణ మస్తాద్రినున్న సూర్యప్రభవలెబ్రకాశించెను. వాలిశరీరమునుండి రక్తధారలు ప్రవహించెను. ఆమె తనకన్నీటిధారలచే వానిశరీరమును దడిపెను. తరువాత నామె యంగదుని జూచి 'నీతండ్రి పాపకర్మలను జేసి వానివలనగల్గిన విరోధముచే బ్రాణములుపోవ నంత్యదశలో నుండెను. ఆతనికి నమస్కరింపు' మని చెప్ప వాడు తనతండ్రిపాదముల బట్టి 'యంగదుడనగు నేను నమస్కరించుచున్నా'నని పలికెను. అప్పుడు తార "పూర్వము మీ రంగదుని 'దీర్ఘాయుష్మంతుడవగు'మని దీవించెడివారు. ఇప్పుడు వాని నట్లేల దీవింపరు? మీయుద్ధమునకు నింద్రుడు సంతోషించి యిచ్చినబంగారపుమాల కనిపింపదేల? మీరు మరణము నొందినను మీశరీరకాంతి సూర్యతేజస్సువలె కనపడుచున్నది. నా మాట మీరు వినరైతిరి. యుద్ధమునకు మీరు పోకుండ మిమ్ము నేను నిలుపలేనైతిని. మీరు యుద్ధములో మడియుటచే నేనును, నా పుత్రుడును జచ్చినవారితో సమమైతిమి. మాకున్నశోభ యిప్పుడు మమ్ము విడుచుచున్న"దని విలపించెను.

అంతట సుగ్రీవుడు మిక్కిలి దుఃఖమునుబొంది కన్నీరు తెచ్చుకొని తారావిలాపముచే మిక్కిలిబాధనొంది తన యనుచరులతో మెల్లగ రామునియొద్దకు వెళ్లి యిట్లనెను. "మీప్రతిజ్ఞను మీరు నెఱవేర్చి నాకు రాజ్య మిప్పించితిరి? కాని నాకు భోగములందును, బ్రాణములందును నిష్టములేదు. నాయన్నభార్యయగు తార యేడ్చుచున్నందునను, బట్టణవాసులు దుఃఖించుచున్నందునను, నంగదుడు బ్రాణములను విడుచునను సంశయము కలుగుచున్నందునను నాకు రాజ్యమునం దిష్టములేదు. నాయన్న నన్ను దేశాంతరము నొందించుటచే నేను క్రోధమునుబొంది దానిని సహింపలేక వానియందలితిరస్కారభావముచే వానిమరణమున కొప్పుకొంటిని; గాని వాడు మరణమునొంద నేను గొప్పవిచారమును నొందుచున్నాను. వానిని జంపి

స్వర్గరాజ్యమును బొందుటకంటె నేను బూర్వమువలె ఋశ్యమూకపర్వతమున జాలకాలము నివసించుటయే నాకు శ్రేయమని తలచెదను. 'నిన్ను బాధింపను. నీయిష్టమువచ్చినట్లు సంచరింపు'మని నాయన్న నాతో బలికినమాట వానిబుద్ధికి దగినట్లున్నది; కానివానివధ దుర్మార్గబుద్ధితో నేను జేయించితిని. భ్రాతృవధజనితమైన దుఃఖముయొక్కయు, రాజ్యముయొక్కయు సారమెఱిగినవాడెవడును గుణవంతుడగు తన సోదరునివధను గోరడు. మహాత్ముడగుటచే నాతడు నావధ కిష్టపడలేదు. ఆతనిప్రాణములు దీయునట్టిబుద్ధి నాకే గల్గినది. ఆతడు నన్ను యుద్ధములో జెట్లతో గొట్టి పిమ్మట నే నేడ్చుచుండ నన్నోదార్చి తిరుగ యుద్ధమువలదని నాకు సెలవిచ్చెను. ఆతడు నాయెడ సోదరభావమును, మర్యాదను, ధర్మబుద్ధిని జూపెను; గాని నేనాతని విషయమై క్రోధమును, గామమును, జంచలమగు వానరబుద్ధిని జూపితిని. నేను నాసోదరునిజంపించియాలోచింప నలవికానిదియు, విడువదగినదియు గోరతగనిదియు జూడతగనిదియునగు గొప్పపాపమును బొందితిని. నేనధర్మమును, గులనాశనకరమునగు పనిని జరిపితిని; గాన నేను ప్రజలమర్యాదకును, యౌవరాజ్యమునకునుగూడ బాత్రుడనుగాను. అట్టిచో నాకు రాజ్యమెందులకు? నాపాపమువలన నేనుగొప్పశోకమనుభవించుచున్నాను. అంగదుడు మంచివాడు; పరోపకారి; చెప్పుచేతలలో నుండువాడు; సుఖముకలిగించువాడు. వాడు దుఃఖముచే మరణమునొందును. అట్టిసుపుత్రుడు లభించుట కష్టము. ఇట్టిసోదరభావముగలవాలితో సహవాస మేదేశములోనైన దొరకుట దుర్లభము. అంగదుడు జీవించియుండిన వానిరక్షణకై తార జీవించును. లేనియెడల నామె దుఃఖముచే జీవింపదని నాకు నిశ్చయముగ దోచుచున్నది. నే నగ్నియందు ప్రవేశించి నాయన్నయు, నంగదుడు పొందిన లోకములను బొందెదను. ఈవానరులందఱు నీయాజ్ఞకులోనై సీతాన్వేషణము తప్పక

జరిపెదరు. నేను మరణించినను మీకార్యముపూర్తిగజరుగును. కుల నాశకుడను, జీవింపననర్హుడననగు నామరణమున కంగీకారమిండు." ఇట్లు సుగ్రీవుడు రామునితో విన్నవించెను.

సుగ్రీవునివాక్యములను విని రాము డొకగడియ విచారము నొందెను. అంతట నతడు తన్ను మాటిమాటికి జూచుచున్న తారను నోదార్చగోరెను. ఆమె తనభర్తశవమును కౌగిలించుకొని విచారించు చుండ వానరవీరు లామెను పైకి లేవనెత్తిరి. ఆమె రాముని నిది వరలో జూచియుండలేదు. అయినను నామె యాతనియందు రాజ చిహ్నములనేకములుండుటచే నాతడే పురుషోత్తముడగు రాముడని భావించి మిక్కిలిగ వేడ్చుచు శరీరముచలింప నాతనిప్రక్కను నిలిచి యాతని నిట్లు ప్రార్థించెను. "మీ రూహింపశక్యముకానివారును, పొందశక్యముకానివారును, నింద్రియజయముగలవారును, గొప్పధర్మాత్ములును, గొప్పకీర్తిమంతులును, మంచిచెడ్డలనెఱిగినవారును, భూమివలెనోరిమిగలవారును, కండ్లయందురక్తజీరలుగలవారును నైయున్నారు. మీరు ధనస్సును, బాణములనుబట్టి సిద్ధముగనున్న గొప్ప బలిష్ఠులు; గొప్పబలపరాక్రమములను వెల్లడిజేయు నవయవసౌష్ఠవము గలవారు; మనుష్యశరీరమును విడిచి దివ్యరూపమును దాల్చినవారు. మీరు నాభర్తనుగొట్టినబాణముతో నన్నుగూడ గొట్టుడు. నేను లేకుండ వాలి క్రీడింపడు. నే నతనిలోకమునకు బోయెదను. స్వర్గములో సుందరులగు నప్సరసలున్నను నేను లేకపోయిన నతడు సుఖముగ నుండడు. సీతలేకపోవుటచే ఋశ్యమూకమున మీ రెట్లుండిరో యట్లే వాలి స్వర్గములో నేను లేకపోవుటచే విచారముతో నెండినశరీరముతోనుండును. భార్యావియోగమువలనగలుగు దుఃఖములు యౌవనులగు మీకు దెలిసియేయున్నవి. నిజస్థితుల దెలిసినమీరు నేనులేని దుఃఖము వాలికి గలుగకుండునటుల నన్ను బాణముతో గొట్టుడు.

వేదశాస్త్రములనుబట్టి భార్య భర్తయాత్మనుండి వేఱుకాదు. దానిని బట్టి నేను వాలియాత్మనగుదును. కనుక మీరు నన్ను జంపిన మీకు స్త్రీహత్యాపాపము లేదని నేను తలచెదను. కనుక నన్ను గొట్టి చంపుడు. లోకములో జ్ఞానవంతులుచేయు దానములలో భార్యావియోగముపొందినవానికి వానిభార్యనిచ్చుటకంటె గొప్పదానమేదియు లేదు. కాన మీరు నన్ను జంపిన నాభర్తకు నన్ను సమర్పించినవారగుదురు. మీ కధర్మమేమియు గలుగదు. అట్లు చేయుడు. నేను వాలిలేకుండ చాలకాలము జీవింపలేను." ఇట్లు తార ప్రార్థింప రాముడామె నిట్లోదార్చెను.

*"నీవు వీరునిభార్యవు. నీవు విపరీతమగునాలోచనలనుజేయకుము. లోకమంతయు బ్రహ్మచే నిర్మింపబడినది. అతనిచేతనే సుఖదుఃఖములు కూడ కల్పింపబడినవని లోకులు పలుకుదురు. మూడులోకములు

---

* అ. రా:— వాలిమరణానంతరమున తారవిలపించుచుండ రాముడామెకు తత్త్వజ్ఞానముపదేశింపదలచి యిట్లు దయతో నామెనోదార్చెను. "భయస్వభావముగలదానా! నీవు శోకింపగూడని నీభర్తనుగూర్చి వ్యర్థముగ నేలవిచారించెదవు? నీపతియగువాడు దేహమా? లేక జీవాత్మా? నిజముగ దెలుపుము. నీభర్త దేహమైనచో నది పంచభూతవికారమగు దేహము. జడమైనదియు, చర్మము, మాంసము, రక్తము, ఎముకలుగలదియు, కాలవశముననుఁ, కర్మవశముననుఁ, సత్త్వాదిగుణవశముసను బుట్టినదియు నైయున్నది. అట్టిదేహరూపుడగు నీభర్త నీయెదుట నుండ నీవేలవిచారించెదవు? నీభర్త జీవాత్మయైనచో నతడు నాశరహితుడు; జననమరణములు లేనివాడు; గమనాదులులేనివాడు; స్త్రీపున్నపుంసకరూపుడుగాడు; సర్వజగత్తులోనునిండినవాడు; ˋసజాతీయ విజాతీయ స్వగతభేదములులేనివాడు (అనగా-లోకములోనుండువస్తువులలో సజాతీయవిజాతీయస్వగతభేదము

నాతనిచే సృజింపబడి యాతనివశములో నుండుటచే నాతనియాజ్ఞలను మీఱియుండలేవు. నీకు సంతోషముకలుగును. నీకుమారుడు యౌవ రాజ్యమును బొందును. ఇట్లు బ్రహ్మ నిర్ణయించెను. శూరులభార్యలు విలాపమునొందరు.' ఇట్లు రాముడు తారను నోదార్చ నామెయూర కుండెను.

పిమ్మట రామలక్ష్మణులు సుగ్రీవాంగదులను, తారను నిట్లోదా ర్చిరి. 'మీరు శోకము తెచ్చుకొని గొప్పపరితాపమునొందిన చని పోయినవానికి మేలుచేకూరదు. వాని కనంతక్రియలను జేయయత్నిం పుడు. లోకాచారమునను సరించి మీరు కన్నీరు విడిచిరి. ఎవడును కాలము నతిక్రమించి యేకర్మను జేయలేరు.' ఇట్లు వారు కాలమహి

---

లున్నవి. ఎట్లన్న-ఒకమామిడిచెట్టుకలదు. దానికిసజాతీయము మఱి యొకమామిడిచెట్టు. విజాతీయము-మఱ్ఱిచెట్టు. స్వగత (వృక్షగత) మైనవస్తువులు-పత్రశాఖాదులు. ఇట్లు లోకములోనియున్నివస్తువులకు నిట్టిభేదములుగలవు. పరమాత్మ కాభేదములు లేవు. ఎట్లన్న-ఆత్మ సజాతీయమైన మఱియొకయాత్మలేనిది గనుక సజాతీయభేదము లేనిది. విజాతీయములగు వస్తువులున్నను నసదారోపములుగాననవి మిథ్యా భూతములైనవి. ఆత్మ అవయవములులేనిదిగనుక స్వగతవస్తుభేద రహితమైనది.); ఆకాశమువలె దేనిని నంటియుండనివాడు; నిత్యుడు; జ్ఞానస్వరూపుడు; పరిశుద్ధుడు. కనుక నట్టిజీవాత్మయగు నీభర్త మృతి నొందనపుడు నీవేలవిచారించెదవు!" ఇట్లు రాముడు బోధింప నామె యిట్లు విన్నవించెను. 'దేహము అచిత్తు; కఱ్ఱవంటిది. కాని జీవుడు నిత్యుడు; చిత్స్వరూపుడు. రామా! సుఖదుఃఖములసంబంధమెవనికి గలుగునో నాకు దెలుపుడు.' ఇట్లు తార యడుగ నత డిట్లామెకు దెలిపెను. "దేహేంద్రియాదులకన్న తానువేఱనెడువివేకములేనివానికి దేహేంద్రియములతోగూడ నహంకారముమొదలగువానిసంబంధ

మను దెలుపుచు 'వాలి ధర్మార్థకామములను బాగుగ నెఱవేర్చి స్వర్గముపొందెను. అతడు తనప్రాణములం దాశవీడి యుద్ధముజేసి పవిత్రమగు శరీరమునొంది యుత్తమలోకమునకు బోయెను. మీరిపుడు కాలోచితమగు పనుల జరుపు'డని సెలవిచ్చిరి. తరువాత లక్ష్మణుడు విచారించుచున్నసుగ్రీవునితో నిట్లు పలికెను. నీవు తారాంగదులతో వాలిప్రేతకార్యములను జరుపుము. ఆతనిదహనమునకొఱకు నెండినకట్టెలను, చందనాదులను దెప్పింపుము. సుగ్రీవా! దీనముగనున్న యంగదుని నోదార్పుము. పామరబుద్ధిని వీడుము. కిష్కింధ నీవశమై యున్నది. అంగదుడు మాల్యములను, ననేకవిధములగువస్త్రములను, నేతిని, నూనెను, మంచిగంధములను దెప్పింపవలయును. తారుడను

---

మెంతవరకునుండునో యంతవరకు సంసారముకలుగును. విషయములను ధ్యానించుచు నిద్రించువానికి మిథ్యాభూతములగు నావిషయములే స్వప్నములో గనిపించును. అవి వానికి తెలివిరాగానే నశించును. అట్లే యజ్ఞానమువల్ల వచ్చిన మిథ్యాభూతమైనసంసారము జ్ఞానముచే పోవును. కాని స్వయముగ నశింపదు. స్వప్నములో గనబడిన మిథ్యాభూతములైనవిషయములకు నాస్వప్నమునకు పూర్వమందలి విషయధ్యానమే కారణమైనటుల రాగద్వేషాదులతో గూడినసంసారమునకు ననాదియైనయవిద్యయు, దానివలనగలుగు నహంకారము కారణములైనవి. సంసారమునకు మూలకారణము మనస్సే. సుఖాది భోగములుగలది మనస్సే. ఆత్మ, మనస్సు ఏకమగుటవలన మనస్సునకుగలుగు సుఖదుఃఖాదిబంధన మాత్మకుగూడ గలిగినది. స్వచ్ఛమైన స్ఫటికము లత్తుక మొదలగురంజనద్రవ్యములను బొంది యారంజనద్రవ్యసామీప్యమువలన నెఱుపురంగును బొందినట్లు సుఖదుఃఖాదులుగలమనస్సంబంధమువలన నాత్మ సుఖదుఃఖాదులను బొందును. ఆత్మ తనస్వరూపమును తెలుపుడుచేయు మనస్సునుబొంది దానియందుండు

వానరశ్రేష్ఠుడు మంచిసవారీని దీసికొనిరావలయును. దానిపై వాలిని మోయుటకు బలముగలవానరులు సిద్ధముగ నుండవలయును.' ఇట్లు లక్ష్మణుడు పలికి రామునిప్రక్కను నిలిచెను. తారు డామాటలను విని కిష్కింధకు బోయి మంచిసవారీ నొకదానిని దీసికొనివచ్చెను. దానిలో రాజులకు దగినమంచియాసనము లుండెను. దానిపైన మంచి రథమున కుండునటుల శిల్పులుచెక్కిన పక్షులు, చెట్లు, యుద్ధపు రౌతులు, పర్వతములుగల చిత్తరవు లుండెను. అది మంచికిటికీలను గలిగి విశాలముగ విశ్వకర్మచేనిర్మింపబడిన సిద్ధులవిమానమువలె నుండెను. అది మంచిభూషణములను, హారములను, మాల్యములను, రక్తచందనములనుగలిగి కృత్రిమమగు గుహాలతో నిండియుండెను.

---

కోరికలనుగూడపొందుచు మనస్సంబంధమైనరాగద్వేషాదులచే గట్టుబడి యస్వతంత్రమైనదై సంసారమును బొందును. ముందు మనస్సు రాగద్వేషాదులను సృజించి పిమ్మట నారాగద్వేషాదులవల్ల హింసాదిరహితమైన జప ధ్యానాదిసహితశుక్లకర్మలను, హింసాసహితమైన యాగాదిరూపలోహితకర్మలను, బ్రహ్మహత్యాదిపాపకర్మరూపకృష్ణకర్మలను సృజించినది. శుక్లకర్మలవలన బ్రహ్మలోకగతియు, లోహితకర్మలవలన స్వర్గలోకగతియు,కృష్ణకర్మలవలననరకలోకగతియు గలుగుచున్నది. ఈతీరుగ జీవుడు కర్మవశమువలన ప్రళయకాలపర్యంతము జననమరణరూప సంసారమును బొందుచున్నాడు. ప్రళయకాలమునందు జీవుడు తనకర్మవాసనల (పుణ్యాపాపములు) తోగూడుకొని యంతఃకరణతోనైక్యభ్రమవల్ల నవిద్యావశుడై యుండును. తిరుగసృష్టికాలమున నాజీవుడు మనస్సంబంధమైనపూర్వకర్మవాసనలతోగూడియే జన్మించుచుండును. ఇట్లు సృష్టిప్రళయకాలములలో ఘటీయంత్రము (మోట) వలె క్రిందికి పైకితిరుగుచు నస్వతంత్రుడై యుండెను. ఇట్టి జీవుడు సుశాంతులును, మద్భక్తులునునగువారియొక్క సాంగత్యమును

మఱియు నది పద్మదళములతోను, బుష్పములతోను నిండియుండెను. అట్టిసవారీని జూచి రాముడు లక్ష్మణునితో 'వాలిశవమును దానిలో నుంపించి ప్రేతకార్యములను జరిపింపు'మని చెప్పెను. అప్పుడు సుగ్రీవుడును, నంగదుడును వాలిశవము నెత్తి సవారీలో నుంచిరి. దానిపై నలంకారములను, మంచిమాల్యములను, వస్త్రములను నుంచిరి. సుగ్రీవుడు వానరులకు 'మీరుసవారీముందు ననేకవిధములగు రత్నములను జల్లుచు వెళ్లుడు. తరువాత మఱికొందఱు సవారీని మోయుచు రాజులకు తగినటుల నుత్తరక్రియలను జరుపు'డని యాజ్ఞాపించెను. ఆసవారీ వెనుక తారుడుమొదలగు వానరశ్రేష్ఠులును, నంగదుడును, నగరులో నుండు వాలికిష్టమగు వానరస్త్రీలును, తారమొదలగు వాలిభార్యలును

---

బొంది, నావిషయమగుబుద్ధిని, నాకథలను వినుటయందు శ్రద్ధను బొందునో యప్పుడు తనస్వరూపమును గురుకటాక్షముచే తత్త్వమసీతి వాక్యోపదేశమువలన ; దేహేంద్రియమనః ప్రాణాహంకారములకన్న వేఱుగానుండిన యద్వితీయమగు సచ్చిదానందరూపునిగ దెలిసికొని తత్కాలమందే ముక్తుడగును. నేను చెప్పినదంతయు సత్యము. నేను చెప్పినదెల్లప్పుడు నాలోచించువానికి సంసారదుఃఖము లెంతమాత్రము ముట్టవు. నీవుకూడ నేను చెప్పినదానిని పరిశుద్ధమగుమనస్సుతో నాలోచింపుము. అప్పుడు దుఃఖపరంపరలు నిన్నుబొందవు. నీవు కర్మబంధమునుండి విముక్తినొందెదవు. పూర్వజన్మమున నీకు నాయందు భక్తియుండెను. కనుకనే నేను నీకు ముక్తిగలిగించుటకు నారూపమును జూపితిని. నీవు నారూపమునెల్లప్పుడు ధ్యానించుచు నేనుచెప్పినదానిని నాలోచింపుము. నీవు సంసారప్రవాహములో వచ్చుకార్యములను జరిపినను నవి నీకంటవు." ఇట్లు రాముడు పలుక దానినంతయు తార విని మిక్కిలియాశ్చర్యమునొందెను. ఆమె దేహాభిమానమువలన గలిగినశోకమును విడిచి రామునకు నమస్కరించి యాత్మను దెలిసికొను

నేడ్చుచు వెళ్లిరి. ఆరోదనముతో నడవులును, కొండలన్నియును బ్రతిధ్వనించెను. అంతట నీటిమధ్యను నిసుకతిన్నెపైన శుభ్రమైనస్థలమున వానరులు చితి నేర్పఱుప దానిసమీపమున వాహకులు సవారీని దింపి స్వల్పదూరమున దుఃఖముతో నిల్చిరి. అప్పుడు తార తన భర్తశవమును జూచి యాతనితలను దనతొడమీద నుంచుకొని యిట్లు విలపించెను. 'అయ్యో! వానరమహారాజా! నన్ను జూడుడు. విచారముతోనున్న మీప్రజలను మీ రేల జూడరు? మీకు బ్రాణములు లేకున్నను మీముఖ మస్తమించుచున్న సూర్యుని తేజస్సువంటి కాంతిగలిగి సంతోషముతోనున్న ట్లున్నది. మీకు మరణకాలము రామరూపముతో వచ్చి యొకబాణముతో మిమ్ము నంతమునొందించెను. మేము విధవలమైతిమి. మీకిష్టులగు మీభార్య

టచే సంతోషమునొంది పరమాత్ముడగునాతని నొకక్షణము దర్శనముచేయుటచే జీవన్ముక్తురాలయ్యెను. ఆమె మాయబంధము నెగురగొట్టి పాపములను విడిచి ముక్తినొందెను. సుగ్రీవుడుకూడ నీవాదమును విని యజ్ఞానమునంతను విడిచి సంతోషమగు మనస్సుగలవాడయ్యెను.

సారాంశము:—దేహేంద్రియమనస్సులతో నైక్యమును బొందిన చిద్రూపుడగుజీవుడు నీభర్త. అట్టిభర్తయందు ననాదియగు నవిద్యవలన గలిగిన మమకారమువల్ల నీవు శోకించుచుంటివి. ఈమమకారమునకు మూలభూతమైనది యనాదియగు నవిద్య (స్వస్వరూపమును దెలిసికొనకపోవుట). గురూపదేశమగు తత్త్వమసీతి వాక్యోపదేశమువల్ల దేహేంద్రియమనోవిలక్షణమైన సచ్చిదానందరూపమగు పరబ్రహ్మమే నేననెడి యనుభవము కలుగును. దానిచే నట్టియజ్ఞానము నశించును. అట్టియజ్ఞాన నాశనమువల్ల అహంకార మమకారరూపమగు బంధము నశించును. అట్టి బంధనాశనమే మోక్షము.

లందఱు నడచి యింతదూరము వచ్చిరి. వారిని మీరేల కనుగొనరు? సుగ్రీవుడును, దారుడు మొదలగు మీమంత్రులును, కిష్కింధవాసులును వచ్చిరి. వారికి సెలవిండు. మనమందఱము వనముల నిచ్చవచ్చినట్లు క్రీడింతము. ఇట్లు తార విలపించుచుండ వానరస్త్రీ లామెను ప్రక్కకి లాగిరి. సుగ్రీవుడును, నంగదుడును నేడ్చుచు శోకముతో వాలి శవమును జితిపైనుంచిరి. వాలిపుత్రుడు దానికి నగ్ని ముట్టించి యపసవ్యముగ ప్రదక్షిణముచేసి వాలిని యథావిధిగ సంస్కరించెను. వాని శరీరము దహనమైనతరవాత నందఱు నదిలో స్నానముచేసి వానికి తర్పణములను విడిచిరి. తరువాత రాముడు మిక్కిలిశీఘ్రముగ సుగ్రీవునిచే వాలికి ప్రేతకార్యములు జేయించెను. తరువాత తడిబట్టలతోనున్న సుగ్రీవునితోగూడ వానరశ్రేష్ఠులందఱు రామునిసమీపమునకు వెళ్లి వానికి నమస్కరించుచు నిలిచిరి. అప్పటికి రామలక్ష్మణులు ఋశ్యమూకముచేరునప్పుడుండు వసంతఋతువు, తరువాతగ్రీష్మ ఋతువు గడచెను. వాలిమరణసమయమునకు వర్షఋతు వారంభమయ్యెను.

---

## ౨౬. అధ్యాయము. సుగ్రీవునియభిషేకము.

వాలికి ప్రేతకారములు జరిగినతరువాత * సుగ్రీవుడును, వానరశ్రేష్ఠులును రామునియొద్ద నిలిచిరి. అంతట మేరుశిఖరమువంటి కాంతికలవాడును, బాలసూర్యునివంటిముఖముకలవాడునునగు హను

---

* అ. రా:—సుగ్రీవుడు వాలికి దహనాదిక్రియలనుజరిపి స్నానముచేసి రామునియెదుట నిలిచి 'రామా! వానరులరాజ్యమును మీరు పరిపాలింపుడు. మీదాసుడనగు నేను లక్ష్మణునివలె చిరకాలము మీపాదపద్మముల సేవించుచుండెద' నని విన్నవింప నతఁడు

మంతుడు రాముసకు జేతులుజోడించి యిట్లనెను. 'మీదయచే దస పూర్వులవానరరాజ్యము కష్టముతో సుగ్రీవునకు దొరకెను. మీరు గిరిగుహలోనుండు కిష్కింధానగరమునకు వచ్చి స్నేహితులతోఁగలిసి చేయవలసినకార్యముల నాజ్ఞాపింపుడు. అతడు క్రమప్రకారముగ నభిషేకమునొంది మిమ్ము రత్నములతోను, మాల్యములతోను బూజించును. మీరాపట్టణమునకు వచ్చి యాతని వానరరాజుగా నభిషేకింపుడు' వాయుపుత్రునియీమాటలను రాముడు విని యిట్లు సెలవిచ్చెను. 'బుద్ధిమంతుడా! నేను నాతండ్రియాజ్ఞచొప్పున 14సంవత్సరములు గ్రామమునగాని, పట్టణమునగాని ప్రవేసింపను. సుగ్రీవుడు కిష్కింధకు రాజుగా నభిషిక్తుడగుగాక!' ఇట్లు రాముడు హనుమంతునకు సెలవిచ్చి సుగ్రీవునితో నిట్లనెను. 'నీవంగదుని యువరాజుగ నభిషేకింపుము. నీయన్నకుమారుడగు నీతడు పరాక్రమమున తండ్రితో సమానుడు. యౌవరాజ్యమునకు దగినవాడు. ఇప్పుడు శ్రావణ మాసము జరుగుచున్నది. వర్షాకాలమగు నీనాలుగునెలలును బ్రయాణమునకు దగినవికావు; కాన నీవు కిష్కింధలో నుండుము. నే నీప్రస్రవణపర్వతశిఖరమున మంచిగుహలో నుండెదను. అది విశాలముగ నున్నది. అక్కడ మంచిగాలి వీచును. మంచినీరు దొరకును. కార్తీక మాసముప్రారంభింపగనే రావణునివధగూర్చి యత్నింపుము. అప్పుడది మనకు మంచిసమయము.' ఇట్లు రాముడు సెలవీయ సుగ్రీవుడు కిష్కింధకు బోయెను. వానరులంద అతనికి నమస్కరించి చుట్టును నిలిచిరి. ప్రజలంద అతనిపాదములపై బడి నమస్కరించిరి. అతడు

---

చిఱునవ్వునవ్వుచు నిట్లనెను. 'నీవే నేను. సందేహములేదు. నీవు నాయాజ్ఞచొప్పున శీఘ్రముగ బోయి కిష్కింధారాజ్యమున నభిషిక్తుడవుకమ్ము.' ఇట్లు రాముడు సెలవీయ సుగ్రీవు డతనికి నమస్కరించి 'అట్లు చేసెద' నని పలికెను.

వారితో మాట్లాడి తనయన్న నగరునకు బోయి తార మొదలగు వారిని గలిసికొని తిరుగవచ్చెను. అప్పుడు వానరవీరులగు గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గంధమాదనుడు, మైందుడు, ద్వివిదుడు, హనుమంతుడు, జాంబవంతుడు, నలుడు ననువారు బంగారుకట్లుగల తెల్లని గొడుగును, బంగారుకట్లుగల కఱ్ఱలతో నొప్పు రెండు తెల్లనివింజామరలను, ననేకవిధములగు రత్నములను, ధాన్యములను, నోషధులను,బువ్వులను, నాకులను,తెల్లనిబట్టలను, శరీరమునబూసికొను సుగంధద్రవ్యములను, పద్మములను, జందనములను, పచ్చనియక్షతలును, నేతిని, తేనెను, పెరుగును, పులిచర్మమును, సడవిపందిచర్మపుపాదరక్షలును జాగ్రత్తపఱచిరి. 16గురు కన్యలు మంచిలేపనములను బట్టుకొని సిద్ధముగ నుండిరి. వానరవీరులు బ్రాహ్మణశ్రేష్ఠులకు రత్నములను, బట్టలను నిచ్చి భోజనములను బెట్టిరి. వారు హోమగుండములో నగ్నిని మంత్రవిధులతో నుంచి దానిలో మంత్రములతో హవిస్సును వేయించి యనేకనదులనుండియు, దీర్ధములనుండియు, సముద్రములనుండియు దెప్పించినసీటిని గలిపి బంగారుపాత్రలో నుంచి మేడమీద తూర్పుముఖముగ నొకబంగారునాసనమును గల్పించి దానిపై మంచి చర్మములు మొదలగువానిని బఱచిపించి శాస్త్రప్రకారము సువాసనగలనీటితో సుగ్రీవునకు నభిషేకముచేసిరి. అప్పుడు వానరు లందఱు సంతోషముగ గేకలువేసిరి. ఆవానరరాజంగదుని యువరాజుగ నభిషేకించెను. దానికి వానరులు మిక్కిలి సంతోషించి సుగ్రీవుని, రామలక్ష్మణులను బొగడిరి. పట్టణమున ప్రజలందఱు సంతోషముతో జండాలను గట్టిరి. తరువాత సుగ్రీవుడు రామునియొద్దకు బోయి తన యభిషేకవిషయమును దెలిపి తనభార్యతో గిష్కింధలో సుఖముగ నుండెను.

అతడు వానరులను మంచిమాటలతో లాలించుచు దానము లను జేయుచు మర్యాదగ రాజ్యమును బాలించుచుండెను. వారు వనములోను, పర్వతములపైనను, నిండ్లలోను గ్రీడించుచుండిరి.

---

౭ వ. అధ్యాయము.

రామలక్ష్మణులు ప్రస్రవణగిరియందు నివసించుట.

సుగ్రీవుడు కిష్కింధలో నభిషిక్తుడైనతరువాత రామలక్ష్మణులు దానికి సమీపముననున్న ప్రస్రవణగిరియను నామాంతరము గల మాల్యవంతపర్వతశిఖరముననున్న యొకమంచిగుహలో వర్షాకాలమున నివసించుటకు నేర్పఱచుకొనిరి. ఆపర్వతమున ననేకక్రూర జంతువులును, వివిధములగుచెట్లును, వానరులును, నెలుగుబంట్లరూపము గలవారును, నావుతోకవంటి తోకలుగలవారును, సిల్లులును, గుహాలును, నీటిమడుగులును, బక్షులును నుండెను. అక్కడ లోహము లన్నియు దొరకును. మంచిగాలి వీచుచుండును. ఆగుహ విశాలముగ నుండెను. అది యీశాన్యమూలకు విస్తరించియుండి పశ్చిమమున కెత్తుగనుండెను. దానియెదుట మంచినదునుగల విశాలమగు పెద్దరాయి యొకటియుండెను. దానికి దగ్గఱగనే మంచిపద్మములుగల కొల నొకటి యుండెను. దానికి నుత్తరమున నొకపెద్దశిఖరమును, దక్షిణమున నొక తెల్లనిశిఖరమును నుండెను. దానికి మూర్పున దూర్పునకు బ్రవహించు నదియొకటి స్వచ్ఛమగు నీరు కలిగి బురదలేకయుండెను. ఆయేటిగట్లపై ననేకవిధములగుచెట్లును, వానిపై సంతోషముతోగూయు పక్షులును నుండెను. ఆనదిలోనున్న సుందరమగు నిసుకతిన్నెలపై హంసలు మొదలగునీటిపక్షులు పరుగెత్తుచు ధ్వనిచేయుచుండెను. దానిలో నల్లకలువలును, నెఱ్ఱకలువలును, పద్మములు మొదలగుపుష్పములును నక్క-

జక్కడనుండెను. ముని లక్కడ స్నానముచేయుచుందురు. అట్టి గుహను రామలక్ష్మణులు నివాసముగ నేర్పఱచుకొనిన పిమ్మట రాముడు తనతమ్మునితో 'మనమిక్కడ నివసింతము. ఇది కిష్కింధకు దగ్గఱగ నున్నది. అక్కడి వానరుల గీతవాద్యములును, మద్దెల మొదలగు వానిధ్వనులతో వారినాట్యమును నిక్కడికి వినిపించుచుండును. సుగ్రీవుడు రాజ్యమును, భార్యను బొంది స్నేహితులతో గొప్పశుభము లననుభవించుచుండు' నని పలికి లక్ష్మణునితోగూడ నాగుహాలో నివసించెను.

అక్కడ వస్తువు లన్నియు దొరకుచున్నను రామున కెంత మాత్రమును సుఖములేకుండెను. అతడు తనప్రాణములకంటె నెక్కువయగు సీతను రావణుడు హరించుటచే నామెను దలంచుచు విచారించుచుండెను. అతడు రాత్రులందు మంచిపక్కపైని పండుకొనినను నాతనికి నిద్రపట్టకుండెను. చంద్రు డుదయించినది మొదలు లాతని కెక్కువ బాధ కలుగుచుండెను. అతడు లేచి కూర్చుండి కంటినుండ నీరు విడచుచు శోకముతో విచారించుచుండ లక్ష్మణుడిట్లతని నోదార్చెను. 'మీరు దుఃఖింపకుడు. మీరు విచారింపకూడదు. దుఃఖముకలవాని కన్నికార్యములు నశించును. మీకన్నివిషయములు తెలియును. మీరు కార్యపరులు; దైవచింతగలవారు; ధర్మబుద్ధిగలవారు; కార్యమవలంబించువారు. మీరు సరియగుప్రయత్నముచేయనియెడల కుటిలుడగు నారాక్షసవీరుని జంపలేరు. మీరు శోకమును విడిచి, తగినప్రయత్నములను జేసి వానిని వానిబంధువులు మొదలగువారితోగూడ నాశనముచేయుడు. జగత్తునంతయు తలక్రిందుగ జేయు సామర్థ్యముగల మీకు వాడనగ నెంత? ఇప్పుడు వర్షాకాలము వచ్చినది. శరత్కాలము వచ్చువఱకు మీరు నిరీక్షింపుడు. అప్పుడు రావణుని, వాని రాజ్యములోని వారినందఱిని జంపెదముగాక! నిప్పునుగప్పినబూడిదవలె

మందముగనున్న మీపరాక్రమమును నేను మీకు జ్ఞాపకముచేయు చున్నాను.' లక్ష్మణుని యీమాటలను రాము డంగీకరించి వాని కిట్లు సెలవిచ్చెను. 'నీవు నాయందలియనురాగముచే దగినమాటల నిప్పుడు నుడివితివి. నేను శోకమును విడిచి నాబలపరాక్రమములను దగినసమయమున జూపెదను. నీవచనానుసారముగ నేను శరత్కాల మును నిరీక్షించెదను. అప్పుడు నదీప్రవాహము లడ్డురాకుండును. సుగ్రీవుడు తగినయత్నముచేయగలడు. మనముచేసినయుపకారమునకు నతడు తప్పకప్రత్యుపకారము జేయును. ఉపకారికి నపకారము జేసి నచో సాత్త్వికులమనస్సు దుఃఖమునొందును.' రామునియీమాట లకు లక్ష్మణుడు సంతోషించి యాతనికి నమస్కరించి 'నాయభిప్రాయ మునునట్లే. మీరుకోరినదంతయు మీరు చెప్పినట్లు సుగ్రీవుడుచేయును. మీరు కోపమును విడిచి వర్షాకాలమువెళ్లువఱకు నిరీక్షించుచు నివ సింపుడు. శరత్కాలమురాగానే శత్రువులను జంపుప్రయత్నము చేయుద'మని పలికెను.

తరువాత రాముడు లక్ష్మణునకు * వర్షాకాలచిహ్నములను వర్ణించిచెప్పుచు సీతావియోగముచేగలిగిన తనవిరహవేదనను దెలు పుచు నింకను నిట్లనెను. "ఈయాషాఢమాసమున భరతుడు గృహము నకు గావలసిన క్రొత్తవస్తువులను, ధననిచయములను సంగ్రహించి చాతుర్మాస్యవ్రతమున నిమగ్నుడై యుండును. సరయూనది నీటితో నిండి తొందరగ ప్రవహించుచుండును. ఇప్పుడు సుగ్రీవుడు శత్రు క్షయముకాగా భార్యతో సుఖమనుభవించుచు రాజ్యము నేలుచున్నాడు. నేను భార్యనుగోలుపోయి రాజ్యభ్రష్టుడనై తడిసిపోయినయేటిగట్టువలె క్షీణించుచున్నాను. నాకీవర్షాకాలమున శోకమెక్కువైనది. రావ

* 13 వ. ప్రకరణము. ౨౮ వ. అధ్యాయము. వర్షర్తువర్ణనచూడుము.

ణుడు నాకు గొప్పశత్రువయ్యెను. ఈవిచారములు నాకంతులేనివిగ గనిపించుచున్నవి. ఇది దండయాత్రికు దగినసమయముకాదనియు, త్రోవలలో నీరుండుననియు సుగ్రీవుడు వినయముగ నాతో జెప్పుటచే నేనేమియు ననలేకపోతిని. అతడిదివరకు గొప్పబాధలనొంది యిప్పుడు భార్యతో సుఖముగనుండెను. నాకార్యము మిక్కిలికష్టమైనదగుట చేతను, స్వల్పకాలములో సాధ్యమగునదికాకపోవుటచేతను నతని నేమైన ననుటకు నాకిష్టములేదు. అతడు తగినకాలమాలోచించి నాకు ప్రత్యుపకారమును జేయును. అనుమానములేదు. నేను శరత్కాలమును నిరీక్షించెదను." ఇట్లు రాముడు పూర్వమువలెనే పలుక లక్ష్మణుడు పూర్వమువలెనే యతనిని తగినట్లోదార్చెను.

పిమ్మట వర్షాకాలము గడచెను. ఆకాశమున మేఘములు లేకుండెను. శరత్కాలచంద్రుడు ప్రకాశమానముగనుండెను. సుగ్రీవుడు తనభార్యయగు రుమతోను, తారతోను రాత్రింబగళ్లు విహరించుచుండెను. అతడు తనరాజకార్యములన్నియు మంత్రులకప్పజెప్పియుండెను. అప్పుడు కాలధర్మముల నెఱిగినవాడును, నిజస్థితిదెలిసినవాడును, కార్యనిశ్చయముగలవాడుననగు హనుమంతుడు వానరరాజు మనస్సునకింపగునటుల మధురములును, హితములుననగు సామధర్మార్థనీతులను దెలుపుచు నిట్లు పలికెను. "మీకు మీవంశీయుల రాజ్యము దొరకినది. మీయశస్సు, సంపత్తు వృద్ధి నొందెను. మీస్నేహితులకార్యము నెఱవేర్చుట మిగిలియున్నది. దానిని మీరు చేయవలెను. వారియెడ కాలముగుర్తెఱిగి మంచిగ ప్రవర్తించువానిరాజ్యము, కీర్తి, ప్రతాపము వృద్ధినొందును. ధనము, సైన్యము, స్నేహితులు గలరాజు తనరాజ్యభోగములను బాగుగ ననుభవించును. కాన మంచి ప్రవర్తనగలమీరు మీస్నేహితునికార్యమును ప్రతిజ్ఞచేసినట్లు జరుపవలెను. తనస్నేహితులకొఱకై తనకార్యముల విడిచి వారిపనులను

నెఱవేర్చువానికి కష్టము లేశ మైనను కలుగదు. కాలవిలంబనము జరిగినతరువాత తనస్నేహితులకార్యములను గూర్చి మనుజుడెక్కువగ ప్రయత్నములజేసియు వానిని నెఱవేర్పలేడు. సీతను వెదకుటయను రాముని కార్యము విలంబమైనది. అతడు దానినిగూర్చి తొందరగలవాడైనను ప్రాజ్ఞుడగుటచే నాసంగతి మీతో జెప్పలేదు. మీ కుటుంబమునకు నాతడు గొప్పబంధువు; గొప్పప్రభావముగలవాడు. మీగుణములుగూడ గొప్పవి. అతడు మీకార్యమును జరిపెను. మీరాతనికార్యమును జరుపుటకై వానరశ్రేష్ఠులను బంపుడు. అతడు తనకార్యమునుగూర్చి మనల నాజ్ఞాపించినతరువాత మనము దానిని జరిపినయెడల కాలవిలంబముజరుగును. అతడాజ్ఞాపింపక పూర్వమే మన మాతనికార్యమును జరుపవలెను. మీకుపకారము చేయనివారిపనులనుగూడ మీరు చేసెదరు. అట్టిచో మీకు రాజ్యమును, ధనమును సమకూర్చిన వారికార్యములను జరుపుటయందాశ్చర్యమేమి? రామునికార్యమును జరుపుటకు మీకు శక్తిప్రతాపములున్నను మీరేలవానిని సమకూర్పరు? అతడు తనబాణములచే దేవాసురాదులనుగూడ తనవశముచేసికొనగలడు. కాని మీప్రతిజ్ఞనుగూర్చి నిరీక్షించుచున్నాడు. అతడు తనప్రాణములకు నష్టముకలుగునను శంకనుగూడ పొందక మీకు ప్రియమగు పనిని జరిపియున్నాడు. సీత భూలోకములోనున్నను, మీదిలోకములనున్నను నామెను వెదకుదము. దేవగంధర్వయక్షాదులైనను నతనికి భయమును గలుగజేయలేరు. అట్టిచో రాక్షసులేమిచేయగలరు? శక్తిపరుడును, ముందుగ మీ కుపకారమును జేసినవాడును నగు రామునికార్యమును సంపూర్ణమగుమనస్సుతో మీరు చేయవలెను. మీరాజ్ఞాపించినయెడల మా వానరులకు క్రిందిలోకమునకుగాని, యడవులకుగాని, మీదిలోకమునకుగాని వెళ్లుటకేమియు నడ్డములేదు. నీసేవకులగు వానరులు

కోట్లకొలది యున్నారు. వారిలో నెవ డేమిచేయవలెనో యెక్కడికి వెళ్ళవలెనో మీరాజ్ఞాపింపుడు.” ఇట్లు హనుమంతుడు మనవిచేయ సుగ్రీవుడు బాగుగానాలోచించి నీలుడను సేనానాయకునిబిలిచి ‘అన్ని దిక్కులనుండి నాసమస్తసైన్యములను రప్పింపుము. సేనానాయకు లందఱు తమసేనలతో రావలయును. 15 రోజులలో రానివానరు లందఱికి మరణదండన విధింపబడును. నాయాజ్ఞానుసారముగ నీవును, నంగదుడును వృద్ధులగువానరులనుగూడ దీసికొనిరావలె’నని యాజ్ఞాపించెను. తరువాత సుగ్రీవుడు తనయంతఃపురముజేరి రుమతోను, తారతోను గ్రీడించుచుండెను.

రాముడు శరత్కాలమున కామసుఖములలో సుగ్రీవుడు మునిగియున్నందులకును, సీతాహరణమునకును, నామెను వెదకుటకు గాలహరణముజరుగుచున్నందులకును మిక్కిలియాతురత జెంది మూర్ఛ నొందెను. తరువాత నతడు తెలివినొంది పర్వతశిఖరమునకు బోయి కూర్చుండి నిర్మలమగు నాకాశమును జూచి తనమనస్సు ప్రియురాలి మీదికి బోవ నిట్లు విలపించెను. ‘పూర్వము సారసపక్షులవలె బలుకుచు నాశ్రమమున క్రీడించు నాసీత యిప్పు డెట్లు సంతోషముగలిగి యుండును? పూర్వము పుష్పములతోనిండిన చెట్లపై కూర్చుండి నాకై యెదురుచూచుచుండెడు నామె యిప్పుడు నేనులేకుండ నెట్లు విహరించును? పూర్వము కలహంసలయొక్క కలకంఠస్వరములచే తెలివి

---

అ. రా:—అడవిలో మృగపక్షులు రామునిజూచి కదలక మునీశ్వరులవలె నెల్లప్పుడు ధ్యాననిష్ఠతో నుండెను. అతడు మానుష రూపమునెత్తి కొండలలోను, నడవులలోను తిరుగుటచూచి సిద్ధగణములు వానిని పరమాత్మునిగ దెలిసికొని భూలోకమున మృగపక్షులై! వానిని సేవించిరి. లక్ష్మణుడు రాముడొక్కడే వేఱుగనుండి ధ్యానమునందే మనస్సుగలిగియుండుటను గనిపెట్టి యదిపూర్తియైన తరువాత భక్తిప్రేమవినయములతో నతనితో నిట్లు విన్నవించెను. ‘దేవా!

నొందు నాయువతి యిప్పు డెట్లు తెలివినొందును? పూర్వము చక్రి వాకద్వంద్వములధ్వనులను విని వానితో సంచరించు నాయబల యిప్పుడేలాగుండును? నేను సరస్సులలోను, నదులలోను, దిగుడుబావుల లోను, నడవులలోను, తోటలలోను దిరుగుచున్నను నామెలేకపోవు టచే నాకు సుఖము కలుగకున్నది. సుకుమారియగు నామె యీ శరత్కాలమందు మన్మథబాధచేతను, నావియోగముచేతను మిక్కిలి పీడనొందదుగదా?' యిట్లు వర్షముకొఱకు నిరీక్షించు చాతకపక్షివలె రాముడు విలపించుచుండ ఫలములకొఱకు కొండచరియలకు బోయిన లక్ష్మణు డద్దుత్రోవను వచ్చుచుండెను. అప్పుడు లక్ష్మణుడొంటరిగ విచారించుచున్న తనయన్నను జూచి తానుగూడ మిక్కిలివిచారము

---

మీరు పూర్వము నాతో బలికినవాక్యములవలన మాయచే నామన స్సులోబుట్టినసంశయములను నేను పోగొట్టుకొంటిని. మీపూజ లోక ములో యోగులెట్లు చేయుదురో యాపనులను దెలియగోరెదను. ఇదియే ముక్తిసాధన మని వారెల్లప్పుడును బలుకుదురు. నారదుడును, వ్యాసుడును, బ్రిహ్మయుగూడ నట్లే తెలిపిరి. నాలుగువర్ణములవారి కిని, నన్నియాశ్రమములవారికిని ముక్తిగలిగించునదియు, స్త్రీలకు, శూద్రులకు సులభముగ ముక్తినిచ్చెడిదియు, లోకుల కుపకారమగు నదియునగు దానిని మీరు మీభక్తుడను, మీతమ్ముడనగు నాకు దెలుపుడు.' ఇట్లు లక్ష్మణుడు విన్నవింప రాముడిట్లు సెలవిచ్చెను. "నాపూజావిధానమునకు నంతములేదు. అయినను దానిని పూర్వము జరిగినదాని ననుసరించి సంక్షేపముగ దెలిపెదను. మనుజుడు తనకుచిత మగు నాపస్తంబాదిసూత్రోక్తప్రకారముగ నుపనయనసంస్కారమును బొంది తనకు గలిగిన సమస్తసంశయములను బోగొట్టెడి సద్గురువువల్ల మంత్రోపదేశమును బొంది మంత్రములకు ముఖ్యార్థమైన నాయందు భక్తివిశ్వాసము గలవాడై యట్టిసద్గురునిచే విధింపబడిన మార్గాను

నొంది తనయన్నతో నిట్లనెను. 'ఆర్యా! మీరు కామునకు లోబడుట వలనను, పౌరుషమునకు భంగముకలిగించుకొనుటవలనను లాభము లేదు. ఈసమయమున మీరు మనస్సును బాగుగ నిలుపుకొనవలెను. యత్నమును విడువగూడదు. మనకార్యముజరుగునటుల మీరు మనస్సున బాగుగ నాలోచించుకొని, తగినకాలముజూచి, తగినసాహాయ్యమునుబొంది, తగినకర్మలనాచరించి మనపనులు నెఱవేఱునటుల జేయవలెను. సీత నెవరును తమవశము చేసికొనలేరు.' ఇట్లు లక్ష్మణుడు పలుక రాముడు వాడినముఖముతో సీతనుగూర్చి యాలోచించుచు * శరదృతులక్షణములను వర్ణించుచు మంచివియు, వినదగినవియు, సామధర్మార్థములతోను,నీతితోను గూడినవియునగు వాక్యములనిట్లుపలికెను.

సారముగ నన్నారాధింపవలయును. ప్రతిదినమందు నుషఃకాలమున లేచి పాదప్రక్షాళనాదులనాచరించి బ్రహ్మరంధ్రమందు స్వగురుని ధ్యానించి పిమ్మట యథాశక్తిగ శ్రేష్ఠదేవతామంత్రమును జపించి శౌచాదినిత్యకర్మల నాచరించి శరీరమునకు మట్టిరాసికొని పరిశుద్ధజలమందు వైదికతాంత్రికమంత్రములచే స్నానమాచరింపవలెను. పిమ్మట సంధ్యావందనము, అగ్నిహోత్రము మొదలుగాగల నిత్యకర్మలను నిర్వర్తించి మద్బుద్ధిచే గురువును ధ్యానించి పూజాసంకల్పమును జేసిపూజాసామగ్రిని సంపాదించి తనకు దక్షిణపువైపుననుంచుకొని ముందు దర్భాసనమును, దానిపైన కృష్ణాజనమును, దానిపైన వస్త్రాసనమును వేయవలెను. ఈతీరుగ నాసనమును గల్పించుకొని యాయాసనముపై దేవునకు నెదురుగ గూర్చుండి భూశుద్ధి, భూతశుద్ధి నాచరించి పిమ్మట నంతర్మాతృక, బహిర్మాతృక యను న్యాసములను నాచరింపవలెను. తరువాత కేశవాది 24 నామములతోను ముఖము మొదలగు నాయాస్థానములను స్పృశించి తత్త్వవిన్యాసముచేసి నాశరీరావయవములను

* 13వ. ప్రకరణము. ౨౨వ. అధ్యాయము. శరదృతువర్ణనజూడుము.

"మనకార్యము తప్పక జరుగునటుల తగినయుత్సాహముతో పను లను జరుపవలెను. ఈకాలమున రాజు లొకరినొకరు గెలుచు తలం పుతో తమసేనలతో యుద్ధమునకు బయలువెడలుచుందురు. మొదటి దండయాత్రకు నిదియేమంచిసమయము. సుగ్రీవుడట్టి ప్రయత్నములో నున్నట్లు మనకు తోచుటలేదు. నాతోగూడ దండకావనమునకు వచ్చిన సీత హరింపబడుటచే వర్షాకాలము నాలుగుమాసములు నాకు నాలుగువందలసంవత్సరములవలె గనబడినవి. రాజ్యహీనుడను, భార్యావిహీనుడనునగు నాపై నీకపిరాజు దయజూపకున్నాడు. 'రాముడు రావణునిచే పరాభవమునొంది తనరాజ్యమును గోలుపోయి దీనుడై విదేశమున నివసించి కాముకుడై నన్ను శరణుబొందెనుగదా!'

---

గూర్చిన న్యాసమును మంత్రములతో జేయవలెను. తరువాత పంజర న్యాసముచేసి మంత్రన్యాసము జేయవలెను. ఈతీరుగ నాచరించినన్యాస ములచే నతడు మంత్రమూర్తియై ప్రతిమాదులయందుగూడ నిట్టిన్యాస ముల నాచరింపవలెను. తరువాత కలశను తనయెదుట నెడమప్రక్కను నుంచుకొని యర్ఘ్య పాద్య మధుప ర్కాచమనపాత్రలను నాల్గిటిని వేఱువేఱుగ నుంచవలెను. తరువాత తనహృదయ పద్మమందు సచ్చి దానందరూపుడనగు నన్ను తనతో నేకమైనవానిగధ్యానించి యాచి త్కలను తనదోసిలియందున్న పుష్పములందు వాయురూపమున ముక్కురంధ్రములనుండి ప్రవేశపెట్టవలెను. అట్టిపుష్పములయందు ప్రవేశపెట్టబడిన చిత్కలను ప్రతిమాదులందునుంచి యాప్రతిమయందు ధ్యానముచేసి పాద్య అర్ఘ్య ఆచమనీయ స్నాన వస్త్ర గంధ భూషణ పుష్ప ధూప దీప నివేదన తాంబూల నీరాజన మంత్రపుష్ప ప్రదక్షి ణాదులచే ప్రధానదేవతను పూజింపవలెను. ఐశ్వర్యమున్నయెడల కర్పూరము, కుంకుమ, అగరు, చందనము మొదలగుసుగంధద్రవ్య ములతోను, మంచివాసనగల శుభప్రదములగు పుష్పములతోను,

యని తలచుచున్న సుగ్రీవునివలన నేనవమానమునొందితిని. వాడు సీతను వెదకుటకు ప్రతిజ్ఞచేసి యందులకై బయలుదేఱుటకు తగిన కాలమును నిశ్చయించి నాచే తనపనిని జేయించుకొని తాను చేసిన నియమితకాలమును దుర్బుద్ధిచే నెఱుగకున్నాడు. లక్ష్మణా! నీవు కిష్కింధకుబోయి నీచసుఖముల ననుభవించుచు మూర్ఖుడుగనున్న సుగ్రీవునితో నిట్లనుము. 'ఇదివఱకు నీ కుపకారముచేసి యిప్పుడు నీప్రత్యుపకారమునుగోరుచున్న మాయాశలను జరుపకుండుటవలన నీవు లోకమున గొప్పపురుషాధముడవగుచున్నావు. తానుపలికిన మాట మంచిదైనను, చెడ్డదైనను దానిని నిజముగ జరుపువాడుత్తమ పురుషుడు. స్నేహితులచే తమపనులను జరిపించుకొని తిరిగి వారి కార్యములను జరుపనికృతఘ్నులు మరణమునొందినపుడు వారిమాంస మును జంతువులుగూడదినవు. నీవు రామునిప్రతాపమును, ధనస్సును, ధనుష్టంకారమును, మెఱుపుతోసమానమగుదానికాంతిని యుద్ధములో

---

మంత్రములతోను పూజింపవలెను. ఈశ్వరుడనగు నేను శ్రద్ధతో వాని నన్నిటిని ననుభవించెదను. పిమ్మట తంత్రమందు చెప్పబడిన యావరణ దేవతలను పూజించి మహానివేదన చేయవలెను. ప్రీతితోను, శ్రద్ధతోను, భక్తితోను నిచ్చిననీరైనను నాకు జాలును. భక్ష్యభోజ్యాదులనిచ్చిన వేఱెచెప్పనేల? మంత్రోపాసకుడు విధ్యుక్తముగ ప్రయత్నముతో హోమము జేయవలెను. ఎట్లన:—ఉపాసకుడు తంత్రములను విమర్శించి యగస్త్యసంహిత మొదలగు సంహితలయందు విధింపబడినరీతిగ నగ్ని కుండమును రచించి యక్కడ తాంత్రికాగ్నిని ప్రతిష్ఠాపనచేసి యందు మూలమంత్రములచేత చరువునుగాని, ఆజ్యహవిస్సునుగాని హోమము చేయవలెను. లేక ఔపాసనాగ్నియందు పురుషసూక్తముచే చరువును గాని, ఆజ్యహవిస్సునుగాని హోమమును చేయవలెను. ఆహోమకాలమందు నాయగ్నిమధ్యమందు పుటము పెట్టబడినబంగారమువంటి దేహకాంతి

'జూడఁగోరుచున్నావా? నీకు సాహాయ్యముచేసిన యాతనిపరాక్రమము నీకు బాగుగఁదెలిసినను నీకేమియు విచారము కలుగకున్నది. ఆతడెందునిమిత్తము నీతో సఖ్యముచేసెనో దానిసంగతి నీవు తెలిసికొనకున్నావు. నీవు వర్షాకాలాంతమున సీతాన్వేషణముజరిపెదనని యొప్పుకొని యిప్పుడిచ్చవచ్చినట్లు విహరించుచు కార్యమును దెలియకున్నావు. నీవు నీమంత్రులతోను, నీబంధువులతోను మధుపానముచేయుచు గ్రీడించుచు దీనులమగు మాయందు దయజూపకున్నావు.' ఇట్లు సుగ్రీవునితో బలికి యింకను నాప్రతాపముసంగతి వాని కిట్లు దెలుపుము. 'వాలి చరించిన ట్లధర్మమార్గమున జరింపకుము. నీప్రతిజ్ఞను నిలుపుకొనుము. ఒక్కబాణమున వాడు చంపబడెను. న్యాయముదప్పిన నిన్ను, నీబంధువులను రాముడు చంపును.' ఇట్లు తెలిపి నీవు చెప్పవలసినమాటలను జెప్పి సీతాన్వేషణకాలము మించకుండునటుల వానిని తొందరబెట్టుము." ఇట్లు రాముడు పలుక లక్ష్మణునకు గూడ సుగ్రీవునిపై గోపముప్పుట్టెను.

---

గలనన్ను దివ్యాభరణభూషితునిగ ధ్యానించి నాసేవకులగు నాంజనేయాదులకు భూతబలినిచ్చి హోమమును సమాప్తిజేయవలెను. ఆసనమున గూర్చుండి నామంత్రములను యథాశక్తిగ నన్ను ధ్యానము చేయుచు జపించి స్తుతిపాఠములనుజేసి సాష్టాంగనమస్కారము జేయవలెను. తరువాత ప్రసాదస్వీకారమునుజేసి 'ఓ దేవా! భయంకరమగు సంసారసాగరమునుండి నన్నుద్ధరింపు'మని ప్రార్థించి ప్రతిమాదులనుండి నన్నుద్వాసనచేసి హృదయమందు నిలుపుకొనవలెను. ఈ తీరుగ ప్రతిదినమందు నన్ను తనహృదయమందుగాని, యగ్నియందుగాని, విగ్రహములయందుగాని, సూర్యునియందుగాని, సాలగ్రామశిలయందుగాని తొందరపాటులేనివాడై పూజింపవలయును. అట్టి సాలగ్రామశిలాద్యులయందు నన్నావాహనచేసి షోడశోపచారములచే

అప్పు డతడు తనయన్న కిట్లు విన్నవించెను. 'మనకార్యము జరుపకపోవుటచే నీకపిరాజు మంచిమార్గమున జరింపడు. నెఱవేర్చ బడినతనపనులను నాలోచింపడు. తనవానరరాజ్యమునుగూడ ననుభ వింపడు. మతిపోవుటచే వాడు నీచసుఖముల ననుభవించుచు మన కుపకారము చేయదలపని మనస్సుగలిగియున్నాడు. వాడుగూడ మీాచే తనయన్నవలె జంపబడును. అట్టివానికి రాజ్యముండగూడదు. నాకు గలిగినయీాగొప్పకోపమును నేను బట్టలేను. అసత్యముజరిపిన

---

బూజింపవలయును. సాలగ్రామశిలాదులందైన నభిషేకము చేయ వలెను. ప్రతిమాదులందైన పత్రపుష్పాదులతో మార్జనము (నీటిని జల్లుట) చేయవలెను. విగ్రహాదులందైన భూషణవస్త్రాద్యలంకారము లను జేయవలెను. అగ్నియందైన హోమము చేయవలెను. హృదయ మందైన ధ్యానముమొదలు సర్వము మనఃకల్పితమగు పదార్థముల చేతనే పూజింపవలెను. సూర్యునియందైన మట్టితో చిన్నతిన్నె వేసి దానిపై సూర్యయంత్రమును వేసి యాయంత్రమందు పూజింపవలెను. ఇట్లు పూజించువా డిహపరలోకములందు సర్వసిద్ధులను బొందినవాడై నాసారూప్యమును బొందును. లక్ష్మణా! యిది రహస్యమైనది. దీనిని నేను నీకు స్వయముగ జెప్పితిని." ఇట్లు రాముడు లక్ష్మణునకు బోధించెను.

రాముడన్నియు తెలిసినవాడును, నెల్లప్పుడు నెడతెగనిమాయా శక్తిగలవాడును, విజ్ఞానస్వరూపుడునునైనను సీతనుగూర్చి సామాన్య

---

ఆంధ్రభాగవతము సప్తమస్కంధము 453గద్యమున 'గతత్రేతాయుగమున మాత్రమే పరస్పరపాత్రంబులకు సహింపని మనుష్యులకు పూజనార్థంబుగా హరి ప్రతిమలు కల్పింపబడిన'వని తెలుపబడినది. దీనినిబట్టి యీాపూజావిధానము కోటి సంవత్సరములక్రిందట జీవించినరామునికాలమునాటిదికాదనియు, గతద్వాపరమున జన్మించిన వ్యాసుని పేరయీాగ్రంథమున వివరింపబడుటచే నిది యిటీవలిగ్రంథ మనియు మేమూహించెదము.

యానుగ్రీవుని నేను జంపెదను. మీరు హనుమంతునిచేతను, నితర వానరవీరులచేతను సీతను వెదకింపుడు.' ఇట్లు లక్ష్మణుడు పలికి తన ధనస్సునుబట్టుకొని కోపముతో యుద్ధమునకు బయలుదేఱ రాము డాతనికి మంచినీతి నిట్లు బోధించెను. "నీవంటివాడు పాపము జేయగూడదు. స్నేహితులను జంపుటయను పాపమును జేయక మంచిబుద్ధితో నుండువా డుత్తమపురుషుడు. నీవు పాపకార్యమును జేయక

---

మనుష్యుడు సామాన్యస్త్రీనిగుఱించి విచారించునటుల విచారించెను. మాయయొక్క కార్యములను తప్పించుకొని తిరుగువాడును, బుద్ధిమొద లగువానికి సాక్షిభూతుడును, రాగాదిరహితుడునునగు నతనికి రాగా దులవలనగలుగు దుఃఖము మొదలగునవి యెట్లు సంభవించెననగా విష్ణువు బ్రహ్మపలికినమాటలను సత్యముగ జరుపుటకును, దశరథుని తపస్సు ఫలింపజేయుటకును మనుష్యరూపమును ధరించి జన్మించెను. మఱియు నతడు 'అజ్ఞానముగల జనులందఱు మాయచే మోహింప బడిరి. వీరికి మోక్షమెట్లుకలుగు'నని యాలోచించి పాపములనన్నిటిని బోగొట్టు రామాయణకథను లోకములో వ్యాపింపజేయు కొఱకు రామునిగ నవతరించి మనుష్యచేష్టలను జేయుచు వ్యవహారసిద్ధికొఱకు క్రోధ మోహ కామగుణములను నాయాకాలములకు తగినట్లుపొంది తనకు గుణములు లేకపోయినను ననేకగుణములుగలవానిగ గనబడుచు నస్వతంత్రులగు ప్రజలను మోహింపజేసెను. అతడు విజ్ఞానస్వరూపు డును, విజ్ఞానశక్తిగలవాడును, సాక్షిభూతుడును, గుణములు లేని వాడును నగుటచే నాకాశమునకు నేదియునంటనటుల కామాది గుణము లాతని నంటవు. ఇట్టివాడైనను నీ రాముని సనకాదిమునీశ్వరు లును, పరిశుభ్రమగునాత్మగలయతనిభక్తులును సరిగ నెఱుగుదురు. వారిచిత్తములననుసరించి భగవంతుడు జన్మాదులులేనివాడయ్యు పుట్టి చుండును.

పూర్వము మనకు సుగ్రీవునియెడ గలిగిన స్నేహబుద్ధినిజూపుము. నీవు కఠినోక్తులను విడిచి మంచిమాటలతో 'కాలవిలంబమైన'దని తెలియ బలుకుము." ఇట్లు రామునిచే లక్ష్మణుడు బోధింపబడి కిష్కింధకు వెడలెను.

---

## ౩౧వ. అధ్యాయము. లక్ష్మణుడు కిష్కింధలో నిలుచుట.

రాముని యాజ్ఞననుసరించి లక్ష్మణుడు ప్రస్రవణగిరిని విడిచి కిష్కింధకు వెడలుచు పెద్దధనస్సును బట్టుకొని సుగ్రీవునితో దానుచెప్ప వలసినసంగతులను, దిరిగి వాడిచ్చుజవాబులను బృహస్పతివలె దెలిసిన వాడయ్యె సుగ్రీవునివిలంబమునకు మిక్కిలి కోపించి వడిగ బోవుచు కొండమీదిపెద్దచెట్ల నిటునటు త్రోయుచు రాళ్లను పాదములతో ముక్కలుజేయుచు దొందరగ నొక్క దాటున గిష్కింధగుహదగ్గఱకు వెళ్లెను. అక్కడ గొప్పబలముగల వానరు లనేకు లుండిరి. వారు లక్ష్మణునికోపమును, వానిశీఘ్రగమనమును జూచి మఱియొకపర్వత శిఖరమునకును, పెద్దచెట్లమీదికిని బరుగెత్తుకొనిపోయి రాళ్ళు మొదలగువానిని బట్టియుండిరి. లక్ష్మణుడు దానిని జూచి యెక్కువకోపము నొందెను. కొందఱు వానరులు జడిసి నలుదిక్కులకు బాఱిపోయిరి. వానరశ్రేష్ఠులుకొందఱు నగరులోనికి బోయి సుగ్రీవునకు లక్ష్మణుడు కోపముతోవచ్చుచుండుటను దెల్పిరి. అప్పుడాతడు తారతోను, రుమతోను మదలోలాసక్తుడై నిద్రించియుండుటచే వారిమాటలను వినలేదు. తరువాత మంత్రులయాజ్ఞవలన గొప్పబలముగలకపివీరులు చెట్లనుబట్టుకొని కిష్కింధలో నిలిచిరి. లక్ష్మణుడు కిష్కింధలో బట్టణద్వారమువద్ద సుగ్రీవునివిలంబమును, దనయన్నవిచారమును దలచి కోపముతో వేడినిట్టూర్పు దీయుచు కండ్లెఱ్ఱజేసి తనవిల్లును బట్టుకొని

యుండ వానిని జూచి భయముతో నంగదు డక్కడకు వచ్చి నిలచి యుండెను. అంతట లక్ష్మణుడు వానితో 'నేను సుగ్రీవునినిమిత్తము వచ్చితిని. ఈసంగతి వానికి నిశ్చయముగ దెల్పుము. నామాటలను జరుపుటయందు నతనికిష్టమున్న యెడల నేను గోరినవాని నతడు జరుపవలెనని పలుకుము. తరువాత నీవిక్కడికి శీఘ్రముగ రా'మ్మనిచెప్ప నంగదుడు తొందరగా దనపినతండ్రియొద్దకు బోయి విచారముతో నాతనికాళ్లకు నమస్కరించెను. తరువాత నతడు తారారుమలపాదము లకు మ్రొక్కి జరిగినసంగతి వారికి దెలిపెను. సుగ్రీవుడు మత్తుడై గాఢ నిద్రలోనుండి తెలివిలేకయుండెను. లక్ష్మణునిజూచి భయమునందిన వానరు లాతనిని సంతోషపెట్టుటకు కిలకిలశబ్దమును, సింహనాదమును జేసిరి. ఆధ్వనితో సుగ్రీవునకు దెలివివచ్చెను. వానికండ్లు మిక్కిలి యెఱ్ఱగనుండి తిరుగుచుండెను. వానిశరీరమునందున్న యలంకారము లును, బూలదండలును కదలుచుండెను. అంతఃపురములోనికి బోవుటకు దగిన ప్లక్షుడు, ప్రభావుడు నను మంత్రులిద్ద అంగదునిమాటలు విని సుగ్రీవునకు లక్ష్మణునిరాకను బెద్దధ్వనితో దెల్పిరి. సుగ్రీవుడు కూర్చుండియుండ వారు మంచిమాటలను బలుకుచు 'లక్ష్మణుడు కోప ముతో నందఱిని దహింప సిద్ధముగనున్నాడు. మీరును, మీబంధువు లును నతనియొద్దకు బోయి యతనిపాదములకు నమస్కరించి యతని కోపమును బోగొట్టి రాము డిదివరలో సెలవిచ్చినప్రకారముగా జరిపి సత్యపరిపాలకులరై మీరు న్యాయమును నిలుపుకొను'డని మనవిచేసిరి.

వారిమాటలను విని సుగ్రీవుడు తనయాసనమున భయముచే గంపించెను. అతడు మంత్రులలోబుద్ధిమంతులగువారిని బిలిపించి మంచి చెడ్డలను బాగుగ నాలోచించి వారికి దనయభిప్రాయ మిట్లు దెల్పెను. 'లక్ష్మణునిగూర్చి నేనేమియు జెడుగుపలుకలేదు. చెడ్డపనులను జేయ లేదు. ఆతడేలకోపించెనో యని యాలోచించుచున్నాను. నాకయిష్టు

లయినవారు నాలోలేనిలోపములను వేనినో నాయందారోపించి యత నితో బలికియుందురు. మీరందఱు బాగుగనాలోచించి మీనిశ్చి తాభిప్రాయమును మెల్లగ నాకు దెలుపుడు. నాకు నిజముగ లక్ష్మణుని వలనను, రామునివలననుగూడ భయములేదు. స్నేహితు డకారణ ముగా గోపించినందులకు నాకు తొందర కలుగుచున్నది. స్నేహము జేయుట సులభమేగాని యాస్నేహమును నిలుపుకొనుటకష్టము. మనస్సు చంచలమైనదగుటచే స్వల్పాపరాధమునైన సహింపక భేదము నొందు చుండును. రాముడు నాకు జేసినయుపకారమునకు నేను ప్రత్యుప కారము చేయలేకపోయినందున నతనివలన నాకు భయముకలుగు చున్నది.' ఇట్లు సుగ్రీవుడు పలుక మంత్రిలలో శ్రేష్ఠుడగు హనుమం తుడు "రాముడు మీకు జేసినయుపకారము మీరు మఱువకుండుట యన్నివిధముల నాశ్చర్యకరముగాదు. అతడు భయమును విడిచి మీమేలుకొఱకు నింద్రతుల్యుడగు వాలిని జంపెను. రాముడు క్రుద్ధుడై నను మీయందలిదయచే లక్ష్మణుని మీయొద్దకు బంపెను. దీనికి సందేహములేదు. మీరు ప్రమత్తులై శరత్కాలము ప్రవేశించిన సంగతి తెలిసికొనకున్నారు. ఆకాశమున గ్రహనక్షత్రములు నిర్మల ముగనున్నవి. మేఘములు లేవు. దిక్కులు ప్రకాశముగ నున్నవి. నదులు, సరస్సులు దాటుటకు వీలుగ నున్నవి. మీరు యుద్ధ యాత్రకు వెడలుకాలమును దెలియకున్నారు. ఆసంగతిదెలిసికొని లక్ష్మణు డిక్కడకు వచ్చెను. రాముడు భార్యావియోగముచే బల్కినపలుకులను లక్ష్మణుడు మీకు దెలిపిన మీరు వానినోర్చి యుండవలెను. మీరు చేసినయపకారమునకు లక్ష్మణునకు మీరు నమస్కరించి యాతనిదయను బొందుటయే యుత్తమము. తగిన మంత్రులు కాలోచితముగ రాజునకు దగినయాలోచనను జెప్పవలెను. కనుక నేను నానిశ్చితాభిప్రాయమును దెలుపుచున్నాను. రామునకు

గోపమువచ్చిన నాతడు ధనస్సును బట్టి దేవతలను, వసువులను, గంధర్వులను, నితరలోకముల నన్నిటినిగూడ జయించును. పూర్వోప కారము జ్ఞాపకముతెచ్చికొని కృతజ్ఞతజూపవలసినమీ రాతనికి దయ కలుగునట్లు వర్తింపుడు. అతనికి గోపముకలిగించుట మీకు మంచిది కాదు. మీరును, మీపుత్రులును, మీస్నేహితులును నాతనిపాదము లకు నమస్కరించి యాతనిని వశపఱచుకొనుఁ"డని సలహా యిచ్చెను.

ఇట్టిసమయమున బట్టణములోనికి రమ్మని పిలువబడిన లక్ష్మణు నకు బలశాలురగు ద్వారపాలకులు పట్టణద్వారమునొద్ద చేతులు జోడించుకొని నమస్కరించిరి. అత డాద్వారమును దాటి మేడలను జూచుచు వెడలుచుండెను. అవి ధనధాన్యములతోను, స్త్రీరత్నముల తోను నిండియుండెను. తరువాత నతడు సుగ్రీవునినగరముప్రక్కకు వెళ్ళెను. నగరుద్వారములవద్ద బలవంతులగు వానరులు శస్త్రములను బట్టుకొని కాపుండిరి. ఎవ్వరును లక్ష్మణుని నడ్డలేదు. అనగ రేడు ప్రాకారములు గలిగి జనులతో నిండియుండెను. లక్ష్మణుడు వాని నన్నిటిని దాటి యంతఃపురమునకు వెళ్లెను. అక్కడ బంగారముతోను, వెండితోను జతిగింపబడిన పక్కలును, మంచిచర్మములుమొదలగు వానితో నేర్పఱుపబడిన యాసనములును నుండెను. మధురమగు స్వరములతో వీణాదులధ్వనులు బాగుగ వినబడుచుండెను. అక్కడ వానికి మంచిరూపయౌవనులును, మంచిమాల్యములను సిద్ధముచేయు వారును, ఫలములను, మాల్యములను గొనియున్నవారును, మంచి భూషణములు ధరించినవారును, మంచిబట్టలు కట్టుకొనినవారునునగు పరిచారకులు కనబడిరి. సుగ్రీవుడు స్త్రీభోగములలో మునిగియుండెను. లక్ష్మణుడు కోపముతో ధనస్సును శబ్దముచేయుంచి యేకాంతస్థలమున నిలిచియుండెను. ఆశబ్దముచే నాసుగ్రీవు డంగదుడు తనతో జెప్పిన ప్రకారము లక్ష్మణు డక్కడికి వచ్చెనని దెలిసికొని మిక్కిలిజడిసి తన

యాసనమునుండి చలించెను. వానిముఖము వాడిపోయెను. అప్పుడు సుగ్రీవుడు తనమనస్సు చలించుచుండ తారతో 'లక్ష్మణుడు సహజముగ మెత్తనిమనస్సుకలవాడు; కోపములేనివాడు. ఇత డేకారణమున నిట్లు రోషముతో నిక్కడకు వచ్చెను. ఇతడు నిష్కారణముగా గోపము నొందుచున్నాడు. మనమాతనికి జేసినయప్రియ మేదైననున్నట్లు నీకుదెలిసియుండినచో నీవు శీఘ్రముగ నాకు దెల్పుము. లేక,నీవు స్వయముగ నాతనియొద్దకు బోయి మంచిమాటలచే నాతనిమనస్సు కరుగునట్లు జేయుము. అతడు నిర్మలమగు మనస్సుకలవాడు; గాన నిన్ను జూచినతోడనే కోపమును బొందడు. మహాత్ములు స్త్రీలకు దారుణాపునులేమియు జేయరు. ఇట్లు నీ వతని మనస్సునకు సంతోషము కలుగజేసినతరువాత నే నతని యొద్దకు బోయెద'నని పలికెను.

సుగ్రీవునిమాటలను తార విని తొట్రుపాటుతో నడుగులు వేయుచు మదముచేజలించు నేత్రములు, నణకువగల శరీరావయవములు గలదై బంగారుమొలనూలును, మెడలోనిహారములును వ్రేలాడుచుండ లక్ష్మణునిసమీపమునకు వెళ్లెను. అత డామెను జూచి సిగ్గుతో దలవంచుకొని యాడుది కనిపించుటచే గోపమును విడిచియుండెను. మధుపానముచేయుటచే నామెకు సిగ్గుతొలగిపోయెను. లక్ష్మణు డామెను దయతో జూచుచుండుట గాంచి యామె గుంభనమగు వాక్యములను వానికి దయకలుగునట్టిట్లు పలికెను. 'మీకు గోపమేల వచ్చెను? మీయాజ్ఞప్రకార మెవరు ప్రవర్తింపరు? మీకోపాగ్ని యెదుటపడినదానిని దహింపకుండునా?' తార పలికిన యీమాటలను లక్ష్మణుడు విని యిట్లు పలికెను. "నీభర్త ధర్మార్థములను విడిచి కామముల ననుభవించుచు తనప్రభుకార్యముజరుపకుండుట నీవేల తెలిసికొనకున్నావు? అతడు రాజకార్యములను విడిచి శోకములో మునిగిన మాసంగతి యేమియు నాలోచింపక తాను దనమంత్రులు మొద

లెగువారితో మద్యపానముచేయుచున్నాడు. అతడు నాలుగు మాసములు వ్యవధినిర్ణయించి యావ్యవధిగడచినను మత్తతచే విహరించుచు నేమియు దెలియకున్నాడు. ధర్మార్థములు సిద్ధించుటకు మధుపానము మంచిదికాదు. దానివలన ధర్మార్థములు క్షీణించును. ఉపకారికి ప్రత్యుపకారము చేయకపోయినచో గొప్పధర్మలోపమును, నందునవలన గుణవంతులగు స్నేహితులకు గొప్పకష్టములును, ననర్థములును సంభవించును. సత్యధర్మములుగలవాడును,నర్థకామములలాభముకంటె నెక్కునగువాడుననగు మిత్రుని విడుచుటచే సుగ్రీవుడు ధర్మార్థకామములను విడిచినవా డగును. కార్యముల నిజస్థితి నీవెఱిగిన దానవు. ఇప్పుడు మేము చేయవలసినకార్యమును నీవు తెలుపుము." ఇట్లు లక్ష్మణుడు పలుక తార రామునికార్యమునెఱవేర్పువిషయమై నమ్మకముకలుగునటుల తిరుగ నిట్లు పలికెను. "రాజకుమారా! కోపించుట కిది సమయముకాదు. తనవారివిషయమై గొప్పకోపమును బొందకూడదు. మీకార్యసాఫల్యముగోరు జనులయందు దప్పులున్నను మీరోర్చి యుండవలెను. కోపమననది యేమియు గొప్పగుణముకాదు; బలహీనులు కోపమును జూపెదరు. సత్త్వగుణముకలవారును, శాంతస్వరూపులుననగు మీవంటివారు కోపమునకు లోనై యేలయుండెదరు? రామునిరోషమును, కార్యవిలంబమును, మీరు మమ్మ గూర్చి జరిపిన గొప్పకార్యములను నిప్పుడు చేయవలసినకార్యమును నేనెఱుగుదును. సుగ్రీవునకు గలిగిన గొప్పమన్మథపీడను, నత డెవరితో భోగించుచున్నాడో వారిని నేనెఱుగుదును. మీకు గామభోగములందు మనస్సులేదు; కనుక మీరు గొప్ప కోపమునొందియున్నారు. కామాభిలాషగల మనుష్యుడు దేశకాలములను, ధర్మాధర్మములను జూడడు. కామవృత్తిలో మునిగి సిగ్గునువిడిచియున్న వానరరాజగు మీసుగ్రీవమిత్రుని క్షమింపుడు. తపోధర్మములయందునిష్ఠగల మహా

ష్ఠులుగూడ మోహముకలిగినప్పుడు గొప్పకామసుఖములననుభవింతురు. అట్టిచో సహజముగ చపలుడును, వానరుడుననగు నీసుగ్రీవుడు సుఖములలో నేలములిగియుండడు?" ఇట్లు తార పలికి తనభర్త కనుకూలమగునట్లు మఱికొన్నిమాటల నిట్లు పలికెను. 'మీకోరికప్రకారము కార్యము జరుపుటకు సుగ్రీవు డిదివరలో చాలకాలము క్రిందట ప్రయత్నము చేసియున్నాడు. పర్వతనివాసులును, గామరూపులును, గొప్ప వీర్యముగలవారుననగు వానరు లనేకకోట్లు వచ్చియున్నారు. మీరు సత్పురుషులుగనుక నితరులభార్యలను జూచినను దోషములేదు. నాతో మీ రంతఃపురములోనికి వేగముగ రండు.' ఇట్లు తారపలుక నామెతో లక్ష్మణుడు లోనికిబోయెను. అక్కడ సుగ్రీవుడు చక్కనిబంగారపు టాసనముపై రుమను నాలింగనముచేసికొని కండ్లెఱ్ఱనైయుండ సూర్యునివలె దేజరిల్లుచు మంచిబట్టను, నాభరణములను, మంచిమాల్యములను ధరించి సుగంధద్రవ్యములను బూసికొని యితరస్త్రీలమధ్యనుండెను. వానిని జూడ లక్ష్మణునకు గొప్పకోపమువచ్చెను. అతడు నిట్టూర్పుదీయుచు గండ్లెఱ్ఱజేసెను.

అంతట సుగ్రీవుడు లక్ష్మణుని జూచి తనయింద్రియములు చలింప నాసనమునుండి దిగి వెంటనే పైకివచ్చెను. రుమయు నితరస్త్రీలుగూడ నాయాసమును విడిచిరి. సుగ్రీవుడు వణకుచు లక్ష్మణుని యెదుట గొప్పకల్పవృక్షమువలె నిలిచి యాతనికి నమస్కరించెను. అప్పుడు లక్ష్మణుడు "మంచివంశమునబుట్టినవాడును, దయగలవాడును, నింద్రియనిగ్రహముకలవాడును, సత్యవచనుడును, గృతజ్ఞుడుననగు రాజు లోకమున గౌరవమునొందును. ఉపకారముజేసినస్నేహితులవిషయమై యధర్మముగ సంచరించువాడును, నబద్ధప్రతిజ్ఞచేయువాడుననగు రాజుకంటె మిక్కిలిక్రూరు డెక్కడను నుండడు. పూర్వము స్నేహితుల వలన నుపకారమును బొంది దానికి బ్రత్యుపకారము జేయనివా డన్ని

భూతములకు గృతఘ్నుడును, జంపతగినవాడును నగును. నీవు మర్యాద హీనుడవు; కృతఘ్నుడవు; అబద్ధపుమాటలను బలుకువాడవు. రాముని వలన పూర్వము నీ వుపకారమునుబొంది దానికి బ్రత్యుపకారమును జేయకున్నావు. నీ వాయుపకారమును దలచి దానిని నెఱవేర్చుటకు సీతను వెతకుబ్రయత్నము చేయవలయును. నీవు నీచభోగములననుభవించుటయందాసక్తికలవాడవును, నబద్ధపుప్రతిజ్ఞగలవాడవునునై యున్నావు. పైకి నమాయకముగ గనిపించు నీవు క్రూరుడ వనుసంగతి రాముడు తెలిసికొనలేకపోయెను. పాపుడవును, దురాత్ముడవునునగు నీకు మహాత్ముడును,దయాసముద్రుడునునగు రాముడువానరరాజ్యమును సమర్పించెను. అతడుచేసినమేలును నీవు తెలిసికొనకుండిన నిప్పుడే యతని బాణములచే జీల్చబడి యమపురికి బోయెదవు; కాన నీవు వాలిత్రోవన సంచరింపక నీప్రతిజ్ఞను నెఱవేర్చుకొను"మని సెలవిచ్చెను.

అప్పుడు తార "లక్ష్మణా! మీరిట్లు కఠినోక్తుల నాడకూడదు. మీవలన నిట్టిమాటలను సుగ్రీవుడు వినతగినవాడు కాడు. అతడు కృతజ్ఞతలేనివాడుకాని, లోలోపల నప్రియముల జేయువాడుగాని, దారుణుడుగాని, యబద్ధపుమాటలుపలుకువాడుకాని, కుటిలుడుగాని కాడు. ఇతరులు యుద్ధములో జూపలేనిపరాక్రమమును జూపిన రాముని యుపకారమును నితడు మఱువలేదు. రామునికరుణావలననే యితనికి గొప్పకీర్తియు, శాశ్వతమగుకపిరాజ్యమును, రుమయు, నేనును లభించితిమి. పూర్వమితడు గొప్పదుఃఖముల ననుభవించి యిప్పుడు సుఖములను బొంది నిద్రించి నిర్ణయకాలము నెఱుగకుండెను. పూర్వము ధర్మాత్ముడగు విశ్వామిత్రఋషి మేనకతో బదిసంవత్సరములు భోగముల ననుభవించి కాలము తెలియక దాని నొకరోజుగ భావించెను. అట్టిచో నితరులసంగతి వేఱె చెప్పనేల? సుగ్రీవుని క్షమింపుడు. అతడు చేసినయత్నమును గనుగొనకుండ మీరు రోషమును బొంద

కూడదు. బలవంతులగు మీవంటిపురుషు లాలోచింపకుండ తొందరగ రోషమునొందరు. సుగ్రీవునిగూర్చి మిమ్ము వేడెదను. గొప్ప రోషమువలనగలిగిన మీతొందరను విడువుడు. సుగ్రీవుడు కపిరాజ్యమును, ధనధాన్యములను, రుమను, నన్నునుగూడ రామునిప్రీతికొఱకు విడువసిద్ధముగ నున్నాడు. అతడు రావణుని యుద్ధములోజంపించి సీతను రామునకై తీసికొనివచ్చును. లంకలో బలవంతులును, గామరూపులుననగు రాక్షసు లనేకకోట్లున్నారు. వారిని సుగ్రీవుని సహాయముచే జంపినగాని రావణుని జంపవీలులేదు. ఈసంగతి వాలి నాతో జెప్పియుండెను. వానికి లంకసంగతి బాగుగ తెలియును; కాని సీతనుదెచ్చుమార్గ మతడు నాతో జెప్పియుండలేదు. మీసహాయమునకై మహాబలులగు వానరులను, వానరయూధములను దీసికొనివచ్చుటకు వానరవీరులు వెళ్లియున్నారు. వారిరాక నిరీక్షించుచు సుగ్రీవుడు యుద్ధయాత్రకు బయలుదేఱుకున్నాడు. ఇదివరకు నిర్ణయించినప్రకార మీదినమున వానరులు వచ్చెదరు. ఎలుగుబంట్లవంటి రూపముగలవారనేకకోట్లును, గోపుచ్ఛలును, దేజోవంతులగువానరులును నీదినమున మీయొద్దకు వచ్చెదరు. మీరు కోపమును వీడుడు. క్రోధముతోనున్న మీముఖమును సుగ్రీవునిభార్యలమగు మేము చూచి యతనిప్రాణములనుగూర్చి భయమునొంది మనశ్శాంతినొందకున్నా" మని లక్ష్మణునకు ప్రత్యుత్తర మిచ్చెను. ఆమెమాటలను మృదుస్వభావముగల లక్ష్మణు డంగీకరించెను.

అప్పుడు సుగ్రీవు డతనివలన భయమును విడిచి తనమెడలోనున్న పువ్వులదండలను తెంచిపాఱవైచి మత్తతలేనివాడై సంతోషముతో లక్ష్మణునితో నిట్లనెను. 'పోయినసిరియు, కీర్తియు, శాశ్వతమగుకపిరాజ్యమును రామునికరుణచే నాకు దిరుగ ప్రాప్తించెను. గొప్పపరాక్రమముగలవాడును, దేవస్వరూపుడుననగు నాతనికి వ్యతి

లేకముగ వెళ్ళుట కెవనికి శక్తి కలదు? నేను వేరునకు సహాయముగ నుండెదను; గాని ధర్మాత్ముడగు నారాముడు తన తేజముచే రావణుని జంపి సీతను బొందగలడు. ఆతనిప్రతాప మిదివఱకే నేను జూచియుంటిని. రావణుని, వానిబంధువులను, ననుచరులను జంపుటకు వెళ్లుచున్న రామునితోగూడ నేను లంకకు దండయాత్రకు బోయెదను. దాసుడనగు నేను విశ్వాసముచేతగాని, స్నేహముచేతగాని, యేమి తప్పుచేసినను క్షమింపవేడెదను. తప్పుచేయని సేవకులే యుండరు.' ఇట్లు సుగ్రీవుడు పలుక లక్ష్మణుడు సంతోషముబొంది ప్రేమతో నిట్లు పలికెను. 'నీవు ప్రభావముచేతను, శుచిచేతను, ఋజుమార్గముచేతను వానరరాజ్యలక్ష్మిని బాగుగ ననుభవింప తగియున్నావు. నీసాహాయ్యముచే రాముడు శీఘ్రముగ శత్రువులను జంపగలుగుట కనుమానము లేదు. నీవు ధర్మము తెలిసినవాడవు; కృతజ్ఞుడవు; యుద్ధములో వెనుదిరుగనివాడవు. నీవు పలికినది మిక్కిలియుక్తముగ నున్నది. నాయన్నతరువాత విద్వాంసుడవు నీవే. నీవు రామునివలె విక్రమమును, బలమును గలిగియున్నావు. దైవయోగమున నీసాహాయ్యముమాకు దొరికెను. నీ విక్కడనుండి నాతోగూడ బయలుదేఱి నీసఖుడగు రాముని నోదార్పుము. ఆతడు నాతోజెప్పినకఠినపుమాటలను నీతో బలికినందులకు క్షమింపుము.' ఇట్లు లక్ష్మణుడు పలుక సుగ్రీవుడు తనప్రక్కనున్న హనుమంతుని బిలిచి వానికి ట్లాజ్ఞాపించెను. 'మనవానరులు జగత్తులో నంతటనున్నారు. వారలనందఱిని బిలుచుటకు వానరులను బంపుము. మంచిమాటలతోను, బహుమానములతోను వారిని సంతోషముగ రప్పింపుము. ఇదివఱకు వానరులను బిలుచుటకు గొందఱు వెళ్ళియున్నారు. వారినిగూడ దొందరపెట్టి రప్పింపుము. ఇష్టమువచ్చినట్లు సుఖములననుభవించువారిని,విలంబముగకార్యములుచేయువారినిముఖ్యముగ దొందరపెట్టుము. నాయాజ్ఞప్రకార మందఱును శీఘ్రముగ రావల

యును. పదిరోజులలో రానివారుమరణదండనకు పాత్రులగుదురు. వానరులను బిలుచుట కిక్కడనుండి యనేకు లన్నిదిక్కులకును బోవలయును.' ఇట్లు సుగ్రీవు డాజ్ఞాపింప హనుమంతుడు వానరుల నట్లు పంపెను. వా రాకాశమార్గమున బోయి వానరుల నందఱిని బిలిచిరి. ముందుగ బిలుచుటకు వెళ్ళినవానరులు హిమవత్పర్వతమును, నక్కడ శివుడు యజ్ఞముచేసినచోటును జూచి యజ్ఞద్రవ్యములు పడుటచే నక్కడ పుట్టిన మూలములను, మంచిఫలములను, మంచియోషధులను, మంచి పువ్వులను దెచ్చి సుగ్రీవునకు సమర్పించిరి. వీరు తాముపిలిచినవానరులును, వారినాయకులును రాకపూర్వమే సుగ్రీవునియొద్దకు వచ్చినిల్చిరి. దీనికి సుగ్రీవుడు మిక్కిలిసంతోషించి యావానరులకు వారియిండ్లకు బోవుటకు సెలవిచ్చి రామునికార్యము, తనకార్యము నెఱవేఱునని సంతోషించెను. లక్ష్మణుడుకూడ సంతోషించి సుగ్రీవునితో 'నీకిష్టమైన మనము కిష్కింధనుండి బయలుదేఱుద'మని పలికెను. ఆమాటలు విని సుగ్రీవుడు మిక్కిలిసంతోషముతో 'అట్లేయగుగాక! మీయాజ్ఞాప్రకారము పోవుద'మని చెప్పి తార మొదలగు భార్యలకు సెలవిచ్చి యక్కడనుండు వానరులకు మంచిసవారీని సిద్ధముచేయుటకు నాజ్ఞయిచ్చెను. అంతట వారు మంచిబంగారుతోమలిచిన సవారీని వేగముగ సిద్ధముచేసి దానినిమోయువారినిగూడ సిద్ధముచేసిరి. దానిలో లక్ష్మణుడును, సుగ్రీవుడును గూర్చుండిరి. సవారీనడచుచుండ వానరులు సుగ్రీవునకు దెల్లనిఛత్రముసు బట్టిరి; వింజామరలతో వీచిరి. అప్పుడు శంఖభేరీలశబ్దములు వ్యాపించెను. అనేక వానరులు శస్త్రములనుబట్టుకొని ముందునడిచిరి. ఇట్లు వారు రాముఁడుండు ప్రస్రవణగిరికి వెడలిరి.

---

## ౯వ. అధ్యాయము.

### సుగ్రీవుడు రాముని దర్శించి వానరులను సీతను వెదకుటకు బంపుట.

సుగ్రీవుడును, లక్ష్మణుడును ప్రస్రవణగిరిపై రాముడుండు చోటికి సవారీపై వెళ్లి యక్కడ దిగిరి. ఆకపిరాజును, వానరులును చేతులుజోడించుకొని రామునిదగ్గఱకు వెళ్ళిరి. రాము డాగొప్పసైన్యమునుజూచి సంతోషించెను. రాముడు తనకాళ్లమీదబడినసుగ్రీవుని లేవనెత్తి ప్రేమతోను, మర్యాదతోను వానిని కౌగిలించుకొని 'కూర్చుండు'మని యనెను. తరువాత నతడు వానితో 'కాలమునను సరించి ధర్మార్థకామములనాచరించు వాడే తగినరాజు. మొదటి రెండింటినివిడిచి మూడవదియగు కామము నాచరించువాడు చెట్టుచివరను నిద్రించి క్రిందబడువానివలె నగును. శత్రువులను వధించుటయందును, మిత్రులను సంపాదించుటయందును శ్రద్ధకలిగి యీమూడిటిని జరుపు రాజు ధర్మయుక్తుడగును. ఇప్పుడు వానరులను బంపుసమయము వచ్చినది. నీమంత్రులతో నాలోచింపు'మని చెప్పెను. అప్పుడు సుగ్రీవు డాతనితో 'పోయిననాసిరిని, కీర్తిని, శాశ్వతమగు నీకపిరాజ్యమును మీయన్నదమ్ములదయవలన నేను తిరుగబొందితిని. ఉపకారమునకు ప్రత్యుపకారముచేయనివాడు మనుష్యులలో దూషణకుపాత్రుడగును. బలవంతులగు నీవానరముఖ్యులు మిగిలిన వానరులనందఱిని బిలుచుకొనివచ్చిరి. ఘోరస్వరూపులును, శూరులును, కొండలను, నడవులను నెఱిగినవారును, నెలుగుబంట్లవంటి రూపముగలవారును, గోపుచ్ఛులనేకులును వచ్చి మనకు శ్రేవను జూపెదరు. లెక్కకుమీఱినవానర నాయకులు తమసైన్యములతో వచ్చుచున్నారు. వీరితో మీరు వెళ్లి రావణుని, వానిబంధువులను జంపి సీతను దీసికొనిరాగల'రని మనవి చేయ వికసించిననల్లకలువలవంటి కాంతిగలరాముడు మిక్కిలి సంతో-

పించెను. తరువాత నారాముడు వానిని గౌగిలించుకొని 'ఇంద్రుడు వర్షించుటయు, సూర్యుడు చీకటిని బోగొట్టుటయు, జంద్రుడు భూమిపై చల్లనికిరణములను బ్రసరింపజేయుటయు నీవు ప్రత్యుపకారముజేయుటయు మీాసహజగుణములు. నీవు ప్రియముల బలుకువాడవు. నీసాహాయ్యముచే నేను శత్రువులను జయించెదను. నీవు నాకు సహాయముచేయవలెను. తనమరణమునకై సీతనెత్తుకొనిపోయిన రావణుని శీఘ్రముగ వాడిబాణములచే నంతమునొందించెద'నని సెలవిచ్చెను.

అట్టిసమయమున ననేకవానరులును, వారినాయకులును, నచటికి వచ్చుటచే భూమినుండి యెక్కువగనెగిరినధూళి యాకాశముననుండు సూర్యకాంతిని గప్పెను. దిక్కులు కనపడలేదు. భూమి కదలెను. * నూఱుకోట్లసైన్యములు వచ్చెను. సేనాధ్యక్షులపేరులు, వారిసైన్య విస్తారము నీక్రిందజూపబడెను.

| | |
|---|---|
| 10010000 | శతవలి. |
| కొన్నివేలకోట్లు | సుషేణుడు. |
| వేయికోట్లు | సుగ్రీవునిమామయగు తారుడు. |
| అనేకవేలు | కేసరి (హనుమంతునితండ్రి). |
| 10001000 | గవాక్షుడు (గోలాంగులరాజు). |
| 10002000ఋక్షులు | ధూమ్రాక్షుడు (ఋక్షరాజు). |
| 30000000 | పనసుడు. |
| 100000000 | నీలుడు (సేనానాయకుడు). |
| 50000000 | గవయుడు. |
| 10001000 | దరీముఖుడు. |

* మొదట నూఱుకోట్లబలమని చెప్పబడినది. వివరణలో నెక్కువగ గాన్పించుచున్నది. ఇది కవిచాతుర్యముగ గనుపించుటచే నూఱుకోట్లసైన్యమనియే స్థిరపఱచితిమి.

| | |
|---|---|
| 10001000 | మైందుడు. } అశ్విపుత్రులు. |
| 10001000 | ద్వివిదుడు. |
| 30000000 | గజుడు. |
| 100000000 | జాంబవంతుడు. (ఋక్షరాజుతమ్ముడు). |
| 10000100 | ఋషణ్వాంతుడు. |
| 10000001100 | గంధమాదనుడు. |
| అనేకులు | అంగదుడు. |
| 50000000 | తారుడు. (మఱియొకడు). |
| 110000000 | ఇంద్రజాలుడు. |
| 11100 | రంభుడు. |
| 20000000 | దుర్ముఖుడు. |
| 10000000000 | హనుమంతుడు. |
| 1000001100 | నళుడు. |
| 100000000 | దధిముఖుడు. |
| 100000 | వినతుడు. |
| అనేకులు | శరభుడు, కుముదుడు, వహ్ని, రంహుడు. |

ఇట్లు జగత్తంతటను నుండు వానరులువచ్చి పర్వతములమీదను వనములలోను గంతులు వేయుచు, గర్జించుచు నుండిరి. వారందఱు సుగ్రీవునకు నమస్కరించి నిలిచిరి. యూధపాలకులుగూడ చేతులు జోడించుకొని యాతనికి నమస్కరించి నిలిచిరి. సుగ్రీవుడు వారిసంగతి రామునకు వేఱువేఱుగ దెలిపి నమస్కరించి యూధపాలకులతో 'మీమీబలములను వేఱువేఱుకొండలందును, వనములందును నిలిపి వానిసంగతిని దెలుపు'డని పలుక వారట్లుచేసిరి. తరువాత నతడు రామునితో నిట్లు విన్నవించెను. 'నావశములోనున్న వానరులందఱు వచ్చిరి. వీరు గొప్పబలపరాక్రమముగలవారు. శత్రువులను జంప్ప

తరువాత పెద్దదగు నుదయపర్వతముకలదు. అక్కడనే సూర్యు డుదయించును. దీనియంచు స్వర్గమునకు దగిలియుండును. అక్కడ 40 క్రోసులపొడుగును, 4 క్రోసుల వెడల్పునుగల సౌమనసమను చిన్న బంగారుపర్వతముకలదు. వామనుడు దానిపై నొకపాదమును, మేరు శిఖరమున రెండవపాదమును నిలిపెను. అక్కడ వైఖానసులును, వాలఖిల్యులునునగు ఋషులు తపస్సుచేయుచుందురు. ఇవన్నియు నుండు దేశమునకు సుదర్శనద్వీపమని పేరు. ఇంతవఱకు మీరు వెళ్ళగలరు. కొండలలోను, గుహాలలోను, నితరప్రదేశములలోను, తోటలలోను సీతారావణులుండు స్థలములను మీరు వెతకవలెను. మీకొక మాసము గడువిచ్చితిని. ఇంతలో మీరు సంగతులను సంగ్రహించి రావలెను. మీరు విలంబముజరిపిన వధింపబడుదురు." ఇట్లు సుగ్రీవుడు పలికి వానరులను తూర్పుదిక్కునకు బంపెను.

తరువాత నావానరరాజు దక్షిణపుదిక్కునకు బోవుటకు నీలుని, హనుమంతుని, జాంబవంతుని, సుహోత్రుని, శరారిని, శరగుల్మని, గజుని, గవాక్షుని, గవయుని, సుషేణుని, ఋషభుని, మైందుని, ద్వివిదుని, విజయుని, గంధమాదనుని, నుల్కాముఖుని, ననంగుని, నంగదుని, వేగము, పరాక్రమముగలయితరులను వడిగలసైన్యములతో నిట్లు నియమించెను. "మీరు వింధ్యపర్వతము మొదలగు పర్వతములను నదులను, దేశములను వెతకుచు మలయపర్వతముననుండు నగస్త్యుని దర్శించి యతనిసెలవుపొంది మఱికొన్నిటిని వెదకుచు మహేంద్ర పర్వతమునకు వెళ్ళుడు. అక్కడ సీతను బాగుగ వెదకుడు. అక్కడ నుండి రావణుడుండు లంకకు బోవలెను. అక్కడికి మనుష్యులుపోలేరు. ఆసమీపమున సముద్రములో నంగారకయను పేరుతో రావణునిసంబంధమైన రాక్షసిరొకతె కలదు. ఎవరినీడ యామెయందుపడునో వారిని అది భక్షించుచుండును. తరువాత నూఱు యోజనములదూరమున

నొక్కపాదముకలవారును, మిక్కిలివడిగలవారును, మనుష్యులను భక్షించువారును, చెవులవద్ద కేశపాశములు గలవారుననగు కిరాతులు గలరు. జంబూద్వీపమును దాటినతరువాతనున్న ద్వీపములలో పచ్చిచేపలను భుజించుకిరాతులును, నీటిలోసంచరించు ఘోరస్వరూపులును, వ్యాఘ్రస్వరూపులును నుందురు. వీనినన్నిటిని వెతకవలెను. ప్లక్షద్వీపమున, నిక్షుసముద్రమున వెదకవలెను. ఈసముద్రమున మిక్కిలియాకలిగలవారును, బలవంతులుననగు నసురులుగలరు. ఎవరిఛాయవారియొద్ద పడునో వారిని వారుపట్టుకొనెదరు. వారినిదప్పించుకొని మీరు శాల్మలీద్వీపమునకుబోవలెను. అక్కడ పెద్దశాల్మలీ (బూరుగు) వృక్షముండుటచే నాద్వీపమున కాపేరు వచ్చినది. అక్కడ గరుత్మంతునికై విశ్వకర్మయొకభవనమును నిర్మించెను. తరువాత మధుసముద్రముకలదు. అక్కడ ఘోరస్వరూపులగు మందేహులను రాక్షసులు కొండశిఖరములనిలుచుచు సూర్యునితో ప్రతిదినము యుద్ధముచేయుచుందురు. ద్విజులు గాయత్రీమంత్రముజపించుటచే వారు సముద్రములో బడుచుందురు. అందుచే సూర్యునికి వారిబాధ తప్పుచుండును. తరువాత మీరు కుశద్వీపమును, నేతిసముద్రమును, క్రౌంచద్వీపమును దాటి పాలసముద్రమునకు బోవలెను. అక్కడ ఋషభపర్వతమును, సుదర్శనసరస్సును నున్నవి. ఆసరస్సున దేవతలు, చారణులు, యక్షులు, కిన్నరులు, అప్సరసలు క్రీడించుచుందురు. తరువాత మీరు శాకద్వీపమును, పెరుగుసముద్రమును, పుష్కరద్వీపమును దాటి యుదకసముద్రమునకు బోవలెను. అక్కడ హయగ్రీవు డుండును. అతనితేజము ప్రళయకాలమందు లోకములను దహించును. అక్కడికి 52క్రోసులదూరమున కనకపర్వతముండును. దానిశిఖరమున ననంతుడు భూభారమును వహించుచు నిలుచును. అక్కడ దేవత లొకవేదికనుస్థాపించి దాని మధ్యనొకబంగారుతాటిచెట్టును పాతిరి. దానికి మూడుశాఖలుగలవు.

తరువాత పెద్దదగు నుదయపర్వతముకలదు. అక్కడనే సూర్యు డుద యించును. దీనియంచు స్వర్గమునకు దగిలియుండును. అక్కడ 40 క్రోసులపొడుగును, 4 క్రోసులవెడల్పునుగల సౌమనసమను చిన్న బంగారుపర్వతముకలదు. వామనుడు దానిపై నొకపాదమును, మేరు శిఖరమున రెండవపాదమును నిలిపెను. అక్కడ వైఖానసులును, వాలఖిల్యులునునగు ఋషులు తపస్సుచేయుచుందురు. ఇవన్నియు నుండు దేశమునకు సుదర్శనద్వీపమని పేరు. ఇంతవఱకు మీరు వెళ్ళ గలరు. కొండలలోను, గుహలలోను, నితరప్రదేశములలోను, తోటల లోను సీతారావణులుండు స్థలములను మీరు వెతకవలెను. మీకొక మాసము గడువిచ్చితిని. ఇంతలో మీరు సంగతులను సంగ్రహించి రావలెను. మీరు విలంబముజరిపిన వధింపబడుదురు." ఇట్లు సుగ్రీవుడు పలికి వానరులను తూర్పుదిక్కునకు బంపెను.

తరువాత నావానరరాజు దక్షిణపుదిక్కునకు బోవుటకు నీలుని, హనుమంతుని, జాంబవంతుని, సుహోత్రుని, శరారిని, శరగుల్ముని, గజుని, గవాక్షుని, గవయుని, సుషేణుని, ఋషభుని, మైందుని, ద్వివిదుని, విజయుని, గంధమాదనుని, నుల్కాముఖుని, ననంగుని, నంగదుని, వేగము, పరాక్రమముగలయితరులను వడిగలసైన్యములతో నిట్లు నియమించెను. "మీరు వింధ్యపర్వతము మొదలగు పర్వతములను నదులను, దేశములను వెతకుచు మలయపర్వతముననుండు నగస్త్యుని దర్శించి యతనిసెలవుపొంది మఱికొన్నిటిని వెదకుచు మహేంద్ర పర్వతమునకు వెళ్ళుడు. అక్కడ సీతను బాగుగ వెదకుడు. అక్కడ నుండి రావణుడుండు లంకకు బోవలెను. అక్కడికి మనుష్యులుపోలేరు. ఆసమీపమున సముద్రములో నంగారకయను పేరుతో రావణునిసంబంధ మైన రాక్షసియొకతె కలదు. ఎవరినీడ యామెయందుపడునో వారిని నామె భక్షించుచుండును. తరువాత నూఱుయోజనములదూరమున

పుష్పితకమను పర్వతముగలదు. అక్కడ సిద్ధచారణులు విహరింతురు. దానిపై నున్న యొకబంగారుశిఖరమును సూర్యుడును, వెండిశిఖరమును జంద్రుడును సేవింతురు. అక్కడకు వెళ్ళి మీరు దానికి నమస్కరించి సీతను వెదకవలెను. అక్కడికి కృతఘ్నులుగాని, క్రూరులు గాని, నాస్తికులుగాని పోలేరు. తరువాత మీరు 56 క్రోసులదూరమున నున్న సూర్యవంతమనుపర్వతమునకును, వైద్యుతమనుపర్వతమునకును బోవలెను. అక్కడ మీరు ఫలమూలములను దిని తేనెలం ద్రాగి తరువాత కుంజరపర్వతమునకు బోవలయును. అక్కడ విశ్వకర్మనిర్మితమగు నగస్త్యభవనము కలదు. అది నాలుగు క్రోసుల వెడల్పును, 40 క్రోసులపొడవును గలిగియున్నది. తరువాత సర్పములకు నివాసమగు భోగవతి యను పట్టణము కలదు. దానిని వాసుకి పాలించుచుండును. తరువాత కొన్ని దేశములుదాటి ఋషభపర్వతమునకు బోవలెను. దానిపై మంచివనములు కలవు. వానిని గంధర్వులుపాలించుచుందురు. అది పుణ్యాత్ములకు నివాసస్థానము. తరువాత మీరావలికి బోగూడదు. అది యముని దేశము. అతనిపట్టణము చీకటితో నిండి యుండును. అంతవఱకు మీరు సీతను వెదకవలెను. తరువాత మీరు వెళ్ళలేరు. ఇట్లు మీరు వెతకి యొకమాసములో నాకు దానిని తెలియ పఱచవలెను. 'సీతను జూచితి'నని తెలుపువాడు నాతోసమానమగు భోగము ననుభవించును. అత డిదివఱకు నపరాధములను జేసినను నే నతనిని మిక్కిలి గౌరవించెదను. అతడు నాప్రాణములకంటె నెక్కువవా డగును." ఇట్లు సుగ్రీవుడు పలుకుచు వారిని దక్షిణదిక్కునకు బంపెను.

తరువాత సుగ్రీవుడు తారతండ్రియగుసుషేణుని బిలిచి వానికి నమస్కరించి వానిని వానిసైనికులను పశ్చిమదిక్కునకు బంపుచు నిట్లు పలికెను. "మీరు మరీచిపుత్రులగు రెండులక్షలవానరులతో

సీతను వెదకుటకు వెళ్లవలెను. మీరు * భరతఖండముననున్న దేశములు, నదులు మొదలగువానిని వెతకుచు సింధునది సముద్రమున గలియుచోటునకు వెళ్లవలయును. అక్కడ నూఱుశిఖరములుగల హేమగిరి యను పర్వతమున్నది. అందు సింహములు, పక్షులు, మదించిన యేనుగులు నుండును. అక్కడ బాగుగ వెతకవలెను. తరువాత పారియాత్రిపర్వతమున వెతకవలెను. అక్కడ కామరూపులును, ఘోరస్వరూపులునునగు గంధర్వులు 24 కోట్లుందురు. వారు తోటలకు కావలియుందురు. తరువాత మీరు వజ్రగిరిని, చక్రవంతపర్వతమును, వరాహపర్వతమును, దానిపైనున్న నరకాసురుని ప్రాగ్జ్యోతిషపురమును, సౌవర్ణపర్వతమును, దేవతలచే దేవేంద్రు డభిషిక్తుడయిన మేఘవంతమను పర్వతమును దాటి 60 వేల బంగారుపర్వతములకును బోవలెను. తరువాత మేరుపర్వతమునకు వెళ్లవలెను. దానిపై విశ్వకర్మచే నిర్మింపబడిన వరుణునియాలయము కలదు. అక్కడ మేరుసావర్ణి యను ఋషి కలదు. తరువాత నస్తగిరి యుండును. దానితరువాతి దేశము చీకటి కలదై సూర్యుడులేకయుండును. మీ రక్కడకు వెళ్లలేరు. మీరు నెలరోజులలో దిరిగి రావలెను. ఆలాగు రానియెడల మీకు మరణమే శిక్ష. నామామగారుచెప్పినప్రకారము మీరు జరిపి సీతను జూచి తిరిగి రండు. నేను జెప్పనిది యేమైనను మనకార్యమున కుపయోగమైనది యున్నయెడల దేశకాలముల నాలోచించి దానిని మీరుచేయుడు.” ఇట్లు సుగ్రీవుడు సెలవీయ వానరులు బయలుదేఱి వెడలిరి.

తరువాత నావానరరాజు శతవలిని, తేజోవంతులును, యముని పుత్రులునునగు లక్షమంది వానరులను నుత్తరదిక్కునకు బంపుచు నావానరనాయకునితో నిట్లనెను. “రాముని ప్రియకార్యము మనము నేఱవేర్చి

* 13 వ. ప్రకరణము. ౧౬ వ. అధ్యాయము. భరతఖండభూగోళమును జూడుము.

యతనిఋణము తీర్చుకొందము. అతడు మన కుపకారమును జేసెను. మన మతనికి ప్రత్యుపకారమును జేసిన మనజీవితము సఫలమగును. పూర్వ ముపకారముచేయని యితరులుకోరినపనినిగూడ మనము చేయవలెనుగదా! అట్టిచో మనకు నుపకారముజేసినవారిసంగతి వేఱెచెప్ప నేల? మీరు దీనిని మనస్సులోనుంచుకొని సీతను వెదకవలెను. రాముడు సర్వభూతములకును బూజనీయుడు. మనయం దాతనికి మిక్కిలి ప్రేమ. మీరు వనములను, నదులను, గొండలుమొదలగు రహస్యప్రదేశములను వెదకుచు భరతఖండమునంతను జూడవలెను. తరువాత మీరు మ్లేచ్ఛరాజ్యములను వెతకుచు హిమవంతమును దాటి కాళపర్వతమున వెతకవలెను. అక్కడ సోమునియాశ్రమము కలదు. తరువాత మీరు సుదర్శన దేవసఖపర్వతములను దాటిన 100 యోజనములవఱకు జెట్లు, పర్వతములు, నదులు, జంతువులు నుండనిగొప్ప యెడారి కలదు. దానితరువాత కైలాసపర్వతము కలదు. దానికి దక్షిణపుప్రక్కను కుబేరభవనమును, నాసమీపమున మానససరోవరమును గలవు. పిదప మీరు క్రౌంచపర్వతమునకు వెళ్లవలెను. అక్కడొకబిలములో మహర్షులు తపస్సుచేయుచుందురు. తరువాత నవృక్షగిరికిని, కామశైలమునకును, మైనాకపర్వతమునకును బోవలెను. అక్కడ మయుడను రాక్షసుడు తనగృహమును గట్టుకొనెను. అక్కడ కింపురుషస్త్రీ లుందురు. తరువాత సిద్ధులు, వైఖానసులు, వాలఖిల్యులు నుండుదేశము కలదు. అక్కడ వైఖానససరస్సు కలదు. ఆదేశమున కుబేరునివాహనమగు సార్వభౌమ మను నేనుగు తిరుగుచుండును. తరువాత కొంతవఱకు సూర్యచంద్రులు, నక్షత్రమేఘములు గనపడని మహామేరువుక్రింద కొంతదేశముండును. అక్కడ ఋషులప్రకాశముచే నంతయు కనబడును. తరువాత శైలోద యను నది కలదు. అటుపిమ్మట నుత్తరకురుదేశములు కలవు. వానిలో

మంచిసరస్సులును, నదులును నున్నవి. అక్కడ మంచిముత్యములును, మణులును, లోహములును దొరకును. అన్ని ఋతువులందు ఫలముల నిచ్చునవియును, నెప్పుడును బూచునవియును, మంచి తేనెలనిచ్చునవియును, బట్టలునేయుట కుపయోగమైన మంచినారకలిగి నవియును, మంచి పక్కలు, నాసనములు దయారుజేయుట కుపయోగమైన పీచుకలవి యునునగు చెట్లున్నవి. అక్కడ గంధర్వ కిన్నర నాగ విద్యాధరులును, పూర్వముపుణ్యముచేసిన పురుషులును దమతమ స్త్రీలతోను, వీణాదుల రవములతోను సంతోషముగ విహరింతురు. అక్కడ సౌఖ్యము లధికములగుచుండును. తరువాత నుత్తరలవణ సముద్రము కలదు. దీనిలో 'సోమగిరి' యను పర్వతము కలదు. ఇంద్ర లోకమునకు, బ్రహ్మలోకమునకు బోవు దేవత లక్కడకు వచ్చి దానిని జూచుచుందురు. సూర్యు డక్కడలేకున్నను నాప్రదేశము ప్రకాశించుచుండును. అక్కడ బ్రహ్మవిష్ణుమహేశ్వరులు బ్రహ్మర్షులు మొదలగు తమపరివారములతో వచ్చి నివసింతురు. తరువాత మీరు పైకి పోకూడదు. అక్కడ సూర్యుడుండకపోవుటచే నాప్రదేశము చీకటితో నిండియుండును. మీరీదేశముల నన్నిటిని వెతకి నేను జెప్పనిప్రదేశము లున్న వానిని గూడ బాగుగ వెతకి సీతను జూచి యాసంగతిని నాతో జెప్పవలెను." ఇట్లు సుగ్రీవుడు పలికి శతవలిని, వానరులను నుత్తరదిక్కునకు బంపెను.

సుగ్రీవుడు వానరు లందఱిని బంపుచు కార్యములను నెఱవేర్చుటలో శక్తిమంతుడగు హనుమంతుని బిలిచి మిక్కిలి సంతోషముతో వానితో నిట్లనెను. 'నీ వన్నిచోట్లకు శీఘ్రముగ బోగలవు. నీ కన్ని లోకములు తెలియును. గమనములోను, వేగములోను, తేజస్సులోను, శరీరమును దేలికచేసికొనిపోవుటలోను నీవు నీతండ్రియగు వాయువుతో సమానుడవు. ఏపురుషుడును తేజమున నీతో సరిపోలడు. నీకు

దేశకాలముల ననుసరించుమార్గము,బుద్ధి,బలపరాక్రమములును గలవు. నీకు నీతి తెలియును. ఉపాయముతో నీవు సీతను గనుగొనుము.' ఇట్లు సుగ్రీవుడు పలుక రాము డిట్లాలోచించెను. 'ఈవానరరాజు వాయు పుత్రు డన్నివిధముల కార్యసిద్ధి జేయునని నిశ్చయించియున్నాడు. ఇతడు తప్పక కార్యసాధకు డగును. వీనిచేష్టలనుబట్టి చూడ వీడు బూనినకార్యము తప్పక నెఱవేఱును.' ఇట్లాతడు తలచి వానివలన తనపనిజరుగునని మిక్కిలిసంతోషించి వానియందు సీతకు నమ్మకము కలుగునటుల తన పేరుతో జెక్కబడియున్న యుంగరము వానికిచ్చి యిట్లనెను. 'నీవు నాచేబంపబడితి వని యీయుంగరమును జూచి సీత భయములేకుండ నిన్ను బోల్చును. నీవు కార్యములను బాగుగ నెఱ వేర్చువాడవు; బలపరాక్రమములు కలవాడవు. సుగ్రీవుడు నిన్ను బంపుటను బట్టియే నాకార్యము సఫల మగుచున్నదని నాకు దెలియ వచ్చుచున్నది.' ఇట్లు రాముడు పలుక హనుమంతు డాయుంగరమును తన శిరస్సున బెట్టుకొని యాతని పాదములకు మ్రొక్కి బయలుదేఱు టకు సిద్ధముగ నుండెను. ఆయుంగరమును దీసికొనుటవలన నతనికిని, మిగిలినవానరులకును నెక్కువబలము కలిగెను. మేఘములులేని యాకాశమధ్యముననుండుచంద్రునివలె నాంజనేయుడు తేజరిల్లెను. అప్పుడు రాముడతనితో 'బలవంతుడవగు నోవాయుపుత్రా! నీపరాక్ర మముచే సీత నాకు లభించుయత్నము చేయు'మని యనెను.

ఇట్లు వానరులందఱు సుగ్రీవునిచే నాజ్ఞాపింపబడి పిమ్మట 'రావ ణుని జంపుదుము. సీతను దీసికొనివచ్చెద'మని కేకలు వేయుచు, సింహ నాదముజేయుచు, గర్జించుచు, లంఘించుచు నుండిరి. మఱియు వారిట్లు పలికిరి. 'నేనొక్కడనే చెట్లను బడద్రోసి కొండలను బిండిచేసి భూమిని బ్రద్దలకొట్టి సముద్రముల కలగించి రావణుని జంపి సీత పాతాళ ములో నున్నను నా మెను దెచ్చెదను. నేను నూఱుయోజనము లెగుర

గలను. నేనంతకంటె నూఱుయోజనము లెగురగలను. భూమియం
దును, సముద్రమునందును, గొండలందును వనములందును, బాతాళ
మందును బోవుటకు నాకేమియు నష్టులేదు.' ఇట్లు వానరులు పలికి
సీతను వెదకుటకు వెళ్ళిరి. తరువాత రాముడు సుగ్రీవుని 'నీకీ భూమం
డలములోని సంగతు లన్నియు నెట్లు తెలిసినవి?' యని యడుగ నతడు
'పూర్వము నేను వాలిచే తఱుమబడినపు డన్నిటిని జూచితి'నని చెప్పెను.

---

## ౧౦ వ. అధ్యాయము.

### వానరులువెళ్ల రాముడు ప్రస్రవణగిరియందు నివసించుట.

సుగ్రీవుడు వానరులను బంపించినతరువాత రాముడు వారు తిరుగవచ్చు మాసపుగడువును నిరీక్షించుచు నాప్రస్రవణగిరియందు నివసించెను. ఆవానరరాజుకూడ నక్కడ సంతోషముతో నుండెను. తూర్పునకు, పశ్చిమమునకు, నుత్తరమునకు బంపబడినవానరులును, వానరవీరులును సరస్సులు,నదులు,కొండలు,గుహలు,అడవులు మొదలగు వానినన్నిటిని నతికష్టముతో బగలంతయు వెదకుచుండిరి. రాత్రి మాత్రము శయనించుచుండిరి. వారికి సీత దొరకలేదు. మాసము గడువు పూర్తియైనపిమ్మట వా రామఱునాటియుదయమున తమప్రయత్నము సఫలముకాకపోవుటచే నిరాశనుబొంది సుగ్రీవునికిని, రామునకును నాసంగతి దెలిపిరి. ఇంకను వారు 'హనుమంతుడు మంచివంశము గలవాడు; బలముగలవాడు; మహాత్ముడు. అతడు సీతను జూచును. దక్షిణదిక్కుననే సీత యున్న'దని మనవిచేసిరి.

---

## ౧౧ వ. అధ్యాయము.

## హనుమంతాదులు దక్షిణదిక్కున వెదకుట.



దక్షిణదిక్కున వెతకుటకు బంపబడిన హనుమంతుడును, నంగదుడును, తారుడు మొదలగువారును వింధ్యపర్వతపంక్తి చేరిరి. దానికి వేయిశిఖరములు కలవు. ఆపర్వతశిఖరములను, గుహలను, నడవులను, నదులను, పెద్దసరస్సులను, చెట్లను వారు వెతకిరి. కాని వారికి సీత గనబడలేదు. తరువాత వారు నదులు, జలాశయములు లేనిదియు, జంతువులు లేనిదియు, పుష్పించినచెట్లు లేనిదియు, ఫలమూలములు దొరకనిదియు నగు ప్రదేశమును వారు చూచిరి. అక్కడ కండుడను మహర్షి 16 సంవత్సరములుగల తనకుమారుడు మరణించుటచే నాప్రదేశ మట్లుండునటుల శపించెను. అక్కడ వారు వెతకుచుండ వారికి నొక ఘోరరాక్షసుడు కనబడెను. వానరవీరులందఱు వానితో యుద్ధమునకు సిద్ధముకాగా వాడు వారిని జూచి 'మీరు మరణించెద'రని పలికి వారితో యుద్ధమునకు దలపడెను. అంగదుడు 'వీడే రావణు'డని తలంచి తనయఱచేతితో వాని తలమీదగొట్ట వాడు రక్తముగక్కుచు మరణించెను. తరువాత వానరులు సీతను వెదకుచు నామెను గానక విచారముతో నాచెట్టు క్రింద గూర్చుండిరి.

అప్పుడంగదుడు వారితో నిట్లనెను. 'మనము కష్టపడి సీతను వెదకుచున్నాము. కాని యామె దొరకలేదు. సుగ్రీవుని శాసనము కఠినమైనది. అతడు మనకిచ్చినగడువు సమీపించుచున్నది. మీరు కునికిపాటును, విచారమును, నిద్రనువిడిచి బాగుగ వెతకవలెను. ఫల బుద్ధి, సమర్థత, మనోధైర్యము గలవారికి కార్యములు సిద్ధించును. కార్యములను జరుపువారికి తప్పక ఫలములు కలుగును. మనమజ్ఞానముచే నూరకొనకూడదు. సుగ్రీవకోపములకు భయపడు జడియవలెను.' ఇట్లం

గడుడు వానరులతో బలుక వారతనిమాటల నంగీకరించి యట్లు వెత కిరి. తరువాత రజతపర్వతమును, దానిపైనుండు క్రోంచవనమును వారు వెతకిరి. కాని వారికి సీతదొరకలేదు. ఇట్లు వారు వింధ్యపంక్తిని వెద కుచు దానిదక్షిణపుకొనను, పశ్చిమపుకొనను జేరి యలసటనొంది దాహముకలవారై యచటనుండిరి. సుగ్రీవుడిచ్చిన మాసముగడువు పూర్తియయ్యెను. అక్కడ మయుడు నిర్మించిన ఋక్షబిలమనెడు భూసొరంగమొకటి వారికి గనబడెను. ఆగుహ, చెట్లతోను, లతల తోను గప్పబడియుండెను. దానినుండి తడిసిన క్రౌంచపక్షులును, హంసలును, బెగ్గురుపక్షులును, పద్మలపుప్పొడి తగులుటచే నెఱుపు వర్ణముగల చక్రవాకపక్షులును వచ్చుట వారు చూచిరి; కాని దాని లోనికి పోవుటకు వా రనుమానించిరి. హనుమంతు డాపక్షులను జూచి 'ఆబిలములో దప్పక నీరు దొరకు'ననియనెను. అది మిక్కిలి చీకటిగ నుండుటచే వానరు లొకరిచేతి నొకరు పట్టుకొని యెగురుచు లోనికి నొకయోజనము శీఘ్రముగ బోయిరి. కొంతసేపటికి వారికి వెలుతురు గలప్రదేశ మగపడెను. అక్కడ ననేకవిధములగు బంగారుచెట్లు ప్రకాశమానముగ నుండెను. అక్కడక్కడ వైడూర్యముతో జెక్క పడినవేదిక లుండెను. సరస్సులు నిర్మలమగునీటితోను, మంచిపద్మముల తోను, పక్షులు, చేపలు, మొసళ్లు మొదలగువానితోను, నిండియుం డెను. అక్కడ బంగారపువిమానములును, వెండివిమానములును నుండెను. బంగారముతోను, వెండితోను జెక్కబడినవియు, వైడూర్య మణిమయములైనవియు, మంచికిటికీలు కలవియు, సుందరములైనవియు నగుగృహములుండెను. చెట్లు మంచిపువ్వులతోను, బండ్లతోను నిండి యుండెను. వానినుండి తేనెలు కాఱుచుండెను. బంగారముతోను, మణులతోను జెక్కబడినమంచములును, మంచిపక్కలును, మంచి యాసనములును, మంచినవారీలును నక్కడ వారికి గనపడెను. బంగా

రముతోను, వెండితోను, కంచుతోను జేసినపాత్రలను, జందనాగరు దినుసులను, మంచిఫలములను, మంచితేనెలను, మంచిబట్టలను, మంచి తివాసీలను, చర్మములనుగూడ వారు చూచిరి. వానరు లక్కడ సీతను వెతకిరి.

అక్కడ వారు తమసమీపమున నారచీరలను, లేడిచర్మమును ధరించినదియు, నియమముగ భుజించునదియు, మిక్కిలి తేజముగలదియు తాపసియునగు స్త్రీనొకతెను జూచి మిక్కిలిభయపడి యాశ్చర్యము నొంది కొంతవెనుకకు వచ్చిరి. అప్పుడు హనుమంతు డామెకు నమస్కరించి యిట్లు ప్రశ్నించెను. 'నీ వెవతెవు? ఈసారంగ మెవరిది? ఇక్కడి వస్తువు లెవరివి? మేము దాహముచే నీసారంగమును బ్రవేశించితిమి. ఎవరిప్రభావముచే నివి సృజింపబడినవి? మాకు దెలియబలుకుము.' ఆంజనేయుని యీప్రశ్నల కామె యిట్లు జబాబిచ్చెను. "మయుడను పేరుతో మాయావియగురాక్షసు డొకడుండెను. అతనిమాయచే నిది నిర్మింపబడినది. అతడు పూర్వమున విశ్వకర్మగ నుండి వేయి సంవత్సరము లడవిలో గొప్పతపస్సుచేసి బ్రహ్మవలన శిల్పవిజ్ఞానమును నొందెను. అతడే యీతోటలను, నిండ్లను నిర్మించి తనకోరికల నెఱవేర్చుకొనుచు నిక్కడుండెను. అతడు హేమ యనెడునప్సరసను మోహించి భోగముల ననుభవించుచుండ నింద్రు డాతనిని జంపెను. బ్రహ్మ యాహేమకు వీని నన్నిటి నిచ్చెను. * నేను సావర్ణిపుత్రికను;

*అ. రా:—స్వయంప్రభ తనవృత్తాంతమును దెలుపుచు హేమ తనకు పూర్వముచెప్పినసంగతు లిట్లు పలికెను. 'నీవిక్కడ తపస్సుచేయు చుండుము. త్రేతాయుగమున నారాయణుడు దశరథునిపుత్రుడై భూభారమును బోగొట్టుటకై యడవిలో దిరుగుచుండును. వానరు లతని భార్యను వెదకుటకై యీసారంగమునకు వచ్చెదరు. వారికి నీవు తగినమర్యాదసలిపి రామునియొద్దకు బోయి ప్రయత్నముతో నతనిని

స్వయంప్రభ యనుదానను. నేనిక్కడ దీనిని రక్షించుచున్నాను. నాప్రియసఖియగు హేమ బ్రహ్మయెదుట నాట్యముచేసి పాడుచుండును. 'నేనీగృహమును గాపాడుచుండు'నని యామెయెదుట నొప్పుకొని యున్నాను. మీ రేకారణమున నేపనికొఱకు నీయడవిని ప్రవేశించితిరి? మీ రెట్లు రాగలిగితిరి. మీరిక్కడ మంచిఫలములను దిని మంచి నీళ్ళను ద్రాగి యంతయు నాకు దెలుపుడు." ఇట్లు స్వయంప్రభ పలుక వారట్లు తమయాకలిదప్పుల దీర్చుకొనిరి. తరువాత నాంజనేయుడు తాము వచ్చినకార్యమంతయు నామెకు దెలిపి 'నీయాతిథ్యమున ఫలమూలములను భుజించి ప్రాణములను నిలుపుకొంటిమి. మేము నీ కేమిప్రత్యుపకారముజేయగల' మని పలుక నామె 'నాప్రభావముచే నే నన్నియు దెలిసికొంటిని. నేను మీమాటలకు సంతోషించితిని. నేను ధర్మముగా జరించుదానను. మీరు నా కేమియుజేయనక్కఱ'లేదని జవాబుచెప్పెను.

---

స్తుతింపవలెను. అపుడు నీవు యోగులు పొందతగినదియు, సనాతనమైనదియునగు విష్ణుగృహమునకు బోయెదవు.' ఇట్లు స్వయంప్రభ పలికి 'నేను రామునియొద్దకు త్వరగ బోవుటకు గోరుచున్నా'నని తెలిపెను. తరువాత నామె యాబిలమును విడిచి శీఘ్రముగ రామలక్ష్మణసుగ్రీవులుండు ప్రస్రవణగిరికి బోయి వారిని జూచెను. తరువాత నామె రామునకు ప్రదక్షిణ మొనర్చి యనేకపర్యాయములు నమస్కరించి శరీరమున రోమములు గగుర్పాటునొంద గద్గదస్వరముతో నతని నిట్లు ప్రార్థించెను. "రాజశ్రేష్ఠా! నేను మీదాసురాలను; మిమ్ము దర్శింప వచ్చితిని. నేను సొరంగములో ననేకవేలసంవత్సరములు మీదర్శనమునకై గొప్పతపస్సు చేసితిని. అది యిప్పుడు ఫలించినది. మాయకు వేఱుగనుండువారును, సర్వభూతములందు గనబడకుండ లోపలను, వెలుపలను నుండువారునునగు మిమ్మిప్పుడు నమస్కరించెదను. యోగ

స్వయంప్రభపలికిన యీమాటలను హనుమంతుడు విని యామెతో నిట్లు విన్నవించుకొనెను. 'మేమందఱము నిన్ను శరణు బొందితిమి. మేము చాలకాలము బిలములో దిరుగుటచే సుగ్రీవుడు మాకిచ్చినగడువు గడచినది. అతనిమాటను దప్పి మిక్కిలియాయాస మును బొందిన మమ్ము రక్షింపగల శక్తిగలదానవునీవే. మమ్మీ ఘోరసారంగమునుండి దాటింపుము. మేము గొప్పకార్యము జేయ వలసియుండెను. ఇక్కడనుండుటచే మేము దానిని జేయలేకపోయితిమి.'

---

మాయయనెడు తెరచే గప్పబడి మనుష్యరూపమును దాల్చిన మీరు శైలూష (నటుడు) రూపమునుదాల్చినవానివలె నజ్ఞానముగలవారికి గనబడరు. భగవంతునియందు భక్తిగలవారికి భక్తియోగమును గలి గించు కోరికతో మీరు జన్మించితిరి. తామసగుణముగల నేను మిమ్మె ట్లు తెలిసికొనగలను? లోకములో నెవడో యొకడు మీనిజస్థితినిదెలిసి కొనును. మీరూపమెల్లప్పుడును నాహృదయమున నుండుగాక! మోక్ష మును జూపునట్టియు, సంసారసాగరములో మునిగినవారికి గనబడ నట్టియు, తత్త్వజ్ఞానమును గలుగజేయునట్టియు మీరెండుపాదములను నేను జూచితిని. ధనము, పుత్రులు, భార్య మొదలగు వానితోను, నైశ్వ ర్యముతోను గర్వించినజనుడు దరిద్రుడు ధనమునువలె విషయవాంఛలు లేనివారుకోరదగినమిమ్ము నుచ్చరించుటకుగూడ నర్హుడుగాడు. సంసా రమునుండి తొలగించువారును, స్వస్వరూపమునందే క్రీడించువారును, గుణరహితులును, గుణస్వరూపులునునగు మీకు నమస్కరించెదను. కాలరూపులును, నీశ్వరులును, మొదలు, మధ్య, తుద లేనివారును, నన్ని జీవులయెడ సమబుద్ధిగలవారును, నన్నిచోట్ల చరించువారునునగు మిమ్ము పురుషోత్తమునిగ నాలోచించుచున్నాను. దేవా! మనుష్య వ్యాపారము ననుకరించుచున్న మీవ్యాపారము నెవ డెఱుగును. మీకొకనియందు దయయు, మఱియొకనియందు ద్వేషబుద్ధియు లేదు

ఇట్లు హనుమంతు డామెను ప్రార్థింప నాస్వయంప్రభ 'దీనిలో ప్రవేశించినవారు ప్రాణములతో దిరుగ వెళ్లలేరు. నాతపఃప్రభావముచేతను, నియమములచేబొందిన పుణ్యముచేతను మిమ్ములనందఱిని నీసొరంగమునుండి బయటకు దీసికొనివెళ్లెదను. మీరు కండ్లు మూసికొనుడు. వానిని దెఱచిన మీరు పైకి వెళ్లలేరని పలికెను. వారు పైకిపోవుటయందలిసంతోషముతో తమచేతులతోను, వ్రేళ్లతోను తమకండ్లను మూసికొని యొకనిమిషములో బైకివచ్చిరి. తరువాత

---

మీకు పరుడనువాడుగూడలేడు. మీమాయచే నావరింపబడిన వారట్టిమిమ్ము దెలిసికొనలేరు. దేవా! జన్మలేనివారును, కర్తృత్వరహితులును, నీశ్వరులునునగు మీరు దేవతలలోను, తిర్యగ్జంతువులగు మత్స్యాదులలోను, నరులుమొదలగువారిలోను జన్మించుటయు, నట్లు సంచరించుటయు వాస్తవముకాదు. అక్షరులగు మీరు జన్మించుట కోసలరాజుతపస్సుయొక్క ఫలసిద్ధికొఱకని కొందఱును, రామాయణకథను జనులు వినుటకని కొందఱును, కౌసల్య ప్రార్థింప జన్మించితిరని కొందఱును, బ్రహ్మ మిమ్ము దుష్టరాక్షసుల వలన గలిగినభూభారమును బోగొట్టుటకు ప్రార్థింప మీరు నరరూపమున జన్మించితిరని కొందఱును బలుకుదురు. ఈరామాయణకథను వినువారును, పాడువారును సంసారమును బాగుగదొలగించు మీపాదపద్మములను జూతురు. దేవా! మీమాయాగుణములచే గట్టబడిననేను మాయకు లోబడనివారును, గుణములుగలవారును, నీశ్వరులును, నింద్రియములకు గోచరముకానివారునునగు మిమ్మెట్లు తెలిసికొందును! లేక పొగడగలుగుదును? ధనస్సును, బాణములను బట్టినవారును, లక్ష్మణసుగ్రీవులతో నున్నవారును, రఘుశ్రేష్ఠులునునగు మీకు నమస్కరించెదను." ఇట్లు రాముడు పొగడబడి గొప్పదయగలవాడై సత్కర్ములగువారిపాపములను హరించువాడగుటచే భక్తురాలగు నామెను

నామె వారినోదార్చి యిట్లు పలికెను. 'ఇదిగో! వింధ్యపర్వతపంక్తి; అదిగో! ప్రస్రవణగిరి; అదిగో! పశ్చిమసముద్రము. మీకు శుభమగు గాక! నేను నాయింటికి బోయెదను.' ఇట్లామె పలికి తనబుక్షబిలమున బ్రవేశించెను. అక్కడ వానరులు మిక్కిలిధ్వనిజేయుచున్న కెరటములు గల మహోదధిని జూచిరి.

---

'నీమనస్సులోనికోరిక యే'దనియడుగ నామెభక్తితో రాముని నిట్లుప్రార్థించెను. "నేనెక్కడ జన్మించినను మీయందు చలింపనిభక్తిని నాకు మీరిచ్చెదరుగాక! సామాన్యమనుష్యులతోగాక మీభక్తులతో నెల్లప్పుడు సహవాసము కల్పించెదరుగాక! నానాలుక 'రామ! రామ'యని భక్తితో నెల్లప్పుడు పలుకుచుండుగాక! శ్యామలరూపముగలవారును, సీతాలక్ష్మణులతో నుండువారును, ధనస్సును, బాణములను బట్టిన వారును, పచ్చనివస్త్రమును గట్టినవారును, ప్రకాశమానముగనుండు కిరీటమును, భుజకీర్తులను, కాలియందెలను, మెడలోముత్యాలహారము లను, కౌస్తుభమణిని, కుండలములను ధరించినవారును, ప్రకాశమాన ముగనున్నవారుననగు మీయొక్క రూపమును నామనస్సున నేను స్మరించుచుండెదనుగాక! నేనితరవరమును గోరను." ఇట్లు స్వయంప్రభ విన్నవింప రాముడు 'అట్లేయగుగాక!' యని సెలవిచ్చి 'మహాత్మురాలా! నీవు బదరికావనమునకు బొమ్ము. అక్కడ నీవు నన్ను స్మరించుచు పంచభూతాత్మకమైన యీశరీరమును విడిచి పరమాత్ముడనగు నన్ను శీఘ్రముగ బొందెద' వని సెలవీయ నామె యట్లుచేసి యక్కడ నెల్లప్పుడు రాముని స్మరించుచు తనశరీరమును విడిచి పరమ పదమును బొందెను.

## ౧౨వ. అధ్యాయము.
## హనుమంతాంగదాదులు ప్రాయోపవేశముచేయుట.

అంగదుడు, హనుమంతుడు మొదలగు వానరులు పశ్చిమసముద్రమును జేరుటకుముందు బాగుగపుష్పించిన వింధ్యపర్వతముమీది చెట్లక్రింద కూర్చుండి బాగుగఫలించినమామిడిచెట్లు మొదలగువానిని జూచి వసంతఋతువు వచ్చినదని తెలిసికొని తమకు నియమింపబడిన కార్యము, గడువుకాలము వ్యర్థమయినవని దలచి భూమిమీదబడిరి. అప్పుడు సింహవక్షమువంటి వక్షస్థలముగలవాడును, యువరాజును నగు నంగదు డిట్లు పలికెను. 'కపిరాజునాజ్ఞచే మనమందఱము బయలుదేఱివచ్చితిమి. సారంగములో నెలరోజులు గడచినవి. ఆశ్వయుజ మాసములో మనలనుబంపెడి ప్రసంగము వచ్చినది. ఇప్పుడు మన కిచ్చినగడువుమాసముగూడ గడచెను. మనమిప్పు డేమిచేయవలెను? మీరు విశ్వాసపాత్రులు; నీతిమార్గమును బాగుగ నెఱిగినవారు; మీ మీయజమానుని కార్యములందు నెక్కుడు శ్రద్ధగలవారు; కార్యముల నన్నిటిని జరుపుటలో శక్తిగలవారు; గొప్పకార్యములను నిర్వహించుటలో నన్నిదిక్కులఖ్యాతినొందినవారు. మీరందఱు సుగ్రీవుని యాజ్ఞాప్రకారము నావెంటవచ్చితిరి. దానిని జరుపకుండ నెవడు సుఖముగ నుండగలడు? కార్యముజరుపనందులకు మనకు మరణదండన తప్పదు. అతడు నిర్ణయించినకాలము మించినది. కనుక ప్రాయోపవేశముచేయుటయే మనవానరులకు తగినది. అతడు సహజముగ కఠినుడును, రాజును నై యున్నాడు. అపరాధము చేసినమనలను నతడు క్షమింపడు. సీతవార్తను దెలియజేయనందులకు మనవిషయమై యతడు పాపమునాచరించును. కనుక మనకు ప్రాయోపవేశమే యిప్పుడు తగియున్నది. మనము భార్యలను, పుత్రులను నిండ్లను, ధనములను విడిచి వచ్చితిమి.

ఇక్కడనుండి వెళ్ళినమనకు తగని మరణదండనను రాజు విధించును. అంతకంటె నిక్కడనే మనకు మరణము శ్రేయము. అతడు నన్ను యువరాజుగ నభిషేకింపలేదు. రాము డట్లు చేసెను. సుగ్రీవుడు నాకు బూర్వపువిరోధి; గనుక నాయందు లోపము కనబడినయెడల నతడు నన్ను కఠినముగ దండనచే హింసించును. నేనట్లు ప్రాణముల విడుచు చుండ నాస్నేహితు లెట్లు చూడగలరు? పుణ్యస్థలమగు నీసముద్ర తీరముననే ప్రాయోపవేశము చేయగోరెదను.' ఇట్లంగదుడు పలుక నాపలుకులను వానరశ్రేష్ఠులు విని మనస్సు కలుగ నిట్లనిరి. 'సుగ్రీ వుడు సహజముగ కఠినుడు. రాముడు తనభార్యయందు మనస్సు కలిగి యున్నాడు. మనము సీతను జూడకుండ వెళ్ళినయెడల నాతనిని సం తోషపఱచుటకు మనరాజు నిశ్చయముగ మనలను బాధించును. అప రాధమునుజేసినమన మతనియెదుటకు వెళ్ళుట యుక్తముకాదు. మన మిక్కడ సీతను వెతకి యామె సమాచారము లభించిన నక్కడికి వెళ్ళుదము. లేనియెడల మనము యమపురికి బోవుదము.' ఇట్లు గొప్ప భయముచే వారు పలుకుచుండ తారుడను వానరవీరు డిట్లనెను. 'మీరు గొప్పవిచారము బొందనేల? మీకందఱికి నిష్టమున్న మయుని సొరంగమున బ్రవేశించి యక్కడ మనము నివసింతము. అక్కడ మంచిచెట్లు, నీరు, మంచిభక్ష్యములు నున్నవి. అక్కడ తినుటకు ఫలాదులు, తేనెలు మొదలగునవికూడ బాగుగ దొరకును. అక్కడ నిందునివలనగాని, రామసుగ్రీవులవలనగాని మనకు భయముండదు.' ఇట్లు తారుడుపలుక వానరులు వానిమాటలు విని యువరాజుపలుకులే యుక్తముగనున్నవని సంతోషించి 'మనకు బాధలేనికార్యమును శీఘ్రము ముగ జేయుద'మని యనిరి.

హనుమంతుడుగూడ వారిద్దఱిమాటలను విని యంగదుని మాటలే తగినవనియు, నతడు రాజ్యమున కర్హుడనియు దలంచెను.

అతని నాంజనేయుడు తేజోబలపరాక్రమములుగలవానిగను, చంద్రుని వంటిశోభకలవానిగను, బుద్ధిలో బృహస్పతివంటివానిగను, పరాక్రమములో వాలివంటివానిగను, స్వామికార్యమును శ్రమపడిజరుపువానిగను, సన్నిశాస్త్రములు తెలిసినవానిగను నాలోచించెను. ఆవాయుపుత్రుడు యువరాజుచెప్పిన మాటలయందువిశ్వాసముగలవానరుల మనస్సు తిరుగునటుల వానిమాటలను భేదోపాయముచే గోపముతో గూడిన భయంకరపుమాటలతో నిట్లు ఖండించెను. 'అంగదా! నీవు నీతండ్రికంటె యుద్ధములో నెక్కువసామర్థ్యముకలవాడవు. అతనివలె నీవు కపిరాజ్యమును బాలింపశక్తికలవాడవు. ఎల్లప్పుడు చంచలచిత్తులగువానరులు తమభార్యలను, బుత్రులను విడిచి నీయాజ్ఞప్రకారము నడచుటకు సహింపరు. జాంబవంతుడును, నీలుడును, సుహోత్రుడును, నేనును నీవుచెప్పినప్రకారము చేయము. నేను నిజముపలికెదను. సామదానములచేగాని, దండోపాయముచేగాని నీవు సుగ్రీవునినుండి మమ్ము విడదీయలేవు. దుర్బలునితో బలవంతుడు విరోధముబొందినను నిలిచియుండగలడుగాని తనరక్షణగోరుకొను దుర్బలుడట్లు బలవంతునితో విరోధముబొంది నిలిచియుండలేడు. మీరు ఋక్షబిలములో నివసించుటకు నాలోచించుచున్నారు. దానిని లక్ష్మణుడు తనబాణములతో జీల్చుటకేమియు సందియములేదు. వానిబాణములు కొండలనైనను ముక్కలుముక్కలుగ జేయును. ఆసారంగములో వానరులుగూడ నిలువరు. వారు దారాపుత్రాదులందు మనస్సుగలిగి యాకలిచే బాధింపబడి పండుకొనుటకు మంచిపక్కలులేక మీమాటలను దిరస్కరించెదరు. నీస్నేహితులును, బంధువులును, నీమేలుకోరువారును నిన్ను విడిచినయెడల నప్పుడు నీవు గడ్డిపరకకంటె తక్కువవాడవగుదువు. లక్ష్మణుని కార్యమును జేయక నీవు దాగుకొనినయెడల నతని బాణములు నిన్ను తప్పక దహించును. వారితో నీవు కిష్కింధకువచ్చి

వినయముగ బ్రవర్తించిన నిన్ను సుగ్రీవుడు రాజ్యమున నిలుప్పును. అతడు నీకు పినతండ్రి; ధర్మమునందు బుద్ధిగలవాడు; నీకు బ్రీతి జేయువాడు; మంచినియమములుకలవాడు; శుచికలవాడు; సత్యప్రతిజ్ఞుడు. అతడు నిన్ను హింసించుట కెంతమాత్రము నిష్టపడడు. అతడు నీతల్లికి బ్రియముచేయదలచియే జీవించియున్నాడు. అతనికి పుత్రులులేరు; కాన మనము కిష్కింధకు మఱలుదము.' ఇట్లు హనుమంతుడు వానికి బుద్ధిచెప్పెను. *

ఆంజనేయునియీమాటలకు నంగదు డిట్లు జబాబిచ్చెను. 'సుగ్రీవునకు స్థిరబుద్ధి, యాత్మమనశ్శౌచములు, దయ, ఋజుమార్గము, పరాక్రమము, ధైర్యము నను గుణము లేవు. అతడు తనయన్న జీవించి

---

* అ. రా:—అంగదుడు 'ప్రాయోపవేశముచేయుద' మని పలికినపుడు హనుమంతుడు దానిని ఖండించుచు రహస్యమగువిషయము నిట్లు దెలిపెను. 'రాముడు మనుష్యుడుకాడు. సాక్షాత్తునాశనరహితుడగు నారాయణుడు. లక్ష్మియగుసీత లోకములనన్నిటిని మోహింపజేయు మాయ. లక్ష్మణుడు లోకములనన్నిటిని మోయు పాములరాజగు శేషుడు. వారందఱు బ్రహ్మచే ప్రార్థింపబడి రాక్షసులనాశనముఁజేయుటకును, లోకములను రక్షించుకొఱకును మాయామానుషరూపములదాల్చి జన్మించిరి. మనమందఱము వైకుంఠములో విష్ణువుప్రక్కనుండువారము. పరమాత్మ తనయిచ్ఛానుసారముగ మనుష్యరూపమును దాల్చియుండ వానిమాయచే మనము వానరరూపములతో జన్మించితిమి. పూర్వము మనము తపస్సుచే లోకప్రభువు నుబూజింప నతడు మనయందు గరుణజూపుచు తనప్రక్కను ననుచరులుగనుండుట కనుగ్రహించెను. ఇప్పుడును మనము మాయచే నతనిసేవ జేసి తిరుగ వైకుంఠమునకు బోయి సుఖముగనుండుదము.' ఇట్లు హనుమంతు డంగదునికి బోధించెను.

యుండ ధర్మముగ తనకు దల్లియగువానిభార్యను గ్రహించి పాతకము నొనర్చెను. తనయన్న యుద్ధమునిమిత్తము వెళ్లుచు నొకసారంగము నొద్ద కాపుండుటకు నియమించియుండ దాని కడ్డుగా నితడు పెద్దరాయి పెట్టియుండెను. అట్టియాతని కేమిధర్మము తెలియును? అతడు రామునితో సఖ్యమునకై వానిచేయి బట్టి తనపనినెఱవేర్చుకొని తరువాత వానిని మఱచెను. అట్టియాతడు పైవారుచేసినమంచిపనుల నెట్లు జ్ఞాపకముంచుకొనును? లక్ష్మణునియందలి భయముచే సీతను వెతకుటకు మనలను బంపెనుగాని, యధర్మముకలుగునను భయముచేతకాదు. అట్టి యాతనికి ధర్మమేమున్నది? ఇట్టి పాపముజేసి, కృతఘ్నుడై చేసినదానిని మఱచిన చంచలబుద్ధిగల యాతనిని మర్యాదగలవా డెవ్వడు నమ్మును? మంచికులమున బుట్టినవాడును, జీవించుటయందిష్టముకలవాడును నెంతమాత్రము నాతనిని నమ్మడు. మంచిగుణములు కలిగినను, చెడుగుణములు కలిగినను తనపుత్రుడే రాజ్యమునకు దగినవాడు. సుగ్రీవరాజు తనశత్రుకులములోబుట్టిన నన్నేల బ్రతుకనిచ్చును? అతనికి వ్యతిరేకముగ నాలోచనచేసి యపరాధము చేసిన నేను శక్తిహీనుడనై కిష్కింధను బ్రవేశించి యనాథునివలెను, దుర్బలునివలెను నెట్లు జీవింపగలను? క్రూరుడును, నిర్దయుడును, లోలోపల గీడుదలచువాడునునగు నాతడు తనరాజ్యలాభమునుగూర్చి నాకు కఠినదండనవిధించి నన్ను కారాగృహమున నుంచును. అట్టి యవమానము కంటె నాకు ప్రాయోపవేశమే మేలు. నేను జెప్పినదాని నంగీకరింపుడు. నే నక్కడకు రాను. వానరులందఱు దమయిండ్లకు బోవచ్చును. నాకు మరణము శ్రేయము; కనుక నేను ప్రాయోపవేశము చేసెదను. నేను రామలక్ష్మణులకును, సుగ్రీవునకును నమస్కరించితిననియు, వారికుశల మడిగితిననియు వారితో జెప్పుడు. రుమకుశలమును, నారోగ్యమును నడిగితినని జెప్పుడు. మీరు నాతల్లియగుతారను నోదార్చ

వలెను. ఆమె దయకలది; సహజముగ నాయందు ప్రేమగలది. నామరణము విని యామె ప్రాణములను విడుచును.' ఇట్లంగదుడు పలికి పెద్దలకు నమస్కరించి యేడ్చుచు దుఃఖముతో దర్భలపై శయనించెను. దానిని వానరులు చూచి దుఃఖముతో కన్నీరు విడచుచు సుగ్రీవుని నిందించుచు వాలిని బొగడుచు నంగదుని చుట్టును జేరి వారుకూడ ప్రాయోపవేశముచేయుటకు సిద్ధమైరి. వారు సముద్రపుటుత్తరపు తీరముననున్న వింధ్యపర్వతముపై నిల్చి యాచమనమును జేసి దక్షిణపువైపు కొనలుండునట్లు దర్భలను పఱచి తూర్పువైపు ముఖముంచుకొని మరణముకోరుచు ప్రాయోపవేశ ముండిరి. ఇట్లు వారు ప్రాయోపవేశ ముండి రామునివనవాసమును, దశరథుని మరణమును, జనస్థానమున రాక్షసులమరణమును, జటాయుమరణమును, సీతాపహరణమును, వాలివధయు, సుగ్రీవునివిలంబమునుగూర్చి రామునకు కోపము వచ్చుటయు బిగ్గఱగ జెప్పుకొనుచుండ నాపర్వతము ప్రతిధ్వనించెను.

---

## ౧౩ వ. అధ్యాయము

## వానరులు సంపాతిని గలియుట.

ఇట్లు వింధ్యపర్వతముపై వానరులు ప్రాయోపవేశముచేయుచుండ జటాయువుకంటె పెద్దదియు, గొప్పబలపౌరుషములుకలదియు చిరంజీవియునగు సంపాతియను పేరుగల గృధ్రమొకపర్వతగుహాలోనుండి బైటకువచ్చి వారిని జూచి సంతోషముతో 'చాలకాలమునకు వీరు నాకు నాహారమైరి. దైవయోగమున మనుష్యునకు నిజముగ యోగక్షేమములుగలుగును. వీరిని జంపి భుజించెద'నని యనెను. అప్పుడు మిక్కిలిశ్రమనొందినయంగదుడు హనుమంతునితో 'సీతనువెదకుటకుమేషచే

మనమిక్కడకు వచ్చితిమి. యముడిప్పుడు స్వయముగ మనలకాపద కలిగించుటకై యీదేశమునకు వచ్చియున్నాడు. రామునికార్యము సుగ్రీవుడుచెప్పినట్లుజరుగలేదు. వానరులకు తెలియకుండ నీవిపత్తు శీఘ్రముగ తనంతటతానె సంభవించినది. ఆమెప్రియమునుగూర్చి గృధ్రరాజగుజటాయువు చేసినదంతయు మీరు వినియున్నారు. తిర్య గ్జంతువులన్నియుగూడమనవలెనేరామునియందు స్నేహము,కరుణయు గలవై యాతనిప్రియముకొఱకు దమప్రాణములను విడుచుచున్నవి. ధర్మము తెలిసినయీపక్షి తనప్రాణములనుగూడ విడిచి యాతనికి బ్రియమగుకార్యము చేసెను. మనమాతనిగూర్చి గొప్పయాయాస మును బొంది ప్రాణములను బోగొట్టుకొనుటకు సిద్ధమై యడవుల న్నింటిని దిరుగుచుంటిమి;గాని సీత నెచ్చటను గానలేకుంటిమి. రావణు నితో యుద్ధముచేసి మరణమునొందినజటాయువు సుఖమును బొందెను. అది సుగ్రీవునివలన భయములేచిదై గొప్పలోకమును బొందెను. దశ రథుఁను, జటాయువును మరణమునొందుటవలనను, సీతాహరణ మగుటవలనను వానరుల కిట్టిప్రాణసంశయముసంభవించెను. కైకేయి వరమునొందుటచే సీతారామలక్ష్మణులవనవాసము, ననేకరాక్షసులు రామునిచే వధింపబడుటయు,నాతనిబాణముచే వాలి వధింపబడుటయు జరిగె'నని పలికెను.

సంపాతి యీవానరులమాటలు విని మిక్కిలిదుఃఖమునొంది మనస్సు మిక్కిలిచలింప నిట్లు పలికెను. 'నాప్రాణములకంటె నెక్కు వగువాడును, నాసహోదరుడునునగు జటాయునివధనుగూర్చి నామనస్సు కంపించున ట్లెవడు ఘోషపెట్టుచున్నాడు? జనస్థానములో వానికిని, రావణునకును యుద్ధమెట్లయ్యెను? చాలకాలమునకు నిప్పుడు నాతమ్ముని పేరు నేను వింటిని. మీరు కొండమీదనుండి క్రిందికి రావలెనని కోరుచున్నాను. మంచిగుణములుకలవాడును, గొప్పవిక్రమముకల

వాడుననగు నాతమ్ముని పేరు చాలకాలమునకు వినియుండుటచే మిక్కిలి సంతోషము నొందితిని. జనస్థానములో నాతమ్మునిమరణమును, రాక్షసులమరణమును నెట్లుజరిగెనో వినగోరుచున్నాను. జటాయువునకు రామునితండ్రియగు దశరథుడు సఖుడు. ఆత డేమయ్యెను? నారెక్కలు సూర్యకిరణములచే గాలిపోయినందున నేను మీయొద్దకు నెగిరిరాలేను. మీరే యాపర్వతమునుండి దిగిరావలెను.' ఇట్లు సంపాతి దీనస్వరముతో బలికినను వానరు లది తమ్ము చంపి తినివేయు ననుభయముచే నూరకుండిరి. ఇంకను వారు 'మనల నది భక్షింపక పోయిన మన మిక్కడనుండి వెడలిపోయి కృతార్థులమయ్యెద'మని యనుకొనిరి. తరువాత నంగదుడు పర్వతమునుండి క్రిందకు దిగి యాపక్షికి వాలిసుగ్రీవులచరిత్రమును, రామాదులచరిత్రమును, నిదివఱకు జరిగినదంతయును దెలిపి 'మేము సీతను వెదకుటకు బంపబడి ఋక్షబిలమున వెతకుచు నక్కడ నొకమాసము నిలిచినను నామె మాకు దొరకలేదు. కాలము మించుటచే రామలక్ష్మణసుగ్రీవులందలి భయమువలన మే మిచ్చట ప్రాయోపవేశము చేయుచుంటి'మని పలికెను.

ఆపక్షి యావానరశ్రేష్ఠునిమాటలు విని పెద్దధ్వనితో నిట్లు నుడివెను. 'రావణునితో యుద్ధముచేసి మృతినొందిన జటాయువు నాతమ్ముడు. వానిమరణవార్త వినుటచే నాకు గోపమువచ్చినను నేను ముసలివాడను, రెక్కలులేనివాడననగుటచేనాభ్రాతృవిరోధిని సాధించుటకు శక్తిలేనివాడ నైతిని.' ఇట్లు సంపాతి పలికి * తాను, జటాయువును వేసికొనినపందెమును, సూర్యరశ్మివలన తనరెక్కలు కాలిపోవుటచే దాను వింధ్యపర్వతమున బడుటయు, నప్పటినుండియు తనతమ్ముని వార్త తనకు దెలియకుండుటయు జెప్పెను. అంతట బ్రాజ్ఞుడగు

* ౭వ. షష్ఠికరణము. ౨వ. అధ్యాయము. సంపాతిజటాయువుల చూడుము.

నంగదుడు 'నీవు జటాయుని యన్నవైనయెడలను, రావణునినివాస స్థానము నీకు దెలిసినయెడలను వాడిక్కడకు దగ్గఱగనుండెనో, దూరముగనుండెనో మాకు దెలుపు'మని దానిని గోరెను. దీనికి సంపాతి వానరులు సంతోషించునటుల తనమనస్సులోనున్న దాని నిట్లు చెప్పెను. "నాఱెక్కలు కాలిపోయినవి. నాకు పరాక్రమము లేదు. నేను మాటలచే రామునకు సహాయముచేసెదను. నే నూర్ధ్వ లోకములను, నధోలోకములను, సముద్రము నమృతమునకై మథించు టయు నెఱుగుదును. రామునికార్యమును నేను ముఖ్యముగజరుప వలెను; కాని ముసలితనముచే నా తేజ ముడిగియున్నది. నాప్రాణములు దుర్బలములైయున్నవి. నేనిక్కడ నిలిచియుండ రావణుడు మంచి రూప యౌవనములుకలదియు, నన్నియలంకారములు కలదియు, 'రామా! లక్ష్మణా!'యని యేడ్చుచున్నదియునగునొకస్త్రీనితనతొడపై గూర్చుండ బెట్టుకొని తీసికొనిపోవుచుండెను. అప్పుడు వణకుచున్నశరీరముగల యామె తననగలను క్రిందకు బడవైచుచుండ నే నామెను జూచితిని. ఆమె రాముని గీర్తించుటచే నామెయే సీత యని నేను దలచెదను. రావణుని నివాసస్థానమును దెలిపెదను వినుడు. విశ్రవసునిపుత్రుడును, కుబేరునితమ్ముడునునగు రావణుడు లంకాపట్టణమున నుండును. ఈసముద్రమునకు దక్షిణపుదిక్కున 'లంక' యను ద్వీపము కలదు. దక్షిణసముద్రతీరమునుండి యక్కడకు 400 క్రోసులదూరమున్నది. దానిలో విశ్వకర్మవలన నిర్మింపబడిన లంకాపట్నము కలదు. దానికి సువర్ణమయములగు ద్వారములును, బంగారుతిన్నెలును, దెల్లగనున్న పెద్దప్రాకారములును గలవు. అందు రావణునియంతఃపురమున సీత రాక్షసస్త్రీలు కావలియుండ పచ్చనిపట్టుబట్టను ధరించియున్నది. ఆమె నక్కడ మీరు చూడగలరు. నేను నాదివ్యచక్షువులతో దీనిని నెఱిగి యున్నాను. వానరులారా! మీరు శీఘ్రముగ వెళ్ళి విక్రమబలములచే

నామెను జూచి తిరుగ రండు.” ఇట్లు సంపాతి వారికి సీతారావణుల సమాచారము దెలిపెను. తరువాత నది వారికి ♦ పక్షులుతిరుగు నాకాశభాగములను దెలుపుచు ‘మేము గరుత్మంతులము. భూమినుండి 400 క్రోసులదూరమున పైన దిరుగువారము. ఇక్కడనుండి నేను సీతా రావణులను జూచుచుంటిని. నాదివ్యచక్షువులచే నంతయు గనిపించు’నని పలికి యిట్లనెను. ‘రావణుడు సీతను దీసికొనివచ్చుట యను నిందార్హ మగుకార్యమును జరిపెను. నాతమ్ముని జంపుటవలన వానిపై నాకు గలిగిన గొప్పవిరోధమునకు తగినప్రతిఫలమును వా డనుభవించును. మీరు రెల్లైన సముద్రమునుదాటు నుపాయ మాలోచింపుడు. మీరు సీతను జూచినయెడల మీకార్యసిద్ధియగును. మీతో నేను దక్షిణ సముద్రతీరమునకు వచ్చి స్వర్గస్థుడైన నాతమ్మునికి మొదట నుదక ప్రదానము చేసెదను.’ ఇట్లు సంపాతిపలుక వానరులు దానిని మొదట నక్కడికి తీసికొనిపోయి దానిచేత జటాయువునకు నుదక దానమిప్పించి తిరుగవింధ్యపర్వతమునకు దీసికొనివచ్చిరి. అప్పుడు సంపాతి * తన

---

♦ 13 వ. ప్రకరణము. ౧౭ వ. అధ్యాయము. భూలోకభూగోళము చివర పటమును జూడుము.

* 2 వ. ప్రకరణము. ౨ వ. అధ్యాయము. సంపాతి జటాయువులు చూడుము.

వాల్మీకి రామాయణము కిష్కింధాకాండలో 59 మొదలు 63 వఱకు నుండు సర్గలు కొన్నిప్రతులలో గానరావట. అవి ప్రక్షిప్తములవలె గానవచ్చుచున్నవి. వీనిలో నున్న యంశములనన్నిటిని చరిత్రలో దెలియబఱచుటయవసరమని తోచదు. పైన జెప్పిన యంశములలో ‘సంపాతి రావణుడు సీతనెత్తుకొనిపోవుట నూఱుయోజనముల దూరమునుండి చూచుచుండె’నని తెలుపబడినది. 59 సర్గలో తానురావణుడు సీత నెత్తుకొనిపోవుట చూడలేదనియు, తనకుమారుడగు సుపార్శ్వుడు మహేంద్రగిరి యొద్ద చేపలనిమిత్తము నిరీక్షించుచు సీతారావణులను జూచి తనతో జెప్పెననియు వక్కాణింపబడియున్నది. ఈసంగతి నమ్మతగినది కాదు. కనుక చరిత్రలో జేర్ప లేదు. ఎగురలేని సంపాతి మాత్రము దీనినెట్లు చూచియుండును? అయినను ముఖ్యాంశములను గ్రంథములో నిమిడ్చితిమి.

పూర్వవృత్తాంతమును వారికి దెలుపుచు నిట్లనెను. 'మీతో నా సంగతి చెప్పగనే నాకు ఱెక్కలు వచ్చినవి. సంతోషముగలనాకు పూర్వము వలెనే బలపౌరుషపరాక్రమములు వచ్చినవి. నాకుఱెక్కలువచ్చుటచే

అ. రా:—సంపాతి చంద్రమసుడను ఋషితో తనయవస్థను దెలిపినప్పుడత డిట్లు సెలవిచ్చెను." దేహమువలననే యీదుఃఖము సంభవించెను. దేహము కర్మవలన పుట్టును. ఆకర్మపురుషునికి దేహమునందు నహంకారబుద్ధిచే గలుగును. ఆయహంకార మనాది యైనదియు, నవిద్యవలనబుట్టినదియు, జడమును నై యున్నది. కాలినయినపగుండు అగ్నితో నైక్యమును బొందినటుల నహంకారము చిచ్ఛక్తితో నైక్యమును బొందియున్నది. కనుక చిజ్జడముల తాదాత్మ్యమువలన దేహముకూడ చైతన్యముకలదైనది. నేనేదేహ మనుబుద్ధి జీవునకు నహంకారబుద్ధిచే గలుగును. నేనేదేహ మనుబుద్ధివల్ల కర్మద్వారా సుఖదుఃఖాదులను గలుగజేయు నీసంసారము కలిగినది. వికారరహితుడగు జీవునకు మిథ్యాభూతమైనయంతఃకరణతాదాత్మ్యాధ్యాసవలన (నేను అనుభ్రమ) 'నేను బ్రాహ్మణుడను.' అనునధ్యాస కలిగినది. (నేను అనుదానికి నంతఃకరణతాదాత్మ్యాధ్యాసయనియు, (నేను) బ్రాహ్మణుడను అనుదానికి దేహాధ్యాసయనియు నందురు.) దానివలన ఫలాపేక్షచే నతడు కర్మల నాచరించి పిమ్మట నాఫలములచే బద్ధుడై యెల్లప్పుడు నూర్ధ్వాధోలోకములను బొందుచున్నాడు. ఎట్లన;—బ్రాహ్మణుడనైన నేను స్వర్గాదులను గలుగజేయు యజ్ఞదానాదులను జేసి స్వర్గమునుబొంది యక్కడ సుఖింపగల నను సంకల్పముగలవాడై యజ్ఞదానాదుల నాచరించి స్వర్గసుఖముల ననుభవించి యట్లనుభవించుటచే క్షీణించినపుణ్యము గలవాడై జన్మహేతువగుకర్మచే ప్రేరేపింపబడినవాడగుచు నిచ్ఛలేక పోయినను చంద్రమండలమందు ప్రవేశించును. అచ్చటనుండి కిరణములద్వారా మంచుతోగూడినవాడై భూమియందుండు ధాన్యాదులయందు మంచురూపముగ ప్రవేశించి చిరకాలమచ్చటనుండిభక్ష్య

మీకార్యసిద్ధియగును. మీరు సీతను వెదకుటకు ప్రయత్నము తప్పకుండ జేయవలెను.' ఇట్లు సంపాతి పలికి యాపర్వతశిఖరమునుండి యెగిరి

---

భోజ్య లేహ్య చోష్య రూపముగ విభజింపబడి పురుషులచే భుజింపబడి రేతోరూపమునుబొంది ఋతుకాలమందు స్త్రీయోనియందు ప్రవేశించి యోనిరక్తముతో గలిసి యొకదినములో 'జరాయు'వను పేరుగలగర్భము నావరించియుండు చర్మవిశేషముచే నావరింపబడును. పిమ్మట రేతో రక్తములు 'కలల' మను పరిణామవిశేషమునుబొంది 5 రోజులలో నీటిబుడగరూపమును బొందును. తరువాత బుద్బుదరూపమునుబొందిన యాగర్భము 7 రోజులకు మాంసపేశిత్వరూపమునుబొందును. పిమ్మట 15రోజులకు నది రక్తముతో నావరింపబడును. 25రోజులగుసరికినా పేశి యందు నవయవములంకురించును. పిమ్మట 30 రోజులగుసరికి నా పేశి యందంకురించినయవయవములు కంఠము, శిరస్సు, భుజములు, వెనుక భాగము, కడుపునను రూపములుగ క్రిమక్రిమముగ నగును. 2 మాస ములకు హస్తములు, పాదములు, పార్శ్వభాగములు, కటిప్రదేశము, జానువులు నంకురించును. 3 మాసములగుసరికి నీయంకురించిన యవ యవములకు సంధులేర్పడును. 4 వ మాసమున వ్రేళ్ళంకురించును. 5 వ మాసమున ముక్కు, చెవులు, నేత్రములు, దంతపఙ్క్తి, గోళ్ళు, పృష్ఠము నంకురించును. 6వ మాసమున కర్ణములకు రంధ్రములు, ముక్కురం ధ్రములు, గుదము, శిశ్నము, ఉపస్థ, నాభి యంకురించును. 7వ మాస మున రోమములు, శిరస్సు, కేశములు కలుగును. 8వ మాసమున నీకలిగినయవయవములన్నియు వేఱువేఱుగనేర్పడి స్త్రీగర్భమందు వృద్ధినిబొందుచుండును. జీవునకు 5వమాసమున జ్ఞానమంకురించును. ఆగర్భస్థజీవుడు తనతల్లియొక్క యన్నకోశమునకును, తననాభికిని సం బంధించియున్న తిత్తిద్వారా తల్లిచే ననుభవింపబడుచున్న పదార్థముల యొక్క సారము ననుభవించుచు వృద్ధినిబొందుచు తాను ముందనుభ

పత్తులుపోవు మార్గమున బోయెను. అప్పుడు వానరులు మిక్కిలి

---

వింపవలసిన ప్రారబ్ధకర్మవల్ల మృతినిబొందక పూర్వజన్మలందుజేసిన తనకర్మలను స్మరించి జఠరాగ్నిసంతప్తుడై యీతీరుగబలుకును. 'దేవా! నేనిదివరలో ననేకయోనులందు పుట్టిపుట్టి దారాపుత్రధనపశుబంధు సంబంధమునుబొంది కుటుంబపోషణయందాసక్తిగలవాడనై న్యాయాన్యాయములచేత ధనమార్జించితిని. స్వప్నములో నైనను మీస్మరణ జేయనైతిని. అందువలన నిప్పుడు ద్వాదశాంగుళ ప్రమాణముగల యీగర్భనరకమందు ప్రవేశించి గొప్పదుఃఖమును బొందుచుంటిని. ఈ దేహ మశాశ్వతమైనదైనను శాశ్వతమనెడు బుద్ధిచేత నత్యాశతో గూడినవాడనై శాస్త్రవిరుద్ధమును, దుఃఖదాయకమునునగు కర్మలనె యాచరించితిని. దుఃఖములేనిమోక్షమునుగలుగజేయు మంచికర్మలను జేయనైతిని.' ఈతీరుగ ననేకవిధములుదుఃఖించి 'నేనెప్పుడీగర్భనరకము నుండి బయటపడుదును? ఇకపిమ్మట నేనెల్లప్పుడు విష్ణువునే పూజించె దను. పాపములు చేయు'నని మొఱబెట్టుచున్నవాడై యోనియంత్రముచే పీడింపబడినవాడగుచు రౌరవాదినరకములనుండి పంచమహాపాతకి వలెను, దుర్గంధభూయిష్టమగు పుండునుండి పురుగువలెను గర్భము నుండి బయటపడి బాహ్యవాయువుచే నావరింపబడినవాడగుచు పూర్వ జ్ఞానము నశించిపోవ బాలుడై యేడ్చుచు క్రమముగ బాల్యావస్థ, యౌవనావస్థ మొదలుగాగల యవస్థలను బొందుచు మంచికార్యము లనుజేయక చెడ్డపనులనేచేయుచు జననమరణప్రవాహరూపమగు సం సారమునేపొందుచుండును. గృధ్రా! నాచే జెప్పబడిన యన్నియవస్థ లను నీవు పొందియుంటివికదా! ఇంకనువర్ణింపదగినవిషయములు కొన్ని యుండినను నవి యందఱకు దెలిసినవేగాన వానిని నేను వర్ణించియుండ లేదు. దీనికంతకు మూలకారణమైన దేదియనగా 'దేహమందు నేను' అనుబుద్ధియే. దానివల్లనుండియే నరకము, గర్భవాసాదిదుఃఖములు

సంతోషముతో మంచిముహూర్తము న నెగిరి వాయువేగముతో దక్షిణసముద్రముయొక్క యుత్తరతీరమునకు బోయి నిలిచిరి.

---

కలుగుచున్నవి. కాన స్థూలసూక్ష్మ దేహములకన్నను, ప్రకృతికన్నను నాత్మను వేఱుగ దెలిసికొని దారాపుత్రధనాదులందు మమకారమును విడిచి యాయాత్మను జాగ్రదాద్యవస్థలులేని సత్యజ్ఞానాది స్వరూపము గను, శుద్ధముగను, బుద్ధముగను, శాంతమైనదానిగను దెలిసికొనిన యెడల నజ్ఞానమువల్లగలిగిన మోహము నశించును. పిమ్మట ప్రారబ్ధ కర్మాధీనమైన దేహ ముండిన నుండుగాక! పోయిన పోవుగాక! యోగులకు నజ్ఞానము నశించుటచే నజ్ఞానమువల్ల గలిగినసుఖదుఃఖములు లేవు. కావున గృధ్రా! నీవు నేను చెప్పినప్రకారముగ నాత్మస్వరూపమును దెలిసికొని ప్రారబ్ధకర్మక్షయపర్యంతముండి సర్పము కుబుసమునువలెనే దేహమును విడిచి ముక్తిని బొందుదువు." చంద్రముపుడు సంపాతికిట్లు చెప్పెను.



ఓమ్.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# విశోధితరామాయణము.

## 10వ. ప్రకరణము.

## లంకలో హనుమంతునిచరిత్రము.

### ౧వ. అధ్యాయము.

### హనుమంతుడు లంకకు నెగురుపప్రయత్నము.

వానరులందఱు దక్షిణసముద్రపుటుత్తరతీరమునకు బోయి సింహనాదముచేయుచు నక్కడ విడిసిరి. అక్కడ లోకములోనుండు చెట్లు, చేమలు మొదలగునవన్నియు నుండెను. సముద్రమున పెద్ద జంతువులును,వికృతాకారముగల జంతువులును క్రీడించుచుండెను. కొన్ని తమనోళ్లను తెఱచుకొనియుండెను. కొన్నిచోట్ల పెద్దపెద్ద కెరటములు వచ్చుచుండెను. కొన్నిచోట్ల నీరు చలింపకయుండెను. దానిలో పాతాళమునుండి వచ్చిన దానవశ్రేష్ఠులు క్రీడించుచుండిరి. వానరు లిదంతయుజూచి గొప్పవిచారమును బొంది తమకార్య మెట్లు జరుగునని యనుకొనిరి. దానికి బుద్ధిమంతుడగు నంగదుడు 'మనస్సునకు విషాద ముండకూడదు. అది యన్నిదోషములలోను గొప్పది. అది మనుష్యుని జంపును. పరాక్రమముగలవాని నది లొంగదీసికొని వానితేజమును బోగొట్టును. అపుడు వానికార్యములు నెఱవేఱ'వని వారినోదార్చెను. తరువాత నాటిరాత్రియంతయు నావానరులు గడపిరి. ఆమఱునాటి

యుదయమున నంగదుడు హనుమంతుని, నితరవానర శ్రేష్ఠులనందఱిని పిలిచి వారితో నిట్లాలోచనచేసెను. 'నూఱుయోజనములుదూరము గల యీసముద్రమును లంఘించి సుగ్రీవునిమాటలు నిజమగునటుల జరిపి మీయందఱిమనస్సులోనునుండుభయమును నెవడు తొలగించును? ఎవనిప్రభావముచే మనమందఱము మనకార్యమును జరుపుకొని యిక్కడ నుండివెడలి మనభార్యలను, పుత్రులను, గృహములను సుఖముగబొంది రామలక్ష్మణసుగ్రీవులను సంతోషముతో జూచెదము? సముద్రమును దాటగలిగిన సమర్థుడు మనకు శీఘ్రముగ నభయదక్షిణనిచ్చుగాక!' ఇట్లంగదుడు పలుక వానరసేనయంతయు నూరకుండెను. అంతట తిరుగ నతడు 'మీరు బలవంతులలో శ్రేష్ఠులు; గొప్పవిక్రమముగల వారు; గొప్పవంశములోబుట్టినవారు; నిర్భయులు; లోకములచే బూజింపబడువారు. మనలో నెవరికైన నెక్కడికైన వెళ్లుటకెంత మాత్ర మాటంకములేదు. ఎవరెంతదూరమెగురగలరో వానర శ్రేష్ఠులగుమీరు నాకు దెలియజేయు'డని వారినిగోరెను.

అప్పు డావానరయువరాజుమాటలను విని వారు తామెగురగల దూరము నిట్లు తెలిపిరి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| గజుడు | 10 | యోజనములు. | మైందుడు | 60 | యోజనములు. |
| గవాక్షుడు | 20 | ,, | ద్వివిదుడు | 70 | ,, |
| గవయుడు | 30 | ,, | సుషేణుడు | 80 | ,, |
| శరభుడు | 40 | ,, | జాంబవంతుడు | 90 | ,, |
| గంధమాదనుడు | 50 | ,, | | | |

అందఱిలోను వృద్ధుడును, మాటలనుజెప్పుటలో నేర్పరియు, గొప్పబుద్ధిమంతుడునునగు జాంబవంతు డిట్లు పలికెను. 'ఎగురుటలో బూర్వము నాకు మంచిపరాక్రమముండెడిది. ఇప్పుడు నాకు ముసలి తనమువచ్చినది. అయినను రామసుగ్రీవులు నిశ్చయించిన కార్యమున్ను

గూర్చి వెళ్లుటలో మనముపేక్షింపగూడదు. మీరు కాలమునను సరించి యెంతదూరము వెళ్ళగలరో తెలుపుడు. నేను నిస్సందేహముగ 90 యోజనములదూరము వెళ్ళగలను. పూర్వము బలి యజ్ఞమున మహావిష్ణువు మూడుపాదములు వేసినకాలమున 21 సార్లు నేను భూప్రదక్షిణముచేసి వచ్చితిని. మేము విష్ణునియాజ్ఞచే నోషధులను దెచ్చి సముద్రములో వైచి దానిని దఱచి యమృతమును ద్రాగితిమి. ఇప్పు డట్టి పరాక్రమము నాకు లేదు. ఇప్పుడీకార్యమునుజరుపుటకు సముద్రమును దాటగలిగినంతశక్తి నాకు లేదని నేనూహించెదను.' ఇట్లు జాంబవంతుడు పలుక నౌదార్యముకలయంగదుడు 'నేను నూఱు యోజనములు వెళ్ళగలను; గాని తిరుగవచ్చుటకు నాకు శక్తిగలదో లేదో యని యనుమానించుచున్నా' నని తెలుప నాఋక్షశ్రేష్ఠు డిట్లు విన్నవించుకొనెను. 'మీకు నూఱు యోజనములుకాని, వేయి యోజనములుకాని వెళ్ళి తిరుగవచ్చుటకు తగినసామర్థ్యము కలదు. మాకు రాజగు మీరు సేవకుడుచేయవలసిన యిట్టి పని చేయగూడదు. అందులకై సేవకులమగు మే మందఱ మున్నాము. సైన్యాధిపతులగు మీరెల్లపుడు రక్షింబడదగినవారు. ఇప్పటియీకార్యమునకు మీరు ముఖ్యులు. దీనిని నిర్వహించుటకై మీరు రక్షింపబడవలెను. వేరున్న యెడల చెట్లు పుష్పించి ఫలించును. కార్యము దెలిసినవా రీనీతిని బాలింతురు. ఈకార్యమును నెఱవేర్చుటలో మీరు బుద్ధిబలముగలవారు. మీరు మాకు ప్రభువులును, ప్రభుపుత్రులును నై యున్నారు. మిమ్మాశ్రయించియే మేమన్నికార్యములను జరుపగలము.' జాంబవంతుని యీమాటలను నావానరయువరాజు విని యిట్లు సెలవిచ్చెను. 'వానరులారా! నేనును, మిగిలినవానరులును లంకకు వెళ్ళలేకపోయిన మనము తిరుగ ప్రాయోపవేశము చేయవలెను. బుద్ధిమంతుడగు సుగ్రీవుని యాజ్ఞను మనము నెఱవేర్చకుండ నాతనియొద్దకు బోయిన

ప్రాణములను రక్షించుకొనుటకు మనకు వీలులేదు. అతనికి దయయు, గోపమును నధికముగ గలవు. అతనియాజ్ఞను జరుపకుండ వెళ్లిన మనకు నాశనము కలుగును. ఈకార్యముజరుగునటుల మీరు బాగుగ నాలోచింపుడు.' ఇట్లంగదుడు పలుక జాంబవంతుడు 'ఈకార్యమునకు నష్టమేమియుగలుగదు. దానిని సాధింపగలవాడీహనుమంతుడే' యని పలికి యొకమూలను సుఖముగ గూర్చుండియున్న వానరశ్రేష్ఠుడగు నాతనిని లంకకు బోవుటకు నియమించెను.

వానరులందఱు విచారముతోనుండ వాయుపుత్రుడొకమూల నూరక కూర్చుండియుండెను. జాంబవంతు డతనిని జూచి యిట్లు పొగడెను. 'అన్ని శాస్త్రములు దెలిసిన వానరవీరా! హనుమంతా! నీవేల యూరకున్నావు? నీవు సుగ్రీవరాజుతో సమానుడవు. తేజోబలములందు రామలక్ష్మణులతోగూడ సరియగువాడవు. అన్నిపక్షులలోను గొప్పవాడును, గొప్పబలముగలవాడునునగు గరుత్మంతుడు సముద్రమునుండి పాములనుబట్టియెగురుట జాలసారులుచూచితిని. వానికిగల వేగము, పరాక్రమము, వాని ఱెక్కలకు గలబలము నీకుగూడనున్నవి. నీకుగల బలమును, బుద్ధిని, తేజమును నీవేల తెలిసికొనవు?' ఇట్లు జాంబవంతుడు పలికి * హనుమంతుని జన్మవృత్తాంతమును దెలిపి యింకను నిట్లనెను. 'నీకు బ్రహ్మ శస్త్రమువలన మరణము లేదని వరమిచ్చెను. నీయిష్టమువచ్చినపుడు నీకు మరణముకలుగునని యింద్రుడు వరమిచ్చెను. నీవెగురుటలోను, తేజమునను వాయువుతో సమానుడవు. నీవే ప్రాణములుపోయిన మమ్ము రక్షింపదగినవాడవు. హనుమంతా! పరాక్రమముచే నీరూపమును వృద్ధిబొందింపుము. ఎగురుటలో నీవే ముఖ్యుడవు. నీపరాక్రమమును వానరులందఱు చూడగోరుచున్నారు. లెమ్ము; సముద్రమును దాటుము. సమస్తభూతముల గమనముకంటె

* 4వ. ప్రకరణము, ౨వ. అధ్యాయము, హనుమంతుడు చూడుము.

నీగమనము గొప్పది. వానరులందఱు గొప్పవిచారమును బొంది యున్నారు. వామనుడు తనరూపమును బెంచినటుల నీవు నీశరీరమును వృద్ధినొందింపుము.' ఇట్లు జాంబవంతుడు హనుమంతుని గోరెను.

అప్పు డాంజనేయుడు తనరూపమును వృద్ధినొందించెను. దానిని జూచి మిగిలినవానరులు తమ విచారమును విడిచి మిక్కిలిసంతోషము నొంది పెద్ద కేకలు పెట్టిరి. త్రివిక్రమరూపమును జూపినవామనుని వలెను, కొండశిఖరముననుండు సింహమువలెను హనుమంతుడు పెద్ద శరీరమును బొంది తనతోకను క్రిందగొట్టెను. ఆతనిముఖము పొగలేని యగ్నివలె ప్రకాశించెను. ఆతని వెండ్రుకలు గగుర్పాటునొంద నతడు వానరవృద్ధులకు నమస్కరించి తనప్రతాపము నిట్లు తెలిపెను. 'నేను బలవంతుడగు వాయుపుత్రుడను. అతనివలె నేను శీఘ్రముగ నెచ్చోటి కైన బోగలను. గొప్పదగు మేరుపర్వతమును నేను వేయిసారులు విలంబముచేయకుండ ప్రదక్షిణముచేసి రాగలను. నాబాహువేగమున సముద్రములు, పర్వతములు, నదులు, సరస్సులు మొదలగువానితో నిండిన లోకమును జుట్టి రాగలను. నేనట్లుచేయ నావేగముచే సముద్ర మల్లకల్లోలమగును. అందుండు పెద్దజంతువులు పైకి తేలుచుండును. ఆకాశముననుండి తనయాహారముకొఱకు శీఘ్రముగబోవు గరుత్మంతుని నేను వేయిసారులు ప్రదక్షిణము చేయగలను. సూర్యు డుదయపర్వతమునుండి బయలుదేఱ నాతనితోగూడ నేను బయలుదేఱి ముందుగా నస్తగిరికి బోయి తిరుగవచ్చి మధ్యమార్గమున నాతని జూడగలను. అక్కడనుండి భూమికి వచ్చి యెక్కడను విశ్రాంతిదీసికొనకుండతిరిగి యాతనియొద్దకు బోగలను. ఆకాశముననుండు గ్రహనక్షత్రాదుల గమనము నతిక్రమించి నేను రాగలను. సముద్రము నింకింపజేయగలను. భూమిని బ్రద్దలుగొట్టగలను. పర్వతములను బిండిచేయగలను. నేను సముద్రముపై నెగురుచున్నప్పు డావేగముచే నాకులు, పువ్వులు

నావెంట వచ్చును. నేనాకాశమున నక్షత్రపథమున బోగలను. నే నాకాశమున క్రిందికి, మీదికి బోవునపు డన్నిజంతువులు నన్ను జూచు చుండును. మేఘమువలె నే నాకాశమున గదలుచున్నట్లు మీకు గన బడెదను. అప్పుడు మేఘములు ముక్కలగుచుండును. సముద్రమల్ల కల్లోలమగుచుండును. గరుత్మంతునికిని, వాయువునకును గలవేగము నాకు మాత్రమే గలదు. మేఘములోని మెఱపువలె నాకాశమున నేను శీఘ్రముగబోవుదును. నాబుద్ధిచేతను, నామనస్సుచేతను నాలోచింప నేను సీతను తప్పకజూడగల నని నాకు దోచుచున్నది. మీరందఱు సంతోషమునొందుడు. నేను పదివేలయోజనములదూరమైన నెగుర గలను. ఇంద్రుని, బ్రహ్మను, జయించి బలవంతముగ నే నమృతమును దేగలను. నేను లంకను పెకలించి శీఘ్రముగ రాగల నని తలచు చున్నాను.' ఇట్లు హనుమంతుడు పలుక వానరులందఱు గొప్పసంతో షమును బొంది యాతనినాశ్చర్యముగ జూచుచుండిరి.

అప్పుడు జాంబవంతుడు మిక్కిలిసంతోషమును బొంది హనుమంతు నితో నిట్లనెను. "కేసరీపుత్రా! మారుతీ! వీరహనుమంతా! స్నేహితుల మగు మాశోకము నీవలన బోయినది. వానరులు నీహితమునుగోరి కార్యసిద్ధికై నీకు దీవనల నిచ్చుచున్నారు. ఋషులయొక్కయు, వానర వృద్ధులయొక్కయు, గురువులయొక్కయు దయచేతను నీవెగిరి సముద్ర మును దాటుము. నీవు తిరుగవచ్చువఱకు మే మొక్కపాదమున నిలిచి నీరాకకెదురు చూచెదము. మావానరులప్రాణములన్నియు నీయందే నిలిచియున్నవి.' ఇట్లు జాంబవంతుడు పలుక నాంజనేయుడు'అట్లే యగు గాక!' యని పలికి 'నేనీభూమినుండి యెగురుటకు నావేగము నిది భరింపలేదుగాన పెద్దరాళ్లు, శిఖరములుగల మహేంద్రపర్వతమునుండి యెగిరెద' నని పలికెను. ఆమహేంద్రపర్వతముపై మంచియాకులును, పూవులును, ననేకవిధములగు ఫలములునుగల మంచిచెట్లును, నేను

గులు, సింహములు మొదలగు మృగములును, జలప్రవాహములును, మంచిపక్షులునునుండెను. అతడు దానినెక్కి యిందునితో సమాన మగు పరాక్రమమున దిరిగెను. వానిని జూచి యచ్చటిజంతువులు భయ మొందెను. చెట్లన్నియు గంపమునొందెను. అతనివక్షస్థలపురాపుడుచే గొన్ని చెట్లు క్రిందబడెను. వానివలన కొన్ని మృగములు మృతినొం దెను. అతడు సముద్రమును నాకాశమార్గమున దాటుట కాలోచించి తనతోడివానరులతో నిట్లనెను. 'రాముడు బాణమును లంకపై విడి చిన నది వాయువేగమున నెట్లు తిన్నగబోవునో యారీతినే నేను బోయెదను. నే నక్కడ సీతను జూడలేకపోయినయెడల నక్కడనుండి వెంటనే యామెను వెదకుటకు స్వర్గమునకు బోయెదను. అక్కడను నామె నాకు గనబడకపోయిన రావణునిగట్టి యీడ్చుకొనివచ్చి రామునియెదుట బెట్టెదను. ఏలాగునైనను నాకార్యమును సఫలముచేసి కొని సీతతో దిరుగవచ్చెదను. లేక లంకను రావణునితోగూడ పెల్ల గించి తీసికొనివచ్చెదను.' ఇట్లు హనుమంతుడు పలికి మహేంద్రపర్వత మును విడువ సిద్ధమాయెను.

---

## ౧ వ. అధ్యాయము.

## హనుమంతుడు లంకకు నెగురుట.

హనుమంతుడు సూర్యునికిని, మహేంద్రునికిని, వాయుదేవుని కిని, బ్రహ్మమొదలగు దేవతలకును నమస్కరించి సముద్రమును దాటుటకు సిద్ధమై తూర్పువైపునకు దిరిగి వాయువేవునకు నమస్క రించి పాదములతోను, చేతులతోను లంఘించి * మహేంద్రగిరినుండి

* అ. రా:—హనుమంతుడు మహేంద్రపర్వతమునుండి యెగు రునపుడు 'ఈదినమున నేను సీతను జూచెదను. నేను కృతార్థుడనైతిని!

మొగిరెను. అప్పుడు పుష్పించిన చెట్లనుండి పూవు లెక్కువగ రాలెను. పర్వతమునుండి నీటికాలువలు బంగారము మొదలగులోహములతో గలిసి ప్రవహించెను. కొండమీదిరాళ్లు పగుల వానిమధ్యనుండు లోహములకాంతి వ్యాపింప నవి క్రిందకు దొర్లిపోయెను. గుహలలో నుండు జంతువులు బాధనొంది వికృతస్వరములతో నేడ్చెను. అందుండు గొప్పజంతువులధ్వని దిక్కులకు వ్యాపించెను. పెద్దసర్పములు విశాలములగు తమతలలనుండి యగ్నినిగ్రక్కుచు రాళ్ళను గఱచెను. వాని విషము తగులుటచే నవి చాలముక్కలై ప్రకాశించెను. ఆపాముల విషమునునాపర్వతముననున్న యోషధులు శాంతినొందింపలేకపోయెను. అక్కడనుండుఋషులు పర్వతము ముక్కలుగ గొట్టబడినట్లు తలంచి దానిని విడిచిరి. అక్కడివిద్యాధరులు తమస్త్రీలతోగూడ భయమును బొంది తాము త్రాగుచుండెడిమద్యములను, తినుచుండెడి మాంసము మొదలగు భక్ష్యములను విడిచి చర్మపుటొరలుగల తమఖడ్గములను గూడ వదలి మత్తతచే నెఱ్ఱనికన్నులుగలవారై నవ్వుచు తమ యణిమాదిసిద్ధులనుజూపుచు నాకాశమ్ముపై కెగిరి నిలిచిరి. ఋషులును, చారణులును, సిద్ధులును నాపర్వతమును విడిచి యాకాశమున కెగసి 'ఇదిగో! హనుమంతుడు రామకార్యార్థము వానరులకు సంతోషము కలుగజేయుటకు సముద్రమును దాటుటయను గొప్పకార్యమును జేయుచున్నా'డని పలికిరి. అక్కడ క్రీడించు నాగ కిన్నర గంధర్వ

---

నేను కృతార్థుడనై తిని. నేను రాముని తిరుగజూచెదను. జనుడు తనప్రాణములుపోవు సమయమున రాముని పేరుస్మరించినంతమాత్రమున నే సంసారసాగరమునుదాటి యాతనిస్థానమును బొందును. అట్టిచో నతనిదూతను, నాతని వ్రేలియుంగరమును బట్టుకొనినవాడనునగు నే నేల యాతనిస్థానమును బొందను? అతనినే నామనస్సునధ్యానించుచు నీస్వల్పసముద్రమును దాటెద'నని పలికెను.

విహంగసంఘములుకూడ నా పర్వతమును విడిచెను. గొప్పపాములు పుట్టలలోనడగి సగము నిట్టూర్పుదీయుచుండెను. హనుమంతుడు పర్వతమునుండి లంఘించునపుడు వానివేగముచే నక్కడిచెట్లయాకులు రాలి వానితోగూడ బోయెను. పూచినచెట్లుకొన్నియు, గుగ్గిలపుచెట్లు కొన్నియు వానితోగూడ గొంతదూరముపోయి సముద్రమునబడెను. అతనిశరీరమునకు గొన్నిపువ్వులు పడియుండెను; కాని తరువాత నవి సముద్రములో బడెను. అవి యాకాశమునందు నక్షత్రములవలె సముద్రమున బ్రకాశించెను. హనుమంతుడు సముద్రమును దాటు నపుడు తన శరీరమును గదలించి మేఘమువలె పెద్దగర్జనచేసితనతోకను గరుత్మంతుడు పాములను విసరునటుల విసరుచు నాడించి తన పెద్ద భుజములను చలింపకుండ నిలిపి పాదములను లోనికిముడుచుకొని నడుమును సన్నముగ జేసి జుట్టు ముడివేసికొని తన తేజమును, బలమును, వీర్యమును పూరించి పైమార్గము చాలదూరమువరకు గనబడునటుల దృష్టిని నిలిపి యాకాశమును జూచుచు తన ప్రాణములను బిగబట్టి చెవులనెత్తి పెట్టుకొని యాకాశమార్గమున బోయెను. 'నేను గరుత్మంతుడ'నను మనస్సుతో నతడు పోవుచుండెను. అతడు సముద్రసమీపమున బోవునపుడు నీరు త్రాగుచున్నవానివలెను, నాకాశమున బోవునపుడు దాహముకలవానివలెను గనబడెను. అత డెగురునపు డాతని కండ్లు పర్వతములనుండునగ్నులవలెను, నతడు చక్రమువలె దిరుగుచు బోవునపు డవి యుదయించిన సూర్యచంద్రులవలెను బ్రకాశించెను. వానిముక్కు, ముఖము నెఱుపు, పసుపుకలిసిన రంగుగలిగి సంధ్యాకాలమునందుండు సూర్యమండలమువలె నొప్పెను. అతడట్లు పోవుచు తన తోకను సమానముగ మీదికి నిలుపనపు డది యింద్రధ్వజమువలె గనబడెను. వాని తోక మొద లెఱుపు, పసుపుగలిసిన రంగుగ నుండెను. అతడు పెద్దశరీరముతో నెగురునపుడు ఱెక్కలుగలపర్వతమువలెను, నాకాశమునుండిపోవుచున్న దీర్ఘాకారముగల సూర్యుని

వలెను, గొలుసుతో గట్టబడుటచే విజృంభించిన యేనుగువలెను [illegible] శించెను. అత డెగురుచున్నపుడు 10 యోజనములు పొడవు [illegible] నములు వెడల్పునుగలవానినీడ సముద్రములో తేలుచున్న [illegible] గదలుచు గనబడెను. అత డెగురుచున్న ప్రదేశములను [illegible] కెరటము లల్లకల్లోలములుగ నుండె నిక్కాలిపై కెగయు [illegible] వేగము బోవుచుండుటచే సముద్రములోని నీటియొక్క [illegible] నందుండు శేషు గిలుములు, పెద్దజంతువులు, మొసళ్ళు, [illegible] పైకి గనబడెను. అతడు గరుత్మంతునివలె [illegible] బోవుచు మేఘములను వాయువువలె గదలించెను. [illegible] చాలరంగులతో గనబడెను అతడు మేఘములందు [illegible] తరిగి వానిని విడుచుచు చంద్రునివలె గనిపించెను. శీఘ్రముగ [illegible] చున్న వానిని జూచి దేవదానవగంధర్వులు పుష్పవర్షము [illegible] సూర్యుడు వానికి తాపమునుగలిగింపలేదు; వాయువు [illegible] ఋషు లతనిని దీవించిరి. దేవగంధర్వులు పాడిరి. నాగులు, [illegible] పక్షులు, దిక్పాలురు సంతోషించిరి.

ఇట్టిసమయమున సముద్రు డిట్లాలోచించెను. 'నేను హను మంతునికి సాహాయ్యము చేయనియెడల సర్వవిధముల [illegible] దను. ఇక్ష్వాకువంశపు చక్రవర్తియగు సగరునివలన నేను వృద్ధినొం తిని. ఇత డావంశపురాజగు రామునికి మంత్రి. ఇతనికి కష్టము కలుగ కుండ జేయవలయును. ఇత డిక్కడ విశ్రమించునటుల నేను చేయ వలెను. అట్లుచేసిన మిగిలినదూరమును నితడు సుఖముగ దాటి పోవును.' ఇట్లు సముద్రుడు మంచియాలోచనచేసి సముద్రములో మునిగియున్న మైనాకపర్వతముతో నిట్లనెను. 'పాతాళములోనుండు నసురులు భూలోకమునకు రాకుండ తోవలోనడ్డముగ నీ వింద్రునిచే నుంచబడితివి. మీదికిని, క్రిందికిని, ప్రక్కలకును వృద్ధిపొందగల

సామర్థ్యమును నీవు కలిగియున్నావు. నిన్ను పైకి లెమ్మని నేనాజ్ఞాపించుచున్నాను. వానరశ్రేష్ఠుడు రామునికార్యసిద్ధికై సముద్రమును దాటుట యను గొప్పకర్మను జేయుచున్నాడు. ఇతడు నీపైని నిలిచి కొంచెము విశ్రాంతి తీసికొనును. ఇక్ష్వాకుకులమున కుపకారము చేయు వీనికి నేను సహాయము చేయవలెను. ఆవంశస్థులను నేను, నీవు కూడ మర్యాద చేయవలెను. మనకార్యము మించకుండునట్లు నీవు సహాయము చేయుము. చేయవలసినకార్యమును జేయకపోయిన యెడల సత్పురుషులకు గొప్పకోపమువచ్చును. ఈ వానరశ్రేష్ఠుడు మాకు పూజనీయుడైన యతిథి. అత డీపర్వతమున గూర్చుండి విశ్రమించును. రామునిదయాస్వభావమును, సీతపరదేశముననుండుటయు, హనుమంతునిశ్రమయు నీ వాలోచించి నీటినుండి పైకిలెమ్ము' ఇట్లు సముద్రుడు సెలవీయ మైనాకపర్వతము బంగారుశిఖరములతోను, పెద్దచెట్లు లతలుమొదలగువానితోను పైకి శీఘ్రముగలేచెను. ఆపర్వతముపైని కిన్నరులు, నాగులు క్రీడించుచుండిరి. దానిశిఖరము లాకాశము నంటుచున్నట్లుండెను. హనుమంతుడు త్రోవకు నడ్డుగనున్న యాపర్వతమును జూచి యది తనకు విఘ్నము చేయుననియాలోచించి గొప్పవేగముతో దానిని తనవక్షస్థలముతో గొట్టెను. అది యట్లు కొట్టబడి యాతనివేగమునకు తనసంతోషమును జూపుచు మనుష్యరూపమును దాల్చి తనశిఖరమున నిలువబడి యాకాశమునుండి పోవుచున్న వానిని జూచి యిట్లు పలికెను. "నీవు కష్టమగుకార్యమును జేయుచున్నావు. నీవు నాశిఖరములందు నిలిచి సుఖముగ విశ్రాంతి దీసికొనుము. రఘువంశమువారిచే సముద్రుడు వృద్ధినొందెను. కాన రామునికి మేలుచేయగోరు నీకు సముద్రుడు ప్రత్యుపకారమును జేయగోరుచున్నాడు. ఉపకారముచేసినవానికి ప్రత్యుపకారముచేయుట సనాతనధర్మము; గనుక నీవు దానినంగీకరించవలెను. ఈకపిశ్రేష్ఠుడు

నూఱుయోజనములదూర మెగురుచున్నాడనియు, నీశిఖరముం దల నటదీర్చుకొని మిగిలినదూరమును సుఖముగ వెళ్ళునవియు నన్ను సముద్రుడు మిక్కిలి మర్యాదగ నాజ్ఞాపించెను. కనుక నీవు నాపై విశ్రమించి వెళ్ళవలెను. ఇక్కడ మంచిరుచి, మంచివాసనగల కందమూలములు, పండ్లు మొదలగున వనేకములు గలవు. వానిని నీవు భుజించి నీయాయాసమును దీర్చుకొని వెళ్లుము. నీతో మాకును సంబంధము కలదు. నీవు మూడులోకములలోను ప్రఖ్యాతిగల మంచిగుణములు గలవాడవు. వేగముగ నెగురువానరులలో నిన్ను నేను ముఖ్యునిగ భావించుచున్నాను. ధర్మము తెలిసినవానికి సామాన్యమైనయతిథికూడ పూజనీయుడే. అట్టిచో నీవంటియతిథిసంగతి వేఱె చెప్పనేల? మహాత్ముడును, శ్రేష్ఠుడునునగు వాయువునకు పుత్రుడవగు నీవు వేగమున నాతనితో సమానమైనవాడవు. నిన్ను పూజించిన నాతడుకూడ సంతుష్టినొందును. అతనికిని, నాకునుగల సంబంధమును దెలిపెదను; వినుము. పూర్వము కృతయుగమునపర్వతమునకు ఱెక్కలుండెడివి. ఆ పర్వతములు వాయువేగమున నన్నిదిక్కులకు వెళ్ళుచుండుటచే నవి యెక్కడపడునోయని దేవతలకును, ఋషులకును, మిగిలినజీవులకును భయముకలిగెను. అప్పుడింద్రుడుగొప్పకోపముతో తనవజ్రముచే పర్వతముల ఱెక్కలనుముక్కలుముక్కలుగ ఖండించెను. అతడునాయొద్దకు గూడవచ్చుచుండ వాయుదేవునిచే నేనీసముద్రమున ఱెక్కలతోగూడ దాచబడి రక్షింపబడితిని. కనుక నాతడు నాకు బూజనీయుడు. నీవును నట్లే. ఇప్పుడు సముద్రుడును, నేనును నీకు ప్రత్యుపకారమును జేయుచున్నాము. నీవు సంతోషబుద్ధితో మాకు ప్రియము నొనర్పుము. నీయాయాసమును దీర్చుకొని మామర్యాదనంగీకరించి సంతోషమును బొందుము నిన్ను జూచుటచే నేను సంతోషము నొందితిని.” ఇట్లు మైనాకుడు పలుక హనుమంతు డిట్లు జబాబిచ్చెను. ‘నీయాతిథ్యమునకు

నేను ప్రీతినొందితిని. నీవు కోపమును విడువవలెను. నేను శీఘ్రముగ తిరుగవచ్చెదను. నేను మధ్యమార్గమున నెక్కడను నిలువనని ప్రతిజ్ఞ చేసితిని.' ఇట్లు హనుమంతుడుపలికి పర్వతమునుముట్టి సంతోషముతో దానిని జూచుచు నాకాశమార్గమునబోవుచుండెను. ఇట్లు సముద్రుని చేతను, మైనాకునిచేతను నతడు గొప్పమర్యాదను బొంది వారివలన తగినయాశీర్వచనములనుగూడ బొందెను. తరువాత నాతడు చాల దూరము పైకెగిరి వాయుమార్గమున బోవుచుండెను. మొదట సముద్రమును దాటుచుండెడి వానిగొప్పతనమును, తరువాత పర్వతమును దప్పించుకొని వెళ్ళుటయను గొప్పతనమును జూచి, దేవతలు, సిద్ధులు, గొప్పఋషులు వానినిబొగడిరి. ఇంద్రుడును, దేవతలును మైనాకుని పనికి సంతోషించిరి. ఇంద్రుడు సంతోషగద్గదభాషణములతో మైనాకుని కిట్లనెను. 'నీవుచేసినపనికిసంతోషించి నీకభయము నిచ్చుచున్నాను. నీవు సుఖముగనుండుము. నూఱుయోజనములు హనుమంతుడు నిర్భయముగ నెగురుచుండ మాకు భయముకలిగినది. నీవు వానికి సహాయము చేసితివి. రామునిదూతగపోవు నతనికి నీవుచేసిన మంచిపనికి నేనెక్కువగ సంతోషించితిని.' ఇంద్రుడిట్లు పలుక మైనాకుడు వానినిజూచి గొప్పసంతోషమునొందెను. హనుమంతుడా ప్రదేశమును నొక ముహూర్తములో దాటెను.

తరువాత దేవతలును, గంధర్వులును, సిద్ధులును, గొప్పఋషులును హనుమంతుని బలపరాక్రమముల నింకను పరీక్షింప నిశ్చయించి నాగులతల్లియగు సురసతో నిట్లనిరి. 'వాయుపుత్రుడగు నీహనుమంతుడు సముద్రముపై నెగురుచున్నాడు. ఒకముహూర్త మతని ప్రయాణమునకు విఘ్నముచేయుము. నీవు పర్వతమువంటి ఘోరమగు గొప్పరాక్షసరూపమునుదాల్చి భయంకరముగుకోరలును, గోరోచన వర్ణమువంటి కన్నును, నాకాశమువంటినోరును గలిగి వానికి గన

బడును. ఇతడు నిన్నుపాయమున జయించునో, లేక గొప్పవిచార మును బొందునో తెలియగోరెదము.' ఇట్లు వారు కోర సురస వారు చెప్పినట్లు వికృతమును, సన్నిజీవులకు భయంకరమునునగు రాక్షస రూపమునుబొంది హనుమంతుని కడ్డుగవచ్చి యిట్లు పలికెను. 'దేవత లచే నాకు నీవు భోజనముగ నిర్ణయింపబడియున్నావు. నిన్ను నేను తిని వేసెదను. కాన నీవు నానోటిలో ప్రవేశింపుము.' ఇట్లు సురస పలుక హనుమంతు డామెకు నమస్కరించి సంతోషముతో గూడిన ముఖము గలవాడై 'సీతారామలక్ష్మణులు దండకావనములో నివసించునప్పుడు రామలక్ష్మణులు మఱియొకదిక్కున నుండుసమయమున రావణుడుసీత నెత్తుకొనిపోయెను. రామునియాజ్ఞచే నేను దూతగ నామెను వెదకు టకు వెళ్లుచుంటిని. నీవు కూడ వారలకు సహాయము చేయవలెను. లేనియెడల నేను సీతను, రామునిజూచి నీనోటను ప్రవేశింతును. ఇది నిజ' మని పలుక సురస 'ఎవరును న న్నతిక్రమించివెళ్ళగూడదు. ఇది నా వర'మని పలికి తననోరు తెఱవ బుద్ధిమంతుడగు హనుమంతుడు తన శరీరమును బొటనవ్రేలంత చిన్నదిగాజేసి శీఘ్రముగ నామెనోటను బ్రవేశించి తిరిగి యతివేగముగ బైటకు వచ్చి యంతరిక్షమున నిలిచి యామెతో నిట్లనెను. 'నీనోటను నేను బ్రవేశించితిని. నీకు నమస్కా- రము. నీవరము నిజమైనది. సీతయుండుచోటునకు బోయెదను. హనుమంతుని యీమాటలను సురస విని తననిజరూపమును బొంది వానితో 'నీకార్యము నెఱవేర్చుకొనుటకు వెళ్ళుము. సుఖముగ బోయి సీతారాములసమావేశము జరుగునట్లుచేయు' మనిపలికెను. మూడవ దగు హనుమంతుని యీగొప్పకర్మనుజూచి జీవులన్నియు వానిని 'బాగుబా' గని పొగిడెను. తరువాత నతడు సముద్రమునుండి మీది కెగిరి మేఘములును, పక్షులును, విద్యాధరులును, మహర్షులును, గంధర్వులును, యక్షులును, గ్రహనక్షత్రములును, సూర్యచంద్రులును,

నుండు వాయుమార్గమున వెళ్ళెను. తరువాత కామరూపిణియగు 'సింహిక' యను రాక్షసి 'ఇప్పుడు చాలకాలమునకు పెద్దజంతు వాహారము దొరకిన' దని యాలోచించి యాతనిఛాయను బట్టుకొనెను. అప్పుడతడు 'నాపరాక్రమము దీనికి లోనయ్యె' నని దలంచి యన్ని దిక్కులు జూచుచు సముద్రమునందు నాఘోరరూపమును కనిపెట్టి యిది సుగ్రీవుడు చెప్పిన ఛాయాగ్రాహి యగు వికృతరూపముగల రాక్షసి యనియు, గొప్పపరాక్రమము, గొప్పశరీరము కలదనియు దెలిసికొని తనశరీరమును మిక్కిలి వృద్ధినొందించెను. సింహిక దానిం జూచి తనపెద్దనోటిని తెఱచి పెద్ద మేఘమువలె గర్జించుచు హనుమంతుని కెదురుగ బరుగెత్తెను. అతడు దానిగొప్పశరీరమును, నాయువు పట్టుండు స్థలములను జూచి తనశరీరమును చిన్నదిగ జేసికొని దాని ముఖమున బ్రవేశించెను. తరువాత నతడు తనవాడిగోళ్ళతో దాని మర్మస్థానములను జీల్చి శీఘ్రముగ మనోవేగముగ పైకివచ్చి తనశరీరమును పూర్వమువలె వృద్ధినొందించెను. ఆరాక్షసి సముద్రమున పడి చచ్చెను. ఆకాశమునందు నన్నిజీవులును హనుమంతుడు రాక్షసిని చంపుటయను గొప్పపనిని జేసెననియు, హనుమంతునివలె నెవనికి ధైర్యము, దూరదృష్టి, బుద్ధికుశలత, శక్తి యుండునో వాడెప్పుడును నష్టము నొందడనియు బలికి హనుమంతుని బొగడిరి.

తరువాత హనుమంతు డాకాశమార్గమున బోవుచు సముద్రపుటావలియొడ్డున జేరి యక్కడనుండు చెట్లసమూహమును, లంకకు దక్షిణమునందు మలయపర్వతమును, నుద్యానవనములను, సముద్రమున కలియునదులను జూచెను. అతడు తనదీర్ఘశరీరమును రాక్షసులు చూచెదరని యాలోచించి సామాన్యశరీరము నొంది త్రికూటమునందు లంకాపట్టణమును జేరెను.

---

## 3 వ. అధ్యాయము.
## హనుమంతుడు లంకలో ప్రవేశించుట.

హనుమంతుడు లంకకు చేరినతరువాత నందలిచిత్రములను జూచుచు రాముడు వచ్చి సీతను హరింపకుండునటుల ఘోరరాక్షసులు కాపుండుట జూచి విచారమును బొందెను. తరువాత నతఁ డుత్తర ద్వారము వద్దకుబోయి యక్కడ గూడ రాక్షసులు కాపుండుట జూచి యిట్లాలోచించెను. "ఇక్కడకు వానరులు వచ్చినను తమకార్యములను నెఱవేర్చుకొనలేరు. దేవతలైనను యుద్ధములో లంకనుజయింప లేరు. కష్టమగు నిట్టిచోటునకు రామునుడువచ్చినను నేమి చేయగలడు? రాక్షసులను సామ దానభేదములచేగాని, యుద్ధముచేగాని జయించుటకు నవకాశము లేకున్నది. నేనును, నీలుడును, నంగదుడును, సుగ్రీవుడును మాత్రమే సముద్రమునుదాటి రాగలము. మొదట నేను సీత జీవించియున్నదో లేదో తెలిసికొనవలెను. ఆమెను జూచిన తరువాత నాలోచించెదను." ఇట్లు హనుమంతు డాలోచనచేసి పర్వతశిఖరమున గూర్చుండి రామునికార్యజయమును గోరుచు నిట్లు తర్కించెను. "గొప్పపరాక్రమముకలవారును, మహావీరులును, శూరులును, బలవంతులునునగు రాక్షసులచే కాపాడబడుచున్న లంకకు నేనీపెద్దరూపముతో వెళ్ళకూడదు. నేను సీతను వెదకవలెనన్న వారిని మోసపుచ్చవలెను. సూక్ష్మరూపముతో నేనీరాత్రి లంకలో బ్రవేశించినయెడల నాగొప్పకార్యమును నెఱవేర్చుకొన గలుగుదును." ఇట్లాంజనేయు డాలోచించి దేవతలకును, నసురులకును జయింపశక్యముకాని లంకను జూచి గడియగడియకు నిట్టూర్పుదీయుచు నింకను నిట్లాలోచించెను. "రావణాసురునకు కనబడకుండ నే యుపాయమున నేను సీతను జూడ గలుగుదును? రామునికార్యము నష్టముచెందకుండునట్లుల నా మై

యొక్క తెయుండుసమయమున నేనొక్కడను నామె నెట్లు చూడ గలుగుదును? దూత వివేకములేనివాడైన బాగుగ నిర్ణయింపబడిన కార్యములకు దేశకాలవిరోధములగు ననర్థములు సంభవించును. కార్యాకార్యములందు నిశ్చితమగు రాజులబుద్ధిని, కార్యములను నవివేకులగు దూతలు పాడుచేయుదురు. కార్యము నష్టముకాకుండు నటులను, నేను బుద్ధిహీనుడనుకాకుండునటులను, నాసముద్ర లంఘనము వ్యర్థముకాకుండునటులను జేయవలెను. నన్ను రాక్షసులు చూచిన యెడల రావణునినాశనముకోరు రామునికార్యమునకు నష్టముకలుగును. నేను రాక్షసరూపము నొందినను వారు నన్ను గుర్తించెదరు. అట్టిచో నితరరూపమును నొందిన వేఱె చెప్పనేల? రాక్షసులకు దెలియకుండ నిక్కడ వాయువుకూడ సంచరింపలేదు. నేను నా నిజస్వరూపముతో బోయితినేని నాశనము నొందెదను. రామునికార్యముకూడ నాశనమగును. రాత్రి నేను సూక్ష్మరూపమునొంది రామకార్యసిద్ధికై లంకలోబ్రవేశించి యన్నియిండ్లను వెతకి సీతను జూచెదను." ఇట్లు హనుమంతుడాలోచించి సూర్యాస్తమయమగువఱకు వేచియుండి యప్పుడు పిల్లియంతరూపమును దాల్చెను. అతడు లంక యొక్క యద్భుతమును జూచి యాశ్చర్యమును, విచారమునుగూడ నొందెను. అట్టిసమయమున చంద్రుడుదయించి నక్షత్రములతో బ్రకాశించుచుండెను.

ఆంజనేయుడాపట్టణమును జూచుచు నిట్లాలోచించెను. 'ఆయుధములనుబట్టిన రాక్షసులు దీనిని రక్షించుచుండుటచే బలవంతముగ దీని నితరులు జయింపలేరు. అయినను నీలంకలో కుముదాంగదులును, సుషేణుడును, మైందద్వివిదులును, సుగ్రీవుడును, కుశపర్వణుడును, కేతుమాలియు, నేనును ప్రవేశింపగలము.' ఇట్లాతడాలోచించి పరాక్రమముగల రామలక్ష్మణులు సులభముగ దీనినిజయింతురని తలచి

యర్ధరాత్రివేళ పట్టణద్వారమును దాటుచు నాపట్టణమును రక్షించు చున్నదియు, వికృతమగుముఖముకలదియు, పట్టణమునకు నధిదేవతా రూపిణియునగు లంకిణిని జూచెను. ఆలంకిణి హనుమంతుని యెదుటకు వచ్చి నిలువబడి పెద్దకేక వేసి 'నీవెవ్వడవు? ఏకార్యముకొఱకు వచ్చితివి? నిజమును జెప్పి నీప్రాణములు రక్షించుకొనుము. ఈపట్టణము రావణునిబలముచే రక్షింపబడుచున్నది. వానరా! నీవిందు ప్రవేశింపవీలులే'దని పలుక నతడు 'నీవు కోరినవానినన్నిటిని దెలిపెదను. వికృతనేత్రములతో నీవు పురద్వారమున నేలయుండెదవు? ఎందునిమిత్తము నీవు నన్నడ్డి క్రూరముగను, నమర్యాదగను పలికెద'వనియడుగ. దానికి కామరూపిణియగు లంకిణిమిక్కిలికఠినములగుమాటలనిట్లనెను. 'రాక్షసరాజును, మహాత్ముడునునగు రావణునియాజ్ఞను నేను పాలించుచు నజేయమగు నీలంకనురక్షించుచున్నాను. నన్నవమానించి నీవీ పట్టణమున ప్రవేశింపవీలులేదు. ఇప్పుడు నావలన నీవు చంపబడి ప్రాణములను విడిచెదవు. నేనే లంకాధిదేవతను. ఈపట్టణమునంతను నేను రక్షించుచున్నాను. ఈసంగతంతయు నీకు దెలిపితిని.' ఇట్లు లంకిణి పలుక మంచియాలోచనగల హనుమంతుడు పర్వతాకారుడై నిలిచి యామెతో నిట్లనెను. 'ఈపట్టణమును, నిందుగలచిత్రములను జూచుటకు నేను వచ్చితిని. నా కీవిషయమై మిక్కిలికుతూహలముగ నున్నది. ఇందలియడవులను, నుద్యానవనములను, తోటలను, ముఖ్య గృహములను జూచుటకు నేను వచ్చితిని.' ఇట్లు హనుమంతుడు పలుక నారాక్షసి 'దుర్బుద్ధీ! నన్ను జయింపకుండ నీవీపట్టణమును జూచుటకు వీలులే'దని పలికెను. అంత నాతడు 'ఈపట్టణమును జూచి తిరిగి వచ్చెద'ననియనెను. దానికి లంకిణిపెద్దధ్వనిచేసి వేగముగ వచ్చి యా వాయుపుత్రుని తనయఱచేతితో గట్టిగగొట్టెను. అప్పుడతడు పెద్ద ధ్వనిచేసి తనయెడమచేతిపిడికిలితో గొప్పరోషమున నామెను పొడి

చెను; కాని యతడామెను నాడుది యని తలచి గట్టిగ పొడువలేదు. ఆదెబ్బతో నామె శరీరము కంపింప వికృతాకారముతో భూమిపై బడెను. అప్పుడు హనుమంతుని కామెయందు స్త్రీయని దయగలిగెను. *లంకిణి గద్గదస్వరముతో "హరిశ్రేష్ఠా! దయతో నన్ను రక్షింపుము. గొప్పబలవంతు లిట్లు స్త్రీహత్యజేయరు. నేనే లంకాదేవతను. నీ పరాక్రమముచే నేను జయింప బడితిని. నేను నిజము పలికెదను; వినుము. పూర్వము బ్రహ్మ 'వానరుడొకడు వచ్చి పరాక్రమమున నిన్నుజయించినపుడు రాక్షసులకు భయముకలుగు నని తెలిసికొను' మని నాకు వరమిచ్చెను. నీదర్శనమువలన నట్టిసమయ మిప్పుడు వచ్చినది. బ్రహ్మ చెప్పినది నిజమైనది. అతనిమాట తప్పదు. సీతనుగూర్చి, రాక్షస రాజును, క్రూరాత్ముడునగు రావణునకును, రాక్షసులందఱికినిగూడ

---

*అ. రా:—హనుమంతుడు లంకిణిని గొట్టినతరువాత నామె బ్రహ్మ తనకు దెలిపిన మాటలిట్లు పలికెను. '28వ. మహాయుగములో త్రేతాయుగమున నాశనరహితుడగు నారాయణుడు దశరథపుత్రుడై రామునిగ జన్మించును. యోగమాయ జనకునిగృహమున సీతయై జన్మించును. నేను మహావిష్ణుని భూభారమును బోగొట్టుటకై ప్రార్థించితిని. రాముడును, నతనిభార్యయు, నతనితమ్ముడును గలిసి గొప్ప యడవికి బోయెదరు. అక్కడ గొప్పమాయాస్వరూపిణియగు సీతను రావణుడు హరించును. తరువాత రామునకు, సుగ్రీవునకు స్నేహము గలుగును. సుగ్రీవు డామెను వెదకుటకై వానరులను బంపును. అప్పుడు వానరు డొకడు రాత్రివేళ నీసమీపమునకు వచ్చును. నీవు వానిని భయపెట్టినను వాడు తన పిడికిలితో నిన్ను బొడుచును. అప్పుడు నీవు బాధనొందెదవు. అప్పుడే రావణున కంతము గలుగును. ఇట్లు బ్రహ్మనాతో జెప్పె'నని పలికి 'నీవు సీతను నశోకవనములో శింశుపా వృక్షముక్రింద వెతకు'మని చెప్పి "చాలకాలమునకు సంసారబంధమును

నాశనము తటస్థించినది. కాన నీవు లంకలో ప్రవేశించి నీకిష్టములగు కార్యములను జరుపుము. ఈపట్టణము దైవవశమున శాపమునుబొంది పీడింపబడుచున్నది. నీవు వెళ్ళి నీయిష్టమువచ్చినట్లు సీతను వెదకు” మని పలికెను.

---

## ౪ వ అధ్యాయము.

## హనుమంతుడు సీతను వెదకుట.

హనుమంతుడు లంకిణిని జయించినతరువాత ద్వారములేని చోట పట్టణప్రాకారమునొకదానిని నెగిరిదాటి తన యెడమపాదముతో లోనప్రవేశించి పెద్దవీధిలో రాత్రివేళ తిరుగుచుండెను. పెద్దభవనములలోను, మేడలలోను సౌందర్యవతులగు స్త్రీలు సంతోషముతో క్రీడించుచుండిరి. వాద్యవిశేషములు వినబడుచుండెను. స్త్రీలు బాగుగ పాడుచుండిరి. మంచిదీపములు వెలుగుచుండెను. స్త్రీపురుషులు మద్యమును సేవించి మదనావస్థలోనుండిరి. ప్రతిగృహమును, హనుమంతుడు పరిశోధించెను. ఇట్లతడు ప్రహస్తుడు, మహాపార్శ్వుడు, కుంభకర్ణుడు,

---

త్రెంపివేయు రామనామస్మరణము నాకు గలిగెను. అతనిభక్తులతో దుర్లభమగు సహవాసము నాకు గలిగెను. అతడు దయతో నాహృదయమున నిలుచుగాక!”యని రాముని ప్రార్థించెను.

టిప్పణము:—1వ ప్రకరణము. ౧వ. అధ్యాయము. రాముని కాలనిర్ణయములోనతడు 25వ. మహాయుగమున జన్మించెనని మేము చర్చించితిమి. ఇప్పుడు జరుగుచున్న 28వ. మహాయుగమున రాముడు జన్మించెనని యీయధ్యాత్మరామాయణమున తెలుపబడుటచే నిది ప్రస్తుతకలికాలపు గ్రంథమని 7వ. ప్రకరణము. ౩వ అధ్యాయము. అ. రా:—టిప్పణాంశములో దృఢపఱచితిమి.

విభీషణుడు, మహోదరుడు, విరూపాక్షుడు, విద్యుజ్జిహ్వుడు, విద్యున్మాలి, వజ్రదంష్ట్రుడు, శుకుడు, సారణుడు, ఇంద్రజిత్తు, జంబుమాలి, రశ్మికేతుడు, సూర్యశత్రువు, వజ్రకాయుడు, ధూమ్రాక్షుడు, సంపాతి, విద్యుద్రూపుడు, భీముడు, ఘనుడు, విఘనుడు, శుకనాసుడు, వక్రుడు, శఠుడు, వికటుడు, బ్రహ్మకర్ణుడు, దంష్ట్రుడు, రోమశుడు, యుద్ధోన్మత్తుడు, మత్తుడు, ధ్వజగ్రీవుడు, ఇంద్రజిహ్వుడు, హస్తిముఖుడు, కరాళుడు, పిశాచుడు, శోణితాక్షుడు మొదలగువారియిండ్లు వెతకెను. కొన్నియిండ్లలో స్త్రీలు స్వర్గములోనుండు నప్సరసలవలె మంచిసంగీతము పాడుచుండిరి. వారికి మంచియాభరణము లుండెను. వారు నడచునపుడును, మేడమెట్లెక్కునప్పుడును వారియాభరణముల చప్పుడును, పట్టణములోనిసింహనాదములును హనుమంతునకు వినబడెను. ఆయిండ్లలో నెక్కడను వానికి సీత కనిపించలేదు. అందుచే నతడు విచారించుచుండెను. అక్కడ కొందఱు మంత్రములను జపించుచు, వేదములను చదువుచు నుండిరి. కొందఱు రావణునిగూర్చి స్తవములు సలుపుచు గట్టిగనఱచుచుండిరి. రాజనగరుసమీపమున నారాక్షసరాజు మూలబల ముండెను. అగ్నిహోత్రమును జరుపువారును, నాయుధములను సంపాదించువారును, ననేకవిధములగునాయుధములను ధరించినవారును నుండిరి. ఇంకను నక్కడ ననేకవిధములగు వికృతరూపములుగల రాక్షసులు లక్షలకొలది యుండిరి. వారి నందఱిని హనుమంతుడు చూచెను.

రావణునియంతఃపురము లంకలో నొకశిఖరముపై నుండెను. తరువాత నాంజనేయుడు దానికడకు వెళ్ళెను. అక్కడ విచిత్రములను జూచుచు నతడు రావణుడు కుబేరునిజయించి తెచ్చిన విమానమును జూచెను. అత డక్కడ మంచిసువాసనలను బీల్చి యది యెక్కడనుండి వచ్చుచున్నదో యని యాలోచించి పుష్పకముపరిక్కనున్న రావణుని

గృహామునుండి వచ్చుచున్నదని కనిపెట్టి యక్కడకుబోయెను. ఆరాక్షసరాజుసమీపమున వికృతరూపములుగల రాక్షసస్త్రీలు శూలములను, ముద్గరములను, శక్తులను, తోమరములను బట్టి నిద్రించుచుండిరి. రావణునిసౌందర్యమును హనుమంతుడు చూచి "ఇది యింద్రపట్టణమా? ఇతర దేవలోకమా? లేక బ్రహ్మపట్టణమా?" యని తలచెను. అక్కడ వానికి జూదమాడెడి బంగారుపాచికలు కనబడెను. మంచిదీపములయొక్కయు, రావణునియొక్కయు, వాని భార్యలయాభరణములయొక్కయు కాంతివలన నాగృహాము మండుచున్నట్లగపడెను. అక్కడ మంచిచిత్రవర్ణములుగల పక్కలపై నతని భార్యలనేకులు మంచిబట్టలను గట్టుకొని మంచిభూషణములను ధరించి బాగుగ నలంకరించుకొని పానమత్తులై క్రీడాసుఖముల బొంది యలసటచే నిద్రించుచుండ వారిని హనుమంతుడు చూచెను. అప్పటికి సగము రాత్రియయ్యెను. స్త్రీలు కండ్లు నోరు మూసికొని నిద్రించుచుండ సుందరములగు వారిముఖముల నతడు చూచెను. పుణ్యక్షయముకాగా నాకాశమునుండిపడిన నక్షత్రములవలె వారు వానికి గనబడిరి. వారిలో కొందఱొకరిశరీరమొకరికి తగులునటుల నిద్రించుచుండిరి. వారిమధ్యను రావణుడు మంచిపక్కగల మంచము మీాద నిద్రించుచుండెను. అక్కడ మంచిగంధము మొదలగు పరిమళద్రవ్యముల సువాసనలు వ్యాపించియుండెను. రావణునిశరీరమునసువాసనద్రవ్యములు పూయబడియుండెను. వానికంఠమున పూలదండలు వేయబడెను. మత్తతచే వానికండ్లెఱ్ఱగనుండెను. వాడు బంగారువర్ణము గల మంచి పచ్చనివస్త్రమును గట్టి మంచి యలంకారముల ధరించియుండెను. వానిముఖమునుండి మద్యములవాసనయు, మంచిభోజనములవాసనయు నూపిరివిడుచునపుడు పైకివచ్చుచుండెను. వానిపక్కయందు సౌందర్యవతులగు వానిభార్య లలంకారములధరించి పరుండిరి.

కొందఱు నృత్యచిహ్నలతోను, కొందఱు వీణలనుబట్టియు, కొం దఱు మద్దెళ్ళనుబట్టియు, కొందఱు పిల్లనగ్రోవులనుబట్టియు,కొందఱితర వాద్యవిశేషములనుబట్టియు నిద్రించిరి. రావణుని మంచమునకుకొంత దూరమున మఱియొక మంచమున వానిపట్టమహిషియగు మండోదరి బాగుగనలంకరించుకొని బంగారమువలె ప్రకాశించుచు నిద్రించెను. హనుమంతు డామెనుజూచి సీత యని యనుమానించెను. కాని 'సీత రాముడులేకుండ భుజింపదు; ఆభరణములనలంకరించుకొనదు; నిద్రిం పదు; పానముచేయదు. ఆమె దేవేంద్రునైనను జేరియుండదు. రాము నితో సమానమగువాడు దేవతలందుగూడలేడు. ఈమె సీతకాదు. మఱియొకతెయైయుండు'నని నిశ్చయించెను.

తరువాత నతడాసమీపముననున్న మద్యశాలలో వెతకెను. అక్కడ మంచిమాంసములతోనిండిన పళ్లెరములును, భోజనపదార్థము లును, ననేకవిధములగు మద్యములును నతనికి కనబడెను. ఆపానశాల మంచియాసనములు, మంచములు, పక్కలు మొదలగువానితో ప్రకా శించుచుండెను. పరిమళద్రవ్యములతోగూడిన మంచిమద్యములు, బంగారు, వెండి, స్ఫటికము, మణులు మొదలగుపాత్రలలో నుండెను. సగముమద్యము త్రాగబడినపాత్రలు కొన్నియు, నంతయుత్రాగబడిన మద్యముగలపాత్రలుకొన్నియు, పూర్తిగ మద్యముగలపాత్రలుకొన్ని యునుండెను. అక్కడక్కడకొంతనీరును, కొన్నిమాల్యములును, కొన్ని ఫలములును నుండెను. కొన్నిమంచములపై స్త్రీలొకరినొకరు కౌగి లించుకొని నిద్రించుచుండిరి. చల్లని చందనముయొక్కయు, తీపిగల మద్యముయొక్కయు, ననేకవిధములగుమాల్యములయొక్కయు, నగరు ధూపములయొక్కయు వాసన లాగృహమునందును, పుష్పకమునం దును వ్యాపించియుండెను. వీనినన్నింటిని జూచినపిమ్మట హనుమంతు డాపానశాలను విడచెను.

అక్కడనుండు స్త్రీల నందఱి నాతడు చూచి 'రావణుడు సీత నేల యపహరించెను? ఆమెను విడిచినయెడల నాతడు బుద్ధిగలవాడై యుండు' నని యాలోచించెను. అతనికెక్కడనుసీత కనబడలేదు. అతడు పరస్త్రీలనుజూచినందులకు తనకు ధర్మలోపముకలుగునేమో యని విచారించి 'నేను రావణునిభార్యలనందఱిని నిష్టమువచ్చినట్లు బాగుగ జూచినను నాకు మనోవికారము కలుగలేదు. శుభాశుభకార్యములను జరుపుటలో నింద్రియముల నుపయోగించునది మనస్సు. అది నాకు బాగుగనున్నది. నేను సీతను వెదకవలెనన్న స్త్రీలలోనే వెతకవలెను. నేను మంచిమనస్సుతో వెతకితి'నని యాలోచించి యామె యెక్కడను తనకు కానరానందులకు మిక్కిలి విచారించెను.

తరువాత హనుమంతు డక్కడనుండు పొదరిండ్లను, తోటలను వెదకి సీతకానరానందులకు నిట్లు చింతించెను. "ఆమె చనిపోయి యుండునా? తనగుణములను రక్షించుకొనుచుండిన యామెను దుర్మార్గుడగు రావణుడు చంపియుండెనా? వికృతరూపముకలవారును, వికారవర్ణముకలవారును, పెద్దముఖముకలవారును నగు వానిపరిచారకులను జూచి యామె భయముచే మరణించియుండునా? నాశ్రమయంతయు వృథయయ్యెను. నే నామెను చూడకుండగను, నాపౌరుషమును శత్రువులకు జూపకుండగను వానరులతో చాలకాలవిలంబనము జరిపినందులకు సుగ్రీవునియొద్దకు వెళ్ళకూడదు. అతడు బలవంతుడు; కఠినముగ శిక్ష విధించువాడు. నేనుసీతను జూడకుండ వెళ్ళినయెడల నాతోవచ్చిన వానరులు నన్ను 'నీ వేమి పనులను జేసితి'వనియడుగ నేనేమని వారికి జబాబు చెప్పెదను? నామాటలను విని వారుతప్పక ప్రాయోపవేశము చేసెదరు. వృద్ధుడగు జాంబవంతుడును, యువరాజగు నంగదుడును, మిగిలినవానరులును 'నీవు సముద్రముదాటి యేమిపనియొనర్చితి' వని యందురు. ఉత్సాహమువలన సుఖములు కలుగును. అది సిద్ధికిమూలము,

అది యెల్లప్పుడు నన్ని కార్యములను నెఱవేర్చును. ఉత్సాహముతో జేయుకార్యము తప్పక సఫలమగును; కనుక నే నుత్సాహముతో గొప్ప ప్రయత్నముచేసెదను." ఇట్లు హనుమంతు డాలోచించి యామెను వెతక నారంభించెను. అతడు భూగృహములను, చతుష్పథములందుండు దేవగృహములను, నిండ్లకుదూరమున క్రీడార్థము నిర్మింపబడిన గృహములను, ప్రాకారము లోపలివీథులను, దేవవృక్షములక్రిందనుండుతిన్నెలను, పాడవగుసరస్సులను, నన్నిటిని వెతకెను. అత డట్లు నాలుగంగుళములపరిదేశమైనను విడువక వెతకెను. అతడు పైకెక్కుచు, క్రిందికి దిగుచు, కూర్చుండుచు, తిరుగ నడచుచు, ద్వారములు తెఱచి లోనికి ప్రవేశించుచు, తలుపులను త్రోసివేయుచు, పైకివచ్చుచు వెదకెను; కాని సీత కానరాలేదు. అక్కడ నతడు వికృతరూపములుగల రాక్షసస్త్రీలను, మిక్కిలిసౌందర్యముగల విద్యాధరస్త్రీలను, నాగకన్యకలను నందఱిని వెతకెను; కాని సీత కానరాలేదు. అప్పుడతడు తనతో వానరులు వెతకుటకు బయలుదేఱుటయు, తాను సముద్రమునుదాటుటయు వ్యర్థమయ్యెనని తలచి బుద్ధిమంతుడైనను విచారమునొందెను.

తరువాత హనుమంతుడు రావణునిగృహమును విడిచి ప్రాకారముపై కెక్కి "లంకలోనున్న మడుగులు, చెఱువులు, సరస్సులు, నదులు, వనములు, కొండలుమొదలగు భూపరిదేశముల నన్నిటిని వెతకితిని. రావణునివాసగృహములో సీతయున్నదని సంపాతి పలికియుండెను; కాని యక్కడ నా కామె కానరాలేదు. జనకునికుమార్తె యగునామె దుష్టాచరణగల రావణుని నెంతమాత్రము కామించి యుండదు. అత డాకాశమార్గమున నామెనుతీసికొనివచ్చుచు రామబాణములకు వెఱచి యామెను విడిచినచో నామె దారిలోపడియుండును; లేక యట్టిసమయమున నామె సముద్రమును జూచి భయమును జెంది దానిలో పడియుండును; లేక యప్పుడు వేగముగ

నెగుస్తుచున్న యాతనిభుజములలో బడి నలిగిపోయి ప్రాణములను విడిచియుండును; లేక యాతడు చాలపై కెగురుటచే నామె మూర్ఛ నొంది సముద్రమున పడియుండును; లేక తనమానమును రక్షించు కొను సీత యాతనిమాటను వినియుండకపోవుటచే తన్ను రక్షించు వారులేక యాతనిచే తినివేయబడియుండును; లేకదుష్టులగు రావణుని భార్య లామెను భక్షించియుందురు; లేక యామె రామునిధ్యానిం చుచు 'హా! రామా! హా! లక్ష్మణా! హా! అయోధ్యా!' యని విల పించుచు ప్రాణములను విడిచియుండును; లేక పంజరములోనుంచ బడినచిలుకవలెనే యామె యాతనిచే గూఢప్రదేశమున నుంచబడి విలపించుచుండును. ఎట్లైనను నామె రావణుని వశమై యుండదు. నాయనుమానములు నిజమై యామె కనబడనియెడల నేను రాముని కీసంగతుల దెలియజేయగూడదు. నే నట్లు తెలిపినను తెలుపకపోయి నను నాకు దోషమే కలుగును. నాకు విషమపరిస్థితి వచ్చినది. నేనేమి చేయవలయును? కాలోచితమేమి?" యని యాలోచించెను.

తరువాత నతడు చాలసా రిట్లు విచారించి "నేను సీతనుజూడక కిష్కింధకు వెళ్ళినయెడల నా కేమిపురుషార్థముండును? నేను సముద్ర మును దాటుటయు, లంకలో ప్రవేశించి రాక్షసులను జూచుటయు వ్యర్థమగును. సుగ్రీవుడును, వానరులును, రామలక్ష్మణులును నన్నే మనెదరు? 'సీతను నేను చూడలే'దని నేను రామునితో కఠినవాక్య ములు పలికిన నత డామాటలు విని ప్రాణములను విడుచును. అతడు మరణమునొంద నతనిననుసరించియుండు బుద్ధిమంతుడగు లక్ష్మణుడు కూడ జీవింపడు. భరతుడు వారిరువురికష్టములను విని చనిపోవును. దానిని శత్రుఘ్నుడు చూచి జీవింపడు. కుమారులు మృతినొంద వారితల్లులగు కౌసల్యాసుమిత్రలును, కైకేయియు జీవింపరు. అప్పు డిట్టి రామునిజూచి కృతజ్ఞుడును, సత్యసంధుడునునగు సుగ్రీవుడు మర

ణమునొందును. వానిని జూచి రుమ భర్తృశోకముచే ప్రాణములను విడుచును. తార వాలిమరణముచే నిదివఱకే దుఃఖముతో నున్నది. ఆమె సుగ్రీవునిమరణము విని యిక జీవింపదు. అంగదు డిట్టిమరణములను జూచి జీవింపలేడు. తమరాజు మరణింప కొందఱు వానరులుదుఃఖముచే నఱచేతులతోను, పిడికిళ్ళతోను పొడుచుకొని చనిపోయెదరు. కొందఱు కొండశిఖరములనుండి విషమస్థలములందు పడి మరణించెదరు. కొందఱు విషముత్రాగియు, కొంద ఱురిపోసికొనియు, కొంద ఱగ్నిహోత్రమున ప్రవేశించియు, కొందఱు భోజనములమానియు, కొంద ఱాయుధములతో పొడుచుకొనియు మరణించెదరు. నే నిక్కడ నుండి వెళ్ళినయెడల గొప్పరోదనమును, నిక్ష్వాకుకులమునకు, వానర కులమునకు నాశనమును గలుగును. నే నిక్కడనుండి కిష్కింధకు వెళ్ళను. నేను సీతను జూడకుండ సుగ్రీవుని జూడలేను. నేను వెళ్ళకుండిన ధర్మాత్ములును, మహారథులునునగు రామలక్ష్మణు లాశగలవారై జీవింతురు. వానరులుకూడ జీవించెదరు. ఆమెను చూడలేకపోయిన యెడల నేను దొరకినదానిని భుజించుచు నియమముతో చెట్టుక్రింద కూర్చుండి వానప్రస్థుడనయ్యెదను; లేక సముద్రతీరమున కట్టెలనుచేర్చి యగ్నిని ప్రజ్వలింపజేసి యందుపడి మరణించెదను; లేక ప్రాయోపవేశముచేసి ప్రాణములను విడిచిన నన్ను కాకులు, మాంసాహారము గలజంతువులు తినును. ఇట్టిమరణమును మహర్షులు పూర్వమునిర్ణయించిరి. లేనియెడల నేను నీటిలోబడి మునిగిచచ్చెదను. శోభకలదియు చంద్రకిరణములచే మనోహరము, కీర్తివంతమునైనదియునగు నీరాత్రి సీతనుజూడకపోవుటచేనాకుదీర్ఘముగగనిపించుచు నిష్ఫలమైనదయ్యెను. ఆమె కనబడకపోయినయెడల నేను నియమముతో నిక్కడనే వృక్షమూలము నాశ్రయించి తాపసుడనయ్యెదను. ఆమెను జూడకుండ నేను వెళ్ళితినేని యంగదుడును, మిగిలినవానరులును జీవింపరు. అధి

యట్లున్నను జనుడు నాశనమునొందిన ననేకదోషములు కలుగును; జీవించియుండిన ననేకసుఖములను జూచును.కనుక నేను జీవించియుండి నిశ్చయముగ శ్రేయము నొందెదను." ఇట్లు దుఃఖించుచున్న హనుమంతునిశోకమునకు నంతములేదయ్యెను.

తరువాత హనుమంతు డింకను నిట్లు తలచెను. 'సీతను రావణు డెత్తుకొనిపోయినందులకు వానిని జంపెదను; లేక వానిని బట్టుకొని సముద్రమును దాటి రామునియెదుట బెట్టెదను.' ఇట్లు హనుమంతుడు విచారించుచు నిట్లాలోచించెను. 'సీత కనబడువఱకు నీలంకలో తిరిగితిరిగి వెదకెదను. నే నామెను జూడకుండ సంపాతిమాటల యందలి నమ్మకముచే రాముని నిక్కడకు తీసికొనివచ్చిన నత డిక్కడ సీతనుగానక వానరుల నందఱినినాశనముచేయును. ఇక్కడ నేను నియతభోజనుడనై యింద్రియములను జయించి యుండెదను. నన్నుగూర్చి వానరులందఱు నాశనమొందగూడదు. ఇక్కడకు గనబడుచున్న యశోకవనమును నేను వెతకలేదు. వసువులను, రుద్రులను, నాదిత్యులను, నశ్వినీదేవతలను, మరుత్తులను నమస్కరించి యక్కడకు వెళ్ళెదను. నేను రాక్షసులను జయించి వారికి విచారము కలిగించి రామునకు సీతను సమర్పించెదను.' ఇట్లు విచారముచే హనుమంతు డొక్కగడియ యాలోచించి లేచెను. అతడు రామలక్ష్మణులకును, సీతకును, రుద్రునకును, యమునకును, వాయుదేవునకును,మరుద్గణమునకును, సుగ్రీవునకును నమస్కరించి యన్నిదిక్కులను జూచి యశోకవనమునుగూర్చి యాలోచించుచు 'అక్కడ ననేకరాక్షసులు నిశ్చయముగ కాపుందురు. అక్కడ వాయువుకూడ జడిసి వీవదు. రామునికార్యము జరుపుటకై రావణునకు గనపడకుండునటులనాశరీరమును చిన్నదిగ జేసెదను. దేవతలును, ఋషిగణములును, బ్రహ్మయు, శివుడును, నగ్నియు, వాయుదేవుడును, నింద్రుడును, వసువులును,

సూర్యచంద్రులును, నశ్వినులును, మరుత్తులును నాకార్యసిద్ధిని గలిగిం చెదరుగాక! అన్నిభూతములును, వానిప్రభువును, కనబడనివియు, దారిలోవర్తించునట్టివియునగు భూతములుకూడ నాకార్యసిద్ధిని కలిగించుగాక! నేను సుందరమగు సీతనెపుడు చూచెదను? పాపుడును, నీచుడును, క్రూరుడును, దారుణరూపుడును, నలంకారములుకల వాడునునగు రావణునిచే నామె బలవంతముగ తీసికొనిపోబడినది. ఆమె నాకెట్లు కనబడు'నని విచారించెను.

---

## ౫ వ. అధ్యాయము.

## హనుమంతు డశోకవనమున సీతను జూచుట.

ఆరాత్రి హనుమంతుడు రావణునిగృహ ప్రాకారముననుండి యాలోచించి యక్కడనుండి యశోకవనమున కెగురునపుడు వసంత కాలము ప్రారంభమాయెను. చెట్లన్నియు, పువ్వులతోను, కాయల తోను నిండియుండెను. అక్కడ బంగారురంగుగల చెట్లును, వెండిరం గుగల చెట్లును నుండెను. పక్షులు ధ్వనిచేయుచుండెను. అతడక్కడ నుండి సీతను వెతకుచు బోయి నిద్రించియున్న పక్షులనులేపెను. అందు వలన చెట్లనుండి పుష్పములు రాలెను. అవియన్నియు నాతనిశరీర మున బడుటచే నక్కడిజంతువుల కాతడు వసంతునివలె నగపడెను. అతడు చెట్లను కదల్చుటచేగూడ పువ్వు లతనిశరీరమున నెక్కువగ రాలెను; ఫలములుకూడ రాలెను. అతడు చెట్లను కాళ్ళతోను, చేతుల తోను కదల్చుచు తోకతో నాడించుచుండెను. గోళ్ళతోను, దంత ములతోను వానిని జీల్చుచుండెను. అందువలన పెద్దచెట్లు విఱిగి పోయెను. అతడు లతాసమూహములను గట్టిగ విఱుచుచుండెను. మృదంగములను, ప్రవాహములను, నదులు మొదలగు నక్కడివిచిత్రములు

లను జూచుచు నతడు వేలుగనున్న శింశుపావృక్షము నొకదానిని జూచెను. దానిని చాల లతలు చుట్టుకొనియుండెను. ఆచెట్టు మంచి పుష్పములతోను, తెమ్మెలతోను, నాకులతోను నిండియుండెను, దాని చుట్టు బంగారుతిన్నెలును, భూసారంగములును, సెలయేళ్ళును, బం గారువర్ణముగలచెట్లును నుండెను. హనుమంతు డాశింశుపా (ఇరుగుడు) వృక్షము నెక్కి యిట్లాలోచించెను. 'ఇక్కడనుండి నేను సీతను జూచె దను. ఆమె రామునిజూచుటయందు మనస్సుకలిగి యీయశోకవన మున నిక్కడనేతిరుగుచుండును. పక్షులకలకలధ్వనులు, పద్మములుగల యీనది కామె వచ్చును. వనములలో విహరించుటయందు నేర్పరి తనముగలయామె రామవియోగమును భరింపలేక యిక్కడతిరుగును. ఆమె సంధ్యాకాలమున *సంధ్యావందనముచేయుటకై జలముకొఱకీ నదియొద్దకు వచ్చును. ఆమె జీవించియుండిన తప్పక యిచ్చటకు వచ్చును.' ఇట్లు హనుమంతు డాలోచించి యాకులతోను, పుష్పముల తోను దట్టముగనున్న శింశుపావృక్షముపై దాగియుండి సీతకొఱకు జూచుచుండెను.

ఆవృక్షమునకు సమీపమున దేవగృహమువలె నొకమంచి మేడ యుండెను. అది మిక్కిలి యెత్తుగనుండి వేయిస్తంభములుకలిగి మిక్కిలి తెల్లగనుండెను. ఇంకను నది పగడములతో చెక్కబడిన మెట్లు, బంగారువేదికలును గలిగి మిక్కిలి తేజోవంతముగ నుండెను. అక్కడ నొకవృక్షమూలమున శరీరమున బుగ్గికలదియు, మిక్కిలినలిగి పోయిన పచ్చనివస్త్రమును గట్టినదియు, వికృతరూపములు గలరాక్షస స్త్రీలమధ్యనున్నదియు, నెక్కువముడికిగల జటలుకలదియు, నుపవాస ములుచేయుటచే కృశించినశరీరముకలదియు, దీనురాలైయున్నదియు,

* ఈగ్రంథరచనాకాలమున స్త్రీలకు సంధ్యావందనకృత్య మున్నట్లు తెలియు చున్నది.

మిక్కిలిదుఃఖముచే తాపమునొందుచు ముఖమువాడియుండ గడియ గడియకు నిట్టూర్పులీయుచున్నదియు, శుక్లపక్షములో మొదటకనిపించుచంద్రునివలె కాంతికలదియు, నలంకారములులేకున్నను సుందరముగనున్నదియు, సిగ్గుకలదియు, భూమియందు తపస్వినివలె కూర్చుండియున్నదియు, నంగారకగ్రహముచే పీడింపబడిన రోహిణివలె కనబడునదియు, కన్నీరుకలదియు, శోకధ్యానములయందే మనస్సుకలదియు, తనసమీపమున ప్రియజనులులేనిదియు, రాక్షసగణములను జూచిభయమును జెందినదియునగు నొకస్త్రీని జూచి యీమెయే సీత యని తలచి "పూర్వము కామరూపుడగు రావణుడాకాశమున బలవంతముగ దీసికొనిపోవునపుడు నేను చూచిన స్త్రీ యీమెయే. ఈమెకాంతివలన నన్నిదిక్కులును బ్రకాశించుచున్నవి. ఈమెయవయవములన్నియు లెస్సగనున్నవి. జగత్తునకు సంతోషముకలుగజేయు నీమె మన్మథుని రతీదేవివలె నున్నది. తన్నారాక్షసరాజు హరించినందులకును, రామునితో వియోగముకలిగినందులకును నీమె విచారించుచు నటునిటు చూచుచున్నది. ఈమె కన్నీరెక్కువగవిడుచుచున్నది. ఈమె సీతయగునా? కాదా"యని యనుమానించి యిట్లాలోచించెను. 'దుఃఖముచే నీమె తనశరీరమును చక్కగనుంచుకొనలేదు. ఈమెమాటలు విపరీతార్థమును బోధించుచున్నవి. ఈమెయవయవములు రాముడు నాతో చెప్పినట్లేయున్నవి. ఈమెయాభరణములు చెట్లకొమ్మలకు తగిలింపబడియున్నవి. చెవులకు కుండలములును, చేతులకు మణులతో చెక్కబడినయాభరణములునుమాత్రము చాలకాలమునుండి యున్నవి. ఇవన్నియు రాముడు వర్ణించినట్లున్నవి. ఈమె తనయుత్తరీయమున గట్టి ఋశ్యమూకమున పడవైచినయలంకారములుతప్ప మిగిలిన యలంకారములు కనిపించుచున్నవి. ఆయాభరణములనుమూటకట్టినబట్టరంగును, నీమె కట్టుకొనియున్న బట్టరంగును నొకటే కాని చిరకాలమునుండి కట్టుటచే

నిట్టిమాత్రము మిక్కిలినలిగియున్నది. ఈమెకు రామునితో వియోగము కలిగినను నాతనిమనస్సులో నీమె నిలచియుండును. రావణు డెత్తుకొని పోవుచున్న స్త్రీని తాను రక్షింపనందులకు కనికరమును, తన్నాశ్రయించి యున్న యామెను రక్షింపనందులకు దయాస్వభావమును, తన భార్యను రక్షింపనందులకు విచారమును' తన ప్రియురాలిని రక్షింపనందులకు మన్మథవికారమును రాముడు పొందెను. ఈమె యవయవముల రూపము రాముని యవయవముల రూపము వలెనున్నవి. కనుక నీమెయే సీత. సీతా రాములు తమమనస్సాకరిపై నొకరు నిలుపుకొనిన వారగుటచే తమకు వియోగము కలిగినను జీవించియున్నారు. అతడు యౌవనవతియగు నీమెను విడిచి శోకముచే నాశనము నొందక జీవించియున్నాడు. ఇది గొప్పకష్టము. ఇట్లొకగడియయైన విడిచియుండుట మిక్కిలి గొప్ప కష్టము.' ఇట్లుహనుమంతు డాలోచించుచు సీతను జూచి రాముని యందు తనమనస్సును నిల్పి యాతనిని గీర్తించెను.

తరువాత నతడామెనుగూర్చి కండ్లంట నీరు తెచ్చుకొని యిట్లు దుఃఖించెను. 'పెద్దలయొద్ద నణకువ కలవాడును, లక్ష్మణునియన్నయు నగు రాముని భార్య గొప్పదుఃఖముచే బాధనొందుచున్నది. కాలవశ మెవ్వరికిని తప్పింపశక్యము కాదు. రామలక్ష్మణులపరాక్రమములా మెకు తెలిసిన నామెమనస్సు మిక్కిలివిచారము నొందదు. సీతారాముల గుణములు, వయస్సు, కులము, లక్షణములు సరిగ నున్నవి.' ఇట్లు హనుమంతు డాలోచించి రామునిస్మరించి యిట్లుపలికెను. 'ఈమెను గూర్చియే రాముడు విరాధుని, కబంధుని, వాలిని జంపెను. ఇంకను చాలమందిని జంపెను. మఱికొన్ని గొప్పపనులు జరిపెను. రాముడు లోకములనన్నింటిని క్రిందుమీదుగ జేసినను నీమెనుగూర్చియే శ్రేయును. త్రైలోక్యరాజ్యముకంటె నీమెయే యాతనికెక్కువ.' ఇట్లు

హనుమంతుడు సీతను వర్ణించుచు నామె జననమును, నామె భర్త యొక్కయు, మామయొక్కయు పరితాపమునుగూడ వర్ణించుచు నింకను నిట్లుపలికెను. 'ఈమె యన్నిమాయలను విడిచి భర్తయందలి యనురాగముచే కష్టములనాలోచింపక యడవిలో ప్రవేశించెను. అక్కడ నీమె తనభర్తకు పరిచర్యచేయుచు దొరకినఫలమూలములను భుజించుచు సంతోషముతో నుండెను; కష్టము నెఱుగనిదైనను వనములో గొప్పకష్టముల ననుభవించెను. ఇట్టి సుగుణములు కల యీమెను రావణుడు దొంగిలించినను రాముడు చూడదగును. ఈమెను జూచినతరువాత నతడు మిక్కిలిసంతోషము నొందును. కావలసినభోగములు, బంధువులులేని యీమె తనభర్తృసమాగమమును గోరుచు ప్రాణముల నిలిపియున్నది. ఈమె తన చుట్టునునుండు రాక్షసస్త్రీలను,పువ్వులను, పండ్లను,చెట్లను జూడక తనమనస్సులో రామునినే నిలిపియతనిని ధ్యానించుచున్నది. స్త్రీలకు భూషణములకంటెభర్తయే యెక్కువవాడు. అట్టి వాడీమె కిక్కడలేనందున నీమెశోభిల్లకున్నది. అత డీమెలేకుండ నిలిచి దుఃఖముచే నాశనమొందక యెట్లో జీవించి యున్నాడు. అట్లుండుట గొప్పకష్టము. సౌందర్యవతియగు నీమె రాక్షసస్త్రీలమధ్య దుఃఖించుచుండ నామనస్సునకుకూడ విచారము కలుగుచున్నది.' ఇట్లు హనుమంతుడు పలుకుచు చెట్టుపై కూర్చుండి యుండెను.

తరువాత చంద్రుడాకాశమున ప్రకాశించుచు నాతనిపై కిరణముల ప్రసరింపజేసెను. సీత మిక్కిలి విచారముతో ముఖమును క్రిందికి వంచుకొని యుండ *వికృతరూపములుగల రాక్షసస్త్రీ లామెచుట్టును

* ౧౪వ. ప్రకరణము. ౨౫వ. అధ్యాయము. రాక్షసస్త్రీలవికృతరూపములు చూడుము.

నుండిరి. వారిలో కొందఱు కోపముకలవారును, కలహప్రియులును నుండిరి. కొందఱు నల్లనియినుపయాయుధములను, గొప్పశూలములను, ముద్గరములను బట్టి యుండిరి. ఇట్లు ఘోరరూపములుగల రాక్షస స్త్రీలు భయంకరముగ నామెచుట్టును జేరి యెల్లప్పుడును, మద్యమును పానముచేయుచు, రక్తమును త్రాగుచు, మాంసమును తినుచు, తమ శరీరమున రక్తమాంసము లంటియుండ నితరులకు గగుర్పాటు గలుగు నటుల కనిపించుచు సీతయుండు చెట్టుచుట్టును కూర్చుండి యుండిరి. అక్కడ నతనికి సీతకనబడెను. రావణుని చెఱలోనున్న యామె తన పుణ్యము పూర్తికాగా నాకాశమునుండి పడిననక్షత్రమువలెను, నేను గులమందను విడిచి సింహముచే నడ్డగింపబడిన యాడయేనుగువలెను నున్నను తానామెను చూడగలిగినందులకు సంతోషమును బొందెను. అతడు సంతోషబాష్పముల దెచ్చుకొని రామునకు నమస్కరించి చిన్నరూపమును బొంది యాకులలో గనబడకుండ దాగియుండెను.

అంతట నారాత్రి తెల్లవాఱు జామయ్యెను. అప్పుడు వేద వేదాంగములు దెలిసినవారును, యజ్ఞములను చేసినవారునునగు రాక్షసబ్రాహ్మణులు వేదఘోష చేయుచుండిరి. శుభవాద్యముల శబ్దములు రావణునకు మనోహరముగ నుండ నతడు సరియగుకాలమున తెలివితెచ్చుకొని *తాను కట్టుకొనినబట్టయు, కంఠమునవేసి

---

*అ. రా:—'రామునివలన నాకు శీఘ్రముగ మరణ మెట్లు కలుగును?' సీతనుగూర్చికూడ నతడు రాకపోవుటకు గారణమేమై యుండును?' ఇట్లు రావణుడు రామునిగూర్చి తనమనస్సులో నెల్లప్పుడు తలంచుచుండెను. ఆరాత్రిరెండవభాగమున నతడొకకలనుగనెను. అందు రామునివలన బంపబడిన కామరూపముగల వానరు డొకడు వచ్చి సూక్ష్మరూపమును బొంది చెట్టుచివరనునిలుచుండుట నతడు చూచెను. ఆశ్చర్యమగునిట్టికలనుగని యాతడు తెలివివచ్చినపిమ్మట

కొనిన పూలదండలు విడిపోవుచుండ సీతయందు మనస్సుకల వాడై కామబాధను తనలో నిలుపుకొనలేక యామెను జూచుట కాలోచించెను. అతను మత్తుడై బాగుగ నలంకరించుకొని రూప యౌవనములుగలవాడును, తనకుభార్యలుగనున్న నూఱుమంది దేవగంధ ర్వాదిస్త్రీలతో నశోకవనమునకు వెళ్లుటకు బయలుదేఱెను. కొందఱు బంగారుకాగడాలను బట్టుకొనిరి. కొందఱు వింజామరలను, తాటి యాకుల విసనకఱ్ఱలనుబట్టి వీచుచుండిరి. కొందఱు మంచినీరుకల బంగారుఝారీలనుబట్టుకొనుచు నడిచిరి. కొందఱు ఆసనములను, నాయుధములను బట్టుకొని వెనుక నడిచిరి. ఒకతె రత్నఖచితమగు నొకపెద్దగిన్నెలో మద్యమును బట్టుకొనియుండెను. బంగారుకఱ్ఱగలిగి ప్రకాశసమానముగ నొప్పుచున్న ఛత్రము నొకతె పట్టి యాతనివెనుక నడచుచుండెను. రావణుడు మద్యమును సేవించియుండుటచేతను, బాగుగ నిద్రింపకుండుటచేతను వానికన్నులెఱ్ఱగనుండెను. వాడు కునికి పాట్లు పడుచు హారకేయూరములు జారిపోవుచుండ, జుట్టు చిక్కులు పడుచుండ, శరీరము చెమటపట్టుచుండ తమభర్తననుసరించి మెల్లగ నడిచి వెళ్ళుచుండిరి. హనుమంతుడు వారిరాకను కనిపెట్టెను. రావ ణునికన్నులెఱ్ఱగను, విశాలముగను, వంకరగను నుండెను. అతడుజారి పోవుచున్న తనవస్త్రమును సరిగ కట్టుకొని వచ్చుచుండెను. ఆంజ నేయుడు చెట్టుకొమ్మలలో దాగియుండి యతనిని, నతనిభార్యలను జూచెను. వాడు సీతయొద్దకు వెళ్ళినతరువాత నావాయుపుత్రుడు

---

'కలయొకానొకస్వప్నము నిజముగ'నని తనమనస్సులో నాలోచించి నేను సీతను మిక్కిలికఠినములగు మాటలతో మిక్కిలిదుఃఖము కలదానినిగ జేసెదను. వానరుడు దీనినంతయు జూచి రామునికీసంగతిని దెలుపు గాక!' యని తలచి సీతయొద్దకు తనభార్యలతో వెళ్ళెను.

మఱియొక శాఖపై కెగిరి చుట్టును నావరించియున్న యాకులలో గుప్తముగ దాగియుండి యక్కడ జరుగుదానినంతను జూచుచుండెను.

రావణుఁడును, నతనిభార్యలును వచ్చుట సీత చూచి గాలికి కదలు నరటిచెట్టువలె వణకెను. ఆమె తనభుజములతో స్తనములను, తొడలతో నుదరభాగమును కప్పుకొని యేడ్చుచు నుండెను. హనుమంతునకు నగపడినటులే యామె యొకజడతో రావణునకుగూడ కనబడెను. అతఁడామెను చూచి తనమరణమునకై వలపును దెలుపు తియ్యనిమాటలతో నామె నిట్లు కోరెను. "నీవు నన్ను చూచినస్తనములను, నుదరభాగమును గప్పుకొని నిన్నెవరును చూడకూడదని కోరుచున్నావు. నేను నిన్ను కామించుచున్నాను. సర్వాంగసౌందర్యముకలిగి యన్నిలోకముల వారికిని మనోహరముగ గనబడు నీవు నన్నెక్కువగ ప్రేమింపుము. ఇక్కడ మనుష్యులుగాని, కామరూపులగు రాక్షసులుగాని యెవ్వరునులేరు. నాయందలి భయమును నీవు వీడుము. పరభార్యలను బలవంతముగ హరించి వారిని బొందుట రాక్షులకుస్వధర్మము. నీకు నాయందు మోహము లేనియెడల నిన్ను నేను ముట్టను. నాయందు బాగుగ నీమోహమును జూపుము. ఇప్పుడు నీవు భయపడకూడదు. నాయందు విశ్వాసముంచి నిజముగ ప్రేమను జూపుము. నీవు శోకములో మునిగియుండకూడదు. ఒకజడనే ధరించి భూమియందు శయనించుచు మురికివస్త్రములను గట్టి ధ్యానించుచు నుపవసించుట నీకు తగదు. నీవు చిత్రమగు మాల్యములను ధరించి చందనమును, నగరును బూసికొని యనేకవిధములగు నమూల్యవస్త్రములను గట్టి మంచియాభరణములను బెట్టుకొని మంచిమద్యమును సేవింపుము. సంగీతమును, నాటపాటలను వినుచు మంచియాసనముల మీదను, పక్కలమీదను గూర్చుండి నన్ను పొందుము. నీవు స్త్రీలలో నింపైనదానవు. నీ వీ విధముగ నుండకుము. నీవు బాలగ

నలంకరించుకొనుము. నీవు నన్ను పొందియుండ నీకు కావలసిన దే ముండును? యౌవనము గతించినమొదల తిరుగ రాదు. నీరూపముతో సరియగున దేదియు లేదు. భగవంతుడు నిన్ను సృజించి యిక నీవంటి స్త్రీని సృజింపక యూరకుండె నని తలచెదను. రూపయౌవనవంతు రాలవగు నిన్ను పొందినవాడు బ్రహ్మయైనను తిరుగ నిన్ను విడువ గలడా? నీయవయవములలో దేనినిజూచినను నామనస్సు దానినుండి తిరుగకున్నది. నీవు నీయజ్ఞానమును విడిచి నాభార్యవగుము. నే నిక్క డకు తీసికొనివచ్చిన స్త్రీలందఱికి నీవె యజమానురాలవై నాపట్టపు రాణివికమ్ము. నేను లోకముల జయించి తెచ్చినరత్నములును, నా రాజ్యమును, నంతయునుగూడ నీవే. నేనునునీవాడనే. నిన్నుగూర్చిజగత్తు నంతను జయించి జనకున కిచ్చెదను. నన్ను జయించినవానిని లోక ములో నెక్కడను గానను. యుద్ధములో నసమానమగు నాపరా క్రమమును నీ వాలోచించుకొనుము. రణభూమియందు నాయెదుట నిలుచుటకు సురాసురులైనను సమర్థులు కారు. వారిజండాలనువిఱుగగొట్టి తిని. మంచికాంతిగల భూషణములను నీయిష్టమువచ్చిన ట్లలంకరించు కొనుము. వానినలంకరించుకొనినప్పుడుండెడి నీయందమును నేనుచూడ కోరుచున్నాను. నీవు చక్కగనలంకరించుకొని నీయిష్టమువచ్చినట్లు భోగముల ననుభవింపుము. సముద్రతీరముననున్న వనములలో నాతో విహరించుచు యథేచ్ఛగ మద్యమును సేవించి నాతో రమింపుము. నీయిచ్ఛవచ్చిన దేశములనుగాని, ధనమునుగాని నీవు స్వేచ్ఛగదానము చేయవచ్చును. నీవు విచారమును వీడి నాతోక్రీడింపుము. నీయిష్టము వచ్చినట్లు నన్నాజ్ఞాపింపుము. నీవు నాతోక్రీడించుచుండ నీబంధువు లిష్టమువచ్చినదాని ననుభవించెదరు. నాయైశ్వర్యమును, కీర్తిని, సిరిని జూడుము. అడవిలో సంచరించుచు నారచీరలను గట్టి జయము, సిరియులేక నేలపైశయనించుచుండు రాముని వలన నీ కేమి ప్రయోజనము

జనము? అతడు జీవించియుండెనో లేదో యని శంకించెదను. ఈలంక లోనున్న నిన్నాతడు చూడలేడు. నాచేతిలోజిక్కిన నిన్నాతడుతిరుగ బొందలేడు. సుందరమగు నీస్వరూపము నామనస్సును హరించి యున్నది. నీవు నలిగిపోయిన పచ్చనివస్త్రమును గట్టుకొని యలంక రించుకొనక యుండినను నిన్నుజూచినప్పటినుండియు నాకు నాభార్య లందు సుఖముకలుగకున్నది. నేను మూడులోకములనుండి తీసికొనివచ్చిన నాయంతఃపురస్త్రీలందఱికి నీవు ప్రధానురాలవుకమ్ము. లక్ష్మిని నప్సరసలు సేవించునట్లు వారు నిన్ను సేవించెదరు. నాయొద్ద నుండు రత్నములను, ధనమును త్రైలోక్యరాజ్యమును నీవునాతోగూడి యనుభవింపుము. రాముడు తపస్సునగాని, బలమునగాని, పరాక్రమమునగాని, ధనమునగాని, తేజస్సునగాని, కీర్తినిగానినాతోసరిపోలడు." ఇట్లు రావణుడు సీతతో పలికెను.

ఆమాటల కామె గొప్పవిచారమునుబొంది దీనస్వరముతో మెల్లగ నేడ్చుచు, వణకుచు, తనభర్తను స్మరించుచు నొకగడ్డిపరకను బట్టుకొని 'నీవు నాయందలి మనస్సును త్రిప్పుకొని నీభార్యలందు నిలుపుకొనుము. నన్ను ప్రార్థించుట నీకు తగియుండలేదు. పతివ్రతను, గొప్పకులమునబుట్టినదానను, పవిత్రకులమును బొందినదాననునగు నేను నీవు చెప్పినకార్యమును జేయు'నని రావణుని తిరస్కరించి "పరభార్య నగు నేను నీకు తగినభార్యనుగాను. నీవు మంచిధర్మము నాలోచించి సంచరింపుము. నీభార్యలు నీకెట్లురక్షింపదగినవారో యట్లే యితరులభార్యలునురక్షింపదగినవారు. ఈసంగతినినీవాలోచించి నీభార్య లతో క్రీడింపుము. తన భార్యలందు తృప్తిలేనివాడును, చపలుడును, చలించుచున్నయింద్రియములు కలవాడును, దుర్మార్గుడును నగు పురుషుడు పరదారలనుగూడి తనయొక్క యైశ్వర్యాదులను బోగొట్టు కొనును. ఇట్టిదుర్మార్గపుబుద్ధినుండి నిన్ను నివారించువారికఱ్ఱఢ

నున్నారా? లేరా? లేక వారిమాటలను నీవు వినవా? నీ వాచారమును వీడి విపరీతబుద్ధిని బొందియున్నావు. యుక్తాయుక్తములు తెలిసిన వారు చెప్పినమాటలను వినక నీ వసత్యమందు బుద్ధిని నిలిపి రాక్షస కులనాశనముకై చరించుచున్నావు. మంచియాలోచనలను విననివా డును, నీతిలేనివాడునునగు రాజునుగుఱించిపట్టణములు, సర్వసమృద్ధిగల దేశములు నశించును. ఇట్లే నీదుష్కర్మవలనమంచియైశ్వర్యముగల లంక నశించును. నీపాపపురుషకార్యములచే నీవునాశనమునొంద నీసంగతి నిది వరకే తెలిసికొనిన భూతములు సంతోషము నొందును. నీచే నవమా నింపబడినజనులు దైవయోగమున నీకు ఘోరదుఃఖముసంభవించెనని సంతోషింతురు. నీవు నన్ను రత్నములు, ధనము మొదలగువాని నిత్తునని లోభపెట్టి స్వాధీనముచేసికొనలేవు. సూర్యకాంతి సూర్యుని దైనట్లు నేను రామునిదానను; గాని యితరులదాననుగాను. జ్ఞానవం తుని విద్య విడిచియుండనటుల నేను వేదములనేర్చినవాడును, ధైర్య వంతుడునునగు రాముని విడిచియుండను. నే నతనికి దగినభార్యను. నీవు న న్నాతనితో జేర్పుము. అతడు స్నేహము చేయదగినవాడు. నీపదవిని నీవు నిలుపుకొనుటకును, నాతనివలన ఘోరమరణమును దప్పించుకొనుటకును నీకిష్టమున్న యెడల నీవు నన్నాతనికి సమర్పిం పుము. అతడు శరణుబొందినవారిని రక్షించును; అతడు ధర్మము తెలిసినవాడు; అన్నియు బాగుగ నెఱిగినవాడు. నీకు జీవించుట కిష్టమున్న యెడల నాతనితో స్నేహముచేసి యాతనిని సంతోష పెట్టుము. నన్నాతనికి సమర్పించిన నీకు శ్రేయస్సుకలుగును. లేని యెడల నీవు వధింపబడెదవు. ఇంద్రునివజ్రాయుధమును, యముడును నెప్పటికైన నిన్ను విడిచిన విడువవచ్చునుగాని చాలకోపమువచ్చిన లోకనాథుడగురాముడుమాత్రము నిన్ను విడువడు. ఇక్కడ శీఘ్ర కాలములో నతనివింటిశబ్దమును నీవు వినెదవు. రాక్షసులనుజంపు

రామలక్ష్మణుల బాణములను నీవు చూచెదవు. నామనుష్యుడు మూడు పాదములతో రాక్షసులసిరిని తీసికొనునట్లు నీయొద్దనుండి రాముడు నన్ను శీఘ్రముగ దీసికొనిపోవును. అతఁడు జనస్థానములో రాక్షసులను సంహరించినందులకు దుర్బలుడవగు నీవు వా రాశ్రమమున లేనిసమయమున నన్నెత్తుకొని వచ్చితివి. యుద్ధమున వారియెదుట నీవు నిలువలేక యిట్టిపని చేసితివి. రామలక్ష్మణులు నిన్ను బాణములతో గొట్టి చంపుదురు. నీవెక్కడికి బోయినను నీకు మరణముతప్ప"దని పలికెను.

ఆమెమాటలను రావణుడు విని విప్రియవాక్యముల నిట్లు నుడివెను. 'స్త్రీలమంచిమాటలకు పురుషుడు వశుడగును. మంచిమాటలాడినపురుషుని వా రవమానింతురు. నీపై నాకెక్కువ కోపమువచ్చినను నేను దాని నాపుకొంటిని. ఒకపురుషునికొక స్త్రీయందు మోహము కలిగినపు డామె ప్రతికూలముగనున్నను సతని కామెయందుదయయు, స్నేహము నిజముగ గలుగును. ఈకారణముచే నేను నిన్ను బాధింపను. నీవు న న్నవమానించుటచేతను, వనవాసములోనున్న రాముని యందు నీవు నిజముగ మనస్సునిలిపియుండుటచేతను నీవు చంపదగిన దానవైనను నేను నిన్ను బాధింపను. నన్నాడినకఠినవాక్యములకు నీకు దారుణవధ విధించుట యుక్తము.' ఇట్లు రావణుడు సీతతో బలికి గొప్పకోపముతో తొందరగ నిట్లనెను. 'నేనింకను నిన్ను రెండుమాసములు చూడవలెను. ఈగడువు నీ కిచ్చితిని. తరువాత నీవు నా పాన్పును సేవింపవలెను. అప్పుడు నీవు నన్ను భర్తగాగోరనియెడల నావంటవాండ్రు నాయుదయమాంసభోజనమునకై నిన్ను జంపి ముక్కలుచేసి వండెదరు.' ఇట్లు త డామెను తర్జనజేయు నాతనిభార్యలగు దేవగంధర్వస్త్రీలు గొప్పవిచారమును బొంది పెదవులసంజ్ఞలతోను, నోరు, కండ్లు మొదలగువానిసంజ్ఞలతోను నామె నోదార్చిరి. ఆమె తనపాతివ్రత్యబలముచే వానితో 'ని న్నిహేయుకర్మమునుండి నివారించు

వా రెవ్వరును లేరు. ధర్మాత్ముడగు రాముని భార్యనగు నన్ను మూడు లోకములలోను నీవు తప్ప నితరు లెవ్వరును మనస్సులోనైన గోరు దురా? నీచ రాక్షసా! మిక్కిలి తేజోవంతుడగు రాముని భార్యను గూర్చి నీవు పలికిన మాటల పాపము నీ వెక్కడ నున్నను నిన్ను విడుచునా? అతడు మదించిన యేనుగు వంటివాడు. నీవు కుందేలు వంటివాడవు. అతనిని వంచించినందులకు నీకు సిగ్గుకలుగుట లేదా? అతనికంటికి కనబడకుండ తప్పిపోయితివి. వికృతరూపములును, క్రూరములును నగు నీకంళ్లు నన్ను జూచినందులకు నూడిపోయి క్రిందయేల పడవు? నన్నిట్టిమాటలాడి నందులకు నీనాలుక యేల తెగి పడదు. నాపాతివ్రత్యముచే నేను నిన్ను భస్మముచేయగలను; గాని నాభర్త సెలవీయనందున నేనట్లు చేయకున్నాను. రాముని వద్దనుండి నన్ను హరించుటకు నీకు శక్యము కాకున్నను నాహరణము నిన్ను వధించుటకై విధిచే నిర్ణీతమైనది. సందేహము లేదు. శూరుడవును, కుబేరుని తమ్ముడవును, గొప్పబలము కలవాడవు నైనను నీవు రాముని నాశ్రమమునుండి యడవికి బంపి నన్ను హరించితి'వని పలికెను.

సీతపలికిన యీమాటలకు రావణుడు తనకంళ్లను ద్రిప్పుచు నామెను జూచెను. నల్లని మేఘమువంటి శరీరము, పెద్దభుజములు, నల్లని తల, మెఱ్ఱని కంళ్లు, నాలుక, సింహబలమువంటి బలముగల యాతడు తనతల నాడించుచు మందరపర్వతమువలె నిలుచుండెను. వాని భుజములు మందరగిరిశిఖరములవలె గనబడెను. అతడు కల్పవృక్షమువలెను, వసంతునివలెను నిలుచుండి భయంకరముగ గనబడుచు నెఱ్ఱని నేత్రములు గలవాడై పామువలె బుసకొట్టుచు నామెతో 'నీతిలేనిదానా! యైశ్వర్య వంతుడనగు నన్ను నంగీకరింపక యర్థహీనుడగు రాముని నంగీకరించుచున్నావు. ఇప్పుడే నిన్ను నాశనమొందింతు'నని పలికెను. తరు వాత నట దక్కడనున్న వికృతాకారములుగల రాక్షసస్త్రీలకు 'మీరాగ

దఱుకలిసి సీత నాకు స్వాధీనమగునట్లు చేయవలయును. సామదాన భేదదండోపాయములచేతను, నామెకు ప్రతికూలమగుకార్యములచేతను నామెను నాస్వాధీనముచేయు'డని తిరుగ తిరుగ నాజ్ఞాపించెను. అప్పు డతని భార్యయగు * ధాన్యమాలి యాతనిని గౌగిలించుకొని యిట్లు పలికెను. 'మహారాజా! నాతో క్రీడింపుడు. సౌందర్యములేని యీ మనుష్యస్త్రీ మీకేల? నిజముగ నీదివ్యభోగముల ననుభవించుటకు నామెకు బ్రహ్మ నిర్ణయించియుండలేదు. కామములేని స్త్రీని పురుషుడు పొందిన సుఖముండదు. కామము గలస్త్రీని పొందిన వానికి మంచిప్రీతికలుగును.' ఆమె పలికిన యీమాటలను రావణుడు విని లేచి పెద్దనవ్వునవ్వుచు బయలుదేఱెను. అతడు భూమి కదలునట్లు నడచుచు తనభార్యలగు దేవ గంధర్వ నాగస్త్రీలు తన్ను వెంబడింప తనగొప్పభవనమును జేరెను.

---

## ౬౯న అధ్యాయము.

### అశోకవనమున సీతను రాక్షసస్త్రీలు భయపెట్టుట.



ఆరాత్రి తెల్లవాఱుజామున రావణు డశోకవనమును విడిచిన తరువాత వికృతరూపములు, భయంకరరూపములుగల రాక్షసస్త్రీలు సీతచుట్టుజేరి గొప్పకోపముతో 'పులస్త్యపుత్రుడును, మహాత్ముడుననగు రావణునికి భార్యగానుండుటమిక్కిలిగొప్పదని యాలోచింపకున్నా'వని పలికిరి. తరువాత నేకజట యనునది సీతనుబిలిచి యిట్లనెను.'ఆఱుగురు ప్రజాపతులలోను పులస్త్యుడు నాల్గవవాడు. అతడు బ్రహ్మమానస

---

* ఋ, రా;—మండోదరి,

పుత్త్రుడు; తేజోవంతుడు. మహర్షియగు నతనికి విశ్రవసుడు పుత్త్రుడు. వాడు తన తండ్రితో సమానమగు తేజస్సుకలవాడు. వాని కుమారుడు రావణుడు. ఇతడు శత్త్రువులను బీడించువాడు. ఇట్టివానికి నీవు తగిన భార్యవు. నామాట లేలయంగీకరింపవు?' ఇట్లు రాక్షసస్త్రీ పలికిన తరువాత పిల్లికండ్లవంటికండ్లుగల హరిజటయనునామె కోపముతో తన కండ్లనుద్రిప్పుచు 'రావణుడు 33 దేవతలను, నిందుద్రునిజయించెను. నీ వాతనిభార్యవగుటకు తగినదాన'వని యనెను. తరువాత ప్రఘసయను నది సీతకు చీవాట్లు పెట్టుచు ఘోరమగు మాటలిట్లనెను. 'గొప్పవీరుడును, శూరుడును, యుద్ధములో వెనుదిరుగనివాడును, బలవంతుడును నగు రావణునికి భార్యనగుటకు నీ వేలకోరుటలేదు? తనభార్యలలో కెల్ల ప్రియభార్యయగు మండోదరియందుకంటె నీయందు రాజు మనస్సును నిలిపియున్నాడు. అతడు మంచి సౌందర్యముగల స్త్రీలతోను, ననేకవిధములగురత్నములు మొదలగువానితోనునొప్పుతన యంతఃపురమును విడిచి నీదగ్గఱకు వచ్చుచున్నాడు.' ఇట్లు రాక్షసిపలికిన తరువాత వికటయనురాక్షసి 'నీచురాలా! దేవతలను, నాగ గంధర్వ దానవులను యుద్ధములో జయించిన రావణుడు నీయొద్దకువచ్చియున్నాడు. అట్టి గొప్పయైశ్వర్యముగలవానికి భార్యగనుండుట కేలకోరకున్నా' వని యనెను. పిమ్మట దుర్ముఖి యనునామె 'రావణునియందలి భయముచే సూర్యుడు తనకాంతిచే తాపమును గలుగ జేయలేడు. వాయువు గట్టిగ వీవలేదు. చెట్లుపువ్వులను రాల్చుచుండును. కొండలు, మేఘములు నీటినిచ్చుచుండును. లోకభయంకరుడగు నిట్టివానికి భార్యవగుటకు నీ కేల బుద్ధి కలుగటలేదు? నీకునిజముగ మంచిమాటలన్నియు దెలిపితిని. నామాటలను వినుము. మఱియొకలాగున జేయకు'మని పలికెను. తరువాత రాక్షసస్త్రీలందఱు సీతతో ప్రజలకందఱికి మనోహరమగున దిద్యము, మంచిపక్కలు మొదలగునవికల్గియున్నగు రాజనగరుంతో నిన

సించుటకు నీకేలయిష్టములేదు; మనుష్యస్త్రీనగు నీవు మనుష్యునకు భార్యగనుండుటయే గొప్పగ దలచుచున్నావు. రాజ్యభ్రష్టుడును, తన కార్యమును నెఱవేర్చుకొనలేనివాడును, వ్యాకులచిత్తుడునునగు రాముని యందు నీవు మనస్సును విడుము. మూడులోకములకు రాజగు రావణునిగూడి యిష్టమువచ్చినట్లు విహరింపు'మని కఠినముగ బలికిరి.

ఆరాక్షసస్త్రీలమాటలను సీత విని కన్నులంట నీరు దెచ్చుకొని 'మీరందఱు కలిసిచెప్పిన లోకగర్హితమగు పాపపు మాటలు నామనస్సునకు బాగుగలేవు. మనుష్యస్త్రీనగు నేను రాక్షసునికి భార్యనగుటకు దగియుండను. మీరంద ఱిష్టమువచ్చినట్లు నన్ను దినివేయుడు. మీరు చెప్పినమాటను నేను జేయను. దీనుడైనను, రాజ్యహీనుడైనను నాభర్తయగు నాతడే నాగురుడు. సూర్యుని సువర్చలవలెనే నేనెప్పుడు నాతని ధ్యానించుచుండెదను. శచి యింద్రుని, రోహిణి చంద్రుని, నరుంధతి వశిష్ఠుని, లోపాముద్ర యగస్త్యుని, సుకన్య చ్యవనుని, సావిత్రి సత్యవంతుని, శ్రీమతి కపిలుని, మదయంతి సౌదాసుని, కేశిని సగరుని, దమయంతి నలుని ననుసరించియున్నట్లు నేనిక్ష్వాకువంశశ్రేష్ఠుడగు రాముని ననుసరించియుండెద'నని పలికెను.

ఆమెమాటలకు రాక్షసస్త్రీలు గొప్పకోపమును దెచ్చుకొని రావణునియాజ్ఞప్రకారము సీతకు చీవాట్లు పెట్టుచుండిరి. శింశుపావృక్షముమీద నెవరికిని గనబడకుండ దాగియున్నహనుమంతు డిదంతయు జూచి యేమియు మాట్లాడక యూరకుండెను. సీత భయముచే వణకుచుండ నారాక్షసస్త్రీలు గొప్పకోపముతో వ్రేలాడుచున్న తమ పెదవులను పండ్లతో కొఱికి గండ్రగొడ్డళ్ళను బట్టి 'ఈమెకు రాక్షసాధిపుడగురావణుడు తగినభర్త కాడని పలికిరి. భయంకరాకారములుగల యారాక్షసస్త్రీ లిట్లామెను భయపెట్టుచుండగ నామె కన్నీరు విడుచుచు శింశుపావృక్షమునొద్దకు వెళ్ళెను. అక్కడికి రాక్షసస్త్రీలుకూడ

వెళ్ళిరి. సీత మఱికిబట్టలను గట్టుకొని యెండిపోయినశరీరమును, గలిగి దీనముఖముతో నుండ నారాక్షసస్త్రీ లామెను ననేకవిధములుగ బాధించిరి. అప్పుడు భయంకరాకారముగల వినత యనునామె కోపముతో 'ఇంతవఱకు నీవు నీభర్తనుగూర్చి చాలస్నేహము గనబఱచితివి. ఏదైనను నెక్కువైనయెడల దుఃఖమును గలిగించును. నీవు మనుష్యులు చేయవలసిన కార్యములను జేసినందులకు సంతోషించితిని. అయినను నీహితమును గోరి చెప్పు నుపయోగమగు నామాటను జరుపుము. రాక్షసులందఱికి రాజును, పరాక్రమవంతుడును, రూపవంతుడును, శక్తిగలవాడును, దానశీలుడును, సందఱికి ప్రియమును జేయువాడునునగు రావణుని భర్తగా సేవింపుము. లోభియగు రాముని విడిచి నేటినుండి మంచిగంధములను బూసికొని మంచిమాల్యములను, యాభరణములను ధరించి యగ్నిని స్వాహాదేవియు, నిందుని శచీదేవియు సేవించునటులనే యన్నిలోకములకు ప్రభువగు రావణుని నీవాశ్రయింపుము. లోభియు, ప్రాణములుపోవసిద్ధముగ నున్నవాడునునగు రామునివలన నీకేమిప్రయోజనము? నేను చెప్పినదానిని నీవు జరుపనిచో మేమందఱము నీచే విషమును ద్రాగించెద'మని పలికెను. తరువాత వ్రేలాడుచున్న పెద్దస్తనములుగల వికట యనునామె గర్జించుచు పిడికిలి యెత్తి సీతతో నిట్లనెను. 'దుర్మార్గురాలా! నీవనేకవిధప్రియములను బలికినను నీయందలియనురాగముచేతను, దయచేతను వానిని సహించితిమి. కాలోచితమగు మామంచిమాటలను నీవు వినకుంటివి. ఇతరులు రాలేని యీలంకకు నీవుతీసికొనిరాబడి ఘోరమగు రావణునియంతఃపురమున బ్రవేశించితివి. మేము నీకు గావలియుండ నిన్ను రక్షించుట కింద్రుడైనను శక్తుడుగాడు. నేను నీహితమునకై చెప్పుమాటలను వినుము. నీవు కండ్లంట నీరువిడుచుట చాలించి నీకు బాధకలిగించు నీశోకమును విడువుము. సీతా! యెల్లప్పుడునుండు

నీదైన్యమును నీవు విడిచి ప్రీతిని, సంతోషమును బొంది రాక్షసరాజుతో సుఖముగ క్రీడింపుము. స్త్రీలయౌవనము శాశ్వతముకాదని నీకు దెలియునుగదా! నీయౌవనము వ్యర్థముకాకుండ సుఖమనుభవింపుము. సుందరమగు నుద్యానవనములందును, పర్వతములదగ్గఱనుండు వనములందును నీవు రావణునితోగూడి సంచరింపుము. నీస్వాధీనమున 7000 స్త్రీలుండెదరు. కనుక రావణుని భర్తగ సేవింపుము. నేను చెప్పినమాటలను నీవు జరుపకపోయినయెడల నీగుండెలను పైకి తీసివేసి భుజించెదను.' ఇట్లు రాక్షసి పలికినపిమ్మట చండోదరియనునది క్రోధముతో పెద్దశూలమును దిప్పుచు 'ఈమె భయముచే వణకుచున్నది. రావణుడుహరించిన యీమెను జూడ నామెకడుపులో కుడిప్రక్కను, నెడమప్రక్కను నుండుమాంసమును, గుండెలను, పేగులను, తలను తినవలె నని నాకుమనస్సుకలుగుచున్న'దని పలికెను. తరువాత ప్రఘస యనునామె "ఈదురాత్మురాలి కంఠమును నొక్కుదము. ఆలస్యమెందులకు? మనము 'సీత చనిపోయిన'దని రావణరాజుతో దెలిపిన నాతడు 'తినివేయు'డని సెలవిచ్చును. దీని కెంతమాత్రము సందేహము లే"దని పలికెను. తరువాత నజాముఖి యను రాక్షసి 'ఈమెను ముక్కలు ముక్కలుగనరికి మనమందఱము సమానముగ వివాదములేకుండ పంచుకొందము. ఆమాంసముతో గలిపిత్రాగుటకు మంచిమద్యమును, తినుటకు మంచిలేహ్యమును తెం'డని యనెను. అంతట శూర్పణఖ యనునది "అజాముఖిచెప్పినది బాగుగనున్నది. మద్యమును తెండు. అదియన్ని విచారములను బోగొట్టును. దానితో మనుష్యమాంసమును భుజించి 'నికుంభిల' యను శక్తివద్ద నృత్యము చేయుద"మని పలికెను. ఇట్లు సీతను ఘోరరూపములుగల రాక్షసస్త్రీలు భయపెట్టుచుండ నామె ధైర్యమును విడిచి యేడ్చుచుండెను.

అప్పుడామె మిక్కిలిభయముకలదై గద్గదస్వరముతో 'మనుష్యస్త్రీ రాక్షసునికి భార్యయగుటకు తగదు. మీరందఱు మీయిష్టము

వచ్చినట్లు నన్ను తినివేయుడు. మీమాటలను నేను జరుపనని పలికెను. ఆరాక్షసస్త్రీలమధ్యనున్న సీత కెంతమాత్రము సుఖము లేకపోయెను. వనములో మందనుండి విడిపోయి నక్కలచే తరుమబడి తనశరీరమును జూచుకొని వణకు లేడివలె నామె మిక్కిలిగ వణకెను. ఆమె శింశుపావృక్షమునకు దగ్గఱగ పుష్పించియున్న యొకయశోక వృక్షశాఖను బట్టుకొనెను. ఆమె మనస్సంకోచనముగ నుండెను. ఆమె కన్నీటిచే నామె వక్షఃస్థలమంతయు తడిసెను. తనభర్తను స్మరించుచున్న యామెశోకమున కంతము లేకపోయెను. ఆమె మిక్కిలిగ వణకుచుండెను. రాక్షసస్త్రీలవలన గొప్పభయము గలుగుటచే నామెముఖమెండి పోయెను. ఆమెజడ నల్లత్రాచుపామువలె గదలుచుండెను. ఆమె గొప్పదుఃఖముచేతను, శోకముచేతను నిట్టూర్పుదీయుచు 'హా! రామా! హా! లక్ష్మణా! హా! కౌసల్యా! హా! సుమిత్రా! స్త్రీకిగాని, పురుషునికి గాని యకాలమృత్యువు కలుగదని చెప్పిన పండితులవాక్యములు నిజమయ్యెను. అందుచేతనే నేనీ రాక్షసస్త్రీల బాధనొంది రాముని విడిచి జీవించియున్నాను. అల్పపుణ్యముగల నేను రక్షించువాడు లేక నాశనమొందెదను. రాక్షసస్త్రీలకు జిక్కిన నేను నాభర్తను జూడలేక నిజముగ శోకముచే నశించెదను. అదృష్టవంతులగువారు పద్మపత్రములవంటి నేత్రములుగలవాడును, సింహపరాక్రమమువంటి పరాక్రమముగలవాడును, కృతజ్ఞుడును, ప్రియములు పలుకువాడునునగు నా భర్తను జూచెదరు. తీక్ష్ణమగు విషమును ద్రాగినవానికి జీవనము దుర్లభమగునట్లు రామవియోగముచే నాకు జీవనము దుర్లభమగును. నాకిప్పు డిట్టి గొప్పదుఃఖము సంభవించుటకు పూర్వజన్మమున నేనేమి గొప్పపాపములను జేసియుంటినో! రాక్షసస్త్రీలు నాకు కావలియున్నారు. రాముడు నన్ను బొందలేడు. ఈగొప్పశోకము ననుభవింపలేక నేను ప్రాణములను విడువగోరుచున్నాను. నేనితరులవశ

ములో నుండుటయు, నేను మానవజన్మ మెత్తుటయు, నాయిష్టమువచ్చి నట్లు ప్రాణములు పోకుండుటయు నిందింపఁగిన' వని విలపించెను.

శంకను నామె సుఖమును క్రిందికి వంచుకొని వెఱ్ఱిదానివలెను, మిక్కిలిమత్తత నొందినదానివలెను, చలించినమనస్సుగలదానివలెను నేడ్చుచు నిట్లు విలపించెను. "రాము డజాగ్రత్తగనుండ కామరూపుఁడగు రావణునిచే బలవంతముగ నేనిక్కడకు దీసికొనిరాబడితిని. ఇక్కడ రాక్షసస్త్రీలు దారుణముగ నన్ను భయపెట్టుచున్నారు. నాభర్తను దలచుచున్న నాకు గొప్పదుఃఖము కలుగుటచే నేనుజీవింపలేను. మహారథుఁడగు రాముఁ విడిచి రాక్షసస్త్రీలమధ్యను నివసించు నాకు జీవనమువలనను, కోరికలవలనను నేమిప్రయోజనము? నాహృదయము నిజముగ రాతివలెనున్నది. దానికి నాశనములేదు. అందుచేతనే నాదుఃఖమునకు నంతములేకనబడకున్నది. మర్యాదలేని నాజీవనము నిందింపఁదగినది. రాముని విడిచి పాపినై జీవించియున్నందులకు నాబ్రతుకు నింద్యమైనది. సముద్రముయొక్కయావలిప్రదేశము నివసించు నాప్రియభర్తను విడిచి జీవించుటకుఁగాని, సుఖించుటకుఁగాని నాకేలశక్తికలుగును? రాక్షసస్త్రీలారా! మీరు నాశరీరమును బొడిచినను నాకిష్టమే; తినివేసినను నాకిష్టమే. మీకు దాని నప్పజెప్పెదను. నాప్రియభర్తను విడిచి నేను చాలకాలము దుఃఖ మనుభవింపలేను. నాకుడికాలితో నైన నేను రావణుని ముట్టను. అట్టివానో హేయమనునట్లు వాని నెట్లు కామించెదను? నారాయి భావమునకు నన్ను ప్రార్థించు నారాఁడు నాసిరాకరణమునుగాని, తనగొప్పతనమునుగాని, తనకులమునుగాని తెలియకున్నాఁడు. నాశరీరమును బొడిచినను, ముక్కలుచేసినను, మండెడు మంటలో కాల్చినను నాకిష్టమే; కాని నేను రావణునిమాటను సమ్మతింపను. మీరిట్లు చాలకాలమేల పేరెదరు? ప్రఖ్యాతపురుషుఁడును, కృతజ్ఞుఁడును, దయాళుఁడును, మంచినడవడికగలవాఁడుననగు రాముఁడు

నాభాగ్యము నశించుటచే నాయందు నిర్దయగలిగియున్నాడని నే ననుమానించుచున్నాను. జనస్థానమున 14000 రాక్షసులను సహాయములేకుండ జంపినవాడును, విరాధుని గూలనేసినవాడునునగు రాముడు నన్నేల రక్షింపడు? స్వల్పబలముగల రావణుడు నన్నిక్కడనిలిపెను. వానిని యుద్ధములో జంపుటకు నాభర్తమిక్కిలిసమర్థుడు. సముద్రముమధ్యనున్న యీలంక యితరులు ప్రవేశించుటకు శక్యముకానిదైనను రామబాణములనుమాత్రము నడ్డలేదు. గొప్పపరాక్రమముగల రాముడు ప్రియురాలగు తనభార్యను రాక్షసు డెత్తుకొనిపోన నామె నేలరక్షింపకుండును? నేనిక్కడనుంటినని యీతనికి దెలియలేదని నే ననుమానించుచున్నాను; తెలిసిన నన్నెత్తుకొనివచ్చినందులకు కోపోద్రేకమును బొందియుండును. నన్ను రావణు డెత్తుకొనిపోయెనని రామునితో జెప్పగలిగిన వృద్ధుడగు జటాయువు రావణునిచే యుద్ధములో జంపబడెను. అతడు నన్ను రక్షించుటకు రావణునితో యుద్ధమునకు దలపడి గొప్పపోరు సలిపెను. నేనిక్కడ నున్నానని రామునకు దెలిసినయెడల నతడు లోకములోనున్న రాక్షసులనందఱిని బాణములతో గొట్టిచంపి సముద్రమును నింకించి యీలంకాపట్టణమును నాశనము చేసి రావణునికీర్తి నడంచి వాని పేరులేకుండజేయును. అప్పుడు రాక్షసస్త్రీలు లంకలో ప్రతిగృహమందును తమ తమ భర్తల నాశనమునకై యిప్పుడు నేనేడ్చుచున్నట్లే యెక్కువగ నేడ్చెదరు. అనుమానము లేదు. రామలక్ష్మణులు లంకకు వచ్చి వెతకివెతకి రాక్షసులను నాశనము చేసెదరు. వారికి గనబడినశత్రువు రెండుగడియలైనను జీవింపడు. లంకలోని మార్గములన్నియు చచ్చిపోయిన రాక్షసులతోను, చితుల నుండిబయలుదేఱినపొగతోను, శవములను బొడిచి తినుగ్రద్దలతోను నిండియుండ నీలంక శీఘ్రముగ శ్మశానముపలె నగును, శీఘ్రముగ నామనోభీష్టము సిద్ధించును. ఈదురాత్మాగ్రపుకర్మ మీయందఱినాశన

మును దెలియజేయుచున్నది. ఇప్పుడు లంకలో గనబడు దుశ్శకునములచే నిది శీఘ్రముగ కళావిహీన మైనదగును. పాపుడగు రావణుని వధ జరుగ లంక విధవవలె శోకమును బొందును. పూర్వము మంచి యుత్సవములతో సంతోషముగనుండిన యీపట్టణము విధవవలె నుండును. తమభర్తలు నశింప ప్రతిగృహమునందు రాక్షసస్త్రీలు రోదనముచేయ దానిని స్వల్పకాలములో నేను వినెదను. నేను రావణునిగృహమున నున్నట్లు శూరుడగు రామునికి దెలిసినయెడల నతడు గొప్పకోపముతో నీపట్టణమునంతను తన బాణములతో గాల్చి రాక్షసులనందఱిని జంపి దీని ప్రభ నశింపజేయును. క్రూరుడును, నీచుడును నగు రావణుడు నాకు నిర్ణయించినగడువు సమీపింపవచ్చినది. పాపులగు రాక్షసులకు చేయగూడనిపని తెలియదు. కాన వారియధర్మమువలన నాకు గొప్పయాపద వచ్చినది. రావణుడు నన్ను జంపి తన యుదయభోజనమునకు వండవలెనని తనయనుచరులకు నాజ్ఞాపించెను. నేను రాముని జూడకుండ నేమిచేయుదును? ఇప్పు డెవ్వరైననునాకువిషము నిచ్చినయెడల నేను పతిని విడిచి మరణమునొంది యమలోకమునకు బోయెదను. రామలక్ష్మణులకు నేను జీవించియున్నసంగతి తెలియదు? వారికి దెలిసియుండినయెడల వారు లోకములో నన్ను తప్పక వెదకెదరు. రాముడు నావియోగముచే నిశ్చయముగ పరలోకమును బొంది యుండును. అక్కడ నతనిజూచు దేవతలు, గంధర్వులు, సిద్ధులు, గొప్ప ఋషులు మిక్కిలిధన్యులు. మఱియొకతీరున నాలోచింప పరమాత్ముడును, బుద్ధిమంతుడును, రాజర్షియు, ధర్మమందే కోరికగలవాడును, కామమునం దభిలాషలేనివాడునునగు నాతనికి నేను భార్యనై యుండుటవలన ప్రయోజనములేదు. కృతఘ్నులితరులపై కంటికి కనిపించు నంతకాలమే ప్రేమను, స్నేహమును జూపెదరు; గాని తరువాత జూపరు. రాముడట్లుగాక యితరులపై నెల్లప్పుడు ప్రేమను, స్నేహ

మును జూపును. నాకు గుణములు లేవా? లేక నాకదృష్టము లేదా? రాముని జూడకుండ నేనేల నాశనమునొందుచున్నాను? మహాత్ముడును, మంచిచరిత్రముకలవాడును, శూరుడును, శత్రువులను సాధించువాడును నగు రామునివియోగముతో జీవించుటకంటె నాకు మరణమే శ్రేయము. వనములో ఫలమూలములను దిని జీవించుచు శస్త్రము లను విడిచి మంచిచరిత్రములుగల రామలక్ష్మణులక్కడ సంచరించు చుండిరా? లేక శూరులగు వారు దురాత్ముడగు రావణునిమాయలో బడిపోయిరా? ఇట్లు కాలమునకింపు సన్నివిధములు నేను మరణమునే కోరుచున్నాను; కాని నాకీదుఃఖముతప్ప మృత్యువు నిర్ణయింపబడలేదు. ఆత్మలనుజయించి ప్రియాప్రియములులేక పాపములులేక జీవించు మహా త్ములగు మునులు ధన్యులు. ప్రియమగుకార్యమువలన సుఖమును, నప్రియకార్యమువలన గొప్పభయమును గలుగును. ఈరెండిటివలన బాధనొందకయుండు నామహాత్ములకు నేను నమస్కరించెదను. నా ప్రియుడగు రాముని విడిచి పాపుడగు రావణునికి వశ్యనై నేను ప్రాణ ములను విడిచెదను.” ఇట్లు సీత విలపించుచుండ నావిలాపమును రావణునకు దెలుపుటకు కొందఱు రాక్షసస్త్రీలు వెళ్లిరి. తరువాత కొందఱా మెచుట్టునుజేరి ‘సీమాంసము నిప్పుడే సుఖముగ భుజించెద’ మని పలికిరి.

---

## ౭ వ. అధ్యాయము.

## త్రిజటస్వప్నము, సీత యాత్మహత్యచేసికొనబోవుట.



వికృతరూపములుగల రాక్షసస్త్రీలు సీతను భయపెట్టుచుండ పడుకొనియున్న త్రిజటయను ముసలిరాక్షసి లేచి వారిని జూచి యిట్లు పలికెను. ‘మీరు మీశరీరములను తినివేయుడు. జనకునిప్రియపుత్రి కమ్ము, దశరథునికోడలునునగు నామెను తినకుడు. నే నిప్పుడొక భయంక

కరమును, శరీరమునకు గగుర్పాటుగలిగించునదియునగు కలను గంటిని. రాక్షసులకు నాశనమును నామెభర్తకు గొప్పశుభమును గలుగును.’ఆవృద్ధరాక్షసి పలికినయీమాటలను నక్కడనుండు రాక్షస స్త్రీలందఱు విని గొప్పభయమును బొంది ‘నీవెట్టికలను గంటివో మాతో జెప్పు’ మని యామెను గోరిరి. అప్పు డాయుపయానున త్రిజట తనకలలోని యంశములనిట్లు వారికి జెల్పెను. “రాముడు తెల్లని బట్టలను గట్టుకొని మంచిగంధమునూసికొని మాల్యములను ధరించి యేనుగుదంతముతో చేయబడినదియు, ప్రకాశమానమైనదియు, హంస లచే మోయబడునదియు, నంతరిక్షమునందున్నదియునగు నవారీనెక్కి లక్ష్మణునితో గూడ వచ్చెను. సీత తెల్లనిబట్టలను గట్టుకొని చుట్టును సముద్రముగల శ్వేతపర్వతమున నిలిచెను. తరువాత రామలక్ష్మణులు నాలుగుదంతములుగల పెద్దయేనుగునెక్కి తిరుగుచు తమతేజములతో ప్రకాశించుచు సీతయొద్దకు వచ్చి యాపర్వతమున దానిని నిలిపిరి. ఆకాశమున నిలిచియున్న యాయేనుగుమూపుపైని సీతను రాముడు కూర్చుండబెట్టుకొనెను. అప్పుడు సూర్యునితో సూర్యకాంతి కలిసినట్లు రామునితో సీత కలిసెను. తరువాత నామె తనభర్తతోడనుండి లేచి తనచేతులతో సూర్యచంద్రులను బట్టుకొనెను. అనుగ్గురితోను నేనుగు లంకపై నిలిచెను. అప్పు డెనిమిదియెద్దులుగట్టిన రథముపై వారుముగ్గు రిక్కడకు వచ్చిరి. తరువాత వారు ప్రకాశమానమగు పుష్పకము నెక్కి యుత్తరదిక్కునకు బోయిరి. గొప్పతేజముగల రాముడు పరా క్రమవంతుడును, పురుషోత్తముడునునగు విష్ణునివలె నాకు గనబడెను. అతనిని దేవాసురులును, రాక్షసులును, నితరులునుగూడ జయింపలేరు. రావణుడు తనశరీరమందంతటను నూనె నిండియుండ నల్లనిబట్టలనుగట్టి మద్యమును సేవించి గన్నేరుపువ్వులదండను మెడలోవేసికొని యెఱ్ఱని చందనమును బూసికొని యెఱ్ఱనిదండలను ధరించి నొకస్త్రీచే పుష్పక

విమానమునుండి క్రిందికి లాగబడి భూమియందు బడెను. తరువాత నతనితల గొఱిగబడెను. పిమ్మట నతడు నల్లనిబట్టలను గట్టెను. గాడిదలనుగట్టిన రథముపై నతడు కూర్చుండి యెఱ్ఱనిమాల్యములను ధరించి యెఱ్ఱనిగంధములు శరీరమున రాయబడియుండ నూనెత్రాగుచు గంతులువేయుచు మతిపోవుటచే స్పృహనెఱుగక పడియుండెను. తరువాత నతడు గాడిద నెక్కి దక్షిణదిక్కునకు బోయి భయముచే దానినుండి తలక్రిందుగబడెను. తిరుగ నతడు లేచి భయముచేతను, తొందరచేతను, మత్తతచేతను వ్యాకులతనొంది దిగంబరుడై వెఱ్ఱివానివలె ననేకదుర్వాక్యములను బ్రేలుచు చీకటిగనున్నదియు, చెడువాసన కొట్టుచున్నదియు, చాలమలమూత్రములతో నిండినదియునగు నొకపెద్దగోతిలో బడెను. ఎఱ్ఱనిబట్టలను గట్టిన కాళి శరీరమున బురదగలిగియున్న రావణుని మెడకు త్రాడుగట్టి పశ్చిమదిక్కునకు నీడ్చుకొనిపోయెను. కుంభకర్ణుడుగూడ నిట్లే నాకు గనబడెను. రావణునికుమారులందఱి శరీరమున నూనె పూయబడియుండెను. రావణు డడవిపందినెక్కియు, నింద్రజిత్తు మొసలినెక్కియు, కుంభకర్ణు డొంటెనెక్కియు దక్షిణదిక్కునకు వెళ్లుచుండిరి. అప్పుడు విభీషణుడు తెల్లనిబట్టలనుగట్టి తెల్లనిగంధములను బూసికొని తెల్లనిమాల్యములను ధరించి తెల్లనిగొడుగు పట్టబడియుండ శంఖదుందుభులధ్వని వ్యాపించుచుండ నృత్యసంగీతములు జరుగుచుండ నాలుగుదంతములుగల పెద్దయేనుగు నెక్కెను. అతనిమంత్రులునలుగు రాకాశముననిలిచిరి. ఎఱ్ఱనిబట్టలనుగట్టి యెఱ్ఱనిమాల్యములను ధరించి మద్యమునుద్రాగి వాద్యవిశేషములతో పాటలను బాడుచున్న రాక్షసులసభగల యీలంకాపట్టణము గోపురబహిర్ద్వారములతోను, ఏనుగులు, గుఱ్ఱములు, రథములు మొదలగువానితోను సముద్రమున బడెను. రామదూతయగు నొకవానరునిచే లంక కాల్చబడెను. రాక్షసస్త్రీలు నూనెత్రాగి గంతులు వేయుచు మిక్కి

లిగ నవ్వుచు పెద్దధ్వనిచేయుచు కాలిపోయినలంకలో బ్రవేశించిరి. కుంభకర్ణుడు మొదలగు రాక్షసశ్రేష్ఠులందఱు నెత్తురుబట్టలనుగట్టి పేడ కుప్పలుగలగోతిలో బ్రవేశించిరి." ఇట్లు త్రిజట తనకలసంగతి వారికి దెలిపెను.

ఇంకను నామె వారి కిట్లు బోధించెను. రాక్షసస్త్రీలారా! మీరు సీతను విడిచిపెట్టుడు. రాముడు సీతను బొందెను. రాక్షసులమీద కోపముగలవాడై వారితో మనలనుగూడ జంపును. తనతోగూడ వనవాసముచేసిన తనప్రియభార్యను మీరు హింసబెట్టుచుండుట నతడు చూచి సహింపడు. మీక్రూరవాక్యము లిక చాలును. మంచిమాటలాడుడు. నేను చెప్పినది మీకిష్టమైనయెడల నీమెను మనము వేడుకొనెదము. దుఃఖముల ననుభవించుచున్న యీమెనుగూర్చి నాకిట్టిస్వప్నము వచ్చినది; కనుక నీమె యీదుఃఖముల నన్నిటిని విడిచి ప్రియమును బొందును. రామునివలన రాక్షసులందఱికి గొప్పభయము కలుగును. మనమీమెను క్షమాపణ గోరుదము. మీరనుమానింపకుడు. మనము ప్రార్థించిన నీమెకు దయకలుగును. మనరాక్షసస్త్రీలను గొప్పభయమునుండి యీమెయే రక్షింపగలదు. ఈమెను మీరు బాధపెట్టినను నీమె శరీరమున విరూపముగాని, యవయవములందు కొంచెమైనను విలక్షణముగాని కాన్పింపదు. ఆమెశరీరకాంతి మాసినమాత్రమే కనబడుచున్నది. సీతకు కార్యసిద్ధియు, రామునకు జయమును రావణునకు నాశనమును గలుగును. ఈమె కొంచెము సంతోషము గలిగి యున్న ట్లీమెయెడమకన్నదరుచున్నది; ఎడమభుజ మకస్మాత్తుగ గదలుచున్నది; ఏనుగతొండమువలెనున్న యీమెయెడమతొడకదలుచున్నది. ఇవన్నియు రాముడు దగ్గఱనున్నట్లు సూచించుచున్నవి. చెట్టుకొమ్మపైనుండు పక్షి మిక్కిలి సంతోషముతో మంచిమంచిశాంతవచనములను బలుకుచు రాబోవు శుభమును సూచించుచున్నది. ఇది

తిరుగతిరుగ సీతకు సంతోషముకలిగించుచున్నట్లున్నవి.” ఇట్లు త్రిజట బోధించినపిమ్మట రాక్షసస్త్రీలు నిద్రజెందరి.

సీత పూర్వముపలెనే విలపించుచు తనలోతానిట్లనుకొనెను. “నేను రావణునియందు మనస్సును నిలుపను. భయంకరుడగు నాతని మూలమున జంపబడుటకంటె నే నాత్మహత్య చేసికొనుటయే శ్రేయము. రాము డిచటకు రాకపూర్వము శీఘ్రముగ వాడిశస్త్రములచే నాయవయవములు ఛేదింపబడును. రెండుమాసములు గడువు పూర్తియైనపిమ్మట మరణముకలుగు నాకు బంధనలోనుండి తెల్లవారకిన వెంటనే వధింపబడు దొంగకువలె దుఃఖమువచ్చుచున్నది. హా! రామా! హాలక్ష్మణా! హా! సుమిత్రా! హా! తల్లీ! హా! రామమాతా! నేనిట్లు గొప్పవిపత్తులోనున్నాను. నిజముగ పురుషశ్రేష్ఠులగు నారామలక్ష్మణులు నన్ను గుఱించి మృగరూపమును ధరించినమాయావియగు రావణునిచే నాశనమునొందిరి. నిశ్చయముగ రావణుడు మొదట వారిని మృగరూపమున వంచించి నన్నుగోరి యెత్తుకొనిపోయెను. హా! రామా! సత్యవ్రతా! పూర్ణచంద్రునివంటి మోముగలవాడా! అన్నిలోకములకు హితమును జేయువాడా! నేను రాక్షసులచే జంపబడుటకు సిద్ధముగనున్నసంగతి మీరు దెలియరు. ఇతరదైవములను దలపక పతినే దైవముగ దలచుటయు, కష్టముల నన్నిటిని నోర్చియుండుటయు, భూమియందు శయనించుటయు, ధర్మమునందు నియమముగలిగియుండుటయు, పతివ్రతాధర్మమును జరుపుటయు నను నివన్నియు కృతఘ్నులకు జేసినమేలువలె నిష్ఫలము లయ్యెను. నేను పాతివ్రత్యముగలదాననై కృశించి శరీరము వివర్ణత నొంద మిమ్ము గలిసికొను నాశ వదలి మిమ్ము జూడలేకున్నాను. రామా! మీరు మీతండ్రియాజ్ఞను క్రమముగ జరిపి వనవాసముపూర్తిచేసి యయోధ్యకు బోయి కృతార్థులరై తిరుగని వాహరూాక్షి భార్యలతో గ్రీడించె

దను. నేను మీయందు కామముగలిగి చాలకాలము మీయందు బుద్ధి నిలిపి వ్యర్థముగ తపోవ్రతమునలిపి స్వల్పభాగ్యము కలదాననై ప్రాణములను విడిచెదను. విషముదాగికాని, వాడిగలయాయుధముచేగాని శీఘ్రముగ ప్రాణములను విడిచెదను; కాని నా కీరాక్షసగృహమున విషమునుగాని, శస్త్రమునుగాని యిచ్చువారెవ్వరును లేరు." ఇట్లు సీత యనేకవిధములవిలపించుచు రాముని బాగుగ మనస్సున స్మరించుచు వణకుచు వాడిపోయినముఖముకలదై యశోకవృక్షము వద్దకువెళ్లెను. అక్కడ నామె తనజుట్టుముడిని చెట్టుకొమ్మకు వేల గట్టి 'శీఘ్రముగ యమునియొద్దకు బోయెద' నని పలికి కొమ్మను బట్టుకొని నిలిచియుండెను. తరువాత నామె తనభర్తను, లక్ష్మణుని, తన కులమును స్మరించుచుండ తనశోకమును బోగొట్టి ధైర్యమును గలిగించు సుప్రసిద్ధమగు శుభశకునము లామెకు గనబడెను. రాముడు తనవెనుకను నిలిచిన ట్లామెకు గనబడెను. బంగారువర్ణముగలిగి కొంచెముమాసిపోయిన యామెబట్ట జారెను. ఈశుభసూచకములను బట్టియు, మఱికొన్నిటినిబట్టియు నామె తనభర్త రాబోవువార్తను నెఱిగి సంతోషించెను. ఇట్లామె శోకమును, తొందరను విడిచి తన శరీరమునకు తాపములేకయుండ తనమనస్సున కానందముగలుగ సుఖముగ నుండెను. అప్పుడామెముఖము పూర్ణచంద్రునివలె బ్రకాశించెను.

---

౨౯. అధ్యాయము.

హనుమంతు డాలోచించి సీతతో మాట్లాడుట.



హనుమంతు డాశింశుపావృక్షమున నారాత్రి తెల్లవారుఝామువఱకు నిలిచి యక్కడజరిగినదంతయుజూచి యిట్లనేకవిధములు నాలో

చించెను. "వానరు లన్నిదిక్కులకు బంపబడిరి. నేనీదిక్కునకు వచ్చితిని. నేను మంచిమూతనై రహస్యముగ సంచరించుచు శత్రుబలము నంతటిని జూచితిని. రావణునిప్రభావమును, రాక్షసులవిశేషమును, లంకను జూచితిని. సత్యవంతుడును, దయాళుడునునగు రామునిభార్య తనభర్తను జూడగోరియున్నది. కనుక నే నీమెను నోదార్చుట యుచితము. ఈమె గొప్పదుఃఖమును బొంది దానియంతమును గానకున్నది. పూర్వమెప్పుడును నీమె దుఃఖము నెఱుగదు. నే నీమె నోదార్చెదను. నే నట్లు చేయక యిక్కడనుండి వెళ్ళితినేని నాకు గొప్పదోషము వచ్చును. తన్ను రక్షించువారిసంగతి నీమె యెఱుగక తనప్రాణములను విడుచును. సీతను జూచుటయందు మిక్కిలి యాసక్తిగల రామునికి నీమెసంగతిని దెలిపి యతని నోదార్చుటుచితము. రాక్షసస్త్రీల యెదుట నీమెతో మాట్లాడుట యుక్తముకాదు. అట్లయిన నిప్పుడీ కష్టమునకు నేనేమిచేయవలయును? ఈ తెల్లవాఱులోపల నే నీమెను నోదార్పనేని యీమె ప్రాణములను విడుచును. అందులకెంతమాత్రము సందేహములేదు. రాముడు 'సీత యేమిపలికిన'దని నన్నడిగిన నీమెతో మాట్లాడనిచో నే నేమని మాఱు పలికెదను? ఈమెజాబు నేను తీసికొనివెళ్ళక తొందరగ నతనియొద్దకు బోయిన నతడు నన్ను తన కోపాగ్నిచే దహించును. ఈమెతో నేనుమాట్లాడక వెళ్ళి సైన్యముతో రామసుగ్రీవులను నిచటికి దీసికొనివచ్చిన నదివ్యర్థమగును. నే నిక్కడనే నిలిచి రాక్షసస్త్రీలులేనిసమయమున విచారముతో నున్న యీమెను మెల్లగ నోదార్చెదను. నేనిస్వల్పవానరశరీరముతో సంస్కృతభాషనుగాని, మనుష్యభాషనుగాని యీమెతో మాట్లాడెదను. ద్విజాతునివలె నేను సంస్కృతమున మాట్లాడిన నీమె నన్ను రావణుడేమో యని యనుమానించి మిక్కిలిభయమునున్ బొందును. వానరు డెట్లాభాషలో మాట్లాడగలడు? ముఖ్యముగ నేను మనుష్యభాషలో

మాట్లాడి యీమె నోదార్చవలెను. మఱియొకతీరున గాదు. రాక్షస స్త్రీలవలన భయమునుజెందిన యీమె నావానరరూపమును జూచి నామనుష్యభాషను విని తిరుగ నెక్కువగభయమును బొందును. ఈమె నన్ను కామరూపముగలరావణుడనియనుమానించిపెద్దధ్వనినిచేయును. అప్పుడు రాక్షసస్త్రీలందఱు తమయాయుధములనుబట్టి నాచుట్టునుజేరి తమశక్తికొలది నన్ను పట్టుకొనుటకును, జంపుటకును యత్నింతురు. చెట్లమొదళ్లనుండియు, కొమ్మలనుండియు నేను పరుగెత్తుచుండ నన్ను జూచి వారు మిక్కిలిభయమునుజెంది యనుమానించెదరు. వారు వనములో జరించు పెద్దదగు నావానరరూపమును జూచి భయమును జెందెదరు. అప్పుడు వారు రావణునినివాసమున నీసంగతిని దెలుప నతడు ఘోరరాక్షసులను బంపును. వారందఱు తమయాయుధములతో నన్ను బట్టయత్నింతురు. అప్పుడు వారితో నేను యుద్ధమును జేసి సముద్రతీరమునకు బోవ నశక్తుడనగుదును. అప్పుడు సీతసంగతి రామునకు దెలుప వీలుకాకుండును. క్రూరులగు రాక్షసు లామెను హింసింతురు. రామసుగ్రీవులకార్యము నిష్ఫలమగును. సముద్రముచే చుట్టబడినదియు, రాక్షసులచే కాపాడబడునదియు, నితరులు ప్రవేశించుటకు వీలుకానిదియునగు నీలంకలో సీత రహస్యముగ నుండవలసివచ్చును. నన్ను యుద్ధములో రాక్షసులు పట్టుకొనినను, లేక చంపినను నూఱుయోజనములుదూరముగల యీసముద్రమును దాటి రామునికార్యమును నెఱవేర్చువాడు మఱియొకడు కనబడడు. నేను వేలకొలదిరాక్షసులను యుద్ధములో జంపగలుగుదును; కాని తరువాత సముద్రమును దాటి యావలితీరమును జేరలేకపోవుదును. యుద్ధము చేసినయెడల జయాపజయములను నిశ్చయింపవీలులేదు. నిస్సంశయములగుకార్యములను నేబుద్ధిమంతుడు సంశయితముగ జేయును? నేనీమెతో మాట్లాడనియెడల నీమె ప్రాణములను విడుచును. మాట్లాడినయెడల

నీగొప్పదోషములు కనబడుచున్నవి. ఫలమునుజెందిన పను లవివేకి యగు దూతచే దేశకాలములకు వ్యతిరిక్తములై నశించును. చేయ దగినవియు, చేయగూడనివియు నైనకార్యములు నిశ్చయమైయున్నను నవివేకులగు దూతలవలన బాగుగజరుపబడవు; లేక పాడుచేయబడును. వారికార్యము నశింపకుండుట యెట్లు? నేను బుద్ధిహీనతలేకుండ సంచ రించుట యెట్లు? నాసముద్రలంఘనము వృథగాకుండుట యెట్లు? నా మాటలను సీత విని భయమునుజెందక యెట్లుండును?" ఇట్లు హను మంతు డాలోచించి మంచిసంగతి నిట్లు తలంచెను; 'గొప్పకర్మలనుజరిపిన రాముని, నాతనిబంధువులను గీర్తించుచు సీమెభయమును బాసి యాతనియందు మనస్సునిలుపునటుల చేసెదను. ఇక్ష్వాకువంశపురాజు లలో శ్రేష్ఠుడగు రామునిసంగతులను దెలుపుచు నన్నియంశములను మధురవాక్యములతో బలుకుచు వానియందామెకు మిక్కిలిశ్రద్ధ గలుగునటుల జేసెదను.' ఇట్లు హనుమంతు డనేకవిధముల నాలో చించి శింశుపావృక్షపుకొమ్మలలోను, నాకులలోను దాగియుండి మంచి మాటలను బలికెను.

తరువాతహనుమంతుడు దశరథుని, రామునిగీర్తించుచు రఘురా ముడు వనవాసము వెళ్లుటయు, రావణుడు సీతనెత్తుకొనిపోవుటయు, సుగ్రీ వసఖ్యమును, నతడు వానరులను సీతనువెదకుటకు నలుదిక్కులకుబంపు టయు, తానక్కడకు వచ్చి సీతను జూచుటయు మొదలగు చరిత్రమంత యుదెలిసి, రాముడుసీతనుగూర్చి యేరూపమును, నేవర్ణమును, నేశోభను దెలిపెనో యవన్నియు యీామెయందున్నట్లు పలికి యూరకుండెను. ఆమాటల నామె విని యాశ్చర్యమును బొంది తనతలను పైకెత్తి యాశింశుపావృక్షమును జూచెను. ఆమె యాతనిమాటలను విని యన్నిదిక్కులను జూచి సంపూర్ణమనస్సుతో తనభర్తను దలచుచు గొప్పసంతోషమును బొందెను. ఆమె మీాదికిని, క్రిందికిని, ప్రక్కకును

జూడ నాచెట్టుపై సుగ్రీవునిమంత్రియగు హనుమంతు డుదయించిన సూర్యునివలె నామెకు గనబడెను. బుద్ధిమంతులలో శ్రేష్ఠుడగు నాతడు తెల్లనివస్త్రముంగట్టి కాలినబంగారువంటి కాంతిగల పెద్ద కన్నులను, వంకఱయైన నోటిని గలిగి వినయముతో మంచిమాట లాడుచుండ నామె వానిని జూచి యాశ్చర్యమును బొంది 'అయ్యో! యీవానరునిరూపము పెద్దదియై చూడలేనంత భయంకరముగ నున్న'దని తెలిసికొని ముఖము తిరుగ 'రామా! రామా! లక్ష్మణా!' యని విలపించి మందస్వరముతో మిక్కిలిగ నేడ్చెను. ఆమె యాతనిని జూచి యది కలయేమో యని తలంచెను. ఆమె యాతని తిరుగ జూచి మూర్ఛనొంది చాలసేపటికి తెలివితెచ్చుకొని "ఇది నిజముగ కలయే. ఇందు శాస్త్రవిరోధముగ వికృతాకారముగల కోతిని జూచితిని. రామలక్ష్మణులకును, నాతండ్రియగు జనకునకును శుభమగుగాక! నేను శోకముచేతను, దుఃఖముచేతను పీడింపబడి నిద్రలేక యున్నానుగదా! అందుచే నిది యొంతమాత్రము కల గాదు. రామవియోగముచే నాకు సుఖములేదు. నే నాతని నెల్లప్పుడు మనస్సున నిలిపి ధ్యానించుచు పిలుచుచుండుటచే దానికితగినట్లు రామకథలె నాకు వినబడుచున్నవి. వానినే నేను తెలిసికొనుచున్నాను. 'నామనస్సులోనికోరిక జరుగుగాక!' యని నేనాలోచించుచున్నాను. అతనిని నాబుద్ధిచే తర్కించుచున్నాను. ఈతడు పలుకు రాముని మంచిరూపము నాకేల కనబడకున్నది? ఈవానరుడు పలుకుమాట నిజముగుగాక! మఱియొకవిధమునగాగూడదని నేను బ్రహ్మను, నింద్రుని, బృహస్పతిని నమస్కరించుచు ప్రార్థించుచున్నా"నని పలికెను.

తరువాత హనుమంతు డాశింశుపావృక్షమునుండి క్రిందకుదిగెను. అప్పటికి రాక్షసస్త్రీలందఱును నిద్రించుచుండిరి. అప్పు డతడు దీనుడై వినయముగ నామెదగ్గఱకు వచ్చి సాష్టాంగనమస్కారముచేసి

తలమీద చేతులను జోడించి మధురములగు మాటల నిట్లు పలికెను. "సౌందర్యవంతురాలవగు నీవు నలిగిపోయిన ముత్తికిబట్టను గట్టుకొని చెట్టుకొమ్మను బట్టుకొని యేలనిలిచియుంటివి? నీనేత్రములనుండి కన్నీ రేలవచ్చుచున్నది? నీవు దేవతా స్త్రీవా! రాక్షసస్త్రీవా? లేక యక్ష కిన్నర రుద్ర మరుత్తులలో నొకతెవా? లేక వసువుల స్త్రీవా? నీవు నాకు దేవతాస్త్రీవలె ప్రకాశమానముగ గనబడుచున్నావు. స్వర్గ లోకమునుండి చంద్రునివిడిచివచ్చినదియు, సన్నిసుగుణములుగలదియు నక్షత్రములలో శ్రేష్ఠురాలునునగు రోహిణివా? లేక కోపముచేతను గాని యజ్ఞానముచేతనుగాని వసిష్ఠునివిడిచిన యరుంధతివా? నీతండ్రి యును, నీభర్తయును, నీపుత్రుడును, నీయన్నదమ్ములును నెవ్వరు? నీవేడ్చుచుండుటనుబట్టియు, నెక్కువగ నిట్టూర్పుదీయుటనుబట్టియు, భూమియందు నిలుచుటనుబట్టియు నీరాజలక్షణములనుబట్టియు నీవు దేవతాస్త్రీవికావని తలచెదను. నీలక్షణములుచూడ నీవు భూపాలునిపట్టపురాణివలె గనబడుచున్నావు. నీవు జనస్థానము నుండి రావణు డెత్తుకొనివచ్చిన సీతవైనయెడల నాసంగతి నాకు దెలుపుము. నీదైన్యమును లోకములో సాటిలేని నీరూపమును, తపస్వినకనుకూలమగునీవేషమును జూడ నీవు నిజముగ రాముని భార్యవలె గనబడుచున్నావు." ఇట్లు హనుమంతుడు పలుక తనభర్తను గీర్తించుటచే సీత సంతోషమునుబొంది తనమామయగు దశరథుని యొక్కయు తండ్రియగు జనకునియొక్కయు, భర్తయగు రాముని యొక్కయు, తనయొక్కయు చరిత్రములను వానికి దెలిపినేదును, రామ లక్ష్మణులును దండకావనములో నివసించియుండ రావణుడు నన్నెత్తు కొనివచ్చెను. వాడు నాకింక రెండుమాసములు గడు విచ్చెను. తరు వాత నేను ప్రాణములను విడిచెద'నని పలికెను.

ఆంజనేయుడు దుఃఖముచే మిక్కిలిబాధపడుచున్న యామె మాటల కిట్లు జవాబుచెప్పెను. 'నేను రామునియాజ్ఞచే నిన్ను వెదకుటకు వచ్చినదూతను. కుశలముగనున్న యాతడు నీకుశలమును కనుగొనుమనెను. అతడు బ్రహ్మాస్త్రము మొదలగు నస్త్రప్రయోగములను, వేదములను బాగుగ నెఱిగినవాడు. నీభర్త కనుచరుడును, తమ్ముడును నగు లక్ష్మణుడు నిన్నుగూర్చి గొప్పవిచారమును బొంది నీకు శిరస్సుతో నమస్కరించెను.' ఇట్లు హనుమంతుడు పలుక సీత వారికుశలములను దెలిసికొని మిక్కిలిసంతోషించి యతనితో 'కుశలమునుగూర్చి పలికినయిట్టిమాటలు నూఱుసంవత్సరములు జీవించినమనుష్యునికైనను నానందమును గలిగించును. నావిషయమై నీవు పలికినమాట నిజమగుగాక' యని యనెను. హనుమంతునిజూచినతరువాత నామె కతనియందు మిక్కిలిప్రీతి కలిగెను. వారిరువు రన్యోన్యము నమ్మికముగలవారై సంభాషించిరి. సీతమాటల నాంజనేయుడు విని యామెసమీపమునకు వెళ్లుచుండ నామె 'అతడు రావణుడేమో' యని యిట్లు శంకించెను. 'అయ్యో! నేను వీనితో బలికినది తగియుండలేదు. రావణుడిట్లు మఱియొకరూపమును బొంది వచ్చెను.' ఇట్లామె పలికి శింశుపావృక్షశాఖను విడిచి భూమియందు శోకముతో గూర్చుండెను. హనుమంతుడు భయమునొంది దుఃఖించుచున్న యామెను జూచి యామెకు నమస్కరించెను; కాని యామె వానివైపు చూడలేదు. తరువాత నామె వాడు వందనమాచరించుట చూచి పెద్దనిట్టూర్పు దీయుచు నిట్లు పలికెను. "మాయావియు, మాయరూపమును బొందినవాడవును నగు నీవు రావణుడవు. నా కనేకపర్యాయములు నీవు సంతాపమును గలిగించుచున్నావు. నీకిది శ్రేయస్సుకాదు. నీవే నీస్వరూపమును విడిచి జనస్థానమున యతిరూపమును బొందియుంటివి. ఆరావణుడవే నీవు. నేనుపవాసముచే కృశించి దీనురాలనైయుండ నీవు కామరూప

మునుబొంది నాకు సంతాపమును గలుగజేయుచున్నావు. ఇది నీకు మంచిదికాదు. అయినను నే ననుమానపడినది నిజము కాకపోవచ్చును. నిన్ను జూచుటచే నాకు ప్రీతికలుగుచున్నది. నీవు రామదూతవై వచ్చినయెడల నీకు శుభముగుగాక! నేను రాముని చరిత్రమును, గుణములను దెలుపుమని నిన్నడుగుచున్నాను. బుద్ధిమంతుడా! నీమాటలయందు నామనస్సు ప్రీతి నలిగియున్నది. ఆహా! యేమి యీస్వప్నములోని సుఖము! చాలకాలముక్రిందట నెత్తుకొనిపోబడిన నే నిప్పుడు రాముడు పంపినదూతను జూచుచున్నాను! నేను స్వప్నములోనైన రామలక్ష్మణులను జూచిన యెడల నాకు నాశనముకలుగదు. ఆస్వప్నముకూడ నాకు శత్రువైనది. ఇది స్వప్నమని నేను తలంపను. నేను కలలో వానరునిజూచినయెడల నాకు గలుగబోవు శుభముకూడ గలుగదు. లేక యిది నామనోవిభ్రమమా? ఉపవాసాదులచే గలిగిన వాతగతియా? పిచ్చివలన గలిగినవికారమా? లేక యెండమావులు కనబడునపు డుండెడి దృష్టిచాంచల్యమా? ఇది పిచ్చికాని, మనోవిభ్రమముగాని కాదు. నేను నాసంగతిని, నీకపిసంగతిని సరిగ కనుగొనెదను." ఇట్లు సీత యనేకపక్షముల నుంచిచెడ్డల నాలోచించి హనుమంతుని రావణునిగ దలచి వానికి జవాబు చెప్పలేదు.

అప్పు డాతడా మెయూలోచనను గనిపెట్టి *రాముని గుణములను వర్ణించుచు నా మెవినుట కింపైనమాట లిట్లు పలికెను. "లోకముల కాశ్రయుడగు రాముని నాశ్రమమునుండి పంపి యాతడు లేనపుడు నిన్ను దెచ్చిన రావణుడు తగినఫలమనుభవించుట నీవు చూచెదవు. వాడు శీఘ్రముగ రాముని వాడి బాణములచే యుద్ధమున మరణమునొందును. రామునిచే నేను నీయొద్దకు దూతగ బంపబడియిక్కడకు వచ్చితిని. నీవియోగమునుచే నాతడు మిక్కిలిదుఃఖము నొంది నీకుశలమడుగుమనెను.

* 7వ. ప్రకరణము. ౧వ. అధ్యాయము రాముని గుణములు చూడుము.

లక్ష్మణుడుగూడ నీకు నమస్కరించి నీకుశలమడిగెను. రామునిసఖుడును, వానరరాజుననగు సుగ్రీవుడుకూడ నీకుశలమడిగెను. వారుముగ్గురు నిత్యము నిన్నేతలచుచుందురు. నీవు రాక్షసస్త్రీలవశమైనను దైవయోగమున బ్రతికియుంటివి. నీభర్తయు, నీమఱదియు కోట్లకొలది వానరులను వెంటబెట్టుకొని సుగ్రీవునితో నిక్కడకు రాగా వారిని నీవు స్వల్పకాలములోజూచెదవు. నేను సుగ్రీవునిమంత్రిని. 'హనుమంతు'డను పేరుగల వానరుడను. నేను సముద్రమును దాటివచ్చి లంకను రక్షించు రావణుని సేవకులను నాపరాక్రమముచే దప్పించుకొని నిన్ను జూడవచ్చితిని. నేను నీవనుమానించు రావణుడను గాను. ఆయనుమానమును విడిచి నీవు నామాటలను నమ్ముము." ఇట్లు హనుమంతుడు పలుక మధురములగు మాటలతో వాని నిట్లడిగెను. 'నీకు రామునితో సమాగమ మెట్లు కలిగెను? లక్ష్మణుని నీ వెట్లెఱుగుదువు? నరులకు, వానరులకు సమాగమ మెట్లాయెను? రామలక్ష్మణుల చిహ్నములేవి? రాముని యవయవములు, రూపము లెట్లుండును?' ఇట్లు సీత ప్రశ్నింప నాప్రశ్నలకాంజనేయు డామెతో 'నీకు రామలక్ష్మణులయవయవములును, రూపములును దెలిసినను నాయదృష్టవశమున సన్నదుగుచున్నావు? చెప్పెదను వినుమ'ని పలికి రామలక్ష్మణులరూపములను, నవయవ*గుణములను వర్ణించెను. ఇంకను హనుమంతుడు రామలక్ష్మణులు సీతను వెదకుచు ఋశ్యమూకపర్వతమునకు వచ్చినది మొదలు తాను లంకకు వచ్చువఱకు జరిగినకథను, తనజననమును నామెకు దెలిపి 'విచారింపవల'దని యామెనోదార్చి రామలక్ష్మణులు శీఘ్రముగవచ్చి రావణుని సకుటుంబపరివారముగ నాశనమొనరింతురని బలికి 'నీయనుమానమును బాపుటకు నేను రామునిగుణములను దెలిపితిని. నేను నిజముగ హనుమంతుడనువాడను. రామదూత'నని చెప్పెను. అప్పు డాంజనేయుని

---

* 7వ. ప్రకరణము. ౧వ. అధ్యాయము రామునిగుణములు చూడుము.

మాటలను సీత నమ్మి 'వాడు దూత' యని తెలిసికొని మిక్కిలి సంతోషమును బొంది కండ్లంట నానందబాష్పములను విడిచెను. ఆమె ముఖము సంతోషముతో పూర్ణచంద్రునివలె ప్రకాశించెను.

---

౯ వ. అధ్యాయము.

హనుమంతుడు సీతకు రాముని యుంగరము నిచ్చుట;

యామె వానికి మణి నిచ్చుట.



తరువాత నాయుదయముననే హనుమంతుడు తనయందు సీతకు నమ్మకము కలుగుటకై వినయముగ ననేక వాక్యములను బలికి రాముడు తనకిచ్చిన రామనామముగల యుంగరమును నామె కానవాలుగనిచ్చి 'నీకు శుభమగును. దుఃఖమును విడువు' మని పలికెను. ఆమెదానిని బట్టుకొని చూచి తనభర్త యక్కడకు వచ్చినట్లే తలచెను. విశాలమైననేత్రములుగల యామెముఖ మప్పుడు రాహువువిడిచిన చంద్రునివలె ప్రకాశించెను. ఆమె యాంజనేయుని గౌరవించి యాతని బ్రశంసించుచు నిట్లు పలికెను. "నీవు గొప్పపరాక్రమము, సామర్థ్యము, గొప్పబుద్ధి గలవాడవు. కనుకనే నీవొక్కడ వీరాక్షసులస్థానమును గష్టముతో బ్రవేశించితివి. నీ వతిసులభముగ నూఱుయోజనములు దూరముగల సముద్రమును దాటితివి. నీకు రావణునివలన భయము గాని, కంగారుగాని లేకపోవుటచే నీవు సామాన్యవానరుడవుకావు. నీవు గొప్పబుద్ధిగలరామునిచే బంపబడుటచే నాతో మాట్లాడుటకు తగుదువు. అత డితరుని బాగుగపరీక్షింపకయు, వానిపరాక్రమమును దెలిసికొనకయు బంపడు. ముఖ్యముగ నాయొద్దకు దూతగ బంపడు.

దైవయోగమున రామలక్ష్మణులు కుశలముగ నున్నారు. నాభర్త కుశలముగ నున్నయెడల సముద్రమధ్యమున నున్న యీసింహళ భూప్రదేశమును కోపముచే దహింపగలరు? కాని వారిద్దఱు దేవాసురులనైనను యుద్ధమున నోడింపగలరు. నాదుఃఖములకు పరిణామము లేదని నే నాలోచించెదను. రాముడు నన్నుగూర్చి విచారపశ్చాత్తాపముల బొందలేదా? నన్ను రక్షించు ప్రయత్నములను జేయుచున్నాడా? అతడు దీనుడు గాకుండ, తొట్రుపాటులేకుండ కార్యములను తెలివిగ జేయునా? అతడు పౌరుషకార్యములను జేయుచుండునా? స్నేహితులయెడ నతడు సామదానములను, శత్రువులను జయించుటలో సామ దాన భేద దండోపాయములను నుపయోగించుచుండెనా? అతనికి స్నేహితులు దొరకిరా? వారితో నతడు కలియుచుండునా? మిత్రుల కుపకారముచేసి తిరిగి మిత్రులవలన నుపకారమును గోరుచుండెనా? అతనికి మంచిమిత్రుడు దొరకెనా? తనకు మేలుచేయుకొఱకు దేవతల నాతడు ప్రార్థించుచుండెనా? అతనికి స్వబలమును, దైవబలమును గలిగెనా? నేను దేశాంతరము పొందుటచే నాపై నతడు దయవిడిచెనా? అతడు నన్నీబాధలనుండి తప్పించునా? సుఖముల ననుభవింపదగినవాడును, నిజమలకు దుఃఖముల నెఱుగనివాడును నగు రాము డిప్పటియీదుఃఖములవలన ధైర్యమును బోగొట్టుకొనెనా? కౌసల్యాసుమిత్రలయొక్కయు, భరతునియొక్కయు క్షేమవార్తలు తెలియుచున్నవా? నన్నుగూర్చి నాభర్త శోకమును బొందుచుండెనా? ఇతరపనులను జూచుకొనుచుండెనా? అతడు నన్ను తరింపజేయునా? భరతుడు నాకొఱకు పెద్దసైన్యమునుబంపునా? సుగ్రీవుడు నానిమిత్తము పెద్దవానరసైన్యముతో వచ్చునా? లక్ష్మణుడు తనయస్త్రముల నుపయోగించి రాక్షసుల జంపునా? స్వల్పకాలములో తీవ్రమగు నస్త్రములచే రావణుడును, వానిబంధువులును జచ్చుట నేనుచూచెదనా? నేను

లేనందున నాభర్తముఖము వాడిపోయెనా? ధర్మాచరణబుద్ధిచే తన రాజ్యమును విడిచి నన్ను దీసికొని కాలినడకను నడవికివచ్చి దుఃఖము కాని, భయముకాని, విచారమునుకాని పొందనియాతడిప్పుడు ధైర్యమును వహించియుండెనా? అతనికి తల్లిదండ్రులయందుగాని, యితరులయందుగాని నాయందుండెడి ప్రేమతో సరియగు ప్రేమగాని యెక్కువ ప్రేమగాని లేదు. నే నతని నడవడిక తెలిసికొనువఱకు జీవించుటయందిచ్ఛగలిగియుండవలెను." ఇట్లు సీత గొప్పసంగతులను దెలిపి రామునిగూర్చి హనుమంతు డేమి తెలుపునో యని యూరకుండెను.

ఆమాటల కాతడు తనతలమీద చేతులను జోడించి యిట్లుపలికెను. 'నీ విక్కడనుండు సంగతి రామునకు దెలియదు. అందుచే నాతడు నిన్ను శీఘ్రముగ తీసికొనివెళ్ళలేదు. నామాటలనాతడు విని యెలుగుబంట్లు, వానరులుగల స్వసైన్యములతో బయలుదేఱి బాణసమూహముచే సముద్రమును కదలకుండునట్లు చేసి లంకకు వచ్చి యిక్కడనున్న రాక్షసుల నందఱిని నాశనము జేయును. తన కడ్డువచ్చు దేవాసురులనైనను, మృత్యువునైనను నతడంతము నొందించును. నిన్ను జూడకపోవుటచే గలిగిన శోకములో నతడు మునిగి సుఖమును బొందకున్నాడు. మంచినేత్రములు, దొండపండువంటియధరము, సొగసైన కుండలములుగల పూర్ణచంద్రునివంటి రామునిముఖమును నీవు శీఘ్రకాలములో జూడగలనని నేను మాకాధారములగు పర్వతములను బట్టియు, ఫలమూలములనుబట్టియు శపథముచేయుచున్నాను. అతడు మధుమాంసములను విడిచి వనసంబంధమగు ఫలమూలాదులను స్వల్పముగ భుజించుచు ప్రస్రవణపర్వతమం దున్నాడు. నీయందు మనస్సు నిలుపుటచే నతడు తనశరీరమున పాఱుచు నడవిదోమలను, పురుగులను, పాములను మర్దింపకున్నాడు. అతడు నిన్నే ధ్యానించుచు నిన్నుగూర్చి గొప్పవిచారమునుబొందుచు కామవశుడై యితరవిషయముల నేమియు

నాలోచింపకున్నాడు. ఎల్లప్పుడు నిద్రలేనియాతఁ డెప్పుడైనను నిద్ర వచ్చినయెడల 'సీతా!' యని పలుకుచు మేలుకొనుచుండెను. ఫలములు గాని, పుష్పములుగాని, మనోహరములగు నితరవస్తువులుగాని యత నికి గనఁబడినయెడల నతఁడనేకపర్యాయములు 'హా! ప్రియురాలా!' యని పిలుచుచు నిట్టూర్పుదీయుచుండును. ఆతఁ డెల్లప్పుడు పరితపించుచు నిన్నే తలఁచుచు గట్టిప్రతముతో నిన్ను రక్షించు ప్రయత్నములో నున్నాడు." హనుమంతుని యీమాటలను సీత విని గొప్పవిచారమును విడిచి రామునితో సమముగ విరహశోకమును మాత్రము బొందెను.

తరువాత నామె యాతని కిట్లు తెలిపెను. "నీవుపలికినమాట లలో నాభర్త నాయందే మనస్సుగలిగియున్నాడనుమాట యమృత తుల్యముగనున్నను శోకముతోనున్నాడనుమాట నాకు దుఃఖకరమైనది. మనుజునికి దైవయోగమువలన నైశ్వర్యముకాని, గొప్పదుఃఖముకాని గలుగును. నిశ్చయముగ దైవవిధి తప్పదు. నేనును, రామలక్ష్మణు లును శోకముల పాలగుట జూడుము. నాభర్తదుఃఖమున కెప్పు డం తము కలుగును. అతఁడు రాక్షసులను వధించి రావణుని జంపి లంకను నాశనముచేసి నన్నెప్పుడు చూచును? రావణుడు నాకొకసంవత్సరము గడువు పెట్టెననియు, పదిమాసములు గతించినవనియు, రెండుమాస ములుమాత్రము మిగిలినవనియు, తొందరపడవలెననియు నతనికి దెలుపుము. రావణుని తమ్ముడగు విభీషణుడు 'సీతను తిరుగ రామున కిచ్చివేయు'మని వినయముతో పెద్దయత్నముచేసి వానిని గోరుటయు, దానికి వాడిష్టపడకపోవుటయు విభీషణుని పెద్దకుమార్తెయగు ననల నాకు దెలిపెను. వాడు కాలవశుడై యుద్ధమున మరణము గోరు చున్నాడు. శీఘ్రముగ నాభర్త నన్ను పొందును. సంశయములేదు. నాయంతరాత్మ శుద్ధమైనది. రామునకు నుత్సాహము, పౌరుషము, బలము, దయ, పరాక్రమము, శక్తి మొదలగు మంచిగుణములు

గలవు. 14000 రాక్షసులను నొంటరిగ జంపిన వీరునికి నే శత్రువు భయము జెందక యుండును? ఆతడు విచారముచే చలింపడు. నే నతని పరిభావ మెఱుగుదును." ఇట్లు సీత రాముని గూర్చి శోకించుచు కన్నీరు విడుచుచుండ హనుమంతు డామెను జూచి యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. 'అతడు నా మాటలను విని యెలుగుబంట్లు, వానరులు గల పెద్ద బలమును సమకూర్చుకొని శీఘ్రముగ వచ్చును. లేనియెడల నిప్పుడే నేను నిన్ను తీసికొని సముద్రమును దాటి యాతడుండు ప్రస్రవణగిరి యొద్ద నిన్నుంచి నీ దుఃఖమును బాపెదను. నిన్నును, రావణునితో గూడిన లంకను మోయుటకు నాకు శక్తి గలదు. అక్కడ రాక్షసులను వధించుటకు విష్ణువువలె సిద్ధముగ నున్న రాముని నీవు చూచెదవు. అతనితో నిప్పుడే గలియ గోరిన యెడల నీవు నా వీపుపై కెక్కుము; ఉపేక్ష చేయకుము. చంద్రసూర్యులతో మాట్లాడుచున్న దానవువలె వెళ్లెదవు. నే నెగురుచు వెళ్లునపుడు లంకలోనుండు వారెవరును నన్ను వెంబడింపలేరు. నే నిక్కడకు వచ్చినట్లే యక్కడకును నిన్ను దీసికొని యాకాశమార్గమున నెగిరిపోగలను.' ఇట్లు హనుమంతుడు పలుక సీత సంతోషముతో తనశరీరము గగుర్పాటు జెంద నాతనిని 'అంతదూరము నన్ను నీ వెట్లు తీసికొనిపోగలవు? నీవు వానరచాపల్యముచే నిట్లు పలుకుచున్నావని తలచెదను. ఇంత స్వల్పశరీరము గల నీవు నన్నెట్లు మోయగల' వని యడిగెను. దానికతడు 'నా బలమును, నా పరిభావమును, నా రూపమును నీ వెఱుగవు. కాన నీవు నా కామరూపమును జూచుగాక!' యని యాలోచించి యామెకు నమ్మకము గలుగుటకై తన నిజరూపమును జూపెను. అత డా చెట్టు దగ్గఱనుండి కొంచెము దూరము వెళ్లి తన శరీరమును మేరుమందర పర్వతములవలె పెద్దదిగ వృద్ధినొందించి కాంతి గలదిగ జేసి యెఱ్ఱని ముఖమును, గొప్ప బలమును, వజ్రములవంటి కోఱలను, గోళ్లను గలిగి భయంకర రూపముతో నామె

యెదుట నిలిచి 'పర్వతములు, వనములు, ప్రాకారములుగల యీ లంకను రావణునితోఁగూడ దీసికొనిపోవుటకు నాకు శక్తి కలదు. నీవు పేక్షచేయకుము. రామలక్ష్మణులనుగూర్చి నీవు విచారమును వీడు' మని పలికెను.

హనుమంతుని భీమరూపము సీత చూచి వానిమాటలను విని "వాయుపుత్రా! నీబలపరాక్రమములను నేనెఱుగుదును. నీకు వాయుగమనముకలదు. అగ్నివలె నీ కద్భుతమగు తేజస్సుకలదు. సామాన్యుఁడెవ్వఁడు సముద్రమును దాటి యిక్కడ కెట్లు రాగలుగును? మహాత్ముఁడవగు నీవలన మా కార్యసిద్ధియగును. నీతో నేను వచ్చుట యుక్తముకాదు. నీవాయువేగమువలన నాముఖముతిరుగ నేను భయముచే నీవీపునుండి సముద్రమునబడి జలజంతువులచే భక్షింపబడుదును. నీవు నన్ను దీసికొనిపోవుచుండ రావణునిచే నియమింపబడిన ఘోరరాక్షసులు శూలములు మొదలగు నాయుధములతో నీతో యుద్ధమునకు వచ్చి నిన్ను చుట్టబెట్టిన నీవు నన్ను రక్షింపలేవని నే ననుమానించుచున్నాను. నిరాయుధుఁడవగు నీవు శూలములను, నాయుధములనుబట్టిన వారితో యుద్ధమునుచేయుచు నన్నెట్లురక్షింపగలవు? అట్టిసమయమున నేను భయముచే నీవీపునుండి సముద్రమున బడిపోవుదును. రాక్షసు లేలాగైనను కొంతమట్టుకు నిన్ను జయింతురు. లేక నీవు యుద్ధముచేయుచుండ నేనుపడిపోయినయెడల పాపులగు రాక్షసులు నన్నెత్తుకొనిపోవుదురు. నాను నీయొద్దనుండి నన్ను బలవంతముగ దీసికొనిపోయెదరు. లేక నన్ను జంపుదురు. యుద్ధమున జయాపజయములు రెండును నుండును. నేను వారిచే భయపెట్టబడి యాపదనొందిన నీయత్నమంతయు విఫలమగును. వారినందఱిని జంపుటకు నీశక్తి చాలును. కాని యట్లు జరిగినయెడల రామునికీర్తి తగ్గును. రాక్షసులు నన్ను దీసికొని

పోయి గూఢప్రదేశమున దాచినచో నీకును, వానరులకును, రామలక్ష్మ ణులకును నాప్రదేశము తెలియకుండును. అప్పుడు నీవుచేసినకార్యమం తయు నిష్ఫలమగును. కావుననీవు నాభర్తతో తిరుగవచ్చుట శ్రేయము. అతడును, నతనితమ్ములును, సుగ్రీవుడును తమప్రాణములను నాయందు నిలిపియున్నారు. నేను కనబడకపోయినయెడల రామలక్ష్మణులు శోక సంతాపములు గలవారై నిరాశతో వానరులందఱితోను తమప్రాణ ముల విడిచెదరు. నాభర్తయందలి భక్తిచే నే నితర పురుషుల శరీర మును ముట్టను. బలవంతముగ రావణుడు నన్నెత్తుకొనివచ్చుటచేతను, వానినుండి తప్పించుకొనుటకు నాకు శక్తి లేకపోవుటచేతను, నేను మూర్ఛనొందుటచేతను, నాభర్త దగ్గఱ లేకుండుటచేతను వానిని స్పృశించుట జరిగినది. దానికి నేనేమిచేయగలను? రాము డిక్కడకు వచ్చి రావణుని, వానిబంధువులను జంపి నన్ను దీసికొనివెళ్ళిన నది యాతనికి తగినదగును. రామునిపరాక్రమమును నేను వినియుంటిని; మఱియు జూచియుంటిని. దేవ గంధర్వ నాగ రాక్షసులు యుద్ధ ములో నాతనితో సరిపోలరు. అతడు తనగొప్పవింటిని బట్టి తన తమ్ము నితోగూడ యుద్ధమున నిలిచినయెడల నెవరతనియెదుట నిలువగలరు? హనుమంతా! వారిని శీఘ్రముగ వారిబలగములతో నిక్కడకురప్పించి చాలకాలమునుండి రామవియోగముచే శోకముతో నున్న నన్నానంద పఱుపు"మని పలికెను.

ఆ మెమాట్లలను వాక్యములనుబలుకుటలో నేర్పరియగు హను మంతుడు విని మిక్కిలిసంతోషించి యిట్లనెను. "ఈవచనములు నీవంటి వినయముగల స్త్రీలును, పతివ్రతలును బలుకుటకు తగినట్లే యున్నవి. నీవు స్త్రీవగుటచే నావీపుమీదకూర్చుండి నూఱుయోజనములుగల సముద్రమును దాటలేవు. 'రాముని తప్ప నితరులను స్పృశింప'నని నీవు తెలిపిన రెండవకారణము మహాత్ముడగురామునకు భార్యవగు

నీకు దగియున్నది. నీవుతప్ప నితరస్త్రీయెవతె యిట్లుపలుకును? ఇక్కడ జరిగినదానిని, నాయెదుట నీవుపలికినవాక్యములను నేనేమియు విడువకుండ నీభర్తతో జెప్పెదను. రామునికి ప్రియమును జేయగోరి యతని యందలిస్నేహముచేతను, ననేకకారణములచేతను నిన్నిప్పుడు మోసికొనిపోయెద నని పలికితిని. లంక ప్రవేశించుటకు వీలుకానిదగుట చేతను, సముద్రము దాటుటకు దుస్తరమైనదగుటచేతను, నాసామర్థ్యమును నేనెఱుగుటచేతను నిట్లు పలికితిని. రామునియందు నాకున్న గొప్పస్నేహముచేతను, భక్తిచేతను, రామునితో నిన్ను శీఘ్రముగ కలుపగోరి యట్లుచెప్పితిని; గాని మఱియొకకారణము చేతనుగాదు. నాతో వచ్చుటకు నీకిష్టములేనియెడల నిన్ను నేను చూచినటుల రాముడు పోల్చుటకు చిహ్నముగ నేదైన నిమ్ము." ఇట్లు హనుమంతుడు పలుక నామాటలకు సీత కన్నీరు దెచ్చుకొని మెల్లగ నిట్లనెను. * 'పూర్వము చిత్రకూటమున మేము నివసించునప్పుడు నాస్తనముల మీద పొడిచినకాకిపై నతడు బ్రహ్మాస్త్రము నుపయోగించె'నని పలికి యావృత్తాంతమంతయు నతనికి దెలిపి "ఈకథను నతనికి జ్ఞాపకము చేయుము. నన్నుగుఱించి స్వల్పమగుకాకిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించిన యీరాము డిప్పుడు నన్నెత్తుకొనివచ్చిన రావణు నేల యుపేక్షించుచున్నాడు? నాకు భర్తయున్నను నే సనాథవలె నుంటిని. అతడు నాపై కృపజూపవలెను. అతడు నాతో 'దయజూపుటయే పరమధర్మ'మని చెప్పెను. అతడు గొప్పవీర్యవంతుడనియు, గొప్పయుత్సాహము గలవాడనియు, గొప్పసుగుణములుగలవాడనియు నేనెఱుగుదును. అత డస్త్రముల నుపయోగించుట బాగుగ దెలిసినవాడైనను, సత్యవంతుడును, బలవంతుడును నైనను నీరాక్షసులపై నస్త్రములనేల

---

* ౭వ ప్రకరణము. ౧వ, అధ్యాయము. రాముడు చిత్రకూటమున నివసించుట చూడుము.

విడువకున్నాడు? నాగ గంధ ర్వాసుర మరుద్గణములు యుద్ధములో నాతని బాణవేగమును సహింపలేరు. ఆతనికి నాయందెట్టిత్తొందర మన స్సైననున్న యెడల నాతడు రాక్షసులపై తీవ్రబాణముల నేల విడువకున్నాడు? లక్ష్మణుడైననునాతని యాజ్ఞనుబొంది నన్నేలరక్షింప కున్నాడు? గొప్పబలశాలురగు వారిద్దఱు కలిసి నన్ను రక్షించుటకేల యుపేక్షచేయుచున్నారు? వారు నాపై కటాక్షమును జూపకపోవుటచే నాయందు కొంచెముగనో యెక్కువగనో దోషముండియుండు"నని దీనస్వరముతో జెప్పుచు కన్నీరు విడిచెను.

ఆమెమాటలను విని యాంజనేయు డిట్లు పలికెను. 'రాముడు నీవియోగదుఃఖముచే నితరవిషయములందు విముఖతనొందెననియు, దానికి లక్ష్మణుడు పరితాపమునొందెననియు నేను సత్యముగ శప థముచేయుచున్నాను. నిన్నెట్లో నేను చూడగలిగితిని. విచారించుట కిది సమయముకాదు. నిన్ను జూచుటయందుత్సాహముకల రామ లక్ష్మణు లిప్పుడే యిక్కడకు వచ్చి లంకను భస్మముచేయ నీదుఃఖ ములు పోవును. రాముడు క్రూరుడగు రావణుని, వానిబంధువులను జంపి తనపట్టణమునకు నిన్ను దీసికొనివెళ్ళును. అతనికిని, నతనితమ్మున కును, సుగ్రీవునకును, నక్కడనున్న వానరులకును నేనేమి తెలుపవలెనో చెప్పుము.' హనుమంతు డిట్లు పలుక సీత సంతాపమునొందుచు నాత నితో నిట్లనెను. "నాకొఱకు లోకరక్షకుడగు నారాముని సుఖమును గోరితిననియు, శిరస్సుతో నమస్కరించితిననియు రామునకు దెలు పుము. సుమిత్రానందనుడగు లక్ష్మణుడు సుఖములను, ధనములను, ప్రియమగుస్త్రీలను, గొప్పయైశ్వర్యమును విడిచి తలిదండ్రులకు నమ స్కరించి వారినొప్పించి తనయన్నను గౌరవించుచు భక్తితో వనము నకు వచ్చెను. అతడు రాముని తండ్రిగను నన్ను తల్లిగను భావించి యుండెను. రావణుడు నన్నెత్తుకొనిపోవుట యాతనికి దెలియదు,

అతడు వృద్ధులను సేవించువాడు; లక్ష్మీసమంతుడు; శక్తిగలవాడు; మిత భాషి; నాకును, రామునకును ప్రియుడు; నామామగారితో సమమగు వాడు; నాకెల్లప్పుడును ప్రియమును జేయువాడు; తానుపూనినకార్య మును నిర్వహించువాడు; మృదువగువాడు; ఎల్లప్పుడును శుచియగు వాడు? అట్టిలక్ష్మణునితో నతనికుశలమును నేనడిగితినని యు, నన్ను తీసికొనివెళ్ళుప్రయత్నము చేయవలెనని చెప్పితినని యు పలుకుము. నా దుఃఖముపోవుటకు తగినకార్యమును నీవు చేయవలెను. రాముడు నీ సహాయమువలన నావిషయమై ప్రయత్నముచేయవలెను. శూరుడగు రామునకు నేనొకమాసము జీవింతుననియు, తరువాత, జీవింపననియు సత్యమును దెలుపుచున్నాననియు, రావణునిచే నిరోధింపబడిన నన్ను రక్షింపవలెననియు పలుమార్లు దెలుపుము." ఇట్లు సీత పలికి తన బట్టలోనున్న దివ్యమైనదియు, శుభమైనదియునగు తనశిరోభూషణ మునుదీసి 'దీనిని రామునకిమ్మ'ని హనుమంతున కిచ్చెను. సూక్ష్మ రూపమునుబొందిన వీరుడగునాతడు దానిని పుచ్చుకొని తనవ్రేలికి తగి లించుకొనెను. అతడామెకు నమస్కరించి ప్రదక్షిణముచేసి వినయ ముతో ప్రక్కనునిలిచి రాముని మనస్సులో దలచి మిక్కిలి సంతోష ముతో నుండెను.

---

## ౧౧న. అధ్యాయము.

### హనుమంతుడు సీతయొద్ద సెలవుపుచ్చుకొనుట.



సీత హనుమంతునికి తనశిరోమణి నిచ్చి యిట్లనెను. 'రాము నితో నిదియే యానవాలని చెప్పుము. దీనిని నావివాహకాలమందు దశరథునియెదుట నాతండ్రి నాతల్లిచే నాతలమీద వేయించెను; గాన

నాభర్త యీమణిని జూచి వారిని ముగ్గురిని స్మరించును.' ఇట్లామె పలికి యాతనితో 'ఈకార్యమును నెఱవేర్చుటలో నుత్సాహముగల నీవే సమర్థుడవుగాన నేదిచేసిన ననుకూలముగనుండునో బాగుగ నాలోచించి మాదుఃఖనాశకుడవగు'మని చెప్ప నతడు 'అట్లే చేసెద' నని పలికి శిరస్సుతో నామెకు మ్రొక్కి వెళ్లుటకు సిద్ధమై యుండెను. దాని నామె చూచి కన్నీరు విడుచుచు గద్గదస్వరముతో 'రాముడు మొదలగువారందఱికికుశలమును నడిగితినని చెప్పుము. రాముడు నన్నీ దుఃఖమునుండి తరింపజేయునట్లును, నేను జీవించియుండ రాముడు నన్ను పొందునట్లును నీవు పలికి యీ ధర్మఫలమును బొందుము. నీవు చెప్పు నుత్సాహపుమాటలవలన నన్ను పొందుటకు జేయు నతని పురుష ప్రయత్నములు వృద్ధినొందును. నేను చెప్పినమాటలను నీ వతనితో బలికిన నతడు నన్ను బొందుటకు పరాక్రమముతో పనులనుజేయ నిశ్చయించు'నని పలుక నామాటలను హనుమంతుడు విని తనతలమీద చేతులు జోడించి యిట్లు విన్నవించెను. 'శీఘ్రముగ రాముడు వానరులతో వచ్చి తనశత్రువులను యుద్ధములో జయించి నీశోకమును బోగొట్టును. మనుష్యులలోగాని, యసురులలోగాని, దేవతలలోగాని యతనిబాణముల కెదురుగ నిలువ దగినవానిని నేను గానను. ఇంద్ర సూర్య యములతోనైనను నతడు యుద్ధమును జేయ శక్తుడు. ముఖ్యముగ నీకొఱ కతడు వారితో యుద్ధము చేయగలడు. అతడు నీకొఱకై యీభూప్రదేశమునంతటిని శిక్షించి జయమును బొందగలడు.' ఇట్లా వాయుపుత్రుడు నిజమును బలుక నామె మంచిమాటలను నెక్కువగ దలచెను. తరువాత నతడు బయలుదేఱుచుండ నామె యాతనితట్టు బాగుగ జూచి తనభర్త యందలి స్నేహముచే 'హనుమంతా! నీకిష్టమైన నొకదిన మిచ్చట రహస్యప్రదేశమున విశ్రమింపుము. రేపు వెళ్ళవచ్చును.

నిన్ను జూచుచున్నకొంత సేపైనను నల్పభాగ్యము గలనాకు నీగొప్ప దుఃఖము పోవును. నీవువెళ్ళి తిరుగ వచ్చునంతకునాప్రాణములుండునో లేదో యని నే ననుమానించుచున్నాను. నీవుకనబడకపోవుటచే గలిగినదుఃఖము పూర్వదుఃఖముకంటె నన్నెక్కువగ పరితాప పెట్టును. వానరులును, రామలక్ష్మణులును జాటశక్యముగాని యీ సముద్రమును నెట్లు దాటెదరను గొప్పసందేహము నాకు గలుగు చున్నది. గరుత్మంతునకును, వాయువునకును, నీకునుమాత్రమే సము ద్రమును దాటుటకు శక్తి కలదు. కార్యసాధనములు తెలిసినవారిలో శ్రేష్ఠుడవగు నీవీవిషయమై యేమిసమాధానము చెప్పెదవు? నీవొక్క డవే యీకార్యమును నెఱవేర్చి శత్రువులను జయించి యశమును బొందగలవు; కాని రాముడు తనసైన్యమంతటితో నిక్కడకు వచ్చి రావణుని యుద్ధములో జయించి తనపట్టణమునకు నన్ను తీసికొని పోయిన నాకు యశస్కరముగనుండును. లంకనంతటిని నతడు తన బాణములతో నింపి నన్ను తోడ్కొనివెళ్ళుట యతనికి తగియుండును. అత డట్లు తగినపరాక్రమమును జూపునట్లు నీవు చేయు' మని పలికెను.

ఆమెమాటలకు తగినట్లు వాయుపుత్రు డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "దేవీ! వానరులయొక్కయు, నెలుగుబంట్లయొక్కయు సైన్య ముల కధిపతియగు సుగ్రీవుడు నీవిషయమై తగినకార్యముల చేయ నిశ్చయించియున్నాడు. రాక్షసులనుజంపు సామర్థ్యముగల యాతడు కోట్లకొలదివానరులతో శీఘ్రముగ వచ్చును. అతనియాజ్ఞలో గొప్ప పరాక్రమముగలవారును, బలముగలవారును, గొప్పతేజస్సుగలవా రునునగు వానరు లున్నారు. వారు మనోవేగముగ మీదికి, క్రిందికి ప్రక్కకు వెళ్ళగలరు. గొప్పపనులను జేయుటయందైనను వారు వెను దీయరు. గొప్పతేజస్సుగలవారును, గొప్పయుత్సాహముగలవారును

నగు నావానరులు వాయువేగముతో భూమినంతయు ననేకపర్యాయ ములు ప్రదక్షిణముచేసిరి. నాకంటె నెక్కుడువారును, నాతో సమమగు వారును మారాజుకొలువులోనున్నారు; కాని నాకంటె తక్కువవారెవ రును లేరు. వారిలో నేనిక్కడకు వచ్చితిని. ఆమహాబలులసంగతి వేఱె చెప్పనేల? బలహీనులును, నితరజనులును నిక్కడకు బంపబడరు. దేవీ! నీపరితాపమును, శోకమును మానుము. వారొక్కమూఱెగిరి లంకకు వచ్చెదరు. రామలక్ష్మణులు నావీపుపైకూర్చుండి యిక్కడకు వచ్చి యిక్కడుండువారిని బాణములతో జంపెదరు. నీభర్త రావణుని, వానిమంత్రులను, బంధువులను జంపి నిన్ను తనపట్టణమునకు దీసికొని పోవును. అంతవఱకు నీవోర్పువహించి కాలమును నిరీక్షింపుము. శీఘ్ర ముగ నతడు వచ్చి రాక్షసులను జంపినవెంటనే నీశోకమున కంతము కలుగును.” ఇట్లు హనుమంతుడు సీతనోదార్చి వెళ్ళుట కాలోచించి యామెతో 'రామలక్ష్మణులు ధనస్సులను బట్టి లంకాద్వారమున నిలుచుటయు, కోఱలును, గోళ్లును నాయుధములుగా గలవారును, సింహవ్యాఘ్రపరాక్రమములు గలవారును, నేనుగుగుంపులవలె కలిసి వచ్చువారును, మేఘములవంటిశరీరములు గలవారునునగు వానరులు లంకలోని మలయపర్వతశిఖరములందు నాదముచేయుచుండుటయునీవు చూచెదవు. రాముడు మన్మథపీడపొంది సుఖమును బొందకున్నాడు. దేవీ! నీవు విచారింపకుము. శోకమును, విప్రియమును విడువుము. శచి యింద్రునిజేరునటుల నీవు నీభర్తను గలిసికొనెదవు. అతనికంటె గొప్పవాడెవడు కలడు? రామలక్ష్మణు లగ్నివాయువులవంటి వారు. నీవిషయమై వారు ప్రయత్నముచేయుచున్నారు. ఈ రాక్షసప్రదేశ మున నీ వెక్కువకాల ముండవు. నీప్రియుడు శీఘ్రముగ వచ్చును. నే నాతని గలియువఱకు నిరీక్షింపు'మని పలికెను.

తరువాత సీత వానికి తనకష్టము లిట్లు తెలిపెను. "ఆంజనేయా! నీప్రియవచనములకు నేను మిక్కిలి సంతోషించితిని. నేను నాభర్తనుగూడునట్లు నీవు నాయందు దయజూపుము. కాకిపై బ్రహ్మాస్త్రముగ ప్రయోగించిన దర్భపుల్లను, పూర్వమొకప్పుడు తిలకము చెరిగినపోయిన నానుదుటను తానుంచినతిలకమును జ్ఞాపకము తెచ్చుకొనుమని చెప్పుము. ఇంద్రవరుణులతో సమానమగు వీర్యముకల యాతడు నన్ను రాక్షసు డెత్తుకొనిపోయి రాక్షసస్త్రీలమధ్యను విడువ నేలయుపేక్షించియున్నాడు? నాతలమీదిమాణిక్యమును నేను జాగ్రత్తగ దాచియుంచి దానిని జూచి యాతనిగనే భావించి విచారములోనైనను కొంతసంతోషమును బొందుచుంటిని. దానినిగూడ నిప్పుడు నీ కిచ్చివేసితిని. ఇటుపైని నేను శోకములో మునిగి మఱిజీవింపలేను. ఘోరరాక్షసస్త్రీలు సహింపజాలనికష్టములను బెట్టుచున్నను, గుండెలను పగులజేయు మాటలనుబలుకుచున్నను నతనికొఱకే వానినన్నిటిని సహింపగలిగితిని. నేనొకమాసమువఱకు జీవించెదను. ఈఘోరరావణుడు కనపడినప్పుడు నాకు సుఖమేమియుగలుగదు. నాభర్త విలంబము చేసిననేనొకనిమిషమైనను జీవింపలేను." ఇట్లు సీత దీనముగ కన్నీరువిడుచుచు బలుక హనుమంతుడు పూర్వమువలెనే యామె నోదార్చి 'నాకేదైననింకొకయానవాలి'మ్మని యడుగ నామె 'ఇదవఱకే నీకుశిరోరత్నమిచ్చితిని. దానినిజాగ్రత్తగనుంచుకొనుము. నీవుపలికినప్రకారము జరుగు'నని యనెను. అత డామణిని జాగ్రత్తగనుంచుకొని తనశిరస్సుతో నామెకు మ్రొక్కి వెళ్ళుటకు సిద్ధముగనుండెను. అతడు తన శరీరమును పెంచి వేగముగ నెగురుటకు సిద్ధముగనుండ దీనురాలగు నామె వానిని జూచి శోకగద్గదస్వరముతో 'రామలక్ష్మణులయొక్కయు, సుగ్రీవునియొక్కయు, వానిమంత్రులయొక్కయు, మిగిలినవానరులయొక్కయు కుశలమడిగితినని చెప్పుము. నాభర్త నన్నీదుఃఖసముద్ర

మునుండి దాటించుటకు నీవు తగినయత్నమును జేయవలెను. నాయీ గొప్ప శోకమును, రాక్షసస్త్రీలు నన్ను భయపెట్టుటయు నీవు నాభర్త యొద్దకువెళ్ళినతరువాత నాతనికి దెలుపుము. నీకు దారిలో శుభమగు గాక!' యని పలికెను. దానికి హనుమంతుడు మిక్కిలిసంతోషించి 'కొంచెము జరుగవలసినపని మిగిలియున్న' దని యాలోచించి యుత్తర దిక్కునకు వెళ్ళుటకు మనస్సులో దలచెను. *

---

౧౧న. అధ్యాయము.

హనుమంతు డశోకవనమును విఱుచుట.

సీత మంచిమాటలాడుచుండ హనుమంతు డామెవద్ద సెలవు పుచ్చుకొని కొంతదూరము వెళ్ళి యిట్లాలోచించెను. "సీతను నేను చూచితిని. ఇంకను నేను చేయవలసినది స్వల్పకార్యము మిగిలియున్నది. సామాద్యుపాయములునాల్గిటిలోను చివరిదియగు దండోపాయము నాకిప్పుడు బాగుగ కాన్పించుచున్నది. రాక్షసులయెడ సామోపాయము మంచిది కాదు. మంచియైశ్వర్యముగల వీరివిషయమై దాన మనుకూలమైనది కాదు. బలగర్వితులగుటచే వారు భేదసాధ్యులు గారు. కాన నిప్పుడు నాపరాక్రమమును జూపుటయే మంచిదని నాకు

---

* అ. రా:—హనుమంతు డక్కడనున్న ఫలములను జూచి యాకలిగలవాడై సీతతో 'నీకును, నాకును గనబడుచున్న యావన ఫలములన్నిటిని దినిన నా కాకలి తీరును. వానిని తినుటకు నాకు సెలవిమ్మ'ని యడుగ నామె యందులకంగీకరించెను. అప్పు డత డాక ఫలమును తిని తరువాత నామెకు నమస్కరించి కొంచెముదూరము వెళ్ళెను.

తోఁచుచున్నది. ఈకార్యములో నుపయోగించుటకు పరాక్రమము తప్ప మఱియేదియు నాకు గనబడదు. రాక్షసవీరులు కొందఱు యుద్ధములో నశించనచినయెడల మిగిలినవారు లొంగియుందురు. ఒకకార్యమునుజేయుటకు నియోగింపబడినవా డాకార్యమునకు విరోధము లేకుండ నితరకార్యములనుగూడ జేసినయెడల వాడు కార్యములను నెఱవేర్చుటలో తగినవాడగును. స్వల్పమగుకార్యమును నెఱవేర్చుటకైనను నొక్క కారణమేసాధించునది కాదు. ప్రయోజనములను బాగుగ నెఱిగినవాడు కార్యసాధనములో సమర్థు డగును. నాయొక్కయు, శత్రువులగు రాక్షసులయొక్కయు యుద్ధబలాబలములను నిక్కడనే నేను నిశ్చయించి సుగ్రీవునియెదుటకు వెళ్లినయెడల నాప్రభునాజ్ఞను పూర్తిగ జరిపినవాడనగుదును. నా కిప్పుడు వారితో కయ్య మెట్లు వచ్చును? వారితో నేను యుద్ధముచేసినయెడల నాబలమును, వారి బలములను రావణుడు తెలిసికొనును. ఆతనితోను, నాతనిమంత్రులతోను, నితరసైన్యములతోను నేను యుద్ధము చేసి యాతనిమనస్సులోని తలంపును కనుగొని యిక్కడనుండి సుఖముగ వెళ్లెదను. కాన నేను కండ్లకుప్రకాశమానముగ గనబడునదియు, ననేకవృక్షములుగలదియు, నింద్రునినందనవనమువలె నుత్తమమైనదియునగు నారావణుని యశోకవనమును నాశనముచేసెదను. దానితో నాతడు కోపము తెచ్చుకొని తనచతురంగబలమును నాతో యుద్ధమునకు బంపును. ఆరాక్షసులాయుధములనుబట్టి నాతోయుద్ధముచేయ నేను వారిని జంపి సుగ్రీవుని యొద్దకు బోయెదను." ఇట్లు హనుమంతు డాలోచించి యాక్రీడావనమున వేగముగ బరుగెత్తుచుండ వానివేగముచే బయలుదేఱినగాలి ప్రచండవాయువువలె చెట్లకు తగిలి వానిని విఱిచెను. పొదలనుగూడ నాశనము చేసెను. ఆగాలిచే నీటిమడుగులు కలిగిపోయెను. పర్వతశిఖరములు చూర్ణము లయ్యెను. పక్షులన్నియు నఱచుచుండెను. పూల

గుత్తులు వాడిపోయెను. లతాగృహములును, చిత్రగృహములును, రాళ్ళగృహములును, సామాన్యపునిండ్లును నాశనమయ్యెను. పెద్దపాములును, క్రూరజంతువులును పీడనొందెను. రావణుని సేవకురాండ్రగు రాక్షసస్త్రీలచే వృద్ధినొందింపబడిన యూవన మిట్లాకపిశ్రేష్ఠునిచే నాశనము చేయబడెను. అతడిట్లావనమును .పాడుచేసి రాక్షసులతో యుద్ధముచేయుట కావనబహిర్ద్వారమున కూర్చుండెను.

పక్షులనాదములవలనను, చెట్లువిఱుగునపుడు కలిగిన శబ్దము వలనను లంకలోనుండు రాక్షసుల కందఱకు భయమును, తొందరయు కలిగెను. మృగపక్షులు భయముచే నఱచుచు నన్నిదిక్కులకు పరుగెత్తెను. రాక్షసులకు దుశ్శకునములు కనబడెను. అప్పు డశోకవనముననుండు రాక్షసస్త్రీలు నిద్రనుండి తెలివి నొంది యూవనమంతయు విఱిగిపోవుటయు, నాపెద్దవానరు డక్కడ నుండుటయు జూచిరి. అతడువారిని భయపెట్టుటకు గొప్పరూపమును, పెద్దబాహువులను, గొప్పబలమును బొందెను. వారు వానిని జూచి భయమునొందిరి. అప్పుడువారు 'వీడెవడు? ఎవరిసంబంధమైనవాడు? ఎక్కడనుండివచ్చెను? ఇక్కడికేల వచ్చెను? సీతతో వీడేల సంభాషించెను? ఎందునిమిత్తము మీకు సంభాషణ జరిగెను? నీకు భయములేదు. మాకు దెలుపు' మని సీత నడిగిరి. దానికామె 'భీమరూపులగు రాక్షసులను నే నెట్లు తెలిసికొనగలను? వాడెవడో యేమిచేయునో? మీరే తెలిసికొనుడు. పాముకాళ్ళు పాముకే తెలియును. నేనుకూడ వానిని జూచి భయము నొందితిని. వాడెవడో నే నెఱుగను. వాడు కామరూపుడగు రాక్షసునివలె గనబడుచున్నా' డని పలుక కొందఱు రాక్షసస్త్రీలక్కడనుండి నలుదిక్కులకు పరుగెత్తిరి. కొంద ఱక్కడ నిలిచిరి. కొందఱు రావణునియొద్దకు పరుగెత్తి హనుమంతునిగూర్చి యిట్లు తెలిపిరి, 'రాజా! అశోకవనములో భయంకరమగు శరీరము,

గొప్పపరాక్రమముగల వానరు డొకడు సీతతో సంభాషించి యక్కడ నున్నాడు . మేము వానినిగూర్చి యామె ననేకపర్యాయము లడిగి నను నామె తెలియజేయుట కిష్టపడకున్నది. వా డింద్రునిదూతయో కుబేరునిదూతయో లేక సీతను వెదకవచ్చిన రామునిదూతయో నైయుండును. వానిచే మనోహరమగు మీయశోకవనము నాశనము చేయబడెను. కాని యామెయుండు ప్రదేశమునందున్న మంచిపూవులు గల శింశుపావృక్షముమాత్రము నాశనముచేయబడలేదు. ఆమెరక్షణ కొఱకో లేక శ్రమచేతనో యాతడు దానిని విఱువ లేదు. దానిని విఱుచుట కతని కేమిశ్రమ? అది వానిచేతనే రక్షింపబడెను. ఆమెతో సంభాషించి వనమును విఱిచిన యాఘోరస్వరూపుడగు వానరునకు తగినదండన మీ రాజ్ఞాపింపుడు. మీరు మనస్పూర్తిగ పరిగ్రహించిన సీతతో మాట్లాడిన వానికి ప్రాణములమీద నాశయుండునా''? ఇట్లు రాక్షసస్త్రీలు తెలుప రావణుడు కోపముచే కండ్లను ద్రిప్పుచు నగ్ని వలె మండిపడెను. వానికండ్లనుండి యగ్నివలె ప్రజ్వలించు నీటిబిందువులుపడెను. అతడు తనతో సమానమగు శౌర్యముగల 80000 రాక్షస కింకరులను హనుమంతుని బట్టుకొనుటకు బంపెను.

---

## ౧౨వ. అధ్యాయము.
## హనుమంతుడు రాక్షసులతో యుద్ధముచేయుట.

రావణుడు హనుమంతుని బట్టుకొనుటకు 80000రాక్షసులను బంప వారు పెద్దకడుపులు, పెద్దకోఱలు, ఘోరరూపములుకలవారై వివిధాయుధములను బట్టుకొని హనుమంతుని బట్టుకొనుటకు నశోకవన బహిర్ద్వారమువద్దకు వచ్చిరి. తరువాత వా రాతనిసమీపించి గదలు మొదలగువానితో నాతనిని గొట్టిరి. వానిపై వాడిబాణములను విడి

చిరి. హనుమంతుడు భూమియందు తనతోకను విడిచి పెద్దధ్వనిచేసెను. ఆతడు తనశరీరమును నెక్కువగ పెంచి ధైర్యముతో సింహనాదము చేసెను. ఆశబ్దముతో లంక ప్రతిధ్వనించెను. కొండలుకూడ ప్రతిధ్వనులుచేయ నాకాశమునుండి పక్షులు క్రిందపడెను. తరువాత హనుమంతు డిట్లు గట్టిగ ఘోషించెను. "అతిబలుడగు రామునకును, మహాబలుడగు లక్ష్మణునకును . జయమగుగాక! రామునిచే బాలింపబడిన సుగ్రీవరాజు జయమొందుగాక! నేను గొప్పకర్మలుచేసిన రామునిసేవకుడను; 'హనుమంతు'డను పేరుగలవాడను; వాయుపుత్రుడను; శత్రుసైన్యములను జంపువాడను. వేయిమంది రావణులైనను యుద్ధమున నాతో సరికారు. నేను రాళ్లతోను, చెట్లతోను యుద్ధముచేసి లంకలోనున్నవారిని బాధనొందించి సీతకు నమస్కరించి రాక్షసులందఱు చూచుచుండ నాపనులను నెఱవేర్చుకొని వెళ్లెదను." ఇట్లు హనుమంతుడు ఘోషింప నాశబ్దమునకు యుద్ధమునకు వెళ్లిన రాక్షసులు భయమునుజెంది రక్తవర్ణముగల మేఘమువలెనుండు నాహనుమంతుని తమప్రభునాజ్ఞచే నాయుధములతో గొట్టుటకు సమీపించిరి. అంతట నత డాయశోకవనబహిర్ద్వారముననుండు పెద్దయినుపపరిఘను పట్టుకొని దానితో వారలను జంపెను. ఇట్లాకాశమార్గమున వారికి యుద్ధముజరుగ రావణకింకరులగు ననేకరాక్షసులు చచ్చిరి. హనుమంతుడు పూర్వమువలె బహిర్ద్వారముచేరి యుద్ధాభిలాషతో నుండెను. మిగిలినరాక్షసులు పరుగెత్తుకొనిపోయి రావణునికి జరిగినదంతయు దెలుప నతడు కండ్లుత్రిప్పుచు ప్రహస్తపుత్రుడును, వీరుడును ఘోరరూపుడును, పెద్దకోఱలుగలవాడునునగు జంబుమాలిని యుద్ధమునకు బంపెను.

ఇంతలో హనుమంతు డశోకవనబహిర్ద్వారమున కూర్చుండి 'నేను వనమును విఱిచితిని. కాని పెద్దదేవతాలయమును గూడత్రవ్వు

నాశనముచేయలేదు. కాన దానిని పాడుచేసెద'నని తనబలమును జూపుచు మిక్కిలియెత్తగు నాదేవాలయపుమేడనెక్కి సూర్యునివలె ప్రకాశించెను. అతడు పూర్వమువలె శబ్దముచేసి దానిని పాడుచేయ దానిని రక్షించు కావలివాండ్రు భయమును జెందిరి. అతడుపూర్వము వలెనే రామలక్ష్మణసుగ్రీవులనుగూర్చి జయశబ్దములను బలికెను. రాక్షసులకు భయముకలుగునటుల నతడు ధ్వనిచేయ దేవాలయపు కావలివాండ్రునూర్గురును శస్త్రములు మొదలగునాయుధములతో యుద్ధమునకువచ్చి యాతనిచుట్టుజేరి యాతనిగొట్టిరి. అప్పు డాతనికి క్రోధమురాగ నాతడు భయంకరరూపమును ధరించి మేడపైనుండి పెద్ద స్తంభము నొకదానిని పెకలించి గిరగిరత్రిప్పి విసరెను. అది యితర స్తంభములకు తగులుటచే నగ్నిపుట్టెను. అందుచే నాదేవగృహము కాలిపోయెను. తరువాత హనుమంతు డానూర్గురు రాక్షసులను జంపి యాకాశమున నిలిచి 'సుగ్రీవసైన్యములో బలవంతులును మహాత్ములును, నగు వానరశ్రేష్ఠులు వేలకొలది జగత్తులో దిరుగుచున్నారు. మేము కొందఱము మీతట్టువచ్చితిమి. మాలో పదియేనుగులబలముకలవారు కొందఱును, దానికి పదిరెట్లు బలముకలవారుకొందఱును, వేయియేనుగుల బలముకలవారుకొందఱును నొకయేనుగుబలముగలవారు కొందఱును, వాయుదేవునివంటి బలముగలవారు కొందఱును నున్నారు. కోఱలును, గోళ్ళును నాయుధములుగాగల యనేకవానరులతో సుగ్రీవుడు వచ్చి మిమ్ములనందఱిని జంపించును. ఇక్ష్వాకువంశనాథుడును, మహాత్ముడునునగు రామునితో బద్ధవైరము కలిగినందులకు మీలంక మఱియుండదు. మీరావణుడును, మీరునుగూడ జత్తు'రని పలికెను.

రావణునిచే యుద్ధమునకు బంపబడిన జంబుమాలి యెఱ్ఱని మాల్యములను, నెఱ్ఱనిబట్టలను గట్టుకొని కుండలములును, మెడలోని పూలదండలును వ్రేలాడుచుండ కళ్ళనుద్రిప్పుచు కంచరగాడిదలనుగట్టిన

రథమెక్కి యింద్రధనస్సువలెనుండు పెద్దధనస్సును, బాణములనుబట్టి వింటినారిని మోగించెను. ఆశబ్దమన్నిదిక్కులకు వ్యాపించెను. దానిని హనుమంతుడు చూచి మిక్కిలిసంతోషించి వేగముగవచ్చి పెద్దనాదము జేసి బహిర్ద్వారస్తంభముమీద నిలువ వానిపై నారాక్షసవీరుడు పదిబాణములను విడిచెను. అవి యతనికి ముఖముమీదను, తలమీదను, బాహువులమీదను తగిలెను. స్వభావముచే నెఱ్ఱగనున్న వానిముఖము రక్తముచే నింకనునెఱ్ఱనాయెను. అంతట హనుమంతుడు మిక్కిలికోపముతెచ్చుకొని పెద్దరాతినొకదానిని బట్టుకొని యారాక్షసునిపై విసర వాడు దానిని పదిబాణములచే ఖండించెను. తరువాత హనుమంతు డొకగుగ్గిలపుచెట్టునుపెఱికి రాక్షసునిపై విసరెను. దానిని జంబుమాలి నాలుగుబాణములతో తిరుగగొట్టి యతనిభుజముననైదు బాణములను, వక్షస్థలముపై నొకబాణమును, నితరశరీరభాగములందు పదిబాణములను నాటెను. అంతట హనుమంతుడు బహిర్ద్వారమునయుండు నొకపరిఘను బట్టి గొప్పబలముతో విసరనది జంబుమాలి వక్షస్థలమునకు తగిలి, వానితలను, బాహువులను, మోకాళ్ళను, ధనస్సులను, రథమును, గుఱ్ఱములను, బాణములను పిండిపిండిగ జేసెను. ఈసంగతి రావణునికి వెంటనే తెలిసెను. అతడు గొప్పక్రోధముతో కన్నులెఱ్ఱజేసి యస్త్రవిద్యను బాగుగనేర్చిన యమాత్యపుత్రులను హనుమంతునిమీదికి యుద్ధమునకు బంపెను.

ఆమంత్రికుమారులు సూర్యునివలె కాంతిగలవారై చాలబలములను వెంటబెట్టుకొని పెద్దధ్వజములు, బంగారుతోనలంకరింపబడిన మంచిగుఱ్ఱములుగల రథము లెక్కి బయలుదేఱి బంగారుకట్లుగలధనస్సులను బట్టుకొని వానినిమోగించిరి. వీరితల్లులును, బంధువులును, స్నేహితులును రాక్షసకింకరులమరణము విని వీరుకూడ హనుమంతునిచే హతులయ్యెదరని విచారమునొందిరి. మంత్రికుమారులలో నొకని

కంటె నొకడు ముందుగ హనుమంతుని జంపవలెనను నుద్దేశముతో నతడుండు నశోకవనబహిర్ద్వారమువద్దకు వచ్చి యాతనిపై బాణవర్షము కురిపించిరి. అతడు వేగముగ సంచరించుచు వానినుండి తప్పించుకొని యాకాశమున తిరుగుచుండెను. వారుగూడ నంతరాళమునకు రథములతో బోయి వానిపై బాణములను విడిచిరి. అప్పుడు హనుమంతుడు పెద్దధ్వనిచేయ సేనయంతయు భయమునొందెను. వేగముగ నత డామంత్రికుమారులవద్దకు పరుగెత్తి తనయఱచేతితో కొందఱిని, కాళ్ళతో కొందఱిని, పిడికిళ్లతో కొందఱిని, గోళ్లతో కొందఱిని జంపెను. వానివక్షస్థలమునకు, వానితొడలకు తగిలి కొందఱు చచ్చిరి. వానినాదముచే కొందఱు క్రిందపడిరి. మిగిలినసైన్య మన్నిదిక్కులకు పరుగెత్తెను. ఏనుగులు విచారముతో ఘీంకరించెను. గుఱ్ఱములు భూమిపై వ్రాలెను. రథములు ముక్కలాయెను. రక్తధారలు త్రోవలలో ప్రవహించెను. లంకలో రోదనధ్వనులెక్కువాయెను. హనుమంతు డిటుల వారిని జంపి పూర్వమువలెనే బహిర్ద్వారముపై నిలిచి యుద్ధముకోరుచుండెను.

హనుమంతునిచే మంత్రికుమారులు మడిసిరని రావణుడు తెలిసికొని శంకతో బాగుగనాలోచించి విరూపాక్షుడు, యూపాక్షుడు, దుర్ధరుడు, ప్రఘసుడు, భాసకర్ణుడనను సేనాధిపతుల నైదుగుఱిని హనుమంతుని పట్టుకొనుట కాజ్ఞాపించి మంచిపరాక్రమముగలవారును, గొప్ప తేజోవంతులును, నీతినెఱిగినవారును, యుద్ధములో వాయువేగముగలవారునునగు వారితో నిట్లు పలికెను. "మీరందఱు మంచిచతురంగబలములను, మంచిసైనికులను తోడ్కొనివెళ్ళి యావానరుని దండింపుడు. మీరాతనివిషయమున నప్రమత్తులైయుండి దేశకాలములకు విరోధములగు పనులను జేయకుడు. వానిచేష్టలను జూడ వాడు సామాన్యవానరునివలె గనిపించుటలేదు. పెద్దదగువానిశరమును,

గొప్పబలమును నాలోచింప నాకు వా డింద్రునితపోబలముచే మన కొఱకు సృజింపబడియుండునని తోచుచున్నది. మీసహాయమువలన నేను నాగులను, యక్షులను, గంధర్వులను, దేవతలను, నసురులను, గొప్పఋషులను జయించితిని. వారిచేతనే యిప్పుడు నిశ్చయముగ మన కీవిప్రియము జరుపబడియుండును. మీరు బలవంతముగ నావానరుని బట్టుకొనుడు; కాని వాని నవమానింపకుడు. పూర్వము "నేను పరాక్రమవంతులగు వాలిసుగ్రీవులను, జాంబవంతుని, సేనాపతి యగునీలుని, ద్వివిదుని, నితరులను జూచితిని. కాని వారికి వీనికిగల గొప్పగమనము, తేజస్సు, పరాక్రమము, బుద్ధి, బలము, ఉత్సాహము, కామరూపము మొదలగునవి లేవు. కనుక వీనిని మీరు సామాన్యునిగ నెంచకూడదు; కపిరూపముననున్న గొప్పబలవంతునిగ నాలోచింపవలయును. మంచిప్రయత్నము చేసి మీరు వానితో యుద్ధముచేయవలెను. యుద్ధములో మీయెదుట మూడులోకములవారును నిలువలేరు. అయినను నీతిశాస్త్రము తెలిసిన మీరు యుద్ధమున జయమునుగోరుచు మిమ్ములను రక్షించుకొనవలయును. యుద్ధములో జయాపజయములు చంచలములు." ఇట్లు రావణుడు పలుక వానిమాటలను వారు విని తమబలములతో బయలుదేఱి యశోకవనబహిర్ద్వారమున నున్నవాడును, గొప్పశక్తికలవాడును, మహాబలుడును, బుద్ధిమంతుడును, గొప్పశరీరముకలవాడును, గొప్ప వేగముగలవాడును, నుదయించు సూర్యునివలె తేజోవంతుడునునగు నావానరునిచుట్టుచేరి వానినాయుధములతో గొట్టి వాడియగు నినుపబాణములనైదింటిని నాతనిశిరస్సునందు విడువ నత డన్నిదిక్కులకు వ్యాపించునట్లు పెద్దనాదము చేయుచు నాకాశమున కెగసెను. అప్పుడు నుద్ధతుడను రాక్షసుడు తనరథము మీద నిలిచి ధనస్సును సంధించి వందలకొలది వాడిబాణములను విడుచుచు వానినాకాశమున వెంటదఱిమెను. హనుమంతుడు తనశరీర

మున కాబాణములు తగులకుండున ట్లాకాశమున సంచరించెను. తరువాత నతడింకను నాకాశముమీదికెగిరి దుర్ధరునిరథముమీదబడ నారథము, గుఱ్ఱములు పిండి యాయెను. దుర్ధరుడు తనప్రాణములుపోవ క్రిందబడెను. అప్పుడు విరూపాక్ష యూపాక్షులకు గొప్పరోషము పుట్ట వారు పైకెగిరిరి. హనుమంతుడుకూడ వారితో పైకెగిరెను. వారు తమముద్గరములతో వానివక్షస్థలమున గొట్టిరి. అంతట హనుమంతుడు వారికంటె వేగముగ భూమిమీదికి దిగి పెద్దగుగ్గిలపుచెట్టు నొకదాని నెకల్లాగి వారిద్దఱినిగొట్ట వారు చచ్చిరి. తరువాత ప్రఘసుడు పట్టసమును, క్రోధముగలభాసకర్ణుడు శూలమును బట్టుకొని యాతనితో యుద్ధమునకు బయలుదేఱిరి. వారిద్దఱు హనుమంతుని నాయుధములతో బొడువ నతనిశరీరమునుండి రక్తముకారెను. అప్పుడతడు చెట్లతోను,జంతువులతోను నిండియున్న యొకపర్వతశిఖరమును పెకలించి యారాక్షసులనిద్దఱిని దానితో గొట్టి చంపెను. ఆసేనానాయకు లైదుగురు మరణమునొందినపిమ్మట నతడు మిగిలినబలములనుగూడ నాశనముచేసెను. అతడు గుఱ్ఱములను, గుఱ్ఱములతోను, నేనుగులను నేనుగులతోను, సైనికులను సైనికులతోను, రథములను రథములతోను గొట్టి వానిని నాశనముచేసెను. వీనితో భూమియంతయు నిండెను. తరువాత హనుమంతుడు పూర్వమువలెనే యశోకవనబహిర్ద్వారమున నిలిచి యింకను యుద్ధమును గోరుచుండెను.

రావణుడు వారందఱిమరణమును దెలిసికొని యుద్ధోన్ముఖుడగు నక్షకుమారుని హనుమంతునిమీదికి యుద్ధమునకు బంపెను. ప్రతాపవంతుడగు నతడు తపోబలముచే లభించినదియు, బంగారుకట్లుగలదియు నగు ధనస్సును బట్టుకొని బంగారుతో నలంకరింపబడినదియు, మంచిపతాకములుగలదియు, రత్నములతో చెక్కబడిన ధ్వజములుగలదియు, మంచివేగముగల 8 గుఱ్ఱములనుగట్టినదియు, దేవాసురులకు

్నైన జయింపశక్యముకానిదియు, మంచికాంతిగలదియు, నాకాశమున సంచరించునదియు,నమ్ముల పొదులు, 8 మంచికత్తులు గలదియు; శస్త్రలు తోమరములు, మొదలగునాయుధములతో సంపూర్ణమైనదియునగు రథ మెక్కి మంచిభూషణముల నలంకరించుకొని హనుమంతునుండు నశోకవనబహిర్ద్వారమునకు వెళ్లెను. తరువాత నతడు చారులవలన వాయుపుత్రుని వేగమును, పరాక్రమమును దెలిసికొని తనబలమాలోచించి మిక్కిలిక్రోధముతో గొప్పపరాక్రమమును జూపుచు నా వానరుని యుద్ధమునకు ప్రేరేపించుటకు ధనస్సునుబట్టి వానిపై మూడు బాణములను వేసెను. అప్పుడు శ్రమదీర్చుకొనినహనుమంతుడు శత్రువులను జయించినందులకు గర్వముతో నుండెను. తరువాత వారిరువురకు గొప్పయుద్ధము జరిగెను. అది దేవతలకుగూడ తొందరగలిగించెను. దానిని జూచి భూమి గోదనముచేసెను. సూర్యుడు ప్రకాశింపలేదు; వాయువు వీవలేదు; త్రికూట పర్వతము కదలెను; సముద్రము కలగెను; స్వర్గము నాదముచేసెను. గుఱిచూచుటలోను, బాణములను సంధించుటలోను, విడుచుటలోను గొప్పసామర్థ్యముగల యక్షకుమారుడు హనుమంతునితలమీద మూడువాడిబాణములను విడిచెను. దానితో వానిశరీరమునుండి రక్తముకారెను. బాణములనెడి కిరణములతోనొప్పుచున్న వానిముఖమప్పు డుదయించినసూర్యునివలె గనబడెను. చిత్రవిచిత్రములగునాయుధములుగల వానిని హనుమంతుడు చూచి మిక్కిలి సంతోషించి యుద్ధమునకు సిద్ధమయి తనకండ్లనుండి నిప్పులు రాలునటుల కోపముతో నక్షకుమారుని, వానిబలమును జూచెను. తరువాత రావణపుత్రు డాతనిపై శరవర్షము కురిపింప నతడు పెద్దనాదముచేసెను. దానితో నక్షకుమారుడు విజృంభించి బాణములను విడువ హనుమంతుడు వేగముగ నాకాశమున కెగిరెను. ఆరాక్షసవీరుడు తనరథముతో నాతనివెంటఁబడి యనేకబాణములను వానిపై

విడువ నాహనుమంతుడు వానినన్నిటినుండి తప్పించుకొనెను. తరువాత వాయుపుత్రుడు వానిని మర్యాదగ జూచుచు నిట్లు చింతించెను. 'వీడు గొప్పపరాక్రమమును జూపుచున్నాడు. వీనిని జంపుటకు నా కిష్టములేదు. వీనియుద్ధకర్మలను జూచి నాగులు, యక్షులు, మునులు వీనిని ప్రశంసించుచున్నారు. వీడు నాయెదుట నిలిచి పరాక్రమముతో యుద్ధముచేసినందులకు దేవతలయొక్కయు, నసురులయొక్కయు మన స్సులు చలించుచున్నవి. వీనిపరాక్రమము వృద్ధిజెందుచున్నది. వృద్ధి యగునగ్నిని నుపేక్షింపకూడనట్లు వీనిని నే నుపేక్షింప గూడదు.' ఇట్లు హనుమంతు డాలోచించి తనయఱచేతితో 8 గుఱ్ఱములనుగొట్ట నవి చచ్చి క్రిందబడెను. వానిరథమునుగూడ నట్లు తనచేతితో గొట్ట నది ముక్కలుముక్కలాయెను. తరువాత నారాక్షసుడు రథమును విడిచి ధనస్సును, ఖడ్గమునుబట్టి యాకాశమున కెగిరెను. అప్పుడు హనుమంతుడు వానికాళ్ళను గరుత్మంతుడు పామునుబట్టునట్లు గట్టిగ పట్టుకొని వేయిమాఱులు త్రిప్పి భూమిమీద గొట్ట వానిబాహువులు, తొడలు, నడుము, తల ముక్కలయ్యెను. వానిశరీరావయవములనుండి రక్తము కాఱెను. వానియెముకలు, శరీరసంధులు విఱిగిపోవ వాడు చనిపోయి భూమియందు బడెను. ఇట్లక్షకుమారుడు మరణమునొంద రావణునకు గొప్పభయ ముదయించెను. ఆకాశముననున్న మహర్షు లును, భూతములును, యక్షులును, పాములును నింద్రుడుమొదలగు దేవతలును నాశ్చర్యముతో దీనిని జూచుచుండిరి. హనుమంతుడు పూర్వమువలె నశోకవన బహిర్ద్వారమున గూర్చుండి రాక్షసులతో యుద్ధముచేయుట కింకను నెదురుచూచుచుండెను.

---

## ౧౩ వ. అధ్యాయము.

## హనుమంతు డింద్రజిత్తుచే పట్టుబడుట.



రావణుఁ డక్షకుమారునిమరణమును విని ధైర్యమవలంబించి మిక్కిరోషముతో నింద్రజిత్తు కిట్లాజ్ఞాపించెను. "నీవస్త్రశస్త్రములు బాగుగ దెలిసినవాఁడవు. సురాసురులకైనను శోకమును గలిగింపగల వాఁడవు. ఇంద్రాదిదేవతలకు నీకర్మలు తెలియును. నీవు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి యస్త్రములను బొందితివి. నీ వస్త్రముల నుపయోగించిన నసురులును, మరుద్గణములును, నింద్రాదిదేవతలును యుద్ధమున నిలువలేరు. నీవలన యుద్ధములో బాధనొందనివాఁడు మూఁడు లోకములలో నెవఁడును లేఁడు. నీవు భుజబలముచేతను, తపస్సుచేతను జయముల నొందితివి. నీవు దేశకాలముల నెఱిగినవాఁడవు; మంచిబుద్ధి గలవాఁడవు. యుద్ధములో నీకు చేయరాని దేదియులేదు. మంచి యాలోచనగల నీవు చేయలేనిపని యేదియులేదు. మూఁడులోకములలో నీబలమును, నీయస్త్రబలమును తెలియనివారెవరునులేరు. నీవు తపస్సులోను, బలములోను, పరాక్రమములోను నాతో సమానుఁడవు. నీవు యుద్ధమునకు వెళ్ళిన తప్పక జయముకలుగు నని నామనస్సు విచారములేకయుండును. నేను రణమునకుబంపినరాక్షసులందఱు హనుమంతునిచే జంపబడిరి. నీయందు నాకున్నగొప్పనమ్మకము వారియందు లేదు. దీనిని నీవు బాగుగ నాలోచించి వానరునిబలమును, ప్రభావమును, పరాక్రమమును దెలిసికొని నీపరాక్రమమును, ప్రభావమును, జూచుకొని తగినట్లు వానితో యుద్ధము చేయుము. మనబలము నష్టము పొందకుండ నీవు శత్రువులను జయింపుము. సేనయంతయుగూడినైన వానినోడింపలేదు. నీవు సామాన్యాయుధములను బట్టుకొని వాని యొద్దకు బోవలదు. వానివేగము వాయువేగముకంటెగొప్పది. వా

డగ్నిహోత్రములతో తుల్యుడు. కనుక వానిని సామాన్యాయుధము లతో జంపయత్నింపగూడదు. నీవు నేనుచెప్పినవాని నన్నిటిని నాలోచించి నీదివ్యధనస్సును, నస్త్రబలమును స్మరించుచు మనబలములు నాశనముకాకుండ కార్యములను జరుపుము. నిన్ను యుద్ధమునకుబంపుట శ్రేష్ఠముకాదు. అయినను నిది క్షత్రియధర్మము. నీవన్నిశస్త్రముల తోను పోరుసలుపుటలో నిపుణుడవు. కనుక నీవు యుద్ధముచేసి విజయమును గోరుము." ఇట్లు రావణుడు శక్తిమంతుడగు తనపుత్రునితో పలుక వాడు తండ్రికి ప్రదక్షిణ మొనర్చి యుద్ధోన్ముఖుడాయెను. ఇంద్రజిత్తు తన్ను తనస్నేహితులు పొగడుచుండ రణమునకు బయలుదేటి మంచివడిగల నాలుగు సింహములనుగట్టిన రథమెక్కి హనుమంతు డుండు చోటికి వెళ్ళెను.

ఇంద్రజిత్తునిరథధ్వనియు, ధనుష్టంకారమును వాయుపుత్రుడు విని మిక్కిలిసంతోషించెను. ఇంద్రజిత్తు యుద్ధమునకు వచ్చుటచే దిక్కులు కలంగెను.జంతువులు భయంకరముగ శబ్దము చేసెను. ఆకాశమున నాగ యక్ష మహర్షి సిద్ధులు నిలిచియుండిరి. పక్షులు మిక్కిలి సంతోషముగ కూసెను. ఆరాక్షసవీరుడు రథముమీదవచ్చుట హనుమంతుడు చూచి తనశరీరమును వృద్ధినొందించి పెద్దనాదముచేసెను. ఇంద్రజిత్తు తనధనస్సును మోగించెను. ఇరువురును బద్ధవైరముతో యుద్ధమునకు దలపడిరి. ఆరాక్షసవీరుడు విడుచుబాణములు తనకు తగులకుండున ట్లావానరశ్రేష్ఠు డాకాశమున జరించెను. ఇంద్రజిత్తు వాడిబాణములను వేయుచుండెను. హనుమంతుడు వానిగుఱినుండి తప్పించుకొనుటచే నవి వానికి తగులలేదు. వాడు తిరుగ బాణములు వేయుసమయమున కాతడు చేతులను జాచి మీదికెగిరిపోవుచుండెను. యుద్ధకర్మలో నిపుణులగు వారిద్ద అందఱిమనస్సులు తమమీదనే యుండునట్లు మిక్కిలివేగముగ గొప్పపోరు గలిసిరి. వారిరువు రొకరి

లోపము నొకరు తెలిసికొనలేక విక్రమముతో బోరాడుచు జయమును బొందకుండిరి. ఇంద్రజిత్తుహనుమంతునిపై గుఱిపెట్టివ్యర్థము కాని బాణములనుప్రయోగించిననునతడు వాని నన్నిటిని తప్పించుకొనెను. అందుచే నింద్రజిత్తునకుగొప్పవిచారముకలిగెను. అప్పుడు వాడు 'వీడు చంపబడడు. వీనిని కదలకుండ బట్టుకొనుటయొట్లని యాలోచించి యాతనిపై బ్రహ్మాస్త్రమును విడిచెను. దానితో వానరశ్రేష్ఠుడు కట్టుబడి చేష్టలుడుగ భూమియందుబడెను. అతడు బ్రహ్మాస్త్రముచే తానట్లు కట్టబడుటెఱిగి దానిచే తనకు మరణము సంభవింపదనువరమును మనస్సునకు దెచ్చుకొని యిట్లాలోచించెను. 'దీనిబంధమునుండి తప్పించుకొనుటకు నాకు శక్తిలేదు. వాయువును, నింద్రుడును, బ్రహ్మయు నాకిదివరలో నస్త్రబంధమోక్షమునుగూర్చి వరము నిచ్చిరి. కాన నాకు భయములేదు. నన్ను రాక్షసులు పట్టుకొనినందులకు నాకు మంచికలుగును. నేను రావణునితో సంవాదము చేయగలుగుదును. వీరు నన్ను బట్టినబట్టు గాక!' ఇట్లు హనుమంతు డాలోచించి పట్టుబడియెను. అక్కడనుండు రాక్షసు లాతనియొద్దకు వచ్చి తర్జనభర్జనచేయుచు బలవంతముగ నాతనిబట్టుకొన నాతడు నాదముచేసెను. వా రాతనిని చేకుతాళ్ళతోను, నారచీరలతోను గట్టిరి. రావణునియెదుటకు వెళ్ళుట కిష్టము కలవాడగుటచే నాత డాకట్లకు లొంగియుండెను. అస్త్రముచే కట్టబడినవారిని నితరత్రాళ్ళతో గట్టినయెడల నస్త్రబంధము విడిపోవును; కాన హనుమంతుని నస్త్రబంధము విడిచెను. పైకట్లుమాత్రము నిలిచెను. ఇంద్రజిత్తు దీనిని కనిపెట్టి 'అయ్యో! నేను చేసినగొప్పపని నిరర్థకమయ్యెను. మంత్రిముసంగతి రాక్షసులకు తెలిసినది కాదు. బ్రహ్మాస్త్రము నిష్ఫలముకాగ మఱియొక బ్రహ్మాస్త్ర ముపయోగింపవీలులే' దని విచారమును బొందెను. హనుమంతుడు బ్రహ్మాస్త్రముచే విడువబడినను కట్లతో బాధపడుచు రాక్షసులచే నీడ్వబడుచునవమానమును

బొంద లేదు. క్రూరులగు రాక్షసులు కఱ్ఱలతోను, పిడికిళ్ళతోను నాతని గొట్టుచు రావణునియొద్దకు దీసికొనివెళ్లిరి. అక్కడ జరిగినదంతయు నింద్రజిత్తు తనబలములద్వారా తనతండ్రికి కబురుపంప నగరులోని రాక్షసులు దానిని వానికి దెలిపిరి. రాక్షసవీరులు హనుమంతునిగూర్చి యిట్లు ప్రసంగించిరి. 'వీడెవడు; ఎవరిసంబంధమైనవాడు? ఎక్కడనుండి యేకార్యమునిమిత్త మిక్కడకు వచ్చెను. వీని నిక్కడ రక్షించువారెవ్వరు? వీనిని జంపివేయుడు. కాల్చివేయుడు. లేక తిని వేయు' డని పలికిరి. ఇట్లు హనుమంతుడు రాజమార్గమును దాటి రావణునినగరు చేరెను. రావణునికాళ్ళవద్ద వృద్ధులగు మంత్రులు మొదలగువారుండిరి. రాక్షసు లాంజనేయుని నిటునటు లాగుచుండిరి.

---

## ౧౮ వ. అధ్యాయము.

## హనుమంతరావణుల సంవాదము.

హనుమంతుడు రావణునియెదుటకు తీసికొని రాబడి రాక్షసరా జింద్రజిత్తుచే తన్ను బ్రహ్మాస్త్రముచే కట్టించినందులకు నాశ్చర్యపడి రోషముతో కండ్లెఱ్ఱజేసి యాతనిని జూచెను. ఆతనితలమీద బంగారుతో నిర్మింపబడినదియు, ముత్యములవరుసలతో నలంకరింపబడినదియునగు కిరీటముండెను. వజ్రములు, మణులు మొదలగువానితో నలంకరింపబడిన బంగారునాభరణములను, చిత్రములగుమాల్యములను నతడు ధరించియుండెను. రక్తచందనముతో నింపబడిన యెఱ్ఱనిబట్టలను నతడు కట్టియుండెను. అతనికండ్లెఱ్ఱగను, భయంకరముగను నుండెను. పెద్దకోఱలును, పండ్లునుగల యాతడు పెద్దమేఘమువలెను, మందరపర్వతమువలెను నుండెను. అతనిబాహువు లంగదకేయూరములతో

నలంకరింపబడియుండెను. అతడు రత్నములతో చెక్కబడిన స్ఫటికపు పక్కపై కూర్చుండియుండెను. బాగుగ నలంకరించుకొనిన స్త్రీలు వింజామరలతో రావణునికి వీచుచుండిరి. దుర్ధరుడు, ప్రహస్తుడు, మహాపార్శ్వుడు, నికుంభుడు మొదలగు మంత్రులాతని ప్రక్కను కూర్చుండిరి. అప్పుడు హనుమంతుడు ఘోరరాక్షసులచే బాధింపబడుచు నారాక్షసరాజు తేజోమహిమలను జూచి యాశ్చర్యమును బొంది 'అహో! వీనిరూపము, ధైర్యము, బలము, కాంతి యితర సర్వలక్షణములు చాలగొప్పవి. వీనికి ముఖ్యముగ నధర్మము మాత్ర మధికముగ నున్నది. ఇది లేనియెడల వీడు ముల్లోకములను రక్షించును. వీడు క్రూరబుద్ధి, నిర్దయ గలవాడై లోకములకు హేయకరమగు పనులను జేయుటచే నన్నియు వీనికి భయపడుచున్నవి. వీనికి క్రోధమువచ్చిన వీడు వానినన్నిటిని సముద్రములో గలుపు'నని యాలోచించెను.

రావణుడు తనయెదుటనిలిచిన హనుమంతుని, నాతని తేజమును జూచి 'ఇక్కడకు వచ్చినయీతడు సాక్షాత్తుగ భగవంతుడగు నందీశ్వరుడు కాబోలు. పూర్వము నేను కైలాసపర్వతమును గదలింప నాతడు నాకు శాపమిచ్చెను. అతడే యీ వానరరూపమును బొందియుండును. లేక యితడు బలిపుత్రుడగు బాణాసురుడై యుండవచ్చు'నని యాలోచించి రోషముతో కండ్లెఱ్ఱజేసి కాలోచితముగ ప్రహస్తునితో 'ఈదుర్మార్గు డెక్కడనుండి యెందులకిక్కడకు వచ్చెనో యెవరిచే బంపబడెనో యేకారణముచే రాక్షసస్త్రీలనుగొట్టి నావనము విఱిచెనో యితరులు ప్రవేశింప వీలులేని నాపురమునకు వీడు రాగారణమేమో తెలిసికొను'మని పలుక నామంత్రి హనుమంతునితో నిట్లనెను. 'నీవోదార్పు వహింపుము. నీకు శుభమగుగాక! నీవు భయపడవలదు. నీ వింద్ర కుబేర యమ వరుణులదూతవా! లేక జయమును

గోరుచుబంపిన విష్ణునిదూతవా! నిజమును జెప్పుము. నీకు భయము లేదు. నిన్ను విడిపించెదను. నీ తేజస్సు వానరుని తేజస్సువలెలేదు. నీ రూపముమాత్ర మట్లున్నది. నీ విప్పుడు నిజమును జెప్పుము. నిన్ను విడిచెదను. అబద్ధముపలికిన నీవు జీవించుట కష్టము. లేనియెడల నీ వెందుల కిచ్చటకు వచ్చితివో తెలుపుము.' ఇట్లా మంత్రి పలుక నాంజనేయుడు రావణునితో 'నేను నీవుచెప్పినవారిలో నెవరిదూతను గాను. నేను వానర జాతివాడను. నాకు మీదర్శనము దొఱకుట దుర్లభము. అందుచే మీదర్శనము నిమిత్తము నీవనమును నేను విఱిచితిని. బలవంతులగు రాక్షసులు నాతో యుద్ధముచేసినందున నాశరీరరక్షణకై వారితో నేను తిరుగ యుద్ధముచేసితిని. దేవాసురు లైనను నన్ను నస్త్రములతో గట్టలేరు. ఇది నాకు బ్రహ్మయిచ్చిన వరము. నిన్ను జూడవలెనను కోరికతో నేనస్త్రమునకు లోబడితిని. నే నాయస్త్రబలముచే విడువబడినను నన్ను రాక్షసులు పీడించు చున్నారు. నేనొక రాచకార్యమునిమిత్తము నీయొద్దకు వచ్చితిని. నేను పరాక్రమవంతుడగు రామునిదూతను. నేను మంచిమాటలను జెప్పెదను విను'డని పలికెను. *

---

* అ. రా:—హనుమంతుడు రావణునితో బలుకుచు మంచి మాటల నిట్లతనికి బోధించెను. "ధర్మమువలన స్వర్గము, నధర్మము వలన నరకము నని లోకస్థితిని సదసద్వివేకబుద్ధితో విచారించి ఘోర మగు రాక్షసబుద్ధిని విడిచిపెట్టుము. నీవు బ్రహ్మయొక్క యుత్తమ వంశములో బుట్టితివి? పులస్త్యపుత్రుని కుమారుడవు; కుబేరుని తమ్ము డవు. అట్టి నీయొక్క మేలుకొఱకు సంసారమునుండి విముక్తిని గలిగించు దేవప్రోక్తము, పరపీడానివర్తకము నగు మార్గము నాశ్రయింపుము. దేహమం దాత్మబుద్ధిచే నీవు రాక్షసుడవుకాని, దేహాతిరిక్తమైనది యాత్మ యని విచారించినచో నీవు రాక్షసుడవుకావు. స్థూలసూక్ష్మ

తరువాత హనుమంతుడు రావణుని జూచి మంచిప్రయోజనములగు మాటల నిట్లనెను. 'నేను సుగ్రీవుని యాజ్ఞచే నిక్కడకువచ్చితిని. మీయన్నయగు నతడు మీకుశల మడిగెను. ధర్మార్థములతోఁ గూడినదియు, నీలోకములోను, పరలోకములోను శ్రేయస్సునుగలుగఁ జేయునదియునగు మీభ్రాతృసందేశమును వినుడు.' ఇట్లు హనుమంతుడా రాక్షసరాజుతోఁ బలికి దశరథునియొక్కయు, సీతారామలక్ష్మణులయొక్కయు చరిత్రములను దెలుపుచు రాముడు దండకావనములోనుండ సీతాహరణమును, రామసుగ్రీవులసమాగమమును, రావణుని సఖుడగు వాలిని రాముడొక్కబాణముతోఁ జంపుటయు, వానరులు నలుదిక్కులకు సీతనువెదకుటకు బోవ వాయుపుత్రుడగు తా నక్కడకు వచ్చి సీతను జూచుటయు వక్కాణించి యింకను నిట్లనెను. "మీరు ధర్మార్థములను బాగుగ నెఱిగినవారు; తపస్సుచేసి ఫలమును బొందినవారు. మీరు పరదారలను బలాత్కరింపకూడదు. మీవంటి బుద్ధి

---

శరీరములవల్ల కలిగిన దుఃఖపరంపర నిర్వికారుండవగు నీకు నంటవు. నీవు దుఃఖములకు నాశ్రయమగు మనస్సువుకావు. నిద్రించుచున్నవానికి కలలోఁ గనబడు పదార్థములెట్లు మిథ్యాభూతములో యట్లే యజ్ఞానమువల్ల కలుగు దుఃఖపరంపర మిథ్యాభూతమైనది. సర్వము మిథ్యాభూతమైనప్పుడు సత్యమైనవస్తు వేదియనుచోఁ నిర్వికారమును, దేవాదివిలక్షణమునునైన నీస్వరూపమే. మిథ్యాభూతము, జగత్కారణమునగు నజ్ఞానము సత్యమైనదని యన్నచోఁ 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' యనువేదవాక్యముచేత సజాతీయవిజాతీయస్వగతభేదరహితమగుబ్రహ్మకంటె నతిరిక్తమగు నజ్ఞానము మిథ్యాభూతమైనదే. ఆకాశము సర్వవస్తువులయొక్కసంబంధము కలదైనను వస్తువులయొక్క మాలిన్యామాలిన్యములచేత నెట్లంటబడకుండునో యట్లే నీవు దేహత్రయము (స్థూల సూక్ష్మ కారణశరీర) సంబంధము కలవాడవైనను

మంతులు ధర్మవిరుద్ధములును, మిక్కిలియపాయమును గలుగజేయునవియు, మూలనాశనమును గలుగజేయునవియునగు కార్యములను జేయరు. రామలక్ష్మణులు కోపముతో విడుచుబాణముల కడ్డుగ దేవాసురులలో నెవ్వరైనను నిలువలేరు. రాజా! మూడులోకములలో నెవ్వడైనను రామునకు విప్రియము జరిపి సుఖమును బొందగలడా? అన్నిసమయములందు హితమునుగలుగజేయునదియు, ధర్మార్థములతోగూడినదియునగు కార్యమును మీరాలోచించి యాతనికి సీతనప్పజెప్పుడు. శోకముతో నున్నయామెను నేను జూచియుంటిని. ఇంక రాముడుచేయవలసినకార్యము మిగిలియున్నది. ఆమె నైదుతలలుగల పామువంటిదని మీరెఱుగక యామెను గ్రహించితిరి. విషముతో గూడినయన్నమునువలె సీతను దేవాసురులుగూడ పరిగ్రహింపలేరు. మీరు గొప్పతపస్సుచేసి పొందినధర్మఫలమును, మీప్రాణములను

---

'దేహత్రయాతిరిక్తుడ'నను తత్త్వజ్ఞానముచే దేహత్రయాదులవల్లకలుగు సుఖదుఃఖాదులచే నంటబడవు. దేహాత్మబుద్ధిచే బద్ధుడవు కాగలవు. 'నేను చిద్రూపుడను; జననమరణములు లేనివాడను; ఆనందరూపుడను; దేహమైతే అనాత్మ; పాంచభౌతికము. ప్రాణమైతే వాయురూపము, మనస్సైతే అహంకార వికారము. బుద్ధియైతే ప్రకృతివికారము.' ఈతీరుగ విచారణచేయుటవల్ల దేహాదిసంఘముకన్న వేఱును, చిద్రూపమునునగు నాత్మస్వరూపమును దెలిసికొని ముక్తుడవు కాగలవు. రావణా! నీకు నతిశీఘ్రముగ మోక్షమార్గము నుపదేశించెదను; సావధానుండవై వినుము. సర్వజగత్తులయందు నిండియున్న శ్రీమహావిష్ణువునందలి భక్తియతినిర్మలమగుజ్ఞానమును గలుగజేయును. అట్టి జ్ఞానమువల్ల కైవల్యమును బొందగలవు. కాన నిప్పుడు లక్ష్మీపతియు, పురాణపురుషుడును, ప్రకృతికంటె పరుడునునగు శ్రీమహావిష్ణుని రామునిగగుర్తించి యతనిని సేవింపుము. వైరాభావమును వదలుము.

పోగొట్టుకొనుట మీకు ధర్మముగ నుండలేదు. మీరు గొప్పతపస్సు చేసి దేవతలవలనను, నసురులవలనను మరణములేకుండునట్లు వరమును బొందితిరి. అయినను సుగ్రీవుడు దేవుడుకాని యసురుడుకాని, దానవుడుకాని, గంధర్వుడుకాని యక్షుడుకాని పన్నగుడుకాని కాడు. వాని నుండి మీరు మీప్రాణముల నెట్లు రక్షించుకొనెదరు? మీయధర్మకర్మఫలమునుండి మీధర్మకర్మఫలము మిమ్ము తప్పింపదు. ప్రతిదాని ననుభవింపవలెను. ధర్మమువలన నధర్మము నాశనముకాదు. మీరు చేసిన ధర్మకార్యములఫలమును మీరు పూర్తిగ ననుభవించితిరి. మీ యధర్మఫలమును మీరు పొందెదరు. జనస్థానములో రాముడుచేసిన రాక్షసులవధయు, వాలివధయు మీరాలోచించి రామసుగ్రీవుల సఖ్యమునుదలంచి మీమేలునుగూర్చి మీరాలోచించుకొనుడు. మీ చతురంగబలమునంతటిని నేనొక్కడనే నాశనముచేయగలను. కాని రామునకిది యిష్టముకాదు. వానరులయెదుటను, నెలుగుబంట్లయెదు

---

హృదయమందలి శత్రుభావమును త్యజింపుము. సీతామహాదేవిని నెదుటనుంచుకొని పుత్రమిత్ర బంధుయుక్తుడవై శరణాగతప్రియుడగు రామునివద్దకేగి యతనికి నమస్కరించి సీతను సమర్పించి భయముక్తుడవుగమ్ము. పరాత్పరుడును, సుఖరూపుడును, నద్వితీయుడును,హృదయమందు నంతర్యామిగ నుండువాడునునగు శ్రీరాముని సేవింపకుండ దుఃఖపరంపరయను తరంగమాలలచే వ్యాపించిన సంసారసముద్రము ను జను డెట్లు దాటును? నీవుకూడ నట్లు రాముని సేవింపనిచో నజ్ఞానవహ్నిచే ప్రజ్వలించుచున్న నిన్ను నీవు రక్షించుకొనలేవు. ఇంతేగాక సీతాహరణముమొదలుగాగల మహాపాతకములచేత శత్రువవలెనే నీవు నిన్ను నధోలోకమునకు పొందించుకొనగలవు. నీకు నెప్పుడు మోక్షము సంభవించునను నాశకూడ కలుగకుండును.” ఇట్లు హనుమంతుడు రావణునకు బోధింప నతడు కోపముచే మండిపడెను.

టను నతడు 'సీతనెత్తుకొనిపోయినవారిని వధింతు'నని ప్రతిజ్ఞ జేసెను. అతని కపకారముచేసినయెడల నిందుడైనను సుఖమును జెందలేడు. అట్టిచో మీవంటివానిసంగతి వేఱె చెప్పనేల? మీస్వాధీనములోనున్న సీత యనుపేరుగల స్త్రీని లంకనంతటిని నాశనముచేయు ప్రళయకాల శక్తి యనియు, మిమ్ము పట్టిలాగు కాలపాశమనియు దలంపుడు. ఈ విషయమై మీరు బాగుగ నాలోచింపుడు. ఆమె తేజస్సుచేతను, రామునికోపముచేతను లంకయంతయు మండి నశించును. మీరు మీ స్నేహితులను, మంత్రులను, బంధువులను, తమ్ములను నిష్టులగు పుత్రులను, భార్యలను, సుఖములను లంకను నాశనముచేయకుడు. నిజ మగునామాటలను వినుడు. నేను రామునిదూతను; ముఖ్యముగ వానరుడను. రాము డిప్పుడున్న లోకముల నన్నిటిని నంతమునొందించి తిరిగ యాలోకములను సృజింపగల సమర్థుడు. అతడు విష్ణువుతో సమానమగు పరాక్రమవంతుడగుటచే దేవాసుర నర యక్ష రాక్షస విద్యాధర గంధర్వ నాగ సిద్ధ కిన్నర గరుడులందును, నన్నిభూతములందును నాతనితో సమముగ యుద్ధముచేయువాడు లేడు. సర్వలోకముల కధిపతియగు నట్టియాతనికి మీరువిప్రియమును గలిగించి జీవించుటకష్టము. ఇంద్రుడైనను, బ్రహ్మరుద్రులైనను రామునిచే జంపబడువానిని రక్షింపలేరు." ఇట్లు హనుమంతుడు మంచిమాటలను ధైర్యముతో బలికెను.

అతనివాక్యములను రావణుడు విని కోపముచే కండ్లుత్రిప్పుచు నాతని జంపవలె నని తనసేవకుల కాజ్ఞాపించెను. అప్పుడు బుద్ధిమంతుడగు విభీషణుడు పరరాజుయొక్క సంగతిని దెలిపిన హనుమంతుడను దూతవధను నంగీకరింపక రాక్షసరాజు క్రోధముగ నుండుటచే నిట్లాజ్ఞాపించెనని తెలిసికొని చేయవలసినకార్యమునుగూర్చి యాలోచించి తనయన్నను మంచిమాటలతో బొగడుచు మంచిమాటల నిట్లనెను.

'రాక్షసరాజా! క్షమింపుము. రోషమును విడిచి నేచెప్పువాక్యములను దయతో వినుము. మంచిచెడ్డలు తెలిసిన రాజులు దూతలను వధింప నాజ్ఞాపింపరు. వానరుని జంపుట రాజధర్మమునకు విరుద్ధము. లోకవ్యవహారమునకు హేయము. కాన నిది మీకు తగినదికాదు. మీరు ధర్మము తెలిసినవారు; కృతజ్ఞులు; రాజధర్మ మెఱిగినవారు; మంచి చెడ్డలు తెలిసినవారు; అన్నిభూతములలోను గొప్పసంగతుల నెఱిగిన వారు. శాస్త్రవిషయములు బాగుగ దెలిసిన మీరు రోషముచే నిట్లు చేసినయెడల మీరు తెలిసికొనిన శాస్త్రవిషయములు కేవలము శ్రమ కొఱకేయగును. కనుక మీరు దయతో యుక్తాయుక్తముల నాలోచించి దూతకు తగినదండన విధింపవలెను.' ఇట్లు విభీషణుడు విన్నవింప రావణుడు గొప్పరోషముతో 'పాపులను జంపుట పాపముకాదు. కనుక పాపప్రవర్తనగల యీ వానరుని జంపించెద'నని పలికెను. ఆమాటలను విభీషణుడు విని యధర్మమునకు మూలమగునదియు, ననేక దోషములతో గూడినదియు, సమర్యాదయగునదియునగు నాకార్యమును దెలిసికొని గొప్పపరమార్థమును దెలుపువాక్యముల నిట్లు పలికెను. 'రాక్షసరాజా! మీ రోర్పు వహింపుము. ధర్మార్థములతో గూడిన నామాటలను వినుము. అన్నిసమయములందును దూతలను వధింపగూడ దని సర్వదేశములలోను, నన్నిజాతులలోనునున్న బుద్ధిమంతులు పలుకుదురు. వీడు వృద్ధినొంది గొప్పవిప్రియముల నొనరించెను. వీడు మనకు నిజముగ శత్రువే. సంశయములేదు; కాని దూతయగుటచే వీనిని జంపవీలులేదు. దూతలకు విధింపవలసిన శిక్ష లనేకములు కనిపించుచున్నవి. దూతయవయవములకు వికృతరూపములను గలుగజేయుట, వానిని కొరడాతో గొట్టుట, వానిచిహ్నముల బోగొట్టుటయను శిక్ష లనేకములు దూతలకు విధింపబడియున్నవి. కాని వానికి మరణశిక్ష మనమెప్పుడును వినియైన నుండలేదు. మంచిచెడ్డలు

బాగుగ దెలిసిన మీవంటివారు కోపమున కేలలోనయ్యెదరు? బలవంతులు కోపమును తమ వశముచేసికొనెదరు. ధర్మమును, లోకవ్యాపారమును, శాస్త్రములను దెలిసికొనుటలో సురాసురులందఱిలోను మీతో సమానమగువారు లేరు. ఇతడితరులచే బంపబడి వారిమాటల నిక్కడ జెప్పుచున్నాడు. కాన వారికి దగినదండనను విధింపవలెను. కాని వీనిని జంపుటవలన లాభమేమియు లేదు. వీనిని జంపినయెడల నాకాశమార్గమున సముద్రమును దాటి చాలదూరమున నున్న రామలక్ష్మణుల కీవృత్తాంతమును దెలిపి వారిని యుద్ధమునకు బిలుచుకొని వచ్చువాని నింకొకనిని గానను. కనుక వీనిని వధింపగూడదు. మీ రిందాదులను శిక్షించుమార్గమాలోచింపవలయును. పరాక్రమోత్సాహములుగల సురాసురులనుగూడ దుర్జయులగుమీరు యుద్ధమందలిశ్రద్ధను బోగొట్టుకొనుట యుక్తముకాదు. మీయొద్ద శూరులును, జాగరూకులును, మంచిగుణములుగలకుటుంబములో జన్మించినవారును, బుద్ధిమంతులును, శస్త్రములను బాగుగ నుపయోగించువారునునగు యోధు లనేకులున్నారు. మీప్రభావమును రామలక్ష్మణులకు దెలుపుటకై వీరిలో నెవనినైన నొకనిని బంపవలెను.'
ఇట్లు విభీషణుడు తెలుప రావణుడు దానికొప్పుకొని 'నీవు చెప్పినది బాగుగ నున్నది. దూతను వధించుట నీచమగుపని. వధకంటె మఱియొకదండన వీనికి విధింపవలెను. వానరులకు తోక మిక్కిలియిష్టమగు నలంకారము; కాన దానిని శీఘ్రముగ కాల్చుడు. అది కాలిపోయిన తరువాత వీడు పోవచ్చు'నని పలికెను.

## ౧౫ వ. అధ్యాయము.

## హనుమంతుడు లంకనుగాల్చుట.



రావణుడు విభీషణునకు 'హనుమంతుని తోకను గాల్పింపు' మని సెలవిచ్చి 'దీనిని నామిత్రులు, జ్ఞాతులు, బంధువులు చూచెదరు గాక! వీనితోక కాలుచుండ వీనిని పట్టణముచుట్టు త్రిప్పవలె' నని యుత్తరువిచ్చెను. ఈమాటలను రాక్షసులు విని రోషముతో నతని తోకకు చింకిరిగుడ్డలను చుట్టబెట్టిరి. అతడు తనతోకను వృద్ధినొందించుచుండెను. తరువాత వారాగుడ్డలపై నూనెపోసి యగ్ని నంటించిరి. అప్పుడు హనుమంతుడు కోపముతో తనతోకను ద్రిప్ప వారు దూరమున బడిరి. అదికాలుచుండ రాక్షసులును, వారిస్త్రీలును, బాలురును, వృద్ధులును నక్కడకు వచ్చి దానిని జూచి సంతోషించిరి. ఆక్రూరరాక్షసులచే నతడు తిరుగ గట్టబడి యిట్లాలోచించెను. 'వీరు నన్ను కట్టినను వీరికి నాతోసమానమగు శక్తి లేదు. చివరకు నేనీ కట్లను తెంపి వీరిని జంపెదను. రామునిహితముగోరిచరించు నన్ను వీరు రావణు నాజ్ఞచే గట్టుచున్నారు. వీరికి ప్రత్యపకారమేమియు నేను చేయలేదు. వీరినందఱిని యుద్ధములో జయించుటకు నేను చాలుదును. కాని నేను రామునిప్రీతికొఱకు వీని నన్నిటిని సహించియుంటిని. ఈపట్టణమును రక్షించు యంత్రాదులను నిన్నటిరాత్రి నేను బాగుగ పరీక్షింపలేను. ఇప్పుడు దాని నంతటిని తిరిగి నేను బాగుగచూడవలెను. వీ రిష్టమువచ్చినట్లు నాతోకకు నగ్నిని తగిలించినను నాకేమి యుశ్రమలేదు.' ఇట్లు హనుమంతు డాలోచించుచుండ పెద్దరూపము, గొప్పబలముగల యాతని క్రూరులగురాక్షసులు సంతోషముతోను, శంఖభేరీలధ్వనితోను తాముచేసినపనిని కేకలువేసి చెప్పుచు నాపట్ట

ణముచుట్టును ద్రిప్పిరి. అత డట్లు తిరుగుచు నాపట్టణములోని చిత్రమగు మేడలను, నంగళ్ళను, నిండ్లతోనుండు వీధులను, నితరములగు వానిని జూచెను. రాక్షసులు బహిరంగస్థలములలో తాముచేసినపనిని కేకలువేయుచు జెప్పిరి. వానిని దారిలో జూచుటకు స్త్రీలు, బాలురు, ముసలివాండ్రు వచ్చుచుండిరి. ఈ సంగతి నశోకవనముననున్న రాక్షసస్త్రీలు సీతతో నిట్లు చెప్పిరి. 'నీవు మాట్లాడిన వానరునితోకను గాల్చి రాక్షసులు వీధులలో ద్రిప్పుచున్నారు.' ఇట్లు వారు చెప్పనామె ఘోరమగునావార్తను విని విచారమును బొంది హనుమంతునికి శుభముగోరుచు పవిత్రురాలై యగ్నిదేవుని నిట్లు స్తుతించెను. 'హుతాశనా! నేను పతివ్రతనేని, పతిసేవచేసితినేని, తపముచేయుచుంటినేని, రామునకు నామీద కొంచెమైనను దయ యుండెనేని, నాకు భాగ్యమేమైనయుండెనేని, భర్తృసమాగమమును గోరు నాపాతివ్రత్యమును హనుమంతుడు తెలిసికొనెనేని, సుగ్రీవుడు నన్నీయాపదనుండి తప్పించునేని హనుమంతునకు చల్లదనము నిచ్చువాడవగుము.' ఇట్లామె యగ్నిదేవుని ప్రార్థింప నాంజనేయుని తోకయందున్న తీక్ష్ణమగునగ్నిహోత్రము సీతపలికినమంగళమును వానరునకు దెలుపుచున్నట్లువలె జ్వాలలతో ప్రదక్షిణముజేయుచుండెను. ఆంజనేయునితండ్రియగు వాయుదేవుడాతని తోకయందుండు నగ్నితోగూడ గలిసియుండి యామె ప్రభావముచే నాతనికి సుఖము కలుగునట్లు మంచువలె శీతలముగ వీచెను. అప్పుడు హనుమంతుడు తన తోకకాలుచుండ నిట్లాలోచించెను. 'జ్వాలలతోనుండు నీయగ్ని నన్నేల దహింపకున్నది? నాకు గనబడుచున్న యీమహాజ్వాలలు నాకేమియు పీడ గలిగింపకున్నవి. తోకచివరను మంచుపడుచున్నట్లున్నది. నేను సముద్రముమీద నెగురునపుడు నాకు రామునిప్రభావమువలనమైనాక పర్వత మాశ్చర్యముగ గనబడినది. రామునిప్రీతికొఱకు మైనాకపర్వ

తము,సముద్రము నాక ట్లుపకారముచేయ నీయగ్ని మాత్రమేలచేయదు? సీతదయచేతను, రాముని తేజస్సుచేతను, నగ్ని దేవునకు, నాతండ్రియగు వాయుదేవునకు నున్న స్నేహముచేతను నతడు నన్ను గాల్పకున్నాడు,ఇట్లు హనుమంతు డాలోచించి వేగముగ పైకెగిరి పెద్దనాదముచేసి మిక్కిలియెత్తుగు పట్టణద్వారము నెక్కెను. అక్కడ రాక్షసులెవరును లేకుండిరి. అతడు తనరూపమును మొదట నెక్కువగ పెంచి తరువాత చిన్నదిగ జేసి కట్లన్నియు జారిపోవునట్లు చేసెను. తరువాత నాతడు పర్వతరూపమును బొంది యక్కడనుండు నినుపపరిఘనుబట్టి తనకుకావలియున్నవారినందఱిని జంపెను. ఇట్లాతడు లంకను తిరుగ జూచుచు తనతోకకాలుచుండ మంటలనెడు కిరణములతో సూర్యుని వలె ప్రకాశించెను.

ఇట్లు హనుమంతుడు తనమనస్సులోనున్న కార్యములను జరిపి మిక్కిలియుత్సాహముతో 'నేనేమిచేసిన రాక్షసులకు మిక్కిలి సంతాపము కలుగును? నేను వనమును పాడుచేసితిని; రాక్షసులను జంపితిని. ఇంక నీపట్టణమును నాశనముచేయవలెను. ఇది స్వల్పప్రయత్నముతో నెక్కువగొప్పఫలమునిచ్చును. నాతోకను వెలుగుచున్న యగ్నిహోత్రున కీమంచిగృహములను సంతర్పణచేసి వానిని తృప్తినొందించుట న్యాయ' మని తలచెను. తరువాత నతడు తన తోకకాలుచుండ నొక గృహమునుండి మఱియొకగృహమునకు పరుగెత్తుచు వానిని, నుద్యానవనములను, మేడలనన్నిటిని గాల్చెను. ప్రహస్తుడుమొదలగు రాక్షసశ్రేష్ఠులమేడలనుగూడ గాల్చెను. కాని యతడు విభీషణునిమేడను మాత్రము కాల్చలేదు. ఆయిండ్లలోనున్న ఖరీదుగలవస్తువులన్నియు గాలిపోయెను. తరువాత నతడు రావణునినగరుమీదపడి దానిని, నందలిచిత్రములను గాల్చి పెద్దనాదముచేసెను. అప్పుడు వాయువు మిక్కిలిగవీచుటచే నగ్ని బాగుగప్రజ్వలించి యాకాశమునంటియుండు

నిండ్లనన్నిటిని గాల్చెను. ఇట్లు ముఖ్యమగునిండ్లన్నియు నమూల్యమగువస్తువులతో గాలిపోయెను. రాక్షసులు తమయిండ్లను రక్షించుకొనలేక యుత్సాహమును, సిరిని వీడి పగుగొట్టుచు 'నిశ్చయముగ నీయగ్ని కపిరూపమునవచ్చిన' దని గట్టిగ నేడ్చిరి. కొందఱు సుందరులగుస్త్రీలు కాలుచుండెడి మేడలనుండి పిల్లలను చంకబెట్టుకొని యేడ్చుచు జుట్టును విరియబోసికొని భూమిమీదబడిరి. ఇండ్లలోనుండు వజ్రములు, మరకతములు, వైడూర్యములు, ముత్యములు కాలిపోయెను. వెండి, బంగారుమొదలగు లోహములన్నియు కరిగి ద్రవమాయెను. ఇట్లు కట్టెలు, గడ్డికూడ కాలిపోయినను నాశనరహితుడును, ప్రభువునునగు నగ్నికి తృప్తి కలుగలేదు. రాక్షసు లగ్నిబాధలుపొందినను హనుమంతునకు తృప్తికలుగలేదు. వారు చచ్చిపడినను భూమికి తృప్తి నొందలేదు. అగ్నిశిఖ లనేకములగు రంగులతో బయలుదేఱెను. అప్పుడు రాక్షసులలో గొప్పవారనేకులుకూడి లంకాపట్టణమును, ప్రాణులును, చతురంగబలములును, చెట్లును, మృగపక్షులును, నిండ్లును నాశనమొందుటచూచి యిట్లు పలికిరి. 'వానరరూపమును ధరించిన వీ డింద్రుడో!సూర్యుడో! చంద్రుడో! యముడో! వరుణుడో! వాయుదేవుడో! కుబేరుడో! యగ్నియో! రుద్రుడో! లేక కాలస్వరూపుడో! బ్రహ్మయో! మైయుండును. కోపించినవీనివలన రాక్షసులకు నాశనముకలిగెను. లేక యిది యనంతమగునదియు, రూపరహితమగునదియు, చింతింప శక్యముకానిదియు, నొకటిగనుండునదియు, తన మాయతో గూడినదియునగు వైష్ణవమాయయో' యని పలికిరి. అక్కడి రాక్షసులు 'హా! నాయానా! హా! పుత్రికా! హా! భర్తా! హా! మిత్రుడా! హా! జీవితమా!' యని యనేకవిధముల బలుకుచుగట్టిగ నేడ్చిరి. ఇట్లు హనుమంతుడు తనకార్యములను నెఱవేర్చుకొనినతరువాత నతనిమనస్సు రామునిమీదికి వెళ్ళెను. అప్పుడు దేవత లతని గీర్తిం

చిరి. గంధర్వులును, గొప్పఋషులును, దేవతలును లంకకాలిపోవుట చూచి యాశ్చర్యమునొందెను. అగ్నిభూతములా హనుమంతుని జూచి 'కాలాగ్ని'యని భయమునొందెను. గంధర్వులు మొదలగువారందఱును నాతనికార్యమునకు మిక్కిలి ప్రీతినొందిరి.

ఇట్లాతడు లంకను గాల్చి తనతోకయందున్న యగ్నిని సముద్రమునకు బోయి యార్పుకొనెను. తరువాత నతడు కాలిపోవుచున్నలంకను జూచి గొప్పభయమును బొంది యుట్టికర్మలను జేసినందులకు తన్ను తాను నిందించుకొనుచు నిట్లాలోచించెను. "తమకు బుట్టినకోపమును బుద్ధితో నణచుకొనుమహాత్ములు ధన్యులు. క్రోధించిన వాడెవడు పాపముచేయకుండును? క్రుద్ధుడు తనగురువులనైనను జంపును; కఠినమగు మాటలచే మంచివారినాక్షేపించును; పలుకవలసినదానిని, పలుకగూడనిదానిని కొంచెమైనను తెలిసికొనడు. చేయగూడనిపనియు, పలుకగూడనిమాటలును కొంచెమైనను వానికి దెలియవు. పాము తన పాతపొరను విడుచునట్లు తనకు బుట్టినక్రోధమును నోర్పుచే విడుచువాడు పురుషుడనబడును. నేను సీత యగ్నిపాలగునని యాలోచింపక నాప్రభువునకు ఘాత నొనరించినదుర్బుద్ధిని; లజ్జలేనివాడను; పాపముచేసినవాడను. ఇట్టినేను నిందింపదగినవాడను. లంక కాలునపు డామెకూడ కాలిపోయినయెడల నాప్రభుకార్యము నష్టమగును. నేను లంకను గాల్చుచు నామెను రక్షింపలేకపోవుటచే నే నారంభించినకార్యము లన్నియు నష్టమైనవి. నేను చేయవలసిన గొప్పకార్యములలో 'సీత వార్త రామునకు దెలుపుట' యను కొంచెముకార్యము మిగిలియున్నది. కాని యీగొప్పకార్యమంతయు మొదటికి నశించినది. సీత నిశ్చయముగ నశించినది. లంకలో తగులబడనిప్రదేశము కొంచెమైనను మిగులలేదు. పట్టణమంతయు కాలిపోయినది. నావిపరీతబుద్ధిచే కార్యము నష్టమైనందులకు నే నిక్కడ నిప్పుడే ప్రాణములను విడువ

గోరుచున్నాను. ఇప్పుడు నే నగ్నిలోబడి మరణింపనా? లేక బడబాగ్నిలో బడి మరణింపనా? నాశరీరమును సముద్రజంతువుల కాహారముగ నిచ్చెదను. కార్యముల నన్నిటిని నాశనముచేసిన నేను రామలక్ష్మణులను, సుగ్రీవుని నెట్లుచూడగలను? రోషదోషముచే నే నీకార్యములను పాడుచేసి నావానరచాపల్యమును నిజముగ మూడులోకములకు గనబఱచితిని. స్వతంత్రమగునట్టియు, నిందార్హమగునట్టియు నారాజసభావము నింద్యమైనది. నేను శక్తిమంతుడనైనను సీతను రక్షింపలేక పోయితిని. ఆమె నశింప రామలక్ష్మణులును, సుగ్రీవుడును నశింతురు. ఈసంగతి తెలిసిన భరతశత్రుఘ్ను లెట్లు జీవింపగలరు? ధర్మబుద్ధిగల యిక్ష్వాకువంశము నాశనమొందఁ బ్రజలందఱు శోకసంతాపములతో పీడింపబడుదురు. ధర్మార్థములకు లోపముగలిగించినవాడను, నిర్భాగ్యుడనునగు నేను రోషముతో ప్రవర్తించుటచే లోకమునకు నాశనము కలిగెను.”ఇట్లు హనుమంతు డాలోచించుచుండ నతనికి పూర్వమువలెనే శుభశకునము లగపడెను. అప్పు డతడు తిరుగ నిట్లుచింతించెను. ‘సీత తన తేజస్సుచేతనే రక్షింపబడియుండును. ఆమె సౌభాగ్యముకలదగుటచే నశింపదు. అగ్నిని నగ్ని దహింపదు. ధర్మాత్ముడును, మిక్కిలి తేజోవంతుడునునగు రాముని భార్యయు, మంచిచరిత్రముగలదియునగు నామెను నగ్ని స్పృశింపలేదు. ఆకారణముచేతనే యగ్ని దేవుడు నన్ను కాల్చలేదు. భరతలక్ష్మణశత్రుఘ్నులకు దేవతయు, రామునిప్రాణకాంతయునగు సీత యెట్లు నశించును? నాతోకను కాల్చనియగ్ని దేవుడామె నేలముట్టును?’ ఇట్లు చింతించి తనవిశ్రాంతినిమిత్తము సముద్రమధ్యమున మైనాకపర్వతము పైకిలేచుట వారిప్రభావమువలననే యని యాశ్చర్యమునొంది ‘సీత తపముచేయుటచేతను, సత్యముపలుకుటచేతను పాతివ్రత్యముగలదగుటచేతను నగ్నినిదహించును; తాని యగ్ని దామెను దహింపలే’దని యాలోచించుచుండ నాకాశమున మహాత్ము

లగు చారణు లిట్లు పలికిరి. 'అయ్యో! హనుమంతుడు నిజముగ కష్ట మగు పని నొనర్చెను. లంకలోని రాక్షసులగృహములలో నతడగ్నిని రగుల్చుటచే రాక్షసులును, స్త్రీలును, బాలురును, ముసలివారును పరుగెత్తుచున్నారు. పర్వతమున ప్రజ లేడ్చుచు కోలాహలము చేయుచున్నారు. పట్టణమంతయు గోడలు మొదలగువానితోగూడ కాలిపోయినది. సీతమాత్రము కాలకయున్నది. ఇదిమిక్కిలి యద్భుతము.' ఇట్లు వారు పలుక హనుమంతుడు మిక్కిలి సంతోషించి యామెను జూచుటకు వెళ్లెను.

అతడు శింశుపావృక్షమూలమునను న్న సీతను జూచి నమస్కరించి 'దైవయోగమున మీకే బాధయు గలుగకుండుట జూచి సంతోషించితి'నని పలికెను. అతడు బయలుదేరి వెళ్ళుటకు సిద్ధముగనుండ నామె తనభర్తయందలి స్నేహముచే నాతనితోట్లు పలుకుచుండు చూచి రామునిగూర్చి పూర్వమువలెనే పలుక నాతడామెను పూర్వము వలెనే యోదార్చి బయలుదేరుటకు సిద్ధమై యామెకు నమస్కరించెను.

---

## ౧౾వ. అధ్యాయము.

## హనుమంతుడు లంకను విడిచి మహేంద్రగిరిని జేరుట.



హనుమంతుడు లంకను విడిచి సముద్రతీరమునకు వచ్చి * యరిష్టపర్వతమెక్కెను. దానిమీద దేవదారు మొదలగు ననేకవిధములగు చెట్లును, పొదలును నుండెను. ఆకొండమీదనున్న శిఖరము

* 10వ ప్రకరణము. ౨వ అధ్యాయము. హనుమంతుడు లంకకు నెగురుట. 787 పుట పటమును జూడుము.

లను మేఘము లావరించియుండెను. ఆపర్వతమున సూర్యకిరణములు ప్రకాశించుచుండెను. జలధారలయొక్కయు నీటిమడుగులయొక్కయు శబ్దము వినబడుచుండెను. ఆకొండమీద పెద్దపాములును, సింహములు మొదలగు ననేకమృగములును నుండెను. దానిపై మహర్షులు, గంధర్వులు, కిన్నరులు మొదలగువారు నివసించిరి. ఆంజనేయు డాపర్వతమున నిలువ నందలిరాళ్ళు పిండియాయెను. తరువాత నతడు శరీరమును వృద్ధినొందించి దక్షిణదిక్కునుండి యుత్తరమునకు సముద్రమును బ్రార్థించుచు వాయువువలె నెగిరెను. అతనివేగముచే నాపర్వతమునుండి శబ్దముపుట్టెను. 30 యోజనము లెత్తును, 10 యోజనములు వెడల్పునుగల యాకొండ భూమిలోనికి నణగిపోయెను. దానిశిఖరములు కదలెను. చెట్లు పడిపోయెను. జంతువులు రోదనముచేసెను. ఆపర్వతమునుండు విద్యాధరస్త్రీలు తమబట్టలు, నగలు మొదలగు వానితోగూడ పైకెగిరిరి. గొప్పపాములపై రాళ్ళుపడ వానితలలు, మెడలు విఱిగెను. కిన్నరులు, నాగులు, యక్షులు, విద్యాధరులాపర్వతమును విడిచి పైకెగిరి యాకాశమున నిలిచిరి.

హనుమంతుడు సముద్రపుపైభాగమునుండి యాకాశమార్గమున తాను లంకకు వచ్చినతీరుననే యెగురుచు తాను లంకలోజేసినపనులను పొగడుకొనుచు దానిని దాటుచుండెను. అతడు దారిలో మైనాకపర్వతమును ముట్టి బాణమువలె తిన్నగబోవుచు మహేంద్రగిరిని జూచి పెద్ద నాదముచేసి తోకనాడించెను. ఆతీరమున దీనముతోనున్న వానరులందఱును నాతనిజూచుటకు నుత్సాహముతో నుండిరి. జాంబవంతుడు వారినందఱిని నొకచో జేర్చి 'వాయుపుత్రుడు తనకార్యము నన్నివిధములనెఱవేర్చియుండును. లేనియెడల నిట్టు నాదము చేయ' డని యనెను. అందఱు చెట్లపైకెక్కి చిన్నకొమ్మల నాడించుచుండిరి. హనుమంతుడు మహేంద్రగిరిశిఖరమునకు రాగా నంద ఱతనిచుట్టుచేరి

మిక్కిలిసంతోషముతో నాతనికి ఫలమూలముల నిచ్చిరి. అతడు జాంబవంతుడు మొదలగు వృద్ధులకును, యువరాజగు నంగదున కును, నితరవానరులకును నమస్కరించి వారివలన మర్యాదలను బొంది 'సీతను జూచితి' నని సంక్షేపముగ దెలిపెను. తరువాత నతడు మంచిసుందరమగు ప్రదేశమునకు నంగదుని దీసికొనివెళ్ళి తాను సీతను జూచినసంగతిని నతనికిని, నితరవానరులకును దెలుప వారందఱికి సంతోషమెక్కువయ్యెను. కొందఱు సింహనాదముచేసిరి. కొందఱు గర్జించిరి. కొందఱు కిలకిలశబ్దమును జేసిరి. కొందఱు తమ తోకలను ద్రిప్పిరి. కొంద ఱాంజనేయుని ముట్టిరి. అప్పు డంగదు డాతని నిట్లు ప్రశంసించెను. 'బలమున, వీర్యమున నీతో సమానమగు వానరు డెవడును లేడు. నీవు పెద్దసముద్రమును దాటి తిరుగవచ్చితివి. నీకున్నప్రభుభక్తిగొప్పది. దైవయోగమున నీవు రామునిభార్యను జూచుటచే రాముడు శోకమును విడుచును.' ఇట్లావానరయువరాజు హనుమంతుని ప్రశంసించినపిమ్మట నతడును, వాయుపుత్రుడును, జాంబ వంతుడును, మిగిలినవానరులును పెద్దరాళ్లపై కూర్చుండిరి. తరువాత నాబుద్ధిశ్రేష్ఠుడు హనుమంతునితో 'జరిగినదంతయు దెలుపుము. తరు వాత చేయవలసినకార్యమంతయు నాలోచించెదము. రామునితో నీవు గోప్యముగ దెలుపవలసినమాటలను దప్ప మిగిలినవానిని మాతో జెప్పు' మని పలుక నతడు తనతలతో సీతకు నమస్కరించి జరిగినదం తయు వారికి దెలిపెను.

తరువాత నింకను వాయుపుత్రుడు 'రామునియత్నమును, సుగ్రీవునియుత్సాహమును సఫలమగును. సీతగొప్పగుణములను జూడ నా కట్టియాసక్తి జనించినది. రావణుడు గొప్పతపస్సును జేసి లోకము లను జయించియున్నాడు. వానికి కోపమువచ్చినవాడు వాని నన్నిటిని దహించును. వాడు మహాతపస్సంపన్నుడగుటచే పాతివ్రత్యమహిమ

గలయామెను స్పృశించి యెత్తుకొనిపోయినందులకు నాశనమొందకుం డెను. ఆమె తేజమగ్ని తేజముకంటె తీవ్రమైనది. ఆమె తనపతిసెలవు లేకపోవుటచే వానిని దహింపలేదు. నేను చేసినదంతయు మీకు దెలిపితిని. జాంబవంతుడు మొదలగువారిసెలవునుబొంది మనమందఱము లంకకు బోయి రావణాదుల జయించి యామెను రామలక్ష్మణుల కప్ప జెప్పుట యుక్తము. నే నొక్కడనే లంకలోని రాక్షసులను, రావణుని జంపగలను. బుద్ధిమంతులును, శూరులును, బలవంతులును, నస్త్రములయుపయోగము బాగుగ దెలిసినవారునగు మీసహాయము కలుగ జయముతప్పక మనకు లభించును. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమును, నింద్రాస్త్రమును, వాయువ్యాస్త్రమును, వారుణాస్త్రమును విడిచినను నేను వానినన్నిటిని నాశనముచేసెదను. రాక్షసులను, నింద్రజిత్తునుగూడ జంపెదను. నేను పెద్దకొండలను విసిరి దేవతలనైనను యుద్ధమున జంపగలను. అట్టిచో రాక్షసులవిషయమై వేఱె చెప్పనేల? సముద్రమును దానిచెలియలికట్టను దాటింపవచ్చును. మందరపర్వతమునైనను కదల్పవచ్చును. కాని జాంబవంతునిమాత్రము శత్రుసైన్యములు కదల్పలేవు. అంగదు డొక్కడే రాక్షసుల నందఱిని జంపగలడు. పనసనీలులవేగముచే మందరపర్వతమైనను ముక్కలగును. అట్టిచో రాక్షసులనాశనమువిషయమై వేఱుగచెప్పనేల? దేవాసురయక్ష గంధర్వ నాగ గరుడులలో మైందద్వివిదులతో యుద్ధముచేయగలవారిని మీరు తెలుపలేరు. వీరిద్దఱు లంకను, చతురంగబలములను, రాక్షసులను నాశనముచేయగలరు. నేను లంకలో చేసినగొప్పకార్యమును మీకు దెలిపితిని. దానికి చేయవలసినకార్యమేదో మీరాలోచింపవలె' నని పలికెను.

అతని యీమాటలను నంగదుడు విని "వానరులారా! ధైర్యముగలమనము సీతను తీసికొని రాకుండ రామునిసమీపమునకు బోవుట

యుక్తముకాదు. 'మేమామెను జూచితిమి; కాని తీసికొనిరాలే' దని తెలుపుట గొప్పపరాక్రమవంతులమగు మనకు యుక్తముకాదు. ఎగురుటలోను, పరాక్రమములోను దేవదైత్యులును, నితరులునుగూడ సరికారు. హనుమంతుడు రాక్షసులను జంప మనము సీతను తీసికొని వెళ్ళుద" మని తనయభిప్రాయమును వారికి దెలిపెను.

అతని యీమాటలను జాంబవంతుడు విని బాగుగ నాలోచించి 'అంగదా! నీవు పలికినది తగినదైనను రామునియభిప్రాయమును కనుగొనినతరువాత మనము కార్యసిద్ధికి యత్నింపవలె' నని పలుక నతడును, మిగిలినవానరులును, హనుమంతుడును దానినంగీకరించి మిక్కిలిసంతోషించిరి. వాయుపుత్రుడు రామునికార్యమును జరిపినందులకు మిగిలినవానరులందఱు నాతనివెంటబెట్టుకొని మహేంద్రపర్వతమునుండి యెగిరి యాకాశమంతటిని గప్పిరి. భూతములతని గీర్తించుచుండెను. వారంద ఱాతనిపై సంతోషమగు తమదృష్టులను నిలుపుచు రామునికి తమకార్యసిద్ధిని దెలుపుటకు కుతూహలముతో నెగిరివెళ్ళుచుండిరి. అందఱు యుద్ధమందును, రాముడుచేయుయుద్ధసన్నాహమందును మనస్సుగలవారై యుద్ధమునకు సిద్ధముగనుండిరి. ఇట్లు వారెగిరి కిష్కింధసమీపముననున్న సుగ్రీవునిమధువనమున కరిగిరి.

ఇట్లు హనుమంతు డొక్కదినమున లంకకు నెగిరి సాయంకాలమువఱకు నక్కడవేచియుండి చీకటి పడినతరువాత లంకలో బ్రవేశించి రాత్రింతయు సీతను వెదకి తెల్లవాఱుజామున నశోకవనమున నామెనుజూచి యుదయమున నామెతో బ్రసంగించి తానావనమును విఱుచుటచే రాక్షసులతో యుద్ధముసంభవింప వారిని జంపి బ్రహ్మాస్త్రపాశముచే కట్టువడి రావణునితో సంవాదముజరిపి లంకను గాల్చి యాదినముననే మహేంద్రగిరిని జేరెను. తరువాత నాఢోజుననే యక్కడనుండి వానరులందఱు బయలుదేఱిరి.

---

## ౧౭ వ. అధ్యాయము.

## వానరులు మధువనమును విఱుచుట.



హనుమంతుడు మొదలగు వానరులు మహేంద్రగిరినుండి యెగిరి వెళ్ళి కిష్కింధసమీపముననుండు సుగ్రీవుని మధువనమున దిగిరి. అది యింద్రునినందనవనమువలె ననేకవిధములగు చెట్లను, లతలను గలిగి యుండెను. అందెవరును ప్రవేశించుటకు వీలులేకుండెను. దాని నతనిమేనమామయగు దధిముఖుడు కాచుచుండెను. వానరులు మిక్కిలి యుత్సాహముగలవారై సంతోషముతో నంగదుని దానిలోనుండు తేనెలను ద్రాగుటకు సెలవడిగిరి. అప్పు డతడు జాంబవంతుడు మొద లగువృద్ధుల ననుమతిని బొంది తేనెలను ద్రాగుటకు వారికి సెల విచ్చెను. దానితో వానరులు మిక్కిలిసంతోషము నొంది కొంద ఱాడుచుండిరి. కొందఱు పాడుచుండిరి. కొందఱు నమస్కరించుచుం డిరి. కొందఱు పెద్దనవ్వునవ్వుచుండిరి. కొందఱు పడుచుండిరి. కొంద ఱెగురుచుండిరి. కొంద ఱిష్టమువచ్చినట్లు ప్రేలుచుండిరి. కొంద ఱితరు లను బట్టియుండిరి. కొంద ఱితరుల నాక్రమించుచుండిరి. కొంద ఱితరు లతో మాట్లాడుచుండిరి. కొందఱు క్రీడించుచుండిరి. కొందఱు కొన్ని చెట్లనుండి మఱికొన్నిచెట్లకు పరుగెత్తుచుండిరి. కొందఱు చెట్లమీది నుండి భూమిమీద పడుచుండిరి. కొందఱు మిక్కిలిశీఘ్రముగ భూమి మీదనుండి చెట్లకొనలకెగురుచుండిరి. ఒకడు పాడుచుండ మఱియొకడు పెద్దనవ్వునవ్వుచు వానిదగ్గఱకు వెళ్ళుచుండెను. ఒకడు నవ్వుచుండెను. మఱియొక డేడ్చుచుండెను. ఒక డేడ్చుచుండ మఱియొకడు వానిని ద్రోసివేయుచుండెను. మఱియొకడు ధ్వనిచేయుచుండెను. అందఱు తేనెలను ద్రాగి మత్తతచేష్టలను జేయుచు తృప్తిని జెందియుండిరి. వారు వనఫలములను దిని చెట్లకొమ్మలను, నాకులను, పువ్వులను

పాడుచేయ దధివక్త్రుఁడా వానరులను నివారించెను. వారతనిని తర్జన భర్జనచేయ నతఁడు వనమును రక్షించుటకై కొందఱిని ధైర్యముతో కఠినములగు మాటలననెను. కొందఱిని తనయఱచేతులతో గొట్టెను. కొందఱితో కలహించెను. కొందఱిని మంచిమాటలాడెను. అప్పుడు వారందఱు భయమును విడిచి మత్తతచే నిష్టమువచ్చినట్లు మాట్లాడుచు నతనిచుట్టుచేరి యతనియందు దోషములేకపోయినను నాతనిని గోళ్ళతో జీరిరి. పండ్లతో కఱచిరి. అఱచేతులతోను, పాదములతోను గొట్టిరి. అయినను దధిముఖుడు వనమును పాడుచేసినవారిని తఱిమి వేసెను.

ఇట్లతఁడు వారిని దఱుమ హనుమంతుడు వారితో 'మీయిష్టము వచ్చినట్లు మీరు తేనెలను ద్రాగుడు. మీకడ్డువచ్చినవారి నే నాటంకపఱచెద' నని పలుక నంగదుఁడుకూడ నట్లే సెలవిచ్చి 'కార్యమును నెఱవేర్చివచ్చిన హనుమంతుఁడు చెప్పినపని జరుపగూడనిదైనను నేను దానిని జేయవలెను. అట్టిచో నిట్టిపని కేమియు' డ్డని యనెను. దానితో వానరులందఱు మిక్కిలిసంతోషముతో 'బాగున్న' దని పలికి తొందరగ మధువనమునకు తిరుగ నేగిరి. వారు కావలివాండ్రను గెంటివేసి తమలో నొకడు సీతను జూచివచ్చినందులకును, తామామెసంగతి వినియున్నందులకును, నంగదుఁడు తేనెను ద్రాగుటకు సెలవిచ్చినందులకును ధైర్యమును బొంది తేనెనుత్రాగిరి. తోటకావలివాండ్రు వచ్చి వారిని నడ్డ నావానరులు వారిని గొట్టి కుంచములకొలది మధువును ద్రాగిరి. కొందఱు తేనెకుండలను బ్రద్దలకొట్టిరి. కొందఱు తేనెను ద్రాగి కుండలను విసరిరి. మత్తతచే కొందఱు కొందఱిని గొట్టిరి. కొందఱు చెట్లమొదటనుండు శాఖలను బట్టుకొని నిలిచియుండిరి. కొందఱు మత్తతచే నాకులపై పండుకొనిరి. కొందఱుపిచ్చివారివలెనొకరి నొకరు త్రోసికొనిరి. కొందఱుమిక్కిలిసంతోషముతో దొర్లుచుండిరి.కొందఱు

సింహనాదము చేసిరి. కొందఱు పిట్టలవలె కూసిరి. కొందఱు భూమి యందు నిద్రించిరి. కొందఱు నీచకర్మలను చేసిరి. కొంద ఱట్లుచేసి నవ్విరి. కొందఱు వానిని పైకి తెలిపిరి. కొందఱు వానిని చేయుటకా లోచించిరి. దధిముఖుడు పంపినకావలివాండ్రను వానరులు చేతుల తోను, కాళ్ళతోను, మోఁకాళ్ళతోను పొడిచి తమయాపానద్వారము లను వారికి జూపి తఱుము వారన్నిదిక్కులకు పరుగెత్తి తమయధికారి యొద్దకు బోయి జరిగినదంతయు వానికి దెలిపిరి. అతడు క్రోధముతో వారితో 'మనమిక్కడనుండి బయలుదేఱి కలిసివెళ్ళుదము. బలముచే గర్వించినవానరులను మనబలముచే నివారించెద' మని పలికెను. తరువాత వారందఱు కలిసి మధువనమున కేగిరి. అక్కడ నత డొకచెట్టును పెఱికి పట్టుకొని వానరులందఱిని దఱిమెను. కావలి వాండ్రుకూడ రాళ్ళను, చెట్లను, పర్వములను బట్టి చెట్ల మీదనుండువారిని, క్రిందనుండువారిని గొట్టబోవ హనుమంతాంగ దాదు లక్కడకు వచ్చిరి. మత్తుడగు నాయువరాజు చెట్టునుబట్టుకొని తనకెదురువచ్చు దధిముఖుని మదాంధతచే తాతయని తెలియక కోపముతో గొట్టెను. అతడు తనబాహువులకును, తొడలకును దెబ్బ లుతగుల శరీరమువణక రక్తముగ్రక్కుచు భూమిమీదబడి యొక గడియ మూర్ఛ నొందెను. తరువాత నతడు తెలివినొంది కోపముతో మత్తతగలయీవానరులతో 'మీరు సుగ్రీవునిచే దండింపబడుదు' రని పలికి వారిని వారించెను. తరువాత నతడు తోటకావలివాండ్రతో రహస్యముగ నిట్లనెను. 'ఈవానరుల నిక్కడనుండనిండు. మనము రామ లక్ష్మణ సుగ్రీవులుండుచోటికి బోవుదము. దోషమంతయు నంగదుని యందే తెలుపుదము. దానిని వానరరాజు విని వారి నందఱిని దం డించును. ఈగొప్పమధువనమతనికి తనతాతతండ్రులనుండి క్రమముగ వచ్చినది. ఇందెవరును ప్రవేశింప వీలులేదు. రాజాజ్ఞను మీఱిన యీ దుర్మార్గులకు మరణదండన తగినశిక్ష. మనలను రక్కరించినందులకు

వీరికి తగిన ఫలముకలుగును.' ఇట్లు దధిముఖుడు పలికినతరువాత వారందఱు కలిసిమెగిరి వానరరాజుండుచోటునకు నొకనిమిషములో బోయిరి. దధిముఖు డిక్కడ రామలక్ష్మణసుగ్రీవులను జూచి దీనముఖముతో చేతులను తలపై మోడ్చి సుగ్రీవునిపాదములకు నమస్కరించెను.

అప్పుడు సుగ్రీవుడు తనపాదములమీదబడిన యావానరుని జూచి భయము నొంది 'లెమ్ము; లెమ్ము. నీవు నా పాదములమీ దేల పడితివి? నీకు భయము లేదు. అంతయు దెలుపు'మని పలుక దధిముఖుడు లేచి 'మీతండ్రియగు ఋక్షరజసు డున్నప్పుడుకాని మీ యన్నయగువాలి రాజ్యముచేసినప్పుడుకాని, మీ యేలుబడిలోగాని యింతకు పూర్వ మెప్పుడును మధువన మిప్పటివలె వానరులకు నిష్టము వచ్చినట్లు భోగమనుభవించుట కీయబడి భక్షింపబడియుండలే'దని పలికి జరిగినంతయు వానికి దెలిపెను. అప్పు డక్కడనున్న లక్ష్మణుడు 'సుగ్రీవా! ఈవనరక్షకుడువచ్చి దుఃఖునుగుమాటల నేలపలుకుచున్నా' డని యడుగ నత డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. 'దక్షిణ దిక్కునకుండి వచ్చిన యంగదాదులు మధువనములోబడి తేనెలను ద్రాగి రని దధిముఖుడు చెప్పుచున్నాడు. తమకార్యమును జరుపక వారిట్టిపనిని జేయరు. తగినకార్యమును వారు జరిపి తోటలోబడి యట్లు దానిని విఱిచి యున్నారు. అట్లు వారు వనములో బడుటచేతనే వారిపనిసఫలమైనదని తెలియుచున్నది; నిశ్చయము. సీత వారికి గనబడెను. సందేహము లేదు. దానిని హనుమంతుడు తప్ప నితరులు చేయలేరు. అతనివలననే మనకార్యసిద్ధియగును. అతడు మంచిబుద్ధిమంతుడు. కార్యములను బాగుగ నెఱవేర్చును; మంచిబలవంతుడు; మంచిప్రయత్నములను జేయును. ఇతరవస్తుపరిజ్ఞానమతని కధికముగ గలదు. జాంబవంతుడు మంత్రియు, నంగదుడు సేనానాయకుడును, హనుమంతుడు సైన్యరక్ష

కుడును నైయుండ తప్పక జయముకలుగును. అంగదాదులు మధువన మును విఱిచి తేనెలను ద్రాగి దానినిరక్షించువారిని వెడలగొట్టిరి. ఈ సంగతి జెప్పుటకు దధిముఖుడు వచ్చియున్నాడు.'ఇట్లు సుగ్రీవుడు పలుక రామలక్ష్మణులు మిక్కిలి సంతోషించిరి. ఆవానరరాజు కపిశ్రేష్ఠు నితో 'వానరులు తమకార్యమును జరిపి వనమనుభవించినందులకు నాకు సంతోషమైనది.అయినను వారు నాకుకోపమునుగలుగజేయుపనినిజేసిరి. హనుమంతుడు మొదలగు వానరవీరుల నిచ్చుటకుబంపుము. సీతనుజూచు టకు వారుపడినకష్టములను నేనును, రామలక్ష్మణులును వినగోరు చున్నా'మని పలికెను. దానికి రామలక్ష్మణులు ప్రీతినొంది తమ కార్యసిద్ధికై సంతోషముగనుండ వారిని సుగ్రీవుడు చూచి రామునకు తాను చేయవలసిన ప్రత్యుపకారము నెఱవేఱునని తనశరీరచిహ్నాలను బట్టి తెలిసికొని మిక్కిలి సంతోషించెను.

దధిముఖుడు వానరరాజుమాటలను విని సంతోషించి వారి ముగ్గురికి నమస్కరించి వెంటనే యెగిరి మధువనమునకు బోయెను. అప్పటికి వానరులు మూత్రమును విడుచుటచే వారికి మత్తు పోయెను. అప్పుడు దధిముఖు డంగదునియెదుట నిలిచి సంతోషముతో నిట్ల నెను. "తోటకావలివారు మిమ్ము వారించినందులకు రోషము నొంద కుడు. తెలియక వారట్లు చేసిరి. యువరాజగు మీరు రీతోటకు ప్రభు వులు. తెలియకచేసిన మాదోషమును క్షమింపుడు. మీ యందఱి రాక మీ పినతండ్రియగు సుగ్రీవునితో జెప్పితిని. అతడు సంతోష ముతో నున్నాడు. మీరు వనమును విఱిచినందులకు నతనికి క్రోపము లేదు. మిమ్ములనందఱిని నక్కడకు రమ్మనెను." ఇట్లు దధిముఖుడు పలుక నంగదు డామాటలను విని వానరశ్రేష్ఠులతో నిట్లనెను. "ఇక్కడ జరిగినసంగతి రామునకు దెలిసియుండుననని యనుమానించె దను. కార్యము నెఱవేర్చిన మన మిక్కడనుండుట యుక్తముకాదు.

మీరు బాగుగ తేనెలను ద్రాగి యాయాసమును దీర్చుకొంటిరి. నా. తండ్రియగు సుగ్రీవునియొద్దకు పోవుటతప్ప మనము చేయవలసినది మఱేమియు లేదు. మీరందఱు కలిసి చెప్పుదానిని నేను చేసెదను. నేను యువరాజునైనను మిమ్మాజ్ఞాపించువాడను కాను. కార్యమును నెఱవేర్చినమిమ్మాజ్ఞాపించుట యుక్తముకాదు.' ఇట్లంగదుడు పలుక వానరులు సంతోషించి యిట్లనిరి. "ఏరా జిట్లు పలుకును? రాజులైశ్వర్యమత్తతచే 'అంతయు నేనే'యని యనుకొందురు. మీరు పలికిన ట్లితరులు పలుకరు. మీ యణకువ మీమంచిని తెలుపుచున్నది. మీకు ముందు మంచిశుభము కలుగును. సుగ్రీవుడుండుచోటుకు వెళ్ళుటకు మేము నిరీక్షించుచున్నాము. మీ సెలవులేనిదే యీ వానరు లొకపాదమైనను పెట్టుటకు వీలులేదు. మేము నిజమును పలుకుచున్నాము." ఇట్లు వానరులు పలుక నంగదుడు దానినంగీకరించి 'వెళ్ళుద'మని పలికెను. తరువాత నందఱు ఆకాశమున కెగిరిరి.

---

౧౮వ. అధ్యాయము.

హనుమంతుడు రామాదులను దర్శించుట.

ఇట్లు వానరులు మధువనమును విడిచి యంత్రములచే తిరుగు పర్వతములవలె నాకాశమున కెగిరి పెద్దనాదమును జేయుచుండిరి. సుగ్రీవుడుండుచోటికి నంగదు డింకను రాకపోవుటచే రాముడు విచారముతో నుండెను. అప్పుడు వానరశ్రేష్ఠుడగు నాసుగ్రీవుడు రామునితో 'మీరోదార్పు వహింపుడు. మీకు శుభమగును. వానరులు సీతను తప్పక చూచియుందురు. సంశయములేదు. మనము పెట్టినగడువు మించినందున నామెను జూడకుండ వారెక్కడకు రాలేరు. ఆకార్యము నెఱవేఱకుండ

నంగదుడు నాప్రక్కకు రాలే'డని పలికి పూర్వమువలెనే 'వారికార్యసిద్ధియగు'నని యనెను. అట్టిసమయమున వానరులకిలకిలశబ్ద మాకాశమునుండి వారికి వినబడెను. హనుమంతుడు చేసినపనులకు వారు గర్వించి నాదము చేయుచుండిరి. అది కిష్కింధకు వచ్చిన వారికార్యసిద్ధిని దెలుపుచున్నట్లుండెను. సుగ్రీవుడు తనతోకను జాపి సంతోషముతో నుండెను. ముందు వాయుపుత్రాంగదులును, వెనుకను మిగిలినవానరులును వచ్చి రామలక్ష్మణసుగ్రీవులుండు ప్రస్రవణపర్వతమున దిగిరి. హనుమంతు డప్పుడు వారికి నమస్కరించి 'సీత నియమములనుగలిగి పాతివ్రత్యభంగములేకుండ నున్న'దని పలికెను. ఇట్లు నిజమగుసంగతి తెలిసినందులకు సుగ్రీవుడు సంతోషించెను. లక్ష్మణు డాంజనేయుని ప్రీతితో జూచెను. రాము డాతని నంతకంటె నెక్కువ ప్రీతిగజూచెను.

తరువాత వానరులు వారిముగ్గురికి నమస్కరించి సీత రావణుని యంతఃపురములోనుండుటయు, రాక్షసస్త్రీలామెను తర్జనజేయుటయు, రామునియందామెకుండునను రాగమును, నారాక్షసరాజు తన్నుపొందుట కామెకు నిర్ణయించినగడువుకాలమును దెలిపిరి. దీనిని రాముడు విని యామె యెట్లున్నదనియు, తనవిషయమై యెట్టియభిప్రాయముతో నున్నదనియు, దానినంతయు తనకు దెలుపవలెననియు పలికెను. అప్పుడు వానరులు రామునకు జెప్పుటకు హనుమంతుని ప్రేరేపించిరి. దాని కాతడు దక్షిణదిక్కుననున్న సీతకు తనతలతో నమస్కరించి జరిగినదంతయు రామునకు దెలిపి యామె తనకానవాలుగ నిచ్చిన మణిని నాతనికిచ్చెను. అత డామణిని తనహృదయమున బెట్టుకొని యేడ్చెను. లక్ష్మణుడుకూడ కన్నీరు విడిచెను. అప్పుడు రాముడు సుగ్రీవునితో నిట్లు పలికెను. దూడనుజూచినతోడనే యావుకు పాలు స్రవించున ట్లీమణిని జూచినతోడనే నాహృదయము కరుగుచున్నది. దీనిని జనకు డామెవివాహకాలమున నామెకీయ నామెతల్లి యామె

తలమీాద దానినలంకరించెను. జనకునకు యజ్ఞసమయమున నింద్రుడు సంతోషముతో దీని నిచ్చెను. దీనిని జూడ నాకు నాతండ్రిని, నామామను జూచినట్లున్నది. ఇది యామెతలమీాదనుండుటచే నామెను జూచినట్లున్నది.' ఇట్లు రాముడు సుగ్రీవునితో బలికి పిమ్మట నాంజనేయునతో 'హనుమంతా! సీత యేమనెనో పలుమార్లు నాతో జెప్పుము. ఆమె లేకుండ నీమణిని జూచినందులకు నేను మిక్కిలిదుఃఖించుచున్నాను. ఈమాసము సీత జీవించినయెడల నటుపిమ్మట చిరంజీవి యగును. ఆమెలేకుండ నేనొకనిమిషమైనను జీవింపలేను. ఆమెయుండు దేశమునకు నన్ను తీసికొనిపొమ్ము. ఆమెవార్త తెలిసినతరువాత నేనొకగడియయైనను నిలువలేను. మిక్కిలిభయస్థురాలగు నామె ఘోర రూపులగురాక్షసస్త్రీలమధ్య నెట్లున్నది? వైద్యునిమాటలను విని జీవించురోగివలె నే నామెపలుకులను విని జీవించెద' నని చెప్పుచు విలపించెను.

ఆతనిమాటల నాంజనేయుడు విని సీత తనకు దెలిపిన చిత్రకూటకాకవృత్తాంతమంతయు రామునకు జెప్పి యామె తనతో జెప్పిన సంగతులను, తానా మెనోదార్చిన యంశములను పూర్తిగ దెలిపి 'నేను మంచిమాటలాడుటచే నామె శాంతిని బొందిన' దని పలికెను.



ఓమ్

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# విశోధితరామాయణము.



## 11వ. ప్రకరణము.

## రామరావణులయు, బలములయు యుద్ధము.

### ౧వ. అధ్యాయము.

### రాముడు యుద్ధసన్నాహమునుగూర్చి యాలోచించుట.



హనుమంతుడు సీతతో తాను జరిపినప్రసంగమును రామునకు దెలిపినతరువాత రాము డిట్లనెను. "నీవు మనస్సులోనైనను దలంపశక్యముకాని దుర్లభమగు గొప్పకార్యమును జరిపితివి. గరుత్మంతుడును, వాయువును,నీ వునుతప్ప నితరు లెవరును సముద్రమును దాటలేరు. దేవ దానవ యక్ష గంధర్వ నాగ రాక్షసులకుగూడ ప్రవేశింపశక్యముకానిదియు, రావణునిచే రక్షింపబడుచున్నదియునగు లంకలో ప్రవేశించి ప్రాణములతో నెవడు తిరిగి రాగలడు? నీవీర్యబలములతో సమానమగువా రెవరును లేరు. నీ వసమానములగు బలపరాక్రమములను జూపి నీప్రభువగు సుగ్రీవునిగొప్పకార్యమును దూతవై జరిపితివి. దూతలలో * నుత్తమమధ్యమాధములు కలరు. నీ వుత్తమదూతలలోనివాడవు. నీవు చెప్పినదానిని చేయుటయేగాక! నీగొప్పతనమును

*13వ. ప్రకరణము, ౧౨వ. అధ్యాయము రాజనీతులు చూడుము.

గూడ జూపితివి. అందువలన సుగ్రీవుడు సంతసించెను. నీవు సీతను జూచుటచే నేనును, లక్ష్మణుడును, రఘువంశమును ధర్మమార్గమున రక్షింపబడితిమి. నేను ప్రియమునుజెప్పిన నీకు తగినప్రియమును జేయలేనైతినని మిక్కిలి విచారించుచున్నాను. కాన నాసర్వస్వమగు కౌగిలి నీకిచ్చెదను. ప్రత్యుపకారముచేయవలసిన యీకాలమున నే నీకౌగిలిని మహాత్ముడవగు నీ కిచ్చుచున్నాను." ఇట్లు రాముడుపలికి మిక్కిలిసంతోషముచే పులకితగాత్రుడై మహాత్ముడును, కార్యమును జరిపివచ్చినవాడుననగు హనుమంతుని కౌగిలించెను. తరువాత నతడు కొంతసేపాలోచించి సుగ్రీవుడు వినుచుండ వాయుపుత్రునితో నింకను నిట్లనెను. 'నీవు సీతను జూచుటయను గొప్పపనిని జేసితివి. గొప్పసముద్రముసంగతి నాలోచింప నామనస్సు దిగులొందుచున్నది. దాటశక్యముకాని యీసముద్రమును వానరులు లంఘించి లంకయొక్క దక్షిణతీరమున కెట్లు వెళ్లెదరు?' ఇట్లాతడు వాయుపుత్రునితో బలికి శోకముచే చలించుచు నాలోచనానిమగ్నుడయ్యెను.

అట్లు విచారించుచున్న రాముని శోకము పోవునటుల సుగ్రీవుడిట్లు పలికెను. "ఇతరసామాన్యపురుషునివలె మీరెందులకు సంతాపము నొందెదరు? మీరట్లుండగూడదు. మీకు సీతవార్తయు, శత్రువుండుచోటును తెలిసినతరువాత మీసంతాపమునకు నేను కారణమును గానను. గొప్పబుద్ధిమంతులును, శాస్త్రములు దెలిసినవారును, మంచియూహాపోహలుగలవారునునగు మీరు మనప్రయోజనమునకు విరుద్ధమగు నిట్టి బుద్ధిని విడువుడు. మే మెగిరి సముద్రమును దాటి లంకలో బ్రవేశించి మీశత్రువును జంపెదము. శోకముచే నిరుత్సాహము పొందిన దీనునిపనులన్నియు నాశనమగును. తరువాత వాడు విచారమునొందును. శూరులును, శక్తిమంతులునునగు నీవానరశ్రేష్ఠులందఱు మీకొఱ కగ్నిలోనైనను బ్రవేశించుట కుత్సాహము గలిగి

యున్నారు. వారి సంతోషమువలన నేను దీనిని కనిపెట్టుచున్నాను. నేనాలోచించినది నిశ్చయము. పాపుడును, శత్రువునగు రావణునిజంపి పరాక్రమముతో నేను సీతను దెచ్చునటుల మీరుత్సాహమును జూపవలెను. మనము సముద్రమునకు సేతువును గట్టుటకును, రాక్షసరాజు నగరమును జూచుటకును తగినయుపాయమును మీ రాలోచింపుడు. రావణుడు మనలను జూచినతక్షణమే యుద్ధములో జచ్చునని మీరు నమ్ముడు. సముద్రమునకు వారధి గట్టకుండ నింద్రుడును, దేవాసురులును గూడ లంకను జయింపలేరు. లంకాసమీపమువఱకు సేతువును గట్టి దానిపైని మనము వానరసైన్యమును దీసికొనివెళ్లిన మనకు జయము కలుగును. కోరినరూపమును బొందు నీవానరులు గొప్పశూరులు. అన్ని పనులను నాశనముచేయుశోకముతో గూడినమీబుద్ధిని మీరు విడువుడు. మనుజు డెట్టిశౌర్యధైర్యముల నవలంబించినయెడల కార్యములను నెఱవేర్చునో యట్టిశౌర్యధైర్యములను, తేజమును, బలమును మీ రవలంబింపవలెను. శూరులగు మీవంటిమహాత్ములు కనబడనివానిని గూర్చియు, పోయినవానినిగూర్చియు శోకమును బొందగూడదు. శోకముబొందినయెడల నన్ని కార్యములు నశించును. శాస్త్రార్థముల న్నియుదెలిసిన బుద్ధిమంతులగు మీరు మావంటిమంత్రులతో గూడి జయమును తప్పక పొందెదరు. మీరు ధనస్సునుబట్టినిలిచియుండ మీయెదుట నిలుచువానిని మూడులోకములలో నెక్కడను నేను గానను. వానరసహాయముగల మీకార్యమునష్టముకాదు. మీరు సముద్రమును దాటి శీఘ్రముగ సీతను జూచెదరు. మీరు శోకమును విడిచి క్రోధమును బొందుడు. రాజుకోపించిన నతనిక్షత్రియసైనికులు తమమాంద్యమును విడిచి భయమునొందెదరు. మనమందఱము సముద్రమును దాటుటకు తగినమంచియుపాయమును మీరు సూక్ష్మబుద్ధితో నాలోచింపుడు. మనసైన్యము సముద్రమును దాటినవెంటనే మనకు

జయముతప్పదు. ఈవానరశూరులు యుద్ధములో శత్రువులను రాళ్ళ తోను, చెట్లతోనుగొట్టి చంపుదురు. మన మేవిధముననైన నసముద్ర మును దాటగలము. మీశత్రువు యుద్ధములో మరణించెననియే మీ రాలోచింపుడు. పెక్కుమాటలేల? అన్నివిధముల మీకు జయము నిశ్చయము. దానికి శుభశకునములు కనబడుచున్నవి. నామనస్సు మిక్కిలి సంతోషించుచున్నది." ఇట్లు సుగ్రీవుడు కారణములను దెలు పుచు పలుక నామాటల సారమును రాముడు బాగుగ గ్రహించెను.

తరువాత రాముడు హనుమంతునితో నిట్లనెను. 'నాతపఃప్రభా వముచే సముద్రముపై సేతువును గట్టికాని, లేక దానిని నాబాణా గ్నిచే నింకించికాని నేను దానిని దాటగలుగుదును. లంకను రక్షించు యంత్రములు, కట్టడములు, ప్రాకారములు మొదలగునవియెన్నికలవో వానిని నాకు ప్రత్యక్షమగునట్లు చెప్పుము. రావణునిబలమెంత యున్నదో రాక్షసులకెన్నియిండ్లుకలవో తెలుపుము. నీవు చూచిన దంతయు నిజముగ ననుమానములేకుండ దెలుపుము. నీవన్నివిధముల నేర్పుగలవాడవు.' ఇట్లు రాముడడుగ హనుమంతుడు "అన్నిటినిదెలి పెదను; వినుడు. లంక మదించినయేనుగులతోను, గొప్పరథములతోను, మంచిగుఱ్ఱములతోను, రాక్షసగణములతోనునిండియుండి శత్రువులు ప్రవేశింప శక్యముగాకుండనున్నది. దానికి నెత్తుగు నాలుగుపెద్దద్వార ములు గలవు. వానికి మంచిబందులును, నడ్డుగడియలునుగల మంచి తలుపులున్నవి. మంచిద్వారబంధములమీద తలుపులు తిరుగును. ప్రతిద్వారమువద్దను బాణములతోను, రాళ్ళతోను బలముగల పెద్ద యంత్రములు కట్టబడియున్నవి. శత్రువులక్కడకు వచ్చినవెంటనే వారిని నవి చంపును. ప్రతిద్వారమువద్దను నుక్కుతో జేయబడినవియు, పెద్దవియు, వాడివియునగు ముద్గరము లనేకములున్నవి. ఒక్కొక్కటి నూఱుమందిని జంపును. వాని నుపయోగించుటకు రాక్షసులు సిద్ధ

ముగనుందురు. పట్టణముచుట్టునున్న గోడ బంగారుతో గట్టబడి పెద్దది గను, నెక్కుటకు వీలులేనిదిగనుండి మణులు, వైడూర్యములు, ముత్యములు మొదలగు వానితో నలంకరింపబడి యుండెను. పట్టణముచుట్టును నుండు నగడ్త మిక్కిలిలోతుగనుండి నీటితోను, పెద్దచేపలతోను నిండి యుండెను. ప్రతిద్వారమువద్దను నగడ్తలపై విశాలముగ స్థలము లేర్ప ఱుపబడి కఱ్ఱపలకలు కూర్చబడినవి. వానిపై యంత్రములు స్థాపింప బడినవి. అక్కడ నిండ్లుకూడ కట్టబడినవి. శత్రుసైన్యమువచ్చినపుడు యోధు లక్కడ నిలిచి యంత్రములను ద్రిప్ప నాయుధములు వాని నుండిబయలువెడలి యగడ్తలలోబడి శత్రుసైన్యమును పట్టణప్రాకార ములవద్దకు రాకుండ జేయును. ఒక ద్వారమువద్ద నెక్కువవిశాలమగు స్థల మేర్పఱుపబడెను. అక్కడ బాగుగ కఱ్ఱపలకలు నిర్మింపబడెను. బంగారు స్తంభములు, తిన్నెలు కట్టబడెను. రావణు డెట్టివ్యసనముల లోను నుండక యుద్ధకుతూహలుడై, జాగరూకుడై ప్రతిదినము తన బలములను పరీక్షించుచుండును. లంకాపట్టణము పర్వతముపైనుండుట చేతను, చుట్టును పెద్దయగడ్తలును, నడవులును నుండుటచేతను, నాయు ధములు, యంత్రములు మొదలగువానిచే నిండియుండుటచేతను, దేవ తలుకూడ నందుప్రవేశింపలేరు. అది సముద్రమున కావలితట్టున నున్నది. అక్కడకు నోడలు పోలేవు. అక్కడివార్తలు తెలియవు. శతఘ్నులు, (నూఱుమందినిజంపుపరిఘలు) పరిఘలు, వివిధములగు యంత్రములు లంకలో నంతటను నున్నవి. * బాగుగ యుద్ధముచే యగల రాక్షసులనేకులు శూలములను, ఖడ్గములనుబట్టి తూర్పుద్వా రమును రక్షించుచుండిరి. అంతకంటె నధికసంఖ్యాకులగు యోధులు చతురంగబలములతో దక్షిణద్వారమును కాచుచుండిరి. అంతకంటె

* యుద్ధకాండ 3వ. సర్గ 23½ మొదలగు శ్లోకములలో తూర్పుద్వారమున పదివేలరాక్షసులు కాపున్నట్లును, దక్షిణద్వారమున లక్షమంది కాపున్నట్లు ను, పశ్చిమ




నెక్కువసంఖ్యగలవారును, నస్త్రముల నుపయోగించువారునునగు శూరులు పశ్చిమద్వారమును కాపాడుచుండిరి. మంచియోధకుటుంబములో బుట్టినవారును, నేనుగులమీఁదను, గుఱ్ఱములమీఁదను స్వారి చేయువారును, పశ్చిమద్వారమందుకంటె నెక్కువసంఖ్యగలవారును నగుయోధు లుత్తరద్వారమును కాపాడుచుండిరి. పట్టణమధ్యభాగమునుగూడ ననేకరాక్షసబలములు కాపాడుచున్నవి. నేను ద్వారముల వద్ద కఱ్ఱలతో నిర్మింపబడిన యంత్రములను నాశనముచేసితిని; అగడ్త

ద్వారమును పదిలక్షలమంది రక్షించుచున్నట్లును, నుత్తరద్వారమున పదివేలకోట్లమంది కాపున్నట్లును వర్ణింపబడినది. ఇట్టివ్యత్యాసపసంఖ్యగలసైనికు లుంచబడిరని తెలుపుట నిజముకాదనియు, కవిచాతుర్యముచే నట్లు వర్ణింపబడెననియు మాయభిప్రాయము. చరిత్రగ్రంథములో ననేకులు కాపున్నట్లు వ్రాసితిమి. అరణ్యకాండ 55వ. సర్గ 13వ. శ్లోకములో రావణుఁడు తనరాక్షసబలము 32 కోట్లని తెలిపెను. అదేస్థిరమని మాయభిప్రాయము.

లలో రాళ్ళు మొదలగు వానిని వేసి నింపితిని; పట్టణమంతయు గాల్చితిని; ప్రాకారములను భగ్నముచేసితిని; సేనలో నాల్గవభాగమును నాశనముచేసితిని. మనము సముద్రము నెట్లైనను దాటగలము. వానరులు లంకను నాశనముచేసెదరని నిశ్చయించుకొనుము. అంగదుడు, ద్వివిదుడు, మైందుడు, జాంబవంతుడు, పనసుడు, నలుడు, సేనాధిపతియగు నీలుడు మొదలగు వానరులుండ నితరబలములతో మీకు పనియేమి? వారందఱు కొండలతోను, నడవులతోనుగూడ లంకను ధ్వంసముచేసి కోటగోడలను, బహిర్ద్వారములను పొడుచేసి లంకను నిక్కడకు తెచ్చెదరు. మీరు బలముల నన్నిటిని సమకూర్చి మంచిముహూర్తమున బయలుదేఱుటకు నాజ్ఞాపింపు" డని విన్నవించెను.

---

౨ వ. అధ్యాయము.

లంకకు యుద్ధమునకు వానరసైన్యము బయలుదేఱుట.

---

హనుమంతునిమాటలను సత్యపరాక్రముడగు రాముడు విని 'నీవు తెలిపినలంకనంతను నేను ధ్వంసముచేసెదను. నీతో సత్యముపలుకుచున్నా' నని చెప్పి సుగ్రీవుని నిట్లాజ్ఞాపించెను. 'ఈసమయమున నీవు ప్రయాణమై వెడలుటకు సేనను బయలుదేఱజేయవలె నని కోరుచున్నాను. ఈముహూర్తము విజయము కలిగించును. సూర్యుడు తల మీదనున్నాడు. సీత నెత్తుకొనిపోయిన రావణు డెక్కడకు పోగలడు? నేను వానిని వధించి జయమును బొందెదను. మేము బయలుదేఱిన సంగతి సీత విని ప్రాణములపై నాశకలిగియుండును. ఈదినమున

నుత్తరఫల్గునీనక్షత్రము. రేపటికి హస్తవచ్చును. ఈదినమున సర్వసైన్యముతోను బయలుదేఱుదము. మంచిశుభశకునములు కానవచ్చుచున్నవి. నేను రావణుని జంపి సీతను దెచ్చెదను. నాకుడికన్ను మీఁదిభాగ మదరుచున్నది. నామనోరథము జయమును సూచించుచున్నది.' ఇట్లు రాముడుపలుక సుగ్రీవలక్ష్మణు లతని గీర్తించిరి.

తరువాత రాము డింకను నీతిశాస్త్రయుక్తములగు మాటల నిట్లనెను. 'ముందు సేనాధిపతియగు నీలుడు త్రోవను పరీక్షించుటకు మంచివీరులగు లక్ష వానరులను వెంటబెట్టుకొని ఫలమూలములుదొరకునట్టియు, మంచియడవి, చల్లనినీరు కలిగినట్టియు, తేనెలు లభించునట్టియు త్రోవను వెళ్ళవలెను. దారిలో ఫలమూలములను, నీటిని చెడుగుచేసెడిదురాత్ములగు రాక్షసులు విషమునుగలిపి పాడుచేయకుండ నతడు జాగరూకుడై రక్షించుచుండవలెను. పల్లముగలచోట్లను, మిక్కిలి నీరుండుప్రదేశములను, వనములు దట్టముగనుండుచోట్లను వానరులెగిరివెళ్ళుచు శత్రుబలమెక్కడ దాగియుండునో చూచుచుండవలెను. మనబలములలో బలహీనులుగ నున్నవారిని నిక్కడనే యుంచివేయవలెను. యుద్ధముచేయుట మిక్కిలికష్టము. పరాక్రమముతో దానిని సలుపవలెను. సేనముందు మిక్కిలిబలముగల వానరులు వేలకొలది నడచుచుండవలెను. ముందు గజుడు, గవయుడు, గవాక్షుడు వారిని నడపుచుండవలెను. కుడిప్రక్కను ఋషభుడును, నెడమప్రక్కను గంధమాదనుడును సేనను రక్షించుచుండవలెను. మధ్యను నేను హనుమంతునిమీఁద నెక్కియు, లక్ష్మణు డంగదునిమీఁద నెక్కియు వెళ్ళెదము. జాంబవంతుడును, వేగదర్శుడును, ఋక్షరాజును వెనుక రక్షించుచుండవలెను.' ఇట్లు రాము డాజ్ఞాపింప సుగ్రీవు డంతయు నట్లు నియమించెను.

P ఉ .

○జాంబవంతుడు- ○సుషేణుడు- ○వేగదర్శుడు- ○ ఋక్షరాజు

○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ కేసరి

వానరులు ○ పనసుడు

○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ మఱియొకగజుడు

వానరులు

○సుగ్రీవుడు ○రాముడు ○ లక్ష్మణుడు

○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○

వానరులు

ఋషభుడు○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ గంధమాధనుడు

వానరులు

○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○

వానరులు

○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○

వానరులు

○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○

మహాబలులు

○గజుడు ○గవయుడు ○గవాక్షుడు

○ ○ ○ ○ ○ ○ ○ ○ ○ ○

వానరులు

○నీలుడు

వానరులందఱు యుద్ధముచేయునుత్సాహముతో కిష్కింధసమీపముననున్న ప్రస్రవణపర్వతగుహాలనుండియు,కొండశిఖరములనుండియు శీఘ్రముగ నెగిరివచ్చిరి. సుగ్రీవలక్ష్మణులుకీర్తించుచుండ రాముడుసైన్య

ముతో దక్షిణదిక్కునకు బయలువెడలెను. వానరులు నూఱుకోట్ల మంది బయలుదేఱిరి. వారు మిక్కిలిసంతోషముతో గర్జించి యొకని యొద్దకు మఱియొకడు పరుగెత్తుచును, నెగురుచును, గర్జించుచును, సింహనాదముచేయుచును వెడలిరి. వారు మంచివాసనగల పండ్లను తినుచును, తేనెను త్రాగుచును, పూలగెత్తులుగలచెట్లనెక్కుచును వెళ్ళుచుండిరి. ఒకరిచేతు లొకరుపట్టుకొని మీదికెత్తుకొనుచును, త్రోసి కొనుచును, పడుచును, కొండఱిని దూరముగ విసరివేయుచును వెళ్ళిరి. 'రావణుని, రాక్షసులనందఱిని మేము జంపివేయుదు'మని వారు రామునిసమీపమున గర్జించుచుండిరి. సేనమొదట నీలుడును, మఱియొకఋషభుడును, కుముదుడును నడచుచు దారిని పరీక్షించుచుండిరి. సేనమధ్యను సుగ్రీవుడును, రామలక్ష్మణులును నిలిచిరి. * శతవలిచాలసైన్యముతో బయలుదేఱి దానినంతటిని రక్షించుచుండెను. కేసరియు, పనసుడును, మఱియొకగజుడును, నర్కుడును, ననేకసేనలతో బయలుదేఱి వానినొకప్రక్కను రక్షించుచుండిరి. సుషేణుడును, జాంబవంతుడును నెలుగుబంట్లరూపముగల సైన్యముతో సుగ్రీవునివెనుకనిలిచి సేనయొక్కవెనుకభాగమును రక్షించుచుండిరి. నీలుడు ముందుబోవుచు దానినంతటిని రక్షించుచుండెను.

---

* యుద్ధకాండ 4వ. సర్గ 37వ. శ్లోకమున శతవలి పదికోట్లవానరులతో వెళ్ళుచుండెనని వర్ణింపబడినది. కిష్కింధాకాండ 12వ. సర్గ 12 వ. శ్లోకమున నతనిపరివార మొకకోటిపదివేలని చెప్పబడియున్నది. కేసరి పనస గజులకు నూఱు కోట్లపరివారమని యుద్ధకాండలో వర్ణింపబడినది. కిష్కింధాకాండలో కేసరిబల మనేకవేలనియు, పనసునిబలము మూడుకోట్లనియు. గజునిబలము మూడు కోట్లనియు దెలుపబడినది. కవిచాతుర్యముచే నిట్టిసంఖ్యాభేదములు కనబడుచున్న వని మేము తలంచెదము. ప్రత్యేకవీరునితో నింతసైన్యము వచ్చినదని యీచరిత్ర గ్రంథములో మేము తెలుపక చాలసైన్యము బయలుదేఱెనని వ్రాసితిమి. కిష్కింధా కాండలో చెప్పబడిన మొత్తముసైన్యము యుద్ధమునకు బయలుదేఱెనని మేము స్థిరపఱిచితిమి.

దరీముఖుడును, ప్రజంఘుడును, రంభుడును, రభసుడును సైన్యమందంతటను దిరుగుచు వానరులను తొందరజేయుచు దానిని కాపాడుచుండిరి. ఇట్లు వానరసైన్యము ప్రస్రవణగిరినుండి బయలుదేఱి చాలదేశమును దాటి రాముని యాజ్ఞప్రకారము పట్టణములను, పల్లెలను తప్పించుకొని నడిచెను. హనుమంతాంగదులచే మోయబడుచున్న రామలక్ష్మణులు గొప్పగ్రహములగు శుక్రబృహస్పతులతో గూడిన సూర్యచంద్రులవలె ప్రకాశించిరి.

పరిపూర్ణమనోరథుడును, గొప్పబుద్ధిమంతుడునునగు లక్ష్మణుడు దారిలో రామునితో నిట్లనెను. "మీరు రావణుని యుద్ధములో జంపి సీతనుబొంది మీకార్యములనన్నిటిని బాగుగ నెఱవేర్చుకొని యయోధ్యకువెళ్లెదరు. కార్యసిద్ధినిసూచించు శుభశకునములు భూమియందును, నాకాశమందును కనిపించుచున్నవి. గాలి సైన్యమున కనుకూలముగను, సుఖముగను వీచుచు శుభమును దెలుపుచున్నది. మృగపక్షులు మంచిస్వరములతో ధ్వనిచేయుచున్నవి. దిక్కులన్నియు శుభముగనున్నవి. సూర్యుడు తేజస్సుతో ప్రకాశించుచున్నాడు. వేదములు తెలిసిన శుక్రుడు శుభుడై బాగుగ ప్రకాశించుచు మీకనుకూలుడైయున్నాడు. సప్తమహాఋషులును నాకాశమున ప్రకాశించుచు ధృవునిప్రదక్షిణము చేయుచున్నారు. మనయిక్ష్వాకువంశములో పూర్వుడగు త్రిశంకుడు శుభ్రముగ తనపురోహితుడగు వసిష్ఠునితో ప్రకాశించుచున్నాడు. మనయిక్ష్వాకుకులనక్షత్రమగు విశాఖ కాంతిగలిగియున్నది. రాక్షసుల దైవతసంబంధమగు మూలానక్షత్రము సమీపమందున్న ధూమకేతువుచే పీడింపబడుచున్నది. ఇదంతయు రాక్షసులందఱివినాశము కొఱకు సంప్రాప్తించినది. నీరు తేటగను, తియ్యగను నున్నది. తోటలు ఫలించియున్నవి. చెట్లు ఋతువునకు దగినట్లు పుష్పించి మంచివాసన నిచ్చుచున్నవి. తారకాసురుని వధసమయమున దేవసైన్యములు నడచినట్టుల కపిసైన్యములు ప్రకాశమానముగనుండి తగినవ్యూహములతో నడచుచున్నవి. మీరు వీని నన్నిటిని జూచి సంతోషమును బొంద

వలెను." ఇట్లు లక్ష్మణుడు పలికి రాముని నోదార్చెను. ఎలుగుబంట్ల యొక్కయు, వానరులయొక్కయు సైన్యములు భూమినంతటిని గప్పి నడచుటచే నెక్కువగ బుగ్గిరేగి సూర్యకాంతిని గప్పెను. ఆసైన్యమడవులను, పర్వతములను గప్పుచుబోయెను. చాలయోజనములు వ్యాపించిన సైన్యము నదులను దాటునపు డానదీప్రవాహములు బాగుగ పొంగెను. ఇంకను నాసైన్యము సరస్సులను, కొండలను, సమభూములను, చెట్లను, మధ్యమార్గములను, వంకరత్రోవలను, చుట్టుత్రోవలను దాటుచుబోయెను. వానరులు తమవీర్యపరాక్రమములనుజూపుచు, పెద్ద ధ్వనులను జేయుచును వాయువేగమున బోయిరి. వారు శీఘ్రముగనడచుచును, నెగురుచును, కిలకిలశబ్దముచేయుచును, తోకలతో తమపాదములను గొట్టుకొనుచును, రాళ్ళను విసరుచును, చెట్లను విఱుచుచును, కొండశిఖరములనెక్కుచును, సింహనాదముచేయుచును, నడచునపుడు తమకాళ్ళకుతగిలినతీగలను త్రెంపుచును, చెట్లతోను, రాళ్ళతోను నాడుకొనుచును వెళ్ళిరి. ఇట్లువారు కొన్నిరాత్రింబగళ్ళు చాలదూరము వెళ్ళి సహ్యపర్వతమును (నీలగిరి కొండలని నిర్ణయించితిమి.) జేరిరి.



వానరు లాసహ్యాపర్వతముపై విహరించుచు విడిసిరి. అక్కడ మంచిసరస్సులును, పద్మములుగల మంచికొలనులును, నేళ్ళును, నీటి మడుగులును, తోటలును, నడవులును, ననేకవిధములగుచెట్లును, లతలును నుండెను. అనేక మృగము లక్కడ నివసించెను. వానరు లక్కడ నున్నచెట్ల నన్నిటిని విఱిచిరి. గాలిచే చెట్లు రాళ్ళపై పూవులను రాల్చెను. ఆపర్వతమున నెక్కువగనున్న లోహముల ధూళి సేనపై కెగురుచుండెను. వానరు లాపర్వతమునఁనున్న నీటివాగులలో స్నానము చేసి నీరు త్రాగి క్రీడించిరి. వారు సువాసనగల ఫలములను, మూలములను, పుష్పములను దిని చెట్లకుగట్టియున్న కుండలలోని తేనెలను ద్రాగిరి. వారు చెట్లను విఱుచుచు, తీగలను లాగుచు, కొండశిఖరములను గాల్చుచు వెళ్ళిరి. వానరసైన్యము కొన్నిచెట్లనుండి మఱికొన్నిచెట్లమీఁదికి గెంతుచు, పడుచు, నడచుచు వెళ్లెను. అక్కడనుండి యాసేన మలయపర్వతమునకు (మధురజిల్లాలోనుండు నల్లమలాయి మొదలగు కొండలని నిర్ణయించితిమి.) వెళ్లెను. సహ్యాపర్వతముననున్నట్లక్కడకూడ చెట్లు మొదలగునవి యుండెను. అక్కడకూడ వానరులు చెట్లను విఱుచుచు తేనెలను ద్రాగిరి. తరువాత వారు శీఘ్రముగ బోవుచు చివరకు మహేంద్రగిరిని జేరిరి.

రామలక్ష్మణసుగ్రీవులు మహేంద్రపర్వత మెక్కి దానికి తూర్పుననుండు సముద్రమును జూచిరి. అక్కడనుండి వారు సైన్యముతో సముద్రతీరముననున్న వనములోనికి దిగి యక్కడ విడిసిరి. అప్పుడు రాముడు సుగ్రీవునితో 'మన మనుకొన్నట్లీసముద్రమును దాటుయత్నమును జేయవలెను. ఆవలితీరము మనకు గనబడకున్నది. సేనయచ్చటికి బోవుటకు మంచియుపాయమును మన మాలోచింపవలె'నని పలికి 'సేననంతయు నిక్కడ నిలుపవలెను. ఏసేనానాయకుడును తనసేనను విడిచి పోగూడదు. శత్రువులు రహస్యముగ దాగియుండి

మనబలములను జంపుటకు యత్నించుచుందురు. కాన జాగ్రత్తగనుండ వలెను.' ఇట్లు రాముడు సెలవీయ సుగ్రీవలక్ష్మణులు సేనను వేలావనమున నిలిపిరి. వానరులు వేఱుగను, నెలుగుబంట్లరూపముగలవారు వేఱుగను, గోపుచ్ఛులు వేఱుగను విడిసిరి. వారు సముద్రములో నెగురుచున్న పెద్దకెరటములను, భయంకరములగు తిమింగిలములను, పాములను, మొసళ్ళను, రాక్షసులను నాశ్చర్యముతో జూచుచుండిరి.

---

## ౬వ. అధ్యాయము.

## రాముడు సముద్రతీరమున సీతకై విలపించుట.



వానరసేన మహేంద్రగిరిసమీపమున సముద్రతీరముననున్న వేలావనమున విడిసియుండెను. నీలుడు దానిని బాగుగ కాపాడుచుండెను. మైందద్వివిదులు దానిచుట్టు నన్నివైపులకు తిరిగి దానిని రక్షించుచుండిరి. అప్పుడు రాముడు విలపించుచు లక్ష్మణునితో నిట్లు పలికెను. "ఎవరికైనను కాలముగడచినకొలది శోకముపోవును; గానిసీతను జూడకపోవుటచే గలిగిన నాదుఃఖముమాత్రము రోజురోజుకు వృద్ధియగుచున్నది. ఆమె దూరమున నున్నందులకుగాని, యామెను రావణు డెత్తుకొనిపోయినందులకుగాని నాకు దుఃఖములేదు; కాని యామెయౌవనమువ్యర్థమగుచున్నందులకు నేను విచారించుచున్నాను. వాయువా! నీ వామెను స్పృశించి తిరిగినాయొద్దకు వచ్చి నన్ను స్పృశింపుము. ఆమెను రావణుడు తీసికొనిపోవుచున్నపుడామె 'హా! నాథా' యని పలికినపలుకులు విషమువలె నాశరీరమును దహించుచున్నవి. ఆమెవియోగముచేతను, నే నామెను మనస్సులో దలచుచుండుట

చేతను రాత్రింబగళ్ళు మన్మథాగ్నిచే నా శరీరము మండుచున్నది. జలములో పండుకొనినవాని నది యంతగ బాధింపలేదుగనుక నేను నిన్ను విడిచి సముద్రములో స్నానముచేసి పండుకొనెదను. నే నిప్పుడు రావణుని బాణములతో జంపి మిగిలిన శత్రువులను నాశనముచేసి సీతను బొంది యామె సంతోషముగనుండ భోగసౌఖ్యముల ననుభవించెదను. సనాథయగు నామె ఘోరస్వరూపములుగల రాక్షసస్త్రీలమధ్య

---

అ. రా:—రాముడు దేవకార్యార్థము మనుష్యరూపమును బొందెనుగాన నతడు మనుష్యునివలె సీతనుగూర్చి విచారమును బొందెను. అతడు సనాతనుడగు పరమాత్మ; తనవంటివాడులేనివాడు; చిత్స్వరూపుడు. అతనినిజరూపము దెలిసినవారికే దుఃఖాదులెంతమాత్రమంటలేనప్పుడు నాశనరహితుడును, ఆనందస్వరూపుడునునగు నతనివిషయమున వేఱుగ చెప్పదగినదేమున్నది? అజ్ఞానకార్యములగు దుఃఖము సంతోషము, భయము, క్రోధము, లోభము, మహాత్తులాత్మకెట్లుకలుగును? దేహమునం దభిమానముగలవానికే దుఃఖము కలుగునుగాని దేహాభిమానములేనిచిదాత్మకు గలుగదు. నిద్రావస్థయందు రెండవవస్తువులేకపోవుటచేత సుఖమే యెట్లనుభవింపబడుచున్నదో యట్లే పంచకోశములనుండి వేఱుచేయబడిన యాత్మకు బుద్ధ్యాదులసంబంధము లేకపోవుటచే దుఃఖము సంభవింపనేఱదు. (పంచకోశములనగా అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశము లనునవి. అన్నమయకోశము=స్థూల దేహము. ప్రాణమయకోశము=ప్రాణాదిపంచకము, కర్మేంద్రియ పంచకము. మనోమయకోశము=జ్ఞానేంద్రియపంచకము, మనస్సు. విజ్ఞానమయ కోశము=జ్ఞానేంద్రియపంచకము, బుద్ధి. ఆనందమయకోశము=ఇష్టవస్తు సందర్శనమువల్లను, నిష్టవస్తులాభమువల్లను, నిష్టవస్తుభోగమువల్లను గలిగిన సుఖవిశేషములతోగూడిన కారణశరీరమగు నవిద్యయందలి

నుండి యనాథవలె రక్షకుడు లేకయున్నది. జనకమహారాజుకుమా ర్తెయు, దశరథుని కోడలునునగు నామె రాక్షసస్త్రీలమధ్య భూమి యందెట్లు శయనించియున్నది? సహజముగ సన్ననిశరీరముగల యామె శోకముచేతను, భోజనములేకపోవుటచేతను మిక్కిలి మెండిపోయియుం డును.” ఇట్లు రాముడు విలపించుచుండ సంధ్యాకాలమాయెను. లక్ష్మ ణుడతని నోదార్చ సతడు సంధ్యావందన మొనర్చి సీతను దలచుచు శోకముతోనుండెను.

---

## ౨౯. అధ్యాయము.

## రావణుడు లంకలో సభదీర్చుట.

హనుమంతుడు లంకనుగాల్చి వెళ్లినతరువాత రావణుడు సభ దీర్చి సిగ్గుచే కొంచెము తలవంచుకొని యిట్లనెను. ‘ప్రవేశించుటకు వీలులేని యీలంకలో వానరరూపుడగు హనుమంతుడు ప్రవేశించి సీతను జూచి ముఖ్యులగు రాక్షసులను జంపి పట్టణముకాల్చెను. నే నిప్పు డేమిచేయవలెనో యిటుపైని తగినకార్యమేదో దేనిని చేసిన మనకు మేలగునో మనము చేయగలిగినదేదో మంత్రులగు మీరు బాగుగ నాలోచించి చెప్పవలెను.’ మంచియాలోచనవలననే జయము

---

మలినసత్త్వము). బుద్ధికే దుఃఖాదులు గలుగునుగాని యాత్మకు గలు గనేకలుగవు. రాముడు పరమాత్మ; పురాణపురుషుడు; ఎల్లప్పుడు ప్రకాశముగనుండువాడు; ఎల్లప్పుడు సుఖముకలవాడు; కోరికలులేని వాడు; అయినను రాముడు మాయాగుణములతో గూడియుండుటచే నతడజ్ఞానులచే సుఖదుఃఖములు గలవానివలె తలంపబడును.

కలుగునని బుద్ధిమంతులు చెప్పెదరు. మహాబలులగు మీరు రామునిగూర్చి బాగుగ నాలోచనచెప్పవలెను.' ఇట్లు రావణుడు పలికి *యుత్తమ మధ్య మాధమరాజులయొక్కయు,నుత్తమమధ్య మాధమ మంత్రులయొక్కయు లక్షణములను దెలుపుచు 'మీరు ఉత్తమమంత్రులు గాన బాగుగనాలోచించి నేను చేయవలసినపనిని దెలుపవలెను. నేను దానిని జరిపెదను. అనేకవానరవీరులతో రాముడు మన లంకకు వచ్చి దీనిని ముట్టడించును. అతడు తనతమ్మునితోను, బలములతోను సుఖముగ సముద్రమును దాటును; లేక దానిని నింకింపజేయును; లేక దానినిదాటుటకు మఱియేయత్నమునైనను జేయును. అతడట్లులంకను జేరినయెడలను, వానరులతో మనకు యుద్ధము సంభవించినయెడలను మనపట్టణమునకును, సైన్యమునకును మేలుకలుగునట్లు మీరు నా కాలోచన చెప్పవలె'నని పలికెను.

మహాబలులును, బుద్ధిలేనివారును, నీతిశాస్త్రవిరుద్ధముగజరించు వారునునగు రాక్షసులు రావణునిమాటలను విని శత్రువగు రాముని బలము తెలియక 'మీబలములు పరిఘలుమొదలగు నాయుధములను బట్టి యుద్ధముచేయుటకు సిద్ధమైయుండ మీకు విచారమేల?'యని పలికి యాతనిదిగ్విజయములను వర్ణించుచు 'మీరు గొప్పక్షత్రియులను బలాత్కారముగ యుద్ధములో జంపిరి. వారితో రాముడెంతమాత్రము సరిపోలడు. మహారాజా! మీకు శ్రమయేల? మీరు నిలిచి యింద్రజిత్తును బంపిన నతడొక్కడే వానరులను జంపును. అతని పరాక్రమము లన్నియు మీకు తెలియును. మీ రతనిని బంపుడు. వానరసేనను, రాముని నాతడొక్కడే చంపును. నీచుడగు హనుమంతుని వలన మనకు కష్టమువచ్చినది. దానిని మనస్సులో నుంచుకొనగూడదు. మీరు రాముని తప్పక వధించెద'రని పలికిరి.

---

* 13వ్య. ప్రకీర్ణకరణము. ౧౨వ. అధ్యాయము రాజనీతులు చూడుము.

తరువాత నీలమేఘమువంటిశరీరచ్ఛాయగలవాఁడును, సేనాపతి యునగు ప్రహస్తుఁడు చేతులుజోడించి యిట్లు పలికెను. 'దేవ దానవ గంధర్వ పిశాచ నాగులే మిమ్ము పట్టలేనప్పుడు వానరులు యుద్ధమున మిమ్మేమిచేయగలరు? హనుమంతు డున్నప్పుడు మేమందఱ మజాగ్రత్తగ నుండి మనకెవ్వరు నపాయము చేయలేరని మత్తతచే ధైర్యముతో మోసపోతిమి. లేనియెడల నేను జీవించియున్నంతకాలము వాఁడు ప్రాణములతో బోలేఁడు. మీ రాజ్ఞాపించినయెడల జగత్తులోనుండు వానరుల నందఱిని నిర్మూలము చేసెదను. వారివలన బాధయేమియు గలుగకుండ జేసెదను. మీకు సీతాపహరణమువలన దుఃఖమేమియు గలుగదు.' ఇట్లు ప్రహస్తుఁడు పలికినతరువాత 'దుర్ముఖు' డను రాక్షసుఁడు మిక్కిలిక్రోధముతో 'హనుమంతుఁడు మనల నందఱిని జయించుటవలనను, లంకను గాల్చుటవలనను రాక్షసరాజునకు, నంతఃపురమునకు పరిభవమును, మనకు మిక్కిలియవమానమును గలిగెను. ఈముహూర్తమున నేనొక్కఁడనే వానరులనందఱిని సముద్రములోనున్నను, నాకాశమున నున్నను, పాతాళములోనున్నను జంపెద'నని పలికెను. తరువాత మహాబలుఁడగు వజ్రదంష్ట్రుఁడు మాంసరక్తములతో నిండియున్న పెద్ద పరిఘనొకదానిని బట్టి క్రోధముతో నిట్లనెను. "రామలక్ష్మణసుగ్రీవులు జయింపబడనంతకాలము స్వల్పుఁడును, కనికరింపదగినవాఁడును నగు వాయుపుత్రుని నిగ్రహించుటవలన మనకేమిలాభము? ఇప్పుడు నే నొక్కఁడనే వానరసేనను నాశనముచేసి రామలక్ష్మణసుగ్రీవులను నీపరిఘతో జంపివచ్చెదను? రాజా! మఱియొకసంగతిని జెప్పెదను. మీ కిష్టమైన దానిని వినుడు. నేర్పుగలయుపాయముచే సుఖముగ శత్రువులను జయించెదరు. కోరినరూపముధరించువారును, శూరులును, ఘోరస్వరూపులును, మీచే నిర్ణయింపబడినవారునునగు వేలకొలఁది రాక్షసులు భయములు దేఱి మనుష్యరూపమును బొంది రామునియొద్దకు

వెళ్ళి 'మీతమ్ముడగు భరతుడు మమ్ములను బంపెను' అని పలుకవలెను. వారిమాటలను విని యతడు వానరసేనను విడిచి కొంచెముదూరమును వచ్చును. అప్పుడు మేము శూలములు, శక్తులు, గదలు, ధనస్సులు, బాణములు, కత్తులు మొదలగు నాయుధములను బట్టి వేగముగ నాకాశమున కెగసి యాశస్త్రములను, నాయుధములను వానరసేనపై విడువ నది నశించును. మాయారాక్షసులచే నిట్లు రామలక్ష్మణులు తీసికొని రాబడి భయముచే తప్పకతమప్రాణములను విడుతురు." ఇట్లు వజ్రదంష్ట్రుడు పలుక కుంభకర్ణపుత్రుడును, వీర్యవంతుడునునగు నికుంభుడు 'మీరందఱు మహారాజుతో నుండుడు. నేనొక్కడనే వెళ్ళి రామలక్ష్మణసుగ్రీవులను, వానరులనందఱిని జంపెద' నని పలికెను. తదనంతర పర్వతాకారుడగు 'వజ్రహను' వనువాడు కుపితుడై నాలుకతో పెదవులను నాకుకొనుచు నిట్లనెను. 'మీరు విచారమును వీడి కార్యములు సన్నింటిని స్వేచ్ఛగ జేయుచుండవలెను. నేనొక్కడను వానరుల నందఱిని తిని వేయుదును. మీరందఱు మంచిమద్యముత్రాగి చింతలేకుండ క్రీడించు చుండుడు. నేనొక్కడనె లక్ష్మణసుగ్రీవులను, అంగదహనుమంతులను, రణశ్రేష్ఠుడగు రాముని జంపెదను.' ఇట్లు రాక్షసశ్రేష్ఠుడు పలికిన పిమ్మట నికుంభుడును, రభసుడును, సూర్యశత్రుడును, సుప్తఘ్నుడును, యజ్ఞహంతయు, మహాపార్శ్వుడును, మహోదరుడును, నగ్నికేతువును, రశ్మికేతువును, ఇంద్రజిత్తును, ప్రహస్తుడును, విరూపాక్షుడును, వజ్రదంష్ట్రుడును, ధూమ్రాక్షుడును, అతికాయుడును, దుర్ముఖుడును లేచి యాయుధములను బట్టుకొని మిక్కిలిక్రోధముతో 'ఇప్పుడే లంకను గాల్చిన హనుమంతుని, రామలక్ష్మణసుగ్రీవులను జంపెద' మని పలికిరి.

ఇట్లు రావణునిసభలోని రాక్షసవీరు లాయుధములను బట్టుకొని పలుక విభీషణుడు వారినందఱిని వారించి కూర్చుండజేసి చేతులు జోడించి యిట్లు పలికెను. "నాయనలారా! సామదానభేదములచే

కార్యము నెఱవేఱనప్పుడు దండోపాయ ముపయోగింపవలె నని పెద్దలు చెప్పుదురు. శత్రువులు ప్రమత్తులును, ప్రతికూలదైవము కలవారును నగునపుడు శాస్త్రనిర్ణీతములగు దండోపాయములవలన కార్యములు నెఱవేఱును. జాగరూకుడును, బలముతోగూడినవాడును, జయించుటయందిచ్ఛగలవాడును, క్రోధమును స్వాధీనముచేసికొన్నవాడును, జయింపశక్యముకానివాడునునగు రాముని మీ రెట్లు లోబఱుచుకొనగలరు? హనుమంతుడు ఘోరసముద్రమును దాటి చేసినగొప్పపనుల నాలోచింపుడు. శత్రువులు గొప్పబలవంతులు; వీర్యవంతులు. వారి నేకారణముచేతనైనను స్వల్పులుగ నెంచగూడదు. జనులు తమప్రాణములను తమశక్తికొలది రక్షించుకొనవలెను. ఖరుడు మిక్కిలిదుర్వృత్తుడగుటచే రామునివలన వధింపబడెను. రామునిభార్యను రాక్షసరాజు జనస్థానమునుండి యెత్తుకొనిపోవుటకు రాము డతని కేమియపకారము చేసెను? పరదారలపొందు కీర్తిని బోగొట్టును; ఆయువును క్షీణింపజేయును; ప్రయోజనములను బోగొట్టును; పాపమునుగలుగజేయును. సీతనుగూర్చి మనకు గొప్పభయము గలిగినది. ఆమెను తిరుగ నిచ్చివేయవలెను. ఆమెమూలమునవచ్చు కలహమువలన మనకు ప్రయోజనమేమి? ధర్మాచరణుడును, వీర్యవంతుడునునగు రామునితో వైరము మనకు తగదు; విరోధమువలన ప్రయోజనము కూడలేదు. రాముడు పుష్కలమగు నీలంకను బాణములచే నాశనముచేయక పూర్వమే యామెను తిరుగ నాతని కిచ్చివేయవలెను. గొప్పదియు ఘోరమగు నదియు, జయింపశక్యముకానిదియునగు వానరసైన్య మీపట్టణమును ముట్టడింపకమునుపే సీత నిచ్చివేయవలెను. అట్లు చేయనియెడల నీ పట్టణము నశించును. శూరులగు రాక్షసులు మరణము నొందెదరు. రాక్షసరాజా! నేను మీతమ్ముడనగుటచే మిమ్ము వేడుకొనెదను. నా మంచిమాటలను వినుడు. రామునకు సీత నిచ్చివేయవలెనని మిమ్ము

ప్రార్థించుచున్నాను. మీ మరణముకొఱకు రాముడు బాణములను విడువకపూర్వమే నేను మిమ్మిట్లుకోరుచున్నాను. బోగొట్టుకోపమును వీడుడు. మీ క్రీడలను, కీర్తిని వృద్ధిబొందించు ధర్మము నవలంబింపుడు. మీకు దయగలిగినయెడల పుత్త్రబాంధవులతో గూడి జీవించెదము. రామునికి సీతనిండు." ఇట్లు విభీషణుడు పలుకగా మాటలను రావణుడు విని సభలోనుండువారందఱికి సెల విచ్చి తాను తననగరులోనికి వెళ్ళెను.

---

## ౧౧ వ. అధ్యాయము.

### విభీషణుడు రావణునకు మఱియొకమాఱు నీతిని బోధించుట.

---

ఆమఱునాటియుదయమున రావణుడు తననగరులో నమాత్యులతో కొలువుదీర్చియుండ ధర్మార్థములను నాతనికి దెలుపుటకు విభీషణుడు భయములేకుండ నచటికి వెళ్లెను. అక్కడ తనయన్న విజయమునకై వేదము తెలిసినవారు పుణ్యమగుమాటలను బలుకుచుండిరి. మంత్రవేదములు తెలిసినవారిని పూవులతోను, నక్షతలతోనుపూజించి వారికి పెరుగుపాత్రలను, నేతిపాత్రిలను దానము లిచ్చుచుండిరి. విభీషణుడు మంచిబంగారు నాసనమున నున్న తనయన్నను జూచి నమస్కరించి తానుకూడ నొకబంగారునాసనముపై గూర్చుండెను. దేశకాల ప్రయోజనములు తెలిసినవాడును, మంచిచెడ్డలను బాగుగనెఱిగిన వాడునునగు నతడు తనసోదరునిస్తుతించి కారణసహితముగ వానికి హితమగునట్లు మంచిమాటల నిట్లు పలికెను. "సీత యీపట్టణముకు వచ్చినదిమొదల నేకములగు చెడుశకునములు గనబడుచున్నవి.

ఎఱ్ఱనికణములతోనున్నను, పొగతోగూడినజ్వాలలు గలిగియున్నను, మంత్రయుక్తమైనను నగ్ని వృద్ధిబొందకున్నది. అగ్నితోగూడియున్న వంటసాలలలోను, నగ్నిహోత్రములుచేయుహోమశాలలలోను, వేదములుచదువుప్రదేశములలోను పాములు తిరుగుచున్నవి. దేవతలకిచ్చుహావ్యము (నేయికలిసిన యన్నము) లో చీమలు కనబడుచున్నవి. ఆవులపాలెండిపోయెను. పరాక్రమముగల యేనుగులకు మదము లేకున్నది. గుఱ్ఱములు దీనముగ సకిలించుచున్నవి. అవి సంతోషముతో గడ్డిమేయకున్నవి. ఒంటెలు, గాడిదలు, కంచరగాడిదలు వెండ్రుకలను రాల్చుచు కన్నీరు విడుచుచున్నవి. వానికి నౌషధములు మొదలగునవి యిచ్చుచున్నను నవి పూర్వమువలె సహజస్థితిలోనికి రాకున్నవి. మేడల మీదను, విమానములమీదను కాకులుగుంపులు కూడి క్రూరధ్వనులు చేయుచున్నవి. పట్టణములో గ్రద్దలు గిరగిర తిరుగుచు మేడలపై వ్రాలుచున్నవి. ఉదయమునను, సాయంకాలమునను నక్కలు పట్టణసమీపమున నఱచుచున్నవి. మాంసాహారముగలజంతువులు పట్టణద్వారముల నిలిచి ఘోరముగ పెద్దయఱపుల నఱచుచున్నవి. ఈదుశ్శకునములవలన మనకు కీడులు గలుగకుండ మీకిష్టమున్నయెడల రామునికి సీత నిచ్చివేయవలెను. నేను లోభముచేతగాని, యజ్ఞానముచేతగాని యిట్లు పలికితి నని మీకు తోచినయెడల మీరు నన్నుక్షమింపవలెను. ఈబాధలు ప్రజలకును, రాక్షసులకును, రాక్షసస్త్రీలకును, పట్టణమునకును,నంతఃపురమునకును గలుగుచున్నవి. మీమంత్రులందఱికి నీసంగతులు తెలిసినను వారు వానిని మీతో జెప్పుటకు నిష్టపడకున్నారు. నేను వినినది, చూచినది మీకు దెలుపుట నాకు ముఖ్యమైయున్నది. నేను చెప్పినదానిని మీరు బాగుగ నాలోచించి తగినట్లు చేయుడు.” ఇట్లు విభీషణుడు తనయన్నతో నెల్లపుడు నుపయోగించునవియు, హితమగునవియు, మిక్కిలిమంచివియు

నగు మాటలను బలుక నామాటలను రావణుడు విని క్రోధముతో నిట్లుప్రత్యుత్తరమిచ్చెను. 'నేనెక్కడనుండియు భయమును గానను. రాము డెన్నడును సీతను బొందలేడు. అతని కింద్రాదులు సహాయము వచ్చినను నతడు యుద్ధములో నాయెదుట నెంతమాత్రము నిలువలేడు.' ఇట్లు రణవీరుడగు రావణుడు మంచిని జెప్పు తనతమ్మునితో బలికి వానిని విడిచెను.

---

## ౯౭. అధ్యాయము.

### విభీషణుడు రావణునకు నీతినిబోధించి చివరకు సభను విడుచుట.



విభీషణుడు సభలో రావణునితో 'సీతను రామున కిచ్చివేయ వలె'నని చెప్పి యతనివలన నిరాకరణము బొంది వెడలినతరువాత రావణుడు సీతయందలి మోహముచేతను, తానుచేసినపాపకర్మల చేతను, తనతమ్ముడు మొదలగువారు తనయెడ ననాదరణ జూపుట చేతను కొంచెము కృశించెను. రామలక్ష్మణసుగ్రీవులును, వానరసైన్య మును సముద్రపుటావలియొడ్డున విడియుట చారులవలన నతనికి దెలి సెను. అప్పు డత డాలోచనకు కాలము మించినదనియు, యుద్ధము సమీపించినదనియు; తనయమాత్యులతోను, స్నేహితులతోను నాలో చించుటకు కాలము వచ్చినదనియు తలంచి యంతఃపురమునుండి బయ టకు వచ్చి బంగారుతోను, మణులతోను, మాణిక్యములతోను నలంక రింపబడినదియు, మంచిగుఱ్ఱములను గట్టినదియునగు మంచిరథ మెక్కి రాజవీధిని సభకు బోవుచుండెను. అతనిసేన కత్తులు మొదలగు నాయు ధములను బట్టి ముందు నడచుచుండెను. కొందఱు సైనికులు మదిం చినయేనుగులనుగట్టినరథములమీదను, కొంద ఱాడుచుండెడి గుఱ్ఱ

ములమీదను గూర్చుండియుండిరి. మంచియాభరణములను, బట్టలను ధరించిన యనుచరు లతనిప్రక్కను, వెనుకను నిలిచియుండిరి. అతడు వెడలుచుండ తూర్యధ్వనులును, శంఖధ్వనులును నంతటను వ్యాపించుచుండెను. ఆరథముపై శుభ్రమగు ఛత్రమును, రెండుప్రక్కల బంగారుతో నలంకరింపబడినవియు, స్ఫటికములవలె తెల్లగ ప్రకాశించునవియునగు రెండువింజామరలును నుండెను. రథము వీధిలో బోవుచుండ ప్రజలు తమతలలతో నతనికి నమస్కరించిరి. రాక్షసులు జయవాక్యములను బలుకుచుండ నతడు తనసభను జేరెను. బంగారు స్తంభములు, వెండిస్తంభములుగలదియు, స్ఫటికములతో చెక్కబడినదియు, విశ్వకర్మచే నిర్మింపబడినదియునగు నాసభ 600పిశాచములచే రక్షింపబడుచుండెను. అందు బంగారుజలతారుగల తివాసీని బఱచిరి. దానిలో వైడూర్యములతో జెక్కబడిన మంచిసింహాసనముండెను. దానిపై మంచిచర్మమును బఱచిరి. రావణుడు దానిపై గూర్చుండి మంచివేగముగలదూతలతో 'రాక్షసులనందఱిని నిక్కడను దీసికొనిరావలెను. మనకిక్కడ గొప్పపనియున్న'దని చెప్ప వారు లంకాపట్టణములోని యన్నియిండ్లకును, విహారించుస్థలములకును, పడుకొనుస్థలములకును, నుద్యానవనములకును బోయిరాక్షసులనందఱిని బిలిచిరి. వారు, రథము లెక్కియు, గుఱ్ఱముల నెక్కియు, నేనుగుల నెక్కియు సభకు వచ్చిరి. కొందఱు నడిచి వచ్చిరి. వారు వాహనాదులను పైనివిడిచి గిరిగుహను బ్రవేశించు సింహములవలె సభలో బ్రవేశించిరి. వారందఱు తమరాజుపాదములకు నమస్కరించి యతనివలన మర్యాదలను బొంది ప్రహస్తుడును, శుకుడును తమకు తగినయాసనములను జూప వానియందును, భూమియందును గూర్చుండిరి. చేయవలసినకార్యములు బాగుగ దెలిసిన మంత్రులును, మంచి బుద్ధి, గుణములుగల యమాత్యులును, కర్మసచివులును వందలకొలది

యుండిరి. గొప్పశూరులుగూడ ననేకులుండిరి. విభీషణుడుగూడ మంచి గుఱ్ఱములను గట్టిన రథ మెక్కి సభకు వచ్చి తనయన్న పాదములకు తన పేరు చెప్పుచు నమస్కరించి తగినయాసనమున గూర్చుండెను. అక్కడి వారందఱును గట్టిగ మాట్లాడకుండ రావణునిసింహాసనమునట్టె చూచు చుండిరి. అతడు వారిమధ్యను దేవతలలో నింద్రునివలె ప్రకాశించు చుండెను.

అతడు సభనంతను జూచి సేనాధిపతియగు ప్రహస్తునితో 'సేనాపతీ! మనచతురంగబలములో మిక్కిలినేర్పరులగువారిని పట్టణమును బాగుగరక్షించుటకు నిర్ణయింపు'మని యాజ్ఞాపింప నతడు రాజశాసన ప్రకారము బలములను నగరములోపలను, పైనను వేఱుగ నిలిపెను. తరువాత నతడాసంగతిని రాజునకు దెలిపి యాతనితో 'మీరు విచారమును విడిచి మీయిష్టప్రకారము జరుపు' డని విన్నవించెను. ఆరాక్షసరాజు సుఖమును రాజ్యహితమును గోరి తనస్నేహితులతోనిట్లు పలికెను. "సంతోషముగలుగజేయుదానిని, నప్రియమును గలుగజేయు దానిని, సుఖదుఃఖములను, మంచిచెడ్డలను ధర్మార్థకామములలో దేని నిజరుపవలెనను సందేహముచే వచ్చువిషమపరిస్థితులను మీరు బాగుగ దెలుపగలరు. నేనన్నిపనులను మీతో నాలోచనచేసి యెల్లప్పుడును జయమును బొందుచుంటిని. చంద్రుడుమొదలగు గ్రహనక్షత్రములతో గూడిన యింద్రునివలె గొప్పసిరిని మీతోననుభవించితిని. రామాదుల సంగతులనన్నిటిని మీకు దెలిపియుంటిని. కుంభకర్ణునితో జెప్పలేదు. ఆఱుమాసములనుండి నిద్రించియున్న యాతని నిప్పుడు లేపించితిని. రామునిభార్యయగు సీసీతను రాక్షసులనివాసస్థానమగు దండకారణ్యమునుండి తీసికొనివచ్చితిని. మూడులోకములలోను నామెకంటె నెక్కువ సౌందర్యముగల స్త్రీలేదు. ఆమె నాతో సంభోగింప నిష్టపడకున్నది. క్రోధసంతోషకాలములు నొక్కరీతిగ నుండునదియు, శరీరవర్ణ

మును మార్చునదియునగు కామబాధచే నామనస్సు మిక్కిలివిచారముగనున్నది. ఆమె తనభర్త కొఱ కెదురుచూచుచు నాతో సంభోగించుట కొకసంవత్సరము గడువిమ్మని నన్నడిగినది. నేను దానికొప్పుకొంటిని. నేను కామునిబాధచే నలసట నొందితిని. అనేకఘోరజంతువులును, రాక్షసులునుగలసముద్రమును వానరులును, రామలక్ష్మణులును నెట్లు దాటగలరు? అయినను నొకవానరుడు మనలంకకు వచ్చి ఘోరయుద్ధముచేసెను. కార్యములెట్లు జరుగునో తెలియదు. మీరు బాగుగ నాలోచించిపలుకుడు. మనుష్యులవలన నాకెన్నడును భయములేదు. అయినను బాగుగ నాలోచింపుడు. దేవాసురయుద్ధములలో మీరును, నేనును జయమును బొందితిమి. సీతయుండుచోటు తెలియుటకు సముద్రపుటావలియొడ్డున రామలక్ష్మణులును, సుగ్రీవుడును కపిసైన్యముతో విడిసియున్నారు. ఆమెను నేను రామున కియ్యకుండునట్లును, రామలక్ష్మణులు చంపబడునట్లును మీరు బాగుగ నాలోచించి నాకు తెలుపవలెను. వానరులతో సముద్రమును దాటి లంకకు వచ్చుశక్తిగలవానినెవ్వనిని నేను గానను. కనుక నాకు జయము నిశ్చయము.”

ఇట్లు రావణుడు పలుక నామాటలను సభలోనున్న కుంభకర్ణుడు విని క్రోధముతో “మీరు మొదట నేబుద్ధితో బాగుగ నాలోచించి రామలక్ష్మణులనుండి బలవంతముగ సీతను నెత్తుకొనివచ్చితిరో యాబుద్ధితోనే యిప్పు డాలోచనచేయుడు. మహారాజా! యీకార్యమంతయు జేయకపూర్వమే మీరు మాతో నాలోచించినయెడల సమంజసముగ నుండెడిది. రాజు మొదట న్యాయముగను, బాగుగను నిశ్చయించి కార్యములను జేసినయెడల పిమ్మట విచారము నొందడు. అనాలోచితమగు నుపాయముచే చేయబడు విపరీతకర్మలు చెడుపాత్రలలోనుండి వేల్చబడు హవ్యములవలె చెడును. ముందుజరుగవలసిన పనులను వెనుక నాలోచించియు, వెనుక జరుపవలసినకార్యములను

ముందాలోచించియు చేయునతడు నీతిశాస్త్రము తెలిసినవాడుకాడు. ఆలోచనలేనివానికెంతబలమున్నను శత్రువులు వానిని జయింతురు. మీరాలోచింపకుండ సీతాపహరణమను గొప్పకార్యమును జరిపితిరి. దైవయోగమున మీరట్టిసమయమున రాముని చే జంపబడలేదు. నేను మీశత్రువులను జంపి మీకు ప్రారంభించినపనిని చక్కపెట్టెదను. మీశత్రువులగు సింద్రాగ్ని వాయు కుబేర వరుణులైనను నేను యుద్ధముచేసి చంపెదను. పర్వతమువంటిశరీరముగల నేను పరిఘను బట్టి యఱచినయెడల నిందుడైనను భయమునొందును. రాముడు నన్నొక్కబాణముతో గొట్టి మఱియొకబాణమును సంధించులోపల నేను వానిరక్తమును దాగెదను. నేను రాముని జంపి మీకు సుఖము, జయము కలుగునటుల యత్నించెదను. నేను లక్ష్మణునిగూడ జంపి వానరముఖ్యులనందఱిని తినివేసెదను. తరువాత సీత మీకు చాల కాలము స్వాధీనమగును. మీకిష్టమువచ్చినట్లు క్రీడించుచు, మంచి మద్యములను దాగుచు విచారమును వీడి మీకు హితమగుపనులను జేయు"డని పలికెను.

ఆరాక్షసవీరునిమాటలకు రావణునకు క్రోధము రాగా మహాపార్శ్వుడొకగడియ యాలోచించి చేతులుజోడించుకొని యాతనితో నిట్లనెను. 'మీరు గొప్పకష్టముతో సీతను హరించి యజ్ఞానునివలె నామెతో నేలసంభోగింపకున్నారు. మీశత్రువులను మీరణగద్రొక్కి యామెను బలవంతముగ ననుభవింపుడు. మీరందఱకు ప్రభువులు. అట్లు మీరు క్రీడించినతరువాత వచ్చినభయము, రాబోవుభయము పోవుటకు మీరు యత్నింపవచ్చును. కుంభకర్ణుడును,నింద్ర

---

అ. రా:—కుంభకర్ణుడు రావణునితో రాముడు మనుష్యుడు కాడనియు, నాశనరహితుడగు నారాయణుడనియు, సీతలక్ష్మియనియు నీవు రాక్షసులనాశనమునకై యామెను దెచ్చితివనియు బలికెను.

జిత్తును, మేమును నిందుక్రినితో సమానులైనను మిాశత్రువులను నోడిం పగలము. శక్తిలేనివారు సామదానభేదోపాయముల నుపయోగింతురు. అవి మనకు తగవు. మీరు దండోపాయమునే యాలోచింపుడు. లంకకు వచ్చినశత్రువుల నందఱిని మేము మావశము చేసికొనెదము.' ఇట్లు మహాపార్శ్వుడు పలుక వానిని మర్యాదచేసి రావణుడు 'ఒకరహస్యము కలదు. చెప్పెదను; వినుము. నేను * పరస్త్రీలతో వారి కిష్టములేకుండ సంభోగించిన నాతల వేయిముక్కలగును. ఇట్లు నాకు శాపమున్నది. అందుచే నేను సీతను బలాత్కారముగ ననుభవించుటకు భయపడుచున్నాను. నావేగము సముద్రవాయువుల గతివంటిది. రాముడు దానినెఱుగడు. అందుచే వాడు నాతో యుద్ధమునకు వచ్చుచున్నాడు. గిరిగుహలో నిద్రించుచున్న సింహమువలెను, క్రోధించిన మృత్యువువలెను నున్న నన్ను లేపుటకు రాముడు కోరుచున్నాడు. నేను యుద్ధములో విడచు వాఁడిబాణములను వాడు చూచియుండక పోవుటచే నాతో యుద్ధమునకు వచ్చుచున్నాడు. నేను ధనస్సును బట్టి వానిపై ననేకబాణములను శీఘ్రముగ విడుచుచు వానిని జయించి వానిసైన్యమును బాఱదోలెదను. నాబాహుబలముచేతనే కుబేరుని యీలంకాపట్టణమును బట్టుకొంటి' నని ప్రసంగించెను.

---

* రావణుడు రంభను చెఱబట్టినందులకు నలకూబరుడు 'రావణు డితరస్త్రీలతో వారికిష్టములేకుండ సంభోగించిన నతని తల వేయిముక్కలగు' నని శాపమిచ్చెను. ఇచ్చట నతడు 'బ్రహ్మగృహమునకు వెళ్ళుచున్నపుంజికస్థలయను నప్సరసను తాను చెఱబట్టినందులకు బ్రహ్మ తనకు శాపమిచ్చినట్లుతెలిపియున్నాడు. రంభను చెఱబట్టుటయే ప్రఖ్యాతమగు వంశమై నమ్మదగియున్నది. అదియే ముందుజరిగినయెడల నిది జరిగియుండదు. ఇది ముందుజరిగిన నది జరిగియుండదు. కనుక రావణు డిప్పుడు చెప్పినసంగతి కల్పితమువలె గనబడుచున్నది. ఆసంగతినే రావణు డిప్పుడు బ్రహ్మతనకు శాపమిచ్చినట్లు త్రిప్పిచెప్పిన నెక్కువ బలముగనుండునని తోచి చెప్పినట్లున్నది.

విభీషణుడు రావణకుంభకర్ణుల పలుకులను విని జరుపవలసిన కార్యమునుగూర్చి రావణునితో మంచిమాటలిట్లనెను. "రాజా! మీ మెడకు సీతయను సర్పమేలచుట్టుకొన్నది? పర్వతశిఖరములవలెనుండు వానరులు లంకకు పరుగెత్తుకొనివచ్చి కోఱలతోను, గోళ్లతోను యుద్ధముచేయకపూర్వమును, వడిగలరాముని తీవ్రబాణములు రాక్షసవీరుల తలలను తెగగొట్టకపూర్వమును నామెను మీ రాతని కిచ్చివేయవలెను. ప్రహస్తా! రాముని వాడిబాణములు నీశరీరమున ప్రవేశించి నీప్రాణములను దీయువఱకు నీవు నిన్ను పొగడుకొనెదవు. ఇంద్రజిత్తు, కుంభకర్ణుడు, మహాపార్శ్వుడు, మహోదరుడు, నికుంభుడు, కుంభుడు, అతికాయుడు, రాక్షసరాజు మొదలగువారిలో నెవ్వరైనను యుద్ధములో రాముని యెదుట నిలువలేరు. రాజా! మీరు సూర్యునిచేతనైనను, మరుత్తులచేతనైనను, ఇంద్రునిచేతనైనను, మృత్యుదేవతచేతనైనను రక్షింపబడినను, మీ రాకాశమునుగాని, పాతాళమునుగాని ప్రవేశించినను రాముడు మిమ్ము ప్రాణములతో విడిచిపెట్టడు." ఇట్లు విభీషణుడు పలుక ప్రహస్తుడు 'మనకు దేవ దానవ యక్ష గంధర్వ గరుడోరగులవలననైనను యుద్ధములో భయములేనప్పుడు రాజపుత్రుడును, మనుష్యుడునునగు రామునివలన నేలభయముకలుగు' నని పలికెను. అతనిచెడుమాటలను విభీషణుడు విని రాజుహితమును గోరి ధర్మార్థకామములందు బుద్ధిని నిలిపి "ప్రహస్తా! రాజును, మహోదరుడును, కుంభకర్ణుడును, నీవును రామునిగూర్చిపలికిన యంశములను జరుపలేరు. సమస్తవిషయములు దెలిసిన యాతనిని జంపుట నీకుగాని, నాకుగాని, రాక్షసులందఱికిగాని యెట్లు సాధ్యమగును? ధర్మమే ప్రధానముగగలవాడును, మహారథుడును, నిక్ష్వాకువంశములో బుట్టినవాడును, జగత్తునకు రాజును, శక్తిసామర్థ్యములుగలవాడునగు నతడు చేయు పనులను దేవతలైనను తెలిసికొనలేరు. మనరాజు వ్యసనములలో

మునిగియున్నాడు. మీరు మిత్రరూపముతోనున్న శతృవులు. మన ప్రభువు మంచిచెడ్డలు తెలియకయుండ మీరు రాక్షసనాశనమునకై యతనిచిత్తముననుసరించి పలుకుచున్నారు. చాలతలలు, పడగలుగల గొప్పభయంకరమగు మహాసర్పమువంటి రాముని బాధనుండి మీరు రాజునుదప్పింపుడు. అతనివలన లాభములను బొందిన మంత్రులందఱు కలిసి యతనిని కష్టములనుండి తప్పింపవలెను. లంకయొక్కయు, రాక్షసులయొక్కయు, రాక్షసరాజుయొక్కయు, నతనిమిత్రులయొక్కయు శ్రేయమునకై రామునికి సీత నియ్యవలెనని నేను నాయభిప్రాయమును దెలుపుచున్నాను. మంత్రియగువాడు శతృబలమును, తమబలమును నాలోచించి శతృబలమెట్లున్నదో యది తగ్గునో, లేక హెచ్చునో యాలోచించి యట్లే తనుబలమునుగూర్చి కూడ నాలోచించి రాజున కుపయోగమగు నాలోచనను చెప్పవలె”నని పలికెను.

విభీషణుని యీమాటలను రాక్షసవీరులలో ముఖ్యుడగునింద్రజిత్తు విని యాతని నిట్లాక్షేపించెను. ‘తండ్రీ! భయమును జెందినవాని వలె నీవీయుపయోగములేని తేలికమాటల నేల పల్కితివి? మనవంశములోజన్మింపనివాడుకూడ నిట్లు పలుకడు. మనవంశములో బలము, వీర్యము, పరాక్రమము, శౌర్యము, ధైర్యము, తేజస్సు లేనివాడవు, చివరతమ్ముడవునగు నీవొక్కడవే జన్మించితివి. రాక్షసా! రాజపుత్రులగు నారామలక్ష్మణులను మాలో నేరాక్షసుడైనను చంపగలడు. నీవు భయపడుచు మమ్మేల భయపెట్టెదవు? నే నింద్రునిజయించి కట్టి భూలోకమునకు దెచ్చితిని. దేవతలందఱు భయమును జెంది యన్ని దిక్కులకు బాఱిరి. ఐరావతముయొక్క దంతములను నేను విఱుచుటచే నది ఘీంకరించుచు భూమిమీద బడెను. నేను దేవతలగర్వము నణచువాడను. దైత్యులలో ముఖ్యులైనవారికికూడ నన్నుజూచిన భయము కలుగును. ఇట్టిపరాక్రమముగల నేను సహజముగ మనుష్యు

లగు రాజపుత్రుల నేల గెలువలేను.' ఇట్లింద్రజిత్తు పలుక శస్త్రముల నుపయోగించుటలో నేర్పరియగు విభీషణుడు వానిని మందలింపుచు "నాయనా! నీ కాలోచన తెలియదు. నీవు బాలుడవు. ఇంకను నీబుద్ధి పరిపక్వము నొందలేదు. అందునిమిత్తము నీ వాత్మనాశనమునకై ప్రయోజనములేని మాటల నిట్లు ప్రేలుచున్నావు నీవు రావణునికి పుత్రరూపముతో మిత్రునివలె గనబడు శత్రుడవు. నీవు రావణునినాశనమును దెలిసికొనియు నిట్లజ్ఞానముచే బలుకుచున్నావు. దుర్బుద్ధివగు నీవు దండనీయుడవు. ఇప్పు డిట్టిమంత్రాలోచనము జరుగు సభలోనికి బాలుడవును, సాహసముగలవాడవును, పట్టినపట్టువిడువని వాడవును నగు నిన్ను తీసికొనివచ్చినవాడుకూడ దండనకు పాత్రుడు. నీ వజ్ఞానుడవు; గొప్పలు చెప్పుకొనువాడవు; వినయములేనివాడవు; క్రూరస్వభావము గలవాడవు; అల్పబుద్ధిగలవాడవు; మిక్కిలి దుర్బుద్ధివి; వివేకము లేనివాడవు. నీవు చిన్నతనముచే నిట్లు పలుకుచున్నావు. బ్రహ్మదండమువలెను, మృత్యువువలెను, యమదండమువలెనున్న తీవ్రమగు రాముబాణములను యుద్ధములో నెవ్వ డోర్వగలడు? కావున మనము ధనములను, రత్నములను, నలంకారములను, మంచిబట్టలను సీతను రామున కిచ్చి శోకమును విడిచి సుఖముగ నివసించెదముగాక!" యని పలికెను.

ఆ రాక్షసవీరునిమంచిమాటలను మృత్యుదేవతచే నీడ్వబడిన రావణుడు విని కఠినమగుమాట లిట్లు పలికెను. 'సంపూర్ణశత్రువుతోనైనను, క్రోధించినసర్పముతోనైనను వ్యవహరింపవచ్చునుగాని మిత్రరూపమునగనబడు శత్రుపక్షపాతితో వ్యవహరింపగూడదు. రాక్షసా! అన్నిలోకములలోను జ్ఞాతులబుద్ధిని నేనెఱుగుదును. వారు తమజ్ఞాతులకు కష్టమువచ్చినప్పు డెప్పుడును సంతోషించుచుందురు. వారు జ్ఞాతులలో ముఖ్యమగువానిని, కార్యము బాగుగ జరుపువానిని, పండితుని

ధర్మబుద్ధిగలవానిని నవమానింతురు. వారు పైకి సంతోషముగల వారుగ గనబడుచు లోలోపల తమదాయాదులనూర్చి దుఃఖించుచుందురు. వారికి కష్టమువచ్చిన ద్రోహమాలోచింతురు. జ్ఞాతులమనస్సులోని యాలోచన పైకి తెలియదు. వారు ఘోరమగుపనులనుజేయుచు తమజ్ఞాతులకు భయమును గలుగజేయుదురు. వేటకాండ్రు వనములో నేనుగులను తమయేనుగులవలన బట్టుకొందురు. వనగజములకు నగ్నివలనను, నితర శస్త్రములవలనను భయములేదు; కాని తమ్ముబట్టించు నితరగజములవలన భయముకలుగుచున్నది. ఆవులయందు సంపత్తి, బ్రాహ్మణులయందు నింద్రియనిగ్రహము, స్త్రీలయందు చపలబుద్ధి యుండునటుల జ్ఞాతులయందు నితరదాయాదులకు భయముండును. నేను లోకములో గొప్పమర్యాదను బొంది జ్ఞాతులలో గొప్పవాడనై, యైశ్వర్యవంతుడనై, శత్రుజయము గలవాడనగుట జ్ఞాతివగుటచే నీకిష్టములేదు. పద్మపత్రములపైబడు నీటిబిందువులు వేఱువేఱుగ నిలుచును. తుమ్మెద పూవులోనిమధువును ద్రాగి యాపూవును విడుచును. ఏనుగకు మావటీడు స్నానముచేయించినను నది తన దేహముపై తిరుగ బుగ్గిని పోసికొనును. శరత్కాలమేఘములు గర్జించినను వర్షింపవు. ఇట్లే మర్యాదలేనివారితోడి స్నేహము సమయమున కుపయోగింపదు. నీతోడిస్నేహముగూడ నట్టిదే. రాక్షసా! నీవుతప్ప నితరు లిట్లు పలికియుండిన వారిని నాశనముచేసియుందును. నీవు కులనాశకుడవు.' ఇట్లు రావణుడు కఠినపుమాటలుపలుక న్యాయవాదియగు విభీషణుడు 'అనలుడు, శరభుడు, సంపాతి, ప్రఘసుడు' అను నలుగురుమంత్రులతో లేచి క్రోధముతో వారితో నాకాశమున కెగసి తనయన్నతో నిట్లు పలికెను. * 'నీవు నాయన్నవు. నన్నుగూర్చి నీయిష్టమువచ్చినట్లు పలు

---

* తి. రా:— రావణుడు ఖడ్గముచే బట్టుకొని విభీషణుని దఱుమ నతడు నాకాశమార్గమునకు నెగిరెను. రాముని సంబంధమైనకొన్ని

కుము. నీవు పెద్దవాడవును, తండ్రితో సమానుడవునునైనను ధర్మమార్గములో నుండనందున కఠినములగు నీయసత్యవచనములను నే నోప్పుకొనను. దుర్మార్గులు తమమరణము సమీపింప మేలుగోరువారిమంచిమాటలను వినరు. ఎల్లప్పుడును ప్రియమును బలుకువారు దొరకుదురు. విప్రియములైనను మంచిమాటలను జెప్పువారును, వినువారును సాధారణముగ దొరకరు. అయినను నిల్లుకాలుచుండ నాయగ్నిని నార్పుటకు నుపేక్షచేయ గూడనివిధమున కాలపాశబద్ధుడవగునిన్ను గూర్చియుపేక్ష సేయక హితవును జెప్పితిని. రాముని తీవ్రబాణములచే నీవు మరణము నొందుటను జూచుటకిష్టములేక నే నిట్లుపలికితిని. శూరులైనను, బలవంతులైనను, నస్త్రములుపయోగించుట బాగుగనేర్చినవారైనను యుద్ధములో మరణకాలము సమీపింప నేటిలో గట్టబడిన యిసుకగట్లవలె నశింతురు. పెద్దవాడవగు నీవు నీహితమునుగూర్చిచెప్పిన నామాట

---

మాటలను రావణున కిట్లు బోధించెను. 'రావణా! కాలుడు దశరథుని యింటిలో రామరూపముననను, కాళి జనకునికుమార్తెయగు సీతరూపమునను భూభారమును బోగొట్టుటకై జన్మించిరి. నీవు కాలప్రేరితుడవై నామంచిమాటలను వినకున్నావు. శ్రీరాము డెల్లప్పుడు మాయకు వేఱుగనుండువాడు. అతడు సమస్తభూతములయొక్క లోపలను, వెలుపలను నిండియుండి నామరూపభేదములతో నాయాభూతములవలె సంచరించువాడు. ఏతీరున ననేకవిధములగుచెట్లయం దొక్కటేయగ్ని యిమిడియుండి చెట్లరూపమునగనబడుచుండునో యాతీరుగనే పరమాత్మ సర్వభూతములయందు నిమిడియుండి యాయాభూతములవలె నజ్ఞానులకు గనబడుచుండును. నిర్మలమగు స్ఫటికము నీలాదివర్ణముగలవస్తు సంపర్కమువల్ల నీలాదివర్ణముగలదివలె గనబడునట్లు స్వచ్ఛమగుపరమాత్మ అన్నమయాదిపంచకోశసంపర్కమువల్ల నాయాకోశమయుడై ప్రకాశించుచున్నాడు. శుద్ధమైనయాత్మ సంసారబంధము

లను సహింపుము. అన్నివిధముల నీవు నిన్ను, నీపట్టణమును, రాక్షసు లను రక్షించుకొనుము. నీకు శుభమగుగాక! నేను వెళ్ళెదను. నేను లేకుండ నీవు సుఖముగనుండుము. రాక్షసా! నేను నీహితమునుగోరి నిన్ను వారించుచు పలికినపలుకులు నీకిష్టముగా లేదు. మరణకాలము సమీపించినజనులు స్నేహితుల మాటలను వినరు.' ఇట్లు విభీషణుడు పలికి రాముడుండు చోటికి తననలుగురు మంత్రులతోను నాయుధము లను దీసికొనిపోయెను.

---

## ౭ వ. అధ్యాయము. విభీషణుడు రాముని శరణ నొంది లంకారాజ్యమున కభిషేకమునొందుట.

విభీషణుడు రావణునితో 'జాగ్రత్తగ నుండు' మని చెప్పి తన యాయుధములు పట్టుకొని బట్టుకొని యాయుధములను బట్టియున్న లేనివాడైనను తననూయోగుణములగు సత్త్వాదులయందు ప్రతిబిం బించి కాల, ప్రధాన, పురుష, అవ్యక్తరూపుడై మాయాపురుష రూపములచేత సమస్తజగత్తును సృజించుచు తిరిగి దానిని కాలరూపుని చేత నాశనమునొందించుచుండును. కాన రాముడు కాలరూపుడై బ్రహ్మదేవునిచే ప్రార్థింపబడినవాడగుచు నిన్ను వధించుటకైనట్లై యిక్కడకు వచ్చినాడు. సత్యసంకల్పుడగు నీశ్వరు డన్యథాచేయ నేరడు. కావున నతడు పుత్రబలవాహనాదులతోగూడ నిన్ను సంహ రింపగలడు. నీవును, రాక్షసకులమంతయును నాతనిచే నాశనముచేయ బడుట చూడలేనుగనుక నేనతనియొద్దకు బోయెదను.' ఇట్లు విభీషణుడు రావణునకు బోధించెను.

తననలుగురుమంత్రులతో లంకనుండి యెగిరి సముద్రమును దాటి యొకగడియలో రాముడుసైన్యముతో విడిసియున్నప్రదేశముపై నాకాశమున నిలిచెను. మేరుశిఖరములవలెను, మెఱుపులవలెనున్న విభీషణుని, నతనియనుచరులను క్రిందనుండు వానరులు చూచిరి. వానరుల సేనానాయకుడును, గొప్పప్రతాపముగలవాడును, బుద్ధిమంతుడునునగు సుగ్రీవుడుకూడ వారినిజూచి యొకగడియయాలోచించి హనుమంతుడు మొదలగు వానరులందఱితోను, 'ఈరాక్షసుడు నలుగురురాక్షసులతో నన్నియాయుధములనుబట్టి మనలను జంపుటకు వచ్చియున్నాడు. మీరు చూడు' డని పలుక కపిశ్రేష్ఠులందఱు గుగ్గిలపుచెట్లను, కొండలను బట్టి 'ఈదురాత్ములన జంపుటకు మాకు సెలవిండు. వీరిని గొట్టి చంపి క్రిందపడునట్లు చేసెద' మని యనిరి. అప్పు డాకాశమున నిలిచియున్న బుద్ధిమంతుడగు విభీషణుడు సుగ్రీవుడు మొదలగు వానరశ్రేష్ఠులనందఱిని జూచుచు పెద్దస్వరముతో "నేను రాక్షసుడును, దుర్మార్గుడును నగు రావణునితమ్ముడను. విభీషణుడనువాడను. నాయన్నగు రావణుడు జటాయువును జంపి జనస్థానమునుండి సీత నెత్తుకొనిపోయి లంకలో రాక్షసస్త్రీలవశములో నుంచెను. నే ననేకపర్యాయములు వానితో 'ఆమెను రామున కిచ్చివేయు' మని చెప్పినను వాడు తనమరణకాలము సమీపించుటచే దానిని వినక నన్నుగూర్చి కఠినమగుపలుకులను బలికి నన్నవమానించుటచే నేను భార్యను, పిల్లలను విడిచి రాముని శరణుబొందుటకు వచ్చితిని. అన్నిలోకములు శరణుబొందదగినవాడును, మహాత్ముడునునగు రామునితో నేనువచ్చినసంగతిని దెలుపు" డని వారిని ప్రార్థించెను. విభీషణుని యీమాటలను సుగ్రీవుడువిని లక్ష్మణునితోగలిసి వెంటనే వెళ్ళి రామునితో నిట్లు విన్నవించెను. 'రావణునితమ్ముడు విభీషణుడనువాడు నలుగురురాక్షసులతో మిమ్ము శరణుగోరుచున్నాడు. మీరు బాగుగ నాలోచించి మనసైన్య

వ్యూహములను బాగుగ నేర్పఱచి నీతిశాస్త్రప్రకారము కార్యములను జరుపుచు శత్రుసైన్యమునుగూర్చి గూఢచారులను బంపిన మనకు శుభము కలుగును. ఈరాక్షసులు శూరులు. వారు కోరినరూపములను బొంది కనబడుదురు. కొంతసేపుకనబడకుందురు. వారు మాయోపాయములు దెలిసినవారు. వారినెంతమాత్రమునమ్మగూడదు. విభీషణుడు రావణునిచారుడు. వీడు మనలో బ్రవేశించి మనలోమనకు విరోధము కల్పించును; అనుమానము లేదు. లేనియెడల నితడు బుద్ధిమంతుడగుటచే మనలోపమును గనిపెట్టి మనలోనుండి మనకు నమ్మకముకలిగిన తరువాత మనతోయుద్ధముచేయవచ్చును. రాజులు మిత్రసంబంధమైన బలమును, నాటవికజనబలమును, పూర్వపురుషులనుండి వచ్చుసైన్యమును, వేతనములు పుచ్చుకొను సైన్యబలమును పరిగ్రహింపవచ్చును. కానివిరోధులనుండి వచ్చిన బలమును పరిగ్రహింపకూడదు. ఇతడు శత్రువగు రాక్షసరాజునకు స్వాయముగ తమ్ముడు. శత్రుపక్షమునుండి వచ్చినవీని నెట్లు నమ్మవచ్చును? మీరు విభీషణుని రావణుడు పంపిన చారునిగ నాలోచించి పట్టుకొనిన యుక్తముగ నుండునని నాకు తోచుచున్నది. మీ రతనిని నమ్మియుండ నతడు మాయచేమనలో ననుమానములేకుండ ప్రవేశించి తనసంగతి బయలుపడకుండ మనలోపములను గనుకొని వెంటనే మనలను జంపును. క్రూరుడగు విభీషణుని, నతనియనుచరులను కఠినముగ దండించి చంపదగును.' ఇట్లు సుగ్రీవుడు పలికి యూరకుండెను.

ఆవానరరాజుమాటలను రాముడు విని దగ్గఱనున్న హనుమంతుడుమొదలగు వానరులతో 'ఆరాక్షసవీరునిగూర్చి సుగ్రీవుడు చెప్పిన సంగతులను మీరు వినియుంటిరి. కష్టమైనవిషయములనుగూర్చి బుద్ధిమంతుడును, సమర్థుడునునగు నొకస్నేహితుడాలోచనచెప్పునుగదా యని యూరకొనక మిగిలినస్నేహితులుగూడ బాగుగ నాలోచించి

చెప్పవలెను. కావునమీయభిప్రాయములను దెలుపు'డని పలుక వారు తనిమేలును గోరుచు తమతమయభిప్రాయముల నిట్లు తెలిపిరి. 'రామా! మూడులోకములలోను మీకు తెలియనిదేదియులేదు. మీరు తెలిసికొనియు మాయందలిస్నేహభావముచే మమ్మడుగుచున్నారు. మీరు సత్యము పలుకువారు; శూరులు; ధర్మబుద్ధిగలవారు; గొప్పపరాక్రమముగలవారు. మీరెదుటివారిమనస్సును బాగుగ పరిశీలన చేయుదురు; మంచియాలోచన చేయుదురు. మీ స్నేహితులందు మనస్సుంచి పూట్లాడుదురు. కనుక బుద్ధిమంతులును, శక్తిపరులునగు మీమంత్రులు తమతమయభిప్రాయములను మీకు వేఱువేఱుగ కారణములతో దెలుపవలె'నని యనిరి. అప్పుడు బుద్ధిమంతుడగు నంగదు డిట్లు పలికెను. 'శత్రువువద్దనుండివచ్చిన యతడన్నివిధముల ననుమానింపదగినవాడు. ఇతనిని వెంటనే నమ్మవీలులేదు. కుటిలులగువారు తమ యభిప్రాయములను మఱుగుపఱచి శత్రులోపములను గనిపెట్టి వారిని బాధింతురు. అప్పుడు వారికి కీడుసంభవించును. ఏవిషయములోనైనను మంచిచెడ్డలనాలోచించి మంచిగుణములధికముగాగల కార్యమును జేయవలెను. దోషములెక్కువగనున్న దానిని విడువవలెను.' ఇట్లంగదుడు తనయభిప్రాయమును దెలుప శరభుడు 'మంచిబుద్ధిగలవానిచే పరీక్షించిన తరువాత నాతనిని పరిగ్రహింపవచ్చు'నని పలికెను. మంచియాలోచన, శాస్త్రపరిజ్ఞానముగల జాంబవంతుడు 'వీడు పాపుడగు గొప్పశత్రువువద్దనుండి సమయముకానిసమయమున తగనిదేశమునకు వచ్చియున్నాడు. ఇతని నన్నివిధముల ననుమానింపదగు' నని మంచి సలహానిచ్చెను. నీతిశాస్త్రము బాగుగదెలిసిన మైందుడు 'రావణునిసంగతులనుగూర్చి విభీషణుని మంచిమాటలచే నెవనిచేనైన మెల్లగనడిగింపవలెను. తరువాత వానియభిప్రాయమును తెలిసికొని వాడు మంచివాడో చెడ్డవాడో మీరునిశ్చయించితగినట్లుచేయవచ్చు'నని పలికెను.

శాస్త్రములు బాగుగ దెలిసినవాడును, మంత్రిశ్రేష్ఠుడుననగు హనుమంతుడు స్పష్టమును, మధురమునునగు మాటల నిట్లనెను. "మంచిబుద్ధిమంతులును, శక్తిపరులును, మాటలాడువారిలో శ్రేష్ఠులు ననగు మీ రాలోచనలో బృహస్పతికంటె గొప్పవారు. రామా! నేను తర్కించుకొనుటకుగాని, యితరుల సలహాను నాక్షేపించుటకుగాని, నేను బుద్ధిమంతుడనను నాధిక్యముచేతనుగాని; నాయిష్టమువచ్చినట్లు చెప్పవచ్చునను నభిప్రాయముచేతగాని చెప్పుటలేదు. నాయందు మీ కుండు మర్యాదచేత యథార్థమును బలుకుచున్నాను. మీమంత్రులలో నొకడు 'మంచిచెడ్డలనాలోచించి కార్యమును జరుపవలె'నని పలికెను. అది తగినమాటకాదు. కారణమేమన నేమిచేయవలెనో యతడు చెప్పియుండలేదు. మఱియు నట్లుపరీక్షించుట తగియుండదు. కార్యములో నియమించిననేగాని విభీషణునిసామర్థ్యము తెలియదు. అట్లు నియమించుటవలన దోషముకలుగును. 'చారునొకనిని నియమింపవలె'నని మీమంత్రులలో నొకడు చెప్పెను. ఆయాలోచన పనికిరాదు. దానికి కారణ మేమన చారులుచేయుపనుల నీతనివిషయమై యుపయోగింప వీలులేదు. 'సమయముగానిసమయమున దూరదేశమునకు విభీషణుడు వచ్చె'నని మఱియొకమంత్రిచెప్పెను. కాని యిప్పటికి తగిన దేశకాలములివి. అత డుత్తమపురుషులగు మిమ్మును, నధమపురుషుడగు రావణుని నాలోచించి క్రమముగ మీగుణములను రావణుని దోషములను కనిపెట్టి మీపరాక్రమమును, రావణునిదుర్బుద్ధిని జూచి యిత డిక్కడకు వచ్చుట యతనిబుద్ధికి తగియున్నది. మఱియొకమంత్రి ఎవనిచేనైన 'రావణునిసంగతి విభీషణు నడిగింపు'మని సలహా యిచ్చెను. అట్లడిగిన బుద్ధిమంతుడగు నతడాప్రశ్నల ననుమానించి సరియగు నుత్తరములనీయడు. అట్టి చెడుప్రశ్నలచే మనకు మంచిమిత్రుని మైత్రి చెడిపోవును. ఇతరులచే మిక్కిలిచమత్కారముగ నతనిమనస్సులోని

గూఢమగు నభిప్రాయములగుఱించి యడిగించినను సతనిసమాధానములనుబట్టి యతని మనస్సులోనుండువానిని శీఘ్రముగ దెలిసికొనుట యీయితరులకు శక్యముకాదు. విభీషణునిమాటలనుబట్టి చూడ వానియందు దుష్టస్వభావము కొంచెమైనను నాకు గనబడదు. అతనిముఖము సంతోషముగనున్నది. వానివిషయమై నాకేమియు ననుమానములేదు. ఆత డనుమానములేక నిర్భయుడై యున్నాడు; మనస్సులో విప్రియమాలోచించువాడుకాడు; ఇక్కడనుండి వెళ్లక నిలిచియున్నాడు. ఆతనిమాటలలో చెడుగేమియు గానరాదు. ఆవిషయమున నాకు సందేహములేదు. మనుజుడు తనమనస్సులోనిభావమును, తనరూపమును నెంతమఱుగుపఱచినను నవి దాగవు. వానిరూపము బలవంతముగ బయలుపడి వానిభావమును తెలియబఱచును. జనుడు దేశకాలముల నెఱిగి బాగుగ జరిపినకార్యము శీఘ్రముగ మంచిఫలమునిచ్చును. ఈతడు మీరుచేయు గొప్పయత్నమును, రావణుని దుష్ప్రవర్తనను మీరుజరిపినవాలివధను, సుగ్రీవుని యభిషేకమును నాలోచించి లంకారాజ్యమునుగోరి బుద్ధిపూర్వకముగ నిప్పుడు మీదగ్గఱకు వచ్చెను. ఈ పైకారణములచే నాశక్తికొలది విభీషణుడు సత్ప్రవర్తనుడని నేను పలికితిని. మిగిలినసంగతులు మీకే బాగుగ దెలియును." ఇట్లుపలుకుచు హనుమంతు డాలోచన చెప్పెను.

ఆంజనేయునియీమాటలను రాముడు విని సంతోషముతో 'విభీషణునిగూర్చి నేనుచెప్పబోవు నీక్రిందిసంగతులను నాశ్రేయమును గోరుమీరందఱు వినవలెను. స్నేహభావముచే వచ్చినవానిని నేవిధముననైనను నేను విడువలేను. వానియందు దోషమున్నను వానిని గ్రహించుట దోషముకాదని సత్పురుషులు పలుకుదు' రని తెలుప సుగ్రీవుడు బాగుగ నాలోచించి మిక్కిలిశుభమగుసంగతుల నిట్లు పలికెను. 'ఈరాక్షసుడు దుష్టుడైనను, మంచివాడైనను మనకేందులకు?

తనయన్నను కష్టకాలములో విడిచిన యీవిభీషణుడు నింద్యార్హుడు. ఇతఁ డెవనిని విడిచిపెట్టకుండును.' ఇట్లు వానరరాజుపలుక సత్యపరాక్రమములుగల రాము డందఱిని జూచి చిరునవ్వునవ్వుచు లక్ష్మణునితో నిట్లనెను. "కపీశ్వరుడు శాస్త్రములు చదువనియెడలను, వృద్ధులను సేవింపనియెడలను నిట్లు పలుకలేఁడు. ప్రత్యక్షముగ లోకములో జరుగుచున్నమిక్కిలిసూక్ష్మమగు వ్యాపారము రాజులందఱియందు కనబడుచున్నది. జ్ఞాతులకు తమశత్రువులగు దాయాదులు ప్రతిదేశమందు గలరు. వారు కష్టకాలములో తమజ్ఞాతులను హింసింతురు. అందునిమిత్తము విభీషణు డిక్కడకు వచ్చెను. మంచివారగురాజులు కొందఱు తమజ్ఞాతులను మర్యాదచేయుచుందురు. అయినను వారు బుద్ధిమంతుడగు తమజ్ఞాతివిషయములో ననుమానించుచునెయుందురు. శత్రుబలములోనివానిని గ్రహింపగూడదని నీవు పలికితివి. దానికి శాస్త్రము జెప్పెదను; వినుము. మనము విభీషణుని జ్ఞాతులముకాము. ఈతడు రాక్షసరాజ్యమును గోరియున్నాడు. రాక్షసులలోగూడ పండితులు కలరు. కనుక మనము విభీషణుని గ్రహింపవచ్చును. జ్ఞాతులు తమ యితరజ్ఞాతులతో కలిసియున్నప్పుడు నిశ్చలమనస్సుతో సంతోషముగ నుండరు. వారు సమయముదొరకినప్పుడు విరోధమును బొందుదురు. ఇదియొకగొప్పనీతి. ఇతనికి రావణునివలన భయము గలిగినందున నితనిని మనము గ్రహింపవచ్చును. సుగ్రీవా! అన్నదమ్ములందఱు భరతునివలె నుండరు. తండ్రికి నావంటి కుమారులుండరు. నాకు నీవంటి మిత్రులుండరు." ఇట్లు రాముడు పలుక సుగ్రీవలక్ష్మణులు వినయముగ విభీషణునిరాకను పూర్వమువలె ఖండించి యాక్షేపించిరి. అప్పుడు రాముడు బాగుగ నాలోచించి యిట్లు సెలవిచ్చెను. "ఈరాక్షసుడు దుష్టుడైనను మంచివాడైనను మనకేమి? నాకు కొంచెమైనను కీడుగుచేయలేడు, నేను తలచినయెడల లోకములోనుండు పిశాచము

లను, దానవులను, యక్షులను, రాక్షసులను నాగోరుచివరతో జంప గలను. తిర్యక్కులగు పశుపక్ష్యాదులుకూడ శరణుజొచ్చినవారిని రక్షించుచున్నవి. నావంటివానినిగూర్చి వేఱుగజెప్పనేల; సుగ్రీవా! కణ్వమహర్షిపుత్రుడగు కండుడనువాడు ధర్మములను, సత్యమునుదెలుపు నీక్రిందివాక్యములను పలికెను. 'చేతులను తలపై జోడించి దీనుడై శరణువేడు శత్రువునైనను మేలుగోరువాడు చంపగూడదు. భయమును బొందినవాడుకాని, గర్వించినవాడుకాని యగు శత్రుపక్షములోనివాడు వచ్చి శత్రువగుతన్ను శరణుబొందిన వానిని బుద్ధిమంతుడగువాడు తన ప్రాణములను విడిచియైనను రక్షింపవలెను. అట్లు వాడు భయముచేత గాని,యజ్ఞానముచేతగాని,కోరికచేతగానితనశక్తికొలది వానిని రక్షింపక పోయినయెడల వాడు పాపమును బొందుటయేగాక యీలోకమున నిందనుగూడ బొందును. అతడు శరణుగోరువానినినట్లు చూచుచు విడిచిన వాడు నశించుచు నతనిపుణ్యమునంతను తీసికొనిపోవును. శరణుబొందిన వానినిరక్షింపనివారికి నరకముప్రాప్తించుట,కీర్తిపోవుట, బలవీర్యములు పోవుట యనుమహాదోషము లుండును.' కావున నేను కండుమహర్షిచెప్పినట్లు చేసిస్వర్గమునుబొందుట, ధర్మమార్గముననుండుట, కీర్తినిబొందుట యనుఫలములను బొందెదను. నన్ను బొందుట కొకసారి మనస్ఫూర్తిగ 'నేను నీవాడ' నని నన్ను ప్రార్థించిన నే నన్నిజీవులకు నభయమిచ్చు వాడను. ఇది నావ్రతము. నేను విభీషణునికి నభయ మిచ్చితిని. సుగ్రీవా! అతనిని దీసికొనిరమ్ము. విభీషణుడు శరణుబొందుటకు వచ్చినను, స్వయముగ రావణుడువచ్చినను నే నభయమిచ్చెదను." ఇట్లు రాముడు పలుక సుగ్రీవు డతనిగొప్పమనస్సునకు నాశ్చర్యమునుబొంది యిట్లు మాటపలికెను. 'ధర్మసూక్ష్మముల నెఱిగినవారును, లోకరక్షకులును, ప్రజలకు సుఖమును గలిగించువారును, సత్త్వగుణముగలవారును, సత్ప్రవర్తనగలవారునునగు మీ రిట్లు పలుకుటలో నాశ్చర్య

మేమియులేదు. మీరు మీగుణములకు తగినట్లు సూక్ష్మముగ బలికితిరి. అనుమానములవలనను, సమాధానములవలనను మనమందఱము బాగుగ నాలోచించుటవలనను నాయంతరాత్మ, విభీషణుని పరిశుద్ధమైనవానిగ దెలిసికొనుచున్నది. సంగతులన్నియు బాగుగ పరిశీలింపబడెను. గాన బుద్ధిమంతుడగు విభీషణుడు మా యందఱితోను సమానుడగుగాక! మాతో సఖ్యమును బొందుగాక!' ఇట్లు సుగ్రీవుడు పలుకరాము డతనితో 'విభీషణుని వేగముగ దీసికొనిరా' మ్మని చెప్పెను.

ఇట్లు రాము డిచ్చినయభయము సుగ్రీవునచే ప్రాజ్ఞుడును నగు నా రాక్షసశ్రేష్ఠునికి దెలుపబడ నతడు సంతోషముతో నయ్యెడ భూమిని జూచుచు తనయనుచరులతో నాకాశమునుండి క్రిందికి దిగెను. వారందఱు రాముని శరణుగోరి యతని పాదములమీద బడిరి. *అప్పుడు విభీషణు డాతనితో ధర్మయుక్తములును, సంతోషకరములును నగు తగిన మాటల నిట్లు పలికెను. 'నేను రావణుని తమ్ముడను. నేను వానిచేత నవమానమునుబొంది యన్ని జీవులు శరణుబొందదగిన మీయొద్దకు శరణుబొందుటకు వచ్చితిని. నేను లంకను, స్నేహితులను, ధనమును విడిచి వచ్చితిని. నా రాజ్యమును, బ్రతుకును, సుఖములను, మీయందే నిలిపితిని.' విభీషణుని యీమాటలను రాముడు విని మంచిమాటలచే నాతనిమనస్సుకరిగించి యాతని నాదరముగ జూచుచు 'రాక్షసులబలమునుగూర్చి నిజముగ నాకు దెలుపు' మని యడిగెను. దాని కారాక్షసశ్రేష్ఠుడు తనయన్నబలములగూర్చి యిట్లు పలికెను. "రావణుడు బ్రహ్మవరముచే గంధర్వాసురరాక్షసులచేతను, నన్ని భూతములచేతను చంపబడడు. ఆతనితరువాతవాడు కుంభకర్ణుడు; గొప్ప తేజోవీర్యము

*అ. రా:—విభీషణుడు రాముని దర్శించి యాతని నిట్లు స్తుతించెను. 'రామా! రాజశ్రేష్ఠా! సీతమనస్సును రంజింపజేయువాడా! తీవ్రమగు ధనస్సుగలవాడా! ఖరునిజంపినవాడా! భక్తులయెడ వాత్సల్యము

లుగలవాడు. వాడు యుద్ధములో నింద్రునితో సమానుడు. రావణుని సేనాపతి ప్రహస్తుడు, ఇతడు కుబేరునితో యుద్ధముచేసి వాని సేనాపతి యగు మాణిభద్రుని నోడించెను. రావణునికుమారు డింద్రజిత్తు. ఇతడు భేదింపశక్యముకాని కవచములదొడుగుకొని ధనస్సునుబట్టి కనబడకుండ నిలిచి యుద్ధముజేయును. యుద్ధము తటస్థించినపు డితడగ్నిని హోమములచే తృప్తినొందించి శత్రువులకు గనబడకుండ నిలిచి వారినిజంపును. మహోదరుడు, మహాపార్శ్వుడు, అకంపనుడును సేనానాయకులు. వీరు యుద్ధములో దిక్పతులతో సమానులు. లంకలో మాంసమునుదిని రక్తమును ద్రాగువారును, కోరిన రూపమునుబొందువారును గు * ననేకకోట్లరాక్షసవీరులుకలరు. రావణుడు వీరితో గలిసి లోకపాలురతో యుద్ధముచేసివారినోడించెను.” ఇట్లు విభీషణుడు పలుక నాపలుకులను రాముడు విని బాగుగ నాలోచించి యిట్లు సెలవిచ్చెను. ‘నీవు రావణునికర్మలనన్నిటిని నిజముగ దెలిపితివి. నేను రావణుని, ప్రహస్తుని, వానిబంధువులను, పరివారమునంతటిని జంపి నిన్ను రాజుగ జేసెదను. నీతో నిజమును బలుకుచున్నాను. రావణుడు క్రిందిలోకములకు బోయినను, బ్రహ్మలోకమునకు బోయినను నేను వానిని జీవములతో విడువను. అట్లు వారలను యుద్ధ

---

గలవాడా! అంతములేనివాడా! శాంతుడా! మితములేని తేజస్సుగలవాడా! సుగ్రీవుని స్నేహితుడా! రఘువంశశ్రేష్ఠా! జగత్తును బుట్టించుటకును, నాశనముచేయుటకును కారణమైనవాడా! మహాత్ముడా! మూడు లోకములకు గురువైనవాడా! అనాదియైనమాయాశక్తి భార్యగా గల

---

* లంకలో పదివేల కోట్లరాక్షసు లున్నారని యిక్కడ వర్ణింపబడినది. అరణ్యకాండ 55 వ. సర్గ 13 వ. శ్లోకమున రావణుడు తాను 32 కోట్లబలమున కధికారియైనట్లు తెలిపియున్నాడు దీనినే ప్రమాణము స్థిరపరచి యిక్కడ ననేకకోట్లని వక్కాణించితిమి.

ములో జంపకుండ నే నయోధ్యకు వెళ్లను. నాముగ్గురుతమ్ములనుబట్టి నేను శపథము పలుకుచున్నాను.' ఇట్లు రాముడు సెలవీయ ధర్మాత్ముడగువిభీషణు డాతనికి సాష్టాంగనమస్కారముచేసి 'రాక్షసులను జంపుటలోను,లంకనుబట్టుకొనుటలోను మీకు నేను సహాయము జేసెదను. నాశక్తికొలది శత్రుసైన్యములో బ్రవేశించెద'నవిమనవి చేసెను. అప్పుడు రాము డా రావణానుజుని కౌగలించుకొని సంతోషముతో లక్ష్మణునితో 'సముద్రమునుండి నీటిని దెచ్చి దానితో నేను దయజూపిన విభీషణుని రాక్షసరాజుగ నభిషేకము చేయు'మని చెప్పెను. అప్పుడు లక్ష్మణుడు వానరముఖ్యులందఱు చూచుచుండ రామునియాజ్ఞచే విభీషణుని నట్లభిషేకించెను. రామున కిట్లతనిపై గొప్పదయకలుగుటచే మహాత్ముడగు రఘురాముని వారు 'బాగుబా'గని కీర్తించిరి. తరు

---

వాడా! నీకు నమస్కారములు. లోకములకు మొదటివాడవును, నవి నిలుచుటకు స్థానమైనవాడవును, చివరకు వానిని నాశనము చేయువాడవును, నీయిచ్చవచ్చినట్లు చరింపగలవాడవును నీవే. చరాచరములగు భూతములయొక్క పైనను, లోపలను చరించువాడవును, తక్కువ దేశములందును, నెక్కువ దేశములందును నుండి జగన్మయుడవై ప్రకాశించువాడవును నీవే. జనులు నీమాయచే హరింపబడినజ్ఞానముగలవారుగనుక నే స్వస్వరూపజ్ఞానములేని వారైరి. అట్టిస్వస్వరూపజ్ఞానములేని వారుగనుక నే వారు విరుద్ధమైనమార్గమునందు చిత్తమును బ్రవర్తింపజేయుచున్నవారలై యుండుటవల్లగలిగిన పుణ్యపాపములచే జననమరణప్రవాహరూపమగు సంసారమును బొందుచున్నారు. నీయందే నిశ్చితమగు వృత్తిగలచిత్తముచే నీవు తెలియబడునంతవఱకు శుక్తియందలిరజతమువలె నీజగము సత్యమైనదిగతోచును. నీస్వరూపజ్ఞానమువల్ల పుత్రుడు, భార్య, గృహము మొదలగువారియందు నాసక్తిగలవారై చివరకు దుఃఖములను గలిగించు నింద్రియభోగములలో గ్రీడింతురు. ఇంద్రాగ్నియమవరుణవాయుకుబేరులును,

వాత సుగ్రీవహనుమంతులు విభీషణుని 'స్థిరముగనున్న యీసముద్రమును వానరసైన్యమంతయు దాటునుపాయమును గానము. నీ వేమి యాలోచన చెప్పెద'నని యడిగిరి. దానికాతడు 'సముద్రము రాముని పూర్వజులగు సగరపుత్రులచే త్రవ్వబడినందున రామునికార్యము సము

రుద్రుడవును,పురుషోత్తముడవును నీవే. మిక్కిలిచిన్నదానికంటె చిన్నవాడవును, మిక్కిలి పెద్దదానికంటె పెద్దవాడవును నీవే. తల్లిదండ్రులవలె సర్వభూతములయందు సమబుద్ధిగలిగి పాలించువాడవును, ఆదిమధ్యాంతరహితుడవును, పరిపూర్ణుడవును, సర్వశక్తులుగలవాడవును, వృద్ధిక్షయములు లేనివాడవును నీవే. నీవు చేతులు, కాళ్ళు, కన్నులు, చెవులు లేనివాడవైనను గ్రహించుచును, శీఘ్రముగ బోవుచును, చూచుచును, వినుచును నున్నావు. నీవు పంచకోశములకంటె వేఱగువాడవును, గుణములు లేనివాడవును, దేనినాశ్రయించియుండనివాడవును, నిర్వికల్పజ్ఞానగోచరుడవును, మార్పులు లేని వాడవును, నాకారములేనివాడవును, నీకంటె రెండవయధికారిలేనివాడవును, పుట్టుక మొదలగునాఱుభావములు లేనివాడవును, ఆదిలేనివాడవును, మాయకు వేత్తైనవాడవును నైయున్నావు. నీవు మాయచే నావరింపబడి మనుష్యునిగ తలంపబడుచున్నావు. విష్ణుభక్తులు నిన్ను గుణములులేనివానిగను, పుట్టుకలేనివానిగను తెలిసికొని మోక్షమును బొందుచున్నారు. నేను నీపాదభక్తియనెడు నిచ్చెనబొంది జ్ఞానయోగమను మేడ నెక్కగోరుచున్నాను. సీతాపతీ! రామా! గొప్పకరుణగలవాడా! రావణశత్రువా! నీకు నమస్కరించెదను. సంసారసాగరమునుండి నన్ను రక్షింపుము.' ఇట్లు విభీషణుడు రాముని స్తుతింప నాతడు భక్తవత్సలుడగుటచే మిక్కిలి దయనుబొంది 'నీకు మేలగుగాక! నీవు కోరినదానినిచ్చెదను. వరమడుగు'మని యనెను. దానికి రావణానుజు డిట్లు విన్నవించెను. 'నేను ధన్యుడనైతిని. నేను చేయవలసినదానిని జేసితిని. చేయ

ద్రునికి దెలిసినయెడల సాగరమతనిపనిని జేయును. కాన రాముడు సముద్రుని శరణువేడవలె'నని పలికెను. అప్పుడు సుగ్రీవుడు రామలక్ష్మణులుండుచోటికి బోయి యాసంగతి వారికి దెలిపెను. రాముడు సహజముగ ధర్మబుద్ధిగలవాడగుటచే సముద్రుని నుపాసించుట కొప్పుకొనెను. అతడు సుగ్రీవలక్ష్మణులను జూచి నవ్వుచు 'విభీషణునియాలోచన నాకిష్టమైనది, లక్ష్మణా! మీయుద్దేశి యభిప్రాయమును నాకు దెలుపుడు. సుగ్రీవుడు మంచి పండితుడు. నీవు మంచియాలోచనగలవాడవు. మీరు యుక్తమగుదానిని జెప్పు'డని యనెను. అప్పుడు వారిద్దఱు అంజలిబద్ధులై యిట్లు విన్నవించిరి. 'విభీషణునిమాటలు మనకిప్పుడు సుఖమును గలిగించుచున్నవి. అవి మాకేల యిష్టముకావు! ఈఘోరసముద్రమునకు గట్టుకట్టకుండ నింద్రాదులైనను లంకనుజేరలేరు. శూరుడగు

వలసినపని నాకు లభించెను. రామా! నీపాదదర్శనముచే విముక్తుడనైతిని. సందేహములేదు. నిన్ను దర్శించుటచే లోకమున నావంటివాడుకాని, నావంటిధన్యుడుగాని, శుచియగువాడుకానిలేడు. నాకర్మబంధనాశనమునకై నీయందలి యచంచలమగుభక్తివల్లగలుగు జ్ఞానమును, ధ్యానమును వీనివల్లగలుగు మోక్షమునునాకిమ్ము. రామా! యింద్రియసంబంధమగు సుఖమును నేను కోరను. నీపాదకమలములందు విడువని భక్తి నాకెల్లప్పుడును గలుగుగాక!' ఇట్లు విభీషణుడు రామునికోరునప్పుడాతడట్లే జరుగుగాక! యనిపలికి ప్రీతితో నింకను నిట్లు సెలవిచ్చెను. 'నిశ్చితమగు నారహస్యమును దెలిపెదను వినుము. మిక్కిలి శాంతులును, యోగులును, రాగము (ఇంద్రియాసక్తి) లేనివారునునగు నా భక్తులహృదయములందు సీతతో నే నెల్లప్పుడును నివసింతును. కనుక నీ వెల్లప్పుడు అంతరింద్రియనిగ్రహము, బహిరింద్రియనిగ్రహము గలవాడవై నిత్యము నన్ను ధ్యానించుటచే భయంకరమగుసంసారసాగరమును దాటి ముక్తిని బొందగలవు.' ఇట్లు రాముడు సెలవిచ్చెను.

( )

విభీషణునిమాటలప్రకారముజరిపి సముద్రమును ప్రార్థింపుడు. ఇప్పటికే విలంబముజరిగినది. ఇక నాలస్యమేల? ఆగ్నెయము రావణుని లంకాపట్ట ణమునకు సేనతో వెళ్ళునము.' ఇట్లు వారు పలుక రాముడు సముద్ర తీరమున దర్భాసనమున గూర్చుండెను.

---

౧౧. అధ్యాయము.

రావణుడు శుకుని సుగ్రీవునివద్దకు పంపుట.

---

సముద్రపుటుత్తరతీరమున విడిసియున్న వానరసేనను సుగ్రీ వుడు రక్షించుచుండ లంకనుండి శార్దూలుడను రాక్షసచారుడు వచ్చి దానినంతయు బాగుగ జూచి శీఘ్రముగ లంకకునుబోయి రావణునితో నిట్లనెను. 'అనేకవానరులయొక్కయు, ఎలుగుబంట్లవంటి సాహసము గలవారియొక్కయు బలము ఉత్తరసముద్రతీరమున పదియోజనముల వఱకు వ్యాపించియున్నవి. రామలక్ష్మణులు మంచియాయుధములను బట్టి సీతయుండు స్థానమునుగూర్చి వచ్చుచున్నారు. మీరు శీఘ్రముగ దూతలను బంపి నిజమగుసంగతులను పూర్తిగ దెలిసికొనుడు. సామ దానభేదోపాయముల నుపయోగింపుడు.' శార్దూలునియీమాటలను రావణుడు విని తానుచేయవలసినకార్యమును బాగుగనాలోచించి విషయములను దెలిసికొనుటలో నేర్పరియగు శుకుని బిలిచి వానితో నిట్లనెను. "నేను చెప్పినదంతయు నీవు సుగ్రీవునితో పూర్తిగను, నిర్భ యముగను, వినుటకింపగునట్లుగను స్పష్టముగబలుకుము. 'నీవు మంచి కులమున బుట్టితివి; గొప్పబలముగలవాడవు; ఋక్షరజసుని పుత్రుడవు. నీవు సేనను దీసికొనివచ్చుటవలన నీ కేమియులాభములేదు. సేనను

దీసికొనిరాకపోవుటవలన నీకేమియునష్టములేదు. నీవు నాకన్నదమ్ము లతో సమానుడవు. నేను రాజకుమారునిభార్యను హరించిన నీకెందుకు? నీవు కిష్కింధకు వెళ్ళిపొమ్ము. ఈలంకకు వానరు లెంతమాత్రము రాలేరు. దేవగంధర్వులైనను నీలంకకు రాలేనపుడు వానరులును, నరు లును నెట్లురాగల'రని యనుము." ఇట్లు రావణు డాజ్ఞాపింప శుకుడు పక్షిరూపమును దాల్చి శీఘ్రముగ లంకనుండియెగిరి సముద్రమును దాటి వానరసేనయుండుచోట నాకాశమున నిలిచి తనప్రభువు తనతో జెప్పినట్లే సుగ్రీవునితో జెప్పెను. వానరులు దీనిని దెలిసికొని వానిని పిడికిళ్లతో పొడుచుటకును, వానిఱెక్కలను విఱుచుటకును నాకాశము నకు శీఘ్రముగ నెగిరిరి. వారు పక్షిరూపమునొందిన యారాక్షసుని బలవంతముగ కట్టుటచే వాడు భూమియందు బడెను. వానరులు కూడ క్రిందికి దిగి యతనిని గొట్టుచుండ నతడు 'రామా! దూతలను గొట్ట కూడదు. వానరులను మీరు వారింపుడు. దూత తనరాజుచెప్పినమా టలను విడిచి తనమాటలను జెప్పినయెడల వానిని జంపవచ్చు'నని పలి కెను. ఏడ్చుచుపలికిన యాదూతమాటలను రాముడు విని 'వానిని కొట్టవద్దు; చంపవ'ద్దని వానరులకు సెలవిచ్చెను. తరువాత నారాక్షసు డాకాశమున నిలిచి'గొప్పబలపరాక్రమములుగలసుగ్రీవా! రావణునితో నే నేమని చెప్పవలె'నని పలుక సుగ్రీవుడు దానికి "రావణునితో 'నీవు నామిత్రుడవుకావు; అట్లు దయజూపదగినవాడవుకావు; నా కుపకార మును జేసినవాడవుకావు; నాకు ప్రియుడవుకావు. నీవు రామునిశత్రు డవు. నే నతని యాశ్రితుడనగుటచే నాకుకూడ నీవు శత్రుడవే. నీవు వాలివలె జంపబడదగినవాడవు. నీవు హతుడవయ్యెదవు. నేను నిన్ను,నీ పుత్రులను, జ్ఞాతులను, బంధువులను జంపుదును. నాబలముచే నీలంక నంతటిని బుగ్గిచేయుంతును. ఇంద్రాదులు నిన్ను రక్షించినను, నీవు సూర్యునిత్రోవలో దాగినను, పాతాళమునకు బోయినను రాముడు

నిన్ను విడిచిపెట్టడు. మూడులోకములలోను పిశాచులుగాని, రాక్షసులుగాని, గంధర్వులుగాని, యసురులుగాని యతని బాణములనుండి నిన్ను తప్పింపలేరు. ముసలివాడను, శక్తిలేనివాడునునగు జటాయువును జంపుటయాయేమి? రామలక్ష్మణులసాన్నిధ్యమునుండి సీత నెత్తుకొని పోవుటచే వచ్చుకీడును నీవు తెలియకున్నావు. నీప్రాణములను దీయు గొప్పబలవంతుడును, మహాత్ముడునునగు రాముడు దేవతలచేతనైనను జయింపబడడు. ఆతనిసంగతి నీకు దెలియకున్న'దని నామాటలుగ జెప్పు"మని జవాబుచెప్పెను. తరువాత నంగదు డిట్లనెను. 'సుగ్రీవ మహారాజా! వీడు దూతగాడు. చారుడని నాకుతోచుచున్నది. వీ డిక్కడ నిలిచి మనబలమునంతటిని పరీక్షించుచున్నాడు. వీనిని గట్టి యుంచవలెను. వీడు లంకకు బోగూడదు. ఇది నా యభిప్రాయము.' ఇట్లంగదుడు మనవిచేయ వానరరాజాజ్ఞచే వానరులెగిరి శుకుని బట్టి కట్టి తీసికొనివచ్చి కొట్టిరి. వాడు విలపించుచు నిట్లు గట్టిగ నఱచెను. 'రామా! నా ఱెక్కలనుబలవంతముగ విఱిచివేయుచున్నారు. నాకండ్లు పొడిచివేయుచున్నారు. నేను చచ్చినయెడల నాజననము మొదలు మరణమువఱకు నేనుచేసినపాపములన్నియు నిమ్మునను బొందును.' దూత పలికిన యీమాటలను రాముడువిని వానిని గొట్టకుండ జేసి 'దూతను బాధింపవలదు. వా డెక్కడనుండివచ్చెనో యక్కడ వానిని విడువవలె'నని సెలవీయ వానరులు వానిని బంధించి చెఱలోనుంచిరి.

---

## ౯ వ. అధ్యాయము

## వానరులు సేతువును గట్టి దానిని దాటుట.

లక్ష్మణసుగ్రీవులసలహాపై రాముడు సముద్రపుటుత్తరతీరమున దర్భలపై తూర్పుముఖముగ చేతులుజోడించి సముద్రమును జూచుచు

కుడిభుజమును తలక్రిందనుంచుకొని శయనించియుండెను. నీతిమంతుడును, బుద్ధిమంతుడును, ధర్మబుద్ధిగలవాడునునగు నాతడు 'మేము సముద్రమును దాటవలెను. లేనియెడల నేను మరణించెద' నని నిశ్చయించి నియమముతో మాటలాడకుండ సముద్రుని ప్రార్థించుచుండ మూడురోజులు గడచెను; కాని యతడు కనబడలేదు. అప్పు డతడు క్రోధముతో కండ్లెఱ్ఱజేసి తనదగ్గఱనున్న లక్ష్మణునితో నిట్లనెను. "సముద్రుడుగర్వముచే గనబడకున్నాడు. 'క్రోధములేకపోవుట, యపరాధములను సహించుట, సత్ప్రవర్తనగలిగియుండుట, మంచిమాటలాడుట' యను నీమంచిగుణములు దుర్మార్గులకు నశక్తివలె గనబడును. లోకులు తన్నుగూర్చి పొగడుకొనువానిని, దుష్టుని, నిర్దయుని, చెడుమార్గమున ప్రవర్తించువానిని నెల్లపుడు దండించువానిని గౌరవించుచుందురు. ఈలోకములో సామముచే గీర్తి కలుగదు. ఇప్పుడు నేను తీవ్రబాణములను సముద్రముపై విడిచి మొసళ్ళునీటిమీదికి తేలునటులను, నది నీటిని నిలుపునటులను, చేపలతలలు తెగునటులను, సముద్రములోని నీటియేనుగుల తుండములు తెగునటులను నీటిపాములు ముక్కలగునటులను చేసెదను. మఱియు దాని నింకింపజేసెదను. ఇట్టిదుర్మార్గులయెడ నే నోరిమిని జూపగూడదు. లక్ష్మణా! ధనస్సును, బాణములను దెమ్ము. నేను సముద్రము నింకించినతోడనే వానరులు నడచుచు దానిని దాటెదరు. ఇప్పుడే నేను దానిని క్షోభపెట్టెదను." ఇట్లు రాముడు పలికి వింటినిబట్టి కొన్ని బాణములను విడిచెను. అవి సముద్రమున బ్రవేశించి దానిని క్షోభపెట్టెను. దానిలో నుండి గొప్పశబ్దముపుట్టెను. బాణాగ్నినుండి పుట్టినపొగ యంతటను వ్యాపించెను. పాములును, పాతాళమునుండివచ్చిసముద్రములోనిలిచిన దానవులును బాధనొందిరి. కెరటములు మిక్కిలియెత్తుగ నెగిరెను. తిరుగ రాముడు ధనస్సును బట్టి నారిలాగుచుండ లక్ష్మణుడు లేచి దానిని పట్టుకొని 'వలదు; వల' దని పలికెను.

పత్రములవంటి నేత్రములుగలవాడై సముద్రములోఁబుట్టిన రత్నములు నలంకరించుకొని శిలమీఁద పూర్ణదండవేసికొని సముద్రమథనకాలమున కౌస్తుభమణితోఁగూడఁబుట్టిన యొకమణిగల ముత్యాలహారము తనవక్షమునకు తగులుచుండ రామునికి గనబడెను. ఆదివ్యపురుషుఁడు రామునిసమీపించి తనపేరు చెప్పుచు చేతులుజోడించుకొని యిట్లు విన్నవించెను. * 'భూమియు, వాయువును, నాకాశమును, జలమును, తేజస్సును శాశ్వతముగ స్వభావసిద్ధముగు తమపనులను చేయుచుండును. ఇతరులు దాటుటకు శక్యముకాకుండు నట్లగాధముగ నుండుట నాస్వభావము. నన్ను దాటుటయనునది విపరీతము. అయినను నేను దానిని దెలిపెదను. నేను పెద్దమొసళ్లు, చేపలుగలయీనీటిని కోరికచేనైనను, నజ్ఞానముచేనైనను, భయముచేనైనను స్తంభింపనడచుటకు నెంతమాత్రము గట్టిగ స్తంభింపజేయ నేరలేను. కాని వానరసేనయంతయు సముద్రమును దాటునట్లును, నట్టిప్రదేశమునకు సముద్రజంతువులు రాకుండునట్లును తగినసహాయము చేసెదను.' ఇట్లు సముద్రుఁడు విన్నవింప

---

* అ. రా:—సముద్రుఁడు రామునితో నిట్లు మనవిచేసికొనెను. 'తామసాహంకారమువల్ల భూతములన్నియు జన్మించుటచే భూతములయందు తామసమైనజడత్వము సంక్రమించినది. కనుక వానికి మందతయు,నజ్ఞానమును సహజగుణములు. నీవు హానములేనివాఁడవు ప్రభువా! నీవు నిర్గుణుడవైనను లీలచే మాయాగుణముల నంగీకరించి లోకములను సృజించుచు విరాట్పురుషుండవైతివి. అట్టి విరాట్పురుషునియొక్క సత్త్వగుణమువల్ల సనకాదిదేవతలును, రజోగుణమువల్ల మనుష్యులును నింద్రాదులును, తమోగుణమువల్ల రుద్రుఁడున్ను జన్మించిరి. మూర్ఖబుద్ధిగలవాడను, జడుడనునగు నేను లీలచే మనుష్యరూపముఁబొందిన వాడవును, నిర్గుణుఁడవునునగు నిన్నెట్లు తెలిసికొనఁగలను?' ఇట్లు సముద్రుఁడు విన్నవించెను.

రాముడు 'నే నెక్కుపెట్టిన బాణము వ్యర్థముకాదు. దీని నే దేశమున వదలవలె' నని వాని నడిగెను. అప్పు డత డిట్లు మనవిచేసికొనెను. "ఇక్కడకుత్తరమున 'ద్రుమకుల్య' మను సుందరమగు దేశముకలదు. అక్కడ ననేకులగు గొల్లలుమొదలగువారు భయంకరములగు పనులను జేయుచుందురు. ఆపాపులు నానీరు త్రాగుదురు. వారు నన్ను ముట్టుట నేను సహింపలేను. అమోఘమగు మీ బాణము నా దేశముపై ప్రయోగింపుడు." ఇట్లు సముద్రుడు పలుక రాముడు దానిపై తేజముగలతన యస్త్రమును విడిచెను. ఆబాణము భూమిలోనుండి క్రిందిలోకమునకు బోవునపుడు గొప్పశబ్దమాయెను. ఆత్రోవనుండి మంచినీరు బయటకు వచ్చెను. అది 'వ్రణకూప' మను పేరుగల నూయియాయెను. బాణము పడుటచే నక్కడ గోతులలోనుండు పాపపుజలమింకిపోయెను. ఆ దేశమునకు రాము డిట్లు వరమిచ్చెను. 'ఇక్కడ పశువులు తినుట కుపయోగించు గడ్డిమొదలగునవి బాగుగ బయలుదేరుగాక! ఫలములు, మూలములు, తేనెలు మిక్కిలిగ గలుగుగాక! పాలు, నెయ్యియెక్కువగ నుండుగాక! మంచివాసనగల భోజనపదార్థములు దొరకుగాక! అది మంచి ప్రదేశమగుగాక!' ఇట్లాతడు వరము లిచ్చుటచే నా దేశమట్లు శోభిల్లెను. తరువాత సముద్రుడు రామునితో నిట్లనెను. 'వానరశ్రేష్ఠుడును, విశ్వకర్మపుత్రుడునగు నలుడు తనతండ్రివలన శిల్పవిద్యాప్రవీణుడగునటుల వరమును బొందెను. కనుక నతడు సముద్రముపై సేతువునుగట్టుగాక! నేను దానిని భరించెదను.' ఇట్లు సముద్రుడు విన్నవించి యంతర్ధానము నొందెను.

తరువాత నలుడు లేచి రామునితో నిట్లనెను. "నాకు నాతండ్రితోసమానమగు శక్తిగలదు. నేను సముద్రములో సేతువునుగట్టెదను. సముద్రుడు నిజమును బలికెను. లోకములో దండనయే గొప్పదని నా యభిప్రాయము. కృతఘ్నతలేనివారియెడ నోర్పును, మంచిమాటలును,

దానమును బనికిరావు. భయంకరుడగు నీతడు దండనభయముచే మీకు సముద్రములో సేతువుకట్టుటకై చోటునిచ్చెను. మందరపర్వతమున విశ్వకర్మ నాతల్లికి 'తనవలన నామెకు జన్మించినపుత్రుడు తన తోసమానుడగు' నని వరమిచ్చెను. నే నట్లు జన్మించి నాతండ్రితో సమానుడనై తిని. ఈసంగతిని నాకిప్పుడు సముద్రుడు జ్ఞాపకముచేసి నిజమును బలికెను. నన్నడుగకుండ నాగుణములను నేను చెప్పకొనను. నేను సముద్రముపైని సేతువును బాగుగ గట్టగలను. వానరులనందఱిని నిప్పుడే చెట్లు, రాళ్ళుమొదలగు వానిని తెచ్చుటకు నియమింపుడు." ఇట్లు నళుడు పలుక రాముడు కొండలనలెనుండు వానరుల కట్లు సెల వీయ వా రడవికి బోయి యనేకవిధములగు చెట్లను విఱిచి సముద్రమునకు దెచ్చి దానిని నంపిరి. వా రేనుగంతటి పెద్దపెద్దరాళ్ళను, కొండలను పెల్లగించి తెచ్చి సముద్రములో వేసిరి. దాని వలన నీ రాకాశమువఱకు నక్కడక్కడ నెగురుచుండెను. ఇట్లు వానరులు సముద్రమును కలతపెట్టిరి. కొందఱు పదియోజనములు (80 మైళ్ళు) పొడుగుగల త్రాటిని వెడల్పుగబట్టి సేతువును గట్టుటకు తిన్నని మార్గమును జూపించుచుండిరి. కొందఱుకొలతలకు కఱ్ఱలనుబట్టి యుండిరి. కొందఱు గట్టును పరీక్షించుచుండిరి. వానరులుగడ్డిని, కఱ్ఱలనుగూడ తెచ్చి దానిపై వేసిరి. ఇట్లు చెట్లతోను, కొండలతోను, రాళ్ళతోను, నితరమగువానితోను నళుడు వానరసహాయముచే నీక్రిందజూపబడినప్రకారమైదురోజులలో నూఱుయోజనములు సేతువునుగట్టెను. ఇట్లు నూఱుయోజనములు పొడుగును, పదియోజనములు

మొదటిరోజున—14 యోజనములు.
రెండవ రోజున—20 ,,
మూడవ రోజున—21 ,,
నాలుగవ రోజున—22 ,,
ఐదవ రోజున —23 ,,
మొత్తము 100 యోజనములు

వెడల్పునుగల సేతువును నాకాశమునుండి దేవగంధర్వసిద్ధమహర్షులు చూచుచునిలిచిరి. మిగిలినజీవులన్నియు దాని నాశ్చర్యముతో జూచు చుండెను. వానరులు సంతోషముతో సేతువుపై గంతులువేయుచు గర్జించుచుండిరి. * ఇట్లు నేకులగువానరులు కట్టినసేతువు విశాలము గను, గట్టిగను, సుందరముగను, నెత్తుపల్లములు లేకుండగను, జాగ్రత్త గను నుండెను. ముందు విభీషణుడు గదనుబట్టి తనమంత్రులతో సముద్ర మును దాటి సముద్రపుటావలియొడ్డున శత్రువులవలన భయముకలుగ కుండనిలిచెను. సుగ్రీవుడు రామలక్ష్మణులతో 'సముద్రము చాలదూర మువ్యాపించియున్నది. మీరు హనుమంతాంగదులవీపులపై కూర్చుం డుడు. వారు మి మ్మావలియొడ్డుకు తీసికొనిపోయెద' రని చెప్ప వారు

* వెయ్యికోట్లవానరులు సేతువుగట్టిరని యుద్ధకాండలో వర్ణింపబడినది. 9వ ప్రకరణములో నాసైన్యము నూఱుకోట్లని నిర్ణయించితిమి. మఱికొన్నిచోట్ల లెక్క లేని యప్పుదములకొలది వానరులు వచ్చిరని తెలుపబడినది. ఈసంఖ్యాభేదముల సమ న్వయముచేసి నూఱుకోట్లసంఖ్యయే స్థిరపఱచితిమి.

అ. రా:—రాముడు సేతుబంధమునకు పూర్వ మక్కడశివుని స్థాపించి యాదేవునిపూజించి 'రామేశ్వరములోనుండు శివుని జూచి సేతుబంధమునకు నమస్కరించుజనుడు నాయనుగ్రహముచే బ్రహ్మ హత్యమొదలగు పాపములనుండి విముక్తుడగును. అక్కడ స్నానము చేసి రామేశ్వరములోనుండు శివుని దర్శనముచేసి సంకల్ప (మనస్సులో చేయుదానిని నిర్ణయించుట) నియమముగలిగి కాశికి బోయి గంగను దెచ్చి దానితో రామలింగేశ్వరుని నభిషేకించి కాశీకావిడిని సముద్ర ములో విడుచువాడు తప్పక బ్రహ్మత్వమును బొందు'నని లోకహితము కొఱకు పలికెను.

దానికొప్పుకొని తమధనస్సులనుబట్టుకొని సుగ్రీవునితో సైన్యమునకు ముందు వెళ్ళిరి. కొందఱు వానరులు సేతువుమధ్యనుండియు, కొందఱు దానిప్రక్కలనుండియు వెళ్ళిరి. కొంద ఱట్లు వెళ్లుచు నీటిలో పడుచుండిరి. కొంద ఱాకాశమున నెగిరిరి. వానరసేన వెళ్ళునపుడు కలిగినశబ్దముచే సముద్రముయొక్క గొప్ప ఘోషము వినబడకుండెను. ఇట్లు వానరసేన సముద్రమును దాటి సుగ్రీవునితోగూడ మంచిఫలమూలములును, నీళ్ళును దొరకుచోట విడిసెను. ఇట్టిగొప్పకార్యమును రాముడు చేయించుటచే దేవ సిద్ధ చారణ మహర్షులాశ్చర్యపడి యతనిమీద జలమునభిషేకించి 'రాజా! మీరు శత్రువులను జయించి యనేకసంవత్సరములు భూమిని పాలింపు' డని కోరుచు వానిని స్తుతించిరి.



---

టిప్పణము:—ఇప్పుడు 'సేతు'వని స్నానముచేయు సముద్రతీరము రామేశ్వరునియాలయమునకు తూర్పున సుమారు 3క్రోసులదూరమున నున్నది. ఆయాలయమునకు సమీపముననే 'మహేంద్రగిరి' యని చూపబడుచిన్నమెట్టగలదు. దానికి సుమారు 30 మైళ్ళదూరమున రామనాథపురమును, దానికుత్తరమున పదిమైళ్లదూరములో 'నవపాషాణ'మని రాముడుపాతినట్లుచెప్పబడిన నవగ్రహములరాళ్ళును, దక్షిణమున 7 మైళ్ళదూరమున దర్భశయనమును గలవు. రామనాథపురమునకు 50, 60 మైళ్లదూరమున మధురజిల్లాలో నల్లమలాయిమొదలగుపర్వతములు కలవు. వీనిని మేము మలయపర్వతముగ నిదివరలో నిర్ణయించితిమి. రామేశ్వరసమీపమున 'మహేంద్రగిరి' యనుపర్వతమేదియుగానరాదు. దీనినిబట్టి దర్భశయన నవపాషాణములనుండి రామేశ్వరమువరకు పూర్వమొక పర్వతముండెననియు, దానిరాళ్ళుచెట్లు మొదలగునవి సేతువుకట్టుట కుపయోగింపబడెననియు, నాకారణముచే నాస్థలమంతయు నమభూమియయ్యెననియు మాయభిప్రాయము.

○ లంకాపట్టణము.

○ రాముడు. ○ లక్ష్మణుడు.

o o o o o o o o o o o o o o o

వా న రు లు

o o o o o o o o o o o o o o o o o o o o

o o o o o o o o o o o o o o o o o o o o

○ అంగదుడు. ○ నీలుడు.

o o o o o o o o o o o o o o o o

○గంధమాదనుడు o o o o o o o o o o o o o o ○ ఋషభుడు

o o o o o o o o o o o o o o o o o o o o o

వా న రు లు

o o o o o o o o o o o o o o o o o

o o o o o o o o o o o o o o o o o

వా న రు లు

o o o o o o ○జాంబవంతుడు. ○సుషేణుడు. ○వేగదర్శి. o o o

(ఎలుగుబంట్లవంటి రూపముగలవారిలో ముఖ్యులు.)

o o o o o o o o o o o o o o o o o

వా న రు లు

o o o o o o o o o o o o o o o o o

వా న రు లు

○ సు గ్రీ వు డు

దానికి కుడిప్రక్కయందు బలములతో ఋషభు డుండవలెను. ఎడమప్రక్కను గంధమాదను డుండవలెను. నేనును, నీవును సేన ముందు నడవవలెను. జాంబవంతుడును, సుషేణుడును, వేగదర్శియు,

నెలుగుబంట్లవంటిరూపముగలవారిలో ముఖ్యులును కొంచెమువెనుక కుండవలెను. చివరకు పశ్చిమభాగమున నుండి సుగ్రీవుడు సేననురక్షించుచుండవలెను.' ఇట్లు రాముడు సెలవీయ వానరులు కొండలను, చెట్లను బట్టి వానితోను, తమపిడికిళ్లతోను శత్రువులను జంపుటకు సిద్ధమై లంకను సమీపించిరి. తరువాత రాముడు సుగ్రీవునకు 'సైన్యమంతయు క్రమముగ నేర్పఱుపబడినది. దూతయగు శుకుని విడువవచ్చు'

---

అ. రా:—శుకుడు రావణునితో రామునివార్తలను దెలిపి పిమ్మట సతని కిట్లు బోధించెను. "రాముడు మనుష్యమాత్రుడుకాడు. సాక్షాత్తాదినారాయణు డట్లవతరించెను. సీత సాక్షాత్తు జగత్తునకు కారణమగు చిచ్ఛక్తి. వారిద్దఱివలననే చరాచరమగు నీజగత్తంతయు పుట్టినది. కనుక సీతారాములు నిలిచియున్నలోకమంతటికి తలిదండ్రులైయుండ లోకములో వారికి శత్రువెక్కడ నున్నాడు? జగములకు దల్లియగు నామె నీచే తెలియక తీసికొనిరాబడినది. ఒకక్షణములో నాశనమునకు లోనగు సంసారమందును, నంతలో నాశనమగునదియు, పంచభూతములతో జేయబడినదియు. * 24తత్త్వముల (5భూతములు, అహంకారము, బుద్ధి, మాయ, 10జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు. మనస్సు, 5 శబ్దాదివిషయములు.) తో జేరినదియు. మలము, మాంసము ఎముకలదుర్గంధముగలిగి యహంకారము నకు స్థానమైనదియు, జడస్వరూపమైనదియునగు దేహమందు నిట్టిదేహముకంటెవ్యతిరిక్తు డవగు నీకు నాశమేల? దేనికొఱకై నీవు బ్రహ్మహత్యాదిపాపముల జేసితివో యేదిభోగముల ననుభవించునో యట్టిదేహము నశింపగలదు. జీవునిచే నాచరింపబడి జీవునితోగూడ వచ్చుచుండెడి పుణ్యపాపములు జీవునకు దేహసంబధముగలుగజేసి సుఖదుఃఖముల నిచ్చుచున్నవి. ఈజీవు డస్వతంత్రుడై యెంతవఱకు నేనే దేహమనియు, నేనేకర్తననియు

---

* భగవద్గీత 13వ. అధ్యాయము. 6వ. శ్లోకము. ప్రమాణము.

నని సెలవీయ నతడట్లు చేసెను. శుకుడు వెంటనే రావణునియొద్దకు బోయెను. అప్పుడు రావణుడు వానిని జూచి నవ్వుచు 'నీఱెక్కలు కట్ట బడినట్లును, వానిలోని వెంట్రుకలు లాగివేయబడినట్లును కనబడుచున్న వేల? నీవు చంచలచిత్తులగు వానరులవశములో బడలేదుగదా?' యని యడిగెను. అప్పుడు వాడు భయముచే తనకు మతిచాంచల్యముగలిగి నను తనరాజాజ్ఞాపించుటచే నిట్లు పలికెను. 'నేను మీసందేశమంతయు

భ్రమవల్ల నహంకారముగలవాడగునో యంతవఱకు జననమరణములను బొందుచుండును. కనుక గొప్పబుద్ధిగలవాడా! నీవు దేహాదులం దభిమానమును విడువుము. ఆత్మ మిక్కిలి నిర్మలమైనది; శుద్ధమైనది. విజ్ఞాన (ఆత్మజ్ఞాన) రూపమైనది; చలనము,నాశనములేనిది. జనుడు తన యజ్ఞానమువలననే సంసారబంధమును బొంది మోహమును బొందుచున్నాడు. కనుక నీవు పరిశుద్ధమగుమనస్సుతో నాత్మను దెలిసికొని యెల్లప్పుడు దానిని స్మరింపుము. పుత్రులు, భార్య, గృహములు మొదలగు వానియందెల్లప్పుడు నాసక్తిని విడువుము. నరకములందును, కుక్క, పంది మొదలగుజంతువులందునుగూడ భోగములుగలవు. వివేకమునుగలుగజేయు దేహమును బొందుటయు, నంతకంటెనెక్కువగ ద్విజుడై పుట్టుటయు, నంతకంటెకర్మభూమియగు భారతవర్షమునందు జన్మించుటయు మిక్కిలిదుర్లభములు. ఇట్టిదుర్లభమగు జన్మమును బొంది యేవిద్వాంసుడు దేహమం దాత్మబుద్ధిగలవాడై భోగముల ననుభవించును? మఱియు నీవు బ్రహ్మవంశములో బుట్టి పులస్త్యకుమారుని పుత్రుడవైయుండి యజ్ఞానినివలె నెల్లప్పుడు భోగములకై సంతోషముతో నెందులకు గొప్పయత్నమును జేయుచున్నావు? ఇటుపైనైనను నీ వన్నిటితో సంగమమును విడిచి యెల్లపుడు భక్తిభావముచే పరమాత్ముడగురాముని నాశ్రయింపుము. నీవు సీతను రామునకు సమర్పించి యతనిపాదములను సేవింపుము. అట్లైనచో నీవు పాపములన్ని

మీరు చెప్పినట్లక్కడ పలికితిని. వారు నన్నవమానించిరి. రాముడును,
వానరను సముద్రమును దాటి లంకను సమీపించిరి. దేవదానవులవలె
మీకును, వారికిని గూడ సంధి కుదరదు. వానరులు ముందు పట్టణ

---

టిని విడిచి విష్ణులోకమునకు వెళ్లెదవు. లేనియెడల తిరుగ జన్మములేని
మిక్కిలి యన్యలోకములను బొందెదవు. నామాటల నంగీకరింపుము.
నీకు మేలగుదానిని నేను బలికితిని.' ఇట్లు శుకుడు రావణునకు
బోధించెను.

వాడింతజ్ఞానియగుటకు కారణమైన వానిపూర్వజన్మవృత్తాంత
మిట్లు తెలుపబడినది. ఇతడు బ్రాహ్మణుడై బ్రహ్మజ్ఞానము గలిగి, బ్రహ్మ
ము నెతలచుచు, వనమున వానప్రస్థుడై యుండి, తననియతకర్మలను జేయుచు,
దేవతలవృద్ధికొఱకును, వారిశత్రువులనాశనముకొఱకును నెడతెగక
ననేకయజ్ఞములను జేసెను. అందువలన నితడు రాక్షసులకు విరోధి
యాయెను. వజ్రదంష్ట్రుడను గొప్ప రాక్షసుడు వీనిలోపములను గనిపెట్టుచు
వీనికి నపకారము జేయుయత్నములో నుండెను. అంతట నొకానొకసమయ
మున నగస్త్యుడు వీనియాశ్రమమునకు వచ్చెను. ఆమహర్షిని వీడు భోజ
నమున కాహ్వానించెను. ఆఋషి స్నానమునకు వెళ్లగా నాసమయమున
వజ్రదంష్ట్రుడా సంగతిని గనిపెట్టి తనమాయచే నగస్త్యునిరూపమును
దాల్చి శుకునితో 'నీవు నాకు భోజనము పెట్టుట కిచ్ఛయించుచున్నయె
డల నాకు మాంసభోజనమును బెట్టుము. చాలకాలమునుండి నేను మేక
మాంసమును దినకయుంటి' నని చెప్పెను. దానికి శుకు డంగీకరించి
చాలమాంసభోజనమును సిద్ధముచేసెను. అగస్త్యుడు స్నానముచేసి
భోజనమునకు గూర్చుండ నారాక్షసుడు సుందరమగు శుకునిభార్యా
రూపమును దాల్చి యామెమనస్సులో నజ్ఞానమును గలిగించి యాతనికి
బాగుగ వండిన మనుష్యమాంసమును వడ్డించి యదృశ్యుడయ్యెను. దీనికి
నగస్త్యుడు మిక్కిలి కోపించి 'దుర్బుద్ధీ! నీవు నాకపవిత్రమైన నరమాంస

ప్రాకారమెక్కుటకు సిద్ధమైయున్నారు. సీతను రామునకిండు; లేనియెడల వారితో యుద్ధము సేయుడు.' శుకునియీమాటలను రావణుడు విని రోషముతో కండ్లెఱ్ఱజేసి 'దేవ దానవగంధర్వులు నాతో యుద్ధము నకువచ్చినను, నన్నిలోకములనుండి నాకు భయము కలిగినను నేను సీత నియ్యను. నాబాణము లెప్పుడు రామునిశరీరమున నాటును? నేనెప్పుడు వానిబలమును తిరస్కరింతు'నని పలికి తాను పూర్వము తనసభలో తన్నుగూర్చి పలికినట్లే యప్పుడుకూడ ననెను.

---

మును బెట్టితివి. కనుక నీవు రాక్షసుడవై మనుష్యమాంసమును భుజిం చుచుండు' మని శుకుని శపించెను. దానికి వాడు 'మునీశ్వరా! ఇప్పుడు మీరు నన్ను చాలమంచిమాంసమును బెట్టుమని కోర నేనట్లు చేసితిని. అందులకు మీరు నాకేలశాపమిచ్చితి' రని యడిగెను. ఈమాటలను నగస్త్యుడు విని యొకగడియమనస్సులో ధ్యానించి రాక్షసుడుచేసిన పనిని దెలిసికొని మంచిమనస్సుతో శుకునితోనిట్లనెను. 'నీకపకారము చేసినరాక్షసునిచే నిదంతయు జరుపబడెను. దానిని నేను కనుగొనక మునిశ్రేష్ఠుడవగు నీకు శాపమిచ్చితిని. అయినను నామాట వ్యర్థము కాదు. నీవు రాక్షసరూపమును దాల్చి రావణునికి సహాయునిగ నుండె దవు. వానిని జంపుటకు రాముడు వానరులతో లంకసమీపమునకు వచ్చినప్పుడు వాడు నిన్ను రామునివద్దకు చారునిగ బంపును. అప్పుడు నీవు రాముని జూచి శాపమునుండి విడువబడియెదవు. తరువాత నీవు రావణునకు తత్త్వజ్ఞాన ముపదేశించి ముక్తిని బొంది గొప్పపదవిని బొందెదవు.' ఇట్లగస్త్యుడు సెలవీయ నతనిసెలవుప్రకారమంతయు జరి గెను. తరువాత శుకుడు బ్రాహ్మణుడై వైఖానసులతో జేరెను.

## ౧౧వ. అధ్యాయము.

### రావణుడు శత్రుసైన్యపరీక్షకై శుకసారణులను బంపుట.

రాముని సైన్యము సముద్రముదాటివచ్చినతరువాత రావణుడు దానిని తెలిసికొని తనమంత్రులగు మంత్రియొక శుకుని, సారణునిబిలిచి యిట్లు పలికెను. 'పూర్వమెన్నడును గట్టబడని సేతువు రామునిచే గట్టబడెను. దుస్తరమగు సముద్రమును వానరబలము దాటెను. ఈసంగతులను మన మెంతమాత్రము నుపేక్షచేయగూడదు. ఈవానరబలమును నేను తప్పకుండ పరిశీలించి తెలిసికొనవలెను. ఇతరులకు దెలియకుండ మీరా సైన్యమున ప్రవేశించి యది యెంతయున్నదో, దానిబలమెట్టిదో, దానిలో ముఖ్యులగు శూరులెవరో, రామసుగ్రీవులకు నిష్టులగు మంత్రులెవరో, యెవరు ముందునడచుచుండిరో, సముద్రములో సేతువెట్లు కట్టబడినదో, వారచట నెక్కడ నివసించియున్నారో, రాముని పరాక్రమమును, నాయుధములును, యుద్ధోపకరణములును నెట్లున్నవో, లక్ష్మణుని పరాక్రమమెట్టిదో, వానరులకు సేనాధిపతియెవడో సరిగ తెలిసికొని శీఘ్రముగ తిరుగవచ్చి నాతో జెప్పవలెను.' ఇట్లు రావణు డాజ్ఞాపింప శుకసారణులు వానరరూపముల ధరించి శత్రుసైన్యమునబ్రవేశించిరి. అది యెక్కువగనుండుటచే వారు దానిని లెక్కపెట్టలేకపోయిరి. అది పర్వతశిఖరములందును, రాళ్లయందును, గుహలందును, తోటలందును, చిన్నతోటలయందును నుండెను. ఇట్లు మారువేషములతో నున్నవారిని విభీషణుడు చూచి పట్టుకొని రాముని యెదుటబెట్టి 'వీరు రావణుని మంత్రులగు శుకసారణులు; లంకనుండిచారులుగవచ్చి' రని తెలిపెను. వారాతనిజూచి గొప్పవిచారమును బొంది ప్రాణములందాశలేనివారై భయముతో చేతులుజోడించుకొని 'మీబలములనన్నిటిని తెలిసికొనుటకు రావణు డిక్కడకు బంప మేము వచ్చితి'మని విన్నవింప సర్వప్రాణులందు దయగల రాముడు బిగ్గరగ నవ్వుచు నిట్లు

పలికెను. "మీరు మాబలములను, మమ్మును బాగుగపరీక్షించియుండినయెడల, మీప్రభువు చెప్పినకార్యముజరిగినయెడల మీరు స్వేచ్ఛగ వెళ్లవచ్చును. మీ కేమైనను చూడకపోయినయెడల పలుమార్లు బాగుగ జూడవచ్చును. విభీషణుడు మీకు చాలసార్లు దానినిజూపించును. ఇట్లు పట్టుబడినందులకు మీరు మీప్రాణములనుగూర్చి భయపడవలదు. శస్త్రములను బట్టినను, బట్టకున్నను దూతలనుమాత్రము చంపకూడదు. మిమ్ము విడిచిపెట్టినతరువాత మీరు లంకకు బోయి నేనుచెప్పినయీమాటలను రావణునితో జెప్పుడు. ఏబలమునునమ్మి నాసీతను నీవెత్తుకొనిపోయితివో యాబలమును నీవును, నీబంధువులును, నీసైన్యమును నిప్పుడు చూపవలెను. రేపటియుదయమున నాబాణములచే లంక గోడలతోను, బహిర్ద్వారములతోను, రాక్షసులతోను, నితరబలములతోను నాశనముచేయబడును. నేను రావణునిపైని వాని బలములపైని వాడిబాణములను విడిచెదను." ఇట్లు రాము డాజ్ఞాపింప వారు రామునకు జయముపలుకుచు నమస్కరించి యతనివద్ద సెలవు పుచ్చుకొని సంతోషముతో తమ రాజునొద్దకుబోయి వానికి జరిగినసంగతంతయుదెలిపి 'రామలక్ష్మణవిభీషణసుగ్రీవులను పురుషశ్రేష్ఠులు నలుగురును నలుగురులోకపాలురవలెనొకచోటనిలిచియున్నారు. మంచిపరాక్రమముగలవారును, శస్త్రవిద్య బాగుగ దెలిసినవారునునగు నానలుగురును మిగిలినవానరబలమక్కఱలేకుండలంకనుదానిలోనున్న వానితో గూడ నెక్కఁదీసి మఱియొకచోటికి విసరివేయగలరు. రామునిరూపమును, నాయుధములను జూడ నతఁడొక్కఁడును మిగిలినముగ్గురులేకున్నను మనపట్టణమునునాశనముజేయశక్తిగలవానిగగనబడుచున్నాడు. వానరసేనను నింద్రాదిదేవతలైనను జయింపలేరు. అది యుద్ధమునకు సిద్ధమై సంతోషముతోనున్నది. దానితో విరోధము మంచిదికాదు. మీరు శాంతమును బొంది రామునకు సీతనిచ్చివేయుడ'ని పలికిరి.

---

## ౧౨ వ. అధ్యాయము.

### రావణుడు పెద్దమేడపై కెక్కి వానరసైన్యమును పరీక్షించుట.

శుకసారణులు చెప్పినమాటలు రావణున కనిష్టములగుటచే నతడు సారణునితో నిట్లు పలికెను. "దేవదానవగంధర్వులు నాతో యుద్ధమునకు వచ్చినను, సర్వలోకములనుండి నాకు భయము గలిగినను నేను సీత నియ్యను. నీవు వానరులచే పట్టుబడి జడిసి 'సీతనిచ్చివే యుటమంచి'దని యాలోచించుచున్నావు. నన్ను యుద్ధములో నే శత్రువు జయింపగలడు." ఇట్లు రావణుడు కఠినముగ బలికి క్రోధము గలవాడై చాలతాటిచెట్లంతయెత్తుగలదియు, హిమవత్పర్వతమువలె తెల్లనిదియునగునొక మేడను శుకసారణులతో నెక్కెను. అప్పటికి వానర బలము లంకకు కొంతదూరములో నుండెను. ఆమేడనుండి సముద్రమును, పర్వతములను, తోటలను జూడ నాదేశమంతయు ననేకవానరులతో నిండియుండెను. లెక్కపెట్టుటకు వీలులేకుండనున్న యావానర సైన్యమును జూచి రావణుడు "వీరలలో శూరులు, మహాబలులెవ్వరో, ముందుత్సాహముతో వచ్చువారెవ్వరో, యెవరిమాటలను సుగ్రీవుడు వినుచున్నాడో, సేనానాయకులెవరో, ముఖ్యులగువారలెవ్వరో తెలుపు"మని సారణు నడుగ నామంత్రి "అనేకవేలవానరులతో సేనముందునడచుచు లంకయంతయుగదలునటుల పెద్దకేకలువేయుచు లంకకెదురువచ్చువాడు నీలుడనుసేనాపతి. చేతులుపైకెత్తి నడచుచు భయములేనివాడై దిక్కులన్నియు ప్రతిధ్వనించునట్లు క్రోధముచే తనతోకతో నేలనుగొట్టుచు నిన్నుయుద్ధమునకు బిలుచువాడు వాలిపుత్రుడగు నంగదుడు. తనతండ్రితోసమానమగు బలముగలవాడును, సుగ్రీవునకెల్లప్పుడు ప్రియుడునునగు నాతని కపిరాజు యువరాజుగ నభిషేకించెను. అతడు సేనను నడుపుచున్నాడు. అతనిసేనవెనుక గొప్పసేనతోనుండు

వాడు సేతువునుగట్టిన నళుడు. చందనవననివాసులగు *వానరులనేకు లతనితోనిలిచి క్రోధముతో లేచి సింహనాదములుచేయుచు లంకను తామేపట్టుకొనుటకు ప్రార్థించుచున్నారు. గొప్ప విక్రమశాలియు, యుద్ధచపలుడును, బుద్ధిమంతుడును, మూడులోకములలోను ప్రఖ్యాత పురుషుడునునగు శ్వేతుడు తనసైన్యముతో లంకనుగొట్టుటకు గోరుచు సుగ్రీవునియొద్దకు వెళ్ళి తనసైన్యమును బాగుగ నేర్పఱచుటకు తిరిగి వెళ్ళిపోవుచు దానిని యుద్ధమునకు ప్రోత్సాహపఱచుచున్నాడు. తరు వాతవాడు గోమతీతీరమందున్న సంకోచనపర్వతమువద్ద రాజ్యము చేయుచున్న కుముదుడనువాడు. అతడొక సేనానాయకుడు. చండు డనువాడు రోషమును గనబఱచుచు తాను తెచ్చినగొప్పసేనతో లం కనుబట్టుకొనుటకు ప్రార్థించుచున్నాడు.వీని తోకలో చాలరంగులుగల వెండ్రుకలున్నవి. గోరోజనమువంటిరంగుగలవాడును, పెద్దకన్నులు గలవాడును,సింహపరాక్రమముగలవాడునునగు రంభుడు వీరులగువనేక వానరులను యుద్ధమునకు దీసికొనివచ్చి కోపముతో లంకను జూచుచు దానిని పట్టుకొనసిద్ధముగనున్నాడు. తనచెవులను మాటిమాటికిఱుపు చుకొనుచును, పెద్దవిగజేయుచును నుండువాడును, మృత్యుదేవతకు జడియనివాడును, యుద్ధములో వెనుదీయనివాడును, గొప్పబలముగల వాడునునగు శరభుడను వానరనాయకుడు తనతోకను కదలించుచును, వంకరగత్రిప్పుచును, రోషముతో తిరుగజూచుచును, సింహనాదము చేయుచును ననేకవానరులతో యుద్ధమునకు వచ్చెను. భేరీలధ్వనివంటి ధ్వనిగలవాడును, యుద్ధములోగొప్పవాడునునగు పనసుడనేకవానరు

---

* నళపరివారము కిష్కింధాకాండలో నూఱుకోట్లకంటె నెక్కువ యని వర్ణింపబడినది. ఇక్కడ నది 8లక్షలను, వేయికోట్లను నని వర్ణింపబడినది. కవి చాతుర్యములో నిట్టి సంఖ్యావ్యత్యాసములు కనబడుచున్నవి. ఈచరిత్రలో దాని ననేకులని తెలియబఱచితిమి.

లతో యుద్ధమునకు వచ్చెను. వినతుడనువాడు పెద్దసేనతో నిలిచి యున్నాడు. క్రోధనుడను వానరవీరుడు చాలబలముగలసేనతో మిమ్ము యుద్ధమునకు బిలుచుచున్నాడు. గవయుడనువాడు బలముగలవానరవీరులనందఱినిదాటి యెత్తైనె నెనసశరీరమును యుద్ధమునకై వృద్ధి చేయుచు మిమ్ము తిరస్కరించుచు తనబలముచే లంకను పట్టుకొనుటకు ప్రార్థించుచున్నాడు చాలరంగులుగలవియు, పొడుగైనవియునగు వెండ్రుకలుగలతోకతో వచ్చునాతడు పరాక్రమవంతుడగు హరుడు. వాని వెంట ననేకవానరులు లంకగోడ లెక్కుడనుని తొందరజేయుచు వచ్చుచున్నారు. మేఘములవంటి శరీరములుగల యనేకఋక్షులు (ఎలుగు బంట్లనంటిరూపముగలవారు) పర్వతములందును, నదులందును, నెత్తు పల్లములుగల ప్రదేశములందును నిలబడి మిమ్ము యుద్ధమునకు పిలుచుచున్నారు. వారిమధ్య పెద్దకన్నులతో భయంకరముగ గనబడునాతడు వారిరాజగు ధూమ్రుడు. వానితమ్ముడుజాంబవంతుడు; పర్వతరూపుడు. రూపపరాక్రమములలో నితడు తనయన్నవలె గనబడుచునతడుచెప్పిన ప్రకారము జరుపుచు యుద్ధములలో గెలుచుచుండును. ఇతడు దేవాసురయుద్ధములో నింద్రునికి సాయమువెళ్లి యతనివలన వరములను బొందెను. ఇతనిఋక్షులు రాక్షసపిశాచములతో సమానమగువారు. మిక్కిలిబలముగలవాడును, బలముచే నింద్రుని సంతోషపెట్టినవాడును, యుద్ధమునకెగురసిద్ధముగనున్నవాడునునగు నాతడు వానరనాయకుడగు దంభుడు. వానిని వానరులంద ఱాశ్చర్యముతో జూచుచున్నారు. తరువాతివాడు సన్నాదనుడను వానరవీరుడు; గొప్పశరీరము గలవాడు. తరువాతివాడు క్రథనుడను వానరవీరుడు. ఇత డింద్రునితో సమానమగు పరాక్రమముకలిగి యనేకవానరులతోనిలిచి తనబలములచే లంకను బట్టుకొనుటకు ప్రార్థించుచున్నాడు. ఇంద్రుని పరాక్రమమువంటి పరాక్రమముగలిగి బలవంతులగు ననేకవానరు

లతో యుద్ధమునకు వచ్చి మేఘములవలె గనబడుచున్నయాతడు ప్రమాథి. వానిసేనకదలుచున్నప్రదేశమున నెక్కువగ బుగ్గి యెగిరి యున్నది. పెద్దశరీరములుగల మహాబలులగు గోలాంగూలు (ఆవుతో కలవంటితోకలుగలవారు) లనేకులు తమరాజగు గవాక్షునితో లంకను తమపరాక్రమముచే పట్టుకొన సిద్ధమైయున్నారు. అదుగో! హనుమంతునితండ్రియగు కేసరి. అతడు తనసేనతో సిద్ధముగనున్నాడు. మిక్కిలిశూరుడును, బలపరాక్రమములుగలవాడును, పౌరుషముగల వాడునునగు శతవలి పెద్దతోకలును, ననేకవర్ణములుగల శరీరములును, గొప్పపరాక్రమమునుగల వానరసేనను నడుపుచున్నాడు. అతడుతన సేనచే లంకను బట్టుకొనగోరుచు రామునికి ప్రియముచేయుకొఱకు తన ప్రాణములీయ సిద్ధముగనున్నాడు. గజుడు, గవాక్షుడు, గవయుడు, నళుడు, నీలుడు *ననేకసేనలతో సిద్ధమైయున్నారు. ఇంకను ననేకులు గలరు. లెక్కపెట్టుటకు శక్యముకాదు. అందఱు గొప్పప్రభావముకల వారు. భూమినంతయు నొకనిమిషములో నాశనముచేయ శక్తికలవా" రని పలికెను.

తరువాత శుకుడు రావణునకు శత్రుబలమును జూపుచు "ఈ వానరు లనేకులు పెద్దచెట్లవలె నున్నారు. వీరు బలవంతులు; యుద్ధములో గొప్పపరాక్రమముగలవారు. వీరు దేవతలతోను, దైత్యుల తోను, దానవులతోను సమానమగువారు; కోరినరూపమును బొందగలవారు. అదుగో! గొప్పపరాక్రమముగల మైందద్వివిదులు నిలు

*గజాదులు పదికోట్లసైన్యముతో యుద్ధమునకు వచ్చిరని వర్ణింపబడినది. కిష్కింధాకాండలో గవాక్షునిసేన కోటికిపైగాననియు, గజునిసేన మూడుకోట్లనియు నీలునిసేన పదికోట్లనియు నిర్ణయింపబడుటచే నీసంఖ్యలు కేవలము సరియగునవి కావని వ్యాఖ్యాభిప్రాయమగుటచే ననేకమని చరిత్రలో వివరించితిమి.

చుండి లంకనుబట్టుకొనుటకు సెలవడుగుచున్నారు. ఆనిలుచున్నవాడు హనుమంతుడు. ఇదివరలో నాతడు వచ్చి యీలంకను పాడుచేసెను. వాడు తిరుగవచ్చెను. వానికి కోపమువచ్చిన సముద్రమును కలకలము చేయును. వాడు వాయువేగముగలవాడు. వానిబలమును, ప్రభావమును వర్ణింపశక్యముకాదు. తానొక్కడే లంకనుపట్టుకొనుటకు సెలవు గోరుచున్నాడు. వానిప్రక్కనుండువాడు, రాముడు. ఇతడు గొప్పశూరుడు; అతిరథుడు; ధర్మమార్గమును జరించును; అస్త్రములు బాగుగ నెఱిగినవాడు. ఇతడు తనబాణములచే నాకాశమును, పర్వతములను ముక్కలుముక్కలుగ జేయగలడు. ఇతనికోధము మృత్యుదేవతకోధమునంటిది; పరాక్రమ మింద్రునిపరాక్రమమువంటిది. మీ రాతని భార్యను హరించినందులకు మీతో యుద్ధమునకు సిద్ధమైయున్నాడు. ఆతనికుడిప్రక్కనున్నవా డాతనితమ్ముడగులక్ష్మణుడు. ఇతడు కండ్లెఱ్ఱ జేసియున్నాడు; నీతిశాస్త్రములోను, యుద్ధములోను నేర్పరి; బలపరాక్రమములుగలవాడు; జయింపశక్యముగానివాడు; రామునికెల్లప్పుడు బహిఃప్రాణమువలెను, కుడిభుజమువలెను నుండువాడు. రామునిగూర్చి యితడు తనప్రాణములనైనను విడుచును. ఇతడు రాక్షసుల నందఱిని జంపుటకు సెలవడుగుచున్నాడు. రామునియెడమప్రక్కనున్నవాడు మీతమ్ముడగువిభీషణుడు. ఇతడు రామునిపక్షములో జేరెను. ఇతనిని రాముడు లంకాపట్టణమునకు రాజుగ నభిషేకించెను. ఇతడుకూడ మీపైకి యుద్ధమునకు వచ్చుచున్నాడు. ఆమధ్యను పర్వతమువలెనున్న వాడు సుగ్రీవుడు. అతడు వానరులందఱికి రాజు. తేజస్సులోను, బుద్ధిలోను, కీర్తిలోను, జ్ఞానములోను, కులములోను మిగిలినవానరులందఱి కంటె గొప్పవాడు. ఇతడు నూఱుపద్మములుగల బంగారుమాలను ధరించెను. దానియందు వీరలక్ష్మిగలదు. ఇతడు విభీషణునితోను, తన

మంత్రులతోను * లెక్కపెట్టనలవికాని గొప్పసైన్యముతోను మీపైకి యుద్ధమునకు వచ్చుచున్నాడు. దీనిసంతయుజూచి మనకు జయమును, శత్రువునకు పరాజయమును గలుగునట్టుల గొప్పప్రయత్నముచేయు" డని తెలిపెను.

ఇట్లు శుకసారణులు తెలుప రావణునకు క్రోధముకలిగెను. అతడు కొంచెము భయమును బొంది వారి నిద్దఱి నిట్లవమానించెను. రక్షించుటకు, శిక్షించుటకు శక్తిగలప్రభువునొద్ద బనిచేయుమంత్రులతనికి విప్రియము పలుకగూడదు. యుద్ధమునకు శత్రువులువచ్చియుండ నాతని మీరిద్దఱు స్తుతించుట యేమియు తగియుండలేదు. మీరు రాజశాస్త్రములననుసరించి కార్యములను జేయుట బాగుగ గ్రహింపకపోవుటచే మీయాచార్యులకు, గురువులకు, జ్ఞానవృద్ధులకు మీరుచేసినసేవ వృథయైనది. మీరు దానిని గ్రహించినను నది మీకు బాగుగ దెలిసియుండలేదు. మీరు జ్ఞానమును దెలియకున్నారు. ఇట్టి మూర్ఖులగు మీవంటి మంత్రులతో నేను రాజ్యముచేయుచున్నాను. నేను పలికినంతమాత్రమున మీకు శుభాశుభములు గలుగునుగదా! అట్టి

---

* శంఖము=లక్షకోట్లు — మహాశంఖము=లక్షశంఖములు
బృందము=లక్షమహాశంఖములు — మహాబృందము=లక్షబృందములు.
పద్మము=లక్షమహాబృందములు. — మహాపద్మము=లక్షపద్మములు.
ఖర్వము=లక్షమహాపద్మములు. — మహాఖర్వము=లక్షఖర్వములు.
సముద్రము=లక్షమహాఖర్వములు — ఓఘము=లక్షసముద్రములు.
మహౌఘము=లక్షౌఘములు.

వానరబలము — వేయికోట్లు నూఱుశంఖముల వెయ్యిమహాశంఖముల నూఱు బృందముల వేయిమహాబృందముల నూఱుపద్మముల వేయిమహాపద్మముల నూఱు ఖర్వముల నూఱు సముద్రముల నూఱు మహౌఘములని యీ సంతయుగలిసి కోటిమహౌఘములని యువర్ణింపబడినది. ఇదివఱలో నూఱుకోట్లవానరులు యుద్ధమునకు వచ్చిరని తెలిపితిమి. కనుక నీవర్ణనయంతయు కవిచాతుర్యముచే జేయబడినదని మేమభిప్రాయపడుటచే చరిత్రలో గొప్పసైన్యమని తెలిపితిమి.

నాతో కఠినపుమాటలను పలుకుటకు మీకు మృత్యుభయమేల లేదు? అడవిలో నగ్నిపుట్టినను చెట్లు బ్రతుకవచ్చునుకాని రాజకోపమునకు నపరాధముజేసినవారు నిలువలేరు. మీరు పూర్వము నాకు జేసిన యుపకారములను నేను తలంపనియెడల శత్రుపక్షమువారిని గీర్తించి నందులకు మీకు మరణమువచ్చియుండును. మీరు మీపదవులను విడిచి నాయెదుటనుండి పొండు. మీరు కృతఘ్నులు. మీయందు దయ జూపకపోవుటయే మిమ్ములను జంపినట్లగును.” ఇట్లు రావణుడు పలుక శుకసారణు లతనిని గీర్తించుచు సిగ్గుతో వెడలిపోయిరి.

---

## ౨౯ వ. అధ్యాయము.

## రాముని సైన్యమును సువేలపర్వతసమీపమున రావణునిచారులు పరీక్షించుట.

రావణుడు శుకసారణులను బంపినతరువాత సభలోనున్న మహోదరునితో ‘నాయొద్దకు నీతిశాస్త్రమునెఱిగిన చారులను బంపు’ మని యనెను. అతడు రావణుడుచెప్పినట్లాజ్ఞాపింప శత్రుభయములేని వారును, శూరులును, నమ్మకముగలవారును, ప్రభుభక్తిగలవారును నగు శార్దూలాదులు రావణుని గీర్తించుచు తొందరగ నతనియెదుటకు వచ్చిరి. రాక్షసరాజు వారలను జూచి యిట్లాజ్ఞాపించెను. “మీరిక్కడనుండి బయలుదేఱివెళ్ళి రామునియుద్ధప్రయత్నములను పరీక్షింప వలెను. మీరు పైవారికి తెలియకుండ నతనికి మిక్కిలిసమ్మకముగల మంత్రులెవ్వరో, యతనికి నెవరియందు ప్రీతికలదో, యత డెట్లునిద్రించునో, యెట్లు జాగ్రత్తగలిగియుండునో, యేమేమిచేయుచుండునో సమ సముకనుగొని యిక్కడకు రావలెను. చారులవలన శత్రువులసంగతు

లను దెలిసికొనినరాజు స్వల్పయుద్ధముతో శత్రువుల నోడించును." ఇట్లు రావణు డాజ్ఞాపింప చారులు 'అట్లే చేసెద'మని పలికి రాజునకు ప్రదక్షిణముచేసి సువేలపర్వతసమీపమునకు మారువేషముతో వెళ్ళిరి. అక్కడ వారు రామలక్ష్మణులను, సుగ్రీవవిభీషణులను జూచి సేననంతను జూచుచు భయముచే దీనత్వమునొందిరి. దైవయోగము వలన వారు విభీషణునిచే బట్టుబడిరి. పరాక్రమవంతులగు వానరులు వారిని బాగుగ హింసించుచుండ రాముడు వారినందఱిని విడిపించెను. వారు చైతన్యములేనివారై నిట్టూర్పుదీయుచు లంకకు తిరిగివచ్చిరి.

శార్దూలుడు మొదలగుచారులు రావణునితో సువేలపర్వతసమీపమున రామునిబలముండుట దెలిపిరి. రావణుడు దానిని విని కొంచెము కంగారుపడి శార్దూలుని జూచి 'నీశరీరవర్ణము పూర్వము వలె లేదు. నీవు దీనునివలె నున్నావు. నీవు క్రోధముగల శత్రువుల వశముకాలేదుగదా?' యని యడుగ నతడు భయముచే గంపించుచు మెల్లగ నిట్లు పలికెను. "మహారాజా! వానరశ్రేష్ఠులు నన్నెక్కడకును వెళ్లి యేమియుకనుగొననీయలేదు. బలపరాక్రమములుగలవారిని రాముడు రక్షించుచుండుటచే నే నెవరితోనైనమాట్లాడుటకును, నెవరినైన నడుగుటకును వీలుకాలేదు. త్రోవలన్నియు పర్వతాకారులగువానరులచే కాపాడబడుచున్నవి. నే నందు ప్రవేశించి యెక్కడకు తిరుగకమునుపే నాసంగతి వారికి దెలిసిపోయినది. విభీషణునిమంత్రులు నన్ను బలవంతముగ బట్టుకొని విశేషముగ పిడికిళ్ళతోను, మోకాళ్ళతోను, నఱచేతులతోను కొట్టి దంతములతో గఱచిరి. నేను చారుడనని వానరులందఱికి వెల్లడియైనతరువాత వణకుచున్ననాశరీరమునుండి రక్తముకాఱుచుండ నన్ను గొట్టుచు వారు రామునియొద్దకు దీసికొనిపోయిరి. నేన తనికి నమస్కరించి యతనిచే రక్షింపబడి విడువబడి బ్రతికి వచ్చితిని. రాముడు గరుడవ్యూహమున సేనను రక్షించుచు లంకనుజేరవచ్చెను,

అతడు ముందరిప్రాకారమును బట్టుకొనును. సీతను నాతని కిచ్చుటయో, లేక యుద్ధముచేయుటయో మీరు శీఘ్రముగ జేయుడు." ఇట్లు శార్దూలుడు పలుక రావణుడు బాగుగనాలోచించి 'దేవగంధర్వదానవులు నాతో యుద్ధమునకు వచ్చినను, సర్వలోకములవలన నాకు భయముగలిగినను నేను సీత నియ్య'నని పలికెను. ఇంకను నతడు శార్దూలునితో 'నీవు వానరసేనను బాగుగ జూచితివి. దానిలో శూరులెవరో, వారలెట్టివారో, వారితండ్రులెవరో సమముగ దెలుపుము. వారిబలాబలములను దెలిసికొని యుద్ధప్రయత్నము చేసెద' నని పలుక వాడు తనకు తెలిసినదంతయు వానికి దెలిపి 'రాముని సేనయంతయు సువేలపర్వతసమీపమున నున్నది. మిగిలినపనులు మీరాలోచించుకొనవలె' నని రావణునితో మనవిచేసికొనెను.



## ౧౮ వ. అధ్యాయము.

### రావణుడు రామునిమరణమును దెలుపుచు సీతను భ్రమింపజేయుట.



రాముడు సువేలపర్వతసమీపమున సేనతో విడిసియుండుట శార్దూలుడు మొదలగుచారులవలన రావణుడు విని కొంచెము తొట్రుపాటు జెంది తనదగ్గఱనున్న సచివులకు (కర్మసహాయులు) "ఇప్పుడు మన మాలోచింపవలసినకాలము వచ్చినది. మంత్రులను పిలిపింపు'డని సెలవీయ వారు శీఘ్రముగ మంత్రులను రప్పించిరి. అప్పు డతడు ముందు చేయవలసినదానినిగూర్చి వారితో సలహాజేసి తననగరునకు వెళ్లెను. తరువాత గొప్పమాయలు దెలిసినరావణుడు గొప్పమాయలు, బలముగల విద్యుజ్జిహ్వుని పిలిపించి 'మనము సీతను భ్రమింపజేయవలెను. నీవు రాముని మాయాశిరమును, మాయాధనస్సును, బాణములను బట్టుకొని

రమ్మని యన వాఁడు 'అట్లే చేసెద' నని పలికెను. రావణుడు దానికి సంతోషించి రెండో యాభరణమును వానికి బహుమానమిచ్చెను. తరువాత రావణుఁడు ఒక్కరుఁడును అశోకవనమునకుఁ బోయి పూర్వము వలెనే విచారముతో నున్నయామెను జూచి యామెసమీపమునకు వెళ్ళి సంతోషముతో గట్టిగ నిట్లు మాట్లాడెను. "నీవు నీభర్తను ధ్యానించుచు నతనిని నమ్ముకొని నన్ను కఠినపుమాటలాడితివి. అతఁడు యుద్ధములో చనిపోయినందున నేను నిన్నోదార్చుచున్నాను. నీ కాధారము పోయినది. నీగర్వ మణఁచితిని. నీకు గొప్ప వ్యసనము కలుగుటచే నీవు లొంగి నా భార్య వగుదువు. మూర్ఖురాలా! మరణించిన రామునితో నీ కేమి ప్రయోజనము? నీవు రామునియందలి బుద్ధిని విడుము; నా భార్యలలో ముఖ్యురాలవుకమ్ము. అతనిమరణ మెట్లు జరిగెనో చెప్పెదను; వినుము. రాముఁడు నన్ను జంపుటకు సుగ్రీవుఁడు తీసికొనివచ్చిన గొప్పవానరబలముతో సముద్రపు టుత్తరతీరమునకు వచ్చి ప్రొద్దుపోవుసమయమున నచట విడిసెను. మార్గాయాసముచే సేనయంతయు సగము రాత్రికి సుఖముగ నిద్రించెను. రామలక్ష్మణులుకూడ నక్కడ నిద్రించిరి. దానిని నాచారులు వెళ్ళి చూచిరి. అక్కడ ప్రహస్తుఁడు గొప్పదగు నారాక్షసబలమును ననేకవిధములగు నాయుధములతో బంప వానితో వారు వానరులను జంపిరి. గొప్పవీరుఁడును, రాక్షసశ్రేష్ఠుఁడునునగు నా ప్రహస్తుఁ డొకకత్తితో రామునితలను శీఘ్రముగ నఱికెను. అప్పుడు విభీషణుఁడు లేవ రాక్షసులు వానిని బట్టుకొనిరి. లక్ష్మణుఁడును, మిగిలినవానరులును నలుదిక్కులకు పాఱిపోయిరి. సుగ్రీవుఁడు మెడపైగాదగొట్టబడి మరణించెను. హనుమంతుఁడు రాక్షసులచే హతుఁడయ్యెను. వారెగురుచున్న జాంబవంతునికాలిమోఁకాళ్ళమీఁద పట్టిసములో గొట్టి నఱకఁడు ముక్కలై క్రిందఁ బడెను. మైందద్వివిదులనువారు కత్తిచే నఱకఁబడుటచే గాయముక

లై క్రిందబడి రక్తమువఱదలై పాఱుచుండ నేడ్చుచు కొంచెము మూపిరి తీయుచుండిరి. పనసుడు పనసపండువలె భూమియందు బడియున్నాడు. దరీముఖుడును, కుముదుడును బాణములచేగొట్టబడిచచ్చిపడియున్నారు. రాక్షసు లంగదుని బాణములతో గొట్ట నతడు రక్తముగ్రక్కుచు మడిసెను. కొందఱు వానరులు గుఱ్ఱములచేతను, నేనుగులచేతను రథములచేతను త్రొక్కబడిరి. కొందఱను రాక్షసులు తఱుమ వారు పరుగెత్తుకొనిపోయిరి. కొందఱు సముద్రములో బడిరి. కొందఱాకాశమున కెగిరిరి. ఋక్షులు చెట్లెక్కిరి. కొందఱు వానరులు తమవారినే చంపిరి. ఇట్లు నీభర్తయు, నతనిసైన్యమును నాబలములచే జంపబడెను. రక్తముతో తడిసి బుగ్గియంటిన రామునితల తీసికొని రాబడినది." ఇట్లు రావణుడు పలికి సీతవినుచుండ నొకరాక్షసస్త్రీతో 'యుద్ధమునుండి రామునితలను స్వయముగ దీసికొనివచ్చిన విద్యుజ్జిహ్వుని దీసికొనిర'మ్మని చెప్పనామె వానిని దీసికొనివచ్చెను. వాడు రామునిమాయతలను, మాయధనస్సును దెచ్చి రావణునికి తన శిరస్సుతో నమస్కరించి యాతనియెదుటను నిలిచెను. ఆతడు వానికి 'ఆతల నామెయెదుట నామెచూచుటకు నుంచు'మని సెలవీయ వా డట్లుచేసి ప్రక్కకు పోయెను. రావణు డాధనస్సును విసరివేసి యామెతో 'నీభర్తను జంపి ప్రహస్తుడు తెచ్చిన విల్లిదిగో! నీవు నావశముక'మ్మని బలికెను.

రావణుడు రామునిగూర్చి హనుమంతునివలన వినియుండుటచే నాతలలోనికండ్లతనికండ్లవలెను, నుదు రతనినుదుటివలెను, జుట్టతనిజుట్టువలెను గల్పించెను. సీత యాతలను, ధనస్సును తానుపంపినమణిని జూచి పూర్వము హనుమంతుడు చెప్పిన రామసుగ్రీవుల స్నేహసంబంధమును బట్టి రావణుడుచెప్పినదంతయునిజమని తలచి యిట్లు విలపించెను. "కైకేయీ! నీకోరిక చెల్లినది. కులమునకు ముఖ్యముగువాడు మరణించెను. కులమంతయు కలహాబుద్ధిగల నీచే నాశనముచేయబడినది. ప్రాజ

నీయుడగు రాముడు నీ కనిష్టమగు సేవనిని జేయుటచే నాతని వనమునకు బంపితివి?" ఇట్లు సీత విలపించి వణకుచు మూర్ఛనొంది భూమియందరటిచెట్టువలె బడెను. ఒకగడియకు నామె తెలివితెచ్చుకొని యాశిరస్సునుజూచి యెక్కువగ నిట్లు విలపించెను. "అయ్యో! వీరపురుషా! నేను చనిపోయితిని. మీరు మరణమునొందుటవలన నేను విధవనైతిని. స్త్రీ చెడుస్వభావముగలదైన నామెభర్త మొదట మరణించును. నేను మంచిగ ప్రవర్తించుచుండ నాయెదుట మీకు మరణమెట్లు కలిగెను? నన్ను సంరక్షించుటకు సిద్ధముగనున్న మీరు మరణించినచో నిట్టిగొప్పదుఃఖమునుండి నేను దాటుటెట్లు? నాయత్తయగు కౌసల్య దూడపోయినయావువలె నాయెను. మీరుచాలకాలముజీవించెదరని చెప్పిన పెద్దలమాటలు మీస్వల్పకాలజీవనముచేనబద్ధములాయెను. లేక నన్నిజీవులకు నాధారభూతమగు కాలము మిమ్ము నంతమునొందించినట్లే మిక్కిలిబుద్ధిమంతులును, సత్పురుషులునగు వారి బుద్ధినికూడ మీవిషయమున నాశనముచేసెను. నీతిశాస్త్రము తెలిసినవారును, కష్టములను దప్పించుటలో శక్తిగలవారునునగు మీరు కంటికికనబడనిమృత్యువు నెట్లు పొందితిరి? అన్నిభూతములను హరించు కూరశక్తి మిమ్మునుబట్టి యంతమునొందుచెను. పురుషశ్రేష్ఠా! మీరు నన్ను విడిచి భూమినికౌగిలించుకొని పడుకొనియున్నారు. బంగారుకట్లుగలయీధనస్సును మీరును, నేనును గంధముతోను, మాల్యములతోను నెల్లప్పుడును పూజించుచుండెడివారము. మీరు పితృలోకమునకు బోయి మీతండ్రిని కలిసికొంటిరి. మీ రాకాశమున నక్షత్రరూపము నొంది గొప్పపనులను జేసినవారికి ప్రియమగునదియు, పుణ్యమగునదియునగు మీయిక్ష్వాకువంశమును జూచెదరు. రాజా! నన్నేల చూడరు? నాకు ప్రత్యుత్తరమేల యీయరు? నేను చిన్నతనమునుండియు మీకు భార్యగనుంటిని. మీతోగలిసి తిరుగుచుంటిని. మీరు

మిగిలినమంత్రులును మీదర్శనమునకై వేచియున్నారు. ఏదోతొందరపనియున్నది. మీరు క్షమించి వారికి దర్శనమీయవలె' నని పలుకనత డశోకవనమును విడిచి వారిని జూచుటకు సభకు వెళ్ళెను. అతడు వెళ్ళినవెంటనే యాలతయు, ధనస్సు నంతర్ధానమయ్యెను.

ఆసభలో రావణునిమంత్రులు రామునిపరాక్రమమునుగూర్చిన సంగతులను దెలుప దానికి తగినట్లతడు యత్నమును జేసెను. అతడు తనదగ్గఱనున్న సేనానాయకులను, తనమేలుగోరువారినందఱిని పిలిపించి 'మీరు భేరీలను వాయింపించి సేననంతయు రప్పింపుడు. కారణము చెప్పుటకు వీలులే' దని పలుక వారట్లు సేనను రప్పించి 'సేన సిద్ధముగ నున్న' దని తమప్రభువునకు దెలిపిరి.

అట్లు సీత తనభర్తృవియోగమునకు విలపించుచుండ మంచి నియమములుగలదియు, రావణునియాజ్ఞచే నామెను రక్షించుచున్నదియు, నామెకు స్నేహితురాలుగనున్నదియు, విభీషణునిభార్యయునగు సరమాదేవి యామెయందలిస్నేహముచేతను, ప్రేమచేతను, దయచేతను భూమిపై మతిపోయిపడియుండిన యామెను లేవదీసి మంచిమాటలు పలుకుచు నామె నిట్లోదార్చెను. "వైదేహీ! దుఃఖింపకుము. నేను రావణునియందలిభయమును విడిచి యెవరికిని గనబడకుండ నాకాశమున నిలిచి యతడు నీతో పలికినదానిని, నీవు చెప్పినదానిని వినుచుంటిని. నీశ్రేయస్సుకంటె నాప్రాణములు నాకెక్కువకావు. రావణుడు నీయొద్దనుండి తొందరగ నేలవెళ్ళిపోయెనో యని నేనుగూడ వెళ్ళి దానినంతయు దెలిసికొంటిని. రాముడు నిద్రించియుండ నతనిని జంపుట యెవరికిని శక్యముకాదు. అట్టిపురుషశ్రేష్ఠుని సులభముగ వధించుటకు వీలులేదు. ఇంద్రునిచే రక్షింపబడు దేవతలవలె వానరులు రామునిచే రక్షింపబడుచుండుటచే వారు రాక్షసులచే జంపబడరు. రాముడన్నివిధములగొప్పవాడు. అతడు తన్ను నితరులనుగూడ రక్షించుకొనును.

నీతిశాస్త్రముదెలిసినయాతడు లక్ష్మణునితో కుశలముగ నున్నాడు. గొప్పబలపౌరుషములుగలవాడగుటచే సతతము శత్రుసైన్యములను జంపును; గాని తాను మరణమునొందడు. అన్నిజీవములకు శత్రువగు రావణుడు మంచిమాయలుదెలిసినవాడు. అతడు తనకు తగనిబుద్ధిచే నీవిషయమై యీ మాయను గల్పించెను. నీవు శోకింప వలసినకాలము పోయినది. నీకు శుభములు సిద్ధమైయున్నవి. సిరి శాశ్వతముగ నిన్ను బొందును. మిక్కిలిప్రియమగు నామాటలను వినుము. రాముడు వానరసేనతో సముద్రమును దాటి దక్షిణతీరమునవిడిసియుట నేను జూచితిని. రావణుడు పంపినచారులు తిరిగివచ్చి యాసంగతి యాతనికి దెలుప దానినిగురించి యతడు తనమంత్రులతో నాలోచన చేయుచున్నాడు.” ఇట్లు సరమ సీతతో బలుకుచుండ సేనబయలుదేఱు గొప్పధ్వని వారికి వినబడెను. భేరీలశబ్దము మిక్కుటముగవినబడ విభీషణునిభార్య యామెతో నిట్లు మధురమగుమాటలను బలికెను. ‘ఇది యుద్ధసన్నాహపుధ్వని. మదించినయేనుగులు సిద్ధముచేయబడుచున్నవి. గుఱ్ఱములు రథములకు గట్టబడుచున్నవి. వేలకొలదిగుఱ్ఱపురౌతులు ప్రాసములనుబట్టి సంతోషించుచున్నారు. అక్కడక్కడ కాల్బలము సిద్ధమై గుంపులుగుంపులుగ నున్నది. రాజవీథులలో తొందరగ నడచుచున్నట్టియు, సింహనాదముచేయుచున్నట్టియు సైన్యములు నిండియున్నవి. సేన మంచిశస్త్రములను బట్టి మంచికవచములను దొడిగియున్నది. వానిరంగు లనేకవిధములుగ గనబడుచున్నవి. గంటలశబ్దమును, రథములయొక్కయు, గుఱ్ఱములయొక్కయు ధ్వనిని, తూర్యఘోషమును వినుము. ఇంద్రుడు దైత్యులను జంపినటుల రాముడు రావణుని యుద్ధములో శీఘ్రముగ జంపి నిన్ను తనతొడమీద నిడుకొనియుండ నీవు విచారమును విడిచియుండెదవు. నీకార్యమును నెఱవేర్చుకొనిన నిన్నప్పుడు నేను జూచెదను. నిన్నాతడు కౌగిలించుకొన నీవు సంతోషబాష్పములను విడిచెదవు.’ ఇట్లు పలికి యామె ‘మేరుపర్వతమునకు బ్రదక్షిణముచేయునట్టియు, జీవులకాధారమైనట్టియు సూర్యుని నీ విప్పుడు శరణుబొందు’ మని చెప్పెను.

ఇంకను నామె సీతతో కాలోచితముగ నిట్లనెను. 'నే నాకాశమున నెగురునపుడు నాతోగూడ వాయువును, గరుత్మంతుడును రాలేరు. నేను రామునియొద్దకు వెళ్ళి నీసమాచారమును దెలిపి యెవరికిని గనబడకుండ తిరిగివచ్చుశక్తి నాకు గలదు.' ఈమాటలను సీత విని మధురోక్తులను స్పష్టముగ నిట్లు పలికెను. 'నీ వాకాశమునకైనను, పాతాళమునకైనను బోగలవు. నావిషయమై నీవు చేయవలసినపనులనుగూడ జేయగలవని నాకు దెలిసెను. నీమనస్సు స్థిరముగనుండినయెడలను, నీవు నాకు ప్రియము చేయగలిగినయెడలను రావణు డిప్పుడేమిచేయుచున్నాడో చూచి నాకు దెలుపుము. మాయావియు, క్రూరుడును, దుర్మార్గుడునునగు నాతడు నన్ను భ్రమింపజేయుచున్నాడు. వాడెల్లప్పుడును నాచుట్టునున్న రాక్షసస్త్రీలచే నన్ను గొట్టించును. తర్జనభర్జనజేయించును. నా కందువలన నవమానము, భయము కలుగుచున్నది. నామనస్సు సుఖముగ నుండుటలేదు. రావణుడు నన్ను గూర్చి నిశ్చయించినదానిని నీవు నాకు దెలిపిన గొప్పయుపకారముచేసినదానవగుదువు.' ఇట్లు సీత కన్నీరు విడుచుచు బలుక సరమ యాకన్నీటిని దుడిచి 'నీవు చెప్పినట్లు చేసెద' నని పలికి రావణునియొద్దకు బోయి యతనిమాటలను, నతనిమంత్రులమాటలను విని శీఘ్రముగ నశోకవనమున సీతయుండుచోటికి తిరుగవచ్చెను. సీత యామెను స్నేహముగ కౌగిలించుకొని కూర్చుండుటకు చోటుచూపించి 'నేను కోరినదానినంతటిని దెలుపు' మని యడుగ నామె యిట్లు పలికెను. "రావణునితల్లియగుకైకసియు, మంత్రియగు నవిద్ధుడును రాముని మర్యాదచేసి నిన్నాతని కిచ్చివేయవలెనని రావణునకు పెక్కురీతులబోధించిరి. రాముడు జనస్థానమున నద్భుతములగు పనులను జేయుటయు, హనుమంతుడు సముద్రమును దాటి లంకలో బ్రవేశించి రాక్షసులను జంపుటయు ధ్యానికి గారణములుగ నాగు బలికిరి. అతడు తనమంత్రుల

యాలోచనను వినక నిన్ను విడువకుండుటకు నిశ్చయించెను. రావణుడు యుద్ధములో మరణమునొందకుండ నిన్ను విడుచుట కిష్టపడడు. అతడు తనమరణముకోరి యట్లాలోచించెను. ఆతడు భయముచే నిన్ను విడువడు. అతడు యుద్ధములో తానును రాక్షసులందఱును చచ్చెదరని తలంచియైన యుద్ధమునకు వెనుదీయకున్నాడు. రావణుని రాముడు వాడిబాణములతో గొట్టి చంపి నిన్నయోధ్యకు దీసికొని పోవును." ఇట్లు సరమ పలుకుచుండ సువేలపర్వతసమీపముననున్న వానరసైన్యముయొక్క భేరీశంఖశబ్దములను లంకలోని రాక్షసులందఱు విని కాంతివిహీనులైరి.

---

## ౧౫ వ. అధ్యాయము.

## మాల్యవంతుడు రావణునకు చీవాట్లు పెట్టుట.

సువేలపర్వతసమీపముననున్న వానరసైన్యభేరీశబ్దములను సభలోనున్న రావణుడు విని యొకగడియయాలోచించి తనమంత్రులతో గట్టిగ నిట్లనెను. 'మీరు యుద్ధములో గొప్పపరాక్రమముగలవారైనను రాముడు సముద్రమును దాటుటయు, సేసను గూర్చుటయు దలచి వానిపరాక్రమమునకు జడిసితిరని నే నూహించుచున్నాను.' ఇట్లు రావణుడు వారిని నిందించుచు బలుక వానిమాతామహుని యన్నయగు మాల్యవంతుడు వానికి * కొన్ని రాజనీతులను దెలుపుచు నిట్లు బోధించెను. "నీవు రామునితో సంధి జేయవలెను. సీత వలన మనకీవిరోధము సంభవించెనుగాన నామెను నీ వాతని కిచ్చివేయవలెను. దేవతలును, ఋషులును నాతనిజయము గోరుదురు. అతనికి దైవబలముగలదు; కాన నీ వతనితో సంధిజేయదగును." మాల్యవంతు

---

* 13 వ. ప్రకరణము, ౧౩వ అధ్యాయము, రాజనీతులుచూడుడు.

డిట్లు బోధించి ♦ దేవాసురులనైజములను దెల్పుచు నిట్లుపలికెను. నీవు లోకములో జరించుచు ధర్మమును విడిచి యధర్మమెక్కువగ జేయుటచే నీశత్రువులు బలవంతులైరి. నీవాలోచింపకుండ జేసినపనులచే వృద్ధినొందినయధర్మము మమ్ము నాశనముచేసి దేవతల కనుకూలమై వారిని వృద్ధినొందించుచున్నది. నీ వింద్రియలోలుడవై చేసిన పాపకర్మలచే తేజోవంతులగు ఋషీశ్వరులకు గొప్పక్రోధముగలిగెను." ఇట్లు పలికి యతడు* ఋషులలక్షణములను దెలుపుచు రావణుని నిట్లు మందలించెను. "నీవు దేవ దానవ యక్షులవలనమాత్రము మరణము రాకుండునట్లు వరమును బొందితివి. బలవంతులగు మనుష్యులును, వానరులును, నెలుగుబంట్లవంటిరూపముగలవారును, గొప్పబలముగల గోలాంగూలులును నిక్కడకు వచ్చి గర్జించుచున్నారు. అనేక £ దుశ్శకునములు కనబడుచున్నవి. గుజ్జములు మొదలగునవి మెక్కువగధ్వనిజేయుచు కన్నీరువిడుచుచున్నవి. ధ్వజములుకాంతి లేక పడిపోవుచున్నవి. రాత్రివేళ కలలో నల్లనిదేహముగల స్త్రీలిండ్లలో నెదుట నిలిచి పండ్లతో వెక్కిరించుచు చెడుమాటలను బలుకుచు గృహములోనివస్తువులను దొంగిలించి పెద్దస్వప్నవచ్చుచున్నట్లు కనబడుచున్నారు. ఇండ్లలో జేసినబలిహోమములను కుక్కలు తినుచున్నవి. గాడిద లావులతోను, నెలుకలు ముంగిసలతోను, పిల్లులు పులులతోను, పందులు కుక్కలతోను సంగమముచేయుచున్నవి. కిన్నరస్త్రీలు రాక్షసులను, మనుష్యులను బొందుచున్నారు. ఎఱ్ఱరంగు, తెలుపుపచ్చ కలిసినరంగు గలపాదములతోనొప్పు పావురము లెగురుచు రాక్షసులవినాశమును సూచించుచున్నవి. ఇండ్లలోని పెంపుడుగోరువంకలు వికృతముగ నఱచుచున్నవి. మృత్యుదేవత యప్పుడప్పుడు భయంకరముగను, వికృతముగను, జుట్టులేనిదగను నుండి నలుపురంగు, గోరో

---

♦ 2వ. ప్రకరణము ౧వ అధ్యాయము సృష్టివివరము చూడుము.

* 3వ. ప్రకరణము. ౧వ. అధ్యాయము ఋషులలక్షణములు చూడుము.

£ 13వ. ప్రకరణము ౯వ. అధ్యాయము, దుశ్శకునములు చూడుము,

నముఁరంగుకలిసినవర్ణముగలరూపమునుగలిగి యన్నియిండ్లలోను గన బడుచున్నది. ఇంకను ననేకదుశ్శకునములు గనబడుచున్నవి. సము ద్రమును బంధించినరాముడు మనుష్యమాత్రుడుకాడు; గొప్పపరాక్ర మవంతుడును, మనుష్యరూపమునుదాల్చినవాడును నగువిష్ణునిగ నతనిని దలంపవలెను. నీవాతనితో సంధిజేసికొనుము. వీనినన్నిటిని నీవుబాగుగ నాలోచించి ముందుజేయవలసినకార్యములను జేయుము." ఇట్లు గొప్ప పురుషుడగు మాల్యవంతుడు పలికి రావణునిమనస్సును బరీక్షించి యూరకుండెను. *

ఇట్లాతడు బోధించినను నారాక్షసరాజు తనమరణము సమీ పించుటచే నాతనిమాటలను వినలేదు. రావణుడు క్రోధముచే కను బొమలను ముడివైచి కండ్లను ద్రిప్పుచు నాతనితో నిట్లనెను. "నీవు శత్రుపక్షములో జేరి నాహితమునుగోరువానివలె బలుకుచున్నావు. కాని యీపలుకులు కఠినములును, నహితములును నగుటచే నవి నా చెవిలోనికి బోవు. మనుష్యుడును, దీనుడును, నొంటరిగనున్నవాడును, నీచజంతువులగు వానరసహాయముగలవాడును, తండ్రిచే వెడలగొట్టబడి నవాడును,నడవులలోదిరుగువాడుననగు రాముని శక్తిపరునిగనీవేలతలం చెదవు? నేనురాక్షసులకు నధిపతిని; దేవతలకు భయమును గలిగించువా డను; సర్వపరాక్రమములుగలవాడను. అట్టినన్ను నీవు శక్తిలేనివానిగ నేల భావించుచున్నావు? నేను వీరుడనను నసూయచేతనో, నీవుశత్రుపక్ష

---

* అ—రా:—మాల్యవంతుడు రావణునకు "రాముని నారా యణునిగ దెలిసికొని యాతనితో విరోధముమానుము. ఆతనిపాదము లను జ్ఞానులాశ్రయించి భక్తిచే పవిత్రమైనమనస్సుగలవారై సంసారసా గరమును దాటుచున్నారు. కనుక నాతడు మనుష్యుడుకాడు. అందఱి హృదయములోనునుండునతనిని నీవు భక్తిభావముతో భజింపుము. నీవు దురాచారుడవైనను భక్తిచే పవిత్రుడ వయ్యెదవు. నీకుశలమును గోరిపల్కుచున్న నామాటలనుజరుపు"మని బోధించెను.

మున జేరియుండుటచేతనో, పైవారు నిన్ను బ్రోత్సాహపఱచుటచేతనో నన్ను కఠినమగుమాటల నాడితివి. శాస్త్రముల నెఱిగినవాడును, పండితుడుననగువాడెవడును శత్రువుల ప్రోత్సాహములేకుండ మంచిప్రభావముగల నన్నేల కఠినపుమాటలాడును? అరణ్యమునుండి నేను సీతను తీసికొనివచ్చి రామునియందలి భయముచే నామెను తిరుగ నాతనికేల యిచ్చెదను? కొన్నిరోజులలో వానరులను, సుగ్రీవుని, రామలక్ష్మణులను నేను వధించుట నీవు చూచెదవు. దేవతలైనను ద్వంద్వయుద్ధములో నాయెదుట నిలువలేనపుడు నే నితనివలన నేలభయమునొందెదను? నన్ను రెండుముక్కలుగ జేసినను నే నెవరికిని నమస్కరింపను. అది నాస్వభావము. అది దోషమైనను నేను దానిని తప్పవీలులేదు. రాముడు దైవయోగమున సముద్రమున సేతువునుగట్టినంతమాత్రమున నీకు భయముకలుగుచున్నది. అది యాశ్చర్యమగుపనియా యేమి? వానరసేనతో సముద్రమును దాటినయా రాముడు ప్రాణములతో దిరుగ వెళ్ళడని నేను సత్యముగ బలుకుచున్నాను." ఇట్లు రావణుడు కఠినపుమాటలను తొందరగ బలుక మాల్యవంతుడు సిగ్గునొందిజబాబుచెప్పకుండ నతనిని దీవించి తనయింటికేగెను.

తరువాత రావణుడు తనమంత్రులతో బాగుగ నాలోచించి లంకను రక్షించుటకై రాక్షసవీరుల నిట్లునియమించెను. తూర్పుద్వారమున ప్రహస్తుని, దక్షిణద్వారమున మహాపార్శ్వమహోదరులను, పశ్చిమద్వారమున ననేకరాక్షసులతో నింద్రజిత్తునునియమించి 'ఉత్తరద్వారమున శుకసారణులును, నేనును నుండెద'మని పలికి లంకమధ్యమున ననేకరాక్షసులతో విరూపాక్షుని నియమించి తనమృత్యువు సమీపించుటచే నతడు తనకార్యములు బాగుగ జరిగెనని తలంచెను. తరువాత నతడు తనమంత్రులు తన్ను గీర్తించుచుండ వారికి సెలవిచ్చి తనయంతఃపురమున కేగెను.

---

## ౧౬ వ. అధ్యాయము.

### రాముడు సువేలపర్వత మెక్కి-దిగి లంకను ముట్టడించుట; రావణసుగ్రీవులద్వంద్వయుద్ధము; అంగదరాయబారము.

సువేలపర్వతసమీపమున రాముడు తనబలములతో విడిసి యుండెను. రామలక్ష్మణవిభీషణసుగ్రీవులును, మిగిలినవానరముఖ్యులును నక్కడకు గనబడుచుండు లంకను బట్టుకొనుట కాలోచించుచుండిరి. అట్టిసమయమున విభీషణుడు స్వచ్ఛమగుమాటలతో వారి కిట్లు మంచిసలహాచెప్పెను. "నామంత్రులునలుగురు లంకాపట్టణమునకుపక్షిరూపములతో వెళ్ళి శత్రుసైన్యమున బ్రవేశించి యది యెట్లు నియ

మింపబడినదో చూచివచ్చిరి. రామా! వారు చెప్పినసంగతులను మీతో నిజముగ బలికెదను; వినుము. లంకాద్వారములయొద్ద రాక్షసయోధులు కాపున్నరీతి వారు నాకు దెలిపిరి.(పైపటమును జూడుము.) ఒక్కొక్క ద్వారమువద్ద వేయిమందిగజయోధులును, పదివేలమందిరథికులును, 20 వేలమందిగుఱ్ఱపురౌతులును, ఒకకోటిమందిసైనికులును యుద్ధమునకు సిద్ధముగ నుండిరి. మఱియు మిక్కిలి శూరులును, బలవంతులును, యుద్ధములోగొప్పవారును, రావణునికి నెల్లప్పుడు నిష్టులునగు వారుగూడ యుద్ధముచేయుటకు నియమింపబడిరి. ప్రతివీరునకు * ననేకరాక్షసులు యుద్ధములో సహాయులుగ నియమింపబడిరి." ఇట్లు విభీషణుడు పలికి లంకనుండితిరిగివచ్చినతనమంత్రులను రామునికి జూపి వారుగూడ నిజస్థితులను రామునకు దెలిపిరి. తరువాత విభీషణుడింకను నిట్లనెను. "పూర్వము రావణుడు కుబేరునిపైకి యుద్ధమునకు వెళ్ళినపుడు రావణునితో సమానమగువీర్యముగల 60 లక్షలసైన్యమును మాత్రముతీసికొని వెళ్ళెను. శత్రుబలమును నిట్లు పొగిడితినని మీరు కోపమును బొందకుడు. మీకు రోషముపుట్టుట కిట్లు చెప్పితినిగాని మిమ్ము భయపెట్టుటకు గాదు. మీరు వీర్యముచే దేవతలసైనను నోడింపగలరు. మీరు మీ బలములను వ్యూహములుగ విభజించి రావణునితోను, వానిబలములుతోను యుద్ధముచేసి వారినణగద్రొక్కుడు." విభీషణు డిట్లు పలుక రాముడు తనబలములను నిట్లు విభజించెను. (పైపటమును జూడుము.) పిమ్మట రాముడు "తూర్పుద్వారమువద్దనున్న ప్రహస్తునితో నీలుడనేక వానరులను దీసికొనివెళ్ళి యుద్ధముచేయవలెను. దక్షిణద్వారమునకు

---

* ఒక్కొక్కరాక్షసునికి పదిలక్షలపరివారము యుద్ధసహాయమునకై యీయబడినట్లు వర్ణింపబడినది. అట్లయిన నొక్కద్వారమువద్దనే సైన్యముపదిలక్షకోట్లయియుండును. ఇదివరలో లంకలోనిరాక్షససైన్యము 32 కోట్లని మేమునిర్ణయించుటచే పైయంశము కవిచాతుర్యముచే వర్ణింపబడినట్లుభావించి చరిత్రలో ననేకరాక్షసులని తెలిపితిమి.

నంగదు డనేక వానరులతో వెళ్ళి మహోదర మహాపార్శ్వులతో పోరుసలుపవలెను. పశ్చిమద్వారమునకు ననేకకపులతో హనుమంతుడు వెడలి రణముచేసి పట్టణములోనికి బ్రవేశింపవలెను. నేనును, లక్ష్మణుడును లోకకంటకుడగు రావణుని నోడించి యుత్తరద్వారమునుండి లంకలో బ్రవేశింతుము. ఉత్తరపశ్చిమద్వారములమధ్యను సుగ్రీవుడును, ఋక్షరాజగుధూమ్రుడును, విభీషణుడును యుద్ధము చేయుచవలెను. వానరులెవరును యుద్ధసమయమున మనుష్యరూపమును బొందగూడదు. ఇది మనకు యుద్ధములో గుర్తు. విభీషణుడును, సతనమంత్రులునలుగురును,లక్ష్మణుడును, నేనును కలిసి మేమేడుగురము మనుష్యరూపములతో పోరు సలిపుదము" మని పలికి * సువేలపర్వతమెక్కుట కాలోచించెను.

తరువాత రాముడు లక్ష్మణవిభీషణసుగ్రీవులతో నిట్లు పలికెను. "సువేలమనునది రెండుయోజనములు వెడల్పుగల పెద్దపర్వతము. దానిలో ననేకలోహములున్నవి. మనము కొంతబలముతో దానినెక్కి యీరాత్రి యక్కడనుందుము. దురాత్ముడగు రావణుడు తనమరణము నిమిత్తము నా భార్యనెత్తుకొనిపోయెను. వానికి ధర్మము తెలియనే తెలియదు. వానికులము మంచిదికాదు. వాడు నీచబుద్ధిచే నిట్టి యసహ్యకరమగుపనిని జేసెను. వానియంతఃపురమును నీపర్వతశిఖరమునుండి చూచెదము. వానిని గీర్తించిన నాకు గొప్పరోషముపుట్టును. వాని యపరాధమువలన రాక్షసులందఱు నశించెదరు. కులములో నొకడు పాపకార్యములనుజేసి తనకులము వారందఱికి నాశనమును గలుగజేయును. అందువలన వానికులమెల్ల నశించును." ఇట్లు రాముడు రావణునిపై క్రోధముచే బలికి సువేలపర్వతమెక్కెను. అతని వెనుక ధనుర్బా

---

* 10వ. ప్రకరణము 3వ. అధ్యాయము. హనుమంతుడు లంకకునెగురుటమును చూడుము.

ణములనుబట్టి లక్ష్మణుడును, సుగ్రీవుడును, వానిమంత్రులగు హను మంతుడుమొదలగువారును, విభీషణుడును, వానిమంత్రులును నెక్కిరి. మిగిలినవానరులు వాయువేగముతో రాముడుండుచోటికి వెళ్ళిరి. అందఱు నాపర్వతశిఖరమందు నిలిచి లంకాపట్టణమును, రాక్షసులను జూచిరి. వానరులు యుద్ధాసక్తులైనరాక్షసులను జూచి నాదముచేసిరి. అంతట సూర్యుడస్తమించెను. ఆదినము పౌర్ణమియగుటచే సంపూర్ణ మగు చంద్రబింబము గనబడెను. ఆపర్వతశిఖరమున నారాత్రియందఱు నివసించిరి.

ఆమఱునాటియుదయమున నందఱు లేచి యక్కడనుండి లంక లోనిచిత్రములను జూచిరి. కొందఱు వానరవీరులు కామరూపముల ధరించి నిర్భయులై లంకలోనివనములలోను, నుద్యానవనములలోను బ్రవేశించిరి. కొందఱు సుగ్రీవునియొద్ద సెలవు పుచ్చుకొని యాపట్టణ మున బ్రవేశించి పశుపక్షులకు భయమును గలిగించుచు గొప్పనాద మును జేయుచు దిరిగిరి. ఆశబ్దముచే కూరిరమృగము లన్నిదిక్కులకు బరుగెత్తెను. రాముడాపర్వతమున నిలిచి లంకలోనిచిత్రముల నన్నిటిని జూచి యాశ్చర్యమును బొందెను. ఇంకను నతడు దానిలోనుండు సైన్య మును, యంత్రములను, సైన్యవిభాగమునుగూడ జూచెను.

రాముడును, సుగ్రీవుడును, మిగిలినవానరులు మొదలగువారును లంకను జూచుచుండిరి. లంకలో నొకపెద్దగోపురముపై రావణుడు జయఛత్రమును ధరించి శరీరమున నెఱ్ఱనిచందనమును బూసికొని రత్న ములుమొదలగు నలంకారములను బెట్టుకొని నల్లనిమేఘమువంటి శరీరముగలవాడై పువ్వులుగలయెఱ్ఱనిబట్టలను, నుత్తరీయమును ధరించి యుండెను. తెల్లనివింజామరములనుబట్టి సేవకులు వానికి విసరుచుండిరి. అట్టిరాక్షసేంద్రుడు రామునుమొదలగువారికందఱికి గనబడెను. అప్పుడు సుగ్రీవుడనూర్ధ్వ స్థానిని చూచి గొప్పకోపముపుట్ట తనసత్త్వబలమ్ము

లచే సువేలపర్వతశిఖరములనుండి లంకకెగిరి యాతడుండుగోపురము నకు బోయెను. ఆ కపిరాజు అక్కడియ యక్కడ నిలిచి యాతనిని జూచి మనస్సులో నేమియు భయమునొందక యతనిని తృణీకరించి 'నేను లోకములకు ప్రభువగు రాముని సఖుడను; దాసుడను. ఆతని తేజోమహిమలచే నీవిప్పుడు నాచేతిలో బడితివి. ఇక తప్పుకొనిపోలే' వని పలికి యాతనిమీదికెగిరి యాతనికిరీటమును లాగివేసి భూమి మీదికి దిగెను. రావణుడు తనప్రక్కకు శీఘ్రముగ వచ్చిన కపిరాజును జూచి 'సుగ్రీవా! నీమెడను విఱిచెద' నని పలికి యతనిని రెండుచేతుల తోను క్రిందికి త్రోసెను. అతడు బంతివలె లేచి తనరెండుచేతుల తోను రావణుని క్రిందికి ద్రోసివేసెను. తరువాత వారిరువురు * మల్ల యుద్ధముచేసిరి. దానివలన వారిశరీరములనుండి చెమటలును, రక్త మును గాఱెను. కొంతసే పొకరినొకరు విడువకయుండిరి. ఇట్లు చాల సేపువారు గోపురముపై పోరాడి యొకరినొకరు త్రోసికొనుచు చివ రకు గోపురసమీపముననున్న యగడ్తలో బడిరి. అట్టిసమయమున రావణుడు తనమాయబలమును జూపుటకు సిద్ధమైయుండ సుగ్రీవుడు దానిని దెలిసికొని యాయాసములేక యాకాశమునకెగిరెను. రాక్షస రాజు మోసపోయినిలిచెను. ఇట్లా వానరరాజు యుద్ధములో రావణునకు గొప్పశ్రమనుగలుగజేసి కీర్తినిబొంది యాకాశమునకెగిరి రాముడుండు చోటికివచ్చి నిలిచెను. వానరులందఱ అతనిని గీర్తించిరి. సుగ్రీవునిశరీర మున యుద్ధచిహ్నాలు రామునికి గనబడ నతడు వానిని గౌగిలించు కొని యిట్లు పలికెను. 'నాతో నాలోచనచేయకుండ నిట్టికష్టమగు సాహసపుపనిని నీవు చేసితివి. ఇట్టికార్యములను రాజులు చేయరు. నీవొక్కడవె సాహసముతో నక్కడకు బోవ నేనును, వానరబలమును, విభీషణుడును మాజీవితము విషయమై యనుమానపడుచుంటిమి. ఇప్పటి

* 13వ. ప్రకరణము. ౧౫, ౧౬ అధ్యాయములు, మల్లయుద్ధపద్ధతిచూడుము,

నుండి నీవు ముందాలోచనచేయకుండ నిట్టిపనులను జేయకుము. నీకే యాపదయైనను వచ్చినయెడల సీతవలనగాని, నాతమ్ములవలనగాని, నాజీవితమువలనగాని నాకేమియు ప్రయోజనములేదు. నీపరాక్రమము నాకు దెలిసినను నేను నీవురానియెడల యుద్ధములో రావణుని పుత్రులతోను, బలములతోను జంపి లంకలో విభీషణుని నభిషేకించి భరతునకు రాజ్యపట్టాభిషేకముచేసి ప్రాణములను విడువవలెనని నీవు రాకపూర్వరము నిశ్చయించితిని.' ఇట్లు రాముడు పలుక సుగ్రీవుడు 'మీ భార్య నపహరించినరావణుని జూచి నాబలపౌరుషముల నెఱిగిన నే నెట్లు సహింపగలుగుదు' నని జబాబుచెప్పెను. రాముడు దానికి సంతోషించి లక్ష్మణునితో సేనను నడుపుటనుగూర్చి సముద్రమును దాటిన తరువాత తానుపలికినమాటలను తిరుగజెప్పి 'శీఘ్రముగ మనమిప్పుడే వానరసేనతో లంకకు బోవుద'మని పలికి సువేలపర్వతమునుండి యందఱితోను క్రిందికి దిగెను.

అక్కడ రాముడు వానరబలమునంతటిని పరీక్షించెను. అంగదుడును, సుగ్రీవుడును యుక్తమగుకాలమున సైన్యమునకు యుద్ధమునకై నడచుటకు సెలవిచ్చిరి. ముందు రాముడు ధనస్సునుబట్టి లంకతట్టు నడచుచుండ లక్ష్మణుడును, విభీషణుడును, సుగ్రీవుడును, హనుమంతజాంబవంతులును, నలుడును, నీలుడును, ఋక్షరాజగు ధూమ్రుడును నతనిని వెంబడించిరి. తరువాత సేనయంతయు నడచెను. పెద్దరూపములుగలయావానరులు కొండశిఖరములను, పెద్దచెట్లను యుద్ధముచేయుటకు బట్టుకొనిరి. చాలసేపటికి వారు లంకను సమీపించి దానిచుట్టు నెవ రెక్క డెక్కడ నుండుటకు నియమింపబడిరో యక్కడ దక్కడ నిలిచి దానిని ముట్టడించిరి. (ఈయధ్యాయములో మొదటనున్న పటమును జూడుము.) లంకయొక్క యుత్తరద్వారము కొండశిఖరము వలె నెత్తుగనుండెను. అక్కడ రామలక్ష్మణులు ధనస్సులను బట్టి తమ

బలములతో నందుప్రవేశించుటకు సిద్ధమైరి. మంచిబలపరాక్రమములుగల రావణునిబలములు మంచియాయుధములను బట్టి యక్కడ నిలిచెను. లంకగోడపైని మఱికొన్నియాయుధములుండెను. ఈద్వారములను రావణుడు కాపాడుచుండెను. తూర్పుద్వారమునకు వెళ్ళియున్న నీలునికి మైందద్వివిదులు సహాయులుగనుండిరి. దక్షిణద్వారమున నంగదునికి సహాయులుగ ఋషభుడును, గజగవయగవాక్షులును నిలిచిరి. పశ్చిమద్వారమున హనుమంతునికి ప్రమాథిప్రఘసులు సహాయులుగ నుండిరి. పశ్చిమోత్తరద్వారములకు మధ్యను సుగ్రీవుడు 36 కోట్లవానరబలముతోను, జాంబవంతునితోను, నతనిబలములతోను నిలిచెను. సుషేణుడు సుగ్రీవునాజ్ఞచే గొప్పబలముతో నన్నిద్వారములకు తిరుగుచు సేనలను రక్షించుచుండెను. ప్రతిద్వారమువద్దను కోటిసంఖ్యగల వానరులను రామునియాజ్ఞచే లక్ష్మణుడును, విభీషణుడును నిలిపిరి. ఒక కోటిసంఖ్యగల ఋక్షవానరులుకూడ యుద్ధమునకై ద్వారములవద్ద నిలిచిరి. మఱికొంతసైన్యము లంకచుట్టు నంతటను నుండెను. వానరసైన్యము నడచుటవలన సముద్రఘోషమువలె గొప్పశబ్దమాయెను. దానితో లంక చలించెను.

ఇట్లు రాముడు రాక్షసులను జంపుటకు సేనను నిలిపి నీతిధర్మములు బాగుగ నెఱిగినవాడగుటచే రాజధర్మమాలోచించి తనమంత్రులతో పలుమార్లాలోచించుచు విభీషణునియనుమతిని బొంది యంగదుని బిలిపించి వానితో నిట్లనెను. "నీవు భయములేనివాడవై విచారమును విడిచి యెగిరి లంకలోనికి వెళ్ళి రావణునకు గనబడి 'శీఘ్రముగ నీసిరినశించును. నీయధికారముపోవును. నీవు మరణము కోరితివి. నీవు బ్రహ్మవరముచే గర్వించి ఋషి దేవ గంధర్వాప్సరస నాగ యక్ష మనుష్యరాజులకు గర్వముచేతను, నజ్ఞానముచేతను పాపకార్యములను జేసినపరాధములకును, రాముని భార్యను హరించినపరాధములకును రాముడు నిన్ను దండి

డింపవచ్చి లంకాద్వారమున నిలిచియున్నాఁడు. అతఁడు నిన్ను జంప నీవు దేవతలయొక్కయు, మహర్షులయొక్కయు, రాజర్షులయొక్కయు లోకములకు బోరొనర్చు. రాక్షసాధమా! నీవు రాముని మాయచే వంచించి బలవంతముగ సీత నెత్తుకొనిపోయిన బలమిప్పుడు చూపుము. నీ వామెను రామునకు తిరుగనిచ్చివేసి యతనిని శరణుబొందనియెడల నతఁడు వాఁడిబాణములచే లోకములోనుండు రాక్షసులనందఱిని జంపును. రాక్షసశ్రేష్ఠుఁడును, ధర్మాత్ముఁడును, శ్రీమంతుఁడునునగు విభీషణు డచ్చటకు వచ్చియున్నాఁడు. లంకాధిపత్యము నతనికే నిర్మియునట్లు చేయును. మూర్ఖులసహాయముగలవాఁడవును, పాపుఁడవును, మనస్సును స్వాధీనముచేసికొనలేనివాఁడవునగు నీ వధర్మముగ నొకనిమిషమైనను రాజ్యమునను భవింప వీలులేదు. నీవు సీత నియ్యని యెడల ధైర్యశౌర్యములు గలవాఁడవై రామునితో యుద్ధము చేయుము. అతని బాణపుదెబ్బలుతగుల నీవుయుద్ధములో మరణమునొంది పవిత్రుఁడ వయ్యెదవు. నీవు పక్షిరూపమునొంది గొప్పవేగముతో మూఁడులోకములలో నెక్కడకు వెళ్ళినను నతనికి గనబడకుండ ప్రాణములతో నుండలేవు. నీకు మంచిమాటలను జెప్పెదను; వినుము. నీయుత్తరక్రియలను నీవు జరుపుకొనుము. లంకను నొకసారి బాగుగజూచుకొనుము. నీజీవితము రామునిచేతిలోనున్న' దని నేను చెప్పినట్లు చెప్పుము." ఇట్లంగదునితో రాముఁడు పలుక నతఁ డాకాశమున కెగిరి రావణుఁడు మంత్రులతోనుండు గృహమున దిగి తన సంగతిని, రాముఁడు చెప్పినసంగతులను నెక్కువతక్కువలేకుండ వారందఱియెదుట దెలిపెను. ఆకఠిన వాక్యములను దుర్మార్గుఁడగు రాక్షసరాజు విని వానిని సహింపలేక రోషముతో కండ్లెఱ్ఱచేసి 'ఈదుర్బుద్ధిని పట్టుకొని చంపవలె' నని యాజ్ఞాపింప నాతనియాజ్ఞప్రకారము మంచితేజోవంతులగు నలుగురు రాక్షసు లతనిని బట్టుకొనిరి. అతఁడు వారికి తనబలమును జూపుటకు

పట్టుబడి తన రెండుచేతులతోను వారిని పక్షులవలె బట్టుకొని కొండశిఖరమువలె నెత్తుగు రావణుని మేడమీది కెగిరి యక్కడనుండి వారిని విసరివేయ వారు తమరాజు చూచుచుండ క్రిందబడిరి. తరువాత నంగదుడా మేడనుజూచి దానిమీదిభాగమును రావణుడు చూచుచుండ తన పాదములతో పడగొట్టి తన పేరు చెప్పుకొనుచు పెద్దనాదముచేసి యాకాశమున కెగిరెను. దాని కారాక్షసరాజు గొప్పక్రోధమునుబొంది తన నాశనమును శంకించుచు నిట్టూర్పుదీసెను. అంగదుడు రాక్షసులకు భయమును, వానరులకు సంతోషమును గలుగజేయుచు రాముడుండుచోటికి వెళ్ళి జరిగినదంతయు నాతనికి దెలిపెను.



## ౧౭ వ. అధ్యాయము.

## లంకలో ప్రథమదినయుద్ధము.



వానరులు లంక చుట్టు నిలిచినతరువాత రాముడు లంకలో భూమిపై శయనించుచు మిక్కిలిదుఃఖించుచున్న సీతకై మనస్సులో విచారించి వానరులకు రాక్షసులతో యుద్ధముచేయుట కాజ్ఞాపించెను. దానితో వారికి శౌర్యమధికముకాగా వారు సింహనాదముచేసి 'పిడికిళ్ళతోను, పర్వతశిఖరములతోను, చెట్లతోను లంకలోని రాక్షసులను జంపెద' మని మనస్సులో నాలోచించి చెట్లు మొదలగువానిని బట్టి నిలిచిరి. దీనిని రాక్షసులు చూచి దీనులై భయముచే 'హా! హా!' యని మొఱలిడుచు రావణునిగృహమునకు బోయి దీనినంతయు నతనికి దెలుప నతడు క్రోధమును బొంది పూర్వము నియమించిన సేనకంటె రెట్టింపు సేనను యుద్ధమునకు బంపి మేడ యెక్కి చూచుచుండెను. రాక్షసులు గొప్పయాయుధములనుబట్టి యుద్ధమునకు బోయిరి.

రావణుఁ డన్నిచోట్ల వానరులుండుటచూచి 'వారి నెట్లు నాశనముచే యుదు' నని విచారించెను. తరువాత నతఁడు ధైర్యము తెచ్చుకొని రాముని, వానరముఖ్యులను జూచెను. వానరులు మొదటిప్రాకారము ముందునుండు నడవులను, బహిర్ద్వారములను నాశనముచేసి యచ్చటి యగడ్త(కందకము)లను పర్వతశిఖరములతోను, రాళ్లతోను, బుగ్గితోను, గడ్డిమొదలగు వానితోను, కట్టెలతోను, నింపిరి. తరువాత వారగడ్తలను దాటి యగడ్తలకును, ప్రాకారములకును మధ్యనుండుచోటికి వెళ్లిరి. తరువాత వారు పట్టణపుగోడల నెక్కి గోపురములను, బహిర్ద్వారములను ధ్వంసముచేసిరి. వారెక్కడ నెగురుచును, గర్జించుచుచును, 'అతిబలుడగు రామునకును, మహాబలుడగు లక్ష్మణునకును, మమ్ముపాలించుసుగ్రీవునకును జయమగుగాక!' యని కేకలువేయుచునునుండిరి. పట్టణప్రాకారములవద్ద నఖుమను, వీరబాహువును, సుబాహువును వానరసైన్యమునునిలిపిరి.(౧౬౬వ. అధ్యాయములో సపటముగ జూపము.) ఇట్టిసమయమున పదికోట్లవానరులుగల సేనతో కుముదుఁడు పనసుని యొక్కయు, మఱియొకప్రఘసునియొక్కయు సాహాయ్యమున లంకను పట్టుకొనుటకు లంకకు నీశాన్యదిక్కుననిలిచెను. శతవలి20కోట్లసేనతో నాగ్నేయదిక్కున నిలిచి దక్షిణద్వారమును బట్టుకొనుటకు సిద్ధమైయుండెను. నైఋతిదిక్కున తారతండ్రియగు సుషేణుఁడు గొప్పబలముతో నిలిచి పశ్చిమద్వారమును బట్టుకొనుటకు సిద్ధముగనుండెను. రామ లక్ష్మణ సుగ్రీవ గవాక్ష ధూమ్రులు వానరసైన్యముతోను, ఋక్షసైన్యముతోను, గోలాంగూలులసైన్యముతోను నుత్తరద్వారమున నిలిచిరి. వారిసమీపమున విభీషణుఁడు గదనుబట్టి తననలుగురుమంత్రులతోను నిలిచెను. గజ గవయ గవాక్ష శరభ గంధమాదనులు పరుగెత్తుచు సైన్యములను రక్షించుచుండిరి. ఇట్టిసమయమున రావణుడు కోపముతో తనసైన్యములన్నింటికి యుద్ధముచేయుటకు సెలవి

చ్చెను. రాక్షసులు రణభేరీలను, దుందుభులను వాయించిరి. శంఖము లను పూరించిరి. నల్లనిమేఘములవంటిశరీరములుగలవారును, కామ రూపులునగు రాక్షసులు మంచికవచములను దొడుగుకొని సంతోష ముతో యుద్ధమునకు బయలుదేఱిరి. వానరులనాదములచే లంకయం తయు కంపించెను. ఏనుగులఘీంకారములవలనను, గుఱ్ఱములసకిలింపులవ లనను,రథములు నడుచుటచేగలిగినశబ్దములవలనను, రాక్షసులసింహనా దములవలనను శంఖదుందుభుల శబ్దములవలనను లంకయంతయు ప్రతి ధ్వనించెను. ఇట్టిసమయమున వానరులకును రాక్షసులకును దేవాసుర యుద్ధమువలె గొప్పయుద్ధము జరిగెను.ఎవరిరాజునకు వారు జయమును గోరుచు తమపరాక్రమములను దెలుపుచుండిరి. రాక్షసు లనేకవిధము లగు నాయుధములనుబట్టియు, వానరులు చెట్లను, పర్వతశిఖరములను బట్టియు యుద్ధముచేసిరి. కొందఱురాక్షసులు ప్రాకారములపైకెక్కి క్రిందనున్న వానరులపైననేకవిధములగునాయుధములనువిడిచిరి. అప్పుడు వానరులు కోపముతో పైకెగిరియక్కడనుండు రాక్షసులను క్రిందకుబడ ద్రోసిరి. ఇరుపక్షములవారికి గొప్పయుద్ధముజరిగెను. ఆప్రదేశమం తయు రక్తమాంసములతో నిండియుండెను.

తరువాత వానరరాక్షససేనానాయకు లిట్లు ద్వంద్వయుద్ధము నకు దలపడి రణముసలిపిరి.

(1) అంగదుడు × ఇంద్రజిత్తు—అంగదుని నింద్రజిత్తు గదతో మొత్త నతడు వానిగుఱ్ఱములను, రథమును, సారథిని గూల్చెను.

(2) విభీషణునిమంత్రియగుసంపాతి × ప్రజంఘుడు— ప్రజంఘుడు సంపాతిపై మూడుబాణములనువేయ నతడు వానినొకబాణముతో జంపెను.

(3) హనుమంతుడు × జంబుమాలి — జంబుమాలి తనరథమున నున్నశక్తిని హనుమంతునివక్షస్థలముపైకి విసర నతడు తనయఱచేతితో వానిని జంపెను.

(4) విభీషణుడు × మిత్రఘ్నుడు—

(5) గజుడు × తపనుడు—

(6) నీలుడు × నికుంభుడు—నికుంభుడు నీలునిపై ననేక వాడిబాణములను వేసి నవ్వ నతడు వానిరథచక్రమునుదీసి వానియొక్కయు, వానిరథసారథియొక్కయు తలలను దుంచెను.

(7) సుగ్రీవుడు × ప్రఘసుడు— ప్రఘసుడు వానరసైన్యమును మ్రింగునట్లురాగ వానిని సుగ్రీవు డేడురంగులుగలచెట్టుతో గొట్టి చంపెను.

(8) లక్ష్మణుడు × విరూపాక్షుడు—

(9) రాముడు × అగ్నికేతువు, రశ్మికేతువు, సుప్తఘ్నుడు, యజ్ఞకోపుడు— ఈనలుగురు రాక్షసులు రామునిపై బాణములను వేయ నతడు నాలుగువాడిబాణములతో వారితలలనుద్రుంచి చంపెను.

(10) మైందుడు × వజ్రముష్టి—వజ్రముష్టిని మైందుడు పిడికిలితో పొడిచి చంపి వానిరథమును పిండిచేసి గుఱ్ఱములను జంపెను.

(11) ద్వివిదుడు × అశనిప్రభుడు—ద్వివిదుడు రాక్షసులనందఱిని జంపు పర్వతశిఖరములతో నశనిప్రభునిగొట్ట వా డతనిపై ననేకబాణములను వేసెను. అప్పుడు ద్వివిదు డొకగుగ్గిలపుచెట్టుతో వానిరథమును విఱుగగొట్టి వానిని, వానిగుఱ్ఱములను బరిమార్చెను.

(12) నళుడు × ప్రతపనుడు—ప్రతపనుడు నళునిదగ్గఱకు పరుగెత్తి వచ్చి సింహనాదముచేయుచు బాణములను విడువ నతడు వానికండ్లలో పొడిచిచంపెను.

(13) సుషేణుడు × విద్యున్మాలి—విద్యున్మాలి కఠినమగు బాణములను తనరథమునుండి సుషేణునిపైవేసి నాదముచేయ సుషేణు డొక కొండశిఖరముతో వానిరథమును గూల్చెను. అప్పుడు వా డొకగదను బట్టి భూమిపై నిలిచిన నతడు శిలాతలముతో వానినెదిరించెను. విద్యు

న్మాని యాతనివక్షస్థలమున గదతో గొట్టి దానినాతడు లక్ష్యపెట్టక వానిగుండెపై నారాతిని విసరెను. దానితో నాతడు పిండిగానై భూమి యందు బడి చచ్చెను.

మఱికొందఱు రాక్షసవీరులు కపులతో ద్వంద్వయుద్ధముచేసిరి. అనేకనేకరాక్షసులు చచ్చిరి. ఆయుధములు, రథములు విఱిగెను. గుఱ్ఱములు లేనుగులు చచ్చెను. వానరులుకూడకొందఱు చచ్చిరి. కృష్ణ పక్షపాడ్యమిరోజున నిట్లు గొప్పయుద్ధము జరిగెను. అంతట సాయం కాలమాయెను.

రాత్రికూడ యుద్ధము జరుగుచుండెను. ఆరోజుకృష్ణపక్షపాడ్య మియైనను నిండత్రిజత్తుమాయచే గొప్పచీకటియయ్యెను. అందువలన రాక్షసులు తమవారిని వానరులనియు, వానరులు తమవారిని రాక్షసు లనియు భ్రమించి కొట్టుకొనిరి. 'చంపుము; చీరుము; రమ్ము; ఎందుకు పాఱిపోవుచున్నా' వను వీరులమాటలు రాత్రివేళ చీకటిలో వినబడు చుండెను. అట్టిచీకటిలో రాక్షసులుతొడుగుకొనిన బంగారుకవచములు ప్రకాశించుచుండెను. వారు కోపముతో పరుగెత్తివచ్చి వానరులను మ్రింగివేయుచుండిరి. కపులు క్రోధముచే నెగిరి గుఱ్ఱములను, నేనుగు లను, వానిమీదనున్న రౌతులను పండ్లతో కఱచివేయుచు రాక్షస సేనను నల్లకల్లోలముచేయుచుండిరి. రామలక్ష్మణులు చీకటిలో కంటికి కనబడునంతవఱకు రాక్షసులనందఱిని తీవ్రబాణములచే గొట్టుచుం డిరి. ఉభయపక్షములసైన్యము హతమగుచుండెను. రాక్షసులు రాము నిపై బాణవర్షము కురిపించుచు వానిదగ్గఱకు పరుగెత్తుకొనివచ్చిరి. రాక్షసవీరులగు 'మహోదర. మహాపార్శ్వ వజ్రదంష్ట్ర శుక సారణ యమశత్రు' లను నార్గురను రాముడు 6 వాడిబాణములచే నాయుస్థా నములగొట్టె వారు యుద్ధమునుండి పాఱిపోయి తమప్రాణములను రక్షించుకొనిరి. ఆతనిబాణములకాంతిచే దిక్కులన్నియు ప్రకాశించు

చుండెను. అతని నెదుర్కొనిన రాక్షసులందఱు మడిసిరి. రాక్షసవానరులసింహనాదములు త్రికూటపర్వతమున ప్రతిధ్వనించెను. గోలాంగూలులు రాక్షసులను దినివేయుచుండిరి.

అట్టిసమయమునసంగదుడింద్రజిత్తుతో యుద్ధమునుచేయుచువాని రథములను, గుఱ్ఱములను, సారథినిగూల్చెను. తరువాత నింద్రజిత్తువానికి కనబడకుండ పోయెను. అంగదునిగొప్పపనులకు దేవతలును, ఋషులును, రామలక్ష్మణులును సంతోషించిరి. సుగ్రీవవిభీషణులును, వానరులును 'గొప్పపనిచేసితి' వనియతసని బొగడ నిందర్జిత్తునకు తానోడినందులకు గొప్పపౌరుషమువచ్చెను. రాముడు వానరులందఱితోను 'మీరందఱు సుగ్రీవునితో నుండుడు. ఈరాక్షసవీరుడు బ్రహ్మవలన వరములను బొంది లోకముల నన్నిటిని బాధించుచున్నాడు. మీకోరిక సిద్ధించును. కాలవశమున వాడు యుద్ధమునకు వచ్చెను. నేను వానిని జయించెదను. ఇప్పుడు నేను వానిని క్షమింపవలసివచ్చిన' దనిపలికెను.

---

## ౧౮౫వ. అధ్యాయము.

### ఇంద్రజిత్తు ప్రథమయుద్ధమున రామలక్ష్మణులను నాగపాశబద్ధులను జేయుట, వారికి విముక్తికలుగుట.

---

ఇందర్జిత్తంగదునిచే పరాభవమునొంది కనబడకయుండెను. రాముడు వాడుండుచోటును కనిపెట్టుటకై సుషేణపుత్రుల నిద్దఱను, నీలుని, నంగదుని, శరభుని, వినతుని, జాంబవంతుని, సానుప్రస్థుని, ఋషభుని, ఋషభస్కంధుని బంపెను. వారు చెట్లను బట్టుకొని యాకాశమున నన్నిదిక్కులకు ఛదుగెత్తిరి. వారందఱిపై నిందర్జిత్తు

వాడిబాణములను విడిచెను. వారు వేగముగ వెళ్ళినను వారికి చీకటిచే వాడు కనబడలేదు. గొప్పమేఘమువంటి శరీరముగల యింద్రజిత్తు రామలక్ష్మణులశరీరముపై నేమియునవకాశములేకుండునట్లు నాగ పాశశరములతోను, నితర బాణములతోను గొట్ట వారిశరీరములనుండి రక్త మెక్కువగకారెను. అప్పుడు వా డెవరికిని గనబడకుండ వారితో 'నేను కనబడకుండ యుద్ధముచేయునపు డిందుడైనను నన్ను జేరలేడు. అట్టిచో మీమాట వేరె చెప్పనేల? మిమ్ము బాణములతో గొట్టి యమపురికి బంపెద'నని పలికి బాణములను వారియాయుస్థానములందు విడిచి గడియగడియకు నాదముచేయుచుండెను. రామలక్ష్మణులు నింద్రజిత్తుప్రయోగించిననాగపాశములచే గట్టబడుటచే చూడలేక పోయిరి. బాణములు వారి శరీరములకును, నెముకలకును దగులుటచే వారు కంపించుచు భూమియందుబడి పండుకొనిరి. రాము డెక్కుపెట్టిన ధనస్సునుబట్టి పడెను. రాముడు బాణములమీదపడియుండుట లక్ష్మణుడు చూచి యాతనిప్రాణములమీద నాశవిడిచి యెక్కువగ నాతని గూర్చి విలపించుచు క్రిందబడెను.

ఇట్లు రామలక్ష్మణులు బాణములచే గట్టబడియుండ వానరులు వారినిజూచి యాకాశమును, భూమినిజూచుచు మిక్కిలిసంతాపమునొందిరి. వారిద్ద ఱుండుచోటికి విభీషణసుగ్రీవులును, నీలుడును, మైందద్వివిదులును, సుషేణుడును, కుముదుడును, నంగదుడును, హనుమంతుడును వచ్చి చేష్టలులేనివారును, బాణములచే గొట్టబడుటచే శరీరములనుండి రక్తముకారుచుండ పాములవలె కొంచె మూపిరి తీయుచున్నవారును, బాణములమీద పండుకొనియున్నవారునునగు రామలక్ష్మణులను జూచి వారిచుట్టును జేరి మిక్కిలివిచారమును బొంది దిరి. అట్లుచేరిన వారంత నాకాశమును, దిక్కులను జూచిరి; కాని వారు యుద్ధములో సాటిలేనిసమర్థుడగు నింద్రజిత్తు మాయచే దాగి

యుండుటచే వానిని చూడలేకపోయిరి. అయినను విభీషణుడుమాత్ర మిదివఱకుబొందినవరబలముచేతను, మాయచేతను వానిని జూడగలి గెను. ఇట్లు రామలక్ష్మణులు పడియుండుట నింద్రజిత్తు చూచి మిక్కిలిసంతోషించి రాక్షసులందఱితోను నిట్లనెను. "ఖరదూషణులను జంపిన మహాబలులగు వీరు నావాడిబాణములకు లోబడియున్నారు. దేవాసురులందఱు ఋషులసహాయముతో గలిసివచ్చినను నీనాగపాశ బాణములనుండివీరిని విడిపింపలేరు. ఈరాముని గుఱించి యీరాత్రి మూడుజాములు నాతండ్రి శోకములో మునిగి చింతించుచు నిద్రింపక కూర్చుండియున్నాడు. లంకలోనివిపత్తులన్నిటికి మూలకారణమగువా నిని నేనుచంపితిని. రామలక్ష్మణులయొక్కయు, వానరులయొక్కయు పరాక్రమము వ్యర్థమయ్యెను." ఇట్లింద్రజిత్తు పలికి యాయున్నదళ్ముల సమీపమునయుండు నీలునిపై 9 వాడిబాణములను, మైందద్వివిదులపై మూడేసిబాణములను, జాంబవంతునివక్షస్థలముపై నొకబాణమును, హనుమంతునిపై పదిబాణములను, గవాక్షశరభులపై రెండేసిబాణ ములను, గోలాంగూలులరాజగు గవాక్షునిపైనను, నంగదునిపైనను ననేకబాణములను విడిచి సింహనాదముచేసెను. తరువాత వాడు బిగ్గ ఱగనవ్వి 'రాక్షసులారా! నాఘోరపాశములచే రామలక్ష్మణులిద్దఱు సేనకు ముందుభాగమున కట్టబడుట చూడుడ'ని పలుక వారందఱ ఱాశ్చర్యసంతోషములను బొంది రాముడు హతుడయ్యెనని పెద్దధ్వ నిచేసి యింద్రజిత్తును బొగడిరి. రామలక్ష్మణులు కదలకుండుటయు, నూపిరిదీయకుండుటయు జూచి రాక్షసులు వారు మరణించిరని యను కొనిరి. ఇంద్రజిత్తు సంతోషముతో లంకలోనికి బోయెను.

సుగ్రీవాదులు రామలక్ష్మణులచుట్టు నిలిచియుండిరి. సుగ్రీవుడు వారిస్థితినిజూచి గొప్పభయమునుబొంది దీనుడై శోకముచే కన్నీరు విడుచుచుండ విభీషణుడు "నీవు భయమును విడువుము. కన్నీరు

విడువకుము. యుద్ధములో జయము నిశ్చయముకాదు. మన కేమైన భాగ్యశేషమున్న యెడల మహాత్ములగు రామలక్ష్మణుల కీమూర్ఛ పోయి తెలివివచ్చును. నీవు ధైర్యమును దెచ్చుకొనిన నాకుగూడ ధైర్యముగలుగును. సత్యధర్మములందు శ్రద్ధగలవారికి నకాలమృత్యువు కలుగ"దని పలికి తడిచేతులతో సుగ్రీవునికన్నీటిని దుడిచి నీటిని దెచ్చి జపించి దానిని వానికంట్లపై జల్లి ముఖమును గడిగెను. తరువాత విభీషణుడు కంగారుపడకుండ కాలోచితముగ వానితో నిట్లనెను. "విచారించుట కిది సమయము కాదు. ఇట్టిసమయమున నతిస్నేహము మరణమువలెనుండును. అన్ని కార్యములను పాడుజేయు విచారమును విడిచి నీవు రాము ననుసరించియుండు సేనకంతకు నుపయోగమగు పనులను నాలోచింపుము. లేక యతనికి మూర్ఛపోవునంతకు సేనను రక్షింపుము. రామలక్ష్మణులకు తెలివివచ్చినతరువాత వారు మనభయమునుబోగొట్టెదరు. రామునికి శరబంధన మేమియు జేయలేదు. అతడు మరణింపడు. అతనిని కాంతి విడువలేదు. మరణించువానికి నట్టికళయుండదు. కనుక నీ వోర్పువహించి బలములనోదార్చుము. చేయవలసినకార్యములనన్నిటిని నేను చేసెదను. మన సేనకు సంతోషముకలుగజేయుటకు నేను పరుగెత్తుచుండ న న్నింద్రజిత్తుగ భావించి వానరు లాశ్చర్యమును, భయముచే వికారరూపములను బొంది యొకరిచెవిలోనొకరు చెప్పుకొనుచు పరుగెత్తుకొనిపాఱిపోవుటకు నాలోచించుచున్నారు. వారు భయమును విడువవలెను." ఇట్లు విభీషణుడు సుగ్రీవుని వానరసేనను నోదార్చ కపివీరులు రాముని రక్షించుచుండిరి. వానరసేన చెట్లనుబట్టి యన్నిదిక్కులను జూచుచుండెను.

ఇంద్రజిత్తు రాక్షసబలముతో లంకలోనికి బోయి తనతండ్రి యెదుట నిలిచి యాతనికి నమస్కరించి 'రామలక్ష్మణులు మరణించిరని ప్రియమగువార్త నతనికి దెలిపెను. అంతట నతడు తనయాసనమునుండి

లేచి వానిని కౌగిలించుకొని తనరాక్షసులతో 'శత్రువులు మరణించి' రని చెప్పి కుమారునిశిరస్సు మూర్కొని యుద్ధమునుగూర్చి వానిని ప్రశ్నింప వాడు జరిగినదంతయు నాతనికి దెలిపి 'నేను వారిని బాణములచే గదలకుండ కట్టుటచే వారు కదలకుండనుండి తేజస్సువిడిచి పడియుండి'రని చెప్పెను. ఇట్టిసంతోషకరములగుమాటలను రావణుడు విని రామలక్ష్మణులవలన భయమును విడిచి తనకుమారునిపనులకు గొప్పసంతోషపుమాటలను బలికెను.

రావణుడు సంతోషముతో సీతకు కావలియుండు రాక్షసస్త్రీలను, త్రిజటను రప్పించి వారితో సంతోషముగ నిట్లు పలికెను. "ఇంద్రజిత్తుచే రామలక్ష్మణులు మడిసి రని మీరు సీతతో జెప్పుడు. ఆమెను మీరు పుష్పకమునకూర్చుండబెట్టి యుద్ధభూమికి దీసికొని వెళ్లి వారిని నామెకు జూపింపుడు. ఆమె తనభర్తయున్నాడని ధైర్యముచే గర్వించి నాయొద్దకు రాలేదు. ఆమెభర్తయు, నతనితమ్ముడును యుద్ధములో నంతమునొందిరి. ఆమె విచారమునుమాని యతనియందలియాశను విడిచి మంచియలంకారములను ధరించి నన్ను బొందును. ఆమె వారిని జూచి యితరరక్షకులు తనకు లేనందున వారియందాశను విడిచి తనంతటతానే నన్నిప్పుడు పొందును." ఇట్లు రావణుడు పలుక వారు 'అట్లే చేసెద'మని పలికి పుష్పకముతో సీతయొద్దకు నశోకవనమునకు బోయిరి. వారామెకు భర్తృవియోగమునుగూర్చి తెలిపి యామెను పుష్పకమున కూర్చుండబెట్టిరి. త్రిజట రామలక్ష్మణులుండుచోటికి నామెను దీసికొనివెళ్లెను. రావణుడు లంకాపట్టణములో జెండాలను, ధ్వజములను గట్టించి 'ఇంద్రజిత్తుచే రామలక్ష్మణులు మడిసి' రని చాటింపించెను. సీత పుష్పకముమీద యుద్ధభూమికి వెళ్లి కొంతవానరసైన్యము మడియుటయు, వానరులు విచారముగ నుండుటయు, రాక్షసులు సంతోషముగనుండుటయు, కవచములు తెగిపోవ

శరీరమంతటను శరములుతగులుటచే గాయములుగలిగిన రామలక్ష్మ
ణులు బాణములపై పండుకొని తమధనస్సులవిడిచి మూర్ఛబెందియుం
డుటయు జూచి మిక్కిలివిలపించెను.

సీత రామలక్ష్మణులు మరణమునొందిరని తలచి యిట్లు విచా
రించెను. "సాముద్రికశాస్త్రము తెలిసినవారు నేను పుత్రవంతురాల
నగుదుననియు, విధవను కాననియు పూర్వము చెప్పియుండిరి. నేను
యజ్ఞములుచేయువారిభార్యనగుదునని యజ్ఞములుచేయించువారు పలికి
యుండిరి. జ్యోతిష్కులగు బ్రాహ్మణులు నేను శుభముగలదాననని యు
రాజ్యాభిషిక్తురాల నగుదుననియు పలికిరి. ఇప్పుడు రాముడు హతుడై
యుండ వారిమాటలన్నియు నబద్ధములయ్యెను." ఇట్లామె విచారించి
రాజులతో నభిషేకమునొందు రాజభార్యలకుగల* సాముద్రికలక్షణ
ములు తనకుగలవనియు, భాగ్యహీనులగు విధవలకుగలచెడులక్షణము
లేవియు తనకు లేవనియు బలికి యింకను నిట్లు విలపించెను. "రామ
లక్ష్మణులు జనస్థానమునుండి నన్ను రావణు డెత్తుకొనిపోవుట తెలిసి
కొని, నేనుండుచోటును గనిపెట్టి, సాగరమునుదాటి, గొప్పపనులనుచేసి
చివరకు స్వల్పునిచే హతులైరి. వారు గొప్పయస్త్రములు తెలిసినవా
రైనను, నింద్రునితోసమానమగువారైనను మాయచే గనబడకుండ
యుద్ధముచేసిన స్వల్పరాక్షసునిచే హతులైరి. రామునకు గనబడిన
శత్రువు మనోవేగముగలవాడైనను నతని బాణమునుండితప్పించుకొని
ప్రాణములతో పాఱిపోలేడు. వారు హతులగుటచే కాలమునకు శక్య
ముకాని కార్యమేదియు లేదనియు, యముడు జయించుటకు శక్యము
కానివాడనియు దోచుచున్నది. వారలగూర్చి నాకును,నాతల్లికినిగలు
గుదుఃఖముకంటె మాయత్తయగుకౌసల్యకు శోకమెక్కువగ నుండును.
'వనవాసనియమమును పూర్తిచేసి సీతారామలక్ష్మణులుకలిసియెప్పుడు
వచ్చెదరు? నేనెప్పుడు వారిని జూచెదనని యామె నిరీక్షించుచుం

---

*13వ. ప్రకరణము. 2వ. అధ్యాయము సాముద్రికలక్షణములు చూడుము.

షును.” ఇట్లు సీత విలపించుచుండ త్రిజట యామెనుజూచి యిట్లనెను. “నీవు విచారమును బొందకుము. నీభర్త జీవించియున్నాడు. రామలక్ష్మణులు జీవించియున్నట్లు గొప్పనిదర్శనములను దెలుపుచున్నాను; వినుము. రాజు మరణింప యోధులముఖము లిట్లు కోపముతోను, సంతోషముతోను నుండవు. తేజోయుక్తమగు నీ పుష్పకము వారుమరణించినయెడల నిన్ను మోసికొనిరాదు. యుద్ధమునకు వెళ్ళినరాజు మరణించినయెడల సతనిసేన యుత్సాహములేక చెల్లాచెదరై పరుగెత్తును. ఈవానరసేన తొట్రుపాటు, భయములేకుండ నిలిచి పరాక్రమమును జూపుచు రామలక్ష్మణులను రక్షించుచున్నది. ఈకారణముల చేతను, నాకు సంతోషముగనుండుటచేతను వారు జీవించియుండిరని నాకు దెలియుచున్నది. ఈశుభచిహ్నలచే నీవు నీమనస్సును స్థిరము చేసికొని వారు జీవించియున్నారని తెలిసికొనుము. నేను నీయందలి స్నేహముచే నిట్లు పలుకుచున్నాను. నే నెప్పుడును నీ కబద్ధము చెప్పియుండలేదు. నే నెంతమాత్ర మబద్ధమాడను. నీవు మంచిప్రవర్తన గలదానవును, మంచిస్వభావముగలదానవును నగుటచే నీయందు నాకు స్నేహము గలిగెను. వీరిని నింద్రాదులైనను యుద్ధమున గెలువలేరు. పైని దెలిపిన చిహ్నలనుబట్టి నే నిట్లు పలికితిని. వానినన్నిటిని బాగుగనాలోచించిచూడుము. వీరు మూర్ఛనొందియుండుటచే వీరిని ముఖకాంతి విడువకున్నది. మరణించినపురుషులనోళ్లు వికారముగనుండును. సీతా! నీవు రామలక్ష్మణులనుగూర్చి శోకమును, నజ్ఞానమును విడువుము. వారు నిశ్చయముగ జీవించియున్నారు.” త్రిజటపలికినయీమాటలను దీనురాలైనసీత విని యామెకు నమస్కరించి ‘అట్లేయగుగాక’ యని ప్రార్థించెను. వారిద్దఱును పుష్పకమున గూర్చుండి లంకలోనున్న యశోకవనమునకు రాక్షసస్త్రీలతో బోయిరి. రాక్షసస్త్రీలు పూర్వమువలె నామెకు గాపుండిరి. సీత రామలక్ష్మణులను గూర్చి యాలోచించుచు మిక్కిలి విచారముతోనుండెను.

రాముడు ధైర్యవంతుడును, బలవంతుడును నగుటచే మూండా తనికి తెలివివచ్చెను. అతడు శరబద్ధుడును, రక్తముతో నిండినవాడును, విచారముతోనున్నవాడును, దీనమగుముఖముగలవాడును నగు లక్ష్మణునిజూచి యిట్లు విలపించెను. "నాతమ్ముడు యుద్ధములోజయింపబడి యిట్లు పడియుండ సీతవలన నాకేమిలాభము? నేను జీవించియుండిన లాభమేమి? సీతవంటిభార్యను నేను సంపాదింపగలనుగాని యుద్ధములో సహాయముచేయగలిగిన యిట్టితమ్ముని సంపాదింపలేను. అతడు మరణించినయెడల నేనుకూడ వానరులుచూచుచుండ కాలధర్మమునొందెదను. అతడులేకుండ నే నయోధ్యకు వెళ్ళి నాతల్లులతో నేమిచెప్పెదను? తనపుత్రునిరాకకై నిరీక్షించుచున్నసుమిత్ర యతడు లేకపోవుటచే నేడ్చుచుండ నామెను నేనెట్లోదార్చగలను? అతడు లేకుండ నేను వెళ్ళి భరతశత్రుఘ్నులతోను, సుమిత్రతోను నేమనిచెప్పుదును? ఆ మెపలుకునిష్ఠురవాక్యములను నే నెట్లు సహింపగలను? నాకు జీవించుటకిష్టములేదు. ఇప్పుడే నేను ప్రాణములను విడిచెదను. దుర్భాగ్యుడనగు నామూలముననే లక్ష్మణు డిచటకు వచ్చి ప్రాణములుపోయినవానివలె శరతల్పముపై నిద్రించియున్నాడు. లక్ష్మణా! నీవు నేను విచారముగనున్నప్పుడు నన్నోదార్చుచుండెడివాడవు. అట్టినీవు ప్రాణములు పోవుటచే విచారముగనున్ననాతో మాట్లాడకున్నావు. ఇప్పుడు యుద్ధములో నీచే జంపబడినరాక్షసులు పడియున్న భూమిపైనే నీవు కూడ శత్రువులచేగొట్టబడి శరీరమున రక్తమునిండియుండ శరతల్పము మీదపండుకొని బాణములుతగులుటచే మాట్లాడలేకున్నావు. నీముఖ వర్చస్సుజూడ నీవు బాధనొందుచున్నట్లు గనబడుచున్నావు. నీవు నాతో వనవాసమునకు వచ్చినట్లే నేనుకూడ నీతో యమలోకమునకు వచ్చెదను. నీవు నాకు మిక్కిలియిష్టుడవైన బంధుడవై నన్నెల్లప్పుడు విడువకుండనుంటివి. నీకు కోపమువచ్చినప్పుడైనను నీవు కఠినము

లును, విప్రియములును నగు మాటలను బలుకుట నేను వినియుండలేనట్లు జ్ఞాపకము వచ్చుచున్నది. కార్తవీర్యార్జునుడు వేయిచేతులతో 500 బాణములను విడిచినట్లు నీవు నీ రెండుచేతులతోను నన్నిశరములను విడిచెడివాడవు. కాన నీవు వానికంటె గొప్పవాడవు. ఇంద్రునైనను నీయస్త్రములచే గొట్టగలిగినవాడవును, సుఖవాసివియును నగు నీవు భూమియందు పరుండియున్నావు. నేను ప్రతిజ్ఞచేసినప్రకారము విభీషణునికి రాక్షసరాజ్యాభిషేకము చేయకపోవుటచే నామాట యబద్ధమై నన్ను నిశ్చయముగ దహించుచున్నది. సుగ్రీవా! యీగడియలో నీవు నన్ను విడిచి కిష్కింధకు బొమ్ము. బలవంతుడగు రావణుడు చెలరేగును. అంగద నీల నళులను, సైన్యమును నీవు తీసికొని సముద్రమునుదాటి పొమ్ము. ఇతరులు చేయలేనిగొప్పయుద్ధమును హనుమంతుడు చేసెను. ఋక్షరాజుయొక్కయు, గోలాంగూలులరాజు యొక్కయు పనులకు నేను సంతోషించితిని. అంగద ద్వివిద మైంద కేసరి సంపాతి గజ గవయ గవాక్ష శరభులును, మిగిలినవారును నా నిమిత్తము ప్రాణములనైన విడువసిద్ధమై దేవతలవలె జేసినగొప్ప యుద్ధమును మనుష్యులెవరును జేయలేరు. ధర్మబుద్ధిగలమంచిస్నేహితుడు చేయగలదాని నంతయు నీవు చేసితివి. వానరులారా! మీరందఱు స్నేహితునికార్యమును బాగుగజరిపితిరి. మీయిష్టము వచ్చిన చోటికి మీరు పోవుటకు సెలవిచ్చితిని.” ఇట్లు రాముడు పలికి తిరుగ మూర్ఛనొందె కపులందఱు తమకండ్లంట నీరు దెచ్చుకొని యేడ్చిరి.

ఇట్టిసమయమున సేనయంతయు పాఱిపోకుండ విభీషణుడు గద నుబట్టి దానిని నిలుప నాతనిని వానరులు చూచి, యింద్రజిత్తనుకొని భ్రమించి పాఱిపోవుచుండిరి. సుగ్రీవుడు ‘వీ రెందులకు తొందరపడుచున్నా’ రని యడుగ నంగదు డాతనితో ‘రామలక్ష్మణులు పడియుండుటచే వారట్లగుచున్నా’ రని మాఱుపలికెను. అంత నతడు

'కారణములేకుండ నట్టిభయస్థితి గలుగ' దని తెలిపి యిట్లు పలికెను. 'అదుగో! వానరులు విచారముఖములతో నాయుధములను క్రిందబడ వేయుచు భయముచే కండ్లు తెఱచుకొని నలుదిక్కులకు పరుగెత్తు చున్నారు. సిగ్గువిడిచి వెనుకకు చూడకున్నారు. పడిపోయిన వారిని పఱుగెత్తుటకు లాగుచున్నారు. కొంద ఱొరగుచు పాఱిపోవు చున్నారు.' ఇట్లు కపిరాజు పలుకుచుండ విభీషణుడు గదనుబట్టి యతనియొద్దకు వచ్చి యాతనికి నమస్కరించి రామునిజూచెను. వాన రులకు భయకారణమగు రావణానుజుని జూచి సుగ్రీవుడు సమీపమున నున్న ఋక్షరాజగు ధూమ్రునితోను, జాంబవంతునితోను నిట్లనెను. 'వానరు లీవిభీషణునిజూచి రావణునికుమారుడగు నింద్రజిత్తని భ్రమ పడి భయముచే పరుగెత్తుచున్నారు; గనుక విభీషణుడు వచ్చెనని వారికి దెలిపి వారిని మఱలింపుడు.' ఇట్లతడు పలుక వారు శీఘ్రముగ బోయి సుగ్రీవుడు చెప్పినట్లు కపులకుబోధించి యట్లుచేసిరి. విభీషణుడు రామలక్ష్మణులను జూచి మిక్కిలివిచారమును బొంది తడిచేతులతో వారికండ్లుతుడిచి యిట్లాడెను. 'బలపరాక్రమముగల నాస్నేహితు లిద్దఱు కుటిలయుద్ధముచేసినరాక్షసునిచే బాధింపబడి యిట్టిస్థితిలోనున్నారు. సత్త్వవర్తనగల వీరిని దొంగయుద్ధముచేసి దురాత్ముడగునిండ్రజి త్తీగతిని బొందించెను. వీరు తమశరీరమున బాణములుతగిలియుండ, రక్తముకాఱుచుండ భూమియందు శయనించి యున్నారు. నేను వీరివీర్యగుణములను నమ్ముకొని కీర్తిని బొందదలచి తిని. వీరు మరణమునొంది పండుకొనియున్నారు. నేను జీవించియుండి రాజ్యముదొరకు నాశలేక యాపదను బొందితిని. నాశత్రువగు రావ ణుడు తనకోర్కెను నెఱవేర్చుకొని తనకోరికప్రకారము జరుపు కొనెను.' ఇట్లు విభీషణుడు విలపించుచుండ సుగ్రీవు డాతనిని కౌగిలిం చుకొని యిట్లు పలికెను. 'ధర్మజ్ఞా! నీవు లంకారాజ్యమును తప్పక

పొందెదవు. రావణునియొక్కయు, వారికుటుంబము వారియొక్కయు కోర్కెలు నెఱవేఱవు. ఈరోగము రామలక్ష్మణులనేమియు జేయలేదు. వారు మూర్ఛనుండి తెలివి తెచ్చుకొని రాక్షసరాజును, వానిబలములను జంపెదరు.' ఇట్లు సుగ్రీవుడు విభీషణు నోదార్చి తనమామయగు సుషేణునితో 'నీవు శూరులగు వానరులసహాయమున మూర్ఛనొందిన వీరిని కిష్కింధకు దీసికొనిపొమ్ము. నేను రావణుని, వానిబంధువులను, పరివారమును జంపి సీత నచ్చటికి దెచ్చెద' నని పలికెను.

సుగ్రీవునియీమాటలను సుషేణుడు విని యిట్లు పలికెను. "పూర్వము దేవాసురులకు జరిగిన గొప్పయుద్ధమును నే నెఱుగుదును. ఆయుద్ధములో దానవులు శరములను విడుచుట బాగుగ నెఱిగినవార గుటచే దేవతలనోడించి శస్త్రములతో గడియగడియకు వారిని మూర్ఛా నిరి. దేవతలు బాధనొంది మూర్ఛనొందుటచే వారిప్రాణములు పోవు చుండ వారిగురువగు బృహస్పతి మంత్రప్రయోగములుగల తన విద్య లచేతను, సంజీవకరణి విశల్యకరణియను నోషధులచేతను వారిని బాగు జేసెను. అవి పాలసముద్రమును దఱచినచోట చంద్రద్రోణము లను పర్వతములందు గలవు. సంజీవకరణియనగా ప్రాణమిచ్చుదివ్యోషధి. విశల్యకరణియనగా బాణములనూడదీయు దివ్యోషధి. దేవతలక్కడ వానినుంచిరి. వాయుపుత్రుడగు హనుమంతుడు, సంపాతి, పనసుడు మొదలగువానరులు వానినెఱుగుదురు. కనుక వానిని దెచ్చుటకు వారు నతిశీఘ్రముగ వెళ్ళవలెను.' ఇట్లుసుషేణుడుపలుకుచుండ గరుడునిఱెక్క లవలనబయలుదేఱిన గొప్పవాయువు మేఘముల నెగురగొట్టి సముద్ర పునీటిని కలకలముచేసి భూమినికదలించుచుసటుల వచ్చెను. దానివలన సముద్రపుటొడ్డుననున్న చెట్లువిఱిగి సముద్రములోబడెను. దానిలోనున్న పాములు భయమొందెను. జలజంతువులు దానిలో దాగెను. ఆసమయ మునసే గొప్పసహాబలుడును, తేజోమయుడునగు గరుడుని వానరులు

చూచిరి. అతడువచ్చుటను రామలక్ష్మణులశరీరములపై బాణరూపము లతోనున్న పాములు చూచి వారిసవిడిచి పాఱిపోయెను. గరుడుడు వారిని జూచి సంతోషించి వారిశరీరములను తనచేతులతోను, ముఖముతోను నిమిరెను. అందువలన వారిగాయములు మానిపోయెను. వారిశరీర ములు బంగారమువలె ప్రకాశించెను. వారి తేజము, వీర్యము, బలము, కాంతియు, నుత్సాహము, బుద్ధి, జ్ఞాపకశక్తి పూర్వముకంటె రెండు రెట్లాయెను. అతడు వారినిద్దఱిని లేపి వారు సంతోషముగనుండ వారిని కౌగిలించుకొనెను. అప్పుడు రాము డతనితో నిట్లనెను. 'మీదయవలన నిందజిత్తుచే గలిగినగొప్పయుపద్రవమునుండి మేము తప్పించుకొని పూర్వమువలె బలమును బొందితిమి. మంచిరూపసంపన్నులును, మంచి తేజముగలమాలలను ధరించినవారును, సుగంధములను బూసికొని నిర్మ లమగువస్త్రములను గట్టినవారును, తేజముగలయలంకారములను ధరిం చినవారుననగు మీరెవరో తెలుపుడు. ఇప్పుడు నాతండ్రిని, తాతను జూచినటులనామనస్సు మిక్కిలి సంతోషమునొందు చున్నది.' ఇట్లు రాముడు పలుక గరుడుడు సంతోషమునొందియిట్లు విన్నవించెను. 'నేను మీకు ప్రియసఖుడను; గరుత్మంతుడను. మీకు బహిః ప్రాణమువంటివాడను. మీకు సాహాయ్యముచేయునిమిత్తమువచ్చి తిని. గొప్పవీరులగు నసురులు, గొప్పబలులగు దానవులు, ఇంద్రాదిదేవతలు, గంధర్వులు మొదలగువారెవరైనను క్రూరకార్య ములను జరిపిన యింద్రజిత్తుమాయాబలముచే గట్టబడిన యిట్టికష్టమగు మాయశరబంధములను విప్పలేరు. చాలవిషముతోనిండినవాడికోఱలు గల కద్రువసంతానమగు నీనాగులు రాక్షసునిమాయాప్రభావముచే బాణములై మీయందు బ్రవేశించెను. రామా! గొప్పపరాక్రమము గలమీరును, శత్రువులను హింసించు లక్ష్మణుడును భాగ్యశాలులరు. ఈకట్లసంగతి నాకు దెలిసినవెంటనే మీయందలిస్నేహమాలోచించి

శీఘ్రముగ వచ్చితిని. మీరు శరబంధములనుండి విడువబడితిరి. మీ రెల్లప్పుడును జాగ్రత్తగలిగియుండవలెను. రాక్షసులందఱు సహజముగ యుద్ధమున కుటిలముగ బ్రవర్తింతురు. నిర్మలమగుమనస్సుగల మీవంటి శూరులు తమబలములను తిన్నగజూపుదురు. రాక్షసులకు మాయలన్నియు దెలియుననుట కిదియే దృష్టాంతము. వారిని మీ రెన్నడును నమ్మగూడదు." ఇట్లు గరుత్మంతుడు రామునితో బలికి యతనిని కౌగిలించుకొని యింకను మంచిమాటల నిట్లు పలికెను. "మిత్రమా! రామా! మీరు ధర్మము తెలిసినవారు; శత్రువులందుగూడ దయగలవారు. మీరు నాకు సెలవిచ్చిన నేను వచ్చినత్రోవను బోయెదను. 'నేను మీసఖుడ'నని పలికిన నామాటను మీ రిప్పుడు పరిశీలింపనక్కఱలేదు. దానిని మీరు యుద్ధములో జయమునుబొందినతరువాత తెలిసికొనెదరు. మీరు లంకలో బాలురను, వృద్ధులను విడిచి మిగిలినవారిని నాశనమునొందించి రావణుని జంపి సీతను బొందెదరు" ఇట్లు గరుడుడు పలికి వానరులమధ్యనుండు రామునికి రోగముపోవునట్లుచేసి యతనికి బ్రదక్షిణముచేసి యతనిని గౌగిలించుకొని యాకాశమార్గమున వాయువేగమునబోయెను. ఇట్లు రామలక్ష్మణులు రోగములేనివారై నిలుచుటను వానరసేనానాయకులుచూచి సింహనాదముచేసి తోకలనాడించిరి. భేరీలు మొదలగు వాద్యములను పూర్వమువలెనే వాయించిరి. వానరులు పూర్వమువలె కొండశిఖరములను, చెట్లనుబట్టి సింహనాదముచేయుచు లంకాద్వారముల సమీపమున నిలిచిరి. ఇట్లు తెల్లవాఱకమునుపు రామలక్ష్మణులును, వానరులును యుద్ధసన్నద్ధులైరి.

## ౧౯ వ. అధ్యాయము. హనుమదాదులతో ధూమ్రాక్ష వజ్రదంష్ట్ర అకంపన ప్రహస్తులు యుద్ధముచేయుట.

రామలక్ష్మణులు మొదటియుద్ధమున తెల్లవాఱుజామున శరబంధమునుండి విడువబడి వానరులతోగూడి యుద్ధసన్నద్ధులై యుండ వారిశబ్దమును లంకలోని రావణుడును, రాక్షసులును వినిరి. రావణుడు తనమంత్రులతో 'ఈధ్వని జూడ వారు మిక్కిలి సంతోషముగనున్నట్లు కనబడుచున్నది. రామలక్ష్మణులు శరబంధములోనుండ నీశబ్దమును గూర్చి నాకనుమానముకలుగుచున్న' దని పలికి సమీపముననున్న రాక్షసులతో 'విచారసమయమున వానరులు సంతోషముగధ్వని జేయుటకు కారణమును గనుగొను' డని చెప్ప వారు తొందరగ నగరుగోడ యెక్కి రామలక్ష్మణులు లేచి నిలుచుండుటయు, వానరసేనను సుగ్రీవుడు రక్షించుచుండుటయు జూచి భయముతో గోడనుండిదిగి విచారముతో తమరాజున కాసంగతిని దెలిపిరి. అతడు దానిని విని యిట్లు పలికెను. "వరములను బొందిన యింద్రజిత్తు పాములవలె మిక్కిలితీవ్రములును, సూర్యతేజముగలవియునగు గొప్పబాణములను వేసి వారిని తనబలముచే బంధింప వారు విముక్తి నొంది తమప్రాణములను దక్కించుకొనుటచే వానిబలమును గుఱించి నాకు సంశయము కలుగుచున్నది. వాసుకిమొదలగుపాముల తేజముకూడ వ్యర్థమయ్యెను." ఇట్లు రావణుడు పలికి పామువలె నిటూర్పుదీయుచుండెను.

తరువాత రావణుడు రాక్షసులమధ్యనున్న ధూమ్రాక్షుని బిలిచి 'గొప్పబలములతో నీవు రామునియొక్కయు, వానరులయొక్కయు మరణమునకై బయలుదేఱివెళ్ళు' మని సెలవీయవా డాతనికి నమస్కరించి సంతోషముతో రాజనగరునుండి బయలుదేఱి సేనానాయకునితో 'బలములను సిద్ధముచేయు' మనిచెప్ప నత

డట్లు చేసెను. ఆరాక్షసవీరునితో గంటలుకట్టుకొనినవారును, ఘోర రూపులును, బలవంతులును, ననేకాయుధములను బట్టినవారునునగు రాక్షసులును, మంచిగుఱ్ఱములమీదను, కంచరగాడిదలమీదను, ఏనుగులమీదను స్వారిచేయగలరౌతులును, రథములమీద రథికులును సింహనాదముచేయుచు బయలుదేఱిరి. మంచికంచరగాడిదలనుగట్టిన రథముపై ధూమ్రాక్షు డెక్కి యుద్ధమునకు వెడలెను. వారు వెళ్లుచున్నప్పుడు వారి కనేక * దుశ్శకునములు కనబడెను. అతనిరథముపై గ్రద్దవాలెను. ధ్వజములమీద గృధ్రములు గుంపులుగ నిలిచెను. తల లేనితెల్లనిమొండెమొకటి రక్తముతో దడిసి వికృతముగ ధూమ్రాక్షునిసమీపమున నఱచెను. ఇంకను మఱికొన్ని దుశ్శకునములు వారికి గనబడెను. వీని నన్నిటిని ధూమ్రాక్షుడుచూచి విచారమునొందెను. వానిముందువెళ్లురాక్షసులందఱు మూర్ఛపోయిరి. ఇట్లారాక్షసవీరుడు తనసేనతో లంకాపట్నపుపశ్చిమద్వారమునకు వెళ్ళెను. వానరులు వారిని జూచి యుద్ధమునకై సింహనాదముచేసిరి. ఇరుపక్షములవారికి గొప్పయుద్ధముజరిగెను. రాక్షసు లనేకవిధములగు నాయుధములను బట్టియు, వానరులు పర్వతశిఖరములను, రాళ్ళను బట్టియు యుద్ధము చేసిరి. ఇంకను వానరులు రాక్షసులను పండ్లతో గఱచుచు గోళ్ళతో జీల్చుచు యుద్ధముచేసిరి. రాక్షసులు చాలమందివానరులను పూర్తిగ ముక్కలగునట్లు నఱికిరి. వానరులు రాక్షసులను క్రిందపడిచచ్చునట్లు గొట్టిరి. ఉభయులు తమ పేరులను జెప్పుకొనుచు రణమొనర్చిరి. రాక్షసులుకొందఱు రక్తముకక్కుకొనిరి. వానరులు పర్వతశిఖరములతో ధ్వజములను, గుఱ్ఱములను, ఏనుగులను, రథములను నుగ్గుచేసిరి. రాక్షసులు మడియుచుండుటయు, పాఱిపోవుచుండుటయు ధూమ్రాక్షుడు చూచి క్రోధమును బొంది యనేకాయుధములనుబట్టి వానరులతో

* 13 వ. ప్రకరణము, ౯. వ. అధ్యాయము దుశ్శకునములు చూడుము.

యుద్ధముచేసెను. అందు కొందఱువానరులు మడిసిరి. కొందఱుశరా ఘాతములచే పరుగెత్తిరి. (16 వ. అధ్యాయము మొదటి పుటపట మును జూడుము) దీనిని హనుమంతుడు చూచి క్రోధముతో కండ్లెఱ్ఱ జేసి పెద్దరాయిపట్టుకొని ధూమ్రాక్షునిరథముపై విసర నది యారథ మును, గుఱ్ఱములను, దానిమీదనుండు నాయుధములను పిండిచేసెను. ఆరాయివచ్చుట నారాక్షసవీరుడు చూచి చాలముళ్ళుగల యొకగద నుబట్టి తొందరగ రథమునుండి క్రిందికుఱికెను. వాయుపుత్రుడు పెద్ద చెట్లతో రాక్షసులనుగొట్ట వారు మడిసిరి. అతడొకపర్వతశిఖరమును బట్టి ధూమ్రాక్షునిపైకి యుద్ధమునకు వచ్చెను. ధూమ్రాక్షు డాతని తలమీదికి గదను విసర నది వానికి దగిలెను. అంతట నాతడు వానిపై నాపర్వతశిఖరమును విడిచెను. దానితో ధూమ్రాక్షుడు తనయవయ వములన్నియు గదలుచుండ క్రిందపడి పిండిపిండియై మరణమునొందెను. మిగిలినరాక్షసులను వానరులు కొట్టుచుండ వారు లంకానగర మునకు పరుగెత్తిరి. హనుమంతుడు తన్ను మిగిలినవానరులు కీర్తించు చుండ మిక్కిలి సంతోషించెను.

ధూమ్రాక్షుని మరణమును రావణుడు విని మిక్కిలి క్రోధ మునొంది మాయావియు, గొప్పబలవంతుడునునగు వజ్రదంష్ట్రునితో 'వీరుడా!నీవు రాక్షసులతో బయలుదేఱి రామసుగ్రీవులను, వానరులను జంపు'మని చెప్ప నతడట్లే యని చతురంగబలములతోను, కంచరగా డిదలతోను,లొట్టియలతోను, మంచియాయుధములను బట్టినసైనికుల తోను బయలుదేఱెను. వజ్రదంష్ట్రుడు మంచిరథమునకు ప్రదక్షిణము చేసి దానినెక్కెను. అతడును, సేనయుబయలుదేఱివెళ్ళునప్పు డనేక♦ దుశ్శకునములు వారికి గనబడెను. అందుచే రాక్షసులకు భయము గలిగెను. వజ్రదంష్ట్రుడు యుద్ధముచేయునుత్సాహముతో ధైర్యమవలం బించి వెళ్ళెను. ఆరాక్షసవీరుడును, నాసైన్యమును దక్షిణద్వారము

♦ శివ, పరీక్షణము. ౯వ, అధ్యాయము దుశ్శకునములు చూడుము.

దాటివెళ్ళిరి. వానరులు వారిని జూచి పెద్దనాదముచేసిరి. వానరులు చెట్లను, రాళ్ళనుబట్టియు, పెద్దశరీరములుగలరాక్షసు లనేకవిధములగు నాయుధములనుబట్టియు గొప్పయుద్ధమును జేసిరి. కొందఱు బాహువులతో నన్యోన్యము పోరు సలిపిరి. వానరులు కాళ్ళతోను కాలిముణుకులతోను, పిడికిళ్లతోను, రాక్షసులను గొట్టిచంపిరి. వజ్రదంష్ట్రుడు మంచిధనస్సును బట్టి వానరులపై ననేకబాణములను విడిచెను. బలవంతులును, నస్త్రప్రయోగము తెలిసినవారును నగు రాక్షసులుకొందఱు వానరులనుకొందఱిని జంపిరి. దానికి నంగదుడు మిక్కిలి క్రోధమునుజెంది యొకచెట్టును బట్టుకొని రాక్షసులతో యుద్ధముచేయ వారితలలు తెగి క్రిందబడెను. (16 వ. అధ్యాయము మొదటిపుట పటమును జూడుము.) మఱియు రథములు, గుఱ్ఱములు, ధ్వజములు క్రిందబడెను. ఇట్లంగదుడు జయమునొందుటను వజ్రదంష్ట్రుడు చూచి క్రోధమును జెంది తనధనస్సును సిద్ధముచేసి కపులపై ననేకబాణములను విడిచెను. శూరులగు రాక్షసులుకూడ మంచియాయుధములను బట్టి యుద్ధముచేసిరి. ఇరుతెగలవారికి గొప్పపోరు జరిగెను. ఉభయసైన్యములు కొంతవఱకు జచ్చెను. వానరసైన్యములను హెచ్చగుచుండుట నారాక్షసవీరుడు చూచి తనధనస్సు నెక్కుపెట్టి యనేకబాణములను కపిసైన్యముపై విడువ నది యంగదునియొద్దకు పరుగెత్తెను. తరువాత వజ్రదంష్ట్రుడును, నావానరశ్రేష్ఠుడును యుద్ధమునకు దలపడిరి. ఆరాక్షసశ్రేష్ఠుడు డాతనిపై ననేకబాణములను విడువ నతడు వానిపై నొకచెట్టును విసరెను. దానిని వాడు బాణములతో ముక్కలుగ జేసెను. తరువాత నంగదుడొకకొండశిఖరమును వానిపై విసిరి నాదముచేసెను. అది వచ్చుచుండుట వాడు చూచి యొకగదనుబట్టి రథమునుండి క్రిందికురికెను. ఆరథము పిండియాయెను. వజ్రదంష్ట్రుని గదను వానరయువరాజులాగుకొని మఱియొకకొండశిఖరమును వజ్రదం

ష్ట్రునితలమీఁదికి విసర నది వానికి దగిలెను. దానివలన వానికి నెక్కువగ రక్తము వచ్చెను. వాఁడు మఱియొకగదనుబట్టి మూర్ఛనొందెను. కాని వానికి మఱియొకనిమిషమునకు తెలివివచ్చెను. అప్పుడు వాఁడంగదునివక్షమునుపై నాగదతో గొట్టెను. తరువాత వారిద్దఱు పిడికిళ్ళతో పోడుచుకొన వారిరువురకు రక్తము వచ్చెను. అంగదుడు పువ్వులు, పండ్లుగలయొక చెట్టును, తనచర్మపుటొఱలోనున్నయొక ఖడ్గమును బట్టెను. వారిరువురు జయమునుగోరుచు ననేకవిధములుగ యుద్ధముచేయుచు గొట్టుకొనిరి. వారిద్దఱు రక్తము కాఱుచుండ నాయాసముచే భూమిమీఁద మోకాలున గూర్చుండిరి. ఒక్కగడియలో నంగదు డెగిరి వజ్రదంష్ట్రుని పెద్దతలను తనఖడ్గముతో తెగనఱుక వాఁడు క్రిందబడిచచ్చెను. దీనిని మిగిలినరాక్షసులు చూచి వానరులు తమ్ము వెంబడించి హింసించుచుండ విచారముచే ముఖములు వంచుకొని భయముచే లంకకు పరుగెత్తిరి. అంగదుడు కపిసేనలో పరాక్రమముచే ప్రకాశించుచుండెను.

రావణునికి వజ్రదంష్ట్రునిమరణము తెలిసినతరువాత నతఁడు తన సేనాధిపతియగు ప్రహస్తునితో 'దేవతలయుద్ధములోనైనను చలింపనివాఁడును, నన్నిశాస్త్రములసంగతి బాగుగదెలిసినవాఁడును, సూర్య తేజముగలవాఁడుననగు నకంపనుడు మంచిపరాక్రమముగల రాక్షసులతో శత్రుసైన్యముపైకి యుద్ధమునకు బోవలెనని చెప్పి యకంపనుని నిట్లు ప్రశంసించెను. 'ఇతఁడు మంచిసేనాపతి; తనబలములను రక్షించుకొనుచు శత్రుసైన్యములను నాశనముచేయును; ఎల్లప్పుడును నాసిరిని గోరుచుండును. ఇత డెల్లప్పుడు యుద్ధమందాశక్తిగలవాఁడు. ఇతఁడు వానరులను జంపి రామలక్ష్మణసుగ్రీవులను జయించును.' రావణుఁడిట్లు ప్రశంసింప నీలమేఘమువంటి యకంపనుడు పర్వతములవంటి పెద్ద శరీరములుగల రాక్షసులతోను, నితరచతురంగబలములతోను మంచిరథ

మెక్కి యుద్ధమునకు వెళ్లెను. రాక్షసులనేకవిధములగు నాయుధములను బట్టి వానితో వెడలిరి. ఆరాక్షసవీరుడు రథముపై పోవుచుండ గుఱ్ఱములకస్మాత్తుగ దీనత్వమునొందెను. వానియెడమకన్ను దరెను; ముఖవర్ణము మారెను; స్వరము గద్గదమాయెను. ఆరోజు మంచిరోజయినను కఠినముగ వాయువు వీచెను. ఆకాశము మేఘములతో నిండియుండెను. మృగపక్షులు క్రూరముగ ధ్వనిచేసెను. ఈదుశ్శకునములను వాడాలోచింపక యుద్ధమునకు బయలుదేఱెను. రాక్షససేన నడచుచుండ గొప్పశబ్దమాయెను. దానికి వానరులు భయపడిరి. వారు కొండశిఖరములను, చెట్లను, రాళ్ళను బట్టి యుద్ధమునకు నిలిచిరి. ఉభయులకు గొప్పయుద్ధమాయెను. బుగ్గియెక్కువగ నెగిరి యిరుసేనలలోను వ్యాపించుటచే నేమియుగనబడకపోయెను. అట్టిసమయమున నిరుసైన్యములలోని వారు తమవారినిగూడ కొట్టుకొనిరి. తరువాత వారిశరీరములనుండి రక్తముకాలు నాదుమ్మణగిపోయెను. వారొకరినొక రెక్కువగ కొట్టుకొనిరి. అకంపనుడు రాక్షసులను బ్రోత్సహించుచుండెను. వానరులు వారితో యుద్ధముజేయుచుండ కుముదుడు, నళుడు, మైందుడు, ద్వివిదుడు కూడవెళ్ళి రాక్షసుల ననేకులను జంపిరి. దీనిని నా రాక్షసశ్రేష్ఠుడు చూచి మిక్కిలిక్రోధమునుబొంది తనపెద్దధనస్సును గదల్చుచు తనసారథికి 'రాక్షసులెక్కువగ మడియుచుండుచోటికి రథమునుదోలు' మని యాజ్ఞాపింప వాడట్లు చేసెను. అతడు తనధనస్సునెక్కుపెట్టి యనేకతీవ్రబాణములను వానరులపై వేయ వారాతనియెదుట నిలువలేక పరుగెత్తుచుండిరి. వారిని హనుమంతుడు చూచి యకంపనునియొద్దకు వచ్చి వానినెదుర్కొనెను. హనుమంతునిజూచి వానరులు సంతోషముతో తిరిగి రాక్షసుల నెదుర్కొనిరి. అకంపనుడు వాయుపుత్రునిపై ననేక వాడిబాణములను విడిచెను. హనుమంతుడు వానినిలక్ష్యపెట్టక వానిని జంపుటకాలోచించెను. అతడగ్నివర్చస్సుతో సింహనాద

ముచేసి యొకపర్వతశిఖరమును చేతితో పెకలించి వానిపై విసర నకం పనుడు దూరమునుండి దానిని జూచి బాణములను విడిచి దానిని ముక్కలుగ జేసెను. అందుచే హనుమంతునకుక్రోధమువచ్చెను. అప్పు డతడు పొడవగు నొకయశ్వకర్ణవృక్షమును శీఘ్రముగ పెఱికి గిరగిరత్రి ప్పుచు తొందరగ పరుగెత్తుచు నేనుగులను, వానిమీదనున్న రౌతు లను, రథములను, రథికులను, సైనికులను బరిమార్చెను. వానిని జూచి రాక్షసులు పాఱిపోయిరి. రాక్షసులకు భయంకరుడగు నాహనుమం తునిజూచి యకంపనుడు క్రోధము తెచ్చుకొని సింహనాదముచేయుచు వానిపై 14 వాడిబాణములను విడిచెను. దానికి హనుమంతుడు మఱి యొక చెట్టును పెఱికి వేగముగ వానితలమీదికి విసర వాడు క్రిందబడి చచ్చెను. మిగిలిన రాక్షసులు విచారమునుబొంది యాయుధములను విడిచి వానరులచే తఱుమబడి లంకలోనికి పాఱిపోయిరి. వారు జుట్టు విఱియబోసికొని శ్రమచే చెమటలు కాఱుచుండ నిట్టూర్పుదీయుచు భయముచే వెనుకకు జూచుచు నొకరినొకరు త్రొక్కుకొనుచు తొం దరగ నాపట్నమును జేరిరి. యుద్ధభూమిలో వానరులు హనుమంతుని మిక్కిలి కీర్తించిరి. అతడుకూడ వారిని బాగడెను. దేవతలును, రామ లక్ష్మణసుగ్రీవవిభీషణులును హనుమంతుని గొనియాడిరి.

అకంపనునిమరణమును రావణుడు విని కొంచెము దీనుడై తన మంత్రులను జూచెను. తరువాత నత డొకగడియయాలోచించి వారి తో సలహాచేసి లంకలోనుండు సేనలనన్నిటిని పరీక్షించుటకు నుదయ మునబయలుదేఱెను. రాక్షససేన లాపట్టణమునిండనుండెను. జండాలు, ధ్వజము లెగురుచుండెను. తరువాత నతడు తనపట్టణముచుట్టు శత్రు సేనయుండుట జూచి మిక్కిలికోపమునుబొంది సేనాపతియగుప్రహస్తు నితో నిట్లు పలికెను. "మనపట్టణము నాక్రమించుకొని బాధకలుగ

జేయుచున్న శత్రుసైన్యమును బరిమార్చుటకు నేను, కుంభకర్ణుడు, నీవు, ఇంద్రజిత్తు, నికుంభుడు తప్ప నితరులు సమర్థులుకారు. కాన నీవు బలములను వెంటబెట్టుకొని వానరుల సంహరించి జయించుటకు బయలు దేఱుము. అంతటను రాక్షససేనలు సింహనాదము జేయ దానిని నష్టధై ర్యవంతులగు వానరులు విని పాఱిపోయెదరు. అప్పుడు రామలక్ష్మ ణులు సహాయములేనివారై నీకు స్వాధీనమగుదురు. మనము యుద్ధము జేసినయెడల మనకు మరణ మనుమానముగ నుండును. యుద్ధముచేయక పోయినయెడల మనకు మరణము తప్పదు. మనముజయించినను, యుద్ధ ములోజచ్చినను మనకు శ్రేయమే. మనకు హితమగు దానిని నీవు కూడ నాలోచించి తెలుపుము.” ఇట్లు రావణుడు పలుక సేనాపతి యగు ప్రహస్తు డిట్లు సలహానిచ్చెను. “రాజా! యీసంగతినిగూర్చి పూర్వము మంత్రులతో బాగుగనాలోచనచేసి వివాదము పడియుం టిమి. సీత నిచ్చివేయుట మనకు శ్రేయ మనియు, లేనియెడల యుద్ధము జరుగుననియు నేను చెప్పియుంటిని. ఇప్పు డట్లే జరిగినది. మీరు నా కనేకవస్తువులనిచ్చి మర్యాదచేసి యనేకములగు మంచికార్యములను జరిపియుండ నిట్టిసమయమున నేను మీకు ప్రియమును నేలజరుపను? నేను నాపుత్రులందును, భార్యయందును, ప్రాణములందును నభిమాన మును విడిచి మీకొఱకై యుద్ధమునకు తప్పకపోయెదను.” ఇట్లు ప్రహ స్తుడు విన్నవించి సేనానాయకులతో ‘బలములను దీసికొనిరండు. వాన రులను బరిమార్చెద’నని పలికెను. అంతట వారు మంచిచతురంగబల మును సిద్ధముచేసిరి. బ్రాహ్మణులు రావణునిజయమునకై యగ్ని యందు నేయి, మంచిగంధము మొదలగువానిని హోమము చేసి పూజింప దానినుండి సువాసన బాగుగ గొట్టుచుండెను. మంత్రము లతో నభిమంత్రింపబడిన యనేకవిధములగు పూవులదండలను గొప్ప శరీరములుకల రాక్షసులు వేసికొనిరి. చతురంగబల మనేకవిధములగు

నాయుధములతో వెంబడింప ప్రహస్తుడు యుద్ధమునకుబయలుదేఱెను. రాక్షసులు మంచికవచములను దొడుగుకొని రావణునికి నమస్కరించి బయలుదేఱిరి. సేనాధిపతి రావణునియొద్ద సెలవుపుచ్చుకొని పెద్ద భేరిని వాయించి వడిగల గుఱ్ఱములను గట్టినదియు, మంచిసారథి గలదియు, సూర్యుని తేజమువలె ప్రకాశించునదియు, నన్నియాయుధ ములతో నిండినదియు, సర్పధ్వజముగలదియునగు రథమెక్కి వాద్య విశేషములతో బయలుదేఱెను. అతనిసచివు (కార్యనిర్వాహకులు) లగు నరాంతకుడును, కుంభహనువును, మహానాదుడును, సమున్నతుడును గూడ బయలుదేఱిరి. ఇట్లు బలమంతయు బయలుదేఱి లంకయొక్క తూర్పుద్వారమునుదాటి యుద్ధమునకు వెళ్లెను. అట్లు వెళ్ళుచుండ ప్రహస్తునికి ననేక*దుశ్శకునములు గనబడెను. రథధ్వజముపై గ్రద్ద యొకటి దక్షిణముఖముగ నిలిచి తనరెండుప్రక్కలను ముక్కుతో పొడుచుకొనెను. సారథిచేతినుండి గుఱ్ఱములను తోలెడికఱ్ఱ క్రింద బడెను. వానరులు చెట్లను, పెద్దరాళ్లనుబట్టియు, రాక్షసులనేకవిధము లగు నాయుధములనుబట్టియు సింహనాదముచేయుచు యుద్ధమునకు నిలిచిరి.

ఇట్లు ప్రహస్తుడు వానరసేనలో బ్రవేశింప రాముడు చిఱు నవ్వునవ్వుచు 'గొప్పశరీరముకలయీపరాక్రమవంతుడెవ'డని విభీషణు నడుగ నతడు వానిపేరునుజెప్పుచు వాడు రావణునిసేనాపతియనియు, మంచిబలవంతుడును, నస్త్రములు బాగుగదెలిసినవాడును, శూరు డును, ప్రఖ్యాతమగు పరాక్రమముగలవాడునుననియు, లంకలోని మూడవవంతుసైన్యముతో యుద్ధమునకు వచ్చెననియు దెలిపెను. అప్పు డుభయపక్షసైనికులు తమతమయాయుధములనుబట్టి రణము సలిపిరి. అందు రెండుకక్షులలోనివారును కొంతవరకు జచ్చిరి. వాన

*13వ, ప్రకరణము ౯వ, అధ్యాయము దుశ్శకునములు చూడుము.

రులు తమయుఅచేతులతోను, పిడికిళ్ళతోనుగూడ యుద్ధము జేసిరి. రణ భూమియంతయు రక్తముతోను, ననేకావయవములతోను, తెగినచెట్ల తోను, నాయుధములతోను నిండియుండ గ్రద్దలు, కంకపక్షు లక్కడ మూగి మాంసశోణితములను దినుచుండెను. ప్రహస్తునిసచివులు నలుగురును ననేక వానరులను జంపిరి. (16వ అధ్యాయము. మొదటిపుట పటమును జూడుము.) ద్వివిదుడొక కొండశిఖరమునుబట్టి నరాంతకుని నంతమునొందించెను. దుర్ముఖుడను వానరు డొక పెద్దచెట్టునుబట్టి దాని తో సమున్నతునిశీఘ్రముగ గొట్టిచంపెను. జాంబవంతుడొక పెద్దరాతిని బట్టి మహానాదునివక్షస్థలముపై విసరెను. అది వానికిదగులవాడు మరణమునొందెను. తారుడను వానరుడు కుంభహనునితలమీద చెట్టుతో గొట్ట వాడు హతుడయ్యెను. వీనినన్నిటిని ప్రహస్తుడు తన రథమునుండిచూచి సహింపలేక యొకధనస్సునుబట్టి వానరులపై ననేక వాడిబాణములను విడువ వారల కనేకులకు దెబ్బలు తగిలెను. నీలుడు దీనిని జూచి యారాక్షససేనాపతితో యుద్ధమున కెదుర్కొనెను. అత డొకధనస్సునుబట్టి వానరసేనాపతిపై ననేకవాడిశరములను విడువ నవి యాతనికి దగిలి భూమియందుబడెను. తరువాత నీలు డొకచెట్టుతో ప్రహస్తునిగొట్ట నతడు తనశత్రువుపై ననేకబాణములను విడిచెను. నీలుడు కండ్లు మూసికొని యాబాణములను లక్ష్యపెట్టక క్రోధము తెచ్చుకొని యొకగుగ్గిలపుచెట్టునులాగి వానిరథగుఱ్ఱములనుగొట్టి వాని ధనస్సునులాగుకొని ముక్కలుగ జేసి సింహనాదము చేసెను. అంతట ప్రహస్తుడొకపెద్దముసలమునుబట్టి రథమునుండి క్రిందికుఱికెను. తరువాత నిరువురుసేనాపతులు బాహుయుద్ధము జేయుచుండ వారిశరీరములు రక్తముతో దడిసెను. వారు మంచిబలపరాక్రమములు గలవారగుటచే నొకరినొకరు కొట్టుకొనుచు దంతములతో పోరాడు నేనుగులవలె జయముకొఱకై రణము సలిపిరి. ప్రహస్తుడు నీలునిసుదుటను ము

లముతో మొత్త నతడొక పెద్దచెట్టును వానిపైవిసిరెను. వాడుదానిని లక్ష్యపెట్టక యాతనిని ముసలముతో నెదుర్కొనెను. దానిని నీలుడు చూచి పెద్దరాతిని వానితలపైకి విసరెను. దానితో వానితల ముక్కలు కాగా వాడు ప్రాణములను విడిచి క్రిందబడెను. రామలక్ష్మణులు నీలునికీర్తింప నతడు సంతోషముగ నుండెను. ప్రహస్తుడు మరణింప మిగిలిన రాక్షసులు లంకకుపరుగెత్తి యాతనిచావును రావణునకు దెలిపిరి.

---

## ... అధ్యాయము.

## రావణుడు రామునితో ప్రథమయుద్ధముచేసి కిరీటమును బోగొట్టుకొనుట.

ప్రహస్తునిమరణమును రావణుడు విని మిక్కిలిశోకక్రోధము లను బొంది రాక్షసయోధులందఱితోను నిట్లనెను. "యుద్ధములో నింద్రునిహింసించిన సేనాధిపతిని, చతురంగబలములను నాశత్రువులు నాశనము నొందింప వారల నుపేక్షించుట కార్యముగాదు. నేనే స్వయముగ విచారములేకుండ శత్రువుల నంతమునొందించి జయమును బొందుటకు యుద్ధభూమికి బోయెదను. ఇప్పుడు వానరులను, రామలక్ష్మణులను నాబాణాగ్నిచే గాల్చెదను." ఇట్లు రావణుడు పలికి మంచిప్రకాశముగలదియు, మంచిగుఱ్ఱములను గట్టినదియు, బాగుగనలంకరింపబడినదియునగు రథమెక్కెను. శంఖ ములు, భేరీలు మొదలగువాద్యములు మ్రోగుచుండ రాక్షసులు భుజాలులను జఱచుచు సింహనాదముచేయుచుండ, వందిమాగధులు

కీర్తించుచుండ నతడు యుద్ధమునకు బయలు దేరెను. కొండలవలెను, మేఘములవలెనున్న పొడవగు రాక్షసులు యుద్ధమునకు బోయిరి. రావణుడు తననగరమును విడిచి తనసైన్యముతో వెళ్లి చెట్లను, పర్వత శిఖరములను బట్టియున్న వానరసేనను జూచెను. అప్పుడు రాముడు విభీషణుని జూచి 'ఈరాక్షసవీరులెవ'రని యడుగ నతడు వారలసంగతి యిట్లు తెలిపెను. 'అదిగో! యేనుగునెక్కివచ్చుచున్నయా పెద్దశరీరము గలవా డకంపనుడు. అతనిభారముచే నేనుగు తనతలను గదల్చుచున్నది. సింహధ్వజముగల రథముమీద గూర్చుండి యింద్రధనస్సువంటి ధనస్సును గదలించుచు వచ్చుచున్న యేనుగుదంతములవంటికోరలు గలవా డింద్రజిత్తు. ఇతడు బ్రహ్మవలన గొప్పవరములను బొందెను. వింధ్యమహేంద్రాద్రిగిరులవలె నెత్తైనవాడును, గొప్పవీరుడును, నతిర థుడునునగు నాత డతికాయుడు. గంటలు కట్టినయేనుగుపై కూర్చుండి గట్టిగనాదముచేయు నావీరుడు మహోదరుడు. ఎఱ్ఱనిరంగుగల గుఱ్ఱమెక్కి ప్రాసమునుబట్టిన యాతడు పిశాచరాక్షసుడు. పెద్దయెద్దు నెక్కి తీవ్రమగుశూలమునుబట్టి వచ్చువాడు త్రిశిరుడు. మేఘరూపము గలవాడును, రథమున సర్పధ్వజముగలవాడును, ధనస్సును గదలించు చున్నవాడునునగు నాతడు కుంభుడు. బంగారముతోను, వజ్రముల తోను జేయబడిన పరిఘనుబట్టినవాడును, రాక్షసబలముఖ్యుడునునగు నాతడు నికుంభుడు. ధనస్సును, బాణములను, కత్తిని బట్టినవాడును, బాగుగప్రకాశించుజెండాగలరథ మెక్కినవాడును, పర్వతశిఖరములతో యుద్ధముచేయువాడునునగు నాతడు నరాంతకుడు. పులి, యేనుగు, లొట్టియ, గుఱ్ఱము, లేడి మొదలగుమృగములవంటిముఖములుగల వారును, తిరుగుచున్ననేత్రములుగలవారునునగు ననుచరులతో గూడి యున్నవాడును, పంచికిరీటమును, కుండలమును ధరించినవాడును, తెల్లనిగొడుగుగలవాడును, కొండవలెనున్నశరీరముగలవాడును నింద్ర

యములగర్వమణచినవాడునునగు రావణాసురు డదుగో.' ఇట్లు విభీష ణుడు తెలుప రాము డిట్లు పలికెను. 'ఈ రావణునికి సూర్యునికివలె గొప్ప తేజముగలదు. వీనికున్నంతశరీరము దేవదానవవీరులకైనను లేదు. ఇతనితో వచ్చిన రాక్షసవీరులు పర్వతములవంటిశరీరములుగల వారును, మంచి తేజముగలవారును, మంచియాయుధములను బట్టిన వారునునైయున్నారు. దైవయోగమున పాపాత్ముడగు నీ రావణు డిప్పుడు నాకంటబడినాడు. వీడు సీతనెత్తుకొనిపోయినందులకు నాకు గలిగినక్రోధమును నేను వీనిపై తీర్చుకొనెదను.' ఇట్లు రాముడు పలికి ధనస్సును, బాణములనుబట్టి సిద్ధముగనుండెను. లక్ష్మణుడతనిప్రక్కను యుద్ధమునకు సిద్ధముగనుండెను.

రావణుడు తనతోవచ్చిన రాక్షసవీరులతో "మీరందరు నాతో వచ్చినయెడల వానరులు ప్రాకారద్వారములందును, గోపురములందును, వానిప్రక్కనుండుగృహములందును రాక్షసులెవరునులేరని తెలిసికొని మనలోపములను గనిపెట్టి మిక్కిలిసుఖముగ మనపట్టణమును బట్టుకొనెదరు. కాన మీరు వెళ్లి పురమును జాగ్రత్తగ రక్షింపు" డని చెప్పి వారిని బంపెను. తరువాత నతడు వానరులపై వాడిబాణములను విడిచెను. అప్పుడు సుగ్రీవు డొకపర్వతశిఖరమును పెల్లగించి యాతని కెదురుగ పరుగెత్తి యాతనిపై విసర నాతడు మంచిబాణములచే దానిని ముక్కలుగగొట్టెను. తరువాత రావణు డొకతీవ్రబాణమును ధనస్సున సంధించి కపిరాజుపై వేయ నది వానిశరీరమున గొప్పగాయము గలిగించెను. అందుచే వాడు బాధపడుచు క్రిందబడెను. దానికి రాక్షసులందఱు సంతోషముతో శబ్దముచేసిరి. అప్పుడు గవాక్షుడు, గవయుడు మొదలగు పెద్దశరీరములుగల వానరులుకొందఱు కొండల నెత్తి రావణునిపై విసరిరి. వాని నాతడు తనబాణములతో త్రుంచి వారిపై తీవ్రమగు బాణములను విడిచెను. అవి వారికి తగుల వారు

గొప్పశబ్దముచేయుచు భూమిమీద బడిరి. వానరసేనపైనికూడ నాతడు బాణములను విడువ నది రాముని శరణుజొచ్చెను. అంతట రాముడు ధనస్సును బట్టి సిద్ధముగనుండ లక్ష్మణుడు చేతులుజోడించుకొని 'ఈదు రాత్మునివధించుటకు మీరు శక్తిగలవారైనను నే నీనీచుని జంపెదను. నాకు సెలవిం'డనివేడ నతడిట్లు సెలవిచ్చెను. "నీవు వెళ్లుము. యుద్ధములో మిక్కిలి జాగరూకతగనుండుము. రావణుడు గొప్పవీర్యవంతుడు. అద్భుతమగు పరాక్రమము కలవాడు. వానికి కోపము వచ్చిన మూడులోకములలోనివారును యుద్ధమున వానిని గెలువలేరు. ఇది నిశ్చయము. వానిలోపములను గనిపెట్టుచు నీలోపములను బాగుగజూచుకొనుచు నేత్రములను, ధనస్సును నుపయోగించుచు జాగరూకుడవై నిన్ను రక్షించుకొనుము." ఇట్లు రాముడు సెలవీయ లక్ష్మణుడతనిని కీర్తించుచు, నమస్కరించి కౌగిలించుకొని యుద్ధమునకు బయలుదేఱెను. రావణుడు గొప్పచాపముతో వానరులందఱిపైని ననేకబాణములను విడుచుచుండ నవి వారిశరీరముల కెక్కువగ తగులుచుండెను. దానిని హనుమంతుడు చూచి వారికి బాణములుతగులకుండ నడ్డి రావణునిరథముదగ్గఱకు బోయి తనకుడిభుజ మెత్తి వానిని భయపెట్టుచు నిట్లనెను. 'నీవు దేవదానవ గంధర్వ యక్ష రాక్షసులచే మరణము నొందకుండునట్లు వరములను బొందితివి. కాన నీవు వానరులవలన భయమునొందెదవు? అయిదువ్రేళ్లు గలయీ నాకుడిచేతితో చిరకాలము జీవించియున్న నీప్రాణములను దీసెదను.' ఇట్లు వాయుపుత్రుడు పలుక రావణుడు క్రోధముతో కండ్లెఱ్ఱజేసి 'అనుమానము విడిచి శీఘ్రముగ నన్నుకొట్టి శాశ్వతమగు కీర్తిని నీవు పొందుము. తరువాత నేను నీపరాక్రమమును దెలిసికొని నిన్నునాశన మొందించెద' నని పలికెను. ఆమాటలను విని హనుమంతుడు 'పూర్వము నాచే జంపబడిన అక్షకుమారుని జ్ఞాపకముంచుకొను' మని పలుక

రావణు డతనివక్షమును తనయఱచేతితో గొట్టెను. దానితో నతడు మాటిమాటికి జలించుచు కొంతసేపటికి ధైర్యము తెచ్చుకొని రాక్షస రాజును తనయఱచేతితో గొట్టెను. దానితో రావణుడు భూకంపము వచ్చినప్పుడు పర్వతముచలించునట్లు కదలెను. దానికి ఋషులు, వానరులు, సిద్ధులు, దేవతలు, అసురులు సంతోషముతో కేకలువేసిరి. తరువాత రాక్షసరాజు హనుమంతునితో 'నాకు శత్రువవగు నీవు వీర్యమున కొనియాడదగినవాడవైతి' వని పలుక నావాయుపుత్రుడు 'నేనుకొట్టినదెబ్బవలన నీ వింకను జీవించియుండుటచే నావీర్యము నిందింపదగినది. దుర్బుద్ధీ! ఏలపొగడుకొనెదవు? నన్ను బాగుగ కొట్టుము. తరువాత నాపిడికిలిపోటుచే నీవు యమలోకమునకు బోయెద' వని పలికెను. దానికి రావణుడు క్రుద్ధుడై కండ్లెఱ్ఱజేసి కుడిచేతినెత్తి వేగముగ పెడల్పగు హనుమంతుని వక్షస్థలమున గొట్ట నతడు దానితో చలించెను. ఇట్లు వాయుపుత్రుడు బాధనొందుట రావణుడు చూచి తనరథమునువానరసేనానాయకుడగు నీలుడుండుచోటికి తోలించి వానిపై తీక్ష్ణములగు ననేక బాణములను విడువ వాడు పర్వతశిఖర మొకదానిని నాతనిపైకి విసరెను. ఇంతలో హనుమంతుడు తెలివితెచ్చుకొని యుద్ధము చేయుటయందిష్టముగలవాడై నీలునితో యుద్ధముచేయుచున్న రావణునితో 'నీవొకనితో యుద్ధము చేయుచుండ నేను నిన్ను యుద్ధమున నెదుర్కొనుట తగినపనికా' దని పలికెను. రాక్షసరాజు నీలుడువిసరినపర్వతశిఖరమును నేడు వాడిబాణములచే ముక్కలుగజేసెను. అందుచే నీలుడు క్రోధము తెచ్చుకొని గుగ్గిలము, మామిడి మొదలగుచెట్లను నాతనిపై విసర వాని నన్నిటిని నతడు బాణములతో ఛేదించి వానిపై బాణవర్షము కురిపించెను. అప్పుడు వానరసేనాపతి చిన్నరూపమునుబొంది రావణునిరథధ్వజముమీదికెగిరెను. జెండాచివరనున్ననీలునిజూచి రావణుడు క్రోధముచే మండి

పడెను. అప్పుడు నీలుడు నాదముచేసియనేకసూక్ష్మరూపములనుబొంది యతిలాఘవముగ రావణునిధ్వజముపైని, నాతనికిరీటముపైని, ధనస్సు చివరను నుండ నాతనిని రామలక్ష్మణహనుమంతులు చూచి మిక్కిలి యాశ్చర్యమునొందిరి. రావణునకుగూడ నాశ్చర్యముకలిగెను. నీలుని లాఘవమునుజూచి కంగారుపడుచున్న రావణుని వానరులు చూచి సంతోషముతోఁ కేకలువేసిరి. రాక్షసరాజునకు తొట్రుపాటుచే నేమి యుదోచకుండెను. తరువాత నతడు తనధనస్సున నాగ్నేయాస్త్ర ముతోఁ నొకబాణమును సంధించి తనధ్వజముమీదనున్న నీలుని జూచుచు నిట్లు పలికెను. 'వానరా!నీవు గొప్పమాయచే సూక్ష్మరూప మును బొందితివి. నీకు శక్తియున్న నీప్రాణములను రక్షించుకొనుము. నీవంటిరూపముల ననేకములను కలిగించుకొనుము. నేనీయస్త్రముతోఁ బాణమును సంధించివిడుచుచున్నాను.నీప్రాణములను నీవెట్లు రక్షించు కొన్నను నిది వానిని దీసివేయును.' ఇట్లు రావణుడుపలికి నీలునిపై నా యాగ్నేయాస్త్ర యుక్తమగు బాణమును విడిచెను. అది నీలునివక్ష మున తగుల నతడు మండిపోవుచు భూమిమీదపడిమోకాలున నిలి చెను; కాని వా డగ్నిపుత్రుడగుటచేతను, తన ప్రభావముచేతను తన ప్రాణములను బోగొట్టుకొనలేదు.

తరువాత రావణుడు యుద్ధమునందాసక్తిగలవాడై తనకడ్డు వచ్చినయితరవానరులను నివారించి లక్ష్మణునియెదుటికి తనరథమును తోలించిభూమినికదలించునటుల ధనుష్టంకారముచేసెను. అప్పుడు లక్ష్మ ణుడు రాక్షసరాజుతోఁ 'నీవు వానరులతోఁ యుద్ధముచేయుట తగదు. నాయెదుటనిలువు' మని పలికి పెద్దధనుష్టంకారమును జేసెను. అతని ధనుష్టంకారమును, మాటలను రావణుడు విని కోపముతోఁ 'రాఘవా! దైవయోగమున నీవు నాకంటబడితివి. విపరీతబుద్ధిగల నీ వంతముగోరు చున్నావు. ఈక్షణమందే నీవు బాణములచే పీడింపబడి యమలోకము

నకు వెళ్లెద' వని పలికెను. దానికాతడు నిర్లక్ష్యముతో 'రాజా! గొప్ప ప్రభావముగలవారిట్లు గట్టిగ పలుకరు. పాపులలో ముఖ్యుడవగు నీవు నిన్ను గుఱించి పొగడుకొనుచున్నావు. నీబలపరాక్రమములను, వీర్యప్రతాపములను నే నెఱుగుదును. నేను ధనస్సును, కత్తిని, బాణములను బట్టి నిలిచియున్నాను. యుద్ధమునకు రమ్ము. నిన్ను నీవు పొగడుకొనుటవలన లాభమే' మని పలుక రావణు డాతనిపై నేడు వాడిబాణములను విడిచెను. వానిని లక్ష్మణుడు తనవాడిబాణములచే ఖండించెను. అందులకు కోపమురాగా రాక్షసరాజు మఱికొన్ని తీవ్రబాణముల నాతనిపై విడువ నతడు తనధనస్సునుండి వాడితూపులను విడిచి వానిని భగ్నముచేసెను. దానికి రావణు డాశ్చర్యమునొంది తిరుగనాతనిపై వాడిబాణములను విడిచెను. లక్ష్మణుడు వానిని ఖండించుటకును, రావణుని వధించుటకును వాడిబాణములను విడిచెను. రావణుడు వాని నన్నిటిని తనబాణములచే నంతమునొందించి యతితీవ్రమైనదియు, బ్రహ్మ తనకిచ్చినదియునగు నొకబాణముతో నతని నుదుటిపై కొట్టెను. ఆదెబ్బవలన లక్ష్మణుడు ధనస్సును విడిచి తెలివితప్పి క్రిందబడెను. తరువాత నతడు తెలివితెచ్చుకొని తనబాణముతో రావణునిధనస్సును విఱుగగొట్టి మూడుబాణములతో వానిశరీరమును గొట్ట వాడు తెలివితప్పిచలించెను. తరువాత తెలివిరాగ నతడు బ్రహ్మ తనకిచ్చిన శక్తిని దీసెను. అది యగ్నివలె ప్రకాశించుచు వానరసేనకు భయమును గలిగించుచుండ వాడు దానిని లక్ష్మణునిపైకి శీఘ్రముగ విసరెను. దాని నాతడు తీవ్రమగుబాణములతో గొట్టినను నది యతని వక్షస్థలములోనికి ప్రవేశించెను. అతడు శక్తిమంతుడైనను దానివలన నతనిశరీరముమండెను. * ఇట్లాతడు మూర్ఛనొందియుండ రావణుడు

*అ. రా:—లక్ష్మణుడు మూర్ఛజెంది యుండెను. రావణుడు రామునిచే యుద్ధమున పరాభవమ్మునుపొంది లంకకు బోయెను. అంతట

శీఘ్రముగవచ్చి తనరెండుభుజములతోను, నాతనినెత్తబోయెను. హిమవత్పర్వతమును, మందరపర్వతమును, మేరుపర్వతమును, దేవతలతోగూడినమూడులోకములను గూడ నెత్తవచ్చునుగాని యుద్ధములో లక్ష్మణుని నెత్తుట కెవనికిని శక్యముగాదు. బ్రహ్మాసంబంధమగుశక్తిచే గొట్టబడినలక్ష్మణుడు తాను చింతింపశక్యముగాని శక్తిగలవిష్ణునియంశచే జన్మించినవాడగుటచే తనసంగతినాలోచించుకొనెను. ఆకారణ

---

రాముడు లక్ష్మణునిమూర్ఛకు విచారించుచు హనుమంతునితో 'లక్ష్మణుని, వానరులను బ్రతికించుటకు పూర్వమువలె గొప్పయోషధులను తెమ్మని చెప్పెను. అప్పుడు హనుమంతుడు శీఘ్రముగ వాయువేగముతో నెగిరి సముద్రమునుదాటి వెళ్లుచుండెను. ఇంతలో రావణునకీసంగతి చారులు తెలుప నాతడు చాలవిచారమునొంది యారాత్రివేళ తానొక్కడే యొకక్షణములో కాలనేమియింటికిబోయెను. కాలనేమి యతనిని జూచి యాశ్చర్యమును బొంది భయముచే తొట్రుపాటుజెందుచు నమస్కరించి యతనికి నర్ఘ్యము మొదలగువానినిచ్చి 'నేనేమి చేయవలెను? నీవు వచ్చుటకు గారణమేమి?' యని యడుగ రావణుడు విచారముతో హనుమంతుడు వెళ్ళినకార్యమును దెలిపి 'నీవు వానికి విఘ్నముకలుగునటుల చేయుము. నీవు మాయచే మునివేషము వేసికొని వానిని మోసగించి వానికి కాలముమించునట్లు చేసి యింటికి రమ్మని యతని కాజ్ఞాపించెను. దీనిని విని కాలనేమి రావణున కిట్లు బోధించెను. "రాజా! యథార్థమగు నామాటలను విని నిజమును గ్రహింపుము. నీకు నేను ప్రియమును జేసినంతటనే నాప్రాణములు పోవును. పూర్వమడవిలో మాయామృగరూపమును ధరించిన మారీచున కెట్టిదశపట్టెనో యట్టిగతియే తప్పక నాకుగూడపట్టును. నీపుత్రులును, మనుమలును, బంధువులును, రాక్షసులును మరణించిరి. రాక్షసకులమునంతను సంహరింపజేసి నీవు జీవించుటవలనగాని, రాజ్యము

ముచే రావణుడతనిని కదిపి భుజములతో నెత్తలేకపోయెను. అప్పుడు హనుమంతుడు రావణునెదుర్కొని పిడికిటితో వానివక్షస్థలమున గట్టిగ గొట్టెను. దానితో వాడు రథముమీద మోకాళ్లతో నిలుచునట్లు పడి చలించి పడిపోయి కండ్లంట, చెవులంట, నోటంట రక్తముకక్కుకొనెను. వాడురథముపై శరీరమునుగదల్చుచు చేష్టలుడిగి మూర్ఛనొంది లేవలేక పోయెను. దీనికి ఋషులును, వానరులును, నింద్రాదిదేవతలును సంతోషముతో కేకలువేసిరి. అప్పుడు హనుమంతుడు లక్ష్మణుని తన రెండు భుజములతో నెత్తుకొని రాముడుండుచోటికి తీసికొనిపోయెను. వాయు

---

వలనగాని, సీతవలనగాని, జడ (చైతన్యములేని) స్వరూపశరీరమువలన గాని నీకేమియు ప్రయోజనములేదు. నీవు రామునకు సీతను, విభీషణునకు రాజ్యమును నిచ్చి మునిసమూహము నివసించు వనమునకు వెళ్లుము. అక్కడ నీ వుదయముననే లేచి శుభ్రమగు నీటిలోస్నానము చేసి సంధ్యాదిక్రియలను జరిపి తరువాత నెవ్వరునులేనిచోట మంచియాసనమును నేర్పఱచుకొని యందు సుఖముగకూర్చుండి యన్నిటితోను సాంగత్యమును విడిచి పైవిషయములను గ్రహించునింద్రియములను నాత్మను గ్రహించునట్లు చేయుము. ఆత్మను నెల్లప్పుడు మాయకు వేరైనదానినిగ నాలోచింపుము. బ్రహ్మమొదలు గడ్డిపరకవఱకునుండు చరాచరరూపమగు సకలప్రపంచమున్ను, దేహబుద్ధీంద్రియాదులున్ను, వినబడునట్టియు, కనబడునట్టియు సకలప్రపంచమున్ను మాయయే. అదియే ప్రకృతి. జగత్తుపుట్టుటకును, నిలుచుటకును, నశించుటకును నదియే మూలకారణము. ఆమాయయే యెల్లప్పుడు సాత్త్విక రాజస తామస మిశ్ర ప్రజలను సృజించి తనచే సృజింపబడిన ప్రజావృద్ధికై కామక్రోధాదిపుత్రులను, పరహింస, ఆశ మొదలుగాగలకన్యకలను సృజించి ఆత్మశబ్దవాచ్యుడును, నిగ్రహానుగ్రహసమర్థుడును నగు దేవుని తనగుణములచే మోహమును బొందించుచు అహంకార మమకారా

పుత్రుడు మంచిహృదయముగలవాడగుటచేతను, పరమభక్తుడగుటచేతను లక్ష్మణుడు శత్రువులకు కదలింపశక్యముకానివాడయ్యెను నతనికి చులకనగనాయెను. రావణునిశక్తి యుద్ధమున జయించుటకు శక్యముకాని లక్ష్మణునివిడిచి రావణునిరథమునతనస్థానమునకు వెళ్లెను. లక్ష్మణునకు తా నచింత్యుడగు విష్ణునియంశసంభూతు డనునాలోచన కలిగినంతనే యాతనికి దెలివి వచ్చెను. అతనిగాయము లున్నియుగూడ మాని పోయెను. తరువాత రావణుడు తెలివితెచ్చుకొని యుద్ధసన్నద్ధుడై తిరుగ మఱియొక పెద్దధనస్సునుబట్టి బాణములను వానరులపై విడిచెను.

---

విష్టునిగాజేసి కర్తృత్వము, భోక్తృత్వము మొదలుగాగల తనగుణములను నాత్మయందారోపించి యతనిని స్వాధీనముచేసికొనినదై యతనితోనెల్లప్పుడు క్రీడించుచున్నది. పరమాత్మ దర్శనాదివికారములులేనివాడైనను మాయాసంబంధముచే బహిర్విషయములను జూచుచున్నట్లుండి తననిజరూపమును మఱచుచున్నాడు. జనుడు సత్కర్మాదులచే పరిశుద్ధమగునంతఃకరణగలవాడైనప్పుడు బ్రహ్మజ్ఞానియగు గురువుచే బోధింపబడి (ఆత్మస్వరూపమును దెలిసికొని) బాహ్యదృష్టినివదలి యెల్లప్పుడు నాత్మస్వరూపానుసంధాన తత్పరుడగును. అట్టివాడే సత్వరజస్తమోగుణములచే విడువబడినవాడై జీవన్ముక్తుడనిచెప్పబడును. కాన నీవుకూడ నింద్రియములను జయించి యెల్లప్పుడును నాత్మను ధ్యానించుచు ఆత్మ మాయకంటె వేఱైనదని తెలిసికొని ముక్తిని బొందగలవు. అట్లు ధ్యానించుటకు నీకు శక్తిలేనిచో గుణములతోగూడిన దేవుని ధ్యానింపుము. (అది యెట్లనిన) నీహృదయపద్మకర్ణికయందు మణులతోగూడినబంగారువికారమగు పీఠమును గల్పించి యాస్వర్ణపీఠమందు హంసతూలికాతల్పమును గల్పించి యాతల్పమందు వీరాసనాసీనుడును, విశాలాక్షుడును, మెఱుపులసమూహమువలెప్రకాశించు బట్టలను గట్టినవాడును, కిరీట కుండల హార కేయూర కౌస్తుభాది

రావణుడు విడుచు బాణములు వానరసేనానాయకులకు కొంద ఱకు తగుల వారు క్రిందబడిపోయిరి. కొందఱు పరుగెత్తుచుండిరి. దానిని జూచి రాముడు యుద్ధముచేయుటకు రావణునెదురేగెను. అప్పుడు హనుమంతుడు రామునిసమీపమునకు వచ్చి 'బలవంతుడగు గరుత్మంతునిమీదనుండు విష్ణునివలె మీరు నామీఁదెక్కి యుద్ధముచేయ దగు' నని పలుక నతఁ డట్లు చేసి రథమున నున్న రావణుని యెదుట యుద్ధమునకు నిలిచెను. అతడు తనధనస్సునారిని శబ్దముచేసి రావణు మాణిక్యములచేతను, సందెలచేతను, కడియములచేతను, నవసూలచేతను, ప్రకాశించుచుండెడివాడును, రెండుచేతులతోను ధనుర్బాణములను ధరించినలక్ష్మణునిచే సేవింపబడుచుండెడివాడును, సీతాదేవితోఁగూడిన వాడునునగు శ్రీరామచంద్రుని ధ్యానించి యట్టిశ్రీరామునినే నీయా త్మస్వరూపునిగను, సర్వజనులహృదయమందు నంతర్యామిగ నుండు వానిగను భావనచేయుచునుండిన యెడల నీవు ముక్తుడవు కాగలవు. అతని చరిత్రమును నెల్లప్పుడుభక్తులవలన వినుచుండుము. ఈతీరుగ చేసినచో ననంతకోటిజన్మములచే నాచరింపబడిన పాపములనుండి ముక్తుడవు కా గలవు. కావున రావణా! నీవు రామునియందు వైరబుద్ధిని విడువుము, భక్తిగలవాడవు కమ్ము. రాముని పరిపూర్ణునిగను, సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేనివానిగను, నామరూపములు లేనివానిగను, పురా ణపురుషునిగను, శుద్ధ బుద్ధ ముక్తస్వభావునిగను భజింపుము." ఇట్లు కాలనేమి రావణునకు బోధించెను.

ఈ బోధను రావణుడు విని మిక్కిలిక్రోధముచే మండిపడుచు కాలనేమితో 'దురాత్ముడవగు నీవు నాయాజ్ఞను తిరస్కరించు చున్నావు. నీవు శత్రువులనుండి కొంచెము లాభమును బొంది రాముని చారుడవై మాటలాడుచున్నావు. కాన నిన్ను జంపెద' నని పలికెను. దానికి వాడు 'నీవేల క్రోధమును బొందెదవు. నామాటలు నీకిష్టముకాని

నితో గంభీరముగ నిట్లనెను. 'రాక్షసరాజా!నిలువుము, నిలువుము. నా కిట్టివిప్రియ మొనర్చిన నీ వెక్కడకు నెళ్లినను నాచే విడువబడవు. నీ విందర్రి యమ సూర్య బ్రహ్మాగ్ని శివులలో నెవరియొద్దకు బోయినను, లేక యెనిమిదిదిక్కులకుగాని, మీదికిగాని, క్రిందికిగాని వెళ్ళినను నాయెదుటకనబడిన నిన్ను నేను విడువను.నీవిప్పుడు శక్తిప్రయోగముచే కొట్టి విచారమునొందించిన లక్ష్మణుడును,నేనును నొక్కటే. నేను నీతో యుద్ధముచేయగోరి శీఘ్రముగ వచ్చితిని. రణమున నిన్ను, నీకుటుంబ మును నంతమునొందింతును. జనస్థానమున నివసించి మంచియాయు ధములనుబట్టిన ఘోరరూపులగు 14వేలరాక్షసవీరులు నాచే హతు లైరి.'ఇట్లు రాముడు పలుక రావణుడు హనుమంతునిపై వాడిబాణము లను విడిచెను. అతనికి దెబ్బలుతగిలినకొలది యతని తేజస్సధికమగుచుం డెను. వాయుపుత్రునిగొట్టినందులకు రాము డెక్కువక్రోధమునొంది

---

యెడల నేను వెళ్ళి యీకార్యమును నెఱవేర్చెద'నని మనవిచేసికొనెను. ఇట్లు కాలనేమి పలికి హనుమంతునికార్యమునకు విఘ్నముచేయుటకు హిమవత్పర్వతముపక్కకు పోయి యక్కడ తపోవనమునొకదానిని గల్పించి మునివేషమును దాల్చి శిష్యులతో నివసించియుండెను. అంతట వాయుపుత్రు డా మార్గమున బోవుచు శుభమగు నాతనియాశ్రమమును జూచి మనస్సులో నిట్లాలోచించెను. 'ఈమునులసమూహమును నేను పూర్వము చూచియుండలేదు. నేను దారితప్పిపోయితినా? లేక నామనస్సునకు చాంచల్యము కలిగినదా? ఏమైనను తప్పక నే నీయాశ్రమమున బ్రవేశించి మునిని జూచి జలమును ద్రాగి గొప్పదగుద్రోణ పర్వతమునకు వెళ్ళెదను.' ఇట్లాహనుమంతు డాలోచించి మంచిచెట్లు, ఫలములుగలదియు, పరస్పరవైరమును విడిచిన విరోధజంతువులుగల దియు నగు నాయాశ్రమమున బ్రవేశించెను. అక్కడ కాలనేమి యిం ద్రయోగమును బట్టి శివపూజచేయుచుండ నాకపిశ్రేష్ఠు డతనితో తన

రావణునిరథసమీపమునకు బోయి వానిరథమును, గుఱ్ఱములను, ధ్వజమును, ఛత్రమును, సారథిని, వానిఖడ్గమును తీక్ష్ణమగు బాణములచే గూలనేసెను. తరువాత నతడు వానివక్షస్థలమున నొకవాడిబాణమును విడిచెను. ఇంద్రునివజ్రపు దెబ్బలను పిడుగుదెబ్బలను లక్ష్యము చేయని రావణుడు రామబాణముతగులుటచే మిక్కిలి బాధనొంది చలించి తనధనస్సును విడిచెను. తరువాత రాముడు తేజముగలదియు, నర్థచంద్రాకారముగలదియు నగునొక బాణమును రావణునిపైనివేయ నది వానితెల్లనికిరీటమును నెగురగొట్టి ముక్కలుగజేసెను. ఇట్లు రావణుడు కాంతివిహీనుడైయుండ రాముడు వానితో నిట్లనెను. "నీవు గొప్పయుద్ధము చేసితివి. నావీరులుకొందఱు దెబ్బలుపడియున్నారు.నీవాయాసమును జెందియున్నావు. దీనిని నే నెఱుగుటచే నిన్ను బాణములతోగొట్టి యమపురి కంపను. నీవు పోవుటకు సెలవిచ్చితిని. యుద్ధములో దెబ్బలుతినిన నీవీరాత్రి లంకకు బొమ్ము. ఆయాసమును దీర్చుకొని రథమునెక్కి ధనస్సును బట్టి తిరుగరమ్ము. అప్పుడు నాబలమును నీవు తెలిసికొనెదవు." ఇట్లు రాముడు పలుక రావణుడు సంతోషము, గర్వములేక శీఘ్రముగ లంకకు బాఱిపోయెను. తరువాత రాముడు

---

వృత్తాంతమును దెలుపుచు 'నేను పాలసముద్రమునకు బోవుచుంటిని. 'నేను దప్పికచే బాధపడుచుంటిని. నీరుండుచోటును నాకుదెలుపు' మని యతనిని గోరెను. దానికి కాలనేమి 'నాకమండలములోని జలమును ద్రాగుము; పండియున్నయిచ్చటిఫలములను భుజింపుము.ఇక్కడ సుఖముగ విశ్రమింపుము; నిద్రింపుము. నీప్రయాణమునకు తొందరలేదు. నేను తపస్సుచే జరిగిపోయినదియు, జరుగుచున్నదియు, జరుగబోవునదియు తెలిసికొనగలను. లక్ష్మణుడు మూర్ఛనుండి లేచెను. వానరులందఱిని రాముడు చూచె' నని తెలిపెను. అమాయమునిచెప్పిన యీమాటలను విని హనుమంతుడు దేనాకమండలములోని నీటితో

వానరులకు తగిలినబాణముల నూడదీయించెను. రావణుని పరాభవ
మునకు దేవతలును, నసురులును, భూతగణములును, దిక్కులును, సము

---

నాకు దప్పి తీరదు. కాన నాకు జలాశయమును జూపింపు'మని యతని
నడిగెను. అప్పుడు కాలనేమి తనమాయచే గల్పించినయొకబ్రహ్మచారిని
బిలిచి వానితో 'హనుమంతునకు విశాలమగు కొలనునొకదానిని
జూపింపు'మని చెప్పి యాంజనేయునితో 'నీవు కన్నులు మూసికొని నీరు
త్రాగి నాయొద్దకు రమ్ము. నీకు నోషధులు కనబడుమంత్ర ముపదేశిం
చెద'నని చెప్పెను. అంతట వారిద్దఱును నొకజలాశయమునకుబోయిరి.
అక్కడ హనుమంతుడు నేత్రములు మూసికొని నీరుత్రాగుచుండ
గొప్పమాయలుగల యొకయాడుమొసలి వచ్చి తొందరగ మిక్కిలి
బలవంతుడగు నతనిని మ్రింగివేయుచుండ దాని నతడు చూచి తన
చేతులతో దానినోటినిబట్టి చీరివేయ నది చచ్చెను. అంతట నది
యాకాశమందు మంచిప్రకాశమానమగురూపముగల ధాన్యమాలి
యనుస్త్రీయై నిలిచి యిట్లు పలికెను. 'కపిశ్రేష్ఠా! గొప్పదగు నీదయచే
నేను శాపమునుండి ముక్తినొందితిని. అప్సరసనగు నేను కొన్నికారణ
ములచే పూర్వ మొకమునిచే శపింపబడితిని. ఈయాశ్రమములో నీవు
చూచినవాడు కాలనేమియనుగొప్పయసురుడు. అతడు మార్గములో
నీకు విఘ్నముచేయుటకు రావణునిచే బంపబడెను. మునివేషమును
ధరించిన వాడు నిజమగు మునికాడు. బ్రాహ్మణులను జంపిన యాదుష్టుని
నీవు చంపి శీఘ్రముగ ద్రోణపర్వతమునకు బొమ్ము. నీవు నన్నుముట్టు
టచే నేను పాపములనువిడిచి బ్రహ్మలోకమునకు బోవుచున్నాను.'
ఇట్లాస్త్రీ పలికి స్వర్గమునకు బోయెను. హనుమంతు డాశ్రమమునకు
బోవ కాలనేమి యాతనిని జూచి 'నీవింతయాలస్యముచేసితివేమి? నీవు
నావల్ల మంత్రోపదేశమును బొంది గురుదక్షిణ నిమ్మని యడిగెను.

ద్రములును, పాములును, భూమియు, నాకాశమునజరించుజీవులును, ఋషులును సంతోషించిరి.

---

౨౧ వ. అధ్యాయము.

రావణుడు కుంభకర్ణునితో నాలోచించుట.

రావణుడు రామలక్ష్మణులవలన పరాజయమునొంది లంకకు బోయి రాముని బాణములకు భయమొంది వానిని బ్రహ్మాస్త్రములవలె నాలోచించుచు గర్వముడుగ విచారమునొందెను. తరువాత నతడు

---

దాని కాంజనేయుడు తనపిడికిలిని బిగించి 'ఇదిగో! యీదక్షిణను బుచ్చుకొను'మని దానితో వానిని గ్రుద్దెను. అంతట నతడు మునివేషమును విడిచి తనయసురరూపమును దాల్చి యనేకమాయలతో హనుమంతునితో యుద్ధముచేసెను. వాయుపుత్రుడు వానితలమీద పిడికిలితో గొట్ట వాడు మరణము నొందెను. తరువాత నతడు పాలసముద్రమునకు బోయి ద్రోణపర్వతమును జూచి యక్కడ నోషధులు కనబడకపోవుటచే నాపర్వతము నెక్కలాగి పట్టుకొని వాయువేగమున రామునియొద్దకు బోయి దాని నాతనియెదుట బెట్టి 'ఆలస్యముచేయకుండ తగినకార్యమును జరుపు'డని యనెను. దీనికాతడు మిక్కిలిసంతోషమునొంది సుషేణునిచే నోషధులను దీయించి లక్ష్మణునకు చికిత్స చేయించెను. అప్పుడు లక్ష్మణుడు నిద్రించినవాడు లేచినట్లు లేచి 'రావణా! నిలువుము; నిలువుము. నీవెక్కడకు వెళ్ళెదవు? ఇప్పుడే నిన్ను జంపెద'నని పలికెను. దీనిని రాముడు చూచి లక్ష్మణునితల మూర్కొని హనుమంతునితో 'గొప్పదగు నీదయవలన లక్ష్మణుడు కుశలముగ నున్నా'డని పలికెను.

---

బంగారపుసింహాసనమునఁగూర్చుండి రాక్షసులతో నిట్లనెను. "ఇంద్రునితో సమానుడనగు నేను మనుష్యునిచే జయింపబడుటచే నాతపస్సంతయు వృథయయ్యెను. 'నరులవలన నీవు భయమును దెలిసికొను'మని బ్రహ్మ పలికిన ఘోరవాక్య మిప్పుడు నిజమైనది. నేను దేవ దానవ గంధర్వ యక్ష రాక్షస పన్నగులవలన నాకు మరణము రాకుండునట్లు వరమును బొందితిని; కాని మనుష్యులవలన చావు రాకుండునట్లు నేను వరమును కోరలేదు. పూర్వము నే నిక్ష్వాకు కులరాజగు ననరణ్యునితో యుద్ధము చేసినపు డాతడు 'నావంశములో పుట్టినవాడొకడు నిన్ను, నీపుత్రులను, నీచతురంగబలమును జంపగల'డని పలుకుటచే నారాయణుడు మనుష్యుడై దశరథునకు పుత్రుడై రామునిగఁబుట్టె నని నే నాలోచించుచున్నాను. నాచేత పూర్వము బలవంతముగ బట్టుకొనబడి నాకు శాపమిచ్చిన వేదవతియే మహాత్ముఁరాలును, జనకపుత్రికయు నగు సీత. తపఃప్రభావముగల యుమయు, నందీశ్వరుడును, రంభయు, వరుణపుత్రికయు నాకిచ్చినశాపము లసత్యములు కానేఅవు. ఇదంతయు మీరు జ్ఞాపకముంచుకొని ప్రవర్తింపుడు. రాక్షసులందఱు ప్రాకారములమీదను, గోపురములమీదను, వానిప్రక్కలనుండు భటులసంచారప్రదేశములందును, నన్నిద్వారములయొద్దను జాగ్రత్తగ కాపుండవలెను. దేవ దానవులదర్పమడచువాడును, ననమానమగు గాంభీర్యముగలవాడును, బ్రహ్మశాపముచే నిద్రించుచున్నవాడునునగు కుంభకర్ణుని మీరు లేపి యాతనితో నేను పరాజయమొందనసంగతియు, ప్రహస్తుడు యుద్ధములో చనిపోయినసంగతియు దెలుపుడు. ఆతడనేక * మాసములు

---

* యుద్ధకాండ 60వ సర్గ 15I శ్లోకములో కుంభకర్ణుడు 9, 6, 7, 8, నెలల ప్రకారము నిద్రించునని తెలుపబడినది. 61 వ సర్గ28శ్లోకమున 6నెలలు నిద్రించి యొకదినము మెలఁకువగనుండునని చెప్పబడినది. ఆత డనేకసంవత్సరములు నిద్రించుటకు బ్రహ్మవలన వరముపొందెను. వీనినన్నిటిని మేము సమన్వయముచేసి చరిత్రలో ననేకమాసములు నిద్రించునని వ్రాసితిమి.

నిద్రించుచుండును. అతడు నాతో నాలోచనచేసి పండుకొనియిప్పటికి 9 రోజులైనది. అతనిని శీఘ్రముగ లేపుడు. అతడు యుద్ధమున రాక్షసు లందఱిలోను ముఖ్యుడు. అతడు వానరులను, రామలక్ష్మణులను శీఘ్రముగ జంపును. రాక్షసులలో ముఖ్యుడగు నాతడు నీచసుఖమగుని ద్రలో నుండును. అతనికి తెలివివచ్చినమొదల నాకు నాయపజయమువలన శోకము కలుగదు. ఇంద్రతుల్యుడగు రాముడు నన్నవమానింప నితర సహాయములేని నే నేమిచేయగలను?" ఇట్లు రావణుడాజ్ఞాపింప రాక్షసులు మిక్కిలితొందరగ కుంభకర్ణుని నివాసమునకు పోవుటకు సిద్ధమైరి.

మహోదరయూపాక్షులను మంత్రులును, పదివేలరాక్షసులును నేనుగులతోను, గుఱ్ఱములుమొదలగు జంతువులతోను, పెద్దగదలు మొదలగు ననేకాయుధములతోను, శంఖములతోను, భేరీలుమొదలగువాద్యములతోను బయలుదేఱిరి. లేళ్ళయొక్కయు, నెనుపోతులయొక్కయు, నడవిపందులయొక్కయు మాంసపుపోగుల ననేకములను, నన్నపురాసులను, జాలకడవలతో రక్తమును, జాలకడవలతో ననేకవిధములగు మద్యములనుగూడ దీసికొనిపోయిరి. అతడు శరీరమున రాసికొనుటకు సుగంధద్రవ్యములుకూడ తీసికొనిపోబడెను. వారు కుంభకర్ణుడు నిద్రించుగుహలోనికి బోయి యతనియూపిరిచే నెగురగొట్టబడి కష్టముతో చివరకు నిలబడిరి. అతడు నిద్రించుచుండుట వారుచూచి యతనిభోజనపానములకు మాంసమును, నన్నమును, మద్యరక్తములను నుంచి యాతనిశరీరముపై చందనాదిసుగంధద్రవ్యములను రాసిరి. అతనిని లేపుటకు గొప్పధ్వనులను జేసి యతనిని కదలించి కొట్టిరి. శంఖములు, భేరీలుమొదలగు వాద్యములను గట్టిగ వాయించిరి. ఏనుగులు, గుఱ్ఱములుమొదలగుజంతువులను గట్టిగ గొట్టుచు నతనిశరీరమున నడిపించిరి. ఇట్లనేకప్రయత్నములు వారు

చేసినను నతనికి తెలివి రాలేదు. చివరకు వారు వేయియేనుగుల నొక సారి యాతనిశరీరమున పరుగెత్తింప నాతనికి దెలివి వచ్చెను. కొండ శిఖరములతోను, పెద్దచెట్లతోను వారు కొట్ట నతడు లేచెను. వారు తెచ్చినమాంసములను నతడు భుజించి రక్తమద్యములను ద్రాగెను. ఇట్లాతడు తృప్తి జెందిన తరువాత నతనికి రాక్షసులు తమతలలతో నమస్కరించిరి. కుంభకర్ణుడు వారిని జూచి నవ్వుచు నిట్లనెను. 'మీరు నన్నేల యింతతొందరగ లేపితిరి? మన రాక్షసరాజు క్షేమముగ నున్నాడా? అతడు భయమునొందియున్నాడా యేమి? మీరు తొందరగ నన్ను లేపుటచే నితరులనుండి యాతనికినేదో భయము కలిగినదని తలచెదను. ఇప్పుడు నేను దానిని బాపి మహేంద్రునైనను బడద్రోసెదను. అగ్నిదేవుని నైనను నాశనమునొందించెదను. స్వల్పవిషయములకు మీరెన్నడు నన్ను లేపింపరు. దానికి నిజమైనకారణమును మీరు తెలుపుడు.' ఇట్లు కుంభకర్ణుడు తొందరగ పలుక యూపాక్షుడు చేతులు జోడించుకొని యతనితో నిట్లు విన్నవించెను. 'దేవతలవలన మన కెంతమాత్రము భయము లేదు. మనుష్యులవలన మనకుగలిగిన భయము రాక్షసరాజు నెక్కువగ పీడించుచున్నది. పర్వతాకారులగు వానరులు లంకను జుట్టియున్నారు. పూర్వ మొక్కవానరుడే మన లంకకు వచ్చి మనపట్టణమును గాల్చి అక్షకుమారుని, నతనిచతురంగ బలమును జంపెను. ఇప్పుడు మన రాక్షసరాజు సూర్యతేజుడగు రాముని తో యుద్ధముచేసి యోడి చనిపోయినట్లగుటచే నాతనిచే విడువబడెను. దేవ దానవ దైత్యులవలన నేమియు బాధనొందని మనరాక్షసరాజునకు రామునివలన ప్రాణములమీద ననుమానముగలిగెను.' ఇట్లు యూపాక్షునివలన కుంభకర్ణుడు రావణునిపరాజయము విని వానితో నిట్లనెను. 'ఇప్పుడే రామలక్ష్మణులను, వానరసైన్యమును జంపి నాయన్నను జూచెదను. కపుల రక్తమాంసములచే రాక్షసులను

తృప్తిపఱచెదను. నేను రామలక్ష్మణులరక్తమును త్రాగెదను.' ఇట్లు కుంభకర్ణుడు రోషముతోను, గర్వముతోను దుర్నయపుమాటలను బలుక మహోదరుడు చేతులుజోడించుకొని 'మీరు రాక్షసేశ్వరుని మాటలను విని మంచిచెడ్డలను బాగుగ నాలోచించి తరువాత శత్రువులను యుద్ధములో జయింతురుగాక!' యని పలుక దానికాత డొప్పుకొనెను. కొందఱు రాక్షసులు రావణునియొద్దకు పరుగెత్తి జరిగిన సంగతంతయు నాతనికి దెలిపి 'మీరు మీతమ్మునియొద్దకు పోయెదరా? లేక యతడిక్కడకు రావలయునా?' యని యడుగ నతడు వారితో 'కుంభకర్ణుని నే నిచ్చటనే చూడగోరుచున్నాను. ఆతనికి తగినమర్యాద చేయవలె' నని పలికెను. వారట్లే యని మనవిచేసికొని కుంభకర్ణుని యొద్దకు బోయి 'మిమ్ము రాజు చూడగోరుచున్నాడు. మీరు వెళ్ళుటకు నిశ్చయించి యాతనిని సంతోషపెట్టు' డని విన్నవించిరి. అతడాసనమునుండి లేచి, ముఖమునుకడుగుకొని, స్నానముచేసి,యాభరణములను నలంకరించుకొని కిరీటమును ధరించి, బలమును గలుగజేయు
2 వేల కుండల మద్యమును త్రాగి కొంచెముమత్తును బొంది రాక్షసులతో గూడి భూమికదలునటుల నడచుచు రాజమార్గమున వెళ్ళుచుండెను. పట్టణవాసులు చేతులుజోడించుచుపూవులను విసరుచుండిరి.

రాక్షసులందఱిలోను పొడుగైనవాడును, పర్వతశిఖరమునంటివాడునునగు కుంభకర్ణుడు రాజవీధిలో వెళ్ళుచుండ పట్టణపుగోడలపైనున్న వానరసేనానాయకు లందఱతనిరూపమును జూచి భయమునొందిరి. కొందఱు రామునియొద్దకు పరుగెత్తి యతనిని శరణునొందిరి. కొందఱు విచారముచే పడిపోయిరి. కొందఱు దిక్కులకు పాఱిరి. కొందఱు భయముచే భూమిపై పండుకొనిరి. రాముడు తనధనస్సును చేతబట్టి తనదేహమును వృద్ధిబొందించుచు పర్వతమువలెనున్న కుంభకర్ణుని జూచి నవ్వుచు విభీషణుని చూచి యిట్లనెను. 'భూమియంతకు జండా

వలె నొకడు కనబడుచున్నాడు. వానిని జూచినవానరులందఱు నిటు నటు పరుగెత్తుచున్నారు. ఇట్టివానిని నేను పూర్వ మెన్నడును జూచి యుండలేదు. ఇట్టిగొప్పశరీరము కలవాడు రాక్షసుడా? అసురుడా? తెలుపుము.' ఇట్లు రాము డడుగ విభీషణు డిటుల విన్నవించెను. 'వీడు విశ్రవసుని పుత్రుడగు కుంభకర్ణుడు; ప్రతాపవంతుడు. ఇంత పొడవగువాడు రాక్షసులలో నెవడును లేడు. వీనిచే యుద్ధములో నింద్రయములు జయింపబడెరి. యుద్ధమున నితనిచే దేవ దానవ యక్ష నాగ రాక్షస గంధర్వ విద్యాధర కిన్నరులు వేలకొలది కొట్టబడెరి. వీడు శూలమునుబట్టి వికృతముగ జూచుచు రణమున నిలువ దేవతలు వీనిని కాలస్వరూపుడని భ్రమించి చంపలేకపోవుదురు. వీనికి పుట్టుక వలననే గొప్ప తేజోబలములు కలిగినవి. మిగిలిన రాక్షసశ్రేష్ఠులకు వరములవలన బలముకలిగెను.' ఇట్లు విభీషణుడు కుంభకర్ణునకు నిద్ర బ్రహ్మశాపముచే వచ్చినసంగతిని తెలియబలికి యింకను నిట్లనెను. 'వీడు 6 నెలలు నిద్రజెందుటకును, నొకదినమే మేల్కొనియుండుటకును బ్రహ్మ యితనికి శాపమిచ్చెను. ఆయొకదినమేయితడు భూమియంతయు దిరిగి తన పెద్దనోటిని తెఱచి ప్రజలను దినుచుండును. కుంభకర్ణుడు పండుకొనియుండుటచే రావణుడు మీపరాక్రమమునకు జడిసి విచారముచే వీనిని లేపింప వీడు తననివాసమునుండి వచ్చుచున్నాడు. వీడు మిక్కిలికోపమునుజెంది వానరులను తినివేయుటకు పరుగెత్తుచున్నాడు. వారు వీనిని జూచి వీనితో యుద్ధమెట్లు చేయగలుగుదుమని తలచి పరుగెత్తుచున్నారు. వారందఱు నేనుచూపిన యెత్తుగు వ్యూహమున నుండునట్లు చేయుడు. దీని నెఱిగినవారు భయములేక యుందురు.' ఇట్లు విభీషణుడు రామునితో బలుక నతడు సేనాపతియగు నీలున కిట్లాజ్ఞాపించెను. 'నీవు పోయి సేనల నన్నిటిని వ్యూహములుగ నిలుపుము; అన్నిద్వారములవద్ద కాపుంచుము. గోడలపైని, శత్రుసైన్యము లుండుచోటను సేనను నిలుపుము. వానరులు కొండశిఖరములతోను,

రాక్షసులతోను, చెట్లతోను యుద్ధమునకు సిద్ధముగ నుండవలెను.' ఇట్లు రాముడు సెలవీయ నీలుడట్లు చేసెను. తరువాత గవాక్షుడును, శరభుడును, హనుమంతుడును, నంగదుడును పర్వతశిఖరములతో ద్వారములవద్ద నిలిచిరి. పట్టణమునుగాపాడుచుండెడి రాక్షససేనపై వానరులు చెట్లను విసరిరి.

కుంభకర్ణుడు రాజవీధినుండి యనేక రాక్షసులతో వచ్చుచు రావణునినగరుచేరి కొన్ని ద్వారములను దాటి యతఃపురపుష్పకమువద్దకు బోయెను. రావణుడు తనతమ్ముని జూచినతక్షణమే యాసనమునుండి లేచి వానిని తనదగ్గఱకు దీసికొనిపోవ వాడాతనిపాదములకు నమస్కరించి 'ఎందునిమిత్తము నన్ను బిలిపించితి'రని యడిగెను. రావణుడు వానిని కౌగిలించుకొని సంతోషించి కూర్చుండుటకు మంచియాసనమును జూపెను. కుంభకర్ణుడాయాసనమున కూర్చుండి కోపముచే నెఱ్ఱబాఱినకండ్లుగలవాడై 'ఎందునిమిత్తము నన్ను తొందరగ నిద్రనుండి లేపితిరి? మీ కెవరివలన భయముకలిగెను. నే నెవనిని జంపవలె'నని యడుగ నారాక్షసరాజు తనకండ్లను కొంచెము త్రిప్పుచు "నీవు చాల కాలము సుఖముగ నిద్రించితివి. రామునివలన నిప్పుడు నాకు గలిగిన భయమును నీవు తెలియకున్నావు. అతడు బలవంతుడగు సుగ్రీవునితోను, వానిబలములతోను సముద్రమును దాటి మనసేనను నాశనము చేయుచున్నాడు, చూడుము. వానరులు లంకలోని వనములందును, నుద్యానవనములందును నిండియున్నారు. మనలోముఖ్యులగు రాక్షసవీరులు యుద్ధములో వారిచే జయింపబడిరి. వానరులనాశనమెంతమాత్రమును నేను గానను. వారు యుద్ధమున జయింపబడుటయులేదు. కాన నాకీభయము కలిగినది. మహాబలుడా! నన్ను దీనినుండి రక్షింపుము. వారిని నిప్పుడు నాశనమొనర్పుము. అందుకొఱకే నిన్ను లేపించితిని. సర్వైశ్వర్యములు పోయిన నన్ను నీబలము నుపయోగించి రక్షింపుము. బాలురతోను, ముసలివారితోను నున్నయీలంకనుగూడ

రక్షింపుము. నేను పూర్వ మెన్నడును నిట్టిసంగతిని నీకు దెలిపియుండ లేదు. నీవు నీయన్ననిమిత్తమిట్టికష్టమగుపనిని జరుపుము. దేవాసురుల తోజేసిన యనేకయుద్ధములలో నీవు వారివ్యూహములను జెదరగొట్టి వారిని జయించినందులకు నాకు నీయందు మిక్కిలిస్నేహగౌరవములు కలవు. అన్నిజీవులలోను నీతోసమమగుబలముగలవాడు లేడు. నీ పరాక్రమమంతయు జూపుము. నేను చెప్పినటుల నాశత్రువులను బరి మార్చి నాకు ప్రియమొనర్పు"మని పలికెను. *

---

* అ. రా:—కుంభకర్ణునితో రావణుడు తనకువచ్చినకష్టము లను దెలుప నత డిట్లు వానికి బోధించెను. "రాముడు నారాయణుని యవతారమనియు, సీత యోగమాయయనియు పూర్వమే నేను నీతో జెప్పితిని; కాని నీవు తెలిసికొనలేకపోయితివి. ఒకనాటిరాత్రి నేనొక్క డను వనములో విశాలమైనరాతిమీద కూర్చుండియున్నసమయమున ప్రకాశమానమగు రూపముగల నారదుడు స్వయముగ నాయొద్దకు వచ్చెను. అప్పుడు నే నాతని'మీరెక్కడనుండి వచ్చుచున్నా'రనియడుగ నా తడిట్లు జబాబిచ్చెను. 'నేను దేవతలయొక్క విచారస్థానమునుండి వచ్చుచుంటిని. అక్కడ జరిగిన వృత్తాంతమును జెప్పెదను వినుము. మీసోదరుల (రావణకుంభకర్ణుల) చే బాధనొందిన దేవతలందఱు విష్ణువునొద్దకు బోయి యతనిని ప్రార్థించి రావణునివలన మూడులోక ములవారికి పీడకలుగుచున్నదనియు, వానికి మనుష్యునివలన మరణ మును పూర్వము బ్రహ్మ కల్పించెననియు, కావున మీరు మనుష్య జన్మమును బొంది వానిని జంపవలెననియు నతనితో మనవిచేసికొనిరి. అంత నాత డట్లే జరిపెదనని చెప్పి వారికి సెలవిచ్చి సత్యసంకల్పుడగు టచే నతడు రఘుకులమున రాముడై జన్మించెను. అతడు మిమ్ములనం దఱను జంపును.' ఇట్లు దేవముని పలికి వెళ్లెను. కనుక నీవు రాముని సనాతనమగు పరబ్రహ్మగ దెలిసికొని వానితో విరోధమ్మును విడిచి

అతనిమాటలను కుంభకర్ణుడు విని పెద్దనవ్వునవ్వి యిట్లు పలికెను. "నీమేలునుగూర్చి మేముచెప్పినమాటలను నీవు విననందున పూర్వము మే మాలోచించినపు డే దోషములను గనిపెట్టితిమో యవియే యిప్పుడు నీకు సంభవించినవి. పాపముచేసినవారు నరకఫల మనుభవించునటుల నీవుచేసినపాపకర్మమునకు శీఘ్రముగ ఫల మనుభవింపవలసివచ్చినది. మహారాజా! మొదట నీవు బలగర్వమున తరువాత గలుగుదోషముల నాలోచింపక గార్యము జరిపితివి." ఇట్లుకుంభకర్ణుడు పలుకుచు పూర్వము తానుపలికిన *నీతులను దెలుపుచు నెక్కువ నీతివాక్యముల నిట్లు పలికెను. "ఉత్తమ మధ్య మాధమకర్మలరీతులను, వానినారంభించుటయు, వానినాచరించుటకు మనుష్యులను, ద్రవ్యములను సంపాదించుటయు, దేశకాలముల నెఱిగియుండుటయు, నద్దు

భక్తితో నతనినిగొలిచిన నీపై నతనికి గొప్పదయగలుగును. భక్తియే ధ్యానమును బుట్టించును. అదియే మోక్షము నిచ్చును. భక్తివిహీనమగు కర్మనుజేసినను నది చేయబడనిదానితో సమానము. విష్ణులీలలను దెలుపు నవతారము లనేకములుగలవు. వానిలో రాముని యవతారము వేయింటితో సమానము. అతడు జ్ఞానస్వరూపుడును, మంగళస్వరూపుడును నైయున్నాడు. బుద్ధిమంతులు మనస్సుచేతను, మాటలచేతను నెల్లప్పుడు రాముని భజించుచు నాయాసము లేకుండ సంసారమును దాటి విష్ణుపదము నొందుదురు. లోకములో నతని నెల్లప్పుడు మంచి మనస్సుతో ధ్యానించువారును, నతనిచరిత్రములను జదువువారును సంసారబంధములను బాసి సుఖమగునట్టియు, శాశ్వతమైనట్టియు రాముని స్థానమును బొందుదురు." ఇట్లు కుంభకర్ణుడు రావణునకు బోధించెను.

*11వ. ప్రకరణము ౨వ. అధ్యాయము విభీషణుడు రావణునకు నీతిని బోధించి చివరకు సభనువిడుచుట 925పుట చూడుము.

వచ్చినదానినుండి తప్పించుకొనుటయు, కార్యము నిర్వహించుటయు తెలిసియుండి మంత్రులతో బాగుగ నాలోచించి కార్యములనుజేసిన రాజు నీతిమార్గమున ప్రవర్తించును. అట్టి రాజు నీతిశాస్త్రప్రకారము నడచుచు కార్యనిశ్చయమును గుర్తెఱిగి స్నేహితులతోను, మంత్రులతోను నాలోచించుచు యుక్తముగ జరించును. అతడు ధర్మార్థకామములను వేర్వేఱుగగాని, రెండేసి మూడేసి యొకేపర్యాయముగగాని యుక్తకాలమున జరుపుచుండును. ఆమూడింటిలో శ్రేష్ఠమగుదానిని తెలిసికొని దాని నాచరింపనిరాజుయొక్కయు, రాజుతోసమానమగు వానియొక్కయు విద్యలన్నియు వ్యర్థమగును. కాలమును గుర్తెఱిగి సామ దాన భేద దండములను చేయుచు నయానయములను తెలిసికొని మంత్రులతో నాలోచించుచు ధర్మార్థకామములను జరుపు రాజెన్నడును విచారమును బొందడు. నీతిశాస్త్రము తెలిసినమంత్రులతో తనకు శుభము కలుగుసంగతుల నాలోచించి చేయదగినదానిని, చేయగూడనిదానిని తెలిసికొనురాజు బాగుగ జీవించును. ఆ శాస్త్రార్థములను దెలియక పశువులవలె ప్రవర్తించుమంత్రు లాలోచనచెప్పుటకు రాజుచే నియమింపబడినవారైనను సరియైనమాటలను జెప్పలేరు. అర్థశాస్త్రములు తెలియని మంత్రులయొక్క హితముకానిమాటలను నీతిశాస్త్రము తెలియనివారును, సిరినిగోరువారునునగు రాజులు వినగూడదు. ఆరాజుల కహితమగుసంగతులను, హితమగుసంగతులవలె తెలుపువారును, శాస్త్రజ్ఞానములేక తమగొప్పనుజెప్పుకొనువారునునగు పురుషులను రాజులు ముందు బాగుగ నాలోచించి వారితో సలహా చేయక వారిని బంపివేయవలెను. మంత్రులు బుద్ధిమంతులగు శత్రువులతోగూడి తమరాజును నాశనముచేయుటకు వానిచే విపరీతకార్యములను జేయింతురు. రాజు తనమంత్రులుచెప్పు నాలోచనలనుబట్టియు, వారుచేయుపనులనుబట్టియు వారిని స్నేహితులవలెగనబడు శత్రువు

ముగ గుర్తింపవలెను. చెడ్డమంత్రులు చపలచిత్తుడగు రాజుచే శీఘ్రముగ జేయించు కార్యములలో శత్రువులు లోపములను వెదకుచుందురు. రాజు శత్రువులసంగతి తెలిసికొనక తన్నుతాను రక్షించుకొనని యెడల ననేకకష్టములనుబొంది తనపదవిని బోగొట్టుకొనును. పూర్వము విభీషణుడు చెప్పినది మనకు హితమును, జేయదగినదియునై యున్నది. నీకిష్టమైనదానిని జేయుము."

అతని యీమాటలను రావణుడు విని బొమముడి వేయుచు క్రోధముతో నిట్లనెను. "కుంభకర్ణా! మర్యాదను బొందదగిన గురువువలెను, నాచార్యునివలెను నీవు నన్నేల యాజ్ఞాపించుచున్నావు? ఇట్లు పలుకుచు నీవేల శ్రమనొందుచున్నావు? ఇప్పటికితగిన దానిని జెప్పుము. ఇదివరలో నేను భ్రమనొందుటచేతనో, తెలియకపోవుటచేతనో, బలగర్వముచేతనో నీవు చెప్పినట్లు చేయలేదు; కాన నీవు నేనుచేయనిదానిని గూర్చి యిప్పుడు పలుకుట వ్యర్థము. గతించినది గతించినదే. దానిని గూర్చి బుద్ధిమంతులు విచారింపరు. ఇప్పుడు చేయవలసిన దానిని గురించి నీవు నిర్ణయింపవలెను. నేను నీతిమార్గము నవలంబింపనందున కలిగినదోషమును నీవు చక్కపెట్టుము. నాయందు నీకు స్నేహమున్న యెడల నీపరాక్రమమును జూపుము. నీమనస్సునకు యుద్ధకార్యము ముఖ్యమైనదియు, నిష్టమైనదియు నైనయెడల దానిని జరుపుము. అపాయము నొందుచున్నవాడును, దీనుడును నగు వానికార్యములను జేయువాడే స్నేహితుడు. ఆపదసమయములందు సాహాయ్యముచేయువాడే బంధువు." ఇట్లు రావణుడు ధైర్యముతో నిష్ఠురోక్తులను బలుకకుంభకర్ణు డాతనికి కోపమువచ్చినదనియు, నతనిమనస్సు మిక్కిలిచలించినదనియు గ్రహించి మెల్లగ నతని నోదార్చుచు నిట్లు పలికెను.

"రాక్షసశ్రేష్ఠా! మీరు సంతాపము నొందకుడు. మీరు రోషమును విడిచి మనస్సును స్థిరముగ నుంచుకొనుడు. మీ రేవనిగూర్చి

పరితాపమునొందుచున్నారో యట్టిరాముని నేను నాశనమొందించె దను. నేను జీవించియున్నంతకాలము మీరు మనస్సులో విచారము నొందకూడదు. నేను మీకు తమ్ముడ నగుటచేతను, బంధుభావము చేతను మీమనస్సులో నెట్లున్నను మీకు మేలగుమాటలను బలుకుట నాకు తప్పదు; గనుక నే నట్లు బలికితిని. మంచిబంధువగువా డిట్టిసమ యమున చేయదగినపని శత్రువులతో యుద్ధముచేయుట. కనుక నేను దానిని జరిపెదను. చూడుడు; ఇప్పుడు నేను యుద్ధముచేయ రామ లక్ష్మణులు హతులయ్యెదరు. శత్రుసేన పాఱిపోవును. నేను రాముని శిరమును దుంచి తీసికొనిరాగా మీరు దానిని జూచి సుఖమొందె దరు. సీత దుఃఖమును జెందును. యుద్ధములో మరణించిన రాక్షసుల బంధువు లప్పుడు రామునిమరణమును జూచి సంతోషించెదరు. నేను రాముని జంపి రాక్షసులకన్నీటిని దుడిచెదను. పర్వతాకారుడగు సుగ్రీ వుడు యుద్ధములో నిప్పుడు మరణమునొందును. రాముని జంపగోరు చున్నరాక్షసులును, నేనును మిమ్ము రక్షించుచుండ మీ రతనిచే నెట్లు చంపబడుదురు? అతడు ముందు నన్ను చంపినగదా తరువాత మిమ్ము చంపగలుగుట? నావిషయమై నా కేమియు ననుమానము లేదు. ఇప్పుడు మీరు నన్ను యుద్ధమునకు బంపుడు. యుద్ధమునకు నేనుతప్ప వెళ్ళతగిన యితరులెవ్వరునులేరు. నేను మీశత్రువులను హతమార్చెదను.” ఇట్లు కుంభకర్ణుడుపలికి పూర్వము తాను పలికినగొప్పలను చెప్పుకొనుచు నింకనునిట్లు వచించెను. “నేను శస్త్రములను విడిచి చేతులతో శత్రువు లను గొట్టుచు నిలిచియుండ ప్రాణములం దాశగలవా డెవ్వడును నాయెదుట నిలువలేకపోవును. శక్తిని, గదను, కత్తిని, వాడియగు బాణములను నేను పట్టకుండ చేతులతో తొందరగ నింద్రునైనను జంపగలుగుదును. రాముడు నాపిడికిటిదెబ్బలను సహింపగలిగినయెడల రక్తముకాఱునట్లు నే నాతనిపై వాడిబాణములను వేయుదును. రాజా

మీశత్రువును నాశనముచేయుటకై నేను బయలుదేఱుటకు సిద్ధమై యుండ మీరు విచారముచే నేల బాధనొందెదరు? మీరు రామునివలన భయమును వీడుడు. నేనిప్పుడు యుద్ధములో రామలక్ష్మణులను,సుగ్రీవ హనుమంతులను, మిగిలినవానరులను జంపి మీకు గొప్పకీర్తిని గలిగింపగోరుచున్నాను. ఇంద్రునివలననైనను, బ్రహ్మవలననైనను మీకు భయముకలిగినచో నేను దానిని బాపెదను. నాకు క్రోధమువచ్చిన దేవతలు సాగిలపడరా? నేనునక్షత్రములతోగూడ సూర్యుని క్రిందపడద్రోసెదను; ఇంద్రయమాగ్నులను నంతమొందించెదను; సముద్రమును త్రాగెదను; భూమిని బ్రద్దలుకొట్టెదను; పర్వతములను చూర్ణముచేసెదను. చాలకాలము పండుకొనియున్న నాపరాక్రమమును జూపుచు నేను జీవులనన్నింటిని భక్షించెదను. మూడులోకములలోనిజీవులును నా కాహారమునకు చాలవు. నేను రాముని వధించి మీకు సుఖమును గలిగించుటకు వెళ్లుచున్నాను. అతడు యమలోకమునకు బోగా సీత చిరకాలము మీకు వశమగును."

అతనియీమాటలను విని మహోదరుడను మంత్రి యాతనినిట్లాక్షేపించెను. "నీవు గొప్పకులమున బుట్టినను స్వల్పబుద్ధికలవాడవు; సాహసుడవు; చేయవలసినదానినిగూర్చి తెలుపుటకు శక్తిగలవాడవు కావు. రావణునకు నీతులును, అవినీతులును దెలియవని నీవు కేవలము చిన్నతనముచే బలుకుచున్నావు. అతనికి దేశకాలములననుసరించి ప్రవర్తించుటయు, తనశత్రువులస్థితియు, వారిహానివృద్ధులును,తనహానివృద్ధులును తెలియును. స్వల్పబుద్ధిగలవాడును, పెద్దలను సేవింపనివాడును నగు బలవంతునకుగూడ ననర్హమగు పనులను బుద్ధిమంతుడగువాడెవడు చేయును? ధర్మార్థకామములకును, వానిఫలములకును నీవు చెప్పినవి లక్షణములు కావు. కర్మవలననే యన్నిఫలములు కలుగును. పాపకర్మవలనగూడ శ్రేయముకలుగును. ధర్మార్థములవలననైనను,

నధర్మానర్థములవలన నైనను శ్రేయము కలుగకుండును. అధర్మము గను, ననర్థముగను వ్యవహరించినపుడు లాభనష్టములు రెండును కలుగు చుండును. ఈలోకమున కుపయోగించుకర్మలను, పరలోకమున కుపయోగించుకర్మలను పురుషులు చేయుచు వానిఫలములనుగూడ ననుభవించు చున్నారు. అట్లే కామములో మెలగు పురుషులు గూడ మంచిశుభములను బొందుదురు. రావణుడు మనస్సుననిశ్చ యించిన దే మాకు నిష్టముగను, చేయవలసినదియునై యున్నది. రావణు డాలోచింపకుండ చేసె ననుబుద్ధిని తొలగించుకొనుము. 'నే నొక్కడనే వెళ్ళి యుద్ధముచేసెద' నని పలికిన నీపలుకులు బాగుగ నుండలేదు. రామునిచే జనస్థానమున మిక్కిలిబలవంతులగు రాక్షసు లనేకులు చంపబడినపుడు నీ వొక్క డవే యతని నెట్లు జయింపగలుగు దువు? అక్కడనుండి జడిసి వచ్చిన రాక్షసులు మనలంకలో నిప్పుడును నున్నారు. గొప్పపరాక్రమముగలయాతడు మృత్యువువంటివాడు. అతనిని యుద్ధములో జయించుట యనుమానము. ఒక్కడు వెళ్ళి యాతనియెదుట నిలచుట నాకిష్టముకాదు. ప్రాణములమీద నాశగల సామాన్యబలు డెవ్వడును సంపూర్ణబలముగల యాతని నెదుర్కొను టకు నిష్టపడడు. అతనితో మనుష్యులెవ్వరును సమానులుకారు. ఇంద్ర సూర్యులతో సమానమగు నాతనితో నీవు యుద్ధముచేయుట కెట్లు కోరుచున్నావు?" ఇట్లు మహోదరుడు కుంభకర్ణునితో తొందరగ బలికి రావణున కిట్లు సలహా యిచ్చెను. "రాజా! మీరు సీతను దీసి కొని వచ్చి యెందులకిట్టి వ్యర్థవచనములను బలికెదరు? మీ రామెను బొందుటకు నాకు తోచినయుపాయమును జెప్పెదను. దానివలన మీ కామె వశమగును. మీమనస్సున కది యిష్టమైన మీరు దానిని జేయవచ్చును. 'మహోదరుడును, ద్విజిహ్వుడును, సంహ్రాదియు, కుం భకర్ణుడును, వితర్దనుడును నను నీ యైదుగురును రామునివధకొఱకై బయలు

చేయుచున్నా' రని మీరు చాటింపజేయుడు. మే మతనితో యుద్ధము చేసెదము. అతనిని మేము జయించినయెడల నామెను మీరు వశపఱచుకొనుటకు నుపాయముల యవసరము లేదు. మనకార్యము సఫలమగును. అతనిని జయింపలేకపోయిన మే ముపాయములను బన్నెదము. మేము రామబాణములచే గొట్టబడి మాశరీరములనుండి రక్తము కాఱుచుండ నిక్కడకు వచ్చి 'మేము రామలక్ష్మణులను తినివేసితి' మని చెప్పుచు మీకాళ్ళను బట్టుకొనెదము. అప్పుడు మీరు మాకు మంచిబహుమానముల నీయవలెను. మీరొకపురుషుని నేనుగుపై గూర్చుండజేసి వానిచే 'రామలక్ష్మణులు తమసైన్యములతో హతులై' రని చాటింపజేయుడు. తరువాత మీరు మీసైన్యములకును, యోధులకును బహుమానము లిచ్చి సంతోషముతో మద్యమును త్రాగుడు. అప్పుడు రామలక్ష్మణులు మడిసిరను వార్త లోకములో నంతటను వ్యాపించును. తరువాత మీరు సీతయుండుచోటునకు బోయి యామె నోదార్చి యామెకు ధనధాన్యముల నిచ్చియు, 'నీకోర్కెలను నెఱవేర్చెద' నని చెప్పియు, రత్నముల నిచ్చియు నామెను లోబఱచుకొనవలయును. రాజా! ఇట్లు కపటముచే నామెకు భయశోకములు కలుగ నామె భర్త లేడని నిరాశ జెంది మీయందు కోర్కె లేకపోయినను సహజచంచలమగు స్త్రీస్వభావముచే మీకు లొంగి మీవశమగును. పూర్వము సుఖముల ననుభవించినదియు, దుఃఖమునుదాని నెఱుగనిదియు, నిప్పుడు దుఃఖములచే బాధనొందుచున్నదియునగు నామె మీవలనగలుగుసుఖములను దెలిసికొని మిమ్ము బొందును. రాక్షసేశ్వరా! మీరు రామునియెదుట పడిన నిప్పుడే యనర్థము చేకూఱును. మీరు యుద్ధమునకు వెళ్ళకుడు. యుద్ధములేకపోయిన మీరు సుఖమును బొందెదరు. శత్రుసైన్యమునకు కనపడకుండ, యుద్ధములో ప్రాణమున కనుమానముకలుగకుండ శత్రువులను జయించురాజు

కీర్తిని, సుఖమును, సిరిని చిరకాల మనుభవించును." ఇట్లు పలుకుచు మహోదరుడు రావణునకు మాయోపాయములను జెప్పెను.

అతనియీమాటలను కుంభకర్ణుడు విని యాతనికి చీవాట్లుపెట్టి రావణునితో నిట్లనెను. "నేను దుర్మార్గుడగు రాముని జంపి మీకు గలిగిన గొప్పభయమును బాప మీరు శత్రువులులేనివారై సుఖముగ నుండెదరు. శూరులు వ్యర్థముగ గొప్పలు చెప్పుకొనరు. నేను పలికిన ప్రకారము యుద్ధముచేయుట మీరుచూచెదరు. శూరులు పౌరుషకార్యములను జేయకుండ శాంతి నొందరు; తమ్ము తాము పొగడుకొనరు; పైకి ప్రగల్భములను చెప్పక గొప్పపనులను జేయుదురు. మహోదర! నీవంటిబుద్ధిహీనులును, శక్తిహీనులును, పైకి తెలిసినవారివలె నటించువారునునగు మంత్రులమాటలను వినుటచే రాజునకు నిట్టిగతి పట్టినది. నీవంటిపిఱికివారు రాజును జేరి యతని కిష్టమగు మాటలను బలుకుటచే నిట్టిదురవస్థ వచ్చినది. మిత్రస్వరూపమునగనపడు శత్రువులగు మీరాతనియొద్దను నుండుటచే నిప్పటికి లంకలో నతడు మాత్రము మిగిలెను. లంకలోనిసొమ్ము నష్టమయ్యెను; సైన్యము నశించెను. నేను యుద్ధమునకు సిద్ధమై శత్రువులను జయించుటకును, మీరు చేసినచెడుపనులను సరిచేయుటకును నిప్పుడు బయలుదేఱెదను." ఇట్లు కుంభకర్ణుడు పలుక రావణుడు పెద్దనవ్వు నవ్వి యిట్లనెను. "మహోదరుడు రామునిగూర్చి గొప్పభయము నొందియున్నాడు; కనుక వానికి యుద్ధముచేయుటకు నిష్టములేదు. నాకు స్నేహితులలోను, బలవంతులలోను నీవంటివాడు మఱియొకడు లేడు. నీవు శత్రువును వధించుటకును, జయమును బొందుటకును బొమ్ము. నాభయముపోవుటకు నిన్ను లేపించితిని. ఇప్పుడు రాక్షసులు యుద్ధమునకు బోవుటకు మంచిసమయము. నీవు శూలమును బట్టుకొని పాశమునుబట్టిన యమునివలె యుద్ధమునకు బోయి వానరులక్ష్మణులను, వానరులను భక్షింపుము,

నీరూపమును కపులు జూచి పరుగెత్తెదరు. రామలక్ష్మణుల గుండెలు పగులును.” ఇట్లు రావణుడు పలికి తాను తిరుగ పుట్టిన ట్లాలోచించి కుంభకర్ణుని బలపరాక్రమములు తెలియుటచే సంతోషము నొందెను.

— —

౨౨౨ వ. అధ్యాయము.

కుంభకర్ణుని యుద్ధము.

రావణునిమాటలను కుంభకర్ణుడు విని యినుముతో జేయ బడినదియు, బంగారుకట్లుకలదియు, నింద్రునివజ్రాయుధమువలె తీవ్ర మైనదియు, దేవదానవగంధర్వయక్షకిన్నరులను యుద్ధములో పొడు చుట కుపయోగింపబడినదియు, మిక్కిలి తేజముకలదియు నగు నొక శూలమునుబట్టి తనయన్నతో ‘నే నొక్కడనే యుద్ధమునకు బోయె దను. నా సేనయంతయు నిక్కడనే యుండును. నే నిప్పుడే వానరులను తినివేసెద’నని పలుక రావణు డతని కిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.‘అన్ని విధములగు నాయుధములను బట్టినసైన్యముతో నీవు యుద్ధమునకు వెళ్లుము. వానరులు బుద్ధిమంతులు; వేగముకలవారు; కార్యమును బాగుగ జరుపువారు. మత్తుడవగు నీవొక్కడవే పోయిన నిన్ను వారు పండ్లతో జీల్చి చంపుదురు. కనుక నీవు మంచి శక్తిగలబలములతో బోయి శత్రుసైన్యములను నిర్మూలింపుము.’ ఇట్లు రావణుడు పలికి తన యాసనమునుండి లేచి కుంభకర్ణుని మెడలో మణిహారమును, భుజ ములకు భుజకీర్తులను, చేతివ్రేళ్ళకు సుందరములగు నుంగరములను, చెవులకు కుండలములను, మొలకు బంగారు మొలత్రాడును నలంక రించెను. వానిశరీరమునకు సుగంధద్రవ్యములను బూసెను. తరువాత గాతుసశ్రేష్ఠుడగు నాకుంభకర్ణుడు బంగారుతో జేయబడినదియు,

మిక్కిలి బరువుకలదియు, గాలియైన ప్రవేశింప వీలులేనిదియు, కాంతి గలదియునగు నొకకవచమును దొడుగుకొనెను. తరువాత నతడు తన యన్నను కౌగిలించుకొని యాతనికి ప్రదక్షిణముచేసి శిరస్సుచే నమస్కరించి పువ్వులు తనమీదపడుచుండ తెల్లనిగొడుగు వేసికొని యుద్ధమునకు బయలుదేఱి నారాక్షసరాజాతనికి ననేకదీవన లొసంగెను. మంచియాయుధములను బట్టినచతురంగబలముతోను, దుందుభులు మొదలగు వాద్యములతోను కుంభకర్ణుడు బయలుదేఱెను. రాక్షసులు గొప్పశరీరములుగల పాములమీదను, నొంటెలమీదను, కంచర గాడిదలమీదను, సింహములుమొదలగు జంతువులమీదను నెక్కి రణమునకు బయలుదేఱిరి. పెద్దశరీరముగల రాక్షససైన్యములు మంచి యాయుధములను బట్టి బయలుదేఱెను. కుంభకర్ణుడు పెద్దనవ్వు నవ్వుచు వారితో నిట్లనెను. 'ఇప్పుడు వానరముఖ్యు లందఱిని వధించెదను. ఆ వానరజాతి మనకిదివఱకేమియు నపరాధముచేయలేదు. అది తోటలలోను, పట్టణములలోను నుండిన నలంకారముగనుండును. మనపట్టణమును ముట్టడించినరామలక్ష్మణులను హతమార్చి వానర సైన్యమును బరిమార్చెదను.' ఇట్లు కుంభకర్ణుడు పలుకుచుండ రాక్షసులు సింహనాదముచేసిరి. అతడు యుద్ధమునకు బోవుచుండ *దుశ్శకునము లనేకము లతనికి కనపడెను. గ్రద్దలు వరుసగ నతడు పోవుత్రోవలో నెగిరెను. అతని యెడమకన్ను, నెడమభుజము నదరెను. ఆదుశ్శకునములను కుంభకర్ణుడు లక్ష్యముచేయక కాలముచే నీడ్వబడి యుద్ధమునకు బోయెను. అతడు తనపాదములతో లంకాపట్టణప్రాకారమును దాటి యుద్ధభూమిని నిలిచెను.

అప్పుడాకుంభకర్ణుని వానరులు కొందఱు చూచి పరుగెత్తిరి. అతడు పెద్దనాదముచేయ పిడుగులు పడినటులను, పర్వతములు బ్రద్ద

*13వ ప్రకరణము 14వ అధ్యాయము దుశ్శకునములు చూడుము.

లయినటులను గొప్పశబ్దమాయెను. దానితో కొందఱు వానరులు భూమిమీద పడిరి. పాఱిపోవుచున్నకపులను సంగదుడు చూచి నల నీల గవాక్ష కుముదులతో నిట్లనెను. 'మీరు మీపరాక్రమమును, మీకులమును నాలోచింపక సామాన్యకపులవలె భయముచే జడిసి యెక్కడికి వెళ్ళిపోవుచున్నారు? బుద్ధిమంతులారా! వెనుకకుమఱలుడు. ప్రాణముల నటుల రక్షించుకొనుట యెందులకు? ఈరాక్షసుని రూపము భయంకరముగనున్నను వీడు మనతో యుద్ధమున సరిపోడు. భయంకరమగు నీరాక్షససేనను మనము పరాక్రమముచే చంపెదము. వానరులారా! మఱలుడు.' ఇట్లంగదుడు వారినోదార్చ వానరులు గొప్పకష్టముతో తిరుగ వచ్చి కూడుకొని చేతులతో పెద్దపర్వతశిఖరములను, రాళ్లను, చెట్లను బట్టుకొని యుద్ధభూమిని నిలిచి వానిని క్రోధముతో కుంభకర్ణునిపై విసర నతడేమియు చలింపలేదు. అవి యాతనికి గాయములను గలిగింపలేక క్రిందపడెను. అంతట నతడు గొప్పకోపమును బొంది మిక్కిలియత్నముతో వానరులతో బోరు సలుప కొందఱు రక్తము గ్రక్కుచు క్రిందపడిరి. కొందఱు వెనుకకు చూడకుండగ పరుగెత్తిరి. కొందఱు సముద్రములో బడిరి. కొంద ఱాకాశమున కెగిరిరి. సేతువుత్రోవను కొందఱుపరుగెత్తిరి. కొందఱు కొండలనెక్కిరి. ఋక్షులుచెట్లెక్కిరి. కొందఱువానరులుసముద్రములో మునిగిరి. కొందఱు గుహాలలో దాగిరి. కొందఱు కూర్చుండిరి. చివర కక్కడ నెవ్వరును నిలిచియుండలేదు. ఇట్లు వానరులు పాఱిపోవుచుండుట యంగదుడు చూచి వారితో నిట్లనెను. 'మీరు నిలువుడు; యుద్ధముచేయుదము తిరుగ రండు. ఓడిపోయినమీరు నిలుచుటకు చోటులను నే నెచ్చటను కానను. అందఱు తిరుగరండు. మీరు ప్రాణముల నేల రక్షించుకొనెదరు? గొప్పపరాక్రమవంతులారా! మీ రాయుధములులేక పరుగెత్తుచుండుట మీభార్యలుచూచి మిమ్ము

పరిహాసము చేయుదురు. అది మీకు మరణము వంటిది. మనమందర మును గొప్పకుటుంబములో బుట్టినవారము. అల్పులవలె మీరు భయమునొందుచు నీచులవలె నేలపోయెదరు? మీరు బలపౌరుష ములులేక పరుగెత్తుట మీకు మర్యాదలేకపోవుటను దెలియజేయు చున్నది. స్త్రీజలయెదుటపలికిన మీప్రగల్భము లేమయ్యెను? ఛీ యని పించుకొనిబ్రతుకువారు పిఱికివారని యందఱు పలికెదరు. కాన మీరు భయమును విడిచి సత్పురుషులమార్గమున ప్రవర్తింపుడు. మనము బాగుగ యుద్ధముచేసి శత్రువులను జయించిన కీర్తిని బొందుదుము. లేక మరణించిన బ్రహ్మలోకమును బొందుదుము. కుంభకర్ణుడు రాముని జూచిన ప్రాణములతో మఱివెళ్ళడు. ఆరాక్షసవీరునివలన మనమందఱు మోడిపోయి పాఱిపోయి ప్రాణములను రక్షించుకొనిన యెడల మనకీర్తి నాశనమగును.' ఇట్లంగదుడు పలుక పాఱిపోవు చున్నవానరులు 'మేము కుంభకర్ణునితో యుద్ధముచేసితిమి. ఇక మేము నిలువలేము. మేము వెళ్ళిపోయి ప్రాణములను రక్షించుకొందు'మని పలికి యన్నిదిక్కులకు బరుగెత్తిరి. అంగదుడు వారితో మంచిమాట లను యుక్తియుక్తముగ బలికి వారిపరాక్రమమును గీర్తింప వానరు లందఱు మరణమునందు నిశ్చయబుద్ధికలవారై యుద్ధాసక్తితో సంతో షముగ తిరిగివచ్చిరి.

వానరులు పెద్దకొండశిఖరములను, చెట్లను బట్టి కుంభకర్ణుని పైకి విసర నతడు గద నొకదానిని బట్టి వారిని గొట్టెను. ఆదెబ్బలతో వేలకొలది వానరులు భూమిమీదపడిరి. కొందఱినాతడు భుజములను జాపి పట్టుకొని * తిన్నివేచుచుండెను. అప్పుడు మిక్కిలికష్టముతో కపు

*అ. రా:—కుంభకర్ణుడు యుద్ధములో వానరులను జంపుచు తినివేయుచున్నపుడు విభీషణుడు తనగదనుబట్టియుండి వానికిగనబడి నమస్కరించి తనకు, రావణునకు జరిగినవృత్తాంతమును వానికి దెలిపి

లోఁ దార్చపడి కూడుకొని కొండశిఖరములను, చెట్లను బట్టి నిలిచిరి. తరువాత ద్వివిదుడు పర్వతశిఖరము నొకదానిని బట్టుకొని యతనిపై విసర నాతని కది తగులక రాక్షససైన్యముపై బడి గుఱ్ఱములను నేను గులను, రథములను, రాక్షసులను పిండిచేసెను. ఆవానరవీరుఁడు మఱి యొకకొండశిఖరమును బట్టి విసర దానిచే రథగుఱ్ఱములును, సారథులును జచ్చిరి. రథములమీఁద నిలిచినరాక్షసులు గర్జించుచు నాదము చేయుచున్నవానరులపై వాడిబాణములను విడువ వారితలలు తెగెను. కపులు కూడ రాక్షసచతురంగబలముపైని చెట్లను విసరిరి. అప్పుడు హనుమంతు డాకాశమున కెగిరి కుంభకర్ణునితలమీఁద ననేకపర్వతశిఖరములను, చెట్లను పడవేయ నతడు వానినన్నిటిని తనశూలముతో ఖండించెను. తరువాత నాత డాశూలముతో వానరసేనను తఱిమివేసెను. అంతట వాయుపుత్రు డాతనియెదుట నిలిచి క్రోధముతో శీఘ్రముగ పర్వతశిఖరమును నాతనిపై విసర నతనిమాంసము చితికి రక్తము వచ్చెను. దానితో నతడు చలించెను. తరువాత నతడు తనశూలమును త్రిప్పుచు హనుమంతునివక్షస్థలమును గొట్ట వాఁడు ముఖమునుండి రక్తమును గ్రక్కుచు శరీరముచలింప గొప్పధ్వనిచేసెను. దానికి రాక్షసులు సంతోషించిరి. వానరులు భయమునొంది కుంభకర్ణుని

---

'నేను రాముని శరణుజొచ్చితి'నని పలికెను. కుంభకర్ణు డామాటలు విని తనతమ్ముని కౌగిలించుకొని యిట్లు పలికెను. 'కుఱ్ఱవాడా! మనకులమును రక్షించుటకును, రాక్షసులమేలుకొఱకును నీవు రాముని పాదముల నాశ్రయించి బ్రతుకుము. నీవు భగవద్భక్తుడ వని పూర్వము నాతో నారదుడు చెప్పెను. నాయనా! నే నిప్పుడు మత్తుకలిగి యుండుటచే నావారిని, పైవారిని తెలిసికొనజాలను.' ఇట్లు కుంభకర్ణుడు పలుక విభీషణుడు కన్నీటితోఁ దనయన్నకు నమస్కరించి రాముని పక్కకు బోయి విచారముతో నుండెను.

యొద్దనుండి పరుగెత్తిరి. నీలు డప్పుడాబలములను నిలుపుచు నతనిపై నొకకొండశిఖరమును విసర నతడు దానిని తనపిడికిలితో నడ్డెను. అంత నది ముక్కలాయెను. అప్పుడుఋషభుడు,శరభుడు,నీలుడు, గంధమాద నుడు,గవాక్షుడు ననునైదుగురు వానరశ్రేష్ఠు లాతనిశరీరమునందంతటను కొండశిఖరములతోను, చెట్లతోను, పాదములతోను, నఱచేతులతోను, పిడికిళ్లతోను కొట్టిరి. అతడు వానిని లక్ష్యముచేయక ఋషభుని తన రెండుభుజములతోను కౌగిలించి పట్టుకొని నొక్కెను. దానితో వాడు రక్తమును గ్రక్కుచు క్రిందపడెను. తరువాత కుంభకర్ణుడు శరభుని పిడి కిటితోను, నీలుని మోకాలితోను, గవాక్షుని యఱచేతితోను, గంధ మాదనుని.పాదముతోనుగొట్ట వారు ముఖముతిరిగి కండ్లంట రక్తము వచ్చుచుండ క్రిందపడిరి. తరువాత వేలకొలదివానరు లారాక్షసునిశరీ రముపై కెక్కి పండ్లతో వానిని కఱచి గోళ్లతోను, పిడికిళ్లతోను, మోకాళ్లతోను హింసించిరి. కుంభకర్ణుడు వారిని పట్టుకొని తననో టిలో వేసికొనెను. వారు వానినోటినుండియు, ముక్కుచరములనుం డియు, చెవులనుండియు బయటికి వెడలిరి. అతడు కొందఱు వానరులను విఱిచి చంపి తినెను. భూమియంతయు రక్తమాంసములతో నిండియుం డెను. శూలమును బట్టి తిరుగుచున్నకుంభకర్ణు డపుడు వజ్రమును బట్టిన యింద్రునివలెను, పాశమును బట్టినయమునివలెను గనబడెను. అట్లు వానరులు కొట్టబడి భయముచే నఱచుచు రాముని శరణు నొందిరి. అప్పుడు వాలిపుత్రు డొకపెద్దకొండశిఖరమును బట్టి మాటి మాటికి నాదముచేయుచు రాక్షసులను భయపెట్టుచు కుంభకర్ణుని నెదుర్కొని యాతనితలమీదకు దానిని విసరెను. దానితో నతనికి గొప్పకోపము రాగా నత డంగదుని నెదుర్కొని శూలమును వానిపై విసరెను. వాడు యుద్ధమార్గములను బాగుగ నెఱిగినవాడుగాన తన శరీరలాఘవముచే దానినుండి తప్పించుకొని దుమికి యాతనిరొమ్ముపై

యుఱచేతితో గొట్ట నతఁడు మూర్ఛ చెందెను. తరువాత కుంభకర్ణుడు తెలివి తెచ్చుకొని తనయెడమచేతిపిడికిటితో నంగదుని పొడువ వాఁడు తెలివితప్పి క్రిందపడెను. అంత నాతఁడు తనశూలమును దీసికొని సుగ్రీవుని దఱియ వాఁడు కొండశిఖరము బట్టి యెగిరి కుంభకర్ణుని నెదుర్కొ-నెను. వానరులను భక్షించుటచే శరీరమంతటను రక్తమంటియున్న కుంభకర్ణుని సుగ్రీవుడు చూచి యిట్లనెను. 'నీచే వీరులగు వానరులు యుద్ధమున జయింపబడిరి. నీవు గొప్పకష్టమగుపనిని జేసి కీర్తిని బొందితివి. సామాన్యులగు వానరులవలన నీకేమిలాభము? వారినివిడువుము. నేను విసరుచున్న యీపర్వతమును గాచుకొమ్ము.' ఇట్లు సుగ్రీవుడు పలుక కుంభకర్ణుడు 'బ్రహ్మమనుమడవును, ఋక్షరజుని పుత్రుడవును, గొప్పపౌరుషముకలవాడవును నగు నీ వ్యాక్యంబులకు నలిచెద'వని జబాబిచ్చెను. ఆమాటలను విని వానరరాజు కొండశిఖరము నాతని రొమ్ముపైకి విసర నది వానికి తగిలి ముక్క-లయ్యెను. దానిని జూచి రాక్షసులు సంతోషించిరి. వానరులు దుంఖించిరి. కుంభకర్ణుడాదెబ్బచే కోపము తెచ్చుకొని నోరుతెఱచి నాదముచేసి తనశూలమును ద్రిప్పుచు కపిరాజును జంపుటకు దానిని వానిపై విసర హనుమంతుడు శీఘ్రముగ దానికి నడ్డువెళ్లి దానిని రెండుచేతులతోను బట్టుకొని కాలిముణుకున బెట్టి విఱిచివేసెను. దానికి వానరసేనయంతయు సంతోషించి సింహనాదముచేయుచు నాతని గీర్తించెను. దానిని కుంభకర్ణుడు చూచి కోపము తెచ్చుకొని లంకలోనిమలయపర్వతశిఖర మొకదానిని పెఱికి దానితో సుగ్రీవుని గొట్టెను. అదెబ్బతో నతడు తెలివితప్పి క్రిందపడి పోయెను.

ఇట్లాతడు పడిపోవ కుంభకర్ణు డాతని బట్టుకొని లంకకు దీసికొనిపోవుచుండెను. వానితో రాక్షసులు పోవుచు నాతని గీర్తించుచుండిరి. ఆకాశమునునున్న దేవతలు దీనినిజూచి యాశ్చర్యవచనములు

పలుకుచుండిరి. కుంభకర్ణుడు సుగ్రీవునిదీసికొనిపోయినయెడల రాముని, నాతనిసైన్యమును హరించినట్లగునని యాలోచించెను. తరువాత హనుమంతుడు సుగ్రీవుని దీసికొనిపోవుచున్న కుంభకర్ణుని, వెనుకకు పాఱిపోవుచున్నవానరసేనను జూచి బాగుగ నిట్లాలోచించెను. 'కుంభకర్ణుడు వానరరాజును దీసికొనిపోవుచుండ నేను న్యాయముగ జేయవలసినదానిని జేసెదను. నేను పెద్దపర్వతరూపమును బొంది కుంభకర్ణుని నాశనముచేసెదను. అట్లు నేను చేసి సుగ్రీవుని విడిపించిన వానరసేన యంతయు సంతోషమునొందును; లేక దేవాదులు పట్టుకొనినను విడిపించుకొనశక్తిగల కపిరాజు తన్ను తానే విడిపించుకొనును. సుగ్రీవుడు కుంభకర్ణునిచే దెబ్బలు తిని తెలివిరాకయుండుటచే నింకను తిరిగి రాలేదని నేను తలంచెదను. ఈ ముహూర్తములోనే యతడు తెలివితెచ్చుకొని వానినుండి తప్పించుకొనివచ్చి వానరులకు బ్రీతియొనర్చును. నేనొకవేళ సుగ్రీవుని విడిపించినయెడల నతనికి బ్రీతిలేకయుండును. శాశ్వతమగు నతనికీర్తికి నష్టమునచ్చును. కాన గడియవరకు వేచియుండి యతనిపరాక్రమమును జూచెదను. చెల్లాచెదరైనవానరసేన నొకచోట సమకూర్చెదను.' ఇట్లు హనుమంతు డాలోచించి వానరసేనను నొకచోట నిలిపెను. కుంభకర్ణుడు సుగ్రీవుని దీసికొనిపోయి లంకాపట్టణములో బ్రవేశించునపుడు గోపురములనుండియు, కోటగోడలపై కావలివారుండెడి గృహములనుండియు, మేడలనుండియు రాక్షసులాతనిపై పుష్పవర్షమును గురిపించిరి; పేలాలను జల్లిరి; సుగంధద్రవ్యములనుగలిపిన నీటిని మెల్లమెల్లగజల్లిరి. ఈచల్లదనముచే సుగ్రీవునకు మెలకువ వచ్చెను. అతడు తాను లంకలోని రాజవీధులందుండుట తెలిసికొని తన్ను వాడట్లు పట్టియుండ నప్పుడు దానికి తగిన పని తానెట్లుచేయువలెననియు, వానరుల కిష్టమైనదియు, మేలయినదియునగు కార్యమును తాను చేయవలెననియు నాలోచించి తనవాడిగోళ్లతో కుంభకర్ణుని చీరి పండ్లతో ఖానిముక్కును, ప్రక్క-

లను కొఱికెను. అందుచే వానిశరీరమునుండి రక్తముకాఱుచుండ వాడు రోషమును జెంది సుగ్రీవుని గిరగిరత్రిప్పి భూమిమీదికి విసరెను. అతడు పైకెగిరి యాకాశమార్గమున రాముడుండెడిచోటునకు పోయెను.

ఇట్లు సుగ్రీవుడు తప్పించుకొనిపాఱిపోవుట కుంభకర్ణుడు చూచి తనశూలముపోవుటచే పెద్దముద్గర మొకదానిని బట్టి తిరుగ యుద్ధమునకు వచ్చెను. తరువాత నతడు వానరఋక్షసైన్యములను తిని వేయుచుండెను. అత డాకలిచే మాంసమును తినుటయందును, రక్తమును ద్రాగుటయందును మనస్సుకలవాడై యజ్ఞానముచే రాక్షసులను, పిశాచులనుగూడ తినివేయుచుండెను. వానరులు పర్వతశిఖరములతో నతనిని గొట్టినను నతడు వారిరక్తమును త్రాగి మాంసమును దినుచుండెను. ఆతనిదౌడలనుండి రక్తమాంసములు క్రింద పడుచుండెను. మిగిలినవానరులు రామునియొద్దకు బోయి యాతనిని శరణు నొందిరి. కుంభకర్ణుడు వానరులను దినుచు పరుగెత్తుచుండ లక్ష్మణుడు వానిని జూచి క్రోధముజెంది 7 వాడిబాణములను వానిపై విడిచెను. అప్పుడు వా డాతనిని దాటి రామునిమీదికి యుద్ధమునకు బోయెను. రాముడు వానిపై రౌద్రాస్త్రమును ప్రయోగించుచు వానిహృదయమున వాడిబాణములను నాటెను. దానిచే కుంభకర్ణునకు క్రోధము కలిగెను. అతడు శీఘ్రముగ బరుగెత్తుచుండ వానిముఖమునుండి నిప్పులు రాలెను. వాడు పెద్దధ్వనిచేయుచు వానరులమీదికి బరుగెత్తెను. రామునిబాణాఘాతముచే కుంభకర్ణునిచేతిలోనుండు పెద్ద గదయు, నాయుధములును భూమిమీద పడెను. తరువాత నాత డాయుధములులేక జేతులతోను,కాళ్లతోను వానర ఋక్ష రాక్షసులను గొట్టి వారిని దినుచు పరుగెత్తెను. పిదప కుంభకర్ణుడు పర్వతశిఖరమును బట్టి రామునిపై విసరెను. అది తనమీదకు వచ్చుచుండ రాముడు దానిని మధ్యమార్గములోనే 7తీవ్రబాణములచే ముక్కలుగ

జేసెను. అప్పుడు లక్ష్మణుడు రామునితో నిట్లు మనవిచేసికొనెను. 'అనేకకారణములనుబట్టి యాలోచింపకుంభకర్ణుని వధించుటయుక్తము. వీడు రక్తమును ద్రాగుటచే మత్తుడై తనవారిని, పరులను తెలిసికొన జాలక వానర రాక్షసులను దినివేయుచున్నాడు. ఇప్పుడు వానరశ్రేష్ఠు లందఱు నాతనిశరీరముపై నెక్కవలెను. వానరసేనానాయకులందఱు వానిచుట్టును నిలువవలెను. అప్పుడు దుర్బుద్ధియగుకుంభకర్ణుడు పెద్ద బరువుచే క్రిందపడిపోయి వానరులను మఱితినకయుండును.' ఇట్లు లక్ష్మణుడు పలుక వానరు లట్లు చేసిరి. కుంభకర్ణుడు వారిని విసరివేయ వారు క్రిందపడిరి. రాముడు 'వీడు దుష్టు' డని పలికి మంచిధనస్సునొక దానిని బట్టి వేగముగ వానియెదుట నిలువ వానరులు సంతోషము నొందిరి. లక్ష్మణుడుగూడ నతనిప్రక్కనుండెను. కుంభకర్ణుడు వానరుల ప్రక్కకు పరుగెత్తుచుండెను. రాముడు వానిని జూచి ధనుష్టంకారము చేయ వా డాతనియొద్దకు పరుగెత్తుచుండెను. అప్పుడు రాముడు వానితో 'రమ్ము; విచారింపకుము. నేను ధనస్సును బట్టి నిలిచితిని. నన్ను రామునిగ నెఱుగుము. నిన్నొకగడియలో చైతన్యహీనునిగ జేసెద' నని పలుక కుంభకర్ణు డతనిని రామునిగ దెలిసికొని పెద్దనవ్వు నవ్వుచు వానరులమీదికి పరుగెత్తుచు రామునితో నిట్లనెను. 'నేను విరాధ కబంధ ఖర వాలి మారీచులలో నెవ్వడను కాను. నేను కుంభకర్ణుడను. ఇనుముతో చేయబడిన యీముద్గరమును బట్టి నేను పూర్వము దేవ దానవులను జయించియుంటిని. నాముక్కు, చెవులు కోఱికివేయ బడినవని నీవు నన్నవమానింపవద్దు. అందువలన నాకు కొంచమైనను బాధలేదు. నీవు నాపై బాణములను విడిచి నీపరాక్రమమును జూపుము. తరువాత నేను నిన్ను తినివేసెదను.' ఇట్లు కుంభకర్ణుడు పలుక రాముడు వానిపై వాడియగుబాణములను విడిచెను. ఇదివరలో గుగ్గిలపుచెట్లను బడత్రోసినవియు, వాలిని మృతినొందించినవియునగు

రాముని వాడి బాణములు కుంభకర్ణునకు తగిలి వానికేమియు బాధ కలుగజేయలేకపోవుటచే వాడు చలింపలేదు. తరువాత వాడు ముద్గరమును దిప్పుచు రామబాణములను ఖండించి వానరులకు భయము కలిగించుచుండెను. రాము డప్పుడు వాయవ్యాస్త్రమును బ్రయోగించి యొకబాణమును వానిపై విడచెను. అది వానిభుజములను తెగగొట్ట వాడు పెద్దధ్వనిచేసెను. వానిబాహువు ముద్గరముతో గూడ వానర సైన్యముమీద పడ వానరులు నాశనమునొందిరి. కుంభకర్ణుడు మఱి యొకచేతితో చెట్టునొకదానిని పెకికి రాముని నెదురొ్కనెను. అంత రాము డైంద్రాస్త్రమును బ్రయోగించి దానితో నొకబాణమును విడువ నది యాతని రెండవబాహువును ఛేదించెను. అయినను వాడు కదలుచు వానరులపైని, రాక్షసులపైని చెట్లను, పర్వతశిఖరములను, రాళ్లను విసరెను. ఇట్లు కుంభకర్ణుడు బాహువులు తెగినను రాముని యొద్దకు పరుగెత్తికొని వచ్చుచుండ వానిని జూచి రాము డర్ధచంద్రాకారముగల రెండువాడిబాణములను వానిరెండుపాదములమీదికి విడిచి వానిని తెగగొట్టెను. వానిపాదములు దిక్కులుప్రతిధ్వనించునట్లు తెగి క్రిందబడెను. ఇట్లు కుంభకర్ణునికాలుచేతులు తెగిపోయినను వాని మొండెము నోరు తెఱచి రాహువు చంద్రునిపగ్గఱకునలె రాముని యొద్దకు పరుగెత్తును. రాముడు వానినోటను వాడిబాణములతో గొట్ట కుంభకర్ణుడు మాటాడలేక కష్టముతో ధ్వనిజేయుచు మూర్ఛ నొందెను. రాముడు సూర్యకిరణములవంటికాంతిగలదియు, బ్రహ్మ దండ యమదండములవంటిదియునగు నింద్రసంబంధమగు నస్త్రమును దీసి దానితో నొకమంచిబాణమును బ్రయోగింప నది వాని తలను దుంచెను. *దానితో వానితల లంకలోనిగోపురము మొదలగు

* అ. రా. రాముడు కుంభకర్ణుని నైంద్రాస్త్రముతో సంహరించినతరువాత నతడు ధనస్సునుబట్టియుండ నచ్చోటికి నారదుడు

హాన్నిపై బడెను. కుంభకర్ణుని మొండెము పరుగెత్తుచున్న వానరుల మీదను కొంతయు, సముద్రములో కొంతయు పడి దానిలోనున్న జలజంతువులను నంతమునొందించుచు భూమిలో బ్రవేశించెను. అతని

---

వచ్చి యాతని నిట్లు స్తుతించెను. "దేవదేవ! జగన్నాథా! సనాతనుడా! పరమాత్మ! నారాయణా! యన్నిటికి నాధారమగువాడా! లోకములో జరుగుదానిని జూచువాడా! నీకు నమస్కరించెదను. నీవు మిక్కిలిశుద్ధ మగు జ్ఞానస్వరూపుడవయ్యును లోకముల నధికముగ మోసపుచ్చు టకు మాయచే మనుష్యరూపమునుదాల్చి సుఖదుఃఖములను బొందు వానివలె నున్నావు. స్వయముగ ప్రకాశించు నీ వందఱిహృదయము లందు నున్నను మాయచే గప్పబడుచున్నవాడవైతివి. స్వయముగ ప్రకాశించుటయే స్వభావముగాగల నీవు నిర్మలమగు మనస్సుగల వారికి స్పష్టముగ దెలియబడుదువు. నీవు కండ్లను దెఱచుటయే మూడులోకములస్పష్టియు, వానినిమూయుటయే ప్రళయమున్నై యు న్నది. ఏనీయందు సమస్తప్రపంచము ప్రకాశించు చున్నదో ఏనీవల్ల చరాచరప్రపంచముత్పన్నమగుచున్నదో ఏనీయందు లీన మగుచున్నదో ఏనీకన్న నధికమైనదిలేదో యట్టి పరబ్రహ్మరూపుం డవగు నీకు నమస్కారము. ఏనిన్ను మూలప్రకృతిగాను, జీవునిగను, వ్యక్తావ్యక్త (నిమేషక్షణ) స్వరూపమగు కాలముగను మునిశ్రేష్ఠులు తెలిసికొనెదరో యట్టినీకు నమస్కరించుచున్నాను. నిన్ను వేదములు మార్పులేనివానిగను, శుద్ధునిగను, జగత్తే యాకారముగాగలవానిగను దెలుపుచున్నవి. ఇట్లైనచో (వేదములు భగవంతుని నాకారముగలవా నిగను, నాకారములేనివానిగను జెప్పుటవల్ల) శ్రుతులకు పరస్పరవిరో ధము సంభవించుచున్నది. అందువల్ల నీవు సాకారుడవా? నిరాకారు డవా? యని సందేహించువిద్వాంసుడు నీయనుగ్రహములేనిదే యాసం దేహమునుండివిడువబడి నిశ్చయమునుగ్రహింపజాలడు. నిజముగనీవునిరా కారుడవైనను మాయాసంబంధమున సాకారుడవగుటచేశ్రుతివిరోధము

మరణమువలన భూమియు, పర్వతములును చలించెను. దేవ దేవర్షి మహర్షి నాగ గరుడ గుహ్యక యక్ష గంధర్వు లాకాశముననుండి చూచుచు రాముని పరాక్రమమునకును, కుంభకర్ణునిమరణమునకును సంతోషించిరి. మిగిలినరాక్షసులు భయమునొంది లంకకు పరుగెత్తిరి.

---

లేదు. పల్లవప్రదేశములందు వ్యాపించినసూర్యకిరణములుతిరుగ పైకిప్రజ్వలించి చలించుచు మృగములకు జలమువలె తోచునట్లు భ్రాంతివల్ల నీయందే సర్వజగత్తు కల్పింపబడుచున్నది. కాన నీవు జగద్రూపుడవు. ఓదేవా! నిజమగు నీనిర్గుణస్వరూపము మనస్సునకే గోచరముకాదు. అట్టిచో కంటికెట్లగుపడును? కంటికగుపడనిదే సేవించుటెట్లు? కనుక నీవు భక్తులు సేవించుటకై యవతారములనెత్తి యనేకగుణములుగల వాడ వగుచున్నావు. అట్టినిన్ను బుధులు సేవించుచు సంసారసముద్రమును దాటుచున్నారు. కాని కామక్రోధాదిశత్రువులు పూర్జాలములు మూషకములనువలె మనస్సును బెదరించుచు నీధ్యానము నాటంకపఱచుచున్నవి. అట్లైనను నీనామస్మరణ మెల్లప్పుడుచేయుచు, నీరూపమును ధ్యానించుచు, నీపూజనుజేయుచు, నీకథలను వినుచు, నీభక్తులతో సాంగత్యముచేయుచు నుండువారలకు నట్టికామక్రోధాదులు నశించి ధ్యానదారుఢ్యముకలిగి సంసారము గోష్పదము కాగలదు. కనుక రామా! యీనీరూపమును నెల్లప్పుడు నేను మనస్సులో ధ్యానించుచు సర్వదేవతలచేతను పూజింపబడుచున్నవాడనై కామక్రోధాదులకు దూరుడనై యథేచ్ఛగ సంచరించుచుంటిని. రామా! దేవతలకు హితమగునట్లు నీవు కుంభకర్ణునివధించుట యనుగొప్పకర్మను జేయుటచే నీదినమున భూభారము సగమణగెను. రేపటిదినమున లక్ష్మణు డింద్రజిత్తును జంపును. ఆమఱునాడు నీవు రావణుని చంపెదవు. నేను సిద్ధులతోగూడి యాకాశమున నిలిచి యంతయు జూచెదను.

వానరులు రామునిని జూచి మిక్కిలిసంతోషించి యతనిని కీర్తించిరి. అతడుకూడ మిక్కిలియానందము నొందెను.

---

## ౭౩ వ. అధ్యాయము.

## నరాంతక దేవాంతక త్రిశిర మహోదర మహాపార్శ్వాతికాయుల యుద్ధము.

కుంభకర్ణుడు యుద్ధములో మరణమునొంద రాక్షసులు రావణునియొద్దకు పరుగెత్తి యతనికి కుంభకర్ణుడుచేసిన యుద్ధవివరములను, నతనిమరణమును దెల్పిరి. ఆతడు దానిని విని ముఖముతిరుగ క్రిందపడి మూర్ఛపోయెను. ఆతనిపుత్రులగు దేవాంతక నరాంతకులును, త్రిశిరాతికాయులును తమపినతండ్రిమరణమును విని శోకించి యేడ్చిరి. మహోదర మహాపార్శ్వులుకూడ తమయన్నమరణమునకు విచారించిరి. తరువాత రావణుడు కష్టముతో తెలివినొంది కుంభకర్ణుని గూర్చి యిట్లు విచారించెను. "అయ్యో! వీరుడా! కుంభకర్ణా! శత్రువులగర్వమడచు నీవు నాయొక్కయు, నాకుటుంబముయొక్కయు, రాక్షసులయొక్కయు శోకమును బోగొట్టకుండ దైవయోగమున యమలోకమునకు బోయితివి. నీబలమును నమ్మియే దేవతలవలనను, నసురులవలనను భయపడెడివాడను కాను. అట్టి నాకుడిభుజమువంటి నీవు పోయితివి. నేను జీవించినను లాభములేదు. దేవదానవుల గర్వ

---

ఇప్పుడు నాకు సెలవిమ్ము. నేను దేవలోకమునకు బోయెదను." ఇట్లు నారదుడు రామునకు విన్నవించి దేవతలు పొగడుచుండ బ్రహ్మలోకమునకు బోయెను.

మణగద్రొక్కినవాడవును, కాలాంతకరుద్రునితో సమానమగువాడ వును నగు నీవు రామునిచే నెట్లు చంపబడితివి. వజ్రముచేగూడ బాధ నొందని నీ వాతని బాణములచే నెట్లు మృతినొందితివి? దేవతలును, ఋషులును నాకాశమున నిలిచి యిప్పుడు నీమరణమునుగూర్చి సంతోష ధ్వని చేయుచున్నారు. నీమరణమునకు సంతోషించుచు వానరులు మిక్కిలిమంచిసమయము దొరకినదని కష్టమగు లంకాద్వారములనన్ని టిని నెక్కెదరు. కుంభకర్ణుడు పోయినతరువాత నాకు ప్రాణములపై నిష్టములేదు. రాజ్యమువలన సీతవలన నాకేమిప్రయోజనము? నా తమ్మునిజంపినరాముని సేను యుద్ధములో జంపలేకపోయిన నాబ్రతుకు వ్యర్థము? నాకు మరణమే నిశ్చయముగ శ్రేయము. కుంభకర్ణునివిడిచి నేనొక క్షణమైనను బ్రతుకను. నే నిప్పు డతడుండుచోటునకు బోయెద దను. దేవతలకు పూర్వము నే నపకారము చేసినందులకు వారు న న్నిప్పుడు చూచి పరిహసించెదరు. కుంభకర్ణుడు మరణించియుండ నే నిందు నెట్లు గెలిచెదను? నేను విభీషణుని మంచిమాటలను నజ్ఞాన ముచే విననందున దానిఫలము నేడు ననుభవించితిని. ప్రహస్త కుంభ కర్ణులు మరణము నొందినదిమొదలు విభీషణునిమాటలు నన్ను పీడించు చున్నవి. ధార్మికుడగు విభీషణుని నే నవమానించినందులకు నా కిట్టి విపత్తులు వచ్చినవి.” ఇట్లు విలపించుచు రావణుడు క్రిందపడెను.

రావణుని విలాపములను నతనిపుత్రుడగు త్రిశిరుడు విని ‘నా పినతండ్రి మరణించినందులకు మీరు విలపించినటుల సత్పురుషులు విచారమునొందరు. మీరు మూడులోకములకు ప్రభువులైయున్నారు. సామాన్యపురుషునివలె మీరేల యిట్లు శోకించెదరు? మీకు బ్రహ్మ మంచిశక్తిని, కవచమును, ధనస్సును, బాణములను, వేయిగుఱ్ఱములను గట్టెడి మంచిరథమును నిచ్చెను. మీరు దేవదానవులను నాయుధ సహాయములేకుండగనే జయించితిరి. మీ రన్నియాయుధములను బట్టి

రాముని జయింపనగును. మీ యిష్టమువచ్చినట్లు మీ రుండుడు. నేను మీశత్రువులను యుద్ధములో జయించి రాముని హతమొనర్చెదను.' ఇట్లు త్రిశిరుడు పలుక రావణుడు తాను తిరుగ పుట్టినట్లే యాలోచించెను. ఆతనిపుత్త్రులగు దేవాంతక నరాంతకులును, నతికాయుడును, త్రిశిరునిమాటలను విని యుద్ధమునకు బోవ సిద్ధమైరి. వీరందఱు గొప్ప బలపరాక్రమము గలిగి మాయల నెఱిగి దేవాదులను యుద్ధములో గెలిచినవారు. వారిమాటలను రావణుడు విని వారలను కౌగిలించుకొని వారలకు మంచిభూషణముల నిచ్చి బాగుగ నాశీర్వదించి యుద్ధమునకు బంపెను. అతడు 'యుద్ధోన్మత్తుడు, మత్తుడు' నను నామాంతరములుగల మహోదరమహాపార్శ్వలను వారికి సహాయముగబంపెను. ఈయార్వురును రావణునకు నమస్కరించి ప్రదక్షిణముచేసి యుద్ధమునకు బయలుదేఱిరి. వారు యుద్ధములో తమకు దెబ్బలుతగులునపుడు బాధకలుగకుండుటకు శరీరమున నోషధులు రాసికొనిరి. నీలమేఘము వలెనున్నదియు, నైరావతకులములో బుట్టినదియునగు 'సుదర్శన'మను నేనుగుపై నన్నివిధములగు నాయుధములను మహోదరుడు వేయించి దానిపై నెక్కెను. త్రిశిరుడును, నతికాయుడును మంచిగుఱ్ఱములను గట్టినరథముల నెక్కిరి. ఆరథములందు నన్నివిధములగు నాయుధములును నుంచబడినవి. మంచిజాతికలదియు, వడికలదియునగు తెల్లని గుఱ్ఱమునకు బంగారు భూషణముల నలంకరింపించి దానిపై నరాంతకుడు ప్రాసమును, శక్తిని బట్టి యెక్కెను. దేవాంతకుడు పెద్దపరిఘను బట్టెను. మహాపార్శ్వుడు పెద్దగదను బట్టెను. మంచిచతురంగబలములును, నన్నివిధములగునాయుధములను బట్టిన పర్వతశిఖరములవలె నుండు రాక్షసులునుగూడ యుద్ధమునకు బయలుదేఱిరి. రావణపుత్త్రులు 'శత్రువులను జయింపవలెను; లేక యుద్ధములో మరణము నొందవలె'నని నిశ్చయించి బయలుదేఱిరి. సేన నడచుచు గర్జించెను;

సింహనాదము చేసెను; శత్రువుల నాక్షేపించుచుండెను. రాక్షసు లనే కవిధములగు నాయుధములను బట్టియు, వానరులు కొండశిఖరములను, రాళ్లను, చెట్లను బట్టియు నిలిచి యొకరినొకరు చూచి సింహనాదము చేసి యుద్ధముచేసిరి. వానరులు కొండలు మీదికెగిరి చెట్లను, రాళ్లను విసరిరి. కవచములను తొడుగుకొనినవారును, రథములమీదనున్న వారును, గుఱ్ఱములను, నేనుగులను నెక్కినవారును నగు రాక్షసులను వానరులు గొట్టిరి. రాక్షసులుకూడ వారిని నాయుధములతో హింసించిరి. రాక్షసులయాయుధములు క్రిందపడిపోయినప్పుడు వారును, వానరులును బాహుయుద్ధమును సలిపిరి. రాక్షసులు వానరులను పట్టుకొని వారితో వానరులను గొట్టిరి. వానరులుకూడ రాక్షసులతో రాక్షసులను గొట్టిరి. వానరులుపట్టినరాళ్ళను రాక్షసులు లాగుకొని వానితో వారినే గొట్టిరి. రాక్షసులుపట్టినయాయుధములను వానరులు లాగుకొని వానితో వారినే గొట్టిరి. వానరులు రథములతో రథములను, నేనుగులతో నేనుగులను, గుఱ్ఱములతో గుఱ్ఱములను గొట్టిరి. రాక్షసులు తమబాణములచే వానరులుపట్టినచెట్లను, రాళ్ళను ముక్కలుముక్కలుగ గొట్టిరి. ఆయోధులలో నిరుపురిక్కలవారును చచ్చిరి. కొంతసేపటికి వానరులు రాక్షసుల నోడించుచుండ దేవతలు, మహర్షులు నాకాశమునుండి దానిని జూచుచుండిరి.

ఇట్టిసమయమున నరాంతకుడు తా నెక్కినగుఱ్ఱముతో నక్కడకు వచ్చి తనప్రాసముతో 700 వానరుల నొక్క నిమిషములో జంపెను. వానరులు పరాక్రమముతో తన్నెదుర్కొనినకొలది యతడు వారినిప్రాసముతోబాధించుచుండెను. వానరులలోనెగురుచున్నవారిని, నిలిచినవారిని, వెళ్లిపోవుచున్నవారినిగూడ నరాంతకుడు ప్రాసముతో గొట్టుచుండెను. భయముచే వారు పరుగెత్తి పాఱిపోలేకపోయిరి; నిలువలేకపోయిరి. వారు దీనముగ నఱచుచుండిరి. అంతట కుంభక

ష్ణనియుద్ధమున మూర్ఛనొందినవానరులకు తెలివివచ్చెను. వారు కూడ యుద్ధమునకు నిలిచిరి. వానరసేన పాఱిపోవుటయు, నరాంతకుడు గుఱ్ఱమీద వచ్చుటయు, సుగ్రీవుడు చూచి పెద్దమేఘరూపము గల యంగదునితో 'నీవు వెళ్ళి యీ రాక్షసవీరుని ప్రాణములను దీయు' మని చెప్ప నతడు వాని నెదుర్కొని యిట్లనెను. 'నిలువుము, నిలువుము. సామాన్యులగు వానరులతో నేల యుద్ధముచేయుచున్నావు; నీప్రాసముతో నాఱొమ్ముపై గొట్టుము.' ఇట్లంగదుడు పలుక నరాంతకునకు క్రోధముపచ్చెను. అతడు పండ్లతో పెదవిని కఱచుచు నిట్టూర్పుదీయుచు వజ్రతుల్యమగుప్రాసమును ద్రిప్పి దాని నాతనివక్షముపై విసరెను. అది యతనివక్షమునకు తగిలి ముక్కలై క్రిందపడిపోయెను. తరువాత నంగదుడు తనయఱచేతితో నరాంతకునిగుఱ్ఱమును కొట్ట నది ముక్కలై క్రిందపడి చచ్చెను. దానికి నరాంతకుడు కోపించి తనపిడికిలితో నంగదునితలపై పొడిచెను. అతనితల పగిలి రక్తముగాగా నతడు మూర్ఛనొందెను; కాని వెంటనే యతనికి తెలివి వచ్చెను. అతడు నవ్వి వేగముగ తనపిడికిలితో నరాంతకునిగుండె మీద గుద్దెను. దానితో వానిఱొమ్ము పగిలెను. వాడు రక్తము గ్రక్కుచు భూమిమీద పడి మరణించెను. అప్పుడు దీనినంతను చూచుచున్న దేవత లాకాశమునను, వానరులు భూమిపైనను సంతోషధ్వానులను జేసిరి. అంగదుడు రామునకు సంతోషకరమగుకార్యమును జరిపి తిరుగ యుద్ధమునకు సిద్ధమయ్యెను.

నరాంతకునిమరణమునకు నతనియన్నదమ్ములును, పినతండ్రులును విచారించిరి. పెద్దయేనుగు నెక్కిన మహోదరుడు, పరిఘమునుబట్టిన దేవాంతకుడు, రథము నెక్కిన త్రిశిరుడు నను నీముగ్గురును యుద్ధము చేయుటకు నంగదుని నెదుర్కొనిరి. అంగదుడు పెద్దచెట్టును దేవాంతకునిపై విసరగ దానిని త్రిశిరుడు బాణములతో ఖండించెను. తరువాత

అంగదుడు పర్వతశిఖరములను, వృక్షములను వానిపై విసర వానినన్నిటిని వాడిబాణములతో త్రిశిరుడును, పరిఘతో దేవాంతకుడును ఖండించిరి. పిదప త్రిశిరు డంగదునిపై బాణముల విడిచెను. మహోదరుడు తోమరములతో వానివక్షస్థలమున గొట్టెను. దేవాంతకుడు సమీపమునకు వచ్చి పరిఘతో నాతని గొట్టి మఱలిపోయెను. ఇట్లు ముగ్గురు రాక్షసయోధులును తనతో యుద్ధముచేయుచున్నను నంగదునకు బాధకలుగలేదు. ఆతడు వేగముగ నెగిరి తనయఱచేతితో మహోదరునియేనుగును గొట్టె దానికండ్లు పైకివచ్చెను. అది పెద్దధ్వనిచేసెను. అంగదుడు దానికంతమును నూడబెఱికి యెగిరి దానితో దేవాంతకుని గొట్టెను. దానితో వానినోటనుండి రక్తముకాఱ వాడుమూర్ఛచెందెను. తరువాత దేవాంతకునకు తెలివిరాగా వాడు పరిఘనొకదానిని త్రిప్పి దానితో నంగదుని గొట్టెను. ఆదెబ్బచే నతడు క్రిందపడి కాళ్లమీద నిలిచి తిరుగ నెగిరెను. అతనినుదుటిపై త్రిశిరుడు మూడు వాడిబాణములను వేసెను. ఈసంగతి హనుమంతుడును, నీలుడును తెలిసికొని యక్కడకు వచ్చిరి. పిమ్మటనీలుడు త్రిశిరునిపై నొకకొండశిఖరమును విసర వాడు దానిని బాణములతో ఖండించెను. దానికి దేవాంతకుడు గొప్పసంతోషము నొంది పరిఘను బట్టి హనుమంతుని నెదుర్కొనెను. హనుమంతుడెగిరి వానితలమీద తనపిడికిలితో పొడిచి పెద్దనాదముచేసెను. ఆదెబ్బతో దేవాంతకునితల బ్రద్దలయ్యెను. వానిపండ్లు, కండ్లు పెద్దనాలుక పైకివచ్చెను. అంతే వాడు ప్రాణములను విడిచి భూమిమీదపడెను. దానితో త్రిశిరునకు గొప్పక్రోధము కలుగ నతడు నీలునివక్షస్థలమున బాణవర్షము కురిపించెను. మహోదరుడు మఱియొక పెద్దయేనుగు నెక్కి నీలునిపై ననేకబాణములను విడిచెను. ఆబాణాఘాతముచే మొదట నీలుడు మూర్ఛనొంది తిరిగి వెంటనే తెలివితెచ్చుకొని పెద్దకొండశిఖర మొకదానిని పెకలాగి

దానితో మహోదరునితలమీద గొట్టెను. ఆదెబ్బతో నతడును, నతని యేనుగును మృతినొందెను. అతనిమరణమును త్రిశిరుడు చూచి హనుమంతునిపై వాడిబాణములను విడువ నతడు వానిపై నొకకొండశిఖరమును విసరెను. వాడు దానిని బాణముతో ఖండించెను. అప్పుడు హనుమంతుడు వానిపై చెట్లవర్షమును గురిపించెను. త్రిశిరు డాచెట్లను తనబాణములచే ఖండించెను. తరువాత హనుమంతు డెగిరి వానిరథగుఱ్ఱములను తనగోళ్లతో జీల్చెను. అంతటత్రిశిరు డాతనిపై నొకశక్తిని బ్రయోగింప దానినతడు ముక్కలుముక్కలుగ జేసి నాదముచేసెను. త్రిశిరుడు ఖడ్గమును బట్టి హనుమంతుని వక్షముపై నఱికెను. దానికాతడు తనయఱచేతితో రావణపుత్రునియురమున గొట్ట వా డాయుధములను విడచి తెలివితప్పి క్రిందపడెను. హనుమంతుడు వానిఖడ్గమును చేతధరించి రాక్షసులనందఱిని జడిపించెను. అంతలో త్రిశిరుడు తెలివి తెచ్చుకొని యెగిరి హనుమంతుని ఱొమ్మున పిడికిలితో బొడిచెను. దానికి నతడుకోపించి యాఖడ్గముతో నాతనిమూడుతలలను తెగగోసెను. త్రిశిరుడట్లు మరణమునొంద వానరులు హర్షనాదముచేసిరి. భూమి చలించెను. రాక్షసులుపరుగెత్తిరి. యుద్ధమునకు వచ్చినవారు మరణించుట మహాపార్శ్వుడు చూచి తేజముకలదియు, నినుముతో జేయబడినదియునగు గద నొకదానినిపట్టివానరులను నెదుర్కొనెను. వానియెదుట ఋషభుడు యుద్ధమునకునిలువ నాతనిని మహాపార్శ్వుడు గదతో ఱొమ్ముపై కొట్టెను. దానితో నాతనికి రక్తముమిక్కిలికాఱెను. అయినను నాతడు కొంతసేపటికి తెలివినొంది రాక్షసవీరునియొద్దకు పరుగెత్తి వానిగదను లాగికొని త్రిప్పిత్రిప్పి దానితో వానిని గొట్టెను. వాడు కండ్లు, పండ్లుబ్రద్దలు కాగా క్రిందపడి మరణించెను. మిగిలినరాక్షసులు పరుగెత్తిరి.

పర్వతాకారముగల అతికాయుడు తనవారందఱు మరణించుట చూచి గొప్పక్రోధమును బొంది వేయిగుఱ్ఱములనుగట్టినదియు, నలుగురు సారథులుతోలునదియు, మిక్కిలి తేజోవంతమైనదియునగు పెద్ద రథమునెక్కి తనపేరు చెప్పుచు ధనస్సును బట్టి వానరులపై బాణము

లను విడిచి పెద్దధ్వనిచేసెను. ఆరథమున ననేకధనస్సులును, మంచిబాణములును సిద్ధముచేయబడియుండెను. దానికి రాహుధ్వజముండెను. అతికాయుడుపట్టినధనస్సునకు మూడుచోట్ల వంపులుండెను. అదియింద్రధనస్సువలెనుండెను. రథమున నమ్ముల పొదు లనేకములును, రెండు ఖడ్గములును నుండెను. ఇట్టిరథముపైనున్న యతికాయుడు బాణములను విడువగ వానరులు భయపడి గొప్పగను పారిపోసాగిరి. కొందరు 'వీడు కుంభకర్ణుడు; తిరుగ లేచెనని భయమునొంది పాఱిపోయి రాముని శరణుజొచ్చిరి. రాముడు వానిని జూచి యాశ్చర్యమునొంది వానరుల నోదార్చి వానినిగూర్చి విభీషణుని నడిగెను. అతడు వాని చరిత్రమంతయు దెలుపుచు 'వీడు బ్రహ్మచే దేవదానవులవలన మరణము రాకుండునట్లు వరముబొందెను'నని పలికి 'వీడు వానరసైన్యమును నాశనముచేయుచున్నాడు. వీనినిగూర్చి తగినప్రయత్నముచేయు'డని యనెను. అతికాయుడు వానరసైన్యములపై బాణములను వేయుచుండ వానరసేనానాయకులగు కుముదుడును, ద్వివిదుడును, మైందుడును, నీలుడును, శరభుడును వానినెదుర్కొని కొండశిఖరములను, చెట్లను వానిపై విసరిరి. వాని నన్నిటిని నతికాయుడు తనబాణములతో నెగురగొట్టెను. తరువాత వాడు వారి శరీరములపై బాణములనువిడువ వానితో వారు యుద్ధముచేయలేకపోయిరి. పిదప నతికాయుడు తనరథమును రాముడుండెడిచోటునకు తోలించి గర్వముతోనిట్లుపలికెను. 'నేను రథముపై ధనస్సును, బాణములను బట్టియున్నాను. నేను సామాన్యునితో యుద్ధముచేయను. యుద్ధముచేయుటయందు శక్తిగలవాడెవడైననున్నయెడల నాతో నిప్పుడు శీఘ్రముగ యుద్ధముచేయవచ్చును.' ఇట్లతికాయుడు పలుక లక్ష్మణుడా మాటలను విని కోపముతో బయటకు వచ్చి తనధనస్సును బట్టి వాని యెదుట నిలిచి నవ్వుచు తనయమ్ములపొదిలోనుండి బాణమును దీసి ధనస్సును గట్టిగ మ్రోగించుచు దానిని సంధించెను. దానికి నతి

కాయు డాశ్చర్యమును బొంది లక్ష్మణునితో నిట్లనెను. 'లక్ష్మణా! నీవు బాలుడవు. శత్రు పరాక్రమములను దెలియనివాడవు. కాలయము నితోసమానమగు నాతో యుద్ధముచేయ నెట్లుకోరుచున్నావు? నేను బాహువులతో నస్త్రములను విడిచిన వానివేగమును హిమవత్పర్వతము, భూమియు, నాకాశమునుగూడ సహింపలేవు నాతో యుద్ధము చేయుట చల్లగనణిగియున్న కాలాగ్నిని ప్రజ్వలింప జేయుటవంటిది. నీవు నీధనస్సును విడిచి మఱలిపొమ్ము. నాతోయుద్ధముచేసి ప్రాణము లను విడువకుము; నీకు వెళ్లుట కిష్టములేనియెడల నాయెదుట నిలువుము. ప్రాణములను విడిచి యమలోకమునకు బోయెదవు. నా వాడిబాణములు శత్రువులగర్వమడంచును. ఇవియీశ్వరునిత్రిశూలము వంటివి. వీనిని చూడుము. ఈ బాణము పామువంటిది. ఇది నీరక్త మును త్రాగును.'ఇట్లతికాయుడు పలికిక్రోధముతో ధనస్సునందు బాణ మును సంధించెను.' దానికి లక్ష్మణు డిట్లుజవాబుచెప్పెను. "మాటలచే నీవు గొప్పవాడవు కానేఱవు. తన్నుతాను పొగడుకొనువాడు శూరుడుకాడు. దురాత్మా! నేను ధనస్సును బాణములను బట్టియుండ నీబలమును జూపుము; కార్యరూపమున నీపరాక్రమమునుజూపుము; నన్నుగుఱించి నీవు పొగడుకొనకుము. పౌరుషమును జూపువాడే శూరుడు. నీరథమున నన్నివిధములగు నాయుధములును గలవు. నీవు ధనస్సును బట్టి రథమున నిలిచియున్నావు. నీవు బాణములచేగాని యస్త్రములచేగాని నీపరాక్రమమును జూపుము. గాలి తాటిచెట్టు నుండి పండును రాల్చునటుల నేను వాడిబాణములతో నీతలను క్రిందబడగొట్టెదను. ఇప్పుడు నా వాడిబాణములు నీశరీరములో నుండు రక్తమును త్రాగును. నేను బాలుడనని తలచి నన్నవమానించుట తగదు. నేను బాలుడనో, వృద్ధుడనో యుద్ధములో నన్ను మృత్యువుగ తెలిసికొనుము. బాలుడును వామనావతారుడునునగు

విష్ణువు మూడుపాదములచే లోకములనన్నిటిని నాక్రమించెను." ఇట్లు లక్ష్మణుడు పలుక నతికాయుడు గొప్పక్రోధముతో మంచిబాణమును దీసెను. ఆకాశమున విద్యాధరులును, భూతములును, దేవతలును, దైత్యులును, మహర్షులును, గుహ్యకులును, నితరమహాత్ములును నిలిచి యుద్ధమును జూచుచుండిరి. అతికాయుడు ధనస్సును సంధించి యొకబాణమును లక్ష్మణునిపై విడువ దానినాత డర్ధచంద్రాకారము గలబాణముతో ఖండించెను. దానికి నతికాయుడు కోపించి 5 బాణములను లక్ష్మణునిపై విడిచెను. అవి తనయొద్దకు రాకమునుపే యతడు తనబాణములచే వానిని ముక్కలుగ జేసిమఱియొక బాణమునుధనస్సున సంధించి బాగుగలాగి విడువ నది రాక్షసవీరునినుదుటను దగిలెను. దానిచే నతికాయు డెక్కువగ బీడింపబడి తనశరీరమునుండి రక్తము కాఱుచుండ మిక్కిలిచలించెను. వాడునిట్టూర్పుదీసి తనశత్రువుపొగడ దగినవాడని తెలిసికొని బాగుగ నాలోచించి మంచిబాణముల ననేకములను లక్ష్మణునిపై వదల నతడు కంగారుపడక వాడిబాణములచే వానినన్నిటిని ఖండించెను. అందుచే నతికాయుడు మిక్కిలికోపము నొంది మంచిబాణమును లక్ష్మణునిరొమ్ముపై విడిచెను. దానితో నత నికి నెక్కువగ రక్తముకాఱెను. లక్ష్మణు డాబాణమును నూడబెఱికి యాగ్నేయాస్త్రముతో నొకబాణమును తనధనస్సున సంధించిదానిని విడిచెను. అది వచ్చుచుండ యతికాయుడు చూచి సూర్యాస్త్రముతో నొకబాణమును ప్రయోగించి దానిని నాగ్నేయాస్త్రమునకు నస్త్రగవద లెను. ఆరెండుబాణములును నంతరాళమున గొట్టుకొని బలముపోవ రెండును క్రిందబడెను. అతికాయు డపు డైషీకాస్త్రము నుపయోగింప లక్ష్మణుడుదానిని నైంద్రాస్త్రముచే ఖడించెను.తరువాత నతికాయుడు యామ్యాస్త్రముతో బాణమును విడువ నతడు దానిని వాయవ్యాస్త్ర ముతో ఖండించెను.తరువాత లక్ష్మణుడతికాయునిపై ననేకబాణములను

విడువ నవి వానికవచమునకు తగిలి క్రిందపడిపోయెను. లక్ష్మణుడుతిరు గననేక బాణములను వానిపై విడిచెను; కాని వానికవచము భేదింప శక్యముకానిదగుటచే నవి వానినేమియుచేయలేకపోయెను. అప్పు డాకా శమునుండివాయుదేవు డిట్లు పలికెను. 'వీడు బ్రహ్మయిచ్చినవరముచే భేదింపశక్యముకాని కవచమును ధరించియున్నాడు. బ్రహ్మాస్త్రమును బ్రయోగించి వీనిని జంపుము. మఱియేయస్త్రముచేతను వీడు చావడు.' ఇట్లువాయుదేవుడు పలుక లక్ష్మణుడు బ్రహ్మాస్త్రముతో నొక బాణ మును ధనస్సున సంధించి విడువ దానికి దిక్కులు, సూర్యచంద్రులు, గొప్పగ్రహములు భయమునొందెను; భూమివణకెను. వేగముగవచ్చు చున్నయాయస్త్రమును నతికాయుడు చూచి శీఘ్రముగ బాణము లతో దానిని గొట్టెను; గాని యాయస్త్రము వానిని లక్ష్యముచేయక యతికాయుని ప్రక్కకు వచ్చెను. అప్పు డతడు ధైర్యముతో శక్తుల తోను, తోమరములతోను, ఋష్టులతోను, గదలతోను, శూలముల తోను, గండ్రగొడ్డళ్లతోను దానిని గొట్టినను నది వానిని లెక్కజే యక వానిశిరమును దుంచెను. వానితలహిమవత్పర్వతశిఖరమువలె క్రిందబడెను. అతికాయునిమరణమునకు మిగిలినరాక్షసులు భయమును జెంది విచారముతో దీనులై యేడ్చుచు లంకకు పరుగెత్తిరి. వానరు లందఱు సంతోషించి లక్ష్మణుని గీర్తించిరి.

---

## ౭౩. వ. అధ్యాయము.

## ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముచే రామలక్ష్మణాదులను బంధించుట; తిరుగ వారికి బంధవిముక్తి గలుగుట.

---

రావణునిపుత్రులగు దేవాంతకుడు, త్రిశిరుడు, అతికాయుడు, నరాంతకుడు, మిగిలినరాక్షసులు మరణించినట్లు రావణ్ణునకు దెలియ్య

గనే యతడుభయముచే మూర్ఛనొంది కంఠస్ఠంటనీరు తెచ్చుకొని నిక్కిలి విచారముతో నుండెను. తరువాత నత డిట్లు రాక్షసులతో బలికెను. 'నేను పంపించిన ప్రహస్తుడు, కుంభకర్ణుడు, అతికాయుడు మొదలగు గొప్పయోధులు రామునిచేతను, నతనిబలములచేతను గొట్టబడి మడిసిరి. వరబలములచే నింద్రజిత్తుపొందిననాగపాశబాణములచే కట్టబడిన రామలక్ష్మణులు విముక్తులయిరి. ఇక రామలక్ష్మణులతోను, విభీషణ సుగ్రీవులతోను యుద్ధముచేయగలిగినవానిని నేను కానను. రాముడు గొప్పబలవంతుడు. వానియస్త్రబలముగొప్పది. వాడు నారాయణుడని నేను తలచెదను. లంకాబహిర్ద్వారములును, లోపలిద్వారములును నాతనియందలిభయముచే మూయబడినవి. లంక నంతను జాగ్రత్తగ రాక్షసులు కాపాడవలెను. సీతయుండునశోకవనమునకు వచ్చువారి సంగతియు,నందుండి పోవువారి సంగతియు నెల్లప్పుడు మాకు తెలియుచుండవలెను. పూర్వము సేనలు నిలిచినచోటను బాగుగ బలములిప్పుడుండవలెను. సంధ్యాకాలమున, రాత్రివేళ, తెల్లవాఱుసమయమున నన్నికాలములందును వానరులు లంకలోనికి వచ్చినయెడల వారి పాదచిహ్నములను కనిపెట్టుచుండవలెను. వారివిషయమున నశ్రద్ధచేయకూడదు. శత్రుబలమెట్లున్నదో, యెట్లుసిద్ధమైనదో, యెట్లువెళ్లుచున్నదో, యెల్లప్పుడు కనిపెట్టుచుండవలెను.' రాక్షసరాజుపలికినయీ మాటలను రాక్షసులందఱు విని యట్లే నిలిచిరి.ఎముకలనఱకును నాటినక్రోధముచే రావణుడు దీనుడై పుత్రశోకముచే బాధనొందుచు నంతిపురమును చేరెను.

ఇట్లు రావణుడు విచారముతోనుండ నింద్రజిత్తతనియొద్దకు పోయి యిట్లు పలికెను. 'నాయనా! నేను జీవించియున్నంతకాలము మీరు రజ్ఞానకష్టము బొందకుడు. యుద్ధములో నాబాణములచే గొట్టబడినవాడెవ్వడును తనప్రాణములను రక్షించుకొనలేడు. నేనిప్పుడు రామలక్ష్మ

ణులను నా బాణములతో గొట్టి వారిశరీరములం దంతటను బాణములు నిండియుండ వారుమరణించి భూమిపై బడియుండ వారిని మీరుచూచె దరు. ఇప్పుడు పురుషబలముచే నేను నిశ్చయించిన నా యీ ప్రతి జ్ఞను వినుడు. ఇప్పుడే రామలక్ష్మణులశరీరమును నేను మంచిబాణము లతో నింపెదను. బలిచక్రవర్తి యొక్క యజ్ఞవాటమున విష్ణువుచూపిన పరాక్రమమువలెనుండు నాపరాక్రమమును నిప్పుడు ఇంద్రుడు, యముడు, విష్ణువు, మిత్రుడు, సాధ్యులు, అశ్వినులు, అగ్ని, సూర్యచంద్రులు చూచెదరుగాక.' ఇట్లింద్రజిత్తు పలికి రావణునియొద్ద సెలవుతీసికొని వాయువేగముకలదియు, మంచిగాడిదలను గట్టినదియునగు రథము నెక్కి యుద్ధభూమికి పోయెను. వానితోగూడ మంచియాయుధములను బట్టిన చతురంగబలము గుఱ్ఱములమీదను, యేనుగులమీదనుబోయెను. భేరీలు మొదలగు వాద్యములు వాయింప రాక్షసు లిందజిత్తును పొగడుచుండిరి. సేవకులు వానికి తెల్లనిఛత్రమును బట్టి వింజామరలు వీచుచుండిరి. ఇంద్రజిత్తు యుద్ధభూమికి వెళ్ళి తనరథముచుట్టు రాక్ష సులను నిలిపెను. తరువాత నత డగ్నిని ప్రజ్వలింపజేసి దానిలో మం త్రములతో క్రమముగ హోమముజేసెను. అగ్నిహోత్రుని నతడు పేలాలతోను, మాల్యములు, గంధములు మొదలగువానితోను పూజ చేసెను. అగ్నిచుట్టు శస్త్రములను, రెల్లుగడ్డిని, చండ్రసమిధలను, నెత్తురుబట్టలను, నల్లనియినుపస్రువమును నుంచి బ్రతికియున్న నల్లని మేకను గొట్టి దానితల నక్కడ నుంచెను. అత డగ్నిలో మంచి సమిధలను వేల్చుటచే పొగలేని మంచిమంటలు బయలుదేరెను. అందుచే నతనికి యుద్ధములోజయముకలుగుసూచనలు కనబడెను. * అగ్నిహోత్రుడు ప్రత్యక్షమై బంగారుభూషణములు ధరించి మంట

---

* దీనినిబట్టిచూడ నగ్నిలో క్రమప్రకారముగ హోమముచేసినవాడు పూర్వ ముమానుషచర్యలు చేసిరని తెలియుచున్నది.

లెక్కువగ తిరుగుచుండ తనకు వేల్చినమేకతల మొదలగువానిని తాను స్వయముగ పుచ్చుకొనెను. తరువాత నింద్రజిత్తు బ్రహ్మాస్త్రమును, తనధనస్సును, రథమును నభిమంత్రించెను. దానిని జూచి యప్పుడు గ్రహనక్షత్రములతోగూడిన యాకాశమంతయు మిక్కిలి భయమందెను. ఇట్లింద్రజిత్తగ్నిని సంతృప్తిపఱచి తనధనస్సుతోను, బాణముల తోను, కత్తితోను, గుఱ్ఱములు సారథియుగల రథముతోను నెవరికిని గనబడకుండ నంతర్ధానమునొందెను. తరువాత రాక్షసచతురంగబలము యుద్ధాభిలాషతో బయలుదేరెను. వారనేకవిధములగు నాయుధము లనుబట్టి వానరులతో యుద్ధముచేసి వారిని హింసించిరి. ఇంద్రజిత్తు కోపముతో రాక్షసులను జూచి 'మీరు సంతోషముగ వానరులతో యుద్ధము చేయు'డని పలుక వారు సింహనాదముచేయుచు జయమును గోరి వారిపై బాణములను విడిచి గదలతోను, ముసలములతోను వారిని మొత్తిరి. వానరు లింద్రజిత్తును వెంబడింపనతడు వారిని వాడి బాణములతో గొట్టెను. వానరులుపడిపోవుచు నాతనిపై చెట్లను, రాళ్ళను విసర వానినన్నిటిని నాతడు ఖండించెను. తరువాత నింద్రజిత్తు గంధమాదనునిపై 18తీవ్రబాణములను, నలునిపై 9 బాణములను, మైందునిపై 7బాణములను గజునిపై 5బాణములను, జాంబవంతునిపై 10బాణములను, నీల సుగ్రీవ ఋషభాంగద ద్వివిదులపై మూడుదేసి బాణములను విడిచెను. దానితో వారు మూర్ఛనొందిరి. మిగిలినవాన రులపై గూడ నతడు బాణములను విడిచి వారిని హింసించెను. తరువాత నింద్రజిత్తెవరికి గనబడకుండ వానరులపై బాణవర్షము కురిపింప వారాదెబ్బలచే క్రిందబడిపోయిరి. అతడు వారిపై ననేకవిధములగు నాయుధములనుగూడ విసరెను. వానరులు పైకి ముఖములెత్తి చూడ వారికి నింద్రజిత్తు కనబడలేదు; కాని వాడువిడుచుబాణములుమాత్ర మన్నిదిక్కులందును వారికి గనబడుచుండెను. ఇట్లతడెవరికి గనబడ

కుండ వానరవీరులగు హనుమంతుడు, సుగ్రీవుడు, అంగదుడు, జాంబవంతుడు మొదలగు వారినందరిని బాణములతోను, ననేకవిధములగు నాయుధములతోను హింసించి రామలక్ష్మణులపై ననేకతీవ్రబాణములను విడిచెను. అప్పుడు రాముడు వానినిలక్ష్యముచేయక యాశ్చర్యము నొంది లక్ష్మణుని జూచి యిట్లు పలికెను. 'ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రము నుపయోగించి వానరసేననంతను గొట్టి మనపై వాడిబాణములను విడుచుచున్నాడు. వీడు బ్రహ్మవలన వరములను బొంది గొప్పశరీరముతోను, పరాక్రమముతోను నంతరిక్షమున కనబడకుండ నిలిచి యున్నాడు. బ్రహ్మాస్త్రమునుబట్టిన వీని నిప్పుడు చంపుటయెట్లు? ఈ యస్త్రమునకు ప్రభువగు బ్రహ్మ గొప్పప్రభావముకలవాడు. నీవును నేనును నిప్పుడీ బాణపాతములను విచారములేకుండ సహించియుండవలెను. ఈరాక్షస శ్రేష్ఠుడన్నిదిక్కులను బాణములతో నింపియున్నాడు. మనవీరు లందఱు పడియున్నారు. మనము యుద్ధముచేయకుండ తెలివితప్పిక్రిందపడియుండుటను జూచి వీడు మనలను జయించి లంకకు నేగును.' ఇట్లు రాముడు పలికినతరువాత నింద్రజిత్తునిబాణములచే రామలక్ష్మణులు మూర్ఛనొందిరి. దానినింద్రజిత్తు చూచి సంతోషముతో పెద్దనాదముచేసి లంకకు వెళ్ళెను.

ఇట్లు రామలక్ష్మణులును, వానరసేనయు మూర్ఛనొందియుండ విభీషణుడుమాత్రము తెలివిగనుండెను. అతడు మంచిమాటలతో వానరవీరుల నిట్లోదార్చెను. 'మీరు భయమునొందకుడు. ఇప్పుడు విచారమునొందుటకు గాలము కాదు. రామలక్ష్మణు లింద్రజిత్తువిడిచిన బ్రహ్మాస్త్రముచే గొట్టబడి బ్రహ్మయందలి మర్యాదచే మూర్ఛనొందియున్నారు. బ్రహ్మ యింద్రజిత్తునకు బ్రహ్మాస్త్రము వరముగ నిచ్చియున్నాడు. దానిని వీరు మన్నించుచున్నారుగాన మీరు విచారించుటకిది కాలముకాదు.' ఇట్లు విభీషణుడు పలుకుచుండ బ్రహ్మాస్త్ర

ముచే కొంచెము సేపు కట్టబడిన హనుమంతుడు తెలివినొంది విభీషణు నితో 'మనము పడియున్న వానరులలో ప్రాణమున్న వారి నోదార్చుద' మని పలికెను. అంతట వారిద్ద ఱా రాత్రి కఱ్ఱలను వెలిగించి పట్టుకొని సేనలో నంతటను తిరిగి చూడ పర్వతాకారులగు వానరులు తమకు తగిలిన దెబ్బలనుండి రక్తముకాఱుచుండ పడుకొనియుండిరి. సుగ్రీవుడు మొదలగు వానరవీరులును, నితర వానరులును తెలివి లేకయుండిరి. * వారందఱికి సాయంకాలము దెబ్బలుతగిలియుండెను. విభీషణుడును, హనుమంతుడును జాంబవంతునియొద్దకు వెళ్ళిరి. అతడు సహజముగ ముసలివాడు. అతనిశరీరమునిండ బాణములు తగిలియుండుట విభీషణుడు చూచి 'బాణాఘాతములచే నీప్రాణములు పోలేదా?' యని యతని నడిగెను. దానికి జాంబవంతు డతికష్టముతో 'విభీషణా! నీమాటలనుబట్టి నిన్ను పోల్చుచున్నాను. నాకండ్లకు బాణములు తగిలియుండుటచే నిన్ను జూడలేకున్నాను. వాయుపుత్రుడు జీవించియున్నాడా?' యని యడిగెను. దానికి విభీషణుడు 'గొప్పవారిని విడిచి హనుమంతుని నేలయడిగెదవు? సుగ్రీవుడు, అంగదుడు, రాముడు లేరా? హనుమంతునియెడ నీకుండు స్నేహము వారియెడ లేదా?' యని పలుక జాంబవంతు డిట్లనెను. 'నేను హనుమంతుని నడుగుటకు గారణమును దెలిపెదను. అతడు జీవించియుండిన మిగిలిన బలము కొట్టబడినను జీవించును. అతనిప్రాణములు పోయినయెడల మిగిలిన మేమందఱము జీవించినను మరణించినవారమగుదుము. వాయువుతో సమానమగు వాయుపుత్రు డగ్నివలె వీర్యముకలవాడు. అతడు జీవించియున్న మాకు ప్రాణములమీద నాశకలుగును.' ఇట్లుజాంబవంతుడు పలుక

* యుద్ధకాండ 74 వ. సర్గ 11వ. శ్లోకమున 67 కోట్లవానరసైన్యమునకు దెబ్బలు తగిలినవని వ్రాయబడినది. మేము పూర్వము తెలిపినప్రకారము 100 కోట్లసైన్యము యుద్ధమునకు వెళ్లెననియు, నిప్పటికి కొంతమడిసినదనియు బాగుగ నూహింపవచ్చును.

హనుమంతుడు వానిప్రక్కకు బోయి నియమముగ నతని పాదములకు నమస్కరించెను. జాంబవంతుడు బాధపడుచున్నను హనుమంతుని మాటలను విని తాను తిరుగ జన్మించినటుల తలచి వానితో నిట్లనెను. 'వానరశ్రేష్ఠా! రమ్ము. నీవు వానరులను రక్షింపతగినవాడవు. నీకంటె పరాక్రమవంతు డెవడును లేడు. నీవు వీరికి ముఖ్యస్నేహితుడవు. నీవు పరాక్రమము జూపవలసినకాలమువచ్చినది. ఋక్షవానరసైన్యములకు గొప్పసంతోషము కలుగజేయుము. రామలక్ష్మణులు బాణములచే గొట్టబడి యున్నారు. వారికిగుచ్చుకొనిన బాణములు పైకివచ్చునటుల జేయుము. నీవుసముద్రముమీదికెగిరి చాలదూరముదాటి హిమవత్పర్వతమునకు వెళ్ళుము. అచట నీవు పర్వతములలో నెత్తగు బంగారు ఋషభపర్వతమును, కైలాసపర్వతమునుగూడ జూచెదవు. ఆ రెండు కొండల మధ్యను నన్ని యోషధులుకల యోషధిపర్వతముగలదు. దానిశిఖరమున దిక్కులను ప్రకాశింపజేయు నాలుగోషధులున్నవి. మృతసంజీవని (చనిపోయినవారిని బ్రతికించునది), విశల్యకరణి (శరీరమున గ్రుచ్చుకొనిన వానిని నూడదీయునది), సావర్ణ్యకరణి (శరీరమునకు చెడువర్ణమును బోగొట్టి మంచివర్ణమును గలిగించునది), సంధానకరణి (విఱిగినయెముకలు మొదలగువానిని సతుకునది) యను నాలుగోషధులను నీవు శీఘ్రముగ పట్టుకొని రమ్ము. వానివలన వానరు లందఱికి ప్రాణమువచ్చునట్లు చేసి వారి నోదార్చుము.' ఇట్లు జాంబవంతుడుపలుక హనుమంతుడు బాగుగ శక్తినిపూరించి త్రికూటపర్వతముననున్న తాను తనశరీరమును పెద్దకొండవలె పెంచి నిలువ వాని పాదపీడనముచే నాపర్వత మెక్కువగ చలించెను. అక్కడనుండి యతడు మలయపర్వతమునకు బోయి దానిని కాళ్లతో బీడించి రాక్షసులందఱు భయమందునటుల నాదముచేసెను. అద్భుతమగు వానినాదమును రాక్షసులు విని భయమునుబొంది కొంచెమయినను కదలలేకపోయిరి.

తరువాత హనుమంతుడు రామునిగూర్చి నమస్కరించి యాతనికొఱకు గొప్పకార్యములు చేయవలచి గొప్పయత్నములు చేయుచు తనతోక నెత్తి నడుమును వంచి చెవులను నిగిడించి నోరు తెఱచి యెగిరి సముద్రమును, పర్వతములు, నదులు, పట్టణములు మొదలగువానిని దాటి గొప్ప శబ్దముచేయుచు హిమవత్పర్వతమును జేరెను. అత డక్కడి యాశ్రమములు మొదలగువానిని, పాతాళప్రవేశరంధ్రమును జూచెను. తరువాత నాతడు ఋషభపర్వతమునకును, కైలాసపర్వతమునకును మధ్యనున్న యోషధిపర్వతమును జూచెను. దానిమీద నత డోషధులను వెతకెను. అవియన్నియు తమ్ముతీసికొనిపోవుటకు నతడు వచ్చెనని తెలిసికొని యతనికి కనపడకుండ దాగుకొనెను. అవి తనకు కనుపింపక పోవుటచే హనుమంతుడు మిక్కిలికోపము నొంది కండ్లెఱ్ఱజేసి నాదము చేయుచు పర్వతముతో నిట్లనెను. 'నీవు రామునియందు దయలేక యోషధులను దాచుకొన నేలనిశ్చయించితివి? అట్లయిన నాబాహుబలముచే నిన్ను పిండిచేసెదను.' ఇట్లు హనుమంతుడు పలికి యాపర్వతమునంతను శిఖరములు, చెట్లు, ఓషధులు మొదలగువానితోగూడ పెఱికి చేతపట్టుకొని వేగముగ నెగిరెను. దేవతలు మొదలగువారు పొగడుచుండ నత డతిశీఘ్రముగ దానితో యుద్ధభూమికి వచ్చెను. ఆపర్వతపువాసన తగిలినవెంటనే రామలక్ష్మణులును, వానరులును తమకేమియు బాధలేనట్లు లేచిరి. ఇదివరకు యుద్ధములోపడిపోయిన వానరులుగూడ దాని నాఘ్రాణించి నిద్దరనుండిలేచినటుల లేచిరి. కాని వానరులవలన మరణించినరాక్షసులశరీరములు వెనువెంటనే రావణాజ్ఞచే సముద్రములో త్రోయబడుటచే నారాక్షసులు తిరిగి జీవింపలేదు. వానరులు హనుమంతుని జూచి పెద్దనాదము చేసిరి. హనుమంతుడు గూడ పెద్దధ్వనిచేసెను. లంకలోనిరాక్షసు లాశబ్దములను విని భయమునొందిరి. హనుమంతుడు కపిశ్రేష్ఠులకు నమస్కరించి విభీషణుని

కౌగిలించుకొనెను. తరువాత హనుమంతుడు ఓషధిపర్వతమును తిరుగ మోసికొనిపోయి పూర్వస్థలమున నుంచి తిరిగివచ్చి రాముని గలిసెను.

---

## ౭౫వ. అధ్యాయము.

## సుగ్రీవాజ్ఞచే వానరులు లంకను గాల్చుట.

వానరులు బ్రహ్మాస్త్రముచే వచ్చినమూర్ఛనుండి తెలివినొందినతరువాత సుగ్రీవుడు చేయవలసినకార్యమునుగూర్చి హనుమంతునితో నిట్లు పలికెను. 'రావణుడు తనతమ్ముడగుకుంభకర్ణుడును, కుమారులగు నరాంతకాదులును మరణమొందుటచే విచారముకలవాడై మనతో యుద్ధముచేయుటకు బయలుదేఱలేకున్నాడు. శీఘ్రచలనము, గొప్పబలముగల వానరశ్రేష్ఠులందఱు కాల్చినకఱ్ఱలనుబట్టుకొని లంకకుబోయి దానిని గాల్చవలెను.' ఇట్లు సుగ్రీవు డాజ్ఞాపింప వానరులు కాలుచున్నకొఱవులను బట్టుకొని రాత్రిప్రథమయామభాగమున బయలుదేఱి లంకకు వెళ్లి దానినిరక్షించురాక్షసులను బాఱదోలి గోపురములందును, గోడలపైననుండు రక్షణగృహములందును, మేడలయందును, పెద్దవీధులందును, చిన్నవీధులందును నిప్పును ముట్టించిరి. దానితో వేలకొలదియిండ్లు కాలెను. పెద్దపెద్దమేడలు కూలిపోయెను. ముత్యములు మొదలగు విలువగలవస్తువులును, పట్టుబట్టలు మొదలగు బట్టలును, కంబళ్లును, గుఱ్ఱములు, రథములు మొదలగువాని సామగ్రియు, యోధులకవచములును, నాయుధములనుంచు నిండ్లును కాలిపోయెను. కవచములను దొడుగుకొని మద్యముద్రాగి మాంసమును తిని యాయుధములను బట్టి యుద్ధమునకు బోవుటకు సిద్ధముగనున్న రాక్షసులనేకులుగూడ కాలి చచ్చిరి. మంచిమంచియిండ్లు

కాలిపోయెను. బహిర్ద్వారములుకూడ కాలిపోయెను.తమబంధనములను దెంపుకొనిన యేనుగులు, గుఱ్ఱములు పరుగెత్తుచు నన్యోన్యము జూచుకొని భయమందుచుండెను. అగ్నిశబ్దము పదియోజనములవఱకు వినబడుచుండెను. కాలిపోయిన శరీరములుగల రాక్షసులును,మిగిలినరాక్షసులును నక్కడకువెళ్లిన వానరులతో యుద్ధముచేయుచుండిరి. రామలక్ష్మణులు తమధనస్సులను బట్టుకొనినిలిచియుండిరి. రాముడు ధనస్సును మోగింప రాక్షసులు భయమునందిరి. తరువాత నతడు పట్టణగోపురములపై బాణములను విడచి వానిని నాశనముజేసెను. ఇంకను నతడు లంకాపట్టణములోని మేడలపైని, నిండ్లపైని బాణములను విడువ రాక్షసులు యుద్ధసన్నద్ధులైరి. సుగ్రీవాజ్ఞచే వానరులు లంకాద్వారములోనికి బోయి రాక్షసులతో యుద్ధముచేయ రావణునకు గొప్ప కోపము వచ్చెను.

---

## ౭౬. వ. అధ్యాయము.

## కుంభ నికుంభాదులయుద్ధము.

వానరులు లంకను గాల్చుచు నగరద్వారములలో ప్రవేశించుటచే రావణుడు మిక్కిలికోపించి కుంభకర్ణునిపుత్రులగు కుంభ నికుంభులనువారిని యుద్ధమునకు బంపెను. వారికి గొప్పబలముగలవారును, పెద్దశరీరముకలవారునునగు యూపాక్ష శోణితాక్ష ప్రజంఘ కంపనులనువారిని సహాయముగబంపి మంచిబలముగలరాక్షసులను, మంచిచతురంగబలమును గూడ బంపి జయమును బొందవలెనని వారి కాజ్ఞాపించెను. యూపాక్ష శోణితాక్షులన్నదమ్ములు. వారిపినతండ్రి ప్రజంఘుడు. వారందఱు లంకనుండి యుద్ధభూమికి వెళ్ళిరి. అప్పటికి చంద్రో

దయమయ్యెను. అక్కడ రాక్షసు లాయుధములనుబట్టియు, వానరులు కొండశిఖరములను, చెట్లను బట్టియు యుద్ధముచేసిరి. వారు రాక్షసులను పిడికిళ్లతో బొడిచి దంతములతో కఱచుచుండిరి. ఉభయపక్షముల వారికి గాయములుతగిలెను. యుద్ధములో వీరులు 'ఇమ్ము; ఇచ్చుచున్నాడు; ఇచ్చుచున్నాను; నీవేల బాధపెట్టుచున్నావు? నిలువు' అని యన్యోన్యము పలుకుచుండి దెబ్బలచే నుభయపక్షములవారును సమానముగ బాధనొందిరి. యుద్ధము ఘోరముగా జరుగుచుండెను. అంగదుడు కంపనునెదుర్కొని యుద్ధముచేయుచుండ వాడు వానిని గదతో కొట్టెను. దానితో నంగదుడు మతితప్పి చలించెను. తరువాత నతడు తెలివితెచ్చుకొని కొండశిఖరమునొకదానిని వానిపై విసరెను. దానితోవాడు క్రిందపడిచచ్చెను. వా డట్లు చచ్చుట శోణితాక్షుడు చూచి రథముమీద వచ్చి యంగదునిపై వాడిబాణములను విడువ నత డారాక్షసవీరునిరథమును, బాణములను విఱిచివేసెను. తరువాత శోణితాక్షుడు డాలును, కత్తిని బట్టి యాకాశమున కెగిరెను. అంగదుడుకూడ పైకెగిరి యాకత్తిని లాగుకొని పెద్దధ్వనిచేసి వాని మూపుననున్న డాలును దానితో నఱుక వానిశరీరముపై జందెమువలె గాయముతగిలెను. తరువాత నంగదు డాఖడ్గమును బట్టుకొని కనుపించిన రాక్షసవీరులనందఱి నెదుర్కొనెను. అప్పుడు శోణితాక్షు డినుపగద నొకదానిని బట్టుకొని దానితో నంగదుని గొట్టెను. ఇట్టిసమయమున మఱియొకప్రక్కనుండి ప్రజంఘుడును, యూపాక్షుడును రథములమీద వచ్చి యంగదు నెదుర్కొనిరి. అప్పుడు మైందద్వివిదు లంగదునకు సహాయము జేయుటకు వచ్చిరి. అంగద మైందద్వివిదులు మువ్వురును శోణితాక్ష ప్రజంఘ యూపాక్షులతో గొప్పయుద్ధమును జేసిరి. వానరులు వారిపై చెట్లను విసరిరి. ప్రజంఘుడు వానిని కత్తితో నఱికెను. వానరులు రథములపైనను, గుఱ్ఱములపైనను కొండశిఖరములను,

చెట్లను విసర యూపాక్షుడు వానిని తనబాణములతో ముక్కలు ముక్కలుగ జేసెను. ద్వివిదుడును, మైందుడును చెట్లను పెఱికి రాక్షసులపై విసర మార్గమధ్యముననే వానిని శోణితాక్షుడు గదతో విఱిచి వేసెను. ప్రజంఘుడు మంచిఖడ్గమునొకదానిని బట్టుకొని యంగదుని యొద్దకు పరుగెత్తెను. అప్పుడంగదుడు ప్రజంఘుని నశ్వకర్ణవృక్షముతో గొట్టి తనపిడికిలితో ఖడ్గమును బట్టిన వానిబాహువుమీద పొడువ వాడును, వానిఖడ్గమును భూమిమీద వేఱు వేఱుగ పడెను. తరువాత ప్రజంఘుడు లేచి తన పిడికిలితో నంగదునినుదుటిపై పొడువ నతడు చలించి తెలివితప్పి క్రిందపడిపోయి తిరిగి కొంతసేపటికి తెలివి తెచ్చుకొని యాఖడ్గముతో ప్రజంఘునితల తెగనఱికెను. వాడు మరణము నొంద వానియన్నకొడుకగు యూపాక్షుడు కంఠ్యంట నీరు తెచ్చుకొని బాణములన్నియు వ్యయమగుటచే ఖడ్గమొకదానిని బట్టి రథమునుండి దిగెను. వాడు పరుగెత్తుకొనివచ్చుచుండుట ద్వివిదుడు చూచి వాని యురమున గుద్ది వానిని బట్టుకొనెను. తనయన్న యట్లు పట్టుబడుట శోణితాక్షుడు చూచి ద్వివిదునివక్షముపైని గదతో గొట్టెను. దానితో ద్వివిదుడు చలించి శోణితాక్షుడు తిరిగియెత్తుచున్నగదను పట్టుకొనెను. ఇంతలో మైందుడు వచ్చి యూపాక్షునివక్షముపై తనయఱచేతితో గొట్టెను. అప్పుడు శోణితాక్ష యూపాక్షులును, ద్వివిద మైందులును యుద్ధములో తీవ్రముగ లాగుకొనుచు కొట్టుకొనిరి. చివరకు ద్వివిదుడు శోణితాక్షునిముఖమును తనగోళ్ళతో చీరి వానిని గిరగిర త్రిప్పి భూమిమీద కొట్ట వాడు పిండిపిండియై మరణమునొందెను. మైందుడుకూడ క్రోధముతో యూపాక్షుని తనబాహువులతో బీడింప వాడు క్రిందబడి చచ్చెను.

ఇట్లు రాక్షసవీరులు మడియ రాక్షససేన కుంభకర్ణునికుమారుడగు కుంభుడుండెడిచోటునకు వెళ్లెను. వాడు దానినోదార్చి గొప్ప

పరాక్రమముగల వానరవీరులతో గొప్పయుద్ధము చేసెను. వాడు గొప్పదగుతనధనస్సునుబట్టి వానరులపై వాడిబాణములను విడిచెను. తరువాత వాడు బాగుగ ధనస్సునెక్కుపెట్టి యొకవాడిబాణమును ద్వివిదునిపై విడువ నాతడు బాధచే నిలువలేక చలించుచు పెద్దకొండ వలె క్రిందపడెను. అతడట్లుపడుట నాతనియన్నయగు మైందుడుచూచి పెద్దరాతిని కుంభునిపైకి వేగముగ విసర వాడు దానినేడుబాణము లతో ముక్కలుగజేసి మఱియొకమంచిబాణమును సంధించి మైందుని వక్షముపై గొట్టెను. అది యాతనియాయువుపట్టున తగుల నతడు మూర్ఛపోయి క్రిందపడెను. అప్పు డంగదుడు కుంభునితో యుద్ధము చేయుటకు బోవ వా డాతనిపై మంచిబాణముల ననేకములను విడి చెను. దాని కాతడు చలింపక వానితలపై రాళ్ళవర్షమును, చెట్లవర్ష మును గురిపించెను. వానినన్నిటిని కుంభుడు తనబాణములతో కొట్టి వేసెను. తరువాత కుంభుడు తనమీదికివచ్చుచున్న యంగదుని జూచియాతనిబొమముడిపై తీవ్రబాణములువేయ నాతనికి నెక్కువగ రక్తమువచ్చెను. అది యతనికండ్లను గప్పెను. అంతనతడొకచేతితో తనకండ్లనుమూసికొని మఱియొకచేతితో దగ్గఱనున్న యొకగుగ్గిలపు చెట్టును లాగి కుంభునిపై విసర వాడు దానినేడు బాణములతో గొట్టెను. తరువాత నంగదుడు బాధచే మూర్ఛనొందెను. ఈసం గతి కొందఱు వానరులు రామునకు దెలుప నతడు జాంబ వంతుడుమొదలగువారిని కుంభునిపైకి యుద్ధమునకు బంపెను. వారు మిక్కిలి క్రోధముతో చెట్లను, రాళ్లను బట్టుకొని యంగదుని రక్షిం చుటకు వచ్చిరి. జాంబవంతుడును, సుషేణుడును, వేగదర్శియు యుద్ధమున కుంభుని నెదుర్కొన వాడు వారిపై వాడిబాణములను విడి చెను. అందువలన వారా రాక్షసవీరునిసమీపమునకు వెళ్ళలేకపోయిరి. తరువాత సుగ్రీవు డక్కడికి యుద్ధమునకు వచ్చెను. అతడు కుంభునిపై

కొండశిఖరములను, ననేకవిధములగు చెట్లను విసరెను. వానినన్నిటిని వాడు తన బాణములచే ఖండించెను. వాడు సుగ్రీవునిపైని వాడిబాణములను విడువ నతడెగిరి వెళ్ళి వానిధనస్సును విరిచి కోపముతో నిట్లు పలికెను. 'నీవు బాణములను వేగముగ విడువగలవు. నీవీర్య మద్భుతమైనది. రావణునకువలె నీకుకూడ ప్రభావమును, రాక్షసులమీద చూపదగిన వినయమును నద్భుతముగనున్నవి. ప్రహ్లాదుడు, బలి, ఇంద్రుడు, కుబేరుడు, వరుణుడు మొదలగువారితో నీవు సమానమగువాడవు. బలములోనీవొక్కడవే నీతండ్రితో సమానమైనవాడవు. నీవు ధనస్సునుబట్టిన దేవతలు నిన్ను జయింపలేరు. యుద్ధకర్మలలో నీపరాక్రమమును జూపుము. నీపినతండ్రి వరములను బొందుట చేతను, నీతండ్రి వీర్యముచేతను దేవదానవులను గెలిచిరి. నీవు ధనస్సునుపయోగించుటలో నింద్రజిత్తువంటివాడవు; ప్రతాపములో రావణుని వంటివాడవు. బలవీర్యములలో నిప్పుడు నీవు రాక్షసులలోనెల్ల శ్రేష్ఠుడవు. నాతో నీవుచేసినయుద్ధ మాశ్చర్యకరముగనున్నది. నీవు శస్త్రములను విడుచుటలో మంచినేర్పును జూపి వానరవీరులు పడునట్లు చేసితివి. ఇందఱిని మూర్ఛనొందించుటచే నాయాసమును నొందిననిన్ను చంపినయెడల నా కపవాదము కలుగునని నేను నిన్ను కొట్టకుంటిని. నీవు గొప్పయుద్ధముచేసి యాయాసము చెందితివి. నీవు శ్రమదీర్చుకొనినతరువాత నాబలమును జూచెదవు.' ఇట్లు సుగ్రీవుడు పలుక కుంభుడు కోపించి సుగ్రీవుని తన బావులతో పట్టుకొనెను. వారిరువురు నొకరినొకరు పట్టుకొని లాగుకొనుచు నిట్టూర్పుదీయుచు కండ్లంట నిప్పులను రాల్చుచు కొట్టుకొనిరి. తరువాత సుగ్రీవుడు కుంభుని విసరివేయ వాడు సముద్రములో పడెను. అక్కడనుండి వాడెగిరివచ్చి సుగ్రీవునివక్షమున పిడికిలితో పొడిచెను. దానితో నాతనిచర్మము బ్రద్దలయి రక్తముకారెను; వాని బలము చెబ్బతగిలెను. తరువాత సుగ్రీవుడు

తనపిడికిలితో కుంభునిరొమ్మున పొడువ వాడు వెంటనే చలించి క్రింద పడి మరణించెను. అప్పుడు భూమివణకెను. రాక్షసులకు భయమెక్కువయ్యెను.

కుంభునిమరణమును వానితమ్ముడగు నికుంభుడుచూచి మిక్కిలి కోపముతో సుగ్రీవుని జూచుచుయమదండమువలెనుండు పెద్దపరిఘను బట్టిదానిని గిరగిరద్రిప్పుచుండెను. దానినిజూచి భయముచే వానరులును, రాక్షసులును కదలలేకపోయిరి. హనుమంతుడు విశాలమగు తనవక్షస్థలము నికుంభునకు నగబడునటుల నక్కడ నిలిచెను. అప్పుడు వాడాపరిఘతో నాతనియురముపై గొట్ట నాపరిఘ నూఱుముక్కలై క్రిందబడెను. ఆదెబ్బతో హనుమంతుడు చలించి బలముగొలది పిడికిలితో నికుంభునియురమున పొడిచెను. దానితో వానిచర్మము చితికి రక్తముకాఱెను. నికుంభుడు కొంచెమాయాసము తీరినతరువాత హనుమంతుని పట్టుకొనెను. దానిని జూచి రాక్షసులు హర్షధ్వనులుచేసిరి. హనుమంతు డట్లు పట్టుబడి వానిని తిరుగ పిడికిలితో పొడిచెను. తరువాత హనుమంతుడు వానిబాహువులనుండి తప్పించుకొని భూమియందు నిలిచి వానినిటునటు త్రిప్పి పిండిజేసెను. తరువాత నాతడు పైకెగిరి వానివక్షముపైబడి తనచేతులతో వానిని బట్టుకొని వానిజుట్టు నిటునటు త్రిప్పుచు గొప్పశబ్దముచేయుచున్న వానితలను పైకెక్కదీసెను. దానితో వాడు మృతినొందెను. వానరులు సంతోషించి పెద్దధ్వని చేసిరి. రాక్షసులకు భయముకలుగ వారు లంకకు పరుగెత్తిరి.

---

## ౭౭వ. అధ్యాయము.

## మకరాక్షుని యుద్ధము.

---

రావణుడు కుంభ నికుంభాదులమరణమును విని మిక్కిలి కోపశోకములను బొంది విశాలమగు కండ్లుకలవాడును, ఖరుని

పుత్రుడునునగు మకరాక్షుని బిలిచి వానితో 'నాయాజ్ఞచే నీవు బలములను తీసికొనిపోయి రామలక్ష్మణులను, వానరులను జంపు'మని చెప్ప వాడు 'నిశ్చయముగ నట్లు చేసెద' నని పలికి యాతనికి నమస్కరించి ప్రదక్షిణముచేసి మంచిచతురంగబలముతో బయలుదేఱి మంచిరథమునకు ప్రదక్షిణముచేసి దానినెక్కి వెళ్ళెను. రాక్షసులు మంచి యాయుధములను బట్టుకొనిరి. కొందఱు భేరీలుమొదలగువానిని వాయించుచుండిరి. మకరాక్షుడు రాక్షసులకు రావణుడు తనతో చెప్పినసంగతిని దెలిపి 'మీరందఱును నాయెదుట యుద్ధముచేయవలె' నని చెప్పెను. సేన వెళ్ళుచుండ దుశ్శకునము లనేకములాయెను. రథసారథిచేతినుండి కొరడా క్రిందపడెను. రథధ్వజము క్రిందపడెను. గుఱ్ఱములు బాగుగనడువక వంకరగ వెళ్ళుచు దీనముఖములతో కన్నీరు విడిచెను. వాయువు క్రూరముగ వీచుచు బుగ్గిని నెగురగొట్టెను. ఈ దుశ్శకునములను లక్ష్యముచేయక రాక్షసులు యుద్ధమునకు వెళ్ళిరి.

రాక్షసులన్నివిధములగు నాయుధములను బట్టియు, వానరులు చెట్లను, రాళ్ళను బట్టియు ఘోరయుద్ధము సలిపిరి. మకరాక్షుడు వానరులమీద బాణములను విడువ వారు పరుగెత్తిరి. దానిని జూచి రాముడు రాక్షసులపై బాణములను విడచెను. అందుచే మకరాక్షుడు క్రోధము తెచ్చుకొని రామునితో నిట్లనెను. 'రామా! నిలువుము; నాతో ద్వంద్వయుద్ధముచేయుము. నాధనస్సునుండి వాడిబాణములను విడిచి నీప్రాణములను దీసెదను. నాతండ్రియగు ఖరుని నీవు దండకారణ్యములో చంపుటచే నాయెదుటనిలిచిన నిన్ను చూడగనే నాకు రోష మెక్కుడయగుచున్నది. దురాత్మా! ఆసమయమున నీవు నాకు కనుపింపలేదు. అందుచే నప్పటినుండియు నాశరీరము రోషముచే మండుచున్నది. దైవయోగమున నీవు నన్ను చూడగలిగితివి. ఆకలితో నున్నసింహము మృగమును కోరునట్లు నేను నిన్ను కోరుచుంటిని.

ఇప్పుడు నా బాణవేగముచే నేను నిన్ను యమపురికి నంప నీచే చంప బడినవీరులతో నీవు కలిసికొనెదవు. పెక్కుమాటలేల? నామాట వినుము. నీవును, నేనును యుద్ధముచేయుచుండ లోకములన్నియుచూడ వలెను. బాణములతోగాని, గదలతోగాని, బాహువులతోగాని, లేక నీ కభ్యాసముగల యేయితరాయుధములతోగాని యుద్ధముచేయు దము.' ఇట్లు మకరాక్షుడు పలుక రాముడు పెద్దనవ్వు నవ్వుచు వానిమాటల కిట్లు జబాబు చెప్పెను. 'రాక్షసా! నీవు తగనిమాటల ననేకములను బలికి యేల శ్లాఘించుకొనెదవు? యుద్ధములేకుండ మాటలచే రణమున జయింపవీలులేదు. ఖరదూషణ త్రిశిరులును, 14 వేల రాక్షసులును నాచే హతులయిరి. నీమాంసమును గ్రద్దలు మొదలగునవి యిప్పుడు బాగుగతినును.' ఇట్లు రాముడు పలుక మక రాక్షు డాతనిపై బాణములను వేసెను. రాముడు వాడియగుశరము లను విడిచి వానిబాణములను ఖండించెను. వారిద్దఱికి పెద్దయుద్ధము జరిగెను. దేవ దానవ గంధర్వ కిన్నర నాగు లాకాశమున నిలిచి దానిని జూచుచుండిరి. రాముడువిడిచినబాణములను మకరాక్షుడును, వాడువిడిచినబాణములను రాముడును ఖండించుచుండిరి. అన్ని దిక్కు లును, భూమియు బాణములతో నిండెను. తరువాత రాముడు క్రోధ ము తెచ్చుకొని 8 బాణములతో వానిధనస్సును విఱిచి వానిసారథిని జంపి రథమును, గుఱ్ఱములను గూల్చెను. మకరాక్షుడు విరథుడై భూమిమీద నిలిచి యొకగొప్పశూలమును బట్టి దానిని ద్రిప్పుచు రామునిపైకి విసరెను. దానిని రాముడు మూడుబాణములతో ఖండింప నది ముక్కలై క్రిందబడెను. దీనిని జూచి దేవాదు లాతనిని బొగ డిరి. అప్పుడు మకరాక్షుడు పిడికిలిబిగించి రామునితో 'నిలువుము; నిలువు' మని పలుకుచుండ నాతడు వానిపై నాగ్నేయాస్త్రమును విడి చెను. దానితో వానిగుండెపగుల వాడు భూమిమీదబడి మృతినొం

డెను. దేవాదులు సంతోషించిరి. మిగిలిన రాక్షసులు భయముతో లంకకు బరుగెత్తిరి.

---

౨౦౧వ. అధ్యాయము.

## ఇంద్రజిత్తు మాయసీతను జంపినపిమ్మట లక్ష్మణుడు యుద్ధమునకు బయలుదేఱుట.

మకరాక్షునిమరణమును రావణుడు విని గొప్పక్రోధమును బొంది పండ్లు పటపట కొఱికి 'ఏమిచేయుదు'నని యాలోచించియింద్రజిత్తును యుద్ధమునకు బంపుచు వానితో నిట్లు పలికెను. 'నీవన్నివిధముల గొప్పబలముగలవాడవు. నీవు కనబడుచుండిగాని, కనబడకుండగాని రామలక్ష్మణులను హతమొనర్చుము. గొప్పపరాక్రమముగల యింద్రుని నీవుయుద్ధములో జయించితివి. అట్టినీవు మనుష్యులనేలచంపలేవు?' ఇట్లు రావణు డాజ్ఞాపింప దానికి నింద్రజిత్తంగీకరించి బ్రహ్మాస్త్రమును రామాదులపై విడుచునపుడు తాను చేసినరీతిగనే యజ్ఞస్థలమున రాక్షసమంత్రముచే హోమములుచేసి యగ్నిని, దేవ దానవ రాక్షసులను తృప్తినొందించెను. తరువాత నత డంతర్ధానశక్తిగలదియు, నాలుగుగుఱ్ఱములను గట్టినదియునగు రథమునెక్కెను. అందు ననేక విధములగు బాణములును, గొప్పధనస్సును నుండెను. ఇంద్రజిత్తుబ్రహ్మాస్త్రమును బట్టియుండెను. వానితో చతురంగబలముకూడ బయలుదేఱెను. తరువాత నింద్రజిత్తు రాక్షసులతో 'కపటమునివేషములను ధరించిన రామలక్ష్మణులను నిప్పుడు యుద్ధమున హతమొనర్చి జయమును బొంది నాతండ్రికి దెలిపెదను. వానరులను జంపెద'నని పలికి రథముతో నదృశ్యుడై రామలక్ష్మణులుండుచోటికి వెళ్లెను. రాము

లక్ష్మణులు వానరులమధ్యనుండి బాణములను విడుచుచుండ వారిని నింద్రజిత్తు రామలక్ష్మణులుగ నెఱింగి తనరథముపై నాకాశమున నెవరికి గనబడకుండ నిలిచి వారిపై బాణములను విడిచెను. వారా బాణములచే గొట్టబడి వానిపై దివ్యాస్త్రములతో బాణములను విడిచిరి. కాని యవి వానికి తగులలేదు. ఇంద్రజిత్తాకాశమంతయు పొగతో గప్పి చీకటిగ జేయ దిక్కులన్నియు మంచుచే గప్పబడినట్లాయెను. వాని ధనుష్టంకారము గాని, వాని రథశబ్దము గాని యెవరికి వినబడలేదు. వానిరూప మితరులకు కనపడలేదు. అట్టి చీకటిలో నింద్రజిత్తనేక బాణములను విడిచెను. రామలక్ష్మణులకు తీవ్రబాణములు తగుల వారుగూడ నాకాశముమీదికి నట్టిబాణములనే విడిచిరి. అవి వానికి తగిలి రక్తముతో తడిసి క్రిందబడెను. రామలక్ష్మణు లింద్రజిత్తువిడిచిన బాణములచే బాధనొందుచు వానిబాణములను ననేక శరములతో ఖండించిరి. ఆకాశమునుండివచ్చు బాణమార్గములనుబట్టి వారు మంచిదివ్యాస్త్రములను విడచుచుండిరి. ఇంద్రజిత్తన్నిదిక్కులకు రథముత్రిప్పుచు రామలక్ష్మణులపై బాణములను విడువ నవి వారికి బాగుగ తగిలెను. వాడు వెళ్లినత్రోవగాని, వానిరూపముగాని, వాని ధనస్సు, బాణము లుండుస్థానముకాని, మఱేమియుగాని మేఘములచే గప్పబడినసూర్యునివలె నెవరికిని గనబడలేదు. ఇంద్రజిత్తు వానరులపై బాణములను విడువ ననేకులు ప్రాణములను విడిచి క్రిందపడిరి. అప్పుడు లక్ష్మణునకు క్రోధము రాగా నతడు తనయన్నతో 'లోకములోనుండు రాక్షసుల నందఱిని నాశనముచేయుటకై బ్రహ్మాస్త్రమును విడిచెద' నని పలుక నతడు వానినిట్లు నివారించెను. 'ఒక్కరాక్షసునినిమిత్తము లోకములోనుండు రాక్షసులనందఱిని జంపుట యుక్తముకాదు. యుద్ధముచేయనివానిని, దాగుకొనినవానిని, నమస్కరించువానిని, శరణుబొందినవానిని, పాఱిపోవువానిని, మత్తతకలవానిని నీవు చంపకూడదు.

ఇంద్రజిత్తువధకై యిప్పుడు యత్నముచేయుదము. మంచివేగముగల యస్త్రములను విడిచెదము. మాయచే గనబడకుండ రథమునందున్న యా నీచరాక్షసుడు వానరసేనానాయకులకు గనబడినయెడల వారు బలవంతముగ వానిని జంపెదరు. ఇంద్రజిత్తు భూపాతాళములలోనికి చొరబడినను, స్వర్గమునకు బోయినను, పాతాళమునకు బోయినను, నంతరిక్షమున దాగుకొనినను నాయస్త్రములచే వాడు మండి భూమి మీద పడును.' ఇట్లు రాముడు పలికి వానిమరణమునకై యుపాయ మాలోచించుచుండెను.

ఈసంగతి యింద్రజిత్తు తెలిసికొని యుద్ధమునుండి మరలి లంకకు బోయెను. తరువాత వా డిదివరలో జంపబడిన రాక్షసవీరులను దలచుచు క్రోధముతో లంకాపశ్చిమద్వారమున రాక్షసులతో బయ లుదేరెను. ఇంద్రజిత్తు రామలక్ష్మణులు యుద్ధమునకు సిద్ధముగ నున్నారని తెలిసికొని యిట్లు మాయను కల్పించెను. వాడు తన బల ముచే మాయసీతను నిర్మించి దానిని జంపుటకు నిశ్చయించెను. అంద ఱిని భ్రమింపజేయుటకు నాదుర్బుద్ధి యట్లాలోచించి మాయసీతను జంపుటకు సిద్ధమై వానరులయెదుటకు బోయెను. వానిని జూచి వారు క్రోధముతో రాళ్ళను బట్టుకొని వాని కెదు రేగిరి. హనుమంతుడు పెద్ద పర్వతశిఖరమును బట్టి వానియెదుట నిలచెను. సీత యశోకవనమున నేతీరుననుండెనో రథముపైనున్న మాయసీత రూపముగూడ నట్లేయుం డెను. దానిని హనుమంతు డాకమహాదుఃఖము చూచి సీతయనుకొని చాలకాలమునకు నామెను జూచితి నని విచారించుచు కన్నీరు తెచ్చు కొని 'ఎందులకిట్లింద్రజిత్తు చేసె' నని యాలోచించి యామాయసీత నడిగెను. తరువాత నతడును, వానరులును నింద్రజిత్తురథముపైపు పరుగెత్తిరి. దానితో వాడు క్రోధము తెచ్చుకొని తనఖడ్గమును పైకి తీసి తనమాయచే 'రామ రామ' యని యేడ్చుచున్న మాయసీత

జుట్టుపట్టుకొని వానరులందఱు చూచుచుండనామెనుగొట్టెను. తరువాత వాడామెజుట్టుపట్టియుండ హనుమంతుడు చూచి దీనుడై విచారముచే కండ్లంటనీరు విడుచుచు క్రోధముచే వానితో నిట్లనెను. "దురాత్మా! నీనాశనమునకై యామెజుట్టును బట్టియుంటివి. నీవు బ్రహ్మర్షికులములో బుట్టినను రాక్షసస్త్రీకి జన్మించితివి. ఛీ! నీ కిట్టిబుద్ధికలుగ పాపపుపనులను జేయుచున్నావు. కౄరుడా! మర్యాదహీనుడా! దుర్మార్గుడా! నీచుడా! పాపపుపనులలో పరాక్రమమును జూపువాడా! కనికరములేనివాడా! నీవిట్టికౄరపుపని చేసినందులకు నీకు కనికరమేమియు లేదు. రాజగృహమును, రాజ్యమును విడిచి భర్తృవియోగమును బొందిన సీత నీకేమియపకారముచేసినది? నీవామె నేలచంపెదవు? సీతను జంపి నీవు చాలకాలము జీవింపవు. కాన నాచే నీవు చంపబడుదువు. లోకకంటకా! స్త్రీలను జంపినందులకు నిర్ణయింపబడిన హీనమగు నరకలోకమునకు నీవు ప్రాణములను విడిచినతరువాత వెళ్లెదవు." ఇట్లు హనుమంతుడు పలికి వానరులతో నింద్రజిత్తురథమువద్దకు నాయుధములనుబట్టి పరుగెత్తెను. ఇంద్రజిత్తు వారిపై బాణవర్షముకురిపించుచు హనుమంతునితో నిట్లనెను. 'సుగ్రీవుడును, నీవును, రాముడును నెవరినిమిత్తమిక్కడకు వచ్చితిరో యట్టిసీతను నీవు చూచుచుండ నేనిప్పుడే చంపెదను. తరువాత నిన్ను, రామ లక్ష్మణ సుగ్రీవ విభీషణులను హతమొనర్చెదను. వానరా! నీవు స్త్రీలను జంపకూడదని పలికితివి. శత్రువులకు పీడకలుగజేయుపని పాపపుదైనను దానిని చేయవచ్చును.' ఇట్లింద్రజిత్తు పలికి యేడ్చుచున్న మాయసీతను తనవాడిఖడ్గముతో నఱుక నామె క్రిందపడెను. తరువాత నింద్రజిత్తు హనుమంతునితో 'రాముని భార్యయగుసీతను నేను కోపముచే జంపితిని. మీకష్టములన్నియు వృథయయ్యె' నని పలికి సంతోషముతో రథమున నిలిచి పెద్దనాదముచేసెను. అక్కడకు సమీపమునయున్న వానరు లాశ్చ

మును విని దానిని జూచుచు విచారించుచు నన్ని దిక్కులకు పాఱి పోవుచుండిరి. వారిని హనుమంతుడు చూచి యిట్లు పలికెను. 'మీరు యుద్ధసాధనములను విడిచి యుత్సాహములేక విచారముతో నేల పాఱి పోవుచున్నారు. మీశౌర్యమెక్కడకు బోయెను? నే నింద్రజిత్తును నెదుర్కొనుటకు ముందు వెళ్లెదను. మీరు నావెనుకరండు. శూరు లును, మంచికులములో బుట్టినవారునునగు మీరు యుద్ధమునుండి మఱలిపోవుట యుక్తముకాదు.' ఇట్లు హనుమంతుడు పలుక వానరులు సంతోషముతో పర్వతశిఖరములను, చెట్లనుబట్టి గర్జించుచు హను మంతుని వెనుక వెళ్లి రాక్షసులను గొట్టిరి. హనుమంతుడుకూడ రాక్షు సుల ననేకులను జంపెను. అతడు విచారముచేతను, కోపముచేతను నింద్రజిత్తురథముపై నొకపెద్దరాతిని విసర వాడు శీఘ్రముగ రథ గుఱ్ఱములను చాలదూరము తోలించెను. ఆ రాయి వానికితగులక భూమియందు బడెను. వానరులును, హనుమంతుడును కొండ శిఖ రములను, రాళ్లను, చెట్లను నింద్రజిత్తుపైని, రాక్షసులపైని విసరిరి. వాడు తనసైన్యమునకు దెబ్బలుతగులుటచూచి క్రోధముతో ధనస్సును బట్టి యుద్ధముచేయుటకు వానరుల కభిముఖముగ వెళ్లి వారిపై వాడి బాణములను విడిచెను. రాక్షసులుకూడ నాయుధములతో వారిని హింసించిరి. హనుమంతుడు గుగ్గిలపుచెట్లను, రాళ్లనుబట్టి రాక్షసులతో యుద్ధముచేసెను. ఇట్లతడు శత్రుసైన్యములను బరిమార్చి వానరు లతో నిట్లనెను. 'మనము యుద్ధమునుండి మఱలుదము. ఈబలమును జయించుట మనకు సాధ్యముకాదు. రామునిప్రియమునుగోరి యుద్ధము చేయుచు నెవరికొరకై మనము ప్రాణములను విడుచుటకు సిద్ధమైతిమో యట్టిసీత మరణమునొందినది. ఈసంగతి రామసుగ్రీవులకు తెలిపి వారు నిర్ణయించినప్రకారము మనము చేయుదము.' ఇట్లు హనుమంతుడు పలికి కలంగాలుపడకుండ తనబలముతో మెల్లమెల్లగ

మఱలించెను. దాని నింద్రజిత్తు చూచి నికుంభిలయొద్దకు బోయి హోమములుచేయుట కారంభించెను.

రాముడు లంకాపశ్చిమద్వారమున రాక్షసులకును, వానరులకును జరిగినయుద్ధమునుండి బయలుదేఱినగొప్పశబ్దమును విని దగ్గఱనున్న జాంబవంతునితో నిట్లనెను. 'హనుమంతుడు నిజముగ రాక్షసులతో గొప్పయుద్ధము చేయుచున్నాడు. అందుచే నాయుధములధ్వని యెక్కువగ నగుచున్నది. ఈబుుక్షబలముతో నీ వక్కడకు బోయి శీఘ్రముగ వానికి సహాయము చేయుము' ఇట్లు రాముడు పలుక జాంబవంతుడు లంకాపశ్చిమద్వారమునకు తనబలముతో బయలుదేఱెను. అత డట్లు వెళ్లుచుండ నతనికి హనుమంతుడును, వానరులును నెదురుగ వచ్చుచుండిరి. హనుమంతుడు బుుక్షబలమును వెనుకకు మఱలించితన బలముతో రాముడుండుచోటికి వెళ్ళి యింద్రజిత్తుచేసిన సీతవధ నాతనికి దుఃఖముతో దెలిపెను. అత డీమాటలను విని శోకముచే మూర్ఛనొంది తెగగొట్టినచెట్టువలె క్రిందబడెను. కపిశ్రేష్ఠులందఱును దగ్గఱకువచ్చి యాతనిని జూచి క్రిందబడిరి. లక్ష్మణుడు తాపమునొందుచున్న రామునిశరీరముపై పద్మములపరిమళము, నల్లకలువలవాసనగల నీటినిజల్లి రెండుబాహువులతోను నాతనిగాగిలించుకొని తగినమాటలిట్లు పలికెను. "మీరు మంచిమార్గమున జరించుచు నిందిరియములను జయించి నిలిచినను మీధర్మము మిమ్ము కష్టములనుండి రక్షింపలేకపోయెను. భూతములకు స్థావరజంగమములు గనబడునట్లు ధర్మాధర్మములు పైకి గనబడవు; గనుక లోకములో ధర్మాధర్మములు లేవని నాయభిప్రాయము. ధర్మమున్నయెడల మీ కిట్టివిపత్తులు కలుగవు. ధర్మాధర్మములప్రకారము ఫలములు కలుగుచుండినయెడల నధర్మమున నున్న రావణుడు కష్టములను బొందుటయు, ధర్మములోనున్న మీకు నీవిచారములు కలుగకుండుటయు జరుగవలసియుండును. రావణునకు

కష్టములు కలుగకుండుటచేతను, మీకు కష్టములు కలుగుచుండుటచే తను ధర్మమునకు నధర్మఫలములును, నధర్మమునకు ధర్మఫలములును గలుగుచున్నవి. ధర్మాచరణచే ధర్మఫలమును, నధర్మాచరణచే నధర్మ ఫలమును కలుగవలసియుండును. అధర్మమున బుద్ధిగలవా రధర్మకార్య ములను, ధర్మమునందు బుద్ధిగలవారు ధర్మకార్యములను జేయుదురు. ధర్మాధర్మములను జేయువారికి తగినఫలములు కలుగవలసియుండును; కానిప్రత్యక్షముగ నధర్మమునుజరుపువారికి వృద్ధియు, ధర్మమునుజరుపు వారికి బాధలును గలుగుచున్నవి. కనుక ధర్మాధర్మములు సరియగు ఫలములనీయక నిరర్థకములైనవి. పాపకర్ము లధర్మకర్మచే వధింపబడిన యెడల వధకర్మయగు నాయధర్మమే హతమగుచున్నది. హతమైన యాయధర్మ మితరులను నాశనముచేయలేదు. అప్పు డధర్మ మెట్లు బాధించును? లేక జనుడు దైవముచే బాధింపబడినప్పుడును, నతడు మఱియొకనిని బాధించినప్పుడును గలిగినపాపము దైవముచే చెందును; కాని కర్మజరుపువానిని జెందదు. ప్రత్యక్షముగ ఫలమునీయునదియు, స్పష్టముగ పైకి గనబడనిదియు, పొందశక్యముకానిదియునగు ధర్మము వలన గొప్ప శ్రేయస్సును పొంద నెట్లుశక్యమగును? ధర్మపరాయణా! ధర్మమనునది యేదైననున్నయెడల ధార్మికులగు మీకు కీడేమియు గలుగకుండెడిది. మీ కిట్టివ్యసనములు కలుగుటచే ధర్మమేలేదని తల చెదను. లేక ధర్మము బలముగలవాని ననుసరించియుండును. బలహీను డును, పౌరుషములేనివాడును, మర్యాదలేనివాడును ధర్మమును సేవింప కూడదని నాయభిప్రాయము. బలమునకు ధర్మమేగుణమైయుండిన యెడల ధర్మమును విడిచి బలమును సేవింపవలెను. ఒకవేళ సత్యవచ నమే ధర్మమైనయెడల మనతండ్రి మిమ్ము రాజ్యాభిషిక్తునిగజేసెదనని మొదట పలికెను. పిమ్మట మీయందుదయలేక యబద్ధము పలికి మిమ్మడివికి బంపెను. అందులకు మీ రాతని నిరోధింపలేదు.

అంతేగాక రెండవసారిపలికిన తండ్రిమాటను జరుపు మీరు మొదటను తండ్రిపలికిన సత్యవచనము నేల పరిపాలింపలేకపోయి తిరి? ధర్మమార్గముననే ప్రవర్తించి యధర్మమార్గమును విడువవలసి నచో నిందుృడు విశ్వరూపుని జంపకయే యజ్ఞముచేసియుండును. కేవలము ధర్మమునుగాని, యధర్మమునుగాని చేయువాడు నాశనమును బొందును? గనుక నరుడు తనయిష్టప్రకారము కార్యములను జేయుచుండవలెను. ఇష్టమువచ్చినట్లు కార్యములను జేయుటయే ధర్మమనినాయభిప్రాయము. మీరు రాజ్యమును విడిచి ధర్మమునకు మూలమగుదానిని నాశనముచేసితిరి. సంపాదింపబడినవియు, వృద్ధినొందినవియు నగు ధనాదులవలన కార్యములన్నియు నగును. ధనములేని తేజోహీనునికి పనులు జరుగవు. పూర్వము సుఖముల ననుభవించినవాడు తనకు గల ధనాదులను విడిచి సుఖమును గోరుచు దోషకార్యములచే ధనమార్జించి పాపమును జేయును. ధనాదులుగలవానికే లోకములో స్నేహితులు, బంధువులు నుందురు. అట్టి వాడే లోకములో పురుషుడు; పండితుడు; పరాక్రమవంతుడు; భాగ్యవంతుడు; బుద్ధిమంతుడు; గుణవంతుడు.ధనాదులను విడుచుటచే గలుగుదోషములను దెలిపితిని. మీరేమి యాలోచించి రాజ్యమును విడిచితిరో నేను తెలిసికొనలేను. ధనాదులు గలవానికి ధర్మార్థకామములు సుళువుగ లభించును. ధనములేక కోరికలుగలవా డెంతయత్నించినను నవి నెఱవేఱవు. ధనాదులుగలవానికి సంతోషము, కామము, గర్వము, ధర్మము, క్రోధము, శమదమములు శోభించును. ధనాదులయందు మనస్సును విడిచి ధర్మమాచరించువానికి నీలోకమున సౌఖ్యములు లేవు. సకలశ్రేయస్సాధనభూతములగు ధనాదులు మీయందు వర్షాకాలమందు గ్రహములవలె గనబడుట లేదు. మీరు తండ్రిమాటప్రకారము వనమునకు రాగా మీప్రాణము లకంటె ప్రియమగు మీభార్యను రాక్షసు డెత్తుకొనిపోయెను. ఇప్పు

డింద్రజిత్తు మిక్కిలిదుఃఖకరమగు పనిచేసెను. దానికి తగినప్రతిక్రియను నేను చేసెదను. కనుక మీరు లెండు. రామా! మీరు మహాత్ములరు; పరమాత్ములరు. మిమ్ము మీరేల తెలిసికొనరు? మీప్రియముకొఱకు నేను లంకనంతను నాశనము చేసెదను." ఇట్లు పలుకుచు లక్ష్మణుడు రాముని నోదార్చెను.

లక్ష్మణుడు తనతొడమీదమూర్ఛజెంది సిగ్గుతోనున్న రాముని నిట్లోదార్చుచుండ విభీషణుడును, నతనిమంత్రులు నలుగురును వానర సేనను పరీక్షించివచ్చిరి. అతడు రాముడు శోకముతో నుండుటయు, వానరులు కన్నీరు తెచ్చుకొనియుండుటయు జూచి లోనదుఃఖించుచు దీనముఖముతో 'ఇది యేమి'? యని యడిగెను. లక్ష్మణు డాతనిని, సుగ్రీవుని, వానరులను జూచుచు కన్నీరు తెచ్చుకొనుచు 'ఇంద్ర జిత్తు సీతను హతమొనర్చె నని హనుమంతుడు తెలుప రాముడు మూర్ఛజెందె' నని పలుకుచుండ విభీషణుడు లక్ష్మణుని వారించి యక్కడ కూర్చుండి "హనుమంతుడు తెలిపినవార్త సరియైనది కాదని నేను తలచెదను. దురాత్ముడగు రావణునకు సీతనుగూర్చి కలిగిన యభిప్రాయమును నే నెఱుగుదును. అత డామెకు ఘాతయేమియు జేయడు. నేను పూర్వ మనేకపర్యాయము లామెను విడువవలెనని వానిహితమునుగోరి ప్రార్థించినను రావణుడట్లు చేయలేదు. సామ దాన భేద దండోపాయములచేతగాని, మఱియేవిధముననగాని యామె వానికి స్వాధీనము కాలేదు. ఇంద్రజిత్తు వానరుల నిట్లు మాయచేసి లంకలో నికుంభిలయను శక్తియుండు దేవగృహమున హోమముచే యుటకు వెళ్లి యక్కడ దానిని జరుపుచున్నాడు. ఇంద్రజిత్తు దానిని పూర్తిచేసి వచ్చినయెడల వాని నింద్రాదిదేవతలైనను యుద్ధమున జయింపలేరు. తనయజ్ఞమునకు వానరులు పరాక్రమముచే విఘ్నము చేయుదురని యనుమానించి వాడిట్లు మాయను నిజముగ బన్నెను.

ఆయజ్ఞము పూర్తికాకుండ మనము సైన్యములతో నచటికి వెళ్లుదము. రామా! మాయవలన గలిగిన యీదుఃఖమును మీరు విడువుడు. విచారముతోనున్న మిమ్ము జూచి మీసైన్యమంతయు కృశించుచు న్నది. మీ రిక్కడ విచారమును విడిచి బలమునుబొంది నిలువుడు. మాతో మంచి వానరవీరులను, లక్ష్మణుని బంపుడు. అతడు వానిపై వాడిబాణములను విడిచి యజ్ఞమునకు విఘ్నముకావించును. తరువాత నింద్రజిత్తు చంపబడగలడు. ఇంద్రజిత్తును జంపుటకు లక్ష్మ ణుని బంపుడు. శత్రువును జంపుటను గూర్చి యిప్పుడు కాలవిలంబ ముచేయుట యుక్తముకాదు. లక్ష్మణునిబంపుట కాజ్ఞయిండు. ఇంద్రజిత్తు యజ్ఞమును పూర్తిచేసినయెడల యుద్ధములో దేవాసురులకైనను గన బడడు. అప్పుడు వానితో యుద్ధముచేయుటకు గొప్పసంశయము కలు గు"నని విన్నవించెను.

విభీషణునిమాటలను రాముడు విని శోకములో మునిగియుం డుటచే నతడుచెప్పినదానిని సరిగ గ్రహింపలేదు. తరువాత రాముడు ధైర్యము తెచ్చుకొని విభీషణుని 'రాక్షసశ్రేష్ఠా! నీవుచెప్పిన దానిని మఱలవినగోరుచున్నాను. నీయభిప్రాయమును దెలుపు' మని యడుగ నతడిట్లు మనవిచేసెను. "పూర్వము మీ రాజ్ఞాపించినప్రకారము నేను సేననంతను విభజించి నిలిపితిని. మీరు కారణములేకుండ సంతాపము నొందుటచే మాయందఱిమనస్సు విచారముగనున్నది. అసత్యసమా చారము తెలియుటచే గలిగినశోకమును మీరు విడువుడు. మీశోకము వలన శత్రువులకు సంతోష మెక్కువగును. మీరు హర్షమునుబొంది యుద్ధయత్నముచేయుడు. మీకు సీత దొరకవలెననియు, రాక్షసులు హతముకావలె' ననియు నున్నయెడల నేను చెప్పెడి హితవాక్యములను మీరు వినవలెను. నికుంభిలాదేవిగృహమువద్ద నింద్రజిత్తు హోమము చేయుచున్నాడు. అక్కడకు లక్ష్మణుడు గొప్పబలములతో వెళ్ళి వానితో యుద్ధముచేసి తీవ్రములగు బాణములనువిడిచి వానిని జంపవలెను.

ఇదివర కింద్రజిత్తు తపస్సుచేసి బ్రహ్మవరముచే 'బహ్మశిర' మనెడు నస్త్రమును బొందెను. హోమము పూర్తియైనయెడల వానికి తనకోరికప్రకారము వోవుగుఱ్ఱములను గట్టినరథము దొరకును. వాడు నికుంభిలవద్ద హోమము చేయుచు బలములతో సిద్ధముగ నున్నాడు. వాడు దానిని పూర్తి చేసిన మనకందఱికి మరణము కలుగును. అది పూర్తికాకుండ వానిని జంపవలెను. * వానిమరణమునకై లక్ష్మణుని బంపుడు. వాడు మరణించిన రావణుని, వానిబంధుమిత్రులును మృతినొందెదరు." ఇట్లు విభీషణుడు పలుక రాముడిటుల సెలవిచ్చెను. 'నేను మిక్కిలిభయంకరుడగు వానిమాయలను నెఱుగుదును. వాడు గొప్పప్రజ్ఞగలమహాబలుడు; బ్రహ్మాస్త్రము బాగుగ నెఱిగినవాడు. వాడు దేలతలతోను, వరుణునితోను యుద్ధముచేసి వారిని మూర్ఛ నొందించును. వాడు రథమెక్కి యాకాశమున తిరుగుచుండ వాని గమన మెవరికిని తెలియదు.' ఇట్లు రాముడు పలికి లక్ష్మణునితో నిట్లనెను. 'హనుమంతుడు, జాంబవంతుడుమొదలగు వానరవీరులతోను,

* అ. రా:—విభీషణుడు రాముని 'ఇంద్రజిత్తుపై యుద్ధమునకు లక్ష్మణుని బంపు' డని కోర నతడు 'నేనే వచ్చెద' నని పలికెను. దానికి విభీషణుడు 'ఇంద్రజిత్తితరులచే జంపబడడు. 12సంవత్సరములు నిద్రాహారములు లేనివానిచే నింద్రజిత్తు మరణమునొందునని బ్రహ్మ విధించెను. లక్ష్మణుడు మీతో నయోధ్యనుండి బయలుదేఱినది మొదలు మీసేవచేయుకొఱకు నిద్రాహారములు మొదలగువానిని నెఱుగడు. ఇదంతయు నాకు దెలియును. కనుక మీరు శీఘ్రముగ నాతో లక్ష్మణుని బంపిన నతడు తప్పక యింద్రజిత్తును జంపును. అతడు సాక్షాత్తు భూమినిమోయు నాదిశేషుడు. మీరు నారాయణులు. మీరిద్దఱు భూభారమును బోగొట్టుటకై జన్మించి జగత్తనెడు నాటకములో సూత్రధారు లగుచున్నా' రని విన్నవించెను.

వానరబలముతోను నీవు వెళ్ళి మాయలు బాగుగ నేర్చినట్టియింద్రజిత్తును బరిమార్చుము. విభీషణునకు వాడుండుచోటు బాగుగ దెలియును. ఇతడును, నితనిమంత్రులును నీతో వచ్చెదరు.' రాముని యీమాటలను లక్ష్మణుడువిని కవచముతొడుగుకొని మంచిధనస్సును, నమ్ముల పొదులను, ఖడ్గమును బట్టి యాతనిపాదములకు నమస్కరించి 'ఇప్పుడు నావాడిబాణములచే నింద్రజిత్తును బరిమార్చెద' నని పలికి యతనికి ప్రదక్షిణముచేయ రాము డతనిని బాగుగ దీవించెను. విభీషణుడును, వానిమంత్రులును, హనుమంతుడు, అంగదుడు మొదలగు వానరులును, ఋక్షులును వెంటరాగా లక్ష్మణుడు చాలదూరము వెళ్ళి కొంతదూరమున రాక్షసబలము వ్యూహములుగ నిలుచుట చూచెను.

---

## ౮౯వ. అధ్యాయము

### ఇంద్రజిత్తుయుద్ధము, వానిమరణము.

లక్ష్మణుడును, విభీషణుడు మొదలగువారును నికుంభిలకు కొంతదూరమున నిలిచిరి. అంతకుపూర్వమింద్రజిత్తు దట్టముగ చెట్లుకల నికుంభిలయను ప్రదేశమునకు వెళ్ళి యగ్నిలో మాంసమును, రక్తమును వేల్చెను. అగ్ని బాగుగ మండుచుండెను. అనేకరాక్షసులు దానిచుట్టు నిలిచియుండిరి. అంతట విభీషణుడు లక్ష్మణునితో నిట్లనెను. 'నీల మేఘమువలె గనిపించునా రాక్షససైన్యముతో వానరులు శీఘ్రముగ యుద్ధముచేయవలెను. దానిని భేదించినగాని యింద్రజిత్తు వేఱుగ గనబడడు. హోమకర్మ పూర్తికాకముందే బాణములను విడువుము. అన్నిలోకములకు భయంకరుడును, క్రూరకర్మలను జేయువాడును, దురాత్ముడును, మాయావియునగు నింద్రజిత్తుని జంపుము.' ఇట్లు

విభీషణుడు పలుక లక్ష్మణు డింద్రజిత్తుపై వాడిబాణములను విడిచెను. వానరులును, ఋక్షులును కొండశిఖరములు, చెట్లు మొదలగువానిని బట్టియు, రాక్షసు లనేకవిధములగు నాయుధములనుబట్టియు గొప్ప యుద్ధము చేసిరి. రాక్షసు లనేకులు చచ్చుచుండుట యింద్రజిత్తువిని హోమకర్మను పూర్తి చేయకుండ లేచి క్రోధముతో చెట్లమధ్యనుండి పైకివచ్చి గుఱ్ఱములను గట్టినదియు, నాయుధములతో నిండినదియునగు రథ మంతకుపూర్వమే సిద్ధముగనుండ దాని నెక్కెను. వాడు పెద్ద ధనస్సు బట్టియుండుట వానిబలముచూచి వానిచుట్టును జేరెను. అప్పుడు హనుమంతుడు పర్వతరూపుడై యొక పెద్దచెట్టును నెత్తి రాక్షసులను గొట్టెను. అట్లతడనేకవృక్షములను బట్టి వారిని హింసింప వారు తెలివితప్పి క్రిందబడిరి. అప్పు డనేకరాక్షసు లతనిచుట్టుచేరి వివిధాయుధములనుబట్టి యతనితో యుద్ధముచేయు నతడుకూడ వారితో గొప్పయుద్ధముచేసెను. అప్పుడింద్రజి త్తాతని జూచి తనసారథితో 'నేనుపేక్షించిన యెడల మనరాక్షససైన్యము నాశనమగును; గనుక హనుమంతుడుండుచోటికి రథమును తోలు'మని చెప్ప వాడట్లుతోలెను. ఇంద్రజిత్తు హనుమంతునితలపై శరములను, ఖడ్గములను, పట్టసములను, గండ్రగొడ్డళ్ళను విసర నవి వానికి తగిలెను. తరువాత వాయుపుత్రుడు వానితో 'నీవు శూరుడవైన బాహువులతో నాతో ద్వంద్వయుద్ధముచేయుము. నా వేగమునకు నీవు నిలిచిన రాక్షసులలో శ్రేష్ఠుడవేయగుదువు. నాతో యుద్ధముచేసినీవు జీవములతో మరలివెళ్ళ'వని పల్కెను. పిమ్మట నతనితో నింద్రజిత్తు యుద్ధముచేయుచుండ వానిని విభీషణుడు లక్ష్మణునకు జూపి 'పర్వతరూపుడగు వీనిని వాడిబాణములచే నంతమొందింపు' మనిచెప్పెను.

విభీషణు డిట్లు పలికి పిమ్మట లక్ష్మణుని నక్కడకు దగ్గఱగ నున్న నికుంభిలవనమునకు దీసికొనిపోయి యింద్రజిత్తుచేసిన హోమ

కర్మను వానికి జూపెను. తరువాత నత డక్కడనున్న నల్లనిపెద్దమఱ్ఱి చెట్టునొకదానిని జూపి 'ఇక్కడకు సింద్రజిత్తు వచ్చి భూతములకు బలి యిచ్చి తరువాత యుద్ధమునకు వెళ్లును. అప్పుడు వాడెవనికిని గనబడ కుండ నిలిచి మంచిబాణములను శత్రువులపై విడిచి వారిని జంపును. కావున వా డిక్కడకు రాకపూర్వమే వానిని, వానిరథమును, సారథిని వాడిబాణములతో బరిమార్చు'మని కోర లక్ష్మణుడు 'అట్లే చేసెద' ననిపలికి చిత్రమగు తనధనస్సును బ్రయోగించుచు నిలిచెను. అప్పు డిం ద్రజిత్తు మంచికవచమును దొడుగుకొని మంచిధనస్సును బట్టి సూర్య వర్ణముగలరథముపై నెక్కియుండి యతనికి గనబడెను. లక్ష్మణుడు వానిని జూచి 'నిన్ను నేను యుద్ధమునకు బిలుచుచున్నాను. సరియగు యుద్ధమును జేయు'మనికోరెను. అప్పు డింద్రజిత్తు విభీషణునిజూచి యిట్లు కఠినమగుమాటలను బలికెను. "నీవు లంకలో బుట్టిననాటనుం డియు నాతండ్రియగు నీయన్నచే పెంచబడితివి. నీకుమారునివిషయ మున నీ వేలద్రోహముచేయుచున్నావు? దుర్బుద్ధీ! నీవు జ్ఞాతిభావము నుగాని, స్నేహమునుగాని, జాతిసంగతినిగాని, మర్యాదనుగాని, ధర్మ మునుగాని యాలోచింపక యధర్మముగ నేలయిట్లుచేసితివి? నీవు నీవా రిని విడిచి యితరులను సేవించినందులకు మంచివారు నిన్ను నిందించె దరు. నీచబుద్ధిచే నీవు మంచియొక్క తారతమ్యమును నెఱుగకున్నావు. తనవారితో గలిసియుండుటెక్కడ? నీచులగు పరులనాశ్రయించు టెక్కడ? గుణవంతుడగు నితరుని సేవించుటకంటె గుణములు లేక పోయినను తనవారినే సేవించుట మంచిది. పరు లెప్పుడును పరులే. ఎవడు తనపక్షమును విడిచి శత్రుపక్షమును సేవించునో వానిని శత్రుపక్షమువారు వానిపక్షమువారునాశనమైనపిమ్మట జంపుదురు. నే నిప్పుడు చూపినకఠినమగు నిర్దయ బంధువులుచూపదగినదికాదు." ఇట్లింద్రజిత్తు విభీషణునకు చీవాట్లు పెట్ట నత డిట్లు జబాబుచెప్పెను. "రాక్షసా! నాస్వభావమును దెలియనివానివలె నిట్లేలపలుకుచున్నావు?

దుర్మార్గుడా! గొప్పకొఱకై పలుకు నీ కఠినపుమాటలను మానుము. నేను క్రూరకర్ములగు రాక్షసకులమున బుట్టినను నాగుణము రాక్షసగుణముకాదు; సత్పురుషులకు నది ముఖ్యము. నేను దారుణకార్యములను జేయుచును, నధర్మపుపనులను జేయుచును క్రీడింపను. అందుచేతనే నన్ను దుర్మార్గపుగుణములుగల నాయన్న తిరస్కరించెను. ధర్మమును విడిచినవాడును, పాపముచేయువాడునునగు పురుషుని విడుచువాడు సుఖమును బొందును. జనుడు హింస, పరులసొత్తును హరించుట, పరభార్యలనుబొందుట యను దురాచారములను విడువవలెను. పరధనము నపహరించుట, పరభార్యలనుబొందుట, స్నేహితులయందవిశ్వాసముకలిగియుండుట యను మూడుదోషములుకలవారిని నవియే నాశనముచేయును. నీతండ్రికి మహాత్ములను ఘోరముగజంపుట, దేవతలందఱితోను యుద్ధముచేయుట, గర్వము, కోపము, బద్ధవైరము కలిగియుండుట, ఇతరుల శ్రేయస్సు నోర్చకుండుటయను ప్రాణైశ్వర్యనాశనకరములగు నీదోషములు కలవు. సుగుణములను నాశనము చేయు నీదుర్గుణములచేతనే నే నాతని విడిచితిని. ఈలంకగాని, నీవుగాని, నీతండ్రిగాని యిక యుండరు. నిన్నుగుఱించిగొప్పగ నాలోచించుకొనువాడవును, బాలుడవును, చెడునీతులుగలవాడవునునగు నీవు కాలపాశముచే గట్టబడితివి. నీవు నన్నేమియనదలచితివో యనుము. నీ కిప్పుడు కష్టము కలిగినది. నీవు నన్నిప్పు డేమనెదవు? మఱ్ఱిచెట్టు వద్దకు నీవు పోవవీలులేదు. లక్ష్మణుని నెదుర్కొని నీవు జీవింపలేవు. నరశ్రేష్ఠుడగు లక్ష్మణునితో నీవు యుద్ధము చేయుము. నీవు మరణమునొంది యమలోకమునుబొందినపిమ్మట నచట నీదేవతాకార్యమును జేయవచ్చును. నీబలము నిప్పుడు చూపింపుము. బాగుగ ప్రయత్నముచేసి నీయాయుధముల నుపయోగింపుము. లక్ష్మణునిబాణములు తగుల నీవును, నీబలములును ప్రాణములతో వెళ్లరు." ఇట్లు జవాబు చెప్పుచు విభీషణుఁ డింద్రజిత్తును కఠినమగు మాటలననెను.

విభీషణునిమాటల నింద్రజిత్తు విని క్రోధము తెచ్చుకొని పెద్దధనస్సునుబట్టి తనరథమున నిలిచి హనుమంతునివీపుపై నెక్కిన లక్ష్మణున కెదురువెళ్లి యుద్ధమునకు సిద్ధముగనున్న యతనితోను, విభీషణునితోను, మిగిలినవానరులతోను నిట్లనెను. "నాపరాక్రమమును జూడుడు. నేను విడిచినతీవ్రబాణములను మీరడ్డుకొనుడు. అవి మీశరీరములను జీల్చివేయును. నేను బాణములను, శక్తులను, యష్టులను, తోమరములను విడిచి మిమ్ములను యమపురికి పంపించెదను. నేను శీఘ్రముగ బాణవర్షమును కురిపించుచు పెద్దనాదముచేయ నెవడు నాయెదుట నిలువగలుగును? రాత్రియుద్ధమున నేను తీవ్రబాణములను విడువ రామలక్ష్మణులు వానరులందఱితోను భూమిమీద మూర్ఛనొంది శయనించిరి. లక్ష్మణా! నీవు నాతో యుద్ధముచేయుటకు వచ్చుటచే నీకు జరిగినసంగతి జ్ఞాపకములేదని తలచెదను. అది నిశ్చయము. లేనియెడల నీవు యమలోకమునకు పోవుట స్పష్టము." ఇట్లింద్రజిత్తు పలుక లక్ష్మణు డేమియు భయమునొందక వాని కిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "నీవు దుర్లభమగు పనులను చేయుటనుగూర్చి పలుకుటమాత్రమే జరిగినది. వానిని జరిపినవాడు బుద్ధిమంతుడు. నీవు నీచమగు ప్రయోజనములు కలవాడవు. ఎవడును పొందలేని కోరికలుగల నీ వేదో యొకమాటబలికి నీకార్యము జరిగినదని యనుకొనువాడవు. నీవు యుద్ధములో గనబడకుండ నిలిచి చేసిన యుద్ధకర్మలు దొంగలు చేయు దొంగపనులవంటివి. వీరు లట్లు చేయరు. నీవు నాపైని బాణములను విడుచుటకు నీయెదుట నే ననుకూలముగ నున్నాను. అట్లే నీవుకూడ నీపూర్వరూపమును నిప్పుడు చూపుము. నీవు మాటలతో నేల శ్లాఘించుకొనెదవు!" ఇట్లు లక్ష్మణుడు పలుక నింద్రజిత్తు తనధనస్సును సంధించి వాడిబాణములను విడువ నవి లక్ష్మణునకు తగిలి క్రిందపడిపోయెను. తరువాత వాడు మఱికొన్ని వేగముగల బాణములను

నతనిపై విడువ నాతనిశరీరమునుండి రక్తమెక్కువగ వచ్చెను. దానితో నింద్రజిత్తు తనపనులకు సంతోషించి పెద్దనాదముచేయుచు నిట్లు పలికెను. 'నావాడిబాణములు నీప్రాణములను దీసివేయును. నీపైని నక్కలు, గ్రద్దలు మొదలగునవి పడి నిన్ను పీకుకొని తినును. రామునకు తమ్ముడవును, భక్తుడవును నగు నీమరణమును రాము డిప్పుడే చూచును. నీకవచమును, ధనస్సును తెగగొట్టి నీతలను దుంచెదను.' ఇట్లింద్రజిత్తుపలుక లక్ష్మణు డుపయుక్తమగుమాటలతో నిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. 'దుర్బుద్ధీ! పెద్దమాటలను మానుము. నీవు క్రూరకర్మలను జేసియుంటివి. నీవుపలికినపలుకులకు తగినట్లు మంచి కర్మలను జేసి కీర్తిని సంపాదింపుము. రణకర్మ నేమియు చేయక యేల నీ విప్పుడు శ్లాఘించుకొనెదవు? నీవు కీర్తించుకొనుమాటలను నేను నమ్మునట్లు రణకర్మను జేయుము. నీచరాక్షసా! నేను నిన్ను కఠినపు మాటల నేమియు బలుకక యాక్షేపింపక నన్ను నేనుపొగుడుకొనక నిన్ను వధించెదను; చూడుము.' ఇట్లు లక్ష్మణుడు పలికి యింద్రజిత్తు వక్షమునకు దగులునటుల 5 బాణములను పూనికతో విడిచెను. దానితో వానికి రోషముపుట్ట వా డాతనిపై మూడుబాణములను విడిచెను. వారిద్ద ఱొకరినొకరు జయింపగోరుచు గొప్పయుద్ధముచేసిరి. వారిద్దఱు గొప్పబలముకలవారు; పరాక్రమవంతులు; శస్త్రాస్త్రములు బాగుగ నెఱిగినవారు; గొప్ప తేజోవంతులు; జయింపశక్యముకాని వారు. అట్టివారిద్దఱు నాకాశముననుండు గ్రహములవలె పోరాడిరి. ఒకరిపై నొక రనేకబాణములను విడిచిరి.

లక్ష్మణు డింద్రజిత్తుపై నొకవాడిబాణమును విడువ వాడు వాడినముఖముతో సౌమిత్రిని జూచెను. అప్పుడు విభీషణుడు 'రావణపుత్రునికి చెడుచిహ్నములు కనబడుచున్నవి. త్వరపడుము. వీడు నాశన మొందుట నిశ్చయ'మని లక్ష్మణునితో బలుక నతడు రావణిపై వాడిబా

ణములను విడిచెను. దానితో నింద్రజిత్తు మూర్ఛపోయి తిరిగి ముహూర్తములో తెలివితెచ్చుకొని లక్ష్మణునిజూచి రోషముచేనెఱ్ఱబారినకండ్లు గలవాడై యాతనిదగ్గఱకు పోయి కఠినమగు మాటలతో ప్రథమ రాత్రియుద్ధమునుగూర్చి తిరిగిపలుకుచు మఱియు నిట్లనెను. 'నాప్రథమయుద్ధమున నాపరాక్రమము నీకు తెలియకపోయిన దాని నిప్పుడు చూపెదను. నీవు సిద్ధముగనుండుము.' ఇట్లింద్రజిత్తు పలికి లక్ష్మణునిపై నేడుబాణములను, హనుమంతునిపై పదిబాణములను, గొప్పకోపముతో విభీషణునిపై నూఱుబాణములను విడిచెను. లక్ష్మణు డాబాణములను లక్ష్యముచేయక పెద్దనవ్వునవ్వుచు నీపనులేమియు గొప్పవి కావని పలికి వాడిబాణములను వానిపై విడిచెను. తరువాతనతడుజడియక వానితో 'యుద్ధమునకు వచ్చినశూరులు స్వల్పబలముగల బాణములను విడువరు. ఈనీశరములు నాకు తగిలినను సుఖముగనున్నది. యుద్ధములో జయముకోరుశూరులిట్లు యుద్ధముచేయ'రని పలికి వానిపై బాణవర్షము కురిపించి వానికవచము తెగి రథముపై బడునట్లు చేసెను. వానిశరీరము నిండ గాయములయ్యెను. అప్పుడు వాడుకూడ కోపముచే నాతనిపై వేయిబాణములను వేయ నతనికవచముకూడ తెగి క్రిందబడెను. వారిరువు రొకరిపై నొకరు బాణములను విడుచుచుండిరి. వారిరువురకు గాయములుకలుగ రక్తముకాఱుచుండెను. వా రొకరి నొకరుజయించుటకు చాలసేపు గొప్పయుద్ధముచేసిరి. వారికి శ్రమగాని, యుద్ధవిముఖతగాని కలుగలేదు. ఉభయులు పెద్దనాదముచేసిరి. వారు విడిచినబాణములుకొన్ని యొకదానినొకటి ఖండించుకొనెను; కొన్ని చీల్చుకొనెను; కొన్ని రాసికొనుచు బోయెను.

ఇట్లు లక్ష్మణుడును, నింద్రజిత్తును నొకరి నొకరు చంపుకొనుటకు యుద్ధముచేయుచుండ విభీషణుడు పెద్దధనస్సును బట్టి రాక్షసులపై వాడిబాణములను విడిచెను. అతనిమంత్రులుకూడ శూలములను,

కత్తులను, పట్టసములను బట్టి రాక్షసులను గొట్టిరి. వానరు లక్కడ నుండుట విభీషణుడు చూచి వారలతో కాలోచితముగ నిట్లనెను. "రావణునకు నితడొక్కడే గతియై నిలిచియున్నాడు. వానిబలమున కంతకు వీడే మిగిలియున్నాడు. రాక్షసబలములను జూచుచు మీరేల యూరకున్నారు? ఇంద్రజిత్తు మరణించినయెడల సేనలో రావణుడు తప్ప మిగిలినవారు నశించినట్లే. ప్రహస్తాదులందఱు యుద్ధమున మడిసిరి. మిగిలిన యీ రాక్షసులను జంపవలెను. నాయన్నకొడుకును నేను చంపుటయుక్తముకాదు. రామునినిమిత్తము నేను దయను విడిచి వానిని జంపవలసినదే కాని కన్నీరువలన నాకన్నులు కనబడవు. వానిని లక్ష్మణుడు సంహరించును. మీరు వానితోనున్న రాక్షసులను బరిమార్చవలెను." ఇట్లు విభీషణుడు పలుక వానరులు గొప్పసంతోషముతో పెద్దనాదముచేసిరి. జాంబవంతుడును, ఋక్షులును రాక్షసులపై రాళ్లను విసరి గోళ్ళతోను, దంతములతోను వారిని జీల్చిరి. రాక్షసు లనేకవిధములగు నాయుధములను బట్టి భయమునువిడిచి జాంబవంతునిచుట్టుచేరి యతనిని గొట్టిరి. అప్పుడు వానరఋక్షులకును, రాక్షసులకును ఘోరయుద్ధముజరిగెను. హనుమంతు డొకగుగ్గిలపు చెట్టునుబట్టి వేలకొలది రాక్షసులను గొట్టెను. ఇంద్రజిత్తు విభీషణునితో కొంతవరకు యుద్ధముచేసి లక్ష్మణునితో తిరుగయుద్ధమునకు దలపడెను. వారొకరిపై నొకరు బాణములను విడుచుచు శరీరమున నవి తగులుచున్నను ఘోరముగ యుద్ధముచేసిరి. వారు బాణముల నమ్ముల పొదులనుండి తీయుటకాని, వానిని ధనస్సున సంధించుటకాని, దానిని క్రమముగ పట్టుటకాని, నారిని చెవులవరకు వెనుకకు లాగుటకాని, వానిని విడుచుటకాని, పిడికిలితో ధనస్సునుబట్టుటకాని, కొట్టవలసిన దానిని గుఱిచూచుటకాని వారిహస్తలాఘవముచే నితరులు కనిపెట్టలేకపోయిరి. వారు విడిచినబాణము లెక్కువగుటచే చీకటిగాయి యంత

కాళమున నేదియు గనబడకపోయెను. ఇట్లు వారిరువురకు ఘోర యుద్ధముజరిగెను. అన్నిదిక్కులందు బాణములునిండెను. రక్తము వఱద లుగకాఱుచుండ మాంసాహారముగల గ్రద్దలు మొదలగునవిధ్వనిచేయు చుండెను. అప్పుడు వాయువు వీవలేదు; అగ్ని మండలేదు. మహర్షులు 'లోకమునకు శుభమగుగాక!' యని వేడిరి. యుద్ధమును జూచుటకు వచ్చినగంధర్వులు, చారణులు మఱియొకచోటికి బోయిరి. అప్పుడు లక్ష్మణు డింద్రజిత్తురథమునకు గట్టబడిన నల్లగుఱ్ఱములను నాల్గిటిని నాలుగువాడిబాణములతో గొట్టి మఱియొకతీవ్రబాణమును వానిరథ సారథిపై విడువ వానితల తెగిపోయెను. తరువాత నింద్రజిత్తు తానే రథముతోలుచు వింటినిబట్టి బాణములను విడుచుచుండ దాని కంద ఱును నాశ్చర్యమునొందిరి. ఇంద్రజిత్తు గుఱ్ఱములను దోలునపు డింద్ర జిత్తుపైనను, వాడు ధనస్సును బట్టినపుడు వానిరథగుఱ్ఱములపైనను లక్ష్మణుడు బాణములను విడుచుచుండెను. సమయముకనిపెట్టి యతఁ డింకను వానిపై బాణములను విడుచుచుండెను. సారథి చచ్చిపోవుటచే నింద్రజిత్తు యుద్ధాసక్తిని విడిచి విచారముగ నుండెను. దానిని వాన రులు చూచి సంతోషించి లక్ష్మణుని గీర్తించిరి. అప్పుడు ప్రమాథి, శరభుడు, రభసుడు, గంధమాదనుడు నను నలుగురు కోపముతో 4గుఱ్ఱ ములపైకి నుఱికి వానిపై కూర్చుండ నవి ముఖములనుండి రక్తము గ్రక్కుచు మరణమునొంది క్రిందపడెను. వారు రథమునుగూడవిఱిచి లక్ష్మణునియొద్దకు వచ్చిరి. ఇంద్రజిత్తు క్రిందకుఱికి లక్ష్మణునిపై ననేక బాణములను విడువ నతడుకూడ వానిపై ననేకబాణములను విడిచెను.

ఇంద్రజిత్తు విరథుడైనను లక్ష్మణునితో యుద్ధముచేయుచుం డెను. వారిరువు రొకరిపై నొకరు బాణములను వేసికొనుచుండిరి. వానరులు, రాక్షసులు యుద్ధముచేయుచు నొకరి నొకరు చంపుకొను చుండిరి; కాని వారు తమప్రభువులనుమాత్రము విడువక వారిచుట్టును

నిలిచియుండిరి. అప్పు డింద్రజిత్తు సంతోషించి రాక్షసులను స్తుతించుచు వారలకు సంతోషముకలుగునట్లుచేసి యిట్లు పలికెను. 'అన్ని దిక్కులును గొప్పచీకటిచే నిండియున్నవి. మనలను, శత్రువులను పోల్చుకొనుటకు వీలులేకుండనున్నది. వానరులకు నజ్ఞానముకలుగునట్లు నిర్భయముగ మీరు ధైర్యముతో యుద్ధముచేయుడు. నేను లంకకు బోయి రథమునెక్కి యుద్ధమునకు వచ్చెదను. నేను లంకకుబోవుసమయమున వానరులు నాతో యుద్ధముచేయకుండునటుల మీరు ప్రవర్తింపుడు.' ఇట్లు రావణపుత్రుడు పలికి వానరులను మోసపుచ్చి రథముకొఱకై లంకకు బోయెను. వాడు మంచిరథమున నాయుధముల నన్నిటిని పూర్తిగవేయించి మంచిగుఱ్ఱములను గట్టించి గుఱ్ఱములను నడుపుటలో ప్రజ్ఞగలవాడును, తనకు నుపాయములను నుపదేశించువాడునునగు సారథిచే రథమును దోలించుచు దానినెక్కెను. గొప్ప రాక్షసవీరులు తన్ను వెంబడింప యమునిపాలికరుగుటకు సిద్ధమైనట్లింద్రజిత్తు బయలుదేఱి లక్ష్మణుడు, విభీషణుడు నుండుచోటికి బోయెను. లక్ష్మణ విభీషణులును, వానరులును రథముమీదనున్న వానినిజూచి వాడుశీఘ్రముగవచ్చుటకు మిక్కిలి యాశ్చర్యమునొందిరి. తరువాత నింద్రజిత్తు క్రోధముతో వానరసేనానాయకులపై వేలకొలదిబాణములను వేసెను. కొంతమందిని వాడు బాగుగ హింసింప వారు లక్ష్మణుని శరణునొందిరి. అంతట నతడు క్రోధమును జెంది మంచిబాణములచే నింద్రజిత్తుధనస్సును విఱుగగొట్టెను. వాడు శీఘ్రముగ మఱియొకధనస్సును బట్ట దానినిగూడ లక్ష్మణుడు మూడుబాణములతో ఖండించి వానియురముపై నైదువాడిబాణములను విడువ వానికవచము తెగిపడెను. వానియురమునుండి రక్తముకూడకాఱెను. అప్పు డింద్రజిత్తునోటినుండి రక్తమునుగ్రక్కుచు మంచిబలముగల ధనస్సునొకదానినిబట్టి యసంఖ్య బాణములను లక్ష్మణునిపై విడువ నతడు

కంగారుపడకుండ వానినన్నిటిని తనబాణములచే నివారించెను. తరువాత నతడు హస్తలాఘవమునుజూపుచు రాక్షసులపైని,నింద్రజిత్తుపైని శరవర్షమును గురిపించెను. వాడుకూడ నతనిపై ననేకబాణములను విడిచెను. అత డవి తనకు తగులకుండునట్లు వానినిఖండించి యొక వాడిబాణముతో వానిరథసారథి మెడను తెగగొట్టెను. సారథిలేక పోయినను గుఱ్ఱములు కంగారుపడకుండ సరిగపోవుచుండెను. లక్ష్మణుడు క్రోధముతెచ్చుకొని వానిగుఱ్ఱములపై బాణములను విడిచెను. ఇంద్రజిత్తుకూడ గొప్పకోపముతో లక్ష్మణునిపై మంచిబాణములను పదింటిని విడిచెను. అవి లక్ష్మణునికవచమునకు తగిలి క్రిందపడిపోవ నతనికవచము భేదింపశక్యముకానిదని యింద్రజిత్తు తెలిసికొని యాతని నుదుటిపై మూడువాడిశరములను విడిచెను. ఆబాణపుదెబ్బలచే నాతడుకోపించి యింద్రజిత్తుముఖముపై నైదుబాణములను విడిచెను. తరువాత వారిరువు రొకరిపై నొక రనేకబాణములను విడువ వారి శరీరములనుండి రక్తమెక్కువగ వచ్చెను. తరువాత నింద్రజిత్తువిభీషణుని ముఖముపైమూడుబాణములను విడిచి వానరసేనానాయకులందఱిపైన నొక్కొక బాణమును విడిచెను. దానికి విభీషణుడు కోపించి వానిరథగుఱ్ఱములనుతనగదతో గొట్ట నవి యంతమొందెను.సారథియు,గుఱ్ఱములును మరణమునొందుటచే నింద్రజిత్తు రథమునుండి క్రిందకుఱికి శక్తినొక దానిని తీసి తనపినతండ్రిపై విసర దానిని లక్ష్మణుడు త్రోవలోనే బాణములచే భేదింప నది ముక్కలై క్రిందబడెను. విభీషణు డింద్రజిత్తు వక్షముపై నైదువాడిబాణములను విడువ నవి వానికి తగుల వానిశరీరమునుండి రక్తమెక్కువగవచ్చెను. అప్పుడు రావణసుతుడు క్రుద్ధుడై యముడు తనకిచ్చినబాణమును విభీషణునిపై విడుచుటకు దీసెను. దానిని లక్ష్మణుడు చూచి కుబేరుడు తనకు కలలో నిచ్చిన గొప్పబాణమును దీసెను. వారిరువు రాబాణములను ధనస్సుల సంధించి విడువ

నని యంతరాళమున కలిసికొని యుద్ధముచేయుచు పొగతో నగ్ని బయలువెడలుచుండ తమబలమునశింప క్రిందబడెను. దానితో వారి ద్దఱికి సిగ్గుచే రోషమెక్కువాయెను. తరువాత లక్ష్మణు డింద్రజిత్తుపై వారుణాస్త్రమును బ్రయోగింప వాడు రౌద్రాస్త్రమునుప్రయోగించి దానినిఖండించెను. తరువాత నింద్రజిత్తాగ్నేయాస్త్రమును లక్ష్మణునిపై విడువ నాతడు సూర్యాస్త్రమును విసరి దానిబలము నడచెను. ఇంద్రజిత్తు శతృనాశనమునకై యాసురాస్త్రమును నెక్కుపెట్టి విడువ దానినుండి మాయముద్గరములు, మాయశూలములు, మాయగదలు, మాయఖడ్గ ములు, మాయగండ్రగొడ్డళ్లు మొదలగునవి బయలుదేఱెను. వానినన్ని టిని లక్ష్మణుడుమాహేశ్వరాస్త్రముతో ముక్కలుగజేసెను. ఇట్లు వా రిరువురకు ఘోరయుద్ధము జరుగుచుండెను. ఆకాశముననిలిచి చూచు చుండు నింద్రుడు దేవతలు, ఋషులు, పితృదేవతలు, గంధర్వులు, గరు డులు, నాగులు, మొదలగువారు లక్ష్మణుడుండుచోటుకువచ్చి యాతనిని దీవించిరి. వానరులు, రాక్షసులు యుద్ధముచేయుచు గొప్పధ్వనులను జేసిరి. తరువాత లక్ష్మణుడు గుండ్రమైనయాకారముగలదియు, బంగా రముతో జేయబడినదియు, నెంతమందివీరులనైనను జయించునదియు, జయింపశక్యముగానిదియు, పూర్వము దేవాసురయుద్ధములోనింద్రునిచే ప్రయోగింపబడి యసురలను జయించినదియునగు నైంద్రాస్త్రమును ధనస్సున సంధించి నారినిబాగుగలాగి యిట్లనెను. 'రాముడు ధర్మాత్ము డును, సత్యసంధుడును, పౌరుషములో నసమానుడును నయ్యేనేని యీ బాణమింద్రజిత్తుని జంపును.' ఇట్లు లక్ష్మణుడు పలికి యాబాణ మును నైంద్రమంత్రముతో నభిమంత్రించి విడువ నది కుండలముల తోను, కిరీటముతోనునున్న యింద్రజిత్తుతలను తెగగొట్టెను. వానిప్రా ణములు పోవ మొండెము, తల క్రిందబడెను. దానితో వానరులును, విభీషణుడును సంతోషముతో నాదము చేసిరి. వానరులచే గొట్టబడు

చున్న రాక్షసులుకొంద ఱింద్రజిత్తుమరణమును దెలిసికొని యాయుధ ములను విడిచి గతిలేక లంకకు పరుగెత్తిరి. కొంద ఱన్నిదిక్కులకు పరుగెత్తిరి. కొందఱు సముద్రములో బడిరి. కొందఱు పర్వతములె క్కిరి. కాని యొకరాక్షసుడైనను నచట నిలువలేదు. ఇంద్రజిత్తుమరణ ముతో గొప్పపీడ, క్లేశములు తొలగ లోకములు తేజోయుక్తము లయ్యెను. ఇంద్రుడును, దేవతలును, మహర్షులును మిక్కిలిసంతోషము నొందిరి. ఆకాశమున దేవతలు దుందుభులను వాయించిరి. అప్సరసలు గంధర్వు లాడిరి. ఆకాశమునుండి పుష్పవర్షములు కురిసెను. దిక్కు లును, సముద్రములును ప్రశాంతముగ నుండెను. దైత్యదానవులు సం తోషించిరి. దేవ దానవ గంధర్వులు 'బ్రాహ్మణులు భయ దుఃఖ ములను విడిచి యిష్టమువచ్చినట్లు తిరుగవచ్చు' నని పలికిరి. వానర సేనానాయకులందఱు మిక్కిలి సంతోషించిరి. విభీషణుడును, హను మంతుడును, జాంబవంతుడును, ధూమ్రాక్షుడును సంతోషించి లక్ష్మ ణుని పొగడిరి. వానరులు సింహనాదముచేయుచును, తోకలనాడించు చును, కొట్టుచును, 'లక్ష్మణుడు జయించె'నని యఱచుచును నాతని చుట్టుచేరిరి. వారొకరినొకరు కౌగిలించుకొని లక్ష్మణునికథలను జెప్పు కొనిరి.

తరువాత లక్ష్మణుడు తనశరీరమునుండి రక్తముకాఱుచుండినను నింద్రజిత్తును జంపినందులకు గొప్పసంతోషమును బొంది తొందరగ జాంబవంతునితోను, హనుమంతుడు మొదలగువానరులతోను, విభీష ణునితోను రామసుగ్రీవులుండుచోటికి వెళ్ళెను. అతడు తనయన్నకు నమస్కరించి తానింద్రజిత్తును జంపినసంగతి తడబడుమాటలతో దెలి పెను. విభీషణుడు దానినతనికి స్పష్టముగ దెలుప రాముడు మిక్కిలి సంతోషమును బొంది యిట్లు పలికెను. 'లక్ష్మణా! నీవు మంచిపని చేసి తివి, నీవు యుద్ధకర్మను బాగుగ నొనరించితివి. నాకు మిక్కిలి సంతో

షముగలిగెను. ఇంద్రజిత్తునుగణమువలన మనకు జయముకలిగెనని భావింపుము.' ఇట్లు రాముడు పలికి లక్ష్మణునిశిరస్సును మూర్కొని యతడు సిగ్గుతోనుండ నతనిని స్నేహముతో తనతొడపై కూర్చుండ బెట్టుకొని కౌగిలించుకొని మాటిమాటికి ప్రేమతో నాతనిని జూచు చుండెను. లక్ష్మణుడు తనశరీరముపైనున్న బాణపుదెబ్బలచే నిట్టూర్పు దీయుచుండ వానిని రాముడు చూచి దుఃఖముచే తాపమునొం దుచు తానుకూడ నిట్టూర్పుదీయుచు ననేకపర్యాయములు వాని శిరస్సుమూర్కొనుచు మాటిమాటికి వానిశరీరమును నిమురుచు వాని నోదార్చి తిరుగనిట్లు ప్రశంసించెను. 'నీవు గొప్పకష్టముగు యుద్ధకర్మను జరిపి మిక్కిలిశుభమగుపనిజేసితివి. తనకుమారుడు యుద్ధములో మర ణించుటచే రావణుడు కూడ హతమయ్యెనని నేనాలోచించెదను. దుర్మార్గుడగు శత్రువు మరణించుటచే నేను జయమునొందితిని. క్రూరు డగు రావణునకు కుడిభుజమువలె మంచిబలముగనున్న యింద్రజిత్తును దైవయోగమున నీవు హతమొనరించితివి. యుద్ధములో విభీషణహను మంతులు గొప్పపనులను జేసిరి. మూడురోజులు రాత్రింబగళ్లు యుద్ధము చేయ నతికష్టముచే వాడెట్లో మరణము నొందెను. రావణుడు తనకుమారుని మరణమును విని విచారముచే గొప్పబల ముతో నాతో యుద్ధముచేయుటకు వచ్చును. వారినందఱిని నేను వధించెదను. దొరకుటకు శక్యముగాని సీతయు, రాజ్యమును నింద్రజి త్తునుజంపిన నీవలన నాకు లభించును.' ఇట్లు పలుకుచు రాముడు లక్ష్మణు నోదార్చివానిని కౌగిలించుకొని సంతోషముతో సుషేణుని బిలిచి వానితో నిట్లు చెప్పెను. 'లక్ష్మణునకు బాణములు తగిలియు న్నవి. వానిశరీరముబాగుగ నుండునటుల జేయుము. వానికిని, విభీష ణునకును, వానరబుత్తులకును బాణములు తగులుటచే గాయములు పడినవి, వారికి గుచ్చుకొనినశల్యము లూడివచ్చునట్లును, గాయములు

మానునట్లును, వారు సుఖముగనుండునట్లును జేయుము. ఔషధముల నిచ్చియు, నితరయత్నములు చేసియు వారిని బాగుజేయుము." రాముని యీమాటలను సుషేణుడు విని లక్ష్మణునకు ముక్కుతో పీల్చుటకు * నొకయోషధినిచ్చెను. దానితో వానిశరీరమునుండి బాణములూడెను; గాయములుపూడెను; బాధలుపోయెను. తరువాత సుషేణుడు మిగిలినవారినికూడ బాగుచేసెను. లక్ష్మణుడు సహజముగనుండు శరీర స్థితినిబొంది విచారములేక సంతోషముతో నుండ వానిని జూచి యందఱు సంతోషించిరి.

---

## ౩౦ వ. అధ్యాయము.

## రావణుడు సీతను జంపబోవుట.

ఇంద్రజిత్తుతో గూడ యుద్ధమునకు బోయినరాక్షసు లింద్రజిత్తు మరణింప లంకకు వచ్చి జరిగినదంతయు సభలో రావణునకు దెలిపిరి. దానితో నతడు మూర్ఛ జెంది చాలసేపటికి తెలివిరాగ శోకముచే దీనుడై యిట్లు విలపించెను. "అయ్యో! రాక్షససేనలో ముఖ్యమైనవాడా! మహారథా! కుమారా! ఇంద్రునిజయించిన నీవు లక్ష్మణుని వశ మెట్లైతివి? నీవు క్రోధమును జెంది కాలాంతకులను (యమస్వరూపులను) గూడ బాణములతో ఛేదించితివి. మందరశిఖరములనుగూడ ముక్కలుగ జేయగలిగితివి. అట్టినీవు లక్ష్మణుని యుద్ధములో నష్టిల చేయలేకపోయితివి! యమునిచే నీవు కాలధర్మమునొందితివిగాన నిప్పుడు

---

* హిందూదేశమున పూర్వకాలమున నిట్టియోషధులవలన గొప్పపనులు జరుపబడెననియు, క్రమక్రమముగ వానిసంబంధమైన జ్ఞానము జనులకు నశించెననియు స్పష్టమగుచున్నది.

యముడు నాకు గౌరవనీయుడయ్యెను. మరణములలోనెల్ల యుద్ధములోని యోధులమరణమే శ్రేష్ఠమైనది. తనప్రభువునిమిత్తము మరణించుయోధుడు స్వర్గమునొందును. ఇట్టి వీరమరణమును విని దేవతలును, దిక్పాలురును, ఋషులును భయములేక సుఖముగ నిద్రించెదరు. వాడులేకపోవుటచే లోకములన్నియు నాకు శాంతిహీనముగ గనబడుచున్నవి. ఇప్పుడు రాక్షసస్త్రీలయార్తనాదము లంకయందంతటను నెక్కువగనుండును. పుత్రా! లంకాపట్టణమును, యౌవరాజ్యమును, రాక్షసులను, నీతల్లిని, నన్ను, నీభార్యను వదలి యెక్కడకు బోయితివి? నేను మరణమునొందిన నా ప్రేతకార్యములను నీవుగదా చేయవలసినది? కాని యిప్పుడు దానికి వ్యతిరేకముగ జరిగెను. నక్కలోని బల్లెములవంటి సుగ్రీవ రామ లక్ష్మణులు జీవించియుండ నీవు వారిని జంపకుండ మమ్ములను విడిచి యెక్కడకు బోయితివి?" యట్లు రావణుడు విలపించుచు గొప్పక్రోధమునుబొందెను. సహజముగ కోపస్వభావముగలయాతడు కుమారునిమరణశోకముచే నెక్కువగనుండెను. తనపది తలలయందు కనుబొమలను ముడిచి ముఖములనుండి యగ్నిని గ్రక్కుచు సీతనుజంపుట కాలోచించెను. సహజముగ నెఱ్ఱగనుండు నాతని కండ్లు కోపముచే నెక్కువగ నెఱ్ఱనయ్యెను. స్వభావముచే భయంకరముగనుండు నాతనిరూపము క్రోధముచే రుద్రునిరూపమువలె నెక్కువ భయంకరముగ నయ్యెను. ఆతనికండ్లనుండి కన్నీటిబిందువులు కాలుచున్నదీపములనుండిజారుతైలబిందువులవలె పడుచుండెను. అతడు పండ్లను పటపటకొఱుకుచుండ పెద్దయంత్రధ్వనివలె వినబడుచుండెను. అతడు క్రోధముచేచూచుచుండ నాయాదిక్కులందుండు రాక్షసులు భయముచే దాగుకొనిరి. వానిసమీపమునకు నెవ్వరును పోవలేదు. అప్పుడు రావణుడు భయమునొందినరాక్షసులను యుద్ధమున నిలుపుకొనుటకు నేను వేలకొలదిసంవత్సరములు గొప్పతపస్సుచేసి దానిని సంతుష్టి

నొందించి బ్రహ్మను మిక్కిలి సంతోషపఱచితిని. అతడుదయచే దేవాసురులవలన నాకు భయమురాకుండునట్లు వరమిచ్చెను. దేవాసురయుద్ధములలో వారు నాపైనివిడుచు వజ్రముచేతనుగాని, శస్త్రలు మొదలగువానిచేతనుగాని తెగని తేజోమయమగు గొప్పకవచమును బ్రహ్మనాకిచ్చెను. దానిని నేను తొడుగుకొని రథముమీద యుద్ధమున నిలువ నన్నెవడెదుర్కొనును? నాయెదుట నింద్రుడైనను నిలువలేడు. ఇంకను బ్రహ్మ నాపై దయగలవాడై ధనస్సును, బాణములను దేవాసురయుద్ధములలో నుపయోగించుటకిచ్చెను. ఇప్పుడు యుద్ధమున రామలక్ష్మణులవధకై వానిని సిద్ధముచేయు'డని పలికెను.

రావణుడు తనపుత్రునిమరణముచే మిక్కిలిక్రోధమునొంది సీతను వధించుటకు నిశ్చయించి రాక్షసులతో నిట్లనెను. పూర్వము వానరులను మోసపుచ్చుటకు నింద్రజిత్తు మాయచే సీతను హతమొనర్చినట్లొకస్వల్పవస్తువును జూపించెను. నాకు ప్రియమగునట్లు నే నిప్పుడా మెను నిజముగ నాశనముచేసెదను.' ఇట్లు రావణుడు పలికి, తళతళ మెఱయుతెల్లని ఖడ్గమును బట్టుకొని తనభార్యయు, మంత్రులును తన వెంట పరుగెత్తుకొని వచ్చుచుండ నశోకవనమునకు వేగముగవెళ్లెను. దానిని రాక్షసులు చూచి సింహనాదముచేసి యొకరినొకరు కౌగిలించుకొని 'ఇట్లు క్రోధముచేవెళ్లుచున్న రావణు నిప్పుడు రామలక్ష్మణులు చూచినగొప్పవిచారమునొందుదురు. క్రోధముచే లోకపాలురను జయించిన రావణుడు యుద్ధములలో ననేకశత్రువులను జయించి మూడులోకములయైశ్వర్యమును ననుభవించుచున్నాడు. బలపరాక్రమములలో నితనికి సాటియెవరునులే'రని పేర్కొనుచుండ రాక్షసరాజుమేలుగోరువారును, ప్రాణస్నేహితులును నతనిని వారించినను నత డశోకవనములోని సీతయొద్దకు పరుగెత్తెను. రాక్షసస్త్రీలచే రక్షింపబడుచున్న సీత ఖడ్గమునుబట్టినవాడును, స్నేహితులచే నివారింపబడుచు

న్నవాడుననగు నాతనిని జూచి మిక్కిలివిచారించి దుఃఖముతో నిట్లు విలపించెను. "వీడు క్రోధముతో నాప్రక్కకు పరుగెత్తుకొనివచ్చుచు న్నాడు. ఈదుష్టుడు భర్తగలనన్ను భర్తలేనిదానినివలె చంపును. పతి వ్రతనగు నన్ననేకపర్యాయములు 'నాకు భార్యవగుము; నాతో గ్రీడింపు'మని ప్రోత్సహించినను నే నొప్పుకొనకపోవుటచే వీడు నిరా శను జెంది క్రోధమోహములుగలవాడై నన్ను జంపుటకు సిద్ధమైయు న్నాడు. లేక రామలక్ష్మణులు నానిమిత్తము యుద్ధముచేసి వీనివలన మరణమును జెందియుందురు. ఛీ నాబ్రతుకేల? నామూలమున వారికి నాశనము కలిగెను. అట్లు కానియెడల రావణుడు పుత్రశోకముచే వారిని జంపలేక రుద్రుడై పాపబుద్ధితో నన్ను జంపును. హనుమంతుడు నన్ను తనవీపుపై నెక్కించుకొని యెగిరి రాముడుండుచోటికి తీసికొనిపో వుదుననెను.స్వల్పబుద్ధిగలదాననగుటచే నే నాతనిమాటలను వినవైతిని. నేను వానిమాటలను వినియుండిన నిప్పుడీవిచారములేక నాభర్తతో గూడియుందును. కౌసల్యకు తనయొక్కయేకపుత్రుడగు రాముడు యుద్ధ ములో మరణించినట్లు తెలిసినయెడల నామెగుండెపగులును. ఆమె యాతనిపుట్టుకయు, బాల్యమును, యౌవనమును, ధర్మకార్యాచరణ మును జ్ఞాపకము తెచ్చుకొని యేడ్చును. ఆమె చనిపోయినతనపుత్రు నికి శ్రాద్ధకర్మను జరిపి యగ్నిలోగాని, నీటిలోగాని పడి ప్రాణములను విడుచును. ఛీ! మఱుగుజ్జుమంథరా! నీపాపబుద్ధిచే కౌసల్యకు నిట్టి దుఃఖముకలిగినది." ఇట్లు పలుకుచు సీత విలపించుచుండెను.

అప్పుడు గొప్పబుద్ధిమంతుడును, శుచియునగు రావణుని యమాత్యుడు సుపార్శ్వుడనువాడు విలపించుచున్నసీతనుజూచి మంత్రు లచే నివారింపబడుచున్నరావణునితో నిట్లుపలికెను. 'దశగ్రీవా! మీరు సాక్షాత్తు కుబేరునితమ్ములరు. మీరు క్రోధముచే ధర్మమును విడిచిసీత నేలచంపెదరు? వేదములు చదివి యజ్ఞములు, వ్రతములు మొదలగు

మంచికర్మలను జేసినమీ రాముఁడానిని జంపుట కేలకోరుచున్నారు? మీరును, మేమును రామునిమీఁద మనక్రోధమును తీర్చుకొందము. మీరు సీతనుగుఱించి వేచియుండుఁడు. ఈకృష్ణపక్ష * చతుర్దశినాఁడు సైన్యమునంతను నతనిపైకి యుద్ధమునకు బంపుచు నమావాస్యనాఁడు జయమునిమిత్తము మీరు బలములతో నతనిపై యుద్ధమునకు బయలు దేఱుఁడు. శూరులును, బుద్ధిమంతులునునగు మీరు మంచిరథమునెక్కి ఖడ్గమునుబట్టి యుద్ధములో రాముని హతమొనర్చిన సీతను బొందెదరు.' ఇట్లామయమాత్యుఁడు పలుక రావణుఁడు వాని మాటలను విని యింటికి బోయి తరువాత సభకు వెళ్లెను.

---

౬౧వ. అధ్యాయము.

రావణునిమూలబలములు, విరూపాక్ష మహోదర మహాపార్శ్వులు యుద్ధముచేయుట.

---

బహుళచతుర్దశినాఁడు రావణుఁడు తనపుత్రుని మరణముచే మిక్కిలిదుఃఖమునొంది తనసభలో సింహాసనమునఁగూర్చుండి క్రోధముచే నిట్టూర్పుదీయుచు తనసేనానాయకులకు చేతులుజోడించి యిట్లు పలికెను. 'మీరందఱు మిగిలినచతురంగబలములతో వెళ్ళి రాముని

---

* పౌర్ణమినాఁడు రాముఁడు సువేలపర్వతముననిలిచెను. బహుళపాడ్యమినాఁడు యుద్ధమారంభమాయెను. దశమివరకు ధూమ్రాక్ష వజ్రదంష్ట్రి కుంభకర్ణాదుల యుద్ధములు. వారిమరణములుజరిగెను. తరువాత నింద్రజిత్తు మూడురోజులుయుద్ధముచేసి మరణించెను. చతుర్దశినాఁడు రావణునిమూలబలము యుద్ధమునకుబోయి మరణించెను, రావణుఁ డమావాస్యనాఁడు యుద్ధమునకు బోయెను. ఇట్లొక పక్షములో లంకలోని రాక్షసబలమంతయును, రాక్షసవీరులును నాశనమైరి.

చుట్టుచేరి యతనిపై బాణవర్షముకురిపించి యతనినిహతె మొనర్చనలెను. అతడట్లు మరణమునొందనియెడల నేను స్వయముగ మీతో రేపటి దినమున వచ్చి యతనిపై వాడిబాణములను విడిచి లోకులుచూచు చుండ నతని నంతమునొందించెదను.' ఇట్లు రావణుడు పలుక * 10 వేలరథములు, 18 వేల యేనుగులు, 14 వేల నౌతులుగల గుఱ్ఱములు, 2లక్షల కాల్బలముగల చతురంగబలములతో పర్వతాకారులగు రాక్షసవీరులు వివిధాయుధములనుబట్టి యుద్ధమునకు బయలుదేతి రణభూమికి వెళ్ళిరి. రాక్షసులనేకవిధములగు నాయుధములనుబట్టియు, వానరులు కొండశిఖరములను, చెట్లనుబట్టియు గొప్పయుద్ధము చేసిరి. సూర్యోదయమున యుద్ధమారంభమాయెను. వానరు లెగిరి ఛత్రధ్వజములను, కవచములను, రథములను, గుఱ్ఱములను, నాయుధములను తునకలుగజేసి తమగోళ్ళతోను, దంతములతోను, రాక్షసుల చెవులను, ముక్కులు మొదలగువానిని జీరిరి. ఒక్కొక రాక్షసునితో నూరుమంది వానరులుచొప్పున పోరు సలిపిరి. రాక్షసులుకూడ తమతమాయుధములతో వానరులను దఱుముచు కొట్టిరి. అంతట వానరులు రాముని శరణునొందిరి. అప్పు డతడు తనధనస్సుతో రాక్షససైన్యములో బ్రవేశించి వారిపై శరవర్షమును గురిపించెను. రాక్షసులెవరును నతనిదగ్గఱకు వెళ్ళలేకపోయిరి. అతడుచేసినగొప్పయుద్ధకర్మలవలన జరిగినపనులను మాత్రమే వారు చూచిరికాని యతడు వాని నెట్లుచేయుచుండెనో చూడలేకపోయిరి. వారికి సేనకదలుచుండుటయు, శరములచే

* యుద్ధకాండ 94వ. సర్గ 3౹వ. శ్లోకమున అనీక శబ్దముపయోగింపబడినది. దానికి సేనయనియు, 2187 ఏనుగులు, 2187 రథములు 6561 గుఱ్ఱములు, 10935కాల్బలములుగలసేనాసమూహమనియునర్థములుగలవు. అన్ని సేనాభాగములకు నొకేరీతిగకొన్నయనీకములని తెలుపబడక పరిఠిదానికి వేఱువేఱుసంఖ్యలు నిర్ణయింపబడుటచేనాపదమునకు సైన్యమనియే మేము సాధారణార్థమును గ్రహించితిమి.

చతురంగబలము, రథములు ముక్కలగుచుండుటయు కనబడుచుండెనే కాని రాముడు కనబడలేదు. 'ఇదుగో రాముడు; ఏనుగులను గొట్టుచున్నాడు. ఇదుగో! యిక్కడ; రథములను ఛేదించుచున్నాడు. ఇదిగో! యిక్కడ గుఱ్ఱములను, కాల్బలమును హింసించుచున్నా' డని పలుకుచు రాక్షసులు రామునివంటిరూపముగల రాక్షసులనుగొట్టుచు తమలో తామే యొకరినొకరు చంపుకొనిరి. రామునిచే ప్రయోగింపబడిన గంధర్వాస్త్రముచే రాక్షసులు భ్రమజెంది తమ్ము బాణములచే గొట్టుచున్న రాముని జూడలేకపోయిరి. రాక్షసులకు వేలకొలది రాములు కనబడుచుండిరి. ఒక్కొక్కప్పుడొకరాముడే కనబడుచుండెను. బంగారుకొనలుగల యతనివిల్లు గిరగిరతిరుగుటయే రాక్షసులు చూచిరికాని యాతని జూడలేకపోయిరి. అవింటినుండి బాణము లనేకములు వచ్చుచుండెను. నారిశబ్దము వినబడుచుండెను. రాక్షసులు బాణములచే జచ్చుచుండిరి. ఇట్లు రామునిశరములచే 1గంట 30 నిమిషములలో రాక్షససేనయంతయు మడిసెను. మిగిలినరాక్షసులు లంకకు పరుగెత్తిరి. దేవ గంధర్వ సిద్ధ మహర్షు లాకాశమున నిలిచి రాముని గీర్తించిరి. అతడు దగ్గఱగనున్న సుగ్రీవాదులతో 'ఇట్టియస్త్రబలము నాకును, శివునకును మాత్రమేగల' దని పలికెను.

ఇట్లు రావణునిమూలబలము మడియ చచ్చినవారిభార్యలును, తల్లులును లంకలోగూడి దీనులై శోకముచే నిట్లు విలపించిరి. 'ముసలిదియు, భయంకరురాలును, కురూపియు, తెల్లనిజుట్టుకలదియునగు శూర్పణఖ మన్మథునివంటిసుందరుడును, గొప్పబలవంతుడును, సర్వజీవులమేలుకోరువాడునునగు రాముని నేలమోహించెను. ఆమెమూలమున జనస్థానములో రాక్షసవధయు, రామునితో రావణునకు విరోధమును సంభవించెను. మనరాజు తనమరణమునిమిత్తము సీతను దెచ్చెను; కాని యామె నత డనుభవింపలేడు; రావణునకు నిట్టి లిబ్బలవంతు

డగు రామునితో బద్ధవైరముమాత్రము కలిగెను.' ఇట్లు వారు విల
పించి రాముడు జరిపినగొప్పకార్యములను దెలుపుచు నింకను నిట్లనిరి.
"విభీషణుడు రావణునితో ధర్మమగుమాటలనుబలికినను నతడువినలేదు;
అతడు వినియుండిన లంకలోనిరాక్షసులందఱు చచ్చియుండకపోదురు.
యుద్ధములో తనతమ్ముడును, కుమారులును మరణించినను నతనికిబుద్ధి
రాలేదు. లంకలోనిప్రతిగృహములోను స్త్రీలు 'నాభర్త, నాసోద
రులు, నాపుత్రులు యుద్ధములో జచ్చిపోయి' రని యేడ్చుచున్నారు.
రావణునిచతురంగబలము విశేషముగ నశించినది. విష్ణువో, శివుడో,
యింద్రుడో' లేకయముడో రామునిరూపమున మనలనందఱిని జంపు
చున్నాడు. రాక్షసవీరు లంద అతనిచే మడిసిరి. మనభయమున కంత
ములేదు. మనకిక ప్రాణములమీద నాశలేదు. మనము దిక్కులేక
యేడ్చుచున్నాము. రావణునకు రామునివలన మరణమున్నది. దీనినా
తడు తెలియకున్నాడు. దేవాదు లాతనికి సహాయమువచ్చియైనను
రామునిచే యుద్ధములో మరణమాసన్నమైన యాతనిని రక్షింపలేరు.
ప్రతియుద్ధములోను దుశ్శకునములు కనిపించుచు రావణునిమరణమును
సూచించుచున్నవి. బ్రహ్మ యతనితపస్సునకు సంతోషించి దేవదా
నవరాక్షసులవలన భయమురానటుల వరమిచ్చెను.' మనుష్యులవలన
మరణముకలుగకుండునటుల రావణుడు వరము కోరలేదు. కాన రావ
ణునకును, రాక్షసులకును మనుష్యులవలన మరణమునుగలుగజేయు
భయము కలిగినది. సంశయములేదు. రావణుడు తనకు దొరకినవరము
లచే గర్వించి దేవతలను బాధింప వారు తీవ్రమగు తపస్సుచేసి
బ్రహ్మను సంతోషపఱుప వారిమేలుకోఱకై బ్రహ్మ వారితో 'ఇప్పటి
నుండి లోకములలోని దానవులును, రాక్షసులును గొప్పభయము
గలిగి తిరుగగల'రని పలికెను. తరువాత బ్రహ్మయు, దేవతలును,
నింద్రుడును శివునియొద్దకు బోయి యుతనిని ప్రార్థించిరి. అతడు వారి

యెడ దయ గలవాడై వారలతో 'మీహితముకొఱకు స్త్రీయొకతె జన్మించి రాక్షసులకు నాశనము కలిగించు'నని పలికెను. పూర్వము దేవత లమృతము త్రాగి పిమ్మట దానవులనాశనముకొఱ కాకలిని ప్రయోగించిన ట్లీమెను మహాదేవుడు సృజించెను. కాన నీసీత రావణుని, రాక్షసులను నాశనము చేయును. [మనరాజుదుర్బుద్ధివలనను, దుర్మార్గములవలనను లంక నాశనమై శోకముతో నిండియున్నది. రాముని వలన భయమునొందిన మేము శరణుబొందదగినవాని నెవనిని గానము. విభీషణుడు తగినపనిచేసెను. ఎవరివలన భయముకనబడెనో వానిని శరణుబొందెను." ఇట్లు రాక్షసస్త్రీ లొకరినొకరు కౌగిలించుకొని విచారముచే నెక్కువగ నేడ్చిరి.

ప్రతిగృహమునుండి బయలువెడలుచున్న రాక్షస్త్రీలవిలాపములను రావణుడు వినెను. అత డమావాస్యనాడు పెద్దనిట్టూర్పుదీసి యొకగడియ బాగుగ నాలోచించి మిక్కిలిక్రోధముచెంది పండ్లతో పెదవులను గొఱికి కండ్లెఱ్ఱజేసి దగ్గరనున్న మహోదర మహాపార్శ్వ విరూపాక్షులతో 'నాయాజ్ఞచే సేనలను యుద్ధమునకు బయలుదేఱుటకు నియమింపు'డని పలికెను. అంతట వా రాతని యాదేశముచే భయముకలవారై యుద్ధముచేయుటకు నిష్టములేని రాక్షసులను యుద్ధము చేయుటకు ప్రోత్సహించిరి. గొప్పరూపములు గలవారందఱు దానికంగీకరించి శుభవాక్యములనుబలుకుచు తగినట్లు రావణునకు నమస్కరించుచునతనిజయమునుకోరుచు యుద్ధమునకు బయలుదేఱిరి. రావణుడు వారిని జూచి పెద్దనవ్వునవ్వుచు మహోదర మహాపార్శ్వ విరూపాక్షులతో క్రోధమున నిట్లనెను. "ఇప్పుడు నావాడిబాణములచే రామలక్ష్మణులను యమపురికి బంపెదను. ఖరుని, కుంభకర్ణుని, ప్రహస్తుని, నింద్రజిత్తును హతమొనరించినందులకు నేను శత్రువులను సంహరించి నాపగను తీర్చుకొనెదను. నేను బాణములను నెక్కువగ విడిచిన నాకా

శమును, దిక్కులును, నదులును, సముద్రములును శబ్దాయమానములై యుండును. నా వాడిబాణములచే వానరపీనులను, వానరులను హత మొనర్చెదను. నేను శత్రువులను జంపి యుద్ధములో మరణమునొందిన రాక్షసులయొక్క స్త్రీలదుఃఖమును బోగొట్టెదను. శత్రుసైన్యము మరణమునొందిన యుద్ధభూమిలో గ్రద్దలు మొదలగునవి సంతోష ముతో మాంసము తినుచుండును. నారథమును వేగముగ సిద్ధముచేయుడు. నాధనస్సును నిండు. మిగిలిన రాక్షసులందఱు నాతో యుద్ధమునకు రావలయును." ఇట్లు రావణుడు పలుక మహా పార్శ్వ డక్కడనున్న సేనానాయకులతో 'బలములను దీసికొనిరం'డని చెప్పెను. వారు తొందరగ లంకలోనిప్రతిగృహమునకు బోయి రాక్ష సులను యుద్ధమునకు బిలిచిరి. ఘోరస్వరూపములుగల యారాక్షసు లనేకవిధములగు నాయుధములను బట్టి బయులుదేఱగ. మంచిసారథి కలదియు, వడిగల 8 గుఱ్ఱములను గట్టినదియు, మంచిధనస్సుతో ప్రకాశించునదియునగు మంచిరథము సిద్ధముకాగా రావణుడు దానిపై కూర్చుండి రాక్షసులతో సంతోషముగ బయులు దేఱెను. మహోదర మహాపార్శ్వ విరూపాక్షులుకూడ రథములనెక్కి బయులు దేఱిరి. వారి కనేకదుశ్శకునములుగనబడెను. రావణునిరథాశ్వములు దారిలో జారి పడెను. అతనిరథముపై గ్రద్ద వాలెను. అతనియెడమకన్ను నదరెను; ఎడమభుజము చలించెను. వానిముఖము వాడెను; స్వరము కొంచెము తగ్గెను. అతడు వీని నన్నిటిని లక్ష్యముచేయక కాలసన్నిహితుడై రామలక్ష్మణులున్న యుత్తరద్వారమువద్దకు యుద్ధమునకు బోయెను. వానరులు పర్వతశిఖరములను, చెట్లను, రాళ్ళను బట్టియు, రాక్షసులు వివిధాయుధములనుబట్టియు ఘోరముగ యుద్ధముచేసిరి. రావణుడు తనధనస్సునుబట్టి వాడిబాణములనేకములను క్రోధముతో విడువ కొందఱువానరులతలలు తెగెను; కొన్ని విఱిగిపోయెను. కొందఱి

గుండెలు పగిలెను; కొందఱిచెవులు తెగెను; కొందఱికళ్లు పోయెను. కొందఱూపిరితీయలేక చనిపోయిరి. కొందఱిపక్కలు తెగిపోయెను. తరువాత రావణుడు రామునితో యుద్ధమునకు దలపడెను.

ఇట్టిసమయమున సుగ్రీవుడు వానరులకు దెబ్బలుతగులుట చూచి వానరసేనయొద్ద సుషేణుని నిలిపి చెట్లనుబట్టుకొని యుద్ధమునకు బయలుదేఱెను. అతనితో వానరసేనానాయకులు కొండశిఖరములను, చెట్లనుబట్టి బయలుదేఱిరి. తరువాత సుగ్రీవుడు నాదముచేయుచు రాక్షసముఖ్యులను కొందఱిని గొట్టెను. అతడు రాక్షసులపై పర్వతశిఖరవర్షమును గురిపించి వారిని నాశనమునొందించుచుండ విరూపాక్షుడు తనరథమునుండి యెగిరి పెద్దయేనుగునొకదానినెక్కి సుగ్రీవునిపై వాడిబాణములను విడిచెను. దానితో నావానరరాజు గొప్పక్రోధమును జెంది చెట్టునొకదానిని బట్టి యాయేనుగును గొట్ట నది కొంతదూరముపోయి చతికిలబడెను. అంతట విరూపాక్షుడు ఖడ్గము నొకదానినిబట్టి పరుగెత్తుకొని వచ్చి సుగ్రీవున కెదురుగ యుద్ధమునకునిలిచెను. దానితో సుగ్రీవుడు క్రోధమును బొంది పెద్దరాతినిబట్టివానిపై విసర వాడు ప్రక్కకు వెళ్లి తప్పించుకొని యతనిని ఖడ్గముతో గొట్టెను. దానితో నతడొకగడియమూర్ఛపోయెను. తరువాత సుగ్రీవునకు తెలివిరాగా నతడెగిరి తనపిడికిలితో విరూపాక్షునివక్షస్థలముపై పొడువ వాడు తన ఖడ్గముతో సుగ్రీవునికవచము తెగునటులకొట్టెను. దానితో నతడు క్రిందపడిపోయి తిరుగ నెగిరి తనయఱచేతితో విరూపాక్షునిగొట్టబోవ దానిని వాడు చమత్కారముగ తప్పించుకొని తనపిడికిలితో సుగ్రీవుని బొడిచెను. అప్పుడా వానరరాజు మంచిసమయమును గనిపెట్టి తనయఱచేతితో వానినుదుట గొట్ట వాడు రక్తముగ్రక్కుచు చెవులనుండి రక్తము కాఱుచుండ భూమిమీద పడి మరణమునొందెను.

రెండుపక్షములలోను సైన్యములు క్షీణించెను. విరూపాక్షుని మరణమును, తనబలముక్షీణించుటయు రావణుడు తెలిసికొని క్రోధ మధికముకాగా దైవయోగముచే తనబలము వానరులచే గొట్టబడి నాశనమగుటకు విచారమునొంది దగ్గఱగనున్న మహోదరునితో నిట్లనెను. 'ఇప్పుడు నాజయాశ యంతయు నీయందున్నది. నీపరాక్రమమును జూపి శత్రుసైన్యములను జంపుము. ప్రభువువద్ద వేతనము పుచ్చుకొన్నందులకు తగినయుద్ధకార్యమును లెస్సగ జరుపుము.' ఇట్లు రావణుడు పలుక మహోదరుడు దానికంగీకరించి యుద్ధమునకు వెళ్లి వానరసైన్యముతో యుద్ధముచేయ వారు పెద్దరాళ్లను బట్టుకొని రాక్షసులను బరిమార్చిరి. దానికి మహోదరుడు తనరథమున నిలిచి ధనస్సునుబట్టి వాడిబాణములను విడిచి వానరులయవయవములను దెగ గొట్టెను. అంతట వానరులంద ఱన్నిదిక్కులకు పరుగెత్తిరి. కొందఱు సుగ్రీవునిజేరిరి. అంతట సుగ్రీవుడు మహోదరు నెదుర్కొని పెద్దపర్వతమువలెనుండు రాతిని వానిపై విసర దానిని వాడు తనబాణములతో ముక్కలుగజేసెను. దానికి సుగ్రీవుడు క్రోధమును జెంది గుగ్గిలపుచెట్టు నొకదానిని పెఱికి వానిపైకి విసరెను. దానినికూడవాడు బాణములచే ఖండించెను. తరువాత సుగ్రీవుడు క్రిందపడియున్న పరిఘను జూచి క్రోధముతో దానిని బట్టుకొని గిరగిరత్రిప్పి దానితో నారాక్షసవీరుని రథాశ్వములను గొట్ట నవి క్రిందబడి చచ్చెను. గుఱ్ఱములు చచ్చుటచే మహోదరుడు తనరథమునుండి పైకెగిరి గదనొకదానిని పట్టినిలిచెను. అతడు గదనుబట్టియు, సుగ్రీవుడు పరిఘనుబట్టియు యుద్ధమునకై నాదముచేసిరి. మహోదరుడు సుగ్రీవునిపైకి గదను విసర నతడు దానిపైకి తనపరిఘను విసరెను. ఆరెండును ముక్కలయి క్రిందబడెను. అప్పుడుసుగ్రీవుడు క్రిందపడియున్న యినుపముసలమునుబట్టి మహోదరునిపైకి విసర వాడు మఱియొకగదను సుగ్రీవునిపైకి విసరెను. అవిరెండును నొకదాని

కొకటితగులుకొని ముక్కలై క్రిందబడెను. తరువాత వారిద్దరు కలిసి పిడికిళ్ళతో పొడుచుకొనిరి. తరువాత నఖచేతులతో చరుచుకొని క్రిందబడి తిరుగ పైకెగిరి కొట్టుకొని బాహువులనుబట్టి విసరుకొనిరి. ఇట్లు వారు బాహుయుద్ధములో శ్రమనొంది చెరియొకఖడ్గమునుబట్టి నిలిచిరి. వారు రోషముచే నాఖడ్గములను బట్టుకొని యడుగులువేయుచుండిరి. మహోదరుడు తనఖడ్గమును డాలునకుతగిలించి గుంజుచూచుచుండ సుగ్రీవుడు తనఖడ్గముతో వానిమెడను తెగగొట్టెను. అప్పుడు వానిప్రాణములుపోవ వానిమొండెము క్రిందబడెను. రాక్షసులు పారిపోయిరి. సుగ్రీవుడు సంతోషముతో నాదముచేసెను. రాముడు సంతోషించెను. రావణునకు క్రోధమెక్కువాయెను. ఆకాశముననున్న సుర యక్ష సిద్ధులు భూమికి వచ్చి సుగ్రీవునిగీర్తించిరి.

మహోదరుడు మరణమునొంద మహాపార్శ్వుడు క్రోధముతో కండ్లెఱ్ఱజేసి రథమున నిలిచి యంగదునిసేనపై బాణములను విడిచెను. దానితో వానరులలో కొందఱి తలలును, కొందఱిబాహువులును, కొందఱినడుములును, కొందఱిపక్కలును తెగెను. వానరులు విచారమునొందుటయు, బలము భయమునొందుటయు నంగదుడు చూచి యినుపపరిఘనొకదానినిబట్టి మహాపార్శ్వునిపై విసర వాడు సారథితోకూడ క్రిందబడి మూర్ఛజెందెను. అప్పుడు ఋక్షరాజగు గవాక్షుడు తనఋక్షసైన్యమునుండి బయలువెడలి పెద్దరాతినిబట్టి రాక్షసవీరునిగథమును విఱిచి గుఱ్ఱములను జంపెను. ఒకగడియలో మహాపార్శ్వుడు తెలివినొంది ధనస్సును బట్టుకొని యంగదునిపై ననేకబాణములను, జాంబవంతునిపై ౩ బాణములను, నతనియన్నయగు గవాక్షునిపై ననేకబాణములను విడిచెను. దానితో నంగదుడు క్రుద్ధుడై పరిఘనొకదానిని బట్టి రెండుచేతులతోను దానిని ద్రిప్పుచు మహాపార్శ్వునిపై విసరెను. దానితో వానిధనస్సును, బాణ

ములును, శిరస్త్రాణమును క్రిందబడెను. తరువాత నంగదుడు వాని గూబమీద తనయఱచేతితో గొట్టె మహాపార్శ్వుఁడొకగండ్రగొడ్డలిని నొకచేతితో బట్టి దానిని నంగదునిపై విసరెను. అది యతనియెడమ మూపుపై బాగుగ తగుల నంగదుడు దానిని లాగిపాఱవేసెను. తరువాత నతడు తనపిడికిని బాగుగ బిగించి మహాపార్శ్వునిహృదయమున గట్టిగగొట్టె వానిహృదయము పగిలెను. దానితో వాడు క్రింద పడి మరణమునొందెను. అంతట రాక్షససైన్యము కలంగెను. రావణునకు క్రోధమెక్కువాయెను. వానరులు సంతోషముతో సింహనాదముచేసిరి.

తరువాత రావణుడు తనసారథితో 'రాక్షసులమరణములవలనను, శత్రుసైన్యముపట్టణముచుట్టునుండుటచేతను నాకు గలిగినదుఃఖమును రామలక్ష్మణులను, సుగ్రీవాదివానరులను జంపి తీర్చుకొనెద' నని పలికి రాముడుండుచోటికి తనరథమును దోలించెను. బ్రహ్మస్వయముగ నిర్మించిన తామసాస్త్రమును రావణుడు వానరులపై విడువ నది వానరులను గాల్చెను. అందు కొందఱు పడిపోయిరి; కొందఱు పరుగెత్తుకొని పోయిరి. అట్లుపరుగెత్తుటచే బుగ్గి యెక్కువగ నెగిరెను. ఆయస్త్రబాధను సహింపలేక వానరులు రాముడుండుచోటికి వెళ్ళిరి. రావణుడు పెద్దధనస్సునుబట్టి రామలక్ష్మణులుండుచోటికివచ్చి నిలిచెను. రాముడుకూడ సంతోషముతో తనధనస్సుబట్టినిలిచి దానిని బ్రయోగించెను. లక్ష్మణుడు మొదట యుద్ధముచేయదలచి తన ధనస్సునుసజ్జుచేసి రావణునిపై వాడిబాణములను విడిచెను. వానినన్నిటిని రాక్షసరాజు సమానసంఖ్యగల తనబాణములచే ఖండించి యతనిని విడిచి రామునితో యుద్ధముచేయనారంభించి యాతనిపై తీక్ష్ణబాణములను విడువ నతడు మంచిబాణములతో వాని నన్నిటిని ఖండించెను. వారిరువు రొకరిపై నొకరు శరవర్షముకురిపించుకొనిరి,

వారు కుడిప్రక్కకును, నెడమప్రక్కకును కదలుచు మండలాకారముగ నిలుచుచు నొకరిపై నొకరు బాణములను విడుచుకొనుచు నొకరిబాణములనొకరు ఖండించుకొనుచు చాలసేపుయుద్ధము చేసిరి. అందెవరును వీగిపోలేదు. దీనిని జూచి జీవులన్నియుభయమునొందెను. బాణములచే నాకాశమంతయు చీకటియయ్యెను. ఒకరిని జంపుట కొకరు కోరుచు వారు చింతింపనలవికాని గొప్పయుద్ధమునుజేసిరి. వారిద్దఱును మంచిబలవంతులు; బాణములను విడుచుటలో గొప్ప నేర్పరులు; శస్త్రాస్త్రముల నుపయోగించుట బాగుగ నెఱిగినవారు. అప్పుడు రావణుడు బాణపరంపరలను రామునినుదుట తగులునటుల విడువ నతడు బాధనొందక మంత్రములను జపించుచు రౌద్రాస్త్రముతో బాణములను ధనస్సున సంధించి రావణునిపై విడచెను. అవి దుర్భేద్యమగు వానికవచమునకు తగిలి క్రిందబడెను. కాని వాని కేమియు బాధ కలిగింపలేదు. అతడు మఱియొకమంచియస్త్రమును నభిమంత్రించి దానితో బాణములను విడిచి వానినుదుటనుగొట్ట వానిని వాడు తిరుగగొట్ట నవి వ్యర్థములయ్యెను. తరువాత రావణుడు క్రోధముచే నాసురాస్త్రముతో సింహము, పులి, నక్క, పంది మొదలగు మృగములయొక్కముఖములవంటి చివరలుకలవియు, గ్రద్ద, కాకి మొదలగు పక్షులయొక్కముఖములవంటికొనలుగలవియునగు బాణములను, మఱికొన్ని వాడిబాణములను రామునిపై విడిచెను. వానినన్నిటిని ప్రతిహతముచేయుటకు రాముడు పావకాస్త్రమును ప్రయోగించి యగ్ని, సూర్యుడు, చంద్రుడు, గ్రహములు, నక్షత్రములు మొదలగు వానిముఖములవంటికొనలుగల బాణములను విడిచి రావణునియస్త్రముచే ప్రయోగింపబడినశరములను నంతరాళమున ఖండించెను. దీనితో సుగ్రీవాదికపులు కిలకిలస్వనముతో గర్జించి గొప్పనాదము చేసిరి,

ఇట్లు తనయస్త్రముచే విడువబడిన బాణములు ఖండింపబడుట రావణుడు చూచి క్రోధమధికముకాగా మయుడు సృజించి తనకిచ్చిన రౌద్రాస్త్రమును రామునిపైని విడువ దానినుండి తీక్ష్ణములగు శూలములును, గదలును, ముసలములును, ముద్గరములును, మాయపాశములును, పిడుగులును బయలువెడలి రామునిసమీపింప నతడు వానినన్నిటిని గాంధర్వాస్త్రముచే తునకలుగ జేసెను. అందుచే క్రోధముకలుగ రావణుడు కండ్లెఱ్ఱజేసి సౌరాస్త్రము నాతనిపై ప్రయోగింప దాని నుండి తెల్లనిచక్రములు బయలుదేరెను. అవి యాకాశమునకును, దిక్కులకును గాంతికలుగునటుల ప్రకాశించుచు రామునిప్రక్కకు రాగా నతడు వానినన్నిటిని తనబాణములచే ఖండించెను. అందులకు రావణుడు క్రోధమును జెంది యాతనియాయుస్థానములందు వాడి బాణములను విడిచెను. కాని యాతడా బాణములకు చలింపలేదు. తరువాత రాముడు కోపముతో రావణునిశరీరమంతటను నాటునటుల ననేకబాణములను విడిచెను. ఇట్టిసమయమున లక్ష్మణుడు మిక్కిలి క్రోధమునుజెంది యొకవాడిబాణముతో మనుజునితలగల రావణుని ధ్వజమును,నొకబాణముతో వానిసారథితలను, 5 బాణములతో నేనుగు తొండమువలె పెద్దదిగనుండు వానిధనస్సును గూలనేసెను. రావణునిరథాశ్వములను విభీషణు డెగిరి తనగదతో గొట్ట నవి మరణించెను. దానితో రావణునకు గొప్పక్రోధమువచ్చెను. అంతట వాడు రథమునుండి క్రిందికుఱికి మంచి ప్రకాశముగలదొకశక్తిని విభీషణునిపై విసర దానిని దారిలో లక్ష్మణుడు 3 వాడిబాణములతో గొట్ట నది మూడుముక్కలై భూమియందు బడెను. తరువాత రావణుడు 8 గంటలుకలదియు, మయుడు నిర్మించి తనకిచ్చినదియు, తనచే బూజింపబడినదియు, యమునకుగూడ భయమును గలిగించునదియు, గొప్ప తేజముగలదియునగు శక్తినొకదానిని తనచేతితో బట్టి నిలిచెను. దీనిని

లక్ష్మణుడు చూచి 'వాడు దానిని విభీషణునిపై విడిచిన వానిప్రాణ ములు పోవునేమో' యని చింతించి వానిని రక్షించుటకు నడ్డుగవచ్చి తనధనస్సుచే రావణునిపై బాణవర్షము కురిపించెను. దానితో తన పరాక్రమముతగ్గ రావణుడు దానిని విభీషణునిపై విడుచుటకు నాలో చింపక లక్ష్మణునికెదురుగనిలిచి యిట్లు పలికెను. 'నీవు గొప్పబలవం తుడవు. నీవు విభీషణుని కాపాడితివిగాన వానిని విడిచి యీశక్తిని నీపై నుపయోగించెదను. రక్తముతో దడిసియున్నయీశక్తి నీగుండె లను పగులగొట్టి నీప్రాణములను నీయును.' ఇట్లు రావణుడు పలికి గొప్పక్రోధముతో నాదముచేసి లక్ష్మణునిపైకి నాశక్తిని విసరెను. అది వచ్చుచుండ దానితో రాముడు 'లక్ష్మణునికి శుభమగుగాక! నీయత్నము విఫలమగుగాక! నీవు వ్యర్థమయ్యెదవుగాక!' యని పలి కెను. అది లక్ష్మణునివక్షస్థలమునకు తగిలెను. దానితో నతనిహృద యము పగుల నతడు భూమియందు బడిమూర్ఛపోయెను. రాము డత నిని జూచి మిక్కిలివిచారమునొంది యొకగడియ యాలోచించి కంటంట నీరు తెచ్చుకొని మిక్కిలికంగారు పడెను. తరువాత నతడు 'విచారించుట కిది సమయముకాదని యాలోచించి లక్ష్మణుని జూచుచు రావణుని జంపుటకు నిశ్చయించి గొప్పయత్నముతో వానితో యుద్ధముచేసెను. లక్ష్మణునిశరీరమునందంతటను రక్తము నిండియుండెను. రావణుడు వానరులపై బాణములను వేయుచుండుటచే వారు శక్తిని ఖండింప లేకపోయిరి. లక్ష్మణునిశరీరములో బ్రవేశించి పైకిబయలువెడలి భూమియందుబడిన యాశక్తిని రాముడు తనరెండుచేతులతోను పట్టు కొని ముక్కలుగజేసెను. రామునియాయువుపట్లను రావణుడు బాణ ములతో గొట్టుచున్నను వాని నతడు లక్ష్యముచేయక లక్ష్మణుని కౌగిలించుకొని హనుమంతునితోను, సుగ్రీవునితోను నిట్లనెను. "మీరు లక్ష్మణునిచుట్టు నిలువుడు. చాలకాలమునకు నేను కోరినసమయము

దొరకెను. ఇది నా పరాక్రమమును జూపింపవలసిన సమయము. పాపాత్ముడును, పాపకర్ముడును నగు నీదశగ్రీవుని జంపవలెను. వానరులారా! లోకములో రాముడైనను జీవించియుండవలెను; రావణుడైనను జీవించియుండవలెను. దీని నీగడియలో సత్యముగ నెఱవేర్చి మీకు జూపెదను. నాకు రాజ్యనాశనము, వనవాసము, సీతాపహరణము, రాక్షసులతో యుద్ధము నను దుఃఖములు సంప్రాప్తించినవి. ఇంతకంటె లక్ష్మణుడు పడుట యను గొప్పదుఃఖము కలిగినది. ఈ దుఃఖము నరకలోకకష్టమువంటిది. ఇప్పుడు రావణుని యుద్ధములో జంపి యీ దుఃఖములనన్నిటిని బోగొట్టుకొనెదను. వీనిని జంపునిమిత్తమే నేను వానరసైన్యము నిక్కడకు దీసికొనివచ్చితిని; వాలినిజంపి సుగ్రీవునకు రాజ్యపట్టాభిషేకము చేసితిని; సముద్రమునకు సేతువునుగట్టి మీతో దానిని దాటితిని. ఇప్పుడు పాపుడగు నీ రావణుడు నాకంట్లకు గనపడినాడు. కంటబడినవిషముగల పామును మనుష్యుడు నాశనమొందించునట్లు నేను వీని నంతము నొందించెదను. వానరులారా! మీరు పర్వతశిఖరములపై గూర్చుండి మనస్సున వ్యాకులమునొందక రావణునితో నేనుచేయు యుద్ధమును జూడుడు. అన్నిలోకములవారును, జంగమస్థావరజీవులును, దేవతలును భూమి నిలిచియుండుసంతకాల మొల్లప్పుడును నీయుద్ధమునుగూర్చి చెప్పుకొనునట్లు నేను యుద్ధమును జేసెదను.” ఇట్లు రాముడు పలికి నిశ్చలచిత్తుడై వాడిబాణములను రావణునిపై విడిచెను. ఉభయులు యుద్ధముచేయుచు నొకరిపై నొకరు బాణములను విడుచుకొనిరి. అవి యంతరిక్షమున ప్రతిహతములైనవై తమబలముపోవ క్రిందబడెను. ఉభయులధనుష్టంకారములు ప్రజలందఱికి భయమును గలిగించెను. చివరకు రావణుడు రామబాణములవలన దెబ్బలు తగులుటచే భయమునొంది యుద్ధభూమినుండి పాఱిపోయెను.

## ౩౭వ. అధ్యాయము.
## లక్ష్మణుడు రావణునిశక్త్యాఘాతముచే మూర్ఛనొంది లేచుట.

లక్ష్మణునిపై రావణుడు శక్తినివిసర నది యతనిశరీరమునుండి దూసికొనిపోయి భూమియందుబడ నతనిశరీరమంతయు రక్తమయ మయ్యెను. అంతట రాముడు రావణునిపై బాణములను విసువ వాడు యుద్ధభూమినుండి పాఱిపోయెను. అప్పుడు రాముడు సుషేణునితో నిట్లనెను. 'వీడు రావణునిపరాక్రమముచే భూమియందు పామువలె బడియున్నాడు. అందుచే నాకు శోకముకలుగుచున్నది. నాప్రాణముల కంటె నెక్కువప్రియమగు వీనిశరీరమంతయురక్తముతో నిండియున్నది. దీనిని జూడ నామనస్సు కలకలమునొందుచున్నది. ఇక యుద్ధము చేయుటకు నాకు శక్తి యెట్లుకలుగును? యుద్ధమున గొప్పకీర్తినిబొందిన వాడును, శుభలక్షణములుగలవాడునునగు నాతమ్ముడు మరణించిన యెడల నాకు ప్రాణములవలనను, సుఖములవలనను నేమిలాభము?

అ. రా:—రావణుడు రామునిచే పరాజయమునొంది లంకకు బాఱిపోయెను. తరువాత నతడు శీఘ్రముగ శుక్రుండుచోటికి బోయి యతనికి నమస్కరించి యిట్లు పలికెను. 'భగవంతుడా! లంకయంతయు రాక్షససేనానాయకులతోగూడ రామునిచే నాశనము చేయబడినది. నాపుత్రులు, బంధువులు మొదలగు గొప్పరాక్షసులందఱుగూడ మరణమునొందిరి. మీరు నాకు మంచిగురువులై యుండ నీదుఃఖములన్నియు నాకెట్లు కలుగుచున్నవి?' ఇట్లు రావణుడు విన్నవింప శుక్రుడిట్లు సెల విచ్చెను. 'నీవు రహస్యముగ గొప్పప్రయత్నముతో హోమము చేయుము. దానికి విఘ్నముకాకుండినయెడల నాహోమాగ్నినుండి గొప్పరథమును, గుఱ్ఱములును, ధనస్సును, నమ్ములపొదియు, బాణము

రావణునిచే జంపబడిన నాత్మజ్ఞునిజూడ నావీర్యమునకు సిగ్గుకలుగు చున్నట్లును, నాచేతినుండి ధనస్సు జారిపోవుచున్నట్లునున్నది. బాణ ములు జారిపోవుచున్నవి. నాదృష్టి కన్నీటిచే బాగుగ కనబడకున్నది. నాశరీరము క్షీణించుచున్నది. నాకు గొప్పవిచారము కలుగుచున్నది.

---

లును బుట్టును. వానినిబట్టి యుద్ధముచేసినయెడల నీవు జయింపబడనే రవు. నేను చెప్పినమంత్రములను నీవు గ్రహించి శీఘ్రముగ హోమ ముచేయుము.' ఇట్లు శుక్రుడు సెలవీయ రావణుడు శీఘ్రముగ లం కకు బోయెను. అక్కడ నతడు తననగరున * పాతాళముతో సమమగు గుహను గల్పించి యెక్కువప్రయత్నముతో లంకయొక్క ద్వారములు, తలుపులు మొదలగువానిని బంధింపజేసి మరణమునుగూర్చిచేయబడు నా (అభిచారిక) హోమమునకు గావలసినవస్తువులనన్నిటిని తెప్పించి యెవరును దగ్గఱలేకుండ గుహలో బ్రవేశించి మౌనముదాల్చి హోమము చేయుచుండెను. అప్పుడు దానినుండి చాలపొగబయలు వెడల దానిని విభీషణుడు చూచి యది హోమపుపొగయని తెలిసికొని భయముచే వ్యాకులమునొంది రామునకు దానిని జూపి యతనితో 'రావణుడు హోమముచేయుట కారంభించెను. అది పూర్తి యయ్యెనేని వాడు జయింపశక్యముకానివాడగును. కనుక దానికి విఘ్నముచేయుటకు వానరులను శీఘ్రముగ బంపు' డని మనవిచేసి కొనెను. అతడందుల కంగీకరించి సుగ్రీవునితో నాలోచించి యంగదుని, గొప్పబలులగు హనుమంతుడు మొదలగు వానరులను హోమమునకు విఘ్నముచేయుటకు నాజ్ఞాపించెను. అంతట పదికోట్ల వానరులు లం కాప్రాకారములను నెగిరి దాటి రావణుని గృహములో బ్రవేశించి దానికి కాపుండువారిని పిండిచేసి గుఱ్ఱములను, నేనుగులను నొకక్షణ

---

* ఇట్టివిద్య పూర్వముండినటులను క్రమక్రమముగ నది నశించినట్లును గనబడుచున్నది.

నాకు ప్రాణములను విడుచుటయుం దాసక్తి కలుగుచున్నది.' ఇట్లు రాముడు విలపించుచు గొప్పదుఃఖములో మునిగి యింకను నిట్లు పలికెను. 'నాతమ్ముడు యుద్ధమున జంపబడి బుగ్గిలో బడియుండ రణము వలనగాని, యితరకార్యములవలనగాని, నాప్రాణములవలనగాని, సీతవలనగాని, రాజ్యమువలనగాని నాకేమియు లాభములేదు. ప్రతి

---

ఘులో జంపిరి. తరువాత తెల్లవాఱుజామున విభీషణునిభార్యయగు సరమాదేవి హస్తసంజ్ఞచే హోమముచేయుస్థలమును జూపెను. అప్పు డంగదు డాగుహపైని గప్పబడియున్న పెద్దపాషాణములను తనకా ళ్ళతో తన్ని నవి పిండియాయెను. అంతట నాతడు గుహలో బ్రవే శించి యచ్చట నాసనముపై దృఢముగ గూర్చుండి కండ్లుమూసికొని యున్న రావణునిజూచెను. పిమ్మట నంగదుని యాజ్ఞచే వానరులం దఱు వేగముగ లోనికి బ్రవేశించి యక్కడనున్న సేవకులను దన్నుచు హోమద్రవ్యములను హోమగుండమునంతటను జల్లుచు నల్లకల్లోలము చేసిరి. హనుమంతుడు కోపముతో రావణునిచేతినుండి బలవంతముగ స్రువమును ముక్కలగునటుల లాగి దానితో శీఘ్రముగ నాతని గొట్టెను. వానరులు తమపండ్లతో వానిశరీరమును జీల్చి కఱ్ఱలతో వానిశరీరమందంతటను గొట్టినను వాడు జయించుకోరికతో తనధ్యాన మును మానలేదు. అప్పుడంగదుడు రావణుని యంతఃపురములోనికి మిక్కిలిశీఘ్రముగ బోయి మండోదరిజుట్టుముడినిబట్టి యామె నాతని యెదుటకు నీడ్చుకొనివచ్చెను. ఆమె నాథుడు లేనిదానివలె నాతని యెదుట విలపించుచుండ ముత్యములతోను, రత్నములతోను చిత్రింప బడిన యామెరవికను నంగదుడు చించెను. అంతట దానినుండి ముత్య ములును, రత్నములును క్రిందరాలెను. తరువాత నతడు రత్నము లతో జెక్కబడిన యామెమొలనూలును తెంప నది క్రిందబడెను. అంతట నతడు రావణుడుచూచుచుండ నామెనడుమునన్నున్నకోక

దేశమునందు భార్యలు దొరకుదురు; బంధువులు దొరకుదురు; కాని సోదరుడు దొరకు దేశమును నే నెచ్చటను గానను.' ఇట్లు రాముడు శోకముచేత దీనముగ పలుకుచు మాటిమాటికి నిట్టూర్పు విడుచుచుండ నాతనిని సుషేణుడు యిట్లు ఓదార్చెను. 'రామా! శోభాయుక్తుడగు నీ లక్ష్మణుడు మరణించలేదు. ఇతని నోరు కృష్ణవర్ణము నొందలేదు; రంగు మారలేదు;

---

ముడిని సడలించెను. ఆ నగలన్నియు భూమియందు పూడ్చబడెను. వానరులు రావణుని భార్యలగు దేవగంధర్వస్త్రీలను పక్కకీడ్చి సంతోషముతో దీసుకొని వచ్చిరి. అప్పుడు పట్టపురాణి రావణుని యెదుట నెక్కువగ నేడ్చుచు దీనముగ నిట్లు విలపించెను. 'రావణా! శత్రువులు నీయెదుట నీ భార్యల జుట్టుముడిని పట్టుకొని లాగుచుండుటయు, పాపులగు శత్రువులు లాగుచున్న నీ యెదుట కొట్టుచుండుటయు నీవు చూచుచు సిగ్గు లేకుండ హోమము చేయుచున్నావు గనుక నీకు వెంటనే నాశము తగియున్నది. ఇట్టి సమయమున జీవించుటకంటె మరణించుటయే శ్రేష్ఠము. అయ్యో! ఇంద్రజిత్తా! వానరులచే నీ తల్లి బాధింపబడుచున్నది. నీవు జీవించియుండిన నా కిట్టి దుఃఖములు కలుగును? నా భర్త తన జీవితమందలి యాశచే తన భార్యను, లజ్జను విడిచెను.' ఇట్లు మండోదరి విలపించుచుండ దానిని రావణుడు విని ఖడ్గమును బట్టి లేచి యంగదునితో 'నా భార్యను విడువు' మని పలుకుచు నతని మెడను దానితో గట్టిగ నరికెను. అప్పుడు వానరు లందరు నిట్టి గొప్ప యాగమును పాడుచేసి దానిని విడిచి రాముని సన్నిధికి బోయి సంతోషముతో నిలిచిరి.

తరువాత రావణుడు తన భార్య నిట్లు ఓదార్చెను. "దేవీ! సర్వము దైవాధీనము. జీవించియున్న పురుషుడు దేనిని జూడడు? నీవు నిశ్చయింపబడిన యాత్మజ్ఞానమును బొంది శోకమును విడువుము. అజ్ఞానమువలన శోకము కలుగును. శోకము జ్ఞానమును బోగొట్టును. ఆత్మజ్ఞానికి శరీరాద్యులయందు నహంకారబుద్ధి యజ్ఞానమువలన కలుగును.

కాంతిపోలేదు. ఇతనిముఖము మంచిప్రభగలిగి సంతోషకరముగ గనబడుచున్నది. అఱచేతులెఱ్ఱకలువరంగుగలిగియున్నవి. కండ్లు కాంతి గలిగియున్నవి. ప్రాణములు పోయినవారిరూపమిట్లుండదు. చాల కాలముజీవించువారిముఖమువలె నితనిముఖము కాంతిగలిగియున్నది. ఇతనిశరీరమును ప్రాణములు విడువలేదు; అవి నిలిచియున్నవి. మీరు విచారముపొందకుడు. ఇతనిశరీరము కదలుచుండుటయు, హృదయము గడియగడియకు గొట్టుకొనుచుండుటయు, నితడూపిరితీయుచుండుటయు జూడ నితడు నిద్రించుచున్నట్లు కనబడుచున్నాడు.' ఇట్లు సుషేణుడు రామునితో బలికి హనుమంతుని మిక్కిలితొందరపెట్టుచు నిట్లు పలి కెను. 'బుద్ధిమంతుడా! నీవు శీఘ్రముగ నిక్కడనుండి * జాంబవంతు డిదివరలో జెప్పిన యోషధిపర్వతమునకు బోయి దానిదక్షిణశిఖర ముననుండు విశల్యకరణి, సవర్ణకరణి, సంజీవకరణి, సంధానకరణి యను

అహంకారమూలముననే పుత్రులు, భార్య మొదలగువారితోసంబంధ రూపమైన సంసారముగలుగును. అట్టిసంసారమువల్ల సంతోషము, విచారము, భయము, క్రోధము, లోభము, మోహము, వాంఛ మొద లగునవియు, జననమరణములును, ముసలితనము మొదలగునవియు గలుగును. ఆత్మ శుద్ధమైనదియు, నొక్కటిగానుండునదియు, నజ్ఞానము కంటె వ్యతిరిక్తమైనదియు, దేనిని నంటనిదియు, నానందస్వరూపమై నదియు, జ్ఞానస్వరూపమైనదియు, సుఖదుఃఖములు లేనిదియు నై యు న్నది. అట్టిసద్రూపమగు నాయాత్మకు దేనితోను సంయోగముకాని, వియోగముకాని లేదు. కనుక నీవు ఆత్మస్వరూపమును నిట్టిదానినిగా దెలిసికొని శోకమును విడువుము. ఇప్పుడే నేను పోయి రామలక్ష్మణు లను జంపి వచ్చెదను. లేనియెడల రాముడు తనవాడిబాణములచే నన్ను

* 11వ ప్రకరణము ౨౪వ అధ్యాయము. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముచే రామ లక్ష్మణాదులను బంధించుట. తిరుగవారికి బంధవిముక్తిగలుగుట 1073, ఫ పంక్తులు.

నోషధులను శీఘ్రముగ దెమ్ము. లక్ష్మణునిబ్రతికించుటకు నవి కావలెను.' ఇట్లు సుషేణుడు పలుక హనుమంతు డోషధిపర్వతమునకు బోయి యా యోషధులు తనకు దెలియకపోవుటచే మిక్కిలివిచారము నొంది యిట్లాలోచించెను. 'నేను పర్వతశిఖరమంతయు దీసికొనిపోయెదను. దీనియందే మేలునుగలిగించు నోషధియున్నదని తలచెదను. సుషేణుడుగూడ నిట్లే చెప్పెను. విశల్యకరణిని నేను వేళకు దీసికొని వెళ్ళలేకపోయిన యెడల కాలాతీతముచే దోషము, కీడులు కలుగును.' ఇట్లు హనుమంతు డాలోచించి యాపర్వతశిఖరమును మూడుమారులు కదిపి పైకెక్కడీసి తనచేతులతో బట్టుకొని యాకాశమార్గమున నెగిరి లక్ష్మణుడుండుచోట నాశిఖరమును నుంచి కొంచెము సేపాయాసమును దీర్చుకొని సుషేణునితో నిట్లు పలికెను.'ఆ యోషధి నాకు దెలిసినదికాదు. ఆపర్వతశిఖరమునంతను దెచ్చితిని.' ఇట్లు హనుమంతుడు పలుక సుషేణుడు దానిని బాగడి తనకుగావలసిన యోషధిని దీసికొనెను. దేవతలైనను జేయలేనిపనిని హనుమంతుడు

---

జంప నేను విష్ణుపాదములసన్నిధికి వెళ్లెదను. అప్పుడు నీవు చేయవలసినదానిని నేను నీ కాజ్ఞాపించుచున్నాను. నీవు సీతను జంపి తరువాత నాతోగూడ నగ్నిలో బ్రవేశింపుము" ఇట్లు రావణుడు పలుక నామె మిక్కిలిదుఃఖించి యిట్లనెను. 'నాథా!నామాటను విని దానిని నిజముగ జరుపుము. నీవుకాని; యితరులుకాని రాముని నెన్నడును జయింపలేరు. అతడు దేవతలలో శ్రేష్ఠుడును,సాక్షాత్ప్రధానపురుషుడునునగు పరమాత్మ. అతడిదివరలో మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన పరశురామావతారములనుబొంది లోకముల నుద్ధరించెను. పరాత్పరుడగు నత డిప్పుడు రఘువంశమున మనుష్యరూపమున నీమరణమునకై పుట్టియున్నాడు. నీమరణమునకును, నీపుత్రులమరణమునకును నట్టి రాముని భార్యయగుసీతను బలాత్కారముగ నరణ్యమునుండి తీసికొని

చేసినందులకు వానరులు, రాక్షసు లాశ్చర్యమునొందిరి. సుషేణు డాయోషధిని గుండకొట్టి లక్ష్మణునిముక్కుదగ్గఱపెట్ట నతడు దానిని బీల్చెను. అప్పుడు వెంటనే యాతని శరీరమునకు దగిలియున్న బాణము లన్నియు బయలువెడలెను. అప్పు డతడు రోగములేని వాడై భూమినుండి లేచెను. వానరులందఱు దీనిని జూచి 'బాగుబా' గని సంతోషముతో సుషేణుని గీర్తించిరి. రాముడు లక్ష్మణునితో 'రమ్మర'మ్మని పలికి యానంద బాష్పములతో వానిని స్నేహముచే కౌగిలించి 'దైవయోగమువలన నీవు మరణము నుండి తప్పింపబడితివి. నీ వంతమునొందినయెడల నాజీవితమువలనను, సీతవలనను, యుద్ధములో జయమువలనను నాకు ప్రయోజనములే'దని

---

వచ్చితివా యేమి? ఇప్పుడైనను నీవు సీతను రామున కప్పగించి విభీషణు నకు రాజ్య మిచ్చి నన్నుదీసికొని తపోవనమునకు వెళ్ళుము.' ఇట్లు మండోదరి పలుక రావణు డిట్లు మాఱుపలికెను. 'నేను నాపుత్రులను, తమ్ములను, రాక్షససమూహమును రామునిచే యుద్ధమున నంతము నొందించుకొని వనమున నెట్లుందును? నే నాతనితో యుద్ధముచేసి తీవ్రమగు నాతనిబాణములచే మరణించినయెడల నతనియొక్క పరమ పదమును బొందెదను. అతడు విష్ణువనియు, సీత లక్ష్మియనియు నే నెఱుగుదును. అట్లెఱిగియుండియే యాతనివలన మరణమునొంది పరమపదమునొందదలచి నేను సీతను బలవంతముగ వనమునుండి తీసి కొనివచ్చితిని. నేను నిన్ను సంసారమునుండి తప్పించి నీతోగలిసి మోక్ష మును గోరువారు సేవించునదియు, శుద్ధమగునదియు, మిక్కిలి యానం దమగునదియునగు గతికి వెళ్ళెదను. నేను రామునిచే యుద్ధమున మర ణమునొంది పాపముల నన్నిటిని నిక్కడ బోగొట్టుకొని దుర్లభమగు ముక్తిని బొందెదను.' ఇట్లు రావణుడు పలికి రామునితో యుద్ధము చేయుటకు బయలుదేఱెను.

పలికి లక్ష్మణుడు గొప్పవిచారమును బొంది మెల్లగ నాతని కిట్లనెను. "మీరు రావణునిజంపి విభీషణునకు పట్టాభిషేకము నర్పెదనని పూర్వము ప్రతిజ్ఞ చేసియుంటిరి. మీరు దుర్బలులవలె స్వల్పపుమాటలను బలుకవలదు. బుద్ధిమంతులగు సత్పురుషు లసత్యప్రతిజ్ఞలను జేయరు. బలముగలవానికి తనప్రతిజ్ఞను నెఱవేర్చుకొనుటయే ముఖ్యలక్షణము. మీరు చేయవలసినపనులవిషయమై నన్నుగూర్చి నిరాశను బొందగూడదు. మీరు రావణుని వధించి మీప్రతిజ్ఞను జరుపుకొనుడు. తీక్ష్ణమగు కోరలుగలదియు, గర్జించుచున్నదియు నగు సింహమునకు నెదుట పడిన యేనుగు ప్రాణములతో వెళ్లలేనటుల మీబాణములబారికి లోనగు శత్రువు ప్రాణములతో మరలిపోలేడు. ఈదినమున సూర్యాస్తమయముకాకపూర్వ మీదుర్మార్గునివధ మీరు జరుపవలెనని నేను కోరుచున్నాను. మీరు యుద్ధములో రావణునిజంపి మీప్రతిజ్ఞను నెఱవేర్చుకొనదలచిన యెడలను, మీయునన్నులోనుండునట్టి దానను జరుపదలచిన యెడలను నేను చెప్పినమాటను శీఘ్రముగ జరుపుడు." ఇట్లు లక్ష్మణుడు పలుక రాముడు ధనస్సును నెక్కుపెట్టెను.

—:o:—

౩౩ వ. అధ్యాయము

రామ రావణయుద్ధము; రావణవధ.



రావణుడులక్ష్మణునిమూర్ఛనొందించి పాఱిపోయి మంచిచిత్రపువులుగలదియు, బంగారుమాలలచే నలంకరింపబడిన స్వర్ణనిగుళ్లములను గట్టినదియు, మంచియాయుధములతో నిండినదియు, మంచిధ్వజములు, జెండాలుగలదియు, మిక్కిలిప్రకాశమానముగ నున్నదియు,

నాశ్చర్యకరమగునదియు, భయంకరమైనదియు, మేఘములవలె నల్లనైన దియు నగు మఱియొకరథము నెక్కి రాముడుండుచోటికి యుద్ధమునకు వచ్చెను. రాముడు ధనస్సునుబట్టి ఘోరములగు బాణములతో రావ ణునిగొట్టెను. వాడుకూడ నతనిపై బాణములను విడిచెను. రాముడు భూమియందు నిలిచి యుద్ధముచేయుటయు, రావణుడు రథమెక్కి యుద్ధముచేయుటయు దేవదానవగంధర్వులుచూచి యిది తగినదికాదని పలికిరి. అప్పు డింద్రుడు తనసారథియగు మాతలితో మంచిరథమును రామునకు బంపెను. బంగారునలంకారములు, పచ్చనివర్ణము గల మంచిగుఱ్ఱములను గట్టినదియు, తెల్లనిచామరములుగలదియు, వందల కొలదిగంటలుగలదియు, మంచి తెలుపురంగుగలదియు, బంగారపుధ్వ జము, చక్రములు గలదియు, ప్రకాశమానమైనదియునగు నారథము స్వర్గమునుండి రాముడుండుచోటికి వచ్చెను. మాతలి రథము మీదనుండియే యతనికి నమస్కరించి 'ఈరథము మీవిజయమునకై యింద్రునిచే బంపబడినది. అతడు మీకు నింద్రధనస్సును, నగ్నివలె ప్రకాశించు కవచమును, సూర్యతేజముగల బాణములను, శుభ్రమగు తెల్లని శక్తినిగూడ బంపెను. ఈరథమునెక్కి రావణుని జంపు' డని విన్నవించెను. అంతట నత డారథమునకు ప్రదక్షిణముచేసి నమస్క రించి లోకములన్నియు తన తేజముచే ప్రకాశించునటుల దానినెక్కెను. అప్పుడు రామ రావణులకు నెడతెఱపిలేని యాశ్చర్యకరమగుయుద్ధము జరిగెను. రావణుడు ప్రయోగించినగాంధర్వాస్త్రమును గాంధర్వాస్త్ర ముతోను, దైవాస్త్రమును దైవాస్త్రముతోను రాముడు తిరుగగొ ట్టెను. దానితో రావణుడు గొప్పక్రోధమును జెంది రాక్షసాస్త్రమును నతనిపై బ్రయోగించి తనధనస్సునుండి బాణములను విడువ నవి గొప్ప విషముగల సర్పరూపములతో నన్నిదిక్కుల వ్యాపించునటుల నగ్నిని గ్రక్కుచు భయంకరములగు నోళ్ళతో నతనిని జేరెను. అంతట రాము

డా బాణములకు భయముకలిగించునట్టి గాంధర్వాస్త్రమును ప్రయో గించి ప్రకాశమానములగు బాణములను విడువ నవి యన్నివైపుల ప్రస రించుచు బంగారుశరీరముగల గరుడపాతాసములతో [illegible] వెడలి పాములవలెనున్న శరములను సమీపించి వానినన్నిటిని నాశనముచే సెను. ఇట్లు తనయస్త్రప్రయోగము విఫలమగుటచే [illegible] క్రోధము తెచ్చుకొని రావణుడిప్డు ఘోరమగు [illegible] మాతలిపై గూడ ననేక బాణములను విడిచెను. [illegible] ముతో రాముని రథధ్వజముపడునట్లు గొట్టి [illegible] గూడ బాణములను విడిచెను. దీనిని జూచి [illegible] దేవ గంధర్వ దానవ చారణులు గొప్పవిచారమునొందిరి. [illegible] యశుభములాకాశమునందు గనబడెను. [illegible] రోహిణీనక్షత్రస్థానమున ప్రజలకు కీడును [illegible] నిలిచెను. సముద్రముఉక్కువగపొంగి యాకాశమును [illegible]. ఇంకను వానికి మరికొన్ని దుశ్శకునములు గనబడెను. [illegible] నిండియుండెను. కోసలరాజులనక్షత్రమగు విశాఖనక్షత్రమున [illegible] కుడు నిలిచెను. రావణుడు 10 తలలతోను, 20 భుజములతోను నిలిచి పెద్దధనస్సునుబట్టి పెద్దపర్వతమువలె గనబడెను. రాముడు [illegible] నవమానమును బొందుటచే వానిపైని తనధనస్సు నెక్కుపెట్టి బాణ ములను విడువలేకపోయెను.

తరువాత రామునికి గొప్పక్రోధము వచ్చెను. వాని కండ్లు కొంచెమెఱ్ఱగ నుండెను. వానిని జూచి భూతములన్నియు భయమొం దెను. భూమి కంపించెను. సముద్రములు కల్లోలములయ్యెను. పక్షులు కఠి నముగ కూయుచు చెడుగును సూచించుచు నాకాశమున నెగురుచుం డెను. క్రోధమునుబొందిన రామునిజూచియు, దుశ్శకునములను జూచి యు రావణుడు భయమునొందెను. పిమ్మట రామ రావణులకు ఘోర

యుద్ధము జరిగెను. ఆకాశమున విమానములనుండి దేవ గంధర్వోరగ ఋషి దానవ దైత్య గరుత్మంతాదులు దానిని జూచిరి. అసురులు రావణుడు జయముపొందవలెననియు, దేవతలు రాముడు జయము పొందవలెననియు, పలుమార్లుపలుకుచుండిరి. ఇట్టిసమయమున రావణుడు మిక్కిలికఠినమైనదియు, పెద్దయినుపముండ్లుగలదియు, నూచుటకు భయంకరమగునదియు, వాడియైనకొనలుగలదియు, 8గంటలుగలదియు, మిక్కిలిధ్వనిచేయునదియునగు గొప్పశూలమును బట్టి గొప్పనాదముచేసి తనసైన్యమునకు సంతోషమును గలుగజేయుచు రాముని నిట్లు కఠినపుమాటలాడెను. 'వజ్రమువలె కఠినమైన యీశూలమును నేను రోషముచే నీపైని విడుచుటకు బట్టియుంటిని. ఇది నీప్రాణములను, నీతమ్మునిప్రాణములను తక్షణమే తీసివేయును. నిన్ను హతమొనర్చి యుద్ధములో జచ్చిన రాక్షసులతో సమముగ యమలోకమునకు బంపెదను. ఈశూలముతో నిప్పుడే నిన్ను నంతమునొందించెదను; నిలువుము.' ఇట్లు రావణుడు పలికి రామునిపై నాశూలమును విసర నాతడు దానిపై వాడిబాణములను విడిచెను. కాని యది వానినన్నిటిని లక్ష్యపెట్టక తనపైకి వచ్చుచుండెను. అప్పుడు దానిని జూచి యాతడు మిక్కిలిక్రోధమునుజెంది యింద్రుడు తనకు మాతలిద్వారా పంపిన శక్తినిబట్టియుండ నది గంటలతో మ్రోగుచు తేజోమయముగ నుండెను. దానిని రాముడు రావణునిశూలముపైకి విసర వాని శూలముముక్కలై క్రిందపడెను. తరువాత రాముడు వాడిబాణములచే రావణునిగుఱ్ఱములను గొట్టి వానియురముపైని, నుదుటి పైనికూడ తీవ్రబాణములను నాటెను. దానితో వానికి రక్తమెక్కువగ కారుచు వాడు గొప్పవిచారమును, క్రోధమును బొందెను.

తరువాత గొప్పకోపముతో రావణుడు కండ్లెఱ్ఱజేసి ధనస్సును బట్టి రామునిపైని బాణవర్షమును కురిపింప నతడు కదలకుండ తన

బాణములచే వానినన్నిటిని తునుకగొట్టెను. పిమ్మట నానావిధములగు వాడిబాణములను నాటు నతనిశరీరమునుండి యెక్కువగ రక్తము కారెను. ఐనను నాతడు తిరిగి వాడిబాణములను వానిపైని విడిచెను. ఇట్లు వారిద్దఱు ఘోరయుద్ధముచేయుచు నొకరిపై నొకరు బాణములను వేసికొనుటచే చీకటి వ్యాపింప నాకాశము కనబడకపోయెను. అప్పుడు రాముడు మిక్కిలి క్రోధమును జెంది పెద్దనవ్వునవ్వి రావణునితో కఠినమగుమాటల నిట్లనెను. "రాక్షసాధమా! నాభార్యను రక్షించు వారెవ్వరు లేనప్పుడు జనస్థానమునుండి యన్యాయముచే నెత్తుకొనిపోయినందులకు నీవు వీర్యవంతుడవుగావు. నేనులేనిసమయమున గొప్పయడవిలోనుండి దీనురాలగు నాసీతను నీవు బలవంతముగ నెత్తుకొనిపోయియు, భర్తలు లేనిసమయమున వారిభార్యలయెడ దుర్మార్గముగ ప్రవర్తించియు, మర్యాదలేనివాడవై సిగ్గును విడిచియు నీగర్వమువలన నీకు మరణము సిద్ధముగసంభవించియుండ నింకను నీవు 'నేను శూరుడ' నని తలంచుకొనుచున్నావు. కుబేరుని తమ్ముడవును, శూరుడవును, మంచిబలము, యశస్సుగలవాడవును నగు నీవుకొనియాడదగినదియు, కీర్తికరమునునగు గొప్పకార్యమును జేసితివి! నీవు గర్వముతో కీడుకలిగించు హేయమగుపనులను జేయుటచే నాపనులకుదగిన గొప్పఫలములననుభవించెదవు. దుర్బుద్ధీ! 'నేను శూరుడ' నని యనుకొనుచున్న నీవు దొంగవలె సీతనెత్తుకొనిపోయినందులకు నీకు సిగ్గుగలుగుటలేదా? నీవు నాయెదుటనుండి సీతను బలవంతముగ దీసికొనిపోయియుండినయెడల నాబాణములచే జంపబడి నీతమ్ముడగు ఖరుని జూచియుందువు. దుష్టాత్మా! దైవయోగమున నీవిప్పుడు నా కంటబడితివి. నిన్ను తీక్ష్ణబాణములచే యమపురికి బంపెదను. నావాడి బాణములు నీశిరములను దెగగొట్టి యుద్ధభూమియందు బడవేయగా దానిని మాంసాహారముగలజంతువులు పీకుకొనితినును. నీశరీరమునైని

కగుపడిన శుభసూచకములను జూచుచును యుద్ధముచేయుటకు నిశ్చయించి భయములేకుండ యుద్ధముచేసిరి. జయింపవలెనని రాముడును, మరణముతప్పదని రావణుడును ధైర్యమవలంబించి యుద్ధములో తమ పరాక్రమములను పూర్తిగ జూపిరి. తరువాత క్రోధముతో రావణుడు రాముని రథధ్వజముపై బాణములను విడువ నవి రథమునకు సూత్రము తగిలి క్రిందబడెను. దానితో రాముడు గొప్పక్రోధమును బొంది దానికి ప్రతీకారమాలోచించి వాడి బాణమును వానిధ్వజముపై వేయ నది దానిని ఛేదించి భూమిమీఁద బడెను. రథధ్వజముకూడ క్రిందబడి పోయెను. దానితో నా రాక్షసరాజు క్రోధించి యాతనిగుఱ్ఱములపై బాణములను వేయ నవి యేమియు జలింపలేదు. అందుచే రావణునకు నెక్కువక్రోధముకలుగ నా గుఱ్ఱములపై తిరిగి శరసమూహమును గురిపించెను. ఇంకను వాడు గదలను, పరిఘలను, చక్రములను, ముసలములను, పర్వతశిఖరములను, చెట్లను, శూలములను, గండ్రగొడ్డళ్ళనుకూడ తనమాయచే గల్పించి వానిపైని క్రోధముతో వేయ నవి రాముని రథమునకు తగులకుండ వానరులమీఁద బడెను. తరువాత వాడు మిక్కిలియుత్సాహముతో వేలకొలది బాణములను విడువ నవి యాకాశమును గప్పెను. దానిని రాముడు చూచి యేమియు నాయాసము లేకుండ ననేకబాణములను విడువ రావణుడుకూడ నాకాశమున నేమియు నవకాశములేకుండునటుల బాణములను విడిచెను. ఆశరములెట్లు విడువబడినను కొన్ని యిరువురకు తగిలియు, కొన్ని యొకదానికొకటి తగిలియు, కొన్ని వ్యర్థముగను క్రిందబడెను. వారు కుడిచేతితోను, నెడమచేతితోను నెడతెలుపిలేకుండ విడుచు బాణము లాకాశమంతయు నిండెను. తరువాత నొకరిగుఱ్ఱములనొకరు బాణములతో గొట్టుచు గొప్పయుద్ధముచేసిరి.

ఇట్లు రామరావణులు ఘోరమగుయుద్ధముచేయుచుండ నందఱును నాశ్చర్యముతో జూచుచుండిరి. వారు రథములను గుండ్రము

గను, ముందునకును, వెనుకకును దోలించుచును, రథగమనమును వెలుపుడుచేయుచును నొకరినొకరు చంపుకొనుటకై భయంకరరూపములను దాల్చి వాడిబాణములను విడుచుకొనిరి. ఇట్లు వారు యుద్ధముచేయుచుండ రెండురథములు గుఱ్ఱములకు గుఱ్ఱములు తగులునట్లు దగ్గఱకు నెదురుగ వచ్చినిలిచెను. అప్పుడు రాముడు రావణుని గుఱ్ఱములు నాల్గింటిపై నాలుగువాడిబాణములను విడిచి వానిని మళ్ళించెను. దానికి రావణుడు క్రోధమును జెంది మాతలిపై వాడిశరములను విడిచెను; కాని యాదెబ్బలకు నతడు ముఖవికారమునుగాని, విచారమునుగాని పొందలేదు. తరువాత నారాక్షసరాజు యాతనిపై వాడిబాణములను విడువ నవి వానిశరీరమునకు దగిలినను వానికేమియు మూర్ఛగాని, విచారముగాని కలుగలేదు. రావణుడు మాతలిని గొట్టుటచే రాముడు మిక్కిలికోధమునుజెంది యనేకబాణములను రావణునిరథముపై విడిచెను. దానికి మాఱుగ వాడాతనిపై గదలవర్షమును, ముసలములవర్షమును గురిపించెను. ఇట్లు వారికి ఘోరమగుయుద్ధముజరుగుచుండ సముద్రములు కలంగెను. పాతాళములోనుండు దానవులు, నాగులు భయమునొందిరి. భూమియంతయు గంపించెను. సూర్యునికి గాంతి తగ్గెను. వాయువు వీవలేదు. అప్పుడు దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు, కిన్నరులు మొదలగు వారికి గొప్పవిచారము కలిగెను. ఆఘోరయుద్ధమును జూచి దేవతలును, మహర్షులును 'గోబ్రాహ్మణులకు శుభమగుగాక! లోకములు శాశ్వతముగ నుండుగాక! రాముడు రావణుని యుద్ధములో జయించుగాక!' యని పలుకుచుండిరి. గంధర్వులును, నప్సరసలును యుద్ధమును జూచుచు 'ఈయుద్ధమున కిదియేసాటి' యని పలికిరి. తరువాత రాముడు గొప్పకోధముతో తనధనస్సున మంచివాడిగలకత్తివలెనుండు బాణములను సంధించి రావణునిశిరస్సులపై విడువ నవి వానిశిరస్సులనన్ని

టిని తెగగొట్టెను. ఐనను వానికి తలలు పూర్వమువలె నుండెను. రెండవసారికూడ రాముడట్టి బాణములతో వానిశిరములను ఖండించెను; కాని యవి తిరుగ పుట్టి మొలిచెను. ఇట్లు రాముడు 101 పర్యాయము బాణములనువిడిచి వానిశిరములను తెగగొట్టెను సరి తిరుగ మొలుచుచునే యుండెను; కాని వానికి మరణముసంభవింపలేదు. తరువాత నన్నియస్త్రముల ప్రయోగము తెలిసిన రాముడు 'ఈనా బాణములచేతనే మారీచుడు, ఖరుడు, విరాధుడు, కబంధుడు మొదలగువారు యుద్ధములందు మడిసినను రావణునిగూర్చి యివి నిష్ఫలములయి తగ్గి యున్న' వని విచారించి జాగరూకుడై రావణునివక్షమునందు శరవర్షమును గురిపించెను. దానికి మారుగ వాడు తనిష్ట గదలయొక్కయు, ముసలములయొక్కయు వర్షమును గురిపించెను. ఇట్లు వారు త్రికూట పర్వతశిఖరమునను, భూమిమీదను, నాకాశమునను సురలు చూచుచుండ రాత్రియనక పగలనక యొకక్షణమైనను విరామములేకుండ ఘోరయుద్ధముచేసిరి.

* ఇట్టిసమయమున మాతలి శీఘ్రముగ రామునితో నిట్లు పలికెను. 'వీరవర్యా! మీరు తెలియనివానివలె నేల వర్తించుచున్నారు? వీనిపైని బ్రహ్మాస్త్రమును విడువుడు. వీనివినాశకాలమునుగూర్చి సురలు పలికినసమయమిప్పుడే' యని జ్ఞాపకముచేయ నతడు తొలుత దండకావనమున మొదట నగస్త్యుడిచ్చిన బాణమునుదీసెను. దానిని బ్రహ్మ నిర్మించి యింద్రునకు మూడులోకములను జయించుటకిచ్చెను. దానిని నింద్రుడగస్త్యున కిచ్చెను. యుద్ధములో వ్యర్థముకానిదియు, తేజోమయమైనదియు, వీర్యముకలదియు, వజ్రతుల్యమైనదియు, శీఘ్రముగ శత్రువులను నాశనముచేయునదియు, బంగారుకట్టుగలదియు నగు

---

* అ. రా:—రాముడు రావణునిపై నైంద్రాస్త్రముతో బాణములను ప్రయోగింప నవి వానితలలను తెగగొట్టెను; కాని

దానిఱెక్కలయందు వాయుశక్తియు,కొనయందగ్ని సూర్యులశక్తియు, మధ్యభాగమందాకాశ (బ్రహ్మ) శక్తియునుండెను. అది మేరు మందర పర్వతములవలె బరువుకలిగి యన్నిభూతములయొక్క తేజస్సారము తోను జేయబడియుండెను. ఇంకనునది సూర్యుని తేజస్సు గలిగియుండెను; శత్రువులయేనుగులను, గుఱ్ఱములను, నితరబలములను సంహారింపశక్తి గలిగియుండెను; శత్రువులకోటలను, నాయుధములను కొట్టగలిగియుం డెను; కొండలనుగూడ పగులగొట్టగలిగి యుండెను. దీనికి రక్తమాం సములంటియుండెను. అది యుద్ధములో యమునిపరాక్రమమువంటి వీర్యముగలిగి గరుత్మంతుని ఱెక్కలవంటి ఱెక్కలుగలిగి యుండెను. మిక్కిలిగొప్పదగు నిట్టిబాణమును రాముడు తీసి వేదవిధిగ దానినభి

---

వానికి తిరిగి తలలు మొలుచుచుండ రామునకు విచారముకలిగెను. అప్పుడు సమీపమున నున్న విభీషణుడు 'రావణుడు బ్రహ్మవలన వర ములు పొందియుండుటచే వానితలలు, బాహువులు తెగగొట్టబడినను శీఘ్రముగ తిరుగ మొలుచుచున్నవి. కాన వానినాభిదేశమందున్న యమృతకలశను నాగ్నేయాస్త్రముతో నిగరకొట్టిన వానికి మరణము కలుగు' నని విన్నవించెను. అందుపైని రాము డాగ్నేయాస్త్రమును రావణునినాభిదేశమందు విడిచి తరువాత వానితలలను, బాహువులను తెగగొట్టెను. అప్పుడు రావణుడు క్రోధమునొంది విభీషణునిజంపుటకు గొప్పశక్తినితీసి వానిపై విసర రాముడు దానిని తనవాడిబాణము లతో ముక్కలుముక్కలుగ జేసెను. రామునిచే రావణునితలలు తెగగొట్టబడుటవలన వాని తేజస్సంతయు పోయెను. వానికి నొక్క తలయు, బాహువులుమాత్రమే నిలిచెను. తరువాత రావణుడు రామునిపై నస్త్రములను, శస్త్రములను, బాణములను విడిచెను. ఇట్లు వారికి గొప్పయుద్ధముజరుగుచుండ నట్టిసమయమున మాతలి రామునకు 'బ్రహ్మాస్త్రముతో ప్రయోగింపు' మని జ్ఞాపకముచేసెను.

మంత్రించి తనధనస్సున సంధించెను. అప్పుడు జీవులన్నియు భయము నొందెను. భూమికదలెను. తరువాత రాముడు తనధనస్సునెక్కు- నారిని లాగుగలంగి గొప్పయగ్నిముతో నా బ్రహ్మాస్త్రమును రావణునిపై విడువ నది వానివక్షఃస్థలమును తగిలి వానిహృదయమును భేదించెను. అది వానిప్రాణములను తీయుచు రక్తముతోగూడ భూమిమీద బడి వినయముతో రాముని యమ్ములపొదిలో తిరుగ ప్రవేశించెను. అంతట రావణుని చేతిలోనుండి వెంటనే ధనస్సును బాణములును జారి క్రిందబడెను. ప్రాణములుపోవుటచే వాడు రథమునుండి క్రిందబడెను. *ఇట్లు రావణుడు యుద్ధమారంభించినయామావాస్యనాడే మృతినొందెను. దీనిని మిగిలినరాక్షసులు చూచి భయముచే పరుగెత్తుచుండ వానరులు చెట్లతో గొట్టుచు వారిని తరుముచు వారిపైబడుచు లంకకు బరుగెత్తిరి. వానరులు రావణునిమరణమును, రామునివిజయమును పైకి తెలియజేయుచు మిక్కిలిసంతోషముతో నాదముచేసిరి. ఆకాశమున దేవదుందుభులు మ్రోగెను. వాయువు మంచివాసనలతో వీచెను. ఆకాశమునుండి పుష్పవర్షము రామునిరథముపై కురిసెను. దేవతలు మొదలగువారు మంచిమంచిపుష్పములను రామునిరథమున జల్లిరి.

---

*అ. రా:— రావణుడు మరణింపగా వాని దేహమునుండి సూర్యుని తేజస్సువంటిగొప్పతేజస్సు బయలువెడలి దేవతలు చూచుచుండ రాముని దేహములో ప్రవేశించెను. అప్పుడు దేవతలిట్లు పలికిరి. 'ఆహా! మహాత్ముడగు రావణుని భాగ్య మెంతగొప్పది! మేము సత్త్వగుణముకలిగి విష్ణునికరుణకు పాత్రులమై యున్నను సంసారములో మెలగుచు భయము దుఃఖము మొదలగు గుణములుగలిగియున్నాము. వీడు క్రూరరాక్షసుడు; బ్రాహ్మణులను జంపినవాడు; మిక్కిలిదుష్టుడు; పరభార్యలయందాసక్తి గలిగియున్నవాడు; విష్ణువునందు ద్వేషబుద్ధి గలవాడు; మునులను హింసించినవాడు. అట్టివాని తేజస్సు సర్వభూత

ఆకాశమున దేవతలును, నితరమహాత్ములును 'బాగుబాగని రాముని గీర్తించిరి. అన్నిలోకములకు భయంకరుడును, రౌద్రుడునునగు రావణుడు మడియుటచే దేవతలకును, చారణులకును గొప్పసంతోషము కలిగెను. రాముడు రావణునిజంపి సుగ్రీవాంగదులకు మిక్కిలి ప్రీతిని

---

ములు చూచుచుండ రామునిలో ప్రవేశించెను.' ఇట్లు దేవతలుపలుక నారదుడు నవ్వుచు 'ధర్మతత్త్వమును విచారణచేయు దేవతలారా! వినుడు. రావణుడు రామునియందలి ద్వేషమువలన నెల్లప్పుడు నతనినే మనస్సులో చింతించుచు తనసేవకులతోగూడ నెల్లప్పుడు నాతనిచర్యలనుగూర్చి ద్వేషము కలిగియుండెను. వాడాతనివలన తనకు మరణము కలుగునని విని భయముచే నన్ని-చోట్ల రామునినే చూచుచు ప్రతిదినమున స్వప్నములోకూడ నాతనిని జూచుచుండెను. వానికి నాతనిపై క్రోధము గురువుచే బోధింపబడినజ్ఞానముకంటె శీఘ్రముగ నెక్కు-వాయెను. చివరకు వాడాతనివలన మరణమునొంది తనపాపములనన్నిటిని బోగొట్టుకొని సంసారబంధమువిడిచి రామునిలో నైక్యమునుబొందెను. పాపిష్ఠుడైనను, దురాత్ముడైనను పరధన పరదారలయందాసక్తి గలవాడైనను స్నేహముచేతగాని, భయముచేతగాని యెల్లప్పుడు రామునిదలచుచు మరణించినయెడల వాడు పరిశుద్ధమైన యంతఃకరణ గలవాడై నూఱుజన్మములనుండిగలిగిన యనేకపాపములనుండి విడువబడి తత్క్షణమే సురశ్రేష్ఠులచే స్తుతింపబడునదియు, మొదటిలోకమును నగు రామావతారమునొందినవిష్ణువుయొక్క వైకుంఠమునకు బోవు'నని సెలవిచ్చెను.

---

బ్రహ్మాండపురాణమున 'రావణుడు 6,01 60,000 సంవత్సరములు రాజ్యము చేసె' నని తెలుపబడినది. ఒకమహాయుగమునకు 43,20,000 సంవత్సరములు. రావణుడు రాజ్యముచేసినది 14మహాయుగములకు నెక్కువగును. ఇట్లు రావణుడు చిరకాలము రాజ్యముచేసి లోకములను పీడించి విష్ణువుచే హతుడయ్యెను.

జూపెను. మరుద్గణములు మిక్కిలి సంతోషించెను. దిక్కులు కలకల మయ్యెను. ఆకాశము నిర్మలముగనుండెను. భూమికంపించుట మానెను. వాయువు బాగుగ వీచెను. సూర్యుడు తన తేజముతో బాగుగ ప్రకాశించెను. అప్పుడు సుగ్రీవుడు, విభీషణుడు, లక్ష్మణుడు మొదలగువారు రాముని జయముచే మిక్కిలిసంతోషించి యాతనిక క్రమముగ మర్యాద చేసిరి. దేవ గంధర్వ దానవులు తమవిమానములపైనుండి రావణుని వధయు, రామునిపరాక్రమమును, వానరులుచేసిన గొప్పయుద్ధమును, సుగ్రీవునిమంత్రిత్వమును, లక్ష్మణునకు రామునియెడగల యనురాగమును, నతనిపరాక్రమమును జెప్పుకొనుచు సంతోషముతో తమతమ నివాసములకు జనిరి. రాముడు మాతలికి మంచిమర్యాద చేసి యింద్ర రథమును దీసికొనిపోవుటకు సెలవొసంగ నతడు దానిని దీసికొని స్వర్గమునకు బోయెను. తరువాత రాముడు సంతోషముతో సుగ్రీవుని కౌగిలించుకొనెను.

---

## ౧౧౧ వ. అధ్యాయము.

### విభీషణుడు రావణునకుత్తరక్రియలుజరుపుట.

విభీషణుడు రావణుడు మరణించియుండుట చూచి మిక్కిలి శోకము గలుగనిట్లువిలపించెను. "గొప్పపరాక్రమముగలవీరుడా! లెస్సగ విద్యల నభ్యసించినవాడా! రాజనీతులు బాగుగదెలిసినవాడా! మంచి పక్కలపై పరుండతగిననీవు హతుడవై భూమియందుశయనించితి వేమి? నేను పూర్వము నీతో పలికినమాటలు కామమోహములకులోంగి యున్న నీ కిష్టముకాకపోవుటచే నిట్టిగతి పట్టినది. గర్వముచే ప్రహస్తుడును, నిందజిత్తును, కుంభకర్ణుడును, నతికాయుడును, నరాంతకుడును,

నీవును, నితరరాక్షసులును నామాటలను తిరస్కరించుటచే దానికితగిన ఫలము మీకుగలిగినది. ధర్మనీతులు తెలిసినవాడును, ధర్మమూర్తియు, గొప్పబలుడును, గొప్పస్తుతులు పొందినవాడునునగు రావణుడు పోయెను. వీరుడగు నితడు భూమియందుబడియుండ సూర్యుడు భూమి యందు బడినట్లును, చంద్రుడు చీకటిలోమునిగిపోయినట్లును, నగ్ని చల్లారినట్లును, నుత్సాహశక్తి నశించినట్లును నున్నది. ఇతడు మరణిం చుటచే లోకములో మఱివీరులులేరు. మంచిధైర్యమును, నుత్సాహ మును, శౌర్యమును, గొప్పరోషమియు, తపోబలమును, తేజమును, గొప్పప్రతాపమును, కోపమునుగల యీతడు గొప్పసంగ్రామములో బుద్ధి రాక్షసముఖ్యుడై శత్రువులను జయించి చపలుడై యున్నాడు రామునిచే మడిసెను." ఇట్లు విభీషణుడు రావణునిగూర్చివిలపించుచుండ రాముడు శోకముబొందియున్నవాని నిట్లోదార్చెను. 'చేష్టలుడిగినయీరావణుడు నశింపలేదు. కాని గొప్పయుత్సాహముగలవాడును, యుద్ధములో గొప్ప పరాక్రమముగలవాడునునగు రావణుడు నిజముగ మరణించి యున్నాడు. క్షత్రియధర్మములోనుండి ముందులోకములను బొంద నిశ్చయించి యుద్ధముచేసి మరణించినవానిగూర్చి విచారింపగూడదు. ఈబుద్ధిమంతునివలననింద్రుడును, మూడులోకములవారునుయుద్ధములో భయమునొందిరి. వీనికి కాలమురాగా వీడు మరణించెను. అందుచే నిత నినిగూర్చి విచారింపవలసినయవసరములేదు. వీరుడు రణములో శత్రువు లనుజంపును; లేక వారిచే జంపబడును. కాని యెల్లప్పుడునుయుద్ధమున నొక నికే జయము కలుగదు. ఇట్టిమరణము క్షత్రియులకు తగినగతి యనియు, క్షత్రియుడుయుద్ధమున మరణించినయెడల వానినిగూర్చివిచారింపగూడ దనియు పూర్వులు తెలిపియుండిరి. ఇట్టినిశ్చయముచు నీవు తెలిసికొని పరమార్థబుద్ధితో నిటుపైని చేయవలసిన కార్యమాలోచింపుము.' ఇట్లు రాముడు పలుక విభీషణుడు తనయన్నకు జేయవలసిన యనంతర

క్రియలనుగూర్చి తగినమాటలిట్లుపలికెను. 'పూర్వమింద్రాది దేవతలతో జేసిన యుద్ధములలో జయమొందినయీతఁ డిప్పుడు మీచేత మడిసెను. ఇతఁడు మంచిదానములను జేసెను. గురుదేవతలను బూజించెను. మంచి భోగములననుభవించెను; సేవకులననేకులను బోషించెను; స్నేహితు లకు మంచివస్తువులనిచ్చెను; శత్రువులను దండించెను. ఇతఁ డాహితాగ్ని; గొప్పతపముజేసినవాఁడు; వేదాంతము నెఱిగినవాఁడు; గొప్పకర్మలను జరిపినవాఁడు. ఇట్టిగొప్పవాఁడు ప్రేతత్వమునొందుటచే నితనికిదగిన కర్మలను మీదయవలన నేను చేయగోరుచున్నాను.' ఇట్లు విభీషణుఁడు పలుక రాముఁడు వాఁడు స్వర్గమునకు బోవుటకుఁతగిన యుత్తరక్రియలను జేయనాజ్ఞాపించి 'మరణాంతమువఱకే విరోధములుండును. మనకు గావలసిన ప్రయోజనము నెఱవేఱినది. నీవు నాకు నిగ్రాహుఁడవగుటచే నీకు రావణుఁడెట్టివాఁడో నాకును నట్టివాఁడే. వానికి తగినకర్మలను నీవు చేయు వలె' నని సెలవిచ్చెను.

రావణునిమరణము లంకలో నంతఃపురమునసున్న యతని భార్యలకు దెలిసెను. వారందఱితరులచే 'వెళ్లవ'ద్దని నివారింపబడినను మానక జుట్లువిఱబోసికొని శీఘ్రముగ నుత్తరద్వారమునుండి బయలు వెడలి యతఁడుపడియున్న యుద్ధభూమికి వెళ్ళి యతనిశవముచుట్టుఁ జేరి 'హా! రాజపుత్రా! హా! నాథా!' యనుచు నేడ్చిరి. ఒకతె యాతని శరీరమును కౌగిలించుకొనియు, నొకతె యాతనికాళ్లనుబట్టుకొనియు, నొకతె యాతనిమెడనుబట్టుకొనియు, నొకతె యతనిభుజములనొత్తు చును, మఱియొకతె యతనితలను తనతొడమీఁద నుంచుకొనుచును నెక్కువగ నేడ్చిరి. అతనిమొగము చూడఁగనే యొకతె మూర్ఛనొం దెను. తరువాత వారు విలపించుచు నిట్లు పలికిరి. 'మీరింద్రియములకు భయమును గలిగించిరి. కుబేరునివద్ద పుష్పకమును లాగుకొని దేవత లకు, గంధర్వులకు, ఋషులుమొదలగు మహాత్ములకు గొప్పభయ

మును గలిగించిరి. అట్టి మీరు యుద్ధమున హతులై భూమిపై శయనించియున్నారు. అసురులవలనను, సురులవలనను, నాగులవలనను భయమెఱుగని మీకు మనుష్యునివలన భయము కలిగెను. దేవతలవలనను, దానవరాక్షసులవలనను, యక్షులవలనను మరణమునొందని మీరు బలహీనునివలె వాహనములేకుండ భూమిమీదతిరుగు మనుష్యునిచే జంపబడితిరి.' ఇట్లు వారు పలుకుచు రోదనముచేయుచు నింకను నిట్లు విలపించిరి. మీమేలుకోరు స్నేహితుల పలుకులను మీరు వినక మీమరణముసకై సీతను నెత్తుకొని వచ్చితిరి. అందువలన రాక్షసులు మడిసిరి. మాకుకూడ నిట్టిదశ పట్టినది. మీతమ్ముడగు విభీషణుడు మీకు మంచిమాటలను జెప్పినను మీరువినక మీమరణముకోరి యజ్ఞానముచే వానిని కఠినపుమాటలచే తిరస్కరించితిరి. మీరురామునికి సీత నిచ్చివేసియుండిన మాకిట్టి ఘోరమగు దుఃఖము కలిగియుండకపోను; మీతమ్మునిమనోరథముకూడ నెఱవేఱియుండును; రాముడు మీకులమునకు మిత్రుడై యుండును; మేము విధవలము కాకపోయి యుందుము; శత్రువులకోరికలు నెఱవేఱకుండును; మీరు సీతను క్రూరముగను, బలవంతముగను దెచ్చుటచే రాక్షసులును, మీరును మేమును నాశనమైతిమి. రాక్షసశ్రేష్ఠా! మీయిష్టమువచ్చినట్లు మీరు చేయవీలులేదు;అన్నియు దైవమేచేయించును. దైవహతులకే యన్యులవలన మరణము కలుగును. ఈయుద్ధములో వానరులయొక్కయు, రాక్షసులయొక్కయు నాశనమును, మీమరణమును దైవయోగమువలన జరిగినవి. దైవగతిని ధనముచేగాని, కోరికచేగాని, పరాక్రమముచేగాని, యాజ్ఞాపించుటచేగాని, యితరప్రయత్నములచేగాని తప్పింపవీలులేదు.'ఇట్లు విలపించుచు రావణునిభార్యలు దుఃఖముతో కన్నీరు విడిచిరి.

రావణునిజ్యేష్ఠభార్యయగు మండోదరి కూడ వారితో యుద్ధభూమికివచ్చి రామునిచే జంపబడిన రావణునిజూచి దీనముగ నిట్లు విల

పించెను. "కుబేరునితమ్ములును, గొప్పగొప్పైశ్వర్యవంతులునునగు మీకు క్రోధమువచ్చినయెడల మీయెదుట నిలుచుటకు నింద్రుడును, ఋషులును, బ్రాహ్మణులును, గంధర్వులునుగూడ భయపడెడివారు. భయంకరములగు మీపనులకు చారణులందఱు దిక్కులకు పాఱిపోయెడివారు. అట్టిమీరు మనుష్యమాత్రునిచే యుద్ధములో జయింపబడినందులకు మీకు సిగ్గుకలుగలేదా? మీరు పరాక్రమముచే మూడు లోకములను జయించి జయలక్ష్మితో నొప్పుచు నిర్జయులై యుండ మిమ్ము నడవులలో తిరుగు మనుష్యు డెట్లుచంపగలిగెను? మనుష్యులకు గనపడనిప్రదేశములందు కామరూపముతో సంచరించు మీకు యుద్ధములో రాముని వలన మరణము సంభవించుట తగియుండలేదు. అన్నియాయుధములుగల మీరు యుద్ధములో మరణించుటకు రాముడు కారణముకాదని తలంచెదను. ఎప్పుడైతే మీసోదరుడగు ఖరుడుజనస్థానములో ననేకరాక్షసులతోగూడ రాముని వలన మృతినొందెనో, ఘోరవానరులు సముద్రమునకు సేతువునుగట్టిరో యప్పుడే నేను మనస్సులో రాముడు నరుడుకాడని భావించితిని. దేవతలకైనను ప్రవేశింపవీలుకాని యీలంకలో హనుమంతుడు ప్రవేశించినప్పుడే మేము గొప్పవిచారమును బొందితిమి. మీనాశనమునుగూర్చి యముడు ప్రకృతిని మంచిరూపలావణ్యములుగలసీతగ నొసగ్గి తానే స్వయముగ రాముడై వచ్చియుండును. లేక యిందుద్రుడే మిమ్ము జంపియుండెనా? అట్లుచేయుటకు యుద్ధములో మిమ్ము జూచుటకైనను నతనికి శక్తియెక్కడ? దీనినిబట్టిచూడ రాముడు మహాయోగియనియు, శాశ్వతమగు పరమాత్మయనియు, నాదిమధ్యాంతరహితుడనియు, గొప్పవారగునింద్రాదిదేవతలకంటెను, వారికంటె గొప్పవారగు బ్రహ్మాదులకంటెను నింకను మిక్కిలిగొప్పవాడనియు, చీకటికంటెపరుడైన తేజోరాశియనియు, సృష్టికర్తయనియు, శంఖచక్రగదాధరుడనియు, వక్షమున

శ్రీవత్సము, కౌస్తుభము, మొదలగువానిని ధరించినవాడనియు, నెల్లవుడు సిరికలవాడనియు, నజేయుడనియు, శాశ్వతుడనియు, మార్పులు లేనివాడనియు తలచెదను. సర్వలోకేశ్వరుడును, సత్యపరాక్రముడును నగు మహావిష్ణువు మనుష్యరూపమునుదాల్చి వానరరూపములను దాల్చిన దేవతలందఱితో వచ్చి లోకములన్నిటికి మేలుచేయుకొఱకు రాక్షసులను, మిమ్మును హతమొనర్చెను. మొదట మీరింద్రియములను జయించి పిమ్మట మూడులోకములను గెలిచితిరి. ఆ పూర్వవైరమును స్మరించినవివలె నిప్పు డాయింద్రియములు మిమ్ము జయించినవి. రామునితో విరోధముకూడదని నేను చెప్పినను దానిని మీరు వినక పోవుటచే దానికి సిద్ధిఫల మిప్పుడు వచ్చినది. మీస్వజనులయొక్కయు, మీ దేహముయొక్కయు, నైశ్వర్యముయొక్కయు నాశనముకొఱకు నిష్కారణముగ మీరు సీతను కామించితెచ్చితిరి. పతివ్రతలగు నరుంధతీరోహిణులకంటె గొప్పదియగు సీతను మీరు బలవంతముగదెచ్చుటయను నయుక్తమగుపనిని జేసితిరి. భూమికంటె నెక్కువయోర్పుగలదియు, మిక్కిలిసిరిగలదియు, పతివ్రతయునగు నామెను నరణ్యమునుండి యెవరునులేనిసమయమున మీరు మాయచే దీసికొనివచ్చి దీనురాలగు నామెతో సంభోగకోర్కెను బొందక దూషణను బొంది యామెపాతివ్రత్యాగ్నిచే దగ్ధమైతిరి. ఆమెను దీసికొనివచ్చునప్పుడే మీ రామె పాతివ్రత్యముచే దగ్ధముకాకపోవుటచే నింద్రుడును, అగ్ని మొదలగు దేవతలు మీకు జడిసియుందురు. పాపకర్మలుచేసినవాడు కాలము రాగా ఘోరమగు దానిఫలము ననుభవించును; సంశయములేదు. మంచి పనులనుజేయువాడు మంచిఫలమును, పాపపుపనులుచేయువాడు చెడు ఫలమును ననుభవించును. కావుననే విభీషణుడు సుఖమును బొందెను. మీరట్టి దుఃఖమును బొందితిరి. మీకు సీతకంటె నెక్కువసౌందర్యము గలస్త్రీలు మీభార్యలలోనున్నను మీరు మన్మథబాణవశవర్తులగుటచే

దానిని తెలిసికొనలేకపోయితిరి. కులమునగాని, రూపమునగాని, తెలి
వితేటలలోగాని సీత నాకంటెగొప్పదియు, సమానమైనదియుగుండకా
దని మీరు మోహముచే తెలిసికొనకపోయితిరి. లోకములోని యున్ని
జీవులకు నేదోయొక కారణములేకుండ మరణముసంభవింపదు. ఇక్కడ
మీమరణమునకు సీత కారణమైనది. సీతయనెడిమృత్యువును మీరు
దూరమునుండి తెచ్చుకొంటిరి. ఆమె రామునితో విచారములేకుండ
సుఖముగ విహరించును. నేను స్వల్పపుణ్యముకలదాననగుటచే ఘోర
మగుశోకసాగరములో పడిపోయితిని. మీతో నేను కైలాస మందర
మేరుపర్వతములందును, కుబేరునిచైత్రరథవనమునందును, నితర దేవ
తలయుద్యానవనములన్నిటియందును విహరించితిని. విమానమున
దేశములన్నియుజూచుచు మంచిబట్టలనుగట్టుకొని పూలదండలువేసి
కొని గొప్పసిరినమభవించియుంటిని. అట్టినేను మీమరణమువలన
నాకామభోగములనుండి భ్రంశురాలనైతిని. ఛీ! రాజుల రాజ్యములు,
భోగములు చంచలములు. మంచిసుందరమైనమోముగలమీరు రామ
బాణములచే గొట్టబడి శయనించియున్నారు. నాకు వైధవ్యమును
గలుగజేయు నట్లు మీకు మరణము సంభవించునని మందబుద్ధిగల నే
నెప్పుడును తెలిసికొనకపోయితిని. నాతండ్రి దానవులరాజనియు,
నాభర్త రాక్షసరాజనియు, నాకుమారు డింద్రునిజయించెననియు
నేనెక్కువగ గర్వించియుంటిని. మీరు శూరులనియు, గొప్పబలపౌరు
షములుగలవారనియు, గొప్పశత్రువులను జయించువారనియు, దేనివల
నను మీకు భయములేదనియు నాకు గట్టినమ్మకముండెడిది. అట్టి
ప్రభావముగలమీకు తెలియకుండ మనుష్యునివలన భయమెట్లు సం
ప్రాప్తించెను? పూర్వమనేకవిధములగు నాభరణములతో ప్రకాశిం
చుచు సుందరముగనున్న మీదేహమునిండ ననేకబాణములు గ్రుచ్చు
కొని రక్తమువచ్చుటచే మిమ్ము నేను ముట్టుకొనుటకుగాని, కౌగిలించు

కొనుటకుగాని వీలులేకుండనున్నది. అయ్యో! ఇది స్వప్నమా? కాదు; సత్యమే. మీరు రామునిచే నెట్లుచంపబడితిరి? మృత్యుదేవతకుకూడ మృత్యువువంటిమీరు మృత్యువున కెట్లు లోబడితిరి? అయ్యో! గొప్ప పరాక్రమమును జూపి గొప్పగొప్పపనులనుజేసినమీరు మరణింప నేను మిమ్ము జూచుచు కఠినురాలనై యీదేహముతో నిలిచితిని. మంచి పక్కలపై శయనించిన మీరీబుగ్గియందేల పండుకొనియున్నారు? యుద్ధములో నింద్రజిత్తును లక్ష్మణుడు చంపగనే నేను గొప్పవిచారమును బొందియుంటిని. ఇప్పుడు మీమరణముచే నేను పూర్తిగజంపబడినదాననైతిని. బంధువులు, పుత్రులు, భర్త, కామభోగములులేక పోవుటచే నేను విచారించుచు శాశ్వతముగ నేను జీవించియుండలేను. కాన పుణ్యమగువీరస్వర్గమునకుపోవుమీరు ప్రసన్నులై దుఃఖముచేకృశించుచున్న నన్నుగూడదీసికొనిపొండు. మిమ్ములను విడిచి నేను జీవింపలేను. దీనురాలనగు నన్నిక్కడ విడిచి మీ రేలపోవుటకు గోరుచున్నారు? ఇట్లువిలపించుచున్న నాతో మీ రేలపలుకుటలేదు? నగరద్వారమునుండి మేలిముసుగులేకుండ నడిచి వచ్చిన నన్ను జూచి మీరు క్రుద్ధులుకాలేదుగదా? రాణివాసముగల మీభార్యలందఱు అంతఃపురమును విడిచి సిగ్గును విడిచి నడిచి యిక్కడికి మీయొద్దకు వచ్చినందులకు మీరు వారిని జూచి యేలకోపపడరు? మీక్రీడలలో సహాయముగ నున్న వీరు నాథుడులేక విలపించుచుండ వీరిని మీరు మంచిమాటలను బలుకుచు నోదార్పక యేలయూరకున్నారు? పతివ్రతలును, ధర్మబుద్ధిగలవారును, తమభర్తలకు గొప్ప సేవచేయుటయందాసక్తిగలవారునునగు చాలమందికులస్త్రీలయొక్క భర్తలను మీరు చంపి యాస్త్రీలను విధవలుగ జేసితిరి. అందులకు వారు శోకముచే మిమ్ము శపింప మీరు శత్రువుచే జంపబడితిరి. 'పతివ్రతలకన్నీరు కారణములేకుండ భూమిమీదపడ' దను జనవాదము మీయెడ ముఖ్యముగ సత్యమైనది. తేజముచే లోకములను

జయించిన వారును, శౌర్యముగల వారునునగు మీరు నీచమగు స్త్రీహరణమెట్లుచేసితిరి? రాముని లేడియనుమిషచే నాశ్రమమునుండి దూరముగబంపి సీతనెత్తుకొనివచ్చుటయే దొంగపని. యుద్ధములో మీరు దొంగపనిచేయుట యెప్పుడును నే నెఱుగను. ఇప్పుడు మీ దౌర్భాగ్యమువలన నిట్టిపని మీనాశనముకై చేసితిరి. ఇదివరలో జరిగినదియు నిప్పుడుజరుగుచున్నదియు, ముందుజరుగబోవునదియు తెలిసినవాడును, సత్యవచనుడునునగు నామఱది విభీషణుడు కామక్రోధములుగలమీరుదుర్బుద్ధితో సీతనెత్తుకొనివచ్చుట తెలిసికొని దానిని గూర్చిచాలసేపాలోచించి పలికినమాటలప్రకారము రాక్షసముఖ్యులనాశనముకలిగెను. మీవల్ల మూలచ్ఛేదమగు గొప్పయనర్థము సంభవింప నిప్పుడు రాక్షసకులమునకు నాథుడు లేడయ్యెను. గొప్పబలపరాక్రమములుగలమిమ్ముగూర్చి నేను విచారింపపనిలేదు. కాని స్త్రీబుద్ధిచే నే నిట్లు దీనముగ విలపించుచుంటిని. మీరు మీపుణ్యపాపములను గ్రహించి మీగతిని బొందితిరి. మీవియోగముచే నేను దుఃఖించుచు నన్ను గూర్చి విచారించుచున్నాను. మీ మేలునుగోరుచున్నహితులయొక్క మాటలను, మీతమ్ములమంచిమాటలను, మారీచుని, నాతండ్రిపలికిన హితవచనములను మీరుబలమత్తతచే విననందున నిట్టిఫలము ప్రాప్తించినది. నాథా! మీరు నిద్రించుచున్నవానివలె పడుండి శోకించుచున్న నాతోనేలమాట్లాడకున్నారు? నావైపేలచూడకున్నారు? లెండు; లెండు. నూతనపరాభవముకలుగుచుండ నింకను నిద్రించెదరేల? సూర్యకిరణము లిప్పుడు నిర్భయముగ లంకలో ప్రవేశించుచున్నవి. యుద్ధములలో మీకు జయమునుగలుగజేసిన మీపరిఘ రాముని బాణములచే వేయిముక్కలై క్రిందపడినది. మీరు యుద్ధభూమిని ప్రియభార్యనువలె కౌగిలించుకొని పండుకొనియున్నారు. ఇష్టముకానిభార్యతోనువలె నాతోనేల మాట్లాడకున్నారు? ఛీ! నాహృదయము [illegible]

నది. మీరు మరణించియుండ శోకమువలన నా హృదయము వేయిముక్క-లుకాకున్నది." ఇట్లు మందోదరి విలపించుచు కల్మష కన్నీటిచే నిండియుండ తన భర్తయందలి యనురాగముచే నానావిధముల బడి మూర్ఛ జెందియుండ మిగిలిన రావణుని భార్యలామెను ప్రక్కకు లాగి కూర్చుండ బెట్టి యామెచుట్టుచేరి మిక్కిలిగ నేడ్చుచు నామెతో 'బాల్యాదియవస్థాభేదములుగల లోకముల స్థితియు, రాజుల స్థితియు చంచలములైనవని నీకు తెలియదా తల్లీ?' యని పలుకచు దాసీజనము మిక్కుటముగ నేడ్చెను.

ఇట్టిసమయమున * రాముడు ధర్మాత్ముడగు విభీషణునితో 'నీయన్నకు దహనాదిసంస్కారములు చేయుము. ఈ స్త్రీలనందరిని బంపివేయు' మని పలికెను. ఆతడు రాముని యభిప్రాయము బాగుగ నాలోచించి విషయమునకు తగినట్లుగ రామున కిట్లు ప్రత్యుత్తర

*అ. రా:— రావణుని గూర్చి వాని భార్యలును, విభీషణుడును విచారించుచున్నప్పుడు రాముడు లక్ష్మణునితో నిట్లు చెప్పెను. 'రావణుని భార్యలను నివారించి రావణుని శవమునకు నాలస్యము చేయకుండ దహనాది సంస్కారములను జేయవలెనని విభీషణునకు బోధింపుము.' ఇట్లు రాముడు పలుకగా లక్ష్మణు డట్లు విభీషణుని సమీపమునకు బోయి వాని కిట్లు తత్త్వోపదేశమును జేసెను. "ఎవనిని గూర్చి నీవు దుఃఖముచే విచారించుచుంటివో వానికిని, నీకును సంబంధ మేమి? సృష్టికంటె పూర్వమందుగాని, యిక ముందుగాని సంబంధము లేని మీ యిద్దరికి గలిగిన యీసంబంధము వాస్తవికమైనదికాదు. కాని యభిమానమూలకమైనది. (ఎట్లన:— ప్రవాహమందుపడి పోవుచుండెడి యిసుక రేణువులు పరస్పరము పూర్వోత్తరములందు సంబంధములేకపోయినను మధ్యయందు కొద్దికాలము సంబంధముకలవైన జలవేగముచే గొట్టబడినవై యెట్టిసంబంధముకలవగునో యట్లే కాలవశమున జీవులు కలిసికొనుచు తిరిగి వియోగమును బొందుచుందురు.) ఇట్టి పరిణామముచే పంచభూతము

మిచ్చెను. "రావణుడు ధర్మములను, వ్రతనియమములను విడిచి క్రూరుడై యసత్యముగ జరించుచు పరస్త్రీలతో సంభోగించినందులకు నేను వానికి సంస్కారముచేయుటకు తగను. అందరికి హింసచేయుట యందాసక్తిగల యితడు నాకు శత్రువుకాని యన్నకాడు. ఇతడు నాయన్నయైనందులకు మర్యాదకు తగినవాడైనను నాపూజకు నర్హుడు కాడు. నే నీతనికి సంస్కారము చేయనియెడల నన్ను జనులు 'క్రూరు' డని మొదటపలికినను వానిగుణములన్నియు దెలిసినతరువాత నేను బాగుగ జేసితినని పలికెదరు." ఈమాటలను రాముడు విని మిక్కిలిప్రీతుడై తగినటులనిట్లు పలికెను. "స్వప్రభావముచేతనే నేను

---

లందు జీవులు ప్రేరేపింపబడుదురు. నిన్నును, మమ్మును, సూర్యాదులను కాలవశమున తుల్యముగనే జన్మించితిని. కర్మవశమువల్ల నీవలన పరిచిత ములై జన్మమృత్యువులు కలుగుచుండును. బాలుడు ఫలాపేక్ష లేనివా డైనను బాల్యచాపల్యమున మట్టిచే స్త్రీపురుషాకారములను రెండింటి నిన్ని, వానికి సంతానముగా చిన్నపిల్లను సృజించి యామూడిటికిని జన్యజనకభావముచే (తల్లి, తండ్రి, పిల్ల యను పేరులతో) వ్యవహరించి పిమ్మట నామూడిటికి పరస్పరసమ్మర్దముచేసి యొకనశింపజేయునో యట్లే యీశ్వరుడు ఫలాపేక్ష లేనివాడైనను జీవులయొక్క కర్మవిశేషమువల్ల తనచే సృజింపబడినట్టియు, నస్వతంత్రములైనట్టియు జీవులను స్త్రీపురుషాది రూపముగ వ్యవహరించి సృజించి కర్మవిశేషమువల్ల నశింపజేయు చున్నాడు. జీవుడు దేహరూపుడుకాడు; కాని కర్మద్వారా దేహము కలవాడు. బీజమువల్ల బీజ ముత్పన్నమైనట్లు కర్మద్వారా దేహము వల్లదేహము పుట్టుచున్నది. కాన దేహదేహులకు భేదము శా శ్వతమైనది. (దేహము అనిత్యము, దేహి నిత్యము అగుటచే నా రెండిటికి భేదము శాశ్వతమైనది.) ఈజీవునకు దేహసంబంధము గూడ నజ్ఞానముచే గల్పింపబడినది. కష్టియందుండు వికారము (అనగా

జయమును బొందితిని. కాన నాకు ప్రియమైనదానినే నీవు చేయవలెను. నీకు హితమునే నేను చెప్పవలెను. ఈ రావణుడధర్మముగను, నసత్యముగను ప్రవర్తించినను యుద్ధములలో నెల్లప్పుడు గొప్పశూరుడును, బలవంతుడును, తేజముగలవాడును నై యుండెను. ఇంద్రాదిదేవతలచేత నైనను నితడు పరాజయము పొందలేదు. మహాత్ముడగు నీతడు లోకములను పీడించెను. నేనిదివరలో దెలిపినట్లు మరణాంతమువరకే విరోధములుండును. నీవలన నీతడు విధ్యుక్తముగ సంస్కారము పొందదగి యున్నందున దానిని నీవు జరుపవలెను. ధర్మజ్ఞా! నీ వట్లుచేసి యశమును బొందెదవు." ఇట్లు రాముడు పలుక విభీషణుడు * చైత్రశుద్ధ పాడ్యమినాడు రావణునిశవమునకు దగిన దహనాదిసంస్కారములను

లావు, పంకరన్ని కట్టునాశ్రయించియున్నయగ్నికివలెనే దేహధర్మములగు భేదము, ఉత్పత్తి, నాశము, క్షయము, వృద్ధి, సుఖదుఃఖములు నను నివి యన్నియు దేహీకి నారోపింపబడుచున్నవి. భ్రమరకీటన్యాయముచే భృంగరూపమును ధ్యానించుచున్న కీటకమునకు భృంగమను ప్రసిద్ధియెట్లో యటులనే సదసద్రూపములను ధ్యానించుచుండెడి యీజీవులకు సదసద్రూపములనెడి ప్రసిద్ధికలుగుచున్నది. కాన నీకు సంభవించిన యీశోకము నిరాధారమైనది. నిద్రపోవుచున్నవానికి అహంభావములేకపోవుటచే సంసారమెటులలేదో యట్లే యహంభావరహితుడై జీవన్ముక్తుడైన జీవునకు సంసారములేదని తెలిసికొనుము. కాన విభీషణా! మాయవల్లనుంచియు, మనస్సువల్లనుంచియు గలిగిన యీ అహం మమతా భ్రమను వదలి సర్వజగత్తులలో నిండియున్న సర్వభూతస్వరూపుడును, మాయామానుషరూపుడునునగు రామచంద్రమూర్తియందు బాహ్యేంద్రియాదిసంబంధమువదలి నీమనస్సును నిలు

* రావణుడు సీతను తనగృహమున నొకసంవత్సరముంచెను. సీతాహరణము ఫాల్గుణబహుళఅమావాస్యతోగూన జరిగియుండును.

మథించుకఱ్ఱలను రోకలి మొదలగు వస్తువులను నిర్ణీతస్థానములందు వేదశాస్త్రముల ప్రకారము నిలిపి పవిత్రమగు మేకపోతును జంపి నేతితో తడిసిన పరిస్తరణ పాత్రలసన్నిటిని నాశవముపై వేసిరి. విభీషణుని మంత్రులు కన్నీరు విడుచుచు రావణునిశవముపై సుగంధద్రవ్యములను జల్లి పూలదండలను వేసి యనేక విధములగు బట్టలను గప్పి పేలాలను జల్లిరి. తరువాత విభీషణుడు విధియుక్తముగ శవమునకు నగ్నిని ముట్టించెను. అతడు స్నానముచేసి తడిబట్టలతో తనయన్నకై దూర్వాలతో గలిసినతిలలను నీళ్లతో వేదోక్తముగ విడిచి నీటినిగూడ విడిచి తనశిరస్సుతో నమస్కరించెను. తరువాత నతడు రావణుని భార్యలనందఱిని మంచిమాటలతో నోదార్చి యంతఃపురమునకు బంపెను. అట్లు విభీషణుడు వారి నందఱిని నంతఃపురములోనికి బంపి రామునియొద్దకు వచ్చెను. ఇంతలో రామలక్ష్మణ సుగ్రీవులు సంతోషముతో తమ శిబిరములకు బోయిరి.



## ౧౧౨-వ. అధ్యాయము.

## విభీషణుని పట్టాభిషేకము.

రామలక్ష్మణులు తమ శిబిరములలో నున్నప్పుడు విభీషణుడు రావణుని భార్యలను లంకలో నుంచి వారియొద్దకు వచ్చెను. అప్పుడు రాముడు లక్ష్మణునితో నిట్లనెను. 'ఈ విభీషణుడు నా భక్తుడు; నాయం దనురాగము గలవాడు; నాకు నుపకారము చేసెను. ఇట్టి విషమకాలములో మన గొప్పకోరిక తీరునటుల మనకు మిక్కిలి సాహాయ్యము చేసినయితనిని నీవు లంకలో పట్టాభిషిక్తునిగ జేయుము. లంకలో నభిషేకమునొందిన యితనిని జూడవలెను.' ఇట్లు రాముడు పలుక లక్ష్మణుడు -'అట్లే చేసెద'నని పలికి సంతోషముతో బంగారుబిందెలను వానరులలో మిక్కిలి శీఘ్రగమనముగలవారి కిచ్చి సముద్రములందలి

యుదకమును దెచ్చుటకు బంపెను. వారు శీఘ్రముగ బోయి సముద్రోదకములను దెచ్చిరి. లక్ష్మణుడాయుదకములను లంకకు దీసికొనిపోయి మందియాసనమున విభీషణుని కూర్చుండజేసి రాక్షసులమధ్యను, స్నేహితులమధ్యను వేదమంత్రములతో రాజుగ నభిషేకించి తాను రామునియొద్దకు బోయెను. ఆ యభిషేకమునకు విభీషణుని మంత్రులును, వానిభక్తులగు నితర రాక్షసులును సంతోషించిరి. విభీషణుడు రామునివలన రాజ్యమును బొంది ప్రజలను సంతోషపఱచి రాముని సన్నిధికి బోయి పట్టణవాసులగు రాక్షసులు తనకిచ్చిన యక్షతలను మోదకములను, పేలాలను, మంచి పువ్వులను, మంచిపస్తులను రామలక్ష్మణులకు సమర్పించెను. అతనికార్యము బాగుగ నెఱవేఱినందుకు నాతని యందలి ప్రీతిచే వారు వాని సన్నిటిని పుచ్చుకొనిరి.

---

## ౩౬౨వ. అధ్యాయము.

## రాముడు సీతపాతివ్రత్యమును పరీక్షించుట.



విభీషణపట్టాభిషేకమైనతరువాత రాముడు శిబిరములో తన ప్రక్కను పెద్దకొండవలె చేతులుజోడించుకొని యున్న హనుమంతుని జూచి యిట్లనెను: 'నీవు విభీషణరాజు ననుజ్ఞను దీసికొని లంకకు బోయి రావణునిగృహముచేరి సీతయుండుచోటికి వెళ్లి మావిజయ మామెకు దెలిపి యామెను సంతోషపెట్టి నేనును, సుగ్రీవుడును, లక్ష్మణుడును కుశలముగనున్నామనియు, విభీషణ వానరులసహాయమున నేను రావణుని జంపితిననియు ప్రియవర్తమాన మామెకు దెలిపి యామె చెప్పెడి మాటలను తిరిగివచ్చి నాతో జెప్పుము.' ఇట్లు రాముడు సెలవీయ వాయుపుత్రుడు రాక్షసులచే గౌరవింపబడుచు సీతయుండు నశోకవనమునకు బోయి పూర్వమువలె నానందములేక శరీరసంస్కారములున్న

జూచుకొనక విచారముతో రాక్షసస్త్రీలమధ్యనున్న యామెనుజూచెను. అతడు మిక్కిలియణకువతో కదలకుండ నిలిచి యామెకు నమస్కరించెను. ఆమె మొదట వానిని జూచి యూరకుండి తరువాత జ్ఞాపకము తెచ్చుకొని మిక్కిలిసంతోషమును బొందెను. అప్పుడామె సంతోషముగ నుండుట యాతడు కనిపెట్టి రాముని వాక్యములన్నియు నామెకు దెలిపి యిట్లు పలికెను. "దేవీ! సీతతో ప్రియవాక్యములను పలికి నిన్నెక్కువగ సంతోషపఱచెదను. రాముడు చాలసంతోషముగలవాడై కృతార్థమైనమనస్సుతో సీతతో నిట్లు చెప్పుమనెను. 'ధర్మము తెలిసినదానా! యుద్ధములో నేను జయముపొందునట్లుకు నీవు దైవయోగమున జీవించియుంటివి. మనకువిజయము కలిగెను. నీవు విచారమును విడిచి మనస్సును సుఖముగ నుంచుకొనుము. శత్రువగు రావణుడు హతుడయ్యెను. ఈలంక మనవశములో నున్నది. నిన్ను శత్రువారి నుండి తొలగించుటకు నేను నిద్రింపక స్థిరబుద్ధితో గొప్పసముద్రమునకు సేతువును గట్టించి రావణుని జంపి నాప్రతిజ్ఞను నెఱవేర్చుకొంటిని. లంకారాజ్యమంతయు విభీషణున కిప్పింపబడినది. కాన రావణుని గృహమున నీవున్నను నీకు భయమేమియు లేదు. మనయింటిలో నున్నటుల నే నమ్మకముకలిగి యోర్పువహించియుండుము. విభీషణుడు నిన్ను జూచుటకు సంతోషముతో వచ్చుచున్నాడు.' ఇట్లు రాముడు సీతో చెప్పుమనెను." హనుమంతుడు పలికినయీమాటలను సీత విని లేచి మిక్కిలియానందముకలుగుటచే నేమియు మాట్లాడలేకపోయెను. దీనిని హనుమంతుడు చూచి 'అమ్మా! ఏమియాలోచించుచున్నావు? నాతో నీవేలమాట్లాడకున్నా'వని యడుగ నామె గద్గదస్వరముతో నిట్లు పలికెను. 'నాభర్తవిజయమును గూర్చి ప్రియమగు వార్తను వినుటచే మిక్కిలిసంతోషముగలుగ నొకనిమిషము మాట్లాడలేకపోయితిని. నాతో ప్రియమును జెప్పిన నీకు నిపుడు ప్రత్యుత్తరముగ జెప్పుటకు

తగినంత సంతోషమును గలిగించు మాట దొరకక యాలోచించు చుంటిని. నాకు ప్రియమును జెప్పినందులకు నీ కీయదగినబహుమాన మీలోకములో గూడ నేదియు గనబడుటలేదు. బంగారముగాని, వెండి గాని, యనేకవిధములగు రత్నములుగాని మూడులోకముల రాజ్యము గాని నీకిచ్చినను నీవు చెప్పినదానికి తగినసన్మానముకాదు.' ఇట్లు సీత పలుక హనుమంతుడు చేతులుజోడించుకొని యామెతో నిట్లు పలికెను. 'నీవు నీభర్తప్రియమును గోరి యాతనివిజయమునందాసక్తిగలదానవై యుండుటచే దానికితగినట్లు పలికితివి. నీవుపలికినమంచిమాట లనేక రత్నములకంటెను, స్వర్గరాజ్యముకంటెనుగూడ గొప్పవి. శత్రువును జయించి విజయముపొందినరాముని నేను చూచుటచే నాకు స్వర్గరాజ్యము మొదలగు లాభములను బొందినట్లున్నది.' ఇట్లు హనుమంతుడు పలుక సీత 'బాగుగ మాట్లాడుటలో నీవే తగినవాడ'వని పలికి వానిగుణములను కీర్తించెను. తరువాత నతడామెను చూచి వినయముతో చేతులుజోడించి రాక్షసస్త్రీలు నిన్ను కొట్టునప్పుడు నీవు పతియే దైవ మని తలచుచు మంచిప్రవృత్తిలో నుంటివి. అందుచే క్రూరమగుమాటలను బలికిన యీ క్రూరరాక్షసస్త్రీలను వివిధ హింసలతో జంపుటకు వరముగోరెద'నని విన్నవింప నామె యిట్లు జవాబిచ్చెను. "రాజునాశ్రయించి వానికి వశ్యులై వానియాజ్ఞప్రకారము చేయుదాసీలపై నెవనికి కోపముగలుగును? నాదుర్భాగ్యము చేతను, పూర్వజన్మమందు చేసినపాపముచేతను నిదియంతయు నాకు గలిగెను. నేను చేసినదానికంతకు ఫలితము ననుభవించితిని. అనుభవింపవలసిన కాలమువచ్చుటచే నప్పుడు రావణునిదాసీలు చేసినదానినంతయు దుర్బలురాలనై నేను సహించితిని. వీరు వానిచే నాజ్ఞాపింపబడి నన్ను గొట్టిరి. వాడు చనిపోయినందున మఱియట్లు చేయరు. పెద్దపులిచే తఱుముబడి వృక్షమెక్కినమనుష్యుని రక్షించినయెలుగుబంటి

చెప్పిన యీధర్మవాక్యమును వినుము. 'ఇతరులు తన్ను గూర్చి పాపపు పనులను జేసినను బుద్ధిమంతుడు వానికి ప్రత్యపకారము చేయడు. ఈ ధర్మము నందఱు కాపాడవలెను.' సత్పురుషులకు మంచినడవడికలే భూషణములు. మరణదండనకు నర్హులగు మంచివారియెడ సత్పురుషుం డెట్లు దయచూపవలెనో యట్లే మరణదండనకు నర్హులగు చెడ్డవారియెడ కూడ దయచూపవలెను. ఆలోచింపక నపరాధము చేయువాడెవడును నుండడు. లోకులకు హింసచేయుటయందే యాసక్తిగల కామరూపులగు రాక్షసులు పాపములను జేసినను వారిని దండించుట యుక్తము కాదు." అప్పుడు సీత హనుమంతునితో ధర్మసహితముగ బలుక నత డామెను 'నీవు పలికినది భక్తిగల రాముని భార్యవగు నీకు తగినట్లున్నది. నేను రాముని యొద్దకు పోయెదను. అతని కేమి చెప్పవలెనో తెలుపు' మని కోరెను. అప్పు డామె 'నేను నా భర్తను చూడగోరెద' నని పలుక హనుమంతుడు సంతోషించి 'పూర్ణచంద్రునివంటి ముఖము గల రాముని, లక్ష్మణుని, వానరమిత్రులను నీవు చూచెద'వని పలికి రాముని యొద్దకు శీఘ్రముగ బోయెను.

హనుమంతుడు రాముని యొద్దకు వచ్చి సీతయొద్ద జరిగినదంతయు నాతనికి దెలిపెను. * రాముడు దానిని విని కన్నీరు దెచ్చుకొని వెంటనే కొంత సేపాలోచించి యుక్కిలి నిట్టూర్పు విడిచి భూమిని జూచుచు మేఘమువంటి శరీరము గలిగి దగ్గఱ గనున్న విభీషణునితో నిట్లు పలికెను. 'సీతకు నభ్యంగనము చేయించి మంచిసువాసనద్రవ్యములను శరీరమునకు బూయించి ప్రకాశమానమగు నాభరణములను ధరింపజేసి యిక్క

* అ. రా :—హనుమంతుడు సీతకుశలస్థితిని రామునకు దెలుపగానే వంతులలో శ్రేష్ఠుడగు నతడు మాయసీతను విడుచుటకును, నగ్నిలోనుండిన నిజసీతను గ్రహించుటకును మనస్సులో నాలోచించి విభీషణునితో 'సీతను రప్పింపు' మని చెప్పెను.

డకు రప్పింపుము.' ఇట్లు రాముడు పలుక నామాటలను విభీషణుడు విని శీఘ్రముగ తనయంతఃపురమునకు బోయి రాముడు చెప్పినప్రకారము తన యాడువారిచే సీతకు కబురుపంపెను. దాని కామె 'నేను స్నానముచేయకుండగనే రాముని జూడగోరెద' నని తిరిగి కబురుపంపెను. అప్పు డతడు తిరిగి యామెకు 'నీభర్త చెప్పినట్లు నీవుచేయవలయు,' నని కబురుపంపసీత దానికినంగీకరించెను. తరువాత నచ్చటిస్త్రీలామెకు నభ్యంగనముచేయించి యాభరణములను ధరింపజేసి మంచిబట్టలను గట్టి యామెశరీరమునకు సుగంధద్రవ్యములను రాసిరి. తరువాత నామెను వారు మంచిబట్టలచే చుట్టునుగట్టబడిన దివ్యమానమగు సవారీలో కూర్చుండబెట్టిరి. అప్పుడు విభీషణుడు చుట్టును రాక్షసులు కాపుండ నామెను రాముడుండుచోటికి బంపెను. అతడుకూడ నక్కడకు బోయి తనరాకను జూచియు నాలోచించుచున్న రామునికి నమస్కరించి సంతోషముతో సీతరాకను దెలిపెను. దానిని రాముడు విని యామెచాలకాలము రావణునిగృహములో నుండుటచే హర్షమును, దీనత్వమును, రోషమును బొంది బాగుగ నాలోచించి సంతోషము లేనివాడై వానితో 'రాక్షసరాజా!సీతను నాయొద్దకు రప్పింపు' మని పలికెను. ఆమాటలను విభీషణుడు విని శీఘ్రముగ నక్కడుండుప్రజల నందఱిని దూరముగ బంపివేయుటకు ప్రయత్నించెను. అతడు తనభటులను దూరముగబంపివేయుచుండ పెద్దధ్వనియాయెను. రాముడు వారి నందఱి నట్లు పంపివేయుట కిష్టపడక దయతో వారిని నివారించెను. తరువాత రాముడు రోషముచే మండుచున్న నేత్రములతో విభీషణుని జూచి తిరస్కారముగ నిట్లు పలికెను. 'నామాటవినక నీ వీజనులనందఱిని నేలబంపివేయుచున్నావు? అట్లు చేయకుము. వీరందఱు నావారు. ఇండ్లును, బట్టలును, ప్రాకారములును, తెరలును స్త్రీలకు నావరణములుకావు; మంచినడవడికయే యావరణము. రాజ్యనాశనమువలనను, దైవికముగను కష్టము నవచ్చినపుడును, యుద్ధమునందును, స్వయం

వరములయందును, యజ్ఞములయందును, వివాహములందును స్త్రీలు పైకిగనబడినను వారికి దోషములేదు. సీత యుద్ధభూమికి వచ్చినది. గొప్పకష్టములోనున్నది. ఆమె కనబడినను నాకు దోషములేదు. ముఖ్యముగ నాకు దగ్గఱగనుండుటచే నేమియుదోషములేదు. విభీషణా! ఆమెను నాయొద్దకు శీఘ్రముగరప్పింపుము. నాస్నేహితులందఱు నాదగ్గఱనుండ నన్నామె చూచుగాక!' ఇట్లు రాముడు విభీషణు నితో బలుక నతడనుమానపడుచు వినయముతో నామెను రప్పించెను. రామునిమాటలను లక్ష్మణ సుగ్రీవ హనుమంతులు విని మిక్కిలి విచారమునొంది యాతనికి సీతయందు ప్రీతిలేన ట్లాతనిమాటలనుబట్టి యు, ముఖవర్ణమునుఁ మొదలగువానినిబట్టియు గ్రహించి యాలోచించు చుండిరి. ఆమె లజ్జచే శరీరమును ముణుచుకొనుచు విభీషణుడు వెంటరా నచటకివచ్చెను. ప్రజ లక్కడనుండుటచే నామె సిగ్గుచే ముఖమును బట్టతో గప్పుకొని 'ఆర్యపుత్రా!' యని భర్తను పిలుచుచు నేడ్చెను. పతివ్రతయగు నామె యాశ్చర్యముతోను, సంతోషముతోను, స్నేహము తోను పూర్ణచంద్రునివంటితనభర్తముఖమును జూచి చాలకాలమునకు నతనినిజూచుటచే తనమనస్సులోని యాయాసమును బోగొట్టుకొనెను.

రాముడు తనప్రక్కను సిగ్గుచే తలవంచుకొని నిలిచియున్న సీతను జూచి యామెయందు మిక్కిలికోపముగలవాడై యిట్లు పలికెను. "నేను యుద్ధములో శత్రువును జయించి నిన్ను బొందితిని. నాపౌరుషమువలన జేయవలసినదంతయు జేసితిని. నాకోప మంత మొందినది. నీయవమానమును, శత్రువును నేకకాలముననే పోగొట్టితిని. ఇప్పుడు నాపౌరుషము చూపబడినది; నాశ్రమఫలించినది. నా ప్రతిజ్ఞ నెఱవేరుటచే నే నిపుడు స్వతంత్రుడనైతిని. చంచలచిత్తుడగు రాక్షసుడు నేను లేనపుడు నిన్ను దెచ్చినందులకు దైవయోగమున గలిగిన యీయవమానమును మనుష్యప్రయత్నముచే నేను బోగొట్టి

తిని. తనకుగలిగినయవమానమును తనపరాక్రమముచేతను పోగొట్టు
కొనని స్వల్పవీర్యముగల పురుషునకు పురుషార్థములేదు. సముద్రమును
దాటుట, లంకలోనిరాక్షసులను హింసించుట మొదలుగాగల గొప్ప
కర్మలను జరిపినహనుమంతునియొక్కయు, తనసైన్యముతోగూడ యుద్ధ
మునకు నాకు సహాయమునచ్చి నాకు మంచిసలహాలను జెప్పుచు
పరాక్రమముతో యుద్ధముచేసినసుగ్రీవునియొక్కయు, దుర్మార్గుడగు
తనయన్నను విడిచి భక్తితో నన్నుచేరి నిలిచిన విభీషణునియొక్కయు
శ్రమలు రావణునిహరణముచే నిప్పుడు సఫలములైనవి." ఇట్లు రాముడు
పలుకుచుండ సీత మిక్కిలికన్నీరు విడిచెను. నేయిపోసినయగ్నిహోత్ర
మువలె నామెను జూచినకొలది రామునకు క్రోధ మెక్కువయ్యెను.
అప్పు డాతడు కనుబొమలను ముడివైచి తనదృష్టిని మరలించి వానర
రాక్షసులు చూచుచుండ సీతను నిట్లు కఠినోక్తులాడెను. 'నిన్ను రావ
ణుడు బలవంతముగ నెత్తుకొనిపోయినందులకు ప్రతీకారముగ మను
ష్యుడు చేయవలసినదానినంతయు నేను చేసితిని. నేను యుద్ధములో
పడినశ్రమయంతయు నాస్నేహితులపరాక్రమముచే సఫలమునొంది
నది. దానిని నేను నీకొరకు చేయలేదు. నాకు గలిగినయపవాదమును
బోగొట్టుకొనుటకును, ప్రఖ్యాతమగు నావంశపుకీర్తిని నిలుపుకొనుట
కును శ్రమపడితిని. అనుమానమునకు కారణమైన చరిత్రముగల నీవు
నాయెదుట నిలిచి కంటిరోగముగలవానికి దీపమువలె నా కెక్కువ
బాధ కలిగించుచున్నావు. నేను నీకు సెలవిచ్చితిని. కావున నీ విపది
దిక్కులలోను నేదిక్కునకైనను నీయిచ్చవచ్చినచోటికి బోవచ్చును.
నీతో నాకు పనిలేదు. ఇతరులగృహములోనున్న తనభార్యను మంచి
కులములోబుట్టినవాడును, స్నేహితులస్నేహముకోరువాడును, మంచి
మనస్సుగలవాడును, తేజశ్శాలియునగు నేపురుషుడు తీసికొనివచ్చును?
రావణుడు నిన్ను తనతొడమీదకూర్చుండబెట్టుకొని తీసికొనిపోయు

చెమతలంపుతో జూచెను. అట్టి నిన్ను నా కులగౌరవమును నిలుపు కొనదలచిన నేనెట్లు గ్రహించెదను? నాకులకీర్తికై రావణుని జయించి నిన్ను బొంది కీర్తిని నిలుపుకొంటిని. నీయందు నా కాసక్తి లేదు. నీ విక్కడనుండి నీయిష్టమువచ్చిన చోటికి బోవచ్చును. నేను బాగుగ నాలోచించియే యిట్లుపలికితిని. నీవు నీయుదరపోషణకొఱకు లక్ష్మణునియందుగాని, భరతునియందుగాని, లేక వానరేంద్రుడగు సుగ్రీవునియందుగాని, రాక్షసరాజగు విభీషణునియందుగాని నీయిష్ట మువచ్చినట్లు మనస్సును నిలుపుము. చిరకాలము తనగృహములో నున్న నిన్ను, మనోహరమగు నీదివ్యరూపమును జూచి రావణు డెక కోపింపడు." ఇట్లు రాముడు చాలమంది నిలిచినయాచోట సీతను గతి నొక్కలాడ నామె యిక్కడిదనారమునొంది యతడాడినమాటలన్నియు విని సిగ్గునుపొంది తలవంచుకొని తనశరీరము కుంగిపోవ కన్నీరెక్కువగ విడిచెను.

తరువాత నామె కన్నీరు తుడుచుకొనుచు మెల్లగ గద్గదస్వర ముతో తనభర్తతో నిట్లనెను. "పురుషోత్తమా! సామాన్యపురుషుడు తనభార్యను బలికినట్లు మీరు వినుటకు తగని కఠినమగు మాటల నన్నిట్లేల పలికెదరు? మీరనుకొనినట్లు . నేను ప్రవర్తింపలేదు. నా పాతివ్రత్యమునుబట్టి నేను శపథముచేసెదను. అప్పుడు నామాట నమ్ముడు. దుష్టస్త్రీలప్రవర్తనలనుబట్టి యందఱిస్త్రీలను ననుమా నింపదగునా? నాస్వభావము నిదివఱకు మీరు పరీక్షించియున్న యెడల నాయందలి యీయనుమానమును విడువుడు. నన్ను రావణు డెత్తుకొనిపోవునప్పుడు నాశరీరము వానికితగులుట నే నస్వతంత్రురాల నగుటచే జరిగినది. ఆవిషయమున నాకు కోరికయేమియులేదు. ఆయ పరాధము దైవయోగమువలన జరిగినది. నామనస్సు నాస్వాధీనములో నుంపుటచే దానిని మీయందునిలిపితిని, నాశరీరము పరాధీనమగుటచే

నాకేమియు స్వతంత్రము లేనపుడు నేనేమిచేయగలను? మీచే పోషింపబడినపుడును, మీతో కలిసితిరిగినపుడును మీకు నాస్వభావము తెలియకపోయినయెడల నేను ముఖ్యముగ నాశనమైతిని. నన్ను వెతకుటకై మీరు వీరుడగుహనుమంతునిలంకకు బంపినపుడే లంకలోనున్న నన్నేల విడువలేదు. మీరు నన్ను విడిచినసంగతిని నేనతనినుండి వినినయెడల నతనియెదుటనే ప్రాణములను విడిచియుందును. మీప్రాణములకు సంశయమునుగలిగించు శ్రమయు, మీస్నేహితులకు ప్రయాసయు కలుగకుండెడిది. మీరు నాపై క్రోధమును జెంది యల్పమనుష్యుడు సామాన్యస్త్రీనివలె జూచితిరి; గాని నాశీలమును గ్రహింపకపోయితిరి; నేను భూమినుండి జన్మించి జనకునిపుత్రికవలె తెలిబడుచుండ నామంచి చరిత్రమును మీరు బాగుగ నాలోచింపలేదు. మీబాల్యమందు మీరు పొందిననాపాణిగ్రహణమును, మీయందు నాకు గలభక్తిని,నామంచి స్వభావమును మీరెంతమాత్రము నాలోచింపలేదు."ఇట్లు సీత గద్గద స్వరముతో పలికియేడ్చుచు విచారముచే నాలోచించుచు దీనముగనున్న లక్ష్మణునిజూచి 'సౌమిత్రీ!నాకొఱకై చితి నేర్పఱుపుము. నేను దానిలో బడుటవలన నాకీవిచారము తొలగును. మిథ్యాపవాదముగలిగిన నేను జీవించుట కుత్సహింపను. నాపాతివ్రత్యాదిగుణములచేగూడ ప్రీతి నొందనినాభర్త యీప్రజలయెదుటనన్ను విడిచినపుడు నాకు తగినగతి యగు నగ్నిలో బ్రవేశించెద'నని పలుక నతడు దైన్యమును బొంది రామునిముఖమును జూచెను. తరువాత లక్ష్మణు డాతనిరూపమునుబట్టి యాతనిమనస్సులోని యభిప్రాయమును దెలిసికొని చితిని కల్పించెను. తరువాత నామె తనముఖమును క్రిందికివంచుకొని మెల్లగ రామునకు ప్రదక్షిణముచేసి మండుచున్నయగ్నియొద్దకు వెళ్ళి దేవతలకును, బ్రాహ్మణులకును నమస్కరించి చేతులుజోడించుకొని యగ్నిసమీపమున నిట్లనెను. 'నామనస్సెల్లప్పుడు రామునివిడువకుండునట్లును,మంచి

చరిత్రముగల నన్ను దుష్టచరిత్రముగలదానిగ రాముడు తలంపకుండు నట్లును, నేను మనస్సుచేతను, మాటలచేతను, కర్మలచేతను సమస్తధర్మములు తెలిసినరాముని విడిచి యింకొకవిధముగ సంచరింపకుండునట్లును, భగవంతుడగు సూర్యుడును, వాయువును, చంద్రుడును, పగలును, రాత్రియు, నుభయసంధ్యలును, భూమియు, తదితరభూతములును నాపవిత్రచరిత్రమును నెఱుగునట్లును లోకసాక్షియగు నగ్ని దేవుడు సర్వవిధముల నన్ను రక్షించుగాక!' యట్లుపలికి పుటముపెట్టినబంగారు వంటికాంతి గలదియు, ప్రకాశమానమగు సలంకారములుగలదియునగు నాసీత యగ్నికి ప్రదక్షిణముచేసి మనస్ఫూర్తిగ శరీరమందాశవిడిచి మండుచున్నయగ్నిలో ప్రవేశించెను. అప్పు డక్కడ కూడియున్న యాబాల గోపాలము దానిని జూచి భయమునొందెను. మిక్కిలిపవిత్రమగునేయి మంత్రయుక్తముగ నగ్నిలో వేల్చబడినట్టుల సీత యగ్నిలో బడ మూడులోకములవారును, దేవ గంధర్వ దానవులును దానినిజూచి మిక్కిలి బాధనొందిరి. స్త్రీలును, నక్కడనున్న వానరులును, రాక్షసులు ను'హా! హా!'యని గొప్పశబ్దమును జేసిరి.

దీనినంతయు రాముడు విని మిక్కిలి విచారమును బొంది యొకగడియ యాలోచించి కన్నీరు దెచ్చుకొనెను. అప్పుడు కుబేరుడును, యముడును, నింద్రుడును, వరుణుడును, వృషభధ్వజుడును, త్రినేత్రుడునునగు శివుడును, సృష్టికర్తయగు బ్రహ్మయు మంచితేజస్సుగల విమానములపై కూర్చుండి రాముడుండు లంకాపట్టణమునకు వచ్చిరి. తరువాత వారు తమ్ము జూచి చేతులుజోడించుకొని నిలిచియున్న రామునిజూచి తమ బాహువుల నెత్తి యాతనితో నిట్లనిరి. 'మీరు లోకములు నన్నిటిని సృజించిన మహావిష్ణువులరు; జ్ఞానవంతులలో శ్రేష్ఠులు. అట్టి మీరు సీత యగ్నిలో బ్రవేశించుచుండ నేల యుపేక్షించితిరి? మీరు మీయాత్మను దేవతలలో శ్రేష్ఠమైన

దానిగ నేల త్రోసికొనెదరు? మీరు స్వయంభువులయ్యు (స్వయముగ పుట్టినవారు) సామాన్య పురుషునివలె సీత నేల యుపేక్షించుచున్నారు?' ఇట్లు లోకపాలకులు రామునితో రాముని పూర్వస్వరూపములను దెలియబలుక నాతడు వారితో నిట్లనెను. 'నన్ను నేను దశరథపుత్రునిగను, మనుష్యునిగను, రామునిగను భావించెదను. ఓ! బ్రహ్మదేవా! నే నెవడనో యెవరి సంబంధమైనవాడనో యెక్కడనుండి యిక్కడకు వచ్చితినో మీరు నాకు దెలుపుడు.' ఇట్లు రాముడు పలుక బ్రహ్మ యతనితో 'మీరు* పరబ్రహ్మ స్వరూపులరలగు మహావిష్ణువ'రని వివరముగ దెలిపి♦'మీరు పూర్వము నారాయణదేవుడను నామము

---

* 12వ. ప్రకరణము. ౨౨వ. అధ్యాయము. రాముని విశ్వరూప వర్ణన చూడుము.

♦ అ.రా.—బ్రహ్మ రాముని నిట్లు స్తుతించెను. "దేవా! నిర్గుణుడవును, సమస్త ప్రపంచము యొక్క యునికికి కారణభూతుడవును, ఆత్మజ్ఞానము కలవారి హృదయమందెల్లప్పుడు నుండువాడవును, సుఖదుఃఖాదిద్వంద్వవిహీనుడవును, ఉత్కృష్టుడవును, సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేనివాడవును, సద్రూపుడవును, సర్వహృదయములందునుండి కర్మానుసారముగ కర్తవ్యాకర్తవ్యములను బోధించువాడవును, జ్ఞానరూపుడవునగు నీకు నమస్కారము. యతీశ్వరులు ప్రాణ అపానవాయువులను యోగాభ్యాసముచేత హృదయమునందు బంధించి శ్రవణాదులచే నీశ్వరవిషయిక (ఈశ్వరుడున్నాడా? లేడా? జ్ఞానస్వరూపుడా? శరీరముకలవాడా? అను) సంశయములను, 'విషయములు అనిత్యములు, అపరిశుద్ధములు' అనే నిశ్చయముచే శబ్దాది విషయములను బోగొట్టుకొని (అనగా చిత్తమును వానినుండి మరల్చి) మోహరహితులై యేనిన్ను జూచుచున్నారో యట్టి నీకు నమస్కారము. జననమరణప్రవాహరూపసంసారము లేనివాడవును, లక్ష్మీభర్తవును, మొదటివాడవును, మానము (దేశకాల ప్రమాణము) లేనివాడవును, సేవకుల యజ్ఞానమును నాశనము చేయువాడవును, మునులచే నమస్క-

లచే మూఁడులోకములనాక్రమించి బలినిబంధించి యింద్రునకు ముల్లోకముల నిచ్చితిరి. సీత మహాలక్ష్మి. మీరు విష్ణు దేవులరు. మీరే నల్లనిరూపముగల కృష్ణులరు. మీరే ప్రజాపతులరు. మీరు రావణుని వధించుటకు మనుష్యరూప మెత్తి వానిని జంపుటచే మాకార్యము నెరవేఱినది. మీరు కొంతకాలము సంతోషముతో రాజ్య మనుభవించి పిమ్మట వైకుంఠమునకు వెళ్ళుడు. మీబల వీర్యములును, పరాక్రమమును మిక్కిలిగొప్పవి. మీదర్శనము

---

దింపబడు వాడవును, యోగులచే ధ్యానింపబడు వాడవును, యోగము లను రక్షించువాడవును, పరిపూర్ణుడవును, లోకములను రంజింప జేయువాడవును, మనోహరమగు రూపము గలవాడవును నగు నీకు నమస్కారము. (భాసము=దృశ్యము, కంటికి గనబడునది. అభా వము=తుచ్ఛమైనది; అసత్యమైనది; లేనిది. అట్టి దృశ్యతుచ్ఛవిషయిక జ్ఞానమందు గోచరింపనివాడవును, భోగములందు కోరికలులేని శివాదులచే సేవింపబడు పాదపద్మములు గలవాడవును, నిత్యుడవును, శుద్ధుడవును, * బుద్ధుడవును, సంశయములేనివాడవును, ఓంకార స్వరూపు డవును, రాక్షసులందఱకు దావాగ్నివంటి వాడవును నగు నీకు నమ స్కారము. నాకు ప్రభుడవును, నాచే ప్రార్థింపబడిన సమస్తకార్యము లను జేసినవాడవును, కాలదేశవస్తుకృతపరిచ్ఛేదము లేనివాడవును, లక్ష్మీభర్తవును, సన్నిధిని ధరించువాడవును, భక్తిచే పొందబడువాడ వును, ఎవడు ఏరూపముగా నిన్ను ధ్యానముచేయునో యారూపుడవై వానిని సంసారమునుండి దాటించువాడవును, సంసారబంధమును బోగొట్టువాడవును, యోగాభ్యాసములచే నిర్మలములైన చిత్తములందు సంచరించువాడవును నగు నీకు నమస్కారము. సకలలోకములయొక్క సృష్టిస్థితి సంహారములకు గారణభూతుడవును, ప్రత్యక్షాది ప్రమాణ

---

* బుద్ధయనుమాట యధ్యాత్మరామాయణములో కనబడుటచే నీగ్రంథము హిందువులు బుద్ధుని నవతారముగ నొప్పుకొనిన తరువాత రచింపబడినదనియు, బౌద్ధమత మున్నన్నముకాగా ప్రచురింపబడినదనియు మే మూహించుచున్నాము.

వలన జనులకు గొప్పశుభము కలుగును. మిమ్ము కొనియాడుట యెప్పుడును వ్యర్థము కాదు. మీయందు భక్తిగలవారు సహస్రకోరికలను బొందుదురు. మిమ్ము భక్తితో పూజించువారీలోకమునందును, పరలోకమునందును నిశ్చయముగ తమకోరికలను బొందుదురు. మీమాహాత్మ్యము నెల్లప్పుడును గీర్తించువారికి శత్రుభయము లేకుండు' నని రాముని స్తుతించెను.

---

ములచే దెలియబడనివాడవును, (పరమేశ్వరునియందును, వాని పూజలయందుగల ప్రేమయే భక్తి యనబడును. ఆపూజాదులవల్ల సనశ్యము ఫలము సంభవింగలదనే నమ్మకముననే శ్రద్ధ యనబడును.) అట్టి భక్తి శ్రద్ధలతో గూడుకొన్నవారిచే సేవింపదగినవాడవును, సుందరుడవును, నల్లకలువతో సమానమైన దేహకాంతి గలవాడవును నగు నీకు నమస్కారము. అన్నిచోట్ల నుండువాడవును, పరిచ్ఛేదశూన్యుడవును నగు నిన్ను నింద్రియములం దాశక్తిగలవాడు తెలిసికొనుట కెట్లు సమర్థుడగును? * బృందావనమున కృష్ణరూపుడవై దేవతాసమూహముచే నమస్కరింపబడినవాడవును, శాస్త్రములచే నిర్ణయింపబడిన యర్థములుగల వేదసమూహములచే తెలియబడువాడవును, నెల్లప్పుడు నానందరూపుడవును, నిర్వికల్ప జ్ఞానవిషయుడవును, మొదలులేనివాడవును, *మధురాపట్టణమునకు ప్రభుడవును, నేను సేవించుకొనుటకు మనుష్యభావము బొందినవాడవును నగు నీకు నమస్కారము" ఇట్లు బ్రహ్మ రాముని స్తుతించెను.

తరువాత నగ్ని తనతొడపైని సీతనిడుకొని రఘురామునితో నిట్లు విన్నవించెను. 'రామా! పూర్వము నీవు దండకారణ్యమున

---

* బృందావనమున దేవతలచేబూజింపబడినవాడును, మధురాధిపతియునగు శ్రీకృష్ణుడు ఇప్పటికలియుగమున ముందున్నద్వాపరాంతమున జన్మించిన యవతారపురుషుడు. రాముడన్ననో కోటిసంవత్సరములకు బూర్వముండినవాడు. దీనిని బట్టియీ మహాత్మరామాయణము కలియుగమున రచింపబడిన దను సంగతిస్పష్టము.

బ్రహ్మపలికినయీశుభవాక్యములను నగ్ని దేవుడు విని సీతను తనతొడమీఁద నిడుకొని చితినుండి తనరూపముతో పైకిలేచెను. ఆమె బాలసూర్యునివలె ప్రకాశించుచు బాగుగ మెఱయుచున్న బంగారు భూషణములను ధరించి యెఱ్ఱనిబట్టలను గట్టుకొని నల్లనిముంగురులు గలజుట్టుగలిగి శుభ్రమగుపూలదండలను వేసికొని యగ్నిలోఁ బ్రవేశించునప్పుడున్నరూపముతోనే ప్రసన్నమనస్కురాలై కనబడుచుండ నామెను లోకసాక్షియగునగ్ని రామున కిచ్చి యిట్లు పలికెను. 'రామా! యీమెయందు పాపమేమియులేదు. మంచిప్రవర్తనగల యీమె మనస్సుచేతగాని, వాక్కుచేతగాని, నేత్రములచేతగాని, యాలోచనచేతగాని నిన్ను విడిచి యన్యథాచరించియుండలేదు. నీవు దగ్గఱ లేకపోవుటచే దీనురాలగు నీమె వివశురాలై రక్షించువారులేక నిర్జనమగు నడవినుండి బలముచేగర్వించిన రావణునిచే నెత్తుకొనిపోబడినది. ఈమె వానియంతఃపురములో నిరోధింపబడి రహస్యముగ దాచబడి వికృతరూపములుగలవారును, భయంకరముగ గనబడువారునునగు రాక్షసస్త్రీలు రక్షించుచున్నను నీయందే మనస్సుగలిగి నిన్నే యుత్తమగతిగ దలచుచుండెను. ఆరాక్షసు లీమెను ననేకవిధములుగ నాశపెట్టినను, భయపెట్టినను నీమె నీయందే మనస్సుగలిగి యుండు

---

నాయందు సీత నుంచితివి. ఎవనివధకై నీవు మాయసీతను గల్పించితివో యారావణుఁడు తన పుత్రబాంధవులతో జంపబడెను. దానితో భూభారము పోయెను. ఆమాయసీత తన కార్యములను నెరవేర్చి యంతర్ధానము నొందెను. కాన నిజమగు నీసీతను గ్రహింపుము" ఇట్లగ్ని మనవిచేయ రాముడు మిక్కిలి సంతోషముతో జానకి నంగీకరించెను. లక్ష్మీనాథుడగు రాముడు మూడులోకములకు దక్షియు, తన్నెప్పుడు నెడబాయకుండునదియు, లక్ష్మీదేవియునగు సీతను తన తొడపై నిడుకొనెను.

టచే వానినిగూర్చి యాలోచింపలేదు. కేవలము శుద్ధమగు మనస్సు గలదియు, నిష్పాపము లేనిదియునగు నీమెను నీ వంగీకరింపుము. నీవు మరేమియు చెప్పవలదు. నేను నిన్నాజ్ఞాపించుచున్నాను.' ఇట్లగ్ని దేవుడు పలుక నామాటలను గొప్ప తేజోవంతుడును, మంచి పరాక్రమము గలవాడును నగు రాముడు విని మనస్సున బ్రీతిజెంది కంట్లంట నీరు తెచ్చుకొని యొకగడియ యాలోచించి యా యగ్ని దేవునితో నిట్లు పలికెను. "సీత రావణుని యంతఃపురములో చిరకాలమున్నను నీమె శుభచరిత్రయగుటచే మూడులోకములలోను నెంతమాత్రము నింద నుబొందదు; కాని యీమెను పరీక్షింపకుండ నేను గ్రహించితినేని 'దశరథపుత్రుడగు రాముడు కామబుద్ధి గలవాడు; అజ్ఞానుడ'ని నన్ను లోకులు పలుకుదురు. ఈమెకు నితరులందు మనస్సు లేదనియు, నీమె నాయిష్టము ననుసరించి వర్తించుననియు, నాయందు భక్తి గలదనియు నాకుగూడ దెలియును. కాని మూడులోకముల వారికి నమ్మకము కలుగుటకు కేవలము నేను సత్యమునే కోరుచు నీమె యగ్నిలో బ్రవేశించుచుండ నుపేక్షించితిని. తన తేజముచే తన్ను రక్షించుకొనిన యీమెను సముద్రము తన చెలియలి కట్టవలె రావణుడుకూడ నతిక్రమించి సంచరింపలేదు. దుష్టాత్ముడగు నాతడీమెను మనస్సుచేతగూడ స్వాధీనపఱచుకొనలేక పోయెను. సూర్యునిని కాంతి విడువనట్లు నాకంటె వేఱుకాని యీమె నన్నువిడిచి రావణుని యంతఃపురమున నైశ్వర్యమనుభవించుటకు తగినదికాదు. ఈమె మూడులోకములలోను మిక్కిలి పవిత్రమగు చరిత్ర గలది. ఈమె నెవరునపహరింపలేరు. లోకములో పూజ్యులును, హితమును జెప్పువారునునగు మీయందఱి శుభవచనములను నేను ముఖ్యముగ జరుపవలెను." ఇట్లు రాముడు పలికి దేవతలచే గీర్తింపబడి తన భార్యతోగూడి సుఖముగనుండెను.

---

## ౧౨౨. అధ్యాయము.

## రాముడు వరములను బొందుట.

రాముడు సీతను గ్రహించిన తరువాత శివుడిట్లు మంచి మాటలను బలికెను. *"గొప్ప బాహువులు, గొప్ప వక్షస్థలముగల రామా! దైవయోగమున నీవిట్టి గొప్ప కర్మను జేసితివి. నీవు రావణుని యుద్ధములో జంపి వానివలన సర్వలోకములకు గలిగిన కీడును తొలగించితివి. నీ వయోధ్యకు బోయి దీనుడగు భరతుని నోదార్చి కౌసల్యను, కైకేయీ సుమిత్రలను జూచి యక్కడ రాజ్యాభిషిక్తుడవై స్నేహితుల నందఱిని సంతోషపఱచి యిక్ష్వాకువంశమును వృద్ధినొందించి యశ్వమేధము నొనర్చి గొప్ప కీర్తిని బొంది బ్రాహ్మణులకు ధనమిచ్చి స్వర్గమునకు బోవలెను. ఇదుగో! నీతండ్రియగు దశరథుడు. మనుష్యలోకములో జీవించియున్నపు డితడు నీ గురువు. ఇతడు నీచే తరింపబడి యింద్రలోకమునకు బోయి విమానముపై నిక్కడకు వచ్చెను. నీతండ్రికి నీవును, లక్ష్మణుడును నమస్కరింపుడు." ఇట్లు శివుడు పలుక విమానముపైనున్న తమ తండ్రిని రామలక్ష్మణులు చూచి నమస్కరించిరి. అతడు తన తేజస్సుచే ప్రకాశించుచు శుభ్రమగు బట్టలను గట్టుకొని గొప్ప సంతోషముతో తన ప్రాణములకంటె నెక్కుడగు రాముని జూచి నానిని, లక్ష్మణుని తన తొడలమీద కూర్చుండబెట్టుకొని తన బాహువులతో కౌగిలించుకొని యిట్లు పలికెను. "నేను స్వర్గలోకమునుబొంది దేవఋషులచే గౌరవము నొందుచున్నను నిన్ను

* అ. రా.—రామునికి నెదుట శివుడు పార్వతితోగూడ విమానమున గనబడి 'నీవు పట్టాభిషేకమును బొందునపుడు మే మయోధ్యలో గనబడుదు'మని సెలవిచ్చి యతనికి తండ్రియగు దశరథుని జూపెను.

విశిచియుండుటచే నాకు సంతోషము కలుగుటలేదని నిజమును బలుకు చున్నాను. రామా! శత్రువులను జంపి వనవాసమును పూర్తి జేసి మిక్కిలి సంతోషమగు మనస్సుతోనున్న నిన్ను జూడ నిప్పుడు నాకు మిక్కిలి ప్రీతి గలిగినది. నిన్ను వనవాసము పంపుటకై కైకేయి పలికిన పలుకులు నామనస్సున స్థిరముగ నాటుకొని యున్నవి. కుశలముగ నున్న నిన్ను, లక్ష్మణుని కౌగిలించుకొని యిప్పుడు దుఃఖములను విడిచితిని. రామా! నీవలననే నేను తరించితిని. రావణుని వధకొఱకు నీకు రాజ్యాభిషేకము తప్పిపోవుటయు, నీవు వనవాసమునకు వచ్చుటయు జరిగినదని దేవశ్రేష్ఠులు నాకు దెలిపిరి. నీ వయోధ్యకు బోయి రాజగృహమున బ్రవేశించిన తరువాత కౌసల్య సంపూర్ణమనోరథయై సంతోషముతో నిన్ను జూచును. అయోధ్యలో నీపట్టాభిషేకమును జూచు ప్రజలందఱు అదృష్టవంతులు. బలవంతుడును, శుచియు, ధర్మముగ బ్రవర్తించువాడునునగు భరతునితో నీవు కలిసికొనునపుడు నేను మిమ్ము జూడ గోరుచున్నాను. నీవు సీతతోను, లక్ష్మణునితోను 14 సంవత్సరములు వనవాసముచేసి నీ ప్రతిజ్ఞను నెఱవేర్చితివి. నీవు రావణుని యుద్ధములో జంపుటచే దేవతలు సంతోషించిరి. నీవు కొనియాడదగిన కీర్తికరములగు పనులను జేసితివి. నీవు నీ తమ్ములతోగూడ రాజ్యముచేయుచు చిరకాలము జీవించెదవుగాక!" ఇట్లు దశరథుడు పలుక రాముడు చేతులు జోడించుకొని యిట్లు విన్నవించెను. "మీరు కైకేయితో 'నిన్నును, నీకుమారుని విడుచుచున్నా'నని పలికినందులకు వారలమీద గొప్ప దయను జూపుడు. ఆశాపమువారలకుగలుగకుండునట్లు వరమునుప్రసాదింపుడు." ఇట్లు రాముడు విన్నవింప దశరథుడు దానికంగీకరించి లక్ష్మణుని తిరుగ కౌగిలించుకొని వానితో నిట్లనెను. "నీవు సీతారాములను భక్తితో సేవించుటచే నాకు గొప్ప ప్రీతి కలిగినది; నీకు ధర్మాచరణఫలము కలిగినది, రాముసకు నీమీద

దయగలిగినయెడల నీవు భూలోకములో గొప్పకీర్తిని, ధర్మమును బొంది తరువాత స్వర్గమును, గొప్పమహత్తును బొందెదవు. రాముడన్నిలోకములకు శుభముకోరువాడు. నీవు వానిని సేవించిన నీకు శుభముకలుగును. ఈ యింద్రాది దేవతలును, మూడులోకముల వారును, సిద్ధులును, గొప్పఋషులును పురుషోత్తముడగు నాతని యొద్దకు వచ్చి యతనిని పూజించుచున్నారు. భక్తిలేనివానికి గనపడనివాడును, నాశనరహితుడును, వేదముల కర్థమైనవాడును, దేవతల హృదయ మందుండువాడును, నుపనిషత్తులచే దెలిసికొనదగినవాడును నగు పరబ్రహ్మ రామరూపమున నవతరించెనని బ్రహ్మాదిదేవతలు పలికిరి. నీవు సీతారాములను సేవించి ధర్మాచరణను, గొప్పకీర్తిని బొందితివి." ఇట్లు దశరథుడు లక్ష్మణునితో బలికి తరువాత సీతతో నిట్లనెను. 'నీహితమును గోరి నీమనశ్శుద్ధికొఱకిట్లుచేసిన రామునిపై నీవు క్రోధమును విడువుము; వీనిని విడువకుము. నీభర్తశుశ్రూషనుగుఱించి నేను నీకు వేఱుగ చెప్పనక్కఱలేదు; కాని నీభర్త నీకు మిక్కిలిగొప్ప దైవతమనిమాత్రము నేను చెప్పవలెను.' ఇట్లు దశరథుడు పలికి ప్రకాశమానమగు విమానమున నింద్రలోకమునకు బోయెను.

తరువాత రాముడు చేతులు జోడించుకొని నిలిచియుండ నింద్రుడు 'రామా! మాదర్శన మమోఘమైనది. మేమందఱము ప్రీతి నొందితిమి. నీమనస్సులోని కోరికను దెలుపు'మని పలుక సీతాలక్ష్మణులతోగూడ చేతులు జోడించుకొని నిలిచియున్న రాము డీప్రకారముగ మనవిచేసెను. 'మీరు నాపైని ప్రీతికలిగి నేడు నాకోరికను దెలిపెదను. దానిని సత్యముగ జరుపుడు. నాకు ప్రియము చేయుకొఱకు మృత్యువునుగూడ లెక్కచేయక తమ భార్యాపుత్రులను విడిచివచ్చి యుద్ధము చేసి మరణించిన పరాక్రమవంతులగు వానరులు మీ దయవలన తిరుగ తమ ప్రాణములను బొంది నిలిచెదరు గాక! అట్లే గొప్ప బలపౌరుష

ములుగల గోపుచ్ఛులును, ఋక్షులును, రోగములేనివారై గాయములు లేక నిలిచెదరుగాక! వానరులుండు చోట నకాలమందైనను ముఖ్యములగు మూలములు, ఫలములు నుండుగాక! నదులు స్వచ్ఛమగు నీరుకలిగి ప్రవహించుగాక!' ఇట్లు రాముడు విన్నవింప నింద్రుడు 'నీ చెప్పినను రెండవమాట పలికియుండలేదు. నీవు కోరిన గొప్పవరము తప్పక జరుగును. రాక్షసులచే యుద్ధములో మరణించినవారును, గాయములు తగిలినవారును నగు వానరులును, ఋక్షులును, గోపుచ్ఛులును రోగములు, గాయములు లేనివారై గొప్ప బలపరాక్రమములతో నిద్రనుండి మేల్కొనినట్లు లేచెదరు. వారు తమ స్నేహితులను, బంధువులను, జ్ఞాతులను, సర్వజనులను గలిసికొని సంతోషముతో నుండెదరు. అకాలమందైనను చెట్లు పూవులతోను, కాయలతోను, పండ్లతోను నిండియుండును. నదులు నీటితో నిండియుండు'నని పలుక వానరులు నిద్రనుండివలె లేచి నిలిచి యిదియేమి యని యాశ్చర్యమునొంది రామునకు నమస్కరించిరి. రాముని మనోభీష్టము నెఱవేఱ దేవతలందఱు రామలక్ష్మణులను గీర్తించి యిట్లు పలికిరి. 'రామా! మీరు వానరుల నిక్కడ విడిచి సీతమనస్సును సంతోషపఱచి యయోధ్యకు బోయి శత్రుఘ్నుని, మీతల్లుల నందఱిని, మిమ్ముగూర్చి విచారముచే నియమముతోనున్న భగతుని జూడుడు. తరువాత మీరు పట్టాభిషేకము నొంది పట్టణవాసులకు సంతోషమును గలుగజేయుడు.' ఇట్లు దేవతలు పలికి రామలక్ష్మణులవద్ద సెలవుపుచ్చుకొని వారిచే నమస్కరింపబడుచు ప్రకాశమానములగు విమానములపై స్వర్గమునకు వెడలిరి. ఆ రాత్రి వానరసేనయు, లక్ష్మణుడును, సీతారాములును నక్కడనే యుండిరి.

## ౩౦ వ. అధ్యాయము.

## సీతారామలక్ష్మణులును, సుగ్రీవ విభీషణాదులును నయోధ్యకు బోవుట

ఇంద్రుడు రామునకు వరములిచ్చిన మఱునాటియుదయమున రాముడు లేచియుండ విభీషణు డతనిదగ్గఱకుబోయి నమస్కరించి జయమును బలుకుచు 'మీరు స్నానముచేయుటకు నీటిని, తరువాత నలంకరించుకొనుటకు నాభరణములను, కట్టుకొనుటకు మంచిబట్టలను, శరీరమున రాసికొనుటకు చందనము మొదలగు సుగంధద్రవ్యములను దెచ్చి స్త్రీలు సిద్ధముగనున్నారు. కాన వానినన్నిటిని నంగీకరింపు' డని యనెను. దానికాతడిట్లు జవాబిచ్చెను. 'నీవు సుగ్రీవాదివానరముఖ్యులను స్నానమునకు బిలువుము. ధర్మాత్ముడును, సుఖములననుభవింపతగినవాడును,సుకుమారుడునునగు భరతుడునన్ను గుఱించి నియమముతోనుండ నే నాతనిని విడిచి స్నానముచేయుటయు, బట్టలను,నాభరణములను ధరించుటయు నెట్లు? అయోధ్యనుండి నేను వచ్చినకష్టమైన త్రోవనుండియే తిరుగ శీఘ్రముగ వెళ్లవలెను.' ఇట్లు రాముడు పలుక విభీషణు డిట్లు విన్నవించెను. 'మాయన్నయగు రావణుడు కుబేరుని జయించి యతనిపుష్పకమును బలవంతముగ దెచ్చియున్నాడు. దానిని మీకొఱకే యిప్పటివఱకు నుంచితిని. దానిపై మిమ్ము నయోధ్యకు నొక్కపగటిపూటలో పంపగలను. నాయందు మీకనుగ్రహమున్నయెడలను, స్నేహభావమున్నయెడలను, నాగుణములను మీరు స్మరించినయెడలను, దయతో సీతాలక్ష్మణులతోగూడ నిచటనుండుడు. స్నేహముచేతను, మర్యాదచేతను సమస్తభూషణాదులతో నేను చేయు సత్కారములను మీరుపొంది నేను సైన్యముతో మీవెంటరాగ మీరు మిత్రులతోగూడ గలిసి వెళ్లెదరు. మీపరిచారకుడనగు నేను నిజముగ మిమ్ము ప్రార్థించుచున్నాను; గాని యాజ్ఞాపించుటలేదు.' ఇట్లు విభీషణుడు మనవిచేయు రాక్షసవానరులందఱు వినుచుండ రాముడిట్లు

పలికెను. 'విభీషణా! నిండుమనస్సుతో నీవు జరిపిన మంత్రిత్వముచేతను, నీవుచేసిన కార్యములచేతను, నీగొప్పస్నేహముచేతను నేను బాగుగ మర్యాదనొందితిని. నీమాటప్రకారము నిశ్చయముగ జరుపకపోవుట కూడదు; కాని నాతమ్ముడగు భరతునిజూచుటకు నామనస్సు తొందరపడుచున్నది. అతడు చిత్రకూటమునకువచ్చి నన్ను దీసికొనిపోవుటకెంతయత్నించినను నేను వానిమాటజరుపక వానిని బంపివైచితిని. మాతల్లులను, గురువులను, స్నేహితులను, నయోధ్యావాసులనుగూడ జూచుటకు నాకు తొందరగనున్నది. నీవు విమానమును శీఘ్రముగ తెప్పింపుము. ఇక్కడ నాకార్యము నెఱవేఱినది. నేనుండుటకు వీలులేదు. నామాటనంగీకరింపుము. నీవలన పూజనొందితిని. నీవు క్రోధము తెచ్చుకొనకుము. ప్రయాణమునుగూర్చి నిన్ను తొందరపెట్టుచున్నాను.' ఇట్లు రాముడుపలుక విభీషణుడు పుష్పకమును శీఘ్రముగ దీసికొనివచ్చెను.

విభీషణుడు పుష్పకమును దెచ్చి రామునిసమీపమున నిలిచి చేతులుజోడించుకొని వినయముతో 'ఇకనేమిచేయవలె' నని పలికెను. అప్పుడు రాముడాలోచించి సమీపముననున్న లక్ష్మణుడు వినుచుండ స్నేహముచే విభీషణునితో నిట్లనెను. 'వానరులు తమశక్తికొలది కర్మలను జరిపిరి. వారికి రత్నములను, నలంకారములను, నన్నవస్త్రములను నిచ్చి మర్యాదచేయుము. వారు ప్రాణభయమునువిడిచి వెనుదిరుగక సంతోషముతో యుద్ధముచేసిరి. వారిసహాయముచేతనే యితరులకు జయింపనలవికాని యీలంక జయింపబడినది. కృతజ్ఞతచే నీవు వారికిట్లు మర్యాదచేసిన వారు సుఖముగ సంతోషముతో వెళ్ళెదరు. వారు నిన్ను దాతగను, స్నేహితులను సంపాదించువానిగను, గొప్పదయగలవానిగను, కీర్తిమంతునిగను తెలిసికొనెదరని నేను నీతో జెప్పుచున్నాను. రాజు ప్రీతినిగలుగజేయు నౌదార్యాదిగుణములు లేనివాడును, హింసించు స్వభావముగలవాడును నైనయెడల దుఃఖ

మునొందిన సైన్యము యుద్ధములో వానిని విడుచును.' ఇట్లు రాముడు పలుక విభీషణుడు వానరులందఱికి తగినటుల రత్నములు మొదలగు వాని నిచ్చి గౌరవించెను. తరువాత రాముడు సిగ్గుతోనున్న సీతను తనతొడపై నిడుకొని పుష్పకమెక్కెను. లక్ష్మణుడు ధనస్సునుబట్టి యెక్కెను. అప్పుడు రాముడు విభీషణుని, సుగ్రీవుని, మిగిలినవానర శ్రేష్ఠులను మర్యాదచేయుచు వారలతో నిట్లు పలికెను. 'వానరశ్రేష్ఠులారా! మీరందఱు స్నేహితునికార్యమును జరిపితిరి. మీయిష్టమువచ్చినచోటికి వెళ్ళుటకు మీకు సెలవిచ్చితిని; వెళ్ళుడు. సుగ్రీవా! అధర్మమందుభయముగలనీవు స్నేహితుడు చేయవలసినకార్యముల నన్నిటిని జరిపితివి. నీసేనలతో నీవు శీఘ్రముగ కిష్కింధకు బొమ్ము. విభీషణా! నేను నీకిచ్చిన లంకారాజ్యమున నీవు నివసింపుము. నిన్నింద్రాదిదేవతలైనను జయింపలేరు. నేనునాతండ్రిరాజధానియగు నయోధ్యకుబోయెదను. నేనుమీయందఱివద్ద సెలవుపుచ్చుకొని పోవుచున్నాను.' ఇట్లు రాముడు పలుక వారందఱును చేతులుజోడించుకొని యతనితో నిట్లు పలికిరి. 'మేమందఱ మయోధ్యకు రాగోరుచున్నాము. మమ్ములను దీసికొని వెళ్ళుడు. అక్కడివనములను, పట్టణములను జూచుచు జాగ్రత్తగ దిరిగెదము. మీపట్టాభిషేకమును జూచి కౌసల్యకు నమస్కరించి శీఘ్రముగ మాయిండ్లకు వెళ్లెదము.' ఇట్లు వారు పలుక రాముడు వారితో 'స్నేహితులగు మీయందఱితోగలిసి నేనయోధ్యకు బోవుట నాకు మిక్కిలిప్రియతరమగుకార్యము. అట్లైన నేను గొప్పప్రీతిని పొందెదను. మీరందఱు శీఘ్రముగ విమానమెక్కు' డని యనెను. అంతట సుగ్రీవుడును, విభీషణుడును తమసైన్యములతోను, నమాత్యులతోను పుష్పకమెక్కిరి. తరువాతరాముడు సెలవీయ విశాలమగు నాపుష్పకమాకాశమందెగురుచుకదలుచుండెను.

పుష్పకముకదలుచుండ రాము డన్నిదిక్కులను జూచుచు సీతకు లంకాపట్టణమును, యుద్ధముజరిగినస్థానమును, రావణుడు మొదలగు

రాక్షసవీరులు పడి మరణించినప్రదేశములను, సముద్రముస సేతువును గట్టినచోటును, మిగిలినప్రదేశములను, తాను సేతువునస్థ స్థాపించిన శివలింగమును జూపెను. తరువాత కిష్కింధచేరెను. అక్కడ తాను జరిగినచర్యలనన్నిటిని రాముడు సీతకుదెలుప నామె యతనితో స్నేహముచే 'సుగ్రీవునిప్రియభార్యలగు తారమొదలగువారితోను, మిగిలిన వానరశ్రేష్ఠులభార్యలతోను గూడి నే నయోధ్యకు వెళ్ళగోరుచున్నా' నని పలికెను. రాముడు దానికంగీకరించి విమానమును నిలిపి సుగ్రీవునకు సీతయభిప్రాయమును దెలుప నతడట్లాజ్ఞాపింప వారిభార్యలును, సుగ్రీవునిభార్యలును వచ్చి విమానము నలంకరించి దానికి ప్రదక్షిణముచేసి దానినెక్కిరి. తరువాత రాముడు సుగ్రీవునితో తాను స్నేహము చేసిన ఋశ్యమూకపర్వతమును, తాము వనవాసమునకు వచ్చినపుడు నివసించినప్రదేశముల నన్నిటిని సీతకు జూపుచుండ విమానము భరద్వాజాశ్రమమును సమీపించెను.

రాముడు 14 సంవత్సరములు వనవాసము పూర్తికాగా చైత్ర శుద్ధ పంచమిరోజున భరద్వాజాశ్రమమును జేరి మునికి నియమముగ నమస్కరించెను. తరువాత నతడు ఋషిని నయోధ్యలో నన్నపానాదులు బాగుగ జరుగుచున్నవా? యనియు, పురవాసులంద ఆరోగ్యముగనున్నారా? యనియు, భరతుడు ప్రజాపాలనాది కార్యములలో జాగ్రత్తగనున్నాడా? యనియు, తన తల్లులు జీవించియున్నారా? యనియు నడుగ నాతడు సంతోషముతో నవ్వుచు నిట్లు పలికెను. 'భరతుడు జటలను ధరించి శరీరమున బుగ్గియంటియుండ నీపాదుకల నెదుటనుంచుకొని నీరాకకొఱ కెదురుచూచుచున్నాడు. నీగృహమున నందఱు కుశలముగ నున్నారు. పూర్వము నీవు కైకేయిమాటల ననుసరించి తండ్రియాజ్ఞాప్రకారము రాజ్యమును, నన్నిభోగములను విడిచి కేవలముధర్మమునే కోరుచు నారచీరలనుగట్టి భార్యతోను, తమ్మునిని

న్గోను నడచుచును వనమునకు వెళ్ళుటయు, నచట మూలములను, ఫలములను దినుటయు జూడ నప్పుడు నా కెక్కువదుఃఖము కలిగెను. ఇప్పుడు నీకోర్కెలు నెరవేరి నీవు శత్రువులను జయించి స్నేహితులతోను, బంధువులతోను నుండుటనుజూడ నాకు గొప్పప్రీతికలిగినది. నీకు గలిగిన సుఖదుఃఖములన్నియు నాకు నాతపోబలమున తెలిసినవి. నీవీదినమున నాయాశ్రమమున నివసించి నాచే మర్యాదను, వరమునుబొంది రేపటి దినమున నయోధ్యకు వెళ్ళవచ్చును.' ఇట్లు * భరద్వాజుడు పలుక రాము డాఋషికి తలతో మ్రొక్కి యతడు చెప్పినదానికంగీకరించి 'మేమయోధ్యకుబోవుత్రోవలో నకాలమున వృక్షములన్నియు ఫలించునట్లును, ననేకవిధములగు నాఫలములు తేనెలూరుచుండ నమృతముతోసమముగ నుండునట్లును వరమునిప్పింపు'డని వేడ నాఋషి

* అ. రా:—భరద్వాజుడు రామునిగలిసికొని యతనితో సంభాషించి తరువాత నతని నిట్లు స్తుతించెను. "రామా! నీవు సాక్షాత్తు పరబ్రహ్మవు. ఆదిమధ్యాంతరహితుడవు. మొదట నీవు నీటిని సృజించి యచట నివసించినవాడవుగనుక నారాయణుడవైతివి. మఱియు నీవు జీవసమూహముయొక్క యంతరాత్మవగుటచే నారాయణుడవైతివి. నీనాభికమలమున లోకములన్నిటికిని సృష్టికర్తయగు బ్రహ్మ జన్మించెను. అందుచే నీ వన్నిలోకములకు నధిపతివి; వానిచే నమస్కరింపబడువాడవు. నీవు విష్ణుడవు. సీత లక్ష్మి. లక్ష్మణుడు శేషుడు. నీచేత నీయందే యీజగము నీమాయచే సృజింపబడుచున్నది. చిచ్ఛక్తిచే సర్వమునుజూచు నీవు ఆకాశమువలె దేనిని నంటియుండవు. నీవే భూతములయొక్క లోపలను, పైనను నుండువాడవు. నీవు పూర్ణుడవయ్యును మూఢబుద్ధిగలవారికి వేఱువేఱు ఖండములుగ గనబడుదువు. జగత్తు నీవె. దాని కాధారమైనవాడవు నీవే. దానిని పాలించువాడవు నీవే. భోక్తలైన సర్వభూతములును నీవే. భోజనము నీవే. కనబడునదియును,

'అట్లేయగుగాక!' యని సెలవిచ్చెను. [illegible] చెట్లు స్వర్గములో నివృక్షములవలె నాయెను. [illegible] ఫలించెను. పూవులు లేని చెట్లు పుష్పించెను. [illegible] లుండెను. చెట్లనుండి తేనెలు కారుచుండెను. [illegible] నుండు చెట్లు ఫలపుష్పములతో [illegible] లు గొప్పసంతోషమును బొంది [illegible].

---

వినబడునదియు, స్మరింపబడునదియు [illegible] నీవే. [illegible] చే ప్రేరేపింపబడి మాయ తన గుణములను [illegible] వానిచే లోకములను సృజించును. అట్లు మాయ లోకములను సృజించుచుండగా మూఢులా సృష్టికర్తృత్వమును [illegible] చున్నారు. జడమైన యినుమునకు సూదంటురాయి [illegible] సాన్నిధ్యముచే నట్లు చలన స్వభావము కలుగుచున్నదో యట్లే జడమైన మాయాశక్తికి నీయాక్షణమువల్ల సృజించుస్వభావము కలుగుచున్నది. విశ్వమును రక్షింపగోరునట్టియు, దేహము లేనట్టియు నీకు రెండు దేహములు. నీస్థూలశరీరము విరాడ్రూపమనియు, నీసూక్ష్మశరీరము సూత్రమనియు పిలువబడును. నీవిరాడ్రూపమువలననే నీయవతారములు వేలకొలది పుట్టి వానిపనులు నెఱవేర్చిన తరువాత తిరిగి నీవిరాట్టును జేరును. ఇతరములందు మనస్సులేక నీయవతారకథలను లోకములో గానము చేయువారలకును, వినువారలకును ముక్తి గలుగును. పూర్వము నీవు భూభారమును బోగొట్టుటకై బ్రహ్మచే ప్రార్థింపబడి వాని మనస్సుకు మెచ్చి రఘుకులమున బుట్టి మిక్కిలి కష్టమగు దేవకార్యమును ఏమియు కొఱతలేకుండ జరిపితివి. అనేకవేల సంవత్సరములు నీవు మనుష్యదేహమును బొంది యిహపరలోకముల హితమునకై పాపములను బోగొట్టు మిక్కిలి కష్టమగు పనులను జేయుచు లోకములో కీర్తి నింపెదవు." ఇట్లు భరద్వాజుడు రాముని స్తుతించెను.

తరువాత రాముడు నయోధ్యనుగురించి యాలోచించుచు హనుమంతునితో నిట్లనెను. 'నీ వయోధ్యకు బోయి మా రాజగృహమున జనులు క్షేమముగా నున్నారో, లేదో కనుగొనుము. నీవు మొదట శృంగిబేరపురమునకు బోయి నాతో సమానుడును, సఖుడును నగు గుహునితో నేను క్షేమముగా నున్నాననియు, నాకు రోగములు, విచారములు లేక సుఖముగా నుంటిననియు చెప్పుము. అతడు నా కుశలమును విని మిక్కిలి సంతోషమును బొందును. వాడు నీ కయోధ్యకు మార్గమును, భరతుని వృత్తాంతమును దెలుపును. భరతునితో గూడ నీవు నేను వాని కుశల మడిగితిననియు, నేనును, నా భార్యయు, లక్ష్మణుడును మా కార్యములను నెరవేర్చుకొని వచ్చుచున్నామనియు దెలుపుము. రావణుడు సీతనపహరించినది మొదలు యిప్పటివఱకు జరిగినవృత్తాంతమంతయు గూడ దెలుపుము. వీనినన్నిటిని వినునప్పుడు భరతుని రూప మెట్లుండునో సమ్మతించునో యతని మనోభావ మెట్టిదో యంతయు నాకు బాగుగ దెలుపుము. రాముడు శత్రువులను జయించి గొప్పకీర్తిని బొంది మహాబలులగు మిత్రులతో వచ్చుచున్నాడని నీవు భరతునితో దెలిపిన తరువాత జరిగినసంగతులను, వాని ముఖవర్చస్సునుబట్టియు, వాని చూపులు, మాటలు మొదలగు లక్షణములనుబట్టియు వాని మనోభిప్రాయమును గనిపెట్టి నాకు దెలుపవలెను. మంచి చతురంగబలము కలదియు, తాతతండ్రుల నుండి వచ్చుచున్నదియునగు రాజ్యమునందెవనికి మనస్సు కలుగకుండును? భరతుడు చిరకాలము రాజ్యము చేయుటచే వానికి రాజ్యమందు కోరిక యున్నయెడల వాడే రాజ్యమంతయు పరిపాలింపవచ్చును. వాని బుద్ధిని, వ్యవహారమును దెలిసికొని మేము చాలదూరము రాకమునుపే త్వరగా నీవు రావలెను.' ఇట్లు రాముడు సెలవీయ హనుమంతుడు మానుష్యరూపమును బొంది యయోధ్యకు బోవ సిద్ధమాయెను. తరువాత వాడు ఆకాశమున కెగిరి వాయుపథమున గం

గాయమునలమధ్య దేశమును దాటి * శృంగిబేరపురమునకు బోయి గుహునితో సంతోషముగ రాముడు తెలిపినమాటలను జెప్పెను. తరువాత నతడు మిక్కిలిసంతోషముతో పైకెగిరి పరశురామతీర్థమును, వాలుకీనదిని, గోమతీనదిని, గుగ్గిలపుటడవిని దాటి కోసలదేశములోని యనేక గ్రామములను, ప్రజలను జూచెను. అతడట్లు చాలదూరము వెళ్ళి నందిగ్రామసమీపముననున్న చెట్లనుజూచెను. అక్కడ స్త్రీలును, వారి పుత్రులును, ముసలివారును సంతోషముచే నాడుకొనుచుండిరి. అయోధ్యకు నొకక్రోసుదూరముననున్న నందిగ్రామమున భరతుడు నారచీరలను, లేడిచర్మమును ధరించి దీనుడై కృశించి జటలను ధరించి శరీరమున మురికినిండియుండ భ్రాతృవియోగముచే దుఃఖించుచు ఫలమూలములను దిని నియమముతో ధర్మముగ జరించుచు మునివలె నింద్రియనిగ్రహముగలిగి ధ్యానించుచు తపశ్శ్రమమున బ్రహ్మర్షితో సమానమైన తేజస్సుగలిగి యుండ నతనిని హనుమంతుడు చూచెను. అతడు రామపాదుకల నెదుటనుంచుకొని దేశమును బాలించుచు భయముతో నాలుగువర్ణములవారినిరక్షించుచు నమాత్యులతోను, శుచులైన పురోహితులతోను, కాషాయవస్త్రములను ధరించిన సేనానాయకులతోను వ్యవహారము జరుపుచుండెను. ధర్మమందుప్రీతిగల భరతుడు నారచీరలను, లేడిచర్మమును ధరించియుండుటచే నాతనివిడిచి పురజనులు భోగముల ననుభవించుట కిష్టపడలేదు. అట్టిభరతుని హనుమంతుడుచూచి యిట్లు పలికెను. 'నారచీరలనుగట్టి జటలను ధరించి దండకారణ్యములోనివసించుచున్న రామునిగూర్చి విచారించుచున్న మిమ్ము నా రాముడు కుశలమడుగుమనెను. నేను మీకు గొప్పప్రియమును దెలిపెదను. దానివలన మీరు మీశోకమును విడిచెదరు. ఈసమయముననే యా రాముని మీరు కలిసికొనెదరు. అతడు యుద్ధములో రావణుని

* 414, 424A పుటల పటములనుజూడుము.

జంపి సీతనుబొంది సంపూర్ణమనోరథుడై మహాబలులగుమిత్రులతోను, లక్ష్మణునితోను వచ్చుచున్నాడు.' ఇట్లు హనుమంతుడు తెలుప భరతుడు గొప్పసంతోషమునుబొంది యానందాతిశయముచే మూర్ఛజెందెను. తరువాత నాతడొకగడియలో తెలివినొంది లేచి నిట్టూర్పుదీసి వాయుపుత్రునికౌగిలించుకొని యానందబాష్పములతో సతనిని దడుపుచు నిట్లనెను. 'నీవు దేవుడవా? లేక మనుష్యుడవా? నాయందలి దయచే నిక్కడకు వచ్చితివి. నీవు నాకు ప్రియమునగువార్త్తను దెలిపినందులకు లక్షగోవులను, నూరుగ్రామములను, సర్వాభరణములను ధరించిన 16గురుకన్యలను నిచ్చుచున్నాను.' ఇట్లు భరతుడు పలికి రాముని రాకనుగోరుచు మిక్కిలిసంతోషముతోనుండెను.

తరువాత భరతు డింకను హనుమంతునితో నిట్లు పలికెను. 'నాకు ప్రభువగు రాముడు వనమునకు బోయి యనేక సంవత్సరము లాయెను. ప్రీతికరమగు నాతని నామసంకీర్తన మిప్పుడు నేను వింటిని. మనుష్యుడు జీవించియుండినయెడల నూరుసంవత్సరముల తరువాతనైనను నానందమును బొందునను సుభమగులోకోక్తి నాకిప్పుడు కనబడుచున్నది. రాముడును, కపులును, నేదేశమున నేకారణమున కలిసికొనిరి? జరిగినదానినంతను నాకు నిజముగ దెలుపుము.' ఇట్లు భరతుడడుగ హనుమంతుడు ఋషులుకూర్చుండు నాసనమున కూర్చుండి రామునచరిత్ర మంతయు సవిస్తరముగ నతనికి దెలిపి 'రేపటిదినమున పుష్యమీ నక్షత్రమున రామాదులు వత్తురని పలికెను. నిజమును బలికిన హనుమంతుని మాటలను భరతుడు విని మిక్కిలి సంతోషించి 'చాలకాలమునకు నా మనోరథము పూర్ణమాయెను'నని పలికి మిక్కిలి సంతోషమును నొందెను. భరతుడు సంతోషకరములగు మాటలను హనుమంతునివలన విని శత్రుఘ్నున కిట్లాజ్ఞాపించెను. 'సమస్త దేవతలును, పట్టణములో నాలుగువీథుల మధ్యమందు దేవగృహములలోని

దేవతలను మంచిగంధములతోను, పుష్పములతోను, శుచులగు ప్రజలు పూజింపవలయును. స్తుతిపురాణములు తెలిసిన సూతులును, వంశావళిని గీర్తించు వందిమాగధులును, వాద్యవిశేషములు తెలిసినవారును వారస్త్రీలును, వేఱు వేఱు గుంపులుగ రాముని నెదుర్కొనుటకు బయలుదేఱి వెళ్లవలెను.' ఇట్లు భరతు డాజ్ఞాపింప శత్రుఘ్నుడు నందిగ్రామమునకువచ్చు త్రోవను, నక్కడనుండి యయోధ్యకు వెళ్ళు త్రోవను మెరకపల్లములు లేకుండునట్లు సమముచేసి చెట్లు, చేమలు నఱుకుటకు ననేకవేల పనివాండ్రను నియమించెను. కొందఱిని మార్గములో దుమ్ము రేగకుండునట్లు చల్లనిసీటిని జల్లుటకు నియమించెను. తరువాత నామార్గములో పేలాలను ,పువ్వులనుజల్లుటకును, పీఁఘులలో నెత్తైన జెండాలను గట్టుటకును గొందఱిని నియమించెను. మఱునాటి యుదయములోపున నన్నియిండ్లకు పూలదండలనుగట్టుటకును, రాజమార్గమున పువ్వులను, మంచిగంధములను జల్లుటకును, తరువాత నైదు రంగులుగల మంచి ముగ్గులను బెట్టుటకును కొందఱిని నియమించెను. ఆమఱునాటి యుదయమునకు నయోధ్యనుండి యందఱును నందిగ్రామమునకు వచ్చియుండిరి. రాజస్త్రీలును, నమాత్యులును, సేనలును, వారస్త్రీలును, బ్రాహ్మణులును, రాజులును, పట్టణములోని ముఖ్యులును, సామాన్యులును రాముని నెదుర్కొనుటకు నందిగ్రామమునుండి బయలుదేఱిరి. ధృష్టుడు, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రిపాలుడు, సుమంత్రుడు నను 8 గురమాత్యులు బంగారుతో నలంకరింపబడిన మదించినయేనుగులపై నెక్కి యనేకవేల యేనుగులు వెంటరాగ బయలుదేఱిరి. బంగారుత్రాళ్లతో గట్టబడిన మంచియేనుగులనెక్కి కొందఱును, మంచి గుఱ్ఱములను గట్టిన మంచిరథములమీాద కొందఱును బయలుదేఱిరి. కాల్బల మనేకవిధములగు నాయుధములనుబట్టి ధ్వజములతోను,

జెండాలతోను నడచుచుండ గుఱ్ఱపురౌతులనేకులు గుఱ్ఱములనెక్కి-బయలుదేఱిరి. దశరథుని భార్యలగు కౌసల్య, సుమిత్ర, కైకేయి మొదలగు వారు సవారీలలో గూర్చుండి రామునిజూచుటకు వెళ్ళిరి. గుఱ్ఱపుడెక్కల ధ్వనిచేతను, రథచక్రములధ్వనిచేతను, దుందుభులధ్వనిచేతను భూమి కంపించినట్లయ్యెను. ధర్మాత్ముడును, ధర్మము తెలిసినవాడునునగు భరతుడు నారచీరలను, లేడిచర్మమును ధరించి యుపవాసములవలనకృశించి దీనుడై తలమీదరామపాదుకలను బెట్టుకొని మంచిపరిమళద్రవ్యములనుజల్లినగొడుగును బట్టుకొని బంగారుచేనలంకరింపబడిన తెల్లనివింజామరలతో పరిచారకులు వీచుచుండ వందిమాగధులు స్తోత్రములుజరుపుచుండ ద్విజశ్రేష్ఠులు, వర్తకులు, మంత్రులు మాల్యములను, మోదకములను బట్టుకొని తనవెంటవచ్చుచుండ తనయన్నయగు రాముని జూచువేడ్కతో నందిగ్రామమునుండి బయలుదేఱెను. తరువాత నతడు మార్గములో హనుమంతునిజూచి 'రాముడుకాని, కామరూపులగు వానరులుగాని కనబడుటలేదు. నీవు నిజముగ చంచలమగువానర బుద్ధిని జూపలేదుగదా?' యని యడుగ నతడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. 'భరద్వాజునివరముచేతను, ఇంద్రునివరముచేతను చెట్లిప్పుడు ఫలములను, పుష్పములను, తేనెలను నిచ్చుచున్నవి. వానినన్నిటిని వానరులు సేవించి సంతోషముతో గొప్పశబ్దముచేయునాధ్వని మనకు వినబడుచున్నది. వారిప్పుడు గోమతీనదిని దాటుచున్నారని తలచెదను. వాలుకీనదిసమీపమున నెగురుచున్నగొప్పబుగ్గిని చూడుడు. ఇప్పుడు గుగ్గిలపుటడవిలో వానరులు క్రీడించుచున్నారని తలచెదను. అదిగో దూరమున బ్రహ్మనిర్మితమగు తెల్లనిపుష్పకము కనబడుచున్నది. రావణుని, వానిబంధువులను జంపి రాముడు దానిని బొందెను. దానిలో సీతారామలక్ష్మణులును, సుగ్రీవవిభీషణులును నున్నారు.' ఇట్లు హనుమంతుడు పలుక స్త్రీలు, బాలురు, యౌవనులు, వృద్ధులు 'అదు

శత్రుఘ్నుడుకూడ రామలక్ష్మణులకు నమస్కరించి సీతపాదములకు ప్రణమిల్లెను. రాముడు శోకముచే కృశించినదియు, దీనురాలునునగు కౌసల్యయొద్దకు బోయి యామెమనస్సునకు సంతోషమును గలుగజే యుచు నామెపాదములకు నమస్కరించెను. తరువాత నతడు సుమిత్రా కైకేయిలకు నమస్కరించి దశరథునియితరభార్యలకుగూడ ప్రణమిల్లి వసిష్ఠునకు నమస్కరించెను. అయోధ్యావాసులందఱు చేతులుజోడించి 'రామా నీరాక లెస్స'యని పలికిరి. భరతుడు తాను తెచ్చినరామపాదు కలను రాముని కాళ్ళకు దొడిగిచేతులుజోడించి యిట్లు పలికెను. 'ఇదిగో! నేను కాపాడినరాజ్యమును మీకప్పజెప్పితిని. తిరుగ నయోధ్యకు వచ్చి రాజుగనున్నమిమ్ము జూచుటచే నిప్పుడు నాజన్మ సఫలమైనది; నామనోరథము నెఱవేఱినది. మీసంబంధమగు ధనాగారమును, ధాన్యపుకొట్లను, పట్టణమును, సైన్యమును జూచుకొనుడు. మీ తేజో మహిమచేతనే నేను వీనినన్నిటిని పదిరెట్లు వృద్ధినొందించితిని.' ఇట్లు భరతుడు పలుక వాని భ్రాతృవాత్సల్యమునుజూచి వానరులును, విభీష ణుడును కన్నీరు విడిచిరి. తరువాత రాముడు సంతోషముతో తన తమ్ముని తనతోడపై కూర్చుండబెట్టుకొని విమానముపై నందిగ్రామము లోని భరతునియాశ్రమమునకు వెళ్లెను. సైన్యమంతయుగూడ వాని వెంటవెళ్లెను. తరువాత రాముడు విమానమునుండి క్రిందికిదిగి యా విమానమునకు 'కుబేరునియొద్దకుబోయి యాతనిమోయుచుండు' మని సెలవీయ నది యుత్తరదిక్కునకు బోయి కుబేరునిగృహమును జేరెను. తరువాత రాముడు వసిష్ఠునిపాదములకు నమస్కరించెను. పిమ్మట వారు వేఱువేఱు నాసనములపై కూర్చుండి మాట్లాడుకొనుచుండిరి.

అట్టిసమయమున భరతుడు తనతలపై చేతులనుజోడించి రాము నితో నిట్లనెను. 'మాతల్లిమాటలను మీరు గౌరవించితిరి. మీరు నా కిచ్చినరాజ్యమును నేను మీకు తిరుగ నిచ్చివేయుచున్నాను. మంచిబల్ల

ముగలయెద్దుమోయగలిగినబరువును చిన్నదూడ మోయలేనట్లు నే నీ రాజ్యభారమును మోయలేను. రాజ్యమును బాలించుటలో కలుగునసే కలోపములను చక్కబెట్టుకొనుట గొప్పకష్టము. అశ్వగమనమును గాడిదయు, హంసగమనమును కాకియు ననుసరింపలేనట్లు మీరాజ మార్గమును నేననుసరింపలేను. ఒకానొకడు తనయింటి పెరటిలో విత్తన మువేసి వృక్షమును వృద్ధినొందింప నది పెద్దదై శాఖలుకలిగి పుష్పించి కాయలను మాత్రముకాయకపోయినయెడల నాయజమానికి సుఖము కలుగదు. అట్లే దశరథునకు జన్మించినమీరు గొప్పవారై రాజ్యము చేయక మీ సేవకులమగు మమ్ముపాలింపనియెడల మనతండ్రికి సుఖముకలుగదు. ఈవిషయమును మీరు తెలిసికొనవలెను. మధ్యాహ్నమున ప్రకాశించు సూర్యునివలె రాజ్యాభిషిక్తులగు నన మిమ్ము జగత్తంతయు జూచును. రాజపర్యాయము మంగళవాద్య ధ్వనులచేతను, మంచిపాటలచేతను, సొగసగుపరిచారకులసందడిచేతను నుదయమున మీరు లేచెదరుగాక! గ్రహములు జగత్తునందుండునంత కాలమును, భూలోకముండునంతకాలమును మీరు రాజ్యమును బాలిం చెదరుగాక!' ఇట్లు భరతుడు విన్నవింప రాముడు 'అట్లే జరుగుగాక!' యని యొప్పుకొని వానిని మంచియాసనమున కూర్చుండజేసెను.

---

## ౪౦ వ. అధ్యాయము.

## శ్రీరామపట్టాభిషేకమహోత్సవము.

నందిగ్రామమున భరతుడు వేడుటచే రాముడు పట్టాభిషేక మునకొప్పుకొనెను. శత్రుఘ్నుడు రామునకును, లక్ష్మణునకును క్షౌర మునుచేయుటకును, నభ్యంగనమునుచేయించుటకును మంగలివాండ్రను సిద్ధ

ముచేసెను. ముందుభరతుడును, లక్ష్మణుడును, సుగ్రీవుడును, విభీష ణుడును స్నానముచేసిరి. రాముడు తనజటలు జాగ్రత్తగతీయబడిన తరువాత స్నానముచేసి మంచిబట్టలను ధరించి మెడలో మంచిపూల దండలు వేసికొని మంచి తేజస్సుతో ప్రకాశించుచుండెను. శత్రుఘ్నుడు రామలక్ష్మణులకు నాభరణముల నలంకరింపజేసెను. దశరథుని భార్యలు స్వయముగ సీతకు నలంకరించిరి. రాముడువచ్చెనను సంతో షముచే వానరులభార్యలకందఱకు కౌసల్యయే కుండలములను, గొప్ప యాభరణములను నలంకరించెను. శత్రుఘ్నునియాజ్ఞచే సుమంత్రు డనుసారథి సూర్యమండలముతోసమముగప్రకాశించు దివ్యమగు రథమునకు గుఱ్ఱములనుగట్టిసిద్ధముచేయ రాముడు దానినెక్కెను. స్నానముచేసిప్రకాశమానమగుబట్టలనుగట్టినవారును, మంచికుండలము లను ధరించినవారును, నిందునితోసమానమగు కాంతిగలవారును నగు సుగ్రీవహనుమంతులుకూడ బయలుదేఱిరి. సీతయు, సుగ్రీవుని భార్యలును, మంచియాభరణములను ధరించి యయోధ్యకుబోవుటకు వారిననుసరించిరి. అయోధ్యలో దశరథుని మంత్రులగు నశోకుడును, విజయుడును, సుమంత్రుడును వసిష్ఠునితో నభిషేకసామగ్రినిగూర్చి యాలోచించి వానిని జాగ్రత్తపఱచి రామునిజూచుటకై దారిలోనికి నెదురు వెళ్ళిరి. రాముడెక్కినయారథమును భరతుడు తోలుచుండెను. శత్రుఘ్నుడతనికి గొడుగుపట్టెను. లక్ష్మణుడతనియెదుట నిలిచి తెల్లని వింజామరతో నతనికి వీచుచుండెను. మఱియొకవింజామరను విభీషణుడు పట్టి విసరుచుండెను. అంతరిక్షమున ఋషిసమూహములును, మరుద్గ ణములును, దేవతలును రాముని మంచిమాటలతో బొగడుచుండిరి. సుగ్రీవుడు పెద్దపర్వతమువలెనున్న శత్రుంజయమనునేనుగునొకదాని నెక్కెను. కామరూపులగువానరులు మనుష్యరూపములనుబొంది మంచి యాభరణములను ధరించి9వేలయేనుగులపై కూర్చుండి వెళ్లుచుండిరి.

ఇట్లు రాముని రథ మయోధ్యకు వెళ్లుచుండ శంఖములు, దుందుభులు, తూర్యములు, తాళములు మొదలగు వానిశబ్దమంతటను వ్యాపించుచుం డెను. ప్రజలు శుభమగు మాటలను బల్కుచుండిరి. మంత్రులు మొద లగువారు రామునిదీవించి యతనిచే గౌరవింపబడుచు నతనితో గూడ వెళ్లుచుండిరి. అమాత్యులతోను, బ్రాహ్మణులతోను, ప్రజలతోను కూడు కొనినరాముడు నక్షత్రములతో గూడిన చంద్రునివలె ప్రకాశించెను. అతనిముందు గోవులును, కన్యలును, నక్షతలనుబట్టిన ద్విజులును, మోద కములనుబట్టినజనులును నడచుచుండిరి. రాముడు మంత్రులతో సుగ్రీ వునకు, తనకుగలిగినసఖ్యమునుగూర్చియు, హనుమంతునిప్రభావమును గూర్చియు, వానరులుచేసినపనినిగూర్చియు, రాక్షసులబలమునుగూర్చి యు, విభీషణునితో తానుగలియుట మొదలగు సంగతులనుగూర్చియు జెప్పెను. దానినంతను నయోధ్యావాసులందఱును విని మిక్కిలియాశ్చ ర్యమును బొందిరి. తరువాత నతడు పుష్పకమునగు నయోధ్యలో ప్రవే శించెను. పట్టణవాసులు తమతమయిండ్లకుగట్టినజెండాలను బైకెత్తిరి. రాముడిక్ష్వాకుకులుడగు తనతండ్రిగృహముప్రవేశించి కౌసల్యను, సుమిత్రకును, కైకేయికిని నమస్కరించి భరతునితో 'మనయంతఃపురో ద్యానవనమగు నశోకవనమును సుగ్రీవునకు జూపింపు'మని చెప్ప నతడు కపిరాజుచేయిపట్టుకొని మంచిదీపములను, నక్కలను, నాసనములను నాతనికి జూపుచు నశోకవనమునకు దీసికొనివెళ్లెను. తరువాత భర తుడు 'రామునిపట్టాభిషేకమునకై నాలుగుసముద్రములనుండి నీటిని దెచ్చుటకు వానరులను బంపు'మని సుగ్రీవునిగోర నతడు వానరులకు రత్నములతో జెక్కబడినబంగారుబిందెలనిచ్చి 'మీరు రేపు తెల్లవాఱు నప్పటికి నాలుగుసముద్రములనుండి జలమును దీసికొనిరం'డని నియమిం చెను. అంతట పెద్దయేనుగులవంటిదేహములుగల యావానరులు గరుత్మంతునివలె పైకెగిరి వెళ్ళిరి.

ముందుగను తరువాత కన్యలును, మంత్రులును, సేనానాయకులును, వణిజులును నాతనినభిషేకించిరి. ఆకాశముననున్న దేవతలందఱును, దిక్పాలురునలుగురును సమస్తమైన యోషధులరసములతోను రాముని నభిషేకించిరి. శత్రుఘ్నుడాతనికి శుభ్రమగు శ్వేతచ్ఛత్రమును

---

లోకములను సృజించి క్రిందిలోకమున ననంతరూపుండవై పైభాగమున సూర్యచంద్ర వాయు మేఘ ఓషధిరూపుండవై యాలోకముల నుద్ధరించుచుకాపాడుచుంటివి. నీ వీలోకమున జీవులయొక్క శరీరములందు జఠరాగ్నిరూపుండవై యుండి వారు భుజించినపదార్థములన్నింటిని ప్రాణాదిపంచకసహాయముచే జీర్ణింపజేయుచు నీజగమును భరించుచుంటివి. చంద్రసూర్యాగ్నులయొక్క మధ్యభాగమందలి తేజస్సున్ను, సకలజీవులయొక్క చైతన్యమున్ను, సమస్తజీవులయొక్క శౌర్యము, ధైర్యము, ఆయుర్దాయమునను నివియన్నియు నీసత్తయే. నీవు బ్రహ్మయందు, శివునియందు, విష్ణువునందు, కాలమందు, కర్మయందు, సూర్యచంద్రులయందు వేఱువేఱుగభక్తిగలవారలకు వేఱువేఱుగానే ప్రకాశించుచుంటివి. తత్త్వము విచారింపగా నీవొక్కడవేగాని, పెంకురూపములుగలవాడవుకావు. మత్స్యాదిదశావతారములతో వేదములందును, పురాణములందును లోకములోనుప్రసిద్ధుండైనవాడవు నీవొక్కడవేయైనట్లు సదూపమగుబ్రహ్మయు, నసదూపమగు ప్రపంచమును గూడ నీవొక్కడవే. నీవుకానిదేదియు లోకములో ప్రకాశింపదు. అంతములేనిసృష్టిలోపుట్టినదంతయు, పుట్టబోవునదియుగూడ నీవే. చరాచరములందు నీవులేనిదేదియుగనబడదు. కనుక నీ వుత్కృష్టమైన హిరణ్యగర్భాదులకన్న నెక్కువయుత్కృష్టుడవు. జనులందఱు నీమాయచే మోహితులై పరమాత్మయొక్కనిజస్థితిని తెలియలేకున్నారు. కాని మీభక్తులయొక్క సేవచే శుభ్రమగుమనస్సుగలవారు నీసంబంధమగుగొప్పతత్త్వమును దెలిసికొనుచున్నారు. బాహ్యార్థమునే తెలిసి

బట్టెను. సుగ్రీవవిభీషణులు తెల్లనివింజామరలతో వీచుచుండిరి. రాము నకు నింద్రుడు వాయుదేవునిచే నూఱుపద్మములుగలబంగారుమాలను, ననేకవిధములగు రత్నములతోను, మణులతోను గూడిన యొక ముత్యాలహారమును కానుకగ నిప్పించెను. అప్పుడు దేవగంధర్వులు

కొనుటయందుసమర్థులగు బ్రహ్మాదులు చిదాత్మయగు నీతత్త్వస్వరూ పమును దెలిసికొనలేకున్నారు. నీచిద్రూపమును దెలిసికొనుట కసమర్థ మైనవాడు కనబడుచుండెడియీనీస్థూలరూపమును ధ్యానముచేయుచు ననాయాసముగ ముక్తినిబొందగలడు. నేను కాశీక్షేత్రమున మృతి నొందువారలకు ముక్తినిచ్చు నీరామనామము నుపదేశించుచుసర్వకాల ములందు పార్వతీదేవితోగూడి నీరామనామమునే ధ్యానముచేయుచు నివసించుచుంటిని." ఇట్లు పార్వతీపరమేశ్వరులు రాముని స్తుతించిరి.

పిమ్మట దేవేంద్రుడు 'ఓరామా! పరమపాపాత్ముడగు నీరావ ణుడు బ్రహ్మదేవుడిచ్చిన వరములవల్ల గర్వించి హరించిననాస్వర్గ రాజ్యము తిరుగ నీకరుణావిశేషమువల్ల నాకు సంప్రాప్తమైనది; గాన నీకనేకనమస్కారములాచరించుచున్నా'ననిపలికెను. తరువాత దేవతలు 'ఓరామా! బ్రాహ్మణులు మాకిచ్చినయజ్ఞభాగములను హరించుచుం డెడి యీరావణుని నీవు చంపి మాభాగములను నిరాటంకముగ మే మనుభవించున ట్లనుగ్రహించితివిగాన నీ కనేకనమస్కారము'లని పలి కిరి. అనంతరము పితృదేవతలు 'గయామొదలగుక్షేత్రములందు మాదా యాదులు మా కిచ్చు పిండములను బలాత్కారముగ హరించెడి యీ దుష్టదైత్యుడు నీచే సంహరింపబడుటచే మేము యథేచ్ఛగా మాభాగ ముల ననుభవింపగలము; కాన నీకు నమస్కార' మని పలికిరి. పిమ్మట యక్షులు 'దేవా! జీతభత్యములీయకుండ బలాత్కారముగ నుమ్మెత్తిచ్చు కొనిపోయి పల్లకీలను, సవారీలను మోయించుకొన్న యీదురాత్ముడు నీచే సంహరింపబడుటచే మేము కష్టములనుండి ముక్తులమైతి' మని

పాడిరి. అప్సరసలాడిరి. రాముని పట్టాభిషేకకాలమునందు భూమి సస్యములతోను, చెట్లు ఫలములతోను నిండియుండెను. పూవులు మంచి పరిమళములు గలిగియుండెను. రాముడు బ్రాహ్మణులకు లక్షగుఱ్ఱములను, లక్షధేనువులను, నూతనవస్త్రభూషణములను నిచ్చెను. బ్రాహ్మణులకు 30కోట్లబంగారునాణెములను, నానావిధములగుబట్టలను, నలంకారములను

---

ప్రాపించిరి. తరువాత గంధర్వులు 'రామచంద్రా! గానమునకధిపతులమగు మేము, నీకథలనుచక్కగ గానము చేయుచు నానందసముద్రములో మునుగుచుంటిమి. మేము రావణునకు భయపడినవారము వానికథల గానము చేయుచు వానినే సేవించుచుండినవారము. అట్టి మమ్ము నేడు నీవు వానిని సంహరించుటచే దుఃఖమునుండి రక్షించితి' వని పలికిరి. పిమ్మట నాగులును, సిద్ధులును, మహర్షులును, వసువులును, మనువులును, గోపులును, గుహ్యకులును, గరుడులును, ప్రజాపతులును, నప్సరసలును రాముని జేరి రావణునివలన తమకు గలిగిన కష్టములనుగూర్చి వేరువేరుగ నతనికి దెలిపి సంతోషముతో నతనిపట్టాభిషేక మహోత్సవమును జూచి యతనివలన గౌరవములను బొందిరి. తరువాత బుధాగ్రిములు, రాముని గీర్తించుచు వానిపై పూవులజల్లుచు దేవదుందుభులను మ్రోగించుచు తమస్థానములకేగిరి.

తరువాత రామునియెదుట గుహుడు చేతులు జోడించుకొని నిలిచియుండ నతడు వానితో 'స్నేహితుడా! నీవు శృంగిబేరపురమునకు బోయి నన్నే యెల్లప్పుడు తలంచుచు నీకు గలిగినభోగముల నన్నింటిని ననుభవించుచు చివరకు నాసారూప్యమును బొందెద'వని చెప్పెను. తరువాత రాముడు వానికి మంచియాభరణములను, వానిరాజ్యమును విజ్ఞానమును, నిచ్చి వానిని కౌగిలించుకొని వానిదేశమునకు బంపెను.

నిచ్చెను. తరువాత నతఁడు సుగ్రీవునకు సూర్యకాంతితో సమముగ ప్రకాశించునదియు, మణులతో గూడినదియునగు నొకబంగారుమాలనిచ్చెను. వైడూర్యములు, రత్నములు, వజ్రములు, మణులు గలభుజకీర్తులను నంగదునకిచ్చెను. సీత శుభ్రమగుమంచిబట్టలను, నలంకారములను హనుమంతునకిచ్చెను. రాముఁడు చంద్రకిరణముల వలె ప్రకాశించు మంచిమణులతో నలంకరింపబడిన ముత్యాలహారమును సీతకంఠమున వేసెను. ఆమె దానిని తన మెడనుండి పైకితీసి వానరులందఱివైపునకును, తనభర్తవైపునకును జూచుచుండెను. దానిని రాముఁడు కనిపెట్టి 'ఎవరిపనులవలన నీకు గొప్పసంతోషము కలిగెనో యెవనికి గొప్పపౌరుషము, పరాక్రమము, బుద్ధి యెల్లప్పుడు నుండునో వానికీయవచ్చు'ననియనెను. అంతట నామె దానిని హనుమం

---

సీత హనుమంతునికి హారము వేసినతరువాత రాముఁడాతనితో 'నీభక్తికి మిక్కిలి సంతోషించితినిగాన వరమడుగు'మని పలికెను. దానికాంజనేయు డతనికి నమస్కరించి 'నీనామముస్మరించు చున్నను నాచిత్తము సంతుష్టినొందక నీనామస్మరణయందే యాసక్తమై యున్నదిగాన భూలోకములో నెంతవరకు నీనామము వ్యాపించియుండునో యంతవరకు నీనామమే స్మరించుచు నాశరీరముండునటుల వరమీయు' మని యడుగగా రాముఁడు దానికంగీకరించి 'ఆంజనేయా! యీతీరుగ కల్పాంతమువరకు నుండి కోరినసుఖములను బొంది పిమ్మట నాసాయుజ్యముబొందెద'వని సెలవిచ్చెను. తరువాత సీత 'ఆంజనేయా! నీవెక్కడ నున్నను నాయాజ్ఞచే నీకు భోగములు గలుగు' నని సెలవిచ్చెను. అప్పుడు హనుమంతుఁడు వారికి నమస్కరించి కష్టముతో హిమవంతమునకు తపస్సుచేసికొనుటకు వెళ్లెను.

తున కీయ నతడు తెల్లనిమేఘములచే నావరింపబడినపర్వతమువలె ప్రకాశించెను. తరువాత రాముడు ద్వివిద, మైంద, నీలులకు మంచి యాభరణములు మొదలగువాని నిచ్చెను. మిగిలినవానరులందఱకు మంచిబట్టలును, నలంకారములును తగినటుల నీయబడెను.



ఓమ్

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# విశోధితరామాయణము.

## 12 వ ప్రకరణము.

### రామపరిపాలన

### ౧ వ. అధ్యాయము.

### అగస్త్యుడు పూర్వకథలను జెలుపుట

రాముసకు పట్టాభిషేకమయ్యెను. అందఱును సభలోనుండిరి. అంతలో తూర్పుదిక్కునసుండెడు కౌశికుడు, యవక్రీతుడు, రైభ్యుడు, చ్యవనుడు, కణ్వుడు, మేధాతిథి, ఘంత్రుసు మొదలగుఋషులును, దక్షిణదిక్కునసుండెడు నగస్త్యుడు, స్వస్తి, ఆత్రేయుడు, నముచి,ప్రముచి మొదలగు ఋషులును, పశ్చిమదిక్కునసుండెడు పృషద్గుడు, కవషుడు, ధౌమ్యుడు, రాధేయుడు మొదలగు ఋషులును, వారి శిష్యులును, నుత్తరదిక్కునసుండెడు వసిష్ఠుడు, కశ్యపుడు, అత్రి, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, భరద్వాజుడు సను సప్తమహర్షులును వచ్చి రాముని సభాద్వారమున నిలిచిరి. అంతట నగస్త్యుడు ద్వారపాలకునితో తమరాక రామునకు తెలియజేయవలెనని చెప్ప వాడుశీఘ్రముగ నాతని దగ్గఱకు బోయెను. వాడు నీతియు, నింగితజ్ఞానము దెలిసిన వాడును, మంచి ప్రవర్తనగలవాడును, ధైర్యస్థైర్యములు గలవాడును

నగుటచే సమయము కనిపెట్టి రామునకు వారు వచ్చినసంగతి దెలిపెను. అంత నతఁడు 'వారిని లోనికి దీసికొనిర'మ్మని చెప్ప వాఁడట్లు వారితోఁజెప్పి వారిని లోన ప్రవేశపెట్టెను. రాముఁడు వారిని జూచి యాసనమునుండి లేచి వారి నెదుర్కొని చేతులు జోడించి వారికి నర్ఘ్యపాద్యాదులనిచ్చి మంచి దర్భాసనములు, లేడిచర్మములు మొదలగు వానిని పఱచిన బంగారునాసనములపై వారిని కూర్చుండజేసెను. తరువాత నతఁడు వారిని, వారిశిష్యులను కుశలమడిగెను. వారు 'మా మందఱము కుశలముగ నున్నా'మని చెప్పి 'ప్రధానయోగమున నీవు లోకకంటకుఁడగు రావణుని, వానిబంధువులను, మంత్రులు మొదలగు వారిని జంపి నీ భార్యతోను, తమ్ములతోను, తల్లులతోను కుశలముగ నుంటి'వని పలికిరి. తరువాత నాఋషులు రాక్షసులవధనుగూర్చి రామలక్ష్మణులను బొగడుచు సందడిలోను నింద్రజిత్తు చంపశక్యము కానివాఁడనియు, గొప్ప మాయలుకలవాఁడనియు, వానివధగూర్చి తమకు నాశ్చర్యము కలిగెననియు దెలుప రాముఁడు మిక్కిలి యాశ్చర్యమునొంది 'రావణకుంభకర్ణులు మొదలగువారిని విడిచి మీరు వాని నేల ప్రశంసించెదరు? వాని ప్రభావము, బలపరాక్రమము లెట్టివి? వాఁడు రావణునికంటె నేల యెక్కువవాఁడు? వానిచరిత్రమును దెలియజేయుట కాక్షేపణలేనియెడల దానిని నాకు దెలుపుఁడు. వాఁడింద్రుని జయించి వరముల నెట్లు పొందె'నని వారి నడిగెను. ఈమాటల నగస్త్యుఁడు విని 'ఇంద్రజిత్తుయొక్కయు, రావణునియొక్కయు చరిత్రములను దెలిపెద'నని పలికి * పూర్వరాక్షసులు, రావణుఁడు, వాని తమ్ములు, వానికుటుంబము, ఇంద్రజిత్తు, * వాలిసుగ్రీవులు, హనుమంతుఁడు మొదలగు వారిచరిత్రములను దెలిపెను. ♦ ఆచరిత్రములను

---

*4, 5, ప్రకరణములను జూడుము.

♦ అ.రా:—అగస్త్యుఁడు రామునకు పాతకథలను దెలిపి తరువాత నాతని నిట్లు స్తుతించెను. "నీవు కేవలము నారాయణుఁడవు.

విని రామాదు లాశ్చర్యమును బొందిరి. తరువాత నగస్త్యుడు మొదలగు ఋషులు 'మేము పోయెద'మని రామునితో దెలుప నతడు వినయముతో వారికి చేతులుజోడించి యిట్లు పలికెను. 'ఈదినమున మీదర్శనముచే నా దేవతలందఱును, పితృదేవతలును బంధువులును నెల్లప్పుడు సంతోషముతో నుందురు. నాకిప్పుడు జ్ఞాపకమువచ్చిన సంగతిని మీతో తెలియబలుకుచున్నాను. దానిని మీరు కరుణతో జేయవలెను. పట్టణవాసులను, దేశవాసులను రాజకార్యములలో క్రమముగ నిలిపిన తరువాత సత్పురుషులగు మీ ప్రభావముచే నేను యజ్ఞములను జేసెదను. మీరందఱు వానికి దయచేసి నాయందనుగ్రహము జూపవలెను. మీసహాయమువలన నేనును, నాపూర్వులును తరించెదము.' ఇట్లు రాముడు మనవిచేయ ఋషు లందుల కంగీకరించి రామునిచే నమస్కరింపబడి తమ తమ స్థానముల కేగిరి. ఇట్లు పట్టాభిషేకదినము గడచెను.

---

జగత్తును మొదట సృజించినవాడవు. చరాచరజంతువులతో గూడిన యీజగత్తంతయు నీస్వరూపమే. నీనాభికమలమునుండి యందఱిని సృజించినబ్రహ్మపుట్టెను. నీముఖమునుండి యగ్నియు, వాక్కును బుట్టెను. నీబాహువులనుండి లోకపాలురును, నేత్రములనుండి సూర్యచంద్రులును, చెవులనుండి దిక్కులు, మూలలును,ముక్కునుండి ప్రాణములును, దేవశ్రేష్ఠులగునశ్వినులును, పిక్కలు, మోకాళ్లు, తొడలు, పిరుదులనుండి భువర్లోకాదులును పుట్టెను. నీకడుపునుండి చతుస్సముద్రములును, నీస్తనభాగములనుండి యింద్రవరుణులును, నీరేతస్సునుండి వాలఖిల్యఋషులును, నీశిశ్నమునుండి యముడును, గుదమునుండి మృత్యువును, కోపమునుండి రుద్రుడును, నెముకలనుండి పర్వతములును, వెండ్రుకలనుండి మేఘసమూహములును, రోమములనుండి యోషధులును,గోళ్ళనుండి ఖురములు మొదలగునవియు జన్మించెను. నీవు విశ్వ

తరువాత రాముడు సాయంకాలమగుటచే రాజులను, వానరు లను విడచి సంధ్య నుపాసించి యంతఃపురముచేరెను. తెల్లవారుజామున వందిమాగధులు పాడుచు రాముని నిట్లు కీర్తించిరి. 'కౌసల్యకు సుఖక మగు ప్రీతి గలిగించువాడా! బుద్ధిమంతుడా! లెమ్ము. నీవు నిద్రించి యుండ లోకమంతయు శయనించును. నీవు పరాక్రమమున విష్ణువు తోను, రూపమున నశ్వినీదేవతలతోను, బుద్ధిలో బృహస్పతితోను, నోర్పున భూమితోను, తేజమున సూర్యునితోను, వేగమున వాయువు తోను, గంభీరమున సముద్రముతోను, స్థైర్యమున శివునితోను, నాహ్లా దకరమున చంద్రునితోను సమానులు. నీకు బ్రహ్మతో సమానులు. మీవంటి రాజులు పూర్వమందెవరును లేరు. నీవు జయింపశక్యముకాని వాడవు, ధర్మము దప్పకుండ నడచువాడవు, ప్రజాహితమును జరుపు వాడవు నగుటచే కీర్తియు, లక్ష్మియు, సిరియు, ధర్మమును, నీయందు నిలిచియున్నవి.' ఇట్లింకను మఱికొన్ని సంగతులతో రాముని నంది

---

రూపుడవును, పురుషుడవును, మాయయనెడి శక్తిచే సృజించినవాడ వునై గుణవ్యత్యాసమువల్ల నానారూపములు గలవాడవై ప్రకా శించుచుందువు. నిన్నాశ్రయించియే దేవతలు యజ్ఞమున నమృతమును ద్రాగుదురు. చరాచరములతో గూడిన యీ లోకములన్నియు నీవే సృష్టిం చితివి. అవియన్నియు నిన్నే యాశ్రయించి జీవించును. నేయి పాలలో నంతటను వ్యాపించియున్నట్లు నీవన్ని వస్తువులందును, సర్వసమాన కాలమందును వ్యాపించియుందువు. సూర్యుడు మొదలగు గ్రహములు నీ తేజస్సువలననే ప్రకాశించును; కాని వారి తేజమువలన నీవేమియు ప్రకాశింపవు. జ్ఞానమను నేత్రముగలవారు సర్వవ్యాపకుడవును, శాశ్వ తుడవును, నొక్కడవునునగు నిన్ను జూచుదురు. గ్రుడ్డివాడు సూర్యుని జూడలేనటుల నజ్ఞానుడు నిన్ను జూడలేకపోవును. నీవు జడరూపుడవు, దృశ్యుడవు కావని నిరసించుచుండే యుక్తినిమిత్తముచే నహర్నిశములందు

మాగధులు కీర్తించిరి. సూతులుకూడ మంచికీర్తనలనుపాడ రాముడు మేల్కొనెను. అతడు పక్కనుండి లేవ వినయముతో వేలకొలదిపురుషులుజలఘటములనుబట్టి నిలిచిరి. రాముడాజలముతో కాలోచితములగు కర్మలను దీర్చుకొని స్నానముచేసి శుచియై యగ్నిలో హోమము చేసి నగరులోనుండి దేవగృహమునకు బోయి క్రమముగ దేవతలను, పితరులను, బ్రాహ్మణులను బూజించి రాజగృహము వెలువడి సభకు వచ్చెను. అక్కడ మంత్రులును, పురోహితులగువసిష్ఠాదులును, ననేకదేశములనుండివచ్చినక్షత్రియులును నిలిచియుండిరి. భరతలక్ష్మణశత్రుఘ్నులును, సేవకులును, సుగ్రీవుడు మొదలగు వానరులును, విభీషణుడును, వానిమంత్రులును, పురములోనివణిజులు మొదలగువారును రామునకు నమస్కరించుచు నిలిచిరి. అందఱు కూర్చుండినతరువాత ధర్మముతోగూడిన కథలను పురాణములు తెలిసినమహర్షులు తెలుపుచుండిరి.

---

## ౩౯వ. అధ్యాయము.

## రాముడు సుగ్రీవ విభీషణులను, రాజులు మొదలగువారిని వీడ్కొలుపుట.

పట్టాభిషేకదినము గడచిన కొన్నిదినములవఱకు ఋషులు తప్ప మిగిలిన వారందఱునుండిరి. అంతట నొకనాడు సభలో రాముడు జనకునిజూచి నమస్కరించి యిట్లు విన్నవించెను. 'మీరు మాకు

---

యోగీశ్వరులు తమదేహములందే నిన్ను జూచుచున్నారు. స్వల్పమైనను నీపాదభక్తిగలయోగులు ఉపనిషద్విచారణచేసి నిన్ను చిన్మాత్రునిగ దెలిసికొనుచున్నారు. కానిధర్మవంతునిగా(సగుణునిగా) దెలిసికొనుటలేదు. సర్వజ్ఞుడవగునీయెదుట (ఆంజనేయునియెదుటకుప్పిగంతులవలె) కించిజ్ఞుడనగు నేను పలికినపల్గాకుమాటలన్ను క్షమింపుము." ఇట్లగస్త్యుడు రాముని స్తుతించెను.

ముఖ్యమగుగతి. మీవలన నేను పాలింపబడితిని. గొప్పదగు మీ తేజోమహిమచే నావలన రావణుడు చంపబడెను. ఇక్ష్వాకువంశము వారికిని, మిథిలేశ్వరులకును గల ప్రీతియు, సంబంధములును గొప్పవి. మీరు రత్నములను కానుకగ గైకొని మీ పట్టణమునకు వెళ్ళుడు. మీ వెనుక సహాయముగ భరతుడు వచ్చును.' ఇట్లు రాముడు పలుక జనకుడు దానికొప్పుకొని 'నీ నీతికిని, నిన్ను జూచినందులకును సంతోషించితిని. నీవు నాకిచ్చిన రత్నములను నేను నా కుమార్తెయగు సీత కిచ్చెద'నని పలికి యట్లుచేసి సంతోషముతో మిథిలానగరమున కేగెను. తరువాత రాముడు కేకయ రాజకుమారుడగు యుధాజిత్తునకు చేతులుజోడించి 'ఈ రాజ్యమును, నేనును భరత లక్ష్మణులును మీ యాజ్ఞను జరుపుటకు సిద్ధముగ నున్నాము. రాజా! మీరు మాకు గతి. వృద్ధుడగు మీ తండ్రి మీ కొరకు విచారించుచుండును. కనుక మీరు వెళ్లిన బాగుగనుండునని తలచెదను. లక్ష్మణుడు ధనమును, ననేకవిధములగు రత్నములను బట్టుకొని మీ వెనుక వచ్చు'నని పలికెను. అతడు దానికొప్పుకొని 'నీకు ధనమును, రత్నములును నక్షయమగు గాక!' యని యాతని దీవించెను. యుధాజిత్తునకు రాముడు నమస్కరించి ప్రదక్షిణముచేసిన తరువాత నతడు లక్ష్మణుని సహాయముతో బయలువెడలెను. తరువాత రాముడు తనకు స్నేహితుడును, కాశీ రాజునునగు ప్రతర్దనునితో నిట్లు పలికెను. 'మీరు నాయెడ గొప్ప ప్రీతిని, స్నేహభావమును గనబరచితిరి. భరతునకు మీరు పరిపాలనలో సహాయము చేసితిరి. మీరు మంచి బహిర్ద్వారములు కలదియు, ప్రకాశమానమైనదియు, బాగుగ కాపాడబడుచున్నదియు, మీకు రాజధానియునగు వారణాసికి వెళ్లుడు.' ఇట్లు రాముడు సెలవిచ్చి తన యుత్తమాసనమునుండి లేచి యాతనిని కౌగిలించుకొని యాతనిని బంపివేసెను. పిమ్మట రాముడు సభలోనున్న 300 మంది రాజులనుజూచి

చిఱునవ్వు నవ్వుచు మధురముగ నిట్లు పలికెను. 'మీ తేజముచే రక్షింపబడిన ప్రీతి నిశ్చలమైనది. ఎల్లపుడు సత్యధర్మములందు బుద్ధిగల మీ ప్రభావముచేతను, మహాత్ముల తేజోసహాయముచేతను దుష్బద్ధియు, రాక్షసాధముడును నగు రావణుడు చంపబడెను. వాడు మరణించుటలో నేను కారణముమాత్రమైతిని. వాడు పుత్రమంత్రి బంధువులతో యమలోకమున కరిగెను. రావణుడు సీతను నడవినుండి యెత్తుకొనిపోయెనని భరతుడు విని యుద్ధమునకు సిద్ధమై యున్న గొప్ప రాజులగు మిమ్ములనందఱను రప్పించెను. మీరు వచ్చి చాలకాలమయ్యెను. కాన మిమ్ము వెళ్ళగోరెదను.' ఇట్లు రాముడు పలుక వారు హర్షముతో నిట్లనిరి. 'రామా! నీవు దైవయోగమున శత్రువునుజంపి జయమునుబొంది సీతను దీసికొనివచ్చి పట్టాభిషేకమును బొంది నీరాజ్యమును బాలించుచున్నావు. శత్రువును జంపి జయమును బొందిన మిమ్ము జూచుటచే మా కోరిక నెఱవేఱినది. మాకు గొప్పసంతోషముకలిగెను. మమ్ములనుగూర్చి నీవుపలికెడి ప్రశంసావాక్యములు నీకే తగియున్నవి. ప్రశంసార్హుడవగు నీ విట్లు శ్లాఘించుటకు మేము తగినవారముకాము. నీవెల్లప్పుడు మామనస్సులో నుండెదవు. మేము వెళ్ళుటకు నీసెలవును గోరుచున్నాము. నీయందు ప్రీతి కలిగి వర్తించెదము. నీకుకూడ మాయందెల్లప్పుడును ప్రీతియుండును గాక!' ఇట్లు రాజులు పలికి సంతోషముతో రామునకు చేతులు జోడించివెళ్ళుటకు సిద్ధమైరి. ఆతడు వారికి తగినమర్యాదను జరుప వారు తమతమదేశములకు బయలుదేఱిరి. గొప్పబలపరాక్రమములును, వాహనములునుగలయామహారాజులు వెళ్ళిపోవుచు దారిలో నిట్లనుకొనిరి. 'రామునియెదుట యుద్ధమునకునిలిచిన రావణుని మనము చూడలేదు. యుద్ధానంతరమున భరతుడు మనలను నిరర్థకముగ రప్పించెను. మనచే రాక్షసులు శీఘ్రముగ సంశయములేకుండ చంపబడియుం

ము. రామలక్ష్మణులపరాక్రమముచే మనము రక్షింపబడుచు సము
ద్రమును దాటి విచారములేకుండ యుద్ధముచేసియుంటిమి.' ఇట్లు
మఱికొన్ని సంగతులను జెప్పుకొనుచు నారాజులు సమస్తైశ్వర్యముల
తోను, నిండియున్న తమతమ దేశములకరిగిరి. తరువాత వారు రాము
నికి కానుకగ గుఱ్ఱములను, రత్నములను, మదించిన యేనుగులను, చం
దనములను, నాభరణములను, మణులను, ముత్యములను, పగడములను,
చీరలను, ననేకవిధగంధములను, మంచిరూపయౌవనములుగలదాసీ
లను బంపిరి. భరతలక్ష్మణశత్రుఘ్నులు వానినన్నిటిని దీసికొని
యయోధ్యకు బోయి రామునికి సమర్పించిరి.

రాముడు తమతమ్ములు తెచ్చిన మణులు మొదలగువానిని పుచ్చు
కొని తనకు సహాయముగనున్న సుగ్రీవరాజునకు గొన్నిరత్నముల
నిచ్చెను. కొన్ని విభీషణునకును, వానిమంత్రులకును, వానరులకును
నిచ్చెను. కపులును, రాక్షసులును రాముడిచ్చినరత్నములను తమతల
లపైని, భుజములపైని నలంకరించుకొనిరి. రాముడు హనుమంతాంగ
దులను తనతొడమీదనిడుకొని సుగ్రీవునితో నిట్లనెను. 'నీయంగదుడు
సుపుత్రుడు; వాయుపుత్రుడు మంచిమంత్రి. వీరిద్దఱు మంచియాలో
చనచెప్పుటలో తగినవారును, నాహితమును గోరువారును నైయు
న్నారు. నీసంబంధమువలన వీరు నేనుచేయుమర్యాదకు పాత్రులు.'
ఇట్లు రాముడు పలికి తనశరీరముననున్న మంచియాభరణములను
పైకితీసి హనుమంతాంగదులయవయవములకు దొడగెను. తరువాత
నతడు నీలుని, నళుని, కేసరిని, కుముదుని, గంధమాదనుని,సుషేణుని
పనసుని, మైందుని, ద్వివిదుని, జాంబవంతుని, గవాక్షుని, వినతుని,
ధూమ్రుని, వలీముఖుని, ప్రజంఘుని, సన్నాదుని, దరీముఖుని, దధిము
ఖుని, నింద్రజానుని బిలిచి మిక్కిలిప్రేమాదరముగ వారినిజూచుచు మధు
రమ్ములగుమాటల నిట్లనెను. 'మీరు నాకు నన్నదమ్ములవంటివారును,

స్నేహితులును నైయున్నారు. మీసహాయమువలన నేను విచారము లనుండి యుద్ధరింపబడితిని. మీవంటి స్నేహితులుండుటచే సుగ్రీవుడు ధన్యుడు.' ఇట్లు రాముడు పలికి వారికి తగినటుల నాభరణములను, మంచివస్త్రములను నిచ్చి వారిని కౌగిలించుకొనెను. తరువాత వానరులు రాముడిప్పించిన మంచిసువాసనగల తేనెలను, మంచిమాంసములను, మూలములను, ఫలములను దినుచు నొకనెల యక్కడ నివసించి నను వారి కది యొకనిమిషమువలె గనబడెను. రాముడు కామరూపులగువారితోగూడ సుఖముగ క్రీడించెను. ఈరీతిగ వారు క్రీడించుచుండ మఱియొకమాసముకూడ గడచెను. తరువాత రాముడు సుగ్రీవునితో నిట్లనెను. 'ప్రియసఖుడా! నీవు కిష్కింధకుబోయి శత్రురహితముగు రాజ్యమును బాలింపుము. అంగదుని, హనుమంతుని,నితరవానర శ్రేష్ఠులను మిక్కిలిదయతో జూచుచుండుము. ఈమహాత్ములందఱు నానిమిత్తము తమప్రాణములవిడువసిద్ధమైయుండిరి. వారి కేమియు నప్రియమును జేయకుము.' ఇట్లు రాముడు పలికి సుగ్రీవుని పలుమార్లు కౌగిలించుకొని విభీషణునితో మధురమగువాక్కుల నిట్లు పలికెను. 'నీవు ధర్మము తెలిసినవాడవు. రాక్షసులునివసించునదియు, నీయన్నదమ్ములపట్నమునగు లంకను ధర్మముగ బాలింపుము. అధర్మమందు బుద్ధిని నెంతమాత్రము నిలుపకుము. బుద్ధిమంతులగు రాజులు భూమిని శాశ్వతముగ బాలింతురు. నీవెల్లప్పుడు నన్ను, సుగ్రీవుని మిక్కిలి ప్రీతితో తలచుచుండుము. నీవు విచారములేకుండ వెళ్లుము.' ఇట్లు రాముడు పలుక నక్కడనుండుబుుష్యులు, వానరులు, రాక్షసులు 'బాగుబా'గని పలుమార్లు రాముని గీర్తించి 'మీబుద్ధిపరాక్రమము లద్భుతములు. మీమాటలు బ్రహ్మాపలుకులవలె మధురముగ నుండు'నని విన్నవించిరి. తరువాత హనుమంతుడు రామునకు నమస్కరించి యిట్లు పలికెను. 'రాజా! నాస్నేహము, భక్తి, మనస్సు మీయందు

ములకు బోయినది. తరువాత రాముడు తన తమ్ములతో సుఖముగ నుండెను. అంతట నొకదినమున మధ్యాహ్నసమయమున తమ్ములతో గూడియున్న రామునకు నంతరిక్షమునుండి శబ్దమొకటి యీతీరుగ వినబడెను. "రామా! మీరు నన్ను మంచిదృష్టితో జూడుడు. నేను కుబేరుని పుష్పకమును. అతనియాజ్ఞచే నే నిక్కడకు వచ్చితిని. మీ యాజ్ఞప్రకారము మొదట నే నతనియొద్దకు బోయితిని. అంతట నతడు నన్ను తన ప్రక్కనుండవలదనియు, రాముడు యుద్ధములో రావణుని జంపుటచే నాతనివలన నీవు జయింపబడిన దానవైతివనియు, నాడు తనపుత్రబంధుపరివారముతో నంతమునొందుట నాకుగూడ మిక్కిలి ప్రీతియే యనియు,నీవు లంకలో రామునిచే జయింపబడుటచే నీ వాతనిని మోయుచుండవలెనని నేను నిన్నాజ్ఞాపించుచున్నాననియు, లోకము లనుభరించు నాతని నీవు మోసినయెడల నాకొప్పకోరిక యీడేరును ననియు, నీవేమియు విచారములేకుండ నతనియొద్దకు బోవలెననియు సెలవీయ నేను మీయొద్దకు వచ్చితిని. కాన మీరు రనుమానము లేకుండ నన్ను పరిగ్రహింపుడు. కుబేరుని యాజ్ఞవలన నన్నెవరును బట్టుకొనలేరు. మీ యాజ్ఞప్రకారము ప్రవర్తించుచు నాప్రభావముచే నేను సంచరించెదను." ఇట్లు పుష్పకము పలుక రాముడు తనయొద్దకు తిరిగి వచ్చిన యాపుష్పకమును జూచి 'నీవు కుబేరునియాజ్ఞచే నిచ్చుటకు వచ్చినయెడల నీయాగమనము మంచిది. దానివలన మనకేమియు దోషములేదని పలికి దానిని పేలాలతోను, పుష్పములతోను, మంచివాసనగల ధూపములతోను పూజించి 'నీవిప్పుడు వెళ్లుము. నేను కోరినప్పుడు వచ్చెదవుగాక! నీవు స్థిరులవై విచారములేకుండ చరించుచు నన్నిదిక్కులకు నడ్డులేకుండ బోవచ్చు' నని దానికి సెల విచ్చెను. రామునిచే పుష్పకమిట్లు మర్యాదనుబొంది తానువచ్చిన త్రోవను బోయెను.

పుష్పకము వెళ్ళిన తరువాత భరతుడు రాముని జూచి నమస్క-రించి "దేవస్వరూపుడగు నీవు రాజసమానముగ రాజ్యమును పాలించు సరికి నమానుషములగు శక్తులు కనబడుచున్నవి. జీవులన్నియు రోగములు లేకయున్నవి. వారికి మృత్యుభయము వచ్చినను మరణము కలుగ కున్నది. స్త్రీలు రోగములు లేకుండ ప్రసవించుచున్నారు. మనుష్యులు మంచి శరీరములు గలిగియున్నారు. పట్టణవాసులకు హర్షము హెచ్చగు చున్నది. ఇంద్రుడు సరియగు కాలమున వర్షించుచు మంచినీటి నిచ్చు చున్నాడు. వాయువులు సుఖముగ వీచుచున్నవి. ఇట్టిరాజు శాశ్వత ముగ మాకుండవలెనని జనులనుకొనుచున్నా"రని పలికెను. రాము డామాటలను విని సంతోషము నొందెను.

తరువాత రాము డయోధ్యలోనున్న యశోకవనమున బంగారుచే రచించి మంచిచర్మములు గలదియు, పువ్వులతో నలంకరింపబడి నదియు నగు నాసనమున సీతతో గూర్చుండెను. అతడు సీతను తన బాహువులతో కౌగిలించుకొని యమృతముచే పవిత్రమగు తియ్యని మైరే యమును త్రాగించెను. రాముని సేవకులు రాముడు భుజించుటకు చిత్రము లగు మాంసములను, అనేకవిధములగు ఫలములను శీఘ్రముగ నచటికి దెచ్చిరి. నృత్యము, పాటలు బాగుగ నేర్చిన రూపవతులగు బాలికలు మద్యపానముచేసి రామునియెదుట నృత్యముచేసిరి. ధర్మబుద్ధిగల రాము డెల్లప్పుడు మంచిభూషణములను ధరించి వారికి సంతోషమును గలుగ జేయుచుండెను. అతడు సీతతో గూర్చుండినపుడు అరుంధతితో నున్న వసి ష్ఠునివలె కనబడుచుండెను. ఇట్లు రాము డొక దేవునివలె సంతోషము గలవాడై సీతకు సంతోషమును గలుగజేయుచు ప్రతిదినమును నామెతో విహరించుచుండెను. ఇట్లు రాముడు సీతతో విహరించుచు రాజ్యముచేయుచుండ పదివేల సంవత్సరములు గడచెను. రాముడు మధ్యాహ్నమువఱకు ధర్మకార్యములను జరిపి మధ్యాహ్నమునుండి

యంతఃపురమున కాలమును గడపుచుండెను. సీతకూడ మధ్యాహ్నము వఱకు దేవపూజలను జరిపి యత్తలకు సేవజేయుచుండెను. తరువాత నామె మంచి యాభరణములను, బట్టలను ధరించి యాతనియొద్దకు బోవుచుండెను. అప్పుడాతడు గొప్పసంతోషమును బొంది 'బాగు బా'గని పలుకుచుండెను.

---

## ౪౨. అధ్యాయము.

### రాముడు సీతాపవాదను విని యామెను నడవికి బంపుట.

రాముడట్లు సీతతో చాలకాలము సుఖముగ విహరించుచు కాపురముచేసినతరువాత నొకనా డత డామెనుజూచి 'నీవు గర్భమును ధరించితివి. కాన నీవేమికోరెదవు? ఏకోరికను నేను నీకు జరుపవలె' నని యడుగ నామె యాతని జూచి చిఱునవ్వునవ్వి యిట్లు పలికెను. 'గంగాతీరమున నుండుగొప్ప తేజముగలఋషులయొక్క తపోవనము లను నేను చూడగోరెదను. మూలములను, ఫలములను భుజించు

అ. రా:—రాముడొకనాడు తననగరులో నన్నియలంకార ములను ధరించి మిక్కిలిసంతోషముతో శాంతముగ కూర్చుండియున్న సమయమున నాభరణములనన్నిటినిధరించినసీత యాతనిపాదము లొత్తుచు నిట్లు పలికెను. "దేవదేవా! జగన్నాథా! పరమాత్మా!సనా తనుడా! చిదానందముగలవాడా! మొదలు, మధ్య, చివర లేనివాడా! సర్వజగత్తునకు గారణమైనవాడా! దేవతలు నాయొద్దకు వచ్చియేకాం తమున నా వైకుంఠాగమనమును గూర్చి యిట్లు ప్రార్థించిరి. 'దేవీ! రాముడు శాశ్వతమైనతన వైకుంఠమును, మమ్మును విడిచి చిచ్ఛక్తివగు

నా ఋషుల పాదముల వద్ద చరించుటయే ముఖ్యమగు నా కోరిక. అక్కడ నేనొక రాత్రియైనను నివసింపవలెను.' సీతపలికిన యీమాటలను రాముడు విని 'అట్లే జరిగెదను; చింతపడకుము. రేపే తప్పక పోయెద' వని యనెను. తరువాత సతితో కొన్ని ముచ్చట్లు మాటాడి చింతచే న్యాయుల మనోరంజకులగు స్నేహితులవలె యంతఃపురమునుండి బాహ్యగృహమును జేరి స్నేహితులందరితోను గలిసి కూర్చుండెను.

రామునకు స్నేహితులును, హాస్యకారులును నగు విజయుడు, మధుమత్తుడు, కాశ్యపుడు, పింగళుడు, కటుడు, సురాజు, కాళియుడు, భద్రుడు, దంతవక్త్రుడు, సుమాగధుడు నను వారు రాముని చుట్టుచేరి సంతోషముతో చమత్కారముగ ననేక విధములగు కథలను చెప్పుచుండిరి. ఒకనాడు

---

నీవు కుమారానంపుటచే నీ భూలోకములో నివసించియున్నావు. కావున నీవు రాముని వదలి వైకుంఠమునకు వచ్చినచో నాతోపాటు శీఘ్రము కాలములో వైకుంఠమునకు రాగలవు.' ఇట్లు వారు ప్రార్థించిరి గాన నామాటలను మీకు దెలిపితిని. ఆప్రకారము చేయుడు; కాని నేను మిమ్ముల నాజ్ఞాపింపగలదానను గాను." ఇట్లు సీత పలుకగ రాముడా మాటలను విని ధ్యానించి వెంటనే యిట్లు పలికెను. 'దేవీ! అంతయు నాకు దెలిసెను. దానికి నీకు నుపాయము చెప్పెదను. నేను నీకు లోకాపవాదమనెడు నొక మిషను గల్పించి దానిచే భయమును బొందిన పామరునివలె నిన్నడవిలో విడిచెదను. నీకు వాల్మీకియాశ్రమసమీపమున నిద్దఱుకుమారులు కలిగెదరు. ఇప్పుడు నీవు గర్భము ధరించియున్నావు. నీవు నాయొద్దకు తిరుగవచ్చునపుడు లోకములకు నమ్మకముగలుగుటకును, నీమర్యాదనిలుపుకొనుటకును శపథమును బలికి భూమిబ్రద్దలు చేసికొని దానిలో ప్రవేశించి శీఘ్రముగ వైకుంఠమునకు బోయెదవు. ఈతీరుగ పంచినిశ్చయముగల నేను తరువాత వైకుంఠమునకు వెళ్లెదను' ఇట్లు రాముడు సీతతో బలికెను.

భద్రుడు కథలను జెప్పుసమయమున రాము డాతనిని 'అయోధ్యలోను, దేశగ్రామములలోను నన్నుగుఱించియు, సీతనుగుఱించియు, లక్ష్మణ భరత శత్రుఘ్నులను గుఱించియు, కైకేయీ కౌసల్యలను గుఱించియు నేమివార్తలు చెప్పుకొనుచున్నారో చెప్పు'మని యడిగి 'రాజులు నూతనముగ రాజ్యముచేయునపుడు రహస్యముగ సమాచారములను కనుగొనుచుండు'రని యనెను. దానికి భద్రుడు చేతులుజోడించి 'పట్టణవాసులు మీరు రావణుని జంపి గొప్పజయమును బొందిరను శుభవార్తలను జెప్పుకొనుచున్నా'రని మాఱుపలికెను. రాము డీమాటలను విని 'నీవేమియు విడువక యథార్థముగ జరిగినదంతయు దెలుపుము. పట్టణవాసులు, గ్రామవాసులు చెప్పుకొను శుభాశుభవాక్యములను కంగారుపడకుండ నిర్భయముగ దెలుపుము. ఆమాటలను విని నేను శుభవాక్యముల ప్రకారము ప్రవర్తింపుచు నశుభవాక్యముల ప్రకారము సంచరింపకుండెదను. పౌరులు పాపపుమాటలను జెప్పుకొనినను వానిని నీవు నాకు విడువకుండ జెప్పవలె'నని యడుగ నాతని యాజ్ఞాప్రకారము భద్రుడు చేతులు జోడించుకొని "వీధులలోను, దుకాణములలోను, వనములందును, నుద్యానవనములందును పురవాసులనుకొను మాటలను దెలిపెదను వినుడు. 'దేవదానవులు చేయలేనిదియు, మనపూర్వులు వినియుండనిదియు నగు సేతువును గట్టుటయను గొప్ప కష్టమగుపనిని రాముడు జరిపించి మిక్కిలి బలవంతుడగు రావణుని, వానిసేనలను జంపెను. వానరులు, ఋక్షులు, రాక్షసులు నతనివశమైరి. తరువాత నాతడు క్రోధమును విడిచి సీతను తనయింటికి దీసికొనివచ్చెను. రావణుడు తనతొడమీద కూర్చుండబెట్టుకొని బలవంతముగ గొనిపోయినట్టియు, లంకలో రాక్షసస్త్రీల వశములో నశోకవనమున నున్నదియు నగు సీతతో సంభోగ

సుగుణుఁడు రామునికి మనస్సెట్లు కలుగుచున్నది? అతఁ డామె నేల నిం దింపఁజేయఁడు? స్త్రీచర్యలను మా భార్యలవిషయమునఁగూడ మేము సహించి యుండవలెను. రాజెట్లుచేయునో ప్రజలుకూడ నట్లే చేయుదురు.' ఇట్లు పట్టణగ్రామవాసులు పలుకుచున్నా"రని భద్రుఁడు తెలుప రాముడు గొప్పవిచారమునుబొంది హాస్యకారులగు తనస్నేహితులందఱితో 'ఈ వార్తలు నిజమేనా? తెలుపు'డని పలుక వారాతనికి నమస్కరించి 'భద్రునిపలుకులు నిజ' మని యనిరి. పిమ్మట నతఁడు వారికి సెలవిచ్చి పంపివేసెను.

తరువాత రాముఁడీసంగతులను బాగుగ నాలోచించి దగ్గఱగ నున్న ద్వారపాలకునితో 'లక్ష్మణ భరత శత్రుఘ్నులను వెంటనే తీసి కొనిర'మ్మని చెప్పెను. అప్పుడు వాఁడు వెంటనే బయలుదేఱి లక్ష్మణుని యొద్దకుఁబోయి యాతనికి నమస్కరించి రామునాజ్ఞ తెలిపెను. అంతట నతఁడుతొందరగ రథమెక్కి తనయన్న యుండుచోటికి బయలుదేఱెను. తరువాత ద్వారపాలకుఁడట్లే భరత శత్రుఘ్నులగృహములకు వెళ్లి వారలకుగూడ రామునాజ్ఞను దెలుప వారును రాముడుండుచోటికి నడుచుచువెళ్లిరి. ద్వారపాలకుడు ముందుగ రామునియొద్దకు బోయి వారిరాకను దెలుప నతఁడు చింతచే వ్యాకులముపొందినమనస్సుగలవాఁడై ముఖమువంచుకొని దీనముతో 'నాకు ప్రాణములవంటివారును, ప్రియ మగువారునునగు వారిని లోనికి దీసికొనిరమ్ము. వారియందే నాజీవిత మున్న'దని పలికెను. తెల్లనిబట్టలుకట్టుకొనినలక్ష్మణభరతశత్రుఘ్నులు రామునియాజ్ఞచే జాగ్రత్తగను, వినయముగను లోనబ్రవేశించిరి. రామునిముఖము రాహువుచేపట్టబడినచంద్రునివలెను, సంధ్యాకాల మునమండుసూర్యునివలెను, శోభలేనిపద్మమువలెను తేజములేక కాంతి హీనముగనుండెను, అతనికండ్లనుండి కన్నీరు కాఱుచుండెను, లక్ష్మణ

భరతశత్రుఘ్నులు రాముని పాదములకు నమస్కరించి జాగ్రత్తగనిలి చిరి. రాముడు తనకన్నీరు తుడుచుకొని వారిని కౌగిలించుకొని యాసనములగూర్చుండుటకు వారికి సెలవిచ్చి యిట్లు పలికెను. 'నాసర్వస్వమును, ప్రాణములును మీరే. మీరు రాజ్యకార్యముల నన్నిటిని జరుప నేను రాజ్యమును బాలించుచున్నాను. మీరు శాస్త్రార్థములు బాగుగదెలిసినవారును, కుశలమగుబుద్ధిగలవారునుగాన నేనుచెప్పుసంగతినిగూర్చి యందఱుకలిసి బాగుగ నాలోచింపవలెను.' ఇట్లు రాముడు పలుక వారు రాముడేమిచెప్పునోయని విచారముతో సావధానులై దీనముగనుండిరి.

అంతట రాముడు వారితో నిట్లనెను. 'మీరు మనస్సును నిలిపి జాగ్రత్తగ నామాటలను వినుడు. నన్నుగురించియు, సీతనుగూర్చియు పట్టణగ్రామవాసు లపవాదమును బలుకుటచే నది నామనస్సును స్వకవగ కలకలముచేయుచు నాయాయుస్థానములను దెగగోయుచున్నది. నేను గొప్పదగు నిక్ష్వాకుకులమున బుట్టితిని. సీతగొప్పదగు జనక కుల మందు బుట్టినది.' ఇట్లు రాముడు పలికి దండకావనమునుండి రావణుడు సీతనెత్తుకొని పోయినందులకు తాను వానిని జంపుటయు, వానిలంకలో నామె యుండుటచే నామెను తాను దీసికొని వచ్చుటకు నిష్టపడక పోవుటయు, నందుచే నామె యగ్నిలోబడి తన పాతివ్రత్యమును వెల్లడి చేయుటయు, నామె పాతివ్రత్యమును, పవిత్రచరిత్రమును నగ్ని, వాయువు మొదలగు దేవతలు దెలుపుటయు జరిగిన పిమ్మటనే తా నామెను నయోధ్యకు దీసికొనివచ్చుటయు వారికి దెలిసి యుండెను నిట్లు పలికెను. "సీతనుగూర్చి పుట్టిన యీ యపవాదము నామనస్సునకు గొప్ప శోకమును గలిగించుచున్నది. లోకములో నపకీర్తిగలవాడు తన యపకీర్తి లోకములో నుండునంతకాలము నీచలోకములను

తగినయాసనమును తెప్పించి యందు వేయుము. నేను రాజాజ్ఞచే నామెను పుణ్యకర్మలుచేయు మహర్షులయాశ్రమములకు దీసికొని వెళ్లుచున్నాను.' ఇట్లు లక్ష్మణుడు తెలుప నతడట్లు చేసి రథములో సీతకొఱకై మంచిపక్కను పఱిచెను. తరువాత లక్ష్మణుడు రాజభవనములోనున్న సీతయొద్దకు బోయి 'నీవు గంగాతీరమున నున్న ఋష్యాశ్రమములను జూచుటకు వెళ్ళవలెనని రాముని కోరియుంటచే నతడందుల కంగీకరించి నిన్నక్కడకు దీసికొనివెళ్ళుటకు నన్ను నియమించెను. కాన నేను నిన్ను దీసికొని వెళ్ళెద' నని పలికెను. దాని కామె మిక్కిలిసంతోషమును బొంది యట్లు వెళ్ళుటకు నిశ్చయించి మునిభార్యల కిచ్చుటకు మంచిబట్టలను, ననేకవిధరత్నములను, నాభరణములను దీసికొని బయలుదేఱెను. సీతయు, రాముని యాజ్ఞను మనస్సులో దలచుచున్న లక్ష్మణుడును రథముమీద కూర్చుండ సుమంత్రుడు రథమును దోలెను. దారిలో కొన్ని దుశ్శకునములుగనబడ సీత లక్ష్మణునితో 'నా కిప్పుడు కన్నదరుచున్నది; నాశరీరము వణకుచున్నది. నామనస్సునకు సుఖములేనట్లు కనబడుచున్నది. నాకు తత్తరపాటును, నధైర్యమును గలుగుచున్నవి. భూమియందేమియు లేనట్లు నాకు గనబడుచున్నది. నీయన్నగారు శుభముగనుందురా? నాయత్తలందఱును, పరిజనలందఱును కుశలముగనుందురా?' యని పలికి చేతులుజోడించి దేవతలను ప్రార్థించెను. లక్ష్మణుడు తనమనస్సులో దుఃఖముగనున్ననునామె మాటలను విని యామెకు శిరస్సుతో నమస్కరించి సంతోషముతో 'అందఱు శుభముగ నుండి'రని పలికెను. ఆదినము నారాత్రి వారు గోమతీతీరమున విడిసిరి. మఱునాటియుదయమున లక్ష్మణుడు సుమంత్రునితో 'రథమును సిద్ధముచేయుము. గంగాతీరమునకు వెళ్ళి యక్కడ స్నానముచేసెద'నని పలుక నతడు రథమును సిద్ధముచేసెను. సీతా



లక్ష్మణులు దానిలోఁ గూర్చుండ నది గంగాతీరమునకు వెళ్లెను. అక్కడ నొకప్రొద్దు వారు నిలిచిరి. గంగను లక్ష్మణుడు చూచి బిగ్గఱగ నేడ్చెను. అంతట సీత కంగారుతో లక్ష్మణునిజూచి యిట్లు పలికెను. 'నీవేల యేడ్చెదవు? నేను చిరకాలమునుండికోరుచున్న గంగాతీరమునకు వచ్చి సంతోషముతోనుండ నీవేల నాకు గొప్పవిచారమును గలిగించెదవు? ఎల్లప్పుడు రాముని యొద్దనుండెడి నీ విప్పుడు రెండు రాత్రులనుండి యతనియొద్ద లేకపోవుటచే నీకు శోకము వచ్చినదా? అతడు నాప్రాణములకంటె కూడ నాకు ప్రియుడు. అట్టినేనే విచారింపనపుడు నీ వేలవిచారించెదవు? నీవజ్ఞానమును బొందకుము. నన్ను గంగను దాటించి నాకు మునులను జూపుము. వారికి నేను బట్టలను, నాభరణములను నిచ్చి తగినట్లు నమస్కరించి యక్కడ నొకరాత్రినివసించిన పిమ్మట మనము మనపట్టణమునకు తిరుగఁబోవుదము. పద్మపత్రములవంటి నేత్రములుగలవాడును, సింహావక్షమువంటి వక్షముగలవాడును, సన్ననినడుముగలవాడును, సంతోషముగలుగఁజేయువారిలో శ్రేష్ఠుఁడునగు రాముని జూడఁదలఁచెదని

నామనస్సునకుగూడ తొందరకలుగుచున్నది.' ఇట్లు సీత పలుక లక్ష్మ ణుడు తనకన్నీరు తుడుచుకొని పడవను నడుపువారిని బిలిపించెను. వారు చేతులుజోడించి 'మంచినావ సిద్ధమైన'దని పలికిరి.

తరువాత నావలోలక్ష్మణుడు సీతనుముందుగకూర్చుండజేసితాను కూడ నందు కూర్చుండెను. అతడు సుమంత్రునితో'నీ వచ్చటనుండు' మనిచెప్పి నావికునితో 'నావను నడుపు'మని చెప్పెను. సీతయు,లక్ష్మణు డును గంగానదియావలిగట్టుచేరిరి. అప్పుడు లక్ష్మణుడుగద్గదస్వరముతో సీతతో నిట్లనెను. 'సీతా! యీవిషయములో లోకులందఱు నన్ను నిందించునట్లును, నామనస్సునకు గొప్పవిచారము కలుగునట్లును బుద్ధి మంతుడగు నాయన్న నా కిట్లాజ్ఞాపించెను. లోకనింద్యమగు నిట్టికార్య ములో నియోగింపబడుటకంటె మరణమునుగాని, మరణముకంటె గొప్పదగు నింకొకదానినిగాని పొందుట శ్రేయము.న న్ననుగ్రహించి నాయందు రోషమును జూపకుము.' ఇట్లు లక్ష్మణుడు పలికి చేతులు జోడించి యేడ్చుచు భూమియందు బడెను. మరణము కోరుచున్న వాడును, దుఃఖించుచున్నవాడును నగు లక్ష్మణుని జూచి సీత మిక్కిలి విచారమునుబొంది యిట్లు పలికెను. 'ఈ సంగతి యేమియు నాకు దెలియుట లేదు. నిజమును దెలుపుము. నీకు సుఖము లేకున్నది. నీ యన్న యగు రామునకు క్షేమమేగదా? నీకు సంతాపము కలుగు నట్లు రాజేమి యాజ్ఞాపించెనో నాకు తెలియజేవలెనని నేను నిన్నా జ్ఞాపించుచున్నాను.' ఇట్లు సీత పలుక లక్ష్మణుడు దీనమగు మనస్సు గలవాడై ముఖము వంచుకొని గద్గదస్వరముతో నిట్లు పలికెను. 'నిన్నుగుఱించి పట్టణగ్రామవాసులు పలికిన గొప్ప యపవాదమును రాముడు తన సభలో విని సంతాపమునొంది నన్నీపనికి నియోగించి గృహమునకు వెళ్ళెను. కోపమును విడిచి మనస్సులో నిలిపిన రాముని వచనములను నేను నీకు చెప్పగూడదు, రాజు పౌరాపవాదభీతిచేత

వందనమొనర్చి కుశలమడిగితిననియు, నంతఃపురస్త్రీలకందఱికి నేను తలవంచి మ్రొక్కితిననియు, రాజును ధర్మమార్గమున నుండఁగోరితి ననియు, నేను నిజముగ పవిత్రమైనదాననని యతనికి దెలియుననియు, గొప్పభక్తితో నేనతనిహితమును గోరుచుంటిననియు, నపకీర్తియందు భయముగల యతనిచే నేను వనమందు విడువబడుటచే నాయపవాద వలనపుట్టినసిందను నేనుకూడ పోగొట్టుకొనవలెననియు, నతడే నాకు ముఖ్యమగుగతియనియు, నతడు తనతమ్ములయందెట్టిభావముచూపునో యట్టిభావమునే ప్రజలయందుగూడ జూపవలెననియు, నదియే గొప్ప ధర్మమైనదనియు, దానివలననే గొప్పకీర్తికలుగుననియు, నతడు ప్రజ లను ధర్మముగ బాలించిన నాశరీరమెట్లున్నను నేను విచారింపననియు, ప్రజలయపవాదమునననుసరించియే యతడు సంచరింపవలెననియు, స్త్రీలకు పతియే దైవము, బంధువు, గురువుగనుక భర్తకార్యము భార్యకు ప్రాణములకంటెకూడ ముఖ్యముగ ప్రియమైనదనియు, దెలు పుము." ఇట్లు సీత పలికి 'లక్ష్మణా! గర్భముధరించియున్ననన్నొక సారిచూచివెళ్లు'మని చెప్ప లక్ష్మణుడు దీనమగుమనస్సుగలవాడై భూమిపై వ్రాలి యేమియుబలుకలేకపోయెను. తరువాత నతడు లేచి యామెకు ప్రదక్షిణముచేసి గొప్పధ్వనితో నేడ్చుచు నొకగడియయా లోచించి యిట్లు పలికెను. 'శుభ్రమగుచరిత్రగలదానా! నాతో నేమి పలికెదవు? నీరూపమును నేనెన్నడును జూడలేదు; నీపాదములను మాత్రము చూచితిని. అట్టి నే నిక్కడ వనములో రాముడులేనిసమయ మున నిన్నెట్లుచూచెదను?' ఇట్లు లక్ష్మణుడు పలికి సీతకు నమస్క రించి తిరిగివెళ్లి నావనెక్కి నావను నడుపుటకు నావికునకు నాజ్ఞనీయ వాడాతనిని గంగానదియుత్తరతీరమునకు తీసికొనివెళ్లెను. తరువాత లక్ష్మణుడు దుఃఖముచే తెలివిలేక త్వరగరథమెక్కి గంగానదియా వలియొడ్డున ననాథవలెనూర్చుండియున్నసీతను మాటిమాటికి వెనుకకు

తిరిగి చూచుచు వెళ్లెను. ఆమె మిక్కిలి విచారముచే దూరముగనున్న గిరులనైనను, లతలనైనను మాటిమాటికి జూచుచు భయమును జెంది గొప్ప శోకమును బొందెను. గొప్పకీర్తిగలదియు, నియమము గలదియు, పతివ్రతయునగు నామె తనభర్తను జూడలేకపోవుటచే గొప్ప దుఃఖమును బొంది కుంగిపోయి యడవిలో బిగ్గరగ నేడ్చుచుండెను.

ఇట్టిసమయమున మునిపుత్రులామెను జూచి గొప్పబుద్ధిమంతుడును, ఐశ్వర్యవంతుడునునగు వాల్మీకిమహర్షికడకు పరుగెత్తి యాతనిపాదములకు నమస్కరించి యామెగూర్చిన మాతనికి దెలియజేయుచు నిట్లు పలికిరి. 'లక్ష్మివలెనున్న యామె యేమహాత్ముని భార్యయోగాని మేమి దివరకెన్నడును నామెను జూచియుండలేదు. వికృతాకారముగలముఖముగలదై యామె మిక్కిలియే భర్తలేనిదానివలె నేకాకినగ నేడ్చుచున్నది. దుఃఖశోకముల ననుభవింపతగనియా స్త్రీ స్వర్గమునుండి క్రిందకుబడిన దేవతవలె నదీతీరమున మనయాశ్రమమునకుసమీపమున దుఃఖించుచున్నది. ఆమె మనుష్యస్త్రీయని మేము తలంపము. ఆమెయందు దయజూపుడు. ఆశ్రమసమీపమున నామె మిమ్ము శరణు బొందినది. మీరామెను రక్షింపవలెను. ఆమెకు తగినసత్కారమును జేయుడు.'

ఇట్లు మునిపుత్రులు పలుక వాల్మీకి ధర్మము తెలిసినవాడగుటచే తన బుద్ధిచే నాలోచించి దివ్యదృష్టితో జూచి సీతయుండుచోటికిపరుగెత్తెను. శిష్యులుకూడ నతనివెంట నరిగిరి. ఆమహర్షి యర్ఘ్యమును బట్టుకొని గంగాతీరమునకు వెళ్లెను. అక్కడ రామునిప్రియభార్యయగు సీత మిక్కిలిశోకముతోనుండ నామెకు సంతోషముకలుగునట్లు ఋషి మంచిమాటల నిట్లు పలికెను. 'పతివ్రతవగు నీవు దశరథునికోడలవును, జనకునికుమార్తెవును, రామునిప్రియభార్యవునునగుసీతవు. నీరాక తెలిసినదైనది. నేను ధర్మమగుసమాధిచే నీవిక్కడకు వచ్చితివని తెలిసికొంటిని, నాతపోమహిమచేతనే మూడులోకములలో జరిగినదానినంతను తెలిసి

కొందును. నీవు వచ్చుటకు గారణమును, నీ వేపాపముచేయ లేదనియు తెలిసినది. నీవు శాంతినొంది నాయొద్దనుండుము. నాయాశ్రమసమీపమున తపముచేయుచుండెడి ముని పత్నులున్నారు. వారెల్లప్పుడు నిన్ను పిల్లవలె కాపాడుచుందురు. ఈయర్ఘ్యమును పుచ్చుకొనుము. నీస్వగృహమున నుండునటుల విచారములేక యుండుము.' ఇట్లు ఋషి మిక్కిలియద్భుతమగుమాటలను బలుక సీత యాశ్చర్యమును జెంది తనతలతో నతనిపాదములకు నమస్కరించి 'అట్లే జరిపెద'నని పలికి యతడు ముందు నడచుచుండ నతనివెనుకను వెళ్లెను. వారువచ్చుచుండుట మునిభార్యలుచూచి మిగుల నెక్కు సంతోషముతో 'మునిశ్రేష్ఠా! మీరు చాలకాలమునకు వచ్చితిరి. మీరాక లెస్స. మీకు నమస్కరించుచున్నాము. మేము చేయవలసినపని దెలుపు'డని పలికిరి. వారిమాటలను వాల్మీకి విని 'ఈమె దశరథుని కోడలును, జనకుని కుమార్తెయు, రాముని భార్యయునగుసీత. ఈమె పాపముచేయకపోయినను తనభర్తచే విడువబడి యిక్కడకువచ్చినది. కాన నే నీమెను సంరక్షింపవలెను. ఈమెయందు మీరు గొప్పస్నేహమును జూపి నామాటలయందు గౌరవముంచి యీమెను సుత్కారము చేయవలె'నని వారితో జెప్పెను. ఇట్లు తిరుగతిరుగ వాల్మీకి సీతను వారి కప్పజెప్పి శిష్యులతో తనయాశ్రమమునకు బోయెను.

—:*:—

## ౫౨వ. అధ్యాయము

### లక్ష్మణుఁడయోధ్యకు మరలుట.

లక్ష్మణుడు మునియాశ్రమమునకు వెళ్ళుచున్న సీతను జూచి దీనుడై గొప్పసంతాపమును బొందినసుమంత్రునితో నిట్లనెను. 'సీతను గూర్చికలుగు సంతాపమువలన రామునికెంత దుఃఖముకలుగునో

మహాత్ముడు. అతడు మంచిచరిత్రముగలతన భార్యను విడుచుటచే నతని కెక్కువదుఃఖముకలుగును. సీతతో శాశ్వతవియోగము దైవయోగ మని తలంచెదను. ఎవరికైనను దైవయోగ మతిక్రమింపశక్యముకాదు గదా? క్రోధమువచ్చినప్పుడు దేవతలను, గంధర్వులను, దానవులను, రాక్షసులను జంపగలిగిన యతడు దైవయోగమునకు లొంగవలసి వచ్చెను. పూర్వ మతడు మాతండ్రివాక్యములచే జనులులేనిదండకార ణ్యమందు 14సంవత్సరములు నివసించెను. అంత నిప్పుడు జనులమాట లనువిని సీతావియోగమునొంది యంతకంటె నెక్కువదుఃఖమును బొం దెను. అతడు నాకు క్రూరునివలె గనిపించుచున్నాడు. స్వల్పులగు జనులమాటలచే నపకీర్తికలుగునట్లు సీతను విడుచుట యతని కేమిధర్మ ముగనున్నది?' ఇట్లు లక్ష్మణుడు పలుక సుమంత్రుడు వానిని చేతులుజో డించి యిట్లు పలికెను. 'సీతనుగురించి నీవు సంతాపము నొందకుము. పూర్వమీసంగతి మీతండ్రికి వసిష్ఠునియెదుట దుర్వాసుడు తెలిపెను. రాముడు నిశ్చయముగ నల్పభాగ్యవంతుడు. అతడుతన ప్రియభార్యను విడిచి వియోగమువలన గొప్పదుఃఖమును బొందును. అతడు చాలకా లముపోయినతరువాత నిన్ను శత్రుఘ్నభరతులనుగూడ విడుచును. దుర్వాసుడు మీతండ్రికి దెలిపినమాటలను నేను నీకుగాని, భరతశత్రు ఘ్నులకుగాని తెలుపకూడదు. వీని నెవరికిని దెలుపగూడదని మీతండ్రి నాకాజ్ఞాపించెను. నేను దానిని మన్నింపవలెను; గనుక నే నీసంగతి నీకు దెలుపకూడదు. అయినను నీకు వినవలెనని కోరికయున్న రహ స్యమైనను దానిని దెలిపెదను. దైవయోగ మెవరికిని తప్పింపవీలులేదు. ఈసంగతులను నీవు భరతశత్రుఘ్నులకుగూడ దెలుపగూడదు.' ఇట్లు సుమంత్రుడు పలుక లక్ష్మణుడు 'నిజమగు సంగతిని దెలుపు' మని యన నతడు పూర్వము దశరథుడు వసిష్ఠునిజూడబోయినప్పుడు దుర్వాసు డక్కడనుండుటయు, దశరథుడు తనవంశమునుగూర్చి యతని నడుగ

నతఁడు రాముఁడు మహావిష్ణువైనందున నతనికి*భృగుశాపముచే భార్యా వియోగము కలుగునని తెలుపుటయు,దశరథునిసంగతియు, నతనివంశ వృత్తాంతములను దెలుపుటయు జెప్పి 'రామునిగూర్చికాని, సీతను గూర్చికాని నీవు సంతాపమునొందక మనస్సును దృఢముగ నుంచుకొన వలె'నని పలికెను. ఈమాటలను లక్ష్మణుఁడు విని 'బాగుబా'గని పలికి సంతోషముగ నుండెను. వారు రథమున బోవుచుండ కేశినియనుగ్రామ మువద్ద సాయంకాలముకాగా నారాత్రి యక్కడ నిలిచిరి.

ఆమఱునాటియుదయమున లక్ష్మణుఁడు లేచి సూతుఁడు సిద్ధము చేసియుంచినరథ మెక్కి యొకపూటలో నయోధ్యచేరెను. అతఁడు 'రామునిపాదములకు నమస్కరించి యేమిపలుకుదు'నని యాలోచించి గొప్పవిచారమును బొందెను. అతఁడు రాజభవనమువద్ద రథముదిగి దీన మగుమనస్సుతో ముఖముక్రిందికివంచుకొని వెళ్ళి కన్నీటితోనిండిన నేత్రములతో దీనముగను,విచారముగను నాసనమునకూర్చుండియున్న రాముని జూచెను. తరువాత లక్ష్మణుఁ డతనికాళ్ళకు నమస్కరించి చేతు లుజోడించుకొనినిలిచి 'నేను మీయాజ్ఞప్రకారము వాల్మీకియాశ్రమము పక్కను సీతను విడిచి మీపాదములను సేవించుటకు తిరిగివచ్చితి' నని పలికి యింకను నిట్లు మనవిచేసికొనెను. "కాలగతి యిట్లున్నది. మీరు విచారింపకుఁడు. బలవంతులును, బుద్ధిమంతులునగు మీవంటివారు శోకమునొందరు. అన్నివస్తువులును నాశనమునకు లోనైయుండును. మిక్కిలియెత్తుగలవన్నియు పడుటకును, సంయోగము వియోగమున కును, జీవనము మరణమునకును లోనై యుండును. కనుక పుత్రులం దును, భార్యలందును, మిత్రులందును, ధనములందును నెక్కువ సం బంధ ముంచుకొనఁగూడదు. వానితో వియోగము నిశ్చయముగ గలు

* ౧౦వ ప్రకరణము. ౫వ అధ్యాయము. విష్ణువు భృగుశాపమునొందుట చూడుము,

గును. రామా! మీరు మీయాత్మచే నాత్మను, మనస్సుచే మనస్సును, నన్నిలోకములను గనిపెట్టుటకు శక్తి గలవారలు. అట్టి మీకు శోక మేల? మీవంటిపురుషశ్రేష్ఠులు లజ్జానమును బొందరు. మీరిట్లు విచారించుచున్నయెడల జనులు 'రాముడు లోకాపవాదమునకు వెఱచి సీతను విడిచెనే కాని నిజముగ నతనికి సీతను విడుచుట కిష్టములేదని మఱల నపనింద మోపుదురు. పురుషశ్రేష్ఠులగు మీరు ధైర్యమవలంబించి దుర్బలబుద్ధిని విడువుడు. సంతాపము నొందకుడు." ఇట్లు లక్ష్మణుడు ముక్కిలిప్రీతితో బలుక రాముడు 'నీవు పలికినంతయు నిజమే. నీవు నాకార్యమును జరిపినందులకు సంతోషించి నీమంచిమాటలచే సంతాపమును బోగొట్టుకొంటిని. నావిచారము పోయిన'దని పలికెను.

—:♦:—

## ౬౩. వ. అధ్యాయము.

## రాముని రాచకార్యములు.

తరువాత రాముడు లక్ష్మణుని బిలిచి 'నాలుగురోజులనుండి రాచకార్యములను జరుపకపోవుటచే నాకు చాల బాధగనున్నది. కావున నీవు ప్రజలను, పురోహితులను, మంత్రులను, పనులనుగోరు పురుషులను, స్త్రీలను, పిలిపింపవలెను. దినదినము ప్రజలకార్యములను జరుపని రాజు మరణాంతమున గొప్పనరకమునొందును. పూర్వము బ్రాహ్మణులన్యాయము విననందున నృగమహారాజునకు గొప్పశాపము వచ్చెను. కనుక కార్యమునకై వచ్చినజనులను తిరస్కరించినరాజులకు గొప్పదోషములు కలుగును. కావున కార్యార్థులను నాయొద్దకు రప్పింపు'

మనిపలికి యతనికి * నృగమహారాజుశాపవృత్తాంతమును, ♦ నిమివసిష్ఠులచరిత్రమును, + నగస్త్యునిజన్మము మొదలగుకథలను దెలిపెను. లక్ష్మణుడు వీనినన్నిటిని విని రామునితో 'నిమి క్షత్రియుడును, శూరుడును, యజ్ఞదీక్షగలవాడునైనను వసిష్ఠునియెడ నేమియు నోర్పుచూపలే' దనిపలికెను. అతడు దానికి ప్రత్యుత్తరముగ పురుషులందఱియందు నోర్పుకనబడదనియు, రోషము సహింపశక్యముకానిదనియు, బలము కలవారిలో నోర్పుగలవాడు ⊤ యయాతియొక్కడేయనియుపలికి వాని చరిత్రమును దెలిపెను. ఇట్లు రాముడనేకకథలను దెలిపి 'కార్యములు గలవారినందఱిని నాయొద్దకు దీసికొనిరమ్మ'ని లక్ష్మణునకాజ్ఞాపించెను. అంతలో తూర్పుతెల్లవాఱెను.

ఆమఱునాటియుదయమున రాముడు కాలకృత్యములను దీర్చుకొని రాజధర్మములను జరుపుటకు సభకు వెళ్ళి తనయాసనమున గూర్చుండెను. భృగువు, అంగిరసుడు, కుత్సుడు మొదలగు బ్రాహ్మణులును, వర్తకులును, పురోహితులగువసిష్ఠకాశ్యపఋషులును, వ్యవహారములు తెలిసినమంత్రులును, ధర్మములు తెలిసినయితరులును, నీతిశాస్త్రము తెలిసినవారును, మంత్రులును, క్షత్రియులును, వణిజులును నా సభలోనుండిరి. అది దిక్పాలకులసభవలె ప్రకాశించుచుండెను. అంతట రాముడు లక్ష్మణునితో 'నీవు వెలుపలకు వెళ్ళి తమకార్యములను జెప్పుకొనుటకు వచ్చినవారి నందఱిని లోనికి దీసికొనిరమ్మ'ని చెప్పెను. అతడట్లువెళ్ళి కార్యార్థులను బిలువ 'నాకార్యమున్న'దని యనువారెవరును నతనికి గనబడలేదు. ఈసంగతియు, ప్రజలసుఖస్థితియు లక్ష్మ

---

* ౬వ. ప్రకరణము. ౪. వ. అధ్యాయము. నృగమహారాజుశాపము చూడుము

♦ ౩ వ. ప్రకరణము. ౨ వ. అధ్యాయము. వసిష్ఠుడు చూడుము,

+ ౬ వ. ప్రకరణము. ౮ వ. అధ్యాయము జనకునివంశము చూడుము

⊤. ౧ వ. ౨ వ. అధ్యాయము. చంద్రవంశజులు. యయాతి చూడుము.

ణుడు రామునకు దెలుప నాతడు వానితో 'నీవు తిరుగ బోయి కార్యముగలవారిని కనుగొని తీసికొనిరమ్ము. నీతిమార్గమున బాగుగ పరిపాలించునప్పు డధర్మమొక్కడునునుండదు. రాజభయముచే ప్రజలందరొకరినొకరు రక్షించుకొనుచున్నారు. అయినను నీవుకూడ ప్రజలను బాగుగ రక్షింపు'మని చెప్పెను.

రాముని యాజ్ఞప్రకారము లక్ష్మణుడు రాజసభనుండి వెళ్ళిపోవుచుండ రాజద్వారమున కుక్కయొకటియుండి యాతనిజూచి మాటిమాటికి నఱచుచుండెను. దాని నాతడు గాంచి 'నీవు మనస్సున శాంతమునొంది నీకార్యమేదియో తెలుపు'మని యడుగ నది 'అన్నిభూతములకు శరణ్యమైనవాడును, గొప్పకర్మలు చేయువాడును, భయముగలిగిన వారి కభయదాన మిచ్చువాడునునగు రామునితో మనవిచేసికొనెద' నని తెలిపెను. ఆమాటలను లక్ష్మణుడు విని రామునిసభలోనికి బోయి యాతనితో నాసంగతి తెలిపి తిరుగ పైకివచ్చి కుక్కతో 'నీవుచెప్పవలసిన దేమైననున్న దానిని రాజునకు దెలుపు'మని చెప్ప నది యిట్లు మనవిచేసికొనెను. "మేము కుక్కలము; హీనజాతియందు బుట్టినజంతువులము. దేవగృహములోనికిని, రాజగృహములోనికిని, ద్విజులయిం యిండ్లకును, నగ్ని, యింద్రుడు, సూర్యుడు, వాయువునుండుచోట్లకును పోవుటకు మేము తగినవారముకాము. రాజు ధర్మమూర్తి; యుద్ధము చేయుటలో సమర్థుడు; సత్యముపలుకువాడు; అన్నిభూతములకు మంచి చేయుటయందు శ్రద్ధగలవాడు. రాముడు భగవంతుని స్థానము తెలిసినవాడు; న్యాయము తెలిసినవాడు; సర్వము తెలిసినవాడు; సర్వము జూచినవాడు; ప్రేమకలిగించువారిలో ముఖ్యుడు; అతడే సూర్యుడును, చంద్రుడును, నగ్నియు, మృత్యువును, నలుగురుదిక్పాలురునగనుక ప్రజాపాలకుడగు నతని సెలవులేనిదే నేను సభలోప్రవేశించుటకు యత్నింపనని యతనికి నీవు తెలుపుము." ఇట్లు కుక్క పలుక లక్ష్మణుడు

సభకు పోయి రామునితో 'మీ యాజ్ఞను నేను తెలిపితిని. కుక్క తన కార్యముకొఱకై వెలుపల వేచియున్న'దని మనవిచేసెను. అంత నాతఁడు 'దానిని శీఘ్రముగ లోపల ప్రవేశపెట్టు'మని సెలవీయ లక్ష్మణుఁడు పైకి వెళ్లి కుక్కను లోనికి తీసికొని వెళ్లెను.

రాముఁ డాకుక్కనుజూచి 'నీకు భయములేదు. నీవు చెప్పవలసిన సంగతిని నాతో జెప్పు'మని యనెను. అంతట తలపగిలియున్న కుక్క రాముని జూచి *రాజధర్మములను బలుకుచు నతని నిట్లు పొగడెను. 'మీరు శాస్త్రములు మొదలగు ప్రమాణముల కన్నిటికి ప్రమాణమైనవారు. సత్పురుషులుచేయు ధర్మము మీకు దెలియును. ధర్మములకు మీరు ముఖ్యస్థానము. మంచిగుణములకు మీరు నిధులరు. నే నజ్ఞానముచే నింతవరకు పలికితిని. నేను శిరస్సుతో మీకు నమస్కరించుచున్నాను. మీరు క్రోధమును బొందకుఁడు.' ఇట్లు కుక్క పలుక రాముఁడు దానితో 'నేను నీ కిప్పుడు చేయవలసిన దేమున్నది? నీవు శాంతముతో శీఘ్రముగ దెలుపు'మని పలుక నది యిట్లు మనవి చేసెను. "ధర్మము వలన రాష్ట్రము సంతోషించును. కాన ధర్మముగ ప్రజాపాలన చేయవలెను. ధర్మమువలననే రాజు సమస్త జీవులకు శరణ్యుఁడగును. అతఁడన్నిభయములను బోగొట్టును. నేను మనవిచేయుదానిని విని పిమ్మట చేయవలసిన దానిని జేయుఁడు. బ్రాహ్మణవీధిలో నివసించువాఁడును, 'సర్వార్థసిద్ధి' యను పేరుగల వాఁడును నగు బ్రాహ్మణసన్యాసి నిష్కారణముగ నిర్దోషినగు నన్ను దెబ్బ కొట్టెను." ఇట్లు కుక్క విన్నవింప రాముఁ డాబ్రాహ్మణునికై ద్వారపాలకుని పంపెను. వాఁడాతనిని దీసికొని వచ్చెను. ఆ విప్రుఁడు తన్ను రప్పించుటకు కారణమేమని రాముని నడిగెను. అంతట రాముఁడు వానికిట్లు సెలవిచ్చెను. 'నీ వీకుక్కను గొట్టితివి. అట్లు చేయుట కిది

* 13వ. పరిశిష్టము. 12వ. అధ్యాయము. చివరి రాజనీతులు చూడుము.

నీకు నేనింత యపకార మేమిచేసెను? క్రోధము ప్రాణమును బోగొట్టు నట్టి శత్రువు. అది మిత్రునివలె గనబడును. అది మంచి వాడివైన కత్తివంటిది. ఆక్రోధ మంతటిని నాశనము చేయును. మనుజుడు తపస్సు చేసినను, యజ్ఞముచేసినను, దానమిచ్చినను వాని ఫలమును తన క్రోధము నాశనము చేయును. కనుక క్రోధమును విడువవలెను. పరుగెత్తు గుఱ్ఱములను సారథి కళ్లెములను బట్టిలాగి తన స్వాధీనములో నుంచుకొనునట్లు మనుజుడు దుర్మార్గమున సంచరించు నింద్రియములను విషయములందు ప్రవర్తింపనీయక జాగ్రత్తగ నుంచుకొనవలెను. లోకమునకు శ్రేయమును గోరుచు మనస్సుచేతను, కర్మలచేతను, మాటలచేతను,చూపులచేతను క్రమముగ వర్తించువానికెవనియందును ద్వేషము కలుగదు. వాని కేదియు నంటదు. చెడుమార్గమున ప్రవర్తించు మనస్సు చేయునట్లు తీక్ష్ణమగు కత్తిగాని, తోకత్రొక్కిన సర్పముగాని, యెల్లప్పుడు మిక్కిలి క్రోధముగల శత్రువుగాని చేయలేరు. మనుజుడు వినయము, నీతి కలిగియున్నను ప్రకృతి వానిని విడువదు. దానిని మనుజుడు దాచినను నది తప్పక పైకి గనబడును.' ఇట్లు రాముడు పలుక నా బ్రాహ్మణు డిట్లు విన్నవించెను. "నేను భిక్షకై తిరుగుచుంటిని. కాని నా కెక్కడను భిక్ష దొరకలేదు. అందుచే నాకు క్రోధము గలుగ నే నీదెబ్బ కొట్టితిని. వీధిమధ్యను కుక్కనిలువ దానిని 'పొమ్ము; పొ'మ్మని నేను పలికితిని. అది స్వేచ్ఛగాపోవుచు వీధి చివరను విరోధముగ నిలబడెను. అంతట నే నాకలిచే క్రోధమును బొంది దానిని గొట్టితిని. కావున రాజేంద్రా! అపరాధము చేసిన నన్ను దండింపుము. నీ వలన దండనపొందిన నాకిక నరకభయ ముండదు." ఇట్లు బ్రాహ్మణుడు పలుక రాముడు సభలో నున్నవారితో 'వీని కేమిచేయవలెను? ఏమిదండన విధింపవలెను. సరియగు దండన విధించుటచేతనే ప్రజలు రక్షింపబడుదురు'యని పలికెను.సభవారు'బ్రాహ్మ

ణుడు దండములచే జంపబడకూడ'దని పలికిరి. అప్పుడు మునులు రామునితో 'రాజందఱిని శాసించువాడు. దేవుడవును, శ్రేష్ఠుడవును, మహావిష్ణుడవును నగు నీవు ముఖ్యముగ మూడులోకములను శాసించువాడ'వని పలికిరి. వారందఱు నట్లు పలుకగా రామునితో "మీరు నాయందు సంతోషము గలిగియుంటిరేని, నాకొక [illegible] లేని 'నేనేమి చేయవలె'నని మీరు పలికితిరి గాన నీ బ్రాహ్మణుని దేవాలయాదులం దాధిపత్యము నిండనియు, వానిలో [illegible] ననియు కోరెదా"నని మనవి చేసెను. అట్లు రాము [illegible] యాధిపత్యమున నియమించెను. బ్రాహ్మణుడు మిక్కిలి సంతోషము నొంది యేనుగునెక్కి మర్యాదను బొందుచు నెళ్ళెను. అంతట [illegible] మంత్రు లాశ్చర్యమును బొంది 'వీనికి మీరు వరమిచ్చితిరి; [illegible] వానికి శిక్ష కా'దని పలుక నాతడు వారికి 'మీరు దీని [illegible] గరు. కుక్కకు తెలియు'నని సెలవిచ్చి 'కుక్కా! దానిని [illegible]' మని చెప్ప నది యిట్లు పలికెను. "నేను పూర్వము దేవ[illegible] పూజలయందును, పనులను జేయు స్త్రీపురుషపరిచారకులందును [illegible] రినై మృష్టాన్నభోజనము చేయుచుంటిని. నేను [illegible] బంచిపెట్టుచు మంచిబుద్ధితో కార్యములను [illegible] యందఱిమేలుకోరుచు దేవద్రవ్యమును రక్షించుచుంటిని. [illegible] నిప్పుడు మిక్కిలినీచమగు కుక్కజన్మమునొంది [illegible] స్థనుబొందితిని. ఈబ్రాహ్మణుడు క్రోధముగలిగి ధర్మమును [illegible] చేయుటయందు బుద్ధిగలిగియున్నాడు; ఇతడు క్రోధముగలవాడును, క్రూరుడును, కఠినుడును, తెలివిలేనివాడును; [illegible] తనకులమును 14 జన్మలవరకు నరకములో [illegible] నేయవస్థలోనైనను దేవాలయాధిపత్యమును జనులిష్టపడకూడదు. [illegible] [illegible]

సమబుద్ధిగలవారు; వ్యవహారములందు విధియుక్తముగ ధర్మమార్గ
మున న్యాయమును దెలుపువారు. కండ్లులేనివానికి గన్నులును, నడువ
లేనివానికి నడకయు మీరే. దుర్బలులకును, ననాథులకును రాజే తగిన
బలము. కాన మీరు మాజగడమును వినుడు. నా స్థానమున గ్రద్ద ప్రవేశించి
నన్ను బాధించుచున్నది. మీరు దేవతలను, మనుష్యులను శాసించువారు.'
ఇట్లు గుడ్లగూబ పలుక రాముడు దశరథుని కాలమునుండియున్న తన
మంత్రుల నెనమండుగురను పిలిపించెను. వారు బాగుగ నీతిశాస్త్రము
లును, నితరశాస్త్రములును దెలిసినవారు; మంచికులములో జన్మించిన
వారు; మంచియాలోచనగలవారు. తనవారితో రాముడు పుష్పకమును
మనస్సులో దలంప నది సిద్ధమయ్యెను. అంతట నతడు దానిలో తన
మంత్రులతో గూర్చుండి యీ పక్షుల వివాదస్థలమునకు బోయెను. అక్కడ
రాముడు గ్రద్దను 'నీ వెన్నిసంవత్సరములక్రిందట నీనివాసమును నేర్పరచు
కొంటివో తెలిసియున్న నిజమును బలుకు'మని యడిగెను. అంతట గ్రద్ద
యణకువతో 'ఈభూమి మనుష్యులతో నిండియున్నప్పటినుండియు
నిది నావాస' మని పలికెను. అప్పుడు గుడ్లగూబ 'ఈభూమి చెట్లతో
గూడియున్నప్పటినుండియు నిది నాయిల్ల'ని పలికెను. ఈమాటలను
రాముడు విని సభవారితో 'వృద్ధులులేనిసభ సభకాదు. ధర్మముపలుకని
వారు నిజముగ వృద్ధులుగారు. సత్యములేనట్టిధర్మము ధర్మముగాదు.
ఏదోయొక నెపముతో గూడుకొన్నది సత్యముకాదు. సభికులెల్లప్పుడు
నిజమును దెలిసికొని యాలోచించుచు నూరకొని తెలిసినదానిని
చెప్పనియెడల వారబద్ధముపలికినవారగుదురు. ప్రశ్నల నడిగినపుడు
సమాధానము దెలిసియు కోరికచేతనుగాని, క్రోధముచేతనుగాని, భయ
ముచేతనుగాని నిజమునుబలుకనివారు వేయివరుణపాశములచే బాధింప
బడుదురు. సంవత్సరమునకొక పాశము వారిని విడుచును. కనుక మీరు
శీఘ్రముగ సత్యమును కనుగొని దానిని తెలుపవలె'నని పలికెను.

ఇట్లు రాముడు పలుక నామాటలను మంత్రులు విని యిట్లు విన్నవించిరి. 'గుడ్లగూబమాటలు మంచివిగనున్నవి. గ్రద్ద మాటలు అట్లు లేవు. మహారాజా! యిందులకు మీరే ప్రమాణము. రాజే మాకు నుత్తమగతి. ప్రజలందఱికి రాజే మూలము. రాజే శాశ్వతధర్మము. నరులను రాజే దండించువాడు. అతనివలన దండింపఁబడిన ప్రజలు మరల దండనను బొందరు.' ఇట్లు మంత్రులు పలుక రాముడు పురాణములలోనున్న * సృష్టిక్రమము తెలుపుచు యుగాది ప్రజలు కలిగిరనియు, కొంతకాలమునకు మధుకైటభులను రాక్షసులు జన్మించి విష్ణువుచే మడిసిరనియు, పిదప వృక్షములతో భూమి నిండెననియు, కావున గ్రద్ద చెప్పిన మాట నిజముకాదనియు, గుడ్లగూబమాటయే నిజమని నాయభిప్రాయమనియు పలికెను. తరువాత నతడు 'పాపాత్ముడగు గ్రద్ద యితరుల గృహమును హరించెనుగాన గొప్పదుర్మార్గుడగు దీనిని దండింపవలె'నని సెలవిచ్చెను. అప్పు డశరీరవాణి యాకాశమునుండి యిట్లు పలికెను. "రామా! నీవు గ్రద్దను జంపకుము. అది పూర్వము గౌతమశాప బలమున కాలియుండెను. అది పూర్వజన్మమున బ్రహ్మదత్తుడను రాజై యుండెను. సత్యవ్రతుడును, శుచిగలవాడునునగు నతనిగృహమునకు నూఱుసంవత్సరములు పూర్తిగ భోజనముకావలెనని వెదకుకొనుచు గౌతముడు వెళ్ళెను. అప్పుడు రాజాయనకు నర్ఘ్యపాద్యాదులనిచ్చి సంతోషమును జూపుచు వానికి భోజనము పెట్టించెను. అందు మాంసము వడ్డింపబడెను. దానితో గౌతమునికి క్రోధముకలుగ నతడు 'నీవు గ్రద్దవై జన్మింపు'మని రాజును శపించెను. అప్పుడు బ్రహ్మదత్తుడు ఋషిని 'మహాత్మా! నాయజ్ఞానముచే నిట్లు జరిగినది. నాయందనుగ్రహమును జూపుము. ఈశాపము నన్ను విడుచునట్లు కరుణింపు'మని వేడెను. 'అపని యజ్ఞానముచే జరిగిన'దని గౌతముడు

* 2వ. ప్రకరణము ౧వ అధ్యాయము. సృష్టివివరముచూడుము.

తెలిసికొని 'ఇక్ష్వాకువంశములో రాముడను గొప్పకీర్తిమంతుడు పుట్టును. అతడు నిన్ను ముట్టినీపాపముపోవు'నని పలికెను." ఇట్లు అశరీర వాణి పలుక నామాటలను రాముడు విని గ్రద్దను ముట్ట నది తనస్వరూపము విడిచి శరీరముసమంచిగంధముగల వాడును, ప్రకాశించుచున్న

---

అ. రా—ఒకానొకప్పుడు రాముడేకాంతమునసున్నప్పుడు లక్ష్మణుడు పరిశుభ్రమగుమనస్సుగలవాడై భక్తితో నతనికి నమస్కరించి వినయముగ నిట్లు పలికెను. 'నీవు అఖండచైతన్యస్వరూపుడవు; సర్వజీవులకు బింబరూపుడవు. అంతర్యామిస్వరూపుడవగుటచే నీవు నిరూపకుడవైతివి. నీవు కర్మాధీనమైనశరీరాద్యాకారములులేనివాడవు. ఇట్టినీవు ఈతీరుగానే నీపాదపద్మములందు తుమ్మెదలవలె కలిసికొన్నచిత్తము గలజ్ఞానదృష్టిగలవారలకు స్వయముగగోచరమగుచున్నావు. యోగులు భావించునట్టియు, సంసారమును తొలగించునట్టియు నీపాదపద్మములను శరణుజొచ్చితిని. ఏతీరుగ నజ్ఞానమనెడు మహాసముద్రమును ననాయాసముగ దాటగలుగుదునో యాతీరుగ నన్ను శిక్షింపుము.' ఇట్లు లక్ష్మణుడు పలుక శరణాగతరక్షకుడును, పరమదయాళుడునునగు రాముడు శ్రుతిబోధితమగు ఆత్మతత్త్వజ్ఞానమును నజ్ఞానమనెడునంధకారమునుబోగొట్టుటకు ముందుగా నిట్లుపదేశించెను. (ఆత్మతత్త్వజ్ఞానమునకు బహిరంగసాధనములనియు, అంతరంగసాధనములనియు రెండు విధములగు కారణములుగలవు. బహిరంగసాధనములు=వర్ణాశ్రమోచితనిత్యనైమిత్తికయజ్ఞదానాదులు, అంతరంగసాధనములు=శమ దమ తితిక్ష ఉపరతి శ్రద్ధ సమాధులు, శమము=అంతరింద్రియములగుకామాదులయొక్క నిగ్రహము, దమము=బహిరింద్రియనిగ్రహము, తితిక్ష=శీతోష్ణాదిద్వంద్వసహనము, ఉపరతి=సన్యాసము, లేక ఫలాపేక్షలేనికర్మాచరణ, శ్రద్ధ=గురువేదాంతవాక్యములందువిశ్వాసబుద్ధి, సమాధి=చిత్తైకాగ్ర్యము. సినినుపదేశింపనున్నాను.) "లక్ష్మణా! సంసారమున్ను

శరీరముగలవాఁడనగు రాజయ్యెను. అప్పుడతఁడు రామునితో 'ధర్మ
జ్ఞా! మీకరుణచే నాకు గొప్పమేలుకలిగెను. నేను గొప్పనరకమునుండి
తప్పింపబడి ముక్తుఁడనైతిని. మీవలన నాశాపము తొలఁగిపోయె'నని
పలికెను.



దాటుటయందిచ్ఛగలపురుషుఁడు ముందుగా తనవర్ణాశ్రమాదుల
కుచితములగు శ్రుతిస్మృతిచోదితములగు కర్మలను ఫలాపేక్షలేకుండ పర
మేశ్వరార్పణబుద్ధితో నాచరించుటవలన శుద్ధమగుమనస్సుగలవాఁడై
(అనగా శమాదిషట్కసంపన్నుఁడై) ఆత్మస్వరూపవిజ్ఞానము నపేక్షించి
వేదాంతవిచారముకొరకు సద్గురునాశ్రయింపవలెను. (సంసారము కులా
లచక్రరూపమగుటవల్లను, సంసారనివృత్తి సంసారకారణాజ్ఞాననివృత్తి
మూలకమగుటవల్లను, అజ్ఞాననివృత్తి ఆత్మతత్త్వజ్ఞానసాధ్యమగుటవల్ల
ను, తత్త్వజ్ఞానము వేదాంతవిచారసాధ్యమైనదగుటవల్లను, ఇట్టివేదాంత
విచారము సద్గురుసమాశ్రయణైకసాధ్యమగుటవల్లను సద్గురునాశ్రయిం
పవలెను. ఈవిషయమునే తెలియజేయుచున్నాఁడు.) లక్ష్మణా! పూర్వ
జన్మమందాదరపూర్వకముగా నాచరింపబడిన పుణ్యపాపరూపమగు
కర్మసుఖదుఃఖాద్యనుభవముకొరకు ఈశరీరోత్పత్తికి కారణభూతమైనది.
శబ్ద స్పర్శ రూప రసగంధములనెడు విషయములందభిలాషగలపురుషు
నికి శాస్త్రప్రసిద్ధములగు ధర్మాధర్మములుసుఖదుఃఖజనకములగుచున్న
వి. పూర్వజన్మయందాచరింపబడిన పుణ్యపాపకర్మలవల్ల ధర్మాధర్మ
ములు జన్మించును. అట్టిధర్మాధర్మములవల్ల సుఖదుఃఖానుభవమునకైశరీ
రముద్భవించును. అట్టిశరీరమందు జీవుఁడు ప్రవేశించి ధర్మాధర్మములచే
ప్రేరేపింపబడినమనస్సుగలవాఁడై పుణ్యపాపకర్మలనాచరించును. వాని
వల్ల ధర్మాధర్మములయొక్కయుత్పత్తియు, వానివల్ల శరీరోత్పత్తియు
గలుగును. ఈతీరుగ కులాలచక్రమువలె విషయాభిలాషగలపురుషుఁడు
పుణ్యాపుణ్యముల నాచరించుచు నొకప్పుడధోలోకస్థితియు,మఱొకప్పు

ఊర్ధ్వలోకస్థితియు బొందును. ఈతీరుగ నానావిధలోకములను బొం
దుచు సంచరించుచుండును. ఇట్టి జననమరణప్రవాహరూపమగు సంసార
మునకు కారణభూతమగునది యజ్ఞానమే. (అజ్ఞానమనగా స్వస్వరూప
తిరోధానము) సంసారనివృత్తి కవశ్యమని తోచినప్పు డజ్ఞానమునే
పోగొట్టుకొనవలెను. అట్టి యజ్ఞానమును బోగొట్టునది యాత్మతత్త్వజ్ఞాన
మే కాని యజ్ఞానమువలన బుట్టిన కర్మ కానేరదు. తేజస్తమస్సులకువలె
జ్ఞానాజ్ఞానములకే విరోధము కలదు కాని కర్మాజ్ఞానములకు విరోధము
లేదు. కావున నజ్ఞానమును బోగొట్టునది విద్యయే కాని కర్మ కానేరదు.
కర్మవలన నజ్ఞానము పోదు; రాగాదులు నశింపవు; అనిత్యస్వర్గాదిఫలము
లతో గూడిన కర్మమే యుద్భవించును. అందువల్ల సంసార మెన్నటికి
తప్పనేరదు. కాన వివేకము గలవాడు ఫలాపేక్ష లేకుండ కర్మల నాచ
రించి చిత్తశుద్ధి గలవాడై వేదాంతవిచారముకొరకు గురువు నాశ్రయించి
వేదాంతవిచారము చేసి యాత్మజ్ఞానము గలవాడై తరించవలెను.

(జ్ఞానమే మోక్షసాధనమని నిరూపించుటకొరకు జ్ఞానకర్మస
ముచ్చయవాదము ననువదించి దానిని ఖండించుచున్నారు.)

'బ్రహ్మవి దాప్నోతి పర' మిత్యాది శ్రుతులచే జ్ఞాన మొక్కటే
మోక్షసాధనమని చెప్పబడినదో యట్టి 'ఉభాభ్యామేవ పక్షాభ్యాం
యథా ఖే పక్షిణాం గతిః తథైవ జ్ఞానకర్మాభ్యాం ప్రాప్యతే బ్రహ్మ
శాశ్వతం' ఇత్యాదిశ్రుతులచే కర్మకూడా మోక్షసాధనమని నిరూపిం
చుటచేత ముముక్షు సాధారణజీవమాత్రునకు 'వీరహా వా ఏష దేవా
నాం యోఽగ్ని ముద్వాసయతే యావజ్జీవం అగ్నిహోత్రం జుహోతి'
ఇతి శ్రుతులచే తప్పకుండా చేయతగినదని బోధింపబడుచున్న నిత్యనై
మిత్తికాది రూపమగు కర్మ జ్ఞానమునకు సహాయమగును. పక్షి యాకా
శమునుగూర్చి యెగురుటకు రెండు రెక్కలు సాధనము లగునట్లు
మోక్షప్రాప్తికి జ్ఞానకర్మలు రెండును సాధనములు. ఈరీతిగా సము

చ్చయవాది శంకింపగా స్వద్వైతవాది 'ఓయీ! తేజస్సు అంధకారమును బోగొట్టుటలో సహాయాంతరము నపేక్షింపకుండ నెట్లు సమర్థమగునో యట్లే స్థిరమగు మోక్షమును సంపాదించు జ్ఞానము సహాయాంతరము నపేక్షింపకయే మోక్షము నియ్యగల'దని చెప్పెను. అంతట సముచ్చయవాది 'అక్షయ్యం హ వై చాతుర్మాస్యయాజినః సుకృతం భవతి' అను శ్రుతిచే స్థిరకార్యమని బోధింపబడుచున్న యాగము ఆరాదుపకారకము లగు (సాక్షాత్సాధకములగు) ప్రయాజాదులను, దేశకాలాదులను నెట్లపేక్షించుచున్నదో యట్లే జ్ఞానముకూడా 'అగ్నిహోత్రం జుహోతి' అను విధి వాక్యములచే ప్రతిపాదింపబడు కర్మలను సహాయముగా జేసికొనియే స్థిరమగు మోక్షము నియ్యగల'దని చెప్పెను. అప్పు డద్వైతవాది యీమతము నిట్లు ఖండించెను. 'పురుషుడు దేహాభిమానముచే కర్మచేయుటవల్లను, అభిమానరహితుడై జ్ఞానమును సంపాదించుటవల్లను శాస్త్రమందు దేహాభిమానిని కర్మాధికారినిగాను, అభిమానరహితుని జ్ఞానాధికారినిగాను నిర్ణయించినందున అధికారివిశేషణములగు అభిమానమునకున్ను, అభిమానరాహిత్యమునకున్ను విరోధముండుటచే కర్మజ్ఞానములకు విరోధము;గాన కేవల కర్మగాని, కర్మ జ్ఞానములు రెండుకలిసిగాని మోక్షసాధనములని చెప్పకూడదు. ఇంతేకాక పరిశుద్ధమగు విజ్ఞానమును గలుగజేయు వేదాంతవాక్య విచారణవల్ల ప్రాప్తమైనట్టియు,చరమ(చివరిది)మైనట్టియు బ్రహ్మాకారాకారితాంతఃకరణవృత్తియే విద్యయని చెప్పబడుచున్నది. (నదీజలము తూముగుండా బయలువెడలి వరిమడిలో ప్రవేశించి వరిమడియొక్క రూపమును బొందునట్లు తేజోవిశేషమగు నంతఃకరణము చక్షురింద్రియములద్వారా వెలుపలకువచ్చి యెదుటనున్న వస్తువుతో జేరి వస్తురూపమును బొందుచున్నది. 'సర్వం ఖల్విదం బ్రహ్మ, బ్రహ్మైవాహం' అను శ్రుతిచేసర్వముబ్రహ్మస్వరూపమనినిశ్చయించి యంతఃకరణముస్వస్వరూపమగు బ్రహ్మాకృతినొందుటయే'బ్రహ్మాకారాకారితాంతఃకరణవృత్తి'

యని చెప్పబడుచున్నది.) ఈవిద్యకర్తృత్వాదిబుద్ధులనునిరసించియేజన్మించును. కర్మ కర్తృత్వాద్యంగములతోఁగూడియే ఫలోన్ముఖమగును. కాన విద్యాకర్మల కిట్టి వైషమ్యముండుటచే సముచ్చయవాద మంగీకరింప తగ్గదికాదు. కావున ముముక్షువు నిత్యనైమిత్తికాది కర్మలను చిత్తశుద్ధి పర్యంతమే యాచరింపతగ్గది. కామ్యకర్మ తప్పక పరిత్యజింప తగ్గది. చిత్తశుద్ధి కలిగినపిమ్మట బ్రహ్మానుసంధానమునకు ప్రతిబంధకమగుటచేతను, ఫలము లేకపోవుటచేతను తప్పకుండ కర్మ పరిత్యజింప తగ్గదేను. అట్లు కర్మను త్యజించి గురువు నాశ్రయించి వేదాంత విచారముచేసి శబ్దాదివిషయములను నింద్రియములకు గోచరము కాకుండ జేసి సర్వేంద్రియములకు బ్రహ్మనే గోచరముగాజేసి స్వస్వరూపానుసంధాన మందాసక్తిగలవాడు కావలయును. ఎంతవరకు నజ్ఞానముచే అనాత్మయగు శరీరాదులయం దాత్మబుద్ధియుండునో యంతవరకు విధిచోదితమగు కర్మ నాచరింపవలయును. ఎప్పుడు శరీరాదులం దాత్మబుద్ధి లేకపోవునో, 'నేతి నే' తీతి వాక్యములచేత బ్రహ్మాతిరిక్త ప్రపంచమంతయు మిథ్యయనిన్ని, బ్రహ్మ సత్యమైనదనిన్ని నిశ్చయింపబడునో యప్పుడు కర్మల నాచరింప నక్కఱలేదు. ఇాతేగాక జీవేశులకు భేదమును బోగొట్టు విజ్ఞాన మెప్పు డుదయించునో యప్పుడు సూర్యోదయముచే నంధకారమువలె నవిద్య నశించిపోవును. వేదములు మొదలుగాగల ప్రబల ప్రమాణములచే జన్మించిన జ్ఞానముచే నశింపబడినయవిద్య తిరిగి స్వకార్యమగు సంసారమును తొలగజేయుటయందు సమర్థమైనదికాదు. 'తాడు' అని తెలియక పోవుటవల్ల జన్మించిన సర్పము 'తాడు' అని తెలియుటచే నివర్తనమై తిరిగి యెట్లు పుట్టుటలేదో యట్లే పరిశుద్ధమైనటువంటి శ్రవణమననములవల్లకలిగిన పరిపక్వనిధిధ్యాసనవల్ల (ఎడతెగని నిరంతర ధ్యానసమూహమువల్ల) జన్మించినజ్ఞానమువలన నష్టమగు నవిద్య తిరిగి యెప్పటికిని జన్మింపనేరదు. ఈతీరుగనశించిపోయిన యవిద్య తిరిగి

నుండు తత్ పదమునకు సోపాధికసర్వజ్ఞచైతన్యమర్థము, త్వం పద మునకు సోపాధికకించిజ్ఞచైతన్య మర్థము అసి పదమునకు అభేద మర్థము. ఇట్లుకాగా సర్వజ్ఞచైతన్యము కించిజ్ఞచైతన్యమైనదని విశి ష్టార్థము సంభవించినది. 'కోటీశ్వరుడు దరిద్రుడైనాడు.' అనునట్లు పరస్పరవిరుద్ధమగు నర్థమునుబోధించు తత్త్వమసీతివాక్య మెట్లు అద్వైతమందు ప్రమాణమగును? అనిన వాచ్యార్థములకు విరోధము సంభవించినపుడు 'సోఽయం దేవదత్తః' అను స్థలమందు సః అనుతచ్ఛబ్దము నకు పూర్వకాలీనకాశీస్థ దేవదత్తుడర్థము. అయంపదమునకు ఏతత్కా లీన గోదావరీతీరస్థ దేవదత్తుడర్థము. రెండును ప్రథమాంతవిభక్తులగు టచే నభేదలాభము. ఇట్లుకాగా పూర్వవర్షీయకాశీస్థ దేవదత్తుడు ఏత ద్వర్షీయగోదావరీ తీరస్థదేవదత్తాభిన్నుడని విశిష్టార్థము. ఐతే పూర్వ వర్షకాశీస్థలములకు, ఏతద్వర్షగోదావరీతీరములకు భేదముండుటచే నట్టి యిద్దఱికి నభేదమెట్లుసంభవించుననిన భాగత్యాగలక్షణసంభవింపగల దని శాస్త్రసిద్ధాంతము. (అనగా) పూర్వవర్షకాశీస్థత్వభాగములనున్ను, ఏతద్వర్షగోదావరీతీరస్థత్వభాగములను వదలివేసి కేవలవ్యక్తిమాత్రి మగు దేవదత్తుడే యాతచ్ఛబ్ద ఇదంశబ్దములకు లక్షణయా అర్థమును నిర్వచించి యభేదమును నుపపాదించినట్లు 'తత్త్వమసి' అనుస్థలములో గూడ సర్వజ్ఞత్వ కించిజ్ఞత్వాదిభాగములను వదలి చైతన్యమాత్రిమే జహదజహల్లక్షణయా అర్థమని నిశ్చయించుటచే శుద్ధచైతన్య రూపు లగు జీవేశ్వరులకు నైక్యముసంభవింపగలదని పరమసిద్ధాంతము.

పూర్వసృష్టియందు జ్ఞానోదయముకాకపోవుటచే ముక్తినొందని జీవులయొక్క ఫలోన్ముఖమగుపుణ్యాపాపములవల్ల ఈశ్వరునకు సృష్టి చేయవలెనని సంకల్పము కలిగినది. అట్టిసంకల్పమువల్ల జన్మించిన శబ్ద స్పర్శాద్యపంచీకృతభూతసముదాయముచే పంచీకృత ఆకాశ వాయు అగ్ని జల పృథ్వీరూపమగుపంచమహాభూతములు జన్మించినవి. అట్టి

నుండు తత్ పదమునకు సోపాధికసర్వజ్ఞచైతన్యమర్థము, త్వం పదమునకు సోపాధికకించిజ్ఞచైతన్య మర్థము అసి పదమునకు అభేదమర్థము. ఇట్లుకాగా సర్వజ్ఞచైతన్యము కించిజ్ఞచైతన్యమైనదని విశిష్టార్థము సంభవించినది. 'కోటీశ్వరుడు దరిద్రుడైనాడు.' అనునట్లు పరస్పరవిరుద్ధమగు నర్థమునుబోధించు తత్త్వమసీతివాక్య మెట్లు అద్వైతమందు ప్రమాణమగును? అనిన వాచ్యార్థములకు విరోధము సంభవించినపుడు 'సోఽయం దేవదత్తః' అను స్థలమందు సః అనుతచ్ఛబ్దమునకు పూర్వకాలీనకాశీస్థదేవదత్తుడర్థము. అయంపదమునకు ఏతత్కాలీనగోదావరీతీరస్థదేవదత్తుడర్థము. రెండును ప్రథమాంతవిభక్తులగుటచే నభేదలాభము. ఇట్లుకాగా పూర్వవర్షీయకాశీస్థదేవదత్తుడు ఏతద్వర్షీయగోదావరీ తీరస్థదేవదత్తాభిన్నుడని విశిష్టార్థము. ఐతే పూర్వవర్షకాశీస్థలములకు, ఏతద్వర్షగోదావరీతీరములకు భేదముండుటచే నట్టియుద్దతికి నభేదమెట్లుసంభవించుననిన భాగత్యాగలక్షణసంభవింపగలదని శాస్త్రసిద్ధాంతము. (అనగా) పూర్వవర్షకాశీస్థత్వభాగములనున్ను, ఏతద్వర్షగోదావరీతీరస్థత్వభాగములను వదలివేసి కేవలవ్యక్తిమాత్రిమగు దేవదత్తుడే యాతచ్ఛబ్ద ఇదంశబ్దములకు లక్షణయా అర్థమును నిర్వచించి యభేదమును నుపపాదించినట్లు 'తత్త్వమసి' అనుస్థలములో కూడ సర్వజ్ఞత్వ కించిజ్ఞత్వాదిభాగములను వదలి చైతన్యమాత్రిమే జహదజహల్లక్షణయా అర్థమని నిశ్చయించుటచే శుద్ధచైతన్య రూపులగు జీవేశ్వరులకు నైక్యముసంభవింపగలదని పరమసిద్ధాంతము.

పూర్వసృష్టియందు జ్ఞానోదయముకాకపోవుటచే ముక్తినొందని జీవులయొక్క ఫలోన్ముఖమగుపుణ్యాపాపములవల్ల ఈశ్వరునకు సృష్టిచేయవలెనని సంకల్పము కలిగినది. అట్టిసంకల్పమువల్ల జన్మించిన శబ్దస్పర్శాద్యపంచీకృతభూతసముదాయముచే పంచీకృత ఆకాశ వాయు అగ్ని జల పృథ్వీరూపమగుపంచమహాభూతములు జన్మించినవి. అట్టి

రుగనుపాధిభేదముచే భిన్నులగు జీవేశ్వరులకు లక్షణచే ఉపాధిపరిత్యాగముచేసి స్వస్వరూపమును బ్రహ్మనుగా శ్రవణ మనన నిధిధ్యాసన (ధ్యానము) క్రమముచే దెలిసికొనవలయును. ఈతీరుగ తత్త్వమసీతి వాక్యార్థమును విచారణచేయుటచే ఈజీవుడు పంచకోశములతోసంబంధములేనివాడును, అజుడును, అద్వితీయుడునునగును. (పంచకోశములను గూర్చి 914పుటలోజెప్పబడినది. అవస్థాత్రయమునుగూర్చి చెప్పబడుచున్నది.) జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు మూడును సత్త్వరజస్తమోగుణాత్మకమగు బుద్ధియొక్క ధర్మములేగాని యాత్మయొక్క ధర్మములుగావు. అట్లైనచో జాగ్రదవస్థలో నాత్మ ఉపలభ్యమానమగుచున్నది. స్వప్నసుషుప్తు లుపలభ్యమానమగుచుండుటలేదు. ఈ తీరుగానే స్వప్నసుషుప్తులందుగూడ జాగ్రదవస్థయొక్క యనుభవములేకపోవుటచేతను, ఆత్మానుభవముండుటచేతను నామూడవస్థలు బుద్ధిధర్మములే గాని యాత్మధర్మములుగావు. ఇట్టియవస్థలుమూడు ఉత్పత్తినాశనములు లేనివాడును, గుణత్రయాతీతుడును, వ్యాపకుడును, నసంగుడును, నానందరూపుడునునగు నాత్మకు సంభవింపనేరవు. చిద్రూపుడగు నాత్మకు దేహేంద్రియ ప్రాణమనస్సులతో నైక్యాభిమానముచే నెంతవరకు 'నేను బ్రాహ్మణుడను, నేను క్షత్రియుడను, నేను నల్లనివాడను, నేను గ్రుడ్డివాడను, నేను కుంటివాడను, నేను సంశయించుచున్నాను, నేను నిశ్చయించుచున్నాను.' అను బుద్ధివృత్తులు రజస్తమస్సులవల్ల కలుగుచుండునో యంతవరకు ఈసంసారము తప్పనేరదు. ఎప్పుడు గురుకటాక్షముచే వాక్యవిచారణచేత సత్త్వప్రధానమగు మనస్సుచే 'నేను దేహమునుగాను; ఇంద్రియములుగాను; మనస్సునుగాను; గాని చిద్రూపుడను; నిత్యుడను; సత్యుడను; ఆనందరూపుడను.' అని యీతీరుగ చిద్రసామృతమును నాస్వాదించునో యప్పుడు పిపాసాతురుడు నారికేళఫలమగ్రభాగమునుదకమును త్రాగి ఫలమున్న

త్యజించినట్లు నిస్సారమగు దేహేంద్రియాది ప్రపంచమును హేయమని త్యజించి నిర్భయుడగును. ఈమహాత్మ 'పుట్టువాడు, మృతినొందువాడు క్షీణించువాడు, వృద్ధిపొందువాడు, నూతనస్థైనవాడు, ఉన్నాడు.' అనుభావవికారము లాఱును లేనివాడు; సుఖస్వరూపుడు; స్వయముగ ప్రకాశించువాడు; సర్వవ్యాపకుడు; అద్వితీయుడు. ఇట్టి వీనియందు షడ్వికారములతోను గూడిన దుఃఖస్వరూపమగు నీసంసార మజ్ఞానము వలనగలిగిన భ్రిమవల్లనుంచి ప్రితీయమానమగుచున్నది. జ్ఞానోదయముచే నజ్ఞానము లీనమై భ్రమనివృత్తమై సంసారము నివర్తించును. (ఎట్టిభ్రమ సంసారకారణమనగా) సంకల్పవికల్పములకు గారణభూతమగు మాయలేనివాడును, చిత్స్వరూపుడును, సద్వయుడును, నిరామయుడును నగు బ్రిహ్మయందు 'అహ'మనేయధ్యాస ('నేను' అనుభ్రమ) సంసారకారణ భూతమైనది. ఇంతేకాక ఇచ్ఛ, ఉపేక్ష, రాగము, ద్వేషము, సుఖము, దుఃఖము ఈమొలుగాగల బుద్ధివృత్తులుకూడ సంసారకారణములే. ఈద్వంద్వములు బుద్ధివృత్తులేకాని యాత్మధర్మములుగావు. ఏమనిన సుషుప్తికాలమున ఆత్మ అనుభూయమానమగుచున్నది. రాగద్వేషము లనుభూయమానము లగుటలేదు. అందుచే నాద్వంద్వము లాత్మధర్మములు కానేఱవు. దహనశక్తి యగ్నిదే కాని యితరమైనదికాదు. ఐనను నుక్కుగుండునకు నగ్నికి పరస్పరసంబంధముచే ఉక్కుగుండు కాల్చుచున్నది యనునట్లు చిద్రూపుడగు నాత్మకున్ను, జడమగుబుద్ధికిన్ని అతిసాన్నిధ్యముచే (పరస్పరసంబంధముచే) జడమైన బుద్ధియొక్కధర్మమగు కర్తృత్వము ఆత్మకున్ను, ఆత్మధర్మమగుచైతన్యము బుద్ధికిన్ని సంక్రిమించుటచే నకర్తయగు నాత్మకు కర్తృత్వాధ్యాసచే సంసారము సంభవించినది. గురుసకాశము వల్ల వేదాంతవిచారమువల్ల గలిగినజ్ఞానబలముచేస్వస్వరూపమును నిరుపాధికముగా నిశ్చయించి'నేను ప్రకాశస్వరూపుడను,అజుడను, నిర్మలుడను,

విజ్ఞానఘనుడను, సంపూర్ణుడను, ఆనందమయుడను, సదాముక్తు
డను, బుద్ధీంద్రియాద్యతీతుడను.' అనియీరీతిగ స్వస్వరూపానుసం
ధానముచేయుటచే, బలమునుగోరువాడు రసాయనాద్యౌషధములను
సేవించి రోగవిముక్తుడై సుఖవంతుడగునట్లు శీఘ్రకాలములో నవిద్యా
విముక్తుడై యానందరూపుడగును." ఈతీరుగ నాత్మస్వరూపమును స్పష్ట
పఱచిన శ్రీరామునిగూర్చి లక్ష్మణుడు 'దేవా! యిట్టియాత్మస్వరూపమును
నేతీరుగ ధ్యానముచేయవలయునో యాతీరును నుపదేశింపు'మని ప్రార్థింప
రాము డిట్లు చెప్పెను. "లక్ష్మణా! ముముక్షువు రహస్యప్రదేశమున
పద్మాసనముమీద కూర్చున్నవాడై యింద్రియములను విషయముల
నుండిమఱలించి శమాది షట్కసంపన్నుడై, విద్యుక్తమగు గురుముఖముగల
వాడై గురూపదేశమువల్ల నిశ్చయింపబడిన యాత్మస్వరూపమును బ్రహ్మ
నుగా'బ్రహ్మైవాహ'మని ధ్యానము చేయవలయును. ఈతీరుగ ధ్యానము
చేయుచు లయమును జేయవలయును. అనగా సర్వప్రపంచమును
నాత్మయందు విలాపన చేయవలయును. ఎట్లనిన పాదాదిజానుపర్యంతము
పృథ్వీతత్త్వము. జానువు మొదలు నాభిపర్యంతము జలతత్త్వము. నాభ్యాది
హృదయపర్యంతము తేజస్తత్త్వము. హృదయాది కంఠపర్యంతము
వాయుతత్త్వము. కంఠాది భ్రూమధ్యపర్యంతము ఆకాశతత్త్వము.
భ్రూమధ్యాది ముఖాంతపర్యంతము అహంకారతత్త్వము. ముఖాం
తాదిద్వాదశాంతపర్యంతము ప్రకృతితత్త్వము.(ముఖాంతమునకు, బ్రహ్మ
రంధ్రమునకు మధ్యనుండు ప్రదేశమునకు ద్వాదశాంతమనిపేరు) తరు
వాత సహస్రారచక్రము. ఈతీరుగ తన శరీరమందలి తత్త్వములను విభ
జించి పృథివీతత్త్వమును పృథివీకారణమగు జలమందు లయమును జేయ
వలెను. ఈ తీరుగనే జలమును తేజమందు, తేజస్సును వాయువునందు,
వాయువు నాకాశమందు, ఆకాశము నహంకారమునందు, అహంకార
మును ప్రకృతియందు, ప్రకృతిని సహస్రారపద్మమందలి పరబ్రహ్మమునందు,

విలాపన చేయవలెను. దీనికే లయమని పేరు. (ఈలయవిధానము రహస్యముగనుక గురూపదేశమువలననే తెలియదగినది.) శాస్త్రకర్తలు పూజకన్న 10 రెట్లు జపము, జపముకన్న 10 రెట్లు ధ్యానము, ధ్యానముకన్న 10 రెట్లు లయము శ్రేష్ఠమనియ్యగలదని నిర్ణయించిరి. ఈరీతిగ ధ్యానలయములను జేయుచుండువాడు బాహ్యాంభ్యంతరవస్తు విజ్ఞానరహితుడై చిదానందస్వరూపుడగును. ఈరీతిగ లయమును జేసి సహస్రారకమలమందు పరమశివుని అకార ఉకార మకారాత్మక ఓంకారమంత్రముచే ధ్యానించవలయును. అకారమునకు జాగ్రదవస్థాభిమానియు, స్థూలోపాధికుడునునగు విశ్వుడు. ఉకారమునకు స్వప్నావస్థాభిమానియు, సూక్ష్మశరీరోపాధికుడును నగు తైజసుడు. మకారమునకు కారణశరీరోపాధికుడును, సుషుప్త్యవస్థాభిమానియునగు ప్రాజ్ఞుడు. అకారమును, అకారవాచ్యుడగు విశ్వుని ఉకారతైజసులందును, ఉకారమును, తైజసుని మకారప్రాజ్ఞులందున్ను, మకారప్రాజ్ఞులను చిన్మయుడును, సహస్రారపద్మమందు నివసించువాడును నగు పరబ్రహ్మమందున్ను విలాపన (లయము) చేసి 'సోఽహం' మిత్యాదిభావనాదార్ఢ్యముగలవాడై, ఉపాధి విముక్తుడై, స్వానందానుభవము చేయుచున్నవాడై, నిఖిలప్రపంచ విస్మృతికలవాడై, మేరుపర్వతమువలె చలించనివాడై, సముద్రమువలె గంభీరుడై నిత్య సుఖస్వరూపుడగును. అట్టి యభ్యాసముచే పరిశుద్ధుడును, కామక్రోధాది దూరుడును నగు యోగికి నేను సదా సాక్షాత్కారమిచ్చుదును. వ్యవసాయదారుడు కృషిచేయుటచే పంటఫలించి యున్నది. ఫలించదనే సమ్మకముచే కొంతధాన్యమును నిల్వచేసికొనెను. దినదినము వాడుకొను నిమిత్తము కొంతధాన్యమును గృహములో నుంచుకొనెను. ఇట్లుండగా అతి వర్షములచే ఫలించిన పంటయంతయు ధ్వస్తమైనది. సంచిత ధాన్యమును దొంగలు హరించిరి. పండినపంటయు,సంచితధాన్యము పోగా ప్రతిదినము వాడుక నిమిత్తము

గృహములో నుంచుకొనిన ధాన్యము నెట్లనుభవించునో యట్లే యోగియు జ్ఞానబలముచే సంచితకర్మలను నశింపజేసికొని, నిష్కామ కర్మానుష్ఠానముచే నాగామికర్మలను నశింపజేసికొని యవశ్యము ననుభవింపతగిన ప్రారబ్ధకర్మ ననుభవించుచు కొనను నాయందే లీనమగును. లక్ష్మణా! సంసారము సర్వదా భయశోకములకు గారణమైనది. కాన నట్టి సంసారమును వదలి యోగి శ్రుతిచోదితమగు నాత్మస్వరూపమును సర్వజగత్కల్పనాధిష్ఠానమగు నన్నుగా నెప్పుడు భావనచేయునో యప్పుడు సముద్రములో ప్రవేశించిన నదులు సముద్రరూపమును బొందునట్లును, పాలలో నిక్షిప్తమగు జలము పాలరూపమును బొందునట్లును నా స్వరూపమును బొందును. ఈ విధముగ నాత్మజ్ఞానయుక్తుడగు యోగికి ముత్యపుచిప్పనుజూచి రజితమను భ్రాంతిపొందినవానికి దాని సాన్నిధ్యమును బొందుటచే రజితమను భ్రాంతిపోయినట్లు బ్రహ్మయం దజ్ఞానమువల్ల గలిగిన జగద్భ్రమ నివర్తించును. ఇట్టి జ్ఞానము గలుగుటకు నాయొక్క సేవయే ముఖ్యకారణమగును. ఎంతవరకు జగత్తంతయు నారూపముగా గ్రహింపడో యంతవరకు నా యుపాసన నిష్కామముగా జేయుచు శ్రద్ధాభక్తి విశ్వాసములు గలవాడై యుండిన వానికి నేను సాక్షాత్కరింతును. లక్ష్మణా! శ్రుతిసిద్ధాంతమగు నీరహస్యమును నీకు నాయందలి భక్తి విశ్వాసములచే నుపదేశించితిని. కాన నీవు చక్కగా దీనిని విచారింపుము. అందుచే బంధనవిముక్తుడవై నిత్యసుఖమును బొందగలవు. నాయందు భక్తి విశ్వాసములు గలవాడై యెవడు నేను చెప్పిన యీ యర్థమును చక్కగా విమర్శించి యనుష్ఠానముచేయునో వాడు సర్వపాపవిముక్తుడై ముక్తిని బొందగలడు. సోదరా! పరిదృశ్యమానమగు జగత్తంతయు మాయయే. అట్టి మాయామయమైన దానినిగా నీజగత్తును నీవు నిశ్చయింపుము. నన్ను సర్వదా భావనచేయుచుండుము. సుఖవంతుడవగుదువు. ఎవడు గురు

## ౭వ. అధ్యాయము.

### రాముడు శత్రుఘ్నుని మధురాభిషిక్తునిగఁ జేసి లవణునిపైకి యుద్ధమునకు బంపుట.

---

రాముడు కొలువుదీర్చియుండ లక్ష్మణుడు నాతనికి సహాయభూతుడై కార్యములను జరుపుచుండెను. ఒకనాటి యుదయమున నతడు కాలకృత్యములను దీర్చి సభలోనుండ నక్కడకు సుమంత్రుడు పోయి 'యమునా తీరవాసులగు భృగుపుత్రుడగు చ్యవనుడు మొదలగు ఋషులు రాజద్వారమున నిలిచియున్నారు. కొందరగ మిమ్ము జూచుటకు మీయాజ్ఞకొఱకు నన్ను బంపియున్నా'రని చెప్పెను. ఇట్లు సుమంత్రుడు తెలుప నతడు 'వారిని లోనికి దీసికొని రమ్మ'ని సెలవిచ్చెను. ద్వారపాలకుడు రాజాజ్ఞను శిరసావహించి చేతులు జోడించుకొని వారిని లోనికి బ్రవేశపెట్టెను. నూఱునందికంటె నెక్కువగనున్న ఋషు లన్నితీర్థములలోని నీటితోను నింపిన కలశలను, ఫలమూలములను బట్టి సభకు వచ్చి వానిని రాముని కిచ్చిరి. అతడు తీర్థములను

---

రహితుడనగు నన్ను మనసార గుణవంతునిగా ధ్యానముచేయునో వాడు నా స్వరూపుడై సూర్యుడు తన కిరణములచే జగత్తును పవిత్రము చేయునట్లు స్వపాదరేణువులచే త్రిలోకములను పవిత్రము చేయును. వేదాంతములచే దెలిసికొనదగిన స్వరూపముగల నాచే వచింపబడిన శ్రుతిసమ్మతమగు నీగీతశ్లోకములనుగాని, తదర్థమునుగాని యెవడు శ్రద్ధాభక్తులతో పఠించునో, మననము చేయునో వాడు మద్రూపమును బొందగలడు." ఇట్లు రాముడు లక్ష్మణున కుపదేశించెను.

ఫలమూలమును బుచ్చుకొని వారికి తగిన ట్లాసనములను జూప వారు దర్భాసనములును, లేడిచర్మములునుగల యాసనములమీదను, బంగారు నాసనములమీదను తమకు దగినట్లు కూర్చుండిరి. తరువాత రాముడు వారికి నమస్కరించి వినయముతో నిట్లు విన్నవించెను. 'మీరు వచ్చుటకు గారణమేమి? నేను మీ కేమిచేయవలెను? నే నన్నివిధముల సుఖమును గలుగజేయుటకై మహర్షులయాజ్ఞకు సిద్ధముగనుంటిని. ఈ రాజ్యము, నాహృదయములోనున్న జీవితము, సమస్తము ద్విజులకొఱకే యని నిజమును బలుకుచున్నాను.' ఇట్లు రాముడు తెలుప యమునాతీర వాసులగుఋషులు 'బాగుబా' గని పలికి గొప్పసంతోషమునొంది 'నరశ్రేష్ఠా! భూలోకములో నీవు తప్ప నితరులిట్లు పలుక లేరు. ఇట్లు పలుకుట నీకే తగియున్నది. మహాబలులగు రాజు లనేకులు తాము చేయవలసినకార్యములను జేయకుండ గతించిపోయిరి. వారు కార్య భారమును దెలిసికొని దానిని నెఱవేర్చుటయందు ప్రతిజ్ఞను జేయలేదు. నీవు బ్రాహ్మణులందలిగౌరవముచే కారణమును దెలిసికొనకుండ ప్రతిజ్ఞను జేసితివి. కనుక నీవు తప్పకుండ కార్యములను జరిపెదవు. అనుమానములేదు. గొప్పభయములనుండి ఋషులను తప్పించుటకు నీవు తగినవాడ' వని విన్నవించిరి.

రాముడు వారివిన్నపమును విని 'మీకేలభయముకలిగెనో నేను చేయవలసినకార్యమేదియో తెలుపు'డని యనెను. అప్పుడు భృగుపుత్రుడగు చ్యవనుడు * మధువుచరిత్రమును, వాడు లోకములో నంతమునొందుటయు, వానిపుత్రుడగులవణాసురునిదుర్మార్గమును వివరముగ దెలిపి మధువుపొందినశూలమును, దానిప్రభావమును జెప్పి 'లవణుడు మూడులోకములను, ముఖ్యముగ ఋషులను బాధించుచున్నాడు. రామా! నీవే మాకు ముఖ్యమగుగతి. ఇదివఱకనేకరాజులను

---

*౧ వ, ప్రకరణము, ౧.. వ అధ్యాయము, మధులవణాసురులు ఘాదుఘ్ను,

భయమునుజెందిన మే మభయము కోరితిమి; కాని వారు మమ్ము రక్షింపలేకపోయిరి. నీవు రావణుని బంధుపరివారములతో గూడ జంపితివని విని నిన్ను మేము శరణుబొందితిమి. ఈలవణు డనేకజంతువులను, మనుష్యులను జంపి తినివేయుచున్నాడు; మధువనమున నివసించుచున్నా'డని పలికెను.

తరువాత రాముడు 'మీరు భయమును విడువుడు. నే నారాక్షసుని జంపించెద' నని ప్రతిజ్ఞచేసి యక్కడనుండుతనతమ్ములతోను, నితరులతోను 'వీరులారా! లవణుని నెవరు చంపెదరు? భరతశత్రుఘ్నులారా! మీరు చంపెదరా?' యనియడిగెను. అంతట భరతుడు 'నేను చంపెదను. ఆపని నాకప్పజెప్పు'డని విన్నవించెను. అప్పుడు పరాక్రమశాలియగు శత్రుఘ్నుడు బంగారునాసనమునుండి లేచి రామునకు నమస్కరించి 'భరతు డిదివఱకు చాలకార్యములను జరిపియుండెను. మీరు వనవాసమునకు వెళ్ళినప్పుడు మిమ్ముగూర్చి విచారించుచు మీరు వచ్చువఱకు నాత డయోధ్యను రక్షించెను. భూమియందు శయనించుచు, ననేకదుఃఖముల ననుభవించుచు, ఫలమూలములదినుచు నారచీరలను గట్టి నందిగ్రామమున నివసించెను. మీపరిచారకుడనగు నే నుండ నింకను నతడెక్కువగ కష్టముల ననుభవించుటయొప్పద'ని విన్నవించెను. శత్రుఘ్నునియీమాటలను రాముడు విని 'అట్లేయగుగాక! నాయాజ్ఞను నీవు నెఱవేర్పుము. నేను మధునగరమునకు నిన్నభిషేకించెదను. భరతుని నీవు ప్రేమించితివేని వాని నిక్కడనుంచి నీవే వెళ్లుము. నీవు చోరవచేయుటలో సమర్థుడవు; విద్యలు బాగుగ నేర్చినవాడవు. రాజు తనశత్రువు నోడించి వానిస్థానమున మఱియొక రాజును నియమించనియెడల నతడు నరకమునొందును. కనుక నీవు పాపుడగు లవణాసురునిజంపి నేనుచెప్పినప్రకారము వానిరాజ్యమును ధర్మమ్ముగ నేలుము. నామాటలకు నీ వడ్డు చెప్పకూడదు. తమ్ముడగు వా

డన్నయాజ్ఞను తప్పక నేఱవేర్చవలెను. నిన్ను వసిష్ఠాదులచే క్రమముగ మంత్రములతో నభిషేకముచేయించెద' నని సెలవిచ్చెను.

రామునిమాటలను శత్రుఘ్నుడు విని మిక్కిలి సిగ్గును బొంది మెల్లగ నిట్లు పలికెను. 'నాకంటె పెద్దవాడుండ చిన్నవాడనగు నన్ను మీా రెట్లభిషేకించెదరు? ఈవిషయములో మన కధర్మము కనిపించుచున్నది. మీాయాజ్ఞను తప్పకజరుపవలెను. దాని నతిక్రమించుటకు వీలు లేదు. నాకంటెపెద్దవాడగు భరతునకు నెదురుగ చిన్నవాడనగు నేను మాట్లాడకూడదని మీావలనను, వేదములనుండియు వినియుంటిని. నేను లవణుని యుద్ధములో జంపెదనని ఘోరమగుచెడుమాటను పలికినందులకు నాకు దుర్గతికలుగును. నాకంటె పెద్దవాడు మాట్లాడుచుండ పరలోకమును రాకుండజేయునదియు, నధర్మమునునగు ప్రత్యుత్తరమును నేను చెప్పకూడదు. కనుక నేను మీాకు మఱియొకప్రత్యుత్తరముచెప్పి మరియొకసారిదండనకు పాత్రుడనుగాను. నేనుమీాకోరికను నెఱవేర్చెదను. నేను చేసినయధర్మమునకు నన్నుదండింపుడు.' ఇట్లు శత్రుఘ్నుడు పలుక రాముడుసంతోషించి లక్ష్మణభరతులకు 'అభిషేకమునకుగావలసినవస్తువులనుజాగ్రత్తగ దెప్పింపుడు. ఈ దినముననే దుర్జయుడగు శత్రుఘ్నుని నభిషేకించెదను. పురోహితుడగువసిష్ఠుని, బ్రాహ్మణులను, ఋత్విజులను, వర్తకులను, మంత్రులను రప్పింపు' డని యాజ్ఞనీయ వారట్లు చేసిరి. రాజపురోహితు డభిషేకమునకుగావలసినవస్తువులతో సిద్ధమైయుండ రాజగృహమునకు రాజులు, బ్రాహ్మణులు వెళ్ళిరి. శత్రుఘ్ను డభిషిక్తుడుకాగా రామునకును, పట్టణవాసులకును, బ్రాహ్మణులకును గొప్పసంతోషముకలిగెను. అప్పుడతడు సూర్యునివలె ప్రకాశించెను. కౌసల్యయు, సుమిత్రయు, కైకేయియు, నితరరాజస్త్రీలును నతనిని దీవించిరి. యమునాతీరవాసులగు ఋషు లిదంతయు జూచి లవణుడు చచ్చుట నిశ్చయమని యాలోచించిరి. తరువాత రాముడు శత్రుఘ్నుని

తనసమీపమున నిడుకొని వానికి తేజము నభివృద్ధిచేయుచు మంచిమాట లిట్లనెను. "ఈ బాణము తేజోయుక్తమైనదియు, వ్యర్థముకానిదియు నైయున్నది. దీనితో లవణుని జంపుము. ఇది నిప్పువలె వాడియగు నంచులుకలది; మేరుమందరములవలె నెదురునిలువఁదగినది; యుద్ధములో నపజయము లేనిది. దీనిచే దానవశ్రేష్ఠులను, నసురశ్రేష్ఠులను జంపుటచే నెత్తురంటి యున్నది. మంచి గంధముచే పూజింపఁబడుటచే దీనికి గంధమంటియున్నది. స్వయంభువుడు, నారాయణుండు నగుమహావిష్ణువు సముద్రమున శయనించి నప్పుడు దేవాసురులు చూడకుండునట్లును, సర్వభూతములకు గనబడ కుండునట్లును నీబాణము సృజింపఁబడెను. మహాత్ముఁడగు మధుకైటభుల యొక్కయు, సర్వరాక్షసులయొక్కయు నాశనముకొఱకై యాతఁడు దీనిని సృజించెను. పిమ్మట నతడు దీనితో వారిని జంపి మూడులోకము లను సృజించెను. పంచభూతములకు గొప్పభయముగలుగునని నేను దీనిని రావణుని జంపుటకుపయోగింపలేదు. శివుడు మధువున కిచ్చిన గొప్పశూలమును లవణుడు తనయింటిలో నుంచుకొని పలుమార్లు దానిని పూజించుచుండును. దానిని వాడు గృహములో విడిచి యాహారమునకై యన్నిదిక్కులకు బోవుచుండును. ఎవ్వడైనను వానితో యుద్ధమునకు వచ్చిన లవణుడు దానిని బట్టి శత్రువుతో యుద్ధముచేసి వానిని జంపును. కనుక వాడాయుధమునుబట్టి పట్టణము నకు రాకమునుపే నీ వాయుధములతో పట్టణద్వారమున నిలువుము. వాడు తన యింటిలోనికి వెళ్లకపూర్వమే నీవు వానిని రణమునకు బిలి చిన వాడు నీచేత జచ్చును. మరియొకతీరున జరిగిన వాడు చంపబడడు. నేను చెప్పినట్లుచేసిన వాడు మరణము పొందును. అతిక్రమింప శక్యము గాని శివుని శూలప్రభావమును నీకు దెలిపితిని." ఇట్లు రాముడు శత్రుఘ్నునితో జెప్పి యింకను నిట్లు పలికెను.

"నీతో 4 వేల సైనికులును, 2 వేల రథములును, నూఱేనుగు లును వచ్చును. మంచి దుకాణములుగల వీధులుండు శిబిరములను,

నటనర్తకులను, పదిలక్షల బంగారునాణెములను, వెండినాణెములను, మంచిబట్టలను, ధనవాహనములను నీవు కావలసినన్ని తీసికొనిపొమ్ము. నీసేనకు బాగుగ జీతములిచ్చియు, కానుకలిచ్చియు, మంచిమాటలాడియు దానినెక్కువగ సంతోషపఱుపుము. మనుజునకు మంచిసేనకులును, స్నేహితులును గలచోట భార్యలును, బంధువులును నవసరము లేదు. నీవు గొప్పసేనను ముందుబయలు దేఱదీసి పిమ్మట నీవొక్కడవే ధనస్సునుబట్టి మధువనమునకు వెళ్లుము. నీవు యుద్ధముకోరి వచ్చుచున్నావని లవణునకు తెలియకుండునటులను, వాడనుమానము పడకుండునటులను నీవు వెళ్లుము. వానికింకొకవిధముగ మరణములేదు. వాని దృష్టిలోపడిన శత్రువును వాడు చంపును. ఎండకాలము పూర్తియైన పిదప వర్షకాలపు రాత్రి రాగ వానిని నీవు చంపవలెను. అదియే దురాత్ముడగు వానికి తగిన మరణకాలము. నీసైనికులు మహాత్ములననుసరించి వెళ్ళవలెను. ఎండకాలము చివరను వారు * గంగానదినిదాటవలెను. అక్కడ గంగాతీరమున బలములను నిలిపి నీవు ముందు శీఘ్రముగ ధనస్సునుబట్టి వెళ్లుము." ఇట్లు రాముడు పలుక శత్రుఘ్నుడు గొప్పబలముగల సేనాధిపతులను బిలిపించి 'మీరు ప్రయాణములో మీకొఱకు వేయబడిన మంచిశిబిరములలో నివసింపుడు. ఎవరికిని బాధ కలుగగూడ' దని పలికి వారికి సెలవిచ్చి సేనను ముందు బయలుదేఱదీసెను. తరువాత నతడొకమాసము రాముని యొద్దనుండి తన తల్లులగు కౌసల్యకు, సుమిత్రకు, కైకేయికి నమస్కరించి రామునకు ప్రదక్షిణముచేసి తన శిరముతో ప్రమొక్కెను. తనయన్న సెలవీయ నతడు లక్ష్మణ భరతులకు చేతులుజోడించి మిక్కిలి వినయముతో పురోహితుడగు వసిష్ఠునకు ప్రదక్షిణముచేసి బయలు దేఱెను.

---

* ఈప్రకరణములో ౪వ. అధ్యాయము మధ్యనుండు పటమును జూడుము,

## ౮౫. అధ్యాయము.

## కుశలవుల జననము.

శత్రుఘ్నుడు లవణాసురునిపైకి తన బలములను ముందు బంపి తాను రామునియొద్ద నొక మాసముండి శ్రావణమాసమున నొక్కడే యుద్ధమునకు బయలుదేఱి దారిలో రెండు రాత్రులుండి వాల్మీకి యాశ్రమమునకు వెళ్ళెను. అక్కడ నతడా మహర్షికి నమస్కరించి 'నాయన్న కార్యమువలన నిచ్చటికి వచ్చితిని. ఈరాత్రి యిక్కడుండి రేపటి యుదయమున పశ్చిమదిక్కునకు బోయెద'నని పలుక వాల్మీకి పెద్దనవ్వు నవ్వుచు 'నీరాక లెస్స. నాయాశ్రమము రఘుకులమువారికి స్వాశ్రమమువంటిది; గాన నాయొద్దనుండి శంకలేక పాద్యమును, నర్ఘ్యము నను బుచ్చుకొని సుఖముగ నాసనమున గూర్చుండు'మని చెప్పెను. అతడు దాని కంగీకరించి ఫలమూలములను భుజించి మిక్కిలి తృప్తిగో నుండెను. తరువాత నతడా యాశ్రమమునకు తూర్పుననున్న యజ్ఞ చిహ్నలుగల శాల యెవరిదని యాఋషిని నడుగ నత డిక్ష్వాకువంశ జుడగు ప్రవృద్ధనామాంతరముగల * సౌదాసుని చరిత్రమును, నక్కడ నత డశ్వమేధ యజ్ఞము చేయుటయును, దాని చివరను నతడు వసిష్ఠు నిచే శాపము నొందుటయును, నతనికి కల్మాషపాదుడను పేరువచ్చు టయును వివరముగ నతనికి దెలిపెను. తరువాత శత్రుఘ్నుడు వాల్మీకికి నమస్కరించి యతని పర్ణశాలలో ప్రవేశించి నిద్రించెను.

ఆనాటి యర్ధరాత్రి సమయమునసే సీత బాలచంద్రునివంటి తేజముగలవారును, దేవపుత్రులవలె నుండువారును నగు కవలపుత్రు లను గనెను. అప్పుడు మునికుమారులు వాల్మీకియొద్దకువచ్చి యాతని

* 6వ. ప్రకరణము. 3వ అధ్యాయము, దశరథుని పూర్వులు. ప్రవృద్ధుని చరిత్రము 209 పుట చూడుము.

కీ ప్రియవార్తను దెలిపి 'బాలురకు భూతములనుండి బాధ తొలగు నటుల రక్ష చేయు'డని కోరిరి. ఆమాటలను వాల్మీకి విని మిక్కిలి సంతోషమును బొంది యాపిల్లలుండు చోటునకు బోయి భూతరాక్షసాదులవలన వారికి బాధ కలుగకుండునటుల రక్షచేసెను. ముందు పుట్టినవానికి కుశలను (దర్భలను) బట్టి మంత్రములచే రక్షచేయుటచే 'కుశు'డనియు, వెనుకవానికి దర్భఖండ (లవ) ములచే రక్షచేయుటచే 'లవు'డనియు పేర్లు పెట్టెను. ఇట్లు వాల్మీకి వారికి రక్షచేసి యారక్ష వస్తువులను మునిపత్నులకీయ వారు వానిని బుచ్చుకొని పిల్లలకు గట్టి పిల్లల గోత్రనామములను, వారి తలిదండ్రుల నామములను గీర్తించిరి. దీనిని శత్రుఘ్నుడు విని సీతయుండు పర్ణశాలకు వెళ్లి 'తల్లీ! యిది యంతయు దైవయోగ'మని పలికెను. ఇట్లా రాత్రి గడచెను.

---

## ౬౯. అధ్యాయము.

## లవణాసురుని మరణము; మధురవృద్ధి.

కుశలవులుజన్మించిననాటిరాత్రి గడచినపిదప తెల్లవారు జామున శత్రుఘ్నుడు లేచి కాలోచితకృత్యములను దీర్చుకొని వాల్మీకికి నమస్కరించి యతనివద్ద సెలవుపుచ్చుకొని యాయాశ్రమమునుండి పశ్చిమదిక్కునకేగెను. దారిలో నతడు 7 రాత్రులుండి యమునాతీరముననుండు ఋషులయాశ్రమమునకు వెళ్లెను. ఒకరాత్రి యతడక్కడ నిలిచెను. అప్పుడు వారనేకకథలను నతనికి జెప్పిరి. శత్రుఘ్నుడు లవణాసురునిబలమునుగూర్చియు, శూలమును గూర్చియు, దానిచేమడిసిన రాజులవృత్తాంతమును గూర్చియు భృగుపుత్రుడగుచ్యవనుని నడుగ

నతఁడు లవణుఁడు ఘోరసాహసముగలవాఁడనియు, లెక్కకుమించినరాజులతనిశూలముచే మడిసిరనియు, * మాంధాతకూడ వానిచేతనే మరణమునొందెననియు దెలిపి యుండెను [illegible]. 'ఈపటిసమయమున నీవు సందేహములేకుండ లవణుని వధించెదవు. వాఁడు మాంసమునకై శూలాయుధమును బట్టకుండ వెడలియున్నాఁడు. అప్పుడు వానితో శీఘ్రముగ నీవు యుద్ధముచేసిన నీకు జయముగల్గును. వాఁడు మడియుటచే నన్నిలోకములకు శుభముగలుగును.' ఇట్లు చెప్పుచుండ నారాత్రిగడచెను.

ఆమఱునాటి యుదయమున లవణాసురుఁడు మాంసముకొఱకు తనమధురాపట్టణమును విడిచి బయటికి పోవ శత్రుఘ్నుఁడు యమునానదిని దాటి ధనుర్ధరుఁడై మధురాపురద్వారమున నిలిచెను. మధ్యాహ్నసమయమునకు నారాక్షసుఁడు వేలకొలఁదిజంతువులను జంపి వానిని మోసికొని పురద్వారముకడకువచ్చి ధనుస్సునుబట్టినిలిచిన శత్రుఘ్నుని జూచి యిట్లుపలికెను. 'నీ విక్కడేమిచేయుచున్నావు? ఆయుధములను బట్టిన నీవంటివారి ననేకులను నేను రోషముచే దినియుంటిని. నీవు మరణమును గోరుచుంటివా? నీచపురుషా! నీవు నాకు సంపూర్ణముగ మంచియాహారమగుదువు. దుర్బుద్ధీ! నీవు నాముఖమున స్వయముగ ప్రవేశించెదవాయేమి?' ఇట్లు లవణుఁడు పలుకుచు మాటిమాటికి పెద్దనవ్వునవ్వుచుండ శత్రుఘ్నునకు రోషముచే కంటనీరు కారెను. అతఁడు తనశరీరమునుండి తేజముతోఁగూడిన కిరణములు బయలువెడల క్రోధముతో నిట్లు పలికెను. 'దుర్బుద్ధీ! నేను నీతోఁ యుద్ధముచేయ గోరుచున్నాను. నేను దశరథునిపుత్రుఁడను; బుద్ధిమంతుఁడగు రాముని తమ్ముఁడను;ఎల్లప్పుడు శత్రువులనుజంపుశత్రుఘ్నుఁడను. నేను నిన్నుజంపు

* 6వ ప్రకరణము ౩వ. అధ్యాయము. దశరథునిపూర్వులు మాంధాత చరిత్రము 198 పుటచూడుఁడు.

టకు వచ్చితిని. నీతో ద్వంద్వయుద్ధమును జేయగోరుచున్నాను. అన్ని జీవులకు శత్రుడవగు నీవు నాదగ్గఱనుండి జీవములతో వెళ్ళలేవు.' ఇట్లు శత్రుఘ్నుడు బలుక రాక్షసుడు పెద్దనవ్వునవ్వుచు నిట్లనెను. 'దైవయోగమున నీవు నాకు దొరకితివి. స్త్రీనిగూర్చి నామాతామహితండ్రి యగు మాల్యవంతుని తమ్ముని కూతుకుకై కసి యనునామె కుమారుడగు రావణుని రాముడు చంపెను. రాము డతనికులమును నాశనము చేసినందులకు నే నాయపవాదమును నాలోచింపక శాంతినొందితిని. పూర్వము నేను రాజులను తృణప్రాయముగ దలచి చంపియుంటిని. యుద్ధమునకు రాబోవువారలనుగూడ నట్లు చేసెదను. నీవు యుద్ధము కోరినందున నీతో యుద్ధముచేసెదను. నే నాయుధముతెచ్చుకొను వఱకు నిలిచినయెడల నీకోరికజరుగును.' ఇట్లు లవణాసురుడు పలుక శత్రుఘ్నుడు 'నేను జీవించియున్నంతకాలము నీ వెక్కడికి బోయెదవు? దైవయోగమున గనబడినశత్రువును బాగుగ దెలిసినవాడు విడువడు. బుద్ధిహీనుడెవడైనను శత్రువునకు కొంతవ్యవధి యిచ్చినయెడల తిరిగి తాను వానిచే జంపబడును. మూడులోకములకు శత్రుడవగు నిన్ను వాడిబాణములతో గొట్టి యమలోకమునకు బంపెదను. అప్పుడు జనులు భయమును విడిచి సుఖముగ తిరిగెద' రని పలికెను.

అతని మాటలను గొప్పరూపముగల రాక్షసుడు విని చాలకోపమునుబొంది 'నిలువుము; నిలువు' మని పలికి చేతులను బాగుగ విఱుచుకొని, పండ్లు పటపటకొఱికి నీచునివలె శత్రుఘ్నుని యుద్ధమునకు బిలిచెను. అప్పుడు శత్రుఘ్నుడు వానికిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. 'నీచే జయింపబడినరాజులవలె శత్రుఘ్నుడుపుట్టలేదు. కనుక నీవు నాబాణములచే గొట్టబడి యమలోకమునకు బొమ్ము. రావణునిమరణమును దేవతలు, బ్రాహ్మణులు, పండితులు చూచినట్లులనిప్పుడు నా బాణములచే జంపబడిన నిన్ను ఋషులు చూచెదరు. అప్పుడు

పట్టణములలోను, గ్రామములలోనునుండు జనులు క్షేమముగనుండెదరు. నేను విడుచు బాణములు నీహృదయమును బ్రవేశించును కాచుకొమ్ము.' ఇట్లు శత్రుఘ్నుడు పలుక లవణుడు గొప్పక్రోధమును బొంది యతనిపై పెద్దచెట్టు నొకదానిని విసరెను. అతడు బాణములచే దానిని నూఱుముక్కలుగగొట్టెను. తరువాత రాక్షసుడు రామానుజునిపై ననేకవృక్షములను విసర వానినిగూడ నతడు బాణములచే విఱుగగొట్టెను. తరువాత శత్రుఘ్నుడు లవణునివక్షముపై ననేకబాణములను విడిచినను వాడు బాధనొందలేదు. పిమ్మట వాడు పెద్దనవ్వు నవ్వుచు నవలీలగ నొకచెట్టును పెఱికి తెచ్చి యతనితలమీదగొట్ట నతని యవయవములు కదలెను. అతడు మూర్ఛనొంది పడిపోయెను. ఋషులును, దేవతలును, గంధర్వులును, నప్సరసలును 'హా!హా!' యనిపలికిరి. శత్రుఘ్నుడు చనిపోయెననుతిరస్కారభావముతో వాడు తనయింటిలోనికిప్రవేశింపలేదు; తనశూలమునుగూడ బట్టుకొనిరాలేదు. కాని వాడు 'శత్రుఘ్నుడు చచ్చె'నని తలచి తాను తెచ్చినజంతువులను మోయుచుండెను. ఒకముహూర్తములో శత్రుఘ్నుడు తెలివినొంది తనధనస్సునుబట్టి రాక్షసునిద్వారమున నిలిచి రాముడు తనకిచ్చిన గొప్పబాణమును దీయ నన్నిదిక్కులు దానితేజముచే ప్రకాశించెను. అది ప్రళయకాలాగ్నివలె మండుటచే భూతములన్నియు దానిని జూచి భయమునొందెను. దేవతలును, నసురులును, గంధర్వులును, మునీంద్రులును, నప్సరసలుమొదలగువారును సుఖమేమియులేక బ్రహ్మయొద్దకు వెళ్ళి యతనికి తమభయమును దెలిపిరి. అప్పు డతడు "మీకుభయమును గలిగించినయీయస్త్రమును పూర్వము 'మధు కైటభు' లను రాక్షసులను వధించుటకు సనాతనుడగు విష్ణువు సృష్టించెను. ఆ బాణపుసంగతి పూర్తిగ విష్ణువునకు మాత్రమే తెలియును. అది విష్ణువు యొక్క-పూర్వావతారము. దానితో శత్రుఘ్నుడు లవణుని వధించు"

నని పలికెను. దేవతలు మొదలగువా రామాటలను విని సంతోషించి శత్రుఘ్నలవణాసురులు యుద్ధముచేయుచోటికి తిరుగవచ్చి యాకాశమునుండి దానిని జూచుచుండిరి. శత్రుఘ్నుడు వారిని జూచి పెద్దసింహనాదముచేసి తిరుగ లవణుని యుద్ధమునకు బిలిచెను. వాడు క్రోధముతో యుద్ధమునకు సిద్ధమైయుండ నతడు ధనస్సునారిని తన చెవులవఱకు బాగుగలాగి యాగొప్పబాణమును వానివక్షముపై విడువ నది వానిహృదయమును జీల్చిరసాతలమునకు బోయి దేవతలు కీర్తించుచుండ తిరుగ శత్రుఘ్నునిచేతిలోనికి వచ్చెను. ఆదెబ్బతో లవణుడు భూమిపై బడి మరణించెను. సమస్తభూతములు చూచుచుండ వాని గృహములోనున్న శూలము శివునికడకేగి యతనివశమయ్యెను. అప్పుడు దేవతలును, మహర్షులును, గంధర్వులును, సిద్ధులును, నప్సరసలును దైవయోగమున జయముకలిగె ననియు,భయమును బోగొట్టుకొంటిమనియు కేకలువేసి శత్రుఘ్నుని గీర్తించిరి. ఇట్లతనిచే విడువబడిన యొక్కబాణముచే మూడులోకములవారి భయము తొలగెను. శత్రుఘ్నుడు ధనస్సునుబట్టి వేయి కిరణములుగల సూర్యునివలె ప్రకాశించెను.

అప్పు డింద్రాదిదేవతలు శత్రుఘ్నుని వద్దకు వచ్చి మంచిమాటలతో 'దైవయోగమున నీవు లవణునిజంపి జయమునొందితివి. వరమును గోరుము. నీవిజయమునుగోరివచ్చిన మేము నీకు వరమిచ్చెదము. మాదర్శనము వ్యర్థముకాదని పలికిరి. అతడు వారికి నమస్కరించి దేవతలచే నిర్మింపబడిన యీమధుపురములో నేను శీఘ్రముగ సేనతో నిలిచి విడియునటుల కరుణింపుడు. ఇదియే నాకు గొప్పవర'మని మనవి చేసెను. అప్పుడు వా రతనికి "ఇది నిశ్చయమగుగాక! రమ్యమగు నీపురము శూరులగు సైనికులుకలదై 'శూరసేనా'యని నామమొందు" నని వరమిచ్చి స్వర్గమునకు బోయిరి, తరువాత శత్రుఘ్నుడు తనసేన

లను రప్పించి యాపట్టణమున శ్రావణమాసమున విడిసెను. అతడు 11సంవత్సరములలో దానిని దేవపట్టణమువలె గట్టించి యచట తన సేనలను నిలిపి యాదేశమున ప్రజలకేమియు భయము లేకుండునట్లు చేసెను. పొలములు చేలతో నిండియుండెను. సరియగుకాలమున వర్షములు కురియుచుండెను. పురుషులు పరాక్రమముగలిగి రోగములు లేకయుండిరి. మధురాపట్టణము యమునాతీరమున నర్థచంద్రాకారమువలెనుండి మంచిమేడలతోను, నాల్గువీథులుగల ప్రవేశములతోను, సంగళ్లతోను, మంచివీథులతోను ప్రకాశించుచుండెను. ఆపట్టణమున నాలుగువర్ణములవారు నివసించిరి. అది మంచివ్యాపారముకలిగియుండెను. అపరిశుభ్రముగనున్న లవణునిగృహమును శత్రుఘ్నుడు బాగు చేయించి చాలరంగులువేయించి సంతోషకరముగనుండునట్లు చేసి యక్కడ తోటలను, విహారస్థలములను, చెరువులను నిర్మించెను. దేవతలును, నితరరాష్ట్రములోనిజనులును నక్కడకు వచ్చుచుండిరి. శత్రుఘ్నుడు వారినిజూచి గొప్పసంతోషమును బొందుచుండెను. ఇట్లు 11సంవత్సరములు గడచినపిమ్మట 12వ సంవత్సరము ప్రారంభించినతరువాత శత్రుఘ్నునకు రామునిజూడవలెనని యభిలాషకలిగెను.

---

## ౧౦ వ. అధ్యాయము.

### శత్రుఘ్నుడు మధురనుండి రామునియొద్దకు బోవుట.

---

శత్రుఘ్నుడు 11సంవత్సరములు మధురలో నివసించి 12 వ సంవత్సరమున 7—8మాసములుగడచినతరువాత స్వల్పపరివారముతో నయోధ్యకు బోదలచెను. అతడు తనసేను దిగబెట్టవచ్చిన వసంతులను, సేనానాయకులను వెనుకకు బంపి నూంచిరథమెక్కి నూఱుమందిగుఱ్ఱపు

కొంతులతో నయోధ్యకు వెళ్లుచుండెను. దారిలో నతడు వాల్మీకియాశ్రమమునకు వెళ్ళి యాఋషివద్ద నర్ఘ్యమును, పాద్యమును బుచ్చుకొని యతనికి నతిథియాయెను. ఆఋషి వానియనుచరులకు భోజనము పెట్టించెను. తరువాత నామహర్షి శత్రుఘ్నునకు ననేకవిధములగు కథలను జెప్పి 'పాపియగు లవణునిజంపుట యను గొప్పకష్టమగుకార్యమును నీవు లీలగ జరుపుట నే నిందిసభనుండి చూచితి' నని పలికి వానితలను మూర్కొనెను. పిమ్మట నతడు తాను రచించిన * రామాయణమును వీణాసై తాళయుక్తముగ గానముచేసెను. అందు పూర్వము జరిగినదాని ననుసరించి యంతయు సత్యముగ వర్ణింపబడియుండెను. దానిని శత్రుఘ్నుడు విని కంటనీరు తెచ్చుకొని మాటిమాటికి నిట్టూర్పుదీయుచు నొకగడియ మోహమును జెందెను. పూర్వము జరిగినదంతయు నా రామాయణగానములో నప్పుడు జరుగుచున్నట్లు గనబడ వానియనుచరులు దానిని విని ముఖములు వంచి దీనులై యాశ్చర్యముగ నున్నదనియు, నిది యేమియనియు, మన మెక్కడ నున్నామనియు, నిది స్వప్నమాయనియు, పూర్వము మనము చూచిన యంశములే యీ మునియాశ్రమమున గానములో వినుచున్నామనియు, మనము వినుచున్నది యీ గీతములో వినరింపబడిన కథయా? లేక స్వప్నమా యనియు నొకరితో నొకరు చెప్పుకొనిరి. ఇట్లు వా రెక్కువగ నాశ్చర్యమునుబొంది శత్రుఘ్నునితో 'మీరు వాల్మీకిని బాగుగ నడుగు'డని పలుక నాతడు దీనిసంగతినిగూర్చి మనము ఋషిని నడుగుట మనకు తగదనియు, ఈయాశ్రమమున నాశ్చర్యకరమగు సంగతు లనేకములు కలవనియు, మీరు కుతూహలముతో నాతని నడుగుట యుక్తముకాదనియు జవాబు చెప్పెను. తరువాత నాతడు వాల్మీకికి నమస్కరించి

* రామాయణకర్తృత్వమును గూర్చి మా యభిప్రాయములను 1వ పత్రికల ౬ ను. ౩,౪. అధ్యాయములలో వ్రాసినాము.

తన శిబిరమునకు బోయెను. ఆరాత్రి యంతయు రామాయణగానమును గూర్చి యాలోచించుటచే నతనికి నిద్రపట్టలేదు. ఆరాత్రి శీఘ్రముగ గడచెను. అమఱునాటి యుదయమున నాతడు కాలోచితకృత్యములను దీర్చుకొని ఋషికి చేతులు జోడించి 'నేను రాముని జూడగోరుచున్నాను. మీరును, మీశిష్యులు మొదలగువారును నాకు సెలవీయవలెనని పలుక మహర్షి యాతనిని కౌగిలించుకొని విడిచెను. అతడా మునిశ్రేష్ఠునకు నమస్కరించి రథమెక్కి తనయన్నను జూచువేడుకతో నయోధ్యకు బోయెను.

శత్రుఘ్ను డయోధ్యకు వెళ్ళి సభలో మంత్రులమధ్యను తేజస్సుతో ప్రకాశించుచున్న రామునితో నిట్లు విన్నవించెను. 'మహారాజా! మీరు నా కాజ్ఞాపించిన దంతయు నేను జేసితిని. పాపుడగు లవణుడు హతుడయ్యెను. పట్టణమును నాచేత నిర్మింపఁబడెను. నేను మిమ్ములను విడిచి 12 సంవత్సరములాయెను. మిమ్ము విడిచి నే నుండలేను. నాయందు కరుణజూపుడు. ఆవుదూడ తల్లినివిడిచి యుండలేనట్లు చాలకాలము మిమ్ము విడిచి నేనుండలేను.' ఇట్లు శత్రుఘ్నుడు పలుక రాముడు వానిని కౌగిలించుకొని యిట్లు పలికెను. 'నీవు విచారమును బొందకుము. ఇది క్షత్రియునకు తగినదికాదు. రాజులు గృహములను విడిచియుండు నప్పుడు విచారము నొందరు. మనము క్షత్రియధర్మముచే ప్రజలను పరిపాలింపవలెను. నీ వప్పుడప్పు డయోధ్యాపురమునకు నన్నుజూచుటకు వచ్చి వెళ్లుచుండ వచ్చును. ఇప్పుడు నీవు నీపురమునకు వెళ్లుము. నీవు నాకు నాప్రాణములకంటె ప్రియమైనవాడవు. అనుమానములేదు. రాజ్యపరిపాలన నీవు తప్పక జరుపవలెను. కనుక నీ విక్కడ నేడు రాత్రులు నివసించి పిమ్మట మధురకు నీపరివారముతో వెళ్లుము.' ఇట్లు రాముడు తనమనస్సులోనున్న ధర్మయుక్తమగుమాటలను పలుక శత్రుఘ్నుడు దీన

ముగ దాని కంగీకరించెను. తరువాత నత డేడురాత్రులు నచ్చట నివసించి పిమ్మట రామలక్ష్మణభరతులవద్ద సెలవుపుచ్చుకొని రథమెక్కి వెడలెను. లక్ష్మణుడును, భరతుడును వానితో చాలదూరము వెళ్లి వానిని సాగనంపి తిరుగవచ్చిరి. శత్రుఘ్నుడు మధురాపట్నముచేరెను.

---

## ౧౧ వ. అధ్యాయము.

### రాము డకాలమరణము నొందిన బ్రాహ్మణపుత్రుని బ్రతికించుట

రాముడు శత్రుఘ్నుని మధురాపట్నమునకు బంపి మిగిలిన తమ్ములతో సుఖముగ ధర్మమార్గమున రాజ్యముచేయుచుండెను. కొన్నిరోజులకు కోసలదేశములోనిదగు నొకగ్రామములోనున్న బ్రాహ్మణుడొకడు చనిపోయిన తనకుమారుని తీసికొనివచ్చి తనభార్యతో రాజద్వారమున నిలిచెను. ఆవిప్రుడు తనకుమారునియందలి ప్రేమచే నెక్కువదుఃఖముగలవాడై 'పుత్రా! పుత్రా!' యని యేడ్చుచు నిట్లు పలికెను. "నాకున్న కుమారుడొక్కడు మరణించుటకు పూర్వజన్మలో నేనేమిచెడుకార్యముచేసితిని? నాదుఃఖమునకై నాకుమారు డకాల మరణమునొందియున్నాడు. * వీడు 5వేలసంవత్సరముల బాలుడై యౌవనమురాకుండ మరణించియున్నాడు. పుత్రశోకముచే నేనును, నాభార్యయు కొన్నిరోజులలో మరణించెదము. నేనబద్ధమెన్నడుబలు

---

* 5 వేలసంవత్సరములు బాలునకు వచ్చినను వానికి యౌవనదశరాలేదట.

1వ. ప్రకరణము. ౨వ. అధ్యాయము. రాముని రాజ్యకాలములో నరుని కాయువు సుమారు 10వేలసంవత్సరములని మేమూహించితిమి. ఈయంశమును బట్టి మా యాలోచన సరియైనదని, నాటికాలములో ప్రజలు చిరకాలము జీవించిరనియు స్పష్టము.

గురను, తనతమ్ములను, వణిజులను సభకు పిలిపించెను. బ్రాహ్మణులు రాజును దీవించిరి. అప్పుడు మార్కండేయుడు, మౌద్గల్యుడు, వామదేవుడు, కాశ్యపుడు, కాత్యాయనుడు, జాబాలి, గౌతముడు, నారదుడు నక్కడకు వచ్చియుండ వారికి రాముడు నమస్కరించి తగిన యాసనములపై వారిని కూర్చుండజేసెను. మంత్రులు, వణిజులు తమకు తగిన యాసనములపై కూర్చుండిరి. తరువాత రాజు దీనముగ వారికి బ్రాహ్మణునిసంగతి తెలిపెను. అప్పుడు నారదుడు 'బాలుని మరణ మెట్లు జరిగెనో తెలిపెదను; వినుము. పిమ్మట చేయవలసిన దానిని జేయు' మని పలికి * నాలుగుయుగధర్మములను దెలుపుచు "కృతయుగమున బ్రాహ్మణులు మాత్రమును, త్రేతాయుగమున బ్రాహ్మణక్షత్రియులును, ద్వాపరయుగమున బ్రాహ్మణక్షత్రియవైశ్యులును, కలియుగమున నాలుగువర్ణముల వారును తపస్సుచేయవచ్చును. ఇప్పుడు శూద్రవర్ణములో జన్మించినవాడు గొప్పతపస్సునునీ రాజ్యములో చివరను జేయుచున్నాడు. అందువలన బాలమరణము కలిగినది. ఏ దేశములో జను లధర్మకార్యములను, చేయరానిపనులను జేయుదురో యా దేశపురాజు నరకమునొందును. రాజు ధర్మముగ పరిపాలించుచు ప్రజలు చేయుసుకృతములలో నాల్గవభాగము పుణ్యమును బొందును. అట్టిరాజు ప్రజలను సరిగ పాలింపనియెడల వారుచేయు పాపములలో నాల్గవభాగమును బొందును; కనుక రామా! నీ రాజ్యమును పరిశీలించి దుర్మార్గము జరుగుచోటును కనిపెట్టి తగినప్రయత్నము చేయుము. అట్లు చేసిన ధర్మము వృద్ధియగును; ప్రజలయాయువు వృద్ధినొందును; బాలుడు జీవించు" నని సెలవిచ్చెను.

రాముడీమాటలను విని మిక్కిలిసంతోషమును బొంది లక్ష్మణునితో నిట్లనెను. 'నీవు బ్రాహ్మణునియొద్దకు బోయి వానినోదా

* 13వ ప్రకరణము ౧౫ అధ్యాయము. వేదాంతవిషయములు, ధర్మనీతులు చూడుము.

ర్చుము. ఆ బాలునిశరీరము నూనెగంగాళములో వేయుంచుము. దానిలో మంచిసుగంధద్రవ్యములను, మంచివాసనగల [illegible]ములను వేయుంచి బాలునిశరీరము నాశనముకాకుండునట్లు చేయుము. భద్రముగ దాచి రక్షించినయెడల బాలునిశరీరమునకు మార్పును, నాశనముకలుగ కుండునో [illegible]గ జేయుము.’ ఇట్లు రాముడు లక్ష్మణున కాజ్ఞాపించి కుబేరపుష్పకమును మనస్సులో ధ్యానించెను. [illegible] యది తెలిసి కొని యొకముహూర్తములో నాతనిసమీపమునకు వచ్చి వినయముతో ‘మీ సేవకుడను, మీకు సహాయమునకు నేను సిద్ధముగ వచ్చితి’ నని పలికెను. తరువాత నతడు మహాత్ములకు నమస్కరించి యయోధ్యాపట్టణమును లక్ష్మణభరతులకు నప్పజెప్పి ధనస్సును నమ్ములపొదులను, మంచి ఖడ్గమును బట్టి యావిమానమునెక్కి [illegible]. అతడు మొదట పశ్చిమదిక్కునకు బోయి యక్కడ వెదకెను. అక్కడనుండి మంచుతో నిండిన యుత్తరదిక్కునకు బోయి యక్కడ [illegible] గానక యక్కడనుండి తూర్పుదిక్కునకు బోయెను. అతడు పుష్పకము నుండియే నిర్మలమగునదియు, శుభ్రముగ నున్నదియు, మంచి నడవడిక గలదియు నగు నా ప్రదేశమును జూచెను. తరువాత నతడు దక్షిణదిక్కునకు బోయి * శైవలపర్వతమున [illegible] సమీపమున నొకసరస్సులో గొప్ప తపస్సుచేయువాని నొకనిని జూచెను. వాడు తలక్రిందుగ వ్రేలాడుచు తపస్సు చేయుచుండెను. రాముడు వానియొద్దకు పోయి యిట్లనెను. ‘మంచివ్రతమును జేయుచున్న నీవు ధన్యుడవు. నీవేవర్ణమున బుట్టితివి? నేను దశరథుని పుత్రుడను రాముడను; వేడుకతో నిన్నడుగుచున్నాను. నీ మనస్సులోని కోరిక యేమి? నీవు స్వర్గలాభమునుగూర్చి తపస్సుచేయుచున్నావా? లేక మరియొక దానినిగూర్చి తపస్సుచేయుచున్నావా? ఎవని నాశ్రయించి నీవు

* 194,197 పుటల పటములను జూడుము.

తపస్సుచేయుచున్నావు? నీవు బ్రాహ్మణుడవా? క్షత్రియుడవా? వైశ్యుడవా? లేక శూద్రుడవా? నిజమును జెప్పుము. ఎల్లప్పుడు తపస్సుకంటె సత్య మెక్కువైనది. అమృతమయమగు సత్యము నాశ్రయింపుము.' ఇట్లు రాముడు పలుక నాతపసి తలక్రిందుగనేయుండి "నేను శూద్రవర్ణమున జన్మించితిని. 'శంబుకు'డను పేరుగలవాడను. ఈశరీరముతో దేవలోకమునకు వెళ్ళగోరుచున్నాను. దేవలోకమును జయించుకోరికచే నే నబద్ధమూడ"నని మనవిచేసెను. అంతట రాముడు తన యొఱనుండి ఖడ్గమును పైకితీసి వాని శిరమును ఖండింప వాడు మరణము నొందెను.

ఈ శూద్రమరణమునకు నింద్రుడు మొదలగు దేవతలందఱు 'బాగు బా'గని రాముని గీర్తించి యతనిపై మంచిసువాసనగల పుష్పవర్షమును గురిపించిరి. వాయువుచే గదల్పబడిన చెట్లనుండి పుష్పములన్నియు క్రిందబడెను. దేవతలు 'నీవు దేవకార్యము బాగుగ చేయుటచే మాకు ప్రీతికలిగెను. నీవు వరమును గోరుము. నీవలన నీశూద్రుడు స్వర్గమును బొందలేకపోయె'నని పలికిరి. రాముడు వారి మాటలను విని సంప్రీతుడై యింద్రునికి చేతులుజోడించి యిట్లు పలికెను. "దేవతలకు నాపైని దయగలదేని మీరు బ్రాహ్మణపుత్రుని బ్రతికింపుడు. నేను కోరిన యీగొప్పవరమును నాకిండు. బ్రాహ్మణునకున్న పుత్రుడొక్కడే నాయనాచరణలోపముచే నకాలమరణము నొందెను. వానిని బ్రతికింపుడు. 'నీకుమారుని బ్రతికించెద'నని యాబ్రాహ్మణునితో నేను పలికియుంటిని." రాముని యీమాటలను దేవతలు విని సంతోషముతో 'నీవు విచారమునువిడువుము. ఈదినముననే యాబ్రాహ్మణబాలునకు బాగుగ ప్రాణములు వచ్చినవి. వాడు తన బంధువులతో గూడుకొనియున్నాడు. శూద్రుని నీవు చంపిన తత్క్షణమే యాబాలు

నకు ప్రాణములు వచ్చినవి. నీకు జయమగుగాక! మాన మగస్త్యుని యాశ్రమమునకు బోవుదమ'ని పలికెను.

---

౧౨౮. అధ్యాయము.

రాముడు తిరుగ నగస్త్యాశ్రమమును సెరుగుట.

రాముడు తపస్సుచేయు శూద్రుని జంపి బ్రాహ్మణపుత్రుడు బ్రతికెనని తెలిసికొనిన తరువాత నతనిని దేవతలు 'అగస్త్యుని యాశ్రమమునకు బోవుదము ర'మ్మని పిలిచి యాఋషి దొంక సరస్సులో నీటిపై 12 సంవత్సరములనుండి పండుకొనియున్నాడనియు, నతనిదీక్ష యిప్పటికి సమాప్తమైనదనియు, మనము వెళ్ళి యతనికి నమస్కరింప వలెననియు పలుక రాముడు దాని కొప్పుకొనెను. అతడు తనవిమానమునమీదను, దేవతలు మిక్కిలి పెద్దవగు తమ విమానముల మీదను నగస్త్యుని తపోవనమునకు వెళ్ళిరి. దేవతల సందర్శని ఋషి సత్కరింప వారతని సత్కారములను గ్రహించి మర్యాదచేసి స్వర్గమునకు బోయిరి. రాముడు తన విమానమునుండి దిగి ఋషికి నమస్కరించి యతని యాతిథ్యమును బొంది కూర్చుండెను. అప్పు డగస్త్యుడు రామునితో నిట్లనెను. 'నీరాక లెస్స. దైవయోగమున నీవు వచ్చితివి. నీకు మంచిగుణము లనేకములు గలవు. నీవు నాకు మిక్కిలి యిష్టుడవు; అతిథివి; పూజనీయుడవు. నీ వెల్లప్పుడు నాహృదయమున నుందువు. నీవు శూద్రుని జంపి వచ్చినట్లును, చనిపోయిన బ్రాహ్మణపిల్లవాడు జీవించినట్లును, దేవతలు నాకు చెప్పిరి. ఈరాత్రి నీవిక్కడ నిలిచి రేపటియుదయమున నీపట్టణమునకు పోవలెను.' ఇట్లగస్త్యుడు

పలికి 'నీవుసాక్షాత్తు నారాయణుడవు; శ్రీమంతుడవు;సనాతనుడవు; సమస్తభూతములకు ప్రభుడవు. లోకములన్నియు నీయందు నిలిచి యున్నవి. విశ్వకర్మ నిర్మించి నా కిచ్చిన తేజోమయమగు నీయలంకారమును నీవు గ్రహించి నాకు ప్రియమును జేయుము. దానము పుచ్చుకొన్న వస్తువును తిరిగి దానముచేయుటలో గొప్పఫలముకలదు. గొప్పఫలితముగలవస్తువులను భరించుటకు నీవు శక్తికలవాడవు. ఇంద్రాదిదేవతలనుగూడ తరింపజేయుటకు నీకు శక్తిగలదు. కనుక నేనిచ్చిన చిత్రమగునీయలంకారమును నీవుగ్రహింపు'మని రాముని గోరెను. దీనికి బుద్ధిమంతులలో శ్రేష్ఠుడగు రాముడు క్షత్రియధర్మమునాలోచించుచు ప్రతిగ్రహము బ్రాహ్మణునకుగూడ నింద్యమైనపుడు క్షత్రియుడనగు నేను దానినెట్లు పరిగ్రహించెదను? ముఖ్యముగ బ్రాహ్మణుడిచ్చిన వస్తువును నేనెట్లు పుచ్చుకొందును? నాసందేహమును బాపు'మని యతనిని గోరెను. అప్పు డగస్త్యుడు *రాజునకు లోకపాలుర యంశములు మొదట బ్రహ్మచే నియ్యబడెననియు, నిందాంశమున నీయాభరణమును నన్ను తరింపజేయుటకు నీవు పుచ్చుకొనవలెననియు జెప్పెను. అప్పుడురాముడు దానిని గ్రహించి తేజోమయమగు నాభూషణము పుట్టుటకు గారణ మడుగదలచి యిట్లు పలికెను. 'ఇది మిక్కిలియద్భుతముగను, బాగుగను నున్నది. మీ కిది యెట్లు వచ్చినది? ఎక్కడనుండి వచ్చినది? మీకు దీని నెవరిచ్చిరి? దీనిని దెలిసికొనుటకు నభిలాషకలుగుటచే నేను మిమ్ముల నడిగితిని. ఆశ్చర్యకరములగు ననేకవిషయములను తెలుపుటకు మీరు నిధివంటివారు.' రాముడు పలికిన యీమాటల నగస్త్యుడు విని పూర్వము త్రేతాయుగమున ♦ విదర్భరాజగు శ్వేతు డీసరోవరమువద్ద తపస్సుచేసి యెవరికిని భోజనమిడక

* 13వ. ప్రకరణము. ౧౨వ. అధ్యాయము. రాజనీతులు చూడుము.

♦ 3వ. ప్రకరణము. 3వ. అధ్యాయము, అగస్త్యుడు చూడుము,

తన శరీరమును పోషించుకొనుచు కొంతకాలమునకు శరీరమును విడిచి స్వర్గమునకు బోయెననియు, నచట నతడాకలిదప్పులచే బాధనొంది స్వర్గమునుండి వచ్చి తన శరీరమాంసమును దినుచుండెననియు, తనకు నతడాయాభరణమిచ్చుటచే నతనికి కష్టములనుండి విముక్తి గలిగె ననియు దెలిపెను. రాముడు దానిని విని యాసరోవరమునుగూర్చి విపులముగ దెలుపవలెనని యామునిని నడుగ నతడిక్ష్వాకు పుత్రుడగు *దండుడు రాజ్యముచేయుచు శుక్రపుత్రికయగు నరజను బలాత్కా-రముగ బట్టుటయు, నందుచే శుక్రుడు వానిని, వింధ్యశైవల పర్వతముల మధ్యనుండు వానిదేశమును నశింపచేసెననియు, గాన నది దండకావన మయ్యెననియు దెలిపి 'రామా! సాయంకాలమైనది. సంధ్యావందన కాలమతిక్రమించుచున్నది. మహర్షులాసరస్సులో తమ కలశలనిండ నీటిని నింపిరి. నీవు వారితో గలిసి సూర్యునికి నర్ఘ్య ప్రదానమి'మ్మని చెప్పెను.

ఆసాయంకాల మప్సరసలుమొదలగువారుండు నాసరస్సువద్ద రాముడు సంధ్యావందనమొనర్చినతరువాత నగస్త్యుడు తనయాశ్రమములోనతనికి ననేకకందమూలఫలములతోను, నోషధులతోను,మంచి శుభ్రమగుఅన్నములతోను భోజనముపెట్టించెను. రాముడు వానినన్నిటినిభుజించి మిక్కిలిసంతోషమునొంది యారాత్రియక్కడ నిలిచెను. ఆమఱునాటియుదయమున నతడు లేచి కాలోచితకృత్యములను దీర్చుకొని వెళ్లిపోవుటకు ఋషులవద్ద సెలవుపుచ్చుకొనుటకు బోయెను. అతడు తనపట్టణమునకు వెళ్లుటకు నగస్త్యుని సెలవడిగి 'మీదర్శనముచే నేను ధన్యుడనైతిని. అనుగ్రహింపబడితిని. నేను పావనమగుటచే తిరుగ మిమ్ము జూచుటకు వచ్చెద'నని పలికెను. దీనికి ధర్మబుద్ధి

* 6 వ.ప్రకరణము. 3వ అధ్యాయము. దశరథుని పూర్వులు దండుని చరిత్ర 194 పుట చూడుము

గలవాడును, తపస్సే ధనముగాగలవాడుననగు నామహర్షి యిట్లు బదులుపలికెను. 'రామా! శుభమగునీమాటలాశ్చర్యకరములు. నీ వన్ని భూతములను పవిత్రముచేయువాడవు. నిన్నొకముహూర్తమైనను చూచుజీవులు పవిత్రులై స్వర్గమును బొంది దేవతలందఱిచే మర్యాదను బొందుదురు. లోకములో నిన్ను దుష్టబుద్ధితో జూచువారు యమదండముచే మరణమునొంది వెంటనే నరకమును బొందుదురు. ఇట్లు నీవు జీవులనన్నిటిని పవిత్రముచేయువాడవు. ఈలోకములో నీ కథలనుజెప్పుకొనువారుకూడ ముక్తినొందుదురు. నీవు దారిలో శుభములను జూచుచు వెళ్ళుము. నీ కెక్కడనుభయములేదు. నీవు ధర్మముతో రాజ్యముచేయుచు ప్రజలను శాసింపుము. నీవే లోకములకు గతి.' ఇట్లగస్త్యుడు పలుక రాముడామాటలను బాగుగ గ్రహించి యతనికి చేతులుజోడించి ప్రదక్షిణముచేసి యితరఋషులకందఱికి నమస్కరించి పుష్పకమెక్కెను. అదిపోవుచుండ మునులందఱు రాముని నాశీర్వదించిరి. ఇట్లు రాముడొకపూటలో నయోధ్యానగర మధ్యమప్రాకారమునకు వచ్చి పుష్పకమునకు వెళ్లుటకు సెలవిచ్చెను.

---

## ౧౩ వ. అధ్యాయము.

## రాము డశ్వమేధమును జేయ నిశ్చయించుట.

రాము డగస్త్యునియాశ్రమము నుండి యయోధ్యకు వచ్చి తరువాత మధ్యమప్రాకారమువద్దనున్న ద్వారపాలకునితో 'నీవు లక్ష్మణభరతులవద్దకు శీఘ్రముగ బోయి నేను వచ్చినసంగతి వారికి దెలిపి వారిని పిలువు'మని చెప్ప వాడు పోయి వారిని దోడ్కొని

వచ్చెను. అంతట రాముడు తనతమ్ములను కౌగిలించుకొని వారికి జరిగినదంతయు దెలిపి 'నేను శూద్రముని జంపినందులకు మీరాసహాయమున తిరుగ రాజసూయయజ్ఞమును జేసి శాశ్వతధర్మమును సంపాదించెద' నని పలికెను. అతడు * పూర్వమీయజ్ఞముచేసినవారిసంగతిని వారికి దెలిపి 'నేను చేయవలసినకార్యమేదియో మీరాలోచించి చెప్పు'డని యనెను. రామునియీమాటలను భరతుడు విని చేతులు జోడించుకొని యిట్లు పలికెను. 'మీయందు గొప్పధర్మమును, కీర్తియు, జగత్తంతయును నిలిచియున్నవి. దేవతలందఱు బ్రహ్మను పూజించునట్లు రాజులందఱును, మేమును మిమ్ము లోకనాథుడగు మహాత్మునిగ గౌరవించుచున్నాము. ప్రజలందఱు మిమ్ముతండ్రినివలె జూచుచున్నారు. జగత్తునకును, జగత్తులోని భూతములకన్నిటికిని మీరు గతియైయున్నారు. మీరీయజ్ఞముచేయుటవలన జగత్తులో పౌరుషముగల రాజులకందఱకు కోపమువచ్చును. అప్పుడు వారు మీతో యుద్ధము చేసి నాశనమొందెదరు. గొప్పగుణములుగల మీరు జగత్తులో మీవశములో నున్నవారిని జంపుట యుక్తముకాదు. మీరాలోచించి ప్రజలకు మేలును గలుగజేయుడు. వారికి మీరే యుత్తమమగు గతి.' ఇట్లు భరతుడు పలుక రాముడు మిక్కిలిసంతోషమునొంది 'నీమాటలకు నాకు గొప్పప్రీతికలిగెను. నేను సంతోషమును బొందితిని. నీవు భూపరిపాలననుగూర్చి ధర్మమగు మంచిపలుకులను బలికితివి. నీమంచి మాటలచే నేను రాజసూయయజ్ఞముచేయుబుద్ధిని విడిచెదను. బుద్ధిమంతులు లోకులకుపీడగలుగుపనులను జేయరు; పిల్లలుచెప్పినను వినెదరు. కనుక నీమాటలను నేను వినెద'నని సెలవిచ్చెను.

తరువాత లక్ష్మణుడు తనకు తోచిన శుభమగు మాటల నిట్లు పలికెను. 'గొప్పదగు అశ్వమేధమువలన నన్నిపాపములును బోవును.

---

* 13వ. ప్రకరణము. ౬ వ అధ్యాయము. పుణ్యకర్మలుచూడుము.

కనుక దానిని మీరు చేయవలెను. అది పవిత్రమైనది. పూర్వ మింద్రు డశ్వమేధము చేయుటచే బ్రహ్మహత్యాపాపమునుండి విడువబడెను.' ఇట్లు లక్ష్మణుడు పలికి * వృత్రాసురుని నింద్రుడు చంపినసంగతియు, నతనికి బ్రహ్మహత్యాపాపము కలుగుటయు, దేవతలశ్వమేధముచేసి దానినుండి యతనిని దప్పించుటయు రామునకు దెలిపి 'అశ్వమేధము గొప్పప్రభావము గలదిగనుక దానిని మీరు చేయు'డని పలికెను. లక్ష్మణుని యీమాటల నతడువినిమిక్కిలి సంతోషించి మిక్కిలిగనవ్వి ♦ ఇళచక్రవర్తి స్త్రీరూపము నొందుటయు, నశ్వమేధముచేసి యతడు తిరుగి పురుషత్వము నొందుటయు, దాని ప్రభావమును వారికి దెలిపెను. తరువాత రాముడాయజ్ఞమును జేయుటకు నిశ్చయించెను.

---

## ౧౫వ. అధ్యాయము

## రాము డశ్వమేధముచేయుట, సీత భూమిలో ప్రవేశించుట.

రాము డశ్వమేధముచేయుటకు నిశ్చయించి లక్ష్మణునితో 'వసిష్ఠుని, వామదేవుని, జాబాలిని, కాశ్యపుని, నందఱిలోను శ్రేష్ఠులగు ననేకబ్రాహ్మణులను బిలిపించి వారితో నాలోచించి మంచిలక్షణములుగలగుఱ్ఱమును విడిచెద'నని పలుక నావాక్యముల నతడు విని వారిని రప్పించెను. దేవతలతో సమానుడగు రాముడు వారిపాదములకు నమస్కరింప వా రతని నాశీర్వదించిరి. అతడు వారలకు చేతులు

---

* 2వ. ప్రకరణము. 3వ. అధ్యాయము. ఇంద్రుడు, దేవతలు. 13వ పుట చూడుము.

♦ 6వ. ప్రకరణము. 3వ. అధ్యాయము. చంద్రవంశజులు. ఇళునిచరిత్రము 186 పుట చూడుము.

జోడించి ధర్మముతో గూడినయశ్వమేధము చేయుటనుగూర్చి తనయభిప్రాయమును దెలిపెను. వారు శివునికి సమస్కరించి యశ్వమేధయజ్ఞమునుగూర్చి స్తుతించిరి. దీనికి రాముడు మిక్కిలి సంతోషమును బొంది వారియభిప్రాయమును దెలిసికొని లక్ష్మణున కిట్లాజ్ఞాపించెను. "మన యజ్ఞముచూచుటకు గొప్పవారగు ననేకవానరులతో సుగ్రీవుడువచ్చునటులదూతలను బంపుము. విభీషణుడు కామరూపులగు ననేకరాక్షసులతో యజ్ఞమునకు వచ్చునట్లు చేయుము. నాప్రియమునుగోరుగొప్ప రాజులు తమపరివారముతో శీఘ్రముగ వచ్చెదరుగాక! ధర్మబుద్ధితో దేశాంతరము వెళ్ళిన బ్రాహ్మణులు తమ భార్యలతో గూడ యజ్ఞమునకు వచ్చునట్లు వారిని బిలిపింపుము. ఋషులను,మహాత్ములగు తాపసులను పిలిపింపుము. తాళములు వాయించువారిని,నాట్యమాడువారిని పిలిపింపుము. యజ్ఞశాలను * నైమిశారణ్యమున గోమతీతీరముననున్న తపోవనమున నేర్పఱచి యక్కడ శాంతులను జేయింపుము. ధర్మము తెలిసినవారు వందలకొలదివచ్చి మిక్కిలియుత్తమమగు యజ్ఞములో సంతోషముగ సుఖముల ననుభవించి తగినట్లు పుర్యాదలనుబొంది తమ తమస్థానములకుబోయెదరు. కనుక ప్రజలనందఱిని పిలిపింపుము. లక్షబళ్ళతో మంచిబియ్యమును, పదివేలబళ్ళతో పెసలను, నువ్వులను, ననేకవిధములగు సెనగలను, ఉలవలను, మినుములను, నుప్పును, వీనికి తగినట్లు తైలమును, మంచిగంధములను, యజ్ఞశాలకు దీసికొనివెళ్ళవలెను. అనేకకోట్లబంగారునాణెములను, వానికి నూఱురెట్లు వెండినాణెములను, ముందుభరతుడు జాగ్రత్తగ పట్టుకొనివెళ్ళవలెను. ఆయజ్ఞవాటములో మంచియుంగళ్ళుగలవీధులను నిర్మింపవలెను. వంట చేయువారనేకులును, బాగుగనలంకరించుకొనిన వేశ్యలనేకులును, నటనర్తకులును నచట నుండెదరుగాక! భరతునితో గూడ ముందుగ సేన

* ఈ ప్రకరణములో ౪వ. అధ్యాయము మధ్యనున్నపటమును జూడుము

లును, వర్తకులును, సేనానాయకులలో గొప్పవారును, ద్విజులును వెళ్ళవలెను. పనులను జేయించు రాజసేవకులును, వడ్రంగులును, కోశాధికారులును, నాతల్లులంఱును, రాజకుమారులును, నంతఃపురములో నుండువారును ముందువెళ్ళవలెను. నాభార్యరూపముగ బంగారువిగ్రహమును జేయించి భరతుడు దానిని ముందు తీసికొనివెళ్లవలెను. గొప్పరాజులకును, వారియనుచరులకును తగిన వసతిగృహములను గట్టించి సదుపాయము చేయవలెను." ఈతీరుగ రాముడు లక్ష్మణున కాజ్ఞాపించెను.

అట్లు యజ్ఞమున కంతయు శీఘ్రముగ సిద్ధమైనపిమ్మట రాముడు నల్లని రంగుగలదియు, మంచిలక్షణములు గలదియు నగు గుఱ్ఱమును విడిచెను. దానితో లక్ష్మణుడును, ఋత్విక్కులును వెళ్లిరి. రాముడు తనసైన్యముతో నైమిశారణ్యమునకు బోయి బాగుగ గట్టబడియున్న యజ్ఞశాలను జూచి మిక్కిలి సంతోషమునొందెను. అక్కడకు రాజులందఱు వచ్చి యతనికి కానుకలనిచ్చిరి. అతడు వారలందఱికి తగిన గౌరవముచేసెను. రాజులకును, వారి యనుచరులకును తగిన వసతుల నిచ్చి సదుపాయములను జరిపెను. వారందఱికి భరతశత్రుఘ్నులు తగిన భోజనములు పెట్టించి వస్త్రములనిచ్చిరి. వానరులును, సుగ్రీవుడును బ్రాహ్మణులకు వినయముగ నమస్కరించుచు చుట్టును నిలిచిరి. విభీషణుడు మెడలో దండలువేసికొని తన రాక్షసులతో గలిసి గొప్ప తపస్సుచేసిన మహాత్ములందఱికి మర్యాదచేసెను. ఇట్లశ్వమేధము బాగుగ జరుగుచుండెను. లక్ష్మణుడు గుఱ్ఱమువెళ్ళుచుండ దానిని రక్షించుచుండెను. ఈతీరున రాజశ్రేష్ఠునియజ్ఞము బాగుగ జరుగుచుండ 'యాచకులు కోరినప్రకారము వర్షింపుడు; వర్షింపు'డను మాటలుతప్ప నితరశబ్దమేమియు వినబడకుండెను. వారు తృప్తినొందువరకు మంచి భోజనములను, పెల్లపుపిండివంటలను పెట్టిరి. వారినోటినుండి మాటు

వచ్చినవెంటనే వారికిగావలసినవానిని వానరులును, రాక్షసులునువడ్డించిరి. ఆయజ్ఞమున శుభ్రములేనివాడుకాని, దీనుడుకాని, కోరికలచే బాధనొందువాడుకాని కనబడలేదు. ప్రజలు బాగుగ భుజించి మిక్కిలి సంతోషముగనుండిరి. యజ్ఞమునకు వచ్చిన చిరజీవులగు గొప్పమునులు 'ఇట్టి యజ్ఞమునెన్నడును జూడలేదు; ఎక్కడను జరుగలేదని పలికిరి. బంగారముకోరినవారికి బంగారమును, ధనముకావలసినవారికిధనమును, రత్నములు కోరినవారికి రత్నములను నిచ్చిరి. రాసులుగనున్న బంగారమును, వెండిని, కెంపులు మొదలగురాళ్లను, బట్టలను నెల్లప్పుడు పంచి పెట్టుచుండిరి. తాపసులు 'ఇంద్రుడుకాని, కుబేరుడుకాని, యముడు కాని, వరుణుడుకాని యశ్వమేధయజ్ఞము నిట్లు జరుపలేదనియనిరి. అన్నిచోట్లను, వానరులును, రాక్షసులును బట్టలను, ధనమును, నన్నమును కోరినవారికి నెక్కువగ నిచ్చిరి. ఇట్లు మంచిసుగుణములతో యజ్ఞము జరుగుచుండ నొకసంవత్సరము గడచెను. అందేమియు కొఱత లేకుండెను.

ఇట్లు యజ్ఞము జరుగుచుండ వాల్మీకి తనశిష్యులతో నచటికి వచ్చి యద్భుతమగు నాయజ్ఞమును జూచి ఋషులు నివసించిన యాశ్రమములవద్దనున్న యొక పర్ణశాలలో నివాసముచేసెను. రాము డాతని బసవద్దకు మంచిఫలములు, మూలములుగల బండ్లను బంపి యతనిని పూజించెను. ఋషులుకూడ నతనిని గౌరవించిరి. * పిమ్మట వాల్మీకి సంతోషముతో తన శిష్యులగు కుశలవుల కిట్లాజ్ఞాపించెను. "మీరిద్దఱు

---

* అ. రా:—వాల్మీకియు, కుశలవులును రామునియజ్ఞమును జూచుటకు వచ్చి తమకు నిర్ణయింపబడిన పర్ణశాలలో విడిసిరి. తరువాత నచట వాల్మీకి యేకాంతమున సమాధిపూర్తిచేసికొని యున్నసమయమున నతనిని కుశుడు జ్ఞానశాస్త్రమునుగూర్చి యిట్లు ప్రశ్నించెను. 'భగవంతుడా! అంతయు దెలిసినవాడా! ఆత్మకు సంసారమనెడి దృఢ

వెళ్లి పుణ్యములగు ఋషుల యాశ్రమములందును, బ్రాహ్మణగృహము లందును, రాజగృహములందును, వీధులందును, రాజమార్గములందును, రాముడు యజ్ఞము చేయుచున్న భవనద్వారమువద్దను, ఋత్విజుల యెదుటను రామాయణమంతయు మిక్కిలి సంతోషముగ పాడుడు. ఆపర్వతములమీదనున్న తీయనిఫలములను దినుచు పాడుడు. ఈ పండ్లను, మంచిమూలములను తినినయెడల మీకెక్కుడుశ్రమకలుగదు.

---

బంధమెట్లు కలిగినది? అట్టి బంధమునుండి జీవు డేయుపాయముచే విముక్తుడగును? అట్టియుపాయమును శిష్యుడనగు నాకు నుపదేశింపుడు.' ఇట్లు ప్రశ్నింప వాల్మీకి యిట్లు తెలిపెను. "బంధమోక్షముల యొక్క స్వరూపమును, సాధనమును జెప్పెదను. నీవు దానిని చక్కగ విని యాతీరుగ నాచరించినచో జీవన్ముక్తుడవగుదువు. చిద్రూపుడును, దేహరహితుడునునగునాత్మయనే సార్వభౌముడు అవిద్యావశమున తనచే గల్పింపబడినయహంకారమనెడిమంత్రితోగూడి అవిద్యావశమున దేహమనే మహాగృహమున ప్రవేశించెను. (అనగా అవిద్యావశమున చిద్రూపుడగునాత్మకు 'ఈ దేహము నాది' యను నహంకారము పుట్టినది.) పిమ్మట నీయహంకారము చిదాత్మతో తాదాత్మ్యమును బొంది తాను చేయుపనులను చిదాత్మకు సంక్రమింపజేయుచున్నది. అహంకారము జడమైనదైనను చిత్సంపర్కమువల్ల కార్యకరణసామర్థ్యముకలదైనది. ఈ యహంకారమనుమంత్రి కార్యములనుసంకల్పించుచు తనసంకల్పమును చిద్రూపునియందు సంక్రమింపజేయుచున్నాడు. ఈ సంకల్పములనెడి గొలుసుచేత నీచిద్రూపుడు గట్టబడినవాడై తనకు భార్య, గృహము, పుత్రులు, ధనముకావలెనని సంకల్పించుచు నావస్తువులు లభించనప్పుడును, లభించినవి నశించినప్పుడును గొప్పదుఃఖమును బొందుచున్నాడు. ఈయహంకారము తామసాహంకారమనియు, సాత్వికాహంకారమనియు, రాజసాహంకారమనియు మూడువిధములుగానున్నది. అందు తామసా

మీరు పట్టణము వెలుపలనుండవలెను. రాముడు వినుటకు మిమ్ములను ఋషులయెదుటకు పిలిపించినయెడల నప్పుడచ్చట మీరు పాడవలెను. నే నిదివరలో మీకు జెప్పినప్రకారము దినమునకు 20సర్గలచొప్పున మంచికంఠముతో ననేకములగు ప్రమాణములతో పాడవలెను. కొంచెమైనను మీకు లోభముకాని, ధనాశగాని మనస్సులోనైనను నుండగూడదు. ఫలమూలములనుదిని యాశ్రమములో జీవించుమనకు ధన

---

హంకారమువల్ల చిదాత్మ తామససంకల్పమనెడి ఈర్ష్య, అసూయ మొదలగువానిచే హత్యాదిదుష్టకార్యములనాచరించి క్రిమికీటాదిజన్మములను బొందుచున్నాడు. సాత్వికాహంకారముచే చిదాత్మ సాత్వికములగు నిష్కామకర్మలనాచరించి తద్వారా శ్రవణమననాదులచే జన్మించినజ్ఞానబలమున కొలదికాలములోనే మోక్షసామ్రాజ్యమును బొంది సుఖరూపుడగుచున్నాడు. రాజసాహంకారమువల్ల నీచిదాత్మ రాజసములగు కార్యములను(కేవలము ఐహికవ్యాపారములను) నాచరించి పుత్రదారాదిరంజనచేయుచు జననమరణప్రవాహరూపసం

అహంకారము




క్రిమికీటాదులు. ధర్మజ్ఞానబుద్ధికలవారు. ఐహికవ్యాపారములుగలవారు.

సారమందే తిరుగుచున్నాడు. కనుక బుద్ధిమంతుడా! నీవు త్రివిధమగు నహంకారమును వదలి(మొదట తామస రాజసాహంకారములనువదలి సాత్వికాహంకారమునవలంబించినిష్కామకర్మలనాచరింపుము. దానిచే శుద్ధచిత్తుడవగుదువు. పిమ్మట శ్రవణమననాద్యుల కధికారివగుదువు.

మువలన ప్రయోజనమేమి? రాముడు మిమ్ము 'మీరెవరిపుత్రు'లని యడిగినయెడల 'మేము వాల్మీకి శిష్యుల'మని తెలుపుడు. ఈతీగెలు మధురస్వరములుకలవి. ఈస్థానము పూర్వమెప్పుడునుజూడనిస్థానము. మంచిసమయము దొరకినది. మీరేమియు బాధపడకుండ వినువారు మూర్ఛపొందునట్లు పాడుడు. మీరు రాజునవమానింపకుండ మొదటి నుండి పాడుచుండవలెను. అతడు సర్వభూతములకు ధర్మశాస్త్రప్రకా రము తండ్రిగనుక మీరు రేపటియుదయమున మిక్కిలిసంతోష ముతో తీగెలపై లయతో మధురముగ పాడవలెను." ఇట్లు వాల్మీకి కుశలవుల కాజ్ఞాపించి యూరకుండెను. వారట్లుచేయుటకొప్పుకొనిరి.

---

అటుపిమ్మట శ్రవణాదుల నాచరింపుము. తరువాత లయము నాచరిం పుము. దీనివలన (సాత్వికాహంకారముకూడ నశించిపోవును.) లయ ముచే సర్వసంకల్పవిముక్తుండవై మోక్షమునొందుదువు. నీవు వేల కొలదివత్సరములు స్వర్గభూపాతాళములందు నివసించి దారుణమైన తపస్సు నాచరించినను మోక్షసిద్ధినొందలేవు. సంకల్పనాశముకన్న నుపాయాంతరమేదియు మోక్షమునకు లేదు. సంకల్పమనుదారమందు నిఖిలవిభవములు గుచ్చబడియున్నవి. అట్టిసంకల్పమనేతంతువు లయ మనే మహాఖడ్గముచే నెప్పుడు ఛేదింపబడునో యప్పుడు సర్వవిభవ ములు వినాశము పొందగలవు. సంకల్పజాలమెప్పుడు నశించునో యప్పుడీజీవుడు బ్రహ్మత్వమునుబొందగలడు. కనుక నీవు పరమాత్మ స్వరూపమును చక్కగ దెలిసికొని సంకల్పవికల్పములను వదలి యద్వి తీయపరబ్రహ్మరూపమును బొంది సుఖింపుము." ఇట్లు వాల్మీకి కపస నకు జ్ఞానోపదేశము చేయ వాడు తనయజ్ఞానమును విడిచి నిస్సంక ల్పుడై బాహ్యమునందు కార్యములుచేయుచున్నవానివలె సంచరిం చుచు జీవన్ముక్తుడయ్యెను.

లేదనియు జెప్పుకొనిరి. ఈమాటలను వినినవారందఱు మిక్కిలిసంతో షమునొందిరి. ఆమునికుమారులు నారదుడు చెప్పినవిషయముగల మొదటిసర్గనుండి రామాయణమును మిక్కిలిమధురముగ మనుష్యు లెవరుపాడలేనట్లు పాడిరి. ఆపాట సొగసుగనుండుటచే దానిని వినిన వారందఱికి పరిపూర్ణసంతుష్టికలుగలేదు. వారు రోజునకు 20 సర్గలు చొప్పున పాడి దానిని పూర్తిచేసినతరువాత నొకానొకదినమున మధ్యాహ్నమున రాముడు భరతునితో 'ఒక్కొక్కరికి 18వేలబంగారు నాణెములను, కోరినవస్తువులనుని'మ్మనిచెప్ప నత డట్లుచేసెను. కాని వానిని కుశలవులుపుచ్చుకొనక 'అడవిలోపుట్టినఫలములను దినిజీవించెడి మాకు వీనివలననేమిప్రయోజన'మని పలుక రాముడును, మిగిలిన వారును నాశ్చర్యమునొందిరి. రాము డాకావ్యరచననుగూర్చి తెలిసికొన గోరియామునికుమారులను 'ఈ గ్రంథపరిమాణమెంత? దీనికాధారమేది? దీనినిరచించినమహాత్ముడెక్కడనున్నా'డని యడుగవారు తమగురువగు వాల్మీకియే దానికి గ్రంథకర్తయనియు, నతడు యజ్ఞమునకువచ్చెననియు, 7 కాండలు, 24 వేల శ్లోకములు, నూఱు ఉపాఖ్యానములు, 500 సర్గలు కల యీరామాయణములో రామునిచరిత్ర వర్ణింపబడినద నియు, నిందాతని జీవితకాలములో జరిగిన శుభాశుభములగు సంగతు లన్నియు గలవనియు, మీరీకావ్యమును దిరుగ వినగోరినయెడల యజ్ఞకర్మ పూర్తిగ జరిగిన పిమ్మట మీతమ్ములతో శ్రద్ధగ వినవచ్చు ననియు దెలిపిరి. రాముడు దానికంగీకరించి వారిని బంపెను. వారు వాల్మీకియుండు పర్ణశాలకు వెళ్లిరి. రాముడుగూడ మునులతోను, రాజులతోను రామాయణగానమును విని యజ్ఞశాలలోబ్రవేశించెను.

ఈరీతిగ రాముడు సభలో కుశలవులపాట ననేకదినములు వినెను. తరువాత నతడా రామాయణ గానమునుబట్టి వారు సీత కుమారులని తెలిసికొని యాలోచించి మంచి నడవడికగల దూతలను

బిలిచి 'మీరు వాల్మీకియొద్దకుబోయి నేను చెప్పిన యీమాటల నాతనితో జెప్పుడు. సీత శుద్ధమైన చరిత్రముకలదై పాపములేని దైనయెడల నామె వాల్మీకి యనుమతినిబొంది యిచట తన శుద్ధత్వమును దెలుపవలెను. మీరీ సంగతి వాల్మీకికి దెలిపి యతనిమనోభిప్రాయమును, మాకు నమ్మకమునుజూపెడి సీతయభిప్రాయమును దెలిసికొని యీసంగతి శీఘ్రముగ నాకు దెలుపవలెను. రేపటి యుదయమున నామె సభలో నాకును, సభవారికిని నమ్మకము కలుగునట్లు శపథము చేయవలెను.' రాముడు చెప్పిన యీమాటలను దూతలు విని వాల్మీకియుండు పర్ణశాలకువెళ్ళి యాతనికి రాముడు చెప్పిన వాక్యములన్నియు దెలిపిరి. దీనికి నతడు రాముడు చెప్పినట్లే సీత జరుపుననియు, స్త్రీకి పతియే దైవమనియు బలుక నాదూతలు శీఘ్రముగ రామునియొద్దకు బోయి యీసంగతి నతనికిదెలిపిరి. అప్పుడు రాముడు మిక్కిలి సంతోషమును బొంది యక్కడనుండు మునులతో నిట్లు పలికెను. 'మీరును, మీశిష్యులును, రాజులును, వారి యనుచరులును, నితరులును సీతశపథమును జూచెదరుగాక!'యని పలికెను. దానికి ఋషిముఖ్యులు 'బాగు, బా'గని పలికిరి. రాజులు రామునితో నట్లు చేయుట మీకే తగియున్నదనియు, నితరులకు తగియుండలేదనియు బలికిరి. రాముడు మఱునాటి యుదయమున సీత శపథము నిర్ణయించి సభవారందఱికి సెలవిచ్చెను.

ఆమఱునాటి యుదయమున రాముడు యజ్ఞశాలకు బోయి ఋషులనందఱిని బిలిపించెను. వసిష్ఠుడును, వామదేవుడును, జాబాలియు, కాశ్యపుడును, గొప్ప తపస్సుచేసిన విశ్వామిత్రుడును, గొప్ప నియమముగల దూర్వాసుడును,పులస్త్యుడును,భగవంతుడగు శక్తియు, భార్గవుడును, వామనుడును, దీర్ఘాయుష్మంతుడగు మార్కండేయుడును, మౌద్గల్యుడును, గర్గుడును, చ్యవనుడును, ధర్మము తెలిసిన శతానందు

డును, భరద్వాజుడును, నగ్నిపుత్రుడును, సుప్రభుడును, నారదుడును, పర్వతుడును, గొప్పకీర్తిగల గౌతముడును, కాత్యాయనుడును, సుయజ్ఞుడును, తపోసిధియగు నగస్త్యుడును, మఱికొందఱు మునులును నచటికి వచ్చిరి. గొప్పపరాక్రమముగల రాక్షసులును, మహాబలులగు వానరులును, ననేకులగు క్షత్రియులును, వైశ్యులును, శూద్రులును, ననేకదేశములనుండి వచ్చిన యితరులును, గొప్ప నియమముగల బ్రాహ్మణులును నాసభలోనుండిరి. జ్ఞానము తెలిసికొనుటలో మిక్కిలి శ్రద్ధగలవారును, కర్మలు చేయుటలో శ్రద్ధగలవారును, యోగముల నభ్యసించుటలో బుద్ధిగలవారును, నితరులును సీతచేయు శపథమునుజూచుటకై వచ్చియుండిరి. అందఱు కదలకుండ నుండిరి. అప్పుడు వాల్మీకి శీఘ్రముగ సీతతో నచటికి వచ్చెను. ముందు ఋషి నడచుచుండ నతనివెనుక సీత తలవంచుకొని చేతులు జోడించుకొని కన్నీరుకాఱుచుండ తనమనస్సులో రామునినే దలచుచు వచ్చెను. దానికి సభవారు 'బాగు, బాగని గొప్పశబ్దముచేసిరి. అందఱు గొప్ప దుఃఖముగలవారై తమ మనస్సు కలకలమునొంద హాహాశబ్దముచేసిరి. కొందఱు 'మంచిది రామా!' యనియు, కొందఱు 'మంచిది సీతా!' యనియు, కొందఱు 'మంచిది సీతారాములారా!' యనియు మొఱలిడిరి. అప్పుడు సభమధ్యకు వాల్మీకి ప్రవేశించి సీతకు సహాయముగ నిలిచి "దాశరథీ! ఈసీత మంచి నియమముగలది; ధర్మమార్గమున జరించినది; అపవాదమువలన నీచే నాయాశ్రమ సమీపమున విడువబడినది. లోకములోని యపవాదులకు భయమునొందిన నీకు సీత నమ్మకము గలిగించును. నీవామె నాజ్ఞాపింపుము. పరాక్రమవంతులగు నీయిద్దఱు కవలపిల్లలు సీతకు నీవలన జన్మించిరి. నేను నిజముపల్కుచున్నాను. నేను వరుణపుత్రులలో పదవవాడను. మనస్సులోనైనను నేనబద్ధమును స్మరింపను. వీరిద్దఱు నీపుత్రులు. అనేకవేల సంవత్సర

ములు నేను తపస్సుచేసితిని. సీత దుష్ప్రవర్తనగలదైన దానిఫలమును నేను పొందను. ఆమె మనస్సుచేతను, కార్యములచేతను, మాటలచే తను పాపము చేసియుండలేదు. ఆమె పాపముచేయనియెడల దాని ఫలమును నేను పొందెదను. నేను పంచభూతములందును, మనస్సునందును సీత పవిత్రురాలని తెలిసికొని వనమునుండి యామెను నా యాశ్రమమునకు దీసికొని వచ్చితిని. ఈమె పవిత్రమైన చరిత్రగలది; పాపము చేయనిది; పతియే దైవముగాగలది. లోకాపవాదమునకు భయమునుజెందిన నీకు భర్తయందలి వినయముగల యీ మహాత్మురాలు స్వయముగ నమ్మకము కలిగించు" నని పలికెను.

వాల్మీకి పలికిన యీమాటలను రాముడు విని దేవతాస్త్రీవలె నున్న సీతను జూచి సభలో నిలిచి చేతులుజోడించి వాల్మీకితో నిట్లనెను. 'మహాత్ముడా! ధర్మము తెలిసిన మీరు పలికిన మాటయందు నాకు నమ్మకము గలిగినది. పూర్వము సీత దేవతలసన్నిధానమున శపథముచేసి నాకు నమ్మకము కలిగించుటచే నే నామెను నా యింటిలో ప్రవేశపెట్టితిని. సీత పాపములేనిదని నాకు తెలిసినను లోకాపవాద మధికముగ నుండుటచే లోకులభయమువలన నే నామెను విడిచితిని. దానికి మీరు నన్ను క్షమింపవలెను. కవలపిల్లలగు నీ కుశలవులు నాకుమారులని నాకు తెలియును. ఈసభలో శుద్ధమగు చరిత్రగల యీామెయందు నాకు ప్రీతిగలుగుగాక!' ఇట్లు రాముడు పలుక సీత శపథమునుగూర్చి యతని మనస్సులోనున్న యభిప్రాయమును బ్రహ్మ మొదలగు దేవతాశ్రేష్ఠులు తెలిసికొని యక్కడకు వచ్చిరి. ఆదిత్యులును, వసువులును, రుద్రులును, నశ్వినీదేవతలును, మరుద్గణములును, గంధర్వులును, నప్సరసలును, సాధ్యులును, విశ్వేదేవులును, గొప్పఋషులును, నాగులును, గరుత్మంతులును, సిద్ధులును, సీత శపథమునుగూర్చి కంగారుపడుచున్న మనస్సుగలవారై సంతోషముతో

వచ్చిరి. అప్పుడు రాముడు దేవతలను, ఋషులను జూచి 'వాల్మీకి మహర్షి పలికిన పాపరహితమగు మాటలచే నాకు నమ్మకముగలిగినది. సభలో పవిత్రచరిత్రురాలగు సీతయందు నాకు ప్రీతి కలుగుగాక!' యని పలికెను. అప్పుడు శుభమగు వాయువు మంచిసువాసనలతో మనస్సున కింపగునటుల వీచ ప్రజలకు మిక్కిలి సంతోషము కలిగెను. అన్ని దేశములనుండి ప్రజ లాశ్చర్యకరమగు నీకార్యమును జూచుటకు కృతయుగములో వలెనే వచ్చిరి. అప్పుడు కాషాయవస్త్రమును గట్టి యున్న సీత వారినందఱిని జూచి చేతులుజోడించి ముఖముక్రిందికి వంచుకొని యిట్లు పలికెను.'నేను రామునితప్ప నితరులనుమనస్సులోనైన ను తలంపనియెడలను, నేను నామనస్సుచేతను, కార్యములచేతను, మాటలచేతను, నతనిని పూజించుచుండినయెడలను, రామునితప్ప నే నితరుని నెఱిగియుండని యెడలను, నేను సత్యముపలికియుండినయెడ లను, విష్ణునిభార్యయగు భూదేవి నేను ప్రవేశించుటకు సారంగమునిచ్చు గాక!' ఇట్లు సీత శపథము పలుకుచుండ భూమినుండి వెంటనే యాశ్చ ర్యకరమైనదియు, తేజోమయమగునదియు, రత్నములతో చెక్కబడి నదియునగు సింహాసనము పైకివచ్చెను. దానిని మిక్కిలిపరాక్రమ ముతో నొప్పు శరీరముగల నాగులు శిరస్సులతో మోయుచుండిరి. భూదేవి వచ్చి సీతను కుశలమడుగుచు గౌరవించి తన రెండుబాహువు లతో నామెను పైకెత్తి సింహాసనముపై కూర్చుండబెట్టెను. అంతట నాసింహాసనము రసాతలమునకు బోవుచుండెను. సీతపై నెడతెఱపి లేకుండునట్లు ప్రకాశమానమగుపుష్పవర్షము కురిసెను. 'సీతయొక్క గుణముచాలగొప్పది. బాగు, బాగని పలుకుచు నాకాశముననున్న దేవతలు గొప్పశబ్దముచేసిరి. సీత భూప్రవేశమగుచుండ నంతరిక్షమున నున్న దేవతలుమొదలగువారు సంతోషముచే మంచిమాటల ననేక ములను బలికిరి. యజ్ఞశాలలోనున్న ఋషులును, రాజులును, మనుష్యు

శ్రేష్ఠులును నాశ్చర్యముచే కదలకుండనుండిరి. ఆకాశమునందును, భూమియందునునుండు స్థావరజంగమజీవులలోను, గొప్పశరీరముగల దానవులలోను, పాతాళమునయున్న నాగశ్రేష్ఠులలోను కొందఱు సంతోషముతో గొప్పశబ్దముచేసిరి. కొందఱు దాని నాలోచించుచుండిరి. కొందఱు రాముని జూచుచుండిరి. కొందఱు శరీరస్పృహత్వము లేనివారై సీతవైపుచూచుచుండిరి. జగత్తంతయు నాముహూర్తమున మూర్ఛనొందినట్లాయెను.

సీత భూమిలో ప్రవేశించుచుండ రామునియెదుటనున్న వానరులును, మునులును 'బాగు, బాగని మొఱలిడ రాముడు కంటినుండి నీరు తెచ్చుకొని, కఱ్ఱనానుకొని, తలవంచుకొని దీనమగు ముఖమునుగలవాడై మిక్కిలిదుఃఖమునొందెను. అతడు చాలసేపేడ్చి మిక్కిలిగ కన్నీరు విడుచుచు క్రోధశోకములను బొంది యిట్లు పలికెను. 'లక్ష్మివంటి రూపముగలసీత నేనుచూచుచుండ నష్టముపొందుటచే పూర్వమెప్పుడునుగలుగని దుఃఖము నామనస్సునకు గలుగుచున్నది. పూర్వము సముద్రమున కావలితట్టుననున్న లంకకు తీసికొనిపోబడిన సీతను తిరుగ దీసికొనివచ్చిన నేను భూమినుండి యామెనుదీసికొనివచ్చుట యేమికష్టము? భూదేవీ! నీయొద్దనున్న సీతను నాకిచ్చివేయుము. లేనియెడల నన్ను నీవు తెలిసికొనునట్లు నారోషమును జూపెదను. నీవు నిజముగ నాకు అత్తగారవు. నీదగ్గఱనున్నసీత భూమినిదున్నుచున్న నాగలివలన జనకునకు దొరకినది. కనుక నామెను నీవు నాకిచ్చివేయవలెను. లేనియెడల నేను నీలోప్రవేశించుటకు సొరంగము నేర్పఱుపుము. నేను పాతాళమునగాని, స్వర్గలోకమునగాని సీతతో నివసించెదను. నీవు సీతను నాకిమ్ము. నేనామెనుగూర్చి మోహమును జెందియున్నాను. ఆమెను పూర్వమున్నరూపముతో నీవు నాకియ్యకపోయినయెడల పర్వతములలోను, వనములలోను నున్న నిన్ను పూర్తిగ

నంతమునొందించెదను. అంతటను నీవు వ్యాపించునట్లు చేసెదను.' ఇట్లు రాముడు క్రోధశోకములతో బలుక దేవతలమధ్యనున్న బ్రహ్మ యిట్లు పలికెను. 'రామా! మంచినియమములుగల నీవు సంతాపమును బొందకూడదు. నీవు పూర్వజన్మలో జరిగినదానిని, నప్పటి యాలోచనను జ్ఞాపకము తెచ్చుకొనుము. నిజముగ నిన్ను నే నుత్తమపురుషునిగ దలచుచున్నాను. ఈముహూర్తమున నీవు మిక్కిలిగొప్పదియగు విష్ణుసంబంధమగు నీజన్మను దలచి పవిత్రమైనసీతను పూర్వజన్మమునుండియు నిన్నాశ్రయించియున్న పతివ్రతగ నాలోచింపుము. నిన్నాశ్రయించియుండుటయను తపోబలముచే నామె స్వర్గలోకసుఖమును బొందును. స్వర్గలోకమున నీ వామెను గలిసికొనెదవు; అనుమానములేదు. ఆమెనుగూర్చిచేసియున్న యీసభలో నేను పలికినదానిని నీవు గ్రహింపుము. నీసంబంధమగు నీకావ్యము కావ్యములలోకెల్ల మిక్కిలిగొప్పది. నీజననము మొదలు నీకు గలిగినసుఖదుఃఖములీకావ్యమున పూర్తిగవిస్తరించివర్ణింపబడియున్నవి. గొప్పఋషియగువాల్మీకిచే ముందు జరుగబోయెడి సంగతులన్నియు నుత్తరకాండమున రచింపబడియున్నవి. ఈ మొదటికావ్యమంతయు నీచరిత్రతో నిండియున్నది. రాముడుతప్ప నితరులుకావ్యములందు కీర్తిని బొందుటకు తగినవారుకారు. గొప్పదియు, నద్భుతమైనరూపముగలదియు, సత్యమైనదియు, వెల్లడియైనదియునగు నీచరిత్రమంతయు పూర్వము దేవతలతోగూడ నేను వినియుంటిని. అట్టినీవు ధర్మముతోగూడుకొన్నవాడవై మిక్కిలి యాశ్చర్యకరమైనదియు,ముందుజరుగబోవునదియునగు మిగిలిన యుత్తరరామాయణకావ్యమును ఋషులతోగలిసి వినుము. ఉత్తమమగు నీకావ్యము నిజముగ నితరులవలన వినతగినదికాదు.' ఇట్లు బ్రహ్మపలికి దేవతలతో తన లోకమునకు బోయెను. తరువాత నక్కడనుండు బ్రహ్మర్షులు బ్రహ్మయాజ్ఞనుబొంది రాముడుచెప్పబోవు నుత్తరకాండ వినుట కుపక్రమించిరి. సకల

ధనమును, మంచిదక్షిణలను నిచ్చెను. వీనినిజేయుటకతడు మఱియొక స్త్రీని వివాహమాడక బంగారముతో సీతావిగ్రహమును జేయించి దానితో యజ్ఞములను జేసెను. ఇట్లు రాముడు ధర్మముగ జరించుచు

అ. రా:—ఒకనాడు రాముడు ధ్యానించుచు నేకాంతమున నుండుసమయమున కౌసల్య యతడు సాక్షాత్తు నారాయణుడని తెలిసి కొని ప్రియవచనములను బలుకుచు ప్రసన్నుడైన వానిసద్దకు బోయి సమస్కరించి సంతోషముతో నిట్లు పలికెను. 'రామా! నీవు లోకము లకు మొదటివాడవు; మొదలు, మధ్య, తుది లేనివాడవు; పర మాత్ముడవు; గొప్పయానందముతో గూడినవాడవు; పూర్ణుడవు; ఈశ్వరుడవు. అట్టినీవు నాపుణ్యమధికమగుటచే నాగర్భమునకుగృహ మున బుట్టితివి. నేను ప్రాణములను విడువవలసినసమయము వచ్చినది. ఇప్పుడైనను నజ్ఞానమువలనబుట్టినసంసారబంధమునన్న పూర్తిగవిడువ లేదు. ఈశ్వరా! యిప్పుడైనను నాసంసారబంధమును బోగొట్టి జ్ఞాన మును కొద్దిమాటలలోబోధింపుము.' ఇట్లుదీనముగ వల్కెడు తనతల్లి యందు గొప్పదయగలవాడై రాముడుధర్మబుద్ధితో నిట్లుపలికెను. "తల్లీ సృష్ట్యాదియందునాచే 'కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము' సనుమూడును మోక్షమునుబొందుటకు సాధనములని శ్రుతులందు జెప్పబడినది. ('తమేవంవిదిత్వాతిమృత్యుమేతినాన్యఃపంథావిద్యతేయ నాయ' అనుశ్రుతిచే జ్ఞానయోగమే మోక్షమునకు ముఖ్యకారణమని నిర్ణయింపబడియుండగా కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగములు మూడు మోక్షమునకు సాధనములనిచెప్పినరామునియభిప్రాయ మేమ నగా ఈశ్వరునియందు కోరికలేకుండ నాచరింపబడిన కర్మయోగమువల్ల

రములలోను సీతతోకాపురముచేసిన 10 వేలసంవత్సరములు గాక మిగిలినవేయి సంవత్సరము లాయజ్ఞములను జరిపియుండును; గనుక నిట్టిపట్టున కవిచాతుర్యము పతె గాన్పించుచున్నది.

గాలమును గడుపుచుండెను. కౌసల్య పుత్రపౌత్రులతో చాలకాలము గడపి తరువాత మరణమునొందెను.సుమిత్రయు, కైకేయియుగూడ కాల

---

గలిగిన చిత్తశుద్ధిచే సంపాదింపబడిన జ్ఞానయోగ మొకటి. ఈజన్మయందు నాచరింపబడిన భక్తియోగముచే గలిగిన చిత్తశుద్ధిద్వారా కలిగిన జ్ఞానయోగము రెండు. పూర్వజన్మయందు నాచరింపబడిన భక్తియోగకర్మయోగములచే సంపాదింపబడినచిత్తశుద్ధిద్వారాకలిగిన జ్ఞానయోగముమూడు. కేవలకర్మగాని, కేవలభక్తిగాని మోక్షసాధనము కానేఱదు.) కర్మయోగభక్తియోగములలో భక్తియోగము జ్ఞానమునకు సాక్షాత్సాధనము. భక్తియనగా అనురాగవిశేషము. అట్టిభక్తి సాత్విక రాజస తామసభేదములచే మూడువిధములు. భక్తి మూడు విధములగుటచే భక్తులుకూడ తామసభక్తుడని, రాజసభక్తుడని, సాత్వికభక్తుడని మూడువిధములుగ జెప్పబడుచున్నారు. ఎవడు పరులను మోసముచేయనుద్దేశించి దంభమాత్సర్యాదులతో గూడిన వాడై భేదబుద్ధితో నన్ను సేవించునో వాడు తామసభక్తుడు. ఎవడు భోగముల నపేక్షించియు, ధనకీర్తులనపేక్షించియు ఫలాపేక్షచే భేదబుద్ధితో నన్ను సేవించునో వాడు రాజసభక్తుడు.ఎవడు తనపాపక్షయము నపేక్షించికాని, శాస్త్రములయందు భగవత్సేవ విధింపబడినదనిగాని నన్ను తనకంటె వేఱుగా తలంపక తొందరలేనివాడై నిష్కాముడై పూజించునో వాడు సాత్వికభక్తుడు. అనంతగుణాకరుడనగు నాయందలిగుణములను చక్కగ సద్గురునివలన విని యాగుణములను మననముచేసి యట్లుమననముచేయబడినగుణములను తైలధారవలె తెంపులేకుండ ధ్యానించుటయే పరమభక్తి యని చెప్పబడును. అట్టిభక్తి తారతమ్యమున సాలోక్యముక్తియు, సామీప్యముక్తియు, సారూప్యముక్తియుగలుగును. (అనగా తాను ధ్యానించుమూర్తిని నేలోకమునందున్నవానిగా ధ్యానించునో యాలోకమును, నట్టివానిసమీప

ధర్మమునొందిరి. అందఱు ధర్మమార్గమున బ్రవర్తించుచు స్వర్గమునకు బోయి దశరథునితో సుఖముగనుండి ధర్మములను జరుపుచుండిరి.

---

మును, నట్టివానిస్వరూపమును బొందును.) ఎవరు సర్వదా నన్నే సేవించుచు ప్రతిగ్రహనివృత్తులై (దానముపుచ్చుకొనకుండ) ప్రాప్తమైన దానితో సంతోషించుచు నుందురో వారు ఆత్యంతిక (సంపూర్ణ)భక్తులని చెప్పబడుదురు. అట్టివారు నారూపమును బొందగలరు. ఎవరు సత్వరజస్తమోగుణములను దాటి కోరికలులేనివారలై స్వధర్మమునాచరించుచు, హింసారహితమైనకర్మల నాచరించుచు, నాదర్శనమును, నాస్తుతిని, నాపూజను జేయుచు, నన్నుస్మరించుచు, నాకువందనముల నాచరించుచు, సర్వభూతములను నన్నుగా భావించుచు, అసత్యాది దుర్గుణములను వదలి, మహాత్ములను, బహుమానించుచు, దుఃఖవంతులను దయతోజూచుచు, సమానులయందుమైత్రినవలంబించి, యంతరింద్రియబహిరింద్రియములను నిగ్రహించి, వేదాంతవాక్యములను వినుచు, నానామస్మరణజేయుచు, నహంకారమును వదలి, సత్సాంగత్యముచేయుచు నుందురో వారు పరిశుద్ధమైనయంతఃకరణగలవారలై 'అహంబ్రహ్మాస్మి' త్యనుసంధానదార్ఢ్యమువల్ల ప్రారబ్ధక్షయపర్యంతము శరీరమాత్రధారులైయుండి యవిద్యానాశమువల్ల తత్కార్యమగులింగ శరీరముతో విముక్తులై స్వస్వరూపమును బొందగలరు. (ఇదియేసాయుజ్యముక్తి) తల్లీ! సర్వభూతములయందు నన్ను భావించుచు చేయుపూజాదులవల్లనుంచియే నాకు సంతోషముగలుగును. అట్లు భావనచేయకుండ నల్పమగు మూర్తులయందు (ప్రతిమాదులయందు) జేయుపూజాదులవల్ల నాకు సంతోషము కలుగదు. వారికి మోక్షముసంభవింపనేరదు. ఎవడు నన్ను తనకంటె వేఱుగభావించుచు పూజించునో, సేవించునో వానికి భయము, మృత్యువు తప్పదు. ఎవన్ను

వారినిగూర్చి యెప్పుడెప్పుడు రాముడు గొప్పదానములను జేసెను. అతడు పితృదేవతలనుగూర్చియు, దేవతలనుగూర్చియు దక్షిణలతో పితృకార్యములను యజ్ఞములను జేసెను.

---

సర్వభూతములయందు నిండియున్న నన్ను శ్రుత్యాదిప్రమాణములచే నొక్కనిగా నిర్ణయించి, సర్వప్రాణులయందు విరోధబుద్ధిలేకుండ మైత్రిచే నన్ను మానసికోపచారములచే బూజించునో యాపూజయే వానికి సాయుజ్యముక్తికి సాధనమగు జ్ఞానవైరాగ్యములను గలుగజేయును. అంబా! నీకు భక్తియోగముతో గూడిన జ్ఞానయోగముయొక్క స్వరూపమును దెలిపితిని. నీవు భక్తియోగము నాశ్రయింపుము. దానిచే శాంతిని బొందగలవు. తొండముదిరి యూసరవిల్లియైనట్లు భక్తియోగమతిశయించినయెడల జ్ఞానయోగమగును. దానివల్ల ముక్తినొందగలవు. నన్ను సర్వభూతములయందు నిండియున్నవానిగ ధ్యానింపలేనియెడల పుత్రరూపునిగ ధ్యాంచినను ముక్తిని బొందగలవు." రాముడుచెప్పినయీయుపదేశములను కౌసల్య విని యానందమునుబొంది యతని నెల్లప్పుడు హృదయమున దలంచుచు సంసారబంధమును ద్రెంచి మూడులోకములను దాటి యుత్తమలోకమునకుబోయెను. కైకేయికూడ రాముడిదివరలో తనకుజెప్పిన యోగమును బొంది పరమపదమును బొందెను. సుమిత్రకూడ పవిత్రమగు మనస్సుతో నాలోకమునుబొందెను.

## ౧౬౭ వ. అధ్యాయము.

## రాముడు లక్ష్మణ భరతపుత్రులను నితర దేశములకు రాజులుగ జేయుట.



రాముడు రాజ్యముచేయుచుండ కొంతకాలమునకు కేకయ రాజగు యుధాజిత్తు తనకు గురువును, నంగిరసపుత్రుడును, మిక్కిలి తేజోవంతుడునునగు గార్గ్యుడను బ్రహ్మర్షిని రామునియొద్దకు బంపెను. అతనితో పదివేలగుఱ్ఱములను, శాలువలను, రత్నములను, చిత్రములగువస్త్రములను, మంచియాభరణములను కేకయరాజు రామునకు కానుకగ పంపెను. ఋషివచ్చుట రాముడు తెలిసికొని తనతమ్ములతో నొకక్రోసుదూర మతని కెదురుగనేగి యతనిని మర్యాదచేసి తననగరునకు దీసికొనివచ్చెను. తరువాత నతడు కానుకలను బుచ్చుకొని మాటిమాటికి నందఱికుశలమునుగూర్చియు, తనమామయగునశ్వపతికుశలమునుగూర్చియు నతని నడిగెను. పిమ్మట గార్గ్యుడు కూర్చున్నతరువాత రాముడు 'నామామ యేమిమాటలను జెప్పెను? మీరు వచ్చుటకు గారణమేమి?' యని యతనినడిగెను. దానికాతడు యుధాజిత్తు చెప్పినమాటల నిట్లు రామునకు జెప్పెను. 'సింధునదికి రెండుప్రక్కలను మిక్కిలిశోభాయుక్తమగు గంధర్వులదేశమున్నది. అది యెల్లప్పుడు మంచిఫలమూలములతో నొప్పుచుండును. యుద్ధవిశారదులగు గంధర్వులాయుధములనుబట్టి దానిని రక్షించుచున్నారు. శైలూషుని (విభీషణునిభార్యయగుసరమతండ్రి) పుత్రులు మూడుకోట్లమంది కామరూపములనుబొంది దానినిగాపాడుచున్నారు. వారిని నీవు జయించి జాగ్రత్తగ నక్కడ రెండుపురములను నిర్మింపుము. ఆదేశ మితరులకు స్వాధీనముకాదు. నేను శ్రేయస్సుకానిదానిని బలుకను. దీనికి నీ వంగీకరింపుము.' ఆమాటలను రాముడు విని మిక్కిలిసంతో

పించి దానినంగీకరించి భరతునివైపు చూచెను. తరువాత నతడు ఋషికి చేతులుజోడించి యిట్లు పలికెను. 'భరతునిపుత్రులగు తక్ష పుష్కలు లనువారిద్ద ఱా దేశమును పాలించెదరు. ధర్మముగ జరించు వీరు నామామచే రక్షింపబడుచు భరతునితోఁగూడ సేనలను దీసికొని వెళ్ళి గంధర్వులను జంపి యా దేశమును రెండుభాగములుగజేసి రెండు పట్టణములను స్థాపించెదరు. అతిధార్మికుడగు భరతు డాపట్టణములందు తనకుమారులనుంచి నాయొద్దకు తిరుగవచ్చును.' ఇట్లు రాముడు గార్గ్యునితో బలికి సైన్యముతో వెళ్ళుటకు భరతున కాజ్ఞాపించి మంచి నక్షత్రమున వానికుమారులను నా దేశమున కధిపతులుగ నభిషేకించెను. గార్గ్యుడును, భరతుడును, సైన్యములును, భరతపుత్రులును నయోధ్యనుండి బయలుదేఱిరి. దేవతలకైనను జయింపశక్యముగాని యా సేనకును, భరతునకును ముందు మాంసమును భుజించు మృగములును, రాక్షసులును, వేలకొలది సింహములును, పులులును, నడవిపందులును, నాకాశమునతిరుగు పక్షులును యుద్ధభూమిలో గంధర్వుల మాంసము తినుటకు బయలుదేఱివెళ్లెను.

ఇట్లు భరతుడుమొదలగువారు బయలుదేఱి కేకయదేశమునకు 15దినములలో వెళ్ళిరి. ఆదేశపురాజు మిక్కిలి సంతోషమును బొంది తానుగూడ గొప్పసైన్యమును దీసికొని వారితో *గంధర్వదేశమునకు వెళ్ళెను. ఈసంగతి గంధర్వులు తెలిసికొని యుద్ధముచేయ గోరి పోరుసలుపుటకు వచ్చి పెద్దశబ్దముచేసిరి. అప్పు డుభయసైన్యములకును నేడురాత్రులు గొప్పయుద్ధముజరిగెను. అందెవరికిని జయము కలుగలేదు. ఆయుద్ధమునరక్తము ప్రవహించుచుండ నందు ఖడ్గములు మొదలగు నాయుధములు పెద్దజలజంతువులవలె గనబడెను. మను

* 13వ ప్రకరణము ౧౮వఅధ్యాయము భరతఖండ భూగోళ పటమును జూడుము.

ష్యులకళేబరములు దానిలో తేలుచుండెను. అప్పుడు భరతునకుగొప్ప
క్రోధముగలుగ నతడు కాలునియస్త్రమగు సంవర్తమను దారుణాస్త్ర
మును గంధర్వులపై విడువ దానిచే నొకనిమిషములో 3 కోట్లమంది
గంధర్వులు చీల్చబడి మడిసిరి. దానికి దేవతలేమియు శ్రద్ధతీసికొన
లేదు. తరువాత భరతుడా గాంధారదేశమున తక్షునికి 'తక్షశిల'యను
పట్టణమును, పుష్కలునకు 'పుష్కలావతి' యను పట్టణమును సర్వవస్తు
సమృద్ధిగనుండునట్లు కట్టించెను. అవి మంచివనములుగలిగి ధనధాన్య
ములతోను, రత్నసమూహములతోను నిండియుండెను. అవి స్పర్థచే
నొకదానినొకటి యతిశయించియుండవలెనని మంచిగుణములతో
నొప్పుచుండెను. మఱియు నారెండుపట్టణములు మోసములేనివ్యాపా
రములను, మంచియుద్యానవనములను, మంచివాహనములను, మంచి
విమానములను, బాగుగ విభజింపబడినయంగడివీధులను, విశాల
మగునిండ్లను మంచిమేడలనుగలిగి యొప్పుచుండెను. ఇంకను నాపట్ట
ణములలో మంచిమేడలనేకములును, విశాలములగు దేవాలయములును,
ననేకవిధములగు చెట్లునుగూడనుండెను. భరతుడక్కడ 5 సంవత్సరము
లుండి తిరుగ రామునియొద్దకు వచ్చి యాతనికి నమస్కరించి జరిగిన
దంతయు దెలిపెను. అతడు దానిని విని సంతోషించెను.

తరువాత రాముడు లక్ష్మణునితో నిట్లనెను. 'నీపుత్రులగు
నంగద చంద్రకేతులు మంచిధర్మపరులు; పరాక్రమము గలవారు;
రాజ్యముచేయదగినవారు. కావున మంచిసుందరమగు దేశమును వెదు
కుము. ఆదేశమున వారికి రాజ్యాభిషేకముచేయు, ధనుర్ధరులగు వా
రచ్చట క్రీడించెదరు. ఆశ్రమములకు నాశనముగలుగనిదియు, రాజు
లకు పీడకలుగనిదియునగు దేశమునుజూడుము. మనమపరాధము చేయ
గూడదు.' ఇట్లు రాముడుపలుక భరతుడు 'కారుపథదేశము సుందర
మైనదియు, నారోగ్యమైనదియునగుటచే లక్ష్మణపుత్రు లక్కడ పట్ట

ణములను నిర్మింపజేయు'డని తెలిపెను. దీని కాతడొప్పుకొని యాదేశ
మును స్వాధీనముచేసికొని యంగదునకు సుందరమైనదియు, బాగుగ
రక్షింపబడునదియునగు నంగదీయపురమును నిర్మించెను. శరీరవ్యా
యామము తెలిసినచంద్రకేతువునకు మల్లయుద్ధవిశారదులుండు దేశమున
స్వర్గపురమువలె నొకపట్టణమును నిర్మించెను. అప్పుడు రామ
లక్ష్మణ భరతులు మిక్కిలిసంతోషమునొంది యక్కడకుబోయి కారు
పథదేశములోని పశ్చిమభాగమునను నంగదుని, నుత్తరభాగము
నకు చంద్రకేతువును నభిషేకించిరి. అంగదునకు లక్ష్మణుడును,
చంద్రకేతువునకు భరతుడును సహాయముగనుండిరి. లక్ష్మణు డొక
సంవత్సర మక్కడ నివసించి రామునియొద్దకు తిరుగ వచ్చెను. భర
తుడు రెండుసంవత్సరములు నివసించి వచ్చెను.



౧౨౬. అధ్యాయము.

యముడు తాపసవేషమున వచ్చి రాముని
యవతారాంతమును గోరుట.



తరువాత కొంతకాలమునకు రామునిరాజ్యాంతము సమీపించెను. అప్పుడు యముడు తాపసవేషమును ధరించి రామునిరాజద్వార
మునకు వచ్చి కీర్తిమంతుడును, ధైర్యశాలియునగు లక్ష్మణునితో
'నేను గొప్ప తేజోవంతుడును, మహాబలుడునునగు మహర్షియొక్క
దూతను. కార్యావసరముచే రామునికొఱకు వచ్చితిని. అతనితో నీసంగతి
తెలుపు'మనిచెప్ప నతడు వెంటనే తొందరగ రామునియొద్దకుబోయి
యతనికి నావార్త దెలిపెను. అతడు 'మునిని దీసికొనిర'మ్మని సెల

వీయ లక్ష్మణుడు వెళ్ళి మిక్కిలి తేజముగల యాతనితోడ్కొనివచ్చెను. ఆఋషి రాముని జూచి మంచిమాటలచే దీవించెను. రాము డతనికి నర్ఘ్యము మొదలగు పూజల నొసగి కుశలమడిగి యతనిని బంగారునాస నమున కూర్చుండబెట్టి 'మీరాక లెన్న! దూతగవచ్చినమీరు తెలుప వలసినమాటలను దెలుపు'డని పలుక ఋషి 'నీవు శ్రేయమునుగోరిన యెడల మనమిద్దఱముమాత్రమే మాటలాడుకొనవలెను. మఱియొక డెవ్వడైన మనలను జూచినను, మనమాటలను వినినను వాడు చంపబడ వలెను. ఇట్లు మహాముని శ్రేష్ఠుడు నిర్ణయించియుండె'నని తెలిపెను. దానికి రాముడొప్పుకొని లక్ష్మణునితో 'నీవు ద్వారమువద్ద నిలిచి ద్వారపాలకుని పంపివేయుము. మామాటల నెవ్వడైన వినినను, మమ్ము జూచినను వాడు చంపబడు'నని చెప్పి యతనిని ద్వారమువద్ద నుంచి మునితో 'మీరు కోరినసంగతియేమి? మిమ్ము బంపినవారెవరు? మీ రెవరు? ఏలవచ్చితిరి? అనుమానములేకుండ దెలుపుడు. నామనస్సు శంకించుచున్న' దని యనెను.

రామునిమాటలను ఋషి విని యిట్లు పలికెను. "బ్రహ్మ నన్ను బంపెను. నేను పూర్వజన్మమున మీపుత్రుడను; మాయ చేకూడుకొని సర్వమును సంహరించుచున్న కాలుడను. లోకప్రభువగు బ్రహ్మదేవుడు నీవు లోకములను రక్షించుటకు ప్రతిజ్ఞ చేసితివని చెప్పి మొదటిదియగు * నీవిష్ణ్వవతారమును దెలిపెను. మఱియు నీవు జీవులను రక్షించువాడ వగుటచే విష్ణుత్వమును బొందితివనియు, ప్రజలు రావణునిచే గొప్ప బాధలనొందుచుండ నీవు రావణుని జంపగోరి మనుష్యరూపమును బొందితివనియు, 11 వేల సంవత్సరములు ♦ భూలోకములో నివసించు

---

* ౭వ. ప్రకరణము. ౧వ. అధ్యాయము. సృష్టివివరము చూడుము.

♦ రాముడు 11 వేల సంవత్సరములు భూలోకనివాసము నిర్ణయించుట యిక్కడ వర్ణింపబడినను నితరచోట్ల నతడు 11 వేల సంవత్సరములు రాజ్యము చేసినట్లు కనబడుచుండుటచే నామాట సత్యమని యూహించి గ్రంథములో వ్రాసితిమి.

టకు పూర్వము నీవు స్వయముగ నిర్ణయించుకొంటివనియు, నీవీ మనుష్యలోకములో పూర్ణాయువుగలవాడవనియు, నీ యవతారము చాలించుటకు కాలము సమీపించినదనియు, నింకను నీకు ప్రజలను బాలింపవలెనని యున్నయెడల నిచట నివసింపవచ్చుననియు, నీకు శుభమగుగాక! యనియు, లేక నీకు దేవలోకమునకు రావలెనని యున్నయెడల నట్లుచేసి దేవతలకు విచారములేకుండ జేయవలెననియు బ్రహ్మసెలవిచ్చెను.” ఇట్లు ఋషి పలుక నామాటలను రాముడు విని పెద్దనవ్వు నవ్వుచు సర్వసంహారుడగు నామునితో నిట్లనెను. ‘బ్రహ్మ పలికిన యద్భుతవాక్యములను వినుటచేతను, మీరు వచ్చుటచేతను నాకు గొప్ప ప్రీతికలిగెను. మూడులోకములకు శుభమగు కార్యములను జేయుటకే నేను జన్మించితిని. ఎక్కడనుండి నేను వచ్చితినో యక్కడకు తిరుగ బోయెదను. మీకు శుభమగుగాక! నే నన్నికార్యములలోను దేవతలకు వశమైయుందును. నామనస్సులో నున్నదంతయు జరిగినది. ఆవిషయములో నే నాలోచింపనక్కఱలేదు. బ్రహ్మ చెప్పినట్లే యంతయు జరుగవలెను.’ ఇట్లు రాముడు పలుకుచుండ సర్వసంహారుడగు నాఋషి వినుచుండెను.

---

## ౧౦౪. అధ్యాయము
## లక్ష్మణునియవతారాంతము.

రాముడు కాలపురుషఋషితో మాట్లాడుచుండ లక్ష్మణుడు ద్వారమువద్ద కాపుండెను. అంతలో దుర్వాసుడు రాముని జూచుటకై వచ్చి ద్వారమువద్దనున్నలక్ష్మణుని జూచి ‘మొదట నీవు నాకు మీయన్నను జూపుము. నాపని మించిపోవుచున్న’ దని పలికెను. ఆ

మాటలను లక్ష్మణుడు విని యాఋషికి నమస్కరించి 'మీాపనియేమి? మీాకుగావలసినప్రయోజనమేమి? నేనేమిచేయవలెను? రాముడు మఱి యొకకార్యములో నిమగ్నుడై యున్నందున నొకముహూర్తము తాళు'డని మనవిచేసెను. దానికి దుర్వాసుడు క్రోధమునుజెంది కండ్ల నుండి నిప్పులను గ్రక్కుచున్నట్లిట్లు పలికెను. 'ఈక్షణముననే నేను వచ్చినసంగతి రామునకు దెలుపుము. అట్లు తెలుపవేని మీాదేశమును, పట్టణమును, నిన్ను, రాముని, భరతుని, మీావంశమువారిని శపించెదను. క్రోధమును నేను మనస్సులో పట్టలేను.' ఇట్లు ఋషి మిక్కిలికఠినముగ బలుక నామాటలను లక్ష్మణుడు విని 'నా కొక్కనికి మరణము సంభ వింపనగునుగాని యందఱికి నాశనము జరుగకూడ'దని మనస్సులో నా లోచించి రామునియొద్దకు బోయి దుర్వాసఋషివచ్చినసంగతి యతనికి దెలిపెను. రాముడు దానిని విని కాలఋషికి సెలవిచ్చి శీఘ్రముగ పైకి వచ్చి దుర్వాసుని జూచి యతనికి నమస్కరించి 'నేను చేయవలసినదే' మని మనవిచేసికొనెను. దాని కత డాదినమునకు తానుచేసిన వేయి సంవత్సరములతపస్సు పూర్తియయ్యెననియు, తనకు సిద్ధముగ భోజ నము పెట్టవలెననియు గోరెను. రాము డట్లు సంతోషముతో ఋషికి భోజనముపెట్టింప దుర్వాసుడు భోజనముచేసి రామునిగీర్తించి తన యాశ్రమమునకు బోయెను. తరువాత రాముడు కాలఋషితో తాను జేసిననిశ్చయమును, జ్ఞాపకము తెచ్చుకొని దుఃఖముచే సంతాపము నొంది దీనమగుమనస్సుతో ముఖమును వంచుకొని యేమియుబలుకలేక కాలఋషిమాటలను తనబుద్ధిచే నాలోచించి యిది యిట్లు కాదని నిశ్చ యించి యూరకుండెను.

ఇట్లు తలవంచుకొని విచారించుచున్న రాముని జూచి లక్ష్మ ణుడు సంతోషముతో మంచిమాటల నిట్లు పలికెను. 'రామా! నాని మిత్తము మీారు సంతాపమును బొందకూడదు. పూర్వనిర్మాణముచే

బద్ధమైన కాలగతి యిట్లున్నది. నన్ను శంకలేకుండ చంపి ప్రతిజ్ఞను పాలింపుము. ప్రతిజ్ఞప్రకారముజరుపని మనుష్యులు నరకమును బొందుదురు. నీకు నాయందు ప్రీతియు, ననుగ్రహము నున్నయెడల నన్ను శంకలేకుండ చంపి ధర్మమును వృద్ధిబొందింపుము. ఈమాటలను రాముడు విని తనయింద్రియములు చలింప మంత్రులను,పురోహితులను పిలిపించి దుర్వాసుడువచ్చుటయు, తాను కాలఋషితోజేసినప్రతిజ్ఞయు వారికి దెలిపెను. వసిష్ఠుడు దానిని విని యిట్లు పలికెను. 'నేను నీనాశనమును, లక్ష్మణునితో వియోగమును దివ్యదృష్టిచే జూచితిని. నీవు లక్ష్మణుని విడువుము. కాలము బలవత్తరమైనది. నీప్రతిజ్ఞను నీవు వృథచేయగూడదు. అట్లు చేసినయెడల ధర్మముకూడనాశనమగును. అట్టిధర్మము నశించినయెడల చరాచరములతోగూడినమూడులోకములును, దేవఋషిగణములన్నియును సందేహములేకుండ నాశనమొందును. కనుక నీవు లక్ష్మణుని విడిచి మూడులోకములయొక్క పరిపాలనవలన జగత్తునకు సుఖమును గలుగజేయుము.' ఇట్లు వసిష్ఠుడు సభలో ధర్మవాక్యములను బలుక రాముడావాక్యములను విని లక్ష్మణునితో 'నేను నిన్ను విడిచెదను. ధర్మమునకు వ్యతిరేకము జరుగకూడదు. విడుచుటయైనను, వధయైనను మంచివారికి సమానములే.' యని పలుక లక్ష్మణుడు కన్నీరు తెచ్చుకొని తనయింటిలోగూడ ప్రవేశింపకుండ శీఘ్రముగ సరయూతీరమును జేరెను. అక్కడ నత డాచమనముచేసి సర్వేంద్రియములను నిగ్రహించి యూపిరికూడదీయకుండనుండెను. అప్పుడతనిపై నింద్రుడును, దేవతలును, నప్సరసలును, ఋషులును పూలవర్షమును గురిపించిరి. అతడు మనుష్యులందఱకు గనబడని గొప్పశరీరమును బొందగ నింద్రుడాతనిని స్వర్గమునకు దీసికొనిపోయెను. ఇట్లు విష్ణువుయొక్క నాల్గవభాగము స్వర్గమునకు వచ్చుట దేవతాశ్రేష్ఠులందఱు జూచి ఋషులతో పూజలను జేసిరి.

## ౧౬౫. అధ్యాయము
## కుశలవుల పట్టాభిషేకము.

రాముడు లక్ష్మణుని విడిచిన తరువాత దుఃఖశోకములతో గూడుకొనినవాడై వసిష్ఠునితోను, మంత్రులతోను, వర్తకులతోను 'ఇప్పుడు భరతుని సర్వసామ్రాజ్యాధిపతిగ నభిషేకించి నే నడవికి వెళ్లిపోయెదను. కనుక వస్తువులను విలంబముచేయక తెప్పించుడు. లక్ష్మణుడు వెళ్లినత్రోవను నేనుకూడ బోయెద'నని పలికెను. అతని యీమాటలను ప్రజలందఱు విని తమతలలతో నతనికి ననేక పర్యాయములు నమస్కరించుచు ప్రాణములు పోయినవారివలె నైరి. భరతుడు రాముని మాటలను విని మూర్ఛజెంది రాజ్యముచేయుట కిష్టపడక యతనితో నిట్లనెను. 'నేను సత్యమును, స్వర్గలోకమునుబట్టి శపథము పలుకుచున్నాను. మీరులేని రాజ్యము నా కక్కఱలేదు. మీ కుమారులకు పట్టాభిషేకముచేయుడు. కోసలదేశమునకు కుశుని, నుత్తరదేశమునకు లవుని నభిషేకముచేయుడు. శీఘ్రముగ బోవుదూతలు శత్రుఘ్నుని యొద్దకుబోయి మనము స్వర్గమునకుబోవుసంగతి యతనికి దెలుపవలెను' ఇట్లు భరతుడు పలుక పట్టణవాసులందఱు శోకముచే ముఖము వంచుకొనియుండిరి. అప్పుడు వసిష్ఠుడు వారినందఱిని జూచి రామునితో 'వత్సా! భూమిలోనికి తలవంచుకొనియున్న యీప్రజల మనస్సులోని కోరికను దెలిసికొనుము. వారికి విప్రియము చేయకు' మని యనెను. ఈమాటలను రాముడు విని వారిని లేవనెత్తి 'నే నేమిచేయవలయు' నని యడిగెను. అప్పుడు వారు 'మిమ్మనుసరించి మేముకూడవచ్చెదము. పౌరులమగు మాయందు మీకు గొప్పస్నేహము, ప్రీతియు నున్న యెడల మాభార్యాపుత్రులతోగూడ మేము మిమ్ము వెంబడించివచ్చెదము. తపోవనమునకైనను, ప్రవేశించుటకుకష్టమైన దేశమునకైనను,

నదికైనను, సముద్రమునకైనను మీతో వచ్చుటకు సిద్ధముగనుంటిమి. మేము విడిచిపెట్టతగనివారమైనయెడల మమ్ము మీరు తప్పక దీసికొని వెళ్ళుడు. ఇదియే మాకు మిక్కిలిప్రీతికరమగుకార్యమును, గొప్పవర మునునైయున్నది. మీవెంటవచ్చుటయే మామనస్సులోనికోరిక.'యని పలికిరి. ఇట్లు పట్టణవాసులకు తనయందున్నదృఢభక్తిని రాముడు తెలిసికొని 'నిశ్చయముగ నట్లు జరుగు'నని యనెను. తరువాత నత డా దినముననే తనయవతారాంతదినమును నిశ్చయించుకొని కోసలదేశము నకు కుశుని, నుత్తరదేశమునకు లవుని నభిషేకముచేసి వారిని తన తొడలమీదకూర్చుండబెట్టుకొనివారిని కౌగిలించుకొని వారిశిరస్సులను మూర్కొనెను. వారికొక్కొక్కరికి వేలకొలదిగుఱ్ఱములను, మిక్కిలి ధనమును, ననేకరత్నములనునిచ్చెను. వారిప్రజలు మిక్కిలివృద్ధినొంది సంతోషముతోనుండిరి. కుశునికి * వింధ్యపర్వతముపై సమతలమున 'కుశావతి' యనుపట్టణమును, లవునికి ప్రఖ్యాతికల' శ్రావస్తి'యను పట్టణమును రాముడు కట్టించి యాకుమారులను నాయాపట్టణములకు బంపెను.

---

*దశరథునికాలములో కోసలదేశము దక్షిణమునకు గంగానదివరకు వ్యాపించి యుండెను, అది రామావతారాంతమున వింధ్యపర్వతమువరకు వ్యాపించుటను బట్టి రాముడు రాక్షసులబాధబోగొట్టినతరువాత నంతవరకునుండినజనస్థానమును, దండ కారణ్యమును బాగుచేయించి ప్రజలు నివసించుటకు యోగ్యముగ జేయించి వారి నక్కడ నివసింపజేసి తనకోసలదేశము వృద్ధిపొందించెనని మేమూహించెదము. వింధ్యపర్వతసమీపమునయుండు ప్రదేశమునకు 'మహాకోసల'యని పేరువచ్చుటకు నిదియేకారణమని మేమాలోచనచేసెదము. ౧౩వ. ప్రకరణము, ౧౨వ. అధ్యాయము పఠముచూడుము.

## ౧౧౦వ. అధ్యాయము.

## రామ భరత శత్రుఘ్నులును, నయోధ్యావాసులును స్వర్గమునకు బోవుట.

రాముడు కుశలవులకు పట్టాభిషేకము చేసిన తరువాత శత్రుఘ్నుని దీసికొనివచ్చుటకు దూతలను మధురాపురమునకు బంపెను. వారు దారిలో నాలస్యము చేయకుండ శీఘ్రముగ మూడు రాత్రింబగళ్లలో నాపట్టణమునుజేరి జరిగినదంతయు శత్రుఘ్నునకు దెలిపి రామాదులును, నయోధ్యావాసులును స్వర్గమునకు బోవ సిద్ధముగ నున్నసంగతి చెప్పి శత్రుఘ్నుని శీఘ్రముగ బయలుదేటి రమ్మని చెప్పిరి. అంత నతడు తన పురోహితుని, పౌరులను బిలిపించి వారికి జరిగినదంతయుదెలిపి 'నేను నాయన్నలతో పరమపదము నొందెద' నని చెప్పెను. తరువాత నతడు మధురాపట్నమునకు తన కుమారుడగు సుబాహువును, శూరసేన దేశమునకు శత్రుఘాతి యను మఱియొక పుత్రుని నభిషేకించి తనసేనను రెండుభాగములుగజేసి వారికప్పజెప్పెను. తరువాత నతడు తన ధనమును యుక్తముగ వ్యయముచేసి యొకరథము నెక్కి కూర్చుండి యయోధ్యనుజేరెను. రాముడు పలుచని తెల్లబట్టను గట్టుకొని మునులతో ప్రసంగించుచుండ శత్రుఘ్నుడతనికి నమస్కరించి చేతులు జోడించుకొని మిక్కిలి వినయముతో ధర్మయుక్తముగ నిట్లనెను. 'నేను నాకుమారులకు రాజ్యాభిషేకముచేసి మిమ్మనుసరించి వచ్చుటకు నిశ్చయించితిని. మీశాసన మతిక్రమింప శక్యముకానిది కాన మీరు మఱేమియు నాజ్ఞాపింపవలదు. మీభక్తుడనగు నన్ను విడుచుట మీకు తగియుండలేదు.' ఇట్లు శత్రుఘ్నుడు పలుక వాని యభిప్రాయమును రాముడు తెలిసికొని 'అట్లే యగుగాక!' యని పలికెను.

తరువాత కామరూపులగు ననేక వానరులును, ఋక్షములును, రాక్షసులును సుగ్రీవునితో రామునియొద్దకు వచ్చిరి. రాముడు స్వర్గమునకు బోవుటకు సిద్ధమైయుండుట వారు తెలిసికొని వచ్చియుండిరి. వారు రామునికి నమస్కరించి 'మీతోగూడ పోవుటకు వచ్చితిమి. మీరు మమ్ము విడిచి వెళ్ళితిరేని మేము యమదండమువలన గొట్టబడినవారివలె నగుదు'మని పలికిరి. దానికాతడు సమ్మతించి 'మీకోరిక నిశ్చయముగ జరుగు'నని యనెను. అంతలో సుగ్రీవు డాతనికి నమస్కరించి 'నే నంగదునకు పట్టాభిషేకముచేసి వచ్చితిని. మీతో వచ్చెద'నని మనవిచేసికొనెను. ఈమాటలన్నియు రాముడు విని విభీషణునితో మధురమగుమాటల నిట్లు పలికెను. 'విభీషణా! ప్రజలు లోకములో నిలుచునంతకాలము నీవు లంకలోనుండి పాలించుచుండెదవు. ఆలోకములో సూర్యచంద్రులు, భూమి యుండునంతకాలమును, నాకథలు లోకములో నుండునంతకాలమును నీవు రాజ్యము చేసెదవు. నీయందలి స్నేహముచే నేను నీవుచేయవలసిన కార్యములను నీకాజ్ఞాపించితిని. ధర్మముగ ప్రజలను సంరక్షింపుము. నీవిందులకు వ్యతిరేకముగ మాట్లాడ కూడదు. ఇక్ష్వాకు కులదైవతమును, నెల్లప్పుడు దేవతలచేతను, నింద్రుని చేతనుపూజింపబడువాడునునగు జగన్నాథుని నీవు పూజింపుము.' ఇట్లు రాముడు పలుక నాతని మాటలను విభీషణు డంగీకరించెను. తరువాత రాముడు హనుమంతునితో నిట్లనెను. 'నీకు జీవించుటయందిష్టమున్నది గనుక నీప్రతిజ్ఞను వ్యర్థముచేయకుము. నాచరిత్రము లోకములో వ్యాపించియున్నంతకాలము నామాటలను పాలించుచు సంతోషముతో క్రీడించుచుండుము.' ఇట్లు రాముడు పలుక హనుమంతుడు గొప్ప సంతోషముతో దానినంగీకరించెను. తరువాత నతడు జాంబవంతుడు, మైందుడు, ద్వివిదుడు మొదలగు వారలకు 'మీరు కలికాలము వచ్చువఱకు జీవింపు'డని యాజ్ఞయిచ్చెను. పిమ్మట నతడు మిగిలిన ఋక్షవానరులకు 'మీరు కోరినట్లు నాతో రం'డని సెలవిచ్చెను.

ఆమఱునాటి యుదయమున రాముడు వసిష్ఠునితో 'ముందు బ్రాహ్మణులును, మండుచున్న యగ్నిహోత్రమును, యజ్ఞసంబంధమగు గొడుగును వెళ్లవలె'నని యనెను. అట్లు వసిష్ఠు డేమియు కొఱత లేకుండునట్లంతయుజరిపి స్వర్గమునకు బోవుటకు జేయవలసిన కార్యములనన్నిటిని జేసెను. తరువాత రాముడు మిక్కిలి పలుచని బట్టకట్టి తానే స్వయముగ వేదాధ్యయనము చేయుచు దర్భలను బట్టుకొని దారిలో నెవరితోను నేమియు బలుకకుండ నిశ్చేష్టుడును, సుఖములేనివాడునునై సూర్యునివలె ప్రకాశించుచు నింటినుండి బయలుదేఱెను. అతని కుడిప్రక్కను పద్మముతోగూడిన శ్రీయు, నెడమప్రక్కను భూదేవియు నాశ్రయించియుండెను. పురోభాగమున ప్రయత్న మాశ్రయించియుండెను. అనేక విధములగు శరములును, గొప్పధనస్సును ననేక విధములగునాయుధములును పురుషరూపములను ధరించి రాముని వెంట బయలుదేఱెను. బ్రాహ్మణరూపమునుబొందిన వేదములును, సమస్తమును రక్షించు గాయత్రీదేవతయు, నోంకారమును, వషట్కారమును రామునిననుసరించి వెడలెను. మహాత్ములగు ఋషులందఱును, బ్రాహ్మణులందఱును తెఱువబడియున్న స్వర్గద్వారమునకు రామునితో వెళ్ళిరి. అంతఃపురస్త్రీలును, బాలవృద్ధస్త్రీదాసీలును, నంతఃపురపాలకులును, నంతఃపురములోనుండు వారందఱును, భరతశత్రుఘ్నులును, నగ్నిహోత్రములును, పట్టణములోని మహాత్ములును, నందఱి భార్యలును, పిల్లలును, మంత్రులును, సేవకులును, వారివారిపశుపుత్రబాంధవులును, పరివారమును, సమృద్ధిగనుండు ప్రజలందఱును, నయోధ్యలోనుండు స్త్రీపురుషులును రాముని ననుసరించి వెళ్ళిరి. పక్షులును, పశువులును, వాహనములునుగూడ రామునితో వెళ్ళెను. వానరులందఱు స్నానముచేసి సంతోషముతో కిలకిలశబ్దముచేయుచు నతని వెంటనరిగిరి. ఆసమయమున రామునిననుసరించి వెళ్ళువారిలో దీనుడుగాని, సిగ్గుగల

వాడుగాని, దుఃఖముగలవాడుగాని లేకుండెను. అందఱు మిక్కిలి సంతోషముగనుండిరి. నిర్యాణమునుగూర్చి వెళ్ళుచున్న రామునిజూచుటకు వచ్చిన యితరగ్రామవాసులగు జనులందఱు స్వర్గమునకు నతని వెంట నరిగిరి. ఋక్షరాక్షసులుగూడ నతనివెంట నరిగిరి. అయోధ్యలోనున్న కనబడనిజీవులుకూడ రామునితో స్వర్గమునకు బోవుచుండెను. రామునిజూచిన స్థావరజంగమజీవులుకూడ స్వర్గమునకు నతని ననుసరించి పోవుచుండెను. అయోధ్యలోని మిక్కిలి సూక్ష్మములగు జీవులుకూడ నచట నిలువకుండ నతనిననుసరించి వెళ్లెను. తిర్యగ్జంతువులన్నియు రామునివెంట నరిగెను.

ఇట్లు రాముడు ప్రజలతో తననగరునుండి 1½ యోజనములు (12 మైళ్ళు) నడిచి తూర్పునుండి పశ్చిమమునకు పాఱుచున్న సరయూనదిని జేరెను. అప్పుడు బ్రహ్మయు, దేవతలును మహాత్ములగు మహర్షులును నక్కడకు ననేకవిమానములపై వచ్చిరి. పుణ్యకర్మలుచేసిన స్వర్గలోకవాసుల తేజముచే నాకాశమంతయు ప్రకాశించుచుండెను. వాయువు సువాసనలతో సుఖమునుగలుగజేయుచు వీచుచుండెను. దేవతలు పుష్పవర్షములను గురిపించిరి. తూర్యములు వాయింపబడుచుండ నప్సరసలు, గంధర్వులు పాడుచుండ రాముడు సరయూనదిలో నిలిచెను. అప్పుడు బ్రహ్మ యాకాశమునుండి యిట్లు పలికెను. *'విష్ణుదేవా! రమ్ము. నీకు శుభమగుగాక! మాయదృష్టముచే నీవు వచ్చితివి.

* అ. రా:—రాముడు సరయూనదిలో దిగుచుండ బ్రహ్మ హాని నిట్లు స్తుతించెను. 'రామా! నీవు పరమాత్ముడవు; పరమేశ్వరుడవు; విష్ణుడవు; ఎల్లప్పుడును నానందమయుడవు; పూర్ణుడవు; కావున నేకమగునీనిజతత్వమును నీ వెఱుగుదువు. ఐనను భక్తపరాధీనుడవగు నీవు దాసుడనగు నావాక్యానుసారముగ జేయదగిన కార్యములనన్నిటిని జేసితివి. నీవు నీసోదరులతో గూడ నీనిజదేహమును బొందు (అనగా సీత

దేవకాంతిగలనీతమ్ములతో నీవుకోరుచున్న విష్ణురూపమునుబొందుము; లేక సనాతనమగు నాకాశరూపమును బొందుము. నీవు లోకములకు గతివి. చింతింపశక్యముకానివాడవును, గొప్పయాకారముగలవాడవును, ముసలితనము, నాశనము లేనివాడవునగు నిన్ను పూర్వమునుండియు నిన్నాశ్రయించియున్న మాయతప్ప నితరులు తెలిసికొనలేరు. నీవు కోరెడి నీస్వశరీరమును బొందుము.' ఇట్లు బ్రహ్మ విన్నవింప రాముడు బాగుగ నాలోచించి తనతమ్ములతో విష్ణుతేజముగలశరీరమును బొందెను. అప్పు డావిష్ణుదేవుని దేవతలును, సాధ్యులును, మరుద్గణములును నిందులు, అగ్ని మొదలగు దేవతలును, ఋషులును, గంధర్వులును,

---

మహాలక్ష్మిరూపమును, లక్ష్మణుడు శేషరూపమును, భరతశత్రుఘ్నులు శంఖచక్రరూపములను బొందియుండగా నీవు చతుర్భుజములతో గూడిన నీలమేఘచ్ఛాయగలదేహమును బొంది) లేక, 'నేను ఇంద్రియాతీతరూపుడ'నని నీకిష్టమైనచో నారూపమునే పొంది (అనగా పరమేశ్వరునికి నామరూపోపాధులులేవుగనుక నిరుపాధికచైతన్యరూపమునే బొంది) దేవతలను రక్షింపుము. నీవు దేవతల కధిపతివి. నేను తప్ప నితరులు నిన్ను దెలిసికొనలేరు.' ఇట్లు బ్రహ్మ స్తుతింప రాముడు పురాణపురుషుడగు విష్ణుస్వరూపమునుబొంది చక్రము మొదలగువానిని ధరించియుండెను. లక్ష్మణుడు శేషుడై యతనికి పక్క యాయెను. భరతశత్రుఘ్నులు శంఖచక్రములై విష్ణుహస్తముల నలంకరించిరి. పిమ్మట నిట్టిరూపముతోగూడియున్న శ్రీమహావిష్ణువును నింద్రాది దేవతలందఱు చూచి పూజించి స్తుతించి యానందనిమగ్నులైరి. తరువాత రామునియాజ్ఞప్రకారము బ్రహ్మ రామునితోవచ్చినవారినందఱిని సరయూనదీజలస్నానముచే పవిత్రులనుగాజేసి సాంతానికలోకములను బొందించి 'పవిత్రమైనరామనామము నెల్లప్పుడు భజించువారందఱు పవిత్రులై సాంతానికలోకములను బొందగల'రనిపలికెను.

నప్సరసలును, గరుడులును, నాగులును, యక్షులును, బ్రహ్మాదానవ రాక్షసులును పూజించిరి. అందఱు సంపూర్ణమనోరథులై మిక్కిలి సంతోషమును బొందిరి. దేవతలయొక్క 'బాగు, బాగను శబ్దములు' నాకాశమంతయు నిండెను. అప్పుడు విష్ణువు బ్రహ్మతో నిట్లు పలికెను. 'స్నేహముచే న న్ననుసరించివచ్చిన యీజీవులకు మంచిలోకముల నిమ్ము. వీరు నాభక్తులై నన్నుగుఱించి తమశరీరములను విడిచిరి. కనుక వీరికి తగినట్లు మర్యాదచేయవలెను.' ఇట్లు విష్ణువుపలుక బ్రహ్మ 'వీరు 'సంతానికము'లను లోకములను బొందెదరు. భక్తితో నిన్నే తలచుచు ప్రాణములను విడుచు తిర్యగ్జంతువులుకూడ సమస్తబ్రహ్మగుణము లతో గూడుకొన్నదియు, బ్రహ్మలోకమువలెనుండునదియునగు సత్పం తానలోకమున నివసించు'నని పలికెను. అప్పుడు వానరులును, ఋక్షు లును తా మే దేవతలవలనజన్మించిరో యట్టి దేవతారూపములను బొం దిరి. సుగ్రీవుడు సూర్యమండలమును దేవతలుచూచుచుండ ప్రవేశిం చెను. బ్రహ్మమాటలను విని మిగిలినవారందఱు సంతోషబాష్పము లను విడుచుచు గోప్రతారమునొంది సరయూనదిలో స్నానముచేసి మనుష్యదేహములను విడిచి విమానములనెక్కిరి. తిర్యగ్జంతువులుకూడ సరయూనదిలో స్నానముచేసి ప్రకాశించుచున్నశరీరములుకలవై స్వ ర్గమునకుబోయెను. ఇట్లు సరయూనదిలో స్నానముచేసిన స్థావరజంగము జీవులన్నియు ప్రకాశించుచుండెడి దేవతాశరీరములతో దేవలోకము నకు బోయెను. ఋక్షవానరరాక్షసులుకూడ నందు స్నానముచేసి స్వర్గమును బొందిరి. విష్ణువు సంతోషముగ వారితో స్వర్గమునకు బోయెను.

తరువాత నయోధ్య యనేకసంవత్సరములు నిర్జనముగనుండి ఋషభుడు రాజైనతరువాత నివాసపట్టణమయ్యెను.

## ౨౧ వ. అధ్యాయము.

## రామునిరాజ్యమున ప్రజలస్థితి.

రాముడు రాజ్యముచేయుకాలమున లోకములో దుర్మార్గులు గాని, నీచులుగానిలేరు. పాములభయములేకుండెను; రోగములు లేకుండెను. భూమి పండినసస్యములతోను, సన్నిధౌషధులతోను నిండి యుండెను. చెట్లపూవు పుష్పములతోను, ఫలములతోను నిండి యుండెను. పిల్లలుగాని, యౌవనవంతులుకాని, మధ్యకాలముకలవారు కాని మరణింపలేదు. రాముడు ధర్మముగ పాలించుటచే ప్రజలకు బాధలేమియుగలుగలేదు. అకాలమున వర్షములు కురియుటచే పంటలు బాగుగపండెను. వాయువు సుఖముగ వీచెను. దిక్కులు స్వచ్ఛముగ నుండెను. పట్టణమునను, దేశమునను ప్రజలు మిక్కిలిసంతోషముతో వృద్ధిగనుండిరి. ధనవస్త్రవ్యసనము కోరువారు లేకుండెను. భర్తలు మరణించుటకాని, స్త్రీలు విధవలగుటగాని లేకపోవుటచే స్త్రీలు తమభర్తలను గూర్చి విచారించుటకవకాశములేకుండెను. ప్రజలొకరికొకరు ఉప కారములను జేయుచుండిరి. వేలకొలదిసంవత్సరములు పుత్రపౌత్రులతో ప్రజలుజీవించిరి. ఒక్కొక్కనికి వేయేసిమందిపుత్రులు కలిగిరి. ప్రజలందరు లోభములేనివారై సంతోషముతో తమపనులను జరిపిరి. ప్రజలు ధర్మమునందు శ్రద్ధగలవారై మంచిలక్షణములుగలిగియుండిరి.

---

## ౨౨ వ. అధ్యాయము.

## రాముని విశ్వరూపదర్శనము.*

రాముడన్నిలోకములను సృజించిన విష్ణువు. జ్ఞానవంతులలో శ్రేష్ఠుడు. పూర్వ మతడు వసువులలో 'ఋతధామా' యనువసువు;

* రాముడు సీతపాతివ్రత్యమును బరీక్షించుట 1180 పుటచూడుము.

రుద్రులలో 8వ రుద్రుడు; సాధ్యులలో 5వ సాధ్యుడు; మహాదులోక
ములను మొదటపుట్టించినవాడు; తనంతట తానే పుట్టినవాడు. అశ్వినీ
దేవతలిద్దఱాతనిచెవులు; చంద్రసూర్యులు కండ్లు; బ్రహ్మ యాతని
హృదయము; సరస్వతి నాలుక; దేవత లతని దేహమందలి రోమములు.
అతడు కండ్లుమూసిన రాత్రియు, కండ్లు తెరచిన పగలును గలుగును.
వేదము లతనిమహిమను దెలుపును. జగత్తంతయు నతనిశరీరము.
భూమియతని స్థైర్యము. అగ్ని యతనికోపము. చంద్రుడతనిదయ.
అతడు లోకములుపుట్టుటకు పూర్వమును, ప్రళయమందునుగూడ గన
బడును. అతడే నీరుస్థానముగా గలనారాయణుడు; ఆదిదేవుడు; శాశ్వ
తుడు; సిరితోగూడినవాడు; నాలుగుభుజములుగలవాడు; చక్రమును,
'శార్ఙ్గ'మను కోదండమును, ఖడ్గమును ధరించినవాడు. ఒకకొమ్ము
గల యాదివరాహమూర్తి. గడచినకాలమునను, రాబోవుకాలమునను
శత్రుజయముగలవాడు; షడ్భావవికారములు (పుట్టుట, మనుట, వృద్ధి
బొందుట, పరిణామముబొందుట, క్షీణించుట, నశించుట) లేనివాడు;
నాశరహితుడు; పరబ్రహ్మస్వరూపుడు. సృష్టికి మొదటను, మధ్యను,
చివరను నుండెడిగొప్పధర్మస్వరూపుడు; విష్వక్సేనుడు; ఇంద్రియముల
నియమించువాడు; జనులహృదయములందు నిలుచువాడు; ఫలముల
నిచ్చువాడు; పురుషులలో ముఖ్యుడు; జయింపశక్యముకానివాడు; సర్వ
వ్యాపకుడు; కృష్ణుడు; గొప్పబలముకలవాడు. అతడే సేనలకధిపతి;
ఎవనికర్మఫలములవాని కిచ్చువాడు. అతడే బుద్ధి; సత్త్వము, ఓర్పు, ఇం
ద్రియనిగ్రహము. లోకములనుసృష్టించువాడును, నశింపజేయువాడును
నతడే. అతడే వామనుడనుపేరుగల యుపేంద్రుడు; మధువునుజంపిన
మహావిష్ణువు; ఇంద్రునివలె గొప్పకర్మలనుజేయువాడు; మహదైశ్వర్య
సంపన్నుడు; నాభియందు పద్మముగలవాడు; యుద్ధములో జనులను
సంతసమునొందించువాడు; శరణు బొందదగినవాడు; రక్షగోపాథు

మైనవాఁడు; వేయిశాఖలుగల సామవేదస్వరూపుఁడు; అనేకవిధములుగ ప్రేరేపించువాఁడు; వేదములాత్మగాగలవాఁడు; మిక్కిలి శ్రేష్ఠుఁడు; సిద్ధులకును, సాధ్యులకును నాశ్రయమగుటకు మొదటజన్మించినవాఁడు. అతఁడే యజ్ఞము; వషట్కారము, ఓంకారము, గొప్పతపస్సు. అతని పుట్టుకయు, నంతమును, నతఁడెవ్వఁడైనదియు నెవరికిని దెలియదు. అతఁడే బ్రాహ్మణులందును, గోవులందును, సర్వభూతములందును, సమస్త దిక్కులందును, నాకాశమునను, పర్వతములందును, వనములందును

* అ. రా:—పాతాళలోకము విశ్వరూపునియొక్క పాదతలము (అఱకాలు), మహాతలము కాలిమణము, రసాతల తలాతలములు రెండును రెండుపిక్కలు, సుతలము కాలిముణుకులు (మోకాళ్లు), వితలము తొడలు, అతలము, భూమి పిఱుదులు, భువర్లోకము నాభి, సువర్లోకము వక్షస్థలము, మహర్లోకము కంఠము, జనలోకము నోరు, తపోలోకము నుదురు, సత్యలోకము శిరస్సు, ఇంద్రాదిలోకపాలురు భుజములు, దిక్కులు శ్రోత్రములు, అశ్వినీదేవతలు ముక్కురంధ్రములు, అగ్ని ముఖము, సూర్యుఁడు నేత్రములు, చంద్రుఁడు మనస్సు, కాలము నిమేషము (రెప్పపాటు), బృహస్పతి బుద్ధి, రుద్రుఁడు అహంకారము, ఛందస్సులు (వేదములు) వాక్కులు, యముఁడు కోఱలు, నక్షత్రములు దంతములు, మాయ నవ్వు, సృష్టి క్రీగంటిప్రసారము, ధర్మము పురోభాగము, అధర్మము వెనుకభాగము, రాత్రింబగళ్లు ఉచ్ఛ్వాసనిశ్వాసములు, సప్తసముద్రములు కడుపు, నదులు నాడులు, వృక్షౌషధులు రోమములు, వర్షము రేతస్సు, జ్ఞానశక్తి విశ్వరూపుని యొక్కమహిమము. (ఈతీరుగ విశ్వరూపునియొక్కస్థూలరూపమును ధ్యానముచేయువారికి అనాయాసముగ ముక్తి కలుగును.)

* 12 వ పే. ౨౧౭. కబంధునివద. "రామసుగ్రీవుల స్నేహోపదేశ" పుట చూడుము.

ములో పుత్రపౌత్రులతో నభివృద్ధినొంది గొప్పలోకములను బొందును. రామాయణములో నొకసర్గ వినువానికి వేయియశ్వమేధముల ఫలమును, పదివేలవాజపేయయాగముల ఫలమును గలుగును. ఈరామాయణమును వినువానికి ప్రయాగ మొదలగుతీర్థములను సేవించినఫలమును, గంగ మొదలగు నదులలో స్నానముచేసినఫలమును నైమిశము మొదలగు నరణ్యములను జొచ్చినఫలమును, కురుక్షేత్రమున సూర్యగ్రహణకాలమందు పర్వతమువలెనున్నంతబంగారమును దానముచేసినఫలమును గలుగును. మందబుద్ధితోను, భక్తితోను రామాయణమును వినువాడు క్రోధములేనివాడై దుష్టములను దాటి సమస్తపాపములను విడిచి సశరీరముతో వైకుంఠమును బొందును. ఇతర దేశవాసమును బొందినవాడు దీనిని వినినయెడల రామునిదయవలన వాడుతిరిగితనదేశమునచ్చి బంధువులను, భార్యాపుత్రులను గలిసికొని కోరినవరములను బొందును. మఱియు దీనిని వినువానికి భార్యాపుత్రులును, సంతతియు, సంపదయు వృద్ధినొందును. రామాయణము గాయత్రీస్వరూపము. మానసికమును దెలిసికొని నియమముగలవారిచే దానిని జదివించి వినవలెను. రామాయణమును ప్రతిదినము భక్తితో జదువువాడును, వినువాడును, పాపములను విడిచి చిరంజీవి యగును. శ్రేయమును గోరువాడు రాముని నెల్లప్పుడు చింతింపవలెను. ప్రతిదినము బ్రాహ్మణులచే రామాయణమును జదివింపవలెను. రామునిచరిత్రమంతయు జదువువాడు మరణకాలమున విష్ణులోకమును బొందుటకు సందేహములేదు. రామునిచరిత్రమంతయుజదువువాని తండ్రియు, తాతయు, ముత్తాతయు

అ. రా.—అధ్యాత్మరామాయణము నెల్లప్పుడు చదువువాడు సంసారబంధములవలన విడువబడును. దానినెల్లప్పుడు చదువువానికిని, వినువానికి, భక్తితో వ్రాయువానికిని మిక్కిలిదయాళుడగు సీతారాముడెల్లప్పుడు ప్రసన్నుడగుచు నైశ్వర్యమును గలుగజేయును.

మాతాతతండ్రి తాతలును విఘ్నవును బొందరు. రామునిచరిత్రము ధర్మార్థకామమోక్షము లను 4వర్గములనిచ్చును. కనుక ప్రియత్నముచే నెల్లప్పుడును దానిని ముఖ్యముగ జదివింపవలెను. రామాయణము లోని యొకశ్లోకపాదమునైనను, లేక యొకమాటనైనను భక్తితో విన వాడు బ్రహ్మలోకమును బొంది బ్రహ్మచే నెల్లప్పుడు పూజింపబడును ఈపూర్వకాలపుకథను సావధానముగ జదువువానికి శుభములును విఘ్నబలమును గలుగుగాక!



ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# విశోధిత రామాయణము.

## 13 వ. ప్రకరణము.

### సామాన్యాంశములు.

### ౧ వ. అధ్యాయము.

### వేదాంతవిషయములు, ధర్మనీతులు.

పరబ్రహ్మ శాశ్వతమైనవాడు; ఎల్లప్పుడు నుండువాడు; నాశన రహితమైనవాడు. పురుషు డస్వతంత్రుడగుటచే తనయిచ్ఛవచ్చినట్లు ప్రవర్తింపలేడు. ఎక్కడికైనను వాడు దైవయోగమున బోవును. ఎంత కష్టముచే సంపాదింపబడిన నైనను నన్నివస్తువులును, ధనములును కాలకర్మవశమున నశించును. మిక్కిలి యున్నతమగునవి యైనను పడుటకు లోనగును. మిక్కిలి సంయోగముగల వస్తువులకైనను వియోగము గలుగును. మిక్కిలి యుత్కృష్టమగు జీవితముగూడ చివరకు మరణమునకు లోనగును. పండిన ఫలములకు పడిపోవుటతప్ప మఱి యేభయము లేనట్లు పుట్టినజీవులకు మరణ భయముకంటె మఱి యేదియు లేదు. బాగుగను దిట్టముగను గట్టబడిన యిల్లు పాతగిలి శిథిలమగునట్లు ప్రజలు ముసలితనమునకు, మృత్యువునకు లోనై

నశించుచున్నారు. నదిలోని నీరు సముద్రమునకు బోవుచున్నదేగాని తిరుగ వెనుకకు రానట్లు రాత్రింబగళ్ళు గడచుచున్నవేగాని యవి తిరుగ రావు. ఎండకాలమున సూర్యకిరణములచే నీరువలె నన్నిప్పుడును రాత్రింబగళ్ళచే నాయువు క్షీణించుచున్నది. ఎప్పుడును మృత్యుభయ మెల్లప్పుడు నుండును. మృత్యువునకు మాత్రము నాశనము లేదు. మనుష్యునకు ముసలితనము రాగ వాని శరీరమున చర్మము ముడుతలు పడును; తలవెండ్రుకలు తెల్లబడును; శరీరము కృశించును. వీని నుండి తప్పించుకొనుటకు వానికి శక్తియేది? సూర్యోదయమైనను, సూర్యాస్తమయమైనను మనుష్యుడు సంతోషించుచుండును; కాని తన యాయువు క్షీణమగుచున్నదని తెలిసికొనడు. ఇట్లే వాడు క్రొత్తఋతువులు వచ్చినవని సంతోషించునుగాని తనయాయువు క్షీణించుచున్నదని యాలోచింపడు. మహాసముద్రమున కాలవశమున కట్టెయొకటి మఱియొక కట్టెతో జేరుటయు, తిరిగి వేఱగుటయు జరుగుచుండును. అట్లే మనుష్యుడుకూడ కాలవశమున భార్య, పుత్రులు, బంధువులు, ధనము మొదలగువానితో కూడియుండుటయు, తిరిగి వానిని విడుచుటయు జరుగుచుండును. మనుజుడు లోకములో తన యిచ్చవచ్చినట్లు ప్రవర్తింపలేకపోవుటచే వానికి మరణబాధనుండి తప్పించుకొనుటకు శక్తిలేదు. తమ తాతతండ్రులవలంబించిన మార్గమునే పుత్రులవలంబింపవలెను; దానికి తిరుగులేదు; దానిని పొందినవాడు విచారమునేల పొందును? ఆయువు నిరాటంకముగ రోజురోజుకు వ్యయమగుచున్నందున జనుడు ధర్మమార్గమున నిలిచియుండవలెను. అట్లున్నవాడు సుఖమును బొందును. మనుజుడు దుఃఖముకలిగినప్పుడు మనస్సులో బాధను, ప్రీతియగు వస్తువులు సంప్రాప్తించినపుడు మిక్కిలి సంతోషమును బొందకూడదు.

---

రాముడు రాజ్యాభిషేకము నిష్టపడకపోవుట 511 పుటజూడుము.

జాబాలి వసిష్ఠులు రామునిరాజ్యాభిషేకకము గోరుట 517 పుటజూడుము.

సత్యము వలననే లోకము నిలిచియున్నది. ఋషులును దేవతలును సత్యమును మిక్కిలిగొప్పదానిగ భావించెదరు. సత్యముపలుకువాఁడీలోకమున గొప్పపదవిని బొందును. లోకములో సత్యమే గొప్ప ధర్మమును, స్వర్గమును బొందుటకు మూలకారణమును నైయున్నది. సత్యమేయీశ్వరుఁడు. సత్యమును సిరి యాశ్రయించియుండును. అన్నిటికిని సత్యము మూలమైనది. సత్యముకంటె గొప్పదేదియు లేదు. దానములు, యజ్ఞములు, హోమములు, జపములు, తపస్సులు, వేదములు సత్యము నాశ్రయించియుండును. అదియే లోకమును, కులమును పాలించును; స్వర్గమును బొందించును. సత్యముతప్పినవాని నదియే నరకమునొందించును. సత్యము పలుకనివాఁడు, చంచలమైనమనస్సుగలవాఁడు, దృఢమనస్సులేనివాఁడునగు పురుషుఁడు మంచివాఁడైనను వానిహవ్యకవ్యములను దేవతలును, పితరులును గ్రహింపరు. సత్యముపలుకు వానికి భూమియు, కీర్తియు, సిరియు సమకూరును.

పురుషునికి మువ్వురుగురువులు:—తండ్రి, తల్లి, ఆచార్యుఁడు. వీరిలో నాచార్యుఁడు మిక్కిలిపూజ్యుఁడు. మాతాపితరులు పురుషునికి దేహమునిత్తురు. అతనికి బుద్ధినిగలుగఁజేయుటచే నాచార్యు డుత్కృష్టుఁడగు గురువని పిలువఁబడును. అన్ననుగూడ గురువందురు.

తమ్ముఁడు, పుత్రుఁడు, శిష్యుఁడు వీరిని పుత్రులందురు.

మిక్కిలిసూక్ష్మమగు నాత్మ యన్నిజీవరాసులహృదయమందు నిలిచి సత్పురుషులకైనను దెలిసికొనుటకు గష్టమైనదై, ధర్మస్వరూపమైనదై మనుష్యులుచేయు పుణ్య కర్మలను దెలిసికొనుచుండును.

లోకములన్నియు నీశ్వరునిచే సృజింపబడినవి. కార్యములన్నియు నతనివలననే యగుచుండును. జీవులన్నియు చేయుపను లతనియాజ్ఞకు లోనైయుండును. ఎవనికిని స్వాతంత్ర్యములేదు. లోకమంతయు స్వభావము (ఈశ్వరుని) వలన చరించుచుండును. దానికి కాలమేగతి. కాలమున నిర్ణీతసుఖదుఃఖముల ననుభవింప వలెను. కాలమునకు నాశ

రాముఁడు మరణించిన బ్రాహ్మణపుత్రుని బ్రతికించుట 1277వపుటచూడుము.

సమము లేదు. కాలమును నెవ్వరును మీఱియుండలేరు. దానికి బంధువులు, స్నేహితులు లేరు. దానిని పరాక్రమముచేతగాని, మఱియొక విధముగగాని స్వాధీనముచేసికొనవీలు లేదు. కాలము ఘనగుణునివశము కాదు. బాగుగ నాలోచింపగా లోకములో జరుగు కార్యములన్నియు కాలము ననుసరించియే యుండును. ధర్మార్థకామములుగూడ కాలము ననుసరించియే యుండును.

బ్రాహ్మణప్రధానమై యొప్పునట్టి కృతయుగమున బ్రాహ్మణులుమాత్రము తపస్సుచేయుచుండిరి. బ్రాహ్మణులుగాని వారెవరును తపస్సుచేయలేరు. అందఱును ముందుజరుగబోవుదానిం గూర్చిన జ్ఞానముగలవారును, నకాలమృత్యువు లేనివారును నై యుండిరి.

పిమ్మట బలవంతులగు మనుష్యుల (క్షత్రియుల) దైన త్రేతాయుగము ప్రారంభమాయెను. కృతయుగమున క్షత్రియులు తపోబలముగలవారును, నీ త్రేతాయుగమున తపోవీర్యబలములు రెండును గలవారును నైరి. బ్రాహ్మణక్షత్రియజాతులు రెండును నీ రెండు యుగములందును సమానమైన శక్తి గలిగియుండెను. వారందఱు వారిలో నెక్కువ తారతమ్యమును గానక నాలుగువర్ణముల వారికి సమ్మతమైన ధర్మములను స్థాపించిరి. ఇట్టి త్రేతాయుగమున వెల్లడియైన ధర్మము తేజరిల్లుచుండ నధర్మము భూమియందొక పాదమును బ్రవేశపెట్టెను. అందుచే నధర్మముతో గూడుకొనిన తేజస్సు తగ్గిపోగలదు. అట్టి యధర్మముగల ప్రజలు వీర్యహీనులైరి. పూర్వీకుల సంబంధమైన యాహారమును, రాజసమైనమలమును నొకపాదమున ననృతము పేర భూమియందేర్పడెను. అధర్మమున నొకపాద మా యనృతమును బడగొట్టినది. ఆయనృతము పడగొట్టబడినపుడు ధర్మము యొక్క యొకపాదము నశించినది. అంతకంటె ముందున్న పాపమంతయు నాయనృతమునందు జేరినది. భూతలమున నధర్మముచే నీయనృతము నశింపగా నధర్మము వృద్ధికాగా లోకములందలి ప్రజలు సత్యము

పలుకుట, తమ స్వధర్మముల నాచరించుట యనువానిని ముఖ్యముగా నెంచి పుణ్యకార్యముల నొనర్చిరి. త్రేతాయుగమున బ్రాహ్మణులు, క్షత్రియులు తపస్సు చేయుచుండ తక్కిన వర్ణములవారు వారికి శుశ్రూషచేసిరి. బ్రాహ్మణ క్షత్రియుల ముఖ్యధర్మము వైశ్యులను, తరువాత శూద్రులను బొందెను. తక్కిన యన్నివర్ణములవారికి శూద్రులు శుశ్రూషలు చేసిరి. ఇంతలో వారి కధర్మమును, నసృతమును బ్రబలముకాగా నంతకు బూర్వపువారు క్షీణదశ నొందిరి.

తరువాత నధర్మముయొక్క రెండవపాద మవతరించెను. అందుచే నీయుగమునకు ద్వాపరయుగమను పేరువచ్చెను. ఈయుగమున నధర్మమును, నసత్యమును బ్రబలమయ్యెను; తపస్సు వైశ్యులను జెందెను. మూడుయుగములందును తపస్సు మూడువర్ణములవారిని బొందెను. ఈయుగములందు శూద్రు డుగ్రతపంబు చేయుటకు బ్రారంభింపలేదు.

కలియుగమున శూద్రులను తపస్సు జెందును.

భర్త యెట్టివాడైనను వానిని ప్రేమించు స్త్రీ లుత్తమలోకముల నొందుదురు. అతడే వారికి దైవము. వారి కతనికంటె నెక్కువ బంధువుడు లేడు. స్త్రీలు తపము చేయుచుండవలెను. అట్టివారికి చెడు గుణములుగాని, చెడుసంగతులుగాని కలుగవు. కామమువందే సంచరింపగోరుచు పరపురుషులను బొందగోరువారు ధర్మభ్రష్టులై యపకీర్తిపాలై చేయగూడని పనులను జేయుదురు. ధర్మమును బ్రవర్తించు స్త్రీలు స్వర్గమును బొందుదురు.

ధర్మమువలననే కోరికలు నెఱవేఱును. దానివలననే సుఖమును, స్వర్గమునుగలుగును. జగత్తంతయు ధర్మమూలమువననే నిలిచియుండును.

దేవతలపక్షమున ధర్మమును, నసురుల పక్షమున నధర్మమును నిలిచియుండును. కృతయుగమున నధర్మముధర్మముచే క్షీణించియుండును. కలియుగమున ధర్మ మధర్మవృద్ధిచే క్షీణతనొందును.

## ౨వ. అధ్యాయము. అగస్త్యుడు రామునకు తెలిపిన యాదిత్యహృదయము*

శ్లో॥ రామ రామ మహాబాహో!, శృణు గుహ్యం సనాతనం।
యేన సర్వా నరీన్ వత్స, సమరే విజయిష్యసి॥
ఆదిత్యహృదయం పుణ్యం, సర్వశత్రువినాశనం।
జయావహం జపే న్నిత్య, మక్షయ్యం పరమం శివం॥
సర్వమంగళమాంగళ్యం, సర్వపాపప్రణాశనం।
చింతాశోకప్రశమనం, ఆయుర్వర్ధన ముత్తమం॥
రశ్మిమంతం సముద్యంతం, దేవాసురనమస్కృతం।
పూజయస్వ వివస్వంతం, భాస్కరం భువనేశ్వరం॥
సర్వదేవాత్మకో హ్యేష, తేజస్వీ రశ్మిభావనః।
ఏష దేవాసురగణాన్, లోకాన్ పాతి గభస్తిభిః॥ 1—5

తా॥ రామా! నేను తెలుపబోవు నాదిత్యహృదయమును వినుము. శాశ్వతమైనదియు, రహస్యమైనదియు నగు దీనిని జపించుట వలన శత్రువులనందఱిని యుద్ధములో జయింపగలవు. దీనిని నిత్యము జపించుచుండుము. ఇది పుణ్యము నిచ్చును. సర్వశత్రువులను నాశనము చేయును; జయమును గలుగజేయును; శాశ్వతమగు ఫలము నిచ్చును; మిక్కిలి శుభమును గలుగజేయును. ఇది యన్ని శుభముల లోను మిక్కిలి శుభమైనది; అన్ని పాపములను బోగొట్టునది; చింతను, శోకమును బోగొట్టునది; ఆయువును వృద్ధినొందించునది; మిక్కిలి శ్రేష్ఠమయినది. మంచికిరణములుగల వాడును, దినదినము క్రొత్తక్రొత్తగ నుదయించువానివలె గనబడుచు ప్రజలను పనులందు ప్రవేశ పెట్టువాడును, దేవతలచేతను, నసురులచేతను నమస్కరింపబడువాడును గొప్ప తేజముగలవాడును, లోకములనన్నిటిని నియమించువాడునునగు భాస్కరుని పూజింపుము. ఇతడు సర్వదేవతాస్వరూపుడు; గొప్ప తేజోవంతుడు; కిరణములచే భావింపదగినవాడు. ఇతడే తనకిరణములచేత దేవతలను, నసురులను, లోకములను రక్షించును. 1—5

* రామరావణయుద్ధము. రావణవధ 1147 పుట చూడుము.

శ్లో॥ ఏష బ్రహ్మా చ విష్ణు శ్చ, శివ స్స్కందః ప్రజాపతిః,
మహేంద్రో ధనదః కాలో, యమ స్సోమో హ్యపాంపతిః॥
పితరో వసవ స్సాధ్యా, హ్యశ్వినౌ మరుతో మనుః,
వాయు ర్వహ్నిః ప్రజా ప్రాణ, ఋతుకర్తా ప్రభాకరః॥
ఆదిత్య స్సవితా సూర్యః, ఖగః పూషా గభస్తిమాన్,
సువర్ణసదృశో భాను, ర్హిరణ్యరేతా దివాకరః॥
హరి దశ్వ స్సహస్రార్చి, స్సప్తసప్తి ర్మరీచిమాన్,
తిమిరో న్మథన శ్శంభు, స్త్వష్టా మార్తాండ అంశుమాన్॥
హిరణ్యగర్భ శ్శిశిర, స్తపనో భాస్కరో రవిః
అగ్నిగర్భో ఽదితేః పుత్ర, శ్శంఖ శ్శిశిరనాశనః॥ 6—10

బ్రహ్మవిష్ణుమహేశ్వరులును, కుమారస్వామియు, ప్రజాపతులును, మహేంద్రుడును, కుబేరుడును, కాలమును యముడును, చంద్రుడును, వరుణుడును, పితృదేవతలును, వసువులును, సాధ్యులును, నశ్వినీదేవతలును, మరుత్తులును నీసూర్యుడే. మనువు, వాయువు, అగ్ని, ప్రజలు, ప్రాణములు, ఋతువులనుగలుగజేయుప్రభువు, కాంతినిచ్చువాడునీసూర్యుడే. ఇతడే యాదిత్యుడు (అదితిపుత్రుడు); సవిత (నిద్రించుజీవులను లేపువాడు) సూర్యుడు (ప్రాణులను పనులయందు ప్రేరేపించువాడు) ఖగుడు (ఆకాశమున సంచరించువాడు); పూషుడు (పోషించువాడు); కిరణములుగలవాడు; బంగారువర్ణముగలవాడు; భానుడు (ప్రకాశించువాడు); బ్రహ్మాండమునుసృజించువాడు; పగలుచేయువాడు; ఆకుపచ్చని గుఱ్ఱములుగలవాడు; వేయికిరణములుగలవాడు; 'సప్త' అను పేరుగలగుఱ్ఱముగలవాడు; ప్రకాశముగల కిరణములుగలవాడు; చీకటిని బోగొట్టువాడు; సుఖమును గలుగజేయువాడు; త్వష్ట (సర్వసంహారకుడు); మార్తాండుడు (నశించిన బ్రహ్మాండమును బ్రతికించువాడు); మంచికిరణములుగలవాడు; బ్రహ్మాండముగర్భమందుగలవాడు; విశ్రాంతి కలుగజేయువాడు; తాపమునుగలుగజేయువాడు; భాస్కరుడు; రవి (స్తుతింపబడువాడు); అగ్ని గర్భమందుగలవాడు; అదితిపుత్రుడు; గొప్పసుఖముగలవాడు; మంచునుబోగొట్టువాడు.

శ్లో॥ వ్యోమనాథ స్తమోభేదీ, ఋగ్యజుస్సామపారగః।
ఘనవృష్టి రపాంమిత్రో, వింధ్యవీథీ ప్లవంగమః॥
ఆతపీ మండలీ మృత్యుః, పింగళ స్సర్వతాపనః।
కవి ర్విశ్వో మహాతేజా, రక్త స్సర్వభవోద్భవః॥
నక్షత్రగ్రహతారాణా, మధిపో విశ్వభావనః।
తేజసా మపి తేజస్వీ, ద్వాదశాత్మ న్నమోఽస్తు తే॥
నమః పూర్వాయ గిరయే, పశ్చిమే గిరయే నమః।
జ్యోతి ర్గణానాం పతయే, దినాధిపతయే నమః॥
జయాయ జయభద్రాయ, హర్యశ్వాయ నమో నమః।
నమో నమస్సహస్రాంశో, ఆదిత్యాయ నమో నమః॥ 11—15

---

ఇతడే యాకాశమున కధిపతి; అజ్ఞానమును బోగొట్టువాడు; ఋగ్యజుస్సామవేదములసారమును బొందినవాడు; మేఘములనుండి వర్షమును గురిపించువాడు; సముద్రములకు మిత్రుడు; వింధ్యపర్వత శిఖరములచరించువాడు; ఎండను గలిగించువాడు; గుండ్రనిరూపము గలవాడు; శత్రువులను నాశనముచేయువాడు; గోరోచనవర్ణముగల వాడు; అన్నిలోకములకు వేడినిగలిగించువాడు; అన్నియు దెలిసిన వాడు (పండితుడు); లోకమంతటను వ్యాపించినవాడు; గొప్పతేజము కలవాడు; అందఱియందు ప్రేమగలవాడు; సర్వప్రపంచోత్పత్తికి గారణమైనవాడు; నక్షత్రరూపములగు గ్రహములకును, చుక్కలకునుఅధి పతి; విశ్వమును స్థాపించువాడు; తేజస్సుగలవారిలోకెల్ల గొప్పతేజస్సు గలవాడు; 12నెలలకు 12రూపములనుబొంది 'ఇంద్రుడు, ధాత, భగుడు, పూషుడు, మిత్రుడు, వరుణుడు, అర్యముడు, అర్చి, వివస్వంతుడు, త్వష్ట, సవిత, విష్ణువు' అనునామములను బొందువాడు. ఇట్టిసూర్యునకు నమస్కారము. తూర్పుదిక్కుననుదయపర్వతమునను, పశ్చిమదిక్కున నస్తపర్వతమునను నున్నవాడును, జ్యోతిర్గణాధిపతియు, పగటికి ప్రభువును, జయముగలవాడును, జయముగలిగించువాడును, పచ్చని రంగుగల గుఱ్ఱములుగలవాడును, వేయికిరణములుగలవాడును, నాదిత్యుడును నగు సూర్యునకు నమస్కారములు. 11—15

శ్లో॥ నమ ఉగ్రాయ వీరాయ, సారంగాయ నమో నమః।
నమః పద్మప్రబోధాయ, మార్తాండాయ నమో నమః॥
బ్రహ్మేశానాచ్యుతేశాయ, సూర్యా యాదిత్యవర్చసే।
భాస్వతే సర్వభక్షాయ, రౌద్రాయ వపుషే నమః॥
తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నా యామితాత్మనే।
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయేనమః॥
తప్తచామీకరాభాయ, వహ్నయే విశ్వకర్మణే।
నమ స్తమోభినిఘ్నాయ, రుచయే లోకసాక్షిణే॥
నాశయ త్యేష వై భూతం, తదేవ సృజతి ప్రభుః।
పాయ త్యేష తప త్యేష, వర్ష త్యేష గభస్తిభిః॥　　16-20

---

తన్ను సేవింపనివారికి నుగ్రుడును, వీరుడును, శీఘ్రముగబోవు వాడును, పద్మములను వికసింపజేయువాడును, మార్తాండుడును, బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు మూలమగు పరమాత్మయు, సూర్యుడును, ఆదిత్యస్వరూపుడును, ప్రకాశించువాడును, సర్వసంహారకుడును, భయంకరస్వరూపుడును, అంధకారమును, మంచును బోగొట్టువాడును, శత్రువులను జంపువాడును, గొప్పశరీరముగలవాడును, కృతఘ్నులను నాశనముజేయువాడును, స్వయముగ ప్రకాశించురూపముగలవాడును, గ్రహములలో ముఖ్యమగువాడును, బంగారమువంటి రూపముగల వాడును, అగ్నిస్వరూపుడును, సర్వజగత్తును సృజించువాడును, అజ్ఞానమును బోగొట్టువాడును, కాంతిగలవాడును, లోకులుచేయుపనులనెల్ల ప్పుడుచూచువాడునునగుసూర్యునకు నమస్కారము. ప్రభువగు నీ సూర్యుడు జగత్తునంతను నశింపజేయును. అతడే తిరుగ దానిని సృజించును. ఇతడు తనకిరణములచే నీటిని నింకించి నాశనముచేసి వర్షమును గురిపించుచుండును.

కంబళ అశ్వతర కర్కోటక ధనంజయము లను నాగులును, గొప్పవిష ముగలతక్షకుడును, నుపతక్షకుడును, ముఖమందు నగ్నియు. భుజము లందు రుద్రులును, రెండుప్రక్కలనుండుకోలలందు పక్షి మాస ఋతువులును, ముక్కునందు కుహూ(చంద్రకళకనబడనియమావాస్య) అను నమావాస్యయు, ముక్కురంధ్రములందు వాయువులును, మెడయందు పార్వతీ సరస్వతులును, చెవులందు నశ్వినీదేవతలును, కంఠయందు సూర్యచంద్రులును, దేహమందు వేదవేదాంగములును, ననేకవిధము లగుయజ్ఞములును, మంచికార్యములను బోధించు మంచివాక్యములును, తేజస్సును, సిద్ధియు, తపస్సులును నుండెను. (ఇట్లు రావణునకు గనబడెను.)

---

## ౫౫. అధ్యాయము.

### * సనత్కుమారుని విష్ణువర్ణన.

సర్వజగత్తును బోషించువాడును, జనులకు తెలియని జన్మము గలవాడును, సురాసురులచే నెల్లప్పుడు పూజింపబడువాడును, నారాయణుడను నగు హరియే సమస్త జగత్తునకు ప్రభువు. అతని నాభి నుండి బ్రహ్మ యుదయించెను. అతనివలననే స్థావరజంగమ లోకమంతయు సృజింపబడినది. విధిప్రకారముగ దేవతలు యజ్ఞమందాహారిని నాశ్రయించి యమృతమును ద్రాగుదురు. మనుష్యులు పురాణములచేతను, వేదములచేతను, పంచరాత్రదీక్షలచేతను, యజ్ఞములచేతను నాతని పూజింతురు; యోగులు ధ్యానింతురు. అతడు యుద్ధములో

* ఉ.ప్ర.౫౧౧అ. రావణుడు మోహశక్తి కల్గి రాఘవునితో యుద్ధమునుగోరుట, 145, 140 పుటలు చూడుము.

దైత్య దానవ రాక్షసులను, దేవతలకు శత్రువులగు నితరులనుగూడ జయించును. అందఱిచేత నతఁడెల్లప్పుడు పూజింపఁబడును.

విష్ణు వహ్నిశిరయందు నుండును; కాని సనాతనుఁడగు నతఁడు సూక్ష్మరూపుఁడగుటచే స్పష్టముగ నెవరికిని గనఁబడఁడు. అతఁడు చరాచరమగు ప్రపంచమంతటను వ్యాపించియున్నాఁడు. భూస్వర్గ పాతాళములందును, పర్వతవనములందును, నన్నిస్థానములందును, పట్టణగ్రామములందును నతఁడున్నాఁడు. ఓంకారమును, సత్యమును, సావిత్రీదేవతయు, భూమియు, పర్వతములను ధరించువాఁడును, ననంతుఁడును నాతఁడే. రాత్రింబగళ్ళును, నుభయసంధ్యలును, సూర్యచంద్రులును, కాలమును, నగ్నియు, వాయువును, బ్రహ్మాదులును, నాతఁడే. అతఁడే దేవుఁడు; వెలుగుచుండువాఁడు; నుండుచుండువాఁడు; ప్రకాశించువాఁడు; రక్షించువాఁడు. అతఁడు లోకమును సృజించును; శాసించును; అంతము నొందించును. సంసారనాశనమునగు సృష్టిస్థితినాశనుఁడును, నాశనము లేనివాఁడును, పురాణపురుషుఁడును, లోకనాథుఁడును నగు నామహావిష్ణువు క్రీడించుచుండును. చరాచరములతోఁ గూడిన మూఁడు లోకములలోను నాతఁడు వ్యాపించియున్నాఁడు. నల్లకలువలవలె శ్యామల వర్ణము గలవాఁడును, తామరపువ్వులవలెనుండు నెఱ్ఱని వస్త్రమును గట్టినవాఁడును నగుటచే వర్షాకాలములో నాకాశమున మెఱుపులతోఁ గూడిన మేఘమువలె నుండువాఁడును, పద్మములవలెనుండు నెఱ్ఱని నేత్రములు గలవాఁడును, శ్రీమంతుఁడును, చంద్రునిచిహ్నముగాఁ ధరించినవాఁడు (ఈశ్వరుఁడు)ను, శ్రీవత్సమనెడు పుట్టుమచ్చ చిహ్నముగ గలవాఁడును నగు నాతని శరీరమున మేఘమందు మెఱుపువలె యుజ్జ్వలరూపముగల లక్ష్మి యెల్లప్పుడు నిలిచియుండును. దేవతలకుగాని, యసురులకుగాని, నాగులకుగాని యతనిని జూచుటకు శక్యముకాదు. కాని యెవ్వనియందు దాతని కెక్కువదయగలుగునో వాఁడుమాత్రమే యాతనిని

జూడగలుగును. యజ్ఞఫలములచేతగాని, తపములచేతగాని, పూర్వ పుణ్యములచేతగాని, దానములచేతగాని యతనిని జూడవీలులేదు. అతనియందు భక్తిగలిగి తమప్రాణములను, చిత్తములను నతనియందే యిడి యాతనిని ధ్యానించువారు జ్ఞానమనెడు నగ్నిచే పోగొట్టబడిన పాపములుగలవారై యాతనిని జూడగలుగుదురు. చరాచరములతో గూడిన జగత్తునంతను సృజించినవాడును, వానిని భరించువాడును నగు నాతని జన్మమెవరికిని దెలియదు. వేదములు దెలిసినవా రతనిని చీకటి కంటె పరముగనున్న పురుషుడనియు, నాదిత్యరూపుడనియు, ముసలితనములేనివాడనియు, పరమాత్ముడనియు, నీశ్వరుడనియు బలుకుదురు. అతని నాభినుండి బ్రహ్మయు, నతని క్రోధమునుండి శివుడును బుట్టిరి. అతనిని దేవత లాశ్రయించి, యజ్ఞములలో విధియుక్తముగ నీయబడిన హవిస్సును భుజించి, దైత్యుల నవమానపఱచి యమృతమును ద్రాగుదురు. విష్ణువు పాలసముద్రమున శ్వేతద్వీపమును గల్పించెను. అతనిచే మడిసిన దైత్యదానవు లాలోకమున నివసింతురు. నారాయణ పరాయణులైనవా రాజగన్నాథుని సర్చింతురు. సర్వ భూతములందు ద్వేషములేనివారును, గొప్ప యోగబలము నాశ్రయించినవారును నైదువిధములగు యజ్ఞములచే నెల్లప్పుడు నామధుసూదనుని సేవింతురు. గొప్పబలులగు వీరు భగవంతునియం దేకాంతబుద్ధి గలిగి సమాధిగలవారై యీద్వీపమున నివసింతురు. అతనిని మునులు వేదమందును, పురాణమందును, పాంచరాత్రిమందును పఠింతురు. సాంఖ్యయోగముచే ధ్యానింతురు. మునులచేతను, దేవసమూహములచేతను భగవంతుడు స్థాపింపబడును. అతనిని బ్రహ్మకూడ తెలియజాలడు. అతనిని దెలిసికొనినవారికి మోక్షము తప్పదు.

శ్లో॥ వేదాంతగో వేదమయః, పశూనాం పతి రవ్యయః
శూలధృ చ్ఛూలకేతు శ్చ, నేతా గోప్తా హరి శ్శివః॥ ౫
జటీ ముండీ శిఖండీ చ, లగుడీ చ, మహాయశాః
భూతేశ్వరో గణాధ్యక్ష, స్సర్వాత్మా సర్వభావనః॥ ౬
సర్వద స్సర్వహారీ చ, స్రష్టా చ గురు రవ్యయః
కమండలుధరో దేవః, పినాకీ ధూర్జటి స్తథా॥ ౭
పూజనీయో మాననీయ శ్చ, ఓంకార స్సామవేదగః॥
మృత్యు శ్చ మృత్యుపహా శ్చ, పారియాత్ర శ్చ సువ్రతః ౮

---

వేదాంతముచే తెలియదగిన వాడవు, వేదస్వరూపుడవు, సకల ప్రాణులకు ప్రభువవు, నాశనరహితుడవు, శూలమును ధరించినవాడవు, శూలమే జండాగాగలవాడవు, సకలజనులకు నాయకుడవు, రక్షకుడవు, హరివి, శోభనుడవు. ౫

జడలుదాల్చినవాడవు, గొరగబడినతలగలభిక్షుకుడవు, శిఖండివి, దుష్టశిక్షణంటి పూయుధమును బట్టుకొనినవాడవు, గొప్పకీర్తిగలవాడవు, భూతములకు ప్రభుడవు, ప్రమథగణముల కధిపతివి, సర్వస్వరూపుడవు, సర్వమునకు సాక్షివి. ౬

అన్నిటిని నిచ్చువాడవు, ప్రళయకాలమున నన్నిలోకములను సంహరించువాడవు, సర్వమును సృజించువాడవు, లోకములకు గురుడవు, నాశనరహితుడవు, కమండలమును ధరించినవాడవు, ప్రకాశమానుడవు, పినాకమనెడు ధనస్సుకలవాడవు, భారమునువహించుజడలుగలవాడవు. ౭

గౌరవింపదగినవాడవు, పూజింపదగినవాడవు, ఓంకారస్వరూపుడవు, సామవేదముచే కీర్తింపబడువాడవు, మృత్యుస్వరూపుడవు, మృత్యుహరుడవు, సర్వసంగమును వీడినవాడవు, వ్రతములు సలుపువాడవు. ౮

శ్లో॥ బ్రహ్మచారీ గృహీ యోగీ, వీణాపణవతూణవాన్।
అమరో దర్శనీయశ్చ, బాలసూర్యనిభస్తథా॥
శ్మశానచారీ భగవా, నుమాపతి రరిందమః।
భగనేత్రప్రహర్తా చ, పూష్ణోదశననాశనః॥ ౧౧
జ్వరహర్తా పాశహస్తః, ప్రళయః కాల ఏవ చ।
ఉల్కాముఖో ఽగ్నికేతుశ్చ, ముని ర్దీప్తో విశాంపతిః॥ ౧౨
ఉన్మాదో మోహనకర, స్సముద్ధ స్త్రిదశోత్తమః।
వామనో వామదేవశ్చ, ప్రాగ్దక్షిణ్యశ్చ నామతః॥ ౧౩
భిక్షుశ్చ భిక్షురూపీ చ, త్రిజటీ జటిల స్స్వయమ్।
చక్రహస్తః ప్రతిష్టంభీ, చమూనాం స్తంభనస్తథా॥ ౧౪

---

వేదాధ్యయనవ్రతము నాచరించువాడవు, గృహస్థుడవు, యోగివి, వీణ మద్దెల మొదలగువానిని వాయించువాడవు, మరణములేనివాడవు, చక్కనివాడవు, బాలసూర్యునివంటి కాంతిగలవాడవు.

శ్మశానములందు సంచరించువాడవు, భగవంతుడవు, పార్వతీపతివి, శత్రువులను బరిమార్చువాడవు, సూర్యునికన్ను బొడిచినవాడవు, సూర్యునిపండ్లు విఱుగగొట్టినవాడవు. ౧౧

జ్వరమును బోగొట్టినవాడవు, పాశములు (త్రాళ్ళు) హస్తములందు గలవాడవు, ప్రళయరూపుడవు, కాలరూపుడవు, కొఱవినినోట నుంచుకొన్నవాడవు, అగ్ని చిహ్నముగాగలవాడవు, మౌనముగల వాడవు, జ్వలించువాడవు, ప్రజల కధిపతివి. ౧౨

పిచ్చిని, మోహమును గలుగజేయువాడవు, సముద్ధుడవు, దేవతాశ్రేష్ఠుడవు, పొట్టివాడవు, వామదేవుడవు, ప్రాగ్దక్షిణ్యుడను పేరుగలవాడవు. ౧౩

బిచ్చగాడవు, భిక్షురూపమును దాల్చినవాడవు, మూడు జడలవాడవు, జడలు కలవాడవు, హస్తమందు చక్రమును ధరించినవాడవు, ఇతరులను స్తంభింపగలవాడవు, శత్రుసైన్యములను నిటునటుకదలకుండ గెలుపువాడవు. P.T.O ౧౪

శ్లో॥ ఋతు శ్చ ర్తుకరః కాలో, మధు ర్మధురలోచనః।
వానస్పత్య శ్శ్రీకర శ్చ, నిత్యమాశ్రితపూజితః॥ ౧౪
జగద్ధాతా చ కర్తా చ, పురుష శ్శాశ్వతో ధ్రువాజః।
ధర్మాధ్యక్షో విరూపాక్ష, స్త్రీవర్త్మా భూతభావనః॥ ౧౫
త్రినేత్రో బహునేత్రశ్చ, సూర్యాయుత సమప్రభః।
దేవదేవో౽భిదేవ శ్చ, చంద్రాంకితజట స్తథా॥ ౧౬
నర్తకో లాసక శ్చైవ, పూర్ణేందుసదృశాననః।
సుబ్రహ్మణ్య శ్శరణ్య శ్చ, సర్వదేవమయ స్తథా॥ ౧౭

---

ఋతుస్వరూపుడవు, ఋతువులను జేయువాడవు, కాలుడవు, వసంతకాలరూపుడవు, సొగసైన నేత్రములు గలవాడవు, పూవుల వలన బుట్టిన ఫలములుగల వృక్షరూపుడవు, ఐశ్వర్యమును గలిగించువాడవు, ఎల్లప్పుడు నాశ్రితులచే పూజింపబడువాడవు. ౧౪

జగత్తును రక్షించువాడవు, సృజించువాడవు, క్షేత్రజ్ఞుడవు (జీవుడవు), శాశ్వతుడవు, జన్మములేనివాడవు, న్యాయసాక్షివి, విరూపాక్షుడవు (బేసికన్నులుగలవాడవు), మూడుమార్గముల బోవువాడవు, (స్వర్గమర్త్యపాతాళములందు దిరుగువాడవు), ప్రజలందఱికిసాక్షివి. ౧౫

మూడునేత్రములు గలవాడవు, బహునేత్రుడవు (అనేక విధములుగ జూచువాడవు), పదివేల సూర్యులతో సమానమగు కాంతి గలవాడవు, దేవతలకు దేవుడవు, అందఱికంటె గొప్ప దేవుడవు, చంద్రునితో నొప్పు జడలుగలవాడవు. ౧౬

నృత్యముచేయువాడవు, లాస్యము (అభినయము)చేయువాడవు, పూర్ణచంద్రునితో సమమగు మోముగలవాడవు, వైదిక కర్మలను బాగుగ నాచరించువారిలో శ్రేష్ఠుడవు, శరణుజొంద దగినవాడ సమస్త దేవతాస్వరూపుడైనవాడవు.

సర్వభూతనివాసశ్చ, సర్వబంధవిమోచనః।
మోహనో వంచనశ్చైవ, సర్వాధారో నరోత్తమః॥ ౧౭

పుష్పదంతో విభాగశ్చ, ముఖ్యస్సర్వహరస్తథా।
హరిశ్మశ్రుర్ధనుర్ధారీ, భీమో భీమపరాక్రమః॥ ౧౮

భక్తాభీష్టప్రదస్స్థాణుః, పరమాత్మా సనాతనః॥ ౧౯

---

సర్వప్రాణులందు నివసించువాడవు, సమస్తబంధములనుండి భక్తులను విడిపించువాడవు, సకలజనులను మోహింపజేయువాడవు, వారిని మాయచే వంచనచేయువాడవు, అన్నిటిని ధరించువాడవు, ఉత్తములలో నుత్తముడవు. ౧౭.

పుష్పదంతమను ఏనుగుతో సమానమైనవాడవు, (పుష్పదంతుడవు); మంచిచెడ్డలు మొదలగు ద్వంద్వములను విభజించువాడవు, అందరిలోను ముఖ్యుడవు, సమస్తమును హరించువాడవు, పచ్చనిగడ్డమును, మీసములుగలవాడవు, ధనస్సును ధరించినవాడవు, శత్రుభయంకరుడవు, భయంకరమగు పరాక్రమము గలవాడవు. ౧౮

భక్తులకోర్కెలనిచ్చువాడవు, స్థిరముగువాడవు, పరమాత్ముడవు, సనాతనుడవు. ౧౯

---

## ౬.వ. అధ్యాయము. పుణ్యకర్మలు.

శత్రువులతో ధర్మయుద్ధముచేయువారు పుణ్యలోకములను బొందుదురు. ఈయుద్ధమునకు వెళ్ళి వెనుదిరుగక యుద్ధముచేసియందు మరణమునొందువారు మంచిలోకములను బొందుదురు. సాధువులు (మంచినడివడికలవారు)ను, వేదముపఠించువారును, తపస్సుచేయువారును, భూదానముచేయువారును, నగ్నినుపాసించువారును, ఏకపత్నీ

వ్రతస్థులును, వేయిగోవులను దానమిచ్చువారును, గురువుల సేవజేయువారును, గంగ మొదలగు నదులయందు ప్రాణములను విడుచువారును స్వర్గలోకములను బొందుదురు.

రాజసూయయజ్ఞమువలన శాశ్వతమగు ధర్మము గలుగును. దీనిని సూర్యుడు చేసి సర్వభూతములందు స్నేహము మొదలగుధర్మములను బొందెను. పాశ మాయుధముగాగల వరుణుడీయజ్ఞముచేసి తనయధికారమును బొందెను. చంద్రుడు దీనిని జేసి సర్వలోకములలోను శాశ్వతమగు కీర్తిస్థానమును బొందెను. రాజసూయమువలన నన్నిపాపములు బోవును.



## ౭వ. అధ్యాయము.

## పాపకర్మలు.



అబద్ధముపలుకుట, ఒకయజమాని తనసేవకునిచే గొప్పకార్యములను జేయించుకొని వానికి తగినద్రవ్యమీయకుండుట, రాజు ప్రజలను బిడ్డలవలెపాలించుచుండ వారు వానికిద్రోహముచేయుట, విశ్వాసముచే రహస్యముగజెప్పినదానిని వెల్లడిచేయుట, ప్రత్యుపకారము చేయకుండుట, చేసినమేలును మఱచుట, ఆత్మహత్యచేసికొనుట, మంచివారిచే విడువబడి సిగ్గులేకుండ జీవించుట, ఎల్లప్పుడు స్త్రీసాంగత్యము చేయుట, త్రాగెడునీటిని పాడుచేయుట, విషమునిచ్చుట, దప్పికచే నీరుత్రాగుటకువచ్చినవానికి మంచినీటినీయక వాని నవమానించుట, దొంగతనముచేయుట, దొంగలచే దొంగిలింపబడినసొమ్ముల నన్నిటిని సంగ్రహించుట.

నిద్రించినయావును సతికించంపుట, ఆవును కాలితోదన్నుట, కాసిన గూంవువొక్కపాలను వెంటనేతీయుట.

శాస్త్రములందు నమ్మకములేకపోవుట, పావులవస్థనేనకొనవృత్తి చేయుట, సూర్యునికెదురుగ మలమూత్రములను విడుచుట, ప్రజలకు వచ్చునాదాయములో 6వభాగము రాజు పుచ్చుకొని వారిని న్యాయముగ పరిపాలింపకుండుట, యజ్ఞమునకు ఋత్విజులను బిలిచి వారికీయవలసిన దక్షిణలను హరించుట, న్యాయయుద్ధమునుండి వెనుకకు దిరిగి వచ్చుట, గురువు కష్టపడిచెప్పిన వేదాంతాదిశాస్త్రములను మఱచుట, పాయసమును, పులగమును, మేకమాంసమును కారణములేకుండ(పితృదేవతలుమొదలగువారికర్పింపకుండ) భుజించుట, గురువులనవమానించుట, గురువులనుగూర్చి యపవాదములను బలుకుట, భార్యయు, పిల్లలును,ఆశ్రితులుమొదలగువారును నింటిలోనుండ తానొక్కడేమృష్టాన్నమును భుజించుట, వివాహములేకయు, ధర్మకార్యములనుజేయకయు, పుత్రులులేకయు మరణించుట, తనభార్యయందు సంతతిలేకదుఃఖముతో పూర్ణాయుర్దాయములేకయుండుట, రాజ స్త్రీ బాల వృద్ధులను జంపుట, భృత్యులను విడుచుట, లక్క, మద్యము, మాంసము, లోహములు, విషము నమ్మి జీవించుట, వానితో భృత్యులను పోషించుట. యుద్ధములో భయపడిపాఱిపోవువానిని బట్టి వధించుట, కపాలమునుబట్టి, నారచీరలనుధరించి వెఱ్ఱివానివలె బిచ్చమెత్తుకొనుట, మద్యముత్రాగుట, స్త్రీలోలుడగుట, జూదమాడుట, కామక్రోధములుగలిగియుండుట, ధర్మకార్యములందు మనస్సులేకుండుట, అధర్మకార్యములనుజేయుట, దానముపుచ్చుకొనుటకు తగనివానికి దానమిచ్చుట, సూర్యోదయాస్తమయకాలములందు నిద్రించుట, అగ్నినందిచ్చుట, గురుభార్యనుభోందుట, మిత్రద్రోహముచేయుట, దేవత

లను, పితృదేవతలను పూజింపకుండుట, తల్లిదండ్రులకు సేవచేయకుండుట, కీర్తికరములగు మంచిపనులను జేయకుండుట, ఏమైననిచ్చెదరని యాశించి స్తుతించుచు సధికారులనైపుచూచు యాచకులయాశను వృధచేయుట, నిత్యము కఠినోక్తులాడుట, కొండెములను జెప్పుట, పరులను మోసగించుటయందాసక్తిగలిగియుండుట, శుచి లేకయుండుట, అసూయగలిగియుండుట, రాజదండనమునకు జడియకుండుట, ఋతుస్నానముచేసి పుత్రేచ్ఛగలిగి తనసమీపముననున్న భార్యనుబొందకుండుట, తనభార్యను విడిచి యితరునిభార్యనుబొందుట, ధర్మమందు బుద్ధివిడుచుట, మూనము విడుచుట, బ్రాహ్మణుడు పుత్రులులేకయుండుట, బ్రాహ్మణునిపూజించుటకు జేయుయత్నమునకు భంగముగలిగించుట, ఇష్టము తగవులాడుచుండ న్యాయమును విడిచి కుటిలముగ నొకరిని జేయుట, ప్రాణులకుహింసచేయుటయందాసక్తిగలిగియుండుట, అన్నకు వివాహముకాకపూర్వము తమ్ముడు వివాహమాడుట, లుబ్ధత్వముతోనుండుట.

అనృతము 3విధములు:—మనస్సులో నాలోచించుట, నోటితో పలుకుట, శరీరముతో జేయుట.

పైన చెప్పబడిన దోషములలో 3 ముఖ్యమైనవి:—అనృతమాడుట; (దీనికంటెగొప్పదోషము) పరస్త్రీనిబొందుట, విరోధములేక యే హింసచేయుట.

అబద్ధపుసాక్ష్యముపలుకువాడు మరణాంతమున తనమాంసమును తానే తినును.

మహాపాతకములు:—రాజహత్య, బ్రహ్మహత్య, గోహత్య, మిత్రహత్య.

పుత్రికతోగాని, అక్కచెల్లెళ్ళతోగాని, సోదరుని భార్యతోగాని సంగమముచేయుట. (ఇట్టిపాపికి మరణామే శిక్ష)

ఒక గర్భమును గూర్చి యబద్ధమాడిన నూరు గర్భములను జంపిన పాపమును బొందును. ఒక యావును గూర్చి యబద్ధమాడిన వేయి గోవులను జంపిన పాపమును బొందును. ఒక పురుషుని గూర్చి యబద్ధమాడిన తన స్వజనకులకు వారికి నాశనము గలుగును.

బ్రహ్మహత్యకు, సురాపానమునకు, సువర్ణస్తేయమునకు, వ్రతములను జరుపనందులకు ప్రాయశ్చిత్తము కలదుగాని కృతఘ్నునకు ప్రాయశ్చిత్తము లేదు.

---

## 18. అధ్యాయము.

## * సాముద్రిక లక్షణములు.

రాజులకు గూడ పట్టాభిషేకము నొందు రాజభార్యలకొనక్క-పాదములందు పద్మరేఖలుండును. వారి శిరోజములు సన్నముగను, నీలముగను, పొడుగు పొట్టి లేక సమానముగను, మృదువుగను నుండును. బొమముడులు కలియక వేర్వేరుగనుండును. నిక్కులు రోమములు లేక తిరిగియుండును. దంతములు దగ్గఱదగ్గఱగ కలిసి యుండును. నేత్రములును, నేత్రాంతములందుండు నుదుటిపక్కలును, చేతులును, కాళ్ళును, కాలి-చీలమండలును, తొడలును యుక్తముగనుండును. వ్రేళ్ళు తగినగోళ్ళుగలిగి, నునుపుగను, సమముగనుండును. స్తనములు రెండు గట్టిగను, నొకదానికొకటి తగులునట్లు బలిసియు, చనుమొనలు కొంచెము మునిగినట్లును నుండును. నాభి లోతుగనుండును. వక్షస్థలము, పక్కలు యుక్తముగనుండును. శరీరము పూవులవలె కాంతి గలిగి

* 11. ప్ర 16. అ. ఇంద్రజిత్తు ప్రథమయుద్ధము 1001 పుట చూడుము.

బట్టుట, పెద్దవాయువులు వీచుట, పగటిసమయముననే నక్షత్రములు కనబడుచుండుట, రాత్రి చంద్రునకు కళ తగ్గియుండుట, చుక్కలు రాలుట, సరస్సులలోని పద్మము లెండిపోయియుండుట, చేపలు నీటిలో మునిగియుండుట, చెట్లు పూవులు, పండ్లు లేకయుండుట, గాలి వీవకుండగనే బుగ్గి మేఘములవలె బూడిదరంగుగలిగి యెగురుచుండుట, నోరువంకలు విపరీతముగ కూయుచుండుట, భూమి యంతయు గొప్ప ధ్వనిచేయుచు పర్వతములతోను, వృక్షములతోను కంపించుట, సముద్రము పొంగుట, చెట్లకొమ్మలెత్తుగ పడుట, మృగపక్షులు కష్టముపొందువానికి సవ్యదక్షిణముగ దిరుగుట, యుద్ధమునకు వెళ్లునపుడు రథధ్వజముపై గ్రద్దలు నిలుచుట, ప్రయాణము చేయువారిపైని గ్రద్దలు గుండ్రముగ తిరుగుట దుశ్శకునములని చెప్పబడినవి.

---

## ౧౦వ. అధ్యాయము.

## చార్వాకమతము, లేక నాస్తికమతము. *

లోకములో నొకనికి మఱియొకడు బంధువుకాడు. వాని కే సంబంధముచేతను బొందదగినదేదియులేదు. మనుజుడు తానొక్కడే జన్మించి తానొక్కడే మృతినొందును. ఆకారణమువలన తల్లిదండ్రుల నభిమానించువాడు పిచ్చివాడు. ఎవరికిని నాదియను వస్తువులేదు. ఒక మనుష్యుడొక గ్రామమునకు ప్రయాణముచేయుచు మార్గమున నొక చోటనొకరోజు నిలిచి మఱునాడు దానిని విడుచునట్లు తలిదండ్రులను, నిల్లునుధనమునుగూడ కొంతకాల మనుభవించి విడిచివేయును. సత్పురు

* జాబాలి వసిష్ఠులు రాముని రాజ్యాభిషేకముగోరుట 616 పుటచూడుము.

షులు వానిని మిక్కిలిగ నాలోచింపరు. తండ్రికి, పుత్రునకు నేమియు సంబంధములేదు. తండ్రి వేరు, కొడుకు వేరు. పుత్రునకు తండ్రి బీజమాత్రుడు. తల్లిధరించిన శుక్లశోణితములె యతడు జన్మించుటకు ముఖ్యకారణము. వెంటనే యనుభవమునకువచ్చు తమ సౌఖ్యములను విడిచి మనుష్యులు ధర్మార్థపరులు కాగూడదు. ధర్మార్థపరు లీలోకమునందును, మరణాంతమునను గూడ బాధనొందుదురు. జీవులందఱు మరణాంతమున పంచభూతములలోను జేరుదురు. కొందఱు జనులు అష్టకశ్రాద్ధములనెడు పితృసాంవత్సరికాది శ్రాద్ధములను పెద్దలకు బెట్టుదురు. వానివలన నన్నము వ్యయమగుటేకాని చనిపోయిన వాడేమియు భుజింపడు. ఒకడు భుజించినయన్నము మఱియొకని దేహమును బొందదు. ఎట్లనిన నింటిలోనుండినవాడు భుజించిన దారిపోవువానికి కడుపు నిండదు. ఉపాయములు తెలిసినవారు పరద్రవ్యములను హరించుటకై దానములు, యజ్ఞములు మొదలగు వానిని జేయవలెననియు, దీక్షకలిగి యుండవలెననియు, తపస్సుచేయవలెననియు గ్రంథములలో వ్రాసిరి. కంటికి కనబడుచు వెంటనే యనుభవమునకువచ్చి సుఖములను గలుగ జేయుకార్యములనే చేయవలెనుగాని, కంటికి గనబడని పరలోకసుఖముల నాశించి కార్యములను జేయగూడదు. పరలోక మనునది యేదియులేదు.

---

౧౧ వ. అధ్యాయము.

నాస్తికమతఖండన. *

సత్యమే ముఖ్యమైనది. దానిని నరుడు తప్పకుండనవలంబింపవలెను. నూఱుయజ్ఞములుచేయుటచే నింద్రునకు స్వర్గాధిపత్యము

* 617 వ పుటచూడుము.

వచ్చెను. కర్మభూమియగు భరతఖండములో జన్మించువారు నుంచి కర్మలను జేయనగును. పూర్వము అగ్ని, వాయువు, చంద్రుడు కర్మలను జేయుటచేతనే వారికట్టి యధికారములు వచ్చెను. గోప్యబుషులు క్రియనుగు తపస్సుచేసి స్వర్గమును బొందిరి. మనుజులు తాముచేయు కర్మఫలములను తప్పక పొందెదరు. సత్యము, ధర్మము, పరాక్రమము, భూతదయ, మంచిమాటలాడుట, దేవబ్రాహ్మణపూజ స్వర్గమునకు మార్గములు. అందుచేతనే బ్రాహ్మణులాసంగతి నెరిగినవారై దానియజేయుచు జాగరూకులై తమతమధర్మములను జరుపుచు నుత్తమ లోకములను బొందుటకు యత్నించుచున్నారు. మనుష్యులు ధర్మము లందు బుద్ధిగలిగి సత్పురుషులతో సహవాసముచేయుచు గోప్యతేజోవంతులయి దానముచేయుట మొదలగు మంచిగుణములుగలిగి హింసవిడిచి పాపములనుండి తొలగి ముక్తులై మహాత్ములగుచున్నారు.

---

## ౧౪వ. అధ్యాయము.

## రాజనీతులు. *

పూర్వము బ్రాహ్మణప్రధానమగు కృతయుగమున దేవతలకు నింద్రుడు రాజుగనుండెను. కాని ప్రజలకు రాజులేకుండెను. అప్పుడు ప్రజలు రాజుకొఱకు బ్రహ్మదగ్గఱకు వెళ్ళి యతనితో 'నీవు దేవతల కింద్రుని రాజుగ నియమించితివి. మాకుగూడ నొకరాజశ్రేష్ఠుని నిమ్ము. మే మతనిని పూజించుచు మాకార్యములందలి పాపములను బోగొట్టుకొందుము. రాజులేనియెడల మేము నివసింపలేము. ఇదియే ముఖ్యమగు మాకోరిక.' యని తెలిపిరి. అప్పుడాతడు లోకపాలుర నందఱిని బిలిచి

*503, 599, 900, 916, 980, 1241, 1281 పుటలు చూడుము.

'మీ మీ తేజోభాగముల నిం'డని పలుక వారట్లిచ్చిరి. అప్పుడు బ్రహ్మ క్షుపుఁడనువానిని సృజించి ప్రజలకు రాజుగనిచ్చెను. అత డింద్రుని యంశమున భూమిని పాలించెను. వరుణుని యంశమున ప్రజలను పోషించెను. కుబేరునియంశమున ప్రజలకు సొమ్ము నిచ్చెను. యముని యంశమున ప్రజలను దండించెను.

రాజమంత్రులు రాజుతో సమానులును, విశ్వసింపదగినవారును, శూరులును, నింద్రియజయము గలవారును, నీతిశాస్త్రము తెలిసిన వారును, మంచికులములో జన్మించినవారును, రూపచేష్టలనుబట్టి యెదుటివారిని పోల్చువారును, శక్తిసామర్థ్యములు గలవారును నై యుండవలెను. అట్టివారు ముగ్గురుగాని, నలుగురుగాని యుండవలెను. వారితో రాజు వేఱువేఱుగగాని, కలిసిగాని రహస్యముగ నాలోచించు చుండవలెను.

అమాత్యులు శాస్త్రములు చదివినవారును, శుచిగలవారును, వంశపారంపర్యముగ వచ్చువారును, పరీక్షకు నిలిచినవారును, మంచి యాలోచన గలవారును నై యుండవలెను. అట్టియెడ రాజులకు తప్పక జయము కలుగును.

రాజులు నిద్రామత్తులై యుండక యుదయమున సరియగు వేళకు లేచుచుండవలెను. వారు తెల్లవాఱుజామున సొమ్మురాబట్టు నుపాయములనుగూర్చి యాలోచనలు చేయుచుండవలెను. ఇంద్రియజయము కలిగియుండవలెను.

రాజు తా నొక్కఁడే కాని, లేక చాలమందితోఁగూడికాని యాలోచన చేయకూడదు. తనయాలోచనలు ప్రజలకు తెలియనీయకూడదు.

రాజు ప్రతివిషయమునుగూర్చియు సులభమగు మార్గమున నధికలాభముకలుగున ట్లాలోచించి వెంటనే దానిని ప్రారంభింపవలెను; కాని దీర్ఘవిలంబము చేయకూడదు.

రాజు తాను సాగించి నెఱవేర్చిన కార్యములును, చేయుచుండిన కార్యములను మాత్రము ఇతరరాజులకు తెలియవచ్చునుగాని; యతడు చేయబోవు కార్యములను మాత్రము వారికి తెలియగూడదు. రాజును, నతని యమాత్యులును నూహించిన కార్యములు పైవారికి తెలియగూడదు.

వేయిమంది మూర్ఖులసలహాకంటె నొకపండితుని యాలోచన మంచిది. దానివలన నే కష్టమగు వ్యవహారములలో గూడ జయము గలుగును. మూర్ఖులెంతమంది చెప్పినను నట్టిదానివలన లాభములేదు. మంచిబుద్ధిగలవాడును, సమగ్రుడును, శూరుడును, బాగుగ పరిశీలించువాడును నగు నొక యమాత్యుడు చెప్పుదానిని చేయుటవలన గొప్ప లాభము గలుగును.

రాజులు మూడువిధములు:—ఉత్తములు, మధ్యములు, అధములు.

మంచియాలోచనచేయుటయందు సామర్థ్యముగలవారును, మంచినీతిగలవారును నగుమంత్రులతోగాని, స్నేహితులతోగాని, సుఖదుఃఖములను తనతో సమానముగననుభవించు బంధువులతోగాని, హితులతోగాని యాలోచించి దైవమందు బుద్ధినిలిపి కార్యములను జేయురాజు ఉత్తముడు.

తానొక్కడే ధర్మమందు మనస్సునిలిపి ప్రయోజనముల నాలోచించి కార్యములనుజేయువాడు మధ్యముడు.

మంచిచెడ్డల నాలోచింపక ధర్మమార్గమును విడిచి 'కార్యములను జేసెదను' ననుచు వాని నుపేక్షించువాడు అధముడు.

మంత్రులుకూడ మూడు విధములు:—ఉత్తములు, మధ్యములు, అధములు.

మంచియాలోచనకలవారును, శాస్త్రమునసనుసరించి యొక్కటిగ నాలోచనచేయువారును నగు మంత్రు లుత్తములు.

కోపమునొంది యారాజును దూషింతురు. కానివల్ల రాజునకు గొప్ప కీడుకలుగును. రాజవంశములో జన్మించినవారు ప్రధానులును, రాజునందను రాగముగలవారును, రాజునుగూర్చినను ప్రాణములనైన విడుచువారునునై యుండవలెను. అట్టివారు ప్రవర్తించునట్లు రాజు వారిని మర్యాదచేయుచుండవలెను.

రాజు తనదేశమున జన్మించినవారును, పండితులును, సమర్థులును, సమయస్ఫూర్తిగలవారును, తనయాజ్ఞప్రకారము జరుపువారునునగు జనులను దూతలుగ నియమింపవలెను. వారు రాజునకు ప్రతికూలముగ జరుగుకార్యములకు భంగముచేయుసమర్థులై యుండవలెను. ఏదైనొకవిషయమును నైనను దెలిసికొనుటకు నొకరిసంగతి మఱియొకరికిగాని, యితరులకుగాని తెలియకుండునట్లు ముగ్గురుచారులను బంపవలెను. వారలకు తెలియవలసినయంశములు తీర్థములనబడును. (అవియేవియన) 1 మంత్రి, 2 పురోహితుడు, 3 యువరాజు, 4 సేనాపతి, 5 ద్వారపాలకులయజమానుడు, 6 అంతఃపురములోని కార్యములను నెఱవేర్చువాడు, 7 కారాగృహాధికారి, 8 ధనమును భద్రపఱచువాడు, 9 రాజాజ్ఞలను దెలుపువాడు, 10 వ్యవహారవిషయికప్రశ్నలనడిగి సంగతులను దెలిసికొనువాడు, 11 సేనకు జీతములు మొదలగువాని నిచ్చువాడు, 12 నగరమును, ప్రాకారములను, ద్వారములను గాపాడువారిని రాత్రివేళ పరీక్షించువాడు, 13 జీతములను పంచువాడు, 14 సభాధర్మములను క్రమముగజరుపువాడు, 15 ధర్మశాస్త్రానుసారముగ వివాదములను పరిష్కరించువాడు, 16 రాజదండనను నెఱవేర్చువాడు, 17 వనములు, కొండలు మొదలగువానిని రక్షించువారియజమానుడు, 18 రాజ్యముయొక్క హద్దులను రక్షించువాడు. ఈపదునెనమండ్రు నెఱవేర్పవలసివిధులను చారులు బాగుగ గుర్తెఱిగియుండవలెను. రాజు పరరాజ్యమునుండి యీ 18 విషయము

లను, తనరాజ్యములోనుండి చివరి 15 విషయములను గూఢచారుల వలన దెలిసికొనుచుండవలెను. ఇతరరాజ్యసంబంధమైనచారులను రాజులు చంపకూడదు; కాని వారికి దండనల విధింపవచ్చును. (అవి యేవియన) అంగములవికూపమునొందించుట, కొరడాతోగొట్టుట, తల గొరిగించుట మొదలగునవి.

చారులు 3 విధములు:—ఉత్తములు, మధ్యములు, అధములు.

రాజుచే దుష్కరమగు కార్యముచేయుటయందు నియమింపబడి దానిని చేసి యతనిచే నియమింపబడకపోయినను నతని క్లిష్టమగు నితర కార్యములనుగూడ నెఱవేర్చువాడు ఉత్తముడు. ఇతరకార్యములనుగూడ జేయుటయందు సమర్థుడును, నుత్సాహయుక్తుడును నైనను రాజు చెప్పినదానిని మాత్రమే చేసి యితరకార్యములను జేయనివాడు మధ్యముడు. సమర్థుడైనను రాజు చెప్పినదానినిగూడ చేయనివాడధముడు.

యుద్ధములో నోడిపోయినశత్రువులు తిరుగ యుద్ధమునకు వచ్చినప్పుడు వారు పూర్వమునవలెనే బలములేనివారని తలచి యశ్రద్ధ వహించినచో రాజునకు ముప్పు వచ్చును.

బ్రాహ్మణులు కొందఱు నాస్తికులయి మేము పండితులమని యనుకొనుచు మూర్ఖులుగనుందురు. వారివలన రాజునకు ననేకాపదలు కలుగును. వారు ముఖ్యమైన ధర్మశాస్త్రములను, వేదములను నిందించుచు వ్యర్థమగు వాదములను జేయుచుందురు. అట్టివారిని రాజు తన దేశమునుండి వెడలగొట్టవలెను.

రాజు తనకుటుంబములోని స్త్రీలకు యథాశక్తిముగ దయ జూపుచు వారిని రక్షించుచుండవలెను; కాని వారు చెప్పినట్లుమాత్రము చేయకూడదు. రహస్యవిషయములనుగూర్చి వారితో ముచ్చటింప గూడదు.

రాజు ప్రాతఃకాలమునలే లేచి రాజసభకు బోయి ప్రజలకు దర్శనమిచ్చుచుండవలెను. రాజు తనధర్మకార్యులకు (పరిచారకులకు)

తఱుచుగ దర్శనమిచ్చుటగాని, కేవలము దర్శనవిహీనుఁడగుటగాని జరుపక తగిన యవసర సమయములందు దర్శనమిచ్చుచు మధ్యమమార్గ మవలంబింపవలెను.

రాజునకు వచ్చురాబడి యెక్కువగను, వ్యయము స్వల్పముగను నుండవలెను. తగనివారికి (నటవిటగాయకాదులకు) నెప్పుడు నధిక ధనమీయకూడదు. ద్రవ్యమును దేవకార్యములందును, పితృకార్యములందును, బ్రాహ్మణులకొఱకును, నతిథులకొఱకును, భృత్యులకొఱకును, స్నేహితులకొఱకును నుపయోగింపవలెను. దైవములవలనను, మనుష్యులవలనను వచ్చుకీడులకు ప్రతీకారము చేయుచుండవలెను.

నిర్మలమగు బుద్ధిగలవాఁడును, శుచిగలవాఁడును, పూజ్యుఁడును నగు వానిపైని దైవయోగముచే చౌర్యనేర మారోపింపబడినయెడల శాస్త్రములలో మంచి పరిశ్రమగలవారు విచారణచేయకుండ ధనలోభముచే పైవానినుండి ధనము పుచ్చుకొని వానికి శిక్ష విధింపకూడదు. చోరుఁడొకఁడు పట్టుపడినప్పుడు వానిని ప్రశ్నలచే పరిశీలించి తగినకారణములున్నయెడల సాక్ష్యములను బట్టి వానికి తప్పక శిక్ష విధింపవలెను. కాని ధనలోభముచే వానివద్ద ధనముపుచ్చుకొని వానిని విడువకూడదు. ధనికునకును, దరిద్రునకును వివాదమువచ్చినప్పుడు బాగుగ ధర్మము తెలిసిన రాజమంత్రులు ధనలోభములేనివారై వారి వ్యవహారములను పరిష్కరింపవలెను. కేవలము భోగముకొఱకు రాజ్యముచేయుచు రాజులు న్యాయాన్యాయములను విచారింపక ప్రజలను శిక్షించినయెడల ప్రజలకన్నీటిబిందువులు రాజవంశమునకును, నతని సంపత్తికిని హానికలిగించును.

ముసలివారిని, పిల్లలను, మంచివిద్వాంసులను రాజు తగిన బహుమానము లిచ్చుటచేతను, మనస్సుచేతను, మంచి మాటలచేతను సంతోషపెట్టవలెను.

రాజు తన గురువులకును, ముసలివారికిని, ఋషులకును, దేవతలకును, పతివ్రతలకును, నాలుగుబాటలు కలియుచోటనుండు దేవతలకు నివాసమగు వృక్షములకును, యజ్ఞములు మొదలగు మంచికార్యములను జేసినవారికిని, బ్రాహ్మణులకును నమస్కరింపవలెను.

ధర్మముజరుపవలసిన సమయములం దర్థార్జనయందుబుద్ధిగలిగి ధర్మమునకుగాని, అర్థార్జనచేయవలసినసమయములందు ధర్మమునందు బుద్ధిగలిగి యర్థమునకుగాని, సుఖాభిలాషచేతను, కామముచేతను నాధర్మార్థముల రెండిటికిగాని భంగముకలుగజేయగూడదు. రాజు సమయాసమయములను దెలిసికొని యాధర్మార్థకామములనుమూడిటిని గూడ జేయుచుండవలెను. రాజును సర్వశాస్త్రములు తెలిసినబ్రాహ్మణు లాశీర్వదించుచుండవలెను. పట్టణదేశవాసులును నాతనిసుఖమును గోరుచుండవలెను.

రాజదోషములు 14:—1 నాస్తికము (ఈలోకముతప్ప మఱేమియులేదనుభావము), 2 అబద్ధము, 3 క్రోధము, 4 తొందర, 5 ఆలస్యముగ కార్యములజేయుట, 6 జ్ఞానులనుజూడకుండుట, 7 మత్తుపదార్థములను సేవించుటచే కార్యవిలంబముచేయుట, 8 పంచేంద్రియములకు లొంగియుండుట, 9 తానొక్కడే యాలోచనచేయుట, 10 స్వప్రయోజనములనుగూర్చి కుటిలులతో నాలోచించుట; 11 నిశ్చయించినకార్యములను ప్రారంభింపకుండుట, 12 ఆలోచించినరహస్యవిషయములు వెల్లడికాకుండునట్లు రక్షింపకుండుట, 13 శుభమగుపనులను జేయకుండుట, ప్రతికూలములేనగనే యుద్ధమును జూడకుండుట. 14 అన్నిదేశములపైకి దండయాత్రవెడలుట.

వ్యసనములు 10:—1 వేట, 2 జూదము, 3 పగలుపండుకొనుట, 4 పరులను నిందించుట, 5 స్త్రీవ్యామోహముగలిగియుండుట, 6 మద్యసేవ, 7 నృత్యము, 8 గీతము, 9 వాద్యము, 10 పనిలేకతిరుగుట,

రాజులు జాగ్రత్తపఱచవలసినదుర్గములు 5:—1 జలము, 2పర్వతములు, 3 వృక్షములు, 4 ధనస్సులు, 5 ఎడారిప్రదేశములు. (వీనిసంబంధమైనవిదుర్గములనబడును.)

రాజుల కుండవలసినయుపాయములు4:—1సామము,2దానము, 3 భేదము, 4 దండము.

నీతివిద్యలను బాగుగదెలిసికొని నీతిశాస్త్రప్రకారము ప్రవర్తించు రాజు శత్రువులను వశముచేసికొని చిరకాలమైశ్వర్యమనుభవించును. కాలమును గుర్తెఱిగి శత్రుబలముతో సంధియు, యుద్ధమును జేయురాజు తనవశమును వృద్ధినొందించుచు గొప్పయైశ్వర్యమును బొందును. తగ్గిపోవుచున్న బలముగలరాజుతోను, తనతోసమానమైన శత్రురాజుతోను సంధిచేయవలెను. ఎక్కువబలముగలరాజు తనశత్రువు నుపేక్షచేయక వానితో యుద్ధముచేయవలెను.

రాజ్యమున కుండవలసిన అంగములు 7:—1 ప్రభువు, 2 అమాత్యులు, 3 దేశము, 4 దుర్గము (శత్రువులు వచ్చుట కష్టముగనుండు గొప్ప ప్రదేశములు), 5 ధనము, 6 స్నేహితులు, 7 సైన్యము.

రాజ్యమునకుండు కష్టములు 8:—1 దుర్మార్గము, 2 సాహసము, 3 ద్రోహము, 4 ఈర్ష్య (శాంతిలేకపోవుట), 5 అసూయ, 6 అర్థదూషణము, 7 మాటలలోను, శిక్షలలోను కఠినత్వము, 8 కోపమును బుట్టించుగుణము.

త్రివర్గము:—1 ధర్మము, అర్థము, 3 కామము.

మూడువిద్యలు:— 1 త్రయి=వేదము (అన్ని దేశములనెక్కువిషయములను దెలిసికొనుట), 2 వార్తా=కృషి, గోరక్షణ వాణిజ్యములు, 3 దండనీతి=రాజదండములన్ను, రాజనీతులను దెలియుజేయు నీతిశాస్త్రము.

షడ్గుణములు:— 1 సంధి, 2 విగ్రహము (కలహించుట), 3 యానము (దండెత్తుట), 4 ఆసనము (యుద్ధమునకు సమయమును జూచుచు నిలుచుట), 5 ద్వైధీభావము(భేదముపుట్టించుట), 6 సమాశ్రయము (బలవంతముగ చేపట్టుట).

ఈక్రింద నుదహరింపబడిన యిరువదిమందితోను రాజులు సంధి చేయగూడదు:—

1 బాలుడు, 2 వృద్ధుడు, 3 దీర్ఘరోగముగలవాడు, 4 బంధువులచే బహిష్కరింపబడినవాడు, 5 జడిసినవాడు, 6జడిసినమంత్రులు మొదలగువారుగలవాడు, 7 లుబ్ధుడు, 8 లుబ్ధులగుప్రజలుగలవాడు, 9 అనుకూలముగలేనిప్రజలుగలవాడు, 10 ఇంద్రియలోలుడు, 11అనేకులసలహాపొందువాడు, 12 దేవతలను, బ్రాహ్మణులను నిందించువాడు, 13 మహాత్ములు మొదలగువారిచే శాపములను బొందినవాడు, 14 దైవము మీదభారమునైచి పురుషప్రయత్నముచేయనివాడు, 15 కరువు మొదలగుబాధలచే బాధనొందువాడు, 16 సైనికులనాశనముచే బాధనొందువాడు, 17 తనదేశమును విడిచి దూరదేశమునసున్నవాడు, 18 అనేక శత్రువులుగలవాడు, 19 క్రూరగ్రహదశలతో గూడుకొన్నవాడు, 20 సత్యధర్మములను విడిచినవాడు.

రాజులు దండయాత్రజేయుటకు తగినమార్గములను దెలిసికొని యుండవలెను.

రాజు మంచిబుద్ధితో ప్రజలను యమధర్మరాజువలె న్యాయము గను, ధర్మముగను పరిపాలించినయెడల లోకమంతయు బొంది కాలవశమున శరీరమును విడిచి యాత్మజ్ఞానముగలవాడై స్వర్గలోకమును బొందును.

ప్రజలను ధర్మమార్గమున బాలించురాజు తనప్రజలసుకృతములలో నాఱవభాగమునొందును. ప్రజలయొద్ద నాదాయములలో నాఱవ

భాగముపుచ్చుకొని వారిని రక్షింపనిరాజు వారిపాపములో నాల్గన భాగమునుబొందును. తనప్రియపుత్రులవలె ప్రజల నందఱిని మిక్కిలి జాగరూకుడై యెల్లప్పుడు రక్షించురాజు చాలకాలమునిలిచి కీర్తిని బొంది బ్రహ్మలోకమునకుబోయియక్కడగూడ గౌరవమునుబొందును. ఎవనిదేశములో మునులు దుంపలు, ఫలములుమొదలగువానిని దిని జీవించుచు గొప్పధర్మమార్గమునవర్తింతురో యామునులధర్మములో నాల్గవభాగము ధర్మముగరక్షించు రాజునుజెందును. లుబ్ధుడగురాజును ప్రజలు మన్నింపరు. రాజు తనకార్యములను స్వయముగజూడకపోయిన యెడల నవియును, రాజ్యమును నాశనమునొందును. చివరకు రాజు కూడనాశనమునొందును. తగినచారులులేనివాడును, తగినకాలములం దైనను ప్రజలకు దర్శనమీయనివాడును, నస్వతంత్రుడునునగు రాజును ప్రజలు విడిచెదరు. క్రూరుడును, నీయవలసినదానికంటె తక్కువవేతన మిచ్చువాడును, ప్రమత్తుడును, గర్వించినవాడును, విషయభోగములం దాసక్తిగలవాడును, రహస్యముగ చెడుగులనాలోచించువాడును నగు రాజును కష్టకాలములో వానిమంత్రులుమొదలగువారుకూడ రక్షించుటకు ప్రయత్నింపరు. తన్ను తాను గౌరవముగాదలచుకొనువాడును, సత్పురుషుల చేగ్రహింపతగనివాడును, తన్నుదానుపొగడుకొనువాడును, అకారణముగ క్రోధమునొందువాడునునగు రాజునకు కష్టకాలమువచ్చి నపుడు వానిమంత్రులు, భృత్యులుమొదలగువారుకూడ వానిని జంపుదురు. రాజు భయహేతువులగుకార్యములందు భయమునొందకుండ వానిని తగురీతిని నెఱవేర్చవలెను. అట్లు వానిని నెఱవేర్చనియెడల వాడు రాజ్యభ్రష్టుడగును.

రాజులు:—అగ్నివలె తీక్ష్ణులును, ఇంద్రునివలె పరాక్రమశాలురును, చంద్రునివలె సాహ్లాదకరులును, యమునివలె దండించువారును, వరుణునివలె ధర్మముజూపువారునునై యుండవలెను. వీరు దేవాంశగలవారు.

రాజు కామవృత్తి గలిగి చెడుమార్గమున నుండినయెడల వానిని వానియమాత్యు లన్నివిధములదానినుండి మఱలింపవలెను. మంత్రులు రాజును మంచిమార్గములో నుంచినయెడల ధర్మార్థకామములను, యశస్సును బొందుదురు. రాజు మంచిమార్గములో లేకపోయినయెడల వానిమంత్రులకు నాధర్మనుమొదలగునవి కలుగకపోవుటయేగాక రాజ్యమందలిప్రజలకుగూడ పీడలు గలుగును. రాజుమూలముననే ధర్మమును, జయమును గలుగును. కనుక రాజు నెల్లప్పుడు కాపాడు చుండవలెను.

రాజు క్రూరదండనలను విధించుచుగాని, ప్రజలకిబ్బందికలుగు నటులగాని, యవినీతిగగాని రాజ్యమును బాలింపకూడదు. మంత్రులు రాజుచే నారీతిగ బాలించునట్లు చేయించినయెడల నెత్తుపల్లములుగల ప్రదేశములందు తెలివితక్కువగలసారథి రథాశ్వములను శీఘ్రముగ దోలినప్పుడువలె సందటికి నాపదలువచ్చును.

ధర్మముగ నుండురాజు పరదారలను గ్రహింపగూడదు. అట్లు ప్రవర్తించుటయేగాక ముఖ్యముగ రాజభార్యల నట్టియాపదలనుండి రక్షింపవలెను. రాజే ధర్మము, కామము. రాజుయొక్కప్రవర్తనము వలననే పాపముకాని, ధర్మమగుపుణ్యముగాని లభించును.

రాజులకుండవలసినగుణములు:—ఇంద్రియనిగ్రహము, మన శ్శాంతి, ఓరిమి, ధార్మికత్వము, ధైర్యము, సత్యము, పరాక్రమము, దుష్టశిక్షణము.

పాపకార్యములను జేసినమానవులు రాజుచే శిక్షనుబొందిన యెడల వారు తమపాపములను బోగొట్టుకొని పుణ్యముచేసినవారివలె స్వర్గమునకు బోవుదురు. రాజు దొంగను విచారణచేసి శిక్షించినను, లేక వాడు దోషికాడని విడిచినను నాదొంగ తనపాపములనుండిముక్తు

డగును. రాజు పాపులను శాసింపనియెడల వారిపాపములను తాను బొందును. వారిని దండించిన రాజు స్వర్గమును బొందును.

రాజులకుండవలసినలక్షణములు.

బుద్ధిగుణములు:8— 1 గ్రహించుట, 2 ధారణచేయుట, 3 స్మరించుట, 4 నిరూపించుట (నిర్ధారణచేయుట), 5 ఊహించుట, 6 యోచనచేయుట, 7 శబ్దార్థజ్ఞానము కలిగియుండుట, 8 తత్త్వజ్ఞానము కలిగియుండుట.

నాలుగుబలములు:—1 బాహుబలము, 2 మనోబలము, 3 ఉపాయబలము, 4 బంధుబలము.

14 గుణములు:—1 దేశకాలములను దెలిసియుండుట, 2 దార్ఢ్యము కలిగియుండుట, 3 సర్వక్లేశములను సహింపగలిగి యుండుట, 4 అన్నివిషయములు తెలిసినవారి నెఱిగియుండుట, 5 నేర్పుకలిగి యుండుట, 6 ఉత్సాహము కలిగియుండుట, 7 మంత్రులతోగలిసి యాలోచించుట, (రహస్యముగనాలోచించుట), 8 వాదింపకుండుట, 9 శౌర్యముకలిగియుండుట, 10 బలముగలవారిని దెలిసియుండుట, 11 చేసినమేలుమఱవకుండుట, 12 శరణుపొందినవారిని ప్రేమతో రక్షించుట, 13 క్రోధములేకయుండుట, 14 చంచలచిత్తములేక యుండుట.

ప్రజాపోషకుడును, ప్రజానాశకుడును రాజేయైయున్నాడు. ప్రజలు నిద్రించునపుడు రాజు మెలకువగనుండి జాగ్రత్తగ వారినిపాలించుచుండును. రాజనీతి బాగుగ నడచునప్పుడు రాజుచే పాలింపబడు ప్రజలు ధర్మమును గాపాడుదురు. రాజెప్పుడు ధర్మమును బాలింపడో యప్పుడు ప్రజలెల్ల ధర్మమును నాశనముచేయుదురు. రాజే సకలజగత్తునకు గర్తయు, తండ్రియు, పాలకుడునునైయున్నాడు. అతడే కాలము, యుగము. లోకమంతయుగూడ నతడే. ధర్మము చరాచర

ములతోఁగూడిన యీజగత్తుసంతతిని ధరించుటవలన(పోషించుటవలన) ధర్మమనబడుచున్నది. ధర్మముచేతనే ప్రజలు ధరింపబడుచున్నారు. ప్రజలను ధరించుటవలనను, జనులను సంతోషపెట్టుటవలనను ధర్మమే ధారణమనబడును. అదియే ధర్మమనుటనిశ్చయము. రక్షణముదప్ప యిహపరములందు మేలుగూర్చు ధర్మము వేరొక్కటిలేదు. ధర్మము వలన బొందరానిదేదియు లేనేలేదు. 'దానము, భూతదయ, సత్పురుషులను గౌరవించుట, వివాదములను పరిష్కరించుటయందు పక్షపాతము లేకుండుట' యను వీనిని గాపాడుటతప్ప యిహపరములందు మించిన ధర్మములేదు.

---

### ౧౬౫. అధ్యాయము. అరాజకము. *

రాజులేని దేశమందీక్రిందివానుదహరింపబడిన బాధలుకలుగును. మేఘములు ఉఱుములు, మెఱుపులుగల్గియు భూమియందు వర్షింపవు. విత్తనములు సరిగ జల్లబడవు. తండ్రికి కొడుకును, భర్తకు భార్యయు లొంగియుండరు. ప్రజలకు ధనముండదు; భార్యలుండరు. గొప్ప భయములు గలుగుచుండును. సస్య మెంతమాత్రమునిలువదు. ప్రజలు గ్రామములందు సభలను జేయలేరు. సంతోషముతో మంచియుద్యానవనములను, దేవగృహములను నిర్మింపలేరు. యజ్ఞశీలురగు బ్రాహ్మణులు యజ్ఞములను జేయలేరు. మనోనిగ్రహముగల బ్రాహ్మణులు నియమవ్రతములను జరుపలేరు. యజ్ఞములుచేయువారు ధనాఢ్యులైనను ఋత్విజులకు తగినదక్షిణలనియ్యలేరు. నృత్యముచేయువారియొక్కయు, నాట్యముచేయువారియొక్కయువిద్యలను జూపెడియుత్సవములు బాగుగ జరుపబడవు. దేశవృద్ధిగోరు కీర్తిమనుజములుండవు. స్వాధ్యాయనిష్ఠుల

* 7 ప్రి. ౧౧. అ, 457 పుట చూడుము.

తమకార్యములను నెఱవేర్చుకొనలేరు. ఇతిహాస పురాణములలోని కథ
లను జెప్పుటలో నేర్పరులు ప్రజలకు సంతోషముకలుగునట్లు కథలను జెప్ప
లేరు. యౌవనవంతులు బంగారునాభరణములను ధరించుకొని సాయం
కాలమున నుద్యానవనములందు కలిసి క్రీడించుటకు వెళ్ళలేరు. పురుషులు
తమస్త్రీలతో గుఱ్ఱపుబండ్లను, నితరవాహనములను నెక్కి వనములకు
వెళ్ళలేరు. వ్యవసాయమువలనను, పశువులను పెంచుటవలనను జీవించు
ధనికులు తమయిండ్లలో తలుపులను దెఱచుకొని రాత్రివేళ నిర్భయ
ముగ నిద్రింపలేరు. మంచిదంతములుగల యేనుగులు గంటలచే నలంక
రింపబడి రాజమార్గములందు దిరుగవు. ధనుర్విద్య నేర్చుకొనువారు
బాణములను విడుచునపుడు కలుగు నారిశబ్దములు వినబడవు. దూర
దేశములకుబోవువర్తకు లనేకములగు తమవస్తువులనుబట్టి క్షేమముగ
బోలేరు. యతీశ్వరులు జితేంద్రియులై మనస్సులో నాత్మనుదలం
చుచు సాయంకాలమున నెక్కడనైనను నొక్కచోట నాతిథ్యమును
బొందుటకు దిరుగలేరు. ప్రజలకు యోగక్షేమములు గలుగవు.
సైన్యము యుద్ధములో శత్రువులను జయింపలేదు. జనులు నగలను
ధరించి మంచిగుఱ్ఱములనుగట్టినరథములపై సంతోషముగ నెక్కడకును
విహరించుటకు వెళ్ళలేరు. శాస్త్రములు తెలిసినపండితులు వనములం
దును, నుపవనములందును తమతమశాస్త్రవాదములను జరుపలేరు.
ప్రజలు దేవునిపూజించుటకు మంచిపరిమళద్రవ్యములను, దక్షిణలను,
నుండ్రాళ్ళుమొదలగువానిని సంపాదింపరు. రాజకుమారులు మంచి
గంధముమొదలగు సుగంధద్రవ్యములను బూసికొని సంతోషముగ
దిరుగలేరు. ఎవనికిని నాదియను ఆస్తియుండదు. అరాజకముగ నున్న
రాష్ట్రము నీరులేనినదులవలెను, నూతులవలెను, గడ్డిలేనియడవుల
వలెను, పశుపాలకుడులేని గోవులవలెను నుండును. రథములకు జెండా
లును, నగ్నికి పొగయు ముఖ్యమగునట్లు ప్రజలకు రాజే ముఖ్యుడు.

దేశమరాజకముగనున్న యెడల మనుష్యు లొకరినొకరు చేపలవలె నాశనముచేసికొందురు. తమమర్యాదలనువిడిచినవారును, నీలోకముతప్ప మఱేదియులేదనువారును, చేయదగినదానిని, చేయగూడనిదానిని నాలోచింపనివారును, రాజదండనల ననుభవించినవారునునగు నాస్తికులు 'ఇక రాజదండనలే' దని ధైర్యమవలంబించితమతమప్రభావములను జూపెదరు. శరీరమునకు నేత్రములువలె సత్యధర్మములకును, రాష్ట్రమునకును రాజుప్రధానుడు. ధర్మమును, సత్యమును, కులాచారములను జరిపించువాడును, తల్లియును, దండ్రియును, మేలుచేయువాడును నతడే. సర్వవిధములను ప్రజలను రక్షించుచు రాజ్యముచేయురాజుకంటె యమ కుబేర ఇంద్ర వరుణులుకూడ తక్కువవారగుదురు. రాష్ట్రమునకు రాజు లేనియెడల మంచిచెడ్డలను విభజించువారులేకపోవుటచే నారాష్ట్రమంతయు నేమియుగనబడని కటికిచీకటివలె నుండును.

---

## ౧౯ వ. అధ్యాయము. పుత్రవాత్సల్యము. *

పూర్వమొకప్పుడు దేవతలచేపూజింపబడుచున్న కామధేనువు మధ్యాహ్నసమయమున నెండలో పొలమునుదున్నుటచే నాయాసమును బొంది తెలివితప్పిపడియున్న తనపుత్రులగు దుక్కిటెడ్లను రెండిటిని జూచి కండ్లంట నీరుతెచ్చుకొని పుత్రశోకముచే నాకాశమున నేడ్చుచుండెను. ఆసమయమున నిందుడ్రు దానికిక్రిందుగ వెళ్లుచుండ పరిమళముతోనొప్పిడియాకామధేనువుయొక్క కన్నీటిబిందువు లతనిశరీరమున బడెను. అంత నతడు దానిని జూచి మిక్కిలిమర్యాదచేసెను. అతడు పుత్రశోకముచే నాకాశమున నేడ్చుచున్నదానికి నమస్కరించి విచారముతో 'మాదేవతలలో నెవరివలననైన నీకు భయము కలుగలేదు

* 7 ప్ర. ౧౨. అ. 469 పుట చూడుము.

గదా! అన్నిలోకములకు మేలుగోరు నీ వేలవిచారించెదవని యడిగెను. దాని కది యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. 'పాపము శమించుగాక! మీలో నెవరివలనను నాకేమియు బాధ కలుగలేదు. ఎండవేడిమిచే బాధనొందుచు కృశించి భూమినిదున్నుటకు వ్యవసాయదారునిచేకొట్టబడుచునున్న నాపుత్రులగు యెద్దులను నేనుజూచివిచారించుచున్నాను. ఇవి నావంశములో జన్మించినవి. తల్లికి పుత్రులతో సమానమైనప్రియవస్తు వేదియులేదు.' ఇట్లు కామధేనువు తెలుప నింద్రుడు సమస్తజగత్తులోను వేలకొలది వ్యాపించియున్నపుత్రులుగలకామధేను వట్లు విచారించుట జూచి తల్లికి పుత్రులకంటె నెక్కువైనవస్తువేదియు లేదని తలచెను.

---

## ౧౨౯. అధ్యాయము. విప్రలంభ శృంగారము *

భార్యాభర్తలు కొంతకాలము కాపురముచేసినతరువాత దైవయోగమున వారిద్దరికి వియోగముగలిగినయెడల పరస్పరము వారికి కలుగుమనోవ్యవహారములే విప్రలంభశృంగారమని వర్ణింపబడును. నాయకుడు వనమధ్యమందున్నయెడల నత డున్మత్తునివలె నక్కడి చెట్లనుపిలుచుచు 'మీరు నాప్రియురాలిని జూచితిరా?' యని వానినడుగుచు నామెయవయవములను వృక్షశాఖాభాగములతోను, లతలతోను సరిపోయినట్లు వర్ణించుచుండును. అతడు జంతువులనుజూచికూడ నట్లే యడుగుచుండును. తనప్రియురాలు తనప్రక్కనే దాగినట్లును, నంతలో గనబడి, యంతలో పారిపోయినట్లును ననుకొనుచుండును. ఆమెను పలుమార్లు గట్టిగ పిలుచుచుండును. ఆమె తనసమీపమున లేకపోయినను తనదగ్గఱనేయున్న ట్లామెయవయవములను వర్ణించుచుండును.

---

*౭. ప్ర. ౧౮, అ. 641 పుట చూడుము.

## ౧౬. వ. అధ్యాయము. భరతఖండభూగోళము.

1 ముఖ్యపర్వతములు:—

హిమవంతము:—హిమవత్పర్వతపంక్తిని ననేకశిఖరములు కలవు. అవి భూలోకములోనున్నయన్నిశిఖరములకంటె నెత్తైనవి. ఈ పర్వతమున దేవస్థలపుణ్యాశ్రమములుకలవు. (వానిపేళ్లు) బ్రహ్మకోశము, రజతాలయము, శక్రాలయము, మద్రిశరప్రమోక్షము, హయాననము, బ్రహ్మశిరము, సూర్యకింకరాశ్రమము, వజ్రాలయము, నైశ్రివణాలయము, సూర్యప్రభము, సూర్యనిబంధనము, బ్రహ్మాసనము, శంకరకార్ముకము.

* వింధ్యపర్వతపంక్తి:—దీనియందు వేయిశిఖరములుకలవు.

* సహ్యము:—నీలగిరిపర్వతసమూహము.

* మలయము:—మధురజిల్లాలోనుండు నల్లమలాయి, అన్నమలాయి మొదలగుపర్వతములు. వీనిమీద నగస్త్యుడు తపము చేయుచుండును.

* మహేంద్రము:—ఇది రామేశ్వరసమీపమున నుండెను. ఇది సువర్ణమయమైయుండెను. ఇందు దేవస్థలును, యక్షులును, నప్సరసలును, సిద్ధచారణులును క్రీడించుచుండిరి. ఇక్కడకు పూర్ణిమామావాస్యలయందు నింద్రుడు సముద్రస్నానమునకు వచ్చుచుండెను.

2 చుట్టునుండుసముద్రము:—

దీనిలో తిములు. తిమింగిలములు, పెద్దజలజంతువులు, పెద్దచేపలు, పెద్దపాములు, తాబేళ్ళు, మొసళ్ళు, ఏనుగులు, రత్నములు, నాచు, శంఖములు, ముత్యములు నుండును. ఇందు పర్వతములు మునిగియుండును.

---

* 11వ. ప్రి. ౨వ, ౧౨. 911 పుట పటమును జూడుడు.

3. ముఖ్యమైననదులు:—

* గంగ:—ఇది యాకాశమునుండి శివునిజటాజూటమున బడెను. అక్కడనుండి బిందుసరస్సులో బడి యేడుపాయలైనది. అందలి ముఖ్యమగుపాయ జహ్నుమహామునియజ్ఞవాటమును దడుప నతడు దానిని ద్రాగి చెవులనుండి విడిచెను. అందుచే గంగకు జాహ్నవి యను నామమువచ్చెను. గంగ సముద్రములో బడినతరువాత దానిని భగీరథుడు పాతాళమునకు దీసికొనివెళ్లెను. అందుచే నది భాగీరథి యనునామమొందెను.

గంగాజలము నిర్మలమైనది; శ్రేయస్సును గలిగించునది. ఆతీరమున ఋషులు మంచియాశ్రమముల నేర్పఱచుకొని నివసింతురు. అప్సరసలు సరస్సులుగ నేర్పడినయాయాప్రదేశములందు క్రీడింతురు. దేవతలు, దానవులు, గంధర్వదంపతులుకూడ నచట క్రీడింతురు. దేవతలకు నచట క్రీడాపర్వతములును, క్రీడావనములును గలవు. గంగాజలము పెద్దరాళ్ళపై బడి ప్రవహించుటచే గొప్పశబ్దము బయలుదేఱును; తెల్లని నురగ బయలుదేఱుచుండును. మెరకపల్లములుగల ప్రదేశములనుబట్టినీరు పాఱుచుండుటచే నది వంకఱవంకఱగనుండును. అది లోతైనప్రదేశములందు ప్రవహించునపుడు నీరు సమానముగనుండును. ఆనదిలో హంసలు, చక్రవాకములు, సారసపక్షులు, మిక్కిలిమదించినపక్షులుధ్వనిచేయుచుండును. గంగాతీరమున చెట్లపంక్తు లనేకములు గలవు. నదిలో పద్మములు, నల్లకలువలు మొదలగుపుష్పములుండును. అక్కడివనములలో గొప్పయేనుగులు, దిగ్గజములు తిరుగుచు ఘీంకరించుచుండును. అవి చక్రవాకపక్షులతో నిండియుండును.

సరయూనది:—కైలాసపర్వతమున బ్రహ్మచే నిర్మింపబడిన మానససరస్సుగలదు. దానిలోనుండి నీరు క్రిందబడి దక్షిణముగ

* 260 A. 272 పుటలు చూడుము

ప్రవహించి యయోధ్యచుట్టును దిరిగి గంగలో గలియును. సరస్సు నుండిపుట్టుటచే దీనికి 'సరయూ' అనునామము వచ్చెను. ఈసరయూ గంగాసంగమమున కామాశ్రమముగలదు.

శోణ లేక మాగధి:—ఇదిమగధదేశముననైదుకొండలమధ్య నుండి తూర్పునకు బాఱి గంగానదిలో గలియును.

వింధ్యపంక్తికి దక్షిణమునసుండు నదులు:—

నర్మద (దీనిలో పాములెక్కువగనుండును.) గోదావరి, కృష్ణవేణి, కావేరి, తామ్రపర్ణి. (వీనిలో జలజంతువు లనేకము లుండును).

4　వనములు:—* దండకావనము. ఇది వింధ్యశైవలపర్వతములమధ్యను 800 మైళ్ళ నిడుపుగల దేశము. దీని నిక్ష్వాకుపుత్రు డగు దండు డేలుచు శుక్రపుత్రికయగు అరజను బలాత్కారముగ బట్టెను. అందుచే శుక్రశాపమువలన వాడును, వానిదేశములోని స్థావరజంగమజీవులును నాశనముకాగా నాదేశమునకు దండకావనమని పేరు కలిగెను. గోదావరినదిపాఱువనమునకుగూడ దండకావనమని పేరుకలదు.

5　ముఖ్యదేశములు:—

♦ అంగదేశము:—గంగాసరయూసంగమమున శివుడు తపస్సు చేయుచుండ కాముడు కందర్పరూపముతో నతనినిచలింపజేసెను. అంత నతడు తనరౌద్రనేత్రదృష్టిచే వానిని నాశనముచేసెను. వాని యంగములుపడినయీ దేశమునకు నంగదేశమను పేరువచ్చెను. (హిందూ దేశపటమున జూడ నిది ప్రస్తుతపుబీహారుప్రదేశమున గంగాసరయూ సంగమమున కుత్తరదేశమునలె గనబడుచున్నది.)

♦ మలద కరూశ దేశములు:—వృత్రాసురవధానంతరమున నిం

* 194 పుట　పటమును జూడుడు.

♦ 260 పుట　పటమును జూడుడు.

ఇంద్రుడు గంగాదక్షిణతీరదేశమున నిలిచెను. అతనిశరీరము మలముతో నిండియుండెను. బ్రహ్మహత్యాదోష మాలిన్యము యాతనివెంబడించెను. దేవతలప్పు డింద్రుని నుదకముచే స్నానముచేయించి మలనిర్మోచనము గావించిరి. తనమలముపడినదేశమునకు మలదదేశమనియు, తనయాకలి (కరూశము) పోయినదేశమునకు కరూశదేశమనియు నింద్రుడు పేర్లు పెట్టెను. అతనివరముచే నవి ధనధాన్యములతో వృద్ధిబొందుచుండెను. అంతట తాటక సుబాహులచేత ప్రాణిహింసచేయుటచే నా దేశములు వనముగ మారిపోయినవి. (హిందూదేశపటమున జూడ నీదేశములు ప్రస్తుతము బీహారుదేశములో గంగానదికి దక్షిణమున, తూర్పున నుండు గయమొదలగు దేశములవలె గనబడుచున్నవి.)

*మగధదేశము:— ఈ రాజ్యమున ప్రధానముగ కొండ లైదు కలవు. దీనిమధ్యనుండి శోణనది ప్రవహించును. దీనిలో కౌశాంబీనగరము, మహోదయము, ధర్మారణ్యము, గిరివజ్రము నను నాలుగు పట్టణములుండెను. (హిందూదేశపటమున జూడ నిది దక్షిణబీహారుదేశములో గంగాతీరమునకు దక్షిణపశ్చిమముననున్న ప్రదేశమువలె గనబడుచున్నది.)

*విదేహము:— కోసలదేశమునకు తూర్పుననుండు దేశము. దీని మిథిలానగరము రాజధాని.

కోసల:— దీనికి నుత్తరమున నేపాళమును, దక్షిణమున వింధ్యపంక్తియు సరిహద్దులు. ఉత్తరభాగము 'ఉత్తరకోసల' లవుని రాజ్యము. రాజధాని 'శ్రావస్తి.' దక్షిణభాగము 'దక్షిణకోసల' కుశుని రాజ్యము. రాజధాని 'కుశావతి' (12 ప్ర. ౧౯ అ. చూడుము)

కాశీ:— కాశీపట్నము చుట్టునుండు దేశము.

* 260 A పుట పటమును చూడుము.

<u>కురుజాంగములు:</u>—ఇవి కోసలదేశమునకు పశ్చిమముగను, హిమవంతమునకు దక్షిణముగను, సరస్వతీనదికి తూర్పుగను నుండు దేశములు. రాజధాని హస్తినాపురము.

<u>ఉత్తరపాంచాలము:</u>—ఇది కురుజాంగములకు పశ్చిమముగను, హిమవంతమునకు దక్షిణముగను నుండును.

<u>శూరసేనము:</u>—యమునానదిపశ్చిమతీరమున నుండు మథురాపట్నము దీనికి రాజధాని. ఈ దేశము దానిచుట్టునుండును. (12 ప్రి. ౯ అ. చూడుము.)

<u>వీరమత్స్యము:</u>—ఇది కురుజాంగములకు పశ్చిమమునను, సరస్వతీనదికి తీరయు నుండు దేశము.

<u>బాహ్లీకము:</u>—'వితస్తా, చంద్రభాగ, ఇరావతి, విపాశ, శతద్రు' అను 5నదులేకమై 'పంచనద' మను పేరొందిన నదియు, సింధునదియు గల దేశము.

<u>కేకయము:</u>—ఇది బాహ్లీకమునకు నుత్తరమున నుండును. దీనికి రాజధాని గిరివజ్రము, లేక రాజగృహము.

<u>మద్రము:</u>—బాహ్లీకమునకు దక్షిణముననుండు దేశము.

<u>గాంధారము:</u>—సింధునదిమధ్యభాగమునకు పశ్చిమముగనుండు దేశము. (12 ప్రి. ౧౫ అ. చూడుము.) ఇది ప్రస్తుతపు పశ్చిమోత్తరసరిహద్దు రాష్ట్రములతో నించుమించుగ సరిపోవుచున్నది. దీనిలో తక్షశిల, పుష్కలావతి ముఖ్యపట్టణములు.

<u>సింధు:</u> —పశ్చిమసముద్రములో కలియుటకుపూర్వము సింధునది ప్రవహించు దేశము.

<u>వింధ్యపర్వతపంక్తికి దక్షిణముననున్న దేశములు:</u>—

ఉత్కళము, దశార్ణము, అవంతి, విదర్భ, మహిషము(మైసూరు), కళింగము, ఆంధ్రము, పుండ్రము, చోళము, పాండ్యము, కేరళము.

వింధ్యపర్వతపంక్తికి నుత్తరపశ్చిమముననుండు దేశములు:—

మాళవము, సురాష్ట్రము, కుక్షి దేశము.

వింధ్యపంక్తికి నుత్తరతూర్పుననుండు దేశములు:—

పౌండ్రము, కాంభోజము, యవనము, శకము, టంకణము, వంగము (బంగాళము).

---

౧౨ వ. అధ్యాయము.

భూలోక భూగోళము.

భూమిపైనుండునాకాశము పక్షులచే నీతీరున చుట్టబడుచుండును. క్రిందినుండి 1, 2, 3, 4, 5, 6, 7 ప్రదేశములుగ విభజింపబడినది.

| | |
|---|---|
| 7 | గరుత్మంతులు. |
| 6 | హంసలు. |
| 5 | గ్రద్దలు. |
| 4 | డేగలు. |
| 3 | నీటికాకులు, కొంగలు, గోరువంకలు. |
| 2 | చెట్లఫలములను భుజించుపక్షులు, కాకులు. |
| 1 | ధాన్యపుగింజలను భక్షించుపక్షులు. |

గరుత్మంతులుండు ప్రదేశము భూమికి 400 క్రోసుల (800 మైళ్ళు) యెత్తుననుండును.





(1) ఇక్కడ బలవంతులగు నసురులుగలరు. బ్రహ్మ వరముచే వీరు ఛాయః నిచట విశ్వకర్మనిర్మితమగుభవనముగలదు. (3) మందేహరాక్షసు లిక్క సముద్రమున బడుచుందురు. (4) ఇక్కడ హయగ్రీవుడుండును. (5) ఆయంచు 400 క్రోసులవిశాలముగలిగి, బంగారువికారముగనుండి, వేదికల



(1) ఈపర్వతమున సిద్ధచారణులుందురు. దీనిమీదనుండు నొకబంగారుశిఖ చుండును. (2) ఇక్కడ విశ్వకర్మనిర్మితమగు నగస్త్యునిదివ్యభవనముకలదు.

## ౧౮ వ. అధ్యాయము. యుద్ధసామగ్రి.*

ధనస్సులు, శరములు, శక్తులు, వృష్టులు, తోమరములు, (చిల్లకోల), శూలములు, ప్రాసములు (ఈటెలు), గదలు, ఖడ్గములు (వంకఅకత్తులు), శతఘ్నులు(నూఱుమందినిజంపుగదవంటియంత్రములు), పరశ్వధములు (గండ్రగొడ్డళ్లు), ముద్గరములు (లోహముతోజేయబడిన పెద్దగదలు), పట్టసములు (ఒకవిధమైనకత్తులు), చక్రములు, పరిఘులు (ఇనుపకట్లుగలగదలు), ముసలములు, కూటములు, యష్టులు (కేవల దంతములు), భిండివాలములు (గదావిశేషములు), బల్లెములు, పాశ ములు, కుంతములు, నిఖాతములు, ఇనుపదుడ్లు.

రథ గజాశ్వ పదాతులు సైన్యము. రథములు పతాకములతో నొప్పుచుండును. యుద్ధముచేయువారు కవచములను దొడుగుకొని శస్త్రములతోను, నస్త్రములతోను, గదలుమొదలగువానితోను యుద్ధ ముచేయుదురు.

శరములు వాయువేగమనోవేగములుగలవై వజ్రమువలె వాడిగనుండును. వజ్రము మెఱుపువలె ప్రకాశించుచుండును.

బాణము లనేకవిధములుగనుండును. కొన్ని చిన్నగొట్టముల వలెనుండును. కొన్ని సూదిగనుండును. కొన్ని యినుముతో జేయ బడును. కొన్నిటికి చెవులవలె నంచులుండును. బాణములు విషపు కోఱలుగలపాములవలె తీవ్రముగనుండును. వానికి బంగారపుకట్లు గూడనుండును. కొన్నిశరములు వంకఅగగాక తిన్నగవెళ్లును. కొన్ని బాణములచివర నెముకలతోజేయబడినకొనలుండును. కొన్నిటికొన లర్ధచంద్రునివలె నుండును. కొన్నిటికొనలు గండ్రగొడ్డలిచివరివలెను దోసిలివలెను, దూడదంతమువలెను, సింహదంతములవలెను, కత్తి కొనలవలెను నుండును. కొన్నిటికి రెండుప్రక్కలను వాడి యుండును. కొన్నిటికి మంగలికత్తులవలె వాడియుండును. కొన్నిటికి కంకపత్ర ములవలె చివరలుండును. కొన్నిటికి రెండుప్రక్కలను, చివరను చెవ్వు

లుండును. కొన్నిటికి కరపీరపత్రములవలె చివరలుండును. కొన్ని బాణ ములవలె [illegible]గానుండును.

—*—

... వ. అధ్యాయము. మల్లయుద్ధపద్ధతి *

మల్లవీరులు పిడికిళ్లతోను, చేతిమణికట్టులతోను, తన్నులతోను పోరాడుచుందురు. అఱచేతులతోను, బాహువులతోను కొట్టుకొందురు. వారొకరినొకరు త్రోసుచును, లాగుచును, దేహములను వంచుకొనుచును, పదములను వేయుచును, బాహువులతో పట్టుకొనుచును, త్రోసికొనుచును, తిరుగకలియుచును, భూమినుండి ఎగురుచును, దండపట్టు పట్టుచును, కౌగిలించుకొనుచును, తిరుగవిడుచుచును, వక్షస్థలముపై గ్రుద్దుకొనుచును, పదములరాపిడిచే క్రిందపడుచును, తిరిగిలేచి యెగురుచును, కొంతసేపు చక్రమువలె గుండ్రముగ దిరుగుచును, క్రిందపడవైచుకొనుచును, గోమూత్రికాపద్ధతిని వంకరగదగ్గఱకువచ్చుచును, తిరుగ వెనుకకు బోవుచును, కొంతసేపు కుడిప్రక్కకును, కొంతసేపు ఎడమప్రక్కకును బోవుచును మల్లయుద్ధము చేయుదురు. ఇట్లు యుద్ధముచేయునప్పుడు వారు తమ శరీరములకు దెబ్బలుతగులకుండ తప్పించుకొందురు. ఒకడు నిలిచియుండ నవాని యొకడు వానిచుట్టును తిరుగును. ఒకనిమీదికి నొకడు శీఘ్రముగా బోవును; మెల్లమెల్లగ నడచును. ఒకరి కొకరు పట్టుబడకుండ నొకరి ముందొకరు నిలుతురు; వెనుకకును, ప్రక్కకును నడుతురు. ఒకరి నొకరు పట్టుకొనుటకు వంగితిరిగెదరు. ఒకరిపాదముల నొకరు పట్టుకొని ముందుకులాగి పడగొట్టుటకు క్రిందకువంగి తిరుగుచు నెగురుదురు. ఒకరిదండలనొకరుపట్టుకొనుటకు తమబాహువులను జాపెదరు. తమదండలు ఎదుటవారికి దొరకకుండునట్లు తమబాహువులను ముణుచుకొందురు.

———

* II ప్ర. ౧౬౫, అ, 1188 పుటచూడుము.

## ౨౦ వ. అధ్యాయము.

### వసంతఋతు వర్ణన. *

ఈ ఋతువున నశోకవృక్షములు మొదలగునవి చిగిర్చి పుష్పించును. కొన్ని చెట్లు ఫలించును. పుష్పములమీఁదిపరిమళములతో గాలి చల్లఁగా వీచుచుండును. తుమ్మెదలు పూవులలోని తేనెను త్రాగి ఝుంకారముచేయుచు మఱికొన్నిపుష్పములమీఁదికి వెళ్ళుచుండును. గాలిచే చెట్లు చక్కఁగ కదలుచుండును. వానిమీఁద మదించినకోయిలలు మంచిస్వరములతో గూయుచుండును. బాగుగపుష్పించినకొండగోగుచెట్లు బంగారసరులచే నలంకరింపబడిన పచ్చనిబట్టలవలె ప్రకాశించుచుండును. సీటిమడుగులలోను, సరస్సులు మొదలగువానిలోను నీటికాకులు కూయుచుండును. పక్షులు ధ్వనిచేయుచు చెట్లపైనను, పొదరిండ్లపైనను, తలపైనను దిరుగుచుండును. పక్షిమిథునములు సంతోషముగకూయుచు నత్యాతురతతో దిరుగుచుండును. మయూరద్వంద్వములు తమపింఛములను విప్పి సంతోషముగ నాట్యముచేయుచును, కూయుచును, మన్మథోద్రేకముచే నొకదానినొకటి విడువకయుండును. మగలేళ్లు ఆడలేళ్లుతోఁడ కలిసి యల్లే తిరుగుచుండును. తిలకపుష్పములపై తుమ్మెదలు వ్రాలుచుండును. అశోకవృక్షపు పూలగుత్తులు రాలిపోయి గాలిచే నెగురుచుండును. మామిడిచెట్లు బాగుగపూచి కాయలతో నిండియుండును. చెట్లనుండి భూమిపై రాలినపూవులు పూలపాన్పువలె ప్రకాశించుచుండును.

---

* శి. ప్ర ౨౩ అ. 670 పుట చూడుము.

ములు మొదలగునవి కొట్టుకొనిపోవుచుండును. మంచినేరేడిపండ్లు బాగుగ పండియుండును. గాలిచే మామిడిపండ్లు క్రిందబడుచుండును. అడవులలో వర్షమధికముగ కురియుటచే పచ్చగడ్డి యధికముగ బెరుగును. చెట్లు బాగుగబెరుగును. నెమళ్లు తమపింఛములను విప్పి కదంబవృక్షములక్రింద నృత్యముచేయుచుండును. కొన్నిచెట్లు బాగుగ పుష్పించియుండును. ఈచాతుర్మాస్యకాలమున విష్ణువు పాలసముద్రమున శయనించియుండును. గట్లు తెగి పడిపోవునట్లు నదులు వేగముగ ప్రవహించుచుండును; అందు చక్రవాకములు తేలుచు నీదుచుండును; ఫలములు మొదలగునవి యానదీప్రవాహములలో కొట్టుకొనిపోవుచు సముద్రములో గలియుచుండును, వృషభములు గోవులను గలియుచుండును. భూమి సస్యములతో నిండియుండును. మదించిన యేనుగులు ఘీంకారముచేయుచుండును. అంతకుపూర్వముకనబడని కప్పలు వర్షఋతువువచ్చినవెంటనే బయలువెడలి యనేకవిధములగు రంగులుగలశరీరములతో నటించుచుండును. తుమ్మెదలు ఝంకారము చేయుచు తీసినపుష్పాసవములును, మకరందమును వర్షముచే గొట్టుకొని పోవుచుండును. ఏనుగులు మేఘధ్వనులను విని శత్రువులయేనుగులు యుద్ధరవము చేయుచున్నట్లాలోచించి వెనుకకు మరలుచు సంతోషముగ నడవులలో దిరుగుచుండును. కొన్నిపక్షులు చెట్లయాకుల మీదనుండు జలమునే త్రాగుచుండును. సింహములు తమతమనివాసస్థానములందే నిలిచియుండును. చెరువులు, బావులు నీటితో నిండియుండును. సాయంకాలము పక్షులు తమగూళ్ళలో నిలుచును. పద్మములు ముడుచుకొనియుండును. మాలతీలతలు వికసించును. భాద్రపదమాసమున బ్రాహ్మణులు వేదమారంభింతురు.

## ౧౫. అధ్యాయము. శరదృతు వర్ణన. *

శరత్కాలమునందు వర్షములు కురియుట ముగియును. సస్యములు పండియుండును. మేఘములు బలములేనివై పోవుటచే తెల్లబడి సన్నగిల్లియుండును. వాయువు పుష్పపరిమళములతో చల్లగ వీచుచుండును. మేఘగర్జనలును, ఏనుగుల ఘీంకారములును, నెమళ్ల కేకలును, సెలయేళ్ల శబ్దములును లేకయుండును. కొండలమీద నున్న మునియుండుటచే నవి వికాసమును బొంది చిత్రవిచిత్రములుగ నుండును. నదులు కొంచెము నీటితో పారుచుండుటచే నిసుకతిన్నెలు కనబడుచుండును. చేపలు నదులలో నడుగుచుండును. చెట్లకొమ్మలు సుందరముగ నుండును. నక్షత్రములును, సూర్యచంద్రులును కాంతిగలిగి యుండును. వెన్నెల బాగుగ ప్రకాశించుచుండును. మదించిన వృషభములు కొమ్ములతో నేలను త్రవ్వుచు అంకెలు వేయుచు ఆవులతో గూడ తిరుగుచుండును. చెరువులు పద్మములతోను, కలువలతోను వికాసముగ నుండును. సారసపక్షులు, గోరువంకలు (క్రౌంచములు), హంసలు, చక్రవాకములు ద్వంద్వములుగగూడి నదులలోని యిసుకతిన్నెలయందును, సరస్సులలోని పద్మములందును మెల్లగ తమ రెక్కల నాడించుచు క్రీడించుచుండును. సారసపక్షులు పండిన ధాన్యపుగింజలను దిని సంతోషముతో నాకాశమున బారులుతీర్చి యెగురుచుండును. నెమళ్లు ఆకాశమున మేఘములు లేకయుండుట చూచి తమ పింఛములను విడిచి సంతోషములేనివై శోభావిహీనముగ నుండును. కప్పలయరుపులు లేకయుండును. అనేక విధములగు చెట్లు తెలుపు, పసుపు మొదలగు రంగులును, మంచి సువాసనలును గల పుష్పములను గలిగియుండును. చెట్లకు ననేకలతలు చుట్టుకొని బాగుగ నుండును.

మదించిన మొగయేనుగు లాడయేనుగులతో గలిసి యడవులందు విహరించుచు, చెరువులలోను, నదులలోను క్రీడించుచు, నీళ్లు

*8 వ్రి. ౙ అ. 728 పుటచూడుము.

